# ధ్వన్యాలోకము

## లోచనసహితము

### ఆంధ్రవ్యాఖ్య బాలానందినితో

వ్యాఖ్యాత

డా. పుల్లెల శ్రీరామచంద్రుడు

ప్రకాశకులు

శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్సు,

హైదరాబాదు

ధ్వన్యాలోకము - లోచనసహితము

ఆంధ్రవ్యాఖ్య బాలానందినితో



ప్రథమ ముద్రణ 1998

వెల రూ. 300/-

ప్రకాశకులు :

శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్సు,

డోర్ నెం. 22-311/97, వెస్టర్న్ హిల్స్,

జలవాయువిహార్ రోడ్, కెపిహెచ్‌బి ఎదురుగా,

కూకట్‌పల్లి (పోస్ట్), హైదరాబాదు - 500 072.

ఫోన్ : 880986.

డిస్ట్రిబ్యూటర్స్:

శ్రీ గోపాల్ పబ్లికేషన్సు,

3-3-860, ఆర్యసమాజ్ ఎదురుసందులో,

కాచిగూడా, హైదరాబాదు - 27.

ఫోన్ : 4658101

టైప్ సెట్టింగ్ : వసంతా గ్రాఫిక్స్,

లక్డి-కా-పూల్, ఫోన్ : 3320742

ముద్రణ : శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్ - 29

# కృతిసమర్పణమ్

యో భాషాశాస్త్రపాణ్డిత్యా సర్వదేశసువిశ్రుతః,
యద్వచో ద్రావిడే భాషాశాస్త్రేऽశ్నోత్యగ్రమాన్యతామ్. 1

నిబన్ధగ్రన్థనిర్మాతా యో నిఘణ్టూనజీఘటత్,
సాహితీమార్గసంచారచుఞ్చుర్యో వాగ్మితాచణః. 2

ఉద్ధరేదాత్మనాత్మానమిత్యుక్తేర్యో నిదర్శనమ్,
ఉద్ధరత్యాత్మనా సార్ధమన్యానపి చ యః సుధీః. 3

సదా విదేశగమనాగమనవ్యాపృతశ్చ యః,
స్తోకముర్వ్యాం బహుతరం ప్రయాతి వియతి ద్రుతమ్. 4

ఆచార్యపదమధ్యక్షపదం సంకాయనేతృతామ్,
కలాశాలాధిపతితామాప్నోద్యః కర్మదీక్షితః. 5

సప్తవర్షాణి హైద్రాబాద్విశ్వవిద్యాలయస్య యః,
అవహత్ కౌలపత్యం చ సర్వైః శ్లాఘితపాలనః. 6

తస్మై సలోచనధ్వన్యాలోకవ్యాఖ్యా సుధీమతే,
శ్రీకృష్ణమూర్తయే బాలానన్దిన్యేషా సమర్ప్యతే. 7

శ్రీ భద్రిరాజవరవంశసుధార్ణవేన్దో
విద్వద్వతంస హితమానస కృష్ణమూర్తే,
నైకోన్నతాధికృతిలబ్ధవిశాలకీర్తే
రానన్దవర్ధనముపాయనమస్త్విదం తే. 8

- పుల్లెల శ్రీరామచంద్రుడు

# ఆనందనీరాజనం

ఈ ధరిత్రిని పరమార్థసాధనములు
రెండె - వానికై భారతీయుం డెవండు
పశ్చిమాశకు పరుగెత్త బనియు లేదు
తత్త్వముకొరకు - కావ్యతత్త్వంబు కొరకు.

కాళిదాసాదికవులు పెక్కండ్రు కలరు
రసికు డనిన ఆనందవర్ధను డొకండె
దూరదర్శి సాహిత్యపాథోనిధాన
కుంభసంభవుం డభినవగుప్తు డొకడె.

విబుధ విష్ణువక్షస్థల విమల కాంతి
వర్ధనైకకౌస్తుభము కావ్యప్రకాశ
పటిమతోడ ఆచార్య మమ్మటుల కృపను
కావ్యజగతి ప్రస్థానషట్కమును గడచి.

ఎల్లకవిత్వతత్త్వమను నీ కరదీపిక నాకు ఈ జగం
బెల్లను జూపె, నన్నరువదేండ్లకు పారమహంస్యసంహితా
యల్లక మగ్ను జేసి పరమావధిగా తెలిపెన్ వ్రజాంగనా
వల్లభు వేణుగాయకు కృపాపరు వేదశిరోఽగ్రగోచరున్.

కాకలుదీరినట్టి ధ్వనికారుడు చూడ ప్రపంచసాహితీ
లోకమునందు మేరుగిరి, లోచనదానము చేసి ఉత్తమ
శ్లోకు డొకండు తద్గరిమ జూపెను, దానిని పెల్లగించి మా
కీకొనువాని గొల్తును సుధీంద్రుని పుల్లెల రామచంద్రునిన్.

- "ఉత్పల"

(శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్య)

శ్రీః

# ప్రస్తావన

"ధ్వనినాతిగభీరేణ కావ్యతత్త్వనివేశినా
ఆనన్దవర్ధనః కస్య నాసీదానన్దవర్ధనః".

- రాజశేఖరుడు

"ధ్వనికృతామ్ అలఙ్కారసరణివ్యవస్థాపకత్వాత్"

- పండితరాయలు.

'సహృదయాలోకం' 'కావ్యాలోకం' అనే నామాంతరాలు గల ధ్వన్యాలోకాన్ని రచించిన ఆనందవర్ధనుడు కాశ్మీరదేశీయుడు. ఇతడు క్రీ.శ. 855 నుండి 883 వరకు కాశ్మీరదేశాన్ని పాలించిన అవంతివర్మ ఆస్థానంలో ఉండేవా డని కల్హణుడు రాజతరంగిణిలో చెప్పి ఉన్నాడు -

ముక్తాకణః శివస్వామీ కవిరానన్దవర్ధనః,
ప్రథాం రత్నాకరశ్చాగాత్సామ్రాజ్యేఽవన్తివర్మణః (రా. త. 5.34)

దీనిచేత అనేకమైన ఇతర ప్రమాణాలచేత ఆనందవర్ధనుడు క్రీ.శ. తొమ్మిదవశతాబ్దికి చెందినవాడని నిశ్చయించబడింది.

ఆనందవర్ధనుడు ఎంతటి మహాపండితుడో అంతటి మహాకవి. సహృదయ శిరోమణి. 'అర్జునచరితమ్', 'విషమబాణలీలా', 'దేవీశతకం' ఇతడు రచించిన కావ్యాలు. 'విషమబాలలీల' ప్రాకృతకావ్యం. 'ధర్మోత్తమావివృతి' బౌద్ధపండితుడైన ధర్మకీర్తి రచించిన "ప్రమాణవినిశ్చయం" మీద వ్యాఖ్యానం. "తత్త్వాలోకం' వేదాంతశాస్త్రగ్రంథం.

తొమ్మిదవ శతాబ్దినుండి నేటివరకు ఆనందవర్ధనుని యశఃసౌరభాన్ని నిరంతరము దశదిశలలో ప్రసరింపచేస్తూన్న అలంకారశాస్త్ర గ్రంథం 'ధ్వన్యాలోకం'. లౌకికవ్యవహారంలో కూడ ఏదైనా ఒక వాక్యం పలికినప్పుడు ఆ వాక్యం పలికినవానిని పట్టి, సందర్భాన్ని పట్టి, ఆ వాక్యంలో ఉన్న పదాలు బోధించే అర్థంకంటె అతిరిక్తంగా మరొక అర్థం స్ఫురిస్తుం దనే విషయం సర్వవిదితం. అలా స్ఫురించే రెండవ అర్థానికి వ్యంగ్యార్థం లేదా

ప్రతీయమానార్థం అని పేరు. కావ్యంలో కేవలవాచ్యార్థంకంటె ఇలాంటి వ్యంగ్యార్థానికి ప్రాధాన్యం ఇస్తే ఆ కావ్యం చాలా అందంగా ఉంటుంది; అలాంటి కావ్యానికే ధ్వని అని పేరు అని ఆనందవర్ధనుడు ఈ ధ్వన్యాలోకంలో ప్రతిపాదించాడు. ఆ వ్యంగ్యార్థంలో ఎన్ని భేదాలు ఉండడానికి అవకాశం ఉంటుంది; వ్యంగ్యార్థాన్ని ప్రకాశింపచేయడానికి ఎలాంటి పదాలు ఉపయోగించాలి; ఇంకా ఏ అంశాలు పాటించాలి మొదలైన విషయాలను సవిస్తరంగా సోదాహరణంగా చర్చించాడు. పదానికి అభిధ, లక్షణ అనే వ్యాపారాలు మాత్రమే కాకుండా వ్యంజకత్వం, అనగా వ్యంగ్యార్థాన్ని బోధించడం అనే వ్యాపారం కూడా ఉందని ప్రతిపాదించాడు. వ్యంగ్యార్థం లేనిది కావ్యమే కాదన్నాడు. ఈ సిద్ధాంతం గూర్చి ఆనందవర్ధనునికి పూర్వం ఎవరైనా స్థూలంగా చెప్పారేమో తెలియదు గాని దీనికి ఒక నియమితరూపం ఇచ్చినవాడు ఆనందవర్ధనుడే. "కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైః యః సమామ్నాతపూర్వః" ఇత్యాది ప్రథమకారికను బట్టి అలాంటి అభిప్రాయాలు ఆతనికి పూర్వమే అస్పష్టంగా ప్రతిపాదించబడి ఉన్నా యని ఊహించవచ్చు. సమాసోక్తి-పర్యాయోక్త్యాదులలో ప్రతీయమానమైన మరొక అర్థం ఉన్న దని భామహోద్భటాదులు కూడ అంగీకరించారు కదా. వ్యంగ్యార్థమనేది ఒకటి ఉంది అని చెప్పడంలో ఎవరికీ విప్రతిపత్తి ఉండదు కాని వ్యంజకత్వం అనేదానిని ఒక స్వతంత్రమైన శబ్దవ్యాపారంగా అంగీకరించాలా అనే విషయంలోనే అభిప్రాయభేదం ఉంది. ఈ విషయం సవిస్తరంగా అస్మద్విరచిత కావ్యప్రకాశవ్యాఖ్య, బాలానందిని ప్రస్తావనలో చర్చించబడింది.

ధ్వన్యాలోకంలో కారికలు, వృత్తి (వ్యాఖ్యానం) ఉదాహరణలు అని మూడు భాగా లున్నాయి. వీటిలో కారికలు, వృత్తి కూడ ఆనందవర్ధనుడు రచించినవే. కారికలు మరెవరో రచించారు అనే కొందరి వాదనను డా. కే. కృష్ణమూర్తి మొదలైనవారు సంయుక్తంగా ఖండించి ఉన్నారు. పది పదిహేను తప్ప మిగిలిన ఉదాహరణశ్లోకా లన్నీ ప్రాచీనకవుల రచనల నుండి గ్రహించబడినవే.

ఆనందవర్ధనుడు ఈ గ్రంథంలో అనేకమైన నూతనవిషయాలు ప్రతిపాదించి ఉన్నాడు. అవి తరువాతి ఆలంకారికు లందరికీ మార్గదర్శకాలుగా ఉన్నాయి -

1. వర్ణపదాదుల సంఘటన (కూర్పు)కు రసానికి ఉన్న సంబంధం;
2. ఒక కవి సఫలు డైనాడా విఫలు డైనాడా అని నిర్ణయించడానికి ఉపయోగించే ఔచిత్యాన్ని పాటించడం మొదలైన అంశాలు,

3. మహాకావ్యాలలో అంగరసాలు అంగిరసాలు, ఎలా ఉండా లనే విషయం,

4. రసాలలోని దోషాలు,

5. రసాలలో పరస్పరం విరోధావిరోధాలు,

6. అలంకారశాస్త్రంలో ఇతరాలంకారికులు ప్రతిపాదించిన అలంకారాలు, గుణాలు, రీతులు, వృత్తులు మొదలైనవాటిని రసవత్కావ్యంలో తగు విధంగా ఉపయోగించడాన్ని గూర్చిన సూచనలు,

7. అలంకారం ఉపయోగించి చెప్పిన అర్థానికీ, ప్రతీయమానార్థానికీ మధ్య ఉన్న చమత్కారంలో భేదం,

8. ఒక కావ్యంలో ఏ రసం ప్రధానంగా ఉన్నదో కనుగొనడానికి ఉపయోగించవలసిన విధానం ఇత్యాదులు ఎన్నో ఉన్నాయి.

ప్రాచీనాచార్యులు ప్రతిపాదించిన అలంకారసిద్ధాంతమైనా, రససిద్ధాంతమైనా, రీతిసిద్ధాంతమైనా, ధ్వనిసిద్ధాంతమైనా, ఔచిత్యసిద్ధాంతమైనా అన్నీ కూడా భారతీయభాషలో రచించిన ఏ కావ్యానికైనా వర్తిస్తాయి. మన మస్తిష్కానికి దట్టంగా పట్టించుకొన్న "పురాణమిత్యేతదసాధు సర్వం" అన్న భావాన్ని కొంచెం తప్పించుకొని, ఈ శాస్త్రంలోని విషయాలు జాగర్తగా చదివితే భారతీయసాహిత్యాలకే కాదు సకలదేశసాహిత్యాలకీ ఈ సిద్ధాంతాలను సమన్వయించవచ్చును. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో ఉదాహరించిన మొత్తం 222 శ్లోకాలలో 184 సంస్కృత శ్లోకాలు, 42 ప్రాకృత శ్లోకాలు. అభినవగుప్తుడు లోచనంలో ఉదాహరించిన 138 శ్లోకాలలో సంస్కృతశ్లోకాలు 125, ప్రాకృతశ్లోకాలు 13. అక్కడక్కడ ప్రాకృతకవిగోష్ఠ్యాదులను గూర్చి కూడ వీరు నిర్దేశించి ఉన్నారు.

ఎందరో ధ్వన్యాలోకానికి వ్యాఖ్యానాలు రచించినట్లు కనబడుతుంది కాని ఇప్పుడు మనకు 'లోచనం' అనే అభినవగుప్తరచితవ్యాఖ్యానం మాత్రమే లభిస్తున్నది. అభినవగుప్తుడు 'చంద్రిక' అనే ఒక ప్రాచీనవ్యాఖ్యానాన్ని పేరుతో నిర్దేశించాడు. మరికొన్ని వ్యాఖ్యానాలను పేరులేకుండా నిర్దేశించాడు.

**అభినవగుప్తుడు** :- ఈయన కూడ కాశ్మీరదేశానికి సంబంధించినవాడే. పన్నెండవశతాబ్దికి చెందినవాడు. అపారమేధానంపన్నుడు, అసాధారణమైన వివిధశాస్త్రపాండిత్యం నంపాదించినవాడు. కాశ్మీరశైవాచార్యుడు. ఈయన

కాశ్మీరశైవసిద్ధాంతానికి సంబంధించిన అనేక ఉద్గ్రంథాలకు వ్యాఖ్యలు రచించాడు. అనేకస్తోత్రాలు నిర్మించాడు. అలంకారశాస్త్రానికి సంబంధించినంతవరకు ఈయన రచించిన భారతనాట్యశాస్త్రవ్యాఖ్య 'అభినవభారతి', ధ్వన్యాలోకవ్యాఖ్య 'లోచనం' చాలా ప్రధానమైనవి. పేరుకు వ్యాఖ్యానాలు కాని ఇవి స్వతంత్రగ్రంథాలే. ఈయన వ్యాఖ్యానాలలో అడుగడుగునా అనేక శాస్త్రీయవిషయాల చర్చ కనబడుతుంది. అందుచేత ఇతరశాస్త్రాలతో పరిచయం లేనివాళ్లకి ఇవి కొరుకుడు పడవు.

ఒక విధంగా చెప్పాలంటే అభినవగుప్తుడు ప్రౌఢివాది. వ్యాఖ్యానాపదేశంతో స్వీయభావాలను మూలగ్రంథాలకు అంటకడతాడు. రసస్వరూపాన్ని గూర్చి ఆనందవర్ధనుని అభిప్రాయానికి అభినవగుప్తుడు చెప్పినదానికీ సంబంధం లేదు. ఈ విషయం అస్మదీయకావ్యప్రకాశవ్యాఖ్యాప్రస్తావనలోను "రసో వై కః" అను శీర్షికతో వారాణసేయ సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయంవారు ప్రచురించిన అస్మదీయనిబంధచతుష్టయసంగ్రహంలోను వివరించబడింది. ఇంకా అనేక స్థలాలలో కూడ అభినవగుప్తుడు ఆనందవర్ధనుని మతమే అని చెపుతూ తన అభిప్రాయాలను చేర్చాడు. అలాంటి కొన్ని విషయాలు ఈ వ్యాఖ్యలో ఆ యా స్థలాలలో విశదీకరించడం జరిగింది. గ్రంథవిస్తరభీతిచేత ఇక్కడ వాటిని మళ్లీ ఉట్టంకించడంలేదు.

ధ్వన్యాలోకలోచనాలకు ఆ యా భాషలలో వ్యాఖ్యలు, అనువాదాలు చేసినవారు గాని, ఈ గ్రంథాలమీద వ్యాసాలు (ఆర్టికల్స్) వ్రాసినవారు గాని గుర్తించని ఒక విషయాన్ని ధ్వన్యాలోకానికి 'దీపశిఖ' అనే సంస్కృతవ్యాఖ్య వ్రాసిన ఆచార్య చండికాప్రసాదశుక్ల చూపి ఉన్నారు. (ఇది 1989లో విశ్వవిద్యాలయ ప్రకాశన్, చౌక్, వారాణసి అనేవారు ప్రచురించారు).

"యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ,
వ్యఙ్క్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః". (ధ్వ. 1.13)

అని ఆనందవర్ధనుడు చెప్పిన లక్షణం ప్రకారం 'ధ్వని' అనగా 'ఏ కావ్యంలో శబ్దార్థాలు తాము అప్రధానత్వం పొంది ఏదో ఒక్క వ్యంగ్యార్థాన్ని బోధిస్తాయో ఆ కావ్యం' అని మాత్రమే అర్థం. ఇంకా అనేకమైన ఇతరస్థలాలలో కూడ ఆనందవర్ధనుడు ధ్వనిశబ్దాన్ని కావ్యవిశేషం అనే అర్థంలోనే ప్రయోగించాడు - (1) "వ్యఙ్గ్యప్రాధాన్యే హి ధ్వనిః" (2) "నను ధ్వనిః కావ్యవిశేష ఇత్యుక్తమ్" (3) "ధ్వనిసంజ్ఞితః ప్రకారః కావ్యస్య

వ్యక్షీతః సోఽయమ్" (4) "వ్యఙ్గ్యోఽర్థో లలనాలావణ్యప్రఖ్యః యః ప్రతిపాదితః తస్య ప్రాధాన్యే ధ్వనిరిత్యుక్తమ్" (5) వ్యఙ్గ్యస్యార్థస్య ప్రాధాన్యే ధ్వనిసంజ్ఞితకావ్యప్రకారః, గుణభావే తు గుణీభూతవ్యఙ్గ్యతా" (6) "తదయమత్ర సంగ్రహః - యస్మిన్ రసో వా భావో వా తాత్పర్యేణ ప్రకాశతే, సంవృత్త్యాభిహితం వస్తు యత్రాలంకార ఏవ వా, కావ్యా ధ్వని ధ్వనివ్యఙ్గ్యప్రాధాన్యైకనిబన్ధనః, సర్వత్ర తత్ర విషయో జ్ఞేయః సహృదయైర్జనైః" (7) ధ్వనేరిత్థం గుణీభూతవ్యఙ్గ్యస్య చ సమాశ్రయాత్, న కావ్యార్థవిరామోఽస్తి యది స్యాత్ప్రతిభాగుణః" మొ.

వాచ్యార్థలక్ష్యార్థాలకంటె వేరుగా స్ఫురించే అర్థాన్ని ఆనందవర్ధనుడు 'వ్యంగ్యార్థం' లేదా 'ప్రతీయమానార్థం' అని మాత్రమే అన్నాడు కాని ధ్వని అని ఎక్కడా అనలేదు. ఆయన దృష్టిలో 'ధ్వని' అంటే కావ్యమే; వ్యంగ్యార్థం కాదు. (సంస్కృతాలంకారికుల ప్రకారం కావ్యం అనగా చమత్కారజనకమైన ఒక శ్లోకం కావచ్చు, చిన్న వాక్యం కావచ్చు, శ్లోక-వాక్యసముదాయం కావచ్చు. శ్లోకవాక్యాదిసముదాయాలకు లఘుకావ్య-మహాకావ్య-రూపకాదినామధేయాలు ఉండవచ్చు.

అయితే 'కావ్యస్యాత్మా ధ్వనిరితి' ఇత్యాదిప్రథమకారికలోనే ధ్వని కావ్యానికి ఆత్మ అని చెప్పబడింది కదా అని ఆశంకించుకొని ఇక్కడ 'ఆత్మా' అనేదానికి స్వరూపం అని అర్థం అని శుక్లా విశదీకరించారు. ఇంకా అనేకమైన ఇతరస్థలాలలో కూడ ధ్వనిశబ్దానికి ధ్వనికావ్యం అనే అర్థమే చెప్పాలి అని స్పష్టీకరించారు. ఇది ఇలా ఉండగా లోచనకారుడు ధ్వనిశబ్దానికి వ్యంగ్యార్థం, వ్యంజకశబ్దం, వ్యంజనావ్యాపారం, వ్యంగ్యార్థం ఉన్న కావ్యం అని అర్థాలు చెప్పవచ్చును అని ప్రతిపాదించాడు. అయితే ఇది ఆనందవర్ధనుడు చెప్పినదానికి విరుద్ధం అనే విషయం ఆయనకు కూడ తెలుసు. అందుచేతనే - "కారికయా తు ప్రాధాన్యేన ధ్వనిరూప ఏవ కావ్యరూపో ముఖ్యతయా ధ్వనిరితి ప్రతిపాధితమ్" (పేజి 106) ("అయితే కారికలో మాత్రం కావ్యరూపమైన సముదాయానికే ధ్వని అని పేరు అని ప్రతిపాదించబడినది" అని దీని అర్థం).అభినవగుప్తుడు చేసిన ఈ వ్యాఖ్యానంతో తరవాత వచ్చిన చాలమంది అలంకారికులు, పండితులు కూడ 'ధ్వని' 'వ్యఙ్గ్య' శబ్దాలు పర్యాయశబ్దా లన్నట్లు భావించడం జరిగింది. ఈ భావం ఎంత దృఢంగా పాతుకొనిపోయిం దనగా ధ్వని అనగా వ్యంగ్యం కాదు, వ్యంగ్యం ఉన్న కావ్యం అని అంటే ఎవరూ అంగీకరించరు. ఇది అభినవగుప్తుని ప్రౌఢివాదానికి ఒక మచ్చుతునక.

"అనురణనరూపవ్యఙ్గ్యే ధ్వనౌ" ఇత్యాదివాక్యాలకు అర్థం వ్రాస్తున్నప్పుడు 'అనురణనరూపవ్యఙ్గ్యే' అని కాని "అనురణనరూపధ్వనౌ" అని కాని అంటే సరిపోతుంది కదా "అనురణనరూపవ్యఙ్గ్యే ధ్వనౌ" అని అన్నా డెందుకు ఆనందవర్ధనుడు అని సందేహం కలిగినప్పుడు సరియైన సమాధానం దొరకక "అనురణన రూపవ్యంగ్యరూపమైన ధ్వనిలో" ఇత్యాదివిధంగా అర్థం వ్రాశాను. ధ్వనిశబ్దానికి అభినవగుప్తుడు అనావశ్యకంగా వ్యంగ్యశబ్దపర్యాయత్వం తీసికొనివచ్చా డనే భావం నాకు తోచలేదు. వ్యాఖ్యానం అంతా వ్రాసి రెండవ ప్రూఫ్ (మొత్తం గ్రంథం అంతా కంపోజు అయినది) చూస్తున్న రోజులలో నేను శ్రీ శుక్లగారి ధ్వన్యాలోకవ్యాఖ్యాగ్రంథానికి ప్రారంభంలో ఉన్న "ఆవశ్యక నివేదన్" అనే ప్రస్తావన చూడడం జరిగింది. ఆయన ప్రతిపాదించిన విషయం సర్వథా యుక్తిసహంగా ఉన్నట్లు తోచింది. అప్పుడు ప్రూఫ్‌లో వీలున్న చోట్ల కొన్ని మార్పులు చేశాను. పై వాక్యాన్ని ఆనందవర్ధనుడు "అనురణనరూపవ్యంగ్యం గల ధ్వనికావ్యంలో" అనే అర్థంలో ప్రయోగించాడు. అదే విధంగా ఆయన ప్రయోగించిన 'ఉపమాధ్వని' 'రూపకధ్వని' ఇత్యాదిపదాలకు ఉపమ వ్యంగ్యంగా ఉన్న ధ్వనికావ్యం, రూపకం వ్యంగ్యంగా ఉన్న ధ్వనికావ్యం ఇత్యాదివిధాలుగా అర్థాలు చెప్పాలి. ఆయన ఎంతో ఆలోచించి ఇచ్చిన ధ్వనిలక్షణాన్ని పూర్తిగా విస్మరించి మన ఇష్టం వచ్చిన అర్థాలు చెప్పడం అసంగతం కదా? ఈ విషయం తెలుగువారికి కూడా తెలియా లనే అభిప్రాయంతో ఇక్కడ చర్చించడం జరిగింది. ఈ విషయాన్ని గూర్చి అధికంగా తెలుసుకొనదలచిన వారు శుక్లా రచించిన ప్రస్తావన చదువుకొనవచ్చును.

అభినవగుప్తునికి తానేమి చెప్పినా చెల్లిపోతుంది అనే ఆత్మవిశ్వాసం ఎక్కువ. అనేకశాస్త్రపాండిత్యం, ప్రతిభావైశిష్ట్యం ఈ రెండూ ఇందుకు కారణాలు. ఇంతటి మహామేధావి రచించిన వ్యాఖ్యానం సరిగా అర్థం చేసికొనడం కూడ చాల కష్టమైన పని. దీనికి ప్రాచీనవ్యాఖ్యానా లేవైన ఉన్నాయేమో తెలియదు గాని 1867 సంవత్సరంలో కేరళదేశంలో జనించిన రామషారక అనే పండితుడు బాలప్రియ అనే చక్కని వ్యాఖ్యానం వ్రాశాడు. ఈయన కూడ అనేకగ్రంథాలు వ్యాఖ్యలు రచించిన మహాపండితుడు. ఈ వ్యాఖ్య సాహాయ్యంతోనే నేను లోచనాన్ని ("The contribution of Panditaraja to Sanskrit Poetics" అనే గ్రంథం వ్రాసే రోజులలో) అర్థం చేసికొనకలిగాను. ఇప్పుడు తెలుగులో వ్యాఖ్య వ్రాయకలిగాను. ఈ విషయం ఎందుకు చెప్పవలసివచ్చిన దనగా - ఒక హిందీ వ్యాఖ్యారచయిత ఈ వ్యాఖ్యానాన్ని గూర్చి వ్రాస్తూ "ఇదంతా

అవతారికలరూపంలో ఉంది; విషయవివేచనం తక్కువ'' అని అన్నాడు. అది చదవగానే ''పాపం ఈయనకు సంస్కృతవ్యాఖ్యానసంప్రదాయం తెలియదేమో అనిపించింది. మూలంలోని ఒక పేరాలో ఉండే భావా న్నంతనీ స్పష్టమైన మాటలలో చెప్పి ఆ పేరాను ఇంట్రడ్యూస్ చేయడం మహామేధావులైన వ్యాఖ్యాతలు అవలంబించే పద్ధతి. అవతారిక అనగా ముందు రాబోయే విషయంలోనికి పఠితను ప్రవేశింపచేసేది అని అర్థం. ఆనందగిర్యాదులు శాంకరభాష్యాదులకు వ్రాసిన వ్యాఖ్యానాలలో ఈ పద్ధతి చూడవచ్చు. విషయం ఏమీ లేకుండా ఊకదంపుడుగా పేజీలకు పేజీలు వ్రాసేవాళ్లకు ఈ పద్ధతి నచ్చకపోవచ్చును. సంస్కృతభాషలో ఉన్న సంక్షిప్తత్వం వ్యాఖ్యానాదులలో కూడ కనబడుతుంది.

ఇది కాక కేరళదేశీయుడే అయిన శ్రీమదుత్తుంగోదయరాజా (ఈయన రాజవంశానికి చెందినవాడు) రచించిన 'కౌముది' అనే వ్యాఖ్యానం 1944 సంవత్సరంలో మద్రాసులోని కుప్పుస్వామి శాస్త్రి రిసర్చి ఇన్స్టిట్యూట్నుండి ప్రకటించబడింది. కేవలం ప్రథమోద్ద్యోతం మాత్రమే ప్రకటించబడింది. మిగిలిన మూడు ఉద్ద్యోతాలకు కౌముదీవ్యాఖ్య ఉన్నదో లేదో తెలియదు. ఈ వ్యాఖ్య బాలప్రియకంటె కొంచెం విస్తృతంగా ఉంది. మంచి వ్యాఖ్యానం. దీనితో పాటు కుప్పుస్వామిశాస్త్రి గారు రచించిన 'ఉపలోచనం' అనే అతిసంక్షిప్తమైన టిప్పణి కూడ ప్రకటించబడింది. పేరు బాగానే ఉంది కాని సారం ఏమీ లేదు. మొత్తం 166 పంక్తులు ఉన్నాయి. అయితే ఈ పుస్తకంలో పాదికలో ఇచ్చిన పాఠాంతరాలు ఉపయోగకరంగా ఉన్నాయి. ఈ కౌముదీవ్యాఖ్య, పాఠాంతరాలు కూడ నాకు కొన్ని చోట్ల ఉపయోగించాయి. ఈ విధంగా అనేకగ్రంథసాహాయ్యంతో రూపు దిద్దుకొన్నది ఈ బాలానందినీ వ్యాఖ్య.

ఈ వ్యాఖ్యానం వ్రాస్తూన్న రోజులలో ఒకనాడు సహృదయులు, ప్రసిద్ధాంధ్ర మహాకవులు, అలంకారశాస్త్రప్రవీణులు అయిన శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారు ఫోనుచేసినప్పుడు మాటల సందర్భంలో ప్రస్తుతం ఈ వ్యాఖ్య వ్రాస్తున్నా నని చెప్పగా వారు చాల సంతోషించి తాము చాలకాలం క్రితం ఆనందవర్ధనాభినవగుప్తులను గూర్చి వ్రాసిన రెండు పద్యాలు ఫోనులోనే చదివి వినిపించారు. దైవానుగ్రహంచేత ఈ వ్యాఖ్య పూర్తి అయి ముద్రణభాగ్యం పొందినట్లయితే ఆ పద్యాలు దీనిల్లో ప్రారంభంలో ముద్రిస్తే బాగుంటుంది అనే అభిప్రాయం కలిగింది. అయితే అప్పుడు వారితో చెప్పలేదు. వ్యాఖ్య వ్రాయడం పూర్తి అయి ముద్రణం ప్రారంభం అయిన తరవాత

వారితో చెప్పగా వారు సంతోషపూర్వకంగా ఆ పద్యాలు పంపారు. వారి మొదటి నాలుగు పద్యాలు ఈ గ్రంథానికి తిలకాలంకారం వలె ఉన్నాయి. చివరి పద్యం బుగ్గన చుక్క. (అభినవగుప్తాచార్యుని ప్రధానాచార్యులలో ఉత్పలాచార్యులు ఒకరు). వారికి చాల కృతజ్ఞుడను.

ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు భాషాశాస్త్రంలో, విశేషించి ద్రావిడ భాషాశాస్త్రంలో విశ్వవిఖ్యాతి సంపాదించిన మహాపండితులు, సహృదయులు, సాహితీప్రియులు. వారితో మాట్లాడుతున్నప్పుడు వారు ఉదాహరించే తెలుగు పద్యాలు, సంస్కృతశ్లోకాలు విన్నప్పుడల్లా పరిశోధనాప్రధానమైన భాషాశాస్త్రవిషయచింతనతోనే రాత్రింబగళ్లు గడిపేవారికి ఇంత సాహిత్యరుచి కూడా ఉన్నదా అని ఆశ్చర్యం కలుగుతుంది. ఉస్మానియావిశ్వవిద్యాలయంలో, ఆంధ్రరాష్ట్రంలో మరే విశ్వవిద్యాలయంలోనూ లేని భాషాశాస్త్రశాఖ నెలకొల్పి, పీఠాధ్యక్షులై ఈ శాఖకు అంతర్జాతీయగౌరవప్రతిపత్తులను సంపాదించిన మహామనీషి. బాల్యదశలో ఉన్న హైదరాబాదు విశ్వవిద్యాలయానికి ఏడు సంవత్సరాలపాటు కులపతియై దాని సర్వతోముఖాభివృద్ధికి పాటుబడిన కర్మశూరుడు. అస్మద్ధితైషులు. ఈ బాలానందినిని వారికి కృతి ఇవ్వాలనే అభిలాష కలిగి ఫోను చేసి అడగగానే అందుకు అంగీకరించినందుకు వారికి కృతజ్ఞుడను. వారి సప్తతిపూర్తిమహోత్సవం సందర్భంలో ఈ కృతిని సమర్పించడం అధికముదావహం.

ధ్వన్యాలోకానికి తెలుగులో వ్యాఖ్య వ్రాయవలసినదిగా నా మిత్రులు చాలమంది కోరి ఉన్నారు. లోచనం లేని ధ్వన్యాలోకం అసంపూర్ణమే. నాకు దానితో సహా ధ్వన్యాలోకానికి వ్యాఖ్య వ్రాసే శక్తి ఉన్నదా అని సందేహించి చాల కాలం ఉపేక్ష చేశాను. డిస్ట్రిక్ట్ జడ్జిగా రిటైరైన శ్రీ రావినూతుల శ్రీనాథరావుగారితో రెండు సంవత్సరాలక్రితం మాత్రమే నాకు పరిచయమయింది. ఆయన న్యాయాధికారిపదవిలో ఉంటూ అలంకారశాస్త్రంలో మంచి పరిశ్రమ చేశారు. వారు తిరుపతిలో ఉన్నప్పుడు యూనివర్సిటీ లైబ్రరీ నుండి నేను రసగంగాధరంమీద వ్రాసిన The Contribution of Panditaraja to Sanskrit Poetics అనే పుస్తకం తెప్పించుకొని రెండు సంపుటాలూ కూడ అమూలాగ్రంగా చదివి దానిమీద నోట్సు రాసుకున్నారట. దాన్ని ఆధారంగా చేసికొని ఒక పేపరు వ్రాసి ప్రచురించారు. వారి విద్యాశ్రద్ధ అంతటిది. వారు ఒకసారి కలిసినప్పుడు మీరు తప్పకుండా ధ్వన్యాలోకానికి వ్యాఖ్య వ్రాయాలి అని పట్టుపట్టారు. దానితో ప్రారంభించి పూర్తి చేశాను. దీన్ని కంపోజు చేయడం 1997 నవంబరులోనే పూర్తి

అయినది. అది మొదలు ఎప్పుడు బైటకు వస్తుందని పదిరోజుల కొకసారి ఫోను చేస్తూండేవారు. కొద్దివారాల క్రితమే వారు స్వర్గస్థు లయ్యారు. వారు ఈ గ్రంథం చూచి ఉంటే చాల సంతోషించి ఉండేవారు. దైవగతి అచింత్యం.

ధ్వన్యాలోకలోచనాలు మూలాలతో సహా ఈ వ్యాఖ్యానం ముద్రణలో దాదాపు 1100 పేజీలు వచ్చింది. దీని ముద్రణం అధికధనసాధ్యం. దీనిని ముద్రింపచేయడానికి ఉత్సహించిన శ్రీ చలమచర్ల శేషాచార్యులుగారిని అభినందిస్తూ భారతీయులకు గర్వకారణమైన సంస్కృతవాఙ్మయంలోని, విశేషించి శాస్త్రాలలోని కొన్ని అంశాలైనా తెలుగువారికి యథాశక్తిగా స్పష్టమైన రీతిలో అందజేయాలనే నా ప్రయత్నానికి సహకరిస్తున్నందుకు వారికి నా కృతజ్ఞత తెలుపుతున్నాను.

హైదరాబాదు

1.7.1998 పుల్లెల శ్రీరామచంద్రుడు

# మామాట

అలంకారశాస్త్రానికి తలమానికం అనదగ్గ గ్రంథం ఆనందవర్ధన రచితమైన ధ్వన్యాలోకం. దీనికి వ్యాఖ్య అభినవగుప్తుడు రచించిన లోచనం. ఈ రెండూ అలంకారశాస్త్రజిజ్ఞాసువులకు తప్పక అధ్యయనం చేయవలసినవి. ఇవి అర్థం కావాలంటే అలంకారశాస్త్రసంప్రదాయపరిజ్ఞానంతో పాటు, న్యాయ, వ్యాకరణాది శాస్త్రాలలో తగినంత జ్ఞానం తప్పక అవసరం.

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు అలంకారశాస్త్రంలోనూ, న్యాయ వేదాంత, వ్యాకరణాది శాస్త్రాల్లోనూ లబ్ధప్రతిష్ఠులైన పండితులు, కవులు కూడా. వారు ఇదివరకే వక్రోక్తిజీవితం, ఔచిత్యవిచారచర్చ, కావ్యాదర్శం, కావ్యాలంకారం, కావ్యప్రకాశ, కావ్యమీమాంస, కావ్యాలంకారసూత్రవృత్తి మున్నగు అలంకారశాస్త్రగ్రంథాలకూ, లఘుసిద్ధాంతకౌముదికీ పలు వేదాంతగ్రంథాలకూ 'బాలానందిని' పేరుతో తెలుగు అనువాద వ్యాఖ్యానాలు రచించారు. ఆ గ్రంథాలన్నీ విద్యార్థులకూ, ఆచార్యులకూ కూడా ఎంతో ఉపకరించాయి. విద్యార్థిలోకానికి మరింత ఉపకరించాలనే లక్ష్యంతో ధ్వన్యాలోకానికీ, లోచనానికీ కూడా వ్యాఖ్య రచించి, వారు అవసరమైన అన్నిచోట్లా విపులమైన వివరణ లిచ్చారు. మేము ఈ గ్రంథప్రచురణ చేయటానికి ఏమాత్రం ధనాపేక్షా లేకుండా అనుమతించడం వారి సౌజన్యానికి, ఔదార్యానికీ నిదర్శనం. వారికి మా హార్దిక ధన్యవాదాలు.

ఈ గ్రంథం అన్ని స్థాయిలలోని విద్యార్థులకూ ఉపయుక్తమై మన్ననలు పొందగలదని విశ్వసిస్తున్నాము.

ప్రకాశకులు

# విషయసూచిక

## ప్రథమోద్ద్యోతం



## ద్వితీయోద్ద్యోతం



## తృతీయోద్ద్యోతం

## చతుర్థోద్ద్యోతం

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# ధ్వన్యాలోకః

## లోచనసహితః

### బాలానన్దిన్యాఖ్యయా ఆంధ్రభాషావ్యాఖ్యయా అలంకృతః

## ప్రథమః ఉద్ద్యోతః

శ్రీనృహరయే నమః

### ధ్వన్యాలోకః

శ్లో. స్వేచ్ఛాకేసరిణః స్వచ్ఛస్వచ్ఛాయాయాసితేన్దవః,
త్రాయన్తాం వో మధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః.

బాలానందిని

నత్వా శ్రీతాతపాదాదీన్ సర్వశాస్త్రేషు సద్గురూన్,
వివృణోమ్యాన్ధ్రభాషాయాం ధ్వన్యాలోకం సలోచనమ్.

ఆనందవర్ధనుడు 'ధ్వన్యాలోకము' అనే ధ్వనిసిద్ధాంతప్రతిపాదకగ్రంథం రచించడానికి ప్రారంభించి తాను సంకల్పించిన కార్యం నిర్విఘ్నంగా సమాప్తి పొందడానికై స్వేష్టదేవతానమస్కారం చేయుచున్నాడు.

- స్వేచ్ఛేతి. స్వేచ్ఛాకేసరిణః = తన ఇచ్ఛచేత సింహమైన, సింహరూపం ధరించిన, మధురిపోః = శ్రీమహావిష్ణువుయొక్క, స్వచ్ఛస్వచ్ఛాయాయాసితేన్దవః = స్వచ్ఛత్వంచేత, తమ మనోహరమైన ఆకారంచేతా బాధింపబడిన చంద్రుడు గల, 'వీటి పరిశుభ్రత్వం ముందు, వీటి అందమైన ఆకారం ముందు తన కాంతి మొదలైనవి వెలవెలబోవడంచేత చంద్రుడు బాధపడుతున్నాడు అని భావం'. ప్రపన్నార్తిచ్ఛిదః = శరణుజొచ్చినవాళ్ల బాధలను ఛేదించు, నఖాః = గోళ్లు, వః = మిమ్ములను, త్రాయన్తామ్ = రక్షించుగాక.

లోచనమ్

శ్లో. అపూర్వం యద్వస్తు ప్రథయతి వినా కారణకలాం
జగద్గ్రావప్రఖ్యం నిజరసభరాత్సారయతి చ,

క్రమాత్ప్రఖ్యోపాఖ్యాప్రసరసుభగం భాసయతి త
త్సరస్వత్యాస్తత్త్వం కవిసహృదయాఖ్యం విజయతే.

బాలానందిని

ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకం రచించాడు. ధ్వన్యాలోకం అనగా ధ్వనిసిద్ధాంతాన్ని స్పష్టంగా చూపించే వెలుతురు అని అర్థం. ఏ లోపాలూ లేని కన్ను ఉంటేనే కాని వెలుతురు ఉన్నంతమాత్రంచేత ప్రయోజనం లేదు. అందుచేత అభినవగుప్తుడు ధ్వన్యాలోకాన్ని వివరిస్తూ తాను వ్రాసిన వ్యాఖ్యానానికి 'లోచనం' (కన్ను) అని పేరు పెట్టాడు. ఈ లోచనవ్యాఖ్యానం వ్రాయడానికి ప్రారంభించి ఆ కార్యం నిర్విఘ్నంగా పూర్తి అవడం కోసం సంప్రదాయానుసారం సరస్వతీస్మరణరూపమైన మంగళాచరణం చేస్తున్నాడు.

అపూర్వమితి- యత్ = ఏది, కారణకలాం వినా= కారణలేశం కూడా లేకుండగా, అపూర్వమ్= క్రొత్తదైన, వస్తు = వస్తువును, ప్రథయతి =విస్తరింపచేస్తుందో, గ్రావప్రఖ్యమ్= ఱాతితో సమానమైన, జగత్= జగత్తును, నిజరసభరాత్ = తన రసమును నింపడంవల్ల, సారయతి చ= సారంగా, సరసంగా చేస్తుందో, క్రమాత్= క్రమంవలన, ప్రఖ్యోపాఖ్యా ప్రసరసుభగమ్ = ప్రఖ్యోపాఖ్యా ప్రసారంచేత సుందర మయేటట్లుగా లేదా సుందరమై,. భాసయతి= ప్రకాశింపచేస్తుందో, తత్ = అట్టి, కవిసహృదయాఖ్యమ్ = కవి, సహృదయుడు అనే పేరు గల, సరస్వత్యాః తత్త్వమ్ = సరస్వతియొక్క తత్త్వము, విజయతే = సర్వోత్కర్షతో ఉన్నది.

వివరణ :- సకలవాఙ్మయాధిష్ఠానదేవత సరస్వతి. వాఙ్మయంలో ఒక శాఖ అయిన కావ్యానికి కూడా సరస్వతి అధిష్ఠానదేవతయే. కావ్యానికి సంబంధించినంతవరకు ఈ సరస్వతిలో కవి, సహృదయుడూ అనే రెండు తత్త్వాలు ఉన్నాయి. అనగా కవి, సహృదయుడూ ఈ ఇద్దరూ ఉన్నప్పుడే కావ్యసరస్వతీస్వరూపం పరిపూర్ణం అవుతుంది. లోకంలో ఘటం, పటం మొదలైన వస్తువులను సృష్టించడానికి మట్టి, నూలు మొదలైన ఉపాదానకారణాలు, కుమ్మరి, సాలెవాడు మొదలైన నిమిత్తకారణాలూ ఉండాలి. బ్రహ్మ చేసే సృష్టి కూడా ఇలాంటి కారణాలద్వారానే జరుగుతుంది. కాని సరస్వతీతత్త్వం ఇలాంటి కారణా లేవీ లేకుండగానే, అపూర్వమైన, ఇదివరకెన్నడూ కనీ, వినీ ఎరగని వస్తువుల్ని సృష్టిస్తుంది. అందుచేత ఇది చేసే సృష్టి బ్రహ్మదేవుని సృష్టి కంటె కూడా గొప్పది అని ధ్వని. జగత్తులో ఉన్న సారం లేని పదార్థాలను కూడా ఈ సరస్వతి

తత్త్వం తన రసంతో నింపి సారవంతాలను చేస్తుంది. 'ప్రఖ్యా' అనగా కవిప్రతిభ. 'ఉపాఖ్యా' అనగా చెప్పడం. ముందు కవి తన ప్రతిభను ఉపయోగించి మానసికంగా కొన్ని వస్తువుల్ని (ఒకానొక జగత్తును) సృజిస్తాడు. వాటినే (ఆ జగత్తునే) మాటలలో ప్రకటిస్తాడు. ఈ విధంగా చేయకలిగిన కవి, సహృదయుడు అనే రెండు రూపాలలో ఉన్న సరస్వతీతత్త్వం అన్ని తత్త్వాలకంటె ఉత్కర్షతో ప్రకాశిస్తూన్నది. ఏ సరస్వతీతత్త్వం క్రమంగా ప్రతిభా (ప్రఖ్యా) వచనాల (ఉపాఖ్యా) ప్రసారంచేత సుందరమై, అపూర్వవస్తువును ప్రకాశింపచేస్తుందో, శిలవంటి జగత్తును సరసం చేస్తుందో అని కూడా అన్వయం చెప్పుకొనవచ్చు. సరస్వతీతత్త్వం - లేని కొత్త వస్తువును సృష్టించగలదు అని మొదటి వాక్యంలోను, పూర్వమే ఉన్న రసవిహీనమైన వస్తువును సరసం చేస్తుంది అని రెండవ వాక్యంలోను, ఆ రెండింటినీ మనోహరంగా ఉండేటట్లు ప్రకాశింపచేస్తుంది అని మూడవ వాక్యంలోను చెప్పబడినది అని కొందరు వివరించారు. ఈవిధంగా ఈ శ్లోకంలో సరస్వతీమహిమప్రతిపాదనరూపమైన మంగళాచరణం చేయబడింది.

లోచనమ్

భట్టేన్దురాజచరణాబ్జకృతాధివాస
హృద్యశ్రుతోఽభినవగుప్తపదాభిధోఽహమ్,
యత్కించిదప్యనురణన్ స్ఫుటయామి కావ్యా
లోకం స్వలోచననియోజనయా జనస్య.

బాలానందిని

భట్టేన్దురాజచరణాబ్జకృతాధివాసహృద్యశ్రుతః = (గురువైన) భట్టేందురాజుయొక్క పద్మాలవంటి పాదాల దగ్గర నివసించడంచేత, పాదసేవ చేయడం చేత హృదయంలో ఉన్న శాస్త్రాలు గల, భట్టేందురాజు పాదపద్మాల శుశ్రూష చేసి తద్ద్వారా తన హృదయంలో సమస్తశాస్త్రాలు నింపుకొనినవాడు అని అర్థం. పద్మాల సుగంధం ప్రసరించడంచేత మనోహరములైనట్లు తనలో ఉన్న శాస్త్రాలన్నీ గురుచరణపంకజసుగంధప్రసారంచేత మనోహరంగా ఉన్నాయి అని ధ్వని. అధివాసశబ్దానికి పైనుంచి సువాసనను ప్రసరింపచేయడం అని కూడా అర్థం. అభినవగుప్తపదాభిధః = 'అభినవగుప్త' అనే పదం పేరుగా గల, అహమ్ = నేను, యత్కిఞ్చిత్ = ఏమేమో, అనురణన్ అపి = వెనక వెనకనే 'గుఁయ్, గుఁయ్' అని ధ్వని చేస్తున్నా కూడా, అనగా మూలగ్రంథం ఘంటానాదం అయితే దాన్నే అనుసరించి సాగుతూన్న ఈ నా వ్యాఖ్యానం దాని అనునాదం వంటిది,

అనగా దానిని వెంబడించి వినవచ్చే ధ్వనివంటిది అని భావం. స్వలోచననియోజనయా = నా లోచనాన్ని సమకూర్చడంచేత, లోచనం అనగా మనస్సు లేదా ఆలోచన, జ్ఞానం; దానిని జతపరచడంచేత, జనస్య = జనానికి(పాఠకలోకానికి), కావ్యాలోకమ్ = కావ్యాలోకాన్ని, స్ఫుటయామి = స్పష్టం అయేటట్లు చేస్తున్నాను.

vi. ధ్వన్యాలోకానికి 'కావ్యాలోకం' 'సహృదయాలోకం' అనే పేర్లు కూడా ఉన్నాయి. ఆలోకం అనగా వెలుతురు. "ధ్వనికి సంబంధించిన వెలుతురు", "కావ్యానికి సంబంధించిన వెలుతురు", "సహృదయులకు ఉపయోగపడే వెలుతురు" అని ఆ పదాలకి అర్థం. నిర్దుష్టమైన నేత్రం లేకపోతే వెలుతురున్నా ఏమీ ప్రయోజనం ఉండదు. అందుచేత నా లోచనం అనే వ్యాఖ్యానం పఠితలకు నేత్రంవలె ఉపయోగపడుతుంది అని భావం.

లోచనమ్

స్వయమవ్యుచ్ఛిన్నపరమేశ్వరనమస్కారసంపత్తిచరితార్థోఽపి వ్యాఖ్యాతృశ్రోతౄణామ్ అవిఘ్నేన అభీష్టవ్యాఖ్యాశ్రవణలక్షణఫలసంపత్తయే సముచితాశీః ప్రకటనద్వారేణ పరమేశ్వరసాంముఖ్యం కరోతి వృత్తికారః - స్వేచ్ఛేతి.-

బాలానందిని

వృత్తిని రచించిన ఆనందవర్ధనుడు తాను నిరంతరమూ పరమేశ్వరునికి నమస్కారం చేస్తూనే ఉంటాడు. ఆ విధంగా నమస్కారప్రకర్షచేత ఆతడు చరితార్థుడే. అయినా కూడా తన గ్రంథానికి ఎవరైనా మున్ముందు వ్యాఖ్యానం రచించబోతే వాళ్లకీ, తన గ్రంథం వినబోయేవాళ్లకీ (పఠించబోయేవాళ్లకీ) కూడా వాళ్లు కోరుకొనే వ్యాఖ్యారచన - గ్రంథశ్రవణం అనే ఫలాలు లభించడం కోసం తగిన ఆశీస్సును ప్రకటించడం ద్వారా పరమేశ్వరుని విషయంలో సంముఖత్వాన్ని స్వేచ్ఛేత్యాది శ్లోకంద్వారా చేస్తున్నాడు; అనగా ఈ వ్యాఖ్యాతలనూ శ్రోతలనూ కూడా పరమేశ్వరుని ఎదుట నిలబెడుతున్నాడు.

వివరణ: - ధ్వన్యాలోకంలో కారికలు, వృత్తి (కారికలకి వ్యాఖ్యానం), ఉదాహరణాలు అని మూడు విభాగా లున్నాయి. ఏవో కొన్ని తప్ప ఉదాహరణలు చాలావరకు ప్రాచీనకావ్యాలనుంచి గ్రహించినవే. ఇంక కారికలు, వృత్తీ ఈ రెండూ కూడా ఆనందవర్ధనుడే రచించాడా, లేదా పూర్వమే ఉన్న కారికలకి ఆనందవర్ధనుడు వ్యాఖ్యానం మాత్రమే వ్రాశాడా అనేది ప్రశ్న. కారికావృత్తిరచయితలు వేరు వేరు వ్యక్తులు అని కొందరు అభిప్రాయపడగా చాలామంది పండితులు ఈ రెండింటినీ రచించినవాడు

ఆనందవర్ధనుడే అని అంటున్నారు. ఇక్కడ అభినవగుప్తుడు "వృత్తికారుడు ఈ ప్రార్థనాశ్లోకం చెప్పినాడు" అని వ్రాయడాన్ని పట్టి ఇద్దరూ వేరు వేరు వ్యక్తులు అన్నట్లు కనబడుతుంది. మున్ముందు కొన్నిచోట్ల చూస్తే ఇద్దరూ ఒకరే అని ఈయన భావిస్తున్నట్లు కనబడుతుంది. కారికారచయితా వృత్తికారుడూ ఒక్కరే అని నిశ్చితంగా తెలిసిన గ్రంథాలలో కూడా వృత్తికారుడే కారికాకారుణ్ణి గూర్చి ప్రథమపురుషలో నిర్దేశించడం అలవాటుంది. వ్యక్తి అవడానికి ఒకడే; కారికలు వ్రాసిన సమయంలో అతడు ఆ కాలానికి సంబంధించినవాడు; అతడే మళ్లీ లేఖిని తీసికొని వ్యాఖ్యానం వ్రాయడానికి ఉపక్రమించినప్పుడు మరొకకాలానికి సంబంధించినవా డవుతాడు. అందుచేత వేరు వేరు వ్యక్తులుగా భావించి కారికాకారుణ్ణి ప్రథమపురుషలో నిర్దేశించడం జరుగుతుంది. ఇది శాస్త్రగ్రంథాలలో చాలా చోట్ల ఉన్న సంప్రదాయం. ఇలాంటి అభిప్రాయభేదం కావ్యప్రకాశవిషయంలో కూడా ఉంది. ఈ విధంగా ఒక వ్యక్తియే తనను తాను ప్రథమపురుషలో నిర్దేశించుకొంటున్నప్పుడు వ్యాఖ్యాతలు కారికా - వృత్తికారులను వేరు వేరు వ్యక్తు లన్నట్లు నిర్దేశించడంలో ఆశ్చర్యం లేదు. ఇక్కడ అభినవగుప్తుడు వాడిన "...... కరోతి వృత్తికారః" అనే పదాలను పట్టి "స్వేచ్ఛాకేసరిణః" ఇత్యాది శ్లోకం వృత్తి ప్రారంభంలో కూర్చిన మంగళశ్లోకం, కారికల ప్రారంభంలోనిది కాదు అని మాత్రమే మనం గ్రహించాలి.

లోచనం

మధురిపోః నఖాః వః యుష్మాన్, వ్యాఖ్యాతృశ్రోతౄంస్త్రాయన్తామ్. తేషామేవ సంబోధనయోగ్యత్వాత్; సంబోధనసారో హి యుష్మదర్థః. త్రాణం చాభీష్టలాభం ప్రతి సాహాయకాచరణమ్. తచ్చ తత్ప్రతిద్వన్ద్వి విఘ్నాపసరణాదినా భవతీతి, ఇయదత్ర త్రాణం వివక్షితమ్. నిత్యోద్యోగినశ్చ భగవతః అసంమోహాధ్యవసాయయోగిత్వేన ఉత్సాహప్రతీతేః వీరరసో ధ్వన్యతే.

బాలానందిని

మధువు అనే రాక్షసుని శత్రువైన శ్రీమహావిష్ణువుయొక్క, నఖాః = గోళ్లు, వః = మిమ్ములను, అనగా వ్యాఖ్యాతలను, శ్రోతలను; త్రాయన్తామ్= రక్షించుగాక. ఇలాంటి గ్రంథాల ప్రారంభంవంటి సందర్భాలలో సంబోధన చేయడానికి తగినవాళ్లు వ్యాఖ్యాతలు శ్రోతలూ మాత్రమే. అందుచేత వాళ్లనే సంబోధిస్తున్నట్లు గ్రహించాలి. ఎవళ్లైతే సంబోధించబడతారో వాళ్లనే యుష్మచ్ఛబ్దంచేత నిర్దేశించడం జరుగుతుంది. అందుచేత యుష్మచ్ఛబ్దానికి (ఇక్కడ వః అనేదానికి) సంబోధించబడేవాళ్లే ప్రధానమైన అర్థం.

ఇక్కడ త్రాణం (రక్షించడం) అనగా ఇష్టమైనది లభించడం విషయంలో సాహాయ్యం చేయడం. ఈ సాహాయ్యం చేయడం, ఇష్టలాభానికి అడ్డుతగిలే విఘ్నాలను తొలగించడం మొదలైన పనుల ద్వారా జరుగుతుంది. అందుచేత ఇక్కడ ఈ విధమైన త్రాణం (రక్షణం) మాత్రమే వివక్షితం అయినది. అనగా చెప్పడానికి ఉద్దేశించబడింది. భగవంతుడు ఎల్లప్పుడూ కూడ ఉద్యమశీలుడు. అందుచేత ఆయనలో ఏమాత్రం పొరబాటు ఉండదు; దృఢమైన నిశ్చయం ఉంటుంది. ఈ విధంగా ఆయనలో గొప్ప ఉత్సాహం ఉన్నది అని ప్రతీయమానం అవడంచేత ఇక్కడ (ఉత్సాహం స్థాయిభావంగా గల) వీరరసం ధ్వనించబడుతున్నది. అనగా త్రివిధధ్వనులలో ఒకటైన రసధ్వని ఈ శ్లోకంలో ఉందని భావం.

లోచనం

నఖానాం ప్రహరణత్వేన ప్రహరణేన చ రక్షణే కర్తవ్యే నఖానా మవ్యతిరిక్తత్వేన కరణత్వాత్, సాతిశయశక్తితా కర్తృత్వేన సూచితా, ధ్వనితశ్చ పరమేశ్వరస్య వ్యతిరిక్తకరణాపేక్షావిరహః. మధురిపోః ఇత్యనేన తస్య సదైవ జగత్త్రాసాపసరణోద్యమః ఉక్తః.

బాలానందిని

గోళ్లు (వ్యాఘ్రాల) ఆయుధాలు. రక్షణం చేయడం విషయంలో ఈ నఖాలు ఇక్కడ కరణాలు, అనగా సాధనాలు. అవ్యతిరిక్తసాధనాలు. వాటికి కర్తృత్వం చెప్పబడడంచేత వాటి శక్తి అత్యద్భుతమైనది అనే విషయం సూచించబడింది. పరమేశ్వరునికి వ్యతిరిక్తమైన మరే కరణం అపేక్షా లేదు అని ధ్వనింపబడింది. 'మధురిపోః' అనడంచేత పరమేశ్వరుడు జగత్తుకు కలిగే భయాన్ని తొలగించడానికి ఎల్లప్పుడూ ఉద్యుక్తుడై ఉంటాడు అనే విషయం చెప్పబడింది.

వివరణ. వ్యాఘ్రాదులు తమ గోళ్లను ఇతరమృగాలను చంపడానికి సాధనంగా ఉపయోగించుకుంటాయి. అందుచేత అవి ఆ వ్యాఘ్రాదులకు కరణాలు. ఏదైనా ఒక పనిని సాధించడానికి తప్పకుండా అవసర మయేదానికి (కొమ్మ నరకడానికి కత్తి వలె) 'కరణం' అని పేరు, బాహ్యం, అభ్యంతరం అని కరణం రెండు రకాలు. కత్తి మొదలైనవి బాహ్యకరణాలు. హస్తం మొదలైనవి అభ్యంతరకరణాలు ఇక్కడ రక్షణకు కరణాలు అని చెప్పిన నఖాలు అభ్యంతరకరణాలు. శరీరం కంటె వేరుగా లేవు. అందుచేత అవి అవ్యతిరిక్త (విడిగా లేని) కరణం. "దేవదత్తః అసినా శాఖాం

ఛినత్తి" (దేవదత్తుడు కత్తితో కొమ్మ నరుకుతున్నాడు) ఇత్యాదివాక్యాలలో దేవదత్తుడు కర్త. కరణం అసి. దానిని తృతీయావిభక్తిలో ప్రయోగించడం జరిగింది. అలా కాకుండా "అసిః శాఖాం ఛినత్తి" (కత్తి కొమ్మను నరికివేస్తూన్నది) అని ప్రయోగిస్తే కరణమైన కత్తి కర్తగా చెప్పబడింది. ఈ విధంగా కరణంగా చెప్పవలసినదానిని కర్తగా చెప్పడంచేత ఆ కత్తి ఛేదనకార్యాన్ని అనాయాసంగా నిర్వహిస్తూన్నది అని సూచితం అవుతుంది. ఒక పనిని అనాయాసంగా జరుపుతున్నట్లు చెప్పాలనే ఉద్దేశంతో (వివక్షతో) కర్మ - కరణ - అధికరణాలను కర్తలుగా భావించి వాక్యనిర్మాణం చేసే పద్ధతి సంస్కృతభాషలో ఉన్నది. " కాష్ఠాని భిద్యన్తే" (కఱ్ఱలు పగిలిపోతున్నాయి - గొడ్డలి తగిలీ తగలకుండానే బద్దలైపోతున్నాయి అని అర్థం) "కుఠారః ఛినత్తి" (గొడ్డలి ఛేదిస్తూన్నది),"స్థాలీ పచతి" (పాత్ర వండుతూన్నది) ఇత్యాదులు ఉదాహరణలు. ప్రకృతంలో "మధురిపువు నఖాలచేత మిమ్మల్ని రక్షించుగాక" అనడానికి బదులు "నఖాలు రక్షించుగాక" అని నఖాలకు కర్తృత్వం చెప్పబడింది. దీనిని పట్టి రక్షణవిషయంలో నఖాలకు అత్యధికమైన శక్తి ఉన్నది అని సూచించబడుతున్నది. పరమేశ్వరుడు మిమ్మల్ని రక్షించడానికి ఆయన నఖాలే చాలు; ఇతర ఆయుధాలతో పని లేదు అనే వస్తువు (విషయం) ఇక్కడ ధ్వనింపబడింది. లోకానికి బాధ కలిగించిన మధువు అనే వాణ్ణి సంహరించినవాడు అని 'మధురిపోః' అనడంచేత పరమేశ్వరుడు జగత్తుకు కలిగిన భయాన్ని తొలగించడానికి సర్వదా ఉద్యుక్తు డయే ఉంటాడు అనే వస్తువు కూడ ధ్వనించబడుతున్నది.

**లోచనం**

కీదృశస్య మధురిపోః? స్వేచ్ఛయా కేసరిణః, నతు కర్మపారతన్త్ర్యేణ, నాప్యన్యదీయేచ్ఛయా; అపి తు విశిష్టదానవహననోచితతథావిధేచ్ఛా పరిగ్రహౌచిత్యాదేవ స్వీకృతసింహరూపస్యేత్యర్థః. కీదృశాః నఖాః? ప్రపన్నానామార్తిం యే ఛిన్దన్తి; నఖానాం హి ఛేదకత్వముచితమ్. ఆర్తేః పునః ఛేద్యత్వం నఖాన్ ప్రత్యసంభావనీయమపి తదీయానాం నఖానాం స్వేచ్ఛా నిర్మాణౌచిత్యాత్ సంభావ్యత ఏవేతి భావః. అథవా త్రిజగత్కణ్టకో హిరణ్యకశిపుః విశ్వస్యోత్క్లేశకర ఇతి స ఏవ వస్తుతః ప్రపన్నానాం భగవదేకశరణానాం జనానామార్తికారిత్వాత్ మూర్తైవార్తిః; తం వినాశయద్భిరార్తిరేవోచ్ఛిన్నా భవతీతి పరమేశ్వరస్య తస్యామప్యవస్థాయాం పరమకారుణికత్వముక్తమ్.

బాలానందిని

ఎలాంటి మధురిపువు యొక్క? తన కోరికచేత సింహంగా అయిన మధురిపువు యొక్క. అంతేనే కాని కర్మకు అధీను డవడంచేత కాని, ఇతరుల ఇచ్ఛచేత గాని అయినవాడు కాదు. మరేమనగా సాధారణరీతులలో చంపడానికి శక్యం కాకపోవడం అనే ఒక విశేషం ఉన్న ఒక దానవుణ్ణి సంహరించడానికి తగిన ఆ విధమైన ఇచ్ఛను స్వీకరించడంలోని ఔచిత్యంవల్లనే సింహరూపాన్ని స్వీకరించినవాడు అని అర్థం. ఎలాంటి గోళ్లు? శరణు జొచ్చిన వాళ్ల బాధలను ఛేదించే గోళ్లు. గోళ్లు త్రుంచివేయకలగడం యుక్తమే. అయితే బాధ నఖాలచేత త్రుంచివేయబడడం అనేది మాత్రం ఊహించ శక్యం కానిది. అయినా కూడ ఈతని నఖాలు తన ఇచ్ఛానుసారం సృష్టించబడి ఉండడంచేత బాధకు వాటిచేత ఛేద్యత్వం (ఛేదించడానికి శక్యం అయి ఉండడం) సంభావ్యమే అని భావం. లేదా - మూడు లోకాలకీ కంటకం అయిన హిరణ్యకశిపుడు ప్రపంచకాని కంతకీ క్లేశం కలిగించేవాడు అవడంచేత భగవంతుణ్ణి ఒక్కనినే నమ్ముకొని ఉన్నభక్తులకు కూడ ఆర్తిని (పీడను) కలిగిస్తూ సాక్షాత్తు అతడే మూర్తీభవించిన ఆర్తి వలె ఉన్నాడు. అలాంటి హిరణ్యకశిపుణ్ణి నశింపచేసిన నఖాలు ఆర్తినే నశింపచేసిన ట్లవుతుంది. ఈ విధంగా ఆ అవస్థలో కూడ (రౌద్రనృసింహరూపంలో ఉన్నప్పుడు కూడ) పరమేశ్వరుడు ఎంతో కారుణికుడు అనే వస్తువు ధ్వనింపబడుతున్నది.

లోచనం

కిం చ తే నఖాః స్వచ్ఛేన= స్వచ్ఛతాగుణేన నైర్మల్యేన; స్వచ్ఛ మృదుప్రభృతయో హి ముఖ్యతయా భావవృత్తయ ఏవ. స్వచ్ఛాయయా చ = వక్రహృద్యరూపయా ఆకృత్యా, ఆయాసితః = ఖేదితః ఇన్దుః యైః. అత్రార్థశక్తిమూలేన ధ్వనినా బాలచన్ద్రత్వం ధ్వన్యతే. ఆయాసనేన తత్సన్నిధౌ చన్ద్రస్య విచ్ఛాయత్వప్రతీతిరహృద్యత్వప్రతీతిశ్చ ధ్వన్యతే. ఆయాసకారిత్వం చ నఖానాం సుప్రసిద్ధమ్. నరహరినఖానాం తచ్చ లోకోత్తరేణ రూపేణ ప్రతిపాదితమ్. కిం చ తదీయాం స్వచ్ఛతాం కుటిలిమానం చ అవలోక్య బాలచన్ద్రః స్వాత్మని ఖేదమనుభవతి; తుల్యేఽపి స్వచ్ఛకుటిలాకారయోగే అమీ ప్రపన్నార్తినివారణకుశలాః, న త్వహమితి వ్యతిరేకాలఙ్కారోఽపి ధ్వనితః. కిం చాహం పూర్వమేక ఏవ అసాధారణవైశద్యహృద్యాకారయోగాత్ సమస్త

జనాభిలషణీయతాభాజనమభవమ్, అద్య పునరేవంవిధా నఖా దశ బాలచన్ద్రాకారాః సంతాపార్తిచ్ఛేదకుశలాశ్చేతి తానేవ లోకో బాలేన్దుబహుమానేన పశ్యతి; న తు మా మిత్యాకలయన్ బాలేన్దురవిరతమాయాసమనుభవతీవ ఇత్యుత్ప్రేక్షాపహ్నుతిధ్వనిరపి. ఏవం వస్త్వలఙ్కారరసభేదేన త్రిధా ధ్వనిరత్ర శ్లోకే అస్మద్గురుభిర్వ్యాఖ్యాతః.

బాలానందిని

అంతే కాకుండా ఆ గోళ్లు, స్వచ్ఛేన = స్వచ్ఛత్వం అనే గుణంచేత, అనగా నిర్మలత్వం చేత; 'స్వచ్ఛ' 'మృదు' మొదలైన పదాలు ప్రధానంగా భావాన్నే (స్వచ్ఛత్వం, మృదుత్వం మొదలైన ధర్మాన్నే) బోధిస్తాయి కదా. స్వచ్ఛమైనది, మృదువైనది ఇత్యాద్యర్థాలు లాక్షణికాలు అని అర్థం. స్వచ్ఛాయయా చ= వంకరగా, మనోహరంగా ఉన్న తమ ఆకారం చేతా, ఏ నఖాలచేత చంద్రుడు ఖేదం కలవాడుగా చేయబడినాడో ( ఏ నఖాలు చంద్రుణ్ణి బాధపెట్టినాయో) అట్టివాటిచేత. ఇక్కడ అర్థశక్తిమూలకమైన ధ్వనిచేత బాలచంద్రత్వం ధ్వనింపబడుతున్నది. అనగా - మనోహరమైన ఆకారంచేత ఆయాసపెట్టడం అనే అర్థంలోని శక్తిలో ఉన్న ధ్వనిచేత (వ్యంజనావ్యాపారంచేత) ఇక్కడ ఆయాస పెట్టబడుతూన్న చంద్రుడు పూర్ణచంద్రుడు కాడు, బాలచంద్రుడు అని ధ్వనింపచేయబడుతున్నది. వక్రనఖాలు తమ పోలిక ఉన్న వక్రచంద్రుడికే బాధ కలిగిస్తాయి కాని పూర్ణచంద్రునికి కలిగించవు కదా అని అర్థం. ఆయాసపెట్టడం అనడం చేత (చంద్రునికి నిజంగా ఖేదం అనేది ఉండదు గాన) వాటి దగ్గర చంద్రుడు కాంతిహీనుడైనాడు అనే అర్థం, మనోహరంగా లేడు అనే అర్థం, ధ్వనివ్యాపారంచేత బోధింపబడుతున్నాయి (ధ్వన్యతే). నఖాలు ఆయాసాన్ని (ఖేదాన్ని) కలిగిస్తాయి అనే విషయం సుప్రసిద్ధమే. నరహరినఖాల కున్న ఆ ఆయాసకారిత్వం అలౌకికమైన పద్ధతిలో ప్రతిపాదించబడింది. ఈ విధంగా నరహరినఖాలకి ఇతరనఖాలకంటె వైశిష్ట్యం ఉన్నట్లు సూచించబడింది. అందుచేత వ్యతిరేకాలంకారధ్వని. వాటి స్వచ్ఛత్వాన్నీ, వక్రత్వాన్నీ చూడగానే చంద్రుడు - "నాకూ వీటికీ కూడా స్వచ్ఛత్వం, కుటిలత్వం కూడా సమానంగానే ఉన్నా శరణుజొచ్చిన వాళ్ల ఆర్తిని నివారించే సామర్థ్యం వీటికే ఉంది. నాకు లేదు కదా" అని అనుకుంటూండడంచేత (ఉపమానభూత బాలచంద్రునికంటె ఉపమేయభూతనఖాలకి వైశిష్ట్యం సూచింపబడడంచేత) మరొక వ్యతిరేకాలంకారధ్వని కూడ ఉన్నది. ఇంకా ఏమనగా గొప్ప స్వచ్ఛత్వం, మనోహరమైన ఆకారం ఉండడంచేత

పూర్వం లోకులు నన్ను మాత్రమే గౌరవభావంతో చూసేవారు. ఇప్పుడు బాలచంద్రాకారంలో ఉన్న ఇలాంటి పది నఖాలు వచ్చాయి. సంతాపరూపమైన పీడను కూడ తొలగిస్తున్నాయి అనే అభిప్రాయంతో ఈ లోకులు వాటినే గౌరవాభిమానంతో చూస్తున్నారు. కాని నన్ను చూడడం లేదు అని బాలేందువు నిరంతరమూ మనః ఖేదాన్ని అనుభవిస్తున్నాడా అన్నట్లున్నాడు అని ఉత్ప్రేక్షాపహ్నుత్యలంకారధ్వని కూడ ఉన్నది. ఈ విధంగా ఈ శ్లోకంలో వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని అనే మూడు విధాలైన ధ్వనీ కూడా ఉన్నదని మా గురువులు వివరించారు.

ఏ. లోకు లందరూ నఖాలలో ఉన్న నఖత్వాన్ని నిషేధించి, వాటిమీద బాలచంద్రత్వాన్ని ఆరోపిస్తున్నారు. ఇవి నఖాలు కాదు, బాలచంద్రులు అనుకుంటున్నారు. అందుచేత అపహ్నుత్యలంకారం. నా విషయంలో లోకుల కుండే బహుమానం తగ్గిపోయినది కదా అని చంద్రుడు దుఃఖిస్తున్నట్లు ఊహించబడింది. అందుచేత ఉత్ప్రేక్షాలంకారం. ఇలా ఉత్ప్రేక్షించడానికి కారణం నఖాలమీద (నఖత్వాన్ని నిషేధించి) చంద్రత్వాన్ని ఆరోపించడం అనే అపహ్నవాలకారం. అందుచేత అపహ్నవాలంకారం అంగం; ఉత్ప్రేక్షాలంకారం అంగి. 'ఉత్ప్రేక్షాపహ్నుతి' అనగా ఉత్ప్రేక్షకు ఉపకరించే (అంగంగా ఉన్న) అపహ్నుత్యలంకారం అని అర్థం. అనగా ఈ రెండు అలంకారాలు అంగాంగిభావంతో కలిసిపోవడంచేత సంకరధ్వని (ధ్వన్యమానాలంకారద్వయసంకరం).

## ధ్వన్యాలోకం

**కా. కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైర్యః సమామ్నాతపూర్వః**
**తస్యాభావం జగదురపరే భాక్తమహుస్తమన్యే,**
**కేచిద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచుస్తదీయం**
**తేన బ్రూమః సహృదయమనఃప్రీతయే తత్స్వరూపమ్. 1**

### బాలానందిని

కావ్యస్య = కావ్యంయొక్క, ఆత్మా = ఆత్మ, ధ్వనిః ఇతి =ధ్వని అని, యః = ఏది, సమామ్నాతపూర్వః = పూర్వం చెప్పబడినదో, అపరే = కొందరు, తస్య = దానియొక్క, అభావమ్ = లేకపోవుటను, జగదుః = చెప్పినారు. అన్యే = మరికొందరు, తమ్ = దానిని, భాక్తమ్ = గౌణమునుగా, ఆహుః = చెప్పుచున్నారు. కేచిత్ = మరికొందరు, తదీయమ్ = దానికి సంబంధించిన, తత్త్వమ్ = తత్త్వమును, వాచామ్

= వాక్కులయొక్క, అవిషయే=విషయముకాకపోవుటయందు, స్థితమ్ = ఉన్నదానినిగా, ఊచుః= చెప్పిరి. తేన= ఆ కారణంచేత, సహృదయమనః ప్రీతయే = సహృదయుల మనస్సుయొక్క సంతోషంకోసం, తత్స్వరూపమ్ = దాని స్వరూపమును, బ్రూమః = చెప్పుచున్నాము.

## ధ్వన్యాలోకం

బుధైః కావ్యతత్త్వవిద్భిః, కావ్యస్యాత్మా ధ్వనిరితి సంజ్ఞితః పరమ్పరయా యః సమామ్నాతపూర్వః సమ్యక్ ఆ సమన్తాత్ మ్నాతః ప్రకటితః, తస్య సహృదయజనమనఃప్రకాశమానస్యాపి అభావమ్ అన్యే జగదుః. తదభావవాదినాం చామీ వికల్పాః సంభవన్తి. తత్ర కేచిదాచక్షీరన్- శబ్దార్థశరీరం తావత్కావ్యమ్. తత్ర చ శబ్దగతాః చారుత్వహేతవః అనుప్రాసాదయః ప్రసిద్ధా ఏవ; అర్థగతాశ్చోప మాదయః. సంఘటనాధర్మాశ్చ యే మాధుర్యాదయః తేఽపి ప్రతీయన్తే. తదనతిరిక్తవృత్తయో వృత్తయోఽపి యాః కైశ్చిదుప నాగరికాద్యాః ప్రకాశితాః తా అపి గతాః శ్రవణగోచరమ్. రీతయశ్చ వైదర్భీప్రభృతయః. తద్వ్యతిరిక్తః కోఽయం ధ్వనిర్నామేతి?

### బాలానందిని

బుధైః : కావ్యతత్త్వం తెలిసినవాళ్లచేత, కావ్యాత్మ పేరు "ధ్వని" అని "ధ్వని" బాగా, అంతటా ప్రకటింపబడింది. అలాంటి కావ్యాత్మ అయిన ధ్వని సహృదయుల మనస్సులలో ప్రకాశిస్తూనే ఉంది. అయినా కొందరు ధ్వని అనేది లేదు అని అన్నారు. ధ్వని లేదనే వాళ్లు చెప్పే వికల్పాలు ఈ విధంగా ఉండవచ్చు. వాళ్లల్లో (ధ్వన్యభావవాదులలో) కొందరు ఈ విధంగా చెప్పవచ్చు. - శబ్దార్థాలే కదా కావ్యానికి శరీరం? ఆ రెండింటిలో ( తత్ర చ) శబ్దాల సౌందర్యానికి హేతువులైన అనుప్రాసాదులు శబ్దాలకు సంబంధించి ఉంటాయి. అవి అందరికీ తెలిసినవే. అర్థానికి సంబంధించిన ఉపమ మొదలైన అర్థాలంకారాలు కూడా అందరికీ తెలిసినవే. మాధుర్యం మొదలైనవి వర్ణాల కూర్పుకు సంబంధించినవి. అవి కూడా అందరికీ తెలుస్తూనే ఉన్నాయి.

కొందరు 'ఉపనాగరిక' మొదలైన వృత్తులు ఉన్నాయి అని అంటారు. నిజానికి అవి వర్ణసంఘటనాధర్మాలే. వాటిని కూడా వింటున్నాం. 'వైదర్భి' మొదలైన రీతులు కూడా ఉన్నాయి. అవి కూడా అందరూ వింటూన్నవే. వీటికి అన్నింటికీ భిన్నంగా 'ధ్వని' అంటూ ఇదేమిటి! (ఇది ధ్వన్యభావవాదాలలో మొదటి వాదం)

లోచనం

అథ ప్రాధాన్యేనాభిధేయస్వరూపమభిదధత్ అప్రధానతయా ప్రయోజన ప్రయోజనం, తత్సంబద్ధం ప్రయోజనం చ సామర్థ్యాత్ ప్రకటయన్ ఆదివాక్యమాహ కావ్యస్యాత్మేతి. కావ్యాత్మశబ్దసంనిధానాత్ బుధశబ్దోఽత్ర కావ్యాత్మావబోధనిమిత్తక ఇత్యభిప్రాయేణ వివృణోతి - కావ్యతత్త్వవిద్భిః ఇతి. ఆత్మశబ్దస్య తత్త్వశబ్దేనార్థం వివృణ్వానః సారత్వమ్, అపరశాబ్ద వైలక్షణ్యకారిత్వం చ దర్శయతి. ఇతిశబ్దః స్వరూపపరత్వం ధ్వనిశబ్దస్యాచష్టే, తదర్థస్య వివాదాస్పదీభూతతయా నిశ్చయాభావేనార్థత్వాయోగాత్. ఏతద్వివృణోతి సంజ్ఞితః ఇతి. వస్తుతస్తు న తత్ సంజ్ఞామాత్రేణోక్తమ్. అపి తు అస్త్యేవ ధ్వనిశబ్దవాచ్యం ప్రత్యుత సమస్తసారభూతమ్. న హ్యన్యథా బుధాః తాదృశమామనేయురితి అభిప్రాయేణ వివృణోతి - తస్య సహృదయేత్యాదినా.

బాలానందిని

**అథేతి**:- అథ = గ్రంథం ప్రారంభించబడుతున్నది. ప్రధానంగా అభిధేయస్వరూపం చెపుతూ, అప్రధానమైన ప్రయోజనప్రయోజనాన్నీ దానితో సంబంధించిన ప్రయోజనాన్నీ సామర్థ్యంవల్ల సూచిస్తూ 'కావ్యస్యాత్మా' అని మొదటి వాక్యం చెపుతున్నాడు.

వి. ధ్వన్యాలోకం అనే ఈ గ్రంథంలో ప్రధానంగా ప్రతిపాదించబడే విషయం (అభిధేయం) ధ్వనిస్వరూపం. ధ్వనిస్వరూపజ్ఞానం ప్రయోజనం. దానికి (ధ్వనిస్వరూప జ్ఞానానికి) ప్రయోజనం ప్రీతి; అనగా ఆనందం. ఈ విషయమే " తత్స్వరూపం సహృదయమనఃప్రీతయే బ్రూమః" అని చెప్పబడింది. "ధ్వనిస్వరూపాన్ని సహృదయుల ప్రీతికోసం చెపుతున్నాము" అనడంలో ప్రధానంగా చెప్పబడేది ధ్వనిస్వరూపం అని చెప్పినట్లయింది. ధ్వనిస్వరూపాన్ని చెప్పినందుకు ప్రయోజనం ఏమిటి? సహృదయుల మనస్సుకు ప్రీతి. ఇది అప్రధానం. ప్రధానంగా ప్రతిపాదించే ధ్వనిస్వరూపం దృష్ట్యా అది అప్రధానమే కదా? ఈ ప్రీతి ఎలా కలుగుతుంది? ధ్వనిస్వరూపం తెలుసుకుంటే

కలుగుతుంది. అందుచేత ధ్వనిస్వరూపం ప్రతిపాదించడానికి ప్రయోజనం దాని జ్ఞానం అనీ, దాని ప్రయోజనం ప్రీతి అనీ తేలింది. ఈ విధంగా ధ్వనిప్రతిపాదన ప్రయోజనమైన ధ్వనిస్వరూపజ్ఞానాన్ని, దాని ప్రయోజనమైన ప్రీతిని పేర్కొనడం ద్వారా, తత్సామర్థ్యంచేత, (అనగా వాచ్యంగా కాకుండా) సూచించినట్లయింది.

కావ్యేతి:- 'కావ్యాత్మ' శబ్దం దగ్గరఉండడంచేత 'బుధ' శబ్దానికి కావ్యాత్మను తెలుసుకొన్నవారు అని అర్థం అనే అభిప్రాయంతో "బుధైః" అనే పదానికి " కావ్యతత్త్వం తెలిసినవాళ్లచేత" అని అర్థాన్ని వివరిస్తున్నాడు. "కావ్యాత్మవిద్భిః", " అని కాకుండా " కావ్యతత్త్వవిద్భిః," అనడంచేత "కావ్యాత్మ, అనేదానికి "కావ్యతత్త్వం' అని అర్థం సూచిస్తూ అదేసారం అనీ, అది శబ్దాలవల్ల కలిగే ఇతర విధాలైన బోధల (జ్ఞానం) కంటె విలక్షణమైన దనీ చూపుతున్నాడు. "ధ్వనిః ఇతి" అని 'ఇతి' శబ్దం ప్రయోగించబడింది. అందుచేత ఇక్కడ 'ధ్వని' శబ్దానికి 'ధ్వని' అనే శబ్దమే అర్థం. అనగా కావ్యాత్మకు 'ధ్వని' అని పేరు అని చెప్పినట్లయింది. ధ్వనిశబ్దానికి అర్థం ఏమిటి అనేది వివాదాస్పదంగానే ఉంది, ఇంకా తేలలేదు. అలాంటప్పుడు ఇక్కడ 'ధ్వని' శబ్దానికి అర్థం ఆ శబ్దమే కాని దానికి ఏది అర్థం అని చెప్పబోతున్నారో అది కాదు. ఈ విషయాన్నే 'సంజ్ఞితః' (ధ్వని, అని పేరు గలది) అని వివరిస్తున్నాడు.

వి. "ఇతి శబ్దః పదార్థవిపర్యాసకృత్" అని ఒక న్యాయం ఉంది. అనగా ఒక పదం ప్రక్కన ' ఇతి' చేర్చగానే ఆ పదం అర్థం మారిపోతుంది అని అర్థం. " గౌ ః ఆగచ్ఛతి' ' అనే వాక్యంలో 'గౌ ః' అనేదానికి 'గోవు' అని అర్థం. 'గోవు వస్తూన్నది' అని వాక్యానికి అర్థం. అయితే "గౌః ఇతి ఆహ" అన్నప్పుడు 'గౌః' అని అంటున్నాడు అని అర్థం. ఇక్కడ 'గౌః' పక్కన 'ఇతి' ఉండడంచేత 'గౌః' అనే పదానికి అర్థం 'గౌః' అనే పదమే కాని 'గోవు' అనేది కాదు. అదే విధంగా ఇక్కడ వృత్తిలో "కావ్యస్యాత్మా ధ్వనిః ఇతి సంజ్ఞితః" అన్నప్పుడు 'ధ్వనిః' పక్కన 'ఇతి' ఉండడంచేత దీనికి ('ధ్వనిః' అనేదానికి) 'ధ్వని' అనే పదమే అర్థం. వ్యంగ్యం ఇత్యాదికార్థం తీసికొనకూడదు అని భావం.

ఈ విధంగా వృత్తికారుడు వ్రాసినదానిని బట్టి కావ్యాత్మకు (అది ఏదైనా కావచ్చును) 'ధ్వని' అని పేరు అని చెప్పినట్లయింది. అయితే 'ఇతి' అనే దానికి 'ధ్వనిః' అనే దాని ప్రక్క చేర్చకుండా మరొక విధంగా చెప్పడం మంచి దని లోచనకారుడు చెప్పబోతున్నాడు.

వస్తుతస్తు ఇతి :- నిజానికి 'ధ్వని' అనేది పేరు మాత్రమే కాదు; 'ధ్వని' శబ్దానికి అర్థమైన, ఆ శబ్దంచేత ప్రతిపాదించబడే, అన్నింటిలోకి సారమైనది ఒకటి ఉండనే ఉన్నది. అలా కాకపోతే బుధులు అలాంటిదానిని చెప్పరు కదా అని "తస్య సహృదయ' ' ఇత్యాదివాక్యంచేత వివరిస్తున్నాడు.

లోచనం

ఏవం తు యుక్తతరమ్ :- ఇతిశబ్దో భిన్నక్రమః వాక్యార్థపరామర్శకః; ధ్వని లక్షణోఽర్థః కావ్యస్యాత్మేతి యః సమామ్నాతః ఇతి. శబ్దపదార్థకత్వే హి ధ్వనిసంజ్ఞితోఽర్థ ఇతి కా సంగతిః? ఏవం చ ధ్వనిశబ్దః కావ్యస్యాత్మేత్యుక్తం భవేత్, గవిత్యయమాహేతి యథా. న చ విప్రతిపత్తిస్థానమసదేవ; ప్రత్యుత సత్యేవ ధర్మిణి ధర్మమాత్రకృతా విప్రతిపత్తిః ఇత్యల మప్రస్తుతేన భూయసా సహృదయోద్వేజనేన.

బాలానందిని

ఏవమితి:- కాని ఇలా చెపితే ఇంకా బాగుంటుంది. "కావ్య స్యాత్మా ధ్వనిరితి' ' అన్న చోట ఉన్న 'ఇతి' శబ్దాన్ని 'ధ్వని' అనే దాని ప్రక్కనుంచి తీసి 'కావ్యస్యాత్మా' అనే పదాల చివర చేరిస్తే అప్పుడు 'ఇతి' అనేది "ధ్వనిః కావ్యస్య ఆత్మా" అనే వాక్యాన్ని నిర్దేశిస్తుంది. అప్పుడు "ధ్వనిరూపమైన ఏ అర్థం కావ్యాత్మ అని చెప్పబడిందో" అనే అర్థం ఏర్పడుతుంది. (ఇది బాగుంటుంది). అలా కాకుండా 'ధ్వని' అనేదానికి 'ధ్వని' శబ్దమే అర్థం అని చెప్పి "ధ్వని అనే పేరుగల అర్థం" అని అర్థం చెప్పుకుంటే ఏం బాగుంటుంది? అలా చెప్పిన పక్షంలో "గవిత్యయమాహ - (గో ఇత్యయమాహ)" అన్న దానిలో వలె " 'ధ్వని' శబ్దం కావ్యానికి ఆత్మ"అని చెప్పినట్లు అవుతుంది. విప్రతిపత్తి స్థానం అసలే లేదనడానికి వీలులేదు. ధర్మి ఉన్నప్పుడే ధర్మాలను పట్టి విప్రతిపత్తి ఏర్పడుతుంది. సరే - సహృదయులకు విసుపు పుట్టించే సుదీర్ఘమైన అప్రస్తుతచర్చ ఇంతటితో చాలిద్దాం.

వివరణ:- ఏదైనా ఒక వస్తువు విషయంలో 'ఇది ఇలా ఉందా అలా ఉందా' అని ఏర్పడిన వివాదానికి 'విప్రతిపత్తి' అని పేరు. ఆ వస్తువు 'విప్రతిపత్తిస్థానం'. ఉదాహరణకి - శబ్దం అనేది ఒకటి ఉంది. అది నిత్యమా లేక అనిత్యమా అని విచికిత్స కలిగితే అది విప్రతిపత్తి. కుందేటి కొమ్మువంటి అసలే లేనిదాని విషయంలో " ఇది

వంకరగా ఉందా, నిటాలుగా ఉందా" ఇత్యాది విప్రతిపత్తులకు అవకాశం లేదు. ధర్మాలు గల 'ధర్మి' అనేది ఒకటి ఉంటేనే దాని ధర్మాలను గూర్చి విప్రతిపత్తి ఉండవచ్చు. శబ్దం అనే ధర్మి ఒకటి ఉంటే దాని ధర్మాలైన నిత్యత్వ - అనిత్యత్వాల విషయంలో విప్రతిపత్తి ఉన్నట్లు. అదే విధంగా ధ్వనివిషయంలో కూడా. ధ్వని అనేది ఒకటి ఉంది అని అందరూ అంగీకరించాలి. ఇంక విప్రతిపత్తి అల్లా దేనిని గూర్చి అంటే ఈ ధ్వనే కావ్యాత్మ అవుతుందా లేక ఇది అందరూ అంగీకరించిన అలంకారాదులలో అంతర్గతం అయిపోతుందా అన్న విషయంలోనే.

### లోచనం

బుధస్యైకస్య ప్రామాదికమపి తథాభిధానం స్యాత్; న తు భూయసాం తద్యుక్తమ్. తేన బుధైరితి బహువచనమ్. తదేవ వ్యాచష్టే పరమ్పరయేతి: అవిచ్ఛిన్నేన ప్రవాహేణ తైరేతదుక్తం వినాపి విశిష్టపుస్తకేషు వినివేశనాదిత్యభిప్రాయః. న చ బుధా భూయాంసః అనాదరణీయం వస్త్వాదరేణోపదిశేయుః, ఏతత్త్వాదరేణోపదిష్టమ్. తదాహ - సమ్యగామ్నాతపూర్వ ఇతి. పూర్వగ్రహణేన ఇదంప్రథమతా నాత్ర సంభావ్యత ఇత్యాహ, వ్యాచష్టే చ-సమ్యగాసమన్తాదామ్నాతః ప్రకటితః ఇత్యనేన. తస్యేతి-యస్యాధిగమాయ ప్రత్యుత యతనీయం కా తత్రాభావసంభావనా? అతః కిం కుర్మః ? అపారం మౌర్ఖ్యమభావవాదినామితి భావః.

### బాలానందిని

ఒక్క పండితుడైతే పొరబాటున చెప్పవచ్చు. కాని చాలామంది పండితులు అలా పొరబాటున చెప్పారని అనడం యుక్తం కాదు. ఈ విషయాన్నే పరమ్పరయా అని వ్యాఖ్యానిస్తున్నాడు. విశిష్టమైన ఏ పుస్తకాలలోనూ చేర్చకపోయినా వాళ్లు అవిచ్ఛిన్న ప్రవాహరూపంలో ఈ విషయం చెపుతూ వస్తున్నారని అభిప్రాయం. ఆదరణయోగ్యం కాని విషయాన్ని చాలామంది పండితులు ఆదరపూర్వకంగా చెప్పరు కదా? ఈ విషయమైతే వారు ఎంతో ఆదరంతో ప్రతిపాదించి ఉన్నారు. ఈ విషయాన్నే సమ్యగామ్నాతపూర్వః ఇత్యాదివాక్యంచేత వివరిస్తున్నాడు. 'పూర్వ' పదం ప్రయోగించడం చేత ఇది ఇప్పుడే తొలిసారిగా ప్రతిపాదించబడుతున్నది అనడానికి వీలు కాదు అని చెపుతున్నాడు. దీనినే సమ్యక్ "ఆ సమ్యక్ ఆ సమన్తాత్ ఆమ్నాతః ప్రకటితః" అని వివరిస్తున్నాడు. తస్యేతి : నిజానికి దేనిని గూర్చి తెలుసుకోవడం కోసం ప్రయత్నం

చేయవలసి ఉందో అదిలేదని ఊహించడం కూడా ఎలా శక్యం అవుతుంది ? అయితే మాత్రం మనం ఏం చెయ్యగలం ? అభావవాదులలో, ధ్వని లేదనే వాళ్లలో, అంత అపారమైన మూర్ఖత్వం ఉంది అని భావం .

లోచనం

న చాస్మాభిః అభావవాదినాం వికల్పాః శ్రుతాః; కింతు సంభావ్య దూషయిష్యన్తే. అతః పరోక్షత్వమ్. న చ భవిష్యద్వస్తు దూషయితుం యుక్తమ్, అనుత్పన్నత్వాదేవ. తదపి బుద్ధ్యారోపితం దూష్యతే ఇతి చేత్ బుద్ధ్యారోపితత్వాదేవ భవిష్యత్త్వహానిః. అతో భూతకాలోన్మేషాత్,పారోక్ష్యాత్, విశిష్టాద్యతనత్వప్రతిభానాభావాచ్చ లిటా ప్రయోగః కృతః జగదురితి.

బాలానందిని

అవతారిక: పై శ్లోకంలోని- "తస్యాభావం జగదుః" అనే వాక్యంలో "జగదుః" అని లిట్ ప్రయోగించబడింది. లిట్ పరోక్ష (ప్రయోక్త తాను ప్రత్యక్షంగా చూచి లేదా విని ఉండని) అనద్యతనభూతకాలికత్వాన్ని (గడచిన రాత్రి పన్నెండు గంటలకు పూర్వం జరిగి ఉండడాన్ని) బోధిస్తుంది. అలాంటి లిట్‌ను ప్రయోగించడాన్ని సమర్థిస్తూ వ్యాఖ్యానిస్తున్నాడు- న చేతి:- మేము అభావవాదులు చేసే వికల్పాలు ఏవీ వినలేదు. కేవలం అవి ఇలా ఉండి ఉండవచ్చును అని ఊహించుకొని దూషిస్తున్నాం. అందుచేత అవి మాకు పరోక్షాలు. ఎప్పుడో రాబోయే దానిని దూషించడం యుక్తం కాదు; అవి ఇంకా పుట్టకపోవడమే అందుకు కారణం. దానిని (రాబోయే దానిని) కూడా బుద్ధిలో ఉంచుకొని (ఊహించి) దూషించవచ్చును కదా అని అనడానికి వీలు లేదు. అవి బుద్ధిలో ఉంచుకొనబడ్డాయి అనడంతో అవి భవిష్యత్తులో ఉంటాయి అనే మాట పోయింది. ఈ విధంగా భూతకాలం భాసించడం చేత, పరోక్షంగా ఉండడంచేత, అద్యతనత్వం (గడచిన రాత్రి తరవాత జరిగిఉండడం) కూడా భాసించకపోవడం చేతా 'జగదుః'అని లిట్‌లో (గదధాతువు) ప్రయోగించబడింది.

లోచనం

తద్వ్యాఖ్యానాయైవ సంభావ్య దూషణం ప్రకటయిష్యతి. సంభావనాపి నేయమసంభ తో యుక్తా అపి తు సంభవత ఏవ. అన్యథా సంభావనానామపర్యవసానం స్యాత్; దూషణానాం చ. అతః సంభావనామ్

అభిధాయిష్యమాణాం సమర్థయితుం పూర్వం సమ్భవన్తీత్యాహ. 'సంభావ్యన్తే' ఇతి తూచ్యమానం పునరుక్తార్థమేవ స్యాత్. న చ సంభవస్యాపి సంభావనా, అపి తు వర్తమానతైవ స్ఫుటేతి వర్తమానేనైవ నిర్దేశః.

బాలానందిని

దానిని (లిట్‌ను) వ్యాఖ్యానించడం కోసమే సంభావ్యమైన వికల్పాల దూషణాన్ని, (ఆయా అభావవాదులు చెప్పినట్లు ఊహించిన వికల్పాల దూషణాన్ని) ప్రకటించనున్నాడు. దేనినైతే ఊహిస్తామో అది అసంభవ మైనది(Impossible) కాకూడదు. ఏదైతే ఉండడానికి అవకాశం ఉంటుందో దాని సంభావన మాత్రమే చెయ్యాలి. అలా కాని పక్షంలో ఈ సంభావనలకీ (ఊహలకీ), దూషణాలకీ ఒక అంతం అనేది ఉండదు. అందుచేత మున్ముందు చెప్పబోయే సం భావనను (ఊహను) సమర్థించడంకోసం ముందుగా సంభవన్తి (ఇలాంటి ఊహ లన్నీ ఉండడానికి అవకాశం ఉన్నది) అని అంటున్నాడు. 'సంభవన్తి' అన్నాడు కాని సంభావ్యన్తే అనలేదు. అలా అన్నట్లయితే పునరుక్తత్వం వస్తుంది. (అనగా ఆచక్షీరన్ ఇత్యాది విధంగా విధిలిజ్‌లు ప్రయోగించ బోతున్నాడు. విధిలిజ్ సంభావనను బోధిస్తుంది. ఇక్కడ సంభావ్యన్తే (ఊహించ బడుతున్నాయి) అని చెప్పి మళ్లీ సంభావనార్థకాలైన విధిలిజ్‌లను ప్రయోగిస్తే చెప్పిన అర్థమే మళ్లీ చెప్పడంచేత పునరుక్తి ఏర్పడుతుంది అన్ని అర్థం). సంభావనకి మూలం అయిన సంభవం కూడా సంభావ్యమే అనకూడదు. అది ఉన్నదే. ఈ విషయాన్ని సూచించడంకోసం సంభవన్తి అని లట్ ప్రయోగించడం ద్వారా వర్తమానత్వం చెప్పబడింది (అనగా 'సంభవన్తి' అనడానికి బదులు 'సంభవేయుః' అనలేదు. ఆ విధంగా విధిలిజ్ ప్రయోగిస్తే సంభవం సంభావ్యమే అని అర్థం వస్తుంది. సంభవం (Possibility) అనేది నిజంగా ఉంది. అది కేవలం ఊహ్యం కాదు. అందుచేత వర్తమానార్థక లట్‌ను ప్రయోగించడం జరిగింది అని అర్థం).

లోచనం

నను సంభవద్వస్తుమూలయా సంభావనయా యత్సంభావితం తద్దూషయితుమ్ అశక్యమిత్యాశఙ్క్యాహ వికల్పా ఇతి. న తు వస్తు సంభవతి తాదృక్ యత ఇయం సంభావనా, అపి తు వికల్పా ఏవ. తే చ తత్త్వావబోధ వన్ధ్యతయా స్ఫురేయురపి. అత ఏవ ఆచక్షీరన్ ఇత్యాదయోఽత్ర సంభావనా,

విషయాః లిఙ్ ప్రయోగాః అతీతపరమార్థత్వే ఏవ పర్యవస్యన్తి. యథా:-

"యది నామాస్య కాయస్య యదన్త స్తద్బహిర్భవేత్
దణ్డమాదాయ లోకోఽయం శునః కాకాంశ్చ వారయేత్".

ఇత్యత్ర. అర్థాత్ యద్యేవం కాయస్య దృష్టతా స్యాత్ తదైవమవలోక్యేతేతి భూతప్రాణతైవ. "యది న స్యాత్తతః కిం స్యాత్" ఇత్యత్రాపి "కిం వృత్తం యది పూర్వవత్ న భవనస్య సంభావనా" ఇత్యయమే వార్థః ఇత్యలమప్రకృతేన బహునా.

బాలానందిని

నన్వితి: ఉండడానికి అవకాశం ఉన్న వస్తువును ఆధారంగా చేసుకొని ఏర్పడిన సంభావనచేత (ఊహచేత) సంభావించబడినదానిని దూషించడం శక్యం కాదు కదా అని ఆశంకించుకొని 'వికల్పాః' అని అంటున్నాడు. (నిజంగా వస్తువు ఉన్నట్లయితే దానిని పట్టి ఏర్పడిన సంభావనలు దూషించడం శక్యం కాకపోవడం నిజమే. కాని అలాంటి వస్తువు ఏదీ లేదు దానిని పట్టి సంభావన లన్నీ వచ్చాయని చెప్పడానికి. ఉన్నవల్లా వికల్పాలే. తత్త్వం (యథార్థస్వరూపం) తెలియకపోవడంచేత అలాంటి వికల్పాలు కలుగుతూనే ఉంటాయి. అందుచేతనే సంభావనను (ఊహను) మాత్రమే సూచించే ఆచక్షీరన్ ఇత్యాదివిధిలిఙ్ ప్రయోగాలు భూతకాలానికి సంబంధించి ఉండడం అనే అర్థాన్నే (తాత్పర్యార్థాన్నే) బోధిస్తున్నాయి. (అతీతపరమార్థత్వే పర్యవస్యన్తి). "యది నామాస్య" ఇత్యాదిశ్లోకంలో ఎట్లో ఇక్కడ కూడా అట్లే "ఈ శరీరం లోపల ఉన్నది అంతా బైట ఉన్నట్లయితే మానవులు మీదకి వచ్చే కుక్కల్నీ కాకుల్నీ కూడా, ఒక కఱ్ఱ చేతితో పట్టుకొని, తోలుకొంటూ ఉండేవాళ్లు" అన్నప్పుడు "శరీరం ఈ విధంగా కనబడే టట్లయితే ఈ విధంగా చూడబడేది" అనే అర్థాన్నిపట్టి భూతకాలానికే ఏ విధంగా ప్రాధాన్యం ఉంటుందో అదే విధంగా ఇక్కడ కూడా. "యది న స్యాత్ తతః కిం స్యాత్"(లేకపోతే మాత్రం ఏమి అవుతుంది?) అన్నప్పుడు కూడా వెనుక చెప్పినట్లే "ఉండడానికి (భవనస్య) సంభావన లేకపోతే మాత్రం ఏమి అయింది" అనే అర్థం. (అనగా "యదినామాస్య" ఇత్యాది శ్లోకంలో విధిముఖంలో "శరీరంలో ఉన్న దంతా బైట ఉంటే" అని చెప్పడానికి బదులు నిషేధముఖంలో "అలా లేకపోతే మాత్రం ఏమి అవుతుంది" అని చెప్పినా కూడ "ఏమీ అవలేదు" అని భూతకాలప్రాధాన్యమే

కనబడుతుంది అని భావం). అప్రకృతమైన ఈ చర్చ ఇంతటితో చాలిద్దాం.

వివరణ:- 'అత ఏవ ఆచక్షీరన్' మొదలు "సంభావనేత్యయమేవార్థః" వరకు ఉన్న లోచనవాక్యాలకు ఇంతవరకు చూపిన అర్థం కొందరు వ్యాఖ్యాతలను అనుసరించి వ్రాయబడింది. కాని వీటి అర్థం మరొక విధంగా చెపితే బాగుంటుంది:- అసలు తత్త్వం తెలియకపోవడంచేత అనేకవిధాలైన వికల్పాలు (ఇలా చెప్పవచ్చా అలా చెప్పవచ్చా అనే అభిప్రాయాలు) తోచవచ్చును. అందుచేతనే (అత ఏవ) 'ఆచక్షీరన్' మొదలైన లిఙ్ప్రయోగాలు ఈ చెప్పిన దంతా పరమార్థానికి అతీతం, అనగా తత్త్వం కాదు అనే అర్థంలో పర్యవసిస్తాయి. అనగా చివరికి "ఈ ఊహలన్నీ సమంజసంకాదు" అనే అర్థాన్ని సూచిస్తాయి. "యది నామాస్య" ఇత్యాదిశ్లోకంలో ఎట్లో అట్లే. అనగా - శరీరంలోపల ఉన్న రక్తమాంసాదు లన్నీ బైట ఉంటే మానవులు మీదికి వచ్చి పడే కుక్కల్నీ కాకుల్నీ తోలుకుంటూ కూర్చుండవలసిందే; కాని అలా బైట లేవు కదా? అందుచేత అవన్నీ బైట ఉండడం యథార్థం కాకపోయినా వైరాగ్యదృష్టి ఏర్పడడంకోసం అలా చెప్పడం జరిగింది. అదే విధంగా చాలా మంది చాలా వికల్పాలు చెపితే చెప్పవచ్చు. అయిన అవన్నీ యథార్థాలు కావు అని భావం. " అత ఏవ" అనేది ఈ అర్థాన్నే సూచిస్తున్నది." "అర్థాత్ యద్యేవం..... భూత ప్రాణతైవ" అనేది మరొక వాక్యం. 'భవేత్' 'వారయేత్' అని లిఙ్లు ప్రయోగించినా "అవి అలా ఉండి ఉంటే ఇది ఇలా జరిగి ఉండేది" అని భూతకాలచ్ఛాయయే గోచరిస్తున్నది అని భావం.

'యది నామాస్య కాయస్య' అనే వాక్యంలో విధిముఖంలో చెప్పినదానినే "యది న స్యాత్" ఇత్యాదివాక్యంలో నిషేధముఖంలో చెప్పినా భూతకాలసంబద్ధత్వం స్ఫురిస్తుంది అనే వ్యాఖ్యానం కూడా యుక్తం కాదని తోస్తుంది. ఇది మరొక ఉదాహరణం. నాస్తికవాదాన్ని ఖండిస్తూ "యది న స్యాత్తతః కిం స్యాదస్తి చేన్నాస్తికో హతః" అని ఒక ప్రసిద్ధవాక్యం ఉంది." నాస్తికులు చెప్పినట్లు దేవుడు, పరలోకం మొదలైనవి లేకపోతే లేకపోవచ్చు. అయినా అవి ఉన్నాయనే దృష్టితో జాగర్తగా ప్రవర్తించడం మంచిది. ఆ విధంగా ప్రవర్తిస్తే పరలోకాదు లేవీ లేకపోయినా నష్టం ఏమీ లేదు. నిజంగా పరలోకాదులే ఉన్నాయా అవి లేవని స్వేచ్ఛగా ప్రవర్తించిన నాస్తికుడు చచ్చినట్లే" అని దీని భావం. ఈ వాక్యంలో కూడా 'యది నామాస్య' ఇత్యాదివాక్యంలో వలె "లేకపోతే ఏమి అయింది?' 'అని భూతకాలచ్ఛాయ గోచరిస్తున్నదని చెప్పడం కోసం అభినవగుప్త డీ వాక్యం కూడా ఉదాహరించా డని చెప్పాలి.

లోచనం

తత్ర సమయాపేక్షణేన శబ్దోఽర్థప్రతిపాదక ఇతి కృత్వా వాచ్యవ్యతిరిక్తం నాస్తి వ్యఙ్గ్యమ్; సదపి వా తదభిధావృత్త్యాక్షిప్తం శబ్దావగతార్థబలాకృష్టత్వాద్భాక్తమ్; తదనాక్షిప్తమపి వా న వక్తుం శక్యం, కుమారీష్వివ భర్తృసుఖమతద్విత్సు ఇతి త్రయ ఏవైతే ప్రధానవిప్రతిపత్తిప్రకారాః.

బాలానందిని

తత్రేతి:- ధ్వని విషయంలో మూడు విధాలైన ప్రధానవిప్రతిపత్తులు (అభిప్రాయభేదాలు) ఉన్నాయి. (1) ఒక శబ్దం సమయాన్ని, అనగా సంకేతాన్ని, పట్టి ఒక అర్థాన్ని బోధిస్తుంది. ("ఈ శబ్దానికి ఇది అర్థం" అనే నిర్ణయానికి 'సంకేతం' లేదా సమయం' అని పేరు). అందుచేత వాచ్యార్థమే కాని దానికంటె వేరుగా వ్యంగ్యార్థం అనేది లేదు. (2) ఏదైనా ఉన్నా అది అభిధావృత్తిచేత (శబ్దంలో ఉన్న ఒక ముఖ్యార్థాన్ని బోధించే శక్తిచేత)దూరంగా లాగి తీసినదే (ఆక్షిప్తమే); శబ్దం వినగానే తెలిసిన దాని అర్థం బలంచేత అధికంగా లాగి తెలిసికొనబడిన అర్థం అవడంచేత అది భాక్తం అయిన అర్థం మాత్రమే. (3) అభిధావృత్తిచేతనే ఆక్షిప్తం అని చెప్పడానికి వీలులేకపోయినా భర్తృసుఖం ఎలా ఉంటుందో అనుభవం లేని అవివాహితయువతులు ఆ సుఖాన్ని గూర్చి ఎలా చెప్పజాలరో అదే విధంగా ఈ ప్రతీయమానార్థస్వరూపాన్ని స్పష్టంగా చెప్పడం అసంభావ్యం. ఈ విధంగా ధ్వని అనేదే లేదు అని, ఉన్నా అభిధావృత్తి బోధించే దూరదూరమైన అర్థం అనీ, అలా అభిధావృత్తిబోధ్యం కాకపోయినా దానిని గూర్చి స్పష్టంగా చెప్పడం కుదరదు గాన అది లేనట్లే అని మూడు వాదాలకి అవకాశం ఉంది అని భావం

లోచనం

తత్రాభావవికల్పస్య త్రయః ప్రకారాః - శబ్దార్థగుణాలంకారాణామేవ శబ్దార్థశోభాకారిత్వాల్లోకశాస్త్రాతిరిక్తసున్దరశబ్దార్థమయస్య కావ్యస్య న శోభాహేతుః కశ్చిదన్యోఽస్తి యోఽస్మాభిర్న గణిత ఇత్యేకః ప్రకారః. యో వా న గణితః స శోభాకార్యేవ న భవతీతి ద్వితీయః. అథ శోభాకారీ భవతి తర్హ్యస్మదుక్త ఏవ గుణే వాలంకారే వాన్తర్భవతి; నామాన్తరకరణే తు కియదిదం పాణ్డిత్యమ్! అథాప్యుక్తేషు గుణేష్వలంకారేషు వా నాన్తర్భావః,

(తథాపి) కించిద్విశేషలేశమాశ్రిత్య నామాన్తరకరణముపమావిచ్ఛిత్తిప్రకారాణామ సంఖ్యత్వాత్, తథాపి గుణాలఙ్కారవ్యతిరిక్తత్వాభావ ఏవ. తావన్మాత్రేణ చ కిం కృతమ్? అన్యస్యాపి వై చిత్ర్యస్య శక్యోత్ప్రేక్షత్వాత్. చిరన్తనైర్హి భరతముని ప్రభృతిభిర్యమకోపమే ఏవ శబ్దార్థాలంకారత్వేనేష్టే; తత్ప్రపఞ్చదిక్ ప్రదర్శనం త్వన్యైరలంకారకారైః కృతమ్. తద్యథా- "కర్మణ్యణ్ "ఇత్యత్ర కుమ్భకారా ద్యుదాహరణం శ్రుత్వా స్వయం నగరకారాదిశబ్దా ఉత్ప్రేక్ష్యన్తే, తావతా క ఆత్మని బహుమానః? ఏవం ప్రకృతేఽపీతి తృతీయః ప్రకారః. ఏవమేకస్త్రిధా వికల్పః, అన్యౌ చ ద్వావితి పఞ్చ వికల్పా ఇతి తాత్పర్యార్థః.

**బాలానందిని**

**తత్రేతి:-** పైన చెప్పిన మూడు వికల్పాలలో 'ధ్వని అనేదే లేదు' అని చెప్పే అభావవికల్పానికి మూడు ప్రకారాలు (పద్ధతులు)ఉంటాయి- "లోకంలోను (లౌకికవ్యవహారంలోను), శాస్త్రాలలోను ఉపయోగించే శబ్దార్థాల కంటె భిన్నంగా ఉండే సుందరశబ్దార్థాలే కదా కావ్యం అంటే? ఆ శబ్దార్థాలకి శబ్దగుణాలు, అర్థగుణాలు, శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు శోభను కలిగిస్తాయి. మేము పరిగణించకుండగా విడిలేసిన, వీటిని మించిన, శబ్దార్థశోభాహేతువు మరొకటి ఏదీ లేదు" అనేది మొదటి ప్రకారం. "మేం పరిగణించకుండా విడిలేసినది ఏదైనా ఉన్నా అది శోభాహేతువు కాదు' ' అనేది రెండవ ప్రకారం. కాదు; అది శోభాకరమే అంటారా- అది మేం చెప్పిన గుణాలలోనో అలంకారాలలోనో అంతర్గతం అయిపోతుంది(చేరిపోతుంది); దానికేదో ఒక కొత్త పేరు పెట్టడంలో పెద్ద పాండిత్యం ఏముంది!

**అథాపీతి:-** ప్రాచీనులు చెప్పిన గుణాలలో గాని అలంకారాలలో గాని ధ్వనికి అంతర్భావం లేదనే అనుకుందాం; ఉపమాసౌందర్యరీతులు అసంఖ్యాకంగా ఉండడంచేత ఏదో ఒక చిన్న విశేషాన్ని పట్టి దానికి ఒక పేరు పెట్టారని కూడా అనుకుందాం; అలాగైనా కూడా ఈ ధ్వని ఏదో ఒక గుణమో, అలంకారమో అవవచ్చునేమో గాని ఒక అపూర్వవిషయం అని చెప్పడానికి వీలులేదు.

వివరణ:- అనగా చెప్పిన గుణాలంకారాదులలో అంతర్గతం కాకపోయినా మీరు చెప్పే ధ్వని అనేది ఒక క్రొత్త గుణమో, కొత్త అలంకారమో కావచ్చును. ఉపమాలంకారంలో ఉన్న సౌందర్యవిశేషాన్ని పట్టి అనన్వయాలంకారం,

ఉపమేయోపమాలంకారం మొదలైన కొత్త అలంకారాలు అంగీకరించినట్లే ధ్వని అనేదానిని కూడా ఒక కొత్త అలంకారంగానో, గుణంగానో చెపితే చెప్పవచ్చును అని భావం. లోచనంలోని "ఉపమావిచ్ఛిత్తిప్రకారాణామ్" అనే దానికి ఉపలక్షణచేత "ఉపమాదివిచ్ఛిత్తిప్రకారాణామ్"(ఉపమ మొదలైనవాటి - గుణాలతో సహా-సౌందర్యరీతులు) అని అర్థం.

తావన్మాత్రేణేతి:- తావన్మాత్రంచేత ఏమయింది? ఇలాంటి వైచిత్ర్యాలు మరి కొన్ని కూడా ఊహించవచ్చును కదా? ప్రాచీనులైన భరతముని మొదలైన వారు యమకాలంకారం శబ్దాలంకారం అనీ, ఉపమ అర్థాలంకారం అనీ ఈ రెండు మాత్రమే అంగీకరించారు. తరవాత వచ్చిన ఆలంకారికులు భరతాదులు చెప్పిన అలంకారాలనే విస్తరించి చెప్పారు. ఉదాహరణకి- "కర్మణ్యణ్"(పా.సూ.3.2.1)అనే పాణినిసూత్రంలో 'కుమ్భకారః' మొదలైన ఉదాహరణలు చూచి "నగరకారః" ఇత్యాది పదాలను స్వయంగా ఊహించి తెలుసుకున్నంత మాత్రాన ఏదో గొప్ప పని చేసినట్లు బడాయి చెప్పుకోవడానికి ఏముంది? ప్రకృతంలో కూడా ఇంతే; ఇది మూడవ ప్రకారం. ఈ విధంగా మూడు ప్రధానవికల్పాలలో మొదటిది(అభావరూపవికల్పం) మూడు విధాలు; మిగిలిన వికల్పాలు రెండు. ఈ విధంగా మొత్తం ఐదు వికల్పా లని తాత్పర్యం.

వివరణ:- ఏధాతువు కైనా కర్మవాచకపదం ఉపపదంగా ఉన్నప్పుడు (పక్కన ఉన్నప్పుడు) దానికి (కర్మవాచకపదం తరవాత ఉన్న ధాతువుకి) 'అణ్' ప్రత్యయం వస్తుంది అని 'కర్మణ్యణ్' అనే సూత్రానికి అర్థం. "కుమ్భమ్(కుమ్భ + అమ్) + కృ" అని ఉన్నప్పుడు 'కృ' ధాతువు చివర 'అణ్' అనే ప్రత్యయం చేరి "కుమ్భకార" అనే శబ్దం నిష్పన్నం అవుతుంది. ఈ ఉదాహరణను ఆధారంగా తీసికొని ఎవరైనా 'నగరకారః' 'తన్తువాయః'ఇత్యాది పదాలు తయారుచేసినంతమాత్రాన తానేవో కొత్తపదాలు కనిపెట్టానని అతడు సగర్వంగా చెప్పుకొంటే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో ధ్వని అనే పేరుతో ఏదో ఒక కొత్త గుణమో అలంకారమో కనిపెట్టానని చెప్పుకుంటే కూడ అలాగే ఉంటుంది అని"తద్యథా....బహుమానః" అనే వాక్యానికి భావం.

**లోచనం**

తానేవ క్రమేణాహ - శబ్దార్థశరీరం తావదిత్యాదినా. తావద్గ్రహణేన కస్యాప్యత్ర న విప్రతిపత్తిరితి దర్శయతి. తత్ర శబ్దార్థౌ న తావద్ధ్వనిః; యతః

సంజ్ఞామాత్రేణ హి కో గుణః? అథ శబ్దార్థయోశ్చారుత్వం స ధ్వనిః?తథాపి ద్వివిధం చారుత్వం - స్వరూపమాత్రనిష్ఠం, సంఘటనాశ్రితం చ. తత్ర శబ్దానాం స్వరూపమాత్రకృతం చారుత్వం శబ్దాలంకారేభ్యః; సంఘటనాశ్రితం తు శబ్దగుణేభ్యః. ఏవమర్థానాం చారుత్వం స్వరూపమాత్రనిష్ఠముపమాదిభ్యః; సంఘటనాపర్యవసితం త్వర్థగుణేభ్య ఇతి న గుణాలంకారవ్యతిరిక్తో ధ్వనిః కశ్చిత్. సంఘటనాధర్మా ఇతి - శబ్దార్థయోరితి శేషః. యద్గుణాలం౦-౦వ్యతిరిక్తం తచ్చారుత్వకారి న భవతి, నిత్యానిత్యదోషా అసాధుత్వదుఃశ్రవత్వాదయ ఇవ. చారుత్వహేతుశ్చ ధ్వనిః; తన్న తద్వ్యతిరిక్త ఇతి వ్యతిరేకీ హేతుః.

బాలానందిని

౦నేవేతి:- వరుసగా ఆ ఐదు వికల్పాలను గూర్చి "శబ్దార్థశరీరం తావత్" ఇత్యాదివాక్యాలలో చెపుతున్నాడు:- 'తావత్' అనడంచేత ఈవిషయంలో (కావ్యానికి శబ్దార్థాలే శరీరం అనే విషయంలో) ఎవరికీ విప్రతిపత్తి (అభిప్రాయభేదం) లేదని అంటున్నాడు. అందులో శబ్దార్థాలైతే ధ్వని కాదు. (వాటి రెండింటికీ గాని, ఏదో ఒకదానికి గాని) ధ్వని అని పేరు పెట్టినంత మాత్రంచేత ఏమి విశేషం వస్తుంది? అలా కాదు; శబ్దార్థాల సౌందర్యం ధ్వని అంటారా?(అదీ కుదరదు). స్వరూపంలో మాత్రం ఉన్నది, వాటి కూర్పులో ఉన్నది అని శబ్దార్థాల చారుత్వం(సౌందర్యం) రెండు విధాలు. శబ్దాలంకారాల వల్ల శబ్దాలలో వచ్చే సౌందర్యం శబ్దస్వరూపమాత్రకృతం; శబ్దగుణాలవల్ల వచ్చే సౌందర్యం శబ్దసంఘటనాశ్రితం. అదే విధంగా ఉపమ మొదలైన అర్థాలంకారాలవల్ల అర్థాలలో వచ్చే సౌందర్యం అర్థస్వరూపమాత్రనిష్ఠం, అర్థగుణాలవల్ల వచ్చేది అర్థసంఘటనాగతం. అందుచేత గుణాలంకారాలకంటె వేరుగా ధ్వని అంటూ ఏదీ లేదు. సంఘటనాధర్మాః అనేదాని ప్రక్కన శబ్దార్థయోః అని అధ్యాహారం తెచ్చుకొని "శబ్దార్థాల సంఘటనల ధర్మాలు" అని అర్థం చెప్పుకోవాలి.

ఈ విషయంలో అనుమానప్రయోగాన్ని సూచిస్తున్నాడు - యదితి. ఏది గుణాలంకారాలకంటె భిన్నమో అది సౌందర్యాన్ని కలిగించేది కాదు. (అనగా కావ్యానికి సౌందర్యం కలిగించాలంటే అది గుణమైనా కావాలి, అలంకారమైనా కావాలి). ఉదాహరణం- దోషాలలో నిత్యదోషాలైన అసాధుత్వాదులు, అనిత్యదోషాలైన దుఃశ్రవత్వాదులు ఎట్లో అట్లే(అనగా గుణాలంకారభిన్నాలైన దోషాలు చారుత్వహేతువులు ఎలా కావో అలాగే). ధ్వని చారుత్వానికి హేతువు అని అంటున్నావు. అందుచేత అది

గుణాలంకారాలకంటె భిన్నం కాకూడదు; (గుణమైనా కావాలి, అలంకారమైనా కావాలి అని అర్థం) అని వ్యతిరేకహేతువు.

వివరణ. అనుమానప్రయోగంలో ఉపయోగించే హేతువు అన్వయవ్యతిరేకి, కేవలాన్వయి, కేవలవ్యతిరేకి అని మూడు విధాలుగా ఉంటుంది. ఇక్కడ ఇది కేవలవ్యతిరేకి. వీటి స్వరూపం తర్కసంగ్రహ-తర్కభాషాదులనుండి గ్రహించాలి. అబినవగుప్తుడు సూచించిన అనుమానప్రయోగం నైయాయికభాషలో ఈ విధంగా ఉంటుంది. "ధ్వనిః గుణాలంకారవ్యతిరిక్తత్వాభావవాన్; చారుత్వహేతుత్వాత్, యో హి గుణాలంకారవ్యతిరిక్తో భవతి స చారుత్వహేతుర్న భవతి; యథా అసాధుత్వదుఃశ్రవత్వాదికో దోషః' - (ధ్వనిగుణాలంకారాలకంటె భిన్నం కాదు; ఎందుచేత ననగా ఇది చారుత్వానికి (కావ్యసౌందర్యానికి) హేతువు. గుణాలంకారాలకంటె భిన్నమైనది ఏదీ చారుత్వహేతువు అవడానికి వీలు లేదు. (గుణాలంకారభిన్నాలైన) అసాధుత్వదుఃశ్రవత్వదోషాలు చారుత్వహేతువులు కానట్లే.

### లోచనం

నను వృత్తయో రీతయశ్చ యథా గుణాలంకారవ్యతిరిక్తాః, చారుత్వహేతవశ్చ, తథా ధ్వనిరపి తద్వ్యతిరిక్తశ్చ చారుత్వహేతుశ్చ భవిష్యతీత్యసిద్ధో వ్యతిరేక ఇత్యనేనాభిప్రాయేణాహ - తదనతిరిక్తవృత్తయః ఇతి. నైవ వృత్తిరీతీనాం తద్వ్యతిరిక్తత్వం సిద్ధమ్. తథాహి - అనుప్రాసాదీనామేవ దీప్తమసృణమధ్యమవర్ణనీయోపయోగితయా పరుషత్వలలితత్వమధ్యమత్వ స్వరూపవివేచనాయ వర్గత్రయసంపాదనార్థం తిస్రోఽనుప్రాసజాతయో వృత్తయ ఇత్యుక్తాః; వర్తన్తే అనుప్రాసభేదా ఆస్వితి. యదాహ-

"సరూపవ్యఞ్జనన్యాసం తిసృష్వేతాసు వృత్తిషు,
పృథక్పృథగనుప్రాసముశన్తి కవయః సదా". *(ఉద్భ.కావ్యా. 1.8)* ఇతి.

పృథక్ పృథగితి - పరుషానుప్రాసా నాగరికా; మసృణానుప్రాసా ఉపనాగరికా లలితా; నాగరికయా విదగ్ధయా ఉపమితేతి కృత్వా. మధ్యమమకోమలపరుషమిత్యర్థః. అత ఏవ వైదగ్ధ్యవిహీనస్వభావసుకుమారాపరుషగ్రామ్యవనితాసామ్యాదియం వృత్తిర్గ్రామ్యేతి. తత్ర తృతీయః కోమలానుప్రాస ఇతి

వృత్తయో ఽనుప్రాసజాతయ ఏవ.

బాలానందిని

నన్వితి:- కావ్యంలో గుణాలంకారాలే కాకుండా వృత్తులూ, రీతులూ కూడా ఉంటాయి. అవి గుణాలంకారాలకంటె భిన్న మైనవే; కావ్యసౌందర్యానికి హేతువులుగా కూడా ఉంటాయి. అదే విధంగా ధ్వని కూడా గుణాలంకారాలకంటె భిన్నంగా ఉండవచ్చు; కావ్యసౌందర్యహేతువు కావచ్చు కదా? "అందుచేత చారుత్వహేతువైనది గుణమైనా కావాలి, అలంకారమైనా కావాలి" అనే నియమానికి వృత్తి - రీతులలో వ్యభిచారదోషం కదా, అనగా ఆ నియమం వాటి విషయంలో ప్రవర్తించదు కదా? వాటిలో ప్రవర్తించనట్లే ధ్వని విషయంలో కూడా ప్రవర్తించదు. అందుచేత ధ్వనిని గుణంగానో, అలంకారంగానో పరిగణించాలి అనే మాట యుక్తం కాదు అని ఆశంకించుకొని తదనతిరిక్తవృత్తయః ఏవ అని చెపుతున్నారు. వృత్తులు గాని రీతులు గాని గుణాలంకారవ్యతిరిక్తాలు కాదు; తదంతర్గతాలే. ఎందుచేత ననగా - రౌద్రాదులలో దీప్తమైన విభావాదుల్నీ, శృంగారాదులలో మధురమైనవాటిని, హాస్యాదులలో మధ్యమవిషయాలనీ వర్ణించడానికి ఉపయోగించే విధంగా పరుషత్వ - లలితత్వ - మధ్యమత్వస్వరూపాల్ని వివేచించడంకోసం, అనుప్రాసలలోనే మూడు వర్గాలను ఏర్పాటు చేయాలనే అభిప్రాయంతో వృత్తులు అనే పేరుతో మూడు అనుప్రాసజాతుల్ని అంగీకరించడం జరిగింది. "వర్తన్తే అనుప్రాసభేదాః అను" అనే విగ్రహంచేత విభిన్న అనుప్రాసలు వీటిలో ఉంటాయి అని 'వృత్తి' శబ్దానికి అర్థం. ఈవిషయమే (ఉద్భటుడు కావ్యాలంకారసారసంగ్రహంలో) చెప్పి ఉన్నాడు. - సరూపేతి. "సమానమైన రూపం గల వ్యంజనాలను వేరు వేరుగా ఈ వృత్తులలో కూర్చడం 'అనుప్రాస' అని కవులు అంగీకరిస్తున్నారు".

కారికలోని 'పృథక్ పృథక్' అనేదాని అర్థం ఏమనగా - పరుషమైన అనుప్రాస ఉన్న వృత్తి'నాగరిక'. మధురమైన అనుప్రాస ఉన్నది 'ఉపనాగరిక'. దీనికే 'లలిత' అని కూడా పేరు. ("ఉపమితా నాగరికయా ఉపనాగరికా" అనే విగ్రహాన్ని అనుసరించి) నాగరికస్త్రీతో పోల్చబడుతుంది కాబట్టి దీనికి 'ఉపనాగరిక' అని పేరు. కోమలమూ కాకుండా, పరుషమూ కాకుండా ఉండేది మధ్యమం. అందుచేతనే సహజమైన సౌకుమార్యంతో పారుష్యం లేని, అయితే జాణతనం ఎరగని పల్లెటూరు పడుచుతో పోలిక ఉండడంచేత దీనికి 'గ్రామ్యవృత్తి' అని పేరు. ఈ మూడవ వృత్తి 'కోమలానుప్రాస' ఈ విధంగా వృత్తులు అనుప్రాసజాతులే కాని అనుప్రాస అనే శబ్దాలంకారంకంటె

భిన్నమైనవి కావు.

వివరణ: కావ్యాలంకారసారసంగ్రహంలో ఉద్భటుడు 'పరుష', 'ఉపనాగరిక', 'కోమల' (దీనికే 'గ్రామ్య' అనికూడా పేరు) అని మూడు వృత్తులు చెప్పి ఉన్నాడు.

"శషాభ్యాం రేఫసంయోగైష్టవర్గేణ చ యోజితా,
పరుషా నామ వృత్తిః స్యాత్ హ్లహ్వహ్యాద్యైశ్చ సంయుతా" (1.4)

శకారషకారాలు, క్ర ర్క మొదలైన రేఫసంయోగాలు, ట ఠ డ ఢ లు, హ్ల హ్వ హ్య మొదలైనవి. వీటి ప్రయోగం ఉన్నది 'పరుషవృత్తి'.

"సరూపసంయోగయుతాం మూర్ధ్ని వర్గాన్త్యయోగిభిః,
స్పర్శైర్యుతాం చ మన్యన్తే ఉపనాగరికాం బుధాః" . (1.5)

సమానమైన రూపంగల వర్ణాల సంయోగం (క్క, ప్ప, చ్చ మొ.) నెత్తిమీద వర్గపంచమాక్షరా లున్న స్పర్శాక్షరాలు (కాదయో మావసానాః స్పర్శాః) (ఙ్క, ఞ్చ, ణ్ట, మ్ప మొదలైనవి) ఉన్నది 'ఉపనాగరిక'.

"శేషైర్వర్ణైర్యథాయోగం కథితాం కోమలాఖ్యయా,
గ్రామ్యాం వృత్తిం ప్రశంసన్తి కావ్యేష్వాదృతబుద్ధయః". (1.6)

యథావకాశంగా పరుషోపనాగరికావృత్తులలో ఉపయోగించని వర్ణాలను ఉపయోగిస్తే 'కోమల'. దీనికే 'గ్రామ్య' అని కూడ పేరు.

అభినవగుప్తుడు పరుషకి 'నాగరిక' అని, 'ఉపనాగరిక'కి 'లలిత' అని, కోమలకు 'మధ్య' అనీ కూడ పేర్లు పెట్టినాడు. 'వృత్తి' అనగా వ్యవహారం, వ్యాపారం. ఆ యా రసాదుల్ని అభివ్యక్తం చేయడం అనే వ్యాపారం ఈవర్ణవిన్యాసంలో ఉండడంచేత వృత్తి అని పేరు పెట్టారు. "అతస్తాస్తావద్ వృత్తయః రసాద్యభివ్యక్త్యనుగుణ వర్ణవ్యవహారాత్మికాః....'' అని "సరూప" (1.7) అనే కారిక వ్యాఖ్యానంలో ఇందురాజు చెప్పి ఉన్నాడు.

"వృత్తయః అనుప్రాసజాతయ ఏవ"అన్న లోచనవాక్యానికి వృత్తులు అనుప్రాసకు చెందిన జాతులవంటివి అని అర్థం. పరుషత్వాదులతో కూడిన అనుప్రాసాదులు ఆ వృత్తులను వ్యజింపచేస్తాయి. గోత్వం, వృక్షత్వం మొదలైన జాతులు గోవు, వృక్షం మొదలైన వాటిలో ఉంటాయి. తమలో ఉన్న ఆ జాతుల్ని గోవు, వృక్షం మొదలైనవి వ్యక్తీకరిస్తాయి. గోవును చూడగానే దీనిలో గోత్వజాతి ఉన్నది కదా అని తెలుస్తుంది కదా? అదే విధంగా వృత్తులు ఏ అనుప్రాసలలో ఉంటాయో వాటిచేత వ్యక్తీకృతాలౌతాయి. అందుచేత ఈ వృత్తులు జాతులవంటివి అని అర్థం.

అయితే "వర్తన్తే అనుప్రాసభేదాః ఆసు" అని వెనుక చెప్పిన వ్యుత్పత్తి ప్రకారం అనుప్రాసలు వృత్తులలో ఉంటాయి కాని వృత్తులు అనుప్రాసలలో ఉండడంలేదు కదా. అప్పుడు జాతి వ్యక్తిలో (గోవు, వృక్షం మొదలైన వాటిలో) ఉందని చెప్పడానికి బదులు వ్యక్తియే జాతిలో ఉందని చెప్పినట్లయింది కదా? ఇది "నిత్యమేకమనేకానుగతం సామాన్యమ్"(జాతి అనేది నిత్యం; అది అనేకవ్యక్తులలో ఉంటుంది) అన్న వైశేషికుల సిద్ధాంతానికి విరుద్ధం కదా అని ఆశంక కలుగుతుంది. దానికి సమాధానం చెపుతున్నాడు:-

**లోచనం**

న చేహ వైశేషికవద్వృత్తిర్వివక్షితా, యేన జాతౌ జాతిమతో వర్తమానత్వం న స్యాత్; తదనుగ్రహ ఏవ హి తత్ర వర్తమానత్వమ్, యథాహ కశ్చిత్:-

"లోకోత్తరే హి గామ్భీర్యే వర్తన్తే పృథివీభృతః" ఇతి.

తస్మాద్వృత్తయోఽనుప్రాసాదిభ్యోఽనతిరిక్తవృత్తయో నాభ్యధికవ్యాపారాః. అత ఏవ వ్యాపారభేదాభావాన్న పృథగనుమేయస్వరూపా అపీతి వృత్తి శబ్దస్య వ్యాపారవాచినోఽభిప్రాయః. అనతిరిక్తత్వాదేవ వృత్తివ్యవహారో భామహాదిభిర్న కృతః. ఉద్భటాదిభిః ప్రయుక్తేఽపి తస్మిన్ న అర్థః కశ్చిద్ అధికో హృదయపథమవతీర్ణ ఇత్యభిప్రాయేణాహ - గతాః శ్రవణగోచరమితి.

**బాలానందిని**

ఇక్కడ మేం చెప్పదలచిన వృత్తి (ఉండడం) వైశేషికులు చెప్పిన వృత్తి వంటిది కాదు. అలా చెప్పిన పక్షంలో జాతిమత్తు (వ్యక్తి) జాతిలో ఉంది అని చెప్పినట్లు అయేది. దానియందు(వృత్తిరూపజాతియందు) ఉండడం అన్నదానికి అర్థం ఆ జాతిచేత అనుగ్రహింపబడడం (లాభం పొందడం) అని మాత్రమే. "రాజులు లోకోత్తరమైన, అసాధారణమైన, గాంభీర్యంలో ఉంటారు' అని ఎవరో అన్న వాక్యంలో ఎట్లో ఇక్కడ కూడా అట్లే. "రాజులు గాంభీర్యంలో ఉంటారు" అనే దానికి "గాంభీర్యం వల్ల రాజులకు కార్యనిర్వహణదక్షత్వం మొదలైన లాభం కలుగుతుంది"అని భావం; అట్లే ఇక్కడ కూడా అనుప్రాసలు వృత్తులలో ఉంటాయి. (అనగా వృత్తులవల్ల అనుప్రాసలకు లాభం కలుగుతుంది. అని మాత్రమే అర్థం. అందుచేత పరుషాదివృత్తులకు అనుప్రాసాదులకంటె అధికమైన వృత్తులు, అనగా వ్యాపారాలు ఏవీ లేవు అని అభిప్రాయం). అనుప్రాసాదులకంటె వేరుగా వృత్తులనేవి లేవు కాబట్టి భామహాదులు ఈవృత్తులను గూర్చి చెప్పలేదు. ఉద్భటాదులు వీటిని గూర్చి చెప్పినా కొత్త విషయం

ఏదీ హృదయానికి గోచరం కాలేదు అనే అభిప్రాయంతో గతాః శ్రవణగోచరమ్ (మా చెవిని పడ్డాయి) అన్నాడు. (విన్నాం కాని వాటిలో విశేషం ఏదీ లేదు అని భావం).

లోచనం

రీతయశ్చేతి: తదనతిరిక్తవృత్తయోఽపి గతాః శ్రవణగోచరమితి సంబన్ధః. తచ్ఛబ్దేనాత్ర మాధుర్యాదయః గుణాః, తేషాం చ సముచితవృత్త్యర్పణే యదన్యోన్యమేలనక్షమత్వేన పానక ఇవ గుడమరిచాదిరసానాం సంఘాత రూపతాగమనం, దీప్తలలితమధ్యమవర్ణనీయవిషయం గౌడీయవైదర్భ పాఞ్చాలదేశహేవాకప్రాచుర్యదృశా తదేవ త్రివిధం రీతిరిత్యుక్తమ్. జాతిర్జాతిమతో నాన్యా, సముదాయశ్చ సముదాయినో నాన్య ఇతి వృత్తిరీతయో న గుణాలఙ్కారవ్యతిరిక్తా ఇతి స్థిత ఏవాసౌ వ్యతిరేకీ హేతుః. తదాహ - తద్వ్యతిరిక్తః కోఽయం ధ్వనిరితి. నైష చారుత్వస్థానం, శబ్దార్థరూపత్వాభావాత్; నాపి చారుత్వహేతుః, గుణాలంకారవ్యతిరిక్తత్వాదితి తేనాఖణ్డబుద్ధిసమాస్వాద్యమపి కావ్యమపోద్ధారబుద్ధ్యా యది విభజ్యతే తథాప్యత్ర ధ్వనిశబ్దవాచ్యో న కశ్చిదతిరిక్తోఽర్థో లభ్యతే ఇతి నామ శబ్దేనాహ.

బాలానందిని

రీతయశ్చేతి ఇతి :- 'రీతయశ్చ' అనేదానికి కూడా "తదనతిరిక్తవృత్తయోఽపి గతాః శ్రవణగోచరమ్" అనే దానితో అన్వయం. ఇక్కడ తచ్ఛబ్దం గుణాలను నిర్దేశిస్తుంది. మాధుర్యాదిగుణాలకంటె భిన్నమైన వృత్తి (వ్యాపారం) లేని రీతులు కూడా మా చెవిని పడ్డాయి అని అర్థం. ఒకదానితో ఒకటి కలవడానికి తగి ఉండడంచేత బెల్లం, మిరియాలు మొదలైన వాటి రసాలు (రుచులు)పానకంలో కలిసిపోయినట్లు ఆ మాధుర్యాదిగుణాలు దీప్తాదివర్ణనీయౌచిత్యం గల విశిష్టవర్ణరచనలో (లేదా ఆ యా రసాల వ్యంజనకు ఉచితమైన వ్యాపారాన్ని సమకూర్చడంలో) ఒకదానితో ఒకటి చక్కగా కలిసిపోవడానికి తగి ఉండడంచేత దీప్తం, లలితం, మధ్యమం అయిన వర్ణించవలసినవాటి విషయంలో సముదాయాలుగా ఏర్పడతాయి. దీప్తవర్ణనీయవిషయంలో అవి సంఘాతంగా ఏర్పడినప్పుడు గౌడరీతి అనీ, లలితవర్ణనీయవిషయంలో సంఘాతంగా ఏర్పడినప్పుడు వైదర్భరీతి అనీ, మధ్యమవర్ణనీయ విషయంలో సంఘాతంగా ఏర్పడినప్పుడు పంచాలరీతి అనీ గౌడ-వైదర్భ-పాంచాల దేశకవుల స్వభావాన్ని లేదా స్వేచ్ఛను పట్టి వాళ్లలో

ఎక్కువగా కనబడడంచేత వామనాదులు వాటికి మూడు విధాలుగా ఆ పేర్లు పెట్టారు. జాతి జాతిమత్తుకంటె భిన్నం కాదు. సముదాయం సముదాయుల కంటె భిన్నం కాదు. అందుచేత వృత్తులు రీతులూ కూడ గుణాలంకారాలకంటె భిన్నమైనవి కాదు. (అనగా ఇక్కడ వృత్తి జాతి, అనుప్రాస జాతిమత్తు. వృత్తికి అనుప్రాసలంకారాలకీ భేదం లేదు. రీతులు సముదాయాలు గుణాలు సముదాయులు- సముదాయం గలవి. అందుచేత వాటికీ పరస్పరభేదం లేదు అని అర్థం).అందుచేత అనుమానప్రయోగంలో వెనక చూపిన కేవలవ్యతిరేకిహేతువు యుక్తమైనదే. వ్యభిచారదోషదుష్టం కాదు. అందుచేత తద్వ్యతిరిక్తః కోఽయం ధ్వనిః (గుణాలంకారాలకంటె భిన్నమైన ఈ ధ్వని అనేది ఏమిటి) అని అంటున్నాడు.

నైష ఇతి - ఇది (ధ్వని) చారుత్వానికి స్థానం కాదు; ఎందుచేత ననగా ఇది శబ్దస్వరూపమూ కాదు, అర్థస్వరూపమూ కాదు (చారుత్వం అనేది శబ్దంలో నైనా ఉండాలి అర్థంలో నైనా ఉండాలి కదా అని భావం). ఇది చారుత్వస్థానం కాకపోయినా చారుత్వహేతువు అందామా అంటే అదీ కుదరదు. ఎందుచేత ననగా ఇది గుణమూ కాదు అలంకారమూ కాదు కదా? ఈ విధంగా కావ్యం అనేది నిజానికి అఖండమైన బుద్ధిచేత ఆస్వాదించతగినదే అయినా, దానిని విభాగబుద్ధిచేత విభజించి చూచినా దానిలో 'ధ్వని' అని చెప్పదగిన; శబ్దాగుణాలంకారాదులకంటె వేరుగా కొత్త విషయం ఏదీ కనబడడంలేదు అని 'నామ' అనే శబ్దంచేత చెపుతున్నాడు.

వివరణ. వికసించిన అందమైన పద్మం, గులాబిపూవు మొదలైనవాటిని గాని, చక్కని చిత్రపటాన్నిగాన్ని చూచి ఆనందం అనుభవించాలంటే వాటి పరిపూర్ణస్వరూపం చూడాలి. వేరు వేరు విధాలుగా చూడకూడదు. అలా చూస్తే దానిలోని అందం కనబడదు. అదే విధంగా కావ్యం అనే దాన్ని కూడా పరిపూర్ణదృష్టితో (దాని మొత్తం స్వరూపం మనస్సులో ఆకళించుకొని) చూచి ఆనందం అనుభవించాలి. అఖండ బుద్ధిసమాస్వాద్యత్వం అంటే ఇదే. ఆ పుష్పాదుల్ని ఏ భాగానికి ఆ భాగం విడదీసి చూచినట్లుగా కావ్యాన్ని కూడా ఏ భాగానికి ఆభాగం విడదీసి చూస్తే అప్పుడు దానిలో శబ్దాలు, అర్థాలు, గుణాలు, అలంకారాలు మొదలైనవి కనబడతాయి. ఇది పరీక్షకుడు చేసే పని. ఆ విధంగా ఏ కీలు కా కీలు విడదీసి చూచినా కావ్యంలో 'ధ్వని' అనేది ఏదీ కనబడడం లేదు అని "కోఽయం ధ్వనిర్నామ" (ఏమిటి ఈ ధ్వని అనేది) అనడంలో భావం.

అభినవగుప్తుడు సహృదయశిరోమణి. ఆయన వ్యాఖ్యానాలలో చెణుకుల్లాంటి మాటలు అప్రయత్నంగా దొర్లుతుంటాయి. అవి సారస్వత తత్త్వ ప్రతిపాదకాలుగా కూడ ఉంటాయి. "అఖణ్డబుద్ధిసమాస్వాద్యం కావ్యమ్" అనేది అలాంటి వాక్యాలలో ఒకటి. కావ్యం విషయంలో చెప్పిన ఈ వాక్యం కళాత్మక వస్తువు లన్నింటికీ వర్తిస్తుంది.

## ధ్వన్యాలోకం

అన్యే బ్రూయుః - నాస్త్యేవ ధ్వనిః. ప్రసిద్ధప్రస్థానవ్యతిరేకిణః కావ్యప్రకారస్య కావ్యత్వహానేః. సహృదయహృదయాహ్లాది శబ్దార్థమయత్వమేవ కావ్యలక్షణమ్. న చ ఉక్తప్రస్థానవ్యతిరేకిణః మార్గస్య తత్సమ్భవతి. న చ తత్సమయాన్తఃపాతినః సహృదయాన్ కాంశ్చిత్ పరికల్ప్య తత్ప్రసిద్ధ్యా ధ్వనౌ కావ్యవ్యపదేశః ప్రవర్తితోఽపి సకలవిద్వన్మనోగ్రాహితామవలమ్బతే.

### బాలానందిని

అన్యే ఇతి- మరికొందరు ఇలా అనవచ్చు. అసలు ధ్వని అనేదే లేదు. ప్రసిద్ధంగా ఉన్న మార్గానికి విరుద్ధంగా ఏదైనా ఒక కావ్యపద్ధతిని (కావ్యభేదాన్ని) గూర్చి చెప్పినా అది కావ్యమే కాజాలదు. "సహృదయుల హృదయానికి ఆహ్లాదం కలిగించే శబ్దార్థాలే కావ్యం" అని కావ్యానికి లక్షణం. ఈ చెప్పిన ప్రస్థానానికి విరుద్ధంగా ఉన్న మార్గానికి అది (కావ్యత్వం) కుదరదు. ఇలాంటిది కూడా కావ్యమే అనే మతానికి చెందిన (తత్సమయాన్తః పాతినః) కొందరు సహృదయుల్ని కూడగట్టుకొని, వాళ్ల ప్రసిద్ధిని పట్టి ధ్వని కూడా కావ్యమే అని ఒక వాదం లేవదీసినా అది అందరు విద్వాంసుల మనస్సుల్నీ ఆకర్షించదు.

### లోచనం

నను మా భూదసౌ శబ్దార్థస్వభావః, మా చ భూత్తచ్చారుత్వహేతుః, తేన గుణాలంకారవ్యతిరిక్తోఽసౌ స్యాదిత్యాశఙ్క్య ద్వితీయ మభావప్రకార మాహ-అన్యే ఇతి. భవత్వేవమ్, తథాపి నాస్త్యేవ ధ్వనిర్యాదృశస్తవ లిలక్షయిషితః. కావ్యస్య హ్యసౌ కశ్చిద్వక్తవ్యః. న చాసౌ నృత్తగీతవాద్యాది స్థానీయః కావ్యస్య కశ్చిత్. కవనీయం కావ్యమ్; తస్య భావశ్చ కావ్యత్వమ్. న చ నృత్తగీతాది

కవనీయముచ్యతే.

### బాలానందిని

నన్వితి:-ఇది(ధ్వని) శబ్దస్వరూపం గాని అర్థస్వరూపం కాని కాకపోవచ్చు. శబ్దార్థాల సౌందర్యానికి హేతువు కూడా కాకపోవచ్చు. అందుచేత (శబ్దార్థచారుత్వ హేతువు కాకపోవడంచేత) ఇది గుణాలంకారాలకంటె భిన్నం అయితే కూడా కావచ్చు(అయితే మాత్రం నష్టం ఏమిటి?) అని ఆశంకించుకొని రెండవ అభావవాదం 'అన్యే' ఇత్యాదివాక్యాలలో చెపుతున్నాడు. భవత్వితి - నువ్వు చెప్పినట్లే అయితే కావచ్చు; అయినా కూడ నువ్వు ఎలాంటి ధ్వనిని నిరూపించదలచుచున్నావో అలాంటిది లేనే లేదు. ఎందుచేత ననగా - అదేదో కావ్యానికి సంబంధించిన ఒకానొక వస్తువు అని చెప్పాలి కదా? (నువ్వు చెప్పే) ఈ ధ్వని నృత్త-గీత-వాద్యాదులవంటి దన్నట్లు కనబడుతూన్నది. అలాంటి దీనికి కావ్యంతో ఏమీ సంబంధం లేదు. కావ్యం అనగా కవనీయం(చెప్పదగినది) కదా? కావ్యం యొక్క ధర్మం కావ్యత్వం, అనగా చెప్పదగినదిగా ఉండడం. నృత్తగీతాదుల్ని ఎవరూ కవనీయం అని అనరు కదా?

వివరణ:- కావ్యశబ్దం 'కుఙ్ శబ్దే' అనే ధాతువు నుండి నిష్పన్న మైనది. "కవతే ఇతి కవిః; కవేః కర్మ కావ్యమ్" అని కొందరు వ్యుత్పత్త్యర్థం చెపుతారు. "శబ్దం చేసేవాడు కవి; అతడు చేసినది కావ్యం" అని దీని అర్థం. ఇక్కడ అభినవగుప్తుడు 'శబ్దించదగినది' అని కావ్యశబ్దానికి అర్థం చెప్పి ఉన్నాడు. ఏమైనా కావ్యం అనేది శబ్దార్థస్వరూపం అని అర్థం. నువ్వు చెప్పే ఈ ధ్వని శబ్దస్వరూపమూ కాదు. అర్థస్వరూపమూ కాదు, వాటికి సంబంధించిన గుణాలంకారాలూ కాదు. నృత్తగీతాదులవంటిది. ఇవి కవనీయాలు కావు కదా అని భావం.

### లోచనం

ప్రసిద్ధేతి - ప్రసిద్ధం ప్రస్థానం శబ్దార్థౌ తద్గుణాలంకారాశ్చేతి, ప్రతిష్ఠన్తే పరమ్పరయా వ్యవహరన్తి యేన మార్గేణ తత్ప్రస్థానమ్, కావ్యప్రకారస్యేతి - కావ్యప్రకారత్వేన తవ మార్గో ఽభిప్రేతః, "కావ్యస్యాత్మా" ఇత్యుక్తత్వాత్. నను కస్మాత్తత్కావ్యం న భవతీత్యాహ - సహృదయేతి. మార్గస్యేతి - నృత్తగీతా క్షినికోచనాదిప్రాయస్యేత్యర్థః. తదితి - సహృదయేత్యాది కావ్యలక్షణమిత్యర్థః.

నను యే తాదృశమపూర్వం కావ్యరూపతయా జానన్తి త ఏవ సహృదయాః. తదభిమతత్వం చ నామ కావ్యలక్షణముక్తప్రస్థానావ్యతిరేకిణ ఏవ భవిష్యతీత్యాశఙ్క్యాహ-న చేతి. యథా హి ఖడ్గలక్షణం కరోమీత్యుక్త్వా ఆతానవితానాత్మా ప్రప్రియమాణః, సకలదేహాచ్ఛాదనః, సుకుమారశ్చిత్రతన్తు విరచితః, సంవర్తనవివర్తనసహిష్ణుః. అచ్ఛేదకః సుచ్ఛేద్య ఉత్కృష్టః ఖడ్గ ఇతి బ్రువాణః, పరైః పటః ఖల్వేవంవిధో భవతి న ఖడ్గ ఇత్యయుక్తతయా పర్యనుయుజ్యమాన ఏవం బ్రూయాత్ ఈదృశ ఏవ ఖడ్గో మమాభి ప్రేత ఇతి తాదృగేవైతత్. ప్రసిద్ధం హి లక్ష్యం భవతి న కల్పితమితి భావః. తదాహ - సకలవిద్వదితి.

బాలానందిని

ప్రసిద్ధేతీతి - ప్రసిద్ధమైన ప్రస్థానం అనగా శబ్దార్థాలు, వాటి గుణాలంకారాలూను. ఒక పరంపరను అనుసరించి ఏ మార్గంచేత, ప్రతిష్ఠన్తే = వ్యవహరిస్తారో, అది ప్రస్థానం. కావ్యప్రకారస్యేతీతి - "కావ్యస్యాత్మా"అని అంటూ నువ్వు దేనినైతే ఒక కావ్యప్రకారం అని, కావ్యభేదం అని, అంగీకరిస్తున్నావో ఆ మార్గం యొక్క అని అర్థం. అది మాత్రం కావ్యం ఎందుకు కాకూడదు అనే దానికి సహృదయ ఇత్యాదికంచేత సమాధానం చెపుతున్నాడు. మార్గస్యేతీతి - నృత్తం, గీతం, కన్ను గీటడం వంటి మార్గంయొక్క అని అర్థం. 'తత్ సంభవతి' అనే దానిలో 'తత్' అనగా సహృదయహృదయాహ్లాది శబ్దార్థమయత్వం అనే కావ్యలక్షణం అని అర్థం. నన్వితి - ఎవరైతే అపూర్వమైన అలాంటిదానినే (ధ్వనిరూపమైనదానినే) కావ్యంగా తెలుసుకుంటారో వాళ్లే సహృదయులు, అలాంటి సహృదయులకు అంగీకారయోగ్యం అవడం అనే కావ్యలక్షణం మేం చెప్పిన ప్రస్థానం కంటె భిన్నం కానిదానికే (అనగా మేం చెప్పినదానికే) వర్తిస్తుంది కదా అని ఆశంకించుకొని 'న చ' ఇత్యాది వాక్యంచేత సమాధానం చెపుతున్నాడు. యథాహీతి- "ఖడ్గం అంటే ఏమిటో చెపుతాను" అని ప్రారంభించి - "ఖడ్గం అనేది పడుగు పేకల రూపంలో ఉంటుంది. దాన్ని విప్పితే దేహం అంతా కప్పుకోవచ్చు. చిత్రవర్ణాలైన దారాలతో నేసి సుకుమారంగా ఉంటుంది. మడతపెట్టడానికీ, విప్పడానికీ వీలుగా ఉంటుంది. ఛేదించేందుకు, అనాయాసంగా ఛేదించడానికి, వీలుగా ఉంటుంది. అదే ఉత్కృష్టమైన ఖడ్గం" అని అంటూన్న వాణ్ణి - "ఏమయ్యా! దీన్ని బట్ట అంటారు కదా;

ఖర్థం ఎలా అవుతుంది" అని ఇతరులు అడిగినప్పుడు "నాకు ఇష్టమైన నేను చెప్పదలచిన ఖర్థం ఇదే" అని అతడు సమాధానం చెపితే ఎలా ఉంటుందో (ధ్వని అంటూ ఏదో కల్పించి, అది ఉన్నదే కావ్యం అని మీరు చెప్పేది) అలాగే ఉంటుంది. లోకప్రసిద్ధిని అనుసరించి లక్షణం చెప్పాలి కాని ఏదో స్వయంగా కల్పించి చెప్పకూడదు కదా అని భావం. ఈవిషయాన్నే "సకలవిద్వత్" ఇత్యాదివాక్యంతో చెపుతున్నాడు.

**లోచనం**

విద్వాంసో౽పి హి తత్సమయజ్ఞా ఏవ భవిష్యన్తి ఇతి శఙ్కాం సకలశబ్దేన నిరాకరోతి. ఏవం హి కృతే౽పి న కించిత్ కృతం స్యాత్; ఉన్మత్తతా పరం ప్రకటితేతి భావః.

యస్త్వత్రాభిప్రాయం వ్యాచష్టే - జీవితభూతో ధ్వనిస్త్వావత్తవాభిమతః, జీవితం చ నామ ప్రసిద్ధప్రస్థానాతిరిక్తమ్; అలంకారకారైరనుక్తత్వాత్. తచ్చ న కావ్యమితి లోకే ప్రసిద్ధమితి, తస్యేదం సర్వం స్వవచనవిరుద్ధమ్. యది హి తత్కావ్యస్యానుప్రాణకం తేనాఙ్గీకృతం పూర్వపక్షవాదినా తచ్చిరన్తనైరనుక్త మితి ప్రత్యుత లక్షణార్హమేవ భవతి. తస్మాత్ ప్రాక్తన ఏవాభిప్రాయః.

**బాలానందిని**

ఆ సమయం, అనగా ధ్వని సమయం(సంప్రదాయం) తెలిసినవాళ్లే మా దృష్టిలో విద్వాంసులు అని అనవచ్చును. ఈ ఆశంకను తొలగించడం కోసం, నువ్వు చెప్పేది విద్వాంసులందరికీ అంగీకారయోగ్యం కావాలి కాని నువ్వు కూడగట్టుకొని వచ్చిన ఏ కొద్దిమందికో అయితే చాలదు అనే ఉద్దేశంతో 'సకల' శబ్దాన్ని ప్రయోగించి నిరాకరిస్తున్నాడు. ఇలా చేసినా కూడ, అనగా ఏ కొద్దిమందినో కూడగట్టుకొని, వాళ్లకి సహృదయు లని పేరు పెట్టి, ఏమేమో చెప్పినా కూడ ఏమీ ప్రయోజనం లేదు; తమ ఉన్మత్తతను ప్రకటించుకోవడం మాత్రమే జరుగుతుంది అని భావం.

మూలంలో చెప్పిన ధ్వన్యభావవాదాన్ని కొందరు మరొక విధంగా ప్రతిపాదించారు; దాన్ని ఖండిస్తున్నాడు - యస్త్వితి(ధ్వన్యభావవాది ధ్వనివాదితో అంటూన్న మాటలివి)- "ధ్వని జీవితం అని కదా నువ్వు చెప్పేది? పూర్వపు ఆలంకారికు లెవరూ జీవితాన్ని గూర్చి చెప్పలేదు; అందుచేత ఇది ప్రసిద్ధమైన ప్రస్థానం కంటె భిన్నమైనది. అది (ధ్వనిప్రధానమైనది) కావ్యం అని లోకంలో కూడా ఎక్కడా ప్రసిద్ధి లేదు. అందుచేత ధ్వనిని అంగీకరించవలసిన

పని లేదు అని భావం" అని ఒకడు చేసిన వ్యాఖ్యానం స్వవచనవిరుద్ధం. ధ్వని కావ్యానికి జీవితం అని పూర్వపక్షి(అభావవాది) అంగీకరించిన పక్షంలో దాన్ని గూర్చి ప్రాచీను లెవరూ చెప్పలేదు గాన దాని లక్షణాదికం చెప్పడమే యుక్తం గాని చెప్పకుండా ఉండకూడదు. అందుచేత ఈ ప్రఘట్టకానికి మేం వెనక చెప్పిన భావమే యుక్తం.

## ధ్వన్యాలోకం

పునరపరే తస్యాభావమన్యథా కథయేయుః - న సమ్భవత్యేవ ధ్వనిర్నామ కశ్చిత్. కామనీయకమనతివర్తమానస్య తస్యోక్తేష్వేవ చారుత్వహేతుష్వన్తర్భావాత్. తేషామన్యతమస్యైవ వా అపూర్వ సమాఖ్యామాత్రకరణే యత్కిఞ్చన కథనం స్యాత్.

కిం చ వాగ్వికల్పానామానన్త్యాత్ సంభవత్యపి వా కస్మింశ్చిత్కావ్య లక్షణవిధాయిభిః ప్రసిద్ధైరప్రదర్శితే ప్రకారలేశే ధ్వనిర్ధ్వనిరితి యదేతద లీకసహృదయత్వభావనాముకులిత లోచనైర్నృత్యతే తత్ర హేతుం న విద్మః. సహస్రశో హి మహాత్మభి రన్యైరలఙ్కారప్రకారాః ప్రకాశితాః ప్రకాశ్యన్తే చ. న చ తేషామేషా దశా శ్రూయతే. తస్మాత్ ప్రవాదమాత్రం ధ్వనిః. న త్వస్య క్షోదక్షమం తత్త్వం కించిదపి ప్రకాశయితుం శక్యమ్.

### బాలానందిని

పునరితి:- మరికొందరు అభావవాదాన్ని ఈ విధంగా ప్రతిపాదించవచ్చు. ధ్వని అంటూ కొత్తది ఏదీ ఉండడానికి అవకాశం లేదు. ఎందుచేత ననగా ఇది కూడా చారుత్వాన్ని కలిగించేదే కావాలి కదా? అలాంటప్పుడు అది చారుత్వహేతువులుగా ఇంతకు పూర్వమే అంగీకరించినవాటిలో దేనిలోనో ఒకదానిలో అంతర్గతం అవుతుంది. వాటిలో (చారుత్వహేతువులలో) ఒకదాన్ని తీసుకొని దానికి ఒక క్రొత్త పేరు పెట్టినంతమాత్రంచేత ఏమేమో (సారరహితమైన విషయం) చెప్పినట్లే అవుతుంది.

కించేతి:- ఇంకొక విషయం ఏమిటంటే వాగ్వికల్పాలకి(ఒక విషయం చెప్పే విధానాలకి) అంతం అనేది లేదు. ప్రసిద్ధులైన కావ్యలక్షణవిధాయకులు ఇంతకు

పూర్వం చెప్పని ఏదో ఒక చిన్న (ఏ ప్రాధాన్యం లేని) ప్రకారం (పద్ధతి) ఉంటే ఉండవచ్చు. దానిని పట్టుకొని "ఓహో! ధ్వని! ధ్వని!" అంటూ లేని సహృదయత్వం ఆపాదించుకొని, అర్ధనిమీలితనేత్రాలతో ఇలా నృత్యం చేయడం ఎందుకో మాకు హేతు వేదీ కనబడడంలేదు. మహాత్ములైన ఇతరాలంకారికులు వేలకొలది అలంకారప్రకారాలు ప్రకాశింపచేసి ఉన్నారు; ఇంకా ప్రకాశింపచేస్తున్నారు కూడా . వాళ్లెవరూ ఈ విధంగా ప్రవర్తించడం లేదు. అందుచేత 'ధ్వని' అనేది కేవలం ప్రవాదం మాత్రమే(కల్పన మాత్రమే). గట్టిగా పరిశీలించి చూస్తే నిలిచే దీని తత్త్వం (యథార్థస్వరూపం) ఏదీ ప్రతిపాదించడం శక్యం కాదు.

### లోచనం

నను భవత్వసౌ చారుత్వహేతుః శబ్దార్థగుణాలంకారాన్తర్భూతశ్చ; తథాపి ధ్వనిరిత్యముయా భాషయా జీవితమిత్యసౌ న కేన చిదుక్త ఇత్యభిప్రాయ మాశఙ్క్య తృతీయమభావవాదముపన్యస్యతి - పునరపర ఇతి. కామనీయకమితి- కమనీయస్య కర్మ. చారుత్వహేతుతేతి యావత్.

నను విచ్ఛిత్తీనామసంఖ్యత్వాత్ కాచిత్తాదృశీ విచ్ఛిత్తిరస్మాభిర్దృష్టా, యా నానుప్రాసాదౌ, నాపి మాధుర్యాదౌ ఉక్తలక్షణే అన్తర్భవేత్ ఇత్యా శఙ్క్యాభ్యుపగమపూర్వకం పరిహరతి - వాగ్వికల్పానామితి. వక్తీతి వాక్ శబ్దః; ఉచ్యతే ఇతి వాక్ అర్థః; ఉచ్యతే అనయేతి వాక్ అభిధావ్యాపారః. తత్ర శబ్దార్థవైచిత్ర్యప్రపఞ్చః అనన్తః. అభిధావైచిత్ర్యప్రకారో ఽప్యసంఖ్యేయః.

### బాలానందిని

నన్వితి:- ఇది చారుత్వహేతువే కావచ్చు. శబ్దార్థగుణాలంకారాలలో అంతర్భూతం అయితే కావచ్చును. అయినా ఇంతవరకు ఎవరూ కూడ 'ధ్వని' అనే భాషతో (పేరు పెట్టి)కావ్యజీవితం అని చెప్పలేదు అని ఆశంకించుకొని మూడవ అభావవాదాన్ని "పునరపరే" ఇత్యాదివాక్యాలలో ప్రతిపాదిస్తున్నాడు. 'కామనీయకమ్' అనగా అందమైనదాని కర్మ. (కమనీయస్య కర్మ కామనీయకమ్). చారుత్వజ్ఞానానికి, ఇది అందంగా ఉంది అన్న జ్ఞానానికి, హేతువు అయి ఉండడం అని భావం.

నను విచ్ఛిత్తీనామిత్యాది :- శోభలు అసంఖ్యాకంగా ఉంటాయి. అలాంటి ఒక శోభను (విచ్ఛిత్తిని) మేం కనిపెట్టాం. అది పూర్వికులు లక్షణాలు చెప్పి ప్రతిపాదించిన

అనుప్రాసాదులలో కాని మాధుర్యాదులలో కాని అంతర్గతం కాదు అని ఆశంకించుకొని ఆ వాదాన్ని అంగీకరిస్తూనే వాగ్వికల్పానామ్ ఇత్యాదివాక్యాలచేత పరిహరిస్తున్నాడు. (వాగ్వికల్పానామ్' అన్నదానిలో 'వాక్' అనేదానికి అనేకార్థాలు ఉన్నాయి. వికల్పశబ్దానికి వైచిత్ర్యం అని అర్థం అని విశదీకరిస్తున్నాడు). "వక్తీతి వాక్" (చెప్పేది కాబట్టి వాక్) అనే వ్యుత్పత్తిని అనుసరించి 'వాక్' అనగా 'శబ్దం' అని ఒక అర్థం. "ఉచ్యతే ఇతి వాక్" (చెప్పబడుతుంది కాబట్టి వాక్) అనే వ్యుత్పత్తిచేత 'అర్థం' అని అర్థం. "ఉచ్యతే అనయా ఇతి వాక్" (దీనిచేత చెప్పబడుతుంది కాబట్టి వాక్) అనే వ్యుత్పత్తిచేత 'అభిధావ్యాపారం' అని అర్థం. వీటిలో శబ్దవైచిత్ర్యప్రకారం, అర్థవైచిత్ర్యప్రకారమూకూడా అనంతమైనది. అభిధావైచిత్ర్యప్రకారం కూడా లెక్కపెట్టడానికి శక్యంకానంత సంఖ్యలో ఉంటుంది.

లోచనం

ప్రకారలేశ ఇతి - స హి చారుత్వహేతుర్గుణో వాలంకారో వా? స చ సామాన్యలక్షణేన సంగృహీత ఏవ. యదాహుః - "కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః; తదతిశయహేతవస్త్వలంకారాః" (వా.సూ.3.1.1.-2). తథా "వక్రాభిధేయశబ్దోక్తిరిష్టా వాచామలంకృతిః" (భామహాలంకారం 1.36) ఇతి. ధ్వనిర్ధ్వనిరితి వీప్సయా సంభ్రమం సూచయన్నాదరం దర్శయతి. నృత్యతే ఇతి తల్లక్షణకృద్భిః తదుక్తకావ్యవిధాయిభిః, తచ్ఛ్రవణోద్ఘాతచమత్కారైశ్చ ప్రతిపత్తృభిః ఇతి శేషః. ధ్వనిశబ్దే కోఽత్యాదర ఇతి భావః. ఏషా దశా ఇతి. స్వయం దర్పః పరైశ్చ స్తూయమానతేత్యర్థః వాగ్వికల్పాః వాక్ప్రవృత్తిహేతు ప్రతిభావ్యాపారా ఇతి వా. తస్మాత్ ప్రవాదమాత్రమ్ ఇతి - సర్వేషామభావవాదినాం సాధారణ ఉపసంహారః. యతః శోభాహేతుత్వే గుణాలఙ్కారేభ్యో న వ్యతిరిక్తః, యతశ్చ వ్యతిరిక్తత్వే న శోభాహేతుః, యతశ్చ శోభాహేతుత్వేఽపి నాదరాస్పదం తస్మాదిత్యర్థః.

బాలానందిని

ప్రకారలేశః ఇతి - చారుత్వహేతువైన అది (ధ్వని) గుణమైనా కావాలి. అలంకారమైనా కావాలి. ఏదైనా అది సామాన్యలక్షణం క్రిందికే వచ్చేస్తుంది. అలాంటి సామాన్యలక్షణం వామనాదులు చెప్పి ఉన్నారు కదా? "కావ్యానికి శోభను కలిగించే

ధర్మాలు గుణాలు, ఆ శోభయొక్క అతిశయానికి హేతువులు (ఆ శోభను పెంపొందింపచేసేవి) అలంకారాలు" అని వామనుడు చెప్పాడు. 'వక్రమైన అనగా సుందరమైన అర్థాలయొక్క, శబ్దాల యొక్క కూర్పు వాక్కుల అలంకారంగా చెప్పబడింది' అని భామహుడు చెప్పాడు. అందుచేత మీ ధ్వనికి ఈలక్షణాల్లో ఏదో ఒక లక్షణం పట్టి అది వాటిలో అంతర్గతం అయిపోతుంది అని భావం. "ధ్వనిః ధ్వనిః" అని రెండు మాట్లు ఆవృత్తి చేయడంచేత తొందరను సూచించడం ద్వారా ఆదరాన్ని చూపుతున్నాడు. నృత్యతే ఇతి- "దాని లక్షణం చెప్పినవాళ్లచేత, అది ఉన్న కావ్యం రచించే వాళ్లచేత, ఆ కావ్యాన్ని వినడంవల్ల కలిగిన చమత్కారం కలవాళ్లచేత" అని అధ్యాహారం. వీళ్లందరూ ఏమేమో నృత్యం చేస్తున్నారు అని అర్థం. 'ధ్వని' అనే మాటమీద ఎందుకు ఇంత ఆదరం అని భావం. ఏషా దశా = ఇలాంటి పరిస్థితి; అనగా తమకు దర్పం, ఇతరుల స్తోత్రాలు అందికోవడమూనూ అని అర్థం.

తస్మాత్ ప్రవాదమాత్రం ధ్వనిః అనేది అభావవాదు లందరూ కలిసి చేసిన ఉపసంహారం. ధ్వని శోభకి హేతువైన పక్షంలో గుణాలంకారాలకంటె భిన్నం కాజాలదు కాబట్టి, గుణాలంకారాలకంటె భిన్నం అయిన పక్షంలో అది శోభాహేతువు కాజాలదు కాబట్టి, ఏదో కొంత శోభకు హేతువు అని అంగీకరించినా అంత ఆదరం చూపవలిసింది కాదు కాబట్టి - ఈ మూడు హేతువులచేత కూడా ఏదో క్రొత్త పేరు పెట్టడం తప్ప ధ్వని అనేది లేదు అని అర్థం.

## ధ్వన్యాలోకం

తథాచాన్యేన కృత ఏవాత్ర శ్లోకః -

యస్మిన్నస్తి న వస్తు కించన మనఃప్రహ్లాది సాలంకృతి
వ్యుత్పన్నై రచితం చ నైవ వచనైర్వక్రోక్తిశూన్యం చ యత్,
కావ్యం తద్ధ్వనినా సమన్వితమితి ప్రీత్యా ప్రశంసన్ జడో
నో విద్మోఽభిదధాతి కిం సుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః. (1)

### బాలానందిని

తథా ఇతి - ఈ విషయమే చెపుతూ ఒకడు శ్లోకం ఒకటి రచించి ఉన్నాడు- యస్మిన్నితి :- యస్మిన్ = ఏ కావ్యంలో, మనఃప్రహ్లాది = మనస్సుకు ఆనందం కలిగించేది, సాలంకృతి = అలంకారాలతో కూడినదీ అయిన, వస్తు = వస్తువు,

కించన=ఏదీ కూడా, నాస్తి = లేదో, యత్ = ఏది, వ్యుత్పన్నైః = వ్యాకరణశాస్త్రసంమతాలై మనోహరంగా ఉన్న, వచనైః = పదాలచేత, న రచితమ్ = రచింపబడలేదో, యత్ = ఏది, వక్రోక్తిశూన్యమ్ = వక్రోక్తితో శూన్యమో, తత్ = అట్టి, కావ్యమ్ = కావ్యము, ధ్వనినా = ధ్వనితో, సమన్వితమ్ ఇతి = కూడినది అని అంటూ, ప్రీత్యా = ఆనందంతో, ప్రశంసన్ = ప్రశంసించే, జడః = మూర్ఖుడు, ధ్వనేః = ధ్వనియొక్క, స్వరూపమ్ = స్వరూపాన్ని గూర్చి, పృష్టః= అడగబడినవాడై, కిమ్ = ఏమి, అభిదధాతి = చెప్పునో, నో విద్మః = ఎరుగము.

### లోచనం

న చేయమభావసంభావనా నిర్మూలైవ దూషితా ఇత్యాహ - తథా చాన్యేన ఇతి. గ్రన్థకృత్సమానకాలభావినా మనోరథనామ్నా కవినా. యతో న సాలంకృతి అతో న మనఃప్రహ్లాది. అనేనార్థాలంకారాణామభావ ఉక్తః. వ్యుత్పన్నైః రచితం చ నైవ వచనైరితి శబ్దాలంకారాణామ్. వక్రోక్తిః ఉత్కృష్టా సంఘటనా; తచ్ఛూన్యమితి శబ్దార్థగుణానామ్. వక్రోక్తిశూన్యశబ్దేన సామాన్య లక్షణాభావేన సర్వాలంకారాభావ ఉక్త ఇతి కేచిత్. తైః పునరుక్తత్వం న పరిహృత మేవేత్యలమ్. ప్రీత్యా ఇతి గతానుగతికానురాగేణేత్యర్థః. సుమతినా ఇతి జడేన పృష్టో భ్రూభఙ్గకటాక్షాదిభిరేవోత్తరం దదత్తత్స్వరూపం కామమాచక్షీత ఇతి భావః.

### బాలానందిని

నేతి - ఈ ధ్వన్యభావసంభావనకు ఏమీ మూలం లేకుండానే దూషించలేదు అని తథా చ ఇత్యాది వాక్యంలో చెపుతున్నాడు. ఇలా ఆక్షేపిస్తూ శ్లోకం వ్రాసినవాడు గ్రంథకారునికి సమకాలికుడైన మనోరథుడనే కవి. అలంకారాలు ఉన్నది కాకపోవడంచేత అది మనస్సుకు ఆనందకరం కాదు. దీనిచేత అర్థాలంకారాలు లేవని చెప్పినట్లయింది. వ్యుత్పన్నైః రచితం చ నైవ వచనైః అనడంచేత శబ్దాలంకారాలు లేవని చెప్పబడింది. వక్రోక్తి అనగా ఉత్కృష్టమైన కూర్పు (సంఘటన). దానితో శూన్యం అనడంచేత శబ్దగుణాలు, అర్థగుణాలు లేవని చెప్పబడింది. "వక్రోక్తిశూన్య" శబ్దంచేత సుందరమైన ఉక్తి అనే సామాన్యలక్షణం లేదనడంచేత ఏ అలంకారాలూ లేవని చెప్పినట్లు అయింది అని కొందరు వాఖ్యానించారు. అలా వ్యాఖ్యానిస్తే (అర్థాలంకారశబ్దాలంకారాలు లేకపోవడాన్ని గూర్చి మొదటి పాదంలోను రెండో పాదంలోను చెప్పి ఉండడం చేత) పౌనరుక్త్యదోషం వస్తుంది. ఆ దోషానికి ఆ వ్యాఖ్యాతలు పరిహారం చెప్పలేదు. ఇంక

చాలు (ఈ వ్యాఖ్యలో ఉన్న ఈ ఒక్క దోషం చూపితే చాలు). ప్రీత్యా అనగా గతానుగతి కానురాగంచేత, అనగా ఒకరిని చూచి మరొకరు ఆసక్తి చూపడంచేత అని అర్థం. సుమతిసేతి- జడునిచేత ప్రశ్నించబడితే కనుబొమ్మల విరుపులచేత, క్రీకంటి చూపుల చేత సమాధానం చెపుతూ దాని స్వరూపాన్ని గూర్చి చెప్పవచ్చునేమో అని భావం.

వివరణ. బుద్ధిమంతులెవరైనా వచ్చి ఏమిటయ్యా నువ్వు అంతగా పొగుడుతూన్న ధ్వని అంటూ అని ప్రశ్నిస్తే సమాధానం ఏమీ చెప్పలేకపోయినా ఎవడైనా జడమతి వచ్చి ఆ ప్రశ్న వేస్తే అబ్బో దాని స్వరూపం ఏం వర్ణించమంటావు! అన్నట్లు కనుబొమ్మలు ఎగరేస్తూ, నేత్రకోణాలతో చూస్తూ ఏమేమో అభినయించి దాని స్వరూపాన్ని చెప్పడానికి ప్రయత్నించవచ్చు అని పరిహాసోక్తి.

ధ్వన్యాలోకం

"భాక్తమాహుస్తమన్యే" - అన్యే తం ధ్వనిసంజ్ఞితం కావ్యాత్మానం గుణవృత్తిమాహుః. యద్యపి చ ధ్వనిశబ్దసంకీర్తనేన కావ్యలక్షణవిధాయిభిః గుణవృత్తిః అన్యో వా న కశ్చిత్ ప్రకారః ప్రకాశితః, తథాపి, అముఖ్యవృత్త్యా కావ్యేషు వ్యవహారం దర్శయతా ధ్వనిమార్గో మనాక్ స్పృష్టోఽపి న లక్షిత ఇతి పరికల్ప్య ఏవముక్తమ్ - "భాక్తమాహుస్తమన్యే" ఇతి.

బాలానందిని

భాక్తమితి : - "ధ్వని' అనే పేరు గల ఆ కావ్యాత్మ 'గుణవృత్తి' అని మరికొందరు అంటున్నారు. అయితే కావ్యలక్షణవిధాయకు లెవ్వరూ కూడ గుణవృత్తిని గాని, మరొక ప్రకారాన్ని (వృత్తిని) గాని, ధ్వని' అని పేరు పెట్టి ప్రతిపాదించి ఉండలేదు; అయినా కావ్యాలలో అముఖ్యమైన వృత్తిచేత, అనగా అభిధావృత్తి కంటె భిన్నమైన ముఖ్యం కాని వృత్తిచేత, వ్యవహారాన్ని చూపిన భామహ-వామనాదులు ధ్వనిమార్గాన్ని కొంచెం స్పృశించారు గాని దానికి (ధ్వనికి) స్పష్టంగా లక్షణం చెప్పలేదు అనే విషయాన్ని దృష్టిలో ఉంచుకొని (పరికల్పించి) "భాక్తమాహుస్తమన్యే" అనడం జరిగింది.

వివరణ. ధ్వని అనేది ఒకటుంది. కాని అది భక్తిలో (గౌణవృత్తిలో) అంతర్గతం అవుతుంది అని ప్రాచీనాలంకారికు లెవరూ చెప్పలేదు కదా? అలాంటప్పుడు "కావ్యస్యాత్మా" ఇత్యాది శ్లోకంలో "భాక్తమాహుస్తమన్యే" (ఈ ధ్వని భక్తిలో, గౌణవృత్తిలో,

చేరుతుంది అని కొందరంటున్నారు) అని ఎలా చెప్పబడింది అనే ప్రశ్నకు ఇక్కడ సమాధానం చెప్పబడింది. నిజమే, ధ్వని భాక్తం అని ఎవరూ చెప్పలేదు. అయినా భామహ వామనాదులు, కావ్యాలలో అభిధావృత్తికంటె భిన్నమైన గౌణవృత్తికి (ఇది లక్షణావృత్త్యంతర్గతమే) అనుప్రవేశం ఉందని చెప్పారు. లక్షణావృత్తిని అంగీకరించారు అంటే దానిలోని ప్రయోజనాంశం ధ్వనివిషయమే గాన దాన్ని వాళ్లు స్పృశించినట్లే. స్పష్టంగా మాత్రం చెప్పలేదు. ఈ అభిప్రాయంచేత "భాక్తమాహుస్తమన్యే" అని చెప్పడం జరిగింది అని సమాధానం.

వివరణ. "గంగాయాం ఘోషః' అనేది లక్షణావృత్తికి ఉదాహరణం. లక్షణచేత గంగాశబ్దానికి 'గంగాతీరం' అని అర్థం. 'గంగాతీరే ఘోషః' అనకుండా 'గంగాయాం' అనడంవల్ల గంగలో ఉన్న పావనత్వాదులు ఈ ఘోషంలో ఉన్నాయని సూచింపబడుతుంది. ఈ అంశం ధ్వనిచేతనే తెలుస్తుంది. "సింహోఽయం యోధః" (ఈ యోధుడు సింహం) అనే గౌణప్రయోగంలో (సింహంలో ఉన్న శౌర్యధైర్యాదిగుణాలు యోధునిలో ఉండడంచేత వీనినే సింహం అనడం జరిగింది. అందుచే దీనికి గౌణ ప్రయోగం అని పేరు. ఇది లక్షణాభేదం). అనాయాసంగా శత్రుసంహారాదికం చేయగలడు ఇత్యాద్యర్థాలు సూచించబడుతున్నాయి. అవి ధ్వనివిషయాలు. ఈ విధంగా కావ్యాలలో అభిధాభిన్నమైన వృత్తిని అంగీకరించిన భామహవామనాదులు ధ్వని అని పేరు పెట్టి ధ్వనిని చెప్పకపోయినా ఆ ధ్వనిని అప్రత్యక్షంగా (indirectly) అంగీకరించినట్లే. అయితే దీనిని భాక్తంగా (లక్షణాసంబద్ధంగా) చెప్పారు.

లోచనం

ఏవ మేతే అభావవికల్పాః శృఙ్ఖలాక్రమేణాగతాః, న త్వన్యోన్యాసంబద్ధా ఏవ. తథాహి - తృతీయాభావప్రకారనిరూపణోపక్రమే 'పునః' శబ్దస్యాయమేవాభిప్రాయః. ఉపసంహారైక్యం చ సంగచ్ఛతే. అభావవాదస్య సంభావనాప్రాణత్వేన భూతత్వముక్తమ్. భాక్తవాదస్త్వవిచ్ఛిన్నః పుస్తకేషు ఇత్యభిప్రాయేణ భాక్తమాహుః ఇతి నిత్య ప్రవృత్త వర్తమానాపేక్షయాభిధానమ్.

బాలానందిని

ఏవమితి:- ఈ అభావవికల్పా లన్నీ గొలుసుకట్టుగా ఏర్పడినవే; ఒకదానితో ఒకటి సంబంధంలేనివి కావు. అందుచేతనే మూడవ అభావవాదాన్ని ప్రతిపాదించడానికి

ప్రారంభించినప్పుడు "పునరపరే తస్యాభావమన్యథా కథయేయుః" అని 'పునః' శబ్దాన్ని ప్రయోగించడం, "తస్మాత్" ప్రవాదమాత్రం ధ్వనిః" అని అభావవాదాలు మూడింటినీ ఒకే వాక్యంచేత ఉపసంహరించడం యుక్తంగా ఉంది.

అభావవాదస్యేతి :- అభావవాదం పూర్తిగా సంభావన (ఊహ) మీద ఆధారపడి ఉండడంచేత అది భూతకాలసంబద్ధమైనది అని వెనక చెప్పి ఉన్నాం. భాక్తవాదం మాత్రం ప్రాచీనకాలంనుండీ కూడా పుస్తకాలలో (గ్రంథాలలో) అవిచ్ఛిన్నంగా వస్తూనే ఉంది అనే అభిప్రాయంతో "సూర్యః పూర్వస్యాం దిశి ఉదేతి" ఇత్యాదులలో వలె, నిత్యమూ జరుగుతూండే వర్తమానాన్ని దృష్టిలో ఉంచుకొని భాక్తమాహుః అని చెప్పడం జరిగింది. ('ఆహుః' అనేది బ్రూఞ్ధాతువు లట్ ప్రథమపురుష బహువచనం).

లోచనం

భజ్యతే, సేవ్యతే పదార్థేన ప్రసిద్ధతయా ఉత్ప్రేక్ష్యతే ఇతి భక్తిః, ధర్మః అభిధేయేన సామీప్యాదిః, తతః ఆగతః భాక్తః, లాక్షణికోఽర్థః, యదాహుః -

"అభిధేయేన సామీప్యాత్సారూప్యాత్సమవాయతః,
వైపరీత్యాత్ క్రియాయోగాల్లక్షణా పఞ్చధా మతా." ఇతి.

గుణసముదాయవృత్తేః శబ్దస్యార్థభాగః తైక్ష్ణ్యాదిః భక్తిః, తత ఆగతో గౌణోఽర్థః భాక్తః, భక్తిః ప్రతిపాద్యే సామీప్యతైక్ష్ణ్యాదౌ శ్రద్ధాతిశయః. తాం ప్రయోజనత్వేనోద్దిశ్య తత ఆగతో భాక్తః. ఇతి ముఖ్యార్థబాధా, నిమిత్తం, ప్రయోజనమితి త్రయసద్భావః ఉపచారబీజమిత్యుక్తం భవతి.

బాలానందిని

భజ్యతే ఇతి- 'భక్తి' శబ్దానికి నాలుగు అర్థాలు చెప్పి తద్వారా 'భాక్త' శబ్దానికి గౌణం, లాక్షణికం ఇత్యాద్యర్థాలు ఎలా వచ్చాయో, లక్షణాహేతువు ఏదో చెపుతున్నాడు. "భజ్యతే ఇతి భక్తిః" అని విగ్రహం, గంగాతీరరూపపదార్థంచేత సేవించబడుతుంది, అనగా సామీప్యాదులద్వారా ప్రసిద్ధం అవడంచేత ఆశ్రయించబడుతుంది, అని అర్థం. లేదా వక్తచేత గాని, శ్రోతచేత గాని గంగారూప శబ్దార్థంచేత, లోకప్రసిద్ధిని పురస్కరించుకొని ఊహించబడుతుంది అని అర్థం. అనగా వాచ్యార్థంతో సామీప్యం మొదలైన ధర్మం 'భక్తి'. ఆ భక్తి ద్వారా, సామీప్యాదిధర్మం ద్వారా, లభించినది 'భాక్తం', అనగా లాక్షణికార్థం. అందుచేతనే లక్షణను గూర్చి ఇలా చెప్పి ఉన్నారు.

అభిధేయేనేతి : - "వాచ్యార్థంతో సామీప్యం, సాదృశ్యం, విడదీయరాని సంబంధం, వైపరీత్యం, క్రియాసంబంధం వీటి వల్ల లక్షణ ఏర్పడుతుంది; అందుచేత ఇది అయిదు విధాలు". (దీనిని ముమ్ముందు లోచనకారుడే వివరించనున్నాడు (పేజీ 249)

'భాక్త' శబ్దానికి లక్షణాపరంగా అర్థం చెప్పి గౌణార్థపరంగా చెపుతున్నాడు - గుణసముదాయేతి - సింహాదిశబ్దం కొన్ని గుణాల సముదాయాన్ని బోధిస్తుంది. అనగా 'సింహ' శబ్దం సింహత్వజాతిని గాని సింహత్వజాతివిశిష్టవ్యక్తిని గాని బోధిస్తుంది. సింహంలో ఉన్న శౌర్యాదిగుణాలను కూడా ఆక్షేపంచేత (ఊహచేత) బోధిస్తుంది. ఈ విధంగా సింహాది శబ్దాలచేత ప్రత్యక్షంగా గాని, అప్రత్యక్షంగా గాని బోధించబడే గుణాల సముదాయంలో ఒక భాగమైన శౌర్యాదికం 'భక్తి'. దానిని పట్టి వచ్చిన అర్థం, గౌణార్థం, 'భాక్తం'.

దీనికే మరొక అర్థం చెపుతున్నాడు - భక్తిః ఇతి - 'భక్తి' అనగా - ప్రతిపాదించ దలచిన సామీప్యం, శౌర్యం మొదలైనవాటియందు అధికమైన శ్రద్ధ. దాన్ని ప్రయోజనంగా ఉద్దేశించి, దానివల్ల ఏర్పడినది 'భాక్తం' -అది గౌణమూ కావచ్చు. లాక్షణికమూ కావచ్చు. 'భక్తి' శబ్దానికి భంగం అని అర్థం. ఇక్కడ ముఖ్యార్థానికి బాధ అని అర్థం. ముఖ్యార్థానికి బాధ కలిగినప్పుడే, ముఖ్యార్థం కుదరనప్పుడే, లాక్షణికార్థం చెప్పవలసివస్తుంది. అందుచేత లక్షణకు ముఖ్యార్థబాధ కారణం. ఈ విధంగా 'భక్తి' శబ్దానికి నాలుగు అర్థాలు చెప్పడం ద్వారా లక్షణకి ముఖ్యార్థబాధ, ముఖ్యార్థసంబంధం, ప్రయోజనం అనే మూడూ బీజం అని చెప్పినట్లయింది.

లక్షణాహేతుస్వరూపాదులను గూర్చి స్పష్టంగా తెలుసుకొనగోరేవారు బాలానందినీసహితకావ్యప్రకాశలో ద్వితీయోల్లాసం చూడవచ్చు.

లోచనం

కావ్యాత్మానం గుణవృత్తిమితి - సామానాధికరణ్యస్యాయం భావః - యద్యప్యవివక్షితవాచ్యే ధ్వనిభేదే "నిఃశ్వాసాన్ధ ఇవాదర్శః" ఇత్యాదావుపచారోఽస్తి తథాపి న తదాత్మైవ ధ్వనిః; తద్వ్యతిరేకేణాపి భావాత్ వివక్షితాన్యపరవాచ్యప్రభేదాదౌ అవివక్షితవాచ్యేఽపి ఉపచార ఏవ, న ధ్వనిరితి వక్ష్యామః. తథా చ వక్ష్యతి-

"భక్త్యా బిభర్తి నైకత్వం రూపభేదాదయం ధ్వనిః,
అతివ్యాప్తేరథావ్యాప్తేర్న చాసౌ లక్ష్యతే తయా" ఇతి.
"కస్య చిద్ధ్వనిభేదస్య సా చ స్యాదుపలక్షణమ్". ఇతి చ.

బాలానందిని

కావ్యేతి. "భాక్తమాహుః తమ్" అనే వాక్యానికి కావ్యాత్మ అయిన ధ్వని గుణవృత్తి అని అంటున్నారు అని అర్థం. (ఆశంక) "ధ్వనిర్నామ గుణవృతిరేకీ నాస్తి కశ్చిత్" (గౌణవృత్తికి భిన్నంగా ధ్వని అనేది ఏదీ లేదు) అని నిషేధముఖంగా చెప్పవచ్చు కదా? "కావ్యాత్మానం గుణవృత్తిమ్ ఆహుః" అని సామానాధికరణ్యంచేత చెప్పడం ఎందుకు? అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు- సామానాధికరణ్యస్యేతి. ధ్వనికి గుణవృత్తికి తాదాత్మ్యం లేదు, అనగా ధ్వనీ, గుణవృత్తీ రెండూ ఒకటి కావు అనే విషయాన్ని ధ్వనివాదులు నిరాకరించాలి కాని ధ్వని ఉన్నచోట ఉపచారస్పర్శ (గుణవృత్తిస్పర్శ) ఉండదు అని నిరూపించవలసిన పని లేదు. ఎందుచేతననగా "నిఃశ్వాసాంధ ఇవాదర్శః" ఇత్యాది అవివక్షితవాచ్యధ్వనిస్థలాలలో ధ్వనితో పాటు ఉపచారం (గౌణవృత్తి) కూడా ఉంది. అయినా ధ్వని ఉపచారస్వరూపం కాదు. ఎందుచేత ననగా వివక్షితాన్యపరవాచ్యధ్వనిభేదాదులలో ఉపచారం లేకపోయినా ధ్వని ఉంది. అయితే వివక్షితాన్యపరవాచ్యభేదాదులలో ఉపచారం ధ్వనీ కలిసి ఉండక పోయినా అవివక్షితవాచ్యధ్వనిస్థలాలలో ఆ రెండూ కలిసి ఉన్నాయి కాబట్టి వాటికి తాదాత్మ్యం చెప్పవచ్చును కదా అని ఆశంకించడానికి అవకాశం లేదు. "సువర్ణపుష్పామ్" ఇత్యాదులలో అవివక్షితవాచ్యత్వం ఉన్నా కూడ ఉపచారమే కాని ధ్వని లేదు అని అక్కడ చెప్పగలం. ఈ విధంగా ధ్వని - ఉపచారాల తాదాత్మ్యమే నిషేధ్యం కాని ఏకాశ్రయత్వం (ఒకే ఉదాహరణలో కలిసి ఉండడం) నిషేధ్యం కాదని సూచించడానికై "ధ్వనిసంజ్ఞితం కావ్యాత్మానం గుణవృత్తిమ్ ఆహుః" అని సామానాధికరణ్యనిర్దేశం చేయబడింది అని భావం. (సామానాధికరణ్యం అనగా రెండింటిని విశేషణవిశేష్యాలుగా ఒకే విభక్తిలో చెప్పడం. ఉదా. "నీలమ్ ఉత్పలమ్". ఇలా చెప్పినప్పుడు ఇక్కడ పేర్కొన్న'నీలం' 'ఉత్పలం' కూడ ఒకటే అని తాదాత్మ్యం స్ఫురిస్తుంది.

అయితే ఈ విషయం అంతా నేను చెపుతున్నది కాదు, ధ్వనికారుడే చెప్పనున్నాడు అని చెపుతున్నాడు - తథా చ వక్ష్యతి ఇతి. ఈ విషయాన్నే "భక్త్యా బి భర్తి... లక్ష్యతే తయా" (కా.1-14) "కస్యచిద్ధ్వని.. ఉపలక్షణమ్" (కా.1.19) అని చెప్పబోతున్నాడు.

లోచనం

గుణాః సామీప్యాదయో ధర్మాః తైక్ష్ణ్యాదయశ్చ. తైరుపాయైః వృత్తిః అర్థాన్తరే యస్య, తైరుపాయైః వృత్తిర్వా శబ్దస్య యత్ర స గుణవృత్తిః శబ్దోఽర్థో వా. గుణద్వారేణ వా వర్తనం గుణవృత్తిః అముఖ్యోఽభిధావ్యాపారః- ఏతదుక్తం భవతి- ధ్వనతీతి వా, ధ్వన్యత ఇతి వా, ధ్వననమితి వా యది ధ్వనిః తథాప్యుపచరితశబ్దార్థవ్యాపారాతిరిక్తో నాసౌ కశ్చిత్. ముఖ్యార్థే అభిధైవేతి పారిశేష్యా దముఖ్య ఏవ ధ్వనిః, తృతీయరాశ్యభావాత్.

బాలానందిని

గుణా ఇతి- 'గంగాయాం ఘోషః' ఇత్యాద్యుదాహరణలలో సామీప్యం మొదలైనవి, "సింహో మాణవకః" ఇత్యాదులలో తీక్ష్ణత్వం (శౌర్యం) మొదలైనవి 'గుణాలు'. ఆ ఉపాయాలను (నిమిత్తాలను) బట్టి ఒక తీరశబ్దం మాణవకాదికమైన మరొక అర్థంలో ప్రవర్తిస్తే అది 'గుణవృత్తి'. ఆ నిమిత్తాలచేత ఏ తీర-మాణవకాద్యర్థం బోధించబడుతుందో ఆ అర్థం కూడా 'గుణవృత్తి'. ఆ విధంగా శబ్దం, అర్థం కూడా 'గుణవృత్తి' అని చెప్పవచ్చు. అనగా గుణైః వృత్తిః యస్య (శబ్దస్య) సః గుణవృత్తిః" అనే విగ్రహంచేత శబ్దం గాని, "గుణైః వృత్తిః యస్మిన్ (అర్థే) స గుణవృత్తిః" అనే విగ్రహం చేత అర్థంగాని 'గుణవృత్తి' అని చెప్పబడుతుంది. లేదా "గుణద్వారేణ వృత్తిః (వర్తనం) గుణవృత్తిః" అని విగ్రహంచేత గుణాల ద్వారా ప్రవర్తించడం, బోధించడం అని అర్థం. అప్పుడు అముఖ్యమైన అభిధావ్యాపారం అని 'గుణవృత్తి' శబ్దానికి అర్థం.

ఏతదితి :- ఇది చెప్పబడినట్లు అవుతుంది. (ఇంతవరకు చెప్పినదాని భావం ఇది): "ధ్వనతీతి ధ్వనిః" అనే విగ్రహంచేత ధ్వనింప చేసేది 'ధ్వని'. అనగా శబ్దం. "ధ్వన్యతే ఇతి ధ్వనిః" అనే విగ్రహంచేత ధ్వనిం చేయబడేదీ ధ్వని'. అనగా వ్యంగ్యార్థం. 'ధ్వననం ధ్వనిః' అనే విగ్రహం చేత ధ్వనింపచేయడం 'ధ్వని'; అనగా వ్యంజనావ్యాపారం, ఈ విధంగా ఏ అర్థం చెప్పినా ఈ ధ్వని అనేది ఉపచరితమైన (గౌణమైన) శబ్దమో, గౌణమైన అర్థమో, గుణమైన వ్యాపారమో - ఈ మూడింటిలో ఏదో ఒకటి కావలసిందే కాని వాటికంటె భిన్నం అవడానికి అవకాశం లేదు. అందుచేత 'ధ్వని' అంటూ ఏదీ లేదు. ఒక పదానికి ఉన్న ముఖ్యార్థాన్ని అభిధయే బోధిస్తుంది. కాబట్టి ఇంక మిగిలిన రెండవ వృత్తియైన అముఖ్యవృత్తియే (గుణవృత్తియే) ధ్వని అని చెప్పాలి. అభిధావృత్తి, గుణవృత్తి అనేవి కాకుండా మూడవ రాశి (Item) ఏదీ లేదు కదా? అందుచేత మీరు

చెప్పే ఈ ధ్వని భక్త్యంతర్గతమే అని భాక్తవాదుల అభిప్రాయం.

లోచనం

నను కేనైతదుక్తం ధ్వనిర్గుణవృత్తిరిత్యాశఙ్క్యాహ - యద్యపి చ ఇతి. అన్యో వేతి- గుణాలఙ్కారప్రకార ఇతి యావత్. దర్శయతేతి - భట్టోద్భటవామనాదినా. భామహేనోక్తమ్ -"శబ్దాశ్ఛన్దోభిధానార్థాః" ఇతి అభిధానస్య శబ్దాద్భేదం వ్యాఖ్యాతుం భట్టోద్భటో బభాషే - "శబ్దానామ్ అభిధానమ్ అభిధావ్యాపారః ముఖ్యో గుణవృత్తిశ్చ" ఇతి. వామనోఽపి సాదృశ్యాలక్షణా వక్రోక్తిః" ఇతి. మనాక్ స్పృష్ట ఇతి - తైస్తావత్ ధ్వని దిగున్మీలితా; యథాలిఖితపాఠకైస్తు స్వరూపవివేకం కర్తుమశక్నువద్భిః తత్స్వరూపవివేకో న కృతః, ప్రత్యుత ఉపాలభ్యతే, అభగ్ననారికేలవత్ యథాశ్రుత తద్గ్రన్థగ్రహణమాత్రేణ. అత ఏవాహ- పరికల్ప్యైవముక్తమితి. యద్యేవం న యోజ్యతే తదా ధ్వనిమార్గః స్పృష్టః ఇతి పూర్వపక్షాభిధానం విరుధ్యతే.

బాలానందిని

నన్వితి -"ధ్వని గుణవృత్తియే" అని ఎవరు చెప్పారు అని ఆశంకించుకొని (వృత్తికారుడు) యద్యపి చ ఇత్యాది వాక్యంలో సమాధానం చెపుతున్నాడు. అన్యో వా అనగా గుణాలంకారాలవంటిది అని అర్థం. అనగా ధ్వని అనేది గుణాలంకారాలలో ఒకటే, వాటివంటిదే, అని అభావవాదులు ఏ విధంగా స్పష్టంగా చెప్పలేదో అదే విధంగా భాక్తవాదులు కూడా "ధ్వని గుణవృత్తియే" అని చెప్పలేదు అని భావం. దర్శయతా= చూపించిన భట్టోద్భటవామనాదులచేత. భామహుడు కావ్యహేతువులను గూర్చి చెపుతూ -

"శబ్దాశ్ఛన్దోఽభిధానార్థా ఇతిహాసాశ్రయాః కథాః,
లోకో యుక్తిః కలాశ్చేతి మన్తవ్యాః కావ్యహేతవః" (భామహాలంకారం 1.9)

అన్నాడు. భామహవివరణం అనే వ్యాఖ్యానం (ఇది ఇప్పుడు అలభ్యం) రచించిన భట్టోద్భటుడు శబ్దాలకీ అభిధానానికీ ఉన్న భేదాన్ని వివరించడం కోసం (అనగా అభిధానశబ్దానికి కూడా) శబ్దం అనే అర్థం అవడం చేత "శబ్దాలు, అభిధానం" అన్నప్పుడు పౌనరుక్త్యదోషం వస్తుందని దానిని పరిహరించడం కోసం)- "శబ్దాల అభిధానం; అనగా ముఖ్యమైన అభిధావ్యాపారం, గుణవృత్తీ కూడా" అని అన్నాడు.

(అనగా శబ్దాలకి అభిధావృత్తి, గుణవృత్తి అనే రెండు వృత్తులు (వ్యాపారాలు) ఉన్నాయని చెప్పినట్లయింది) వామనుడు కూడా "సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః" (కావ్యా.సూ.4.3.8)అన్నాడు. "సాదృశ్యంవల్ల లక్షణను గ్రహించినప్పుడు అది వక్రోక్త్యలంకారం " అని దాని అర్థం. (ఈ విధంగా 'అభిధానమ్' అనే శబ్దంచేత భామహుడు, 'గుణవృత్తి' శబ్దం చేత ఉద్భటుడు, 'లక్షణా' శబ్దంచేత వామనుడు కావ్యాలలో గుణవృత్తిచేత వ్యవహారం ఉంటుంది అని చెప్పి ఉన్నారు అని భావం.)

మనాక్ స్పృష్ట ఇతి- వారిచేత ధ్వనిపద్ధతి సూచించబడియే ఉంది. అయితే ఉన్నది ఉన్నట్లు మాత్రమే చదువుకునే వాళ్ళు వాళ్ళు సూచించిన ధ్వనిస్వరూపాన్ని విశదీకరించడానికి అసమర్థులై దాని స్వరూపాన్ని విశదీకరించకపోవడం సరికదా దాన్ని నిందించారు కూడా. దీని కంతకీ కారణం ఏమిటనగా ఒలవని కొబ్బరిపండు దొరికినవాళ్లు దాన్ని ఏం చేయాలో తెలియక తికమకపడినట్లు విన్న గ్రంథాన్ని విన్నట్లుగానే కంఠస్థం చేయడం అనే అలవాటే. అందుచేతనే పరికల్ప్యైవముక్తమ్ అని అన్నాడు. దీనికి ఈ విధంగా భావం చెప్పకపోతే "ధ్వనిమార్గం స్పృశించబడింది" అని పూర్వపక్షంలో చెప్పడం విరుద్ధం అవుతుంది.

వివరణ. పైన చూపిన విధంగా భట్టోద్భటవామనాదులు కావ్యాలలో అభిధావృత్తికే కాక గుణవృత్తికి కూడా అనుప్రవేశం ఉంది అని చెప్పి ఉన్నారు. గుణవృత్తిని అంగీకరిస్తే ధ్వనిని కూడా అంగీకరించినట్లే. ఎందుచేత ననగా 'గంగాయాం ఘోషః' 'సింహో మాణవకః' ఇత్యాది లక్షణాగుణవృత్త్యుదాహరణలలో గంగాతీర- సింహసదృశత్వాద్యర్థాలు లక్షణావృత్తిగమ్యాలైనా పావనత్వ- శైత్యాది ప్రయోజనాలు ధ్వనిచేతనే గమ్యం అవుతాయి. అందుచేత ప్రాచీనాలంకారికులలో కొందరు గుణవృత్తిని అంగీకరించారంటే ధ్వనిదాకా వెళ్ళినట్లే. ఎటొచ్చీ వాళ్లు ఆ ధ్వనిస్వరూపాన్ని విశదీకరించలేదు. తరవాత వచ్చినవాళ్ళు ఈ రహస్యం గ్రహించక ధ్వని కూడా గుణవృత్తియే అని అనుకున్నారు. ఇందుకు యథాశ్రుతగ్రాహిత్వమే కారణం అని భావం.

కొందరు వ్యాఖ్యాతలు -"గుణవృత్తిని అంగీకరించిన భట్టోద్భటాదులే ధ్వనిస్వరూపం కూడా తెలపవలసి ఉంది. కాని వాళ్లు కాలిదాసాదికావ్యాలలో ధ్వనిస్థానాలైన శ్లోకాదుల్ని పైపైగా మాత్రమే చదివి, లోపలకి వెళ్ళలేకపోవడంచేత ధ్వనిస్వరూపం నిరూపించలేకపోయారు. పైపెచ్చు ధ్వనిని నిందించారు కూడ" అని ఈ ఘట్టంలోని

లొచనానికి భావం చెప్పారు. కాని ఉద్భటాదుల తరవాత వచ్చిన ఆలంకారికులలోనే ఈ దోషం ఉన్నట్లు చెప్పడం యుక్తం అని తోస్తుంది. వాళ్లు ధ్వనిమార్గాన్ని చూపినా వీళ్లు గ్రహించలేకపోయారు. వాళ్ల వ్రాతలు వీళ్లు పైపైనే అర్థం చేసుకున్నారు అని భావమే యుక్తం. ఉద్భటవామనాదులు ధ్వనిని ఖండించినట్లు ఎక్కడా కనబడదు. అందుచేత "ప్రత్యుత ఉపాలభ్యతే" అనే లోచనవాక్యం వాళ్ల విషయంలో వర్తించదు కదా?

"ధ్వనిమార్గః మనాక్ స్పృష్టః" అని వృత్తికారుడు అనడంచేత "ఉద్భటాదులు గుణవృత్తిని అంగీకరించడం ద్వారా ధ్వనిమార్గాన్ని కొంచెం స్పృశించారు" అని భావం చెప్పవలసి వచ్చింది. ధ్వనిమార్గాన్ని గూర్చి ఉద్భటాదులకి కూడా తెలియదు, వాళ్లకి తెలిసినది అభిధావృత్తి, గుణవృత్తి మాత్రమే అన్నట్లయితే "ధ్వనిమార్గః మనాక్ స్పృష్టః" అనే వాక్యం అసంగతంగా ఉంటుంది అని "యద్యేవం" ఇత్యాదిలోచనవాక్యానికి భావం.

## ధ్వన్యాలోకం

కేచిత్పునః లక్షణకరణశాలీనబుద్ధయః ధ్వనేస్తత్త్వం గిరామగోచరం సహృదయహృదయసంవేద్యమేవ సమాఖ్యాతవన్తః. తేనైవంవిధాసు విమతిషు స్థితాసు సహృదయమనఃప్రీతయే తత్స్వరూపం బ్రూమః.

### బాలానందిని

కేచిదితి- లక్షణం చెప్పే బుద్ధిప్రాగల్భ్యం లేని కొందరైతే "ధ్వనితత్త్వం మాటలకు అందదు; కేవలం సహృదయులు మాత్రమే, వాళ్లైనా తమ హృదయాలచేతనే, తెలుసుకోకలుగుతారు" అని అన్నారు. ఈ విధంగా ధ్వని విషయంలో అభిప్రాయభేదాలు ఉన్నాయి. అందుచేత సహృదయుల మనస్సుకు ఆనందం కలిగించడం కోసం ఆ ధ్వని స్వరూపాన్ని గూర్చి చెపుతున్నాం.

### లోచనం

శాలీనబుద్ధయః ఇతి - అప్రగల్భమతయః ఏతే చ త్రయ ఉత్తరోత్తరం భవ్యబుద్ధయః. ప్రాచ్యా హి విపర్యస్తా ఏవ సర్వథా. మధ్యమాస్తు తద్రూపం జానానా అపి సన్దేహేన అపహ్నువతే. అన్త్యాస్తు అనపహ్నువానా అపి

లక్షయితుం న జానతే ఇతి క్రమేణ విపర్యాససన్దేహాజ్ఞానప్రాధాన్యమేషామ్. తేనేతి - ఏకైకోఽప్యయం విప్రతిపత్తిరూపో వాక్యార్థో నిరూపణే హేతుత్వం ప్రతిపద్యతే ఇత్యేకవచనమ్. ఏవంవిధాసు విమతిషు ఇతి నిర్ధారణే సప్తమీ అసు మధ్యే ఏకోఽపి యో విమతిప్రకారః తేనైవ హేతునా తత్స్వరూపం బ్రూమః ఇతి- ధ్వనిస్వరూపమ్ అభిధేయమ్. అభిధానాభిధేయలక్షణో ధ్వనిశాస్త్రయోః, వక్తృశ్రోత్రోః వ్యుత్పాద్యవ్యుత్పాదకభావః సంబన్ధః; విమతినివృత్త్యా తత్స్వరూపజ్ఞానం ప్రయోజనమ్, శాస్త్రప్రయోజనయోః సాధ్యసాధనభావః సంబన్ధః ఇత్యుక్తమ్.

బాలానందిని

శాలీనేతి - శాలీనబుద్ధయః అనగా ప్రాగల్భ్యంలేని బుద్ధి గలవారు అని అర్థం. వీళ్ల ముగ్గురూ, ఉత్తరోత్తరం, అనగా మొదటి వాళ్ల కంటె రెండోవాళ్లు, రెండోవాళ్లకంటె మూడోవాళ్లు, తెలివైనవాళ్లు. మొదటివాళ్లు, అనగా మూడు విధాల అభావవాదులూ కూడ, పూర్తిగా పొరపాటుపడ్డవాళ్ళే. మధ్యములు, అనగా భాక్తవాదులు, ధ్వనిని గూర్చి తెలిసినా కూడ సందేహం చేత, అనగా ముఖ్య - గుణవృత్తులు కాక ధ్వని అనే మూడవ వ్యాపారం ఉందో లేదో అనే సందేహం చేత, దాన్ని కప్పిపుచ్చివేశారు. చివరివాళ్లు దానిని కప్పిపుచ్చలేదు కాని దానికి లక్షణం ఎలా చెప్పాలో వాళ్లకి తెలియదు. ఈ విధంగా ఈ మూడు తరగతుల వాదులలోనూ వరసగా విపర్యాసం (పొరపడడం), సందేహం, అజ్ఞానం ప్రధానంగా కనబడుతున్నాయి. తేనేతి - విప్రతిపత్తిరూపమైన ఈ ఒక్కొక్క వాక్యార్థం నిరూపణానికి హేతుత్వాన్ని పొందుతున్నది (ధ్వనిస్వరూపం నిరూపించడానికి కారణం అవుతున్నది) అని సూచించడం కోసం తేన అని ఏకవచనం ప్రయోగించబడింది.

వివరణ. ఏదైనా ఒక విషయాన్ని గూర్చి ఇలా చెప్పాలా, అలా చెప్పాలా అన్న ఆలోచనకు 'విప్రతిపత్తి' అని పేరు. కావ్యంలో అసలు ధ్వని అనేది ఉందా లేదా అనేది మొదటిపక్షంలో విప్రతిపత్తి. ధ్వని గుణవృత్తికంటె వేరుగా ఉందా లేదా అనేది రెండవ పక్షంలో విప్రతిపత్తి. ధ్వనికి లక్షణం చెప్పడం కుదురుతుందా కుదరదా అనేది మూడవ పక్షంలో విప్రతిపత్తి. ఈ మూడింటిలో ఏ ఒక్క విప్రతిపత్తి ఉన్నా ధ్వనిస్వరూపం చెప్పవలసిన అవసరం ఏర్పడుతుంది అని సూచించడం కోసం 'తైః' (ఆ విప్రతిపత్తులచేత) అని బహువచనం కాకండా 'తేన' (ఆ విప్రతిపత్తిచేత) అని ఏకవచనం ప్రయోగించబడింది అని అర్థం.

ఏవ మిత్యాది - ఏవంవిధాసు విమతిషు అనేది నిర్ధారణసప్తమి. వీటిలో ఏ విమతిప్రకారమైనా ధ్వనిస్వరూపనిరూపణానికి హేతువు కావచ్చును కాబట్టి దాని స్వరూపాన్ని చెప్పుతున్నాము అని భావం.

వివరణ: 'ఏవంవిధాసు విమతిషు' అన్నప్పుడు "యస్య చ భావేన భావలక్షణమ్" (పా.సూ.2-3-37) అనే సూత్రంచేత భావలక్షణ సప్తమి చెప్పవచ్చు, లేదా "యతశ్చ నిర్ధారణమ్" (పా.సూ. 2.3.42) నిర్ధారణసప్తమి చెప్పవచ్చును. "పఞ్చసు రూప్యకేషు లబ్ధేషు వ్యయితవాన్" అన్నప్పుడు భావలక్షణసప్తమి చెప్పి "ఐదురూపాయలు దొరకగా ఖర్చుపెట్టి వేశాడు" అని అర్థం చెపితే ఐదురూపాయలూ కూడా ఖర్చు పెట్టేశాడు అనే భావం రావచ్చు. "దొరకిన ఐదు రూపాయలలో ఖర్చు పెట్టినాడు" అని నిర్ధారణసప్తమి చెప్పినప్పుడు ఒకటైనా ఖర్చుపెట్టవచ్చు, రెండైనా ఖర్చు పెట్టవచ్చు ఇత్యాది రీతులలో భావం వస్తుంది. అదే విధంగా ఇక్కడ భావలక్షణసప్తమిని చెప్పిన పక్షంలో ఈ మూడు విప్రతిపత్తులూ ఉన్నాయి కాబట్టి ధ్వనిస్వరూపం చెపుతున్నాడు అనే అర్థం రావడంచేత ధ్వనిస్వరూపనిరూపణానికి విప్రతిపత్తిత్రయం హేతువు అనే భావం వస్తుంది. నిర్ధారణ సప్తమి చెపితే మూడింటిలో ఏ ఒక్కటైనా హేతువే అనే భావం వస్తుంది. ఇలాంటి వన్నీ వ్యాఖ్యానకారులు చూపే సూక్ష్మాంశాలు. "గోషు దుహ్యమానాసు గతః" (ఆవుల పాలు పిదుకుచున్నప్పుడు వెళ్లాడు) అనేది భావలక్షణసప్తమికి ప్రసిద్ధోదాహరణం. ఒకడు వెళ్ళడం అనే పనికి (భావం) పాలుపిదకడం అనే పని గుర్తుగా చెప్పబడింది. "గోషు కృష్ణా బహుక్షీరా" (ఆవులలో కపిలగోవు చాలా పాలు ఇస్తుంది) ఇది నిర్ధారణసప్తమికి ప్రసిద్ధోదాహరణం.

ధ్వనిస్వరూపమితి :- ఈ (శాస్త్రంలో) గ్రంథంలో, ప్రతిపాదించబడే విషయం ధ్వనిస్వరూపం. ధ్వనికీ శాస్త్రానికీ అభిధానాభిధేయభావసంబంధం. అనగా శాస్త్రం అభిధానం (చెప్పేది). ధ్వని అభిధేయం (చెప్పబడదగినది). వక్తకి శ్రోతకీ మధ్య వ్యుత్పాద్యవ్యుత్పాదకభావసంబంధం; అనగా శ్రోత బోధించదగినవాడు, వక్త బోధించే వాడు. ధ్వనివిషయంలో ఉన్న విమతి తొలగిపోయి ధ్వనిస్వరూపం చక్కగా తెలియడం ప్రయోజనం. శాస్త్రానికీ ప్రయోజనానికీ మధ్య సంబంధం సాధ్యసాధనభావసంబంధం; అనగా ప్రయోజనం సాధ్యం (సాధించతగినది), శాస్త్రం సాధనం (సాధించేది) అని "తత్స్వరూపం బ్రూమః" అనే వాక్యంచేత సూచించినట్లయింది.

## ధ్వన్యాలోకం

తస్య హి ధ్వనేః స్వరూపం సకలసత్కవికావ్యోపనిషద్భూతమతి రమణీయమ్, అణీయసీభిరపి చిరన్తనకావ్యలక్షణవిధాయినాం బుద్ధిభిః అనున్మీలితపూర్వమ్, అథ చ రామాయణమహాభారత ప్రభృతిని లక్ష్యే సర్వత్ర ప్రసిద్ధవ్యవహారం లక్షయతాం సహృదయానామ్ ఆనన్దో మనసి లభతాం ప్రతిష్ఠామితి ప్రకాశ్యతే.

### బాలానందిని

తస్యేతి - ఆ ధ్వనియొక్క స్వరూపం సత్కవులందరి కావ్యాలలోని రహస్యం. చాలా అందమైనది. దీనిని కావ్యలక్షణం చెప్పిన ప్రాచీనుల సూక్ష్మబుద్ధులు కూడ చూపలేదు. అయితే రామాయణమహాభారతాదిలక్ష్యగ్రంథా లన్నింటిలోను దీని వ్యవహారం (ఉపయోగం), ప్రసిద్ధంగా ఉంది. అలాంటి ఈ ధ్వనిస్వరూపాన్ని గుర్తించిన సహృదయుల మనస్సులో ఆనందం(ఆనందవర్ధనుడు) ప్రతిష్ఠను పొందాలనే ఉద్దేశ్యంతో ఇది ప్రకాశింపచేయబడుతున్నది.

### లోచనం

అథ శ్రోతృగతప్రయోజన ప్రయోజన ప్రతిపాదకం "సహృదయమనః ప్రీతయే" ఇతి భాగం వ్యాఖ్యాతు మాహ - తస్య హీతి. వివుతిపదపతితస్యేత్యర్థః ధ్వనేః స్వరూపం లక్షయతాం సంబన్ధిని మనసి ఆనన్దో నిర్వృత్యాత్మా చమత్కారాపరపర్యాయః, ప్రతిష్ఠాం పరైః విపర్యాసాద్యుపహతైః అనున్మూల్యమానత్వేన స్థేమానం, లభతామ్ ఇతి ప్రయోజనం సంపాదయితుం తత్స్వరూపం ప్రకాశ్యతే ఇతి సంగతిః. ప్రయోజనం చ నామ తత్సమ్పాదకవస్తు ప్రయోక్తృతాప్రాణతయైవ తథా భవతీతి ఆశయేన "ప్రీతయే తత్స్వరూపం బ్రూమః" ఇత్యేకవాక్యతయా వ్యాఖ్యేయమ్. తత్స్వరూపశబ్దం వ్యాచక్షాణః సంక్షేపేణ తావత్ పూర్వోదీరితవికల్పపఞ్చకోద్ధరణం సూచయతి - సకలేత్యాదినా. సకలశబ్దేన సత్కవిశబ్దేన చ ప్రకారలేశే కస్మింశ్చిత్ ఇతి నిరాకరోతి. అతిరమణీయమితి భాక్తాద్వ్యతిరేకమాహ. న హి "సింహో వటుః" "గఙ్గాయాం

ఘోషః'' ఇత్యత్ర రమ్యతా కాచిత్. ఉపనిషద్భూతశబ్దేన తు అపూర్వ సమాఖ్యామాత్రకరణ ఇత్యాది నిరాకృతమ్. అణీయసీభిః ఇత్యాదినా గుణాలంకారానన్తర్భూతత్వం సూచయతి. అథ చ ఇత్యాదినా "తత్సమయాన్తః పాతిన'' ఇత్యాదినా యత్సామయికత్వం శఙ్కితం తన్నిరవకాశీకరోతి. రామాయణమహాభారతశబ్దేన ఆదికవేః ప్రభృతి సర్వైరేవ సూరిభిః అస్యాదరః కృత ఇతి దర్శయతి. లక్షయతామ్ ఇత్యనేన వాచాం స్థితమ్ అవిషయే ఇతి పరాస్యతి. లక్ష్యతే అనేనేతి లక్షః లక్షణమ్. లక్షేణ నిరూపయన్తి లక్షయన్తి. తేషాం లక్షణద్వారేణ నిరూపయతామిత్యర్థః.

**బాలానందిని**

**అథేతి:-** ఇప్పుడు తస్య హీత్యాది వాక్యంచేత శ్రోతలలో ఉండే ప్రయోజనంయొక్క ప్రయోజనాన్ని ప్రతిపాదించే (కావ్యస్యాత్మా ఇత్యాది శ్లోకంలోని) "సహృదయమనః ప్రీతయే'' అనే భాగాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. తస్య హి అనగా విమతికి (అభిప్రాయభేదానికి) గురి అయిన అని అర్థం. అలాంటి ధ్వనియొక్క స్వరూపాన్ని గుర్తించినవారి (దాని లక్షణం గ్రహించినవారి) మనస్సులో సుఖరూపము, చమత్కారం అనే మరొక పేరు గలదీ అయిన ఆనందం, ప్రతిష్ఠను, అనగా విపర్యాసాదులతో చెడిపోయిన ఇతరులు కదల్చజాలనంతగా స్థిరత్వాన్ని, పొందుగాక అని ఈ ప్రయోజనాన్ని సంపాదించడంకోసం దాని స్వరూపం ప్రకాశింపచేయబడుతున్నది అని అన్వయం.

(ఆశంక)ధ్వని విషయంలో విప్రతిపత్తులు ఉండడంచేత ధ్వనిస్వరూపాన్ని విశదీకరిస్తున్నాడు అని చెప్పడంవల్ల ధ్వనిస్వరూపనిరూపణకి ప్రయోజనం ఆ విప్రతిపత్తులు తొలగిపోవడమే అనే అర్థం వస్తుంది. కాని అది ముఖ్యప్రయోజనం కాజాలదు. ముఖ్యప్రయోజనం ప్రీతియే. విప్రతిపత్తులను తొలగించడం ప్రీతికి అంగం మాత్రమే కదా? ఈ ఆశంకను మనస్సులో పెట్టుకొని 'తేన బ్రూమః' ఇత్యాది చతుర్థపాదార్థాన్ని విశదీకరిస్తూ ప్రయోజనపదార్థాన్ని నిర్వచిస్తున్నాడు - ప్రయోజనం చేతి - ప్రయోజనాన్ని ఏది సంపాదిస్తుందో (ఇక్కడ ప్రయోజనాన్ని సంపాదించేది ధ్వనిస్వరూప నిరూపణం) అలాంటి వస్తువును ప్రయోగింపచేయడమే ప్రధానలక్ష్యంగా కలదానినే కదా ప్రయోజనం అంటాం. అనగా ఒక పని చేస్తున్నాం అంటే ఒక ప్రయోజనం కోసం చేస్తాం. అందుచేత ఆ పనిని చేయించేది ప్రయోజనం. అదే ప్రధానమైనది. ప్రస్తుతంలో సహృదయమనఃప్రీతి అనేది ధ్వనిస్వరూపనిరూపణాన్ని చేయిస్తూన్నది. అందుచేత అదే

ప్రధానప్రయోజనం. విప్రతిపత్తిని తొలగించడం దానికి అంగం మాత్రమే. అందుచేత (ధ్వనిస్వరూపనిరూపణం ద్వారా) విప్రతిపత్తులను తొలగించి, తద్వారా ప్రీతిని కలిగించడంకోసం ధ్వనిస్వరూపనిరూపణం చేస్తున్నాము అని ఒక వాక్యంగా కలిపి వ్యాఖ్యానించుకోవాలి. అంతేనే కాని "విప్రతిపత్తులు ఉన్నాయి కాబట్టి వాటిని తొలగించడం కోసం ధ్వనిస్వరూపనిరూపణం చేస్తున్నాం", "సహృదయమనఃప్రీతికోసం ధ్వనిస్వరూపనిరూపణం చేస్తున్నాం" అని వాక్యద్వయం చేత అర్థం చెప్పకూడదు. అలా చెపితే ఏది ప్రధానప్రయోజనమో ఏది దానికి అంగమో తెలియదు అని భావం.

తత్స్వరూపశబ్దమితి - 'తత్స్వరూప' శబ్దాన్ని వ్యాఖ్యానిస్తూ సకలేత్యాది వాక్యంచేత వెనుక చెప్పిన ఐదు వికల్పాలకీ కూడ సంక్షిప్తంగా సమాధానం చెపుతున్నాడు. సకలసత్కవి ఇత్యాదివాక్యంలో 'సకల', 'సత్కవి' అనే పదాలను ప్రయోగించడంచేత "ఇదేదో అత్యల్పమైన (అప్రధానమైన) ప్రకారం అనే దానిని నిరాకరిస్తున్నాడు. అందరు సత్కవుల కావ్యాలలో ఉండడంచేత ఇది సర్వవ్యాప్తమూ, ప్రధానమూ కూడ అని భావం. అతిరమణీయమ్ అనడంచేత ఇది భాక్తం కాదు అని చెపుతున్నాడు. 'సింహో వటుః' 'గంగాయాం ఘోషః' ఇత్యాది భాక్తప్రయోగాలలో సౌందర్యం ఏమీ లేదు కదా? "ఉపనిషద్భూత"అనడంచేత 'ఏదో క్రొత్త పేరు పెట్టినంత మాత్రంచేత ఏమవుతుంది' అనే దానికి సమాధానం చెప్పినట్లయింది. ఇది కావ్యతత్త్వవేత్తలకు మాత్రమే అర్థం అయ్యే, ఇతరులకు అర్థం కాని పరమరహస్యం అని అర్థం. అణీయసీభిః ఇత్యాదివాక్యంచేత ఇది గుణాలంకారాదులలో అంతర్గతం కాదు అని సూచిస్తున్నాడు. అథ చ ఇత్యాదివాక్యం చేత - "ఎవర్లనో కొంతమందిని కూడగట్టుకొని "ధ్వని ధ్వని" అంటూ గొడవ చేస్తే ఏం ప్రయోజనం?"అన్న ఆక్షేపణకు సమాధానం చెపుతున్నాడు. రామాయణమహాభారతశబ్దంచేత ఆదికవి మొదలు అందరు కవులూ కూడా ధ్వనిని ఆదరించారు అని సూచిస్తున్నాడు. లక్షయతామ్ అనే పదంచేత ఇది మాటలలో చెప్పడానికి శక్యం కానిది అన్న వాదాన్ని నిరాకరిస్తున్నాడు. "లక్ష్యతే అనేనేతి లక్షః" అనే విగ్రహంచేత 'లక్షః' అనగా లక్షణం అని అర్థం, 'లక్షయన్తి' అనగా లక్షంచేత (లక్షణంచేత) నిరూపిస్తున్నారు. 'లక్షయతామ్' అనగా లక్షణంద్వారా నిరూపించుచున్న (సహృదయులయొక్క) అని అర్థం.

**లోచనం**

సహృదయానామితి - యేషాం కావ్యానుశీలనాభ్యాసవశాద్విశదీభూతే మనోముకురే వర్ణనీయతన్మయీభవనయోగ్యతా తే స్వహృదయ సంవాదభాజః

సహృదయాః. యథోక్తమ్ -

"యోఽర్థో హృదయసంవాదీ తస్య భావో రసోద్భవః,
శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠమివాగ్నినా" ఇతి.

అనన్ద ఇతి. రసచర్వణాత్మనః ప్రాధాన్యం దర్శయన్ రసధ్వనేరేవ సర్వత్ర ముఖ్యభూతమాత్మత్వమితి దర్శయతి. తేన యదుక్తమ్-

"ధ్వనిర్నామాపరో యోఽపి వ్యాపారో వ్యఞ్జనాత్మకః,
తస్య సిద్ధేఽపి భేదే స్యాత్ కావ్యేఽంశత్వం న రూపతా"

ఇతి తదపహస్తితం భవతి. తథాహి - అభిధాభావనారసచర్వణాత్మకేఽపి త్ర్యంశే కావ్యే రసచర్వణా తావజ్జీవితభూతేతి భవతోఽప్యవివాదోఽస్తి. యథోక్తం త్వయైవ-

"కావ్యే రసయితా సర్వో న బోద్ధా న నియోగభాక్" ఇతి.

తద్వస్త్వలంకారధ్వన్యభిప్రాయేణ అంశమాత్రత్వమితి సిద్ధసాధనమ్. రసధ్వన్యభిప్రాయేణ తు స్వాభ్యుపగమప్రసిద్ధిసంవేదనవిరుద్ధమితి.

**బాలానందిని**

సహృదయానామితీతి - ఎవరి మనోముకురం (మన స్సనే అద్దం) కావ్యాలను మాటిమాటికి పరిశీలించడంవల్ల నిర్మలమై కావ్యాలలో వర్ణించే నాయకాది విభావాదులతో తన్మయత్వం చెందడానికి యోగ్యం అవుతుందో అలాంటి స్వహృదయసంవాదభాక్కులు 'సహృదయులు'.

వివరణ. 'సహృదయ' శబ్దానికి 'హృదయేన సహ వర్తన్తే ఇతి సహృదయాః' అని, "సమానం హృదయం యేషాం తే సహృదయాః" అని రెండు విధాల విగ్రహం చెప్పవచ్చు. "హృదయం ఉన్నవాళ్లు", "సమానమైన హృదయం ఉన్నవాళ్లు" అని అర్థం. తమ హృదయాలలో ఇతరుల హృదయాలతో సంవాదం పొందే వాళ్లు అని భావం. 'సంవాదం' అనగా ఒకే విధమైన ఆలోచన, అభిరుచి మొదలైనవి ఉండడం. పఠితల హృదయాలు, కవుల హృదయాలు సమంగా ఉండడంచేత వాళ్లిద్దరి మధ్యా హృదయసంవాదం ఉంటుంది. కవులచే సమర్పించబడిన విభావాదుల్ని ఈ పఠితలు ఆస్వాదించ కలుగుతారు. ఈ హృదయసంవాదం (empathy) లేనివాళ్లు ఆస్వాదించజాలరు.

యథా ఇతి - ఈ విషయమే భట్టనాయకుడు "యోఽర్థః" ఇత్యాది కారికలో ప్రతిపాదించాడు - "ఏ అర్థం హృదయసంవాదిగా ఉంటుందో దాని భావం, అనగా భావన(నిరంతరచర్వణ) రసోత్పత్తికి హేతువు అవుతుంది (రసోద్భవః). నిప్పు ఒక్క మాటుగా ఎండిపోయిన కట్టెను అంతనూ వ్యాపించి నట్లు దానిచేత(రసంచేత) శరీరం అంతా కూడా వ్యాపించబడుతుంది. (రసానుభూతిప్రభావం ఒక్క హృదయంలోనే కాకుండా శరీరం అంతటిమీదా ప్రసరిస్తుంది)".

అనన్ద ఇతి - 'ఆనన్దః' అనే పదాన్ని ప్రయోగించి రసచర్వణాస్వరూపమైన ఆనందం ప్రధాన మైనది అని చూపుతూ అంతటా కూడ రసధ్వనియే ముఖ్యమైనది, అదే ఆత్మ అని సూచిస్తున్నాడు. అందుచేత "ధ్వనిర్నామాపరః" ఇత్యాదిభట్టనాయకవచనం నిరాకరించబడినట్లయింది. - "వ్యంజనారూపమైన ధ్వని అనే మరొక వ్యాపారం ఏదైతే చెప్పబడుతున్నదో అదొక భేదంగా (భిన్నవ్యాపారంగా) సిద్ధించినా అది (అభిధాలక్షణాదులతో పాటు) కావ్యంలో ఒక అంశం అయితే కావచ్చును; అదే ప్రధానం అనడానికి వీలులేదు" అని ఈ కారిక భావం.

ధ్వని అనేది కావ్యంలోని అనేకాంశాలలో ఒక అంశం మాత్రమే అనడం యుక్తం కాదు. తథాహీతి - ఎందుచేత ననగా - అభిధ, భావన, రసచర్వణ అనే మూడు అంశా లున్న కావ్యంలో రసచర్వణ జీవితం అని నువ్వు కూడ అంగీకరించిన విషయమే. "రసాస్వాదం చేయగల ప్రతివానికీ కావ్యంలో(కావ్యం చదవడానికి) అధికారం ఉంది; అంతేనే కాని దీనివల్ల ఏదో ఉపదేశం గ్రహించాలనుకొనేవాడికి గాని, వేదాదులనుంచి వలె ఏదైనా కర్తవ్యాన్ని(విధిని) తెలుసుకోవా లనుకొనేవానికి గాని అధికారం లేదు" అని నువ్వే చెప్పావు కదా?

తదితి:- ధ్వని కూడా కావ్యంలో ఉండే అనేకాంశాలలో ఒకటి మాత్రమే అని నువ్వు అన్నమాట వస్తుధ్వని - అలంకారధ్వనులను గూర్చి అయితే సిద్ధసాధనం; అనగా కావ్యంలో వస్తుధ్వని - అలంకారధ్వనులకి అంతగా ప్రాధాన్యం లేదు అని మేం కూడా అంగీకరించిన విషయమే; అందుచేత సిద్ధించినదానినే (అంగీకరించినదానినే) ఏదో క్రొత్తవిషయం అన్నట్లు సాధించడం (సిద్ధసాధనం అనే) దోషం. నువ్వు చెప్పినది రసధ్వనిని గూర్చియే అన్న పక్షంలో అది (నీ అభిప్రాయానికి) నువ్వే అంగీకరించినదానికి, లోకప్రసిద్ధికీ, స్వీయానుభవానికీ కూడా విరుద్ధం. రసం ప్రధానమైనది అని నువ్వు ఒప్పుకొని ఉన్నావు; లోకంలో ప్రసిద్ధి, సహృదయానుభవం కూడా రసానికి ప్రాధాన్యం ఇస్తున్నాయి.అలాంటప్పుడు నీ మాట వీటికన్నింటికీ విరుద్ధం అని భావం.

లోచనం

తత్ర కవేస్తావత్కీర్త్యాపి ప్రీతిరేవ సంపాద్యా. యదాహ - "కీర్తిం స్వర్గఫలామాహుః" ఇత్యాది. శ్రోతౄణాం చ వ్యుత్పత్తిప్రీతీ యద్యపి స్తః, యథోక్తమ్ -

"ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ,
కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్యనిషేవణమ్"

(భామహాలంకారం 1.2) ఇతి

తథాపి తత్ర ప్రీతిరేవ ప్రధానమ్. అన్యథా ప్రభుసంమితేభ్యః వేదాదిభ్యః మిత్రసంమితేభ్యశ్చేతిహాసాదిభ్యః వ్యుత్పత్తిహేతుభ్యః కోఽస్య కావ్యరూపస్య వ్యుత్పత్తిహేతోర్జాయాసంమితత్వలక్షణో విశేష ఇతి ప్రాధాన్యేనానన్ద ఏవోక్తః. చతుర్వర్గవ్యుత్పత్తేరపి ఆనన్ద ఏవ పార్యన్తికం ముఖ్యం ఫలమ్.

ఆనన్ద ఇతి చ గ్రన్థకృతో నామ. తేన స ఆనన్దవర్ధనాచార్యః ఏతచ్ఛాస్త్రద్వారేణ సహృదయహృదయేషు ప్రతిష్ఠాం, దేవతాయతనాదివత్ అనశ్వరీం స్థితిం, గచ్ఛత్వితి భావః. యథోక్తమ్ -

"ఉపేయుషామపి దివం సన్నిబన్ధవిధాయినామ్,
ఆస్త ఏవ నిరాతఙ్కం కాన్తం కావ్యమయం వపుః "

(భామహాలంకారం. 1.6) ఇతి-

తథా మనసి ప్రతిష్ఠామ్ ఏవంవిధమస్య మనః, సహృదయచక్రవర్తీ ఖల్వయం గ్రన్థకృదితి యావత్; యథా - "యుద్ధే ప్రతిష్ఠా పరమార్జునస్య" ఇతి. స్వనామప్రకటనం శ్రోతౄణాం ప్రవృత్త్యఙ్గమేవ సంభావనాప్రత్యయోత్పాదనముఖేనేతి గ్రన్థాన్తే వక్ష్యామః. ఏవం గ్రన్థకృతః, కవేః, శ్రోతుశ్చ ముఖ్యం ప్రయోజనముక్తమ్.

బాలానందిని

తత్రేతి :- కవి కీర్తిచేత కూడా చివరికి సంపాదించదగినది ఆనందమే. అందుచేతనే "కీర్తికి ఫలం స్వర్గం అని అంటున్నాడు" అని అన్నాడు. "ఉత్తమకావ్యాలను సేవించడం ధర్మార్థకామమోక్షాలలోను, కళలలోను నేర్పును, కీర్తిని, ప్రీతిని

కలిగిస్తుంది" అని భామహుడు చెప్పినట్లు శ్రోతలకి కూడా వ్యుత్పత్తీ, ప్రీతీ రెండూ కలిగినా వాటిలో ప్రధానమైనది ప్రీతియే. అలా కాకపోతే ప్రభువువంటి వేదాలకంటె మిత్రులవంటి వ్యుత్పత్తికి హేతువులైన ఇతిహాసాదుల కంటె, వ్యుత్పత్తికి హేతువైన కావ్యం అనేదానికి భార్యాసంమితత్వం అనే విశేషం ఏమి ఉంది? అందుచేత ఆనందమే ప్రధానం అని చెప్పబడింది. ధర్మార్థాదిచతుర్వర్గంలో కలిగే వ్యుత్పత్తికి కూడా చివరికి ముఖ్యమైన ఫలం ఆనందమే.

గ్రంథకర్త పేరు కూడా ఆనందుడే. అందుచేత ఈ శాస్త్రం ద్వారా ఆనందవర్ధనాచార్యుడు సహృదయుల హృదయాలలో, దేవాలయాదులలో వలె, వినాశరహితమైన ప్రతిష్ఠను, అనగా స్థితిని, పొందుగాక అని భావం. "ఉత్తమగ్రంథాలు రచించినవారు స్వర్గానికి వెళ్లిపోయినా వాళ్ల కావ్యరూపమైన మనోహరమైన శరీరం ఎలాంటి బాధలూ లేకుండా ఉండనే ఉంటుంది" అని చెప్పినట్లు సహృదయుల మనస్సులో- 'ఈతని మనస్సు ఇలాంటిది; ఈ గ్రంథకారుడు సహృదయచక్రవర్తి కదా?' అనే ప్రతిష్ఠను, అనగా బహుమానాన్ని, పొందుగాక. "యుద్ధంలో అర్జునునకు ఉన్న ప్రతిష్ఠ, గౌరవం, చాల గొప్పది" అనే వాక్యంలో వలె ఇక్కడ కూడా ప్రతిష్ఠాశబ్దానికి గౌరవం అని అర్థం. తన పేరు ప్రకటించుకొనడం గౌరవభావాన్ని పుట్టించడం ద్వారా శ్రోతలు ఏతచ్ఛాస్త్రశ్రవణానికై ప్రవర్తించడానికి అంగం (హేతువు) అవుతుంది అని గ్రంథాంతంలో చెప్పగలం. ఈ విధంగా గ్రంథరచయితకి, కవికి, శ్రోతలకీ లభించే ముఖ్యమైన ప్రయోజనం చెప్పబడింది.

## ధ్వన్యాలోకం

తత్ర ధ్వనేరేవ లక్షయితుమారబ్ధస్య భూమికాం రచయితుమిదముచ్యతే -

యోఽర్థః సహృదయశ్లాఘ్యః కావ్యాత్మేతి వ్యవస్థితః,
వాచ్యప్రతీయమానాఖ్యౌ తస్య భేదావుభౌ స్మృతౌ. 2

కావ్యస్య హి లలితోచితసంనివేశచారుణః శరీరస్యేవాత్మా సారరూపతయా స్థితః, సహృదయశ్లాఘ్యః యోఽర్థస్తస్య వాచ్యః ప్రతీయమానశ్చేతి ద్వౌ భేదౌ.

### బాలానందిని

తత్రేతి - లక్షణం చెప్పడానికి ప్రారంభించిన ధ్వనికి సంబంధించిన భూమికను తయారుచేయడంకోసం చెప్పబడుతున్నది - యః ఇతి - సహృదయశ్లాఘ్యః = సహృదయులచేత శ్లాఘించదగిన, యః = ఏ, అర్థః = అర్థం, కావ్యాత్మా ఇతి = కావ్యాత్మగా, వ్యవస్థితః = ఉన్నదో, లేదా కావ్యాత్మ అని నిర్ణయించబడి ఉన్నదో, తస్య = దానికి, వాచ్యప్రతీయమానాఖ్యౌ = వాచ్యమూ ప్రతీయమానమూ అని, ఉభౌ = రెండు, భేదౌ = భేదాలు, స్మృతౌ= చెప్పబడినవి.

కావ్యస్యేతి : లలితంగాను, ఉచితంగాను ఉన్న కూర్పుచేత అందంగా ఉన్న కావ్యానికి, శరీరానికి ఆత్మ ఉన్నట్లు, దానికి (కావ్యానికి) సారభూతమై, సహృదయులచేత శ్లాఘించబడే ఏ అర్థం ఉందో దానికి వాచ్యార్థం, ప్రతీయమానార్థం అని రెండు భేదాలు ఉన్నాయి.

### లోచనం

"నను ధ్వనిస్వరూపం బ్రూమః" ఇతి ప్రతిజ్ఞాయ వాచ్యప్రతీయమానాఖ్యౌ ద్వౌ భేదౌ అర్థస్యేతి వాచ్యాభిధానే కా సంగతిః కారికాయామ్ ఇత్యాశఙ్క్య సఙ్గతిం కర్తుమవతరణికాం కరోతి - తత్రేతి. ఏవంవిధే అభిధేయే ప్రయోజనే చ స్థితే ఇత్యర్థః. భూమిరివ భూమికా; యథా అపూర్వనిర్మాణే చికీర్షితే పూర్వం భూమిర్విరచ్యతే, తథా ధ్వనిస్వరూపే ప్రతీయమానాఖ్యే నిరూపయితవ్యే నిర్వివాదసిద్ధవాచ్యాభిధానం భూమిః. తత్పృష్ఠే అధికప్రతీయమానాంశోల్లిఙ్గనాత్. వాచ్యేన సమశీర్షికయా గణనం తస్యాప్యనపహ్నవనీయత్వం ప్రతిపాదయితుమ్. స్మృతౌ ఇత్యనేన 'యః సమామ్నాతపూర్వః'ఇతి ద్రఢయతి. 'శబ్దార్థశరీరం కావ్య'మితి యదుక్తం తత్ర శరీరగ్రహణాదేవ కేనచిదాత్మనా తదనుప్రాణకేన భావ్యమేవ. తత్ర శబ్దస్తావచ్ఛరీరభాగ ఏవ సంనివిశతే; సర్వజనసంవేద్యధర్మత్వాత్ స్థూలకృశాదివత్. అర్థః పునః సకలజనసంవేద్యో న భవతి, న హ్యర్థమాత్రేణ కావ్యవ్యపదేశః, లౌకికవైదికవాక్యేషు తదభావాత్. తదాహ - సహృదయశ్లాఘ్య ఇతి.

బాలానందిని

నన్వితి - "ధ్వనిస్వరూపం చెపుతాం" అని ప్రతిజ్ఞ చేసి (ప్రారంభించి) అర్థంలో వాచ్యం, ప్రతీయమానం అనే రెండు భేదాలు ఉన్నాయి అని అంటూ 'కారికలో' వాచ్యాన్ని గూర్చి చెప్పడంలో సంగతి (ఔచిత్యం) ఏముంది అని ఆశంకించుకొని సంగతిని చేయడానికి (యుక్తమే అని చెప్పడానికి) తత్ర ఇత్యాదివాక్యాలచేత అవతరణిక చేస్తున్నాడు. (ఏదైనా విషయాన్ని ప్రతిపాదించే ముందు దానికి ముందు చెప్పే చిన్న ఉపోద్ఘాతం 'అవతరణిక'). తత్ర అనగా ఇంతవరకు చెప్పి నట్లు ఈ విధమైన అభిధేయం (గ్రంథప్రతిపాద్యవిషయం), ప్రయోజనం (ప్రీతిరూపప్రయోజనం) ఉండగా అని అర్థం. భూమికా అనగా భూమివంటిది అని అర్థం. క్రొత్త నిర్మాణం (గృహాదికం) చేయదలచినప్పుడు ముందుగా నేలను సరిచేసినట్లు ప్రతీయమానం అనే పేరు గల ధ్వని స్వరూపం నిరూపించవలసి ఉన్నప్పుడు వివాదం లేని (వాదిప్రతివాదులిద్దరికీ సంమతమైన) వాచ్యాన్ని గూర్చి చెప్పడం "భూమి". ఎందుచేత ననగా దానిమీద అధికంగా ప్రతీయమానమైన అంశాన్ని (ధ్వనిని) నిర్మించవలసి ఉంది. (నిలబెట్టవలసిఉంది). "వాచ్యప్రతీయమానాఖ్యౌ" అని వాచ్యంతో కలిపి (వాచ్యంతో సరిసమానంగా చేర్చి) చెప్పడం అది కూడా కప్పిపుచ్చడానికి శక్యం కాదు అని ప్రతిపాదించడంకోసం. అనగా శబ్దానికి వాచ్యార్థం అనేది లేదు అని ఎవరూ ఏ విధంగా అనలేరో అదే విధంగా ప్రతీయమానార్థం లేదు అని కూడా అనలేరు అని సూచించడంకోసం ఈ రెండువిధాలైన అర్థాల్నీ ఒకే ద్వంద్వసమాసంలో కలిపి చెప్పడం జరిగింది అని భావం. "స్మృతౌ" అనే మాటచేత "యః సమామ్నాతపూర్వః" అని వెనక చెప్పిన దానిని దృఢీకరిస్తున్నాడు.

శబ్దార్థేతి - "కావ్యానికి శబ్దార్థాలు శరీరం అన్నప్పుడు శరీరాన్ని గూర్చి చెప్పగానే ఆ శరీరాన్ని సజీవంగా ఉంచే ఒక ఆత్మ కూడా ఉండి తీరాలి. మానవాదుల శరీరం స్థూలంగాను, కృశంగాను పైకే అందరికీ కనబడ్డట్లు శబ్దం కూడా అందరికీ కనబడుతూ ఉండడంచేత అది శరీరభాగం క్రిందికే వస్తుంది. కాని అర్థం మాత్రం అందరికీ తెలిసేది కాదు. అయితే శబ్దంతో పాటు ఏదో ఒక అర్థం ఉన్నంతమాత్రంచేత కావ్యం అనడానికి వీలులేదు. అలా అయితే లౌకికవాక్యాల్నీ వైదికవాక్యాల్నీ కూడా కావ్యం అనవలసి వస్తుంది. ఈ విషయమే సహృదయశ్లాఘ్యః అనే పదంచేత చెపుతున్నాడు.

లోచనం

స ఏక ఏవార్థో ద్విశాఖతయా వివేకిభిః విభాగబుద్ధ్యా విభజ్యతే, తథాహి - తుల్యే అర్థరూపత్వే కిమితి కస్మై చిదేవ సహృదయాః శ్లాఘన్తే? తద్భవితవ్యం తత్ర కేన చిద్విశేషేణ. యో విశేషః స ప్రతీయమానభాగో వివేకిభిః విశేషహేతుత్వాదాత్మేతి వ్యవస్థాప్యతే. వాచ్యసంవలనావిమోహితహృదయైస్తు తత్పృథగ్భావే విప్రతిపద్యతే, చార్వాకైరివ ఆత్మపృథగ్భావే. అత ఏవ అర్థః ఇతి ఏకతయా ఉపక్రమ్య సహృదయశ్లాఘ్య ఇతి విశేషణద్వారా హేతుమభిధాయ అపోద్ధారదృశా తస్య ద్వౌ భేదౌ అంశౌ ఇత్యుక్తమ్, న తు ద్వావప్యాత్మానౌ కావ్యస్యేతి.

బాలానందిని

స ఇతి - ఆ ఒకే అర్థాన్ని వివేకవంతులు విభాగబుద్ధిచేత రెండు శాఖలుగా విభజిస్తున్నారు. అర్థరూపత్వం తుల్యంగానే ఉన్నా, అనగా ఇది అదీ కూడా అర్థాలే అయినా, సహృదయులు ఒక రకమైన అర్థాన్నే ఎందుకు మెచ్చుకుంటున్నారు? అంటే దానిలో ఏదో ఒక విశేషం ఉండి ఉండాలి. ప్రతీయమానభాగమే, అనగా అర్థంలో ఉన్న వాచ్య-ప్రతీయమానభాగాలలో ప్రతీయమానభాగమే, ఆ విశేషం. అందుచేత విశేషహేతువైన ఆ ప్రతీయమానభాగాన్ని వివేకవంతులు ఆత్మ అని ప్రతిపాదిస్తున్నారు. శరీరంకంటె వేరుగా ఆత్మ ఉంది అనే విషయంలో చార్వాకులు విప్రతిపత్తి (లేదు అనే బుద్ధిని, భ్రాంతిని) చూపుతున్నట్లు, ఈ ప్రతీయమానార్థం వాచ్యార్థంతో కలిసిపోవడంచేత విమోహం చెందిన హృదయాలు గల కొందరైతే అది (ప్రతీయమానార్థం అనేది) వేరుగా లేదు అని భ్రాంతి చెందుతున్నారు..అందుచేతనే (కారికలో) 'అర్థః' అని ఏకవచనంతో ప్రారంభించి (ఒక అర్థం అని ఉపక్రమించి), 'సహృదయశ్లాఘ్యః' అనే విశేషణంచేత హేతువును చెప్పి, అపోద్ధారదృష్టితో దానికి రెండు భేదాలు, అనగా అంశాలు ఉన్నాయి అని చెప్పాడు; అంతేనే కానీ రెండూ కావ్యానికి ఆత్మలే అని చెప్పలేదు. అపోద్ధారం అనగా విడదీసి చూపడం(Analysis).

లోచనం

కారికాభాగగతం కావ్యశబ్దం వ్యాకర్తుమాహ-కావ్యస్య హీతి. లలితశబ్దేన గుణాలంకారానుగ్రహమాహ. ఉచితశబ్దేన రసవిషయమేవౌచిత్యం భవతీతి

దర్శయన్ రసధ్వనేర్జీవితత్వం సూచయతి. తదభావే హి కిమపేక్షయేద మౌచిత్యం నామ సర్వత్ర ఉద్ఘోష్యతే ఇతి భావః. యోఽర్థః ఇతి యదా అనువదన్ పరేణాప్యేతత్తావదభ్యుపగతమితి దర్శయతి. తస్యేత్యాదినా తదభ్యుపగమ ఏవ ద్వ్యంశత్వే సత్యుపపద్యతే ఇతి దర్శయతి. తేన యదుక్తం "చారుత్వహేతుత్వాద్గుణాలఙ్కారవ్యతిరిక్తో న ధ్వనిః" ఇతి, తత్ర ధ్వనేరాత్మస్వరూపత్వాత్ హేతురసిద్ధ ఇతి దర్శితమ్. న హ్యాత్మా చారుత్వహేతుః దేహస్యేతి భవతి. అథాప్యేవం స్యాత్తథాపి వాచ్యే అనైకాన్తికో హేతుః; న హ్యలఙ్కార్య ఏవాలంకారః, గుణీ ఏవ గుణః. ఏతదర్థమపి వాచ్యాంశోపక్షేపః. అత ఏవ వక్ష్యతి - "వాచ్యః ప్రసిద్ధః" ఇతి. 2

బాలానందిని

కారికేతి - కారికాభాగంలో ఉన్న 'కావ్య' శబ్దాన్ని వ్యాఖ్యానించడానికి కావ్యస్య హి ఇత్యాదికం చెపుతున్నాడు. లలితశబ్దంచేత కావ్యానికి గుణాలంకారాల అనుగ్రహం(సాహాయ్యం) ఉండాలని చెపుతున్నాడు. ఉచిత శబ్దంచేత ఔచిత్యం అనేది రసవిషయకమే (రసానికి సంబంధించినదే) అయి ఉంటుం దని చూపుతూ రసధ్వనియే జీవితం అని చెపుతున్నాడు. రసమే లేకపోతే అంతటా ఘోషించబడే ఔచిత్యం అనేది దేన్ని పట్టి ఏర్పడుతుంది అని భావం. అనగా ఔచిత్యానౌచిత్యాలను రసాన్ని పట్టే నిర్ణయించాలి; రసం లేకపోతే ఔచిత్యచర్చకు అవకాశం లేదు అని భావం. యః అర్థః అని యచ్ఛబ్దంచేత (యదా) అనువదిస్తూ పరుడు ఈ విషయం అంగీకరించే ఉన్నాడు అని చూపుతున్నాడు. 'ఏ అర్థం ఉందో' అని చెప్పడంలో ఆ అర్థం ఉందని అంగీకరించినవిషయమే, అని సూచించబడుతుంది అని భావం. ఆ అర్థంలో వాచ్యం, ప్రతీయమానం అని రెండు అంశాలు ఉంటేనే దాన్ని (సహృదయ శ్లాఘ్యార్థాన్ని) అంగీకరించడం కుదురుతుంది అని తస్యేత్యాది పదాలచేత చూపుతున్నాడు. తేనేతి - అందుచేత, (ఈవిధంగా ధ్వనికి ఆత్మత్వాన్ని అంగీకరించడంచేత) ధ్వని చారుత్వానికి హేతువు గాన 'ఇది గుణాలంకారాలకంటె భిన్నం కాదు'; అని పూర్వపక్షి చెప్పినది పరాస్తమైనది. ఎందుచేత ననగా - ధ్వని ఆత్మరూపం గాన - "చారుత్వహేతువు అవడం వల్ల" అనే హేతువు అసిద్ధం అని చూపబడింది. ఆత్మ దేహానికి చారుత్వహేతువు కాదు కదా? అథవా - ఆత్మకూడ చారుత్వహేతువే అని అంగీకరించినా కూడ "ధ్వనిః

గుణాలంకారావ్యతిరిక్తః, చారుత్వహేతుత్వాత్" అని మీరు చూపిన అనుమాన ప్రయోగంలోని "చారుత్వహేతుత్వాత్" అన్న హేతువుకు వాచ్యార్థంలో అనైకాంతికత్వం, అనగా వ్యభిచారదోషం. వాచ్యార్థం చారుత్వహేతువే అయినా అది గుణాలంకారావ్యతిరిక్తం కాదు కదా? (పట్టకూడని చోట హేతువు పట్టడం వ్యభిచారదోషం). అలంకార్యమే అలంకారం కాదు కదా? గుణియే (గుణాశ్రయం) గుణం కాదు కదా? ఉపమాదులు అలంకారాలు, అర్థం అలంకార్యం, అలంకరించదగినది. అదే విధంగా శ్లేషాదులు గుణాలు; అర్థం గుణి. అలంకార్యమైన అర్థం అలంకారం కాజాలదు, గుణియైన అర్థం గుణం కాజాలదు. అందుచేత చారుత్వహేతువైన వస్తు అలంకారమైనా కావాలి, గుణమైనా కావాలి అని చెప్పే మీ అనుమానప్రయోగం వ్యభిచారదోషదుష్టం అని భావం. ఏతదర్థమితి - ఇందుకోసం కూడా, అనగా భూమికాప్రదర్శనంకోసమే కాకుండా ఈ అనైకాంతికతాదోషం చూపడానికి కూడా, వాచ్యాంశాన్ని గూర్చి చెప్పడం జరిగింది. అందుచేతనే వాచ్యః ప్రసిద్ధః అని చెప్పనున్నాడు. అనగా ప్రసిద్ధమైన స్థలంలోనే వ్యభిచారదోషం చూపాలి. ఏ వాచ్యార్థంలో వ్యభిచారం చూపించామో అలాంటి వాచ్యార్థం ప్రసిద్ధమే, చారుత్వహేతువుగా సర్వవిదితమే అని చెప్పడం కోసం "వాచ్యః ప్రసిద్ధః" అని ఉత్తరకారికలో చెప్పబోతున్నాడు అని అర్థం. 2

## ధ్వన్యాలోకం

కా. తత్ర వాచ్యః ప్రసిద్ధో యః ప్రకారైరుపమాదిభిః

బహుధా వ్యాకృతః సోఽన్యైః

కావ్యలక్ష్మవిధాయిభిః.

తతో నేహ ప్రతన్యతే. 3

కేవలమనూద్యతే పునర్యథోపయోగమితి.

### బాలానందిని

తత్రేతి - ఆ రెండు విధాలైన అర్థాలలో ప్రసిద్ధమైన ఏ వాచ్యార్థం ఉందో అది ఇతరులచే ఉపమాదిప్రకారాలచే బహుధా విశదీకరించబడినది. కావ్యలక్ష్మవిధాయిభిః అనేది అన్యైః అనే పదానికి వృత్తికారుడు చెప్పిన అర్థం. కావ్యలక్షణం చెప్పిన ఇతరులచే అని అర్థం. తతః ఇతి - అందువల్ల అది ఇక్కడ విస్తరించబడదు. కేవలమితి - అవసరాన్ని పట్టి ఆ వాచ్యార్థాన్నిగూర్చి అక్కడక్కడ ముచ్చటించడం మాత్రం జరుగుతుంది. 3

## లోచనం

తత్రేతి - ద్వ్యంశత్వే సత్యపీత్యర్థః. ప్రసిద్ధ ఇతి- వనితావదనోద్యానేన్దూదయాదిః లౌకిక ఏవేత్యర్థః. "ఉపమాదిభిః ప్రకారైః స వ్యాకృతో బహుధా" ఇతి సంగతిః. అన్యైరితి కారికాభాగం కావ్యేత్యాదినా వ్యాచష్టే. తతో నేహ ప్రతన్యతే ఇతి విశేషప్రతిషేధేన శేషాభ్యనుజ్ఞేతి దర్శయతి - కేవలమిత్యాదినా. 3

## బాలానందిని

తత్రేతి - తత్ర అనగా ద్వ్యంశత్వం ఉన్నప్పటికీ అని అర్థం. అనగా అర్థం వాచ్యం, ప్రతీయమానం అని రెండు విధాలున్నా కూడ అని అర్థం. ప్రసిద్ధః ఇతి - యువతీముఖం, ఉద్యానం, చంద్రోదయం మొదలైన లోకప్రసిద్ధ మైనదే వాచ్యార్థం అని అర్థం. "ఉపమాదిభిః ప్రకారైః సః వ్యాకృతః బహుధా" అని అన్వయం. కావ్యేత్యాది పదంచేత కారికలోని అన్యైః అన్న పదాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. తతో నేహ ప్రతన్యతే అని విశేషాన్ని నిషేధించడంచేత మిగిలినది అంగీకార్యమే అని, కేవలమ్ ఇత్యాదివాక్యంచేత చూపుతున్నాడు.

వివరణ:- ప్రతననం అనగా తెలియని క్రొత్త విషయాన్ని సవిస్తరంగా చెప్పడం. అలాంటి ప్రతననం అనే విశేషాన్ని నిషేధించడంచేత మిగిలినదాన్ని అంగీకరించినట్లు అనగా అవసరాన్ని పట్టి తెలిసిన విషయాలనే సంక్షిప్తంగా అక్కడక్కడ నిర్దేశిస్తామని చెప్పిన ట్లయింది అని భావం. 3

## ధ్వన్యాలోకం

కా. ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్,
యత్తత్ ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్యమివాఙ్గనాసు.4

ప్రతీయమానం పునరన్యదేవ వాచ్యాత్ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్. యత్తత్సహృదయసుప్రసిద్ధం ప్రసిద్ధేభ్యః అలంకృతేభ్యః ప్రతీతేభ్యో వా అవయవేభ్యః వ్యతిరిక్తత్వేన ప్రకాశతే లావణ్యమ్ ఇవ అఙ్గనాసు. యథా హ్యఙ్గనాసు లావణ్యం పృథక్ నిర్వర్ణ్యమానం నిఖిలావయవవ్యతిరేకి కిమప్యన్యదేవ సహృదయ లోచనామృతం తత్త్వాన్తరం తద్వదేవ సోఽర్థః.

బాలానందిని

ప్రతీయమానమితి -అఙ్గనాసు = స్త్రీలయందు, యత్=ఏ, తత్ = ఆ, ప్రసిద్ధమైన, ప్రసిద్ధావయవాతిరిక్తమ్ = ప్రసిద్ధాలైన, లేదా అలంకరించబడిన, అవయవాలకంటె భిన్నమైన, లావణ్యమివ = లావణ్యం వలె, విభాతి = ప్రకాశిస్తూన్నదో, అట్టి, మహాకవీనామ్ = మహాకవుల, వాణీషు = వాక్కులలో, అన్యదేవ = మరియొక, వాచ్యార్థాతిరిక్తమైన, ప్రతీయమానమ్ = ప్రతీయమానమైన, వ్యంగ్యమైన, వస్తు = వస్తువు, అస్తి = ఉన్నది. 4

ప్రతీయమానమితి - మహాకవుల వాక్కులలో వాచ్యంకంటె భిన్నంగా ప్రతీయమానమైన వస్తువు ఉంది. సహృదయులలో ప్రసిద్ధమైన, సహృదయులకు మాత్రమే తెలియదగిన, ఆ ఏ ప్రతీయమానవస్తువు, ప్రసిద్ధేభ్యః = అలకరించబడిన లేదా స్పష్టంగా కనబడుతున్న, అవయవాలకంటె వేరుగా, అంగనలలో లావణ్యంవలె, ప్రకాశిస్తూ ఉంటుందో, స్త్రీలలో సకలావయవాలకంటె భిన్నంగా ఉండి వేరుగా కనబడుతూన్నా, వర్ణించి చెప్పడానికి శక్యం కాని (కిమపి) సహృదయుల నేత్రాలకి అమృతం అయిన లావణ్యం అనే ఒకానొక తత్త్వవిశేషం ఉంటుందో, అలాంటిదే ఆ ప్రతీయమానార్థం కూడ.

లోచనం

అన్యదేవ వస్త్వితి. పునఃశబ్దో వాచ్యాద్విశేషద్యోతకః. తద్వ్యతిరిక్తం సారభూతం చేత్యర్థః. మహాకవీనామ్ ఇతి బహువచనమ్ అశేషవిషయ వ్యాపకత్వమాహ. ఏతదభిధాస్యమాన ప్రతీయమానానుప్రాణిత కావ్యనిర్మాణ నిపుణప్రతిభాభాజనత్వేనైవ మహాకవివ్యపదేశో భవతీతి భావః. యదేవంవిధమస్తి తద్భాతి. న హ్యత్యన్తాసతో భానముపపన్నమ్. రజతాద్యపి నాత్యన్తమసద్భాతి. అనేన సత్త్వప్రయుక్తం భానమితి భానాత్సత్త్వమవగమ్యతే. తేన యద్ భాతి తదస్తి తథేత్యుక్తం భవతి. తేనాయం ప్రయోగార్థః - ప్రసిద్ధం వాచ్యం ధర్మి ప్రతీయమానేన వ్యతిరిక్తేన తద్వత్; తథా భాసమానత్వాత్, లావణ్యోపేతాఙ్గనాఙ్గవత్.

ప్రసిద్ధశబ్దస్య సర్వప్రతీతత్వమ్ అలంకృతత్వం చార్థః. యత్తదితి సర్వనామసముదాయః చమత్కారసారతాప్రకటీకరణార్థమ్ అవ్యపదేశ్యత్వమ్,

అన్యోన్యసంవలనాకృతం చావ్యతిరేకభ్రమం దృష్టాన్తదార్ష్టాన్తికయోః దర్శయతి. ఏతచ్చ కిమపీత్యాదినా వ్యాదష్టే. లావణ్యం హి నామ అవయవ సంస్థానాభివ్యఙ్గ్యమ్, అవయవవ్యతిరిక్తం ధర్మాన్తరమేవ. న చావయవానామేవ నిర్దోషతా వా భూషణయోగో వా లావణ్యమ్. పృథఙ్నిర్వర్ణ్యమానకాణాది దోషశూన్యశరీరావయవయోగిన్యామపి, అలంకృతాయామపి లావణ్యశూన్యేయమితి, అతథాభూతాయామపి కస్యాంచిత్ లావణ్యామృత చన్ద్రికేయమితి సహృదయానాం వ్యవహారాత్.

### బాలానందిని

అన్యదేవేతి - 'పునః' శబ్దం వాచ్యంకంటె ప్రతీయమానార్థంలో ఒక విశేషం ఉంది అని సూచిస్తుంది. ఇది దానికంటె భిన్నమూ, సారమైనదీ కూడ అని అర్థం. మహాకవీనామ్ అని బహువచనప్రయోగం, ఇది (ప్రతీయమానార్థం) సమస్త విషయాల్నీ వ్యాపించి ఉంది అనీ, ఎందరో మహాకవుల గ్రంథాలలో వ్యాపించి ఉంది అనీ చెపుతున్నది. ఈ గ్రంథంలో చెప్పబడబోయే ప్రతీయమానార్థంచేత సజీవంగా చేయబడిన కావ్యాల నిర్మాణంలో నేర్పు గల ప్రతిభకు పాత్రు లవడంచేతనే మహాకవి అనే పేరు లభిస్తుంది అని భావం. ఈ విధమైన ఏది (ఏ ప్రతీయమానం) ఉన్నదో అది జ్ఞానగోచరం అవుతుంది; తెలుస్తుంది. అసలే లేనిది (చెవులపిల్లి కొమ్ము వంటిది) తెలియడం (కనబడడం) యుక్తం కాదు కదా? ముత్యపు చిప్ప మొదలైన వాటిని చూచినప్పుడు అవి వెండి అనే జ్ఞానం కలుగుతున్నది. అందుచేత లేనిది కూడా కనబడడం ఉంది కదా అని ఆశంకించుకొని రజతాద్యపి అని చెపుతున్నాడు. అక్కడ కూడా అసలు లేని వెండి కనబడడం లేదు. ఇంట్లోను, బజారులోను ఉంది కదా. అదే భ్రాంతిచేత కనబడుతున్నది. అంతేనే కాని రజతాదికం కుందేటి కొమ్ము వంటిది కాదు అని భావం. దీనిని బట్టి ఏ వస్తువుయొక్క జ్ఞానమైనా దాని ఉనికిని పట్టి మాత్రమే (ఆ వస్తువు ఉంటేనే) కలుగుతుంది అని చెప్పాలి. అందుచేత జ్ఞానాన్ని పట్టి దాని ఉనికి తెలుస్తుంది. అందుచేత ఏది తెలుస్తుందో (దేని జ్ఞానం కలుగుతుందో) అది ఆ విధంగా ఉంది అని చెప్పినట్లయింది. అందుచేత ఈవిధంగా అనుమానప్రయోగం చేయవచ్చు - "ప్రసిద్ధమైన వాచ్యార్థరూపధర్మి తనకంటె భిన్నమైన ప్రతీయమానార్థంతో కలిసి ఉంటుంది. ఎందుచేత ననగా అది ఆ విధంగా (ప్రతీయమానార్థసంవలితంగా) భాసిస్తుంది (తెలుస్తుంది); లావణ్యంతో కూడిన స్త్రీశరీరం వలె."

వివరణ. దేనియందు మరొకటి ఉన్నది అని అనుమానప్రమాణంచేత సాధిస్తామో అది ధర్మి. "పర్వతో వహ్నిమాన్ ధూమాత్; యథా మహానసః" (పర్వతంమీద నిప్పు ఉంది; అక్కడ ధూమం ఉంది కాబట్టి; వంటింట్లోవలె) అనే అనుమానప్రయోగంలో పర్వతం మీద అగ్ని ఉంది అని సాధిస్తున్నాం. అందుచేత పర్వతం 'ధర్మి'; అగ్ని 'ధర్మం', ధూమం 'హేతువు', మహానసం 'ఉదాహరణం'.

ప్రసిద్ధేతి - 'ప్రసిద్ధ' శబ్దానికి అందరికీ తెలిసి ఉండడం, అలంకరించబడి ఉండడం అని రెండర్థాలు. యత్తదితీతి - చమత్కారమే దీని (ప్రతీయమానార్థం యొక్క) సారం అని ప్రకటించడం కోసం 'యత్ తత్' అనే రెండు సర్వనామశబ్దాల సముదాయాన్ని ప్రయోగించడం-దృష్టాంతదార్ష్టాంతికాలు రెండూ కూడ చమత్కారానికి సంబంధించినంతవరకు మాటలలో వర్ణించడానికి శక్యం కాని వనీ, రెండూ కలిసిపోవడంచేత వేరు వేరు కాదనే భ్రమ కలుగుతుందనీ చూపుతూన్నది.

వివరణ. ఏదైనా ఒక విషయాన్ని స్పష్టీకరించడానికి చూపిన ప్రసిద్ధోదాహరణం దృష్టాంతం. ఏ విషయం స్పష్టీకరించబడుతుందో అది దార్ష్టాంతికం. ప్రకృతంలో వాచ్యార్థంకంటె భిన్నంగా భాసించే ప్రతీయమానార్థం దార్ష్టాంతికం. స్త్రీల అవయవ సంస్థానంకంటె వేరుగా భాసించే లావణ్యం దృష్టాంతం. ఇక్కడ 'యత్ తత్ ' (ఏ, ఆ- అనగా ప్రసిద్ధమైన, భావనామాత్ర వేద్యమైన) అని రెండు సర్వనామ శబ్దాల సముదాయాన్ని ప్రయోగించడంవల్ల అత్యధికమైన చమత్కారం ఉన్నదని ప్రకటించబడుతుంది. లావణ్య -రసాలు రెండూ కూడా మాటలలో వర్ణించడానికి అందవనీ, వాచ్యప్రతీయ మానార్థాలు, అవయవసంస్థాన లావణ్యాలూ ఒకదానితో ఒకటి కలిసిపోవడంవల్ల వాచ్యం ప్రతీయమానం కూడా ఒకటే అని, అలాగే అవయవసంస్థానం లావణ్యం కూడా ఒకటే అనీ భ్రాంతికి అవకాశం ఉందనీ సూచించబడుతున్నది.

ఏతచ్చేతి:- ఈ విషయాన్నే కిమపి ఇత్యాది వాక్యంచేత వివరిస్తున్నాడు. అవయవాల కూర్పుచేత వ్యంజింపచేయదగిన, కాని అవయవాలకంటె వేరైన ఒకానొక ధర్మవిశేషమే కదా 'లావణ్యం' అంటే? అంతేనే కాని అవయవాలలో ఏ దోషమూ లేకపోవడం గాని, అలంకరించుకొనడం గాని 'లావణ్యం' కాదు. వేరు వేరుగా కనబడుతూ, కాణత్వాది (ఒంటికన్ను) దోషా లేవీ లేని శరీరావయవాలు ఉన్నా, అలంకరించుకున్నా కూడ ఒక స్త్రీని చూడగానే ఈమెలో లావణ్యం లేదనీ, మరొక స్త్రీ అలా లేకపోయినా (ఏదో కాణత్వదోషం వంటిది ఉండి అలంకరించు

కొనకపోయినా)"అహా! ఈమె లావణ్యామృతంతో నిండిన వెన్నెల కదా!" అని సహృదయులలో వ్యవహారం కనబడుతున్నది కదా?

## ధ్వన్యాలోకం

స హ్యర్థో వాచ్యసామర్థ్యాక్షిప్తం వస్తుమాత్రమ్, అలంకారరసాదయశ్చ ఇత్యనేకప్రభేదభిన్నః దర్శయిష్యతే. సర్వేషు చ తేషు ప్రకారేషు తస్య వాచ్యాదన్యత్వమ్. తథా హ్యాద్యస్తావత్ ప్రభేదో వాచ్యాద్దూరం విభేదవాన్. స హి కదాచిద్వాచ్యే విధిరూపే ప్రతిషేధరూపః. యథా -

గాథ : "భమ ధమ్మిఅ వీసత్థో సో సుణఓ అజ్జ మారిఓ దేణ,
గోలాణఇకచ్ఛకుడఙ్గవాసిణా దరిఅసీహేణ". (2)

### బాలానందిని

స ఇతి - ఆ ప్రతీయమానార్థం వాచ్యార్థసామర్థ్యంచేత ఆక్షిప్తమైన (ఊహించి గ్రహించబడిన) వస్తుమాత్రం (ఏదో ఒక విషయం) అయినా కావచ్చు, అలంకార-రసాదులైనా కావచ్చు. ఈ విధంగా అనేక భేదాలచేత భిన్నభిన్నంగా ఉంటుందని చూపబడబోతుంది. ఆ అన్ని ప్రకారాలలోనూ (భేదాలలోనూ) అది (ప్రతీయమానార్థం) వాచ్యార్థంకంటె భిన్నంగానే ఉంటుంది. అది ఎట్లనగా (తథాహి-) - మొదటి భేదం వాచ్యార్థంకంటె చాలా భిన్నంగా ఉంటుంది. ఒకప్పుడు వాచ్యార్థం విధిరూపంలో (ఇది ఇలా చెయ్యి అనే రీతిలో) ఉంటే అది నిషేధరూపంలో (అలా చేయవద్దు అన్న రీతిలో) ఉంటుంది. ఎట్లనగా -

భ్రమేతి - ఒక ధార్మికుడు, దేవతాపూజాదులు చేసే పుణ్యాత్ముడు, గోదావరీతీరంలో ఉన్న పొదలలో పుష్పాలు కోయడానికి వస్తూండడంచేత ఒక స్వైరిణి ఆ ప్రాంతంలో తన ప్రియుణ్ణి కలవడానికి విఘ్నం కలుగుతుంది. అత డక్కడికి రాకుండా చేయడానికి ఆమె ఒక ఉపాయం పన్ని పలికే మాట లివి. ఈ గాథ గాథాసప్తశతిలోనిది. ధార్మిక = ధార్మికుడా! విస్రబ్ధః = విశ్వాసం కలవాడవై, నిర్భయంగా, భ్రమ = తిరుగు. సః శునకః = ఆ కుక్క, గోదావరీకచ్ఛకుఞ్జవాసినా = గోదావరీనదియొక్క జలప్రాయ ప్రాంతంలోని పొదలలో నివసిస్తూన్న, తేన = ఆ, దృప్తసింహేన = గర్వించిన

సింహంచేత, మారితః = చంపబడింది.

**లోచనం**

నను లావణ్యం తావత్ వ్యతిరిక్తం ప్రథితమ్. ప్రతీయమానం కిం తదిత్యేవ న జానీమః. దూరే తు వ్యతిరేకప్రథేతి తథా భాసమానత్వమసిద్ధో హేతురిత్యాశఙ్క్య స హ్యర్థ ఇత్యాదినా స్వరూపం తస్యాభిధత్తే; సర్వేషు చ ఇత్యాదినా చ వ్యతిరేకప్రథాం సాధయిష్యతి.

తత్ర ప్రతీయమానస్య తావత్ ద్వౌ భేదౌ - లౌకికః, కావ్యవ్యాపారైక గోచరశ్చేతి. లౌకికో యః స్వశబ్దవాచ్యతాం కదాచిదధిశేతే, స చ విధినిషేధాద్యనేక ప్రకారః వస్తుశబ్దేనోచ్యతే. సోఽపి ద్వివిధః - యః పూర్వం క్వాపి వాక్యార్థే అలఙ్కారభావముపమాదిరూపతయా అన్వభూత్, ఇదానీం త్వనలఙ్కార రూప ఏవ అన్యత్ర గుణీభావాభావాత్; స పూర్వప్రత్యభిజ్ఞానబలాత్ అలంకారధ్వనిరితి వ్యపదిశ్యతే బ్రాహ్మణశ్రమణన్యాయేన. తద్రూపతాభావేన తూపలక్షితం వస్తుమాత్రముచ్యతే. మాత్రగ్రహణేన హి రూపాన్తరం నిరాకృతమ్. యస్తు స్వప్నేఽపి న స్వశబ్దవాచ్యః, న లౌకికవ్యవహారపతితః, కిం తు శబ్ద సమర్ప్యమాణహృదయసంవాదసున్దరవిభావానుభావసముచిత ప్రాగ్వి నివిష్టరత్యాదివాసనానురాగసుకుమారస్వసంవిదానంద చర్వణావ్యాపార రసనీయరూపః రసః, స కావ్యవ్యాపారైకగోచరః రసధ్వనిరితి, స చ ధ్వనిరేవేతి, స ఏవ ముఖ్యతయా ఆత్మేతి.

**బాలానందిని**

(ఆశంక) నన్వితి. లావణ్యం అనేది వేరుగా, అవయవాది సంస్థానంకంటె భిన్నంగా, ప్రసిద్ధంగా, అందరికీ తెలిసినదిగా ఉంది. అయితే నువ్వు చెప్పే ఈ ప్రతీయమానం అనేది ఏమిటో మాకేమీ తెలియడం లేదు; అలాంటప్పుడు అది వాచ్యార్థంకంటె భిన్నంగా ఉన్నట్లు తెలియడం లేదని వేరే చెప్పనక్కరలేదు. అందుచేత వెనుక నువ్వు చెప్పిన "తథా భాసమానత్వాత్" (వేరుగా కనబడుతున్నది కావున) అనే హేతువు అసిద్ధం; అని ఆశంకించుకొని స హ్యర్థః ఇత్యాదిభాగంచేత దాని స్వరూపం చెపుతున్నాడు. సర్వేషు చ ఇత్యాదివాక్యంచేత ప్రతీయమానార్థం వాచ్యార్థంకంటె భిన్న మైనది అనే విషయం కూడా సాధిస్తాడు.

తత్రేతి :- లౌకికము, కావ్యవ్యాపారైకగోచరమూ (కేవలం వ్యంజనారూప కావ్యవ్యాపారం ద్వారా మాత్రమే ప్రతిపాదించతగినది) అని ప్రతీయమానార్థం రెండు విధాలు. వీటిలో లౌకికమైన అనగా లోకంలో తెలిసిన ఏ ప్రతీయమానార్థం ఉందో అది ఒక్కొక్కప్పుడు స్వశబ్దవాచ్యత్వాన్ని కూడా పొందుతుంది. అనగా ప్రతీయమానమైన లౌకికార్థం ఒకప్పుడు ప్రతీయమానమే కాకుండా వాచ్యం కూడా కావచ్చు. విధిరూపంలోను, నిషేధరూపంలోను, ఇంకా అనేకరూపాలలోను ఉండే ఆ లౌకికప్రతీయమానార్థాన్ని 'వస్తువు' అని అంటారు. అనగా వస్తుధ్వని అంటారు.

వస్తువు అంటే ఏమో చెప్పి 'వస్తుమాత్రం' లోని 'మాత్ర' శబ్దార్థాన్ని వివరిస్తున్నారు- సోఽపీతి : ఆ లౌకికవస్తువు కూడా రెండు విధాలు. పూర్వం అనగా వాచ్యత్వావస్థలో, ఉపమాదిరూపంలో అలంకారత్వాన్ని పొంది ఉండి, ఇప్పుడు, అనగా ప్రతీయమానత్వావస్థలో, మరొకదానికి దేనికీ అంగంగా (అప్రధానంగా) ఉండకపోవడంచేత (గుణీభావాభావాత్) అలంకారరూపంలో లేకపోయినా, వెనుకటి స్థితియొక్క గుర్తింపును పట్టి (వెనుకటి అలవాటును పట్టి) బ్రాహ్మణశ్రమణన్యాయంచేత అలంకారం అని చెప్పబడేది (ఒకటి).

అనగా ఒక వస్తువు (విషయం) వాచ్యంగా ఉన్నప్పుడు అది ఏ ఉపమాలంకారమో అయి ఉండవచ్చు. దాన్ని అలంకారం అంటున్నామంటే దానిచేత అలంకరించబడేది (అలంకార్యం) ఒకటున్న దన్నమాట. అందుచేత ఆ అలంకార్యం ప్రధానం, అలంకారం దాని దృష్ట్యా అప్రధానం (గుణీభూతం). అయితే ప్రతీయమానావస్థలో ఈ వస్తువే ప్రధానం; దేనికీ గుణం(అప్రధానం) కాదు. అందుచేత నిజానికి దీన్ని అలంకారం అనకూడదు. అయినా వెనుకటి స్థితిని (వాచ్యత్వావస్థను) పట్టి అలంకారం అని, 'అలంకారధ్వని' అంటున్నాం. ఉదాహరణకి ఒక బ్రాహ్మణుడు బౌద్ధసంన్యాసి అయ్యాడు. అప్పుడింక అతడు బ్రాహ్మణుడు కాడు. అయినా పూర్వపుస్థితిని పట్టి బ్రాహ్మణశ్రమణుడు (బ్రాహ్మణ బౌద్ధసంన్యాసి) అని అంటున్నారు. దీన్ని అలంకారధ్వని అనడం కూడా అలాంటిదే.

తద్రూపేతి - తద్రూపంతో గుర్తించబడనిది మాత్రం, అనగా అలంకారంగా గుర్తించబడనిది వస్తు వనే చెప్పబడుతుంది. 'మాత్ర' శబ్దం ప్రయోగించడం చేత దీనికి మరొక రూపం నిరాకరించబడింది(ఇది రెండవది).

ఈ విధంగా వస్తువు వాచ్యమైనా కావచ్చు. ప్రతీయమాన మైనా కావచ్చు. పూర్వం అది అలంకారంగా ఉంటే దాన్ని అలంకారధ్వని (ప్రతీయమానాలంకారం)

అనవచ్చు అని భావం. కాని రసం మాత్రం ఏ నాడూ వాచ్యం కాదు; అది వ్యంగ్యం మాత్రమే అని చెపుతున్నాడు. - యస్త్వితి :- ఏది (ఏ రసం) స్వప్నంలో కూడ స్వశబ్దవాచ్యం కాదో (సాధారణమైన 'రస' శబ్దంచేత గాని 'శృంగార' మొదలైన విశేషశబ్దాలచేత గాని వాచ్యం కాదు అని అర్థం), లౌకికవ్యవహారంలో పడేది కాదో, అనగా ఇది లౌకికమైన, లోకప్రసిద్ధమైన, విషయమే అని చెప్పడానికి వీలైనది కాదో, మరేమనగా (కిం తు) శబ్దాలచేత సమర్పించబడేవీ, హృదయసంవాదంచేత సుందరమైనవీ అయిన విభావానుభావాలకు తగిన, పుట్టుక నుంచీ ఉన్న (ప్రాగ్వినివిష్ట) రత్యాది వాసనలను (రత్యాదుల సూక్ష్మరూపాలను) రంజింపచేయడం చేత (ఉద్బుద్ధా లయేటట్లు చేయడంచేత - కదల్చడంచేత) సుకుమారమైన స్వాత్మచైతన్య (స్వసంవిద్) రూపానందాస్వాదవ్యాపారంచేత ఆస్వాదింపదగిన రూపం గలదో అట్టి రసం మాత్రం ఒక్క కావ్యవ్యాపారానికి మాత్రమే గోచరం అవుతుంది. అనగా కావ్యంలోని వ్యంజనావ్యాపారంచేతనే వ్యంగ్యం అవుతుంది. అందుచేత అది రసధ్వని; అదే ధ్వని; అదే ముఖ్యమైన దవడంచేత కావ్యానికి ఆత్మ.

(విభావాను భావవ్యభిచారిభావాలు, స్థాయిభావాలు, వాటి పరస్పరసంబంధం, వీటి అన్నింటినీ గూర్చిన చర్చ మా కావ్యప్రకాశవ్యాఖ్యానంలో చూడవచ్చు.)

వివరణ. ఈ సుదీర్ఘసమాసంలో ప్రతిపాదించిన రసస్వరూపాన్ని మామూలు మాటలలో ఈ విధంగా చెప్పవచ్చు. సంవిత్ అనగా జ్ఞానం, అనగా చైతన్యం. అదే ఆత్మ. అది ఆనందస్వరూపం. ప్రతివానిలోనూ రతి (ప్రేమ), హాసం, శోకం, కోపం, ఉత్సాహం, భయం, జుగుప్స (అసయించు కోవడం), ఆశ్చర్యం, శమం లేదా ఒక విధమైన వైరాగ్యం ఇవి నిగూఢంగా, సూక్ష్మరూపంలో, పుట్టుకనుంచీ ఉంటాయి. అందుచేత వీటికి స్థాయిభావాలని పేరు. బాహ్యమైన కొన్ని పరిస్థితులు ఏర్పడి నప్పుడు నిగూఢంగా ఉన్న భావాలను కెలికినట్లయి అవి పైకి ఉబికి వస్తాయి. దీనినే 'రత్యాదులు-ఉద్బుద్ధాలవడం' అంటారు. ఉదాహరణకి కొన్ని పరిస్థితులలో ఒక సుందరిని చూచినప్పుడు పురుషునిలో నిగూఢంగా ఉన్న రతి ఉద్బుద్ధం అవుతుంది; సుందరుణ్ణి చూచినప్పుడు స్త్రీలో నిగూఢంగా ఉన్న రతి ఉద్బుద్ధం అవుతుంది. వికృతవేషభాషాదులు చూచినప్పుడు హాసం, విషాదకరదృశ్యాలు చూచినప్పుడు లేదా అలాంటి సంఘటనలు ఏర్పడినప్పుడు శోకం, శత్రువులు మొదలైన వాళ్లని చూచినప్పుడు కోపం ఈ విధంగా ఆ యా పరిస్థితులలో ఆ యా భావాలు ఉద్బుద్ధా లౌతాయి. ఇవన్నీ దైనందినజీవితంలో ప్రతివారిలోనూ కలిగే భావాలే; భావావేశాలే. కావ్యనాటకాదులలో కవినటాదులు ఆ

యా వర్ణనలచేత, చతుర్విధాభినయాలచేతా వెనుక చెప్పిన పరిస్థితులవంటి పరిస్థితుల్ని కల్పించినప్పుడు కూడా వాటి ప్రభావంచేత పఠితలలోను, సామాజికులలోను నిగూఢంగా ఉన్న రతి-హాస-శోక-క్రోధాదిభావాలు ఉద్బుద్ధాలవుతాయి. ఇవి లోకంలో జరిగిన సంఘటనలవల్ల కాక కావ్యాదులలో వర్ణించిన సంఘటనలవల్ల ఉద్బుద్ధాలయ్యాయి. అందుచేత ఇవి (సంఘటనాదులు, రత్యాదులు) అలౌకికాలే. ఈ రత్యాదులు తీవ్రతర స్థాయికి చేరుకున్నప్పుడు వీటికి శృంగారాదినామధేయాలు పెట్టారు. ఇవన్నీ ఆనందరూప సంవిత్తుతో (చైతన్యంతో) సంబంధించినవే అవడంచేత ఆనందరూపాలు. ఈ రత్యాదులు లౌకికసంఘటనల ద్వారా ఉద్బుద్ధాలై నప్పుడు అవన్నీ ఆనందరూపాలు కావు. వాటి సహజస్వభావాలను పట్టి వివిధరూపాలుగా ఉండవచ్చు. కావ్యాలలో వర్ణించిన సంఘటనలద్వారా, కావ్యవ్యాపారంద్వారా, ఉద్బుద్ధా లైనప్పుడు మాత్రం ఆనందమయ సంవిద్రూపా లై పోతాయి. ఆనందమయచైతన్యరూపా లైపోతాయి. ఇదీ అభినవగుప్తుడు అనేకస్థలాలలో 'లోచనాభినవభారత్యాదులలో') ప్రతిపాదించిన రసస్వరూప సారాంశం. 'రసానుభవం' 'రసాన్ని ఆస్వాదించడం' ఇత్యాది విధంగా ప్రతిపత్తిసౌకర్యం కోసం మాట వరసకి అన్నా రసం వేరు దాని ఆస్వాదం వేరు కాదు; రసమే ఆస్వాదం; ఆస్వాదమే రసం అని కూడా రసచర్చ వచ్చినప్పు డల్లా చెపుతూ ఉంటాడు.

### లోచనం

యదూచే భట్టనాయకేన - "అంశత్వం న రూపతా" ఇతి, తద్వస్త్వలంకారధ్వన్యోరేవ యది నామోపాలమ్భః. రసధ్వనిస్తు తేనై వాత్మతయాంగీకృతః; రసచర్వణాత్మనః తృతీయస్యాంశస్య అభిధాభావనాంశద్వయోత్తీర్ణత్వేన నిర్ణయాత్. వస్త్వలంకారధ్వన్యోః రసధ్వనిపర్యన్తత్వమేవేతి వయమేవ వక్ష్యామః తత్ర తత్రేత్యాస్తాం తావత్.

### బాలానందిని

యదితి - " (ధ్వని అనేది ఒకటి ఉందని అంగీకరించినా) అది కావ్యంలో ఒక అంశమే అవుతుందేమో కాని కావ్యరూపమే కాజాలదు". అని భట్టనాయకు డేదైతే అన్నాడో అది వస్తుధ్వని -అలంకారధ్వనులకు మాత్రమే సంబంధించిన ఆక్షేపం అయితే కావచ్చు. రసధ్వని అయితే కావ్యాత్మయే అని అతడే అంగీకరించాడు. (అతడు దానికి రసధ్వని అని పేరు పెట్టకపోయినా) రసచర్వణారూప మైన మూడవ అంశం, అభిధ, భావన అనే రెండు అంశాలకంటె అతీతమైనది, నిర్ణయించి ఉన్నాడు కదా? వస్త్వలం

కారధ్వనులకు చివరికి రసధ్వనిలోనే పర్యవసానం అని అక్కడక్కడ మేమే చెప్పనున్నాం. ఇంక ఈ విషయం ఇంతటితో నిలుపుదాం.

వివరణ . భట్టనాయకుడు అభిధ, భావన, భుక్తి అని మూడు శబ్దవ్యాపారాలు అంగీకరించాడు. భుక్తి అంటే రసచర్వణ. అది అతని ప్రకారం కూడా కావ్యాత్మ. మేం చెప్పేది కూడా రసధ్వని కావ్యాత్మ అనియే. అందుచేత వస్త్వలంకారధ్వనులు కావ్యాత్మ కాజాలవు అని అతడు అంటే అది మాకూ అంగీకార్యమే అని భావం.

లోచనం

వాచ్యసామర్థ్యాక్షిప్తమ్ ఇతి భేదత్రయవ్యాపకం సామాన్యలక్షణమ్. యద్యపి ధ్వననం శబ్దస్యైవ వ్యాపారః తథాప్యర్థసామర్థ్యస్య సహకారిణః సర్వత్ర అనపాయాత్ వాచ్యసామర్థ్యాక్షిప్తత్వమ్. శబ్దశక్తిమూలానురణ నవ్యఙ్గ్యేఽపి అర్థసామర్థ్యాదేవ ప్రతీయమానావగతిః; శబ్దశక్తిః కేవలం అవాన్తరసహకారిణీతి వక్ష్యామః. దూరం విభేదవాన్ ఇతి. విధినిషేధౌ విరుద్ధావితి న కస్యచిదపి విమతిః. ఏతదర్థం ప్రథమం తావేవ ఉదాహరతి -

భ్రమ ధార్మిక విస్రబ్ధః స శునకోఽద్య మారితస్తేన,
గోదావరీనదీకూలలతాగహనవాసినా దృప్తసింహేన.

కస్యాశ్చిత్సంకేతస్థానం జీవితసర్వస్వాయమానం ధార్మికసంచరణాన్తరాయ దోషాత్, తదవలుప్యమానపల్లవకుసుమాదివిచ్ఛాయీకరణాచ్చ పరిత్రాతు మియమ్ ఉక్తిః. తత్ర స్వతఃసిద్ధమపి భ్రమణం శ్వభయేనాపోదితమితి ప్రతిప్రసవాత్మకః నిషేధాభావరూపః, న తు నియోగః ప్రైషాదిరూపోఽత్ర విధిః; అతిసర్గప్రాప్తకాలయోర్హి అయం లోట్. తత్ర భావతదభావయోః విరోధాత్ ద్వయోస్తావత్ న యుగపద్వాచ్యతా, న క్రమేణ; విరమ్య వ్యాపారాభావాత్. "విశేష్యం నాభిదా గచ్ఛేత్" ఇత్యాదినా అభిధావ్యాపారస్య విరమ్య వ్యాపారాసంభవాభిధానాత్.

బాలానందిని

వాచ్యేతి - "వాచ్యసామర్థ్యంచేత ఆక్షిప్తమైన" అనేది మూడు భేదాలకీ, అనగా వస్తు - అలంకార - రసధ్వనులు మూడింటికీ, అన్వయించే సామాన్య లక్షణం. అనగా

ఈ మూడు ధ్వనులూ కూడ వాచ్యసామర్థ్యాక్షిప్తాలే. ధ్వననం (ధ్వనింపచేయడం) అనేది శబ్దానికే చెందిన వ్యాపారమే అయినా అన్నింటిలోనూ కూడా అర్థసామర్థ్యం సహకారిగా తప్పకుండా ఉంటుంది కాబట్టి వాచ్యసామర్థ్యాక్షిప్తం అని చెప్పడం జరిగింది. శబ్దశక్తిమూలానురణన ధ్వనిలో కూడ ప్రతీయమానార్థం అర్థసామర్థ్యంచేత తెలుస్తుంది; శబ్దశక్తి కేవలం మధ్యలో ఉండి సహకారం చేస్తుంది అని (ఆ ఘట్టంలో) చెపుతాం.

దూరమితి - విధి - నిషేధాలు పరస్పరవిరుద్ధాలు అనే విషయంలో ఎవరికీ విమతి (అభిప్రాయభేదం) ఉండదు. ఇందుకోసం (అనగా వాచ్యార్థ ధ్వన్యమానార్థాల మధ్య ఉన్న భేదాతిశయాన్ని చూపడంకోసం) ముందుగా వాటినే, వాచ్యవ్యంగ్యాలైన విధినిషేధాలనే, 'భ్రమ ధార్మిక' ఇత్యాదిశ్లోకాల ద్వారా ఉదాహరిస్తున్నాడు. ఒక నాయిక తన జీవితసర్వస్వమైన సంకేతస్థానాన్ని ధార్మికుని సంచారం అనే విఘ్నదోషంనుంచీ, అతడు చిగుళ్లు పువ్వులూ కోసివేయడంచేత శోభాశూన్యం అయిపోవడం నుంచీ రక్షించడానికి అంటూన్న మాట ఇది. తత్రేతి - ఇక్కడ స్వతఃసిద్ధమే అయిన భ్రమణం కుక్కనుండి ఏర్పడిన భయంచేత నిషిద్ధమై ఉంది. అందుచేత విధి ప్రతిప్రసవరూపమైనది; నిషేధాభావరూప మైనది. అంతేనే కాని ఇది ప్రైషాదిరూపమైన నియోగం కాదు. ఈ లోట్ అతిసర్గప్రాప్తకాలార్థాలలో విధించినది.

వివరణ. పై శ్లోకంలో భ్రమ అని లోట్ మధ్యమపురుషైకవచనం ప్రయోగించ బడింది. 'తిరుగుము', 'సంచరించుము' అని అర్థం. ఇది విధి. "ఇలా చెయ్యి" అని చెప్పడానికి 'విధి' అని పేరు. అయితే ఇక్కడ ఒక పనిని చేయడానికి ఉద్యమించనివానిని ఆ పనిలో క్రొత్తగా నియమించడం కాదు. అతడు ధార్మికు డవడంచేత పుష్పాదుల కోసం ఎవరి ప్రేరణా అక్కరలేకుండా తనంతట తానే సంచరిస్తాడు. ఎటొచ్చీ కుక్కకి భయపడి సంచరించడం మానేశాడు. అందుచేత ఇక్కడ ఉన్న విధి ప్రతిప్రసవాత్మక మైనది. నిషేధాన్ని నిషేధించడం 'ప్రతిప్రసవం' అనగా ఈ విధి శ్వభయంవల్ల ఏర్పడిన సంచారనిషేధాన్ని(సంచారాభావాన్ని) నిషేధిస్తూన్నదే కాని క్రొత్తగా సంచారాన్ని విధించడం లేదు. "సంచారం మానివేయవద్దు" అని చెప్పడంద్వారా సంచారాన్ని విధిస్తూన్నది. 'ప్రైష' అనగా పెద్దవాడు ఒక చిన్నవాణ్ణి ఏదైనా పనిచేయడానికి నియోగించడం. ఇక్కడ లోట్‌కు ఇలాంటి ప్రైషరూపమైన విధి అర్థం కాదు. మరేమనగా. 'అతిసర్గం' అనే అర్థంలో ప్రయోగించినలోట్. అతిసర్గం' అనగా కామచారానుజ్ఞ; "నీకు ఇష్టం అవుతే చేయవచ్చు" అని చెప్పడం. ప్రస్తుతోదాహరణంలో ఈ విధమైన విధి; విధి వంటి విధి అని ఈ ఘట్టానికి అర్థం.

"విధినిమన్త్రణామన్త్రణాధీష్టసంప్రశ్నప్రార్థనేషు లిఙ్" (3.3.161) అనే సూత్రం చేత లిఙ్ ఏ అర్థాలలో ప్రయోగించబడుతుందో చెప్పి "లోట్ చ" (3.3.162) అనే సూత్రంచేత లోట్ కూడా విధ్యాద్యర్థాలలోనే ప్రయోగించ బడుతుంది అని చెప్పబడింది. విధి అంటే నియోగం; నియమించడం. పెద్దవాడు చిన్నవాణ్ణి ఒక పని చెయ్యమని నియమిస్తే అది 'ప్రైష'. సముణ్ణి నియమిస్తే అది 'ఆమంత్రణం'. పెద్దవాణ్ణి ఒక పని చేయ మని కోరితే 'అధ్యేషణం'. ఈ క్రింది శ్లోకం ఈ భావమే చెపుతూన్నది.

"కార్యమేవ హి వక్తౄణాం జ్యాయః సమకనీయసామ్,
ప్రవర్త్యాపేక్షయా భేదాత్ ప్రైషాదివ్యపదేశభాక్".

"ప్రైషాతిసర్గప్రాప్తకాలేషు కృత్యాశ్చ" (3.3.163) అనే సూత్రం ప్రకారం అతిసర్గార్థంలో కూడా లోట్ ప్రయోగించవచ్చును. ప్రాప్తకాలం అనగా "ఒక పనిచేయడానికి తగిన సమయం వచ్చింది" అని అర్థం.

భ్రమణనిషేధం వ్యంగ్యమే; ఇది వాచ్యం అని కాని, మరొక విధంగా గాని చెప్పడానికి వీలు లేదు అని ప్రతిపాదించడానికి ఉపక్రమిస్తున్నాడు - తత్రేతి- ఈ విధమైన ఈ వాక్యంలో భ్రమణం, భ్రమణాభావం ఈ రెండూ కూడా ఒకే సారి వాచ్యాలు అవుతాయి (అభిధచేతనే బోధించబడతాయి) అనడం కుదరదు; ఎందుచేత ననగా భావం (భ్రమణం ఉండడం) అభావం (భ్రమణం లేకపోవడం) అనేవి పరస్పరవిరుద్ధాలు. క్రమంగా వాచ్యా లవుతాయి అనడం కూడా కుదరదు. అనగా మొదట భ్రమణం వాచ్యం అవుతుంది; తరవాత భ్రమణాభావం వాచ్యం అవుతుంది, అనడం కూడా కుదరదు. ఎందుచేత ననగా విరమ్యవ్యాపారం లేదు. అనగా అభిధావ్యాపారం ఒక మాటు ఒక అర్థం బోధించిన తరవాత కొంచెం సేపు ఆగి (విరమ్య) మరొక అర్థం చెప్పడం అనేది ఉండదు. తాను బోధించవలసిన అర్థం బోధించిన తరవాత అది ఇంక పనిచేయడం మానేస్తుంది అని అర్థం.

విశేష్యమితి - "విశేష్యం నాభిధా గచ్ఛేత్" ఇత్యాదివాక్యం 'విరమ్యవ్యాపారం కుదరదు' అని ప్రతిపాదిస్తున్నది కదా?

వివరణ. జాతిశక్తివాదం (ఒక శబ్దం అభిధచేత జాతినే బోధిస్తుంది అనే వాదం) ప్రకారం 'గో' శబ్దానికి 'గోత్వం' అర్థం. గోవు విశేష్యం, గోత్వం విశేషణం. 'గో' శబ్దం గోత్వం అనే అర్థాన్ని బోధించడంతో దాని శక్తి క్షీణించిపోతుంది; అంతటితో ఆగిపోతుంది. అందుచేత దాని అభిధాశక్తి విశేష్యం అయిన గోవును బోధించజాలదు. గోవు లేకుండా గోత్వం ఉండదు కనక గోత్వాన్ని పట్టి విశేష్యమైన గోవును ఆక్షేపించుకొనవలసిందే.

"విశేష్యం నాభిధా గచ్ఛేత్ క్షీణశక్తిర్విశేషణే" అని పూర్తి వాక్యం. "విశేషణాన్ని బోధించడంతోనే క్షీణించిన శక్తి గల అభిధ విశేష్యం దాకా వెళ్లదు" అని అర్థం. అందుచేత అభిధ ముందు ఒక అర్థాన్ని బోధించి, కొంతసేపు ఆగి మరొక అర్థాన్ని బోధిస్తుంది అని చెప్పే ప్రసక్తి లేదు అని భావం.

**లోచనం**

నను తాత్పర్యశక్తిః అపర్యవసితా వివక్షయా, దృప్త - ధార్మిక - తదాదిపదార్థానన్వయరూపముఖ్యార్థబాధబలేన, విరోధనిమిత్తయా విపరీతలక్షణయా చ వాక్యార్థీభూతనిషేధప్రతీతిమ్ అభిహితాన్వయదృశా కరోతీతి శబ్దశక్తిమూల ఏవ సోఽర్థః "ఏవమ్ అనేనోక్తమ్" ఇతి హి వ్యవహారః. తత్ న వాచ్యాతిరిక్తః అన్యోఽర్థః ఇతి.

**బాలానందిని**

అభిధయే తాత్పర్యశక్తి సాహాయ్యంతో లక్షణ ద్వారా నిషేధరూపార్థాన్ని బోధిస్తుంది అని చెప్పవచ్చు; ధ్వనిని అంగీకరించడం ఎందుకు అని ఆశంకిస్తున్నాడు:- నన్వితి - తాత్పర్యశక్తికి భ్రమణవిధిలో పర్యవసానం లేదు. అందుచేత ఆ తాత్పర్యశక్తి వివక్షచేత 'ఈ విషయం చెప్పాలి' అని వక్తకున్న ఇచ్ఛచేత, 'గర్వించిన (సింహం)', 'ఓధార్మికుడా!' 'ఆ' (ప్రసిద్ధమైన సింహంచేత) అనే పదాల అర్థాలు నిషేధరూపార్థం చెపితేనే కాని అన్వయించకపోవడంచేత ఏర్పడిన ముఖ్యార్థబాధయొక్క బలంచేత విరోధం నిమిత్తంగా గల (విరోధరూపసంబంధంచేత చెప్పవలసిఉన్న) విపరీతలక్షణచేత, అభిహితాన్వయపద్ధతిప్రకారం వాక్యార్థమైన నిషేధంయొక్క ప్రతీతిని కలగచేస్తుంది. కాబట్టి ఆ అర్థం (నిషేధరూపార్థం) శబ్దశక్తిమూలమే. "ఇతడు ఇలా చెప్పాడు" అని లోకంలో అంటారు కదా? "అతడు ఇలా ధ్వనింపచేశాడు" అని అనరు కదా?) అందుచేత ఆ రెండవ అర్థం వాచ్యంకంటె భిన్నం కాదు.

వివరణ. మాటలాడే వ్యక్తి ఏ అభిప్రాయంతో మాటలాడుతున్నాడో దానిని పట్టి వాక్యార్థం నిర్ణయించాలి. ఇక్కడ ఉన్న పదాలన్నీ తమ తమ అర్థాలు బోధించిన తరవాత తాత్పర్యశక్తిని పట్టి, ఇక్కడ ఏ అర్థం ఉద్దిష్టమైనదో దానిని పట్టి, ఆ పదార్థాలకి ఒక దానికి మరొక దానితో ఉన్న సంబంధం నిర్ణయించాలి. ఇక్కడ 'దృప్త', 'ధార్మిక', 'తేన' పదాల అన్వయం కూడా భ్రమణరూపముఖ్యార్థం మాత్రమే గ్రహిస్తే కుదరదు. "ఓయీ! ఆ కుక్కని ఒక సింహం చంపేసింది" అని చెపితే చాలు. "ఓ ధార్మికా!

ప్రసిద్ధమైన ఆ సింహం కుక్కను చంపేసింది" అని ఇంత వర్ణించి చెప్ప నవసరంలేదు. అందుచేత ముఖ్యార్థబాధ కనబడుతున్నది. కావున విరోధరూపసంబంధాన్ని పురస్కరించుకొని విపరీతలక్షణచేత 'భ్రమ' అన్నదానికి 'మా భ్రమ' అని అర్థం చెప్పాలి. (అపకారం చేసిన ఒకనితో 'మిత్రమా! నాకు గొప్ప ఉపకారం చేశావు" అని అన్నప్పుడు "చాలా అపకారం చేశావు" అని అర్థం. ఇది విపరీతలక్షణ). ఈ విధంగా ఇక్కడ చెప్పదలచిన వాక్యార్థం నిషేధమే. దాని జ్ఞానం అభిహితాన్వయపద్ధతిలో విపరీతలక్షణచేతనే కలుగుతూన్నప్పుడు ధ్వనిని అంగీకరించడం ఎందుకు అని పూర్వపక్షం. (అభిహితాన్వయవాదం, అన్వితాభిధానవాదం, తాత్పర్యరూపవృత్తి ఈ విషయాలను సవిస్తరంగా మా కావ్యప్రకాశవ్యాఖ్య బాలానందినిలో (18-21 పేజీల్లో) చూడవచ్చును).

### లోచనం

నైతత్; త్రయో హ్యత్ర వ్యాపారాః సంవేద్యన్తే - పదార్థేషు సామాన్యాత్మసు అభిధావ్యాపారః. సమయాపేక్షయా అర్థావగమనశక్తిర్హి అభిధా; సమయశ్చ తావత్యేవ, న విశేషాంశే, ఆనన్త్యాత్ వ్యభిచారాచ్చైకస్య. తతో విశేషరూపే వాక్యార్థే తాత్పర్యశక్తిః పరస్పరాన్వితే "సామాన్యా న్యన్యథాసిద్ధే ర్విశేషం గమయన్తి హి" ఇతి న్యాయాత్. తత్ర చ ద్వితీయకక్ష్యాయాం భ్రమేతి విధ్యతిరిక్తం న కించిత్ ప్రతీయతే, అన్వయమాత్రస్యైవ ప్రతిపన్నత్వాత్. నహి "గఙ్గాయాం ఘోషః" "సింహో వటుః" ఇత్యత్ర యథా అన్వయ ఏవ బుభూషన్ ప్రతిహన్యతే యోగ్యతావిరహాత్ తథా తత్ర భ్రమణనిషేద్ధా స శ్వా సింహేన హతః. తదిదానీం భ్రమణనిషేధకారణవైకల్యాత్ భ్రమణం తవోచితమ్ ఇత్యన్వయస్య కాచిత్ క్షతిః. అత ఏవ ముఖ్యార్థబాధా నాత్ర శఙ్క్యేతి న విపరీతలక్షణాయా అవసరః.

### బాలానందిని

నేతి:- ఇది యుక్తం కాదు. ఇక్కడ మూడు వ్యాపారాలు తెలియవస్తున్నాయి. సామన్యస్వరూపాలైన పదార్థాల విషయంలో అభిధావ్యాపారం ఉంటుంది. ఇది మొదటిది. అనగా 'గో' మొదలైన పదాలు అభిధావ్యాపారంచేత గోత్వాది సామాన్యరూపార్థాలను బోధిస్తాయి. సమయాపేక్షచేత, అనగా దీనికి ఇది అర్థం అనే సంకేతంయొక్క అపేక్షచేత, అర్థం బోధించే శక్తియే కదా 'అభిధ' అంటే. సమయం

(సంకేతం) కేవలం సామాన్యరూపపదార్థం విషయంలోనే ఉంటుంది; విశేషం విషయంలో ఉండదు. ఎందుచేత ననగా విశేషాంశాలు అనంతంగా ఉంటాయి; ఒక విశేషం విషయంలో సమయం అంగీకరిస్తే మరొక విశేషంలో వ్యభిచారం ఉంటుంది. ఉదాహరణకి 'గో' పదానికి ఒక గోవు విషయంలో సంకేతం అని చెపితే ఇతర గోవ్యక్తులవిషయంలో ఉండదు. ప్రపంచంలోని భూతభవద్భవిష్యద్గోవ్యక్తు లన్నింటి విషయంలో సంకేతం గ్రహించడం కుదరదు. అలా కుదరదు గాన గ్రహించని వాటి విషయంలో గోశబ్దాన్ని ఉపయోగిస్తే వ్యభిచారదోషం వస్తుంది.

వివరణ. సామాన్యాత్మస్వభిధావ్యాపారః" ఇత్యాదివాక్యాలకి కొందరు వ్యాఖ్యాతలు వ్రాసిన అర్థం పైన చూపబడింది. కాని ఈ సందర్భంలో లోచనకారుడు చర్చిస్తున్నది పదాలకు జాతియందు శక్తి ఉంటుందా, వ్యక్తియందు ఉంటుందా, జాతిసహితవ్యక్తియందు ఉంటుందా అన్న విషయం కాదు. ఒక వాక్యంలో ఉన్న పదాలలో ఏ పదాని కా పదం తన అర్థాన్ని మాత్రమే బోధిస్తుందా లేక ఇతరపదాల అర్థాలతో సంబంధించిన అర్థాన్ని బోధిస్తుందా అనే విషయం. అందుచేత ఈ వాక్యాలకి- 'అభిధావ్యాపారం సామాన్య స్వరూపాలైన పదార్థాల విషయంలో మాత్రమే ప్రవరిస్తుంది. విశేషాంశవిశిష్టమైన అనగా కర్తృత్వకర్మత్వకరణత్వాది విశిష్టమైన ఇతరపదార్థాన్వితమైన, పదార్థాన్ని బోధించదు. తద్విశిష్టపదార్థం విషయంలో శబ్దానికి సంకేతం కుదరదు కదా? దాన్ని బోధించా లంటే మరొక వ్యాపారం ముందుకు రావాలి, అదే తాత్పర్యవ్యాపారం' అని భావం గ్రహిస్తే బాగుంటుంది.

ఇప్పుడు రెండవ వ్యాపారాన్ని, దాని విషయాన్నీ వివరిస్తున్నాడు -తతః ఇత్యాది. తరవాత, అనగా అభిధ సామాన్యస్వరూపమైన అర్థాన్ని బోధించిన తరవాత, పరస్పరంతో అన్వయించిన విశేషరూపమైన వాక్యార్థంలో తాత్పర్యశక్తి ప్రవరిస్తుంది. అనగా ఒక వాక్యంలోని పదాల అర్థాలు వేటి కవి వేరువేరుగా అభిధ ద్వారా తెలిసిన తరవాత ఆ పదార్థాల మధ్య ఉన్న పరస్పసంబంధం (అదే వాక్యార్థం) తాత్పర్యశక్తి ద్వారా తెలుస్తుంది అని అర్థం. 'సామాన్యాని' ఇత్యాది శాస్త్రీయన్యాయం ఉంది కదా?

"సామాన్యాని = పదాలచేత బోధించబడిన పదార్థరూపాలైన అర్థాలు, అన్యథా = విశేషాల బోధలేనిచో, అసిద్ధేః = క్రియాదులతో అన్వయం కుదరదు కాబట్టి, విశేషమ్ = పరస్పరాన్వయరూపవిశేషాన్ని, గమయన్తి హి = తెలుపుతాయి కదా" అని దీని అర్థం.

పూర్వపక్షి చెప్పినట్లు ఇక్కడ లక్షణ కుదరదు అని ప్రతిపాదిస్తున్నాడు - తత్రేతి. ఈవిధంగా తాత్పర్యశక్తికి విషయమైన (తత్ర) రెండవ కక్ష్యలో పదార్థాల పరస్పరాన్వయం మాత్రమే తెలుస్తుంది. ఆ అన్వయాన్ని పట్టి "సంచరించుము" అని విధి తప్ప మరేదీ (తిరగవద్దు అనే నిషేధం) తెలియదు. "గఙ్గాయాం ఘోషః" "సింహో వటుః" ఇత్యాదులలో "గంగ అనే ఆధారంమీద గొల్లపల్లె", "వటుడే సింహం" అని పదార్థాలకు పరస్పరాన్వయం చెప్పి వాక్యార్థం గ్రహించాలని ప్రయత్నించగానే యోగ్యత లేకపోవడంచేత, అనగా గంగకి ఘోషాధారతాయోగ్యత్వం, సింహవటువులకు అభేదం లేదు గాన, అన్వయమే ఏ విధంగా కుదరదో ఆ విధంగా ఇక్కడ "నువ్వు సంచరించడానికి అడ్డంగా ఉన్న కుక్కని సింహం చంపివేసింది; అందుచేత నీ సంచారానికి విఘ్నం కలిగించే కారణాలేవీ లేవు గాన నువ్వు సంచరించవచ్చు' అని అన్వయం చెప్పడానికి ఏ విధమైన అభ్యంతరమూ లేదు. అందుచేత ఇక్కడ ముఖ్యార్థబాధ ఉందని శంకించడానికి వీలు లేదు. అలాంటప్పుడు విపరీతలక్షణకి అవకాశం లేదు.

### లోచనం

భవతు వాసౌ; తథాపి ద్వితీయస్థానసంక్రాన్తా తావదసౌ న భవతి. తథాహి - ముఖ్యార్థబాధాయాం లక్షణాయాః ప్రక్లప్తిః. బాధా చ విరోధ ప్రతీతిరేవ. న చాత్ర పదార్థానాం స్వాత్మని విరోధః. పరస్పరం విరోధ ఇతి చేత్ - సోఽయం తర్హి అన్వయే విరోధః ప్రత్యేయః. న చాప్రతిపన్నే అన్వయే విరోధప్రతిపత్తిః. ప్రతిపత్తిశ్చ అన్వయస్య నాభిధాశక్త్యాః; తస్యాః పదార్థప్రతిపత్త్యుపక్షీణాయాః విరమ్యావ్యాపారాత్ ఇతి తాత్పర్యశక్త్యైవాత్ర అన్వయప్రతిపత్తిః.

### బాలానందిని

ముఖ్యార్థబాధ లేదు గాన లక్షణ అంగీకరించడానికి వీలు లేదు అని చెప్పి లక్షణను అంగీకరించినా కూడ దానిని రెండవ కక్ష్య అయిన తాత్పర్యశక్తికి సంబంధించినట్లు చెప్పకూడదు అని చెపుతున్నాడు - భవత్వితి - ఇది (లక్షణ) ఉంటే ఉండనీ; అయినా ఇది ద్వితీయస్థానానికి, అనగా ద్వితీయకక్ష్య అయిన తాత్పర్యవృత్తికి, సంబంధించింది కాజాలదు. ఎందువలన అనగా - ముఖ్యార్థానికి బాధ కలిగినప్పుడు కదా లక్షణను చెప్పేది? ముఖ్యార్థానికి బాధ అనగా ముఖ్యార్థానికి విరోధమే. ఈ శ్లోకంలోని పదాల అర్థాలకి తమయందు (ఆ అర్థాలతో ఆ అర్థాలకే) విరోధం లేదు.

తమతో తమకే విరోధం లేకపోయినా పరస్పరం, ఒక పదార్థంతో మరొక పదార్థానికి, విరోధం ఉంది అని అంటావా; అయితే ఈ విరోధం ఒకదానితో మరొకటి అన్వయించడంలో విరోధం అని చెప్పాలి. అయితే పరస్పరాన్వయం తెలియనప్పుడు విరోధప్రతీతి ఎలా కలుగుతుంది? పదార్థాల పరస్పరాన్వయజ్ఞానం అభిధాశక్తిచేత కలగదు కదా? ఎందుచేత ననగా ఆ అభిధాశక్తి పదార్థజ్ఞానం కలిగినవెంటనే క్షీణించిపోతుంది; అది కొంత సేపు ఆగి మళ్లీ పదార్థాల అన్వయాన్ని బోధించే ప్రసక్తి లేదు. అందుచేత అన్వయజ్ఞానం కలగాలంటే అది తాత్పర్యశక్తిచేతనే కలుగుతుంది. ఈ విధంగా అభిధావృత్తిచేత పదార్థాల జ్ఞానం మాత్రం కలిగే ప్రథమకక్ష్యలో ముఖ్యార్థానికి విరోధరూపమైన బాధ లేదు; ద్వితీయకక్ష్యలో తాత్పర్యవృత్తి చేత పదార్థాల పరస్పరాన్వయం కలగనే కలుగుతుంది. ఆ అన్వయజ్ఞానం కలిగినతరవాతనే ముఖ్యార్థబాధ ఉందా లేదా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. అందుచేత తాత్పర్యవృత్తిప్రవృత్తిరూప మైన రెండవ కక్ష్యలో లక్షణకి అవకాశం లేదు అని భావం.

### లోచనం

నన్వేవమ్ "అఙ్గుల్యగ్రే కరివరశతమ్" ఇత్యత్రాప్యన్వయప్రతీతిః స్యాత్? కిం న భవతి అన్వయప్రతీతిః దశదాడిమాదివాక్యవత్? కిం తు ప్రమాణాన్తరేణ సోఽన్వయః ప్రత్యక్షాదినా బాధితః ప్రతిపన్నోఽపి శుక్తికాయాం రజతమివేతి తదవగమకారిణో వాక్యస్యాప్రామాణ్యమ్. "సింహో మాణవకః" ఇత్యత్ర ద్వితీయకక్ష్యానివిష్టతాత్పర్యశక్తిసమర్పితాన్వయబాధకోల్లాసానన్తరం అభిధాతాత్పర్యశక్తిద్వయవ్యతిరిక్తా తావత్తృతీయైవ శక్తిః తద్బాధకవిధురీకరణనిపుణా లక్షణాభిధానా సముల్లసతి.

### బాలానందిని

అభిధాశక్తిచేత ఒక వాక్యంలోని పదాల అర్థాలు తెలిసిన వెంటనే తాత్పర్యశక్తి చేత ఆ అర్థాల పరస్పరాన్వయం తెలుస్తుంది అని చెప్పే పక్షంలో అసందర్భంగా ఉన్న భావాలు చెప్పే కొన్ని వాక్యాలలో కూడ పదార్థాల పరస్పరాన్వయం కలుగుతుం దని చెప్పవలసి వస్తుంది కదా అని ఆశంకించుకొని, ఎందుకు కలగదు? తప్పకుండా కలుగుతుంది అని అంగీకారరూపమైన సమాధానం చెపుతున్నాడు - నన్వేవమితి - ఇలాగైతే "వేలి చివర వంద ఏనుగు లున్నాయి" అనే వాక్యంలో కూడ అన్వయజ్ఞానం కలగాలి కదా? (ఇది ఆశంక). దీనికి సమాధానం -దశదాడిమాది వాక్యాలలో కలిగినట్లుగానే

"అఙ్గుల్యగ్రే" ఇత్యాదివాక్యాలలో కూడా అన్వయం ఎందుకు కలగదు? తప్పకుండా కలుగుతుంది. అయితే - ముత్యపు చిప్ప మీద కనబడిన వెండి క్షణాంతరంలో బాధించబడినట్లు, అక్కడ గ్రహించబడిన అన్వయం ప్రత్యక్షం మొదలైన ఇతరప్రమాణాలచేత బాధింపబడిపోతుంది; అందుచేత ఆ అన్వయజ్ఞానం కలిగించిన వాక్యం ప్రమాణంగా గ్రహించబడదు.

సింహః ఇతి -"సింహో మాణవకః" అనే చోట ద్వితీయకక్ష్యకి సంబంధించిన తాత్పర్యశక్తి ద్వారా ఇవ్వబడిన (లభించిన) అన్వయానికి బాధకం స్ఫురించగానే (సింహం పిల్లవాడూ ఇద్దరూ ఒక్కరే అనేది కుదరదు అనే జ్ఞానం కలగగానే) ఆ బాధజ్ఞానాన్ని తొలగించ గలిగిన 'లక్షణ' అనే మరొక శక్తి పనిచేయడం ప్రారంభిస్తుంది. అది అభిధా - తాత్పర్యశక్తులకంటె భిన్నమైన మూడవ శక్తి.

వివరణ. అకాంక్ష, యోగ్యత మొదలైనవి లేకపోతే ఏవో కొన్ని పదాలు ఒక చోట పోగుగా చేర్చినంతమాత్రాన సరియైన వాక్యార్థం ఏదీ రాదు అని చెప్పడానికి మహాభాష్యంలో (1.2.45) "దశ దాడిమాని, షడపూపాః, కుణ్డమ్, అజాజినమ్, పలలపిణ్డః, అధరోరుకమేతత్ కుమార్యాః, స్ఫ్యైకృతస్య పితా ప్రతిశీనః" అనే వ్యర్థపదసముదాయం ఉదాహరణంగా చూపబడింది. "పది దానిమ్మపళ్లు; ఆరు అప్పాలు; అగ్నికుండం; మేకతోలు, మాంసం ముద్ద; కుమారి అధోవస్త్రం; స్ఫ్యైకృతుని తండ్రి ఎదురుకోలు ఇవ్వబడ్డాడు" అని వీటి అర్థాలు. అన్నీ కలిపితే వాక్యార్థం ఏదీ లేదు. అయితే చివరికి తేలే ప్రామాణికమైన వాక్యార్థం లేకపోయినా ఈ మాటలలో (రెండేసి ఉన్నచోట) అన్వయం ఉండనే ఉంది కదా? అలాగే 'అంగుల్యగ్రే' ఇత్యాదివాక్యంలో కూడా తాత్పర్యవృత్తిచేత అన్వయం ఏర్పడుతుంది. ప్రమాణాంతరంచేత ఈ వాక్యార్థం అప్రమాణం అయితే అది వేరే విషయం అని భావం.

## లోచనం

నన్వేవం "సింహో వటుః" ఇత్యత్రాపి కావ్యరూపతా స్యాత్; ధ్వననలక్షణస్య ఆత్మనః అత్రాపి సమనన్తరం వక్ష్యమాణతయా భావాత్? నను ఘటేఽపి జీవవ్యవహారః స్యాత్, ఆత్మనో విభుత్వేన తత్రాపి భావాత్? శరీరస్య ఖలు విశిష్టాధిష్ఠానయుక్తస్య సత్యాత్మని జీవవ్యవహారః, న యస్య కస్యచిదితి చేత్? గుణాలఙ్కారౌచిత్యసున్దరశబ్దార్థశరీరస్య సతి ధ్వననాఖ్యాత్మని

కావ్యరూపతావ్యవహారః. న చాత్మనోఽసారతా కాచిదితి చ సమానమ్. న చైవం భక్తిరేవ ధ్వనిః; భక్తిర్హి లక్షణావ్యాపారః తృతీయకక్ష్యానివేశీ - చతుర్థ్యాం తు కక్ష్యాయాం ధ్వననవ్యాపారః. తథాహి - త్రితయసంనిధౌ లక్షణా ప్రవర్తతే ఇతి తావద్భవన్త ఏవ వదన్తి. తత్ర ముఖ్యార్థబాధా తావత్ ప్రత్యక్షాది-ప్రమాణాన్తరమూలా. నిమిత్తం చ యదభిధీయతే సామీప్యాది తదపి ప్రమాణాన్తరావగమ్యమేవ.

బాలానందిని

నన్వితి (ఆశంక) అర్థాంతరాన్ని ధ్వనింపచేయడం అనే ఆత్మ ఉంది అని ఇప్పుడే చెప్పబోతున్నావు కదా? అందుచేత "సింహో వటుః" ఇత్యాదిలక్షణావృత్తి సహితాలైన వాక్యాలు కూడా కావ్యాలు కావాలి కదా? ప్రతిబందితో సమాధానం చెపుతున్నాడు (అడిగిన ప్రశ్నకి సూటిగా సమాధానం చెప్పకుండా అలాంటి ఎదురు ప్రశ్న వేసి సమాధానం చెప్పడానికి "ప్రతిబన్ద్యా సమాధానమ్" అని పేరు. అలాంటి ఎదురు ప్రశ్న 'ప్రతిబంది') ఆత్మ సర్వవ్యాపి అవడంచేత ఘటంలో కూడా ఆత్మ ఉంటుంది కదా? అందుచేత ఘటాన్ని కూడా 'జీవుడు' అనాలి కదా? (దీనికి మొదటివాని సమాధానం) - విశిష్టమైన కరచరణాద్యవయవాలు ఇంద్రియాలు ఉన్న శరీరాన్నే, దానిలో ఆత్మ ఉన్నప్పుడు జీవుడు అని వ్యవహరిస్తాం కాని, ఆత్మతో సంబంధం ఉన్న ప్రతీవస్తువునూ జీవుడు అనం అని సమాధానం చెపుతావా - అలా అయితే గుణాలు, అలంకారం, ఔచిత్యం వీటితో సుందరమైన శబ్దార్థరూపశరీరం ఉన్నదానినే ధ్వననం అనే ఆత్మ ఉంటే కావ్యం అని వ్యవహరించాలి అని మా సమాధానం. ఆత్మ అనేది మాత్రం ఏ నాటికీ సారరహితం కాదు అనే విషయం ఉభయత్రా సమానమే.

న చైవమితి - ఇలా చెప్పడంవల్ల భక్తియే ధ్వని అనకూడదు. భక్తి అనేది లక్షణావ్యాపారం. ఇది మూడవకక్ష్యతో సంబంధించినది. నాల్గవ కక్ష్యలో వచ్చే వ్యాపారం ధ్వనన వ్యాపారం. ఎందుచేత ననగా ముఖ్యార్థబాధ, నిమిత్తం (ముఖ్యార్థంతో సంబంధం), ప్రయోజనం అనేవి మూడు ఉన్నప్పుడే లక్షణ ప్రవర్తిస్తుంది అని మీరే అంటున్నారు కదా? ఆ మూడింటిలో ముఖ్యార్థబాధ అనేది ప్రత్యక్షం మొదలైన ఇతరప్రమాణాలచేత తెలియదగినది. సామీప్యం మొదలైనది నిమిత్తం అని ఏది అంటున్నారో అది కూడా ఇతర ప్రమాణాలచేత తెలియదగినదే.

లోచనం

యత్త్విదం ఘోషస్య అతిపవిత్రత్వశీతలత్వసేవ్యత్వాదికం ప్రయోజనమ్ అశబ్దాన్తరవాచ్యం, ప్రమాణాన్తరాప్రతిపన్నం, వటోర్వా పరాక్రమాతిశయశాలిత్వం, తత్ర శబ్దస్య న తావన్న వ్యాపారః. తథాహి - తత్సామీప్యాత్తద్ధర్మత్వానుమానమనైకాన్తి కమ్, సింహశబ్దవాచ్యత్వం చ వటోః అసిద్ధమ్, అథ 'యత్ర యత్ర ఏవం శబ్దప్రయోగః తత్ర తత్ర తద్ధర్మయోగః' ఇత్యనుమానమ్. తస్యాపి వ్యాప్తిగ్రహణకాలే మౌలికం ప్రమాణాన్తరం వాచ్యమ్, న చాస్తి. న చ స్మృతిరియమ్. అననుభూతే తదయోగాత్. నియమాప్రతీతేః వక్తుః ఏతద్వివక్షితమ్ ఇత్యధ్యవసాయాభావప్రసంగా చ్చేతి అస్తి తావదత్ర శబ్దస్యైవ వ్యాపారః. వ్యాపారశ్చ నాభిధాత్మా, సమయాభావాత్, న తాత్పర్యాత్మా, తస్యాన్వయప్రతీతావేవ పరిక్షయాత్. న లక్షణాత్మా ఉక్తాదేవహేతోః స్ఖలద్గతిత్వాభావాత్. తత్రాపి హి స్ఖలద్గతిత్వే పునర్ముఖ్యార్థ బాధా, నిమిత్తం, ప్రయోజనమ్ ఇత్యనవస్థా స్యాత్. అత ఏవ యత్ కేనచిత్ లక్షితలక్షణేతి నామ కృతం తద్ వ్యసనమాత్రమ్, తస్మాత్ అభిధాతాత్పర్య లక్షణావ్యతిరిక్తః చతుర్థోఽసౌ వ్యాపారః ధ్వనన-ద్యోతన - వ్యఞ్జన - ప్రత్యాయన - అవగమనాదిసోదరవ్యపదేశనిరూపితః అభ్యుపగన్తవ్యః. యద్వక్ష్యతి -

ముఖ్యాం వృత్తిం పరిత్యజ్య గుణవృత్త్యార్థదర్శనమ్,
యదుద్దిశ్య ఫలం తత్ర శబ్దో నైవ స్ఖలద్గతిః." (ధ్వన్యా.1.20) ఇతి.

బాలానందిని

యత్త్వితి :- గొల్లపల్లె అతిపవిత్రమైనది, చల్లగా ఉంది, సేవించదగి ఉంది ఇత్యాదికమైన ప్రయోజనం ("గంగాయాం ఘోషః" అనే లక్షణాస్థలంలో) తెలియబడుతూన్నది. దీన్ని (పై వాక్యమే తప్ప) మరొక శబ్దం ఏదీ బోధించడం లేదు. ఇది ఇతరప్రమాణాలు వేటిచేతా కూడా తెలియడం లేదు. అదేవిధంగా వటువు యొక్క పరాక్రమాతిశయశాలిత్వరూపమైన ప్రయోజనం కూడ. ఈ ప్రయోజనాన్ని బోధించడానికి శబ్దానికి వ్యాపారం లేదనే మాట లేదు అనగా ఈ ప్రయోజనాలు కూడా శబ్దవ్యాపారంచేతనే బోధించబడుతున్నాయి.

తథాహి ఇతి :- ఎందుచేతననగా దానికి దగ్గరగా ఉండడంవల్ల దాని ధర్మాలు దీనికీ ఉంటాయి అనే అనుమానం అనైకాంతికం, వ్యభిచారదోషదుష్టం. అనగా "తీరం గఙ్గాగతాతిపవిత్రత్వాదిధర్మవత్, గఙ్గాసామీప్యాత్, మునిజనాదివత్" (గంగలో ఎలాంటి పవిత్రత్వాది ధర్మాలున్నాయో అలాంటి ధర్మాలు గంగాతీరంలో ఉంటాయి; ఎందువల్ల ననగా అది గంగకు దగ్గరగా ఉంది. ఉదాహరణకి మునిజనాదుల వలె) అని అనుమాన ప్రయోగం దోషరహితం కాదు. ఎందుచేతననగా గంగ దగ్గరనే ఉన్న మనిషి పుర్రెలలో వ్యభిచారం. అవి గంగ దగ్గరనే ఉన్నా అపవిత్రాలే కదా?

సింహేతి :- వటువుకు సింహశబ్దవాచ్యత్వం కూడా అసిద్ధమే. అనగా "వటుః సింహధర్మవాన్, సింహశబ్దవాచ్యత్వాత్, సంప్రతిపన్న సింహవత్" (వటువులో సింహధర్మాలన్నీ ఉన్నాయి; ఎందుచేత ననగా అతడు సింహశబ్దం చేత వాచ్యుడు - అభిధయా బోధించబడుతున్నాడు, ఉదాహరణకి అందరికీ తెలిసి అంగీకరించిన సింహం వలె) అనే అనుమానం కూడా దుష్టమే. సింహ శబ్దవాచ్యత్వం అనే హేతువే లేదు కదా ?

అథ ఇతి :- "యత్ర యత్ర ఏవం శబ్దప్రయోగః తత్ర తత్ర తద్ధర్మయోగః" (ఎక్కడైతే ఇలాంటి లాక్షణికశబ్దాలు ప్రయోగిస్తారో అక్కడల్లా దాని ధర్మాల సంబంధం ఉంటుంది. అని పైరెండు ఉదాహరణలకీ వర్తించే వ్యాప్తితో కూడిన హేతువును కూడా చెప్పడం కుదరదు.

వివరణ. "యత్ర యత్ర ధూమః తత్ర తత్ర వహ్నిః" - "ఎక్కడెక్కడ ధూమం ఉంటుందో అక్కడల్లా నిప్పు ఉంటుంది" అనేది వ్యాప్తి. వ్యాప్తిని పట్టి అనుమాన ప్రయోగాలు ఈ విధంగా చేయవచ్చు "తటః గఙ్గాశబ్దవాచ్యవృత్తిధర్మవాన్; లక్షణయా గఙ్గాశబ్దప్రయోగవిషయత్వాత్" "వటుః సింహశబ్దవాచ్యవృత్తిధర్మవాన్; లక్షణయా సింహశబ్దప్రయోగవిషయత్వాత" "యః లక్షణయా యత్పదప్రయోగవిషయః సః తత్పదవాచ్యవృత్తిధర్మవాన్" (తీరంలో గంగాశబ్దవాచ్యమైన గంగలో ఏ ధర్మాలు ఉంటాయో అవి ఉన్నాయి; ఎందుచేత ననగా లక్షణచేత గంగాశబ్దాన్ని దీని విషయంలో ప్రయోగిస్తున్నాం. వటువులో సింహశబ్దవాచ్యమైన సింహంలో ఏ ధర్మాలుంటాయో ఆ ధర్మాలున్నాయి; ఎందుచేత ననగా లక్షణచేత సింహశబ్దాన్ని ఈ వటువు విషయంలో ప్రయోగిస్తున్నాం; లక్షణచేత దేని విషయంలో ఏ పదం ప్రయోగిస్తామో ఆ పదంచేత వాచ్యమైన దానిలో ఉండే ధర్మాలు దానిలో ఉండాలి అని ఏటి అర్థం)

తస్యాపీతి :- (ఈ విధంగా చెప్పడం యుక్తం కాదు) ఎందుచేత ననగా ఈ అనుమానప్రయోగానికి తగిన వ్యాప్తిని గ్రహించడానికి మౌలికంగా (ప్రారంభంలో) ఏదైనా ఒక ప్రమాణం ఉండాలి కదా? అలాంటి దేదీ లేదు.

వివరణ. వంటిల్లు మొదలైన ప్రదేశాలలో ధూమం ఉన్న చోటల్లా అగ్ని ఉండడం ప్రత్యక్షంగా చూచి ఆ ప్రత్యక్షప్రమాణాన్ని ఆధారంగా చేసికొని "యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః" అని వ్యాప్తిని ఏర్పరచుకొంటారు కదా? ఇక్కడ చెప్పిన వ్యాప్తిని ఏర్పరచుకోవడానికి మౌలికమైన ప్రమాణం ఏదీ లేదు; అందుచేత ఈ వాదం యుక్తం కాదు.

న చేతి:- పోనీ ఇది స్మృతి అందామా అంటే అదీ కుదరదు. పూర్వం అనుభవించి ఉన్నదానినే కదా స్మరించడం అనేది జరుగుతుంది? నియామకేతి - మరొకవిషయం ఏమిటంటే ఇక్కడ ఇదే ప్రయోజనం అని చెప్పాలి అనే నియమించేది ఏదీ లేదు గాన వక్త చెప్పదలచుకొన్నది ఇదే అని నిశ్చయించడం కూడా కుదరదు. ఈ కారణంచేత ఇతర ప్రమాణాదులేవీ ప్రయోజనాన్ని బోధించ జాలవు అని భావం. అందుచేత ప్రయోజనాన్ని తెలపడం విషయంలో శబ్దవ్యాపారం మాత్రమే ఉంది. అనగా ప్రయోజనం కూడా శబ్దవ్యాపారంచేతనే తెలియాలి. ఈ శబ్దవ్యాపారం అభిధ అవడానికి వీలులేదు; సంకేతం లేదు కదా? తాత్పర్యరూపవ్యాపారం కూడా కాదు; అన్వయాన్ని బోధించడంతో అది క్షీణించి పోయింది. లక్షణారూపమైన వ్యాపారం కూడా కాదు; వెనుక చెప్పిన ముఖ్యార్థబాధాదిహేతువువల్ల స్ఖలద్గతిత్వం లేదు కదా.

వివరణ. ' గఙ్గాయాం ఘోషః' అనే ఉదాహరణలో గంగాప్రవాహరూప ముఖ్యార్థాన్ని తీసికొని గంగాప్రవాహంలో ఘోషం ఉన్నది అని చెప్పడానికి వీలు లేకపోయింది. ప్రవాహంలో ఘోషం ఉండదు గాన ప్రవాహరూపార్థాన్ని బోధించడంలో గంగాశబ్దం కుంటు పడింది. స్ఖలద్గతి అయింది. అందుచేత ప్రవాహం అనే అర్థం విడిచి వేసి తీరం అనే అర్థాన్ని చెప్పవలసివచ్చింది. ఇప్పుడు పావనత్వాద్యర్థం చెప్పవలసి వచ్చినవుడు గంగాశబ్దం స్వార్థాన్ని విడవవలసిన వని లేదు. గంగాప్రవాహరూపార్థానికీ పావనత్వాదికానికీ విరోధం (బాధ) లేదు కదా. పావనత్వాదికం గంగలో ఉంటుంది కదా? అందుచేత లక్షణకు మూలమైన స్వార్థబాధ లేదు గాన ప్రయోజనాన్ని కూడా లక్షణావృత్తిచేతనే చెప్పవచ్చు అనేది కుదరదు.

తత్రాపీతి -: పావనత్వాదిరూపార్థబోధనం విషయంలో కూడా గంగాశబ్దం స్ఖలద్గతియే అని చెప్పే పక్షంలో, అనగా పావనత్వాదిరూపార్థాన్ని లక్షణయా చెప్పాలి అనే

పక్షంలో, మళ్ళీ ఈ లక్షణకోసం ముఖ్యార్థబాధ, నిమిత్తం, ప్రయోజనం అనే హేతుత్రయాన్ని అంగీకరించవలసి వస్తుంది. ఈ రెండవ లక్షణలోని ప్రయోజనం కూడా మరొక లక్షణచేత తెలుస్తుంది అని చెప్పవలసివస్తుంది. ఈ విధంగా లక్షణలకి ఒక అంతం అనేది ఉండదు గాన అనవస్థాదోషం ఏర్పడుతుంది. అత ఏవేతి- ఈ కారణంవల్లనే దీనికి ఒకడు "లక్షితలక్షణ" (అనగా గంగాశబ్దంచేత లక్షణావృత్తిచేత తీరరూపార్థం చెప్పిన తరవాత మళ్ళీ మరొక లక్షణచేత ప్రయోజనరూపార్థం బోధించబడుతుంది) అని పేరు పెట్టడం కేవలం వ్యసనం మాత్రమే. ఏదో పేరు పెట్టాలని పెట్టడం మాత్రమే, (నిజానికి ప్రయోజనరూపార్థాన్ని బోధించేది ధ్వనియే అని అర్థం). తస్మాదితి - అందువల్ల అభిధా- తాత్పర్య-లక్షణలకంటె భిన్నమైన ఈ నాల్గవ వ్యాపారాన్ని అంగీకరించాలి. ఈ వ్యాపారమే ధ్వననం, ద్యోతనం, వ్యఞ్జనం, ప్రత్యాయనం, అవగమనం, మొదలైన పర్యాయపదాలలో నిర్దేశం చేయబడుతుంది. అందుచేతనే "ముఖ్యాంవృత్తిమ్" (ధ్వన్యా 1.20) ఇత్యాదికారికలో ఈ విషయము చెప్పబోతున్నాడు.

వివరణ. "ఉక్తాదేవ హేతోః స్ఖలద్గతిత్వాభావాత్" లోని "ఉక్తాదేవహేతోః" అనేదాన్ని ఒక హేతువుగాను, "స్ఖలద్గతిత్వాభావాత్", అనేదాన్ని మరొక హేతువుగాను గ్రహించి అర్థం చెప్పవచ్చు. పైన చెప్పిన "నియమాప్రతిపత్తేః... ప్రసంగాచ్చ" అనే హేతువువల్ల అని కాని, "తాత్పర్యవృత్తి అన్వయప్రతీతి చేతనే క్షీణించినట్లు లక్షణ తీర ప్రతీతిలోనే క్షీణించింది" అని కాని "ఉక్తాదేవ హేతోః" అనే దానికి భావం. "స్ఖలద్గతిత్వాభావాత్" ఇత్యాదికానికి పూర్వోక్తార్థమే. ఈ సందర్భంలో కావ్యప్రకాశకారుడు చూపిన యుక్తులు మరొక విధంగా ఉన్నాయి. (చూ.కా.ప్ర.55-59 పేజీలు).

లోచనం

తేన సమయాపేక్షా వాచ్యావగమనశక్తిః అభిధాశక్తిః. తదన్యథానుపపత్తి సహాయార్థావబోధనశక్తిః తాత్పర్యశక్తిః. ముఖ్యార్థబాధాదిసహకార్యపేక్షార్థ ప్రతిభాసనశక్తిః లక్షణాశక్తిః. తచ్ఛక్తిత్రయోపజనితార్థావగమమూలజాత తత్ప్రతిభాసపవిత్రితప్రతిపత్తృప్రతిభాసహాయార్థద్యోతనశక్తిః ధ్వననవ్యాపారః, స చ ప్రాగ్వృత్తం వ్యాపారత్రయం న్యక్కుర్వన్ ప్రధానభూతః కావ్యాత్మేత్యాశయేన నిషేధప్రముఖతయా చ ప్రతీయమానవిషయోఽపి నిషేధవిషయ ఇత్యుక్తమ్. అభ్యుపగమమాత్రేణ చైతదుక్తమ్. న త్వత్ర లక్షణా; అత్యన్త తిరస్కారాన్యాసం

క్రమణయోరభావాత్. న హ్యర్థశక్తిమూలే అస్యా వ్యాపారః. సహకారిభేదాచ్చ శక్తిభేదః స్పష్ట ఏవ. యథా తస్యైవ శబ్దస్య వ్యాప్తిస్మృత్యాదిసహకృతస్య వివక్షావగతానుమాపకత్వవ్యాపారః, అక్షాదిసహకృతస్య వా వికల్పకత్వ వ్యాపారః, ఏవమ్ అభిహితాన్వయవాదినామ్ ఇయదనపహ్నవనీయమ్.

బాలానందిని

తేనేతి - అందుచేత సమయాన్ని (సంకేతాన్ని) అపేక్షించే వాచ్యార్థబోధశక్తి, అనగా సంకేతంమీద ఆధారపడి వాచ్యార్థాన్ని బోధించే శక్తి, అభిధాశక్తి. అభిధయొక్క అన్యథానుపపత్తి, అనగా పదార్థాల పరస్పరాన్వయం లేకుండా అభిధ ఒక్కటి మాత్రమే ఉండడంచేత ప్రయోజనం లేకపోవడం అనేది, సహాయంగా గల అర్థబోధనశక్తి తాత్పర్యశక్తి. ముఖ్యార్థబాధ మొదలైన సహకారుల అపేక్ష గల అర్థబోధనశక్తి లక్షణాశక్తి. ఆ మూడు శక్తుల వల్ల కలిగిన అర్థజ్ఞానం మూలాన కలిగిన ఆ వాచ్య- పరస్పరాన్విత - లక్ష్యార్థాల జ్ఞానంచేత పవిత్రితమైన జ్ఞాతలయొక్క ప్రతిభ సహాయంగా గల, అలాంటి వాళ్ల ప్రతిభను పట్టి మాత్రమే జరుగు, అర్థద్యోతనశక్తి, అర్థాన్ని సూచించే శక్తి, ధ్వననవ్యాపారం. అది ముందు ఉన్న (పని చేసిన) మూడు వ్యాపారాలనీ కూడ తిరస్కరిస్తూ, తనకంటె అప్రధానమైన వాటినిగా చేస్తూ, తాను ప్రధానమై కావ్యాత్మగా ఉంటుంది అనే అభిప్రాయంతో ప్రయోజనవిషయకమైనా కూడ నిషేధద్వారకం అవడంచేత నిషేధవిషయమైనది అని చెప్పబడింది.

వివరణ. భ్రమధార్మిక' ఇత్యాది శ్లోకంలో 'సంచరించుము' అని వాచ్యార్థం, ''సంచరించవద్దు'' అని ధ్వన్యమానార్థం అని వృత్తిలో చెప్పబడింది. కాని ఇంతవరకు జరిగిన చర్చను పట్టి సంచరించుము అనేది విపరీతలక్షణాగమ్యం అనీ, మరొకటి ఏదో ధ్వనించబడుతున్నదనీ చెప్పినట్లు స్పష్టం అవుతుంది. అందుచేత వృత్తిలో చెప్పిన నిషేధానికి వ్యంగ్యత్వం అసంగతం కదా అని ఆశంకకు సమాధానంగా 'నిషేధప్రముఖతయా' ఇత్యాదికం చెపుతున్నాడు. భ్రమణనిషేధం లక్షణాగమ్యమే. ఈ స్వైరిణి తన సంకేతస్థానాన్ని రక్షించుకొనడానికీ, స్వేచ్ఛగా విహరించడానికీ కోరుతున్నది అనేదే వ్యంగార్థం. పైన చెప్పిన ఈ ప్రయోజనం ధ్వనికి విషయం, అనగా ధ్వని ప్రతిపాద్యం. అయితే ఈ వ్యంగార్థం భ్రమణనిషేధం ద్వారా సాధించదగింది కాబట్టి వృత్తికారుడు ధ్వనికి విషయం నిషేధం అని చెప్పాడు. వాస్తవానికి ధ్వనివిషయం స్వైరవిహారాదికమే అని భావం.

అభ్యుపగమ్యేతి :- ఇంతకీ నిజానికి ఇక్కడ లక్షణ లేదు. ప్రౌఢివాదం మాత్రం చేత లేకపోయినా ఉందని అంగీకరించి ఇలా సమాధానం చెప్పాం. వాచ్యానికి అత్యంతతిరస్కారం, అన్యార్థసంక్రమణం ఉంటేనే లక్షణ చెప్పాలి. ఇక్కడ ఇవి లేవు గదా? అర్థమూలకమైన ధ్వనిలో లక్షణకి పని ఉండదు కదా? సహకారిభేదాన్ని పట్టి కూడ శక్తిభేదం స్పష్టంగా తెలుస్తూనే ఉంది. అనగా అర్థశక్తిమూలధ్వనికి వక్తృ-బోద్ధవ్యాదివైశిష్ట్యం సహకారి అయితే, లక్షణకి ముఖ్యార్థబాధాదికం సహకారి గాన ఆ శక్తి వేరు, ఈ శక్తి వేరు అని భావం.

ఈ విషయాన్ని దృష్టాంతం చూపి విశదీకరిస్తున్నాడు - యథా ఇతి. అర్థం బోధించడానికే ప్రయోగించిన "గామానయ" (గోవును తీసికొనిరా) అనే శబ్దం (వాక్యం) వ్యాప్తిస్మృత్యాదులతో సహకృతం అయినప్పుడు వివక్షను (ఈ వాక్యాన్ని ఉపయోగించినవాడు చెప్పదలచిన దానిని) తెలుసుకొనడం విషయంలో అనుమాపకం అంటున్నాం. అదే శబ్దం (వాక్యం) చక్షురింద్రియాది సహకృతం అయినప్పుడు వికల్పకం అంటున్నాం. ఈ విధంగా అభిహితాన్వయవాది అభిధాదివ్యాపారత్రయాతీతమైన ధ్వని అనే నాల్గవ వ్యాపారం లేదని కప్పిపుచ్చడానికి శక్యం కాదు.

వివరణ. ఎవరైనా ఒక వ్యక్తి "గామ్ అనయ" అన్న వాక్యం ప్రయోగించినప్పుడు అది విన్న పక్కవానికి వ్యాప్తిస్మృతి మొదలైనవి కలిగినప్పుడు, (పర్వతంమీద ఉన్న ధూమాన్ని చూడగానే "యత్ర యత్ర ధూమః తత్ర తత్రాగ్నిః" అనే వ్యాప్తి స్మరణకు వచ్చి "పర్వతో వహ్నిమాన్; ధూమాత్" అనే జ్ఞానం కలిగినట్లు) వాటి సహకారంవల్ల "అయం వక్తా ఏతద్వివక్షుః, ఏతచ్ఛబ్దప్రయోగాత్" (ఈ వక్త ఈ విషయం చెప్పదలచుకున్నాడు; ఈ పదాలు ప్రయోగించాడు కాబట్టి) అనే అనుమితి కలుగుతుంది. ఈ విధంగా ఆ శబ్దానికి వ్యాప్తిస్మృత్యాది సహకారంవల్ల అనుమాపకత్వశక్తి వచ్చింది. అదే విధంగా ఈ వాక్యం విన్న సమయంలో కంటితో చూడడం కూడా సంభవించినప్పుడు ఆ చక్షురింద్రియ సహకారం వల్ల సవికల్పకజ్ఞానం కలుగుతుంది. అనగా కేవలం ఆవు అన్నమాట విన్నంత మాత్రాన అదేదో ఒక ఆవు అనే జ్ఞానం కలుగుతుందే కాని అది నల్లగా ఉందా, తెల్లగా ఉందా, బలిసి ఉందా, బక్కచిక్కి ఉందా ఇత్యాదిజ్ఞానం కలగదు. దీనికి నిర్వికల్పకజ్ఞానం అని పేరు. ఈ విధంగా అదే శబ్దానికి ప్రత్యక్షాది సహకారం కలిగినప్పుడు వికల్పకత్వవ్యాపారం (శక్తి) కూడా ఏర్పడుతుంది. దీనిని పట్టి సహకారిభేదంవల్ల శక్తిభేదం కలుగుతుంది అని భావం.

లోచనం

యోఽప్యన్వితాభిధానవాదీ "యత్పరః శబ్దః స శబ్దార్థః" ఇతి హృదయే గృహీత్వా శరవదభిధావ్యాపారమేవ దీర్ఘదీర్ఘమిచ్ఛతి, తస్య యది దీర్ఘో వ్యాపారః తదా ఏకః అసౌ ఇతి కుతః? భిన్న విషయత్వాత్. అథానేకోఽసౌ, తద్విషయసహకారిభేదాదసజాతీయ ఏవ యుక్తః, సజాతీయే చ కార్యే విరమ్యవ్యాపారః శబ్దకర్మబుద్ధ్యాదీనాం పదార్థవిద్భిః నిషిద్ధః. అసజాతీయే చ అస్మన్నయ ఏవ.

బాలానందిని

య ఇతి - ఏ అన్వితాభిధానవాది "శబ్దం ఏ అర్థం ప్రధానంగా గలదో అదే దాని అర్థం" (శబ్దం ప్రధానంగా ఏ అర్థాన్ని బోధించడానికి ఉద్దిష్టం అయిందో అదే ఆ శబ్దానికి అర్థం) అని మనస్సులో పెట్టుకొని (అనే అభిప్రాయంతో) అభిధావ్యాపారమే, బాణవ్యాపారం వలె, అతిదీర్ఘమైనది - అనగా ఒక సమర్థుడైన ధానుష్కుడు ప్రయోగించిన బాణం ఒకే వ్యాపారం చేత (in one attempt only) ఎదుటివాని కవచాన్నీ, దాని లోపల ఉన్న చొక్కానీ, దానిలోపల చర్మాన్నీ, దాని లోపల మాంసాదుల్నీ (ఒకేదెబ్బలో) ఏ విధంగా చీల్చి వేస్తుందో అదే విధంగా అభిధావ్యాపారం చాలా దీర్ఘం అవడం చేత అక్కడ చెప్పవలసిన అర్థాలన్నింటినీ అదే బోధిస్తుంది - అని అంగీకరిస్తాడో ఆతని మతంలో వ్యాపారం దీర్ఘం అయిన పక్షంలో అది ఒకే వ్యాపారం అని చెప్పడం ఎట్లు? దాని విషయాలు వేరు వేరుగా ఉన్నాయి కదా? అలా కాదు; అది అనేకమే (అనేకవ్యాపారపరంపరయే) అని అంగీకరించిన పక్షంలో విషయాలు వేరు, సహకారులు వేరు అవడం చేత అది సజాతీయం కాదనే చెప్పాలి. అనగా వాచ్య-లక్ష్య-వ్యంగ్యాలని చెప్పబడే అర్థాలు (విషయాలు) వేరువేరైనవి. వాటికి సహకారులైన సంకేత-ముఖ్యార్థబాధాది-వక్త్రాదివైశిష్ట్యాదులు కూడా వేరువేరుగా ఉన్నాయి. అందుచేత వాటిని బోధించే వ్యాపారాలు కూడా సజాతీయాలు కాదు, వేరువేరు జాతికి చెందినవి అని చెప్పాలి. సజాతీయమైన కార్యం విషయంలో శబ్దకర్మబుద్ధ్యాదులకు పదార్థవేత్తలు విరమ్యవ్యాపారాన్ని నిషేధించారు. అనగా శబ్దం, కర్మ, బుద్ధి మొదలైనవి తాము చేయవలసిన కార్యాన్ని ఒకే వ్యాపారం చేత చేసివేసి వెనక్కి తప్పుకొంటాయి. కొంతసేపైన తరవాత మళ్లీ అటువంటి కార్యమే మరొకటి చేయడం అనేది వాటికి ఉండదు. ఉదాహరణకి 'ఘట' శబ్దం ఉందంటే అది అభిధావ్యాపారంచేత 'ఘటం'

అనే అర్థాన్ని బోధించి, కొంచెం సేపు అగి మళ్లీ అటువంటి అర్థాన్ని అదే వ్యాపారంచేత బోధించదు. మరొక వ్యాపారంచేత (లక్షణాదికంచేత) వెనుక బోధించిన అర్థానికి సజాతీయం కాని మరొక అర్థాన్ని (కుండలోని నీరు ఇత్యాద్యర్థాన్ని) బోధిస్తే బోధించవచ్చు. అదే విధంగా ఒక మారు పైకి లేచి చెట్టు కొమ్మమీద పడడం అనే వ్యాపారంచేత కొమ్మలో ఒక అంగుళం లోతుదాకా ఛేదించిన గొడ్డలి అదే వ్యాపారంచేత కొంతసేపు ఆగి మరొక అంగుళంలోతు దాకా ఛేదించజాలదు. అందుకు మళ్లీ మరొక క్రొత్త వ్యాపారం కావాలి. ఈ విధంగా నైయాయికాదులు శబ్దాదులకి సజాతీయకార్యం విషయంలో విరమ్యవ్యాపారాన్ని నిషేధించారు. ఈ విధంగా వాచ్యాద్యర్థాలన్నీ సజాతీయాలూ కావు, సజాతీయాలైనా వాటి నన్నింటినీ ఒకే వ్యాపారంచేత శబ్దం బోధించ జాలదు. వాచ్యాద్యర్థాలన్నీ సజాతీయాలు కావు, అసజాతీయాలే అని అంగీకరించావా అప్పుడు మా మతం, అనగా వాచ్యార్థాన్ని అభిధ, లక్ష్యార్థాన్ని లక్షణ, వ్యంగ్యార్థాన్ని ధ్వని అనే వేరువేరు వ్యాపారాలు బోధిస్తాయి అనే మతం అంగీకరించినట్లే.

లోచనం

అథ యోఽసౌ చతుర్థకక్షానివిష్టోఽర్థః స ఏవ ఝటితి వాక్యేనాభిధీయతే ఇత్యేవంవిధం దీర్ఘదీర్ఘత్వం వివక్షితం తర్హి సంకేతాకరణాత్ కథం సాక్షాత్ప్రతిపత్తిః. నిమిత్తేషు సంకేతః, నైమిత్తికస్తు అర్థః సంకేతానపేక్ష ఏవేతి చేత్ పశ్యత శ్రోత్రియస్య ఉక్తికౌశలమ్. యో హ్యసౌ పర్యన్తకక్షాభాగ్యర్థః ప్రథమం ప్రతీతిపథమవతీర్ణః, తస్య పశ్చాత్తనాః పదార్థావగమాః నిమిత్తభావం గచ్ఛన్తీతి నూనం మీమాంసకస్య ప్రపౌత్రం ప్రతి నైమిత్తికత్వమభిమతమ్!

బాలానందిని

దీర్ఘదీర్ఘవ్యాపారం అనగా ఒకే వ్యాపారం అని గాని, సజాతీయమైన వ్యాపారం అని కాని మా అభిప్రాయం కాదు; చెప్పదలచిన అర్థాన్ని వెంటనే చెప్పడం అనే విశేషమే మేం అనే వ్యాపార దీర్ఘత్వం అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు- **అథేతి**. నాల్గవ కక్ష్యకి చెందిన ఏ వ్యంగ్యార్థం ఉందో అది వాక్యంచేత వెంటనే (వాక్యం విన్న వెంటనే) భోధించబడుతుంది; మేం చెప్పదలచిన దీర్ఘదీర్ఘత్వం ఇదే అని చెప్పినట్లయితే - ఆ అర్థం (వ్యంగ్యార్థం) విషయంలో సంకేతం లేదు కదా? అలాంటప్పుడు వాక్యంవల్ల

ఆ అర్థం సాక్షాత్తుగా (నేరుగా) ఎలా తెలుస్తుంది? నిమిత్తాలయందే సంకేతం కావాలి కాని నైమిత్తికం అయిన ఈ వ్యంగ్యార్థం తెలియడానికి సంకేతం అవసరం ఉండదు అని అంటావా - ఆహా! చూడండి ఈ వేదపండితుని (ఛాందసుని) మాటల నేర్పు ఎలా ఉందో! చివరి కక్ష్యకి చెందిన ఏ వ్యంగార్థం వాక్యం విన్న వెంటనే జ్ఞానమార్గాన్ని పొందిందో (తెలిసిందో) దానికి తరవాత కలిగే పదార్థజ్ఞానాలు నిమిత్తాలట! ఈ విధంగా ఈ మీమాంసకుడు తన ప్రపౌత్రుడికి తాను నైమిత్తికుణ్ణి అని అంగీకరిస్తున్నాడు!

వివరణ. వాక్యం వినగానే వ్యంగార్థం స్ఫురిస్తుంది. మేం చెప్పే వ్యాపారదీర్ఘత్వం ఇదే అని అన్వితాభిధానవాది అయిన మీమాంసకుడు అన్నాడు. వ్యంగ్యార్థం విషయంలో ఆ వాక్యానికి సంకేతం లేదు కదా? అలాంటప్పుడు ఆ వాక్యం వ్యంగ్యార్థాన్ని ఎలా బోధిస్తుంది అని సిద్ధాంతి ప్రశ్నిస్తాడు. దీనికి సమాధానంగా - వ్యంగ్యార్థజ్ఞానానికి పదార్థాల జ్ఞానం నిమిత్తం, వ్యంగ్యార్థం నైమిత్తికం. పదార్థజ్ఞానం కలగడానికి సంకేతం ఉండాలి కాని నైమిత్తికమైన వాక్యార్థం (వ్యంగ్యార్థం) తెలియడానాకి సంకేతం అవసరం లేదు అని మీమాంసకుడు సమాధానం చెప్పాడు. ఇలా అన్నందుకు పరిహాసపూర్వకంగా ఆక్షేపిస్తూ సిద్ధాంతి - చూడండి ఈ శ్రోత్రియుని తెలివి! వాక్యం విన్న వెంటనే నాల్గవ కక్ష్యకి చెందిన వ్యంగ్యార్థం ముందుగా తెలిసిపోతుందట; తరవాత కలిగే పదార్థాల జ్ఞానం దీనికి నిమిత్తం అట. దీన్ని పట్టి నా ప్రపౌత్రుడికి నేను నైమిత్తికుణ్ణి అనగా నాకు నా ప్రపౌత్రుడు కారణం. అని చెప్పినట్లవుతుంది కదా! అని అంటాడు. ఏ శాస్త్రగ్రంథం తీసినా ఆ గ్రంథరచయిత తాను ప్రతిపాదించే సిద్ధాంతానికి విరుద్ధంగా ఉన్న ఇతర శాస్త్రగ్రంథస్థవిషయాలతో పాటు, ఆ శాస్త్రకారు లెన్నడూ స్వప్నంలో కూడా చెప్పని కొన్ని విషయాలు కూడా కల్పించి వాటిని పరిహాసపూర్వకంగా ఖండిస్తూంటాడు. ఇది చూడగానే ఈ గ్రంథం చదివేవాళ్లు, "పాపం ఆ గ్రంథరచయితలు ఈ మాత్రం కూడా తెలియని దద్దమ్మలు కాబోలు" అనిపించి, "ఆహా! మా శాస్త్రం ఎంత గొప్పది" అని మురిసిపోతూ ఉంటారు. ఇది దార్శనికగ్రంథాలలో ఎక్కుగా కనబడుతుంది. పరమమాహేశ్వరుడైన అభినవగుప్తుడు కూడా గొప్ప దార్శనికుడు. అందుచేత ఈయన అడుగడుగునా ఇతరశాస్త్రకారుల విషయంలో ఇలాంటి పరిహాసోక్తులు, ఛలోక్తులు, విసురుతూ ఉంటాడు. తావన్మాత్రంచేత ఆ మీమాంసకాదులు ఏమీ తెలియని వెఱ్ఱి ఛాందసులని ఎవరూ అనుకోకూడదు. ఆ గ్రంథాలు కూడా చదివి మంచి చెడ్డలు స్వయంగా అర్థం చేసుకొనే అలవాటున్నవాళ్లకి ఈ ప్రమాదం ఉండదు.

లోచనం

అథోచ్యతే - పూర్వం తత్ర సంకేతగ్రహణసంస్కృతస్య తథా ప్రతిపత్తిః భవతీతి అముయా వస్తుస్థిత్యా నిమిత్తత్వం పదార్థానామ్, తర్హి తదనుసరణోపయోగి న కించిదపి ఉక్తం స్యాత్. న చాపి ప్రాక్పదార్థేషు సంకేతగ్రహణం వృత్తమ్; అన్వితానామేవ సర్వదా ప్రయోగాత్. ఆవాపోద్వాపాభ్యాం తథా ప్రయోగ ఇతి చేత్, సంకేతః పదార్థమాత్ర ఏవేత్యభ్యుపగమే పాశ్చాత్త్యైవ విశేషప్రతీతిః.

బాలానందిని

పదార్థజ్ఞానం తరవాత జరిగినా పదార్థాలను గూర్చిన సంకేతం ముందుగానే కలిగి ఉంది కాబట్టి, అటువంటి సంకేతగ్రహణాన్ని పురస్కరించుకొని పదార్థాలు వాక్యార్థజ్ఞానానికి నిమిత్తం అని చెప్పడంలో తప్పేమీ లేదు. సంకేతజ్ఞానం ఉన్న జ్ఞాత "గఙ్గాయాం ఘోషః"అనే వాక్యాన్ని విన్న వెంటనే శైత్యం, పావనత్వం మొదలైన చివరి అర్థాన్ని గ్రహిస్తున్నాడు కదా అని ఆశంకను లేవదీసి పరిహరిస్తున్నాడు- **అథోచ్యతే ఇత్యాది** - పదార్థాల విషయంలో ముందుగానే ఉన్న సంకేతజ్ఞానం సంస్కారం మనస్సులో ఉన్నవానికి, వ్యంగ్యార్థం అని చెప్పబడే చివరి అర్థంయొక్క జ్ఞానం కలుగుతున్నది. ఈ వాస్తవికపరిస్థితిని పురస్కరించుకొని పదార్థాలు ఆ పార్యంతికార్థజ్ఞానానికి నిమిత్తం అని అనవచ్చు. కదా అని కూడా అనడానికి వీలు లేదు. పదార్థాలు పార్యంతికార్థప్రతీతికి నిమిత్తాలు ఏ విధంగా అవుతాయో ఏమీ నిమిత్తం చెప్పలేదు కదా? అనగా సంకేతం గ్రహించినవానికి అభిధాశక్తిచేత సంకేతితపదార్థాల జ్ఞానం కలగవచ్చును, కాని సంకేతితం కాని పార్యంతికార్థంయొక్క జ్ఞానం పదార్థసంకేతం వల్ల ఎల్లా కలుగుతుందో తగిన కారణం ఏమీ మీరు చెప్పలేకపోతున్నారు కదా అని భావం.

**న చాపీతి** - మరొక విషయం ఏమనగా- మీ మతం ప్రకారం ముందుగా పదార్థాల విషయంలో సంకేతగ్రహణం కూడా జరగలేదు. ఇతరపదాల అర్థాలతో అన్వయించే పదాలనే వాక్యంలో ప్రయోగిస్తారు కాబట్టి సంకేతం కేవలపదార్థాల విషయంలో కాదు, ఇతరపదార్థాలలో అన్వయించిన పదార్థాల విషయంలోనే అని కదా మీ మతం? ఆవాపోద్వాపాలచేత, అనగా ఒకపదం తీసివేసి మరొక పదం చేర్చడం, దాన్ని తీసివేసి మళ్లీ మొదటిదాన్ని చేర్చడం ఈ విధమైన ప్రక్రియ చేత, వేరు వేరు పదార్థాల

విషయంలో కూడా సంకేతం సిద్ధిస్తుంది అని అంటారా? అలా అనే పక్షంలో విశేషజ్ఞానం, అనగా వాక్యార్థజ్ఞానం, వాక్యం విన్నవెంటనే కలగక పదార్థజ్ఞానానంతరమే జరుగుతుంది; ఇది మీ మతానికి విరుద్ధం కాదా అని భావం.

లోచనం

అథోచ్యతే- దృష్టైవ ఝటితి తాత్పర్యప్రతిపత్తిః, కిమత్ర కుర్మః ఇతి; తదిదం వయమపి న నాఙ్గీకుర్మః, యద్వక్ష్యామః-

తద్వత్సచేతసాం సోఽర్థో వాచ్యార్థవిముఖాత్మనామ్,

బుద్ధౌ తత్త్వావభాసిన్యాం ఝటిత్యేవావభాసతే." (ధ్వన్యా. 1.12) ఇతి. కింతు సాతిశయానుశీలనాభ్యాసాత్తత్ర సంభావ్యమానోఽపి క్రమః సజాతీయతద్వికల్ప పరమ్పరానుదయాత్ అభ్యస్తవిషయవ్యాప్తి సమయస్మృతి క్రమవత్ న సంవేద్యతే ఇతి నిమిత్తనైమిత్తికభావశ్చావశ్యాశ్రయణీయః, అన్యథా గౌణలాక్షణికయోః ముఖ్యాద్భేదః, "శ్రుతిలిఙ్గాదిప్రమాణషట్కస్య పారదౌర్బల్యమ్" ఇత్యాది ప్రక్రియావిఘాతః. నిమిత్తనైమిత్తికవైచిత్ర్యేణైవాస్యాః సమర్థితత్వాత్, నిమిత్తతావైచిత్ర్యే చాభ్యుపగతే కిమపరమస్మాసు అసూయయా.

యేఽప్యవిభక్తం స్ఫోటం వాక్యం తదర్థం చాహుః తైరప్యవిద్యా పదపతితైః సర్వేయమనుసరణీయా ప్రక్రియా. తదుత్తీర్ణత్వేతు సర్వం పరమేశ్వరాద్వయం బ్రహ్మేత్యస్మచ్ఛాస్త్రకారేణ న న విదితం తత్త్వాలోక గ్రన్థం విరచయతా ఇత్యాస్తామ్.

బాలానందిని

అథేతి :- (పదార్థసంకేతగ్రహణం నిమిత్తం అవునా కాదా అనే చర్చ మాట ఎలా ఉన్నా)- వాక్యం వినగానే తాత్పర్యజ్ఞానం కలుగుతున్నది; అందుకు మేం ఏమి చెయ్యాలి ? అంటారా ఈ విషయం మేం కూడా అంగీకరించం అనే మాట లేదు. అందుచేతనే "తద్వత్సచేతసామ్" ఇత్యాదికారికలో ఈ విషయమే చెప్పబోతున్నాం. పదార్థజ్ఞాన - పార్యంతికవ్యంగ్యార్థజ్ఞానాల మధ్య క్రమం ఉన్నా కూడ. (సహృదయుడు) ఎక్కువగా కావ్యానుశీలనం చేసి చేసి ఉండడం చేత సజాతీయాలైన, అనగా వాక్యార్థ ప్రతీతికి అంగం అవడంచేత సమానజాతీయాలైన, వాటి (పదార్థాల) వికల్పాల(జ్ఞానాల)

పరంపర భాసించక పోవడంవల్ల, బాగా అలవాటుపడ్డ విషయాలను గూర్చి వ్యాప్తిస్మృతి - సమయస్మృతుల క్రమం ఏ విధంగా గుర్తించబడదో అదే విధంగా గుర్తించబడడం లేదు. అందువల్ల నిమిత్త నైమిత్తిక భావాన్ని తప్పకుండా అంగీకరించాలి. అలా కాకపోతే "గౌణ-లాక్షణికార్థాలు ముఖ్యార్థంకంటె భిన్నమైనవి" "శ్రుతిలింగాది షట్ప్రమాణాలలో పారదౌర్బల్యం - మొదటిదానికంటె రెండవది దుర్బలం, దానికంటే మూడవది దుర్బలం ఇత్యాది విధంగా పరమైనవాటికి దౌర్బల్యం"- ఈ విధమైన ప్రక్రియకి భంగం వస్తుంది. ఈ భేదదౌర్బల్యాదుల్ని నిమిత్తత్వంలో ఉన్న వైచిత్ర్యాన్నే పట్టి సమర్థించడం జరిగింది కదా? ఈ విధంగా నిమిత్తతావైచిత్ర్యాన్ని తప్పకుండా అంగీకరించవలసి ఉన్నప్పుడు మీకు మేం అంటే ఎందుకు ఇంత కోపం?

వివరణ. పదార్థజ్ఞానానికీ, పార్యంతిక(చివరి) వాక్యార్థజ్ఞానానికీ మధ్య క్రమం లేక పోలేదు. తప్పకుండా ఉంది. అయినా నిరంతరం కావ్యానుశీలనం చేసేవాళ్ళు ఈ క్రమాన్ని గుర్తించకుండా వాక్యాన్ని విన్న వెంటనే వాక్యార్థాన్ని గ్రహించారన్నట్లు కనబడుతుంది కాని పదార్థాలు తెలిసిన తరవాతనే వాళ్లు వాక్యార్థం గ్రహిస్తున్నారు. 'ఘటః', 'పటః', 'తరుః' మొదలైన పదాలకి కుండ, బట్ట, చెట్టు అనే అర్థాల విషయంలో సంకేతం ఉంది అని తెలిసినవానికే ఈ పదాలు వినగానే ఈ అర్థాలు స్ఫురిస్తాయి. ఈయితే- ఈ పదాలు విన్న తరవాత "ఓహో! ఘటశబ్దానికి కుండ అనే అర్థంలో సంకేతం ఉంది కదా? అందుచేత దీనికీ అర్థం ఇది" అని ఒక క్షణం అలోచించి అతడు ఆ అర్థం గ్రహించడు. వెంటనే గ్రహిస్తాడు. తావన్మాత్రంచేత శబ్దశ్రవణానికి అర్థగ్రహణానికీ మధ్య సంకేతస్మృతి లేదనడానికి వీలు లేదు. అదే విధంగా దూరంగా ఉన్న పొగ చూచి అక్కడ నిప్పు ఉందని వెంటనే ఊహిస్తాడు. "యత్ర యత్ర ధూమః తత్ర తత్ర వహ్నిః" అనే వ్యాప్తిని గూర్చి అంతకుముందు తెలిసి ఉన్నవాడే ఆ విషయం ఊహించకలుగుతాడు. అనగా అక్కడ నిప్పు ఉంది అని తెలుసుకొనేటట్లుగా వానికి వ్యాప్తిస్మృతి కూడా కలిగిందనే అర్థం. అయినా శీఘ్రత్వంలో అది ఉన్నట్లు కనబడదు. ఈ విధంగా ఎక్కువ అలవాటులో ఉన్న విషయాలలో ధూమాదిహేతువుచేత గాని, శబ్దంచేత గాని జ్ఞానం కలిగేటప్పుడు వ్యాప్తిస్మృతీ, సమయస్మృతీ మధ్యలో ఉన్నా కూడ ఆ క్రమం ఏ విధంగా గుర్తించబడదో అట్లే ఇక్కడ కూడాను. అందుచేత నిమిత్త నైమిత్తిక భావం (పదార్థజ్ఞానం నిమిత్తం, పార్యంతిక వాక్యార్థజ్ఞానం నైమిత్తికం అని) అంగీకరించి తీరాలి. అలా అంగీకరించకపోతే గౌణలాక్షణికార్థాల జ్ఞానానికి ముఖ్యార్థబాధ నిమిత్తం గాన ముఖ్యార్థం మౌలికనిమిత్తం; అందుచేత వాటి మధ్య భేదం ఉంది అనీ, శ్రుతిలింగాదిమీమాంసకోక్త

ప్రమాణాలలో ముందువాటికంటె తరవాతవి దుర్బలాలైన వనీ చెప్పడం కుదరదు. నిమిత్తత్వంలో ఉన్న వైచిత్ర్యాన్నే పట్టి ఈ భేదదౌర్బల్యాదుల్ని స్థాపించడం జరిగింది కదా?

అభిధకే దీర్ఘదీర్ఘవ్యాపారం ఉందనే ఈ వాదాన్ని కావ్య ప్రకాశకారుడు కూడా చర్చించాడు. శ్రుతిలింగాదిస్వరూపతద్దౌర్బల్యాదులను గూర్చి సవిస్తరంగా మా కావ్యప్రకాశవ్యాఖ్యలో వివరించబ డింది (చూ 260-270 పేజీలు).

యే పేతి :- ఏ వైయాకరణులు, పారమార్థికదృష్టితో పరిశీలిస్తే వాక్యంలో పదవర్ణాదివిభాగా లేవీ ఉండ వనీ, అవిభక్తమైన స్ఫోటమే వాక్య మనీ, వాక్యార్థంలో కూడా విభాగాలేవీ లేవనీ అన్నారో వాళ్లు కూడా అవిద్యాపదంలో పడి ఉన్నప్పుడు, అనగా వ్యావహారికదశలో ఉన్నప్పుడు, పదం, పదార్థం, వాక్యం, వాక్యార్థం, అభిధాలక్షణావ్యంజనలు మొదలైన భేదాలన్నీ అంగీకరించవలసిందే. ఆ అవిద్యాదశను దాటిన పారమార్థికదశలో (తదుత్తీర్ణత్వే తు) అంతా పరమేశ్వరాద్వయమే; బ్రహ్మ ఒక్కటే పారమార్థికం, ఈ కాల్పనికభేదా లేవీ సత్యాలు కావు అనే విషయం 'తత్త్వావలోకం' అనే గ్రంథం రచించిన మా శాస్త్రకారుడికి (ఆనందవర్ధనాచార్యుడికి) తెలియకపోలేదు; సరే ఈ విషయం ఇంతటితో ఆపుదాం. ఇక్కడ సూచించిన వైయాకరణమతాన్ని గూర్చిన విస్తృతవివరణకు చూ. మా కావ్యప్రకాశవ్యాఖ్య. బాలానందిని 284-286 పేజీలు).

లోచనం

యత్తు భట్టనాయకేనోక్తమ్- ఇహ దృప్తసింహాదిపదప్రయోగే చ ధార్మిక ప్రయోగే చ భయానకరసావేశకృతైవ నిషేధావగతిః, తదీయభీరువీరత్వ ప్రకృతినియమావగమమన్తరేణ ఏకాన్తతో నిషేధావగత్యభావాత్ ఇతి, తత్ న కేవలార్థసామర్థ్యం నిషేధావగతేః నిమిత్తమ్ ఇతి - తత్రోచ్యతే- కేనోక్తమేతత్ "వక్తృప్రతిపత్తృవిశేషావగమవిరహేణ, శబ్దగతధ్వననవ్యాపారవిరహేణ చ నిషేధావగతిః" ఇతి? ప్రతిపత్తృప్రతిభాసహకారిత్వం హి అస్మాభిః ద్యోతనస్య ప్రాణత్వేనోక్తమ్, భయానకరసావేశశ్చ న వర్జ్యస్య. తస్య భయమాత్రోత్పత్త్య భ్యుపగమాత్. ప్రతిపత్తుశ్చ రసావేశో రసాభివ్యక్త్యైవ. రసశ్చ వ్యఙ్గ్య ఏవ; తస్య శబ్దవాచ్యత్వం తేనాపి నోపగతమితి వ్యఙ్గ్యత్వమేవ. ప్రతిపత్తురపి రసావేశో న నియతః, న హ్యసౌ నియమేన భీరుధార్మిక సబ్రహ్మచారీ సహృదయః.

బాలానందిని

భట్టనాయకుడు ఈ సందర్భంలో చెప్పిన విషయాన్ని అనువదించి సమాధానం చెపుతున్నాడు - యత్తు ఇతి - భట్టనాయకుడు - "ఇక్కడ 'దృప్తసింహాదుది,' పదాలను ప్రయోగించడంలోను, 'ధార్మిక'పద ప్రయోగంలోను నిషేధం తెలియడానికి కారణం భయానకరసావేశమే; ఎందుచేత ననగా ఆ ధార్మికుడు భీరుస్వభావం గలవాడా, వీరస్వభావం గలవాడా అనే విషయం తప్పకుండా తెలిస్తే తప్ప (లేదా ఆతనికి భీరుత్వంతో అవినాభావసంబంధం ఉంది, లేదా వీరత్వంతో అవినాభావసంబంధం ఉంది అనే విషయం తెలిస్తే తప్ప నిషేధజ్ఞానం కలగదు కాబట్టి కేవలం అర్థసామర్థ్యం నిషేధజ్ఞానానికి నిమిత్తం కాదు" అని అన్నాడు. అనగా కేవలం అర్థసామర్థ్యాన్ని పట్టి నిషేధం తెలియదు; ఆ ధార్మికుడు పిరికివాడని తెలియడం ద్వారా భయానకరసం చేతనే నిషేధరూపార్థం తెలుస్తుంది. అతడు వీరుడైతే అక్కడికి వెళ్ళడం మానడు కదా అని భట్టనాయకుని అభిప్రాయం.

తత్రేతి :- ఈ విషయంలో చెపుతున్నాం - వక్తృప్రతిపత్తృవిశేషజ్ఞానం లేకుండా, శబ్దంలో ధ్వననవ్యాపారం లేకుండా నిషేధజ్ఞానం కలుగుతుంది అని ఎవరన్నారు? అనగా నిషేధరూపార్థం మాటలాడే వ్యక్తిని పట్టి, ఎవరితో అంటున్నారో అతని స్వభావాన్ని పట్టి, శబ్దంలో ఉన్న ధ్వనివ్యాపారాన్ని పట్టి మాత్రమే తెలుస్తుందని మేం అంగీకరించిన విషయమే అని భావం. ద్యోతనానికి (వ్యంజనానికి) గ్రహించేవాని ప్రతిభ సహకారిగా ఉంటూ దానికి ప్రాణమై నిలిచి ఉంటుంది అని మేం చెప్పాం కదా? ఇక్కడ భయానకరసావేశం వర్ణించబడే ధార్మికునికి కాదు; ఎందుచేత ననగా అతనికి భయం మాత్రమే కలుగుతుంది అని అంగీకరించబడింది.

వివరణ. భయానకరసావేశశ్చ న నివార్యతే" అన్నచోట న నివార్యతే కి బదులు "న వర్ణ్యస్య" అనే పాఠం యుక్తంగా ఉండడంచేత దానిని గ్రహించాం. "వక్తృ ప్రతిపత్తృవిశేషావగమవిరహేణ" అన్నచోట 'ప్రతిపత్తృశబ్దానికి బోద్ధవ్యుడు, ఎవరితో చెపుతున్నారో అతడు, అని అర్థం. "ప్రతిపత్తుశ్చ రసావేశః" లోని ప్రతిపత్తృశబ్దానికి సహృదయుడు అని అర్థం.

ప్రతిపత్తుశ్చ ఇతి :- సహృదయునికి భయానకరసావేశం రసాభివ్యక్తి ఉంటేనే కలుగుతుంది. రసం ఎప్పుడూ వ్యంగ్యమే. రసం స్వశబ్దవాచ్యం అని అతడూ (భట్టనాయకుడూ) అంగీకరించలేదు; అందుచేత అది వ్యంగ్యమే. అయితే ప్రతిపత్తకి (సహృదయుడికి) కూడా రసావేశం తప్పక ఉంటుందనడానికి వీలులేదు; ఎందుచేతననగా

ఈ సహృదయుడు తప్పకుండా పిరికివాడైన ఆ ధార్మికునితో సమానమైనవాడై ఉంటాడని చెప్పలేం. అనగా వర్ణ్యమానునితో హృదయసంవాదం లేనప్పుడు రసానుభూతి ఎలా కలుగుతుంది? అందుచేత ఇక్కడ భయానకరసావేశం ఉందనీ, తద్ద్వారా మాత్రమే నిషేధరూపార్థం తెలుస్తూన్న దనీ చెప్పడం యుక్తం కాదు అని భావం.

లోచనం

అథ తద్విశేషోఽపి సహకారీ కల్ప్యతే; తర్హి వక్తృప్రతిపత్తృ ప్రతిభాప్రాణితో ధ్వననవ్యాపారః కిం న సహ్యతే? కిం చ వస్తుధ్వనిం దూషయతా రసధ్వనిః తదనుగ్రాహకః సమర్థ్యత ఇతి సుష్ఠుతరాం ధ్వనిధ్వంసో ఽయమ్! యదాహ - "క్రోధోఽపి దేవస్య వరేణ తుల్యః" ఇతి. అథ రసస్యైవేయతా ప్రాధాన్యముక్తమ్? తత్ కో న సహతే? అథ వస్తుమాత్ర ధ్వనేరేతదుదాహరణం న యుక్త మిత్యుచ్యతే, తథాపి కావ్యోదాహరణత్వాత్ ద్వావప్యత్ర ధ్వనీ స్తః, కో దోషః?

బాలానందిని

**అథేతి**- ప్రతిపత్తయొక్క (సహృదయునియొక్క) భీరుత్వాదివిశేషంకూడా సహకారిగా ఉంటుందని కల్పించబడుతుంది అంటావా- అనగా ధార్మికు డే విధంగా భీరువో సహృదయుడు కూడా భీరువే; అందుచేత అతనిలో భయానకరసావేశం కలగవచ్చును కదా అని అంటావా - అట్లైతే (ఇలా కల్పించి భయానకరసావేశం ఉందని ఏదో విధంగా స్థాపించడానికి బదులు) వక్తృ - ప్రతిపత్తృ (బోద్ధవ్య) ప్రతిభలచేత జీవింపచేయబడే ధ్వననవ్యాపారం ఉందని ఎందుకు సహించవు? మరొక విషయం ఏమనగా నువ్వు ఇక్కడ వస్తుధ్వనిని దూషిస్తూ (అది లేదని చెపుతూ) దానికి అనుగ్రాహకమైన (వస్తు అలంకారధ్వనులకి కూడా చివరికి రసధ్వనియందే తాత్పర్యం అని మేం అంగీకరించి ఉండడంచేత రసధ్వని వస్తుధ్వనికి అనుగ్రాహకం అని భావం) రసధ్వనిని సమర్థిస్తున్నావు! ఆహా! నువ్వు చేసే ఈ ధ్వనిధ్వంస (ధ్వనినిరాకరణం) అద్భుతంగా ఉంది! "దేవుడి కోపం కూడా వరంవంటిదే" అన్నట్లుంది! ఇక్కడ రసానికే ప్రాధాన్యం ఉంది అని మాత్రమే మేం ఇంతవరకు చెప్పినదంతా అని అంటావా - దాన్ని ఎవరు సహించరు? అది మాకూ ఇష్టమే అని భావం. దీనిని వస్తుధ్వనికి మాత్రమే ఉదాహరణంగా చూపకూడదు, (దీనిలో రసధ్వని కూడా ఉంది కదా) అని అంటావా- అయినా కూడ ఇది కావ్యోదాహరణం అవడం వల్ల రెండు ధ్వనులూ కూడా ఉన్నాయి; దోషం ఏమిటి?

లోచనం

యది తు రసానువేధేన వినా న తుష్యతి, తత్ భయానకరసానువేధో నాత్ర సహృదయహృదయదర్పణ మధ్యాస్తే. అపి తు ఉక్తనీత్యా సంభోగాభిలాష విభావసంకేతస్థానోచిత విశిష్టకాక్వాద్యనుభావశబ్దలనోదితశృఙ్గారరసానువేధః, రసస్యాలౌకికత్వాత్, తావన్మాత్రాదేవ చానవగమాత్ ప్రథమం నిర్వివాదసిద్ధ వివిక్తవిధినిషేధప్రదర్శనాభిప్రాయేణ చైతద్వస్తుధ్వనేరుదాహరణం దత్తమ్.

బాలానందిని

యదీతి - ఇక్కడ రసానువేధ (రసస్పర్శ) ఉందని అంటేనే కాని నువ్వు సంతోషించకపోతే, అలా అయినా కూడా ఇక్కడ భయానకరసానువేధ సహృదయ హృదయదర్పణంలో నిలవడం లేదు; అనగా ఇక్కడ ఉన్నది భయానకరసం కాదు. మరేమనగా "కస్యాశ్చిత్ సంకేతస్థానం జీవితసర్వస్వాయమానమ్" అని వెనుక చెప్పినట్లు సంభోగాభిలాషకు ఉద్దీపనవిభావం అయిన సంకేతస్థానం, ఆ సంభోగాభిలాషకే తగిన విశిష్టకాక్వాద్యనుభావాలూ, వీటి కలయికచేత ఉదయించిన శృంగారరసస్పర్శే ఉంది. అయితే రసం అలౌకికమైనది. ఒక ఉదాహరణం ఇచ్చినంతమాత్రాన స్ఫురించదు. అందుచేత ఏ వివాదమూ లేకుండా సిద్ధమైన (అనగా వివాదానికి అవకాశం లేని) విస్పష్టంగా అర్థం అవుతూన్న విధినిషేధాలను చూపించాలనే అభిప్రాయంతో ముందుగా దీన్ని వస్తుధ్వనికి ఉదాహరణగా ఇవ్వడం జరిగింది.

లోచనం

యస్తు ధ్వనివ్యాఖ్యానోద్యతః తాత్పర్యశక్తిమేవ, వివక్షాసూచకత్వమేవ వా ధ్వననమవోచత్, స నాస్మాకం హృదయ మావర్జయతి. యదాహుః "భిన్న రుచిర్హి లోకః" (రఘు 6.30) ఇతి. తదేతదగ్రే యథాయథం ప్రతనిష్యామ ఇత్యాస్తాం తావత్.

భ్రమేతి - అతిసృష్టోఽసి; ప్రాప్తస్తే భ్రమణకాలః, ధార్మికేతి - కుసుమా ద్యుపకరణార్థం యుక్తం తే భ్రమణమ్. విస్రబ్ధ ఇతి - శఙ్కాకారణవైకల్యాత్. స ఇతి - యస్తే భయప్రకమ్పామ్ అఙ్గలతికామ్ అకృత. అద్యేతి -దిష్ట్యా వర్ధస ఇత్యర్థః. మారిత ఇతి - పునరస్యానుత్థానమ్. తేనేతి - యః పూర్వం

కర్ణోపకర్ణికయా త్వయాప్యాకర్ణితో గోదావరీకచ్ఛగహనే ప్రతివసతీతి. పూర్వమేవ హి తద్రక్షాయై తత్తయోపశ్రావితోఽసౌ; స చాధునా తు దృప్తత్వాత్ తతో గహనాత్ నిఃసరతీతి ప్రసిద్ధగోదావరీతీరపరిసరానుసరణమపి తావత్కథా శేషీభూతం కా కథా తల్లతాగహనప్రవేశశఙ్కాయా ఇతి భావః.

బాలానందిని

అభినవగుప్తునికి పూర్వం మరెవరో ధ్వన్యాలోకానికి వ్యాఖ్య రచించి ఉంటారు. ప్రథమోద్యోతం చివర అభినవగుప్తుడు వ్రాసిన శ్లోకాన్ని పట్టి ఆ వ్యాఖ్యానం పేరు 'చంద్రిక' లేదా 'ధ్వన్యాలోకచంద్రిక' అయి ఉంటుంది. ధ్వని విషయంలో ఆ వ్యాఖ్యాత ప్రకటించిన అభిప్రాయం ఖండిస్తున్నాడు - యస్త్వితి. ధ్వనివ్యాఖ్యానం రచించడానికి ఉద్యుక్తుడై ఎవడు తాత్పర్యశక్తియే లేదా వివక్షను సూచించడమే ధ్వననం అని అన్నాడో అతడు మా హృదయాన్ని ఆకర్షించడం లేదు. "లోకుల రుచులు వేరువేరుగా ఉంటాయి" అన్నారు కదా? ఈ విషయం తగు విధంగా ముందు ముందు విశదీకరిస్తాం.

భ్రమ ధార్మిక - ఇత్యాదిశ్లోకంలోని కొన్ని పదాల భావం విశదీకరిస్తున్నాడు - భ్రమేతి. ఇక్కడ లోట్ అతిసర్గప్రాప్తకాలార్థాలలో ఉపయోగించబడింది అని వెనుక చెప్పి ఉన్నాడు. తదనుసారం భ్రమ అనేదానికి "నీకు ఇష్టం అయితే తిరగవచ్చు". "నువ్వు తిరగడానికి తగిన సమయం వచ్చింది" అని అర్థం. ధార్మికేతి - పుష్పాదిపూజోపకరణాల కోసం నువ్వు సంచరించడం యుక్తమే. విస్రబ్ధః ఇతి - భయకారణం లేదు కాబట్టి నిర్భయుడవై అని అర్థం. సః అనగా ఏది నీ సన్నని శరీరాన్ని భయంచేత వణకిపోయేటట్లు చేసేదో అది అని అర్థం. అద్యేతి : ఇప్పుడు నీ అదృష్టం బాగుంది అని సూచన. మారితః ఇతి - ఇంక అది మళ్లీ లేవదు. తేనేతి - గోదావరీతీరజలప్రాయగహనంలో ఉందని దేనిని గూర్చి నువ్వు కూడా ఒక చెవినుంచి మరొక చెవితో (కర్ణోపకర్ణికయా) (ఆ నోటా ఆ నోటా) విని ఉన్నావో అట్టిదానిచేత అని భావం. తన సంకేతస్థానాన్ని రక్షించుకోవడం కోసం ఆమె పూర్వమే సఖ్యాదుల ద్వారా ఆతనికి సింహాన్ని గూర్చి తెలిపి ఉంది. ఇప్పుడైతే ఆ సింహం బాగా మదించి ఆ పొదనుంచి బైటకి వస్తుంది. అందుచేత అందరూ సంచరించే (ప్రసిద్ధ) గోదావరీతీరప్రాంతాల దగ్గరికి వెళ్లడం కూడా కథాశేషం అయిపోయింది. (ఏనాటి మాటగానో అయిపోయింది) ఆ తీగల పొదలో ప్రవేశిస్తాడు అనే శంకకి కూడా ఇంక అవకాశం ఎక్కడిది అని భావం.

# ధ్వన్యాలోకం

## క్వచిద్వాచ్యే ప్రతిషేధరూపే విధిరూపః యథా -

గాథ. అత్తా ఏత్థ ణిమజ్జఇ ఏత్థ అహం దిఅసహం పలోఏహి,
మా పహిఅ రత్తిఅంధఅ సేజ్జాఏ మహ ణిమజ్జిహిసి". (3)

బాలానందిని

క్వచిదితి - కొన్నిచోట్ల వాచ్యం ప్రతిషేధరూపంగా ఉన్నప్పుడు వ్యంగ్యం విధిరూపంలో ఉంటుంది. ఎట్లనగా -

అత్తా ఇతి - "రేచీకటితో బాధపడుతూన్న పాంథుడా! నా అత్త ఇక్కడ మునిగి ఉంటుంది (ఈ కుక్కిమంచంమీద పడి ఉంటుంది). నేను ఇక్కడ ఉంటాను. పగలే చూచుకో (లోచనానుసారం "ఇది పగలు" అని అర్థం) మా పక్కలలో పడ్డావు కనక!'

లోచనం

అత్తా ఇతి:-

"శ్వశ్రూరత్ర నిమజ్జతి అత్రాహం దివసకం ప్రలోకయ
మా పథిక రాత్ర్యన్ధ శయ్యాయామావయోర్నిమజ్క్ష్య సి."

మహ ఇతి నిపాతః అనేకార్థవృత్తిః అత్రావయోరిత్యర్థే న తు మమేతి. ఏవం హి విశేషవచనమేవ శఙ్కాకారి భవేదితి ప్రచ్ఛన్నాభ్యుపగమో న స్యాత్. కాంచిత్ ప్రోషితభర్తృకాం తరుణీమవలోక్య ప్రవృద్ధమదనాఙ్కురః సంపన్నః పాన్థః అనేన నిషేధద్వారేణ తయాభ్యుపగత ఇతి నిషేధాభావోఽత్ర విధిః. న తు నిమన్త్రణరూపః అప్రవృత్తప్రవర్తనాస్వభావః; సౌభాగ్యాభిమానఖణ్డనా ప్రసంగాత్. అత ఏవ రాత్ర్యన్ధేతి సముచితసమయసంభావ్యమాన వికారాకులితత్వం ధ్వనితమ్. భావతదభావయోశ్చ సాక్షాద్విరోధాత్ వాచ్యాద్వ్యఙ్గ్యస్య స్ఫుటమేవాన్యత్వమ్.

బాలానందిని

"శ్వశ్రూః" ఇత్యాదికం 'అత్థా' ఇత్యాదిగాథకి సంస్కృతచ్ఛాయ. మహ ఇతి- 'మహ' అనే నిపాత అనేకారాలను బోధిస్తుంది. ఇక్కడ దీనికి మా ఇద్దరియొక్క అని

అర్థం; 'నాయొక్క' అని కాదు. 'నాయొక్క' అని విశేషించి చెప్పడంవల్ల ప్రక్కనున్న అత్తకి శంక కలగవచ్చు. ప్రచ్ఛన్నాంగీకారం (అంగీకారాన్ని నిగూఢంగా చెప్పడం) కూడా కాకుండా పోతుంది. అనగా "నా మంచం మీదనే పడు" అని ప్రత్యక్షంగానే చెప్పినట్లయి సహృదయహృదయాహ్లాదకం కాదు అని భావం.

కాంచిదితి - భర్త ప్రవాసం వెళ్లిన ఒక తరుణిని చూడగానే రూపయౌవనాది సంపన్నుడైన ఒక పాంథునికి మన్మథాంకురం వృద్ధిచెందింది. అలాంటి పాంథుణ్ణి "మా ణిమజ్జహిసి" అని నిషేధించడం ద్వారా ఇక్కడ అంగీకరించడం జరిగింది. ఈ విధంగా ఇక్కడ ఉన్న విధి (మమ శయనే నిమజ్జస్వ అనేది) నిషేధాభావరూపమే కాని ప్రవర్తించనివానిని ప్రవర్తింపచేయడం అనే స్వరూపం గల నిమంత్రణ (ఆహ్వాన) రూప విధి కాదు. అలాంటి విధి అయిన పక్షంలో ఆమె కున్న సౌభాగ్యాభిమానం దెబ్బతినే అవకాశం ఉంటుంది.

వి. ఆ పాంథుని చేష్టాదులచేతనే ఆతనికి తన మీద అసక్తి ఉన్నట్లు ఆ తరుణి గ్రహించింది. అందుచేత ఆతనిలో లేని ప్రవృత్తిని కలిగించడం కోసం నిమంత్రణం చేయవలసిన పని లేదు. అందుచేత ఇక్కడ ప్రతీయమానమైన విధి నిమంత్రణరూపం కాదు. నిషేధాభావరూపమైనది. ఆతడు ప్రవర్తిస్తే నిషేధించకపోవడమే ఇక్కడ గమ్యం అవుతూన్న విధి. అలా కాక ఆ తరుణియే ముందుగా చొరవ తీసికొని ఈతన్ని నిమంత్రిస్తున్నది అంటే ఆమె సౌభాగ్యాభిమానానికి, బెట్టుకి, భంగం వాటిల్లుతుంది.

అత ఏవేతి :- అందుచేతనే రాత్ర్యంధ అని సంబోధించడం ద్వారా సంభోగానికి తగిన రాత్రి సమయంలో జరగడానికి అవకాశం ఉన్న వికారాలచేత ఆకులురాలై ఉన్నది అని ధ్వనించబడింది. ఈ విధంగా ధ్వనింపచేయడం ద్వారా తన సౌభాగ్యాభిమానాన్ని తెలుపుకొన్నది. అని భావం. భావేతి - ఇక్కడ శయనపతనాభావం వాచ్యం; శయనపతనం వ్యంగ్యం. ఈ విధంగా వ్యంగ్యమైన శయనపతనభావానికి (శయనపతనం ఉండడానికి, జరగడానికి), వాచ్యమైన శయనపతనాభావానికీ పరస్పరవిరోధం స్పష్టమే. ఈ విధంగా వాచ్యంకంటె వ్యంగ్యం భిన్నం అనే విషయం స్పష్టం.

లోచనం

యత్త్వాహ భట్టనాయకః - "అహమిత్యభినయవిశేషేణ ఆత్మదశావేదనాచ్ఛాబ్దమేతదపి" ఇతి - తత్ర అహమితి శబ్దస్య తావన్నాయం

సాక్షాదర్థః; కాక్వాదిసహాయస్య చ తావతి ధ్వననమేవ వ్యాపార ఇతి ధ్వనేర్భూషణమేతత్. అత్తేతి ప్రయత్నేన అనిభృతసంభోగపరిహారః, అథ యద్యపి భవాన్ మదనశరాసారదీర్యమాణహృదయ ఉపేక్షితుం న యుక్తః, తథాపి, కిం కరోమి, పాపో దివసకోఽయమ్. అనుచితత్వాత్ కుత్సితోఽయ మిత్యర్థః, ప్రాకృతే పుంనపుంసకయోరనియమః. న చ సర్వథా త్వాముపేక్షే, యతోఽత్రైవాహమ్, తత్ప్రలోకయ. నాన్యతోఽహం గచ్ఛామి. తదన్యోన్యవదనావలోకనవినోదేన దినం తావదతివాహయావ ఇత్యర్థః, ప్రతిపన్నమాత్రాయాం చ రాత్రావన్ధీభూతో మదీయాయాం శయ్యాయాం మా శ్లిషః, అపి తు నిభృతనిభృతమేవ అత్తాభిధాననికటకణ్టకనిద్రాన్వేషణ పూర్వకమ్ ఇతీయదత్ర ధ్వన్యతే.

బాలానందిని

యదితి - 'అహమ్' అని అంటూ తన పరిస్థితిని ఒక విధమైన అభినయం ద్వారా తెలపడంవల్ల ఇది కూడా (వ్యంగ్యం అని మీరు చెప్పే ఈ విధి కూడా) వాచ్యమే అని భట్టనాయకుడు అన్నాడు. అయితే ఇక్కడ అలోచించవలసినది ఏమనగా - "అహమ్" అనే శబ్దానికి ఈ విధి సాక్షాత్తు (సూటియైన) అర్థం అయితే కాదు. కాక్వాదుల సహాయంతో ఈ శబ్దం పై అర్థాన్ని (విధిరూపార్థాన్ని) బోధిస్తుంది అని చెప్పాలి. అలా చెప్పిన పక్షంలో అది ధ్వననవ్యాపారమే అవుతుంది గాన ఇది మేం చెప్పే ధ్వనికి భూషణమే (కాని దూషణం కాజాలదు).

అత్తా అనడం చేత నిభృతం కాని (రహస్యం కాని) సంభోగాన్ని ప్రయత్నపూర్వకంగా పరిహరించాలి అని సూచింపబడుతున్నది. 'దివస' శబ్దానికి కుత్సితార్థంలో 'క' ప్రత్యయం చేర్చగా 'దివసకం' అయింది. 'చెడ్డ పగలు' అని అర్థం. ఆ పదం ప్రయోగించడంలో ఉన్న విశేషాన్ని విశదీకరిస్తున్నాడు - అథేతి. మదనబాణాల ధారచేత చీల్చివేయబడుతున్న హృదయం గల నిన్ను ఉపేక్షించడం యుక్తం కాకపోయినా, ఏం చెయ్యను, ఈ చెడ్డ పగటిభాగం నడుస్తూంది. అనుచితం అవడంచేత ఇది చాలా కుత్సితమైనది, చెడ్డది అని అర్థం. ప్రాకృతభాషలో పుంలింగనపుంసకలింగాల విషయంలో నియమం లేదు. అందుచేత సంస్కృతంలో దివసశబ్దం పుంలింగమే అయినా ప్రాకృతంలో 'దిఅసఅం' అని నపుంసకలింగంలో ప్రయోగించబడింది అని అర్థం. న చేతి- అయితే

ఇంత బాధలో ఉన్న నిన్ను పూర్తిగా ఉపేక్షిస్తాను అని అనుకొనకు. ఎందుచేత నంటే నేనిక్కడే ఉన్నాను; చూడు. మరొక చోటికి ఎక్కడికీ వెళ్లను. అందుచేత పరస్పరావలోకనవినోదంలో ఈ పగటి భాగాన్ని గడిపివేద్దాం అని అర్థం. రాత్రి పడగానే గుడ్డివాడిలా నా శయ్యమీదకి వచ్చి పడి కౌగిలించుకొనకు. ఈ అత్త అనే దగ్గరనే ఉన్న కంటకం (ముళ్లకంప) నిద్రించిందా లేదా అని తెలుసుకొని అతిరహస్యంగా, మెల్లమెల్లగా రా అని ఇంత అర్థం ఇక్కడ ధ్వనింప చేయబడుతున్నది.

## ధ్వన్యాలోకం

క్వచిద్వాచ్యే విధిరూపే అనుభయరూపః యథా:-

గాథ . వచ్చ మహ వ్విఅ ఏక్కే ఇ హోన్తు ణీసాసరోఇఅవ్వాఇ,
మా తుజ్జ వి తీఅ విణా దక్ఖిణ్ణహఅస్స జాఅన్తు. (4)

### బాలానందిని

క్వచిదితి - కొన్ని చోట్ల వాచ్యార్థం విధిరూపంలో ఉంటుంది; వ్యంగ్యార్థం అనుభయరూపంగా ఉంటుంది. అనగా విధిరూపమూ కాదు, నిషేధరూపమూ కాదు. ఎట్లనగా - వచ్చ ఇతి- "సరే! వెళ్లు; ఈ నిట్టూర్పులూ, ఏడ్పులూ నా ఒక్కదానికే ఉండనీ. దాక్షిణ్యహతుడవైన (పాపం! అందరినీ సమంగానే చూచుకుంటూన్నట్లు కనబడే విశాలహృదయం ఉన్నవాడవు నువ్వు!) నీకు కూడా, ఆమె దగ్గర లేకపోవడంచేత నిట్టూర్పులూ, ఏడ్పులూ, కలగకుండు గాక".

### లోచనం

"వ్రజ మమైవైకస్యా భవన్తు నిఃశ్వాసరోదితవ్యాని,
మా తవాపి తయా వినా దాక్షిణ్యహతస్య జనిషత."

అత్ర వ్రజేతి విధిః. న ప్రమాదాదేవ నాయికాన్తరసంగమనం తవ, అపి తు గాఢానురాగాత్, యేనాన్యాదృక్ ముఖరాగః, గోత్రస్ఖలనాది చ. కేవలం పూర్వ కృతానుపాలనాత్మనా దాక్షిణ్యేన ఏకరూపత్వాభిమానేనైవ త్వమత్ర స్థితః. తత్సర్వథా శఠోఽసి ఇతి గాఢమన్యురూపోఽయం ఖణ్డితనాయికాభిప్రాయోఽత్ర ప్రతీయతే. న చాసౌ వ్రజ్యాభావరూపో నిషేధః, నాపి విధ్యన్తరమేవ అన్యనిషేధాభావః.

బాలానందిని

వ్రజేత్యాదికం వచ్ఛ ఇత్యాది గాథకి సంస్కృతచ్ఛాయ. అత్రేతి: ఇక్కడ 'వ్రజ' (వెళ్లుము) అని విధి. వ్యంగ్యార్థాన్ని వివరిస్తున్నాడు - నేతి - నువ్వు చేస్తున్న నాయికాంతరసంగమం పొరబాటుచేత కాదు; మరేమనగా ఆమెమీద గాఢానురాగం ఉండడం మూలానే. అందుచేత నీ ముఖకవళికలన్నీ అదో రకంగా ఉన్నాయి; గోత్రస్ఖలనాదికం కూడా జరుగుతూన్నది. (గోత్రం అంటే పేరు. ఎదుట ఉన్న వ్యక్తిని పొరబాటున తనకు అతిపరిచితురాలైన మరొక వ్యక్తి పేరుతో పిలవడం గోత్రస్ఖలనం). కేవలం పూర్వం చేసిన పనుల్ని (పూర్వం నా విషయంలో చూపించిన ప్రేమాదుల్ని) పాటించడం అనే దాక్షిణ్యంతో, "నేను ఎల్లప్పుడూ నీ విషయంలో ఒకే విధంగా ఉన్నాను" అని చెప్పాలనే అభిమానంతో (పట్టుదలతో) మాత్రమే నువ్వు ఇక్కడ ఉన్నావు. నువ్వు అన్ని విధాలా శఠుడవు, రహస్యంగా అపకారం చేసే స్వభావం ఉన్నవాడవు అని ఖండితనాయికలో (ప్రియునిచేత మోసగించబడిన నాయిక ఖండితనాయిక) ఉన్న ప్రగాఢకోపరూపమైన అభిప్రాయం ఇక్కడ వ్యంజింపబడుతున్నది. ఇది వ్రజ్యాభావరూప (వెళ్లవద్దు అని చెప్పడం, వెళ్లకపోవడం అనే) నిషేధమూ కాదు, వెళ్లకపోవడాన్ని నిషేధించే 'వెళ్లు' అనే మరొక విధం కాదు. అందుచేత ఇక్కడ వాచ్యం విధిరూపం, వ్యంగ్యం అనుభయరూపం అని అర్థం.

## ధ్వన్యాలోకం

క్వచిద్వాచ్యే ప్రతిషేధరూపే అనుభయరూపః. యథా -

గాథ. దే ఆ పసిఅం ణివత్తసు ముహససిజోహ్ణావిలుత్తతమణివహే,
అహిసారిఆణం విగ్ఘం కరోసి అణ్ణాణం వి హఆసే. (౫)

బాలానందిని

క్వచిదితి - కొన్ని చోట్ల వాచ్యం ప్రతిషేధరూపంలో ఉంటుంది; వ్యంగ్యం అనుభయరూపంగా ఉంటుంది. ప్రతిషేధరూపమూ కాదు, విధి రూపమూ కాదు అని అర్థం. ఎట్లనగా - దే ఇతి - "ముఖచంద్రుని వెన్నెల చేత చీకటిని తొలగిస్తూన్నదానా! దయచేసి వెనక్కిరా. ఓ! హతాశురాలా! నువ్వు ఇతర అభిసారికలకి కూడా విఘ్నం చేస్తున్నావు."

లోచనం

దే ఇతి నిపాతః ప్రార్థనాయామ్. ఆ ఇతి తావచ్ఛబ్దార్థే. తేనాయమర్థః-
"ప్రార్థయే తావత్ ప్రసీద నివర్తస్వ ముఖశశిజ్యోత్స్నావిలుప్తతమోనివహే.
అభిసారికాణాం విఘ్నం కరోష్యన్యాసామపి హతాశే".

అత్ర వ్యవసితాద్గమనాత్ నివర్తస్వేతి ప్రతీతేః నిషేధో వాచ్యః. గృహాగతా నాయికా గోత్రస్ఖలితాద్యపరాధిని నాయకే సతి తతః ప్రతిగన్తుం ప్రవృత్తా, నాయకేన చాటూపక్రమపూర్వకం నివర్త్యతే. న కేవలం స్వాత్మనో మమ చ నిర్వృతివిఘ్నం కరోషి, యావదన్యాసామపి; తతస్తవ న కదాచన సుఖలవలాభోఽపి భవిష్యతీత్యత ఏవ హతాశాసీతి వల్లభాభిప్రాయరూపః చాటువిశేషః వ్యఙ్గ్యః.

బాలానందిని

'దే' అనే నిపాత ప్రార్థనను సూచిస్తుంది. 'ఆ' అనే నిపాత 'తావత్' అనే పదానికున్న అర్థాన్ని సూచిస్తుంది. అందుచేత పై గాథ అర్థం ఇది "ప్రార్థయే తావత్" ఇత్యాదికం 'దే ఆ' ఇత్యాదిగాథకు సంస్కృతచ్ఛాయ. ఇక్కడ "నువ్వు నిశ్చయించుకున్న గమనం నుంచి నివర్తించుము'' అనే అర్థం తెలుస్తూన్నది కాబట్టి వెళ్లవద్దు అని నిషేధం వాచ్యం. నాయకుడు గోత్రస్ఖలితాద్యపరాధం చేయడంతో ఇంటికి వచ్చిన నాయిక తిరిగి వెళ్లిపోవడానికి ఉద్యుక్తురాలైంది. నాయకుడు మంచి మాటలు (స్తుతివాక్యాలు)పలకడం ప్రారంభించి అమెను వెళ్లకుండా మరలేటట్లు చేస్తున్నాడు. నువ్వు కేవలం నా ఆనందానికి నీ ఆనందానికీ మాత్రమే కాదు, ఇతర స్త్రీల ఆనందానికి కూడా విఘ్నం కలిగిస్తున్నావు. దానివల్ల నీకు ఎన్నటికీ, సుఖలేశం కూడా లభించదు. అందుచేత నువ్వు హతాశురాలవు (దెబ్బతిన్న ఆశగలదానవు) అనే ప్రియుని అభిప్రాయం అయిన ఒకానొక చాటువాక్యవిశేషం వ్యంగ్యం.

లోచనం

యది వా సఖ్యా ఉపదిశ్యమానాపి తదవధీరణయా గచ్ఛన్తీ సఖ్యా ఉచ్యతే - న కేవలమాత్మనో విఘ్నం కరోషి, లాఘవాదబహుమానాస్పదమ్ ఆత్మానం కుర్వతీ, అత ఏవ హతాశా,యావద్వదనచన్ద్రికాప్రకాశితమార్గతయా అన్యాసామప్యభిసారికాణాం విఘ్నం కరోషీతి సఖ్యభిప్రాయరూపః చాటు

విశేషః వ్యఙ్గ్యః. అత్ర తు వ్యాఖ్యానద్వయేఽపి వ్యవసితాత్ ప్రతీపగమనాత్ ప్రియతమగృహగమనాచ్చ నివర్తస్వేతి పునరపి వాచ్య ఏవ విశ్రాన్తేః గుణీభూతవ్యఙ్గ్యభేదస్య ప్రేయోరసవదలఙ్కారస్య ఉదాహరణ మిదం స్యాత్, న ధ్వనేః.

బాలానందిని

దీనికి మరొక విధంగా భావం చెపుతున్నాడు - యది వా ఇత్యాది - లేదా - సఖురాలు ఉపదేశిస్తున్నా కూడ ఆమెను తిరస్కరించి వెళ్లిపోతూన్న నాయికతో సఖురాలు - "నువ్వు నీ అంతట నువ్వే ప్రియుని దగ్గరికి వెడితే చులకనైపోవడం ద్వారా నిన్ను నువ్వే అనాదరానికి పాత్రనుగా చేసుకుంటూ, అందుచేతనే హతాశురాలవై, నీకు మాత్రమే విఘ్నం చేసుకొనడం కాదు, ముఖచంద్రికచేత మార్గాన్ని ప్రకాశింపచేయడం ద్వారా ఇతర అభిసారికలకి కూడా విఘ్నం చేస్తున్నావు" అని అంటూన్నది అని భావం చెపితే అప్పుడు సఖ్యభిప్రాయరూపమైన చాటువిశేషం వ్యంగ్యం అవుతుంది.

వివరణ. మొదటి వ్యాఖ్యానంలో తన ఇంటికి వచ్చిన ప్రియురాలు కోపించి తిరిగి వెళ్లిపోతూన్నప్పుడు ప్రియుడు బ్రతిమాలుతున్నాడు. రెండవ వ్యాఖ్యలో ప్రియుడు రమ్మనకుండానే నాయిక అతని ఇంటికి అభిసారికగా వెడుతున్నప్పుడు, అలా చేస్తే చులకనైపోతావు; వెళ్లవద్దు అని సఖురాలు బ్రతిమాలుతున్నది.

అత్ర తు ఇతి - ఈ రెండు విధాలైన వ్యాఖ్యలలోనూ కూడా (మొదటిదాని ప్రకారం) "నువ్వు నిశ్చయించుకొన్న తిరిగి వెళ్లిపోవడంనుంచి విరమించు" (రెండవ వ్యాఖ్యానం ప్రకారం) "ప్రియుని ఇంటికి వెళ్లడంనుంచి విరమించు" అనే వాచ్యార్థాలనే పైన చూపిన రెండు వ్యంగ్యార్థాలూ (వరసగా) సమర్థిస్తున్నాయి. అందుచేత వ్యంగ్యార్థం చేత సమర్థింప బడుతూన్న వాచ్యార్థాలే ప్రధానాలుగా గోచరిస్తున్నాయి. అందుచేత ఇది (ఈ శ్లోకం) గుణీభూతవ్యంగ్యంలో భేదమైన ప్రేయోలంకారానికో, రసవదలంకారానికో ఉదాహరణం అవుతుంది కాని ధ్వనికి ఉదాహరణం కాదు.

వివరణ. సఖీవచనం అనే పక్షంలో నాయిక విషయంలో ఆమెకున్న భావరూపమైన రతి (స్నేహభావం) వ్యంగ్యం అవుతూ ఆమె చెప్పిన మాటల ద్వారా 'నివర్తస్వ' అనే వాచ్యార్థానికి అంగం అవడంచేత అది ప్రేయోలంకారరూపమైన గుణీభూతధ్వని అవుతుంది. నాయకుని మాటలు అనే పక్షంలో నాయకునికి నాయిక విషయంలో ఉన్న రతి (ప్రేమ) వ్యంగ్యమై అతడు పలికిన మాటల ద్వారా పైన చెప్పిన

వాచ్యార్థానికి అంగం అవుతూన్నది కాబట్టి అది రసవదలంకారరూప గుణీభూతవ్యంగ్యం అవుతుంది అని భావం.

లోచనం

తేనాయమత్ర భావః- కాచిత్ రభసాత్ ప్రియతమమభిసరన్తీ తద్గృహాభిముఖమాగచ్ఛతా తేనైవ హృదయవల్లభేన ఏవముపశ్లోక్యతే అప్రత్యభిజ్ఞానచ్ఛలేన. అత ఏవ ఆత్మప్రత్యభిజ్ఞాపనార్థమేవ నర్మవచనం హతాశే ఇతి. అన్యాసాం చ విఘ్నం కరోషి, తవ చేప్సితలాభః భవిష్యతీతి కా ప్రత్యాశా. అత ఏవ మదీయం వా గృహమాగచ్ఛ, త్వదీయం వా గచ్ఛావ ఇత్యుభయత్రాపి తాత్పర్యాదనుభయరూపో వల్లభాభిప్రాయః చాట్వాత్మా ఇయత్యేవ వ్యవతిష్ఠతే.

అన్యే తు - "తటస్థానాం సహృదయానామ్ అభిసారికాం ప్రతి ఇయమ్ ఉక్తిః" ఇత్యాహుః. తత్ర హతాశే ఇత్యామన్త్రణాది యుక్తమ్ అయుక్తం వేతి సహృదయా ఏవ ప్రమాణమ్.

బాలానందిని

ఇది గుణీభూతవ్యంగ్యం కాకుండా ధ్వని కావాలంటే దీని భావం ఎలా చెప్పాలో ప్రతిపాదిస్తున్నాడు - తేనేతి. అందుచేత ఇక్కడ భావం ఇది - ఒక అభిసారిక తొందరతొందరగా ప్రియతముని ఇంటికి వెడుతూన్నది. ఇంతలో ఆమె హృదయవల్లభుడే ఆమె ఇంటి వైపు వస్తున్నాడు. అప్పుడతడు ఆమెను గుర్తించనట్లు అభినయిస్తూ ఈ మాటలతో ఆమెను స్తుతిస్తున్నాడు. ఒక మూల స్తుతిస్తూ తనను ఆమె గుర్తుపట్టేటట్లు చేసుకోవడం కోసం "హతాశే" అని వేళాకోళంగా పలకరించాడు. (పరిచయం ఉన్న వాళ్లు తప్ప ఇతరులు ఇలాంటి నర్మవచనం పలకరు కదా? "నువ్వు ఇతర అభిసారికలకి విఘ్నం కలిగిస్తున్నావు, నీ కోరిక తీరుతుందని మాత్రం నమ్మకం ఏముంది? అందుచేత నువ్వు మాయింటికేనా రా, లేదా ఇద్దరం కలిసి మీ ఇంటికి వెడదాం." అని రెండింటి విషయంలోనూ తాత్పర్యం ఉంది. అందుచేత అనుభయరూపమైన, అనగా విధిరూపం కాని నిషేధరూపం కాని కానట్టి చాటురూపమైన ప్రియుని అభిప్రాయం వ్యంగ్యంగా, అంతలోనే నిలిచి పోతున్నది, అనగా దేనికీ అంగం కాకుండా స్వప్రాధాన్యంతోనే ఉంది. వెనుకటి రెండర్థాలు "తిరిగి వెళ్లవద్దు" అనే వాచ్యార్థానికి అంగం అయినట్లు ఇది

కాలేదు, ప్రధానంగానే ఉంది అని భావం.

## ధ్వన్యాలోకం

క్వచిద్వాచ్యాద్విభిన్నవిషయత్వేన వ్యవస్థాపితః. యథా -

గాథ. కస్స వ ణ హోయి రోసో దట్ఠూణ పిఅఏ సవ్వణం అహరమ్.

సభమరపఉమగ్ఘాఇణి వారిఅవామే సహసు ఏణ్హిమ్. (6)

అన్యే చైవంప్రకారాః వాచ్యాద్విభేదినః ప్రతీయమానభేదాః సంభవన్తి. తేషాం దిఙ్మాత్రమేతత్ప్రదర్శితమ్. ద్వితీయోఽపి ప్రభేదో వాచ్యాద్భిన్నః సప్రపఞ్చమగ్రే దర్శయిష్యతే.

### బాలానందిని

క్వచిదితి - కొన్ని చోట్ల వాచ్యార్థం కంటె భిన్నమైన విషయం కలదిగా నిర్ణయించబడినది. అనగా వాచ్యార్థం ఎవరిని ఉద్దేశించి చెప్పబడుతుందో ఆ వ్యక్తిని ఉద్దేశించి కాక మరొక వ్యక్తిని ఉద్దేశించి వ్యంగ్యార్థం చెప్పబడుతుంది అని అర్థం. వాచ్యార్థానికి విషయమైన వ్యక్తి వేరు, వ్యంగ్యార్థానికి విషయమైన వ్యక్తి వేరు అని భావం. ఎట్లనగా -

కస్స వా ఇతి : - ప్రవాసం నుంచి వచ్చిన భర్త తన భార్య అధరోష్ఠ మీద దంతక్షతం చూచి కోపించగా ఆమె నిరపరాధ అని ఆమె భర్తకూ, ఇతరులకూ చెప్పడంకోసం ఆమె సఖి ఆమెతో అంటూన్న మాటలు. సవ్రణమ్ -వ్రణంతో కూడిన, ప్రియాయాః అధరమ్ - ప్రియురాలి అధరోష్ఠాన్ని, దృష్ట్వా - చూచి, కస్య వా - ఎవనికి, రోషః - కోపం, న భవతి - కలగదు, సభ్రమరపద్మాఘ్రాయిణి- తుమ్మెదతో కూడిన పద్మాన్ని ఆఘ్రాణించినదానా! వారితవామే - నివారించినా ప్రతికూలంగా ప్రవర్తించినదానా! (విననిదానా) ! ఇదానీమ్ - ఇప్పుడు, సహస్వ - సహించుము.

అన్యే ఇతి - వాచ్యం కంటె భిన్నగా ఉండే ఈ విధమైన వ్యంగ్యార్థ భేదాలు ఇంకా కొన్ని ఉండడానికి అవకాశం ఉంది. వాటిలో మచ్చుకు ఇంతవరకూ కొన్ని చూపబడ్డాయి.

ద్వితీయోఽపీతి - ఇంతవరకు ఉదాహరించినవి వస్తుధ్వని భేదాలు. రెండవదైన అలంకారధ్వనిరూపభేదం కూడా వాచ్యం కంటె ఎట్లు భిన్నంగా ఉంటుందో మున్ముందు

సవిస్తరంగా చూపబడుతుంది.

లోచనం

ఏవం వాచ్యవ్యఙ్గ్యయోః ధార్మిక - పాన్థ - ప్రియతమాభిసారికా విషయైక్యేఽపి స్వరూపభేదాద్భేద ఇతి ప్రతిపాదితమ్. అధునా తు విషయభేదాదపి వ్యఙ్గ్యస్య వాచ్యాద్భేద ఇత్యాహ - క్వచిద్వాచ్యాదితి. వ్యవస్థాపిత ఇతి. విషయభేదోఽపి విచిత్రరూపో వ్యవతిష్ఠమానః సహృదయైః వ్యవస్థాపయితుం శక్యతే ఇత్యర్థః.

"కస్య వా న భవతి రోషో దృష్ట్వా ప్రియాయాః సవ్రణమధరమ్,
సభ్రమరపద్మాఘ్రాణశీలే వారితవామే సహస్వేదానీమ్".

కస్స వేతి - అనీర్ష్యాలో రపి భవతి రోషః దృష్ట్వైవ; అకృత్వాపి కుతశ్చిదేవ అపూర్వతయా ప్రియాయాః సవ్రణమధరమవలోక్య. సభ్రమరపద్మాఘ్రాణశీలే - శీలం హి కథంచిదపి వారయితుం న శక్యమ్. వారితే వారణాయామ్, వామే తదనఙ్గీకారిణి, సహస్వేదానీమ్ ఉపాలమ్భ పరమ్పరామిత్యర్థః. అత్రాయం భావః - కాచిదవినీతా కుతశ్చిత్ ఖణ్డితాధరా నిశ్చితతత్సవిధసంనిధానే తద్భర్తరి తమ్ అనవలోకమానయేవ కయాచిత్ విదగ్ధసఖ్యా తద్వాచ్యతాపరిహారాయైవముచ్యతే. సహస్వేదానీమితి వాచ్యమ్ అవినయవతీవిషయమ్.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ధార్మికుడు, పాంథుడు, ప్రియతమాభిసారిక అనే విషయాలలో (ఉద్దేశించబడినవాళ్లలో) భేదం లేకపోయినా స్వరూపభేదాన్ని పట్టి వాచ్య-వ్యంగ్యాలకు భేదం ఉన్నదని ప్రతిపాదించబడింది. విషయభేదాన్ని పట్టి కూడా వ్యంగ్యం వాచ్యంకంటె భిన్నగా ఉంటుంది అని ఇప్పుడు చెపుతున్నాడు - క్వచిద్వాచ్యాత్ ఇత్యాది. వ్యవస్థాపిత ఇతి. విషయభేదం కూడా విచిత్రరూపంగా ఉంటుందని సహృదయులు స్థాపించడానికి శక్యమే అని అర్థం."కస్స" ఇత్యాది ప్రాకృతగాథకి "కస్య' ఇత్యాదికం సంస్కృతచ్ఛాయ.

కస్య వేతి - తాను (సవ్రణం) చేసి ఉండక, మరే కారణం చేతనైన కూడ ప్రియురాలి అధరోష్ఠం, కొత్తగా సవ్రణం అయి ఉంటే అది చూడగానే కోపం లేనివానికి

కూడా కోపం కలుగుతుంది. సభ్రమరపద్మాఘ్రాణశీలే - (పుట్టుకతో వచ్చిన) శీలాన్ని (స్వభావాన్ని) ఏ విధంగానూ కూడ నివారించడం శక్యం కాదు కదా? వారితవామే ('వారిత' శబ్దం భావార్థక క్తప్రత్యయాంతం; నివారించుట అని అర్థం) నివారించడంలో (నివారించినా) దానిని అంగీకరించనిదానా. ఇప్పుడు నిందాపరంపరను సహించుము అని అర్థం. ఇక్కడ దీని భావం ఇది - అవినీతురాలైన ఒకతె అధరాన్ని ఎవడో ఖండించాడు. (గాఢచుంబనం చేసి అధరక్షతం కలిగించాడు). చతురురాలైన ఆమె సఖురాలు, ఆమె దగ్గరనే భర్త ఉన్నాడని తెలిసి కూడా తెలియనట్లు నటిస్తూ, ఆమెను ఎవరూ నిందించకుండా ఉండడం కోసం (వాచ్యతాపరిహారాయ) ఆమెతో ఇలా అంటూన్నది. ఈ విధంగా సహస్వేదానీమ్ అనే పదం యొక్క వాచ్యార్థం అవినయవంతురాలైన ఆ స్త్రీ విషయంగా గలది (ఆ స్త్రీని గూర్చి చెప్పినది).

లోచనం

భర్తృవిషయం తు - అపరాధో నాస్తీత్యావేద్యమానం వ్యఙ్గ్యమ్ సహస్వేత్యపి చ తద్విషయం వ్యఙ్గ్యమ్. తస్యాం చ ప్రియతమేన గాఢము పాలభ్యమానాయాం తద్వ్యలీకశఙ్కిత ప్రాతివేశికలోకవిషయం చ అవినయప్రచ్ఛాదనేన ప్రత్యాయనం వ్యఙ్గ్యమ్. సపత్నీమధ్యే ఇయతా ఖలీ కృతాస్మీతి లాఘవమాత్మని గ్రహీతుం న యుక్తమ్; ప్రత్యుత అయం బహుమానః. సహస్వ శోభస్వ ఇదానీమ్ ఇతి సఖీవిషయం సౌభాగ్యప్రఖ్యాపనం వ్యఙ్గ్యమ్. అద్యేయం తవ ప్రచ్ఛన్నానురాగిణీ హృదయవల్లభా ఇత్థం రక్షితా పునః ప్రకటరదనదంశనవిధిః న విధేయః ఇతి తచ్చౌర్యకాముక విషయసంబోధనం వ్యఙ్గ్యమ్. ఇత్థం మయా ఏతదపహ్నుతమ్ ఇతి స్వవైదగ్ధ్యఖ్యాపనం తటస్థవిదగ్ధలోకవిషయం వ్యఙ్గ్యమ్ ఇతి- తదేతదుక్తం వ్యవస్థాపితశబ్దేన.

అగ్ర ఇతి - ద్వితీయోద్ద్యోతే - "అసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః క్రమేణోద్ద్యోతితః పరః" ఇతి వివక్షితాన్యపరవాచ్యస్య ద్వితీయప్రభేద వర్ణనావసరే. యథా హి విధి నిషేధ తదనుభయాత్మనా రూపేణ సంకలయ్య వస్తుధ్వనిః సువచః, తథా నాలంకారధ్వనిః; అలఙ్కారాణాం భూయస్త్వాత్. తత ఏవోక్తం సప్రపఞ్చమ్ ఇతి.

బాలానందిని

భర్తృవిషయ మితి - ఈమె ఏ అపరాధమూ ఎరుగదు అని తెలపబడే వ్యంగ్యార్థం భర్తృవిషయమైనది. భర్తను ఉద్దేశించి చెప్పినది. సహస్వ (కోప్పడకు) అనే వ్యంగ్యం కూడా భర్తృవిషయమే. ఆమె చేసిన అవినయాన్ని కప్పిపుచ్చి నమ్మకం కలిగించడం అనే వ్యంగ్యార్థానికి విషయం - ఆమెను ప్రియుడు తీవ్రంగా నిందిస్తూండడం చూచి ఈమె తప్పు చేసి ఉంటుంది అని శంకించే ఇరుగు పొరుగు వాళ్లు. (అనగా ఈ వ్యంగ్యార్థం వాళ్లని గూర్చి సూచించబడింది). ఆమె తప్పు చేసినందుకు తిట్లు తింటూన్నందుకూ సవతి సంతోషిస్తూంటే "ప్రియాయాః" అనే పదం బలం చేత (అనగా నువ్వు నీ భర్తకు ప్రియురాలవు అని సూచించడంచేత) ఆమె కున్న సౌభాగ్యాతిశయాన్ని (భర్తృప్రేమాతిశయపాత్రత్వాన్ని) ప్రకటించడం సవతులను గూర్చిన వ్యంగ్యార్థం. సవతుల మధ్య నేనింత అవమానానికి పాత్రురాలనయ్యాను అని నిన్ను నువ్వు చులకన చేసుకొనవలసిన పని లేదు ; అవమానం కాదు కదా - ఇది పై పెచ్చు బహుమానమే, అందుచేత ఇప్పుడు సహస్వ - శోభించుము అని సౌభాగ్యప్రకటనరూపమైన వ్యంగ్యం సఖీవిషయమైనది ( ఆ అవినీతవనితను గూర్చినది). నీ ప్రచ్ఛన్నానురాగిణి (రహస్యప్రేమ గలది) అయిన నీ హృదయప్రియురాలిని ఇప్పుడేదో విధంగా కాపాడినాను, మళ్లీ ఎన్నడూ ఇలా స్పష్టంగా దంతక్షతాలు ఏర్పడే టట్లు చెయ్యకు అని ఆమె చౌర్యకాముకుడికి బోధించడం ఆతనిని ఉద్దేశించి చెప్పిన వ్యంగ్యార్థం. చూచారా; నేను ఎంతతెలివిగా ఈ అవినయాన్ని కప్పిపుచ్చానో అని తన నేర్పును ప్రకటించడం అక్కడ ఉన్న తటస్థులైన (ఏ పక్షానికీ చెందని) విదగ్ధజనుల విషయమైన (అన్ని విషయాలు చటున గ్రహించగలిగిన నేర్పరులను) ఉద్దేశించి చెప్పిన వ్యంగ్యం. ఈ వివిధవ్యంగ్యాలనే వ్యవస్థాపిత శబ్దం చెపుతున్నది.

అగ్రే ఇతి - ద్వితీయోద్యోతంలో -"అసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః క్రమేణోద్యోతితః పరః" అని వివక్షితాన్యపరవాచ్యవ్యంగ్యానికి సంబంధించిన రెండవ భేదాన్ని ప్రతిపాదించే సందర్భంలో అని అర్థం. విధిరూపం, నిషేధరూపం, తదనుభయరూపం ఇత్యాది విధంగా వస్తుధ్వనిని సంకలనం చేసి సులభంగా చెప్పినట్లు అలంకారధ్వనిని గూర్చి చెప్పడం కష్టం; అలంకారాలు చాలా ఉన్నాయి కదా? అందుచేతనే సప్రపఞ్చమ్ అని అన్నాడు.

## ధ్వన్యాలోకం

తృతీయస్తు రసాదిలక్షణః ప్రభేదో వాచ్యసామర్థ్యాక్షిప్తః ప్రకాశతే; న తు సాక్షాత్ శబ్దవ్యాపారవిషయ ఇతి వాచ్యాద్విభిన్న ఏవ. తథాహి - వాచ్యత్వం తస్య స్వశబ్దనివేదితత్వేన వా స్యాత్, విభావాది ప్రతిపాదనముఖేన వా; పూర్వస్మిన్ పక్షే స్వశబ్దనివేదితత్వాభావే రసాదీనామ్ అప్రతీతిప్రసఙ్గః. న చ సర్వత్ర తేషాం స్వశబ్దనివేదితత్వమ్. యత్రాప్యస్తి తత్, తత్రాపి విశిష్టవిభావాది ప్రతిపాదన ముఖేనైవ ఏషాం ప్రతీతిః. స్వశబ్దేన సా కేవలమ్ అనూద్యతే, న తు తత్కృతా. విషయాన్తరే తథా తస్యాః అదర్శనాత్. న హి కేవల శృఙ్గారాది శబ్దమాత్రభాజి విభావాదిప్రతి పాదనరహితే కావ్యే మనాగపి రసవత్త్వ ప్రతీతిరస్తి. యతశ్చ స్వాభిధానమన్తరేణ కేవలేభ్యోఽపి విభావాదిభ్యః విశిష్టేభ్యః రసాదీనాం ప్రతీతిః, కేవలాచ్చ స్వాభిధానాత్ అప్రతీతిః, తస్మాదన్వయవ్యతిరేకాభ్యామ్ అభిధేయసామర్థ్యాక్షిప్తత్వమేవ రసాదీనామ్, న త్వభిధేయత్వం కథంచిత్ ఇతి తృతీయోఽపి ప్రభేదః వాచ్యాత్ భిన్న ఏవ ఇతి స్థితమ్. వాచ్యేన త్వస్య సహేవ ప్రతీతిః ఇత్యగ్రే దర్శయిష్యతే.

### బాలానందిని

తృతీయ ఇతి - రసాదిరూపమైన మూడవ ధ్వనిప్రభేదమైతే వాచ్యార్థ సామర్థ్యం చేత ఆక్షిప్తమై (పైకి లాగబడి, ఊహింపబడి) ప్రకాశిస్తుంది; అంతే కాని సాక్షాత్తుగా (సూటిగా) శబ్దవ్యాపారానికి, అభిధావ్యాపారానికి, విషయం కాదు. (అభిధచేత తెలియదు). అందుచేత అది కూడా వాచ్యార్థం కంటె భిన్నమైనదే.

రసాదికం వాచ్యంకంటె భిన్నమైన దనే విషయం సమర్థిస్తున్నాడు - **తథాహీతి.** ఎందుచేత ననగా - రసాదులు స్వశబ్దాలచేత (శృంగారరసం, వీరరసం, ఇత్యాదిశబ్దాల చేత) బోధింపబడడంచేత వాటిని వాచ్యాలంటావా, లేదా విభావాదులను ప్రతిపాదించడం

ద్వారా బోధించబడుతూండడం చేత వాచ్యాలంటావా? మొదటి పక్షంలో రసాదులు స్వశబ్దాలచేత తెలుపబడకపోతే వాటి ప్రతీతి (జ్ఞానం, అనుభవం) కలగదని చెప్పవలసివస్తుంది. అనగా రసాదుల్ని స్వశబ్దాలను ప్రయోగించే చెప్పాలి అన్నట్లయితే ఎక్కడైతే శృంగారాదిశబ్దాల ప్రయోగం ఉండదో (విభావాద్యుపస్థాపనం మాత్రమే ఉంటుందో) అక్కడ రసాదిప్రతీతి కలగదు అని చెప్పవలసి వస్తుంది. అది అనుభవవిరుద్ధం.

న చేతి - రసాదులు ఎక్కడైనా స్వశబ్దనివేదితాలే కావాలి అనడానికి వీలు లేదు. ఎక్కడైనా (కొన్ని ఉదాహరణలలో) స్వశబ్దవాచ్యత్వం ఉన్నా అక్కడ కూడా రసాది ప్రతీతి కలుగుతూన్నదంటే అందుకు కారణం విశిష్టాలైన విభావాదుల్ని ప్రతిపాదించడమే కాని స్వశబ్దాల ప్రయోగం కాదు. అక్కడ జరుగుతూన్న రసప్రతీతి స్వశబ్దాలచే అనువదించబడుతున్నదే కాని స్వశబ్దప్రయోగంవల్ల కలగడం లేదు. ఎందుచేతననగా విషయాంతరంలో, అనగా స్వశబ్దప్రయోగం మాత్రమే ఉండి విభావాదిప్రతిపాదన లేని చోట్ల, అది (ఆ రసప్రతీతి) కనబడడం లేదు. కేవలం శృంగారాదిశబ్దాల ప్రయోగం మాత్రమే ఉండి విభావాదుల ప్రతిపాదనం లేని కావ్యంలో 'దీనిలో రసం ఉంది' అన్న ప్రతీతి (రసప్రతీతి) కొంచెమైనా లేదు కదా?

యతశ్చేతి - స్వశబ్దప్రయోగం లేకపోయినా కేవలం విశిష్టాలైన విభావాదుల్ని ప్రతిపాదించడంవల్ల రసాదిప్రతీతి కలుగుతూన్నది, కేవలం స్వశబ్దాలు ప్రయోగించి నంత మాత్రాన రసాదిప్రతీతి కలగడం లేదు. అందుచేత ఈ అన్వయవ్యతిరేకాలను పట్టి రసాదులు వాచ్యార్థసామర్థ్యాక్షిప్తాలే కాని, ఏ విధంగానూ కూడ అవి వాచ్యాలు కావు, ఈ కారణంచేత రసాదిధ్వనిరూపమైన మూడవ భేదం కూడా వాచ్యంకంటె భిన్నమే అనేది నిర్ధారణ చేసిన విషయం. అయితే ఇది (రసాదికం) వాచ్యంతో కలిసి పోయినట్లు, వాచ్యార్థంతో పాటే తెలుస్తున్నట్లు, కనబడుతుంది అనే విషయం మున్ముందు చూపబడుతుంది.

## లోచనం

తృతీయస్త్వితి - తుశబ్దో వ్యతిరేకే. వస్త్వలంకారావపి శబ్దాభిధేయత్వమ్ అధ్యాసాతే తావత్. రసభావతదాభాసతత్ప్రశమాః పునః న కదాచిదభిధీయన్తే; అథ చాస్వాద్యమానతాప్రాణతయా భాన్తి. తత్ర ధ్వననవ్యాపారాదృతే నాస్తి కల్పనాన్తరమ్. స్ఖలద్గతిత్వాభావే ముఖ్యార్థబాధాదేః లక్షణానిబన్ధనస్య

అనాశఙ్కనీయత్వాత్. ఔచిత్యేన ప్రవృత్తౌ చిత్తవృత్తేః ఆస్వాద్యత్వే స్థాయిన్యాం రసః, వ్యభిచారిణ్యాం భావః, అనౌచిత్యేన తదాభాసః, రావణస్యేవ సీతాయాం రతేః. యద్యపి తత్ర హాస్యరూపతైవ, "శృఙ్గారాద్ధి భవేద్ధాసః" ఇతి వచనాత్, తథాపి పాశ్చాత్త్యేయం సామాజికానాం స్థితిః, తన్మయీభవనదశాయాం తు రతేరేవ ఆస్వాద్యతా ఇతి పౌర్వాపర్యవివేకావధీరణేన "దూరాకర్షణమోహమన్త్ర ఇవ మే తన్నామ్ని యాతే శ్రుతిమ్" ఇత్యాదౌ. తదసౌ శృఙ్గారాభాస ఏవ. తదఙ్గం భావాభాసః. చిత్తవృత్తేః ప్రశమ ఏవ ప్రక్రాన్తాయాః హృదయ మాహ్లాదయతి యతో విశేషేణ, తత ఏవ తత్సంగృహీతోఽపి పృథగ్గణితః అసౌ. యథా -

శ్లో. ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతో
రన్యోన్యస్య హృది స్థితేఽప్యనునయే సంరక్షతో ర్గౌరవమ్,
దమ్పత్యోః శనకైరపాఙ్గవలనామిశ్రీభవచ్చక్షుషో -
ర్భగ్నో మానకలిః సహాసరభసవ్యావృత్తకణ్ఠగ్రహమ్ (అమరుకం. 23)

ఇత్యత్ర ఈర్ష్యారోషాత్మనః మానస్య ప్రశమః.

బాలానందిని

తృతీయస్తు - అనే దానిలోని 'తు' శబ్దం వ్యతిరేకాన్ని, రసాదిధ్వనికి వస్త్వలంకారధ్వనులకంటె భేదాన్ని, సూచిస్తుంది. వస్త్వలంకారాలు శబ్దవాచ్యత్వాన్ని కూడా అధిష్ఠిస్తాయి. వస్త్వలంకారాలు వాచ్యాలు కూడా అవుతాయి అని అర్థం. రస- భావ- రసాభాస- భావాభాస- భావప్రశమా లైతే ఏనాడూ వాచ్యాలు కావు. కాని ఆస్వాద్యమానత్వమే ప్రాణంగా గలవై భాసిస్తాయి. అనగా రసాదులు భాసిస్తూనే ఉంటాయి. ఆస్వాదించబడడమే వాటి ప్రాణం. వాటి విషయంలో ధ్వననవ్యాపారం తప్ప మరొక పద్ధతి (వ్యాపారం) ఏదీ లేదు. స్ఖలద్గతిత్వం లేనప్పుడు, అనగా శబ్దం వాటిని బోధించజాలదు అనేది లేనప్పుడు, లక్షణకి కారణమైన ముఖ్యార్థబాధాదికం ఆశంకించతగినది కాదు. అనగా రసాదుల విషయంలో లక్షణావ్యాపారం ప్రవర్తించదు; అది ప్రవర్తించాలంటే ముఖ్యార్థబాధాదులు ఉండాలి. ముఖ్యార్థబాధ ఉండాలంటే అక్కడ ప్రయోగించిన శబ్దానికి అనుకున్న ఆ అర్థం (రసాదిరూపార్థం)

బోధించజాలకపోవడం అనే స్ఖలద్గతిత్వం ఉండాలి. అది లేదు గాన రసాదులు లక్షణావృత్తిగోచరాలు కావు అని భావం.

ఇప్పుడు రసాదుల స్వరూపం సంక్షిప్తంగా చెపుతున్నాడు - ఔచిత్యేనేతి. ఔచిత్యంతో ప్రవర్తించినప్పుడు స్థాయి అయిన రత్యాదిరూపచిత్తవృత్తిని ఆస్వాదిస్తే అది రసం. ఔచిత్యప్రవృత్తమైన వ్యభిచారిభావరూపచిత్తవృత్తిని ఆస్వాదిస్తే అది భావం. సీతా విషయంలో రావణుని రతి వలె అనౌచిత్యంతో ప్రవర్తించినరత్యాది రూపచిత్తవృత్తిని ఆస్వాదిస్తే అది రసాభాసం. "శృఙ్గారాద్ధి భవేద్ధాసః" (శృంగారంనుంచి హాసం పుడుతుంది) అని చెప్పినట్లు అలాంటి శృంగారరసాభాసం హాస్యరసరూపమే అయినా - సామాజికులకు ఈ స్థితి (హాస్యానుభూతిరూపస్థితి) తరవాత ఏర్పడుతుంది. "దూరాకర్షణ" ఇత్యాది శ్లోకంలో (ఇది మళ్లీ రెండవ ఉద్యోతంలో ఉదాహరించబడుతుంది.) ముందు వెనుక లన్నీ విమర్శించి నిర్ణయించని తన్మయీభావదశలో మాత్రం రతియే ఆస్వాదించ బడుతుంది కాబట్టి ఇది శృంగారంగానే భాసిస్తుంది. అప్పుడు తన్మయీభావస్థితిలో ఇది శృంగారాభాసమే. (హాస్యం కాదు. తన్మయీభావస్థితినుంచి బైటకు వచ్చి సహృదయుడు పౌర్వాపర్యవివేకంతో ఇక్కడ ఉన్న రతియొక్క ఆలంబనం అనుచితం అని గ్రహించి నప్పుడు మాత్రం ఆతనికి హాస్యానుభూతి కలగవచ్చును అని భావం). దానికి (రసాభాసకి) అంగమైనది భావాభాసం.

భావశాంతిని ఉదాహరణపూర్వకంగా వివరిస్తున్నాడు - చిత్తవృత్తేః ఇతి- ప్రారంభం అయిన చిత్తవృత్తి యొక్క ప్రశమమే (శాంతించడమే) ఎక్కువగా హృదయాహ్లాదకంగా ఉంటుంది. అందులోని 'భావ' శబ్దంచేతనే భావశాంతిని కూడా గ్రహించడానికి వీలున్నా దానిని (భావశాంతిని) వేరుగా పరిగణించడం జరిగింది. ఎట్లనగా -

ఏకస్మిన్ ఇతి - (ఇది అమరుకంలోని శ్లోకం). ఏకస్మిన్ శయనే - శయనమునందు, సఖ్యాదుల బలవంతంచేత ఒక శయనం మీద పరుండిన తరవాత కూడ అని భావం, పరాఙ్ముఖతయాపరాఙ్ముఖత్వంతో, ఇంకా మనస్సులలో మానం ఉండడం చేత ఎడమొగం పెడమొగాలతో, వీతోత్తరమ్ = పోయిన తరువాతి క్రియలు కలుగునట్లుగా, శయనాధిరోహణానంతరకర్తవ్య క్రియ లేవీ లేకుండా, తామ్యతోః = మనస్సులలో ఉడికి పోతున్న వాళ్లు, అన్యోన్యస్య = ఒండొరులయొక్క, హృది = హృదయమునందు, అనునయే= బ్రతిమిలాడుకొనడము, బ్రతిమిలాడాలనే ఇచ్ఛ అని

అర్థం. స్థితేఽపి = ఉన్నా కూడ, గౌరవమ్ = గౌరవమును, (బింకాన్ని), సంరక్షతోః = రక్షించుకొనుచున్నవాళ్లూ, శనకైః = మెల్లగా, అపాఙ్గవలనామిశ్రీభవచ్చక్షుషోః = నేత్రాంతాలు కదలడంచేత కలిసిన చూపులు గల వాళ్లూ అయిన, దమ్పత్యోః = దంపతులయొక్క, మానకలిః = మానంచేత ఏర్పడిన కలహం, సహాసరభసవ్యావృత్తకణ్ఠగ్రహమ్ = నవ్వుతోను వేగంతోను తిరగడంచేత కలిగిన కంఠాలింగనం కలుగునట్లుగా, భగ్నః = భగ్నమై పోయింది.

ఇక్కడ ఈర్ష్యారోషరూప మైన మానంయొక్క ప్రశమం, ప్రశమరూపంలో సహృదయహృదయహ్లాదకంగా ఉంది. అందుచేత భావంకంటె వేరుగా భావశాంతి చెప్పబడింది అని అర్థం.

లోచనం

న చాయం రసాదిరర్థః "పుత్రస్తే జాతః" ఇత్యతో యథా హర్షో జాయతే తథా. నాపి లక్షణయా. అపి తు సహృదయస్య హృదయసంవాదబలాత్ విభావానుభావప్రతీతౌ తన్మయీభావేనాస్వాద్యమాన ఏవ రస్యమానతైకప్రాణః సిద్ధస్వభావసుఖాదివిలక్షణః పరిస్ఫురతి. తదాహ - ప్రకాశతే ఇతి. తేన తత్ర శబ్దస్య ధ్వననమేవ వ్యాపారః అర్థసహకృతస్యేతి. విభావాద్యర్థోఽపి న పుత్ర జన్మహర్షన్యాయేన తాం చిత్తవృత్తిం జనయతీతి జననాతిరిక్తః అర్థస్యాపి వ్యాపారః ధ్వననమేవోచ్యతే.

బాలానందిని

న చేతి-ఈ రసాదిరూపమైన అర్థం "నీకు కుమారుడు కలిగాడు"' అనే మాట వల్ల ఎలాంటి ఆనందం కలుగుతుందో అలాంటిది కాదు. ఇది లక్షణచేత తెలియదగిన అర్థం కూడా కాదు. మరే మనగా విభావానుభావాల ప్రతీతి కలిగిన పిమ్మట సహృదయునకు హృదయసంవాదబలంవల్ల తన్మయత్వం ఏర్పడడంచేత ఆస్వాదించబడుతుంది. దీనికి ఆస్వాదించబడడం ఒక్కటే ప్రాణం; అనగా ఆస్వాదనమే రసం అని భావం. సిద్ధమైన స్వభావం గల సుఖాదులకంటె విలక్షణమై స్ఫురిస్తుంది. అనగా స్థిరంగా ఉన్న ఏ రత్యాది (సుఖాది) స్థాయిభావాలు ఉంటాయో వాటికంటె విలక్షణంగా స్ఫురిస్తుంది. ఈ విషయాన్నే ప్రకాశతే అన్న పదంచేత చెపుతున్నాడు. అందుచేత రసాదుల విషయంలో అర్థసహకృతమైన (అర్థం సహాయంతో కూడిన) శబ్దానికి ఉన్న ధ్వననమే వ్యాపారం.

విభావాదులైన అర్థాలు కూడా అలాంటి చిత్తవృత్తిని, అనగా రసాద్యనుభూతిని, పుత్రుడు జనించడంవల్ల కలిగిన హర్షం రీతిలో పుట్టించవు. అందుచేత విభావాదిరూపఅర్థాలకి కూడా రసాదుల విషయంలో జననంకంటె (పుట్టించడంకంటె) అతిరిక్తమైన ధ్వననవ్యాపారమే ఉంటుంది.

లోచనం

స్వశబ్దేతి - శృఙ్గారాదిశబ్దేన అభిధావ్యాపారవశాదేవ నివేదితత్వేన. విభావాదీతి. తాత్పర్యశక్త్యేత్యర్థః. తత్ర స్వశబ్దస్యాన్వయవ్యతిరేకౌ రస్యమానతా సారం రసం ప్రతి నిరాకుర్వన్ ధ్వననస్యైవ తావితి దర్శయతి -న చ సర్వత్రేతి. యథా భట్టేన్దురాజస్య -

యద్విశ్రమ్య విలోకితేషు బహుశో నిఃస్థేమనీ లోచనే
యద్గాత్రాణి దరిద్రతి ప్రతిదినం లూనాబ్జినీనాలవత్,
దూర్వాకాణ్డవిడమ్బకశ్చ నిబిడో యత్పాణ్డిమా గణ్డయోః
కృష్ణే యూని సయౌవనాసు వనితాస్వేషైవ వేషస్థితిః.

ఇత్యత్రానుభావవిభావబోధనోత్తరమేవ తన్మయీభవనయుక్త్యా తద్విభావానుభావోచితచిత్తవృత్తివాసనానురఞ్జితస్వసంవిదానందచర్వణాగోచరః అర్థః రసాత్మా స్ఫురత్యేవ అభిలాషచిన్తౌత్సుక్యనిద్రాధృతిగ్లాన్యాలస్యశ్రమస్మృతివితర్కాదిశబ్దాభావేఽపి.

బాలానందిని

స్వశబ్దేతి - శృంగారాదిశబ్దంచేత అభిధావ్యాపారంచేతనే తెలుపబడడంచేత. విభావాదీతి - తాత్పర్యశక్తిచేత విభావాదులను ప్రతిపాదించడం ద్వారా అని అర్థం. ఈ రెండు పక్షాలలో రస్యమానత్వమే సారంగా గల రసాన్ని గూర్చి స్వశబ్దానికి అన్వయవ్యతిరేకాలను నిరాకరిస్తూ అవి(అన్వయవ్యతిరేకాలు) ధ్వననానికే వర్తిస్తాయి అని న చ సర్వత్రేత్యాదికంచేత చూపుతున్నాడు.

వివరణ: 'యత్సత్త్వే యత్సత్త్వమ్ అన్వయః; యదభావే యదభావః వ్యతిరేకః' ఇది ఉంటేనే అది ఉంటుంది అని చెపితే అన్వయం. ఇది లేకపోతే అది ఉండదు అని చెప్పడం వ్యతిరేకం. కార్యకారణభావాదుల్ని స్థాపించడానికి ఈ అన్వయవ్యతిరేకాలను ప్రమాణంగా చూపిస్తారు. నిప్పు ఉంటేనే వేడి ఉంటుంది అని అంటే అది అన్వయం.

నిప్పులేకపోతే వేడి ఉండదు అంటే అది వ్యతిరేకం. ఈ అన్వయవ్యతిరేకాలను పట్టి నిప్పు వేడికి కారణం అని తేలింది. ప్రస్తుతంలో స్వశబ్దవాచ్యత్వం ఉంటేనే రసప్రతీతి ఉంటుంది అనడానికి వీలులేదు. విభావాదినిబంధనం లేనిచోట స్వశబ్దవాచ్యత్వం ఉన్నా రసప్రతీతి లేదు కదా? అట్లే స్వశబ్దవాచ్యత్వం లేకపోతే రసప్రతీతి ఉండదు అనే వ్యతిరేకం కూడా కుదరదు. స్వశబ్దవాచ్యత్వం లేనిచోట కూడా విభావాదినిబంధనం ఉంటే రసప్రతీతి కలుగుతున్నది కదా? అందుచేత అన్వయవ్యతిరేకాలు చూపి స్వశబ్దవాచ్యత్వం రసప్రతీతికి కారణం అని నిరూపించడం కుదరదు. అయితే ధ్వననం ఉంటేనే రసప్రతీతి ఉంటుంది. ధ్వననం లేపోతే రసప్రతీతి ఉండదు అని అన్వయవ్యతిరేకాలు చూపి రసప్రతీతిధ్వనుల మధ్య కార్యకారణభావం స్థాపించవచ్చును అని భావం.

యథా ఇతి - "యద్విశ్రమ్య" ఇత్యాది భట్టేందురాజరచితశ్లోకంలో అభిలాష - చింతా - ఔత్సుక్య - నిద్రా -ధృతి - గ్లాని - ఆలస్య - శ్రమ - స్మృతి - వితర్కాదిశబ్దాలు ప్రయోగించకపోయినా ఏ విధంగా అనుభావవిభావాలను గ్రహించిన వెనువెంటనే తన్మయీభావం ఏర్పడి ఆ విభావానుభావాలకు తగిన (రతిరూప)చిత్తవృత్తియొక్క వాసనచేత (సంస్కారంచేత) రంజితమైన సంవిద్రూపానందచర్వణకు గోచరమైన రసం అనే అర్థం(విషయం) తప్పక స్ఫురిస్తుందో అదే విధంగా స్వశబ్దవాచ్యత్వం లేకపోయినా రసప్రతీతి కలుగుతుంది. అందుచేత అన్ని చోట్లా అవి స్వశబ్దనివేదితాలు కావు అని భావం. "యద్విశ్రమ్య" ఇత్యాదిశ్లోకానికి అర్థం ఇది-

యదితి - విశ్రమ్య= మధ్య ఆగి, బహుశః = అనేక పర్యాయములు, విలోకితేషు = చూడడాలలో, లోచనే = నేత్రాలు, నిఃస్థేమనీ ఇతి యత్ = స్థైర్యం లేనివిగా ఉన్నా యనేది ఏది కలదో, ఈ మొదటిపాదంలో 'అలస' అనే దృష్టి చెప్పబడింది, వ్రీడ, ఔత్సుక్యం గమ్యం అవుతున్నాయి. గాత్రాణి = అవయవాలు, లూనాబ్జినీనాలవత్ = తుంపివేసిన తామరతూడు వలె, ప్రతిదినమ్ = ప్రతిదినమూ, దరిద్రతి ఇతి యత్ = కృశించిపోతున్నా యనేది ఏది కలదో, లూనేత్యాద్యుపమ మ్లానచ్ఛాయత్వాదుల్ని (రంగువాడిపోవడం మొ.) సూచిస్తున్నది. గణ్డయోః = గండస్థలములమీద, దూర్వాకాణ్డవిడమ్బకః = దూర్వకాడను అనుకరించే, పాణ్డిమా = పాండుత్వం, నిబిడః ఇతి యత్ = దట్టంగా ఉంది అనే మాట ఏది గలదో, కృష్ణే = కృష్ణుడు, యూని= యువకు డగుచుండగా, సయౌవనాసు = యౌవనంతో కూడిన, వనితాసు = స్త్రీలలో, వేషస్థితిః - వేషం యొక్క స్థితి, ఏషైవ = ఇదే.

## లోచనం

ఏవం వ్యతిరేకాభావం ప్రదర్శ్య అన్వయాభావం దర్శయతి - యత్రాపీతి. తదితి స్వశబ్దనివేదితత్వమ్. ప్రతిపాదనముఖేనేతి - శబ్దప్రయుక్తయా విభావాదిప్రతిపత్త్యేత్యర్థః. సా కేవలమితి. తథాహి-

"యాతే ద్వారవతీం తదా మధురిపౌ తద్దత్తఝుమ్పానతాం
కాలిన్దీతటరూఢవఞ్జులలతామాలిఙ్గ్య సోత్కణ్ఠయా,
తద్గీతం గురుబాష్పగద్గదగలత్తారస్వరం రాధయా
యేనాన్తర్జలచారిభిర్జలచరైరప్యుత్కమాకూజితమ్".

ఇత్యత్ర విభావానుభావావమ్లానతయా ప్రతీయేతే. ఉత్కణ్ఠా చ చర్వణాగోచరం ప్రతిపద్యత ఏవ. సోత్కణ్ఠాశబ్దః కేవలం సిద్ధం సాధయతి. ఉత్కమిత్యనేన తు ఉక్తానుభావానుకర్షణం కర్తుం సోత్కణ్ఠశబ్దః ప్రయుక్త ఇత్యనువాదోఽపి నానర్థకః; పునరనుభావప్రతిపాదనే హి పునరుక్తిః, అతన్మయీభావో వా.

## బాలానందిని

ఏవమితి - ఈ విధంగా అన్వయవ్యతిరేకాలలో వ్యతిరేకం లేదని చూపించి యత్రాపీత్యాదికంచేత అన్వయం కూడా లేదని చూపుతన్నాడు. తత్ అనగా స్వశబ్దనివేదితత్వం. ప్రతిపాదనముఖేన అనగా శబ్దప్రయుక్తమైన విభావాదిజ్ఞానం ద్వారా అని అర్థం. సా కేవలమితి - అందువల్లనే "యాతే ద్వారవతీమ్" ఇత్యాది శ్లోకంలో విభావానుభావాలు వాడిపోకుండా (స్పష్టంగా) కనబడుతున్నాయి. ఉత్కంఠ కూడ చర్వణకు (ఆస్వాదానికి) గోచరం అవుతూనే ఉంది. ఆస్వాదింపబడుతూనే ఉంది. ఇక్కడ ఉన్న సోత్కణ్ఠాశబ్దం కేవలం (విభావానుభావాలద్వారా) సిద్ధమైన విషయాన్నే మళ్లీ సాధిస్తూన్నది (చెపుతున్నది). అయితే విభావాదుల ద్వారా తెలిసినదానినే మళ్లీ అనువదిస్తూ 'సోత్కణ్ఠా' శబ్దం ప్రయోగించడంలో ఒక ప్రయోజనం లేకపోలేదు. అదే మనగా చెప్పిన ఈ విభావాన్ని "ఉత్కమ్" అనే పదంచేత అనుకర్షించడం(To refer) దీని ప్రయోజనం. అనగా రాధ ఎంత ఉత్కంఠతో విలపించిందంటే అక్క డున్న జలచరాలకి కూడా ఉత్కంఠ జనించే టట్లు ఏడ్చింది అని చెప్పడానికి మొదట ఒకసారి ఉత్కంఠను పేర్కొంటేనే దాన్ని పునర్నిర్దేశం చేయడం కుదురుతుంది కదా? ఇలాంటి ప్రయోజనం ఏదీ లేకుండా మళ్లీ అనుభావాన్ని ప్రతిపాదిస్తే అది పునరుక్తి అవుతుంది; తన్మయీభావం కూడా ఉండదు. 'యాతే' ఇత్యాది శ్లోకానికి అర్థం ఇది-

యాతే ఇతి- మధురిపౌ = శ్రీకృష్ణుడు, ద్వారవతీమ్ = ద్వారకను గూర్చి, యాతే = వెళ్లిపోయినవా డగుచుండగా, తదా = అప్పుడు, తద్దత్తఝుమ్పానతామ్ = అతడు ఇచ్చిన కుదుపుచేత వంగిన, అతడు గోకులంలో ఉన్న రోజులలో విహారసమయంలో పైనుంచి దుమకడంచేత క్రిందికి వంగి ఉన్నది అని అర్థం. కాలిన్దీతటరూఢవఞ్జులలతామ్ = యమునానదీతీరంమీద మొలిచిన వంజులలతను, ఆలిఙ్గ్య = కౌగలించుకొని, సోత్కణ్ఠయా = బెంగతో కూడిన, రాధయా = రాధచేత, గురుబాష్పగద్గద గలత్తారస్వరమ్ = అధికమైన కన్నీళ్లచేత (కంఠంలోనే నిలిపిన బాష్పంచేత) డగ్గుత్తికతో పైకి వస్తున్న ఉచ్చస్వరం కలుగునట్లుగా, తత్ = ఆ విగమైన, గీతమ్ = గానం చేయబడింది; యేన = దేని చేత, అన్తర్జలచారిభిః = నీటిలో సంచరించే, జలచరైః అపి =సారసాదిపక్షులచేత కూడ, జలం పైన సంచరించే హంసాదులే కాకుండా జలంలో సంచరించే సారసాదులు కూడా అని భావం, ఉత్కమ్ = ఉత్కంఠతో కూడినట్లుగా, ఉత్కూజితమ్ = బిగ్గరగా కూతకూయబడెనో.

ఇక్కడ ద్వారకకి వెళ్లిపోయిన శ్రీకృష్ణుడు ఆలంబనవిభావం. యమునా తీరాదులు ఉద్దీపనవిభావాలు. లతాలింగనాదులు అనుభావాలు. వీటివల్ల ఉత్కంఠ అనే వ్యభిచారిభావం గమ్యం అవుతూనే ఉన్నా 'సోత్కణ్ఠయా' అని దానిని స్వశబ్దంచేత చెప్పడం జరిగింది. ఇక్కడ సహృదయులకు కలిగే ఉత్కంఠారూపభావాస్వాదం అనుభావాదిజ్ఞానంవల్లనే జరుగుతుంది. కాని ఉత్కంఠాశబ్దాన్ని ప్రయోగించినంతమాత్రాన జరగదు. అందుచేత ఇది విభావాదివ్యంగ్యమైన ఉత్కంఠను శబ్దంచేత అనువదించడమే. అయితే ఈ అనువాదం నిష్ప్రయోజనం కాదు. ఎందుచేత ననగా రాధకు ఎంత ఉత్కంఠ ఉందో జలచరాదులికి కూడా అంత ఉత్కంఠా ఉందని చెప్పాలని కవి అభిప్రాయం. మళ్లీ వాటికి సంబంధించిన విభావానుభావాదుల్ని చెప్పనవసరం లేకుండా ఆమెకు ఎంత ఉత్కంఠ ఉందో అంత ఉత్కంఠతో అవి కూడా కూజించాయి అని చెప్పడంతో వాటికి సంబంధించిన విభావాదుల్ని కూడా ఊహించుకొనవచ్చు. వాటి విభావాదుల్ని కూడా ప్రతిపాదించవచ్చు కదా అని ప్రశ్న రావచ్చు. దానికి సమాధానం ఏమనగా మళ్లీ అవే విభావాదులు ప్రతిపాదిస్తే పునరుక్తిదోషం వస్తుంది; సహృదయులకు తన్మయీభావం కూడా ఉండదు.

లోచనం

న తు తత్కృతేత్యత్ర హేతుమాహ-విషయాన్తరే ఇతి. 'యద్విశ్రమ్య' ఇత్యాదౌ. న హి యదభావే యద్భవతి తత్కృతం తదితి భావః. అదర్శనమేవ

ద్రఢయతి న హీతి. కేవలశబ్దార్థం స్ఫుటయతి - విభావాదీతి. కావ్య ఇతి. తవ మతే కావ్యతయా ప్రసజ్యమాన ఇత్యర్థః. మనాగపీతి -

"శృఙ్గారహాస్యకరుణరౌద్రవీరభయానకాః,

బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః".

ఇత్యత్ర. ఏవం స్వశబ్దేన సహ రసాదేః వ్యతిరేకాన్వయాభావమ్ ఉపపత్త్యా ప్రదర్శ్య తథైవ ఉపసంహరతి - యతశ్చేత్యాదినా కథంచిదిత్యన్తేన.

అభిధేయమేవ సామర్థ్యం సహకారిశక్తిరూపం విభావాదికం రసధ్వననే శబ్దస్య కర్తవ్యే, అభిధేయస్య చ పుత్రజన్మహర్షభిన్నయోగక్షేమతయా జననవ్యతిరిక్తే దివాభోజనాభావవిశిష్టపీనత్వానుమితరాత్రిభోజనవిలక్షణతయా చానుమానవ్యతిరిక్తే ధ్వననే కర్తవ్యే సామర్థ్యం శక్తిః విశిష్ట సముచిత వాచకసాకల్యమ్ ఇతి ద్వయోరపి శబ్దార్థయోః ధ్వననం వ్యాపారః. ఏవం ద్వౌ పక్షౌ ఉపక్రమ్య ఏకః దూషితః, ద్వితీయస్తు కథంచిద్దూషితః, కథం చిదఙ్గీకృతః. జననానుమానవ్యాపారాభిప్రాయేణ దూషితః, ధ్వననాభిప్రాయేణ అఙ్గీకృతః.

యస్త్వత్రాపి తాత్పర్యశక్తిమేవ ధ్వననం మన్యతే స న వస్తుతత్త్వవేదీ. విభావానుభావప్రతిపాదకే హి వాక్యే తాత్పర్యశక్తిః భేదే సంసర్గే వా పర్యవస్యేత్. న తు రస్యమానతాసారే రసే ఇత్యలం బహునా.

ఇతిశబ్దో హేత్వర్థే "ఇత్యపి హేతోః తృతీయోఽపి ప్రకారో వాచ్యాద్భిన్న ఏవ" ఇతి సంబన్ధః. సహేవేతి - ఇవశబ్దేన విద్యమానోఽపి క్రమో న సంలక్ష్యతే ఇతి దర్శయతి - అగ్ర ఇతి - ద్వితీయోద్ద్యోతే. 4

బాలానందిని

న చేతి - "న చ తత్కృతా" (రసాదిప్రతీతి స్వశబ్దగ్రహణంచేత కలగడంలేదు) అనడానికి "విషయాన్తరే" అని హేతువును చెపుతున్నాడు. "యద్విశ్రమ్య" ఇత్యాది విషయాంతరంలో అని అర్థం. న హీతి - ఏది లేకపోయినా ఏది ఉంటుందో అది దానివల్ల చేయబడింది కాదు కదా అని భావం. నహి ఇత్యాదిచేత రసప్రతీతి కనబడకపోవడాన్నే దృఢం చేస్తున్నాడు. "కేవలశృఙ్గారాది"లో ఉన్న 'కేవల' శబ్దార్థాన్ని విభావాది ఇత్యాదికంచేత స్పష్టీకరిస్తున్నాడు. కావ్యే ఇతి – ఇక్కడ 'కావ్యే' అన్నదానికి నీ

మతం ప్రకారం కావ్యం అనడానికి అవకాశం ఏర్పడేదానిలో అని అర్థం. నిజానికి అది కావ్యం కాదని అభిప్రాయం. మనాగపీతి (కొంచెం కూడ). 'శృఙ్గారహాస్య' ఇత్యాది శ్లోకంలో అన్ని రసాల పేర్లు చెప్పినా ఏ రసమూ కూడ ప్రతీయమానం కాదు కదా అని భావం. ఏవమితి - ఈ విధంగా రసాదులకీ స్వశబ్దాలకీ మధ్య వ్యతిరేకమూ, అన్వయమూ కూడ లేదని యుక్తిచేత ప్రదర్శించి "యతశ్చ" మొదలు "కథఞ్చిత్" వరకు ఉన్న వాక్యంచేత ఆ విధంగానే (వ్యతిరేకాన్వయాలు లేవని చెపుతూ) ఉపసంహరిస్తున్నాడు.

మూలంలో "అభిధేయసామర్థ్యాక్షిప్తత్వమేవ రసాదీనామ్" అని చెప్పబడింది. అనగా రసాదులు అర్థసామర్థ్యంచేతనే ఆక్షిప్తాలవుతాయి అని అర్థం. అయితే కేవలం అర్థ సామర్థ్యమే కాదు శబ్దసామర్థ్యం కూడా గ్రహించాలి అని చెప్పడంకోసం వివరిస్తున్నాడు- అభిధేయమేవేతి. శబ్దం రసాదిధ్వననం చేయవలసి ఉన్నప్పుడు విభావాదిరూపమైన అర్థమే సహకారిశక్తిరూప మైన సామర్థ్యంగా ఉంటుంది. అనగా శబ్దం రసాదుల్ని ధ్వనింపచేసేటప్పుడు విభావాదిరూపార్థం ఆ శబ్దానికి సహకరించే శక్తిగా ఉంటూ ఆ శబ్దానికి ఉన్న సామర్థ్యం అని చెప్పబడుతుంది అని భావం. అదేవిధంగా అర్థం కూడా ధ్వననం చేయవలసి ఉంది. ఈ ధ్వననం, పుత్రజన్మవల్ల కలిగే హర్షంకంటె భిన్నమైన స్వరూపం (భిన్నయోగక్షేమ) కలదవడంచేత పుట్టించడంకంటె భిన్న మైనది. అనగా విభావాద్యర్థం రసాదిప్రతీతిని కలిగిస్తుంది. ఈ రసాదికం పుత్రజన్మజన్యహర్షం వంటిది కాదు. విభావాద్యర్థంవల్ల కలిగే రసాదిప్రతీతి పుత్రజన్మవల్ల హర్షం పుట్టడం వంటిదికాదు అని అర్థం. దివేతి - అదే విధంగా ఈ ధ్వననం పగలు భోజనం లేకపోయినా బలిసి ఉండడంచేత అనుమితమైన (ఊహించబడిన) రాత్రిభోజనంకంటె విలక్షణం అవడంచేత అనుమానంకంటె భిన్న మైనది. అర్థం ఇలాంటి ధ్వననం చేయాలంటే దానికి ఒక సామర్థ్యం ఉండాలి. విశిష్టాలైన, తగిన శబ్దాల సాకల్యమే (ఉచితశబ్దాల కొరత లేకపోవడమే) ఆ సామర్థ్యం, అనగా శక్తి. ఈ విధంగా ధ్వననం అనే వ్యాపారం శబ్దార్థాలు రెండింటిలోనూ కూడా ఉంటుంది.

వివరణ:- కొందరు 'అర్థాపత్తి' అనే ప్రమాణాన్ని అనుమానంకంటె భిన్నంగా అంగీకరిస్తారు. "పీనో దేవదత్తః దివా న భుఙ్క్తే" (దేవదత్తుడు బాగా బలిసి ఉంటాడు; అతడు పగలు భోజనం చెయ్యడు) అనేది ప్రసిద్ధోదాహరణం. అసలే భోజనం చేయనివాడు బలిసి ఉండడం కుదరదు. అందుచేత పగలు భోజనం చేయకపోయినా అతడు రాత్రి భోజనం చేస్తాంటాడు అని ఊహించవచ్చు. దీనిని కూడా అనుమానప్రమాణంలో చేర్చివేయవచ్చు నని నైయాయికాదుల అభిప్రాయం.

అభినవగుప్తుని మతం కూడా అదే అయి ఉంటుంది.

ఏవమితి - ఈ విధంగా స్వశబ్దనివేదితత్వమూ, విభావాదిప్రతిపాదన ద్వారా బోధ్యత్వమూ అని రెండు పక్షాలు ఉపక్రమించి మొదటిది దూషించబడింది. రెండవది ఒక విధంగా దూషించబడింది, ఒక విధంగా అంగీకరించబడింది. జననానుమాన వ్యాపారం అనే అభిప్రాయంచేత దూషించబడింది. ధ్వననాభిప్రాయంచేత అంగీకరించబడింది. అనగా - పుత్రజననశ్రవణంచేత హర్షజననం అనుమేయ మైనట్లు (ఊహించబడినట్లు) విభావాద్యర్థంచేత రసం అనుమేయం అవుతుంది అన్న అంశం దూషించబడింది. విభావాదులచేత రసం ధ్వన్యమానం అవుతుంది అనే అంశం అంగీకరించబడింది. మొత్తంమీద విభావాద్యర్థాల ఆవశ్యకత అంగీకరించబడింది అని భావం.

"రసాదులు అభిధేయసామర్థ్యం చేతనే ఆక్షిప్తా లవుతాయి" అని ప్రతిపాదించిన వృత్తికారుని అభిప్రాయం ప్రకారం తాత్పర్యశక్తియే ధ్వననవ్యాపారం అన్నట్లు కనబడుతుంది. దీనిని తాత్పర్యశక్తికంటె భిన్నమైన నాల్గవ కక్ష్యలో చేరిన వ్యాపారంగా అతడు అంగీకరిస్తున్నట్లు లేదు. వాచ్యార్థాల అన్వయం సరిగా కుదరకపోతే కుదిరేటట్లు చేసి అర్థం చెప్పే వ్యాపారమే కదా తాత్పర్యవృత్తి అనగా? అని కొందరు చెప్పిన దానిని ఖండిస్తున్నాడు - యస్తు ఇత్యాది - ఇక్కడ కూడా 'ధ్వననం' అనేది తాత్పర్యశక్తియే అని ఎవడైతే అన్నాడో అతడు వస్తుతత్త్వం తెలిసినవాడు కాదు. విభావానుభావాలను ప్రతిపాదించే వాక్యంలో ఉన్న తాత్పర్యశక్తి భేదంలో నైనా పర్యవసిస్తుంది; లేదా సంసర్గంలో పర్యవసిస్తుంది. అంతే కాని రస్యమానతయే ప్రధానంగా గల రసంలో పర్యవసించదు. సరే ఇది ఇంతటితో చాలు.

వివరణ:- "గామ్ ఆనయ" (గోవును తీసికొనిరా) ఇత్యాదివాక్యాలలో ఇతరకర్మలకంటె, ఇతరక్రియలకంటె భేదమే వాక్యార్థం; దీన్ని తాత్పర్యశక్తి బోధిస్తుంది. అనగా నువ్వు తీసికొని రావలసింది ఘటాదుల్ని కాదు; గోవును తీసికొనిరావాలి అని ఇతర మైన ఘటాదికర్మలనుండి భేదం బోధించబడుతుంది. అలాగే నువ్వు చేయవలసింది తీసికొనివెళ్లడం మొదలైన పనికాదు; తీసుకొనిరావడం అనే పని అని ఇతరక్రియలకంటె భేదం బోధించబడుతుంది. ఈ విధంగా బోధించబడే కర్మక్రియాదిభేదమే వాక్యార్థం. 'గామ్' అనే పదానికీ, 'ఆనయ' అనే పదానికీ సంసర్గం (పరస్పరాన్వయం) అర్థాత్ సిద్ధం అవుతుంది. అనగా వాటి అర్థాలు తెలిసిన తరవాత మానసికంగా వీటి అర్థాల్ని పట్టి వాటి అన్వయం తెలిసిపోతుంది అని కొందరి మతం. పదార్థపరస్పరసంబంధరూపమైన

సంసర్గమే తాత్పర్యవృత్తిబోధ్యమైన వాక్యార్థం, భేదం అర్థం, అనగా అర్థాత్సిద్ధం అని మరికొందరి మతం.

ఈ విధంగా తాత్పర్యశక్తికి భేదాన్ని కాని, సంసర్గాన్ని కాని బోధించే శక్తి మాత్రమే ఉంది కాని రస్యమానతాప్రాణమైన రసాన్ని బోధించే శక్తి లేదు. అందువల్ల చతుర్థకక్ష్యానివిష్టమైన ధ్వననాన్ని అంగీకరించవలసిందే అని భావం.

ఇతీతి - 'ఇతి తృతీయభేదోఽపి' అన్న చోట ఇతి శబ్దానికి 'ఈ కారణంవల్ల' అని అర్థం. 'ఈ హేతువువల్ల కూడా మూడవప్రకారం(రసాదికంకూడా) వాచ్యంకంటె భిన్నమే' అని అన్వయం. సహేవేతి - 'ఇవ'శబ్దం ప్రయోగించడంచేత నిజంగా క్రమం ఉంది కాని అది గుర్తింపబడదు అని చూపుతున్నాడు. అగ్రే అనగా ద్వితీయోద్ద్యోతంలో.

## ధ్వన్యాలోకం

కా. కావ్యస్యాత్మా స ఏవార్థస్తథా చాదికవేః పురా,
క్రౌఞ్చద్వన్ద్వవియోగోత్థః శోకః శ్లోకత్వమాగతః. 5

వివిధవాచ్యవాచకరచనాప్రపఞ్చచారుణః కావ్యస్య స ఏవార్థః సారభూతః. తథా చాదికవేః వాల్మీకేః నిహతసహచరీవిరహకాతర క్రౌఞ్చాక్రన్దజనితః శోక ఏవ శ్లోకతయా పరిణతః. శోకో హి కరుణస్థాయిభావః. ప్రతీయమానస్య చాన్యభేదదర్శనేఽపి రసభావముఖేనైవ ఉపలక్షణం ప్రాధాన్యాత్.

### బాలానందిని

కావ్యస్యేతి - సః అర్థః ఏవ = ఆ ధ్వన్యమాన (రసరూప) అర్థమే, కావ్యస్యకావ్యంయొక్క, ఆత్మా = ఆత్మ. తథా చ = ఆ విధంగానే, అనగా కావుననే, పురా = పూర్వం, క్రౌఞ్చద్వన్ద్వవియోగోత్థః = క్రౌంచపక్షుల ద్వంద్వంయొక్క వియోగంవల్ల పుట్టిన, శోకః = శోకం, శ్లోకత్వమ్ = శ్లోకత్వాన్ని, ఆగతః = పొందినది.

వివిధేతి - అనేకవిధాలైన వాచ్యాలయొక్క శబ్దాలయొక్క రచనావిస్తారంచేత సుందరమైన కావ్యానికి ఆ అర్థమే సార మైనది. ఇందుకు నిదర్శనం ఏమనగా (తథా చ) చంపబడిన సహచారిణియొక్క విరహంవల్ల దుఃఖిస్తూన్న క్రౌంచపక్షియొక్క ఏడుపుచేత పుట్టించబడినదైన ఆదికవి అయిన వాల్మీకియొక్క శోకమే శ్లోకరూపంగా పరిణమించింది.

శోకం కరుణకి స్థాయిభావం కదా? అందుచేత శ్లోకానికి అనగా కావ్యానికి, రసం సారమైనది అని తెలుస్తూన్నది అని భావం.

ప్రతీయమానస్యేతి - ప్రతీయమానార్థానికి (ధ్వనించబడే అర్థానికి) ఇతర భేదాలున్నా, అనగా వస్తుధ్వని - అలంకారధ్వనులు ఉన్నా, రస - భావాలు ప్రధానం అయిన వవడంచేత వాటి ద్వారానే నిర్దేశించడం (గ్రహణం) జరుగుతుంది.

లోచనం

ఏవం "ప్రతీయమానం పునరన్యదేవ" ఇతీయతా ధ్వనిస్వరూపం వ్యాఖ్యాతమ్. అధునా కావ్యాత్మత్వమితిహాసవ్యాజేన చ దర్శయతి - కావ్యస్యాత్మా ఇతి. స ఏవ ఇతి- ప్రతీయమానమాత్రే ఽపి ప్రక్రాన్తే తృతీయ ఏవ రసధ్వనిరితి మన్తవ్యమ్; ఇతిహాసబలాత్ ప్రక్రాన్తవృత్తిబలాచ్చ. తేన రస ఏవ వస్తుతః ఆత్మా, వస్త్వలంకారధ్వనీ తు సర్వథా రసం ప్రతి పర్యవస్యేతే ఇతి వాచ్యాదుత్కృష్టౌ తౌ ఇత్యభిప్రాయేణ "ధ్వనిః కావ్యాత్మా" ఇతి సామాన్యేనోక్తమ్.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా "ప్రతీయమానం పునరన్యదేవ" అనేదానిచేత ధ్వనిస్వరూపం వివరించబడింది. ఇప్పుడు ఇతిహాసం చెప్పడం అనే వ్యాజంచేత ధ్వనియే కావ్యాత్మ అని చూపుతున్నాడు. కావ్యస్యాత్మా ఇత్యాది శ్లోకంలో 'స ఏవ' (అదే) అని మొత్తం ప్రతీయమానార్థాన్ని అంతనీ గూర్చి, అనగా ధ్వని అని చెప్పబడే మూడు విధాల ధ్వనులను గూర్చి, ప్రారంభించినా, చెప్పిన ఇతిహాసాన్నిపట్టి, ప్రారంభించిన వృత్తిగ్రంథాన్ని పట్టీ కూడ (ఆత్మగా చెప్పబడేది) మూడవదైన రసధ్వనియే అని గ్రహించాలి. అందుచేత నిజానికి రసం ఒక్కటే ఆత్మ. అయితే వస్త్వలంకారధ్వనులు అన్ని విధాలా చివరికి రసంలోనే పర్యవసిస్తాయి, రసధ్వనికి ఉపకరిస్తూ దానిలోనే ఇమిడిపోతాయి. అందుచేత అవి వాచ్యార్థంకంటె ఉత్కృష్టమైనవి అనే అభిప్రాయంచేత "ధ్వనిః కావ్యస్య ఆత్మా" అని సామాన్యంగా (అన్నివిధాల ధ్వనులకీ వర్తించేటట్లు) చెప్పబడింది.

లోచనం

శోక ఇతి - క్రౌఞ్చస్య ద్వన్ద్వవియోగేన, సహచరీహననోద్భూతేన సాహచర్యధ్వంసేన, ఉత్థితః యః శోకః స్థాయిభావః, నిరపేక్షభావత్వాత్ విప్రలమ్భశృఙ్గారోచితరతిస్థాయిభావాదన్య ఏవ. స ఏష తథాభూతవిభావ

తదుత్థాక్రన్దాద్యనుభావచర్వణయా హృదయసంవాదతన్మయీభావనక్రమాదా స్వాద్యమానతాం ప్రతిపన్నః కరుణరసరూపతాం, లౌకికశోకవ్యతిరిక్తాం స్వచిత్తద్రుతిసమాస్వాద్యసారాం ప్రతిపన్నః రసపరిపూర్ణకుమ్భోచ్ఛలనవత్ చిత్తవృత్తినిష్యన్దస్వభావవాగ్విలాపాదివచ్చ సమయానపేక్షత్వేఽపి చిత్తవృత్తి వ్యఞ్జకత్వాత్ ఇతి నయేన, అకృతకతయైవ ఆవేశవశాత్ సముచితశబ్దఛన్దో వృత్తాదినియన్త్రితశ్లోకరూపతాం ప్రాప్తః-

"మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః,

యత్క్రౌఞ్చమిథునాదేకమవధీః కామమోహితమ్". ఇతి

న తు మునేః శోక ఇతి మన్తవ్యమ్. ఏవం హి సతి తద్దుఃఖేన సోఽపి దుఃఖిత ఇతి కృత్వా రసస్యాత్మతేతి నిరవకాశం భవేత్. న చ దుఃఖసంతప్తస్య ఏషా దశా ఇతి. ఏవం చర్వణోచితశోకస్థాయిభావాత్మక కరుణరససముచ్ఛలన స్వభావత్వాత్ స ఏవ కావ్యస్యాత్మా, సారభూతస్వభావః అపరశాబ్దవైలక్షణ్య కారకః. ఏతదేవోక్తం హృదయదర్పణే -

"యావత్పూర్ణో న చైతేన తావన్నైవ వమత్యముమ్" ఇతి.

బాలానందిని

శోకః ఇతి :- ఇక్కడ "క్రౌఞ్చద్వన్ద్వవియోగోత్థః" అనే పదానికి క్రౌంచపక్షుల జంటయొక్క వియోగంవల్ల (పరస్పరవియోగంవల్ల) జనించిన అని అర్థం. ఆ అర్థంలోనే కారికాకారుడు ప్రయోగించి ఉంటాడు. అయితే అభినవగుప్తుడు తాను ప్రతిపాదించబోయే విషయానికి అనుగుణంగా ఈ సందర్భంలోని కొన్ని పదాల అర్థాలు మార్చి, కొన్నింటికి క్రొత్త భావాలు చెప్పి వ్యాఖ్యానిస్తున్నాడు. "ద్వన్ద్వస్య వియోగః ద్వన్ద్వవియోగః; క్రౌఞ్చస్య ద్వన్ద్వవియోగః క్రౌఞ్చద్వంద్వవియోగః; తస్మాత్ ఉత్థః" అని విగ్రహం గ్రహించి అర్థం చెపుతున్నాడు. క్రౌంచపక్షియొక్క, ద్వన్ద్వవియోగేన = సహచారిణి అయిన ఆడ క్రౌంచపక్షిని చంపివేయడంవల్ల కలిగిన సాహచర్యవినాశంచేత, అనగా జంటగా ఉండడానికి విఘాతం కలగడంచేత, ఉదయించిన (పురుషక్రౌంచపక్షిలోని) ఏస్థాయిభావమైన శోకం ఉందో అది. నిరపేక్షేతి - అయితే ఇక్కడ ఉన్న స్థాయిభావం శోకమే కాని విప్రలంభశృంగారానికి తగిన రతి అనే స్థాయిభావం కాదు. ఎందువలన అనగా మళ్లీ కలిసే ఆశ ఉన్నప్పుడే విప్రలంభానికి అవకాశం. అది లేనప్పుడు శోక -

కరుణలకే అవకాశం అని భావం. స ఏవేతి - అదే (పురుషక్రౌంచగతమైన శోకరూపస్థాయి భావమే) ఆ విధమైన, సాహచర్యం నశించిన క్రౌంచపక్షి అనే విభావంయొక్క, దానినుంచి బయలుదేరిన అరపు మొదలైన (దాని ఏడుపు మొదలైన) అనుభావాలయొక్క చర్వణచేత (ఆస్వాదించడంచేత), హృదయసంవాదము, తన్మయీభావమూ, మొదలైనవాటి క్రమంవల్ల ఆస్వాద్య మానత్వాన్ని పొంది (ఆస్వాదించబడినదై) కరుణరసరూపత్వాన్ని పొందింది. ఇది లౌకికమైన శోకంకంటె భిన్నం అయినది. తన (సహృదయుని) చిత్తం ద్రవించడంచేత ఆస్వాదించదగిన సారం కలది (ఈ కరుణరసం). నీటితో నిండిన కుంభం తొణికి నట్లు చిత్తవృత్తిస్రావరూపాలైన వాక్కులు, విలాపాదులవలె, "సమయాపేక్ష లేకపోయినా చిత్తవృత్తిని వ్యంజింపచేస్తాయి" అనే న్యాయంచేత(అనే తీరున) కృత్రిమత్వం ఏమీ లేకుండానే ఆవేశవశంవల్ల ఉచితమైన ఛందస్సు, వృత్తం మొదలైనవాటితో నియంత్రితం(నియమబద్ధం చేయబడిన) "మా నిషాద" ఇత్యాదిశ్లోక రూపం దాల్చింది. న తు ఇతి :- అంతేనే కాని మునికి శోకం కలిగిం దని అనుకొనకూడదు. అలా అన్నట్లయితే దాని దుఃఖంచేత అతనికి కూడా దుఃఖం కలిగింది అని చెప్పవలసి ఉంటుంది. కాబట్టి రసమే ఆత్మ అని చెప్పడానికి అవకాశం ఉండదు. మరొక విషయం ఏ మనగా దుఃఖపీడితునికి ఈ స్థితి ఉండదు. అనగా అతడు శాపవచనం పలకడం గాని, శ్లోకం రచించడంగాని కుదరదు. అందుచేత ఆ శ్లోకం చర్వణకు తగిన స్థాయిభావరూపమైన కరుణరసంయొక్క పైకిపొంగడమే స్వరూపంగా కలది కాబట్టి, (అనగా పైకి ఉబికి వచ్చిన కరుణరసం పొంగే ఆ శ్లోకం అని భావం) ఆ కరుణరసమే కావ్యాత్మ; కావ్యానికి అంతకీ సారమైన స్వభావం గలది. ఇతర శాబ్దజ్ఞానాలకంటె (శబ్దాలవల్ల కలిగే ఇతరజ్ఞానంకంటె) విలక్షణం అయింది. ఏతదేవేతి-ఈ విషయమే - "దానితో (రసంతో) పూర్తిగా నిండేవరకూ దానిని పైకి కక్కజాలడు" అని హృదయదర్పణం లో చెప్పబడింది.

వివరణ:- ఇక్కడ ఒకటి రెండు విషయాలు పరిశీలించవలసి ఉంది. ప్రస్తుతం మనకు లభించే రామాయణంలో ఉన్న పాఠాన్ని అనుసరించి బోయవాడు మగపక్షిని చంపినట్లు, అప్పుడు ఆడపక్షి ఏడుస్తూండగా వాల్మీకి హృదయంలో శోకం కలిగినట్లు తెలుస్తున్నది. ఆనందవర్ధనుడు, అభినవగుప్తుడు కూడ చంపబడ్డది ఆడపక్షియే అని వ్రాస్తున్నారు. కాని అభినవగుప్తుడు ఉదాహరించిన ఇప్పుడు రామాయణంలో కూడా లభ్యం అవుతున్న 'మా నిషాద' ఇత్యాది శ్లోకాన్నిపట్టి 'ఏకం కామమోహితమ్ అవధీః' అని ఉండడంచేత ఆ చంపబడింది పురుషపక్షియే అని తెలుస్తూంది. రామాయణంలోని

పూర్వాపరశ్లోకాలను కొన్నింటిని పరిశీలించినా కూడ మగపక్షియే చంపబడినట్లు, అది చూచి వాల్మీకికి దుఃఖం కలిగినట్లు స్పష్టంగా తెలుస్తూన్నది. కాశ్మీరప్రతిలో ఉన్న ఈ ఘట్టంలో మగపక్షి అన్న చోట అల్లా ఆడపక్షి అని ఉండి ఉండవచ్చును. మానిషాదేత్యాది శ్లోకంలో కూడా "యత్ క్రౌఞ్చమిథునాదేకామవధీః కామమోహితామ్" అనే పాఠం ఉండి ఉండవచ్చు.

దీనికంటె ప్రధానమైనదీ ప్రాచీనులు కాని ఆధునికులు గాని అయిన ఏ వ్యాఖ్యాతలూ స్పృశించనిదీ అయిన మరొక అంశం ఉంది. "నిషాదుడు ఒకపక్షిని చంపివేయడంతో ఆ క్రౌంచపక్షుల జంటకి వియోగం ఏర్పడింది, అది చూడగానే మునికి శోకం కలిగింది" అని మాత్రమే "క్రౌఞ్చద్వన్ద్వవియోగోత్థః శోకః" అనే వాక్యంవల్ల స్పష్టంగా లభించే అర్థం. ధ్వనికారుడు వ్రాసిన ఈవాక్యానికి మూలం రామాయణంలోని వాక్యాలే.

"శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా"(బా.కాం. 2.18)

"సోఽనువ్యాహరణాద్భూయః శోకః శ్లోకత్వమాగతః" (బా.కాం. 2.40)

ఈవిషయం ఆనందవర్ధనుడే చతుర్థోద్ద్యోతంలో స్పష్టంగా చెప్పాడు - "రామాయణే హి కరుణోరసః స్వయమాదికవినా సూచితః - 'శోకః శ్లోకత్వ మాగతః' ఇత్యేవంవాదినా" (ధ్వ.ఆ.4.5వ కారికవృత్తి)."నిషాదవిద్ధాణ్డజదర్శనోత్థః శ్లోకత్వమాపద్యత యస్య శోకః" (రఘు.14.70) అనే కాళిదాసవాక్యానికి కూడా అవే మూలం. నిషాదుడు చంపేసిన పక్షిని చూడగానే మునికి శోకం కలిగింది అనే దాని భావం కూడ. చంపినంత మాత్రాన చూచేవాళ్లకి కొంచెం శోకం కలిగితే కలగవచ్చు; చంపబడినదానిని గూర్చి రెండవది దీనంగా ఏడుస్తూంటే చూచేవాళ్లకి తప్పకుండా శోకం, జాలీ అధికంగా కలుగుతాయి. ఈ భావాన్నే వృత్తికారుడు "నిహతసహచరీవిరహకాతరక్రౌఞ్చాక్రన్దజనితః శోకః ఏవ" అనే మాటలలో వివరించాడు. దీనిని పట్టి పక్షుల విరహం చూడగానే మునికి శోకం కలిగింది. అతని శోకం శ్లోకరూపంలో బైటకి అభివ్యక్తీకరించబడింది. ఇది శ్లోకరూపంలో రావడం కూడా అప్రయత్నంగానే జరిగింది; బ్రహ్మదేవుడే అలా పలికించాడు అని అక్కడ పూర్వాపరాల పరిశీలనవల్ల స్పష్టంగా తెలుస్తూనే ఉంది.

కాని అభినవగుప్తుడు ఇక్కడ మునికి కలిగినది శోకం కాదు; కరుణరసమే అని నిరూపించడానికి గట్టిగా ప్రయత్నించాడు. మునికి తీవ్రమైన శోకం కలిగింది; శోకం కరుణరసానికి స్థాయిభావం. దాన్ని ఈ శ్లోకంద్వారా ఆవిష్కరించాడు. అందుచేత కావ్యానికి రసం ఆత్మ అని మాత్రమే ఆనందవర్ధనుని అభిప్రాయం. అభినవగుప్తుడు

మాత్రం - మగపక్షికి ఆడపక్షితో ఉన్న ద్వంద్వం (జోడుకట్టి ఉండడం)బోయవానిచేత నశింపచేయబడింది. దానితో దాని మనసులో శోకం పుట్టింది. ఆ శోకాన్ని చూస్తూంటే ముని హృదయంలో కరుణరసస్ఫూర్తి కలిగింది. అందుచేత ఆదికవి మనస్సులో పుట్టిన శోకం, అనగా కరుణ, శ్లోకంగా మారింది అని అర్థం అని ప్రతిపాదించడానికి చాలా శ్రమపడ్డాడు. ఈ అర్థం రావడంకోసం 'ద్వన్ద్వవియోగోత్థః' అన్నచోట క్లిష్టకల్పన చేసి సాహచర్యధ్వంసవల్ల పక్షిలో కలిగిన అని అర్థం చెప్పాడు.

ఈ విధంగా క్లిష్టవ్యాఖ్యానం చేయడానికి కారణం రసస్వరూపవిషయంలో ఆనందవర్ధన అభినవగుప్తుల మధ్య అభిప్రాయభేదం ఉండడమే.

ఆనందవర్ధనునివరకు ఉన్న, లోల్లట శంకుకాది ఆలంకారికుల అభిప్రాయం ప్రకారం, భవభూతిమురార్యాది కవుల అభిప్రాయం ప్రకారమూ కూడా రసానికి ఆశ్రయం నాయకాదులే. నాయకాదులలో ఉన్నట్లు నిబద్ధమైన రసాన్ని తెలుసుకొని సహృదయులు ఆనందిస్తారు. అంతవరకే. రసం నాయకాద్యాశ్రితంకాదు, సామాజిక - పరిశ్రోత్రాద్యాశ్రితం అని మొట్టమొదట స్థాపించినవాడు భట్టనాయకుడు. అక్కడక్కడ భట్టనాయకుణ్ణి విమర్శిస్తూనే ఉన్నా చాలా వరకు కొన్ని సాధారణీకరణ - రసాశ్రయాది ప్రధానవిషయాలలో అభినవగుప్తుడు అతనినే అనుసరించాడు(రసాశ్రయవిషయంలో ఆనందవర్ధనాభినవగుప్తుల మధ్య ఉన్న మతభేదాన్ని గూర్చి అస్మదీయకావ్యప్రకాశవ్యాఖ్య బాలానందిని ప్రస్తావన 42-44 పేజీలలో సవిస్తరంగా చర్చించబడింది) అందుచేత అభినవగుప్తుడు తన మతాన్ని అనుసరించి పక్షిగతస్థాయ్యాదుల జ్ఞానం ద్వారా మునిలో కరుణరసం కలిగింది అని ప్రతిపాదించడానికి పాటుబడ్డాడు.

నిజానికి మునిలో కరుణరసం పుట్టడానికి ఆలంకారికశాస్త్రం ఒప్పుకోదు. లోకంలో ఉన్న కారణ-కార్య-సహకారులకే కావ్యనాట్యాలలో విభావానుభావ వ్యభిచారులని పేరు. వాటివల్లనే రసనిష్పత్తి కలుగుతుంది అని కదా సిద్ధాంతం? అనగా కావ్యనాటకాదులలో సమర్పితాలైన విభావాదుల ద్వారానే సహృదయునికి రసానుభూతి కలుగుతుంది అని అర్థం. ప్రత్యక్షంగా స్త్రీపురుషాదిరతి చూస్తే, ఎవరైనా తిట్టుకుంటూండగా, కొట్టుకుంటూండగా చూస్తే అక్కడ శృంగార - రౌద్ర - వీరాదిరసానుభూతి కలగదు. అవన్నీ లౌకికానుభూతులే కదా? రసానుభూతి కావ్యనాట్యాదిజన్యం అవడంచేత అలౌకికం కదా. ప్రస్తుతంలో ముని పక్షిని వ్యాధుడు చంపడం, అది పడిపోవడం, అందుకు రెండవ పక్షి ఏడవడం అనే వాటిని స్వయంగా ప్రత్యక్షంగా చూస్తున్నాడు. అలా ప్రత్యక్షంగా లోకంలో కనబడేవి విభావాదులు అనడానికి వీలులేదు. వాటివల్ల ద్రష్టకి

కలిగే అనుభూతి రసం అనడానికి వీలులేదు. అలా అంగీకరించడం అభినవగుప్తుడే అనేకస్థలాలలో చేసిన రసస్వరూపప్రతిపాదనకు విరుద్ధం. అందుచేత ఇక్కడ అభినవగుప్తుడు చెప్పిన దంతా ప్రౌఢివాదమాత్రమే. ఆనందవర్ధనాభిమతసిద్ధాంతానుగుణం కాదు. క్రౌంచవధ చూడగానే మునికి శోకరూపభావావేశం కలిగింది; ఆ ఆవేశాన్ని శ్లోకంలో నిబంధించాడు. అందుచేత శ్లోకానికి, శ్లోకసమూహాత్మకకావ్యానికి భావావేశప్రకటనమే, ప్రయోజనం (అది భావస్థితిలోనే ఉండిపోవచ్చు, తీవ్రమైన రసస్థితి పొందవచ్చు) అని మాత్రమే ఆనందవర్ధనుని అభిప్రాయం. మరొక విషయం ఏమనగా తిర్యగాదిగతమైన రత్యాదికం స్థాయిభావం అయినప్పుడు "తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా" అని మమ్మటుడు చెప్పినట్లు అది రసాభాసమే కావాలి కాని రసం కాకూడదు.

"మా నిషాద" ఇత్యాదిశ్లోకానికి అర్థం - నిషాద = ఓ బోయవాడా! యత్ = ఎందువలన, క్రౌఞ్చమిథునాత్ = క్రౌఞ్చపక్షుల జంటనుండి, కామమోహితమ్ = కామంచేత మోహింపబడి ఉన్న, ఏకమ్ = ఒక పక్షిని, అవధీః = చంపినావో అందువలన, శాశ్వతీః = శాశ్వతమైన, సమాః = సంవత్సరములను (చాలా కాలంపాటు) త్వమ్ = నువ్వు, ప్రతిష్ఠామ్ = ప్రతిష్ఠను (జీవించి ఉండుటను) మా అగమః = పొందకుండెదవుగాక.

### లోచనం

అగమ ఇతి ఛాన్దసేనాడాగమేన. సఏవేత్యేవకారేణ ఇదమాహ నాన్య ఆత్మేతి. తేన యదాహ భట్టనాయకః -

శబ్దప్రాధాన్యమాశ్రిత్య తత్ర శాస్త్రం పృథగ్విదుః,
అర్థతత్త్వేన యుక్తం తు వదన్త్యాఖ్యానమేతయోః,
ద్వయోర్గుణత్వే వ్యాపారప్రాధాన్యే కావ్యధీర్భవేత్.

ఇతి, తదపాస్తమ్. వ్యాపారో హి యది ధ్వననాత్మా రసనాస్వభావః, తత్ న అపూర్వమ్ ఉక్తమ్. అథాభిధైవ వ్యాపారః తథాప్యస్యాః ప్రాధాన్యం నేత్యావేదితం ప్రాక్.

### బాలానందిని

అగమ ఇతి:- "అగమః' - "గమ్ గతౌ" అనే ధాతువు లుఙ్ మధ్యమపురుషైక వచనం. లుఙ్‌లో ధాతువుకు ముందు 'అట్' (అ) అనేది ఆగమంగా వచ్చి చేరి 'అగమః' అయినది. కాని 'మాఙ్' (మా)ను ప్రయోగించినప్పుడు ధాతువుకు అడాగమం రాకూడ

దని "న మాఙ్యోగే" (6.4,74) అనే సూత్రంచేత నిషేధించబడింది. 'మా గమః' అని అనాలి. ఇది ఆర్షప్రయోగం అవడంచేత అ చేర్చబడింది. రామాయణాది ఆర్షగ్రంథాలు కూడ వేదంవంటివి అనీ లౌకికభాషకు చెప్పిన నియమాలు కొన్నిచోట్ల వాటికి వర్తించ వనీ అంటారు. 'స ఏవ' అని 'ఏవ' కారంచేత రసమే కాని మరేదీ ఆత్మ కాదు అని చెపుతున్నాడు. అందుచేత భట్టనాయకుడు అన్న "శబ్దప్రాధాన్యమ్" ఇత్యాదికం నిరాకరించబడిన ట్లయింది.

శబ్దప్రాధాన్యేతి - తత్ర = శాస్త్ర -అఖ్యాన-కావ్యాలలో, శబ్దప్రాధాన్యమ్=శబ్దానికి ప్రాధాన్యాన్ని, ఆశ్రిత్య = ఆశ్రయించి, శాస్త్రమ్ = శాస్త్రాన్ని, పృథక్ = వేరుగా, విదుః చెప్పుచున్నారు. అనగా శాస్త్రంలో శబ్దానికి ప్రాధాన్యం ఉంటుంది. అర్థతత్త్వేన= అర్థప్రాధాన్యంతో, యుక్తం తు = కూడినదాని నైతే, ఆఖ్యానమ్ = ఆఖ్యానమునుగా, వదన్తి = చెప్పుచున్నారు. ఏతయోః = ఈ, ద్వయోః = శబ్దార్థాలు రెండింటికీ, గుణత్వే = అప్రాధాన్యం ఉండగా, వ్యాపారప్రాధాన్యే = వ్యాపారానికి మాత్రమే ప్రాధాన్యం ఉండగా, కావ్యధీః = కావ్యం అనే బుద్ధి, భవేత్ = అగును.

వ్యాపారో హి ఇతి - రసనా(ఆస్వాదనా) స్వరూపమైన ధ్వననరూపవ్యాపారం ప్రధాన మైనది అని నీ అభిప్రాయ మైతే క్రొత్తవిషయం ఏమీ చెప్పినట్లు కాదు. అది మేం చెప్పిన విషయమే కదా అని భావం. అది కాక నువ్వనేది అభిధావ్యాపారం అయితే అలా అయినా కూడా దీనికి ప్రాధాన్యం (కావ్యంలో) లేదు అని వెనుకనే చెప్పి ఉన్నాం.

లోచనం

శ్లోకం వ్యాచష్టే - వివిధేతి. వివిధం తత్తదభివ్యఞ్జనీయరసానుగుణ్యేన విచిత్రంకృత్వా వాచ్యే, వాచకే, రచనాయాం చ ప్రపఞ్చేన యత్ చారు, శబ్దార్థాలఙ్కారగుణయుక్తమిత్యర్థః. తేన సర్వత్రాపి ధ్వననసద్భావేఽపి న తథా వ్యవహారః, ఆత్మసద్భావేఽపి క్వచిదేవ జీవవ్యవహార ఇత్యుక్తం ప్రాగేవ. తేనైతన్నిరవకాశమ్. యదుక్తం హృదయదర్పణే - "సర్వత్ర తర్హి కావ్యవ్యవహారః స్యాత్" ఇతి. నిహతసహచరీతి విభావ ఉక్తః. ఆక్రన్దితశబ్దేన అనుభావః. జనితః ఇతి :- చర్వణాగోచరత్వేనేతి శేషః.

నను శోకచర్వణాతః యది శ్లోకః ఉద్భూతః తత్ ప్రతీయమానం వస్తు కావ్యస్యాత్మేతి కుత ఇత్యాశఙ్క్యాహ - శోకో హి ఇతి. కరుణస్య తచ్చర్వణాగోచరాత్మనః స్థాయిభావః. శోకే హి స్థాయిభావే యే విభావానుభావాః

తత్సముచితా చిత్తవృత్తిః చర్వ్యమాణాత్మా రస ఇతి ఔచిత్యాత్ స్థాయినః రసతాపత్తిరిత్యుచ్యతే. ప్రాక్స్వసంవిదితం పరత్రానుమితం చ చిత్తవృత్తిజాతం సంస్కారక్రమేణ హృదయసంవాదమాదధానం చర్వణాయాముపయుజ్యతే యతః.

బాలానందిని

వివిధేతి :- వివిధేత్యాది వాక్యాల చేత శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. వివిధమ్ = వ్యంజింపదగిన ఆ యా రసాలకు అనుగుణంగా విచిత్రంగా ఉండేటట్లు, వాచ్యమునందు, వాచకమునందు, రచనలోను (వాచ్యవాచకరచనలలోను)విస్తరింప చేయడంచేత ఏది అందంగా ఉంటుందో (అట్టి కావ్యంయొక్క) శబ్దార్థాలంకారగుణాలతో కూడినది అని అర్థం. అందుచేత ధ్వననం అనేది అన్నిచోట్లా ఉన్నా ఆ విధంగా వ్యవహారం లేదు. అనగా కావ్యం అని చెప్పడానికి ధ్వననం ఉన్నంతమాత్రాన చాలదు, దానితో పాటు శబ్దార్థాలంకారగుణాదియోగం కూడా ఉండాలి అని భావం. ఆత్మ అంతటా ఉన్నా జీవు డనే వ్యవహారం కొన్ని చోట్ల (ఇంద్రియాదిసహితశరీరం)లోనే ఉంటుంది అని వెనక చెప్పే ఉన్నాం. అందుచేత (ధ్వననం ఉన్న దల్లా కావ్యం అయితే) అంతటా కూడ (సింహో మాణవకః ఇత్యాదులలో కూడ) కావ్యత్వవ్యవహారం ఉండాలి అని హృదయదర్పణంలో చెప్పిన ఆక్షేపణకి అవకాశం లేదు. నిహతసహచరీ అనేదానిచే విభావం చెప్పబడింది. ఆక్రన్దితశబ్దంచేత అనుభావం చెప్పబడింది. జనితః ఇతి- 'చర్వణాగోచరత్వేన' అని అధ్యాహారం. అనగా "క్రౌఞ్చాక్రన్దజనితః" అన్న పదానికి క్రౌంచపక్షియొక్క అరపుచేత చర్వణాగోచరంగా చేయబడినది అని అర్థం.

నన్వితి:- శోకచర్వణవల్ల శ్లోకం పుట్టిన పక్షంలో "ప్రతీయమానవస్తువు (అనగా రసం) కావ్యాత్మ" అని వెనుక చెప్పినది ఎలా కుదురుతుంది? అని ఆశంకించుకొని శోకో హి ఇత్యాదికంతో సమాధానం చెపుతున్నాడు. కరుణస్య = ఆ శోకంయొక్క చర్వణకు గోచరమైన స్వరూపం గల కరుణరసంయొక్క, స్థాయిభావం అని అర్థం. శోకే హి ఇతి - స్థాయిభావమైన శోకంలో ఏ విభావానుభావా లుంటాయో వాటికి అనుకూలమైన చిత్తవృత్తియే ఆస్వాదింపడే స్వరూపం గల రసం. అందుచేత ఔచిత్యాన్ని పట్టి (రసానుభూతికి ఉపయోగించేదిగా ఉండడంచేత), స్థాయియే రసంగా అవుతుంది అని చెప్పబడుతుంది. ఎందుచేత ననగా సహృదయునిచేత పూర్వమే అనుభవించబడినదీ, క్రౌంచాదులలో ఊహించబడినదీ అయిన చిత్తవృత్తి సముదాయం, అనగా స్థాయిభావం,

సంస్కారక్రమంచేత, అనగా స్వానుభవ - స్వానుమానాల సంస్కారంయొక్క క్రమంచేత, హృదయసంవాదాన్ని కలిగిస్తూ చర్వణలో (రసచర్వణలో) ఉపయోగిస్తుంది.

వివరణ:- రతి - శోకాదిరూపమైన చిత్తవృత్తి మొదటినుంచీ సహృదయునిలో ఉంటుంది. విభావాదుల సహాయంచేత పరులలో కూడ ఇది ఉన్నట్లు ఊహించబడుతుంది. అలాంటి స్థాయిభావరూపచిత్తవృత్తికి తగిన విభావానుభావాలు (ఉపస్థాపితాలు కాగానే) వర్ణింపబడగానే స్వీయానుభవసంస్కారంచేత, పరుల హృదయాలలో ఉన్నట్లుగా అనుమానం ద్వారా తెలిసికొని ఉన్నాడు గాన ఆ అనుమాన సంస్కారంచేత హృదయసంవాదం ఏర్పడుతుంది. అప్పుడు ఆ చిత్తవృత్తి (స్థాయిభావం) ఆస్వాదించబడుతుంది. ఈ విధంగా స్థాయిభావం రసచర్వణకి ఉపయోగపడుతుంది కాబట్టి స్థాయియే రసంగా అయింది అని అంటూంటారు.

లోచనం

నను ప్రతీయమానరూపమాత్మా. తత్ర త్రిభేదం ప్రతిపాదితం, న తు రసైకరూపమ్. అనేన చేతిహాసేన రసస్యైవాత్మభూతత్వం భవతీత్యాశఙ్క్య అభ్యుపగమేనైవోత్తరమాహ - ప్రతీయమానస్య చేతి. అన్యో భేదః వస్త్వలంకారాత్మా. భావగ్రహణేన వ్యభిచారిణో ఽపి చర్వ్యమాణస్య తావన్మాత్ర విశ్రాన్తావపి స్థాయిచర్వణాపర్యవసానోచితరసప్రతిష్ఠామ్ అనవాప్యాపి ప్రాణత్వం భవతి ఇత్యుక్తమ్ యథా -

"నఖం నఖాగ్రేణ విఘట్టయన్తీ వివర్తయన్తీ వలయం విలోలమ్,
ఆమన్ద్రమాశిఞ్జితనూపురేణ పాదేన మన్దం భువమాలిఖన్తీ".

ఇత్యత్ర లజ్జాయాః. రసభావశబ్దేన తదాభాసతత్ప్రశమావపి సంగృహీతావేవ. అవాన్తరవైచిత్ర్యే ఽపి తదేకరూపత్వాత్. ప్రాధాన్యాదితి :- రసపర్యవసానాదిత్యర్థః. తావన్మాత్రవిశ్రాన్తావపి చాన్యశాబ్దవైలక్షణ్యకారిత్వేన వస్త్వలంకారధ్వనేరపి జీవితత్వమ్ ఔచిత్యాత్ ఉక్తమితి భావః. 5

బాలానందిని

నన్వితి :- ప్రతీయమానమైనది (ధ్వనించబడేది) ఆత్మ అనీ, దానిలో మూడు భేదాలు ఉన్నా యనీ ప్రతిపాదించబడింది కాని అది (ప్రతీయమానం) కేవలం ఒక్క రసస్వరూప మైనదే అని ప్రతిపాదించబడలేదు కదా? ఈ ఇతిహాసాన్ని పట్టి చూస్తే రసం

ఒక్కటే ఆత్మ అని చెప్పిన ట్లవుతున్నది కదా అని ఆశంకించుకొని దానికి అంగీకారరూపమైన సమాధానం ప్రతీయమానస్య చ ఇత్యాదివాక్యంచేత చెపుతున్నాడు. అన్యభేదం అనగా వస్త్వలంకారరూపమైన భేదద్వయం అని అర్థం.

భావేతి - 'రసభావముఖేన' అని భావాన్ని గ్రహించడంచేత చర్వించబడే (ఆస్వాదించబడే) వ్యభిచారిభావంకూడా తావన్మాత్రంలోనే విశ్రమించినా, అనగా ఆ చర్వణతో ఆగిపోయినా, స్థాయిభావచర్వణ పర్యవసానం చెందడానికి ఉచితమైన రస ప్రతిష్ఠను పొందకపోయినా కూడ, అనగా రసచర్వణవరకూ వెళ్లకపోయినా కూడ, దానికి (అలాంటి వ్యభిచారిభావానికి) కూడా ప్రాణత్వం ఉంటుంది అని చెప్పబడింది. 'నఖం నఖాగ్రేణ' ఇత్యాది శ్లోకంలో లజ్జారూపవ్యభిచారిభావానికి ఎట్లో (ప్రాణత్వం ఎట్లో) అట్లే. శ్లోకానికి అర్థం - నఖమ్ ఇతి .:- నఖాగ్రేణ = నఖంయొక్క అగ్రభాగంచేత, నఖమ్=నఖాన్ని, విఘట్టయన్తీ = ఘట్టనం చేస్తూ, ఒక వేలి గోరుచివరి భాగాన్ని రెండవ చేతి గోరు చివరిభాగంతో కొంచెం చప్పుడు అయేటట్లు క్రిందికి అదుముతూ, విలోలమ్ = ఒదులై కదలుతూన్న, వలయమ్=కంకణాన్ని, వివర్తయన్తీ = (ముంజేతిమీద) తిప్పుతూ, అమన్దమ్ = చాల మెల్లిగా, ఆశిఞ్జితనూపురేణ=గల గల ధ్వని చేస్తూన్న నూపురం గల, పాదేన = పాదంచేత, భువమ్ = భూమిని, ఆలిఖన్తీ = వ్రాస్తూ(ఆమె నిలబడింది).

వివరణ :- ఇక్కడ వలయం తిరుగున్నది అని చెప్పడంచేత ప్రియతముడు కనబడకపోవడంవల్ల కలిగిన కృశత్వం ధ్వనిస్తూన్నది. నఖవిఘట్టన - పాదలేఖనాదులు అనుభావాలు. ప్రియతమవార్తాశ్రవణాదికం విభావం. వీటి అన్నింటిచేత లజ్జ అనే వ్యభిచారభావం వ్యంజింపబడుతున్నది. ఇది శృంగారరసంలో పర్యవసానాన్ని పొందకపోయినా, అనగా చివరికి శృంగారరసవ్యంజనోపయుక్తం కాకపోయినా సహృదయ హృదయచర్వణాగోచరం అవడంచేత ప్రాణంగా ఉంది. లజ్జను మించి శృంగార వ్యంజనకు తగినవి మరేవీ ఇక్కడ వర్ణించబడలేదు కదా అని భావం.

రసేతి:- రస-భావ శబ్దాలచేత రసాభాస - భావాభాసలను కూడా సంగ్రహించినట్లే. వాటి ఆభాసత్వంచేత కొంత వైచిత్ర్యం ఉన్నా అవి కూడా రసభావరూపాలే కదా? రసభావాలే కదా? ప్రాధాన్యాత్ అనగా రసంలో పర్యవసానం చెందుటవల్ల అని అర్థం. తావన్మాత్రేతి - వస్త్వలంకారాలు తావన్మాత్రంలో విశ్రాంతి పొందకపోయినా, అనగా వస్తువుగానో అలంకారంగానో మాత్రమే ఉండక రసంలో పర్యవసానం చెందడంచేత, ఇతరశబ్దజన్యజ్ఞానంకంటె కొంత వైలక్షణ్యం కలిగిస్తూండడంచేత వస్త్వలంకారధ్వనులు

కూడా, ఔచిత్యాన్ని పురస్కరించుకొని జీవితంగా చెప్పబడ్డాయి అని భావం. 5

## ధ్వన్యాలోకం

సరస్వతీ స్వాదు తదర్థవస్తు నిఃష్యన్దమానా మహతాం కవీనామ్
అలోకసామాన్యమభివ్యనక్తి పరిస్ఫురన్తం ప్రతిభావిశేషమ్. 6

తత్ వస్తుతత్త్వం నిఃష్యన్దమానా మహతాం కవీనాం భారతీ అలోకసామాన్యం ప్రతిభావిశేషం పరిస్ఫురన్తమ్ అభివ్యనక్తి. యేన అస్మిన్ అతివిచిత్రకవిపరమ్పరావాహిని సంసారే కాలిదాసప్రభృతయః ద్విత్రాః పఞ్చషాః వా మహాకవయః ఇతి గణ్యన్తే.

### బాలానందిని

సరస్వతీతి - స్వాదు = మధురమైన, తత్ = ఆ, అర్థవస్తు = ధ్వనించబడే అర్థం అనే వస్తువును, నిఃష్యన్దమానా = స్రవిస్తున్న, మహతామ్ = గొప్పవారైన, కవీనామ్ = కవులయొక్క, సరస్వతీ = వాక్కు, అలోకసామాన్యమ్ = లోకసామాన్యం కాని, పరిస్ఫురన్తమ్ = అంతటా ప్రకాశిస్తున్న, ప్రతిభావిశేషమ్ = ప్రతిభావిశేషాన్ని; అభివ్యనక్తి = ప్రకటిస్తున్నది.

**తత్ ఇతి** - ఆ వస్తుతత్త్వాన్ని స్రవిస్తున్న మహాకవుల భారతి లోకసామాన్యం కాని, ప్రకాశిస్తున్న ప్రతిభావిశేషాన్ని ప్రకటిస్తున్నది. అతివిచిత్రమైన కవిపరంపరను ప్రవహించే ఈ సంసారంలో ఏ ప్రతిభావిశేషం ఉండడంచేత కాళిదాసు మొదలైనవారు ఇద్దరు - ముగ్గురో, ఐదారుగురో మహాకవులుగా పరిగణించబడుతున్నారో.

### లోచనం

ఏవమ్ ఇతిహాసముఖేన ప్రతీయమానస్య కావ్యాత్మతాం ప్రదర్శ్య స్వసంవిత్సిద్ధమప్యేతదితి దర్శయతి - సరస్వతీతి. వాగ్రూపా భగవతీత్యర్థః. వస్తుశబ్దేన అర్థశబ్దం, తత్త్వశబ్దేన చ వస్తుశబ్దం వ్యాచష్టే. నిఃష్యన్దమానేతి - దివ్యమానన్దరసం స్వయమేవ ప్రస్నువానా ఇత్యర్థః. యదాహ భట్టనాయకః-

"వాగ్ధేనుర్దుగ్ధ ఏతం హి రసం యద్బాలతృష్ణయా,
తేన నాస్య సమః స స్యాద్దుహ్యతే యోగిభిర్హి యః".

తదావేశేన వినా ప్యాక్రాన్త్యా హి యో యోగిభిర్దుహ్యతే. అత ఏవ -

'యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే,

భాస్వన్తి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీమ్' (కుమా 1.2)

ఇత్యనేన సారాగ్ర్యవస్తుపాత్రత్వం హిమవత ఉక్తమ్. అభివ్యనక్తి పరిస్ఫురన్తమ్ ఇతి - ప్రతిపత్తౄన్ ప్రతి సా ప్రతిభా న అనునీయమానా, అపి తు తదావేశేన భాసమానేత్యర్థః. యదుక్తమ్ అస్మదుపాధ్యాయభట్టతౌతేన -

"నాయకస్య కవేః శ్రోతుః సమానోఽనుభవస్తతః" ఇతి.

'ప్రతిభా' అపూర్వవస్తునిర్మాణక్షమా ప్రజ్ఞా. తస్యాః విశేషః రసావేశవైశద్య సౌన్దర్యమ్; కావ్యనిర్మాణక్షమత్వమ్. యదాహ మునిః - "కవేరన్తర్గతం భావమ్" ఇతి. యేనేతి - అభివ్యక్తేన స్ఫురతా ప్రతిభావిశేషేణ నిమిత్తేన మహాకవిత్వగణనేతి యావత్. 6

బాలానందిని

ఏవమితి - ప్రతీయమానార్థం కావ్యాత్మ అనే విషయాన్ని ఇతిహాసం చెప్పడం ద్వారా ప్రదర్శించి ఇది(ప్రతీయమానార్థం కావ్యాత్మ అనే విషయం) స్వానుభవసిద్ధం కూడ అని చూపుతున్నాడు - సరస్వతీతి. సరస్వతి అనగా వాగ్రూప అయిన భగవతియే అని అర్థం. వస్తుశబ్దంచేత అర్థశబ్దాన్ని, తత్త్వశబ్దంచేత వస్తుశబ్దాన్ని వివరిస్తున్నాడు. అనగా శ్లోకంలో ఉన్న 'అర్థవస్తు' అనేదానికి వృత్తిలో 'వస్తుతత్త్వం' అని అర్థం చెప్పాడు. దానిని పట్టి అర్థశబ్దానికి 'వస్తువు' అనీ 'వస్తు'శబ్దానికీ 'తత్త్వం'అనీ అర్థం అని చెప్పినట్లయింది. మొత్తంమీద 'అర్థవస్తు' అనేదానికి 'అర్థతత్త్వం' అని అర్థం అని తేలింది. నిష్యన్దమానా ఇతి - దివ్యమైన ఆనందరసాన్ని తనంత తానే చేపుతున్నది (స్రవిస్తున్నది) అని అర్థం. ఈ విషయమే భట్టనాయకుడు "వాగ్ధేనుః" మొదలైన మాటలలో చెప్పాడు -

వాగ్ధేనురితి - వాగ్ధేనుః = వాక్కు అనే ధేనువు, ఏతం రసమ్ = ఈ రసాన్ని, యత్ = ఏ కారణంవల్ల, బాలతృష్ణయా = సహృదయు డనే లేగదూడయం దున్న స్నేహంచేత, దుగ్ధే = స్వయంగానే చేపుతుందో, తేన = ఆ కారణంచేత, యః = ఏది, యోగిభిః = యోగీశ్వరులచేత, దుహ్యతే = పితకబడుతుందో, సః = అది, అస్య = దీనికి, సమః = సమానమైనది, న హి = కాదు కదా?

తదావేశేనేతి - తదావేశేన వినాపి = రసావేశం లేకపోయినా ఏది ఆక్రమించడం

చేత, హఠయోగాదిప్రక్రియచేత, యోగులచేత పిదుకబడుతుందో.

వివరణ:- సహృదయు డనే లేగదూడమీద ఉన్న స్నేహంచేత వాగ్ధేనువు స్వయంగానే రసం చేపి, పైకి కారివచ్చేటట్లు చేసి, తాగిస్తుంది. యోగీశ్వరులు కూడా రసాస్వాదం (ఆనందాస్వాదం) పొందుతారు; కాని వాళ్లు శ్రమపడి పిదికికొని త్రాగే ఆ రసానికీ ఈ రసానికీ పోలిక లేదు అని శ్లోకభావం. తదావేశేన వినాపి అన్నదానికి వ్యాఖ్యాతలు రసావేశం లేకపోయినా, అని అర్థం చెప్పారు. అంతకంటె " ఆ ధేనువుయొక్క స్నేహావేశం లేకపోయినా" బలవంతంగా (ఆక్రాన్త్యా) పిండిన రసం అని అర్థం యుక్తంగా ఉంటుంది.

**అత ఏవేతి** - అందుచేతనే 'యం సర్వశైలాః' ఇత్యాదిశ్లోకంలో హిమవంతుడు సారంచేత శ్రేష్ఠమైన వస్తువులకు పాత్రు డైనట్లు చెప్పబడింది. శ్లోకార్థం -

యమితి - సర్వశైలాః సమస్తపర్వతాలు, యమ్ = ఏ హిమాలయాన్ని, వత్సమ్ = లేగ దూడనుగా, పరికల్ప్య = చేసి, దోహదక్షే = పిదుకుటయందు సమర్థుడైన, మేరౌ = మేరుపర్వతము, స్థితే = ఉండగా, లేదా "మేరౌ దోహదక్షే స్థితే" = మేరువు పిదికేవాడుగా ఉండగా, పృథూపదిష్టామ్ = పృథువుచేత చూపబడిన, ధరిత్రీమ్ = (గోరూపంలో) ఉన్న భూమిని, భాస్వన్తి = ప్రకాశిస్తున్న, రత్నాని = రత్నాలను, మహౌషధీః చ = గొప్ప ఓషధులను, దుదుహుః = పిదికినవో.

గోరూపంలో ఉన్న భూమి లేగదూడగా అయి పాలు త్రాగుతూన్న హిమవంతునికి ప్రేమాతిశయంచేత రత్నాలలోను, ఓషధులలోను ఉన్న మంచివాటి నన్నింటినీ ముందే ఇచ్చివేసి ఉంటుందని కాళిదాసు భావం. వాగ్ధేనువు సహృదయుని కిచ్చే రసం కూడా యోగు లనుభవించే రసంకన్న చాలా గొప్పది అని భట్టనాయకుని భావాన్ని అభినవగుప్తు డిక్కడ విశదీకరిస్తున్నాడు.

**అభివ్యనక్తీతి** - "అభివ్యనక్తి" అనే పదం తరవాత 'ప్రతిపత్తౄన్ ప్రతి' అని చేర్చాలి. ప్రకాశిస్తూన్న ప్రతిభావిశేషాన్ని ప్రతిపత్తలను గూర్చి, అనగా రసానుభూతి పొందే సహృదయులకు ప్రకటం చేస్తుంది అని అర్థం. అనగా మహాకవులలోని ఆ ప్రతిభ సహృదయులకు, అనుమానప్రమాణగ్రాహ్యం కాదు; మరేమనగా రసావేశంచేత వాళ్లు ఆ మహాకవులలో ఉన్న ప్రతిభావిశేషాన్ని ప్రత్యక్షంగా తెలుసుకుంటారు అని భావం.

యదుక్తమితి - మా ఉపాధ్యాయులైన భట్టతౌతుడు - "తతః = ఆ కావ్యంవల్ల, నాయకస్య = నాయకునికి, కవేః = కవికీ, శ్రోతుః=శ్రోతకు కూడ,

అనుభవః = అనుభవం (రసానుభవం), సమానః = సమానమే" అని చెప్పారు. ప్రతిభావంతుడైన మహాకవి కావ్యంవల్ల సహృదయుడు రసాస్వాదం పొందుతున్నాడంటే ఇతనికి కూడా అలాంటి ప్రతిభ ఉండాలి అని భావం.

ప్రతిభేతి - పూర్వం ఎన్నడూ చెప్పబడని క్రొత్త వస్తువును (విషయాన్ని) నిర్మించడానికి సమర్థమైన ప్రజ్ఞకు(బుద్ధికి) 'ప్రతిభ' అని పేరు. ఆ ప్రతిభయొక్క విశేషం అనగా రసావేశానికి అనుకూలమైన నిర్మలత్వం అనే సౌందర్యం, అనగా కావ్యనిర్మాణసమర్థత్వం అని అర్థం.

సరస్వతి కవిగతప్రతిభను సహృదయులకు వ్యక్తం చేస్తుంది అనే విషయంలో భరతుని 'కవేరన్తర్గతం భావమ్' అనే వాక్యాన్ని ప్రమాణంగా చూపుతున్నాడు. యదాహ ఇతి:- అక్క డున్న శ్లోకాలు ఇవి -

"విభావేనాహృతో యోఽర్థస్త్వనుభావేన గమ్యతే,
వాగఙ్గసత్త్వాభినయైః స భావ ఇతి సంజ్ఞితః.
వాగఙ్గముఖరాగైశ్చ సత్త్వేనాభినయేన చ,
కవేరన్తర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే".

"విభావంచేత ఉపస్థాపితమైన అర్థం అనుభావంచేత, వాచిక - ఆంగిక - సాత్త్విక అభినయాలచేత సూచించబడుతుంది. దానికే భావం అని పేరు". "మాటలచేత, అవయవాలచేత, ముఖరాగంచేత, సాత్వికాభినయంచేత కవి మనస్సులోని భావాన్ని భావింపచేసేది భావం అని చెప్పబడుతుంది. దీనిని పట్టి సహృదయుడు కవియొక్క భావాన్ని, ఆ భావాన్ని ప్రకటించిన ప్రతిభను స్పష్టంగా తెలుసుకొనకలుగుతాడు అని భరతుడు కూడ సూచించి నట్లయింది.

యేనేతి - అభివ్యక్తమై ప్రకాశిస్తున్న ఏ ప్రతిభావిశేషం అనే నిమిత్తంచేతనే మహాకవులుగా పరిగణించడం జరుగుతుందో అని భావం. 6

## ధ్వన్యాలోకం

ఇదం చాపరం ప్రతీయమానస్యార్థస్య సద్భావసాధనం ప్రమాణమ్ -

కా. శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే,
వేద్యతే స తు కావ్యార్థతత్త్వజ్ఞైరేవ కేవలమ్. 7

శబ్దార్థశాసనజ్ఞానమాత్రేఽపి పరం న వేద్యతే సోఽర్థః యస్మాత్

కేవలం కావ్యార్థతత్త్వజ్ఞైరేవ జ్ఞాయతే, యది చ వాచ్యరూప ఏవాసౌ అర్థః స్యాత్ తద్వాచ్యవాచకరూపపరిజ్ఞానాదేవ తత్ప్రతీతిః స్యాత్. అథ చ వాచ్యవాచకలక్షణమాత్రకృతశ్రమాణాం కావ్యతత్త్వార్థ భావనా విముఖానాం స్వరశ్రుత్యాదిలక్షణమివ అప్రగీతానాం గాన్ధర్వలక్షణ విదామ్ అగోచర ఏవ అసావర్థః.

బాలానందిని

ఇదమితి:- ప్రతీయమానార్థం అనేది ఒకటి ఉంది అని సాధించే మరొక ప్రమాణం ఇది-

శబ్దేతి - సః తు = ఆ ప్రతీయమానార్థ మైతే, శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ= శబ్దాలకీ అర్థాలకీ సంబంధించిన శాస్త్రంయొక్క జ్ఞానంమాత్రంచేతనే, న వేద్యతే= తెలియబడదు. కేవలమ్ = కేవలము, కావ్యార్థతత్త్వజ్ఞైరేవ= కావ్యార్థతత్త్వం తెలిసినవాళ్లచేతనే, వేద్యతే = తెలియబడుతుంది.

శబార్థేత్యాది - ఆ ప్రతీయమానార్థం ఎందువలన శబ్దార్థశాస్త్రాల జ్ఞానం ఉన్నంతమాత్రంచేత తెలియబడదో(అందువలన) కావ్యార్థతత్త్వం తెలుసుకొన్న వాళ్లచేతనే తెలియబడుతుంది. ఈ అర్థం వాచ్యరూపమే అయిన పక్షంలో వాచ్యార్థవాచకశబ్దాల స్వరూపం తెలుసుకొన్నంతమాత్రంచేతనే ఇది తెలియాలి(అలా తెలియడం లేదు). మరొక విషయం ఏ మనగా సంగీతశాస్త్రలక్షణం ఎంత బాగా తెలిసినవాళ్లైనా చక్కగా పాడజాలనివాళ్లకి స్వరాలు, శ్రుతులు మొదలైనవాటి స్వరూపం ఏ విధంగా తెలియదో అదే విధంగా వాచ్యార్థాలకు వాచకశబ్దాలకు సంబంధించిన లక్షణం(శాస్త్రం)లో మాత్రమే పరిశ్రమ చేసినవాళ్లే అయినా కావ్యతత్త్వార్థాన్ని భావన చేయడంలో విముఖులైన వాళ్లకి ఈ అర్థం గోచరం కాదు.

లోచనం

ఇదం చేతి-న కేవలం 'ప్రతీయమానం పునరన్యదేవ' ఇత్యేతత్కారికా సూచితౌ స్వరూపవిషయభేదావేవ; యావద్భిన్నసామగ్రీవేద్యత్వమపి వాచ్యాతిరిక్తత్వే ప్రమాణమితి యావత్. వేద్యతే ఇతి- న తు న వేద్యతే, యేన న స్యాదసావితి భావః. కావ్యస్య తత్త్వభూతః యోఽర్థః తస్య భావనా

వాచ్యాతిరేకేణ అనవరతచర్వణా, తత్ర విముఖానామ్. స్వరాః షడ్జాదయః సప్త. శ్రుతిర్నామ శబ్దస్య వైలక్షణ్యమాత్రకారి యద్రూపాన్తరం తత్ప్రమాణా న్వరతదన్తరాలోభయంభేదకల్పితా ద్వావింశతివిధా. ఆదిశబ్దేన జాత్యంశకగ్రామరాగభాషావిభాగాన్తరభాషాదేశీమార్గా గృహ్యాన్తే. ప్రకృష్టం గీతం గానం యేషాం తే ప్రగీతాః. గాతుం వా ప్రారబ్ధా ఇతి ఆదికర్మణి క్తః. ప్రారమ్భేణ చాత్ర ఫలపర్యన్తతా లక్ష్యతే. 7

బాలానందిని

ఇదం చేతి:- "ప్రతీయమానం పునరన్యదేవ" అనే కారికలో సూచింపబడిన స్వరూపభేదవిషయభేదాలే కాకుండా ఇది (ప్రతీయమానార్థం) వేరైన, అనగా వాచ్యార్థాన్ని తెలుసుకొనడానికి కావలసిన దానికంటె వేరైన, సామగ్రిచేత తెలియదగి ఉండడం కూడా ఇది వాచ్యంకంటె భిన్న మైనది అని చెప్పడానికి ప్రమాణం అని భావం. వేద్యతే ఇతి:- తెలియబడ దన్న మాట లేదు. అందుచేత ఇది లేదు అనడానికి వీలు లేదు అని భావం. కావ్యేతి- కావ్యంయొక్క తత్త్వమైన ఏ అర్థం ఉన్నదో దాని భావన, అనగా వాచ్యార్థంకంటె భిన్నంగా నిరంతరం చర్వణ చేయడం. దానియందు విముఖులైనవాళ్లకు. స్వరా లనగా షడ్జం మొదలైన ఏడు స్వరాలు. శ్రుతిర్నామ ఇతి. గీతాదిశబ్దాల పరస్పర భేదం మాత్రమే చేసే ఏ రూపాంతరం ఉన్నదో, అనగా గీతాది శబ్దాలను విన్నప్పుడు దానికి లవం మొదలైన కాలాంశాలను పట్టి ఏ రూపభేదం ఏర్పడుతుందో అదే పరిమాణంగా, కాలప్రమాణంగా, గలది స్వరం. ఇది స్వరం, దాని మధ్యభాగం - ఈ రెండింటి భేదాలను పట్టి ఇరవైరెండు విధాలు ఉంటుంది. ఈ విధంగా స్వరంయొక్క అంశమే శ్రుతి. ఆదిశబ్దేనేతి - 'శ్రుత్యాది'లోని 'ఆది'శబ్దంచేత జాతి, అంశకం, గ్రామం, రాగం, భాష, విభాష, అంతరభాష, దేశి, మార్గం గ్రహించబడతాయి.

ప్రకృష్టమైన గీతం, అనగా గానం, చేయగలవారు ప్రగీతులు. లేదా "ఆదికర్మణి క్తః కర్తరి చ" (పా.సూ.3.4.71)అనే సూత్రంప్రకారం ఆదికర్మ, అనగా ప్రారంభం అనే అర్థంలో 'క్త' ప్రత్యయం చేర్చగా 'ప్రగీత'శబ్దం సిద్ధిస్తుంది. అనగా గానం చేయడానికి ప్రారంభించినవాళ్లు అని అర్థం. ప్రారంభించినవాళ్లు అనడాన్ని పట్టి ఫలపర్యంతత్వం, అనగా చివరిదాకా ఆ గానాన్ని సాగించడం ఊహించాలి. అలా ప్రగీతులు కాని వాళ్లు అప్రగీతులు. శాస్త్రం(theory) తప్ప ఎలా పాడాలో తెలియనివాళ్లు అని అర్థం. 7

## ధ్వన్యాలోకం

ఏవం వాచ్యవ్యతిరేకిణో వ్యఙ్గ్యస్య సద్భావం ప్రతిపాద్య ప్రాధాన్యం తస్యైవ ఇతి దర్శయతి -

కా: సోఽర్థస్తద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చన,

యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ తౌ శబ్దార్థౌ మహాకవేః. 8

వ్యఙ్గ్యః అర్థః, తద్వ్యక్తిసామర్థ్యయోగీ శబ్దశ్చ కశ్చన, న శబ్దమాత్రమ్. తావేవ శబ్దార్థౌ మహాకవేః ప్రత్యభిజ్ఞేయౌ. వ్యఙ్గ్యవ్యఞ్జకాభ్యామేవ సుప్రయుక్తాభ్యాం మహాకవిత్వలాభో మహాకవీనామ్; న వాచ్య వాచకరచనామాత్రేణ.

### బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వాచ్యంకంటె భిన్నమైన వ్యంగ్యం అనేది ఒకటి ఉన్నది అని ప్రతిపాదించి కావ్యంలో దానికే ప్రాధాన్యం అని చూపుతున్నాడు -సః ఇతి. సః అర్థః = ఆ వ్యంగ్యార్థమూ, తద్వ్యక్తిసామర్థ్యయోగీ = ఆ వ్యంగ్యార్థాన్ని వ్యంజింపచేసే సామర్థ్యంతో కూడిన, కశ్చన శబ్దః = ఒకానొక శబ్దమూ, తౌ శబ్దార్థౌ = ఆ శబ్దార్థాలు, మహాకవేః = మహాకవికి (మహాకవిచేత), యత్నతః = ప్రయత్నపూర్వకంగా, ప్రత్యభిజ్ఞేయౌ = గుర్తించదగినవి.

**తావేవేతి** - మహాకవి అలాంటి శబ్దార్థాలనే బాగా గుర్తించాలి. బాగా ప్రయోగించబడిన వ్యంగ్య-వ్యంజకాలచేతనే మహాకవులకు మహాకవిత్వం లభిస్తుంది. వాచ్యవాచకాలను కూర్చినంతమాత్రాన కాదు. వ్యంజకశబ్దాలనీ, వ్యంగ్యార్థాలనీ బాగా గుర్తించి జాగర్తగా ప్రయోగిస్తేనే 'మహాకవి' అనే పేరుకు అర్హత లభిస్తుంది కాని ఏవేవో అర్థాలు బోధించే ఏవేవో శబ్దాలు అల్లినంతమాత్రాన లభించదు అని అర్థం.

### లోచనం

ఏవమితి - స్వరూపభేదేన, భిన్నసామగ్రీజ్ఞేయత్వేన చేత్యర్థః. 'ప్రత్యభిజ్ఞేయౌ' ఇతి అర్హార్థే కృత్యః. సర్వో హి తథా యతతే ఇతీయతా ప్రాధాన్యే లోకసిద్ధత్వం ప్రమాణముక్తమ్. నియోగార్థేన చ కృత్యేన శిక్షాక్రమ ఉక్తః. ప్రత్యభిజ్ఞేయశబ్దేన ఇదమాహ -

"కావ్యం తు జాతు జాయేత కస్యచిత్ ప్రతిభావతః"

ఇతి నయేన యద్యపి స్వయమస్యైతత్ పరిస్ఫురతి తథాపి ఇదమిత్థమితి విశేషతో నిరూప్యమాణం సహస్రశాఖీభవతి. యథోక్తమ్ అస్మత్పరమగురుభిః శ్రీమదుత్పలపాదైః -

"తైస్తైరప్యుపయాచితైరుపనతస్తన్వ్యాః స్థితోఽప్యన్తికే
కాన్తో లోకసమాన ఏవమపరిజ్ఞాతో న రన్తుం యథా,
లోకస్యైష తథానవేక్షితగుణః స్వాత్మాపి విశ్వేశ్వరో
నైవాలం నిజవైభవాయ తదియం తత్ప్రత్యభిజ్ఞోదితా" ఇతి.

తేన జ్ఞాతస్యాపి విశేషతో నిరూపణమ్ అనుసన్ధానాత్మకం ప్రత్యభిజ్ఞానం, నతు తదేవేదమిత్యేతావన్మాత్రమ్. మహాకవేరితి - యో మహాకవిరహం భూయాసమ్ ఇత్యాశాస్తే. ఏవం వ్యఙ్గ్యస్యార్థస్య, వ్యఞ్జకస్య శబ్దస్య చ ప్రాధాన్యం వదతా వ్యఙ్గ్యవ్యఞ్జకభావస్యాపి ప్రాధాన్యముక్తమితి ధ్వనతి, ధ్వన్యతే, ధ్వననమ్ ఇతి త్రితయమప్యుపపన్నమ్ ఇత్యుక్తమ్. 8

బాలానందిని

ఏవమితి - ఏవమ్ = ఇట్లు, అనగా స్వరూపభేదంచేత, వేరు వేరు సామగ్రుల చేత (equipments) తెలియదగి ఉండడంచేత అని అర్థం. 'ప్రత్యభిజ్ఞేయౌ' అన్నప్పుడు అర్హార్థంలో కృత్యప్రత్యయం.

వివరణ:- ఇక్కడ 'ప్రతి' 'అభి' పూర్వకమైన జ్ఞాధాతువునకు "అచో యత్" (3.1.97) అనే సూత్రంచేత 'యత్'(య) ప్రత్యయం చేర్చగా 'ప్రత్యభిజ్ఞేయ' శబ్దం సిద్ధించింది. 'యత్' ప్రత్యయం కృత్ప్రత్యయాంతర్గతమైన కృత్యప్రత్యయం. "అర్హే కృత్యతృచశ్చ"(3.3-169) అనే సూత్రం ప్రకారం కృత్యప్రత్యయాలకి అర్హార్థం కూడా (తగిన అనే అర్థం కూడా) చెప్పవచ్చు. అందుచేత 'ప్రత్యభిజ్ఞాతుమ్ అర్హౌ ప్రత్యభిజ్ఞేయౌ' అనే విగ్రహంచేత గుర్తించడానికి అర్హమైనవి, తగినవి, అని అర్థం లభిస్తుంది.

సర్వ ఇతి - ప్రతీ సహృదయుడు కూడ ఆ విధంగా, అలాంటి శబ్దార్థాలను తెలుసుకొనవలెననే ఇచ్ఛచేత ప్రవర్తిస్తాడు కదా. అందుచేత వ్యంగ్యానికున్న ప్రాధాన్యం విషయంలో లోకప్రసిద్ధత్వమే (సహృదయలోకప్రసిద్ధత్వమే) ప్రమాణంగా చెప్పబడింది.

వివరణ:- అభినవగుప్తుడు ఈ శ్లోకానికి రెండు విధాల వ్యాఖ్యానం చేసినట్లు

కనబడుతుంది. పైన చెప్పిన వ్యాఖ్యానం ప్రకారం 'ప్రత్యభిజ్ఞేయౌ' అన్నప్పుడు (అర్హార్థకృత్యప్రత్యయం గ్రహించడంవల్ల) ప్రత్యభిజ్ఞానకర్తలు సహృదయు లని తెలుస్తూన్నది. దీనినిపట్టి - "ఆ వ్యంగ్యార్థమూ, ఆ వ్యంగార్థాన్ని బోధించే శబ్దమూ, మహాకవియొక్క (మహాకవి ఉపయోగించే) శబ్దార్థాలు రెండూ కూడ సహృదయులచేత గుర్తింపదగినవి" అని అర్థం. ఇది మొదటి వ్యాఖ్యానం. "ప్రైషాతిసర్గప్రాప్తకాలేషు కృత్యాశ్చ" (పా.సూ.3.3.163) అనే సూత్రంచేత 'ప్రత్యభిజ్ఞేయౌ' అన్నప్పుడు కృత్య ప్రత్యయమైన 'యత్' ప్రత్యయానికి ప్రైష, అనగా నియోగం (విధి) అని అర్థం చెప్పిన పక్షంలో ఈ ప్రత్యభిజ్ఞానానికి కర్త మహాకవి. "కృత్యానాం కర్తరి వా" (పా.సూ.2.3.71) సూత్రంచేత కర్త్రర్థంలో షష్ఠి. "ఇలాంటి శబ్దార్థాలను మహాకవి గుర్తించాలి" అని ఇప్పుడు అర్థం. ఇది రెండవ వ్యాఖ్యానం. 'నియోగార్థేన' ఇత్యాదికం ద్వితీయవ్యాఖ్యాసూచకం.

నియోగేతి - నియోగం(విధి) అనే అర్థం గల కృత్యప్రత్యయంచేత, అనగా ఈ కృత్యప్రత్యయానికే నియోగం అనే అర్థం గ్రహిస్తే, శిక్షాక్రమం, కవి చేయవలసిన అభ్యాసక్రమం, చెప్పబడింది. 'ప్రత్యభిజ్ఞేయ' శబ్దంచేత ఈ విషయం చెపుతున్నాడు- "కావ్యమైతే ఎవడో ప్రతిభావంతునికి, ఎప్పుడో పుట్టవచ్చును" అనే న్యాయంచేత కావ్యం, లేదా ఏతాదృశశబ్దార్థయుగళం, స్వయంగానే ప్రతిభావంతునికి స్ఫురించినా ఇది ఇట్లు - దీని స్వరూపం ఇది - అని విశేషరూపంలో నిరూపించబడిన ట్లయితే వేలకొలది (అనేక) శాఖలు కలది అవుతుంది. ఈ విషయమే (మరొక సందర్భంలో) మా పరమగురువులైన శ్రీమదుత్పలపాదులు ఇలా చెప్పి ఉన్నారు:-

తైస్తైః ఇతి: - భట్టేందురాజు అభినవగుప్తుని సాక్షాద్గురువు. ఆయన గురువు శ్రీమదుత్పలదేవపాదులు. అందుచేతనే ఈయనను తన పరమగురువని అభినవగుప్తుడు పేర్కొంటున్నాడు. ఈ ఉత్పలదేవపాదులు ప్రత్యభిజ్ఞాప్రస్థాన ప్రవర్తకులు. ఈ శ్లోకం ఈశ్వరప్రత్యభిజ్ఞాశాస్త్రం చివర ఉన్న శ్లోకం.

ఈశ్వరుణ్ణి గూర్చి సామాన్యరూపంలో తెలిసినా ఈ ఈశ్వరుని విశిష్టస్వరూపం తెలిస్తేనే కాని లోకులకు సామాన్యజ్ఞానంవల్ల ఫలితం ఏమీ ఉండదు. అందుకే ఈ గ్రంథం రచించాను అని ఉదాహరణపూర్వకంగా శ్రీమదుత్పలదేవపాదులు చెపుతున్నారు:- తైస్తైః= ఆ యా, ఉపయాచితైః = దూతీసంప్రేషణాదుల ద్వారా బ్రతిమిలాడుకొనడాలచేత, ఉపనతః = వచ్చిన, కాన్తః = ప్రియుడు, తన్వ్యాః = తనపై అంతగా గాఢానురాగం గల ఆ యువతియొక్క, అన్తికే=సమీపమునందు, స్థితోఽపి = నిలబడి ఉన్నాకూడ, ఏవమ్

= ఆ నా ప్రాణప్రియుడే ఇతడు అని, అపరిజ్ఞాతః = గుర్తించబడనివాడై, లోకసమానః= ఇతరజనులతో సమానుడై, యథా= ఏ విధంగా, రన్తుమ్=ఆమెతో రమించడానికి, నైవ అలమ్ = సమర్థుడు కాజాలడో, తథా= అట్లే, ఏషః ఈ, విశ్వేశ్వరః = పరమేశ్వరుడు, లోకస్య = లోకానికి, మానవులకు తదితరజీవులకు గూడ, స్వాత్మాపి = స్వాత్మ(తమ ఆత్మ)యే అయినా కూడ, అనవేక్షితగుణః = చూడబడని గుణాలు (విశిష్టలక్షణాలు) కలవాడై, నిజవైభవాయ=తన వైభవంకొరకు, తన సత్యస్వరూపం వాళ్లకి తెలిసేటట్లు చేయడానికి, నైవ అలమ్= సమర్థుడు కాడు; తన స్వస్వరూపాన్ని వాళ్లకి తెలుపజాలడు. అనగా వాళ్లు తమస్వస్వరూపమే అయిన పరమేశ్వరుణ్ణి గుర్తించజాలరు అని భావం. తత్=అ కారణంవల్ల, ఇయమ్=ఈ, ప్రత్యభిజ్ఞా=ప్రత్యభిజ్ఞ(శాస్త్రం), ఉదితా = చెప్ప బడింది.దగ్గరనే ఉన్న తనను ప్రియతముణ్ణిగా గుర్తించక ఇతరులవంటివాడే అని బావించే నాయికను ఆ నాయకు డే విధంగా రమింపచేయజాలడో అదే విధంగా తనను గూర్చిన విస్పష్టజ్ఞానం లేనివాళ్లకు ఈశ్వరుడు కూడా ఆనందదాయకుడు కాజాలడు అని భావం.

తేనేతి - అందుచేత ఇక్కడ ప్రత్యభిజ్ఞానం అనగా సామాన్యరూపంలో తెలిసినదాని విశేషాలను గుర్తించడం, దానిని గూర్చిన అనుసంధానం, పునఃపునరాలోచన చేయడం అని అర్థం. అంతే కాని "సోఽయం దేవదత్తః" ఇత్యాదులలో వలె 'అదే ఇది' అని గుర్తించడం మాత్రమే కాదు.

వివరణ:- "కావ్యం తు జాతు జాయేత కస్యచిత్ ప్రతిభావతః" అనేది భామహుని వాక్యం అయి ఉండవచ్చు. ప్రస్తుతం భామహుని కావ్యాలంకారంలో "కావ్యం తు జాయతే జాతు కస్యచిత్ ప్రతిభావతః" అనే పాఠం లభిస్తూన్నది. అర్థం సమానమే. "గురూపదేశాదధ్యేతుం శాస్త్రం జడధియోఽప్యలమ్" అనేది పూర్వార్థం (కావ్యా-1.5). ఒక గురువు దగ్గర చేరి దీక్షగా పట్టుదలతో చదువుకుంటే జడబుద్ధి కలవాడు కూడ శాస్త్రాన్ని సాధించవచ్చు. ప్రతిభావంతులలో ఎవడో, ఏ నాడో ఒక కావ్యం రచిస్తే రచించగలడేమో" అని దీని భావం.

మహాకవేరితి - నేను మహాకవి కావా లని ఎవడు కోరుకుంటాడో వానికి. ఏవమితి - ఈ విధంగా వ్యంగార్థమూ, వ్యంజకశబ్దమూ ప్రధానం అని చెప్పడంతో వ్యంగ్యవ్యంజకభావానికి కూడా ప్రాధాన్యం ఉందని చెప్పిన ట్లయింది. అందుచేత "ధ్వనతి ఇతి ధ్వనిః" ధ్వనింపచేస్తుంది కాబట్టి 'ధ్వని' - శబ్దం; "ధ్వన్యతే ఇతి ధ్వనిః" ధ్వనింపచేయబడుతుంది కాబట్టి 'ధ్వని' - అర్థం; "ధ్వననం ధ్వనిః" ధ్వనింపచేయడం

'ధ్వని'-వ్యంజనావ్యాపారం, అని మూడు అర్థాలూ కూడా యుక్తమైనవే అని చెప్ప బడింది. 8

## ధ్వన్యాలోకం

ఇదానీం వ్యఙ్గ్యవ్యఞ్జకయోః ప్రాధాన్యేఽపి యద్వాచ్యవాచకావేవ ప్రథమముపాదదతే కవయః తదపి యుక్తమేవ ఇత్యాహ:-

కా. ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః,
తదుపాయతయా తద్వదర్థే వాచ్యే తదాదృతః. 9

యథా హ్యాలోకార్థీ సన్నపి దీపశిఖాయాం యత్నవాన్ జనో భవతి తదుపాయతయా, న హి దీపశిఖామన్తరేణాలోకః సంభవతి; తద్వత్ వ్యఙ్గ్యమర్థం ప్రత్యాదృతో జనః వాచ్యేఽర్థే యత్నవాన్ భవతి. అనేన ప్రతిపాదకస్య కవేః వ్యఙ్గ్యమ్ అర్థం ప్రతి వ్యాపారో దర్శితః.

### బాలానందిని

ఇదానీమితి - వ్యంగ్యవ్యంజకాలకే ప్రాధాన్యం అయినా కవులు వాచ్యవాచకాలనే ముందుగా గ్రహిస్తున్నా రనేది కూడా యుక్తమే అని ఇప్పుడు చెపుతున్నాడు.

**ఆలోకార్థీ ఇతి** - ఆలోకార్థీ = వెలుతురును కోరే, జనః =జనుడు, యథా= ఏ విధంగా, తదుపాయతయా = దానికి ఉపాయంగా, దీపశిఖాయామ్ = దీపశిఖయందు, యత్నవాన్ = ప్రయత్నం కలవాడో, తద్వత్ = అట్లే, తదాదృతః= వ్యంగ్యార్థమునందు ఆదరం గల కవి, వాచ్యే = వాచ్యమైన, అర్థే = అర్థమునందు, యత్నవాన్ = ప్రయత్నం కలవాడు.

యథా హీతి - వెలుతురు మాత్రమే కావా లని కోరుకుంటున్నా, జనుడు ఏవిధంగా ఆ వెలుతురు లభించడానికి ఉపాయంగా దీపశిఖయందు ప్రయత్నవంతుడై ఉంటాడో (దీపశిఖకోసం ప్రయత్నం చేస్తాడో), దీపశిఖ లేకుండా వెలుతురు సంభవించదు కదా; అట్లే వ్యంగార్థం విషయంలో ఆదరం గల జనుడు వాచ్యార్థం విషయంలో యత్నవంతు డవుతాడు. దీనిచేత కావ్యవస్తువును ప్రతిపాదించే కవికి వ్యంగ్యార్థం విషయంలో వ్యాపారం ఉంటుంది అని చూపబడింది.

లోచనం

నను ప్రథమోపాదీయమానత్వాత్ వాచ్యవాచకతద్భావస్యైవ ప్రాధాన్యమిత్యాశఙ్క్య ఉపాయానామేవ ప్రథమముపాదానం భవతీత్యభిప్రాయేణ విరుద్ధోఽయం ప్రాధాన్యే సాధ్యే హేతుః ఇతి దర్శయతి - ఇదానీమిత్యాదినా. ఆలోకనమ్ ఆలోకః. వనితావదనారవిన్దాది విలోకనమిత్యర్థః. తత్ర చ ఉపాయో దీపశిఖా. 9

బాలానందిని

నన్వితి:- ముందు గ్రహింపబడడంవల్ల వాచ్య - వాచక - వాచ్యవాచక భావాలకే ప్రాధాన్యం అని చెప్పాలి కదా అని ఆశంకించుకొని, ఎక్కడైనా ఉపాయాలనే ముందుగా గ్రహించడం జరుగుతుంది అనే అభిప్రాయంతో ప్రాధాన్యాన్ని సాధించడంకోసం నువ్వు చెప్పిన "ముందుగ్రహించబడడం" అనే హేతువు విరుద్ధం అని ఇదానీమ్ ఇత్యాదివాక్యంతో చూపుతున్నాడు. ఆలోకనమితి:- ఆలోకః అనగా చూడడం అని అర్థం. వనితాముఖపద్మాదివిలోకనం అని అర్థం. అందుకు ఉపాయం దీపశిఖ.

వివరణ:- ఏ హేతువును చూపి ఒక విషయాన్ని సాధించడానికి ప్రయత్నం చేయబడుతుందో అది నిజానికి సాధ్యం లేకపోవడాన్ని సాధించేదైతే దానికి విరుద్ధహేతువు అని పేరు. ఉదాహరణకి - "శబ్దః నిత్యః; కార్యత్వాత్" (పుట్టించబడుతుంది కాబట్టి శబ్దం నిత్యం) అనే ప్రయోగంలో 'కార్యత్వాత్', అనేది అనిత్యత్వాన్ని సాధిస్తుంది కాని నిత్యత్వాన్ని సాధించజాలదు. అదే విధంగా అప్రధానమైన ఉపాయమే ముందు గ్రహించబడుతుంది గాని ప్రధానమైన ఉపేయం గ్రహించబడదు. అందుచేత ప్రథమోపాత్తత్వం అనేది అప్రధానత్వాన్నే సాధిస్తుంది గాని ప్రధానత్వాన్ని సాధించదు గాన ఈ హేతువు విరుద్ధం అని భావం.

'ఆలోక' శబ్దానికి ప్రసిద్ధమైన అర్థం 'వెలుతురు'. దాన్ని గ్రహించకుండా ఇక్కడ అభినవగుప్తుడు చూడడం అనే అర్థం గ్రహించాడు. దీనిలో పెద్ద విశేషం లేదు. ఏదో ఒక క్రొత్త అర్థం చెప్పడం "వనితావదనారవిన్దాదివిలోకనమ్" ఇత్యాదులు చేర్చడం వంటి చమత్కారాలు చేయడం ఈయనికి అలవాటు. 9

## ధ్వన్యాలోకం

ప్రతిపాద్యస్యాపి తం దర్శయతుమాహ -

కా. యథా పదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే,
వాచ్యార్థపూర్వికా తద్వత్ప్రతిపత్తస్య వస్తునః. 10

యథా హి పదార్థద్వారేణ వాక్యార్థావగమః తథా వాచ్యార్థప్రతీతిపూర్వికా వ్యఙ్గ్యస్యార్థస్య ప్రతిపత్తిః.

బాలానందిని

ప్రతిపాద్యస్యాపి=ప్రతిపాదించబడే వాచ్యార్థానికి కూడా, తమ్=వ్యంగ్యార్థాన్ని గూర్చి వ్యాపారాన్ని అని ఒక వ్యాఖ్యాత అర్థం వ్రాశాడు. ప్రతిపాదించబడే వాచ్యార్థానికి కూడా వ్యంగ్యార్థంవిషయంలో వ్యాపారం ఉంటుం దని ఈ కారిక చెప్పుచున్న దని ఆయన అభిప్రాయం. కాని పై వాక్యంలో 'ప్రతిపాదకస్య' అనే పదానికి ప్రతిపాదించే కవికి అని వృత్తికారుడే అర్థం చెప్పి ఉన్నాడు. అందుచేత ఇక్కడ 'ప్రతిపాద్యస్య' అనే పదానికి ఎవరిని ఉద్దేశించి కవి చెపుతున్నాడో వానికి, అనగా 'పఠితకు' అని అర్థం చెప్పడం యుక్తం. అలాగే 'తమ్' అనే పదానికి "వాచ్యార్థజ్ఞానయత్నమును" అని అర్థం చెప్పాలి. అనగా- ప్రతిపాద్యుడైన శ్రోత లేదా పఠిత కూడా ఆ వ్యంగ్యార్థం దాకా వెళ్ళే ముందు వాచ్యార్థాన్ని తెలుసుకొనే ప్రయత్నం చేస్తాడు అని అర్థం. ప్రతిపాద్యునికి కూడా దానిని చూపడానికి చెపుతున్నాడు-

యథా ఇతి. వాక్యార్థః=వాక్యార్థం, యథా=ఏ విధంగా, పదార్థద్వారేణ=పదాల అర్థాలద్వారా, సంప్రతీయతే=తెలియబడుతుందో, తద్వత్=అట్లే, తస్య వస్తునః = ఆ వ్యంగ్యార్థం యొక్క, ప్రతిపత్ = జ్ఞానం, వాచ్యార్థపూర్వికా= వాచ్యార్థజ్ఞానపూర్వకమైనది.

యథా హీతి:- వాక్యార్థజ్ఞానం ఏ విధంగా పదార్థాల జ్ఞానం ద్వారా కలుగుతుందో (ముందుగా పదాల అర్థాలు తెలిసిన పిమ్మటనే కలుగుతుందో) వ్యంగ్యార్థజ్ఞానం కూడా అదే విధంగా వాచ్యార్థజ్ఞానపూర్వక మైనది; ముందు వాచ్యార్థం తెలిసిన తరవాతనే కలుగుతుంది.

లోచనం

ప్రతిపదితి భావే క్విప్. 'తస్య వస్తున' ఇతి - వ్యఙ్గ్యరూపస్య సారస్యేత్యర్థః. అనేన శ్లోకేన అత్యన్తసహృదయో యో న భవతి తస్యైష స్ఫుటసంవేద్య ఏవ క్రమః. యథా అత్యన్తశబ్దవృత్తజ్ఞో యో న భవతి తస్య పదార్థవాక్యార్థక్రమః. కాష్ఠాప్రాప్తసహృదయభావస్య తు వాక్యవృత్తకుశలస్యేవ

సన్నపి క్రమః అభ్యస్తానుమానావినాభావస్మృత్యాదివదసంవేద్య ఇతి దర్శితమ్. 10

బాలానందిని

ప్రతిపదితి - ప్రతిపత్ అనేది భావార్థంలో 'క్విప్' ప్రత్యయం చేర్చగా ఏర్పడినది. జ్ఞానం అని అర్థం. తస్య వస్తునః అనగా వ్యంగ్యరూపమైన సారంయొక్క అని అర్థం. ఎవడైతే బాగా సహృదయుడు కాడో వానికి ఈ వాచ్యవ్యంగ్యార్థాల మధ్య ఉన్న క్రమం స్పష్టంగా తెలుస్తుంది. శబ్దాల పద్ధతి బాగా తెలియనివానికి అనగా భాషలో మంచి ప్రవేశం లేనివానికి, పదార్థవాక్యార్థాల మధ్య ఉన్న క్రమం ఎట్లు స్పష్టంగా తెలుస్తుందో అట్లే ఇది కూడా. భాషాప్రవేశం సరిగా లేనివాడు ముందు ఒక్కొక్క పదానికే అర్థం మెల్లి మెల్లిగా తెలుసుకొని తరవాత వాక్యార్థం తెలుసుకుంటాడు. అందుచేత వానికి ఆ రెండింటి మధ్యా ఉన్న క్రమం తెలుస్తుంది. అదే విధంగా సహృదయత్వం తక్కువగా ఉన్నవానికి వాచ్యార్థ - వ్యంగ్యార్థాల మధ్యఉన్న క్రమం స్పష్టంగా తెలుస్తుంది అని భావం.

కాష్ఠా ఇతి:- అత్యున్నతస్థితిని పొందిన సహృదయత్వం కలవానికి మాత్ర,ం వాక్యస్వభావం విషయంలో మంచి నేర్పు ఉన్నవానికి వలె, వాటి రెండింటి మధ్యా క్రమం ఉన్నా కూడ అది, బాగా అలవాటు ఉన్నవానికి అనుమితికి అవినాభావస్మృతికీ, అనగా వ్యాప్తిస్మృతికీ, ఉన్న క్రమం వలె, తెలియదు అని చూపబడింది.

ధూమం చూడగానే అగ్ని ఉందనే అనుమితి కలుగుతుంది. నిజానికి ధూమం చూడగానే ధూమం ఉన్నచోటల్లా అగ్ని ఉంటుంది అనే అంతకు పూర్వమే తెలిసిన వ్యాప్తిజ్ఞానం స్మృతికి వచ్చి తరవాతనే ఈ అనుమితి కలిగింది. అయినా అలవాటు ఎక్కువగా ఉండడంచేత ఆ స్మృతి కలిగినట్లే అనిపించదు. అట్లే ఇక్కడ కూడా అని భావం. 10

## ధ్వన్యాలోకం

ఇదానీం వాచ్యార్థప్రతీతిపూర్వకత్వేఽపి తత్ప్రతీతేః వ్యఙ్గ్యస్యార్థస్య ప్రాధాన్యం యథా న వ్యాలుప్యతే తథా దర్శయతి -

కా. స్వసామర్థ్యవశేనైవ వాక్యార్థం ప్రతిపాదయన్
యథా వ్యాపారనిష్పత్తౌ పదార్థో న విభావ్యతే. 11

యథా స్వసామర్థ్యవశేనైవ వాక్యార్థం ప్రకాశయన్నపి పదార్థః వ్యాపారనిష్పత్తౌ న భావ్యతే విభక్తతయా.

కా. తద్వత్సచేతసాం సోఽర్థో వాచ్యార్థవిముఖాత్మనామ్,

బుద్ధౌ తత్త్వార్థదర్శిన్యాం ఝటిత్యేవావభాసతే. 12

బాలానందిని

ఇదానీమితి - వ్యంగ్యార్థప్రతీతి వాచ్యార్థప్రతీతిపూర్వమే అయినా, ముందు వాచ్యార్థజ్ఞానం కలిగిన తరవాతనే వ్యంగ్యార్థజ్ఞానం కలిగినా, వ్యంగ్యార్థాని కున్న ప్రాధాన్యం ఎలా తగ్గిపోదో అది, ఇప్పుడు చూపుతున్నాడు-

స్వేతి - పదకొండు, పన్నెండు కారికలకు ఒకటే అన్వయం. "స్వసామర్థ్యవశేనైవ= తన సామర్థ్యం చేతనే, వాక్యార్థమ్ = వాక్యార్థాన్ని, ప్రతిపాదయన్=ప్రతిపాదిస్తూన్న, పదార్థః = పదార్థం, వ్యాపారనిష్పత్తౌ = వాక్యార్థప్రతిపాదనరూపమైన వ్యాపారమునందు, అనగా వాక్యార్థజ్ఞానంలో, యథా =ఎట్లు, న విభావ్యతే=వేరుగా తెలియబడదో" -

యథా ఇతి - తన సామర్థ్యంచేతనే వాక్యార్థాన్ని ప్రకాశింపచేస్తున్నా కూడ పదార్థం (పదాల అర్థం) వాక్యార్థబోధనరూపవ్యాపారం జరగడంలో ఏ విధంగా, వేరుగా తెలియబడదో-

తద్వదితి:- "తద్వత్ = అదే విధంగా, వాచ్యార్థవిముఖాత్మనామ్ = వాచ్యార్థం విషయంలో విముఖమైన మనస్సులు గల, వాచ్యార్థం విషయంలో ఆసక్తి లేని, సచేత సామ్= సహృదయులయొక్క, తత్త్వార్థదర్శిన్యామ్ = తత్త్వార్థాన్ని చూచే, బుద్ధౌ=బుద్ధియందు, ఝటిత్యేవ = వెంటనే, అవభాసతే = స్ఫురిస్తుంది".

లోచనం

న వ్యాలుప్యత ఇతి - ప్రాధాన్యేన తత్పర్యానుసరణరణరణకత్వరి తా మధ్యే విశ్రాన్తిం న కుర్వత ఇతి క్రమస్య సతోఽప్యలక్షణం ప్రాధాన్యే హేతుః. స్వసామర్థ్యమాకాఙ్క్షాయోగ్యతాసన్నిధయః. విభావ్యతే ఇతి. విశబ్దేన విభక్తతా ఉక్తా. విభక్తతయా న భావ్యత ఇత్యర్థః. అనేన విద్యమాన ఏవ క్రమో న సంవేద్యత ఇత్యుక్తమ్. తేన యత్ స్ఫోటాభిప్రాయేణ అసన్నేవ క్రమ ఇతి వ్యాచక్షతే తత్ ప్రత్యుత విరుద్ధమేవ. వాచ్యేఽర్థే విముఖః విశ్రాన్తినిబన్ధనం పరితోషమలభమానః ఆత్మా హృదయం యేషామ్ ఇత్యనేన సచేతసా

మిత్యస్యైవ అర్థ అభివ్యక్తిః. సహృదయానామేవ తర్హి అయం మహిమాస్తు. న తు కావ్యస్యాయం కశ్చిదతిశయః; ఇత్యాశఙ్క్యాహ- అవభాసతే ఇతి. తేనాత్ర విభక్తతయా న భాసతే, న తు వాచ్యస్య సర్వథైవానవభాసః. అత ఏవ తృతీయోద్ద్యోతే ఘటప్రదీపదృష్టాన్తబలాత్ వ్యఙ్గ్యప్రతీతికాలేఽపి వాచ్యప్రతీతిర్న విఘటతే ఇతి యద్వక్ష్యతి తేన సహాస్య గ్రన్థస్య న విరోధః. 11, 12

బాలానందిని

న వ్యాలుప్యత ఇతి - ప్రాధాన్యంవల్లనే, అనగా వ్యంగ్యార్థం ప్రధానం అవడంవల్లనే, దానివరకూ వెళ్లాలనే వేడుకచేత (రణరణక) తొందరపెట్టబడినవారై మధ్యలో విశ్రాంతిని చెయ్యరు(ఆగరు). అందువల్ల క్రమం ఉన్నా దాన్ని గుర్తించకపోవడం వ్యంగ్యార్థప్రాధాన్యానికి హేతువు. 'స్వసామర్థ్యమ్' అనగా ఆకాంక్షాయోగ్యతాసంనిధులు. విభావ్యతే ఇతి:- 'వి' శబ్దంచేత విభక్తంగా ఉండడం చెప్పబడింది. వేరుగా గుర్తించబడదు అని అర్థం. దీనిచేత క్రమం ఉంది కాని ఆ ఉన్న క్రమమే గుర్తించబడడంలేదు అని చెప్పబడింది. అందుచేత - స్ఫోట అనే అభిప్రాయంచేత క్రమమే లేదు అని కొందరు చేసిన వ్యాఖ్యానం అసంగతమే కాదు కదా విరుద్ధం కూడా.

అనగా ఇక్కడ కొందరు వాక్యార్థం అనగా వైయాకరణులు చెప్పిన ఏ విభాగాలూ లేని స్ఫోట అనే అర్థం గ్రహించి అసలు క్రమమే లేదు అని వ్యాఖ్యానించారు. అది అసంగతం అవడమే కాకుండా 'న విభావ్యతే' అని క్రమం ఉన్నా వేరుగా ఉన్నట్లు గుర్తించబడదు అని చెప్పిన దానికి విరుద్ధం అని భావం.

వాచ్యే ఇతి - "వాచ్యార్థవిముఖాత్మనామ్" అనగా వాచ్యార్థమునందు, విముఖమైన, అనగా వాచ్యార్థంతోనే ఆగిపోవడంచేత తృప్తి చెందని, ఆత్మ అనగా హృదయం కలవాళ్లకు, అనడంచేత సహృదయులకు అనే అర్థం స్పష్టం అవుతున్నది. అయితే ఇది సహృదయుల మహిమమాత్రమే కావచ్చును కదా? ఇది కావ్యంలో ఉన్న అతిశయం ఏమీ కాదు అని ఆశంకించుకొని అవభాసతే అంటున్నాడు. తేనేతి - సహృదయులకు భాసిస్తూన్నది అని చెప్పడంచేత, ఇక్కడ విడిగా భాసించడం లేదు అంతేనే కాని వాచ్యం అనేది అసలే భాసించదు అని అర్థం కాదు. అత ఏవేతి - అందువల్లనే, అనగా వాచ్యం దానిస్వరూపంలో భాసిస్తూనే ఉంటుంది, కాని వాచ్యవ్యంగ్యాల విభాగం మాత్రం భాసించదు అని అంగీకరించడంవల్ల, వ్యంగ్యార్థ ప్రతీతికాలంలో కూడ వాచ్యార్థప్రతీతి తొలగిపోదు అని ఘట-ప్రదీపదృష్టాంతంతో

తృతీయోద్యోతంలో (33 వ కారికలో) ఇతడు చెప్ప నున్న దానితో ఈ గ్రంథానికి విరోధం లేదు. 11. 12.

## ధ్వన్యాలోకం

ఏవం వాచ్యవ్యతిరేకిణః వ్యఙ్గస్యార్థస్య సద్భావం ప్రతిపాద్య ప్రకృతే ఉపయోజయన్నాహ-

కా. యత్రార్థః శబ్దో వా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ,
వ్యఙ్క్తః కావ్యవిశేషః స ధ్వనిరితి సూరిభిః కథితః. 13

యత్రార్థః వాచ్యవిశేషః వాచకవిశేషః శబ్దో వా తమర్థం వ్యఙ్క్తః స కావ్యవిశేషో ధ్వనిరితి. అనేన వాచ్యవాచకచారుత్వహేతుభ్యః ఉపమాదిభ్యః అనుప్రాసాదిభ్యశ్చ విభక్త ఏవ ధ్వనేః విషయ ఇతి దర్శితమ్. యదప్యుక్తమ్ - "ప్రసిద్ధప్రస్థానాతిక్రమిణో మార్గస్య కావ్యత్వహానేః ధ్వనిః నాస్తి" ఇతి తదప్యయుక్తమ్. యతః లక్షణకృతామేవ స కేవలం న ప్రసిద్ధః, లక్ష్యే తు పరీక్ష్యమాణే స ఏవ సహృదయహృదయాహ్లాదకారి కావ్యతత్త్వమ్; తతోఽన్యచ్చిత్రమేవేతి దర్శయిష్యామః. యదప్యుక్తమ్ - "కామనీయకమనతివర్తమానస్య తస్య ఉక్తాలఙ్కారేష్వన్తర్భావః" ఇతి తదప్యసమీచీనమ్. వాచ్యవాచకమాత్రాశ్రయిణి ప్రస్థానే వ్యఙ్గ్యవ్యఞ్జకసమాశ్రయేణ వ్యవస్థితస్య ధ్వనేః కథమన్తర్భావః? వాచ్యవాచకచారుత్వహేతవో హి తస్య అఙ్గభూతాః, స తు అఙ్గిరూప ఏవేతి ప్రతిపాదయిష్యమాణత్వాత్. పరికరశ్లోకశ్చాత్ర-

వ్యఙ్గ్యవ్యఞ్జకసమ్బన్ధనిబన్ధనతయా ధ్వనేః,
వాచ్యవాచకచారుత్వహేత్వన్తఃపాతితా కుతః.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వాచ్యంకంటె భిన్నమైన వ్యంగ్యార్థం ఉన్న దని ప్రతిపాదించి దానికి ప్రకృతమైన లక్షణంలో ఉపయోగాన్ని తెలుపుతూ చెపుతున్నాడు- యత్రేతి - యత్ర=ఏ కావ్యంలో, అర్థః = అర్థం కాని,శబ్దో వా = శబ్దంకాని, ఉపసర్జనీకృత స్వార్థౌ=అప్రధానంగా చేయబడిన తానూ అర్థమూ కలవై, అనగా అర్థం తననీ, శబ్దం అర్థాన్నీ అప్రధానంగా చేసినవై, తమ్=ఆ, అర్థమ్=వ్యంగ్యార్థమును, వ్యఙ్క్తః= వ్యంజింపచేయుచున్నాయో, సః = అట్టి, కావ్యవిశేషః=కావ్యవిశేషం, ధ్వనిః ఇతి=ధ్వని అని, కథితః=చెప్పబడింది. 13

యత్ర ఇతి - దేనిలో అర్థమూ అనగా వాచ్యార్థవిశేషమూ, శబ్దమూ అనగా వాచకవిశేషమూ,ఆ అర్థాన్ని వ్యంజింపచేస్తాయో ఆ కావ్యవిశేషం ధ్వని అని చెప్పబడింది.

అనేనేతి - ఇలా చెప్పడంచేత ధ్వనియొక్క విషయం అనగా ధ్వనియొక్క స్థానం, (ధ్వని అని చెప్పదగినది) వాచ్యమైన అర్థంయొక్క వాచకమైన శబ్దంయొక్క చారుత్వానికి హేతువులైన ఉపమాదులకంటె(అర్థాలంకారాలకంటె) అనుప్రాసాదులకంటె (శబ్దాలంకారాలకంటె) వేరైనది అని చూపబడింది. "ప్రసిద్ధమైన ప్రస్థానాలకంటె భిన్నమైన మార్గం కావ్యం అని చెప్పడానికి తగదు కాబట్టి 'ధ్వని' అనేది లేదు అని వెనుక పూర్వపక్షి చెప్పినది కూడ అయుక్తమే. ఎందువల్ల ననగా - అది(ధ్వని) కేవలం కావ్యలక్షణం చెప్పిన వారిలో మాత్రమే ప్రసిద్ధం కాదు. లక్ష్యమైన (కావ్యాదుల్ని) పరిశీలిస్తే మాత్రం అదే (ధ్వనే) సహృదయుల హృదయాలకి ఆహ్లాదం కలిగించే కావ్యతత్త్వం. దానికంటె భిన్నమైనది (ధ్వనిరహితమైనది) చిత్రకావ్యం మాత్రమే అని ముందు చూపగలం.

యదప్యుక్తమితి - "సౌందర్యాన్ని అతిక్రమించని ఆ ధ్వని, అనగా ధ్వని కూడ కావ్యసౌందర్యహేతువే కాబట్టి అది, అలంకారాదుల ప్రకారాలలోనే అంతర్భావం చెందుతుంది" అని చెప్పిన మాట కూడ సమీచీనం కాదు. వ్యంగ్యవ్యంజకభావాన్ని ఆశ్రయించి ఉన్న(సిద్ధించిన) ధ్వనికి వాచ్యవాచకత్వమాత్రాన్ని ఆశ్రయించిన ప్రస్థానంలో అంతర్భావం ఎట్లు కుదురుతుంది? వాచ్యవాచకాల చారుత్వానికి హేతువైన అలంకారాలు ఆ ధ్వనికి అంగమైనవి అనీ, ధ్వని ఐతే ఎప్పుడూ అంగిరూపంగానే ఉంటుం దనీ ప్రతిపాదించబడబోతున్నది (ప్రతిపాదించబోతున్నాం). ఈ విషయంలో ఇది పరికరశ్లోకం - వ్యఙ్గ్యేతి:- ధ్వనేః = ధ్వని, వ్యఙ్గ్యవ్యఞ్జకసంబన్ధ నిబన్ధనతయా= వ్యంగ్యవ్యంజకభావ సంబంధం ఆధారంగా కలదవడంచేత, వాచ్యవాచకచారుత్వహేత్వన్తఃపాతితా= వాచ్యవాచకాల సౌందర్యానికి హేతువైనవాటిలో, అంతర్గతత్వం, కుతః= ఎట్లు కుదురుతుంది?

లోచనం

సద్భావమితి- సత్తాం సాధుభావం చేత్యర్థః. ద్వయం హి ప్రతిపిపాదయిషితమ్. ప్రకృత ఇతి లక్షణే. ఉపయోజయన్ ఉపయోగం గమయన్. తమర్థమితి చాయముపయోగః. స్వశబ్ద ఆత్మవాచీ. స్వశ్చార్థశ్చ తౌ స్వార్థౌ. తౌ గుణీకృతౌ యాభ్యామ్. యథాసంఖ్యేన తేనార్థో గుణీకృతాత్మా, శబ్దః గుణీకృతాభిధేయః.

తమర్థమితి - "సరస్వతీ స్వాదు తదర్థవస్తు" ఇతి యదుక్తమ్. వ్యఙ్క్తః ద్యోతయతః. వ్యఙ్క్త ఇతి ద్వివచనేనేదమాహ - యద్యప్యవివక్షితవాచ్యే శబ్ద ఏవ వ్యఞ్జకః తథాపి అర్థస్యాపి సహకారితా న త్రుట్యతి. అన్యథా అజ్ఞాతార్థోఽపి శబ్దః తద్వ్యఞ్జకః స్యాత్. వివక్షితాన్యపరవాచ్యే చ శబ్దస్యాపి సహకారిత్వం భవత్యేవ; విశిష్టశబ్దాభిధేయతయా వినా తస్యార్థస్యావ్యఞ్జకత్వాత్ ఇతి సర్వత్ర శబ్దార్థయోః ఉభయోరపి ధ్వననం వ్యాపారః. తేన యద్భట్టనాయకేన ద్వివచనం దూషితం తద్గజనిమీలికయైవ. అర్థః శబ్దో వేతి తు వికల్పాభిధానం ప్రాధాన్యాభిప్రాయేణ.

బాలానందిని

సత్తామితి - "సద్భావమ్" అనే పదానికి సత్త(ఉండుట), సాధుత్వం అనగా ప్రాధాన్యం, ఉత్తమత్వం అని రెండర్థాలు, ఎందుచేత ననగా ఇక్కడ ధ్వని ఉన్న దనీ, అదే శ్రేష్ఠమైన దనీ రెండు విషయాలూ ప్రతిపాదించడానికి ఇచ్ఛయింపబడుతున్నాయి కదా? ప్రకృతే అనగా లక్షణమునందు. ఉపయోజయన్ = ఉపయోగాన్ని పొందిస్తూ. 'తమర్థమ్' అని ఆ వ్యంగ్యార్థాన్ని పరామర్శించడమే ఇక్కడ ఉపయోగించడం. వ్యంగ్యం ఉన్న దని స్థాపించిన తరవాతనే కదా "ఆ వ్యంగ్యాన్ని" అని దానిని పరామర్శించడం ద్వారా ఉపయోగించడం జరుగుతుంది? స్వేతి - స్వశబ్దం తాను అనే అర్థాన్ని బోధిస్తుంది. స్వశ్చ అర్థశ్చ స్వార్థౌ అని ద్వంద్వసమాసం. అవి వేటిచేత అప్రధానంగా చేయబడినవో అట్టి అర్థశబ్దాలు. యథాసంఖ్యంగా అన్వయించగా అర్థం తనను తాను అప్రధానమైనదానినిగా చేసుకుంటుంది. శబ్దం అర్థాన్ని అప్రధానమైన దానినిగా చేస్తుంది అని అర్థం లభిస్తుంది. తమర్థమితి - "సరస్వతీ స్వాదు తదర్థవస్తు" అనే శ్లోకంలో ఏది చెప్పబడిందో దానిని. వ్యఙ్క్తః ద్యోతింపచేస్తాయో, వ్యంజింపచేస్తాయో.

కొన్ని చోట్ల శబ్దం వ్యంజకంగా ఉంటుంది, కొన్ని చోట్ల అర్థం వ్యంజకంగా ఉంటుంది కదా? అందుచేత 'వ్యనక్తి' (అర్థః వ్యనక్తి, శబ్దః వ్యనక్తి) అని ఏకవచనమే ప్రయోగించాలి కాని 'వ్యఙ్క్తః' అని ద్వివచనం ఎందుకు ప్రయోగించాడు అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు- వ్యఙ్క్తః ఇతి. 'వ్యఙ్క్తః' అని ద్వివచనంచేత ఈ విషయం చెపుతున్నాడు - ఏ మనగా, అవివక్షితవాచ్యధ్వనిలో శబ్దమే వ్యంజకం అయినా అర్థం కూడా సహకారిగా ఉండడానికి ఏ అడ్డూ లేదు. అలా కాకపోతే అర్థం తెలియని శబ్దం కూడా వ్యంజకం కావలసి వస్తుంది. అదే విధంగా వివక్షితాన్యపరవాచ్య ధ్వనిలో కూడ శబ్దం కూడా సహకారిగా ఉండనే ఉంటుంది. విశిష్టమైన శబ్దంచేత, అనగా తత్తద్రసానుగుణగుణాదు లున్న శబ్దంచేత, బోధించబడితే తప్ప ఆ అర్థం వ్యంజకం కాజాలదు కదా? అందుచేత అన్నిచోట్లా కూడ, అన్ని విధాలైన ధ్వనులలోనూ కూడ, ధ్వననవ్యాపారం శబ్దార్థాలు రెండింటికీ కూడా ఉంటుంది. అందుచేత ఇక్కడ చేసిన ద్వివచనప్రయోగాన్ని భట్టనాయకుడు దూషించడం గజనిమీలికచేత చేసినదే.

వివరణ:- మత్తులో ఉన్న ఏనుగు చుట్టుప్రక్కల ఏం జరుగుతూన్నదో కూడ పట్టించుకోకుండా ఒక విధమైన నిర్లక్ష్యభావంతో ఉన్నట్లు కళ్లు సగం మూసుకొని ఉంటుంది. ఈ విధంగా నిర్లక్ష్యభావంతో ఏమీ ఆలోచించకుండా ఉండడాన్ని 'గజనిమీలిక' అంటారు. ఇది లాక్షణికప్రయోగం.

అర్థశబ్దాలు రెండింటికీ ధ్వననవ్యాపారం ఉన్న పక్షంలో 'అర్థః శబ్దః చ' అనాలి కాని 'వా' శబ్దం ఎలా ప్రయోగించాడు అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు. **అర్థః ఇత్యాది** - అర్థః శబ్దో వా అని వికల్పం చెప్పడం ప్రాధాన్యాభిప్రాయంచేత. అనగా రెండూ వ్యంజకాలే అయినా కొన్ని చోట్ల ధ్వననం విషయంలో అర్థానికి ప్రాధాన్యం ఉంటుంది; కొన్ని చోట్ల శబ్దానికి ప్రాధాన్యం ఉంటుంది. ఆ కారణంచేత 'వా' శబ్దాన్ని ఉపయోగించి అర్థమైనా, శబ్దమైనా వ్యంజింపచేస్తుంది అని చెప్పబడింది అని భావం.

లోచనం

"కావ్యం చ తద్విశేషశ్చ అసౌ" "కావ్యస్య వా విశేషః". కావ్యగ్రహణాత్ గుణాలంకారోపస్కృతశబ్దార్థపృష్ఠపాతీ ధ్వనిలక్షణ ఆత్మేత్యుక్తమ్. తేనైతన్నిరవకాశం శ్రుతార్థాపత్తావపి ధ్వనివ్యవహారః స్యాదితి. యచ్చోక్తమ్ - "చారుత్వప్రతీతిస్తర్హి కావ్యస్యాత్మా స్యాత్" ఇతి తదఙ్గీకుర్మ ఏవ. నామ్ని ఖల్వయం వివాద ఇతి. యచ్చోక్తమ్ - "చారుణః ప్రతీతిర్యది కావ్యాత్మా

ప్రత్యక్షాదిప్రమాణాదపి సా భవన్తీ తథా స్యాత్" ఇతి తత్ర శబ్దార్థమయ కావ్యాత్మాభిధానప్రస్తావే క ఏష ప్రసఙ్గ ఇతి న కించిదేతత్. స ఇతి:- అర్థో వా శబ్దో వా, వ్యాపారో వా. అర్థోఽపి; వాచ్యో వా ధ్వనతీతి; శబ్దోఽప్యేవమ్. వ్యఙ్గ్యో వా ధ్వన్యత ఇతి; వ్యాపారో వా శబ్దార్థయోః ధ్వననమితి. కారికయా తు ప్రాధాన్యేన సముదాయ ఏవ కావ్యరూపో ముఖ్యతయా ధ్వనిరితి ప్రతిపాదితమ్. విభక్త ఇతి:- గుణాలఙ్కారాణాం వాచ్యవాచకభావప్రాణత్వాత్, అస్య చ తదన్యవ్యఙ్గ్యవ్యఞ్జకభావసారత్వాత్ నాస్య తేష్వన్తర్భావ ఇతి. అనన్యత్ర భావో విషయశబ్దార్థః. ఏవం తద్వ్యతిరిక్తః కోఽయం ధ్వనిః ఇతి నిరాకృతమ్. లక్షణకృతామేవేతి. లక్షణకారాప్రసిద్ధతా విరుద్ధో హేతుః. తత ఏవ హి యత్నేన లక్షణీయతా. లక్ష్యే త్వప్రసిద్ధత్వమ్ అసిద్ధో హేతుః. యచ్చ నృత్తగీతాదికల్పం, తత్ కావ్యస్య న కించిత్. చిత్రమితి - విస్మయకృద్వృత్తాదివశాత్, న తు సహృదయాభిలషణీయచమత్కారసారరసనిఃష్పన్దనమయమ్ ఇత్యర్థః. కావ్యానుకారిత్వా ద్వా చిత్రమ్. ఆలేఖమాత్రత్వాద్వా, కలామాత్రత్వాద్వా. అగ్ర ఇతి:-

ప్రధానగుణభావాభ్యాం వ్యఙ్గ్యస్యైవం వ్యవస్థితమ్,
ద్విధా కావ్యం తతోఽన్యద్యత్తచ్చిత్రమభిధీయతే (ధ్వన్యా. 3.42)

ఇతి తృతీయోద్ద్యోతే వక్ష్యతి. పరికరార్థం కారికార్థస్య అధికావాపం కర్తుం శ్లోకః పరికరశ్లోకః.

బాలానందిని

'కావ్యవిశేషః' అనేదానికి రెండు విధాల అర్థం చెప్పడానికై రెండు విధాల విగ్రహవాక్యాలు చెపుతున్నాడు - కావ్యమితి - "కావ్యం చ తద్విశేషశ్చ అసౌ" అనే విగ్రహంలో అసౌ = ఈ ధ్వని, కావ్యమూ, దాని విశేషమూ కూడ అని అర్థం. అనగా ఈ ధ్వని కావ్యమూ అవుతుంది, దానిని ఇతర శాస్త్రాదులనుండి వేరుచేసే వైశిష్ట్యమూ అవుతుంది అని ఈ కర్మధారయసమాసంవల్ల వచ్చే భావం. 'కావ్యస్య విశేషః కావ్యవిశేషః' అని షష్ఠీతత్పురుష చెప్పినట్లయితే ధ్వని కావ్యంలోనే ఉండే విశేషం; ఇతరశాస్త్రాదులలో ఉండదు అని భావం. 'కావ్య' శబ్దాన్ని గ్రహించడంవల్ల ధ్వనిరూపమైన ఆత్మ

గుణాలంకారాలచేత ఉపస్కృతమైన (అందం కలదిగా చేయబడిన) శబ్దార్థాల వెనుకనే ఉంటుంది అని చెప్పబడింది. దీనిచేత, అనగా గుణాలంకారోపస్కృతశబ్దార్థపృష్ఠపాతి యైనదే ధ్వని అనడంచేత, శ్రుతార్థాపత్తిలో కూడా 'ధ్వని' అనే వ్యవహారం రావచ్చు కదా అన్న ఆక్షేపణకి అవకాశం లేదు.

వివరణ:- అర్థాపత్తి రెండు విధాలు - ఒక వ్యక్తి పగలు భోజనం చేయకపోయినా బలిసి ఉన్నాడు అని ప్రత్యక్షాదుల ద్వారా తెలుసుకొని 'ఇతడు రాత్రి భోజనం చేస్తున్నాడు' అనే అర్థాన్ని (విషయాన్ని) ఊహించినట్లయితే అది దృష్టార్థాపత్తి. "పీనః దేవదత్తః దివా న భుఙ్క్తే" అని శబ్దం విని "రాత్రౌ భుఙ్క్తే" అనే వాక్యం కల్పించి న ట్లయితే అది శ్రుతార్థాపత్తి. "పీనః దేవదత్తః దివా న భుఙ్క్తే"ఇత్యాది వాక్యాలు గుణాలంకారాలచేత ఉపస్కృతాలు కాకపోవడంచేత "రాత్రౌ భుఙ్క్తే" అని ప్రతీయమానం అవుతున్నా ఇది ధ్వని కాదు అని భావం.

యచ్చేతి - " అయితే - చారుత్వంయొక్క ప్రతీతియే కావ్యాత్మ" అవుతుంది' ' అని ఏ ఆక్షేపం చెయ్యబడుతుందో అది మాకు అంగీకార్యమే. ఈ వివాదం అంతా పేరు విషయంలోనే కదా?

వివరణ:- చారుత్వానికి హేతువులుగా ప్రసిద్ధాలైన గుణాలంకారాలకంటె ధ్వని భిన్నమైనది, అదే ఆత్మ అని చెప్పడానికి బదులు చారుత్వప్రతీతియే(చారుత్వం కనబడడమే) ఆత్మ అని చెపితే సరిపోతుంది కదా; మధ్యలో ఈ ధ్వని అనేది ఎందుకు అని ఆక్షేపం చేసేవాని భావం. చారుత్వప్రతీతియే ఆత్మ అనే విషయం మాకు కూడా అంగీకార్యమే. మేం దానినే 'ధ్వని' అంటున్నాం. మీరు 'చారుత్వప్రతీతి' అంటున్నారు. "మన కున్న తగాదా అల్లా పేరు విషయంలోనే" అని భావం.

మరొక ఆక్షేపణకి సమాధానం చెపుతున్నాడు - యచ్చేతి - "అందమైన విషయంయొక్క ప్రతీతియే ఆత్మ అయితే ప్రత్యాక్షాదిప్రమాణాలవల్ల కలిగే చారువిషయజ్ఞానం కూడా ఆత్మ కావలసి ఉంటుంది" అనే ఆక్షేపణ ఏది ఉందో అది ఒక విషయమే కాదు; నిఃసారమైన దని భావం. శబ్దార్థమయమైన కావ్యానికి ఆత్మ ఏది అని విచారించే సందర్భంలో ఈ ప్రసంగం ఏమిటి? ఈ ఆక్షేపణకి అర్థమే లేదు అని భావం. సః ఇతి:- కారికలోని 'సః' అనేదానికి అర్థం కాని, శబ్దం కాని వ్యాపారం కాని అని అర్థం. ('ధ్వనతీతి ధ్వనిః' అని విగ్రహంచేత) ధ్వనింపచేస్తుంది కాబట్టి వాచ్యార్థం ధ్వని. శబ్దం కూడా ఇట్లే - అనగా ధ్వనింపచేస్తుంది కాబట్టి 'ధ్వని' ("ధ్వన్యతే ఇతి ధ్వనిః" అనే విగ్రహంచేత) ధ్వనింపచేయబడుతుంది కాబట్టి వ్యంగ్యం కూడా 'ధ్వని' (ధ్వననం

ధ్వనిః అనే విగ్రహంచేత) శబ్దార్థాల రెండింటిలోనూ ఉన్న ధ్వననవ్యాపారం (ధ్వనింపచేయడం అనే వ్యాపారం) కూడా 'ధ్వని'యే. కారికయా ఇతి:- ధ్వనిశబ్దానికి పైన చెప్పిన అర్థాలన్నీ ఉన్నా కారికలో మాత్రం ప్రాధాన్యాన్ని పట్టి వీటి అన్నింటి సముదాయం అయిన, అనగా శబ్ద-వాచ్య - వ్యంగ్య - వ్యఞ్జనా వ్యాపారసముదాయమైన, కావ్యమే ముఖ్యంగా, (రూఢిచేత) 'ధ్వని' అని ప్రతిపాదించబడింది.

విభక్త ఇతి - గుణాలంకారాలకు వాచ్యవాచకభావం ప్రాణం, దీనికి దానికంటె వేరైన వ్యఙ్గ్యవ్యఞ్జకభావం సారం. అందుచేత దీనికి (ధ్వనికి) వాటిలో (గుణాలంకారాలలో) అంతర్భావం కుదరదు. అనన్యత్ర ఇతి:- మరొకదానిలో దేనిలో ఉండకపోవడం 'విషయ' శబ్దానికి అర్థం. ధ్వనియొక్క విషయం విభక్తమై ఉన్నది, అనగా ధ్వని గుణాలంకారాదులు వేటిలోను లేదు అని అర్థం. ఏవమితి - ఈవిధంగా 'వాటికంటె(గుణాలంకారాలకంటె) భిన్నంగా ఈ ధ్వని అంటూ ఏమిటి?" అనే పూర్వపక్షి వాదం నిరాకరించబడింది. లక్షణకృతామేవేతి - 'ప్రసిద్ధమైన ఆ ప్రస్థానంకంటె వేరుగా ఉండడంచేత 'ధ్వని' అనే కావ్యప్రకారం లేదు' అని పూర్వపక్షి చెప్పినదానికి అర్థం లక్షణకారులలో ప్రసిద్ధంగా లేదని అర్థమా, లక్ష్యాలలో లేదని అర్థమా? ఈ రెండు వికల్పాలూ కూడ అయుక్తాలే అని చెపుతున్నాడు. లక్షణకారులలో ఇది అప్రసిద్ధం అనే హేతువు విరుద్ధం. కావ్యవిశేషాలలో ధ్వనిలక్షణం పట్టడంచేత అవి కావ్యశబ్దవాచ్యాలే అయినా కూడా లక్షణకారాప్రసిద్ధత్వం అనే హేతువు ప్రవర్తింపచేయబడుతున్నది. అందుచేత ఈ హేతువు 'విరుద్ధం'. శబ్దం అనిత్యం అని తెలియక ఎవడైనా 'శబ్దః నిత్యః. కృతకత్వాత్ అని ప్రయోగం చూపినంతమాత్రాన కృతకత్వహేతువు విరుద్ధం కాకపోదుకదా? తత ఇతి - నువ్వు చెప్పినట్లు ఇది లక్షణకారులలో అప్రసిద్ధం కనకనే దీన్ని ప్రయత్నపూర్వకంగా లక్షణాదులు చెప్పి ప్రతిపాదించాలి. లక్ష్యంలో ప్రసిద్ధం కాదు అనడం అయుక్తం అంటున్నాడు - లక్ష్యే త్వితి - లక్ష్యాలలో ధ్వని ప్రసిద్ధంగా ఉండనే ఉంది. అందుచేత 'లక్ష్యే అప్రసిద్ధత్వాత్ అనే హేతువు అసిద్ధం.

గుణాదివ్యతిరిక్తమైన మీరు చెప్పే ధ్వని నృత్తగీతాదులవంటిదే అవుతుంది అని అభావవాది చేసిన దూషణానికి సమాధానం చెపుతున్నాడు - యచ్చేతి - నృత్తగీతాది సమానమైనది ఏది ఉందో దానికీ శబ్దార్థరూపమైన మనం మాటలాడుతున్న కావ్యానికీ ఏమీ సంబంధం లేదు. ఆ ఆక్షేపం నిరాధారం అని భావం. చిత్రమితి - ధ్వనికంటె భిన్నమైనది ఆశ్చర్యం కలిగించే వృత్తాదులు, అనుప్రాసాదులు ఉపయోగించడంవల్ల అది ఆశ్చర్యకరం మాత్రమే కాని సహృదయుల హృదయాలచేత అభిలషించదగిన,

చమత్కారమే సారం గల, రసనిష్యంద (రసప్రవాహ) మయం కాదని అర్థం. లేదా ధ్వని కావ్యాన్ని అనుకరించడంచేత దీనిని చిత్రం అని అనవచ్చు. ప్రతిమాదులు విష్ణ్వాదులను అనుకరించడాన్ని గాని, చిత్రపటంలో చిత్రించడాన్నిగాని, ఏదైనా కళనుగాని చిత్రం అని అన్నట్లు కూడా దీనిని కూడా చిత్రం అనవచ్చు. అగ్ర ఇతి:- ఈ విషయం తృతీయోద్ద్యోతంలో "ప్రధానగుణభావాభ్యామ్" అనే కారికలో చెప్పబోతున్నాడు. పరికరశ్లోకం అనగా పరికరం కోసం, కారికలో చెప్పిన అర్థాన్ని విశదీకరించడంకోసం చెప్పిన శ్లోకం.

## ధ్వన్యాలోకం

నను యత్ర ప్రతీయమానస్యార్థస్య వైశద్యేన అప్రతీతిః స నామ మా భూద్ధ్వనేః విషయః, యత్ర తు ప్రతీతిరస్తి, యథా - సమాసోక్త్యాక్షేపానుక్తనిమిత్తవిశేషోక్తిపర్యాయోక్తాపహ్నుతి దీపకసంకరాలంకారాదౌ తత్ర ధ్వనేః అన్తర్భావః భవిష్యతి ఇత్యాది నిరాకర్తుమ్ అభిహితమ్ - "ఉపసర్జనీకృతస్వార్థౌ" ఇతి. అర్థో గుణీభూతాత్మా, గుణీభూతాభిధేయః శబ్దోవా యత్ర అర్థాన్తరమ్ అభివ్యనక్తి స ధ్వనిరితి తేషు కథం తస్య అన్తర్భావః?? వ్యఙ్గ్య ప్రాధాన్యే హి ధ్వనిః, న చైతత్ సమాసోక్త్యాదిషు అస్తి. సమాసోక్తౌ తావత్ -

**శ్లో.** ఉపోఢరాగేణ విలోలతారకం తథా గృహీతం శశినా నిశాముఖమ్,
యథా సమస్తం తిమిరాంశుకం తయా పురోఽపి రాగాద్గలితం న లక్షితమ్. (7)

ఇత్యాదౌ వ్యఙ్గ్యే అనుగతం వాచ్యమేవ ప్రాధాన్యేన ప్రతీయతే; సమారోపిత నాయికానాయకవ్యవహారయోః నిశాశశినోరేవ వాక్యార్థత్వాత్.

### బాలానందిని

ఆశంక - నన్వితి - ప్రతీయమానమైన అర్థం ఎక్కడైతే స్పష్టంగా తెలియదో అది ధ్వనికి విషయం కాకపోతే కాకపోవచ్చు. సమాసోక్తి - ఆక్షేప - అనుక్తనిమిత్త**విశేషోక్తి** - పర్యాయోక్త - అపహ్నుతి - దీపక- సంకరాలంకారాదులలో ఎక్కడైతే దాని (ప్రతీయమానార్థంయొక్క) ప్రతీతి ఉన్నదో దానియందు (ఆ అలంకారాలలో) ధ్వని

అంతర్గతం కావచ్చును కదా- ఇత్యాద్యాక్షేపాన్ని నిరాకరించడానికి 'ఉపసర్జనీకృతస్వార్థౌ' 'అని చెప్పబడింది. ఎక్కడైతే తనను తాను అప్రధానంగా చేసికొన్న వాచ్యార్థం కాని, అప్రధానంగా చేయబడిన అర్థం గల శబ్దం గాని మరొక అర్థాన్ని అభివ్యక్తం చేస్తుందో అది ధ్వని. అలాంటప్పుడు దానికి వాటిలో అంతర్భావం ఎలా కుదురుతుంది? వ్యంగ్యం ప్రధానంగా ఉంటేనే కదా ధ్వని? ఇది (వ్యంగ్యప్రాధాన్యం) సమాసోక్త్యాదులలో లేదు. సమాసోక్త్యలంకారంలో అయితే - 'ఉపోఢరాగేణ' ఇత్యాది శ్లోకంలో నాయికానాయకభావాన్ని ఆరోపించిన నిశా - శశాంకులే వాక్యార్థం అవడంవల్ల వ్యంగ్యంచేత అనుసరించబడిన వాచ్యార్థమే ప్రధానంగా తెలుస్తున్నది. శ్లోకానికి అర్థం ఇది-

ఉపోఢేతి - ఉపోఢరాగేణ = గ్రహించబడిన రాగం గల, రాగశబ్దానికి ఎరుపు అనురాగం అని రెండర్థాలు, శశినా = చంద్రునిచేత, విలోలతారకమ్ = చంచలములైన తారకలు గల, తారకశబ్దానికి నక్షత్రాలు, కనుగ్రుడ్లు లేదా నేత్రాంతాలు అని రెండర్థాలు, నిశాముఖమ్ = నిశయొక్క ముఖం, ముఖశబ్దానికి ప్రారంభం, మొగం అని రెండర్థాలు, తథా = ఆ విధంగా, గృహీతమ్=గ్రహించబడింది; యథా= ఎట్లనగా, పురః = ఎదుట, తూర్పుదిక్కున అని రెండవ అర్థం. రాగాత్ = రాగంవల్ల, సంధ్యారాగం పోగానే, అనురాగంవల్ల అని రెండర్థాలు, గలితమ్ = జారిపోయిన, తయా= ఆరాత్రితో, సమస్తమ్= మిశ్రితమైన, తిమిరాంశుకమ్= చీకటితో కలిసిన కిరణసముదాయం, నల్లనివస్త్రం అని రెండర్థాలు, న లక్షితమ్ = గుర్తించబడలేదు.

వివరణ:- ఇక్కడ ప్రయోగించిన కొన్ని శబ్దాలను పట్టి నిశా-నిశాకరుల మధ్య జరిగిన వ్యవహారం గమ్యం అవుతున్నది. అందుచేత ఇక్కడ సమాసోక్త్యలంకారం.

లోచనం

యత్రేతి అలంకారే. వైశద్యేనేతి చారుతయా స్ఫుటతయా చేత్యర్థః. అభిహితమితి భూతప్రయోగః; ఆదౌ వ్యఙ్క్తః ఇత్యస్య వ్యాఖ్యాతత్వాత్. గుణీకృతాత్మేతి. ఆత్మేత్యనేన స్వశబ్దస్యార్థో వ్యాఖ్యాతః న చైతదితి వ్యఙ్గ్యస్య ప్రాధాన్యమ్. ప్రాధాన్యం చ యద్యపి జ్ఞప్తౌ న చకాస్తి, 'బుద్ధౌ తత్త్వావభాసిన్యామ్' ఇతి నయేన అఖణ్డచర్వణావిశ్రాన్తేః, తథాపి వివేచకైః జీవితాన్వేషణే క్రియమాణే యదా వ్యఙ్గ్యోఽర్థః పునరపి వాచ్యమేవ అనుప్రాణయన్ ఆస్తే తదా తదుపకరణత్వాదేవ తస్యాలంకారతా. తతో వాచ్యాదేవ తదుపస్కృతాత్

చమత్కారలాభ ఇతి. యద్యపి పర్యన్తే రసధ్వనిరస్తి, తథాపి మధ్యకక్ష్యానివిష్టోఽసౌ వ్యఙ్గ్యః అర్థః న రసోన్ముఖీ భవతి స్వాతన్త్ర్యేణ; అపి తు వాచ్యమేవార్థం సంస్కర్తుం ధావతి ఇతి గుణీభూతవ్యఙ్గ్యతా ఉక్తా.

బాలానందిని

యత్ర = ఏ అలంకారంలో, వైశద్యేన= రమణీయంగాను స్ఫుటంగాను అని అర్థం. ముందుగానే 'వ్యఙ్గ్యః' అనేది వ్యాఖ్యానించబడి ఉండడంచేత 'ఆహ' అని అనకుండా 'అభిహితమ్' అని భూతకాలప్రయోగం చేయబడింది. **గుణీకృతాత్మేతి-** 'ఆత్మా' అనేదానిచేత 'ఉపసర్జనీకృతస్వార్థౌ' లోని 'స్వ' శబ్దార్థం వ్యాఖ్యానించబడింది. **న చైతదితి.** ఏతత్ అనగా వ్యంగ్యానికి ప్రాధాన్యం. ధ్వనియైనా, గుణీభూతవ్యంగ్యమైనా రెండు స్థలాలోనూ కూడ వ్యంగ్యార్థప్రతీతిసమయంలో ప్రాధాన్యంయొక్క ప్రతీతి ఉండకపోవడం సమానమే అయినా తరవాత ప్రాధాన్యాప్రాధాన్యాల జ్ఞానం కలుగుతుంది అని చెపుతున్నాడు. **ప్రాధాన్యం చేతి** "బుద్ధౌ తత్త్వావభాసిన్యాం ఝటిత్యేవావభాసతే" అని వెనక చెప్పినట్లు సహృదయులకు అఖండమైన వ్యంగ్యార్థచర్వణయందు విశ్రాంతియే కలుగుతుంది. ఆ క్షణంలో ఇది ప్రధానమా అప్రధానమా అనే ఆలోచనకు అవకాశం ఉండదు. అందుచేత వ్యంగ్యార్థస్ఫూర్తిసమయంలో (జ్ఞప్తౌ) ప్రాధాన్యం ప్రకాశించక పోయినా, గోచరించకపోయినా, ఆ అఖండచర్వణావిశ్రాంతి జరిగిన తరవాత వివేచకులు ఇక్కడ ప్రధానమైనది ఏది అని జీవితంయొక్క అన్వేషణం చేసే సమయంలో వ్యంగ్యార్థం కూడా మళ్లీ వెనక్కి వెళ్లి వాచ్యార్థాన్నే జీవింపచేస్తూ (వాచ్యార్థానికే ప్రాణం పోస్తూ) కనబడుతుంది. అప్పుడు అది (వ్యంగ్యార్థం) ఆ వాచ్యార్థానికి ఉపకరణం అవడం మూలానే అది (వ్యంగ్యార్థం) అలంకారం అవుతుంది. అందువల్ల (వ్యంగ్యం అలంకారంగా అవడంవల్ల) ఆ వ్యంగ్యంచేత ఉపస్కృతమైన వాచ్యంవల్ల చమత్కారం కలుగుతుంది. యద్యపీతి - చివరకి రసధ్వని ఉన్నా, మధ్యకక్ష్యలో ఉన్న వ్యంగ్యార్థం స్వతంత్రంగా రసోన్ముఖం కాకుండా వాచ్యార్థాన్ని సంస్కరించడానికే పరుగెత్తుతుంది. అందుచేత ఇది గుణీభూతవ్యంగ్యం అని చెప్పబడింది.

వివరణ:- సమాసోక్త్యాదులలో వాచ్యం ప్రథమకక్ష్యకి, వస్తువ్యంగ్యం ద్వితీయకక్ష్యకి, రసధ్వని మూడవ కక్ష్యకి సంబంధించి ఉంటాయి.

లోచనం

సమాసోక్తావితి-

యత్రోక్తౌ గమ్యతే ఽన్యో ఽర్థస్తత్సమానైర్విశేషణైః,

సా సమాసోక్తిరుదితా సంక్షిప్తార్థతయా బుధైః. (భామహకావ్యా. 2.79)

ఇత్యత్ర సమాసోక్తేః లక్షణస్వరూపం, హేతుః, నామ, తన్నిర్వచనమ్ ఇతి పాదచతుష్టయేన క్రమాదుక్తమ్. ఉపోఢోరాగః సాన్ధ్యో ఽరుణిమా ప్రేమ చ యేన. విలోలాః తారకాః జ్యోతీంషి నేత్రత్రిభాగాశ్చ యత్ర తథేతి. ఝటిత్యేవ ప్రేమరభసేన చ గృహీతమ్ ఆభాసితం, పరిచుమ్బితుమ్ ఆక్రాన్తం చ, నిశాయాః ముఖం ప్రారమ్భః, వదనకోకనదం చ ఇతి. యథేతి - ఝటితిగ్రహణేన ప్రేమరభసేన చ. తిమిరం చాంశుకాశ్చ సూక్ష్మాంశవః తిమిరాంశుకమ్. రశ్మిశబలీకృతం తమఃపటలమ్. తిమిరాంశుకం నీలజాలికా నవోఢాప్రౌఢవధూచితా. రాగాత్ రక్తత్వాత్ సన్ధ్యాకృతాత్ అనన్తరం ప్రేమరూపాచ్చ హేతోః. పురో ఽపి పూర్వస్యాం దిశి అగ్రే చ, గలితం ప్రశాన్తం పతితం చ తయా రాత్ర్యా కరణభూతయా సమస్తమ్ మిశ్రితమ్, ఉపలక్షణత్వేన వా. న లక్షితమ్, రాత్రిప్రారమ్భో ఽసావితి న జ్ఞాతమ్. తిమిరసంవలితాంశుదర్శనే హి రాత్రి ముఖమితి లోకేన లక్ష్యతే న తు స్ఫుట ఆలోకే. నాయికాపక్షే తు తయేతి కర్తృపదమ్. రాత్రిపక్షే తు అపిశబ్దో లక్షితమిత్యస్యానన్తరః.

బాలానందిని

సమాసోక్తావితి - సమాసోక్తికి భామహుడు కావ్యాలంకారంలో ఇచ్చిన లక్షణం చూపుతున్నాడు-యత్రేతి. "యత్ర=ఎక్కడ, ఉక్తౌ = ప్రకృతార్థంయొక్క చెప్పడమునందు, ప్రకృతార్థం చెప్పబడగా, తత్సమానైః= దానితో సమానాలైన, సాధారణాలైన, విశేషణైః = విశేషణాలచేత, అన్యః = మరియొక, అర్థః= అర్థం, గమ్యతే= తెలియబడునో, సా = అది, సంక్షిప్తార్థతయా= సంక్షిప్తమైన, ఒకే వాక్యంలో చేర్చబడిన, రెండర్థాలు కలదగుటచేత, సమాసోక్తిః = సమాసోక్తిగా, బుధైః= పండితులచేత, ఉదితా = చెప్పబడింది.

ఇత్యత్రేతి- ఈ శ్లోకంలో సమాసోక్తిలక్షణం యొక్క స్వరూపం, హేతువు, పేరు, దాని నిర్వచనం(వరసగా) నాలుగు పాదాలలో చెప్పబడ్డాయి. ఉపోఢేతి-ఎవనిచేత రాగం

అనగా సంధ్యాకాలసంబంధమైన ఎరుపు (నాయకుని పక్షంలో) ప్రేమ, ధరించబడ్డాయో అట్టి. విలోలేతి- చంచలాలైన నక్షత్రాలు, నేత్రాంతాలు దేనియందో అది. తథా=హటాత్తుగా, ప్రేమావేశంతోను, గృహీతమ్=ప్రకాశింపచేయబడింది; చుంబించడానికి ఆక్రమించబడింది. నిశయొక్క, ముఖమ్= ప్రారంభం. ముఖపద్మం. యథా ఇతి :- హటాత్తుగా గ్రహించడంచేత, ప్రేమావేశం వల్ల కలిగిన తొందరచేత "తిమిరం చ అంశుకాశ్చ తిమిరాంశుకమ్" అనే విగ్రహంచేత చీకటీ, సూక్ష్మకిరణాలు; అనగా సూక్ష్మకిరణాలతో మిశ్రమైన చీకటి అని అర్థం. నాయిక పక్షంలో క్రొత్తగా వివాహంచేసుకొన్న ప్రౌంఢాంగనకు తగిన (ఆమె ధరించే) నల్లని జాలిక, పల్చని మేలిముసుగు లేదా 'నీలజాలికా' అనేది కామశాస్త్రప్రసిద్ధమైన నీలవర్ణమైన పట్టువస్త్రం. రాగాత్= సంధ్యవల్ల ఏర్పడిన ఎరుపురంగుకు తరవాత; ప్రేమరూపమైన రాగంవల్ల, పురః అపి=తూర్పు దిక్కున. ఎదుట, గలితమ్= శాంతించినది, జారిపడిపోయినది. తయా రాత్ర్యా= కరణమైన రాత్రితో, సమస్తమ్= మిశ్రితమైనది. తిమిరమూ, సన్నని కిరణాలూ కలవడానికి రాత్రి కరణం. అందుచేత 'తయా'అన్నప్పుడు కరణార్థంలో తృతీయావిభక్తి అని అర్థం. లేదా 'తయా' అన్నప్పుడు తృతీయ ఉపలక్షణార్థంలో చెప్పవచ్చును. అనగా "జటాభిః తాపసః" ఇత్యాదులలో వలె "ఇత్థంభూతలక్షణే"(2.3.21) అనే సూత్రంచేత తృతీయ. రాత్రి అవడంమూలాన తిమిరాంశుకాలు కలిసినట్లున్నాయి అని తెలుస్తూన్నది అని అర్థం. న లక్షితమ్= ఇది రాత్రి ప్రారంభం అని తెలియబడలేదు. చీకటితో కలిసిన కిరణాలు చూచినప్పుడు జనులు ఇది రాత్రి ప్రారంభం అని తెలుసుకుంటారు కాని వెలుతురు బాగా ఉన్నప్పుడు గుర్తించరు కదా? నాయికాపక్షంలో 'తయా' అనేది కర్తృపదం. నాయికచేత అని అర్థం. రాత్రిచేత ఏర్పడిన తొలగిన తిమిరాంశుకాన్ని లోకులు గుర్తించలేదు. తన తిమిరాంశుకాన్ని నాయిక గుర్తించలేదు అని అర్థం. "పురోఽపి న లక్షితమ్" అన్న వాక్యంలోని 'అపి' శబ్దాన్ని రాత్రిపక్షంలో 'లక్షితం' తరవాత చేర్చి "న లక్షితమపి" (చూడబడలేదు కూడ) అని అర్థం చెప్పుకోవాలి. నాయికాపక్షంలో మాత్రం 'పురః అపి' (ఎదుటనే అయినా కూడ) అని చెప్పుకోవాలి అని అర్థం.

లోచనం

అత్ర చ నాయకేన పశ్చాద్గతేన చుమ్బనోపక్రమే పురో నీలాంశుకస్య గలనం పతనమ్.యది వా-"పురః అగ్రే నాయకేన తథాగృహీతం ముఖమ్" ఇతి సంబన్ధః. తేనాత్ర వ్యఙ్గ్యే ప్రతీతేఽపి న ప్రాధాన్యమ్. తథాహి - నాయకవ్యవహారో నిశాశశినావేవ శృఙ్గారవిభావరూపౌ సంస్కుర్వాణః

అలఙ్కారతాం భజతే. తతస్తు వాచ్యాద్విభావీభూతాద్రసనిఃష్యన్దః.

యస్తు వ్యాచష్టే - "తయా నిశయా ఇతి కర్తృపదమ్; న చ అచేతనాయాః కర్తృత్వమ్ ఉపపన్నమ్ ఇతి శబ్దేనైవాత్ర నాయకవ్యవహారః ఉన్నీతః, అభిధేయ ఏవ, న వ్యఙ్గ్యః ఇత్యత ఏవ సమాసోక్తిః" ఇతి - స ప్రకృతమేవ గ్రన్థార్థమత్యజత్ "వ్యఙ్గ్యేనానుగతమ్ ఇతి. ఏకదేశవివర్తి చేత్థం రూపకం స్యాత్ - "రాజహంసైరవీజ్యన్త శరదైవ సరోనృపాః" ఇతివత్, న తు సమాసోక్తిః, తుల్యవిశేషణాభావాత్. గమ్యతే ఇతి చానేన అభిధావ్యాపార నిరాసాత్; ఇత్యలమవాన్తరేణ బహునా. నాయికాయాః నాయకే యో వ్యవహారః స నిశాయాం సమారోపితః నాయికాయాం నాయకస్య యో వ్యవహారః స శశిని సమారోపితః ఇతి వ్యాఖ్యానే నైకశేషప్రసఙ్గః.

బాలానందిని

అత్రేతి :- ఇక్కడ - వెనక ఉన్న నాయకుడు చుంబనం చేయడానికి ఉపక్రమించగానే అగ్రభాగంలో నీలాంశుకంయొక్క గలనం, అనగా అది క్రిందికి పడిపోవడం. లేదా ("పురః గలితం" అని కాకుండా "పురః ముఖం గృహీతమ్" అని చెప్పినట్లయితే) "అగ్రభాగంలో నాయకునిచేత ముఖం ఆ విధంగా గ్రహించ బడింది" అని అన్వయం చెప్పవచ్చును. తేనేతి - ఈ విధంగా ఇక్కడ వ్యంగ్యార్థం ప్రతీయమానం అవుతున్నా దానికి ప్రాధాన్యం లేదు. ఎందుచేత ననగా - నాయకవ్యవహారం శృంగారానికి విభావాలైన నిశాశశాంకులనే సంస్కరిస్తూ (వాటికే సంబంధిస్తూ) అలంకారత్వాన్ని పొంతుతున్నది. తరవాత వాచ్యం విభావం అవడంతో దానివల్ల రసనిఃష్యందం (రసప్రసారం) జరుగుతుంది.

ఇక్కడ మరొక రెవరో చేసిన వ్యాఖ్యను అనువదించి దానిని నిరాకరిస్తున్నాడు - యస్త్వితి - "తయా (నిశయా) అనేది కర్తృపదం. అచేతనమైన నిశకు కర్తృత్వం కుదరదు గాన ఇక్కడ శబ్దంచేతనే నాయకవ్యవహారం ఊహించబడడంచేత అభిధేయమే(వాచ్యమే) అయింది. వ్యంగ్యం కాదు. అందుచేతనే ఇక్కడ సమాసోక్తి" అని వ్యాఖ్యానించినవాడు "వ్యఙ్గ్యేన అనుగతమ్" అనే ప్రకృతవృత్తిగ్రంథార్థాన్నే విడిచివేశాడు. "వ్యంగ్యంతో కూడిన" అని వృత్తికారుడు స్పష్టంగా చెపుతూండగా నాయకవ్యవహారం వ్యంగ్యమే కాదు, వాచ్యమే అనడం వృత్తిగ్రంథవిరుద్ధం అని భావం.

అతడు చెప్పిన వ్యాఖ్యానం ప్రకారం ఇది - "సరస్సు లనే రాజులు శరత్కాలంచేత, రాజహంసలచేత వీచబడినవి" అనే వాక్యంలో వలె ఏకదేశవివర్తిరూపకం అవుతుంది కాని సమాసోక్తి కాదు. ఎందువల్ల ననగా అలా గ్రహించినప్పుడు తుల్యవిశేషణాలు ఉండవు.

వివరణ:- 'రాజహంసైః' ఇత్యాది శ్లోకార్థంలో 'సరోనృపాః' అని సరస్సులయందు నృపత్వాన్ని ఆరోపించడంవల్ల శరత్కాలంమీద చామరగ్రాహిణీత్వాన్ని, హంసలమీద చామరత్వాన్ని ఆరోపించగా ఏకదేశవివర్తిరూపకం అవుతుంది. అదే విధంగా ఇక్కడ కూడా "తిమిరాంశుకమ్" తిమిరమే అంశుకం అని తిమిరంమీద అంశుకత్వాన్ని ఆరోపించి అర్థం చెపితే నిశాదులయందు నాయికాత్వారోపాదులు చేసికొని దీనిని కూడా ఏకదేశవివర్తిరూపకం అనవలసివస్తుంది. వాచ్యార్థానికి గమ్యార్థానికి సమంగా అన్వయించే విశేషణా లున్నప్పుడే సమాసోక్తి. 'తిమిరాంశుకం' ఇత్యాదులకు సమానవిశేషణత్వం లేకపోతే అది సమాసోక్తి కాజాలదు.

గమ్యతే ఇతి:- (పైన చూపిన సమాసోక్తి లక్షణంలో) 'గమ్యతే' అనడంచేత అభిధావ్యాపారం నిరాకరించబడింది కదా? సరే, అధికమైన ఈ అవాంతరచర్చ ఇంతటితో చాలు.

నాయికాయా ఇతి - నాయకుని విషయంలో నాయికయొక్క ఏ వ్యవహారం ఉంటుందో అది రాత్రియందు ఆరోపించబడింది; నాయికవిషయంలో నాయకుని ఏ వ్యవహారం ఉంటుందో అది చంద్రునిమీద ఆరోపించబడింది అని వ్యాఖ్యానం చేసుకుంటే ఏకశేషకి ప్రసక్తి లేదు.

వివరణ:- వృత్తిలో "సమారోపితనాయికానాయకవ్యవహారయోః" అని ఉన్నది. 'నాయికా చ నాయకశ్చ" అని సమానరూపాలైన పదాలకు ద్వంద్వసమాసం చేసినప్పుడు "పుమాన్ స్త్రియా"(1.2.67) అనే పాణినిసూత్రంచేత స్త్రీవాచకం లోపించి పురుషవాచకం మిగిలి "నాయికా చ నాయకశ్చ నాయకౌ" అని రూపం ఏర్పడుతుంది కాబట్టి "సమారోపితనాయకవ్యవహారయోః" అనాలి కదా అని ఆశంకించుకొని పై విధంగా అర్థం చెప్పుకోవడానికి అనుగుణంగా "నాయికానాయకవ్యవహారౌ" అని ప్రయోగించడం జరిగింది అని సమాధానం చెప్పాడు.

## ధ్వన్యాలోకం

ఆక్షేపే ऽపి వ్యఙ్గ్యవిశేషాక్షేపిణో ऽపి వాచ్యస్యైవ చారుత్వమ్.

ప్రాధాన్యేన వాచ్యార్థః ఆక్షేపోక్తిసామర్థ్యాదేవ జ్ఞాయతే. తథాహి - తత్ర శబ్దోపారూఢో విశేషాభిధానేచ్ఛయా ప్రతిషేధరూపో య ఆక్షేపః స ఏవ వ్యఙ్గ్యవిశేషమ్ ఆక్షిపన్ ముఖ్యం కావ్యశరీరమ్. చారుత్వోత్కర్షనిబన్ధనా హి వాచ్యవ్యఙ్గ్యయోః ప్రాధాన్యవివక్షా. యథా -

"అనురాగవతీ సన్ధ్యా దివసస్తత్పురఃసరః,
అహోః దైవగతికీదృక్తథాపి న సమాగమః". (8)

అత్ర సత్యామపి వ్యఙ్గ్యప్రతీతౌ వాచ్యస్యైవ చారుత్వమ్. ఉత్కర్షవదితి తస్యైవ ప్రాధాన్యవివక్షా. యథా చ దీపకాపహ్నుత్యాదౌ వ్యఙ్గ్యత్వేనోపమాయాః ప్రతీతావపి ప్రాధాన్యేనావివక్షితత్వాత్ న తథా వ్యపదేశః తద్వదత్రాపి ద్రష్టవ్యమ్.

బాలానందిని

ఆక్షేపేఽపీతి:- ఆక్షేపాలంకారంలో కూడ వ్యంగ్యవిశేషాన్ని ఆక్షేపించే దైనా (ఊహించి పైకి లాగడం ఆక్షేపం) వాచ్యానికే చారుత్వం (సుందరత్వం) ఉంటుంది. ఆక్షేపాన్ని చెప్పడంయొక్క సామర్థ్యంవల్లనే, వాచ్యార్థం ప్రధానంగా తెలుస్తుంది. ఎందుచేతననగా - ఏదో ఒక విశేషాన్ని చెప్పాలనే ఇచ్ఛచేత శబ్దాన్ని అధిష్ఠించి ఉన్న (శబ్దంలో ఉన్న అనగా వాచ్యమైన) నిషేధరూపమైన ఏ ఆక్షేపం ఉందో, వ్యంగ్యవిశేషాన్ని ఆక్షేపించే అదే ముఖ్యమైన కావ్యశరీరం. వాచ్యవ్యంగ్యార్థాల ప్రాధాన్యవివక్ష వాటి చారుత్వంయొక్క ఉత్కర్షనుపట్టి ఏర్పడుతుంది కదా? అనగా వాచ్యవ్యంగ్యాలలో దేనిలో చారుత్వం ఎక్కవ ఉంటుందో దానికి ప్రాధాన్యం అని చెప్పాలి అని అర్థం. ఎట్లనగా - 'అనురాగవతీ' ఇత్యాది శ్లోకంలో వ్యంగ్యప్రతీతి ఉన్నా కూడ వాచ్యంయొక్క చారుత్వమే అధికంగా ఉంది గాన దానికే ప్రాధాన్యం అని చెప్పడంలో అభిలాష. శ్లోకానికి అర్థం ఇది -

అనురాగవతీ ఇతి - సన్ధ్యా= సంధ్య, అనురాగవతీ=అనురాగం కలది. దివసః= దివసం, తత్పురఃసరః = దానికి ముందే నడుస్తూన్నది. దైవగతిః = దైవగతి, కీదృశీ = ఎట్టిదో కదా! తథాపి= అట్లయినా కూడా, సమాగమః = కలయిక, న = లేదు.

అహో = ఏమి ఆశ్చర్యం!

వివరణ:- ఇక్కడ ఇద్దరు నాయికానాయకుల మధ్య పరస్పరప్రేమ, సాన్నిహిత్యమూ ఉన్నా సమాగమం కుదరడంలేదు అనే వ్యంగ్యార్థం ఉన్నా దానికంటె వాచ్యార్థంలోనే చమత్కారం అధికంగా ఉండడంచేత దానికే ప్రాధాన్యం అని భావం.

యథా చ ఇతి - (మరి యొక ఉదాహరణం ఎట్లనగా) - దీపకం, అపహ్నుతి మొదలైనవాటిలో ఉపమ వ్యంగ్యంగా ప్రతీయమానం అవుతున్నా దానికి ప్రాధాన్యం చెప్పాలనే అభిప్రాయం లేకపోడంచేత వీటిని ఆ పేరుతో ఎట్లు నిర్దేశించడం ఉండదో, అనగా వీటిని ఉపమ అని ఎట్లు అనమో ఇక్కడకూడ అట్లే చూచుకోవాలి.

లోచనం

ఆక్షేప ఇతి:-

ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిధిత్సయా,

వక్ష్యమాణోక్తవిషయః స ఆక్షేపో ద్విధా మతః (భామహకావ్యా 2.68)

తత్రాద్యో యథా -

"అహం త్వాం యది నేక్షేయ క్షణమప్యుత్సుకా తతః,

ఇయదేవాస్త్వితోఽన్యేన కిముక్తేనాప్రియేణ తేః. (భామహకావ్యా. 2.69)

**ఇతి వక్ష్యమాణవిషయః నిషేధాత్మాక్షేపః. తత్ర 'ఇయదస్తు' ఇత్యేతదేవ అత్ర 'మ్రియే' ఇత్యాక్షిపత్ సత్ చారుత్వనిబన్ధనమితి ఆక్షేప్యేణాక్షేపకమ్ అలంకృతం సత్ ప్రధానమ్.**

బాలానందిని

ఆక్షేప ఇతి:- ఆక్షేపాలంకారానికి భామహోక్తలక్షణం చెపుతున్నాడు- ప్రతిషేధ ఇతి- విశేషాభిధిత్సయా= ఒక విశేషాన్ని చెప్పాలనే ఇచ్ఛచేత, ఇష్టస్య = ఇష్టమైనదానియొక్క, వక్ష్యమాణోక్తవిషయః = చెప్పబడబోయేది, చెప్పబడింది విషయంగా గల, యః = ఏ, ప్రతిషేధః ఇవ = నిషేధం వలె ఉంటుందో, సః=అ, ఆక్షేపః= ఆక్షేపాలంకారం, ద్విధా= రెండు విధాలుగా, మతః= చెప్పబడింది.

వివరణ:- ఏదో ఒక విశేషాన్ని చెప్పాలనే అభిప్రాయంతో ఇష్టమైనదానిని ఒకదానిని నిషేధించినట్లు నిషేధించడం, నిజంగా అది నిషేధం కాదని భావం, ఆక్షేపాలంకారం. ఏదో చెప్పబోయి దానిని నిషేధించడం ఒక భేదం. చెప్పినదానిని నిషేధించడం రెండవ భేదం.

తత్రాద్య ఇతి - వాటిలో మొదటి భేదం ఎట్లనగా-

అహమ్ ఇతి - తనను విడచి దూరదేశప్రవాసం వెళ్లబోతూన్న ప్రియునితో ప్రియురాలు అంటూన్న మాటలు - అహమ్=నేను, క్షణమపి= క్షణకాల మైనను, త్వామ్ =నిన్ను, నేక్షేయ యది = చూడకపోతే, తతః= దానివలన, ఉత్సుకా= బెంగగొన్నదాన నవుతాను. ఇయదేవ= ఇంతమాత్రమే, అస్తు= అగుగాక (చాలును). తే = నీకు, అప్రియేణ= ప్రియం కాని, ఉక్తేన = చెప్పబడిన, అన్యేన= ఇతరవిషయంచేత, కిమ్= ఏమి ప్రయోజనం?

వివరణ:- నిన్ను క్షణం చూడకపోయినా నాకు బెంగగా ఉంటుంది. (నువ్వు వెళ్లిపోతే నాకు మరణం తప్పదు) ఇంక నీ కప్రియమైన మాట చెప్పడం ఎందుకులే అని భావం. "నేను మరణిస్తాను" అని చెప్పబోయినదానికి ఇక్కడ నిషేధం.

తత్రేతి - ఇక్కడ "నేను మరణిస్తాను" అనే అర్థాన్ని ఆక్షేపిస్తూన్న (సూచిస్తూన్న) "ఇయదస్తు" అనేదే చారుత్వానికి హేతువుగా ఉంది. అందుచేత ఆక్షేప్యం అయిన "అహం మ్రియే" అనేదే ఆక్షేపకం అయిన 'ఇంత చాలు' అనే దాన్ని అలంకరిస్తూన్నది. అందుచేత వాచ్యార్థమే ప్రధానం.

లోచనం

ఉక్తవిషయస్తు యథా మమైవ-

భో భోః కిం కిమకాణ్డ ఏవ పతితస్త్వం పాన్థ కాన్యా గతిః
తత్తాదృక్తృషితస్య మే ఖలమతిః సోఽయం జలం గూహతే,
అస్థానోపనతామకాలసులభాం తృష్ణాం ప్రతి క్రుధ్య భోః
త్రైలోక్యప్రథితప్రభావమహిమా మార్గః పునర్మారవః.

అత్ర కశ్చిత్సేవకః ప్రాప్తః ప్రాప్తవ్యమస్మాత్ కిమితి న లభే ఇతి ప్రత్యాశావిశస్యమాన హృదయః కేన చిదమునా ఆక్షేపేణ ప్రతిబోధ్యతే. తత్రాక్షేపేణ నిషేధరూపేణ వాచ్యస్యైవాసత్పురుషసేవాతద్వైఫల్యతత్కృతోద్వేగాత్మనః శాన్తరసస్థాయిభూత నిర్వేదవిభావరూపతయా చమత్కృతిదాయిత్వమ్.

బాలానందిని

ఉక్తేతి- చెప్పబడినదానిని గూర్చిన నిషేధం వల్ల ఏర్పడిన ఆక్షేపాలంకారద్వితీయ భేదానికి ఉదాహరణం నా శ్లోకమే ఎట్లనగా-

భోః ఇతి - భోః భోః పాన్థ = ఓయీ! ఓయీ! పాంథుడా! త్వమ్=నీవు, అకాణ్ణ ఏవ = సమయం కాని సమయంలో హటాత్తుగానే, పతితః = పడిపోయావు; కిం కిమ్= ఏమిటిది ఏమిటిది? (పాంథుని సమాధానం) - అన్యా= మరియొక, గతిః = గతి, కా ఏమున్నది? ఖలమతిః= చెడ్డబుద్ధి గల, సః అయమ్= ఆ ఈ మరుమార్గం, తత్రా దృక్తృషితస్య= ఆ విధంగా అంతగా దప్పికొన్న, మే = నా విషయమునందు, జలమ్= నీటిని, గూహతే= దాచివేస్తూన్నది. (మళ్లీ మొదటవాడు అంటూన్న మాటలు) - భోః = ఓయీ! అస్థానోపగతామ్= తగని స్థానంలో వచ్చిన, అకాలసులభామ్= కాలంకాని కాలంలో సులభంగా కలుగుతూ ఉండే, తృష్ణాం ప్రతి= దప్పికను గూర్చి, క్రుధ్య= కోపించుము. మారవః = మరుదేశానికి సంబంధించిన, మార్గః పునః= మార్గం అయితే, త్రైలోక్యప్రథితప్రభావమహిమా= మూడు లోకాలలోనూ ప్రసిద్ధమైన, ప్రభావమూ మహిమా కలది.

అత్రేతి - ఇక్కడ ఒక రాజుదగ్గరికో ధనికుని వద్దకో వచ్చిన ఒక సేవకుడు ఇతని నుంచి పొందవలసినదానిని దేన్నీ పొందలేకుండా ఉన్నానే అని ఎదురు చూడడంతో పీడింపబడుతున్న హృదయం కలవాడై ఎవనిచేతనో ఈ ఆక్షేపం ద్వారా ఉపదేశించబడు తున్నాడు. నువ్వు నీ దాహాన్ని నిందించు కాని మరుమార్గాన్ని నిందించవద్దు అని పాంథుడు చేసిన మరుమార్గనిందను నిషేధించడంచేత ఇది ఆక్షేపాలంకారం. (ఉక్త)నిషేధరూప మైన ఈ ఆక్షేపంచేత, అసత్పురుషసేవ, దాని నిష్ఫలత్వం, దానివల్ల కలిగిన మనఃక్లేశం- ఏతద్రూపమైన వాచ్యమే శాంతరసానికి స్థాయి అయిన నిర్వేదానికి విభావంగా ఉండి చమత్కారాన్ని కలిగిస్తున్నది. అందుచేత వాచ్యానికే ప్రాధాన్యం; వ్యంగ్య మైన నిర్వేదానికి కాదు అని భావం.

లోచనం

వామనస్య తు 'ఉపమానాక్షేపః' ఇత్యాక్షేపలక్షణమ్. ఉపమానస్య చన్ద్రాదేః ఆక్షేపః, అస్మిన్ సతి కిం త్వయా కృత్యమితి. యథా-

శ్లో. తస్యాస్తన్ముఖమస్తి సౌమ్యసుభగం కిం పార్వణేనేన్దునా
సౌన్దర్యస్య పదం దృశౌ యది చ తైః కిం నామ నీలోత్పలైః,
కిం వా కోమలకాన్తిభిః కిసలయైః సత్యేవ తత్రాధరే
హా ధాతుః పునరుక్తవస్తురచనారమ్భేష్వపూర్వో గ్రహః.

అత్ర వ్యఙ్గ్యోఽప్యుపమార్థః వాచ్యస్యైవోపస్కురుతే. కిం తేన కృత్యమితి

త్వపహస్తనారూప ఆక్షేపో వాచ్య ఏవ చమత్కారకారణమ్. యది వా ఉపమానస్యాక్షేపః సామర్థ్యాదాకర్షణమ్. యథా-

ఐన్ద్రం ధనుః పాణ్డుపయోధరేణ శరద్దధానార్ద్రనఖక్షతాభమ్,

ప్రసాదయన్తీ సకలఙ్కమిన్దుం తాపం రవేరభ్యధికం చకార.

ఇత్యత్ర ఈర్ష్యాకలుషితనాయకాన్తరముపమానమాక్షిప్తమపి వాచ్యార్థమేవాలంకరోతీతి. ఏషా తు సమాసోక్తిరేవ; తదాహ - చారుత్వోత్కర్షేతి. అత్రైవ ప్రసిద్ధం దృష్టాన్తమాహ-అనురాగవతీతి. తేనాక్షేపప్రమేయసమర్థనమేవ అపరిసమాప్తమితి మన్తవ్యమ్. తత్రోదాహరణత్వేన సమాసోక్తిశ్లోకః పఠితః.

బాలానందిని

వామనస్యేతి - వామనుని ఆక్షేపలక్షణ మైతే "ఉపమానాక్షేపః" అని. "ఉపమానాక్షేపశ్చ ఆక్షేపః" (4.3.27) అని పూర్తిసూత్రం. చంద్రాద్యుపమానముయొక్క, ఆక్షేపః; ఇది ఉండగా నీచేత ఏమి పని? అని నిషేధం అని అర్థం. ఎట్లనగా-

తస్యాః ఇతి- సౌమ్యసుభగమ్= సౌమ్యమూ సుందరమూ అయిన, తస్యాః= ఆమెయొక్క, తత్ ముఖమ్= ఆ ముఖం, అస్తి= ఉన్నది. పార్వణేన= పర్వానికి (పూర్ణిమకు) సంబంధించిన, ఇన్దునా= చంద్రునిచేత, కిమ్= ఏమి ప్రయోజనం? సౌన్దర్యస్య= సౌందర్యానికి, పదమ్= స్థానమైన, దృశౌ= నేత్రాలు, యది చ= ఉన్నట్లైతే, నీలోత్పలైః= నల్ల కలవలచేత, కిం నామ= ఏమి ప్రయోజనం? తత్ర= ఆ, అధరే= అధరోష్ఠం, సత్యేవ= ఉండగా, కోమలకాన్తిభిః= కోమలమైన కాంతిగల, కిసలయైః= చిగుళ్లచేత, కిం నామ = ఏమి ప్రయోజనం? పునరుక్తవస్తురచనారమ్భేషు= పునరుక్తాలైన వస్తువుల రచనల ఆరంభాలయందు, ఉన్న వస్తువుల వంటి వాటినే మళ్లీ రచించడంలో, ధాతుః = బ్రహ్మదేవునియొక్క, అపూర్వః= క్రొత్తదైన, గ్రహః= పట్టుదల, హీ= హాస్యాస్పదమైనది కదా?

అత్రేతి - ఇక్కడ (ముఖపార్వణచంద్రాదులమధ్య) ఉపమ వ్యంగ్యంగా ఉన్నా కూడ అది వాచ్యానికే ఉపకారకంగా ఉంది. "దానివల్ల ప్రయోజనం ఏమిటి" అని త్రోసిపుచ్చివేయడం రూపంలో వాచ్యంగానే ఉన్న ఆక్షేపమే చమత్కారజనకంగా ఉంది.

"ఉపమానాక్షేపః" అనే లక్షణాన్ని మరొక విధంగా వ్యాఖ్యానిస్తున్నాడు- యది వా ఇతి- ఉపమానస్య ఆక్షేపః అన్నదానికి సామర్థ్యంచేత పైకి లాగడం, అనగా వ్యంజింపచేయడం అని అర్థం చెప్పిన పక్షంలో ఉదాహరణం ఎట్లనగా-

ఐన్ద్రమ్ ఇతి - ఆర్ద్రనఖక్షతాభమ్= తడిగా ఉన్న నఖక్షతం వంటి కాంతి గల, ఐన్ద్రం ధనుః= ఇంద్రధనస్సును, పాణ్డుపయోధరేణ= తెల్లని పయోధరంచేత, మేఘం, స్తనం అని రెండర్థాలు, దధానా= ధరిస్తూన్న, శరత్= శరదృతువు, సకలఙ్కమ్= కలంకంతో కూడిన, కలంకశబ్దానికి మచ్చ, దోషం అనీ రెండర్థాలు. ప్రసాదయన్తీ= ప్రసన్నుణ్ణి చేస్తూ, నిర్మలంగా స్పష్టంగా ఉండేటట్లు చేస్తూ, సంతోష పెడుతూ, రవేః= సూర్యునియొక్క, తాపమ్= తాపాన్ని, వేడి, మనస్తాపం అని రెండర్థాలు, అభ్యధికమ్= అధికమైనదానినిగా, చకార= చేసెను.

ఇత్యత్రేతి- ఇక్కడ ఈర్ష్యతో బాధపడుతూన్న మరొక నాయకుడు అనే ఉపమానం ఆక్షిప్తం అయినా అది వాచ్యార్థాన్నే అలంకరిస్తూన్నది. ఏషా తు ఇతి - అయితే వామనుని ప్రకారం ఇది ఆక్షేపాలంకారం అయినా భామహుని ప్రకారం సమాసోక్తియే.

తదాహేతి - చారుత్వోత్కర్షేత్యాదివాక్యంచేత వృత్తికారుడు ఆ విషయాన్నే, అనగా వాచ్యానికే ప్రాధాన్యం వ్యంగ్యానికి కాదు అనే విషయాన్నే, చెపుతున్నాడు అని అర్థం. అత్రైవేతి- ఈ విషయంలోనే ప్రసిద్ధ మైన అనురాగవతీత్యాది దృష్టాంతం చెపుతున్నాడు. తేనేతి- అందుచేత, అనగా దీన్ని దృష్టాంతంగా మాత్రమే చూపడంచేత ఆక్షేపా లంకారప్రమేయం(విషయం) యొక్క సమర్థనం పరిసమాప్తంకాదనే('ఏవ'ను 'అపరిసమాప్తమ్' తరవాత చేర్చుకోవాలి) తెలుసుకోవాలి. తత్రేతి - తత్ర= ఆక్షేపాలం కారసమర్థన విషయంలోనే సమాసోక్తి ఉన్న శ్లోకం పఠించబడింది.

అనగా ప్రస్తుతం ఆక్షేపాలంకారాన్ని గూర్చిన చర్చ జరుగుతూన్నది. 'అనురాగవతీ' ఇత్యాదిశ్లోకంలో ఉన్నది సమాసోక్త్యలంకారం, ఆక్షేపాలంకారం కాదు. ఇది కేవలం "వాచ్యవ్యంగ్యాల ప్రాధాన్యాప్రాధాన్యాలను చమత్కారోత్కర్షను పట్టి నిర్ణయించాలి" అనే విషయాన్ని నిరూపించడంకోసం ఉదాహరణంగా ఇవ్వబడింది. అందుచేత ఆక్షేపాలంకారాన్ని గూర్చిన చర్చ ఇంతకు ముందే పూర్తి అయిపోయిం దని అనుకోకూడదు. ఈ శ్లోకంకూడా ఆ చర్చలో భాగమే అని భావం.

లోచనం

అహో దైవగతిరితి - గురుపారతన్త్ర్యాదినిమిత్తః అసమాగమః ఇత్యర్థః. తస్యైవేతి-వాచ్యస్యైవేతి యావత్. వామనాభిప్రాయేణాయమాక్షేపః, భామహాభిప్రాయేణ తు సమాసోక్తిః, ఇత్యముమాశయం హృదయే గృహీత్వా సమాసోక్త్యాక్షేపయోః యుక్త్యా ఇదమేకమేవోదాహరణం వ్యతరద్ గ్రన్థకృత్.

ఏషాపి సమాసోక్తిర్వాస్తు ఆక్షేపో వా; కిమనేనాస్మాకమ్? సర్వథా అలంకారేషు వ్యఙ్గ్యం వాచ్యే గుణీభవతీతి నః సాధ్యమ్ ఇత్యత్ర ఆశయోఽత్ర గ్రన్థే అస్మద్గురుభిః నిరూపితః.

బాలానందిని

అహో ఇత్యాది- సమాగమం జరగకపోవడానికి కారణం పెద్దవాళ్లమీద ఆధారపడిఉండడం (పారతంత్ర్యం, స్వాతంత్ర్యం లేకపోవడం) అని అర్థం. తస్యైవ అనగా వాచ్యానికే అని అర్థం. అనురాగవతీత్యాదిశ్లోకంలో వామనుని అభిప్రాయం ప్రకారం, (అనగా ఉపమానాన్ని వ్యంజింపచేయడం ఆక్షేపం అనే రెండవ పక్షంలో) ఆక్షేపాలంకారం. భామహుని మతం ప్రకారం అయితే సమాసోక్తి. ఈ అభిప్రాయాన్ని మనస్సులో ఉంచుకొని గ్రంథకారుడు సమాసోక్తి - ఆక్షేపాలంకారాలు రెండింటికీ కలిపేసి (యుక్త్వా) (లేదా యుక్తిచేత, లాఘవంకొరకు) ఈ ఒక్క ఉదాహరణమే ఇచ్చాడు. ఏషాపీతి - ఇదైనా సమాసోక్తి కానీ, ఆక్షేపం కాని; ఏదైతే మాత్రం మన కేమి? అలంకారాలలో వ్యంగ్యం వాచ్యానికి అంగం అవుతుంది, అప్రధానంగా ఉంటుంది అని అన్ని విధాలా మేం సాధించవలసిన విషయం అని ఈ గ్రంథంలో అభిప్రాయం (వృత్తికారుని అభిప్రాయం) అని మా గురువుగారు నిరూపించారు.

లోచనం

ఏవం ప్రాధాన్యవివక్షాయాం దృష్టాన్తముక్త్వా వ్యపదేశోఽపి ప్రాధాన్యకృత ఏవ భవతీత్యత్ర దృష్టాన్తం స్వపరసిద్ధమ్ ఆహ- యథా చేతి. ఉపమాయా ఇతి - ఉపమానోపమేయభావస్యేత్యర్థః. తయేత్యుపమయా. దీపకే హి - "ఆదిమధ్యాన్తవిషయం త్రిధా దీపకమిష్యతే" ఇతి లక్షణమ్.

మణిః శాణోల్లీఢః సమరవిజయీ హేతిదలితః
కలాశేషశ్చన్ద్రః సురతమృదితా బాలలలనా,
మదక్షీణో నాగః శరది సరిదాశ్యానపులినా
తనిమ్నా శోభన్తే గలితవిభవాశ్చార్థిషు జనాః.

ఇత్యత్ర దీపనకృతమేవ చారుత్వమ్.

బాలానందిని

ఏవమితి- ప్రాధాన్యవివక్షలో ఈ విధంగా దృష్టాంతం చెప్పి "పేరు పెట్టడం

కూడా ప్రాధాన్యాన్ని పట్టే జరుగుతుంది" అని నిరూపించడంకోసం తనకు ఇతరులకూ కూడా అంగీకారయోగ్య మైన దృష్టాంతాన్ని యథాచేత్యాది వాక్యాలలో చెపుతున్నాడు,. **ఉపమాయాః** ఇతి- 'ఉపమా' అనగా ఇక్కడ ఉపమానోపమేయభావం అని అర్థం. 'తయా' అనగా ఉపమచేత. దీపకే హి ఇతి - "దీపకే హి...దీపనకృతమేవ చారుత్వమ్' ' అని అన్వయం. ఒక ధర్మం అనేకమైన వాటితో అన్వయించడం దీపనం. ఆ దీపనం ఉన్నది దీపకాలంకారం.

**ఆదీతి** - ఇది భామహు డిచ్చిన లక్షణం(భామహకావ్య.2.25) "వాక్యంయొక్క ఆదియందు గాని, మధ్యయందుగాని, అంతమునందు గాని దీపకపదం ఉన్నట్లయితే అది మూడు విధాలైన దీపకం" అని దీని అర్థం.

**మణిః** ఇతి -. శాణోల్లీఢః = శానంచేత ఒరయబడిన, సానబట్టిన, మణిః= మాణిక్యం, హేతిదలితః= అయుధాలచేత చీల్చివేయబడిన(గాయాలు తగిలిన), సమరవిజయీ= యుద్ధంలో విజయం పొందినవాడూ, కలాశేషః = ఒక్క కళయే మిగిలిన, చన్ద్రః= చంద్రుడు, సురతమృదితా= సురతంలో మర్దించబడిన(నలిగిన), బాలలలనా= యువతీ, మదక్షీణః= మదంచేత కృశించిన, నాగః= ఏనుగు, శరది= శరత్కాలమునందు, ఆశ్యానపులినా= కొంచెం సన్నగిలిన ఇసుక తిన్నెలు గల, సరిత్= నదీ, అర్థిషు= యాచకుల విషయంలో, గలితవిభవాః= తరిగిపోయిన ఐశ్వర్యం గల, జనాః చ = జనులూ, తనిమ్నా= కృశత్వంచేత, శోభన్తే= ప్రకాశిస్తున్నారు.

**ఇత్యత్రేతి** - ఈ శ్లోకంలో సౌందర్యం దీపనంవల్లనే కలిగినది; అంతే కాని మణి, సమరవిజయి మొదలైన వాటి మధ్య ఉన్నట్లు వ్యంగ్యమైన ఉపమానోపమేయభావంచేత కాదు అని అర్థం. "తనిమ్నా శోభన్తే" అనేది దీపకపదద్వయం - అది వాక్యం చివర ఉండడంచేత ఇది అంత్యదీపకం.

లోచనం

"అపహ్నుతిరభీష్టస్య కించిదన్తర్గతోపమా" (భామహకావ్య.3.21) ఇతి. తత్ర అపహ్నుత్యైవ శోభా; యథా -

"నేయం విరౌతి భృఙ్గాలీ మదేన ముఖరా ముహుః,

అయమాకృష్యమాణస్య కన్దర్పధనుషో ధ్వనిః". (భామహకావ్యా-3.22)

ఇతి.

బాలానందిని

అపహ్నుతికి భామహోక్తలక్షణం చూపి అక్కడ కూడ శోభ వాచ్యమైన అపహ్నుతిచేతనే అని చెపుతున్నాడు. అపహ్నుతిః ఇతి - అభీష్టస్య= వర్ణించడానికి ఇష్టమైన దానియొక్క(లో), కించిత్= కొంచెము, ఉపమా= ఉపమ, అన్తర్గతా= అంతర్గతంగా ఉన్నట్లయితే, అపహ్నుతిః= అపహ్నుత్యలంకారము.

తత్రేతి - అక్కడ కూడ శోభ అపహ్నుతిచేతనే కలుగుతున్నది. ఎట్లనగా-నేతి- ఇయమ్=ఈ, భృఙ్గాలిః=తుమ్మెదల పంక్తి, మదేన=మదంచేత, ముహుః=మాటి మాటికి, ముఖరా=అతిగా వాగుతూ, న విరౌతి=ధ్వని చేయడం లేదు. అయమ్=ఇది, ఆకృష్యమాణస్య=లాగబడుతూన్న, కన్దర్పధనుషః= మన్మథుని ధనస్సుయొక్క, ధ్వనిః = ధ్వని.

వివరణ:- ఇక్కడ భృంగాలీరావ మన్మథచాపధ్వనుల మధ్య ఉన్న వ్యంగ్యమైన ఉపమానోపమేయభావంకంటె వాచ్యమైన అపహ్నవమే అధికచమత్కారజనకంగా ఉంది గాన అదే ప్రధానం.

## ధ్వన్యాలోకం

అనుక్తనిమిత్తాయామపి విశేషోక్తౌ -

శ్లో. ఆహూతోఽపి సహాయైః ఓమిత్యుక్త్వా విముక్తనిద్రోఽపి,
గన్తుమనా అపి పథికః సంకోచం నైవ శిథిలయతి. (౯)

ఇత్యాదౌ వ్యఙ్గ్యస్య ప్రకరణసామర్థ్యాత్ ప్రతీతిమాత్రమ్. న తు తత్ప్రతీతినిమిత్తా కాచిచ్చారుత్వనిష్పత్తిః ఇతి న ప్రాధాన్యమ్.

బాలానందిని

అనుక్తేతి - చెప్పబడని నిమిత్తం గల విశేషోక్తిలో కూడ -

ఆహూత ఇతి - సహాయైః = సహాయులచేత (కలిసి ప్రయాణం చేస్తూన్నవారిచేత) ఆహూతోఽపి= పిలవబడినవాడైనా, ఓమ్ ఇతి= సరే వస్తున్నాను అని, ఉక్త్వా= పలికి, విముక్తనిద్రోఽపి= విడవబడిన నిద్రకలవాడైనా, గన్తుమనాః అపి = వెళ్లాలని అనుకుంటున్నవాడైనా, పథికః=పాంథుడు, సంకోచమ్= ముణిచిపెట్టుకొని పండుకోవడాన్ని, నైవ శిథిలయతి= శిథిలం చేయడం లేదు-

ఇత్యాదులలో ప్రకరణసామర్థ్యంవల్ల వ్యంగ్యార్థం ఏదో స్ఫురిస్తూన్నదే తప్ప దాని స్ఫురణంవల్ల సౌందర్యనిష్పత్తి ఏదీ లేదు గాన దానికి ప్రాధాన్యం లేదు.

లోచనం

ఏవమాక్షేపం విచార్య ఉద్దేశక్రమేణ ప్రమేయాన్తరమాహ-అనుక్త నిమిత్తాయామ్ ఇతి.

శ్లో. ఏకదేశస్య విగమే యా గుణాన్తరసంస్తుతిః,
విశేషప్రథనాయాసౌ విశేషోక్తిరితి స్మృతా.

యథా-

స ఏకస్త్రీణి జయతి జగన్తి కుసుమాయుధః,
హరతాపి తనుం యస్య శమ్భునా న హృతం బలమ్.

ఇయం చాచిన్త్యనిమిత్తా ఇతి నాస్యాం వ్యఙ్గ్యస్య సద్భావః. ఉక్తనిమిత్తాయామపి వస్తుస్వభావమాత్రత్వే పర్యవసానమితి తత్రాపి న వ్యఙ్గ్యసద్భావశఙ్కా- యథా-

శ్లో. కర్పూర ఇవ దగ్ధోఽపి శక్తిమాన్ యో జనే జనే,
నమోఽస్త్వనన్తవీర్యాయ తస్మై కుసుమధన్వనే.

తేన ప్రకారద్వయమవధీర్య తృతీయం ప్రకారమాశఙ్కతే - అనుక్తనిమిత్తాయా మపీతి. వ్యఙ్గ్యస్యేతి - శీతకృతా ఖల్వార్తి రత్ర నిమిత్తమితి భట్టోద్భటః. తదభిప్రాయేణాహ - న త్వత్ర కాచిచ్చారుత్వనిష్పత్తిరితి. యత్తు రసికైరపి నిమిత్తం కల్పితం - "కాన్తా సమాగమే గమనాదపి లఘుతరముపాయం స్వప్నం మన్యమానః నిద్రాగమబుద్ధ్యా సంకోచం నాత్యజత్" ఇతి, తదపి నిమిత్తం చారుత్వహేతుతయా నాలంకారవిద్భిః కల్పితమ్, అపి తు విశేషోక్తిభాగ ఏవ న శిథిలయతీత్యేవంభూతోఽభివ్యజ్యమాననిమిత్తోపస్కృత శ్చారుత్వ హేతుః. అన్యథా తు విశేషోక్తిరేవేయం న భవేత్. ఏవమభిప్రాయద్వయ మపి సాధారణోక్త్యా గ్రన్థకృత్ న్యరూపయత్, న తు ఔద్భటేనైవాభిప్రాయేణ గ్రన్థో వ్యవస్థిత ఇతి మన్తవ్యమ్.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ఆక్షేపాలంకారాన్ని గూర్చిన విచారణ చేసి (మధ్య చేసిన దీపకాపహ్నుతివిచారణ దృష్టాంతం చూపడంకోసం చేసిన ప్రాసంగికవిచారణ) ఉద్దేశక్రమంచేత, అనగా "సమాసోక్త్యాక్షేప" ఇత్యాదివాక్యంలో పూర్వం నిర్దేశించిన

క్రమంచేత, ఇప్పుడు చెప్పవలసి ఉన్న విషయాంతరాన్ని గూర్చి అనుక్తనిమిత్తాయామ్ ఇత్యాదికం చెపుతున్నాడు.

ఏకదేశస్యేతి - ఏకదేశస్య= ఒకభాగం లేదా అంశంయొక్క, విగమే = తొలగిపోవడం జరగగా, విశేషప్రథనాయ= ఏదో ఒక విశేషాన్ని చెప్పడం కొరకు, యా= ఏ, గుణాన్తరసంస్తుతిః= మరియొక గుణంయొక్క చెప్పడం కలదో, అసౌ= ఇది, విశేషోక్తిరితి= విశేషోక్తి అని, స్మృతా= చెప్పబడినది. ఎట్లనగా-

స ఇతి: యస్య = ఎవనియొక్క, తనుమ్=శరీరాన్ని, హరతాపి = హరించినా, శమ్భునా= శివుని చేత, బలమ్ = బలం, న హృతమ్ = హరించబడలేదో, ఏకః= ఒక్కడే అయి ఉండి, త్రీణి జగన్తి= మూడు జగత్తులను, జయతి= జయించు చున్నాడో, సః కుసుమాయుధః = ఆ మన్మథుడు, జయతి = సర్వోత్కర్షగా ఉన్నాడు.

దేహం పోయినా బలం ఉన్నట్లు ఇక్కడ వర్ణించబడింది. దానికి ఏదో కారణం ఉండాలి. కాని అది ఊహింప శక్యం కానిది అని చెపుతున్నాడు - ఇయం చ ఇతి. ఇది ఊహింప శక్యం కాని నిమిత్తం గలది అవడంచేత దీనిలో (అచింత్యనిమిత్త విశేషోక్తిలో) వ్యంగ్యం లేదు. ఉక్తనిమిత్తాయామపీతి:- చెప్పబడిన నిమిత్తం గల విశేషోక్తిలో కూడ చివరికి వస్తుస్వభావమాత్రమునందే పర్యవసానం (చివరికి వస్తుస్వభావమే చెప్పినట్లు అవుతుంది) గాన అక్కడ కూడా వ్యంగ్యం ఉంటుం దనే శంక లేదు. ఎట్లనగా -

కర్పూర ఇతి - యః = ఏ మన్మథుడు, దగ్ధోఽపి= కాల్చివేయబడినా కూడా, కర్పూర ఇవ = కాల్చబడిన కర్పూరం వలె, జనే జనే= ప్రతిజనుని విషయంలోనూ, శక్తిమాన్= శక్తి గలవాడో, అవార్యవీర్యాయ= నివారించ శక్యం కాని వీర్యం గల, తస్మై కుసుమధన్వనే= ఆ మన్మథునకు, నమః అస్తు= నమస్కారం అగుగాక.

తేనేతి - ఆ కారణం చేత మొదటి రెండు భేదాలను తిరస్కరించి (విడిచి) మూడవ ప్రకారాన్ని గూర్చి అనుక్తనిమిత్తాయామపి ఇత్యాదికంచేత ఆశంకిస్తున్నాడు, వ్యఙ్గ్యస్యేతి - ఇక్కడ ఆ పాంథుని ఆర్తి చలిచేత కలిగినది అని భట్టోద్భటుడు అన్నాడు. ఆ అభిప్రాయంచేతనే - "ఈ వ్యంగ్యంలో చారుత్వనిష్పత్తి ఏమీ లేదు" అని అంటున్నాడు. యత్తు ఇతి - "లేచి వెళ్లడంకంటె కూడా తన ప్రియురాలి సమాగమానికి స్వప్నం లఘు తరమైన ఉపాయం అని భావిస్తూ ఆ పాంథుడు, నిద్ర వస్తుం దనే ఆశతో సంకోచం విడవడ లేదు" అని కొందరు రసికులు ఏ నిమిత్తాన్ని కల్పించారో ఆ నిమిత్తం కూడా చారుత్వానికి హేతు వని అలంకారవేత్తలు కల్పించలేదు. మరే మనగా వ్యంజింపచేయబడుతూన్న నిమిత్తంచేత ఉపస్కృతమైన "న శిథిలయతి" అనే ఈ

విధమైన విశేషోక్తిభాగమే చారుత్వహేతువు. అలా కాని పక్షాన, అనగా వ్యంజింపజేయబడుతున్న నిమిత్తంచేత ఉపస్కృతం అవడం అనేది లేకపోతే, ఇది విశేషోక్తే కాజాలదు. ఏవమితి - ఈ విధంగా గ్రంథకారుడు సాధారణరూపంలో ఈ రెండు అభిప్రాయాలనూ కూడ, అనగా భట్టోద్భటుని అభిప్రాయాన్నీ, రసికుల అభిప్రాయాన్నీ కూడ నిరూపించాడు. అంతేనే కాని ఇక్కడ ఈ గ్రంథభాగం ఉద్భటుని అభిప్రాయం మాత్రమే పురస్కరించుకొని వ్యవస్థితం అయిన దని (ప్రతిపాదించబడిందని) అనుకొనకూడదు.

## ధ్వన్యాలోకం

పర్యాయోక్తేఽపి యది ప్రాధాన్యేన వ్యఙ్గ్యత్వం తద్భవతు నామ తస్య ధ్వనావన్తర్భావః. న తు ధ్వనేస్తత్రాన్తర్భావః. తస్య మహావిషయత్వేన, అఙ్గిత్వేన చ ప్రతిపాదయిష్యమాణత్వాత్. న పునః పర్యాయోక్తే భామహోదాహృతసదృశే వ్యఙ్గ్యస్యైవ ప్రాధాన్యమ్, వాచ్యస్య తత్ర ఉపసర్జనీభావేన అవివక్షితత్వాత్. అపహ్నుతిదీపకయోః పునః వాచ్యస్య ప్రాధాన్యం వ్యఙ్గస్య చ అనుయాయిత్వం ప్రసిద్ధమేవ.

## బాలానందిని

పర్యాయోక్తేఽపీతి - పర్యాయోక్తాలంకారంలో కూడా ప్రాధాన్యంతో వ్యంగ్యత్వం ఉంటే (వ్యంగ్యం ప్రధానంగా ఉంటే) దానికి ధ్వనిలో అంతర్భావం ఉంటే ఉండవచ్చు. అంతే కాని ధ్వనికి దానిలో (పర్యాయోక్తంలో) అంతర్భావం కుదరదు. ఎందుచేత ననగా ధ్వని మహావిషయం అనీ, అనగా ధ్వనియొక్క పరిధి అతివిస్తృతం అనీ, ధ్వనియే అంగి అనీ ప్రతిపాదించబడబోతూన్నది. న పునరితి - భామహుడు ఉదాహరించినదానితో సమానమైన పర్యాయోక్తంలో వ్యంగ్యానికి ప్రాధాన్యమే లేదు. అక్కడ వాచ్యం అప్రధానంగా ఉండా లని వివక్ష (వక్త ఇచ్ఛ) లేదు. అపహ్నుతిదీపకాలంకారాలలో అయితే వాచ్యానికి ప్రాధాన్యం, వ్యంగ్యానికి తదనుసారిత్వం (వ్యంగ్యం వాచ్యానికి వెనక దానికి అంగంగా ఉండడం) ప్రసిద్ధమే.

## లోచనం

పర్యాయోక్తేఽపీతి -

శ్లో. పర్యాయోక్తం యదన్యేన ప్రకారేణాభిధీయతే,

వాచ్యవాచకవృత్తిభ్యాం శూన్యేనావగమాత్మనా (ఉద్భట కావ్యా. 4.47)

ఇతి లక్షణమ్. యథా-

శ్లో. శత్రుచ్ఛేదదృఢేచ్ఛస్య మునేరుత్పథగామినః,

రామస్యానేన ధనుషా దేశితా ధర్మదేశనా. ఇతి

అత్ర భీష్మస్య భార్గవప్రభావాభిభావీ ప్రభావః ఇతి యద్యపి ప్రతీయతే, తథాపి తత్సహాయేన "దేశితా ధర్మదేశనా" ఇత్యభిధీయమానేనైవ కావ్యార్థోఽలంకృతః. అత ఏవ "పర్యాయేణ ప్రకారాన్తరేణ అవగమాత్మనా వ్యఙ్గ్యేన ఉపలక్షితం సద్యదభిధీయతే తదభిధీయమానమ్ ఉక్తమేవ సత్ పర్యాయోక్త మిత్యభిధీయతే" ఇతి లక్షణపదమ్, పర్యాయోక్తమితి లక్ష్యపదమ్, అర్థాలంకారత్వం సామాన్యలక్షణం చేతి సర్వం యుజ్యతే. యది తు **అభిధీయతే** ఇత్యస్య బలాద్వ్యాఖ్యానమ్ 'అభిధీయతే ప్రతీయతే ప్రాధాన్యేన' **ఇతి**, ఉదాహరణం చ "భమ ధమ్మిఅ" ఇత్యాది తదా అలఙ్కారత్వమేవ దూరే సంపన్నమ్, ఆత్మతాయాం పర్యవసానాత్. తదా చాలంకారమధ్యే గణనా న కార్యా. భేదాన్తరాణి చాస్య వక్తవ్యాని. తదాహ - యది ప్రాధాన్యేనేతి. ధ్వనావితి ఆత్మన్యన్తర్భావాత్ ఆత్మైవాసౌ న అలంకారః స్యాదిత్యర్థః.

తత్రేతి - యాదృశః అలంకారత్వేన వివక్షితః తాదృశే ధ్వనిః నాన్తర్భవతి. న తాదృగస్మాభిః ధ్వనిరుక్తః; ధ్వనిర్హి మహావిషయః సర్వత్ర భావాత్ వ్యాపకః, సమస్తప్రతిష్ఠాస్థానత్వాచ్చ అఙ్గీ. న చాలంకారః వ్యాపకః, అన్యాలంకారవత్, న చ అఙ్గీ, అలంకార్యతన్త్రత్వాత్. అథ వ్యాపకత్వాఙ్గిత్వే తస్య ఉపగమ్యేతే, త్యజ్యతే చాలంకారతా, తర్హి అస్మన్నయ ఏవ అయమ్ అవలమ్బ్యతే కేవలం మాత్సర్యగ్రహాత్ పర్యాయోక్తవాచా ఇతి భావః.

బాలానందిని

పర్యాయోక్తేఽపీతి - పర్యాయోక్తానికి ఉద్భటుడు కావ్యాలంకారసార సంగ్రహంలో ఇచ్చిన లక్షణం చూపుతున్నాడు-

పర్యాయోక్తమితి- "వాచ్యవాచకవృత్తిభ్యామ్ = వాచ్యవాచకవృత్తులతో, శూన్యేన= శూన్యమైన, అవగమాత్మనా= అవగమనరూప మైన, అర్థసామర్థ్యంచేత బోధించడం అనే రూపం గల, ప్రకారేణ= ప్రకారంచేత, యత్= ఏది, అభిధీయతే = చెప్పబడుతుందో అది, పర్యాయోక్తమ్= పర్యాయోక్తం". ఇది లక్షణం. ఎట్లనగా-

శత్రు ఇతి - శత్రుచ్ఛేదదృఢేచ్ఛస్య= శత్రువులను ఛేదించుటయందు దృఢమైన ఇచ్ఛ గల, ఉత్పథగామినః= చెడ్డమార్గంలో నడుస్తూన్న, మునేః = ముని యైన, రామస్య= పరశురామునకు, అనేన= ఈ భీష్మనిచేత, ధనుషా= ధనస్సుతో, ధర్మదేశనా= ధర్మోపదేశం, దేశితా= ఇప్పించబడింది.

అత్రేతి - ఇక్కడ భీష్మని ప్రభావం పరశురాముని ప్రభావాన్ని అణచి వేసింది అని ధ్వనించబడుతున్నా, అది (ఆ వ్యంగ్యార్థం)సహాయంగా గల'దేశితా ధర్మదేశనా' అని వాచ్యమైనదానిచేతనే కావ్యార్థం అలంకరించబడింది. అందువల్లనే (వాచ్యమే కావ్యార్థాన్ని అలంకరించడంవల్లనే) పర్యాయేణ= అవగమరూపమైన ప్రకారంచేత, వ్యంగ్యంతో కూడినదిగా ఏది వాచ్యరూపంగా బోధించబడుతూన్నదో అట్టి అభిధీయమానం వాచ్యంగా చెప్పబడుతూనే ఉండి పర్యాయోక్తం అని చెప్పబడుతుంది అని లక్షణపదం, అనగా లక్షణవాక్యం, పర్యాయోక్తం అనే లక్ష్యపదం, అర్థాలంకారత్వం అనే సామాన్య లక్షణం అన్నీ యుక్తంగా ఉన్నాయి.

వివరణ:- అనగా లక్షణాన్ని పట్టే దీనిలో వ్యంగ్యార్థం వాచ్యార్థంతో జోడించబడి ఉంటుంది అని తెలుస్తున్నది. 'పర్యాయోక్త' అనే పేరు కూడా సార్థకమే. అర్థాలంకారంగా పరిగణించడం కూడా కుదురుతుంది. వ్యంగ్యానికే ప్రాధాన్యం ఉన్న పక్షంలో అది అలంకార్యం అవుతుంది కాని అలంకారం కాదు కదా? అని భావం.

యదీతి - 'అభిధీయతే' అన్న పదానికి 'అభిధీయతే ప్రతీయతే ప్రధానతయా' (ప్రధానంగా ప్రతీయమానం అవుతున్నది) అని బలాత్కారంగా వ్యాఖ్యానం చేసి "భమ ధమ్మిఅ" ఇత్యాదికం ఉదాహరణగా ఇవ్వబడిన ట్లయితే అప్పుడు దీనికి అలంకారత్వమే పోతుంది. ఎందువలన అనగా ఇది ఆత్మగా పర్యవసానం చెందుతుంది. అప్పుడు దీనిని అలంకారాల మధ్య చేర్చకూడదు. (ప్రధానవ్యంగ్యాలు బహువిధాలుగా ఉంటాయి కాబట్టి) దీనికి ఎన్నో అవాంతరభేదాలు కూడా చెప్పవలసి ఉంటుంది. ఈ విషయాన్నే - యది ప్రాధాన్యేన ఇత్యాదివాక్యాలలో చెపుతున్నాడు. ధ్వనావితి - ఇది ఆత్మలో అంతర్భూతం అయిపోతుంది కాబట్టి ఇది ఆత్మయే అవుతుంది కాని అలంకారం అవదు అని అర్థం. తత్రేతి - ఎలాంటి దానిని అలంకారంగా చెప్పాలని అనుకుంటున్నారో

అలాంటిదానిలో ధ్వని అంతర్గతం కాదు. మేం అలాంటి ధ్వనిని చెప్పలేదు. ఎందుచేత ననగా ధ్వనివిషయం చాలా విస్తృతం అయినది. అంతటా ఉండడంవల్ల అది వ్యాపక మైనది. (గుణాదులైన) అన్నింటి ప్రతిష్ఠకు (స్థితికి) స్థానం అవడంవల్ల అంగి. లోకప్రసిద్ధ మైన కటకాద్యన్యాలంకారాలు ఏ విధంగా వ్యాపకాలు కావో అదే విధంగా ఈ అలంకారం కూడా వ్యాపకం కాదు. ఇది అలంకార్యంమీద ఆధారపడి ఉంటుంది; అందువల్ల ఇది అంగి కాజాలదు. అలా కాక దీనికి వ్యాపకత్వాన్నీ, అంగిత్వాన్నీ అంగీకరిస్తే, అలంకారత్వం విడిచివేస్తే అప్పుడు మా సిద్ధాంతమే అంగీకరించిన ట్లవుతుంది. కేవలం మాత్సర్యంవల్ల ఏర్పడిన పట్టుదలవల్ల పర్యాయోక్తం అని పేరు పెట్టడం మాత్రమే జరుగుతుంది.

లోచనం

న చేయదపి ప్రాక్తనైః దృష్టమ్; అపి తు అస్మాభిరేవ ఉన్మీలితమితి దర్శయతి - న పునరితి. భామహస్య యాదృక్తదీయం రూపమ్ అభిమతం తాదృగుదాహరణేన దర్శితమ్. తత్రాపి నైవ వ్యఙ్గ్యస్య ప్రాధాన్యమ్ చారుత్వాహేతుత్వాత్. తేన తదనుసారితయా తత్సదృశం యదుదాహరణా న్తరమపి కల్ప్యతే తత్ర నైవ వ్యఙ్గ్యప్రాధాన్యమితి సంగతిః.

యది తు తదుక్తముదాహరణమనాదృత్య 'భమ ధమ్మిఅ' ఇత్యాద్యుదాహ్రియతే తదస్మచ్ఛిష్యతైవ. కేవలం తు నయమనవలమ్బ్య అపశ్రవణేన ఆత్మసంస్కారః ఇత్యనార్యచేష్టితమ్. యదాహురైతిహాసికాః - "అవజ్ఞయాప్యవచ్ఛాద్య శృణ్వన్నరకమృచ్ఛతి". భామహేన హ్యుదాహృతమ్-

"గృహేష్వధ్వసు వా నాన్నం భుఞ్జ్మహే యదధీతినః,

విప్రా న భుఞ్జతే" ఇతి.

ఏతద్ధి భగవద్వాసుదేవవచనం పర్యాయేణ రసదానం నిషేధతి. యత్ స ఏవాహ- "తచ్చ రసదాననివృత్తయే" ఇతి. న చాస్య రసదాననిషేధస్య వ్యఙ్గ్యస్య కించిచ్చారుత్వమస్తి యేన ప్రాధాన్యం శఙ్క్యేత. అపి తు తద్వ్యఙ్గ్యోపోద్బలితం విప్రభోజనేన వినా యదన్నభోజనం తదేవోక్తప్రకారేణ పర్యాయోక్తం సత్ ప్రాకరణికం భోజనార్థమలంకురుతే. న హ్యస్య నిర్విషం

భోజనం భవత్వితి వివక్షితమితి పర్యాయోక్తమలంకార ఏవేతి చిరన్తనానా మభిమత ఇతి తాత్పర్యమ్.

బాలానందిని

ఇంత మాత్రంకూడా ప్రాచీను లెవరూ చూడలేదు; మేమే దీనిని కనుగొన్నాం అని న పునః ఇత్యాదివాక్యంలో చెపుతున్నాడు. భామహస్యేతి - భామహునికి దాని (పర్యాయోక్తంయొక్క) ఎలాంటి స్వరూపం అభిమత మైనదో అలాంటి రూపమే ఉదాహరణలచేత చూపబడింది. దానిలో కూడ వ్యంగ్యం చారుత్వహేతువు కాదు; అందువల్ల దానికి ప్రాధాన్యం లేదు. అందుచేత దానినే అనుసరించి దానితో సమానమైన మరొక ఉదాహరణం కల్పించినా దానిలో కూడ వ్యంగ్యానికి ప్రాధాన్యం ఉండదు అని అన్వయం.

యది తు ఇతి - ఆ ఉదాహరణాన్ని కాదని 'భమ ధమ్మిఅ' ఇత్యాదికాన్ని ఉదాహరిస్తే అప్పుడు నువ్వు కూడా మా శిష్యుడ వైనట్లే. అలా చేయడం కేవలం నీతి మార్గాన్ని అనుసరించకుండా, అనగా సవినయగౌరవంగా తెలియని విషయాన్ని గురువు నుంచి యథావిధిగా గ్రహించకుండా, వంకర దారిలో విషయం విని (గ్రహించి) తనను సంస్కారవంతుణ్ణి చేసుకొనడం (విద్య నేర్వడం) అనార్యులు చేసే పని(చెడ్డపని). ఈ విషయంలోనే ఐతిహాసికులు ఇలా అంటున్నారు. - "అవజ్ఞయా= విద్యయందు, గురువునందు అనాదరభావంతో, అవచ్ఛాద్య = తనను కప్పిపుచ్చుకొని, అనగా రహస్యంగా కుటిలమార్గంలో, శృణ్వన్= శాస్త్రం విన్నవాడు, నరకమ్ ఋచ్ఛతి= నరకం పొందును.

భామహేనేతి - భామహుడు పర్యాయోక్తానికి ఈ ఉదాహరణ ఇచ్చి ఉన్నాడుకదా? గృహేషు ఇతి - యత్ = దేనిని, అధీతినః= వేదాధ్యయనం చేసిన, విప్రాః= బ్రాహ్మణులు, న భుఞ్జతే= తినరో, అన్నమ్= అలాంటి అన్నాన్ని, గృహేషు= ఇంట్లో కాని, అధ్వసు వా =మార్గాలలో గాని (ప్రయాణాలలో గాని) న భుఞ్జ్మహే= తినము".

ఏతదితి - భగవంతుడైన శ్రీకృష్ణుడు పలికిన ఈ వచనం పర్యాయంచేత, అనగా వాచ్యంగా కాకుండా, అవగమనారూపవ్యాపారంచేత, విషదానాన్ని నిషేధిస్తూన్నది. ఎందువలన అనగా భామహుడే తరవాత "తచ్చ రసదాననివృత్తయే" "ఆహారంలో విషం పెట్టడాన్ని నివర్తింపచేయడానికి "అని అన్నాడు (భామహాలంకారం. 3-8-9).

వివరణ:- "గృహేష్వధ్వసు .... ద్విజాః" అని శ్రీకృష్ణుడు శిశుపాలునితో అన్నాడు. అని దీనిని పర్యాయోక్తానికి ఉదాహరణగా చూపి ఇలా అనడంలో అభిప్రాయం ఏమనగా "శిశుపాలుని ఇంట్లో భోజనం చేస్తే వాడు ఆహారంలో విషం కలిపే ప్రమాదం ఉంది గాన తన్నివృత్తికోసం" అని కవి తన మాటలలో అన్నాడు. దీనిని పట్టి ఇదే 'గృహ్వేష్వధ్వసు వా' అనే వాక్యంలోని వ్యంగ్యార్థం అని భామహుడే అంగీకరించాడని భావం.

న చాస్య ఇతి - వ్యంగ్యమైన ఈ రసదాననిషేధానికి ప్రాధాన్యం ఉంది అని శంకించడానికైనా దీనిలో ఏ మాత్రం సౌందర్యం లేదు. మరేమనగా - ఆ వ్యంగ్యార్థం చేత ఉపోద్బలితమైన (బలం చేకూరిన) విప్రులు భుజించకుండా భోజనం చేయకపోవడం అనేది (అనే వాచ్యార్థం) ఏది ఉన్నదో అదే ఈ ప్రకారంచేత పర్యాయోక్తమై ప్రాకరణికమైన భోజనరూపార్థాన్ని అలంకరిస్తున్నది. "నువ్వు పెట్టే భోజనంలో విషం లేకుండా ఉండాలి" అని చెప్పడంలో తాత్పర్యం లేదు. అందుచేత ఇది పర్యాయోక్తాలంకారమే అని ప్రాచీనులకు అభిమతం అని దీని తాత్పర్యం.

లోచనం

అపహ్నుతిదీపకయోరితి - ఏతత్ పూర్వమేవ నిర్ణీతమ్. అత ఏవాహ - ప్రసిద్ధమితి. ప్రతీతం, ప్రసాధితం, ప్రామాణికం చేత్యర్థః, పూర్వం చైతత్ "ఉపమాదివ్యపదేశభాజన మేవ తద్యథా న భవతి" ఇత్యముయా ఛాయయా దృష్టాన్తతయా ఉక్తమపి ఉద్దేశక్రమపూరణాయ గ్రన్థశయ్యాం యోజయితుం పునరప్యుక్తం 'వ్యఙ్గ్యప్రాధాన్యాభావాన్న ధ్వనిః" ఇతి ఛాయాన్తరేణ. వస్తు పునరేకమేవ ; ఉపమాయా-ఏవ వ్యఙ్గ్యత్వేన ధ్వనిత్వాశఙ్కనాత్.

బాలానందిని

అపహ్నుతీతి - ఇది (అపహ్నుతిదీపకాలలో వాచ్యానికే ప్రాధాన్యం, వ్యగ్యం కేవలం దాన్ని అనుసరించి ఉంటుంది అనేది) వెనుకనే నిర్ణయించబడింది. "అది (దీపకాపహ్నుత్యాదికం) ఉపమాదిశబ్దాలతో పిలవడానికే యోగ్యం ఏ విధంగా కాదో ఆ విధంగా " అనే ఛ్చాయలో (Shade of expression) వెనుక దీన్ని దృష్టాంతంగా (యథా చ దీపకాపహ్నుత్యాదౌ" ఇత్యాదివాక్యంలో) చెప్పినా, ఉద్దేశక్రమాన్ని (వెనుక చేసిన 'సమాసోక్త్యాక్షేప' ఇత్యాదినామతోనిర్దేశాన్ని) పూరించడం కోసం "వీటిలో వ్యంగ్యప్రాధాన్యం లేదు గాన వీటికి ధ్వనిత్వం లేదు" అనే మరొక ఛ్చాయలో మళ్ళీ

ఇక్కడ చెప్పబడింది. విషయం మాత్రం (అక్కడా ఇక్కడా కూడ) ఒకటే, ఎందుచేతననగా రెండు చోట్లూ కూడ "ఉపమ వ్యంగ్యం కాబట్టి ఈ అలంకారాలలో ధ్వని ఉంది" అన్న ఆశంకయే చేయబడింది.

లోచనం

యత్తు వివరణకృత్ - దీపకస్య సర్వత్రోపమాన్వయో నాస్తీతి బహునా ఉదాహరణప్రపఞ్చేన విచారితవాన్ తత్ అనుపయోగి, నిఃసారం, సుప్రతిక్షేపం చ.

శ్లో. మదో జనయతి ప్రీతిం సానఙ్గం మానభఙ్గనమ్,
స ప్రియాసంగమోత్కణ్ఠాం సాసహ్యాం మనసః శుచమ్".

(భామహకావ్యా 2.27) ఇతి.

అత్రాప్యుత్తరోత్తరజన్యత్వేఽపి ఉపమానోపమేయభావస్య సుకల్పత్వాత్. న హి క్రమికాణాం నోపమానోపమేయభావః, తథాహి :-

శ్లో. రామ ఇవ దశరథోఽ భూద్దశరథఇవ రఘురజోఽ పి రఘుసదృశః,
అజ ఇవ దిలీపవంశశ్చిత్రం రామస్య కీర్తిరియమ్.

ఇతి న న భవతి. తస్మాత్ క్రమికత్వం సమం వా ప్రాకరణికత్వమ్ ఉపమాం నిరుణద్ధీతి కోఽ యం త్రాసః ఇత్యలం గర్దభీదోహానువర్తనేన.

బాలానందిని

యత్ ఇతి - దీపకాలంకారానికి (కొన్నింటిలో ఉన్నా) అన్ని స్థలాలలోను ఉపమాన సంబంధం ఉండదు అని వివరణకారుడు చాలా ఉదాహరణలు సవిస్తరంగా చూపి విచారణ చేశాడు. దానిలో ఏమాత్రం సారం లేదు; దాన్ని అనాయాసంగా నిరసించవచ్చు. ( ఈ వివరణకారు డెవరో అతని గ్రంథం ఏదో మనకిప్పుడు తెలియదు, అది కూడ ఒక ధ్వన్యాలోకవ్యాఖ్య అయి ఉంటుంది)

మదః ఇతి - "మదం ప్రీతిని పుట్టిస్తుంది. అది (ప్రీతి) మానాన్ని (ప్రణయకోపాన్ని) తొలగించే మన్మథుణ్ణి పుట్టిస్తుంది. అతడు(మన్మథుడు) ప్రియురాలి సంగమం విషయంలో అత్యాసక్తిని పుట్టిస్తాడు. అది (ఉత్కంఠ) మనస్సుకు దుఃఖాన్ని కలిగిస్తుంది".'

అత్రేతి - ఇక్కడ కూడా ఉత్తరోత్తరజన్యత్వం ఉన్నా (ముందు చెప్పినదానినుండి తరవాత చెప్పినవి పుట్టినా) ఉపమానోపమేయభావం అనాయాసంగా కల్పించవచ్చును

కదా? క్రమంలో చెప్పిన వాటికి ఉపమానోపమేయభావం లేదు అనే మాట లేదు కదా? ఎందుచేత ననగా-

రామ ఇతి - "రాముడు దశరథుడు వలె ఉండెను; రఘువు దశరథుడు వలె ఉండెను. అజుడు కూడ రఘువుతో సమానుడై ఉండెను. దిలీపవంశం అంతా అజుడు వలె ఉండెను. ఇదంతా రాముని కీర్తి. ఏమి ఆశ్చర్యం?"

ఇతీతి - ఈ విధంగా (క్రమంగా ఉన్నవాళ్ల మధ్య ఉపమానోపమేయభావం) ఉండ దనే మాట లేదు కదా?(ఈ శ్లోకం బహుశా ఈ సందర్భంకోసం అభినవగుప్తుడే రచించి ఉంటాడు). తస్మాదితి - అందువల్ల క్రమికత్వం కాని, ఒకచోట చెప్పిన అన్నింటియందూ ఒకే విధంగా ప్రాకరణికత్వం గాని ఉపమను అడ్డుకుంటుంది., ఉపమ కుదరకుండా చేస్తుంది అని ఏమి టీ భయం? సరే ఇంతటితో గాడిదపాలు పిదకడం కొనసాగింపు చాలు.

## ధ్వన్యాలోకం

సంకరాలంకారేఽపి యదా అలంకారః అలంకారాన్తరచ్ఛాయామ్ అనుగృహ్ణాతి తదా వ్యఙ్గ్యస్య ప్రాధాన్యేన అవివక్షితత్వాత్ న ధ్వనివిషయత్వమ్. అలంకారద్వయసంభావనాయాం తు వాచ్యవ్యఙ్గ్యయోః సమం ప్రాధాన్యమ్. అథ వాచ్యోపసర్జనీభావేన వ్యఙ్గ్యస్య తత్రావస్థానం తదా సోఽపి ధ్వనివిషయోఽస్తు; న తు స ఏవ ధ్వనిరితి వక్తుం శక్యమ్. పర్యాయోక్తనిర్దిష్టన్యాయాత్. అపి చ సంకరాలంకారేఽపి క్వచిత్ సంకరోక్తిరేవ ధ్వనిసంభావనాం నిరాకరోతి.

### బాలానందిని

సంకరేతి - సంకరాలంకారంలో కూడా ఎప్పుడు ఒక అలంకారం మరి యొక అలంకారంయొక్క ఛాయను అనుగ్రహిస్తుందో, మరొక అలంకారానికి సహాయకంగా ఉంటుందో, అప్పుడు వ్యంగ్యం ప్రధానంగా ఉన్నట్లు చెప్పా లని ఇచ్ఛయింపబడలేదు గాన (అవివక్షితత్వాత్) అది ధ్వనికి విషయం కాదు. రెండు అలంకారాలు కలిసి ఉన్నట్లు చెప్పడానికి వీలయి నప్పుడు మాత్రం వాచ్యవ్యంగ్యాలకి ప్రాధాన్యం సమంగానే ఉంటుంది. మరి (అథ) వాచ్యంయొక్క ఉపసర్జనత్వంతో, అనగా వాచ్యం అప్రధానంగా

ఉండి, అక్కడ వ్యంగ్యం (ప్రధానంగా) ఉన్నట్లయితే అది కూడా (అలాంటి సంకరాలంకారం కూడా) ధ్వనికి విషయం అవుతే అవుగాక, కాని అదే ధ్వని అని చెప్పడానికి మాత్రం వీలులేదు. పర్యాయోక్తాలంకారం విషయంలో చెప్పిన న్యాయమే ఇక్కడ వర్తిస్తుంది. మరొక విషయం ఏమనగా - సంకరం అని చెప్పడమే ఏ విధమైన సంకరాలంకారంలోనూ కూడా ధ్వని ఉండే అవకాశాన్ని నిరాకరిస్తుంది. అనగా సంకరాలంకారానికి సంబంధించిన ఏ భేదంలోనూ కూడా ధ్వనికి అవకాశం లేదని 'సంకరం' అనే పేరును పట్టే తెలుస్తుంది. రెండు క్షీరనీరన్యాయంలో కలిసిపోయి నప్పుడు ఒకదానికి ప్రాధాన్యం మరొకదానికి అప్రాధాన్యం అనేది ఉండదు కదా అని భావం.

లోచనం

సంకరాలంకారేఽపీతి-

శ్లో. విరుద్ధాలంక్రియోల్లేఖే సమం తద్వృత్త్యసంభవే,
ఏకస్య చ గ్రహే న్యాయదోషాభావే చ సంకరః.
ఇతి లక్షణాత్ ఏకః ప్రకారః. యథా మమైవ-

శ్లో. శశివదనా సితసరసిజనయనా సితకున్దదన్తపఙ్క్తిరియమ్,
గగనజలస్థలసంభవహృద్యాకారా కృతా విధినా. ఇతి

అత్ర ''శశీ వదనమస్యాః'' ''తద్వద్వా వదనమస్యాః'' ఇతి రూపకోపమోల్లేఖాద్యుగపద్ద్వయాసంభవాత్ ఏకతరపక్షత్యాగగ్రహణే ప్రమాణాభావాత్ సంకర ఇతి వ్యఙ్గ్యవాచ్యతాయా ఏవ అనిశ్చయాత్ కా ధ్వని సంభావనా?

యోఽపి ద్వితీయః ప్రకారః - శబ్దార్థాలంకారాణామేకత్ర భావ ఇతి తత్రాపి ప్రతీయమానస్య కా శఙ్కా? యథా-

"స్మర స్మరమివ ప్రియం రమయసే యదాలిఙ్గనాత్" ఇతి అత్రైవ యమకముపమా చ.

తృతీయః ప్రకారః - యత్రైకత్ర వాక్యాంశే అనేకః అర్థాలంకారః తత్రాపి ద్వయోః సామ్యాత్ కస్య వ్యఙ్గ్యతా? యథా -

శ్లో. తుల్యోదయావసానత్వాద్ గతేఽస్తం ప్రతి భాస్వతి,
వాసాయ వాసరః క్లాన్తో విశతీవ తమోగుహామ్. (భామహ కావ్యా3.48)

ఇతి.

అత్ర హి స్వామివిపత్తిసముచితవ్రతగ్రహణహేవాకికులపుత్రకరూపణమ్ ఏకదేశవివర్తి రూపకం దర్శయతి. ఉత్ప్రేక్షా చ ఇవశబ్దేనోక్తా. తదిదం ప్రకారద్వయముక్తమ్.

శ్లో. శబ్దార్థవర్త్యలంకారా వాక్య ఏకత్ర వర్తినః,
సంకరశ్చైక వాక్యాంశప్రవేశాద్వాభిధీయతే. (ఉద్భటకావ్యా.5.9)

ఇతి చ.

బాలానందిని

సంకరాలంకారేఽపీతి - సంకరాలంకారంలో మొదటి భేదానికి లక్షణోదాహరణలు చూపుతున్నాడు - విరుద్ధేతి :- "విరుద్ధాలంక్రియోల్లేఖే = విరుద్ధాలైన అలంకారాలను కూర్చగా, సమమ్= సమంగా (ఒకే సమయంలో కలిసి), తద్వృత్త్యసంభవే= వాటి ఉనికియందు అసంభవం ఉండగా (అవి రెండూ ఒకే సమయంలో ఉండడం కుదరకపోగా) ఏకస్య= ఒకదానియొక్క, గ్రహే= గ్రహణమునందు, న్యాయదోషాభావే చ= న్యాయం కాని, దోషం కాని లేకపోగా, సంకరః= సంకరాలంకారము". ఈ లక్షణం ప్రకారం ఒక భేదం. దీనికి ఉదాహరణం నా శ్లోకమే ఎట్లనగా- శశీతి- శశివదనా = చంద్రుడే ముఖం గా కలది, (చంద్రునివంటి ముఖం కలది) అసితసరసిజనయనా= నల్లని పద్మాలే లేదా కలవలే నేత్రాలుగా గలది (అసితసరసిజాల వంటి నేత్రాలు కలదీ), సితకున్దదశనపఙ్క్తిః= తెల్లని మల్లిమొగ్గలే దంతాలపంక్తి గలది, (తెల్లని కుందపంక్తివంటి దంతాలు గలదీ) అయిన, ఇయమ్= ఇది (ఈమె), గగనజలస్థలభవహృద్యాకారా= గగన-జల-స్థలసంభవములచేత(వలె), ఆకాశసంభవుడైన చంద్రుడు, జలసంభవమైన పద్మం, స్థలసంభవమైన కుందం, వీటితో లేదా వీటివలె, మనోహరమైన అకారంగలదిగా, విధినా=బ్రహ్మచేత, కృతా=చేయబడినది.

అత్రేతి - ఇక్కడ "శశీ వదనమ్ అస్యాః" (చంద్రుడే దీని ముఖము) అని గాని, "శశివత్ ముఖమ్ అస్యాః" (చంద్రునివంటి ముఖం ఈమెది) అని గాని రూపక - ఉపమాలంకారాల కూర్పు ఉంది; కాని ఒకే సమయంలో రెండిటినీ గ్రహించడం కుదరదు. ఒక దాన్ని విడిచి మరొకదాన్ని గ్రహించడానికి తగిన ప్రమాణం ఏదీ లేదు.

అందుచేత రెండు అలంకారాల (సందేహ) సంకరం ఉంది. అందువల్ల ఏది వాచ్యమో ఏది వ్యంగ్యమో నిశ్చయించడానికే అవకాశం లేదు. అలాంటప్పుడు ఇక్కడ ధ్వనికి అవకాశం ఎక్కడ ఉంది?

వివరణ :- పై శ్లోకంలో రూపకాలంకారపక్షంలో రాత్రిని వర్ణిస్తున్నట్లూ, ఉపమాలంకారం అయితే వనితను వర్ణిస్తున్నట్లూ గ్రహించాలి. స్త్రీకి చంద్రుడే ముఖం అని చెప్పడం అంత యుక్తం కాదు కదా?

యోఽపీతి :- శబ్దాలంకార - అర్థాలంకారాలు ఒకే చోట ఉండడం అనే రెండవ సంకరాలంకారభేదం ఏదైతే ఉందో దానిలో కూడా ప్రతీయమానార్థం ఉంటుందనే శంక కూడ ఏమి ఉంటుంది ? దీనికి ఉదాహరణం ఎట్లనగా - స్మరేతి - యమ్ = ఎవనిని, ఆలిఙ్గనాత్ = ఆలింగనం వల్ల, రమయసే = క్రీడింపచేస్తున్నావో, స్మరమివ = మన్మథునివంటి, ప్రియమ్ = ప్రియుణ్ణి, స్మర =స్మరించుము. అత్రేతి = ఇక్కడ "స్మర" స్మర" అని శబ్దాలంకారమైన యమకం, "స్మరమివ" అనే అర్థాలంకారమైన ఉపమ కలిసి ఉన్నాయి. ఇక్కడ వ్యంగ్యార్థం ఏదీ ఉండే ప్రసక్తి లేదని అభిప్రాయం.

తృతీయ ఇతి - ఒక వాక్యాంశంలో అనేకార్థాలంకారాలు కలిసి ఉండడం అనే మూడవ సంకరభేదంలో కూడా ఆ రెండు అలంకారాలు సమంగానే ఉన్నప్పుడు దేనిని వ్యంగ్యం అనగలం? ఎట్లనగా - తుల్యేతి - భాస్వతి =సూర్యుడు, అస్తంగతే =అస్తమించగా, దివసః=పగలు, తుల్యోదయావసానత్వాత్=సమమైన ఉదయం (అభివృద్ధి), అవసానమూ (వినాశమూ) కలిగి ఉండడం వల్ల, క్లాన్తః=అలసినదై, దుఃఖాక్రాంతమై, వాసాయ = నివాసం కొరకు, తమోగుహామ్ = చీకటి అనే గుహను, విశతీవ = ప్రవేశిస్తున్నట్లు ఉన్నది.

అత్ర ఇతి - ఇక్కడ ఏకదేశవివర్తిరూపకం, అనగా 'తమస్సే గుహ' అనే రూపకం. వాసరమునందు, ప్రభువుయొక్క ఆపదకు తగిన వ్రతాన్ని గ్రహించడానికి ఉద్యుక్తుడైన (పోవాకి) కులపుత్రకుని (సత్కులప్రసూతుడైన రాజాశ్రితయువకుని) రూపణాన్ని (ఆరోపాన్ని) చూపుతున్నది.

వివరణ:- 'తమోగుహామ్' అని తమస్సునందు గుహాత్వాన్ని ఆరోపించడం చేత దివసం తన ప్రభువుకు ఆపద వచ్చినప్పుడు తాను కూడ దానికి తగిన కష్టమైన వ్రతాన్ని అవలంబించడంచేత ఉత్సాహవంతుడైన యువకుడనీ, సూర్యుడు ప్రభువు అనీ, అతడు అస్తమించడం స్వామికి కలిగిన ఆపద అనీ, రూపణాలకు దారి తీస్తున్నది. అందుచేత ఇక్కడ ఏకదేశవివర్తిరూపకాలంకారం ఉంది. 'విశతీవ' అన్నప్పుడు ఇవ

శబ్దం ఉత్ప్రేక్షను బోధిస్తున్నది. ఈ విధంగా ఇక్కడ రెండు అర్థాలంకారాలు కలిసి ఉన్నాయి. రెండూ సమంగానే ఉన్నాయి. దీనిలో ఒకటి వ్యంగ్యం, రెండవది వాచ్యం అని చెప్పడానికి వీలు లేదు.

తదితి : ఈ విధంగా ప్రకారద్వయం ఈ క్రింది కారికలో చెప్పబడింది. అనగా సందేహసంకరం, ఏకవాచకానుప్రవేశసంకరం అనే రెండు భేదాలు చెప్పబడ్డాయి.

శబ్దేతి - ఏకత్ర=ఒకచోట, వర్తినః = ఉండే, శబ్దార్థవర్త్యలంకారాః = శబ్దార్థాలకు సంబంధించిన అలంకారాలు, అనగా ఒకే చోట శబ్దాలంకారం, అర్థాలంకారం ఉండడం, సంకరః=సంకరాలంకారం. ఏకవాక్యాంశప్రవేశాద్వా=ఒకే వాక్యాంశంలో అనేక అలంకారాలు ప్రవేశించడంవల్లనైనా, అభిధీయతే = సంకరాలంకారంగా చెప్పబడుతుంది.

వివరణ:- ఈ విధంగా సందేహసంకరం, శబ్దార్థాలంకారసంకరం, ఒక వాక్యాంశంలో రెండు అర్థాలంకారాలు ఉండడంచేత ఏర్పడిన సంకరం చూపబడ్డాయి.

లోచనం

చతుర్థస్తత ప్రకారః యత్ర అనుగ్రాహ్యానుగ్రహకభావః అలంకారాణామ్. యథా -

శ్లో. ప్రవాతనీలోత్పలనిర్విశేషమధీరవిప్రేక్షిత మాయతాక్ష్యా,
తయా గృహీతం ను మృగాఙ్గనాభ్యస్తతో గృహీతం ను మృగాఙ్గనాభిః.

(కుమా 1.46)

అత్ర మృగాఙ్గనావలోకనేన తదవలోకనస్యోపమా యద్యపి వ్యఙ్గ్యా తథాపి వాచ్యస్య సా సన్దేహాలంకారస్య అభ్యుత్థానకారిణీత్వేన అనుగ్రాహకత్వాత్ గుణీభూతా; అనుగ్రాహ్యత్వేన హి సన్దేహే పర్యవసానమ్. యథోక్తమ్ -

పరస్పరోపకారేణ యత్రాలంకృతయః స్థితాః,
స్వాతన్త్ర్యేణాత్మలాభం నో లభన్తే సోఽపి సంకరః

(ఉద్భట కావ్యా 5.64)

**తదాహ** - యదాలంకార ఇత్యాది. ఏవం చతుర్థేఽపి ధ్వనితా నిరాకృతా. మధ్యమయోస్తు వ్యఙ్గ్యసంభావనైవ నాస్తీత్యుక్తమ్. ఆద్యే తు ప్రకారే శశివదనేత్యాద్యుదాహృతే కథంచిదస్తి సంభావనా ఇత్యాశఙ్క్య నిరాకరోతి. అలఙ్కారద్వయేతి. సమమితి - ద్వయోరప్యాన్దోల్యమానత్వాత్ ఇతి భావః.

బాలానందిని

చతుర్థః ఇతి - ఎక్కడైతే అలంకారాల మధ్య అనుగ్రాహ్యానుగ్రాహకభావం ఉంటుందో, అనగా ఒక అలంకారం మరొక అలంకారంమీద ఆధారపడి ఉంటుందో, అది నాల్గవ సంకరాలంకార ప్రకారం. ఎట్లనగా - ప్రవాతేతి - ప్రవాతనీలోత్పలనిర్విశేషమ్ = అధికమైన గాలి ఉన్న చోట ఉన్న నల్లకలవకంటె భేదం లేని (నల్లకలవవంటి), అధీరవిప్రేక్షితమ్ = చంచలమైన చూపు, ఆయతాక్ష్యా = విశాలమైన నేత్రాలు గల, తయా=ఆ పార్వతిచేత, మృగాఙ్గనాభ్యః = ఆడలేళ్లనుండి, గృహీతం ను= గ్రహించబడిందో, మృగాఙ్గనాభిః = ఆడలేళ్లచేత, తతః = ఆమెనుండి, గృహీతం ను = గ్రహించబడినదో!

అత్రేతి - ఈ శ్లోకంలో ఆడలేళ్ల చూపులతో పార్వతి చూపులకు ఉపమ వ్యంగ్యంగానే ఉన్నా, అది వాచ్యమైన సందేహాలంకారానికి ఉత్థానం కలిగించేది అవడం వల్ల, (సందేహాలంకారం పుట్టడానికి ఉపకరిస్తూండడంవల్ల) దానికి అనుగ్రాహకం; (ఉపమ సందేహాలంకారాన్ని అనుగ్రహిస్తూన్నది. ఉపమే లేకపోతే సందేహం కలగదుకదా?) అందువల్ల ఇది అప్రధానమై, అనుగ్రాహ్యమైన సందేహాలంకారంలో పర్యవసానం చెందుతూన్నది. ఈ విషయమే క్రింది లక్షణకారికలో చెప్పబడింది.

పరస్పరేతి - యత్ర=ఎక్కడ, పరస్పరోపకారేణ=పరస్పరోపకారంతో, పరస్పరోపకారకాలుగా, స్థితాః=ఉన్న, అలంకృతయః=అలంకారాలు. స్వాతంత్ర్యేణ= స్వాతంత్ర్యంతో, ఆత్మలాభమ్=పుట్టుకను, నో లభన్తే=పొందవో, సః అపి=అదికూడ, సంకరః = సంకరాలంకారం.

తదితి- ఆ విషయాన్నే "యదా అలంకారః" ఇత్యాదివాక్యంలో చెపుతున్నాడు. ఏవమితి - ఈ విధంగా నాల్గవ ప్రకారంలో కూడ ధ్వనిత్వం నిరాకరించబడింది. మధ్యప్రకారంలో (ద్వితీయ తృతీయభేదాలలో) అయితే ధ్వని ఉండే ప్రసంగమే లేదని చెప్పబడింది. ఆద్యే ఇతి- 'శశివదనా' ఇత్యాదిశ్లోకం ఉదాహరించి ప్రతిపాదించిన మొదటి ప్రకారంలో అయితే ఏదో విధంగా వ్యంగ్యానికి సంభావన (వ్యంగ్యం ఉండే అవకాశం) ఉంది అని ఆశంకించుకుని అలంకారద్వయే త్యాదివాక్యంలో నిరాకరిస్తున్నాడు. సమమితి- రెండు అలంకారాలు కూడ ఊగులాడుతున్నాయి కాబట్టి అని భావం.

లోచనం

నను యత్ర వ్యఙ్గ్యమేవ ప్రాధాన్యేన భాతి తత్ర కిం కర్తవ్యమ్? యథా-

గాథ. హోఇ ణ గుణాణురాఓ ఖలాణం ణవరం పసిద్ధిసరణాణమ్,
కిర పహిణుసఇ ససిమణిం చన్దే పిఅముహే దిట్ఠే.

శ్లో. "భవతి న గుణానురాగః ఖలానాం కేవలం ప్రసిద్ధిశరణానామ్,
కిల ప్రస్నౌతి శశిమణిః చన్ద్రే న ప్రియాముఖే దృష్టే' (సంస్కృతచ్ఛాయ).

అత్రార్థాన్తరన్యాసస్తావత్ వాచ్యత్వేనాభాతి; వ్యతిరేకాపహ్నుతీ తు వ్యఙ్గ్యత్వేన ప్రధానతయా ఇత్యభిప్రాయేణాశఙ్క్యతే-అథేతి. తత్రోత్తరమ్-తదాసోఽపీతి. సంకరాలంకార ఏవాయం న భవతి, అపి తు అలంకారధ్వనినామాయం ధ్వనేః ద్వితీయో భేదః యచ్చ పర్యాయోక్తే నిరూపితం తత్సర్వమత్రాప్యనుసరణీయమ్.

అథ సర్వేషు సంకరప్రభేదేషు వ్యఙ్గ్యసంభావనానిరాసప్రకారం సాధారణమాహ అపి చేతి. "క్వచిదపి సంకరాలంకారే చ" ఇతి సంబన్ధః. సర్వభేదభిన్న ఇత్యర్థః. సంకీర్ణతా హి మిశ్రత్వం లోలీభావః, తత్ర కథమేకస్య ప్రాధాన్యం క్షీరజలవత్?

బాలానందిని

నన్వితి- (ఆశంక) వ్యంగ్యమే ప్రధానంగా భాసించే చోట ఏమి చెయ్యాలి? ఎలాంటి స్థలాలలో అనగా- భవతీతి- కేవలమ్=కేవలం, ప్రసిద్ధిశరణానామ్=లోకంలో ఉన్న ప్రసిద్ధియే శరణంగా గల, పదిమంది అనే విషయం నమ్మడమే కాని స్వయంగా ఆలోచించుకునే శక్తి లేని, ఖలానామ్-దుష్టులకు (మూఢులకు), గుణానురాగః= గుణాలపైన అనురాగం, న భవతి=ఉండదు. శశిమణిః=చంద్రకాంతమణి, చన్ద్రే=చంద్రుడు, దృష్టే=చూడబడినవాడగుచుండగా, ప్రస్నౌతి=స్రవిస్తుంది, ప్రియాముఖే= ప్రియాముఖం చూడబడినప్పుడు, న కిల=స్రవించదుకదా?

**అత్రేతి** = ఇక్కడ అర్థాంతరన్యాసం అయితే వాచ్యంగానే భాసిస్తూన్నది గాని వ్యతిరేక - అపహ్నుతులు మాత్రం వ్యంగ్యాలై ప్రధానంగా భాసిస్తున్నాయి అనే అభిప్రాయంతో ఆశంకిస్తూన్నాడు. **అథేతి** -

వివరణ :- ఉపమానంగా ప్రసిద్ధమైన చంద్రుని కంటె ప్రియాముఖం చాలా సుందరమైనది అని ధ్వనించడంచేత వ్యతిరేకాలంకారధ్వని. "అక్కడ కనబడుతూన్నవాడు చంద్రుడు కాదు; ప్రియాముఖమే చంద్రుడు" అనే అర్థం గమ్యం అవడంచేత

అపహ్నుత్యలంకారధ్వని. వాచ్యమైన అర్థాంతరన్యాసంకంటె ఈ వ్యంగ్యాలంకారాలే ప్రధానంగా ఉన్నాయి అని భావం.

తదా సో ఽపీత్యాదికం : ఈ ఆశంకకు సమాధానం. అప్పుడిది సంకరాలంకారమే కాదు. మరే మనగా- అలంకారధ్వని అనే పేరుగల ధ్వనియొక్క ద్వితీయభేదం. యచ్చ ఇతి- పర్యాయోక్తం విషయంలో చెప్పినదంతా ఇక్కడ కూడా అన్వయించుకోవాలి. అనగా ఈ రెండింటిలో ఒకదానిని మరొకదానిలో అంతర్గతం చెయ్యాలంటే పరిమితమైన విషయంగల ఈ అలంకారాన్ని మహావిషయంగల ధ్వనిలో అంతర్గతం చెయ్యాలి కాని, ధ్వనిని దీనిలో అంతర్గతం చేయడం యుక్తం కాదు.

అథేతి:-ఇప్పుడు సంకరభేదాలన్నింటిలోనూ కూడా వ్యంగ్యస్థితి నిషేధించే పద్ధతిని సాధారణంగా (అన్నింటికీ వర్తించే విధంగా) చెపుతున్నాడు - అపి చేతి. 'సంకరాలంకారేఽపి చ క్వచిత్' అన్న పదాలలో 'అపి' ని 'క్వచిత్' పక్క చేర్చి "క్వచిదపి సంకరాలంకారే చ " అని అన్వయించుకోవాలి. 'క్వచిదపి' అనగా 'సర్వభేదాలచేత భిన్నమైన' అని అర్థం, "సంకరాలంకారానికి చెందిన ఏ భేదంలోనూ కూడా " అని భావం. సంకీర్ణతా ఇతి : సంకీర్ణత అనగా మిశ్రం అవడం, పూర్తిగా కలిసిపోవడం (లోలీభావః) దానిలో, కలిసిపోయిన క్షీరనీరాలలో వలె, ఒకదానికి ప్రాధాన్యం అని చెప్పడం ఎలా కుదురుతుంది?

## ధ్వన్యాలోకం

అప్రస్తుతప్రశంసాయామపి యదా సామాన్యవిశేషభావాత్, నిమిత్తనిమిత్తిభావాద్వా అభిధీయమానస్యాప్రస్తుతస్య ప్రతీయమానేన ప్రస్తుతేన అభిసంబన్ధః తదా అభిధీయమానప్రతీయమానయోః సమమేవ ప్రాధాన్యమ్. యదా తావత్ సామాన్యస్య అభిధీయమానస్య ప్రాకరణికేన విశేషేణ ప్రతీయమానేన సంబన్ధః తదా విశేషప్రతీతౌ సత్యామపి ప్రాధాన్యేన తత్సామాన్యేన అవినాభావాత్ సామాన్యస్యాపి ప్రాధాన్యమ్. యదాపి విశేషస్య సామాన్యనిష్ఠత్వం తదాపి సామాన్యస్య ప్రాధాన్యే, సామాన్యే సర్వవిశేషాణామ్ అన్తర్భావాత్ విశేషస్యాపి ప్రాధాన్యమ్. నిమిత్త నిమిత్తిభావే చ అయమేవ న్యాయః , యదా

తు సారూప్యమాత్రవశేన అప్రస్తుతప్రశంసాయామ్ అప్రకృతయోః సంబన్ధః తదాప్యప్రస్తుతస్య సరూపస్య అభిధీయమానస్య ప్రాధాన్యేన అవివక్షాయాం ధ్వనావేవ అన్తఃపాతః. ఇతరథాతు అలఙ్కారాన్తరమేవ.

బాలానందిని

అప్రస్తుతేతి - అప్రస్తుతప్రశంసలో కూడ సామాన్యవిశేషభావంవల్ల గాని, నిమిత్తనిమిత్తిభావంవల్లగాని, వాచ్యమైన అప్రస్తుతానికి ప్రతీతమానమైన (వ్యంగ్యమైన) ప్రస్తుతంతో ఎప్పుడు సంబంధం ఉంటుందో అప్పుడు వాచ్యప్రతీయమానార్థాలు రెండింటికీ కూడ ప్రాధాన్యం సమంగానే ఉంటుంది. వాచ్యమైన అప్రస్తుతసామాన్యానికి ప్రాకరణికమైన (ప్రస్తుతమైన) ప్రతీయమానవిశేషంతో సంబంధం ఉండడంవల్ల ఆ సామాన్యం ద్వారా విశేషప్రతిపత్తి ప్రధానంగా కలిగినప్పుడు కూడా ఆ విశేషానికి దాని సామాన్యంతో అవినాభావసంబంధం ఉండడంవల్ల సామాన్యనికి కూడా ప్రాధాన్యం ఉంటంది. విశేషం సామాన్యనిష్ఠం అయినప్పుడు కూడా, అనగా విశేషంవల్ల సామాన్య ప్రతిపత్తి ప్రధానంగా కలిగినప్పుడు కూడా, అన్ని విశేషాలు సామాన్యంలో అంతర్భావం చెందుతాయి కాబట్టి విశేషానికి కూడా ప్రాధాన్యం ఉంటుంది. నిమిత్తనిమిత్తిభావంతో కూడా ఇదే న్యాయం(పద్ధతి). ఎప్పుడైతే సారూప్యమాత్రంచేత, అప్రస్తుతప్రశంసలో, అప్రకృతప్రకృతాలకి సంబంధం ఏర్పడుతుందో, అప్పుడు కూడా అప్రస్తుతసమానరూపం అయిన వాచ్యానికే ప్రాధాన్యం ఉన్నట్లు చెప్పదలపకపోతే అప్పుడు దానికి ధ్వనిలోనే అంతర్భావం. మరొక విధంగా అయితే, వాచ్యానికే ప్రాధాన్యం చెప్పాలనే అభిప్రాయం ఉంటే, అది ఒక అలంకారాంతరమే అవుతుంది.

లోచనం

శ్లో. అధికారాదపేతస్య వస్తునోఽన్యస్య యా స్తుతిః

అప్రస్తుతప్రశంసా సా త్రివిధా పరికీర్తితా. (భామహకావ్యా. 3.29)

అప్రస్తుతస్య వర్ణనం ప్రస్తుతాక్షేపిణ ఇత్యర్థః. స చ ఆక్షేపః త్రివిధో భవతి - సామాన్యవిశేషభావాత్, నిమిత్తనిమిత్తిభావాత్, సారూప్యాచ్చ. తత్ర ప్రథమే ప్రకారద్వయే ప్రస్తుతాప్రస్తుతయోః తుల్యమేవ ప్రాధాన్యమితి ప్రతిజ్ఞాం కరోతి - అప్రస్తుతేత్యాదినా ప్రాధాన్యమిత్యన్తేన. తత్ర సామాన్యవిశేషభావేఽపి ద్వయీ గతిః - సామాన్యమ్ అప్రాకరణికం శబ్దేనోచ్యతే, గమ్యతే తు

ప్రాకరణికో విశేషః, స ఏకః ప్రకారః. యథా-

శ్లో. అహో సంసారనైర్ఘృణ్యమహో దౌరాత్మ్యమాపదామ్,

అహో నిసర్గజిహ్మస్య దురన్తా గతయో విధేః.

అత్ర హి దైవప్రాధాన్యం సర్వత్ర సామాన్యరూపమ్ అప్రస్తుతం వర్ణితం ప్రకృతే వస్తుని క్వాపి వినష్టే విశేషాత్మని పర్యవస్యతి. తత్రాపి విశేషాంశస్య సామాన్యేన వ్యాప్తత్వాత్ వ్యఙ్గ్యవిశేషవత్ సామాన్యస్యాపి ప్రాధాన్యమ్. న హి సామాన్యవిశేషయోః యుగపత్ ప్రాధాన్యం విరుధ్యతే.

బాలానందిని

అప్రస్తుతప్రశంసాలంకారంలో వ్యంగ్యప్రాధాన్యం ఉన్నదా లేదా అనే చర్చకు ముందు దాని స్వరూపం తెలపడంకోసం లక్షణం చెపుతున్నాడు-

**అధికారాదితి** - అధికారాత్= ప్రస్తుతత్వంనుండి, అపేతస్య= తొలగిన, అప్రస్తుతమైన, అన్యస్య= మరియొక, వస్తునః=వస్తువుయొక్క, యా = ఏ, స్తుతిః= స్తుతి, అనగా వర్ణనం ఉన్నదో, సా= అది, త్రివిధా= మూడు విధాలైన, అప్రస్తుతప్రశంసా= అప్రస్తుతప్రశంసగా, మతా= చెప్పబడింది.

**అప్రస్తుతస్యేతి** - ప్రస్తుతాన్ని ఆక్షేపించే, బైటకు లాగే, ఊహింపచేసే, అప్రస్తుతవస్తువుయొక్క వర్ణనం అప్రస్తుతప్రశంస అని అర్థం. సామాన్య విశేషభావంవల్ల, నిమిత్తనిమిత్తిభావంవల్ల, సాదృశ్యంవల్ల ఈ ఆక్షేపం మూడు విధాలుగా ఉంటుంది. అనగా వర్ణించబడేవాటిలో ఒకటి సామాన్యం రెండవది విశేషం అయి ఉంటుంది. అదొక భేదం. ఒకటి నిమిత్తం అవుతుంది రెండవది నిమిత్తి (కార్యం) అవుతుంది; అది రెండవది. వర్ణించబడే రెండింటికీ ఏదో సాదృశ్యం ఉంటుంది. అది మూడవది.

**తత్రేతి**- ఈ మూడు భేదాలలోని మొదటి రెండు భేదాలలో ప్రస్తుత - అప్రస్తుతాల ప్రాధాన్యం తుల్యంగానే ఉంటుం దని అప్రస్తుత మొదలు ప్రాదాన్యమ్ అనుదానివరకూ ఉన్న వాక్యసముదాయంచేత ప్రతిజ్ఞ చేస్తున్నాడు, అనగా నిరూపించడానికి ముందు చెపుతున్నాడు. తత్ర ఇతి:- ఆ సామాన్యవిశేషభావంలో కూడా రెండు విధాలైన గతి ఉంటుంది(రెండు పద్ధతు లుంటాయి). అప్రాకరణికమైన(అప్రస్తుతమైన) సామాన్యం శబ్దంచేత బోధించబడుతుంది, ప్రాకరణికమైన విశేషం గమ్యంగా ఉంటుంది- అదొక ప్రకారం. ఎట్లనగా- అహో ఇత్యాది "సంసారంయొక్క నిర్దయత్వం ఎంత ఆశ్చర్యకర మైనది? ఆపదల చెడ్డతనం ఎంత ఆశ్చర్యకరమైనది? స్వభావంచేత వక్రుడైన విధియొక్క

గతులు, కార్యవిధానాలు ఎంత చెడ్డవి!".

అత్ర హీతి:- ఇక్కడ - అంతటా సామాన్యరూపంలో ఉన్న అప్రస్తుతమైన దైవప్రాధాన్యం వర్ణించబడినదై నశించిన ఏదో ఒక విశేషాత్మకమైన వస్తువునందు పర్యవసానం చెందుతున్నది. అనగా - అచింతితమైన ఆపద ఏదో కలిగి ఎవరో మరణించడం వంటి ఒక విశేషం జరిగింది. అది ప్రస్తుతం. ఆ విశేషాన్ని మాటలలో చెప్పకుండా "ప్రతివిషయంలోనూ దైవం చాలా ప్రధానమైనది" అనే అప్రస్తుత వస్తువు(విషయం) చెప్పబడింది. ఇది చివరికి పైన చెప్పిన విశేషార్థంలోనే పర్యవసానం చెందుతుంది. ఈ విధంగా ఇక్కడ అప్రస్తుతమైన "దైవగతి నిసర్గవక్ర మైనది" అనే సామాన్యంచేత ప్రస్తుతమైన ఆపద్విశేషం గమ్యం అవుతున్నది అని భావం. **తత్రాపీతి** - దానిలో కూడ విశేషాంశం సామాన్యంచేత వ్యాప్తమైనది గాన, అనగా విశేషాంశం ఉన్నచోట తప్పకుండా సామాన్యాంశం కూడా ఉంటుంది గాన; వ్యంగ్యమైన విశేషం వలె, వాచ్యమైన సామాన్యం కూడా ప్రధానమైనదే. సామాన్యవిశేషాలు రెండింటికీ ఒకే సమయంలో ప్రాధాన్యం ఉండడంలో విరోధం ఏదీ లేదు కదా?

లోచనం

యదా తు విశేషః అప్రాకరణికః ప్రకారణికం సామాన్యమాక్షిపతి తదా ద్వితీయః ప్రకారః. యథా-

ఏతత్తస్య ముఖాత్ కియత్కమలినీపత్రే కణం పాథసో
యన్ముక్తామణిరిత్యమంస్త స జడః శృణ్వన్యదస్మాదపి,
అఙ్గుల్యగ్రలఘుక్రియాప్రవిలయిన్యాదీయమానే శనైః
తత్రోడ్డీయ గతో హహేత్యనుదినం నిద్రాతి నాన్తఃశుచా.

అత్రాస్థానే మహత్త్వసంభావనం సామాన్యం ప్రస్తుతమ్. అప్రస్తుతం తు జలబిన్దౌ మణిత్వసంభావనం విశేషరూపం వాచ్యమ్. తత్రాపి సామాన్యవిశేషయోర్యుగపత్ ప్రాధాన్యే న విరోధ ఇత్యుక్తమ్. ఏవమేకః ప్రకారః ద్విభేదోఽపి విచారితః - యదా తావదిత్యాదినా విశేషస్యాపి ప్రాధాన్యమ్ ఇత్యన్తేన.

బాలానందిని

యదా ఇతి - అప్రాకరణికమైన విశేషం ఎప్పుడు ప్రాకరణికమైన సామాన్యాన్ని

ఆక్షేపిస్తుందో అప్పుడు రెండవ ప్రకారం ఎట్లనగా-

ఏతదితి - ఇది భల్లటశతకంలోని పద్యం. ఒక మూర్ఖుని మూర్ఖత్వాన్ని గూర్చి ఆశ్చర్యంతో మాటలాడుతూన్న ఒకనితో అతని మిత్రుడు అంటూన్న మాటలు. తస్య= వానియొక్క, ముఖాత్= ముఖంనుండి, ఏతత్= ఇది, కియత్= ఎంత? అతడు అలా మాటలాడా డంటే ఆశ్చర్యం ఏమిటి అని అర్థం. యత్= ఎందువలన అనగా, సః జడః = ఆ మూర్ఖుడు, కమలినీపత్రే= తామరాకుపైన, స్థితమ్= ఉన్న, వారిణః కణమ్= జలబిందువును, ముక్తామణిః ఇతి= ముత్యం అని, అమంస్త= తలచెను, అస్మాదపి= దీనికంటె కూడ, అన్యత్= మరి యొక విషయాన్ని, శృణు= వినుము. శనైః = మెల్లగా, ఆదీయమానే= గ్రహించబడుచు, అఙ్గుల్యగ్రలఘుక్రియాప్రవిలయిని= వ్రేళ్ల చివరి భాగాల లఘువైన క్రియచేత (తేలికగా ముట్టుకోవడంచేత) అది వ్రేళ్లమీదనే లీనమై పోగా, మమ= నా ముత్యం, ఉడ్డీయ= ఎగిరి, క్వ= ఎక్కడికి, గతః= వెళ్లిపోయినది, ఇతి = అని, అనుదినమ్ = ప్రతిరోజూ, అన్తఃశుచా = లోపల దుఃఖంచేత, న నిద్రాతి నిద్రపోవడంలేదు.

అత్రేతి- ఏమీ అవసరం లేని విషయంలో (నిష్ప్రయోజనమైన విషయంలో) గొప్పగా భావించడం అనే సామాన్యం ఇక్కడ ప్రస్తుతం. జలబిందువును మణి అనుకోవడం విశేషరూపమైన వాచ్యం. అక్కడ కూడా సామాన్యవిశేషాలకి ఒకే సమయంలో ప్రాధాన్యం చెప్పినా విరోధం లేదని చెప్పబడింది. ఈ విధంగా రెండు భేదాలు ఉన్న ఒక ప్రకారం, యదా తావత్ మొదలు విశేషస్యాపి ప్రాధాన్యమ్ అనే వరకు ఉన్న గ్రంథభాగంచేత విచారించబడింది.

## లోచనం

ఏతమేవ న్యాయం నిమిత్తనైమిత్తికభావే అతిదిశన్ తస్యాపి ద్విప్రకారతాం దర్శయతి- నిమిత్తేతి. కదాచిత్ నిమిత్తమ్ అప్రస్తుతం సత్ అభిధీయమానం నైమిత్తికం ప్రస్తుతమ్ ఆక్షిపతి. యథా-

శ్లో. యే యాన్త్యభ్యుదయే ప్రీతిం నోజ్ఝన్తి వ్యసనేషు చ,
తే బాన్ధవాస్తే సుహృదో లోకః స్వార్థపరోఽపరః.

అత్రాప్రస్తుతం సుహృద్బాన్ధవరూపత్వం నిమిత్తం సజ్జనాసక్త్యా వర్ణయతి నైమిత్తికీం శ్రద్ధేయవచనతాం ప్రస్తుతామాత్మనః అభివ్యఙ్క్తుమ్. తత్ర నైమిత్తి:

ప్రతీతావపి నిమిత్తప్రతీతిరేవ ప్రధానీభవతి అనుప్రాణకత్వేనేతి వ్యఙ్గ్యవ్యఞ్జకయోః ప్రాధాన్యమ్.

బాలానందిని

ఏతమితి - ఈ న్యాయాన్నే నిమిత్తనైమిత్తికభావస్థలంలో అతిదేశిస్తూ(పట్టిస్తూ) అది కూడ రెండు విధాలైనది అని చూపుతున్నాడు - నిమిత్తేతి. ఒకప్పుడు చెప్పబడుతూన్న (వాచ్యంగా ఉన్న) నిమిత్తం అప్రస్తుతమై ఉండి, ప్రస్తుతమైన నైమిత్తికాన్ని(కార్యాన్ని) ఆక్షేపిస్తుంది. ఎట్లనగా- యే ఇతి - ఏ = ఎవరు, అభ్యుదయే= అభ్యుదయంలో, ఐశ్వర్యాద్యభివృద్ధి కలిగినప్పుడు, ప్రీతిమ్=ఆనందాన్ని, యాన్తి=పొందుతారో, వ్యసనేషు= ఆపదలలో, న ఉజ్ఝన్తి చ=విడిచిపెట్టరో, తే=వాళ్లే, బాన్ధవాః=బంధువులు తే=వాళ్లే, సుహృదః=మిత్రులు అపరః=ఇతరమైన, లోకః=లోకం, స్వార్థపరః= స్వార్థపర మైనది.

అత్రేతి - ఇక్కడ వక్త నైమిత్తికము (కార్యం) ప్రస్తుతమూ అయిన తన శ్రద్ధేయవచనత్వాన్ని (తాను చెప్పిన మాట తప్పక నమ్మదగినది అనే విషయాన్ని) వ్యంజింపచేయడంకొరకై అప్రస్తుతమైన సుహృద్బాంధవరూపత్వాన్ని సజ్జనులయందు ఆసక్తితో, అక్కడ నున్న సజ్జనులను దృష్టిలో ఉంచుకొని వాళ్లు వినడం కోసం, వర్ణిస్తున్నాడు.

వివరణ:- ఇక్కడ సజ్జనాసక్త్యా, అన్న పదం సరిగా అన్వయించడంలేదు, పాఠాంతరం ఏదైనా ఉండవచ్చును. ఒక పుస్తకంలో ఈ పాఠమే గ్రహించినా క్రింద 'సజ్జరాసన్ధోక్త్యా' అనే పాఠాంతరం చూపబడింది. ఆ పదానికి కూడా సరిగా అర్థం కుదరడం లేదు. ఈ శ్లోకం ఎక్కడిదో తెలియదు. జరాసంధుడు అంటున్నాడు అని అర్థం అయితే 'సజ్జరాసంధోక్త్యా' కాక "జరాసంధః స్వోక్త్యా" (జరాసంధుడు తనమాటలచేత) అని ఉండవచ్చును. ఇది కేవలం ఊహమాత్రం. సజ్జనాసక్త్యాకి, ఎవరైనా సంతృప్తికరమైన అర్థం చెపితే శ్రమే లేదు. వ్యాఖ్యాతలు అక్షరార్థం మాత్రమే చెప్పారు.

తత్రేతి:- అక్కడ నైమిత్తికం అయిన శ్రద్ధేయవచనత్వం ధ్వనింపబడుతున్నా నిమిత్తజ్ఞానమే దానికి ప్రాణం పోసేదిగా ఉండడంచేత వ్యంగ్యవ్యంజకాలు రెండింటికీ (తుల్యమైన) ప్రాధాన్యమే ఉంది.

లోచనం

కదాచిత్తు నైమిత్తికమ్ అప్రస్తుతం వర్ణ్యమానం ప్రస్తుతం నిమిత్తం వ్యనక్తి. యథా సేతౌ-

శ్లో. సగ్గం అపారిజాఅం కోత్థుహలచ్ఛిరహిఅం మహుమహస్స ఉరమ్,
సుమరామి మహణపురఓ అముద్ధఅన్దం చ హరజడాపబ్భారమ్.

అత్ర జామ్బవాన్ కౌస్తుభలక్ష్మీవిరహితహరివక్షఃస్మరణాదికమ్ అప్రస్తుతనైమిత్తికం వర్ణయతి ప్రస్తుతం వృద్ధసేవాచిరజీవిత్వవ్యవహారకౌశలాది నిమిత్తభూతం మన్త్రితాయామ్ ఉపాదేయమ్ అభివ్యఙ్క్తుమ్. తత్ర నిమిత్తప్రతీతావపి నైమిత్తికం వాచ్యభూతమ్. ప్రత్యుత తత్ నిమిత్తాను ప్రాణితత్వేన ఉద్ధురకన్ధరీకరోత్యాత్మానమితి సమప్రధానతైవ వాచ్యవ్యఙ్గ్యయోః.

బాలానందిని

కదాచిదితి - ఒకప్పుడు అప్రస్తుతమైన నైమిత్తికం వర్ణింపబడినదై నిమిత్తాన్ని వ్యంజింప చేస్తుంది. ఉదాహరణకు సేతుబంధకావ్యంనుంచి ఒక శ్లోకం ఎట్లనగా-

శ్లో. స్వర్గమపారిజాతం కౌస్తుభలక్ష్మీరహితం మధుమథనస్యోరః,
స్మరామి మథనాత్ పురతః అముగ్ధచన్ద్రం చ హరజటాప్రాగ్భారమ్.

(ఇది సంస్కృతచ్ఛాయ).

స్వర్గమితి. మథనాత్ పురతః= సముద్రమథనంకంటె ముందు, అపారిజాతమ్= పారిజాతవృక్షం లేని, స్వర్గమ్= స్వర్గాన్ని, కౌస్తుభలక్ష్మీరహితమ్= కౌస్తుభమూ, లక్ష్మీ లేని, మధుమథనస్య= మహావిష్ణువుయొక్క, ఉరః=వక్షఃస్థలాన్ని, అముగ్ధచన్ద్రమ్= సుందరమైన చంద్రకళ లేని, హరజటాప్రాగ్భారమ్= శివుని జటాజూటపు ముందుభాగాన్ని, స్మరామి= స్మరిస్తున్నాను.

అత్రేతి- ఇక్కడ జాంబవంతుడు, మంత్రిత్వంలో గ్రహింపదగిన, అనగా మంత్రినిగా నియమించడానికి అవసరమైన, నిమిత్తమైన, ప్రస్తుతమైన వృద్ధసేవ, చిరజీవిత్వం, వ్యవహారకౌశలం మొదలైనవాటిని వ్యంజింపచేయడంకొరకు అప్రస్తుతమూ, నైమిత్తికమూ అయిన కౌస్తుభ - లక్ష్మీదేవులు లేని విష్ణువక్షఃస్థలాన్ని స్మరించడం మొదలైన దానిని వర్ణిస్తున్నాడు. వాటిలో నిమిత్తం వ్యంగ్యం అయినా నైమిత్తికం వాచ్యంగా ఉంది. (అయినా అది అప్రధానం కాదనేమాట అటుండగా) మీదుమిక్కిలి (ప్రత్యుత) అది అనగా వాచ్యమైన నైమిత్తికం, నిమిత్తంచేత అనుప్రాణితం అవడంచేత (ప్రాణం పోసినట్లు అవడంచేత) తనను తాను పైకి ఎత్తబడిన మెడ కలదానినిగా (ఉద్ధురకన్ధరీకరోతి)(ప్రధానమైన దానినిగా) చేసుకుంటూన్నది. అందుచేత ఈ వాచ్యవ్యంగ్యాలు రెండింటికీ ఉన్న ప్రాధాన్యం సమానమే.

లోచనం

ఏవం ద్వౌ ప్రకారౌ ప్రత్యేకం ద్వివిధౌ వివిచ్య తృతీయః ప్రకారః పరీక్ష్యతే సారూప్యలక్షణః. తత్రాపి ద్వౌ ప్రకారౌ - అప్రస్తుతాత్ కదాచిత్ వాచ్యాత్ చమత్కారః. వ్యఙ్గ్యం తు తన్ముఖప్రేక్షమ్. యథా అస్మదుపాధ్యాయభట్టేన్దురాజస్య-

శ్లో. ప్రాణా యేన సమర్పితాస్తవ బలాద్యేన త్వముత్థాపితః
స్కన్ధే యస్య చిరం స్థితోఽసి విదధే యస్తే సపర్యామపి,
తస్యాస్య స్మితమాత్రకేణ జనయన్ ప్రాణాపహారక్రియాం
భ్రాతః ప్రత్యుపకారిణాం ధురి పరం వేతాల లీలాయసే.

అత్ర యద్యపి సారూప్యవశేన కృతఘ్నః కశ్చిదన్యః ప్రస్తుతః ఆక్షిప్యతే తథాపి అప్రస్తుతస్యైవ వేతాలవృత్తాన్తస్య చమత్కారకారిత్వమ్. న హ్యచేతనోపాలమ్భవత్ అసమ్భావ్యమానోఽయమ్ అర్థః, న చ న హృద్య ఇతి వాచ్యస్యాత్ర ప్రధానతా.

బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా ఒక్కొక్కటి రెండేసి విధాలుగా ఉన్న రెండు ప్రకారాలను గూర్చి వివేచనం చేసి ఇప్పుడు సారూప్యరూపమైన మూడవ ప్రకారం పరీక్షించబడుతున్నది. దీనిలో కూడ రెండు ప్రకారాలున్నాయి. ఒకప్పుడు అప్రస్తుతమైన వాచ్యంవల్లనే చమత్కారం కలుగుతుంది. వ్యంగ్యం అయితే దాని ముఖం చూస్తూ ఉంటుంది. దానిమీద అధారపడి ఉంటుంది(తన్ముఖప్రేక్షం). ఉదాహరణంగా మా ఉపాధ్యాయులైన భట్టేందురాజు శ్లోకం ఎట్లనగా-

ప్రాణా ఇతి - ఇది ఏ సందర్భంలో ఎవరు అంటున్నారో తెలియదు. వేతాల అనేది కూడా నిజంగా వేతాలుణ్ణి ఉద్దేశించి పలికినదో లేక ఒక కృతఘ్నుణ్ణి సంబోధిస్తూన్న గౌణప్రయోగమో కూడ తెలియదు. భ్రాతః= సోదరా! వేతాల= వేతాలమా, యేన= దేనిచేత, తవ= నీకు, ప్రాణాః = ప్రాణాలు, సమర్పితాః= సమర్పించబడ్డాయో, యేన= దేనిచేత, బలాత్= బలంవల్ల, త్వమ్= నీవు, ఉత్థాపితః= పైకి లేపబడినావో, యస్య= దేనియొక్క, స్కన్ధే= భ్రమానునందు, పెద్దకొమ్మమీద, చిరమ్= చిరకాలం, స్థితః అసి= ఉన్నావో, యః= ఏది, తే = నీకు, సపర్యామపి= సేవను కూడ, విధధే= చేసెనో, స్మిత

మాత్రకేణ= చిరునవ్వుమాత్రంచేతనే, తస్య= అట్టి, అస్య= దీనికి, ప్రాణాపహారక్రియామ్= ప్రాణాలను హరించే క్రియను, జనయన్= కలిగిస్తూన్న నువ్వు, ప్రత్యుపకారిణామ్= ప్రత్యుపకారంచేసేవాళ్లయొక్క, ధురి= అగ్రభాగంలో, పరమ్= అధికంగా, లీలాయసే= ప్రకాశిస్తున్నావు.

వివరణ:- వేతాళానికి కొంతకాలం నివాసస్థానంగా ఉన్న ఒక చెట్టును ఆ వేతాళమే చంపివేసి ఉంటుందని పై అర్థం చెప్పబడింది. లేదా ఆభిచారికప్రయోగంచేత తనను పుట్టించి తనకు బలం చేకూర్చినవానినే అది చంపివేసింది అనే అర్థం గ్రహిస్తే యచ్ఛబ్దాలకి 'యేన=ఎవనిచేత' ఇత్యాద్యర్థం, 'స్కన్ధే=భుజంమీద' అని అర్థం చెప్పుకోవాలి. 'యేన సముత్థాపితః' అనేది ఈ రెండవ అర్థానికి అనుకూలంగా ఉంది. ఆభిచారిక క్రియలచేత వేతాలాన్ని పుట్టించడాన్ని "వేతాళసముత్థాపనం" అంటారు.

అత్రేతి - ఇక్కడ సాదృశ్యంవల్ల ఎవడో ఒక కృతఘ్నుడైన ప్రస్తుతపురుషుణ్ణి ఆక్షేపించినా అప్రస్తుతమైన వేతాలవృత్తాంతమే చమత్కారజనకంగా ఉంది. అచేతనవస్తువును నిందించడం ఏ విధంగా అసంభావ్యమో (నిజంగా జరగడానికి వీలులేనిదో) ఆ విధంగా ఈ అర్థం అసంభావ్యం కాదు, చమత్కారకారిగా లేకపోనూ లేదు. అందుచేత ఇక్కడ వాచ్యానికే ప్రాధాన్యం.

లోచనం

యది పునః అచేతనాదినా అత్యన్తాసంభావ్యమానతదర్థవిశేషణేన అప్రస్తుతేన వర్ణితేన ప్రస్తుతమాక్షిప్యమాణం చమత్కారకారి తదా వస్తుధ్వనిరసౌ. యథా మమైవ:-

భావవ్రాత హఠాజ్జనస్య హృదయాన్యాక్రమ్య యన్నర్తయన్
భఙ్గీభిర్వివిధాభిరాత్మహృదయం ప్రచ్ఛాద్య సంక్రీడసే,
స త్వామాహ జడం తతః సహృదయంమన్యత్వదుఃశిక్షితో
మన్యేఽముష్య జడాత్మతా స్తుతిపదం త్వత్సామ్యసంభావనాత్.

కశ్చిన్మహాపురుషః "వీతరాగోఽపి సరాగవత్" ఇతి న్యాయేన గాఢవివేకాలోక తిరస్కృతతిమిరప్రతానోఽపి లోకమధ్యే స్వాత్మానం ప్రచ్ఛాదయన్ లోకం చ వాచాలయన్, ఆత్మని అప్రతిభాసమేవ అఙ్గీకుర్వన్ తేనైవ లోకేన మూర్ఖోఽయమితి యదవజ్ఞాయతే తదీయం లోకోత్తరం చరితం ప్రస్తుతం

వ్యఙ్గ్యతయా ప్రాధాన్యేన ప్రకాశ్యతే. జడో ఽయమితి హి ఉద్యానేన్దూదయాదిర్భావో లోకేనావజ్ఞాయతే; స చ ప్రత్యుత కస్యచిద్విరహిణః ఔత్సుక్యచిన్తాధూయమానమానసతామ్, అన్యస్య ప్రహర్షపరవశతాం కరోతీతి హఠాదేవ లోకం యథేచ్ఛం వికారకారణాభిర్న యతి. న చ తస్య హృదయం కేనాపి జ్ఞాయతే కీదృగయమితి, ప్రత్యుత మహాగమ్భీరః అతివిదగ్ధః సుష్ఠు గర్వహీనః అతిశయేన క్రీడాచతురః స యది లోకేన జడ ఇతి తత ఏవ కారణాత్ ప్రత్యుత వైదగ్ధ్యసంభావననిమిత్తాత్ సంభావితః, ఆత్మా చ యత ఏవ కారణాత్ ప్రత్యుత జాడ్యేన సంభావ్యః తత ఏవ సహృదయః సంభావితః. తదస్య లోకస్య జడో ఽసీతి యద్వ్యుచ్యతే తదా జాడ్యమేవంవిధస్య భావవ్రాతస్య అతివిదగ్ధస్య ప్రసిద్ధమితి ప్రత్యుత స్తుతిరితి జడాదపి పాపీయానయం లోక ఇతి ధ్వన్యతే. తదాహ-యదా త్వితి.

బాలానందిని

యది పునః ఇతి:- ఏ మాత్రమూ కుదరని అప్రస్తుతార్థవిశేషణాలు గల వర్ణించబడిన అచేతనాదికమైన అప్రస్తుతంచేత ఆక్షిప్తం అయే ప్రస్తుతం చమత్కారకారి అయితే మాత్రం అది వస్తుధ్వని అవుతుంది. అనగా అచేతనంవంటి ఏదైనా ఒక అప్రస్తుతాన్ని వర్ణిస్తాడు. అది అచేతనం అవడంచేత అక్కడ ఉపయోగించిన విశేషాషణాలేవీ దాని కే మాత్రమూ కూడ కుదరవు. అలాంటి అప్రస్తుతంచేత ప్రస్తుతం ఆక్షేపించబడినప్పుడు అది వస్తుధ్వని అవుతుంది అని అర్థం. దీనికి ఉదాహరణంగా నా శ్లోకమే ఎట్లనగా - భావవ్రాతేతి - భావవ్రాత =చంద్ర- ఉద్యానాదిపదార్థాల సముదాయమా! జనస్య= జనునియొక్క, హృదయాని=హృదయాలను, హఠాత్=బలాత్కారంగా, ఆక్రమ్య= ఆక్రమించి; వివిధాభిః=అనేకవిధాలైన, భఙ్గీభిః=రీతులచేత, నర్తయన్= నృత్యం చేయిస్తూ, ఆత్మహృదయమ్=నీ హృదయాన్ని, ప్రచ్ఛాద్య= కప్పిపుచ్చి, యత్= ఎందువల్ల, సంక్రీడసే= ఆడుకొంటున్నావో, తతః=ఆ విధంగా నువ్వు క్రీడిస్తూండడంవల్ల, సహృదయం మన్యత్వదుఃశిక్షితః= నేనే సహృదయుడను అని తలచుకోవడంచేత దుర్వినీతుడైన, సః అతడు, త్వామ్=నిన్ను, జడమ్=జడమైన దానినిగా, ఆహ=చెపుతున్నాడు. త్వత్సామ్యసంభావనాత్= నీతో సామ్యంయొక్క సంభావనవలన, నీతో సామ్యం లభించే అవకాశం ఉండడంవల్ల, అముష్య= వీని యొక్క, జడాత్మతా= జడాత్మత్వం, స్తుతిపదమ్=

స్తుతికి స్థానం, స్తుతించతగినది అని, మన్యే= తలుస్తున్నాను.

వివరణ:- నువ్వు ఒక ప్రక్క వానిని పట్టుకొని నీ ఇష్టం వచ్చినట్లు అనేకవిధాల ఆడిస్తూంటే ఆ విషయం గ్రహించక, తానేదో గొప్ప సహృదయుణ్ణి అని అనుకుంటూ నిన్ను జడం అంటున్నాడు. నిజానికి నిన్ను జడం అన్నవాడే జడుడు. అయితే నిన్ను జడం అంటున్న వానిని జడుడంటే నీతో వాడికి సామ్యం ఏర్పడి, వాణ్ణి స్తుతించినట్లే అవుతుంది అని భావం. ముందుగా ఇక్కడ వ్యంగ్యమైన ప్రస్తుతార్థాన్ని వివరిస్తున్నాడు- కశ్చిదితి - ఒకానొక మహాపురుషుడు గాఢమైన వివేకం అనే కాంతిచేత తిరస్కరింబడిన అంధకారవిస్తారం కలవాడైనా జ్ఞానంచేత అజ్ఞానాన్ని పూర్తిగా నశింపచేసికొన్నవాడైనా "రాగం పూర్తిగా తొలగిపోయిన వాడైనా రాగం ఉన్నవాడు వలె" (జ్ఞాని ప్రవర్తిస్తాడు) అనే న్యాయాన్ని అనుసరించి లోకుల మధ్యలో తన అసలు స్వరూపాన్ని కప్పిపుచ్చుకొని ఉంటే లోకం తనను గూర్చి (ఇష్టంవచ్చినట్లు) వాగేటట్లు చేస్తూ వాళ్లు అనుకుంటూన్నట్లుగా తనయందు అజ్ఞానాన్నే అంగీకరిస్తూ. అనగా తనకేమీ తెలియనట్లే ప్రవర్తిస్తూ. ఆ లోకంచేతనే వీడు మూర్ఖుడు అని అవమానించబడుతూంటాడు. అలాంటి జ్ఞాని యొక్క లోకోత్తరమైన, సామాన్యజనుల కెవరికీ అర్థం కాకపోవడం చేత లోకాతీతమైన, చరితం (నడవడి)ప్రస్తుతం. అది ఇక్కడ వ్యంగ్యంగా ప్రధానంగా ప్రకాశింపచేయ బడుతూన్నది (బోధించబడుతూన్నది).

వివరణ :- మహాజ్ఞాని తన అజ్ఞానాంధకారాన్ని పూర్తిగా తొలగించుకున్నా కూడ పైకి మాత్రం సామాన్యమానవుని కంటె తక్కువగా పిచ్చివాడు వలె ప్రవర్తిస్తూంటాడు. అందుచేతనే తత్త్వజ్ఞానం లభించిన వానికి ఈ లోకంలో అందరూ జడులవలె, పిచ్చివాళ్ల వలె, పిశాచగ్రస్తుల వలె కనబడతారు; వాళ్లకి అతడు ఈ విధంగా కనబడతాడు అని ఒక ప్రసిద్ధశ్లోకంలో చెప్పబడింది -

"జ్ఞాతతత్త్వస్య లోకో ఽయం జడోన్మత్తపిశాచవత్,
జ్ఞాతతత్త్వో ఽపి లోకస్య జడోన్మత్తపిశాచవత్."

ఇప్పుడు వాచ్యార్థం వివరిస్తున్నాడు - జడో ఽయమితి- ఉద్యానం, చంద్రోదయం మొదలైన భావాన్ని (వస్తుజాలాన్ని) ఇది జడం అని అంటూ లోకం అనాదరం చేస్తుంది. అయితే ఈ ఉద్యానాదికం జడం కాకపోవడం సరికదా పైగా - విరహవంతుడైన వానికి ఔత్సుక్య (బెంగ) చింతలతో పీడింపబడిన మనస్సు కలిగి ఉండడాన్ని, (మనస్సులో బెంగ మొదలైనవాటివల్ల పీడను) మరొకనికి ఆనందపరవశత్వాన్ని కలగచేస్తూ ఈ లోకాన్ని (జనుల్నందరినీ) తన ఇష్టం వచ్చినట్లు, బలాత్కారంగా

తన వశంలో ఉంచుకొని అనేకమైన ఔత్సుక్యాదివికారాలు కలిగింపచేయడంచేత నృత్యం చేయిస్తుంది. అయితే ఇది (ఈ భావవ్రాతం - పదార్థజాతం) ఎలాంటిదో దాని హృదయం మాత్రం ఎవరికీ తెలియదు. లోకం అనుకుంటున్న దానికి విరుద్ధంగా (ప్రత్యుత) చాల గంభీరమూ, మంచి నేర్పుగలదీ, చక్కగా ఉన్నదీ, గర్వం లేనిదీ, క్రీడించడంలో మంచి చాతుర్యం గలదీ అయిన ఆ భావవ్రాతం, అనాదరం చూపడానికి బదులు, మంచి నేర్పుగలది అని ఊహించడానికి నిమిత్తమైన (ప్రత్యుత) అదే కారణం వల్ల, అనగా జనుల్ని అందరినీ నృత్యం చేయిస్తూ ఆడుకుంటూన్నది అనే కారణంవల్ల, "ఇది జడమైనది" అని లోకుల చేత గౌరవించబడితే, అదే కారణం వల్ల (జడుడని అనడమే గౌరవించడం అవడంవల్ల) సహృదయుడు తాను కూడ జాడ్యం చేత దూషించబడడానికి బదులు (ప్రత్యుత) గౌరవించతగినవాడే అవుతాడు. అందుచేత ఈ లోకాన్ని గూర్చి "జడః అసి", "నువ్వు జడము" అని అన్నట్లయితే ఈ విధమైన చాల నేర్పుగల భావవ్రాతం యొక్క జాడ్యం చాలా ప్రసిద్ధమైనది గాన అది (లోకం విషయంలో) నింద అవడానికి బదులు స్తుతియే అవుతుంది.

దీని సంపిండితార్థం ఇది :- ఉద్యాన చంద్రోదయాది భావవ్రాతం, వస్తు సముదాయం, ఉంది. మేమే సహృదయులం అనుకుంటూన్న సహృదయులు ఈ భావవ్రాతాన్ని జడం అంటున్నారు. అయితే - ఈ భావవ్రాతం మంచి నేర్పుతో సామర్థ్యంతో, కొందరిని ఏడ్పిస్తూ, కొందరిని నవ్విస్తూ వాళ్లని అనేక విధాల పీడిస్తూ తాను అది చూచి ఆడుకొంటూన్నది. అంత నేర్పు, గాంభీర్యం మొదలైనవి ఉన్న భావవ్రాతాన్ని పట్టుకొని "ఇది జడం" అని అంటున్నారంటే 'జడ' శబ్దానికి మంచినేర్పూ, గాంభీర్యం మొదలైనవి ఉండడం అని కొత్త అర్థం చెప్పుకోవాలి. ఈ దృష్ట్యా చూస్తే లోకం భావవ్రాతాన్ని జడం అన్నట్లుగా, ఎవరైనా ఈ లోకాన్ని (సహృదయులం అనుకొనేవాళ్లని కూడా) 'జడం' అని అన్నట్లయితే అది నిందకాదు సరి కదా స్తుతియే అవుతుంది అని భావం.

ఇంతవరకూ చెప్పినది అప్రస్తుతమైన వాచ్యార్థం. జడాదపీతి :- ఈ వాచ్యార్థం వల్ల గమ్యమైన మరొక వ్యంగ్యార్థం ఏమనగా - "ఈ లోకం జడం కంటె కూడా చాల చెడ్డది" అని. ఈ విషయాన్నే వృత్తికారుడు యదా తు ఇత్యాదికంచేత విశదీకరిస్తున్నాడు.

లోచనం

ఇతరథా త్వితి. ఇతరథైవ పునః అలంకారాన్తరత్వమ్,.

అలంకారవిశేషత్వమ్, న వ్యఙ్గ్యస్య కథంచిదపి ప్రాధాన్యే ఇతి భావః...

బాలానందిని

ఇతరథేతి - మరొక విధంగా మాత్రమే, అనగా వాచ్యం ప్రధానంగా వివక్షితం కానప్పుడే, అలంకారాన్తరత్వమ్=అలంకారవిశేషత్వం ఉంటుంది. ఏ విధంగా నైనా వ్యంగ్యానికే ప్రాధాన్యం ఉంటే మాత్రం అలంకారత్వం ఉండదు అని భావం.

ధ్వన్యాలోకం

తదయమత్ర సంక్షేపః -

శ్లో. వ్యఙ్గ్యస్య యత్రాప్రాధాన్యం వాచ్యమాత్రానుసారిణః,
సమాసోక్త్యాదయస్తత్ర వాచ్యాలంకృతయః స్ఫుటాః,
వ్యఙ్గ్యస్య ప్రతిభామాత్రే వాచ్యార్థానుగమే ఽపి వా,
న ధ్వనిర్యత్ర వా తస్య ప్రాధాన్యం న ప్రతీయతే.
తత్పరావేవ శబ్దార్థౌ యత్ర వ్యఙ్గ్యం ప్రతి స్థితౌ,
ధ్వనేః స ఏవ విషయో మన్తవ్యః సంకరోజ్ఝితః.

తస్మాత్ న ధ్వనేః అన్యత్రాన్తర్భావః.

బాలానందిని

తదితి:- అందువల్ల ఇంతవరకూ చెప్పిన విషయానికి సంక్షేపం ఇది :-

వ్యఙ్గ్యస్యేతి :- వాచ్యమాత్రానుయాయినః =వాచ్యాన్ని మాత్రమే అనుసరించే, వాచ్యాన్ని అనుసరించి మాత్రమే ఉంటూ దానికి ఉపకారకంగా ఉండే అని అర్థం. వ్యఙ్గ్యస్య = వ్యంగ్యానికి, యత్ర =ఎక్కడ, అప్రాధాన్యమ్ = ప్రాధాన్యం ఉండదో, తత్ర = అక్కడ, సమాసోక్త్యాదయః = సమాసోక్తి మొదలైన, వాచ్యాలంకృతయః = అర్థాలంకారాలు, స్ఫుటాః = స్పష్టమైనవి.

వ్యఙ్గ్యస్యేతి - వ్యఙ్గ్యస్య = వ్యంగ్యంయొక్క, ప్రతిభామాత్రే = భానం మాత్రమే ఉన్నా, వాచ్యార్థానుగమే ఽపి వా=వాచ్యార్థాన్ని అనుసరించడం మాత్రమే ఉన్నా, వ్యంగ్యార్థం వాచ్యార్థంకంటె వివిక్తంగా స్వతంత్రంగా లేకపోయినా అని అర్థం. యత్ర = ఎక్కడ, తస్య = ఆ వ్యంగ్యంయొక్క, ప్రాధాన్యమ్ = ప్రాధాన్యం , న ప్రతీయతే వా= కనబడదో అక్కడనైనా, ధ్వనిః న = ధ్వని కాదు.

తత్పరావితి - యత్ర=ఎక్కడ, శబ్దార్థౌ=శబ్దార్థాలు, వ్యఙ్గ్యం ప్రతి = వ్యంగ్యాన్ని గూర్చి, తత్పరావేవ = దానియందే పరమతాత్పర్యం కలవై, స్థితౌ = ఉన్నాయో, సః ఏవ = సంకరోజితః = అదే, సంకరంతో శూన్యమైన, "ఇక్కడ వాచ్యానికి ప్రాధాన్యమా వ్యంగ్యానికి ప్రాధాన్యమా" ఇత్యాది సందేహాలకి తావు లేని, ధ్వనేః విషయః = ధ్వని యొక్క విషయంగా, ధ్వనిస్థానంగా, మన్తవ్యః = తెలియదగినది.

తస్మాదితి - అందువల్ల ధ్వనికి ఇతరమైన దానియందు దేనియందూ అంతర్భావం లేదు.

లోచనం

ఉద్దేశే యదాదిగ్రహణం కృతం సమాసోక్తీత్యత్ర ద్వన్ద్వే, తేన వ్యాజస్తుతిప్రభృతిః అలంకారవర్గోఽపి సంభావ్యమానవ్యఙ్గ్యానువేశః సంభావితః. తత్ర సర్వత్ర సాధారణముత్తరం దాతుముపక్రమతే - తదయమత్రేతి. కియద్వా ప్రతిపదం లిఖ్యతామ్ ఇది భావః.

బాలానందిని

ఉద్దేశే ఇతి - "సమాసోక్తి..... సంకరాలంకారాదౌ" అనే వృత్తిలోని ఉద్దేశరూపమైన (నామగ్రహణరూపమైన) ద్వంద్వసమాసంలో చేయబడిన 'ఆది' శబ్దంచేత వ్యంగ్యం సంబంధం ఉన్నట్లుగా ఊహించడానికి వీలున్న ఏ వ్యాజస్తుత్యాద్యలంకార సముదాయం కూడా వాటిలో (సమాసోక్త్యాదివర్గంలో) చేరుతుందని ఊహించబడిందో( ఊహించడానికి అవకాశం ఉందో) వాటి అన్నింటి విషయంలో సాధారణమైన, వాటికి అన్నింటికీ వర్తించే, సమాధానం తదయమత్రే త్యాదికం చేత చెపుతున్నాడు. అడుగడుగునా, ప్రతీ అలంకారాన్నీ నిర్దేశిస్తూ ఎంతని వ్రాయగలం అని భావం.

లోచనం

తత్ర వ్యాజస్తుతిర్యథా -

కిం వృత్తాన్తైః పరగృహగతైః కిన్తు నాహం సమర్థః
తూష్ణీం స్థాతుం ప్రకృతిముఖరో దాక్షిణాత్యస్వభావః,
గేహే గేహే విపణిషు తథా చత్వరే పానగోష్ఠ్యా -
మున్మత్తేవ భ్రమతి భవతో వల్లభా హన్త కీర్తిః.

అత్ర వ్యఙ్గ్యం స్తుత్యాత్మకం యత్ తేన వాచ్యమేవోపస్క్రియతే.

బాలానందిని

తత్రేతి :- అందు వ్యాజస్తుతి ఎట్లనగా -

కిమితి - పరగృహగతైః = పరుల ఇళ్లకి చెందిన, వృత్తాన్తైః = వృత్తాంతాలచేత, కిమ్ = ఏమి ప్రయోజనం? కింతు = కాని, ప్రకృతిముఖరః = స్వభావం చేతనే అతిగా మాట్లాడే వాడను, దాక్షిణాత్యస్వభావః = దాక్షిణాత్యుల స్వభావం కలవాడను అయిన, అహమ్ = నేను, తూష్ణీమ్ = మౌనంగా, స్థాతుమ్ = ఉండడానికి, న సమర్థః = సమర్థుణ్ణి కాను. భవతః = నీ యొక్క, వల్లభా = ప్రియురాలైన, (ఇష్టమైన), కీర్తిః =కీర్తి, ఉన్మత్తేవ=ఉన్మాదం చెందినది వలె, గృహే గృహే=ఇంటింటా, విపణిషు =బజార్లలోను, తథా=మరియు, చత్వరే=నాలుగు వీథుల మొగలలోను, గ్రామస్థులందరూ సాయంకాలాదిసమయాలలో ఏవేవో ముచ్చటించుకుంటూ కూర్చుండే గ్రామమధ్యప్రదేశాదులకు కూడా చత్వరం అని పేరు. పానగోష్ఠ్యామ్=కల్లు దుకాణాలలోను, అందరూ కలిసి మదిరాపానం చేసే ప్రదేశం లేదా అలాంటి వాళ్ల కలయిక పానగోష్ఠి, భ్రమతి=తిరుగుతున్నది.

అత్రేతి - ఇక్కడ స్తుతిరూపమైన ఏ వ్యంగ్యార్థం ఉన్నదో దానిచేత వాచ్యార్థమే ఉపస్కరించబడుతున్నది; సొగసుగా ఉండేటట్లు చేయబడుతున్నది.

లోచనం

యత్తూదాహృతం కేన చిత్ -

ఆసీన్నాథ పితామహీ తవ మహీ జాతా తతో ఽనన్తరం
మాతా సంప్రతి సామ్బురాశిరశనా జాయా కులోద్భూతయే,
పూర్ణే వర్షశతే భవిష్యతి పునః సైవానవద్యా స్నుషా
యుక్తం నామ సమగ్రనీతివిదుషాం కిం భూపతీనాం కులే.

ఇతి, తదస్మాకం గ్రామ్యం ప్రతిభాతి, అత్యన్తాసభ్యస్మృతిహేతుత్వాత్. కా చానేన స్తుతిః కృతా? త్వం వంశక్రమేణ రాజేతి హి కియదిదమ్? ఇత్యేవంప్రాయా వ్యాజస్తుతిః సహృదయగోష్ఠీషు నిన్దితేత్యుపేక్ష్యైవ.

బాలానందిని

యత్తు ఇతి :- అతడెవడో ఏదైతే ఉదాహరించాడో - -

ఆసీదితి - నాథ=రాజా! మహీ=భూమి, తవ=నీకు, పితామహీ = పితామహిగా,

ఆసీత్=అయిఉండెను. తతః అనన్తరమ్=అటుపిమ్మట, మాతా=తల్లి అయింది. అమ్బురాశిరశనా=సముద్రమే వడ్డాణంగా గల, సా=ఆమె, సంప్రతి=ఇప్పుడు, కులోద్భూతయే= కులంయొక్క అభివృద్ధికొరకు (సంతానం కలగడం కోసం అని రెండవ అర్థం), జాయా=భార్య అయింది. వర్షశతే = నూరు సంవత్సరాలు, పూర్ణే=పూర్ణమైన దగుచుండగా, సైవ=ఆమెయే, పునః=మళ్లీ, అనవద్యా=దోషాలు లేని, స్నుషా= కోడలుగా, భవిష్యతి=కాగలదు. సమగ్రనీతివిదుషామ్ = సమస్తమైన నీతులను ఎరిగిన, భూపతీనామ్ = రాజులయొక్క , కులే = కులమునందు, యుక్తం నామ కిమ్ = ఇది తగిన దేనా ?

తదితి - అది మాకు గ్రామ్యంగా ఉన్నట్లు కనబడుతుంది. ఎందుచేత ననగా అత్యంతము అసభ్యమైన విషయాన్ని స్మరింపచేస్తున్నది. ఇలా చెప్పడంచేత ఏమి స్తుతి చేసి నట్లయింది? నువ్వు వంశక్రమంచేత రాజువు అయ్యావు అని చెప్పడం (ఇతరరాజులకంటె వీనిలో ఉన్న దిగ్విజయం చేసి రాజ్యసంపాదనం చేయడం వంటిది చెప్పనప్పుడు) అసలు ఏమిటిది ! ఈ విధంగా ఉండే వ్యాజస్తుతి సహృదయుల గోష్ఠిలో నింద్యమైనది; అందుచేత ఇలాంటిదాన్ని ఉపేక్షించాలి.

లోచనం

శ్లో. యస్య వికారః ప్రభవన్నప్రతిబన్ధస్తు హేతునా యేన,
గమయతి తమభిప్రాయం తత్ప్రతిబన్ధం చ భావోఽసౌ.

(రుద్రట కావ్యా. 7.38) ఇతి.

అత్రాపి వాచ్యప్రాధాన్యే భావాలంకారతా. యస్య చిత్తవృత్తివిశేషస్య సంబన్ధే వాగ్వ్యాపారాదిః వికారః అప్రతిబన్ధః అనియతః ప్రభవన్ తం చిత్త వృత్తివిశేషరూపమ్ అభిప్రాయం యేన హేతునా గమయతి స హేతుర్యథేష్టోపభోగ్యత్వాదిరర్థః భావాలంకారః. యథా-

శ్లో - ఏకాకినీ యదబలా తరుణీ తథాహ
మస్మిన్ గృహే గృహపతిశ్చ గతో విదేశమ్,
కం యాచసే తదిహ వాసమియం వరాకీ
శ్వశ్రూర్మమాన్ధబధిరా నను మూఢ పాన్థ.

అత్ర వ్యఙ్గ్యమ్ ఏకైకత్ర పదార్థే ఉపస్కారకారీతి వాచ్యం ప్రధానమ్. వ్యఙ్గ్యప్రాధాన్యే తు న కాచిదలంకారతేతి నిరూపితమిత్యలం బహునా.

బాలానందిని

వ్యాజస్తుతిప్రభృతిః అని ప్రభృతిశబ్దం ప్రయోగించడం వల్ల వ్యాజస్తుతిని గూర్చి చర్చించిన తరవాత మరొక అలంకారమైన భావాలంకారాన్ని గూర్చి పరిశీలించడం కోసం రుద్రటుడు చెప్పిన దాని లక్షణం చూపుతున్నాడు -

యస్యేతి - యస్య = ఏ చిత్తవృత్తివిశేషంయొక్క, వికారః = వికారము, అప్రతిబన్ధః= అడ్డు లేనిదై, ప్రభవన్ = సమర్థం అగుచు, అడ్డులేని సామర్థ్యంతో అని భావం, యేన హేతునా = ఏ హేతువు చేత, తమ్ అభిప్రాయమ్ = ఆ అభిప్రాయాన్నే, తత్ప్రతిబన్ధం చ = దాని ప్రతిబంధాన్నీ, గమయతి = వ్యంజింపచేయునో, అసౌ = ఇది, భావః = భావాలంకారం.

అత్రాపీతి - ఇక్కడ కూడ వాచ్యానికి ప్రాధాన్యం ఉన్నట్లయితే భావాలంకారం అవుతుంది. యస్య = ఏ చిత్తవృత్తివిశేషానికి సంబంధించిన వాగ్వ్యాపారం (సంభాషణ) వంటి వికారం ఏ అడ్డూ లేకుండా తన సామర్థ్యాన్ని చూపుతూ ఆ చిత్తవృత్తివిశేషరూపమైన అభిప్రాయాన్ని ఏ హేతువుచేత వ్యంజింపచేస్తుందో ఆ హేతువు, "ఇష్టం వచ్చినట్లు భోగించవచ్చు" ఇత్యాది రూపమైన అర్థం భావాలంకారం. ఎట్లనగా -

యథా ఇతి - మూఢ పాన్థ = = మూఢుడవైన ఓ పాంథుడా! అబలా = అబలను, తథా = మరియు, తరుణీ = యువతినీ అయిన, అహమ్ = నేను, అస్మిన్ గృహే= ఈ గృహంలో, యత్ = ఏ కారణంవలన, ఏకాకినీ = ఒంటరిగా ఉన్నానో, గృహపతిః చ = నా గృహపతి కూడ, విదేశమ్ = విదేశాన్ని గూర్చి, గతః = వెళ్లినాడో, తత్ = అందువలన, ఇహ = ఇక్కడ, వాసమ్ = నివాసాన్ని గూర్చి, కమ్ = ఎవరిని, యాచసే = కోరుతున్నావు? మమ=నాయొక్క వరాకీ = దీనురాలైన, ఇయం శ్వశ్రూః = ఈ అత్త, అన్ధబధిరా నను = గ్రుడ్డిది చెవిటిదీ కూడ కదా ?

అత్రేతి - ఇక్కడ వ్యంగ్యార్థం ఒక్కొక్క పదార్థంలోనూ కూడ ఉపస్కారం (ఒక విధమైన విశిష్టత్వం) కలగచేస్తున్నది. అందుచేత వాచ్యమే ప్రధానం. వ్యంగ్యానికి ప్రాధాన్యం అంగీకరిస్తే మాత్రం అలంకారత్వం ఏదీ ఉండదు అని నిరూపించబడింది. ఈ విషయంలో చాలా చెప్పడం చాలు.

లోచనం

యత్రేతి కావ్యే. అలంకృతయ ఇతి అలంకృతిత్వాదేవ చ వాచ్యోపస్కారకత్వమ్. ప్రతిభామాత్ర ఇతి. యత్రోపమాదౌ శ్లిష్టార్థప్రతీతిః. వాచ్యార్థానుగమః ఇతి. వాచ్యేన అర్థేన అనుగమః సమం ప్రాధాన్యమ్

అప్రస్తుతప్రశంసాయామివేత్యర్థః. న ప్రతీయతే ఇతి. స్ఫుటతయా ప్రాధాన్యం న చకాస్తి, అపి, తు బలాత్ కల్ప్యతే, తథాపి, హృదయే నానుప్రవిశతి.యథా - "దేఆ పసిఅణివిఆతాసు" ఇత్యత్ర అన్యకృతాసు వ్యాఖ్యాసు. తేన చతుర్షు ప్రకారేషు న ధ్వనివ్యవహారః సద్భావేఽపి వ్యఙ్గ్యస్య అప్రాధాన్యే మ్లిష్టప్రతీతౌ. వాచ్యేన సమప్రాధాన్యే అస్ఫుటే ప్రాధాన్యే చ. క్వ తర్హి అసౌ ఇత్యాహ - తత్పరావేవేతి. సంకరేణ అలంకారానుప్రవేశసంభావనయా ఉజితః ఇత్యర్థః, సంకరాలంకారేణ ఇతి తు అసత్, అన్యాలంకారోపలక్షణత్వే హి క్లిష్టం స్యాత్.

బాలానందిని

పరికరశ్లోకాల అర్థం వివరిస్తున్నాడు - యత్రేతి - యత్ర అనగా ఏ కావ్యంలో అని అర్థం. అలంకృతయః ఇతి. అవి అలంకారాలు అవడంచేతనే వ్యంగ్యం వాచ్యార్థోపస్కారకం అవుతుంది. అనగా వ్యంగ్యం అప్రధానం అవడానికి కారణం అది వాచ్యమాత్రాన్ని అనుసరించి ఉండడం. అందుకు కారణం అది వాచ్యార్థానికి ఉపస్కారకంగా ఉండడం. ఇలాంటి పరిస్థితిలోనే అలంకారానికి అవకాశం ఉంటుంది. కాబట్టి 'అలంకృతి' పదంచేత ఈ విషయాలు సూచింపబడ్డాయి అని అర్థం. 'వ్యఙ్గ్య ప్రతిభామాత్రే' అనే దానిని సోదాహరణంగా వివరిస్తున్నాడు - యత్రేతి- ఉపమ మొదలైనవి ఉన్నచోట ఎక్కడ అస్పష్ట (మ్లిష్ట) మైన వ్యగ్యార్థంయొక్క ప్రతీతి కలుగుతుందో అక్కడ వ్యంగ్యానికి ప్రతిభామాత్రమే, కేవలం భాసించడమే, ఉంటుంది అని అర్థం. మొదటి శ్లోకంలో 'వాచ్యమాత్రానుయాయినః' అని చెప్పిన తరవాత రెండవ శ్లోకంలో 'వాచ్యార్థానుగమే' అని చెప్పడంవల్ల పునరుక్తిదోషానికి అవకాశం లేకుండా దీనికి మరొక అర్థం చెపుతున్నాడు - వాచ్యేతి - వాచ్యమైన అర్థంతో అనుగమం (అనుసరించడం), అనగా అప్రస్తుతప్రశంసాలంకారంలో వలె దానితో సమానమైన ప్రాధాన్యం, అని అర్థం. న ప్రతీయతే అనగా దాని ప్రాధాన్యం స్ఫుటంగా కనబడదు; బలవంతంగా దానికి ప్రాధాన్యం ఉన్నట్లు కల్పించబడుతుంది. అయినా అది హృదయంలో ప్రవేశించదు. మనస్సుకు నచ్చదు. "ప్రార్థయే తావత్ ప్రసీత' ఇత్యాదులలో (ఈ గాథ పూర్వం ఉదాహరించబడింది చూ. శ్లో.6) ఇతరులు చేసిన వ్యాఖ్యలు ఏ విధంగా హృదయంగమంగా లేవో అట్లే. తేనేతి. అందుచేత వ్యగ్యం ఉన్నా దానికి ప్రాధాన్యం లేకపోవడం, అస్పష్టంగా గోచరించడం, వాచ్యంతో సమానమైన ప్రాధాన్యంతో ఉండడం,

ప్రాధాన్యం అస్ఫుటంగా ఉండడం అనే నాలుగు ప్రకారాలలోను కూడ 'ధ్వని' అనే వ్యవహారం ఉండదు. దానిని ధ్వని అనకూడదు. క్వేతి - అయితే ఈ ధ్వనివ్యవహారం ఎక్కడ ఉండాలో తత్పరావేవ ఇత్యాదిశ్లోకంలో చెపుతున్నాడు. 'సంకరోజితః" అనగా అలంకారానికి స్థానం ఉంటుంది అనే శంకకు అవకాశం లేనిది అని అర్థం. 'సంకరాలంకారంతో శూన్యమైనది' (సంకరాలంకారం లేనిది) అనే అర్థం మాత్రం సరియైనది కాదు. ఇక్కడ 'సంకర' అనేది ఇతరాలంకారాలకి ఉపలక్షకం అని చెప్పడం క్లిష్టకల్పన అవుతుంది.

## ధ్వన్యాలోకం

ఇతశ్చ నాన్తర్భావః, యతః కావ్యవిశేషః అఙ్గీ ధ్వనిరితి కథితః. తస్య పునః అఙ్గాని-అలఙ్కారాః, గుణాః, వృత్తయశ్చేతి ప్రతిపాదయిష్యన్తే. న చ అవయవ ఏవ పృథగ్భూతః అవయవీతి ప్రసిద్ధః, అపృథగ్భావే తు తదఙ్గత్వం స్యాత్, న తు తత్త్వమేవ. యత్రాపి వా తత్త్వం తత్రాపి ధ్వనేః మహావిషయత్వాత్ న తన్నిష్ఠత్వమేవ.

### బాలానందిని

ఇతశ్చేతి - ఈ కారణం వల్ల కూడా ధ్వనికి ఇతరమైనవాటిలో అంతర్భావం లేదు. ఎందువల్లననగా - అంగియైన కావ్యవిశేషం ధ్వని అని చెప్పబడింది. దానికి అలంకారాలు, గుణాలు, వృత్తులు అంగాలని ప్రతిపాదించనున్నాం. అవయవాన్నే అవయవినుంచి వేరు చేసి అవయవి అనడం ప్రసిద్ధం కాదు. వేరుచేయకపోతే అది దానికి (అంగికి) అంగంగానే ఉంటుది. కాని అదిగానే (అంగిగానే) అయిపోదు. ఎక్కడైనా అదిగానే అయిపోవడం సంభవిస్తే, అనగా అంగియైన ధ్వనిగానే అయిపోతే కూడ ధ్వని మహావిషయం అవడంవల్ల తన్నిష్ఠత్వమే (ధ్వని దానిలోనే ఇమిడిపోవడం) ఉండదు.

### లోచనం

ఇతశ్చేతి - న కేవలమన్యోన్యవిరుద్ధవాచ్యవాచకభావ - వ్యఙ్గ్యవ్యఞ్జకభావసమాశ్రయత్వాన్న తాదాత్మ్యమలఙ్కారాణాం ధ్వనేశ్చ,

యావత్ స్వామిభృత్యవదఙ్గిరూపాఙ్గరూపయోః, విరోధాదిత్యర్థః. అవయవ ఇతి- ఏకైక ఇత్యర్థః. తదాహ - పృథగ్భూత ఇతి. అథ పృథగ్భూతః తథా మా భూత్; సముదాయమధ్యపతితః తర్హ్యస్తు తథా ఇత్యాశఙ్క్యాహ - అపృథగ్భావే త్వితి. తదాపి న స ఏక ఏవ సముదాయః, అన్యేషామపి సముదాయినాం తత్ర భావాత్. తత్సముదాయమధ్యే చ ప్రతీయమానమప్యస్తి, న చ తదలఙ్కారరూపమ్, ప్రధానత్వాదేవ. యత్తు అలఙ్కారరూపం తత్ అప్రధానత్వాత్ న ధ్వనిః, తదాహ తత్త్వమేవ ఇతి. నను అలంకార ఏవ కశ్చిత్ త్వయా ప్రధానతాభిషేకం దత్వా ధ్వనిరితి, ఆత్మేతి చ ఉక్త ఇత్యాశఙ్క్య ఆహ- యదపి వా ఇతి. న హి సమాసోక్త్యాదీనామ్ అన్యతమ ఏవాసౌ తథాస్మాభిః కృతః. తద్వివిక్తత్వేఽపి తస్య భావాత్; సమాసోక్త్యాద్యలంకార స్వరూపస్య సమస్తస్య అభావేఽపి తస్య దర్శితత్వాత్ 'అత్తా ఏత్థ' ఇతి, 'కస్స వా ణ' ఇత్యాది. తదాహ - న తన్నిష్ఠత్వమేవేతి.

బాలానందిని

ఇత్శ్చేతీతి - అలంకారాలకీ ధ్వనికీ తాదాత్మ్యం లేకపోవడానికి, అనగా అలంకారమే ధ్వని అని గాని, ధ్వనియే అలంకారా లని గాని అనడానికి అవకాశం లేకపోవడానికి, కారణం అవి పరస్పరవిరుద్ధాలైన వాచ్యవాచకభావ- వ్యంగ్యవ్యంజక భావాలను ఆశ్రయించి ఉండడమే కాదు, మరి ఇంకా ఏమనగా - అంగిరూప - అంగరూపమైన వాటికి, స్వామిభృత్యులకు వలె విరోధం (అత్యంతభేదం) ఉండడంవల్ల కూడా అని అర్థం.

వివరణ - అలంకారాలూ, ధ్వనీ ఒకటే అనడానికి వీలులేదు, ఎందువల్ల ననగా అలంకారాలు తమకీ శబ్దాలకీ మధ్య ఉన్న వాచ్యవాచకభావంమీద ఆధారపడి ఉంటే ధ్వని తనకీ శబ్దానికీ మధ్య ఉన్న వ్యంగ్యవ్యంజకభావం మీద ఆధారపడి ఉంది. ఇదొక కారణం ఉంటూండగా అలంకారాలు అంగం, ధ్వని అంగి అవడంచేత కూడా ఈ రెండూ ఒకటే అని (వీటికి తాదాత్మ్యం ఉన్నదని) చెప్పడానికి వీలు లేదని భావం.

అవయవ ఇతి - ఒక్కొక్క అవయవం అని అర్థం. ఈ అర్థాన్నే పృథగ్భూతః అనే మాటలో చెపుతున్నాడు; అథేతి - పృథగ్భూతమైనది (విడిగా ఉన్నది) అలా (అవయవిగా) కాకపోతే కాకపోవచ్చు; సముదాయమధ్యంలో ఉన్నది, (మిగిలిన అవయవాలన్నిటితోను

కలిసి ఉన్నది) అట్లు కావచ్చు గదా అని ఆశంకించుకొని (వృత్తికారుడు) చెపుతున్నాడు- అపృథగ్భావే తు ఇతి . తదపీతి - అలా చెప్పినప్పుడు కూడా అది ఒక్కటే సముదాయం కాదు. ఇంకా మిగిలిన సముదాయులు కూడా దానిలో ఉన్నాయి కదా ? సముదాయుల మధ్య ప్రతీయమానం కూడా ఉంటే అది అలంకారమే కాదు; ఎందుచేత ననగా ప్రధానంగా ఉంది కనక. అది అలంకారరూపమే అని నిరూపిస్తారా - అప్పుడు ధ్వని కాదు . ఈ విషయాన్నే న తు తత్త్వమేవ అని చెపుతున్నాడు.

వివరణ - ఒకచోట పది కలిస్తే అది 'సముదాయం'. ఆ సముదాయంలో ఉన్న ఒక్కొక్కటీ 'సముదాయి'

నన్వితి - నువ్వు ఏదో అలంకారానికే ప్రాధాన్యాభిషేకం చేసి దానికి 'ధ్వని' అనీ ఆత్మ అనీ పేర్లు పెడుతున్నావు అని ఆశంకించుకొని 'యత్రాపి వా" ఇత్యాదికం చేత (వృ.కా) సమాధానం చెపుతున్నాడు. న హీతి :- సమాసోక్త్యాదులలో ఒకదానిని తీసికొని మేం అలా చేయలేదు. ఎందుచేత ననగా సమాసోక్త్యాదిభిన్న స్థలాలలో కూడా ధ్వని ఉంటుంది. సమాసోక్త్యాదులకు సంబంధించిన స్వరూపం అంతా లేకపోయినా "అత్తా ఏత్థ" "కస్స వా ణ" ఇత్యాదిస్థలాలలో ధ్వని ఉన్నది అని మేం చూపి ఉన్నాం కదా? ఈ విషయాన్నే (వృ.కా) న తన్నిష్ఠత్వమేవ అన్న మాటలలో చెపుతున్నాడు.

## ధ్వన్యాలోకం

"సూరిభిః కథితః" ఇతి విద్వదుపజ్ఞేయముక్తిః, న తు యథా కథంచిత్ప్రవృత్తేతి ప్రతిపాద్యతే. ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః, వ్యాకరణమూలత్వాత్ సర్వవిద్యానామ్. తే చ శ్రూయమాణేషు వర్ణేషు ధ్వనిరితి వ్యవహరన్తి. తథైవ అన్యైః తన్మతానుసారిభిః సూరిభిః కావ్యతత్త్వార్థదర్శిభిః వాచ్యవాచకసంమిశ్రః శబ్దాత్మా కావ్యమితి వ్యపదేశ్యః వ్యఞ్జకత్వసామ్యాత్ ధ్వనిరిత్యుక్తః. న చైవంవిధస్య ధ్వనేః వక్ష్యమాణప్రభేదతద్భేదసంకలనయా మహావిషయస్య యత్ప్రకాశనం తదప్రసిద్ధాలంకారమాత్రప్రతిపాదనేన తుల్యమితి తద్భావితచేతసాం యుక్త ఏవ సంరమ్భః. న చ తేషు కథంచిత్ ఈర్ష్యా యాకలుషిత

శేముషీకత్వమ్ ఆవిష్కరణీయమ్. తదేవం ధ్వనేస్తావదభావవాదినః ప్రత్యుక్తాః.

బాలానందిని

సూరిభిః ఇతి - ఈ ఉక్తి, అనగా ధ్వనిని గూర్చి చెప్పినది, విద్వాంసులచేత ప్రారంభించబడినదే కాని ఏదో విధంగా నిరాధారంగా చెప్పినది కాదు అని "సూరిభిః కథితః" అనే మాటలచేత ప్రతిపాదించబడుతున్నది. ప్రథమే హి ఇతి:- సమస్త విద్యలకీ మూలం వ్యాకరణమే; అందువల్ల వైయాకరణులు విద్వాంసులలో మొదటివాళ్లు, అగ్రగణ్యులు. వాళ్లు చెవికి వినబదే వర్ణాల విషయంలో ధ్వని అని వ్యవహరిస్తున్నారు. ఆ వర్ణాలను 'ధ్వని' అంటున్నారు. అదే విధంగా కావ్యతత్త్వార్థాన్ని పరిశీలించి చూచిన ఇతరపండితులచేత కూడా, ఆ వైయాకరణుల మతాన్నే అనుసరించి, వాచ్యవాచక సహితమైన సంమిశ్రమూ, శబ్దాత్మయైన కావ్యమూ కూడ వ్యంజకత్వం అనే దాని సామ్యం వల్ల, అనగా ఆ వర్ణధ్వని ఏ విధంగా వ్యంజకమో ఇది కూడా అదే విధంగా వ్యంజకం అవడంవల్ల, 'ధ్వని' అని చెప్పబడ్డాయి. నేతి :- చెప్పబడబోయే ప్రభేదాలను, అంతరభేదాలనూ కలపగా మహావిషయం గల ఈ విధమైన ధ్వనిని ప్రకాశింపచేయడం, (ప్రతిపాదించడం) ఏదో అప్రసిద్ధమైన అలంకారాన్ని ప్రతిపాదించడం వంటిది కాదు; అందువల్ల ఈ ధ్వనిచేత భావితమైన చిత్తం కలవాళ్ల సంరంభం, ఈ ధ్వనిని గూర్చి బాగా మననం చేసి, దానిని మనస్సులో ఆకళించుకున్న వాళ్లు హడావిడి చేయడం, యుక్తమే. వాళ్లమీద ఏదో ఈర్ష్య పెట్టుకొని వాళ్లందరూ కలుషితమైన మనస్సులు కలవారు అని అనకూడదు. లేదా వాళ్ల విషయంలో కలుషమైన శేముషిని ఎవరూ ప్రకటించగూడదు. ఈ విధంగా ధ్వన్యభావవాదులు నిరాకరించబడ్డారు.

లోచనం

విద్వదుపజ్ఞేతి - "విద్వద్భ్యః ఉపజ్ఞా ప్రథమః ఉపక్రమః యస్యా ఉక్తేః" ఇతి బహువ్రీహిః. తేన "ఉపజ్ఞోపక్రమమ్" ఇతి తత్పురుషాశ్రయం నపుంసకత్వం నిరవకాశమ్. శ్రూయమాణేతి :- శ్రోత్రశష్కులీమ్ సన్తానేన ఆగతాః అన్త్యాః శబ్దాః శ్రూయన్త ఇతి ప్రక్రియాయాం శబ్దజాః శ్రూయమాణాః ఇత్యుక్తమ్. తేషాం ఘణ్టానురణనరూపత్వం తావదస్తి; తే ధ్వనిశబ్దేనోక్తాః, యథాహ భగవాన్ భర్తృహరిః -

శ్లో. యః సంయోగవియోగాభ్యాం కరణైరుపజన్యతే,
స స్ఫోటః శబ్దజాః శబ్దా ధ్వనయో௨న్యైరుదాహృతాః.
(వా.ప.బ్రహ్మకాండ 102) ఇతి.

ఏవం ఘణ్టాదినిర్హ్రాదస్థానీయః అనురణనాత్మా ఉపలక్షితః వ్యఙ్గ్యో௨ప్యర్థః ధ్వనిః ఇతి వ్యవహృతః. తథా శ్రూయమాణా యే వర్ణా నాదశబ్దవాచ్యాః అన్త్యబుద్ధినిర్గ్రాహ్యస్ఫోటాభివ్యఞ్జకాః, తే ధ్వనిశబ్దేన ఉక్తాః. యథాహ భగవాన్ స ఏవ -

శ్లో. ప్రత్యయైః అనుపాఖ్యేయైః గ్రహణానుగుణైస్తథా,
ధ్వనిప్రకాశితే శబ్దే స్వరూపమవధార్యతే. (వా.ప.బ్ర.కాండ 83) ఇతి.

తేన వ్యఞ్జకౌ శబ్దార్థావపి ఇహ ధ్వనిశబ్దేన ఉక్తౌ.

బాలానందిని

విద్వదుపజ్ఞేతి - "విద్వద్భ్యః ఉపజ్ఞా యస్యాః సా విద్వదుపజ్ఞా" అని బహువ్రీహి సమాసం గ్రహించడం చేత "విద్వాంసులవల్ల, ఉపజ్ఞ, అనగా మొట్టమొదటి ఉపక్రమం, దేనికో "ఏ ఉక్తికో అది" అని అర్థం. ఇలా చెప్పడంచేత 'ఉపజ్ఞోపక్రమమ్' అని తత్పురుషని పట్టి వచ్చే నపుంసకత్వం నిరవకాశమైనది.

వివరణ - వృత్తిలో 'విద్వదుపజ్ఞా ఇయముక్తిః' అని 'విద్వదుపజ్ఞా' శబ్దం స్త్రీలింగంలో ప్రయోగించబడింది. కాని "ఉపజ్ఞోపక్రమం తదాద్యాచిఖ్యాసాయామ్" (2-4-25) అనే పాణినిసూత్రం ప్రకారం తరవాతవచ్చే విశేష్యం ఏదైనా ఈ పదం నపుంసకలింగం లో ఉండాలి. "ఉపజ్ఞా' 'ఉపక్రమ' శబ్దాలు అంతమునందున్న తత్పురుషసమాసం, "అది ఆదియందు కలది" అనే అర్థంలో నపుంసకలింగంలో ఉంటుంది" అని సూత్రానికి అర్థం. "పాణిన్యుపజ్ఞం గ్రన్థః" "నన్దోపక్రమం ద్రోణః" ఇత్యాదులు ఉదాహరణలు. "పాణినేః ఉపజ్ఞా పాణిన్యుపజ్ఞమ్" "నన్దస్య ఉపక్రమః నన్దోపక్రమమ్" అని విగ్రహవాక్యాలు. 'ఉపజ్ఞా' తెలియబడినది అని 'ఉపక్రమః' ప్రారంభించబడినది అనీ అర్థాలు. పాణినేః, నన్దస్య అనేవి కర్త్రర్థకషష్ఠ్యంతాలు "పాణినికి అనగా పాణినిచేత ప్రప్రథమంగా తెలియబడిన గ్రంథం", నందునిచేత ప్రప్రథమంగా ప్రారంభించబడిన ద్రోణం (కుంచం వంటి ఒక పరిమాణం)" అని అర్థాలు. ఈ విధంగా ఇక్కడ కూడా "విదుషామ్ ఉపజ్ఞా విద్వదుపజ్ఞమ్" అని

నపుంసకలింగంలో ఉండాలి కదా అని ఆశంకించుకొని ఈ సూత్రం తత్పురుష సమాసం విషయంలోనే ప్రవర్తిస్తుంది గాని బహువ్రీహిలో ప్రవర్తించదు. అందుచేత పైన చూపినట్లు బహువ్రీహి గ్రహించాలి అని అభినవగుప్తుని సమాధానం.

కాని ఇది ఏదో సమర్థనం మాత్రమే అన్నట్లు కనబడుతుంది. ప్రత్యేకంగా 'ఉపజ్ఞా' శబ్దం ప్రయోగించడంలో వృత్తికారుని ఆశయం ధ్వని అనే దాన్ని తొలిసారిగా విద్వాంసులే తెలుసుకొన్నారు, దానిని గూర్చి చెప్పారు, అని చెప్పడమే ఉద్దేశ్యం అయి ఉంటుంది. అనగా తదాద్యాచిఖ్యాస ఉన్నదన్న మాట. అలాంటప్పుడు పాణిని విశేషంగా విధించిన ఈ సూత్రాన్నే అన్వయించి షష్ఠీతత్పురుష చెప్పడమే యుక్తం. వ్యధికరణబహువ్రీహిసమాశ్రయణం అగతికగతి. "సప్తమీ విశేషణే బహువ్రీహౌ" (2.2.35) అనే సూత్రంచేత 'కణ్ఠేకాలః' ఇత్యాదులలో సప్తమ్యంతానికి పూర్వనిపాతవిధాన సామర్థ్యంవల్ల వ్యధికరణ బహువ్రీహి అంగీకరించాలి అని భట్టోజి దీక్షితులు, "కణ్ఠేస్థః కాలః యస్య సః" అని విగ్రహంచెప్పి 'స్థ' శబ్దానికి లోపం చేయగా ఈ రూపం సిద్ధిస్తుంది; దీనికి "సప్తమ్యుపమానపూర్వపదస్యోత్తరపదలోపశ్చ,'..... కణ్ఠేస్థః కాలో ఽస్య కణ్ఠేకాలః" అని "అనేకమన్యపదార్థే" (2.2.24) అనే సూత్రంలో భాష్యకారవచనం ప్రమాణం అని బాలమనోరమాకారుడు వ్రాశారు. ఎక్కడైనా ప్రయోగాలను సమర్థించడం కోసం వ్యధికరణజ్ఞాపనాన్ని భట్టోజీదీక్షితులు అంగీకరించి ఉంటాడు. అందుచేత వ్యధికరణ బహువ్రీహ్యాశ్రయణం అగతికగతియే. "విద్వద్భ్యః ఉపజ్ఞా యస్యాః విద్వదుపజ్ఞా" అని చెప్పడం "రావణాత్ భయం యస్య సః రావణభయః" ఇత్యాదుల వలె అసంగతంగానే ఉంటుంది. అంతే కాక ఉపజ్ఞాశబ్దానికి "ప్రథమజ్ఞానం" అని అర్థం కాని "ప్రథమః ఉపక్రమః" అని కాదు. అందుచేత ఈ సమర్థనం చింత్యం. వృత్తికారుడు "విద్వదుఎజ్ఞేయముక్తిః " అనే వ్రాసి ఉండవచ్చు. అభినవగుప్తునికి లభించిన ప్రతిలోని స్త్రీలింగపాఠం లేఖకదోషకృతం కావచ్చును.

శ్రూయమాణేష్వితి - ఇప్పుడు - వ్యంగ్యార్థం, వ్యంజకశబ్దం, ఆ శబ్దంయొక్క అర్థం, వ్యంజనావ్యాపారం ఈ నాలుగింటికీ కూడా 'ధ్వని' అని పేరు విద్వాంసులలో ప్రసిద్ధంగా ఉంది. దానికి కూడ వైయాకరణుల సంమతి ఉన్నది అని ప్రతిపాదిస్తున్నాడు. శ్రోత్రశష్కులీమ్ ఇత్యాది. సంతానంచేత, అనగా అవిచ్ఛిన్న ధారారూపంలో, చక్కిలంవంటి శ్రోత్రావచ్ఛిన్నాకాశాన్ని (చెవిని) చేరిన చివరిశబ్దాలే వినబడతాయి అనే ప్రక్రియలో శబ్దాలవల్ల పుట్టే శబ్దాలు వినబడతాయి అని చెప్పబడింది. ఆ శబ్దాలకు ఘంటానురణనరూపత్వం ఉంది. అవి 'ధ్వని' శబ్దంచేత చెప్పబడ్డాయి. ఈ విషయాన్నే

పూజ్యుడైన భర్తృహరి "యః సంయోగ ఇత్యాదికారికలో చెప్పాడు. యః ఇతి :- కరణైః = సాధనాలైన తాల్వాదిస్థానాలచేత, సంయోగ వియోగాభ్యామ్ = వాటి కలయికచేత విడిపోవడంచేత, యః = ఏది, ఉపజన్యతే = పుట్టించబడుతుందో, సః = అది, స్ఫోటః = స్ఫోట. అన్యైః= ఉత్పత్తివాదులైన ఇతరులచేత, శబ్దజాః = శబ్దాలవల్ల పుట్టిన, శబ్దాః= శబ్దాలు, ధ్వనయః = ధ్వనులుగా, ఉదాహృతాః= చెప్పబడినవి.

వివరణ - వైశేషికుల సిద్ధాంతం ప్రకారం శబ్దం అనిత్యం. అది సంయోగం వల్ల గాని, వియోగంవల్ల గాని, ఏర్పడుతుంది. భేరిని దండంతో కొట్టినప్పుడు ఆ భేరీ దండసంయోగంవల్ల శబ్దం పుడుతుంది. ఒక వెదురుకఱ్ఱను రెండు బద్దలుగా చీల్చినప్పుడు శబ్దం పుడుతుంది. ఇది వియోగజశబ్దం. విడదీయడంవల్ల పుట్టినది. కొంతదూరంలో ఉన్నవాడు ఈ రెండు విధాలైన శబ్దాలూ వినకలుగుతాడు. దానికి కారణం ఏమనగా గాలికి నీటిలో ఒక అల బయలు దేరి, దానిని బట్టి మరొక అల, దానిని పట్టి మరొక అల, ఈ విధంగా అలలు వరసగా పుట్టినట్లు, సంయోగంవల్ల గాని, వియోగంవల్ల గాని పుట్టిన మొట్టమొదటి శబ్దంనుంచి మరొక శబ్దం, దానినుంచి మరొక శబ్దం ఈ విధంగా శబ్దసంతానం పుడుతుంది. ఈ విధంగా శబ్దాలు పుట్టడాన్ని వీచీసంతానన్యాయంలో పుట్టడం అంటారు. ఈ విధంగా పుడుతూ పుడుతూ అంతటా వ్యాపించే శబ్దాలలో చివరిది చెవిలో ప్రవేశించినప్పుడు "ఆ శబ్దం నాకు వినబడింది"' అని అనుకుంటాం. వైశేషికుల మతం ప్రకారం చెవి రంధ్రంలో ఉన్న ఆకాశమే శ్రోత్రేంద్రియం. చెవి ఆకారం చక్కిలం ఆకారం వలె ఉండడంచేత 'కర్ణశష్కులి' అని వ్యవహరిస్తూంటారు. అందుచేత మనం వినేది భేరీశబ్దమూ కాదు. పాట్యమానవంశశబ్దమూ కాదు. ఆ శబ్దంనుంచి పుట్టిన శబ్దసంతానంలో మన చెవిదాకా వచ్చిన శబ్దం. ఇంకా దాని నుంచి శబ్దాలు పుట్టి ముందుకు సాగవచ్చు. మనకు సంబంధించినంతవరకు మన చెవిలో పడ్డది అంత్యశబ్దం.

అదే విధంగా కంఠతాల్వాదిస్థానాలతో వాయువుకు సంయోగవిభాగాలు ఏర్పడడంవల్ల మొట్టమొదట పుట్టిన శబ్దం స్ఫోట. అదే అర్థబోధకం, ఇది తరవాత పుట్టే శబ్దాలకి కారణం. స్ఫోట అనే మొదటి శబ్దం నుంచి పుట్టిన శబ్దాలే (శబ్దజశబ్దాలే) ధ్వనులు అని వైశేషికాదులు అంటారు అని భర్తృహరి ఈ కారికలో వాళ్లమతం అనువదించాడు.

స్ఫోటరూపమైన ఈ ప్రథమశబ్దం నుంచి పుట్టిన శబ్దాలు (ధ్వనులు) ఘంటానురణనం వంటివి, అనగా దేవాలయాదులలోని ఘంటలు మ్రోగించగానే

పుట్టిన మొదటి శబ్దం నుంచి వరసగా పుట్టుకొని వచ్చిన శబ్దసంతానం వంటివి.

ఏవమితి - ఈ విధంగానే ఘంటాదుల అనురణనం (ప్రతిధ్వని) వంటి వ్యంగ్యార్థమూ, అనురణనం వంటిది కాకపోయినా అనురణనం వంటిదిగా భావించబడే రసాదివ్యంగ్యమూ (అనురణనాత్మోపలక్షితః) కూడ ధ్వని అని వ్యవహరించబడుతుంది. ఈ విధంగా వ్యంగ్యమైన అర్థానికి 'ధ్వని' అనే పేరు ఎట్లు వచ్చిందో ప్రతిపాదించాడు.

తథా ఇది :- అదే విధంగా నాదశబ్దవాచ్యాలు (నాదం అనే పేరు గల), అంత్యబుద్ధి నిర్గ్రాహ్యస్ఫోటాభివ్యంజకాలు అయి, చెవికి వినబడే వర్ణాలు కూడా 'ధ్వని' శబ్దంచేత చెప్పబడుతున్నాయి, వాటికి కూడా 'ధ్వని' అని పేరు. పూజ్యుడైన ఆ భర్తృహరియే "ప్రత్యయైః" ఇత్యాదిశ్లోకంలో ఈ విషయం ప్రతిపాదించాడు.

ప్రత్యయైః ఇతి :- అనుపాఖ్యేయైః = (ప్రత్యేకంగా ఒక్కొక్క ధ్వనివల్ల కలిగిన బుద్ధి స్ఫోటను స్ఫుటంగా ప్రకాశింపచేయకపోవడంచేత) వీటి స్వరూపం ఇది అని చెప్పడానికి శక్యం కానివి, తథా = అట్టినా, గ్రహణానుగుణైః = గ్రహించడానికి అనగా చివరి ధ్వనివల్ల జనించిన వ్యక్తస్ఫోటజ్ఞానానికి అనుకూలంగా ఉన్న, ప్రత్యయైః = పూర్వ పూర్వధ్వనులవలన పుట్టిన బుద్ధులతో కలిసి, ధ్వనిప్రకాశితే=చివరి ధ్వనిచేత ప్రకాశింప చేయబడిన, శబ్దే=శబ్దమునందు, స్వరూపమ్=స్వరూపం, అనగా క్రమరహితమైన స్ఫోటయొక్క స్వరూపం, అవధార్యతే = స్ఫుటంగా నిశ్చయించబడుతుంది.

తేనేతి - అందుచేత ధ్వనిని ప్రకాశింపచేసే శబ్దార్థాలు కూడ ధ్వనిశబ్దం చేత ఇక్కడ ( ఈ శాస్త్రంలో) చెప్పబడ్డాయి.

వివరణ - వైయాకరణులు అంగీకరించిన స్ఫోటసిద్ధాంత సంక్షిప్తస్వరూపం ఇది - "గౌః" అన్న పదం విన్న వెంటనే ఒక పదం యొక్క జ్ఞానం కలుగుతున్నది. "గౌః ఆశ్రమం ప్రవిశతి" అని విన్న వెంటనే ఒక వాక్యంయొక్క జ్ఞానం కలుగుతున్నది. "గౌః" అనే దానిలో మూడు ధ్వనులు, గ్+ఔ+ః' ఉన్నాయి. "గౌః ఆశ్రమం ప్రవిశతి" అనే దానిలో కూడా'గ్' మొదట 'ఇ' వరకు అనేకధ్వనులు ఉన్నాయి. ఈ ధ్వనులు ఒక్కొక్కటి వింటున్నప్పుడు ఒక్కొక్క ధ్వని ఉన్నట్లు అవి వేరు వేరుగా తెలుస్తున్నట్లు కనబడినా మొదటి ధ్వనితో ప్రారంభించి చివరి ధ్వని దగ్గరికి వచ్చే సరికి బుద్ధిలో ధ్వనులు ఏవీ గోచరించవు. వాక్యం ఒకటే బుద్ధిలో భాసిస్తుంది. ఇదంతా అతి శీఘ్రంగా జరిగిపోతుంది. కొంచెం జాగర్తగా పరిశీలించి చూచుకుంటే ఆఖరి ధ్వని పూర్తి అయ్యే సరికి ఆ క్షణంలో అఖండమైన వాక్యంయొక్క జ్ఞానం మాత్రమే మిగులుతుంది. ధ్వనుల జ్ఞానం ఏమీ ఉండదు. అదే విధంగా ఆ అఖండవాక్యంవల్ల తెలిసే అర్థం

పరిమాణం, ఎంత ఉందో అంతమాత్రమే వినబడుతూండగా వాటిని ఉచ్చరించడం కోసం చేయవలసిన ప్రసిద్ధమైన వ్యాపారమే కాకుండా ద్రుతవిలంబితాదివృత్తి భేదరూపమైన మరొక వ్యాపారం వక్తలో ఏదైతే ఉన్నదో అది కూడా ధ్వని అని చెప్పబడింది. ఈ విషయాన్ని భర్తృహరియే చెప్పి ఉన్నాడు.

శబ్దస్యేతి - శబ్దస్య - స్ఫోటరూపమైన శబ్దంయొక్క, అభివ్యక్తేః = ప్రాకృతధ్వనులవలన కలిగిన అభివ్యక్తికంటె, ఊర్ధ్వమ్ = పైన, తరవాత పుడుతూన్న, వైకృతాః = వైకృతధ్వనులు, వృత్తిభేదే = ద్రుతాదివృత్తిభేదం విషయంలో, సముపోహన్తే = కారణం అవుతున్నాయి. తైః = ఆ వైకృతధ్వనుల చేత, స్ఫోటాత్మా=స్ఫోటరూపశబ్దం, న భిద్యతే = భేదం పొందదు.

వివరణ - వైయాకరణులు ప్రాకృతధ్వని, వైకృతధ్వని అని రెండు విధాలైన ధ్వనిని అంగీకరిస్తారు. స్ఫోటను వ్యంజింపచేసేది ప్రాకృతధ్వని; దాని తరవాత వృత్తిభేదాన్ని, ద్రుతాదివృత్తులను కలిగించేది వైకృతధ్వని.

శ్లో. స్ఫోటస్య గ్రహణే హేతుః ప్రాకృతో ధ్వనిరిష్యతే,
వృత్తిభేదే నిమిత్తత్వం వైకృతః ప్రతిపద్యతే". (ఇది సంగ్రహకారుని శ్లోకం).

"స్ఫోటను గ్రహించడానికి హేతువైనది ప్రాకృతధ్వని; వృత్తిభేదానికి నిమిత్త మైనది వైకృతధ్వని" అని దీని భావం.

మంత్ర - శ్లోక- వాక్యాదుల్ని ఉచ్చరించేటప్పుడు ద్రుతం, మధ్యమం, విలంబితం అని మూడు వృత్తులుంటాయి. మామూలుగా ఏ అక్షరానికి ఎంత మాత్ర (కాలం) ఉంటుందో అంతమాత్రను ఇస్తూ ఒక విధమైన వేగంలో చదివితే అది 'ద్రుతవృత్తి'. కొంచెం ఆలస్యంగా, వేగం తగ్గించి, చదివితే అది "విలంబిత వృత్తి" ద్రుతమూ కాక విలంబితమూ కాక మధ్యలో ఉన్నది 'మధ్యవృత్తి'.

"అభ్యాసార్థం ద్రుతా వృత్తిర్మధ్యా వై చిన్తనే స్మృతా,
శిష్యాణాముపదేశార్థం వృత్తిరిష్టా విలమ్బితా".

అని ప్రాతిశాఖ్యాదిప్రసిద్ధ శ్లోకం. దీనిలో పాఠభేదాలున్నాయి.

" అభ్యాసార్థే ద్రుతాం వృత్తిం ప్రయోగార్థే తు మధ్యమామ్,
శిష్యాణాముపదేశార్థే కుర్యాద్వృత్తిం విలమ్బితామ్" (ఋగ్వేదప్రాతిశాఖ్య - 13.48)

"కంఠస్థం చేయడం కోసం చదివేటప్పుడు ద్రుతవృత్తిని ఉపయోగించాలి. అర్థచింతన చేసేటప్పుడు (లేదా యాగాదులలో మంత్రాలను వినియోగించేటప్పుడు) మధ్యమవృత్తిని ఉపయోగించాలి. శిష్యులకి ఉపదేశించేటప్పుడు విలంబితవృత్తిని ఉపయోగించాలి" అని అర్థం.

తేషు తావత్స్వేవ శ్రూయమాణేషు వక్తుర్యః అన్యః ద్రుతవిలమ్బితాదివృత్తి భేదాత్మా ప్రసిద్ధాదుచ్చారణవ్యాపారాత్ అభ్యధికః సః నిరుక్తః, యదాహ స ఏవ -

శ్లో. శబ్దస్యోర్ధ్వమభివ్యక్తేర్వృత్తిభేదే తు వైకృతాః,
ధ్వనయః సముపోహన్తే స్ఫోటాత్మా తైర్న భిద్యతే.

(వాక్యప. బ్రహ్మకాండ 77)

అస్మాభిరపి ప్రసిద్ధేభ్యః శబ్దవ్యాపారేభ్యః అభిధా- తాత్పర్య - లక్షణారూపేభ్యః అతిరిక్తో వ్యాపారః ధ్వనిరిత్యుక్తః. ఏవం చతుష్కమపి ధ్వనిః. తద్యోగాచ్చ సమస్తమపి కావ్యం ధ్వనిః. తేన వ్యతిరేకావ్యతిరేకవ్యపదే శోఽపి న యుక్తః.

బాలానందిని

కించేతి - వర్ణాల పరిమాణంలో మార్పు ఏమీ ఉండదు. అనగా వర్ణంలో భాగాలు (అవయవాలు ) అనేవి ఉండవు. (మన చెవికి వర్ణం ఎంత పరిమాణంతో ఉన్నట్లు వినబడుతుందో అంతే దాని పరిమాణం). ఈ విషయమే ఈ క్రింది శ్లోకంలో చెప్పబడింది.

అల్పీయసాపీతి. అల్పీయసా = అత్యల్పమైన, యత్నేన = యత్నంచేత, ఉచ్చారితమ్ అపి = ఉచ్చరించబడినదైనప్పటికీ, శబ్దమ్ = శబ్దాన్ని, మతిః = బుద్ధి, స్ఫుటమ్ = స్పష్టంగా, యది వా నైవ గృహ్ణాతి = గ్రహించనైనా గ్రహించదు. సకలమ్ = సమస్తమైన, వర్ణమ్ = వర్ణాన్ని, గృహ్ణాతి వా = గ్రహించనైనా గ్రహిస్తుంది.

వివరణ - ఒక వర్ణాన్ని ఎంత అల్పమైన ప్రయత్నంతో ఉచ్చరించినా దానిని బుద్ధి గ్రహిస్తే పూర్తిగానైనా గ్రహిస్తుంది; లేదా అనలే గ్రహించదు. ఎందుచేతననగా వర్ణాలకి అవయవాలు లేవు. అవయవాలు ఉన్న పక్షంలో ఒక భాగాన్ని గ్రహించడం, మరొకభాగాన్ని గ్రహించకపోవడం, పూర్తిగా గ్రహించడమూ ఇత్యాదులుంటాయి. అవయవాలు లేనిదానిని గ్రహిస్తే పూర్తిగా గ్రహించడమే, లేకపోతే అసలు గ్రహించకపోవడమే అని భావం.

తేషు ఇతి :- "వర్ణేషు తావన్మాత్రపరిమాణేషు సత్సు, తేషు తావత్స్వేవ శ్రూయమాణేషు " అని మధ్యనున్న శ్లోకం కలుపుకొని అన్వయించుకొనాలి. వర్ణాల

పరిమాణం, ఎంత ఉందో అంతమాత్రమే వినబడుతూండగా వాటిని ఉచ్చరించడం కోసం చేయవలసిన ప్రసిద్ధమైన వ్యాపారమే కాకుండా ద్రుతవిలంబితాదివృత్తి భేదరూపమైన మరొక వ్యాపారం వక్తలో ఏదైతే ఉన్నదో అది కూడా ధ్వని అని చెప్పబడింది. ఈ విషయాన్ని భర్తృహరియే చెప్పి ఉన్నాడు.

శబ్దస్యేతి - శబ్దస్య - స్ఫోటరూపమైన శబ్దంయొక్క, అభివ్యక్తేః = ప్రాకృతధ్వనులవలన కలిగిన అభివ్యక్తికంటె, ఊర్ధ్వమ్ = పైన, తరవాత పుడుతూన్న, వైకృతాః = వైకృతధ్వనులు, వృత్తిభేదే = ద్రుతాదివృత్తిభేదం విషయంలో, సముపోహన్తే = కారణం అవుతున్నాయి. తైః = ఆ వైకృతధ్వనుల చేత, స్ఫోటాత్మా=స్ఫోటరూపశబ్దం, న భిద్యతే = భేదం పొందదు.

వివరణ - వైయాకరణులు ప్రాకృతధ్వని, వైకృతధ్వని అని రెండు విధాలైన ధ్వనిని అంగీకరిస్తారు. స్ఫోటను వ్యంజింపచేసేది ప్రాకృతధ్వని; దాని తరవాత వృత్తిభేదాన్ని, ద్రుతాదివృత్తులను కలిగించేది వైకృతధ్వని.

శ్లో. స్ఫోటస్య గ్రహణే హేతుః ప్రాకృతో ధ్వనిరిష్యతే,
వృత్తిభేదే నిమిత్తత్వం వైకృతః ప్రతిపద్యతే". (ఇది సంగ్రహకారుని శ్లోకం).

"స్ఫోటను గ్రహించడానికి హేతువైనది ప్రాకృతధ్వని; వృత్తిభేదానికి నిమిత్త మైనది వైకృతధ్వని" అని దీని భావం.

మంత్ర - శ్లోక- వాక్యాదుల్ని ఉచ్చరించేటప్పుడు ద్రుతం, మధ్యమం, విలంబితం అని మూడు వృత్తులుంటాయి. మామూలుగా ఏ అక్షరానికి ఎంత మాత్ర (కాలం) ఉంటుందో అంతమాత్రను ఇస్తూ ఒక విధమైన వేగంలో చదివితే అది 'ద్రుతవృత్తి'. కొంచెం ఆలస్యంగా, వేగం తగ్గించి, చదివితే అది "విలంబిత వృత్తి" ద్రుతమూ కాక విలంబితమూ కాక మధ్యలో ఉన్నది 'మధ్యవృత్తి'.

"అభ్యాసార్థం ద్రుతా వృత్తిర్మధ్యా వై చిన్తనే స్మృతా,
శిష్యాణాముపదేశార్థం వృత్తిరిష్టా విలమ్బితా".

అని ప్రాతిశాఖ్యాదిప్రసిద్ధ శ్లోకం. దీనిలో పాఠభేదాలున్నాయి.

" అభ్యాసార్థే ద్రుతాం వృత్తిం ప్రయోగార్థే తు మధ్యమామ్,
శిష్యాణాముపదేశార్థే కుర్యాద్వృత్తిం విలమ్బితామ్" (ఋగ్వేదప్రాతిశాఖ్య - 13.48)

"కంఠస్థం చేయడం కోసం చదివేటప్పుడు ద్రుతవృత్తిని ఉపయోగించాలి. అర్థచింతన చేసేటప్పుడు (లేదా యాగాదులలో మంత్రాలను వినియోగించేటప్పుడు) మధ్యమవృత్తిని ఉపయోగించాలి. శిష్యులకి ఉపదేశించేటప్పుడు విలంబితవృత్తిని ఉపయోగించాలి" అని అర్థం.

వైకృతధ్వనులవల్ల కలిగే ఈ ద్రుతాదులవల్ల ప్రాకృతధ్వనివ్యంజితమైన స్ఫోటలో ఏమీ భేదం రాదు; అది కుదించబడుతుంది లేదా పొడిగించబడుతుంది; అంతమాత్రమే అని "శబ్దస్య" ఇత్యాదికారిక భావం.

అస్మాభిః ఇతి :- మేం కూడా ప్రసిద్ధమైన అభిధా - అక్షణా-తాత్పర్య రూపాలైన శబ్దవ్యాపారాలకంటె అతిరిక్తంగా (అధికంగా) ఒక వ్యాపారాన్ని (వ్యంజనావ్యాపారాన్ని) అంగీకరించాం. దానిని కూడా (వైయాకరణులు వైకృతధ్వనిని ధ్వని అన్నట్లు) 'ధ్వని' అంటున్నాం, ఈ విధంగా వ్యంగ్యార్థం, శబ్దం, దాని అర్థం, వ్యంజనా వ్యాపారం అనే చతుష్కం ధ్వనియే. ఈ నాలుగింటికీ ధ్వని అని పేరు. ఇది ఉండడం వల్ల సమస్తమైన అనగా వ్యంగ్య - వాచ్య - వాచక- వ్యాపారరూపమైన, కావ్యం కూడా ధ్వనియే. ఈ విధంగా 'ధ్వని' అనేది ఐదింటికి పేరు అని చెప్పినట్లయింది. తేనేతి అందుచేత వ్యతిరేకాన్ని అవ్యతిరేకాన్ని నిర్దేశించడం అయుక్తం కాదు. అనగా ఒక దృష్టితో చూస్తే కావ్యంలో ధ్వని ఉంది కాబట్టి కావ్యస్యాత్మా ధ్వనిః (కావ్యానికి ధ్వని ఆత్మ) ఇత్యాదులలో కావ్యం వేరు దానిలో ఉండే ధ్వని వేరు అన్నట్లు, "కావ్యవిశేషః స ధ్వనిః' ( ఆ కావ్యవిశేషం ధ్వని అని చెప్పబడింది) ఇత్యాదుల్లో కావ్యమే ధ్వని అన్నట్లూ వ్యవహరించడంలో దోషం లేదు అని భావం.

లోచనం

వాచ్యవాచక సంమిశ్ర ఇతి మధ్యమపదలోపీ సమాసః. "గామశ్వం పురుషం పశుమ్" ఇతివత్ సముచ్చయోఽత్ర చకారేణ వినాపి. తేన వాచ్యోఽపి ధ్వనిః; వాచకోఽపి శబ్దో ధ్వనిః, ద్వయోరపి వ్యఞ్జకత్వమ్, ధ్వనతీతి కృత్వా. "సంమిశ్ర్యతే విభావానుభావసంవలనయా" ఇది వ్యఙ్గ్యోఽపి ధ్వనిః, ధ్వన్యత ఇతి కృత్వా. శబ్దనం శబ్దః, శబ్దవ్యాపారః. న చాసౌ అభిధారూపః, అపి తు ఆత్మభూతః, సోఽపి ధ్వననం ధ్వనిః. కావ్యమితి వ్యపదేశ్యశ్చ యోఽర్థః సోఽపి ధ్వనిః, ఉక్తప్రకారధ్వనిచతుష్టయమయ త్వాత్. అత ఏవ సాధారణహేతుమాహ - వ్యఞ్జకత్వసామ్యాదితి. వ్యఙ్గ్యవ్యఞ్జకభావః సర్వేషు సామాన్యరూపః సాధారణ ఇత్యర్థః.

బాలానందిని

వ్యంగ్యాదులు ఐదింటికీ కూడా ధ్వని అని పేరు అని ఇంతవరకు ప్రతిపాదించిన

దానికి అనుగుణంగా "వాచ్యవాచకసంమిశ్రః శబ్దాత్మా" అనే పదాల అర్థం వివరిస్తున్నాడు- వాచ్య వాచకేతి : అభినవగుప్తుడు మామూలుగా చేసే క్లిష్టార్థకల్పనలలో ఇదొకటి. వాచ్యవాచకసంమిశ్ర అనే పదానికి "వాచ్యవాచకసహితః సంమిశ్రః" అని మధ్యమపదలోపి సమాసం (శాకప్రియః పార్థివః శాకపార్థివః ఇత్యాదులలో వలె). అప్పుడు దానికి. వాచ్యం, వాచకం, సంమిశ్రం అని అర్థం." గామ్, అశ్వమ్, పురుషమ్, పశుమ్" ఇత్యాదులందు వలె 'చ' ప్రయోగించకపోయినా సముచ్చయార్థం (అది ఇదీ కూడ అని చెపితే అది సముచ్చయం) చెప్పవచ్చును. తేనేతి. అందుచేత వాచ్యమైన అర్థమూ ధ్వనియే, వాచకమైన శబ్దమూ ధ్వనియే. ఎందుచేత ననతా 'ధ్వనతీతి ధ్వనిః' అనే విగ్రహంచేత రెండూ కూడ వ్యంజింపచేస్తాయి కాబట్టి వాటికి 'ధ్వని' అనిపేరు. సంమిశ్రః' అనేదానికి "సంమిశ్ర్యతే, విభావానుభావసంకలనయా" అనే వ్యుత్పత్తి చేత విభావానుభావాదులను చేర్చి కలపబడుతుంది అని అర్థం. అనగా వ్యంగ్యం. ఇది కూడా "ధ్వన్యతే ఇతి ధ్వనిః " అనే వ్యుత్పత్తిచేత ధ్వనియే. 'శబ్దాత్మా' అనే దానిలోని 'శబ్ద' శబ్దానికి శబ్దనం, అనగా శబ్దంయొక్క వ్యాపారం అని అర్థం. ఇది అభిధాదిరూపమైన వ్యాపారం కాదు; మరేమనగా ఆత్మయైన వ్యాపారం. అది కూడా ధ్వనియే. ఈ అర్థంలో "ధ్వననం ధ్వనిః" అని వ్యుత్పత్తి. ఈ విధంగా వ్యంజనావ్యాపారం ధ్వని అయింది. కావ్యమితి - కావ్యం అని చెప్పదగిన ఏ అర్థం ఉందో అది కూడా ధ్వనే, అది పైన చెప్పిన నాలుగు ప్రకారాలతో కూడినది కదా? అందుచేతనే ఈ ఐదు విధాల ధ్వనులకు సమంగా వర్తించే సాధారణహేతువును "వ్యఞ్జకత్వసామ్యాత్" అనే పదంతో చెపుతున్నాడు. ఈ అన్ని పక్షాలలోను కూడ వ్యంగ్యవ్యంజకభావం సామాన్యరూపంగా, అనగా సాధారణంగా (అన్నింటికీ వర్తించేదిగా) ఉంది.

వివరణ:- నిజానికి ఆనందవర్ధనుడు ఈ వాక్యంలో చెప్పదలచినది - "వైయాకరణులు ఏ విధంగా ధ్వని అని వ్యవహరిస్తున్నారో అదే విధంగా వారి మతాన్ని అనుసరిస్తూ కావ్యతత్త్వార్థవేత్తలైన పండితులచేతకూడ వైయాకరణులు చెప్పిన ధ్వని ఏ విధంగా స్ఫోటవ్యంజకమో అదేవిధంగా కావ్యం కూడా వ్యంగ్యార్థవ్యంజకం అవడంచేత (వ్యఞ్జకత్వసామ్యాత్) కావ్యం అని చెప్పదగిన, వాచ్యవాచకమిశ్రమైన శబ్దరూపం 'ధ్వని' అని చెప్పబడింది" అని మాత్రమే. అభినవగుప్తుడు దీరికి ఇంత అర్థం లాగాడు. "యత్రార్థః" ఇత్యాదికారికలో కూడ ధ్వనిశబ్దాన్ని ధ్వనికారుడు కావ్యపరంగానే వాడాడు. చాలా చోట్ల అదే పద్ధతి కనబడుతుంది.

లోచనం

యత్పునరేతదుక్తమ్ - "వాగ్వికల్పానామానన్త్యాత్" ఇత్యాది తత్పరిహరతి - న చైవంవిధస్యేతి. వక్ష్యమాణః ప్రభేదో యథా- ముఖ్యే ద్వే రూపే. తద్భేదా యథా - అర్థాన్తరసంక్రమితవాచ్యః, అత్యన్తతిరస్కృత వాచ్యః ఇతి అవివక్షితవాచ్యస్య, అసంలక్ష్యక్రమవ్యఙ్గ్యః, సంలక్ష్య క్రమవ్యఙ్గ్యః ఇతి వివక్షితాన్యపరవాచ్యస్యేతి. తత్రాప్యవాన్తర భేదాః. మహావిషయస్యేతి- అశేషలక్ష్యవ్యాపిన ఇత్యర్థః. విశేష గ్రహణేన అవ్యాపకత్వమాహ. మాత్రశబ్దేన అఙ్గిభావమ్. తత్ర ధ్వనిస్వరూపే భావితం ప్రణిహితం చేతో యేషాం, తేన వా చమత్కారరూపేణ భావితమ్ అధివాసితమ్, అత ఏవ ముకులితలోచనత్వాదివికారకారణం చేతో యేషామితి. అభావవాదినః ఇతి. అవాన్తరప్రకారత్రయభిన్నా అపీత్యర్థః.

బాలానందిని

యదితి - "వాగ్వికల్పానామానన్త్యాత్" ఇత్యాది పూర్వపక్షి వాదానికి న చైవంవిధస్యేత్యాదికంచేత సమాధానం చెపుతున్నాడు. చెప్పబడనున్న ప్రభేదం ఎట్లనగా- దాని ముఖ్యరూపాలు రెండు. వాటి భేదా లెట్లనగా - 'అర్థాంతరసం క్రమితవాచ్యం,' 'అత్యంతతిరస్కృత వాచ్యం' అనేవి అవివక్షితవాచ్య భేదాలు. 'అసంలక్ష్యక్రమవ్యంగ్యం' 'సంలక్ష్యక్రమవ్యంగ్యం' అని వివక్షితాన్యపరవాచ్యధ్వనిభేదాలు. వాటిలో కూడ అవాంతరభేదాలు చాలా ఉన్నాయి.

వివరణ:- "ముఖ్యే ద్వే రూపే" అనగా అవివక్షితవాచ్యం, వివక్షితాన్య పరవాచ్యం అని అర్థం. మహావిషయస్యేతి: సమస్తలక్ష్యాలలోను వ్యాపించి ఉన్నది అని అర్థం. అలంకార విశేష, అని 'విశేష' పదం గ్రహించడంచేత అది వ్యాపకం కాదు అని చెపుతున్నాడు. అనగా "ఏదో అప్రసిద్ధాలంకారవిశేషం కల్పించి దానికి 'ధ్వని' అని పేరుపెడుతున్నారు" అనే వాదం సరియైనది కాదు. అలంకారవిశేషమాత్రం అయితే దానికి సర్వవ్యాపకత్వం ఉండదు. మేం చెప్పే ధ్వని సర్వవ్యాపకం అని భావం.

మాత్రేతి :- 'మాత్ర" శబ్దం ప్రయోగించడంచేత అలాంటి అలంకారవిశేషం అంగి కాజాలదు అని చెపుతున్నాడు. తత్రేతి:- తత్ర = ఆ ధ్వనిస్వరూపంలో, భావితమ్ = ఏకాగ్రంగా ఉండేటట్లు చేయబడిన, చిత్తం కలవారు, లేదా, తేన= చమత్కారరూపమైన

దానిచేత, భావితమ్ = అధివాసితమైన, సుగంధం కలదిగా చేయబడిన, సంస్కరించబడిన, అందుచేతనే ఆనందపారవశ్యంలో కళ్ళు మూతలు పడడం వంటి వికారానికి కారణమైన చిత్తం గలవారు అని "తద్భావితచేతసామ్" అనుదానికి అర్థం. అభావవాదినః ఇతి. అభావానికి సంబంధించిన మూడు అవాంతరభేదాలు ప్రతిపాదించేవాళ్లతో సహా అందరు అభావవాదులు అని అర్థం.

## ధ్వన్యాలోకం

అస్తి ధ్వనిః. స చ అసౌ అవివక్షితవాచ్యః, వివక్షితాన్యపరవాచ్యశ్చ ఇతి ద్వివిధః సామాన్యేన. తత్రాద్యస్యోదాహరణమ్.

శ్లో సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః,
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్. (10)

ద్వితీయస్యాపి :

శ్లో . శిఖరిణి క్వ ను నామ కియచ్చిరం కిమభిధానమసావకరోత్తపః,
తరుణి యేన తవాధరపాటలం దశతి బిమ్బఫలం శుకశావకః. (11)

### బాలానందిని

అస్తీతి : ధ్వని ఉంది, లేదనడానికి వీలులేదని అర్థం. సామాన్యంగా (స్థూలంగా) ఇది అవివక్షితవాచ్యధ్వని, వివక్షితాన్యపరవాచ్యధ్వని అని రెండు విధాలు. వాటిలో మొదటిదానికి ఉదాహరణం-

సువర్ణేతి : శూరశ్చ = శూరుడు, కృతవిద్యశ్చ = విద్యలు చక్కగా నేర్చినవాడు, యః చ= ఎవడు, సేవితుమ్=సేవించడానికి, జానాతి = బాగా తెలుసుకొనుచున్నాడో వాడు, అనగా ప్రభువుకు అనుగుణంగా ప్రవర్తిస్తూ ఎట్లు సేవించాలో తెలిసినవాడూ, త్రయః పురుషాః = ముగ్గురు పురుషులు, సువర్ణ పుష్పామ్ = బంగారాన్ని పుష్పించే, పృథివీమ్ = భూమిని, (భూమి మీద) చిన్వన్తి = పుష్పాలు కోసుకొంటున్నారు, ప్రోగుచేసుకొంటున్నారు.

ద్వితీయస్యేతి - రెండవదానికి కూడా ఉదాహరణం ఎట్లనగా - శిఖరిణీతి - తరుణి = ఓ! తరుణీ! అసౌ శుకశావకః= ఈ చిన్నారి చిలక, క్వ ను నామ= ఏ, శిఖరిణి= పర్వతంమీద, కియత్ చిరమ్= ఎంత కాలం, కిమభిదానమ్= ఏమి పేరు గల, తపః=

తపస్సును, అకరోత్= చేసెనో! యేన= దేనిచేత, తవ= నీయొక్క, అధరపాటలమ్= అధరోష్ఠం వలె పాటలవర్ణమైన, బిమ్బఫలమ్= దొండపండును, దశతి= కొరుకుతూన్నదో.

లోచనం

తేషాం ప్రత్యుక్తౌ ఫలమాహ - అస్తీతి. ఉదాహరణపృష్ఠే భాక్తత్వం సుశఙ్కం సుపరిహరం చ భవతీత్యభిప్రాయేణ ఉదాహరణదానావకాశార్థం, భాక్తత్వాలక్షణీయత్వే ప్రథమం పరిహరణయోగ్యేఽపి అప్రతిసమాధాయ, భవిష్యదుద్ద్యోతానువాదానుసారేణ వృత్తికృదేవ ప్రభేదనిరూపణం కరోతి - స చేతి. పఞ్చధాపి ధ్వనిశబ్దార్థే యేన, యత్ర, యతః, యస్య, యస్మై ఇతి బహువ్రీహ్యర్థాశ్రయేణ యథోచితం సామానాధికరణ్యం సుయోజ్యమ్. వాచ్యే అర్థే తు ధ్వనౌ వాచ్యశబ్దేన స్వాత్మా, తేన అవివక్షితః అప్రధానీకృతః స్వాత్మా యేన ఇత్యవివక్షితవాచ్యో వ్యఞ్జకః అర్థః. ఏవం వివక్షితాన్యపరవాచ్యేఽపి. యది వా కర్మధారయేణ అర్థపక్షే అవివక్షితశ్చాసౌ వాచ్యశ్చేతి. వివక్షితాన్యపరశ్చాసౌ వాచ్యశ్చేతి - తత్రార్థః కదాచిదనుపపద్యమానత్వాదినా నిమిత్తేన అవివక్షితః భవతి. కదాచిదుపపద్యమానః ఇతి కృత్వా వివక్షిత ఏవ, వ్యఙ్గ్యపర్యన్తాం తు ప్రతీతిం స్వసౌభాగ్యమహిమ్నా కరోతి. అత ఏవ అర్థః అత్ర ప్రాధాన్యేన వ్యఞ్జకః, పూర్వత్ర శబ్దః. నను వివక్షా చ అన్యపరత్వం చేతి విరుద్ధమ్? అన్యపరత్వేనైవ వివక్షణాత్ కో విరోధః?

బాలానందిని

తేషామితి - అభావవాదాలను నిరాకరించినందువల్ల లభించిన ఫలాన్ని అస్తి ధ్వనిః అనే మాటలలో చెపుతున్నాడు. ఉదాహరణేతి అభావవాదాలను నిరాకరించిన తరువాత ముందుగా భాక్తత్వ - అలక్షణీయత్వవాదాలను పరిహరించాలి. అయినా వాటికి సమాధానం చెప్పకుండా ముందు ఉదాహరణలు చూపించి, తరవాత భాక్తత్వవాదాన్ని ఆశంకించడంలోను, పరిహరించడంలోనూ కూడా సౌలభ్యం ఉంటుంది అనే అభిప్రాయంతో ఉదాహరణలు ఇవ్వడానికి అవకాశం ఏర్పరచుకోవడంకోసం స చేత్యాది గ్రంథం ప్రారంభిస్తున్నాడు. అదేవిధంగా ద్వితీయోద్ద్యోతంలో అవివక్షితవాచ్యస్య ఇత్యాదులలో ఈ అవివక్షితవాచ్య - వివక్షితాన్య పరవాచ్యాలను అనువదించనున్నాడు. ముందుగా వాటిని గూర్చి కారికలలో ఎక్కడా చెప్పకుండా వాటిని అనువదించడం

(ముందు చెప్పినదానిని మళ్ళీ నిర్దేశించడం అనువాదం) అయుక్తం. అందుచేత రాబోయే ఉద్ద్యోతంలో చేయబోయే అనువాదాన్ని అనుసరించి వృత్తికారుడే ముందు ఆ భేదద్వయాన్ని ప్రతిపాదిస్తున్నాడు. అలా ముందు ప్రతిపాదించడంవల్ల వాటిని అక్కడ అనువదించడం యుక్తమే అవుతుంది అని అర్థం. ఈ కారణం చేత కూడా స చేత్యాది గ్రంథం ప్రారంభిస్తున్నాడు.

పఞ్చధాపీతి: యేన, యత్ర, యతః, యస్య, యస్మై అని బహువ్రీహి సమాసం ఆశ్రయించడంచేత, ఐదు విధాలైన 'ధ్వని'శబ్దార్థంలో తగువిధంగా సామావాధికరణ్యం చక్కగా కుదుర్చుకొనవచ్చును.

వివరణ:- "అవివక్షితవాచ్యః ధ్వనిః" అని ఈ రెండు పదాలకీ సామానాధికరణ్యం చెప్పబడింది. విశేషణవిశేష్యభావాదులున్న రెండింటిని ఒకే విభక్తిలో ప్రయోగించడం సామానాధికరణ్యం. 'యేన' ఇత్యాద్యర్థాలు గ్రహించి బహువ్రీహిసమాసం ద్వారా ఈ సామానాధికరణ్యాన్ని సమర్థించవచ్చు అని అర్థం. " అవివక్షితః వాచ్యః యేన" (ఏ శబ్దంచేత వాచ్యార్థం వివక్షితం కాదో అది) అనే విగ్రహంచేత లేదా అవివక్షితం వాచ్యం యస్మిన్ సః" (దేనియందు వాచ్యం వివక్షితం కాదో అది) అనే విగ్రహం చేత లేదా "అవివక్షితం వాచ్యం యస్మాత్" (దేనివలన వాచ్యం వివక్షితం కాదోఅది) అనే విగ్రహం చేత, లేదా(అవివక్షితం వాచ్యం యస్మై" (దేనికొరకు అనగా దేని అర్థంగా వాచ్యం వివక్షితం కాదో అది) అనే విగ్రహంచేత, లేదా "అవివక్షితం వాచ్యం యస్య" (దేనికి సంబంధించినదిగా వాచ్యం వివక్షితం కాదో) అది అనే విగ్రహంచేత శబ్దం అవివక్షిత వాచ్యం అవుతుంది. ఈ విధంగా "ధ్వని అనగా శబ్దం" అనే పక్షంలో అర్థసమన్వయం చేసుకోవాలి: "ధ్వని అనగా వాచ్యార్థం" అని రెండవ పక్షంలో కూడా "అవివక్షితం వాచ్యం యేన (వాచ్యేన) లేదా యస్మిన్ లేదా యస్మాత్ లేదా యస్య లేదా యస్మై" అని విగ్రహం చెప్పుకోవాలి. "ధ్వని అనగా వ్యంగ్యం"అనే మూడవ పక్షంలో కూడా "అవివక్షితం వాచ్యం యేన (వ్యఙ్గ్యేన) లేదా యస్మిన్ లేదా యస్మాత్ లేదా యస్య లేదా యస్మై" అని విగ్రహం చెప్పుకోవాలి "ధ్వని అనగా వ్యంజనావ్యాపారం" అనే నాల్గవ పక్షంలో కూడా "అవివక్షితం వాచ్యం యేన (వ్యఞ్జనావ్యాపారేణ) లేదా యస్మిన్ లేదా యస్మాత్ లేదా యస్య లేదా యస్మై" అని విగ్రహం చెప్పుకోవాలి. "ధ్వని అనగా కావ్యం" అనే ఐదవ పక్షంలో కూడా "అవివక్షితం వాచ్యం యేన (కావ్యేన) లేదా యస్మిన్ లేదా యస్మాత్ లేదా యస్య లేదా యస్మై" అని విగ్రహం చెప్పుకోవాలి.

"ధ్వని అనగా వాచ్యం" అనే రెండవ పక్షంలో చెప్పిన "అవివక్షితం వాచ్యం

యేన" ఇత్యాదివిగ్రహాలలో వాచ్యశబ్దానికి స్వాత్మ (తను) అని అర్థం చెప్పుకోవాలని ఒక విశేషం చూపుతున్నాడు- వాచ్యేఽర్థే తు ఇతి. వాచ్యార్థం ధ్వని అనే పక్షంలో మాత్రం వాచ్యశబ్దంచేత స్వాత్మ అని అర్థం చెప్పాలి. అప్పుడు ఏ వాచ్యార్థం చేత వాచ్యార్థం అనగా తన స్వరూపం వివక్షితం కాదో, అనగా ఏ వాచ్యార్థం తనను తాను అప్రధానం చేసుకొంటుందో అది అని అర్థం. ఈ విధంగా వ్యంజకమైన వాచ్యార్థం అవివక్షితవాచ్యం అవుతుంది.

ఏవమితి - వివక్షితాన్యపరవాచ్యం విషయంలో కూడా ఇదే విధంగా చెప్పుకోవాలి. అనగా "వివక్షితః అన్యపరశ్చ వాచ్యః యేన లేదా యస్మిన్ లేదా యస్మాత్ లేదా యస్య లేదా యస్మై" అని శబ్ద - వాచ్యార్థ- వ్యంగ్యార్థ - వ్యంజనావ్యాపార- కావ్య రూపాలైన పంచవిధధ్వనులకు సమన్వయం అయే విధంగా విగ్రహవాక్యాలు చెప్పుకోవాలి అని అర్థం. "ధ్వని అనగా వాచ్యార్థం" అనే ద్వితీయపక్షంలో వెనక చెప్పినట్లుగానే ఇక్కడ కూడా 'వాచ్య' శబ్దానికి 'స్వాత్మ' అని అర్థం చెప్పుకోవాలి.

అయితే ఈ రెండవ పక్షంలో బహువ్రీహికి బదులు కర్మధారయ చెప్పినా బాగానే ఉంటుందని చెపుతున్నాడు - యది వా ఇతి. లేదా అర్థపక్షంలో (వాచ్యార్థం కూడా ధ్వనియే అనే పక్షంలో) "అవివక్షితశ్చాసౌ వాచ్యః" (అవివక్షితమైన వాచ్యం). "వివక్షితాన్యపరశ్చ అసౌ వాచ్యశ్చ" (వివక్షితాన్యపరమైన వాచ్యం) అని కర్మధారయ సమాసం గ్రహించవచ్చును. తత్రేతి. ఈ భేదాలలో కొన్నిచోట్ల అర్థం అనుపపన్నంగా ఉండడం (కుదరకపోవడం) మొదలైన కారణాలచేత అవివక్షితం అవుతుంది. కొన్నిచోట్ల ఉపపన్నం అవడంచేత వివక్షితం అవుతూనే తన సౌభాగ్యమహిమచేత (సౌందర్య విశేషంచేత) వ్యంగ్యం వరకు ప్రతీతిని (జ్ఞానాన్ని) కలగచేస్తుంది. అందుచేతనే ఇక్కడ, అనగా అనుపపత్తి ఏదీ లేనిచోట, ప్రధానంగా వ్యంజకంగా ఉంటుంది. అనుపపత్తి ఉన్నచోట (పూర్వత్ర) మాత్రం ప్రధానంగా శబ్దం వ్యంజకంగా ఉంటుంది.

నను ఇతి - (ఆశంక) వివక్ష, అన్యపరత్వం అనేది విరుద్ధం కదా? (సమాధానం) అన్యపరంగా వివక్షచేయడంలో దోషం ఏముంది?

వివరణ:- ఒక ప్రక్క ఏ అనుపపత్తీ లేకపోవడం చేత వాచ్యార్థం వివక్షితం (చెప్పడానికి ఉద్దేశింపబడింది) అంటున్నావు, మళ్ళీ అది ఇతరపరం (వ్యంగ్యార్థం కోసం ఉద్దేశింపబడింది) అంటున్నావు. ఇవి (వివక్షితత్వ - అన్యపరత్వాలు) పరస్పర విరుద్ధాలు కదా అని ఆశంక. అన్యపరంగా ఉండేటట్లు వివక్షితం అయినది అని దీని భావం చెప్పుకోవాలి. అప్పుడు విరోధం ఏముంది? అని సమాధానం.

లోచనం

సామాన్యేనేతి : వస్త్వలంకారరసాత్మనా హి త్రిభేదోఽపి ధ్వనిః ఉభాభ్యామేవ ఆభ్యాం సంగృహీత ఇతి భావః. నను తన్నామపృష్ఠే ఏతన్నామనివేశనస్య కిం ఫలమ్? ఉచ్యతే- అనేన హి నామద్వయేన ధ్వననాత్మని వ్యాపారే పూర్వప్రసిద్ధాభిధాతాత్పర్యలక్షణాత్మకవ్యాపార త్రితయావగతార్థప్రతీతేః ప్రతిపత్తృగతాయాః, ప్రయోక్త్రభిప్రాయరూపాయాశ్చ వివక్షాయాః సహకారిత్వముక్తమితి ధ్వనిస్వరూపమేవ నామభ్యాం ప్రోజ్జీవితమ్.

బాలానందిని

సామాన్యేనేతి - వస్తు - అలంకార- రసరూపాలలో మూడు భేదాలు గల ధ్వని రెండు భేదాలచేత సంగ్రహించబడినది అని భావం. దాని (ధ్వనియొక్క) పేర్ల తరువాత ఈ పేర్లు (రెండు) చేర్చడంవల్ల ఏమి ప్రయోజనం? అనగా వస్త్వాదిరూపాలలో ధ్వని మూడు విధాలు అని ప్రతిపాదించిన తరవాత ఇక్కడ ఈ రెండు పేర్లు చెప్పడం ఎందుకు అని ఆశంకకు సమాధానం చెప్పబడుతున్నది - ప్రతిపత్తకు (జ్ఞాతకు అనగా శ్రోతకు) పూర్వప్రసిద్ధాలైన అభిధా -తాత్పర్య - లక్షణారూపాలైన మూడు వ్యాపారాల ద్వారా కలిగిన అర్థప్రతీతి (జ్ఞానం), ప్రయోక్తయొక్క (వాక్యం ప్రయోగించేవాని) అభిప్రాయం రూపమైన వివక్ష, ఈ రెండూ కూడా ధ్వననం అనే వ్యాపారంలో సహకారాలుగా ఉపకరిస్తాయి అని ఈ రెండు పేర్లచేత చెప్పబడుతున్నది. అందుచేత ఈ రెండు పేర్లు కూడ ధ్వనిస్వరూపాన్నే ప్రోజ్జీవింపచేస్తున్నాయి. అందుచేత ఈ పేర్లు చెప్పడం కూడ అవసరమే అని అర్థం.

లోచనం

సువర్ణపుష్పామితి- సువర్ణాని పుష్ప్యతీతి సువర్ణపుష్పా. ఏతచ్చ వాక్యమేవ అసంభవత్స్వార్థమ్ ఇతి అవివక్షితవాచ్యమ్. అత ఏవ పదార్థమ్ అభిధయా, అన్వయం చ తాత్పర్యశక్త్యా అవగమయ్యైవ, బాధకవశేన తముపహత్య సాదృశ్యాత్ సులభసమృద్ధిసంభారభాజనతాం లక్షయతి. తల్లక్షణాప్రయోజనం శూరకృతవిద్యసేవకానాం ప్రాశస్త్యమ్ అశబ్దవాచ్యత్వేన గోప్యమానం సత్ నాయికాకుచకలశయుగలమివ మహార్ఘతామ్ ఉపయత్ ధ్వన్యతే ఇతి - శబ్దోఽత్ర ప్రధానతయా వ్యఞ్జకః, అర్థస్తు తత్సహకారితయా

ఇతి చత్వారో వ్యాపారాః.

బాలానందిని

'పదార్థమభిధయా' అనే పాఠం స్థానంలో "పదార్థమభిధాయ" అని ఉంటే బాగుంటుంది. సువర్ణపుష్పామితి :- సువర్ణాని పుష్ప్యతీతి సువర్ణపుష్పా = సువర్ణాలను పుష్పించేది. ఈ వాక్యం బోధించే అర్థమే అసంభవం. (భూమి బంగారం పుష్పించదు కదా?) అందుచేత ఇది అవివక్షితవాచ్యం. దీని వాచ్యార్థం వివక్షితం కాదు అని అర్థం. అందువల్లనే అభిధాశక్తిచేత పదార్థాన్ని (వాచ్యార్థాన్ని) తాత్పర్యశక్తిచేత పదార్థాల పరస్పరాన్వయాన్నీ, తెలిపిన పిమ్మటనే బాధక వశంచేత ( ఆ అర్థం కుదరక పోవడం అనే బాధకం చేత) దాన్ని విడిచిపెట్టి, సాదృశ్యంవల్ల సులభమైన సమృద్ధిసంభారానికి పాత్రత్వాన్ని లక్షణయా బోధిస్తుంది. ఇందుకు నిమిత్తం సాదృశ్యం. అనగా నేలమీద పూసిన బంగారు పూవులు ఏరుకోవడం వంటిదే ఈ శూరాదులు సంపాదించే సమృద్ధి అని ఈ రెండింటికీ ఉన్న సామ్యం. తల్లక్షణేతి - ఈ లక్షణకు ప్రయోజనం అయిన శూర - కృతవిద్య - సేవకుల ప్రాశస్త్యం శబ్దంచేత వాచ్యం కాకపోవడంచేత, నాయికా కుచకలశగ్గుగలం వలె, కప్పబడి ఉండి గొప్ప విలువను పొందింది, అనగా చాలసుందరమైనది. అట్టి ఈ ప్రయోజనం ధ్వనింపబడుతున్నది. ఇక్కడ ప్రధానంగా వ్యంజింపచేస్తూన్నది శబ్దం. అర్థం దానికి సహకారిగా ఉంది. ఈ విధంగా ఇక్కడ నాలుగు వ్యాపారాలు - అభిధ, తాత్పర్యం, లక్షణ, ధ్వననం అనేవి ఉన్నాయి.

వివరణ:- నిగూఢంగా ఉండి వ్యంగ్యార్థం నారీకుచకుంభద్వయం వలె చమత్కారజనకంగా ఉంటుంది అనే విషయంలో సాధారణంగా ఈ క్రింది శ్లోకం ప్రసిద్ధంగా ఉదాహరిస్తూంటారు.

"నాన్ధ్రీపయోధర ఇవాతితరాం ప్రగాఢః(ప్రకాశః)
నో గూర్జరీస్తన ఇవాతితరాం నిగూఢః,
అర్థో గిరామపిహిత ః పిహితశ్చ కశ్చిత్
సౌభాగ్యమేతి మరహట్టవధూకుచాభః."

లోచనం

శిఖరిణీతి. న హి నిర్విఘ్నోత్తమసిద్ధయోఽపి శ్రీపర్వతాదయః ఇమాం సిద్ధిం విదధ్యుః. దివ్యకల్పసహస్రాదిశ్చ అత్ర కాలః. న చైవంవిధోత్తమ ఫలజనకత్వేన పఞ్చాగ్నిప్రభృత్యపి తపః శ్రుతమ్. తవేతి భిన్నం పదమ్.

సమాసేన విగలితతయా న ప్రతీయేత - తవ దశతీత్యభిప్రాయేణ. తేన యదాహుః - "వృత్తానురోధాత్ త్వదధరపాటలమితి న కృతమ్" ఇతి, తదసదేవ. దశత్యాస్వాదయతి, అవిచ్ఛిన్నప్రబన్ధతయా, న త్వౌదరికవత్ పరం భుజ్క్తే, అపి తు రసజ్ఞో ఽత్రేతి తత్ప్రాప్తివదేవ రసజ్ఞతాప్యస్య తపఃప్రభావాదేవేతి. శుకశావక ఇతి తారుణ్యాదుచితకాలలాభో ఽపి తపస ఏవేతి. అనురాగిణశ్చ ప్రచ్ఛన్నస్వాభిప్రాయఖ్యాపనవైదగ్ధ్యపటువిరచనాత్మకవిభావోద్దీపనం వ్యఙ్గ్యమ్.

బాలానందిని

శిఖరిణీతీతి- నిర్విఘ్నమైన ఉత్తమసిద్ధులు గల (ఉత్తమసిద్ధుల్ని నిర్విఘ్నంగా ఇచ్చే) శ్రీపర్వతాదులు కూడా ఇలాంటి సిద్ధిని ఇవ్వకపోవచ్చు. దివ్యకల్పసహస్రాది పరిమితమైన కాలం కూడా ఇవ్వకపోవచ్చు. పంచాగ్నిమధ్యతపస్సు వంటి తపస్సు కూడా ఇలాంటి ఉత్తమఫలాన్ని పుట్టించేదిగా వినబడలేదు. తవేతి - సమాసంలో యుష్మచ్ఛబ్దాన్ని చేర్చి "త్వదధరపాటలం" అని అన్నట్లయితే (అది సమాసంలో అప్రధానం అయిపోవడంచేత) దాని అర్థం విడిగా తెలిసి 'తవ దశతి' అనే అర్థాన్ని సూచించడానికి వీలుపడదు. అందుచేత 'తవ' అని వేరు పదంగా ప్రయోగించాడు. అందుచేత ఇది నీ అధరం వలె ఉన్నది కాబట్టి శుకకాబకం నీ అధరాన్నే కొరుకుతున్నానే భావంతో సంతోషిస్తూ కొరుకుతుంది అనే అర్థం సూచించబడుతుంది అని భావం. అందుచేత 'త్వదధరపాటలమ్' అని చెప్పవలసి ఉన్నా వృత్తం చెడిపోతుంది కాబట్టి 'తవ' అనే పదాన్ని వేరుగా ప్రయోగించాడు అని అన్నవాళ్ల మాట యుక్తం కాదు.

మామూలుగా అయితే యుష్మచ్ఛబ్దానికి 'అధర' శబ్దంతో అన్వయం ఉన్నది కాబట్టి దానితో సమాసం చెయ్యాలి. అలా చేయకుండా 'తవ' అనేదాన్ని వేరుగా ప్రయోగించి దానితో అన్వయించే 'అధర' శబ్దానికి 'పాటల' శబ్దంతో సమాసం చేయడం అయుక్తం. ఇది అసమర్థసమాసం అవుతుంది అని దోషంగా పరిగణించాలి. వ్యాఖ్యాత తలుచుకుంటే దోషాన్నికూడా గుణంగా ఎలా నిరూపించడంకోసం ప్రయత్నిస్తాడో ఇదొక ఉదాహరణ.

దశతీతి - 'దశతి' అనగా ప్రబంధం, అనగా ఆస్వాదిస్తూనే ఉండడం అనే కార్యసంతానం, అవిచ్ఛిన్నంగా ఉండేటట్లు ఆస్వాదిస్తూన్నది. అంతేనే కాని తిండిబోతు వలె మొత్తం అంతా నమిలివేయడం లేదు. మరే మనగా ఈ విషయంలో రసజ్ఞత్వంతో ప్రవర్తిస్తూన్నది. అందుచేత దీనికి ఈ బింబఫలం ఏ విధంగా తపఃప్రభావంచేత

లభించిందో ఇలాంటి రసజ్ఞత కూడా తపఃప్రభావంచేతనే లభించిం దని భావం. 'శుక శావకః' అనడంచేత ఇది యౌవనంలో ఉండడంవల్ల తగిన కాలం లభించడం కూడా తపఃప్రభావంవల్లనే అని సూచన. అనురాగిణశ్చేతి - అనురాగవంతుడు గూఢంగా ఉన్న తన అభిప్రాయాన్ని తెలపడం కోసం చాతుర్యంతో చాటువాక్యాలు పలకడం రూపంలో (ద్వారా) విభావాన్ని ఉద్దీపింపచేయడం వ్యంగ్యం.

వివరణ:- అనురాగవంతుడైన ఒక యువకుడు తన మనస్సులోని అభిప్రాయాన్ని (యువతీబింబోష్ఠచుంబనేచ్ఛను) వ్యక్తం చేయడం కోసం చాతుర్యంతో మంచి మాటలు పలుకుతూ తన రతికి ఆలంబనవిభావమైన యువతిని ఉద్దీపింపచేస్తున్నాడు (ఆమెలో ప్రేమోద్రేకాన్ని కలిగిస్తున్నాడు) అనే విషయం వ్యంగ్యం.

లోచనం

అత్రచ త్రయ ఏవ వ్యాపారాః అభిధా, తాత్పర్యం, ధ్వననం చేతి. ముఖ్యార్థబాధాద్యభావే మధ్యమకక్ష్యాయాం లక్షణాయాః తృతీయస్యాః అభావాత్. యది వా ఆకస్మికవిశిష్టప్రశ్నార్థానుపపత్తేః ముఖ్యార్థబాధాయాం సాదృశ్యాత్ లక్షణా భవతు మధ్యే; తస్యాస్తు ప్రయోజనం ధ్వన్యమానమేవ. తత్తుర్యకక్ష్యానివేశి. కేవలం పూర్వత్ర లక్షణైవ ప్రధానం ధ్వననవ్యాపారే సహకారి; ఇహ తు అభిధాతాత్పర్యశక్తీ. వాక్యార్థ సౌన్దర్యాదేవ వ్యఙ్గ్యార్థప్రతిపత్తేః. కేవలం లేశేన లక్షణావ్యాపారోపయోగో ఽప్యస్తీత్యుక్తమ్. అసంలక్ష్య క్రమవ్యఙ్గ్యే తు లక్షణాసమున్మేషమాత్రమపి నాస్తి; అసంలక్ష్యత్వాదేవ క్రమస్య ఇతి వక్ష్యామః. తేన ద్వితీయే ఽపి భేదే చత్వార ఏవ వ్యాపారాః. 13

బాలానందిని

అత్రేతి - ఇక్కడ అభిధ, తాత్పర్యం, ధ్వననం అని మూడే వ్యాపారా లున్నాయి. ముఖ్యార్థబాధాదులు లేకపోవడంవల్ల తృతీయకక్ష్యలో లక్షణ లేదు కదా? లేదా - ఆకస్మికంగా ఒక విశిష్టమైన ప్రశ్న వేయడం అనేది అనుపపన్నం అవడం చేత ముఖ్యార్థానికి బాధ కలిగినట్లయితే అప్పుడు మధ్యలో సాదృశ్యమూలలక్షణ కూడా ఉంటే ఉండవచ్చు. అనగా "అసౌ శుకశాబకః" అనడంచేత సాదృశ్యంవల్ల కాముకుడైన యువకుడు అనే అర్థం, "అధరపాటలం బిమ్బఫలం దశతి" అనడంచేత సాదృశ్యంవల్ల అధరాస్వాదం అనే లాక్షణికార్థం ఉన్న దని అంగీకరిస్తే అంగీకరించవచ్చు అని భావం. అయితే ఈ లక్షణకి ధ్వన్యమానమైన అర్థమే ప్రయోజనం. ఆ ధ్వన్యమానార్థం నాల్గవ

కక్ష్యకు సంబంధించినది. మొదటి ఉదాహరణలో (సువర్ణపుష్పచయనరూపవాచ్యార్థం అనుపపన్నం అవడంచేత) ప్రధానంగా లక్షణయే ధ్వననవ్యాపారానికి సహకారిగా ఉంది. కాని ఇక్కడ అభిధాతాత్పర్యశక్తులు ప్రధాన సహకారులుగా ఉన్నాయి. ఎందుచేత ననగా ఇక్కడ వాక్యార్థసౌందర్యంవల్లనే వ్యంగ్యార్థప్రతిపత్తి (జ్ఞానం) కలుగుతున్నది. లక్షణావ్యాపారోపయోగం కూడా కొంచెం మాత్రమే ఉంది అని చెప్పబడింది.

అసంలక్ష్యేతి - అసంలక్ష్యక్రమవ్యంగ్యంలో అయితే లక్షణాసమున్మేషమాత్రం కూడా ఉండదు. (లక్షణ ఏ మాత్రమూ కనబడదు). ఎందువలన అనగా అక్కడ క్రమమే గుర్తించబడదు అని చెప్పగలం. అందుచేత రెండవ భేదంలో కూడా నాలుగు వ్యాపారాలు ఉన్నాయి. 13.

## ధ్వన్యాలోకం

యదప్యుక్తమ్ భక్తిః ధ్వనిరితి తత్ ప్రతిసమాధీయతే -

కా. భక్త్యా బిభర్తి నైకత్వం రూపభేదాదయం ధ్వనిః.

అయముక్తప్రకారః ధ్వనిః భక్త్యా నైకత్వం బిభర్తి, భిన్నరూపత్వాత్, వాచ్యవ్యతిరిక్తస్య అర్థస్య వాచ్యవాచకాభ్యాం తాత్పర్యేణ ప్రకాశనం యత్ర వ్యఙ్గ్యప్రాధాన్యే స ధ్వనిః - ఉపచారమాత్రం తు భక్తిః.

### బాలానందిని

యదితి - 'భక్తియే ధ్వని' అని ఏదైతే చెప్పబడిందో అది నిరాకరించబడుతున్నది.

భక్త్యా ఇతి - రూపభేదాత్ = స్వరూపాలలో భేదం ఉండడం వల్ల, అయం ధ్వనిః = ఈ ధ్వని, భక్త్యా = భక్తితో, ఏకత్వమ్ = ఏకత్వాన్ని, న బిభర్తి = ధరించదు.

అయమితి - అయమ్ = చెప్పబడిన ప్రకారాలు (భేదాలు) గల ధ్వని భక్తితో ఏకత్వాన్ని పొందదు. ఎందువలన అనగా ఇది దానికంటె భిన్నమైన రూపం గలది. ఎక్కడైతే వాచ్య - వాచకాలు (శబ్దార్థాలు) తత్పరత్వంచేత (అనగా దానికే ప్రాధాన్యం ఇస్తూ) వాచ్యంకంటె భిన్నమైన అర్థాన్ని ప్రకాశింపచేస్తాయో, వ్యంగ్యార్థానికే ఎక్కడ ప్రాధాన్యం ఉంటుందో, అది 'ధ్వని'. కేవలం ఆరోపమాత్రం 'భక్తి'.

### లోచనం

అత ఏవ ఉభయోదాహరణపృష్ఠ ఏవ భాక్తమహురిత్యనుభాష్య

దూషయతి. అయం భావః - భక్తిశ్చ ధ్వనిశ్చ ఇతి కిం పర్యాయవత్తాద్రూప్యమ్? అథ పృథివీత్వమివ పృథివ్యాః అన్యతో వ్యావర్తకధర్మరూపతయా లక్షణమ్? ఉత కాక ఇవ దేవదత్తగృహస్య సంభవదూత్రాత్ ఉపలక్షణమ్? తత్ర ప్రథమం పక్షం నిరాకరోతి - భక్త్యా బిభర్తీతి. ఉక్తప్రకార ఇతి పఞ్చసు అర్థేషు యోజ్యమ్ - శబ్దే, అర్థే, వ్యాపారే, వ్యఙ్గ్యే, సముదాయే చ. రూపభేదం దర్శయితుం ధ్వనేస్తావద్రూపమాహ - వాచ్యేతి. తాత్పర్యేణ విశ్రాన్తిధామతయా, ప్రయోజనత్వేనేతి యావత్. ప్రకాశనమ్ ద్యోతనమిత్యర్థః. ఉపచారమాత్రమితి. ఉపచారః గుణవృత్తిః లక్షణా, ఉపచరణమ్ అతిశయితో వ్యవహార ఇత్యర్థః. మాత్రశబ్దేనేదమాహ- యత్ర లక్షణావ్యాపారాత్ తృతీయాత్ అన్యః చతుర్థః ప్రయోజనద్యోతనాత్మా వ్యాపారః వస్తుస్థిత్యా సంభవన్నపి అనుపయుజ్యమాన త్వేన అనాద్రియమాణత్వాత్ అసత్కల్పః "యమర్థమధికృత్య" ఇతి హి ప్రయోజనలక్షణమ్, తత్రాపి లక్షణాస్తీతి కథం ధ్వననం లక్షణం చేతి ఏకం తత్త్వం స్యాత్?

బాలానందిని

అత ఏవేతి - అందువలననే, అనగా 'శిఖరిణి' ఇత్యాది ద్వితీయభేదంలో కూడా కొన్ని చోట్ల నాలుగు వ్యాపారా లుండడం వల్ల, ఈ రెండు ఉదాహరణల తరువాత "భాక్తమాహుః" అనే దానిని అనువదించి దూషిస్తున్నాడు. దీని భావం ఇది - భక్తి, ధ్వని అనేవాటికి (మీరు చెప్పే) తాద్రూప్యం పర్యాయశబ్దాల మధ్య ఉన్న తాద్రూప్యం వంటిదా, లేదా పృథివీత్వం పృథివిని ఇతరపదార్థాలనుంచి వేరుచేసినట్లు భక్తి అనేది ధ్వనిలో ఉండే వ్యావర్తకధర్మమా (ఇతరవ్యాపారాదులనుండి వేరుచేసే దీనిలో మాత్రమే ఉండే ధర్మమా), దేవదత్త గృహానికి కాకి వలె సంభవమాత్రం చేత ఉపలక్షణమా?

వివరణ:- 'పృథివీత్వం' అనేది పృథివిలోనే ఉంటుంది. పృథివి కానివాటిలో ఉండదు. అందుచేత ఇది పృథివిని ఇతర పదార్థాలనుండి వేరు చేస్తుంది. పృథివీత్వం ఉన్నదే పృథివి అని పృథివికి లక్షణంగా కూడ ఉపయోగిస్తుంది. భక్తి ఈ విధమైన ఇతర వ్యావర్తకలక్షణమా అని ప్రశ్న. దేవదత్తుని ఇల్లు ఏది అని ఎవరో అడిగి నప్పుడు "అదిగో ఆ కాకి వాలి కూర్చున్న ఇల్లు దేవదత్తుని ఇల్లు" అని కాకిని ఉపలక్షణంగా (గుర్తుగా) చెప్పవచ్చు. ఆ కాకి ఆ సమయంలో ఆ ఇంటిమీద ఉండడం యాదృచ్ఛికం.

అడిగినవాడు ఆ యింటికి చేరేసరికి అది ఎగిరిపోవచ్చు. అయినా ఆ సమయానికి అది గుర్తుగా ఉపయోగించింది. భక్తి ధ్వనికి అలాంటి ఉపలక్షణమా అని ప్రశ్న.

తత్రేతి. ఈ మూడు పక్షాలలో మొదటి పక్షాన్ని "బిభర్తి నైకత్వమ్" ఇత్యాదికం చేత నిరాకరిస్తున్నాడు. ఉక్తప్రకారః అనే దానికి శబ్దం, అర్థం, వ్యాపారం, వ్యంగ్యం, వీటి అన్నింటి సముదాయమైన కావ్యం అనే ఐదు అర్థాలలోను అన్వయించాలి. రూపభేదమ్ ఇతి:- ధ్వనికీ భక్తికీ ఉన్న రూపభేదాన్ని చూపడానికి వాచ్యేత్యాదికంచేత ధ్వనియొక్క రూపాన్ని చెవుతున్నాడు. తాత్పర్యేణ అనగా విశ్రాంతిధామంగా, అనగా పరమప్రయోజనంగా అని అర్థం. ప్రకాశనమ్ అనగా ద్యోతింపచేయడం, అనగా బోధించడం అని అర్థం. ఉపచారమాత్రమితీతి. ఉపచారం అనగా గుణవృత్తి; లక్షణ అని అర్థం. దీనికి ఈ అర్థం ఎలా వచ్చిందో చెపుతున్నాడు - ఉపచరణమితి. ఉపచరణం అనగా అతిశయితమైన వ్యాపారం అని అర్థం. అనగా ఏ శబ్దానికి ఏ అర్థంలో వ్యవహారం ప్రసిద్ధంగా ఉంటుందో దాన్ని దాటి ఆ అర్థంతో సంబంధం ఉన్న అర్థంలో ఆ శబ్దాన్ని వ్యవహరించడం అతిశయితవ్యవహారం.

మాత్రేతి - 'ఉపచారమాత్రం' అనే దానిలోని 'మాత్ర' శబ్దంచేత ఈ విషయాన్ని చెపుతున్నాడు. ఎక్కడైతే మూడవదైన లక్షణావ్యాపారంకంటె వేరైన, ప్రయోజనాన్ని వ్యంజింపచేయడం అనే నాల్గవ వ్యాపారం వస్తుస్థితిచేత సంభవించినా, (ఆ వ్యాపారానికి నిజంగా అవకాశం ఉన్నా) అది ఉపయోగించకపోవడంచేత ఆదరించబడనిదై లేనిదానితో సమానంగా ఉంటుందో, "దేనిని గూర్చి ప్రవర్తిస్తాడో అది ప్రధానమైనది" అని కదా,' "యమర్థమధికృత్య ప్రవర్తతే తత్ ప్రయోజనమ్" (న్యాయదర్శనం 1.1.24) అనే సూత్రం చెపుతూన్నది. అలాంటి స్థలాలలో కూడ లక్షణ ఉంటూన్నది. అలాంటప్పుడు 'ధ్వననం' 'లక్షణ' అనేవి రెండూ ఒకే తత్త్వం ఎలా అవుతుంది?

## ధ్వన్యాలోకం

మా చైతత్; స్యాత్ భక్తిః లక్షణం ధ్వనేః ఇత్యాహ -

కా. అతివ్యాప్తేరథావ్యాప్తే ర్న చాసౌ లక్ష్యతే తయా. 14

నైవ భక్త్యా ధ్వనిర్లక్ష్యతే. కథమ్? అతివ్యాప్తేః అవ్యాప్తేశ్చ. తత్ర అతివ్యాప్తిః ధ్వనివ్యతిరిక్తేఽపి విషయే భక్తేః సంభవాత్. యత్ర హి వ్యఙ్గ్యకృతం మహత్ సౌష్ఠవం నాస్తి తత్రాపి ఉపచరితశబ్దవృత్త్యా

ప్రసిద్ధ్యనురోధప్రవర్తితవ్యవహారాః కవయో దృశ్యన్తే. యథా

శ్లో. పరిమ్లానం పీనస్తనజఘనసంగాదుభయత

స్తనోర్మధ్యస్యాన్తః పరిమిలనమప్రాప్య హరితమ్,

ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజలతాక్షేపవలనై :

కృశాఙ్గ్యాః సంతాపం వదతి బిసినీపత్రశయనమ్. (12)

బాలానందిని

మా ఇతి - ఇది (ఏకత్వం) లేకపోవచ్చు. భక్తి ధ్వనికి లక్షణం కావచ్చును. అనే ఆశంకతో చెపుతున్నాడు - అతివ్యాప్తే : ఇత్యాది. అతివాప్తేః = అతివ్యాప్తివలన, అథ= మరియు, అవ్యాప్తేః = అవ్యాప్తివలనా, అసౌ = ఈ ధ్వని, తయా = భక్తిచేత, న లక్ష్యతే = గుర్తించబడదు.

**నైవేతి** - భక్తిచేత ధ్వని లక్షితం కాదు. (భక్తిని ధ్వనికి లక్షణంగా చెప్పకూడదు) ఎందువలన? అతివ్యాప్తి, అవ్యాప్తి కూడ ఉండడంవల్ల. ధ్వనికంటె భిన్నమైన విషయంలో కూడ భక్తి ఉండడానికి అవకాశం ఉండడంవల్ల అతివ్యాప్తి. ఎందుచేత ననగా - వ్యంగ్యంవల్ల కలిగిన గొప్ప మంచితనం (చమత్కారాతిశయం) లేని చోట కూడా ఉపచరితమైన శబ్దవృత్తితో ప్రసిద్ధిని అనుసరించి ప్రవర్తింపచేయబడిన వ్యవహారం కలవారుగా కవులు కనబడుతున్నారు. అనగా ధ్వనివల్ల ఏ మాత్రం చమత్కారం లేకపోయినా కొన్నిచోట్ల కవులు లౌకికప్రసిద్ధిని అనుసరించి లాక్షణికశబ్దాల ప్రయోగం చేస్తూన్నట్లు కనబడుతున్నది అని అర్థం. ఎట్లనగా -

పరిమ్లానమితి - రత్నావళిలో రాజు సాగరికను గూర్చి అంటూన్న మాటలు. పీనస్తనజఘనసంగాత్ = బలిసిన స్తనాలయొక్క జఘనంయొక్క సంబంధం వల్ల, ఉభయతః = ఆ రెండూ ఆనిన రెండు చోట్లయందు, పరిమ్లానమ్ = వాడిపోయినదీ, తనోః = కృశించిన, సన్నని, మధ్యస్య = నడుముయొక్క, అన్తః = మధ్యయందు, పరిమిలనమ్ = (శరీరంతో) సంబంధాన్ని, అప్రాప్య = పొందక, హరితమ్ = ఆకుపచ్చగా ఉన్నదీ, శ్లథభుజలతాక్షేపవలనై : = శిథిలంగా (పట్టు లేకుండా) భుజలతలను పడవేయడంచేత, దొర్లడాలచేతా, వ్యస్తన్యాసమ్ = తారుమారు చేయబడిన కూర్పు కలదీ అయిన, బిసినీపత్రశయనమ్ = తామరాకుల శయనం, కృశాఙ్గ్యాః=సన్నని శరీరంగల ఆమెయొక్క, సంతాపమ్ = సంతాపాన్ని, వదతి = చెప్పుచున్నది.

లోచనం

ద్వితీయం పక్షం దూషయతి - అతివ్యాప్తేరితి. అసౌ ఇతి ధ్వనిః. తయేతి భక్త్యా. నను ధ్వననమ్ అవశ్యం భావీతి కథం తద్వ్యతిరిక్తోఽస్తి విషయః ఇత్యాహ - మహత్ సౌష్ఠవమ్ ఇతి. అత ఏవ ప్రయోజనస్య అనాదరణీయత్వాత్ వ్యఞ్జకత్వేన న కృత్యం కించిదితి భావః. మహద్గ్రహణేన గుణమాత్రం తద్ భవతి. యథోక్తమ్ - " సమాధిరన్యధర్మస్య క్వాప్యారోపో వివక్షితః" ఇతి దర్శయతి. నను ప్రయోజనాభావే కథం తథా వ్యవహారః ఇత్యాహ ప్రసిద్ధ్యనురోధేతి. పరమ్పరయా తథైవ ప్రయోగాత్.

వయం తు బ్రూమః - ప్రసిద్ధిర్యా ప్రయోజనస్య అనిగూఢతేత్యర్థః, ఉత్తానేనాపి రూపేణ తత్ప్రయోజనం చకాసత్ నిగూఢతాం నిధానవదపేక్షత ఇతి భావః. వదతి ఇత్యుపచారే హి స్ఫుటీకరణప్రతిపత్తిః ప్రయోజనమ్. యద్యగూఢం స్వశబ్దేనోచ్యేత కిమచారుత్వం స్యాత్? గూఢతయా వర్ణనే వా కిం చారుత్వమధికం జాతమ్? అనేనైవాశయేన వక్ష్యతి "యతః ఉక్త్యన్తరేణ అశక్యం యత్" ఇతి.

బాలానందిని

ద్వితీయమితి - అతివ్యాప్తేః ఇత్యాదికంచేత రెండవ పక్షాన్ని దూషిస్తున్నాడు. అసౌ అనగా ధ్వని. తయా అనగా భక్తిచేత. నను ఇతి:- ధ్వననం అనేది తప్పకుండా ఉంటుంది కదా? అది లేని విషయం ఎలా ఉంటుంది, అని ఆశంకించుకొని మహత్ సౌష్ఠవమ్ ఇత్యాదికం చెపుతున్నాడు. అందువల్లనే అనగా గొప్ప సౌష్ఠవం ఏదీ లేకపోవడంవల్లనే, ప్రయోజనం ఆదరించతగినది కాదు కాబట్టి అలాంటి వ్యంజకత్వంచేత ఏమీ పని లేదు అని భావం. మహత్ సౌష్ఠవం అనే దానిలో 'మహత్' అనడంవల్ల అక్కడ ధ్వననం ఉన్నా అది "మరొకదాని ధర్మాన్ని మరొకదానిమీద ఆరోపించాలని ఇచ్ఛ ఉన్నట్లయితే అది సమాధి అనే గుణం" అని చెప్పినట్లు ఏదో గుణం మాత్రమే అవుతుంది అని చూపుతున్నాడు. "నన్వితి. ప్రయోజనం లేకపోతే ఆ విధంగా వ్యవహారం ఎలా జరుగుతున్నది అని ఆశంకించుకొని ప్రసిద్ధ్యనురోధేత్యాదికంతో

సమాధానం చెపుతున్నాడు. ప్రసిద్ధ్యనురోధం అనగా అందరూ పరంపరగా ఆ విధంగానే ప్రయోగించడం వల్ల అని అర్థం.

ప్రసిద్ధిశబ్దానికి లోకప్రసిద్ధి లేదా కవిప్రసిద్ధి అని అర్థం చెప్పి మరొక విధంగా వ్యాఖ్యానిస్తున్నాడు - వయం తు బ్రూమః ఇతి. మేం అయితే దీని అర్థం ఇలా చెపుతున్నాం. ప్రసిద్ధి అనగా ప్రయోజనం గూఢంగా లేకపోవడం అని అర్థం. ఉక్తానేతి:- ఆ ప్రయోజనం, అనగా ధ్వనిస్థలంలో ఉండే ప్రయోజనం, స్పష్టమైన రూపంలో ప్రకాశిస్తున్నా నిధి వలె గూఢత్వాన్ని అపేక్షిస్తుంది అని భావం. 'వదతి' అనే ఉపచారానికి స్ఫుటీకరణజ్ఞానం ప్రయోజనం. అగూఢమైన ఈ ప్రయోజనం స్వశబ్దంచేత చెప్పబడినా అచారుత్వం ఏమి ఉంటుంది? గూఢంగా వర్ణిస్తే మాత్రం అధికమైన చారుత్వం ఏమి ఉంటుంది? ఈ ఆశయంచేతనే - "యతః" -"ఉక్త్యన్తరేణాశక్యం యత్" (ధ్వ. ఆ. 1.15) (ఏది మరొకమాటచేత చెప్పడానికి శక్యం కాదో) అని చెప్పనున్నాడు.

వివరణ:- ప్రయోజనం నిగూఢంగా ఉండాలి. అలా లేకపోవడం ప్రసిద్ధి. ఏదైతే ప్రయోజనం అని అంటామో దానిని నిగూఢంగా కాక వాచ్యరూపంలో చెప్పినా చారుత్వానికి ఏమీ లోపం లేనప్పుడు ఆ విధమైన ప్రసిద్ధి ధ్వనికి చారుత్వాన్ని ఇవ్వదు. అందుచేత అక్కడ ధ్వని లేనట్లే. కొన్ని ధ్వనులలో కూడా ప్రయోజనం సుస్పష్టంగానే తెలియవచ్చు. కాని దానిని వాచ్యంగా చెప్పడం కుదరదు. అందుచేత అది నిగూఢంగా ఉన్నట్లే. అది ధ్వనివిషయం అవుతుంది. ప్రకృతంలో అచేతనమైన బిసినీపత్రశయనం నోటితో చెప్పజాలదు గాన 'వదతి' అనేది ఔపచారికప్రయోగం. 'స్పష్టంగా సూచిస్తూన్నది' అనే అర్థాన్ని బోధించడం ఈ ఔపచారికప్రయోగానికి ప్రయోజనం. అయితే "బిసినీపత్రశయనం సంతాపం వదతి" అనడానికి బదులు " బిసినీపత్రశయనం సంతాపం స్పష్టతయా గమయతి" అని చెప్పి పైన చూపిన ప్రయోజనాన్ని వాచ్యం చేసినా అందానికేమీ లోపం రాదు. 'వదతి' అని కొంచెం గూఢంగా చెప్పినంత మాత్రం చేత ఎక్కువ అందం రాలేదు అని భావం. అందుచేత ధ్వనిస్థలంలో ఏ ప్రయోజనాదికం వ్యంజింపబడుతుంది అని అంటామో దానిని అలా ధ్వనింపచేస్తేనే అందం ఉంటుంది. దాన్ని వాచ్యంగా చెప్పినా కూడ చమత్కారంలో లోపం ఏదీ లేదు అన్నట్లు కనబడితే అది ధ్వనికి స్థానం కాదు అని ఈ ప్రఘట్టకం భావం.

# ధ్వన్యాలోకం

తథా-

గాథ. చుమ్బిజ్జఇ అసహుత్తం అవరున్ధిజ్జఇ సహస్సహుత్తమ్మి,
విరమిఅ పుణో రమిజ్జఇ పిఓ జణో ణత్థి పునరుత్తమ్. (13)
శతకృత్వోఽవరుధ్యతే సహస్రకృత్వః చుమ్బ్యతే,
విరమ్య పునా రమ్యతే ప్రియో జనో నాస్తి పునరుక్తమ్.
(సంస్కృతచ్ఛాయ)

తథా-

గాథ. కువిఆఓ పసన్నాఓ ఓరణ్ణముహీఓ విహసమాణాఓ,
జహ గహిఓ తహ హిఅఅం హరన్తి ఉచ్ఛిన్నమహిలాఓ. (14)

తథా:-

గాథ. అజ్జాఏం పహారో ణవలదాఏ దిణ్ణో పిఏణ థణవట్టే,
మిఉఓ వి దూసహో వ్విఅ జాఓ హిఅఏ సవత్తీణమ్. (15)
భార్యాయాః ప్రహారో నవలతయా దత్తః ప్రియేణ స్తనపృష్ఠే,
మృదుకోఽపి దుఃసహ ఇవ జాతో హృదయే సపత్నీనామ్.
(సంస్కృతచ్ఛాయ)

తథా -

శ్లో. పరార్థే యః పీడామనుభవతి భఙ్గేఽపి మధురో
యదీయః సర్వేషామిహ ఖలు వికారోఽ ప్యభిమతః,
న సంప్రాప్తో వృద్ధిం యది స భృశమక్షేత్రపతితః
కిమిక్షోర్దోషోఽసౌ న పునరగుణాయా మరుభువః. (16)

ఇత్యత్ర ఇక్షుపక్షే అనుభవతిశబ్దః. న చైవంవిధః కదాచిదపి ధ్వనేర్విషయః

బాలానందిని

తథా ఇతి - మరియు-శతకృత్వః ఇతి-ప్రియః జనః = ప్రియజనుడు, 'జన' శబ్దం స్త్రీపురుషసాధారణవాచకంగా ప్రయోగించబడుతుంది. అందుచేత 'ప్రియో జనః' ప్రియుడు కావచ్చు, ప్రేయసి కావచ్చు. శతకృత్వః=వంద(అనేక)పర్యాయాలు, అవరుధ్యతే= కౌగలించుకొనబడతాడు (బడుతుంది). సహస్రకృత్వః=వెయ్యి (చాలా) సార్లు, చుమ్బ్యతే = ముద్దుపెట్టుకొనబడతాడు (బడుతుంది). విరమ్య = విరమించి, పునః = మళ్లీ, రమ్యతే =రమించబడతాడు (బడుతుంది). పునరుక్తమ్ = పునరుక్తదోషం, నాస్తి= లేదు.

తథా ఇతి - మరియు - కుపితాః ఇతి - స్వైరిణ్యః మహిలాః = కులటలు, కుపితాః = కోపించినవాళ్లై, ప్రసన్నాః = ప్రసన్నురాళ్లయి, అవరుదితవదనాః ఏడుస్తూన్న ముఖాలు కలవాళ్లై, విహసన్త్యః = నవ్వుచున్నవాళ్లై, యథా = ఏ విధంగా, గృహీతాః = గ్రహించబడుతారో, తథా = అట్లే, హృదయం హరన్తి = హృదయాన్ని హరిస్తారు.

తథా ఇతి - మరియు - భార్యాయా ఇతి :- ప్రియేణ = ప్రియునిచేత, నవలతయా=నూతనమైన లతచేత, భార్యాయాః=భార్యయొక్క, స్తనపృష్ఠే = స్తనాల పై భాగముమీద, దత్తః = ఇవ్వబడిన, ప్రహారః = దెబ్బ, మృదుకః అపి = చాల మృదువే అయినా, సపత్నీనామ్ = సవతులయొక్క, హృదయే = హృదయమునందు, దుఃసహః ఇవ = సహింప శక్యం కానిది వలె, జాతః = అయినది.

తథా ఇతి - మరియు - పరార్థే ఇతి - యః = ఏది, పరార్థే = పరులకొరకై, పీడామ్ = యంత్రంలో నలగగొట్టబడడం అనే పీడను, అనుభవతి = అనుభవిస్తుందో, భఙ్గే ऽపి = ముక్కలు చేసినా, విరిచినా, మధురః = మధురమయినదో, యదీయః = దేని సంబంధమైన, వికారః అపి = వికారం (బెల్లం, పంచదార, మధురఖాద్యాలు మొదలైన రూపాలలో మార్పు) కూడా, ఇహ = ఇక్కడ, సర్వేషామ్ = అందరికీ, అభిమతః చాల ఇష్టమైనదో, సః = అట్టి చెరకు, అక్షేత్రపతితః = క్షేత్రం కాని క్షేత్రంలో, చెడ్డ క్షేత్రంలో పడినదై, భృశమ్ = మిక్కిలి, వృద్ధిమ్ = వృద్ధిని, న సంప్రాప్తః యది = పొందక పోయినట్లయితే, అసౌ = ఇది, ఇక్షోః = చెరకుయొక్క, దోషః = దోషమా, పునః = అంతేకాని, అగుణాయాః = గుణాలు లేని, మరుభువః = ఎడారియొక్క దోషం, న= కాదా?

ఇత్యత్రేతి : ఇక్కడ ఇక్షుపక్షంలో 'అనుభవతి' శబ్దం లాక్షణికప్రయోగం. అచేతనమైన ఇక్షువుకు దుఃఖానుభూతి ఉండదు కదా? నేతి :- ఇలాంటిది ఏనాటికీ కూడ ధ్వనికి విషయం కాదు.

లోచనం

అవరున్నిజ్జఇ ఆలిజ్గ్యతే. పునరుక్తమిత్యనుపాదేయతా లక్ష్యతే. ఉక్తార్థస్యాసంభవాత్.

"కుపితాః ప్రసన్నాః అవరుదితవదనాః విహసన్త్యః,

యథా గృహీతాస్తథా హృదయం హరన్తి స్వైరిణ్యో మహిలాః".

('కువిఆఓ' ఇత్యాదిగాథకి సంస్కృతచ్ఛాయ)

అత్ర గ్రహణేన ఉపాదేయతా లక్ష్యతే. హరణేన పరతన్త్రతాపత్తిః.

తథా - అజ్జేతి - కనిష్ఠభార్యాయాః స్తనపృష్ఠే నవలతయా కాన్తేన ఉచితక్రీడాయోగేన మృదుకోఽపి ప్రహారో దత్తః సపత్నీనాం సౌభాగ్యసూచకం తత్ క్రీడాసంవిభాగమప్రాప్తానాం హృదయే దుఃసహో జాతః, మృదుకత్వాదేవ. అన్యస్య దత్తో మృదుః ప్రహారః అన్యస్య చ సంపద్యతే; దుఃసహశ్చ మృదురపీతి చిత్రమ్. దానేనాత్ర ఫలవత్త్వం లక్ష్యతే.

తథా పరార్థేతి - యద్యపి ప్రస్తుతమహాపురుషాపేక్షయా 'అనుభవతి' శబ్దః ముఖ్య ఏవ, తథాపి అప్రస్తుతే ఇక్షౌ ప్రశస్యమానే పీడాయా అనుభవనేన అసంభవతా పీడావత్త్వం లక్ష్యతే. తచ్చ పీడ్యమానత్వే పర్యవస్యతి. నన్వస్తి అత్ర ప్రయోజనం, తత్ కిమితి న ధ్వన్యతే ఇత్యాశఙ్క్యాహ - న చైవంవిధ ఇతి.14

బాలానందిని

అవరున్నిజ్జఇ ఇతి. అవరుద్ధ్యతే అనగా కౌగలించుకొనబడుతున్నది అని అర్థం. పునరుక్తమ్ అనేదానిచేత అనుపాదేయత్వం లక్షణచేత బోధించబడుతుంది. 'ఉక్త' అనే అర్థం కుదరదు కదా? అనగా - చెప్పినదానినే మళ్ళీ మళ్ళీ చెప్పడం 'పునరుక్తి' దోషం. అది పరిహరించదగినది. ఇక్కడ మాటల ప్రసంగం ఏమీ లేదు గాన 'పునరుక్తి' శబ్దానికి లక్షణచేత "అనుపాదేయం, చేయతగినది కాదు" అని అర్థం. పునరుక్తం అనేది లేదు అనగా ఇలాంటి వాటిలో అనుపాదేయత్వం లేదు అని అర్థం. దీనికి అధికఫలశాలిత్వం ఉంది అని చెప్పడం ప్రయోజనం. అయినా ఇది వ్యంగ్యం అయినా, లక్ష్యార్థంకంటె అధికంగా చమత్కారజనకంగా లేదు అని భావం.

కుపితాః ఇత్యాది - అత్రేతి - ఇక్కడ "గ్రహణం" చేత ఉపాదేయత్వం, అనగా ఆ స్వైరిణులు ఏ విధంగా ఆ యా సమయాలలో ప్రవర్తిస్తున్నా కాముకులకు అంగీకారయోగ్యలే అని, హరణంచేత వాళ్లకి పూర్తిగా లొంగిపోవడం అనేదీ, లక్షణచేత బోధించబడుతున్నాయి. "వాళ్లు ఆ యా విధాల ప్రవర్తిస్తూ కాముకుల్ని తమకు వశుల్ని చేసుకుంటారు" అనేది మొదటిలక్షణకీ, "కాముకులు అంత వైవశ్యం చెందుతారు" అనేది రెండవ లక్షణకూ ప్రయోజనం. వ్యంగ్యాలైన ఈ ప్రయోజనాలలో అంత చమత్కారాతిశయం లేదని భావం.

తథా అజ్ఞేతి - ప్రియుడు ఉచితమైన క్రీడాప్రసంగంలో కనిష్ఠభార్య స్తనోపరిప్రదేశంమీద నవలతతో ఇల్లా అన్నాడు - ఒక చిన్న దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బ చాలా మృదువుగానే ఉన్నా, అది సౌభాగ్య (ప్రియప్రేమపాత్రత్వ) సూచకమైన ఆ క్రీడాసంవిభాగాన్ని ( ఆ క్రీడలో పాలు పంచుకోవడాన్ని) పొందజాలకపోయిన సవతుల హృదయంలో సహించశక్యం కానిది అయింది. అందుకు కారణం ఆ దెబ్బ మృదువుగా ఉండడమే. అనగా ఆ ప్రియుడే కోపంతో ఆ నవలతతోనే, ఆ స్తనోపరిభాగం మీదనే గట్టిగా కొట్టి ఉంటే వాళ్లందరూ సంతోషించి ఉండే వారని భావం. ఒకరిని కొట్టిన మృదువైన దెబ్బ మరొకరికి తగలడం, మృదువైనా భరింపరానిదిగా ఉండడం - ఇదంతా ఆశ్చర్యకరం. ఇక్కడ దానంచేత ఫలవత్త్వం, అనగా కనిష్ఠభార్య చరితార్థురా లవడం లక్షణయా బోధించబడుతుంది. ఆ ప్రహారం సుఖోపభోగయోగ్యంగా ఉండడం ప్రయోజనం. అది అంతగా చమత్కారజనకం కాదని భావం.

తథా - పరార్థే ఇతి : ఈ శ్లోకంలో అప్రస్తుతమైన ఇక్షువృత్తాంతం సూచించబడుతున్నది. యద్యపీతి. ప్రస్తుతుడైన మహాపురుషుని అపేక్షచేత, ( ఆ మహాపురుషుని దృష్ట్యా చూస్తే) 'అనుభవతి' శబ్దానికి ముఖ్యార్థం చెప్పినా కుదురుతున్నా ఇక్కడ చెప్పబడుతున్న అప్రస్తుతమైన ఇక్షువు విషయంలో సంభవించిన 'పీడానుభవం చేత" పీడావత్త్వం (పీడ కలిగిఉండడం) లక్షణయా బోధించబడుతుంది. అది (పీడా వత్త్వం) పీడించబడడం (నలగకొట్టబడడం) అనే అర్థంలో పర్యవసానం చెందుతుంది. కష్టావస్థలో ఉండడం అనేది ప్రయోజనం. అది చమత్కారంగా లేదని భావం. నన్వితి. ఈ ఉదాహరణ లన్నింటిలోనూ ప్రయోజనం ఉంది కదా? అది ఎందుచేత ధ్వనింపచేయబడడం లేదు అని ఆశంకించుకొని నచైవంవిధః ఇత్యాదికం చెపుతున్నాడు. అనాదరపాత్రమైన ఈ విధమైన ప్రయోజనం 'ధ్వని' అని వ్యవహరించడానికి యోగ్యం కాదు అని వృత్తికారుని ఆశయం. 14

## ధ్వన్యాలోకం

యతః -

ఉక్త్యన్తరేణాశక్యం యత్తచ్చారుత్వం ప్రకాశయన్,

శబ్దో వ్యఞ్జకతాం బిభ్రద్ధ్వన్యుక్తేర్విషయీభవేత్. 15

అత్ర చోదాహృతే విషయే న ఉక్త్యన్తరాశక్యచారుత్వవ్యక్తిహేతుః శబ్దః.

### బాలానందిని

యతః ఇతి - ఎందువలన అనగా - ఉక్తీతి. యత్ = ఏది, ఉక్త్యన్తరేణ = మరొక విధంగా చెప్పడంచేత, అశక్యమ్ = శక్యం కాదో, తత్ = అలాంటి, చారుత్వమ్ = సౌందర్యాన్ని, ప్రకాశయన్ = ప్రకాశింపచేస్తున్నదై, వ్యఞ్జకతామ్= వ్యంజకత్వాన్ని, బిభ్రత్ = ధరించుచున్న, శబ్దః = శబ్దం, ధ్వన్యుక్తేః - ధ్వని అనే పేరుకు విషయీభవేత్=విషయం అగును.

అత్రేతి - ఉదాహరించిన ఈ విషయంలో (వదతి ఇత్యాదులలో) శబ్దం (ధ్వని లేకుండా) మరొక విధంగా చెప్పి సంపాదించడానికి శక్యం కాని చారుత్వాన్ని వ్యంజింపచేయడానికి హేతువుగా లేదు.

### లోచనం

యత - ఉక్త్యన్తరేణేతి - ఉక్త్యన్తరేణ ధ్వనివ్యతిరిక్తేన స్ఫుటేన శబ్దార్థ వ్యాపారవిశేషేణ ఇత్యర్థః. శబ్ద ఇతి పఞ్చస్వర్థేషు యోజ్యమ్. ధ్వన్యుక్తేర్విషయీభవేదితి- ధ్వనిశబ్దేన ఉచ్యత ఇత్యర్థః. ఉదాహృత ఇతి- వదతీత్యాదౌ. 15

### బాలానందిని

యత ఇత్యాది - ఉక్త్యన్తరేణ - ధ్వనికంటె భిన్నమైన, స్ఫుటమైన శబ్దార్థాల వ్యాపారవిశేషంచేత అని అర్థం. 'శబ్ద' అనే దాన్ని ఐదు అర్థాలలోను సమన్వయించాలి. అనగా - "శబ్దః ధ్వన్యుక్తేః విషయీభవేత్" అన్నప్పుడు ఒక్క శబ్దమే కాదు - " శబ్ద్యతే అభిధీయతే" అనే వ్యుత్పత్తిచేత వాచ్యార్థం. "శబ్ద్యతే అనేన" అనే వ్యుత్పత్తిచేత వాచకశబ్దమూ, " శబ్ద్యతే వ్యజ్యతే" అనే వ్యుత్పత్తిచేత వ్యంగ్యమూ, 'శబ్దనం శబ్దః' అనే

వ్యుత్పత్తిచేత వ్యంజనావ్యాపారమూ, నాలిగింటి సముదాయం అయిన కావ్యమూ కూడా గ్రహించబడతాయి.

ధ్వన్యుక్తేరితి - "ధ్వన్యుక్తేః విషయీభవేత్" అనగా 'ధ్వని' శబ్దంచేత చెప్పబడుతుంది అని అర్థం. ఉదాహృతే అనగా పైన ఉదాహరించిన శ్లోకాలలోని 'వదతి' ఇత్యాదులలో అని అర్థం. 15

## ధ్వన్యాలోకం

కిం చ -

కా. రూఢా యే విషయేఽన్యత్ర శబ్దాః స్వవిషయాదపి,

లావణ్యాద్యాః ప్రయుక్తాస్తే న భవన్తి పదం ధ్వనేః. 16

తేషు చ ఉపచరితశబ్దవృత్తిః అస్తీతి తథావిధే చ విషయే క్వచిత్ సంభవన్నపి ధ్వనివ్యవహారః ప్రకారాన్తరేణ ప్రవర్తతే. న తథా-విధశబ్దముఖేన.

### బాలానందిని

కిం చేతి - మరొక విషయ మేమనగా- స్వవిషయాత్ = తమ విషయంకంటె, తమ చేత వాచ్యమైన లవణరసయుక్తత్వం మొదలైన అర్థంకంటె, అన్యత్ర = భిన్నమైన, విషయే ఽపి = అర్థంలో కూడ, యే =ఏ, లావణ్యాద్యాః = 'లావణ్య' మొదలైన, శబ్దాః = శబ్దాలు, ప్రయుక్తాః = ప్రయోగించబడినవో (బడుచున్నాయో), రూఢాః =రూఢాలైన, తే = అవి, ధ్వనే : = ధ్వనికి, పదమ్ = స్థానం, న భవన్తి = కావు.

తేషు ఇతి - వాటిలో కూడ ఉపచరితమైన శబ్దవృత్తి ఉంది, అనగా వాటిలో భక్తి ఉంది గాని ధ్వని లేదు అని భావం. తథావిధే ఇతి :- అలాంటి ప్రదేశాలలో కొన్ని చోట్ల 'ధ్వని' అనే వ్యవహారం సంభవించినా (ఉండడానికి అవకాశం ఉన్నా) అది మరొక ప్రకారంచేత ఏర్పడినదే కాని ఆ విధమైన శబ్దాల ద్వారా, (లావణ్యాదిశబ్దాలు ఉండడంచేత) ఏర్పడింది కాదు.

### లోచనం

ఏవం యత్ర ప్రయోజనం సదపి నాదరాస్పదం తత్ర కో ధ్వననవ్యాపారః ఇత్యుక్త్వా యత్ర మూలతః ఏవ ప్రయోజనం నాస్తి, భవతి చ ఉపచారః

తత్రాపి కో ధ్వననవ్యాపారః ఇత్యాహ కించేతి. లావణ్యాద్యా యే శబ్దాః స్వవిషయాత్, లవణరసయుక్తత్వాదేః స్వార్థాత్, అన్యత్ర హృద్యత్వాదౌ రూఢాః, రూఢత్వాదేవ త్రితయసంనిధ్యపేక్షణవ్యవధానశూన్యాః, యదాహ-

"నిరూఢా లక్షణాః కాశ్చిత్సామర్థ్యాదభిధానవత్"

ఇతి, తే తస్మిన్ స్వవిషయాదన్యత్ర ప్రయుక్తా అపి న ధ్వనేః పదం భవన్తి; న తత్ర ధ్వనివ్యవహారః. ఉపచరితా శబ్దస్య వృత్తిః గౌణీ లాక్షణికీ చ ఇత్యర్థః. ఆదిగ్రహణేన 'ఆనులోమ్యమ్' 'ప్రాతికూల్యమ్' 'సబ్రహ్మచారీ' ఇత్యేవమాదయః శబ్దాః లాక్షణికాః గృహ్యన్తే. లోమ్నామ్ అనుగతమ్ అనులోమం మర్దనమ్ ః కూలస్య ప్రతిపక్షతయా స్థితం స్రోతః ప్రతికూలమ్, తుల్యగురుః సబ్రహ్మచారీ ఇతి ముఖ్యో విషయః; అన్యః పునః ఉపచరిత ఏవ. న చాత్ర ప్రయోజనం కిం చిదుద్దిశ్య లక్షణా ప్రవృత్తేతి న తద్విషయో ధ్వనన వ్యవహారః.

నను " దేవడితి లుణాహి పలుత్రమ్మిగమి జ్వాలవణుజ్జ్వలం గుమరిపోల్లపరణ్య'' ఇత్యాదౌ లావణ్యాదిశబ్దసంనిధానే అస్తి ప్రతీయమానాభివ్యక్తిః? సత్యమ్, సా తు న లావణ్యశబ్దాత్. అపి తు సమగ్ర వాక్యార్థ ప్రతీత్యనన్తరం ధ్వననవ్యాపారాదేవ. అత్ర హి ప్రియతమాముఖస్యైవ సమస్తాశాప్రకాశకత్వం ధ్వన్యతే ఇత్యలం బహునా. తదాహ - ప్రకారాన్తరేణేతి. వ్యఞ్జకత్వేనైవ, న తు ఉపచరితలావణ్యాదిశబ్దప్రయోగాదిత్యర్థః. 16

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా - ఎక్కడైతే ప్రయోజనం ఉన్నా అది ఆదరించతగినది కాదో అక్కడ ధ్వననవ్యాపారం ఏముంటుంది అని చెప్పి, ఇప్పుడు- ఎక్కడైతే ప్రయోజనం అసలే ఉండదో, ఉపచారం మాత్రం ఉంటుందో అక్కడ కూడా ధ్వనన వ్యాపారం ఏమి ఉంటుంది అని కించ ఇత్యాదికంతో చూపుతున్నాడు. లావణ్యేతి - "లావణ్య" మొదలైన ఏ శబ్దాలు, స్వవిషయాత్ - లవణరసంతో కూడి ఉండడం మొదలైన తమ స్వార్థంకంటె, భిన్నమైన హృద్యత్వం (మనోహరత్వం) మొదలైన అర్థాలలో రూఢాలో, ఆ విధంగా రూఢా లవడంచేత, "నిరూఢాః" ఇత్యాదివాక్యంలో చెప్పినట్లు ముఖ్యార్థబాధ, ముఖ్యార్థ సంబంధం, ప్రయోజనం అనే మూడింటి సాంనిధ్యాన్ని అపేక్షించడం అనే వ్యవధానంతో

శూన్యాలో, ఆ శబ్దాలు స్వార్థంకంటె భిన్నమైన అర్థాలలో ప్రయోగింపబడినా కూడ ధ్వనికి స్థానం కావు. అందుచేత ఆ పదాలను ప్రయోగించినచోట ధ్వని అనే వ్యవహారం ఉండదు.

వివరణ:- లావణ్య మొదలైన శబ్దాల వాచ్యార్థం లవణరసం కలిగి ఉండడం మొ. అయితే అవి ఆ స్వార్థంకంటె భిన్నమైన మనోహరంగా ఉండడం మొదలైన అర్థాలను రూఢిచేత బోధిస్తూంటాయి. అవి ఆ అర్థాలలో రూఢాలైపోవడంచేత లక్షణకి కావలసిన ముఖ్యార్థబాధాదిత్రయాపేక్ష వాటికి లేదు. అయినా వీటిని లాక్షణిక శబ్దాలని అంటారు. నిరూఢాః ఇత్యాది కారికార్థం ఈ విషయమే చెపుతున్నది. " కాశ్చిత్ లక్షణాః= కొన్ని లక్షణలు, సామర్థ్యాత్= నియమంచేత, ఆ యా అర్థాలను బోధించడానికే ప్రయోగించబడడం అనే సామర్థ్యంవల్ల, అభిధానవత్ = అభిధవలె, నిరూఢాః = నిరూఢమైనవి. ఆ యా అర్థాలను రూఢపదాల వలె బోధిస్తూంటాయి" అని దీని అర్థం. ఈ విధంగా ఈ పదాలు స్వార్థంకంటె భిన్నమైన అర్థాన్ని బోధించడానికి ప్రయోగించబడినా కూడ, అనగా ఒక విధంగా వీటిలో ఉపచారం ఉన్నా కూడ, అవి ధ్వనికి స్థానాలు కావు. అందుచేతనే అలాంటి చోట ధ్వని ఉన్నదని అనకూడదు అని భావం.

ఉపచరితేతి - " ఉపచరితశబ్దవృత్తిః" అనే పదంలో చెప్పిన ఉపచరితశబ్దవృత్తి (అనగా) శబ్దంలో ఉన్న ఉపచరితమైన వృత్తి; అది 'గౌణి' కావచ్చు 'లాక్షణికి' కావచ్చును అని అర్థం.' 'లావణ్యాద్యాః' అని 'ఆది' పదం ప్రయోగించడంచేత 'ఆనులోమ్యమ్' 'ప్రాతికూల్యమ్' సబ్రహ్మచారిన్ ఇత్యాదిలాక్షణిక శబ్దాలు గ్రహించబడతాయి. "లోమాలకు అనుగతమైన" అనగా శరీరంమీద ఉన్న రోమాలు ఎటువైపు వంగి ఉన్నాయో అటు వైపు చేసే శరీరమర్దనం 'అనులోమం'-ఒడ్డుకు ఎదుర్గా ఉన్న ప్రవాహం 'ప్రతికూలం' సమానమైన గురువు గలవాడు' సబ్రహ్మచారి' ఇవి ముఖ్యార్థాలు. వీటికి చెప్పే ఇతరార్థాలు ఉపచరితార్థాలు. అయితే ఇక్కడ ఈ లక్షణ ఏ ప్రయోజనాన్నీ ఉద్దేశించి ప్రవర్తించడం లేదు. అందుచేత ఆ ప్రయోజనం బోధించడానికై ధ్వననవ్యాపారం ఏదీ లేదు.

నను ఇతి. (ఆశంక) లావణ్యాది శబ్దాలున్న 'దేవడితి' ఇత్యాది వాక్యాలలో వ్యంగ్యార్థ ప్రతీతి ఉన్నది కదా? (సమాధానం) నిజమే; ఉంది. ఆ వ్యంగ్యార్థప్రతీతి 'లావణ్య' శబ్దం ఉండడం మూలాన కాదు. మరేమనగా సమగ్రమైన వాక్యార్థం తెలిసిన తరువాత పనిచేయడం ప్రారంభించిన ధ్వననవ్యాపారంవల్లనే ఈ వ్యంగ్యార్థ ప్రతీతి కలుగుతున్నది. ఇక్కడ "ప్రియురాలి ముఖమే సమస్తదిక్కులను ప్రకాశింప

చేస్తున్నది" అనేది వ్యంగ్యార్థం కదా? సరే ఇంతటితో ఈ చర్చ చాలు. ఈ విషయాన్నే "ప్రకారాన్తరేణ' అనే దానిచేత చెపుతున్నాడు. వ్యంజకత్వం కూడా ఉండడంవల్లనే అక్కడ 'ధ్వని' అనే పేరు ఉపయోగిస్తున్నాం కాని 'లావణ్య' మొదలైన ఉపచరితశబ్దాల ప్రయోగంవల్ల కాదు అని అర్థం. 16

## ధ్వన్యాలోకం

అపి చ-

కా. ముఖ్యాం వృత్తిం పరిత్యజ్య గుణవృత్త్యార్థదర్శనమ్,
యదుద్దిశ్య ఫలం తత్ర శబ్దో నైవ స్ఖలద్గతిః 17

తత్ర హి చారుత్వాతిశయప్రకాశనలక్షణే ప్రయోజనే కర్తవ్యే యది శబ్దస్యాముఖ్యతా తదా తస్య ప్రయోగే దుష్టతైవ స్యాత్. న చైవమ్.

### బాలానందిని

యత్ ఫలమ్ = ఏ ఫలాన్ని, ఉద్దిశ్య = ఉద్దేశించి, ముఖ్యామ్ = ముఖ్యమైన, వృత్తిమ్ = వృత్తిని (అభిధావృత్తిని), పరిత్యజ్య = విడచి, గుణవృత్త్యా = గుణవృత్తిచేత, అర్థదర్శనమ్ = అర్థప్రతిపాదనం చేయబడుతున్నదో, తత్ర = దాని విషయంలో, శబ్దః= శబ్దం, స్ఖలద్గతిః - తొట్రుపాటు చెందుతున్న గమనం కలది, ప్రవర్తించనిది, నైవ = కాదు.

తత్రేతి - అక్కడ చారుత్వాతిశయంతో కూడిన అర్థాన్ని ప్రకాశింపచేయడం అనే లక్షణం గల ప్రయోజనం చేయవలసి ఉండగా, సాధించవలసి ఉండగా, శబ్దానికి ముఖ్యత్వం లేకపోతే, (అనగా శబ్దం అందుకు ఉపకరించకపోతే) అది దుష్టమే అవుతుంది. (కాని) అలాంటిది ఏమీ లేదు.

### లోచనం

ఏవం యత్ర యత్ర భక్తిః తత్ర తత్ర ధ్వనిరితి తావత్ నాస్తి. తేన యది ధ్వనేః భక్తిః లక్షణం తదా భక్తిసంనిధౌ సర్వత్ర ధ్వనివ్యవహారః స్యాత్ ఇత్యతివ్యాప్తిః. అభ్యుపగమ్యాపి బ్రూమః - భవతు యత్ర యత్ర భక్తి స్తత్ర తత్ర ధ్వనిః; తథాపి యద్విషయో లక్షణావ్యాపారః న తద్విషయః ధ్వనన వ్యాపారః. న చ భిన్నవిషయయోః ధర్మధర్మిభావః. ధర్మ ఏవ చ

లక్షణమిత్యుచ్యతే. తత్ర లక్షణా తావత్ అముఖ్యార్థవిషయో వ్యాపారః. ధ్వననం చ ప్రయోజనవిషయమ్. న చ తద్విషయోఽపి ద్వితీయః లక్షణా వ్యాపారః యుక్తః; లక్షణాసామగ్ర్యభావాత్ ఇత్యభిప్రాయేణాహ - అపిచేత్యాది.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ఎక్కడెక్కడ భక్తి ఉంటుందో అక్క డల్లా ధ్వని ఉంటుంది అనే దైతే లేదు. అందుచేత భక్తి ధ్వనికి లక్షణం అన్నట్లయితే భక్తి ఉన్న చోట్లన్నింటిలోనూ ధ్వనివ్యవహారం ఉండవలసి ఉంటుంది గాన అతివ్యాప్తి దోషం. పోనీ మీ వాదాన్ని అంగీకరించే మాట్లాడతాం- ఎక్క డెక్కడ భక్తి ఉంటుందో అక్కడల్లా ధ్వని ఉంటుందని అయితే అగుగాక. అయినా కూడ లక్షణావ్యాపారం ఏది విషయంగా గలదో ధ్వననవ్యాపారం అదే విషయం గలది కాదు. అనగా లక్షణావ్యాపారానికి ఏది విషయమో ధ్వననవ్యాపారానికి కూడా అదే విషయం కాదు. వేరు వేరు విషయాలు కలవాటికి ధర్మధర్మిభావం ఉండదు. ధర్మాన్నే లక్షణం అంటాం. ఆ రెండింటిలో లక్షణ అముఖ్యార్థవిషయమైన వ్యాపారం, అనగా లక్షణావ్యాపారానికి విషయం తీరాద్యముఖ్యార్థం. ధ్వననం ప్రయోజనం విషయంగా గలది, అనగా ధ్వననవ్యాపారానికి విషయం ప్రయోజనం. అందుచేత భక్తికి (లక్షణకి) విషయం వేరు ధ్వననానికి విషయం వేరు అవడంచేత భక్తి ధ్వననానికి ధర్మం కాజాలదు. ధ్వననం భక్తికి ధర్మి (ధర్మానికి ఆశ్రయం ధర్మి) కాజాలదు. ధర్మధర్మిభావం లేనప్పుడు ఒకటి మరొకదానికి లక్షణం ఎలా అవుతుంది? గంధవత్త్వం అనేది పృథివిలో ఉన్న ధర్మం. అందుచేత అది పృథివికి లక్షణం అయింది. అలాంటిది ఇక్కడ లేదు కదా అని భావం.

న చేతి - ప్రయోజనం విషయంగా గల రెండవ లక్షణావ్యాపారాన్ని అంగీకరించడం యుక్తం కాదు. ఎందుచేత ననగా - లక్షణకి అవసరమైన ముఖ్యార్థబాధాది సామగ్రి లేదు అని అపి చ ఇత్యాదికం చేత ప్రతిపాదిస్తున్నాడు.

లోచనం

ముఖ్యాం వృత్తిమ్ అభిధావ్యాపారం పరిత్యజ్య పరిసమాప్య, గుణవృత్త్యా లక్షణారూపయా అర్థస్య అముఖ్యస్య దర్శనం ప్రత్యాయనా, సా యత్ ఫలం ప్రయోజనరూపమ్ ఉద్దిశ్య క్రియతే, తత్ర ప్రయోజనే తావత్ ద్వితీయో వ్యాపారః. న చాసౌ లక్షణైవ. యతః స్ఖలన్తీ బాధకవ్యాపారేణ

విధురీక్రియమాణా, గతిః అవబోధనశక్తిః యస్య శబ్దస్య తదీయః వ్యాపారః లక్షణా. న చ ప్రయోజనమవగమయతః శబ్దస్య బాధకయోగః. తథాభావే తత్రాపి నిమిత్తాన్తరస్య ప్రయోజనాన్తరస్య చ అన్వేషణేన అనవస్థానాత్. తేనాయం లక్షణలక్షణాయాః న విషయః ఇతి భావః. 'దర్శనమ్' ఇతి ణ్యన్తో నిర్దేశః. కర్తవ్య ఇతి. అవగమయితవ్య ఇత్యర్థః. అముఖ్య ఇతి. బాధకేన విధురీకృతతేత్యర్థః. తస్యేతి - శబ్దస్య.

బాలానందిని

ముఖ్యామితి: ముఖ్యాం వృత్తిమ్ = అభిధావ్యాపారాన్ని, పరిత్యజ్య = సమాప్తం చేసి, గుణవృత్త్యా = లక్షణారూపమైన గుణవృత్తిచేత, అముఖ్యార్థం యొక్క, దర్శనమ్ = జ్ఞానం కలిగించడం, యత్ ఫలమ్ = కర్మ యైన ఏ ప్రయోజనరూపమైన ఫలాన్ని, ఉద్దేశించి చేయబడుతుందో ఆ ప్రయోజనం విషయంలో రెండవ వ్యాపారమే (అభిధకంటె భిన్నమైన మరొక వ్యాపారమే) ప్రవర్తించాలి. ఆ వ్యాపారం లక్షణయే అని చెప్పడానికి వీలు లేదు. ఎందుచేత ననగా ఏ శబ్దంయొక్క గతి, అనగా శక్తి, స్ఖలన్తీ = బాధకమైన ప్రమాణంయొక్క వ్యాపారంచేత ప్రతిహత మైపోతుందో, అడ్డుకొనబడుతుందో, అలాంటి శబ్దంయొక్క వ్యాపారం లక్షణ. న చేతి - శబ్దం ప్రయోజనాన్ని బోధించడానికి ఉద్యుక్తం అయినప్పుడు బాధకప్రమాణంతో సంబంధం లేదు. అనగా అది ప్రయోజనాన్ని బోధించడానికి ఉద్యుక్తం అయినప్పుడు బాధకప్రమాణంతో సంబంధం లేదు. అనగా అది ప్రయోజనాన్ని బోధించకుండా అడ్డుకొనే బాధక ప్రమాణం ఏదీ లేదు. తథాభావే ఇతి - అలాంటి బాధకం ఏదైనా ఉన్నా ప్రయోజనాన్ని బోధించడానికి కూడా (తత్రాపి) మరొక నిమిత్తం, అనగా సంబంధం, మరొక ప్రయోజనం, వెదకవలసి ఉంటుంది. (ఆ ద్వితీయప్రయోజనాన్ని బోధించడానికి లక్షణ ఆశ్రయించవలసివస్తే మరొక మూడవ ప్రయోజనం వెదకవలసి వస్తుంది). ఈ విధంగా అనవస్థాదోషం ఏర్పడుతుంది. అందుచేత ఇది (ప్రయోజనరూపార్థం) లక్షణలక్షణకి విషయం కాదు అని భావం. 'దర్శనమ్' అనేది ణ్యన్తమైన (ప్రేరణార్థకణిచ్ ప్రత్యయం చేర్చగా ఏర్పడిన దాని) నిర్దేశం. చూపించడం అని అర్థం. కర్తవ్యే అనగా తెలియచేయవలసినదై ఉండగా అని అర్థం. అముఖ్యతా అనగా బాధక ప్రమాణంచేత ప్రతిహతం అవడం అని అర్థం. తస్య అనగా ఆ శబ్దంయొక్క అని అర్థం.

వివరణ:- లక్షణలక్షణ అనగా ముఖ్యార్థాన్ని పూర్తిగా వదలివేసిన లక్షణ.

"ఉపాదానలక్షణ", "లక్షణలక్షణ" అని లక్షణ రెండు విధాలు. కున్తాః ప్రవిశన్తి' ఇత్యాదులలో కుంతాదిశబ్దాలు కుంతాదిధారులను లక్షణయా బోధిస్తాయి. కుంతాలు స్వయంగా ప్రవేశించజాలవు. అందుచేత వాటిని ధరించేవాళ్లు అని అర్థం చెప్పడం ద్వారా కుంతాలకి ప్రవేశం కుదిరే టట్లు చేయబడింది. అయితే లక్ష్యార్థమైన కుంతధారులతో పాటు ముఖ్యార్థమైన కుంతాలకి కూడా ప్రవేశం ఉంటుంది. దీనికి ఉపాదానలక్షణ అని పేరు. 'గఙ్గాయాం ఘోషః' అనే చోట గంగాప్రవాహం ముఖ్యార్థం, తీరం లక్ష్యార్థం. ఘోషం తీరంమీదనే ఉంటుంది. కాని ప్రవాహంలో ఉండదు. అందుచేత ఘోషాధారత్వానికి సంబంధించినంతవరకు ప్రవాహరూపార్థం పూర్తిగా పరిత్యజించబడుతుంది. ఇది లక్షణలక్షణ.

లోచనం

దుష్టత్రైవేతి. ప్రయోజనావగమస్య సుఖసంపత్తయే హి స శబ్దః ప్రయుజ్యతే తస్మిన్ అముఖ్యార్థే. యది చ "సింహో వటుః" ఇతి శౌర్యాతిశయేఽ ప్యవగమయితవ్యే స్ఖలద్గతిత్వం శబ్దస్య తర్హి తత్ప్రతీతిం నైవ కుర్యాదితి కిమర్థం తస్య ప్రయోగః? ఉపచారేణ కరిష్యతి ఇతి చేత్ తత్రాపి ప్రయోజనాన్తర మన్వేష్యం, తత్రాప్యుపచార ఇతి అనవస్థా. అథ న తత్ర స్ఖలద్గతిత్వం తర్హి ప్రయోజనే అవగమయితవ్యే న లక్షణాఖ్యో వ్యాపారః, తత్సామగ్ర్యభావాత్. న చ నాస్తి వ్యాపారః. న చాసావభిధా, సమయస్య తత్రాభావాత్. యత్ వ్యాపారాన్తరమ్ అభిధాలక్షణాతిరిక్తం స ధ్వననవ్యాపారః. న చైవమితి - న చ ప్రయోగే దుష్టతా కాచిత్, ప్రయోజనస్య అవిఘ్నేనైవ ప్రతీతేః. తేన అభిధైవ ముఖ్యేఽర్థే బాధకేన ప్రవివిత్సుః నిరుధ్యమనా సతీ అచరితార్థత్వాత్ అన్యత్ర ప్రసరతి. అత ఏవ అముఖ్యోఽ స్యాయమర్థ ఇతి వ్యవహారః. తథైవ చాముఖ్యతయా సఙ్కేతగ్రహణమపి తత్రాస్తీత్యభిధాపుచ్ఛభూతైవ లక్షణా . 17

బాలానందిని

దుష్టత్రైవేతీతి : ప్రయోజనేతి- ప్రయోజనజ్ఞానం, అనగా శౌర్యాతిశయాదుల జ్ఞానం, అనాయాసంగా కలగడంకొరకే కదా ఆ శబ్దం (సింహాదిశబ్దం) ఆ అముఖ్యార్థంలో (వట్వాద్యర్థంలో) ప్రయోగించబడుతున్నది? అలాంటప్పుడు 'సింహో వటుః' అనే

భక్తిర్భవేన్న స్యాదతివ్యాప్తిః. న చైవమ్; అవివక్షితవాచ్యేఽస్తి భక్తిః " సువర్ణ పుష్పామ్" ఇత్యాదౌ. "శిఖరిణి" ఇత్యాదౌ తు సా కథమ్?

నను లక్షణా తావద్గౌణమపి వ్యాప్నోతి. కేవలం శబ్దస్తమర్థం లక్షయిత్వా తేనైవ సహ సామానాధికరణ్యం భజతే "సింహో వటుః" ఇతి. అర్థో వార్థాన్తరం లక్షయిత్వా స్వవాచకేన తద్వాచకం సమానాధికరణం కరోతి. శబ్దార్థౌ వా యుగపత్తం లక్షయిత్వా అన్యాభ్యామేవ శబ్దార్థాభ్యాం మిశ్రీభవతః ఇత్యేవం లాక్షణికాద్ గౌణస్య భేదః. యదాహ- "గౌణే శబ్దప్రయోగః న లక్షణాయామ్" ఇతి. తత్రాపి లక్షణా అస్త్యేవేతి సర్వత్ర సైవ వ్యాపికా.

బాలానందిని

ఉపసంహరతీతి. 'తస్మాత్' ఇత్యాదివాక్యంచేత ఈ విషయాన్ని ఉపసంహరిస్తున్నాడు (ముగిస్తున్నాడు). యతః ఇతి - లక్షణ అభిధకు పుచ్ఛం మాత్రం అయి ఉండడంవల్ల వాచకత్వాన్ని, అనగా అభిధావ్యాపారాన్ని ఆశ్రయించి ఉంటుంది. ఆ అభిధావ్యాపారానికి బాధ కలగడంచేత ఇది లేస్తూండడంచేత, దానికి పుచ్ఛం అవడంచేత, గుణవృత్తి, అనగా, గౌణలాక్షణికప్రకారం, వ్యంజనారూపమైన ధ్వనికి లక్షణం ఎలా అవుతుంది? ఆ రెండింటి విషయాలు వేరు వేరైనవి కదా? ఈ విషయాన్ని తస్మాదిత్యాది వాక్యంచేత ఉపసంహరిస్తున్నాడు. అతివ్యాప్తి చెప్పబడింది; వీటి విషయాలు భిన్నమైనవి అని కూడా చెప్పబడింది. అందువల్ల అని అర్థం.

ఏవమ్ ఇతి: ఈ విధంగా " అతివ్యాప్తేరథావ్యాప్తేర్న చాఽసౌ లక్ష్యతే తయా" అనే కారికలో చెప్పిన అతివ్యాప్తిని విశదీకరించి ఇప్పుడు అవ్యాప్తిరస్యేత్యాదివాక్యం చేత అవ్యాప్తిని విశదీకరిస్తున్నాడు. అస్య అనగా గుణవృత్తిరూపమైన అని అర్థం. యత్రేతి- ఎక్క డెక్కడ ధ్వని ఉంటుందో అక్క డల్లా భక్తి ఉంటే అవ్యాప్తి ఉండదు. కాని ఇది ఇలా లేదు " సువర్ణపుష్పామ్" ఇత్యాది అవివక్షితవాచ్యస్థలంలో భక్తి ఉంది. కాని "శిఖరిణి" ఇత్యాది శ్లోకంలో అది ఎలా ఉంటుంది?

గౌణస్థలంలో కూడ లక్షణ ప్రసరిస్తుంది గాన వివక్షితాన్యపరవాచ్యోదాహరణంగా చూపిన " శిఖరిణి" ఇత్యాదికంలో కూడా అది (లక్షణ) ఉండనే ఉంది కదా? అక్కడ అది లేదని చెప్పడం అసంగతం కదా అని ఆశంకించి, ఆ ప్రకారంగా అంగీకరించినా కూడ "వివక్షితాన్యపరవాచ్య" ఇత్యాది వృత్తికారగ్రంథాన్ని వ్యాఖ్యానించడానికై ముందు ఆ పూర్వపక్షం ప్రతిపాదిస్తున్నాడు - నన్వితి. గౌణం ఉన్న స్థానాన్ని కూడ లక్షణ

## ధ్వన్యాలోకం

తస్మాత్ -

కా. వాచకత్వాశ్రయేణైవ గుణవృత్తిర్వ్యవస్థితా,
వ్యఞ్జకత్వైకమూలస్య ధ్వనేః స్యాల్లక్షణం కథమ్. 18

తస్మాదన్యో ధ్వనిః అన్యా చ గుణవృత్తిః. అవ్యాప్తిరప్యస్య లక్షణస్య. న హి ధ్వనిప్రభేదః వివక్షితాన్యపరవాచ్యలక్షణః, అన్యే చ బహవః తద్భేదప్రకారాః భక్త్యా వ్యాప్యన్తే. తస్మాద్భక్తిరలక్షణమ్.

### బాలానందిని

తస్మాదితి - అందువల్ల, వాచకత్వేతి :- వాచకత్వాశ్రయేణైవ = వాచకత్వాన్నే (అభిధనే) ఆశ్రయించడంచేత, వ్యవస్థితా = ఉన్న, గుణవృత్తిః = గుణవృత్తి, భక్తి, లక్షణ, వ్యఞ్జకత్వైకమూలస్య = వ్యంజకత్వం అనేది ఒక్కటే మూలంగా గల, ధ్వనేః= ధ్వనియొక్క, లక్షణమ్ = లక్షణం, కథం స్యాత్ = ఎట్లవుతుంది?

తస్మాదితి = అందువలన ధ్వని వేరు గుణవృత్తి వేరు. ఈ లక్షణానికి అవ్యాప్తి కూడా ఉంది. వివక్షితాన్యపరవాచ్యం అనే ధ్వనిప్రభేదమూ, ఇతర మైన ఎన్నో ధ్వనిభేదాలూ భక్తిచేత వ్యాపింపబడడం లేదు గదా - వాటిలో భక్తి లేదు కదా? అందువల్ల భక్తి ధ్వనికి లక్షణం కాజాలదు.

### లోచనం

ఉపసంహరతి - తస్మాదితి. యతః అభిధాపుచ్ఛభూతైవ లక్షణా తతో హేతోః వాచకత్వమ్ అభిధావ్యాపారమ్ ఆశ్రితా, తద్బాధనేన ఉత్థానాత్ తత్పుచ్ఛభూతత్వాచ్చ గుణవృత్తిః, గౌణలాక్షణికప్రకార ఇత్యర్థః, సా కథం ధ్వనేః వ్యఞ్జనాత్మనః లక్షణం స్యాత్? భిన్నవిషయత్వాదితి. ఏతదుపసంహరతి - తస్మాదితి - యతః అతివ్యాప్తిరుక్తా. తత్ప్రసఙ్గేన చ భిన్నవిషయత్వం తస్మాదిత్యర్థః. ఏవమ్ - "అతివ్యాప్తేరథావ్యాప్తేర్న చాసౌ లక్ష్యతే తయా" ఇతి కారికాగతాతివ్యాప్తిం వ్యాఖ్యాయ అవ్యాప్తిం వ్యాచష్టే - అవ్యాప్తిరప్యస్యేతి. అస్య గుణవృత్తిరూపస్యేత్యర్థః. యత్ర యత్ర ధ్వనిస్తత్ర తత్ర యది

భక్తిర్భవేన్న స్యాదతివ్యాప్తిః. న చైవమ్; అవివక్షితవాచ్యేఽస్తి భక్తిః " సువర్ణ పుష్పామ్" ఇత్యాదౌ. "శిఖరిణి" ఇత్యాదౌ తు సా కథమ్?

నను లక్షణా తావద్గౌణమపి వ్యాప్నోతి. కేవలం శబ్దస్తమర్థం లక్షయిత్వా తేనైవ సహ సామానాధికరణ్యం భజతే "సింహో వటుః" ఇతి. అర్థో వార్థాన్తరం లక్షయిత్వా స్వవాచకేన తద్వాచకం సమానాధికరణం కరోతి. శబ్దార్థౌ వా యుగపత్తం లక్షయిత్వా అన్యాభ్యామేవ శబ్దార్థాభ్యాం మిశ్రీభవతః ఇత్యేవం లాక్షణికాద్ గౌణస్య భేదః. యదాహ- "గౌణే శబ్దప్రయోగః న లక్షణాయామ్" ఇతి. తత్రాపి లక్షణా అస్త్యేవేతి సర్వత్ర సైవ వ్యాపికా.

బాలానందిని

ఉపసంహరతీతి. 'తస్మాత్' ఇత్యాదివాక్యంచేత ఈ విషయాన్ని ఉపసంహరిస్తున్నాడు (ముగిస్తున్నాడు). యతః ఇతి - లక్షణ అభిధకు పుచ్ఛం మాత్రం అయి ఉండడంవల్ల వాచకత్వాన్ని, అనగా అభిధావ్యాపారాన్ని ఆశ్రయించి ఉంటుంది. ఆ అభిధావ్యాపారానికి బాధ కలగడంచేత ఇది లేస్తూండడంచేత, దానికి పుచ్ఛం అవడంచేత, గుణవృత్తి, అనగా, గౌణలాక్షణికప్రకారం, వ్యంజనారూపమైన ధ్వనికి లక్షణం ఎలా అవుతుంది? ఆ రెండింటి విషయాలు వేరు వేరైనవి కదా? ఈ విషయాన్ని తస్మాదిత్యాది వాక్యంచేత ఉపసంహరిస్తున్నాడు. అతివ్యాప్తి చెప్పబడింది; వీటి విషయాలు భిన్నమైనవి అని కూడా చెప్పబడింది. అందువల్ల అని అర్థం.

ఏవమ్ ఇతి: ఈ విధంగా " అతివ్యాప్తేరథావ్యాప్తేర్న చాఽసౌ లక్ష్యతే తయా" అనే కారికలో చెప్పిన అతివ్యాప్తిని విశదీకరించి ఇప్పుడు అవ్యాప్తిరస్యేత్యాదివాక్యం చేత అవ్యాప్తిని విశదీకరిస్తున్నాడు. అస్య అనగా గుణవృత్తిరూపమైన అని అర్థం. యత్రేతి- ఎక్క డెక్కడ ధ్వని ఉంటుందో అక్క డల్లా భక్తి ఉంటే అవ్యాప్తి ఉండదు. కాని ఇది ఇలా లేదు " సువర్ణపుష్పామ్" ఇత్యాది అవివక్షితవాచ్యస్థలంలో భక్తి ఉంది. కాని "శిఖరిణి" ఇత్యాది శ్లోకంలో అది ఎలా ఉంటుంది?

గౌణస్థలంలో కూడ లక్షణ ప్రసరిస్తుంది గాన వివక్షితాన్యపరవాచ్యోదాహరణంగా చూపిన " శిఖరిణి" ఇత్యాదికంలో కూడా అది (లక్షణ) ఉండనే ఉంది కదా? అక్కడ లేదని చెప్పడం అసంగతం కదా అని ఆశంకించి, ఆ ప్రకారంగా అంగీకరించినా త "వివక్షితాన్యపరవాచ్య" ఇత్యాది వృత్తికారగ్రంథాన్ని వ్యాఖ్యానించడానికై ముందు ఆ పూర్వపక్షం ప్రతిపాదిస్తున్నాడు - నన్వితి. గౌణం ఉన్న స్థానాన్ని కూడ లక్షణ

వ్యాపిస్తుంది కదా. అనగా గౌణవృత్తిస్థలాలలో కూడ లక్షణ ఉంటుంది కదా? గౌణ స్థలంలో ఉన్న విశేషం అల్లా ఏమనగా - 'సింహ' శబ్దం ఆ అర్థాన్ని (వటురూపార్థాన్ని) లక్షణయా బోధించి "సింహో వటుః" అని దానితోనే (వటు శబ్దంతోనే) సామానాధికరణ్యాన్ని పొందుతుంది. (రెండు శబ్దాలు వేరు వేరు రూపాలలో ఒకే విషయాన్ని (వస్తువును) బోధించడానికి సామానాధికరణ్యం అని పేరు). అర్థో వా ఇతి:- లేదా 'సింహం" అనే అర్థం 'వటువు' అనే మరొక అర్థాన్ని లక్షణయా బోధించి స్వవాచకమైన 'సింహ' శబ్దం తద్వాచకమైన 'వటు' శబ్దంతో సమానాధికరణం అయే టట్లు చేస్తుంది. శబ్దార్థౌ వా ఇతి:- లేదా 'సింహ' శబ్దం, సింహం అనే అర్థం ఈ రెండూ కలిసి 'వటువు' అనే అర్థాన్ని లక్షణయా బోధించి ఇతరశబ్దార్థాలతో (సింహశబ్దతదర్థాలతో) మిశ్రం అవుతాయి. (శబ్దాలు మిశ్రం అవడం అనగా రెండూ ఒకే ధర్మిని బోధించడం. అర్థాలు మిశ్రం అవడం అనగా అభేదాన్వయం పొందడం). లాక్షణికంకంటె గౌణానికి ఉన్న భేదం ఇదే కదా? "గౌణంలో లక్ష్యవాచకపదం (వటుః ఇత్యాదికం) ప్రయోగించబడుతుంది. లక్షణలో అది ప్రయోగించబడదు" అని అంటారు కదా? ఈ విధంగా గౌణ స్థలంలో కూడ లక్షణ ఉండనే ఉంటుంది కాబట్టి అంతటా అది వ్యాపించి ఉంటుంది.

లోచనం

సా చ పఞ్చవిధా - తద్యథా - అభిధేయేన సంయోగాత్, ద్విరేఫశబ్దస్య హి యః అభిధేయః భ్రమరశబ్దః ద్వౌ రేఫౌ యస్యేతి కృత్వా, తేన భ్రమర శబ్దేన యస్య సంయోగః సమ్బన్ధః షట్పదలక్షణార్థస్య సో ఽర్థో ద్విరేఫశబ్దేన లక్ష్యతే; అభిధేయసంబన్ధం వ్యాఖ్యాతరూపం నిమిత్తీకృత్య. సామీప్యాత్ "గఙ్గాయాం ఘోషః". సమవాయాదితి సంబన్ధాదిత్యర్థః, "యష్టీః ప్రవేశయ" ఇతి యథా. వైపరీత్యాత్ యథా - శత్రుముద్దిశ్య కశ్చిత్ బ్రవీతి "కిమివ ఉపకృతం న తేన మమ" ఇతి. క్రియాయోగాదితి - కార్యకారణభావాదిత్యర్థః. యథా అన్నాపహారిణి వ్యవహారః "ప్రాణానయం హరతి" ఇతి. ఏవమనయా లక్షణయా పఞ్చవిధయా విశ్వమేవ వ్యాప్తమ్.

బాలానందిని

సా చేతి : "అభిధేయేన సంయోగాత్సామీప్యాత్సమవాయతః,
వైపరీత్యాత్ క్రియాయోగాల్లక్షణా పఞ్చధా స్మృతా"

అన్న పూర్వోదాహృతశ్లోకాన్ని సోదాహరణంగా వివరిస్తూ లక్షణ ఐదు విధాలు

అనే విషయం నిరూపిస్తున్నాడు - ఆ లక్షణ ఐదు విధాలు. అదెట్లనగా "అభిధేయేన సంయోగాత్", "ద్వౌ రేఫౌ యస్య" (దేనిలో రెండు రేఫలు ఉన్నవో అది) అనే విగ్రహంచేత " ద్విరేఫ" శబ్దానికి 'భ్రమర' శబ్దం అర్థం. ఆ 'భ్రమర' శబ్దంతో తుమ్మెద అనే అర్థానికి సంయోగం అనగా సంబంధం, ఉంది. ఆ సంబంధాన్ని పట్టి "ద్విరేఫ" శబ్దం లక్షణచేత 'తుమ్మెద' అనే అర్థాన్ని బోధిస్తుంది. ఇందుకు నిమిత్తం పైన చెప్పినట్లుగా అభిధేయంతో (భ్రమరశబ్దంతో) సంబంధమే, "గఙ్గాయాం ఘోషః" అన్నచోట సామీప్యాన్ని పురస్కరించుకొని లక్షణ. సమవాయాత్ అనగా సంబంధం వలన అని అర్థం. ఉదాహరణ - "యష్టీః ప్రవేశయ" (కఱ్ఱలను లోనికి ప్రవేశపెట్టుము) (ఇక్కడ కఱ్ఱలతో సంబంధం ఉండడంవల్ల 'యష్టి' శబ్దం యష్టిధారుల్ని లక్షణయా బోధిస్తుంది) వైపరీత్యం వల్ల ఎట్లనగా - శత్రువుని గూర్చి ఒకడు "అతడు నాకు ఎంత ఉపకారం చెయ్యలేదు?" అని అంటాడు. (ఇక్కడ "ఉపకృతమ్" అనేది విపరీతలక్షణచేత 'అపకృతమ్' అనే అర్థాన్ని బోధిస్తుంది). "క్రియాయోగాత్" అనగా - "కార్యకారణభావంవల్ల" అని అర్థం. ఎట్లనగా - అన్నం అపహరించిన వాణ్ణి గూర్చి "వీడు ప్రాణాలు హరిస్తున్నాడు" అని అంటాం. ఈ విధంగా ఐదు విధాలైన లక్షణచేత (అముఖ్యవ్యవహారగోచరమైన) సమస్తమూ కూడ వ్యాప్తమై ఉన్నది. అనగా అముఖ్యార్థాన్ని గ్రహించవలసిన ప్రతి ఉదాహరణలోనూ కూడా ఈ ఐదు విధాల లక్షణలలో ఏదో ఒకటి ఉండి తీరుతుంది అని భావం.

ప్రథమోద్ద్యోతంలోని రెండవ కారిక క్రింద ఈ శ్లోకం మరొక విధంగా ఉంది.

"అభిధేయేన సామీప్యాత్సారూప్యాత్సమవాయతః,
వైపరీత్యాత్ క్రియాయోగాల్లక్షణా పఞ్చధా మతా"

ఇక్కడ లోచనకారుడు చేసిన వ్యాఖ్యను పట్టి "సారూప్యాత్" అనేది లేదు. కాని తరువాతి వాక్యంలోనే "తథాహి. సాదృశ్యలక్షణా అస్త్యేవ" అని ఆయనే వ్రాస్తున్నాడు. అందుచేత ఈ కారికలో 'సాదృశ్యాత్' లేదా "సారూప్యాత్" అనేది కూడా ఉండాలి.

లోచనం

తథాహి - 'శిఖరిణి' ఇత్యత్ర ఆకస్మికప్రశ్నవిశేషాదిబాధకానుప్రవేశే సాదృశ్యాత్ లక్షణా అస్త్యేవ. నన్వత్ర అఙ్గీకృతైవ మధ్యే లక్షణా? కథం తర్హి ఉక్తమ్ వివక్షితాన్యపరేతి? తద్భేదో ఽత్ర ముఖ్యః అసంలక్ష్యక్రమాత్మా వివక్షితః. తద్భేదశబ్దేన చ రసభావతదాభాసతత్ప్రశమభేదాః తదవాన్తరభేదాశ్చ; న చ

తత్ర లక్షణయా ఉపపత్తిః. తథాహి - విభావానుభావప్రతిపాదకే కావ్యే ముఖ్యేఽర్థే తావత్ బాధకానుప్రవేశోఽపి అసంభావ్య ఇతి కో లక్షణావకాశః?

బాలానందిని

తథాహి ఇతి - అది యుక్తమే కదా? (ఈవిధంగా) "శిఖరిణి" ఇత్యాదిశ్లోకంలో ఆకస్మికంగా ఒక విశిష్టపద్ధతిలో ప్రశ్నించడం మొదలైన బాధకాలకు (ముఖ్యార్థ బాధకాదులకు) అనుప్రవేశం ఉండడంచేత, సాదృశ్యంవల్ల లక్షణ తప్పక ఉంది. అందుచేత వివక్షితాన్యపరవాచ్యంలో భక్తి లేదు అనడం యుక్తం కాదు అని పూర్వపక్షం. లక్షణ ఉందని అంగీకరిస్తూ వృత్తిలో చెప్పినదానిని మరొకవిధంగా సమర్థిస్తున్నాడు- (సిద్ధాంతి ప్రశ్న) నన్వితి. మధ్యలో లక్షణ ఉందని (వెనుక) మేమే అంగీకరించాం కదా? (పూర్వపక్షి ప్రశ్న) అయితే మరి 'వివక్షితాన్యపరవాచ్య' అని (వృత్తిలో) ఎలా చెప్పారు? (సమాధానం చెపుతున్నాడు) ఇక్కడ 'వివక్షితాన్యపరవాచ్య' అనడంచేత అసంలక్ష్యక్రమ రూపమైన దాని ముఖ్యభేదం వివక్షితమైనది (చెప్పడానికి ఉద్దేశింపబడింది). "తద్భేద ప్రకారాః' అని 'తద్భేద' శబ్దంచేత రస-భావ- రసాభాస - భావాభాస - భావప్రశమాది భేదాలు, వాటి అవాంతరభేదాలైన శృంగారాదులు వివక్షితమైనవి. వాటిలో లక్షణకు ఉపపత్తి లేదు కదా? ఎందుచేతననగా విభావానుభావాలను ప్రతిపాదించే కావ్యంలో, ముఖ్యార్థం విషయంలో బాధకానికి అనుప్రవేశం కూడా ఉండదు. అలాంటప్పుడు లక్షణకి అవకాశం ఏముంది?

లోచనం

నను కిం బాధయా? ఇయదేవ లక్షణాస్వరూపమ్" "అభిధేయా వినాభూతప్రతీతిర్లక్షణోచ్యతే" ఇహ చాభిధేయానాం విభావానుభావాదీనామ్ అవినాభూతా రసాదయ ఇతి లక్ష్యన్తే. విభావానుభావయోః కారణకార్యరూపత్వాత్; వ్యభిచారిణాం చ తత్సహ కారిత్వాత్ ఇతి చేత్ మైవమ్. ధూమశబ్దాత్ ధూమే ప్రతిపన్నే హి అగ్ని స్మృతిరపి లక్షణాకృతైవ స్యాత్. తతః అగ్నేః శీతాపనోదస్మృతిః ఇత్యాదిరపర్యవసితః శబ్దార్థః స్యాత్. ధూమశబ్దస్య స్వార్థవిశ్రాన్తత్వాత్ న తావతి వ్యాపారః ఇతి చేత్, ఆయాతం తర్హి ముఖ్యార్థబాధో లక్షణాయా జీవితమితి. సతి తస్మిన్ స్వార్థవిశ్రాన్త్యభావాత్. న చ విభావాదిప్రతిపాదనే బాధకం కించిదస్తి.

బాలానందిని

(ఆశంక) నను ఇతి - బాధ ఎందుకు? (ముఖ్యార్థబాధ ఉండాలనే నియమం ఏమిటి) "వాచ్యార్థంతో అవినాభూతమైన (విడిచి ఉండకుండా వాచ్యార్థంతో కలిసి ఉన్న ) మరొక అర్థం యొక్క ప్రతీతియే (జ్ఞానమే) లక్షణ అని చెప్పబడుతుంది" అని ఇంత మాత్రమే కదా లక్షణాస్వరూపం? ఇక్కడ అభిధేయాలైన విభావానుభావాదులతో అవినాభూతాలుగా ఉండే రసాదులు లక్షణచేత బోధింపబడతాయి. (రసాదులకు సంబంధించి నంతవరకు) విభావానుభావాలు కార్యకారణరూపాలు, వ్యభిచారులు వాటికి సహకారులు. ( ఈ విధంగా రసానికి విభావానుభావాదులతో అవినాభావసంబంధం ఉన్నదని భావం). (సమాధానం) ఇలా చెప్పకూడదు. ఇలా అంగీకరించిన పక్షంలో 'ధూమ' శబ్దంవల్ల ధూమం తెలియబడగానే తరవాత కలిగే అగ్నిస్మృతి కూడా లక్షణచేతనే కలుగుతుం దని చెప్పవలసి వస్తుంది. దానివల్ల అగ్ని చలిని పోగొడుతుంది అనే విషయంయొక్క స్మృతి కలుగుతుంది. ఈ విధంగా శబ్దార్థానికి అంతం అనేది ఉండదు. "(అక్కడ ఆ దోషం ఉండదు) 'ధూమ' శబ్దం స్వార్థవిశ్రాంతం గాన, అనగా తనకు ఎంత అర్థమో అంత అర్థం బోధించి విశ్రమిస్తుంది (ఊరుకుంటుంది) గాన, దానికి అంతవరకు (అగ్ని శీతబాధాద్యపనాయకత్వాదిస్మృతివరకు) వ్యాపారం ఉండదు" అని - నువ్వు సమాధానం చెపితే లక్షణకి ముఖ్యార్థబాధ జీవితం అని అంగీకరించినట్లే అయింది. ముఖ్యార్థబాధ ఉంటే స్వార్థవిశ్రాంతి ఉండదు కదా? విభావాదులను ప్రతిపాదించడంలో బాధకం ఏదీ కూడా లేదు. (అందుచేత విభావాదులు రసాన్ని లక్షణయా బోధిస్తాయి అనడానికి వీలులేదు అని భావం)

లోచనం

నన్వేవం ధూమావగమానన్తరమ్ అగ్నిస్మరణవత్ విభావాదిప్రతిపత్త్యనన్తరం రత్యాదిచిత్తవృత్తిప్రతిపత్తిరితి శబ్దవ్యాపార ఏవాత్ర నాస్తి? ఇదం తావదయం ప్రతీతిస్వరూపజ్ఞః మీమాంసకః ప్రష్టవ్యః - కిమత్ర పరచిత్తవృత్తిమాత్రే ప్రతిపత్తి రేవ రసప్రతిపత్తిరభిమతా భవతః? న చైవం భ్రమితవ్యమ్. ఏవం హి లోకగతచిత్తవృత్త్యనుమానమాత్రమితి కా రసతా? యస్త్వలౌకికచమత్కారాత్మా రసాస్వాదః కావ్యగతవిభావాదిచర్వణాప్రాణః నాసౌ స్మరణానుమానాదిసామ్యేన ఖిలీకారపాత్రీకర్తవ్యః. కిం తు లౌకికేన కార్యకారణానుమానాదినా సంస్కృతహృదయః విభావాదికం ప్రతిపద్యమాన

ఏవ న తాటస్థ్యేన ప్రతిపద్యతే, అపి తు హృదయసంవాదాపరపర్యాయ సహృదయత్వపరవశీకృతతయా పూర్ణీభవిష్యద్రసాస్వాదాఙ్కురీభావేన అనుమానస్మరణాదిసరణిమనారుహ్యైవ తన్మయీభవనోచితచర్వణాప్రాణతయా.

బాలానందిని

నను ఇతి (అశంక) ఈ విధంగా ధూమజ్ఞానం కలిగిన తరువాత అగ్నిస్మరణ కలిగినట్లు విభావాదుల జ్ఞానం కలిగిన తరవాత రత్యాదిచిత్తవృత్తుల జ్ఞానం కలుగుతుంది. అందుచేత రసం విషయంలో శబ్దవ్యాపారమే లేదు.

వివరణ:- ఈ అర్థాన్ని అనుమానప్రయోగం ద్వారా విశదీకరించవచ్చును. "విమతా రత్యాది ప్రతీతిః న శాబ్దీ, శబ్దజన్యార్థప్రతీతిజన్యత్వాత్, ధూమశబ్దజనితార్థప్రతీతిజన్యాగ్ని స్మృతివత్" "వివాదాస్పదమైన రత్యాదిప్రతీతి (జ్ఞానం) శబ్దజన్యం కాదు. ఎందువల్ల ననగా - ఇది శబ్దంవల్ల కలిగిన అర్థజ్ఞానంవల్ల కలుగుతుంది. (ఉదాహరణ) - ధూమశబ్దంవల్ల కలిగిన అర్థజ్ఞానంవల్ల కలిగిన అగ్నిస్మృతి వలె" అని దీని అర్థం.

అయితే నువ్వు ఇక్కడ సాధించదలచినది పరులలో ఉన్న చిత్తవృత్తియొక్క జ్ఞానం శబ్దవ్యాపారంవల్ల కలగదు అనే విషయమా? లేదా రసప్రతీతి శబ్దజన్యం కాదు అనే విషయమా? మొదటి పక్షంలో సిద్ధసాధనదోషం (అందరూ అంగీకరించినదే కొత్తగా చెపుతూన్నట్లు సాధించడం అనే దోషం). రెండవ పక్షంలో రసప్రతీతి లోకంలో ఉన్న అన్ని విధాల ప్రతీతులకంటె విలక్షణమైనది గాన నీ అనుమానానికి నువ్వు దృష్టాంతం చూపించజాలవు అనే అభిప్రాయంతో పరిహాసపూర్వకంగా ప్రశ్నిస్తున్నాడు - ఇదమ్ ఇతి: ప్రతీతిస్వరూపాన్ని (జ్ఞానస్వరూపాన్ని) గూర్చి బాగా తెలిసిన ఈ మీమాంసకుణ్ణి ఒక ప్రశ్న అడగాలి - కిమితి - ఇక్కడ (కావ్యంలో) కేవలం పరుల చిత్తవృత్తియొక్క ప్రతిపత్తియే రసప్రతిపత్తి అని నీకు అంగీకార్యమా అని (అడగాలి). ఈ విధంగా భ్రాంతి చెందవద్దు. ఇలా చెప్పేపక్షంలో లోకంలో ఉన్న చిత్తవృత్తులను అనుమానంచేత తెలుసుకోవడం మాత్రమే అయితే దానికి రసత్వం ఏమిటి? యస్త్వితి. రసాస్వాదం అనేది అలౌకికచమత్కారస్వరూప మైనది. కావ్యంలో ఉన్న విభావాదుల చర్వణయే (ఆస్వాదనమే) దానికి ప్రాణం. అలాంటి రసాస్వాదాన్ని పట్టుకొని ఇది స్మరణం వంటిది, అనుమానం వంటిది అని అంటూ దాన్ని, కించపరచడం, చులకనగా చూడడం, యుక్తం కాదు. (న ఖిలీకరణపాత్రీకర్తవ్యః)

కింతు ఇతి - మరేమనగా లౌకికమైన కార్యకారణానుమానాదికంచేత సంస్కరించబడిన హృదయం కలవాడు, అనగా ధూమాదికార్యాన్ని పట్టి వహ్న్యాది కారణాన్ని అనుమానంచేత తెలుసుకొనే సంస్కారం మనస్సులో ఉన్నవాడు, విభావాదుల్ని తెలుసుకుంటూనే వాటిని తాటస్థ్యంతో (తన కేమీ సంబంధం లేదన్నట్లు) గ్రహించడు; మరేమనగా హృదయసంవాదం అనే మరొక పర్యాయపదం గల సహృదయత్వంచేత కలిగిన పారవశ్యంతో, పరిపూర్ణం కానున్న రసాస్వాదం అంకురించడంచేత అనుమానం, స్మరణం మొదలైన వాటి పద్ధతిని ఆరోహించకుండానే (అనుసరించకుండానే) తన్మయీ భావానికి తగిన చర్వణకు ప్రాణంగా ( విభావాదుల్ని) గ్రహిస్తాడు.

లోచనం

న చాసౌ చర్వణా ప్రమాణాన్తరతో జాతా పూర్వం, యేనేదానీం స్మృతిః స్యాత్. న చాధునా కుతశ్చిత్ ప్రమాణాన్తరాత్ ఉత్పన్నా, అలౌకిక ప్రత్యక్షా ద్యవ్యాపారాత్. అత ఏవ అలౌకిక ఏవ విభావాదివ్యవహారః. యదాహ - "విభావో విజ్ఞానార్థః " (నా.శా.7.3). లోకే కారణమేవాభిదీయతే న విభావః. అనుభావోఽపి అలౌకిక ఏవ "యదయమనుభావయతి వాగఙ్గసత్త్వకృతో ఽభినయః" (నా.శా.7.3) తస్మాత్ అనుభావః ఇతి. తచ్చిత్తవృత్తి తన్మయీభవనమేవ హ్యనుభవనమ్. లోకే తు కార్యమేవోచ్యతే నానుభావః. అత ఏవ పరకీయా చిత్తవృత్తిః న గమ్యతే ఇత్యభిప్రాయేణ "విభావానుభావవ్యభిచారిసంయోగాద్రస నిష్పత్తిః" ఇతి సూత్రే స్థాయిగ్రహణం న కృతమ్. తత్ ప్రత్యుత శల్య భూతం స్యాత్. స్థాయినస్తు రసీభావః ఔచిత్యాదుచ్యతే, తద్విభావానుభావోచితచిత్తవృత్తిసంస్కారసున్దర చర్వణోదయాత్. హృదయసంవాదోపయోగిలోకచిత్తవృత్తిపరిజ్ఞానావస్థాయామ్ ఉద్యానపులకాదిభిః స్థాయిభూతరత్యాద్యవగమాచ్చ. వ్యభిచారీ తు చిత్తవృత్త్యాత్మత్వేఽపి ముఖ్యచిత్తవృత్తిపరవశ ఏవ చర్వ్యతే ఇతి విభావానుభావమధ్యే గణితః. అత ఏవ రస్యమానతాయాః ఏషైవ నిష్పత్తిః, యత్ ప్రబన్ధప్రవృత్తబన్ధుసమాగమాదికారణోదితహర్షాదిలౌకికచిత్తవృత్తిన్య గ్భావేన చర్వణారూపత్వమ్. అతః చర్వణామాత్రాభివ్యఞ్జనమేవ, న తు

జ్ఞాపనమ్, ప్రమాణవ్యాపారవత్. నాప్యుత్పాదనమ్, హేతువ్యాపారవత్.

బాలానందిని

న చేతి - ఇప్పుడు ఈ చర్వణ స్మృతి అనడానికి ఇది పూర్వం ఏ ఇతరప్రమాణాల చేతా కలిగి ఉండలేదు. ఇప్పుడు కూడా ఏ ఇతర ప్రమాణాల వల్లా పుట్టడం లేదు. అలౌకికవస్తువు విషయంలో ప్రత్యక్షాదిప్రమాణాలు పనిచేయవు కదా? అందువల్లనే, అనగా రసప్రతీతి అలౌకికం అవడంవల్లనే (దానికి కారణం అయినవాటి విషయంలో కూడా) అలౌకికమైన విభావాదిపదాలతో వ్యవహారం చేయబడుతున్నది. అందుచేతనే (భరతముని) " విభావశబ్దం విజ్ఞానం అనే అర్థం కలది'' అని చెప్పాడు.

అనగా - విశిష్టతయా భావ్యన్తే జ్ఞాయన్తే స్థాయివ్యభిచారిణః అనేన'' (దీనిచేత స్థాయి - వ్యభిచారిభావాలు విశిష్టరూపంలో తెలియబడతాయి) అనే వ్యుత్పత్తిచేత ప్రమదోద్యానాదికం విభావం అని చెప్పబడుతుంది. విశిష్టమైన చిత్తవృత్తియొక్క జ్ఞానం కేవలం అనుభావాలవల్లనే కలగదు. బాష్పాద్యనుభావాలకి అనేక ఇతరకారణాలు కూడా ఉండవచ్చును కదా. అందుచేత చిత్తవృత్తిజ్ఞానానికి విభావాలు బాగా ఉపకరిస్తాయి అని అర్థం.

లోకేత్వితి - లోకంలో అయితే దానిని కారణం అనే అంటారు కాని 'విభావం' అనరు. అనుభావం కూడా అలౌకికమే. వాక్కుచేత, అంగంచేత (అవయవాలచేత) సత్త్వంచేత చేయబడిన అభినయం అనుభవింపచేస్తుంది కాబట్టి 'అనుభావం' అని (భరతముని చెప్పాడు). ఆ చిత్తవృత్తితో తన్మయీభావమే కదా అనుభవనం అనగా?

అనగా - పరుల చిత్తవృత్తిని తెలుసుకొనడం మాత్రమే అనుభవనం కాదు. మరే మనగా స్థాయి మొదలైన ఆ చిత్తవృత్తులకు సంబంధించి సామాజికులు తన్మయత్వం చెందడమే అనుభవనం. అనగా ఆ యా చిత్తవృత్తులను భావన చేయగా చేయగా ఆ వృత్తుల జాతికే చెందిన తమ చిత్తవృత్తులు ఉద్బుద్ధాలవడంతో వాటిని అనుభవించడం అనుభవనం అని అర్థం.

లోకే త్వితి - లోకంలో అయితే దాన్ని కార్య మనే అంటారు కాని 'అనుభావం' అనరు. అందువల్లనే, అనగా అనుభవనం అనేది పరకీయచిత్తవృత్త్యనుమితి కాక పైన చెప్పిన విధంగా ఉండడంవల్లనే, (రసానుభూతిసమయంలో) పరుల చిత్తవృత్తి తెలియబడదు; (మరేమనగా సామాజికులు తమ చిత్తవృత్తినే అనుభవిస్తారు) అనే అభిప్రాయంతో విభావేత్యాదిరససూత్రంలో 'స్థాయి' చెప్పబడలేదు. దాన్ని చెప్పి

ఉన్నట్లయితే అది శల్యం అయి ఉండేది.

వివరణ:- " విభావానుభావవ్యభిచారిసంయోగాత్" అనగానే " కస్య" (దేని॥ అని ఆకాంక్ష కలుగుతుంది. దాన్ని పూరించడానికి 'స్థాయినః' అని చెప్పవలసి ఉంది. అయితే ముని కావాలనే 'స్థాయినః' అనే పదం సూత్రంలో చేర్చలేదు. అనుభావాలను చెపితే వాటిని పట్టి స్థాయిని గూర్చి చెప్పకుండానే తెలుస్తుంది కదా? 'స్థాయి' ని కూడా సూత్రంలో చెప్పిన పక్షంలో పరుల చిత్తవృత్తిని గ్రహించడమే రసం అనే అనిష్టమైన అర్థం వచ్చే అవకాశం ఉంటుంది.

"స్థాయిభావమే రసం అవుతుంది" అని అక్కడక్కడ భరతాదులు అన్నారు కదా? అది ఎలా కుదురుతుంది అని ఆశంకించుకొని చెపుతున్నాడు- స్థాయినస్తు ఇతి. దానికి (స్థాయిభావానికి) సంబంధించిన విభావానుభావాలకు తగిన చిత్తవృత్తియొక్క సంస్కారంచేత సుందరమైన చర్వణ సహృదయులలో ఉదయించడంవల్ల, (నాయకాదిగతమైన) స్థాయి రసంగా అవుతుంది అని ఔచిత్యాన్ని పట్టి చెప్పబడుతుంది. స్థాయిభావాన్ని రసం అనడంలో మరొక నిమిత్తం కూడా ఉందని చెపుతున్నాడు - హృదయేతి. హృదయసంవాదానికి ఉపయోగించే లోకచిత్తవృత్తిజ్ఞానం కలిగే అవస్థలో ఉద్యానపులకాదులచేత స్థాయి అయిన రత్యాదికం తెలియబడడంవల్ల కూడా (స్థాయి రసం అవుతుంది" అని చెప్పడం జరిగింది.)

వివరణ:- హృదయసంవాదం ఉంటేనే కాని రసచర్వణ కలగదు. హృదయసంవాదం కలగడానికి మూలకారణం లోకచిత్తవృత్తిజ్ఞానమే. లోకచిత్తవృత్తులను గూర్చిన జ్ఞానం లేనివానికి హృదయసంవాదం కలగదు కదా? లోకచిత్తవృత్తిని తెలుసుకునే దశలో ప్రమదలు మొదలైన కారణాలకీ, పులకలు మొదలైన కార్యాలకీ, వీటి కన్నింటికీ కూడా కారణం స్థాయిభావమే (నాయకాదిగతస్థాయిభావమే) అని మాటి మాటికీ చూచి ఉండడంచేత తెలుసుకొని ఉంటాడు. అలా తెలుసుకొని ఉండడంవల్ల నాయకాదిగత స్థాయిని గ్రహిస్తాడు. అనగా నాయకాదులలో వీటి కన్నింటికీ కారణమైన స్థాయిభావం ఉందని తెలుసుకొంటాడు అని భావం.

స్థాయి వలె వ్యభిచారిభావం కూడా చిత్తవృత్తియే కదా? అందుచేత స్థాయిని ఏ విధంగా పేర్కొనలేదో అదే విధంగా వ్యభిచారిభావాన్ని కూడా పేర్కొనకుండా ఉండాలి కదా అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు - వ్యభిచారీతి- వ్యభిచారిభావం కూడా చిత్తవృత్త్యాత్మకమే అయినా అది ముఖ్యచిత్తవృత్తి అయిన స్థాయిభావానికి పరవశం కాబట్టి, అనగా స్థాయిభావం అధీనంలో ఉంటుంది కాబట్టి,

దానికి పరవశంగా ఉండే ఆస్వాదించబడుతుంది గాని స్వతంత్రంగా ఆస్వాదించబడదు. అనగా స్థాయి దృష్ట్యా అది అప్రధానం. అందుచేత విభావానుభావాల మధ్య చేర్చి చెప్పబడింది.

అత ఏవేతి - అందువల్లనే, ఏషా = సూత్రంలో చెప్పిన నిష్పత్తి, రస్యమానతాయాః నిష్పత్తిః ఏవ = రసింపబడడంయొక్క నిష్పత్తియే అని ఈ వాక్యంలో అన్వయం చెప్పుకోవాలి. అనగా 'రసనిష్పత్తిశబ్దానికి' 'రసంయొక్క నిష్పత్తి' అని కాదు, రసింపబడడం యొక్క నిష్పత్తి అనగా రసించబడడం అనేది జరగడం అని అర్థం. రస్యమానత అంటే ఏమిటో చెపుతున్నాడు - యదితి- నిరంతరమూ (ప్రబంధ) జరిగే బంధుసమాగమాది కారణాలవల్ల పుట్టే హర్షం మొదలైన లౌకికచిత్తవృత్తిని తిరస్కరించడంచేత, అనగా అలాంటి ఆనందా లన్నింటినీ మించి ఉండడంచేత, చర్వణారూపమై ఉండడం ఏదైతే ఉన్నదో అదే రస్యమానతానిష్పత్తి. అనగా ఏ చర్వణ లౌకికానందా లన్నింటినీ మించి ఉంటుందో ఆ చర్వణయే రస్యమానతానిష్పత్తి అని భావం. అందువల్ల ఇక చర్వణ (రసవిషయక చర్వణ) వ్యంజనయే. అంతేనే కాని ప్రమాణాల వ్యాపారం వలె జ్ఞాపకం కాదు, హేతువ్యాపారం వలె ఉత్పాదకమూ కాదు.

వివరణ:- చక్షురింద్రియాది ప్రమాణాలు ఉన్న వస్తువునే జ్ఞాపింపచేస్తాయి. ఇది (ఈ నిష్పత్తి) జ్ఞాపకం కాదు. దండచక్రాదులు అంతకు ముందు లేని ఘటాదుల్ని పుట్టిస్తాయి. ఇది అలాంటి పుట్టించడం కూడా కాదు.

లోచనం

నను యది నేయం జ్ఞప్తిః న వా నిష్పత్తిః తర్హి కి మేతత్? నన్వయమ్ అసౌ అలౌకికో రసః ? నను విభావాదిరత్ర కిం జ్ఞాపకో హేతుః ఉత కారకః? న జ్ఞాపకః న కారకః, అపి తు చర్వణోపయోగీ. నను క్వ ఏతద్దృష్టమ్ అన్యత్ర? యత ఏవ న దృష్టం తత ఏవ అలౌకికమ్ ఇత్యుక్తమ్. నన్వేవం రసః అప్రమాణం స్యాత్? అస్తు; కిం తతః ? తచ్చర్వణాత ఏవ ప్రీతివ్యుత్పత్తిసిద్ధేః కిమన్యదర్థనీయమ్? నన్వప్రమాణకమేతత్? న; స్వసంవేదసిద్ధత్వాత్. జ్ఞానవిశేషస్యైవ చర్వణాత్మత్వాత్. ఇత్యలం బహునా.

బాలానందిని

(ప్రశ్న) నన్వితి:- ఇది జ్ఞప్తి (జ్ఞాపకం) కాక నిష్పత్తి (పుట్టుక) కాకపోతే ఏమిటిది? (ఉత్తరం) నన్వితి - ఈ రసం అలౌకికం కదా? జ్ఞప్తి, నిష్పత్తి మొదలైనవి లౌకిక

విషయాలకే కాని అలౌకికవిషయాలకి సంబంధించవు అని భావం. (ప్రశ్న) నన్వితి - విభావాదికం దీని (రసం) విషయంలో జ్ఞాపక హేతువా లేక కారకహేతువా?

వివరణ:- ఘటాదిదర్శనానికి దీపం హేతువు. ఉన్నదానినే చూపుతున్నది కాబట్టి అది జ్ఞాపకహేతువు. ఘటాదులు తయారు చేయడానికి దండం, చక్రం మొదలైనవి హేతువులు. అవి లేనిదానిని పుట్టిస్తున్నాయి. అందుచేత కారకహేతువులు. మీరు రసానికి హేతువులంటూన్న విభావాదులు జ్ఞాపకహేతువులా కారకహేతువులా అని ప్రశ్న

(ఉత్తరం) నేతి :- జ్ఞాపకమూ కాదు, కారకమూ కాదు. మరేమనగా చర్వణానికి ఉపయోగిస్తుంది.( ప్రశ్న) నన్వితి:- ఇది (ఈపద్ధతి) మరి ఇతర విషయాలలో ఎక్కడ ఉంది? (ఉత్తరం) యత ఇతి- మరొక చోట ఎక్కడా కనబడదు కాబట్టే దీన్ని అలౌకికం అంటున్నాం. (ప్రశ్న) నన్వితి- ఇలా అయితే రసం ప్రమాణం కాకుండా పోతుంది కదా? (ఉత్తరం) అస్త్వితి. కానీ, ఐతే నేమి? దాని చర్వణవల్లనే ప్రీతీ, వ్యుత్పత్తీ లభిస్తూండగా ఇంక కోరవలసిందేమున్నది? (ప్రశ్న) దీనికి ఏమీ ప్రమాణం లేదు కదా? (ఉత్తరం) అలా అనకూడదు. ఇది స్వానుభవసిద్ధం. చర్వణ అనేది కూడా ఒక జ్ఞానవిశేషమే. సరే ఇంక అధిక ప్రసంగం చాలు.

లోచనం

అతశ్చ రసోఽయమలౌకికః యేన లలితపరుషానుప్రాసస్య అర్థాభిధానానుపయోగినోఽపి రసం ప్రతి వ్యఞ్జకత్వమ్. కా తత్ర లక్షణాయాః శఙ్కాపి? కావ్యాత్మకశబ్దనిష్పీడనైనైవ తచ్చర్వణా దృశ్యతే. దృశ్యతే హి తదేవ కావ్యం పునః పునః పఠన్ చర్వమాణశ్చ సహృదయో లోకః. న తు కావ్యస్య తత్ర "ఉపాదాయాపి యే హేయాః" ఇతి న్యాయేన కృతప్రతీతికస్య అనుపయోగ ఏవేతి శబ్దస్యాపీహ ధ్వననవ్యాపారః. అత ఏ వాలక్ష్యక్రమతా.

బాలానందిని

అతశ్చ ఇతి : ఈ కారణంచేత కూడా ఈ రసం అలౌకికం. దేనిచేత ననగా అర్థం బోధించడానికి అంతగా ఉపయోగించని లలిత - పరుషానుప్రాసకూడా రసం విషయంలో వ్యంజకంగా ఉంటుంది. అనగా రసం లౌకికం అయిన పక్షంలో లోకంలో శబ్దాలు బోధించే అర్థం మాత్రమే వ్యవహారోపయోగి అయినట్లు ఇక్కడ కూడా అర్థం మాత్రమే రసవ్యంజనాహేతువుగా ఉండాలి. అలా కాకుండా అర్థానికి ఏ మాత్రం ప్రాధాన్యం లేని

శబ్దంతో మాత్రమే సంబంధించిన లలిత - పరుషానుప్రాసాదులు కూడా రసవ్యంజకాలుగా ఉన్నాయి. అదుచేత కూడా రసం అలౌకికం అని భావం.

కా ఇతి - అలాంటప్పుడు (అభిధకే స్థానం లేనప్పుడు) ఇక్కడ లక్షణకు స్థానం ఉంటుందా అనే శంకకు కూడా అవకాశం ఎలా ఉంటుంది? అభిధావ్యాపారాపేక్ష లేని శబ్దస్వరూపమే రసవ్యంజకం అవుతుంది అనే విషయానికి అనుభవాన్ని ప్రమాణంగా చూపుతున్నాడు - కావ్యాత్మకేతి. కావ్యాత్మకమైన శబ్దాన్ని పిండడం చేతనే రసచర్వణ కనబడుతూన్నది. అదే కావ్యాన్ని మాటిమాటికీ చదువుతూ చర్వణం చేస్తూ ఉండే సహృదయమైన లోకం, అనగా సహృదయుల సముదాయం, ప్రత్యక్షంగా మనచేత చూడబడుతూన్నది కదా. నేతి:- చర్వణం విషయంలో (తత్ర) చేయబడిన (రస) ప్రతీతి గల (రసప్రతీతి కలిగించిన) కావ్యానికి, "గ్రహించి విడిచిపెట్టదగినవి" అనే న్యాయం చేత అనుపయోగంలేదు కదా? అందుచేత రసవిషయంలో (ఇహ) శబ్దానికి కూడా ధ్వననవ్యాపారం ఉంటుంది. అందుచేతనే అలక్ష్యక్రమత అంగీకరించబడింది.

వివరణ:- శబ్దరూపమైన కావ్యాన్ని మాటిమాటికీ చదువుతూ సహృదయులు రసచర్వణ చేస్తూన్నారంటే శబ్దంలో రసవ్యంజకత్వం ఉందని అర్థం. అందుచేత -

"ఉపాదాయాపి యే హేయాస్తానుపాయాన్ ప్రచక్షతే,
ఉపాయానాం హి నియమో నావశ్యమవతిష్ఠతే".

"అవసరాన్ని బట్టి స్వీకరించినా కూడా వేటిని అవసరం తీరిన తరవాత విడిచివేస్తారో అవి ఉపాయాలు. ఉపాయాల విషయంలో తప్పకుండా నియమం ఉండదు. అనగా ఒక పని సాధించడానికి ఒకే ఉపాయం అనే మాట ఉండదు. అనేక ఉపాయాలు ఉండవచ్చును".అని చెప్పిన "ఉపాయ"' లక్షణం శబ్దరూప మైన కావ్యానికి పట్టదు. మాటి మాటికీ దానిని చదువుతూనే ఉంటారు గదా? పని అయిపోవడం, విడిచివేయడం అనేది వాటి విషయంలో లేదు కదా అని భావం. వాచ్యార్థం దాకా వెళ్ల నవసరం లేకుండా, అనగా కొంత సేపు అక్కడ ఆగవలసిన పని లేకుండా శబ్దంవల్లనే రసాభివ్యక్తి కలుగుతుంది. కాబట్టే అలక్ష్యక్రమత్వాన్ని అంగీకరించడం కుదిరింది.

లోచనం

యత్తు వాక్యభేదః స్యాదితి కేన చిదుక్తమ్, తదనభిజ్ఞతయా. శాస్త్రం హి సకృదుచ్చారితం సమయబలేన అర్థం ప్రతిపాదయత్ యుగపద్విరుద్ధానేక

సమయస్మృత్యయోగాత్ కథమర్థద్వయం ప్రత్యాయయేత్? అవిరుద్ధత్వే వా తావానేకో వాక్యార్థః స్యాత్. క్రమేణాపి విరమ్యవ్యాపారాయోగః పునరుచ్చారితే ఽపి వాక్యే స ఏవ; సమయప్రకరణాదేః తాదవస్థ్యాత్. ప్రకరణ సమయప్రాప్యార్థతిరస్కారేణ అర్థాన్తరప్రత్యాయకత్వే నియమాభావ ఇతి తేన "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" ఇతి శ్రుతౌ ఖాదేత్ శ్వమాంసమ్ ఇత్యేష నార్థః ఇత్యత్ర కా ప్రమేతి ప్రసజ్యతే. తత్రాపి న కాచిదియత్తా ఇతి అనాశ్వాసతా ఇత్యేవం వాక్యభేదో దూషణమ్.

బాలానందిని

యత్తు ఇతి - ఒకే వాక్యం వాచ్యార్థాన్నీ వ్యంగ్యార్థాన్నీ రెండింటినీ బోధిస్తే వాక్యభేదదోషం (ఒక వాక్యానికి రెండు అర్థాలు చెప్పడం 'వాక్యభేద దోషం'. ఇది శాస్త్రాలలో సర్వథా పరిహరణీయం) వస్తుందని ఎవడో అన్నాడు. అది తెలివి తక్కువతనం చేతనే. శాస్త్రం హీతి - ఒక మాటు ఉచ్చరించబడి సంకేతబలంచేత అర్థాన్ని ప్రతిపాదించే శాస్త్రం (శాస్త్రవాక్యం) విరుద్ధమైన అనేకసంకేతాల స్మృతి ఒకే సమయంలో కలగదు కాబట్టి (విరుద్ధాలైన) రెండు అర్థాలను ఎలా ప్రతిపాదిస్తుంది? ఆ రెండర్థాలకు విరోధం లేని పక్షంలో ఆ రెండూ కలిసి ఒకే అర్థంగా పరిగణించబడుతుంది. (ఒకే సమయంలో రెండర్థాలు బోధించకపోయినా ఒకదాని తరవాత ఒకటి బోధించవచ్చును కదా అనడానికి కూడా వీలులేదు) ఒక అర్థాన్ని బోధించి విరమించి మళ్లీ మరొక అర్థం బోధించడానికి వ్యాపారం కుదరదు. (పోనీ అదే వాక్యాన్ని మళ్లీ ఉచ్చరించి మరొక అర్థం కూడా చెప్పవచ్చు కదా అనడానికి కూడా వీలులేదు) మళ్లీ ఆ వాక్యాన్ని ఉచ్చరించినా కూడా అదే సంకేతం, అదే ప్రకరణాదికం ఉంటుంది కదా? ప్రకరణేతి:- ప్రకరణంచేత, సంకేతంచేత లభించే అర్థాన్ని తిరస్కరించి, దాన్ని కాదని, మరొక అర్థం బోధిస్తే నియమం లేకుండా పోతుంది. అప్పుడు "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" (స్వర్గం కోరుకునేవాడు అగ్నిహోత్రహోమం చెయ్యాలి) అనే శ్రుతివాక్యానికి "ఖాదేత్ శ్వమాంసమ్" (కుక్కమాంసం తినాలి) అనే అర్థం చెప్పకూడదనడానికి ప్రమాణం ఏమిటి అని ప్రశ్నకు అవకాశం ఏర్పడుతుంది. ఆ చెప్పే ఇతరార్థాల విషయంలో ఇన్ని అర్థాలు మాత్రమే చెప్పాలి అనే నియమం లేకపోవడం చేత అనిశ్చితత్వం (ఈ అర్థమే బోధించాలి అనే నిశ్చయం లేకపోవడం) ఏర్పడుతుంది. ఈ విధంగా (శాస్త్రంలో) వాక్యభేదం దోషం.

లోచనం

ఇహ తు విభావాద్యేవ ప్రతిపాద్యమానం చర్వణావిషయతోన్ముఖమితి సమయాద్యుపయోగాభావః. న చ నియుక్తోఽహమత్ర కరవాణి 'కృతార్థోఽహమ్' ఇతి శాస్త్రీయప్రతీతిసదృశమదః. తత్ర ఉత్తరకర్తవ్యోన్ముఖ్యేన లౌకికత్వాత్. ఇహ తు విభావాదిచర్వణాద్భుతపుష్పవత్ తత్కాలసారైవ ఉదితా న తు పూర్వాపరకాలానుబన్ధినీతి లౌకికాస్వాదాత్ యోగివిషయాచ్చ అన్య ఏవాయం రసాస్వాదః. అత ఏవ "శిఖరిణి" ఇత్యాదావపి ముఖ్యార్థబాధాది క్రమమనపేక్ష్యైవ సహృదయాః వక్త్రభిప్రాయం చాటుప్రీత్యాత్మకం సంవేదయన్తే. అత ఏవ గ్రన్థకారః సామాన్యేన వివక్షితాన్యపరవాచ్యే ధ్వనౌ భక్తేః అభావమ్ అభ్యధాత్. అస్మాభిస్తు దుర్ధరూటం ప్రత్యాయయితుముక్తమ్ - భవత్వత్ర లక్షణా. అలక్ష్యక్రమే తు కుపితోఽపి కిం కరిష్యసీతి. యది తు న కుప్యతే "సువర్ణపుష్పామ్" ఇత్యాదౌ అవివక్షితవాచ్యేఽపి ముఖ్యార్థబాధాదిలక్షణా సామగ్రీమ్ అనపేక్ష్యైవ వ్యఙ్గ్యార్థవిశ్రాన్తిరిత్యలం బహునా. ఉపసంహరతి - తస్మాద్ భక్తిరితి. 18

బాలానందిని

శాస్త్రంలో వాక్యభేదానికి అవకాశం వచ్చేటట్లు వాక్యార్థం ప్రతిపాదిస్తే అది దోషంగా పరిగణించబడుతుంది. అది యుక్తమే. ఇక్కడి పరిస్థితి వేరు అని చెపుతున్నాడు - ఇహ తు ఇతి - కావ్యంలో అయితే ప్రతిపాదించబడే విభావాదికమే చర్వణావిషయత్వానికి ఉన్ముఖంగా ( చర్వణ కలిగించేదిగా) ఉంటుంది. అందుచేత సమయాదుల ఉపయోగం ఏదీ ఇక్కడ ఉండదు. "నేను ఈ పని చేయడానికి నియుక్తుణ్ణి అయ్యాను, అందుచేత ఈ కర్మ చేస్తాను" అని, "నేను చేయదగిన కర్మ పూర్తి చేశాను" అని శాస్త్రీయవిషయాలలో (పూర్వాపరసమయాలలో) ప్రతీతి (జ్ఞానం) ఉంటుంది. ఇది అలాంటిది కాదు. శాస్త్రంలో వాక్యం విన్న తరవాత చేయవలసిన పని విషయంలో ఉన్ముఖత్వం ఉంటుంది. అందుచేత అది లౌకికం. కావ్యంలో అయితే విభావాదుల చర్వణ ఆశ్చర్యకరమైన పుష్పంవలె తత్కాలమందే సారం గలదిగా (పుట్టుకతోనే పరిమళంతో) పుడుతుంది. అంతేనే కాని దీని పూర్వాపరకాలాలతో సంబంధం ఉండదు. అందువల్ల ఈ రసాస్వాదం లౌకికాస్వాదం కంటె, యోగులకు గోచరమైన

ఆనందాస్వాదంకంటె కూడ భిన్నమైనదే.

అత ఏవేతి: అందువల్లనే, అనగా రసాస్వాదానికి అనితరసాధారణమైన వైశిష్ట్యం ఉండడంవల్లనే, "శిఖరిణి" ఇత్యాదిశ్లోకాలలో కూడా సహృదయులు ముఖ్యార్థబాధ మొదలైన క్రమాన్ని అపేక్షించకుండగానే చాటు ప్రీతిరూపమైన వక్తయొక్క అభిప్రాయాన్ని గ్రహిస్తారు. అందుచేతనే గ్రంథకారుడు వివక్షితాన్యపరవాచ్యధ్వనిలో భక్తి ఉండదు అని సామాన్యరూపంలో చెప్పాడు. అయితే మేం మాత్రం మొండి పట్టుదలతో వాదించేవాడికి నచ్చచెప్పడం కోసం- "సరే ఇక్కడ లక్షణ ఉంటే ఉండనీ; ఎంత కోపం వస్తే మాత్రం అలక్ష్యక్రమంలో ఏం చేస్తావు?" అని చెప్పాం. నీకు కోపం రాదంటే - "సువర్ణపుష్పామ్" ఇత్యాదికమైన అవివక్షితవాచ్యంలో కూడా ముఖ్యార్థబాధ మొదలైన లక్షణాసామగ్రిని అపేక్షించకుండానే, అనగా దాన్ని పట్టించుకొనకుండానే, వ్యంగ్యార్థంలో విశ్రాంతి ఉంది అని అంటాం. సరే. ఇంక అతిగా చెప్పి చాలు. ఉపసంహరతీతి :- 'తస్మాద్ భక్తిః అలక్షణమ్" అని ఈ విషయాన్ని ముగిస్తున్నాడు. 18

## ధ్వన్యాలోకం

కా. కస్యచిద్ధ్వనిభేదస్య సా తు స్యాదుపలక్షణమ్.

సా పునర్భక్తిః వక్ష్యమాణప్రభేదమధ్యాదన్యతమస్య భేదస్య యది నామ ఉపలక్షణతయా సంభావ్యేత ; యది చ గుణవృత్త్యైవ ధ్వనిర్లక్ష్యత ఇత్యుచ్యతే తదభిధావ్యాపారేణ తదితరః అలంకారవర్గః సమగ్ర ఏవ లక్ష్యత ఇతి ప్రత్యేక మలంకారాణాం లక్షణకరణవైయర్థ్య ప్రసంగః.

### బాలానందిని

కస్యేతి - కస్య చిత్ = ఒకానొక, ధ్వనిభేదస్య=ధ్వనిభేదానికి, సా = భక్తి, ఉపలక్షణమ్ = ఉపలక్షణం, స్యాత్ తు = ఐతే కావచ్చును.

సా ఇతి: కాని ఆ భక్తి చెప్పబడబోయే భేదాలలో ఏదైన ఒక భేదానికి ఉపలక్షణం అయితే కావచ్చు. (తావన్మాత్రంచేత) గుణవృత్తిచేతనే ధ్వని లక్షించబడుతుంది అని చెప్పినట్లయితే అభిధావ్యాపారంచేత ఇతరమైన సమగ్రమైన అలంకారసముదాయం లక్షితం అవుతుంది గాన అలంకారాలకి ప్రత్యేకంగా లక్షణం చెప్పడం వ్యర్థం కావలసి వస్తుంది.

లోచనం

నను మా భూద్ధ్వనిరితి భక్తిరితి చైకం రూపమ్. మా చ భూద్భక్తిః ధ్వనేః లక్షణమ్. ఉపలక్షణం తు భవిష్యతి. యత్ర ధ్వనిర్భవతి తత్ర భక్తిరప్యస్తీతి భవత్యుపలక్షితో ధ్వనిః. న తావదేతత్ సర్వత్రాస్తి. ఇయతా చ పరస్య కిం సిద్ధమ్? కిం వా నః త్రుటితమ్? ఇతి తదాహ కస్యచిదిత్యాది. నను భక్తిస్తావత్ చిరన్తనైరుక్తా. తదుపలక్షణముఖేన చ ధ్వనిమపి సమగ్రభేదం లక్షయిష్యన్తి జ్ఞాస్యన్తి చ; కిం తల్లక్షణేనేత్యాశఙ్క్యాహ - యది ఇతి. అభిధానాభిధేయభావో హ్యలంకారాణాం వ్యాపకః తతశ్చ అభిధావృత్తే వైయాకరణమీమాంసకైః నిరూపితే కుత్రేదానీమ్ అలంకారకారాణాం వ్యాపారః ? తథా హేతుబలాత్ కార్యం జాయతే ఇతి తార్కికైరుక్తే కిమిదానీమ్ ఈశ్వరప్రభృతీనాం జ్ఞాతౄణాం కర్తౄణాం వా కృత్యమపూర్వం స్యాదితి సర్వో నిరారమ్భః స్యాత్? తదాహ - లక్షణకరణవైయర్థ్యప్రసఙ్గ ఇతి.

బాలానందిని

నన్వితి - ధ్వనీ భక్తీ అనేది ఒకటే కాకపోతే కాకపోవచ్చు. భక్తి ధ్వనికి లక్షణం కూడా కాకపోవచ్చు. కాని ఉపలక్షణం కావచ్చును. ఎక్కడ ధ్వని ఉంటుందో అక్కడ భక్తి కూడా ఉంటుంది అని ధ్వని భక్తిచేత ఉపలక్షితం అవుతుంది.

వివరణ:- "కాకవద్దేవదత్తగృహమ్" ఇత్యాదులలో కాకి దేవదత్తగృహానికి ఉపలక్షణం (గుర్తు) అయినట్లు భక్తి ధ్వనికి ఉపలక్షణం అని చెప్పవచ్చును కదా అని ఈ పూర్వపక్షి ఆశయం.

ఈ పూర్వపక్షాన్ని నిరాకరిస్తూ కారికను ప్రవేశపెడుతున్నాడు - న తావదితి. ఇది (ధ్వని ఉన్నచోట భక్తి ఉంటుంది అనేది) అంతటా (అన్ని ధ్వనులలోను) లేదు. ఎక్కడైనా కొన్ని ధ్వనులలో ఉండి భక్తి ధ్వనికి ఉపలక్షణం అని చెప్పినంత మాత్రాన పూర్వపక్షికి ఏం లాభం వచ్చింది? మాకు ఏమి నష్టం వచ్చింది? ఈ విషయాన్నే కస్యచిదిత్యాదికం చేత చెపుతున్నాడు. నన్వితి(ఆశంక). భక్తిని అతిప్రాచీనులైన శాస్త్రకారులు అంగీకరించారు. దాన్ని ఉపలక్షణంగా గ్రహించి తద్వారా సకలభేదాలతో సహా ధ్వనిని గుర్తిస్తారు. దానిని గూర్చి తెలుసుకుంటారు కూడ. అలాంటప్పుడు దానికి (ధ్వనికి) లక్షణం చెప్పడం ఎందుకు అని ఆశంకించుకొని యది చ ఇత్యాదికంచేత సమాధానం చెపుతున్నాడు.

వివరణ:- ధ్వనికి మీరు లక్షణం చెప్పడానికి ప్రయత్నిస్తున్నా రంటే ఎందుకు? ఇతరవిషయాలనుంచి వేరు చేసి చూపించడానికి కదా? ఎప్పటినుంచో శాస్త్రకారులందరూ అంగీకరించిన భక్తి ఉండనే ఉంది. దాని సహాయంతో ధ్వనిని, దాని సకలభేదాలను కూడ గుర్తిస్తారు, తెలుసుకుంటారు కూడ. ఆ విధంగా మీరు ధ్వనికి లక్షణం చెప్పి సాధించా లనుకున్న పని అంతకు ముందునుంచీ ఉన్న భక్తిచేతనే జరిగిపోతూండగా కొత్తగా ఈ ధ్వనిలక్షణప్రదర్శనప్రయాస ఎందుకు అని భావం. యది చేత్యాది వాక్యంచేత వృత్తికారుడు సమాధానం చెపుతున్నా డని అర్థం.

అభిధానేతి అభిధానాభిధేయభావం (చెప్పేది చెప్పబడేది అనే సంబంధం) అలంకారా లన్నింటికీ వ్యాపకం. అందువల్ల అభిధావ్యాపారం వైయాకరణులూ మీమాంసకులూ కూడా నిరూపించారు. ఇంక ఆలంకారికులు చేయవలసినది ఏముంటుంది?

వివరణ:- అభిధావ్యాపారాన్ని గూర్చి వైయాకరణులు మీమాంసకులు నిరూపించే ఉన్నారు. అభిధావ్యాపారం శబ్దార్థాలమధ్య ఉన్న అభిధానాభిధేయభావ సంబంధానికి మూలం. అన్ని అలంకారాలలోను ఈ అభిధానాభిధేయభావం ఉంది. దీనికి మూలమైన అభిధను గూర్చి వైయాకరణాదులు చెప్పిన తరవాత అలంకారికులు చెప్పడానికి ఇంక ఏమి మిగులుతుంది అని భావం.

తథా ఇతి - అదే విధంగా కారణంవల్ల కార్యం పుడుతుందని తార్కికులు చెప్పిన తరవాత ఇప్పుడింక ఈశ్వరుడు మొదలైన కర్తలు గాని, వాళ్లని గూర్చి తెలుసుకున్నవాళ్లు గాని ఏం చెయ్యాలి? ఆ విషయాన్నే లక్షణకరణవైయర్థ్యప్రసంగః ఇత్యాదికంచేత చెపుతున్నాడు.

వివరణ:- గుణవృత్తియే ధ్వనిని గుర్తింపచేస్తుంది; అందుచేత ధ్వని లక్షణధ్వనిభేదాదులను చెప్పవలసిన అవసరం లేదు అనే పక్షంలో అభిధావ్యాపారాన్ని గూర్చి స్థూలంగా చెప్పిన తరవాత ఆ వ్యాపారంచేత వ్యాప్తాలైన అలంకారాలను, వాటి అవాంతరభేదాదుల్నీ చెప్పడం అనవసరం అయిపోతుంది. సామాన్యరూపంలో కార్యకారణభావాన్ని గూర్చి చెప్పిన తరవాత జగత్కర్తయైన ఈశ్వరుడు, ఆయన స్వరూపప్రభావాలు, ఆయనను గూర్చి తెలిసిన వారు ఈవిషయా లన్నీ చెప్పడం వ్యర్థం అనవలసి వస్తుంది. వీటి విషయంలో ఏ విధంగా వ్యర్థత్వాన్ని చెప్పలేమో భక్తి ధ్వనికి ఉపలక్షణం అని అంగీకరించినా కూడ ధ్వనిలక్షణాదిప్రతిపాదనం అనావశ్యకం కాదని భావం.

## ధ్వన్యాలోకం

కిం చ -

కా. లక్షణేఽన్యైః కృతే చాస్య పక్షసంసిద్ధిరేవ నః. 19

కృతేఽపి వా పూర్వైః ధ్వనిలక్షణే పక్షసంసిద్ధిరేవ నః. యస్మాత్ ధ్వనిరస్తీతి నః పక్షః. స చ ప్రాగేవ సంసిద్ధ ఇతి అయత్నసంపన్న సమీహితార్థాః సంవృత్తాః స్మః.

యేఽపి సహృదయహృదయసంవేద్యమనాఖ్యేయమేవ ధ్వనేరాత్మానమ్ ఆమ్నాసిషుః తేఽపి న పరీక్ష్యవాదినః; యతః ఉక్తయా నీత్యా వక్ష్యమాణయా చ ధ్వనేః సామాన్యవిశేషలక్షణే ప్రతిపాదితేఽపి యద్యనాఖ్యేయత్వం తత్సర్వేషామపి వస్తూనాం తత్ ప్రసక్తమ్. యది పునః ధ్వనేరతిశయోక్త్యా అనయా కావ్యాన్తరాతిశాయి తైః స్వరూపమాఖ్యాయతే తత్తేఽపి యుక్తాభిధాయిన ఏవ.

ఇతి శ్రీ రాజానకానన్దవర్ధనాచార్యవిరచితే ధ్వన్యాలోకే
ప్రథమ ఉద్ద్యోతః.

### బాలానందిని

కిం చేతి - మరియు - లక్షణే ఇతి - అస్య = ఈ ధ్వనియొక్క, లక్షణే= లక్షణం, అన్యైః= ఇతరులచేత, కృతే= చేయబడిన దగుచుండగా, నః = మాయొక్క, పక్షసంసిద్ధిః ఏవ= పక్షంయొక్క సిద్ధియే.

కృతే ఇతి - పూర్వమే ఇతరులచేత ధ్వనిలక్షణం చెప్పబడే ఉంటే మా పక్షం సిద్ధించి నట్లే; ఎందువలన అనగా - ధ్వని ఉంది అని మా పక్షం. ఆ పక్షం పూర్వమే సిద్ధించింది కాబట్టి ఏమీ ప్రయత్నం చేయకుండానే సిద్ధించిన కోరిన పని కలవాళ్లం అయ్యాం.

యే౽పీతి :- ధ్వనిస్వరూపం సహృదయహృదయవేద్యమే కాని మాటలలో చెప్పడానికి శక్యం కాదు అని ఎవరు అన్నారో వాళ్లు కూడా పరీక్షించి చెప్పినవాళ్లు కారు. ఎందుచేత ననగా పైన చెప్పిన పద్ధతిచేతా, ముందు చెప్పబడ నున్న పద్ధతిచేతా ధ్వనియొక్క సామాన్యవిశేషలక్షణాలు చెప్పిన తరవాత కూడా ఇది మాటలలో చెప్ప శక్యం కానిది అన్నట్లయితే అన్ని వస్తువుల విషయంలోనూ ఈ మాటే చెప్పవచ్చు. అలా కాక వాళ్లు ఈ అతిశయోక్తితో 'ధ్వనికావ్యం ఇతరకావ్యాలన్నింటికంటె ఉత్కృష్టమైనది' అని చెప్పుచున్న ట్లయితే అప్పుడు వాళ్లు యుక్తం గానే చెప్పుచున్నారు.

శ్రీ రాజానక ఆనందవర్ధనాచార్యులు రచించిన ధ్వన్యాలోకంలో
ప్రథమోద్యోతం సమాప్తం.

లోచనం

మా భూదపూర్వోన్మీలనమ్; పూర్వోన్మీలితమేవ అస్మాభిః సమ్యక్ నిరూపితం, తథాపి కో దోషః ఇత్యభిప్రాయేణాహ - కిం చేత్యాది. ప్రాగేవేతి. అస్మత్ప్రయత్నాదితి శేషః. ఏవం త్రిప్రకారమ్ అభావవాదం, భక్త్యన్తర్భూతతాం చ నిరాకుర్వతా అలక్షణీయత్వమ్ ఏతన్మధ్యే నిరాకృతమేవ. అత ఏవ మూలకారికా సాక్షాత్ తన్నిరాకరణార్థా న శ్రూయతే. వృత్తికృత్తు నిరాకృతమపి ప్రమేయశయ్యాపూరణాయ కణ్ఠేన తత్పక్షమనూద్య నిరాకరోతి - యే౽పీత్యాదినా.

బాలానందిని

మా ఇతి :- ఇది క్రొత్తగా చెప్పడం కాకపోవచ్చు. పూర్వం చెప్పబడినదే మాచేత చక్కగా నిరూపించబడింది. అలా అయినప్పుడు దోషం ఏముంది? అనే అభిప్రాయంతో కించేత్యాదికం చెపుతున్నాడు. ప్రాగేవేతి.- 'అస్మత్ప్రయత్నాత్' అని అధ్యాహారం. మా ప్రయత్నంకంటె ముందుగానే అని అర్థం. (ఆశంక) కారికాకారుడు ఇతరపక్షాలను నిరాకరించినట్లు అలక్షణీయత్వపక్షాన్ని ఎందుకు నిరాకరించలేదు అనే శంకను పరిహరిస్తూ యే౽పి ఇత్యాదిగ్రంథాన్ని అవతరింపచేస్తున్నాడు (వ్యాఖ్యానానికి తీసుకుంటున్నాడు)

- ఏవమితి - ఈవిధంగా మూడు విధాలైన అభావవాదాన్నీ, భక్త్యంతర్భూతత్వాన్నీ నిరాకరించిన కారికాకారుడు వీటి మధ్య అలక్షణీయత్వాన్ని నిరాకరించి నట్లే అనగా ధ్వనిని ప్రదర్శించడం ద్వారా ఇతరపక్షాలను నిరాకరించాడు; ధ్వని లక్షణీయం కాని పక్షంలో అది కుదరదు. అందుచేత పక్షాంతరాలను నిరాకరించడం ద్వారా వాటితో ముడిపడి ఉన్న అలక్షణీయత్వపక్షం కూడా నిరాకరించబడినట్లే అని భావం.

అత ఏవేతి : అందువల్లనే సాక్షాత్తుగా అలక్షణీయత్వవాదాన్ని నిరాకరించే మూలకారిక కనపడడంలేదు. వృత్తికారు డైతే పైన చెప్పినట్లు నిరాకరింపబడినదే అయినా ఆ పక్షాన్ని, ప్రమేయాల కూర్పును పూరించడంకోసం, యేపీత్యాది గ్రంథంచేత నిరాకరిస్తూన్నాడు.

లోచనం

ఉక్తయా నీత్యా "యత్రార్థః శబ్దో వా" ఇతి సామాన్యలక్షణం ప్రతిపాదితమ్. వక్ష్యమాణయా తు నీత్యా విశేషలక్షణం భవిష్యతి "అర్థాన్తరే సంక్రమితమ్" ఇత్యాదినా. తత్ర ప్రథమోద్ద్యోతే ధ్వనేః సామాన్యలక్షణమేవ కారికాకారేణ కృతమ్. ద్వితీయోద్ద్యోతే కారికాకారః అవాన్తరవిభాగం విశేషలక్షణం చ విదధత్ అనువాదముఖేన మూలవిభాగం ద్వివిధం సూచితవాన్. తదాశయానుసారేణ తు వృత్తికృత్ అత్రైవ ఉద్ద్యోతే మూలవిభాగమవోచత్ "స చ ద్వివిధః" ఇతి. సర్వేషామితి- లౌకికానాం శాస్త్రీయాణాం చేత్యర్థః,. అతిశయోక్త్యా ఇతి. యథా "తాన్యక్షరాణి హృదయే కిమపి స్ఫురన్తి" ఇతివ దతిశయోక్త్యా అనాఖ్యేయతోక్తా సారరూపతాం ప్రతిపాదయితుమ్ ఇతి శివమ్. 19

బాలానందిని

ఉక్తయా ఇతి - చెప్పబడిన పద్ధతిచేత "యత్రార్థః శబ్దో వా" అని సామాన్యలక్షణం ప్రతిపాదించబడింది. చెప్పబడబోయే పద్ధతిచేత "అర్థాన్తరే సంక్రమితమ్" ఇత్యాదికంచేత విశేషలక్షణం వస్తుంది. ప్రథమోద్ద్యోతంలో కారికాకారుడు ధ్వనిసామాన్యలక్షణం మాత్రమే చెప్పాడు. ద్వితీయోద్ద్యోతంలో కారికాకారుడు, అవాంతరవిభాగాన్నీ విశేషలక్షణాన్నీ చెపుతూ రెండు విధాలైన మూలవిభాగాన్ని అనువాదం ద్వారా ప్రతిపాదించాడు. వృత్తికారుడైతే కారికాకారుని ఆశయాన్నే అనుసరించి "స చ ద్వివిధః" ఇత్యాదివాక్యాలలో,

ఈ ఉద్ద్యోతంలోనే మూలవిభాగం చేశాడు. సర్వేషామ్ అనగా లౌకికవస్తువులకు శాస్త్రీయవిషయాలకూ కూడ అని అర్థం. అతిశయోక్త్యేతి "ఆ అక్షరాలే(మాటలే) ఏమేమో నా హృదయంలో మోగుతున్నాయి" అన్న చోట వలె ధ్వని సారరూపమైనది అని ప్రతిపాదించడంకొరకు అతిశయోక్తిచేత "ఇది చెప్ప శక్యం కానిది" అని చెప్పబడింది. ఇతి శివమ్. 19

లోచనం

శ్లో. కిం లోచనం వినా లోకో భాతి చన్ద్రికయాపి హి,
తేనాభినవగుప్తోఽత్ర లోచనోన్మీలనం వ్యధాత్.

శ్లో. యదున్మీలనశక్త్యైవ విశ్వమున్మీలతి క్షణాత్,
స్వాత్మాయతనవిశ్రాన్తాం తాం వన్దే ప్రతిభాం శివామ్.

ఇతి శ్రీమహామాహేశ్వరాచార్యవర్యాభినవగుప్తోన్మీలితే సహృదయాలోకలోచనే ధ్వనిసఙ్కేతే ప్రథమ ఉద్ద్యోతః.

బాలానందిని

కిమితి:- లోచనం వినా= లోచనం అనే ఈ వ్యాఖ్యానం లేకుండా, ఆలోకః= కావ్యాలోకం అనే నామాంతరం గల ధ్వన్యాలోకం, చన్ద్రికయా= మరెవరో రచించిన చంద్రిక అనే వ్యాఖ్యానంచేత, అపి కిం భాతి= ప్రకాశిస్తుందా? (మరొక అర్థం) లోచనం వినా = నేత్రం లేకుండా, లోకః = లోకం, చన్ద్రికయా= వెన్నెలచేత, అపి కిం భాతి= ప్రకాశిస్తుందా? వెన్నెల ఉన్నా నేత్రం లేకపోతే లోకం ఏ విధంగా ప్రత్యక్షవిషయం కాదో అదే విధంగా లోచనవ్యాఖ్యానం లేకపోతే ధ్వన్యాలోకం, చంద్రికావ్యాఖ్యానం ఉన్నా స్పష్టంగా అర్థం కాదు అని భావం. తేన= ఆ కారణంచేత, అభినవగుప్తః= అభినవగుప్తుడు, అత్ర= ఇక్కడ (ఈ గ్రంథంమీద) లోచనోన్మీలనమ్= లోచనం అనే వ్యాఖ్య యొక్క వికాసమును, తన జ్ఞానంయొక్క ప్రకాశతో కూడిన లోచనవ్యాఖ్యానమును (నేత్రములు తెరచుటను), వ్యధాత్= చేసెను.

ప్రథమోద్ద్యోతాంతంలో కూడ 'పరాదేవతా' నమస్కారరూపమైన మంగళాచరణం కూర్చుచున్నాడు - యదితి. యదున్మీలనశక్త్యైవ= ఏ ప్రతిభయొక్క స్పందనం అనే

శక్తిచేతనే, (పాఠాంతరం) యదున్మీలనయుక్త్యైవ= ఏ శక్తి యొక్క స్పందనంయొక్క సంబంధంచేతనే, విశ్వమ్= ప్రపంచము, క్షణాత్ = క్షణంలో, ఉన్మీలతి= ప్రకాశిస్తుందో, క్షణాత్ అనడంవల్ల ఇతరాపేక్ష ఏదీ లేకుండా సకలజగత్సృష్టి సూచింపబడుతున్నది. స్వాత్మాయతనవిశ్రాన్తామ్= స్వస్వరూపమునందే విశ్రమిస్తూన్న, ప్రతిభామ్= జ్ఞానస్వరూపురాలైన, తామ్= ఆ, శివామ్= శక్తిని, వన్దే=నమస్కరిస్తున్నాను.

యదున్మీలనశక్త్యైవ = ఏ ప్రతిభయొక్క ప్రకాశశక్తి చేతనే, విశ్వమ్ = కావ్య ప్రపంచం, క్షణాత్=క్షణకాలంలో, ఉన్మీలతి = నవనవంగా భాసిస్తుందో, స్వాత్మా యతన విశ్రాన్తామ్ = స్వాత్మ అనే స్థానంలో విశ్రమిస్తూన్న అనగా వాసనారూపంలో ఉన్న, శివామ్ = రసావేశంచేత సుందరమైన, తామ్ = ఆ, ప్రతిభామ్ = కవుల ప్రజ్ఞను, వన్దే = నమస్కరిస్తున్నాను, అని కూడ మరొక అర్థం.

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను లోచనసహితధ్వన్యాలోకాంధ్రభాషావ్యాఖ్యానమునందు ప్రథమోద్యోతం సమాప్తం.



## అథ

## ద్వితీయ ఉద్ద్యోతః

### ధ్వన్యాలోకం

ఏవమ్ అవివక్షితవాచ్యవివక్షితాన్యపరవాచ్యత్వేన ధ్వనిః ద్విప్రకారః ప్రకాశితః. తత్ర అవివక్షితవాచ్యస్య ప్రభేదప్రతిపాదనాయ ఇదముచ్యతే-

కా. అర్థాన్తరే సంక్రమితమత్యన్తం వా తిరస్కృతమ్,
అవివక్షితవాచ్యస్య ధ్వనేర్వాచ్యం ద్విధా మతమ్. 1

తథావిధాభ్యాం చ తాభ్యాం వ్యఙ్గ్యస్యైవ విశేషః. తత్రార్థాన్తర సంక్రమితవాచ్యో యథా -

శ్లో. స్నిగ్ధశ్యామలకాన్తిలిప్తవియతో వేల్లద్బలాకా ఘనా
వాతాః శీకరిణః పయోదసుహృదామానన్దకేకాః కలాః,
కామం సన్తు దృఢం కఠోరహృదయో రామోఽస్మి సర్వం సహే
వైదేహీ తు కథం భవిష్యతి హ హా హా దేవి ధీరా భవ. (1

ఇత్యత్ర రామశబ్దః. అనేన హి వ్యఙ్గ్యధర్మాన్తరపరిణతః సంజ్ఞీ ప్రత్యాయ్యతే, న సంజ్ఞిమాత్రమ్.

బాలానందిని

ఏవమితి :- ఈ విధంగా అవివక్షితవాచ్యం, వివక్షితాన్యపరవాచ్యం అని రెండు విధాలైన ధ్వని ప్రకాశింపచేయబడినది (ప్రతిపాదించబడింది). వాటిలో అవివక్షిత వాచ్యంయొక్క భేదాలను ప్రతిపాదించడానికి ఇది చెప్పబడుతున్నది -

అర్థాన్తరే ఇతి - అవివక్షితవాచ్యస్య ధ్వనేః=అవివక్షితవాచ్యధ్వనియొక్క వాచ్యమ్=వాచ్యం, అర్థాన్తరే సంక్రమితమ్=మరొక అర్థంలో సంక్రమించినది అని వా=లేదా, అత్యన్తమ్=అత్యంతమూ, తిరస్కృతమ్=కప్పివేయబడినదీ అని, ద్విధా రెండువిధాలుగా, మతమ్=చెప్పబడింది.

తథా ఇతి - ఆ విధాలైన ఆ రెండు వాచ్యాలచేత వ్యంగార్థానికే కొంత విశేషం కలుగుతుంది. వాటిలో అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికి ఉదాహరణం ఎట్లనగా -

స్నిగ్ధేతి - స్నిగ్ధశ్యామలకాన్తి లిప్తవియతః=నిగనిగలాడుతూన్న నల్లని కాంతి చేత పూయబడిన ఆకాశం గల, వేల్లద్బలాకాః= (దగ్గర ఎగురుతూ) క్రీడిస్తూన్న కొంగల పంక్తులు గల, ఘనాః=మేఘాలు, శీకరిణః=తుంపరలతో కూడిన, వాతాః=వాయువులు, పయోదసుహృదామ్= మేఘాల మిత్రులైన నెమళ్లయొక్క, కలాః=మధురములైన, ఆనన్దకేకాః=ఆనందంతో కూడిన కేకాధ్వనులు, సన్తు కామమ్=ఉంటే ఉండుగాక, దృఢమ్=దృఢంగా, కఠోరహృదయః=కఠినమైన హృదయం గల నేను, రామః= (సకలదుఃఖాలకీ పాత్రుడైన) రాముడను, అస్మి=అయి ఉన్నాను, సర్వమ్=అంతనూ కూడ, సహే=సహిస్తాను, తు=కాని, వైదేహీ=సీత, కథమ్=ఎట్లు ఉండునో కదా! హ హ హా=అయ్యో! దేవి=ఓ!దేవీ! , ధీరా=ధీరురాలవుగా, భవ=ఉండుము.

ఇత్యత్రేతి - ఈ శ్లోకంలో రామశబ్దం అర్థాంతరసంక్రమితవాచ్యం. ఈ పదంచేత, వ్యంగ్యాలైన కొన్ని ఇతరధర్మాలు కలవాడుగా మారిన సంజ్ఞి తెలుపబడుతున్నాడు; కేవలం సంజ్ఞిమాత్రమే తెలుపబడడంలేదు. (సంజ్ఞ అనగా పేరు). పేరు గలది లేదా కలవాడు 'సంజ్ఞి'.

లోచనం

ద్వితీయ ఉద్యోతః

యా స్మర్యమాణా శ్రేయాంసి సూతే ధ్వంసయతే రుజః.

తామభీష్టఫలోదారకల్పవల్లీం స్తువే శివామ్.

వృత్తికారః సంగతిమ్ ఉద్యోతస్య కుర్వాణః ఉపక్రమతే - ఏవమిత్యాది. ప్రకాశిత ఇతి. యమా వృత్తికారేణ సతా ఇత్యర్థః. న చైతత్ ఉత్సూత్రం మయోక్తమ్; అపి తు కారికాకారాభిప్రాయేణేత్యాహ- తత్రేతి. తత్ర ద్విప్రకారప్రకాశనే వృత్తికారకృతే యన్నిమిత్తభూతం బీజభూతమ్ ఇతి సంబన్ధః. యది వా తత్రేతి పూర్వశేషః. తత్ర ప్రథమోద్యోతే వృత్తికారేణ ప్రకాశితః అవివక్షితవాచ్యస్య యః ప్రభేదః అవాన్తర ప్రకారః తత్ప్రతిపాదనాయ ఇదముచ్యతే, తదవాన్తరభేద ప్రతిపాదనద్వారేణైవ చ అనువాదద్వారేణ అవివక్షితవాచ్యస్య యః ప్రభేదః, వివక్షితాన్యపరవాచ్యాత్ ప్రభిన్నత్వం తత్ప్ర

తిపాదనాయేదముచ్యతే. భవతి మూలతో ద్విభేదత్వం కారికాకారస్యాపి సంమతమేవేతి భావః.

బాలానందిని

వ్యాఖ్యానకారుడు ద్వితీయోద్ద్యోతప్రారంభంలో దేవీ స్తుతిరూపమంగళాచరణం చేస్తున్నాడు- యేతి. యా=ఏ పార్వతి, స్మర్యమాణా=స్మరించబడుచున్నదై, శ్రేయాంసి=శ్రేయస్సులను, సూతే=కనునో, పుట్టించునో, రుజః=బాధలను, ధ్వంసయతే=నశింపచేయునో, తామ్=అట్టి, అభీష్టఫలుదానకల్పవల్లీమ్=ఇష్టమైన ఫలముల విషయంలో ఉదారమైన కల్పలత అయిన, శివామ్=దేవిని, స్తువే= స్తుతిస్తున్నాను.

వృత్తికార ఇతి - వృత్తికారుడు ఈ రెండవ ఉద్ద్యోతానికి పూర్వోద్ద్యోతంతో సంగతిని సమన్వయరూపసంబంధాన్ని చేస్తూ ఏవమిత్యాదికంతో ఉపక్రమిస్తున్నాడు. ప్రకాశితః=వృత్తికారుడుగా ఉండి నాచేత వివరించబడింది అని భావం. నేను సూత్రంతో (కారికతో) సంబంధం లేకుండా ఈ విషయం చెప్పలేదు; కారికాకారుని అభిప్రాయం ప్రకారమే చెప్పాను అనే అభిప్రాయంతో తత్ర ఇత్యాదికం చెపుతున్నాడు. అనగా ఇక్కడ కారికాకారుడు ధ్వనికి రెండు విధాలు చెపుతున్నాడు. దీనిని మనస్సులో ఉంచుకుని వృత్తికారుడు ప్రథమోద్ద్యోతంలోనే ఈ భేదాలను గూర్చి చెప్పి ఉన్నాడు. అతడు అలా చెప్పడానికి ఆధారం ఈ కారికయే అని అర్థం. తత్ర=వృత్తికారుడు చేసిన ప్రకారద్వయ ప్రతిపాదనంలో, ఏది నిమిత్తమో, అనగా అలా ప్రతిపాదించడానికి బీజమో అది చెప్పబడుతున్నది అని "ఉచ్యతే"తో సంబంధం.

యది వా ఇతి - లేదా - 'తత్ర' అనేది పూర్వానికి శేషం, అనగా పూర్వోక్తంతో అన్వయిస్తుంది. అప్పుడు 'తత్ర' అనగా ప్రథమోద్ద్యోతంలో అని అర్థం. ఆ ప్రథమోద్ద్యోతంలో వృత్తికారునిచేత అవివక్షితవాచ్యంయొక్క ఏ ప్రభేదం, అనగా అవాంతరప్రకారం ప్రకాశించబడిందో దానిని ప్రతిపాదించడానికి ఇది చెప్పబడుతున్నది. తదవాన్తరేతి- దాని అవాంతరభేదాలను ప్రతిపాదించడం ద్వారామాత్రమే, అనువాదం ద్వారా, అవివక్షిత వాచ్యానికి వివక్షితాన్యపరవాచ్యంకంటె ఏ ప్రభేదం, అనగా భిన్నత్వం, ఉందో దాన్ని ప్రతిపాదించడంకొరకు ఇది, అనగా ఈ కారిక, చెప్పబడుతున్నది, ఈ విధంగా మూలతః (ప్రధానంగా) రెండు భేదాలు (వివక్షితవాచ్యం, అవివక్షితవాచ్యం అనే రెండు భేదాలు) ఉన్నాయి, ఈ విషయం కారికారునికి కూడా సంమతమే అని భావం.

లోచనం

సంక్రమితమ్ ఇతి ణిచా వ్యఞ్జనావ్యాపారే యః సహకారివర్గః తస్య అయం ప్రభావ ఇత్యుక్తం తిరస్కృతశబ్దేన చ. యేన వాచ్యేన అవివక్షితేన సతా అవివక్షితవాచ్యో ధ్వనిర్వ్యపదిశ్యతే తద్వాచ్యం ద్విధేతి సంబన్ధః. యోఽర్థః ఉపపద్యమానోఽపి తావతైవానుపయోగాత్ ధర్మాన్తరసంవలనయా అన్యతామివ గతః లక్ష్యమాణః అనుగతధర్మి సూత్రన్యాయేనాస్తే స రూపాన్తరపరిణత ఉక్తః. యస్తు అనుపపద్యమాన ఉపాయతామాత్రేణార్థాన్తరప్రతిపత్తిం కృత్వా పలాయత ఇవ స తిరస్కృత ఇతి. నను వ్యఙ్గ్యాత్మనో యదా ధ్వనేర్భేదః నిరూప్యతే తదా వాచ్యస్య ద్విధేతి భేదకథనం న సంగతమితి ఆశఙ్క్యాహ - తథావిధాభ్యాం చేతి-చో యస్మాదర్థే. వ్యఞ్జకవైచిత్ర్యాద్ధి యుక్తం వ్యఙ్గ్య వైచిత్ర మితి భావః. వ్యఞ్జకే త్వర్థే యది ధ్వనిశబ్దః తదా న కశ్చిద్దోషః ఇతి భావః.

బాలానందిని

సఙ్క్రమితమితి - "సఙ్క్రమితమ్" (సంక్రమింపచేయబడినది అనే అర్థాన్ని బోధించే) ణిచ్ ప్రత్యయంచేత ('ణిచ్' ప్రత్యయం ప్రేరణను బోధిస్తుంది) 'తిరస్కృత' శబ్దంచేతా వ్యంజనావ్యాపారంలో సహకారివర్గం (లక్షణ, వక్తృవిశేషం, వివక్ష, మొదలైనది) ఉన్నదో దాని ప్రభావమే ఇది (సంక్రమించడం) అని చెప్పబడింది. (తిరస్కృత' శబ్దం కూడ ఈ అర్థాన్నే చెపుతూన్నది. వివక్షితం కాని ఏ వాచ్యంచేత ధ్వని 'అవివక్షితవాచ్యం' అని చెప్పబడుతూన్నదో ఆ వాచ్యం రెండు విధాలు అని సంబంధం (అన్వయం). యోఽర్థః ఇతి - ఏ అర్థం (రామోఽస్మి ఇత్యాదులలోని రామాదిరూపమైన అర్థం) ఉపపన్నమే అయినా (కుదురుతున్నా) తావన్మాత్రంచేత ఉపయోగం లేకపోవడం వల్ల కొన్ని ఇతరధర్మాల కలయికచేత మరొకటిగా మారిపోయింది అన్నట్లు కనబడుతూ అనుగతమైన ధర్మిగా సూత్రం వలె ఉంటుందో, (అనగా లక్షణయా బోధించబడే ఇతర ధర్మాలు కూడా వచ్చి చేరినా ఆ వాచ్యార్థం మాత్రం పుష్పాలలో దారం వలె అనుస్యూతంగా వస్తూనే ఉంటుంది అని అర్థం) అది రూపాంతరంగా పరిణమించింది, మార్పు చెందినది అని చెప్పబడుతుంది. యస్త్వితి- ఏ అర్థం అయితే ("నిఃశ్వాసాన్ధః' ఇత్యాదులలోని అంధాదిపదార్థం) ఉపపన్నం కానిదై (కుదరనిదై) కేవలం ఉపాయంగా మాత్రం

ఉపయోగించి అర్థాంతరజ్ఞానం కలిగించి పారిపోయిందా అన్నట్లు అవుతుందో అది తిరస్కృతం అని చెప్పబడుతుంది. (ఆశంక) "వ్యంగ్యార్థరూపమైన ధ్వనియొక్క భేదాలను నిరూపించే సందర్భంలో 'వాచ్యం రెండు విధాలు' అని వాచ్యార్థభేదాలను గూర్చి చెప్పడం అసంగతం కదా' అని ఆశంకించుకొని తథావిధాభ్యామ్' ఇత్యాదికంచేత సమాధానం చెపుతున్నాడు. ఇక్కడ ఉన్న 'చ'కు 'తస్మాత్' (ఆ కారణంవల్ల) అని అర్థం. వ్యంజకమైన దాని (వాచ్యార్థంయొక్క) వైచిత్ర్యంవల్ల వ్యంగ్యంయొక్క వైచిత్ర్యం యుక్తమే కదా అని భావం. వ్యఞ్జకస్యేతి - ధ్వనిశబ్దానికి 'వ్యంజకం' అని అర్థం చెప్పిన పక్షంలో ఏ దోషమూ లేదు అని భావం.

వివరణ :- కారికలోని 'ధ్వనేః' అనే పదానికి వ్యంగ్యార్థంయొక్క అని కాకుండా వ్యంజకమైనదానియొక్క అని అర్థం చెప్పవచ్చు. ప్రథమోద్ద్యోతంలో ప్రతిపాదించినట్లు వాచ్యం కూడా 'ధ్వని' అని చెప్పవచ్చును కదా? అప్పుడు అవివక్షితవాచ్యస్య అనగా "అవివక్షితమైన వాచ్యం గల, అనగా స్వస్వరూపం గల" అని అర్థం చెప్పుకొనవచ్చు. ఈ విధంగా "ధ్వని అయిన, అనగా వ్యంజకమైన అవివక్షితవాచ్యం రెండు విధాలు" అని అర్థం చెప్పడంచేత పై ఆశంకకు అవకాశం లేదు అని అర్థం.

లోచనం

భేదప్రతిపాదకేనైవ అన్వర్థనామ్నా లక్షణమపి సిద్ధమ్ ఇత్యభిప్రాయేణ ఉదాహరణమాహ - అర్థాన్తరసంక్రమితవాచ్యో యథా ఇతి - అత్ర శ్లోకే రామశబ్దః ఇతి సంగతిః. స్నిగ్ధయా జలసంబన్ధసరసయా శ్యామలయా, ద్రవిడవనితోచితాసితవర్ణయా కాన్త్యా చాకచక్యేన లిప్తమ్ ఆచ్ఛురితం వియత్ నభః యైః. వేల్లన్త్యః విజృమ్భమాణాః, తథా చలన్త్యః పరభాగవశాత్ ప్రవర్షవశాచ్చ బలాకాః సితపక్షివిశేషాః యేషు తే ఏవంవిధాః మేఘాః. ఏవం నభస్తావద్దురాలోకం వర్తతే, దిశోఽపి దుఃసహాః; యతః సూక్ష్మకణోద్గారిణః వాతా ఇతి మన్దమన్దత్వమేషామ్, అనియతదిగాగమనం చ బహువచనేన సూచితమ్. తర్హి గుహాసు క్వచిత్ప్రవిశ్య ఆస్యతామ్ ఇత్యత ఆహ - పయోదానాం యే సుహృదః తేషు చ సత్సు యే శోభనహృదయాః మయూరాః తేషామానన్దేన హర్షేణ కలాః షడ్జసంవాదిన్యః మధురాః కేకాః శబ్దవిశేషాః

తాశ్చ సర్వం పయోదవృత్తాన్తం దుఃసహం స్మారయన్తి, స్వయం దుఃసహా ఇతి భావః. ఏవమ్ ఉద్దీపనవిభావోద్దీపితవిప్రలమ్భః పరస్పరాధిష్ఠానత్వాద్రతేః విభావానాం సాధారణతామభిమన్యమానః ఇత ఏవ ప్రభృతి ప్రియతమాం హృదయే నిధాయైవ స్వాత్మవృత్తాన్తం తావదాహ - కామం సన్త్వితి. దృఢమితి సాతిశయమ్. కఠోరహృదయ ఇతి - రామశబ్దార్థధ్వనివిశేషావకాశదానాయ కఠోరపదమ్. యథా 'తద్గేహం' ఇత్యుక్తేఽపి 'నతభిత్తి' ఇతి. అన్యథా రామపదం దశరథకులోద్భవత్వ కౌసల్యాస్నేహపాత్రత్వబాల్యచరితజానకీ లాభాదిధర్మాన్తరేణ పరిణతమర్థం కథం న ధ్వనేదితి. అస్మీతి - స ఏవాహం భవామీత్యర్థః.

బాలానందిని

భేదేతి :- భేదాన్ని ప్రతిపాదించే (అర్థాంతరసంక్రమితం) అనే సార్థకనామధేయం చేతనే దాని లక్షణం కూడ చెప్పబడినట్లయినది, అనే అభిప్రాయంచేత ఉదాహరణమే చెపుతున్నాడు - అర్థాన్తరసంక్రమితవాచ్యే యథా అని. " దేని వాచ్యార్థం మరొక అర్థంలో సంక్రమించిందో అది అర్థాంతరసంక్రమితవాచ్యం అని పేరులోనే లక్షణం తెలుస్తూన్నది. అందుచేత లక్షణం వేరే చెప్పకుండా ఉదాహరణం చెపుతున్నాడని భావం. అత్రేతి - ఈ శ్లోకంలో రామశబ్దం అర్థాంతరసంక్రమితవాచ్యం అని అన్వయం.

శ్లోకార్థం వివరిస్తున్నాడు - స్నిగ్ధయా ఇతి. స్నిగ్ధయా = జలసంబంధంచేత సరసంగా ఉన్న, నిగనిగలాడుతూన్న, శ్యామలయా = ద్రవిడాంగనలకు తగిన నల్లని వర్ణం గల, కాన్త్యా = చాకచక్యంచేత, ధగధగలాడడంచేత, లిప్తమ్ = అంతటా, పూయబడిన, ఆకాశం వేటిచేతనో అట్టివి. వేల్లన్త్యః = విజృంభిస్తూన్నవి మరియు చలిస్తూన్నవి మేఘాలు రావడం అనే మంచి అదృష్టంచేత సంతోషిస్తూన్న, బలాకాః = తెల్లని పక్షివిశేషములు (కొంగలు) వేటియందో అట్టి మేఘాలు. ఈ విధంగా ఆకాశం వైపైతే చూడడమే బాధాకరంగా ఉంది. దిక్కులు కూడా సహింప శక్యం కాకుండానే ఉన్నాయి. ఎందువల్ల ననగా - వాయువులు సూక్ష్మమైన జలకణాల్ని చిమ్ముతున్నాయి. అందుచేత ఇవి మందమందంగా వీచుతున్నాయని, బహువచనంచేత ఇవి ఒక దిక్కునుంచి అని కాకుండా అన్ని వైపులనుంచీ వీచుతున్నాయి అనీ సూచించబడింది - అయితే ఏ గుహలోనో ప్రవేశించి కూర్చోవచ్చు కదా అని ఆశంకించుకొని

చెపుతున్నాడు ఏవి మేఘాలకు మిత్రములో, ఆ మేఘాలున్నప్పుడు ఉత్సాహపూరిత హృదయాలు అవుతాయో అలాంటి నెమళ్ల, ఆనందంచేత, కలాః = షడ్జస్వరంతో సమానములై మధురములైన, కేకాః= శబ్దవిశేషాలు. ఆ కేకాధ్వనులను సహించడమే కష్టం. అంతే కాకుండా అవి సహించశక్యం కాని మేఘవృత్తాంతాన్ని స్మరింపచేస్తాయి అని భావం. ఈ విధంగా ఉద్దీపనవిభావాలచేత ఉద్బుద్ధం చేయబడిన, రెచ్చగొట్ట బడిన, విప్రలంభం కలవాడై రతి పరస్పరాధిష్ఠితం అవడంవల్ల, అనగా రతి తనలోను తన ప్రియురాలైన సీతలోనూ కూడా ఉండడం వల్ల, విభావాలు కూడా సాధారణమైనవే. అనగా ఇద్దరికీ సమంగా బాధ కలిగించేవే, అని తెలుపుతూ, ఇక్కడినుంచి (ఈ వాక్యం నుంచి) ప్రియతమను హృదయంలోనే ఉంచుకొని, (ఆమెను స్మరిస్తూ) కామం సన్నిత్యాది వాక్యం చేత తన వృత్తాంతాన్ని తెలుపుతున్నాడు.

దృఢమ్ అనగా అత్యధికంగా అని అర్థం. కఠోరహృదయ ఇతి 'రామ' శబ్దానికి అర్థమైన ధ్వనివిశేషానికి అవకాశం ఇవ్వడం కోసం (To give a clue) 'కఠోరహృదయ' పదం ప్రయోగించబడింది. 'తద్గేహమ్' ఇత్యాదిశ్లోకంలో (ఈ శ్లోకం మూడవ ఉద్యోతంలో రాబోతుంది 93) 'తద్గేహమ్' అని చెప్పిన తరవాత కూడా ఏ విధమైన అర్థం ధ్వనింపబడాలో సూచించడం కోసం 'నతభిత్తి' అనే పదం చేర్చినట్లే ఇది కూడా. ఈ పదం చేర్చక పోతే రామశబ్దం కవి అనుకొన్న అర్థానికి బదులు దశరథుని కులంలో పుట్టడం. కౌసల్యాస్నేహపాత్రు డవడం, బాల్యచరిత్ర, జానకీలాభం మొదలైన అర్థాలను వ్యజింపచేయవచ్చు. అలా జరగకుండా ఉండడం కోసం ఈ పదం చేర్చబడింది. అస్మి ఇతి - నేను ఈ రాముడుగానే ఉన్నాను అని భావం.

లోచనం

'భవిష్యతి' ఇతి క్రియాసామాన్యమ్. తేన కిం కరిష్యతీత్యర్థః, అథ చ భవనమేవ అస్యాః అసంభావ్యమిత్యర్థః. ఉక్తప్రకారేణ హృదయనిహితాం ప్రియాం స్మరణశబ్దవికల్పపరమ్పరయా ప్రత్యక్షీభావితాం, హృదయ స్ఫోటనోన్ముఖీం ససంభ్రమమాహ - హహహా ఇతి దేవీతి. యుక్తం తవ ధైర్యమ్ ఇత్యర్థః. అనేనేతి. రామశబ్దేన అనుపయుజ్యమానార్థేన ఇతి భావః. వ్యఙ్గ్యం ధర్మాన్తరం ప్రయోజనరూపం రాజ్యనిర్వాసనాద్యసంఖ్యేయమ్. తచ్చ అసంఖ్యత్వాత్ అభిధావ్యాపారేణ అశక్యసమర్పణమ్. క్రమేణార్ప్య మాణమపి ఏకధీవిషయభావాభావాత్ న చిత్రచర్వణాపదమితి న

చారుత్వాతిశయకృత్ - ప్రతీయమానం తు తత్ అసంఖ్యమ్ అనుద్భిన్న విశేషత్వేనైవ కిం కిం రూపం న సహతే ఇతి చిత్రపానకరసాపూపగుడమోదక స్థానీయవిచిత్రచర్వణాపదం భవతి. యథోక్తమ్-"ఉక్త్యన్తరేణాశక్యం యత్" (ధ్వన్యా. 1-15) ఇతి. ఏష ఏవ సర్వత్ర ప్రయోజనస్య ప్రతీయమానత్వేన ఉత్కర్షహేతుః మన్తవ్యః. మాత్రగ్రహణేన సంజ్ఞీ నాత్ర తిరస్కృత ఇత్యాహ.

బాలానందిని

భవిష్యతీతి :- 'భవిష్యతి' అనే పదం క్రియాసామాన్యాన్ని, సామాన్యరూపంలో క్రియను, బోధిస్తుంది, అందుచేత 'కథం భవిష్యతి' అన్నదానికి "ఏమి చేస్తుందో" అని అర్థం. దీని అసలు అర్థం కూడా గ్రహించవచ్చును. ఈప్పుడు ఆమె ఉనికియే (భవనమే) ఊహింప శక్యం కానిది అని అర్థం. (ప్రాణాలతో ఉండకలుగుతుందో లేదో అని భావం). ఉక్తేతి - చెప్పిన విధంగా హృదయంలో ఉంచుకొనబడినదై జలధరాద్యుద్దీపకాలు ప్రియతమకు కూడా సాధారణమైనవి అని స్మరించడం, 'వైదేహి' అనే శబ్దం, 'కథం భవిష్యతి' అని వికల్పం అనగా వితర్కం - ఈ స్మరణ - శబ్ద - వికల్పాల పరంపరచేత ప్రత్యక్షంగా ఉన్నట్లు భావనచేయబడి గుండెను బ్రద్దలు కొట్టడానికి అభిముఖురాలుగా (సిద్ధంగా) ఉన్న ఆ ప్రియురాలితో "హ హా హా" అని అంటున్నాడు. దేవీతి:- నువ్వు సామాన్య స్త్రీవి కావు. దేవివి. అందుచేత నువ్వు ధైర్యంగా ఉండడం యుక్తం అని వ్యంగ్యార్థం. అనేనేతి : ఏమైనా సహిస్తాను అనే ప్రకృతార్థానికి ఉపయోగించని అర్థం గల రామశబ్దంచేత అని భావం (రామశబ్దానికి మామూలు అర్థం రాముడు అని మాత్రమే కదా)

వ్యఙ్గ్యమ్ ఇతి. ప్రయోజనరూపమైన వ్యంగ్యమైన రాజ్య నిర్వాసనాధి ధర్మాంతరం (రాజ్యనిర్వాసనం మొదలైన ఇతరధర్మాలన్నీ వ్యంగ్యాలు, అవి ప్రయోజనరూపమైనవి) లెక్కింపశక్యం కానిది. అది (ఆ ధర్మాంతరం) అసంఖ్యేయం అవడంచేత అభిధావ్యాపారంచేత దానిని సమర్పించడం (బోధించడం) అశక్యం. ఒకదాని తరవాత ఒకటి చొప్పున ఆ ధర్మాలన్నింటినీ అభిధద్వారానే బోధించాలన్నా అవి అన్నీ ఒక్క మాటు బుద్ధిలో ఇమడకపోవడంచేత చిత్రమైన చర్వణకు గోచరం కాజాలవు. అందుచేత చారుత్వాతిశయం కలిగించవు, అసంఖ్యాకం అయినా కూడ అది(ధర్మాంతరం) వ్యంగ్యం అయినట్లయితే, విశేషాలన్నీ స్ఫుటంగా గోచరించకుండానే ఏ ఏ రూపం దాల్చజాలదు? (ఊహించగలవాని శక్తిని పట్టి) ఎన్నో వర్ణింప శక్యం కాని

రూపాలు దాలుస్తుంది అని అర్థం) ఈ విధంగా ఇది చిత్రమైన పానకం, చిత్రమైన రసం, చిత్రమైన అపూపం (అప్పం) బెల్లంతో సంస్కరించిన మధురభక్ష్యం, వీటితో సమానమైన విచిత్రమైన చర్వణకు స్థానం అవుతుంది. వ్యంగ్యార్థంలో రాజ్యభ్రంశాది విశేషాలన్నీ వేరువేరుగా భాసించకపోయినా, పానకంలో వేసిన పచ్చకర్పూరం, ఏలకులు, పంచదార, ఇతరద్రవ్యాలు మొదలైనవాటి రుచి వేరువేరుగా తెలియకపోయినా అన్నీ కలిసి ఒక విచిత్రమైన రుచిని కలిగించినట్లు, సమూహాత్మకంగానే చర్వణాగోచరాలవుతాయి అని అర్థం. ఈ విషయమే 'ఉక్త్యన్తరేణాశక్యం యత్' అని వెనుక చెప్పబడింది.

ఏష ఇది :- అంతటా కూడా (ఇతరస్థలాలన్నింటిలోనూ కూడా) ప్రతీయమానమైన ప్రయోజనంయొక్క ఉత్కర్షకు ఇదే హేతువు అని గ్రహించాలి. న సంజ్ఞిమాత్రమ్ అని 'మాత్ర' శబ్దాన్ని ప్రయోగించడంచేత ఇక్కడ సంజ్ఞి (రాముడు) కప్పివేయబడలేదు అని చెపుతున్నాడు. "రాజ్యభ్రంశాద్యసంఖ్యాకకష్టాలకు పాలైన రాముడు" అని అర్థం చెప్పడంచేత వ్యంగ్యార్థంతో పాటు వాచ్యమైన రామరూపార్థం కూడా గ్రహించబడింది అని అర్థం.

## ధ్వన్యాలోకం

యథా చ మమైవ విషమబాణలీలాయామ్ -

గాథ. తాలా జాఅన్తి గుణా జాలా దే సహిఅఏహిం ఘేప్పన్తి,
రఇకిరణానుగ్గహిఆఇం హోన్తి కమలాఇం కమలాఇం. (౹౮)
తదా జాయన్తే గుణా యదా తే సహృదయైర్గృహ్యన్తే,
రవికిరణానుగృహీతాని భవన్తి కమలాని కమలాని
(సంస్కృతచ్ఛాయ).

ఇత్యత్ర ద్వితీయః కమలశబ్దః.

### బాలానందిని

యథా ఇతి : నేనే రచించిన విషమబాణలీలలో నుండి (మరొక ఉదాహరణం) ఎట్లనగా:

తదా ఇతి : యదా = ఎప్పుడు, సహృదయైః = సహృదయులచేత, గృహ్యన్తే= గ్రహించబడతాయో, తదా = అప్పుడు, తే= అవి, గుణాః= గుణాలుగా, జాయన్తే =

అవుతాయి. రవికిరణానుగృహీతాని = సూర్యకిరణాలచేత అనుగ్రహించబడిన, కమలాని = కమలాలు, కమలాని = కమలాలుగా, భవన్తి = అవుతున్నాయి.

అత్రేతి : - ఇక్కడ రెండవ కమలశబ్దం (అర్థాంతరసంక్రమితవాచ్యం).

లోచనం

తాలా తదా : జాలా యదా . ఘేప్పన్తి గృహ్యన్తే. అర్థాన్తరన్యాసమాహ - రవికిరణేతి. కమలశబ్ద ఇతి. లక్ష్మీపాత్రత్వాదిధర్మాన్తరశతచిత్రతాపరిణతం సంజ్ఞినమాహేత్యర్థః. తేన శుద్ధే అర్థే ముఖ్యే బాధా, నిమిత్తం, తత్రార్థే తద్ధర్మసమవాయః, తేన నిమిత్తేన రామశబ్దః ధర్మాన్తరపరిణతమ్ అర్థం లక్షయతి, వ్యఙ్గ్యాని అసాధారణాని అశబ్దవాచ్యాని ధర్మాన్తరాణి. ఏవం కమలశబ్దః. గుణశబ్దస్తు సంజ్ఞిమాత్రమాహేతి - తత్ర యద్బలాత్కైశ్చిదారోపితం తదప్రాతీతికమ్. అనుపయోగబాధితో హ్యర్థోఽస్య ధ్వనేర్విషయః ; లక్షణా మూలం హ్యస్య.

బాలానందిని

**తాలాఇతి:- తాలా** = తదా, జాలా = యదా, ఘేప్పన్తి = గృహ్యన్తే అని ప్రాకృతపదాలకు సంస్కృతపర్యాయాలు. రవికిరణేత్యాదికంచేత అర్థాంతరన్యాసం చెపుతున్నాడు. కమలశబ్ద ఇతి - రెండవ 'కమల'శబ్దం లక్ష్మీపాత్రత్వం మొదలైన వందల కొలది ధర్మాంతరాల చిత్రత్వంలో పరిణమించిన సంజ్ఞిని, (పద్మాన్ని) బోధిస్తూన్నది అని అర్థం.

ఈ సందర్భంలో కొందరు చేసిన వ్యాఖ్యను నిరాకరిస్తున్నాడు. తేనేతి :- "తేన... యత్ బలాత్ కైశ్చిదారోపితం తదప్రాతీతికమ్" అని అన్వయం. తేన = ఇలా చెప్పడంచేత, అనగా పూర్వశ్లోకంలో రామశబ్దం వ్యంగ్యధర్మాంతరపరిణతం అని, ఈ శ్లోకంలో రెండవ కమ శబ్దం వ్యంగ్యధర్మాంతరపరిణతం అనీ చెప్పడంచేత, (ఇతరులు చెప్పినది అనువదిస్తున్నాడు)- ముఖ్యమై శుద్ధమైన (రాముడు, కమలము, అనే) అర్థంలో బాధ ఉంది. రాముడు నేను రాముణ్ణి అని చెప్పడం, కమలాలు కమలాలు అని చెప్పడం అయుక్తం గాన ముఖ్యార్థబాధ ఉంది అని అర్థం. లక్షణచేత ధర్మాంతరపరిణతత్వం అనే అర్థాన్ని బోధించడానికి నిమిత్తం ముఖ్యార్థానికీ దానికీ (ధర్మాంతరాలకీ) సంబంధం ఉండడం. ఆ నిమిత్తంచేత రామశబ్దం ధర్మాంతర పరిణతమైన రామరూపార్థాన్ని అక్షణయా బోధిస్తుంది. శబ్దాలచేత వాచ్యాలు కాని,

అసాధారణమైన ధర్మాంతరాలు, నిర్వేద-గ్లాని-మోహాదులు వ్యంగ్యాలు. కమలశబ్దం విషయంలో కూడా ఇంతే. గుణశబ్దం మాత్రం (తచ్ఛబ్దంచేత పునర్నిర్దిష్టమైనా) సంజ్ఞిని (గుణాలను) మాత్రమే బోధిస్తుంది అని అక్కడ (ఆ శ్లోకాలలో) బలాత్కారంగా (క్లిష్టకల్పన చేసి) కొందరు ఏదైతే ఆరోపించారో అది ప్రతీతిసిద్ధం కాదు. అనగా సహృదయులు ఆ విధంగా గ్రహించరు అని భావం. అందుకు కారణం చెపుతున్నాడు - అనుపయోగేతి :- ఈ ధ్వనికి అనుపయోగంచేత బాధితమైన అర్థం విషయం కదా? దీనికి అక్షణ మూలం కదా.

వివరణ :- ఎక్కడైతే వాచ్యార్థం అనుపయోగంచేత, ఉపయోగించకపోవడం చేత, బాధితం అవుతుందో అదే ఈ అర్థాన్తరసంక్రమితవాచ్యధ్వనికి స్థానం. నేను రాముణ్ణి అని చెప్పడంలో ఉపయోగం ఏమీ లేదు. అందుచేత రామరూపార్థం బాధితం అయి రాజ్యనిర్వాసనాదిక్లేశసముదాయాన్ని ధ్వనింప చేస్తుంది. రాజ్య నిర్వాసనాదిక్లేశం వ్యంగ్యమే కాని లక్ష్యం కాదు. లక్షణ ఎప్పుడూ ఏదో ఒక ధర్మాన్ని పురస్కరించుకుని ప్రవర్తిస్తుంది గాని అనేకధర్మాలను పురస్కరించుకొని ప్రవర్తించదు. అయితే ఈ ధ్వనిలో లక్షణ సహకారిగా మాత్రం ఉంటుంది. లక్షణలో ఉండే ముఖ్యార్థబాధ దీనిలో కూడా ఉంది కాబట్టి అంతవరకే దీని లక్షణామూలత్వం అని భావం.

లోచనం

యత్తు హృదయదర్పణే ఉక్తమ్ - "హ హా హేతి సంరమ్భార్థోఽయం చమత్కారః" ఇతి; తత్రాపి సంరమ్భః ఆవేగః విప్రలమ్భవ్యభిచారీతి రసధ్వని స్తావదుపగతః. న చ రామశబ్దాభివ్యక్తార్థసాహాయ్యకేన వినా సంరమ్భోల్లాసోఽపి. "అహం సహే, తస్యాః కిం వర్తతే" ఇత్యేవమాత్మా హి సంరమ్భః, కమలపదే చ కః సంరమ్భ ఇత్యాస్తాం తావత్. అనుపయోగాత్మికా చ ముఖ్యార్థబాధా త్రాస్తీతి లక్షణామూలత్వాత్ అవివక్షితవాచ్యభేదతాస్య ఉపపన్నైవ; శుద్ధార్థస్య అవివక్షణాత్. న చ తిరస్కృతత్వమ్, ధర్మిరూపేణ తస్యాపి తావత్యనుగమాత్. అత ఏవ చ పరిణతవాచోయుక్త్యా వ్యవహృతమ్.

బాలానందిని

యత్తు ఇతి :- " ఇక్కడ ఉన్న చమత్కారం 'హ హా హా' అనేదానిచేత

గమ్యమైన సంరంభంయొక్క అర్థం, అనగా ఆ సంరంభంయొక్క కార్యం" అని హృదయదర్పణంలో ఏదైతే చెప్పబడిందో అక్కడ కూడా సంరంభం అనగా ఆవేగం విప్రలంభానికి వ్యభిచారిభావం గాన రసధ్వని అయితే అంగీకరించబడినట్లే. అయితే 'రామ' శబ్దంచేత అభివ్యక్తమైన అర్థంయొక్క సాహాయ్యం లేకుండా కేవలం "హ హా హా" అనేదానివల్ల సంరంభం వ్యక్తం కాదు. ఇక్కడ నువ్వు చెప్పే సంరంభం - "నేనైతే సహిస్తాను; ఆమె పరిస్థితి ఎలా ఉంటుందో" అనేదే కదా? 'రామ' శబ్దానికి పైన చెప్పిన అర్థాంతరసంక్రమితత్వం లేకపోతే అది సూచితం కాదు కదా అని భావం. ఈ శ్లోకంలో ఏదో విధంగా సంరంభకృతచమత్కారం ఉందని అంగీకరించినా 'కమల' పదంలో ఏం సంరంభం ఉంది? అందుచేత ఈ విషయం ఇంతటితో ఆపుదాం. అనుపయోగేతి : ఉపయోగించకపోవడం అనే ముఖ్యార్థబాధ ఇక్కడ ఉంది; అందుచేత ఇది లక్షణామూలం అవడంచేత, దీనిని అవివక్షితవాచ్యంలో ఒక భేదంగా చెప్పడం యుక్తమే. శుద్ధార్థం (కేవలముఖ్యార్థం) వివక్షితం కాదు కదా? న చేతి :- శుద్ధార్థం తిరస్కరించబడడం అనేద (పూర్తిగా అంతర్హితం అయిపోవడం అనేది) కూడా లేదు. ఎందుచేత ననగా అది ధర్మిరూపంలో లక్ష్యార్థంలోను, వ్యంగ్యార్థంలోనూ కూడా అనుగతంగా భాసిస్తూన్నది. అందుచేతనే "వ్యఙ్గ్యధర్మాన్తరపరిణతః" అని 'పరిణత' అనే పదం ప్రయోగించబడింది. ధర్మి కూడా కొంచెం మార్పు చెందిన ఆకారంలో రెండు అర్థాలలోను కనబడుతూన్నది కాబట్టి 'పరిణత' అని చెప్పబడింది. అలా కాకపోతే ఇది కూడా 'తిరోహిత" అని చెప్పబడేది.

## ధ్వన్యాలోకం

అత్యన్తతిరస్కృతవాచ్యో యథా ఆదికవేః వాల్మీకేః -

శ్లో. రవిసంక్రాన్తసౌభాగ్యస్తుషారావృతమణ్డలః,
నిఃశ్వాసాన్ధ ఇవాదర్శశ్చన్ద్రమా న ప్రకాశతే. ఇతి. (19)

అత్రాన్ధశబ్దః.

గాథ. గఅణం చ మత్తమేహం ధారాలులిఅజ్జుణాఇం అ వణాఇం,
ణిరహఙ్కారమిఅఙ్కా హరన్తి నీలాఓ వి ణిసాఓ. (20)

అత్ర మత్తనిశరహఙ్కారశబ్దౌ

బాలానందిని

అత్యన్తేతి - ఆదికవియైన వాల్మీకియొక్క అత్యన్తతిరస్కృతవాచ్యం గల శ్లోకం ఎట్లనగా -

రవీతి :- రవిసంక్రాన్త సౌభాగ్యః = సూర్యునియందు సంక్రమించిన సౌభాగ్యం కలవాడు, తుషారావృతమణ్డలః = మంచుచేత కప్పబడిన మండలం కలవాడు అయిన, చన్ద్రమాః = చంద్రుడు, నిఃశ్వాసాన్ధః = నిట్టూర్పు చేత గ్రుడ్డిదైన, ఆదర్శ ఇతి = అద్దం వలె, న ప్రకాశతే = ప్రకాశించడం లేదు.

అత్రేతి :- ఇక్కడ అంధశబ్దం అత్యంతతిరస్కృతవాచ్యం.

గగనమ్ ఇతి - మత్తమేఘమ్ =మదించిన మేఘాలు గల, గగనం చ = ఆకాశమూ, ధారాలులితార్జునాని = వర్షజలధారలచేత నలిపివేయబడిన అర్జున వృక్షాలు గల, వనాని = వనాలు, నిరహఙ్కారమృగాఙ్కాః = అహంకారం లేని చంద్రుడు గల, నీలాః అపి = నల్లగా ఉన్నా, నిశాః = రాత్రులు, హరన్తి = మనస్సును హరిస్తున్నాయి. అత్రేతి :- ఇక్కడ 'మత్త' 'నిరహఙ్కార' శబ్దాలు అత్యంతతిరస్కృతవాచ్యాలు,

లోచనం

ఆదికవేరితి:- ధ్వనేః లక్ష్యప్రసిద్ధతామాహ - రవీతి - హేమన్తవర్ణనే పఞ్చవట్యాం రామస్యోక్తిరియమ్. అన్ధ ఇతి చోపహతదృష్టిః. జాత్యన్ధస్యాపి గర్భే దృష్ట్యుపఘాతాత్; "అన్ధోఽయం పురోఽపి న పశ్యతి' ఇత్యత్ర తిరస్కారః అన్ధార్థస్య న తు అత్యన్తమ్. ఇహ తు ఆదర్శస్య అన్ధత్వమారోప్యమాణమపి న సహ్యమితి అన్ధశబ్దోఽత్ర పదార్థస్ఫుటీకరణాశక్తత్వం నష్టదృష్టిగతం నిమిత్తీకృత్య ఆదర్శం లక్షణయా ప్రతిపాదయతి. అసాధారణ విచ్ఛాయత్వానుపయోగిత్వాది ధర్మజాతమసంఖ్యం ప్రయోజనం వ్యనక్తి.

బాలానందిని

ఆదికవేరితి :- ధ్వని లక్ష్యంలో ప్రసిద్ధంగా ఉంది అని రవీత్యాదివాక్యంలో చెపుతున్నాడు. పంచవటిలో హేమంతవర్ణనసందర్భంలో ఇది రాముడన్న మాట. అన్ధః అనగా దెబ్బతిన్న చూపు కలవాడు అని అర్థం. పుట్టుకతో అంధుడుగా ఉన్నవాని దృష్టి కూడ గర్భంలోనే దెబ్బతిని ఉంటుంది "వీడు గ్రుడ్డివాడు ; (అంధుడు) ముందు ఏముందో చూడడంలేదు" ఇత్యాది వాక్యాలలో అన్ధశబ్దార్థం తిరస్కృతమే కాని పూర్తిగా తిరస్కృతం కాదు. అనగా అక్కడా అంధత్వారోపం ఉందని అర్థం. ఇక్కడైతే ఆదర్శానికి

అంధత్వం ఆరోపించాలన్నా కుదరదు ; అందుచేత ఇక్కడ అన్ధశబ్దం దృష్టిచెడిపోయిన వానిలో ఉన్న పదార్థాలని స్పష్టీకరింపజాలక పోవడం అనేదాన్ని నిమిత్తంగా చేసుకొని లక్షణావృత్తి చేత అద్దాన్ని బోధిస్తుంది. అసాధారణమైన కాంతిరాహిత్యం, ఉపయోగించక పోవడం మొదలైన అసంఖ్యమైన (చంద్రునిలోని) ధర్మసముదాయాన్ని (లక్షణ) ప్రయోజనరూపంలో వ్యంజింపచేస్తుంది.

లోచనం

భట్టనాయకేన తు యదుక్తం - ఇవశబ్దయోగాత్ గౌణతాప్యత్ర న కాచిత్ ''ఇతి తత్ శ్లోకార్థమ్ అపరామృశ్య. ఆదర్శచన్ద్రమసోర్హి సాదృశ్య'' మివ శబ్దో ద్యోతయతి. నిఃశ్వాసాన్ధః ఇతి చాదర్శవిశేషణమ్. ఇవశబ్దస్య అన్ధార్థేన యోజనే ఆదర్శః చన్ద్రమాః ఇత్యుదాహరణం భవేత్. యోజనం చైతదివ శబ్దస్య కిష్టమ్. న చ నిఃశ్వాసేన అన్ధ ఇవాదర్శః, స ఇవ చన్ద్రమాః ఇతి కల్పనా యుక్తా. జైమినీయసూత్రే హ్యేవం యోజ్యతే న కావ్యేఽపీత్యలమ్.

బాలానందిని

భట్టనాయకేనేతి-'ఇక్కడ ఇవశబ్దం ఉండడంవల్ల గౌణత్వం కూడా ఏదీ లేదు' అని భట్టనాయకుడు అన్నది శ్లోకార్థాన్ని పరిశీలించకపోవడంచేత అన్నమాటే; ఎందుచేతననగా - ఇక్కడ ఇవశబ్దం అద్దానికీ చంద్రునికీ సాదృశ్యాన్ని ద్యోతింపచేస్తుంది (సూచిస్తూంది). 'నిఃశ్వాసాన్ధః' అనేది అదర్శానికి విశేషణం (అందుచేత "చన్ద్రమాః ఆదర్శః ఇవ" అని అన్వయం చెప్పాలి). ఇవశబ్దాన్ని అంధశబ్దార్థంతో అన్వయిస్తే, అనగా "నిఃశ్వాసాన్ధ ఇవ ఆదర్శః" అని అన్వయిస్తే 'ఆదర్శం చంద్రుడు' అని అర్థం వస్తుంది. ఇవశబ్దాన్ని ఈ విధంగా యోజనచేయడం, అనగా "నిఃశ్వాసాంధమైనది వలె ఉన్న ఏ అద్దం ఉన్నదో ఆ అద్దం రూపంలో ఉన్నాడు చంద్రుడు" అని అన్వయించడం క్లిష్టకల్పన అవుతుంది. ఇవశబ్దానికి రెండు చోట్లా అన్వయం చేసి "నిఃశ్వాసంచేత అంధమైనది వలె ఆదర్శం ఉంది. ఆ ఆదర్శం వలె చంద్రుడున్నాడు" అనే కల్పన అయుక్తం. ఒక పదాన్ని రెండు చోట్ల అన్వయించి అర్థం చెప్పడం జైమినిసూత్రంలో చేయవచ్చునేమో కాని కావ్యంలో కూడా ఇలా చేయడం కుదరదు. ఇంక దీనిని గూర్చిన విమర్శ చాలు.

వివరణ:- ఇక్కడ అభినవగుప్తుడు భట్టనాయకుణ్ణి చేసిన పరిహాసాన్ని పట్టి అతడు పూర్వమీమాంసాపండితుడేమో అనిపిస్తుంది. మీమాంసకులు విధివాక్యాలలో

భావనను అంగీకరిస్తారు. భట్టనాయకుడు కావ్యశబ్దాలకి భావనావ్యాపారం అంగీకరించాడు. మీమాంసకుల భావనకీ, ఈ భావనకీ ఏ మాత్రం సంబంధం లేక పోయినా నామమాత్రసాదృశ్యాన్ని పురస్కరించుకొని అభినవగుప్తుడు ఈతనిని పూర్వమీ మాంసకు డని ఆక్షేపించి ఉండవచ్చు. మేం ధ్వనిని వైయాకరణుల నుంచి తీసుకొన్నాం అని ధ్వనివాదులు చెప్పినట్లు మేం భావనను మీమాంసకులనుంచి తీసుకొన్నాం అని భట్టనాయకుడు హృదయదర్పణంలో ఏవైనా ఉపపత్తులు చూపించి ఉన్నాడేమో తెలియదు. అయితే ద్వితీయోద్ద్యోతంలోని నాల్గవ కారిక వ్యాఖ్యలో భట్టనాయకమత ప్రతిపాదనసందర్భం చూస్తే భట్టనాయకుడు పూర్వమీమాంసకుల భావనాసిద్ధాంతం అనుకరించాడేమో అనిపిస్తుంది. (అక్కడ చూడండి)

లోచనం

గఅణమితి -

"గగనం చ మత్తమేఘం ధారాలులితార్జునాని చ వనాని,
నిరహఙ్కారమృగాఙ్కాః హరన్తి నీలా అపినిశాః" ఇతి చ్ఛాయా.

చశబ్దః అపిశబ్దార్థే. గగనం మత్తమేఘమపి, న కేవలం తారకితమ్; ధారాలులితార్జునవృక్షాణ్యపి వనాని, న కేవలం మలయమారుతాన్దోలిత సహకారాణి? నిరహఙ్కారమృగాఙ్కా నీలాః అపి నిశాః, న కేవలం సితకర కరధవలితాః, హరన్తి ఉత్సుకయన్తీత్యర్థః. మత్తశబ్దేన సర్వథైవ ఇహ అసంభవత్స్వార్థేన బాధితమద్యోపయోగక్షీబాత్మకముఖ్యార్థేన సాదృశ్యాత్ మేఘాన్ లక్షయతా అసమఞ్జసకారిత్వదుర్నివారత్వాదిధర్మ సహస్రం ధ్వన్యతే. నిరహఙ్కారశబ్దేనాపి చన్ద్రం లక్షయతా తత్పారతన్త్ర్యవిచ్ఛాయత్వోజ్జిగమిషారూప జిగీషాత్యాగప్రభృతిః.

బాలానందిని

చశబ్ద ఇతి - చశబ్దానికి 'అపి' శబ్దార్థం చెప్పాలి. 'గగనం చ' 'అర్జునాని చ', అన్నచోట్ల రెండు చశబ్దాలకు అపి అనేదాని అర్థం చెప్పాలి అని అర్థం ఈ విధంగా చెప్పడంవల్ల అపిశబ్దార్థంచేత గమ్యమైన అర్థాన్ని చెపుతున్నాడు గగనమితి. కేవలం నక్షత్రాలతో నిండినదే కాదు, మదించిన మేఘాలు కలదిగా కూడ ఉన్న ఆకాశం, కేవలం మలయమారుతంచేత కదల్చబడిన తీయమామిచెట్లున్న వనాలే కాదు, ధారాలులితార్జున

వృక్షాలు కూడా అయిన వనాలూ, కేవలం చంద్రుని కిరణాలచేత తెల్లగా చెయబడినవే కాదు నిరంహంకారమృగాంకాలు, నీలాలుకూడా అయిన నిశలు, హరన్తి=ఔత్సుక్యాన్ని కలిగిస్తాయి అని అర్థం. అనగా నక్షత్రాలు కనబడే ఆకాశం మలయమారుతంచేత ఊగుతూన్న తీయమామిడితోటలు, చంద్రకిరణాలచేత తెల్లవైన రాత్రులు ఔత్సుక్యజనకాలనే మాట ప్రసిద్ధమే. అవే కాక ఇవి కూడా యువకుల మనస్సులలో బెంగను రగుల్కొలుపుతాయి అని భావం.

మత్తేతి - ఇక్కడ మత్తశబ్దాని కున్న అర్థం అన్ని విధాలా అసంభవం. మద్యం తాగడంచేత మత్తెక్కినవాడు అనే దీని ముఖ్యార్థం బాధితం. అందుచేత ఇది సాదృశ్యంచేత లక్షణయా మేఘాన్ని బోధిస్తుంది. మేఘానికి అన్వయిస్తుంది. ఈ విధంగా అన్వయించి అసమంజసమైన పని చేయడం, నివారింప శక్యం కాకపోవడం మొదలైన వేలాది ధర్మాలను ధ్వనింపచేస్తుంది. 'నిరహంకార' శబ్దం కూడా చంద్రుణ్ణి లక్షణయా బోధిస్తూ ఆ చంద్రుడు పరాధీనుడై పోవడం, కాంతిరహితుడై పోవడం, పైకి రావాలనే కోరిక అనే జయేచ్ఛను విడిచివేయడం మొదలైనవి ధ్వనింపచేయ బడుతున్నాయి. 1

## ధ్వన్యాలోకం

**కా. అసంలక్ష్యక్రమోద్ద్యోతః క్రమేణ ద్యోతితః పరః,**
**వివక్షితాభిధేయస్య ధ్వనేరాత్మా ద్విధా మతః. 2**

ముఖ్యతయా ప్రకాశమానః వ్యఙ్గ్యః అర్థః ధ్వనేరాత్మా స చ వాచ్యార్థాపేక్షయా కశ్చిదలక్ష్యక్రమతయా ప్రకాశతే, కశ్చిత్ క్రమేణ ఇది ద్విధా మతః.

### బాలానందిని

అసంలక్ష్యేతి :- వివక్షితాభిధేయస్య = వివక్షితవాచ్యమైన, ధ్వనేః=ధ్వని కావ్యం యొక్క, ఆత్మా= స్వరూపం, అసంలక్ష్యక్రమోద్ద్యోతః=గుర్తింప శక్యం కాని క్రమం గల ద్యోతన (వ్యంజన) వ్యాపారం కలది అనీ, పరః=మరొకటి, క్రమేణ=క్రమంచేత, ద్యోతితః=వ్యంజితం అనీ, ద్విధా= రెండు విధాలుగా, మతః=చెప్పబడినది.

**ముఖ్యతయా** ఇతి :- ధ్వనికావ్యంయొక్క ఆత్మ అయిన, ముఖ్యంగా ప్రకాశించే వ్యంగ్యార్థం ఒకటి వాచ్యార్థాపేక్షయా. (వాచ్యార్థం దృష్ట్వా ) అసంలక్ష్యక్రమంగా,

(వాచ్యార్థానికీ తనకీ ఉన్న క్రమం గుర్తించబడని విధంగా) ప్రకాశిస్తుంది. మరొకటి క్రమం చేత (క్రమం గుర్తించబడేటట్లు) ప్రకాశిస్తుంది.

లోచనం

అవివక్షితవాచ్యస్య ప్రభిన్నత్వమ్ ఇతి యదుక్తం తత్ కుతః? న హి స్వరూపాదేవ భేదః భవతీతి ఆశఙ్క్య వివక్షితవాచ్యాదేవాస్య భేదః భవతి, వివక్షాతదభావయోః విరోధాత్ ఇత్యభిప్రాయేణాహ:- **అసంలక్ష్యేతి.** సమ్యక్ లక్షయితుం క్రమో యస్య తాదృశః, ఉద్ద్యోతః ఉద్ద్యోతనవ్యాపారః అస్యేతి బహువ్రీహిః. ధ్వనిశబ్దసాంనిధ్యాత్ వివక్షితాభిధేయత్వేన అన్యపరత్వమ్ అత్రాక్షిప్తమ్ ఇది స్వకణ్ఠేన నోక్తమ్. ధ్వనేరితి :- వ్యఙ్గ్యస్యేత్యర్థః. ఆత్మా ఇతి - పూర్వశ్లోకేన వ్యఙ్గ్యస్య వాచ్యముఖేన భేద ఉక్తః. ఇదానీం తు ద్యోతనవ్యాపారముఖేన ద్యోత్యస్య స్వాత్మనిష్ఠ ఏవేత్యర్థః, వ్యఙ్గ్యస్య ధ్వనేః ద్యోతనే స్వాత్మని కః క్రమః ఇత్యాశఙ్క్యాహ-వాచ్యార్థాపేక్షయేతి. వాచ్యోఽర్థో విభావాదిః.

బాలానందిని

**అవివక్షితేతి** - వెనక ప్రథమకారిక "అవతారికలో" అవివక్షితవాచ్యస్య ప్రభేద ప్రతిపాదనాయ అని అవివక్షితవాచ్యంయొక్క ప్రభిన్నత్వం అని చెప్పబడింది కదా? అది ఎట్లు కుదురుతుంది? స్వరూపంవల్లనే భేదం కుదరదు కదా? అని ఆశంకించుకొని దీనికి వివక్షితవాచ్యంకంటె మాత్రమే భేదం కుదురుతుంది. ఎందువల్లననగా వివక్ష ఉండడం, వివక్ష లేకపోవడం అనేవి పరస్పరవిరుద్ధాలు కదా అనే అభిప్రాయంతో చెపుతున్నాడు.

వివరణ:- అక్కడ "అవివక్షితవాచ్యస్య ప్రభేదప్రతిపాదనాయ" అన్నప్పుడు 'అవివక్షతవాచ్యంయొక్క అవాంతరభేదాలను ప్రతిపాదించి తద్వారా దీనికీ వివక్షితాన్య పరవాచ్యానికీ ఉన్న భేదం ప్రతిపాదించవలసి ఉంది; అందుచేత ఇది చెప్పబడుతున్నది' అని లోచనకారుడు అక్కడే వ్యాఖ్యానించాడు. అదే భావాన్ని మళ్ళీ ఇక్కడ చెపుతున్నాడు. అక్కడ నువ్వు "అవివక్షితవాచ్యంయొక్క ప్రభేదం" అని అన్నావు. భేదం అనేది తననుండి తనకే ఉండదు కదా? మరొక టేదైనా ఉన్నప్పుడు దానికంటె ఇది భిన్నం అని చెప్పడానికి అవకాశం ఉంటుంది. అది ఏది అని ఆశంకించుకొని

- అది అవివక్షితవాచ్యం. దానినుంచే వివక్షితవాచ్యానికి భేదం చెప్పాలని ఉద్దేశించబడింది. అక్కడ వివక్ష లేదు. ఇక్కడ ఉంది. వివక్ష అవివక్ష అనేవి పరస్పరభిన్నాలు కదా? ఈ భేదం తత్కృతమే అని భావం.

సమ్యగితి - బాగుగా గుర్తించడానికి శక్యమైన క్రమం దేనికో అలాంటి ఉద్యోతం, అనగా ఉద్యోతనవ్యాపారం కలది అని బహుప్రీహి సమాసం. (ఆశంక) కారికలో "వివక్షితాన్యపరాభిధేయస్య" అని చెప్పాలి కదా? అలా కాక 'వివక్షితాభిధేయస్య' అని మాత్రమే ఎందుకు చెప్పాడు అని ఆశంకించుకొని లోచనకారుడు సమాధానం చెపుతున్నాడు. ధ్వనీతి:- ఈ పదం ప్రక్కనే 'ధ్వనేః', అనే పదం ఉంది. అందుచేత వివక్షితాభిధేయం అనగానే అభిధేయం వివక్షితమై ఉండి అది ధ్వనిపరంగా ఉంటుంది అనే అర్థం ఆక్షిప్తం అవుతుంది. అందుచేత అన్యపరం అని కంఠతః (నోటితో) చెప్పలేదు. ధ్వనేః అనగా వ్యంగ్యంయొక్క అని అర్థం. ఆత్మేతి :- "అర్థాన్తరే సంక్రమితమ్" ఇత్యాది పూర్వశ్లోకంలో అవివక్షితవాచ్యధ్వనియొక్క భేదం వాచ్యముఖేన, అనగా వాచ్యం ద్వారా, చెప్పబడింది. ఇప్పుడైతే వ్యంజనావ్యాపారం ద్వారా వ్యంగ్యం యొక్క తనలోనే ఉన్న భేదం చెప్పబడింది. అనగా అవివక్షితవాచ్యధ్వనిలోని ఒక భేదంలో వాచ్యం ఇలా ఉంటుంది, మరొక దానిలో వాచ్యం అలా ఉంటుంది అని ఆ ధ్వనినే సాక్షాత్తు నిర్దేశిస్తూ దాని భేదాలు చెప్పబడ్డాయి అని భావం.

వ్యఙ్గ్యస్య ఇతి :- వ్యంగ్యరూపమైన ధ్వనిని ద్యోతింపచేయడంలో స్వస్వరూపంలోనే క్రమం అనేది ఏముంటుంది అని ఆశంకించుకొని 'వాచ్యార్థాపేక్షయా' అని అన్నాడు. అనగా ఈ క్రమం ధ్వనిలోనే ఉన్న క్రమం కాదు, వాచ్యార్థాపేక్షయా, (అనగా వాచ్యార్థానికీ ధ్వనికీ) ఉన్న క్రమం అని అర్థం. వాచ్యార్థం అనగా (ఇక్కడ) విభావాదికం. 2

## ధ్వన్యాలోకం

తత్ర -

కా. రసభావతదాభాసతత్ప్రశాన్త్యాదిరక్రమః,

ధ్వనేరాత్మాఙ్గిభావేన భాసమానో వ్యవస్థితః. 3

రసాదిరర్థో హి సహేవ వాచ్యేన అవభాసతే - స చాఙ్గిత్వే నావభాసమానః ధ్వనేరాత్మా.

బాలానందిని

తత్రేతి - ఆ రెండు విధాలైన వివక్షితవాచ్యధ్వనిలో -

రసేతి :- అఙ్గిభావేన= అంగిగా, భాసమానః=ప్రకాశిస్తూన్న, అక్రమః= క్రమలేని (క్రమం తెలియని), రసభావతదాభాసతత్ప్రశాన్త్యాదిః = రసం, భావం, రసాభాసం, భావాభాసం, భావశాంతి మొదలైనది, ధ్వనేః= ధ్వనికావ్యంయొక్క ఆత్మా=ఆత్మగా, వ్యవస్థితః=ఉన్నది.

రసాదిః ఇతి - రసం మొదలైన అర్థం వాచ్యంతో కలిసి భాసించినట్లుగా భాసిస్తుంది. అది ఆ విధంగా అంగిగా భాసించినట్లయితే అది ధ్వనికావ్యం యొక్క ఆత్మ.

లోచనం

తత్రేతి - తయోర్మధ్యాదిత్యర్థః. యో రసాదిరర్థః స ఏవాక్రమః ధ్వనేరాత్మా, న త్వక్రమ ఏవ సః, క్రమవత్త్వమపి హి తస్య కదాచిద్భవతి. తదా చ అర్థశక్త్యుద్భవానుస్వానరూపభేదతేతి వక్ష్యతే. ఆత్మశబ్దః స్వభావవచనః. ప్రకారమాహ. తేన రసాదిర్యో ఽర్థః స ధ్వనేః అక్రమో నామ భేదః. అసంలక్ష్య క్రమ ఇతి యావత్. నను కిం రసాదిరర్థో ధ్వనేః ప్రకారః నేత్యాహ; కిం తు యదా అఙ్గిత్వేన ప్రధానత్వేన అవభాసమానః. ఏతచ్చ ప్రధానలక్షణే ''గుణీకృతస్వార్థౌ'' ఇత్యత్ర యద్యపి నిరూపితం తథాపి రసవదాద్యలంకారప్రదర్శనావకాశదానాయ అనూదితమ్. స చ రసాదిధ్వనిః వ్యవస్థిత ఏవ; న హి తచ్ఛూన్యం కావ్యం కించిదస్తి.

బాలానందిని

తత్రేతి :- ఆ రెండింటి మధ్యనుండి అని అర్థం. రసభావేత్యాది కారికలో - "అంగిగా భాసిస్తూన్న అక్రమమైన రసభావాదికం ధ్వనియొక్క ఆత్మ'' అని అన్వయం చెప్పాలి. అలా చెప్పిన పక్షంలో రసాదులన్నీ అక్రమాలే అని అర్థం వస్తుంది. కాని భావాలు కొన్ని చోట్ల సంలక్ష్యక్రమాలుగా కూడా ఉంటాయి అని ముందు చెప్పనున్నాడు. అందుచేత దాని అర్థం ఈ విధంగా వివరిస్తున్నాడు - యో రసాదిరితి- రసాదికమైన ఏ అర్థం ఉండో అక్రమమైన అదే ధ్వనియొక్క ఆత్మ. అయితే రసాదికం అసంలక్ష్యక్రమమే అనే నియమం లేదు. ఒకప్పుడు దానికి (భావాదికానికి) సంలక్ష్య

క్రమత్వం కూడా ఉంటుంది. అప్పుడు అది అర్థశక్త్యుద్భవానుస్వానరూపంలో ఒక భేదంగా ఉంటుంది అని చెప్పబడగలదు. ఆత్మశబ్ద ఇతి - ఆత్మశబ్దం స్వభావం అనే అర్థం బోధిస్తుంది; ఇక్కడ ప్రకారం అని దీనికి అర్థం. తేనేతి - అందుచేత రసం మొదలైన ఏ అర్థం (విషయం) ఉన్నదో అది అక్రమం అనే ఒక భేదం; అనగా అసంలక్ష్యక్రమం. నను ఇతి - రసాదిరూపమైన అర్థం ఎల్లప్పుడూ ధ్వనియొక్క అక్రమం అనే భేదమేనా? కాదు అని చెపుతున్నాడు. మరేమనగా - ఎప్పుడైతే అది అంగిగా, ప్రధానంగా, భాసిస్తుందో అప్పుడే అది ధ్వనియొక్క అక్రమం అనే భేదం అని అర్థం. ఏతచ్చేతి :- ఈ విషయం, ధ్వని ప్రధానంగా ఉన్నప్పుడే అది ధ్వనిప్రభేదం అవుతుందనే విషయం, ''గుణీకృతస్వారౌ'' ఇత్యాతిధ్వనిసామాన్యలక్షణంలోనే చెప్పబడింది. అయినా (రసాదిధ్వని అప్రధానం అయినప్పుడు) రసవదాద్యలంకారాలు అవుతాయి అనే విషయం ప్రకాశింపచేయడానికి అవకాశం ఇవ్వడం కోసం ఇక్కడ ఆ విషయమే మళ్లీ అనువదించబడింది. ఆ రసాదికం ధ్వనిగా నిశ్చితమే అయిఉంది. అది లేని కావ్యం ఏదీ ఉండదు కదా?

లోచనం

యద్యపి రసేనైవ సర్వం జీవతి కావ్యం, తథాపి తస్య రసస్య ఏకఘనచమత్కారాత్మనోఽపి కుతశ్చిదంశాత్ ప్రయోజకీభూతాత్ అధికోఽసౌ చమత్కారో భవతి. తత్ర యదా కశ్చిదుద్రిక్తావస్థాం ప్రతిపన్నో వ్యభిచారీ చమత్కారాతిశయప్రయోజకో భవతి తదా భావధ్వనిః. యథా -

శ్లో. తిష్ఠేత్ కోపవశాత్ ప్రభావపిహితా దీర్ఘం న సా కుప్యతి
స్వర్గాయోత్పతితా భవేన్మయి పునర్భావార్ద్రమస్యా మనః,
తాం హర్తుం విబుధద్విషోఽపి న చ మే శక్తాః పురోవర్తినీం
సా చాత్యన్తమగోచరం నయనయోర్యాతేతి కోఽయం విధిః.

అత్ర హి విప్రలమ్భరససద్భావేఽపి ఇయతి వితర్కాఖ్యవ్యభిచారి చమత్క్రియాప్రయుక్తః ఆస్వాదాతిశయః.

బాలానందిని

యద్యపీతి - అన్ని కావ్యాలు కూడా రసంచేతనే జీవిస్తాయి; అయినా, రసం అనేది చమత్కారంయొక్క ఒక ముద్దయే అయినా (ఏకఘనచమత్కారాత్మనోఽపి) ఈ రసానికి కారణమైన ఒకానొక అంశంవల్ల (విభావాదికంవల్ల) ఈ చమత్కారం అధికంగా

కలుగుతుంది. వాటిలో ఉద్రిక్తావస్థను పొందిన ఏదైన ఒక వ్యభిచారిభావం ఎప్పుడు చమత్కారాతిశయానికి కారణం అవుతుందో అప్పుడు అది భావధ్వని అవుతుంది. ఎట్లనగా -

తిష్ఠేత్ ఇత్యాది :- విక్రమోర్వశీయంలో ఊర్వశీవిరహంతో బాధపడుతూన్న పురూరవుని మాటలివి. కోపవశాత్= కోపంవల్ల, ప్రభావపిహితా= తిరస్కరిణీవిద్యా ప్రభావంచేత అంతర్ధానం చెందినదై, తిష్ఠేత్= ఉండునా? ("నైతద్యుక్తమ్, యతః= ఇది యుక్తం కాదు; ఎందువలన అనగా" అని అధ్యాహారం తెచ్చుకోవాలి). సా= ఆమె, దీర్ఘమ్=దీర్ఘంగా, న కుప్యతి= కోపించదు. స్వర్గాయ= స్వర్గం కొరకు (స్వర్గానికి), ఉత్పతితా భవేత్ = ఎగిరిపోయి ఉంటుందా? (పైవలె అధ్యాహారం) పునః= కాని, అస్యాః మనః=ఆమె మనస్సు, మయి= నాయందు, భావార్ద్రమ్=ప్రేమభావం చేత ఆర్ద్రమైనది. మే పురోవర్తినీమ్= నా ఎదుట ఉన్న, తామ్= ఆమెను, హర్తుమ్= హరించుటకు, విబుధద్విషోఽపి=రాక్షసులు కూడా, న శక్తాః=సమర్థులు కారు. సా చ ఆమె, నయనయోః=నేత్రాలకి, అగోచరమ్= అవిషయత్వమును, యాతా=పొందినది, పూర్తిగా కనబడకుండా పోయింది. ఇతి= అని, అయం= ఈ, విధిః=దైవం, కః=ఏమిటి?

అత్రేతి - ఇక్కడ ఈ శ్లోకంలో మాత్రం (ఇయతి) విప్రలంభరసం ఉన్నా వితర్కం అనే వ్యభిచారిభావంయొక్క చమత్కారంచేత కలిగే ఆస్వాదాతిశయం ఉంది (ఆస్వాదమే అధికంగా ఉంది).

### లోచనం

వ్యభిచారిణః ఉదయస్థిత్యపాయత్రిధర్మకాః. యదాహ- "వివిధమాభిముఖ్యేన చరన్తీతి వ్యభిచారిణః" ఇతి. తత్రోదయావస్థా ప్రయుక్తః కదాచిత్. యథా -

శ్లో. యాతే గోత్రవిపర్యయే శ్రుతిపథం శయ్యామనుప్రాప్తయా
నిర్ధ్యాతం పరివర్తనం పునరపి ప్రారబ్ధుమఙ్గీకృతమ్,
భూయస్తత్ప్రకృతం కృతం చ శిథిలక్షిప్తైకదోర్లేఖయా
తన్వఙ్గ్యా న తు పారితః స్తనభరః క్రష్టుం ప్రియస్యోరసః.

అత్ర హి ప్రణయకోపస్యోజ్జిగమిషయైవ యదవస్థానం "న తు పారితః" ఇత్యుదయావకాశనిరాకరణాత్ తదేవాస్వాదజీవితమ్., స్థితిః

పునరుదాహృతా "తిష్ఠేత్ కోపవశాత్" ఇత్యాదినా.

బాలానందిని

తత్రేతి :- వాటిలో ఒకప్పుడు ఉదయావస్థచేత ఏర్పడిన చమత్కారం ఉంటుంది. ఎట్లనగా - యాతే ఇతి:- గోత్రస్ఖలనంవల్ల నాయికకు కోపం ఉదయించబోయింది అని కవి ఈ శ్లోకంలో వర్ణిస్తున్నాడు; ఆ నాయిక ప్రవర్తన ఇక్కడ "జానాతి, ఇచ్ఛతి, యతతే, చేష్టతే"- (తెలుసుకుంటాడు, కోరుతాడు, ప్రయత్నిస్తాడు, ప్రవర్తిస్తాడు అనగా చేస్తాడు) అనే పద్ధతిలో జరిగిందని చెప్పబడుతున్నది. శయ్యామ్=శయ్యను, అనుప్రాప్తయా= పొందిన, ప్రియునితో కూడ శయనించిన యువతిచేత, గోత్రవిపర్యయే=గోత్రస్ఖలనం, అసలు పేరుకు బదులు మరొక స్త్రీ పేరును పెట్టి పిలవడం, శ్రుతిపథమ్= శ్రవణమార్గాన్ని, యాతే = పొందిన దగుచుండగా, పరివర్తనమ్= అటువైపు తిరిగిపోవడం, నిర్ధ్యాతమ్= ఆలోచించబడింది. అటువైపు తిరిగిపోవాలని ఆమె అనుకుంది. పునరపి=మరియు, ప్రారబ్ధుమ్=ప్రారంభించడానికి, అఙ్గీకృతమ్= అంగీరించబడింది. ముందు అనుకొని తరవాత అలా చేయాలని నిశ్చయించుకుంది. భూయః=మళ్లీ, తత్=ఆ పరివర్తనం, ప్రకృతమ్= ప్రారంభించబడింది. భూయః=మళ్లీ అనగా తరవాత, శిథిలక్షిప్తైక దోర్లేఖయా=శిథిలంగా అటువైపు ఉంచబడిన ఒక బాహువు గల, తన్వఙ్గ్యా = ఆ తన్వంగిచేత, తత్= ఆ పరివర్తనం, కృతం చ చేయబడింది కూడా. ఇష్టం లేకపోయినా ఒక బాహువు అటువైపు మెల్లిగా త్రిప్పి పెడమోగంతో పడుకోబోయింది. తు=కాని, ప్రియస్య=ప్రియునియొక్క. ఉరసః=వక్షః స్థలం నుంచి, స్తనభరః=స్తనభారం, క్రష్టుమ్=లాగుకొనుట, న పారితః= శక్యం కాలేదు.

అత్ర హీతి: ఇక్కడ "న తు పారితః" అని కోపం ఉదయించడానికి అవకాశమే లేకపోయింది అని చెప్పడంవల్ల ప్రణయకోపం వెళ్లిపోవాలని (తొలగిపోవాలని) ఇచ్ఛతోనే ఉండడం అనేది ఏది కలదో అది ఆస్వాదజీవితంగా ఉంది. ఇది భావోదయానికి ఉదాహరణం. "తిష్ఠేత్ కోపవశాత్" ఇత్యాదిశ్లోకంలో వితర్కం అనే వ్యభిచారిభావం యొక్క స్థితి ఉదాహరించబడింది.

లోచనం

క్వచిత్తు వ్యభిచారిణః ప్రశమావస్థయా ప్రయుక్తః చమత్కారః. యథోదాహృతం ప్రాక్ "ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా' ఇతి. అయం తత్ప్ర శమః ఇత్యుక్తమ్. అత్ర చ ఈర్ష్యావిప్రలమ్భస్య రసస్యాపి ప్రశమః ఇతి

శక్యం యోజయితుమ్.

క్వచిత్తు వ్యభిచారిణః సన్ధిరేవ చర్వణాస్పదమ్. యథా -

గాథ. ఓసురు సుమ్ఠి ఆఇం ముహూ చుమ్బిఉ జేణ,

అమిఅరసఘోణ్టాణం పడిజాణిఉ తేణ.

+ "ఈర్ష్యాశ్రుశోభితాయా ముఖం చుమ్బితం యేన,

అమృతరసనిగరణానాం తృప్తిర్జ్ఞాతా తేన".

ఇత్యత్ర శ్రుత్యుక్తే తు కోపే కోపకషాయగద్గదమన్దరుదితాయాః యేన ముఖం చుమ్బితం తేన అమృతరసనిగరణవిశ్రాన్తిపరంపరాణాం తృప్తిః జ్ఞాతేతి కోపప్రసాదసన్ధిః చమత్కారస్థానమ్.

బాలానందిని

క్వచిదితి- కొన్ని చోట్ల అయితే వ్యభిచారిభావంయొక్క ప్రశమావస్థచేత చమత్కారం కలిగించబడుతుంది. వెనుక ఉదాహరించిన "ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా" ఇత్యాది శ్లోకంలో కోపప్రశమం అని (కొందరిచేత)చెప్పబడింది. అయితే-ఇక్కడ ఈర్ష్యా విప్రలంభరసంయొక్క ప్రశమం కూడా ఉన్నదని చెప్పవచ్చును.

క్వచిదితి:- కొన్ని చోట్ల అయితే వ్యభిచారిభావాల సంధియే చర్వణాగోచరం అవుతుంది. ఎట్లనగా - ఈర్ష్యేతి - యేన =ఎవనిచేత, ఈర్ష్యాశ్రుశోభితాయాః= ఈర్ష్యచేత కలిగిన కన్నీళ్లతో ప్రకాశిస్తూన్న ప్రియురాలియొక్క, ముఖమ్=ముఖము, చుమ్బితమ్= చుంబించబడిందో, తేన= వానిచేత, అమృతరసనిగరణానామ్= అమృతరసం మ్రింగడాలయొక్క (గుటకలయొక్క) తృప్తిః=తృప్తి, జ్ఞాతా= తెలియబడినది.

ఇత్యత్ర ఇతి:- ఇక్కడ కోపం ఈర్ష్యాశబ్దంచేత చెప్పబడినా - కోపకషాయం చేత గద్గదమైన మందమైన రోదనం గల (గద్గదకంఠంతో మందంగా ఏడుస్తూన్న) ప్రియురాలి ముఖం ఎవడు చుంబిస్తాడో వాడు ఆగి ఆగి అమృతరసం గుటకలు వేస్తుంటే వాటి పరంపరవల్ల కలిగే తృప్తిని తెలుసుకుంటాడు అని కోపప్రసాదాల సంధి, అనగా ప్రియురాలిలో కలిగిన కోపం, ప్రసాదం - ఈ రెండింటి సంధి, చమత్కార జనకంగా ఉంది.

+ (దీని సంస్కృతచ్ఛాయ ఇది కావచ్చును అని (ఇతి ఛాయేవ ప్రతిభాతి ) అని బాలప్రియావ్యాఖ్యాకారుడు అన్నాడు)

లోచనం

క్వచిద్వ్యభిచార్యన్తరశబలతైవ విశ్రాన్తిస్థానమ్ . యథా -

శ్లో. క్వాకార్యం శశలక్ష్మణః క్వ చ కులం భూయోఽపి దృశ్యేత సా
దోషాణాం ప్రశమాయ మే శ్రుతమహో కోపేఽపి కాన్తం ముఖమ్,
కిం వక్ష్యన్త్యపకల్మషాః కృతధియః స్వప్నేఽపి సా దుర్లభా
చేతః స్వాస్థ్యముపైహి కః ఖలు యువా ధన్యోఽధరం ధాస్యతి.

అత్ర హి వితర్కౌత్సుక్యే, మతిస్మరణే, శఙ్కాదైన్యే, ధృతిచిన్తనే పరస్పరం బాధ్యబాధకభావేన ద్వన్ద్వశో భవన్తి, పర్యన్తే తు చిన్తాయా ఏవ ప్రధానతాం దదతీ పరమాస్వాదస్థానమ్. ఏవమన్యదప్యుత్ప్రేక్ష్యమ్. ఏతాని చోదయసంధిశబలత్వాదికాని కారికాయామాదిగ్రహణేన గృహీతాని.

బాలానందిని

క్వచిదితి :- కొన్ని చోట్ల ఇతరవ్యభిచారిభావాలతో కలవడమే విశ్రాంతిస్థానం, అనగా చిత్తవిశ్రాంతిస్థానం, చమత్కారకారణం అని అర్థం. ఎట్లనగా -

క్వాకార్యమ్ ఇతి :- దేవయానిని చూచి యయాతి అనుకుంటూన్న మాట లని కొందరు కావ్యప్రకాశవ్యాఖ్యాతలు వ్రాశారు. కాని ఇది ఏ కావ్యంలోదో, నాటకంలోదో తెలియదు. అకార్యమ్= మునికన్యాభిలాషారూపమైన అకార్యం, క్వ=ఎక్కడ? శశలక్ష్మణః=చంద్రుని యొక్క, కులమ్=కులము, క్వ=ఎక్కడ(వితర్కం). సా=ఆమె, భూయః= మళ్లీ, అపి దృశేతే= చూడబడుతుందా? (ఔత్సుక్యం). నః=మనయొక్క, శ్రుతమ్ = శాస్త్రశ్రవణం,దోషాణామ్=దోషాలయొక్క, ప్రశమాయ=వినాశంకొరకే కదా? (మతి) అహో=ఏమి ఆశ్చర్యం? కోపేఽపి =కోపంలో కూడా, ముఖమ్= ఆమె ముఖం, కాన్తమ్=మనోహరమైనది. (స్మరణం). అపకల్మషాః=తొలగిన పాపాలు గల (పాపాలు లేని). కృతధియః=పండితులు. కిమ్=ఏమి, వక్ష్యన్తి=పలికెదరో? (శంక). సా=ఆమె, స్వప్నేఽపి=స్వప్నంలో కూడా, దుర్లభా=దుర్లభమైనది (దైన్యం), చేతః=చిత్తమా! స్వాస్థ్యమ్= స్వస్థతను, ఉపైహి=పొందుము (ధృతి). ధన్యః=ధన్యుడైన, కః యువా= ఏ యువకుడు, అధరమ్= అధరోష్ఠాన్ని, ధాస్యతి = పానం చేస్తాడో (చింత).

అత్రేతి - ఇక్కడ వితర్క - ఔత్సుక్యాలు, మతి-స్మరణలు, శంకా - దైన్యాలు, ధృతి-చింతలు రెండేసి పరస్పరం బాధ్యబాధకాలుగా అవుతూ చివరికి చింతకే

ప్రాధాన్యం ఇస్తూ మిక్కిలి ఆస్వాదానికి స్థానం అవుతున్నాయి. వితర్కౌత్సుక్యాలు మతిస్మరణలచేత బాధించబడుతున్నాయి. మతిస్మరణలు వితర్కౌత్సుక్యాలచేత బాధించబడుతున్నాయి ఇత్యాది విధంగా ఈ జంటలలో పరస్పరం బాధ్యభాధకభావం ఉన్నది అని అర్థం.

ఏవమితి - ఈ విధంగానే ఇతరమైనవాటిని గూర్చి కూడా ఊహించుకోవాలి. ఈ ఉదయ-సంధి -శబలత్వాదులు కారికలో ఆదిపదంచేత (ప్రశాన్త్యాదిలోని 'ఆది' పదంచేత) గ్రహింపబడ్డాయి.

లోచనం

నన్వేవం విభావానుభావముఖేనాపి అధికచమత్కారః దృశ్యతే ఇతి విభావధ్వనిః అనుభావధ్వనిశ్చ వక్తవ్యః. మైవమ్- విభావానుభావౌ తావత్ స్వశబ్దవాచ్యావేవ. తచ్చర్వణాపి చిత్తవృత్తిష్వేవ పర్యవస్యతీతి రసభావేభ్యో నాధికం చర్వణీయమ్. యదా తు విభావానుభావావపి వ్యఙ్గ్యౌ భవతః తదా వస్తుధ్వనిరపి కిం న సహ్యతే? యదా తు విభావాభాసాద్రత్యాభాసోదయః తదా విభావానుభాసాచ్చర్వణాభాస ఇతి రసాభాసస్య విషయః. యథా రావణకావ్యాకర్ణనే శృఙ్గారాభాసః. యద్యపి "శృఙ్గారానుకృతిర్యాతు స హాస్యః" ఇతి మునినా నిరూపితం తథాప్యౌత్తరకాలికం తత్ర హాస్యరసత్వమ్.

"దూరాకర్షణమోహమన్త్ర ఇవ మే తన్నామ్ని యాతే శ్రుతిం
చేతః కాలకలామపి ప్రకురుతే నావస్థితిం తాం వినా"

ఇత్యత్ర తు న హాస్యచర్వణావసరః.

బాలానందిని

నన్వితి :- (ఆశంక) ఈ విధంగానే విభానుభావాల ద్వారా కూడా అధికమైన చమత్కారం కనబడుతున్నది కాబట్టి 'విభావధ్వని', 'అనుభావధ్వనీ' కూడా చెప్పవలసి ఉంటుంది? (సమాధానం) మైవమితి. ఇది సరికాదు. విభావానుభావాలైతే స్వశబ్దాల చేతనే చెప్పబడతాయి. అందుచేత వాటి చర్వణ కూడా చిత్తవృత్తులలోనే, అనగా రత్యాదిచిత్తవృత్తిచర్వణలలోనే, పర్యవసానం చెందుతుంది. ఆ కారణంచేత రసభావాలకంటె అధికంగా చర్వణీయమైనది ఏదీ ఉండదు, యదా తు ఇతి. విభావానుభావాలు కూడా వ్యంగ్యాలే అయినప్పుడు వస్తుధ్వని కూడా ఎందుకు

సహించబడదు. అనగా అవి వ్యంగ్యాలుగా ఉన్నచోట్ల వాటిని వ్యంగ్యాలే అని అంగీకరించవచ్చు. ఆ ధ్వని వస్తుధ్వని అని చెప్పవచ్చు. అందుకు అభ్యంతరం ఏమీ ఉండకూడదు అని భావం.

రసభావేత్యాదికారికలో 'తదాభాస' శబ్దంచేత నిర్దిష్టమైన ఆభాసను నిరూపిస్తున్నాడు, యదా త్వితి: ఎప్పుడైతే విభావాభాసంవల్ల రత్యాభాసం ఉదయిస్తుందో అప్పుడు విభావాన్ని అనుసరించి ఏర్పడడంచేత (ఆ చర్వణ) చర్వణాభాసం అవుతుంది. అది రసాభాసానికి విషయం అవుతుంది. రావణునికి సంబంధించిన వాక్యాలు విన్నప్పుడు ఉన్న శృంగారాభాస దీనికి ఉదాహరణం.

వివరణ. రావణునికి సీత విషయంలో కలిగిన రతికి సీత ఆలంబనవిభావం. నిజానికి అది యుక్తమైన ఆలంబనం కాదు కాబట్టి ఆలంబనాభాసమే. ఆ ఆలంబనాన్నిపట్టి కలిగిన రతి కూడా ఆభాసమే (రత్యాభాసం). దీనివల్ల కలిగిన చర్వణాభాసం ఎక్కడ ఉంటుందో అది రసాభాసానికి విషయం.

యద్యపీతి : "శృంగారంయొక్క అనుకరణం హాస్యం" అని భరతముని నిరూపించినా కూడ అక్కడ హాస్యరసత్వం ఉత్తరకాలంలో (శృంగారాభాసచర్వణా నంతరం) కలిగేది. అనగా ముందు అక్కడ ఉన్న వర్ణనాదులను బట్టి శృంగారచర్వణ జరిగిపోయిన తరవాత పరిత అయ్యో ఇదంతా అయుక్తం కదా అని తెలుసుకుంటాడు; అప్పుడు హాస్యరసస్ఫూర్తి కలుగుతుంది అని భావం. 'దూరాకర్షణ' ఇత్యాది శ్లోకంలో మాత్రం హాస్యరసచర్వణకి అవకాశం లేదు.

" ఏతైరాకులితస్య విక్షతరతేరఙ్గైరనఙ్గాతురైః
సంపద్యేత కథం తదాప్తిసుఖమిత్యేతన్న వేద్మి స్ఫుటమ్."

అని ఈ శ్లోకానికి ఉత్తరార్ధం. దూరాకర్షణేతి - దూరాకర్షణమోహమన్త్రే ఇవ=దూరంనుంచి ఆకర్షించేది మోహింపచేసేదీ అయిన మంత్రం వలె ఉన్న, తన్నామ్ని=ఆమె పేరు, శ్రుతిమ్=చెవిని, యాతే=పొందినదగుచుండగా, మే చేతః=నా చిత్తం, కాలకలామపి=అత్యల్పకాలమును కూడ (కాలం పాటు కూడ), తాం వినా =ఆమె లేకుండా, అవస్థితిమ్=నిలకడను, న ప్రకురుతే=చేయడం లేదు, అనఙ్గాతురైః =మన్మథునిచేత పీడితాలైన, ఏతైః=ఈ, అఙ్గైః=అవయవాలతో, ఆకులితస్య= వ్యాకులుణ్ణిగా చేయబడిన, విక్షరతేః=తొలగింపబడిన ఇతరవిషయరుచి గల నాకు, తదాప్తిసుఖమ్= ఆమెను పొందడంవల్ల సుఖం, కథమ్= ఎట్లు, సంపద్యేత=లభించును, ఇతి= అని, స్ఫుటమ్=స్పష్టంగా, న జానే=ఎరుగను.

లోచనం

నను నాత్ర రతిః స్థాయిభావోఽస్తి; పరస్పరాస్థాబన్ధాభావాత్ కేనైతదుక్తం రతిరితి? రత్యాభాసో హి సః. అతశ్చాభాసతా, యేనాస్య సీతా మయ్యుపేక్షికా ద్విష్టా వేతి ప్రతిపత్తిః హృదయం న స్పృశత్యేవ. తత్స్పర్శే హి తస్యాప్యభిలాషో విలీయేత. న చ మయి ఇయమ్ అనురక్తా ఇత్యపి నిశ్చయేన కృతం, కామకృతాత్ మోహాత్. అత ఏవ తదాభాసత్వం వస్తుతః తత్ర స్థాప్యతే శుక్తౌ రజతాభాసవత్. ఏతచ్చ శృఙ్గారానుకృతిశబ్దం ప్రయుఞ్జానో మునిరపి సూచితవాన్. అనుకృతిః, అముఖ్యతా, ఆభాసః ఇతి హి ఏకోఽర్థః. అత ఏవ అభిలాషే ఏకతరనిష్ఠేఽపి శృఙ్గారశబ్దేన తత్ర తత్ర వ్యవహారః తదాభాసతయా మన్తవ్యః. శృఙ్గారేణ వీరాదీనామపి ఆభాసతా ఉపలక్షితైవ. ఏవం రసధ్వనేరేవామీ భావధ్వనిప్రభృతయః నిఃష్యన్దాః. ఆస్వాదే ప్రధానం ప్రయోజకమ్ ఏవమ్ అంశం విభజ్య పృథక్ వ్యవస్థాప్యతే. యథా గన్ధయుక్తిజ్ఞైః ఏకరససంమూర్ఛితామోదోపభోగేఽపి శుద్ధమాంస్యాది ప్రయుక్తమిదం సౌరభమ్ ఇతి.

బాలానందిని

నన్వితి - (ఆశంక) ఇక్కడ స్థాయిభావమైన రతి లేనే లేదు కదా? పరస్పర ప్రేమ అనేది ఇక్కడ లేదు కదా? (సమాధానం) ఇది రతి అని నీతో ఎవరు అన్నారు? అది రత్యాభాస కదా? ఇది ఆభాసమే అనడానికి కారణం ఏమిటనగా - "సీత నా విషయంలో ఉపేక్షాభావంతో ఉంది. లేదా ద్వేషంతో ఉంది" అనే ఆలోచనే వాని హృదయంలో కలగడం లేదు. అలాంటి ఆలోచన ఉంటే వాని అభిలాష కూడా అణిగిపోతుంది. "ఈమెకు నామీద అనురాగం ఉంది" అనే నిశ్చయంతో కూడా అతడు అలా చేయడం లేదు, ఎందుచేత ననగా కామజనితమైన మోహంలో ఉన్నాడు. అందుచేతనే నిజానికి దానియందు (తత్ర), అనగా వాని అభిలాషయందు, రత్యాభాసత్వం, శుక్తి యందు రజతాభాసం వలె స్థాపించబడుతున్నది. ఈ విషయాన్ని 'శృఙ్గారానుకృతి' శబ్దాన్ని ప్రయోగించిన ముని కూడ సూచించి ఉన్నాడు. 'అనుకృతి', 'అముఖ్యత' 'ఆభాస' వీటి కన్నింటికీ అర్థం ఒకటే కదా? అందువల్ల - అభిలాష ఒకరిలో మాత్రమే ఉన్నా కూడా అక్కడక్కడ 'శృంగార' శబ్దంతో వ్యవహరిస్తూండడానికి

కారణం శృంగారాభాస అవడంచేత మాత్రమే అని గ్రహించాలి. శృంగారంచేత వీరాదుల ఆభాసత్వం కూడా ఉపలక్షణచేత చెప్పినట్లే.

పైన చెప్పిన కారణాలచేత కొన్నిచోట్ల కనబడే శృంగారాన్ని శృంగారాభాస అని మాత్రమే ఏ విధంగా చెప్పాలో అదేవిధంగా అలాంటి పరిస్థితులలో వీరరసాదుల్ని కూడా వీరరసాద్యాభాసలని మాత్రమే అనాలి అని అర్థం. చెప్పవలసిన దానిలో ఒక అంశాన్ని మాత్రం చెప్పడం 'ఉపలక్షణం'. దీనిని బట్టి మిగిలినవి కూడా ఊహించుకోవాలి.

ఏవమితి -ఈ విధంగా ఈ భావధ్వని మొదలైనవి రసధ్వనియొక్క నిఃష్యందాలే (దానినుంచి జారి వచ్చినవే). ఈ విధంగా (పైన చెప్పిన విధంగా) ఆస్వాదానికి ప్రధాన కారణమైన అంశాన్ని విభజించి ఇవి వేరుగా ఏర్పరుపబడుతున్నాయి. ఏకరసంగా కలిసిపోయిన (అనేక) సువాసనల అనుభవం చేస్తూన్నప్పుడు కూడా, "ఈ సుగంధం శుద్ధమైన మాంసి మొదలైనవాటివల్ల వస్తూన్నది" అని వివిధసువాసనద్రవ్యాలను కలపడంలో నేర్పు కలవాళ్లు ఏ విధంగా అంటూంటారో ఇది కూడా అంతే.

లోచనం

రసధ్వనిస్తు స ఏవ యోఽత్ర ముఖ్యతయా విభావానుభావవ్యభిచారి సంయోజనోదితస్థాయిప్రతిపత్తికస్య ప్రతిపత్తుః స్థాయ్యంశచర్వణాప్రయుక్త ఏవ ఆస్వాదప్రకర్షః. యథా-

శ్లో. కృచ్ఛ్రేణోరుయుగం వ్యతీత్య సుచిరం భ్రాన్త్వా నితమ్బస్థలే
మధ్యేఽస్యాస్త్రివలీతరఙ్గవిషమే నిఃష్పన్దతామాగతా,
మద్దృష్టిస్తృషితేవ సంప్రతి శనైరారుహ్య తుఙ్గౌ స్తనౌ,
సాకాంక్షం ముహురీక్షతే జలలవప్రస్యన్దినీ లోచనే.

అత్ర హి నాయికాకారానువర్ణ్యమానస్వాత్మప్రతికృతిపవిత్రచిత్ర ఫలకావలోకనాత్ వత్సరాజస్య పరస్పరాస్థాబన్ధరూపో రతిస్థాయిభావో విభావానుభావసంయోజనవశేన చర్వణారూఢ ఇతి తదలం బహునా. స్థితమేతత్ - రసాదిః అర్థః అఙ్గిత్వేన భాసమానః అసంలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య ధ్వనేః ప్రకార ఇతి. సహేవేతి - ఇవశబ్దేన అసంలక్ష్యతా విద్యమానత్వేఽపి క్రమస్య వ్యాఖ్యాతా - వాచ్యేనేతి :- విభావానుభావాదినా.

బాలానందిని

రసేతి - విభావానుభావవ్యభిచారిభావాలు కలవడంచేత కలిగిన స్థాయిభావజ్ఞానం గల జ్ఞాతకు స్థాయిభావాంశంయొక్క చర్వణచేత కలిగిన ఏ ఆస్వాదాతిశయం కలుగుతుందో అదే ఇక్కడ ముఖ్యంగా రసధ్వని అని చెప్పబడుతుంది.

వివరణ- జ్ఞాత (సామాజికుడు లేదా పఠిత) విభావానుభావవ్యభిచారిభావాల సంయోగాన్ని, ఒక చోట కూర్చబడి ఉండడాన్ని, గ్రహించగానే అతనికి స్థాయి భావజ్ఞానం కలుగుతుంది. అప్పుడు అతడు వాటి అన్నింటితో కలిసిన స్థాయిభావాంశాన్ని చర్వణం చేస్తాడు. ఆ చర్వణంవల్ల అత్యధిక మైన ఆస్వాదమే ప్రధానంగా ఉన్నప్పుడు రసధ్వని అని చెప్పబడుతుంది అని భావం. ఎట్లనగా - కృచ్ఛ్రేణేతి - రత్నావళిలో రాజు విదూషకునితో అంటూన్న మాటలివి- మద్దృష్టిః=నా దృష్టి, కృచ్ఛ్రేణ=అతికష్టంగా, అస్యాః = ఈమెయొక్క, ఊరుయుగమ్=ఊరువుల ద్వయాన్ని, వ్యతీత్య = దాటి, నితమ్బస్థలే=నితంబప్రదేశమునందు, సుచిరమ్= చాలాకాలము, భ్రాన్త్వా=తిరిగి, త్రివళీతరఙ్గవిషమే=మూడు వళు లనే తరంగములచేత విషమంగా ఉన్న, మధ్యే=నడుమునందు, నిఃష్పన్దతామ్=నిశ్చలత్వాన్ని, ఆగతా=పొందినదై, సంప్రతి= ఇప్పుడు, తుఙ్గౌ= ఉన్నతములైన, స్తనౌ=స్తనాలను, శనైః=మెల్లిగా, ఆరుహ్య=ఎక్కి, తృషితేవ= దప్పికొన్నది వలె, జలలవప్రస్యన్దినీ=జలలవాలను స్రవిస్తూన్న, లోచనే= నేత్రాలను, ముహుః = మాటి మాటికి, ఈక్షతే=చూస్తున్నది.

వివరణ:- ఈ శ్లోకంలో ఊరుయుగమూ, నితంబమూ కూడ అతి విశాలంగా ఉన్నట్లు, నడుము సన్నంగా ఉన్నట్లు, స్తనములు పెద్దవిగా ఉన్నట్లు గమ్యం అవుతుంది. దీనిచేత నాయికయొక్క సౌందర్యాతిశయం ధ్వనిస్తూన్నది. నేత్రాలు జలలవా లున్న వనడంచేత నాయికయొక్క అధికవిరహదుఃఖం గమ్యం అవుతున్నది. ఎవరో ఒక వనిత అరణ్యంలో తిరుగుతున్నట్లు ఒక వృత్తాంతం కూడా ధ్వనింప చేయబడుతున్నది.

అత్ర హీతి - ఇక్కడ నాయికయొక్క ఆకారంచేత దానితో పాటు (దాని ప్రక్కనే) చూడబడుతూన్న తన చిత్రం చేత పవిత్రమైన చిత్రఫలకాన్ని చూడడంవల్ల వత్సరాజు యొక్క పరస్పరం ఆసక్తి కలిగి ఉండడం అనే రతిస్థాయిభావం విభావానుభావాల కూర్పువల్ల చర్వణారూఢమైనది. అందుచేత ఇది రసధ్వని అని అర్థం. ఇంక అధికంగా వ్రాసి చాలును.

స్థితమితి - అంగిగా భాసిస్తూన్న రసాద్యర్థం అసంలక్ష్యక్రమధ్వనియొక్క

ప్రకారం అని ఇది నిర్ణయించిన విషయం. సహేవేతి - 'ఇవ' శబ్దంచేత క్రమం ఉన్నా అది కనబడకపోవడం వివరించబడింది. వాచ్యేనేతి - విభావాదికంతో అని అర్థం.

## ధ్వన్యాలోకం

ఇదానీం రసవదలఙ్కారాత్ అలక్ష్యక్రమద్యోతనాత్మనో ధ్వనేః వివిక్తో విషయ ఇతి ప్రదర్శ్యతే -

కా. వాచ్యవాచకచారుత్వహేతూనాం వివిధాత్మనామ్,

రసాదిపరతా యత్ర స ధ్వనేర్విషయో మతః. 4

రసభావతదాభాసతత్ప్రశమలక్షణం ముఖ్యమర్థమనువర్తమానాః యత్ర శబ్దార్థాలఙ్కారా గుణాశ్చ పరస్పరం ధ్వన్యపేక్షయా విభిన్న రూపా వ్యవస్థితాః తత్ర కావ్యే ధ్వనిరితి వ్యపదేశః.

### బాలానందిని

ఇదానీమితి - అలక్ష్యక్రమద్యోతనాత్మకమైన ధ్వనియొక్క విషయం రసవదలంకారంకంటె భిన్నమైనది అని చూపబడుచున్నది.

వాచ్యేతి - వివిధాత్మనామ్ = అనేకవిధములైన, వాచ్యవాచక చారుత్వహేతూనామ్=వాచ్యానికీ, వాచకానికీ (శబ్దానికీ) వాటి చారుత్వానికీ హేతువులైన వాటికీ, యత్ర=ఎక్కడ, రసాదిపరతా = రసాదులకు అధీనాలై ఉండడమో, సః=అది, ధ్వనేః=ధ్వనియొక్క, విషయః=విషయంగా, మతః=చెప్పబడింది.

రసేతి- ధ్వన్యపేక్షచేత అనగా ధ్వనిదృష్ట్యా పరస్పరమూ వేరువేరైన స్వరూపాలు గల శబ్దార్థాలంకారాలు, గుణాలు కూడ ఏ కావ్యంలో రస-భావ-రసాభాస-భావాభాస-రసప్రశమ - భావప్రశమరూపమైన ముఖ్యార్థాన్ని అనువర్తిస్తూ (దానికి అనుగుణంగా ఉంటూ ఉంటాయో ఆ కావ్యంలో ధ్వని అని నిర్దేశం (ఆ కావ్యం 'ధ్వని' అని చెప్పబడుతుంది)

### లోచనం

నను అఙ్గిత్వేనావభాసమాన ఇత్యుచ్యతే; తత్ర అఙ్గత్వమపి కిమస్తి రసాదేః యేన తన్నిరాకరణాయ ఏతద్విశేషణమ్ ఇత్యభిప్రాయేణ ఉపక్రమతే

- ఇదానీమిత్యాదినా. అఙ్గత్వమస్తి రసాదీనాం రసవత్ - ప్రేయ - ఊర్జస్వి-సమాహితాలఙ్కారరూపతాయామ్ ఇతి భావః. అనయా చ భఙ్గ్యా రసవదాదిషు అలంకారేషు రసాదిధ్వనేః నాన్తర్భావః ఇతి సూచయతి. పూర్వం హి సమాసోక్త్యాదిషు వస్తుధ్వనేః నాన్తర్భావః ఇతి దర్శితమ్. వాచ్యం చ వాచకం చ తచ్చారుత్వహేతవశ్చేతి ద్వన్ద్వః. వృత్తావపి శబ్దాశ్చ అలఙ్కారాశ్చ అర్థాశ్చ అలఙ్కారాశ్చ ఇతి ద్వన్ద్వః. పూర్వమేవైతదుక్తమ్ ఇతి అర్థః.

బాలానందిని

నన్వితి : అంగిగా భాసిస్తున్న అని అంటున్నావు; అయితే రసాదికం అంగంగా ఉండడం కూడా జరుగుతుందా? అలాంటిదాన్ని నిరాకరించడం కోసమే కదా ఈ (అఙ్గిత్వేనావభాసమానః) విశేషణం ఉపయోగించావు? అనే అభిప్రాయంతో ఇదానీమ్ ఇత్యాదికంతో ఉపక్రమిస్తున్నాడు. రసవత్- ప్రేయస్- ఊర్జస్వి- సమాహితాలంకార రూపంలో రసాదులకు అంగత్వం ఉంది అని భావం. ఈ విధంగా చెప్పడంచేత రసాదులు రసవదాద్యలంకారాలలో అంతర్భావం చెందవు అని సూచిస్తున్నాడు. వస్తుధ్వని సమాసోక్త్యాదులలో అంతర్గతం కాదు అని వెనుక ప్రతిపాదించబడింది కదా? "వాచ్యం చ వాచకం చ (తచ్చారుత్వ) హేతవశ్చ" అని ద్వంద్వసమాసం చెప్పాలి. అంతే కాని వాచ్యవాచకాల చారుత్వానికి హేతువులు అని షష్ఠీతత్పురుష కాదు అని అర్థం. అదే విధంగా వృత్తిలో "శబ్దార్థాలంకారాః" అన్నప్పుడు "శబ్దాశ్చ అలంకారాశ్చ, అర్థాశ్చ, అలంకారాశ్చ అని ద్వంద్వసమాసం చెప్పుకోవాలి. మతః ఇతి. ఈ విషయం పూర్వమే చెప్పబడింది అని అర్థం.

లోచనం

ననూక్తం భట్టనాయకేన - "రసో యదా పరగతతయా ప్రతీయతే తర్హి తాటస్థ్యమేవ స్యాత్; న చ స్వగతత్వేన రామాదిచరితమయాత్ కావ్యాత్ అసౌ ప్రతీయతే స్వాత్మగతత్వేన చ ప్రతీతౌ స్వాత్మని రసస్య ఉత్పత్తిరేవ అభ్యుపగతా స్యాత్. సా చాయుక్తా; సీతాయాః సామాజికం ప్రతి అవిభావత్వాత్. కాన్తాత్వం సాధారణం వాసనావికాసహేతువిభావతాయాం ప్రయోజకమితి చేత్- దేవతావర్ణనాదౌ తదపి కథమ్? న చ స్వకాన్తాస్మరణం మధ్యే సంవేద్యతే; అలోకసామాన్యానాం చ రామాదీనాం యే సముద్రసేతుబన్ధాదయః విభావాః

తే సాధారణ్యం కథం భజేయుః ? న చోత్సాహాదిమాన్ రామః స్మర్యతే, అననుభూతత్వాత్. శబ్దాదపి తత్ప్రతిపత్తౌ న రసోపజనః, ప్రత్యక్షాదివ నాయక మిథునప్రతిపత్తౌ. ఉత్పత్తిపక్షే చ కరుణస్య ఉత్పాదాత్ దుఃఖిత్వే కరుణ ప్రేక్షాసు పునరప్రవృత్తిః స్యాత్. తత్ న ఉత్పత్తిరపి, నాప్యభివ్యక్తిః. శక్తిరూపస్య హి శృఙ్గారస్య అభివ్యక్తౌ విషయార్జనతారతమ్యప్రవృత్తిః స్యాత్. తత్రాపి కిం స్వగతోఽభివ్యజ్యతే రసః పరగతో వేతి పూర్వవదేవ దోషః. తేన న ప్రతీయతే, నోత్పద్యతే, నాభివ్యజ్యతే కావ్యేన రసః. కిం తు అన్యశబ్దవైలక్షణ్యం కావ్యాత్మనః శబ్దస్య త్ర్యంశతాప్రసాదాత్. తత్రాభిధాయకత్వం వాచ్యవిషయమ్. భావకత్వం రసాదివిషయమ్. భోగకృత్త్వం సహృదయవిషయమ్ ఇది త్రయః అంశభూతాః వ్యాపారాః. తత్ర అభిధాభాగో యది శుద్ధః స్యాత్ తత్తన్త్రాదిభ్యః శాస్త్రన్యాయేభ్యః శ్లేషాద్యలంకారాణాం కో భేదః? వృత్తిభేదవైచిత్ర్యం చాకిం చిత్కరమ్. శ్రుతిదుష్టాదివర్జనం చ కిమర్థమ్? తేన రసభావనాఖ్యో ద్వితీయో వ్యాపారః, యద్వశాత్ అభిధా విలక్షణైవ. తచ్చైతద్భావకత్వం నామ రసాన్ ప్రతి యత్ కావ్యస్య తద్విభావాదీనాం సాధారణత్వాపాదనం నామ. భావితే చ రసే తస్య భోగః యః అనుభవస్మరణప్రతిపత్తిభ్యః విలక్షణ ఏవ ద్రుతివిస్తరవికాసాత్మా రజస్తమోవైచిత్ర్యానువిద్ధసత్త్వమయనిజచిత్స్వ భావనిర్వృతివిశ్రాన్తిలక్షణః పరబ్రహ్మాస్వాదసవిధః. స ఏవ చ ప్రధానభూతః అంశః సిద్ధరూపః ఇతి. వ్యుత్పత్తిర్నామ అప్రధానమేవ" ఇతి.

బాలానందిని

ఇక్కడ ప్రసంగవశం చేత రసస్వరూపం చెప్పడానికి ముందుగా ఇతరుల మతాలను అనువదిస్తున్నాడు - నను ఇత్యాది - భట్టనాయకుడు ఈ విధంగా చెప్పి ఉన్నాడు కదా? "రసం" అనగా రత్యాదికం, ఇతరులలో ఉన్నట్లుగా గ్రహించబడితే (దానితో సహృదయుల కేమీ సంబంధం లేకపోవడంచేత) తటస్థత్వమే ఉంటుంది. అనగా సహృదయులకు దాని విషయంలో ఏమీ ఆసక్తి ఉండదు. రామాది చరిత్రరూపమైన కావ్యంవల్ల ఇది (రత్యాదికం) తనలోనే ఉన్నట్లు కూడా గ్రహించబడదు. తనలో (అనగా సహృదయునిలో) ఉన్నట్లు గ్రహించబడితే రసం తనయందే పుట్టుతున్నది అని

అంగీకరించినట్లవుతుంది. అది యుక్తం కాదు; సీత సామాజికుణ్ణి గూర్చి (సామాజికుడికి) విభావం కాదు కదా. (సీత సామాజికునికి ఆలంబనవిభావం కానప్పుడు తద్విషయకమైన రతి సామాజికుడిలో ఎలా కలుగుతుంది?). సాధారణమైన కాంతాత్వం సహృదయునిలో ఉన్న రత్యాదివాసన వికసించడానికి హేతువై విభావత్వాన్ని పొందవచ్చును కదా అని అంటే అది దేవతావర్ణనాదులలో ఎలా కుదురుతుంది? (అనగా సీతను సీతగా కాక ఒక కాంతగా మాత్రమే గ్రహించడంవల్ల సహృదయుని మనస్సులో దాగి ఉన్న రత్యాదికం ఉద్బుద్ధం అవుతుంది. ఆ విధంగా సీత కూడా సహృదయుడికి విభావం కావచ్చు కదా అనడం యుక్తం కాదు. దేవతావర్ణనాదులలో సహృదయుడు ప్రారంభంనుంచి ఆ దేవతను పూజ్యతాబుద్ధితోనే చూస్తూ ఉంటాడు; అలాంటప్పుడు ఆమెను కేవలం కాంతగా సాధారణదృష్టితో చూడడం కుదరదు కదా అని భావం). న చేతి:- అలాంటి ఘట్టాలు చూస్తున్నప్పుడు తన కాంత స్మృతిపథంలోనికి వస్తుంది; అప్పుడు రత్యాద్యుద్బోధం కలుగుతుంది అనడానికి మధ్యలో అలాంటి స్మృతి ఏదీ లేదు కదా?

శృంగారరసంలోనే కాదు వీరరసాదులలో కూడా ఇలాంటి అనుపపత్తులు ఉంటాయి అని చెపుతున్నాడు - అలోక ఇతి :- లోకసామాన్యులు కాని రామాదుల సముద్రసేతుబంధనాది (సహృదయగతోత్సాహ) విభావాలు సాధారణరూపంలో ఎలా కనబడతాయి? అనగా ఉత్సాహంతో చేయవలసిన సముద్రసేతుబంధనాదికం నేను కూడా చేయగలను అనే ఆలోచన గాని, హృదయసంవాదం గాని సహృదయులకు కలగదు అని అర్థం. రామాదులలో ఉన్న ఉత్సాహరూపస్థాయిభావంయొక్క జ్ఞానం వల్ల సహృదయులకు రసోద్బోధం కలిగించవచ్చును అని కూడా చెప్పడానికి వీలు లేదు అని అంటున్నాడు - న చేతి:- ఉత్సాహాదు లున్న రాముడు స్మరింపబడుతున్నాడు అనడానికి కుదరదు. పూర్వం ( ఆ రాముణ్ణి ఆ స్థితిలో) చూడలేదు కదా? (స్మరించడం అనేది వెనుక చూచినదానినే కదా?) ప్రత్యక్షంగా చూడకపోయినా కావ్యంవల్ల అలాంటి రాముని అనుభవం (జ్ఞానం) కలుగుతుంది అనడం కూడ యుక్తం కాదు. నాయికానాయకులను ప్రత్యక్షంగా చూచినా కూడా ఏ విధంగా రసోత్పత్తి కలగదో అదే విధంగా కావ్యశబ్దంవల్ల కలిగిన అనుభవం (జ్ఞానం) వల్ల కూడా రసోత్పత్తి కలగదు. ఉత్పత్తిపక్షంలో మరొక దోషం చెపుతున్నాడు- ఉత్పత్తీతి:- రసం పుడుతుంది అనే పక్షంలో సహృదయులలో కరుణ పుట్టడంవల్ల వాళ్లకి దుఃఖం కలుగుతుంది. అప్పుడు వాళ్లు కరుణరసప్రధానాలైన నాట్యాలను మళ్లీ చూడడానికి ప్రవర్తించరు. అందుచేత రసానికి ఉత్పత్తి కుదరదు.

అభివ్యక్తి కూడా కుదరదు. అనగా ముందునుంచీ ఉన్న ఘటాదిపదార్థాలు దీపకాంతిచేత ఏ విధంగా అభివ్యక్తం అవుతాయో అదే విధంగా సహృదయహృదయ గతాలైన రసాలు అభివ్యక్తాలవుతాయి అనడంకూడ యుక్తం కాదు. ఎందుచేత ననగా ఘటాదులు ముందుగానే ఉన్నట్లు రసాదులు సహృదయునిలో ముందుగానే లేవు కదా అని భావం. రత్యాదిరూపమైన రసం సూక్ష్మరూపంలో సహృదయునిలో ఉంటుంది, అందుచేత అది కూడా ఘటాదుల వలె సిద్ధరూపమే అని చెప్పడం కుదరదు అని ప్రతిపాదిస్తున్నాడు - శక్తిరూపస్య ఇతి. శక్తిరూపమైన, అనగా వాసనారూపమైన, శృంగారం (రత్యాదికం) అభివ్యక్తం అవుతుంది అని చెప్పినట్లయితే విషయాన్ని సంపాదించడం విషయంలో తారతమ్యంతో ప్రవృత్తి జరగవలసివస్తుంది.

వివరణ:- విషయార్జనతారతమ్యప్రవృత్తిః అన్నప్పుడు విషయం అనగా రత్యాదికి విషయమైన కాంతాదికం, అనగా రత్యభివ్యక్త్యుపాయం. చీకట్లో ఉన్న వస్తువుల్ని ఎక్కువ స్పష్టంగా చూడా లనుకున్న కొలదీ ఎక్కువ కాంతిని సంపాదించడానికి ప్రయత్నించవలసి ఉన్నట్లు వాసనారూపంలో లోపల ఉన్న రత్యాదికం ఇంకా ఇంకా అధికంగా అభివ్యక్తం కావడం కోసం దానికి ఉపాయమైన విభావాదులను అధికాధికంగా సంపాదించుకోవడంకోసం సహృదయులు ప్రయత్నించవలసి వస్తుంది. అనగా విభావాదుల అనుభవంయొక్క పరిమితిని పట్టి రత్యాద్యనుభూతి పరిమితి మారుతూ ఉంటుందని చెప్పవలసి వస్తుంది.

తత్రాపీతి :- ఈ అభివ్యక్తిపక్షంలో కూడా స్వగతమైన (సహృదయగతమైన) రత్యాదికం అభివ్యక్తం అవుతుందా, లేక పరగతమైనది అభివ్యక్తం అవుతుందా అని ప్రశ్న ఉదయిస్తుంది. అప్పుడు వెనుక చెప్పిన దోషమే ఇక్కడ కూడా వర్తిస్తుంది. అనగా స్వగతమైనది అభివ్యక్తం అవుతుంది అంటే సీతాదులకు విభావత్వం కుదరరదు. పరగతమైనది అభివ్యక్తం అవుతుందని అని అంటే అప్పుడు తాటస్థ్యం ఉంటుంది అని భావం.

తేనేతి :- అందుచేత కావ్యం ద్వారా రసం ప్రతీతిగోచరం (తెలిసేటట్లు) చేయబడదు, పుట్టించబడదు; అభివ్యక్తం చేయబడదు.

ఇప్పుడు భట్టనాయకుడు తన మతం చెపుతున్నాడు - కింతు ఇతి - కావ్య శబ్దానికి మూడు అంశాలు ఉండడంయొక్క అనుగ్రహంవల్ల (మూడు అంశాలు ఉండడంవల్ల) ఇతరశబ్దాలకంటె (శాస్త్రాదిగతశబ్దాలకంటె) వైలక్షణ్యం ఉంది. వాటిలో వాచ్యం విషయంగా గల అభిధాయకత్వం, రసాదులు విషయంగా గల భావకత్వం,

సహృదయులు విషయంగా గల భోగకృత్త్వం అనే మూడు అంశాలైన వ్యాపారాలు ఉన్నాయి. అనగా అభిధ వాచ్యార్థాన్ని బోధిస్తుంది, భావన రసాదిప్రతీతి కలిగిస్తుంది, భోగకృత్త్వం సహృదయులలో భోగాన్ని, ఆస్వాదాన్ని, కలిగిస్తుంది అని అర్థం. తత్రేతి : అభిధ కేవలం శుద్ధంగా ఉంటే, అనగా ఇతర వ్యాపారాల సంబంధం లేకుండా ఉంటే శాస్త్రాలలో అవలంబించే తంత్రం మొదలైన న్యాయాలకీ శ్లేష మొదలైన అలంకారాలకీ భేదం ఏముంటుంది?

వివరణ:- తంత్రం అనగా అనేకఅర్థాలను బోధించాలనే ఇచ్ఛతో ఒకే పదాన్ని ఒకేసారి ఉచ్చరించడం. ఈ పద్ధతి ప్రకారం శాస్త్రాలలో (అక్కడ కూడా చాలా అరుదుగానే) ఒక పదాన్నే రెండు మాట్లు ఆవృత్తి చేసి దానికి రెండర్థాలు చెపుతుంటారు. ఉదాహరణకి భట్టోజిదీక్షితులు "హలన్త్యమ్" అనే పాణిని సూత్రాన్ని రెండు మాట్లు ఆవృత్తి చేసి రెండు విధాల అర్థం చెప్పాడు. అలాంటి పద్ధతి కావ్యాలలో కూడా అంగీకరిస్తే "సర్వదో మాధవః" ఇత్యాదులలో శ్లేషాలంకారం చెప్పడం ఎందుకు? తంత్రంచేతనే పని జరిగిపోతుంది అని అర్థం.

వృత్తీతి :- కావ్యాలలో ఉపనాగరికాదివృత్తు లుంటాయి. అవి శాస్త్రాదులలో ఉండవు. అదే విశేషం అని చెప్పవచ్చు కదా అంటే అది (వృత్తిభేదవైచిత్ర్యం) ఎందుకూ పనికిరాని చిన్న విషయం. అభిధ ఒక్కటే; మరే వ్యాపారాలు లేవు అనుకుంటే శ్రుతిదుష్టం మొదలైన దోషాలను అంగీకరించడం ఎందుకు? ఈ దోషాలున్నా అభిధ తన పని చేసుకొనడానికి అభ్యంతరం ఏదీ లేదు కదా? మీ అభిప్రాయం ప్రకారం అది ఒక్కటీ ఉంటే చాలు కదా అని భావం.

తేన ఇతి :- ఆ కారణంచేత రసభావన (రసాదిభావన) అనే అభిధ తరవాత పనిచేసే రెండవ వ్యాపారం ఉంది. ఈ వ్యాపారం కూడా ఉండడంవల్లనే కావ్యశబ్దాలలో ఉన్న అభిధావ్యాపారానికి ఒక వైలక్షణ్యం ఉంది. భావకత్వం అంటే ఏమనగా - కావ్యం రత్యాదిరసాలకి సంబంధించిన విభావాదుల్ని (విభావానుభావవ్యభిచారిభావాలను) రసాల విషయంలో సాధారణంగా కనబడేటట్లు చేయడమే. అనగా సాధారణీకరణమే భావకత్వం.

భావితే ఇతి - రసం అనగా రామాదిగతరత్యాదికం, భావితం అయిన పిమ్మట (సహృదయులకు) దాని భోగం (భవతి అని అధ్యాహారం) కలుగుతుంది. అనగా రామాదిగతమైన రత్యాదికాన్ని సహృదయులు భావన చేసి చేసి ఆస్వాదించి నప్పుడు

అది రసం అని చెప్పబడుతుంది. రత్యాదులు సాధారణరూపంలో గ్రహించబడడంచేత తాటస్థ్యాదిదోషాలు ఉండవు అని భావం.

ఆ భోగంయొక్క స్వరూపాన్ని చెపుతున్నాడు - యః ఇతి:- ఇది లౌకికాలైన అనుభవాలు, స్మృతులు అనే జ్ఞానాలకంటె విలక్షణ మైనది. చిత్తద్రుతి, చిత్తవిస్తరం, చిత్తవికాసం వీటి స్వరూపంలో ఉంటుంది. (కొన్ని రసాలలో ద్రుతి, కొన్నింటిలో విస్తరం, కొన్నింటిలో వికాసం కలుగుతుంది. ఈ విషయం తరవాత స్పష్టం అవుతుంది "స్పష్టమగ్రే భవిష్యతి". రజస్ ఇతి - ఇంకా ఈ భోగం రజస్తమోగుణాల వైచిత్ర్యంతో కలిసిపోయిన సత్త్వగుణం అధికంగా ఉన్న స్వాత్మచైతన్యరూప ఆనందంలో విశ్రమించడం అనే, విగళితవేద్యాంతరంగా - ఇతర విషయాల జ్ఞానం ఏదీ లేకుండా - నిలిచిపోవడం అనే, లక్షణం గలది. అనగా అలా స్వాత్మచైతన్యానందంలో నిలిచిపోవడమే భోగం. (అందుచేత) ఇది పరబ్రహ్మానుభవంతో సమాన మైనది. అదే ప్రధానమైనది. సిద్ధరూపము. అనగా ఇది చైతన్యవిశ్రాంతిరూపం అవడంచేత, చైతన్యం నిత్యసిద్ధం అవడంచేత భోగం కూడా సిద్ధరూపం. కావ్యంలోని ప్రధానాంశం ఈ భోగమే. కావ్యంవల్ల కలిగే వ్యుత్పత్తి దీని తరవాతనే; అది అప్రధానం. ఇది రసవిషయంలో భట్టనాయకుడు ప్రతిపాదించిన మతం.

లోచనం

అత్రోచ్యతే - రసస్వరూప ఏవ తావద్విప్రతిపత్తయః ప్రతివాదినామ్. తథాహి - పూర్వావస్థాయాం యః స్థాయీ స ఏవ వ్యభిచారిసంపాతాదినా ప్రాప్తపరిపోషః అనుకార్యగత ఏవ రసః. నాట్యే తు ప్రయుజ్యమానత్వాత్ నాట్యరసః ఇతి కేచిత్. ప్రవాహధర్మిణ్యాం చిత్తవృత్తౌ చిత్తవృత్తేః చిత్తవృత్త్యన్తరేణ కః పరిపోషార్థః? విస్మయశోకక్రోధాదేశ్చ క్రమేణ తావత్ న పరిపోష ఇతి న అనుకార్యే రసః. అనుకర్తరి చ తద్భావే లయాద్యననుసరణం స్యాత్. సామాజికగతే వా కః చమత్కారః? ప్రత్యుత కరుణాదౌ దుఃఖప్రాప్తిః. తస్మాత్ నాయం పక్షః. కస్తర్హి? ఇహ ఆనన్త్యాత్ నియతస్య అనుకారః న శక్యః, నిష్ప్రయోజనస్య విశిష్టతాప్రతీతౌ తాటస్థ్యేన వ్యుత్పత్త్యభావాత్.

తస్మాత్ అనియతావస్థాత్మకం స్థాయినముద్దిశ్య విభావానుభావ వ్యభిచారిభిః సంయుజ్యమానైః "అయం రామః సుఖీ" ఇతి స్మృతివిలక్షణా

స్థాయిని ప్రతీతిగోచరతయా ఆస్వాదరూపా ప్రతిపత్తిః అనుకర్త్రాలమ్బనా నాట్యైకగామినీ రసః. స చ న వ్యతిరిక్తమాధారమపేక్షతే; కిం తు అనుకార్యాభిన్నాభిమతే నర్తకే; ఆస్వాదయితా సామాజికః ఇత్యేతావన్మాత్రమ్ అదః. తేన నాట్య ఏవ రసః, న అనుకార్యాదిషు ఇతి కేచిత్.

బాలానందిని

అత్రేతి - ఈ విషయంలో చెప్పబడుచున్నది. ప్రతివాదులకు రసస్వరూపం విషయంలోనే విప్రతిపత్తులు (విభిన్నాభిప్రాయాలు) ఉన్నాయి. ఎట్లనగా (తథాహి) - ముందుగా నాట్యస్థలంలో ఉన్న విప్రతిపత్తులను వివరిస్తున్నాడు. రామాదులను నటులు అనుకరిస్తారు. అందుచేత రామాదులు అనుకార్యులు. ఆ అనుకార్యులలో లలనాద్యాలంబనవిభావాలచేత రత్యాదిస్థాయిభావం పుట్టించబడుతుంది. దానిని ఉద్యానాదులైన ఉద్దీపనవిభావాలు ఉద్దీపింపచేస్తాయి. కటాక్షం మొదలైన అనుభావాలు ఆ స్థాయిభావం ప్రతీతియోగ్యం అయ్యేటట్లు (తెలియదగేటట్లు) చేస్తాయి. ఉత్కం మొదలైన వ్యభిచారిభావాలు పోషిస్తాయి. అప్పుడు ఆ స్థాయిభావమే రసం అ చెప్పబడుతుంది. అది రామాద్యనుకార్యులలోనే ఉంటుంది. నటుణ్ణి చూ రామాదులుగా భావించడం ద్వారా ఆ రసం నటునిలో ఉన్నట్లు వానిమీద ఆరోపిం సామాజికులు ఆస్వాదిస్తారు. ఇది భట్టలోల్లటాదుల మతం. దీన్ని ముందు చూపుతున్నాడ - పూర్వావస్థాయామితి :- పూర్వావస్థలో, అనగా పరిపోషణానికి ముందు, ఏదై స్థాయియో అదే వ్యభిచార్యాదులను కలపడం (సంపాత) మొదలైనవాటిచేత పరిపోష పొంది రసం అవుతుంది. అది అనుకార్యునిలోనే ఉంటుంది. దీనిని నాట్యం ప్రయోగిస్తారు కాబట్టి ఇది నాట్యరసం. (దీన్ని 'నాట్యరసం' అని భరతాదులు అన్నార అని కొందరు (భట్టలోల్లటాదులు).

శ్రీశంకుకాదులు ఈ మతాన్ని దూషించి రసాన్ని మరొక విధంగా ప్రతిపాదించార దానిని చెపుతున్నాడు - ప్రవాహధర్మిణ్యామ్ ఇతి. చిత్తవృత్తి ప్రవాహం వంటి (మాటిమాటికీ ఉదయిస్తూంటుంది, అణిగి పోతూంటుంది). అలాం స్థాయిభావరూపవృత్తిని అలాంటివే అయిన వ్యభిచారులు పోషించడం అనగా ఏమిటి విస్మయశోకక్రోధాదిచిత్తవృత్తులకు క్రమంగా పరిపోషణం ఉండదు కూడ. అన విస్మయం, శోకం, క్రోధం మొదలైన చిత్తవృత్తులు ప్రారంభంలో చాలా తీవ్రం ఉంటాయి, క్రమక్రమంగా వాటి తీవ్రత తగ్గిపోతుంది. అందుచేత వాటిని క్రమం పోషించడం అనేది ఉండదు అని అర్థం. అందుచేత రసం అనుకార్యునిలో ఉండద

అనుకర్తయైన నటునిలో రసం ఉంటే అతడు సంగీతతాలాదులలోని లయను సరిగా అనుసరించజాలడు. సామాజికునిలో ఉంటుంది అంటే దానిలో చమత్కారం ఏమి ఉంటుంది? చమత్కారం లేకపోవడం సరికదా మీదు మిక్కిలి కరుణాదులు (సామాజికునిలోనే ఉంటా యని అంటే) అతనికి దుఃఖం కలగాలి. అందుచేత ఈ పక్షం కుదరదు. అయితే మరి ఏ పక్షం కుదురుతుంది? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ఉపక్రమిస్తూ స్థాయ్యనుకరణ రసం అనే పక్షాన్ని కూడా నిరాకరిస్తున్నాడు-ఇహేత్యాది : ఆ యా వ్యక్తులలో ఉన్న రత్యాదిభావాలు అనంతవిధాలుగా ఉంటాయి. మందతమ - మందతర-మంద-మధ్యమ. ఇత్యాది భేదాలలో అసంఖ్యాకంగా ఉండి, నియతంగా ఉండని రత్యాదిభావాల్ని అనుకరించడం శక్యం కాదు. అనుకరించి ప్రయోజనం కూడా లేదు. విశిష్టత్వం ప్రతీతం అయితే, అనగా ఆ స్థాయిభావాలు ఆ యా వ్యక్తులకు సంబంధించినవి అని కూడా తెలుస్తే అప్పుడు తాటస్థ్యంచేత వ్యుత్పత్తి కలగదు. అనగా ఆ యా స్థాయి భావాలు ఆ యా రామాదులకు సంబంధించినవి అని నటుడు ఆ విధంగానే వాటిని అనుకరిస్తే సామాజికులకు కూడా ఆ యా వ్యక్తులకు సంబంధించినవి అనే జ్ఞానం కలగడంచేత అప్పుడు వాళ్లకు తటస్థతాభావం (ఔదాసీన్యం) కలుగుతుంది. అప్పుడు అలాంటి కావ్యాలవల్ల చతుర్వర్గోపాయవ్యుత్పత్తి కలగదు అని భావం. ఈ విధంగా స్థాయ్యనుకరణమే రసం అనే పక్షం కూడా అయుక్తం అని తేలింది.

తన మతం చెపుతున్నాడు - తస్మాదితి - అందువల్ల అనియతమైన అవస్థయైన స్థాయిని ఉద్దేశించి (నటునిచేత) ప్రయోగించబడుతూన్న విభావానుభావవ్యభిచారుల చేత, అనగా విభావాదిలింగాలచేత, "ఈ రాముడు సుఖం కలవాడు", అనగా " ఈ రామునిలో సీతను గూర్చిన రతి ఉన్నది", అని సామాజికులకు ఒక అనుమితిరూప జ్ఞానం కలుగుతుంది. ఇది స్మృతికంటె విలక్షణమైనది. దీనిలో స్థాయిప్రతీతి గోచరం అవడంచేత ఇది ఆస్వాదరూపమైనది. దీనికి ఆలంబనం అనుకర్త. ఎందువల్ల ననగా చిత్రతురగన్యాయంచేత, దూరంనుంచి నిజమైన గుఱ్ఱం ప్రమాణంలో ఉన్న చిత్రాన్ని చూచి ఇది గుఱ్ఱమే అనే ప్రతీతి కలిగినట్లు, సామాజికులకు నటునియందు రామాదిబుద్ధి కలుగుతుంది. అందుచేత ఈ జ్ఞానం నటాలంబనమే. దీనిలో స్థాయిభావం విషయం అవడంచేత విషయసౌందర్యాన్ని పట్టి ఈ అనుమితిజ్ఞానం (ప్రతీతి) ఆస్వాదరూపంగా ఉంటుంది.

నాట్యేతి :- ఈ అనుమితిరూపప్రతీతియే నాట్యంలో మాత్రమే ఉంటే రసం. స చేతి - రసం అనుకార్యుడైన రామాదినాయకునికంటె అభిన్నుడుగా భావించబడిన

నర్తకునిలోనే ఉంటుంది. దీనికి మరొక ఆధారంయొక్క అపేక్ష ఉండదు. ఆస్వాదించేవాడు సామాజికుడు. దీని స్వరూపం ఇంత మాత్రమే. అందుచేత రసం నటాశ్రయం అని చెప్పడంచేత, ఇది నాట్యంలోనే ఉంటుంది. అనుకార్యాదులలో ఉండదు అని కొందరు (శ్రీశంకుకాదులు) ప్రతిపాదించారు.

లోచనం

అన్యే తు - అనుకర్తరి యః స్థాయ్యవభాసః అభినయాది సామగ్ర్యాదికృతః భిత్తావివ హరితాలాదినా అశ్వావభాసః, స ఏవ లోకాతీతతయా ఆస్వాదాపరసంజ్ఞయా ప్రతీత్యా రస్యమానో రస ఇతి నాట్యాద్రసాః నాట్యరసాః. అపరే పునః విభావానుభావమాత్రమేవ విశిష్టసామగ్ర్యా సమర్ప్యమాణం తద్విభావనీయానుభావనీయస్థాయిరూపచిత్త వృత్త్యుచితవాసనానుషక్తం స్వనిర్వృతిచర్వణావిశిష్టమేవ రసః. తత్ నాట్యమేవ రసాః. అన్యే తు శుద్ధం విభావమ్, అపరే శుద్ధమనుభావమ్. కేచిత్తు స్థాయిమాత్రమ్, ఇతరే వ్యభిచారిణమ్, అన్యే తత్సంయోగమ్, ఏకే అనుకార్యమ్, కేచిత్తు సకలమేవ సముదాయం రసమాహుః ఇత్యలం బహునా.

బాలానందిని

అన్యే తు ఇతి - మరి కొందరైతే - హరితాలం మొదలైన రంగులచేత గోడమీద చిత్రించబడిన అశ్వం నిజమైన అశ్వం కాక ఏ విధంగా అశ్వావభాసమో అట్లే అభినయాదిసామగ్రిచేత ఏర్పడిన అనుకర్తలోని (నటునిలోని) ఏ స్థాయ్యాభాసం ఉంటుందో అదే, లోకాతీతం అవడంచేత ఆస్వాదం అనే మరొక పేరుతో పిలవబడే ప్రతీతి చేత (జ్ఞానంచేత) (సామాజికులచేత) రసింపబడుచు రసం అని చెప్పబడుతున్నది. నాట్యంవల్ల ఏర్పడిన రసాలు అవడంచేత ఇవి నాట్యరసాలు అని చెప్పబడుతున్నాయి.

అపరే ఇతి - విశిష్టమైన సామగ్రిచేత, అనగా భావకత్వంతో కూడిన నాట్యాది సామగ్రిచేత, సామాజికులకు సమర్పించబడి (అందించబడి) వాటిచేత, అనగా విభావాను భావాలచేత విభావనీయమూ, అనుభావనీయమూ అయిన స్థాయిరూపచిత్తవృత్తికి తగిన (సామాజికగతమైన) వాసనతో సంబంధించినదై తన (సామాజికుని) ఆనందరూపమైన చర్వణలో విషయమైన విభావానుభావమాత్రమే రసం అని మరి కొందరు అంటున్నారు. అందువల్ల నాట్యమే రసాలు అని అర్థం. అనగా విభావానుభావాలు

నటనానికి తగి ఉండడం అనే నాట్యరూపాలు గాన నాట్యమే రసాలు అని ఈ పక్షంలో నాట్యరసాః అనే పదానికి అర్థం. కేవలం అనుభావమే రసం అని కొందరు, స్థాయి మాత్రమే రసం అని కొందరూ, వ్యభిచారిభావం రసం అని కొందరు, స్థాయివ్యభిచారుల సంయోగం రసం అని కొందరు, అనుకరించడానికి శక్యమైనదే రసం అని కొందరు, అన్నింటి సముదాయం రసం అని కొందరూ చెపుతున్నారు. ఇంక ఈ విషయంలో చాలా చెప్పడం చాలిద్దాం.

లోచనం

కావ్యే ఽపి లోకనాట్యధర్మిస్థానీయేన స్వభావోక్తివక్రోక్తి ప్రకారద్వయేన అలౌకిక ప్రసన్న మధురౌజస్వి శబ్దసమర్ప్యమాణవిభావాదియోగాదియమేవ రసవార్తా. అస్తు వాత్ర నాట్యాద్విచిత్రరూపా రసప్రతీతిః. ఉపాయవైలక్షణ్యాత్. ఇయమేవ తావదత్ర సరణిః.

ఏవం స్థితే ప్రథమపక్ష ఏవ ఏతాని దూషణాని; ప్రతీతేః స్వపరగతత్వాది-వికల్పనేన. సర్వపక్షేషు చ ప్రతీతిః అపరిహార్యా రసస్య. అప్రతీతం హి పిశాచవత్ అవ్యవహార్యం స్యాత్. కిం తు యథా ప్రతీతిమాత్రత్వేన అవిశిష్టత్వే ఽపి ప్రాత్యక్షికీ, ఆనుమానికీ, ఆగమోత్థా, ప్రతిభానకృతా, యోగిప్రత్యక్షజా చ ప్రతీతిః ఉపాయవైలక్షణ్యాదన్యైవ తద్వదియమపి ప్రతీతిః చర్వణాస్వాదన భోగాపరనామా భవతు. తన్నిదానభూతాయాః హృదయసంవాదాద్యుప కృతాయాః విభావాదిసామగ్ర్యాః లోకోత్తరరూపత్వాత్. రసాః ప్రతీయన్తే ఇతి ఓదనం పచతీతివద్వ్యవహారః. ప్రతీయమాన ఏవ హి రసః. ప్రతీతిరేవ విశిష్టా రసనా. సా చ నాట్యే లౌకికానుమానప్రతీతేః విలక్షణా, తాం చ ప్రముఖే ఉపాయతయా సందధానా. ఏవం కావ్యే అన్యశాబ్దప్రతీతేః విలక్షణా, తాం చ ప్రముఖే ఉపాయతయా అపేక్షమాణా.

బాలానందిని

ఇంతవరకు చెప్పిన రసాన్ని గూర్చిన మతాలలో భట్టనాయకుని మతం ప్రధానంగా కావ్యానికి వర్తించేదిగా ఉంది. ఇతరమతా లన్నీ నాట్యానికి సంబంధించినవి. ఈ రసం నాట్యంలో వలెనే కావ్యంలో కూడా ఉంటుంది అని ప్రతిపాదిస్తున్నాడు - కావ్యేఽపి ఇతి - కావ్యంలో కూడా లోకధర్మినాట్యధర్ములతో సమానమైన స్వభావోక్తి,

వక్రోక్తి అనే ప్రకారద్వయంచేత అనేకమైన ప్రసన్నములు, మధురములు, ఓజస్వులు అయిన శబ్దాలచేత సమర్పించబడే విభావాదుల సంబంధంవల్ల రసవ్యవహారం (రసం) ఇలాగే ఉంటుంది.

వివరణ:- నాట్యంలో లోకధర్మి, నాట్యధర్మి అని రెండు విధాలైన నాట్యం ఉంటే కావ్యంలో లోకధర్మి వంటి స్వభావోక్తి, నాట్యధర్మి వంటి వక్రోక్తి ఉంటాయి. నాట్యంలో విభావాదులు చతుర్విధాభినయాలచేత సమర్పింపబడతాయి, కావ్యంలో ప్రసాద-మాధుర్య-ఓజోవ్యంజకాలైన అలౌకికశబ్దాలద్వారా విభావాదులు సమర్పించబడతాయి. ఈ విధంగా ఉపాయాలు వేరైనా ఉపేయమైన రసంయొక్క స్వరూపం మాత్రం రెండింటిలోనూ ఒకటే.

స్వభావాభినయోపేతం నానాస్త్రీపురుషాశ్రయమ్,
యదీదృశం భవేన్నాట్యం లోకధర్మీ తు సా స్మృతా. (భ.నా.శా.13.71)

"స్వభావంయొక్క అభినయంతో కూడినదై అనేకవిధాలైన స్త్రీపురుషులతో సంబంధించిన నాట్యం లోకధర్మి".

స్వరాలఙ్కారసంయుక్తమస్వస్థపురుషాశ్రయమ్,
యదీదృశం భవేన్నాట్యం నాట్యధర్మీ తు సా స్మృతా (భ. నా. శా. 13.73)

"గానంతోను అలంకారాలతోను కూడినది, పురుషుడు తాను ఉండవలసిన విధంగా (స్వస్థ) ఉండకుండా స్త్రీబలాన్ని ఆశ్రయించి, స్త్రీచేత ప్రేరేపింప తగినట్లుగా, ఉండేది అయిన నాట్యం నాట్యధర్మి".

అస్తు వా ఇతి:- ఉపాయాలలో వైలక్షణ్యం(భేదం) ఉండడంవల్ల కావ్యంలోని రసప్రతీతి నాట్యంలోని రసప్రతీతికంటె భిన్నంగా ఉంటే ఉండవచ్చు. రెండు చోట్లా ఉన్న రసాన్ని నిరూపించే పద్ధతి మాత్రం ఇదే.

ఏవమితి :- ఇది ఇలా ఉండగా ప్రతీతి స్వగతమా, పరగతమా అని వికల్పం చేసి చూపిన దూషణలు మొదటి పక్షంలోనే (భట్టలోల్లటాదుల ఉత్పత్తిపక్షంలోనే) వర్తిస్తాయి. అన్ని పక్షాలలోనూ కూడా (సహృదయులకు) రసప్రతీతి అపరిహార్య మైనది. (ఏపక్షంలోనూ కూడా రసప్రతీతి లేదనడానికి వీలులేదు). పిశాచం వలె అది అప్రతీతం అయితే దాన్ని గూర్చి వ్యవహరించడమే (discussion)కుదరదు. అయితే ప్రతీతిమాత్రత్వంచేత (అన్ని పక్షాలలోను ఉన్నది ప్రతీతియే కాబట్టి) విశేషం ఏమీ లేకపోయినా, ప్రత్యక్షంవల్ల కలిగిన ప్రతీతి, అనుమానంవల్ల కలిగినది, ఆగమంవల్ల కలిగినది, యోగిప్రత్యక్షంవల్ల కలిగినదీ అని ఉపాయభేదాన్ని పట్టి ఆ ప్రతీతు లన్నీ వేరు

అయినట్లు ఈ రసప్రతీతి కూడా చర్వణం, ఆస్వాదనం, భోగం అని ఇతరనామధేయాలు కలది కావచ్చును. హృదయసంవాదాదులచేత ఉపకృతమైన విభావాదిసామగ్రి ఈ రసప్రతీతికి మూలకారణం. ఆ సామగ్రి లోకోత్తరరూప మైనది. అందుచేత ఈ ప్రతీతి కూడా లోకోత్తరం అవడంచేత దీనికి ఇలాంటి అలౌకికమైన పేర్లే పెట్టడం జరిగింది అని భావం.

రసాః ఇతి - "రసాః ప్రతీయన్తే" (రసాలు ప్రతీతము లౌతున్నాయి - రసాల ప్రతీతి కలుగుతున్నది) అని లోకంలో ఉన్న వ్యవహారం 'ఓదనం పచతి' (అన్నం వండుచున్నాడు) అనే వ్యవహారం వంటిది (అన్నం అయిన తరవాత ఇంక వండడం ఎందుకు. అందుచేత అక్కడ "అన్నం తయారయే టట్లు వండుతున్నాడు" అని అర్థం) ఎందువల్ల ననగా ఏదైతే ప్రతీయమానమో అదే రసం. విశిష్టమైన, అనగా విభావాదివిశిష్ట స్థాయిభావం విషయంగా గల, ప్రతీతియే రసన (రసాస్వాదం). ఆ నాట్యంలోని ఆ రసప్రతీతి లౌకికమైన అనుమానప్రతీతికంటె విలక్షణ మైనది; కాని ప్రారంభంలో ఆ లౌకికానుమానప్రతీతిని ఉపాయంగా గ్రహిస్తుంది. (లోకంలో కారణ-కార్య-సహకారాలకు రత్యాదులకు మధ్య అవినాభావసంబంధాన్ని (వ్యాప్తిని) గ్రహించినవాడే నాట్యంలో రసానుభూతిని పొందకలుగుతాడు కదా). అదే విధంగా కావ్యంలోని రసప్రతీతి ఇతర శాబ్ద /శబ్దజన్య) ప్రతీతులకంటె విలక్షణ మైనది. కాని ప్రారంభంలో శాబ్దప్రతీతిని ఉపాయంగా అపేక్షిస్తుంది.

లోచనం

తస్మాదనుత్థానోపహతః పూర్వపక్షః. రామాదిచరితం తు న సర్వస్య హృదయసంవాదీతి మహత్సాహసమ్. చిత్రవాసనావిశిష్టత్వాచ్చేతసః. యదాహ - "తాసామనాదిత్వమ్ ఆశిషో నిత్యత్వాత్" (యో.సూ.4.10) "జాతి దేశకాలవ్యవహితానామప్యానన్తర్యం స్మృతిసంస్కారయోరేకరూపత్వాత్" (యోగ.సూ.4.9). తేన ప్రతీతిస్తావద్రసస్య సిద్ధా. సా చ రసనారూపా ప్రతీతి రుత్పద్యతే. వాచ్యవాచకయోః తత్ర అభిధాదివివిక్తో వ్యఞ్జనాత్మా ధ్వననవ్యాపార ఏవ. భోగీకరణవ్యాపారశ్చ కావ్యస్య రసవిషయో ధ్వననాత్మ ఏవ; నాన్యత్కిఞ్చిత్. భావకత్వమపి సముచిత గుణాలఙ్కారపరిగ్రహాత్మకమస్మాభిరేవ వక్ష్యతే, కిమేతదపూర్వమ్? కావ్యం చ రసాన్ ప్రతి భావకమితి యదుచ్యతే తత్ర భవతైవ భావనాదుత్పత్తిపక్ష ఏవ ప్రత్యుజ్జీవితః. న చ కావ్యశబ్దానాం

కేవలానాం భావకత్వమ్; అర్థాపరిజ్ఞానే తదభావాత్. న చ కేవలానామర్థానామ్; శబ్దాన్తరేణార్ప్యమాణత్వే తదయోగాత్. ద్వయోస్తు భావకత్వ మస్మాభిరేవోక్తమ్ - "యత్రార్థః శబ్దో వా తమర్థం వ్యఙ్క్తః" ఇత్యత్ర.

తస్మాత్ వ్యఞ్జకత్వాఖ్యేన వ్యాపారేణ గుణాలఙ్కారౌచిత్యాదికయా ఇతికర్తవ్యతయా కావ్యం భావకం రసాన్ భావయతి ఇతి త్ర్యంశాయామపి భావనాయాం కరణాంశే ధ్వననమేవ నిపతతి. భోగోఽపి న కావ్యశబ్దేన క్రియతే, అపి తు ఘనమోహాన్ధ్యసంకటతానివృత్తిద్వారేణ ఆస్వాదాపరనామ్ని అలౌకికే ద్రుతివిస్తారవికాసాత్మని భోగే కర్తవ్యే లోకోత్తరే ధ్వననవ్యాపార ఏవ మూర్ధాభిషిక్తః. తచ్చేదం భోగకృత్త్వం రసస్య ధ్వననీయత్వే సిద్ధే దైవసిద్ధమ్; రస్యమానతోదితచమత్కారానతిరిక్తత్వాద్ భోగస్యేతి. సత్త్వాదీనాం చ అఙ్గాఙ్గిభావవైచిత్ర్యస్యానన్త్యాత్ ద్రుత్యాదిత్వేన ఆస్వాదగణనా న యుక్తా. పరబ్రహ్మాస్వాదసబ్రహ్మచారిత్వం చాస్త్వస్య రసాస్వాదస్య. వ్యుత్పాదనం చ శాసనప్రతిపాదనాభ్యాం శాస్త్రేతిహాసకృతాభ్యాం విలక్షణమ్. యథా రామస్తథాహమ్ ఇతి ఉపమానాతిరిక్తాం రసాస్వాదోపాయస్వప్రతిభావిజృమ్భా రూపాం వ్యుత్పత్తి మన్తే కరోతీతి కముపాలభామహే? తస్మాత్ స్థితమేతత్ - అభివ్యజ్యన్తే రసాః, ప్రతీత్యైవ చ రస్యన్తే ఇతి. తత్ర అభివ్యక్తిః ప్రధానతయా భవతు అన్యథా వా; ప్రధానత్వే ధ్వనిః, అన్యథా అలంకారః. తదాహ- ముఖ్యమర్థ మితి. వ్యవస్థితా ఇతి:- పూర్వోక్తయుక్తిభిః విభాగేన వ్యవస్థాపితత్వాదితి భావః. 4

బాలానందిని

తస్మాదితి:- ఏ పక్షంలోనైనా రసప్రతీతి తప్పకుండా ఉండితీరుతుంది గాన భట్టనాయకుని పూర్వపక్షం అనుత్థానోపహతం, అనగా అసలు అలా పూర్వపక్షం చేయడానికే అవకాశం లేకపోవడంచేత లేవకపోవడంచేతనే (అవకాశం లేకపోవడంచేతనే) ఉపహతం (కొట్టబడినది) అయిపోయింది. రామాదీతి :- రామాదుల చరిత్ర అందరికీ హృదయసంవాది కాదు అని ఏదైతే చెప్పబడిందో అది గొప్ప సాహసమే. ఎందువల్ల ననగా మనస్సు విచిత్రమైన వాసనలతో కూడి ఉంటుంది. ఈ విషయాన్ని పతంజలి

యోగసూత్రంలో తాసామిత్యాదిసూత్రద్వయంలో చెప్పి ఉన్నాడు.

ఆసూత్రాల అర్థం - ఈ సూత్రాలలో 'తాసామ్' ఇత్యాదిసూత్రం నాల్గవపాదంలో 10 వ సూత్రం; జాతీత్యాదిసూత్రం 9వ సూత్రం. జాతీతి :- ఒక మనుష్యుడు మరణానంతరం వచ్చిన జన్మలో మార్జారభావం పొందినప్పుడు చాలా దగ్గరగా ఉన్న మనుష్యవాసనయే అభివ్యక్తం కావాలి కాని చాలా దూరంగా ఉన్న మార్జారవాసన ఎలా అభివ్యక్తం అవుతుంది? అనగా ఆ మార్జారం మనుష్యుడు వలె ప్రవర్తించాలి కదా అనే ఆశంకకు సమాధానంగా ఈ సూత్రం చెప్పబడింది. సంస్కారమూ, స్మృతీ ఒకే రూపంలో ఉండాలి. పూర్వసంస్కారం ఎలా ఉంటుందో స్మృతి కూడా అలాగే ఉంటుంది. సంస్కారం ఒక విధంగాను స్మృతి మరొక విధంగాను ఉండదు. అందుచేత జన్మలచేత, దేశంచేత, కాలంచేత వ్యవధానం ఏర్పడినా కూడా ఆ సంస్కారం, స్మృతీ కూడ కలుస్తాయి. అనగా కొన్ని వందల జన్మలకి పూర్వం అతిదూర దేశంలో అతిదీర్ఘకాలానికి ముందు ఈ జీవునికి మార్జాలజన్మ, దాన్ని పట్టి వచ్చిన వాసనలు ఉండవచ్చు. ఆ వాసనలే ఇప్పుడు మార్జాలజన్మ వచ్చినప్పుడు ఉద్బుద్ధాలయి వాటికి తగిన స్మృతిని కలిగించి ఆవిధంగా ప్రవర్తింపచేస్తాయి. ఈ విధంగా ఆ సంస్కారాలు ఈ జన్మకు అనంతరాలు (పక్కనే ఉన్నవి) అవుతాయి అని భావం.

అనంతపూర్వజన్మ లున్నాయి అని చెప్పడానికి ప్రమాణం ఏమిటి అనే ప్రశ్నకు సమాధానంగా "తాసామనాదిత్వమ్" ఇత్యాదిసూత్రం చెప్పబడింది. కోరిక (ఆశిషః) నిత్యంగా ఉంది కాబట్టి వాసనలు అనాదు లని తెలుస్తూన్నది అని సూత్రార్థం. అనగా ప్రతిప్రాణీ కూడ నేను ఇలాగే ఉండాలి. నాకు మరణం రాకూడదు అనుకుంటూ ఉంటాడు. ఈ జన్మలో మరణదుఃఖం అనుభవించలేదు. ఐనా మరణాన్ని గూర్చి భయపడుతున్నాడు. దీనినిపట్టి పూర్వజన్మలో కలిగిన మరణవాసన ఈతనిలో ఉందని స్పష్టం అవుతుంది. అనగా అనంతమైన జన్మలు, అనంతమైన వాసనలు ప్రతిజీవునికీ ఉంటా యని ఊహించవచ్చు. ఈ సూత్రాల విస్తృతవ్యాఖ్యానం అస్మద్విరచితయోగసూత్ర వ్యాఖ్య బాలానందినిలో చూడవచ్చు. పేజి 149 - 153.

ఈ విధంగా పాతంజలయోగసూత్రంలో చెప్పినట్లు మానవుని చిత్తం విచిత్ర వాసనలతో నిండి ఉంటుంది గాన ఏ విషయంతో నైనా హృదయసంవాదం ఉండవచ్చు. అందుచేత లోకోత్తరమైన చరితం చూచినప్పుడు సహృదయునికి హృదయసంవాదం కలగదనడం సాహసమే అని భావం. అయితే భట్టనాయకుడు తన వ్యాపార త్రయవాదాన్ని స్థాపించడానికి ముందు దానికి ఉపపత్తి చూపించే సందర్భంలో

ఇలా అన్నాడు కాని సాధారణీకరణం ద్వారా రామాదిచరిత్రల విషయంలో కూడా సహృదయులకు హృదయసంవాదం ఉంటుందని అంగీకరించే ఉన్నాడు. అందుచేత అభినవగుప్తుడు చేసిన ఈ అధిక్షేపానికి ఆధారం లేదు.

తేనేతి :- అందుచేత రసంయొక్క ప్రతీతి ఉంటుంది అనే విషయం మాత్రం నిశ్చితం. రసనారూపమైన ప్రతీతి పుడుతుంది. శబ్దార్థాలలో ఉన్న, అభిధావ్యాపారంకంటె భిన్నమైన వ్యంజనారూపమైన ధ్వననవ్యాపారం మాత్రమే ఆ ప్రతీతిని కలిగిస్తుంది. (నువ్వు చెప్పిన) కావ్యంలో ఉండే రసవిషయకమైన భోగీకరణవ్యాపారం ధ్వననరూపవ్యాపారమే కాని మరేమీ కాదు. తగిన గుణాలనీ, అలంకారాలనీ స్వీకరించడం అనే భావకత్వం కూడా మేమే సవిస్తరంగా చెప్పనున్నాం. దీనిలో కొత్త విషయం ఏముంది? కావ్యం రసాలను గూర్చి భావకం, అనగా కావ్యం రసాలను భావింపచేస్తుంది, అని అంటూ (భావనవల్ల రసం ఉత్పన్నం అవుతుంది అని చెప్పినట్లయింది గాన) నువ్వే భావన ద్వారా ఉత్పత్తిపక్షాన్ని పునరుజ్జీవితం చేసినట్లయింది. కేవలం కావ్యశబ్దాలే భావకాలవుతాయి అనడానికి వీలులేదు; అర్థం తెలియకపోతే వాటికి భావకత్వం ఉండదు కదా? కేవలం అర్థాలకి కూడా భావకత్వం ఉండదు; మరొక శబ్దంచేత, అనగా లౌకిక శబ్దాలచేత ఆ అర్థం చెప్పినా ఆ భావకత్వం ఉండదు కదా? శబ్దార్థాలు రెండూ కలిసి భావకాలు అవుతాయి అనే విషయం "యత్రార్థః శబ్దో వా వ్యఙ్క్తః" అనే చోట మేమే చెప్పాం.

తస్మాదితి - అందువల్ల "కావ్యం వ్యంజకత్వం అనే వ్యాపారంచేత గుణాలంకారాల ఔచిత్యం మొదలైన ఇతికర్తవ్యంతో (చేయవలసిన విధానంతో) భావకంగా ఉంటూ రసాల్ని భావింప చేస్తుంది" అనే మూడు అంశా లున్న భావనలో కరణాంశలో (సాధనం ఏది అనే అంశంలో) ధ్వననమే వచ్చి నిలుస్తుంది.

వివరణ. ఇక్కడ అభినవగుప్తుడు మీమాంసకుల పరిభాషను ఉపయోగించాడు. ఏదైనా ఒక క్రియాపదాన్ని వినగానే 'ఆ పని చెయ్యాలి' లేదా 'ఆ పని చేస్తున్నాడు' ఇత్యాదిరూపంలో ఏదో ఒక పనిని సాధించడం అనేది బోధించబడుతుంది. ఆ పనిని సాధించే ప్రయత్నానికి 'భావన' అని పేరు. "కుఠారేణ కాష్ఠం 'ఛిన్ద్యాత్'" (గొడ్డలితో కఱ్ఱి ఛేదించాలి) అనే వాక్యం ఉంది. దీనిలోని 'ఛిన్ద్యాత్' అనే మాట వినగానే ఒక పని చెయ్యాలి (భావయేత్) అని తెలుస్తుంది. 'భావయేత్' అనగానే "కిం భావయేత్" "కేన భావయేత్", "కథం భావయేత్" అని మూడు ఆకాంక్షలు (ప్రశ్నలు) ఉదయిస్తాయి, 'కిం భావయేత్' అనేదానికి "ఛేదనం భావయేత్" అనీ, 'కేన భావయేత్' అనే దానికి

'కుఠారేణ భావయేత్' అనీ 'కథం భావయేత్' అనేదానికి "కుఠారం ఉత్‌క్షిప్య ఉత్‌క్షిప్య పాతయిత్వా పాతయిత్వా భావయేత్" అనీ ఆ వాక్యంలోనే ఉన్న పదాలను పట్టి సమాధానాలు వస్తాయి. 'కిం భావయేత్ (దేన్ని ఉండేటట్లు, పుట్టేటట్లు, కలిగేటట్లు చెయ్యాలి, సాధించాలి) అనేదానికి 'సాధ్యాకాంక్ష' అని పేరు. "కేన భావయేత్" (దేనిచేత సాధించాలి) అనే దానికి కరణాకాంక్ష అని పేరు. 'కథం భావయేత్"' (ఎలా సాధించాలి) అనే దానికి 'ఇత్థంభావాకాంక్ష' అని పేరు. ఈవిధంగా ఈ వాక్యానికి 'కుఠారేణ, తం ఉత్‌క్షిప్యోత్‌క్షిప్య, పాతయిత్వా పాతయిత్వా కాష్ఠచ్ఛేదనం భావయేత్"అనే అర్థం సిద్ధిస్తుంది. "యజేత స్వర్గకామః" ఇత్యాది వైదికవాక్యాలలో కూడా "ప్రయాజాదిభిః కరణైః యాగేన స్వర్గం భావయేత్" ఇత్యాదిరూపంలో అర్థం ఏర్పడుతుంది. దీనికి 'ఆర్థభావన' అని పేరు. దీనిని ప్రతిక్రియాపదం కూడా బోధిస్తుంది.

ప్రకృతంలో "కావ్యం భావింపచేస్తుంది" అన్నప్పుడు ఈ మూడు ఆకాంక్షలు ఉన్నాయి. దేనిని భావింపచేస్తుంది? రసాన్ని. దేనిచేత భావింపచేస్తుంది? వ్యంజకత్వం అనే వ్యాపారంచేత. అనగా ఇది కరణం. ఎలా భావింపచేస్తుంది? ఉచిత గుణాలంకారాదినిబంధనం ద్వారా. భావనావ్యాపారాన్ని అంగీకరించిన భట్టనాయకుడు దీనిని పట్టి మీమాంసనుంచి దీనిని గ్రహించి, కొంత మార్పు చేశాడని తెలుస్తున్నది. 'కావ్యం రసాన్ని భావింపచేస్తుంది" అన్నంతవరకు చాలా పోలిక ఉంది. పునః పునరనుసంధానరూపమైన భావనకీ దీనికీ సంబంధం లేదు. అందుచేతనే కాబోలు అభినవగుప్తుడు ఈతనిని మీమాంసకుణ్ణిగా గ్రహించి "జైమినిసూత్రే హ్యేవం యోజ్యతే' అని వేళాకోళం చేశాడు.

భోగోఽపి ఇతి - కావ్యశబ్దంచేత భోగం కూడా చేయబడదనే మాట లేదు. అయితే అది ఏ విధంగా చేయబడుతుందనగా - దట్టంగా ఉన్న మోహరూపమైన అజ్ఞానంవల్ల కలిగిన సంకటతను (ఆనందాంశావరణాన్ని) తొలగించడం ద్వారా ఆస్వాదం అనే మరొక పేరు గల, ద్రుతివిస్తరవికాసరూపమైన, అలౌకికమైన, భోగం చేయవలసి ఉన్నప్పుడు (కలిగించవలసి ఉన్నప్పుడు) లోకోత్తరమైన ధ్వనన వ్యాపారమే మూర్ధాభిషిక్తం (ఆ విషయంలో ధ్వననవ్యాపారానికే పట్టం కట్టాలి). దానికి ఆశ్రయం అవడం చేత కావ్యం సహకారి అని భావం.

వివరణ. కావ్యశబ్దం భోగాన్ని చేస్తుంది అనే మాట కూడా నిజమే. అయితే అది ఆత్మని ఆవరించి ఉన్న మోహరూపమైన అజ్ఞానాన్ని ధ్వననవ్యాపారం ద్వారా తొలగించి ఈ భోగాన్ని కలిగిస్తుంది. ఈ భోగానికే ఆస్వాదం అని కూడా పేరు. నువ్వు

చెప్పినట్లు ద్రుతి-విస్తర-వికాసాలు కూడా దీనిలో ఉంటాయి. ఈ విధంగా భ
అనగా ఆనందాంశాన్ని ఆవరించి ఉన్న అజ్ఞానాన్ని ఈ ధ్వననవ్యాపారం తొల
వేయడంతో విభావాదులతో కూడిన రత్యాదిస్థాయిభావాలచేత అవచ్ఛిన్నమైన, (వా
కూడిన) ఆత్మచైతన్యంయొక్క ఏ సాక్షాత్కారం కలుగుతుందో అదే అని తేలిం

తచ్చేతి:- రసం ధ్వననీయం అని ఎప్పుడైతే నిర్ణయించేమో అప్పుడు న
చెప్పిన భోగకృత్త్వం దైవసిద్ధం; ఎందువల్ల ననగా - రసించబడడంచేత క
చమత్కారం కంటె భోగం భిన్నం కాదు. భోగం అనగా అలాంటి చమత్కారమే కద
అర్థం.

భోగం ద్రుతివిస్తరవికాసరూపమైనది అని భట్టనాయకు డన్నదానిని మనః
ఉంచుకొని అంటున్నాడు - సత్త్వాదీనామ్ ఇతి - సత్త్వాది గుణాల అంగాంగిభా
ఉండే వైచిత్ర్యం అనంతంగా ఉంటుంది. అందుచేత ఆస్వాదం ద్రుత్యాదిరూప
మూడు విధాలుగానే ఉంటుందనడం యుక్తం కాదు.

వివరణ. మూడు గుణాలలో ఒక్కొక్కదాని ఉద్రేకాన్ని పట్టి ద్రుత్యా
మూడూ కలుగుతాయని చెప్పినట్లుంది. కాని ఆ మూడు గుణాలలో ఒకటి అంగి
రెండు అంగాలుగాను ఉండడం, అందులో కూడ అల్పత్వాధిక్యాలు మొ
భేదాలు, వీటివల్ల కలిగే వైచిత్ర్యం అనంతంగా ఉంటుంది. కారణాల ఆనంత్య
కార్యాలైన చిత్తవృత్తులు కూడా అనంతంగానే ఉంటాయి. అందుచేత ద్రుత్యా
మూడే కలుగుతాయి అనడం యుక్తం కాదు అని అర్థం.

పరబ్రహ్మేతి :- నువ్వు చెప్పినట్లు రసాస్వాదం పరబ్రహ్మాస్వాదసబ్రహ
అనేది అలాగే కావచ్చును; మాకూ అంగీకార్యమే అని అర్థం. వ్యుత్పత్తి అప్ర
అని భట్టనాయకు డన్నదాని విషయంలో చెపుతున్నాడు. వ్యుత్పాదనం చ
కావ్యం చేసే వ్యుత్పాదనం (ఉపదేశం) శాస్త్రేతిహాసాలచేత, అనగా వేదపురాణాదు
చేయబడిన శాసనప్రతిపాదనలకంటె, అనగా వేదంచేసే శాసనం కంటె, పురాణా
చేసే విషయప్రతిపాదనంకంటె, అతిరిక్తమైన రసాస్వాదానికి ఉపాయమైన తన
యొక్క విజృంభణం అనే వ్యుత్పత్తిని చివరికి కలగచేస్తుంది కావ్యం. ఇందుకు
తప్పు పడతాం? అనగా పురాణాదులవల్ల నేను రాముడు ప్రవర్తించినట్లు ప్రవర్తి
అని మాత్రమే బుద్ధి కలుగుతుంది. కావ్యం అయితే అంతకు మించి, అనగా
పాటు, ప్రతిభావికాసం కూడా చివరికి కలగచేస్తుంది అంటే ఈ విషయంలో
నిందించాలి? పురాణాదులకంటె అధికంగా వ్యుత్పత్తిని కలిగిస్తూన్నందుకు కా
నిందించాలా అని సపరిహాసప్రశ్న.

తస్మాదితి - అందుచేత, రసాలు వ్యంజింపచేయబడతాయి, ప్రతీతిచేతనే రసించబడతాయి (ఆస్వాదించబడతాయి) అనేది నిశ్చితమైన విషయం. ప్రతీత్యైవ రస్యన్తే అనగా రసన ప్రతీతిరూపమే అని భావం. అయితే ఈ అభివ్యక్తి ప్రధానంగా కావచ్చు లేదా అప్రధానంగా కావచ్చు. ప్రధానంగా అభివ్యక్తం అయితే అది రసధ్వని అవుతుంది అప్రధానంగా అయితే రసాద్యలంకారం అవుతుంది. ఈ విషయమే - ముఖ్యమర్థమ్ అనే మాటలలో చెపుతున్నాడు. వ్యవస్థితాః ఇతి- వెనుక చూపిన యుక్తులచేత గుణాలంకారాదులు ధ్వనికంటె ఏ విధంగా భిన్నమైనవో ప్రతిపాదించబడింది కదా అని భావం. 4

## ధ్వన్యాలోకం

కా. ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాఙ్గం తు రసాదయః,
కావ్యే తస్మిన్నలంకారో రసాదిరితి మే మతిః. 5

యద్యపి రసవదలంకారస్య అన్యైః దర్శితో విషయః తథాపి యస్మిన్ కావ్యే ప్రధానతయా అన్యః అర్థః వాక్యార్థీభూతః తస్య చ అఙ్గభూతా యే రసాదయః తే రసాదేరలంకారస్య విషయాః ఇతి మామకీనః పక్షః. తద్యథా చాటుషు ప్రేయోలంకారస్య వాక్యార్థత్వేఽపి రసాదయః అఙ్గభూతాః దృశ్యన్తే.

### బాలానందిని

ప్రధానే ఇతి - అన్యత్ర = రసాదులకంటె భిన్నమైన, వాక్యార్థే = వాక్యార్థమునందు, యత్ర = ఏ కావ్యంలో,రసాదయః=రసాదులు, అఙ్గం తు = అంగంగా ఉంటాయో, తస్మిన్ కావ్యే = ఆ కావ్యంలో, రసాదిః= రసం మొదలైన, అలంకారః ఇతి= అలంకారం అని, మే మతిః=నా అభిప్రాయం.

యద్యపీతి - రసవదలంకారానికి ఇతరులచేత విషయం చూపబడి ఉన్నా, ఏ కావ్యంలో మరొక అర్థం ప్రధానంగా వాక్యార్థం అయి ఉంటుందో, దానికి ఏ రసాదులు అంగంగా ఉంటాయో అవి రసాద్యలంకారానికి విషయాలు అని నా పక్షం (నా మతం). ఆదెట్లనగా - - చాటువులలో (ప్రీతిజనకవాక్యాలలో) ప్రేయోలంకారం వాక్యార్థం అయినప్పటికీ దానికి రసాదులు అంగంగా ఉన్నట్లు కనబడుతున్నాయి. (ఒక వాక్యం ప్రధానంగా ఏ విషయాన్ని ప్రతిపాదిస్తుందో దాన్ని 'వాక్యార్థం' అంటారు).

## లోచనం

అన్యత్రేతి - రసస్వరూపే, వస్తుమాత్రే, అలంకారతాయోగ్యే వా. షే మతిః ఇతి అన్యపక్షం దూష్యత్వేన హృది నిధాయ అభీష్టత్వాత్ స్వపక్షం పూర్వం దర్శయతి- తథాపీతి. స హి పరదర్శితో విషయః భావినీత్యా నోపపన్న ఇతి భావః. యస్మిన్ కావ్యే ఇతి స్పష్టత్వేన అసంగతం వాక్యమ్ ఇత్థం యోజనీయమ్ - యస్మిన్ కావ్యే తే పూర్వోక్తాః రసాదయః అఙ్గభూతాః వాక్యార్థీభూతశ్చ అన్యోఽర్థః, 'చ' శబ్దః 'తు' శబ్దస్యార్థే; తస్య కావ్యస్య సంబన్ధినో యే రసాదయః అఙ్గభూతాః తే రసాదేరలంకారస్య రసవదాద్యంకారశబ్దస్య విషయాః, స ఏవ అలఙ్కారశబ్దవాచ్యో భవతి యోఽఙ్గభూతః న త్వన్య ఇతి యావత్ - అత్రోదాహరణమాహ - తద్యథేతి. తదిత్యఙ్గత్వమ్. యథాత్ర వక్ష్యమాణోదాహరణే, తథా అన్యత్రాపీత్యర్థః. భామహాభిప్రాయేణ చాటుషు ప్రేయోలంకారస్య వాక్యార్థత్వేఽపి రసాదయః అఙ్గభూతాః ఇత్యేకం వాక్యమ్. భామహేన హి గురుదేవనృపతిపుత్రవిషయప్రీతి వర్ణనం ప్రేయోలంకార ఇత్యుక్తమ్. తత్ర ప్రేయాన్ అలంకారః యత్ర సః ప్రేయోలంకారః అలంకరణీయః ఇహోక్తః. న త్వలఙ్కారస్య వాక్యార్థత్వం యుక్తమ్. యది వా వాక్యార్థత్వం ప్రధానత్వమ్, చమత్కారకారితేతి యావత్. ఉద్భటమతానుసారిణస్తు భఙ్క్త్వా వ్యాచక్షతే - చాటుషు చాటువిషయే వాక్యార్థే చాటూనాం వాక్యార్థత్వే ప్రేయోలంకారస్యాపి విషయః ఇతి పూర్వేణ సంబన్ధః. ఉద్భటమతే హి భావాలంకార ఏవ ప్రేయ ఇత్యుక్తః, ప్రేమ్ణా భావానాముపలక్షణాత్. న కేవలం రసవదలంకారస్య విషయః యావత్ ప్రేయఃప్రభృతేరపీత్యపిశబ్దార్థః. రసవచ్ఛబ్దేన ప్రేయఃశబ్దేన చ సర్వ ఏవ రసవదాద్యలంకారాః ఉపలక్షితాః. తదేవాహ- రసాదయః అఙ్గభూతాః దృశ్యన్తే ఇతి. ఉక్తవిషయ ఇతి శేషః.

## బాలానందిని

అన్యత్రేతి. రసస్వరూపం కాని (ఏ రసం అంగం అవుతుందో దానికంటె భిన్నమైన రసం గాని). వస్తుమాత్రం గాని అలంకారత్వానికి యోగ్యమైనది గాని.

ఉపమాద్యలంకారం ధ్వనించబడితే దానికి అలంకారత్వం ఉండదు; అందుచేత "అలంకారతాయోగ్యే" అన్నాడు. మే మతిః అని ఇతరుల పక్షం దూష్యం అని నిశ్చయించి, ఇష్టం అవడంచేత తన పక్షాన్ని ముందుగా తథాపి ఇత్యాదికంచేత చూపుతున్నాడు. పరులచేత చూపబడిన విషయం చెప్పబోయే యుక్తిచేత (భావినీత్యా) ఉపపన్నం (యుక్తియుక్తం) కాదు అని భావం.

వృత్తిలో "యస్మిన్ కావ్యే.. తస్య చ అఙ్గభూతాః' అని చెప్పబడింది. యచ్ఛబ్దతచ్ఛబ్దాలకు పరస్పరాన్వయం చెప్పాలి గాన "ఏ కావ్యంలో ఇతరార్థం ప్రధానమో," తస్య = ఆ కావ్యానికి ఏ రసాదులు అంగమైనవో" అని అర్థం చెప్పాలి. అది అసంగతం. రసాదులు ప్రధానవాక్యార్థానికి అంగాలు కాని కావ్యానికి అంగాలు కాదు కదా? అందుచేత ఈ వాక్యానికి సరియైన అన్వయాన్ని చెపుతున్నాడు- యస్మిన్ ఇతి - అసంగతం అని స్పష్టంగా కనబడుతూన్న "యస్మిన్ కావ్యే" ఇత్యాది వాక్యాన్ని ఈ విధంగా అన్వయించుకోవాలి - ఏ కావ్యంలో పూర్వం చెప్పిన ఆ రసాదులు అంగంగా ఉంటాయో, మరొక అర్థం వాక్యార్థం అవుతుందో, - 'తస్య చ' అన్నచోట 'చ' శబ్దానికి 'తు' శబ్దార్థం చెప్పాలి - కాని ఆ కావ్యానికి సంబంధించిన ఏ రసాదులు (వాక్యార్థానికి) అంగం అయినవో అవి రసాద్యలంకారానికి, అనగా రసవదాద్యలంకారశబ్దానికి విషయాలు. ఏది అంగమో అదే అలంకారశబ్దవాచ్యం అవుతుంది, మరొకటి (అంగం కానిది) కాదు అని భావం. తద్యథా ఇత్యాదికంచేత ఈ విషయంలో ఉదాహరణం చూపుతున్నాడు. తత్ అనగా అంగత్వం అని అర్థం. ఈ చెప్పబోయే ఉదాహరణంలో ఎట్లో ఇతర స్థలాలలో కూడా అట్లే అని అర్థం. భామహుని అభిప్రాయం ప్రకారం "చాటువులలో ప్రేయోలంకారం వాక్యార్థం అయినా రసాదులు అంగాలుగా కనబడుతున్నాయి". అని ఇది ఒక వాక్యం. ఎందుచేతననగా - భామహుడు గురు - దేవ-నృపతి- పుత్రాదుల విషయమైన ప్రీతిని వర్ణించడం ప్రేయోలంకారం అని చెప్పాడు. తత్రేతి - తత్ర = ఆ భామహుని మతం ఈ విధంగా ఉండగా- ఇహ= ఈ చాటుష్విత్యాది వాక్యంలో, "ప్రేయాన్ అలంకారః యత్ర సః ప్రేయోలంకారః" అనే విగ్రహంచేత ప్రేయస్ అనే అలంకారంచేత అలంకరణీయమైన వాక్యార్థం చెప్పబడుతుంది. అంతే కాని అలంకారానికి వాక్యార్థత్వం యుక్తం కాదు.

వివరణ. "కిం హాస్యేన" ఇత్యాదిశ్లోకంలో వర్ణింపబడుతూన్న రాజుయొక్క ప్రభావాదికమే వాక్యార్థం కాని ప్రేయోరూపాలంకారం వాక్యార్థం కాదు. అందుచేత వృత్తిలోని 'ప్రేయోలఙ్కార'శబ్దాన్ని బహుబ్రీహిసమాసంగా గ్రహించి 'ప్రేయోలంకారం

కలది" "ప్రేయోలంకారంచేత అలంకరించదగినది" అని అర్థం చెప్పాలి. అంతే కాని అలంకారం వాక్యార్థం అనడం యుక్తం కాదు. యదివా ఇతి. లేదా వాక్యార్థశబ్దానికి ప్రధానమైనది అనగా చమత్కారకారి అని అర్థం. ఈ అర్థం చెప్పిన పక్షంలో బహుప్రీహిసమాసం చెప్పవలసిన అవసరం ఉండదు.

వివరణ. భామహుడు ప్రేయోలంకారానికి ఇచ్చిన లక్షణోదాహరణలు ఇవి.

శ్లో. ప్రేయో గృహాగతం కృష్ణమవాదీద్విదురో యథా,
అద్య యా మమ గోవిన్ద జాతా త్వయి గృహాగతే,
కాలేనైషా భవేత్ప్రీతిః తవైవాగమనాత్పునః. (భా . కావ్యా. 3.5)

"ప్రేయోలంకారం ఎట్లనగా.- విదురుడు తన ఇంటికి వచ్చిన శ్రీకృష్ణునితో ఇలా అన్నాడు - 'గోవిందా! ఈ నాడు నువ్వు మా యింటికి రావడం వల్ల ఏ అనందం కలిగిందో ఆ ఆనందం కాలాంతరంలో నువ్వు మా యింటికి వచ్చినప్పుడే కలుగుతుంది.'

ఇక్కడ భక్తిపాత్రుడైన శ్రీకృష్ణుని విషయంలో విదురునికున్న ప్రీతి వర్ణింపబడింది గాన ప్రేయోలంకారం. వృత్తిలోని వాక్యానికి పైన చెప్పిన అర్థం భామహోక్తప్రేయోలంకార తల్లక్ష్యాలను అనుసంధించినది.

ఇప్పుడు ఉద్భటమతానుసారులు ఈ వాక్యానికి చెప్పిన అర్థం విశదీకరిస్తున్నాడు - **ఉద్భటేతి**:- ఉద్భటమతాన్ని అనుసరించినవాళ్లు ఈ వాక్యాన్ని విభజించి వాఖ్యానిస్తున్నారు. వాక్యార్థత్వం చాటువులయందు, అనగా చాటువుల విషయమునందు ఉండగా, అనగా చాటువులు వాక్యార్థం అయినప్పుడు, (చాటుః అని అధ్యాహారం; అ చాటుకావ్యం) ప్రేయోలంకారానికి కూడా విషయం అవుతుంది అని వెనుకటిదానితో "రసాదేః అలంకారస్య విషయాః" లోని విషయశబ్దంతో (ఏకవచనంగా మార్చుకొన్న'విషయః' అనే దానితో) సంబంధం. ఎందుచేత ననగా ఉద్భటుని మతంలో భావాలంకారమే, భామహుడు చెప్పిన ప్రేమచేత ఇతరభావాలను కూడా ఉపలక్షణచేత గ్రహించి, ప్రేయోలంకారం అని చెప్పబడింది.

వివరణ. శ్లో. రత్యాదికానాం భావానామనుభావాదిసూచనైః,
యత్కావ్యం బధ్యతే సద్భిః తత్ ప్రేయస్వదుదాహృతమ్ (కా.అ.సా.సం. 4.2)

'రత్యాదిభావాలను వాటి అనుభావాదులచేత సూచిస్తూ ఏ కావ్యం నిర్మించబడుతుందో అది 'ప్రేయస్వత్' అనగా ప్రేయోలంకారం కలది అని చెప్పబడినది'. "ఇది ఉద్భటుని లక్షణం. ఇక్కడ రత్యాదికానామ్ అని ఆదిశబ్దప్రయోగంచేత స్థాయి - వ్యభిచారి - సాత్త్వికభావాలు, 'అనుభావాది' లోని' 'ఆది' శబ్దం చేత విభావ - వ్యభిచారి - స్వశబ్దాలూ

గ్రహింపబడతాయి. భావాలు అలంకారాలుగా ఇక్కడ చెప్పబడుతున్నాయి అని వ్యాఖ్యాకారుడైన ప్రతీహారేందురాజు చెప్పాడు.

'వ్యాక్యార్థత్యేఽపి' అనే చోట ఉన్న 'అపి' శబ్దాన్ని ప్రేయోలంకారస్య తో అన్వయించి, ప్రేయోలంకారస్యాపి' అని పైన చెప్పబడింది. ఈ అపిశబ్దానికి ప్రయోజనం చెపుతున్నాడు - న కేవలమితి. కేవలం రసవదలంకారానికే విషయం కాదు ప్రేయోలంకారం మొదలైనవాటికి కూడా విషయం అని 'అపి' శబ్దానికి అర్థం. రసవచ్ఛబ్దంచేత, ప్రేయఃశబ్దంచేత, రసవదాద్యలంకారాలు అన్నీ ఉపలక్షణచేత గ్రహింపబడతాయి. ఈ విషయాన్నే రసాదయః అఙ్గభూతాః దృశ్యన్తే" అనే మాటలలో చెపుతున్నాడు. 'ఉక్తవిషయే' అని అధ్యాహారం. చెప్పబడిన చాటుస్థలమునందు అని అర్థం. అనగా చాటుస్థలాలలో రసాదులు అంగాలుగా కనబడుతున్నాయి అని ఆ వాక్యానికి అర్థం.

వివరణ. గుర్వాదులయందున్న ప్రీతిని వర్ణించడమే ప్రేయోలంకారం. చాటుస్థలంలో ఆ ప్రేయోలంకారానికే ప్రాధాన్యం ఉంటుంది. రసాదులు ఆ ప్రీతికి గాని, ఆ ప్రీతికి విషయమైన రాజుయొక్క ప్రభావాదికానికి గాని అంగంగా ఉంటాయి అని భామహమతానుసారంగా వృత్తిలోని 'తద్యథా' ఇత్యాది వాక్యానికి అర్థం. రత్యాది భావాల వర్ణనం భావాలంకారం, అదే ప్రేయోలంకారం. 'కిం హాస్యేన' ఇత్యాదులలో చాటువు వాక్యార్థం. అక్కడ రసవదలంకారం భావాలంకారం ఉంటాయి అని ఉద్భటమతం ప్రకారం అర్థం.

## ధ్వన్యాలోకం

స చ రసాదిరలఙ్కారః శుద్ధః సంకీర్ణో వా. తత్రాద్యో యథా -

శ్లో. కిం హాస్యేన న మే ప్రయాస్యసి పునః ప్రాప్తశ్చిరాద్దర్శనం
కేయం నిష్కరుణ ప్రవాసరుచితా కేనాసి దూరీకృతః,
స్వప్నాన్తేష్వితి తే వదన్ ప్రియతమవ్యాసక్తకణ్ఠగ్రహో
బుద్ధ్వా రోదితి రిక్తబాహువలయస్తారం రిపుస్త్రీజనః. (21)

ఇత్యత్ర కరుణరసస్య శుద్ధస్యాఙ్గభావాత్ స్పష్టమేవ రసవదలంకారత్వమ్. ఏవమేవంవిధే విషయే రసాన్తరాణాం స్పష్ట ఏవ అఙ్గభావః.

### బాలానందిని

స చేతి - ఆ రసాద్యలంకారం శుద్ధమైనా కావచ్చు లేదా సంకీర్ణం కావచ్చు. వాటిలో మొదటిది ఎట్లనగా -

21

కిమితి - హాస్యేన = హాస్యంచేత, కిమ్=ఏమి ప్రయోజనం. చిరాయ= చిరకాలానికి, మే దర్శనమ్= నా దృష్టిని, ప్రాప్తః=పొందిన నువ్వు, పునః=తిరిగి, న ప్రయాస్యసి=వెళ్ళవు. చాలాకాలానికి కనబడిన నువ్వు మళ్లీ వెళ్లి పోవద్దు. నిష్కరుణ= జాలిలేనివాడా! ఇయమ్=ఈ, ప్రవాసరుచితా=ప్రవాసమునందు ఆసక్తి, కా= ఏమిటి? కేన=ఎవనిచేత, దూరీకృతః=దూరం చేయబడినావు? స్వప్నాన్తేషు= స్వప్నాంతముల యందు, ఇతి=ఈవిధంగా, వదన్=పలుకుచు, ప్రియతమ వ్యాసక్తకణ్ఠగ్రహః= ప్రియతమునియందు లగ్నమైన కంఠగ్రహణం గల, (ప్రియతముని కంఠాన్ని ఆశ్లేషించుకొని ఉన్న), తే= నీ యొక్క రిపుస్త్రీజనః=శత్రుస్త్రీ జనం, బుద్ధ్వా=మేల్కొని, రిక్తబాహువలయః= శూన్యమైన బాహువలయం కలదై, తారమ్=బిగ్గరగా, రోదితి=ఏడ్చుచున్నది.

ఇత్యత్రేతి - ఇక్కడ శుద్ధమైన కరుణరసం అంగంగా ఉండడంవల్ల రసవదలంకారత్వం స్పష్టమే. ఈవిధంగా ఈ రకమైన ఇతరరసాలకు కూడా అంగత్వం స్పష్టమే.

## లోచనం

శుద్ధ ఇతి : రసాన్తరేణ అఙ్గభూతేన అలఙ్కారాన్తరేణ వా న మిశ్రః. ఆమిశ్రస్తు సంకీర్ణః. స్వప్నస్య అనుభూతసదృశత్వేన భవనమితి హసన్నేవ ప్రియతమః స్వప్నే అవలోకితః. న మే ప్రయాస్యసి పునః ఇతి- ఇదానీం త్వాం విదితశఠభావం బాహుపాశబన్ధాత్ న మోక్ష్యామి. అత ఏవ రిక్తబాహువలయ ఇతి. స్వీకృతస్య చోపాలమ్భో యుక్త ఇత్యాహ - కేయం నిష్కరుణేతి. కేనాసీతి:- గోత్రస్ఖలనాదిష్వపి న మయా కదాచిత్ ఖేదితోఽసి స్వప్నాన్తేషు స్వప్నాయితేషు, సుప్తప్రలపితేషు పునః పునరుద్ఘాతతయా బహుషు. ఇతి వదన్ యుష్మాకం సమ్బన్ధీ రిపుస్త్రీజనః ప్రియతమే విశేషేణ ఆసక్తః కణ్ఠగ్రహః యేన తాదృశ ఏవ సన్ బుద్ధ్వా శూన్యవలయాకారీకృత బాహుపాశః సన్ తారం ముక్తకణ్ఠం రోదితీతి.

## బాలానందిని

శుద్ధ ఇతి :- అంగమైన ఇతరరసంతో కాని, మరొక అలంకారంతో కాని మిశ్రం కానిది శుద్ధం. వాటితో కలిసినది సంకీర్ణం. పూర్వం జాగ్రదవస్థలో ఏవిధంగా అనుభవించబడి ఉంటుందో స్వప్నం అదే విధంగా ఉంటుంది గాన ప్రియతముడు నవ్వుతున్నట్లుగానే స్వప్నంలో చూడబడ్డాడు. న మే ప్రయాస్యసి పునః ఇతి - నువ్వు

ఎలాంటి శఠుడవో, గూఢంగా విప్రియం చేసేవాడవో, తెలిసి పోయింది. ఇప్పుడింక నా బాహుపాశబంధంనుంచి విడవను. అందువల్లనే రిక్తబాహువలయః అని చెప్పబడింది. స్వీయజనాన్ని (స్వీకృతస్య) నిందించడం యుక్తమే అని కేయం నిష్కరుణ అనే మాటలలో చెప్పుచున్నాడు. కేనాసీతి - గోత్రస్ఖలనాదులు జరిగినప్పుడు కూడా నేను నిన్ను ఎన్నడూ బాధించలేదు. స్వప్నాన్తేషు - మాటి మాటికి ఇలా జరగడంచేత అనేకమైన స్వప్నాయితములయందు, అనగా నిద్రలో కలవరించడాలయందు. ఇతీతి - ఈ విధంగా పలుకుచున్న మీ శత్రుస్త్రీజనం, ప్రియతమునియందు అధికంగా లగ్నం చేయబడిన కంఠగ్రహణం కలదై మేల్కొని శూన్యమైన, వలయాకారంగా చేయబడిన బాహుపాశం కలదై ఎలుగెత్తి ఏడ్చుచున్నది.

లోచనం

అత్ర శోకస్థాయిభావేన స్వప్నదర్శనోద్దీపితేన కరుణరసేన చర్వ్యమాణేన సున్దరీభూతః నరపతిప్రభావః భాతీతి కరుణః శుద్ధః ఏవ అలంకారః. న హి "త్వయా రిపవో హతాః" ఇతి యాదృగనలంకృతోఽయం వాక్యార్థః తాదృగయమ్. అపి తు సున్దరతరీభూతోఽత్ర వాక్యార్థః. సౌన్దర్యం చ కరుణరసకృతమేవేతి. చన్ద్రాదినా వస్తునా యథా వస్త్వన్తరం వదనాద్యలంక్రియతే తదుపమితత్వేన చారుతయా అవభాసాత్, తథా రసేనాపి వస్తు వా రసాన్తరం వా ఉపస్కృతం సున్దరం భాతి ఇతి రసస్యాపి వస్తున ఇవ అలంకారత్వే కో విరోధః?

బాలానందిని

అత్రేతి - ఇక్కడ శోకం స్థాయిభావంగా గలది, స్వప్నంలో చూడడంచేత ఉత్థాపితమూ అయిన, చర్వణచేయబడుచున్న కరుణరసంచేత రాజుయొక్క ప్రభావం సుందరంగా అయి భాసిస్తూన్నది. అందువల్ల శుద్ధమైన కరుణరసమే అలంకారం. 'నీచేత శత్రువులు చంపబడ్డారు' అనే అలంకారరహితమైన వాక్యార్థం ఎలాంటిదో ఇది అలాంటిది కాదు కదా? మరేమనగా ఇక్కడ వాక్యార్థం చాలా సుందరంగా ఉండేటట్లు చేయబడింది. ఈ సౌందర్యం కరుణరసంవల్లనే వచ్చింది. మరొక వస్తువైన ముఖాదికం చంద్రాదివస్తువుతో పోల్చబడడంచేత ఎక్కువ అందంగా భాసించడంవల్ల, ఆ వస్తువుచేత (చంద్రాదివస్తువుచేత) ఏ విధంగా అలంకరించబడుతుందో అదే విధంగా ఒక వస్తువు గాని, మరొక రసం గాని రసంచేత కూడా సుందరంగా ప్రకాశిస్తుంది. అందుచేత రసం

కూడా వస్తువువలె అలంకారం అయితే విరోధం ఏముంది?

లోచనం

నను రసేన కిం కుర్వతా అత్ర ప్రకృతః అర్థః అలంక్రియతే? తర్హి ఉపమయాపి కిం కుర్వత్యా అలంక్రియతే? నను తయా ఉపమీయతే ప్రస్తుతోఽర్థః. రసేనాపి తర్హి సరసీక్రియతే సోఽర్థః ఇతి స్వసంవేద్యమేతత్. తేన యత్ కేచిత్ అచూచుదన్ - "అత్ర రసేన విభావాదీనాం మధ్యే కిమలంక్రియతే?" ఇతి తదనభ్యుపగమపరాహతమ్, ప్రస్తుతార్థస్య అలంకార్యత్వేన అభిధానాత్. అస్యార్థస్య భూయసా లక్ష్యే సద్భావ ఇతి దర్శయతి- ఏవమితి యత్ర రాజాదేః ప్రభావఖ్యాపనం తాదృశ ఇత్యర్థః.

బాలానందిని

(ప్రశ్న) నన్వితి - రసం ఏం చేస్తూ ప్రకృతార్థాన్ని అలంకరిస్తుంది? (ఎదురుప్రశ్న) అయితే ఉపమ కూడా ఏం చేస్తూ ప్రకృతార్థాన్ని అలంకరిస్తుంది? (మొదట ప్రశ్న వేసినవాని సమాధానం) ఉపమచేత ప్రస్తుతార్థం పోల్చబడుతుంది కదా? (రెండవవాని సమాధానం) అయితే రసంచేత కూడా అప్రకృతార్థం సరసంగా ఉండేటట్లు చేయబడుతుంది; ఈ విషయం (ఒకరు చెప్పనక్కరలేదు) ఎవరి మట్టుకు వారి తెలుస్తుంది. అందుచేత 'ఇక్కడ రసం విభావాదులలో దేన్ని అలంకరిస్తుంది?' అ కొందరు చేసిన ఆక్షేపణ అంగీకరించపోవడంచేతనే త్రిప్పికొట్టబడింది. విభావాదులల ఒకదానిని అలంకరిస్తుందని మేం అంటే కదా ఈ ఆక్షేపణకి అవకాశం అని భావం ప్రస్తుతార్థమే దానిచేత అలంకరించబడుతుంది అని కదా మేం అంగీకరించినది అస్యేతి:- ఈ విషయం (రసం అలంకారంగా ఉండడం) చాలా లక్ష్యాలలో ఉంది అ ఏవమిత్యాది వాక్యంచేత చూపుతున్నాడు. ఏవంవిధే విషయే అనగా ఎక్కడైతే రాజాదు ప్రభావాన్ని వర్ణించడం ఉంటుందో అలాంటిదానియందు అని అర్థం.

ధ్వన్యాలోకం

సంకీర్ణో రసాదిః అఙ్గభూతః యథా -

శ్లో. క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోఽంశుకాన్తం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితః సంభ్రమేణ,

ఆలిఙ్గన్ యోఽ వధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శామ్భవో వః శరాగ్నిః.(22)

ఇత్యత్ర త్రిపురరిపుప్రభావాతిశయస్య వాక్యార్థత్వే ఈర్ష్యా విప్రలమ్భస్య శ్లేషసహితస్య అఙ్గభావ ఇతి. ఏవంవిధ ఏవ రసవదాద్య లంకారస్య న్యాయ్యో విషయః. అత ఏవ చ ఈర్ష్యావిప్రలమ్భకరుణ యోః అఙ్గత్వేన వ్యవస్థానాత్ సమావేశో న దోషః. యత్ర హి రసస్య వాక్యార్థీభావః తత్ర కథమలంకారత్వమ్? అలంకారో హి చారుత్వ హేతుః ప్రసిద్ధః న తు అసౌ ఆత్మైవ ఆత్మనః చారుత్వహేతుః.

బాలానందిని

సంకీర్ణ ఇతి : అంగమైన సంకీర్ణరసాదికం ఎట్లనగా -

క్షిప్త ఇతి :- ఇది అమరుశతకంలోని మంగళశ్లోకం. యః=ఏ శరాగ్ని, సాశ్రునేత్రోత్పలాభిః= కన్నీళ్ళతో కూడిన ఉత్పలములవంటి నేత్రాలు గల, త్రిపురయువతిభిః= త్రిపురాసురస్త్రీలచేత, ఆర్ద్రాపరాధః=పచ్చిగా ఉన్న (కొత్తదైన, అప్పుడే చేసిన) అపరాధం గల, కామీవ=కాముకుడు వలె, హస్తావలగ్నః=చేతులకు తగుల్కొంటూ, హస్తస్పర్శ చేస్తూ, క్షిప్తః=దూరంగా విసిరివేయబడిందో, ప్రసభమ్=బలాత్కారంగా, అంశుకాన్తమ్=వస్త్రాంతాన్ని, ఆదదానః అపి=గ్రహిస్తున్నా, అభిహతః=కొట్టబడినదో, కేశేషు=కేశములయందు, గృహ్ణన్=గ్రహిస్తూ, అపాస్తః=విదిలించుకొనబడినదో, చరణనిపతితః= పాదాలమీద పడినదై, సంభ్రమేణ=తొందరచేత, నేక్షితః=చూడబడలేదో, ఆలిఙ్గన్=కౌగిలించుకొంటూ, అవధూతః=తిరస్కరించబడిందో, సః=ఆ, శామ్భవః=శివుని సంబంధమైన, శరాగ్నిః=బాణాగ్ని, వః=మీయొక్క, దురితమ్=పాపమును, దహతు= కాల్చివేయుగాక,

ఇత్యత్రేతి - ఈ శ్లోకంలో త్రిపురారియైన పరమేశ్వరుని ప్రభావాతిశయం వాక్యార్థం. దానికి శ్లేషసహితమైన ఈర్ష్యావిప్రలంభం అంగం. ఈ విధమైనదే రసవదాద్యలంకారానికి విషయం అని చెప్పడం న్యాయసంమతం, అందుచేతనే, ఈర్ష్యావిప్రలంభకరుణలు (మరొకదానికి)అంగంగా ఉండడం చేతనే, ఒక చోట కలిసి ఉండడంలో దోషం లేదు. రసమే ఎక్కడ వాక్యార్థంగా ఉంటుందో అక్కడ దానికి

అలంకారత్వం ఎలా కుదురుతుంది? చారుత్వానికి హేతువైనదే అలంకారం అని ప్రసిద్ధం కదా? ఈ రసం తనకు తానే చారుత్వహేతువు కాజాలదు.

లోచనం

క్షిప్త ఇతి :- కామిపక్షే అనాదృతః ఇతరత్ర ధుతః. అవధూత ఇతి న ప్రతీప్సితః ప్రత్యాలిఙ్గనేన. ఇతరత్ర సర్వాఙ్గధూననేన విశరారూకృతః. సాస్రుత్వమేకత్ర ఈర్ష్యయా అన్యత్ర నిష్ప్రత్యాశతయా. కామీవేత్యనేన ఉపమానేన శ్లేషానుగృహీతేన ఈర్ష్యావిప్రలమ్భో యః ఆకృష్టః తస్య శ్లేషోపమాసహితస్య అఙ్గత్వమ్, న కేవలస్య. యద్యప్యత్ర కరుణో రసో వాస్తవోఽప్యస్తి తథాపి స తచ్చారుత్వప్రతీత్యై న వ్యాప్రియతే ఇత్యనేన అభిప్రాయేణ శ్లేషసహితస్యేత్యేతావదేవ అవోచత్; న తు కరుణసహితస్యేత్యపి. ఏతమర్థమ్ అపూర్వతయా ఉత్ప్రేక్షితం ద్రఢీకర్తుమాహ- ఏవంవిధ ఏవేతి. అత ఏవేతి:- యతోఽత్ర విప్రలమ్భస్య అలంకారత్వం న తు వాక్యార్థతా అతో హేతోరిత్యర్థః. న దోష ఇతి యది హ్యన్యతరస్య రసస్య ప్రాధాన్యమభవిష్యత్ న ద్వితీయో రసః సమావిశేత్. రతిస్థాయిభావత్వేన తు సాపేక్షభావో విప్రలమ్భః. స చ శోకస్థాయిభావత్వేన నిరపేక్షభావస్య కరుణస్య విరుద్ధ ఏవ. ఏవమలంకారశబ్దప్రసంగేన సమావేశం ప్రసాధ్య ఏవంవిధ ఏవేతి యదుక్తం తత్రైవకారస్య అభిప్రాయం వ్యాచష్టే - యత్ర హీతి.

బాలానందిని

క్షిప్త ఇతి :- కాముకుని పక్షంలో అనాదరం చేయబడినవాడు అని, రెండవపక్షంలో దులిపి వేయబడినది అని అర్థం. తిరస్కరించబడినవాడు అని చెప్పడంచేత ప్రత్యాలింగనంచేత సాదరంగా స్వీకరించబడలే దని భావం. శరాగ్నిపక్షంలో చిమ్మివేయబడినది అని భావం. కన్నీళ్లు కలిగి ఉండడం ఒక పక్షంలో ఈర్ష్యచేత, రెండవ పక్షంలో రక్షణ విషయంలో ఆశ లేకపోవడం చేత. కామీవ అనే శ్లేషచేత అనుగ్రహించబడిన ఉపమానంచేత ఏ ఈర్ష్యావిప్రలంభం (ఈర్ష్యవల్ల ఏర్పడిన వియోగం) స్పష్టీకరించబడిందో శ్లేషోపమాసహితంగా ఉండే అది పురరిపుప్రభావరూపవాక్యార్థానికి అంగం; అంతే కాని కేవలవిప్రలంభం అంగం కాదు. ఇక్కడ వాస్తవమైన కరుణరసం కూడా ఉన్నా అది ఆ

వాక్యార్థంయొక్క చారుత్వం తెలియడానికి పనిచేయడంలేదు. అనే అభిప్రాయం చేత 'శ్లేషసహితస్య' అని మాత్రమే చెప్పాడు కాని 'కరుణసహితస్య' అని కూడ చెప్పలేదు. క్రొత్తగా తనచేత ఊహించబడిన (ప్రతిపాదించబడిన) ఈ విషయాన్ని దృఢం చేయడం కొరకు 'ఏవంవిధ ఏవ' అని అంటున్నాడు. అత ఏవేతి:- ఇక్కడ విప్రలంభం అలంకారమే కాని వాక్యార్థం కాదు అందువలన అని అర్థం. న దోషః ఇతి:- ఈ రెండు రసాలలో ఒకటి ప్రధానం అయి ఉండేటట్లయితే అప్పుడు రెండవ రసం ఇక్కడ చేరక పోయేది. విప్రలంభం రతి స్థాయిభావంగా కలదవడంచేత సాపేక్షభావం, అనగా మున్ముందు కలుస్తామనే ఆశయొక్క ఆపేక్ష ఉన్నది. అది శోకం స్థాయిభావంగా కలదవడంచేత నిరపేక్షభావమైన కరుణకి విరుద్ధమే.

వివరణ. విరుద్ధమైన రెండు రసాలను ఒక చోట కూర్చకూడదు. కాని ఆ రెండూ మరొకదానికి దేనికైనా అంగాలైనప్పుడు చేర్చవచ్చు. అందుచేతనే పరస్పర విరోధం గల కరుణవిప్రంభాలకి ఇక్కడ సమావేశం చేసినా దోషం లేదని భావం.

ఏవమితి- ఈవిధంగా అలంకారశబ్దప్రసంగంచేత రెండు విరుద్ధరసాల సమావేశాన్ని సాధించి 'ఏవంవిధ ఏవ' అన్నదానిలో ఉన్న ఏవకారంయొక్క అభిప్రాయాన్ని 'యత్ర హి' ఇత్యాదివాక్యంచేత విశదీకరిస్తున్నాడు.

## ధ్వన్యాలోకం

తథా చాయమత్ర సంక్షేపః -

శ్లో. రసభావాదితాత్పర్యమాశ్రిత్య వినివేశనమ్,
అలంకృతీనాం సర్వాసామలంకాత్వసాధనమ్.

తస్మాద్యత్ర రసాదయః వాక్యార్థీభూతాః స సర్వః న రసాదేరలంకారస్య విషయః, సః ధ్వనేః ప్రభేదః. తస్య ఉపమాదయః అలంకారాః. యత్ర తు ప్రాధాన్యేన అర్థాన్తరస్య వాక్యార్థీభావే రసాదిభిః చారుత్వనిష్పత్తిః క్రియతే స రసాదేః అలంకారతయా విషయః.

### బాలానందిని

తథా చేతి - ఇంతవరకు చెప్పిన విధంగా ఇక్కడ దీని సంక్షేపం ఇది.

రసేతి :- రసభావాదితాత్పర్యమ్ =రసభావాదులయందే తాత్పర్యాన్ని,

ఆశ్రిత్య=ఆశ్రయించి, వినివేశనమ్=కూర్చడం, సర్వాసామ్=సమస్తమైన, అలంకృతీనామ్= అలంకారాలయొక్క, అలంకారత్వసాధనమ్=అలంకారత్వంయొక్క సాధనము.

తస్మాదితి.- అందువల్ల ఎక్కడ రసాదులు వాక్యార్థం అవుతాయో (ప్రధానంగా ఉంటాయో) అది అంతా రసాద్యలంకారానికి అనగా రసాదులు చేసే అలంకరణానికి విషయం కాదు. అది ఒక ధ్వనిభేదం (రసాదిధ్వనికావ్యం). ఆ ధ్వనికావ్యానికి ఉపమాదులు అలంకారాలుగా ఉంటాయి. కాని ఎక్కడ మరొక అర్థం ప్రధానమైన వాక్యార్థంగా ఉంటుందో, దానికి రసాదులు చారుత్వాన్ని సమకూరుస్తాయో, అది రసాదులు అలంకారం అవడానికి విషయం (స్థానం).

లోచనం

సర్వాసామ్ ఉపమాదీనామ్. అయం భావః-ఉపమాదీనామలంకారత్వే యాదృశీ వార్తా తాదృశ్యేవ రసాదీనామ్. తదవశ్యమన్యేన అలంకార్యేణ భవితవ్యమ్. తచ్చ యద్యపి వస్తుమాత్రమపి భవతి, తథాపి తస్య పునరపి విభావాదిరూపతాపర్యవసానాత్ రసాదితాత్పర్యమేవేతి సర్వత్ర రసధ్వనేరేవ ఆత్మభావః. తదుక్తమ్- రసభావాదితాత్పర్యమ్ ఇతి. తస్యేతి:- ప్రధానస్య ఆత్మభూతస్య. ఏతదుక్తం భవతి - ఉపమయా యద్యపి వాచ్యోఽర్థః అలంక్రియతే, తథాపి తస్య తదేవ అలంకరణం యత్ వ్యఙ్గ్యార్థాభివ్యఞ్జనసామర్థ్యాధానమితి వస్తుతో ధ్వన్యాత్మైవాలంకార్యః. కటకకేయూరాదిభిరపి హి శరీరసమవాయిభిః చేతన ఆత్మైవ తత్తచ్చిత్తవృత్తివిశేషౌచిత్యసూచనాత్మతయా అలంక్రియతే. తథా హి - అచేతనం శవశరీరం కుణ్డలాద్యుపేతమపి న భాతి, అలంకార్యస్యాభావాత్. యతిశరీరం కటకాదియుక్తం హాస్యావహం భవతి, అలంకార్యస్య అనౌచిత్యాత్. న హి దేహస్య కించిదనౌచిత్యమితి వస్తుతః ఆత్మైవ అలంకార్యః. "అహమలంకృతః" ఇత్యభిమానాత్. రసాదేః అలంకారతాయాః ఇతి వ్యధికరణషష్ఠ్యా, రసాదేః యా అలంకారతా తస్యాః స ఏవ విషయః. ఏతదనుసారేణైవ పూర్వత్రాపి వాక్యే యోజ్యమ్. రసాదికర్తృకస్య అలంకరణక్రియాత్మనః విషయః ఇతి.

బాలానందిని

సర్వాసామ్ ఇతి - సమస్తమైన ఉపమాదులైన అని అర్థం. దీని భావం ఇది

- ఉపమాదులు అలంకారాలు అని చెప్పడంలో ఏలాంటి పద్ధతియో రసాదుల అలంకారత్వంలో కూడా అదే పద్ధతి. అందువల్ల అలంకరించదగింది మరొకటి తప్పకుండా ఉండాలి. ఆ అలంకార్యం వస్తుమాత్రం కూడా కావచ్చును; అయినా ఆవస్తువు కూడా తిరిగి విభావాదిరూపంలో పర్యవసిస్తుంది. (చివరికి విభావాదిరూపం అవుతుంది) అప్పుడు దానికి కూడా రసాదులయందే తాత్పర్యం ఉంటుంది కాబట్టి అంతటా కూడా రసధ్వనికే ఆత్మత్వం. ఈ విషయమే 'రసభావాదితాత్పర్యమ్' ఇత్యాదికంచేత చెప్పబడింది.

తస్యేతి - 'తస్య ఉపమాదయోఽలంకారాః' అనే వాక్యంలో తస్య అనగా - ప్రధానమూ ఆత్మా అయిన ఆ రసాదికి అని అర్థం. ఏతదితి - ఈ విషయం చెప్పినట్లయింది - ఉపమచేత వాచ్యార్థమే అలంకరించబడినా దానిని (వాచ్యార్థాన్ని) అలంకరించడం అంటే ఏమిటనగా వ్యంగ్యార్థాన్ని వ్యంజింపచేసే సామర్థ్యాన్ని దానియందు సమకూర్చడమే. అందువల్ల నిజానికి అలంకార్యం ధ్వనిరూపమైన ఆత్మయే. శరీరంతో సంబంధించిన కటకకేయూరాదులచేత కూడ ఆ యా చిత్తవృత్తుల ఔచిత్యాన్ని సూచించే విధంగా అలంకరించబడేది చేతనమైన ఆత్మయే కదా?

వివరణ. శరీరం మీద ధరించే అలంకారాలు ధరించేవాని చిత్తవృత్తికి అనుగుణంగా, ఉచితంగాకూడా ఉంటాయి. యువకుల లేదా యువతుల శరీరాలమీద ధరించిన అలంకారాలు వాళ్ల రాగిత్వానికి తగిన విధంగా (ఔచిత్యంతో) ఉంటాయి. యతిశరీరంమీద రుద్రాక్షమాలాదండకమండలాదులు వాళ్ల చిత్తవృత్తికి ఉచితమైనవిగా ఉంటాయి. అలంకారాలు ధరించేటప్పుడు అలంకార్యచిత్తవృత్త్యౌచిత్యం కూడా పరిగణనలోనికి తీసికొనబడుతుంది.

తథాహి ఇతి:- అది యుక్తమే కదా? అచేతనమైన శవశరీరం కుండలాదులతో కూడినదైనా ప్రకాశించదు. అక్కడ అలంకార్యమైన ఆత్మ లేదు కదా? సంన్యాసిశరీరం కటకాదులతో కూడినట్లయితే హాస్యాస్పదం అవుతుంది. ఎందుచేత ననగా అలంకార్యంలో ఔచిత్యం లేదు. దేహానికి సంబంధించినంతవరకు అనౌచిత్యం ఏదీ లేదు. అందుచేత నిజానికి అలంకార్యం ఆత్మయే. ఎందుచేత ననగా 'అహమ్ అలంకృతః' (నేను అలంకరించబడ్డాను) అనే అభిమానం చేతనుడికే ఉంది కాని కేవల శరీరానికి లేదు కదా? "రసాదేః అలంకారతాయాః" అన్నచోట ఉన్న షష్ఠీవిభక్తులు వ్యధికరణషష్ఠులు. అనగా సమానాధికరణషష్ఠులనుగా గ్రహించి విశేషణవిశేష్యభావం (రసాదియైన అలంకారతయొక్క అని) చెప్పకూడదని అర్థం. అందుచేత రసాదులయొక్క

ఏ అలంకారత్వం ఉందో దానికి అదే విషయం, అనగా ఆశ్రయం.

ఏతదనుసారేణ ఇతి - దీనిని అనుసరించి పూర్వవాక్యంలో కూడా అర్థం చెప్పుకోవాలి. రసాదికర్తృకమైన అలంకరణక్రియారూపానికి విషయం (కాదు) అని అన్వయం చెప్పాలి. 'న రసాదేః అలంకారః' అనేదానికి "రసాదికమైన అలంకారానికి విషయం కాదు"'అని మామూలు అర్థం చెప్పడం జరగచ్చు. అలా కాకుండా ఇక్కడ కూడా వ్యధికరణషష్ఠీవిభక్తులుగా గ్రహించి- రసాదేః=రసాదులయొక్క అనగా రసాదులు చేసే (రసాదికర్తృకమైన-రసాదులు కర్తగా గల) అలంకారస్య=అలంకరణానికి అని అర్థం చెప్పుకోవాలి అని భావం.

## ధ్వన్యాలోకం

ఏవం ధ్వనేః ఉపమాదీనాం రసవదలంకారస్య చ వివిక్త విషయతా భవతి. యది తు చేతనానాం వాక్యార్థీభావో రసాద్యలంకారస్య విషయః ఇత్యుచ్యతే తర్హి ఉపమాదీనాం ప్రవిరల విషయతా నిర్విషయతా వా అభిహితా స్యాత్. యస్మాదచేతన వస్తువృత్తే వాక్యార్థీభూతే పునః చేతనవస్తువృత్తాన్తయోజనయా యథాకథంచిద్భవితవ్యమ్. అథ సత్యామపి తస్యాం యత్ర అచేత నానాం వాక్యార్థీభావః నాసౌ రసవదలంకారస్య విషయః ఇత్యుచ్యతే, తత్ మహతః కావ్యప్రబన్ధస్య రసనిధానభూతస్య నీరసత్వమభిహితం స్యాత్.

### బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ధ్వనికి, ఉపమాద్యలంకారాలకీ, రసవదలంకారానికీ విషయాలు (స్థానాలు) వేరు వేరైనవి అనేది కుదురుతుంది. చేతనాలు వాక్యార్థం అవుతే అప్పుడు అది రసవదలంకారానికి విషయం అవుతుంది అని చెప్పినట్లయితే అప్పుడు ఉపమాదులకు విషయం చాలా తక్కువ అయిపోతుంది, అసలే లేకుండా కూడా పోవచ్చు. ఎందువల్ల ననగా అచేతనపదార్థాల వృత్తాంతం వాక్యార్థం అయినప్పుడు అక్కడ మళ్ళీ చేతనవస్తువృత్తాంతాన్ని ఏదో విధంగా కల్పించవలసి ఉంటుంది.

అచేతనవృత్తాంతం వాచ్యార్థంగా ఉన్న చోట్లలో చేతనవస్తువృత్తాంతయోజన ఉన్నా కూడ అది రసవదలంకారానికి విషయం కాదు అని అంటే అప్పుడు రసానికి నిధానం (నిధి) అయిన అతివిస్తృతమైన కావ్యప్రబంధం (ఎన్నో కావ్యాలు) నీరసం అని చెప్పినట్లవుతుంది.

లోచనం

ఏవమితి - అస్మదుక్తేన విషయవిభాగేనేత్యర్థః. ఉపమాదీనామితి:- యత్ర రసస్య అలంకార్యతా రసాన్తరం చాఙ్గభూతం నాస్తి తత్ర శుద్ధా ఏవ ఉపమాదయః. తేన సంసృష్ట్యా నోపమాదీనాం విషయాపహార ఇతి భావః. రసవదలంకారస్య **చేతి** :- అనేన భావాద్యలంకారా అపి ప్రేయస్వ్యూర్జస్వి సమాహితా గృహన్తే. తత్ర భావాలంకారస్య శుద్ధస్య ఉదాహరణం యథా:-

**శ్లో. తవ శతపత్రపత్రమృదుతామ్రతలశ్చరణ**
**శ్చలకలహంసనూపురకలధ్వనినా ముఖరః,**
**మహిషమహాసురస్య శిరసి ప్రసభం నిహితః**
**కనకమహామహీధ్రగురుతాం కథమప్య గతః.**

ఇత్యత్ర దేవీస్తోత్రే వాక్యార్థీభూతే వితర్కవిస్మయాదిభావస్య చారుత్వహేతుతేతి తస్యాఙ్గత్వాత్ భావాలంకారస్య విషయః.

బాలానందిని

ఏవమితి - మేము చెప్పిన విషయవిభాగంచేత అని అర్థం. ఉపమాదీనామ్ ఇతి - ఎక్కడ రసం అలంకార్యంగా ఉంటుందో, దానికి అంగంగా మరొక రసం ఏదీ ఉండదో అక్కడ శుద్ధమైన ఉపమాద్యలంకారాలే. అందుచేత రసవదాదులతో సంసృష్టిచేత ఉపమాదులకు విషయాపహారం, స్థానం లేకపోవడం, ఉండదు. అనగా రసం ఉండి దానికి అంగంగా మరొక రసం ఉన్నట్లయితే రసవదలంకారం అవుతుంది. అక్కడనే ఉపమాద్యలంకారాలు ఉన్నా అవి రసవదలంకారసంసృష్టాలుగానే ఉంటాయి గాని శుద్ధరూపంలో ఉండవు. అందుచేత అలాంటి సంసృష్టికి అవకాశం లేని స్థలాలే శుద్ధోపమాదులకు స్థలాలు అని అర్థం.

రసవదలంకారస్య చేతి. రసవదలంకారం అనేదానిచేత ప్రేయస్వి - ఊర్జస్వి- సమాహితాలంకారాలు కూడా గ్రహించబడతాయి.

వివరణ. భావం మరొకదానికి అంగం అవుతే అది ప్రేయోలంకారం. దీనికే భావాలంకారం అని కూడా పేరు. ప్రేయస్వి, ప్రేయాన్, అనేవి కూడా దీని పేర్లే..రసాభాస-భావాభాసలు మరొకదానికి అంగాలైతే ఊర్జస్వి అలంకారం. భావశాంతి అపరాంగం అయితే సమాహితాలంకారం.

తత్ర ఇతి- వాటిలో శుద్ధమైన భావాలంకారానికి ఉదాహరణం ఎట్లనగా -

తవేతి :- అమ్బ =తల్లీ! శతపత్రపత్రమృదుతామ్రతలః=పద్మపు రేకువలె మృదువుగాను ఎఱ్ఱగాను ఉన్నతలం (అరికాలు) గలది, చలకలహంసనూపురకలధ్వనినా = కదలుతున్న కలహంసల వంటి నూపురముల మధురధ్వనిచేత, ముఖరః= మ్రోగుతూన్నది అయిన, తవ=నీయొక్క, చరణః=పాదం, ప్రసభమ్=బలాత్కారంగా, మహిషమహాసురస్య=మహిషమహాసురుని, శిరసి=శిరస్సుమీద, నిహితః=ఉంచబడినదై, కనకమహామహీధ్రగురుతామ్=మేరుపర్వతం వంటి బరువును, కథమ్=ఎట్లు, గతః=పొందినది. వాని అంత పెద్ద శిరస్సు నలిగిపోవడంచేత ఇది బరువైనది అని తెలుస్తూన్నది అని భావం.

ఇత్యత్రేతి:- ఇక్కడ వాక్యార్థమైన దేవీస్తుతిలో వితర్కం, విస్మయం మొదలైన భావం చారుత్వానికి హేతువై దానికి అంగం అయింది. అందువల్ల ఇది (శుద్ధమైన) భావాలంకారానికి విషయం.

లోచనం

రసాభాసస్య అలంకారతా యథా మమైవ స్తోత్రే -

శ్లో. సమస్తగుణసంపదః సమమలంక్రియాణాం గణై
ర్భవన్తి యది భూషణం తవ తథాపి నో శోభసే,
శివం హృదయవల్లభం యది యథా తథా రఞ్జయే
స్తదేవ నను వాణి తే భవతి సర్వలోకోత్తరమ్.

అత్ర హి పరమేశస్తుతిమాత్రం వాచః పరమోపాదేయమితి వాక్యార్థే శృఙ్గారాభాసశ్చారుత్వహేతుః శ్లేషసహితః. న హ్యయం పూర్ణః శృఙ్గారః నాయికాయాః నిర్గుణత్వే ని ´లంకారత్వే చ భవతి. ''ఉత్తమయువప్రకృతిః ఉజ్జ్వలవేషాత్మకః'' ఇతి చాభిధానాత్.

బాలానందిని

సమస్తేతి - వాణి=నా వాణీ! అలంక్రియాణాం గణైః సమమ్=అలంకారాల గణాలతో కూడా, సమస్తగుణసంపదః=సమస్తమైన గుణసంపదలు, తవ=నీకు, భూషణమ్=భూషణంగా, భవన్తి యది= అయినను, తథాపి=అట్లయినా కూడ, యథా తథా=ఏదో విధంగా, హృదయవల్లభమ్= హృదయప్రియతముడైన, శివమ్=శివుణ్ణి, రఞ్జయేః యది=రంజింపచేసినట్లయితే, తదేవ=అదే, తే=నీకు, సర్వ లోకోత్తరమ్=సమస్తలోకాలలో శ్రేష్ఠమైనదిగా, భవతి నను =అవుతుంది కదా?

అత్ర హి ఇతి - ఇక్కడ వాక్కునకు అత్యంతోపాదేయమైన (సర్వథా స్వీకరించవలసిన) విషయం పరమేశ్వరుని స్తుతిమాత్రమే అనేది వాక్యార్థం. ఆ వాక్యార్థంలో శ్లేషసహితమైన శృంగారాభాస చారుత్వానికి హేతువుగా ఉంది. ఇది పూర్ణమైన శృంగారం కాదు. నాయికగుణాలూ అలంకారాలూ లేనిదైతే పూర్ణశృంగారం కాదు కదా? "శృంగారంలో ఉత్తములైన యువతీయువకులు ప్రకృతిగా ఉండాలి. వారి వేషం ఉజ్జ్వలంగా ఉండాలి" అని నాట్యశాస్త్రంలో చెప్పబడింది కదా?;

వివరణ. ఇక్కడ 'యథా కథం రఞ్జయేః' అని చెప్పడంచేత ప్రతీయమానమైన నాయికకు తగిన గుణాలు, అలంకారాలు లేవు అని సూచించబడింది.

లోచనం

భావాభాసాఙ్గతా యథా-

శ్లో. స పాతు వో యస్య హతావశేషాస్తత్తుల్యవర్ణాఞ్జనరఞ్జితేషు,
లావణ్యయుక్తేష్వపి విత్రసన్తి దైత్యాః స్వకాన్తానయనోత్పలేషు.

అత్ర రౌద్రప్రకృతీనామ్ అనుచితః త్రాసః భగవత్ప్రభావకారణకృత ఇతి భావాభాసః. ఏవం తత్ప్రశమస్యాఙ్గత్వమపి ఉదాహార్యమ్.

బాలానందిని

భావేతి - భావాభాసం అంగం అవడానికి ఉదాహరణం ఎట్లనగా - స ఇతి :- యస్య= ఏ శ్రీమహావిష్ణువుయొక్క, హతావశేషాః= చంపగా మిగిలిన, దైత్యాః= దైత్యులు, లావణ్యయుక్తేష్వపి= లావణ్యంతో కూడినవైనా, తత్తుల్యవర్ణాఞ్జనరఞ్జితేషు= వానితో సమాన మైన కాటుకచేత పూయబడిన, స్వకాన్తానయనోత్పలేషు=తమ భార్యల ఉత్పలాల వంటి నేత్రాలయందు(నుండి), విత్రసన్తి= భయపడుచున్నారో.

అత్రేతి - ఇక్కడ రౌద్రస్వభావం గలవాళ్లకు భయం కలగడం భగవంతుని ప్రభావం అనే కారణంచేత చేయబడింది గాన, ఇది భావాభాస. ఇది వాక్యార్థమైన భగవత్ప్రభావానికి అంగం అవడంచేత ఊర్జస్వ్యలంకారం అని భావం. ఏవమితి - ఈ విధంగా భావప్రశమానికి కూడ ఉదాహరణ చూచుకోవాలి.

లోచనం

"మే మతిః" ఇత్యనేన యత్ పరమతం సూచితం తద్దూషణ ముపన్యస్యతి - యదీత్యాదినా. పరస్య చాయమాశయః - అచేతనానాం చిత్తవృత్తిరూపరసాద్యసంభవాత్ తద్వర్ణనే రసవదలంకార స్యానా శఙ్క్యత్వాత్ తద్విభక్త ఏవ ఉపమాదీనాం విషయ ఇతి. ఏతద్దూషయతి - తర్హీతి. తస్మాద్వచనాద్ధేతోరిత్యర్థః. నను అచేతనవర్ణనం విషయ ఇత్యుక్తమ్ ఇత్యాశఙ్క్య హేతుమాహ - యస్మాదితి. యథాకథంచిదితి :- విభావాదిరూపతయా. తస్యామితి :- చేతనవృత్తాన్తయోజనాయామ్. నీరసత్వమితి:- యత్ర హి రసః తత్ర అవశ్యం రసవదలఙ్కారః ఇతి పరమతమ్. తతః న రసవదలంకారశ్చేత్ నూనం తత్ర రసో నాస్తీతి పరమతాభిప్రాయాత్ నీరసత్వముక్తమ్. న త్వస్మాకం రసవదలంకారస్యాభావే నీరసత్వమ్; అపితు ధ్వన్యాత్మభూతరసాభావే. తాదృక్చ రసః అత్ర అస్త్యేవ.

బాలానందిని

మే ఇతి :- "ప్రధానేఽన్యత్ర వాక్యార్థే" ఇత్యాది కారికలో "మే మతిః" అని చెప్పడం ద్వారా పరుల ఏ మతం సూచించబడిందో దాని దూషణాన్ని యదీత్యాదికంచేత ప్రతిపాదిస్తున్నాడు. పరస్యేతి :- పరుని అభిప్రాయం ఇది - అచేతనపదార్థాలకు చిత్తవృత్తిరూపాలైన రసాదులు ఉండడం సంభవం కాదు. అందువల్ల వాటి వర్ణనలో రసవదలంకారం ఉంటుం దని ఊహించడానికి కూడా అవకాశం లేదు. అందుచేత ఉపమాదులకు రసవదాదులు ఉండేదానికంటె భిన్నమైన స్థలమే విషయం. ఈ మతాన్ని తర్హీత్యాదికం చేత దూషిస్తున్నాడు. తర్హి అనగా ఆవిధంగా చెప్పడం వల్ల అని అర్థం. చేతనవర్ణన ఉన్న చోటనే రసవదాద్యలంకారాలు ఉంటాయి, అచేతనవర్ణనా స్థానాలలో ఉపమాద్యలంకారాలు ఉంటాయి. ఈ విధంగా ఈ రెండింటికీ వేరు వేరు స్థానాలు కేటాయించవచ్చు అని చెప్పడంవల్ల అని భావం.

నన్వితి :- అచేతనవర్ణనం ఉపమాదులకి విషయం అని చెప్పాం కదా అని ఆశంకించుకొని అలా చెప్పినా ఉపమాదులకు విరలవిషయత్వం గాని, నిర్విషయత్వం గాని ఏర్పడుతుంది అనేది యథాతథంగానే ఉంటుంది అని చెప్పడానికి హేతువును యస్మాదిత్యాదికంచేత ప్రతిపాదిస్తున్నాడు. యథాకథంచిత్ అనగా విభావాదిరూపంలో అని అర్థం. తస్యామితి- చేతనవృత్తాంతాన్ని కూర్చినప్పుడు అని అర్థం. నీరసత్వమితి:- రసం ఉన్నచోటల్లా రసవదలంకారం అని పరుల మతం. మాకైతే రసవదలంకారం లేకపోయినా నీరసత్వం ఉండదు. ఎక్కడైతే ధ్వన్యాత్మ అయిన రసం ఉండదో అక్కడ మాత్రమే నీరసత్వం. అలాంటి రసం చేతనవృత్తాంతయోజన ఉన్న చెప్పబోయే ఉదాహరణలలో(అత్ర) ఉండనే ఉంది.

## ధ్వన్యాలోకం

యథా-

శ్లో. తరఙ్గభ్రూభఙ్గా క్షుభితవిహగశ్రేణిరశనా
వికర్షన్తీ ఫేనం వసనమివ సంరమ్భశిథిలమ్,
యథావిద్ధం యాతి స్ఖలితమభిసన్ధాయ బహుశో
నదీరూపేణేయం ధ్రువమసహనా సా పరిణతా. (23)

యథా వా:-

శ్లో. తన్వీ మేఘజలార్ద్రపల్లవతయా ధౌతాధరేవాశ్రుభిః
శూన్యేవాభరణైః స్వకాలవిరహాద్విశ్రాన్తపుష్పోద్గమా,
చిన్తామౌనమివాశ్రితా మధుకృతాం శబ్దైర్వినా లక్ష్యతే
చణ్డీ మామవధూయ పాదపతితం జాతానుతాపేవ సా. (24)

యథా వా-

శ్లో. తేషాం గోపవధూవిలాససుహృదాం రాధారహఃసాక్షిణాం
క్షేమం భద్రకలిన్దశైలతనయాతీరే లతావేశ్మనామ్,
విచ్ఛిన్నే స్మరతల్పకల్పనమృదుచ్ఛేదోపయోగేఽధునా
తే జానే జరఠీభవన్తి విగలన్నీలత్విషః పల్లవాః. (25)

ఇత్యేవమాదౌ విషయే అచేతనానాం వాక్యార్థీభావేఽపి చేతనవస్తు వృత్తాన్తయోజనా అస్త్యేవ.

బాలానందిని

యథేతి - ఎట్లనగా - తరఙ్గేతి - తరఙ్గభ్రూభఙ్గా = తరంగాలే కనుబొమ్మల విరుపులుగా కలదీ, క్షుభితవిహగశ్రేణిరశనా = చెదరగొట్టబడిన పక్షుల పంక్తులే వడ్డాణంగా గలదీ, సంరమ్భశిథిలమ్= తొందరచేత జారిపోతూన్న, వసనమిన = వస్త్రాన్ని వలె, ఫేనమ్ = నురుగును, వికర్షన్తీ= లాగుచున్నదీ, బహుశః = అనేక పర్యాయాలు, స్ఖలితమ్ = తొట్రుపాటును, అభిసంధాయ = పొంది, ఆవిద్ధమ్ = కుటిలంగా, యథా = ఎందువలన, యాతి = వెడుతున్నదో, అందువలన, సా ఇయమ్ = ఆ ఈ ఊర్వశి, అసహనా = కోపంతో కూడినదై, నదీరూపేణ = నదీరూపంచేత, పరిణతా = మారిపోయింది.

స్ఖలితమ్ అభిసన్ధాయ అనగా నదీపక్షంలో శిలాదులమీద తొట్రుపడుతూ, ఎగుడుదిగుడుగా ప్రవహిస్తూ అని అర్థం. ఊర్వశిపక్షంలో నా స్ఖలితాన్ని, అపరాధాన్ని మనస్సులో తలచుకొని అని అర్థం. ఈ శ్లోకం, రాబోయే శ్లోకం కూడా విక్రమోర్వశీయంలో అంతర్హితయైన ఊర్వశికోసం వెదకుతున్న, ఉన్మాదావస్థలో ఉన్న పురూరవుని మాటలు.

యథా వా - మరొక ఉదాహరణం ఎట్లనగా -

తన్వీ ఇతి - ఈ శ్లోకం వెనక ఇయమ్ అనే పదం ఉంది. దీనిలోనికి అన్వయిస్తుంది. తన్వీ = సన్నంగా ఉన్నది (ఇది లతకి నాయికకీ కూడ వర్తిస్తుంది). మేఘజలార్ద్రపల్లవతయా= మేఘజలం చేత తడిసిన చిగుళ్లు కలదవడంచేత, అశ్రుభిః= కన్నీళ్లచేత, ధౌతేవ = కడగబడింది వలె ఉన్నది, స్వకాలవిరహాత్=తన కాలము కాక పోవడంచేత, విశ్రాన్తపుష్పోద్గమా=ఆగిపోయిన పుష్పముల ఆవిర్భావం కలదై, ఆభరణైః= ఆభరణాలతో, శూన్యా ఇవ = శూన్యమైనది వలె ఉన్నది, మధుకృతామ్ = తుమ్మెదల యొక్క, శబ్దైః వినా=శబ్దములు లేకుండా, చిన్తామౌనమ్=చింతవలన మౌనమును, ఆశ్రితా ఇవ= ఆశ్రయించినది వలె ఉన్నది అయిన, ఇయమ్= ఈ లత, పాదపతితమ్= పాదాలమీద పడిన, మామ్=నన్ను, అవధూయ = తిరస్కరించి, జాతానుతాపా= పుట్టిన పశ్చాత్తాపంగల, సా= ఆ, చణ్డీవ= కోపస్వభావురాలైన ఊర్వశివలె, లక్ష్యతే= కనబడుచున్నది.

యథా వా ఇతి : మరొక ఉదాహరణం ఎట్లనగా -

తేషామితి - భద్ర = ఓ! సౌమ్యుడా! గోపవధూవిలాససుహృదామ్ = గోపికల

విలాసాలకు మిత్రములు, రాధారహఃసాక్షిణామ్ =రాధయొక్క రహస్యానికి సాక్షులూ అయిన, కలిన్దశైలతనయాతీరే - యమునాతీరమునందున్న, తేషామ్ = ఆ, లతా వేశ్మనామ్ = లతాగృహాలకు, క్షేమమ్ = క్షేమమా? అధునా = ఇప్పుడు, స్మరతల్పకల్పన మృదుచ్ఛేదోపయోగే = మన్మథశయ్యానిర్మాణంకొరకు, మృదువుగా త్రుంచడం అనే ఉపయోగం, విచ్ఛిన్నే = ఆగిపోయిన దగుచుండగా, తే పల్లవాః = ఆ చిగుళ్లు, విగలన్నీలత్విషః = పోతూన్న నీలకాంతి గలవై, జరఠీభవన్తి = ముదిరి పోతున్నాయి అని, జానే = అనుకొంటున్నాను.

ఇత్యేవమాదీతి - ఈ మొదలైన విషయంలో అచేతనవస్తువులకే వాక్యార్థత్వం ఉన్నాకూడ చేతనవస్తువుల వృత్తాంతాన్ని చేర్చడం ఉండనే ఉంది.

లోచనం

తరఙ్గేతి - తరఙ్గా ఏవ భ్రూభఙ్గాః యస్యాః. వికర్షన్తీ విలమ్బమానం బలాత్ ఆక్షిపన్తీ. వసనమ్ అంశుకమ్. ప్రియతమావలమ్బననిషేధాయేతిభావః. బహుశః యత్ స్ఖలితం యే అపరాధాః తేన అభిసంధాయ హృదయేన ఏకీకృత్య, అసహమానా మానినీత్యర్థః, అథ చ మద్వియోగపశ్చాత్తాపాస హిష్ణుః తాపశాన్తయే నదీభావం గతేతి.

బాలానందిని

తరఙ్గేతి - తరంగాలే కనుబొమ్మల విరుపులు ఎవతెకో ఆమె. వికర్షన్తీ = వ్రేలాడుచున్నదానిని బలాత్కారంగా లాగికొంటూన్నది, వసనమ్ = వస్త్రమును, ప్రియతముడు పట్టుకొనకుండా నిషేధించడానికి అని భావం. అనేకపర్యాయాలు ఏ స్ఖలితమ్ = అపరాధాలు జరిగినవో, వాటిని, అభిసంధాయ = హృదయంలో ప్రోగుచేసికొని, (అన్నింటినీ స్మరిస్తూ), అసహ(మా)నా= మానవంతురాలు. మరియు నా వియోగంవల్ల కలిగిన పశ్చాత్తాపాన్ని సహించజాలనిదై ఆ తాపం శాంతించడానికి నదీత్వాన్ని పొందినది అని భావం.

లోచనం

తన్వీతి :- వియోగకృశాప్యనుతప్తా చాభరణాని త్యజతి. స్వకాలః విసన్తగ్రీష్మప్రాయః ఉపాయచిన్తనార్థం మౌనమ్. కిమితి పాదపతితమపి దయితమ్ అవధూతవత్యహమ్ ఇతి చ చిన్తయా మౌనమ్. చణ్డీ కోపనా. ఏతౌ శ్లోకౌ నదీలతావర్ణన పరౌ తాత్పర్యేణ పురూరవసః ఉన్మాదాక్రాన్తస్యోక్తిరూపౌ.

బాలానందిని

తన్వీతి - వియోగంచేత కృశించినది, పశ్చాత్తాపం చెందినదీ కూడ అయినది ఆభరణాలను విడిచివేయును. స్వకాలః = వసంతగ్రీష్మాల వంటి కాలం. చిన్తామౌనమ్ అనగా ఉపాయాన్ని ఆలోచించడంకొరకు మౌనం; పాదాలమీద పడినా కూడ ప్రియుణ్ణి ఎందుకు తిరస్కరించానా అనే చింతచేత మౌనం అని అర్థాలు. చణ్డీ=కోపస్వభావం గలది. తాత్పర్యంచేత (ప్రధానంగా) నదీలతావర్ణనపరాలైన ఈ రెండు శ్లోకాలు ఉన్మాదాక్రాంతుడైన పురూరవుడు పలికినవి.

లోచనం

తేషామితి - హేభద్ర! తేషామితి, యే మమైవ హృదయే స్థితాః తేషామ్. గోపవధూనాం గోపీనాం యే విలాససుహృదః నర్మసచివాః తేషామ్. ప్రచ్ఛన్నానురాగిణీనాం హి నాన్యో నర్మసుహృద్భవతి. రాధాయాశ్చ సాతిశయం ప్రేమస్థానమిత్యాహ-రాధాసంభోగానాం సాక్షాత్ యే ద్రష్టారః. కలిన్దశైలతనయా యమునా, తస్యాస్తీరే లతాగృహాణాం క్షేమం కుశలమ్ ఇతి కాక్వా ప్రశ్నః. ఏవం తం పృష్ట్వా గోపదర్శనప్రబుద్ధసంస్కారః ఆలమ్బనోద్దీపన విభావస్మరణాత్ ప్రబుద్ధరతిభావమ్, ఆత్మగతమ్, ఔత్సుక్యగర్భమ్ ఆహ ద్వారకాగతో భగవాన్ కృష్ణః- స్మరతల్పస్య మదనశయ్యాయాః కల్పనార్థం మృదు సుకుమారం కృత్వా యః ఛేదః త్రోటనం స ఏవ ఉపయోగః సాఫల్యమ్. అథచ స్మరతల్పే యత్ కల్పనం క్లుప్తిః స ఏవ సుకుమారః ఉత్కృష్టః ఛేదోపయోగః త్రోటనఫలమ్, తస్మిన్ విచ్ఛిన్నే; మయి (అనాసన్నే) కా స్మరతల్పకల్పనా ఇతి భావః. అత ఏవ పరస్పరానురాగనిశ్చయగర్భమేవాహ-తే జానే ఇతి. వాక్యార్థస్యాత్ర కర్మత్వమ్. అధునా జరఠీభవన్తీతి. మయి తు సంనిహితే అనవరతకథితోపయోగాత్ న ఏతే జరాజీర్ణతాఖిలీకారం కదాచిదవాప్నువన్తీతి భావః. విగలన్తి నీలా త్విట్ యేషామ్ ఇత్యనేన కతిపయకాలప్రోషితస్యాపి ఔత్సుక్యనిర్భరత్వం ధ్వనితమ్. ఏవమ్ ఆత్మగతేయ ముక్తిః, యది వా గోపం ప్రత్యేవ సంప్రధారణోక్తిః. బహుభిరుదాహరణైః మహతో భూయసః ప్రబన్ధస్య ఇతి యదుక్తం తత్సూచితమ్.

బాలానందిని

తేషామితి. ఓ భద్రుడా! తేషామ్ = ఏవి ఇంకా నా హృదయంలో మెదులుతూనే ఉన్నాయో అవి. గోపవధూనామ్ = గోపికలయొక్క (కు), ఏవి విలాససుహృదః = నర్మసచివులో (ప్రేమకు సంబంధించిన రహస్యాలు కూడ చెప్పుకోవడానికి తగి ఉండి, ఆ వ్యవహారంలో సహాయం చేసే వాళ్లు నర్మసచివులు) రహస్యమైన అనురాగం గల స్త్రీలకి మరొక నర్మసచివుడు ఉండడానికి అవకాశం లేదు. అది రాధకు అత్యంతప్రేమపాత్రయైన స్థానం అని చెపుతున్నాడు- ఏవి ప్రత్యక్షంగా రాధాసంభోగం చూచాయో. కలిన్దశైలతనయా = యమున. దాని తీరంమీద ఉన్న లతాగృహాలకి, క్షేమమ్ = కుశలమా? కాకుస్వరంచేత ఇది ప్రశ్న. ద్వారకలో ఉన్న భగవంతుడైన కృష్ణుడు వానిని ఇలా ప్రశ్నించి, ఆ గోపాలుణ్ణి చూడడంచేత ప్రబుద్ధమైన సంస్కారం కలవాడై, ఆలంబనోద్దీపనవిభావాల స్మరణంచేత రతిభావం ప్రబుద్ధం కాగా, తనలో తానే, ఔత్సుక్యగర్భంగా అంటున్నాడు - స్మరతల్పస్య = మదనశయ్యయొక్క కల్పనంకొరకు, మృదు = సుకుమారంగా, ఏ, ఛేదః = త్రుంచడం గలదో అదే, ఉపయోగః = సఫలత్వం, ఇంకా (మరొక అర్థం) స్మరతల్పంమీద ఏ, కల్పనమ్ = అమర్చడం కలదో, అదే, సుకుమారః = ఉత్కృష్టమైన, ఛేదోపయోగః = త్రుంచడానికి ఫలం, అది విచ్ఛిన్నమైన దగుచుండగా? నేను అక్కడ లేనప్పుడు స్మరతల్పకల్పన ఏ ముంటుంది? అని భావం. అందువల్లనే పరస్పరానురాగనిశ్చయపూర్వకంగా నమ్మకంతో, తే జానే అంటున్నాడు. జానే (తెలుసుకొనుచున్నాను) అనే క్రియలో వాక్యార్థం కర్మ. పల్లవాలు ముదిరిపోతున్నాయి అనే విషయం ఎరుగుదును అని అర్థం. అధునా జరఠీ భవన్తీతి :- నేను అక్కడ ఉంటే నిరంతరమూ పైన చెప్పిన పనిలో ఉపయోగించడం వల్ల ఈ పల్లవాలు జరాజీర్ణములై పోవడం అనే అనాదరానికి గురి కావు అని భావం. జారిపోతూన్న నీలమైన కాంతి కలవి అని చెప్పడంచేత ఎంతో కాలం క్రితమే గోకులం విడచి ప్రవాసం వెళ్లినా కూడ ఆ కృష్ణుని కున్న ఔత్సుక్యనిర్భరత్వం (తీవ్రమైన బెంగ) ధ్వనించబడుతున్నది. ఈ విధంగా ఇది తనలోనే అనుకొన్న మాట కావచ్చు, లేదా గోపాలునితో విషయం తెలుసుకోవాలని పలికిన మాట కావచ్చు. బహుభిరితి :- ఈ విధంగా చాలా ఉదాహరణలు చూపి మహతః ప్రబన్ధస్య = అత్యధికమైన ప్రబంధానికి (నీరసత్వం చెప్పినట్లు అవుతుంది) అని ఏదైతే చెప్పబడిందో ఆ విషయం సూచించబడింది.

## ధ్వన్యాలోకం

అథ యత్ర చేతనవస్తువృత్తాన్తయోజనాస్తి తత్ర రసాదిః అలంకారః; తదేవం సతి ఉపమాదయో నిర్విషయాః ప్రవిరలవిషయా వా స్యుః. యస్మాత్ నాస్త్యేవ అసౌ అచేతనవస్తువృత్తాన్తః యత్ర చేతన వస్తువృత్తాన్తయోజనా నాస్తి? అన్తతో విభావత్వేన. తస్మాదఙ్గత్వేన న రసాదీనామలంకారతా. యః పునః అఙ్గీ రసః భావో వా సర్వాకారమలం కార్యః స ధ్వనేరాత్మేతి.

### బాలానందిని

చేతనవస్తువర్ణనం ఉన్నచోట రసవదాద్యలంకారాలను అంగీకరించవచ్చు. ఉపమాద్యలంకారాలకి అచేతనవస్తువర్ణనస్థానాలలో అవకాశం ఉంటుంది అని పూర్వ పక్షి చెప్పగా అచేతనవస్తువర్ణనస్థలాలలో కూడ చేతనవృత్తాంతారోపం ఉంటుంది. అని సిద్ధాంతి సమాధానం చెప్పాడు. అలాంటి చేతనవృత్తాంతారోపం ఉన్నా కూడ అచేతన వృత్తాంతం వాక్యార్థం అయిన చోట రసవదలంకారం అంగీకరించవలసిన పనిలేదు అని పూర్వపక్షి చెప్పగా, అలా చెప్పే పక్షంలో చాలా స్థలాలు రసరహితాలని చెప్పవలసి వస్తుంది, అది యుక్తం కాదు అని సూచిస్తూ అచేతనవృత్తాంతం వాక్యార్థంగా ఉండి చేతనవృత్తాంతారోపం ఉన్న మూడు ఉదాహరణలు చూపి ఇవన్నీ నీరసాలు అనకూడదు కదా అనే భావం వ్యక్తీకరిస్తాడు సిద్ధాంతి.

అప్పుడు పూర్వపక్షి - సరే, ఇలాంటివి నీరసాలు అనడం యుక్తం కాదని మీరు అంటున్నారు గాన ఇక్కడ కూడా రసవదలంకారం అంగీకరిస్తాం, అని చెప్పే పక్షంలో (సిద్ధాంతి) సమాధానం చెపుతున్నాడు - అథేతి. ఎక్కడైతే చేతనవస్తువృత్తాంతయోజన ఉంటుందో అక్కడ కూడా రసాద్యలంకారమే అని చెప్పే పక్షంలో కూడా ఉపమాదులకు స్థానం లేకుండా పోతుంది; లేదా అతివిరళమైన స్థానం ఉంటుంది. ఎందువల్లననగా - చేతనవస్తువృత్తాంతయోజన ఉండని అచేతనవస్తువృత్తాంతమే ఉండదు. చివరికి అచేతనవస్తువుల్ని విభావంగా నైనా ఉపయోగించడం జరుగుతుంది. అందుచేత చేతన వృత్తాంతాలు ఉన్న చోటా, అచేతనవృత్తాంతాలు వాక్యార్థం అయిన అన్ని చోట్లా కూడ రసవదలంకారమే అంగీకరించవలసి ఉంటే ఉపమాద్యలంకారాల స్వతంత్రస్థితికి అవకాశం ఉండదు కదా అని భావం. అందుచేత (చేతనవృత్తాంతం వాక్యార్థమా,

అచేతన వృత్తాంతం వాక్యార్థమా అనే ప్రశ్నతో సంబంధంలేకుండా) రసాదులు దేనికైనా అంగం అయినప్పుడు అవి అలంకారాలు. రసంకాని భావంకాని అంగి అయి ఉండి అన్ని విధాలా అలంకార్యంగా ఉన్నప్పుడు అది ధ్వనికావ్యంయొక్క ఆత్మ అవుతుంది.

లోచనం

అథేత్యాది - నీరసత్వమత్ర మా భూ దిత్యభిప్రాయేణేతి శేషః నను యత్ర చేతనవృత్తస్య సర్వథా నానుప్రవేశః స ఉపమాదేర్విషయః భవిష్యతి ఇత్యాశఙ్క్యాహ - యస్మాదిత్యాది. అన్తత ఇతి. స్తమ్భపులకాద్యచేతనమపి వర్ణ్యమానమ్ అనుభావత్వాత్ చేతనమ్ ఆక్షిపత్యేవ తావత్; కిమత్రోచ్యతే? అతిజడోఽపి చన్ద్రోద్యానప్రభృతిః స్వవిశ్రాన్తోఽపి వర్ణ్యమానః అవశ్యం చిత్తవృత్తి విభావతాం త్యక్త్వా కావ్యే అనాఖ్యేయ ఏవ స్యాత్; శాస్త్రేతిహాసయోరపి వా, ఏవం పరమతం దూషయిత్వా స్వమతమేవ ప్రత్యామ్నాయేన ఉపసంహరతి - తస్మాదితి. యతః పరోక్తః విషయవిభాగః న యుక్తః ఇత్యర్థః. భావో వా ఇతి వాగ్రహణాత్ తదాభాసప్రశమాదయ. సర్వాకారమితి క్రియావిశేషణమ్. తేన సర్వప్రకారమిత్యర్థః. అలంకార్యః ఇతి. అత ఏవ నాలంకార ఇతి భావః. 5

బాలానందిని

అథేత్యాది. పైన ఉదాహరించిన శ్లోకాలవంటివాటిలో నీరసత్వం లేకుండా ఉండడం కోసం అనే అభిప్రాయంచేత అని అధ్యాహారం. అనగా ఈ కారణంచేత వీటిలో రసవదాద్యలంకారాలు అంగీకరించవచ్చును అని భావం. నను ఇతి - ఎక్కడైతే చేతనవృత్తానికి అనుప్రవేశం లేదో అక్కడ ఉపమాదులకు అనుప్రవేశం ఉంటుంది. కదా అని ఆశంకించుకొని యస్మాదిత్యాదికం చెపుతున్నాడు.

అన్తతః ఇతి- 'స్తమ్భపులాకాది' అని పాఠం అయి ఉంటుంది. 'స్తమ్బం' అనగా ఒక రకం గడ్డి, వరివెన్ను అని అర్థాలు. 'పులాక' అనగా పొల్లు. వర్ణింపబడే స్తంబం, పులాకం మొదలైన అచేతనం కూడ అనుభావం అవడంవల్ల చేతనాన్ని ఆక్షేపిస్తుంది (ఊహింపచేస్తుంది). ఈ విషయంలో ఏం చెప్పాలి! అతిజడమైన చంద్రోద్యానాదికం స్వవిశ్రాంతంగానే, అనగా దేనికీ సంబంధించినట్లు కాక స్వతంత్రరూపంగానే వర్ణించబడినా కూడ, అది (ఏదో ఒక) చిత్తవృత్తికి విభావం కాకపోతే కావ్యంలో చెప్పతగనిదే అవుతుంది. (కావ్యంలోనే కాదు) శాస్త్రేతిహాసాల్లో అయినా ఇంతే. ఏవమితి- ఈ విధంగా పరుల

మతాన్ని దూషించి తన మతాన్నే తిరిగి మరొకసారి ప్రతిపాదిస్తూ తస్మాదిత్యాదికంచేత ఉపసంహరిస్తున్నాడు. తస్మాత్ అనగా పరులు చెప్పిన విషయవిభాగం యుక్తంగా లేదు కాబట్టి అని అర్థం. భావే వా అని వాశబ్దాన్ని గ్రహించడంచేత భావాభాస భావప్రశమాదులు గ్రహించబడతాయి. సర్వాకారమ్ అనేది క్రియావిశేషణం. అన్ని విధాలా అని అర్థం. అలంకార్య ఇతి:- అందుచేతనే ఇది అలంకారం కాదు అని భావం.

## ధ్వన్యాలోకం

కించ -

కా. తమర్థమవలమ్బన్తే యేఽఙ్గినం తే గుణాః స్మృతాః,

అఙ్గాశ్రితాస్త్వలంకారాః మన్తవ్యాః కటకాదివత్. 6.

యే తమర్థం రసాదిలక్షణమఙ్గినం సన్తమవలమ్బన్తే తే గుణాః శౌర్యాదివత్. వాచ్యవాచకలక్షణాని అఙ్గాని. యే పునః తదాశ్రితాః తే అలఙ్కారాః మన్తవ్యాః కటకాదివత్.

## బాలానందిని

కించేతి - ఇంకా మరేమనగా -

తమితి:- యే = ఏవి, అఙ్గినమ్ = అంగి అయిన, తమ్ అర్థమ్ = ఆ అర్థాన్ని, అవలమ్బన్తే = ఆశ్రయించి ఉంటాయో, తే = అవి, గుణాః స్మృతాః = గుణాలని చెప్పబడ్డాయి. కటకాదివత్ = కటకాదుల వలె, అఙ్గాశ్రితాః తు=అవయవాలను ఆశ్రయించిన వైతే, అలంకారాః = అలంకారాలుగా, మన్తవ్యాః = తెలియదగినవి.

యే ఇతి:- అంగిగా ఉన్న రసాదిరూపమైన ఆ అర్థాన్ని ఏవి ఆశ్రయించి ఉంటాయో అవి శౌర్యాదులవలె, గుణాలు. వాచ్యవాచకరూపములైనవి అంగాలు. ఏవి వాటిని ఆశ్రయించి ఉంటాయో అవి, కటకాదులవలె, అలంకారాలుగా తెలియదగినవి.

## లోచనం

అలంకార్యవ్యతిరిక్తశ్చ అలంకారః అభ్యుపగన్తవ్యః, లోకే తథా సిద్ధత్వాత్. యథా గుణివ్యతిరిక్తో గుణః. గుణాలంకారవ్యవహారశ్చ గుణిన్యలంకార్యే చ సతి యుక్తః. స చ అస్మత్పక్ష ఏవ ఉపపన్నః ఇత్యభిప్రాయద్వయేనాహ -

కించేత్యాది. న కేవలమేతావదుక్తిజాతం రసస్యాఙ్గిత్వే, యావదన్యదపీతి సముచ్చయార్థః. కారికాప్యభిప్రాయద్వయేనైన యోజ్యా. కేవలం ప్రథమాభిప్రాయే ప్రథమం కారికార్థం దృష్టాన్తాభిప్రాయేణ వ్యాఖ్యేయమ్. ఏవం వృత్తి గ్రన్థోఽపి యోజ్యః 6.

బాలానందిని

అలంకార్యేతి:- గుణం గుణి (గుణంకలది) కంటె ఎలా భిన్నమైనదో అదే విధంగా అలంకారం అలంకార్యంకంటె భిన్నం అని అంగీకరించాలి. లోకంలో ఆ విధంగానే ప్రసిద్ధి ఉంది కదా? గుణం, అలంకారం అనే వ్యవహారం గుణి, అలంకార్యమూ ఉన్నప్పుడే యుక్తంగా ఉంటుంది. అది మా పక్షంలోనే ఉపపన్నం, యుక్తియుక్తం అవుతుంది అనే అభిప్రాయంతో కించేత్యాదికం చెపుతున్నాడు. రసం అంగి అనడానికి ఇంతవరకు పైన చూపిన యుక్తుల సముదాయమే కాదు; మరొక కారణం లేదా యుక్తి కూడా ఉంది అని కించ అనే సముచ్చయానికి (మరియు అనడానికి) అర్థం. కారికకి అర్థం ఈ రెండు అభిప్రాయాలకు అనుగుణంగా చెప్పుకోవాలి. మొదటి అభిప్రాయం మాత్రమే అయితే మొదటి కారికార్థాన్ని దృష్టాంతంగా చూపబడింది. అన్నట్లుగా వ్యాఖ్యానించాలి. వృత్తిగ్రంథం కూడా ఈ విధంగానే అన్వయించాలి.

వివరణ:- తమర్థమవలమ్బన్తే ఇత్యాది పూర్వార్థాన్ని మొదటి అభిప్రాయానికి, "అలంకారంకంటె భిన్నంగా అలంకార్యాన్ని అంగీకరించాలి" అనేదానికి దృష్టాంతంగా చెప్పినట్లు వ్యాఖ్యానించాలి. అంగియైన ఆ రసాన్ని ఆశ్రయించినవి గుణాలని చెప్పబడి నట్లు అంగాలను ఆశ్రయించినవి అలంకారాలని చెప్పాలి అని వ్యాఖ్యానించాలి అని భావం. వృత్తిగ్రంథానికి కూడా ఇదే విధంగా "శౌర్యాదులవలె గుణాలు అంగియైన రసాదిని ఆశ్రయించినట్లు అలంకారాలు, కటకాదుల వలె, శబ్దార్థరూపాలైన అంగాలను ఆశ్రయించి ఉంటాయి అని అర్థం చెప్పుకోవాలి (ఇలా చెప్పడంలో విశేషం ఏమిటో తెలియదు).

ధ్వన్యాలోకం

**తథాచ -**

కా. శృఙ్గార ఏవ మధురః సర్వప్రహ్లాదనో రసః.
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి. 7.

శృఙ్గార ఏవ రసాన్తరాపేక్షయా మధురః; ప్రహ్లాదహేతుత్వాత్. తత్ప్రకాశనపరశ బ్దార్థమయతయా కావ్యస్య స మాధుర్యలక్షణో గుణః శ్రవ్యత్వం పునః ఓజసోఽపి సాధారణమితి.

బాలానందిని

తథా చ = ఆ విధంగా,

శృఙ్గార ఇతి:- శృఙ్గారః ఏవ=శృంగారమే, పరః ప్రహ్లాదనః = అత్యధికంగా ఆహ్లాదాన్ని కలిగించే, మధురః రసః = మధురమైన రసం. మాధుర్యమ్ = మాధుర్యం, తన్మయమ్ = శృంగారమయమైన, కావ్యమ్ = కావ్యాన్ని, ఆశ్రిత్య = ఆశ్రయించి, ప్రతితిష్ఠతి = ఉండును.

శృఙ్గార ఏవేతి:- శృంగారమే మధురమైనది. ఎందుచేత ననగా ఇతరరసాలకంటె ఇది ఆనందానికి హేతువు. మాధుర్యం అనే ఆ గుణాన్ని ప్రకాశింపచేసేవి శబ్దార్థాలు. అందుచేత అది అలాంటి శబ్దార్థాలు గల కావ్యంలో ఉంటుంది. శ్రవ్యత్వం అయితే ఓజస్సులో కూడా సాధారణమే; అనగా మాధుర్యంలో వలె ఓజస్సులో కూడా ఉంటుంది. అందుచేత ఉభయసాధారణం అని అర్థం.

లోచనం

నను శబ్దార్థయోః మాధుర్యాదయో గుణాః, తత్ కథముక్తం రసాదికమఙ్గినం గుణా ఆశ్రితాః ఇతి ఆశఙ్క్య ఆహ - తథా చేత్యాదినా. తేన వక్ష్యమాణేన బుద్ధిస్థేన పరిహారప్రకారేణ ఉపపద్యతే చైతదిత్యర్థః. శృఙ్గార ఏవేతి- మధురః ఇత్యత్ర హేతుమాహ - పరః ప్రహ్లాదనః ఇతి. రతౌ హి సమస్త దేవతిర్యఙ్నరాదిజాతిష్వవిచ్ఛిన్నైవ వాసనా ఆస్త ఇతి న కశ్చిత్ తత్ర తాదృక్ యః న హృదయసంవాదమయః, యతేరపి హి తచ్చమత్కారోఽస్త్యేవ. అత ఏవ మధుర ఇత్యుక్తమ్. మధురో హి శర్కరాదిరసః వివేకినః అవివేకినో వా, స్వస్థస్య ఆతురస్య వా ఝటితి రసనానిపతితస్తావదభిలషణీయ ఏవ భవతి. తన్మయమితి. సః శృఙ్గారః ఆత్మత్వేన ప్రకృతో యత్ర వ్యఙ్గ్యతయా. కావ్యమితి శబ్దార్థావిత్యర్థః. ప్రతితిష్ఠతీతి. ప్రతిష్ఠాం గచ్ఛతీతి యావత్.

ఏతదుక్తం భవతి- వస్తుతః మాధుర్యం నామ శృఙ్గారాదేః రసస్యైవ గుణః. తన్మధురరసాభివ్యఞ్జకయోః శబ్దార్థయోః ఉపచరితమ్; మధురశృఙ్గారరసాభివ్యక్తి సమర్థతా శబ్దార్థయోర్మాధుర్యమితి హి తల్లక్షణమ్. తస్మాత్ యుక్తముక్తం తమర్థమిత్యాది. కారికార్థం వృత్త్యాహ - శృఙ్గార ఇతి. నను "శ్రవ్యం నాతిసమస్తార్థశబ్దం మధురమిష్యతే' (భామహకావ్యా 2.2.3) ఇతి మాధుర్యస్య లక్షణమ్. నేత్యాహ- శ్రవ్యత్వమితి సర్వం లక్షణము పలక్షితమ్. ఓజసోఽపీతి- యో యః శస్త్రం ఇత్యత్ర హి శ్రవ్యత్వమ్ అసమస్తత్వం చాస్త్యేవేతి భావః ।

బాలానందిని

నన్వితి - మాధుర్యాదిగుణాలు శబ్దార్థాలలో ఉంటాయి కదా? గుణాలు అంగి అయిన రసాదికాన్ని ఆశ్రయించి ఉంటాయని ఎలా చెపుతున్నావు అని ఆశంకించుకొని తథా చేత్యాదికం చెపుతున్నాడు. నా బుద్ధిలో ఉన్న చెప్పబడబోయే పరిహారప్రకారంచేత ఇలా చెప్పినది ఉపపన్నమే (యుక్తిసంగతమే) అని అర్థం. శృఙ్గార ఏవేతి - మధురం అని చెప్పడానికి హేతువును చెప్పుతున్నాడు - పరః ప్రహ్లాదనః ఇతి - దేవతలు, తిర్యగ్జంతువులు మానవులు మొదలైన సమస్తజాతులలోనూ కూడ రతియందు వాసన అవిచ్ఛిన్నంగా ఉంటుంది. అందుచేత దానివిషయంలో హృదయసంవాదం లేనివాడు ఒక్కడు కూడ ఉండడు. చివరికి సంన్యాసికి కూడ దాని చమత్కారం తప్పక ఉంటుంది. అందువల్లనే మధురం అని చెప్పబడింది. మధురమైన పంచదారరసం వంటి రసం, నాలుకమీద పడగానే, వివేకవంతునికైనా, అవివేకికైనా, స్వస్థునికైనా, రోగికైనా వెంటనే అభిలషించ తగినదిగా అవుతుంది. తన్మయమితి -ఆ శృంగారం దేనియందు, వ్యంగ్యంగా, ఆత్మగా, ప్రకృతమై, అనగా అధికంగా ప్రస్తుతమై, ఉంటుందో అది తన్మయం ("ఇక్కడ తత్ప్రకృతవచనే మయట్ (5.4.21) అనే సూత్రంచేత మయట్ ప్రత్యయం అని సూచించడానికి ప్రకృతః అన్నాడు). కావ్య మితి - శబ్దార్థములు అని అర్థం. ప్రతితిష్ఠతీతి - ప్రతిష్ఠను పొందుతుంది అని భావం.

ఏతదుక్తం భవతీతి:- ఈ చెప్పిన దాని అభిప్రాయం ఇది - నిజానికి మధుర్యం అనేది శృంగారాదిరసంయొక్క గుణమే. అది మధురరసాన్ని వ్యంజింపచేసే శబ్దార్థాల మీద ఆరోపించబడింది. శబ్దార్థాల మాధుర్యం అనగా మధురమైన శృంగారరసాన్ని

వ్యక్తం చేసే సామర్థ్యం అని లక్షణం కదా? అందువల్ల "తమర్థమ్" ఇత్యాది కారికలో గుణాలు రసాశ్రయాలు అని చెప్పినది యుక్తమే. కారికయొక్క అర్థాన్ని శృఙ్గారః ఇత్యాదివృత్తిలో వివరిస్తున్నాడు- నన్వితి. శ్రవ్యం 'నాతిసమస్తార్థశబ్దం మధురమిష్యతే' "అంతగా సమాసాలు నేని అర్థశబ్దాలు గలదై శ్రవ్యంగా ఉండేది మధురం అని చెప్పబడుతుంది". అని కదా మాధుర్యలక్షణం? కాదని చెపుతున్నాడు - శ్రవ్యత్వమితి. సర్వమితి :- (భామహుడు చెప్పిన) శ్రవ్యమిత్యాదిలక్షణం ఉపలక్షణయా (కేవలం గుర్తుగా దీనిలో కూడ నాతిసమస్తార్థశబ్దత్వం ఉంటుంది అని అభిప్రాయంతో) చెప్పినదే. ఓజసోఽపీతి- "యో యః శస్త్రం బిభర్తి ఇత్యాదులలో కూడ శ్రవ్యత్వం, అసమస్తత్వం కూడా ఉన్నాయి అని భావం.7.

## ధ్వన్యాలోకం

కా. శృఙ్గారే విప్రలమ్భాఖ్యే కరుణే చ ప్రకర్షవత్,
మాధుర్యమార్ద్రతాం యాతి యతస్తత్రాధికం మనః. 8

విప్రలమ్భశృఙ్గారకరుణయోస్తు మాధుర్యమేవ ప్రకర్షవత్ సహృదయహృదయావర్జనాతిశయనిమిత్తత్వాదితి.

### బాలానందిని

శృఙ్గారే ఇతి :- విప్రలమ్భాఖ్యే శృఙ్గారే = విప్రలంభం అనే పేరు గల శృంగారమునందు, కరుణే చ = కరుణయందు, మాధుర్యమ్ = మాధుర్యం, ప్రకర్షవత్ = ఆధిక్యం గలది, యతః = ఎందువలన అనగా, తత్ర = వాటిలో, మనః = మనస్సు, అధికమ్ = అధికంగా, ఆర్ద్రతామ్ = ఆర్ద్రతను, యాతి = పొందుతుంది.

విప్రలమ్భేతి:- విప్రలంభశృంగార - కరుణరసాలలో అయితే మాధుర్యమే ప్రకర్ష కలది అయి ఉంటుంది. ఎందువల్ల ననగా సహృదయుల హృదయాలను అధికంగా ఆకర్షించడానికి అది నిమిత్తంగా ఉంటుంది.

### లోచనం

సమ్భోగశృఙ్గారాత్ మధురతరః విప్రలమ్భః, తతోఽపి మధురతమః కరుణః ఇతి తదభివ్యఞ్జనకౌశలం శబ్దార్థయోః మధురతరత్వం, మధురతమత్వం చ ఇత్యభిప్రాయేణాహ - శృఙ్గార ఇత్యాది. కరుణే చేతి చ

శబ్దః క్రమమాహ. ప్రకర్షవదితి. ఉత్తరోత్తరం తరతమయోగేన ఇతి భావః. **ఆర్ద్రతామితి**- సహృదయస్య చేతః స్వాభావికమనావిష్టత్వాత్మకం కాఠిన్యం, క్రోధాదిదీప్తరూపత్వం, విస్మయహాసాదిరాగిత్వం చ త్యజతీత్యర్థః. **అధికమ్**:- ఇతి- క్రమేణేత్యాశయః. తేన కరుణేఽపి సర్వథైవ చిత్తం ద్రవతీత్యుక్తం భవతి. నను కరుణేఽపి యది మధురిమాస్తి తర్హి పూర్వకారికాయాం శృఙ్గార ఏవ ఇత్యేవకారః కిమర్థః? ఉచ్యతే - నానేన రసాన్తరం వ్యవచ్ఛిద్యతే అపితు ఆత్మభూతస్య రసస్యైవ పరమార్థతో గుణాః మాధుర్యాదయః, ఉపచారేణ తు శబ్దార్థయోరిత్యేవకారేణ ద్యోత్యతే. వృత్త్యార్థమాహ- విప్రలమ్భేతి.

బాలానందిని

సంభోగేతి - విప్రలంభశృగారం సంభోగశృంగారం కంటె మధురతరం; దానికంటె మధురతమం కరుణ. అందుచేత దానిని వ్యక్తీకరించడంలోని నేర్పె శబ్దార్థాలలో ఉన్న మధురతరత్వ - మధురతమత్వాలు అనే అభిప్రాయంతో శృఙ్గార ఇత్యాదికం చెపుతున్నాడు. కరుణే చ అన్నప్పుడు 'చ' శబ్దం క్రమాన్ని బోధిస్తుంది. ప్రకర్షవదితి. ఉత్తరోత్తరం తారతమ్యభావంతో అని భావం. (వెనుకటిదానికంటె రెండవదానిలో అధికంగా ఉంటుంది అని భావం) **ఆర్ద్రతామితి** - సహృదయుల చిత్తం 'ఆవేశం లేకపోవడం' అనే స్వాభావికంగా ఉన్న కాఠిన్యాన్ని, క్రోధాదులవల్ల కలిగే దీప్తత్వాన్నీ, విస్మయహాసాదులలో ఉండే రాగిత్వాన్ని, అనగా వాటిచేత పూయబడి విక్షిప్తం అవడాన్ని విడిచివేస్తుంది అని అర్థం. **అధికమితి** :- క్రమంగా అధికం అని భావం. **తేనేతి** :- అందుచేత కరుణలో కూడ చిత్తం పూర్తిగా ద్రవిస్తుంది అని చెప్పినట్లయింది .నన్వితి - కరుణలో కూడా మాధుర్యం ఉంటే వెనుకటి కారికలో "శృఙ్గార ఏవ" అని 'ఏవ' శబ్దం ఎందువల్ల ప్రయోగించబడింది? సమాధానం చెప్పబడుతుంది - దీనిచేత (ఏవకారంచేత) ఇతరరసం వ్యవచ్ఛిన్నం చేయబడడంలేదు అనగా ఇక్కడ ఇతరరసాల్ని పరిహరించడం ఏవశబ్దానికి అర్థం కాదు. మరేమనగా - నిజానికి మాధుర్యాదిగుణాలు ఆత్మయైన రసానికి మాత్రమే సంబంధించినవి; కాని ఉపచారం చేత (ఆరోపణచేత) శబ్దార్థాలలో ఉన్నట్లు చెప్పబడుతున్నాయి అని ఏవకారంచేత సూచించబడుతున్నది.

వృత్త్యా ఇతి :- కారిక అర్థాన్ని విప్రలమ్భేత్యాదివృత్తిచేత వివరిస్తున్నాడు.

ధ్వన్యాలోకం

కా. రౌద్రాదయో రసా దీప్త్యా లక్ష్యన్తే కావ్యవర్తినః,

తద్వ్యక్తిహేతూ శబ్దార్థావాశ్రిత్యౌజో వ్యవస్థితమ్. 9

రౌద్రాదయః రసాః పరాం దీప్తిమ్ ఉజ్జ్వలతాం జనయన్తీతి లక్షణయా త ఏవ దీప్తి రిత్యుచ్యతే. తత్ప్రకాశనపరః శబ్దః దీర్ఘసమాస రచనాలంకృతం వాక్యమ్. యథా -

శ్లో. చఞ్చద్భుజభ్రమితచణ్డగదాభిఘాత

సంచూర్ణితోరుయుగలస్య సుయోధనస్య,

స్త్యానావబద్ధఘనశోణితశోణపాణి

రుత్తంసయిష్యతి కచాంస్తవ దేవి భీమః. (26)

తత్ప్రకాశనపరశ్చార్థోऽనపేక్షితదీర్ఘసమాసరచనః ప్రసన్న వాచకాభిధేయః. యథా -

శ్లో. యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః పాణ్డవీనాం చమూనాం

యోయః పాఞ్చాలగోత్రే శిశురధికవయా గర్భశయ్యాం గతో వా,

యో యస్తత్కర్మసాక్షీ చరతి మయి రణే యశ్చ యశ్చ ప్రతీపః

క్రోధాన్ధస్తస్య తస్య స్వయమపి జగతామన్తకస్యాన్తకోऽహమ్. (27)

ఇత్యాదౌ ద్వయోరోజస్త్వమ్.

బాలానందిని

రౌద్రేతి - కావ్యవర్తినః = కావ్యంలో ఉన్న, రౌద్రాదయః రసాః= రౌద్రాది రసాలు, దీప్త్యా = దీప్తిచేత, లక్ష్యన్తే= గుర్తింపబడతాయి. ఓజః= ఓజోగుణం, తద్వ్యక్తిహేతూ = ఆ రౌద్రాదుల అభివ్యక్తికి హేతువులైన, శబ్దార్థౌ= శబ్దార్థాలను, ఆశ్రిత్య= ఆశ్రయించి, వ్యవస్థితమ్ =ఉన్నది.

రౌద్రేతి - రౌద్రాదిరసాలు అత్యధికమైన దీప్తిని, ఉజ్జ్వలతను కలిగిస్తాయి. అందుచేత లక్షణచేత ఆ రౌద్రాదులే దీప్తి అని చెప్పబడుతున్నది. దీర్ఘసమాసరచనచేత

అలంకృతమైన వాక్యమే వాటిని (రౌద్రాదులను) ప్రకాశింపచేసే శబ్దం. ఎట్లనగా.-

చఞ్చదితి - వేణీసంహారంలో భీముడు ద్రౌపదితో అంటూన్న మాటలివి. దేవి = ఓదేవీ! చఞ్చద్భుజభ్రమితచణ్డగదాభిఘాతసంచూర్ణితోరుయుగలస్య = కదలుతూన్న భుజాలచేత త్రిప్పబడిన, తీవ్రమైన, గదయొక్క దెబ్బచేత చూర్ణం చేయబడిన రెండు తొడలూగల, సుయోధనస్య=సుయోధనునియొక్క, స్త్యానావబద్ధఘనశోణితశోణపాణిః=చిక్కనైన, చేతిలో నిలచిన దట్టమైన రక్తంచేత ఎఱ్ఱనైన హస్తాలు కలవాడై, భీమః =భీముడు, తవ కచాన్=నీ కేశ పాశాలను, ఉత్తంసయిష్యతి= అలంకరించగలడు.

తత్ప్రకాశనేతి - దీర్ఘసమాసరచనాపేక్ష లేకుండానే ప్రసన్నమైన (స్పష్టమైన) వక్తవ్యవిషయం గల, ఆ రౌద్రాన్ని ప్రకాశింపచేయడంకొరకు ఉద్దిష్టమైన అర్థం ఎట్లనగా - యో యః ఇతి :- వేణీ సంహారంలో పితృవధవార్త విని కోపోద్దీప్తుడైన అశ్వత్థామ మాటలివి. పాణ్డవీనామ్= పాండవుల సంబంధమైన, చమూనామ్= సేనలలో, స్వభుజగురుమదః=తన భుజాల గొప్ప మదం గల, యః యః=ఎవడెవడు, శస్త్రమ్= ఆయుధాన్ని, బిభర్తి=ధరిస్తున్నాడో, పాఞ్చాలగోత్రే=పాంచాలవంశంలో, శిశుః=శిశువుగాని, అధికవయాః=అధికమైన వయస్సుకలవాడు గాని (యువకుడు లేదా వృద్ధుడు గాని), గర్భశయ్యామ్= గర్భశయ్యను, గతో వా= పొందినవాడు గాని, యః యః = ఎవడెవడైతే ఉన్నాడో, యః యః=ఎవడెవడు, తత్కర్మసాక్షీ=ఆకర్మకు (నా తండ్రిని చంపడానికి) సాక్షిగా ఉన్నాడో, మయి=నేను, రణే=యుద్ధమునందు, చరతి=సంచరించుచుండగా, యశ్చ యశ్చ=ఎవడెవడు, ప్రతీపః=అడ్డుపడతాడో, తస్య తస్య=అలాంటి ప్రతి ఒక్కనికీ,. స్వయమ్=సాక్షాత్తు, జగతామ్ అన్తకస్యాపి=జగత్తులను నశింపచేసే యమునికి కూడా, క్రోధాన్ధః=క్రోధం చేత అంధుడనైన, అహమ్=నేను, అన్తకః=సంహారకుడను.

ఇత్యాదౌ ఇతి- ఈ విధమైన వాటిలో రెండింటికీ (శబ్దార్థాలు రెండింటికీ కూడ ఓజస్సు ఉన్నది. (మొదటి శ్లోకంలో శబ్దానికి రెండవదానిలో అర్థానికి).

## లోచనం

రౌద్రేత్యాది- ఆదిశబ్దః ప్రకారే. తేన వీరాద్భుతయోరపి గ్రహణమ్. దీప్తిః ప్రతిపత్తుః హృదయే వికాసవిస్తారప్రజ్వలనస్వభావా. సా చ ముఖ్యతయా ఓజఃశబ్దవాచ్యా. తదాస్వాదమయాః రౌద్రాదయః. తయా దీప్త్యా ఆస్వాదవిశేషాత్మికయా కార్యరూపయా లక్ష్యన్తే రసాన్తరాపృథక్తయా. తేన కారణే కార్యోపచారాత్ రౌద్రాది ంవ ఓజఃశబ్దవాచ్యః. తతో లక్షితలక్షణయా

తత్ప్రకాశనపరః శబ్దః దీర్ఘసమాసరచనవాక్యరూపోఽపి దీప్తిరిత్యుచ్యతే. యథా చఞ్చత్ ఇత్యాది. తత్ప్రకాశనపరశ్చార్థః ప్రసన్నైః గమకైః వాచ్యైః అభిధీయమానః సమాసానపేక్ష్యపి దీప్తిరిత్యుచ్యతే. యథా యో యః ఇత్యాది.

బాలానందిని

రౌద్రేతి - రౌద్రాదయః అనేదానిలోని ఆదిపదం ప్రకారార్థంలో. (రౌద్రం వంటివి అని అర్థం). అందుచేత వీరాద్భుతాలు కూడా గ్రహించబడతాయి. అనగా వీటిలో కూడ దీప్తి ఉంది అని అర్థం. 'దీప్తి' అనగా ప్రతిపత్తయొక్క (గ్రహించేవానియొక్క) హృదయంలో కలిగే వికాసరూపమూ, విస్తారరూపమూ అయిన ప్రజ్వలన (జ్వలించే, మంటలు మండే) స్వభావం గల చిత్తవృత్తి. ముఖ్యంగా అది (దీప్తి) ఓజఃశబ్దంచేత బోధించబడుతుంది. దాని ఆస్వాదస్వరూపాలైన రౌద్రాదులు, ఆస్వాదవిశేషరూపమైన వాటి కార్యమైన ఆ దీప్తి చేత లక్షణావృత్తిచేత ఇతరరసాలకంటె భిన్నమైనవిగా గుర్తించ బడతాయి. (బోధించబడతాయి)

వివరణ:- ఓజఃశబ్దానికి ముఖ్యార్థం దీప్తి. రౌద్రాదులలో ఆ దీప్తియొక్క ఆస్వాదం ఉంటుంది. ఆ విధంగా అది రౌద్రాదుల కార్యం, ఆస్వాదవిశేషరూపమైన ఈ దీప్తి తన కారణమైన రౌద్రాదుల్ని ఇతర రసాలనుండి వేరుగా చూపుతూ వాటిని లక్షణావృత్తి చేత బోధిస్తుంది. ఓజస్సు అనగా దీప్తి, ఆ 'దీప్తి' పదానికే లక్షణచేత రౌద్రాదులు అని అర్థం.

తేనేతి - అందుచేత కారణంలో కార్యాన్ని ఆరోపించడంవల్ల, అనగా ఓజస్సుకు కారణాలైన రౌద్రాదులందు కార్యమైన ఓజస్సాన్ని ఆరోపించడం ద్వారా ఓజఃశబ్దంచేత రౌద్రాదులు బోధింపబడతాయి. అటుపిమ్మట లక్షితలక్షణచేత ఆ రౌద్రాదులను ప్రకాశింపచేసే దీర్ఘ సమాసరచనవాక్యరూపమైన శబ్దంకూడా దీప్తి అని చెప్పబడుతుంది.

వివరణ:- లక్షణచేత బోధించబడిన (లక్షితమైన) అర్థంచేత మరొక అర్థాన్ని లక్షణయా బోధించడం లక్షితలక్షణ అని కొందరంటారు. శక్యార్థంతో పరంపరా సంబంధం లక్షితలక్షణ అని మరికొందరు. ఓజఃశబ్దవాచ్యం దీప్తి. ఆ దీప్తిశబ్దం లక్షణయా రౌద్రాదుల్ని బోధిస్తే ఆ రౌద్రాదిరూపలక్ష్యార్థం లక్షణచేత శబ్దాన్ని బోధిస్తుంది. లేదా'దీప్తి' శబ్దమే పరంపరాసంబంధంచేత శబ్దాన్ని బోధిస్తుంది. రెండు విధాలా కూడ ఇది లక్షితలక్షణ.

యథా ఇతి - ఎట్లనగా- చంచదిత్యాది శబ్దం దీప్తి అని చెప్పబడుతుంది.

తత్ప్రకాశేతి - ప్రసన్నములైన అనగా శీఘ్రంగా అర్థాన్ని బోధించే (గమకైః)

శబ్దాలచేత బోధింపబడేదీ, రౌద్రాదులను ప్రకాశించడానికి ఉద్దిష్టమైనదీ అయిన అర్థం కూడ సమాసాపేక్ష లేకుండా కూడ దీప్తి (ఓజస్సు) అని చెప్పబడుతుంది. ఉదాహరణం "యో యః" ఇత్యాదికం.

లోచనం

చఞ్చదితి :- చఞ్చద్భ్యాం వేగాదావర్తమానాభ్యాం భుజాభ్యాం భ్రమితా యేయం చణ్డా దారుణా గదా తయా యోఽభితః సర్వత, ఊర్వోః ఘాతః తేన సమ్యక్ చూర్ణితం పునరనుత్థానోపహతం కృతమూరుయుగలం యుగపదేవ ఊరుద్వయం యస్య తం సుయోధనమనాదృత్యైవ, స్త్యానేతి ఆశ్యానతయా న తు కాలాన్తరశుష్కతయా అవబద్ధం హస్తాభ్యామ్ అవిగలద్రూపమ్, అత్యన్తమాభ్యన్తరతయా ఘనం న తు రసమాత్రస్వభావం యత్ శోణితం రుధిరం తేన శోణౌలోహితౌ పాణీ యస్య సః. అత ఏవ స భీమః కాతర త్రాసదాయీ, తవేతి:- యస్యాః తత్తదపమానజాతం కృతం దేవ్యనుచితమపి తస్యాః తవ, కచాన్ ఉత్తంసయిష్యతి ఉత్తంసవతః కరిష్యతి, వేణీత్వమ పహరన్ కరవిచ్యుతశోణితశకలైః లోహితకుసుమాపీడేనేవ యోజయిష్యతి ఇత్యుత్ప్రేక్షా. దేవీత్యనేన కులకలత్రఖిలీకారస్మరణకారిణా క్రోధస్యైవ ఉద్దీపన విభావత్వం కృతమితి నాత్ర శృఙ్గారశఙ్కా కర్తవ్యా. సుయోధనస్య చ అనాదరణం ద్వితీయగదాఘాతదానాద్యనుద్యమః. స చ సంచూర్ణితోరుత్వాదేవ. స్త్యాన గ్రహణేన ద్రౌపదీమన్యుప్రక్షాలనే త్వరా సూచితా. సమాసేన చ సంతతవేగవహనస్వభావాత్ త్వాత్యేవ, మధ్యే విశ్రాన్తి మల భమానా, చూర్ణితో రుద్వయసుయోధనానాదరణపర్యన్తా ప్రతీతిః ఏకత్వేనైవ భవతీతి ఔద్ధత్యస్య పరం పరిపోషికా. అన్యే తు సుయోధనసంబన్ధి యత్ స్త్యానావబద్ధం ఘనం శోణితం తేన శోణపాణిరితి వ్యాచక్షతే.

బాలానందిని

చఞ్చదితి - చఞ్చద్భ్యామ్ = వేగంగా తిరుగుతూన్న, భుజాలచేత త్రిప్ప బడిన, యా ఇయమ్ = ఏ ఈ, చణ్డా = దారుణమైన, గదాగద గలదో దానిచేత, యః = ఏ, అభితః = అన్ని వైపులా. ఊర్వోః = తొడలయొక్క, ఘాతః = కొట్టడమో, దానిచేత,

సమ్యక్ = బాగుగా, చూర్ణితమ్ = మళ్లీ లేవడం లేకుండగా కొట్టబడిన, ఊరుయుగలమ్ = రెండు ఊరువులూ కూడ ఒకే మారు (కొట్టబడినవి) ఎవనికో, అలాంటి సుయోధనుణ్ణి లెక్కచేయక (ఊరుయుగలస్య సుయోధనస్య అనేది అనాదరే షష్ఠిగా స్వీకరించి ఈ అర్థం చెప్పబడింది) స్త్యానేన = చిక్కగా ఉండడంచేత గట్టి పడిన, అంతే కాని కొంత కాలం నిలవ ఉండడంచేత ఎండడంచేత కాదు, అవబద్ధమ్ = చేతులకు బాగా అంటుకొని ఉన్న, చేతులనుండి కారిపోని, చాలా లోపలిది అవడం చేత గట్టిపడినది, కాని పల్చగా లేనిది అయిన, ఏ, శోణితమ్ = రక్తం ఉన్నదో దానిచేత, శోణౌ = ఎఱ్ఱగా ఉన్న హస్తములు కలవాడు, అందువల్లనే, భీమః = పిరికివాళ్లకి భయం పుట్టించేవాడు, తవేతి:- ఏ నీకు పట్టపురాణికి తగని ఆ అవమానసముదాయం చేయబడిందో అట్టి నీయొక్క, కచములను, ఉత్తంసయిష్యతి = శిరోభూషణం కలవాటినిగా చేస్తాడు. ఒంటి జడగా ఉండడాన్ని తొలగించి చేతినుండి రాలిన రక్తపు ముద్దలచేత ఎఱ్ఱపూవుల శిరోభూషణంతో వలెకూర్చగలడు అని ఉత్ప్రేక్ష. సత్కులానికి సంబంధించిన భార్యయొక్క అవమానాన్ని స్మరింపచేసే "దేవి" అనేదానిచేత కోపానికే ఉద్దీపనవిభావంగా ఉండే టట్లు చేయబడింది. అందుచేత ఇక్కడ శృంగారశంక చేయదగినది కాదు. రెండవ మారు గదతో కొట్టడానికి ఉద్యమించక పోవడమే సుయోధనుణ్ణి అనాదరించడం. అది కూడా (రెండవ దెబ్బ కొట్టడంకొరకు ప్రయత్నించకపోవడం కూడా) మొదటి దెబ్బకే అతని తొడలు చూర్ణం అయి పోవడంవల్లనే. 'స్త్యాన' శబ్దాన్ని గ్రహించడంచేత, చిక్కగా ఉన్న అని చెప్పడంచేత ద్రౌపది కోపాన్ని కడిగివేయడంలో ఆతని కున్న తొందర సూచించబడింది. సమాసంచేత, మధ్యలో విచ్ఛేదం లేకుండా వేగంతో నడవడం అనే స్వభావం (సమాసానికి) ఉండడంవల్ల మధ్యలో విశ్రాంతిని పొందని, చూర్ణితోరుద్వయుడైన సుయోధనుని అనాదరంవరకూ ఉన్న ప్రతీతి (జ్ఞానం) ఒక్క ఊపులోనే ఏర్పడుతుంది కాబట్టి అది (ఆ ప్రతీతి) ఔద్ధత్యాన్ని ఎక్కువగా పోషిస్తూన్నది. అన్యేతు ఇతి:- అనాదరేషష్ఠిని గ్రహించి అర్థం చెప్పబడింది. అందుకు కారణం సుయోధనస్య అనే పదం సమాసమధ్యలో ఉన్న శోణితశబ్దంతో అన్వయించడం వ్యాకరణరీత్యా అయుక్తం అనే అభిప్రాయం. కొందరైతే సుయోధనునికి సంబంధించిన స్త్యానావబద్ధమైన ఏ శోణితం ఉన్నదో దానితో శోణపాణియై అని అర్థం చెప్పారు.

లోచనం

యా ఇతి - స్వభుజయోః గురుః మదః యస్య చమూనాం మధ్యే అర్జునాదిరిత్యర్థః. పాఞ్చాలరాజపుత్రేణ ధృష్టద్యుమ్నేన ద్రోణస్య వ్యాపాదనాత్

తత్కులం ప్రత్యధికః క్రోధావేశః అశ్వత్థామ్నః. తత్కర్మసాక్షీతి కర్ణప్రభృతిః రణే సంగ్రామే కర్తవ్యే మయి మద్విషయే ప్రతీపం చరతి సమరవిఘ్నమాచరతి. యద్వా మయి చరతి సతి సంగ్రామే యః ప్రతీపం ప్రతికూలం కృత్వాస్తే స ఏవంవిధో యది సకలజగదన్తకో భవతి తస్యాప్యహమన్తకః కిముత అన్యస్య మనుష్యస్య దేవస్య వా?

అత్ర పృథగ్భూతైరేవ క్రమాద్విమృశ్యమానైః అర్థైః పదాత్పదం క్రోధః పరాం ధారామాశ్రిత ఇత్యసమస్తస్యైవ దీప్తినిబన్ధనమ్. ఏవం మాధుర్యదీప్తీ పరస్పరప్రతిద్వన్ద్వితయా స్థితే శృఙ్గారాదిరౌద్రాదిగతే ఇతి ప్రదర్శయతా తత్సమావేశవైచిత్ర్యం హాస్యభయానకబీభత్సశాన్తేషు దర్శితమ్. హాస్యస్య శృఙ్గారాఙ్గతయా మాధుర్యం ప్రకృష్టం, వికాసధర్మతయా చ ఓజోఽపి ప్రకృష్టమితి సామ్యం ద్వయోః. భయానకస్య మగ్నచిత్తవృత్తిస్వభావత్వేఽపి విభావస్య దీప్తతయా ఓజః ప్రకృష్టం, మాధుర్యమల్పమ్. బీభత్సేఽప్యేవమ్. శాన్తే తు విభావవైచిత్ర్యాత్ కదాచిదోజః ప్రకృష్టం, కదాచిన్మాధుర్యమితి విభాగః. 9

బాలానందిని

స్వభుజయోః ఇతి:- సేనల మధ్య తన భుజముల గొప్ప మదం గల ఏ అర్జునుడు మొదలైనవా డున్నాడో అని అర్థం. పాంచాలరాజు పుత్రుడైన ధృష్టద్యుమ్నుడు ద్రోణుణ్ణి చంపడంవల్ల ఆతని కులంమీద అశ్వత్థామకు అధికమైన క్రోధావేశం. తత్కర్మసాక్షి అనగా కర్ణాదులు. రణే = యుద్ధం చేయవలసి ఉండగా, ఎవడు, మయి = నా విషయంలో, ప్రతీపం చరతి = యుద్ధానికి విఘ్నం చేస్తాడో? 'చరతి' అనేదానిని లట్ ప్రథమపురుషైకవచనంగా తీసికొని పై అర్థం చెప్పబడింది. దాన్ని చరచ్ఛబ్ద సప్తమ్యంతరూపంగా గ్రహించి చెపుతున్నాడు - యద్వా ఇతి. లేదా నేను సంచరిస్తూండగా యుద్ధంలో ఎవడు నాకు ప్రతికూలంగా ఉంటాడో అలాంటివాడు సకల జగత్తును అంతమొందించేవాడే అయినా ఆతనికి కూడా నేను అంతకుణ్ణి. ఇతరులైన మనుష్యదేవాదుల మాట చెప్పాలా? అత్రేతి - ఇక్కడ వేరువేరుగానే ఉండి క్రమంగా విమర్శించబడుతూన్న అర్థాలచేత క్రోధం ఒక పదంనుంచి మరొక పదానికి అన్నట్లు ఉన్నతమైన ధారను పొందింది. అందుచేత ఇక్కడ సమాసం లేకపోవడమే దీప్తికి కారణం.

ఏవమితి :- పరస్పరవైరులుగా ఉన్న మాధుర్యదీప్తులు ఈ విధంగా శృంగారాదులలోను, రౌద్రాదులలోను ఉంటాయి అని ప్రదర్శించిన గ్రంథరచయిత చేత హాస్య - భయానక - బీభత్స - శాంతాలలో వాటి సమావేశంవల్ల కలిగే వైచిత్ర్యం చూపబడింది. హాస్యం శృంగారానికి అంగం. అందుచేత మాధుర్యం ప్రకృష్టంగా ఉంటుంది. వికాసధర్మం కూడా దీనిలో ఉండడంచేత ఓజస్సు కూడా అధికంగానే ఉంటుంది. అందుచేత హాస్యంలో రెండింటికీ సమప్రాధాన్యం. భయానకరసం మగ్నమైపోయిన చిత్తవృత్తులు కలిగి ఉండడం అనే స్వభావం కలదైనా, అనగా భయానకరసంలో చిత్తవృత్తు లన్నీ అణగిపోయినా, విభావం దీప్తం అవడంచేత ఓజస్సు ప్రకృష్టంగా ఉంటుంది; మాధుర్యం అల్పంగా ఉంటుంది. బీభత్సంలో కూడా ఇంతే. శాంతంలో అయితే విభావాల వైచిత్ర్యంవల్ల ఒకప్పుడు ఓజస్సు ప్రకృష్టంగా ఉంటుంది ఒకప్పుడు మాధుర్యం ప్రకృష్టం అని విషయవిభాగం. 9

## ధ్వన్యాలోకం

కా. సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ ప్రతి,
స ప్రసాదో గుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః. 10.

ప్రసాదస్తు స్వచ్ఛతా శబ్దార్థయోః. స చ సర్వరససాధారణో గుణః సర్వరచనాసాధారణశ్చ వ్యఙ్గ్యార్థాపేక్షయైవ ముఖ్యతయా వ్యవస్థితో మన్తవ్యః.

### బాలానందిని

సమర్పకత్వమ్ ఇతి :- కావ్యస్య = కావ్యంయొక్క, సర్వరసాన్ ప్రతి = సమస్తరసములను గూర్చి (రసముల యొక్క), యత్ = ఏ, సమర్పకత్వమ్ = స్పష్టంగా అందించడం కలదో, సః = అది, సర్వసాధారణక్రియః = అన్నింటికీ సాధారణమైన క్రియ గల, ప్రసాదః గుణః = ప్రసాదగుణంగా, జ్ఞేయః = తెలియ దగినది.

ప్రసాద ఇతి :- శబ్దార్థాల స్వచ్ఛత్వం ప్రసాదం. అది సర్వరసాలకు సర్వరచనలకీ సాధారణమైన గుణం. ముఖ్యంగా అది వ్యంగ్యార్థంమీదనే ఆధారపడి ఉంటుంది అని గ్రహించాలి.

### లోచనం

సమర్పకత్వం సమ్యగర్పకత్వమ్, హృదయసంవాదేవ ప్రతిపత్తౄన్

ప్రతి స్వాత్మావేశేన వ్యాపకత్వం ఝుటితి శుష్కకాష్ఠాదిదృష్టాన్తేన అకలుషోదక దృష్టాన్తేన చ తదకాలుష్యం ప్రసన్నత్వం నామ సర్వరసానాం గుణః. ఉపచారాత్తు తథావిధే వ్యఙ్గ్యేఽర్థే యచ్ఛబ్దార్థయోః సమర్పకత్వం తదపి ప్రసాదః తమేవ వ్యాచష్టే ప్రసాదేతి. నను రసగతో గుణః? తత్కథం శబ్దార్థయోః స్వచ్ఛతా ఇత్యాశఙ్క్యాహ- స చేతి:- చశబ్దః అవధారణే. సర్వరససాధారణ ఏవ గుణః, స ఏవ చ గుణః ఏవంవిధః. సర్వా యేయం రచనా శబ్దగతా చార్థగతా చ సమస్తా చాసమస్తా చ తత్ర సాధారణః. ముఖ్యతయేతి. అర్థస్య తావత్సమర్పకత్వం వ్యఙ్గ్యం ప్రత్యేవ సంభవతి, నాన్యథా. శబ్దస్యాపి స్వవాచ్యార్పకత్వం నాను కియదలౌకికం యేన గుణః స్యాదితి భావః. ఏవం మాధుర్యౌజఃప్రసాదా ఏవ త్రయో గుణాః ఉపపన్నాః భామహాభిప్రాయేణ. తే చ ప్రతిపత్త్రాస్వాదమయాః ముఖ్యతయా.తతః ఆస్వాద్యే ఉపచరితారసేః. తతః తద్వ్యఞ్జకయోః శబ్దార్థయోరితి తాత్పర్యమ్. 10

బాలానందిని

సమర్పకత్వమితి - బాగా అర్పించడం, ప్రతిపత్తలను గూర్చి (అనగా గ్రహించే సహృదయులను గూర్చి) హృదయసంవాదంచేత, ఎండిన కఱ్ఱమీద ఉన్న అగ్నియొక్క దృష్టాంతంచేత, వెంటనే స్వాత్మావేశం చేత వ్యాపింపచేయడం.

వివరణ:- బాగా ఎండిన కఱ్ఱకు నిప్పు ముట్టించగానే అది ఏ విధంగా ఒక్కమాటు భగ్గుమని ఆ కఱ్ఱని అంతనీ వ్యాపిస్తుందో అదే విధంగా కావ్యం, సహృదయులలో హృదయసంవాదం కలిగించి, అన్ని రసాలూ సహృదయహృదయాలలో ఆవేశించి అతిశీఘ్రంగా, వెంటనే, వ్యాపించే టట్లు చేస్తుంది. అదే కావ్యంలో (రసాలలో) ఉన్న ప్రసాదగుణం అనగా.

అకలుషేతి:- కలుషంకాని ఉదకం యొక్క దృష్టాంతంచేత ఆ అకాలుష్యమ్, ప్రసన్నత్వం అనే సకలరసాలలోను ఉండే గుణం.

స్వచ్ఛమైన జలంలో పరిశుభ్రమైన వస్త్రం తడపగానే ఆ జలం ఆ వస్త్రాన్నంతనీ ఏ విధంగా వెంటనే వ్యాపించి తడిసి పోయేటట్లు చేస్తుందో అదేవిధంగా రసాలను సహృదయహృదయంలో ప్రసరింపచేసే గుణం ప్రసాదం అని అర్థం. అయితే ఈ ప్రసాదగుణం కావ్యంలో ఉంటుందని చెప్పి నట్లు అయింది కదా అని ఆశంకించుకొని చెప్పుతున్నాడు - ఉపచారాదితి. ఆ విధమైన అనగా రసాదిరూపమైన, వ్యంగ్యార్థం

నిష్పన్న మవుతున్నది. అత్యంతస్నేహపాత్రుల విషయంలో అమంగళకరమైన పదాలు నోటితో కూడ ఉచ్చరించకూడ దనేది మన భారతీయసంప్రదాయం.

లోచనం

అప్రస్తుతప్రశంసాధ్వనిరపి -

ఢుణ్ఢులన్తో మారిహిసి కణ్టఅకలిఆఇం కేఅఇవణాఇం,

మాలఇ కుసుమసరిచ్ఛం భమర భమన్తో ణ పాలిహిసి.

"అన్వేషయన్ మరిష్యసి కణ్టకకలితాని కేతకీవనాని,

మాలతీకుసుమసదృశం భ్రమర భ్రమన్న ప్రాప్స్యసి" (సంస్కృతచ్ఛాయ)

ప్రియతమేన సాకముద్యానే విహరన్తీ కాచిన్నాయికా భ్రమరమేవమాహేతి భృఙ్గస్య అభిధాయాం ప్రస్తుతత్వమేవ. న చ ఆమన్త్రణాదప్రస్తుతత్వావగతిః, ప్రత్యుత ఆమన్త్రణం తస్యాః మౌగ్ధ్యవిజృమ్భితమితి అభిధయా తావన్నాప్రస్తుత ప్రశంసా సమాప్యా. సమాప్తాయాం పునరభిధాయాం వాచ్యార్థబలాదన్యాపదేశతా ధ్వన్యతే. యత్సౌభాగాభిమానపూర్ణా సుకుమారపరిమల మాలతీకుసుమసదృశీ కులవధూః నిర్వ్యాజప్రేమపరతయా కృతకవైదగ్ధ్యలబ్ధ ప్రసిద్ధ్యతిశయాని శమ్ఫలీకణ్టకవ్యాప్తాని, దూరామోదకేతకీవనస్థానీయాని వేశ్యాకులాని ఇతశ్చేతశ్చ చఞ్చూర్యమాణం ప్రియతమమ్ ఉపాలభతే.

బాలానందిని

అప్రస్తుతేతి :- అప్రస్తుతప్రశంసాధ్వని కూడ ఉన్నది. ఉదా -

అన్వేషయన్నితి :- భ్రమర=ఓ తుమ్మెదా! కణ్టకకలితాని=ముల్లతో నిండిన, కేతకీ వనాని= మొగలిపొదలను, అన్వేషయన్=అన్వేషిస్తూ, మరిష్యసి= మరణించగలవు. భ్రమన్= ఎంత తిరిగినా కూడ, మాలతీకుసుమసదృశమ్= మాలతీపుష్పంతో సమాన మైనదానిని, న ప్రాప్స్యసి = పొందవు.

ప్రియేతి - ప్రియతమునితో కూడ ఉద్యానంలో విహరిస్తున్న ఒక నాయిక తుమ్మెదతో ఇలా అంటూన్నది గాన భృంగవృత్తాంతం చెప్పబడుతూన్నది. అందుచేత అది ప్రస్తుతమే. (అభిధలో భృంగం ప్రస్తుతమే) పిలవడంవల్ల, అనగా పిలవడానికి యుక్తం కాని భృంగాన్ని సంబోధించడంవల్ల, భృంగం (భృంగవృత్తాంతం) అప్రస్తుతం అనడానికి వీలులేదు. అలా అనడానికి వీలులేకపోవడమే కాకుండా మీదు మిక్కిలి

(ప్రత్యుత) అలా పిలవడం ఆమెయొక్క ముగ్ధత్వమువల్ల విజృంభించినది (జరిగినది) గాన అభిధచేత అప్రస్తుతప్రశంస (అప్రస్తుతవిషయ కథనం) సంభావ్యం కాదు. అభిధచేత బోధించబడే విషయం ప్రస్తుతమే అని అర్థం. అభిధ పూర్తి అయిపోయిన తరవాత వాచ్యార్థబలంవల్ల ఇది అన్యాపదేశం అనే విషయం ధ్వనించబడుతున్నది. అదే మనగా- సౌభాగ్యాభిమానంతో నిండి ఉన్నదీ, సుకుమారపరిమలం గల మాలతీపుష్పంతో సమానురాలూ అయిన కులవధువు, నిర్వ్యాజమైన ప్రేమతో నిండినదై ఉండడంచేత, కృత్రిమమైన వైదగ్ధ్యం (చాతుర్యం) విషయంలో అత్యధికప్రసిద్ధి పొందినవీ, తార్పుడు కత్తె లనే ముళ్లతో నిండినవీ, దూరం దాకా సువాసన గల మొగలిపొదలవంటివీ అయిన వేశ్యాగృహాలలో ఇక్కడా అక్కడా కుత్సితమైన రీతిలో తిరుగుతూన్న తన ప్రియతముణ్ణి నిందిస్తూన్నది.

లోచనం

అపహ్నుతిధ్వనిర్యథా అస్మదుపాధ్యాయభట్టేన్దురాజస్య -

శ్లో. యః కాలాగురుపత్రభఙ్గరచనావాసైకసారాయతే
గౌరాఙ్గీకుచకుమ్భభూరిసుభగాభోగే సుధాధామని,
విచ్ఛేదానలదీపితోత్కవనితాచేతోఽధివాసోద్భవం
సన్తాపం వినినీషురేష వితతైరఙ్గైర్నతాఙ్గి స్మరః.

అత్ర చన్ద్రమణ్డలమధ్యవర్తినః లక్ష్మణః వియోగాగ్నిపరిచిత వనితాహృదయోదితప్లోషమలీమసచ్ఛవిమన్మథాకారతయా అపహ్నవో ధ్వన్యతే.

అత్రైవ ససన్దేహధ్వనిః - యతశ్చన్ద్రవర్తినః తస్య నామాపి న గృహీతమ్, అపి తు గౌరాఙ్గీస్తనాభోగస్థానీయే చన్ద్రమసి కాలాగురుపత్రభఙ్గ విచ్ఛిత్త్యాస్పదత్వేన యః సారతామ్ ఉత్కృష్టతామ్ ఆచరతీతి తన్న జానీమః కిమేతద్వస్త్వితి ససన్దేహోఽపి ధ్వన్యతే.

బాలానందిని

అపహ్నుతీతి - మా ఉపాధ్యాయులైన భట్టేన్దురాజు శ్లోకంలో అపహ్నుతిధ్వని ఎట్లనగా -

యః ఇతి - నతాఙ్గీ= వంగిన శరీరంగల ఓ! లతాంగీ! యః = ఏది, గౌరాఙ్గీకుచకుమ్భభూరిసుభగాభోగే= తెల్లని శరీరం గల వనితయొక్క కుచకుంభం

వలె మిక్కిలి సుందరమైన వైశాల్యం గల, సుధాధామని= చంద్రునియందు, కాలాగురు పత్రభఙ్గరచనావాసైకసారాయతే= కాలాగురుచేత (నల్లని అగురుచేత) చేయబడిన పత్రరీతుల ఆవాసంయొక్క ప్రధానమైన సారంగా అవుతున్నదో (గౌరాంగీవిశాల స్తనతటంమీద కాలాగురువుతో ఆకులు చిగుళ్లు మొదలైన ఆకారాలలో వేసిన అందమైన బొమ్మలవలె ఉన్నది అని అర్థం), ఏషః=అది, విచ్ఛేదానలదీపితోత్క వనితాచేతోధివాసోద్భవమ్= వియోగాగ్నిచేత ప్రజ్వలింపచేయబడిన ఉత్కంఠితలైన వనితల చిత్తములయందు నివసించడంచేత కలిగిన, సన్తాపమ్= సంతాపాన్ని, వితతైః= విస్తృతములైన, శిథిలంగా ఇటుఅటూ జార్చబడిన, అఙ్గైః= అవయవాలచేత, వినీషుః= తొలగించుకొనడానికి ఇచ్ఛయిస్తున్న, స్మరః = మన్మథుడు.

వివరణ:- చంద్రబింబం మధ్య కనబడుతున్నది కళంకం కాదు - విరహాగ్నితో ప్రజ్వలిస్తున్న వనితల మనస్సులలో నివసించడంవల్ల వేగిపోయిన మన్మథుడు ఆ చంద్రబింబం మధ్య తన కాళ్లూ, చేతులూ మొదలైన అవయవాలు శిథిలంగా పడవేసి ఆ సంతాపాన్ని తగ్గించుకోవడం కొరకు ప్రయత్నిస్తున్నాడు. ఆ మన్మథుడే కలంకంలాగ కనబడుతున్నాడు అని శ్లోకానికి భావం.

అత్రేతి - ఇక్కడ చంద్రమండలం మధ్య నున్న కళంకాన్ని, వియోగాగ్నితో కూడిన వనితల హృదయాలలో కలిగిన వేగిపోవడంచేత మలినమైన కాంతి గల మన్మథుని ఆకారంగా వర్ణించడంచేత అపహ్నవాలంకారం ధ్వనింపబడుతున్నది. "అది కళంకం కాదు; మరేమనగా అలాంటి మన్మథుడు" అని చెప్పినట్లయితే వాచ్యాపహ్నుతి అయి ఉండేది. అలా చెప్పకపోవడంవల్ల అపహ్నుతిధ్వని అని భావం.

అత్రైవేతి - ఇక్కడనే ససందేహధ్వని కూడా ఉన్నది. ఎందువల్ల ననగా - చంద్రబింబం మధ్య నున్నదాని పేరు కూడ చెప్పలేదు. గౌరాఙ్గీస్తనాభోగంతో సమానమైన చంద్రబింబంలో ఏది కాలాగురురచితపత్రసౌందర్యం గలదై సారత్వాన్ని, ఉత్కృష్టత్వాన్ని కలిగిస్తున్నదో అది ఏమిటో మాకు తెలియడం లేదు అని ససందేహాలంకారం కూడ ధ్వనించబడుతుంది. "చంద్రుని మధ్య ఏ కలంకం కనబడుతున్నదో" అని స్పష్టంగా చెప్పకపోవడంచేత అది కలంకమా ఏదైనా మరొక వస్తువా అని వక్తకు సందేహం ఉన్నట్లు వ్యంగ్యం అవుతున్నది గాన ససందేహధ్వని అని భావం.

లోచనం

పూర్వమనఙ్గీకృతప్రణయామ్ అనుతప్తాం విరహోత్కణ్ఠితాం వల్లభాగమనప్రతీక్షాపరత్వేన కృతప్రసాధనాదివిధితయా వాసకసజ్జీభూతాం

పూర్ణచన్ద్రోదయావసరే దూతీముఖానీతః ప్రియతమః త్వదీయ కుచకలశన్యస్తకాలాగురుపత్త్రభఙ్గరచనా మన్మథోద్దీపనకారిణీ ఇతి చాటుకం కుర్వాణః చన్ద్రవర్తినీ చేయం కువలయదలశ్యామలకాన్తిరేవమేవ కరోతీతి ప్రతివస్తూపమాధ్వనిరపి.

బాలానందిని

పూర్వమితి :- ఒక నాయిక ప్రియుడు చూపిన ప్రణయాన్ని ముందు అంగీకరించలేదు. తరవాత ఆమెకు పశ్చాతాపం కలిగింది. విరహోత్కంఠితురాలై వల్లభుని రాక కోసం నిరీక్షిస్తూ చక్కగా అలంకరించుకొని వాసకసజ్జికగా తయారయింది. పూర్ణచంద్రోదయసమయంలో దూతికను పంపగా ఆ ప్రియతముడు వచ్చాడు. "నీ కుచకలశంమీద ఉన్న కాలాగురుపత్రరచన మన్మథోద్దీప్తిని కలిగిస్తూన్నది" అని చాటువాక్యాలు (ప్రియవాక్యాలు) పలుకుతూ అతడు 'చంద్రునిలో ఉన్న ఈ నల్లకలువరేకులు వలె శ్యామలమైన కాంతి కూడ ఇదే విధంగా కామోద్దీపకంగా ఉంది' అని అంటున్నాడు. అందుచేత ప్రతివస్తూపమాధ్వని కూడ ఇక్కడ ఉంది. నీ కుచకలశంమీద ఉన్న పత్త్రరచన ఏ విధంగా మన్మథోద్దీపకంగా ఉందో చంద్రునిలోని ఆ కలంకం కూడ అదే విధంగా మన్మథోద్దీపకంగా ఉంది అని ప్రతివస్తూపమ వ్యంగ్యం అవుతున్నది అని భావం.

లోచనం

సుధాధామనీతి చన్ద్రపర్యాయతయోపాత్తమపి పదం సన్తాపం వినినీషురిత్యత్ర హేతుతామపి వ్యనక్తీతి హేత్వలంకారధ్వనిరపి.

త్వదీయకుచశోభా మృగాఙ్కశోభా చ సహ మదనముద్దీపయతః ఇతి సహోక్తిధ్వనిరపి. "త్వత్కుచసదృశః చన్ద్రః, చన్ద్రసమః త్వత్కుచాభోగః" ఇత్యర్థ ప్రతీతేః ఉపమేయోపమాధ్వనిరపి. ఏవమన్యేఽప్యత్ర భేదాః శక్యోత్ప్రేక్షాః. మహాకవివాచః అస్యాః కామధేనుత్వాత్. యతః -

శ్లో. హేలాపి కస్యచిదచిన్త్యఫలప్రసూత్యై
కస్యాపి నాలమణవేఽపి ఫలాయ యత్నః,
దిగ్దన్తిరోమచలనం ధరణీం ధునోతి
ఖాత్సంపతన్నపి లతాం చలయేన్న భృఙ్గః.

ఏషాం తు భేదానాం సంసృష్టిత్వం సంకరత్వం చ యథాయోగం చిన్త్యమ్

బాలానందిని

సుధేతి :- 'సుధాధామని' (అమృతానికి స్థానమైన చంద్రునియందు) అని 'చంద్ర శబ్దానికి పర్యాయంగా ఉపయోగించబడినా ఈ పదం "సంతాపాన్ని తొలగిం తలచుకొనుచున్నాడు" అని చెప్పడంలో హేతుత్వాన్ని వ్యంజింపచేస్తున్నది. అందుచే ఇక్కడ హేత్వలంకారధ్వని కూడ ఉంది. త్వదీయేతి - "నీ కుచశోభ మృగాంకశోభా కు మదనోద్దీపకాలుగా ఉన్నాయి" అని సహోక్త్యలంకారధ్వని కూడ ఉంది. త్వదితి 'చంద్రుడు నీ కుచాలవలె ఉన్నాడు. నీ కుచాభోగం చంద్రునితో సమంగా ఉంది' అ అర్థం వ్యంగ్యం అవడంచేత ఉపమేయోపమాధ్వని కూడ ఉంది. ఈ విధంగా ఇక్క ఇంకా మరికొన్ని అలంకారధ్వనిభేదాలు ఊహించడానికి వీలు ఉంది. ఎందువల్ల నన - ఈ మహాకవి వాక్కు కామధేనువు. యతః ఇతి - ఎందువల్ల అనగా -

హేలాపీతి :- కస్యచిత్= ఒకనియొక్క, హేలాపి= విలాస కూడ, ఒకడు అలవోక చేసిన పని కూడ, అచిన్త్యఫలప్రసూత్యై= ఊహింపశక్యం కాని ఫలితాలను ఇవ్వడా సమర్థం అవుతుంది. కస్యాపి= ఒకానొకని, యత్నః = ప్రయత్నం, అణవే= అత్యల్పమై ఫలాయ= పలం ఇవ్వడానికి, న అలమ్= సమర్థం కాదు, దిగ్దన్తిరోమచలనమ్= దిగ్గ యొక్క రోమాల కదలిక కూడ, ధరణీమ్= భూమిని, ధునోతి= ఊపివేస్తుంది. ఖా ఆకాశంనుంచి, సంపతన్నపి= వచ్చి వేగంగా పడుతున్నా కూడ, భృఙ్గః= తుమ్మె లతామ్= లతను, న చలయేత్= చలింపచేయజాలదు.

అందువల్ల మహాకవుల రచనలో ఇన్ని విశేషాంశాలు ఉండడంలో ఆశ్చర లేదని భావం. ఏషామితి :- ఈ భేదాల సంసృష్టి - సంకరాలను కూడా యథావకాశం ఊహించుకొనాలి.

లోచనం

అతిశయోక్తిధ్వనిర్యథా మమైవ-

శ్లో. కేలీకన్దలితస్య విభ్రమమధోర్ధుర్యం వపుస్తే దృశౌ
భఙ్గీభఙ్గురకామకార్ముకమిదం భ్రూనర్మకర్మక్రమః,
ఆపాతేఽపి వికారకారణమహో వక్త్రామ్బుజన్మాసవః
సత్యం సున్దరి వేధసస్త్రిజగతీసారస్త్వమేకా కృతిః.

అత్ర మధుమాసమదనాసవానాం త్రైలోక్యే సుభగతా అన్యోన్యం పరిపోషకత్వేన. తే తు త్వయి లోకోత్తరేణ వపుషా సంభూయ స్థితాః ఇతి అతిశయోక్తిర్ధ్వన్యతే. "ఆపాతేఽపి వికారకారణమ్" ఇత్యాస్వాదపరంపరా క్రియయాపి వినా వికారాత్మనః ఫలస్య సంపత్తిరితి విభావనాధ్వనిరపి. "విభ్రమమధోర్ధుర్యమ్" ఇతి తుల్యయోగితాధ్వనిరపి. ఏవం సర్వా లఙ్కారాణాం ధ్వన్యమానత్వమస్తీతి మన్తవ్యమ్; న తు యథా కైశ్చిత్ నియతవిషయీకృతమ్. యథాయోగమితి - క్వచిదలఙ్కారః, క్వచిద్వస్తు వ్యఞ్జకమిత్యర్థో యోజనీయ ఇతి. 27

బాలానందిని

**అతిశయోక్తీతి** - అతిశయోక్తిధ్వనికి ఉదాహరణంగా నా శ్లోకమే ఎట్లనగా -

**కేలీతి** - తే దృశౌ= నీ నేత్రాలు, కేలీకన్దలితస్య= విలాసిజనుల క్రీడయొక్క నవాంకురావిర్భావం కలిగిన, (అప్పుడే విలాసిజనుల క్రీడను అంకురింపచేసిన), విభ్రమమధోః= శృంగార చేష్టలనే వసంతర్తువుయొక్క, ధుర్యమ్= భారవహనక్షమమైన, అనగా కామోద్దీపనాదికార్యభారాన్ని వహించకలిగిన, వపుః= శరీరం (శరీరంగా ఉన్నాయి). నీ నేత్రద్వయం కొంచెం కాలం క్రితమే ఆవిర్భవించిన వసంతుని కామోద్దీపనాది కార్యాలు చేసే శరీరమే అని భావం. భ్రూనర్మకర్మక్రమః= నీ కనుబొమ్మల విలాసక్రమం, ఇదమ్= ఈ, భఙ్గీభఙ్గురకామకార్ముకమ్= వివిధభంగులలో వంగుతూన్న మన్మథధనుస్సు. వక్త్రామ్బుజన్మా= ముఖపద్మంనుండి పుట్టిన, ఆసవః= ఆసవం (అధరరసం అనే ఆసవం) ఆపాతేఽపి= కొంచెం ఆస్వాదించినా కూడ, వికారకారణమ్= వికారాలకి కారణం. అహో= ఏమి ఆశ్చర్యం! సున్దరి= ఓ! సుందరీ! సత్యమ్= నిజంగా, త్వమ్= నువ్వు, త్రిజగతీసారః= మూడు లోకాలలో సారమైన, వేధసః= బ్రహ్మదేవునియొక్క ఏకా= ఒక్క, కృతిః= కృతివి.

**అత్రేతి** - మధుమాస - మదన - ఆసవాలు పరస్పరం ఒకదాని నొకటి పోషించుకుంటాయి. అందుచేత అవి మూడు లోకాలలోను సౌభాగ్యం ఉన్నవి. అవన్నీ కలిసి నీలో లోకోత్తరమైన శరీరంతో ఉన్నాయి అని అతిశయోక్తి ధ్వనించబడుతూన్నది. "ఆపాతేఽపి వికారకారణమ్" అని చెప్పడంచేత ఆస్వాదపరంపరాక్రియ, అలాగ మాటి మాటికి ఆస్వాదిస్తూనే ఉండడం అనే క్రియ, లేకపోయినా వికారరూపమైన ఫలం సంపన్నం అయింది అని చెప్పడంచేత విభావనాధ్వని కూడ. (కారణం లేకపోయినా

విషయంలో శబ్దార్థాల కున్న ఏ సమర్పకత్వం ఉన్నదో అది కూడ ఉపచారంవల్ల ప్రసాదమే. అనగా ప్రసాదగుణం వాస్తవంలో రసగతమే. ఆ రసగతమైన ప్రసాదాన్ని శబ్దార్థాలు సమర్పిస్తున్నాయి. అందుచేత శబ్దార్థాలలో ఉన్న ఆ సమర్పకత్వం కూడా ఉపచారంచేత (లక్షణచేత) ప్రసాదం అని చెప్పబడుతుంది. ఈ విషయాన్నే ప్రసాదేత్యాదికం చేత వివరిస్తున్నాడు.

నన్వితి :- ప్రసాదగుణం రసంలో ఉంటే స్వచ్ఛత్వం శబ్దార్థాలలో ఉండడం ఏమిటి అని ఆశంకించుకొని చెప్పుతున్నాడు - స చేతి :- చ శబ్దానికి అవధారణం (నిశ్చితత్వం) అర్థం. అనగా 'ఏవ' కు ఏ అర్థమో ఆ అర్థం గ్రహించాలి. దానిని రెండు చోట్ల అన్వయించి స సర్వసాధారణ ఏవ గుణః (ఆ గుణం అన్నిరసాలకీ సాధారణమే) అనీ, స ఏవ సర్వ సాధారణో గుణః (అదే అన్ని రసాలకీ సాధారణమైన గుణం) అనీ అర్థాలు చెప్పాలి.

సర్వా ఇతి :- శబ్దగతమూ, అర్థగతము, సమస్తమూ (సమాసాలతో కూడినదీ) అసమస్తమూ అయిన ఏ యీ సమస్తరచన ఉందో దానిలో కూడ ఈ గుణం సాధారణ మైనది. ముఖ్యతయేతి :- వాచ్యార్థానికి సమర్పకత్వం అనేది వ్యంగ్యాన్ని గూర్చి మాత్రమే ఉంటుంది. అనగా వాచ్యార్థం చేయకలిగిన దల్లా వ్యంగ్యార్థాన్ని సమర్పించడమే అని అర్థం. అదే విధంగా శబ్దం కూడా స్వవాచ్యార్థాన్ని సమర్పిస్తుం దంటే దానిలో అలౌకికత్వం ఎంత (ఏమి) ఉంది గుణం అని చెప్పడానికి?

వివరణ:- వాచ్యార్థానికి ఉన్న వ్యంగ్యార్థసమర్పకత్వంలో కాని, శబ్దానికి ఉన్న వాచ్యార్థసమర్పకత్వంలో కాని అలౌకికత్వం ఏమీ లేదు. అందుచేత ఆ సమర్పకత్వాలని గుణం అనడానికి వీలు లేదు. అందుచేత రసం తనను ఆవేశింపచేసి సహృదయ హృదయాలలో వ్యాపించడమే గుణం. అందుచేత ముఖ్యంగా గుణం రసనిష్ఠమే. కేవలం ఉపచారంచేత శబ్దార్థాలలో ఉన్నట్లు చెప్పబడుతున్నది అని భావం.

ఏవమితి :- ఈ విధంగా భామహుని అభిప్రాయం ప్రకారం మూడు గుణాలు మాత్రమే ఉపపన్నమైనవి (యుక్తియుక్తమైనవి). అవి ముఖ్యంగా ప్రతిపత్తయొక్క (జ్ఞాతయొక్క, సహృదయుని) ఆస్వాదరూప మైనవి. సహృదయునిలో ఉన్న వాటిని ఆస్వాద్యమైన రసంమీద ఆరోపించడం జరిగింది. తరవాత వాటిని వ్యంజింప చేసే శబ్దార్థాలమీద ఆరోపించడం జరిగింది అని తాత్పర్యం. 10

## ధ్వన్యాలోకం

కా. శ్రుతిదుష్టాదయో దోషా అనిత్యా యే చ దర్శితాః,
ధ్వన్యాత్మన్యేవ శృఙ్గారే తే హేయా ఇత్యుదాహృతాః. 11

అనిత్యా దోషాశ్చ యే శ్రుతిదుష్టాదయః సూచితాస్తేఽపి న వాచ్యే అర్థమాత్రే; న చ వ్యఙ్గ్యే శృఙ్గారవ్యతిరేకిణి శృఙ్గారే వా ధ్వనే రనాత్మభూతే; కిం తర్హి? ధ్వన్యాత్మన్యేవ శృఙ్గారే అఙ్గితయా వ్యఙ్గ్యే తే హేయా ఇత్యుదాహృతాః. అన్యథా హి తేషామనిత్యదోషతైవ న స్యాత్. ఏవమ్ అసంలక్ష్యక్రమద్యోత్యో ధ్వనేరాత్మా ప్రదర్శితః సామాన్యేన.

### బాలానందిని

శ్రుతీతి :- యే = ఏ, శ్రుతిదుష్టాదయః = శ్రుతిదుష్టం మొదలైన, అనిత్యాః దోషాః = అనిత్యదోషాలు, దర్శితాః = చూపబడ్డాయో, తే = అవి, ధ్వన్యాత్మభూతే = ధ్వనికి ఆత్మయైన, శృఙ్గారే ఏవ = శృంగారమునందే, హేయాః ఇతి = పరిహరించతగినవి అని, ఉదాహృతాః = చెప్పబడ్డాయి.

అనిత్యా ఇతి. శ్రుతిదుష్టం మొదలైన ఏ దోషాలు అనిత్యా లని సూచించ బడ్డాయో అవి కూడా వాచ్యార్థమాత్రంలో కాని, శృంగారంకంటె భిన్నమైన వ్యంగ్యంలో కాని ధ్వనికావ్యాకి ఆత్మ కాని శృంగారంలో కాని,ఉంటాయని, అనగా ప్రతివాచ్యార్థానికి, ప్రతివ్యంగ్యార్థానికీ సంబంధించి ఉంటా యని, చెప్పబడలేదు; మరేమనగా అంగిగా వ్యంగ్యమైన, ధ్వనికావ్యానికి ఆత్మయైన శృంగారంలోనే అవి పరిహరించదగినవి అని చెప్పబడ్డాయి. అలా కాకపోతే - అనగా అవి అన్నివిధాలైన వాచ్యార్థాలలోను, వ్యంగ్యార్థాల లోనూ కూడ పరిహరించతగినవి అని చెప్పినట్లయితే, వాటికి అనిత్యదోషత్వమే ఉండదు. (నిత్యదోషాలుగానే పరిగణించబడతాయి). ఏవమితి - ఈ విధంగా ధ్వనికావ్యానికి ఆత్మయైన అసంలక్ష్యక్రమవ్యంగ్యం సామాన్యరూపంలో చూపబడింది.

### లోచనం

ఏవమస్మత్పక్ష ఏవ గుణాలంకారవ్యవహారో విభాగేన ఉపపద్యతే ఇతి ప్రదర్శ్య నిత్యానిత్యదోషవిభాగోఽపి అస్మత్పక్ష ఏవ సంగచ్ఛతే ఇతి

దర్శయితుమాహ - శ్రుతిదుష్టాదయ ఇత్యాది. వాన్తాదయః అసభ్యస్మృతి హేతవః శ్రుతిదుష్టాః; అర్థదుష్టాః వాక్యార్థబలాత్ అశ్లీలార్థప్రతిపత్తికారిణః; యథా- "ఛిద్రాన్వేషీ మహాంస్తబ్ధో ఘాతాయైవోపసర్పతి" ఇతి. కల్పనాదుష్టాస్తు ద్వయోః పదయోః కల్పనయా. యథా - రుచిం కురు ఇత్యత్ర క్రమవ్యత్యాసే. శ్రుతికష్టస్తు అధాక్షీత్, అక్షౌత్సీత్, తృణేఢి ఇత్యాది. శృఙ్గార ఇతి ఉచిత రసోపలక్షణార్థమ్. వీరశాన్తాద్భుతాదావపి తేషాం వర్జనాత్. సూచితా ఇతి :- నత్వేషాం విషయవిభాగప్రదర్శనేన అనిత్యత్వం భిన్నవృత్తాదిదోషేభ్యః వివిక్తం ప్రదర్శితమ్. నాపి గుణేభ్యః వ్యతిరిక్తత్వమ్. బీభత్సహాస్యరౌద్రాదౌ తు ఏషా మస్మాభిః ఉపగమాత్ శృఙ్గారాదౌ చ వర్జనాత్ అనిత్యత్వం చ దోషత్వం చ సమర్థితమేవేతి భావః. 11

బాలానందిని

ఏవమితి - ఇవి గుణాలు, ఇవి అలంకారాలు అని వేరు వేరుగా గుణాలంకారాల విభాగం మా పక్షంలోనే కుదురుతుంది అని చూపించి, ఇవి నిత్యదోషాలు, ఇవి అనిత్య దోషాలు అనే విభాగం కూడా మా పక్షంలోనే కుదురుతుంది అని చూపడానికి శ్రుతిదుష్టాదయః ఇత్యాదికం చెపుతున్నాడు.

"శ్రుతిదుష్టార్థదుష్టే చ కల్పనాదుష్టమిత్యపి ,
శ్రుతికష్టం తథైవాహుర్వాచాం దోషం చతుర్విధమ్".

ఇత్యాది శ్లోకాలలో భామహుడు శ్రుతిదుష్టాదిదోషాలను నిరూపించాడు. వాటిని సోదాహరణంగా చూపుతున్నాడు - వాన్తాదయః ఇతి :- అసహ్యమైన వస్తువుల స్మృతికి హేతువులైన వాన్త మొదలైనవి శ్రుతిదుష్టాలు (కక్కడం అనే అసహ్యార్థాన్ని స్ఫురింప చేసి వినడానికే ఎబ్బెట్టుగా ఉంటాయి, వాక్యార్థం బలంవల్ల మొత్తం వాక్యార్థం గ్రహిచేటప్పటికి) అశ్లీలార్థ ప్రతీతి కలిగించేవి అర్థదుష్టాలు. ఉదా - ఛిద్రాన్వేషీ త్యాదికం (ఇది రాజవర్ణనం. "ఛిద్రాలను వెతుకుతూ ఉంటాడు, చాలా మొండివాడు. చంపడం కోసం దగ్గరికి వస్తాడు" అని అర్థం దీనివల్ల పురుషశేఫోరూపమైన అశ్లీలార్థం తోస్తుంది కాబట్టి అర్థదుష్టం). రెండు పదాల కల్పనవల్ల (కూర్పువల్ల) అశ్లీలార్థం వస్తే అది కల్పనాదుష్టం. ఎట్లనగా కురు రుచిమ్ అనే పదాల క్రమం మార్చి రుచింకురు అని చెప్పినప్పుడు ('చింకు' అనే యోన్యతర్గతాంకురార్థం గల పదం ఏర్పడడంచేత) ఇది కల్పనాదుష్టం.

'అధాక్షీత్ (కాల్చెను), ''అక్షౌత్సీత్ (నలగకొట్టాడు;) 'తృణేఢి' (హింసిస్తున్నాడు) ఇత్యాదులు శ్రుతిదుష్టదోషం ఉన్నవి (వినడానికే కటువుగా ఉంటాయి).

శృఙ్గారే ఇతి:- ''శృఙ్గారే అనేది తగిన రసాలను ఉపలక్షణచేత బోధించడం కోసం. ఎందువల్లననగా శృంగారరసంలోనే కాకుండా వీర - శాంత - అద్భుతరసాదులలో కూడ (శ్రుతిదుష్టాదిదోషాలు) పరిహరించదగినవే. సూచితాః ఇతి :- సూచించబడ్డాయే కాని వీటికి విషయవిభాగం చూపించి (ఇవిఇక్కడ ఉంటే దోషాలు, ఇక్కడ ఉంటే కాదు అనే విషయాన్ని చూపించి) తద్వారా ఇవి అనిత్యదోషాలనీ, అందుచేత భిన్నవృత్తం మొదలైన నిత్యదోషాలకీ వీటికీ భేదం ఉందనీ చూపబడలేదు. గుణాలకంటె దోషాలు భిన్నమైన వని కూడా చూపబడలేదు. మేమైతే బీభత్స - హాస్య-రౌద్రాదులలో శ్రుతి దుష్టత్వాదులు ఉండవచ్చుననీ, శృంగారాదులలో వీటిని పరిహరించాలనీ చెప్పి వీటి అనిత్యత్వాన్నీ, దోషత్వాన్నీ కూడా సమర్థించాం అని భావం. 11

## ధ్వన్యాలోకం

కా. తస్యాఙ్గానాం ప్రభేదా యే ప్రభేదాః స్వగతాశ్చ యే.
తేషామానన్త్యమన్యోన్యసంబన్ధపరికల్పనే. 12

అఙ్గితయా వ్యఙ్గ్యో రసాదిః వివక్షితాన్యపరవాచ్యస్య ధ్వనేః ఏక ఆత్మా యః ఉక్తః తస్యాఙ్గానాం వాచ్యవాచకానుపాతినామ్ అలంకారాణాం యే ప్రభేదాః నిరవధయః, యే చ స్వగతాః తస్య అఙ్గినః అర్థస్య రసభావతదాభాసతత్ప్రశమలక్షణాః, విభావాను భావవ్యభిచారిప్రతిపాదనసహితాః అనన్తాః స్వాశ్రయాపేక్షయా నిఃసీమానః విశేషాః తేషామ్ అన్యోన్య సంబన్ధ పరికల్పనే క్రియమాణే కస్య చిదన్యతమస్యాపి రసస్య ప్రకారాః పరిసంఖ్యాతుం న శక్యన్తే కిముత సర్వేషామ్.

తథాహి - శృఙ్గారస్య అఙ్గినస్తావదాద్యౌ ద్వౌ భేదౌ - సంభోగో విప్రలమ్భశ్చ, సంభోగస్య చ పరస్పరప్రేమదర్శన సురత విహరణాది లక్షణాః ప్రకారాః. విప్రలమ్భస్యాపి అభిలాషేర్ష్యావిరహప్రవాసవిప్ర

లమ్భాదయః. తేషాం చ ప్రత్యేకం విభా నుభావవ్యభిచారిభేదః. తేషాం చ దేశకాలాద్యాశ్రయావస్థాభేద ఇతి స్వగతభేదాపేక్షయా ఏకస్య తస్య అపరిమేయత్వమ్, కింపునరఙ్గప్రభేదకల్పనాయామ్? తేహ్యఙ్గప్రభేదాః ప్రత్యేకమఙ్గిప్రభేదసంబన్ధపరికల్పనే క్రియమాణే సతి ఆనన్త్యమేవ ఉపయాన్తి.

బాలానందిని.

తస్యేతి :- తస్య = ఆ వివక్షితాన్యపరవాచ్యధ్వనియొక్క, యే ప్రభేదాః = ఏ ప్రభేదములు కలదో, స్వగతాశ్చ = తమకు (ఆ అంగములకు) సంబంధించిన, యే ప్రభేదాః = ఏ ప్రభేదములు కలవో, తేషామ్ = వాటి యొక్క, అన్యోన్యసమ్బన్ధ పరికల్పనే = పరస్పరసంబంధముయొక్క కల్పన చేయబడగా, ఆనన్త్యమ్ = అనంతత్వము.

అఙ్గితయా ఇతి :- వివక్షితాన్యపరవాచ్యధ్వనియొక్క ఆత్మయైన ఏ ఒక రసాదివ్యంగ్యం అంగిగా చెప్పబడిందో దాని అంగాలైన వాచ్యవాచకసంబద్ధాలైన అలంకారాల ఏ అవధిలేని ప్రభేదాలు ఉన్నవో, అంగి అయిన ఆ అర్థంయొక్క రస-భావ- తదాభాస - తత్ప్రశమలక్షణాలైన, విభావానుభావవ్యభిచారిప్రతిపాదనంతో కూడిన, అనన్తాః = తమ ఆశ్రయాల అపేక్షచేత అంతం లేని ఏ స్వగతభేదాలు ఉన్నాయో వాటికి పరస్పరసంబంధాల పరికల్పన చేయబడగా ఏ ఒక్కరసం యొక్క ప్రకారాలు కూడ లెక్కించడానికి శక్యం కావు, అన్ని రసాల ప్రకారాల మాట చెప్పాలా? ఎట్లనగా (తథాహి) అంగియైన శృంగారానికి సంభోగం, విప్రలంభం అని మొదట రెండు భేదాలు. సంభోగానికి పరస్పరప్రేమతో పరస్పరదర్శనం, సురతం, విహారం మొదలైన రూపాలు గల ప్రకారాలు ఉంటాయి. విప్రలంభానికి కూడా అభిలాషా విప్రలంభ - ఈర్ష్యావిప్రలంభ - విరహవిప్రలంభ - ప్రవాసవిప్రలంభాది భేదాలు ఉంటాయి. వాటిలో ఒక్కొక్కదానికి విభావానుభావవ్యభిచారులు వేరు వేరుగా ఉంటాయి. వాటికి కూడ దేశం, కాలం మొదలైనవి, ఆశ్రయాలు (కారణాలు), అవస్థలు వీటి భేదాలు ఉంటాయి. ఈ విధంగా ఒక రసాన్ని తీసుకొంటే దానిలోనే ఉన్న భేదాలను పట్టి అది అపరిమేయంగా ఉంటుంది. దాని అంగాలకి సంబంధించిన భేదాలు కూడా ఏర్పరిస్తే ఇంక చెప్పాలా? ఆ అంగాల ప్రభేదాలకు ఒక్కొకదానికి దాని అంగికి సంబంధించిన ప్రభేదాలతో సంబంధం కల్పిస్తే ఆ భేదాలు అనంతాలు అవుతాయి.

లోచనం

అఙ్గానామితి - అలఙ్కారాణామ్. స్వగతా ఇతి. ఆత్మగతాః సంభోగవిప్రలమ్భాద్యాః ఆత్మీయగతాః విభావాదిగతాః తేషాం లోష్టప్రస్తారేణ అఙ్గాఙ్గిభావే కా గణనేతి భావః. స్వాశ్రయః - స్త్రీపుంసప్రకృత్యౌచిత్యాదిః, పరస్పరం ప్రేమ్ణా దర్శనమితి ఉపలక్షణం సంభాషణాదేరపి. సురతం చాతుఃషష్టికమ్ ఆలిఙ్గనాది. విహరణముద్యానగమనమ్. ఆదిగ్రహణేన జలక్రీడా పానకచన్ద్రోదయక్రీడాది. అభిలాషవిప్రలమ్భః ద్వయోరపి అన్యోన్యజీవితసరపాస్వాభిమానాత్మికాయాం రతావుత్పన్నాయామపి కుతశ్చిత్ హేతోః అప్రాప్తసమాగమత్వే మన్తవ్యః. యథా సుఖయతీతి కిముచ్యతే ఇత్యతః ప్రభృతి వత్సరాజరత్నావల్యోః, న తు పూర్వం రత్నావల్యాః. తదా హి రత్యభావే కామావస్థామాత్రం తత్. ఈర్ష్యావిప్రలమ్భః ప్రణయఖణ్డనాదినా ఖణ్డితయా సహ. విరహవిప్రలమ్భః పునః ఖణ్డితయా ప్రసాద్యమానయాపి ప్రసాదమ్ అగృహ్ణన్త్యా పశ్చాత్తాపపరీతత్వేన విరహోత్కణ్ఠితయా సహ మన్తవ్యః. ప్రవాసవిప్రలమ్భః ప్రోషితభర్తృకయా సహ ఇతి విభాగః. ఆదిగ్రహణాత్ శాపాదికృతః విప్రలమ్భ ఇవ చ విప్రలమ్భః. వఞ్చనాయాం హ్యభితలషితో విషయో న లభ్యతే, ఏవమత్ర. తేషాం చేతి :- ఏకత్ర సంభోగాదీనామ్, అపరత్ర విభావాదీనామ్, ఆశ్రయో మలయాదిః మారుతాదీనాం విభావానామితి యదుచ్యతే తత్ దేశశబ్దేన గతార్థమ్. తస్మాదాశ్రయః కారణమ్. యథా మమైవ -

శ్లో. దయితయా గ్రథితా స్రగియం మయా హృదయధామని నిత్యనియోజితా,
గలతి శుష్కతయాపి సుధారసం విరహదాహరుజాం పరిహారకమ్.

తస్యేతి :- శృఙ్గారస్య. అఙ్గినాం రసాదీనాం ప్రభేదాః తత్సమ్బన్ధకల్పనేత్యర్థః

బాలానందిని

అఙ్గానామ్ ఇతి :- అఙ్గానామ్ అనగా అలంకారాలయొక్క అని అర్థం. స్వశబ్దానికి

తాను తనకు సంబంధించినది అని రెండర్థాలు. ఆ రెండర్థాలతో అన్వయిస్తూ వ్యాఖ్యానిస్తున్నాడు - స్వగతాః ఇతి :- తనలో ఉన్న సంభోగవిప్రలంభాదిభేదాలు, తమవాటికి సంబంధించినవి అనగా తమ విభావాదులకు సంబందించిన భేదాలు, లోష్టప్రస్తారంచేత అనగా చయనం మొదలైన యజ్ఞాలలో గరుడాదివివిధాకారాలు వచ్చేటట్లు ఇటూ అటూ మారుస్తూ ఇటకలు పరిచినట్లు, అంగాంగిభావం ఏర్పరిస్తే లెక్క ఏ ముంటుంది అని భావం. వివిధవృత్తాలలోని గణాలను ఇటూ అటూ మారిస్తే అసంఖ్యాకాలైన వృత్తాలు ఏర్పడతాయి, ఇలాంటి మార్పుకు ప్రస్తారం అని పేరు, ఆ పద్ధతిలో అంగాంగిభావం అని బాలప్రియావ్యాఖ్యాకారుడు వ్రాశాడు. అది యుక్తంగానే ఉంది కాని లోష్టశబ్దానికి అన్వయం కుదరదు. స్వాశ్రయాః అనగా స్త్రీపురుషప్రకృతుల ఔచిత్యం మొదలైనవి. పరస్పరము ప్రేమతో చూచుకోవడం అనేది సంభాషణాదులకు ఉపలక్షణం. సురతం అనగా అరవైనాలుగు విధాలైన ఆలింగనాదిరూపసురతం (కామశాస్త్రప్రసిద్ధం). విహరణం అనగా ఉద్యానగమనం. ఆది అనడంచేత జలక్రీడ, పానగోష్ఠి (ఆపాన), చంద్రోదయసమయంలో క్రీడించడం మొదలైనది గ్రహించబడుతుంది.

అభిలాషేతి :- ఈమె నా జీవితసర్వస్వం, ఇతడు నా జీవితసర్వస్వం అనే అభిమానరూపమైన రతి ఇద్దరిలోను పుట్టినా కూడ ఏ కారణంచేతనైనా సమాగమం జరగక పోతే అది అభిలాషవిప్రలంభం అని గ్రహించాలి. ఎట్లనగా - రత్నావళినాటికలో వత్సరాజు విదూషకునితో అన్న "సుఖయతీతి కిముచ్యతే" అనే వాక్యంతో ప్రారంభించి వత్సరాజరత్నావళుల మధ్య అభిలాషావిప్రలంభం. ఇంతకుముందు రత్నావలిది అభిలాషావిప్రలంభం కాదు. (ఈ మాటలు విన్నతరవాతనే రాజుకు తనమీద అభిలాష ఉందని రత్నావళికి తెలిసింది) అంతకు ముందు రతి లేదుగాన ఆమెది కామావస్థమాత్రమే. (పరస్పరం తీవ్రంగా ఉంది అని నిశ్చితమైన రతియే శృంగారానికి స్థాయిభావం. ఈ వాక్యాలు వినడానికి ముందు రత్నావళికి రాజుమీద ప్రేమ ఉన్నా తనమీద ఆతని కున్నదనే విషయం తెలియదు. అందుచేత అది సరియైన రతి కాదు అని అర్థం). ఖండితనాయికతో ప్రణయాన్ని ఖండించడం మొదలైన కారణా చేత ఏర్పడిన విప్రలంభం ఈర్ష్యావిప్రలంభం. ఖండితనాయిక ప్రియుడు ఎంత బ్రతిమాలినా ప్రసన్నురాలు కాక తరవాత పశ్చాత్తాపంతో నిండినదై విరహంచేత ఉత్కంఠితురాలైతే అలాంటి నాయికతో విరహం విరహవిప్రలంభం. భర్త ప్రవాసంలో ఉన్న నాయికతో విరహం ప్రవాస

విప్రలంభం. 'ఆది' శబ్దం ప్రయోగించడంవల్ల శాపాదులవల్ల వచ్చిన విప్రలంభం కూడా గ్రహించబడుతుంది.

వఞ్చనాయామ్ :- విప్రలంభశబ్దానికి ముఖ్యార్థం వంచన. వంచన చేసినప్పుడు కావాలనుకున్న విషయం లభించదు కదా? ఇక్కడ కూడా కావాలను కొన్న వ్యక్తి లభించకపోవడంవల్ల ఈ విప్రలంభం విప్రలంభం (వంచన) వంటిది అనే అభిప్రాయంతో దాని కా పేరు పెట్టబడింది అని అర్థం. వృత్తిలో తేషాం చ ప్రత్యేకం ఇత్యాదివాక్యంలో ఉన్న తేషామ్ అనే పదానికి అర్థం చెపుతున్నాడు- "తేషాం చేతి :- ఒక చోట (మొదటివాక్యంలో) తేషామ్ అనగా సంభోగాదులయొక్క అని, మరొక చోట విభావాదులయొక్క అనీ అర్థం. "దేశకాలాద్యాశ్రయ" అన్న పదానికి దేశకాలాదులు, ఆశ్రయం అనగా కారణం అని అర్థం. కొందరు ఆశ్రయశబ్దానికి మరొక అర్థం చెప్పారు. అది అయుక్తం అని చెపుతున్నాడు ఆశ్రయః ఇతి :- ఆశ్రయం అనగా మారుతాదివిభావాలకు ఆశ్రయమైన మలయపర్వతాదికం అని ఏ అర్థం చెప్పబడిందో అది దేశశబ్దంచేత గతార్థం అయిపోయింది. అనగా దేశశబ్దంచేతనే ఈ అర్థం చెప్పబడింది. మళ్లీ అదే అర్థం చెపితే పౌనరుక్త్యం అని అర్థం. అందుచేత అశ్రయశబ్దానికి కారణం అని అర్థం. ఉదాహరణంగా నా శ్లోకమే ఎట్లనగా -

దయితయా ఇతి :- దయితయా = ప్రియురాలిచేత, గ్రథితా = కట్టబడిన, మయా = నా చేత, హృదయదామని = హృదయస్థానమునందు, నిత్యనియోజితా = నిత్యమూ ఉంచబడిన, ఇయం స్రక్ = ఈ పుష్పమాల, శుష్కతయాపి = ఎండిపోవడం చేత కూడ, ఎండిపోయినా కూడ, విరహదాహరుజామ్ = విరహతాపబాధలకు, పరిహారకమ్ = తొలగించేదైన, సుధారసమ్ = అమృతరసాన్ని, గలతి = స్రవిస్తూన్నది.

వివరణ:- 'శుష్కతయాపి'కి శుష్కతరాపి అనే పాఠం ఉండవచ్చు. ఇక్కడ పుష్పమాలిక ఉద్దీపకం అవడంచేత విరహపీడను కలిగించవలసి ఉన్నా ప్రియురాలు గుచ్చినది అవడం అనే కారణవిశేషంచేత విరహపీడాపరిహారకమైన సుధారసం స్రవిస్తూన్న దని చెప్పబడింది. అందుచేత ఇది కారణకృతభేదానికి ఉదాహరణం. 12

## ధ్వన్యాలోకం

కా. దిఙ్మాత్రం తూచ్యతే యేన వ్యుత్పన్నానాం సచేతసామ్,
బుద్ధిరాసాదితాలోకా సర్వత్రైవ భవిష్యతి. 13.

దిఙ్మాత్రకథనేన హి వ్యుత్పన్నానాం సహృదయానామ్ ఏకత్రాపి రసభేదే సహాలంకారైః అఙ్గాఙ్గిభావపరిజ్ఞానాత్ ఆసాదితాలోకా బుద్ధిః సర్వత్రైవ భవిష్యతి.

బాలానందిని

దిఙ్మాత్రమితి - తు = కాని, దిఙ్మాత్రమ్ = దిక్కు (మార్గం) మాత్రమే, ఉచ్యతే = చెప్పబడుచున్నది - యేన = దేనిచేత, వ్యుత్పన్నానామ్ = వ్యుత్పత్తి గల, సచేతసామ్ = సహృదయులయొక్క, బుద్ధి ః = బుద్ధి, సర్వత్రైవ = అన్ని విషయాలలోను కూడ, ఆసాదితాలోకా = పొందబడిన జ్ఞానం కలదిగా, భవిష్యతి = కాగలదో.

దిఙ్మాత్రేతి - దిఙ్మాత్రం చెప్పడంచేతనే, మార్గం చూపడంచేతనే, వ్యుత్పత్తిమంతులైన సహృదయులకు ఒక్క రసభేదంలోనే అలంకారాలతో కూడ అంగాంగిభావం తెలియడంవల్ల, వాళ్ల బుద్ధి, అన్ని విషయాలలోను కూడ పొందబడిన జ్ఞానం కలది కాగలదు.

లోచనం

యేనేతి - దిఙ్మాత్రోక్తేనేత్యర్థః. సచేతసామితి మహాకవిత్వం సహృదయత్వం చ ప్రేప్సూనామితి భావః. సర్వత్రేతి- సర్వేషు రసాదిష్వా సాదిత ఆలోకః అవగమః సమ్యక్ వ్యుత్పత్తి ః యయా ఇతి సంబన్ధః. 13

బాలానందిని

యేనేతి - చెప్పబడిన ఏ దిఙ్మాత్రంచేత అని అర్థం. సచేతసామితి - మహాకవిత్వాన్ని, సహృదయత్వాన్ని పొంద గోరుతున్న వారికి అని భావం. సర్వత్రేతి -సమస్త మైన రసాదులయందు పొందబడిన, ఆలోకః = అవగమం, బాగా వ్యుత్పత్తి, ఏ బుద్ధిచేతనో అని అన్వయం. 13.

## ధ్వన్యాలోకం

తత్ర -

కా. శృఙ్గారస్యాఙ్గినో యత్నాదేకరూపానుబన్ధవాన్,
సర్వేష్వేవ ప్రభేదేషు నానుప్రాసః ప్రకాశకః. 14

అఙ్గినో హి శృఙ్గారస్య యే ఉక్తాః ప్రభేదాః తేషు సర్వేషు ఏక

ప్రకారానుబన్ధితయా ప్రబన్ధేన ప్రవృత్తః అనుప్రాసః న వ్యఞ్జకః. అఙ్గిన ఇత్యనేన అఙ్గభూతస్య శృఙ్గారస్య ఏకరూపానుబన్ధ్యనుప్రాస నిబన్ధనే కామచారమాహ.

బాలానందిని

తత్రేతి :- దిఙ్మాత్రం చూపవలసి ఉండగా. శృఙ్గారస్యేతి - అఙ్గినః = అంగియైన, శృఙ్గారస్య = శృంగారంయొక్క, సర్వేష్వేవ = సమస్తమైన, ప్రభేదేషు = భేదాలలో, యత్నాత్ = ప్రయత్నంవల్ల, ఏకరూపానుబన్ధవాన్ = ఒకే విధమైన సాతత్యం కల, అనుప్రాసః = అనుప్రాస, ప్రకాశకః = ప్రకాశకం, న = కాదు.

అఙ్గినః ఇతి:- అంగియైన శృంగారంయొక్క ఏ ప్రభేదాలు చెప్పబడ్డాయో వాటిలో అన్నింటిలోనూ కూడ ఒకే ప్రకారమైన అనుబంధం ఉండే టట్లు, అవిచ్ఛిన్నంగా ఉండేటట్లు, ప్రవృత్తమైన అనుప్రాస వ్యంజకం కాదు. అఙ్గినః అనడంచేత శృంగారం అంగం అయితే మాత్రం ఒకే రూపంలో అవిచ్ఛిన్నంగా ఉండే అనుప్రాసను కూర్చడం విషయంలో స్వేచ్ఛను చెప్పుచున్నాడు.

లోచనం

తత్రేతి - వక్తవ్యే దిఙ్మాత్రే సతీత్యర్థః. యత్నాదితి - యత్నతః క్రియమాణత్వాదితి హేత్వర్థః అభిప్రేతః. ఏకరూపం తు అనుబన్ధం త్యక్త్వా విచిత్రః అనుప్రాసః నిబధ్యమానో న దోషాయేత్యేకరూపగ్రహణమ్ 14.

బాలానందిని

తత్రేతి - దిఙ్మాత్రం చెప్పవలసి ఉండగా అని అర్థం, యత్నాదితి :- ప్రయత్నపూర్వకంగా చేయబడినందువల్ల అని హేతువును సూచించుచున్నది. ఇదే అప్రకాశకత్వానికి హేతువు అని అర్థం. ఒకే విధమైన అనుబంధాన్ని (అవిచ్ఛిన్నత్వాన్ని) విడిచి విచిత్రమైన అనుప్రాస నిబంధింపబడినా కూడ అది దోషం కాదు అని సూచించడం కోసం ఏకరూప అని చెప్పబడింది.

## ధ్వన్యాలోకం

కా. ధ్వన్యాత్మభూతే శృఙ్గారే యమకాదినిబన్ధనమ్,
శక్తావపి ప్రమాదిత్వం విప్రలమ్భే విశేషతః. 15

ధ్వనేరాత్మభూతః శృఙ్గారః తాత్పర్యేణ వాచ్యవాచకాభ్యాం ప్రకాశ్యమానః, తస్మిన్, యమకాదీనాం యమకప్రకారాణాం నిబన్ధనం దుష్కరశబ్దభఙ్గశ్లేషాదీనాం శక్తావపి ప్రమాదిత్వమ్. ప్రమాదిత్వమ్ ఇత్యనేన ఏతద్దర్శ్యతే - కాకతాలీయేన కదాచిత్ కస్యచిత్ ఏకస్య యమకాదేః నిష్పత్తావపి భూమ్నా అలంకారాన్తరవత్ రసాఙ్గత్వేన నిబన్ధో న కర్తవ్య ఇతి. "విప్రలమ్భే విశేషతః" ఇత్యనేన విప్రలమ్భే సౌకుమార్యాతిశయః ఖ్యాప్యతే. తస్మిన్ ద్యోత్యే యమకాదేః అఙ్గస్య నిబన్ధః నియమాత్ న కర్తవ్య ఇతి.

బాలానందిని

ధ్వన్యాత్మేతి :- ధ్వన్యాత్మభూతే = ధ్వనికావ్యానికి ఆత్మ అయిన, శృఙ్గారే = శృంగారమునందు, శక్తావపి = శక్తి ఉన్నాకూడ, యమకాదినిబన్ధనమ్ = యమకాదుల కూర్పు, ప్రమాదిత్వమ్ = పొరబాటే అవుతుంది, విప్రలమ్భే = విప్రలంభంలో. విశేషతః = అధికంగా ప్రమాదిత్వం అవుతుంది.

ధ్వనేరితి - వాచ్యవాచకాలచేత (శబ్దార్థాల చేత ) తత్పరత్వంతో ధ్వన్యాత్మ అయిన ఏ శృంగారం ప్రకాశించబడుతుందో దానియందు శక్తి ఉన్నాకూడ యమకాదీనామ్ = యమక భేదాలయొక్క, దుష్కరబంధాదులయొక్క, శబ్దభంగశ్లేషాదుల యొక్క కూర్పు ప్రమాదమే (పొరబాటే). ప్రమాదిత్వమ్ అనడంచేత - కాకతాలీయంగా ఎక్కడైనా ఒకప్పుడు ఒక యమకాదికం నిష్పన్నం అయినా (ఏర్పడినా) ఇతరాలంకారాలకు వలె రసానికి అంగంగా దీనిని అధికంగా కూర్చకూడదు అని చూపబడుతున్నది. విప్రలమ్భే విశేషతః అనడంవల్ల విప్రలంభంలో ఎక్కువ సౌకుమార్యం ఉంటుందని స్పష్టీకరించబడుచున్నది. విప్రలంభాన్ని వ్యంజింప చేయవలసి ఉన్నప్పుడు యమకాదియైన అంగాన్ని అసలు కూర్చకూడదు.

లోచనం

యమకాదీత్యాది శబ్దః ప్రకారవాచీ. దుష్కరం మురజబన్ధాది. శబ్దభఙ్గశ్లేష ఇతి. అర్థశ్లేషో న దోషాయ. రక్తస్త్వమ్ ఇత్యాదౌ. శబ్దభఙ్గోఽపి క్లిష్ట ఏవ దుష్టః; న త్వశోకాదౌ. 15

బాలానందిని

యమకాదీతి - యమకాది అనే దానిలోని ఆదిశబ్దం ప్రకారం అనే అర్థాన్ని బోధిస్తుంది. అనగా యమకమూ, అలాంటివీ అని అర్థం. దుష్కరమ్ = శ్రమపడి కూర్చదగిన మురజబంధచక్రబంధాదికం. శబ్దభఙ్గశ్లేష ఇతి :- రక్తస్త్వమ్ ఇత్యాదులలోని అర్థశ్లేష దోషం కాదు. శబ్దభంగశ్లేష కూడా క్లిష్టంగా ఉంటేనే దుష్టం; అశోకాది పదాలలో కాదు. (రక్తస్త్వమ్ ఇత్యాదిశ్లోకం 19 వ కారిక దగ్గర రాగలదు. చూ. 33 వ శ్లోకం)

ధ్వన్యాలోకం

అత్ర యుక్తిరభిధీయతే -

కా. రసాక్షిప్తతయా యస్య బన్ధః శక్యక్రియో భవేత్,
అపృథగ్యత్ననిర్వర్త్యః సోఽలఙ్కారో ధ్వనౌ మతః. 16

నిష్పత్తావాశ్చర్యభూతోఽపి యస్యాలంకారస్య రసాక్షిప్తతయైవ బన్ధః శక్యక్రియః భవేత్ సః అస్మిన్ అలక్ష్యక్రమ వ్యఙ్గ్యధ్వనావలంకారో మతః. తస్యైవ రసాఙ్గత్వం ముఖ్యమిత్యర్థః. యథా-

శ్లో. కపోలే పత్రాలీ కరతలనిరోధేన మృదితా
నిపీతో నిఃశ్వాసైరయమమృత హృద్యోఽధరరసః,
ముహుః కణ్ఠే లగ్నస్తరలయతి బాష్పః స్తనతటీం
ప్రియో మన్యుర్జాతస్తవ నిరనురోధే న తు వయమ్. (28)

బాలానందిని

అత్రేతి - ఈ విషయంలో యుక్తి చెప్పబడుతున్నది. రసేతి :- యస్య = ఏ అలంకారంయొక్క, బన్ధః = కూర్పు, రసాక్షిప్తతయా = రసంచేత ఆక్షిప్తం అవడంచేత, ఆవశ్యకంగా గుర్తింపబడడంచేత, అపృథగ్యత్ననిర్వర్త్యః= వేరైన ప్రయత్నం లేకుండగానే సాధించవలసిందిగా, శక్యక్రియః =శక్యమైన క్రియగలది (చేయ శక్య మైనది), భవేత్ = అవుతుందో, సః= అట్టి, అలంకారః= అలంకారమే, ధ్వనౌ= ధ్వనికావ్యమునందు, మతః= అంగీకరించబడినది.

నిష్పత్తావితి - ఏ అలంకారంయొక్క కూర్పు, పూర్తి అయిన తరవాత ఆశ్చర్యజనకమైనా (చమత్కారజనకమైనా) రసాక్షిప్తం అవుతూనే చేయడానికి శక్యం

అవుతుందో అది ఈ అసంలక్ష్యక్రమవ్యంగ్యం అయిన ధ్వనికావ్యంలో అలంకారంగా అంగీకరించబడింది. అలాంటి అలంకారానికే ముఖ్యమైన రసాంగత్వం ఉంటుంది అని అర్థం. ఎట్లనగా - కపోలే ఇతి :- కపోలే= గండస్థలంమీద, పత్రాలీ= మకరికాదిపత్రాల పంక్తి, కరతలనిరోధేన= అరిచేతి రాపిడిచేత, మృదితా= మర్దించబడింది, తుడిచి వేయబడింది; అమృతహృద్యః= అమృతంవలె మనోహరమైన, అయమ్= ఈ, అధరరసః= అధరరసం, నిఃశ్వాసైః= నిట్టూర్పులచేత, నిపీతః= త్రాగివేయబడింది. ముహుః= మాటిమాటికి, కణ్ఠే= కంఠమునందు, లగ్నః= లగ్నమైన, బాష్పః= కన్నీరు, స్తనతటీమ్= స్తనతటమును, తరలయతి= చంచలంగా చేస్తూన్నది. నిరనురోధే= అనుకూలత్వం లేనిదానా, ఎంత బ్రతిమాలినా విననిదానా, తవ= నీకు, మన్యుః= కోపం, ప్రియః = ప్రియం (యుడు)గా, జాతః = అయినది. తు= కాని, వయమ్=మేము, న = కాదు.

లోచనం

యుక్తిరితి - సర్వవ్యాపకం వస్త్విత్యర్థః. రసేతి - రససమవధానేన విభావాదిఘటనామేవ కుర్వన్ తన్నాన్తరీయకతయా యమాసాదయతి స ఏవాత్రాలంకారో రసమార్గే, నాన్యః. తేన వీరాద్భుతాదిరసేష్వపి యమకాది కవేః ప్రతిపత్తుశ్చ రసవిఘ్నకార్యేవ. గడ్డరికాప్రవాహోపహత సహృదయ ధురాధిరోహణవిహీనలోకావర్జనాభిప్రాయేణ తు మయా శృఙ్గారే విప్రలమ్భే చ ఇత్యుక్తమితి భావః. తథా చ - "రసేఽఙ్గత్వం తస్మాదేషాం న విద్యతే" ఇతి సామాన్యేన వక్ష్యతి. నిష్పత్తావితి - ప్రతిభానుగ్రహాత్ స్వయమేవ సంపత్తౌ నిష్పాదనానపేక్షాయామిత్యర్థః. ఆశ్చర్యభూత ఇతి. కథమేష నిబద్ధ ఇత్యద్భుతస్థానమ్. కరకిసలయన్యస్తవదనా, శ్వాసతాన్తాధరా ప్రవర్తమాన బాష్పభరనిరుద్ధకణ్ఠీ. అవిచ్ఛిన్నరుదితచఞ్చుత్కుచతటా రోషమపరిత్యజన్తీ చాటూక్త్యా యావత్ ప్రసాద్యతే తావదీర్ష్యావిప్రలమ్భగతానుభావచర్వణావహితచేతస ఏవ వక్తుః శ్లేషరూపకవ్యతిరేకాద్యా అయత్న నిష్పాద్యాః చర్వయితురపి న రసచర్వణావిఘ్నమాదధతీతి.

బాలానందిని

యుక్తిరితి - అన్నింటికీ వర్తించే వస్తువు (విషయం) అని అర్థం. రసేతి - రసంమీదనే మనస్సును ఏకాగ్రం చేయడంచేత విభావాదుల కూర్పును మాత్రమే చేస్తూ

వాటితో నాంతరీయకంగా, విడదీయడానికి వీలులేకుండా, ఏ అలంకారాన్ని పొందుతాడో (కూర్చకలుగుతాడో) అదే ఈ రసమార్గంలో అలంకారం; మరొకటి కాదు. అందుచేత వీరఅద్భుతాదిరసాలలో కూడ యమకాదికం కవికీ, సహృదయునికీ అంతటా కూడా రసవిఘ్నం తప్పకుండా చేస్తుంది. అయితే - గొఱ్ఱెల మంద పద్ధతిలో పడిపోయి సహృదయులలో అగ్రస్థానాన్ని అధిష్ఠించజాలని కొందరు జనుల్ని ఆకర్షించడం కోసం మాత్రమే నేను వెనక "శృంగారంలోను, విశేషించి విప్రలంభంలోను యమకాది ప్రయోగంచేయకూడదు" అని చెప్పాను అని భావం. అందుచేతనే "వీటికి రసంలో అంగత్వం లేదు" అని సామాన్యరూపంలో చెప్పనున్నాడు.

నిష్పత్తావితి - ప్రతిభానుగ్రహంవల్ల స్వయంగా సంపన్నమై శ్రమపడి ఏర్పరచవలసిన అవసరం లేనప్పుడు అని అర్థం. ఆశ్చర్యభూత ఇతి - ఇది ఎంత చక్కగా కూర్చబడిందో అని ఆశ్చర్యానికి హేతువు. కరేతి - చిగురువంటి అరిచేతిలో ముఖం ఉంచుకొని, శ్వాసచేత వాడిపోయిన అధరోష్ఠం కలదై, ఉబికివస్తూన్న బాష్పభారంచేత అడ్డుకొనబడిన కంఠం కలదై అవిచ్ఛిన్నంగా ఏడవడంచేత కదలుతూన్న కుచతటం గలదై, రోషం విడవని నాయిక చాటువచనంచేత ప్రసన్నురాలుగా చేసికొనబడే వరకూ, వక్త, ఈర్ష్యావిప్రలంభానికి సంబంధించిన అనుభావాల ఆస్వాదంలో సావధానమైన చిత్తం కలవాడై, ప్రయత్నపూర్వకంగా నిష్పాద్యాలు (ఏర్పరచవలసినవి) కాని ఏ శ్లేష-రూపక--వ్యతిరేకాద్యలంకారాలు కూర్చాడో అవి చర్వణ చేసే సహృదయునికి కూడా రసచర్వణలో విఘ్నం కలిగించడంలేదు.

వివరణ:- 'అధరరసః'లోని 'రస' శబ్దానికి 'ఆస్వాదించదగినది' 'మాధుర్యం' అని రెండర్థాలు. 'కణ్ఠే లగ్నః' అనే దానికి కంఠంలో తగుల్కొన్నది, కంఠాశ్లేషం చేస్తున్నాడు అని రెండర్థాలు. 'ప్రియః' అనగా ఇష్టమైనది. ప్రియుడు అని రెండర్థాలు. ఈ విధంగా శ్లేషాలంకారం. మొత్తం శ్లోకంలోనే అర్థశ్లేష ఉంది. "మన్యుః ప్రియః" అని రూపకాలంకారం. "వయంతు న ప్రియాః" అని వ్యతిరేకాలంకారం. ఆద్యపదంచేత అనుప్రాసాలంకారం గ్రహించబడుతుంది.

## ధ్వన్యాలోకం

రసాఙ్గత్వే చ తస్య లక్షణమ్ అపృథగ్యత్ననిర్వర్త్యత్వమితి యో రసం బన్ధుమ్ అధ్యవసితస్య కవేః అలంకారః తాం వాసనామ్ అత్యూహ్య యత్నాన్తరమాస్థితస్య నిష్పద్యతే స న రసాఙ్గమితి.

యమకే చ ప్రబన్ధేన బుద్ధిపూర్వకం క్రియమాణే నియమేనైవ యత్నాన్తరపరిగ్రహః ఆపతతి శబ్దవిశేషాన్వేషణరూపః. అలఙ్కారాన్తరేష్వపి తత్తుల్యమితి చేత్ - నైవమ్; అలంకారాన్తరాణి హి నిరూప్యమాణదుర్ఘటనాన్యపి రససమాహితచేతసః ప్రతిభానవతః కవేః అహంపూర్వికయా పరాపతన్తి. యథా కాదమ్బర్యాం కాదమ్బరీ దర్శనావసరే, యథా చ మాయారామశిరోదర్శనే విహ్వాలాయాం సీతాయాం సేతౌ. యుక్తం చైతత్; యతో రసాః వాచ్యవిశేషైరే వాక్షేప్తవ్యాః. తత్ప్రతిపాదకైశ్చ శబ్దైః తత్ప్రకాశినో వాచ్యవిశేషా ఏవ రూపకాదయోఽలఙ్కారాః. తస్మాన్న తేషాం బహిరఙ్గత్వం రసాభివ్యక్తౌ. యమక దుష్కరమార్గేషు తు తత్ స్థితమేవ. యత్తు రసవన్తి కానిచిద్యమకాదీని దృశ్యన్తే తత్ర రసాదీనామఙ్గతా యమకాదీనాం తు అఙ్గితైవ. రసాభాసే తు అఙ్గత్వమప్యవిరుద్ధమ్. అఙ్గితయా తు వ్యఙ్గ్యే రసే నాఙ్గత్వం; పృథక్ప్రయత్న నిర్వర్త్యత్వాద్యమకాదేః.

బాలానందిని

రసేతి :- రసాంగం అనడానికి తగిన అలంకారానికి లక్షణం ఏమనగా - "వేరే ప్రయత్నంచేత సాధించవలసిన అవసరం లేకపోవడం". అందువల్ల రసం నిబంధించాలని నిశ్చయించుకొని ఉన్న కవి ఆ వాసనను అనగా రసబంధాధ్యవసాయవాసనను, ఉల్లంఘించి, మరొక ప్రయత్నం అవలంబించి ఏ అలంకారాన్ని సమకూరుస్తాడో అది రసానికి అంగం కాదు. బుద్ధిపూర్వకంగా యమకాన్ని అవిచ్ఛిన్నంగా కూర్చే టప్పుడు శబ్దవిశేషాలను వెదకడంకోసం, తప్పనిసరిగా, మరొక ప్రయత్నాన్ని స్వీకరించడం వచ్చి పడుతుంది.

అలఙ్కారేతి - ఇది ఇతర అలంకారాలవిషయంలో కూడా సమానమే కదా అని అనడానికి వీలు లేదు. ఎందుచేత ననగా, బాగా పరిశీలించి చూస్తే కూర్చడానికి చాలా కష్టమైనవే అన్నట్లు కనబడినా, ఇతరాలంకారాలు, రసంమీద బుద్ధిని ఏకాగ్రం చేసిన ప్రతిభావంతుడైన కవికి మేం ముందు, మేం ముందు అని పోటీపడుతూ వచ్చి

పడతాయి. ఉదాహరణకి- కాదంబరిలో కాదంబరిని చూచిన సమయంలోను, సేతుబంధకావ్యంలో రాముని మాయానిర్మితశిరస్సును చూచి సీత వ్యాకులత చెంది నప్పుడూను. ఇది యుక్తమే కూడ - ఎందువల్లననగా - రసాలు వాచ్యవిశేఎషాలచేతా (విశిష్టమైన ఎ-చ్యార్థాలచేతా) వాటిని ప్రతిపాదించే శబ్దాలచేతా ఆక్షేపించబడతాయి (ఊహించబడతాయి). రూపకాద్యలంకారాలు ఆ రసాన్ని ప్రకాశింపచేసే (తత్ప్రకాశినః) వాచ్యవిశేషాలే. అందుచేత అవి రసాభివ్యక్తికి బహిరంగాలు కాదు; (అంతరంగాలే). యమకాలలోను, మురజచక్రబంధాదిదుష్కరమార్గాలలోను అది (బహిరంగత్వం) తప్పకుండా ఉంది. కొన్ని యమకాదులు, రసం ఉన్నవి, ఏవి కనబడుతున్నాయో అక్కడ యమకాదులకే అంగిత్వం, రసాదులు వాటికి అంగాలు, రసాభాసలో అయితే యమకాదులకు అంగత్వం కూడా అవిరుద్ధమే. అయితే ఎక్కడైతే రసం అంగిగా వ్యంగ్యం అవుతుందో అక్కడ యమకాదులు, వేరే ప్రయత్నంచేత సంపాదించబడినవి అవడంచేత, రసానికి అంగాలు కావు. (అక్కడ రసం దారి రసానిదే, యమకాదుల దారి యమకాదులదే. యమకాదులు రసాన్ని పోషించడం అనేది అక్కడ ఉండదు అని అర్థం).

లోచనం

లక్షణమితి - వ్యాపకమిత్యర్థః. 'ప్రబన్ధేన క్రియమాణః' ఇతి సంబన్ధః. అత ఏవ బుద్ధిపూర్వకత్వమవశ్యంభావీతి బుద్ధిపూర్వకశబ్దః ఉపాత్తః. రససమవధానాదన్యో యత్నో యత్నాన్తరమ్. నిరూప్యమాణాని సన్తి దుర్ఘటాని. బుద్ధిపూర్వం చికీర్షితాన్యపి కర్తుమశక్యానీత్యర్థః. తథా నిరూప్యమాణే దుర్ఘటనాని; కథమేతాని రచితాని ఇత్యేవం విస్మయావహానీత్యర్థః. అహం పూర్వః అగ్ర్య ఇత్యర్థః. అహమాదౌ అహమాదౌ ప్రవర్తే ఇత్యర్థః. అహంపూర్వం ఇత్యస్య భావః అహంపూర్వికా. అహమితి నిపాతః విభక్తిప్రతిరూపకః అస్మదర్థవృత్తిః ఏతదితి:- అహంపూర్వికయా పరాపతనమిత్యర్థః.

బాలానందిని

లక్షణమితి:- అన్నింటికీ వర్తించేది (వ్యాపకం) అని అర్థం. 'ప్రబన్ధేన క్రియమాణే' అని అన్వయం. అందువల్లనే, అనగా ప్రబంధంచేత, అనగా అవిచ్ఛిన్నంగా, వరసగా చేయబడడంవల్లనే అలా చేయడానికి తప్పకుండా బుద్ధిపూర్వకత్వం ఉంటుంది అని చెప్పడంకోసం "బుద్ధిపూర్వక" శబ్దం గ్రహించబడింది. 'యత్నాన్తరమ్' అనగా రసంమీద

చిత్తాన్ని ఏకాగ్రం చేయడంకంటె భిన్నమైన యత్నం అని అర్థం. "నిరూప్యమాణాని సన్తి దుర్ఘటాని నిరూప్యమాణదుర్ఘటాని". బుద్ధిపూర్వకంగా చేయ నిచ్ఛయించబడినా కూడా చేయడానికి శక్యం కానివి అని అర్థం. అట్లే - పరిశీలించగా దుర్ఘటమైనవి, వీటిని ఎలా రచించకలిగాడు అని ఆశ్చర్యం కలిగించేవి అని అర్థం "అహంపూర్వః" అనగా ముందు ఉండేవాడు అని అర్థం, నేను ముందు చేస్తాను, నేను ముందు చేస్తాను అని ముందు ఉండేవాడు అని అర్థం. "అహంపూర్వస్య భావః అహంపూర్వికా" అని విగ్రహం. అలా అంటూ ముందు ఉండేవాని ధర్మం అని అర్థం. అహమ్ అనేది విభక్తివలె కనబడే నిపాత (అవ్యయం). నేను అని దీని అర్థం. యుక్తం చైతత్ అన్నప్పుడు 'ఏతత్' అనగా ఇలా 'అహంపూర్వికతో వచ్చిపడడం' అని అర్థం.

## ధ్వన్యాలోకం

అస్యైవార్థస్య సంగ్రహశ్లోకాః -

శ్లో. రసవన్తి హి వస్తూని సాలంకారాణి కాని చిత్,
ఏకేనైవ ప్రయత్నేన నిర్వర్త్యన్తే మహాకవేః.

శ్లో. యమకాదినిబన్ధే తు పృథగ్యత్నోఽస్య జాయతే,
శక్తస్యాపి రసేఽఙ్గత్వం తస్మాదేషాం న విద్యతే.

శ్లో. రసాభాసాఙ్గభావస్తు యమకాదేర్న వార్యతే,
ధ్వన్యాత్మభూతే శృఙ్గారే త్వఙ్గతా నోపపద్యతే.

బాలానందిని

అస్యేతి - ఈ అర్థాన్నే సంగ్రహించే శ్లోకాలు ఇవి - రసేతి :- కానిచిత్= కొన్ని, సాలంకారాణి= అలంకారాలతో కూడిన, రసవన్తి= రసం గల, వస్తూని= వస్తువులు, మహాకవేః= మహాకవియొక్క, ఏకేన ప్రయత్నేనైవ= ఒక్క ప్రయత్నంచేతనే, నిర్వర్త్యన్తే= జరపబడతాయి.

యమకేతి - యమకాదినిబన్ధే తు= యమకాదులను కూర్చడంలో అయితే, శక్తస్యాపి= సమర్థుడైనను, అస్య= కవికి, పృథక్= వేరుగా, యత్నః = ప్రయత్నం, జాయతే= కలుగును. తస్మాత్= ఆ కారణంవల్ల, ఏషామ్=ఈ అలంకారాదులకు, రసే = రసమునందు, అఙ్గత్వమ్= అంగత్వము, న విద్యతే= లేదు.

రసాభాసేతి - యమకాదేః= యమకాదికానికి, రసాభాసాఙ్గభావస్తు= రసాభాసానికి అంగత్వం అయితే, న వార్యతే= నివారించబడదు. ధ్వన్యాత్మభూతే= ధ్వనికావ్యానికి ఆత్మయైన, శృఙ్గారే తు= శృంగారంలో అయితే, అఙ్గతా= (యమకాదులకు) అంగత్వం, న ఉపపద్యతే = ఉపపన్నం కాదు, కుదరదు.

లోచనం

కానిచిదితి:- కాలిదాసాదికృతానీత్యర్థః. శక్తస్యాపి పృథగ్యత్నం జాయతే ఇతి సంబన్ధః. ఏషామితి - యమకాదీనామ్. "ధ్వన్యాత్మభూతే శృఙ్గారే" ఇతి యదుక్తం తత్ ప్రాధాన్యేన అర్ధశ్లోకేన సంగృహ్ణీతే -ధ్వన్యాత్మభూతే. ఇతి .16

బాలానందిని

కాని చిదితి - కాలిదాసాదులు రచించినవి అని అర్థం. "శక్తస్యాపి పృథక్ యత్నః జాయతే" అని అన్వయం. ఏషామితి - యమకాదుల యొక్క. "ధ్వన్యాత్మభూతే శృఙ్గారే"అని (15వకారిక) చెప్పినదానినే ప్రధానంగా, ధ్వన్యాత్మభూతే ఇత్యాది శ్లోకార్థం చేత సంగ్రహిస్తున్నాడు. 16

ధ్వన్యాలోకం

ఇదానీం ధ్వన్యాత్మభూతస్య శృఙ్గారస్య వ్యఞ్జకః అలంకారవర్గః ఆఖ్యాయతే-

కా. ధ్వన్యాత్మభూతే శృఙ్గారే సమీక్ష్య వినివేశితః,
రూపకాదిలంకారవర్గ ఏతి యథార్థతామ్. 17

అలంకారో హి బాహ్యాలంకారసామ్యాత్ అఙ్గినః చారుత్వహేతుః ఉచ్యతే. వాచ్యాలంకారవర్గశ్చ రూపకాదిః యావానుక్తః వక్ష్యతే చ కైశ్చిత్, అలంకారాణా మనన్తత్వాత్, స సర్వోఽపి యది సమీక్ష్య వినివేశ్యతే తదలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య ధ్వనేః అఙ్గినః సర్వస్యైవ చారుత్వహేతుః నిష్పద్యతే.

బాలానందిని

ఇదానీమితి :- ఇప్పుడు ధ్వనికి ఆత్మయైన శృంగారాన్ని వ్యంజింపచేసే అలంకారాల సముదాయం చెప్పబడుతున్నది -

ధ్వన్యాత్మేతి - ధ్వన్యాత్మభూతే = ధ్వనికావ్యానికి ఆత్మయైన, శృఙ్గారే= శృంగారంలో, సమీక్ష్య= బాగా పరిశీలించి, వినివేశితః= కూర్చబడిన, రూపకాదిః= రూపకం మొదలైన, అలంకారవర్గః= అలంకారసముదాయం, యథార్థతామ్= యథార్థత్వాన్ని, అలంకరించేది అనే పేరుయొక్క సార్థకత్వాన్ని, ఏతి = పొందును.

అలంకారః ఇతి:- బాహ్యాలైన ఆభరణాలతో సామ్యంవల్ల అలంకారం అంగికి చారుత్వహేతు వని చెప్పబడుచున్నది. రూపకం మొదలైన మొత్తం అలంకారసముదాయం ఎంత ఉందో, అలంకారాలు అనంతాలు కాబట్టి మునుముందు ఏ అలంకారసముదాయం ఇతరులచేత చెప్పబడ నున్నదో, అది అంతా కూడా బాగా పరిశీలించి కూర్చబడిన ట్లయితే, అప్పుడు అంగి అయిన సమస్తమైన అలక్ష్యక్రమవ్యంగ్యకావ్యమైన ధ్వనికావ్యానికీ కూడ చారుత్వహేతువు అవుతుంది.

లోచనం

ఇదానీమితి - హేయవర్గః ఉక్తః, ఉపాదేయవర్గస్తు వక్తవ్య ఇతి భావః. వ్యఞ్జక ఇతి. యశ్చ యథా చేత్యధ్యాహారః. యథార్థతామితి - చారుత్వహేతుతామిత్యర్థః. ఉక్త ఇతి- భామహాదిభిదలంకారలక్షణకారైః. వక్ష్యతే చేత్యత్ర హేతుమాహ- అలంకారాణామనన్తత్వాదితి. ప్రతిభానన్త్యాత్ అన్యైరపి భావిభిః కైశ్చిదిత్యర్థః. 17

బాలానందిని

ఇదానీమితి - ఇంతవరకు పరిహరించవలసిన అలంకారాల వర్గం చెప్పబడింది. స్వీకరించదగినవాటి వర్గం ఇప్పుడు చెప్పవలసి ఉంది అని భావం. వ్యఞ్జక ఇతి:- 'యశ్చ, యథా' అని అధ్యాహారం తెచ్చుకోవాలి. "ఏది ఎట్లు వ్యంజకమో" అని అర్థం చెప్పుకోవాలి అని భావం. యథార్థతామితి - సౌందర్యహేతుత్వాన్ని అని అర్థం. ఉక్తః ఇతి :- భామహుడు మొదలైన అలంకారలక్షణకారులచేత చెప్పబడినది అని అర్థం. చెప్పబడగలదు కూడ అన్నదానికి 'అలంకారాణామనన్తత్వాత్' అనే దానిని హేతువుగా చెపుతున్నాడు. ప్రతిభ అనంతమైనది,' అందువల్ల రాబోయే కొందరు ఇతర కావ్యలక్షణ కారులచేత కూడ చెప్పబడును అని అర్థం. 17

ధ్వన్యాలోకం

ఏషా చాస్య వినివేశనే సమీక్షా-

కా. వివక్షా తత్పరత్వేన నాఙ్గిత్వేన కదాచన,
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా. 18
నిర్వ్యూఢావపి చాఙ్గత్వే యత్నేన ప్రత్యవేక్షణమ్,
రూపకాదేరలఙ్కారవర్గస్యాఙ్గత్వసాధనమ్. 19

రసబన్ధేషు అత్యాదృతమనాః కవిః యమ్ అలంకారం తదఙ్గతయా వివక్షతి, యథా -

బాలానందిని

ఏషా ఇతి - ఈ అలంకారవర్గంయొక్క కూర్పులో జాగర్తగా పరిశీలించే విధానం ఇది - వివక్షా ఇతి:- తత్పరత్వేన= రసాదిపరంగానే, వివక్షా= చెప్పవలె ననే ఇచ్ఛ, కదాచన= ఎన్నడూ కూడ, అఙ్గిత్వేన= అంగిగా (ఆ అలంకారాలే అంగిగా ఉండే టట్లుగా) న= వివక్షలేకపోవడం, కాలే చ= తగిన కాలంలో, గ్రహణత్యాగౌ= గ్రహించడం, విడవడం, నాతినిర్వహణైషితా= అతిగా నిర్వహించాలని కోరకపోవడం, నిర్వ్యూఢౌ అపి= నిర్వహించినా కూడ, అఙ్గత్వే= అంగత్వంలో, యత్నేన= ప్రయత్నంచేత, ప్రత్యవేక్షణమ్= పరీక్షించడం, రూపకాదేః=రూపకం మొదలైన, అలఙ్కారవర్గస్య= అలంకారసముదాయంయొక్క అఙ్గత్వసాధనమ్= అంగత్వానికి సాధనము.

రసేతి - రసబంధాదులయందు చాలా ఆదరంతో కూడిన మనస్సుగల కవి ఏ అలంకారాన్ని దానికి అంగంగా చెప్పదలచుకుంటాడో - ఎట్లనగా -

లోచనం

సమీక్షేతి :- సమీక్ష్యేత్యనేన శబ్దేన కారికాయాముక్తేతి భావః. శ్లోకపాదేషు చతుర్షు శ్లోకార్ధే చాఙ్గత్వసాధనమిదమ్. రూపకాదేరితి ప్రత్యేకం సంబన్ధః. యమలఙ్కారం తదఙ్గతయా వివక్షతి నాఙ్గిత్వేన, యమవసరే గృహ్ణాతి, యమనవసరే త్యజతి, యం నాత్యన్తం నిర్వోఢుమ్ ఇచ్ఛతి, యం యత్నాదఙ్గత్వేన ప్రత్యవేక్షతే, సఏవముపనిబధ్యమానః రసాభివ్యక్తి హేతుర్భవతీతి వితతం మహావాక్యమ్. తన్మహావాక్యమధ్యే చ ఉదాహరణావకాశమ్, ఉదాహరణస్వరూపమ్, తద్యోజనం, తత్సమర్థనం చ నిరూపయితుం గ్రన్థాన్తరమితి వృత్తిగ్రన్థస్య సంబన్ధః.

బాలానందిని

సమీక్షేతి - పై కారికలో సమీక్ష్య అనే శబ్దంచేత చెప్పబడిన సమీక్ష అని భావం. నాలుగు శ్లోకపాదాలలోను, శ్లోకార్ధంలోను ఇది అంగత్వసాధనం. అనగా ఒకటిన్నర శ్లోకాలలో అలంకారాలకి అంగత్వం ఎలా ఏర్పరచాలో చెప్పబడింది. "రూపకాదేః అలంకారవర్గస్య" అనేది ఒక్కొక్కదానితో సంబంధిస్తుంది. అనగా "రూపకాదేః అలంకారవర్గస్య తత్పరత్వేన వివక్షా అఙ్గత్వసాధనమ్" ఇత్యాదివిధంగా ఈ సార్ధశ్లోకంలో ఉన్న అయిదువాక్యాంశాలతో వేరు వేరుగా అన్వయించాలి అని అర్థం.

వృత్తిలో "రసబన్ధేషు అత్యాదృతమనాః" ఇత్యాదివాక్యాలలో యచ్ఛబ్దాలు ప్రయోగించి ఉదాహరణలు ప్రత్యుదాహరణలు చూపుతూ, వాటిని సమన్వయిస్తూ "శ్యామాస్వఙ్గం" ఇత్యాది శ్లోకం తరవాత "స ఏవముపనిబధ్యమానః" ఇత్యాదివాక్యంలో తచ్ఛబ్దం ఉపయోగించాడు. పై యచ్ఛబ్దాలన్నింటికీ ఆ తచ్ఛబ్దంతో అన్వయం గాన ఈ వాక్యాలు అన్నీ కలిసి ఒక విస్తృతమైన మహావాక్యం అని వివరిస్తున్నాడు - యమ్ ఇత్యాది: "ఏ అలంకారాన్ని అంగిగా కాక ఆ రసాదికి అంగంగా చెప్పదలుస్తాడో, దేనిని తగు సమయంలో స్వీకరిస్తాడో, దేనిని తగని సమయంలో విడిచివేస్తాడో, దేనిని ఎక్కువగా నిర్వహించడానికి ఇచ్ఛయించడో, దేనిని అంగంగా ఉండే టట్లు ప్రయత్నపూర్వకంగా పర్యవేక్షిస్తూ ఉంటాడో, ఈ విధంగా కూర్చబడే అలంకారం రసాభివ్యక్తికి హేతువు అవుతుంది అని విస్తృతమైన మహావాక్యం. ఆ మహావాక్యం మధ్యలో ఉన్న మిగిలిన గ్రంథం అంతా ఉదాహరణావకాశాన్ని, ఉదాహరణస్వరూపాన్ని, దాని సమన్వయాన్నీ, దాని సమర్థనాన్నీ నిరూపించడంకోసం ఉంది అని వృత్తిగ్రంథానికి సంబంధం (అన్వయం).

## ధ్వన్యాలోకం

శ్లో. చలాపాఙ్గాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదు కర్ణాన్తికచరః,
కరౌ వ్యాధూన్వత్యాః పిబసి రతిసర్వస్వమధరం
వయం తత్త్వాన్వేషాన్మధుకర హతాస్త్వం ఖలు కృతీ. (29)

అత్ర హి భ్రమరస్వభావోక్తిః అలంకారః రసానుగుణః.

బాలానందిని

చలేతి:- ఇది అభిజ్ఞానశాకుంతలంలో తుమ్మెద శకుంతలమీదికి వస్తూండగా అక్కడే ఉండి చాటునుంచి చూస్తున్న దుష్యంతుడు ఆ తుమ్మెదతో అంటూన్న మాటలు. మధుకర= ఓ! తుమ్మెదా! చలాపాఙ్గామ్= చంచలమైన నేత్రాంతాలు గల, దృష్టిమ్= దృష్టిని, వేపథుమతీమ్= కంపం గల ఈ శకుంతలనూ, "చలాపాఙ్గాం దృష్టిమ్" అన్న తరవాత 'వేపథుమతీమ్' అనేదానిని దృష్టికి విశేషణంగా అన్వయించడం కంటె శకుంతలను నిర్దేశిస్తున్నట్లుగా చెప్పడం మంచిది. "చలాపాఙ్గం దృష్టః" అనే పాఠం ఇంకా మంచిది. చంచలములైన నేత్రాంతాలు కలుగునట్లు చూడబడుచూ అని అర్థం. బహుశః= అనేక పర్యాయాలు, స్పృశసి= స్పృశిస్తున్నావు. రహస్యాఖ్యాయీవ = రహస్యం చెపుతూన్నదానవు వలె, కర్ణాన్తికచరః= చెవుల దగ్గర తిరుగుతూ, మృదు= మృదువుగా, స్వనసి=ధ్వని చేస్తున్నావు. కరౌ=చేతులను, వ్యాధున్వత్యాః= విదిపివేయు చున్న ఈమె యొక్క, రతిసర్వస్వమ్= రతిసర్వస్వమైన, అధరమ్= అధరోష్ఠాన్ని, పిబసి= పానం చేస్తున్నావు. వయమ్= మేము, తత్త్వాన్వేషాత్= ఆమె ఎవరి కన్య అనే తత్త్వాన్ని అన్వేషించడంవల్ల, హతాః= నిరాశుల మైనాము. త్వమ్= నువ్వు, కృతీ ఖలు= పుణ్యాత్ముడవు కదా?

అత్రేతి:- ఇక్కడ భ్రమరస్వభావాన్ని వర్ణించే స్వభావోక్త్యలంకారం రసానికి అనుగుణంగా ఉంది.

లోచనం

చలాపాఙ్గామితి - హే మధుకర వయమేవంవిధాభిలాషచాటుప్రవణా అపి, తత్త్వాన్వేషణాత్ వస్తువృత్తే అన్విష్యమాణే హతాః ఆయాసమాత్రపాత్రీ భూతాః జాతాః. త్వం ఖల్వితి నిపాతేన అయత్నసిద్ధం తవైవ చరితార్థత్వమ్ ఇతి శకున్తలాం ప్రత్యభిలాషిణః దుష్యన్తస్యేయముక్తిః. తథా హి - కథమేతదీయకటాక్షవిషయా భూయాస్మ? కథమేషా అస్మదభిప్రాయవ్యఞ్జకం రహోవచనమాకర్ణ్యేత్? కథం ను హఠాత్ అనిచ్ఛన్త్యా అపి పరిచుమ్బనం విధేయాస్మ? ఇతి యదస్మాకం మనోరాజ్యపదవీమ్ అధిశేతే తత్తవాయత్నసిద్ధమ్. భ్రమరో హి నీలోత్పలధియా తదాశఙ్కాకరీం దృష్టిం పునః పునః స్పృశతి. శ్రవణావకాశపర్యన్తత్వాచ్చ నేత్రయోః ఉత్పలశఙ్కానపగమాత్ తత్రైవ దన్ధ్వన్యమానః ఆస్తే. సహజసౌకుమార్యకాతరాయాశ్చ రతినిధానభూతం

వికసితారవిన్దకువలయామోదమధురం పిబతీతి భ్రమరస్వభావోక్తిరలంకారః అఙ్గతామేవ ప్రకృతరసస్య ఉపగతః. అన్యే తు భ్రమరస్వభావే ఉక్తిర్యస్యేతి భ్రమరస్వభావోక్తిరూపవ్యతిరేకః ఇత్యాహుః.

బాలానందిని

చలాపాఙ్గేతి - ఓ! మధుకరమా! ఈ విధమైన అభిలాషయందు చాటువాక్యాలయందు ఆసక్తి కలవార మైనా మేము తత్త్వాన్వేషణాత్= వస్తువృత్తం, యథార్థవిషయం అన్వేషించడంవల్ల, అనగా ఉన్న పరిస్థితిని పరిశీలిస్తే, (ఇది పైన చెప్పిన అర్థంకంటె వేరుగా ఉంది. బాగున్నది. ఆ అర్థం చెప్పుకున్నా పూర్వాపరసందర్భాలను పట్టి దోషం లేదు). హతాః= కేవలం ఆయాసానికి పాత్రులంగా అయినాం. త్వంఖలు అనే నిపాతచేత(ఖలు) నీకే చరితార్థత్వం అప్రయత్నసిద్ధంగా లభించింది అని, ఇది శకుంతలయందు అభిలాష గల దుష్యంతుని మాట. ఇది యుక్తమే - ఆమె కటాక్షానికి ఎలా విషయం అవుదాం. (ఆమె కటాక్షవీక్షణాలు మనమీద ఎలా ప్రసరిస్తాయి) మన అభిలాషను సూచించే రహస్యంగా చెప్పే మాటలను ఆమె ఎలా వింటుంది; ఆమె అంగీకరించకపోయినా హటాత్తుగా పట్టుకొని ఆమెను ఎలా చుంబించాలి, అని మా మనోరాజ్యపదవిలో ఉన్న దంతా నీకు ఏ ప్రయత్నం చేయకుండానే సిద్ధించింది. తుమ్మెద నల్లకలువ అనే బుద్ధితో ఆ భ్రాంతిని కలిగించే దృష్టిని మాటిమాటికి స్పృశిస్తున్నది. నేత్రాలు చెవులదగ్గర ఉన్న ప్రదేశందాకా (చెవులదాకా) ఉండడంవల్ల ఉత్పలాలనే భ్రాంతి తొలగక 'గుంయ్ గుంయ్' అంటూ అక్కడే ఉంటూంది. సహజమైన సౌకుమార్యంచేత కలిగిన భయంతో కంగారుపడుతూన్న ఆమెయొక్క, రతికి నిధానం (నిధి) అయిన వికసించిన పద్మాల, కలవల సువాసనవంటి సువాసనతో మధురంగా ఉన్న అధరోష్ఠాన్ని పానం చేస్తూన్నది అని ఈ భ్రమరస్వభావోక్త్యలంకారం ప్రకృతరసానికి అలంకారత్వాన్నే పొందింది. అన్యే తు ఇతి:- కొందరు "భ్రమరస్వభావే ఉక్తిః యస్య సః భ్రమరస్వభావోక్తిః" అనే విగ్రహాన్ని గ్రహించి ఇక్కడ రూపక-వ్యతిరేకాలంకారా లని చెపుతున్నారు.

వివరణ:- భ్రమరంమీద నాయకత్వాన్ని ఆరోపించడంచేత రూపకం అనీ, చతుర్థపాదంలో "నువ్వు నాకంటె అదృష్టం ఉన్నదానవు" అని చెప్పడంచేత వ్యతిరేకాలంకారం అని వాళ్ల అభిప్రాయం. అయితే నిజానికి ఇక్కడ భ్రమరస్వభావాన్ని వర్ణించడంచేత నాయకవ్యవహారం గమ్యం అవుతున్నది గాన ఇది సమాసోక్త్యలంకారమే

అనే అభిప్రాయంతో దీనిని ఇతరుల మతం అని చెప్పాడు.

## ధ్వన్యాలోకం

"నాఙ్గిత్వేనేతి" - న ప్రాధాన్యేన. కదాచిద్రసాదితాత్పర్యేణ వివక్షితోఽపి హ్యలంకారః కశ్చిదఙ్గిత్వేన వివక్షితో దృశ్యతే. యథా -

శ్లో. చక్రాభిఘాతప్రసభాజ్ఞయైవ చకార యో రాహువధూజనస్య,
ఆలిఙ్గనోద్దామవిలాసవన్ధ్యం రతోత్సవం చుమ్బనమాత్రశేషమ్. (30)

అత్ర హి పర్యాయోక్తస్యాఙ్గిత్వేన వివక్షా రసాదితాత్పర్యే సత్యపీతి.

## బాలానందిని

నేతి - 'న అఙ్గిత్వేన' అనగా ప్రాధాన్యంచేత కాదు అని అర్థం. ఒకప్పుడు రసాదులందు తాత్పర్యంచేత (రసాదులకే అలంకారంగా ఉండాలి అనే ఉద్దేశ్యంచేత) చెప్పదలచిన దైనా ఒక అలంకారం అంగిగా వివక్షిత మైనట్లు (చెప్పదలపబడినట్లు) కనబడుతుంది. ఎట్లనగా-

చక్రేతి - యః= ఏ శ్రీ మహావిష్ణువు, చక్రాభిఘాతప్రసభాజ్ఞయైవ= చక్రం చేత కొట్టడం అనే బలాత్కారంగా (తొందరగా) ఇచ్చిన ఆజ్ఞచేతనే, రాహువధూజనస్య= రాహువుయొక్క స్త్రీలయొక్క, రతోత్సవమ్ = సురతోత్సవాన్ని, ఆలిఙ్గనోద్దామవిలాసవన్ధ్యమ్= ఆలింగనరూపమైన అతితీవ్రమైన విలాసలతో శూన్యమైనదానినిగాను, చుమ్బనమాత్రశేషమ్= చుంబనం మాత్రమే శేషం కలదానినిగాను, చకార= చేసెనో!

అత్రేతి - ఇక్కడ రసాదుల విషయంలో తాత్పర్యం ఉన్నా పర్యాయోక్తాన్ని అంగిగా చెప్పాలనే ఇచ్ఛ ఉన్నది.

## లోచనం

చక్రాభిఘాత ఏవ ప్రసభాజ్ఞా అనుల్లఙ్ఘనీయః నియోగః తయా యః రాహుదయితానాం రతోత్సవం చుమ్బనమాత్రశేషం చకార; యతః ఆలిఙ్గనమ్ ఉద్దామమ్ ప్రధానం యేషు విలాసేషు తైః వన్ధ్యః శూన్యోఽసౌ రతోత్సవః. అత్రాహ కశ్చిత్ - "పర్యాయోక్తమేవాత్ర కవేః ప్రాధాన్యేన వివక్షితమ్; న తు రసాది; తత్కథముచ్యతే రసాదితాత్పర్యే సత్యపి ఇతి? నైవమ్; వాసుదేవప్రతాపో హ్యత్ర వివక్షితః. స చాత్ర చారుత్వహేతుతయా న చకాస్తి. అపి తు పర్యాయోక్తమేవ. యద్యపి చాత్ర కావ్యే న

కాచిద్దోషాశఙ్కా, తథాపి దృష్టాన్తవదేతత్ - యత్ ప్రకృతస్య పోషణీయస్య స్వరూప తిరస్కారకః అఙ్గభూతో ఽ ప్యలంకారః సంపద్యతే. తతశ్చ క్వచిదనౌచిత్యమాగచ్ఛతీతి అయం గ్రన్థకృత ఆశయః. తథా చ గ్రన్థకార ఏవమగ్రే దర్శయిష్యతి - "మహాత్మనాం దూషణోద్ఘోషణమ్ ఆత్మన ఏవ దూషణమ్ ఇతి నేదం దూషణోదాహరణం దత్తమ్".

బాలానందిని

చక్రాభిఘాత :- ఇతి చక్రాభిఘాతమే ప్రసభాజ్ఞ, ఉల్లంఘించడానికి శక్యం కాని ఆజ్ఞ. దానిచేత ఏ మహావిష్ణువు రాహువుయొక్క ప్రియురాళ్లయొక్క రతోత్సవాన్ని చుంబనం మాత్రమే మిగిలినదానినిగా చేశాడో? ఎందువలన అనగా ఆలింగనమే, ఉద్దామమ్ = ప్రధానమైనది ఏ విలాసలయందో వాటితో శూన్యమైనది ఈ రతోత్సవం, అత్రేతి - ఇక్కడ ఒకడు - "కవి ఇక్కడ పర్యాయోక్తాలంకారాన్నే ప్రధానంగా చెప్పదలచాడు? అలాంటప్పుడు రసాదులందు తాత్పర్యం ఉన్నాకూడ అని ఎలా అంటున్నారు?" అని అన్నాడు. ఇట్లు కాదు. ఇక్కడ చెప్పదలచినది వాసుదేవుని ప్రతాపం కదా? అది ఇక్కడ చారుత్వానికి హేతువుగా ప్రకాశించడం లేదు? మరేమనగా పర్యాయోక్తమే చారుత్వహేతువుగా ప్రకాశిస్తున్నది. ఈ వాక్యంలో (శ్లోకంలో) దోషాశంక ఏదీ లేకపోయినా ఇది - అంగం అయిన అలంకారం, కూడ ప్రకృతమైన, పోషించదగిన, దాని స్వరూపాన్ని అణచివేసేదిగా ఉంటుంది అని చెప్పడానికి దృష్టాంతంగా చెప్పబడింది. అందువల్ల కొన్ని చోట్ల అనౌచిత్యం వస్తుంది అని మాత్రమే గ్రంథకారుని ఆశయం. అంతేనే కాని ఈ శ్లోకంలో దోషం ఉందని కాదు. అందుచేతనే గ్రంథకారుడు మున్ముందు - "మహాత్ముల దూషణాలను ఎత్తి చూపడం తనను దూషించుకొనడమే అవుతుంది" అని చెప్పబోవుచున్నాడు. అందుచేత దీనిని దూషణానికి ఉదాహరణంగా ఇవ్వలేదు.

ధ్వన్యాలోకం

అఙ్గత్వేన వివక్షితమపి యమవసరే గృహ్ణాతి నానవసరే. అవసరే గృహీతిర్యథా-

శ్లో. ఉద్దామోత్కలికాం విపాణ్డురరుచం ప్రారబ్ధజృమ్భాం క్షణా
దాయాసం శ్వసనోద్గమైరవిరలైరాతన్వతీమాత్మనః,
అద్యోద్యానలతామిమాం సమదనాం నారీమివాన్యాం ధ్రువం
పశ్యన్ కోపవిపాటలద్యుతి ముఖం దేవ్యాః కరిష్యామ్యహమ్. (31)

ఇత్యత్ర ఉపమాశ్లేషస్య.

బాలానందిని

అఙ్గత్వేనేతి - అంగంగా చెప్పదలచబడిన దైనా దేనిని తగిన సమయంలోనే గ్రహిస్తాడు కాని అసమయంలో గ్రహించడో - సమయంలో గ్రహించడం ఎట్లనగా - ఉద్దామేతి :- ఇది రత్నావళినాటికలోని శ్లోకం. ఉద్దామోత్కలికామ్ = అధికమైన బయలుదేరుతున్న మొగ్గలు కలది, (నాయిక పక్షంలో అత్యధికమైన ఉల్లాసం, ఉత్కంఠ, ఉత్సాహం కలది అని అర్థం), విపాణ్డురరుచమ్ = తెల్లని కాంతి గలది, క్షణాత్ = క్షణకాలంలో, ప్రారబ్ధజృమ్భామ్ = ప్రారంభించబడిన విజృంభణం కలది (ప్రారంభించబడిన ఆవులింతలు గలది). అవిరలైః = అధికమైన, శ్వసనోద్గమైః = వాయుసంచారముల చేత, (నిట్టూర్పులు వెడలడాలచేత), ఆత్మనః = తనకు, ఆయాసమ్ = ఆయాసాన్ని, తన్వతీమ్ = చేస్తూన్నదీ అయిన, ఇమామ్ = ఈ, ఉద్యానలతామ్ = ఉద్యానలతను, సమదనామ్ = మదనవృక్షంతో కూడినది (మన్మథునితో కూడిన), అన్యాం నారీమివ = మరి యొక స్త్రీనివలె, పశ్యన్ = చూస్తూన్న, అహమ్ = నేను, అద్య = ఇప్పుడు, దేవ్యాః ముఖమ్ = దేవి ముఖాన్ని, కోపవిపాటలద్యుతి = కోపంచేత ఎఱ్ఱనైన కాంతి గలదానినిగా, కరిష్యామి = చేయగలను. ధ్రువమ్ = నిశ్చయము.

అత్రేతి - ఇక్కడ ఉపమాశ్లేషల కూర్పు (రసాంగంగా సరియైన సమయంలో (స్థానంలో) చేయబడింది).

లోచనం

ఉద్దామాః ఉద్గతాః కలికాః యస్యాః ఉత్కలికాశ్చ రుహరుహికాః. క్షణాత్ తస్మిన్నేవ్వాసరే ప్రారబ్ధా జృమ్భా వికాసః యయా జృమ్భా చ మన్మథకృతః అఙ్గమర్దః, శ్వసనోద్గమైః వసన్తమారుతోల్లాసైః ఆత్మనః లతాలక్షణస్య, ఆయాసనమ్ ఆన్దోలనయత్నమ్ ఆతన్వతీమ్; నిఃశ్వాసపరమ్పరాభిశ్చ ఆత్మనః ఆయాసం హృదయస్థితం సన్తాపమ్ ఆతన్వతీం ప్రకటీకుర్వాణామ్, సహ మదనాఖ్యేన వృక్షవిశేషేణ మదనేన కామేన చ. అత్రోపమాశ్లేషః ఈర్ష్యావిప్రలమ్భస్య భావినః మార్గపరిశోధకత్వేన స్థితః చర్వణాభిముఖ్యం కుర్వన్నవసరే రసస్య ప్రముఖభావదశాయాం పురః సరాయమాణః గృహీత ఇతి భావః. అభినయోఽప్యత్ర ప్రాకరణికే ప్రతిపదమ్. అప్రాకరణికే తు వాక్యార్థాభినయేన అపాఙ్గాదినా. న తు సర్వథా నాభినయః ఇత్యలమవాన్తరేణ.

ధ్రువశబ్దశ్చ భావీర్ష్యావకాశప్రదానజీవితమ్.

బాలానందిని

ఉద్దామా ఇతి :- అధికమైన, బయలుదేరిన మొగ్గలు దేనికో అది. ఉత్కలికాః అనగా రుహరుహికలు, ఉత్కంఠ అని అర్థం. క్షణాత్ = ఆ సమయంలోనే, ప్రారంభించబడిన, జృమ్భా = వికాసము, దేనిచేతనో అది. జృమ్భా అనగా మన్మథపారవశ్యంవల్ల అంగమర్దనం. శ్వసనోద్గమైః = వసంతవాయువుల ఉల్లాసాలచేత, ఆత్మనః = లతయైన తనయొక్క, ఆయాసమ్ = ఊగే ప్రయత్నాన్ని, చేస్తూన్నది, నిట్టూర్పుల పరంపరలచేత, ఆయాసమ్ = తన హృదయంలో ఉన్న సంతాపాన్ని, ఆతన్వతీమ్ = ప్రకటిస్తూన్నది. మదనం అనే ఒకానొక వృక్షంతో కూడినది; కామంతో కూడినది.

అత్రేతి - ఇక్కడ ఉపమాసహితమైన శ్లేషాలంకారం రాబోయే (ద్వితీయాంకం చివర వర్ణించబోయే) వాసవదత్తాగతేర్ష్యాజన్యవిప్రలంభానికి దారిలో అడ్డు తొలగిస్తూ (మార్గపరిశోధకత్వేన) దానిని చర్వణకి అభిముఖం చేస్తూ, అవసరంలో, అనగా రసం ప్రముఖం కాబోయే ముందు (రసచర్వణ ప్రారంభం కాబోయే ముందు) ముందు నడుస్తూండేటట్లు (పురఃసరాయమాణః) గ్రహించబడింది అని భావం. ఈ సందర్భంలో నటులకు మార్గదర్శనం చేస్తున్నాడు - అభినయః ఇతి - ఇక్కడ (ఈ శ్లోకం చదువుతూన్నప్పుడు) ప్రాకరణికార్థం. (లతారూపార్థంలో) ప్రతిపదానికి అభినయం చెయ్యాలి. ప్రతిపదంయొక్క అర్థాన్ని అభినయం ద్వారా సూచించాలి. అప్రాకరణికార్థంలో (నాయికార్థంలో) అయితే అపాంగవీక్షణం మొదలైన వాక్యార్థాభినయం చేత (నాట్యంచేత) సూచించాలి. అంతేనే కాని రెండవ అర్థంలో పూర్తిగా అభినయం లేకపోవడం అనేది లేదు. ఇంక ఈ అవాంతరవిషయాన్ని గూర్చిన చర్చ చాలు. 'ధ్రువ' శబ్దం రాబోయే ఈర్ష్యకు అవకాశం ఇవ్వడంలో జీవితం వంటిది. అనగా రాబోయే ఈర్ష్యను స్పష్టంగా సూచిస్తూన్నది.

ధ్వన్యాలోకం

గృహీతమపి చ యమవసరే త్యజతి తద్రసానుగుణతయా అలఙ్కారాన్తరాపేక్షయా. యథా

శ్లో. రక్తస్త్వం నవపల్లవైరహమపి శ్లాఘ్యైః ప్రియాయా గుణైః
త్వామాయాన్తి శిలీముఖాః స్మరధనుర్ముక్తాః శరా మామపి,

కాన్తాపాదతలాహతిస్తవ ముదే తద్వన్మమాప్యావయోః

సర్వం తుల్యమశోక కేవలమహం ధాత్రా సశోకః కృతః. (32)

అత్ర హి ప్రబన్ధప్రవృత్తోఽపి శ్లేషః వ్యతిరేకవివక్షయా త్యజ్యమానః రసవిశేషం పుష్ణాతి. నాత్ర అలంకారద్వయసంనిపాతః; కిం తర్హి? అలఙ్కారాన్తరమేవ శ్లేషవ్యతిరేక లక్షణం నరసింహవదితి చేత్ - న; తస్య ప్రకారాన్తరేణ వ్యవస్థాపనాత్. యత్ర హి శ్లేష విషయ ఏవ శబ్దే ప్రకారాన్తరేణ వ్యతిరేకప్రతీతిర్జాయతే స తస్య విషయః. యథా- "స హరిర్నామ్నా దేవః స హరిర్వరతురగనివహేన" ఇత్యాదౌ. అత్ర హ్యన్య ఏవ శబ్దః శ్లేషస్య విషయః అన్యశ్చ వ్యతిరేకస్య. యది చైవంవిధే విషయే అలఙ్కారాన్తరత్వకల్పనా క్రియతే తత్సంసృష్టేః విషయాపహార ఏవ స్యాత్.

బాలానందిని

గృహీతమితి - గ్రహించబడినదానిని కూడ దేనిని ఏ(ఏ అలంకారాన్ని) ఆ రసానికి అనుగుణంగా ఉండే విధంగా మరొక అలంకారాన్ని అపేక్షించడంచేత ఒక తగు సమయంలో విడిచిపెడతాడో - ఎట్లనగా -

రక్త ఇతి :- అశోక = అశోకమా ! త్వమ్ = నువ్వు, నవపల్లవైః = నూతనములైన చిగుళ్లచేత, రక్తః = ఎఱ్ఱగా ఉన్నావు. అహమపి = నేను కూడ, ప్రియాయాః = ప్రియురాలియొక్క, శ్లాఘ్యైః = శ్లాఘించదగిన, గుణైః = గుణాలచేత, రక్తః = అనురాగం కలవాడను. శిలీముఖాః = తుమ్మెదలు, త్వామ్ = నిన్ను గూర్చి, ఆయాన్తి = వస్తూన్నవి. తథా = అట్లే, స్మరధనుర్ముక్తాః = మన్మథుని ధనుస్సునుండి విడవబడిన, శిలీముఖాః = బాణాలు, మామ్ అపి = నన్ను గూర్చి కూడ, ఆయాన్తి = వస్తూన్నవి. (నా మీద పడుచున్నాయి). కాన్తాపాదతలాహతిః = కాంతయొక్క అరికాలిచేత కొట్టడం, తవ = నీ యొక్క, ముదే = సంతోషంకొరకు (పుష్పవికాసానికి) అవుతుంది? మమాపి = నాకుకూడ, తద్వత్ = అట్లే, ముదే = సంతోషంకొరకు అవుతుంది (మోదజనకం అవుతుంది). సర్వమ్ = అంతాకూడ, తుల్యమ్ = సమానమే. కేవలమ్ = కేవలం, అహమ్ = నేను, ధాత్రా = బ్రహ్మదేవునిచేత, సశోకః = శోకంతో కూడినవాడనుగా, కృతః

= చేయబడ్డాను.

వివరణ:- స్త్రీలు (పద్మినీజాతికి చెందిన స్త్రీలు మాత్రమే) ముట్టుకుంటే ప్రియంగులత వికసిస్తుంది. మద్యాన్ని దానిమీద పుక్కిలిస్తే బొగడచెట్టు, పాదంతో తన్నితే అశోకవృక్షం, చూస్తే తిలకవృక్షం, కౌగలించుకుంటే గోరింటచెట్టు, పరిహాస వాక్యాలు పలుకుతే మందారవృక్షం, గట్టిగా తియ్యగా నవ్వితే సంపెంగ చెట్టు లేదా తీగ, నోటిగాలికి మామిడిచెట్టు, పాట పాడితే నమేరువృక్షం, దాని ఎదట నృత్యం చేస్తే కర్ణికారవృక్షం వికసిస్తాయి అని కవిసమయం (Convension of the poets).

శ్లో. స్త్రీణాం స్పర్శాత్ప్రియఙ్గుర్వికసతి వకులః సీధుగణ్డూషసేకాత్
పాదాఘాతాదశోకస్తిలకకురవకౌ వీక్షణాలిఙ్గనాభ్యామ్.
మన్దారో నర్మవాక్యాత్ పటుమధుహసనాచ్చమ్పకో వక్త్రవాతా
చ్చూతో గీతాన్నమేరుర్వికసతి చ పురో నర్తనాత్కర్ణికారః.

అనే ప్రసిద్ధశ్లోకంలో ఈ కవిసమయాలు చెప్పబడ్డాయి.

అత్ర హీతి - ఇక్కడ అవిచ్ఛిన్నంగా వరసగా ప్రవర్తించినదైనా శ్లేషాలంకారం వ్యతిరేకాలంకారాన్ని చెప్పాలనే ఇచ్ఛచేత విడువబడినదై రసవిశేషాన్ని (విప్రలంభాన్ని) పోషిస్తున్నది. ఇక్కడ రెండు అలంకారాల కలయిక కాదు. మరేమనగా ఇది నరసింహమూర్తి వలె శ్లేషవ్యతిరేకం అనే స్వరూపం గల మరొక స్వతంత్రమైన అలంకారమే అని చెప్పవచ్చు కదా? అలా చెప్పకూడదు. అది (మీరు చెప్పే అలంకారంవంటిదాని స్వరూపం) మరొక విధంగా నిర్ణయించబడింది. ఎక్కడైతే శ్లేషకి విషయం (స్థానం) అయిన శబ్దంలో మరొక ప్రకారంచేత వ్యతిరేకాలంకారప్రతీతి కలుగుతుందో అది దానికి (శ్లేషవ్యతిరేకానికి) విషయం. ఎట్లనగా - స హరిః ఇత్యాదులలో- సః దేవః ఆ దేవుడు, నామ్నా = పేరుచేత, హరిః = హరి (నువ్వు) వరతురగనివహేన = శ్రేష్ఠమైన గుఱ్ఱాల సముదాయంచేత, సహరిః = సహరివి. (హరిశబ్దానికి అశ్వం అని కూడా అర్థం) అత్ర హీతి - ఇక్కడ శ్లేషవిషయమైన హరిశబ్దం వేరు, వ్యతిరేకానికి విషయం అయిన శబ్దం (సహరి శబ్దం) వేరు. ఇలాంటి విషయాలలో (రక్తస్త్వం ఇత్యాదులలో) మరొక అలంకారం అని కల్పిస్తే సంసృష్టికి (రెండు అలంకారాల కలయిక సంసృష్టి) చోటు లేకుండా చేసినట్లు అవుతుంది.

లోచనం

రక్తో లోహితః, అహమపి రక్తః ప్రబుద్ధానురాగః, తత్ర చ ప్రబోధకో విభావః తదీయపల్లవరాగః ఇతి మన్తవ్యమ్. ఏవం ప్రతిపాదమ్ ఆద్యో౽ర్థః

విభావత్వేన వ్యాఖ్యేయః. అత ఏవ హేతుశ్లేషోఽయమ్. సహోక్త్యుపమాహే త్వలంకారాణాం హి భూయసా శ్లేషానుగ్రాహకత్వమ్. అనేనైవ అభిప్రాయేణ భామహః న్యరూపయత్ -"తత్సహోక్త్యుపమాహేతునిర్దేశాత్త్రివిధం మతమ్" ఇత్యుక్త్వా. న త్వన్యాలంకారానుగ్రహనిరాచికీర్షయా. రసవిశేషమితి - విప్రలమ్భమ్. సశోకశబ్దేన వ్యతిరేకమానయతా శోకసహభూతానాం వ్యభిచారిణాం విప్రలమ్భపరిపోషకాణామ్ అవకాశో దత్తః. కిం తర్హీతి - సంకరాలంకార ఏక ఏవాయమ్; తత్ర హి కిం త్యక్తం కిం వా గృహీతమ్ ఇతి పరస్యాభిప్రాయః. తస్యేతి సంకరస్య. ఏకత్ర హి విషయే అలఙ్కార ప్రతిభోల్లాసః సంకరః. 'సహరి' శబ్దః ఏకో విషయః. సః హరిః, యది వా సహ హరిభిః సహరిః ఇతి. అత్ర హీతి హి శబ్దః తు శబ్దస్యార్థే. రక్తస్త్వమ్ ఇత్యత్రేత్యర్థః. అన్య ఇతి రక్త ఇత్యాదిః. అన్యశ్చ అశోకసశోకాదిః. నన్వేకం వాక్యాత్మకం విషయమాశ్రిత్య ఏకవిషయత్వాదస్తు సంకర ఇత్యాశఙ్క్యాహ - యదీతి - ఏవంవిధే వాక్యలక్షణే విషయే. విషయ ఇత్యేకత్వం వివక్షితం బోధ్యమ్. ఏకవాక్యాపేక్షయా యద్యేకవిషయత్వమ్ ఉచ్యతే తన్న క్వచిత్సంసృష్టిః స్యాత్; సంకరేణ వ్యాప్తత్వాత్.

బాలానందిని

రక్త ఇతి - రక్తః = ఎఱ్ఱనైనదానవు, నేను కూడ, రక్త : = ఉద్బుద్ధమైన అనురాగం కలవాడను. ఆ విధంగా ప్రబుద్ధం చేసే విభావం దాని పల్లవాల ఎరుపు అని గ్రహించవలెను. ఈ విధంగా ప్రతీ పాదంలోనూ మొదటి అర్థాన్ని విభావంగా వ్యాఖ్యానించాలి - అందుచేతనే ఇది హేతుశ్లేష (హేత్వలంకారంతో కూడిన శ్లేష). సహోక్తి- ఉపమా - హేత్వలంకారాలు చాలవరకు శ్లేషను అనుగ్రహించేవిగా ఉంటాయి. ఈ అభిప్రాయంచేతనే, భామహుడు - తత్సహోక్తి ఇత్యదివచనంచేత నిరూపించాడు. అంతేనే కాని ఇతరాలంకారాల అనుగ్రహాన్ని నిరాకరించాలనే అభిప్రాయంతో కాదు. తత్ = ఆ శ్లిష్ట మైన వచనం, సహోక్తి - ఉపమా - హేత్వలంకారాల నిర్దేశంవల్ల, త్రివిధమ్ = మూడు విధాలైనది అని ఆ కారికార్థానికి అర్థం. అనగా ఇలా చెప్పడంలో భామహుని అభిప్రాయం చాల వరకు శ్లేషాలంకారానికి సహోక్తి ఉపమా హేత్వలంకారాలు అనుగ్రాహకాలుగా, శ్లేషాలంకారం ఆవిర్భవించడానికి కారణాలుగా, ఉంటాయని

చెప్పడం మాత్రమే కాని దీనికి ఇతరాలంకారాలు అనుగ్రాహకాలు కావు అని చెప్పడం కాదు. రసవిశేషమ్ ఇతి - విప్రలంభాన్ని. సశోకేతి - వ్యతిరేకాలంకారాన్ని తీసుకొని వస్తూన్న సశోకశబ్దంచేత శోకంతో కూడా ఉండే, విప్రలంభపరిపోషకాలైన నిర్వేదచిన్తాదివ్యభిచారులకు అవకాశం ఇవ్వబడింది. కింతర్హీతి- ఇది ఒక్క సంకరాలంకారమే - అందుచేత ఇక్కడ ఏది విడవబడింది. ఏది గ్రహించబడింది అనగా ఒక అలంకారాన్ని విడచి మరొక అలంకారం గ్రహించబడింది. అని చెప్పడానికి అవకాశం ఏముంది అని పరుల అభిప్రాయం. తస్యేతి - సంకరంయొక్క. ఒక విషయంలో రెండు అలంకారాల జ్ఞానం కలగడం 'సంకరం'; సహరిశబ్దం ఒక విషయం, సః హరిః అనీ మరియు (యది వా) "సహ హరిభిః" అనీ. అనగా విష్ణువు పక్షంలో సః హరిః అనీ రాజు పక్షంలో సహరిః అనీ చెప్పవలసి ఉన్నా సహరి అనేదానిలోని అక్షరాల ఆనుపూర్వి ఒకే విధంగా ఉండడంచేత ఏకవిషయం అని చెప్పబడింది. అత్ర హి ఇతి- హి కితు అని అర్థం. రక్తస్త్వమ్ ఇత్యాదిశ్లోకంలో అయితే అని అర్థం. అన్యః ఇతి - రక్తః ఇత్యాదిశబ్దం. అన్యశ్చ అనగా అశోక సశోక మొదలైనది. (ఆశంక) నన్వితి. పదాలను పట్టి, ఏకవిషయత్వం లేకపోయినా వాక్యం అనే విషయం ఒకటే కదా, దానిని పట్టి సంకరం అంగీకరించవచ్చును కదా అని ఆశంకించి సమాధానం చెపుతున్నాడు - యదీతి - ఏవంవిధే విషయే = వాక్యరూపమైన విషయంలో. విషయే అన్నచోట ఏకత్వం కూడా వివక్షితం. అందుచేత ఒక్క విషయంలో అని అర్థం. ఏకవాక్యేతి :- ఏకవాక్యాన్ని పట్టి ఏకవిషయత్వం అని చెప్పే పక్షంలో ప్రతీచోటా సంకరమే చెప్పవలసి ఉండడంచేత సంసృష్టికి ఎక్కడా కూడా అవకాశం లేకుండా పోతుంది అని అర్థం.

## ధ్వన్యాలోకం

శ్లేషముఖేనైవాత్ర వ్యతిరేకస్య ఆత్మలాభ ఇతి నాయం సంసృష్టేర్విషయః ఇతి చేత్ న? వ్యతిరేకస్య ప్రకారాన్తరేణాపి దర్శనాత్. యథా-

శ్లో. నో కల్పాపాయవాయోరదయరయదలత్క్ష్మాధరస్యాపి శమ్యా
గాఢోద్గీర్ణోజ్జ్వలశ్రీరహని న రహితా నో తమఃకజ్జలేన,
ప్రాప్తోత్పత్తిః పతఙ్గాన్న పునరుపగతా మోషముష్ణత్విషో వో
వర్తిః సైవాన్యరూపా సుఖయతు నిఖిలద్వీపదీపస్య దీప్తిః. (33)

అత్ర హి సామ్యప్రపఞ్చప్రతిపాదనం వినైవ వ్యతిరేకో దర్శితః. నాత్ర శ్లేషమాత్రాత్ చారుత్వప్రతీతిరస్తీతి శ్లేషస్య వ్యతిరేకాఙ్గత్వేనైవ వివక్షితత్వాత్ న స్వతః అలంకారతా ఇత్యపి న వాచ్యమ్. యత ఏవంవిధే విషయే సామ్యమాత్రాదపి సుప్రతిపాదితాత్ చారుత్వం దృశ్యత ఏవ. యథా-

బాలానందిని

ఇక్కడ వ్యతిరేకం శ్లేషద్వారా మాత్రమే పుట్టుతున్నది - అందుచేత ఇది సంసృష్టికి విషయమే కాదు అనడం యుక్తం కాదు. ఎందువల్ల ననగా - వ్యతిరేకం మరొక ప్రకారంచేత కూడ, శ్లేషలేకుండా కూడ, కనబడుతున్నది. ఎట్లనగా -

నో ఇతి - అదయరయదలత్క్ష్మాధరస్య = అత్యధికమైన వేగంచేత బ్రద్దలైపోతూన్న పర్వతాలు గల, కల్పాపాయవాయోరపి = ప్రళయకాలవాయువుకు (చేత) కూడ, నో శమ్యా = శాంతింప చేయ శక్యం కానిది, అహని = పగటియందు, గాఢోద్గీర్ణోజ్జ్వలశ్రీః = గాఢంగా ఆవిర్భవింప చేయబడిన ప్రకాశిస్తూన్న శోభ కలది, తమఃకజ్జలేన = తమస్సు అనే కాటుకచేత, న రహితా నో = శూన్యం కానిది కానిదీ, అనగా శూన్యమైనదీ, పతఙ్గాత్ = సూర్యుని నుండి, ప్రాప్తోత్పత్తిః = పొందబడిన ఉత్పత్తి కలది, పతఙ్గశబ్దానికి సూర్యుడు, మిడత అని రెండర్థాలు. మామూలు దీపవర్తి మిడతచేత ఆర్పివేయబడుతుంది, ఇది పతంగంనుంచే పుట్టింది), మోషం పునః = వినాశమునైతే (ఆరిపోవడాన్నైతే), న ఉపగతా = పొందనిది, నిఖిలద్వీపదీపస్య = సమస్తద్వీపముల దీపమైన, ఉష్ణత్విషః = సూర్యునియొక్క, అన్యరూపా ఏవ = మరొక విధమైన రూపం గలదే అయిన, వర్తిః = వర్తి, (వత్తి) అయిన, దీప్తిః = కాంతి, వః = మిమ్మల్ని, సుఖయతు = సుఖం కలవారినిగా చేయుగాక.

అత్రేతి - ఇక్కడ సామ్యాన్ని విస్తృతంగా ప్రతిపాదించడం లేకుండానే వ్యతిరేకం చూపబడింది. నాత్రేతి:- ఇక్కడ కేవలం శ్లేషవల్ల చారుతాప్రతీతి కాదు గాన శ్లేష వ్యతిరేకానికి అంగంగానే వివక్షితం అవడంవల్ల దానికి స్వతః అలంకారత్వం (స్వతంత్రాలంకారత్వం) లేదు అని కూడ చెప్పకూడదు. ఎందువల్లననగా ఇలాంటి విషయంలో బాగా ప్రతిపాదించబడిన కేవలసామ్యంవల్ల కూడా చారుత్వం కనబడుతూన్నది. ఎట్టనగా -

లోచనం

ననూపమాగర్భః వ్యతిరేకః; ఉపమా చ శ్లేషముఖేనైవ ఆయాతీతి శ్లేషోఽత్ర వ్యతిరేకస్య అనుగ్రాహక ఇతి సంకరస్యైవ విషయః. యత్ర తు అనుగ్రాహ్యానుగ్రాహకభావః నాస్తి తత్ర ఏకవాక్యగామిత్వే ఽపి సంసృష్టిరేవ; తదేతదాహ - శ్లేషేతి - శ్లేష బలానీతోపమాముఖేన ఇత్యర్థః. ఏతత్పరిహరతి నేతి. అయం భావః-కిం సర్వత్రోపమాయాః స్వశబ్దేనాభిధానే వ్యతిరేకో భవతి, ఉత గమ్యమానత్వే? తత్రాద్యం పక్షం దూషయతి- ప్రకారాన్తరేణేతి. ఉపమాభిధానేన వినాపీత్యర్థః.

బాలానందిని

నన్వితి - (ఆశంక) వ్యతిరేకాలంకారం ఉపమాగర్భం కదా? (వ్యతిరేకంలో ఉపమ ఉంటుంది కదా?). ఇక్కడ ఉపమ శ్లేషద్వారానే వచ్చింది; అందుచేత శ్లేష ఇక్కడ వ్యతిరేకానికి అనుగ్రాహకం గాన ఇది సంకరానికే (శ్లేషవ్యతిరేకాల సంకరానికి) విషయం అవుతుంది. ఎక్కడైతే అనుగ్రాహ్యానుగ్రాహకభావం ఉండదో అక్కడ (రెండు అలంకారాలూ) ఒకే వాక్యంలో ఉన్నా కూడ సంసృష్టి అవుతుంది. ఈ విషయాన్ని శ్లేషేత్యాది వాక్యంచేత చెపుతున్నాడు. శ్లేషముఖేన అనగా శ్లేషచేత తీసికొని రాబడిన ఉపమద్వారా అని అర్థం. దీనిని న ఇత్యాదికంచేత పరిహరిస్తున్నాడు. దీని భావం ఇది - ఉపమ అన్ని చోట్ల స్వశబ్దవాచ్యం అయినప్పుడే వ్యతిరేకాలంకారం ఏర్పడుతుందా లేక ఉపమ గమ్యమానం అవుతున్నప్పుడు అవుతుందా? వీటిలో ప్రకారాన్తరేణ ఇత్యాదికం చేత మొదటి పక్షాన్ని దూషిస్తున్నాడు, ప్రకారాన్తరేణాపి అనగా ఉపమను చెప్పకపోయినా కూడ అని అర్థం.

లోచనం

శమ్యా శమయితుం శక్యేత్యర్థః. దీపవర్తిస్తు వాయుమాత్రేణ శమయితుం శక్యతే. తమ ఏవ కజ్జలం తేన. న నో రహితా అపి తు రహితైవ. దీపవర్తిస్తు తమసాపి యుక్తా భవతి. అత్యన్తమప్రకటత్వాత్, కజ్జలేన చోపరిచరేణ. పతఙ్గాత్ అర్కాత్. దీపవర్తిః పునః శలభాద్ధ్వంసతే నోత్పద్యతే - సామ్యేతి - సామ్యస్య ఉపమాయాః ప్రపఞ్చేన ప్రబన్ధేన యత్ ప్రతిపాదనం స్వశబ్దేన తేన వినాపీత్యర్థః. ఏతదుక్తం భవతి - ప్రతీయమానైవ ఉపమా

వ్యతిరేకస్య అనుగ్రాహిణీ భవన్తి నాభిధానం స్వకణ్ఠేన అపేక్షతే. తస్మాన్న శ్లేషోపమా వ్యతిరేకస్య అనుగ్రాహిత్వేన ఉపాత్తా. నను యద్యప్యన్యత్ర నైవం తథాపీహ తత్ప్రావణ్యేన సా ఉపాత్తా. తదప్రావణ్యే స్వయం చారుత్వ హేతుత్వా భావాత్ ఇతి శ్లేషోపమాత్ర పృథగలంకారభావమేవ భజతే. తదాహ - నాత్రేతి. ఏతదసిద్ధం, స్వసంవేదనబాధితత్వాత్ ఇతి హృదయే గృహీత్వా స్వసంవేదనమ్ అపహ్నువానం పరం శ్లేషం వినా ఉపమామాత్రేణ చారుత్వసంపన్నము దాహరణాన్తరం దర్శయన్ నిరుత్తరీకరోతి యత ఇత్యాదినా.

### బాలానందిని

శమ్యా = శమింప చేయుటకు శక్యమైనది అని అర్థం. దీపవర్తి అయితే చిన్న గాలికే శమింప చేయడానికి శక్యం అవుతుంది, తమస్సే కాటుక (దీపంపైన కట్టే నల్లని పొగ), న నో రహితా - మరేమనగా రహితమైనదే. దీపవర్తి అయితే చీకటితో కూడ కలిసి ఉంటుంది. పైనఎగిరే కజ్జలంచేత చాల అప్రకటంగా ఉంటుంది కదా? పతఙ్గాత్ = సూర్యునినుండి. దీపవర్తి అయితే మిడతచేత ఆరిపోతుంది. కాని దానినుంచి పుట్టదు. సామ్యేతి - సామ్యస్య = ఉపమయొక్క, ప్రపఞ్చేన = అవిచ్ఛిన్నంగా స్వశబ్దంచేత ఏ ప్రతిపాదనం ఉన్నదో అది లేక పోయినా కూడ అని అర్థం. ఇది చెప్పినట్లయింది - ఉపమ ప్రతీయమానం (గమ్యమానం) అవుతూనే వ్యతిరేకానికి అనుగ్రాహకం అవుతుంది. స్వకంఠంచేత, స్వశబ్దంచేత, దానిని చెప్పవలసిన ఆవశ్యకత లేదు. అందువల్ల శ్లేషోపమ (శ్లేషసహితోపమ) వ్యతిరేకానుగ్రాహకంగా గ్రహించబడలేదు. నన్వితి (ఆశంక) ఇతర ప్రదేశాలలో ఇలా కాక పోయినా ఇక్కడ మాత్రం వ్యతిరేకాలంకారాన్ని అనుగ్రహించడానికే అది గ్రహించబడింది. దానియందు (వ్యతిరేకమునందు) దీనికి తాత్పర్యం లేకపోతే అది స్వయంగా (స్వతంత్రంగా) చారుత్వహేతువుగా లేదు కదా? అందుచేత ఇక్కడ శ్లేషోపమకు వేరు (స్వతంత్రమైన) అలంకారత్వమే లేదు. ఈ విషయమే చెపుతున్నాడు - నాత్రేతి. (ఆశంకకు సమాధానం) ఇది అసిద్ధం (నువ్వు చెప్పిన శ్లేషోపమామాత్రంవల్ల చారుత్వం లేదు అనే మాట యుక్తం కాదు) ఎందుచేతననగా ఇది స్వానుభవానికి విరుద్ధం అని మనస్సులో ఉంచుకొని, స్వానుభవాన్ని కప్పి పుచ్చుతూన్న పూర్వపక్షిని యత ఇత్యాదికంచేత, శ్లేష లేకుండా ఉపమామాత్రంచేతనే చారుత్వం ఉన్న మరొక ఉదాహరణ చూపి నిరుత్తరుణ్ణి చేస్తున్నాడు.

## ధ్వన్యాలోకం

శ్లో. ఆక్రన్దాః స్తనితైర్విలోచనజలాన్యశ్రాన్తధారామ్బుభి
స్తద్విచ్ఛేదభువశ్చ శోకశిఖినస్తుల్యాస్తడిద్విభ్రమైః,
అన్తర్మే దయితాముఖం తవ శశీ వృత్తిః సమైవావయో
స్తత్కిం మామనిశం సఖే జలధర త్వం దగ్ధుమేవోద్యతః. (34)

ఇత్యాదౌ.

### బాలానందిని

ఆక్రన్దా ఇతి - ఆక్రన్దా ః = నా ఆక్రందనాలు (బిగ్గరగా ఏడ్పులు) స్తనితైః = ఉరుములతో, తుల్యాః = సమానమైనవి. విలోచనజలాని = కన్నీళ్లు, అశ్రాన్త ధారామ్బుభిః = నిరంతరమైన ఉదకధారలతో సమానములు. తద్విచ్ఛేదభువః = ఉదక ధారలు ఆగిపోయినప్పుడు కలిగిన, శోకశిఖినః = శోకాగ్నులు, తడిద్విభ్రమైః = మెరుపుల విలాసలతో సమానములు, మే అన్తః = నాలోపల, దయితాముఖమ్ = ప్రియురాలి ముఖం ఉన్నది. తవ = నీలోపల, శశీ = చంద్రుడున్నాడు. ఆవయోః = మన ఇద్దరియొుక్క, వృత్తి ః = ప్రవృత్తి, సమైవ = సమమైనదే. తత్ = అందువల్ల, సఖే జలధర = మిత్రమా, మేఘమా! త్వమ్ = నువ్వు, అనిశమ్ = ఎల్లప్పుడు, మామ్ = నన్ను, దగ్ధుమేవ = కాల్చివేయుటకే, కిమ్ ఉద్యతః = ఎందుకుఉద్యుక్తుడవై ఉన్నావు ? ఇత్యాదులలో.

వివరణ:- మన ఇద్దరికీ చాలా పోలికలున్నాయి. అందుచేత బంధువులం. నువ్వు నన్ను ఎక్కువగా పీడిస్తున్నావు కాని నేను నీకేమీ బాధ కలిగించడం లేదు అని సూచించడంవల్ల వ్యతిరేకాలంకారం. ఇక్కడ శ్లేష లేకుండగానే జలధరవిరహుల మధ్య సామ్యం మొదటి మూడు పాదాలలోను చెప్పబడింది. అందుచేత వ్యతిరేకస్థలాలలో ప్రతి ఉదాహరణలోనూ శ్లేష ఉపమానుగ్రాహకంగా ఉంటుంది అనడానికి వీలు లేదు. అందుచేత రక్తస్త్వమ్ ఇత్యాదిశ్లోకంలో శ్లేషకి స్వతంత్రస్థితి లేదు అనడం యుక్తం కాదు.

### లోచనం

ఉదాహరణశ్లోకే తృతీయాన్తపదేషు తుల్యశబ్దః అభిసంబన్ధనీయః. అన్యత్ సర్వం "రక్తస్త్వమ్" ఇతివద్యోజ్యమ్.

బాలానందిని

"అక్రన్దాః" ఇత్యాద్యుదాహరణశ్లోకంలో స్తనితైః ఇత్యాది తృతీయాంతపదాలతో తుల్యశబ్దం అన్వయించాలి. మిగిలినది అంతా "రక్తస్త్వమ్" ఇత్యాదిశ్లోకం వలెనే అన్వయించుకోవాలి. అనగా - స్తనితాదికం ఆక్రందనాదులకు హేతువు అని గ్రహించాలి అని అర్థం.

## ధ్వన్యాలోకం

రసనిర్వహణైకతానహృదయః యం చ నాత్యన్తం నిర్వోఢుమిచ్ఛతి; యథా

శ్లో. కోపాత్కోమలలోలబాహులతికాపాశేన బద్ధ్వా దృఢం
నీత్వా వాసనికేతనం దయితయా సాయం సఖీనాం పురః,
భూయో నైవమితి స్ఖలత్కలగిరా సంసూచ్య దుశ్చేష్టితం
ధన్యో హన్యత ఏవ నిహ్నుతిపరః ప్రేయాన్ రుదత్యా హసన్.

(అమరు - 9) (35)

అత్ర హి రూపకమాక్షిప్తమ్ అనిర్వ్యూఢం చ పరం రసపుష్టయే.

బాలానందిని

రసేతి - రసాన్ని నిర్వహించడంలోనే ఏకాగ్రమైన హృదయం కలవాడై (కవి) దేనిని పూర్తిగా నిర్వహించడానికి ఇచ్ఛయించడో - ఎట్లనగా -

కోపాదితి:- కోపాత్ = కోపంవల్ల, కోమలలోలబాహులతికాపాశేన = కోమలమైన బాహులతాపాశంచేత, దృఢమ్= దృఢంగా, బద్ధ్వా = బంధించి, వాసనికేతనమ్ = శయ్యాగృహమును గూర్చి, నీత్వా = తీసికొని వెళ్లి, సాయమ్ = సాయంకాలమునందు, సఖీనామ్ = సఖురాండ్రయొక్క, పురః = ఎదుట, దుశ్చేష్టితమ్ = చేసిన చెడ్డ పనిని, సంసూచ్య = సూచించి, భూయః= మళ్లీ, ఏవమ్ = ఇట్లు, న =చెయ్యవుకదా అని, స్ఖలత్కలగిరా = తొట్రుపడుతూన్న మధురమైన వాక్కు గల, రుదత్యా = ఏడుస్తూన్న, దయితయా = ప్రియురాలిచేత, హసన్ = నవ్వుతూ, నిహ్నుతిపరః = తన అపరాధం కప్పిపుచ్చడానికి ప్రయత్నిస్తూన్న, ధన్యః = ధన్యుడైన, ప్రేయాన్ = ప్రియుడు, హన్యతే ఏవ = కొట్టబడును.

అత్రేతి - ఇక్కడ రూపకం ప్రారంభించబడినా ( ఆక్షిప్తమపి) రసపుష్టిని దృష్టిలో ఉంచుకొని చివరిదాకా నిర్వహించబడలేదు.

లోచనం

ఏవం గ్రహణత్యాగౌ సమర్థ్య "నాతినిర్వహణైషితా" ఇతి భాగం వ్యాచష్టే - రసేతి - చకారః సమీక్షాప్రకారసముచ్చయార్థః. బాహులతి కాయాః బన్ధనీయపాశత్వేన రూపణం యది నిర్వాహయేత్ దయితా వ్యాధవధూః, వాసగృహం కారాగారపఞ్జరాదీతి పరమనౌచిత్యం స్యాత్. సఖీనాం పురః ఇతి - భవత్యః అనవరతం బ్రువతే నాయమ్ ఏవం కరోతీతి తత్పశ్యన్త్వి దానీమ్ ఇతి భావః. స్ఖలన్తీ కోపావేశేన కలానీమధురా చ గీర్యస్యాః సా. కాసౌ గీరిత్యాహ - భూయో నైవమిత్యేవంరూపా. ఏవమితి యదుక్తం తత్కిమిత్యాహ - దుశ్చేష్టితమ్- నఖపదాది. సంసూచ్య అఙ్గుల్యాదినిర్దేశేన. హన్యత ఏవేతి - న తు సఖ్యాదికృతః అనునయః అనురుధ్యతే యతః అసౌ హసనం నిమిత్తీకృత్య నిహ్నుతిపరః ప్రియతమశ్చ; తదీయం వ్యలీకం కా సోఢుం సమర్థేతి.

బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా (రసపోషణదృష్టిచేత) అలంకారాల గ్రహణాన్ని త్యాగాన్నీ సమర్థించి నాతినిర్వహణైషితా అనే భాగాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు - రసేతి. చకారం పర్యవేక్షప్రకారాన్ని సముచ్చయం చేయడంకొరకు. ఇది ఘరొక సమీక్షాప్రకారం అని చెప్పడంకొరకు. బాహులతిక బంధించే పాశం అనే రూపణాన్ని చివరి దాకా నిర్వహిస్తే, దయితయే ఒక వ్యాధస్త్రీ, వాసగృహమ్ కారాగారం లేదా పంజరం ఇత్యాది విధంగా రూపకాలు కొనసాగిస్తే చాలా అనౌచిత్యం కలుగుతుంది. సఖీనాం పురః ఇతి :- ఇతడు ఇలా చేసే మనిషి కాదు అని మీరు ఎల్లప్పుడూ అంటూండేవాళ్లు కదా? ఇప్పుడు చూడండి ఎలాంటివాడో అని భావం. స్ఖలన్తీ = కోపావేశంచేత తొట్రుపాటుపడుతున్నది, కలా = మధురము అయిన మాట గలది. ఏమిటి ఆ మాట అనగా చెపుతున్నాడు - భూయః నైవమ్ అనే ఆమాట. ఏవమ్ (ఇల్లాగ) అని అంది కదా? అదేమిటో చెపుతున్నాడు - దుశ్చేష్టితమ్ - నఖచిహ్నాదికాన్ని. సంసూచ్య =వ్రేలితో చూపడం మొదలైనవాటి ద్వారా సూచించి, హన్యత ఏవ ఇతి - తప్పకుండా కొట్టబడతాడు? అంతేనే కాని సఖులు మొదలైనవాళ్లు బ్రతిమాలినా అందుకు ఒప్పుకోదు. ఎందువల్లననగా

ఏదో నవ్వేస్తూ కప్పిపుచ్చుకోవాలని చూస్తున్నవాడు, అందులోనూ ప్రియతముడు - అలాంటివాడు చేసిన అపరాధాన్ని ఎవతె సహించగలదు?

ధ్వన్యాలోకం

నిర్వోఢుమిష్టమపి యం యత్నాదఙ్గత్వేన ప్రత్యవేక్షతే; యథా -

శ్లో. శ్యామాస్వఙ్గం చకితహరిణీప్రేక్షణే దృష్టిపాతం
గణ్డచ్ఛాయాం శశిని శిఖినాం బర్హ భారేషు కేశాన్,
ఉత్పశ్యామి ప్రతనుషు నదీవీచిషు భ్రూవిలాసాన్
హన్తైకస్థం క్వచిదపి న తే భీరు సాదృశ్యమస్తి.

(మేఘ 2.41)(36)

ఇత్యాదౌ.

స ఏవముపనిబధ్యమానః అలఙ్కారః రసాభివ్యక్తిహేతుః కవేర్భవతి. ఉక్తప్రకారాతిక్రమే తు నియమేనైవ రసభఙ్గహేతుః సంపద్యతే. లక్ష్యం చ తథావిధం మహాకవిప్రబన్ధేష్వపి దృశ్యతే బహుశః. తత్తు సూక్తిసహస్రద్యోతితాత్మనాం మహాత్మనాం దోషోద్ఘోషణమ్ ఆత్మన ఏవ దూషణం భవతీతి న విభజ్య దర్శితమ్, కింతు రూపకాదేరలఙ్కారవర్గస్య యేయం వ్యఞ్జకత్వే రసాదివిషయే లక్షణదిగ్దర్శితా తామనుసరన్ స్వయం చాన్యల్లక్షణముత్ప్రేక్షమాణో యద్యలక్ష్యక్రమప్రతిభమ్ అనన్తరోక్తమేనం ధ్వనేరాత్మానముప నిబధ్నాతి సుకవిః సమాహితచేతాః తదా తస్యాత్మలాభో భవతి మహానితి.

బాలానందిని

నిర్వోఢుమితి - నిర్వహించడానికి ఇష్టమైనా ఏ అలంకారాన్ని అంగంగా ఉండేటట్లు ప్రయత్నపూర్వకంగా చూస్తాడో - ఎట్లనగా.

శ్యామాస్వితి - ఇది మేఘసందేశంలోని శ్లోకం. శ్యామాసు = ప్రియంగులతల యందు, అఙ్గమ్ = శరీరాన్నీ, చకితహరిణీప్రేక్షణే = భయపడిన ఆడలేడి చూపులో, దృష్టిపాతమ్ = దృష్టిప్రసారాన్నీ, శశిని = చంద్రునిలో, గండచ్ఛాయామ్ = గండస్థల కాంతిని, శిఖినామ్ = నెమళ్లయొక్క, బర్హభారేషు = పింఛభారాలయందు, కేశాన్ = కేశాలను, ప్రతనుషు = చిన్నవైన, నదీవీచిషు = నదీతరంగాలయందు, భ్రూవిలాసాన్ = కనుబొమ్మల విలాసాలను, ఉత్పశ్యామి = ఊహిస్తున్నాను. భీరు = భయస్వభావం గలదానా, క్వచిదపి = ఎక్కడా కూడ, తే సాదృశ్యమ్ = నీ సాదృశ్యం, ఏకస్థమ్ = ఒక చోట ఉన్నదిగా, నాస్తి = లేదు. హన్త = ఎంతకష్టం!

ఇత్యాదులలో. స ఇతి - ఈవిధంగా కూర్చబడుతున్న అలంకారం కవియొక్క రసాభివ్యక్తికి హేతువు అవుతుంది. చెప్పిన పద్ధతులను అతిక్రమిస్తే అది రసభంగానికి హేతువు అవుతుంది. మహాకవుల ప్రబంధాలలో కూడ అనేకస్థలాలలో ఆ విధమైనది (ఈ పద్ధతులను అనుసరించకపోవడంచేత రసభంగానికి హేతువైన అలంకారప్రయోగం) కనబడుతుంది. అయితే - వేలకొలది సూక్తుల (ఉత్తమ కావ్యాల - సంస్కృతాలంకారి కుల ప్రకారం ఒక్క శ్లోకం లేదా ఒక చక్కని వాక్యం కూడా కావ్యమే) ప్రకాశింప చేయబడిన బుద్ధి గల మహాత్ముల దోషాలను ఉద్ఘోషించడం తనను తానే దూషించుకొనడం అవుతుంది. అందుచేత దానిని విభజించి, ఇక్కడ ఇది అని విశ్లేషించి, చూపబడలేదు, కిం త్వితి - కాని ఎవరైనా ఒక సుకవి సావధానచిత్తుడై, రసాది విషయంలో రూపకాద్యలంకారవర్గానికి ఉన్న వ్యంజకత్వాన్ని ఈ ఏ లక్షణమార్గం చూపబడిందో దానిని అనుసరిస్తూ, స్వయంగా కూడా మరొక లక్షణాన్ని (మరికొన్ని పద్ధతుల్ని) ఊహించుకుంటూ ఇంత క్రితమే చెప్పబడిన అలక్ష్యక్రమంవంటి ఈ ధ్వనికావ్యాత్మను కూర్చినట్లయితే అప్పుడు ఆ కవికి గొప్ప పూజ్యమైన ఆత్మలాభం (సుకవిత్వలాభం) కలుగుతుంది.

లోచనం

నిర్వోఢుమితి - నిఃశేషేణ పరిసమాపయితుమిత్యర్థః. శ్యామాసు సుగన్ధిప్రియఙ్గులతాసు, పాణ్డిమ్నా, తనిమ్నా, కణ్టకితత్వేన చ యోగాత్. శశినీతి - పాణ్డురత్వాత్, ఉత్పశ్యామీతీ యత్నేన ఉత్ప్రేక్షే. జీవితసంధారణాయే త్యర్థః. హన్తేతి కష్టమ్. ఏకస్థసాదృశ్యాభావే హి దోలాయమానోఽహం సర్వత్ర స్థితః న కుత్రచిదేకత్ర ధృతిం లభే ఇతి భావః. భీర్వితి -యో హి కాతరహృదయో

భవతి నాసౌ సర్వస్వమేకస్థం ధారయతీత్యర్థః. అత్ర హి ఉత్ప్రేక్షాయాః తద్భావాధ్యారోప రూపాయాః అనుప్రాణకం సాదృశ్యం యథా ఉపక్రాన్తం తథా నిర్వాహితమపి విప్రలమ్భరసపోషకమేవ జాతమ్. తత్తు లక్ష్యం న దర్శితమితి సంబన్ధః. ప్రత్యుదాహరణే హ్యదర్శితేఽపి ఉదాహరణానుశీలనదిశా కృతకృత్యతేతి దర్శయతి-కింత్వితి. అన్యల్లక్షణమితి. పరీక్షాప్రకారమిత్యర్థః. తద్యథా అవసరే త్యక్తస్యాపి పునర్గ్రహణమిత్యాది. యథా మమైవ -

శ్లో. శీతాంశోరమృతచ్ఛటా యది కరాః కస్మాన్మనో మే భృశం
సంప్లుష్యన్త్యథ కాలకూటపటలీసంవాససందూషితాః,
కిం ప్రాణాన్న హరన్త్యుత ప్రియతమాసంజల్పమన్త్రాక్షరై
రక్ష్యన్తే కిము మోహమేమి హహ హా నో వేద్మి కేయం గతిః.

ఇత్యత్ర రూపక - సందేహ - నిదర్శనాః త్యక్త్వా పునరుపాత్తాః రసపోషణాయ ఇత్యలమ్ . 18.19.

బాలానందిని

నిర్వోఢుమితి - పూర్తిగా సమాప్తి చెందించుటకు అని అర్థం. అనగా చివరి దాకా నడిపించడానికి అని అర్థం. శ్యామాసు =సుగంధం గల ప్రియంగులతలయందు. అవి తెలుపుతోను, తనుత్వం (సన్నంగా ఉండడం) తోను, చిన్నముండ్లు కలిగి ఉండడంతోను సంబంధించి ఉండడంవల్ల, అనగా ప్రియంగులతలు తెల్లగా సన్నంగా చిన్న చిన్న పులకాంకురాల వంటి ముళ్లతో ఉంటాయి అని అర్థం. శశినీతి - తెల్లగా ఉండడంవల్ల. ఉత్పశ్యామీతి ప్రయత్నపూర్వకంగా ఊహించుకుంటున్నాను. ఏదో విధంగా ప్రాణాలు నిలబెట్టుకొనడం కొరకు అని అర్థం. హన్త ఇతి - ఎంత కష్టం. ఒకే చోట ఉండే సాదృశ్యం లేకపోవడంతో, నేను ఊగులాడుతూ అన్ని చోట్లా ఉండి (అన్నిచోట్లకీ వెళ్లి) ఎక్కడా, కూడ ఒక చోట ధృతిని (నిలకడను, ధైర్యాన్ని) పొందలేకుండా ఉన్నాను అని భావం. భీరు ఇతి. భయంతో నిండిన హృదయం కలవాడు (పిరికిగుండెవాడు) తన కున్న ధనం అంతా (ఎవరైనా మొత్తం అపహరిస్తారనే భయంచేత) ఒక చోట ఉంచడు అని అర్థం. (అందుచేత నువ్వు నీ ఆ యా అవయవాల సాదృశ్యాన్ని వేరు వేరు వస్తువులలో ఉంచావు కాని ఒక చోట ఉంచలేదని భావం). అత్ర హీతి - ఇక్కడ తద్భావారోప రూపమైన, అనగా అది కానిదానిని అదిగా కావాలని ఊహించడం అనే స్వరూపంగల,

ఉత్ప్రేక్షకు అనుప్రాణకమైన (ప్రాణంపోసే) సాదృశ్యం ఎలా ఉపక్రమించబడిందో అలాగే చివరివరకూ నిర్వహించబడినా విప్రలంభరసానికి పోషకమే అయింది. తత్తు ఇతి - ఆ లక్ష్యం అయితే చూపబడలేదు అని అన్వయం. ప్రత్యుదాహరణం చూపకపోయినా ఉదాహరణలని జాగర్తగా పరిశీలించడం మొదలైనవాటిచేత కృతకృత్యత లభిస్తుంది అని కిం త్వితి ఇత్యాదికంచేత చూపుతున్నాడు. అన్యల్లక్షణమ్ ఇతి :- అనగా పరీక్షించే పద్ధతి అని అర్థం. అది ఎట్లనగా తగిన సమయంలో విడవబడినదానిని కూడ మళ్లీ గ్రహించడం మొదలైనది. ఉదాహరణంగా నా శ్లోకమే ఎట్లనగా-

శీతాంశోరితి:- శీతాంశోః = చంద్రునియొక్క, కరాః = కిరణాలు, అమృతచ్ఛటాః యది = అమృతపు ముద్దలే అయితే, మే మనః = నా మనస్సును, కస్మాత్ = ఎందువల్ల, భృశమ్ = మిక్కిలి, సంప్లుష్యన్తి = ఎండింపచేస్తున్నాయి (వేచేస్తున్నాయి)? అథ = అట్లు కాక, కాలకూటపటలీసంవాససందూషితాః = కాలకూటవిషసముదాయంతో (సముద్రంలో) కలిసి ఉండడంచేత దూషితము లైనట్లయితే, ప్రాణాన్ = ప్రాణాలను, కిమ్ = ఎందువల్ల, న హరన్తి = హరించడంలేదు? ఉత =లేదా, ప్రియతమా సంజల్పమన్త్రాక్షరైః = ప్రియతమానామోచ్చారణం అనే మంత్రాక్షరాలచేత, కిం రక్ష్యన్తే = (ప్రాణాలు) రక్షించబడుతున్నాయా? కిము = ఎందువలన, మోహమ్ = మోహమును, ఏమి = పొందుచున్నాను? హహహా= అయ్యో! ఇయం గతిః = ఈ గతి, కా = ఏమిటో, నో వేద్మి = తెలుసుకొన జాలకున్నాను.

ఇత్యత్రేతి - రూపక - సందేహ - నిదర్శనలు విడిచి, రసపోషణంకోసం మళ్లీ గ్రహించబడినవి. ఇంక చాలు.

వివరణ:- శీతాంశోః కరాః అమృతచ్ఛటాః అనే రూపకాన్ని గ్రహించి కస్మాత్ మనః సంప్లుష్యన్తి అని దానిని విడిచివేయడం జరిగింది. అథ (లేదా) అంటూ ఆ రూపకాన్ని మళ్లీ గ్రహిస్తూనే- అనగా చంద్రకరాలు అమృతచ్ఛటలు అనే విషయాన్ని అంగీకరిస్తూనే, కాలకూటసంబంధంవల్ల సందూషితము లయ్యాయా అని సందేహాలంకారం కూర్చబడింది. ఆ సందేహం కిం ప్రాణాన్ న హరన్తి కాలకూట సంబంధంచేత దూషితాలైతే ప్రాణాలు తీయాలి కదా, అందుచేత అది కాదు అని ఆ సందేహం విడవబడింది. ప్రియతమాసంజల్పమంత్రాక్షరాలచేత ప్రాణాలు తీయడంలేదేమో అని మళ్లీ ఆ సందేహన్ని సంగ్రహించి నిదర్శనాలంకారం ఉపయోగించబడింది. ఇక్కడ మాటలాడుతున్నది ప్రియావిరహంతో బాధపడుతున్నవాడు; అందుచేత ప్రియతమయొక్క మాటలాడడం (మాటల)లోని

మంత్రాక్షరాలు అని చెప్పడం కుదరదు. ఆమె దగ్గర లేదు కదా. అందుచేత ప్రియతమురాలి నామాన్ని పునః పునరుచ్చరించడం అనే మంత్రాక్షరాలు అని అర్థం యుక్తం అని తోస్తుంది. ఇక్కడ నిదర్శన ఎలా చెప్పాలో స్పష్టంగా తెలియడం లేదు. రక్షణం అనేది చేతనకర్తృకమైనది. దానిని మంత్రాక్షరాలు చేస్తున్నట్లు చెపుతున్నాడు. అందుచేత -

"అయం మన్దద్యుతిర్భాస్వానస్తం ప్రతి యియాసతి,

ఉదయః పతనాయేతి శ్రీమతో బోధయన్నరాన్. (భామహాలంకారం 3.34)

"ఉదయం (అత్యున్నతి) చివరికి పతనానికే దారి తీస్తుంది అని ఐశ్వర్యవంతులకు బోధిస్తూ సూర్యుడు అస్తమించనున్నాడు" అని దీని భావం. ఇక్కడ నిజంగా సూర్యుడు బోధించడం లేదు. అందుచే బోధయన్నివ (బోధిస్తున్నాడా అన్నట్లు) అని అర్థం చెప్పాలి. దీనిని పట్టి శ్రీమంతులకు సూర్యునికీ ఉపమానోపమేయభావం గమ్యం అవుతుంది. ఈ విధంగా ఇది నిదర్శన. అదే విధంగా ఇక్కడ కూడా 'రక్ష్యన్తే ఇవ' (రక్షించబడుతున్నాయా అన్నట్లుంది) అని అర్థం చెప్పుకొని నిదర్శన అని చెప్పవచ్చునేమో అని తోస్తూన్నది. ఈ నిదర్శన కిము మోహమేమి అనే వాక్యంచేత త్యజించబడింది. నో వేద్మి కేయం గతిః అని ఆ నిదర్శన మళ్లీ పరిగ్రహించబడింది. లేదా మేమనః కస్మాత్ సంప్లుష్యన్తి అనే వాక్యంచేత రూపకం త్యజించబడింది. కిం ప్రాణాన్ న హరన్తి అనేదానిచేత సందేహాలంకారం త్యజించబడింది. కిము మోహమేమి అనేదానిచేత నిదర్శన త్యజించబడింది. నో వేద్మి కేయం గతిః అనే దానిచేత అవన్నీ మళ్లీ పరిగ్రహించ బడ్డాయి అని చెప్పుకొనవచ్చును. పైన చెప్పిన పద్ధతిలో ఆ యా అలంకారాల పునఃపరిగ్రహం అభ్యూహ్యంగా ఉంది. అయినా అదే యుక్తంగా కనబడుతుంది. 18,19.

## ధ్వన్యాలోకం

కా. క్రమేణ ప్రతిభాత్యాత్మా యోऽస్యానుస్వానసంనిభః

శబ్దార్థశక్తిమూలత్వాత్ సోऽపి ద్వేధా వ్యవస్థితః. 20

అస్య వివక్షితాన్యపరవాచ్యస్య ధ్వనేః సంలక్ష్యక్రమవ్యఙ్గ్యత్వాత్ అనురణనప్రఖ్యః య ఆత్మా సోऽపి శబ్దశక్తిమూలః అర్థశక్తిమూలశ్చేతి ద్విప్రకారః.

బాలానందిని

క్రమేణేతి :- అస్య = ఈ వివక్షితాన్యపరవాచ్యధ్వనికావ్యముయొక్క,

అనుస్వానసంనిభః = ప్రతిధ్వనితో సమానమైన, యః = ఏ, ఆత్మా = ఆత్మ, క్రమేణ = క్రమంచేత, ప్రతిభాతి =భాసించునో, సోఽపి=అది కూడ, శబ్దార్థశక్తిమూలత్వాత్= శబ్దశక్తి- అర్థశక్తి మూలం అవడంవల్ల, ద్వేధా = రెండు విధాలుగా, వ్యవస్థితః = ఏర్పరుపబడినది.

అస్యేతి - ఈ వివక్షితాన్యపరవాచ్యమైనధ్వనికావ్యం సంలక్ష్యక్రమం అవడంచేత అనురణనరూపమైన దీని ఆత్మ ఏది కలదో అది కూడ శబ్దశక్తిమూలం, అర్థ శక్తిమూలం అని రెండు విధాలు.

లోచనం

ఏవం వివక్షితాన్యపరవాచ్యధ్వనేః ప్రథమం భేదమ్ అలక్ష్యక్రమం విచార్య ద్వితీయం భేదం విభక్తుమాహ - క్రమేణేత్యాది. ప్రథమపాదః అనువాదభాగః హేతుత్వేన ఉపాత్తః. ఘణ్టాయాః అనురణనమ్ అభిఘాతజ శబ్దాపేక్షయా క్రమేణైవ భాతి. సోఽపీతి:- న కేవలం మూలతో ధ్వనిః ద్వివిధః, నాపి కేవలం వివక్షితాన్యపరవాచ్యో ద్వివిధః; అయమపి ద్వివిధ ఏవేతి అపిశబ్దార్థః. 20.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వివక్షితాన్యపరవాచ్యధ్వనియొక్క ప్రథమభేదమైన అలక్ష్యక్రమాన్ని గూర్చి చెప్పి, రెండవ భేదాన్ని విభజించడంకొరకు క్రమేణేత్యాదికం చెపుతున్నాడు. అనువాదభాగమైన మొదటి భాగం హేతువుగా చెప్పబడింది. ఘంటయొక్క అనురణనమ్= మొదటి ధ్వనిని అనుసరించి ఏర్పడి కొంతసేపు వినబడే ధ్వని, ప్రతిధ్వని, ఘంటను మ్రోగించడంవల్ల కలిగిన శబ్దం దృష్ట్యా క్రమంగానే తెలుస్తుంది. సోఽపీతి ధ్వని మూలతః (ప్రప్రథమంగా) రెండు విధాలు అని మాత్రమే కాదు. కేవలం వివక్షితాన్యపరవాచ్యధ్వని మాత్రమే రెండు విధాలు కాదు. ఇది కూడ రెండు విధాలు అని 'అపి' శబ్దానికి అర్థం.

## ధ్వన్యాలోకం

నను శబ్దశక్త్యా యత్రార్థాన్తరం ప్రకాశతే స యది ధ్వనేః ప్రకారః ఉచ్యతే; తదిదానీం శ్లేషస్య విషయ ఏవాపహృతః స్యాత్? నాపహృత ఇత్యాహ-

కా. ఆక్షిప్త ఏవాలంకారః శబ్దశక్త్యా ప్రకాశతే,
యస్మిన్ననుక్తః శబ్దేన శబ్దశక్త్యుద్భవో హి సః. 21

యస్మాత్ అలంకారః, న వస్తుమాత్రమ్, యస్మిన్ కావ్యే శబ్దశక్త్యా ప్రకాశతే సః శబ్ద శక్త్యుద్భవో ధ్వనిరిత్యస్మాకం వివక్షితమ్. వస్తుద్వయే చ శబ్దశక్త్యా ప్రకాశమానే శ్లేషః. యథా -

శ్లో. యేన ధ్వస్తమనోభవేన బలిజిత్కాయః పురాస్త్రీకృతో
యశ్చోద్వృత్తభుజఙ్గహారవలయో గఙ్గాం చ యోఽధారయత్,
యస్యాహుః శశిమచ్ఛిరో హర ఇతి స్తుత్యం చ నామామరాః
పాయాత్స స్వయమన్ధకక్షయకరస్త్వాం సర్వదోమాధవః. (37)

బాలానందిని

నన్వితి :- (ఆశంక) ఎక్కడైతే శబ్దశక్తిచేత మరొక అర్థం ప్రకాశిస్తుందో అది ధ్వని కావ్యం ప్రకారం అని చెప్పినట్లయితే ఇప్పు డింక శ్లేషకి విషయమే అపహరించబడినదై పోతుంది? (శ్లేషకి స్థానమే లేకుండా పోతుంది) అపహరించబడలేదని చెపుతున్నాడు.

ఆక్షిప్త ఇతి - యస్మిన్=ఏ కావ్యమునందు, శబ్దేన=శబ్దంచేత, అనుక్తః=చెప్పబడకపోయినా కూడ, అలంకారః=అలంకారం, శబ్దశక్త్యా=శబ్దశక్తిచేత, ఆక్షిప్త ఏవ=ఆక్షిప్తమై (ఊహించబడినదై), ప్రకాశతే = ప్రకాశిస్తుందో, సః=అది, శబ్దశక్త్యుద్భవః హి=శబ్దశక్తివల్ల ఉద్భవించిన ధ్వనికావ్యం కదా?

యస్మాదితి -ఎందువల్ల - ఏ కావ్యంలో అలంకారం, వస్తుమాత్రం కాదు, శబ్ద శక్తిచేత ప్రకాశిస్తుందో అది శబ్దశక్త్యుద్భవధ్వనికావ్యం అని మాచేత చెప్పదలపబడిన (మేం చెప్పదలచిన) విషయం. శబ్దశక్తిచేత రెండు వస్తువులు ప్రకాశిస్తే అది శ్లేష. ఎట్లనగా -

యేనేతి :- ఇది చంద్రకుడనే కవి రచించిన శ్లోకం. దీనికి విష్ణుపరంగాను శివపరంగాను రెండర్థాలు. విష్ణుపక్షంలో పదచ్ఛేదం - యేన, ధ్వస్తమ్, అనః, అభవేన, బలిజిత్, కాయః, పురా, స్త్రీకృతః, యః, చ, ఉద్వృత్తభుజఙ్గహా, రవలయః, అగమ్, గామ్, చ, యః, అధారయత్, యస్య, ఆహుః, శశిమచ్ఛిరోహరః, ఇతి, స్తుత్యమ్, చ, నామ, అమరాః, పాయాత్, సః, స్వయమ్, అన్ధకక్షయకరః, త్వామ్, సర్వదః, మాధవః.

శివుని పక్షంలో పదచ్ఛేదం - యేన, ధ్వస్తమనోభవేన, బలిజిత్కాయః, పురా, అస్త్రీకృతః, యః, ఉద్వృత్తభుజఙ్గహారవలయః, గఙ్గామ్, చ, యః, అధారయత్, యస్య, ఆహుః, శశిమత్, శిరః, హరః, ఇతి, స్తుత్యమ్, చ, నామ, అమరాః, పాయాత్, సః, అన్ధకక్షయకరః, త్వామ్, సర్వదా, ఉమాధవః.

విష్ణుపక్షంలో అర్థం - యేన = ఎవనిచేత, అనః=శకటము, ధ్వస్తమ్= నశింపచేయబడిందో, విష్ణువు శ్రీకృష్ణుడుగా అవతరించి శిశువుగా ఉన్నప్పుడు శకట రూపంలో వచ్చిన అసురుణ్ణి సంహరించాడు, అభవేన=పుట్టుక లేదా సంసారం లేని, యేన=ఎవనిచేత, బలిజిత్=బలిని జయించిన, కాయః=తన శరీరం, పురా=పూర్వం, స్త్రీకృతః=స్త్రీగా, మోహినిగా, చేయబడిందో, యశ్చ, =ఎవడు, ఉద్వృత్త భుజఙ్గహా=దృప్తుడైన కాలియుడనే సర్పాన్ని హింసించాడో, రవలయః=శబ్దాలకు అనగా పేర్లకు లయస్థానమో, నామరూపాదులన్నీ పరబ్రహ్మలో లీనం అయిపోతాయని వేదాంతులు చెపుతారు. యః= ఎవడు, అగమ్=గోవర్ధనపర్వతాన్నీ, గాం చ=భూమినీ (వరాహావతారంలో). అధారయత్=ధరించెనో, యస్య=ఎవనియొక్క, శశిమచ్ఛిరోహరః= "శశినం మథ్నాతీతి శశిమత్" చంద్రుణ్ణి పీడించే రాహువు. ఆ రాహువుయొక్క శిరస్సును హరించినాడని, స్తుత్యమ్=స్తుతించదగిన, నామ=పేరును, అమరాః=దేవతలు, ఆహుః=చెపుతూంటారో, అన్ధకక్షయకృత్=యాదవులకు క్షయమును, అనగా ద్వారకారూపనివాసమును, కల్పించిన, సర్వదః=అన్నీ ఇచ్చే, సః=ఆ, మాధవః=లక్ష్మీపతియైన విష్ణువు, స్వయమ్=స్వయంగా, త్వామ్=నిన్ను, పాయాత్=రక్షించుగాక.

శివుని పక్షంలో అర్థం - ధ్వస్తమనోభవేన=నశింపచేయబడిన మన్మథుడు గల, యేన=ఎవని చేత, పురా=పూర్వం(త్రిపురదైత్య వధకాలంలో) బలిజిత్కాయః=బలిని జయించిన విష్ణువుయొక్క శరీరం, అస్త్రీకృతః=అస్త్రంగా, బాణంగా చేయబడిందో, శివుడు భూమిని రథంగాను, బ్రహ్మదేవుణ్ణి సారథినిగాను, మేరుపర్వతాన్ని ధనస్సుగాను, వాసుకిని నారిగాను, చంద్రసూర్యుల్ని రథచక్రాలుగాను, విష్ణువును బాణంగాను, అగ్నిని బాణాగ్రంగాను చేసికొని వెళ్ళి త్రిపురాసురసంహారం చేశాడని పురాణకథ. యః చ= ఎవడు, ఉద్వృత్తభుజఙ్గహారవలయః=ఉద్ధతాలైన సర్పాలు హారంగాను వలయాలుగాను కలవాడో, యః=ఎవడు, గఙ్గాం చ = గంగను కూడ, అధారయత్= ధరించెనో, యస్య=ఎవని యొక్క, శిరః శిరస్సు, శశిమత్=చంద్రుడు కలదో, హరః ఇతి= సర్వలోకసంహారకుడు అని, స్తుత్యమ్=స్తుతించదగిన, నామ=ఎవని పేరును, అమరాః=దేవతలు, ఆహుః= చెపుతుంటారో, సః=అట్టి, అన్ధకక్షయకరః=అంధకాసురుణ్ణి

నశించేసిన, ఉమాధవః= ఉమాపతియైన, శివుడు, సర్వదా=ఎల్లప్పుడూ, త్వామ్=నిన్ను, స్వయమ్=స్వయంగా, పాయాత్ =రక్షించుగాక.

లోచనం

కారికాగతం 'హి' శబ్దం వ్యాచష్టే-యస్మాదితి. అలఙ్కారశబ్దస్య వ్యవచ్ఛేద్యం దర్శయతి - న వస్తుమాత్రమితి. చశబ్దః తుశబ్దస్యార్థే. యేనేతి - యేన ధ్వస్తం బాలక్రీడాయామ్ అనః శకటమ్. అభవేన అజేన సతా. బలినః దానవాన్ యో జయతి తాదృక్ యేన కాయః వపుః పురా అమృతహరణకాలే స్త్రీత్వం ప్రాపితః, యశ్చ ఉద్వృత్తం కాలియాఖ్యం భుజఙ్గం హతవాన్, రవే శబ్దే లయో యస్య, 'అకారో విష్ణుః' ఇత్యుక్తేః. యశ్చాగం గోవర్ధనపర్వతం గాం చ భూమిం పాతాలగతామ్ అధారయత్. యస్య చ నామ స్తుత్యమ్ ఋషయః ఆహుః, కిం తత్? శశినం మథ్నాతీతి, క్విప్, రాహుః, తస్య శిరోహరః మూర్ధాపహారక ఇతి. స త్వామ్ మాధవః విష్ణుః సర్వదః పాయాత్. కీదృక్? అన్ధకనామ్నాం జనానాం యేన క్షయః నివాసః ద్వారకాయాం కృతః. యది వా మౌసలే ఇషీకాభిః తేషాం వినాశో యేన కృతః. ద్వితీయోఽర్థః - యేన ధ్వస్తకామేన సతా బలిజితో విష్ణోః సంబన్ధీ కాయః పురా త్రిపురనిర్దహనావసరే అస్త్రీకృతః, శరత్వం నీతః, ఉద్వృత్తాః భుజఙ్గా ఏవ హారాః వలయాశ్చ యస్య, మన్దాకినీం చ యః అధారయత్, యస్య చ ఋషయః శశిమచ్చన్ద్రయుక్తం శిర ఆహుః, హర ఇతి చ యస్య నామ స్తుత్యమాహుః, స భగవాన్ స్వయమేవ అన్ధకాసురస్య వినాశకారీ త్వాం సర్వదా సర్వకాలమ్ ఉమాయా ధవో వల్లభః పాయాదితి. అత్ర వస్తుమాత్రం ద్వితీయం ప్రతీతం నాలఙ్కార ఇతి శ్లేషస్యైవ విషయః.

బాలానందిని

కారికేతి - యస్మాత్ ఇత్యాదికంచేత కారికలో ఉన్న 'హి' శబ్దాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. వస్తుమాత్రమే కాదు అని అంటూ అలంకారశబ్దంచేత మినహాయించబడినదానిని చూపుతున్నాడు. వస్తుద్వయే చ అన్నచోట 'చ' శబ్దానికి 'తు' కాని అని అర్థం. యేనేతి - ఎవనిచేత బాలక్రీడలో, అనః=శకటం, నశింపచేయబడిందో,

అభవేన- పుట్టుకలేనివాడై ఉండి, బలినః=దానవులను ఏది జయించునో అట్టి, కాయః = శరీరం, పురా = అమృతహరణకాలంలో, స్త్రీత్వాన్ని పొందించబడిందో, ఎవడు ఉద్వృత్తమ్=మదంతో కూడిన, కాలియుడనే సర్పాన్ని పీడించి నాడో. రవంలో అనగా శబ్దంలో ఎవనికి లయమో, అనగా తాదాత్మ్యమో "అకారం విష్ణువు" అని చెప్పబడింది కదా? ఎవడు అగమ్ = గోవర్ధనపర్వతాన్ని, గాం చ = పాతాలంలో ఉన్న భూమినీ ధరించెనో, ఎవని పేరు స్తుత్యమైనది అని ఋషులు అంటారో. అది ఏది? "శశినం మథ్నాతి" అనే అర్థంలో 'క్విప్' ప్రత్యయం. శశిమత్ అనగా రాహువు. వాని శిరస్సును హరించినవాడు అని. అట్టి అన్నీ ఇవ్వ సమర్థుడైన, మాధవః=విష్ణువు నిన్ను రక్షించుగాక. ఎలాంటివాడు? అంధకు లను పేరు గల జనులకు ఎవనిచేత, క్షయః=ద్వారకలో నివాసం ఏర్పరచబడిందో, లేదా మౌసలపర్వంలో చెప్పినట్లు తుంగగడ్డిచేత వాళ్ల, క్షయః=వినాశం చేయబడిందో, రెండవ అర్థం. నశింపచేయబడిన మన్మథుడు గల ఎవనిచేత విష్ణువుయొక్క శరీరం, పురా = త్రిపురదహనసమయంలో, అస్త్రీకృతః=శరత్వాన్ని పొందించబడిందో, ఉద్వృత్తాః= క్రూరములైన సర్పాలు ఎవని హారాలూ వలయాలూనో, ఎవడు మందాకినీనదిని ధరించెనో, ఎవని శిరస్సు శశిమత్= చంద్రునితో కూడినది అని ఋషులు అంటారో, హరుడు అనే ఎవని పేరు స్తుతింపదగింది అని అంటారో, స్వయంగా అంధకాసురుణ్ణి, సంహరించిన భగవంతుడు, ఉమయొక్క ధవః= వల్లభుడైన శివుడు, నిన్ను సర్వదా=ఎల్లప్పుడూ, రక్షించుగాక. **అత్రేతి** – ఇక్కడ గమ్యం అవుతూన్న రెండవది వస్తువే కాని అలంకారం కాదు. అందుచేత ఈ కావ్యం శ్లేషకే విషయం.

## ధ్వన్యాలోకం

నను అలఙ్కారాన్తరప్రతిభాయామపి శ్లేషవ్యపదేశో భవతీతి దర్శితం భట్టోద్భటేన; తత్పునరపి శబ్దశక్తిమూలో ధ్వనిర్నిరవకాశః ఇత్యాశఙ్క్య ఇదముక్తం 'ఆక్షిప్తః' ఇతి. తదయమర్థః- యత్ర శబ్దశక్త్యా సాక్షాదలఙ్కారాన్తరం వాచ్యం సత్ ప్రతిభాసతే స సర్వః శ్లేషవిషయః. యత్ర తు శబ్దశక్త్యా సామర్థ్యాక్షిప్తం వాచ్యవ్యతిరిక్తం వ్యఙ్గ్యమేవాలఙ్కారాన్తరం ప్రకాశతే స ధ్వనేః విషయః. శబ్దశక్త్యా సాక్షాదలఙ్కారాన్తరప్రతిభా యథా -

శ్లో. తస్యా వినాపి హారేణ నిసర్గాదేవ హారిణౌ,
జనయామాసతుః కస్య విస్మయం న పయోధరౌ. (38)

అత్ర శృఙ్గారవ్యభిచారీ విస్మయాఖ్యో భావః సాక్షాద్విరోధాలంకారశ్చ ప్రతిభాసత ఇతి విరోధచ్ఛాయానుగ్రాహిణః శ్లేషస్యాయం విషయః, న త్వనుస్వానోపమవ్యఙ్గ్యస్య ధ్వనేః.

బాలానందిని

నన్వితి - (ఆశంక) మరొక అలంకారం భాసించినా కూడ శ్లేష అని చెప్పవచ్చు అని భట్టోద్భటుడు అన్నాడు కదా? ఆతడు చెప్పిన దానిని బట్టి శబ్దశక్తిమూలధ్వనికి అవకాశం ఉండదు - అని ఆశంకించుకొని (కారికలో) 'ఆక్షిప్తః' అని చెప్పబడింది. అందువల్ల ఇక్కడ అర్థం ఇది - ఎక్కడైతే మరొక అలంకారం కూడా సాక్షాత్తుగా (సూటిగా)శబ్దశక్తిచేత, వాచ్యమై భాసిస్తుందో అదంతా శ్లేషకు విషయం. కాని ఎక్కడైతే శబ్దశక్తిచేత, వాచ్యంకంటె భిన్నమైన, వ్యంగ్యమే అయిన, మరొక అలంకారం (సాక్షాత్తుగా కాక) సామర్థ్యంచేత ఆక్షిప్తమై (అర్థసామర్థ్యం చేత లాగబడినదై ) ప్రకాశిస్తుందో అది ధ్వనికి విషయం. సాక్షాత్తు శబ్దశక్తిచేత మరొక అలంకారం భాసించడానికి ఉదాహరణం ఎట్లనగా -

తస్యా ఇతి - హారేణ వినాపి = హారం లేకపోయినా, హారిణౌ=హారులైను (మనోహరాలు, హారం కలవి అని రెండర్థాలు), తస్యాః పయోధరౌ= ఆమె స్తనములు, కస్య=ఎవనికి, విస్మయమ్=ఆశ్చర్యాన్ని, న జనయామాసతుః=పుట్టించలేదు?

అత్రేతి - ఇక్కడ శృంగారానికి వ్యభిచారియైన విస్మయం అనే భావం, సాక్షాత్తు విరోధాభాసాలంకారమూ భాసిస్తున్నాయి. అందుచేత ఇది విరోధాలంకారచ్ఛాయను అనుగ్రహించే శ్లేషకే విషయం కాని అనుస్వానం వంటి వ్యంగ్యంగల ధ్వనికావ్యానికి విషయం కాదు.

లోచనం

ఆక్షిప్తశబ్దస్య కారికాగతస్య వ్యవచ్ఛేద్యం దర్శయితుం చోద్యేనోపక్రమతే - నన్వలంకారేత్యాదినా. తస్యా వినాపీతి - అపిశబ్దోఽయం విరోధమాచక్షాణః అర్థద్వయే ఽపి అభిధాశక్తిం నియచ్ఛతి - హరతః హృదయమ్ అవశ్యమితి హారిణౌ, హారో విద్యతే యయోస్తావితి హారిణావితి - అత ఏవ

విస్మయశబ్దోఽస్యైవార్థస్య ఉపోద్బలకః. అపిశబ్దాభావే తు న తత ఏవ అర్థద్వయస్యాభిధా స్యాత్. స్వసౌన్దర్యాదేవ స్తనయోర్విస్మయహేతుత్వోపపత్తేః. విస్మయాఖ్యో భావః ఇతి దృష్టాన్తాభిప్రాయేణోపాత్తమ్. యథా విస్మయః శబ్దేన ప్రతిభాతి 'విస్మయమ్' ఇత్యనేన శబ్దేన తథా విరోధోఽపి ప్రతిభాతి 'అపి' ఇత్యనేన శబ్దేన.

బాలానందిని

ఆక్షిప్తేతి - కారికలో ఉన్న ' ఆక్షిప్త' శబ్దంచేత వ్యవచ్ఛేద్యమైనదానిని (వేరు చేయవలసిన దానిని) చూపడానికై నన్వలంకారేత్యాదికంతో ప్రారంభిస్తున్నాడు. తస్యా వినాపీతి :- ఈ 'అపి' శబ్దవిరోధాన్ని బోధిస్తూ (హారిణౌ' అనే శబ్దంయొక్క) అభిధాశక్తిని "హృదయాన్ని తప్పక హరించేవిగాన హారిణౌ" "హారం వేటిపై ఉన్నదో అవి హారిణౌ" అని రెండర్థాలూ బోధించే టట్లు నియమిస్తూన్నది. అందువల్లనే. 'అపి' శబ్దం ఉండడంవల్లనే, విస్మయ' శబ్దం ఈ అర్థానికే ఉపోద్బలకం. 'అపి' శబ్దం లేకపోతే దానివల్లనే (విస్మయశబ్దంవల్లనే) అర్థద్వయప్రతీతి కలగదు. స్తనాలు తమ సౌందర్యం వల్లనే విస్మయాన్ని కలిగించవచ్చును కదా?

వివరణ. 'అపి' శబ్దం ప్రయోగించకుండా "హారం వినా హారిణౌ తస్యాః పయోధరౌ కస్య విస్మయం న జనయామాసతుః" అని అన్నట్లయితే "సహజంగానే అవి విస్మయజనకాలుగా ఉన్నాయి" అనే అర్థం వస్తుంది.'విస్మయ' శబ్దాన్ని ప్రయోగించినంతమాత్రంచేత 'హారిణౌ' అనేదానికి రెండు అర్థాలు చెప్పాలనే దృష్టి కలగదు. 'అపి' శబ్దం ప్రయోగించడంవల్ల 'హారం వినా అపి హారిణౌ' అనడంతో అపి శబ్దవాచ్యమైన విరోధాన్ని పరిహరించడం కోసం రెండు అర్థాలు చెప్పవలసి వస్తుంది అని అర్థం.

విస్మయాఖ్యః ఇతి - 'విస్మయాఖ్యః భావః' అనేది దృష్టాంతప్రదర్శనార్థం చెప్పబడింది. విస్మయం అనే భావం 'విస్మయ" శబ్దంచేత ఏ విధంగా భాసిస్తూన్నదో అదే విధంగా 'అపి' శబ్దంచేత విరోధం కూడా భాసిస్తూన్నది అని అర్థం.

## ధ్వన్యాలోకం

అలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య తు ధ్వనేః వాచ్యేన శ్లేషేణ విరోధేన వా వ్యఞ్జితస్య విషయ ఏవ. యథా మమైవ -

శ్లో. శ్లాఘ్యాశేషతనుం సుదర్శనకరః సర్వాఙ్గలీలాజిత
త్రైలోక్యాం చరణారవిన్దలలితేనాక్రాన్తలోకో హరిః,
బిభ్రాణాం ముఖమిన్దురూపమఖిలం చన్ద్రాత్మచక్షుర్దధత్
స్థానే యాం స్వతనోరపశ్యదధికాం సా రుక్మిణీ వో ఽవతాత్. (39)

అత్ర వాచ్యతయైవ వ్యతిరేకచ్ఛాయానుగ్రాహీ శ్లేషః ప్రతీయతే.

యథా చ -

శ్లో. భ్రమిమరతిమలసహృదయతాం
ప్రలయం మూర్ఛాం తమః శరీరసాదమ్;
మరణం చ జలదభుజగజం
ప్రసహ్య కురుతే విషం వియోగినీనామ్. (40)

యథా వా -

గాథ. చమహిఅమాణసకఞ్చణపఙ్కఅణిమ్మహిఅపరిమలా జస్స,
అఖణ్డిఅదాణపసారా బాహుప్పలిహా వ్విఅ గఇన్దా. (41)
"ఖణ్డితమానసకాఞ్చనపఙ్కజనిర్మథితపరిమలా యస్య,
అఖణ్డితదానప్రసరా బాహుపరిఘా ఇవ గజేన్ద్రాః".
(సంస్కృతచ్ఛాయ).

అత్ర రూపకచ్ఛాయానుగ్రాహీ శ్లేషో వాచ్యతయైవావభాసతే.

బాలానందిని

అలక్ష్యేతి - (అనురణనరూపవ్యంగ్యానికి ఇది స్థానం కాకపోయినా) వాచ్యమైన శ్లేషచేత గాని, విరోధంచేత గాని వ్యంజింప బడిన (రతిరూప) అలక్ష్య క్రమవ్యంగ్యానికైతే విషయమే . (మరొక) ఉదాహరణగా నా శ్లోకమే ఎట్లనగా -

శ్లాఘ్యేతి :- సుదర్శనకరః = సుదర్శనం హస్తమునందు కలవాడు, చూడడానికి అందమైన చేతులు కలవాడు అని మరొక అర్థం, చరణారవిన్దలలితేన = పాదారవింద క్రీడచేత, అక్రాన్తలోకః=ఆక్రమించబడిన లోకం గలవాడు, చన్ద్రాత్మ చక్షుః=చంద్రరూపమైన

నేత్రమును, ధధత్ = ధరిస్తూన్నవాడు అయిన, హరిః = శ్రీకృష్ణుడు, శ్లాఘ్యాశేషతనుమ్=శ్లాఘించదగిన సమస్త శరీరం కలదీ, సర్వాఙ్గలీలాజితత్రైలోక్యమ్= సకల అవయవాల లీలచేత జయించబడిన మూడు లోకాలు గలదీ, ఇన్దురూపమ్= చంద్రుని వంటి రూపం గల, (చంద్రరూపమైన), అఖిలమ్=సమస్తమైన, ముఖమ్=ముఖమును, బిభ్రాణామ్=ధరించుచున్నదీ అయిన, యామ్= ఏ రుక్మిణిని, స్వతనోః=తన శరీరంకంటె, అధికామ్= అధికురాలినిగా, స్థానే=యుక్తంగానే, అపశ్యత్=చూచెనో, సా రుక్మిణీ=ఆ రుక్మిణి, వః=మిమ్ములను, అవతాత్=రక్షించుగాక. అత్రేతి - ఇక్కడ వ్యతిరేకచ్ఛాయను అనుగ్రహిస్తూన్న శ్లేష వాచ్యంగానే తెలూస్తూన్నది. మరొక ఉదాహరణం ఎట్లనగా -

భ్రమిమితి - జలదభుజగజమ్=మేఘ మనే సర్పంవల్ల పుట్టిన, విషమ్=జలం అనే విషం, విషశబ్దానికి జలం, గరలం అని రెండర్థాలున్నాయి, వియోగినీనామ్= వియోగవతులకు, భ్రమిమ్=త్రిప్పును, అరతిమ్=దేనిమీదా ఇష్టం లేకపోవడాన్ని, అలసహృదయతామ్= మందమైన హృదయం కలిగి ఉండడాన్నీ, హృదయదౌర్బల్యాన్నీ, ప్రలయమ్=బాహ్యేంద్రియాలు పనిచేయకపోవడాన్నీ, మూర్ఛామ్=మూర్ఛను, తమః=చీకటినీ, అంధత్వాన్నీ, శరీరసాదమ్= శరీరం క్షీణించిపోవడాన్నీ, మరణం చ=మరణాన్నీ, ప్రసహ్య=బలాత్కారంగా, కురుతే=చేయును. మరొక ఉదాహరణం ఎట్లనగా -

ఖణ్డితేతి- స్య = ఎవనియొక్క ఖణ్డితమానసకాఞ్చనపఙ్కజనిర్మథిత పరిమలాః=ఖండించబడిన శత్రుమానసాలనే పద్మాలచేత వ్యాపింపచేయబడిన ప్రతాపాలు గల, ఖండించబడిన మానససరోవరమునందున్న బంగారు పద్మాల మథించబడని పరిమలం గల అని రెండవ అర్థం, అఖణ్డితదానప్రసరాః=ఖండించబడని దానం యొక్క (మదోదకంయొక్క అనిరెండవ అర్థం) ప్రసారం గల, బాహుపరిఘాః=పరిఘల వంటి బాహువులు, గజేన్ద్రా ఏవ=గజేంద్రములే.,

అత్రేతి - ఇక్కడ రూపకచ్ఛాయను అనుగ్రహించే శ్లేష వాచ్యంగానే భాసిస్తూన్నది.

లోచనం

నను కిం సర్వథాత్ర ధ్వనిర్నాస్తి ఇత్యాశఙ్క్యాహ - అలక్ష్యేతి. విరోధేన వేతి. వాగ్రహణేన శ్లేషవిరోధ సంకరాలంకారోఽయమితి దర్శయతి. అనుగ్రహ యోగాత్, ఏకతరత్యాగగ్రహణనిమిత్తాభావో హి వాశబ్దేన సూచ్యతే.

సుదర్శనం చక్రం కరే యస్య. వ్యతిరేకపక్షే సుదర్శనౌ శ్లాఘ్యౌ కరావేవ యస్య. చరణారవిన్దస్య లలితం త్రిభువనాక్రమణక్రీడనమ్. చన్ద్రరూపం చక్షుః ధారయన్. వాచ్యతయైవేతి. స్వతనోరధికామితి శబ్దేన వ్యతిరేకస్య ఉక్తత్వాత్.

భుజగశబ్దపర్యాలోచనాబలాదేవ విషశబ్దః జలమభిధాయాపి న విరన్తుముత్సహతే, అపి తు ద్వితీయమర్థం హాలాహలలక్షణమ్ ఆహ. తదభిధానేన వినా అభిధాయా ఏవ అసమాప్తత్వాత్. భ్రమిప్రభృతీనాం తు మరణాన్తానాం సాధారణ ఏవార్థః.

నిరాశీకృతత్వేన ఖణ్డితాని యాని మానసాని శత్రుహృదయాని తాన్యేవ కాఞ్చనపఙ్కజాని; ససారత్వాత్, తైః హేతుభూతైః. ణిమ్మహిఅపరిమలా ఇతి. ప్రసృతప్రతాపప్రసరాః అఖణ్డితవితరణప్రసరాః. బాహుపరిఘా ఏవ యస్య. గజేన్ద్రా ఇతి. గజేన్ద్రశబ్దవశాత్ చమహిఅశబ్దః, పరిమలశబ్దః, దానశబ్దశ్చ త్రోటనసౌరభమదలక్షణానర్థాన్ ప్రతిపాద్యాపి న పరిసమాప్తాభిధావ్యాపారా భవన్తీత్యుక్తరూపం ద్వితీయమపి అర్థమ్ అభిదధత్యేవ.

బాలానందిని

నన్వితి - ఇక్కడ ఏ ధ్వనీ కూడా లేదా అని ఆశంకించుకొని అలక్ష్య ఇత్యాదికం చెపుతున్నాడు. అనురణనధ్వని లేకపోయినా రతిరూపఅసంలక్ష్యక్రమధ్వని ఉంది అని వృత్తికారుని అభిప్రాయం. విరోధేన వా ఇతి. 'వా' అనడంచేత (తస్యాః ఇత్యాది శ్లోకంలో) శ్లేషవిరోధాలంకారాల సంకరం అని చూపుతున్నాడు. అనుగ్రహం ఉండడంవల్ల, అనగా విరోధ - శ్లేషలకు అనుగ్రాహ్యానుగ్రాహకభావం ఉండడంవల్ల ,రెండింటిలో ఒకదానిని విడవడానికి గాని, గ్రహించడానికి గాని నిమిత్తం లేదు అని 'వా' శబ్దం సూచిస్తూన్నది.

సుదర్శనమితి - సుదర్శనం ఎవని చేతిలో ఉన్నదో అతడు. వ్యతిరేకపక్షంలో సుదర్శనౌ= శ్లాఘింపదగిన, కరములు ఎవనికి ఉన్నవో అని అర్థం. చరణారవిందంయొక్క, లలితమ్= త్రిభువనాలను ఆక్రమించడం అనే క్రీడ. చంద్రరూపమైన నేత్రాన్ని ధరిస్తూన్నవాడు. వాచ్యతయైవేతి - 'స్వతనోః అధికామ్' అనే శబ్దంచేత వ్యతిరేకాలంకారం వాచ్యంగానే చెప్పబడింది కదా?

భుజగేతి :- 'భుజగ' శబ్దాన్ని గూర్చి పర్యాలోచించడంయొక్క బలంవల్లనే 'విష' శబ్దం జలం అనే అర్థాన్ని చెప్పికూడా దానితో ఆగిపోవడానికి అంగీకరించదు. ఇంకనేమంటే హలాహలం అనే రెండవ అర్థం కూడా చెపుతుంది. అది చెప్పే వరకు అభిధ సమాప్తం కాదు. 'భ్రమి' మొదలు 'మరణ' శబ్దం వరకూ ఉన్నవాటికైతే సాధారణమైన అర్థమే.

నిరాశీతి - నిరాశకలవిగా చేయబడిన ఖండితాలైన ఏ మానసాని = శత్రుహృదయాలు కలవో అవే బంగారు పద్మాలు. సారవంతములు కదా? హేతువులైన ఆ హృదయాలచేత. ఊమ్మహిఅపరిమలా ఇతి. ప్రసరించిన ప్రతాపసారం గల, అఖండితమైన వితరణప్రసారం గల బాహుపరిఘలే ఎవనియొక్క గజేంద్రాలో, 'గజేన్ద్ర'శబ్దబలంవల్ల 'చమహిఅ'శబ్దం, 'పరిమల'శబ్దం, 'దాన'శబ్దం కూడా ఖండించడం, పరిమలం, మదం అనే అర్థాలను ప్రతిపాదించిన తరవాత కూడ వాటి అభిధావ్యాపారం పరిసమాప్తం కాదు. అందుచేత పైన చెప్పిన రెండవ అర్థాన్ని కూడా తప్పక అభిధచేతనే బోధిస్తాయి.

## ధ్వన్యాలోకం

స చాక్షిప్తః అలంకారః యత్ర పునః శబ్దాన్తరేణాభిహితస్వరూపః తత్ర న శబ్దశక్త్యుద్భవానురణనరూపవ్యఙ్గ్యధ్వనివ్యవహారః. తత్ర వక్రోక్త్యాదివాచ్యాలంకారవ్యవహార ఏవ. యథా

శ్లో. దృష్ట్యా కేశవ గోపరాగహృతయా కించిన్న దృష్టం మయా
తేనైవ స్ఖలితాస్మి నాథ పతితాం కిం నామ నాలమ్బసే,
ఏకస్త్వం విషమేషు ఖిన్నమనసాం సర్వాబలానాం గతి
ర్గోప్యైవం గదితః సలేశమవతాద్గోష్ఠే హరిర్వశ్చిరమ్. (42)

బాలానందిని

స చేతి - ఎక్కడైతే ఆక్షిప్తమైన ఆ అలంకారమే మళ్లీ మరొక శబ్దంచేత చెప్పబడిన స్వరూపంకల దవుతుందో అక్కడ శబ్దశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యం అనే వ్యవహారం ఉండదు. అక్కడ వక్రోక్త్యాదివాచ్యాలంకారవ్యవహారమే ఉంటుంది. ఎట్లనగా -

దృష్ట్యా ఇతి - కేశవ= ఓ! కృష్ణా! గోపరాగహృతయా= ఆవుల పరాగంచేత హరించబడిన, దృష్ట్యా= దృష్టిచేత, మయా= నాచేత, కించిత్= ఏమీ కూడ, న దృష్టమ్=

చూడబడలేదు. తేనైవ= ఆ కారణంచేతనే, స్ఖలితా అస్మి= తొట్రుపడితిని, నాథ= ప్రభూ! పతితామ్= పడిపోయిన నన్ను, కిం నామ = ఎందువల్ల, నాలమ్బసే= పట్టుకొనవు? విషమేషు= ఎగుడుదిగుడు ప్రదేశములందు, ఖిన్నమనసామ్= ఖేదం చెందిన మనస్సు కల, సర్వాబలానామ్= దుర్బలు లందరికీ, త్వమ్ ఏకః= నువ్వు ఒక్కడవే, గతిః= గతివి; ఏవమ్= ఈ విధంగా, గోష్ఠే= గోశాలలో, గోప్యా= గోపికచేత, సలేశమ్= సూచనాపూర్వకంగా, గదితః= పలకబడిన, హరిః = విష్ణువు, వః= మిమ్ములను, చిరమ్= చిరకాలము, పాతు= రక్షించుగాక అని బాహ్యార్థం.

కేశవా! గోప-రాగహతయా= గోపాలునియందు (నీయందు) అనురాగంచేత హరించబడిన, దృష్ట్యా= దృష్టిచేత, మయా= నాచేత, కించిత్= ఏమీ, న దృష్టమ్= చూడబడలేదు. నేను వెనకముందు లేవీ చూచుకోలేదు. తేనైవ= ఆ కారణంచేతనే, స్ఖలితా అస్మి= పొరబాటు పని చేశాను. నాథ= నాథా! పతితామ్= (నా విషయంలో) పతిత్వాన్ని, భర్తృత్వాన్ని, కిం నామ నాలమ్బసే= ఎందుకు అవలంబించకున్నావు? త్వమ్ ఏకః=నువ్వు ఒక్కడవే, విషమేషుఖిన్నమనసామ్= మన్మథునిచేత పీడించబడిన మనస్సులు గల, సర్వాబలానామ్= సమస్తస్త్రీలకు, గతిః= గతివి. గోప్యా ఇత్యాది చతుర్థపాదానికి వెనుక చెప్పిన అర్థమే.

లోచనం

ఏవమాక్షిప్తశబ్దస్య వ్యవచ్ఛేద్యం ప్రదర్శ్య ఏవకారస్య వ్యవచ్ఛేద్యం దర్శయితుమాహ - స చేతి. ఉభయార్థప్రతిపాదనసమర్థశబ్దప్రయోగే, యత్ర తావదేకతరవిషయనియమనకారణమభిధాయాః నాస్తి యథా - "యేన ధ్వస్తమనోభవేన" ఇతి, యత్ర వా ప్రత్యుత ద్వితీయాభిధావ్యాపార సద్భావావేదకం ప్రమాణమస్తి, యథా-"తస్యా వినా" ఇత్యాదౌ, తత్ర తావత్ సర్వథా "చమహిఅ" ఇత్యన్తే, సోఽర్థోఽభిధేయ ఏవేతి స్ఫుటమదః. యత్రాప్యభిధాయా ఏకత్ర నియమహేతుః ప్రకరణాదిర్విద్యతే తేన ద్వితీయస్మిన్నర్థే నాభిధా సంక్రామతి, తత్ర ద్వితీయః అర్థః అసౌ ఆక్షిప్త ఇత్యుచ్యతే; తత్రాపి యది పునస్తాదృక్ శబ్దో విద్యతే యేన అసౌ నియామకః ప్రకరణాదిరపహతశక్తికః సంపాద్యతే, అత ఏవ సా అభిధాశక్తిః బాధితాపి సతీ ప్రతిప్రసూతేవ తత్రాపి న ధ్వనేర్విషయః ఇతి తాత్పర్యమ్. చ శబ్దః అపిశబ్దార్థే

భిన్నక్రమః, ఆక్షిప్తోఽపి ఆక్షిప్తతయా ఝటితి సంభావయితుమారబ్ధో ఽపీత్యర్థః. న త్వసావాక్షిప్తః, కిం తు శబ్దాన్తరేణ అన్యేన అభిధాయాః ప్రతిప్రసవాత్ అభిహితస్వరూపః సంపన్నః. పునర్గ్రహణేన ప్రతిప్రసవం వ్యాఖ్యాతం సూచయతి. తేన ఏవకారః ఆక్షిప్తాభాసం నిరాకరోతీత్యర్థః.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా "ఆక్షిప్త ఏవ" ఇత్యాది కారికలలోని 'ఆక్షిప్త'శబ్దంచేత వ్యవచ్ఛేద్యమైనదానిని (వేరుచేయతగినదానిని) చూపి ఇప్పుడు 'ఏవ' కారంచేత వ్యవచ్ఛేద్యమైనదానిని చూపడానికి స చ ఇత్యాదికంతో చెపుతున్నాడు. ఉభయేతి - రెండు అర్థాలను ప్రతిపాదించడానికి సమర్థమైన శబ్దాలను ప్రయోగించినప్పుడు, ఎక్కడైతే అభిధను ఒకే అర్థాన్ని బోధించడానికి నియమించడానికి తగిన కారణం ఏదీ లేదో అట్టి "యేన ధ్వస్తమనోభవేన" ఇత్యాదులలోను, ఎక్కడేతై నియమించడానికి తగిన కారణం లేకపోవడం సరికదా పైగా (ప్రత్యుత) రెండవ అభిధావ్యాపారం ఉన్నదని చెప్పే ప్రమాణం ఉన్న "తస్యా వినా" మొదలు "చమహిఅ" వరకు ఉన్న నాలుగు ఉదాహరణలలోను అన్ని విధాలా ఆ అర్థం (రెండవ అర్థం) అభిధేయమే, అభిధావ్యాపారంచేత వాచ్యమే, అనే విషయం స్పష్టమే. అభిధను ఒక అర్థం బోధించడానికే నియమించే ప్రకరణాదికం ఉండడంచేత, అనగా ప్రకరణాదికాన్ని పట్టి ఒక శబ్దం ఒక అర్థాన్నే బోధించవలసిన ఉండడంచేత, ఎక్కడ అభిధ రెండవ అర్థాన్ని చెప్పడానికి ప్రసరించదో, అక్కడ ఈ రెండవ అర్థం ఆక్షిప్తం అని చెప్పవలసి ఉంటుంది. కాని అక్కడ ఒకానొక శబ్దం ప్రయోగించడంవల్ల నియామకమైన (అభిధను ఒక అర్థాన్ని మాత్రమే బోధించే టట్లు చేసే) ప్రకరణాదికం తొలగించబడిన (నియమన)శక్తి కలదైపోతుంది. అనగా అక్కడ ప్రకరణాదికానికి ఉన్న నియమనశక్తి తొలగించబడుతుంది. అందువల్ల ఆ అభిధాశక్తి (ప్రకరణాదికంచేత) బాధించబడినా కూడ ప్రతిప్రసూతం అయినట్లు (తిరిగి ప్రాణం పోసినట్లు) అవుతుంది. అక్కడ కూడా ధ్వనికి విషయం కాదు అని తాత్పర్యం.

వివరణ:- శాస్త్రంలో ఏదైనా ఒకటి విధించి, విధించినదానిని కొన్ని సందర్భాలలో నిషేధించి, మళ్లీ కొన్ని సందర్భాలలో ఆ నిషేధాన్ని నిషేధించి మొదటి విధినే తిరిగి నిలిపినట్లయితే దానికి ప్రతిప్రసవం అని పేరు. ప్రకృతంలో ఒక శబ్దానికి రెండు అర్థాలను బోధించే శక్తి ఉంది అని చెప్పబడింది. అయితే కొన్ని చోట్ల ఆ శబ్దాన్ని

ప్రయోగించినా అక్కడుండే ప్రకరణాదుల్ని పట్టి ఈ అర్థమే చెప్పాలి, రెండవ అర్థం చెప్పకూడదు అని చెప్పబడుతుంది. అయితే ఆ శ్లోకంలోనో వాక్యంలోనో ఉన్న మరొక శబ్దాన్ని పట్టి "ప్రకరణంచేత రెండవ అర్థాన్ని నిషేధించకూడదు, ఆ అర్థంకూడ చెప్పాలి"అని చెప్పబడుతుంది. ఇది ప్రతిప్రసవం.

చ శబ్ద ఇతి - "స చాక్షిప్తః" అన్నచోట 'చ' శబ్దానికి 'అపి' అని అర్థం. దానిని ఆక్షిప్తః తరవాత చేర్చుకొని "ఆక్షిప్తః చ= ఆక్షిప్తోఽపి" అని అన్వయించుకోవాలి. (భిన్నక్రమత్వం అనగా పదాల క్రమంలో మార్పు చేయడం). అప్పుడు - ఆక్షిప్తః అపి= విన్న వెంటనే ఆక్షిప్తమైనట్లు ఊహించబడినదైనప్పటికీ అని అర్థం. ఇది ఆక్షిప్తం కాదు; మరే మనగా - శబ్దాన్తరేణ= విశేషం శబ్దచేత, అభిధయొక్క ప్రతిప్రసవం వల్ల, అది వాచ్యమే అవుతుంది. యత్ర పునః అన్నప్పుడు పునఃశబ్దంచేత పైన వివరించిన ప్రతిప్రసవాన్ని సూచిస్తున్నాడు. తేనేతి - అందుచేత "ఆక్షిప్త ఏవ" అనే కారికలోని 'ఏవ' కారం ఆక్షిప్తాభాసాన్ని, ఆక్షిప్తంవలె కనబడేదానిని, నిరాకరిస్తూన్నది అని అర్థం.

లోచనం

హే కేశవ - గోధూలిహృతయా దృష్ట్యా న కించిద్దృష్టం మయా, తేన కారణేన స్ఖలితాస్మి, మార్గే. తాం పతితాం సతీం మాం కిం నామ, కః ఖలు హేతుః యత్ నాలమ్బసే హస్తేన. యతః త్వమేవైకః అతిశయేన బలవాన్ నిమ్నోన్నతేషు సర్వేషామబలానాం బాలవృద్ధాఙ్గనాదీనాం ఖిన్నమనసాం, గన్తుమశక్నువతాం గతిః ఆలమ్బనాభ్యుపాయః ఇత్యేవం విధేఽర్థే యద్యప్యేతే ప్రకరణేన నియన్త్రితాభిధాశక్తయః శబ్దాః తథాపి ద్వితీయేఽర్థే వ్యాఖ్యాస్యమానే అభిధాశక్తిర్నిరుద్ధా సతీ 'సలేశమ్' ఇత్యనేన ప్రత్యుజ్జీవితా. అత్ర సలేశం ససూచనమిత్యర్థః. అల్పీభవనం హి సూచనమేవ.

హే! కేశవ! గోపస్వామిన్, రాగహృతయా దృష్ట్యేతి. కేశవగేన ఉపరాగేణ హృతయా దృష్ట్యేతి వా సంబన్ధః. స్ఖలితాస్మి ఖణ్డితచరిత్రా జాతాస్మి. పతితామ్ ఇతి:- భర్తృభావం మాం ప్రతి. ఏక ఇత్యసాధారణసౌభాగ్యశాలీ త్వమేవ. యతః సర్వాసామ్ అబలానాం మదనవిధురమనసామ్, ఈర్ష్యాకాలుష్య నిరాసేన సేవ్యమానః సన్ గతిః జీవితరక్షోపాయ ఇత్యర్థః.

బాలానందిని

హే కేశవేతి - "ఓ! కేశవా! గోధూలిచేత హరించబడిన చూపుచేత నేను ఏదీ చూడకపోయాను. ఆ కారణంచేత మార్గంలో తొట్రుపడ్డాను. పడిపోయిన నన్ను కిం నామ= కారణం ఏమిటి, నువ్వు చెయ్యి ఊత ఇచ్చి పట్టుకొనడం లేదు? ఎందువల్ల ననగా నువ్వు ఒక్కడవే చాలా బలం కలవాడవు. నిమ్నోన్నతప్రదేశాలలో, ఖిన్నమనసామ్= శ్రమపడుతున్న మనస్సు కల, నడవజాలని, అబలానామ్= బాలవృద్ధ-అంగనాదులకు, గతిః=ఆలంబనం పొందడానికి ఉపాయమైనవాడవు'. - ఈ విధమైన అర్థాన్ని బోధించడానికే ఇక్కడున్న శబ్దాలన్నీ ప్రకరణంచేత నియంత్రితమైన అభిధాశక్తి కలవైనా కూడ, ప్రకరణం ఈ పదాలకున్న అభిధాశక్తిని ఈ అర్థంమాత్రమే బోధించడానికి నియమించినా కూడ, వ్యాఖ్యానించబడబోయే రెండవ అర్థాన్ని బోధించకుండా ఈ విధంగా అడ్డుకొనబడిన అభిధాశక్తి 'సలేశమ్' అనే పదంచేత పునరుజ్జీవితం అయింది. ఇక్కడ సలేశమ్- అనగా 'సూచనాసహితంగా' అని అర్థం. లేశశబ్దానికి అసలు అర్థం అల్పంగా ఉండడం అని అర్థం. అల్పంగా ఉండడం అనగా ఇక్కడ సూచనమే కద? ఎక్కువ మాటలు ఉపయోగించకుండా తక్కువ మాటలలో చెప్పడం సూచనం అని భావం.

హే కేశవేతి - ఓ! కేశవా, గోప= స్వామీ! (రక్షకుడా) రాగంచేత, అనురాగంచేత హరించబడిన చూపుచేత, లేదా కేశవ+ఉపరాగేణ= కేశవుని యందు (నీయందు) ఉన్న ఉపరాగం (అనురాగం)చేత, హరించబడిన దృష్టిచేత అని అన్వయం. స్ఖలితాస్మి= ఖండితమైన చరిత్ర కలదానను అయినాను. పతితామ్ అనగా నావిషయంలో భర్తృత్వాన్ని అని అర్థం. ఏకః అనగా అసాధారణమైన సౌందర్యం గల నీవు మాత్రమే, ఎందువలన, సర్వాబలానామ్= మదనపీడితమైన మనస్సుగల స్త్రీలకందరికీ, ఈర్ష్యాకాలుష్యాన్ని విడచి సేవించబడినవాడవై, గతిః= జీవితరక్షోపాయం అని అర్థం.

ధ్వన్యాలోకం

ఏవంజాతీయకః సర్వ ఏవ భవతు కామం వాచ్యశ్లేషస్య విషయః. యత్ర తు సామర్థ్యాక్షిప్తం సదలఙ్కారాన్తరం శబ్దశక్త్యా ప్రకాశతే స సర్వ ఏవ ధ్వనేః విషయః. యథా-

"అత్రాన్తరే కుసుమసమయయుగముపసంహరన్ అజృమ్భత గ్రీష్మాభిధానః ఫుల్లమల్లికాధవలాట్టహాసః మహాకాలః". (హర్షచరితం.

ద్వితీయోచ్ఛ్వాసం. కాని లభ్యమానగ్రంథంలో "అత్రాన్తరే" కి బదులు "తత్రస్థస్య చాస్య కదాచిత్" అని ఉంది).

యథా చ -

శ్లో. ఉన్నతః ప్రోల్లసద్ధారః కాలాగురుమలీమసః,
పయోధరభరస్తస్యాః కం న చక్రేఽభిలాషిణమ్. (43)

యథా వా -

శ్లో. దత్తానన్దాః ప్రజానాం సముచితసమయాకృష్టసృష్టైః పయోభిః
పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశి దిశి విరమత్యహ్ని సంహారభాజః,
దీప్తాంశోర్దీర్ఘదుఃఖప్రభవభవభయోదన్వదుత్తారనావో
గావో వః పావనానాం పరమపరిమితాం ప్రీతిముత్పాదయన్తు. (44)

ఏషూదాహరణేషు శబ్దశక్త్యా ప్రకాశమానే సతి అప్రాకరణికే అర్థాన్తరే వాక్యస్యాసంబద్ధార్థాభిధాయిత్వం మా ప్రసాఙ్క్షీదితి అప్రాకరణికప్రాకరణికార్థయోః ఉపమానోపమేయభావః కల్పయితవ్యః సామర్థ్యాత్ ఇతి అర్థాక్షిప్తోఽయం శ్లేషః న శబ్దోపారూఢ ఇతి విభిన్న ఏవ శ్లేషాత్ అనుస్వానోపమవ్యఙ్గ్యస్య ధ్వనేః విషయః.

బాలానందిని

ఏవమితి - ఈ విధమైనది సమస్తమూ కూడ వాచ్యశ్లేషాలంకారానికి విషయం అయితే కావచ్చు. అయితే ఎక్కడ మరొక అలంకారం శబ్దశక్తిచేత సామర్థ్యాక్షిప్తమై, వాచ్యం కాక కేవలం ఊహించబడినదై, ప్రకాశిస్తుందో అది సమస్తమూ కూడ ధ్వనికి విషయం. ఎట్లనగా -

అత్రేతి - ఇంతలో వసంతర్తువుకు సంబంధించిన రెండు మాసాలను ఉపసంహరిస్తూ మనోహరాలుగా ఉండే టట్లు చేయబడిన అంగళ్లు గల, అనగా అంగళ్లను మనోహరంగా ఉండేటట్లు చేసిన, వికసించిన మల్లికలు గల గ్రీష్మం అనే మహాకాలం విజృంభించెను. "ఇంతలో - కృతయుగాదుల్ని ఉపసంహరిస్తూ

భయంకరమైన పేరు గల వికసించిన మల్లికలవంటి అట్టహాసం కల మహాకాలుడు విజృంభించెను" అని వ్యంగ్యార్థం. మరొక ఉదాహరణం ఎట్లనగా - ఉన్నతః ఇతి - ఉన్నతః= ఉన్నతమూ, పోల్లసద్ధారః= ప్రకాశిస్తూన్న హారాలు కలదీ, కాలాగురుమలీమసః= కాలాగురువుచేత నల్లగా ఉన్నదీ, అయిన, తస్యాః = ఆమెయొక్క, పయోధరభరః= స్తనభారం, కమ్= ఎవనిని, అభిలాషిణమ్= అభిలాష కలవానినిగా, న చక్రే= చెయ్యలేదు? గమ్యమానవర్షర్తుపక్షంలో, "ఉన్నతమూ, ప్రకాశిస్తూన్న జలధారలు కలదీ, కాలాగురువు వలె నల్లనిదీ అయిన ఆ ప్రావృట్కాలంయొక్క, పయోధరభరః= మేఘసముదాయం, ఏ పాంథుణ్ణి అభిలాష కలవానినిగా చేయలేదు" అని అర్థం. మరొక ఉదాహరణం ఎట్లనగా - దత్తానన్దాః ఇతి - సముచితసమయాకృష్టసృష్టైః = తగిన సమయంలో ఆకర్షించబడి విడవబడిన, పయోభిః= ఉదకాలచేత, ప్రజానామ్= ప్రజలకు, దత్తానన్దాః= ఇవ్వబడిన ఆనందం గలవి, పూర్వాహ్ణే= పూర్వాహ్ణమునందు, దిశి దిశి= ప్రతి దిక్కునందూ, విప్రకీర్ణాః= వ్యాపించినవి, అహ్ని= పగటిభాగం, విరమతి సతి = విరమిస్తూండగా, సంహారభాజః =ఉపసంహారాన్ని పొందేవీ, దీర్ఘ....నావః - దీర్ఘ= దీర్ఘమైన, దుఃఖ= దుఃఖానికి, ప్రభవ=ఉత్పత్తిస్థానమైన, భవభయ= సంసారభయం అనే, ఉదన్వత్= సముద్రంయొక్క, ఉత్తార=దాటుటయందు, నావః= నావలు అయిన, ఇవన్నీ 'గావః'కు విశేషణాలు, దీప్తాంశోః= సూర్యునియొక్క, గావః= కిరణాలు, పావనానామ్= పవిత్రులైన, వః =మీకు, పరమ్= మిక్కిలి, అపరిమితామ్= అపరిమితమైన, ప్రీతిమ్= ఆనందాన్ని, ఉత్పాదయన్తు= పుట్టించుగాక.

ఏష్వితి - ఈ ఉదాహరణాలలో అప్రాకరణికమైన మరొక అర్థం శబ్దశక్తిచేత ప్రకాశిస్తూన్నది(తెలియబడుతున్నది). ఇలా స్ఫురిస్తూన్న రెండవ అర్థానికి ప్రకరణంలో ఏమీ సంబంధం లేకపోవడంచేత ఈ వాక్యం అసంబద్ధమైన అర్థాన్ని, ఎక్కడా అన్వయించని అర్థాన్ని, బోధిస్తూన్నది అని చెప్పవలసి ఉంటుంది (అసంబద్ధార్థాన్ని బోధించడం కూడా దోషమే కదా.) అలాంటి దోషం కలగకుండా ఉండాలంటే ప్రాకరణికార్థానికీ, అప్రాకరణికార్థానికీ సామర్థ్యాన్ని పట్టి ఉపమానోపమేయభావం కల్పించాలి. అందుచేత అర్థసామర్థ్యాన్ని పట్టి వచ్చిన శ్లేష శబ్దాలలో లేదు. అనగా శబ్దంలో ఉన్న అభిధాశక్తివల్ల ఏర్పడినది కాదు. అందుచేత ఇది మామూలు శ్లేషకంటె భిన్నం అయినది. ఇది అనుస్వానోపమమైన (అనుస్వానం వంటి) ధ్వనికి విషయం.

లోచనం

ఏవం శ్లేషాలంకారస్య విషయమ్ అవస్థాప్య ధ్వనేరాహ - యత్రత్వితి - కుసుమసమయాత్మకం యద్యుగం మాసద్వయం తదుపసంహరన్. ధవలాని హృద్యాని అట్టాని ఆపణా యేన తాదృక్ ఫుల్లమల్లికానాం హాసః వికాసః సితిమా యత్ర. "ఫుల్లమల్లికా ఏవ ధవలాట్టహాసః అస్య" ఇతి తు వ్యాఖ్యానే జలదభుజగజమ్ ఇత్యేతత్తుల్యమేతత్ స్యాత్. మహాంశ్చాసౌ దినదైర్ఘ్యదురతివాహతాయోగాత్ కాలః సమయః. అత్ర తు ఋతువర్ణన ప్రస్తావనియన్త్రితాభిధాశక్తయః అత ఏవ "అవయవప్రసిద్ధేః సముదాయప్రసిద్ధిః బలీయసీ" ఇతి న్యాయమ్ అపాకుర్వన్తః 'మహాకాల' ప్రభృతయః శబ్దాః ఏతమేవ అర్థమ్ అభిధాయ కృతకృత్యా ఏవ. తదనన్తరమర్థావగతిః ధ్వననవ్యాపారాదేవ శబ్దశక్తిమూలాత్.

బాలానందిని

ఏవమితి - ఈవిధంగా శ్లేషాలంకారానికి విషయాన్ని నిర్ణయించి ధ్వనియొక్క విషయాన్ని గూర్చి చెపుతున్నాడు - యత్ర త్వితి - కుసుమేతి :- వసంతర్తురూపమైన ఏ, యుగమ్= మాసద్వయం ఉన్నదో, దానిని ఉపసంహరిస్తూ, ధవలాని= మనోహరములైన, అట్టాని= అంగళ్లు దేనిచేతనో, తాదృక్= అట్టి, వికసించిన మల్లికలయొక్క, హాసః= వికాసం, తెలుపు, దేనియందో అది. ఫుల్లమల్లికలే ధవలమైన అట్టహాసం దేనికో అది అని వ్యాఖ్యానిస్తే "జలదభుజగజమ్" అనే దానివంటిదే అవుతుంది.

వివరణ:- 'ఫుల్లమల్లికాధవలాట్టహాసః" అనే పదానికి వికసించిన మల్లికాలతలనే (మల్లిపువ్వు లనే) తెల్లని అట్టహాసం (చాల బిగ్గరగా ఉన్న నవ్వు) అని వికసించిన మల్లికలమీద ధవలాట్టహాసత్వాన్ని ఆరోపించిన పక్షంలో ఈ రూపకాన్ని ఆధారంగా చేసికొని యుగమే యుగం, ఉపసంహారమే ప్రలయకాలసంహారం, మహాకాలమే మహాకాలుడు అని చెప్పవలసివస్తుంది. అప్పుడు అది వాచ్యమైన శ్లేషానుప్రాణిత సావయవరూపకం అయిపోతుంది. 'భ్రమిమ్ అరతిమ్' ఇత్యాది శ్లోకంలో వలె అట్టహాసత్వారోపబలంవల్ల యుగాదిశబ్దాలకి అర్థద్వయం అభిధచేతనే చెప్పవలసి వస్తుంది. అప్పుడిది ధ్వనికి ఉదాహరణం కాజాలదు. అందుచేత ఫుల్లాశ్చ తాః మల్లికాశ్చ ఫుల్లమల్లికాః; వికసించిన మల్లికలు, ధవలాని అట్టాని యైః తే ధవలాట్టాః. వేటిచేత (ఏ

హాసాలచేత) అట్టాలు, అంగళ్లు, ధవళంగా, అనగా మనోహరంగా ఉన్నాయో అవి ధవలాట్టాలు. ధవలాట్టాః చ తే హాసాశ్చ ధవలాట్టహాసాః. హృద్యములైన, మనోహరంగా చేయబడిన అంగళ్లు గల హాసాలు, అనగా వికాసాలు, అనగా తెలుపు. ఫుల్లమల్లికానాం ధవలాట్టహాసాః యస్మిన్= దేనియందు ఫుల్లమల్లికల ధవలాట్టహాసాలు ఉన్నవో అట్టి మహాకాలం అని అర్థం చెప్పాలి.

మహాన్ ఇతి :- మహాన్ చ అసౌ కాలశ్చ మహాకాలః. పగళ్లు దీర్ఘంగా ఉండడంవల్ల గడపడం చాలా కష్టం. అలాంటి కష్టం ఉండడంచేత గొప్పదైన సమయం అని అర్థం. అత్రేతి - ఇక్కడ 'మహాకాల'మొదలైన శబ్దాల అభిధాశక్తులు ఋతువర్ణన ప్రస్తావంచేత ఒకే అర్థాన్ని బోధించేటట్లు నియమితాలయిపోయాయి. అందుచేత "అవయవప్రసిద్ధేః సముదాయప్రసిద్ధిః బలీయసీ" అనగా "అవయవార్థంకంటె సముదాయార్థం బలవత్తరమైనది" అనే న్యాయాన్ని కూడా విడిచిపెట్టి ఈ అర్థాన్ని మాత్రమే బోధించి కృతకృత్యాలయిపోయాయి. తాము చేయవలసిన పని ముగించుకొన్నాయి. అయినా కూడ మరొక అర్థం స్ఫురిస్తూన్నదంటే అది ధ్వననవ్యాపారం వల్లనే (అభిధవల్ల కాదు). ఆ ధ్వననవ్యాపారం శబ్దశక్తిమూలక మైనది.

వివరణ:- ప్రకరణం ప్రకారం చెప్పవలసిన గ్రీష్మాగమనరూపార్థం చెప్పిన తరవాత ఈ పదాలవల్ల "కృతయుగం మొదలైన యుగాల్ని ఉపసంహరిస్తూ భయంకరమైన పేరు గల (గ్రీష్మాభిధానః) వికసించిన మల్లికలవంటి అట్టహాసం గల, మహాకాలుడు (లోకసంహారకుడైన రుద్రుడు) విజృంభించెను" అనే రెండవ అర్థం స్ఫురిస్తూన్నది. ఇది ధ్వననవ్యాపారంచేతనే స్ఫురిస్తూన్నది గాని అభిధచేత కాదు. ఎందువలన అనగా ప్రకరణం ఋతురూపమైన ఒక్క అర్థాన్ని మాత్రమే ఈ వాక్యం చెప్పేటట్లు నియతం చేసింది.

ఈ నియమనం ఎంత అనివార్యం అనగా 'మహాకాలః' ఇత్యాది శబ్దాలు ప్రసిద్ధమైన - "అవయవ ప్రసిద్ధేః" ఇత్యాదినియమాన్ని కూడా పాటించకుండా ప్రకరణానికి అనుకూలమైన అర్థాన్ని మాత్రమే బోధించాయి. ఏదైన ఒక పదం యోగంచేత, అనగా శబ్దవ్యుత్పత్తిని అనుసరించి, ఒక అర్థం చెప్పవచ్చు. కాని భాషలో నిరంతరప్రయోగవశంచేత ఆ శబ్దం తప్పనిసరిగా ఆ యౌగికార్థంతో సంబంధం ఉన్న ఏదో ఒక అర్థానే బోధిస్తుంది. "పఙ్కజ" శబ్దం ఉంది. దీన్ని పంకంనుంచి పుట్టిన పద్మం, కలవ, నాచు, నత్తగుల్ల మొదలైన అన్ని అర్థాలలోను ప్రయోగించడానికి అవకాశం ఉంది. కాని దీని ప్రయోగం 'పద్మం' అనే అర్థంలోనే చెయ్యాలని భాషాసంప్రదాయం ఉంది. అందుచేత దీనికి

'పద్మం' అనే అర్థంలో 'రూఢి' ఏర్పడిపోయింది. "రూఢిః యోగాద్ బలీయసీ" అని శాస్త్రనియమం. యోగంకంటె రూఢి బలవత్తరమైనది. అందుచేత తప్పనిసరి అయితే తప్ప యౌగికార్థం గ్రహించకూడదు. రూఢ్యర్థాన్నే గ్రహించాలి. అవయవప్రసిద్ధేః= ఒక పదంలోని అవయవాల అర్థంకంటె, సముదాయప్రసిద్ధిః= మొత్తం పదాల సముదాయంయొక్క అర్థం, బలవత్తరమైనది" అని ఈ న్యాయం 'రూఢిర్యోగాద్బలీయసీ' అనేదానినే వేరు మాటలలో చెపుతున్నది. 'మహాకాలః' అనే శబ్దానికి లోకసంహారకుడైన మహాకాలుడు అని రూఢివల్ల ఏర్పడిన అర్థం. దానినే గ్రహించాలి కాని ఇక్కడ ప్రకరణవశంచేత ఈ పదం కూడా రూఢార్థాన్ని పరిత్యజించి యౌగికార్థాన్ని బోధించింది (వాచ్యమైన మొదటి అర్థంలో).

లోచనం

అత్ర కేచిన్మన్యన్తే - "యత ఏషాం శబ్దానాం పూర్వమ్ అర్థాన్తరే అభిధాన్తరం దృష్టం తతః తథావిధే అర్థాన్తరే దృష్టతదభిధాశక్తేరేవ ప్రతిపత్తుః నియన్త్రితాభిధాశక్తికేభ్యః ఏతేభ్యః ప్రతిపత్తిః ధ్వననవ్యాపారాదేవేతి శబ్దశక్తిమూలత్వం వ్యఙ్గ్యత్వం చేత్యవిరుద్ధమ్" ఇతి.

అన్యే తు - "సా అభిధైవ ద్వితీయా అర్థసామర్థ్యం గ్రీష్మస్య భీషణదేవతావిశేషసాదృశ్యాత్మకం సహకారిత్వేన యతః అవలమ్బతే తతో ధ్వననవ్యాపారరూపా ఉచ్యతే" ఇతి.

ఏకే తు - "శబ్దశ్లేషే తావత్ భేదే సతి శబ్దస్య, అర్థశ్లేషేఽపి శక్తిభేదాచ్ఛబ్దభేద ఇతి దర్శనే ద్వితీయః శబ్దస్తత్రానీయతే. స చ కదాచిదభిధావ్యాపారాత్, యథా ఉభయోరుత్తరదానాయ 'శ్వేతో ధావతి' ఇతి, ప్రశ్నోత్తరాదౌ వా తత్ర వాచ్యాలంకారతా. యత్ర తు ధ్వననవ్యాపారాదేవ శబ్ద ఆనీతః తత్ర శబ్దాన్తరబలాదపి తదర్థాన్తరం ప్రతిపన్నం ప్రతీయమానమూలత్వాత్ ప్రతీయమానమేవ యుక్తమ్" ఇతి.

ఇతరే తు "ద్వితీయపక్షవ్యాఖ్యానే యదర్థసామర్థ్యం తేన ద్వితీయా అభిధైవ ప్రతిప్రసూయతే. తతశ్చ ద్వితీయోఽర్థః అభిధీయత ఏవ న తు ధ్వన్యతే. తదనన్తరం తు తస్య ద్వితీయార్థస్య ప్రతిపన్నస్య ప్రథమార్థేన

ప్రాకరణికేన సాకం యా రూపణా సా తావద్ధ్వాత్యేవ, న చ అన్యతః శబ్దాదితి సా ధ్వననవ్యాపారాత్; తత్ర అభిధాశక్తేః కస్యాశ్చిదపి అనాశఙ్కనీయత్వాత్. తస్యాం చ ద్వితీయా శబ్దశక్తిర్మూలమ్. తయా వినా రూపణాయాః అనుత్థానాత్. అత ఏవ అలఙ్కారధ్వనిరయమితి యుక్తమ్. వక్ష్యతే చ "అసమ్బద్ధార్థాభిధాయకత్వం మా ప్రసాఙ్క్షీత్" ఇత్యాది. పూర్వత్ర తు 'సలేశమ్' ఇతి శబ్దేనైవ అసమ్బద్ధతా నిరాకృతా. 'యేన ధ్వస్త' ఇత్యత్ర అసమ్బద్ధతా నైవ భాతి. "తస్యా వినాపి" ఇత్యత్ర 'అపి' శబ్దేన, 'శ్లాఘ్యా' ఇత్యత్ర అధికశబ్దేన, 'భ్రమిమ్' ఇత్యాదౌ చ రూపకేణ అసంబద్ధతా నిరాకృతా ఇతి తాత్పర్యమ్.

బాలానందిని

ఇలాంటి స్థలాలో అభిధావ్యాపారం తన పనిని ఎంతవరకూ సాగిస్తుందో, ధ్వననవ్యాపారం ఎక్కడినుంచి ప్రారంభం అవుతుందో ఈ విషయాన్ని గూర్చి ఉన్న అభిప్రాయభేదాలను విశదీకరిస్తున్నాడు - అత్ర ఇతి - ఈ విషయంలో కొందరు ఈ విధంగా భావిస్తున్నారు - ఈ శబ్దాలకు మరొక అర్థం విషయంలో కూడా మరొక అభిధ ఉన్నది అని చూడబడి ఉండడంచేత, ఆ విధమైన అర్థాంతరంలో ఆ శబ్దానికి ఉన్న మరొక అభిధాశక్తిని చూచి ఉన్న (తెలిసికొని ఉన్న) ప్రతిపత్తకే (జ్ఞాతకే) నియంత్రితమైన అభిధాశక్తి గల (ఒక అర్థాన్ని మాత్రమే బోధించే విధంగా ఏ శబ్దాల అభిధ నియమితం అయినదో అట్టి) ఈ శబ్దాలవల్ల రెండవ అర్థంయొక్క జ్ఞానం కలుగుతూన్న దంటే అది ధ్వననవ్యాపారం వల్లనే. దాని జ్ఞానం శబ్దశక్తివల్ల కలుగుతున్నదిగాన ఇది శక్తిమూలం అనీ ధ్వననవ్యాపారంవల్ల కలుగుతూన్నది గాన వ్యంగ్యం అనీ చెప్పడంలో విరోధం లేదు. (అనగా ఈ శబ్దానికి ఈ రెండవ అర్థం కూడా ఉంది అని తెలిసినవానికే కదా ఆ రెండవ అర్థం ప్రతీతి కలగడం? అందుచేత ఆ రెండవ అర్థం శబ్దశక్తిమూలమే. అయితే దానికిరెండు అర్థాలు చెప్పగలిగినరెండు అభిధలు ఉన్నారెండవ అభిధ ప్రకరణాదులచేత అడ్డుకొనబడింది గాన అది పని చేయజాలదు. అందుచేత ఆ ద్వితీయార్థప్రతీతి ధ్వనన వ్యాపారంచేతనే కలుగుతుంది అని అర్థం.

అన్యే తు ఇతి - మరి కొందరు ఇలా అంటున్నారు - "ఆ రెండవ అభిధయే గ్రీష్మం భయంకర మైన దేవతావిశేషం (మహాకాలుని) వంటిది అనే అర్థసామర్థ్యాన్ని సహకారిగా అవలంబిస్తూన్నది; అందుచేత అదే ధ్వననవ్యాపార రూపం అయినది" అని చెప్పబడుతున్నది.

వివరణ:- ఈ మతం ప్రకారం రెండవ అర్థాన్ని బోధించేది కూడా అభిధయే; అది పూర్వం గ్రహించి ఉన్న రెండవ అభిధ. అయితే అర్థసామర్థ్యంచేత గ్రీష్మానికీ, భయంకర దేవతావిశేషానికీ మధ్య ఆక్షిప్తమైన (లాగబడిన, ఊహించబడిన) సాదృశ్యం ఈ ద్వితీయార్థజ్ఞానానికి సహకారిగా, (ఉపయోగించేదిగా) ఉండడంచేత ఈ అభిధనే ధ్వననం అని అంటున్నాం. అంతమాత్రమే. అందుచేత సంకేతం గ్రహించినంతమాత్రాన అర్థం బోధించే అభిధ శుద్ధమైన అభిధ. సంకేతగ్రహణంతో పాటు అర్థసామర్థ్యాది సహకారాన్ని కూడా అపేక్షించే అభిధ ధ్వననం అని వీళ్ల అభిప్రాయం.

ఏకే తు ఇతి. కొందరు ఇలా అంటున్నారు - శబ్దశ్లేషలో శబ్దానికి భేదం ఉంటుంది; అర్థశ్లేషలో కూడ "శక్తిభేదం వల్ల శబ్దభేదం" అనే న్యాయం ప్రకారం అక్కడ (శబ్దశ్లేషలోనూ కూడ) రెండవ శబ్దం తీసికొని రాబడుతుంది.

వివరణ:- శక్తిభేదం అనగా అర్థాన్ని బోధించే శక్తి యొక్క భేదం. ఉదా- హరి శబ్దానికి విష్ణువు అనే అర్థం ఉంది. సింహం అనే అర్థం కూడా ఉంది. హరిశబ్దంలో ఉన్న విష్ణువు అనే అర్థాన్ని బోధించే శక్తి వేరు, సింహరూపార్థాన్ని బోధించే శక్తి వేరు. శక్తిభేదాన్ని పట్టి ఈ హరిశబ్దం వేరు, ఆ హరిశబ్దం వేరు. శక్తిభేదం అనగా మొత్తంమీద అర్థభేదం అని తేలింది. అర్థభేదాన్ని పట్టి శబ్దాలకు భేదం అని అర్థం. 'హరి' అనే పదాలలోని ఆనుపూర్వి ఒకే విధంగా ఉన్నా విష్ణువాచక హరిశబ్దం వేరు; సింహవాచకం వేరు. అందుచేత రెండవ అర్థం చెప్ప వలసివచ్చినప్పుడు అక్కడ ప్రయోగించిన శబ్దాల పోలిక ఉన్న శబ్దాంతరాలు అక్కడికి తెచ్చుకొని అర్థం చెప్పుకోవాలి అని అర్థం.

స చేతి - ఆ రెండవ శబ్దం, ఒకప్పుడు, అనగా ప్రకరణాదికాన్ని పట్టి రెండు అర్థాలు చెప్పవలసి వచ్చినప్పుడు, ఆ రెండర్థాలనీ అభిధావ్యాపారంవల్లనే చెప్పవలసి ఉండడంవల్ల అక్కడికి తీసికొని రాబడుతుంది. ఉదాహరణకి రెండు ప్రశ్నలకు సమాధానంగా ఉద్దిష్టమైన శ్వేతో ధావతి ఇత్యాదులలోను, ప్రశ్నోత్తరాదులలోను ఉన్న శ్లేష వాచ్యాలంకారం, యత్ర తు ఇతి - ఎక్కడైతే (అభిధ ప్రకృతార్థంలోనే నియమితం అయినచోట) ధ్వననవ్యాపారాన్నిపట్టి శబ్దం తీసికొని రాబడుతుందో అక్కడ ఆ రెండవ అర్థం మరొక శబ్దంయొక్క బలంవల్లనే తెలియబడినా కూడ, ప్రతీయమానమైన (అనగా ధ్వననంవల్ల లభించిన) శబ్దం దానికి మూలం అవడంచేత ఆ అర్థం ప్రతీయమానం (వ్యంగ్యం) అనడమే యుక్తం.

వివరణ:- ఒకడు పక్కవానిని "కః ఇతో ధావతి? కింగుణవిశిష్టః సః?" అని రెండు ప్రశ్నలు వేశాడు. దానికి సమాధానంగా "శ్వేతో ధావతి" అని సమాధానం

చెప్పాడు. మొదటి ప్రశ్నకు సమాధానం 'శ్వా ఇతః ధావతి' ఇటువైపు కుక్కపరుగెత్తుతున్నది. ప్రశ్నకు సమాధానం 'శ్వేతః ధావతి" (తెల్లగా ఉన్నది పరుగెత్తుతున్నది). రెండర్థాలూ ప్రకృతాలే. అందుచేత శ్వేతః అనే మొదటి పదం, తెచ్చిపెట్టుకొన్న శ్వేతః అనే రెండవ పదమూ కూడ అభిధచేతనే తమ తమ అర్థాలను (రెండర్థాలను) బోధిస్తున్నాయి. అందుచేత ఈ శ్లేష వాచ్యాలంకారం.

శ్లో. యత్తు పర్యనుయోగస్య నిర్భేదః క్రియతే బుధైః,
విదగ్ధగోష్ఠ్యాం వాక్యైర్వా తద్ధి ప్రశ్నోత్తరం విదుః.

విదగ్ధుల గోష్ఠిలో పండితులు వాక్యాలచేత ప్రశ్నలను విడగొడతారు. అది ప్రశ్నోత్తరం అని ప్రశ్నోత్తరలక్షణం. ఉదాహరణ-

శ్లో. "కాహమస్మి గుహా వక్తి ప్రశ్నే ఒముష్మిన్ కిముత్తరమ్,
కథముక్తం న జానాసి కదర్థయసి యత్సఖే.

నేను ఎవరిని? అని గుహ అడుగుతున్నది. దీనికి సమాధానం ఏమిటి? మిత్రమా! చెప్పినా తెలుసుకొనకుండా ఎందుకు ఇలా బాధిస్తావు? ఈ ప్రశ్నకు సమాధానం (కథ + ముక్తమ్ = కథముక్తమ్) 'కథ" లచే'త విడవబడిన (అవి తీసివేసిన) కదర్థయసి, అనేది. 'కదర్థయసి'లోని 'క''థ'లు తీసేస్తే 'దర్యసి' మిగులుతుంది. నువ్వు దరి అయి ఉన్నావు (దరి అంటే గుహ) అని సమాధానం. ఇక్కడ కూడా అన్ని అర్థాలూ వాచ్యాలే.

"కుసుమసమయ" ఇత్యాదివాక్యంలోని పదాలను ధ్వననవ్యాపారాన్ని పట్టి తెచ్చుకోవడం జరిగింది. అందుచేత అక్కడ అర్థాంతరాలు శబ్దాంతరాలచేత బోధించబడినా అక్కడ ఆ శబ్దాంతరాలు (వాచ్యార్థం బోధించిన శబ్దాలతో సమానమైన ఆనుపూర్వి గల శబ్దాంతరాలు) ధ్వననవ్యాపారబలంచేత తెచ్చుకున్నవి కాబట్టి అక్కడ ఆ అర్థం వ్యంగ్యమే అని వీరి అభిప్రాయం. ఇతరే తు ఇతి - రెండవ పక్షంయొక్క వ్యాఖ్యానంలో (అన్యే తు ఇత్యాదికంలో) ఏ అర్థసామర్థ్యం చెప్పబడిందో దానిచేత రెండవ అభిధ ప్రతిప్రసూతం అవుతుంది, అనగా పునరుజ్జీవితం అవుతుంది. అందువల్ల రెండవ అర్థం కూడా అభిధచేతనే బోధించబడుతుంది కాని ధ్వనించబడదు. రెండవ అర్థం తెలిసిన తరవాత ఆ తెలిసిన రెండవ అర్థానికి ప్రాకరణికమైన మొదటి అర్థంతో ఏ రూపణ (ఆరోపం) ఉంటుందో అది తప్పక భాసిస్తుంది, అనగా ధ్వననవ్యాపారంచేతనే తెలుస్తుంది. మరి ఏ ఇతరశబ్దంవల్ల అది భాసించదు గాన ధ్వననవ్యాపారంవల్లనే భాసిస్తుంది. అక్కడ (అభేదారోపంలో) ఏ అభిధాశక్తి కూడ ఉంటుందని ఆశంకించడానికి వీలు లేదు కదా?

ఆ రూపణయందు (కు) రెండవ శబ్దశక్తి మూలం. అది లేకుండా రూపణానికి అవకాశమే లేదు కదా? అందువల్లనే ఇది అలంకారధ్వని అని చెప్పడమే యుక్తం. వృత్తికారుడే - అసమ్బద్ధార్థాభిధాయిత్వం మా ప్రసాఙ్క్షీత్ ఇత్యాదికం చెప్పనున్నాడు కదా. అనగా ఉపమానోపమేయభావం కల్పించాలి, ఆ అంశం మాత్రమే వ్యంగ్యం అని ఆతడే చెప్పినాడు అని అర్థం. పూర్వత్రేతి - దృష్ట్యా కేశవ ఇత్యాది పూర్వోదాహరణంలో సలేశం అనే పదంచేతనే అర్థద్వయానికి అసంబద్ధత్వం నిరాకరించబడింది. అనగా - అక్కడ ప్రధానంగా వివక్షితమైన అర్థం ద్వితీయార్థమే ; ప్రథమార్థం రెండవ అర్థాన్ని రహస్యంగా ఉంచడానికే. అందుచేత అక్కడ రూపణాదికం చేయవలసిన అవసరం లేదు. యేన ధ్వస్త ఇత్యాదికంలో (మాధవ - ఉమాధవులు ఇద్దరూ కూడ స్తుత్యులుగా ప్రకృతులే కాబట్టి) అసంబద్ధత భాసించడమే లేదు. తస్యా వినాపి అనే శ్లోకంలో 'అపి' శబ్దంచేత, శ్లాఘ్యాశేష ఇత్యాది శ్లోకంలో అధికామ్ అనే పదంచేత, భ్రమిమ్ ఇత్యాది శ్లోకంలో రూపకాలంకారంచేత అసంబద్ధత నిరాకృతమైనది. అందుచేత అన్ని ఉదాహరణలలోను శ్లేష వాచ్యమే. రూపకకల్పనావశ్యకత కూడ లేదు అని భావం.

లోచనం

పయోభిరితి పానీయైః క్షీరైశ్చ. సంహారః ధ్వంసః, ఏకత్ర ఢౌకనం చ. గావః రశ్మయః సురభయశ్చ. అసంబద్ధార్థాభిధాయిత్వమితి. అసంవేద్య మానమేవేత్యర్థః. ఉపమానోపమేయభావ ఇతి - తేన ఉపమారూపణ వ్యతిరేచన నిహ్నవాదయః వ్యాపారమాత్రరూపా ఏవ అత్ర ఆస్వాదప్రతీతేః ప్రధానం విశ్రాన్తిస్థానమ్, న తు ఉపమాదీతి సర్వత్రాలఙ్కారధ్వనౌ మన్తవ్యమ్. సామర్థ్యాదితి - ధ్వననవ్యాపారాదిత్యర్థః.

బాలానందిని

దత్తానన్దాః ఇత్యాదిశ్లోకంలోని కొన్ని పదాలకి అర్థాలు చూపుతున్నాడు - పయోభిరితి నీళ్లచేత, క్షీరములచేత అని రెండర్థాలు. సంహారః అనగా ధ్వంసం,ధేనువుల పక్షంలో ఒక చోటికి చేర్చడం. గావః = కిరణాలు, దేనువులు కూడ.

ఈ శ్లోకానికి వ్యంగ్యమైన రెండవ అర్థం ఇది - సముచిత సమయాకృష్ట సృష్టైః = తగిన సమయాలలో, ప్రాతః సాయంకాలాలలో లాగబడి, పితకబడి, ఇవ్వబడిన, పయోభిః = క్షీరములచేత, ప్రజానామ్ = ప్రజలకు, దత్తానన్దాః = ఇవ్వబడిన ఆనందం కలవీ, పూర్వాహ్ణే = పూర్వాహ్ణమునందు, దిశి దిశి = ప్రతిదిక్కునందు, విప్రకీర్ణాః మేతకై

= వ్యాపించినవీ, దీప్తాంశోః = సూర్యుని యొక్క, సూర్యుడు ప్రకాశిస్తూ ఉండు, అహ్ని = పగటిభాగం, విరమతి = విరమించిన దగుచుండగా, సంహారభాజః = ఒక చోట కలియుటను పొందేవీ, గోష్ఠాలలో చేరేవీ, దీర్ఘ....... నావః = దీర్ఘమైన దుఃఖానికి ఉత్పత్తి స్థానమైన సంసారభయసముద్రాన్ని దాటడానికి నావలూ అయిన, గోదానం చేయడంచేత వాటి క్షీరంతో హోమాదులు చేయడంచేత సంసారసముద్రాన్ని దాటవచ్చునని శాస్త్రాలు చెపుతున్నాయి. గావః = గోవులు. పావనానాం వః పరమ్ అపరిమితాం ప్రీతిమ్ ఉత్పాదయన్తు = సూర్యకిరణపక్షంలో వలెనే అర్థం.

అసంబద్ధార్థాభిధాయిత్వమితి - తెలియబడకుండానే అని అర్థం. అనగా రెండవ అర్థం స్ఫురించిన వెంటనే ప్రతిపత్తకు ప్రకృతానికి ఈ అర్థానికీ ఏమీ సంబంధం లేదే అని అనిపించకపోవచ్చును. అనిపించకపోయినా రెండవ అర్థం అసంబద్ధార్థం అనే మాట వాస్తవమే కదా? అలాంటి అసంబద్ధార్థాన్ని బోధించడం కవిపక్షాన దోషమే అవుతుంది. అందుచేత తద్దోషపరిహారార్థం ఉపమానోపమేయభావాదికం కల్పించాలి అని భావం. ఉపమానోపమేయభావ ఇతి - తేనేతి - అందుచేత వ్యాపారమాత్రరూపాలైన ఉపమా (ఉపమితి) - రూపణ - వ్యతిరేచన (భేదదర్శన) - నిహ్నవాదులే ఆస్వాదింపబడతాయి కాబట్టి ప్రధానమైన చమత్కారవిశ్రాంతిస్థానం ఆ వ్యాపారాలే. ఆ వ్యాపారాల జ్ఞానంవల్లనే చమత్కారం కలుగుతుంది. అందువల్ల ఉపమేయాదులవల్ల చమత్కారం కలగదు అనే విషయం అన్ని అలంకార ధ్వనులలోనూ గుర్తు ఉంచుకోవాలి. అనగా ఉపమారూపకవ్యతిరేకాది ధ్వనులలో ఆ అలంకారాలలో ప్రధానమైన ఉపమానోపమేయభావం, ఆరోపణం, భేదాన్ని చూపడం- ఇలాంటి వ్యాపారాలలో మాత్రమే చమత్కారం ఉంటుంది. దాన్ని గ్రహిస్తే చాలు. అంతకు మించి ఇక్కడ ఉపమేయం ఏది; సాదృశ్యం సరిగా ఉందా లేదా; ఇత్యాదివిచారణలతో లోతుగా విమర్శిస్తే దానిలో ఉన్న అందం కాస్తా చెడిపోతుంది. సామర్థ్యాదితి - ధ్వనన వ్యాపారంవల్ల అని అర్థం.

## ధ్వన్యాలోకం

అన్యేఽపి చాలంకారాః శబ్దశక్తిమూలానుస్వానరూపవ్యఙ్గ్యే ధ్వనౌ సంభవన్త్యేవ. తథాహి - విరోధోఽపి శబ్దశక్తిమూలానుస్వానరూపో దృశ్యతే. యథా స్థాణ్వీశ్వరాఖ్యజనపదవర్ణనే భట్టబాణస్య - "యత్ర చ మాతఙ్గగామిన్యః శీలవత్యశ్చ, గౌర్యో విభవరతాశ్చ, శ్యామాః

పద్మరాగిణ్యశ్చ, ధవలద్విజశుచివదనాః మదిరామోదిశ్వసనాశ్చ ప్రమదాః (హర్షచ. తృతీయోచ్ఛ్వాసం)

అత్ర హి వాచ్యో విరోధచ్ఛాయానుగ్రాహీ వా శ్లేషో ఽయమితి న శక్యం వక్తుమ్. సాక్షాత్‌శబ్దేన విరోధాలంకారస్య అప్రకాశితత్వాత్. యత్ర హి సాక్షాత్ శబ్దావేదితో విరోధాలంకారః తత్ర హి శ్లిష్టోక్తౌ వాచ్యాలంకారస్య విరోధస్య శ్లేషస్య వా విషయత్వమ్. యథా తత్రైవ-

"సమవాయ ఇవ విరోధినాం పదార్థానామ్. తథాహి - "సంనిహిత బాలాన్ధకారాపి భాస్వన్మూర్తిః" ఇత్యాదౌ. యథా వా మమైవ -

శ్లో. సర్వైకశరణమక్షయమధీశమీశం ధియాం హరిం కృష్ణమ్,
చతురాత్మానం నిష్క్రియమరిమథనం నమత చక్రధరమ్. (45)

అత్ర హి శబ్దశక్తిమూలానుస్వానరూపః విరోధః స్ఫుటమేవ ప్రతీయతే.

బాలానందిని

అన్యే ఇతి - శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యంలో ఇతర అలంకారాలు కూడ సంభవిస్తాయి. ఇతరాలంకారాలు ఉండే అవకాశం కూడ ఉంది.అదెట్లనగా (తథాహి) - శబ్దశక్తిమూలానుస్వానరూపమైన విరోధంకూడా కనబడుతుంది. భట్టబాణుడు స్థాణ్వీశరం అనే జనపదాన్ని వర్ణించే ఘట్టంలో ఎట్లనగా -

యత్రేతి -ఏ జనపదంలోని స్త్రీలు మాతంగగామినులో (ఏనుగు వంటి నడక గలవారు, అంత్యజుణ్ణి కూడే వారు అని రెండర్థాలు). శీలవతులో; గౌరలో (గౌరవర్ణం కలవారు, పార్వతులు అని రెండర్థాలు) విభవరతలో (ఐశ్వర్యంమీద ఆసక్తి కలవారు, భవుడు లేని స్థానాలయందు, ఆసక్తి కలవాడు అని రెండర్థాలు) శ్యామలో ( యౌవన మధ్యస్థలు, నల్లగా ఉన్న వాళ్లు అని రెండర్థాలు) పద్మరాగిణులో (పద్మరాగమాణిక్యాలు కలవాళ్లు, పద్మాలవంటి ఎరుపుగలవాళ్లు అని రెండర్థాలు) ధవలద్విజశుచివదనలో (తెల్లని దంతాలు గల పరిశుద్ధములైన ముఖాలు కలవాళ్లు, పవిత్రులైన బ్రాహ్మణుల వలె పరిశుద్ధములైన ముఖాలు కలవాళ్లు అని రెండర్థాలు) మదిరామోదిశ్వసనలో =

మద్యం సువాసనతో కూడిన శ్వాస కలవాళ్లో.

అత్రేతి:- ఇక్కడ విరోధాలంకారంగాని, విరోధచ్ఛాయను అనుగ్రహించే శ్లేషగాని వాచ్యం అని చెప్పడానికి శక్యం కాదు. సాక్షాత్తుగా శబ్దంచేత (అపిశబ్దంచేత) విరోధాలంకారం ప్రకాశింప చేయబడడం లేదు కదా? ఎక్కడైతే విరోధాలంకారం సాక్షాత్తుగా శబ్దంచేత నివేదించబడుతుందో అలాంటి శ్లిష్టోక్తిలో (శ్లేష ఉన్న ఉక్తిలో) వాచ్యాలంకారమైన విరోధానికి గాని, శ్లేషకు గాని విషయత్వం ఉంటుంది. (అది విరోధానికిగాని, శ్లేషకు గాని విషయం అవుతుంది) ఆ ఘట్టంలోనే ఉదాహరణం ఎట్లనగా.

సమవాయ ఇతి :-అది విరోధులైన పదార్థాల సముదాయం (ఒకచోట చేరిక) వలె ఉంది. సంనిహితమైన బాలాంధకారం, కేశాల నల్లదనం, కలదైనా (చిరు చీకటి కలదైనా అని రెండవ అర్థం) భాస్వన్మూర్తి (ప్రకాశిస్తూన్న మూర్తి గలది, సూర్యుని మూర్తి అని రెండర్థాలు) ఇత్యాదులలో.

యథా వా ఇతి - మరొక ఉదాహరణం నా శ్లోకమే ఎట్లనగా -

సర్వేతి - సర్వైకశరణమ్ = అందరికీ ప్రధాన శరణ అయినవాడు. అందరికీ ఒకే ఇల్లు అయినవాడు అని గమ్యమానార్థం, అక్షయమ్ = నాశంలేనివాడు, ఇల్లు లేనివాడు అని కూడ అర్థం. అధీశమ్ = ప్రభువు అయినవాడు, బుద్ధికి ప్రభువు కానివాడు అని మరొక అర్థం. ధియామ్ = బుద్ధులకు, ఈశమ్ = ప్రభువు అయినవాడు, హరిమ్ = పాపహరుడు, పచ్చని రంగు గలవాడు అని కూడ అర్థం. కృష్ణమ్ = కృష్ణుడు. నల్లని వాడు అని రెండవ అర్థం. చతురాత్మానమ్ = పరాక్రమయుక్తమైన, నేర్పు గల, స్వరూపం లేదా బుద్ధి కలవాడు. నిష్క్రియమ్ = క్రియలు లేనివాడు, అరిమథనమ్ = శత్రుసంహారకుడు, అరం అనగా చక్రానికి ఉండే ఆకు. అరంకలది అరి. చక్రాన్ని మథించేవాడు అని మరొక అర్థం. చక్రధరమ్ = చక్రాన్ని ధరించేవాడు అయిన శ్రీమహా విష్ణువును, నమత = నమస్కరించండి.

అత్ర హీతి - ఇక్కడ శబ్దశక్తిమూలానుస్వానరూపవిరోధం స్ఫుటంగానే తెలుస్తూన్నది.

లోచనం

మాతఙ్గేతి - మాతఙ్గవద్ గచ్ఛన్తి తాః శబరాంశ్చ గచ్ఛన్తీతి విరోధః. విభవేషు రతాః, విగతమహాదేవస్థానే చ రతాః. పద్మరాగరత్నయుక్తాః, పద్మసదృశలౌహిత్యయుక్తాశ్చ. ధవలైః ద్విజైః దన్తైః శుచి నిర్మలం వదనం

యాసామ్ ధవలద్విజవత్ ఉత్కృష్టవిప్రవత్ శుచి వదనం చ యాసామ్. యత్ర హీతి -. యస్యాం శ్లేషోక్తౌ కావ్యరూపాయాం, తత్ర యో విరోధః శ్లేషో వేతి సఙ్కరః తస్య విషయత్వమ్. స విషయో భవతీత్యర్థః. కస్య? వాచ్యాలఙ్కారస్య వాచ్యాలంకృతేః, వాచ్యాలంకృతిత్వస్యేత్యర్థః. తత్రైవ విరోధే శ్లేషే వా వాచ్యాలంకారత్వం సువచమితి యావత్. బాలేషు కేశేషు అన్ధకారః కార్ష్ణ్యమ్. బాలః ప్రత్యగ్రశ్చ అన్ధకారః తమః.

నను మాతఙ్గేత్యాదావపి ధర్మద్వయే యః చకారః స విరోధద్యోతక ఏవ. అన్యథా ప్రతిధర్మం, సర్వధర్మాన్తే వా, న క్వచిద్వా చకారః స్యాత్ యది సముచ్చయార్థః స్యాత్ ఇత్యభిప్రాయేణ ఉదాహరణాన్తరమాహ - యథేతి. శరణం గృహమ్. అక్షయరూపమ్ అగృహం కథమ్? యో న ధీశః స కథం ధియామీశః? యో హరిః కపిలః స కథం కృష్ణః? చతురః పరాక్రమయుక్తః యస్యాత్మా స కథం నిష్క్రియః? అరీణామ్ అరయుక్తానాం యో నాశయితా స కథం చక్రం బహుమానేన ధారయతి? విరోధ ఇతి విరోధనమ్ ఇత్యర్థః. ప్రతీయతే ఇతి - స్ఫుటం నోచ్యతే కేనచిదితి భావః.

బాలానందిని

మాతఙ్గేతి:- మాతంగాల వలె, ఏనుగుల వలె నడుస్తారు. మాతంగులను, శబరులను పొందుతారు అని విరోధం. విభవాలయందు. ఐశ్వర్యాలయందు, ఆసక్తి కలవాళ్లు, మహాదేవుడు లేని స్థానంలో ఆసక్తి కలవాళ్లు. పద్మరాగరత్నాలతో కూడిన వాళ్లు పద్మాలతో సమానమైన ఎరుపుతో కూడిన వాళ్లు. తెల్లనైన ద్విజాలతో దంతాలతో, శుచియైన. నిర్మల మైన ముఖాలు కలవాళ్లు. యత్ర హీతి. కావ్యరూపమైన ఏ శ్లేషోక్తి యందు విరోధమా శ్లేషయా అనే (సందేహ) సంకరం ఉంటుందో అక్కడ దానికి విషయత్వం. అనగా అది విషయం అవుతుంది అని అర్థం. దేనికి? వాచ్యాలంకారానికి; వాచ్యాలంకృతిత్వానికి అని అర్థం. (ఏ శ్లేషోక్తిరూపకావ్యంలో విరోధాలంకారం సాక్షాత్తు శబ్దంచేత బోధించబడుతుందో అక్కడ విరోధ - శ్లేష- సందేహరూపసంకరానికి విషయత్వం అని భావం) తత్రైవేతి. అక్కడనే విరోధాన్ని కాని, శ్లేషాలంకారాన్ని గాని వాచ్యాలంకారం అని తప్పకుండా చెప్పవచ్చు అని తాత్పర్యం. బాలేష్వితి - బాలేషు = కేశములయందు,

అన్ధకారః = నలుపు, బాలః = క్రొత్తదైన, అంధకారః = చీకటి.

నన్వితి - మాతఙ్గేత్యాదివాక్యంలో ఏ చకారం ఉన్నదో అది విరోధాన్ని ద్యోతింపచేస్తున్నది. అలా కాక ఈ చకారం సముచ్చయార్థంలో ప్రయోగించబడినట్లయితే (ఇదీ అదీ కూడ అని చెప్పడం సముచ్చయం. రామః లక్ష్మణః చ ఇత్యాదులలో వలె) ప్రతి ఒక్క ధర్మం తరవాత లేదా అన్ని ధర్మాల తరవాత చకారం ప్రయోగించి ఉండాలి; లేదా ఎక్కడా కూడా దీనిని ప్రయోగించి ఉండకూడదు. అప్పుడిది సముచ్చయార్థకం అయిఉండేది అనే అభిప్రాయంతో మరొక ఉదాహరణం చూపుతున్నాడు - యథా ఇతి.

వివరణ:- ఈ వాక్యంలో విరోధం ఉన్న నాలుగు యుగ్మాలు పేర్కొనబడ్డాయి. ప్రతి రెండవదాని తరవాత చశబ్దం ఉపయోగించ బడింది. మాతఙ్గగామిన్యః - శీలవత్యః చ. శ్యామాః - పద్మరాగిణ్యః చ ఇత్యాదివిధంగా. దీనిని పట్టి కవి ఇక్కడ చ శబ్దాలను నాలుగు చోట్లా కూడ విరోధాన్ని ద్యోతింపచేయడానికే ఉపయోగించి నట్లు తెలుస్తూన్నది. అలా కాకపోతే ఘటం చ, పటం చ, ఫలాని చ ఆనయ అన్నట్లు సముచ్చయార్థంలో అన్ని పదాల తరవాతా చ శబ్దాన్ని ఉపయోగించి ఉండాలి. లేదా ఘటం, పటం, ఫలాని చ ఆనయ అన్నట్లు చివరి పదం దగ్గర ఉపయోగించి ఉండాలి. లేదా ఘటం, పటం, ఫలాని ఆనయ అన్నట్లు అసలు ఉపయోగించకుండా నైన ఉండవచ్చు. అందుచేత ఈ చ శబ్దాలు విరోధాన్ని సూచిస్తూన్నాయి గాన విరోధాలంకారం వాచ్యం అయిపోయింది అని ఆశంకించుకొని మరొక ఉదాహరణ చూపాడని భావం.

శరణమితి - శరణమ్ = గృహం, అక్షయరూపం అనగా గృహంకానిది ఎలా అవుతుంది? ఎవడు న ధీశః = అధీశః = ధీశుడు కాడో, అతడు, ధియామ్ ఈశః = బుద్ధులకు ప్రభువు ఎలా అవుతాడు? ఎవని ఆత్మ, చతురః =పరాక్రమయుక్తమో అతడు నిష్క్రియుడు ఎలా అవుతాడు ? అరీణామ్ = అరములు (చక్రం ఆకులు) కలవాటిని, చక్రాలను, ఎవడు నశింపచేస్తాడో అతడు చక్రాన్ని ఆదరపూర్వకంగా ఎలా గ్రహిస్తాడు? విరోధః ఇతి - విరోధనక్రియ అని అర్థం. ప్రతీయతే ఇతి - దేనిచేతా కూడా స్పష్టంగా చెప్పబడడం లేదు అని భావం.

## ధ్వన్యాలోకం

ఏవంవిధో వ్యతిరేకోఽపి దృశ్యతే; యథా మమైవ-

శ్లో. ఖం యేఽప్యుజ్జ్వలయన్తి లూనతమసో యే వా నఖోద్భాసినో
యే పుష్ణన్తి సరోరుహశ్రియమపి క్షిప్తాబ్జభాసశ్చ యే,

యే మూర్ధస్వవభాసినః క్షితిభృతాం యే చామరాణాం శిరాం
స్యాక్రామన్త్యుభయేऽపి తే దినపతేః పాదాః శ్రియే సన్తు వః.
(46)

ఏవమన్యేऽపి శబ్దశక్తిమూలానుస్వానరూపవ్యఙ్గ్య ధ్వనిప్రకారాః సన్తి. తే సహృదయైః స్వయమనుసర్తవ్యాః - ఇహ తు గ్రన్థవిస్తరభయాన్న తత్ప్రపఞ్చః కృతః.

బాలానందిని

ఏవమితి:- ఈ విధమైన (శబ్దశక్తి మూలానుస్వానరూపమైన) వ్యతిరేకాలంకారం కూడ కనబడుచున్నది. ఉదాహరణకు నా శ్లోకమే ఎట్లనగా -

ఖమితి - లూనతమసః = తొలగించబడిన చీకటి (పాపం అని రెండవ అర్థం) గల, యే = ఏవి, ఖమ్ = ఆకాశాన్ని, అత్యుజ్జ్వలయన్తి = చాలా ప్రకాశింప చేస్తున్నాయో, యే వా = ఏవి, నఖోద్భాసినః = గోళ్లతో ప్రకాశిస్తున్నవో (ఆకాశాన్ని ప్రకాశింపచేయడంలేదో అని మరొక అర్థం). యే = ఏవి, సరోరుహశ్రియమపి = పద్మాల శోభను కూడ, పుష్ణన్తి = పోషిస్తున్నాయో, యే =ఏవి, క్షిప్తాబ్జభాసః = తిరస్కరించ బడిన పద్మకాంతి గలవో, యే = ఏవి, క్షితిభృతామ్ = పర్వతాలయొక్క, మూర్ధసు = శిఖరాలమీద, (శిరస్సులమీద అని రెండవ అర్థం), అవభాసినః = ప్రకాశిస్తూన్నవో, యే చ = ఏవి, అమరాణామ్ = దేవతలయొక్క, శిరాంసి = శిరస్సులను, ఆక్రామన్తి = ప్రణామసమయములో ఆక్రమిస్తున్నాయో, తే = అట్టి, ఉభయేऽపి = రెండువిధాలైన, దినపతేః పాదాః = సూర్యుని కిరణాలు, వః = మీయొక్క, శ్రియే = ఐశ్వర్యంకొరకు, సన్తు = అగుగాక.

వివరణ:- పాదశబ్దానికి కిరణాలు, పాదాలు అని రెండర్థాలు. సూర్యుని రెండు విధాలైన పాదాలు ఇక్కడ వర్ణించబడుతున్నాయి. నఖోద్భాసినః, క్షిప్తాబ్జభాసః, అమరాణాం శిరాంసి ఆక్రామన్తి అనేవి చరణాలకి సంబంధించినవి. లూనతమసః అనేది కిరణాలకి పాదాలకీ కూడ సంబంధించినది. మిగిలినవి కిరణాలకి సంబంధించినవి. ఇక్కడ తమస్సును తొలగించడంవంటి ధర్మాలచేత కిరణాలతో సమానములైన సూర్య చరణాలకి ఆకాశాన్ని ప్రకాశింపచేయక పోవడం మొదలైన ధర్మాలను పట్టి కిరణాలకంటె వ్యతిరేకం ధ్వనింపబడుతున్నది .

ఏవమితి - ఈ విధంగా ఇంకా ఇతరమైన శబ్దశక్తిమూలానుస్వానరూపవ్యంగ్య ప్రకారాలున్నాయి. సహృదయులు వాటిని స్వయంగా ఊహించుకోవాలి. గ్రంథం

పెరిగిపోతుం దనే భయంచేత వాటి విస్తృతవివరణం చేయబడలేదు.

లోచనం

నఖైరుద్భాసన్తే యే, అవశ్యం ఖే గగనే న ఉద్భాసన్తే. ఉభయే రశ్మ్యాత్మానః అఙ్గులీపార్ష్ణ్యాద్యవయవిరూపాశ్చేత్యర్థః 21.

బాలానందిని

నఖైరితి - ఏవి నఖాలచేత ప్రకాశిస్తున్నాయో, ('అవశ్యం' అని ఎందుకు అన్నాడో తెలియడం లేదు) ఖే=ఆకాశంలో, న ఉద్భాసన్తే=ప్రకాశించడంలేదో, ఉభయే= కిరణరూపాలు, వ్రేళ్లు మణవ మొదలైన అవయవాలు ఉండే అవయావులైన చరణాలుకూడ అని అర్థం.

## ధ్వన్యాలోకం

కా. అర్థశక్త్యుద్భవస్త్వన్యో యత్రార్థః స ప్రకాశతే,
యస్తాత్పర్యేణ వస్త్వన్యద్వ్యనక్త్యుక్తిం వినా స్వతః. 22

యత్రార్థ ః స్వసామర్థ్యాదర్థాన్తరమభివ్యనక్తి శబ్దవ్యాపారం వినైవ సః అర్థశక్త్యుద్భవః నామ అనుస్వానోపమవ్యఙ్గ్యో ధ్వనిః యథా-

శ్లో. ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితురధోముఖీ ,
లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ. (47)

బాలానందిని

అర్థేతి - యత్ర = ఎక్కడ, యః అర్థః = ఏ అర్థం, ఉక్తిం వినా = శబ్దం లేకుండా. అనగా శబ్దవ్యాపారం లేకుండా, స్వతః = స్వయంగా, తాత్పర్యేణ = ధ్వనన వ్యాపారంచేత, అన్యద్వస్తు = మరియొక వస్తువును, వ్యనక్తి = వ్యంజింపచేయునో సః = ఆ, అన్యః = మరియొక, శబ్దశక్త్యుద్భవంకంటె భిన్నమైన, అర్థశక్త్యుద్భవః = అర్థశక్తివల్ల పుట్టిన, అర్థః = అర్థం, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

యత్రేతి - ఎక్కడ అర్థం శబ్దవ్యాపారం లేకుండానే, తన సామర్థ్యంవల్ల మరియొక అర్థాన్ని వ్యంజింప చేస్తుందో అది అర్థశక్త్యుద్భవం అనే పేరు గల అనుస్వాన పమవ్యంగ్యమైన ధ్వనికావ్యం. ఎట్లనగా -

ఏవమితి - ఇది కుమారసంభవంలో సప్తర్షులు హిమవంతుని వద్దకు వెళ్లి పార్వతిని పరమేశ్వరున కిచ్చి వివాహం చేయవలసిందిగా కోరుతూన్న ఘట్టంలోనిది. దేవర్షౌ = దేవర్షియైన అంగిరసుడు, ఏవంవాదిని = ఇలా పలుకుచుండగా, పితుః = తండ్రియొక్క, పార్శ్వే = పార్శ్వమునందున్న, పార్వతీ = పార్వతి, అధోముఖీ = క్రిందికి వంచబడిన ముఖం కలదై, లీలాకమలపత్రాణి = విలాసార్థమైన పద్మము నందలి రేకులను, గణయామాస = లెక్కపెట్టెను.

లోచనం

ఏవం శబ్దశక్త్యుద్భవం ధ్వనిముక్త్వా అర్థశక్త్యుద్భవం దర్శయతి - అర్థేతి. అన్య ఇతి - శబ్దశక్త్యుద్భవాత్. స్వతః తాత్పర్యేణ ఇతి అభిధావ్యాపారని రాకరణపరమిదం ధ్వననవ్యాపారమాహ న తు తాత్పర్యశక్తిమ్. సా హి వాచ్యార్థప్రతీతావేవ ఉపక్షీణేత్యుక్తం ప్రాక్. అనేనైవ ఆశయేన వృత్తౌ వ్యాచష్టే - యత్రార్థః స్వసామర్థ్యాదితి. స్వతః ఇతి శబ్దః స్వశబ్దేన వ్యాఖ్యాతః . ఉక్తిం వినేతి వ్యాచష్టే - శబ్దవ్యాపారం వినైవేతి. ఉదాహరతి యథా ఏవమితి.

బాలానందిని

శబ్దేతి - శబ్దశక్త్యుద్భవధ్వనిని చెప్పి అర్థశక్త్యుద్భవధ్వనిని చూపుతున్నాడు - అర్థేతి. అన్యః ఇతి - శబ్దశక్త్యుద్భవంకంటె వేరైనది. స్వతః = స్వయంగా. తాత్పర్యేణ అనే ఈ పదం అభిధావ్యాపారాన్ని నిరాకరించడానికి ఉద్దిష్టమైనది. ధ్వననవ్యాపారం అర్థాన్ని బోధిస్తుంది. అంతేకాని తాత్పర్యశక్తిని బోధించదు. ఆ తాత్పర్యశక్తి వాచ్యార్థాన్ని బోధించడంతోనే క్షీణించినది అని పూర్వం చెప్పబడింది. ఈ అభిప్రాయంతోనే వృత్తిలో యత్రార్థః స్వసామర్థ్యాత్ అని వ్యాఖ్యానిస్తున్నాడు. కారికలో ఉన్న స్వతః అనే శబ్దం స్వసామర్థ్యాత్ లోని స్వశబ్దంచేత వ్యాఖ్యానించబడినది. అనగా తాత్పర్యేణ అనే దానికి సామర్థ్యాత్ అనే పదంచేత, స్వతః అనే పదానికి సామర్థ్యాత్ అనే దానికి ముందు స్వశబ్దం చేర్చడంచేత అర్థం వివరించబడింది. ఉక్తిం వినా అనే దానిని శబ్దవ్యాపారం వినైవ అనే పదాలచేత వ్యాఖ్యానిస్తున్నాడు. యథా ఏవమ్ ఇత్యాదికంతో ఉదాహరిస్తున్నాడు.

ధ్వన్యాలోకం

అత్ర హి లీలాకమలపత్రగణనమ్ ఉపసర్జనీకృతస్వరూపం శబ్దవ్యాపారం వినైవ అర్థాన్తరం వ్యభిచారిభావలక్షణం ప్రకాశయతి.

న చాయమలక్ష్యక్రమవ్యఙ్గ్యస్యైవ ధ్వనేః విషయః; యతః యత్ర సాక్షాత్ శబ్దనివేదితేభ్యః విభావానుభావవ్యభిచారిభ్యః రసాదీనాం ప్రతీతిః, న తస్య కేవలస్య మార్గః. యథా కుమారసంభవే మధుప్రసఙ్గే వసన్తపుష్పాభరణం వహన్త్యా దేవ్యా ఆగమనాదివర్ణనం మనోభవశరసంధానపర్యన్తం శంభోశ్చ పరివృత్తధైర్యస్య చేష్టావిశేషవర్ణనాది సాక్షాచ్ఛబ్దనివేదితమ్. ఇహ తు సామర్థ్యాక్షిప్తవ్యభిచారిముఖేన రసప్రతీతిః. తస్మాదయమన్యో ధ్వనేః ప్రకారః.

బాలానందిని

అత్రేతి - ఇక్కడ లీలాకమలపత్రగణనం తన స్వరూపాన్ని అప్రధానం చేసి శబ్దవ్యాపారం లేకుండానే వ్యభిచారిభావస్వరూపమైన మరొక (లజ్జారూప మైన) అర్థాన్ని బోధిస్తున్నది. ఇది అలక్ష్యక్రమవ్యంగ్యధ్వనికావ్యానికే విషయం కాదు. ఎందువల్ల ననగా ఎక్కడైతే విభావానుభావవ్యభిచారులు సాక్షాత్ శబ్దాలచేత నివేదించబడతాయో (తెలుపబడతాయో) వాటివల్ల రసాదిప్రతీతి కలుగుతుందో, అదే కేవలమైన దానియొక్క (అసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనికావ్యంయొక్క) మార్గం. ఎట్లనగా కుమారసంభవంలో వసంతర్తుప్రసంగంలో వసంతపుష్పాలను ఆభరణాలుగా ధరించి దేవి రావడం మొదలు మన్మథుడు బాణం సంధించినంతవరకూ వర్ణనం, ధైర్యం చెదిరిన శివుని చేష్టావిశేషాన్ని వర్ణించడం మొదలైనది సాక్షాత్తు శబ్దంచేత చెప్పబడినది. ఇలాంటి ఘట్టం అసంలక్ష్యక్రమానికి లక్ష్యం అని అర్థం. ఇక్కడైతే అర్థసామర్థ్యంచేత వ్యభిచారి ద్వారా రసప్రతీతి కలుగుతుంది. అందువల్ల ఇది ధ్వనికావ్యంయొక్క మరొక ప్రకారం.

లోచనం

అర్థాన్తరమితి - లజ్జాత్మకమ్. సాక్షాదితి, వ్యభిచారిణాం యత్ర అలక్ష్యక్రమతయా వ్యవధివన్త్యైవ ప్రతిపత్తిః స్వవిభావాదిబలాత్ తత్ర సాక్షాత్ శబ్దనివేదితత్త్వం వివక్షితమితి న పూర్వాపరవిరోధః. పూర్వం హ్యుక్తం వ్యభిచారిణామపి భావత్వాత్ న స్వశబ్దతః ప్రతిపత్తిరిత్యాది విస్తరతః. ఏతదుక్తం భవతి - యద్యపి రసభావాదిరర్థో ధ్వన్యమాన ఏవ భవతి న వాచ్యః కదాచిదపి తథాపి న స సర్వః అలక్ష్యక్రమస్య విషయః. యత్ర హి

విభావానుభావేభ్యః స్థాయిగతేభ్యః వ్యభిచారిగతేభ్యశ్చ పూర్వేభ్యః ఝటిత్యేవ రసవ్యక్తి ః తత్ర అస్తు అలక్ష్యక్రమః. యథా -

శ్లో. నిర్వాణభూయిష్ఠమథాస్య వీర్యం సంధుక్షయన్తీవ వపుర్గుణేన,
అనుప్రయాతా వనదేవతాభిరదృశ్యత స్థావరరాజకన్యా.

ఇత్యాదౌ సంపూర్ణాలంబనోద్దీపనవిభావతాయోగ్యస్వభావవర్ణనమ్.

శ్లో. ప్రతిగ్రహీతుం ప్రణయిప్రియత్వాత్త్రిలోచనస్తాముపచక్రమే చ.
సంమోహనం నామ చ పుష్పధన్వా ధనుష్యమోఘం సమధత్త బాణమ్.

ఇత్యనేన విభావతోపయోగః ఉక్తః.

శ్లో. హరస్తు కించిత్పరివిలుప్తధైర్యశ్చన్ద్రోదయారమ్భ ఇవామ్బురాశిః,
ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే వ్యాపారయామాస విలోచనాని.

అత్ర హి భగవత్యాః ప్రథమమేవ తత్రప్రవణత్వాత్ తస్య చేదానీం తదున్ముఖీభూతత్వాత్ ప్రణయిప్రియతయా చ పక్షపాతస్య సూచితస్య గాఢీ భావాత్ రత్యాత్మనః స్థాయిభావస్య ఔత్సుక్యావేగచాపల్యహర్షాదేశ్చ వ్యభిచారిణః సాధారణీభూతః అనుభావవర్గః ప్రకాశిత ఇతి విభావానుభావ చర్వణైవ వ్యభిచారిచర్వణాయాం పర్యవస్యతి. వ్యభిచారిణాం పారతన్త్ర్యాదేవ స్రక్సూత్ర కల్పస్థాయిచర్వణావిశ్రాన్తేః అలక్ష్యక్రమత్వమ్.

ఇహ తు పద్మదలగణనమధోముఖత్వం చాన్యథాపి కుమారీణాం సంభావ్యతే ఇతి ఝటితి న లజ్జాయాం విశ్రమయతి హృదయమ్, అపి తు ప్రాగ్వృత్తతపశ్చర్యాదివృత్తాన్తానుస్మరణేన తత్ర ప్రతిపత్తిం కరోతీతి క్రమవ్యఙ్గ్యతైవ. రసస్తు అత్రాపి దూరత ఏవ వ్యభిచారిస్వరూపే పర్యాలోచ్య మానే భాతీతి తదపేక్షయా అలక్ష్యక్రమతైవ. లజ్జాపేక్షయా తు తత్ర లక్ష్య క్రమత్వమ్. అముమేవ భావమ్ ఏవశబ్దః కేవలశబ్దశ్చ సూచయతి.

బాలానందిని

అర్థాన్తరమితి - లజ్జారూపమైన మరొక అర్థాన్ని. సాక్షాదితి. వృత్తిలో సాక్షాత్ శబ్దనివేదితేభ్యః విభావానుభావవ్యభిచారిభ్యః అనడంచేత వ్యభిచారిభావం కూడా సాక్షాత్

శబ్దనివేదితం అవుతుంది. అనగా వాచ్యం అవుతుంది అని చెప్పినట్లయింది. కాని వ్యభిచారిభావాలు వ్యంగ్యాలే కాని వాచ్యాలు కావని వెనక ప్రతిపాదించబడింది. ఇది దానికి విరుద్ధంగా ఉంది కదా అని ఆశంకించుకొని వృత్తికారుని అభిప్రాయం విశదీకరిస్తున్నాడు - వ్యభిచారిణామ్ ఇతి - ఎక్కడైతే వ్యభిచారిభావాలు తమ విభావాదుల బలంవల్ల వ్యవధి లేకుండా, అలక్ష్యక్రమాలుగా, గ్రహించబడతాయో అక్కడ అవి సాక్షాత్ శబ్దనివేదితాలని, అనగా వ్యవధానం లేకుండా శబ్దాలచేత తెలుపబడతాయని చెప్పడమే ఇక్కడ వృత్తికారుని అభిప్రాయం (అంతేనే కాని అవి వాచ్యా లవుతాయని చెప్పడం అభిప్రాయం కాదు), అందుచేత పూర్వాపరవిరోధం లేదు.

ఏతదుక్తం భవతీతి:- ఇక్కడ ప్రతిపాదించిన విషయం ఇది - రసభావాది రూపమైన అర్థం ఎల్లప్పుడూ కూడ ధ్వనింపబడేది గానే ఉంటుంది కాని అది ఎన్నడూ వాచ్యం కాదు అనే మాట సత్యమే అయినా ఆ రసభావాద్యర్థం అంతాకూడ అలక్ష్య క్రమానికి విషయం కాదు; అనగా అవి తప్పకుండా అలక్ష్యక్రమాలుగానే ఉండాలనే నియమం లేదు. ఎక్కడైతే, స్థాయికి సంబంధించిన విభావానుభావాలు, పరిపూర్ణంగా ఉన్నప్పుడు వాటివల్ల వెంటనే రసప్రతీతి కలుగుతుందో అక్కడ అది అలక్ష్యక్రమమే కావచ్చు. ఎట్లనగా -కుమారసంభవంలోని తృతీయ సర్గలో - శివుణ్ణే వివాహం ఆడాలనే దృఢమైన అభిలాష గల పార్వతి హిమవత్పర్వతంమీద తపస్సు చేసుకొంటూన్న శివునికి, సఖీసమేతురాలై, తండ్రి అనుమతితో, సపర్యలు చేస్తూ ఉంటుంది. ఇంద్రుడు ప్రేరేపించగా మన్మథుడు శివునికి పార్వతిమీద అనురాగం కలిగించడం కోసం సమయానికై వేచి ఉంటాడు. అతని మిత్రుడు అంతకు ముందే ఆ వనం అంతా వికసితకుసుమాదులతో సుశోభితం అయేటట్లు చేసి ఉన్నాడు. ఇక్కడ ఉదాహరించిన మూడు శ్లోకాలు ఆ ఘట్టంలోనివి.

నిర్వాణేతి - అథ = అటుపిమ్మట (అంతలో), అస్య = ఈ మన్మథునియొక్క, నిర్వాణభూయిష్ఠమ్ = చాల వరకు ఆరిపోయిన (అణిగిపోయిన), వీర్యమ్ = పరాక్రమాన్ని, శివుణ్ణి తప్పకుండా కామవశుణ్ణి చేస్తానని ఎంతో ధీమాతో వచ్చిన మన్మథునికి ఆ ధ్యానముద్రలో ఉన్న శివుణ్ణి చూడగానే గుండె జారిపోయింది. వపుర్గుణేన = శరీర సౌందర్యంచేత, సంధుక్షయన్తీవ = రగుల్కొలుపుతూన్నది వలె ఉన్న, స్థావరరాజకన్యా = పార్వతి, వనదేవతాభిః = వనదేవతలచేత, అనుయాతా = అనుసరించ బడినదై, అదృశ్యత = కనబడెను.

ఇత్యాదావితి:- ఈ మొదలైన శ్లోకాలలో ఆలంబనవిభావత్వానికి (పార్వతి

ఆలంబనవిభావం), ఉద్దీపనవిభావత్వానికీ (ఆమె సౌందర్యం, వసంత పుష్పాభరణ ధారణాదికం ఉద్దీపనవిభావం) యోగ్యమైన స్వభావం పరిపూర్ణంగా వర్ణించబడింది.

ప్రతిగ్రహీతుమితి - త్రిలోచనః = మహేశ్వరుడు, ప్రణయిప్రియత్వాత్ = తనపై ప్రేమకలవాళ్లు ప్రియులుగా కలవాడగుట వలన, భక్తులయందు ప్రేమ ఉన్నవాడవడంవల్ల, తామ్ = పార్వతి సమర్పిస్తూన్న పుష్పమాలను, ప్రతిగ్రహీతుమ్ = స్వీకరించడానికి, ఉపచక్రమే చ = ఉపక్రమించాడు. పుష్పధన్వా = మన్మథుడు, ధనుషి = ధనుస్సుమీద, సంమోహనం నామ = సంమోహనం అనే పేరుగల, అమోఘమ్ = వ్యర్థం కాని, బాణమ్ = బాణమును, సమధత్త = సంధించెను.

ఇత్యనేనేతి - దీనిచేత ఆలంబనోద్దీపనవిభావత్వాల ఉపయోగం చెప్పబడింది. హరస్తు ఇతి - హరస్తు = శివుడైతే, చన్ద్రోదయారమ్భే = చంద్రోదయప్రారంభంలో, అమ్బురాశిరివ = సముద్రం వలె, కించిత్ = కొంచెం, పరివృత్తధైర్యః = సడలిన ధైర్యం కలవాడై, బిమ్బఫలాధరోష్ఠే = దొండపండు వంటి అధరోష్ఠం గల, ఉమాముఖే = ఉమాముఖమునందు, విలోచనాని = నేత్రాలను, వ్యాపారయామాస = ప్రసరింపచేసెను. **అత్ర హీతి** - ఇక్కడ పార్వతికి మొదటినుంచీ ఆతనిమీద ఆసక్తి ఉండడంవల్ల, ఇపుడు అతడు ఆమె విషయంలో సుముఖత్వం చూపడంవల్ల, ప్రణయిప్రియత్వంచేత సూచించబడిన పక్షపాతం గాఢం అవడంవల్ల, రతిరూపమైన స్థాయిభావానికీ, ఔత్సుక్య - ఆవేగ - చాపల్య - హర్షాదివ్యభిచారిభావాలకీ సాధారణాలైన అనుభావాల వర్గం ప్రకాశింపచేయబడింది. అందుచేత విభావానుభావచర్వణయే వ్యభిచారిచర్వణలో పర్యవసానం పొందుతుంది. అనగా విభావానుభావాల ద్వారా వ్యభిచారిభావం వ్యంగ్యం అవడంచేత విభావాదుల చర్వణ చివరికి వ్యభిచారిచర్వణకి దారి తీస్తుంది. వ్యభిచారిభావాలు పరాధీన మైనవి. అందుచేత వాటి చర్వణ పుష్పమాలలో దారం వలె అనుస్యూతంగా వస్తూన్న స్థాయిభావచర్వణలో విశ్రమిస్తుంది. అందుచేత ఆ ఘట్టంలో విభావాదిజ్ఞానం కలిగిన వెంటనే వ్యభిచారిభావచర్వణ, వ్యభిచారిభావచర్వణ జరిగిన వెంటనే రసచర్వణా కలిగాయి. ఇదంతా అతిశీఘ్రంగా జరగడంచేత అలక్ష్యక్రమత్వం ఉంది అని భావం.

**ఇహ తు ఇతి** - ఇక్కడైతే - బాలికలు పద్మాల రేకులు లెక్కపెట్టడం, తలవంచుకొని కూర్చొనడం మొదలైనవి ఇతరకారణాలచేత కూడ జరగవచ్చును గాన ఈ అనుభావాలు తెలిసిన వెనువెంటనే హృదయాన్ని లజ్జయందు విశ్రమింపచేయవు, అనగా లజ్జచేతనే ఈమె ఈ విధంగా చేస్తూన్నదని తెలియడానికి అవకాశం లేకపోవడంచేత

సహృదయునికి లజ్జాభావప్రతీతి వెంటనే కలగదు. మరేమనగా పూర్వం ఆమె శివుని కొఱకై చేసిన తపస్సు మొదలైన వృత్తాంతాన్ని స్మరించడంచేత, తద్ద్వారా ఈ పద్మపత్రగణన - అధోముఖత్వాదికం లజ్జాప్రతిపత్తిని (లజ్జారూపవ్యభిచారిభావజ్ఞానాన్ని) కలిగిస్తుంది. అందుచేత ఈ లజ్జకు క్రమవ్యంగ్యత్వమే. ఈ అనుభావజ్ఞానానికీ లజ్జా ప్రతీతికీ మధ్య తపశ్చర్యాదిస్మరణావశ్యకత ఉండడంచేత లజ్జాప్రతీతిలో కొంత ఆలస్యం జరుగుతుంది గాన ఇది సంలక్ష్యక్రమవ్యంగ్యమే అనిఅర్థం.

రసస్తు ఇతి - ఇక్కడ వ్యభిచారిస్వరూపాన్ని గూర్చిన పర్యాలోచన దూరంగా, అనగా ఆలస్యంగా, చేసిన తరవాత వ్యభిచారిచర్వణ జరగగానే వెంటనే రసచర్వణ కలుగుతుంది. అందుచేత ఇక్కడ లజ్జాపేక్షయా ఇది సంలక్ష్యక్రమః వ్యంగ్యం గాని రసాపేక్షయా అసంలక్ష్యక్రమవ్యంగ్యమే. ఈ భావాన్నే, ఎప్పుడైనా భావం సంలక్ష్యక్రమం కావచ్చును గాని రసంమాత్రం ఎల్లప్పుడూ అసంలక్ష్యక్రమమే అనే భావాన్నే, అలక్ష్యక్రమస్యైవ అనే చోట ఉన్న ఏవశబ్దం, స తస్య కేవలస్య అన్నచోట ఉన్న కేవలశబ్దమూ సూచిస్తున్నాయి.

## ధ్వన్యాలోకం

యత్ర చ శబ్దవ్యాపారసహాయః అర్థః అర్థాన్తరస్య వ్యఞ్జకత్వేన ఉపాదీయతే స నాస్య ధ్వనేర్విషయః -యథా -

శ్లో. సంకేతకాలమనసం విటం జ్ఞాత్వా విదగ్ధయా,
హసన్నేత్రార్పితాకూతం లీలాపద్మం నిమీలితమ్. (48)

అత్ర లీలాకమలనిమీలనస్య వ్యఞ్జకత్వమ్ ఉక్త్యైవ నివేదితమ్.

### బాలానందిని

యత్రేతి - ఎక్కడ మరొక శబ్దంయొక్క వ్యాపారం సహాయంగా గల అర్థం, అనగా శబ్దవ్యాపారంయొక్క సాహాయ్యం తీసికొన్న అర్థం, అర్థాంతరాన్ని వ్యంజింపచేసేదిగా గ్రహించబడుతుందో, మరొక అర్థాన్ని వ్యంజింప చేస్తుందో, అది ఈ ధ్వనికి విషయం కాదు. ఎట్లనగా -

సంకేతేతి - విటమ్ = విటుణ్ణి, సంకేతకాలమనసమ్ = సంకేతకాలమునందు మనస్సు కలవాణ్ణిగా, సంకేతకాలాన్ని తెలుసుకొన గోరుచున్నవానినిగా, జ్ఞాత్వా= తెలుసుకొని, విదగ్ధయా = నెరజాణచేత, హసన్నేత్రార్పితాకూతమ్ = నవ్వుతూన్న

(వికసించిన) నేత్రాలలో ఉంచబడిన గూఢాభిప్రాయం కలుగునట్లుగా, లీలాపద్మమ్ = విలాసార్థమైన పద్మం, నిమీలితమ్ = రేకులు ముడుచుకొనే టట్లు చేయబడింది.

**అత్రేతి** - ఇక్కడ లీలాకమలనిమీలనానికి ఉన్న వ్యంజకత్వం శబ్దాలచేతనే తెలపబడింది. అందుచేత ఇది ఈ సంలక్ష్యక్రమవ్యంగ్యకోటిలో చేరదు అని అర్థం.

లోచనం

**ఉక్తింవినా ఇతి యదుక్తం తద్వ్యవచ్ఛేద్యం దర్శయితుముపక్రమతే - యత్ర చేతి - చశబ్దః తుశబ్దస్యార్థే. అస్యేతి - అలక్ష్యక్రమస్తు తత్రాపి స్యాదేవేతి భావః. ఉదాహరతి - సంకేతేతి. వ్యఞ్జకత్వమితి - ప్రదోషసమయం ప్రతీతి శేషః. ఉక్త్యైవేతి - ఆద్యపాదత్రయేణేత్యర్థః. యద్యపి చాత్ర శబ్దాన్తర సంనిధానేఽపి ప్రదోషార్థం ప్రతి న కస్యచిదభిధాశక్తిః పదస్యేతి వ్యఞ్జకత్వం న విఘటితం తథాపి శబ్దేనైవోక్తమ్ - అయమర్థః అర్థాన్తరస్య వ్యఞ్జక ఇతి. తతశ్చ ధ్వనేః యత్ గోప్యమానతోదితచారుత్వాత్మకం ప్రాణితం తదపహస్తితమ్. యథా కశ్చిదాహ - "గమ్భీరోఽహం న మే కృత్యం కోఽపి వేద న సూచితమ్, కించిద్ బ్రవీమి" ఇతి. తేన గామ్భీర్యసూచనార్థః ప్రత్యుత ఆవిష్కృత ఏవ అత ఏవాహ - వ్యఞ్జకత్వమితి; ఉక్త్యైవ ఇతి చ. 22.**

బాలానందిని

**ఉక్తిమితి** -"అర్థశక్త్యుద్భవః" ఇత్యాదికారికలో "ఉక్తిం వినా" అని ఏది చెప్పబడిందో దానిచేత వ్యవచ్ఛేద్యమైన దానిని (దూరం చేయదగిన దానిని) చూపడానికై యత్ర చ ఇత్యాదికంతో ఉపక్రమిస్తున్నాడు. ఇక్కడ 'చ'కు 'తు' అని అర్థం. **అస్య ఇతి.** ఈ ధ్వనికి, అనగా సంలక్ష్యక్రమధ్వనికి, విషయం కాదు అని చెప్పడంచేత అక్కడ కూడ అలక్ష్యక్రమధ్వని ఉండవచ్చునని భావం. ఉదాహరిస్తున్నాడు - సంకేతేతి. వ్యఞ్జకత్వమితి- ప్రదోష సమయాన్ని గూర్చి వ్యంజకత్వం అని అర్థం. **ఉక్త్యా ఏవ ఇతి** - మొదటి మూడు పాదాలచేత అని అర్థం. **యద్యపి ఇతి** - ఇక్కడ ఇతరశబ్దాలు ఉన్నా కూడ ప్రదోషం (సాయంకాలపు వేళ) అనే అర్థాన్ని గూర్చిన అభిధాశక్తి ఏ పదానికీ లేదు గాన వ్యంజకత్వానికి ఏమీ విఘాతం రాకపోయినా - ఈ అర్థం మరొక అర్థాన్ని వ్యంజింపచేస్తుంది అని శబ్దంచేతనే (మూడు పాదాలచేతనే) చెప్పబడింది. అనగా పద్మపురేకులను ముడవడం సాయంకాలసమయాన్ని వ్యంజింపచేస్తుంది అనే విషయం మొదటి

మూడు పాదాల ద్వారా చూపబడింది అని భావం. తతశ్చ ఇతి - అందువల్ల రహస్యంగా ఉంచడంవల్ల చారుత్వం కలగడం అనే ధ్వనియొక్క జీవితం (ప్రాణితమ్) మెడమీద చెయ్యివేసి గెంటివేయబడింది (అపహస్తితమ్). ఉదాహరణకి - ఎవడైనా ఇలా అంటే "నేను చాలా గంభీరుణ్ణి; నేను సూచించకపోతే నేను ఏపని చేయదలుస్తున్నానో ఎవడూ తెలుకొనజాలడు. అందుచేత కొంచెం చెపుతాను" అప్పుడు అతడు గాంభీర్యంచేత సూచించదగిన విషయాన్ని సూచించడానికి బదులు ఆవిష్కరించి నట్లే అవుతుంది. ప్రకృతంలో సాయంకాలరూపమైన అర్థం వ్యంజింపచేయబడబోతుంది అని ప్రథమ పాదత్రయం స్పష్టంచేయడం కూడా ఇలాంటిదే అని భావం. బాలప్రియావ్యాఖ్యానంలో దీని భావం మరొక విధంగా చెప్పబడింది. "గంభీరుడు తాను చేయదలచుకున్న పనిని మాటలలో చెప్పడు, ఎప్పుడైనా సూచిస్తే సూచిస్తాడు" అనే లోకవ్యవహారాన్ని దృష్టిలో ఉంచుకొని ఒకడు ఇలా అన్నాడు - "నేను గంభీరుణ్ణి కాను. అందుచేత సూచింపబడిన నా కృత్యాన్ని గూర్చి ఎవడూ తెలుకొనజాలడు. అందుచేత కొంచెం చెపుతాను" అని శ్లోకభాగానికి అర్థం. గామ్భీర్య సూచనార్థః అనగా గాంభీర్యసూచకమైన ముఖవికారాద్య భావరూపమైన విషయం.

**అత ఇతి** - అందుచేతనే వృత్తికారుడు వ్యఞ్జకత్వమ్ ఉక్త్యైవ అని అన్నాడు. అనగా ఇక్కడ ఉన్న వ్యంజకత్వం, ధ్వనింపచేస్తుందనే విషయం, మాటలచేతనే తెలపబడింది అని అన్నాడు కాని వ్యఙ్గ్యార్థః శబ్దాన్తరేణ ప్రదర్శితః (ఇక్కడ ఉన్న వ్యంగార్థం మరొక శబ్దంచేత చూపబడింది) అని అనలేదు.

## ధ్వన్యాలోకం

తథాచ -

కా. శబ్దార్థశక్త్యాక్షిప్తోఽపి వ్యఙ్గ్యోఽర్థః కవినా పునః,
యత్రావిష్క్రియతే స్వోక్త్యా సాన్యైవాలంకృతిర్ధ్వనేః. 23

శబ్దశక్త్యా అర్థశక్త్యా, శబ్దార్థశక్త్యా వా ఆక్షిప్తోఽపి వ్యఙ్గ్యః అర్థః కవినా పునర్యత్ర స్వోక్త్యా ప్రకాశీక్రియతే సః అస్మాత్ అనుస్వానోపమ వ్యఙ్గ్యాత్ ధ్వనేః అన్య ఎవ అలంకారః. అలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య వా సతి సంభవే స తాదృగన్యోఽలంకారః

బాలానందిని

**తథాచేతి**- ఆవిధంగా -

శబ్దార్థశక్త్యా = శబ్దార్థశక్తిచేత, ఆక్షిప్తోఽపి = ఆక్షిప్తమైనా కూడ, వ్యఙ్గ్యః అర్థః = వ్యంగ్యమైన అర్థం, కవినా = కవిచేత, పునః = మరల, యత్ర = ఎక్కడ, స్వోక్త్యా = ఆ అర్థాన్నే వాచ్యం చేసే మరొక మాటచేత, ఆవిష్క్రియతే = ఆవిష్కరించబడుతుందో, సా = అది, ధ్వనేః = ధ్వనికంటె, అన్యా = భిన్నమైన, అలంకృతిరేవ = అలంకారమే.

**శబ్దేతి** - శబ్దశక్తిచేత అర్థశక్తిచేత లేదా శబ్దార్థశక్తిచేత ఆక్షిప్తమైనా కూడ వ్యంగ్యార్థం కవిచేత మరల ఎక్కడైతే తద్వాచకమైన మరొక మాటచేత ప్రకాశింపచేయబడుతుందో అది ఈ అనుస్వానోపమవ్యంగ్యం అనే ధ్వనికావ్యంకంటె భిన్నమైన అలంకారమే. అక్కడ అలక్ష్యక్రమవ్యంగ్యానికి అవకాశం ఉన్న పక్షంలో అది అలాంటిదే మరొక అలంకారం కావచ్చును.

లోచనం

ప్రక్రాన్తప్రకారద్వయోపసంహారం తృతీయప్రకారసూచనం చైకేనైవ యత్నేన కరోమీత్యాశయేన సాధారణమవతరణపదం ప్రక్షిపతి వృత్తికృత్ - **తథా చేతి**. తేన చ ఉక్తప్రకారద్వయేన అయమపి తృతీయః ప్రకారః మన్తవ్య ఇత్యర్థః. శబ్దశ్చార్థశ్చ శబ్దార్థౌ చేత్యేకశేషః. సా అన్యైవేతి. న ధ్వనిరసౌ, అపి తు శ్లేషాదిరలంకార ఇత్యర్థః. అథవా ధ్వనిశబ్దేన అలక్ష్యక్రమః తస్యాలంకార్యస్య అఙ్గినః సః వ్యఙ్గ్యః అర్థః అన్యః వాచ్యమాత్రాలంకారాపేక్షయా ద్వితీయో లోకోత్తరశ్చాలంకార ఇత్యర్థః. ఏవమేవ వృత్తౌ ద్విధా వ్యాఖ్యాస్యతి.

బాలానందిని

ఏదైన ఒక శ్లోకానికి గాని వాక్యానికి గాని వ్యాఖ్యానం వ్రాసేముందు దానికి సంబంధించిన కొంత విషయాన్ని చెపుతూ ఆ శ్లోకాన్ని గాని వాక్యాన్ని గాని వ్యాఖ్యానానికి గ్రహించడం జరుగుతుంది. ఈ విధంగా ముందు వ్రాసిన దానికి అవతారిక అని పేరు. పై కారికకు వృత్తికారుడు తథా చ అని అవతారిక వ్రాశాడు. ఇంతవరకు ఈ విధంగా చెప్పుకున్నాం కనక అని తథా చ అనేదానికి అర్థం. వెనకటి కారికలో అర్థశక్త్యుద్భవధ్వనిని గూర్చి చెప్పబడింది. తథా చ అనగా అర్థశక్తిమూలధ్వని ఇలా ఉంటుందని ప్రతిపాదించబడింది కనక అని అర్థం చెప్పాలి. ఈ అర్థం ఈ కారికలో చెప్పబోయే అర్థంతో సరిగా అన్వయించదు. అందుచేత లోచనకారుడు దానికి తగువిధమైన అర్థం

సూచిస్తున్నాడు - ప్రక్రాన్తేతి - ఉపక్రమించిన, శబ్దశక్తిమూలధ్వని, అర్థశక్తిమూలధ్వని అని రెండు ప్రకారాలను ఉపసంహరిస్తూ ఒకే ప్రయత్నంచేత తృతీయప్రకారసూచన కూడ చేస్తాను అనే అభిప్రాయంచేత వృత్తికారుడు సాధారణమైన, అన్నింటికి వర్తించే, తథా చ అనే అవతరణపదాన్ని ప్రయోగిస్తున్నాడు. అందుచేత పైన చెప్పిన ప్రకారద్వయంతో పాటు ఈ మూడవ ప్రకారం కూడా గ్రహించాలి అని అర్థం. 'శబ్దార్థౌ' అనేది ఏకశేష. శబ్దశ్చ అర్థశ్చ శబ్దార్థౌ; శబ్దార్థౌ చ శబ్దార్థౌ చ శబ్దార్థాః" అని విగ్రహం. ఈ ఏకశేషను గ్రహించడంచేతనే వృత్తికారుడు శబ్దశక్త్యా అర్థశక్త్యా - శబ్దార్థశక్త్యా అని అర్థం చెప్పాడు. సాన్యైవేతి - అది ధ్వని కాదు, (సంలక్ష్యక్రమధ్వని కాదు) మరేమనగా శ్లేషాద్యలంకారమే అవుతుంది అని అర్థం.

ధ్వనేః అన్యా అలంకృతిః (సంలక్ష్యక్రమధ్వనికంటె భిన్నమైన అలంకారం) అనే అన్వయం ప్రకారం పై అర్థం చెప్పబడింది. వృత్తికారుడే సూచించినవిధంగా దీనికి మరొక అర్థం చెపుతున్నాడు - అథవా ఇతి - లేదా ధ్వనిశబ్దంచేత అలక్ష్యక్రమధ్వని గ్రహించబడుతుంది. అంగి, అలంకార్యమూ అయిన ఆ ధ్వనికి, ఆ వ్యంగ్యార్థం, వాచ్యమాత్రాలంకారాపేక్షయా వేరైన, రెండవదైన, లోకోత్తర మైన అలంకారం అని అర్థం. ఈ విధంగానే వృత్తిలో రెండు విధాలుగా వ్యాఖ్యానిస్తాడు.

## ధ్వన్యాలోకం

తత్ర శబ్దశక్త్యా యథా -

శ్లో. వత్సే మా గా విషాదం శ్వసనమురుజవం సన్త్యజోర్ధ్వప్రవృత్తం
కమ్పః కో వా గురుస్తే భవతు బలభిదా జృమ్భితేనాత్ర యాహి,
ప్రత్యాఖ్యానం సురాణామితి భయశమనచ్ఛద్మనా కారయిత్వా
యస్మై లక్ష్మీమదాద్వః స దహతు దురితం మన్థమూఢాం పయోధిః. (49)

### బాలానందిని

తత్రేతి - వాటిలో శబ్దశక్తిచేత ఎట్లనగా - వత్సే ఇతి - వత్సే = ఓ! వత్సా! అమ్మా! విషాదమ్ = దుఃఖమును, మా గాః = పొందకుము. ఊర్ధ్వప్రవృత్తమ్= పైకి ప్రసరిస్తూన్న, ఉరుజవమ్= గొప్ప వేగం గల, శ్వసనమ్= శ్వాసను, సంత్యజ = విడువుము. తే = నీకు, గురుః = గొప్పదైన, కమ్పః = కంపం, కో వా = ఏమిటి? ఎందుకు? బలభిదా = బలాన్ని

తొలగించే, జృమ్భితేన= అవులింతచేత, భవతు=అగుగాక; చాలును. అత్ర= ఇక్కడికి, యాహి= వెళ్లుము. ఇది ఒక అర్థం. విషాదమ్= విషం తిన్న ఈశ్వరుణ్ణి, మా గాః పొందకుము. ఉరుజవమ్= గొప్పవేగం గల, శ్వసనమ్= వాయుదేవుణ్ణి, ఊర్ధ్వప్రవృత్తమ్= పైకి జ్వాలారూపంలో లేచే అగ్నిదేవుణ్ణి, త్యజ = విడువుము. కమ్పుః= జలాధిపతియైన వరుణుడు, కో వా = బ్రహ్మదేవుడు, తే= నీకు, గురుః = గురువు, జృమ్భితేన = ధనమదమత్తుడైన, బలభిధా= ఇంద్రునిచేత, భవతు= అగుగాక. అతనితో నీకు పని లేదు అని రెండవ అర్థం. ఇతి= ఈ విధంగా, భయశమనచ్ఛద్మనా = భయాన్ని శాంతింపచేయడం అనే మిషచేత, సురాణామ్= దేవతలయొక్క, ప్రత్యాఖ్యానమ్= ప్రత్యాఖ్యానమును, కారయిత్వా= చేయించి, పయోధిః= సముద్రుడు, మన్థమూఢామ్= సముద్రమథనంచేత మూఢురాలుగా ఉన్న, ఆ హడావిడిలో ఏమి చెయ్యాలో తెలియకుండా ఉన్న, లక్ష్మీమ్ = లక్ష్మిని, యస్మై= ఏ శ్రీమహావిష్ణువునకు, అదాత్= ఇచ్చెనో, సః = ఆ శ్రీమహావిష్ణువు, వః = మీయొక్క, దురితమ్ = పాపమును, దహతు= దహించుగాక.

లోచనం

విషమత్తీతి విషాదః. ఊర్ధ్వప్రవృత్తమ్ అగ్నిమిత్యత్ర చార్థో మన్తవ్యః. కమ్పుః అపాం పతిః. కో బ్రహ్మ వా తవ గురుః. బలభిదా ఇన్ద్రేణ జృమ్భితేన ఐశ్వర్యమదమత్తేనేత్యర్థః. జృమ్భితం చ గాత్రసంమర్దనాత్మకం బలం భినత్తి, ఆయాసకారిత్వాత్. ప్రత్యాఖ్యానమితి వచసైవ అత్ర ద్వితీయో ఽర్థః అభిధీయతే ఇతి నివేదితమ్. కారయిత్వా ఇతి - సా హి కమలా పుణ్డరీకాక్షమేవ హృదయే నిధాయ ఉత్థితేతి స్వయమేవ దేవాన్తరాణాం ప్రత్యాఖ్యానం కరోతి. స్వభావసుకుమారతయా తు మన్దరాన్దోలితజలధితరఙ్గభఙ్గపర్యాకులీకృతాం తేన ప్రతిబోధయతా తత్సమర్థాచరణమన్యత్ర దోషోద్ఘాటనేన అత్ర యాహీతి చాభినయవిశేషేణ నకలగుణాదరదర్శకేన కృతమ్. అత ఏవ మన్థమూఢామిత్యాహ. ఇత్యుక్తప్రకారేణ భయనివారణవ్యాజేన సురాణాం ప్రత్యాఖ్యానం మన్థమూఢాం లక్ష్మీం కారయిత్వా ప్రయోధిర్యస్మై తామదాత్ స వో యుష్మాకం దురితం దహతు ఇతి సమ్బన్ధః.

## బాలానందిని

విషమితి :- 'విషమ్ అత్తీతి విషాదః' - విషం తినేవాడు. ఊర్ధ్వప్రవృత్తమ్ అనేదానికి అగ్ని అని కూడా అర్థం తెలియదగినది. కమ్పః = జలప్రభువు, కః = బ్రహ్మదేవుడు. వీళ్లల్లో ఎవరైనా నీకు గురువే. బలభిదా= ఇంద్రునితో, జృమ్భితేన= ఐశ్వర్యమదమత్తుడు. గాత్రసంమర్దనరూపమైన జృంభితం ఆవులింత, ఒళ్లు విరుపు, ఆయాసం కలిగించడంవల్ల, బలం భినత్తి = బలాన్ని పోగొడుతుంది. ప్రత్యాఖ్యానం అనే పదంచేతనే ఇక్కడ రెండవ అర్థం వాచ్యంగా బోధించబడుతున్నది అని ; తెలుపబడింది. కారయిత్వేతి : ఆ లక్ష్మి పుండరీకాక్షుణ్ణే హృదయంలో ఉంచుకొని సముద్రంనుంచి లేచింది కాబట్టి ఇతరదేవతలను ఆమెయే తిరస్కరిస్తుంది. కాని ఆమె స్వభావంచేతనే సుకుమారురాలు అవడంచేత మందరపర్వతంచేత చిలికి వేయబడిన సముద్రతరంగభంగాలచేత వ్యాకులత చెంది ఉంది. అందుచేత ఆమెకు బోధిస్తూ సముద్రుడు ఇతరులలో ఉన్న దోషాలను ఉద్ఘాటించడంచేత, "ఇటు వెళ్లు" అని (మహావిష్ణువులో ఉన్న) సకలగుణాలను, ఆతనిపై ఆదరాన్ని సూచించే అభినయవిశేషంచేతా ఆమెకు అనుకూల మైన పని చేశాడు. అందువల్లనే 'మన్థమూఢామ్' అన్నాడు. ఇతి = చెప్పబడిన ప్రకారంచేత, భయాన్ని తొలగించే మిషతో మన్థమూఢయైన లక్ష్మిచేత దేవతల ప్రత్యాఖ్యానం చేయించి సముద్రుడు ఎవనికి ఆమెను ఇచ్చెనో అతడు, వః= మీయొక్క, పాపాన్ని దహించుగాక అని అన్వయం.

## ధ్వన్యాలోకం

అర్థశక్త్యా యథా -

శ్లో. అమ్బా శేతేఽత్ర వృద్ధా పరిణతవయసామగ్రణీరత్ర తాతో
నిఃశేషాగారకర్మశ్రమశిథిలతనుః కుమ్భదాసీ తథాత్ర,
అస్మిన్ పాపాహమేకా కతిపయదివసప్రోషితప్రాణనాథా
పాన్థాయేత్థం తరుణ్యా కథితమవసరవ్యాహృతివ్యాజపూర్వమ్.

(50)

ఉభయశక్త్యా యథా- "దృష్ట్వా కేశవ గోపరాగహృతయా" ఇత్యాదౌ.

బాలానందిని

**అర్థేతి**:- అర్థశక్తిచేత ఎట్లనగా - రూపవంతుడైన ఒక పాంథుణ్ణి చూచి కామపీడితురాలైన ఒక స్వైరిణి అంటూన్న మాట లివి - **అమ్బా ఇతి** :- వృద్ధా = వృద్ధ అయిన, అమ్బా = తల్లి, అత్ర = ఇక్కడ, శేతే= శయనించుచున్నది, శయనిస్తుంది, పరిణతవయసామ్ = ముదిరిపోయిన వయస్సుకలవారిలో, అగ్రణీః = అగ్రనాయకుడైన, తాతః= నా తండ్రి, అత్ర = ఇక్కడ, తథా = మరియు, నిఃశేషాగారకర్మశ్రమశిథిలతనుః= ఇంటి పని అంతాచేయడంచేత కలిగిన శ్రమచేత శిథిలమైన శరీరం గల, కుమ్భదాసీ = ఇంటి దాసి, అత్ర = ఇక్కడ. కతిపయదివసప్రోషితప్రాణనాథా = కొన్ని దినాల క్రితం ప్రవాసం వెళ్లిన భర్త గల, పాపా = పాపాత్మురాలనైన, అహమ్ = నేను, ఏకా= ఒకత్తెను, అస్మిన్ = ఈ ప్రదేశంలో శయనిస్తాను. ఇత్థమ్ = ఇట్లు, తరుణ్యా = యువతిచేత, అవసరవ్యాహృతివ్యాజపూర్వమ్ = తగిన సమయమును గూర్చి చెప్పడంలో వ్యాజపూర్వకంగా, పాన్థాయ = బాటసారికి, కథితమ్ = చెప్పబడింది.

**వివరణ**:- ఆమె చెప్పిన మాటలను పట్టి వ్యంగ్యార్థం తెలియడానికి అవకాశం ఉంది. అయినా కవి "అవసరవ్యాహృతివ్యాజపూర్వమ్" అని ఆ వ్యంగ్యాన్ని స్పష్టం చేశాడు.

**ఉభయేతి** : శబ్దార్థోభయశక్తిచేత ఎట్లనగా - పూర్వం చూపిన "దృష్ట్యా కేశవ గోపరాగహృతయా" (శ్లో. 42) ఇత్యాదులలో.

లోచనం

**అమ్బేతి** - అత్ర ఏకైకస్య పదస్య వ్యఞ్జకత్వం సహృదయైః సుకల్ప్యమితి స్వకణ్ఠేన నోక్తమ్. వ్యాజశబ్దోఽత్ర స్వోక్తిః. ఏవముపసంహారవ్యాజేన ప్రకారద్వయం సోదాహరణం నిరూప్య తృతీయప్రకారమాహ - **ఉభయేతి** - శబ్దశక్తిస్తావత్ గోపరాగాది శబ్దశ్లేషవశాత్. అర్థశక్తిస్తు ప్రకరణవశాత్. యావదత్ర రాధారమణస్య అఖిలతరుణీజనచ్ఛన్నానురాగగరిమాస్పదత్వం న విదితం తావదర్థాన్తరస్య అప్రతీతేః. 'సలేశమ్' ఇతి చాత్ర స్వోక్తిః. 23

బాలానందిని

**అత్రేతి** - ఇక్కడ ఒక్కొక్కపదం ఏ విధంగా అర్థాంతరవ్యంజకంగా ఉందో సహృదయులు సులభంగా కల్పించుకొనవచ్చు. అందుచేత స్వకంఠంచేత (మేం) చెప్పలేదు. ఇక్కడ 'వ్యాజ' శబ్దం స్వోక్తిని అనగా వ్యంగ్యార్థాన్ని వాచ్యం చేసే మాట. ఈ

విధంగా ఉపసంహారవ్యాజంచేత రెండు ప్రకారాలను ఉదాహరణపూర్వకంగా నిరూపించి ఉభయేత్యాదికంచేత మూడవ ప్రకారం చెపుతున్నాడు. 'గోపరాగ' మొదలైనచోట్ల ఉన్న శబ్దశ్లేషను పట్టి శబ్దశక్తి. ప్రకరణాన్ని పట్టి అర్థశక్తి. రాధారమణుడు సకలతరుణీజనుల రహస్యానురాగగరిమకు అస్పదమైనవాడు అనే విషయం తెలిసేవరకు అర్థాంతరప్రతీతి (రెండవ అర్థంయొక్క జ్ఞానం) కలగదు కదా? ఇక్కడ 'సలేశమ్' అనేది స్వోక్తి అనగా వ్యంగ్యార్థాన్నే వాచ్యం చేసే మాట. 23

## ధ్వన్యాలోకం

కా. ప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరః సమ్భవీ స్వతః,

అర్థోఽపి ద్వివిధో జ్ఞేయో వస్తునోఽన్యస్య దీపకః. 24

అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యఙ్గ్యే ధ్వనౌ యో వ్యఞ్జకోఽర్థః ఉక్తః తస్యాపి ద్వౌ ప్రకారౌ-కవేః, కవినిబద్ధస్య వా వక్తుః ప్రౌఢోక్తిమాత్రనిష్పన్న శరీరః ఏకః, స్వతఃసమ్భవీ చ ద్వితీయః. కవిప్రౌఢోక్తిమాత్రనిష్పన్న.శరీరో యథా-

గాథ.సజ్జేహి సురహిమాసో ణ దావ అప్పేఇ జుఅఇజణలక్ఖముహే,

అహిణవసహఆరముహే ణవపల్లవపత్తలే అణఙ్గస్స శరే. (51)

### బాలానందిని

ప్రౌఢోక్తీతి :- అన్యస్య= మరియొక, వస్తువునకు, దీపకః = ప్రకాశకమైన, వ్యంజకమైన, అర్థః అపి = అర్థంకూడ, ప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరః=ప్రౌఢోక్తిమాత్రంచేత నిష్పన్న మైన శరీరం (స్వరూపం) గలది, స్వతఃసంభవీ= స్వయంగా సంభవించేది అని, ద్వివిధః రెండు విధాలైనదిగా, జ్ఞేయః = తెలియదగినది.

అర్థేతి - అర్థశక్త్యుద్భవానురణ రూపవ్యంగ్యమైన ధ్వనికావ్యంలో ఏ అర్థం వ్యంజకం అని చెప్పబడిందో దానికి కూడ రెండు ప్రకారా లున్నాయి. కవి యొక్క గాని, కవిచేత కల్పించబడిన వక్తయొక్కగాని ప్రౌఢోక్తిమాత్రం చేతనే నిష్పన్నమైన శరీరం కలది ఒకటి. స్వతఃసంభవి రెండవది.

కవీతి :- కవి ప్రౌఢోక్తిమాత్రంచేత నిష్పన్నమైన (ఏర్పడిన) శరీరం (స్వరూపం కలది ఎట్లనగా - "సజ్జేహి" ఇత్యాదిగాథ.

లోచనం

ఏవమర్థశక్త్యుద్భవస్య సామాన్యలక్షణం కృతమ్. శ్లేషాద్యలంకారేభ్యశ్చాస్య విభక్తః విషయ ఉక్తః. అధునాస్య ప్రభేదనిరూపణం కరోతి - ప్రౌఢోక్తీత్యాదినా. యః అర్థాన్తరస్య దీపకః వ్యఞ్జకః అర్థః ఉక్తః సోఽపి ద్వివిధః. న కేవలమనుస్వానోపమో ద్వివిధః, యావత్తద్భేదో యో ద్వితీయః సోఽపి వ్యఞ్జకార్థద్వైవిధ్యద్వారేణ ద్వివిధ ఇతి అపిశబ్దస్యార్థః. ప్రౌఢోక్తావపి అవాన్తరభేదమాహ - కవేరితి. తేన ఏతే త్రయో భేదా భవన్తి. ప్రకర్షేణ ఊఢః. సంపాదయితవ్యేన వస్తునా ప్రాప్తః తత్కుశలః ప్రౌఢః. ఉక్తిరపి సమర్పయితవ్యవస్త్వర్పణోచితా ప్రౌఢేత్యుచ్యతే.

"సజ్జయతి సురభిమాసో న తావదర్పయతి యువతిజనలక్ష్యముఖాన్,
అభినవసహకారముఖాన్ నవపల్లవపత్త్రలాననఙ్గస్య శరాన్"

(సంస్కృతచ్ఛాయ)

అత్ర వసన్తః చేతనః అనఙ్గస్య సఖా సజ్జయతి కేవలం న తావదర్పయతి ఇత్యేవంవిధయా సమర్పయితవ్యవస్త్వర్పణకుశలయా ఉక్త్యా సహకారోద్భేదినీ వసన్తదశా యత ఉక్తా అతో ధ్వన్యమానం మన్మథోన్మాథస్యారమ్భం క్రమేణ గాఢగాఢీభవిష్యన్తం వ్యనక్తి. అన్యథా వసన్తే సపల్లవసహకారోద్గమ ఇతి వస్తుమాత్రం న వ్యఞ్జకం స్యాత్. ఏషా చ కవేరేవ ఉక్తిః ప్రౌఢా.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా అర్థశక్త్యుద్భవంయొక్క సామాన్యలక్షణం చెప్పబడింది. శ్లేషాద్యలంకారాలకంటె దీనికి విభిన్నమైన విషయం (స్థానం) చెప్పబడింది (చూపబడింది). ఇప్పుడు ప్రౌఢోక్తీత్యాదికంచేత దీని భేదాలను నిరూపిస్తున్నాడు. యః ఇతి - అర్థాంతరానికి దీపకః = వ్యంజకమైన, ఏ అర్థం చెప్పబడిందో అది కూడా రెండు విధాలు. కేవలం అనుస్వానోపమమే రెండు విధాలైనది కాదు, దాని రెండవ భేదం కూడా వ్యంజకమైన అర్థంయొక్క ద్వైవిధ్యంచేత, రెండు విధాలు అని "అర్థోఽపి" లోని 'అపి' శబ్దానికి అర్థం. ప్రౌఢోక్తియొక్క అవాంతరభేదం కూడా 'కవేః' ఇత్యాదికంచేత చెపుతున్నాడు. అందుచేత ఈ భేదాలు మూడు ఉంటాయి. "ప్రకర్షేణ ఊఢః సంపాదయితవ్యేన

వస్తునా ప్రాప్తః ప్రౌఢః" అని విగ్రహం. సంపాదించదగిన వస్తువుచేత అత్యధికంగా పొందబడినవాడు; అనగా సంపాదించదగిన వస్తువును అత్యధికంగా సంపాదించగలిగినవాడు; అనగా మంచి నేర్పరి అని అర్థం. అలాంటి ప్రౌఢుని ఉక్తి 'ప్రౌఢోక్తి'. సమర్పించదగిన, అనగా తెలుపదగిన, వస్తువును (విషయాన్ని) అర్పించడానికి తగిన ఉక్తి కూడ ప్రౌఢమే. "ప్రౌఢా చ సా ఉక్తిశ్చ" అనే విగ్రహంచేత అలాంటి ఉక్తి 'ప్రౌఢోక్తి' అని అర్థం.

సజ్జయతీతి - సురభిమాసః = వసంతము, యువతిజనలక్ష్యముఖాన్= యువతిజనమే లక్ష్యంగా గల అగ్రభాగాలు గల, నవపల్లవపత్త్రలాన్= నూతనమైన చిగుళ్ళచేత పత్త్రలములైన, బాణాలు సూటిగా వేగంగా వెళ్లడానికి వాటికి రెక్కలు కడతారు. పత్త్రశబ్దానికి ఇక్కడ రెక్కలని అర్థం. అలాంటి పత్త్రాలు కట్టినవి పత్త్రలములు. ఈ బాణాలు నవపల్లవాలచేత పత్త్రలాలుగా ఉన్నాయి అని అర్థం. అభినవ సహకారముఖాన్ = క్రొత్త సహకారపుష్పాలు మొదలైన, అనఙ్గస్య శరాన్ = మన్మథుని బాణాలను, సజ్జయతి = సిద్ధం చేస్తూన్నది. న తావదర్పయతి = కాని వాటిని ఇంకా ఇవ్వడం లేదు; ప్రయోగించడానికి మన్మథునికి ఇంకా ఇవ్వలేదు.

అత్రేతి-చేతనుడైన, అనగా ఆరోపించబడిన చేతనత్వం గల, "మన్మథమిత్రుడైన వసంతుడు కేవలం సిద్ధం చేస్తున్నాడు కాని ఇవ్వడం లేదు" ఇత్యాదివిధమైన, సమర్పించదగిన వస్తువును సమర్పించడంలో నేర్పుగల ఉక్తి (మాట) చేత సహకారవృక్షాలను వికసింపచేసే టట్లు చేసే వసంతదశ చెప్పబడింది. ఈ విధంగా చెప్పబడడంచేత ఇది ( ఈ ఉక్తి) క్రమంగా అతిగాఢం కానున్న మన్మథపీడాప్రారంభాన్ని ధ్వనింపచేస్తూన్నది. ఈ విధంగా చెప్పకుండా - "వసంతర్తువులో పల్లవాలతో మామిడిపువ్వులు బయలుదేరుతున్నాయి అని మాత్రమే చెప్పినట్లయితే ఆ విధంగా చెప్పబడిన వస్తువు ( విషయం) ఇంత అర్థాన్ని వ్యంజింపజాలదు. ఇది కవియే చెప్పిన ప్రౌఢమైన ఉక్తి.

వివరణ:- అచేతనమైన వసంతం ఈ విధంగా బాణాలు తయారుచేయడం మొదలైనది లోకంలో జరిగే పని కాదు. కవి ఆ విధంగా కల్పించాడు. అందుచేత ఇది కవిప్రౌఢోక్తిమాత్రసిద్ధమైన విషయం - కవి ప్రత్యక్షంగా కాక తాను నిర్మించిన పాత్రచేత ఇలాంటి విషయం చెప్పిస్తే అది కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రసిద్ధం. ఆ చెప్పిన విషయం సంభావ్యమే అయితే, లోకంలో అసంభవం కాకపోతే, అది స్వతఃసంభవి అయిన అర్థం.

## ధ్వన్యాలోకం

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరో యథా - ఉదాహృతమేవ 'శిఖరిణి' ఇత్యాది. యథా వా -

గాథ. సాఅరవిఇణ్ణజోవ్వణహత్థాలమ్బం సముణ్ణమన్తేహిమ్,
అబ్భుట్ఠాణం విఅ మమ్మహస్స దిణ్ణం తుహ థణేహిమ్. (52)

స్వతఃసంభవీ చ య ఔచిత్యేన బహిరపి సంభావ్యమానసద్భావః న కేవలం భణితివశేనైవ అభినిష్పన్నశరీరః. యథోదాహృతమ్ - "ఏవంవాదిని" ఇత్యాది. యథా వా-

గాథ. సిహిపిఞ్ఛకణ్ణపూరా జాఆ వాహస్స గవ్విరీ భమఇ,
ముత్తాఫలరఇఅపసాహణాణం మజ్ఝే సవత్తీణమ్. (53)

### బాలానందిని

కవీతి - కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి మాత్రనిష్పన్న శరీరం ఎట్లనగా - వెనక ఉదాహరించిన 'శిఖరిణి' (శ్లో. 12) ఇత్యాదికం. మరొక ఉదాహరణం ఎట్లనగా - 'సాఅర' ఇత్యాదిగాథ.

స్వతః ఇతి:- ఏది కేవలం భణితి (ఉక్తి) వశంచేతనే, అనగా వాస్తవంలో అలాంటిది లేకపోయినా కవి లేదా కవినిబద్ధవక్త చెప్పడంవల్లనే, ఏర్పడిన స్వరూపం కలది కాక బైట లోకంలో కూడ ఉచితంగా ఉంటుందో అది స్వతఃసంభవి. ఎట్లనగా వెనక ఉదాహరించిన 'ఏవంవాదిని' (శ్లో. 47) ఇత్యాదికం. మరొక ఉదాహరణం ఎట్లనగా - 'సిహి' ఇత్యాదిగాథ.

### లోచనం

శిఖరిణీతి - అత్ర 'లోహితం బిమ్బఫలం శుకః దశతి' ఇతి న వ్యఞ్జకతా కాచిత్. యదా తు కవినిబద్ధస్య సాభిలాషస్య తరుణస్య వక్తుః ఇత్థం ప్రౌఢోక్తిః తదా వ్యఞ్జకత్వమ్.

"సాదరవితీర్ణయౌవనహస్తాలమ్బం సమున్నమద్భ్యామ్,
అభ్యుత్థానమివ మన్మథస్య దత్తం తవ స్తనాభ్యామ్". (సంస్కృతచ్ఛాయ)

స్తనౌ తావ దిహ ప్రధానభూతౌ, తతోఽపి గౌరవితః కామః తాభ్యామభ్యుత్థానేన ఉపచర్యతే. యౌవనం చానయోః పరిచారకభావేన

స్థితమ్; ఇత్యేవంవిధేనోక్తివైచిత్ర్యేణ "త్వదీయస్తనాలోకన ప్రవృద్ధమన్మథావస్థః కో న భవతి?" ఇతి భఙ్గ్యా స్వాభిప్రాయధ్వననం కృతమ్. "తవ తారుణ్యేన ఉన్నతౌ స్తనౌ" ఇతి హి వచనే న వ్యఞ్జకతా. న కేవలమితి - ఉక్తివైచిత్ర్యం తావత్ సర్వథైవ ఉపయోగి భవతీతి భావః.

"శిఖిపిచ్ఛకర్ణపూరా జాయా వ్యాధస్య గర్విణీ భ్రమతి,

ముక్తాఫలరచితప్రసాధనానాం మధ్యే సపత్నీనామ్". (సంస్కృతచ్ఛాయ)

శిఖిమాత్రమారణమేవ తదాసక్తస్య కృత్యమ్. అన్యాసు త్వాసక్తః హస్తినోఽప్యమారయదితి హి వచనేన ఉక్తమ్ ఉత్తమసౌభాగ్యమ్. రచితాని వివిధభఙ్గీభిః ప్రసాధనానీతి తాసాం సంభోగవ్యగ్రిమాభావాత్ తద్విరచనశిల్పకౌశలమేవ పరమితి దౌర్భాగ్యాతిశయ ఇదానీమితి ప్రకాశితమ్. గర్వశ్చ బాల్యావివేకాదినాపి భవతీతి నాత్ర స్వోక్తిసద్భావః శఙ్క్యః. ఏష చార్థః యథా యథా వర్ణ్యతే, ఆస్తాం వా వర్ణనా, బహిరపి యది ప్రత్యక్షాదినా అవలోక్యతే తథా తథా సౌభాగ్యాతిశయం వ్యాధవధ్వా ద్యోతయతి. 24

బాలానందిని

**శిఖరిణీతి** - అత్రేతి - "ఎఱ్ఱని దొండపండును చిలక కొరుకుతున్నది" అని మాత్రమే చెపితే ఇక్కడ వ్యంజకత్వం ఏదీ ఉండదు. కవి చిత్రించిన (కవినిబద్ధ), అభిలాషతో కూడిన ఒక యువకుడు ఈ విధంగా పలికిన ప్రౌఢోక్తి అయినప్పుడే దీనికి వ్యంజకత్వం ఉంటుంది.సాదరేతి - సాదరవితీర్ణయౌవనహస్తాలమ్బమ్= ఆదరపూర్వకంగా (యౌవనంచేత) ఇవ్వబడిన, యౌవనంయొక్క చేయూత కలుగునట్లుగా, సమున్నమద్భ్యామ్ = లేచుచున్న, తవ స్తనాభ్యామ్ = నీ స్తనాలచేత, మన్మథస్య = మన్మథునకు, అభ్యుత్థానమ్= అభ్యుత్థానం, ఎవరైనా వచ్చినప్పుడు లేచి వాళ్లకి సాదరంగా ఎదురుగా వెళ్లడం అభ్యుత్థానం, దత్తమివ = ఇవ్వబడిందా అన్నట్లున్నది.

స్తనౌ ఇతి:- ఇక్కడ ప్రధానమైనవి స్తనాలు. అవి కూడా అభ్యుత్థానంచేత మన్మథునికి ఉపచారం చేస్తున్నా యంటే వాటికంటె గౌరవించబడ్డవాడు మన్మథుడు. ఈ ఉభయులకీ (స్తనాలకీ, మన్మథునికీ) యౌవనం పరిచారకుడుగా సేవ చేస్తుందా అన్నట్లుంది. (ఇక్కడ అచేతనాలైన స్తన - యౌవనాలలో చేతనవృత్తాంతాన్ని ఆరోపించడంచేత సమాసోక్తి. అది ఉత్ప్రేక్షకు అంగం). ఈ విధమైన ఉక్తివైచిత్ర్యంచేత

"నీ స్తనాలు చూస్తే ఎవని మన్మథావస్థ తీవ్రం కాదు?" అని భంగిచేత (కొత్తపద్ధతిలో) తన అభిప్రాయంయొక్క ధ్వననం చేయబడింది. ఇలా కాకుండా "తారుణ్యంచేత నీ స్తనాలు ఉన్నతంగా ఉన్నాయి" అని మాత్రమే చెపితే వ్యంజకత్వం ఉండదు. న కేవలమ్ ఇతి - "కేవలం భణితివిశేషంచేతనే కాదు" అని అనడానికి "భణితివిశేషం (ఉక్తివైచిత్ర్యం) అన్నివిధాలూ ఉపయోగించేదిగా ఉంటుంది; ఇంక విశేషం ఏమనగా ఆ చెప్పినది కొన్ని చోట్ల లోకంలో సంభావ్యంగా ఉంటుంది, కొన్ని చోట్ల ఉండదు; అంతే" అని భావం.

శిఖీతి - వ్యాధస్య = వ్యాధునియొక్క, శిఖిపిచ్ఛకర్ణపూరా = నెమలిపింఛం కర్ణాభరణంగా గల, జాయా= (క్రొత్త) భార్య, ముక్తాఫలరచితప్రసాధనానామ్= ముత్యాలతో అల్లిన అలంకారాలు గల, సపత్నీనామ్= (వాని పూర్వభార్యలైన) సవతులయొక్క, మధ్యే= మధ్యయందు, గర్వీణీ= గర్వం గలదై, భ్రమతి = తిరుగుతున్నది.

శిఖిమాత్రేతి - ఆమెయందు ఆసక్తుడైన ఆ వ్యాధుడు చేస్తూన్న పనల్లా కేవలం నెమళ్ళను చంపడం మాత్రమే. ఇతరభార్యలయందు ఆసక్తుడై ఉన్నప్పుడు ఏనుగుల్ని కూడా చంపేవాడు. ఇలా చెప్పడంచేత ఆమెకు ఉన్న ఉత్తమమైన సౌభాగ్యం(భర్తృప్రేమపాత్రత్వం) చెప్పబడింది. అలంకారాలు, రచితాని = అనేకమైన భంగులలో కూర్చబడ్డాయి, అని చెప్పడంవల్ల వాళ్లకు సంభోగాన్ని గూర్చిన వ్యగ్రత్వం (తీవ్రమైన ఆలోచన) లేకపోవడంచేత ఇప్పుడు వాళ్లకున్నదల్లా ముత్యాలతో అలంకారాలు అల్లుకునే విశిల్పంలో నేర్పు మాత్రమే. అందుచేత ఇప్పుడు పాపం వాళ్ల దౌర్భాగ్యం ఎంత అధికంగా ఉంది! అని వ్యంజించబడింది.

(ఆశంక) ఆ నూతనగర్వానికి హేతువు సౌభాగ్యాతిశయమే కదా? ఆ అర్థం 'గర్వీణీ' అనే పదంచేత వాచ్యంగా చెప్పబడింది కదా అని ఆశంకించుకొని చెపుతున్నాడు - గర్వశ్చ ఇతి :- గర్వం బాల్య-అవివేకాదులచేత కూడ కలగవచ్చును. అందుచేత ఇక్కడ గర్వం స్వపదంచేత చెప్పబడింది అని శంకించకూడదు. ఇది స్వతఃసంభవి అనే విషయాన్ని విశదీకరిస్తున్నాడు - ఏష ఇతి - ఈ విషయం ఎలా ఎలా వర్ణించబడుతుందో (వర్ణించినకొలదీ) వర్ణనంమాట అటుండగా, బైటకూడా ప్రత్యక్షాదికంచేత చూడబడినట్లయితే, అలా అలాగే (అంతగానూ కూడ) వ్యాధుని భార్యయొక్క సౌభాగ్యాతిశయాన్ని వ్యంజింపచేస్తుంది. 24

# ధ్వన్యాలోకం

కా. అర్థశక్తేరలఙ్కారో యత్రాప్యన్యః ప్రతీయతే,
అనుస్వానోపమవ్యఙ్గ్యః స ప్రకారోఽపరో ధ్వనేః. 25

వాచ్యాలంకారవ్యతిరిక్తః యత్ర అన్యః అలంకారః అర్థసామర్థ్య ప్రతీయమానః అవభాసతే సః అర్థశక్త్యుద్భవః నామ అనుస్వానర వ్యఙ్గ్యః అన్యో ధ్వనిః.

బాలానందిని

**అర్థేతి** - యత్ర= ఎక్కడ, అర్థశక్తేః= అర్థశక్తివల్ల, అన్యః = మరొక, అలంకారోఽ అలంకారం కూడ, ప్రతీయతే = వ్యంజింపబడునో, అనుస్వానోపమవ్యఙ్గ్య అనుస్వానోపమవ్యంగ్యం అనే, సః= అది, ధ్వనేః= ధ్వనికావ్యంయొక్క, అ ప్రకారః= మరియొక ప్రకారం.

**వాచ్యేతి** - ఎక్కడ వాచ్యాలంకారంకంటె భిన్న మైన మరొక అలంక అర్థసామర్థ్యంవల్ల ప్రతీయమానం (వ్యంగ్యం) అవుతూ భాసిస్తుందో అక్కడ అర్థశక్త్యుద్భవ మైన, అనుస్వానరూపవ్యంగ్యమనే మరొక ధ్వనికావ్యప్రకారం.

లోచనం

ఏవమర్థశక్త్యుద్భవః ద్విభేదః వస్తుమాత్రవ్యఞ్జనీయు వస్తుధ్వనిరూపతయా నిరూపితః. ఇదానీం తస్యైవాలంకారరూపే వ్యఞ్జనీ అలంకారధ్వనిత్వమపి భవతీత్యాహ - **అర్థేత్యాది**. న కేవలం శబ్దశక్తేరలంక ప్రతీయతే పూర్వోక్తనీత్యా యావదర్థశక్తేరపి. యది వా న కేవలం య వస్తుమాత్రం ప్రతీయతే యావదలంకారోఽపి ఇత్యపిశబ్దార్థః. అన్యశ వ్యాచష్టే - వాచ్యేతి. 25

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వస్తుమాత్రం వ్యంజింపబడేదిగా ఉన్నప్పుడు, రెం భేదాలు గల అర్థశక్త్యుద్భవధ్వని వస్తుధ్వనిరూపంగా నిరూపించబడింది. వ్యంజింపదగి అలంకారరూప మైనప్పుడు అదే (అర్థశక్త్యుద్భవమే) అలంకారధ్వని కూడ అవుతుం చెపుతున్నాడు - **అర్థేత్యాది నేతి** - పూర్వం చెప్పిన పద్ధతిలో కేవలం శబ్దశక్తివల్లనే కా

అర్థశక్తివల్ల కూడ అలంకారం వ్యంజింపబడుతుంది అని అర్థం. లేదా - కేవలం వస్తువు మాత్రమే వ్యంజింపబడదు, అలంకారం కూడా వ్యంజింపబడుతుంది అని 'అపి' శబ్దానికి అర్థం.

వివరణ:- "యత్రాప్యన్యః ప్రతీయతే" లోని 'అపి' శబ్దాన్ని 'అర్థశక్తేః' అనే దానితో అన్వయించి 'అర్థశక్తేరపి' అని అర్థం చెపితే మొదటి విధంగాను, 'అలంకారః' తో అన్వయించి "అలంకారోఽపి" అని అర్థం చెపితే రెండవ విధంగాను వ్యాఖ్యానం చేయవచ్చును అని భావం.

అన్యేతి - 'అన్య' శబ్దాన్ని "వాచ్యాలంకారంకంటె అన్యమైన" అని వ్యాఖ్యానిస్తున్నాడు.

## ధ్వన్యాలోకం

తస్య ప్రవిరలవిషయత్వమ్ ఆశఙ్క్య ఇదముచ్యతే -

కా. రూపకాదిరలఙ్కారవర్గో యో వాచ్యతాం గతః,

స సర్వో గమ్యమానత్వం బిభ్రద్భూమ్నా ప్రదర్శితః. 26

అన్యత్ర వాచ్యతేన ప్రసిద్ధో యో రూపకాదిః అలఙ్కారః సోఽన్యత్ర ప్రతీయమానతయా బాహుల్యేన ప్రదర్శితః తత్రభవద్భిః భట్టోద్భటాదిభిః. తథా చ ససన్దేహాదిషు ఉపమారూపకాతిశయోక్తీనాం ప్రకాశమానత్వం ప్రదర్శితమితి అలఙ్కారాన్తరస్య అలఙ్కారాన్తరే వ్యఙ్గ్యత్వం న యత్నప్రతిపాద్యమ్.

### బాలానందిని

తస్యేతి - దానికి అనగా అర్థశక్తిచేత అలంకారం వ్యంగ్యం అవడానికి, విషయం చాలా విరలంగా ఉంటుందని ఆశంకించి ఇది చెప్పబడుచున్నది -

రూపకాదిరితి - యః = ఏ, రూపకాదిః = రూపకం మొదలైన, అలంకారవర్గః= అలంకారసముదాయం, వాచ్యతామ్ = వాచ్యత్వాన్ని, శ్రితః= ఆశ్రయించినదో, స సర్వః = అది అంతా కూడ, భూమ్నా = చాలావరకు, గమ్యమానత్వమ్ = వ్యంగ్యత్వాన్ని, బిభ్రత్= ధరిస్తున్నదిగా, ప్రదర్శితః = చూపబడినది.

అన్యత్రేతి - ఏ రూపకాద్యలంకారం కొన్ని చోట్ల వాచ్యం అని ప్రసిద్ధమో అది మరి కొన్ని చోట్ల చాలవరకు ప్రతీయమానంగా (వ్యంగ్యంగా) ఉంటుంది అని పూజ్యులైన

భట్టోద్భటాదులచేత చూపబడినది. ఆ విధంగా ససందేహాద్యలంకారాలలో ఉపమారూపక అతిశయోక్తులు ప్రకాశిస్తూంటాయి అని ప్రదర్శించబడింది. కొన్ని అలంకారాలచేత మరికొన్ని అలంకారాలు వ్యంగ్యా లవుతాయి అనే విషయాన్ని ప్రతిపాదించడానికి పెద్ద ప్రయత్నం అవసరం లేదు.

లోచనం

ఆశఙ్క్యేతి - శబ్దశక్త్యా శ్లేషాద్యలంకారః భాసతే ఇతి సంభావ్యమేతత్. అర్థశక్త్యా తు కోఽలంకారః భాతి ఇత్యాశఙ్కాబీజమ్. సర్వ ఇతి ప్రదర్శిత ఇతి చ పదేన అసమ్భావనా అత్ర మిథ్యైవేత్యాహ.

"ఉపమానేన తత్త్వం చ భేదం చ వదతః పునః,

ససందేహం వచః స్తుత్యై ససన్దేహం విదుర్యథా. ఇతి.

"తస్యాః పాణిరయం ను మారుతచలత్పత్త్రాఙ్గులిః పల్లవః"

ఇత్యాదౌ ఉపమా రూపకం చ ధ్వన్యతే. అతిశయోక్తేశ్చ ప్రాయశః సర్వాలఙ్కారేషు ధ్వన్యమానత్వమ్. అలంకారాన్తరస్యేతి - యత్రాలంకారోఽపి అలఙ్కారాన్తరం ధ్వనతి తత్ర వస్తుమాత్రేణ అలఙ్కారాన్తరం ధ్వన్యత ఇతి కియదిదమసంభావ నీయమితి తాత్పర్యేణ అలఙ్కారాన్తరశబ్దో వృత్తికృతా ప్రయుక్తః న ప్రకృతోపయోగీ; న హి అలంకారేణ అలంకారః ధ్వన్యతే ఇతి ప్రకృతమదః. అర్థశక్త్యుద్భవే ధ్వనౌ వస్త్వేవ అలఙ్కారోఽపి వ్యఙ్గ్యః ఇత్యేతావతః ప్రకృతత్వాత్. తథా చ ఉపసంహారగ్రన్థే - "తేఽలఙ్కారాః పరాం ఛాయం యాన్తి ధ్వన్యఙ్గతాం గతాః" ఇత్యత్ర శ్లోకే వృత్తికృత్ - "ధ్వన్యఙ్గతా చోభాభ్యాం ప్రకారాభ్యామ్" ఇత్యుపక్రమ్య "తత్రేహ ప్రకరణాత్ వ్యఙ్గత్వేనేత్యవగన్తవ్యమ్" ఇతి వక్ష్యతి. అన్తరశబ్దో వా ఉభయత్రాపి విశేషపర్యాయః. వైషయికీ సప్తమీ. న తు ప్రాగ్వ్యాఖ్యాయామివ నిమిత్తసప్తమీ. తదయమర్థః - వాచ్యాలంకార విశేషవిషయే వ్యఙ్గ్యాలంకారవిశేషో భాతీతి ఉద్భటాదిభిరుక్తమేవేతి అర్థశక్త్యా అలంకారః వ్యజ్యతే ఇతి తై రుపగతమేవ. కేవలం తే అలంకారలక్షణకారత్వాత్ వాచ్యాలంకారవిశేషవిషయత్వేనాహుః ఇతి భావః. 26

బాలానందిని

**ఆశఙ్క్యేతి** - శబ్దశక్తిచేత శ్లేషాద్యలంకారాలు భాసిస్తాయి అనేది సంభావ్యమే; జరగడానికి అవకాశం ఉన్నదే. కాని అర్థశక్తిచేత ఏ అలంకారం భాసిస్తుంది? అనేది ఆశంకకు బీజం. (కారికలో ఉన్న) 'సర్వః' 'ప్రదర్శితః' అనే పదాలు ఈ విషయంలో అసంభావన (అర్థశక్తిచేత అలంకారాలు భాసించడానికి అవకాశం లేదు అనే మాట) మిథ్యయే అని తెలుపుతున్నాయి.

**ఉపమానేనేతి** - ఇది భట్టోద్భటు డిచ్చిన ససందేహాలంకారలక్షణం. స్తుత్యై = స్తుతికొరకు, ఉపమానేన= ఉపమానంతో, తత్త్వం చ= అభేదాన్నీ, పునః = మరల, భేదం చ= భేదాన్నీ, వదతః= చెపుతున్నవానియొక్క, ససన్దేహమ్= సందేహంతో కూడిన, వచః= వచనాన్ని, ససన్దేహమ్=ససందేహాలంకారాన్నిగా, విదుః=తెలియుచున్నారు. యథా= ఎట్లనగా- ప్రస్తుతం లభ్యం అవుతన్న పుస్తకంలో 'యథా'కు బదులు బుధాః అని ఉంది).

**తస్యాః ఇతి** - అయమ్ = ఇది, తస్యాః = ఆమెయొక్క, పాణిః ను = హస్తమా, మారుతచలత్పత్రాఙ్గులిః=గాలిచేత కదలుతూన్న పత్రాలే వ్రేళ్లుగా గల, పల్లవః= చిగురా?

**ఇత్యాదౌ ఇతి** : ఈ మొదలైన ససందేహాలంకారస్థలాలలో ఉపమ కాని, రూపకం కాని ధ్వనించబడుతున్నది. చాలావరకు అన్ని అలంకారాలలోనూ కూడ అతిశయోక్తి ధ్వనించబడుతూ ఉంటుంది.

**అలంకారాన్తరస్యేతి** - అలంకారం కూడా మరొక అలంకారాన్ని ధ్వనింపచేస్తూండగా వస్తుమాత్రంచేత అలంకారం ధ్వనింపచేయబడుతుంది అంటే దీనిలో అసంభావ్యత్వం ఏముంది అని చెప్పడంలో తాత్పర్యంచేత అలంకారాంతరశబ్దం ('అలంకారాన్తరే' అనే శబ్దం) వృత్తికారునిచేత ప్రయోగించబడింది గాని ఇది ప్రకృతోపయోగి కాదు. అలంకారంచేత మరొక అలంకారం ధ్వనింపచేయబడుతుంది అనే విషయం ప్రకృతం కాదు కదా? అర్థశక్త్యుద్భవధ్వనిలో వస్తువు వలె అలంకారం కూడా వ్యంగ్యం కావచ్చును అనే విషయం మాత్రమే ప్రకృతవిషయం. అట్లే (అందువల్లనే) ఉపసంహారగ్రంథంలో కూడ "తేఽలఙ్కారాః" ఇత్యాది శ్లోకంలో (28వ కారిక) - "ఇక్కడ ధ్వన్యంగత్వం రెండు విధాల జరుగుతుంది" అని ఉపక్రమించి "ఇక్కడ ప్రకరణాన్ని పట్టి (అలంకారం) వ్యంగ్యం అవడం ద్వారా (ధ్వన్యంగం అయింది) అని తెలుసుకోవాలి" అని చెప్పనున్నాడు.

"అలంకారే అలంకారాన్తరస్య వ్యఙ్గ్యత్వమ్" అనే దానికి "ఒక అలంకారం మరొక అలంకారంచేత వ్యంగ్యం అవడానికి నిమిత్తం అవడం" అని అర్థాన్ని గ్రహించి

ఇంతవరకూ వివరించాడు. ఇప్పుడు మరొక విధంగా వ్యాఖ్యానిస్తున్నాడు - అన్తరశబ్ద ఇతి - లేదా - రెండు చోట్లా 'అన్తర' శబ్దానికి 'విశేషం' అని అర్థం. 'అలంకారాన్తరే' అనేది పైన చేసిన వ్యాఖ్యలో వలె నిమిత్తార్థకం కాదు. దీనిని విషయసప్తమిగా గ్రహించాలి. అప్పుడు ఇది అర్థం - "వాచ్యలంకారవిశేషవిషయంలో అనగా వాచ్యాలంకారవిశేషం ఉన్న స్థలంలో వ్యంగ్యాలంకారవిశేషం భాసిస్తున్నది అని ఉద్భటాదులు చెప్పే ఉన్నారు. అందుచేత అర్థశక్తిచేత అలంకారం వ్యంజింపబడుతుంది అని వాళ్లు అంగీకరించియే ఉన్నారు. అయితే వాళ్లు అలంకారలక్షణాలను చెప్పేవాళ్లవడంచేత ఇలా వ్యంజింపచేయడం వాచ్యాలంకారవిశేషవిషయం అంటున్నారు. అనగా వాచ్యార్థవిషయం అనకుండా, అనగా వాచ్యార్థం అలంకారాన్ని వ్యంజింపచేస్తుంది అని అనకుండా, ఆ విధంగా అంటున్నారు. అదే భేదం" అని భావం. 26

## ధ్వన్యాలోకం

ఇయత్పునరుచ్యత ఏవ -

కా. అలఙ్కారాన్తరస్యాపి ప్రతీతౌ యత్ర భాసతే,
తత్పరత్వం న వాచ్యస్య నాసౌ మార్గో ధ్వనేర్మతః. 27

అలంకారాన్తరేషు తు అనురణనరూపాలంకారప్రతీతౌ సత్యామపి యత్ర వాచ్యస్య వ్యఙ్గ్యప్రతిపాదనౌన్ముఖ్యేన చారుత్వం న ప్రకాశతే నాసౌ ధ్వనేర్మార్గః. తథా చ దీపకాదావలఙ్కారే ఉపమాయాః గమ్యమానత్వేఽపి తత్పరత్వేన చారుత్వస్య అవ్యవస్థానాత్ న ధ్వని వ్యపదేశః యథా -

గాథ. చన్దమఊఏహి ణిసా ణలినీ కమలేహి కుసుమగుచ్ఛేహి లఆ,
హంసేహి సరఅసోహా కవ్వకహా సజ్జనే హి కరఇ గురుఈ. (54)
"చన్ద్రమయూఖైర్నిశా నలినీ కమలైః కుసుమగుచ్ఛైర్లతా,
హంసైః శారదశోభా కావ్యకథా సజ్జనైః క్రియతే గుర్వీ".
(ఇతి ఛాయా).

ఇత్యాదిషు ఉపమాగర్భత్వేపి సతి వాచ్యాలంకారముఖేనైవ చారుత్వం

వ్యవతిష్ఠతే న వ్యఙ్గ్యాలఙ్కారతాత్పర్యేణ, తస్మాత్తత్ర వాచ్యాలంకారముఖేనైవ కావ్యవ్యపదేశో న్యాయ్యః.

బాలానందిని

ఇయదితి - ఈ విషయం మాత్రం తప్పకుండా చెప్పబడుతుంది -

అలఙ్కారాన్తరేతి : అలఙ్కారాన్తరస్య= మరొక అలంకారంయొక్క, ప్రతీతౌ అపి= ప్రతీతి ఉన్నా కూడా, యత్ర = ఎక్కడ, వాచ్యస్య = వాచ్యానికి, వాచ్యాలంకారానికి, తత్పరత్వమ్= దానియందు ఎక్కువ మక్కువ, న భాసతే = భాసించడంలేదో, అసౌ= ఇది, ధ్వనేః= ధ్వనియొక్క, మార్గః= మార్గంగా, న మతః= అంగీకరించబడలేదు.

**అలంకారేతి** - ఇతరాలంకారాలలో అనురణనరూపమైన అలంకారప్రతీతి ఉన్నా కూడా, ఎక్కడ వాచ్యానికి వ్యంగ్యప్రతిపాదనోన్ముఖత్వంచేత, వ్యంగ్యప్రతిపాదన చేయడంలో తాత్పర్యంచేత, చారుత్వం ప్రకాశించదో అది ధ్వనికావ్యంయొక్క మార్గం కాదు. అందువల్లనే దీపకాద్యలంకారాలలో ఉపమాలంకారం గమ్యం అవుతున్నా దానియందు దీనికి తాత్పర్యం ఉండడం ద్వారా చారుత్వం లేదు గాన, అనగా ఉపమను వ్యంజింపజేసి తద్ద్వారా చారుత్వాన్ని సంపాదించా లనే అభిప్రాయంతో దీపకాదుల్ని ఉపయోగించడం లేదు గాన, అక్కడ 'ధ్వని' అనకూడదు. ఎట్లనగా -

చన్ద్రేతి :- చన్ద్రమయూఖైః = చంద్రుని కిరణాలచేత, నిశా = రాత్రి, కమలైః= పద్మాలచేత, నలినీ= పద్మలత, కుసుమగుచ్ఛైః= పుష్పగుచ్ఛాలచేత, లతా= లత, హంసైః= హంసలచేత, శారదశోభా= శరత్కాలశోభ, సజ్జనైః= సజ్జనులచేత, కావ్యకథా= కావ్యకథ, గుర్వీ= గొప్పదిగా, క్రియతే= చేయబడును.

ఇత్యాదిష్వితి - ఈ మొదలైన వాటియందు ఉపమాగర్భత్వం ఉన్నా కూడ, అనగా ఈ వాచ్యాలంకారాలలో ఉపమ అంతర్గతంగా ఉన్నాకూడ, చారుత్వం వాచ్యాలంకారం ద్వారా మాత్రమే కలుగుతున్నది గాని వ్యంగ్యాలంకారతాత్పర్యంచేత కాదు. అందువల్ల అక్కడ వాచ్యాలంకారాన్ని మాత్రమే ఆధారంగా తీసికొని దానిని కావ్యం (అలంకారకావ్యం) అనడం న్యాయమైనది.

లోచనం

నను పూర్వేణైవ యదీదముక్తం కిమర్థం తవ యత్న ఇత్యాశఙ్క్యాహ- ఇయదితి - అస్మాభిరితి వాక్యశేషః. పునఃశబ్దస్తదుక్తాద్విశేషద్యోతకః. చన్ద్రమఊ ఇతి. చన్ద్రమయూఖాదీనాం న నిశాదినా వినా కోఽపి పరభాగలాభః.

సజ్జనానామపి కావ్యకథాం వినా కీదృశీ సాధుజనతా? చన్ద్రమయూఖైశ్చ నిశాయా గురుకీకరణం భాస్వరత్వసేవ్యత్వాది యత్ క్రియతే, కమలైః నలిన్యాః శోభాపరిమలలక్ష్మ్యాది, కుసుమగుచ్ఛైర్లతాయాః అభిగమ్యత్వమనోహరత్వాది, హంసైః శారదశోభాయాః శ్రుతిసుఖకరత్వమనోహరత్వాది తత్సర్వం కావ్యకథాయాః సజ్జనైరిత్యేతావానయనర్థో గురుః క్రియతే ఇతి దీపకబలాత్ చకాస్తి. కథాశబ్ద ఇదమాహ - ఆసతాం తావత్ కావ్యస్య కేచన సూక్ష్మా విశేషాః, సజ్జనైర్వినా కావ్యమిత్యేష శబ్దోఽపి ధ్వంసతే. తేషు తు సత్సు ఆస్తే సుభగం కావ్యశబ్దవ్యపదేశభాగపి శబ్దసన్దర్భమాత్రమ్. తథా తైః క్రియతే యథా ఆదరణీయతాం ప్రతిపద్యతే ఇతి దీపకస్యైవ ప్రాధాన్యం నోపమాయాః.

బాలానందిని

నన్వితి - ఈ విషయం పూర్వికులే చెప్పి ఉన్నట్లయితే ఇంక నీ ప్రయత్నం ఎందుకు అని ఆశంకించుకొని చెపుతున్నాడు - ఇయదితి - వాక్యం చివర 'అస్మాభిః' అని అధ్యాహారం. మాచేత చెప్పబడుతున్నది అని అర్థం. 'పునః' శబ్దం వాళ్లు చెప్పినదానికంటె విశేషాన్ని ద్యోతింపచేస్తుంది. అనగా వాళ్లు చెప్పనిది మేం చెపుతున్నాం అని అర్థం. చన్ద్రమయూ ఇతి. చంద్రకిరణాదులకు నిశాదులు లేకపోతే ఏమీ వైశిష్ట్యం (సౌందర్యం) ఉండదు. కావ్యకథ లేకపోతే సజ్జనులకు సజ్జనత్వం ఏమిటి? చంద్రకిరణాలచేత రాత్రికి ప్రకాశించడం, సేవ్యత్వం మొదలైన ఏ గౌరవం సంపాదించబడుతుందో, పద్మాలచేత కమలలతకు ఏ శోభ, లక్ష్మి మొదలైనది చేయబడుతుందో, పుష్పగుచ్ఛాలచేత లతకు ఏ దగ్గరకు వెళ్లదగి ఉండడం, మనోహరత్వం మొదలైనది చేయబడుతుందో అదంతా కావ్యకథకు సజ్జనులచేత చేయబడుతుంది అనే అర్థం 'గురుః క్రియతే' (గొప్పదిగా చేయబడుతుంది) అనేదాని బలంవల్ల ప్రకాశిస్తుంది. 'కావ్యకథా' లోని 'కథా' శబ్దం ఈ అర్థాన్ని చెపుతున్నది - కావ్యంయొక్క కొన్ని సూక్ష్మవిశేషాలు ఉంటే ఉండుగాక; సజ్జనులు లేకపోతే కావ్యం అనే శబ్దమే ధ్వస్తం అయిపోతుంది. సజ్జనులు కనక ఉన్నట్లయితే అందంగా ఉన్న, కేవలశబ్దసందర్భం (శబ్దాలకూర్పుకూడా) కావ్యశబ్దంచేత పిలవడానికి యోగ్యం అవుతుంది. వాళ్లు దాన్ని ఆదరించతగిన దానినిగా చేస్తారు అని ఈ విధంగా దీపకానికే ప్రాధాన్యం కాని ఉపమకు ప్రాధాన్యం లేదు.

ధ్వన్యాలోకం

యత్ర తు వ్యఙ్గ్యపరత్వేనైవ వాచ్యస్య వ్యవస్థానం తత్ర వ్యఙ్గ్యముఖేనైవ వ్యపదేశో ఽయుక్తః. యథా-

శ్లో. ప్రాప్తశ్రీరేష కస్మాత్ పునరపి మయి తం మన్థఖేదం విదధ్యా
న్నిద్రామప్యస్య పూర్వామనలసమనసో నైవ సంభావయామి,
సేతుం బధ్నాతి భూయః కిమితి చ సకలద్వీపనాథానుయాత
స్త్వయ్యాయాతే వితర్కానితి దధత ఇవాభాతి కమ్పః పయోధేః.
(55)

యథా వా మమైవ -

లావణ్యకాన్తిపరిపూరితదిఙ్ముఖేఽస్మిన్
స్మేరేఽధునా తవ ముఖే తరలాయతాక్షి,
క్షోభం యదేతి న మనాగపి తేన మన్యే
సువ్యక్తమేవ జలరాశిరయం పయోధిః. (56)

ఇత్యేవంవిధే విషయే అనురణనరూపరూపకాశ్రయేణ కావ్యచారుత్వవ్యవస్థానాత్ రూపకధ్వనిరితి వ్యపదేశో న్యాయ్యః.

బాలానందిని

యత్రేతి :- కాని ఎక్కడైతే వాచ్యం వ్యంగ్యపరంగానే ఉంటుందో అక్కడ వ్యంగ్యముఖంచేతనే (వ్యంగ్యమైన అలంకారాన్ని పట్టి మాత్రమే) పేర్కొనడం యుక్తం. ఎట్లనగా ప్రాప్తేతి - ప్రాప్తశ్రీః=పొందబడిన లక్ష్మికల, ఏషః=ఇతడు, మయి = నాయందు, పునరపి = మరల, తం మన్థఖేదమ్ = ఆ మథించడంవల్ల కలిగే ఖేదాన్ని, విదధ్యాత్ = చేస్తాడా? అనలసమనసః= సోమరితనం లేని మనస్సు గల, అస్య = ఇతనికి, పూర్వాం నిద్రామపి= వెనుకటి నిద్రను కూడా, నైవ సంభావయామి= ఊహించను, భూయః= మళ్ళీ, సేతుమ్= సేతువును, బధ్నాతి=కడతాడా? కిమితి చ = ఎందువల్ల, సకలద్వీపనాథాను యాతః= సమస్తమైన ద్వీపాధితులచేత అనుసరించబడి ఉన్నాడు?

ఇతి= ఈ విధంగా, త్వయి ఆయాతే = నువ్వు వచ్చినవాడవగుచుండగా, నువ్వు రాగానే, వితర్కాన్=ఊహలను, దధతః ఇవ= ధరించుచున్నాడా అన్నట్లున్న, పయోధేః= సముద్రంయొక్క, కమ్పః=కంపం, ఆభాతి = ప్రకాశిస్తూన్నది (కనబడుతూన్నది).

యథా ఇతి - మరొక ఉదాహరణం నా శ్లోకమే ఎట్లనగా -

లావణ్యేతి - తరలాయతాక్షి = చంచలములైన విశాలనేత్రాలు కలదానా! లావణ్యకాన్తిపరిపూరితదిఙ్ముఖే= లావణ్యకాంతిచేత నింపబడిన దిఙ్ముఖాలు గల, అస్మిన్= ఈ, తవ ముఖే= నీ ముఖం, స్మేరే=వికసించిన దగుచుండగా, అయం పయోధిః= ఈ సముద్రం, మనాగపి= కొంచెం కూడ, యత్= ఎందువలన, క్షోభమ్=క్షోభను, న ఏతి = పొందడంలేదో, తేన = దానిచేత, సువ్యక్తమేవ= సుస్పష్టంగానే, జలరాశిః = జలరాశి, 'లడయోరభేదః' అనే న్యాయాన్ని అనుసరించ 'జడరాశి' అని అర్థం.

ఇతీతి - ఈ విధమైన విషయంలో అనురణనరూపమైన రూపకాన్ని ఆశ్రయించడంవల్ల కావ్యానికి చారుత్వం ఏర్పడడంవల్ల దానిని రూపకధ్వని అని అనడమే న్యాయం.

లోచనం

ఏవం తు కారికార్థమ్ ఉదాహరణేన ప్రదర్శ్య అస్యా ఏవ కారికాయాః వ్యవచ్ఛేద్యబలేన యః అర్థః అభిమతః - యత్ర తత్పరత్వం స ధ్వనేర్మార్గః ఇత్యేవంరూపః తం వ్యాచష్టే - యత్ర త్వితి.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా కారికయొక్క అర్థాన్ని ఉదాహరణచేత చూపించి, వ్యవచ్ఛేద్యబలంచేత, అనగా ఈ కారికలో చెప్పినదానికంటె భిన్నంగా ఉన్న స్థలాలలో ఇది వర్తించదు అని చెప్పవలసి ఉండడంచేత, - ఎక్కడైతే తత్పరత్వం ఉంటుందో అది ధ్వనికి మార్గం అనే ఏ అర్థం అభిమతమైనదో దానిని 'యత్ర తు' ఇత్యాదికంచేత వ్యాఖ్యానిస్తున్నాడు.

వివరణ:- పై కారికలో "యత్ర భాసతే, తత్పరత్వం న వాచ్యస్య" అని ఎక్కడ అలంకారాంతరం భాసిస్తూన్నా వాచ్యానికి ఆ అలంకారంమీద తాత్పర్యం ఉండదో అది ధ్వనికి స్థానం కాదు అని చెప్పడంచేత అలాంటిదానికంటె భిన్నమైన స్థలాలలో, అనగా ఎక్కడైతే వ్యంగ్యమైన అలంకారం విషయంలో వాచ్యానికి తాత్పర్యం ఉంటుందో అక్కడ ధ్వని అని చెప్పవచ్చును అని తేలింది. అలాంటి స్థలాలను 'యత్ర తు' ఇత్యాదికంచేత చూపుతున్నాడు అని అర్థం.

## లోచనం

తత్ర చ వాచ్యాలంకారేణ కథాచిద్వ్యఙ్గ్యమలఙ్కారాన్తరమ్, యదివా వాచ్యాలంకారస్య సద్భావమాత్రం న వ్యఞ్జకతా, వాచ్యాలంకారస్య అభావ ఏవ ఇతి త్రిధా వికల్పః. బలసముదాయవతి నరపతౌ సముద్రపరిసరవర్తిని పూర్ణచన్ద్రోదయతదీయబలావగాహనాదినా నిమిత్తేన పయోధేస్తావత్క్షోభో జాతః. సః అనేన సన్దేహేన ఉత్ప్రేక్ష్యతే ఇతి ససన్దేహోత్ప్రేక్షయోః సంకరాత్ సంకరాలంకారో వాచ్యః. తేన చ వాసుదేవరూపతా తస్య నృపతేః ధ్వన్యతే. యద్యపి చాత్ర వ్యతిరేకో భాతి, తథాపి స పూర్వవాసుదేవస్వరూపాత్, నాద్యతనాత్. అద్యతనత్వే భగవతోఽపి ప్రాప్తశ్రీకత్వేన, అనాలస్యేన, సకలద్వీపాధిపతివిజయిత్వేన చ వర్తమానత్వాత్.

న చ సందేహోత్ప్రేక్షానుపపత్తిబలాత్ రూపకస్య ఆక్షేపః, యేన వాచ్యాలంకారోపస్కారకత్వం వ్యఙ్గ్యస్య భవేత్. యో యః అసంప్రాప్తలక్ష్మీకః, నిర్వ్యాజవిజిగీషాక్రాన్తః స స మాం మథ్నీయాదిత్యాద్యర్థసంభావనాత్. న చ పునరపీతి, పూర్వామితి, భూయ ఇతి చ శబ్దైః అయమాకృష్టోఽర్థః. పునరర్థస్య భూయోర్థస్య చ కర్తృభేదేఽపి సముద్రైక్యమాత్రేణాప్యుపపత్తేః; యథా పృథ్వీ పూర్వం కార్తవీర్యేణ జితా, పునరపి జామదగ్న్యేనేతి. పూర్వా నిద్రా చ సిద్ధా రాజపుత్రాద్యవస్థాయామపీతి సిద్ధం రూపకధ్వనిరేవాయమితి. శబ్దవ్యాపారం వినైవ అర్థసౌన్దర్యబలాత్ రూపణాప్రతిపత్తేః.

## బాలానందిని

తత్రేతి - ఒకప్పుడు వాచ్యమైన అలంకారంచేత మరొక అలంకారం వ్యంగ్యం అవుతుంది. లేదా ఒకప్పుడు వాచ్యాలంకారం ఒకటి ఉంటుంది కాని అది మరొక అలంకారాన్ని దేనినీ వ్యంజింపచేయదు, లేదా ఒకప్పుడు వాచ్యాలంకారమే ఉండదు - ఈ విధంగా మూడు విధాలైన వికల్పం ఉంటుంది. దీనిని వీలును పట్టి (యథాప్రయోగం) ఉదాహరణలలో సమన్వయించుకోవాలి. ఉదాహరిస్తున్నాడు - ప్రాప్తేతి - అనంతమైన సేనాసముదాయంతో ఎవరో ఒక రాజు సముద్రపరిసరాలలో ఉన్నప్పుడు, పూర్ణచంద్రోదయం, అతని సేన తనలోనికి దిగడం మొదలైనవాటిచేత సముద్రంలో

కంపం ఏర్పడింది. అది ఈ సందేహంచేత ఉత్ప్రేక్షించబడుతున్నది. అందుచేత ఇక్కడ ససందేహ - ఉత్ప్రేక్షాలంకారాల సంకరం ఉండడంవల్ల సంకరాలంకారం వాచ్యం. దీనిచేత ఈ రాజు వాసుదేవరూపుడు అని ధ్వనించబడుతున్నది. యద్యపీతి :- ఇక్కడ వ్యతిరేకాలంకారం కూడా భాసిస్తున్నా అది పూర్వవాసుదేవస్వరూపంకంటె వ్యతిరేకం కాని, ఇప్పుడున్న వాసుదేవునికంటె కాదు. ఇప్పుడైతే భగవంతుడైన వాసుదేవుడు ప్రాప్తశ్రీకుడై, లక్ష్మిని పొందినవాడై, సోమరితనం లేనివాడై, సకలద్వీపాధిపతివిజేతయై ఉన్నాడు కదా?

వివరణ :- ఇక్కడ ఈ రాజుకు వాసుదేవరూపత్వం వ్యంగ్యం అవడంవల్ల రూపకాలంకారం వ్యంగ్యం అని చెప్పబడింది. అయితే ఇక్కడ "ఈ రాజుకూ శ్రీమహావిష్ణువుకూ భేదం (వ్యతిరేకం) ఉంది అని కూడా గమ్యం అవుతూన్నది కదా? అందుచేత ఇక్కడ వ్యతిరేకాలంకారధ్వని అని చెప్పాలి కదా అని ప్రశ్న. దీనికి సమాధానం ఏమనగా - ఇక్కడ వ్యతిరేకం భాసిస్తూన్న దన్నమాట నిజమే. అయితే ఈ వ్యతిరేకం ఇప్పుడున్న వాసుదేవుని స్వరూపాన్ని పట్టికాదు. సముద్రమథనానికి పూర్వం ఉన్న వాసుదేవస్వరూపాన్ని పట్టి మాత్రమే. ఇప్పుడున్న శ్రీమహావిష్ణువుకు లక్ష్మి ఉంది. ఆలస్యమూ (మాంద్యమూ) లేదు. సకలద్వీపాధిపతివిజేతగా కూడ ఉన్నాడు. అందుచేత ఇక్కడ ఈ రాజునందు అద్యతనశ్రీమహావిష్ణుత్వారోపణ ఉండడం వల్ల రూపకధ్వనియే:

(ఆశంక)రాత్రివేళ ఆ రాజును చూడగానే సముద్రానికి "ఇతడు వాసుదేవుడే" అనే ప్రతీతి కలిగితేనే కదా ఈ వితర్కాలన్నీ? అందుచేత వ్యంగ్యమైన ఈ రూపకం వాచ్యమైన సంకరాలంకారానికి ఉపకారకంగా (సమర్థించేదిగా) ఉండడంచేత గుణీభూతవ్యంగ్యం అయిపోయినది కదా? ఈ ఆశంకను నివారిస్తున్నాడు - న చేతి :- సందేహోత్ప్రేక్షయొక్క అనుపపత్తి యొక్క బలంవల్ల (రాజునందు విష్ణుత్వారోపం లేకపోతే సందేహాలంకారసహిత ఉత్ప్రేక్షాలంకారం కుదరదు గాన)రూపకం ఆక్షేపించబడడం లేదు (ఊహించి తెచ్చుకొనబడడం లేదు). అలా అయిన పక్షంలో వ్యంగ్యం వాచ్యాలంకారానికి ఉపస్కారం (దీన్ని బలపరిచేది) అయి ఉండేది. ఎందువలన అనగా ఎవడెవడు అప్రాప్తలక్ష్మీకుడో (ఎవనికెవనికి లక్ష్మి లభించలేదో) అతడు నన్ను మథించవచ్చును; ఎవడెవడు నిర్వ్యాజవిజిగీషాక్రాంతుడో (ఎవనికి స్థిరమైన జయించాలనే ఇచ్ఛ ఉంటుందో) అతడు నామీద సేతువు బంధించవచ్చు ఇత్యాది విషయాలను (సముద్రుడు) ఊహించవచ్చును. (అలాంటి ఊహచేత ఇలాంటి సందేహం కలగవచ్చు కదా? అందుచేత రూపణం ఉంటేనే సందేహం కలుగుతుంది అనే నియమం లేదు గాన ధ్వన్యమానరూపకం

వాచ్యాలంకారోపస్కారం అనడానికి వీలులేదు అని భావం).

వ్యంగ్యార్థం స్వపదాల ద్వారా వాచ్యం వంటిది అయిపోయింది అనే ఆశంకను నివారిస్తున్నాడు - స చేతి :- 'పునరపి' అని 'పూర్వామ్' అనీ, 'భూయః' అనీ ఇక్కడ ప్రయోగించిన శబ్దాలచేత ఈ అర్థం (విష్ణుత్వారోపణరూపమైన అర్థం) లాగబడుతుంది కదా అనడానికి వీలులేదు. పునఃశబ్దార్థం, భూయఃశబ్దార్థం కూడా కర్తృభేదం ఉన్నా కూడ సముద్రైక్యమాత్రంచేత కూడా ఉపపన్నం అవుతుంది (కుదురుతుంది) కదా? "భూమి పూర్వం కార్తవీర్యునిచేత జయించబడింది; మళ్లీ పరశురామునిచేత జయించ బడింది" అని ఎలా అనవచ్చునో ఇక్కడ కూడా అట్లే. పూర్వనిద్ర రాజపుత్రాద్యవస్థలో సిద్ధిస్తుంది. అందువల్ల ఇది రూపకధ్వనియే. ఎందువల్ల ననగా శబ్దవ్యాపారం (అభిధ) లేకుండానే అర్థసౌందర్యబలంవల్ల రూపణం తెలుస్తున్నది.

వివరణ:- "శ్రీమహావిష్ణువు ఒక పర్యాయం సముద్రమథనం (నా మథనం) చేసి లక్ష్మిని పొంది ఉన్నాడు కదా? మళ్లీ ఎందుకు చేస్తాడు? అతనిలో పూర్వం ఉన్న నిద్రకూడా కనబడడంలేదు. అందుచేత నామీద నిద్రించడానికి రాడు కదా? సేతుబంధం మళ్లీ ఎందుకు చేస్తాడు?" ఈ విధంగా 'పునః', 'పూర్వాం', 'భూయః' అనే పదాలు ప్రయోగించడంవల్ల ఆ విష్ణువే మళ్లీ వచ్చినట్టు సముద్రుడు అనుకొంటున్నాడని స్పష్టం అవుతుంది. ఈ విధంగా ఈ పదాలను పట్టి వ్యంగ్యమైన రూపకం స్పష్టం అయిపోయింది కదా? ఇంక ఇది వ్యంగ్యం ఎలా అవుతుంది అని ప్రశ్న. పునః, భూయః అన్నంతమాత్రంచేత పూర్వం ఏ విష్ణువు మంథనాదికర్తయో అతడే వచ్చాడని అనుకుంటున్నాడని చెప్పవలసిన పని లేదు. లక్ష్మి కావాలనుకొన్నవా డల్లా నన్ను మథించవచ్చు. విజిగీష ఉన్నవాడు ప్రతీవాడు నామీద సేతువు కట్టవచ్చు. అందుచేత నన్ను మళ్లీ మథించాలని వచ్చాడా, మళ్ళీ నామీద సేతువుకట్టడానికి వచ్చాడా అనికూడా సముద్రం అనుకొనవచ్చును కదా? కర్త ఒక డైనప్పుడే 'పునః'(మళ్లీ) అని అనాలి అనే నియమం లేదు. "ఈ భూమిని పూర్వం కార్తవీర్యార్జునుడు జయించాడు. మళ్లీ పరశురాముడు జయించాడు" ఇత్యాది రీతులలో చెప్పడం ఉంది కదా? అదే విధంగా 'పూర్వపు నిద్ర' అనేది విష్ణువునకు సంబంధించిన పూర్వనిద్ర అని చెప్పవలసిన పని లేదు. రాజ్యాభిషిక్తుడు కానప్పుడు, రాజపుత్రుడుగా మాత్రం ఉన్నకాలంలో ఏ చింతా లేకుండా నిద్రించేవాడు కదా? ఆ నిద్ర అని చెప్పవచ్చును. ఈ విధంగా ఇది పదాల అభిధాశక్తితో పని లేకుండా వాచ్యార్థ (వాచ్యసంకారాలంకార) సౌందర్యబలంవల్ల వ్యంగ్యమైన రూపకధ్వని అని ఈ చిన్న ప్రఘట్టానికి భావం.

లోచనం

"యథా చ -

శ్లో. జ్యోత్స్నాపూరప్రసరధవలే సైకతేఽస్మిన్ సరయ్వా
వాదద్యూతం సుచిరమభవత్సిద్ధయూనోః కయోశ్చిత్,
ఏకోఽవాదీత్ప్రథమనిహతం కేశినం కంసమన్యో
మత్వా తత్త్వం కథయ భవతా కో హతస్తత్ర పూర్వమ్.

ఇతి కేచిదుదాహరణమత్ర పఠన్తి. తదసత్. భవతేత్యనేన శబ్దబలేనాత్ర "త్వం వాసుదేవః" ఇత్యర్థస్య స్ఫుటీకృతత్వాత్.

బాలానందిని

కొందరు దీనికే మరొక ఉదాహరణగా వృత్తిలో "యథా చ" అని ప్రారంభించి "జ్యోత్స్నా" ఇత్యాది శ్లోకం ఉన్నట్లు చెపుతున్నారు. అది యుక్తం కాదు అని ప్రతిపాదిస్తున్నాడు. యథా చ ఇతి - ఇంకా ఎట్లనగా -

జ్యోత్స్నేతి - సరయ్వాః = సరయూనదియొక్క, జ్యోత్స్నాపూరప్రసరధవలే = వెన్నెలయొక్క ప్రవాహం ప్రసరించడంచేత తెల్లనైన, అస్మిన్ సైకతే=ఈ ఇసుకతిన్నెమీద, కయోశ్చిత్ = కొందరు, సిద్ధయూనోః = ఇద్దరు సిద్ధయువకుల మధ్య, వాదద్యూతమ్= వాదద్యూతం (పందెం కట్టి చేసిన వాదం) సుచిరమ్ = చాలసేపు, అభవత్ = అయింది. ఏకః= ఒకడు, కేశినమ్= కేశి అనే రాక్షసుణ్ణి, ప్రథమనిహతమ్= ముందు చంపబడిన వానినిగా, అవాదీత్=పలికెను. అన్యః=మరొకడు, కంసమ్=కంసుణ్ణి ముందు చంపబడినవానినిగా చెప్పెను. మత్వా=ఆలోచించి, తత్త్వమ్=యథార్థమును, కథయ=చెప్పుము. తత్ర=వాళ్లలో, పూర్వమ్=ముందుగా, కః=ఎవడు, భవతా=నీచేత, హతః= చంపబడ్డాడు?

ఇతీతి - ఇట్లు కొందరు ఇక్కడ ఒక ఉదాహరణం చదువుతున్నారు. అది అయుక్తం. ఇక్కడ ఉన్న 'భవతా' అనే శబ్దంచేత "నువ్వు వాసుదేవుడవు" అనే అర్థం స్పష్టం చేయబడుతూన్నది కదా? అందుచేత దీనిని అర్థశక్తిమూలరూపకాలంకార ధ్వనికి ఉదాహరణగా చూపడం అయుక్తం అని భావం.

లోచనం

లావణ్యం సంస్థానముగ్ధిమా. కాన్తిః ప్రభా. తాభ్యాం పరిపూరితాని సంవిభక్తాని హృద్యాని సంపాదితాని దిఙ్ముఖాని యేన అధునా

కోపకాలుష్యాదనన్తరం ప్రసాదౌన్ముఖ్యేన స్మేరే ఈషద్విహసనశలే తరలాయతే ప్రసాదాన్దోలనవికాససున్దరే అక్షిణీ యస్యాస్తస్యాః ఆమన్త్రణమ్. అథ చ అధునా న ఏతి, వృత్తే తు క్షణాన్తరే క్షోభమగమత్. కోపకషాయపాటలం స్మేరం చ తవ ముఖం సన్ధ్యారుణపూర్ణశశధరమణ్డలమేవేతి భావ్యం క్షోభేణ చలచిత్తతయా సహృదయస్య. న చైతి; తత్సువ్యక్తమన్వర్థతయాయం జలరాశిః జాడ్యసఞ్చయః. జలాదయః శబ్దాః భావార్థప్రధానాః ఇత్యుక్తం ప్రాక్. అత్ర చ క్షోభో మదనవికారాత్మా సహృదయస్య త్వన్ముఖావలోకనే న భవతి ఇతి ఇయత్యభిధాయా విశ్రాన్తతయా రూపకం ధ్వన్యమానమేవ. వాచ్యాలంకారశ్చాత్ర శ్లేషః. స చ న వ్యఞ్జకః. అనురణనరూపం యద్రూపకమ్ అర్థశక్తివ్యఙ్గ్యం తదాశ్రయేణేహ కావ్యస్య చారుత్వం వ్యవతిష్ఠతే. తతస్తే నైవ వ్యపదేశః ఇతి సమ్బన్ధః .

బాలానందిని

లావణ్యేత్యాది శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు :- లావణ్యమితి - లావణ్యమ్= అవయవసంనివేశంయొక్క సౌందర్యం. కాన్తిః=ప్రభ. ఈ రెండింటిచేత, పరిపూరితాని= నింపబడిన, హృద్యములుగా, మనోహరాలుగా, చేయబడిన, దిఙ్ముఖాలు దేనిచేతనో అది (ముఖం), అధునా=ఇప్పుడు, కోపకాలుష్యం తొలగిపోయిన తరవాత ప్రసాదానికి ఉన్ముఖత్వం చూపడంచేత, స్మేరే = కొంచెం నవ్వుతూన్న. తరలాయతే = ప్రసాదంచేత కలిగిన ఆందోలనంచేత (చంచలత్వంచేత) వికాసంచేత సుందరాలైన, నేత్రాలు ఎవతెకో ఆమె. ఆమెయొక్క సంబోధనం.

వ్యంగ్యానికి అనుగుణంగా ఉండే మరొక అర్థం కూడా చెపుతున్నాడు - అథ చేతి:- మరియు జరిగిపోయిన క్షణాంతరంలో క్షోభ చెందాడు కాని ఇప్పుడు శోభ పొందడంలేదు. కోపకషాయమై ఎఱ్ఱగాను, చిరునవ్వుతో వికసించినదిగాను ఉన్న నీ ముఖం సంధ్యారుణపూర్ణచంద్రమండలమే గాన సహృదయుడైనవానికి, చిత్తచలనరూపమైన క్షోభ కలగాలి. కాని కలగలేదు. అందువల్ల ఇతడు సుస్పష్టంగా సార్థకనామధేయత్వంచేత, (సార్థకనామధేయం గల) జలరాశి, జాడ్యంయొక్క ప్రోగు. జలాదిశబ్దాలు భావార్థప్రధానమైనవి అని వెనుక చెప్పబడింది (జల-జడ అనగా జడత్వం అని అర్థం చెప్పుకోవాలి అని భావం).

వివరణ:- ఇక్కడ 'క్షోభ' శబ్దానికి వ్యాఖ్యాత రెండు అర్థాలు సూచిస్తున్నాడు. స్మేరముఖం చూడగానే సహృదయునికి కలిగే చిత్తచాంచల్యం అని ఒక అర్థం. సముద్రంలో కలిగే జలసంచలనం అని మరొక అర్థం. ఈ రెండు క్షోభలకీ అభేదాధ్యవసాయం. క్షోభశబ్దానికి మొదటి అర్థం మాత్రమే చెప్పిన పక్షంలో ముఖసౌందర్యం మాత్రమే వ్యంజితం అవుతుంది కాని ముఖానికి చంద్రాభేదం వ్యంజితం కాదు. అందుచేత రెండర్థాలు చెప్పుకోవాలి. అదే విధంగా జలానికీ జాడ్యానికీ అభేదాధ్యవసాయం.

ఇక్కడ రూపకధ్వనిని ప్రతిపాదిస్తున్నాడు - అత్రేతి - ఇక్కడ "నీ ముఖం చూడగానే సహృదయునికి మదనవికారరూపమైన క్షోభ(కలగాలి; కాని) కలగడం లేదు" ఇంతమాత్రం అర్థమే బోధించి అభిధ విశ్రమించింది. దాని తరవాత రూపకం (ముఖమునందు చంద్రత్వారోపం) వ్యంగ్యమే. ఇక్కడ శ్లేష వాచ్యాలంకారం. అది వ్యంజకంకాదు. (అర్థమే వ్యంజకం). ఈవిధంగా అర్థశక్తి వ్యంగ్యమైన అనురణనరూపమైన ఏ రూపకం ఉన్నదో దానిని ఆశ్రయించడంచేతనే ఇక్కడ కావ్యానికి చారుత్వం ఏర్పడింది. అందుచేత దీనికి ఆ పేరే (అర్థశక్తివ్యంగ్యానురణనరూపకధ్వని అనే పేరే) పెట్టాలి అని అన్వయం.

## ధ్వన్యాలోకం

ఉపమాధ్వనిర్యథా -

గాథ: వీరాణం రమఇ ఘుసిణరుణమ్మి ణ తదా పిఅథణుచ్ఛఙ్గే,
దిట్ఠీ రిఉగఅకుమ్భత్థలమ్మి జహ బహలసిన్దూరే. (57)

యథా వా మమైవ విషమబాణలీలాయామ్ అసురపరాక్రమణే కామదేవస్య -

గాథ: తం తాణ సిరిసహోఅరరఅణాహరణమ్మి హిఅఅమేక్కరసమ్,
బిమ్బాహరే పిఆణం ణివేసిఅం కుసుమబాణేన. (58)

"తత్రేషాం శ్రీసహోదరరత్నాహరణే హృదయమేకరసమ్,
బిమ్బాధరే ప్రియాణాం నివేశితం కుసుమబాణేన".

(ఇతి ఛాయా)

బాలానందిని

ఉపమా ఇతి - ఉపమాధ్వని ఎట్లనగా - 'వీరాణాం' ఇత్యాది (దీని సంస్కృతచ్ఛాయ వ్యాఖ్యానంలో ఇవ్వబడింది) వీరాణామ్= వీరులయొక్క, దృష్టిః= దృష్టి, బహలసిన్దూరే= అధికమైన సిందూరం గల, రిపుగజకుమ్భస్థలే= శత్రువుల గజాల కుంభస్థలంమీద, యథా = ఎట్లు రమిస్తున్నదో, తథా = అట్లు, ఘుసృణారుణే= కుంకుమచేత ఎఱ్ఱనైన, ప్రియాస్తనోత్సఙ్గే = ప్రియురాలి స్తనతటంమీద, న రమతే = రమించడంలేదు.

యథా ఇతి - విషమబాణలీల అనే నా కావ్యంలోనే కామదేవుడు అసురుల విషయంలో పరాక్రమం చూపిన సందర్భంలోని శ్లోకం మరొక ఉదాహరణగా ఎట్లనగా-

తదితి :- శ్రీసహోదరరత్నాహరణే= లక్ష్మికి తోడబుట్టువులైన రత్నాలను తీసికొనిరావడంలో, ఏకరసమ్= ప్రధానమైన ఆసక్తి గల, తేషామ్= ఆ అసురుల యొక్క, తత్= ఆ, హృదయమ్= హృదయం, కుసుమబాణేన = మన్మథునిచేత, ప్రియాణామ్= ప్రియురాళ్లయొక్క, బిమ్బాధరే= దొండపండువంటి అధరోష్ఠమునందు, నివేశితమ్= ఉంచబడింది.

లోచనం

తుల్యయోజనత్వాత్ ఉపమాధ్వన్యుదాహరణయోః లక్షణం న స్వకణ్ఠేన యోజితమ్,

"వీరాణాం రమతే ఘుసృణారుణే న తథా ప్రియాస్తనోత్సఙ్గే,

దృష్టీ రిపుగజకుమ్భస్థలే యథా బహలసిన్దూరే".

ప్రసాధితప్రియతమాశ్వాసనపరతయా సమనన్తరీభూతయుద్ధత్వరిత మనస్కతయా చ దోలాయమానదృష్టిత్వేఽపి యుద్ధే త్వరాతిశయ ఇతి వ్యతిరేకో వాచ్యాలంకారః. తత్ర తు యేయం ధ్వన్యమానోపమా ప్రియకుచకుడ్మలాభ్యాం సకలజనత్రాసకరేష్వపి శాత్రవేషు మర్దనోద్యతేషు గజకుమ్భస్థలేషు తద్వశేన రతిమాదదానామివ బహుమాన ఇతి సైవ వీరతాతిశయచమత్కారం విధత్తే ఇత్యుపమాయాః ప్రాధాన్యమ్.

అసురపరాక్రమణ ఇతి - త్రైలోక్యవిజయో హి తత్రాస్య వర్ణ్యతే తేషామసురాణాం పాతాలవాసినాం యైః పునః పునః ఇన్ద్రపురావమర్దనాది కిం కిం న కృతం, తద్ధృదయమితి యత్ తేభ్యస్తేభ్యః అతిదుష్కరేభ్యః అపి

అకమ్పనీయవ్యవసాయం తచ్చ, శ్రీసహోదరాణామ్ అత ఏవ అనిర్వాచ్యోత్కర్షాణామిత్యర్థః. తేన రత్నానామ్ ఆ సమన్తాత్ హరణే ఏకరసం తత్పరం యత్ హృదయం తత్ కుసుమబాణేన సుకుమారతరోపకరణసంభారేణ ప్రియాణాం బిమ్బాధరే నివేశితమ్, తదవలోకనపరిచుమ్బనదర్శనమాత్ర కృతకృత్యతాభిమానయోగి తేన కామదేవేన కృతమ్. తేషాం హృదయం యదత్యన్తం విజిగీషాజ్వలనజాజ్వలమానమభూదితి యావత్. అత్ర అతిశయోక్తిః వాచ్యాలంకారః. ప్రతీయమానా చోపమా సకలరత్నసారతుల్యో బిమ్బాధర ఇతి హి తేషాం బహుమానః వాస్తవ ఏవ. అత ఏవ న రూపకధ్వనిః. రూపకస్య ఆరోప్యమాణత్వేన అవాస్తవత్వాత్. తేషామసురాణాం వస్తువృత్త్యైవ సాదృశ్యం స్ఫురతి. తదేవ చ సాదృశ్యం చమత్కారహేతుః ప్రాధాన్యేన.

బాలానందిని

**తుల్యేతి** - ఉపమాధ్వన్యుదాహరణాల రెండింటియొక్క లక్షణసమన్వయం పైన చూపిన రూపకధ్వన్యుదాహరణలక్షణసమన్వయం వలెనే ఉంటుంది. అందుచేత (వృత్తికారుడు) స్వకంఠంచేత ఆ ఉదాహరణలకు లక్షణసమన్వయం చేయలేదు. వీరాణామిత్యాదిశ్లోకభావం వివరిస్తున్నాడు-

**ప్రసాధితేతి** - అలంకరించుకొని ఉన్న ప్రియతమలను ఓదార్చడంలో తత్పరులై ఉండడంచేత, దగ్గరపడిన యుద్ధంకొరకు తొందరపడుతూన్న మనస్సు కలవారగుటచేత, ఆ యోధుల దృష్టి దోలాయమానంగా ఉన్నా యుద్ధం విషయంలో వాళ్లకు చాల తొందర ఉంది. అందుచేత వ్యతిరేకం వాచ్యాలంకారం. అయితే ప్రియాకుచకుడ్మలాలతో ఏ ఉపమ వ్యంజించబడుతున్నదో దానిని పట్టి (తద్వశేన) జను లందరికీ భయం కలిగించేవీ, మర్దించడానికి సిద్ధంగా ఉన్నవీ అయిన శత్రుగజకుమ్భస్థలాలమీద ఆసక్తిని పొందుతున్నారా అన్నట్లున్న యోధులకు వాటిమీదనే అధికమైన ఆదరం ఉంది. అందుచేత అదియే (ఆ ఉపమయే) వీరతాతిశయంచేత ఏర్పడిన చమత్కారాన్ని కలిగిస్తూన్నది. ఆ కారణంచేత ఉపమకే ప్రాధాన్యం.

**అసురపరాక్రమణ ఇతి** :- ఇక్కడ ఆతడు (మన్మథుడు) చేసిన మూడు లోకాల విజయం వర్ణించబడుతూన్నది. పాతాలంలో నివసించే ఆ అసురులు మాటిమాటికి ఇంద్రనగరాక్రమణాదికం ఏ మేమి చేయలేదు! అలాంటి వాళ్ల హృదయం చాలా చేయ

శక్యం కాని ఆయా పనులనుంచి కూడ వెనుకకు మరల్చ శక్యం కాని హృదయం; స్త్రీసహోదరములు, అందుచేతనే చెప్పడానికి శక్యం కాని ఉత్కర్ష గలవి అని అర్థం. ఆ రత్నాలయొక్క, ఆహరణే= అంతటా, పూర్తిగా, హరించడంలో, ఏకరసమ్= తత్పరమైన ఏ హృదయం కలదో అది మన్మథునిచేత, అతిసుకుమారమైన ఉపకరణాల సంభారం గల మన్మథునిచేత, ప్రియురాళ్ల బింబాధరం మీద నిలపబడింది; దానిని బాగా చూడడం, పూర్తిగా చుంబనం చేయడం, కేవలం చూడడం వీటిచేతనే కృతకృత్యులం అయ్యాం అనే అభిమానం కలదిగా ఆ కామదేవునిచేత చేయబడింది. వాళ్ల హృదయం - ఏదైతే (క్షణకాలం క్రితంవరకూ) మిక్కిలి జయేచ్ఛ అనే అగ్నిచేత ప్రజ్వలిస్తూ ఉండేదో అలాంటిది అని భావం.

అత్రేతి - ఇక్కడ వాచ్యాలంకారం అతిశయోక్తి. ఉపమ వ్యంగ్యమైనది. బింబాధరం సకలరత్నసారంతో తుల్యమైనది అనే అభిప్రాయంచేత వాళ్లకి దానిమీద అభిమానం వాస్తవమైనదే. అందువల్లనే ఇది రూపకధ్వని కాదు. రూపకం ఆరోపించబడేది అవడంవల్ల అవాస్తవం కదా? ఆ అసురులకు సాదృశ్యం యథార్థంగానే ఉన్నట్లు స్ఫురిస్తుంది. ఆ ఆ సాదృశ్యమే ప్రధానంగా చమత్కారానికి హేతువు.

## ధ్వన్యాలోకం

ఆక్షేపధ్వనిర్యథా -

శ్లో. స వక్తుమఖిలాన్ శక్తో హయగ్రీవాశ్రితాన్ గుణాన్,
యో ఽమ్బుకుమ్భైః పరిచ్ఛేదం జ్ఞాతుం శక్తో మహోదధేః. (59)

అత్రాతిశయోక్త్యా హయగ్రీవగుణానామవర్ణనీయతా ప్రతిపాదనరూపస్య అసాధారణతద్విశేషప్రకాశనపరస్య ఆక్షేపస్య ప్రకాశనమ్.

### బాలానందిని

ఆక్షేపేతి :- ఆక్షేపధ్వని ఎట్లనగా -

స ఇతి - యః = ఎవడు, అమ్బుకుమ్భైః= జలకుంభాలచేత, మహోదధేః= మహాసముద్రంయొక్క, పరిచ్ఛేదమ్= ప్రమాణాన్ని, జ్ఞాతుమ్= తెలిసికొనుటకు, శక్తః= సమర్థుడో, సః = అతడు, హయగ్రీవాశ్రితాన్= హయగ్రీవుణ్ణి ఆశ్రయించిన, అఖిలాన్= సమస్తమైన, గుణాన్= గుణాలను, జ్ఞాతుమ్= తెలిసికొనుటకు, శక్తః= సమర్థుడు.

అత్రేతి - ఇక్కడ అతిశయోక్తిచేత, హయగ్రీవుని గుణాలు వర్ణింపశక్యం కానివి అని ప్రతిపాదించడం అనే అసాధారణమైన అతని విశేషాన్ని ప్రకాశింపచేసేది అయిన ఆక్షేపంయొక్క ప్రకాశనం చేయబడుతున్నది.

వివరణ:- ఉద్భటుడు చెప్పిన లక్షణం ప్రకారం లోకంలో కనబడని విషయాన్ని 'సంభావ్యం కావచ్చును' అన్నట్లు చెప్పడం అతిశయోక్తిలో ఒక భేదం:-

"నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాన్తగోచరమ్,
మన్యన్తేఽతిశయోక్తిం తామలంకారతయా బుధాః.
భేదేఽనన్యత్వమన్యత్ర నానాత్వం యత్ర బధ్యతే,
తథా సంభావ్యమానార్థనిబన్ధేఽతిశయోక్తిగీః". (ఉద్భటకా. సా.స. 2.11,12)

ఇక్కడ లోకంలో ఎన్నడూ చూడని సముద్రజలాన్ని బిందెలతో కొలవడం సంభావ్యం అన్నట్లు వర్ణించబడింది గాన అతిశయోక్తి. ఈ అతిశయోక్తి హయగ్రీవుని గుణాలు వర్ణింప శక్యం కానివి అని ప్రతిపాదించడం అనే రూపం గల ఆక్షేపాన్ని వ్యంజింపచేస్తూన్నది. ఆతని గుణాలు లెక్కింప శక్యం కావు అని చెప్పడంలోని ప్రధానాభిప్రాయం ఆతనిలో అసాధారణాలైన విశేషాలు ఉన్నాయి అని చెప్పడం. ఇక్కడ అతని గుణాలను చెప్పాలని ప్రారంభించినట్లు, చెప్పడం శక్యం కాదులే అని నిషేధించినట్లు గమ్యం. తద్ద్వారా ఆతనిలోని అసాధారణవిశేషాలు సూచించబడ్డాయి గాన ఇది గమ్యమాన ఆక్షేపం.

"ప్రతిషేధ ఇవేష్టస్య యో విశేషాభిదిత్సయా,
ఆక్షేప ఇతి తం సన్తః శంసన్తి కవయః సదా" (ఉద్భట కా.సా.సం.2.2)

లోచనం

**అతిశయోక్త్యేతి** - వాచ్యాలంకారరూపయేత్యర్థః. అవర్ణనీయతా ప్రతిపాదనమేవ ఆక్షేపస్య రూపమ్, ఇష్టప్రతిషేధాత్మకత్వాత్. తస్య ప్రాధాన్యం విశేషణద్వారేణ ఆహ - అసాధారణేతి.

బాలానందిని

**అతిశయోక్త్యేతి** - వాచ్యాలంకారరూపమైన అతిశయోక్తిచేత అని అర్థం. వర్ణింప శక్యం కాకపోవడాన్ని ప్రతిపాదించడమే ఆక్షేపాలంకారస్వరూపం. ఇష్టమైనదానియొక్క ప్రతినిషేధం దీని స్వరూపం గదా? అనగా లెక్కపెట్టడం ఇష్టం. అది శక్యం కాదు అని నిషేధించడం చేత ఇది ఆక్షేపాలంకారం అని భావం. ఆ ఆక్షేపాలంకారమే ఇక్కడ

ప్రధానమైనది అనే విషయాన్ని అసాధారణేత్యాది విశేషాలచేత చెపుతున్నాడు.

## ధ్వన్యాలోకం

అర్థాన్తరన్యాసధ్వనిః శబ్దశక్తిమూలానురణన రూపవ్యఙ్గ్యః అర్థశక్తిమూలానురణనవ్యఙ్గ్యశ్చ సంభవతి.

గాథ : దేవ్వాఏత్తమ్మి ఫలే కిం కీరఇ ఏత్తిఅం పుణా భణిమో,

కఙ్కేల్లిపల్లవాః పల్లవాణం అణ్ణాణ ణ సరిచ్ఛా. (60)

పదప్రకాశశ్చాయం ధ్వనిరితి వాక్యస్య అర్థాన్తరతాత్పర్యేఽపి సతి న విరోధః.

### బాలానందిని

అర్థాన్తరేతి - అర్థాంతరన్యాసధ్వనికావ్యం శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యం గాను, అర్థశక్తిమూలానురణనరూపవ్యంగ్యంగాను కూడ ఉండవచ్చు. వాటిలో మొదటి దానికి ఉదాహరణం ఎట్లనగా - (సంస్కృతచ్ఛాయ వ్యాఖ్యానంలో ఉన్నది).

దైవాయత్తే ఇతి - ఫలే = ఫలము, దైవాయత్తే= దైవాధీనమైన దగుచుండగా, కిం క్రియతామ్= ఏమి చేయబడుగాక (ఏం చెయ్యాలి)? ఏతావత్ పునః = ఇంతమాత్రం అయితే, భణామః = చెపుతున్నాం (చెపుతాం). రక్తాశోకపల్లవః= రక్తాశోకవృక్షం యొక్క చిగురు, అన్యేషామ్= ఇతరమైన, పల్లవానామ్= పల్లవాలకు, న సదృశః = సమానం కాదు.

పదేతి - ఈ ధ్వని పదప్రకాశం. అందువల్ల వాక్యానికి మరొక అర్థంలోని (అప్రస్తుతప్రశంసారూపార్థంలో) తాత్పర్యం ఉన్నా కూడ విరోధం లేదు.

### లోచనం

సమ్భవతేత్యనేన ప్రసఙ్గాత్ శబ్దశక్తిమూలస్యాత్ర విచార ఇతి దర్శయతి.

"దైవాయత్తే ఫలే కిం క్రియతామేతావత్పునర్భణామః,

రక్తాశోకపల్లవాః పల్లవానామన్యేషాం న సదృశాః".

అశోకస్య ఫలమాత్రమాదివన్నాస్తి. కిం క్రియతామ్? పల్లవాస్తు అతీవ హృద్యాః ఇతి ఇయతా అభిధా సమాప్తైవ. అత్ర ఫలశబ్దస్య శక్తివశాత్, సమర్థకమస్య వస్తునః పూర్వమేవ ప్రతీయతే. లోకోత్తరజిగీషాతదుపాయప్రవృత్తస్యాపి హి

ఫలం సంపల్లక్షణం దైవాయత్తం కదాచిన్న భవేదపీత్యేవంరూపం సామాన్యాత్మకమ్.

నన్వస్య సర్వవాక్యస్య అప్రస్తుతప్రశంసా ప్రాధాన్యేన వ్యఙ్గ్యా; తత్కథమర్థాన్తరన్యాసస్య వ్యఙ్గ్యతా? ద్వయోర్యుగపదేకత్ర ప్రాధాన్యాయోగాత్ ఇత్యాశఙ్క్యాహ - పదప్రకాశేతి. సర్వో హి ధ్వనిప్రపఞ్చః పదప్రకాశః వాక్యప్రకాశశ్చేతి వక్ష్యతే. తత్ర ఫలపదేఽర్థాన్తరన్యాధ్వనిః ప్రాధాన్యేన. వాక్యే తు అప్రస్తుతప్రశంసా. తత్రాపి పునః ఫలపదోపాత్తసమర్థ్యసమర్థకభావ ప్రాధాన్యమేవ భాతీతి అర్థాన్తరన్యాసధ్వనిరేవాయమ్ ఇతి భావః.

బాలానందిని

సంభవతీతి:- అర్థశక్తిమూలధ్వనిని గూర్చి చర్చిస్తూన్న ఈ ఘట్టంలో ప్రసంగవశంచేత శబ్దశక్తిమూలధ్వనివిచారం చేయబడుతున్నది అని సంభవతి అనే పదంచేత చెపుతున్నాడు.

దైవాయత్తే ఇత్యాది. అశోకస్యేతి - చూతవృక్షాదులకు ఉన్నట్లు అశోకవృక్షానికి ఫలం ఉండదు. ఏం చెయ్యగలం? దీని చిగుళ్లైతే చాలా మనోహరంగా ఉంటాయి. ఇంతమాత్రంతోనే అభిధ సమాప్తం అవుతుంది. అత్రేతి :- ఇక్కడ ఫలశబ్దంయొక్క శక్తివల్ల ఈ విషయాన్ని సమర్థించేది పూర్వమే (దైవాయత్తే ఫలే అనే మాటలు వినగానే) గమ్యం అవుతుంది. "లోకోత్తరమైన జయేచ్ఛతో దానికి తగిన ఉపాయం విషయంలో ప్రవర్తించినవానికి కూడా సంపద్రూపమైన ఫలం దైవాధీనమై ఒకప్పుడు కలగకపోవచ్చును కూడ" అనే రూపంలో సామాన్యాత్మకంగా ఉంటుంది.

వివరణ:- "అశోకవృక్షానికి ఫలం ఉండదు" అనేది ప్రకృతార్థం. ఫలశబ్దం శబ్దశక్తిమూలధ్వనిచేత 'సంపద్రూపమైన ప్రయోజనం' అనే అర్థాన్ని బోధిస్తుంది. 'అశోకానికి ఫలాలు ఉండవు' అనే ప్రకృతార్థాన్ని సమర్థించే - 'ఎవరికైనా సంపదలు దైవాధీనమైనవి; ఒకప్పుడు అవి లభించకపోవచ్చును" అనే సామాన్యరూపమైన అర్థం లభిస్తుంది. ఈ అర్థం ఫలశబ్దాన్నిపట్టి లభించింది గాన ఇది శబ్దశక్తిమూలకఅర్థాంతరన్యాసధ్వని.

నన్వితి - (ఆశంక) ఇక్కడ మొత్తం వాక్యంలో ప్రధానంగా అప్రస్తుతప్రశంస వ్యంగ్యంగా కనబడుతున్నది. అలాంటప్పుడు అర్థాంతరన్యాసకు వ్యంగ్యత్వం ఎలా కుదురుతుంది? ఒకచోట, ఒకే మాటు రెండు ప్రధానంగా ఉండడం కుదరదు కదా అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు - పదప్రకాశేతి:- సమస్తమైన ధ్వనిప్రపంచమూ కూడ పదప్రకాశం, వాక్యప్రకాశం అయి ఉంటుం దని చెప్పబడగలదు. ఫలపదంలో

అర్థాంతరన్యాసధ్వని ప్రధానంగా ఉంది. వాక్యంలో అయితే అప్రస్తుతప్రశంస వ్యంగ్యంగా ఉంది. అయితే ఆ రెండింటిలోను ఫలపదంచేత గ్రహించబడిన సమర్థ్యసమర్థకభావానికున్న ప్రాధాన్యమే భాసిస్తూన్నది. అందుచేత ఇది అర్థాంతరన్యాసధ్వనియే అని భావం.

## ధ్వన్యాలోకం

ద్వితీయస్యోదాహరణం యథా -

గాథ: హిఅఅట్ఠావిఅమణ్ణుం అవరుణ్ణముహం హి మం పసాఅన్త,
అవరద్ధస్స వి ణ హు దే మహుజాణఅ రోసిఉం సక్కమ్(61)

"హృదయస్థాపితమన్యుమరోషముఖీమపి మాం ప్రసాదయన్,
అపరాద్ధస్యాపి న ఖలు తే బహుజ్ఞ రోషితుం శక్యమ్(ఇతి ఛాయా).

అత్ర హి వాచ్యవిశేషేణ సాపరాధస్యాపి బహుజ్ఞస్య కోపః కర్తుమశక్య ఇతి సమర్థకం సామాన్యమ్ అన్వితమ్ అన్యత్ తాత్పర్యేణ ప్రకాశతే.

### బాలానందిని

ద్వితీయస్యేతి - రెండవదైన అర్థశక్తిమూలానురణనరూపవ్యంగ్యానికి ఉదాహరణం ఎట్లనగా -

హృదయేతి - హృదయస్థాపితమన్యుమ్ = హృదయంలో ఉంచబడిన కోపం కలదాననై, అరోషముఖీమపి = రోషం లేని ముఖం కలదాననైనా, మామ్ = నన్ను, ప్రసాదయన్= అనుగ్రహింపచేసుకొనుచున్న, బహుజ్ఞ = చాలా తెలివైనవాడా! అపరాద్ధస్యాపి = అపరాధం చేసినవాడవైనా, తే= నీకు, రోషితుమ్= కోపించడానికి, న శక్యం ఖలు= శక్యం కాదు కదా?

అత్రేతి – ఇక్కడ వాచ్యవిశేషంతో అన్వయిస్తూ "అపరాధం చేసినవాడైనా తెలివైనవాడు కోపించడం యుక్తం కాదు" అని సమర్థకమైన మరియొక సామాన్యం తాత్పర్యంచేత ప్రకాశిస్తూన్నది.

### లోచనం

హృదయే స్థాపితో న తు బహిః ప్రకటితో మన్యుః మయా. అత ఏవ అప్రదర్శితరోషముఖీమపి మాం ప్రసాదయన్, హే బహుజ్ఞ! అపరాద్ధస్యాపి

రోషకరణం న శక్యమ్. అత్ర చ 'బహుజ్ఞ' ఇత్యామన్త్రణార్థో విశేషపర్యవసితః. అనన్తరం తు తదర్థపర్యాలోచనాత్ యత్ సామాన్యరూపం సమర్థకం ప్రతీయతే తదేవ చమత్కారకారి - సా హి ఖణ్డితా సతీ వైదగ్ధ్యానునీతా తం ప్రత్యసూయాం దర్శయన్తీ ఇత్థమాహ. యః కశ్చిద్ బహుజ్ఞః ధూర్తః స ఏవం సాపరాధోఽపి స్వాపరాధావకాశమాచ్ఛాదయతీతి మా త్వమాత్మని బహుమానం మిథ్యా గ్రహీరితి. అన్వితమితి - విశేషే సామాన్యస్య సంబద్ధత్వాదితి భావః.

బాలానందిని

హృదయే ఇతి - హృదయంలో ఉంచుకొనబడినా బైటకు ప్రకటించబడని కోపం గలదానను; అందువల్లనే చూపబడని రోషం గల ముఖం కలదాననైనా నన్ను అనుగ్రహింపచేసుకుంటూన్న ఓ! బహుజ్ఞుడా! అపరాధం చేసినవాడ వైనా నువ్వు కోపం చూపడానికి శక్యం కాదు.

అత్రేతి - ఇక్కడ ఉన్న 'బహుజ్ఞ' అనేది ఏకవచనంలో ఉంది. అందుచేత "నేనేమీ అపరాధం చేయలేదు; కోపం విడిచిపెట్టు" అని ఏ నాయకుడు బ్రతిమాలుచున్నాడో ఆ వ్యక్తిని మాత్రమే బోధిస్తుంది. అనన్తరం తు ఇతి :- తరవాత దాని అర్థాన్ని పర్యాలోచించగా సామాన్యరూపమైన సమర్థకం గమ్యం అవుతుంది. అదే చమత్కారం కలిగించేది. ఖండితురాలై వైదగ్ధ్యంచేత (నేర్పుగా) బ్రతిమాలుకొనబడుతూన్న ఆమె ఆతనిపై తనకున్న కోపాన్ని చూపుతూ ఇలా అంటూన్నది - "చాలా తెలివైన ప్రతి ధూర్తుడూ కూడ ఇలా అపరాధం చేసి కూడ తన అపరాధావకాశాన్ని కప్పిపుచ్చు కుంటుంటాడు; అందుచేత నువ్వు "నే నేదో గొప్పవాణ్ణి" అని అనుకొనకు. ఈ విధంగా గమ్యమైన సామాన్యం విశేషాన్ని సమర్థిస్తూన్నది గాన ఇది అర్థశక్తి మూలార్థాన్తరన్యాసానురణనధ్వని అని భావం. అన్వితమితి - సామాన్యం విశేషంతో సంబంధించి ఉంటుంది కదా అని భావం.. వృత్తిలో "సామాన్యం వాచ్యవిశేషేణ అన్వితమ్" అని అన్వయం.

## ధ్వన్యాలోకం

వ్యతిరేకధ్వనిరపి ఉభయరూపః సంభవతి. తత్రాద్యస్యోదాహరణం ప్రాక్ప్రదర్శితమేవ. ద్వితీయస్యోదాహరణం యథా -

గాథ: జాఏజ్జ వణుద్దేసే ఖుజ్జ వ్విఅ పాఅఓ గడిఅవత్తో
మా మాణుసమ్మి లోఏ తాఏక్కరసో దరిద్దో అ. (62)
"జాయేయ వనోద్దేశే కుబ్జ ఏవ పాదపో గలితపత్రః,
మా మానుషే లోకే త్యాగైకరసో దరిద్రశ్చ". (ఇతి చ్ఛాయా)

అత్ర హి త్యాగైకరసస్య దరిద్రస్య జన్మానభినన్దనం త్రుటితపత్ర కుబ్జపాదపజన్మాభినందనం చ సాక్షాచ్ఛబ్దవాచ్యమ్. తథావిధాదపి పాదపాత్తాదృశస్య పుంసః ఉపమానోపమేయత్వప్రతీతిపూర్వకం శోచ్యతాయామాధిక్యం తాత్పర్యేణ ప్రకాశయతి.

బాలానందిని

వ్యతిరేకేతి :- వ్యతిరేకధ్వని కూడ ఉభయరూపం సంభవిస్తుంది. వాటిలో మొదటిది(శబ్దశక్తిమూలం) వెనక ("ఖం యేఽత్యుజ్జ్వలయన్తి" "రక్తస్త్వం నవపల్లవైః" అనే శ్లోకాలలో) చూపబడింది. రెండవదానికి (అర్థశక్తిమూలకవ్యతిరేకానురణ ధ్వనికి) ఉదాహనం ఎట్లనగా -

జాయేయ ఇతి - గలితపత్రః= రాలిపోయిన ఆకులు గల, కుబ్జః = గూనిదైన, పొట్టిదైన, పాదపః ఏవ= వృక్షంగానే, వనోద్దేశే = వనప్రదేశమునందు, జాయేయ= పుట్టుదును గాక. త్యాగైకరసః= దానం చేయడంలో చాలా ఆసక్తి కలవాడినిగాను, దరిద్రశ్చ = దరిద్రుడనుగాను, మానుషే లోకే = మనుష్యలోకంలో (మనుష్యుల మధ్య) మా = పుట్టక పోవుదునుగాక.

అత్రేతి :- ఇక్కడ త్యాగైకరసుడైన దరిద్రుని జన్మను అభినందించకపోవడం, ఆకులు లేని పొట్టి చెట్టు జన్మను అభినందించడం సాక్షాత్తు శబ్దంచేత చెప్పబడుతున్నది. ఇది ఉపమానోపమేయప్రతీతిపూర్వకంగా ఆ విధమైన చెట్టుకంటె కూడ అలాంటి పురుషుని శోచ్యత (చూచి జాలిపడదగి ఉండడం) అధికమైన దని, తాత్పర్యంచేత ప్రకాశింపచేస్తూన్నది.

లోచనం

వ్యతిరేకధ్వనిరపీతి - అపిశబ్దేన అర్థాన్తరన్యాసనదేవ ద్విప్రకారత్వ మాహ. ప్రాగితి - "ఖం యేఽత్యుజ్జ్వలయన్తి" ఇతి, "రక్తస్త్వం నవపల్లవైః" ఇతి.

జాయేయ, వనోద్దేశ ఏవ వనస్యైకాన్తే గహనే యత్ర స్ఫుటతర బహువృక్షసంపత్త్యా ప్రేక్షతేఽపి న కశ్చిత్, కుబ్జ ఇతి రూపఘటనాదౌ అనుపయోగీ. గలితపత్త్ర ఇతి - ఛాయామపి న కరోతి; తస్య కా పుష్పఫలవత్తా ఇత్యభిప్రాయః.. తాదృశోఽపి కదాచిత్ అఙ్గారికస్యోపయోగీ భవేత్, ఉలూకాదీనాం వా నివాసాయేతి భావః. మానుష ఇతి :- సులభార్థిజనే ఇత్యర్థః. లోక ఇతి - యత్ర లోక్యతే సః అర్థిభిః తేన చార్థిజనః, న చ కించిచ్ఛక్యతే కర్తుమ్, తన్మహద్వైశసమితి భావః. అత్ర వాచ్యాలంకారో న కశ్చిత్. ఉపమానేత్యనేన వ్యతిరేకస్య మార్గపరిశుద్ధిం కరోతి. ఆధిక్యమితి - వ్యతిరేకమిత్యర్థః.

బాలానందిని

వ్యతిరేకేతి - 'అపి' శబ్దంచేత అర్థాంతరన్యాసానికి వలె దీనికి కూడ రెండు భేదాలు ఉంటాయని చెపుతున్నాడు. ప్రాగితి :- "ఖం యేఽత్యుజ్జ్వలయన్తి" అని, "రక్తస్త్వం నవపల్లవైః" అని. జాయేయ=పుట్టెదనుగాక. వనోద్దేశ ఏవ= వనంలో ఒక మూల ప్రవేశింప శక్యంకాని ప్రదేశంలో, ఎక్కడైతే అనేకవృక్షాలు బాగా పెరిగి అత్యధికంగా ఉండడంచేత ఎవడూ కూడ నన్ను చూడడో అక్కడ. కుబ్జ ఇతి : రూపం తయారు చేయడానికి కూడ ఉపయోగించనిది. వంకరటింకరగా ఉండడంచేత ఆ కఱ్ఱతో ఏవైన మూర్తులు, దేవతామూర్త్యాదులు, కూడా తయారుచేయడానికి ఉపయోగించదు అని భావం. గలితపత్త్ర ఇతి (రాలిపోయిన ఆకులు గల) అది నీడ కూడ ఇవ్వజాలదు; అలాంటిదానికి పుష్పాలూ ఫలాలూ ఉండడం అనేది ఎక్కడి మాట! అలాంటిదైనా ఒకప్పుడు బొగ్గులు తయారుచేసి జీవించేవానికి ఉపయోగించవచ్చు, గుడ్లగూబలు మొదలైనవి నివసించడానికి ఉపయోగించవచ్చు అని బభావం. లోక ఇతి :- ఎక్కడైతే అతడు యాచకులచేత చూడబడతాడో, అతనిచేత యాచకులు చూడబడతారో, కాని ఏమీ చేయడానికి శక్యంకాదో; అయ్యో! ఇది ఎంత క్రూరమైన హింస అని భావం. అత్రేతి : ఇక్కడ వాచ్యాలంకారం ఏదీ లేదు. 'ఉపమాన' ఇత్యాది వాక్యంచేత వ్యతిరేకానికి మార్గశుద్ధి చేస్తున్నాడు; (దారి సాఫు చేస్తున్నాడు) ఆధిక్యమ్ ఇతి - వ్యతిరేకమును అని అర్థం. (రెండింటి మధ్య ఉపమానోపమేయభావం ఉంటూ ఉపమానంలో కాని ఉపమేయంలో కాని ఏదైన ఆధిక్యం ఉంటే వ్యతిరేకాలంకారం).

## ధ్వన్యాలోకం

ఉత్ప్రేక్షాధ్వనిర్యథా -

శ్లో. చన్దనాసక్తభుజగనిఃశ్వాసానిలమూర్ఛితః,
మూర్ఛయత్యేష పథికాన్ మధౌ మలయమారుతః. (63)

అత్ర హి మధౌ మలయమారుతస్య పథికమూర్ఛా కారిత్వం మన్మథోన్మాథదాయిత్వేనైవ. తత్తు చన్దనాసక్తభుజగనిఃశ్వాసానిల మూర్ఛితత్వేన ఉత్ప్రేక్షితమితి ఉత్ప్రేక్షా సాక్షాదనుక్తాపి వాక్యార్థసామర్థ్యాత్ అనురణనరూపా లక్ష్యతే.

### బాలానందిని

ఉత్ప్రేక్షా ఇతి - ఉత్ప్రేక్షాధ్వని ఎట్లనగా - మధౌ = వసంతఋతువునందు, చన్దనాసక్తభుజగనిఃశ్వాసానిలమూర్ఛితః= చందనవృక్షాలమీద లగ్నమైన సర్పాల శ్వాసల గాలితో వ్యాప్తమైన, ఏషః= ఈ, మలయమారుతః= మలయవాయువు, పథికాన్= పాంథులను, మూర్ఛయతి= మూర్ఛచెందే టట్లు చేస్తున్నది.

అత్రేతి - ఇక్కడ - వసంతర్తువులో మలయమారుతం పథికులకు మూర్ఛ కలిగించడం అనేది మన్మథపీడాజనకత్వంచేతనే. కాని అది (మూర్ఛ కలిగించడం) చందనవృక్షాలమీద లగ్నములైన సర్పాల శ్వాసవాయువులు వ్యాప్తం అయి ఉండడంచేత కలిగినదిగా ఉత్ప్రేక్షించబడింది. ఈ విధంగా ఉత్ప్రేక్ష సాక్షాత్తు చెప్పబడకపోయినా అనురణనరూపంలో వాక్యార్థసామర్థ్యంచేత గుర్తించబడుతున్నది.

### లోచనం

ఉత్ప్రేక్షితమితి - విషవాతేన హి మూర్ఛితః బృంహితః ఉపచితః మోహం కరోతి. ఏకశ్చ మూర్ఛితః పథికమధ్యే అన్యేషా మపి ధైర్యచ్యుతిం విదధత్ మూర్ఛాం కరోతీతి ఉభయథా ఉత్ప్రేక్షా. నన్వత్ర విశేషణమధికీభవత్ హేతుతయైవ సంగచ్ఛతే. తతః కిమ్? న హి హేతుతా పరమార్థతః. తథాపి తు హేతుతా ఉత్ప్రేక్ష్యతే ఇతి యత్కించిదేతత్.

బాలానందిని

ఉత్ప్రేక్షితమితి - విషవాయువుచేత, మూర్ఛితః= నింపబడినది, వృద్ధి పొందించబడినది, మోహం కలిగిస్తుంది. 'మూర్ఛిత' శబ్దానికి పైన చెప్పిన వ్యాపించబడిన 'వృద్ధిపొందించబడిన' అనే అర్థం, మూర్ఛచెందిన, మోహం చెందిన అనే అర్థం కూడా ఉన్నాయి. 'శ్వాసానిలమూర్ఛిత' లోని 'మూర్ఛిత' శబ్దానికి ఈ రెండవ అర్థం కూడా తీసికొని రెండవ ఉత్ప్రేక్ష కూడా ఉందని చెపుతున్నాడు - ఏకశ్చేతి:- పథికులలో ఒకడు మూర్ఛ చెందితే ఇతరులను కూడా ధైర్యం కోల్పోయే టట్లు చేసి వాళ్లకి కూడా మూర్ఛ కలిగిస్తాడు అని రెండు విధాల ఉత్ప్రేక్ష. అనగా మలయమారుతం విషవాయువుచేత వృద్ధిపొందడం, మోహావస్థను పొందడం ఈ రెండూ కూడ పథికులకు మూర్ఛ కలిగించడంలో హేతువులుగా ఉత్ప్రేక్షించబడుతున్నాయి అని అర్థం.

నన్వితి (ఆశంక) ఇక్కడ 'చన్దనాసక్తేత్యాది' విశేషం అధికంగా ఉంది. అది హేతుగర్భంగా ఉండడంచేత దాన్ని హేతువుగా చెపితేనే కుదురుతోంది (హేతువును చెప్పేసిన తరవాత ఉత్ప్రేక్ష వాచ్యం అయిపోయినట్లే. ఇంక వ్యంగ్యం ఎలా అవుతుంది). (సమాధానం) అయితేనేం? హేతువు అయితే మాత్రం ఏమి? అని అర్థం. హేతుత్వం వాస్తవమైనది కాదు కదా. అయినా (వాస్తవం కాకపోయినా) దాన్ని హేతువుగా ఉత్ప్రేక్షించడం జరిగింది. అందుచేత నీ ఆశంకలో పస ఏమీ లేదు (న కించిదేతత్).

ధ్వన్యాలోకం

న చైవంవిధే విషయే ఇవాది శబ్దప్రయోగమన్తరేణ అసంబద్ధతైవ శక్యతే వక్తుమ్. గమకత్వాత్. అన్యత్రాపి తదప్రయోగే తదర్థావగతిదర్శనాత్. యథా -

గాథ: ఈసాకలుసస్స వి తుహ ముహస్స ణం ఏస పుణ్ణిమాచన్దో,

అజ్జ సరిసత్తణం పావిఊణ అఙ్గే విఅ ణ మాఇ. (64)

"ఈర్ష్యాకలుషస్యాపి తవ ముఖస్య నన్వేష పూర్ణిమాచన్ద్రః,

అద్య సదృశత్వం ప్రాప్యాఙ్గ ఏవ న మాతి". (ఇతి ఛాయా)

యథా వా -

శ్లో. త్రాసాకులః పరిపతన్ పరితో నికేతాన్
పుంభిర్న కైశ్చిదపి ధన్విభిరన్వబన్ధి,
తస్థౌ తథాపి న మృగః క్వచిదఙ్గనాభి
రాకర్ణపూర్ణనయనేషు హతేక్షణశ్రీః. (65)

శబ్దార్థవ్యవహారే చ ప్రతీతిరేవ ప్రమాణమ్.

బాలానందిని

న చేతి - ఇలాంటి విషయంలో ఇవాదిశబ్దాల ప్రయోగం లేకపోతే (వాక్యార్థం) అసంబద్ధంగానే ఉంటుంది అని చెప్పడానికి శక్యం కాదు. ఇవాదులు కేవలం సూచకములు మాత్రమే కదా? అనగా 'ఇవ' ఇత్యాది పదాలు సంభావనారూపాద్యర్థాలను బోధించవు; ఆ వాక్యంలో ఉన్న అర్థాన్నే సూచిస్తాయి అని అర్థం. అన్యత్రాపీతి ఇతరస్థలాలలో వాటిని ప్రయోగించకపోయినా కూడ వాటి అర్థం తెలియబడడం ఉంది కదా? ఎట్లనగా -

ఈర్ష్యా ఇతి - ఏషః పూర్ణిమాచన్ద్రః = ఈ పూర్ణిమాచంద్రుడు, తవ= నీ యొక్క, ఈర్ష్యాకలుషితస్యాపి= కోపంచేత కలుషమైనదైనా కూడ, ముఖస్య= ముఖంయొక్క, సదృశత్వమ్= సామ్యాన్ని, ప్రాప్య= పొంది, అద్య= ఇప్పుడు, అఙ్గే ఏవ = శరీరమునందే, న మాతి = ఇమడడంలేదు.

మరొక ఉదాహరణం ఎట్లనగా -

త్రాసాకులః ఇతి - త్రాసాకులః = భయంచేత వ్యాకులమై, నికేతాన్ పరితః= అన్ని ఇళ్లవైపూ, పరిపతన్= పరిగెత్తుచున్న, మృగః= లేడి, ధ్వనిభిః= ధనుర్ధరులైన, పుంభిః= పురుషులచేత, కైశ్చిదపి= ఎవళ్లచేతా కూడా, న అన్వబన్ధి= అనుసరింపబడలేదు. తథాపి= అట్లయినా కూడ అఙ్గనాభిః = స్త్రీలచేత, ఆకర్ణపూర్ణనయనేషుహతేక్షణశ్రీః= చెవివరకునిండిన (చెవివరకు నారి లాగి విడవబడిన అని కూడ అర్థం) నేత్రా లనే బాణాలచేత కొట్టబడిన నేత్రాల శోభగలదై, క్వచిదపి= ఎక్కడా కూడ, న తస్థౌ=నిలవలేదు.

శబ్దార్థేతి - శబ్దార్థాలకి సంబంధించిన వ్యవహారంలో ప్రసిద్ధియే ప్రమాణం.

లోచనం

తదితి - తస్య ఇవాదేరప్రయోగేఽపి తస్యార్థస్య ఉత్ప్రేక్షారూపస్య అవగతేః ప్రతీతేః దర్శనాత్. ఏతదేవ ఉదాహరతి - యథేతి -

ఈర్ష్యాకలుషితస్యాపి ఈషదరుణచ్ఛాయాకస్య. యది తు ప్రసన్నముఖస్య సాదృశ్యముద్వహేత్, సర్వదా వా తత్ కిం కుర్యాత్! త్వన్ముఖం తు ఏతద్భవతీతి మనోరథానామపి అపథమ్ ఇదమ్ ఇత్యపిశబ్దస్యాభిప్రాయః. అఙ్గే స్వదేహే న మాత్యేవ. దశ దిశః పూరయతి యతః. అద్య ఇయతా కాలేన ఏకం దివసమాత్రమపీత్యర్థః. అత్ర పూర్ణచన్ద్రేణ పూరణం స్వరససిద్ధమ్ ఏవముత్ప్రేక్ష్యతే.

బాలానందిని

తదితి - తస్య= ఇవాదిశబ్దంయొక్క, ప్రయోగం లేకపోయినా, తస్య అర్థస్య= ఉత్ప్రేక్షారూపమైన అర్థంయొక్క, అవగతేః = ప్రతీతియొక్క, దర్శనంవల్ల. దీనినే ఉదాహరిస్తున్నాడు - యథేతి - ఈర్ష్యాకలుషస్యాపి, కొంచెం ఎఱ్ఱని కాంతిగలదైనా ప్రసన్నంగా ఉన్న ముఖంయొక్క కాంతిని ధరించినా, లేదా ఎల్లప్పుడూ ధరించినా ఇంకా ఏం చేసి ఉండేవాడో! ఆ చంద్రుడు ఈ నీ ముఖంగా అవుతా డనేది మనోరథాలకి కూడ విషయం కాదు, మనస్సులో కూడ కోరుకొనడానికి శక్యం కాదు, అని అపి శబ్దంయొక్క అభిప్రాయం. అఙ్గే= తన దేహంలో, న మాత్యేవ = ఇమడడమే లేదు. (ఆ ఆనందాన్ని శరీరంలో పట్టజాలకుండా ఉన్నాడు). ఎందువలన అనగా పది దిక్కుల్నీ నింపివేస్తున్నాడు. అద్య= ఇంతకాలానికి, ఒక రోజు మాత్రమే అని అర్థం. ఇక్కడ పూర్ణచంద్రుడు దిక్కులను నింపడం అనేది సహజంగానే జరిగే పని. అది ఈ విధంగా ఉత్ప్రేక్షించబడుతున్నది.

లోచనం

నను ననుశబ్దేన వితర్కోత్ప్రేక్షారూపమాచక్షాణేన అసంబద్ధతా నిరాకృతేతి సంభావయమాన ఉదాహరణాన్తరమాహ - యథా వేతి. పరితః సర్వతః నికేతాన్ పరిపతన్ ఆక్రమన్, న కైశ్చిదపి చాపపాణిభిరసౌ మృగః అనుబద్ధః తథాపి న క్వచిత్ తస్థౌ, త్రాసచాపలయోగాత్ స్వాభావికాదేవ. తత్ర చ ఉత్ప్రేక్షా ధ్వన్యతే - అఙ్గనాభిః ఆకర్ణపూర్ణైః నేత్రశరైః హతా ఈక్షణశ్రీః సర్వస్వభూతా యస్య యతోఽసౌ న తస్థౌ. నను ఏతదపి అసంబద్ధమ్ అస్తు ఇత్యాశఙ్క్యాహ - శబ్దార్థేతి.

బాలానందిని

నన్వితి - వితర్కరూపమైన ఉత్ప్రేక్షను ఈ గాథలో ఉన్న 'నను' శబ్దం బోధిస్తున్నది. దానిచేత అసంబద్ధత్వం తొలగిపోయింది కదా అనే ఆశంకను ఊహించుకొని మరొక ఉదాహరణం చెపుతున్నాడు - యథా వా ఇతి - పరితః = అన్ని వైపులా, గృహాలను, పరిపతన్ = ఆక్రమిస్తున్నదై ఈ లేడి ధనస్సు ధరించిన ఎవరిచేతా కూడ తరమబడడం లేదు. అయినా కూడ అది స్వాభావికమైన భయంవల్ల కలిగిన చాపలంవల్ల ఎక్కడా కూడా నిలబడలేదు. అక్కడ ఉత్ప్రేక్ష వ్యంగ్యం అవుతున్నది - స్త్రీలచేత, ఆకర్ణపూర్ణనేత్రశరాలచేత దాని సర్వస్వం అయిన నేత్రశోభ కొట్టబడింది. అందువల్లనే అది ఒకచోట నిలవలేదు.

నన్వితి- ఇది కూడా అసంబద్ధార్థమే అంటాం అని ఆశంకించుకొని శబ్దార్థేత్యాదికం చెపుతున్నాడు. ఇలాంటి వాక్యాలలో ఇవాదులు లేకపోయినా కూడ సహృదయులు ఉత్ప్రేక్ష ఉన్నట్లు గ్రహించడం ప్రసిద్ధంగా ఉంది. శబ్దార్థసంబంధం పండితలోక ప్రసిద్ధిమీదనే ఆధారపడి ఉంది. అందుచేత ఇలాంటి వన్నీ అసంబద్ధార్థా లని అనకూడ దని వృత్తికారుని వాక్యానికి భావం.

## ధ్వన్యాలోకం

శ్లేషధ్వనిర్యథా -

శ్లో. రమ్యా ఇతి ప్రాప్తవతీః పతాకాః రాగం వివిక్తా ఇతి వర్ధయన్తీః,
యస్యామసేవన్త నమద్వలీకాః సమం వధూభిర్వలభీర్యువానః. (౮౬)

అత్ర వధూభిః సహ వలభీః అసేవన్త ఇతి వాక్యార్థ ప్రతీతేరనన్తరం వధ్వ ఇవ వలభ్యః ఇతి శ్లేషప్రతీతిః అశబ్దాపి అర్థసామర్థ్యాత్ ముఖ్యత్వేన వర్తతే.

బాలానందిని

శ్లేషేతి :- శ్లేషధ్వని (అర్థశక్తిమూలానురణ రూపశ్లేషధ్వని) ఎట్లనగా -

రమ్యాః ఇతి = సుందరములైనవి అవడంచేత, పతాకాః= పతాకాలను, అలంకారణార్థం కట్టిన జెండాలను, ప్రాప్తవతీః= పొందినవీ, స్త్రీల పక్షంలో సుందరు లని ప్రసిద్ధులను పొందినవాళ్లు అని అర్థం గమ్యం అవుతుంది. వివిక్తాః ఇతి = రహస్యప్రదేశాలుగా ఉండడంవల్ల, రాగమ్= సంభోగాభిలాషను. వర్ధయన్తీః =

వృద్ధిపొందించున్నవీ. స్త్రీల పక్షంలో చక్కని వేరు వేరుగా విభక్తములైన అవయవాలు కలవాళ్లు అవడంచేత అనురాగాన్ని వృద్ధిపొందిస్తున్నవాళ్లు అని గమ్యార్థం. నమద్వలీకాః = వంపుగా ఉన్న చూర్లు గలవి అయిన, స్త్రీల పక్షంలో వంగుతున్న నడుము నందలి ముడతలు గలవారు అని గమ్యార్థం. వలభీః=ఇళ్ల పైభాగాలను, యువానః= యువకులు, వధూభిః సమమ్ = స్త్రీలతో కూడ, యస్యామ్= ఏ నగరియందు, అసేవన్త = సేవించిరో.

అత్రేతి - ఇక్కడ స్త్రీలతో కూడ వలభులను సేవించిరి అని వాక్యార్థజ్ఞానం కలిగిన తరవాత వలభులు స్త్రీల వలె ఉన్నారు అని శ్లేష తెలియబడుతున్నది. ఈ శ్లేషప్రతీతి అశాబ్దమైనా కూడ అర్థసామర్థ్యంవల్ల ముఖ్యంగా ఉన్నది. అనగా 'పతాకాః ప్రాప్తవతీః' ఇత్యాదిపదాలు మూడు ద్వితీయాబహువచనంలో ఉన్నాయి. అందుచేత ద్వితీయాబహువచనంలో ఉన్న 'వలభీః' అనే దానితోనే అన్వయించి దానికి తగిన అర్థాన్ని బోధిస్తాయి. 'వధూభిః' అనేది తృతీయాబహువచనంలో ఉంది గాన దానితో ప్రత్యక్షంగా అన్వయించవు. అందుచేత వాక్యార్థం తెలిసిన తరవాత ఈ శబ్దాలలోని రెండవ అర్థం గమ్యం అవుతుంది. అదే ప్రధానమైన దని భావం.

లోచనం

పతాకాః ధ్వజపటాన్ ప్రాప్తవతీః, రమ్యా ఇతి హేతోః. పతాకాః ప్రసిద్ధీః ప్రాప్తవతీః. కిమాకారాః ప్రతీతీః? రమ్యా ఇత్యేవమాకారాః. వివిక్తాః జనసంకులత్వాభావాదితిహేతోః. రాగం సంభోగాభిలాషం వర్ధయన్తీః. అన్యే తు రాగం చిత్రశోభామితి. తథా రాగమ్ అనురాగం వర్ధయన్తీః. అన్యే తు రాగం చిత్రశోభామితి. తథా రాగమ్ అనురాగం వర్ధయన్తీః, యతో హేతోః వివిక్తాః విభక్తాఙ్గ్యః లటభాః. యాః నమన్తి వలీకాని ఛదిపర్యన్తభాగాః యాసు. నమన్త్యః వల్ల్యః త్రివలీలక్షణాః యాసామ్. సమమితి సహేత్యర్థః.

బాలానందిని

పతాకా ఇతి. పతాకాః = ధ్వజపటములను పొందినవి; రమ్యములైనవి అనే కారణంవల్ల, పతాకాః= ప్రసిద్ధులను పొందినారు. ఎలాంటి ప్రసిద్ధులు? సుందరమైన వారు అనే ప్రసిద్ధులు. వివిక్తాః= జనసంకులాలు కాకపోవడంవల్ల రహస్యంగా ఉన్నవి. ఆ కారణంవల్ల, రాగమ్= సంభోగాభిలాషను, వృద్ధి పొందిస్తూన్నవి. 'రాగమ్' అనగా చిత్తరువుల శోభను అని కొందరు అర్థం చెప్పారు. అట్లే రాగమ్= అనురాగాన్ని వృద్ధిపొందిస్తూన్నవి. ఎందువలన అనగా ఏ స్త్రీలు, వివిక్తాః= విభక్తములైన అవయవాలు,

అందంగా విడివిడిగా తేలిన అవయవాలు, గల లటభలు అనగా అధికసౌందర్యవతులైన నెరజాణలు. వంగిన, వలీకాని=ఛదిపర్యంతభాగాలు, ఇంటి కప్పుల చివరి భాగాలు వేటియందో అవి. సమమ్ అనగా సహ అని, కూడా అని, అర్థం.

లోచనం

నను సమశబ్దాత్తుల్యార్థోఽపి ప్రతీతః? సత్యమ్; సోఽపి శ్లేషబలాత్. శ్లేషశ్చ నాభిధావృత్తేః ఆక్షిప్తః, అపి తు అర్థసౌన్దర్యబలాదేవ ఇతి సర్వథా ధ్వన్యమాన ఏవ శ్లేషః. అత ఏవ వధ్వ ఇవ వలభ్యః ఇత్యభిదధతాపి వృత్తికృతా ఉపమాధ్వనిరితి నోక్తమ్. శ్లేషస్యైవాత్ర మూలత్వాత్. 'సమా' ఇతి హి యది స్పష్టం భవేత్ తదా ఉపమాయా ఏవ స్పష్టత్వాత్ శ్లేషః తదాక్షిప్తః స్యాత్. 'సమమ్' ఇతి నిపాతః అఞ్జసా సహార్థవృత్తిః వ్యఞ్జకత్వబలేనైవ క్రియావిశేషణత్వేన వబ్దశ్లేషతామేతి. న చ తేన వినా అభిధాయా అపరిపుష్టతా కాచిత్. అత ఏవ సమాప్తాయామేవ అభిధాయాం సహృదయైరేవ స ద్వితీయః అర్థః అపృథక్ప్రయత్నేనైవ అవగమ్యః. యథోక్తం ప్రాక్ - "శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ' ' ఇత్యాది. ఏతచ్చ సర్వోదాహరణేషు అనుసర్తవ్యమ్. "పీనశ్చైత్రః దివా నాత్తి' ' ఇత్యత్ర అభిధైవ అపర్యవసితేతి సైవ స్వార్థనిర్వాహాయ అర్థాన్తరం శబ్దాన్తరం వా ఆకర్షతీతి అనుమానస్య శ్రుతార్థాపత్తేర్వా తార్కికమీమాంసకయోః న ధ్వని ప్రసఙ్గః ఇత్యలం బహునా. తదాహ - అశబ్దాపీతి.

బాలానందిని

నన్వితి - ఇక్కడ ఉన్న 'సుమమ్' అనే శబ్దంచేత 'తుల్యమైన' అనే అర్థం కూడ తెలుస్తూన్నది కదా? నిజమే, అది కూడా శ్లేషబలంవల్లనే తెలుస్తూన్నది. ఇక్కడ ఉన్న శ్లేష అభిధావృత్తిచేత ఆక్షిప్తం కాదు. అర్థసౌందర్యబలంవల్లనే అది ఆక్షిప్తం అవుతూన్నది. అందుచేత అన్ని విధాలా శ్లేష ధ్వన్యమానమే (కాని అభిధేయం కాదు). అందుచేతనే "వధ్వ ఇవ వలభ్యః" (వలభులు వధువులు వలె ఉన్నవి) అని అంటున్నా కూడ వృత్తికారుడు ఉపమాధ్వని అని చెప్పలేదు. దీనికి మూలం శ్లేష అవడమే ఇందుకు కారణం. 'సమాః' అని (వధూభిః సమాః అని) స్పష్టంగా చెప్పి ఉన్నట్లయితే అప్పుడు ఉపమయే స్పష్టం అవుతుంది కాబట్టి శ్లేష దానిచేత ఆక్షిప్తం అయి ఉండేది. 'సమమ్' అనే నిపాత సామంజస్యంచేత సహశబ్దార్థాన్ని (కూడా అనే అర్థాన్ని) బోధిస్తుంది. అది

వ్యంజకత్వబలంచేతనే క్రియావిశేషణంగా గ్రహించబడి (సమంగా అనే అర్థంలో గ్రహించబడి) శబ్దశ్లేషత్వాన్ని పొందుతుంది.

శ్లేషధ్వనిని స్థాపిస్తున్నాడు - న చేతి. శ్లేషధ్వని లేకపోయినా అభిధకు ఏమీ అపరిపుష్టత్వం (పూర్తి అర్థాన్ని చెప్పకపోవడం) లేదు. అందువల్లనే అభిధ సమాప్తం అయిపోయిన తరవాత సహృదయులు ఆ రెండవ అర్థాన్ని, దాని కోసం వేరే ప్రయత్నం ఏదీ లేకుండానే గ్రహించ కలుగుతారు. ఈ విషయం వెనక -'శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ' (1.7) అనే కారికలో చెప్పబడింది. ఈ విషయం (అనగా ధ్వన్యమానార్థం లేకపోతే వాచ్యార్థానికి ఏమీ లోపం రాదు అనే విషయం) అన్ని ఉదాహరణలలోను అనుసరించాలి (గుర్తుంచుకోవాలి). అలా కాని పక్షంలో, వ్యంగ్యార్థం వాచ్యార్థనిష్పత్తికి హేతువు అని చెప్పినట్లయితే, అది గుణీభూతధ్వని అయిపోతుంది అని భావం). "చైత్రుడు బలిసి ఉన్నాడు, పగలు భోజనం చేయడంలేదు" అనే చోట అభిధ అసమాప్తంగా ఉండడంచేత తన అర్థాన్ని పూర్తి చేసుకోవడం కోసం ("రాత్రి భోజనం చేస్తున్నాడు" అనే) మరియొక అర్థాన్నిగాని, "రాత్రౌ అత్తి" అని శబ్దాన్ని కాని ఆకర్షిస్తుంది, అందుచేత ఇది తార్కికులమతం ప్రకారం అనుమానానికి గాని, మీమాంసకుల మతం ప్రకారం శ్రుతార్థాపత్తికి కాని విషయం అవుతుంది. అందుచేత అలాంటిచోట ధ్వనికి అవకాశం లేదు; సరే ఇంక అధికంగా చర్చించి చాలు. ఈ విషయాన్నే అశబ్దాపి ఇత్యాదికంచేత చెపుతున్నాడు.

## ధ్వన్యాలోకం

యథాసంఖ్యధ్వనిర్యథా -

శ్లో. అఙ్కురితః పల్లవితః కోరకితః పుష్పితశ్చ సహకారః,
అఙ్కురితః పల్లవితః కోరకితః పుష్పితశ్చ హృది మదనః. (67

అత్ర హి యథోద్దేశమనూద్దేశే యచ్చారుత్వమనురణనరూపం మదనవిశేషణభూతాఙ్కురితాదిశబ్దగతం తన్మదనసహకారయో తుల్యయోగితాసముచ్చయలక్షణాద్వాచ్యాదతిరిచ్యమానమాలక్ష్యతే ఏవమన్యేఽప్యలంకారాః యథాయోగం యోజనీయాః.

## బాలానందిని

యథాసంఖ్యాలంకారధ్వని ఎట్లనగా -

అఙ్కురితః ఇతి :- సహకారః= చూతవృక్షం, అఙ్కురితః= అంకురించింది; పల్లవితః = చిగిర్చింది. కోరకితః= మొగ్గతొడిగింది. పుష్పితశ్చ= పుష్పించింది. మదనః= మన్మథుడు, హృది=హృదయంలో, అఙ్కురితః= అంకురించాడు, పల్లవితః=చిగిర్చాడు, కోరకితః= మొగ్గతొడిగాడు, పుష్పితశ్చ= పుష్పించాడు.

అత్ర హీతి- ఇక్కడ ముందు ఒక వరసలో చెప్పిన విధంలో ఆ వరసనే అనుసరించి మళ్లీ చెప్పడంలో మదనునికి విశేషణాలైన 'అంకురిత' మొదలైన శబ్దాలలో అనురణన రూపమైన ఏ చారుత్వం ఉన్నదో అది మదన- సహకారవృక్షాలకు సంబంధించిన తుల్య యోగితా - సముచ్చయరూపమైన వాచ్యంకంటె ఉత్కృష్టంగా కనబడుతున్నది. ఏవమితి :- ఇదే విధంగా ఇతరాలంకారాలు కూడ యథాసంభవంగా సమన్వయించుకోవాలి.

లోచనం

ఏవమన్యేఽపీతి - సర్వేషామేవార్థాలంకారాణాం ధ్వన్యమానతా దృశ్యతే. యథా చ దీపకధ్వనిః :-

శ్లో. మా భవన్తమనలః పవనో వా వారణో మదకలః పరశుర్వా,
వజ్రమిన్ద్రకరవిప్రసృతం వా స్వస్తి తేఽస్తు లతయా సహ వృక్ష.

ఇత్యత్ర 'బాధిష్ట' ఇతి గోప్యమానాదేవ దీపకాత్ అత్యన్తస్నేహాస్పదత్వప్రతిపత్త్యా చారుత్వనిష్పత్తిః.

బాలానందిని

సర్వేషామితి :- అన్ని అలంకారాలూ కూడా వ్యంగ్యాలు అవడం కనబడుతున్నది. దీపకధ్వనికి ఉదాహరణం ఎట్లనగా -

మా ఇతి - భవన్తమ్= నిన్ను, అనలః = అగ్ని గాని, పవనో వా = గాలిగాని, మదకలః= మదం చేత ధ్వనిచేస్తూన్న, వారణః= ఏనుగ గాని, పరశుర్వా = గండ్రగొడ్డలి గాని, ఇన్ద్రకరవిప్రసృతమ్= ఇంద్రుని హస్తంనుంచి ప్రసరించిన, వజ్రమ్= వజ్రం కాని, 'బాధిష్ట' అని దీపకపదాన్ని (అన్నింటితోను అన్వయించే పదాన్ని అధ్యాహారం తెచ్చుకోవాలి) మా బాధిష్ట = బాధించకుండుగాక. వృక్ష = వృక్షమా లతయా, సహ= లతతో కూడ, తే= నీకు, స్వస్తి= క్షేమం, అస్తు = అగుగాక.

ఇత్యత్రేతి - ఇక్కడ దాచబడిన (గోప్యమానాత్) 'బాధిష్ట' అనే దీపకంవల్ల అత్యంతము స్నేహపాత్రమైనది ఆ లతాసహితవృక్షం అని తెలియడంచేత చారుత్వం

సాధించాడు, అనర్థకరమైన ఉపాయాలను అవలంబించి ప్రతినాయకుడు నశించాడు అని సదసదుపాయాల విషయంలో వ్యుత్పత్తిని కలిగించాలి.

లోచనం

ఉపాయశ్చ కర్త్రా ఆశ్రీయమాణః పఞ్చ అవస్థాః భజతే. తద్యథా - స్వరూపమ్, స్వరూపాత్ కించిత్ ఉచ్ఛూనతామ్, కార్యసంపాదనయోగ్యతామ్, ప్రతిబన్ధోపనిపాతేన ఆశఙ్క్యమానతామ్, నివృత్తప్రతిపక్షతాయాం బాధకబాధనేన సుధృఢఫలపర్యన్తతామ్. ఏవమార్తిసహిష్ణూనామ్, విప్రలమ్భభీరూణామ్, ప్రేక్షాపూర్వకారిణాం తావదేవం కారణోపాదానమ్. తా ఏవంవిధాః పఞ్చావస్థాః కారణగతాః మునినోక్తాః -

"సంసాధ్యే ఫలయోగే తు వ్యాపారః కారణస్య యః,
తస్యానుపూర్వ్యా విజ్ఞేయాః పఞ్చావస్థాః ప్రయోక్తృభిః.
ప్రారమ్భశ్చ ప్రయత్నశ్చ తథా ప్రాప్తేశ్చ సంభవః,
నియతా చ ఫలప్రాప్తిః ఫలయోగశ్చ పఞ్చమః. (నా.శా.27- 7, 9) ఇతి.

బాలానందిని

ఉపాయశ్చేతి - కర్తచేత ఆశ్రయించబడే ఉపాయం ఐదు అవస్థలను పొందుతుంది. (ఆ ఉపాయానికి ఐదు అవస్థలు ఉంటాయి). ఎట్లనగా - స్వరూపాన్ని (అనగా ఉపాయాన్ని అనుష్ఠించడానికి ప్రారంభించడాన్ని) స్వరూపంనుంచి కొంచెం ఉబకడాన్ని (అనగా పుష్టిచెందడాన్ని), కార్యసంపాదనయోగత్వాన్నీ, విఘ్నాలు వచ్చిపడడంచేత ఏ మౌతుందా అని ఆశంకించబడడాన్నీ. శత్రువులు (విఘ్నాలు) తొలగిపోవడంతో బాధకమైన దానిని బాధించడంచేత సునిశ్చితమైన ఫలపర్యంతత్వాన్ని (తప్పకుండా పలం లభిస్తుందనే నిశ్చయాన్నీ) ఈ ఐదు అవస్థలనూ పొందుతుంది. ఎంతటి శ్రమనైనా సహించగలవాళ్ళూ, కార్యానికి విఘ్నా లేవీ రావు కదా అని భయపడుతూండేవాళ్లూ అయిన, బాగా ఆలోచించి పనిచేసేవాళ్లందరూ ఈ విధంగానే కారణాలను (ఉపాయాలను) అవలంబిస్తారు. కారణాలకి సంబంధించిన ఈ విధమైన ఐదు అవస్థలనూ ముని చెప్పి ఉన్నాడు.

సంసాధ్యే ఇతి - ఫలయోగే = ఫలసంబంధం సంసాధ్యే= సాధింప దగినదై ఉండగా, కారణస్య= నాయకాదులయొక్క, యః వ్యాపారః = ఏ వ్యాపారం ఉన్నదో,

తస్య= దానియొక్క. పఞ్చ అవస్థాః= ఐదు అవస్థలు, ప్రయోక్తృభిః= ఉపాయాలను ప్రయోగించేవాళ్లచేత, ఆనుపూర్వ్యా= వరుసగా, విజ్ఞేయాః= తెలియదగినవి. ప్రారమ్భశ్చ= ప్రారంభమూ, ప్రయత్నశ్చ= ప్రయత్నము, తథా= మరియు, ప్రాప్తేః= ఫలప్రాప్తియొక్క, సంభవః= సంభవం (లభించవచ్చుననే ఊహ), నియతా= తప్పనిసరియైన, ఫలప్రాప్తిః= ఫలలాభం (తప్పక లభిస్తుందనే అభిప్రాయం) పఞ్చమః= ఐదవదైన, ఫలయోగశ్చ= ఫలసంబంధము.

లోచనం

ఏవం యా ఏతాః కారణస్యావస్థాః తత్సంపాదకం యత్ కర్తురితివృత్తం పఞ్చధా విభక్తం, త ఏవ ముఖప్రతిముఖగర్భావమర్శనిర్వహణాఖ్యాః అన్వర్థనామానః పఞ్చ సంధయః ఇతివృత్తఖణ్డాః, సంధీయన్తే ఇతి కృత్వా. తేషామపి సంధీనాం స్వనిర్వాహ్యం ప్రతి తథా క్రమదర్శనాత్ అవాన్తరభిన్నాః ఇతివృత్తభాగాః సంధ్యఙ్గాని - "ఉపక్షేపః పరికరః పరిన్యాసో విలోభనమ్" ఇత్యాదీని.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ఏ ఈ కారణానికి సంబంధించిన అవస్థలు ఉన్నాయో, వాటిని సంపాదించే కర్తయొక్క ఏ ఇతివృత్తం ఐదు విధాలుగా విభజించబడుతుందో అవే ముఖ-ప్రతిముఖ-గర్భ-అవమర్శ-నిర్వహణా లనే సార్థకనామధేయాలు గల ఐదు సంధులు; ఇతివృత్తఖండాలు. (అవి ఒకదాని తరవాత ఒకటి) సంధించబడతాయి గాన సంధులు. ఆ సంధులకు కూడ తమచేత నిర్వహించబడదగిన, తాము నిర్వహించవలసి ఉన్న, ఫలాన్ని గూర్చి ఆ విధమైన క్రమం ఉండడంవల్ల వాటి అవాంతరభిన్నాలైన ఇతివృత్తభాగాలు సంధ్యంగాలు - ఉపక్షేపం, పరికరం, పరిన్యాసం, విలోభనం మొదలైనవి.

లోచనం

అర్థప్రకృతయోఽత్రైవాన్తర్భూతాః తథాహి - స్వాయత్తసిద్ధేః బీజమ్, బిన్దుః, కార్యమ్ ఇతి తిస్రః. బీజేన సర్వవ్యాపారాః, బిన్దునా అనుసంధానం, కార్యేణ నిర్వాహః, సందర్శనప్రార్థనావ్యవసాయరూపా హ్యేతాస్తిస్రః అర్థే సంపాద్యే కర్తుః ప్రకృతయః స్వభావవిశేషాః. సచివాయత్తసిద్ధిత్వే తు సచివస్య

ఏషాం తు భేదానాం సంసృష్టిత్వం సంకరత్వం చ యథాయోగం చిన్త్యమ్.

బాలానందిని

సుధేతి :- 'సుధాధామని' (అమృతానికి స్థానమైన చంద్రునియందు) అని 'చంద్ర' శబ్దానికి పర్యాయంగా ఉపయోగించబడినా ఈ పదం "సంతాపాన్ని తొలగించ తలచుకొనుచున్నవాడు" అని చెప్పడంలో హేతుత్వాన్ని వ్యంజింపచేస్తూన్నది. అందుచేత ఇక్కడ హేత్వలంకారధ్వని కూడ ఉంది. త్వదీయేతి - "నీ కుచశోభ మృగాంకశోభా కూడ మదనోద్దీపకాలుగా ఉన్నాయి" అని సహోక్త్యలంకారధ్వని కూడ ఉంది. త్వదితి - 'చంద్రుడు నీ కుచాలవలె ఉన్నాడు. నీ కుచాభోగం చంద్రునితో సమంగా ఉంది' అనే అర్థం వ్యంగ్యం అవడంచేత ఉపమేయోపమాధ్వని కూడ ఉంది. ఈ విధంగా ఇక్కడ ఇంకా మరికొన్ని అలంకారధ్వనిభేదాలు ఊహించడానికి వీలు ఉంది. ఎందువల్ల ననగా - ఈ మహాకవి వాక్కు కామధేనువు. యతః ఇతి - ఎందువల్ల అనగా -

హేలాపీతి :- కస్యచిత్= ఒకనియొక్క, హేలాపి= విలాస కూడ, ఒకడు అలవోకగా చేసిన పని కూడ, అచిన్త్యఫలప్రసూత్యై= ఊహింపశక్యం కాని ఫలితాలను ఇవ్వడానికి సమర్థం అవుతుంది. కస్యాపి= ఒకానొకని, యత్నః = ప్రయత్నం, అణవే= అత్యల్పమైన, ఫలాయ= పలం ఇవ్వడానికి, న అలమ్= సమర్థం కాదు, దిగ్దన్తిరోమచలనమ్= దిగ్గజం యొక్క రోమాల కదలిక కూడ, ధరణీమ్= భూమిని, ధునోతి= ఊపివేస్తుంది. ఖాత్= ఆకాశంనుంచి, సంపతన్నపి= వచ్చి వేగంగా పడుతున్నా కూడ, భృఙ్గః= తుమ్మెద, లతామ్= లతను, న చలయేత్= చలింపచేయజాలదు.

అందువల్ల మహాకవుల రచనలో ఇన్ని విశేషాంశాలు ఉండడంలో ఆశ్చర్యం లేదని భావం. ఏషామితి :- ఈ భేదాల సంసృష్టి - సంకరాలను కూడా యథావకాశంగా ఊహించుకొనాలి.

లోచనం

అతిశయోక్తిధ్వనిర్యథా మమైవ-

శ్లో. కేలీకన్దలితస్య విభ్రమమధోర్ధుర్యం వపుస్తే దృశౌ
భఙ్గీభఙ్గురకామకార్ముకమిదం భ్రూనర్మకర్మక్రమః,
ఆపాతేఽపి వికారకారణమహో వక్త్రామ్బుజన్మాసవః
సత్యం సున్దరి వేధసస్త్రిజగతీసారస్త్వమేకా కృతిః.

అత్ర మధుమాసమదనాసవానాం త్రైలోక్యే సుభగతా అన్యోన్యం పరిపోషకత్వేన. తే తు త్వయి లోకోత్తరేణ వపుషా సంభూయ స్థితాః ఇతి అతిశయోక్తిర్ధ్వన్యతే. "ఆపాతేఽపి వికారకారణమ్" ఇత్యాస్వాదపరంపరా క్రియయాపి వినా వికారాత్మనః ఫలస్య సంపత్తిరితి విభావనాధ్వనిరపి. "విభ్రమమధోర్ధుర్యమ్" ఇతి తుల్యయోగితాధ్వనిరపి. ఏవం సర్వాలఙ్కారాణాం ధ్వన్యమానత్వమస్తీతి మన్తవ్యమ్; న తు యథా కైశ్చిత్ నియతవిషయీకృతమ్. యథాయోగమితి - క్వచిదలఙ్కారః, క్వచిద్వస్తు వ్యఞ్జకమిత్యర్థో యోజనీయ ఇతి. 27

బాలానందిని

అతిశయోక్తీతి - అతిశయోక్తిధ్వనికి ఉదాహరణంగా నా శ్లోకమే ఎట్లనగా -

కేలీతి - తే దృశౌ= నీ నేత్రాలు, కేలికన్దలితస్య= విలాసిజనుల క్రీడయొక్క నవాంకురావిర్భావం కలిగిన, (అప్పుడే విలాసిజనుల క్రీడను అంకురింపచేసిన), విభ్రమమధోః= శృంగార చేష్టలనే వసంతర్తువుయొక్క, ధుర్యమ్= భారవహనక్షమమైన, అనగా కామోద్దీపనాదికార్యభారాన్ని వహించకలిగిన, వపుః= శరీరం (శరీరంగా ఉన్నాయి). నీ నేత్రద్వయం కొంచెం కాలం క్రితమే ఆవిర్భవించిన వసంతుని కామోద్దీపనాది కార్యాలు చేసే శరీరమే అని భావం. భ్రూనర్మకర్మక్రమః= నీ కనుబొమ్మల విలాసక్రమం, ఇదమ్= ఈ, భఙ్గీభఙ్గురకామకార్ముకమ్= వివిధభంగులలో వంగుతూన్న మన్మథధనుస్సు. వక్త్రామ్బుజన్మా= ముఖపద్మంనుండి పుట్టిన, ఆసవః= ఆసవం (అధరరసం అనే ఆసవం) ఆపాతేఽపి= కొంచెం ఆస్వాదించినా కూడ, వికారకారణమ్= వికారాలకి కారణం. అహో= ఏమి ఆశ్చర్యం! సున్దరి= ఓ! సుందరీ! సత్యమ్= నిజంగా, త్వమ్= నువ్వు, త్రిజగతీసారః= మూడు లోకాలలో సారమైన, వేధసః= బ్రహ్మదేవునియొక్క ఏకా= ఒక్క, కృతిః= కృతివి.

అత్రేతి - మధుమాస - మదన - ఆసవాలు పరస్పరం ఒకదాని నొకటి పోషించుకుంటాయి. అందుచేత అవి మూడు లోకాలలోను సౌభాగ్యం ఉన్నవి. అవన్నీ కలిసి నీలో లోకోత్తరమైన శరీరంతో ఉన్నాయి అని అతిశయోక్తి ధ్వనించబడుతూన్నది. "ఆపాతేఽపి వికారకారణమ్" అని చెప్పడంచేత ఆస్వాదపరంపరాక్రియ, అలాగ మాటి మాటికి ఆస్వాదిస్తూనే ఉండడం అనే క్రియ, లేకపోయినా వికారరూపమైన ఫలం సంపన్నం అయింది అని చెప్పడంచేత విభావనాధ్వని కూడ. (కారణం లేకపోయినా

కార్యం పుట్టడం విభావన). "విభ్రమమధోః ధుర్యమ్" అని చెప్పడంచేత తుల్యయోగితాధ్వని.

వివరణ:- "న్యూనస్యాపి విశిష్టేన గుణసామ్యవివక్షయా,
తుల్యకార్యక్రియాయోగాదితుక్త్యా తుల్యయోగితా" (భామహ కావ్యా. 3.27)

అని భామహుని లక్షణం ప్రకారం - తక్కువదానికి కూడా విశిష్టమైన దానితో గుణసామ్యం ఉందని చెప్పాలనే ఇచ్ఛచేత, అది విశిష్టమైనదానితో సమానమైన పని చేసినట్లు వర్ణించడం తుల్యయోగిత. ఈ లక్షణం ప్రకారం నేత్రద్వయానికీ వసంతానికీ సామ్యం చెప్పాలనే ఇచ్ఛచేత "నీ నేత్రద్వయం మధువు వలె కామోద్దీపనాదిభారం వహిస్తూన్నది' ' అని గమ్యం అవడంచేత తుల్యయోగితాధ్వని అని అర్థం.

ఏవమితి - ఈ విధంగా సర్వాలంకారాలు కూడ ధ్వనింపబడడం ఉంది అని గ్రహించాలి. అంతేకాని కొందరు చెప్పినట్లు కొన్ని అలంకారాలు మాత్రమే ధ్వనించబడతాయి అనే మాట యుక్తం కాదు. యథాయోగమితి - కొన్ని చోట్ల వాచ్యమైన అలంకారం అలంకారాంతరాన్ని వ్యంజింపచేస్తుంది, మరికొన్ని చోట్ల వస్తువు వ్యంజింపచేస్తుంది అనే విషయాన్ని సమన్వయం చేసుకోవాలి అని అర్థం.

## ధ్వన్యాలోకం

ఏవమలంకారధ్వనిమార్గం వ్యుత్పాద్య తస్య ప్రయోజనవత్తాం ఖ్యాపయితుమిదముచ్యతే -

కా. శరీరీకరణం యేషాం వాచ్యత్వేన వ్యవస్థితమ్,
తేఽలఙ్కారాః పరాం ఛాయాం యాన్తి ధ్వన్యఙ్గతాం గతాః. 28

ధ్వన్యఙ్గతా చ ఉభాభ్యాం ప్రకారాభ్యాం - వ్యఞ్జకత్వేన వ్యఙ్గ్యత్వేన చ. తత్రేహ ప్రకరణాత్ వ్యఙ్గ్యత్వేనేత్యవగన్తవ్యమ్. వ్యఙ్గ్యత్వేఽప్య లఙ్కారాణాం ప్రాధాన్యవివక్షాయామేవ సత్యాం ధ్వనావన్తఃపాతః ఇతరథా తు గుణీభూతవ్యఙ్గ్యత్వం ప్రతిపాదయిష్యతే.

### బాలానందిని

ఏవమితి - ఈ విధంగా అలంకారధ్వనిమార్గాన్ని విశదీకరించి దానికి ప్రయోజనం ఉన్న దనే విషయాన్ని తెలపడంకోసం ఇది చెప్పబడుతున్నది -

శరీరీతి - యేషామ్= ఏ అలంకారాలకు, వాచ్యత్వేన= వాచ్యత్వంచేత, శరీరీకరణమ్= కావ్యశరీరంగా చేయడం, వ్యవస్థితమ్= ఉన్నదో, తే అలఙ్కారాః= ఆ అలంకారాలు, ధ్వన్యఙ్గతామ్= ధ్వనికావ్యానికి అంగత్వాన్ని, గతాః= పొందినవై, పరామ్= గొప్ప, ఛాయామ్= శోభను, యాన్తి= పొందుతున్నాయి.

ధ్వన్యఙ్గతేతి - వ్యంజకంగా ఉండడంచేత, వ్యంగ్యంగా ఉండడంచేత, రెండు విధాల అలంకారాలు ధ్వనికావ్యాంగాలు అవుతాయి. అందులో ఇక్కడ ప్రకరణాన్ని పట్టి(ధ్వన్యమానాలంకారాల విషయం చర్చించబడుతున్నది గాన) వ్యంగ్యాలుగా ఉండి ధ్వనికావ్యానికి అంగంగా ఉండడాన్ని గ్రహించాలి. అలంకారాలు వ్యంగ్యాలైనా కూడ వాటికి ప్రాధాన్యం చెప్పాలనే ఉద్దేశ్యం ఉన్నప్పుడే వాటికి ధ్వనిలో అంతర్భావం. అలా కాని పక్షంలో వాటికి గుణీభూతవ్యంగ్యత్వం ప్రతిపాదించబడగలదు.

లోచనం

నను ఉక్తాస్తావచ్చిరన్తనైః అలంకారాః. తేషాం తు భవతా యది వ్యఙ్గ్యత్వం ప్రదర్శితం కిమియతా ఇత్యాశఙ్క్యాహ - ఏవమిత్యాది. యేషామలంకారాణాం వాచ్యత్వేన శరీరీకరణం, శరీరభూతాత్ ప్రస్తుతాత్ అర్థాన్తరభూతతయా అశరీరాణాం కటకాదిస్థానీయానాం శరీరతాప్రతిపాదనం వ్యవస్థితం సుకవీనామ్ అయత్నసంపాద్యతయా, యది వా వాచ్యత్వే సతి యేషాం శరీరతాపాదనమపి న వ్యవస్థితం, దుర్ఘటమితి యావత్, తేఽలఙ్కారాః ధ్వనేర్వ్యాపారస్య కావ్యస్య వా అఙ్గతాం, వ్యఙ్గ్యస్వరూపతయా, గతాః సన్తః పరాం దుర్లభాం ఛాయాం కాన్తిమ్ ఆత్మరూపతాం యాన్తి.

ఏతదుక్తం భవతి - సుకవిః విదగ్ధపురన్ధ్రీవత్ భూషణం యద్యపి శ్లిష్టం యోజయతి తథాపి శరీరతాపత్తిరేవ అస్య కష్టసంపాద్యా, కుఙ్కుమపీతికాయా ఇవ. ఆత్మతాయాస్తు కా సంభావనాపి? ఏవంభూతా చేయం వ్యఙ్గ్యతా యా అప్రధానభూతాపి వాచ్యమాత్రాలంకారేభ్యః ఉత్కర్షమలంకారాణాం వితరతి. బాలక్రీడాయామివ రాజత్వమివ ఇత్యముమర్థం మనసి కృత్వా ఆహ-

ఇతరథా త్వితి. 18

బాలానందిని

నన్వితి - ప్రాచీనులు అలంకారాలను గూర్చి చెప్పే ఉన్నారు; వాటికే వ్యంగ్యత్వాన్ని నువ్వు ప్రదర్శించావు. తావన్మాత్రంచేత ఏం సాధించినట్లు అని ఆశంకించుకొని ఏవమిత్యాదికం చెపుతున్నాడు. వాచ్యాలయిన అలంకారాలు (లోకంలో కటకాద్యలంకారాలవంటివి అవడంచేత, శరీరమైన ప్రస్తుతార్థంకంటె భిన్నమైనవి. అందుచేత అవి శరీరం (కావ్యశరీరం) కావు. వాటిని కూడ సుకవులు అనాయాసంగా శరీరంగా చేయకలుగుతున్నారు.

కారిక పూర్వార్థంలో ఉన్న 'వాచ్యత్వేన' అనే దానిని తృతీయంగా గ్రహించి పై అర్థం చెప్పబడింది. దానిని 'వాచ్యత్వే'' అని సప్తమ్యంతంగా గ్రహించి ''వాచ్యత్వే న వ్యవస్థితమ్' అని వ్యాఖ్యానిస్తున్నాడు - యది వా ఇతి :- వాచ్యాలవడంచేత ఏ అలంకారాలను శరీరంగా చేయడం కూడ శక్యం కాని పనియో అని అర్థం. ఆ అలంకారాలు, వ్యంగ్యరూపాలై, ధ్వన్యఙ్గతాం గతాః=ధ్వనివ్యాపారానికి, లేదా ధ్వనికావ్యానికి అంగత్వాన్ని పొందినవై, పరామ్= దుర్లభమైన, గొప్ప, ఛాయామ్= కాంతిని, ఆత్మరూపత్వాన్ని, పొందుతాయి.

ఇక్కడ చెప్పిన విషయం ఇది - సుకవి, మంచి నేర్పు గల స్త్రీ భూషణాలను శరీరంమీద కూర్చినట్లు, అలంకారాలను చాల అందంగా (శరీరంలో) కలిసిపోయేటట్లు కూర్చినా కూడ వాటిని శరీరంగా చేయడం, శరీరాంతర్గతం చేయడం ఎంతో శ్రమపడితేనే కాని శక్యం కాదు. కాశ్మీరకుంకుమాన్ని శరీరం మీద వేసి మర్దించి దాని పచ్చరంగు శరీరానికి పట్టేట్లు, శరీరంలో కలిసిపోయే టట్లు చేయడం ఎంత కష్టమో అంత కష్టం. అలాంటప్పుడు దాన్ని ఆత్మగా చేయడం అనేది ఊహించడానికి కూడ శక్యం కాని పని. వ్యంగ్యత్వం ఎలాంటి దనగా - అది అప్రధానమైనా కూడ కేవలం వాచ్యాలుగా ఉన్న అలంకారాలకంటె ఈ (వ్యంగ్యాలైన) అలంకారాలకి ఉత్కర్షను ఇస్తుంది. ఇది బాల్యక్రీడలో కూడ రాజత్వం వంటిది. అనగా పదిమంది బాలలు కలిసి తమలో ఒకణ్ణి రాజును చేసి ఆడుకుంటూన్నప్పుడు ఆ సమయంలో రాజత్వం ఇచ్చిన ఆ బాలునికి ఇతరబాలురకంటె వైశిష్ట్యం ఉన్నట్లు. ఈ విషయాన్నే మనస్సులో ఉంచుకొని ఇతరథా తు ఇత్యాదికం చెపుతున్నాడు. 28

ధ్వన్యాలోకం

అఙ్గిత్వేన వ్యఙ్గ్యతాయామపి అలఙ్కారాణాం ద్వయీ గతిః- కదాచిద్వస్తుమాత్రేణ వ్యజ్యన్తే కదాచిదలంకారేణ - తత్ర-

కా. వ్యజ్యన్తే వస్తుమాత్రేణ యదాలంకృతయస్తదా,

ధ్రువం ధ్వన్యఙ్గతా తాసాం

అత్ర హేతుః

కావ్యవృత్తిస్తదాశ్రయా. 29

యస్మాత్తత్ర తథావిధవ్యఙ్గ్యాలంకారపరత్వేనైవ కావ్యం ప్రవృత్తమ్. అన్యథా తు తద్వాక్యమాత్రమేవ స్యాత్.

బాలానందిని

అఙ్గిత్వేనేతి :- అలంకారాలు అంగిగా వ్యంజింపజేయబడే టప్పుడు కూడ రెండు పద్ధతు లుంటాయి -ఒకప్పుడు వస్తుమాత్రంచేతనే వ్యంజింపబడతాయి; ఒకప్పుడు అలంకారంచేత. అందులో -

వ్యజ్యన్తే ఇతి :- అలంకృతయః = అలంకారాలు, యదా= ఎప్పుడు, వస్తుమాత్రేణ= వస్తుమాత్రంచేత, తయా= ఆ వ్యంగ్యతచేత, వ్యజ్యన్తే= వ్యంజింపచేయబడునో, తాసామ్= వాటికి, ధ్రువమ్= తప్పక, ధ్వన్యఙ్గతా= ధ్వనిలో అంగత్వము, అనగా అవి ధ్వనిలో ఒక భేదం అని అర్థం.

ఇందుకు కారణం ఏమనగా-

కావ్యేతి - కావ్యవృత్తిః= కవివ్యాపారంయొక్క ప్రవృత్తి. తదాశ్రయా= ఆ అలంకారాలను ఆశ్రయించినది, అనగా అలంకారాలను గూర్చి ఏర్పడినది.

యస్మాదితి - ఎందువలన అక్కడ కావ్యం ఆ విధమైన వ్యంగ్యాలంకారాన్ని ప్రధానంగా దృష్టిలో ఉంచుకొని (వ్యంగ్యాలంకారపరత్వేన) ప్రవర్తించినదో అందువల్ల అవి ధ్వన్యంగములు అని భావం. అలా కాకపోతే అది (లౌకికమైన) వాక్యం మాత్రమే అవుతుంది.

లోచనం

తత్రేతి - ద్వయ్యాం గతౌ సత్యామ్. "అత్ర హేతుః" ఇత్యయం వృత్తిగ్రన్థః - కావ్యస్య కవివ్యాపారస్య, వృత్తిః తదాశ్రయా అలంకారప్రవణా యతః. అన్యథేతి - యది న తత్పరత్వమిత్యర్థః. తేన తత్ర గుణీభూతవ్యఙ్గ్యతా నైవ శఙ్క్యేతి తాత్పర్యమ్.

బాలానందిని

తత్రేతి - రెండు విధాలైన గతి ఉండగా అని అర్థం. "అత్ర హేతుః" అనేది వృత్తికి చెందినది, కారికాభాగం కాదు. ఎందువలన - కావ్యస్య = కవివ్యాపారం యొక్క వృత్తి, తదాశ్రయా= అలంకారాలయందు ఆధరం కలదో, అన్యథేతి - అలంకారపరత్వం లేని పక్షంలో అని అర్థం. తేనేతి - అందుచేత అక్కడ గుణీభూతవ్యంగ్యత్వం శంకించతగినది కాదు అని తాత్పర్యం. వస్తుమాత్రంచేత అలంకారాలు వ్యంజింపబడినచోట అలంకార ధ్వనినే అంగీకరించాలి కాని గుణీభూతధ్వనిగా గ్రహించకూడదు అని భావం.

## ధ్వన్యాలోకం

తాసామేవ అలంకృతీనామ్-

కా. అలంకారాన్తరవ్యఙ్గ్యభావే

పునః

ధ్వన్యఙ్గతా భవేత్,

చారుత్వోత్కర్షతో వ్యఙ్గ్యప్రాధాన్యం యది లక్ష్యతే. 30

ఉక్తం హ్యేతత్ - "చారుత్వోత్కర్షనిబన్ధనా వాచ్యవ్యఙ్గ్యయోః ప్రాధాన్యవివక్షా" ఇతి. వస్తుమాత్రవ్యఙ్గ్యత్వే చాలంకారాణామ్ అనన్తరోపదర్శితేభ్య ఏవ ఉదాహరణేభ్యః విషయః ఉన్నేయః. తదేవమ్ అర్థమాత్రేణ, అలఙ్కారవిశేషరూపేణ వా అర్థేన అర్థాన్తరస్య అలంకారస్య ప్రకాశనే చారుత్వోత్కర్షనిబన్ధనే సతి ప్రాధాన్యే అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యఙ్గ్యః ధ్వనిః అవగన్తవ్యః.

బాలానందిని

**తాసామేవేతి** - ఆ అలంకారాలకే -

అలఙ్కారాన్తరేతి - అలంకారాన్తరవ్యంగ్యభావే(పునః)= మరొక అలంకారంచేత వ్యంగ్యత్వం ఉన్నట్లయితే, చారుత్వోత్కర్షతః= చారుత్వంయొక్క ఆధిక్యంవల్ల, వ్యఙ్గప్రాధాన్యమ్ = వ్యంగ్యంయొక్క ప్రాధాన్యం, లక్ష్యతే యది = చూడబడినట్లయితే, ధ్వ్యఙ్గతా= ధ్వన్యంగత్వం, ధ్వనికావ్యాగత్వం, ధ్వనిభేదత్వం, భవేత్= అగును.

ఉక్తమితి - "వాచ్యవ్యంగ్యాల ప్రాధాన్యవివక్ష చారుత్వంయొక్క ఉత్కర్షమీద ఆధారపడి ఉంటుంది" అని (వెనకనే) చెప్పబడింది కదా? అలంకారాలు వస్తుమాత్ర వ్యంగ్యా లవడానికి విషయం, అనగా అవి (అలంకారాలు) ఏ విధంగా వస్తుమాత్రంచేత వ్యంగ్యాలవుతాయో, ఇంత క్రితమే చూపబడిన ఉదాహరణలనుండి ఊహించదగినది. తదేవమితి - అందువల్ల ఈ విధంగా అర్థమాత్రంచేత గాని, అలంకారవిశేషరూపమైన అర్థంచేతగాని; మరియొక అర్థం గాని, మరియొక అలంకారం గాని ప్రకాశించబడినప్పుడు చారుత్వంయొక్క ఆధిక్యం మీద ఆధారపడిన ప్రాధాన్యం ఉన్న పక్షంలో అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యరూపమైన ధ్వనికావ్యం అని తెలుసుకొనాలి.

లోచనం

"తాసామేవ అలంకృతీనామ్" ఇత్యయం పరిష్యమాణకారికోపస్కారః. 'పునః' ఇతి కారికామధ్యే ఉపస్కారః. ధ్వన్యఙ్గతేతి - ధ్వనిభేదత్వమిత్యర్థః. వ్యఙ్గ్యప్రాధాన్యమితి - అత్ర హేతుః చారుత్వోత్కర్షతః ఇతి. యదీతి - తదప్రాధాన్యే తు వాచ్యాలఙ్కార ఏవ ప్రధానమితి గుణీభూతవ్యఙ్గ్యతేతి భావః. నను అలంకారః వస్తునా వ్యజ్యతే అలంకారాన్తరేణ చ వ్యజ్యతే ఇత్యత్ర ఉదాహరణాని కిమితి న దత్తానీతి ఆశఙ్క్యాహ - వస్త్వితి. ఏతత్సంక్షిప్య ఉపసంహరతి - తదేవమితి. వ్యఙ్గ్యస్య వ్యఞ్జకస్య చ ప్రత్యేకం వస్త్వలంకారరూపతయా ద్విప్రకారత్వాత్ చతుర్విధోఽయమ్ అర్థశక్త్యుద్భవః ఇతి తాత్పర్యమ్. 29, 30

బాలానందిని

తాసామితి - "తాసామేవ అలంకృతీనామ్" అనేది చదవబోయే కారికకు ఉపస్కారం; అనగా దాని అర్థాన్ని పూరించడానికి చేర్చబడింది అని అర్థం. 'పునః' అనే పదం కారికామధ్యలో ఉపస్కారం. ధ్వన్యఙ్గతా ఇతి. ధ్వనిభేదత్వం అని అర్థం. వ్యఙ్గ్యప్రాధాన్య మితి - "చారుత్వోత్కర్షతః" అనేది దీనికి (వ్యంగ్యప్రాధాన్యానికి) హేతువు. యదీతి - వ్యంగ్యానికి ప్రాధాన్యం లేని పక్షంలో వాచ్యాలంకారమే ప్రధానం అవుతుంది. అప్పుడు ఆ వ్యంగ్యం గుణీభూతవ్యంగ్యమే అవుతుంది అని భావం. నన్వితి :- అలంకారం వస్తువుచేత వ్యంజించబడుతుంది, మరొక అలంకారంచేత వ్యంజింపబడుతుంది అనే దానికి ఉదాహరణలు చూపలేదేమి? అని ఆశంకించుకొని చెపుతున్నాడు - వస్త్వితి. ఈ విషయా న్నంతనీ సంక్షేపించి తదేవమ్ ఇత్యాదికంతో చెపుతున్నాడు.

వ్యఙ్గ్యస్యేతి : వ్యంగ్యమూ వ్యంజకమూ కూడ ఒక్కొక్కటి వస్త్వలంకారరూపంల రెండు విధాలవడంచేత ఈ అర్థశక్త్యుద్భవం నాలుగు విధాలు అని తాత్పర్యం 29, 3

ధ్వన్యాలోకం

ఏవం ధ్వనేః ప్రభేదాన్ ప్రతిపాద్య తదాభాసవివేకం కర్తుమ్ ఉచ్యతే -

కా. యత్ర ప్రతీయమానోఽర్థః ప్రమ్లిష్టత్వేన భాసతే,

వాచ్యస్యాఙ్గతయా వాపి నాస్యాసౌ గోచరో ధ్వనేః. 31

ద్వివిధోఽపి ప్రతీయమానః స్ఫుటః అస్ఫుటశ్చ. తత్ర య ఏ స్ఫుటః శబ్దశక్త్యా అర్థశక్త్యా వా ప్రకాశతే స ఏవ ధ్వనేర్మార్గః నేతర స్ఫుటోఽపి యః అభిధేయస్య అఙ్గత్వేన ప్రతీయమానః అవభాస సః అస్య అనురణనరూపవ్యఙ్గ్యస్య ధ్వనేః అగోచరః. యథా -

గాథ. కమలాఅరా ణం మలిఆ హంసా ఉడ్డావిఆ ణ అ పిఉచ్ఛా,

కేణ వి గామతడాఏ అబ్భం ఉత్తాణఅం ఫలిహమ్. (68

అత్ర హి ప్రతీయమానస్య ముగ్ధవధ్వాః జలధరప్రతిబిమ్బదర్శనస వాచ్యాఙ్గత్వమేన.

బాలానందిని

ఏవమితి - ఈవిధంగా ధ్వనియొక్క ప్రభేదాలను ప్రతిపాదించి ధన్యాభాసవివేచ చేయడంకోసం చెప్పబడుతున్నది -

యత్రేతి - యత్ర= ఎక్కడ, ప్రతీయమానః అర్థః= వ్యంగ్యమైన అర్థం, ప్రమ్లిష్టత్వేన అస్పష్టంగా, దేనితోనో కలసిపోయినట్లు, భాసతే= భాసిస్తుందో, వాచ్యస్య= వాచ్యంయొక అఙ్గతయా వాపి= అంగంగా గాని, భాసిస్తుందో, అసౌ= ఆ ప్రతీయమానార్థం, ధ్వనే ధ్వని కావ్యానికి, గోచరః= గోచరం, న = కాదు.

ద్వివిధోఽపీతి -రెండు విధాలైన (శబ్దశక్తిమూల - అర్థశక్తిమూల) ప్రతీయమానార్థమ కూడ స్ఫుటంగాను, అస్ఫుటంగానూ కూడ ఉండవచ్చు. వాటిలో శబ్దశక్తిచేతగా అర్థశక్తిచేతగాని భాసించే ఏ అర్థం స్ఫుటంగా ప్రకాశిస్తుందో అదే ధ్వనిమార్గం, రెండవ

కాదు. స్ఫుటమైనది కూడా ఏది అభిధేయానికి (వాచ్యానికి) అంగంగా ప్రతీయమానమై భాసిస్తుందో అది ఈ అనురణనరూపవ్యంగ్యరూపధ్వనికి గోచరం కాదు. ఎట్లనగా -

కమలాఅరా ఇతి - (దీని ఛాయ లోచనంలో ఉంది) కేనాపి = ఎవనిచేతనో, గ్రామతడాగే= గ్రామంలోని చెరువులో, అభ్రమ్= ఆకాశం, ఉత్తానితమ్= వెల్లగితలా చేయబడినదై, క్షిప్తమ్= విసరబడినది., కమలాకరాః= పద్మలతలు, న మలితాః= నలగగొట్టబడలేదు; హంసాశ్చ= హంసలుకూడ, సహసా= హటాత్తుగా, న ఉడ్డాయితాః= ఎగరగొట్టబడలేదు.

అత్రేతి - ఇక్కడ ముగ్ధరాలైన స్త్రీ మేఘప్రతిబింబాన్ని చూడడం అనే వ్యంగ్యార్థం వాచ్యానికి అంగంగానే ఉంది.

లోచనం

ఏవమితి - అవివక్షితవాచ్యో వివక్షితాన్యపరవాచ్య ఇతి ద్వౌ మూలభేదౌ. ఆద్యస్య ద్వౌ భేదౌ - అత్యన్తతిరస్కృతవాచ్యః, అర్థాన్తరసంక్రమితవాచ్యశ్చ. ద్వితీయస్య ద్వౌ భేదౌ - అలక్ష్యక్రమః అనురణనరూపశ్చ. ప్రథమః అనన్తభేదః. ద్వితీయః ద్వివిధః - శబ్దశక్తిమూలః అర్థశక్తిమూలశ్చ. పశ్చిమస్త్రివిధః - కవిప్రౌఢోక్తికృతశరీరః, కవినిబద్ధవక్తృప్రౌఢోక్తికృతశరీరః, స్వతఃసంభవీ చ. తే చ ప్రత్యేకం వ్యఙ్గ్యవ్యఞ్జకయోః ఉక్తభేదనయేన చతుర్ధేతి ద్వాదశవిధః అర్థశక్తిమూలః. ఆద్యాశ్చత్వారో భేదా ఇతి షోడశ ముఖ్యభేదాః, తే చ పదవాక్యప్రకాశత్వేన ప్రత్యేకం ద్వివిధా వక్ష్యన్తే. అలక్ష్యక్రమస్య తు వర్ణపదవాక్యసంఘటనాప్రబన్ధప్రకాశ్యత్వేన పంచత్రింశద్భేదాః.

తదాభాసేభ్యః ధ్వన్యాభాసేభ్యః వివేకః విభాగః. అస్యేత్యాత్మభూతస్య ధ్వనేః అసౌ కావ్యవిశేషో న గోచరః న విషయ ఇత్యర్థః.

"కమలాకరా న మలితా హంసా ఉడ్డాయితా న చ సహసా,
కేనాపి గ్రామతడాగేఽభ్రముత్తానితం క్షిప్తమ్". ఇతి ఛాయా.

అన్యే తు పిఉచ్ఛా పితృష్వసా ఇత్థమామన్త్ర్యతే. కేనాపి అతినిపుణేన. వాచ్యాఙ్గత్వమేవేతి - వాచ్యేనైవ హి విస్మయవిభావరూపేణ ముగ్ధిమాతిశయః ప్రతీయతే ఇతి వాచ్యాదేవ చారుత్వసంపత్. వాచ్యం తు స్వాత్మోపపత్తయే అర్థాన్తరం స్వోపకారవాఞ్ఛయా వ్యనక్తి.

బాలానందిని

ఏవమితి : అవివక్షితవాచ్యం, వివక్షితాన్యపరవాచ్యం అని మౌళికభేదాలు రెండు. అవివక్షితవాచ్యానికి అత్యంతతిరస్కృతవాచ్యం, అర్థాన్తరసంక్రమితవాచ్యం అని రెండు భేదాలు. వివక్షితాన్యపరవాచ్యానికి అలక్ష్యక్రమం, అనురణనరూపం అని రెండు భేదాలు. ఇవి నాలుగు భేదాలు. మొదటిదైన అలక్ష్యక్రమ భేదాలు అనంతంగా ఉంటాయి. రెండవది (అనురణనరూపధ్వని) శబ్దశక్తిమూలం, అర్థశక్తిమూలం అని రెండు విధాలు. చివరిది (అర్థశక్తిమూలం) కవిప్రౌఢోక్తికృతశరీరం అనీ, కవినిబద్ధవక్తృప్రౌఢోక్తికృతశరీరం అనీ, స్వతఃసంభవి అనీ మూడు విధాలు. ఈ మూడు భేదాలూ కూడ ఒక్కొక్కటి పైన చెప్పిన వ్యంగ్యవ్యంజక భేదం చేత నాలుగేసి విధాలు గాన అర్థశక్తిమూలధ్వని పన్నెండు విధాలు.

అనగా (1) కవిప్రౌఢోక్తిసిద్ధవస్తునా వస్తుధ్వనిః, (2) కవిప్రౌఢోక్తిసిద్ధవస్తునా అలంకారధ్వనిః, (3) కవిప్రౌఢోక్తిసిద్ధాలంకారేణ వస్తుధ్వనిః, (4) కవిప్రౌఢోక్తిసిద్ధాలంకారేణ అలంకారధ్వనిః (5) కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధవస్తునా వస్తుధ్వనిః (6) కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధవస్తునా అలంకారధ్వనిః (7) కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధాలంకారేణ వస్తుధ్వనిః (8) కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధాలంకారేణ అలంకారధ్వనిః (9) స్వతఃసంభవివస్తునా వస్తుధ్వనిః (10) స్వతఃసంభవివస్తునా అలంకారధ్వనిః (11) స్వతఃసంభవ్యలంకారేణ వస్తుధ్వనిః (12) స్వతఃసంభవ్యలంకారేణ అలంకారధ్వనిః అని 12 భేదాలు అని అర్థం. ఈ పన్నెండు భేదాలు, మొదటి నాలుగు భేదాలూ కలిస్తే ముఖ్యమైన భేదాలు పదహారు. ఈ పదహారుభేదాలూ కూడ పదప్రకాశత్వంచేత, వాక్యప్రకాశత్వంచేత ఒక్కొక్కటి రెండేసి విధాలని చెప్పబోతున్నాం. ఆ విధంగా మొత్తం ముప్పైరెండు భేదాలు. అలక్ష్యక్రమం వర్ణ-పద-వాక్య-సంఘటనా - ప్రబంధాలచేత వ్యంగ్యం అవుతుంది. అవి కలపగా ముప్పై ఐదు భేదాలు. (పద-వాక్యప్రకాశ్యత్వాన్ని పట్టి వచ్చిన రెండు భేదాలు ముందే చెప్పబడ్డాయి. ఇంక మిగిలినవి వర్ణ-సంఘటనా- ప్రబంధప్రకాశ్యత్వాలు మూడే. ఆ ముప్పైరెండూ, ఈ మూడూ కలుస్తే ముప్పైఐదు భేదాలని భావం.)

తదాభాసేభ్య ఇతి :- ధ్వన్యాభాసలనుండి, వివేకం అనగా విభాగం. అస్య= ఆత్మయైన ధ్వనికి ఆ కావ్యవిశేషం, గోచరః = విషయం, కాదు అని అర్థం.

అన్యేతు ఇతి - కొందరైతే 'పితృష్వసః' (అత్తా!) అనే అర్థం గల 'పిఉచ్ఛా' అనేది సంబోధన అని అన్నారు. కేనాపి - చాలా నేర్పు గల ఎవనిచేతనో, వాచ్యాజ్ఞత్వమేవేతి

- విస్మయానికి విభావం అయిన వాచ్యార్థంచేతనే ముగ్ధతయొక్క అతిశయం, అత్యధికమైన అమాయకత్వం గమ్యం అవుతున్నది. అందుచేత సౌందర్యసంపద అంతా వాచ్యంవల్లనే లభిస్తూన్నది. వాచ్యం మాత్రం తను ఉపపన్నం అవడానికి (కుదరడానికి) తనకు ఉపకారం కలగాలనే వాంఛచేత మరొక అర్థాన్ని వ్యంజింప చేస్తూన్నది.

## ధ్వన్యాలోకం

ఏవంవిధే విషయే అన్యత్రాపి యత్ర వ్యఙ్గ్యాపేక్షయా వాచ్యస్య చారుత్వోత్కర్షప్రతీత్యా ప్రాధాన్యమవసీయతే తత్ర వ్యఙ్గ్యస్య అఙ్గత్వేన ప్రతీతేః ధ్వనేః అవిషయత్వమ్. యథా -

గాథ. వాణీరకుడఙ్గోడ్డీణసఉణికోలాహలం సుణన్తీఏ,
ఘరకమ్మవావడాఏ బహూఏ సీఅన్తి అఙ్గాఇం. (69)

ఏవంవిధో హి విషయః ప్రాయేణ గుణీభూతవ్యఙ్గ్యస్య ఉదాహరణత్వేన నిర్దేక్ష్యతే.

### బాలానందిని

ఏవమితి:- ఇతరత్రా కూడ ఎక్కడ ఇలాంటి విషయంలో వ్యంగ్యంకంటె వాచ్యంలో చారుత్వోత్కర్ష కనబడడంచేత దానికి (వాచ్యానికి) ప్రాధాన్యం నిర్ణయించబడుతుందో అక్కడ వ్యంగ్యం (వాచ్యానికి) అంగంగా కనబడడంచేత అది ధ్వనికి విషయం కాదు. ఎట్లనగా -

వాణీరేతి: (దీని సంస్కృతచ్ఛాయ లోచనంలో ఉంది). వేతసలతాగహనోడ్డీన శకునికోలాహలమ్= పేపడొంక(ప్రబ్బలిపొద)లనుండి ఎగిరిన పక్షుల కోలాహలాన్ని. శృణ్వత్యాః= వింటూన్న, గృహకర్మవ్యాపృతాయాః= ఇంటి పనులలో వ్యాపృతురాలైన, వధ్వాః= స్త్రీయొక్క, అఙ్గాని= అవయవాలు, సీదన్తి= సడలిపోతున్నాయి.

ఏవంవిధ ఇతి - ఇలాంటి విషయం సాధారణంగా గుణీభూతవ్యంగ్యానికి ఉదాహరణంగా నిర్దేశింపబడగలదు.

### లోచనం

"వేతసలతాగహనోడ్డీనశకునికోలాహలం శృణ్వత్యాః,
గృహకర్మవ్యాపృతాయాః వధ్వాః సీదన్త్యఙ్గాని" ఇతి చ్ఛాయా.

అత్ర దత్తసంకేతచౌర్యకాముకరతసముచితస్థానప్రాప్తిః ధ్వన్యమానా వాచ్యమేవ ఉపస్కురుతే. తథాహి - గృహకర్మవ్యాపృతాయా ఇత్యన్యపరాయా అపి, వధ్వా ఇతి సాతిశయలజ్జాపారతన్త్ర్యబద్ధాయా అపి, అఙ్గానీత్యేకమపి న తాదృగఙ్గం యదు గామ్భీర్యావహిత్థవశేన సంవరీతుం పారితమ్, సీదన్తీతి ఆస్తాం గృహకర్మసంపాదనం, స్వాత్మానమపి ధర్తుం న ప్రభవన్తీతి, గృహకర్మయోగే న స్ఫుటం తథా లక్ష్యమాణానీతి - అస్మాదేవ వాచ్యాత్ సాతిశయమదనపరవశతాప్రతీతేః చారుత్వసంపత్తిః.

బాలానందిని

అత్రేతి - ఇక్కడ సంకేతం ఇచ్చిన చౌర్యకాముకుడు (జారుడు) సురతానికి తగిన స్థానానికి చేరినట్లు (పక్షుల కోలాహలంచేత) ధ్వనించబడుచున్నది. ఈ ధ్వని వాచ్యాన్నే ఉపస్కరిస్తున్నది. (వాచ్యానికే అందం కలిగిస్తూన్నది). ఎట్లనగా (తథాహి) - గృహకర్మలలో వ్యాపృతురాలై ఉన్న దనడంచేత ఆమె పరాధీనురాలవడంచేత బైటకు వెళ్లకుండా బద్ధురాలైనది అని, 'అఙ్గాని' (అవయవాలు) అనడంచేత గాంభీర్యంచేత, ఆకారాన్ని దాచుకోడం ద్వారా (అవహిత్థ) ఒక్క అవయవం కూడా కప్పిపుచ్చుకోవడానికి శక్యం గాలేదని, 'సీదన్తి' అనడంచేత ఇంటి పనులు చక్కబెట్టుకొనడం మాట అటుంచి తనను తానే నిలబెట్టుకొనజాలకుండా ఉందని, గృహకర్మలో వ్యాపృతురా లవడంచేత అవయవాలు స్పష్టంగా సడలిపోతూన్నట్లు గుర్తించడానికి వీలులేకుండా ఉన్నాయని ఈ వాచ్యార్థంవల్లనే, అనగా పక్షుల కోలాహలం వినగానే ఆమె సకలావయవాలు సడలిపోయాయి అనే వాచ్యార్థంవల్లనే, తెలుస్తున్నాయి. ఈమె అత్యధికంగా మదనపరవశురాలై ఉంది అనేది కూడా తెలుస్తూన్నది. ఈ విధంగా చారుత్వసంపత్తి వాచ్యార్థంవల్లనే కలుగుతూన్నది. అందుచేత ధ్వన్యమానార్థం వాచ్యార్థానికి అంగంగా ఉండడంవల్ల ఇది గుణీభూతవ్యంగ్యమే అని భావం.

ధ్వన్యాలోకం

యత్ర తు ప్రకరణాదిప్రతిపత్త్యా నిర్ధారితవిశేషో వాచ్యోఽర్థః పునః ప్రతీయమానాఙ్గత్వేనైవావభాసతే సః అస్యైవ అనురణనరూప వ్యఙ్గ్యస్య ధ్వనేర్మార్గః. యథా -

గాథ. ఉచ్చిణసు పడిఅ కుసుమం మా ఘుణ సేహాలిఅం హాలిఅసుణ్హే,
అహ దే విసమవిరావో ససురేణ సుఓ వలఅసద్దో . (70)

అత్ర హి అవినయపతినా సహ రమమాణా సఖీ బహిః శ్రుతవలయకలకలయా సఖ్యా ప్రతిబోధ్యతే. ఏతదపేక్షణీయం వాచ్యార్థప్రతిపత్తయే. ప్రతిపన్నే చ వాచ్యేఽర్థే తస్య అవినయప్రచ్ఛాదనతాత్పర్యేణ అభిధీయమానత్వాత్ పునః వ్యఙ్గ్యాఙ్గత్వమేవేతి అస్మిన్ననురణనరూపధ్వనౌ అన్తర్భావః.

బాలానందిని

యత్రేతి - ఎక్కడ ప్రకరణాదుల జ్ఞానంచేత నిర్ధారణచేయబడిన విశేషం గల వాచ్యార్థం, అనగా ప్రకరణాదులను పట్టి ఇక్కడ ఇదే గ్రహించాలి అని నిర్ధారణ చేయబడిన వాచ్యార్థం, మళ్ళీ ప్రతీయమానార్థానికి అంగంగానే భాసిస్తుందో అది ఈ అనురణనరూపవ్యంగ్యమైన ధ్వనికావ్యంయొక్క మార్గమే. ఎట్లనగా -

ఉచ్చిణసు ఇతి :- (దీని ఛాయ లోచనంలో ఇవ్వబడింది) హాలికస్నుషే= ఓ వ్యవసాయదారుని కోడలా! పతితమ్= రాలిన, కుసుమమ్ = పువ్వునే, ఉచ్చిను= ఏరుకొనుము. శేఫాలికామ్= శేఫాలికాలతను, మ ధునిహి= దులపకుము, విషమవిపాకః= విషమమైన ఫలితం గల, ఏషః= ఈ, వలయశబ్దః= వలయాలశబ్దం, తే శ్వశురేణ= నీ మామచేత, శ్రుతః= వినబడినది.

అత్రేతి - ఇక్కడ అవినయపతితో (జారునితో) రమిస్తూన్న సఖురాలు బైట వినబడిన వలయాల కలకలధ్వని గల (గాజులమోతగల) సఖురాలిచేత జాగర్త అని హెచ్చరించబడుతూన్నది. వాచ్యార్థం తెలియడానికి ఈ వ్యంగ్యార్థం అవసరమే. వాచ్యార్థం తెలిసిన తరవాత అది అవినయాన్ని కప్పిపుచ్చడంలో తాత్పర్యంచేత చెప్పబడుతూండడం వల్ల అది (వాచ్యార్థం) వ్యంగ్యార్థానికి అంగమే అవుతున్నది. అందుచేత దీనికి ఈ అనురణనరూపవ్యంగ్యధ్వనిలోనే అంతర్భావం.

లోచనం

యత్రత్వితి : ప్రకరణమ్ ఆదిర్యస్య శబ్దాన్తరసంనిధానసామర్థ్యలిఙ్గాదేః తదవగమాదేవ యత్రార్థః నిశ్చితసమస్తస్వభావః. పునః వాచ్యః పునః స్వశబ్దేన

ఉక్తః అత ఏవ స్వాత్మావగతేః సంపన్నపూర్వత్వాదేవ తావన్మాత్రార్థపర్యవసాయీ న భవతి తథావిధశ్చ ప్రతీయమానస్య అఙ్గతామేతీతి సోఽస్య ధ్వనేర్విషయ ఇత్యనేన వ్యఙ్గ్యతాత్పర్యనిబన్ధనం స్ఫుటం వదతా వ్యఙ్గ్యగుణీభావే తు ఏతద్విపరీతమేవ నిబన్ధనం మన్తవ్యమిత్యుక్తం భవతి.

"ఉచ్చిను పతితం కుసుమం మా ధునీహి శేఫాలికాం హాలికస్నుషే,
ఏష తే విషమవిపాకః శ్వశురేణ శ్రుతో వలయశబ్దః". ఇతి చ్ఛాయా.

యతః శ్వశురః శేఫాలికాలతికాం ప్రయత్నై రక్షన్ తస్యాః ఆకర్షణధూననాదినా కుప్యతి. తేనాత్ర విషమపరిపాకత్వం మన్తవ్యమ్. అన్యథా స్వోక్త్యైవ వ్యఙ్గ్యాక్షేపః స్యాత్. అత్ర చ "కస్స వా ణ హోఇ రోసో" ఇత్యేతదనుసారేణ వ్యాఖ్యా కర్తవ్యా. వాచ్యార్థస్య ప్రతిపత్తయే లాభాయ తద్ వ్యఙ్గ్యమపేక్షణీయమ్. అన్యథా వాచ్యోఽర్థః న లభ్యేత. స్వతఃసిద్ధతయా అవచనీయ ఏవ సోఽర్థః స్యాదితి యావత్. నన్వేవం వ్యఙ్గ్యస్య ఉపస్కారతా ప్రత్యుత ఉక్తా భవేత్ ఇత్యాశఙ్క్యాహ - ప్రతిపన్నే చేతి. శబ్దేనోక్త ఇతి యావత్. 31

బాలానందిని

యత్రేతి:- 'ప్రకరణాది' శబ్దానికి "ప్రకరణం ఆదిః యస్య" ప్రకరణం ఆదియందు (మొదలుగా) గల అనే విగ్రహంచేత శబ్దాంతరసంనిధి, సామర్థ్యం, లింగం మొదలైనవి అని అర్థం. ("సంయోగో విప్రయోగశ్చ ఇత్యాదిశ్లోకాలలో భర్తృహరి చెప్పిన అర్థనియామకాలైన ప్రకరణాదులు కావ్యప్రకాశలో సోదాహరణంగా వివరించబడ్డాయి). వాటిని తెలుసుకొనడంవల్లనే ఎక్కడ వాచ్యార్థంయొక్క సమస్తస్వభావం నిశ్చితమైనదో, పునః వాచ్యః= మళ్లీ స్వశబ్దంచేత చెప్పబడినదై, అందువలననే, తన స్వరూపంయొక్క జ్ఞానం పూర్వమే సంపన్నం అయి ఉండడంవల్ల తావన్మాత్రమునందే (వాచ్యార్థమాత్రం లోనే) పర్యవసానం చెందేది కాదో, అలాంటిది ప్రతీయమానమైన దానికి అంగత్వాన్ని పొందుతుంది (అంగం అవుతుంది). అందువల్ల అది ధ్వనికి విషయం అవుతుంది. ఈ విధంగా వ్యంగ్యమునందు తాత్పర్యం ఉండడం ధ్వని అని చెప్పడానికి కారణం అని చెప్పడంచేత, అనగా వాచ్యార్థానికి ఎక్కడ వ్యంగ్యార్థాన్ని వ్యంజింపచేయడంలోనే తాత్పర్యం ఉంటుందో అక్కడనే ధ్వని అని అనాలి అని చెప్పడంచేత, గుణీభావంలో, గుణీభూతవ్యంగ్యంలో, అందుకు (గుణీభావానికి) కారణం దీనికి విపరీతంగా ఉండడమే,

అనగా వాచ్యార్థానికి వ్యంగ్యార్థవ్యంజనయందు తాత్పర్యం లేకపోవడం, వ్యంగ్యార్థం వాచ్యానికి ఉపకరించడం అనేవి ఉండడమే అని చెప్పినట్లయింది.

యతః ఇతి :- నీ మామ శేఫాలికాలతను ప్రయత్నపూర్వకంగా కాపాడుకుంటున్నాడు. అందువల్ల దానిని లాగినా ఇంకా అలాంటిది ఏదైనా చేసినా కోపిస్తాడు. అందుచేతనే దాని ఫలితం (అలా దులపడంవల్ల కలిగే ఫలితం) విషమంగా ఉంటుంది అని గ్రహించాలి. అలా కాకపోతే, (నీ మామ వచ్చి చూస్తాడు ఇత్యాదికం మరొకటి ఏదైనా చెపితే) వాచ్యార్థంచేతనే వ్యంగ్యార్థం ఆక్షిప్తం అయిపోతుంది. అప్పుడు దీనికి ధ్వనిత్వం ఉండదు అని భావం అత్ర చేతి - ఇక్కడ "కస్స వా ణ హోయి రోసో" ఇత్యాదిగాథలో వలె వ్యాఖ్య చెయ్యాలి. అనగా అక్కడ ఉన్న వ్యక్తుల భేదాన్ని పట్టి వేరు వేరు వ్యంగ్యార్థాలు ధ్వనిస్తాయి అని చెప్పాలి. వాచ్యేతి - వాచ్యార్థంయొక్క, ప్రతిపత్తయే= లాభంకొరకు ఈ వ్యంగ్యం అక్షేపించదగి ఉంది. ఈ గాథలోని వాచ్యార్థం పూర్తి కావాలంటే ఈ వ్యంగ్యార్థం అవసరం. ఇది కాకపోతే వాచ్యార్థం రాదు (పూర్తికాదు). ఎందుచేత ననగా ఈ వాచ్యార్థం స్వతఃసిద్ధమే గాన ఈ వాచ్యార్థాన్ని చెప్పవలసిన పనియే లేదు. అనగా శేఫాలికాలతను దులపకూడదు అనే విషయం ఉపపతితో రమిస్తూన్న ఆ నాయికకి కూడా తెలిసినదే అవడంచేత చెప్పవలసిన పని లేదు. నన్వితి :- అయితే వాచ్యం వ్యంగ్యానికి ఉపకరించడానికి బదులు (ప్రత్యుత) వ్యంగ్యమే వాచ్యానికి ఉపస్కారంగా ఉంది అని చెప్పిన ట్లయింది కదా అని ఆశంకించుకొని ప్రతిపన్నే చ ఇత్యాదికం చెపుతున్నాడు. ప్రతిపన్నే అనగా శబ్దంచేత చెప్పబడినది కాగా అని అర్థం.

వివరణ:- ముందు వాచ్యార్థం పూర్తికావాలంటే దాన్ని సమర్థించడానికి వ్యంగ్యార్థం కావాలి. దీని సహాయంతో వాచ్యార్థం తెలిసింది. అప్పుడు మళ్లీ ఈవాచ్యార్థం వ్యంగ్యార్థానికే ఉపస్కారం అవుతూ - ఓహో! అక్కడ రమిస్తూన్న యువతికీ, కాముకునికీ, మామ మొదలైన వాళ్లకీ, ఉదాసీనులకీ వేరు వేరు అర్థాలు తెలియడం కోసం, ఆమె అవినయాన్ని కప్పిపుచ్చడంకోసం, ఈ వాచ్యార్థం చెప్పబడింది కదా అనే భావాన్ని కలిగించడంద్వారా వ్యంగ్యార్థానికే సహాయపడుతూ దానికి ప్రాధాన్యం కల్పిస్తూన్నది. అందుచేత ఇది అనురణనరూపవ్యంగ్యమే అని భావం. 31.

## ధ్వన్యాలోకం

ఏవం వివక్షితవాచ్యస్య ధ్వనేః తదాభాసవివేకే ప్రస్తుతే సతి అవివక్షితవాచ్యస్యాపి తం కర్తుమాహ -

కా. అవ్యుత్పత్తేరశక్తేర్వా నిబన్ధో యః స్ఖలద్గతేః,
శబ్దస్య స చ న జ్ఞేయః సూరిభిర్విషయో ధ్వనేః. 32

స్ఖలద్గతేః ఉపచరితస్య శబ్దస్య అవ్యుత్పత్తేః అశక్తేర్వా నిబన్ధో యః స చ న ధ్వనేర్విషయః.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వివక్షితవాచ్యధ్వనికి సంబంధించిన ధ్వన్యాభాసయొక్క వివేచనం ప్రస్తుతమై ఉండగా (ఇప్పుడు) అవివక్షితవాచ్యధ్వనికి సంబంధించిన ధ్వన్యాభాసను కూడ వివేచించడానికి చెపుతున్నాడు -

అవ్యుత్పత్తేః ఇతి:- అవ్యుత్పత్తేః= వ్యుత్పత్తిలేకపోవడంవల్ల గాని, అశక్తేః వా= అశక్తివల్ల గాని, స్ఖలద్గతేః= గౌణమైన, శబ్దస్య = శబ్దంయొక్క, యః నిబన్ధః= ఏ కూర్పు కలదో, సః చ= అది కూడ, సూరిభిః= పండితులచేత, ధ్వనేః విషయః = ధ్వనికావ్యానికి విషయంగా, స్థానంగా, న జ్ఞేయః= తెలియదగినది కాదు.

స్ఖలదితి - స్ఖలద్గతేః= ఉపచరితమైన శబ్దాన్ని సరియైన వ్యుత్పత్తి లేకపోవడంవల్ల గాని, అశక్తివల్ల గాని కూర్చడం ధ్వనికావ్యానికి విషయం కాదు.

లోచనం

తదాభాసవివేకే ప్రస్తుతే సతీతి సప్తమీ హేతౌ. తదాభాస వివేక ప్రస్తావలక్షణాత్ ప్రసఙ్గాదితి యావత్. కస్య తదాభాస ఇత్యపేక్షాయామాహ - వివక్షితవాచ్యస్యేతి. స్పష్టే తు వ్యాఖ్యానే ప్రస్తుత ఇత్యసంగతమ్. పరిసమాప్తౌ హి వివక్షితాభిధేయస్య తదాభాసవివేకః. న త్వధునా ప్రస్తుతః. నాప్యుత్తరకాలమనుబధ్నాతి. స్ఖలద్గతేరితి. గౌణస్య లాక్షణికస్య వా శబ్దస్యేత్యర్థః. అవ్యుత్పత్తిః అనుప్రాసాదినిబన్ధనతాత్పర్యప్రవృత్తిః. యథా-

"ప్రేఙ్ఖత్ప్రేమప్రబన్ధప్రచురపరిచయే ప్రౌఢసీమన్తినీనాం
చిత్తాకాశావకాశే విహరతి సతతం యః స సౌభాగ్యభూమిః".

అత్రానుప్రాసరసికతయా ప్రేఙ్ఖదితి లాక్షణికః, చిత్తాకాశ ఇతి గౌణః ప్రయోగః కవినా కృతోఽపి న ధ్వన్యమానరూపసున్దరప్రయోజనాంశపర్యవసాయీ. అశక్తిః వృత్తపరిపూరణాద్యసామర్థ్యమ్. యథా-

విషమకాణ్డకుటుమ్బకసంచయప్రవర వారినిధౌ పతతా త్వయా,
చలతరఙ్గవిఘూర్ణితభాజనే విచలతాత్మని కుడ్యమయే కృతా.

అత్ర ప్రవరాన్తమాద్యపదం చన్ద్రమస్యుపచరితమ్. భాజనమిత్యాశయే. కుడ్యమయ ఇతి చ విచలే. అత్రైతత్ కామపి కాన్తిం న పుష్యతి, ఋతే వృత్తపూరణాత్.

బాలానందిని

తదాభాసేతి :- "తదాభాసవివేకే ప్రస్తుతే" అన్నప్పుడు సప్తమి హేత్వర్థకం - అనగా దాని ఆభాసయొక్క వివేకం చేయబోవడం అనే ప్రసంగంవల్ల దేనియొక్క తదాభాస? అనే ప్రశ్నకు సమాధానంగా వివక్షితవాచ్యస్య అని చెపుతున్నాడు. అనగా వివక్షిత వాచ్యధ్వన్యాభాసవివేకం చేయవలసి ఉన్నదిగాన అని అర్థం. స్పష్టే తు ఇతి - స్పష్టంగా ఉన్న అర్థం గ్రహిస్తే 'ప్రస్తుతే' అనేది అసంగతం అవుతుంది. అనగా "వివక్షితాభిధేయ ధ్వన్యాభాసవివేకం ప్రస్తుతం అయి ఉండగా" అని స్పష్టంగా కనబడే అర్థం చెప్పిన పక్షంలో 'ప్రస్తుతే' అనే మాట కుదరదు. పరిసమాప్తౌ ఇతి - ఎందువలన అనగా వివక్షితాభిధేయతదాభాసవివేకం చివరికి చేయబడుతుంది. ఇప్పుడు అది ప్రస్తుతం కాదు. దీని వెంటనే కూడ ఆ విషయం రాదు.

స్ఖలద్గతేరితి - గౌణం లేదా లాక్షణికం అయిన శబ్దంయొక్క అని అర్థం. అవ్యుత్పత్తి అనగా అనుప్రాసాదులను కూర్చడంలో ఆసక్తితో ప్రవర్తించడం. ఎట్లనగా -

ప్రేఙ్ఖదితి :- యః= ఎవడు, ప్రౌఢసీమన్తినీనామ్= ప్రౌఢలైన స్త్రీలయొక్క, ప్రేఙ్ఖత్ ప్రేమప్రబన్ధప్రచురపరిచయే - ప్రేఙ్ఖత్= చంచలమైన, ప్రేమ= ప్రేమయొక్క, ప్రబన్ధ= ప్రకృష్టమైన బంధంతో, స్థిరంగా చేయడంతో, ప్రచురపరిచయే= అధికమైన పరిచయం గల, చిత్తాకాశావకాశే = ఆకాశం వంటి చిత్తంయొక్క ప్రదేశంలో, సతతమ్= ఎల్లప్పుడూ, విహరతి= విహరిస్తాడో, సః = అతడు, సౌభాగ్యభూమిః= సౌభాగ్యానికి స్థానం అయినవాడు.

**అత్రేతి** - ఇక్కడ కవి అనుప్రాసయందు రసికు డవడంచేత 'ప్రేఙ్ఖతః' అని లాక్షణికప్రయోగాన్ని 'చిత్తాకాశ' అని గౌణప్రయోగాన్ని చేసినా అది (ఆ ప్రయోగం) ధ్వనింపబడే సుందరమైన ప్రయోజనాంశంలో పర్యవసానం చెందడం లేదు.

వివరణ :- ప్రేఙ్ఖత్= ఉయ్యాలలో ఊగుతూన్న అని అర్థం. ఆ పదాన్ని 'చంచలమైన' 'అస్థిరమైన' అనే లాక్షణికార్థంలో ప్రయోగించువాడు. అప్రత్యక్షత్వాదులచేత ఆకాశంతో సమానమైనది అనే అభిప్రాయంతో చిత్తాన్ని ఆకాశంతో పోలుస్తూ 'చిత్తాకాశ' అని గౌణప్రయోగం చేశాడు. ఇలా లాక్షణిక గౌణప్రయోగాలు చేసినందుకు ప్రయోజనంగా సుందరమైన అర్థం ఏదైనా వ్యంగ్యం కావాలి. అలాంటి దేదీ లేదు. అందుచేత ఇది అవ్యుత్పత్తికృతప్రయోగం.

అశక్తిరితి - అశక్తి అనగా వృత్తాన్ని చక్కగా పూరించడం మొదలైనవాటిలో సామర్థ్యం లేకపోవడం ఎట్లనగా -

విషమేతి - విషమకాణ్డకుటుమ్బకసంచయప్రవర= మన్మథుని కుటుంబాన్ని వృద్ధిపొందించడంలో శ్రేష్ఠుడవైన చంద్రుడా, చలతరఙ్గవిఘూర్ణితభాజనే= చంచలములైన తరంగాలు తిరగడానికి స్థానమైన, వారినిధౌ= సముద్రమునందు, పతతా= పడుచున్న, త్వయా= నీచేత, కుడ్యమయే= గోడవంటి(స్థిరమైన), ఆత్మని= నీయందు, విచలతా= చంచలత్వం, కృతా= చేయబడింది.

అత్రేతి - ఇక్కడ 'ప్రవర' వరకు ఉన్న మొదటిపదం ఉపచరితం. 'భాజనం' అనే పదం స్థానం అనే అర్థంలోను, 'కుడ్యమయే' అనే శబ్దం అచంచలము అనే అర్థంలోనూ ప్రయోగించబడింది. ఇక్కడ ఈ శబ్దాల ప్రయోగం వృత్తాన్ని పూరించడం తప్ప ఏ విధమైన సౌందర్యాన్నీ పోషించడంలేదు.

## లోచనం

స చేతి - ప్రథమోద్ద్యోతే యః "ప్రసిద్ధ్యనురోధప్రవర్తితవ్యవహారాః కవయః" ఇత్యత్ర "వదతి బిసినీపత్రశయనమ్" ఇత్యాదిభాక్త ఉక్తః, స న కేవలం ధ్వనేః న విషయః యావత్ అయమన్యోఽపీతి 'చ' శబ్దస్యార్థః.

## బాలానందిని

స చేతి :- ప్రథమోద్యోతంలో "ప్రసిద్ధ్యనురోధప్రవర్తితవ్యవహారాః కవయః" అని అన్నచోట ఏ "వదతి బిసినీపత్రశయనమ్" ఇత్యాదికాలు భాక్తప్రయోగాలు మాత్రమే అని చెప్పబడ్డాయో, ధ్వనికి విషయం కానివి అవి మాత్రమే కాదు, వాటితో పాటు ఇవి కూడా ధ్వనికి విషయం కాదు: అని చెప్పడం కోసం 'స చ' అన్నచోట 'చ' శబ్దం ప్రయోగించబడింది.

## ధ్వన్యాలోకం

యతః-

కా. సర్వేష్వేవ ప్రభేదేషు స్ఫుటత్వేనావభాసనమ్,

యద్వ్యఙ్గ్యస్యాఙ్గిభూతస్య తత్పూర్ణం ధ్వనిలక్షణమ్. 33

తచ్చోదాహృతమేవ.

ఇతి శ్రీరాజానకానన్దవర్ధనాచార్యవిరచితే ధ్వన్యాలోకే

ద్వితీయ ఉద్ద్యోతః

బాలానందిని

ఎందువలన అనగా -

సర్వేష్వితి - సర్వేష్వేవ= సమస్తమైన, ప్రభేదేషు= భేదాలలో, అఙ్గిభూతస్య= అంగి అయిన, వ్యఙ్గ్యస్య= వ్యంగ్యంయొక్క, యత్= ఏ, స్ఫుటత్వేన= స్ఫుటంగా, అవభాసనం= భాసించడం ఉన్నదో, తత్= అది, పూర్ణమ్= పూర్ణమైన, ధ్వనిలక్షణమ్= ధ్వనికావ్యంయొక్క లక్షణం.

తచ్చేతి - అది ఉదాహరించబడిన విషయం కలదే. అలాంటి ధ్వనికావ్యానికి స్థానాలైన వాటిని ఉదాహరించి ఉన్నాము అని అర్థం.

శ్రీ రాజానకానందవర్ధనాచార్యులు రచించిన ధ్వన్యాలోకంలో

ద్వితీయోద్ద్యోతం సమాప్తం.

లోచనం

ఉక్తమేవ ధ్వనిస్వరూపం తదాభాసవివేకహేతుతయా కారికాకారః అనువదతీత్యభిప్రాయేణ వృత్తికృదుపస్కారం దదాతి - యతః ఇతి. అవభానమితి - ''భావానయంనే ద్రవ్యానయంనమ్'' ఇతి న్యాయాదవభాసమానం వ్యఙ్గ్యమ్. ధ్వనిలక్షణమ్ ధ్వనేః స్వరూపం పూర్ణమ్. అవభాసనం వా జ్ఞానం తత్ ధ్వనేః లక్షణం ప్రమాణమ్, తచ్చ పూర్ణం, పూర్ణధ్వనిస్వరూపనివేదకత్వాత్. అథవా జ్ఞానమేవ ధ్వనిలక్షణమ్, లక్షణస్య

జ్ఞానపరిచ్ఛేద్యత్వాత్. వృత్తౌ ఏవకారేణ తతోఽన్యస్య భాసరూపత్వమేవేతి సూచయతా తదాభాసవివేకహేతుభావో యః ప్రక్రాన్తః స ఏవ నిర్వాహిత ఇతి శివమ్.

శ్లో. ప్రాజ్యం ప్రోల్లాసమాత్రం సద్భేదేనాసూత్ర్యతే యయా,
వన్దేఽభినవగుప్తోఽహం పశ్యన్తీం తామిదం జగత్.

ఇతి శ్రీమహామాహేశ్వరాచార్యవర్యాభినవగుప్తోన్మీలితే
సహృదయాలోకలోచనే ధ్వనిసంకేతే ద్వితీయ ఉద్యోతః.

బాలానందిని

ఉక్తమేవేతి :- చెప్పబడిన ధ్వన్యాభాసస్వరూపాన్ని వివిక్తంగా తెలుసుకొనడానికై హేతువు అవడంచేత, అనగా ధ్వనిస్వరూపం స్పష్టంగా తెలుస్తేనే తదాభాసస్వరూపం కూడా స్పష్టంగా తెలుస్తుంది గాన, కారికాకారుడు అనువదిస్తున్నాడు. "భావానయనే ధర్మానయనమ్' అని శాస్త్రీయన్యాయం. ఏదైన ఒక భావాన్ని, ధర్మాన్ని తీసికొనిరావాలంటే ద్రవ్యాన్ని (ఆ భావంతో సమవేతమైన ద్రవ్యాన్ని) తీసికొని రావాలి అని దీని అర్థం. సౌందర్యాన్ని తీసికొని రావాలంటే సుందరమైన ద్రవ్యం తీసికొనిరావాలి. అదే విధంగా ఇక్కడ 'అవభాసనమ్' అనగా భాసించుట అని అసలు అర్థం. ఆ భాసించడం అనేది దేనిలో ఉందో అది, అనగా భాసించే వ్యంగ్యం, అని గ్రహించాలి. ఆ వ్యంగ్యం పూర్ణం ధ్వనిలక్షణమ్= ధ్వనియొక్క పూర్ణమైన స్వరూపం.

పైన చెప్పిన ప్రకారం వ్యంగ్యం ధ్వనిస్వరూపం అని చెప్పిన ట్లయింది. అయితే వ్యంగ్యార్థకమైన 'అవభాసనమ్' అనే పదానికి "అఙ్గీభూతస్య వ్యఙ్గ్యస్య" అనే దానితో అన్వయం కుదరదు. 'అంగియైన వ్యంగ్యంయొక్క వ్యంగ్యం' అనే అర్థం అనుపపన్నం కదా? అందుచేత అవభాసనశబ్దానికి మరొక అర్థం చెపుతున్నాడు - అవభాననం వా ఇతి లేదా 'అవభాననమ్' అనగా జ్ఞానం. అది ధ్వనియొక్క, లక్షణమ్= ప్రమాణం. అది పూర్ణమైనది. ఎందువల్ల ననగా ఇది పూర్ణమైన ధ్వనిస్వరూపాన్ని బోధిస్తున్నది. లక్షణశబ్దానికి ప్రమాణం అని అర్థం చెప్పవలసిన పని లేకుండా అసాధారణధర్మం అనే ప్రసిద్ధార్థాన్నే గ్రహించి వ్యాఖ్యానిస్తున్నాడు - అథవా ఇతి. లేదా - జ్ఞానమే ధ్వనికి లక్షణం. ఎందుచేత ననగా లక్షణం జ్ఞానంచేత, (లక్ష్యజ్ఞానంచేత) పరిచ్ఛేద్యంగా, నిర్ణయించతగినదిగా, ఉంటుంది కదా. ఈ విధంగా లక్షణానికీ, లక్ష్యజ్ఞానానికీ పరిచ్ఛేద్యపరిచ్ఛేదకభావం

ఉండడంవల్ల అభేదారోపంచేత లక్షణంగా చెప్పబడింది అని అర్థం. వృత్తౌ ఇతి - వృత్తిలో 'ఏవ'కారంచేత (ఉదాహృతవిషయమేవ అన్నచోట ఏవకారం చేత) ఆ ధ్వనికంటె భిన్నమైనది ధ్వన్యాభాసమే కాని ధ్వని కాదు అని సూచిస్తూ వృత్తికారుడు ఏ ధ్వన్యాభాసవివేకహేతుత్వాన్ని ఉపక్రమించాడో దానినే నిర్వహించాడు - అంతా మంగళప్రదం.

ద్వితీయోద్ద్యోత వ్యాఖ్యను శ్రీమదభినవగుప్తాచార్యులు దేవీస్తుతితో ముగిస్తున్నారు - ప్రాజ్యమితి - యయా= మాయారూపమైన ఏ పరమేశ్వరిచేత, ప్రాజ్యమ్= అతివిస్తృత మైన ఈ జగత్తు, ప్రోల్లాసమాత్రమ్= కేవలం ఆభాసమాత్రంగానే, సద్భేదేన= పరమార్థసత్ అయిన బ్రహ్మకంటె భిన్నంగా, ఆసూత్ర్యతే= ప్రకాశింపచేయబడుతున్నదో, ఇదమ్= ఈ, జగత్= జగత్తును, పశ్యన్తీమ్= చూచుచున్న, తామ్= ఆ పరమేశ్వరిని, అభినవగుప్తః= అభినవగుప్తుడనైన, అహమ్= నేను, వన్దే= నమస్కరిస్తున్నాను.

శ్రీమహామాహేశ్వరుడు ఆచార్యవర్యుడు అయిన అభినవగుప్తునిచేత
వికసింపచేయబడిన సహృదయాలోకలోచనంలో ధ్వనిసంకేతంలో
ద్వితీయోద్ద్యోతం సమాప్తం.

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన
సలోచనధ్వన్యాలోకాంధ్రవ్యాఖ్య "బాలానందినిలో"
ద్వితీయోద్ద్యోతం సమాప్తం.

# అథ తృతీయ ఉద్యోతః

## ధ్వన్యాలోకం

ఏవం వ్యఙ్గ్యముఖేనైవ ధ్వనేః ప్రదర్శితే సప్రభేదే స్వరూపే పునర్వ్యఞ్జకముఖేన ఏతత్ ప్రకాశ్యతే -

కా. అవివక్షితవాచ్యస్య పదవాక్యప్రకాశతా,

తదన్యస్యానురణనరూపవ్యఙ్గ్యస్య చ ధ్వనేః. 1

అవివక్షితవాచ్యస్య అత్యన్తతిరస్కృతవాచ్యే ప్రభేదే పదప్రకాశతా యథా మహర్షేః వ్యాసస్య - "సప్తైతాః సమిధః శ్రియః". యథా వా కాలిదాసస్య - 'కః సన్నద్ధే విరహవిధురాం త్వయ్యుపేక్షేత జాయామ్' యథా వా - "కిమివ హి మధురాణాం మణ్డనం నాకృతీనామ్" ఏషూదాహరణేషు 'సమిధః" ఇతి, 'సన్నద్ధః' ఇతి, 'మధురాణామ్' ఇతి చ పదాని వ్యఞ్జకత్వాభిప్రాయేణ కృతాని.

### బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వివిధభేదాలతో కూడిన ధ్వనికావ్యస్వరూపం వ్యంగ్యముఖంగా, వ్యంగ్యం దృష్ట్యా, చూపబడింది. ఇప్పుడు మళ్లీ భేదసహితమైన ధ్వనికావ్యంయొక్క స్వరూపమే వ్యంజకముఖంగా కూడ చూపబడుతున్నది. అనగా వ్యంజకాల భేదాన్నిపట్టి ఏర్పడే ధ్వనికావ్యభేదాలు కూడా ప్రకాశింపచేయబడుతున్నాయి.

అవివక్షితేతి - అవివక్షితవాచ్యస్య= అవివక్షితవాచ్యము, తదన్యస్య= దానికంటె భిన్నమైన వివక్షితాన్యపరవాచ్యమైన, అనురణనరూపవ్యఙ్గ్యస్య= అనురణనరూప వ్యంగ్యమైన, ధ్వనేః చ= ధ్వనికీ కూడ, పదవాక్యప్రకాశతా= పదప్రకాశత, వాక్యప్రకాశత కూడ ఉంటాయి.

అవివక్షితేతి - అత్యంతతిరస్కృతవాచ్యం అనే అవివక్షితవాచ్యధ్వనియొక్క భేదంలో పదప్రకాశత, పదంచేత ప్రకాశించడం, మహర్షియైన వ్యాసుని వాక్యంలో ఎట్లనగా "ఈ ఏడూ లక్ష్మికి సమిధలు". కాలిదాసుని వాక్యంలో ఎట్లనగా - "నువ్వు సంనద్ధుడ

ఉండగా భార్యను ఎవడు ఉపేక్షిస్తాడు?'', మరొకటి ఎట్లనగా "మధురములైన ఆకారాలకి ఏది అలంకారం కాదు? ఈ ఉదాహరణలలో 'సమిధః', 'సంనద్ధే', 'మధురాణామ్' అనే పదాలు వ్యంజకాలుగా ఉండాలనే అభిప్రాయంతోనే ప్రయోగించబడ్డాయి.

వివరణ:- మొదటి వాక్యానికి సంబంధించిన పూర్తి శ్లోకం లోచనంలో ఇవ్వబడింది. మేఘదూతంలో యక్షుడు మేఘునితో అన్న మాటలోనిది రెండవ వాక్యం. అభిజ్ఞానశాకుంతలంలో దుష్యంతుడు నారచీరలు ధరించినా సుందరంగానే కనబడుతూన్న శకుంతలను గూర్చి అన్న వాక్యం మూడవది.

లోచనం

శ్లో. స్మరామి స్మరసంహారలీలాపాటవశాలినః,
ప్రసహ్య శమ్భోర్దేహార్ధం హరన్తీం పరమేశ్వరీమ్.

ఉద్ద్యోతాన్తరసంగతిం కర్తుమాహ వృత్తికారః - ఏవమిత్యాది. తత్ర వాచ్యముఖేన తావత్ అవివక్షితవాచ్యాదయో భేదాః; వాచ్యశ్చ యద్యపి వ్యఞ్జక ఏవ, యథోక్తమ్ - "యత్రార్థః శబ్దో వా" ఇతి, తతశ్చ వ్యఞ్జకముఖేనాపి భేద ఉక్తః, తథాపి స వాచ్యోఽర్థః వ్యఙ్గ్యముఖేనైవ భిద్యతే. తథా హి - అవివక్షితవాచ్యో వ్యఙ్గ్యేన న్యగ్భావితః; వివక్షితాన్యపరవాచ్య ఇతి వ్యఙ్గ్యార్థ ప్రవణ ఏవ ఉచ్యతే, ఇత్యేవం మూలభేదయోరేవ యథాస్వమ్ అవాన్తర భేదసహితయోః వ్యఞ్జకరూపో యోఽర్థః స వ్యఙ్గ్యముఖప్రేక్షితాశరణతయైవ భేదమాసాదయతి. అత ఏవాహ - వ్యఙ్గ్యముఖేనేతి.

బాలానందిని

తృతీయోద్ద్యోతప్రారంభంలో వ్యాఖ్యాత అభినవగుప్తాచార్యులు పరమేశ్వర స్మరణరూపమంగళాచరణం చేయుచున్నారు.

స్మరామీతి - స్మరసంహారలీలాపాటవశాలినః= మన్మథసంహారం అనే లీలయందు సామర్థ్యంతో ప్రకాశిస్తూన్న, శమ్భోః= ఈశ్వరునియొక్క, దేహార్ధమ్= దేహార్ధమును, ప్రసహ్య= బలాత్కారంగా, హరన్తీమ్= హరిస్తూన్న, పరమేశ్వరీమ్= పరమేశ్వరిని, స్మరామి= స్మరిస్తున్నాను.

ఉద్యోతేతి - మరియొక (మూడవ) ఉద్యోతంయొక్క సంగతిని, ద్వితీయోద్యోతానికీ దీనికీ సంబంధాన్ని, ఏర్పరచడంకొరకు వృత్తికారుడు ఏవమిత్యాదికం చెపుతున్నాడు.

వెనుకటి ఉద్యోతంలో వ్యంజకాలలోని భేదాన్ని పట్టి ధ్వనిలో ఏర్పడే భేదాలు చెప్పబడుతున్నాయి అని వృత్తికారుడు అంటున్నాడు. కాని వ్యంజకమైన వాచ్యంలో ఉండే భేదాలను పట్టి ధ్వనిలో ఏర్పడే భేదాలు కూడా వెనుకటి ఉద్యోతంలో చెప్పబడ్డాయి కదా? అందుచేత వ్యంజకభేదాలను పట్టి ఏర్పడే భేదాలు ఇప్పుడే నిరూపిస్తున్నట్లు చెప్పడం అసంగతం కదా అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు - తత్రేతి - ధ్వనిలో అవివక్షితవాచ్యత్వాది భేదాలు వాచ్యముఖాన (వాచ్యాన్ని పట్టి) ఏర్పడ్డాయి. అందుచేత "యత్రార్థః శబ్దో వా" అని చెప్పినట్లు వాచ్యం కూడా వ్యంజకమే. అందుచేత వాచ్యముఖాన కూడా ధ్వనిభేదాలు చెప్పబడినా - వాచ్యార్థంలో వ్యంగ్యాన్ని పట్టే (వ్యఙ్గ్యముఖేనైవ) భేదాలు ఏర్పడతాయి. అది ఎట్లనగా (తథాహి) - వ్యంగ్యంచేత తిరస్కరించబడిన వాచ్యమే అవివక్షితవాచ్యం అని చెప్పబడుతుంది. వ్యంగ్యాన్ని వ్యంజింపచేయడానికే ప్రధానంగా ఉద్దిష్టమైన వాచ్యార్థాన్నే వివక్షితాన్యపరవాచ్యం అంటారు. ఈ విధంగా వాటి అవాంతరభేదాలతో కూడిన మూలభేదాలు రెండింటిలోనే (అవివక్షితవాచ్య - వివక్షితాన్యపరవాచ్యాలలోనే) వ్యంజకరూపమైన ఏ అర్థం (వాచ్యార్థం) ఉన్నదో అది, వ్యంగ్యంయొక్క ముఖంచూడడమే శరణ గలదై, అనగా పూర్తిగా వ్యంగ్యంమీద ఆధారపడి, తనలోని భేదాన్ని పొందుతుంది. అనగా వ్యంజకాలైన ఈ వాచ్యార్థాలను పట్టి వ్యంగ్యార్థంలో భేదాలు ఏర్పడడానికి బదులు, వ్యంగ్యార్థాన్ని పట్టే ఈ వాచ్యార్థాలలో భేదాలు ఏర్పడుతున్నాయి అని అర్థం. అందుచేతనే వ్యఙ్గ్యముఖేన అని అంటున్నాడు.

లోచనం

కిం చ యద్యప్యర్థో వ్యఞ్జకః తథాపి వ్యఙ్గ్యతాయోగ్యోఽప్యసౌ భవతీతి, శబ్దస్తు న కదాచిద్వ్యఙ్గ్యః అపి తు వ్యఞ్జక ఏవేతి. తదాహ - వ్యఞ్జకముఖేనేతి. న చ వాచ్యస్యావివక్షితాదిరూపేణ యో భేదస్తత్ర సర్వథైవ వ్యఞ్జకత్వం నాస్తీతి పునఃశబ్దేనాహ. వ్యఞ్జకముఖేనాపి భేదః సర్వథైవ న న ప్రకాశితః, కింతు ప్రకాశితోఽప్యధునా పునః శుద్ధవ్యఞ్జకముఖేన. తథాహి - వ్యఙ్గ్యముఖప్రేక్షితయా వినా పదమ్, వాక్యమ్, వర్ణాః, పదభాగః, సంఘటనా,

మహావాక్యమితి స్వరూపత ఏవ వ్యఞ్జకానాం భేదః, న చైషామ్ అర్థవత్ కదాచిదపి వ్యఙ్గ్యతా సంభవతీతి వ్యఞ్జకైకనియతం స్వరూపం యత్ తన్ముఖేన భేదః ప్రకాశ్యతే ఇతి తాత్పర్యమ్.

బాలానందిని

కిం చేతి - మరొక విషయం ఏమనగా - అర్థం (వాచ్యార్థం) వ్యంజకమే అయినా అది వ్యంజింపచేయబడడానికి కూడ యోగ్యంగా ఉంటుంది. కొన్ని చోట్ల అది వ్యంగ్యం అవడానికి కూడా అవకాశం ఉంది. కాని శబ్దంమాత్రం ఎల్లప్పుడూ వ్యంజకంగానే ఉంటుంది కాని ఏ నాడూ ఇది వ్యంగ్యం కాజాలదు. ఈ విషయాన్నే వ్యఞ్జకముఖేన అనే మాటలో చెపుతున్నాడు. న చేతి - వాచ్యార్థానికి అవివక్షితత్వాదిరూపంచేత ఏ భేదం ఉన్నదో అక్కడ అర్థానికి వ్యంజకత్వం అసలు లేనే లేదు అన్న మాట లేదు. అనగా వ్యంజకత్వం ఉన్నది, అని పునఃశబ్దంచేత చెపుతున్నాడు. వ్యంజకముఖంచేత కూడ ధ్వనిభేదం (వెనక) అసలే ప్రకాశింపబడలే దన్న మాట లేదు. ప్రకాశింపబడినా కూడ ఇప్పుడుమాత్రం శుద్ధమైన వ్యంజకాల ముఖాన, ఎన్నడూ తాము వ్యంగ్యాలు కాజాలని వ్యంజకాల ద్వారా, చెప్పబడుతున్నది. అది యుక్తమే కదా (తథాహి). పదం, వాక్యం, వర్ణాలు, పదభాగం, సంఘటన, మహావాక్యం అనే ఈ వ్యంజకాల భేదం వాటి స్వరూపంలోనే ఉంది; వ్యంగ్యాన్నిపట్టి ఈ భేదాలు ఏర్పడడంలేదు. అంతేకాదు - అర్థం వలె ఇవి ఎన్నడూ వ్యంగ్యా లవడం సంభవించదు. అందువల్ల కేవలం వ్యంజకాలుగా ఉన్నవాటిలో నియతంగా ఉండే ఏ స్వరూపం ఉన్నదో దాని ముఖాన మాత్రమే, తద్వారా మాత్రమే, భేదం ప్రకాశించబడుతుంది అని తాత్పర్యం.

లోచనం

యస్తు వ్యాచష్టే - "వ్యఙ్గ్యానాం వస్త్వలంకారరసానాం ముఖేన' ఇతి, స ఏవం ప్రష్టవ్యః - ఏతత్తావత్త్రిభేదత్వం న కారికాకారేణ కృతమ్. వృత్తికారేణ తు దర్శితమ్. న చేదానీం వృత్తికారః భేదప్రకటనం కరోతి, తతశ్చ ఇదం కృతమ్, ఇదం క్రియతే ఇతి కర్తృభేదే కా సంగతిః? న చైతావతా సకలప్రాక్తనగ్రన్థసంగతిః కృతా భవతి; అవివక్షితవాచ్యాదీనామపి ప్రకారాణాం దర్శితత్వాత్ ఇత్యలం నిజపూజ్యజనసగోత్రైః సాకం వివాదేన.

బాలానందిని

యస్తు ఇతి - "వ్యంగ్యాలైన వస్త్వలంకారరసాల ముఖంచేత (ద్వారా)" అని ఎవడైతే 'వ్యఙ్గ్యముఖేనైవ' అనే పదానికి వ్యాఖ్యానం చేశాడో అతణ్ణి ఈ విధంగా అడగాలి - "ఈ మూడు భేదాలు ఉన్నట్లు కారికాకారుడు చెప్పలేదు. ఆ భేదాలు చూపినవాడు వృత్తికారుడు. ఇప్పుడు వృత్తికారుడు భేదప్రకటనం చేయడం లేదు (కారికాకారుడు చేస్తున్నాడు). అలాంటప్పుడు కర్తలు వేరైనప్పుడు - ఇది చేయబడింది, ఇది చేయబడుతూన్నది అనడంలో ఔచిత్యం ఏముంది? మరొక విషయం ఏమనగా - ఇలా చెప్పినంతమాత్రంచేత వెనుకటి గ్రంథానికంతకీ సంగతి, ఈ ఉద్ద్యోతంలో చెప్పబడేదానితో సంబంధం, చెప్పినట్లు కాదు కూడ. ఎందువల్ల ననగా వెనుకటి ఉద్ద్యోతంలో అవివక్షితవాచ్యం మొదలైన ప్రకారాలు కూడ చెప్పబడ్డాయి. సరే, మాకు పూజ్యులైన వారితో సగోత్రులైనవారితో (సమానులైన వారితో) వివాదం చాలు.

లోచనం

చకారః కారికాయాం యథాసంఖ్యశఙ్కానివారణాయ. తేన అవివక్షితవాచ్యో ద్విప్రభేదోఽపి ప్రత్యేకం పదవాక్యప్రకాశ ఇతి ద్విధా. తదన్యస్య వివక్షితాభిధేయస్య సంబన్ధీ యో భేదః క్రమద్యోత్యో నామ స్వభేదసహితః సోఽపి ప్రత్యేకం ద్విధైవ. అనురణనేన రూపం రూపణం సాదృశ్యం యస్య తాదృక్ వ్యఙ్గ్యం యత్తస్యేత్యర్థః.

మహర్షేరిత్యనేన తదనుసంధత్తే యత్ ప్రాగుక్తమ్ - "అథ చ రామాయణమహాభారతప్రభృతిని లక్ష్యే దృశ్యతే" ఇతి.

ధృతిః క్షమా దయా శౌచం కారుణ్యం వాగనిష్ఠురా,

మిత్రాణాం చానభిద్రోహః సప్తైతాః సమిధః శ్రియః.

సమిచ్ఛబ్దార్థస్య అత్ర సర్వథా తిరస్కారః, అసంభవాత్. సమిచ్ఛబ్దేన చ వ్యఙ్గ్యోఽర్థః అనన్యాపేక్షలక్ష్మ్యుద్దీపనక్షమత్వం సప్తానాం వక్త్రభిప్రేతం ధ్వనితమ్. యద్యపి "నిఃశ్వాసాన్ధ ఇవాదర్శః" ఇత్యాద్యుదాహరణాదప్యయమర్థో లభ్యతే, తథాపి ప్రసఙ్గాత్ బహులక్ష్యవ్యాపిత్వం దర్శయితుమ్ ఉదాహరణాన్తరాణ్యుక్తాని. అత్ర చ వాచ్యస్య అత్యన్తతిరస్కారః పూర్వోక్తమనుసృత్య యోజనీయః. కిం పునరుక్తేన? సన్నద్ధపదేన చాత్ర అసంభవత్స్వార్థేన ఉద్యతత్వం

లక్షయతా వక్త్రభిప్రేతా సప్కురుణకత్వాప్రతికార్యత్వాప్రేక్షాపూర్వకారిత్వాదయః ధ్వన్యన్తే. తథైవ మధురశబ్దేన సర్వవిషయరఞ్జకత్వతర్పకత్వాదికం లక్షయతా సాతిశయాభిలాషవిషయత్వం నాత్రాశ్చర్యమితి వక్త్రభిప్రేతం ధ్వన్యతే.

బాలానందిని

చకార ఇతి - కారికలోని చకారం యథాసంఖ్యంగా అన్వయిస్తుందనే శంకను నివర్తింపచేయడంకొరకు; అనగా ఈ కారికలో చెప్పిన అవివక్షివాచ్యం, అనురణనరూపవ్యంగ్యం ఈ రెండూ వరసగా పదప్రకాశము, వాక్యప్రకాశమూ అవుతా యనే అర్థం రాకుండా ఉండడంకొర్కై 'ధ్వనేః'కి వెనుక 'చ' ఉపయోగించబడింది. దానిని పట్టి ఈ రెంటిలో ఒక్కొక్కదానికి పదవాక్యప్రకాశత ఉంటుంది అనే అర్థం వస్తుంది. తేనేతి - అందుచేత రెండు విధాలైన అవివక్షితవాచ్యం (అత్యంతతిరస్కృతవాచ్య - అర్థాంతరసంక్రమితవాచ్యాలు రెండూ కూడ) ఒక్కొక్కటి పదప్రకాశం అనీ వాక్యప్రకాశం అనీ రెండు విధాలు. తదన్యస్య= దానికంటె భిన్నమైన వివక్షితాభిధేయంయొక్క క్రమద్యోత్యం అనే ఏ భేదం కలదో, అది తన అవాంతరభేదాలతో కూడ, ఒక్కొక్కటి రెండేసి విధాలు. అనురణనేన= మారుమ్రోగడంతో, రూపమ్= రూపణం= సాదృశ్యం, దేనికో అలాంటి వ్యంగ్యం ఏదైతే ఉన్నదో దానికి అని అర్థం. మహర్షేః అనడంచేత "అథ చ రామాయణమహాభారతప్రభృతిని లక్ష్యే దృశ్యతే" అని వెనుక చెప్పిన దానిని ఇక్కడ కలుపుతున్నాడు.

ధృతిః ఇతి:- "ధైర్యం, ఓర్పు, దయ, శౌచం(మనోవాక్కాయాలలో పరిశుద్ధత్వం) కారుణ్యం, పారుష్యం లేని వాక్కు, మిత్రులకు ద్రోహం చేయకపోవడం ఈ ఏడూ లక్ష్మికి సమిధలు".

ఇక్కడ సమిచ్ఛబ్దానికి 'కట్టెలు' అనే వాచ్యార్థం కుదరదు కాబట్టి పూర్తిగా తిరస్కరించబడుతుంది. సమిచ్ఛబ్దంచేత "ఈ ఏడూ ఇతరాపేక్ష ఏమీ లేకుండా లక్ష్మిని పెంపొందించడానికి సమర్థమైనవి" అని వక్తచెప్పదలచుకున్న అర్థం ధ్వనించబడుతున్నది. అనగా సమిచ్ఛబ్దం లక్షణచేత ఉద్దీపకత్వాన్ని బోధిస్తుంది. ఇతరాపేక్ష ఏదీ లేకపోవడాన్ని వ్యంజింపచేస్తుంది అని అర్థం. "నిఃశ్వాసాన్ధ ఇవాదర్శః" (చూ. శ్లో. 120) మొదలైన పూర్వం ఉదాహరించిన శ్లోకాలలో కూడ ఈ అర్థం ('అంధ' శబ్దానికి అత్యంతతిరస్కృతవాచ్యత్వంవల్ల) లభిస్తున్నా ప్రసంగంచేత, దీనికి అనేక ఉదాహరణలు చూపవచ్చు ననే అభిప్రాయంతో ఇతర ఉదాహరణలు కూడ చెప్పబడ్డాయి. ఇక్కడ

వాచ్యం ఏ విధంగా అత్యంతం తిరస్కృతమైనదో వెనక (120 శ్లోకంలో) చెప్పిన పద్ధతిని అనుసరించి గ్రహించాలి. మాటిమాటికి చెప్పడం ఎందుకు?

సంనద్ధేతి - ఇక్కడ సంనద్ధశబ్దవాచ్యార్థం కుదరదు. అందుచేత ఆ శబ్దం లక్షణచేత ఉద్యుక్తుడవడం అనే-అర్థాన్ని బోధిస్తూ వక్త చెప్పదలచిన నిష్కరుణత్వం, ప్రతిక్రియ చేయడానికి శక్యం కాకపోవడం, సరియైన ఆలోచన లేకుండా పనిచేయడం మొదలైన అర్థాలు వ్యంజింపచేస్తుంది. అట్లే 'మధుర' శబ్దం సకలవిషయాలను రంజింపచేయడం, తృప్తి కలిగించడం మొదలైన అర్థాలను లక్షణచేత బోధిస్తూ, "ఈమె అత్యధికమైన అభిలాషకు విషయమైన దంటే ఈ విషయంలో ఆశ్చర్యం ఏమీ లేదు" అని వక్త చెప్ప దలచిన అర్థాన్ని ధ్వనింపచేస్తుంది.

## ధ్వన్యాలోకం

తస్యైవ అర్థాన్తరసంక్రమితవాచ్యే యథా - "రామేణ ప్రియజీవితేన తు కృతం ప్రేమ్ణః ప్రియే నోచితమ్". అత్ర రామేణేత్యేతత్పదం సాహసైకరసత్వాదివ్యఙ్గ్యాభిసంక్రమితవాచ్యం వ్యఞ్జకమ్. యథా వా-

గాథ. ఏమేఅ జణో తిస్సా దేఉ కవోలోపమాఇ ససిబిమ్బమ్,
పరమత్థవిఆరే ఉణ చన్దో చన్దో విఅ వరాఓ. (71)

అత్ర ద్వితీయశ్చన్ద్రశబ్దః అర్థాన్తరసంక్రమితవాచ్యః.

### బాలానందిని

తస్యేతి - అవివక్షితవాచ్యానికే సంబంధించిన అర్థాన్తరసంక్రమితవాచ్యంలో ఉదాహరణం ఎట్లనగా - రామేణ ఇతి. పూర్తిశ్లోకం లోచనంలో ఇవ్వబడింది. రావణుడు తన ఎదుట మాయాసీతాశిరశ్ఛేదం చేసినప్పుడు సీతను ఉద్దేశించి రాముడు అంటూన్న మాటలు - ప్రియే= ప్రియురాలా! క్రూరేణ= క్రూరుడైన, రక్షసా= రాక్షసునిచేత, తే= నీ యొక్క (నువ్వు చేసిన) ప్రత్యాఖ్యానరుషః= ప్రత్యాఖ్యానంవల్ల కలిగిన కోపానికి, సముచితమ్= తగిన పని, తే= నీ విషయంలో, కృతమ్= చేయబడింది. త్వయా చ= నీచేత కూడ, తత్= వాని క్రూరకార్యం, కులజనః= కులజనం (కులంలోనివారందరూ) యథా= ఎట్లు, శిరః= శిరస్సును, ఉచ్చైః= ఉన్నతంగా, ధత్తే= ధరించునో, తథా=

ఆవిధంగా, సోఢం చ= సహించబడినది. సంప్రతి= ఇప్పుడు, త్వద్వ్యాపదః= నీ ఆపదకు, సాక్షిణా= సాక్షిగా ఉన్నవాడు, ఇదం ధనుః= ఈ ధనస్సును, వ్యర్థమ్= వ్యర్థంగా, బిభ్రతా= ధరిస్తున్నవాడు, ప్రియజీవితేన= ఇష్టమైన తన జీవితం కలవాడు అయిన, రామేణ తు= రాముని చేత నైతే, ప్రేమ్ణః= ప్రేమకు, ఉచితమ్= తగిన విధంగా, న కృతమ్= చేయబడలేదు.

అత్రేతి - ఇక్కడ 'రామేణ' అనే పదం సాహసమునందు ప్రధానమైన (అధికమైన) ఆసక్తి కలిగి ఉండడం మొదలైన వ్యంగ్యం విషయంలో సంక్రమించిన వాచ్యం గలదై వ్యంజకంగా ఉంది. మరొక ఉదాహరణం ఎట్లనగా -

ఏమేఅ ఇతి (దీని సంస్కృతచ్ఛాయ లోచనంలో ఇవ్వబడింది) తస్యాః= ఆమెయొక్క, కపోలోపమాయామ్= చెక్కిళ్లకు ఉపమయందు,జనః= జనం, ఏవమేవ= ఈ విధంగానే, శశిబిమ్బమ్= చంద్రబింబాన్ని, దదాతి= ఇస్తూ ఉంటుంది. పరమార్థవిచారే= పరమార్థాన్ని గూర్చి ఆలోచిస్తే (నిజం చెప్పవలసివస్తే), వరాకః= దీనుడైన (పాపం) చన్ద్రః= చంద్రుడు, చన్ద్ర ఇవ = చంద్రుడువలెనే ఉన్నాడు.

అత్రేతి - ఇక్కడ రెండవ చన్ద్రశబ్దం అర్థాంతరసంక్రమితవాచ్యం.

లోచనం

తస్యైవేతి :- అవివక్షితవాచ్యస్య యః ద్వితీయో భేదః తస్యేత్యర్థః.

శ్లో. "ప్రత్యాఖ్యానరుషః కృతం సముచితం క్రూరేణ తే రక్షసా
సోఢం తచ్చ తథా త్వయా కులజనో ధత్తే యథోచ్చైః శిరః,
వ్యర్థం సంప్రతి భిభ్రతా ధనురిదం త్వద్వ్యాపదః సాక్షిణా" ఇతి.

రక్షఃస్వభావాదేవ యః క్రూరః, అనతిలఙ్ఘ్యశాసనత్వాదుర్మదతయా చ ప్రసహ్య నిరాక్రియమాణః క్రోధాన్ధః, తస్యైతత్తావత్ స్వచిత్తవృత్తిసముచిత మనుష్ఠానం యత్ మూర్ధకర్తనం నామ, మాన్యోఽపి కశ్చిన్మమాజ్ఞాం లఙ్ఘయిష్య తీతి. త ఇతి- యథా తాదృగపి తయా న గణితః తస్యాః తవేత్యర్థః. తదపి తథా అవికారేణ ఉత్సవాపత్తిబుద్ధ్యా నేత్రవిస్ఫారతాముఖప్రసాదాదిలక్ష్యమాణయా సోఢమ్. యథా యేన ప్రకారేణ. కులజన ఇతి యః కశ్చిత్ పామరప్రాయోఽపి కులవధూశబ్దవాచ్యః. ఉచ్చైః శిరో ధత్తే. ఏవంవిధాః కిల వయం కులవధ్వః భవామ ఇతి. అథ చ శిరఃకర్తనావసరే త్వయా శీఘ్రం కృత్యతామ్ ఇతి తథా

సోఢం తథా ఉచ్చైః శిరో ధృతం యథా అన్యోఽపి కులస్త్రీజనః ఉచ్చైః శిరః ధత్తే నిత్యప్రవృత్తతయా. ఏవం రావణస్య తవ చ సముచితకారిత్వం నిర్వ్యూఢమ్.

బాలానందిని

రక్ష ఇతి - ఎవడైతే రాక్షసస్వభావంచేతనే క్రూరుడో, అతడు దృఢమైన పట్టుదలతో (ప్రసహ్య)నీచేత నిరాకరించబడినవాడై, "నా శాసనాన్ని ఎవరూ ఉల్లఘించడానికి వీలు లేదు" అనే దుర్మదం కలవా డవడంచేత క్రోధాంధుడై, "ఇతరు లెవరూ కూడ ఈ విధంగా నా శాసనాన్ని ధిక్కరించకుందురు గాక" అనే ఉద్దేశ్యంతో, తన చిత్తవృత్తికి తగిన, నీ శిరస్సును ఛేదించడం అనే పని చేశాడు. తే ఇతి :- అలాంటివాడు కూడ ఎట్లు నీ చేత ఆ విధంగా లెక్కచేయబడలేదో అట్టి నీయొక్క అని అర్థం. తదపీతి :- అది కూడ, తథా= ఆ విధంగా, నేత్రవికాసమూ, ముఖం ప్రసన్నంగా ఉండడం మొదలైనవాటిచేత ఊహించదగిన "ఉత్సవం లభించింది" అనే బుద్ధితో ఏలాంటి వికారమూ లేకుండా, యథా= ఏ ప్రకారంచేత, కులజన ఇతి. కులవధువు అనే శబ్దంచేత పిలవదగిన పామరప్రాయమైన (పామరజనం వంటి) అతిసాధారణమైన (యః కశ్చిత్) జనం కూడ, ఉచ్చైః శిరో ధత్తే= 'కులవధువులం అంటే మేం ఇలాగే ఉంటాం" అని తల పైకెత్తుకొని ఉంటారో. మరొక అర్థం చెపుతున్నాడు - అథ చేతి - మరియు శిరస్సును ఛేదించే సమయంలో "శీఘ్రంగా ఛేదించు" అన్నట్లు నువ్వు ఆ విధంగా సహించావు, శిరస్సుపైకి ఎత్తినావు, ఎలా అనగా ఇతరకులస్త్రీజనం కూడ తమ శిరస్సులను ఎల్లప్పుడు కూడ (నిత్యప్రవృత్తతయా) పైకి ఎత్తుకొని సంచరిస్తారో. ఈ విధంగా రావణుడు, నువ్వూ కూడ తమకు తగిన పనులు నిర్వహించారు.

లోచనం

మమ పునః సర్వమేవ అనుచితం పర్యవసితమ్. తథాహి; రాజ్యనిర్వాసనాదినిరవకాశీకృతధనుర్వ్యాపారస్యాపి, కలత్రమాత్రరక్షణ ప్రయోజనమపి యచ్చాపమభూత్ తత్సంప్రతి త్వయి అరక్షితవ్యాపన్నాయామేవ నిష్ప్రయోజనమ్; తథాపి చ తద్ధారయామి. తత్ నూనం నిజజీవితరక్షైవాస్య ప్రయోజనత్వేన సంభావ్యతే. న చైతద్యుక్తమ్. రామేణేతి - అసమసాహసరసత్వ నత్యనంధత్వోచితకారిత్వాది వ్యఙ్గ్యధర్మాన్తరపరిణతేనేత్యర్థః". "కాపురుషాదిధర్మ పరిగ్రహస్తు ఆదిశబ్దాత్" ఇతి యద్వ్యాఖ్యాతం తదసత్,

కాపురుషస్య హి ఏతదేవ ప్రత్యుత ఉచితం స్యాత్. ప్రియే ఇతి :- శబ్దమాత్రమేవ ఏతదిదానీం సంవృత్తమ్. ప్రియశబ్దస్య యత్ ప్రవృత్తినిమిత్తం యత్ ప్రేమనామ తదప్యనౌచిత్యకలఙ్కితమితి శోకాలమ్బనోద్దీపనవిభావయోగాత్ కరుణరసో రామస్య స్ఫుటీకృత ఇతి.

బాలానందిని

మమేతి - నాకైతే అంతా అనుచితంగానే పర్యవసించింది. ఎట్లనగా (తథాహి) - రాజ్యం నుంచి నన్ను లేవకొట్టివేయడం మొదలైన కారణాలచేత నాకు ధనస్సును ఉపయోగించే అవకాశమే లేకుండా పోయింది. ఆ విధంగా ఏ ధనస్సుకు భార్యను రక్షించుకొనడం మాత్రమే ప్రయోజనంగా మిగిలిందో అది ఇప్పుడు నువ్వు రక్షింపబడకపోవడంచేత మరణించగా ప్రయోజనశూన్యం అయిపోయింది. అయినా నేను దానిని పట్టుకొనే ఉన్నాను. ఇంక ఇప్పుడు నా జీవితాన్ని రక్షించుకొనడమే దాని ప్రయోజనం అన్నట్లు అయింది. ఇది యుక్తం కాదు. రామేణేతి - సాటిలేని సాహసం కలిగి ఉండడం, సత్యసంధత్వం, ఉచితకార్యకారిత్వం మొదలైన, వ్యంగ్యములైన ఇతరధర్మాల రూపంలో పరిణమించిన (బోధించే) 'రామేణ' అనే పదం అని అర్థం.

'సాహసైకరసత్వాది' లోని 'ఆది' పదంచేత కాపురుషత్వం (నీచపురుషత్వం) మొదలైన ధర్మాలు గ్రహించబడతాయి అని చేసిన వ్యాఖ్యానం అయుక్తం. కాపురుషునికి ఇది అనుచితం అవడానికి బదులు ఉచితమే అవుతుంది కదా? ప్రియే ఇతి :- ఇప్పుడిది మాటమాత్రంగా మిగిలింది. ప్రియశబ్దప్రవృత్తినిమిత్తమైన (ప్రవృత్తినిమిత్తం అనగా అర్థం. ఒక శబ్దాన్ని ప్రయోగించడానికి అర్థమే నిమిత్తం) ఏ ప్రేమ అనేది ఉందో అది కూడ అనౌచిత్యం చేత కలంకితం అయిపోయింది. ఈ విధంగా శోకానికి సంబంధించిన ఆలంబన (మృతురాలుగా భావించబడిన సీత) ఉద్దీపన (తదీయాసాధారణ ప్రేమస్మరణాదికం) విభావాల యోగంవల్ల రాముని కరుణరసం స్పష్టం అవుతున్నది.

లోచనం

ఏమేఅ ఇతి -

"ఏవమేవ జనస్తస్యా దదాతి కపోలోపమాం శశిబిమ్బమ్,

పరమార్థవిచారే పునశ్చన్ద్రశ్చన్ద్ర ఇవ వరాకః" (ఇతి ఛాయా)

ఏవమేవేతి - స్వయమవివేకాన్ధతయా. జనః ఇతి - లోకప్రసిద్ధగతాను గతికతామాత్రశరణః. తస్యా ఇతి అసాధారణగుణగణమహార్ఘవపుషః.

కపోలోపమాయామితి - నిర్వ్యాజలావణ్యసర్వస్వభూత ముఖమధ్యవర్తిప్రధాన భూతకపోలస్యోపమాయాం ప్రత్యుత తదధికవస్తు కర్తవ్యం, తతో దూరనికృష్టం శశిబిమ్బం కలఙ్కవ్యాజజిహ్మీకృతమ్. ఏవం యద్యపి గడ్డరికాప్రవాహపతితో లోకః తథాపి యది పరీక్షకాః పరీక్షన్తే తద్వారాకః, కృపైకభాజనం యః చన్ద్ర ఇతి ప్రసిద్ధః స చన్ద్ర ఏవ క్షయిత్వవిలాసశూన్యత్వమలినత్వధర్మాన్తరసంక్రాన్తః యోఽర్థః. అత్ర చ యథా వ్యఙ్గ్యధర్మాన్తరసంక్రాన్తిః తథా పూర్వోక్తమను సంధేయమ్. ఏవముత్తరత్రాపి.

బాలానందిని

ఏవమితి - తాము అవివేకంచేత అంధులవడంచేత. జనః ఇతి - లోకంలో ప్రసిద్ధమైన గతానుగతికత్వమే శరణంగా గల జనం. గతానుగతికత్వం అనగా ఒకడు ఒక మార్గంలో వెడుతూంటే గ్రుడ్డిగా వాని వెనకనే వెళ్లడం. తస్యా ఇతి - అసాధారణాలైన గుణాల గణంచేత చాలా విలువైన శరీరం గల ఆమెయొక్క. కపోలోపమాయామితి - అకృత్రిమమైన లావణ్యానికి సర్వస్వమైన ముఖం మధ్య ఉన్న ప్రధానమైన కపోలానికి ఉపమయందు; ఆ కపోలంకంటె అధికమైన వస్తువును ఉపమానంగా చూపడానికి బదులు, దానికంటె ఎంతో నికృష్టం అయిన, శశిబిమ్బమ్= కలంకం అనే వ్యాజం గల చెవులపిల్లిచేత మలినం చేయబడిన చంద్రబింబం. ఏవమితి - ఈ విధంగా గడ్డరికాప్రవాహంలో, గొఱ్ఱెల మందపద్ధతిలో, లోకం అంతా పడి ఉన్నా పరీక్షకులు జాగర్తగా పరీక్షిస్తే అప్పుడు, వరాకః=కేవలం జాలికి స్థానమైన, జాలిపడదగిన, ఏ చంద్రుడనే ప్రసిద్ధి కలవాడు ఉన్నాడో వాడు చంద్రుడే. ఏ అర్థం, చంద్రరూపార్థం, ఉన్నదో అది క్షయిత్వం, విలాసశూన్యత్వం, మలినత్వం మొదలైన ధర్మాంతరాలలో సంక్రమించినది. అత్రేతి - ఇక్కడ (ఈ రెండు ఉదాహరణలలో) ఏ విధంగా వ్యంగ్యాలైన ధర్మాంతరాల సంక్రమణం జరుగుతుందో అది వెనుక ద్వితీయోద్యోతప్రారంభంలో స్నిగ్ధేత్యాదిశ్లోకం దగ్గర చెప్పిన విధంగా ఇక్కడ సమన్వయించుకొనాలి. ఇట్లే ముందు ముందు కూడ.

ధ్వన్యాలోకం

అవివక్షితవాచ్యస్య అత్యన్తతిరస్కృతవాచ్యే ప్రభేదే వాక్యప్రకాశతా యథా -

శ్లో. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. (72)

అనేన హి వాక్యేన నిశార్థః న చ జాగరణార్థః కశ్చిద్వివక్షితః. కిం తర్హి? తత్త్వజ్ఞానావహితత్వమ్ అతత్త్వపరాఙ్ముఖత్వం చ మునేః ప్రతిపాద్యతే ఇతి తిరస్కృతవాచ్యస్యాస్య వ్యఞ్జకత్వమ్.

బాలానందిని

అవివక్షితేతి - అవివక్షితవాచ్యంయొక్క అత్యంతతిరస్కృతవాచ్యం అనే ప్రభేదంలో వాక్యప్రకాశత ఎట్లనగా -

యేతి - సర్వభూతానామ్= సకలప్రాణులకు, యా = ఏది, నిశా= రాత్రియో, తస్యామ్= దానియందు, సంయమీ= సంయమవంతుడైన జ్ఞాని, జాగర్తి= మేల్కొని ఉంటున్నాడు, యస్యామ్= దేనియందు, భూతాని= ప్రాణులు, జాగ్రతి= మేల్కొని ఉంటాయో, సా = అది, పశ్యతః= చూస్తున్న, మునేః = మునికి, నిశా= రాత్రి.

అనేనేతి - ఈ వాక్యంచేత నిశ అనే అర్థం గాని, జాగరణం అనే అర్థం గాని ఏదీ వివక్షితం కాదు (చెప్ప నిశ్చయించబడడం లేదు). మరే మనగా - ముని తత్త్వ జ్ఞానంలోనే సావధానచిత్తుడై ఉండడం, అపారమార్థికాలైన విషయాలమీద పరాఙ్ముఖుడై ఉండడం ప్రతిపాదించబడుతున్నది. అందువల్ల తిరస్కృతవాచ్యమైన ఈ వాక్యం వ్యంజకంగా ఉంది.

లోచనం

ఏవం ప్రథమప్రభేదస్య ద్వావపి ప్రకారౌ పదప్రకాశకత్వేన ఉదాహృత్య వాక్య ప్రకాశకత్వేన ఉదాహరతి - యా నిశేతి. వివక్షిత ఇతి. తేన హి ఉక్తేన న కశ్చిదుపదేశ్యం ప్రత్యుపదేశః సిద్ధ్యతి. నిశాయాం జాగరితవ్యమ్, అన్యత్ర రాత్రివదాసితవ్యమ్ ఇతి కిమనేనోక్తేన? తస్మాద్బాధితస్వార్థమేతద్వాక్యం సంయమినఃలోకోత్తరతాలక్షణేన నిమిత్తేన తత్త్వదృష్టౌ అవధానం, మిథ్యాదృష్టౌ చ పరాఙ్ముఖత్వం ధ్వనతి. సర్వశబ్దార్థస్య చాపేక్షికతయాపి ఉపపద్యమానతేతి న సర్వశబ్దార్థాన్యథానుపపత్త్యా అయమర్థః ఆక్షిప్తో మన్తవ్యః. సర్వేషాం బ్రహ్మాది స్థావరాన్తానాం చతుర్దశానామపి భూతానాం యా నిశా వ్యామోహజననీ

తత్త్వదృష్టిః, తస్యాం సంయమీ జాగర్తి కథం ప్రాప్యేతేతి. న తు విషయవర్జనమాత్రాదేవ సంయమీతి యావత్.

యది వా సర్వభూతనిశాయాం మోహిన్యాం జాగర్తి కథమియం హేయేతి. యస్యాం తు మిథ్యాదృష్టౌ సర్వాణి భూతాని జాగ్రతి అతిశయేన సుప్రబుద్ధరూపాణి సా తస్య రాత్రిః అప్రబోధవిషయః. తస్యా హి చేష్టాయాం నాసౌ ప్రబుద్ధః. ఏవమేవ లోకోత్తరాచారవ్యవస్థితః పశ్యతి మన్యతే చ. తస్యైవాన్తర్బహిష్కరణవృత్తిః చరితార్థా. అన్యస్తు న పశ్యతి న చ మన్యతే ఇతి తత్త్వదృష్టిపరేణ భావ్యమితి తాత్పర్యమ్. ఏవం చ పశ్యత ఇత్యపి మునేరిత్యపి చ న స్వార్థమాత్రవిశ్రాన్తమ్. అపి తు వ్యఙ్గ్య ఏవ విశ్రామ్యతి. యత్తచ్ఛబ్దయోశ్చ న స్వతన్త్రార్థతేతి సర్వ ఏవాయమాఖ్యాతసమూహః పదసమూహః వ్యఙ్గ్యపరః. తదాహ - అనేన హి వాక్యేనేతి. ప్రతిపాద్యత ఇతి - ధ్వన్యత ఇత్యర్థః.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా మొదటి భేదమైన అవివక్షితవాచ్యంయొక్క రెండు ప్రకారాలను పదప్రకాశకత్వంచేత ఉదాహరించి, ఇప్పుడు వాక్యప్రకాశకత్వంచేత ఉదాహరిస్తున్నాడు - యా నిశా ఇతి. (ఇది భగవద్గీతలోని శ్లోకం) వివక్షిత ఇతి. చెప్పబడిన దానిచేత, అనగా నిశాదిపదవాచ్యమైన రాత్ర్యాద్యర్థంచేత ఉపదేశింపదగినవానిని గూర్చి ఏ విధమైన ఉపదేశము సిద్ధించదు కదా? రాత్రియందు మెలకువతో ఉండాలి, పగలు రాత్రియం దున్నట్లు ఉండాలి అని చెప్పడంచేత ఏం ప్రయోజనం? అందువల్ల ఈ వాక్యం బాధితమైన స్వార్థం కలదై సంయమవంతుడు లోకోత్తరుడుగా ఉంటాడు, ఈ లోకానికి అందని అత్యున్నతమానసికస్థితిలో ఉంటాడు అనే కారణంచేత ఈతనికి తత్త్వదృష్టియందు ఏకాగ్రతను, మిథ్యాదృష్టియందు అసత్యమైన లౌకికదృష్టియందు, విముఖత్వాన్నీ ధ్వనింపచేస్తున్నది.

(ఆశంక) "సర్వభూతాలకీ ఏది రాత్రో" అన్నప్పుడు ఈ అన్ని భూతాలలో సంయమి కూడ చేరుతాడు. కాని "ఆ సంయమి మేల్కొని ఉంటాడు" అని చెప్పడంచేత ఆతనిని ఈ అందరినుంచీ మినహాయించి నట్లు అయింది. ఈ విధంగా సర్వశబ్దప్రయోగంవల్లనే నువ్వు చెప్పిన వ్యంగ్యార్థం ఆవిష్కరించబడిపోవటంచేత ఇది ధ్వనికాదు. ఈ ఆశంకను సర్వశబ్దార్థస్య ఇత్యాదికంచేత పరిహరిస్తున్నాడు. సర్వశబ్దార్థం

ఆపేక్షికంగా ఉపపన్నం కావచ్చు. ఎవరి అపేక్షయా (ఎవరిని పట్టి) సర్వేలు అంటే సంయమి అపేక్షయా సర్వేలు, అనగా సంయమి తప్ప మిగిలినవాళ్లందరూ అని సర్వశబ్దార్థానికి అర్థం. అందుచేత సర్వశబ్దార్థం మరొక విధంగా ఉపపన్నం కాదు కాబట్టి ధ్వనింపచేయబడుతున్నట్లుగా చెప్పే అర్థం ఆక్షిప్తం అవుతున్నది, లాగబడుతుంది, (అందుచేత ధ్వని కాదు) అని అనకూడదు. సర్వేషామితి :- బ్రహ్మాదిస్థావరాంతాలైన పద్నాలుగు విధాలైన భూతాలకు ఏది రాత్రియో, వ్యామోహం కలిగించే ఏ తత్త్వదృష్టి ఉందో, దానియందు సంయమి, అది నాకు ఎలా లభిస్తుందా అనే ఆలోచనతో మెలకువతో ఉంటాడు. కేవలం భోగాలను విడిచివేసినంతమాత్రంచేత సంయమి కాజాలడు అని తాత్పర్యం.

వివరణ:- బ్రాహ్మ - ప్రాజాపత్య - ఐన్ద్ర - పిత్ర్య - గాంధర్వ - యాక్ష - రాక్షస - పైశాచాలనే ఎనిమిది విధాల దైవభూతాలు, మనుష్యులు, పశు-పక్షి-సరీసృప-కీటక-స్థావరాలనే ఐదు విధాల తిర్యగ్యోనికి చెందిన భూతాలు అని మొత్తం భూతాలు పద్నాలుగు విధాలు. దీనిని గూర్చి "అష్టవికల్పో దైవః" ఇత్యాదిసాంఖ్యకారికలో చెప్పబడింది.

తత్త్వదృష్టి వ్యామోహం కలిగిస్తుం దని చెప్పడం అయుక్తం కదా అని ఆశంకించుకొని మరొక విధంగా వ్యాఖ్యానిస్తున్నాడు - యది వా ఇతి - సర్వభూతాలకీ నిశ అయిన మోహినియైన, అవిద్యయందు సంయమి, దీనిని ఎలా వదల్చుకోవాలా అని జాగరూకుడై ఉంటాడు. ఏ మిథ్యాదృష్టియందు సకలభూతాలు, జాగ్రతి = బాగా మేల్కొని ఉంటాయో, (తగుల్కొని ఉంటాయో) అది అతనికి రాత్రి, అనగా మేల్కొనడం అనేది లేని విషయం. దాని చేష్టలో ఇతడు మేల్కొని ఉండడు, (వశుడై ఉండడు) లోకోత్తరమైన ప్రవర్తనలో ఉన్నవాడు (సంయమి) ఇలాగే చూస్తాడు, ఆలోచిస్తాడు కూడ. ఆతని ఆంతరేంద్రియాల ప్రవర్తనం బాహ్యేంద్రియాల ప్రవర్తనా కూడ సార్థకమైనది. ఇతరుడైతే, సంయమి కానివాడైతే, ఇలా చూడడు, ఆలోచించడు కూడ. అందుచేత తత్త్వదృష్టిపరుడై ఉండాలి అని తాత్పర్యం. ఏవం చేతి - ఈ విధంగా 'పశ్యతః' అనేది, 'మునేః' అనేదీ కూడ స్వార్థమాత్రంలోనే విశ్రమించడంలేదు. దానిలో ఆగిపోవడం లేదు. మరేమనగా వ్యంగ్యార్థంలోనే విశ్రమిస్తున్నాయి. ఈ విషయాన్నే అనేన హి వాక్యేన అని చెపుతున్నాడు. ప్రతిపాద్యతే ఇతి. ధ్వనించబడుతున్నది అని అర్థం.

## ధ్వన్యాలోకం

తస్యైవార్థాన్తరసంక్రమితవాచ్యస్య వాక్యప్రకాశతా యథా-

గాథ. విసమఇఓ కాణ వి కాణ వి వాలేఇ అమిఅణిమ్మాఓ,

కాణ వి విసామిమఓ కాణ వి అవిసామఓ కాలో. (73)

"విషమయితః కేషామపి కేషామపి ప్రయాత్యమృతనిర్మాణః,

కేషామపి విషామృతమయః కేషామప్యవిషామృతః కాలః".

(సంస్కృతచ్ఛాయా)

అత్ర హి వాక్యే విషామృతశబ్దాభ్యాం దుఃఖసుఖరూపసంక్రమిత వాచ్యాభ్యాం వ్యవహార ఇత్యర్థాన్తరసంక్రమితవాచ్యస్య వ్యఞ్జకత్వమ్.

### బాలానందిని

తస్యైవేతి :- ఆ అర్థాంతరసంక్రమితవాచ్యమే వాచ్యప్రకాశం ఎట్లనగా - విషమయితః ఇతి. కాలః= కాలం, కేషామపి= కొంతమందికి, విషమయితః= విషమయంగా చేయబడింది గాను, కేషామపి= కొంతమందికి, అమృతనిర్మాణః= అమృతంతో నిర్మించబడినదిగాను, కేషామపి= కొంతమందికి, విషామృతమయః= విషమయంగాను అమృతమయంగాను, కేషామపి= కొంతమందికి, అవిషామృతః= విషం కాని అమృతం కాని కాకుండాను, ప్రయాతి= గడచును.

అత్రేతి :- ఈ వాక్యంలో సుఖదుఃఖరూపములలో సంక్రమింపచేయబడిన వాచ్యార్థం గల విషామృతశబ్దాలచేత వ్యవహారం (విషయప్రతిపాదనం) గా అర్థాంతరసంక్రమితవాచ్యం వ్యంజకంగా ఉంది.

### లోచనం

విషమయితో విషమయతాం ప్రాప్తః. కేషాం చిద్దుష్కృతినామ్, అతివివేకినాం వా; కేషాం చిత్సుకృతినామ్, అత్యన్తవివేకినాం వా అతిక్రామతి అమృతనిర్మాణః. కేషాం చిత్ మిశ్రకర్మణాం, వివేకావివేకవతాం వా విషామృతమయః, కేషామపి మూఢప్రాయాణాం, ధారాప్రాప్తయోగభూమికా రూఢానాం వా అవిషామృతమయః కాల అతిక్రామతి ఇతి సమ్బన్ధః,

విషామృతపదే చ లావణ్యాదిశబ్దవత్ నిరూఢలక్షణారూపతయా సుఖదుఃఖసాధనయోర్వర్తేతే. యథా - విషం నిమ్బమ్, అమృతమ్ కపిత్థమితి. న చాత్ర సుఖదుఃఖసాధనే తన్మాత్రవిశ్రాన్తే, అపి తు స్వకర్తవ్య సుఖదుఃఖపర్యవసితే. న చ తే సాధనే సర్వథా న వివక్షితే, నిఃసాధనయోః తయోరభావాత్. తదాహ సంక్రమితవాచ్యాభ్యామితి. కేషాం చిదితి చాస్య విశేషే సంక్రాన్తిః. అతిక్రామతి ఇత్యస్య చ క్రియామాత్రసంక్రాన్తిః. కాల ఇత్యస్య సర్వవ్యవహారసంక్రాన్తిః. ఉపలక్షణార్థం తు విషామృతగ్రహణ మాత్రసంక్రమణం వృత్తికృతా వ్యాఖ్యాతమ్. తదాహ - వాక్య ఇతి.

బాలానందిని

విషమయితః= విషమత్వాన్ని పొందినది. కేషాం చిత్= కొందరికి, పాపాత్ములకు లేదా అతివివేకవంతులకు. కొందరికి-పుణ్యాత్ములకు గాని లేదా ఏ మాత్రం వివేకం లేని వాళ్లకి గాని, అమృతంతో నిర్మించబడిందిగా గడుస్తుంది. కొంతమందికి - మిశ్రమైన కర్మలు కలవాళ్లకి అనగా పుణ్యమూ పాపమూ సమంగా ఉన్నవాళ్లకి - లేదా వివేకమూ అవివేకమూ కూడా ఉన్నవాళ్లకి విషమయం గాను అమృతమయంగానూ కూడ ఉంటుంది. కొంత మందికి - మూఢులవంటివాళ్లకి లేదా క్రమంగా లభించిన యోగభూమికలను అధిష్ఠించినవాళ్లకు, విషమయమూ కాకుండా, అమృతమయమూ కాకుండా కాలం గడుస్తుంది అని సంబంధం. విషామృతపదే ఇతి. 'విష' 'అమృత' పదాలు లావణ్యాదిశబ్దాల వలె నిరూఢలక్షణారూపా లవడంచేత సుఖసాధనం, దుఃఖసాధనం అనే అర్థాలను బోధిస్తాయి. 'విష' శబ్దం దుఃఖసాధనం అనే అర్థాన్నీ, 'అమృతశబ్దం సుఖసాధనం అనే అర్థాన్నీ బోధిస్తాయి. ఉదాహరణకి "వేపపండు విషం; వెలగపండు అమృతం" అన్నట్లు. అయితే ఇక్కడ సుఖసాధనం దుఃఖసాధనం అనే అర్థాలు అంతమాత్రంలోనే విశ్రమించవు, ఆగిపోవు; వాటిచేత కలిగించదగిన సుఖదుఃఖాలలో పర్యవసిస్తాయి. అనగా సుఖం, దుఃఖం అనే అర్థాలను బోధిస్తాయి. అయితే ఆ సాధనాలు పూర్తిగా అవివక్షితాలు కూడ (చెప్పడానికి ఉద్దేశించబడనివి కూడ) కాదు, సాధనాలు లేని సుఖదుఃఖాలు ఉండవు కదా? ఈ విషయాన్నే సంక్రమితవాచ్యాభ్యామ్ అనే పదంచేత చెపుతున్నాడు.

వివరణ:- "విషం నిమ్బమ్, అమృతం కపిత్థమ్" ఇత్యాదులలో నిరూఢలక్షణచేత నింబం దుఃఖసాధనం అనీ, కపిత్థం సుఖసాధన మనీ అర్థం లభిస్తుంది. అంతవరకే

అర్థం అక్కడ వివక్షితం. ఇక్కడ కాలం కొంతమందికి దుఃఖమయంగా గడుస్తుంది, కొంతమందికి సుఖమయంగా గడుస్తుంది, ఇత్యాద్యర్థం వివక్షితం. అందుచేత విషపదానికి ఏదో ఒక సాధనంవల్ల కలిగే దుఃఖం అనీ, సుఖపదానికి ఏదో ఒకకారణంవల్ల కలిగే సుఖం అనీ లాక్షణికార్థాలు. ఒకానొక విధమైన దుఃఖం, ఒకానొక విధమైన సుఖం అని వ్యంగ్యార్థం. ఈ విధంగా విష-అమృతపదాల అర్థాలు సాధనరూపంలో సంక్రమించాయి అని భావం.

కేషాంచిదితి :- కేషాంచిత్ అనేది విశేషరూపంలో సంక్రమిస్తుంది. అనగా "కేషాం చిత్" అనే సర్వనామశబ్దానికి 'ఫలానా అని తెలియని కొంతమందికి' అని అర్థం. అయితే 'పాపాత్ములైనవాళ్లకు' మొదలైన విశేషార్థంలో ఇది సంక్రమిస్తూన్నది. అనగా 'అతిక్రామతీతి -అతిక్రామతి అనేది క్రియామాత్రంలో సంక్రమిస్తుంది. అనగా 'అతిక్రామతి' అనే పదానికి 'గడచుచున్నది' అని అర్థం. కాని ఇక్కడ ఈ అర్థం 'భవతి'(ఉంటుంది, అవుతుంది) అనే సామాన్యక్రియారూపార్థంలో సంక్రమిస్తుంది. కాల ఇతి :- కాలశబ్దం సర్వవ్యవహారాలు అనే అర్థంలో సంక్రమిస్తుంది. అనగా 'కాలం' అని మాత్రమే అర్థం కాకుండా జరిగే సమస్తవ్యవహారాలూ అనే అర్థాన్ని బోధిస్తుంది. ఉపలక్షణార్థమితి : వృత్తికారుడు ఉపలక్షణకొరకై (చెప్పవలసినదానిలో కొంత భాగం మాత్రమే చెప్పడం ఉపలక్షణం) విష అమృతశబ్దాలకు సంక్రమణం అని మాత్రమే చెప్పాడు. మిగిలిన పదాలు కూడా అర్థాంతరసంక్రమితా లని ఆయన అభిప్రాయం కూడా. అందుచేతనే 'వాక్యే' అని అన్నాడు.

## ధ్వన్యాలోకం

వివక్షితాభిధేయస్య అనురణనరూపవ్యఙ్గ్యస్య శబ్దశక్త్యుద్భవే ప్రభేదే పదప్రకాశతా యథా -

శ్లో. ప్రాతుం ధనైరర్థిజనస్య వాఞ్ఛాం దైవేన సృష్టో యది నామ నాస్మి,
పథి ప్రసన్నామ్బుధరస్తడాగః కూపోఽథవా కిం న జడః కృతోఽహమ్. (74)

అత్ర హి జడ ఇతి పదం నిర్విణ్ణేన వక్త్రా ఆత్మ సమానాధికరణతయా ప్రయుక్తమ్ అనురణనరూపతయా కూప సమానాధికరణతాం స్వశక్త్యా ప్రతిపద్యతే.

బాలానందిని

వివక్షితేతి - వివక్షితాభిధేయానికి సంబంధించిన అనురణనవ్యంగ్యంయొక్క శబ్దశక్త్యుద్భవప్రభేదంలో పదప్రకాశత ఎట్లనగా -

ప్రాతుమ్ ఇతి - ధనైః= ధనాలచేత, అర్థిజనస్య= యాచకజనంయొక్క, వాఞ్ఛామ్= కోరికను, ప్రాతుమ్= పూరించడానికి, దైవేన= దైవంచేత, యది నామ సృష్టః నాస్మి= సృష్టింపబడకపోయినా, జడః =జడుడనైన, అహమ్= నేను, పథి= మార్గమునందు, ప్రసన్నామ్బుధరః= ప్రసన్నమైన ఉదకం ధరించిన, తడాగః= చెరువుగా గాని, అథవా= లేక, కూపః= నుయ్యిగా గాని, కిమ్= ఎందువలన, న కృతః= చేయబడలేదు?

అత్రేతి - ఇక్కడ నిర్వేదం చెందిన (చింతాక్రాంతుడైన) వక్తచేత తనకు సమానాధికరణంగా తనకు చెందేదిగా ప్రయోగించబడిన 'జడః' అనే పదం అనురణనరూపంగా స్వశక్తిచేత కూపానికి సమానాధికరణం, కూపానికి వర్తించేది అయింది.

లోచనం

ఏవం కారికాప్రథమార్ధలక్షితాన్ చతురః ప్రకారాన్ ఉదాహృత్య ద్వితీయకారికార్ధస్వీకృతాన్ షడన్యాన్ ప్రకారాన్ క్రమేణోదాహరతి వివక్షితాభిధేయస్యేత్యాదినా - ప్రాతుమితి-పూరయితుమ్. ధనైరితి బహువచనం యః యేనార్థీ తస్య తేనేతి సూచనార్థమ్. అత ఏవార్థిగ్రహణమ్. జనస్యేతి. బాహుల్యేన లోకో ధనార్థీ, న తు గుణైరుపకారార్థీ. దైవేనేతి అశక్య పర్యనుయోగేనేత్యర్థః. అస్మీతి. అన్యో హి తావదవశ్యం సృష్టః న త్వహమితి నిర్వేదః. ప్రసన్నం లోకోపయోగి అమ్బు ధారయతీతి. కూపోఽథవేతి. లోకైరప్యలక్ష్యమాణ ఇత్యర్థః. ఆత్మసమానాధికరణతయేతి. జడః కిం కర్తవ్య తామూఢ ఇత్యర్థః. అథ చ కూపః జడః, అర్థితా కస్య కీదృశీతి అసంభవద్వి వేక ఇతి. అత ఏవ జడః శీతలః, నిర్వేదసంతాపరహితః. తథా జడః శీతలజలయోగితయా పరోపకారసమర్థః. అనేన తృతీయార్థేన అయం జడశబ్దః తటాకార్థేన పునరుక్తార్థసంబన్ధ ఇత్యభిప్రాయేణ ఆహ - కూపసమానాధికరణతామితి. స్వశక్త్యేతి శబ్దశక్త్యుద్భవత్వం యోజయతి.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా కారికయొక్క ప్రథమార్ధంలో చెప్పబడిన నాలుగు ప్రకారాలను ఉదాహరించి ఇప్పుడు కారిక ద్వితీయార్ధంలో చెప్పబడిన మిగిలిన నాలుగు భేదాలను క్రమంగా వివక్షితాభిధేయ ఇత్యాదికంచేత ఉదాహరిస్తున్నాడు. ప్రాతుమితి - పూరించుటకు, ఎవనికి ఏది (గోసువర్ణాదికం) కావలెనో వానికి అది ఇవ్వడం ద్వారా అని సూచించడం కోసం 'ధనైః' అని బహువచనం ప్రయోగించబడింది. అందువల్లనే 'అర్థి' శబ్దాన్ని గ్రహించడం జరిగింది. జనస్య ఇతి :- సాధారణంగా లోకం ధనమే కావా లని అనుకుంటుంది గాని గుణాలచేత ఉపకారాన్ని కోరదు అని భావం. దైవేనేతి - ఇలా ఎందుకు చేస్తున్నావు అని అడగడానికి శక్యం కాని దైవంచేత. అస్మీతి - తప్పకుండా మరొక డెవడైనా అలాంటి సామర్థ్యం కలవాడు సృష్టించబడి ఉంటాడు; నేను మాత్రం అలా సృష్టించబడలేదు అని నిర్వేదం. ప్రసన్నమ్ = నిర్మలమైన లోకానికి ఉపయోగించే నీటిని ధరించేది; కూపః అథవా ఇతి - లోకులచేత చూడబడకుండా ఉండే కూపం అని అర్థం - ఆత్మసమానాధికరణతయేతి. జడః= ఏమి చెయ్యాలో తెలియని స్థితిలో ఉన్నవాడు అని అర్థం. మరియు కూపం కూడ, జడః= ఎవనికి ఏది కావాలి అనే వివేకం ఉండే అవకాశం లేనిది. అందువలననే జడం= చల్లనిది, నిర్వేదరూపమైన సంతాపం లేనిది. మరియు జడం= "లడయోః అభేదః" అనే న్యాయంచేత, చల్లని జలం ఉండడంచేత పరోపకారసమర్థము అని అర్థం.

వృత్తిలో 'జడ' శబ్దానికి కూపసమానాధికరణత్వం మాత్రమే చెప్పబడింది. తటాకసమానాధికరణత్వం కూడ ఎందుకు చెప్పబడలేదు అనే ఆశంకకు సమాధానం చెపుతున్నాడు - అనేన ఇతి :- ఈ మూడవ అర్థంచేత ("శీతలజలయోగితయా పరోపకారసమర్థః" అనే అర్థంచేత) జడశబ్దం తటాకరూపార్థంలో పునరుక్తార్థసంబంధం కలదవుతుంది అనే అభిప్రాయంతో "కూపసమానాధికరణతామ్" అని అన్నాడు. అనగా - 'ప్రసన్నామ్బుధరః' అనే విశేషణం తడాగశబ్దానికి ప్రయోగించబడింది. ఈ జడశబ్దాన్ని కూడా దానికి విశేషణంగా చేస్తే పైన చెప్పిన మూడవ అర్థం, "ప్రసన్నాంబుధరః" అనేదాని అర్థం చాలావరకు ఒకటే అవడంచేత పునరుక్తత్వదోషం కలుగుతుంది. అందుచేత జడశబ్దానికి తటాకసమానాధికరణత్వం చెప్పబడలేదు అని భావం. స్వశక్త్యా అని చెప్పడంచేత ఇది శబ్దశక్త్యుద్భవం అనే విషయాన్ని సూచిస్తున్నాడు.

## ధ్వన్యాలోకం

తస్యైవ వాక్యప్రకాశతా యథా హర్షచరితే సింహనాదవాక్యేషు- "వృత్తేఽస్మిన్ మహాప్రలయే ధరణీధారణాయ అధునా త్వం శేషః"

ఏతద్ధి వాక్యమనురణనరూపమ్ అర్థాన్తరశబ్దశక్త్యా స్ఫుటమేవ ప్రకాశయతి.

### బాలానందిని

తస్యైవ ఇతి - దాని వాక్యప్రకాశ - అనగా వివక్షితాభిధేయంయొక్క అనురణన రూపవ్యంగ్యంలోని శబ్దశక్త్యుద్భవభేదంయొక్క వాక్యప్రకాశత, ఎట్లనగా -

హర్షచరితంలోని సింహనాదుని వాక్యాలలో "ఈ మహాప్రలయం జరిగిన తరవాత ఇప్పుడు ధరణీధారణానికి నువ్వే శేషుడవు" (దీని అర్థం లోచనంలో స్పష్టం అవుతుంది). ఏతద్ధి ఇతి - ఈ వాక్యం అనురణనరూపమైన అర్థాంతరాన్ని శబ్దశక్తిచేత స్పష్టంగానే ప్రకాశింపచేస్తున్నది.

### లోచనం

మహాప్రలయ ఇతి - మహస్య ఉత్సవస్య ఆ సమన్తాత్ ప్రలయో యత్ర తాదృశి శోకకారణభూతే వృత్తే ధరణ్యాః రాజధురాయాః ధారణాయ ఆశ్వాసనాయ త్వం శిష్యమాణః, ఇతీయతా పూర్ణే వాక్యార్థే కల్పావసానే భూపీఠభారోద్వహనక్షమ ఏకః నాగరాజ ఏవ దిగ్దన్తిప్రభృతిష్వపి ప్రలీనేషు ఇత్యర్థాన్తరమ్.

### బాలానందిని

మహాప్రలయే ఇతి - మహస్య= ఉత్సవంయొక్క, ఆ= అంతటా, ప్రలయం దేనియందో అట్టి శోకకారణమైన విషయం జరిగినదగుచుండగా, ధరణ్యాః= రాజ్యభారం యొక్క, ధారణాయ= ఆశ్వాసనం కొరకు, ఊరడింపచేయుటకు, నువ్వే, శేషః= మిగిలినవాడవు. దీనిచేతనే వాక్యార్థం పూర్తి అయినా - "కల్పావసానంలో, దిగ్గజాలు మొదలైనవి కూడ అణగిపోయిన తరవాత, భూపీఠభారాన్ని వహించడానికి సమర్థుడైనవాడు నాగరాజైన ఆదిశేషుడే" అని మరొక అర్థం వ్యంగ్యం (హర్షునికీ నాగరాజుకీ మధ్య ఉపమానోపమేయభావం వ్యంగ్యం).

ధ్వన్యాలోకం

అస్యైవ కవిప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరస్య అర్థశక్త్యుద్భవే ప్రభేదే పదప్రకాశతా యథా, హరివిజయే -

గాథ. చూఅంకురావఅంసం

ఛణమప్ప(ప్ప)సరమహగ్ఘణ మణహరసురామోఅమ్,

అసమప్పిఅం పి గహిఅం

కుసుమసరేణ మహుమాసలచ్ఛిముహమ్. (75)

అత్ర హి అసమర్పితమపి కుసుమశరేణ మధుమాసలక్ష్మీముఖం గృహీతమ్ ఇతి అసమర్పితమపీత్యేతదవస్థాభిధాయిపదమ్ అర్థశక్త్యా కుసుమశరస్య బలాత్కారం ప్రకాశయతి.

బాలానందిని

అస్యైవేతి - కవిప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరమైన దీనికే సంబంధించిన, అనగా వివక్షితాభిధేయానురణనరూపవ్యంగ్యంయొక్క, అర్థశక్త్యుద్భవప్రభేదంలో పదప్రకాశత ఎట్లనగా -

చూతాఙ్కురేతి - చూతాఙ్కురావతంసమ్= చూతాంకురం కర్ణభూషంగా కలది, క్షణప్రసరమహార్ఘమనోహరసురామోదమ్= గొప్పదైన ఉత్సవంయొక్క ప్రసారంచేత మనోహరదేవుని, అనగా మన్మథుని, చమత్కారం కలదీ అయిన, మధుమాసలక్ష్మీముఖమ్ = వసంతలక్ష్మీప్రారంభం, అసమర్పితమపి= సమర్పించబడకపోయినా కూడ, కుసుమశరేణ= మన్మథునిచేత, గృహీతమ్= గ్రహించబడింది.

అత్రేతి - ఇక్కడ మధుమాసలక్ష్మియొక్క ముఖం, సమర్పించబడకపోయినా కూడ మన్మథునిచేత గ్రహించబడినది అని, 'అసమర్పితమపి' అనే ఈ అవస్థను బోధించే పదం అర్థశక్తిచేత కుసుమశరుని యొక్క బలాత్కారాన్ని ధ్వనింపచేస్తూన్నది

లోచనం

చూతాఙ్కురావతంసం క్షణప్రసరమహార్ఘమనోహరసురామోదమ్,

అసమర్పితమపి గృహీతం కుసుమశరేణ మధుమాసలక్ష్మీముఖమ్.

(సంస్కృతచ్ఛాయ).

మహార్ఘేణ ఉత్సవప్రసరేణ మనోహరసురస్య మన్మథదేవస్య ఆమోదః చమత్కారః యత్ర తత్. అత్ర మహార్ఘశబ్దస్య పరనిపాతః. ప్రాకృతే నియమాభావాత్. ఛణ ఇత్యుత్సవః. ముఖం ప్రారమ్భః వక్త్రం చ. తచ్చ సురామోదయుక్తం భవతి. మధ్వారమ్భే కామః చిత్తమాక్షిపతీత్యేతావానయమర్థః కవిప్రౌఢోక్త్యా అర్థాన్తరవ్యఞ్జకః సంపాదితః.

అత్ర కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిశరీరార్థశక్త్యుద్భవే పదవాక్యప్రకాశతాయామ్ ఉదాహరణద్వయం న దత్తమ్. 'ప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరః సంభవీ స్వతః' ఇతి ప్రాచ్యకారికాయా ఇయత్రైవోదాహృతత్వం భవేదిత్యభిప్రాయేణ. తత్ర పదప్రకాశతా యథా -

"సత్యం మనోరమాః కామాః సత్యం రమ్యా విభూతయః,
కిం తు మత్తాఙ్గనాపాఙ్గభఙ్గలోలం హి జీవితమ్".

ఇత్యత్ర కవినా యో విరాగీ నిబద్ధః తత్ప్రౌఢోక్త్యా జీవితశబ్దః అర్థశక్తిమూలతయా ఇదం ధ్వనయతి - సర్వ ఏవామీ కామాః విభూతయశ్చ స్వజీవితమాత్రోపయోగినః, తదభావే హి సద్భిరపి తైః అసద్రూపతా ఆప్యతే. తదేవ చ జీవితం ప్రాణధారణరూపత్వాత్, ప్రాణవృత్తేశ్చ చాఞ్చల్యాత్ అనాస్థాపదమితి విషయేషు వరాకేషు కిం దోషోద్ఘోషణదౌర్జన్యేన? నిజమేవ జీవితముపాలభ్యమ్. తదపి చ నిసర్గచఞ్చలమితి న సాపరాధమిత్యేతావతా గాఢం వైరాగ్యమితి. వాక్యప్రకాశతా యథా- "శిఖరిణి" ఇత్యాదౌ.

బాలానందిని

మహార్ఘేణేతి - చాలా విలువ గల ఉత్సవప్రసారంచేత, మనోహరసురస్య= మన్మథునియొక్క, ఆమోదః= చమత్కారం దేనియందో అట్టి, ప్రాకృతంలో నియమం లేకపోవడంచేత, ఇక్కడ మహార్ఘశబ్దానికి పరనిపాత. అనగా - 'మహార్ఘశ్చాసౌ క్షణప్రసరశ్చ' అనే కర్మధారయసమాసంలో మహార్ఘశబ్దానికి పూర్వనిపాతచేత "మహార్ఘప్రసరః" అని కావలెను. కాని ప్రాకృతంలో ఆ నియమం లేకపోవడంచేత "క్షణప్రసరమహార్ఘ" అని మహార్ఘశబ్దానికి సమాసంలో పరనిపాత చేయబడిం దని అర్థం. 'ఛణ' అనగా ఉత్సవం, 'ముఖ' శబ్దానికి ప్రారంభం, వదనం అని రెండర్థాలు. అది సురామోదంతో (మదగంధంతో

కూడి ఉంటుంది. వసంతప్రారంభంలో మన్మథుడు చిత్తాన్ని ఆకర్షిస్తాడు అనే ఇంతమాత్రం అర్థం కవిప్రౌఢోక్తిచేత అర్థాంతరాన్ని వ్యంజింపచేసేదిగా చేయబడింది.

అత్రేతి:- ఇక్కడ కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిశరీరార్థశక్త్యుద్భవధ్వనికి పదప్రకాశతా వాక్యప్రకాశతలయందు రెండు ఉదాహరణలు ఇవ్వబడలేదు. "ప్రౌఢోక్తి" ఇత్యాది పూర్వోక్తకారికలో (2.24) చెప్పిన వాటికి ఇంతమాత్రంచేతనే ఉదాహరణలు ఇచ్చినట్లు అవుతుంది కదా అనే అభిప్రాయంచేత పై రెండు ఉదాహరణలు మాత్రమే ఇవ్వబడినది. దానిలో అనగా కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరంలో పదప్రకాశత ఎట్లనగా-

సత్యమితి - కామాః= కామాలు, భోగాలు, మనోరమాః= మనోహరమైనవి; సత్యమ్= నిజమే, విభూతయః= ఐశ్వర్యాలు, రమ్యాః= సుందరమైనవి; సత్యమ్= నిజమే, కిం తు= కాని, జీవితమ్= జీవితం, మత్తాఙ్గనాపాఙ్గభఙ్గలోలమ్= మదించిన స్త్రీయొక్క క్రీకంటి చూపు మలుపు వలె చంచలమైనది.

ఇత్యత్రేతి - ఇక్కడ కవిచేత నిబద్ధుడైన వైరాగ్యవంతుడైన ఏ వక్త ఉన్నాడో ఆతని ప్రౌఢోక్తిచేత 'జీవిత' శబ్దం అర్థశక్తిమూలత్వంచేత ఈ అర్థాన్ని ధ్వనింపచేస్తుంది. ఏమనగా - అన్ని కామాలు, అన్ని ఐశ్వర్యాలూ కూడ తన జీవితమాత్రానికే ఉపయోగిస్తాయి; ఆ జీవితం లేకపోతే అవన్నీ ఉన్నా అవి లేనివాటివంటివే అయిపోతాయి. జీవితం ప్రాణధారణరూప మైనది. ఆ ప్రాణాలు నిలవడం చంచలమైనది. అందుచేత దీనిని గూర్చి అంతగా శ్రద్ధను, నమ్మకాన్ని చూపడానికి వీలులేదు. అందుచేత పాపం! విషయాలలో ఏవో దోషాలు ఉన్నా యని చాటడం అనే దౌర్జన్యం ఎందుకు? తన జీవితాన్నే నిందించుకోవాలి. నిజానికి దానినీ నిందించకూడదు. చంచలంగా ఉండడమే దాని స్వభావం. ఈ విధంగా వైరాగ్యం గాఢం అవుతుంది. వాక్యేతి - వాక్యప్రకాశత ఎట్లనగా - 'శిఖరిణి' (శ్లో.12) ఇత్యాదులలో; ఇక్కడ వ్యంగ్యం కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధం అని అర్థం.

## ధ్వన్యాలోకం

అత్రైవ ప్రభేదే వాక్యప్రకాశతా - యథోదాహృతం ప్రాక్ - "సజ్జేహి సురహిమాసో" ఇత్యాది. అత్ర "సజ్జయతి సురభిమాసః, న తావదర్పయతి అనఙ్గాయ శరాన్' ఇత్యయం వాక్యార్థః కవిప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరః మన్మథోన్మాథకదనావస్థాం

వసన్తసమయస్య సూచయతి.

బాలానందిని

అత్రైవేతి - ఈ ప్రభేదంలోనే, అనగా కవిప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరంయొక్క అర్థశక్త్యుద్భవప్రభేదంలో వాక్యప్రకాశత ఎట్లనగా - వెనుక ఉదాహరించిన "సజ్జే హి సురహిమాసో" ఇత్యాదికం (శ్లో.51). ఇక్కడ - వసంతర్తువు బాణాలను సిద్ధంచేస్తున్నది కాని వాటిని మన్మథునికి ఇవ్వడంలేదు" అనే వాక్యార్థం కవిప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరం. ఇది వసంతసమయంయొక్క మన్మథపీడాయుద్ధావస్థను సూచిస్తున్నది.

ధ్వన్యాలోకం

స్వతఃసంభవిశరీరార్థశక్త్యుద్భవే ప్రభేదే పదప్రకాశతా యథా-

గాథ. వాణిఅఅ హత్థిదన్తా కుత్తో అహ్మాణ బాధకిత్తీ అ,

జావ లులిఆలఅముహీ ధరమ్మి పరిసక్కఏ సుహ్ణా. (76)

అత్ర 'లులితాలకముఖీ' ఇత్యేతత్పదం వ్యాధవధ్వాః స్వతః సంభావితశరీరార్థశక్త్యా సురతక్రీడాసక్తిం సూచయత్ తదీయస్య భర్తుః సతతసంభోగక్షామతాం ప్రకాశయతి.

బాలానందిని

స్వత ఇతి - స్వతః సంభవిశరీరార్థశక్త్యుద్భవప్రభేదంలో పదప్రకాశత ఎట్లనగా - (సంస్కృతచ్ఛాయ వ్యాఖ్యానంలో ఇవ్వబడింది).

వాణిజకేతి - వాణిజక= ఓ! వర్తకుడా! లులితాలకముఖీ= నలిగిన ముంగురులు ముఖంపైన ఉన్న, ఎగురుతూన్న ముంగురులు గల, స్నుషా= కోడలు, గృహే= ఇంటిలో, యావత్= ఎంతవరకు, పరిష్వక్కతే= సవిలాసంగా తిరుగుతూ ఉంటుందో అంతవరకు, అస్మాకమ్= మాకు, హస్తిదన్తాః= ఏనుగు దంతాలు, వ్యాఘ్రకృత్తయశ్చ= వ్యాఘ్రచర్మలు, కుతః= ఎక్కడివి?

అత్రేతి - ఇక్కడ 'లులితాలకముఖీ' అనే పదం స్వతఃసంభావితశరీరార్థశక్తిచేత, లోకంలో ఇలా జరగదు అనడానికి వీలులేని స్వరూపం గల అర్థశక్తిచేత, వ్యాధవధువుకు ఉన్న అత్యధికసురతక్రీడాసక్తిని సూచిస్తూ, ఆమె భర్త నిరంతరసంభోగంచేత దుర్బలుడైనాడని వ్యంజింపచేస్తున్నది.

లోచనం

"వాణిజక హస్తిదన్తాః కుతోఽస్మాకం వ్యాఘ్రకృత్తయశ్చ,

యావల్లులితాలకముఖీ గృహే పరిష్వక్కతే స్నుషా." (ఇతి ఛ్చాయా)

సవిభ్రమం చంక్రమ్యతే. అత్ర లులితేతి స్వరూపమాత్రేణ విశేషణమవలిప్తతయా చ హస్తిదన్తాద్యపా(నా)హరణం సంభావ్యమితి వాక్యార్థస్య తావత్యేవ న కాచిదనుపపత్తిః.

బాలానందిని

సవిభ్రమమితి - విలాసపూర్వకంగా, ఒయ్యారంగా, తిరుగుతున్నది. 'పరిష్వక్కతే' కి అర్థం. (ఆశంక) 'లులితాలకముఖీ' అనే పదంచేత వ్యాధవధువుయొక్క సురతాసక్తి సూచితమైన పక్షంలో ఇది 'హస్తిదంతాదులు అలభ్యములు' అనే వాచ్యాన్ని సమర్థిస్తూండడంచేత ఈ వ్యంగ్యార్థం వాచ్యసిద్ధ్యంగమైన గుణీభావం చెందుతుంది కదా అని ఆశంకించుకొని చెపుతున్నాడు - అత్రేతి - ఇక్కడ ప్రయోగించిన 'లులితాలకముఖీ' అనే విశేషణం ఆమెయొక్క స్వరూపాన్ని వర్ణించడంకోసం ఉపయోగించబడింది. ఆమె భర్తహస్తిదంతాదులను తీసికొనిరాకపోవడానికి కారణం ఆమె నిరంతరసురతాసక్తురాలై ఉండడమే కానవసరంలేదు. 'ఇప్పటికే కావలసినంత ధనం సంపాదించాను' అనే గర్వం మొదలైన కారణాలచేత కూడ అతడు హస్తి - వ్యాఘ్రాదులను చంపకపోవచ్చును కదా? అందుచేత ఈ విశేషణంచేత వ్యంగ్యమైన అర్థం సహాయం లేకపోయినా వాక్యార్థం కుదురుతుంది గాన దోషం లేదు.

ధ్వన్యాలోకం

తస్యైవ వాక్యప్రకాశతా యథా-

గాథ. సిహిపిఞ్ఛకణ్ణఊరా బహుఆ వాహస్స గవ్వరీ భమఇ

ముత్తాఫలరఇఅపసాహణాణం మజ్ఝే సవత్తీణమ్. (77)

అనేనాపి వాక్యేన వ్యాధవధ్వాః శిఖిపిచ్ఛకర్ణపూరాయాః నవపరిణీతాయాః కస్యాశ్చిత్ సౌభాగ్యాతిశయః ప్రకాశ్యతే. తత్సమ్భోగైకరతో మయూరమాత్రమారణసమర్థః పతిర్జాత ఇత్యర్థప్రకాశనాత్. తదన్యాసాం చిరపరిణీతానాం ముక్తాఫలరచిత

ప్రసాధనానాం దౌర్భాగ్యాతిశయః ఖ్యాప్యతే. తత్సమ్భోగకాలే స ఏవ వ్యాధః కరివరవధవ్యాపారసమర్థ ఆసీదిత్యర్థప్రకాశనాత్.

బాలానందిని

తస్యైవేతి - స్వతఃసంభవిశరీరార్థశక్త్యుద్భవప్రభేదంలోనే వాక్యప్రకాశత ఎట్లనగా - సిహీతి - ఇది 53వ శ్లోకంగా వెనక వచ్చినది. వ్యాఖ్యానాదులు అక్కడ చూడవచ్చును. అనేవాపీతి - ఈ వాక్యంచేత కూడ నెమలిపింఛం కర్ణభూషణంగా ధరించిన, క్రొత్తగా వివాహం చేసికొనబడిన ఒకానొక వ్యాధస్త్రీయొక్క సౌభాగ్యాతిశయం వ్యంజించబడుతున్నది. "ఆమె సంభోగంలోనే అత్యాసక్తి గల భర్త కేవలం నెమళ్లను మాత్రమే చంపగలిగిన స్థితిలో ఉన్నాడు" అనే అర్థాన్ని వ్యంజింపచేయడంవల్ల చాలా కాలం క్రితం వివాహంచేసికొనబడిన, ముత్యాలతో అలంకారాలు నిర్మించుకొన్న ఇతరస్త్రీల దౌర్భాగ్యాతిశయం స్పష్టం చేయబడుతున్నది. ఎందువల్లననగా - వాళ్ల సంభోగం చేసే కాలంలో ఆ వ్యాధుడే శ్రేష్ఠములైన ఏనుగులను కూడా చంపడానికి సమర్థుడై ఉండేవాడు అనే అర్థం వ్యంజింపబడుతున్నది.

లోచనం

సిహిపిచ్ఛేతి - పూర్వమేవ యోజితా గాథా.

బాలానందిని

పూర్వమితి - ఈ గాథ పూర్వమే (శ్లో. 53) సమన్వయించబడింది.

ధ్వన్యాలోకం

నను ధ్వనిః కావ్యవిశేష ఇత్యుక్తమ్; తత్కథం తస్యపదప్రకాశతా. కావ్యవిశేషో హి విశిష్టార్థప్రతిపత్తిహేతుః శబ్దసందర్భవిశేషః. తద్భావశ్చ పదప్రకాశత్వే నోపపద్యతే. పదానాం స్మారకత్వేన అవాచకత్వాత్. ఉచ్యతే - స్యాదేష దోషః యది వాచకత్వం ప్రయోజకం ధ్వనివ్యవహారే స్యాత్. న త్వేవమ్; తస్య వ్యఞ్జకత్వేన వ్యవస్థానాత్. కిం చ కావ్యానాం శరీరాణామివ సంస్థానవిశేషావచ్ఛిన్న సముదాయసాధ్యాపి చారుత్వప్రతీతిః అన్వయవ్యతిరేకాభ్యాం భాగేషు కల్ప్యతే ఇతి పదానామపి వ్యఞ్జకత్వముఖేన వ్యవస్థితో ధ్వనివ్యవహారః న విరోధీ.

బాలానందిని

నన్వితి - (ఆశంక) "యత్రార్థః శబ్దో వా" ఇత్యాదికారికలో ధ్వని అనగా కావ్యవిశేషం అని చెప్పబడింది కదా? అలాంటప్పుడు ధ్వని పదప్రకాశం ఎలా అవుతుంది? కావ్యవిశేషం అంటే విశిష్టమైన (వాచ్యమూ వ్యంగ్యమూ అని విశిష్టమైన) అర్థంయొక్క జ్ఞానానికి హేతువైన శబ్దసందర్భవిశేషం (ఒకవిధమైన శబ్దాల కూర్పు) కదా? ధ్వని పదప్రకాశం అని చెప్పే పక్షంలో ఆ విధంగా అవడం, అనగా విశిష్టార్థప్రతిపత్తిహేతుశబ్ద సందర్భవిశేషత్వం, కుదరదు కదా; ఎందువల్లననగా పదాలు ఆ యా అర్థాలను స్మరింపచేస్తాయే కాని వాచకాలు కావు కదా; అనగా వాక్యార్థానుభవాన్ని కలిగించవు కదా? ఉచ్యతే ఇతి-(సమాధానం)చెప్పబడుతున్నది. ధ్వనివ్యవహారంలో, "ఇది ధ్వని" అని చెప్పడానికి వాచకత్వం ప్రయోజకం (నిమిత్తం) అయితే నువ్వు చెప్పిన ఈ దోషం పట్టవచ్చు. కాని అది అలా కాదు. ఎందుచేత ననగా - పదం వ్యంజకం అని స్థాపించాం కదా? అనగా అది వాచకం అవడంచేత ధ్వనివ్యవహారానికి కారణం అవుతుంది అని మేం చెప్పలేదు కదా అని అర్థం. కిం చేతి - మరొక విషయం ఏ మనగా - శరీరాల వలె కావ్యాలు కూడా ఒక విధమైన అవయవాల కూర్పువల్ల ఏర్పడిన సముదాయరూపాలలో ఉండి చారుత్వప్రతీతిని కలిగిస్తాయి అనే మాట వాస్తవమే అయినా ఈ చారుత్వప్రతీతి అన్వయవ్యతిరేకాలచేత (ఈ భాగం, (అవయవం) ఉంటే చారుత్వం ఉంది; ఈ భాగం లేకపోతే చారుత్వం లేదు అని నిర్ణయించడంచేత) భాగాలలో కూడ (అవయవాలలో కూడ) కల్పించబడుతుంది. అందుచేత పదాలు కూడా వ్యంజకాలే గాన ఆ వ్యంజకత్వం ద్వారా వాటి విషయంలో కూడ వ్యవస్థితమైన (ఉన్న) ధ్వనివ్యవహారం విరుద్ధం కాదు.

లోచనం

నన్వితి - సముదాయ ఏవ ధ్వనిరితి పక్షే చోద్యమేతత్. తద్భావశ్చ ఇతి. కావ్యవిశేషత్వమిత్యర్థః. అవాచకత్వాదితి యదుక్తం సోఽయమప్రయోజకో హేతుః ఇతి ఛలేన తావద్దర్శయతి - స్యాదేష దోష ఇతి. ఏవం ఛలేన పరిహృత్య వస్తువృత్తేనాపి పరిహరతి - కిం చేతి. యది పరో బ్రూయాత్ - న మయా అవాచకత్వం ధ్వన్యభావే హేతూకృతమ్; కిం తూక్తం కావ్యం ధ్వనిః. కావ్యం చ అనాకాఙ్క్షాప్రతిపత్తికారి వాక్యం న పదమితి తత్రాహ - సత్యమేవం; తథాపి పదం న ధ్వనిరిత్యస్మాభిరుక్తమ్; అపి తు సముదాయ ఏవ; తథా చ "పదప్రకాశో ధ్వనిః" ఇతి ప్రకాశపదేనోక్తమ్. నను పదస్య తత్ర తథావిధం

సామర్థ్యమితి కుతః అఖణ్డ ఏవ ప్రతీతిక్రమః ఇత్యాశఙ్క్యాహ - కావ్యానామితి. ఉక్తం హి ప్రాక్ వివేకకాలే విభాగోపదేశః ఇతి.

బాలానందిని

నన్వితి - ఈ చోద్యం (ఆక్షేపం) వాచక - వాచ్య-వ్యంగ్యాదుల సముదాయమే ధ్వని అనే పక్షాన్ని అనుసరించి చేయబడుతూన్నది. తద్భావశ్చేతి - కావ్యవిశేషత్వం అని అర్థం. అవాచకత్వాదితి : 'అవాచకత్వాత్' అని ఏ హేతువు చెప్పబడిందో అది అప్రయోజకం, అనగా నువ్వు అనుకున్న సాధ్యాన్ని సాధించజాలదు, అని ముందుగా ఛలంచేత చెపుతున్నాడు - స్యాదేష దోషః ఇతి.

వివరణ:- "పదాలచేత వాటి అర్థాలు స్మరించబడతాయి. స్మరించబడిన ఆ అర్థాలు ఆకాంక్షమొదలైనవాటి సాహాయ్యంతో వాక్యార్థజ్ఞానాన్ని కలిగిస్తాయి" అనే మతం ప్రకారం పదప్రకాశత్వం, అనగా పదాలచేత స్మరింపచేయబడడం అనేది వాటి అర్థాలలోనే ఉంటుంది. అనగా వాటి అర్థాలనే పదాలు స్మరింపచేస్తాయి; ప్రకాశింపచేయడం అనగా అదే కదా? అలా పదాలచేత ప్రకాశింపచేయబడిన (స్మరింపచేయబడిన) అర్థాలలో కావ్యవిశేషత్వరూపమైన ధ్వనిత్వం లేదు కదా? (ఆ అర్థాలు ధ్వని అనే కావ్యవిశేషం కాదు కదా?) ధ్వనిని ప్రకాశింపచేసేది వాక్యమే కదా? అందుచేత "పదం న ధ్వనిప్రకాశకమ్; అవాచకత్వాత్" (పదం వాచకం కాదు గాన ధ్వనిప్రకాశకం కాదు) అని తేలింది అని పూర్వపక్షి అభిప్రాయం. దీనికి చెప్పవలసిన అసలు సమాధానం తరవాత చెప్పబోతూ ముందుగా ఛలంచేత సమాధానం 'స్యాదేష దోషః' ఇత్యాదికంతో చెపుతున్నాడు అని ఈ లోచనగ్రంథానికి భావం.

'ఛలం' అనగా వాది ఒక అభిప్రాయంతో పలికిన మాట అభిప్రాయం తెలిసి కూడ తెలియనట్లు ఆ మాటను వక్రీకరించి సమాధానం చెప్పడం. ఉదా - "నవకమ్బలోఽయం పురుషః" అని ఎవరైనా అన్నప్పుడు "ఇతని కంబళీ కొత్తది" అని అతని మాటకు అర్థం తెలిసినా కూడ తెలియనట్లు "తొమ్మిది కంబళ్లు ఉన్నాయి" అనే అర్థం గ్రహించి "ఇతడు దరిద్రుడు; రెండు కంబళ్లు కూడా కొనుక్కోజాలడు; నవకంబళాలు ఎక్కడ సంపాదించగలడు" అని రెండవవాడు చెప్పినట్లయితే దానిని ఛలంచేత సమాధానం చెప్పడం అని న్యాయశాస్త్రప్రసిద్ధం. "పదం వాచకం కాబట్టి ధ్వనివ్యవహార ప్రయోజకం" అని మేం ఎప్పుడు చెప్పాం? 'వ్యంజకం కాబట్టి ధ్వనివ్యవహార ప్రయోజకం' అని కదా మేం చెప్పినది" అనే సమాధానం కూడా ఇలాంటిదే.

ఏవమితి - ఈ విధంగా ఛలంచేత ఆక్షేపాన్ని పరిహరించి కిం చ ఇత్యాదికంచేత, యథార్థవిషయం కూడా చెప్పడం ద్వారా పరిహరిస్తున్నాడు:- యదీతి - "ధ్వన్యభావానికి అవాచకత్వం హేతువు అని నేను అనడం లేదు. నువ్వు "కావ్యం ధ్వని" అని కదా అన్నావు? ఆకాంక్ష ఏదీ కలగకుండా పూర్తిగా ఒక విషయాన్ని బోధించే వాక్యమే కావ్యం అవుతుంది కాని పదం కావ్యం కాదు కదా?" అని ప్రతివాది అంటే అందుకు సమాధానం చెపుతున్నాడు - నువ్వు చెప్పినది నిజమే. పదం ధ్వని అని మేమూ అనలేదు. ధ్వని అంటే సముదాయమే. అందుచేతనే "పదప్రకాశో ధ్వనిః" అని 'ప్రకాశ' శబ్దం ప్రయోగించాం.

నను ఇతి (ఆశంక) పదానికి అలాంటి సామర్థ్యం (ధ్వనిప్రకాశనసామర్థ్యం) ఉంటే పక్షంలో వాక్యంవల్ల అఖండమైన జ్ఞానం కలుగుతుంది అని చెప్పడం ఎలా కుదురుతుంది అని ఆశంకించుకొని కావ్యానామ్ ఇత్యాదికం చెపుతున్నాడు. ఉక్తం హీతి :- వివేకకాలంలో విభాగోపదేశం అని వెనుక చెప్పబడింది కదా. వాక్యార్థం అఖండమైనా ఇది ఎలా లభించింది అని విమర్శించే టప్పుడు ఆ వాక్యాన్ని ఎక్కడి కక్కడ (పదవర్ణాదిరూపంలో) విభజించి పరిశీలన జరుగుతుంది అని వెనక చెప్పి ఉన్నాం కదా అని అర్థం.

## ధ్వన్యాలోకం

శ్లో. "అనిష్టస్య శ్రుతిర్యద్వదాపాదయతి దుష్టతామ్,
శ్రుతిదుష్టాదిషు వ్యక్తం తద్వదిష్టస్మృతిర్గుణమ్.
పదానాం స్మారకత్వేఽపి పదమాత్రావభాసినః,
తేన ధ్వనేః ప్రభేదేషు సర్వేష్వేవాస్తి రమ్యతా.
విచ్ఛిత్తిశోభినైకేన భూషణేనేవ కామినీ,
పదద్యోత్యేన సుకవేః ధ్వనినా భాతి భారతీ".

ఇతి పరికరశ్లోకాః

### బాలానందిని

అనిష్టస్యేతి - శ్రుతిదుష్టాదిషు= శ్రుతిదుష్టాదులయందు, అనిష్టస్య= అనిష్టమైన దానియొక్క, అనిష్టార్థమును స్మరింపచేసేదానియొక్క, శ్రుతిః= శ్రవణం, యద్వత్= ఏ విధంగా, దుష్టతామ్= దుష్టత్వాన్ని, ఆపాదయతి= కలిగిస్తుందో, తద్వత్= ఆ విధంగానే, ఇష్టస్మృతిః=ఇష్టమైనదాని స్మృతి, గుణమ్= గుణమును, వ్యక్తమ్= స్పష్టంగా, ఆపాదయతి= కలిగిస్తుంది.

ేన= ఆ కారణంచేత, పదానామ్= పదాలు, స్మారకత్వేఽపి= స్మారకములే అయినా కూడ, ధ్వనేః= ధ్వనియొక్క, సర్వేష్వేవ= సమస్తమైన, ప్రభేదేషు= భేదములయందు, పదమాత్రావభాసినః= పదమాత్రంవల్ల భాసించే ధ్వనికి, రమ్యతా= రమ్యత్వం, అస్త్యేవ= తప్పక ఉంది.

విచ్ఛిత్తిశోభినా= అందంతో శోభిస్తూన్న, ఏకేన= ఒక, భూషణేన= అలంకారంచేత, కామినీవ= స్త్రీవలె, పదద్యోత్యేన= ఒక పదంచేత వ్యంగ్యమైన, ధ్వనినా= ధ్వనిచేత, సుకవేః= సుకవియొక్క, భారతీ= వాక్కు, భాతి= ప్రకాశిస్తూన్నది.

ఇవి పరికర శ్లోకాలు.

## లోచనం

నను భాగేషు పదరూపేషు కథం సా చారుత్వప్రతీతిరారోపయితుం శక్యా? తాని హి స్మారకాణ్యేవ. తతః కిమ్? మనోహారివ్యఙ్గ్యార్థస్మారకత్వాద్ధి చారుత్వప్రతీతినిబన్ధనత్వం కేన వార్యతే? యథా శ్రుతిదుష్టానాం పేలవాదిపదానామ్ అసభ్యపేలాద్యర్థం ప్రతి న వాచకత్వమ్; అపి తు స్మారకత్వమ్, తద్వశాచ్చ చారుస్వరూపం కావ్యం శ్రుతిదుష్టమ్; తచ్చ శ్రుతిదుష్టత్వమన్వయవ్యతిరేకాభ్యాం భాగేషు వ్యవస్థాప్యతే, తథా ప్రకృతేఽపీతి; తదాహ - అనిష్టస్యేతి - అనిష్టార్థస్మారకస్యేత్యర్థః. దుష్టతామ్ ఇతి అచారుత్వమ్. గుణమితి చారుత్వమ్. ఏవం దృష్టాన్తమభిధాయ పాదత్రయేణ, తుర్యేణ దార్ష్టాన్తికార్థః ఉక్తః. అధునా ఉపసంహరతి - పదానామితి. యత ఏవమిష్టార్థస్మృతిః చారుత్వమావహతి తేన హేతునా సర్వేషు ప్రకారేషు నిరూపితస్య పదమాత్రావభాసినోఽపి, పదప్రకాశస్యాపి ధ్వనేః రమ్యతా అస్తి స్మారకత్వేఽపి పదానామ్ ఇతి సమన్వయః. అపిశబ్దః కాకాక్షిన్యాయేన ఉభయత్రాపి సంబధ్యతే. అధునా చారుత్వప్రతీతౌ పదస్యాన్వయవ్యతిరేకౌ దర్శయతి - విచ్ఛిత్తీతి. 1

## బాలానందిని

నన్వితి (ఆశంక) పదరూపాలైన భాగాలలో ఆ చారుత్వప్రతీతి ఆరోపించడానికి ఎలా శక్యం అవుతుంది? పదాలు స్మరింపచేసేవి మాత్రమే కదా? (సమాధానం) మనోహరమైన వ్యంగ్యార్థాన్ని స్మరింపచేయడంవల్ల ఏర్పడే చారుత్వప్రతీతికారణత్వాన్ని

(చారుత్వానుభవానికి కారణంగా ఉండడాన్ని) ఎవరు నివారిస్తారు? ఉదాహరణకి - శ్రుతిదుష్టాలైన (శ్రుతిదుష్టత్వరూపదోషం ఉన్నదిగా చెప్పబడే) పేలవాదిశబ్దాలు అసభ్యమైన 'పేల' (ఈ శబ్దానికి లాటబాషలో పురుషాంగం అని అర్థం) మొదలైన అర్థాలను బోధించడంలేదు. అవి కేవలం ఆ అర్థాన్ని స్మరింపచేస్తున్నాయి. దానితో అందంగా ఉండే కావ్యం శ్రుతిదుష్టం అయిపోతూన్నది. ఆ శ్రుతిదుష్టత్వం, కావ్యానికి వచ్చిన ఆ శ్రుతిదుష్టత్వం, అన్వయవ్యతిరేకాలచేత భాగాలమీద (కావ్యావయవాలైన పదాలమీద) నిలపబడుతున్నది. అనగా కావ్యానికి ఈ శ్రుతిదుష్టత్వం ఈ ఫలానా పదంవల్ల వచ్చింది; ఇది లేకపోతే వచ్చేది కాదు అని విచారణ చేసి ఆ పదాలమీద స్థిరీకరించబడుతుంది; అదే విధంగా ఇక్కడ కూడా. ఈ విషయమే చెపుతున్నాడు - అనిష్టస్యేతి. అనిష్టస్య అనగా అనిష్టార్థాన్ని స్మరింపజేసేది అని అర్థం. దుష్టతామ్= చారుత్వం లేకపోవడాన్ని; గుణమ్= చారుత్వాన్ని. ఈ విధంగా మూడు పాదాలచేత దృష్టాంతం చెప్పి నాల్గవ పాదంచేత దార్ష్టాంతికమైన విషయం చెప్పబడింది.

అధునా ఇతి - ఇప్పుడు పదానామ్ ఇత్యాదికంచేత ఉపసంహరిస్తున్నాడు. ఈ విధంగా ఇష్టస్మృతి చారుత్వాన్ని కలగజేస్తూన్నది గాన, ఆ ఆకారణంచేత, పదాలు స్మారకాలు మాత్రమే అయినా, సమస్తమైన ప్రకారాలలో నిరూపించబడిన ధ్వని, పదమాత్రావభాసినః. అపి= పదప్రకాశమే అయినా కూడ, అని అన్వయం 'స్మారకత్వేఽపి' అన్నచోట ఉన్న 'అపి' శబ్దం, కాకాక్షిన్యాయంచేత, రెండు చోట్లా కూడ, అనగా అటు 'స్మారకత్వే' అనేదానితోను, ఇటు 'పదమాత్రావభాసినః' అనేదానితోను కూడ, అన్వయిస్తుంది. (కాకికి కంటి గ్రుడ్డు ఒకటే ఉంటుందనీ, అది మెడ ఇటువైపుకు త్రిప్పి చూస్తే ఆ కంటి గ్రుడ్డు ఈ వైపుకు వస్తుందనీ, ఆ వైపుకు త్రిప్పి చూస్తే ఆ వైపుకు వెడుతుం దనీ అంటారు. ఇదే 'కాకాక్షిన్యాయం').

అధునేతి - ఇప్పుడు పదానికి చారుత్వప్రతీతివిషయంలో విచ్ఛిత్తీత్యాదిశ్లోకంచేత అన్వయవ్యతిరేకాలను చూపుతున్నాడు. 1

## ధ్వన్యాలోకం

కా. యస్త్వలక్ష్యక్రమవ్యఙ్గ్యో ధ్వనిర్వర్ణపదాదిషు,
వాక్యే సంఘటనాయాం చ స ప్రబన్ధేఽపి దీప్యతే. 2

### బాలానందిని

యః ఇతి - యః= ఏ, అలక్ష్యక్రమవ్యఙ్గ్యః= అలక్ష్యక్రమవ్యంగ్యమైన, ధ్వనిః=

ధ్వని ఉన్నదో, సః= అది, వర్ణపదాదిషు= వర్ణాలు పదాలు మొదలైనవాటియందు, వాక్యే= వాక్యమునందు, సంఘటనాయాం చ= సంఘటనలోను, ప్రబన్ధేఽపి= ప్రబంధంలోను కూడ, దీప్యతే= ప్రకాశిస్తూన్నది.

లోచనం

ఏవం కారికాం వ్యాఖ్యాయ తదసంగృహీతమ్ అలక్ష్యక్రమవ్యఙ్గ్యం ప్రపఞ్చయితుమ్ ఆహ - యస్త్వితి. తు శబ్దః పూర్వభేదేభ్యః అస్య విశేషద్యోతకః. వర్ణసముదాయశ్చ పదమ్. తత్సముదాయో వాక్యమ్. సంఘటనా పదగతా వాక్యగతా చ. సంఘటితవాక్యసముదాయః ప్రబన్ధః ఇత్యభిప్రాయేణ వర్ణాదీనాం గ్రహణమ్. సప్తమ్యా నిమిత్తత్వముక్తమ్. దీప్యతే అవభాసతే సకలకావ్యాభాసకతయేతి పూర్వవత్ కావ్యవిశేషత్వం సమర్థితమ్. 2

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా (మొదటి) కారికను వ్యాఖ్యానించి, ఆ కారికలో సంగ్రహించబడని అలక్ష్యక్రమాన్ని గూర్చి విస్తృతంగా వివరించడానికి చెపుతున్నాడు - యస్త్వితి - 'తు' శబ్దం వెనుకటి భేదాలకంటె దీనికి ఉన్న విశేషాన్ని సూచిస్తుంది. వర్ణాల సముదాయం పదం. వాటి సముదాయం వాక్యం. సంఘటన (కూర్పు) పదాలకీ, వాక్యాలకీ కూడ సంబంధించినది. కూర్చబడిన వాక్యాల సముదాయం ప్రబంధం - ఈ అభిప్రాయంచేత వర్ణాదులు యథాక్రమంగా గ్రహించబడ్డాయి. 'పదాదిషు'లోని 'ఆది' శబ్దంచేత పదంలోని ఒక భాగం, పదద్వయం మొదలైనవి గ్రహించబడతాయి. సప్తమిచేత నిమిత్తత్వం చెప్పబడింది. అనగా 'పదాదిషు' 'వాక్యే' ఇత్యాదులలోని సప్తమి ఆధారార్థం కాదు, నిమిత్తార్థం. అందుచేత అలక్ష్యక్రమధ్వనికి పదాదులు ఆధారం అని కాక పదాదులు అలక్ష్యక్రమధ్వని భాసించడానికి నిమిత్తం అని అర్థం గ్రహించాలి అని అర్థం. దీప్యతే = సకలకావ్యాన్ని భాసింపచేసేదిగా ప్రకాశిస్తుంది. ఈ విధంగా పద-వాక్యాదులు నిమిత్తంగా గల ధ్వని కావ్యాన్ని అంతనీ ప్రకాశింపచేస్తుంది అని చెప్పడంచేత 'ధ్వని అనగా కావ్యవిశేషం' అని వెనుక చెప్పినదానిని సమర్థించిన ట్లయింది అని భావం. 2

ధ్వన్యాలోకం

తత్ర వర్ణానామ్ అనర్థకత్వాత్ ద్యోతకత్వమ్ అసంభవి ఇత్యాశఙ్క్య

ఇదముచ్యతే-

కా. శషౌ సరేఫసంయోగో ఢకారశ్చాపి భూయసా,
విరోధినః స్యుః శృఙ్గారే తేన వర్ణా రసచ్యుతః. 3
త ఏవ తు నివేశ్యన్తే బీభత్సాదౌ రసే యదా,
తదా తం దీపయన్త్యేవ తేన వర్ణా రసచ్యుతః. 4

శ్లోకద్వయేన అన్వయవ్యతిరేకాభ్యాం వర్ణానాం ద్యోతకత్వం దర్శితం భవతి.

బాలానందిని

తత్రేతి :- వర్ణాలకు అర్థం ఉండదు గాన అవి వ్యంజకాలు అవడం అసంభవం అని ఆశంకించుకొని చెపుతున్నాడు -

శషౌ ఇతి :- శషౌ= శకారషకారాలు, సరేఫసంయోగః= రేఫసంయోగంతో కూడిన, ఢకారశ్చాపి = ఢకారం, రేఫసంయుక్తాలైన వర్ణాలు, ఢకారమూ కూడ అని అర్థం. భూయసా= అధికంగా ప్రయోగించబడినవై, శృఙ్గారే= శృంగారమునందు, విరోధినః= విరోధులు, స్యుః= అవుతాయి. వర్ణాః= వర్ణాలు, రసచ్యుతః న= శృంగారాదిరసాలు స్రవించేవి కావు.

త ఏవేతి - తు= కాని, త ఏవ= ఆ శషాదివర్ణాలే, యదా= ఎప్పుడు, బీభత్సాదౌ= బీభత్సం మొదలైన, రసే= రసమునందు, రసం వ్యంగ్యం కావా లనుకొన్నప్పుడు, నివేశ్యన్తే= కూర్చబడతాయో, తదా= అప్పుడు, తమ్= ఆ బీభత్సాదిరసాన్ని, దీపయన్త్యేవ= తప్పక ఉద్దీప్తం చేస్తాయి. తేన= ఆ కారణం చేత, వర్ణాః= వర్ణాలు, రసచ్యుతః= రసాన్ని స్రవించేవిగా ఉంటాయి.

శ్లోకేతి - ఈరెండు శ్లోకాలచేత వర్ణాల కున్న వ్యంజకత్వం అన్వయవ్యతిరేకాలచేత చూపబడినట్లయింది.

లోచనం

భూయసేతి ప్రత్యేకమభిసంబధ్యతే. తేన శకారః భూయసా ఇత్యాది వ్యాఖ్యాతవ్యమ్. రేఫప్రధానః సంయోగః ర్క ర్ఘ ర్ద ఇత్యాదిః. విరోధిన ఇతి - పరుషా వృత్తిర్విరోధినీ శృఙ్గారస్య యతస్తే వర్ణాః భూయసా ప్రయుజ్యమానా

న రసాంశ్చ్యోతన్తి స్రవన్తి. యది వా తేన శృఙ్గారవిరోధిత్వేన హేతునా వర్ణాః శషాదయః రసాత్ శృఙ్గారాత్ చ్యవన్తే, తం న వ్యఞ్జయన్తీతి వ్యతిరేక ఉక్తః. అన్వయమాహ - త ఏవ తు ఇతి. శాదయః. తమితి బీభత్సాదికం రసమ్. దీపయన్తి ద్యోతయన్తి. కారికాద్వయం తాత్పర్యేణ వ్యాచష్టే - శ్లోకద్వయేనేతి. యథాసంఖ్యప్రసఙ్గపరిహారార్థం శ్లోకాభ్యామితి న కృతమ్. పూర్వశ్లోకేన హి వ్యతిరేక ఉక్తః, ద్వితీయేన చ అన్వయః. అస్మిన్ విషయే శృఙ్గారలక్షణే శషాదిప్రయోగః సుకవిత్వమభివాఞ్ఛతా న కర్తవ్య ఇత్యేవంఫలత్వాత్ ఉపదేశస్య కారికాకారేణ పూర్వం వ్యతిరేక ఉక్తః. న చ సర్వథా న కర్తవ్యః అపి తు బీభత్సాదౌ కర్తవ్య ఏవేతి పశ్చాదన్వయః. వృత్తికారేణ అన్వయపూర్వకో వ్యతిరేక ఇతి శైలీమనుసర్తుమ్ అన్వయః పూర్వముపాత్తః.

బాలానందిని

భూయసేతి - 'భూయసా' అనేది ఒక్కొక్క దానితో వేరు వేరుగా సంబంధిస్తుంది. అందుచేత "శకారః భూయసా", "షకారః భూయసా" ఎక్కువగా ఉపయోగించిన శకారం, ఎక్కువగా ఉపయోగించిన షకారం ఇత్యాదివిధంగా అర్థం చెప్పుకోవాలి. రేఫ ప్రధానంగా ఉండే ర్క, ర్భ, ర్ధ మొదలైనవి రేఫసంయోగం. విరోధిన ఇతి :- పరుషవృత్తి శృంగారానికి విరోధి. "శషాభ్యాం రేఫసంయోగైః టవర్గేణ చ యోజితా, పరుషా నామ వృత్తిః స్యాత్" అని భట్టోద్భటుడు చెప్పిన పరుషవృత్తి శృంగారానికి విరోధి అని భావం. యతః ఇతి - ఎందువలన అనగా ఆ వర్ణాలు అధికంగా ప్రయోగించబడిన ట్లయితే, రసాలను స్రవించవు. యది వా ఇతి - లేదా, తేన = శృంగారానికి విరోధు లవడంచేత, వర్ణాః= శషాదివర్ణాలు, రసాత్= శృంగారంనుండి, చ్యవన్తే= దూరం అవుతాయి; దానిని వ్యంజింపచేయవు అని వ్యతిరేకం చెప్పబడింది.

అన్వయం చెపుతున్నాడు - త ఏవ తు ఇతి - శాదులు, తమితి - బీభత్సాద రసాన్ని, దీపయన్తి= వ్యంజింపచేస్తాయి. కారికాద్వయాన్ని వాటి తాత్పర్యం వివరించడం ద్వారా వ్యాఖ్యానిస్తున్నాడు - శ్లోకద్వయేన ఇతి. యథాసంఖ్యం గ్రహించే అవకాశాన్ని పరిహరించడం కోసం 'శ్లోకాభ్యామ్' అనలేదు. ఎందుచేత ననగా - పూర్వశ్లోకంలో వ్యతిరేకం చెప్పబడింది, రెండవ శ్లోకంలో అన్వయం చెప్పబడింది.

వివరణః- "శ్లోకద్వయేన అన్వయవ్యతిరేకాభ్యామ్" అనడానికి బదులు "ద్వాభ్యాం

శ్లోకాభ్యామ్ అన్వయవ్యతిరేకాభ్యామ్" అని చెప్పిన పక్షంలో యథాసంఖ్యగా తీసుకొని మొదటి శ్లోకంచేత అన్వయం, రెండవ శ్లోకంచేత వ్యతిరేకం చెప్పబడింది అనుకొనడానికి వీలుంటుంది. కాని మొదటి శ్లోకంలో వ్యతిరేకం (శషాదిప్రయోగం ఉండకూడదనీ) రెండవ శ్లోకంలో అన్వయం (బీభత్సాదులలో శషాదిప్రయోగం ఉండవచ్చుననీ) చెప్పబడింది అని అర్థం.

అస్మిన్నితి - "సుకవి కావాలనుకొన్నవాడు శృంగారరూపమైన ఈ విషయంలో శషాదిప్రయోగం చేయకూడదు" అనేది ఈ ఉపదేశానికి ఫలం; అందుచేత కారికాకారుడు ముందుగా వ్యతిరేకం చెప్పాడు. "వాటి ప్రయోగం ఏ విధంగానూ కూడ చేయదగినది కాదు అనే మాట లేదు. బీభత్సాదులలో వాటి ప్రయోగం తప్పకుండా చెయ్యాలి" అని అన్వయాన్ని తరవాత చెప్పాడు. అయితే, ముందు అన్వయం రావాలి; తరవాత వ్యతిరేకం చెప్పాలి అనే పద్ధతిని అనుసరించి వృత్తికారుడు అన్వయాన్ని ముందు చెప్పాడు.

### లోచనం

ఏతదుక్తం భవతి - యద్యపి విభావానుభావవ్యభిచారిప్రతీతిసంపదేవ రసాస్వాదే నిబన్ధనం, తథాపి విశిష్టశ్రుతికశబ్దసమర్ప్యమాణాస్తే విభావాదయః తథా భవన్తీతి స్వసంవిత్సిద్ధమదః. తేన వర్ణానామపి శ్రుతిసమయోపలక్ష్యమాణార్థానపేక్ష్యాపి శ్రోత్రైకగ్రాహ్యః మృదుపరుషాత్మా స్వభావః రసాస్వాదే సహకార్యేవ. అత ఏవ చ సహకారితామేవ అభిధాతుం నిమిత్తసప్తమీ కృతా. వర్ణపదాదిష్వితి. న తు వర్ణైరేవ రసాభివ్యక్తిః, విభావాదిసంయోగాద్ధి రసనిష్పత్తిరిత్యుక్తం బహుశః. శ్రోత్రైకగ్రాహ్యోఽపి చ స్వభావో రసనిష్యన్దే వ్యాప్రియత ఏవ, అపదగీతధ్వనివత్, పుష్కరవాద్యనియమిత విశిష్టజాతికరణప్రాణాద్యనుకరణశబ్దవచ్చ.

### బాలానందిని

ఏతదితి - ఇక్కడ చెప్పిన విషయం ఇది - రసాస్వాదానికి కారణం విభావ - అనుభావవ్యభిచారిప్రతీతిసమృద్ధియే అయినా విశిష్టమైన అనగా ఉపనాగరికాదివృత్తి విశిష్టమైన, శ్రవణం గల, ఉపనాగరికాదివృత్తివిశిష్టాలై వినబడే, శబ్దాలచేత సమర్పించబడినప్పుడే ఆ విభావాదులు అలాగ (రసాస్వాదనిబంధనంగా) అవుతాయి అనేది స్వానుభవసిద్ధం. అందుచేత వినే సమయంలో గ్రహించబడే అర్థాలను

అపేక్షించకపోయినా, కేవలం చెవులచేతనే గ్రహించదగిన మృదు-పరుషరూపమైన శబ్దాల స్వభావం రసాస్వదంలో సహకారిగా ఉండనే ఉంటుంది. అందుచేతనే, ఈ వర్ణాలస్వభావం సహకారిగా ఉంటుంది అని చెప్పడం కోసమే, 'వర్ణపదాదిషు' అని నిమిత్తసప్తమి ఉపయోగించబడింది. రసాభివ్యక్తి వర్ణాలచేతనే కలగదు; విభావాదిసంయోగంవల్లనే రసనిష్పత్తి జరుగుతుంది అని అనేక పర్యాయాలు చెప్పబడింది. పదాలు లేని గీతధ్వనివలె, పుష్కరవాద్యంమీద నియమితమైన విశిష్టమైన జాతుల, కరణాల, ఘ్రూణాదుల అనుకరణశబ్దాల వలె కేవలం చెవులచేత మాత్రమే గ్రహించబడే మృదు-పరుషాదిరూపవర్ణస్వభావం కూడ రసం స్రవించడంలో (స్రవింపచేయడంలో) ఉద్వ్యక్తం అవుతుంది (ఉపయోగిస్తుంది).

వివరణ:- పదాలు ఏవీ లేకపోయినా (సాహిత్యం లేకపోయినా) మంచి సంగీతవిద్వాంసులు చేసే ఆలాపన, వీణాదినాదం ఏ విధంగా రసాస్వాదజనకంగా ఉంటుందో, మృదంగాదివాద్యాల మీద పలికించే లయబద్ధమైన నాదం ఏ విధంగా రసాస్వాదజనకంగా ఉంటుందో అదే విధంగా వర్ణస్వభావం రసాస్వదజనకంగా (సహకారిగా) ఉంటుంది అని అర్థం. 'పుష్కరం' అనగా చేతులతో కాని, దండాదులతో కాని కొట్టి శబ్దాన్ని పుట్టించే చర్మభాగం. 'కరణం' లయబద్ధమైన ధ్వని. జాతి అనగా సప్తస్వరాలు. 'ఘ్రూణ' అనే దాని అర్థం తెలియలేదు. బహుశా ముక్కురంధ్రాలలో ఒకటి మూసి ఒకదానితో వ్రేళ్లతో నొక్కుతూ స్వరాలూ పలికించేవారేమో!

ధ్వన్యాలోకం

పదే చ అలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య ద్యోతనం యథా-

శ్లో. ఉత్కమ్పినీ భయపరిస్ఖలదంశుకాన్తా
తే లోచనే ప్రతిదిశం విధురే క్షిపన్తీ,
క్రూరేణ దారుణతయా సహసైవ దగ్ధా
ధూమాన్ధితేన దహనేన న వీక్షితాసి. (78)

అత్ర హి తే ఇత్యేతత్పదం రసమయత్వేన స్ఫుటమేవ అవభాసతే సహృదయానామ్.

బాలానందిని

పదే ఇతి - ఒకానొక పదం ఉన్నప్పుడు అలక్ష్యక్రమవ్యంజనం ఎట్లనగా -

ఉత్కమ్పినీ ఇతి - ఇది తాపసవత్సరాజంలోని శ్లోకం. ఉత్కమ్పినీ= వణకిపోతూన్నదానవు, భయపరిస్ఖలితాంశుకాన్తా= భయంచేత జారుచున్న వస్త్రాంతం కలదానవూ, విధురే= వ్యాకులంగా ఉన్న, తే= ఆ, లోచనే= నేత్రాలను, ప్రతిదిశమ్= ప్రతిదిక్కు వైపూ, క్షిపన్తీ= విసురుచున్నదానవూ, ప్రసరింపచేస్తూన్నదానవూ అయిన, నువ్వు, క్రూరేణ= క్రూరమైన, ధూమాన్ధితేన= ధూమంచేత గ్రుడ్డిదిగా చేయబడిన, దహనేన= అగ్నిచేత, సహసైవ= వెంటనే, దగ్ధా= కాల్చబడితివి. న వీక్షితాసి= చూడబడలేదు.

అత్రేతి - ఇక్కడ 'తే' అనే పదం రసమయంగా సహృదయులకు స్పష్టంగానే భాసిస్తూన్నది కదా.

ఈ శ్లోకం తరవాత కొన్ని ప్రతులలో ఈ క్రింది శ్లోకం కూడా ఉన్నదట. దానికి అభినవగుప్తవ్యాఖ్య లేదు. ప్రక్షిప్తమై ఉంటుంది.

"ఝగితి కనకచిత్రే తత్ర దృష్టే కురఙ్గే
రభసవికసితాస్తే దృష్టిపాతాః ప్రియాయాః,
పవనవిలులితానాముత్పలానాం పలాశ
ప్రకరమివ కిరన్తః స్మర్యమాణా దహన్తి"

ఇవి బహుశా రామాయణకథామూలకమైన ఏ నాటకంలోనో సీతావిరహతప్తుడైన రాముని మాట లయి ఉంటాయి.

ఝగితీతి : తత్ర= అక్కడ, కనకచిత్రే= బంగారంచేత చిత్రమైన, కురఙ్గే= లేడి, ఝగితి= హటాత్తుగా, దృష్టే= చూడబడినదగుచుండగా, రభసవికసితాః= తొందరతో వికసించినవీ, పవనవిలులితానామ్= గాలిచేత తీగలనుంచి వేరు చేయబడిన (ఎగరగొట్టబడిన), ఉత్పలానామ్= నల్లకలువలయొక్క, పలాశప్రకరమ్= రేకుల సముదాయాన్ని, కిరన్తీవ= చిమ్ముచున్నవా అన్నట్లున్నవీ అయిన, ప్రియాయాః= ప్రియురాలియొక్క, తే దృష్టిపాతాః= ఆ దృష్టిప్రసారములు, స్మర్యమాణాః= స్మరించబడుచు, దహన్తి= కాల్చివేస్తున్నాయి.

పై శ్లోకంలో వలె ఈ శ్లోకంలో కూడ 'తే' శబ్దం రసమయంగా భాసిస్తూన్నది.

లోచనం

పదే చేతి - పదే చ సతీత్యర్థః. తేన రసప్రతీతిః విభావాదేరేవ. తే విభావాదయః యదా విశిష్టేన కేనాపి పదేన అర్ప్యమాణాః రసచమత్కార విధాయినో భవన్తి తదా పదస్యైవాసౌ మహిమా సమర్ప్యత ఇతి భావః.

బాలానందిని

పదే చేతి - పదం ఉంటూండగా అని అర్థం. అందుచేత రసప్రతీతి విభావాదులవల్లనే కలుగుతుంది; ఆ విభావాదులు ఎప్పుడైతే విశిష్టమైన ఏదైనా ఒక పదంచేత సమర్పించబడినవై రసచమత్కారజనకాలు అవుతాయో అప్పుడు ఈ మహిమ (రసచమత్కారవిధాయకత్వం) ఆ పదానికే సమర్పించబడుతుంది, దానిదే అన్నట్లు చెప్పబడుతుంది అని భావం.

లోచనం

అత్ర హీతి - వాసవదత్తాదాహాకర్ణనప్రబుద్ధశోకనిర్భరస్య వత్సరాజస్యేదం పరిదేవితవచనమ్. తత్ర చ శోకో నామ ఇష్టజనవినాశప్రభవః ఇతి తస్య జనస్య యే భ్రూక్షేపకటాక్షప్రభృతయః పూర్వరతివిభావతామవలమ్బన్తే స్మ త ఏవ అత్యన్తవినష్టాః సన్తః ఇదానీం స్మృతిగోచరతయా నిరపేక్షభావత్వప్రాణం కరుణముద్దీపయన్తీతి స్థితమ్. తే లోచనే ఇతి తచ్ఛబ్దః తల్లోచన గతస్వసంవేద్యావ్యపదేశ్యానన్తగుణగణస్మరణాకారద్యోతకః రసస్య అసాధారణనిమిత్తతాం ప్రాప్తః. తేన యత్కేనచిత్ చోదితం పరిహృతం చ తన్మిథ్యైవ. తథాహి చోద్యమ్ - ప్రక్రాన్తపరామర్శకస్య తచ్ఛబ్దస్య కథమియతి సామర్థ్యమ్ ఇతి. ఉత్తరం చ - రసావిష్టోఽత్ర పరామ్రష్టా ఇతి. తదుభయమను త్థానోపహతమ్. యత్ర హి అనూద్దిశ్యమానధర్మాన్తరసాహిత్యయోగ్య ధర్మయోగిత్వం వస్తునః యచ్ఛబ్దేన అభిధాయ తద్బుద్ధిస్థధర్మాన్తరసాహిత్యం తచ్ఛబ్దేన నిర్వాచ్యతే, యత్రోచ్యతే - "యత్తదోర్నిత్యసంబన్ధత్వమ్" ఇతి తత్ర పూర్వప్రక్రాన్తపరామర్శకత్వం తచ్ఛబ్దస్య. యత్ర పునః నిమిత్తోపనతస్మరణ విశేషాకారసూచకత్వం తచ్ఛబ్దస్య 'స ఘటః' ఇత్యాదౌ యథా తత్ర కా పరామర్శకత్వకథా ఇతి ఆస్తామలీకపరామర్శకైః పణ్డితంమన్యైః సహ వివాదేన.

బాలానందిని

అత్ర హీతి - ఇది వాసవదత్త అగ్నిదాహంలో దగ్ధురాలైపోయింది అని వినడంచేత బయలుదేరిన శోకంలో నిండిన వత్సరాజు విలపిస్తూ పలికిన వచనం. శోకం అనేది ఇష్టజనంయొక్క వినాశంవల్ల కలుగుతుంది. పూర్వం ఆ ఇష్టజనంయొక్క ఏ కనుబొమ్మల

విరుపులు క్రీకంటిచూపులు మొదలైనవి రతికి విభావాలుగా ఉండేవో అవే ఇప్పుడు పూర్తిగా నశించినవై కేవలం స్మృతికి గోచరాలవుతూ (స్మరించబడుతూ) మళ్లా కలుస్తాం అనే ఆశ లేకపోవడం అనేది ప్రాణంగా గల కరుణరసాన్ని ఉద్దీపించేస్తాయి అనేది నిశ్చితంగా అందరూ అంగీకరించిన విషయం (స్థితమ్). (మళ్లీ కలుస్తాం అనే ఆశ ఉంటే అది విప్రలంభం అవుతుంది). తే లోచనే అనే దానిలోని తచ్ఛబ్దం తనకు మాత్రమే తెలిసిన, వర్ణింప శక్యం కాని, ఆ లోచనాలలో ఉన్న, అనంతగుణగణాల స్మరణం యొక్క ఆకారాన్ని వ్యంజింపచేస్తూ రసానికి అసాధారణనిమిత్తం అవుతూన్నది. అనగా 'ఆ నేత్రాలు' అనడం వల్ల ఏ నేత్రాలు ఒకానొకప్పుడు అనిర్వాచ్యమైన ఆనందాన్ని కలిగించేవో అవి అని స్మరిస్తూన్నట్లు తెలియడంచేత అతని శోకం ఎంత తీవ్రంగా ఉందో సూచిస్తున్నాయి అని భావం. తేనేతి - అందుచేత ఒకడు (ఒక వ్యాఖ్యాత - బహుశా చంద్రికాకారుడు కావచ్చు) ఒక ఆక్షేపం (చోద్యం) లేవదీసి ఏ పరిహారం చెప్పి ఉన్నాడో అది మిథ్యయే. అనగా ఆ చోద్యానికి గాని సమాధానానికి గాని ఇక్కడ ప్రసంగమే లేదని అర్థం. తథా హీతి - అతడు చేసిన చోద్యం ఇది - "ఉపక్రమించినదానిని పరామర్శించే, అనగా ఏదైతే ప్రారంభంలో చెప్పబడిందో దానిని నిర్దేశించే, తచ్ఛబ్దానికి ఇంత అర్థం వ్యంజింపచేసే సామర్థ్యం ఎక్కడ ఉంది"? దానికి - "ఇక్కడ ఆ నేత్రాలను పరామర్శించే వక్త రసావిష్టుడు. అనగా వక్త యైన వత్సరాజు శోకావిష్టుడై ఈ పదం ప్రయోగించాడు కాబట్టి దీని కింత అర్థం సూచించే సామర్థ్యం లభించింది" అని సమాధానం.

తదితి :- ఈ ఉభయమూ కూడ అనుత్థానోపహతమే. అనగా ఈ చోద్యానికీ సమాధానానికీ కూడ ఏ మాత్రమూ అవకాశం లేదని అర్థం. యత్రేతి - ఎక్కడైతే ఒక వస్తువుకు అనూద్దిశ్యమానధర్మాంతరంతో, కలిసి ఉండడానికి తగిన ధర్మంతో, సంబంధం ఉండడం చెప్పి బుద్ధిస్థమైన ఆ ధర్మాంతరంతో సాహిత్యం తచ్ఛబ్దంచేత చెప్పబడుతుందో - అలాంటప్పుడే "యచ్ఛబ్దతచ్ఛబ్దాల సంబంధం నిత్యం" అని అంటారు - అక్కడ తచ్ఛబ్దం పూర్వపరామర్శకం అని చెప్పబడుతుంది. కాని ఎక్కడైతే, ఉదాహరణకి "స ఘటః" (ఆ ఘటం) ఇత్యాదులలో తచ్ఛబ్దం ఏదో కారణంచేత కలిగిన స్మృతివిశేషంయొక్క ఆకారాన్ని సూచిస్తుందో అక్కడ పరామర్శకత్వకథ ఏముంది? సరే! అర్థం లేకుండా పరామర్శలు (విమర్శలు) చేసే పండితంమన్యులతో (మేమే పండితులం అనుకునేవాళ్లు పండితంమన్యులు) వివాదం చాలును.

వివరణ:- ఉద్దేశం అనగా ఒక విషయాన్ని ముందుగా నిర్దేశించడం. అనూద్దేశం అనగా ఆ విషయాన్నే మళ్లీ నిర్దేశించడం. 'యత్తదోః నిత్యసంబంధః' అని ఒక నియమం

ఉంది. యచ్ఛబ్దానికీ తచ్ఛబ్దానికీ సంబంధం అని దీని అర్థం. అనగా యచ్ఛబ్దం ప్రయోగించి ఏదైనా ఒక విషయం చెప్పబడింది అంటే దానినే (యచ్ఛబ్దంచేత చెప్పబడినదానినే) తరవాత వాక్యంలో వచ్చే తచ్ఛబ్దం పరామర్శిస్తుంది అని అర్థం. అయితే ఈ నియమాన్ని గ్రుడ్డిగా ప్రవర్తింపచేసి తచ్ఛబ్దం ఎక్కడ ప్రయోగించబడినా అది తప్పకుండా ముందు చెప్పబడినదానిని పరామర్శిస్తుంది అని చెప్పకూడదు. దానికి కూడా కొన్ని విశిష్టస్థానాలు(అపవాదాలు)న్నాయి. ఒక వ్యక్తిలో ఈ ధర్మం ఉంది గాన అతనిలో చెప్పబోయే ఈ రెండవధర్మం కూడా ఉండే యోగ్యత కలిగింది అని చెప్పేటప్పుడు ఈ నియమం ప్రవర్తిస్తుంది. ఉదాహరణకి "యః విద్వాన్ సః పూజ్యః" ఇత్యాదులలో 'యః విద్వాన్' అనే యచ్ఛబ్దఘటితపదసముదాయంలో "ఎవడైతే విద్వాంసుడో" అని ఒకనిలో విద్వత్త్వం అనే ధర్మం ఉన్నట్లు చెప్పబడింది. 'సః పూజ్యః' అనే తచ్ఛబ్దఘటితపదసముదాయంలోని తచ్ఛబ్దం ఆ వ్యక్తినే పరామర్శించడంచేత ఈ రెండవపదసముదాయం "ఆతనిలో విద్వత్త్వంఉంది కాబట్టి పూజ్యత్వం కూడా ఉంది" అని చెపుతూన్నది. ఈ విధంగా ఎవనిలోనైనా లేదా దేనిలోనైనా ఒక ధర్మం గాని లేదా క్రియాదికం గాని ఉందని చెప్పి ఆతనిలోనే లేదా దానిలోనే మరొక ధర్మం గాని లేదా క్రియాదికం గాని ఉన్నదని చెప్పడం కోసం యచ్ఛబ్ద-తచ్ఛబ్దాలను ప్రయోగించిన వాక్యంలోనే ఈ 'యత్తదోర్నిత్యసంబన్ధః' అనేది ప్రవర్తిస్తుంది. అక్కడమాత్రమే తచ్ఛబ్దం పూర్వపరామర్శకం అవుతుంది. అంతేనే కాని ఏదో కారణంచేత పూర్వం అనుభవించిన దానిని లేదా చూచి ఉన్నదానిని గుర్తుకు తెచ్చుకొని తచ్ఛబ్దాన్ని ఉపయోగిస్తే అది కూడ పూర్వపరామర్శకం అనకూడదు. అది కేవలం స్మరణాన్ని మాత్రమే సూచిస్తుంది. ఉదాహరణకి 'సః ఘటః' అన్నప్పుడు తచ్ఛబ్దం "పూర్వం ఏ నాడో తాను చూచినది" అనే అర్థాన్ని మాత్రమే, స్మృతిని మాత్రమే, బోధిస్తుంది. ఇది కూడ పూర్వపరామర్శకం అనడానికి ఈ వాక్యానికి ముందు ఈ ఘటాన్ని గూర్చి ఏమీ చెప్పలేదు కదా అని ఈ ఘట్టం తాత్పర్యం.

లోచనం

ఉత్కమ్పినీత్యాదినా తదీయభయానుభావోత్ప్రేక్షణం మయా అనిర్వాహితప్రతీకారమితి శోకావేశస్య విభావః. తే ఇతి - సాతిశయ విభ్రమైకాయతనరూపే అపి లోచనే విధురే కాందిశీకతయా నిర్లక్షే క్షిపన్తీ "కః త్రాతా? క్వాసావార్యపుత్రః?" ఇతి తయోః లోచనయోః తాదృశీ చావస్థేతి

సుతరాం శోకోద్దీపనమ్. క్రూరేణేతి - తస్యాయం స్వభావం ఏవ. కిం కురుతామ్? తథాపి చ ధూమేన అన్ధీకృతః ద్రష్టుమసమర్థః ఇతి న తు సవివేకస్యేదృశానుచితకారిత్వం సంభావ్యతే; ఇతి స్మర్యమాణం తదీయం సౌన్దర్యమిదానీం సాతిశయశోకావేశవిభావతాం ప్రాప్తమితి. 'తే' శబ్దే సతి సర్వోఽయమర్థః నిర్వ్యూఢః. ఏవం తత్ర తత్ర వ్యాఖ్యాతవ్యమ్.

బాలానందిని

ఉత్కమ్పినీతి - 'ఉత్కంపినీ' ఇత్యాదికంచేత వాసవదత్తకు కలిగిన భయంయొక్క అనుభావాల (కార్యాల) ఊహ నేను ఆ భయానికి ప్రతిక్రియ చేయజాలకపోయాను కదా అని శోకావేశానికి విభావం. తే ఇతి :- అత్యధికమైన విలాసాలకు ఏకైకస్థానాలైనవైనా, లోచనాలను, విధురే= కాందిశీకత్వంచేత (ఎటువైపు పరుగెత్తాలా అనే ఆలోచనచేత) ఏ లక్ష్యమూ లేని విధంగా, ప్రసరింపచేస్తూ, "నన్ను రక్షించే వారెవరు? ఆర్యపుత్రు డెక్కడ ఉన్నాడో కదా!" అని ఆ నేత్రాలకు ఆ విధమైన అవస్థ కలిగింది - అని అత్యధికంగా శోకోద్దీపనం జరుగుతున్నది. క్రూరేణేతి - ఆ అగ్ని స్వభావమే అలాంటిది; ఏం చేస్తాడు? అంతే కాదు - ధూమంచేత గ్రుడ్డివాడుగా చేయబడి చూడడానికి అసమర్థుడుగా అయ్యాడు. అలా కాకపోతే వివేకవంతుడు ఇలాంటి అనుచితం చేయడం అనేది ఊహించరానిది. ఈ విధంగా స్మరించబడుతూన్న ఆమె సౌందర్యం ఇప్పుడు అత్యధికశోకావేశానికి విభావం అయింది. ఈ ప్రకారం 'తే' శబ్దం ఉండడం మూలాన ఈ అర్థం అంతా నిర్వహించబడింది. అక్కడక్కడ రాబోయే ఉదాహరణలలో కూడా ఈ విధంగానే వ్యాఖ్యానించాలి.

## ధ్వన్యాలోకం

పదావయవేన ద్యోతనం యథా -

శ్లో. వ్రీడాయోగాన్నతవదనయా సన్నిధానే గురూణాం
బద్ధోత్కమ్పం కుచకలశయోర్మన్యుమన్తర్నిగృహ్య,
తిష్ఠేత్యుక్తం కిమివ న తయా యత్సముత్సృజ్య బాష్పం
మయ్యాసక్తశ్చకితహరిణీహారినేత్రత్రిభాగః. (79

ఇత్యత్ర త్రిభాగశబ్దః.

బాలానందిని

పదేతి - పదావయవంచేత వ్యంజింపచేయడం ఎట్లనగా -

వ్రీడేతి :- గురూణామ్= పెద్దలయొక్క, సంనిధానే= సమీపమునందు (సంనిధానం అనగా అక్కడ ఉండడం), కుచకలశయోః= కుచకలశలయందు, బద్ధోత్కమ్పమ్= కట్టబడిన (కలిగించబడిన) కంపంగల, మన్యుమ్= దుఃఖాన్ని, అన్తః= లోపల, నిగృహ్య= నిగ్రహించుకొని, వ్రీడాయోగాత్= సిగ్గువల్ల, నతవదనయా= వంచబడిన ముఖం గల, తయా= ఆమెచేత, బాష్పమ్= కన్నీటిని, సముత్సృజ్య= విడచి, చకితహరిణీహారి నేత్రత్రిభాగః= భయపడిన లేడి (కన్ను) వలె మనోహరం అయిన నేత్రాంతం, మయి= నాయందు, యత్= ఎందువలన, ఆసక్తః= ప్రసరింపచేయబడినదో, అందువలన, ఆమె నేత్రాంతాన్ని నామీద ప్రసరింపచేసిం దనగా అలా చేయడంచేత, తిష్ఠ= ఆగిపో(వెళ్లవద్దు), ఇతి= అని, కిమివ నోక్తమ్= చెప్పబడలేదా?

ఇతీతి - ఇక్కడ త్రిభాగశబ్దం (ద్యోతకంగా ఉంది). (ఇది చకితేత్యాది దీర్ఘపదంలో ఒక అవయవం).

లోచనం

త్రిభాగశబ ఇతి:-గురుజనమవధీర్యాపి సా మాం యథా తథాపి సాభిలాష మన్యుదైన్యగర్వమన్థరం విలోకితవతీత్యేవ స్మరణేన పరస్పరహేతుకత్వప్రాణ ప్రవాసవిప్రలమ్భోద్దీపనం త్రిభాగశబ్దసంనిధౌ స్ఫుటం భాతీతి.

బాలానందిని

త్రిభాగేతి :- ఆమె గురుజనాన్ని కూడా లక్ష్యం చేయక ఏదో విధంగా అభిలాష, దుఃఖం లేదా కోపం (వద్దన్నా వెడుతున్నాడని) దైన్యం, గర్వం వీటితో మందంగా నా వైపు చూచింది అని స్మరించడంచేత పరస్పరహేతుకత్వం ప్రాణంగాగల ప్రవాసవిప్రలంభం యొక్క ఉద్దీపనం ఈ త్రిభాగశబ్దం ఉండడంవల్ల స్ఫుటంగా భాసిస్తున్నది.

వివరణ:- ఇవి ఒకడు తన మిత్రునితో చెపుతున్న మాటలు, లేదా తనలో తాను అనుకుంటూన్న మాటలు, ఈ విప్రలంభానికి నాయికానాయకులిద్దరిలోనూ ఉన్న అవస్థావిశేషం ప్రాణం (పరస్పరహేతుకత్వప్రాణ).

## ధ్వన్యాలోకం

వాక్యరూపశ్చ అలక్ష్యక్రమవ్యఙ్గ్యః ధ్వనిః శుద్ధః అలంకార సంకీర్ణశ్చేతి ద్విధా మతః. తత్ర శుద్ధస్య ఉదాహరణం యథా

రామాభ్యుదయే "కృతకకుపితైః" ఇత్యాదిశ్లోకః. ఏతద్ధి వాక్యం పరస్పరానురాగం పరిపోషప్రాప్తం ప్రదర్శయత్ సర్వత ఏవ పరం రసతత్త్వం ప్రకాశయతి.

బాలానందిని

వాక్యేతి :- వాక్యరూపమైన అలక్ష్యక్రమవ్యంగ్యధ్వని శుద్ధం, అలంకారసంకీర్ణం అని రెండు విధాలుగా అంగీకరించబడింది. వాటిలో శుద్ధానికి ఉదాహరణం ఎట్లనగా - రామాభ్యుదయంలోని "కృతకకుపితః" ఇత్యాదిశ్లోకం. పూర్తి శ్లోకం లోచనంలో ఇవ్వబడింది.

కృతకకుపితైః ఇతి :- ప్రియే= ప్రియురాలా! కృతకకుపితైః= కృత్రిమాలైన కోపాలచేత, బాష్పామ్భోభిః= కన్నీళ్లచేత, సదైన్యవిలోకితైః= దైన్యంతో కూడిన చూపులచేత, తథా= ఆ విధంగా, అమ్బయా= తల్లిచేత, ధృతాపి= అడ్డగించబడినదానవైనా, యస్య= ఎవనియొక్క, ప్రీత్యా= ప్రేమచేత, వనమపి= వనాన్ని కూడ, గతా= పొందావో (వనానికి వచ్చావో), తవ= అట్టి నీయొక్క, సః ప్రియః= ఆ ప్రియుడు, భవతీం వినా= నువ్వు లేకుండగా, నవజలధరశ్యామాః= నూతన మేఘాలతో నల్లనైన, దిశః= దిక్కులను, పశ్యన్= చూస్తూ, కఠిన హృదయః= కఠినహృదయుడై, లేదా ఈ పదం 'సః ప్రియః' కు ముందు అన్వయించవచ్చును. జీవత్యేవ= జీవించియే ఉన్నాడు.

ఏతద్ధీతి - ఈ వాక్యం పరిపుష్టిని పొందిన పరస్పరానురాగాన్ని ప్రదర్శిస్తూ అంతటా కూడ (శ్లోకం అంతా కూడ) గొప్ప రసతత్త్వాన్ని ప్రకాశింపచేస్తున్నది.

లోచనం

వాక్యరూపశ్చేతి - ప్రథమానిర్దేశేన అవ్యతిరేకనిర్దేశస్య అయమభిప్రాయః - వర్ణపదతద్భాగాదిషు సత్స్వేవ అలక్ష్యక్రమః వ్యఙ్గ్యః నిర్భాసమానోఽపి సమస్తకావ్యవ్యాపక ఏవ నిర్భాసతే, విభావాదిసంయోగప్రాణత్వాత్, తేన వర్ణాదీనాం నిమిత్తత్వమాత్రమేవ; వాక్యం తు ధ్వనేరలక్ష్యక్రమస్య న నిమిత్తతామాత్రేణ వర్ణాదివదుపకారి; కిం తు సమగ్రవిభావాదిప్రతిపత్తి వ్యాపృతత్వాత్ రసాదిమయమేవ తత్ నిర్భాసతే ఇతి 'వాక్య' ఇత్యేతత్కారికాయాం న నిమిత్తసప్తమీమాత్రం, అపి తు అనన్యత్రభావ

విషయార్థమపీతి.

బాలానందిని

వాక్యేతి - "వాక్యరూపః అలక్ష్యక్రమవ్యఙ్గ్యః" అని ప్రథమచేత నిర్దేశించి ఈ అలక్ష్యక్రమవ్యంగ్యం వాక్యరూప మైనది, వాక్యంకంటె భిన్నం కాదు అని చెప్పడంలో అభిప్రాయం ఇది - వర్ణాలు, పదాలు, పదభాగాలూ ఉంటూండగానే అలక్ష్యక్రమవ్యంగ్యం భాసిస్తూన్నా కూడ అది సమస్త కావ్యంలోనూ వ్యాపించే భాసిస్తుంది; ఎందుచేత ననగా దానికి విభావాదిసంయోగమే ప్రాణం. అనగా - వర్ణాదు లున్నప్పుడు అసంలక్ష్యక్రమం భాసించినా అది అవి ఉండడంవల్ల మాత్రమే భాసించడం లేదు, మొత్తం కావ్యంలో (శ్లోకరూపవాక్యంలో) విభావాదిసంయోగం ఉండడం మూలాన అది భాసిస్తూన్నది. అందుచేత వర్ణాదులు కేవలం నిమిత్తమాత్రమే. అయితే - వాక్యం అలక్ష్యక్రమధ్వనికి, వర్ణాదుల వలె, కేవలం నిమిత్తంగా ఉండడం ద్వారా ఉపకారకం కాదు; మరేమనగా అది (వాక్యం) సమగ్రమైన విభావాదుల ప్రతిపత్తి కలిగించడం అనే పనిలో నిమగ్నం అయి ఉండడంవల్ల రసాదిమయంగానే భాసిస్తుంది. అందుచేత 'యస్త్వలక్ష్యక్రమ' ఇత్యాదికారికలోని 'వాక్యే' అనే సప్తమి నిమిత్తసప్తమి మాత్రమే కాదు; మరే మనగా ఇతరమైన వాటిలో (వర్ణాదులలో) లేని విషయార్థం కలది కూడ (విషయసప్తమి కూడ).

లోచనం

శుద్ధ ఇతి అర్థాలంకారేణ కేనాప్యసంమిశ్రః.

"కృతకకుపితైర్బాష్పామ్భోభిః సదైన్యవిలోకితై
ర్వనమపి గతా యస్య ప్రీత్యా ధృతాపి తథామ్బయా,
నవజలధరశ్యామాః పశ్యన్ దిశో భవతీం వినా
కఠినహృదయో జీవత్యేవ ప్రియే స తవ ప్రియః."

అత్ర తథా తైస్తైః మాత్రా ధృతాపి ఇత్యనురాగపరవశత్వేన గురువచనోల్లఙ్ఘనమపి త్వయా కృతమితి. 'ప్రియే' 'ప్రియః' ఇతి పరస్పరజీవితసర్వస్వాభిమానాత్మకః రతిస్థాయిభావ ఉక్తః. నవజలధరేతి అసోఢపూర్వప్రావృషేణ్యజలదాలోకనం విప్రలమ్భోద్దీపనవిభావత్వేనోక్తమ్.

జీవత్యేవేతి సాపేక్షభావతా ఏవకారేణ కరుణావకాశనిరాకరణాయ ఉక్తా. సర్వత్ర ఏవేతి - నాత్ర అన్యతమస్య పదస్య అధికం కించిద్రసవ్యక్తిహేతుత్వమిత్యర్థః. రసతత్త్వమితి:- విప్రలమ్భశృఙ్గారాత్మతత్త్వమ్.

బాలానందిని

శుద్ధః ఇతి - ఏ అర్థాలంకారంతోనూ మిశ్రం కానిది. అత్రేతి - ఇక్కడ - ఆ యా పద్ధతుల నుపయోగించి తల్లిచేత అడ్డుకొనబడినదానవైనా కూడ అని చెప్పడంచేత నువ్వు నాయం దున్న అనురాగంచేత పరవశురాలవై గురుజనుల మాట కూడ ఉల్లంఘించావు అని (సూచించబడుతున్నది). 'ప్రియే' 'ప్రియః'' అనే పదాలచేత ఒకరిపై ఒకరి కున్న 'నాజీవితసర్వస్వం' అనే అభిమానరూపమైన రతిస్థాయిభావం చెప్పబడింది. నవజలధర - అనే పదంచేత పూర్వం ఎన్నడూ సహించబడని నూతన వర్షాకాలమేఘదర్శనం విప్రలంభోద్దీపనవిభావంగా చెప్పబడింది. జీవత్యేవ అని 'ఏవ' కారంచేత కరుణరసానికి అవకాశం లేకుండా ఉండడానికి సాపేక్షభావత (మళ్లీ కలుస్తాం అనే ఆశతో ఉండడం) చెప్పబడింది. (కరుణవిప్రలంభాల స్వరూపం చాలా దగ్గరగా ఉంటుంది. ఇంక కలవం అనే భావం నాయికానాయకుల కుంటే కరుణరసం; కలుస్తాం అనే ఆశ ఉంటే విప్రలంభం). సర్వత్ర ఏవేతి :- ఇక్కడ ఏదో ఒక పదం అధికంగా రసాభివ్యక్తికి హేతువుగా ఉండడం అనేది లేదు అని అర్థం. రసతత్త్వమితి :- విప్రలంభశృంగారంయొక్క లేదా విప్రలంభ శృంగారం అనే ఆత్మయొక్క, తత్త్వం.

## ధ్వన్యాలోకం

అలఙ్కారాన్తరసంకీర్ణో యథా - "స్మరనవనదీపూరేణోఢాః" ఇత్యాదిశ్లోకః. అత్ర హి రూపకేణ యథోక్తవ్యఞ్జకలక్షణానుగతేన ప్రసాధితో రసః సుతరామభివ్యజ్యతే.

బాలానందిని

అలంకారేతి :- మరియొక అలంకారంతో సంకీర్ణమైన (వాక్యరూపఅలక్ష్య క్రమవ్యంగ్యం) ఎట్లనగా - "స్మరనవనదీపూరేణోఢాః" ఇత్యాది శ్లోకం. (ఈ శ్లోకం లోచనంలో ఇవ్వబడింది). స్మరేతి - ప్రియాః= ప్రేయసీప్రియులు, స్మరనవనదీపూరేణ= మన్మథుడనే క్రొత్త నదీప్రవాహంచేత, ఊఢాః= మోయబడినవారై, ఆ ప్రవాహంలో కొట్టుకొనిపోయినవారై, పునః= మరల, గురుసేతుభిః= పెద్దవాళ్లనే సేతువులచేత,

విధృతాః యదపి= ఆపివేయబడినవాళ్లైనాకూడ, అపూర్ణమనోరథాః= పూర్ణంకాని కోరికలు గలవారై, ఆరాత్= దగ్గరనే, తిష్ఠన్తి= ఉంటున్నారు. తదపి= అట్లైనా కూడ, లిఖితప్రఖ్యైః= చిత్రించబడినవాటితో సమానములైన, అఙ్గైః= అవయవాలతో, పరస్పరము, ఉన్ముఖాః= అభిముఖులై, నయననలినీనాలానీతమ్= నేత్రా లనే తామరతూడుల ద్వారా తీసికొని రాబడిన, రసమ్= రసాన్ని, పిబన్తి = త్రాగుచున్నారు.

అత్ర హీతి - ఈ శ్లోకంలో పూర్వం చెప్పబడిన వ్యంజకలక్షణంతో కూడిన రూపకంచేత అలంకరించబడిన రసం చక్కగా వ్యంజింపచేయబడుతున్నది.

లోచనం

"స్మరనవనదీపూరేణోఢాః పునర్గురుసేతుభి
ర్యదపి విధృతాస్తిష్ఠన్త్యారాదపూర్ణమనోరథాః,
తదపి లిఖితప్రఖ్యైరఙ్గైః పరస్పరమున్ముఖా
నయననలినీనాలానీతం పిబన్తి రసం ప్రియాః".

రూపకేణేతి :- స్మర ఏవ నవనదీపూరః ప్రావృషేణ్యప్రవాహః, సరభసమేవ ప్రవృద్ధత్వాత్. తేన ఊఢాః పరస్పరసాంముఖ్యమబుద్ధిపూర్వమేవ నీతాః. అనన్తరం గురవః శ్వశ్రూప్రభృతయః ఏవ సేతవః, ఇచ్ఛాప్రసరరోధకత్వాత్. అథ చ గురవః అలఙ్ఘ్యాః తథాపి పరస్పరోన్ముఖతాలక్షణేన అన్యోన్యతాదాత్మ్యేన స్వదేహే సకలవృత్తినిరోధాత్ లిఖితప్రాయైః అఙ్గైః నయనాన్యేవ నలినీనాలాని తైః ఆనీతం పరస్పరాభిలాషలక్షణమాస్వాదయన్తి, పరస్పరాభిలాషాత్మక దృష్టిచ్ఛటామిశ్రీకారయుక్త్యాపి కాలమతివాహయన్తీతి. నను నాత్ర రూపకం నిర్వ్యూఢం; హంసచక్రవాకాదిరూపేణ నాయకయుగలస్య అరూపితత్వాత్. తే హి హంసాద్యా ఏకనలినీనాలానీతసలిలపానక్రీడాధురాషూచితా ఇత్యాశఙ్క్యాహ - యథోక్తవ్యఞ్జకేతి - ఉక్తం హి పూర్వమ్ - 'వివక్షా తత్పరత్వేన' ఇత్యాదౌ 'నాతినిర్వహణైషితా' ఇతి ప్రసాధిత ఇతి. విభావాదిభూషణద్వారేణ రసోఽపి ప్రసాధిత ఇత్యర్థః. 3, 4

బాలానందిని

రూపకేణేతి - స్మర ఏవ = మన్మథుడే, నవనదీపూరః= వర్షాకాలంలో ప్రవాహం.

ఎందువల్ల ననగా అతిశీఘ్రంగా పొంగింది. దానిచేత, ఊఢాః= అనుకొనకుండానే పరస్పర అభిముఖత్వాన్ని పొందించబడినవారు. తరవాత, గురవః= అత్త మొదలైన పెద్దవాళ్లే సేతువులు, ఇచ్ఛాప్రసారానికి అడ్డుతగులుతారు కదా? మరియు (మరొక అర్థం) గురవః= పెద్దవి అవడంచేత లంఘింప శక్యంకాని సేతువులు, వాటిచేత విధృతాః= అడ్డుకొనబడిన ఇచ్ఛ కలవాళ్లు. అందువల్లనే తీరని మనోరథం కలవాళ్లై ఉంటున్నారు. అయినా కూడ పరస్పరం ఉన్ముఖులుగా ఉండడం అనే పరస్పరతాదాత్మ్యం చేత తమ దేహంలో సమస్తవృత్తులు నిరోధించబడిపోవడంవల్ల చిత్రించి నట్లుగా కదలకుండా ఉన్న అవయవాలతో, నేత్రాలే తామరతూడులు, వాటిచేత తీసికొని రాబడిన, రసమ్= పరస్పరాభిలాషారూపమైన రసాన్ని ఆస్వాదిస్తున్నారు. పరస్పరాభిలాషారూపమైన అనగా పరస్పరాభిలాషను సూచించే దృష్టుల కాంతులను కలపడం ద్వారా కాలం గడుపుతున్నారు. నన్వితి (ఆశంక). నాయకయుగలాన్ని హంసచక్రవాకాదిరూపంలో రూపించి ఇక్కడ రూపకం పూర్తిగా నిర్వహించబడలేదేమి?

వివరణ:- 'నాయికా చ నాయకశ్చ నాయకౌ', 'హంసీ చ హంసశ్చ హంసౌ', 'చక్రవాకీ చ చక్రవాకశ్చ చక్రవాకౌ' అని ఏకశేష గ్రహించి అర్థం చెప్పుకోవాలి. నాయకయుగలంమీద హంసమిథునత్వాన్నో, చక్రవాకమిథునత్వాన్నో ఆరోపిస్తే ప్రారంభించిన రూపకాన్ని చివరివరకూ కొనసాగించిన ట్లవుతుంది కదా?

**తే హీతి** - ఆ హంసాదులు ఒక తామరతూడు ద్వారా తీసికొనిరాబడిన నీటిని త్రాగే ఆటలు మొదలైనవాటికి తగినవి కదా? అని ఆశంకించుకొని యథోక్తవ్యంజక అని చెపుతున్నాడు. ఉక్తమితి - వెనక "వివక్షా తత్పరత్వేన" ఇత్యాదికారికలో (2.18) 'నాతి నిర్వహణైషితా" (పట్టుకున్న అలంకారాన్ని చివరివరకూ నడిపించాలని కోరకపోవడం అలంకారాల ప్రయోగంలో తీసికొనవలసిన మెలకువ) అని చెప్పబడింది కదా? ఇక్కడ రూపకప్రయోగం అక్కడ చెప్పినదానికి అనుకూలంగా ఉంది అని అర్థం. ప్రసాధిత ఇతి. విభావాదులను అలంకరించడం ద్వారా రసం కూడా అలంకరించబడింది అని అర్థం.

## ధ్వన్యాలోకం

అలక్ష్యక్రమవ్యఙ్గ్యః సంఘటనాయాం భాసతే ధ్వనిరిత్యుక్తమ్. తత్ర సంఘటనాస్వరూపమేవ తావన్నిరూప్యతే -

కా. అసమాసా సమాసేన మధ్యమేన చ భూషితా,

తథా దీర్ఘసమాసేతి త్రిధా సంఘటనోదితా.

కైశ్చిత్.

తాం కేవలమనూద్య ఇదముచ్యతే -

కా. గుణానాశ్రిత్య తిష్ఠన్తీ మాధుర్యాదీన్ వ్యనక్తి సా,

రసాన్-

సా సంఘటనా రసాదీన్ వ్యనక్తి గుణానాశ్రిత్య తిష్ఠన్తీతి.

బాలానందిని

అలక్ష్యేతి :- అలక్ష్యక్రమవ్యంగ్యధ్వని సంఘటనలో భాసిస్తుంది అని చెప్పబడింది. ముందుగా ఆ సంఘటనాస్వరూపం నిరూపించబడుతున్నది -

అసమాసా ఇతి - అసమాసా= సమాసాలు లేనిది, మధ్యమేన సమాసేన= అంత పెద్దది కాక మధ్యరకంలో ఉండే సమాసంచేత, భూషితా చ= అలంకరించబడింది, తథా= మరియు, దీర్ఘసమాసా ఇతి= దీర్ఘసమాసాలు కలది అని, సంఘటనా= సంఘటనా, ఉదితా= చెప్పబడింది.

కైశ్చిత్= కొందరిచేత. ఇది వృత్తికారుని పూరణం. తామితి :- కేవలం దానినే అనువదించి ఇది చెప్పబడుతూన్నది -

గుణానితి - సా= ఆ సంఘటన, మాధుర్యాదీన్= మాధుర్యం మొదలైన, గుణాన్= గుణాలను, ఆశ్రిత్య= ఆశ్రయించి, తిష్ఠన్తీ= ఉంటూన్నదై, రసాన్= రసాలను, వ్యనక్తి= వ్యంజింపచేయును.

సా ఇతి :- ఆ సంఘటన గుణాలను ఆశ్రయించి ఉంటూ రసాదులను వ్యంజింప చేస్తుంది.

లోచనం

సంఘటనాయామితి భావే ప్రత్యయః. వర్ణాదివచ్చ నిమిత్తమాత్రే సప్తమీ. ఉక్తమ్ఇతి - కారికాయామ్. నిరూప్యతే ఇతి :- గుణేభ్యః వివిక్తతయా విచార్యత ఇతి యావత్. రసాన్ ఇతి కారికాయాం ద్వితీయార్ధస్య ఆద్యం పదమ్. "రసాంస్తన్నియమే హేతురౌచిత్యం వక్తృవాచ్యయోః" ఇతి కారికార్థమ్.

బహువచనేనాద్యర్థః సంగృహీత ఇతి దర్శయతి - రసాదీనితి.

బాలానందిని

సంఘటనాయామితి:- సంఘటనాశబ్దం భావార్థంలో 'యచ్' ప్రత్యయం చేర్చగా ఏర్పడింది. ఇక్కడ కూడ 'వర్ణపదాదిషు' అన్న చోట చెప్పినట్లు నిమిత్తమాత్రసప్తమి. సంఘటన కూడ రసప్రతీతికి నిమిత్తం అని మాత్రమే అర్థం; రసం సంఘటనలో ఉంటుం దని కాదు అని భావం. ఉక్తమితి - కారికలో చెప్పబడింది. నిరూప్యతే ఇతి - గుణాలకంటె భిన్నంగా విచారించబడుతున్నది. అనగా గుణాలకీ సంఘటనకీ ఉన్న భేదం నిరూపించబడుతుంది అని భావం. 'రసాన్' అనేది కారికలోని ద్వితీయార్ధానికి సంబంధించిన మొదటి పదం. "రసాంస్తన్నియమే హేతురౌచిత్యం వక్తృవాచ్యయోః" అనేది పూర్తి కారికార్థం. 'రసాన్' అని బహువచనంచేత, 'ఆది' అనే అర్థం సంగ్రహించబడింది. అనగా "రసాదీన్" అనే అర్థం రావడంకోసం బహువచనం ప్రయోగించబడింది, అని సూచించడానికి "రసాదీన్" అన్నాడు.

ధ్వన్యాలోకం

అత్ర చ వికల్ప్యం - గుణానాం సంఘటనాయాశ్చ ఐక్యం వ్యతిరేకో వా? వ్యతిరేకేఽపి ద్వయీ గతిః - గుణాశ్రయా సంఘటనా, సంఘటనాశ్రయా వా గుణాః ఇతి. తత్రైక్యపక్షే సంఘటనాశ్రయగుణపక్షే చ గుణానాత్మభూతాన్ ఆధేయభూతాన్వా ఆశ్రిత్య తిష్ఠన్తీ సంఘటనా రసాదీన్ వ్యనక్తీత్యయమర్థః. యదా తు నానాత్వపక్షే గుణాశ్రయసంఘటనా తదా గుణానాశ్రిత్య తిష్ఠన్తీ గుణపరతన్త్రభావా న తు గుణరూపైవేత్యర్థః. కిం పునరేవం వికల్పనస్య ప్రయోజనమితి? అభిధీయతే - యది గుణాః సంఘటనా చేత్యేకం తత్త్వం సంఘటనాశ్రయా వా గుణాః, తదా సంఘటనాయాః ఇవ గుణానామ్ అనియతత్వప్రసఙ్గః. గుణానాం హి మాధుర్యప్రసాదప్రకర్షః కరుణవిప్రలమ్భశృఙ్గారవిషయ ఏవ. రౌద్రాద్భుతాదివిషయమోజః. మాధుర్యప్రసాదౌ రసభావతదాభాసవిషయావేవేతి విషయనియమో

వ్యవస్థితః, సంఘటనాయాస్తు స విఘటతే. తథా హి:- శృఙ్గారేఽపి దీర్ఘసమాసా దృశ్యతే రౌద్రాదిష్వసమాసా చేతి.

బాలానందిని

అత్రేతి - గుణాలూ, సంఘటనా ఒకటేనా కాక అవి వేరు వేరైనవా అని ఇక్కడ వికల్పించవలసి ఉంది. రెండూ వేరే అన్నా కూడ - సంఘటన గుణాలను ఆశ్రయించి ఉంటుందా లేక గుణాలు సంఘటనను ఆశ్రయించి ఉంటాయా అని రెండు పద్ధతులు ఉండవచ్చు. రెండూ ఒకటే అన్న పక్షంలోను, గుణాలు సంఘటనను ఆశ్రయించి ఉంటాయి అనే పక్షంలోనూ కూడ, తన స్వరూపమే అయిన, లేదా తన ఆధేయాలైన (తనలో ఉన్న) గుణాలను ఆశ్రయించి ఉన్న సంఘటన రసాదులను వ్యంజింపచేస్తుంది అని అర్థం వస్తుంది. రెండూ ఒకటి కాదు; వేరు వేరైనవి అనే పక్షంలో సంఘటన గుణాలను ఆశ్రయించి ఉంటుంది అని పక్షం అంగీకరిస్తే అప్పుడు సంఘటన గుణాలను ఆశ్రయించి, వాటికి పరతంత్రమై (వాటిమీద ఆధారపడినదై) ఉంటుంది, అంతేకాని ఇది గుణరూపం కాదు అని అర్థం అవుతుంది. ఈ వికల్పన అంతా ఎందుకు అని ప్రశ్నించవచ్చును. చెపుతాను విను - గుణాలూ, సంఘటనా రెండూ ఒకటే అన్నా లేదా గుణాలు సంఘటనను ఆశ్రయించి ఉంటాయి అని అన్నా, అప్పుడు సంఘటనకు వలె గుణాలకి కూడా నియతమైన విషయం (నిశ్చితమైన స్థానం) లేదని చెప్పవలసివస్తుంది. కాని గుణాలలో, మాధుర్యప్రసాదాల ప్రకర్ష కరుణ - విప్రలంభ - శృంగారవిషయమైనది. అనగా కరుణ - విప్రలంభశృంగారాలలోనే మాధుర్య - ప్రసాద గుణాల ప్రకర్ష ఉంటుంది. ఓజస్సు రౌద్రాద్భుతాదివిషయమైనది; వాటిలో ఉంటుంది. మాధుర్య ప్రసాదగుణాలు రస-భావ-తదాభాసవిషయాలు, వాటికి సంబంధించినవి. ఈ విధంగా గుణాలకు సంబంధించినంతవరకు విషయనియమం వ్యవస్థితంగా (నిశ్చితంగా) ఉంది. ఇలాంటి విషయనియమం సంఘటన విషయంలో విఘటితం అయిపోతుంది - కుదరదు. ఎందువల్ల ననగా - దీర్ఘసమాసాలు ఉన్న సంఘటన శృంగారంలో కూడా కనబడుతున్నది; సమాసాలు లేనిది రౌద్రాదులలో కూడ కనబడుతున్నది.

లోచనం

అత్ర చేతి - అస్మిన్నేవ కారికార్థే. వికల్పేన ఇదమర్థజాతం కల్పయితుం వ్యాఖ్యాతుం శక్యమ్. కిం తదిత్యాహ - గుణానామితి. త్రయః పక్షాః యే సంభావ్యన్తే తే వ్యాఖ్యాతుం శక్యాః. కథమిత్యాహ - తత్రైక్యపక్ష ఇతి.

ఆత్మభూతానితి. స్వభావస్య కల్పనయా ప్రతిపాదనార్థం ప్రదర్శితభేదస్య స్వాశ్రయవాచోయుక్తిః దృశ్యతే శింశపాశ్రయం వృక్షత్వమితి. ఆధేయభూతానితి. సంఘటనాయా ధర్మాః గుణాః ఇతి భట్టోద్భటాద్ధయః. ధర్మాశ్చ ధర్మ్యాశ్రితా ఇతి ప్రసిద్ధో మార్గః. గుణపరతన్త్రేతి. అత్ర న ఆధారాధేయభావః ఆశ్రయార్థః; నహి గుణేషు సంఘటనా తిష్ఠతీతి. తేన రాజాశ్రయః ప్రకృతివర్గ ఇత్యత్ర యథా రాజాశ్రయౌచిత్యేన అమాత్యాదిప్రకృతయ ఇత్యమర్థః, ఏవం గుణేషు పరతన్త్రస్వభావా, తదాయత్తా, తన్ముఖప్రేక్షిణీ సంఘటనా ఇత్యయమర్థః లభ్యతే ఇతి భావః.

బాలానందిని

అత్ర చేతి- ఈ కారికార్థంలోనే వికల్పంచేత ఈ అర్థజాతం, విషయసముదాయం కల్పించడానికి, వ్యాఖ్యానించడానికి శక్య మైనది. అదే మనగా చెపుతున్నాడు గుణానామితి. ఏ మూడు పక్షాలు సంభావించబడుతున్నాయో (ఉండడానికి అవకాశ ఉన్నట్లు చెప్పబడుతున్నాయో) అవి వ్యాఖ్యానించడానికి శక్య మైనవి. ఎట్లనగ చెపుతున్నాడు - తత్రైక్యపక్షే ఇతి. ఆత్మభూతానితి:- సంఘటనా గుణాలూ ఒకటే అ పక్షంలో "గుణానాశ్రిత్య తిష్ఠన్తీ" (గుణాలను ఆశ్రయించి ఉన్నదై) అని ఆధారాధేయభావ చేత (గుణాలు ఆధారం, సంఘటన ఆధేయం అని) నిర్దేశం ఎలా కుదురుతుంది అ ఆశంకకు సమాధానం సూచిస్తున్నాడు - స్వభావస్యేతి. ఒక వస్తువుయొక్క స్వభావా ప్రతిపాదించడంకోసం అది తనకంటె భిన్నమైన దని కల్పించి భేదాన్ని ప్రదర్శించడ ద్వారా తనకు తాను ఆశ్రయం అన్నట్లు చెప్పడం కనబడుతుంది. ఉదాహరణ శింశపను వృక్షత్వం ఆశ్రయించి ఉందని అంటాం. శింశప అనేది ఒక వృక్షం. అందుచే శింశపాత్వానికి వృక్షత్వానికీ భేదం లేకపోయినా శింశపలో వృక్షత్వం ఉంది అ చెప్పినట్లు గుణసంఘటనల ఐక్యపక్షంలో కూడ సంఘటన గుణాలను ఆశ్రయిం ఉందని వ్యవహరించడంలో తప్పులేదని అర్థం.

ఆధేయభూతానితి - గుణాలు సంఘటనయొక్క ధర్మాలు అని భట్టోద్భటాదుల ధర్మాలు ధర్మిని ఆశ్రయించి ఉంటాయనేది ప్రసిద్ధమైన మార్గం. గుణపరతన్త్రేతి ఇక్కడ 'ఆశ్రయ' శబ్దానికి ఆధారాధేయభావం అని అర్థం కాదు. (బల్ల మీద పుస్తకా ఉన్నట్లు) గుణాలలో సంఘటన ఉండదు కదా? అందుచేత "అమాత్యాది ప్రకృతివ

రాజును ఆశ్రయించి ఉన్నది" అన్నప్పుడు రాజాశ్రయత్వానికి ఔచిత్యం కుదరాలంటే ('రాజపరతంత్రాః' అని అధ్యాహారం తెచ్చుకోవాలి) అమాత్యాది ప్రకృతులు రాజుకు అధీనులై ఉంటారు అని ఏ విధంగా అర్థమో అదే విధంగా సంఘటన గుణాల విషయంలో పరాధీనత్వం కలది, వాటిమీద ఆధారపడి ఉన్నది, వాటి ముఖంకేసే చూస్తూ ఉంటుంది (తన్ముఖప్రేక్షిణీ) అనే అర్థం లభిస్తుంది అని భావం.

లోచనం

సంఘటనాయా ఇవేతి : - ప్రథమపక్షే తాదాత్మ్యేన సమానయోగక్షేమత్వాత్, ఇతరత్ర తు ధర్మత్వేనేతి భావః. భవత్వనియతవిషయతా ఇత్యాశఙ్క్యాహ - గుణానాం హీతి. హి శబ్దః తు శబ్దార్థే. న త్వేవముపపద్యతే; ఆపద్యతే తు న్యాయబలాదిత్యర్థః. స ఇతి - యోఽయం నియమ ఉక్తః అసావిత్యర్థః. తథాత్వే లక్ష్యదర్శనమేవ హేతుత్వేనాహ - తథాహీతి.

బాలానందిని

సంఘటనాయా ఇతి. మొదటి పక్షంలో రెండింటికీ (గుణాలకీ సంఘటనకీ) తాదాత్మ్యం (ఏకత్వం) ఉండడంచేత ఆ రెండూ సమానయోగక్షేమాలు అవుతాయి. (ఒకదానికి వర్తించేదే రెండవదానికి కూడా వర్తిస్తే ఆ రెండింటినీ సమానయోగక్షేమాలు అని శాస్త్రకారులు అంటూంటారు). గుణాలూ సంఘటనా ఒకటే కాబట్టి సంఘటన విషయంలో ఏది వర్తిస్తుందో అదే గుణాల విషయంలో కూడా వర్తించాలి కదా అని భావం). రెండవ పక్షంలో (గుణాలు సంఘటనను ఆశ్రయించి ఉంటాయి అనే పక్షంలో) కూడా ధర్మి ఎలా ఉంటే ధర్మాలు కూడా అలా ఉండాలి కదా అని అర్థం. భవత్వితి - అనియతవిషయత్వం గుణాలకి కూడా వస్తే రానీ అని ఆశంకించుకొని గుణానాం హి ఇత్యాదికం చెపుతున్నాడు. 'హి' కి 'తు' అని అర్థం. గుణాలకైతే అనియతవిషయత్వం కుదరదు; కాని ఈ రెండు పక్షాలలో ఏ పక్షం అంగీకరించినా న్యాయబలంవల్ల అనియతవిషయత్వం వచ్చిపడుతుంది. అందుచేత రెండు పక్షాలూ అంగీకారయోగ్యాలు కావని భావం. సః ఇతి - గుణాలలో చెప్పిన నియమం సంఘటన విషయంలో విఘటితం అయిపోతుం దని చెప్పడానికి లక్ష్యాలలో ఆ విధంగా కనబడడమే హేతువు అని తథాహీత్యాదికంచేత చెపుతున్నాడు.

ధ్వన్యాలోకం

తత్ర శృఙ్గారే దీర్ఘసమాసా యథా - "మన్దార కుసుమరేణుపిఞ్జరితాలకా" ఇతి. యథా వా-

శ్లో. అనవరతనయనజలలవనిపతనపరిముషితపత్త్రలేఖం తే,

కరతలనిషణ్ణమబలే వదనమిదం కం న తాపయతి. (80)

ఇత్యాదౌ. తథా రౌద్రాదిష్వప్యసమాసా దృశ్యతే; యథా - "యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః" ఇత్యాదౌ. తస్మాత్ న సంఘటనాస్వరూపాః, న చ సంఘటనాశ్రయాః గుణాః.

బాలానందిని

తత్రేతి - శృంగారంలో దీర్ఘసమాసం గల సంఘటనకు ఉదాహరణం ఎట్లనగా - మన్దారేతి:- "మందారపుష్పాల పుప్పొడిచేత పసుపుపచ్చగా చేయబడిన ముంగురులు కలది". మరొక ఉదాహరణం ఎట్లనగా -

అనవరతేతి - ప్రణయకుపితయైన నాయికను బ్రతిమాలుకుంటూన్న నాయకుని మాటలివి. అబలే= ఓ! వనితా! అనవరత....లేఖమ్ - అనవరత = ఎడతెగని, నయనజల= కన్నీళ్లయొక్క, లవ= తుంపరలయొక్క లేదా బిందువులయొక్క, నిపతన= పడడంచేత, పరిముషిత= అపహరించబడిన, పత్త్రలేఖమ్= పత్త్రరచనలు గలదీ, కరతలనిషణ్ణమ్= అరచేతిలో కూర్చున్నదీ అయిన, ఇదమ్= ఈ, తే వదనమ్= నీ ముఖం, కమ్= ఎవనిని, న తాపయతి = తపింపచేయడం లేదు?

ఇత్యాదులలో (శృంగారంలో దీర్ఘసమాససంఘటన ఉన్నది). అదే విధంగా రౌద్రాదులలో కూడ సమాసాలు లేని సంఘటన కనబడుతుంది. ఎట్లనగా - "యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః" (శ్లో. 28) ఇత్యాదులలో. అందువల్ల గుణాలు సంఘటనాస్వరూపాలు కావు, సంఘటనను ఆశ్రయించినవి కూడ కావు.

వివరణ:- సంఘటన, గుణాలు ఒక్కటే అని చెప్పినా, గుణాలు సంఘటనను ఆశ్రయించి ఉంటా యని చెప్పినా మాధుర్యప్రసాదాలు సమాసరహితసంఘటనా ఒకటే అని కాని, లేదా అవి అలాంటి సంఘటనను ఆశ్రయించి ఉంటా యని కాని చెప్పాలి. అదే విధంగా ఓజస్సు, దీర్ఘసమాససంఘటనా ఒకటే అని కాని, ఓజస్సు

అలాంటి సంఘటనను ఆశ్రయించి ఉంటుందని కాని చెప్పాలి. అలా చెప్పిన పక్షంలో మాధుర్యప్రసాదవిషయమైన శృంగారాదులలో సమాసరహితసంఘటనే ఉండాలి కాని దీర్ఘసమాససంఘటన ఉండకూడదు. కాని లక్ష్యాలలో కనబడుతూన్నది. అదే విధంగా ఓజోవిషయాలైన రౌద్రాదులలో దీర్ఘసమాసఘటన మాత్రమే ఉండాలి. అలా లేని లక్ష్యాలు కూడా కనబడుతున్నాయి. గుణాల విషయం నిశ్చితంగా అనుభవసిద్ధంగా ఉంది గాన దానిని మార్చడానికి వీలులేదు. అందుచేత పై రెండు పక్షాలు అసంగతాలే అని భావం.

లోచనం

దృశ్యతే ఇత్యుక్తం దర్శనస్థానముదాహరణమాసూత్రయతి - తత్రేతి. నాత్ర శృఙ్గారః కశ్చిదితి ఆశఙ్క్య ద్వితీయముదాహరణమాహ - యథా వేతి. ఏషా హి ప్రణయకుపితనాయికాప్రసాదనాయోక్తిర్నాయకస్యేతి. తస్మాదితి. నైతద్వ్యాఖ్యానద్వయం కారికాయాం యుక్తమితి యావత్.

బాలానందిని

దృశ్యతే ఇతి :- కనబడుతూన్నది అని చెప్పబడింది. అది కనబడుతూన్న స్థానమైన ఉదాహరణాన్ని తత్రేత్యాదికంచేత ప్రదర్శిస్తున్నాడు. ఇక్కడ (మందారేత్యాదివాక్యంలో) శృంగారం ఏదీ లేదు కదా అని ఆశంకించుకొని రెండవ ఉదాహరణం చెపుతున్నాడు - యథా వేతి. ఏషా ఇతి:- ఇది ప్రణయకోపనం వచ్చిన నాయికను ప్రసన్నురాలిని చేసుకొనడంకొరకు నాయకుడు అంటూన్న మాట. తస్మాదితి. అందుచేత కారికకు చెప్పిన ఈ రెండు విధాల వ్యాఖ్యానమూ కూడ యుక్తం కాదని భావం.

ధ్వన్యాలోకం

నను యది సంఘటనా గుణానాం నాశ్రయః తత్కిమాలమ్బనా ఏతే పరికల్ప్యన్తామ్? ఉచ్యతే - ప్రతిపాదితమేవ ఏషామాలమ్బనమ్-

కా. తమర్థమవలమ్బన్తే యేఽఙ్గినం తే గుణాః స్మృతాః,

అఙ్గాశ్రితాస్త్వలంకారా మన్తవ్యాః కటకాదివత్. ఇతి.

అథవా భవన్తు శబ్దాశ్రయా ఏవ గుణాః, న చైషామనుప్రాసాదితుల్యత్వమ్. యస్మాత్ అనుప్రాసాదయః

అనపేక్షితార్థశబ్దధర్మా ఏవ ప్రతిపాదితాః. గుణాస్తు వ్యఙ్గ్యవిశేషావభాసివాచ్యప్రతిపాదనసమర్థశబ్దధర్మా ఏవ. శబ్దధర్మత్వం చైషామ్ అన్యాశ్రయత్వేఽపి శరీరాశ్రయత్వమివ శౌర్యాదీనామ్.

బాలానందిని

నన్వితి - గుణాలకి సంఘటన ఆశ్రయం కాకపోతే అవి దేనిని ఆశ్రయంగా చేసుకొని ఉంటా యని కల్పించాలి? చెపుతున్నాను విను. వీటికి ఏది ఆశ్రయమో "తమర్థమవలమ్బన్తే" (2.6) ఇత్యాదికారికలో ప్రతిపాదించబడియే ఉన్నది. అథవా ఇతి- లేదా గుణాలు శబ్దాన్నే ఆశ్రయంగా చేసుకొని ఉంటే ఉండవచ్చును. అంతమాత్రంచేత ఇవి అనుప్రాసాదుల వంటివి అయిపోవు. ఎందువల్ల ననగా అనుప్రాసాదులు అర్థం అపేక్ష ఏ మాత్రం లేకుండా కేవలం శబ్దధర్మాలుగానే ప్రతిపాదించబడ్డాయి. కాని గుణాలు వ్యంగ్యవిశేషాన్ని భాసింపచేసే వాచ్యాన్ని ప్రతిపాదించడానికి సమర్థమైన శబ్దాలలో మాత్రమే ఉండే ధర్మాలు. శౌర్యాదులు ఇతరమైనదానిని, అనగా ఆత్మను, ఆశ్రయించి ఉన్నా శరీరాన్ని ఆశ్రయించి ఉన్నాయని చెప్పినట్లు, ఈ గుణాలు (రసధర్మాలయినా) శబ్దధర్మాలు అని చెప్పవచ్చు.

లోచనం

కిమాలమ్బనా ఇతి - శబ్దార్థాలమ్బనత్వే హి తదలంకారేభ్యః కో విశేషః ఇత్యుక్తం చిరన్తనైరితి భావః. ప్రతిపాదితమేవేతి :- అస్మన్మూలగ్రన్థకృతేత్యర్థః. అథవేతి - న హ్యేకాశ్రితత్వాదేవ ఐక్యమ్, రూపస్య సంయోగస్య చ ఐక్యప్రసంగాత్. సంయోగే ద్వితీయమపేక్ష్యమితి చేత్ - ఇహాపి వ్యఙ్గ్యోపకారవాచ్యాపేక్షా అస్త్యేవేతి సమానమ్. న చాయం మమ స్థితః పక్షః, అపి తు భవత్వేషామవివేకినామభిప్రాయేణాపి శబ్దధర్మత్వం శౌర్యాదీనామివ శరీరధర్మత్వమ్. అవివేకీ హి ఔపచారికత్వవిభాగం వివేక్తుంసమర్థః. తథాపి న కశ్చిద్దోషః ఇత్యేవం పరమేతదుక్తమిత్యేతదాహ - శబ్దధర్మత్వమితి. అన్యాశ్రయత్వేఽపీతి. ఆత్మనిష్ఠత్వేపీత్యర్థః.

బాలానందిని

కిమాలమ్బనా ఇతి - గుణాలు శబ్దాలనూ అర్థాలనూ ఆశ్రయించి ఉన్నట్లయితే గుణాలకి ఆ శబ్దాలంకార - అర్థాలంకారాలకంటె విశేషం (వాటికీ, ఈ గుణాలకీ భేదం)

ఏమి ఉంటుంది అని ప్రాచీనులు అన్నారు అని భావం. అనగా గుణాలు కూడా శబ్దార్థాలను ఆశ్రయించి ఉండేటట్లయితే వాటకీ అలంకారాలకీ భేదం ఉండదు; అందుచేత గుణాలు సంఘటనాశ్రితా లనీ అలంకారాలు శబ్దార్థాశ్రితా లనీ చెప్పడం మంచిది అని ప్రాచీనులు అన్నారు కదా? ఇప్పుడు నువ్వు గుణాలు సంఘటనాశ్రయాలు కావని అంటున్నావు; మరి అవి దేనిని ఆశ్రయించి ఉంటాయి? అని భావం.

ప్రతిపాదితమేవేతి :- మా మూలగ్రంథ(కారికా) రచయితచేత అని అర్థం. అథవా ఇతి :- ఒకదానిని ఆశ్రయించి ఉన్నంతమాత్రంచేత (రెండు వస్తువులు) ఒకటే అయిపోవు. అలా అయే పక్షంలో రూపమూ, సంయోగమూ ఒకటి అయిపోవాలి. అనగా రూపం, సంయోగం అనే రెండు గుణాలు ఒక ఘటాన్ని ఆశ్రయించి ఉన్నా అవి రెండూ వేరు వేరే కాని ఒకటి కాదు కదా అని భావం. సంయోగే ఇతి :- సంయోగంలో రెండవ వస్తువు అపేక్షించబడుతుంది కదా అని అంటావా - ఇక్కడ (గుణాల విషయంలో) కూడా వ్యంగ్యానికి ఉపకారకమైన వాచ్యార్థం అపేక్ష ఉంది గాన సమానమే.

వివరణ:- ఘటంలో రూపం, సంయోగం అనేవి రెండూ ఉన్నా యనే మాట నిజమే, కాని సంయోగానికి ఘటంతో పాటు మరొక వస్తువు కూడా (పటమో, హస్తమో) ఉండాలి కదా? అందుచేత ఒకే ఘటాన్ని ఆశ్రయించుకొని ఉన్నంతమాత్రంచేత రూపసంయోగాలకు ఏకత్వం చెప్పడానికి వీలు లేదు. ఇక్కడ అలాంటిది ఏదీ లేదు కదా అని పృచ్ఛకుని అభిప్రాయం. ఇక్కడ కూడా అలాంటి విశేషం (వాచ్యాపేక్షిత్వం) గుణాలకి ఉంది కదా అని సమాధానం.

వృత్తిలో ఉన్న శబ్దధర్మత్వమ్ ఇత్యాదివాక్యం భావాన్ని వివరిస్తున్నాడు - న చేతి - నిజానికి ఈ పక్షం (గుణాలు శబ్దాశ్రితాలు అనే పక్షం) నాది కాదు; నాకు అంగీకార్యం కాదు. మరే మనగా - అవివేకుల అభిప్రాయం ప్రకారం శౌర్యాదులు శరీరధర్మాలు అన్నట్లు గుణాలు శబ్దధర్మాలు అయితే అవుగాక. వివేకం లేనివాడు ఔపచారికత్వ విభాగాన్ని చేయజాలడు కదా? అన్యాశ్రయత్వే పీతి :- ఆత్మనిష్ఠమైనా కూడ అని అర్థం.

వివరణ :- శౌర్యాదులకు సంబంధించినంతవరకు 'అన్యాశ్రయత్వేఽపి' అనగా 'ఆత్మాశ్రయాలైనా' అనీ, గుణాలకు సంబంధించినంతవరకు "కావ్యాత్మ అయిన రసానికి సంబంధించినవైనా" అనీ అర్థం. గుణాలు శబ్దార్థాశ్రితా లనే మాట ఔపచారికం అనే వివేకం లేని వాళ్లు అవి శబ్దాశ్రితాలే అని అనుకున్నంతమాత్రంచేత యథార్థస్థితికి భంగం వాటిల్లదు అని అర్థం.

## ధ్వన్యాలోకం

నను యది శబ్దాశ్రయా గుణాః తత్సంఘటనారూపత్వం, తదాశ్రయత్వం వా తేషాం ప్రాప్తమేవ; న హ్యసంఘటితాః శబ్దాః అర్థవిశేషప్రతిపాద్యరసాద్యాశ్రితానాం గుణానామ్ అవాచకత్వాత్ ఆశ్రయా భవన్తి. నైవమ్, వర్ణపదవ్యఙ్గ్యత్వస్య రసాదీనాం ప్రతిపాదితత్వాత్.

### బాలానందిని

నన్వితి (ఆశంక) గుణాలు శబ్దాశ్రయాలు అని చెప్పినట్లయితే అప్పుడు అవి సంఘటనారూపాలో లేదా సంఘటనాశ్రయాలో అని చెప్పినట్లే అవుతుంది. ఎందువల్ల ననగా - కూర్చబడని (అసంఘటితాః) శబ్దాలు అర్థబోధకాలు (ఆకాంక్షాదిరహితార్థబోధకాలు) కాకపోవడంచేత అర్థవిశేషంచేత ప్రతిపాదించదగిన రసాదులను ఆశ్రయించి ఉండే ఆ గుణాలకు ఆశ్రయాలు కాజాలవు కదా? నైవమితి - (సమాధానం) ఇట్లు కాదు; రసాదులు వర్ణాలచేత పదాలచేతా కూడ వ్యంగ్యాలవుతాయి అని ప్రతిపాదించాం కదా?

### లోచనం

శబ్దాశ్రయా ఇతి :- ఉపచారేణ యది శబ్దేషు గుణాః తదేదం తాత్పర్యమ్ - శృఙ్గారాదిరసాభివ్యఞ్జకవాచ్యప్రతిపాదనసామర్థ్యమేవ శబ్దస్య మాధుర్యమ్. తచ్చ శబ్దగతం విశిష్టఘటనయైవ లభ్యతే. అథ సంఘటనా న వ్యతిరిక్తా కాచిత్, అపి తు సంఘటితా ఏవ శబ్దాః. తదాశ్రితం తత్సామర్థ్యమితి సంఘటనాశ్రితమేవేత్యుక్తం భవతీతి తాత్పర్యమ్.

### బాలానందిని

శబ్దాశ్రయా ఇతి - ఉపచారేణేతి : గుణాలు శబ్దాలలో ఉపచారంచేత ఉన్నాయి అని అంటే దాని తాత్పర్యం ఇది - శబ్దానికున్న మాధుర్యం అంటే - శృంగారాదిరసాలను అభివ్యంజింపచేసే వాచ్యాన్ని ప్రతిపాదించ గలిగిన సామర్థ్యమే. శబ్దాలలో ఉన్న సామర్థ్యం ఒకానొక విశిష్టమైన ఘటనచేతనే లభిస్తుంది. అథేతి :- మరి సంఘటన అనేది కూడా ఏదో వ్యతిరిక్తమైన (శబ్దాలకంటే భిన్నమైన) దేదీ కాదు; మరేమనగా (ఒక

పద్ధతిలో) కూర్చబడిన శబ్దాలే సంఘటన. అనగా ఆ సామర్థ్యం (రసాభివ్యంజక వాచ్యప్రతిపాదన సామర్థ్యం) అలా కూర్చబడిన శబ్దాలను ఆశ్రయించి ఉన్నది కాబట్టి సంఘటనాశ్రితమే అవుతుంది అని తాత్పర్యం.

లోచనం

నను శబ్దధర్మత్వం శబ్దైకాత్మకత్వం వా తావతా అస్తు. కిమయం మధ్యేసంఘటనానుప్రవేశః ఇత్యాశఙ్క్య స ఏవ పూర్వపక్షవాదీ ఆహ - న హీతి - అర్థవిశేషైః న తు పదాన్తరనిరపేక్షశుద్ధపదవాచ్యైః సామాన్యైః ప్రతిపాద్యా వ్యఙ్గ్యా యే రసభావతదాభాసతత్ప్రశమాః, తదాశ్రితానాం, ముఖ్యతయా తన్నిష్ఠానాం గుణానామసంఘటితాః శబ్దాః ఆశ్రయా న భవన్తి. ఉపచారేణాపీతి భావః. తత్ర హేతుః అవాచకత్వాదితి. న హి అసంఘటితాః వ్యఙ్గ్యోపయోగి నిరాకాఙ్క్షరూపం వాచ్యమ్ ఆహురిత్యర్థః. ఏతత్పరిహరతి - నైవమితి. వర్ణవ్యఙ్గ్యో హి యావద్రస ఉక్తః తావదవాచకస్యాపి పదస్య శ్రవణమాత్రావసేయేన స్వసౌభాగ్యేన వర్ణవదేవ యద్రసాభివ్యక్తిహేతుత్వం స్ఫుటమేవ లభ్యత ఇతి తదేవ మాధుర్యాదీతి కిం సంఘటనయా? తథా చ పదవ్యఙ్గ్యో యావద్ధ్వనిరుక్తః తావత్ శుద్ధస్యాపి పదస్య స్వార్థస్మారకత్వేనాపి రసాభివ్యక్తియోగ్యార్థావభాసకత్వ మేవ మాధుర్యాదీతి తత్రాపి కః సంఘటనాయాః ఉపయోగః?

బాలానందిని

నన్వితి - ఇలా చెప్పడంచేత గుణాలకు శబ్దధర్మత్వంకాని, శబ్దైకాత్మత్వం (శబ్దాలతో అభేదం) గాని కావచ్చు, మధ్యలో ఈ సంఘటనని దూర్చడం ఎందుకు?అని ఆశంకించుకొని ఆ పూర్వపక్షియే అంటున్నాడు - న హీతి - వ్యంగ్యాలైన ఏ రస-భావ-తదాభాస-తత్ప్రశమాలు ఉన్నాయో అవి అర్థవిశేషాలచేతనే ప్రతిపాదించబడతాయి కాని ఇతరపదాల అపేక్ష ఏమీ లేని శుద్ధపదాలచేత వాచ్యాలైన సామాన్యాలచేత (జాతిరూపార్థాలచేత) ప్రతిపాదించబడవు. అందుచేత ముఖ్యంగా ఆ అర్థవిశేషాలను ఆశ్రయించిన వాటియందున్న, గుణాలకి సంఘటితాలు కాని శబ్దాలు ఉపచారంచేత కూడ ఆశ్రయాలు కాజాలవు అని భావం. ఇందుకు 'అవాచకత్వాత్' అనేది హేతువు. సంఘటితాలు కాని పదాలు వ్యంగ్యానికి ఉపయోగించే నిరాకాంక్షమైన (ఆకాంక్ష ఏదీ

లేకుండా పరిపూర్ణమైన) వాచ్యాన్ని బోధించవు కదా అని అర్థం. దీనిని నైవమ్ అని పరిహరిస్తున్నాడు. వర్ణేతి - రసం వర్ణాలచేతకూడ వ్యంగ్యం అవుతుంది అని చెప్పబడింది. అంటే వర్ణం వలెనే పదం కూడా అర్థం ఏదీ బోధించకుండానే, శ్రవణమాత్రంచేతనే గ్రహించతగిన తన సౌందర్యంచేత రసాభివ్యక్తికి హేతువు కావచ్చును అనే విషయం స్పష్టంగానే లభిస్తుంది. అదే మాధుర్యాదికం. ఇంక సంఘటన ఎందుకు? తథా చేతి - అదే విధంగా - ధ్వని పదంచేతనే వ్యంగ్యం అవుతుం దని అంగీకరించినప్పుడు శుద్ధమైన (ఇతరపదాలతో సంఘటితం కాని) పదమే తన అర్థాన్ని స్మరింపచేయడం మాత్రంచేతనే కూడ రసాభివ్యక్తికి యోగ్యమైన అర్థాన్ని ప్రకాశింపచేయకలుగుతుంది అని చెప్పాలి. ఇదే (ఇలా ప్రకాశింపచేయడమే) మాధుర్యాదికం. అందువల్ల అక్కడ కూడ (శబ్దార్థవిషయంలోకూడ) సంఘటనకు ఉపయోగం ఏమి ఉంది?

## ధ్వన్యాలోకం

అభ్యుపగతే వా వాక్యవ్యఙ్గ్యత్వే రసాదీనాం న నియతా కాచిత్ సంఘటనా తేషామాశ్రయత్వం ప్రతిపద్యతే ఇతి అనియతసంఘటనా శబ్దా ఏవ గుణానాం వ్యఙ్గ్యవిశేషానుగతా ఆశ్రయాః.

నను మాధుర్యే యది నామైవముచ్యతే తదుచ్యతామ్. ఓజసః పునః కథమ్ అనియతసంఘటనశబ్దాశ్రయత్వమ్? న హ్యసమాసా సంఘటనా కదాచిదోజసః ఆశ్రయతాం ప్రతిపద్యతే. ఉచ్యతే - యది న ప్రసిద్ధిగ్రహమాత్రదూషితం చేతః తదత్రాపి న న బ్రూమః. ఓజసః కథమసమాసా సంఘటనా నాశ్రయః? యతః రౌద్రాదీన్ ప్రకాశయతః కావ్యస్య దీప్తిః ఓజః ఇతి ప్రాక్ ప్రతిపాదితమ్. తచ్చ ఓజః యద్యసమాసాయామపి సంఘటనాయాం స్యాత్ తత్కో దోషః భవేత్? న చాచారుత్వం సహృదయసంవేద్యమస్తి. తస్మాత్ అనియత సంఘటనశబ్దాశ్రయత్వే గుణానాం న కాచిత్ క్షతిః. తేషాం తు చక్షురాదీనామివ యథాస్వం విషయనియమితస్య స్వరూపస్య న కదాచిద్వ్యభిచారః. తస్మాత్ అన్యే గుణాః, అన్యా చ సంఘటనా. న

చ సంఘటనామాశ్రితా గుణాః ఇత్యేకం దర్శనమ్. అథవా సంఘటనారూపా ఏవ గుణాః.

బాలానందిని

అభ్యుపగతే ఇతి - రసాదులు వాక్యంచేత వ్యంజింపచేయబడతాయి అని అంగీకరించినా నియతమైన ఏ సంఘటనా కూడ వాటికి ఆశ్రయం కాదు. అందుచేత వ్యంగ్యవిశేషంతో సంబంధించిన, అనియతసంఘటన గల శబ్దాలే, ఇలాంటి సంఘటనే ఉండాలి అనే నియమం లేని శబ్దాలే, గుణాలకి ఆశ్రయాలు.

నన్వితి (ఆశంక) మాధుర్యం విషయంలో ఇలా చెపితే చెప్పవచ్చు నేమో కాని ఓజస్సు అనియతమైన సంఘటన గల శబ్దాలను ఎలా ఆశ్రయించి ఉంటుంది? సమాసాలులేని సంఘటన ఎన్నడూ ఓజస్సుకు ఆశ్రయం కాదు కదా? ఉచ్యతే ఇతి - (సమాధానం) చెపుతాను విను. లోకంలో అలా ప్రసిద్ధి ఉంది కదా అన్నంతమాత్రంచేత ఒక విధమైన పట్టుదలచేత మీ మనస్సు దూషితం కాకపోతే ఈ విషయంలో కూడ చెప్పము అనే మాట లేదు; తప్పక చెపుతాం. సమాసాలు లేని సంఘటన ఓజస్సుకు ఆశ్రయం ఎందుకు కాకూడదు? ఎందువలన అనగా రసాదులను ప్రకాశింపచేసే కావ్యంయొక్క దీప్తియే ఓజస్సు అని వెనక ప్రతిపాదించబడింది. ఆ ఓజస్సు సమాసాలు లేని సంఘటనలో కూడా ఉంటే ఏమి దోషం వస్తుంది? అలాంటి చోట సహృదయుల హృదయాలచేత తెలియచగిన అచారుత్వం ఏదీ లేదు కదా? అందువల్ల గుణాలు అనియతాలైన సంఘటనలను ఆశ్రయించి ఉంటాయని చెప్పినా కూడ ఏ దోషమూ లేదు. నేత్రాలు మొదలైనవాటికి ఆ యా విషయాలు నిశ్చితంగా ఉన్నట్లు ఈ గుణాలకి కూడా ఆ యా విషయాలమీద నియమితం అయిన స్వరూపానికి ఎన్నడూ వ్యభిచారం లేదు. అనగా ఫలానా గుణానికి ఫలానాది విషయం అని నిశ్చితంగా చెప్పిన నియమానికి ఎప్పుడూ వ్యభిచారం లేదు. అందువల్ల గుణాలు వేరు సంఘటన వేరు. గుణాలు సంఘటనను ఆశ్రయించి ఉండడం అనేది కూడ లేదు అని ఒక మతం. అథవా ఇతి - లేదా గుణాలు సంఘటనారూపాలే.

లోచనం

నను వాక్యవ్యఙ్గ్యే ధ్వనౌ తర్హి అవశ్యమనుప్రవేష్టవ్యం సంఘటనయా; స్వసౌన్దర్యం వాచ్యసౌన్దర్యం వా తయా వినా కుతః ఇత్యాశఙ్క్యాహ - అభ్యుపగత ఇతి. వా శబ్దః అపిశబ్దార్థే వాక్యవ్యఙ్గ్యత్వేఽపీత్యత్ర యోజ్యః.

ఏతదుక్తం భవతి - అనుప్రవిశతు వా సంఘటనా; న హి తస్యాః సంనిధానం ప్రత్యాచక్ష్మహే. కిం తు మాధుర్యస్య న నియతా సంఘటనా ఆశ్రయో వా స్వరూపం వా; తయా వినా వర్ణపదవ్యఙ్గ్యే రసాదౌ భావాత్ మాధుర్యాదేః. వాక్యవ్యఙ్గ్యేఽపి తాదృశీం సంఘటనాం విహాయాపి వాక్యస్య తద్రసవ్యఞ్జకత్వాత్; సంఘటనా సంనిహితాపి రసవ్యక్తౌ అప్రయోజికేతి. తస్మాదౌపచారికత్వేఽపి శబ్దాశ్రయా ఏవ గుణాః ఇత్యుపసంహరతి - శబ్దా ఏవేతి.

బాలానందిని

నన్వితి :- అట్లయితే వాక్యంచేత వ్యంగ్యమైన ధ్వనిలో సంఘటన తప్పకుండా ప్రవేశించవలసి ఉంటుంది (సంఘటన ఉండితీరాలి). అది లేకపోతే తన (వ్యంగ్యంయొక్క) సౌందర్యం కాని, వాచ్యసౌందర్యం కాని ఎలా ఉంటుంది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - అభ్యుపగతే ఇతి - ఇక్కడ 'వా' శబ్దానికి 'అపి' అని అర్థం. వాక్యవ్యంగ్యత్వంలో కూడ అని అర్థం. ఇక్కడ ప్రతిపాదించిన విషయం ఇది - అక్కడ సంఘటన ప్రవేశిస్తే (ఉంటే) ప్రవేశించుగాక. దాని ఉనికి మేం నిరాకరించడంలేదు. కాని మాధుర్యానికి నియతమైన (నిశ్చితమైన) సంఘటన ఆశ్రయం అని కాని, దాని స్వరూపమే అని కాని చెప్పడానికి లేదు. అది (సంఘటన) లేకపోయినా కూడ వర్ణపదాలచేత వ్యంగ్యమైన రసాదికంలో మాధుర్యాదులు ఉంటున్నాయి కదా? (అదే విధంగా) వాక్యవ్యంగ్యంలో కూడ అలాంటి సంఘటన లేకపోయినా వాక్యం ఆ యా రసాలను వ్యంజింపచేయవచ్చును. అందువల్ల (కొన్ని వాక్యవ్యంగ్యస్థలాల్లో) సంఘటన ఉన్నా కూడ రసాదివ్యంజనకు అది కారణం అని చెప్పడానికి వీలు లేదు. అందువల్ల ఔపచారికత్వదృష్టితో మాటలాడినా కూడ గుణాలు శబ్దాశ్రయాలే అని శబ్దా ఏవ ఇత్యాదివాక్యంతో ఉపసంహరిస్తున్నాడు.

లోచనం

నన్వితి. వాక్యవ్యఙ్గ్యధ్వన్యభిప్రాయేణేదం మన్తవ్యమితి కేచిత్. వయం తు బ్రూమః - వర్ణపదవ్యఙ్గ్యేఽపి ఓజసి రౌద్రాదిస్వభావే వర్ణపదానామేకాకినాం స్వసౌన్దర్యమపి న తాదృగున్మీలతి తాదృ్యావత్తాని సంఘటనాఙ్కితాని న కృతానీతి సామాన్యేనైవాయం పూర్వపక్షః. ప్రకాశయత ఇతి "లక్షణహేత్వోః"

ఇతి శతృప్రత్యయః. రౌద్రాదిప్రకాశనాలక్ష్యమాణమ్ ఓజః ఇతి భావః. న చేతి - చ శబ్దో హేతౌ. యస్మాత్ "యో యః శస్త్రమ్" ఇత్యాదౌ నాచారుత్వం ప్రతిభాతి తస్మాదిత్యర్థః. తేషాం త్వితి - గుణానామ్. యథాస్వమితి -శృఙ్గార ఏవ పరమో మనఃప్రహ్లాదనో రసః ఇత్యాదినా చ విషయనియమ ఉక్త ఏవ. అథవేతి - రసాభివ్యక్తావేతదేవ సామర్థ్యం శబ్దానాం యత్ తథా తథా సంఘటమానత్వమితి భావః.

బాలానందిని

నన్వితి :- ఈ ప్రశ్న(పూర్వపక్షం) వాక్యవ్యంగ్యధ్వనిని దృష్టిలో పెట్టుకొని చేసినది అని గ్రహించాలి అని కొంద రన్నారు. అయితే మేం ఇలా అంటాం - వర్ణాలచేత, పదంచేత వ్యంగ్యమైన రౌద్రాదిస్వభావమైన ఓజస్సులో కూడ ఆ వర్ణాలు, పదాలు ఒంటరిగా ఉన్నంతవరకు, వాటిని సంఘటనలో చేరిన వాటినిగా చేయనంతవరకు వాటి సహజసౌందర్యం కూడ వికసించదు అని. ఈ పూర్వపక్షం సామాన్యరూపంచేతనే వర్ణ-పద-వాక్యవ్యంగ్యాల కన్నింటికీ సంబంధించే విధంగానే చేయబడింది. ప్రకాశయతః అన్నప్పుడు "లక్షణహేత్వోః" అని 'శతృ'ప్రత్యయం. "రౌద్రాదిప్రకాశకంగా ఊహించబడుతున్న" అని అర్థం.

వివరణ:- "లక్షణహేత్వోః క్రియాయాః" (పా.సూ.3.2.26) అనే సూత్రంచేత లక్షణం (గుర్తు) హేతువు అనే అర్థాన్ని బోధించే ధాతువు కంటె పరమైన లట్‌కు శతృ-శానచ్‌ప్రత్యయాలు వస్తాయి. పరస్మైపదధాతువైతే 'శతృ' ప్రత్యయం, ఆత్మనేపదధాతువైతే శానచ్ ప్రత్యయం. 'శయానా భుఞ్జతే యవనాః' (యవనులు పండుకొని తింటారు) అనే చోట శానచ్‌ప్రత్యయం. అలా పండుకొని తినడం యవనుల లక్షణం, గుర్తు అని అర్థం. ఇక్కడ 'ప్రకాశయతః' అనేతి శతృప్రత్యయాంతషష్ఠీవిభక్తి. రౌద్రాదులను ప్రకాశింపచేయడానికి గుర్తుగా ఉన్న అని అర్థం.

న చేతి - 'న చ అచారుత్వమ్' అన్నప్పుడు 'చ' శబ్దం హేత్వర్థకం. ఏకారణంవల్ల "యో యః శస్త్రమ్" ఇత్యాదులలో అచారుత్వం భాసించడంలేదో అందువల్ల అని అర్థం. తేషాం తు అనగా గుణాలయొక్క అని అర్థం. యథాస్వమ్ ఇతి. (యథాస్వమ్ అనగా దేనికి ఏదో అది దానికి అని అర్థం). "శృఙ్గార ఏవ పరమః మనఃప్రహ్లాదనో రసః" ఇత్యాదులలో ఆ యా గుణాల విషయనియమం చెప్పబడింది. అథవేతి - శబ్దాలకి ఉన్న రసాన్ని అభివ్యక్తం చేసే సామర్థ్యం అనేది ఏ మనగా - ఆ యా విధంగా

సంఘటితాలు అవడమే అని భావం.

## ధ్వన్యాలోకం

యత్తూక్తం - "సంఘటనావత్ గుణానామపి అనియత విషయత్వం ప్రాప్నోతి, లక్ష్యే వ్యభిచారదర్శనాత్" ఇతి, తత్రాప్యేతదుచ్యతే - యత్ర లక్ష్యే పరికల్పితవిషయవ్యభిచారః తత్ విరూపమేవాస్తు. కథమచారుత్వం తాదృశే విషయే సహృదయానాం నావభాసతీతి చేత్, కవిశక్తితిరోహితత్వాత్. ద్వివిధో హి దోషః - కవేః అవ్యుత్పత్తికృతః అశక్తికృతశ్చ. తత్ర అవ్యుత్పత్తికృతో దోషః శక్తితిరస్కృతత్వాత్ కదాచిన్న లక్ష్యతే. యస్త్వశక్తికృతో దోషః సః ఝటితి ప్రతీయతే. పరికరశ్లోకశ్చాత్ర -

"అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః,
యస్త్వశక్తికృతస్తస్య స ఝటిత్యవభాసతే".

తథా హి - మహాకవీనామప్యుత్తమదేవతావిషయప్రసిద్ధసంభోగ శృఙ్గారనిబన్ధనాద్యనౌచిత్యం శక్తితిరస్కృతత్వాత్ గ్రామ్యత్వేన న ప్రతిభాసతే. యథా కుమారసంభవే దేవీసంభోగవర్ణనమ్. ఏవమాదౌ చ విషయే యథా ఔచిత్యాత్యాగః తథా దర్శితమేవాగ్రే. శక్తితిరస్కృతత్వం చాఽన్వయవ్యతిరేకాభ్యామవసీయతే. తథా హి శక్తిరహితేన కవినా ఏవంవిధే విషయే శృఙ్గార ఉపనిబధ్యమానః స్ఫుటమేవ దోషత్వేన ప్రతిభాసతే. నన్వస్మిన్ పక్షే "యో యః శస్త్రం బిభర్తి" ఇత్యాదౌ కిమచారుత్వమ్? అప్రతీయమానమేవ ఆరోపయామః. తస్మాద్గుణవ్యతిరిక్తత్వే గుణరూపత్వే చ సంఘటనాయాః అన్యః కశ్చిన్నియమహేతుర్వక్తవ్య ఇతి. ఉచ్యతే -

బాలానందిని

యత్తు ఇతి "లక్ష్యాలలో వ్యభిచారం కనబడడంవల్ల సంఘటనకి వలె గుణాలకి కూడా అనియతవిషయత్వం (నిశ్చితమైన స్థానం లేకపోవడం) ఏర్పడుతుంది" అని వెనక ఏ ఆశంక చేయబడిందో ఆ విషయంలో కూడ ఇదిగో సమాధానం చెపుతున్నాం. ఏర్పరచిన విషయానికి ఏ లక్ష్యంలో అయితే వ్యభిచారం కనిపిస్తూన్నదో అది విరూపమే (దోషయుక్తమే) అవుగాక. అలాంటి విషయంలో సహృదయులకు అచారుత్వం ఎందుకు కనబడడంలేదు అని ప్రశ్నిస్తే - అందుకు కారణం అక్కడ ఉండే దోషం కవిప్రతిభచేత కప్పివేయబడడమే. కవికి సరియైన వ్యుత్పత్తి లేకపోవడంచేత కలిగేదీ, శక్తి (ప్రతిభ) లోపించడంచేత కలిగేదీ అని దోషం రెండు విధాలు. వాటిలో, అవ్యుత్పత్తివల్ల ఏర్పడిన దోషం శక్తిచేత కప్పబడిపోవడంచేత ఒకప్పుడు పైకి కనబడకపోవచ్చును. కాని అశక్తిచేత ఏర్పడిన దోషం మాత్రం వెంటనే కొట్టవచ్చినట్లు కనబడుతుంది. ఈ సందర్భంలో చెప్పిన పరికరశ్లోకం ఇది -

అవ్యుత్పత్తీతి - "కవియొక్క అవ్యుత్పత్తిచేత, సరియైన వ్యుత్పత్తి లేకపోవడంచేత, ఏర్పడిన దోషం అతని శక్తిచేత, ప్రతిభచేత, కప్పబడిపోతుంది. కాని అతనికి ప్రతిభ లోపించడంచేత ఏర్పడే దోషం మాత్రం వెంటనే తెలిసిపోతుంది"

తథా హీ తి. అది ఎట్లనగా - ఉత్తమదేవతలకు సంబంధించిన ప్రసిద్ధమైన సంభోగశృంగారాన్ని వర్ణించడం మొదలైన మహాకవులు చూపిన అనౌచిత్యం వాళ్ల ప్రతిభచేత కప్పబడిపోయి గ్రామ్యంగా కనబడదు. ఉదాహరణకి - కుమారసంభవంలోని దేవీసంభోగవర్ణనం. ఇలాంటి విషయాలలో ఔచిత్యాన్ని విడవకుండా ఉండడం ఎలాగో ముందు చూపబడింది. శక్తితిరస్కృతత్వం అన్వయవ్యతిరేకాలచేత నిర్ణయించబడుతుంది. కవి ప్రతిభావంతుడైతే దోషం కనబడకపోవడం అన్వయం, కవిప్రతిభాదరిద్రుడైతే దోషం కనబడడం వ్యతిరేకం. ఈ అన్వయవ్యతిరేకాలను పట్టి దోషం శక్తితిరస్కృతం అని నిర్ధారణ చేయబడుతుంది అని అర్థం. తథాహీతి. ఎందువల్ల ననగా - ఈవిధమైన విషయంలో (పూజ్యదేవతాదివిషయంలో) శక్తిరహితుడైన కవి శృంగారాన్ని నిబంధిస్తే (కూరుస్తే) ఆ దోషం స్పష్టంగా బాసిస్తుంది. నన్వితి - అయితే ఈ పక్షంలో "యో యః శస్త్రమ్" ఇత్యాదులలో అచారుత్వమేనా? (సమాధానం) అచారుత్వం ఏదీ కనబడకపోయినా మనం ఆరోపిస్తున్నాం. తస్మాదితి. అందువల్ల సంఘటన గుణాలకంటె భిన్నమైనది అని చెప్పినా, అది గుణరూపమే అని చెప్పినా దీని విషయంలో నియమానికి తగిన హేతువు ఏదైనా చెప్పాలి. సరే, ఆ నియమహేతువు చెప్పబడుతున్నది-

లోచనం

శక్తిః ప్రతిభానం వర్ణనీయవస్తువిషయనూతనోల్లేఖశాలిత్వమ్. వ్యుత్పత్తిః తదుపయోగిసమస్తవస్తుపౌర్వాపర్యపరామర్శకౌశలమ్. తస్యేతి కవేః. అనౌచిత్యమితి :- ఆస్వాదయితౄణాం యః చమత్కారావిఘాతః తదేవ రససర్వస్వమ్; ఆస్వాదాయత్తత్వాత్. ఉత్తమదేవతాసంభోగపరామర్శే చ పితృసంభోగ ఇవ లజ్జాతఙ్కాదినా కశ్చమత్కారావకాశ ఇత్యర్థః. శక్తితిరస్కృతత్వాదితి. సంభోగోఽపి హ్యసౌ తథా వర్ణితః ప్రతిభానవతా కవినా యథా తత్రైవ విశ్రాన్తం హృదయం పౌర్వాపర్యపరామర్శం కర్తుం న దదాతి యథా నిర్వ్యాజపరాక్రమస్య పురుషస్య అవిషయేఽపి యుధ్యమానస్య తావత్తస్మిన్నవసరే సాధువాదో వితీర్యతే న తు పౌర్వాపర్యపరామర్శే తథాత్రాపీతి భావః. దర్శితమేవేతి. కారికాకారేణేతి భూతప్రత్యయః. వక్ష్యతే హి - "అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్" ఇత్యాది. అప్రతీయమానమేవేతి - పూర్వాపరపరామర్శవివేకశాలిభిరపి ఇత్యర్థః. గుణవ్యతిరిక్తత్వే ఇతి. వ్యతిరేకపక్షే హి సంఘటనాయాః నియమహేతురేవ నాస్తి. ఐక్యపక్షేఽపి న రసో నియమహేతుః ఇతి అన్యో వక్తవ్యః.

బాలానందిని

శక్తిరితి - శక్తి అనగా ప్రతిభానం వర్ణించవలసి ఉన్న వస్తువును గూర్చిన కొత్త కొత్త భావనలతో (ఉల్లేఖ) నిండి ఉండడం. దానికి అనగా వర్ణనీయవస్తువునకు, ఉపయోగించే సమస్తవస్తువుల పౌర్వాపర్యాన్ని (ముందువెనకలను, క్రమాన్ని) పరామర్శించడంలో, స్పృశించడంలో, నేర్పు 'వ్యుత్పత్తి'. తస్య అనగా కవియొక్క. అనౌచిత్యమితి - ఆస్వాదించేవాళ్ల చమత్కారానికి విఘాతం కలగకుండా ఉండడమే రససర్వస్వం. ఎందుచేత ననగా రసం అనేది లేదా చమత్కారం అనేది ఆస్వాదంమీదనే ఆధారపడి ఉంటుంది. ఉత్తములైన దేవతల సంభోగాన్ని పరామర్శించినప్పుడు తలిదండ్రుల సంభోగాన్ని వర్ణించినప్పుడు వలె లజ్జ, పాపభీతి మొదలైనవి కలిగితే ఇంక చమత్కారానికి అవకాశం ఏది అని అర్థం. శక్తితిరస్కృతత్వాదితి. ప్రతిభానవంతుడైన కవి ఈ సంభోగాన్ని కూడా ఎలా వర్ణించా డనగా హృదయం దానియందే విశ్రమించి వెనకముందు విషయాలను గూర్చి ఆలోచించే అవకాశం ఇవ్వదు. సహజమైన పరాక్రమం గల

పురుషుడు తగని విషయంలో, అనగా పెద్దలతోనో, బాలాదులతోనో యుద్ధం చేస్తున్నప్పుడు ఆ సమయంలో మాత్రమే అహా! సాధు! సాధు! అని సాధువాదమే (చాలా బాగుంది అని మెచ్చుకోవడమే) చేయబడుతుంది గాని ముందు వెనక విషయాలు ఆలోచించినప్పుడు సాధువాదం ఎలా చేయబడదో అట్లే ఇక్కడ కూడ. ఇలాంటి స్థలాలలో ముందు వెనకల ఆలోచన లేనంతవరకు తాత్కాలికంగా చమత్కారం కలగవచ్చును. పౌర్వాపర్యపరామర్శలో ఇలాంటి వర్ణనలు చేయడం అనుచితమే అని గ్రహించబడుతుంది అని అభినవగుప్తుని అభిప్రాయం. దర్శితమేవేతి. "అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్" ఇత్యాదికారికలలో ఈ విషయం చెప్పబడబోతుంది. అయితే వృత్తి వ్రాసే సమయానికి కారికలు రచించి సిద్ధంగా ఉన్నాయి గాన "కారికాకారుడు చూపించాడు" అని (వృత్తికారునిచేత) భూతార్థక క్తప్రత్యయం ప్రయోగించబడింది. అప్రతీయమానమేవేతి :- పూర్వాపరపరామర్శవివేకం ఉన్నవాళ్లచేత కూడ ఇక్కడ అనౌచిత్యం ఏదీ గుర్తించబడకపోయినా అని అర్థం. గుణవ్యతిరిక్తత్వే ఇతి - గుణాలు వేరు సంఘటన వేరు అనే పక్షంలో సంఘటనకు సంబంధించినంతవరకు నియమహేతువే లేదు. రెండూ ఒకటే అనే పక్షంలో కూడ రసం నియమహేతువు కాజాలదు; అందుచేత మరొకటి ఏదైనా చెప్పాలి.

## ధ్వన్యాలోకం

కా. తన్నియమే హేతురౌచిత్యం వక్తృవాచ్యయోః. 6

తత్ర వక్తా కవిః. కవినిబద్ధో వా; కవినిబద్ధశ్చాపి రసభావరహితః, రసభావసమన్వితో వా; రసోఽపి కథానాయకాశ్రయః తద్విపక్షాశ్రయో వా; కథానాయకశ్చ ధీరోదాత్తాదిభేదభిన్నః పూర్వః తదనన్తరో వా ఇతి వికల్పాః. వాచ్యం చ ధ్వన్యాత్మరసాఙ్గం రసాభాసాఙ్గం వా, అభినేయార్థమ్, అనభినేయార్థం వా, ఉత్తమప్రకృత్యాశ్రయం తదితరాశ్రయం వా ఇతి బహుప్రకారమ్. తత్ర యదా కవిః అపగతరసభావః వక్తా తదా రచనాయాః కామచారః. యదాపి కవినిబద్ధః వక్తా రసభావరహితః తదా స ఏవ; యదా తు కవిః కవినిబద్ధో వా వక్తా రసభావసమన్వితః, రసశ్చ ప్రధానాశ్రితత్వాత్

ధ్వన్యాత్మభూతః తదా నియమేనైవ తత్ర అసమాసామధ్యసమాసే ఏవ సంఘటనే.

బాలానందిని

తన్నియమే ఇతి - వక్తృవాచ్యయోః= వక్తయొక్క, వాచ్యంయొక్క, ఔచిత్యమ్= ఔచిత్యం, తన్నియమే= సంఘటనయొక్క నియమమునందు, హేతుః= హేతువు.

తత్రేతి - అందులో వక్త కవి కావచ్చు, కవినిబద్ధుడు (కవికల్పితుడైనవాడు) కావచ్చు. కవినిబద్ధుడైన వక్త కూడ రసభావశూన్యుడు కావచ్చు, రసభావసమన్వితుడు కావచ్చు. రసం కూడా కథానాయకుణ్ణి ఆశ్రయించింది కావచ్చు, వాని శత్రువును ఆశ్రయించినది కావచ్చు. కథానాయకుడు కూడ ధీరోదాత్తాదిభేదాలచేత భిన్నుడైన మొదటివాడు (కథానాయకుడు) కావచ్చు, లేదా వాని తరవాతివాడు, అనగా ఉపనాయకుడు కావచ్చు. ఈ విధంగా వక్త మొదలైనవాళ్ల విషయంలో వికల్పాలు ఉంటాయి. వాచ్యం (అర్థం ప్రతిపాదించే విషయం) ధ్వన్యాత్మ (ధ్వనిరూపం) అయిన రసానికి అంగం (వ్యంజకం) కావచ్చు, రసాభాసానికి అంగం కావచ్చు; అభినయించతగినది కావచ్చు, అభినయించడానికి వీలులేని పాఠ్యం మాత్రమే కావచ్చు. ఉత్తమప్రకృతులైనవాళ్లకి సంబంధించినది కావచ్చు, అనుత్తమప్రకృతులకు సంబంధించినది కావచ్చు - ఈ విధంగా వాచ్యం కూడా అనేక విధాలలో ఉంటుంది.

తత్రేతి- రసభావాలు లేని కవి వక్తగా ఉన్నప్పుడు రచన విషయంలో కామచారం, స్వేచ్ఛ, కవినిబద్ధుడైన వక్త రసభావరహితు డైతే కూడ అదే - కామచారమే. అయితే - ఎప్పుడైతే కవి గాని, కవినిబద్ధవక్తగాని రసభావసమన్వితుడై ఉంటాడో, రసం ప్రధానవ్యక్తిని ఆశ్రయించి ఉండడంచేత ధ్వనికావ్యానికి ఆత్మగా ఉంటుందో అప్పుడు, అక్కడ తప్పనిసరిగా సమాసాలు లేని సంఘటన, మధ్యసమాసాలు ఉన్న సంఘటన ఉపయోగించాలి.

లోచనం

తన్నియమ ఇతి కారికాశేషః. కథాం నయతి స్వకర్తవ్యాఙ్గభావమ్ ఇతి కథానాయకః. యో నిర్వహణే ఫలభాగీ. ధీరోదాత్తాదీతి. ధర్మయుద్ధవీరప్రధానో ధీరోదాత్తః. వీరరౌద్రప్రధానో ధీరోద్ధతః. వీరశృఙ్గారప్రధానో ధీరలలితః దానధర్మవీరశాన్తప్రధానః ధీరప్రశాన్త ఇతి చత్వారో నాయకాః క్రమేణ సాత్వత్యారభటీకైశికీభారతీలక్షణవృత్తిప్రధానాః. పూర్వః కథానాయకః. తదనన్తరః

ఉపనాయకః. వికల్పా ఇతి - వక్తృభేదా ఇత్యర్థః. వాచ్యమితి. ధ్వన్యాత్మా ధ్వనిస్వభావః యో రసః తస్య అఙ్గం వ్యఞ్జకమిత్యర్థః. అభినేయః వాగఙ్గసత్త్వాహార్యైః ఆభిముఖ్యం సాక్షాత్కారప్రాయం నేయః అర్థః వ్యఙ్గ్యరూపః ధ్వనిస్వభావో యస్య తదభినేయార్థం వాచ్యమ్; స ఏవ హి కావ్యార్థః ఇత్యుచ్యతే. తస్యైవ చ అభినయేన యోగః. యదాహ మునిః - "వాగఙ్గసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయన్తి" ఇత్యాది. తత్ర తత్ర రసాభినయనాన్తరీయకతయా తు తద్విభావాదిరూపతయా వాచ్యః అర్థః అభినీయతే ఇతి వాచ్యమ్ అభినేయార్థమిత్యేషైవ యుక్తతరా వాచోయుక్తిః. న త్వత్ర వ్యపదేశివద్భావో వ్యాఖ్యేయః, యథాన్యైః. తదితరేతి మధ్యమప్రకృత్యాశ్రయమ్ అధమప్రకృత్యాశ్రయం చేత్యర్థః.

బాలానందిని

తన్నియమే ఇత్యాదికం కారికలోని మిగిలిన భాగం. దీని పూర్వార్థం ఉత్తరార్థంలోని 'రసాన్' అనే మొదటి పదం వెనక ఇవ్వబడ్డాయి. కథామ్ = కథను, నయతి= తన కర్తవ్యానికి అంగత్వాన్ని పొందిస్తాడు గాన "కథానాయకుడు". ఎవడు నిర్వహణసంధిలో (చివరికి) ఫలం పొందుతాడో అతడు. ధీరోదత్తాదీతి :- ధర్మవీర-యుద్ధవీరప్రధానుడు ధీరోదాత్తుడు. వీర-రౌద్రప్రధానుడు ధీరోద్ధతుడు. వీర-శృంగార ప్రధానుడు ధీరలలితుడు. దానవీర-ధర్మవీర - శాంతప్రధానుడు ధీరప్రశాంతుడు. ఈ నలుగురు నాయకులు వరసగా సాత్త్వతీ - ఆరభటీ - కైశికీ - భారతీరూపాలైన వృత్తులు ప్రధానంగా గలవారై ఉంటారు. (సాత్త్వత్యాదుల లక్షణాలు ప్రతాపరుద్రీయాదులలో చెప్పబడ్డాయి). పూర్వః అనగా కథానాయకుడు. తదనన్తరః అనగా ఉపనాయకుడు. వికల్పాః ఇతి - వక్తృభేదాలు అని అర్థం. వాచ్యమితి - ధ్వన్యాత్మా= ధ్వనిస్వభావమైన, ధ్వనిరూపమైన, ఏ రసం ఉందో దానికి, అఙ్గమ్= వ్యంజకము అని అర్థం. అభినేయ ఇతి :- అభినేయః= వాక్- అంగ - సత్త్వ - ఆహార్యాలచేత, సాక్షాత్కారం వంటి అభిముఖత్వాన్ని, నేయః పొందించదగిన, అర్థః= ధ్వని రూపమైన వ్యంగ్యార్థం దేనికో అది అభినేయార్థమైన వాచ్యం. అనగా ఏ వాచ్యార్థం వాచిక - ఆంగిక-సాత్త్విక-ఆహార్యాభినయాల ద్వారా ధ్వనిరూపమైన వ్యంగ్యార్థాన్ని కళ్లకి కట్టినట్లు చూపిస్తుందో అది 'అభినేయార్థం'. స ఇతి. అదే కావ్యార్థం అని చెప్పబడుతుంది. దానికే అభినయంతో సంబంధం. అందుచేతనే

భరతముని అక్కడ - "వాక్-అంగ-సత్త్వాలతో కూడిన అర్థాలను (భావాలు) భావింపచేస్తాయి" అని అంటాడు. వాచ్యార్థం రసానికి విభావాదిరూపంలో ఉండి రసాభినయంతో నాంతరీయకంగా (విడదీయడానికి వీలులేనిదిగా) అభినయించ బడుతుంది. అందుచేత "వాచ్యం అభినేయార్థం" అని చెప్పడం చాల యుక్తమైనదే - అందుచేత కొందరు చేసినట్లు ఇక్కడ వ్యపదేశివద్భావం చేత వ్యాఖ్యానించనవసరంలేదు.

వివరణ :- పైన వివరించినట్లు 'అభినేయార్థమైన వాచ్యం' అనగా - ఏ వాచ్యం రసరూపవ్యంగ్యార్థాన్ని చతుర్విధాభినయాల ద్వారా అభిముఖం చేస్తుందో అది అని అర్థం. దీనిని పట్టి అభినేయమైనది వ్యంగ్యార్థమే కాని వాచ్యార్థం కాదని తేలింది. అయితే వాచ్యార్థాన్నే అభినేయమైన అర్థం అని చెప్పడం ఉంది. అప్పుడు "అభినేయః అర్థః యస్య" "ఏ వాచ్యం యొక్క అర్థం అభినేయమో అది" అనే విగ్రహంలో యచ్ఛబ్దార్థం కూడా అర్థమే గాన 'వాచ్యార్థంయొక్క అర్థం' అని చెప్పినట్లవుతుంది. దీనిని వ్యపదేశివద్భావంచేత సమర్థించవలసి ఉంటుంది. రాహువు శిరస్సు మాత్రమే. ఇతరశరీరం లేదు. అందుచేత రాహువు అంటేనే శిరస్సు అని అర్థం. కాని రాహువు వేరు శిరస్సు వేరు అన్నట్లు భావించి "రాహోః శిరః" 'రాహువు యొక్క శిరస్సు' అని వ్యవహారం ఉంది. దీనిని వ్యపదేశివద్భావం అంటారు. అదే విధంగా "వాచ్యార్థం యొక్క అర్థం అభినేయం" అని కొందరు వ్యాఖ్యాతలు సమర్థించారు. రసాభినయనానికి నాంతరీయకంగా వాచ్యార్థం కూడా అభినయించబడుతుంది. అందుచేత ఇది 'అభినేయార్థం' "అభినయించదగిన అర్థం" అని కూడా వ్యాఖ్యానించిన పక్షంలో ఈ వ్యపదేశివద్భావం అవసరం ఉండదు అని "న త్వత్ర" ఇత్యాదివాక్యానికి భావం.

తదితరేతి :- మధ్యమప్రకృత్యాశ్రయం, అధమప్రకృత్యాశ్రయం అని అర్థం.

లోచనం

ఏవం వక్తృభేదాన్ వాచ్యభేదాం శ్చాభిధాయ తద్గతమౌచిత్యం నియామకమాహ తత్రేతి. రచనాయాః ఇతి. సంఘటనాయాః. రసభావవిహీనః అనావిష్టః తాపసాది రుదాసీనోఽపి ఇతివృత్తాఙ్గతయా యద్యపి ప్రధానరసానుయాయ్యేవ తథాపి తావతి రసాదిహీన ఇత్యుక్తమ్. స ఏవేతి కామచారః., ఏవం శుద్ధవక్త్రౌచిత్యం విచార్య వాచ్యౌచిత్యేన సహ తదేవాహ - యదా త్వితి. కవిర్యద్యపి రసావిష్ట ఏవ వక్తా యుక్తః, అన్యథా "స ఏవ వీతరాగశ్చేత్" ఇతి స్థిత్యా నీరసమేవ కావ్యం స్యాత్. తథాపి యదా

యమకాదిచిత్రప్రదర్శనప్రధానో ఽసౌ భవతి తదా రసాదిహీన ఇత్యుక్తమ్. నియమేన రసభావసమన్వితో వక్తా న తు కథఞ్చి దపి తటస్థః. రసశ్చ ధ్వన్యాత్మభూత ఏవ న తు రసవదలంకారప్రాయః. తదా అసమాసా మధ్యమసమాసే ఏవ సంఘటనే, అన్యథా తు దీర్ఘసమాసాపీత్యేవం యోజ్యమ్. తేన నియమశబ్దస్య ద్వయోశ్చైవకారయోః పౌనరుక్త్యమనాశఙ్క్యమ్.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వక్తృభేదాలను, వాచ్యభేదాలను చెప్పి సంఘటనా నియామకం అయిన వక్తృ-వాచ్యౌచిత్యాన్ని చెపుతున్నాడు - తత్రేతి. రచనాయాః అనగా సంఘటన యొక్క అని అర్థం. రసేతి – రసభావాలు లేనివాడు, భావావేశం లేనివాడు అయిన తాపసుడు మొదలైన ఉదాసీనుడు కూడ ఇతివృత్తంలో ఒక అంగం అవడం చేత ప్రధానరసానుసారియే అయినా ఆతనికి సంబంధించినంత వరకు అతడు రసవిహీనుడు అని చెప్పబడింది. స ఏవ ఇతి - కామచారం అని అర్థం. ఏవమితి - ఈ విధంగా శుద్ధుడైన వక్తయొక్కఔచిత్యాన్ని (వక్తకు మాత్రమే సంబంధించిన ఔచిత్యాన్ని) విచారించి వాచ్యౌచిత్యంతో కలిపి ఆ వక్త్రౌచిత్యాన్నే చెపుతున్నాడు - యదాత్వితి. కవి రసావిష్టుడైన వక్తగా ఉండడమే యుక్తం; అలా కాని పక్షంలో "స ఏవ వీతరాగశ్చేత్" అని ముందు చెప్పనున్నట్లు ఆ కావ్యం నీరసం అయిపోతుంది; అయినా కూడ ఈ కవి యమకాదిచిత్రప్రదర్శనప్రధానుడైతే, (యమకాదులకే ప్రాధాన్యం ఇచ్చేవాడయితే) అప్పుడు అతడు రసాదిహీనుడు అని చెప్పబడింది. వృత్తిలో "నియమేన ఏవ తత్ర అసమాసామధ్యమసమాసే ఏవ సంఘటనే" అనే వాక్యంలో 'నియమేన' అనే పదం, అవధారణార్థకాలైన రెండు 'ఏవ' కారాలు ప్రయోగింపబడ్డాయి. ఈమూడింటికి ఇతరవ్యవచ్ఛేదమే (మరొక విధంగా ఉండగూడదు అనేదే) అర్థం. అందుచేత పౌనరుక్త్య దోషం ఉన్నట్లు కనబడుతుంది. తత్పరిహారార్థమై వాటికి వేరు వేరు పదాలతో సమన్వయం చూపుతున్నాడు - నియమేనేతి. వక్త నియమంచేత (తప్పనిసరిగా) రసభావసమన్వితుడై ఉండాలి కాని ఎట్టి పరిస్థితిలోను తటస్థుడుగా ఉండకూడదు. రసం కూడ ధ్వన్యాత్మయే అయి ఉండాలి గాని రసవదలంకారంవంటిది కాకూడదు. అలాంటప్పుడు సంఘటనలు అసమాసమధ్యసమాసాలే ఉండాలి. మరొక విధంగా అయితే (పైన చెప్పినట్లు కవి రసభావసమన్వితుడు కాకపోయినా, రసం ధ్వన్యాత్మ కాకపోయినా) దీర్ఘసమాససంఘటన కూడ ఉండవచ్చు అని అన్వయించుకోవాలి. ఇలా అన్వయించుకొనడంచేత 'నియమ'

శబ్దానికీ, రెండు 'ఏవ' కారాలకీ పౌనరుక్త్యం ఉందని ఆశంకించడానికి వీలులేదు.

## ధ్వన్యాలోకం

కరుణవిప్రలంభశృఙ్గారయోస్తు అసమాసైవ సంఘటనా. కథమితి చేత్; ఉచ్యతే - రసో యదా ప్రాధాన్యేన ప్రతిపాద్యస్తదా తత్ప్రతీతౌ వ్యవధాయకా విరోధినశ్చ సర్వాత్మనైవ పరిహార్యాః. ఏవం చ దీర్ఘసమాసా సంఘటనా సమాసానామనేకప్రకారసంభావనయా కదాచిద్రసప్రతీతిం వ్యవదధాతీతి తస్యాం నాత్యన్త మభినివేశః శోభతే విశేషతః అభినేయార్థే కావ్యే. తతోఽన్యత్ర చ విశేషతః కరుణ విప్రలమ్భశృఙ్గారయోః. తయోర్హి సుకుమారతరత్వాత్ స్వల్పాయ మప్యస్వచ్ఛతాయాం శబ్దార్థయోః ప్రతీతిః మన్థరీభవతి. రసాన్తరే పునః ప్రతిపాద్యే రౌద్రాదౌ మధ్యమసమాసా సంఘటనా కదాచిద్ధీరోద్ధతనాయకసంబన్ధవ్యాపారాశ్రయేణ దీర్ఘసమాసాపి వా తదాక్షేపావినాభావిరసోచితవాచ్యాపేక్షయా న విగుణా భవతీతి సాపి నాత్యన్తం పరిహార్యా.

### బాలానందిని

కరుణేతి - కరుణ - విప్రలంభశృంగారాలలో అయితే సమాసాలు లేని అసంఘటన ఉండాలి. ఎట్లు అంటే; చెపుతున్నాను విను. రసాన్ని ప్రధానంగా ప్రతిపాదించవలసి ఉన్నప్పుడు దాని ప్రతీతికి వ్యవధానం కలిగించేవి, విరోధులూ కూడ అన్ని విధాల పరిహరించదగినవి. అందుచేత దీర్ఘసమాసాలున్న సంఘటన సమాసాలను అనేక ప్రకారాలలో ఊహింపచేయవచ్చును; అందుచేత ఒకప్పుడు రసప్రతీతిని కప్పివేయవచ్చు (రసప్రతీతికి అడ్డుతగలవచ్చు). అందుచే దీర్ఘసమాససంఘటన విషయంలో ఎక్కువ పట్టుదల శోభించదు. విశేషించి అభినేయార్థమైన కావ్యంలోను (దృశ్యకావ్యంలోను) దానికంటె భిన్నమైన శ్రవ్యకావ్యంలో విశేషించి కరుణవిప్రలంభశృంగారాలలోను ఇది శోభించదు. ఆ రెండూ (కరుణ-విప్రలంభశృంగారాలు) అతిసుకుమారాలు అవడం వల్ల శబ్దార్థాలలో ఏ కొంచెం అస్వచ్ఛత ఉన్నా వాటి ప్రతీతి మందం అయిపోతుంది

రౌద్రం మొదదలైన మరొక రసం ప్రతిపాదించవలసి ఉన్నప్పుడు మధ్యమసమాససంఘటన ఉండవచ్చు. ఒకప్పుడు ధీరోద్ధతనాయకునికి సంబంధించిన వ్యాపారాన్ని ఆశ్రయించడం చేత (వర్ణించడంచేత) ఆ దీర్ఘసమాససంఘటనాక్షేపంతో (దీర్ఘసమాససంఘటనలో అలాంటి సమాసాలను చేర్చడంతో) అవినాభావి అయిన, విడదీయరాని సంబంధంతో ఉన్న, వాచ్యంయొక్క అపేక్షచేత దీర్ఘసమాసరచన కూడ విగుణం కాదు; అందుచేత దానిని పూర్తిగా పరిహరించవలసిన పనిలేదు.

వివరణ:- ధీరోద్ధత్తుని వ్యాపారం వర్ణించే సందర్భంలో ఉపయోగించే రసోచితమైన వాచ్యార్థం దీర్ఘసమాసరచనతో అవినాభావసంబంధం కలిగి ఉంటుంది. అనగా అక్కడ ఉపయోగించే వాచ్యార్థం రసోచితంగా ఉండాలంటే దీర్ఘసమాససంఘటన అవసరం అవుతుంది. అలాంటప్పుడు అలాంటి సంఘటన విగుణం కాదు గాన దానిని పూర్తిగ పరిహరించవలసిన పని లేదు అని అర్థం.

## లోచనం

కథమితి చేదితి :- కిం ధర్మసూత్రకారవచనమేతదితి భావః? ఉచ్యతే ఇతి:- న్యాయోపపత్త్యా ఇత్యర్థః. తత్రప్రతీతావితి. తదాస్వాదే యే వ్యవధాయకాః ఆస్వాదవిఘ్నరూపాః విరోధినశ్చ తద్విపరీతాస్వాదమయా ఇత్యర్థః. సంభావనయేతి- అనేకప్రకారః సంభావ్యతే; సంఘటనా తు సంభావనాయాం ప్రయోక్త్రీతి ద్వౌ ణిచౌ. విశేషతః అభినేయార్థేతి. అత్రుటితేన వ్యఞ్జ్యేన తావత్ సమాసార్థాభినయః న శక్యః కర్తుమ్; కాక్వాదయః అన్తరప్రసాదగానాదయశ్చ తత్ర దుష్ప్రయోజాః బహుతరసందేహప్రసరా చ తత్ర ప్రతిపత్తిః న నాట్యే అనురూపా స్యాత్. ప్రత్యక్షరూపత్వాత్తస్యా ఇతి భావః. అన్యత్ర చేతి. అనభినేయార్థేఽపి. మన్థరీభవతీతి - ఆస్వాదః విఘ్నితత్వాత్ ప్రతిహన్యతే ఇత్యర్థః. తస్యా దీర్ఘసమాససంఘటనాయాః యః ఆక్షేపః తేన వినా యో న భవతి వ్యఙ్గ్యాభివ్యఞ్జకస్తాదృశో రసోచితో రసాభివ్యఞ్జకతయా ఉపాదీయమానః వాచ్యస్తస్య యాసావపేక్షా దీర్ఘసమాససంఘటనాం ప్రతి సా అవైగుణ్యే హేతుః. నాయకస్య ఆక్షేపః వ్యాపారః ఇతి యద్వ్యాఖ్యాతం తన్న శ్లిష్యతీవేత్యలమ్.

బాలానందిని

కథమితి చేదితి - కరుణవిప్రలంభాలలో అసమాససంఘటనే ఉండా లని ఇదేమైనా ధర్మసూత్రకారుని వచనమా అని భావం. ఉచ్యతే ఇతి. న్యాయోపపత్తిచేత చెప్పబడుతుంది అని అర్థం. తత్రప్రతీతావితి : దాని ఆస్వాదంలో ఏవి, వ్యవధాయకాః= ఆస్వాదానికి విఘ్నంగా ఉంటాయో, విరోధినః చ= దానికి (ప్రధానరసానికి) విపరీతమైన ఆస్వాదరూపాలుగా ఉంటాయో అని అర్థం. సంభావనయా ఇతి. (సమాసం) అనేక విధాల ఊహించబడుతుంది. సంఘటన ఆ సంభావనలో ప్రయోక్త్రి, ప్రేరకం.

వివరణ : 'సమ్' పూర్వక భూధాతువుకు 'ణిచ్' (ప్రేరణార్థంలో) ప్రత్యయం చేర్చడంచేత 'సంభావయతి' ఇత్యాది రూపాలు సిద్ధిస్తాయి. దానినుంచి 'ల్యుట్' ప్రత్యయం చేయగా ఏర్పడిన రూపం 'సంభావనా' అనేది. 'ఉండేటట్లు చేయడం' అని దాని అసలు అర్థం. ఊహించడం అనేది ప్రసిద్ధార్థం. 'ణిచ్' ప్రత్యయాంతానికి మళ్లీ ణిచ్ ప్రత్యయం చేర్చవచ్చు. కాని అది లోపిస్తుంది. దాని అర్థం మాత్రం మిగులుతుంది. ఉదాహరణకి 'గమ్' ధాతువుకు 'ణిచ్' ప్రత్యయం చేరిస్తే 'గమయతి' అవుతుంది. వెళ్ళేటట్లు చేస్తున్నాడు; పంపుతున్నాడు. ఆ ణిచ్ ప్రత్యయాంతంమీద మళ్లీ ఒక ణిచ్‌ప్రత్యయం చేర్చినా అది లోపించి 'గమయతి' అనే అవుతుంది. అప్పుడు దానికి వెళ్లేటట్లు చేసేటట్లు చేస్తున్నాడు, పంపేటట్లు చేస్తున్నాడు అని అర్థం. అదే విధంగా ఇక్కడ 'సంభావనా' అనే పదం రెండు 'ణిచ్' ప్రత్యయాలు చేర్చడంచేత ఏర్పడింది. అందువల్ల ఇక్కడ భావం ఏమనగా ప్రతిపత్త అనేకప్రకారాల సమాసాల సంభావన చేస్తాడు. అలా చేసేటట్లు దీర్ఘసమాసఘటితసంఘటన చేస్తుంది అని అర్థం. ఇక్కడ వ్యాఖ్యాత చెప్పదలచిన విషయం ఏ మనగా - దీర్ఘసమాసాలు ప్రయోగించి నప్పుడు అక్కడ ఉన్న సమాసాన్ని శ్రోత కర్మధారయగానో, బహువ్రీహిగానో పంచమీతత్పురుషగానో, షష్ఠీతత్పురుషగానో ఈ విధంగా అనేకవిధాల గ్రహించడానికి వీలు ఉండడంచేత రసప్రతీతికి భంగం వాటిల్లవచ్చు.

విశేషతః అభినేయార్థేతి : వ్యంగ్యమైన రసం తెగి పోకుండా చూచుకుంటూ సమాసార్థాన్ని అభినయించడం శక్యం కాదు. కాక్వాదిస్వరాలను, మధ్య మధ్య ప్రసాదగానం మొదలైనవి ప్రయోగించడం కూడ కష్టం. (ప్రేక్షకుల చిత్తాన్ని రంజింపచేయడం కోసం మధ్య మధ్య లఘువుగా చేసే గానం ప్రసాదగానం. దీర్ఘసమాసాలున్నప్పుడు అవేమీ కుదరవు. పదాలు విడివిడిగా ఉంటే ఇలాంటి వన్నీ శక్యం అవుతాయి అని భావం). అర్థజ్ఞానం కూడా అనేకసందేహాలకి అవకాశం ఇచ్చేదిగా ఉంటుంది. ఈ విధంగా

సందేహబహులమైన అర్థజ్ఞానం ప్రత్యక్షరూపం అవడంచేత నాట్యానికి నప్పదు.

మన్థరీభవతీతి:- ఆస్వాదం విఘ్నితమై దెబ్బతింటుంది అని అర్థం. తదాక్షేపా ఇత్యాదివాక్యానికి అర్థం చెపుతున్నాడు - తస్యాః ఇతి. తస్యాః = దీర్ఘసమాస సంఘటన యొక్క, ఏ, ఆక్షేపం (తనను, వాచ్యార్థాన్ని, బోధించవలసిన శబ్దసముదాయంలో కూర్చడం) ఉన్నదో అది లేకుండా ఏది (ఏ వాచ్యార్థం) వ్యంగ్యాభివ్యంజకం, కాదో, అట్టి, రసోచితః=రసాభివ్యంజకంగా స్వీకరించబడుచున్న ఏ వాచ్యార్థం ఉన్నదో దానికి దీర్ఘసమాస సంఘటనను గూర్చిన ఏ అపేక్ష ఉన్నదో అది వైగుణ్యం లేకపోవడానికి హేతువు. మామూలు మాటలలో దీని భావం ఇది-వాచ్యార్థం రౌద్రాదిరసాలను వ్యంజింపచేయవలసి ఉంది. అందుకు ఆ వాచ్యార్థం ఉచితంగా, తగినదిగా ఉండాలి. అది తగినదిగా ఉండాలంటే దానికి దీర్ఘసమాసాల అవసరం ఉంటుంది. దీర్ఘసమాసాల ప్రయోగానికి, రౌద్రరసాన్ని వ్యంజింప చేయవలసిన వాచ్యార్థానికీ అవినాభావసంబంధం ఉంది. అందుచేత అలాంటి చోట్ల వాచ్యార్థం దీర్ఘసమాససంఘటనను అపేక్షిస్తుంది గాన అక్కడ అలాంటి సంఘటనను ఉపయోగించడంలో వైగుణ్యం (దోషం)ఏదీ లేదు.

నాయకస్యేతి - 'తదాక్షేప' అనేదానికి కొందరు వ్యాఖ్యాతలు చెప్పిన 'నాయకుని ఆక్షేపం, అనగా వ్యాపారం, అర్థం ఇక్కడ సరిపడ్డట్లు కనబడదు; సరే చాలును.

## ధ్వన్యాలోకం

సర్వాసు చ సంఘటనాసు ప్రసాదాఖ్యో గుణో వ్యాపీ. స హి సర్వరససాధారణః సర్వసంఘటనాసాధారణశ్చేత్యుక్తమ్. ప్రసాదాతిక్రమే హ్యసమాసాపి సంఘటనా కరుణవిప్రలమ్భశృఙ్గారౌ న వ్యనక్తి. తదపరిత్యాగే చ మధ్యమసమాసాపి న న ప్రకాశయతి. తస్మాత్ సర్వత్ర ప్రసాదః అనుసర్తవ్యః. అత ఏవ చ 'యో యః శస్త్రం బిభర్తి' ఇత్యాదౌ యద్యోజసః స్థితిర్నేష్యతే తత్ప్రసాదాఖ్య ఏవ గుణః, న మాధుర్యమ్. న చాచారుత్వమ్, అభిప్రేతరసప్రకాశనాత్. తస్మాత్ గుణావ్యతిరిక్తత్వే గుణవ్యతిరిక్తత్వే వా సంఘటనాయాః యథోక్తాదౌచిత్యాత్ విషయనియమోఽస్తీతి తస్యా అపి రసవ్యఞ్జకత్వమ్. తస్యాశ్చ రసాభివ్యక్తినిమిత్తభూతాయాః యోఽ-

యమనన్తరోక్తో నియమహేతుః స ఏవ గుణానాం నియతో విషయ ఇతి గుణాశ్రయేణ వ్యవస్థానమప్యవిరుద్ధమ్.

బాలానందిని

ప్రసాదం అనే గుణం అన్ని సంఘటనలలోను వ్యాపించి ఉంటుంది. అది అన్ని రసాలకి సాధారణం, అన్ని సంఘటనలకీ సాధారణం అని చెప్పబడింది. ప్రసాదం లేకపోతే సమాసాలు లేని సంఘటన కూడ కరుణవిప్రలంభశృంగారాలను వ్యంజింపచేయదు. ఆ ప్రసాదాన్ని విడవకపోతే మధ్యమసమాససంఘటన కూడ వ్యంజింపచేయ దనేమాట లేదు (తప్పక వ్యంజింపచేస్తుంది). అందువల్ల అంతటా కూడ ప్రసాదాన్ని అనుసరించాలి. అందువల్లనే "యో యః శస్త్రం బిభర్తి" ఇత్యాదులలో ఓజస్సు ఉన్నట్లు అంగీకరించని పక్షంలో అక్కడ ప్రసాదం అనే గుణమే ఉంది గాని మాధుర్యం అనే గుణం కాదు. అయినా చారుత్వం లేకపోలేదు. ఎందుచేత ననగా ఏ రసం వ్యంజింపచేయా లని అనుకున్నాడో అది వ్యంజింపచేయబడుతూనే ఉంది. అందుచేత సంఘటన గుణాలకంటె అభిన్నం అయినా భిన్నం అయినా కూడ ఇప్పుడు చెప్పిన ఔచిత్యాన్ని పట్టి విషయనియమం, ఎక్కడ ఏ విధమైన సంఘటన ఉండాలి అనే నియమం, ఉన్నది గాన అది కూడ రసవ్యంజకమే. రసాభివ్యక్తికి నిమిత్తమైన ఆ సంఘటనకు ఇంత క్రితమే చెప్పిన ఏ నియమహేతువు ఉన్నదో అదే గుణాలకు నియతమైన విషయం గాన సంఘటన గుణాశ్రయం అని చెప్పడం కూడ విరుద్ధం కాదు.

లోచనం

వ్యాపీతి - యా కా చిత్సంఘటనా సా తథా కర్తవ్యా, యథా వాచ్యే ఝటితి భవతి ప్రతీతిః ఇతి యావత్. ఉక్తమితి - "సమర్పకత్వం కావ్యస్య యత్తు" ఇత్యాదినా. న వ్యనక్తీతి - వ్యఞ్జకస్య స్వవాచ్యస్యైవ అప్రత్యాయనాదితి భావః. తదితి - ప్రసాదస్య అపరిత్యాగే అభీష్టత్వాత్ అత్రార్థే స్వకణ్ఠేన అన్వయవ్యతిరేకావుక్తౌ. న మాధుర్యమితి. ఓజోమాధుర్యయోర్హి అన్యోన్యా భావరూపత్వం ప్రాఙ్నిరూపితమితి తయోః సంకరః అత్యన్తం శ్రుతిబాహ్యః ఇతి భావః. అభిప్రేతేతి - ప్రసాదేనైవ స రసః ప్రకాశితః, న న ప్రకాశిత ఇత్యర్థః. తస్మాదితి. యది గుణాః సంఘటనైకరూపాః తథాపి గుణనియమ ఏవ

సంఘటనాయా నియమః. గుణాధీనసంఘటనా పక్షేఽప్యేవమ్. సంఘటనాశ్రయగుణపక్షేఽపి సంఘటనాయా నియామకత్వేన యత్ వక్తృవాచ్యౌచిత్యం హేతుత్వేనోక్తం తద్గుణానామపి నియమహేతురితి పక్షత్రయేఽపి న కశ్చిద్విప్లవ ఇతి తాత్పర్యమ్. 5, 6.

బాలానందిని

వ్యాపీతి:-సంఘటన ఏదైనా, దానిని వాచ్యార్థం వెంటనే తెలిసే విధంగా చెయ్యాలి అని తాత్పర్యం. ఉక్తమితి - "సమర్పకత్వం కావ్యస్య యత్తు" (2.10) ఇత్యాదికంచేత చెప్పబడినది. న వ్యనక్తీతి - రసవ్యంజకమైన తన వాచ్యార్థాన్నే బోధించకపోవడంవల్ల అని భావం. తదితి-ప్రసాదం అభీష్టం అవడంచేత దానిని విడవకూడదు అనే విషయంలో అన్వయవ్యతిరేకాలు స్వకంఠంచేత చెప్పబడ్డాయి. స మాధుర్యమితి. ఓజస్సు, మాధుర్యం అనేవి వేరు వేరు అయినవి (అన్యోన్యాభావరూపాలు - ఓజస్సు మాధుర్యం కాదు, మాధుర్యం ఓజస్సు కాదు) అని వెనుక నిరూపించబడింది గాన వాటి సంకరం వినరానిది. అనగా శృంగారాదులలో ఓజస్సు, రౌద్రాదులలో మాధుర్యం ఉండడం అసంభావ్యం అని అర్థం. తస్మాదితి. గుణాలూ సంఘటనలు ఏకరూపాలే (ఒకటే) అని అంగీకరించినా కూడ గుణాలకు ఏ నియమమో అదే సంఘటనలకి కూడా వర్తిస్తుంది. సంఘటనలు గుణాలకి అధీనాలై ఉంటాయి అనే పక్షంలో కూడా ఇంతే. గుణాలు సంఘటనలను ఆశ్రయించుకొని ఉంటాయి అనే పక్షంలో సంఘటనకు నియామకం కావడంలో ఏ వక్తృ-వాచ్యౌచిత్యం హేతువుగా చెప్పబడిందో అదే గుణాల నియమానికి కూడా హేతువు అవుతుంది. ఈ విధంగా మూడు పక్షాలలోను కూడ ఏమీ విప్లవం లేదు అని తాత్పర్యం. 5.6

ధ్వన్యాలోకం

కా. విషయాశ్రయమప్యన్యదౌచిత్యం తాం నియచ్ఛతి,
కావ్యప్రభేదాశ్రయతః స్థితా భేదవతీ హి సా. 7

వక్తృవాచ్యగతౌచిత్యే సత్యపి విషయాశ్రయమ్ అన్యదౌచిత్యం సంఘటనాం నియచ్ఛతి. యతః కావ్యస్య ప్రభేదాః ముక్తకం సంస్కృతప్రాకృతాపభ్రంశనిబద్ధమ్; సందానితకవిశేషక

కలాపకకులకాని; పర్యాయబన్ధః, పరికథా, ఖణ్డకథా - సకలకథే, సర్గబన్ధః, అభినేయార్థమ్, ఆఖ్యాయికా-కథే ఇత్యేవమాదయః. తదాశ్రయేణాపి సంఘటనా విశేషవతీ భవతి. తత్ర ముక్తకేషు రసబన్ధాభినివేశినః కవేః తదాశ్రయమౌచిత్యమ్. తచ్చ దర్శితమేవ. అన్యత్ర కామచారః.

బాలానందిని

విషయేతి - విషయాశ్రితమ్= విషయాన్ని ఆశ్రయించిన, అన్యత్= మరియొక, ఔచిత్యమపి= ఔచిత్యం కూడ, తామ్= సంఘటనను, నియచ్ఛతి= నియమించును. సా= సంఘటన, కావ్యభేదాశ్రయతః= కావ్యభేదాల ఆశ్రయంవల్ల, భేదవతీ= భేదం కలదిగా, స్థితా హి= ఉన్నది కదా?

వక్త్రీతి - వక్తకు వాచ్యానికి సంబంధించిన ఔచిత్యం ఉండగా కూడ విషయానికి సంబంధించిన మరొక ఔచిత్యం సంఘటనను నియమిస్తుంది. ఎందువలన అనగా - సంస్కృతప్రాకృత అపభ్రంశభాషలలో కూర్చబడిన ముక్తకం, సందానితకం, విశేషకం, కలాపకం, కులకం, పర్యాయబంధం, పరికథ, ఖండకథ, సకలకథ, సర్గబంధం, అభినేయార్థం, ఆఖ్యాయిక, కథ ఈ మొదలైన కావ్యప్రభేదాలు ఉన్నాయి. వాటిని ఆశ్రయించడంచేత కూడ సంఘటన విశేషం కలిగి ఉంటుంది. అనగా ఆ కావ్యభేదాలను పట్టి కూడ సంఘటన వేరు వేరుగా ఉంటుంది. వాటిలో ముక్తకాలలో కవి రసబంధాభినివేశం (రసంలో పట్టుదల) కలవాడైతే ఔచిత్యం దానిని ఆశ్రయించుకొని ఉంటుంది. అది వెనక చూపబడింది. రసబంధాభినివేశం లేనప్పుడు కామచారం (స్వేచ్ఛ).

లోచనం

నియామకాన్తరమప్యస్తీత్యాహ - విషయాశ్రయమితి. విషయశబ్దేన సంఘాతవిశేష ఉక్తః. యథా హి సేనాద్యాత్మకసంఘాతనివేశీ పురుషః కాతరోఽపి తదౌచిత్యాదనుగుణతయైవాస్తే తథా కావ్యవాక్యమపి సంఘాతవిశేషాత్మకసన్దానితకాదిమధ్యనివిష్టం తదౌచిత్యేన వర్తతే. ముక్తకం తు విషయశబ్దేన యదుక్తం తత్సంఘాతాభావేన స్వాతన్త్ర్యమాత్రం ప్రదర్శయితుం, స్వప్రతిష్ఠితమాకాశమితి యథా. అపిశబ్దేనేదమాహ - సత్యపి

వక్తృవాచ్యౌచిత్యే విషయౌచిత్యం కేవలం తారతమ్యభేదమాత్రవ్యాప్తమ్; న తు విషయౌచిత్యేన వక్తృవాచ్యౌచిత్యం నివార్యతే ఇతి.

బాలానందిని

నియామకేతి - మరొక నియామకం కూడా ఉన్నది అని చెపుతున్నాడు. విషయాశ్రయమితి. విషయశబ్దంచేత ఒక సముదాయవిశేషం చెప్పబడుతున్నది. సేన మొదలైన ఒక సముదాయంలో చేరిన ఒక పురుషుడు పిరికివాడైనా, ఆ సముదాయౌచిత్యాన్ని పట్టి దానికి అనుగుణంగానే ఎలా ప్రవర్తిస్తాడో అదే విధంగా సంఘాతవిశేషరూపమైన సందానితకాదుల మధ్య చేరిన కావ్యవాక్యం కూడ దానికి తగిన విధంగానే ఉంటుంది.

'విషయ' శబ్దానికి అర్థం సంఘాతం అయితే సంఘాతరూపంలో ఉండని ముక్తకాన్ని వృత్తికారుడు విషయంగా ఎందుకు ప్రతిపాదించాడు అనేదానికి సమాధానం చెపుతున్నాడు - ముక్తకం తు ఇతి. ముక్తకాన్ని విషయంగా ఎందుకు పేర్కొన్నా డనగా, సంఘాతం లేకుండా అది స్వతంత్రంగా నిలవగలదు అని చెప్పడంకోసం. "ఆకాశం స్వప్రతిష్ఠితం" అని చెప్పినట్లు.

వివరణ: ముక్తకం ఇతరాపేక్ష లేని స్వతంత్రరచన. అయినా అది రసనిష్యంది అవడంచేత సంఘటనను నియమించడంలో దానికి స్వాతంత్ర్యం ఉంది అని చెప్పడం కోసం వృత్తికారుడు దానిని గ్రహించాడు. పంచమహాభూతాలలో నాలుగు భూతాలు దేని మీద నిలిచాయి అని ప్రశ్నిస్తే ఆకాశంలో నిలిచాయి అని సమాధానం. ఆకాశం దేనిమీద నిలచింది అని ప్రశ్నిస్తే ఆకాశం ఆకాశంలోనే నిలిచింది; స్వతంత్రమైనది అని చెప్పినట్లు ఇక్కడ ముక్తకాని కున్న స్వాతంత్ర్యం సూచించబడింది అని భావం.

అపిశబ్దేనేతి :- 'విషయాశ్రయమపి'లోని అపిశబ్దంచేత - "వక్తృ వాచ్యౌచిత్యం ఉన్నా కూడ విషయౌచిత్యం కేవలం తారతమ్యభేదాన్ని మాత్రం సూచిస్తుంది; అంతేనే కాని విషయౌచిత్యంచేత వక్తృవాచ్యౌచిత్యం నివారించబడదు, అనగా అవసరం లేకుండా పోదు" అని చెపుతున్నాడు.

లోచనం

ముక్తకమితి - ముక్తమ్ అన్యేన అనాలిఙ్గితమ్. తస్య సంజ్ఞాయాం కన్. తేన స్వతన్త్రతయా పరిసమాప్తనిరాకాఙ్క్షార్థమపి ప్రబన్ధమధ్యవర్తి న ముక్తకమితీత్యుచ్యతే. ముక్తకస్యైవ విశేషణం సంస్కృతేత్యాది. క్రమభావిత్వాత్

తథైవ నిర్దేశః. ద్వాభ్యాం క్రియాసమాప్తౌ సందానితకమ్, త్రిభిః విశేషకమ్, చతుర్భిః కలాపకమ్, పఞ్చప్రభృతిభిః కులకమ్ ఇతి క్రియాసమాప్తికృతా భేదా ఇతి ద్వన్ద్వేన నిర్దిష్టాః. అవాన్తరక్రియాసమాప్తావపి వసన్తవర్ణనాదిః ఏకవర్ణనీయోద్దేశేన ప్రవృత్తః పర్యాయబన్ధః. ఏకం ధర్మాదిపురుషార్థముద్దిశ్య ప్రకారవైచిత్ర్యేణ అనన్తవృత్తాన్తవర్ణప్రకారా పరికథా. ఏకదేశవర్ణనా ఖణ్డకథా. సమస్తఫలాన్తేతివృత్తవర్ణనా సకలకథా. ద్వయోరపి ప్రాకృతప్రసిద్ధత్వాత్ ద్వన్ద్వేన నిర్దేశః. పూర్వేషాం తు ముక్తకాదీనాం భాషాయామనియమః. మహాకావ్యరూపః పురుషార్థఫలః సమస్తవస్తువర్ణనాప్రబన్ధః సర్గబన్ధః సంస్కృత ఏవ. అభినేయార్థం దశరూపకం నాటికాత్రోటకరాసకప్రకరణికాద్యవాన్తరప్రపఞ్చ సహితమ్ అనేకభాషావ్యామిశ్రరూపమ్. ఆఖ్యాయికా ఉచ్ఛ్వాసాదినా వక్త్రాపరవక్త్రాదినా చ యుక్తా. కథా తద్విరహితా. ఉభయోరపి గద్యబన్ధ స్వరూపతయా ద్వన్ద్వేన నిర్దేశః. ఆదిగ్రహనాత్ చమ్ప్వాః. యథాహ దణ్డీ - "గద్యపద్యమయీ చమ్ప్వాః" ఇతి. అన్యత్రేతి - రసబన్ధానభినివేశే.

బాలానందిని

ముక్తకమితి. 'ముక్తమ్' ఇతరమైనదానితో దేనితోనూ కలవనిది అని అర్థం. 'ముక్త' శబ్దానికి సంజ్ఞార్థంలో 'కన్' అనే ప్రత్యయం చేర్చగా 'ముక్తకమ్' అవుతుంది. అనగా ఇది ఒకదానికి పేరు గాన రూఢపదం. అందుచేత ప్రబంధమధ్యలో ఉన్న ఏదైన శ్లోకం పూరాపరశ్లోకాల ఆకాంక్ష లేని పరిసామాప్తమైన అర్థం స్వతంత్రంగా బోధించినా దాన్ని 'ముక్తకం' అనకూడదు. "సంస్కృతప్రాకృతాపభ్రంశనిబద్ధమ్" అనేది (ఏకవచనంలో ఉండడంచేత) 'ముక్తకమ్' అనేదానికే విశేషణం. సంస్కృతప్రాకృత అపభ్రంశభాషలు (ముందు సంస్కృతం తరవాత ప్రాకృతభాషలు తరవాత అపభ్రంశభాషలు అని) క్రమంగా ఉన్నవి అవడంచేత ఆ క్రమంలోనే నిర్దేశించబడ్డాయి. రెండు శ్లోకాలతో క్రియ పూర్తి అయితే 'సందానితకం'; మూడు శ్లోకాలచేత 'విశేషకం'. నాలుగు శ్లోకాలచేత 'కలాపకం'; ఐదు మొదలు శ్లోకాలచేత 'కులకం'. ఈ భేదాలు క్రియాసమాప్తిని పట్టి ఏర్పడ్డవి కాబట్టి ఈ అయిందిటినీ ద్వంద్వసమాసంచేత నిర్దేశించాడు. అవాంతర క్రియాసమాప్తి ఉన్నా అనగా ఏ శ్లోకానికి ఆ శ్లోకం పరిపూర్ణార్థం బోధించేదిగా ఉన్నా, వసంతవర్ణనం మొదలైన ఒక వర్ణనీయ విషయాన్ని ఉద్దేశించి ప్రవర్తించినది

"పర్యాయబంధం" ( ఈ మధ్య చాలామంది సంస్కృతకవులు ఇలాంటి రచనలు చేస్తున్నారు. అస్మద్విరచిత "వ్యాఘ్రీతనయసంవాద', 'వసంతవర్ణన', 'న కదాచిదనీదృశం జగత్' ఇత్యాదులు ఇందుకు ఉదాహరణలు) ఏదైనా ఒక ధర్మాదిపురుషార్థాన్ని ఉద్దేశించి విచిత్రప్రకారాలతో అనంతమైన వృత్తాంతాలవర్ణన ప్రకారంలో ఉండేది "పరికథ". ప్రసిద్ధమైన ఇతివృత్తంలోని ఒక భాగాన్ని వర్ణించడం 'ఖండకథ'. ఫలం అంతమందు గల పూర్తి ఇతివృత్తంయొక్క వర్ణన "సకలకథ". ఈ రెండూ ప్రాకృత భాషలో ప్రసిద్ధాలు గాన "ఖణ్డకథాపరికథే" అని ద్వంద్వసమాసంలో నిర్దేశం చేయబడింది. ఇంతకు ముందు చెప్పిన ముక్తకాదులకు మాత్రం భాష విషయంలో నియమం లేదు. (అవి ఏ భాషలో నైనా ఉండవచ్చు). పురుషార్థం ఫలంగా గలదీ, మహాకావ్యరూపమూ అయిన సమస్తవస్తువులను వర్ణించే ప్రబంధం 'సర్గబంధం'; ఇది సంస్కృతంలోనే ఉంటుంది. నాటిక, త్రోటకం, రాసకం, ప్రకరణిక మొదలైన అవాంతరవిస్తృతితో కూడిన దశరూపకం, అనగా "నాటకం సప్రకరణం భాణః ప్రహసనం డిమః, వ్యాయోగసమవాకారౌ వీథ్యఙ్కేహామృగా దశ" అని చెప్పిన రూపకదశకం "అభినేయార్థం". ఈ అభినేయార్థంలో అనేక భాషలు కలిసి ఉంటాయి. ఉచ్ఛ్వాసం మొదలైన వాటితోను, వక్త్ర-అపరవక్త్రాదిఛందస్సులతోను కూడినది 'ఆఖ్యాయిక'. అవి లేనిది 'కథ'. ఈ రెండూ గద్యబంధరూపాలవడంచేత "ఆఖ్యాయికాకథే" అని ద్వంద్వంలో నిర్దేశించబడ్డాయి. 'ఆది' అనడంచేత చంపువును గ్రహించాలి. "గద్యపద్యమయీ చమ్పూః" (గద్యపద్య మయమైనది చంపువు) అని దండి చెప్పాడు. అన్యత్రేతి - రసబన్ధాభినివేశం లేనప్పుడు.

## ధ్వన్యాలోకం

ముక్తకేషు ప్రబన్ధేష్వివ రసబన్ధాభినివేశినః కవయో దృశ్యన్తే. యథా హ్యమరుకస్య కవేః ముక్తకాః శృఙ్గారరసస్యన్దినః ప్రబన్ధాయమానాః ప్రసిద్ధా ఏవ. సందానితకాదిషు తు వికటనిబన్ధనౌచిత్యాత్ మధ్యమసమాసాదీర్ఘసమాసే ఏవ రచనే. ప్రబన్ధాశ్రయేషు యథోక్తప్రబన్ధౌచిత్యమేవ అనుసర్తవ్యమ్. పర్యాయబన్ధే పునః అసమాసామధ్యమసమాసే ఏవ సంఘటనే. కదాచిదర్థౌచిత్యాశ్రయేణ దీర్ఘసమాసాయామపి సంఘటనాయాం పరుషా గ్రామ్యా చ వృత్తిః

పరిహర్తవ్యా. పరికథాయాం కామచారః. తత్రేతివృత్తమాత్రోపన్యాసేన నాత్యన్తం రసబన్ధాభినివేశాత్. ఖణ్డకథాసకలకథయోస్తు ప్రాకృతసిద్ధయోః కులకాదినిబన్ధనభూయస్త్వాత్ దీర్ఘసమాసాయామపి న విరోధః. వృత్త్యౌచిత్యం తు యథారసమనుసర్తవ్యమ్. సర్గబన్ధే తు రసతాత్పర్యే యథారసమ్ ఔచిత్యమ్. అన్యథా తు కామచారః. ద్వయోరపి మార్గయోః సర్గబన్ధవిధాయినాం దర్శనాత్. రసతాత్పర్యం సాధీయః. అభినేయార్థే తు సర్వథా రసబన్ధే అభినివేశః కార్యః.

బాలానందిని

ముక్తకేష్వితి:- ముక్తకాలలో కూడ ప్రబంధాలలో వలెనే కవులు రసబంధం చెయ్యా లనే పట్టుదల కలవాళ్లు కనబడుతున్నారు. ఉదాహరణకి - అమరుకకవి రచించిన ముక్తకాలలో ప్రబంధాలలో వలె శృంగారరసం చిప్పిలుతూంటుందనే విషయం ప్రసిద్ధమే. (స్వతంత్రమైన) సందానితకాదులలో వికటమైన కూర్పు ఉండడమే ఉచితం గాన మధ్యమసమాససంఘటన గాని దీర్ఘసమాససంఘటన గాని ఉండాలి. అయితే ఈ సందానితకాదులు ప్రబంధాల మధ్య ఉంటే ఆ ప్రబంధంలో ఎలాంటి ఔచిత్యం పాటించాలో దానినే వీటి విషయంలో పాటించాలి. పర్యాయబంధంలో అయితే అసమాససంఘటన, మధ్యమసమాససంఘటన మాత్రమే ఉండాలి. ఒకప్పుడు అర్థౌచిత్యాన్ని పట్టి దీర్ఘసమాసమైన సంఘటన అవలంబించినా కూడ పరుషవృత్తినీ, గ్రామ్యవృత్తినీ పరిహరించాలి. పరికథలో కామచారం (ఎలా వీలుగా ఉంటే అలా చేయవచ్చు) ఎందుచేత ననగా దానిలో కథ చెప్పడానికే ప్రాధాన్యం ఉండడంచేత రసబంధం విషయంలో అంతగా అభినివేశం (పట్టుదల) ఉండదు. ప్రాకృతభాషలో ప్రసిద్ధాలైన ఖండకథ-సకలకథలలో అయితే కులకాదుల కూర్పు ఎక్కువగా ఉండడంచేత దీర్ఘసమాససంఘటన ఉన్నాకూడ విరోధం లేదు. కాని రసానుగుణంగా వృత్తుల ఔచిత్యం మాత్రం పాటించాలి. సర్గబంధంలో అయితే రసం విషయంలో తాత్పర్యం ఉంటే రసానుసారం ఔచిత్యం పాటించాలి. రసబంధాభినివేశం లేకపోతే కామచారం. రెండు మార్గాలలోను సర్గబంధనిర్మాతలు కనబడుతున్నారు: అయితే రసతాత్పర్యం ఉండడం మంచిది. అభినేయార్థంలో మాత్రం అన్ని విధాలా రసబంధంలో పట్టుదల వహించాలి.

లోచనం

నను ముక్తకే విభావాదిసంఘటనా కథం యేన తదాయత్తో రసః స్యాదిత్యాశఙ్క్యాహ - ముక్తకేష్వితి. అమరుకస్యేతి -

"కథమపి కృతప్రత్యాపత్తౌ ప్రియే స్ఖలితోత్తరే
విరహకృశయా కృత్వా వ్యాజప్రకల్పితమశ్రుతమ్,
అసహనసఖీశ్రోత్రప్రాప్తిం విశఙ్క్య ససంభ్రమం
వివలితదృశా శూన్యే గేహే సముచ్ఛ్వసితం తతః".

ఇత్యత్ర శ్లోకే స్ఫుటైవ విభావాదిసంపత్ప్రతీతిః. వికటేతి:- అసమాసాయాం హి సంఘటనాయాం మన్థరరూపా ప్రతీతిః సాకాఙ్క్షా సతీ చిరేణ క్రియాపదం దూరవర్త్యనుధావన్తీ వాచ్యప్రతీతావేవ విశ్రాన్తాసతీ న రసతత్త్వచర్వణాయోగ్యా స్యాదితి భావః. ప్రబన్ధాశ్రయేష్వితి సందానితకాదిషు కులకాన్తేషు. యది వా ప్రబన్ధేఽపి ముక్తకస్యాస్తు సద్భావః, పూర్వాపరనిరపేక్షేణాపి యేన రసచర్వణా క్రియతే తదేవ ముక్తకమ్. యథా "త్వామాలిఖ్య ప్రణయకుపితామ్" ఇత్యాదిశ్లోకః. కదాచిదితి రౌద్రాదివిషయే. నాత్యన్తమితి. రసబన్ధే యో నాత్యన్తమభినివేశః తస్మాదితి సంగతిః వృత్త్యౌచిత్యమితి. పరుషోపనాగరికా గ్రామ్యాణాం వృత్తీనామౌచిత్యం యథాప్రబన్ధం యథారసం చ. అన్యథా ఇతి - కథామాత్రతాత్పర్యే వృత్తిష్వపి కామచారః. ద్వయోరపీతి సప్తమీ. కథాతాత్పర్యే సర్గబన్ధో యథా భట్టజయన్తకస్య కాదమ్బరీకథాసారమ్. రసతాత్పర్యం యథా రఘువంశాది. అన్యే తు సంస్కృతప్రాకృతయోః ద్వయోః ఇతి వ్యాచక్షతే. తత్ర తు రసతాత్పర్యం సాధీయః ఇతి యదుక్తం తత్కిమపేక్షయేతి నేయార్థం స్యాత్. 7

బాలానందిని

నన్వితి - విభావాదులసంఘటనమీద ఆధారపడి ఉన్న రసం కలగడానికి ముక్తకంలో వాటి సంఘటన ఎలా కుదురుతుంది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - ముక్తకేష్వితి. అమరుకస్యేతి.

కథమపీతి - కథమపి= ఎట్లో, కృతప్రత్యాపత్తౌ= చేయబడిన తిరిగి రాక గల, తిరిగి

వచ్చిన, ప్రియే= ప్రియుడు, స్థలితోత్తరే= గోత్రస్ఖలనంతో కూడిన ప్రత్యుత్తరం కలవాడగుచుండగా, ఏదో సమాధానం చెపుతూ గోత్రస్ఖలనం చేయగా, వ్యాజప్రకల్పితమ్= ఏదోవంకచేత చేయబడిన, అశ్రుతమ్= వినకపోవుటను, కృత్వా= చేసి, ఆ గోత్రస్ఖలితాన్ని విననట్లు అభినయించి, విరహకృశయా= విరహంచేత కృశించిన ఆమెచేత అసహనసఖీశ్రోత్రప్రాప్తిమ్= తనకు జరిగిన ఆ అవమానాన్ని సహించని సఖురాళ్ల చెవిః పొందుటను, వాళ్లకు వినబడుటను, విశఙ్క్య = శంకించి, ససంభ్రమమ్= తొందరతో కూడినట్లుగా, వివలితదృశా= త్రిప్పబడిననేత్రాలు కలదిగా అయి, తతః= అటుపిమ్మట శూన్యే గేహే= శూన్యగృహంలో, సముచ్ఛ్వసితమ్= నిట్టూర్పు విడవబడినది. నిట్టూరు ఆ సఖురాళ్లకి వినబడితే వాళ్లు తనకు జరిగిన అవమానాన్ని సహించ రనీ, తాన వాళ్లందరిలో చులకనైపోతా ననీ భయపడి ఆమె ఎవరూ లేని గది వైపు తిరి నిట్టూర్చింది అని భావం.

ఇత్యత్రేతి - ఈ శ్లోకంలో విభావాదుల సమృద్ధియొక్క జ్ఞానం స్ఫుటంగా ఉంది కదా? వికటేతి - సంఘటన సమాసరహితం అయినప్పుడు అర్థప్రతీతి చాల మందంగా ఉంటుంది. అడుగడుగునా ఆకాంక్ష కలుగుతూండగా దూరంగా ఉన క్రియాపదందగ్గరికి చేరేటప్పటికి ఆ జ్ఞానం వాచ్యార్థంలోనే విశ్రాంతి చెందుతుం (వాచ్యార్థంతోనే ఆగిపోతుంది). అలాంటప్పుడు ఆ ప్రతీతి రసచర్వణయోగ్యం కాజాలద అని భావం. ప్రబన్ధాశ్రయేష్వితి :- (ఇక్కడ చెప్పిన నియమం స్వతంత్రంగా ఉన సందానితకాదులకే వర్తిస్తుంది) ప్రబంధమధ్యలో అక్కడక్కడ ఉన్న సందానితక మొదలు కులకం వరకు ఉన్నవాటిలో ముక్తకం ప్రబంధాల మధ్య ఉంద దని వెన చెప్పి ఉన్నాడు. ప్రబంధమధ్యలో కూడ దానిని అంగీకరించవచ్చును అని ఇప్పుడ చెపుతున్నాడు. యది వా ఇతి. లేదా ప్రబంధంలో కూడ ముక్తకం ఉండవచ్చు పూర్వపరాపేక్షలేకుండా దేనిచేత రసచర్వణ చేయబడుతుందో అదే ముక్తకం. ఉదాహరణ - 'త్వామాలిఖ్య' ఇత్యాదిమేఘదూతగతశ్లోకం. అందుచేత "ప్రబంధాని ఆశ్రయించినవాటిలో" అని చెప్పినవాటిలో సందానితకాదులతో పాటు ముక్తకాన్ని కూడ చేర్చుకొనవచ్చును అని భావం. కదాచిదితి - రౌద్రాదులలో అని అర్థం నాత్యన్తమితి - రసబంధంలో ఏ అత్యంతాభినివేశం లేదో దానివల్ల (ఆ కారణంవల్ల) అః అన్వయం. వృత్త్యౌచిత్యమితి. ప్రబంధానుసారంగాను, రసానుగుణంగానూ కూడ పరుష ఉపనాగరికా-గ్రామ్యవృత్తుల ఔచిత్యం. అన్యథా ఇతి- కథామాత్రమునందే తాత్పర్యం ఉంటే వృత్తుల విషయంలో కూడ కామచారమే అని అర్థం. ద్వయోః అపి అః

సప్తమీవిభక్తి. కథామాత్రతాత్పర్యానికి భట్టజయంతకుడు రచించిన 'కాదంబరీసారం' ఉదాహరణం. రసతాత్పర్యానికి రఘువంశాదికం ఉదాహరణం. కొందరు 'ద్వయోః' అనే పదానికి 'సంస్కృత-ప్రాకృతములు రెండు అని అర్థం చెప్పారు. ఈ అర్థం చెపితే "రసతాత్పర్యం సాధీయః" (రసతాత్పర్యం మంచిది) అని చెప్పిన సాధీయస్త్వం దేనిని అపేక్షించి? అనగా రసతాత్పర్యం దేనికంటే మంచిదని చెప్పినట్లు? దీనికి సమాధానంకోసం కొత్త అర్థం కల్పించుకొనవలసి వస్తుంది. 7

## ధ్వన్యాలోకం

ఆఖ్యాయికాకథయోస్తు గద్యనిబన్ధనబాహుల్యాత్ గద్యే చ ఛన్దో బన్ధభిన్నప్రస్థానత్వాత్ ఇహ నియమే హేతురకృతపూర్వోఽపి మనాక్ క్రియతే -

కా. ఏతద్యథోక్తమౌచిత్యమేవ తస్యా నియామకమ్,
సర్వత్ర గద్యబన్ధేఽపి ఛన్దోనియమవర్జితే. 8

యదేతదౌచిత్యం వక్తృవాచ్యగతం సంఘటనాయా నియామకముక్తమ్ ఏతదేవ గద్యే ఛన్దోనియమవర్జితేఽపి విషయాపేక్షం నియమహేతుః. తథాహి - అత్రాపి యదా కవిః కవినిబద్ధో వా వక్తా రసభావరహితః తదా కామచారః. రసభావసమన్వితే తు వక్తరి పూర్వోక్తమేవ అనుసర్తవ్యమ్, తత్రాపి చ విషయౌచిత్యమేవ. ఆఖ్యాయికాయాం తు భూమ్నా మధ్యమసమాసాదీర్ఘసమాసే ఏవ సంఘటనే. గద్యస్య వికటబన్ధాశ్రయేణ ఛాయావత్త్వాత్. తత్ర చ తస్య ప్రకృష్యమాణత్వాత్. కథాయాం తు వికటబన్ధప్రాచుర్యేఽపి గద్యస్య రసబన్ధోక్తమ్ ఔచిత్యమ్ అనుసర్తవ్యమ్.

### బాలానందిని

ఆఖ్యాయికేతి - ఆఖ్యాయికా-కథలలో అయితే గద్యనిబంధన అధికంగా ఉంటుంది. అందుచేత వీటి మార్గం ఛందోబంధంకంటె భిన్నంగా ఉంటుంది. అందుచేత

గద్యవిషయంలో సంఘటనానియమానికి సంబంధించిన హేతువు పూర్వం చెప్పబడకపోయినా ఇప్పుడు కొంచెం చెప్పబడుతున్నది.

ఏతదితి. ఛన్దోనియమవర్జితే= ఛందోనియమాలు లేని, గద్యబన్ధేఽపి= గద్యబంధంలో కూడ, సర్వత్ర= అంతటా, ఏతత్= ఈ, ఔచిత్యమేవ= ఔచిత్యమే. యథోక్తమ్= పైన చెప్పిన విధంగా, నియామకమ్= నియామకము.

యదితి - వక్తృ-వాచ్యాలకి సంబంధించిన ఏ ఔచిత్యం సంఘటనకు నియామకంగా చెప్పబడిందో విషయాపేక్షమైన ఆ ఔచిత్యమే ఛందోనియమవర్జిత మైన గద్యంతో కూడ నియమానికి (సంఘటనానియమానికి) హేతువు. అది ఎట్లనగా (తథా హి) - ఇక్కడ కూడ కవి లేదా కవినిబద్ధవక్త రసభావరహితుడైతే అప్పుడు కామచారమే. వక్త రసభావసమన్వితు డైతే మాత్రం వెనక చెప్పిన ఔచిత్యమే అనుసరించాలి. అందులోను విషయౌచిత్యమే పాటించాలి. ఆఖ్యాయికలో అయితే సంఘటనలు చాలవరకు మధ్యమసమాసాలు గాను, దీర్ఘసమాసాలు గాను ఉండాలి. ఎందువల్ల సనగా వికటబంధం అవలంబిస్తేనే గద్యలో సొగసు ఉంటుంది. ఆఖ్యాయికలో అది (వికటబంధం) అధికంగా ఉంటుంది. కథలో అయితే, గద్య వికటబంధప్రచురంగా ఉన్నా రసబంధం విషయంలో చెప్పిన ఔచిత్యాన్ని పాటించాలి.

లోచనం

విషయాపేక్షమితి - గద్యబన్ధస్య భేదా ఏవ విషయత్వేన అనుమన్తవ్యాః.8

బాలానందిని

గద్యేతి - గద్యబంధంలో ఉన్న భేదాలనే ఇక్కడ విషయంగా గ్రహించాలి. అనగా - 'విషయాపేక్షమ్' అనేదానికి గద్యకావ్యాలలో ఉన్న భేదాలను పట్టి అని అర్థం. 8.

ధ్వన్యాలోకం

కా. రసబన్ధోక్తమౌచిత్యం భాతి సర్వత్ర సంశ్రితా,
రచనా విషయాపేక్షం తత్తు కించిద్విభేదవత్. 9

అథవా పద్యవద్గద్యప్రబన్ధేఽపి రసబన్ధోక్తమౌచిత్యం సర్వత్ర సంశ్రితా రచనా భవతి. తత్తు విషయాపేక్షం కించిద్విశేషవద్భవతి న తు సర్వాకారమ్. తథాహి - గద్యబన్ధేఽప్యతిదీర్ఘసమాసా రచనా న విప్రలమ్భశృఙ్గారకరుణయోః ఆఖ్యాయికాయామపి శోభతే.

నాటకాదావప్యసమాసైవ. న రౌద్రవీరాదివర్ణనే. విషయాపేక్షం త్వౌచిత్యం ప్రమాణతః అపకృష్యతే ప్రకృష్యతే చ. తథాహి - ఆఖ్యాయికాయాం నాత్యన్తమసమాసా స్వవిషయేఽపి; నాటకాదౌ నాతిదీర్ఘసమాసా చేతి సంఘటనాయాః దిక్ అనుసర్తవ్యా.

బాలానందిని

రసేతి - సర్వత్ర= అంతటా కూడ, రసబన్ధోక్తమ్= రసబంధం విషయంలో చెప్పబడిన, ఔచిత్యమ్= ఔచిత్యాన్ని, సంశ్రితా= ఆశ్రయించిన, రచనా= సంఘటన, భాతి= ప్రకాశిస్తుంది. విషయాపేక్షమ్= విషయాన్ని అపేక్షించిన, తత్తు= ఆ రసౌచిత్యం అయితే, కించిత్= కొంచెం, విభేదవత్= భేదం కలది.

అథవేతి - లేదా పద్యంలో వలెనే గద్యబంధంలో కూడ, అంతటా సంఘటన రసబంధం విషయంలో చెప్పిన ఔచిత్యాన్ని ఆశ్రయించి ఉంటుంది. విషయాపేక్షమైన, విషయభేదాన్ని పట్టి ఏర్పడిన, ఆ ఔచిత్యంలో మాత్రం కొంచెం విశేషం ఉంటుంది; అంతే కాని పూర్తిగా భేదం ఉండదు. అది ఎట్లనగా - ఆఖ్యాయికారూపమైన గద్యబంధంలో కూడ విప్రలంభశృంగార-కరుణరసాలలో అతిదీర్ఘమైన సమాసాలున్న రచన శోభించదు. నాటకాదులలో కూడ రౌద్రవీరాదివర్ణనలో సమాసరహితమైన రచన శోభించదు. అనగా నాటకాదులలో రచన అసమాసంగానే ఉండాలి; కాని రౌద్రవీరాదివర్ణనలలో మాత్రం అది శోభించదు అని అర్థం. విషయాపేక్షమైన, అనగా కథా - ఆఖ్యాయికా - నాటకాది విషయాలమీద ఆధారపడి ఉన్న, ఔచిత్యమైతే రసౌచిత్యరూపమైన ప్రమాణాన్ని పట్టి తగ్గవచ్చు, హెచ్చవచ్చు కూడ. అది ఎట్లనగా (తథాహి) - (మధ్యసమాస -దీర్ఘసమాసాలు ఉండవలసిన) ఆఖ్యాయికలో కూడ, స్వవిషయంలో కూడ, అనగా శృంగారకరుణాదులలో కూడ, పూర్తిగా సమాసరహితమైన రచన శోభించదు. నాటకాదులలో (సమాసాధిక్యం ఉండకూడని నాటకాదులలో) స్వవిషయంలో, అనగా రౌద్రవీరాదులలో కూడ అతిదీర్ఘ సమాసమైన సంఘటన శోభించదు. ఈ విధంగా సంఘటన విషయంలో ఈ పద్ధతి అనుసరించతగినది. రసౌచిత్యానికి ప్రాధాన్యం ఇస్తూ, కొంతవరకు ప్రబంధౌచిత్యాన్ని కూడ దృష్టిలో ఉంచుకొని తగిన సంఘటనను ఉపయోగించాలి అని సంపిండితార్థం.

లోచనం

స్థితపక్షం తు దర్శయతి - రసబన్ధోక్తమితి. వృత్తౌ చ వాశబ్దః అస్యైవ పక్షస్య స్థితిద్యోతకః. యథా -

"స్త్రియో నరపతిర్వహ్నిః విషం యుక్త్యా నిషేవితమ్,

స్వార్థాయ యది వా దుఃఖసంభారాయైవ కేవలమ్". ఇతి

రచనా సంఘటనా. తర్హి విషయౌచిత్యం సర్వథైవ త్యక్తమ్? నేత్యాహ - తదేవ రసౌచిత్యం విషయం సహకారితయా అపేక్ష్య, కించిద్విభేదః అవాన్తర వైచిత్ర్యం విద్యతే యస్య సంపాద్యత్వేన తాదృశం భవతి. ఏతద్వ్యాచష్టే - తత్త్వితి. సర్వాకారమ్ ఇతి క్రియావిశేషణమ్. అసమాసైవ ఇతి. సర్వత్రైవేతి శేషః. తథా హి వాక్యాభినయలక్షణే "చూర్ణపాదైః ప్రసన్నైః" ఇత్యాది మునిరభ్యధాత్. అత్రాపవాదమాహ - న చేతి. నాటకాదావితి. స్వవిషయే ఽపీతి సంబన్ధః. 9

బాలానందిని

స్థితేతి - (సంఘటనను గూర్చిన అనేకపక్షాలు ప్రతిపాదించి ఇప్పుడు) ఉన్న పక్షాన్ని (అసలు విషయాన్ని) రసబన్ధోక్తమిత్యాదికంచేత చెపుతున్నాడు. వృత్తిలోని 'హ' శబ్దం (అథవా లోని 'వా' శబ్దం)నిలబడేది ఈ పక్షమే అని సూచిస్తుంది. 'అథవా' అనేది మరొక పక్షాన్ని బోధించే పదం కదా? ఇక్కడ ఈ అర్థం ఎలా లభిస్తుంది అని ఆశంకించుకొని 'వా' శబ్దానికి తాను చెప్పిన అర్థంలో ప్రయోగం చూపుతున్నాడు - యథా ఇతి. స్త్రియః ఇతి "స్త్రీలు, రాజు, అగ్ని, విషం ఈ నాలుగూ తెలివిగా సేవిస్తే తనకు (అలా సేవించేవానికి) లాభం కలిగిస్తాయి. లేదా ఇవి కేవలం దుఃఖసంభారాన్ని కలిగించేవిగానే ఉంటాయి".

ఇక్కడ యదివా లోని 'వా' శబ్దం మొదట చెప్పినదానిని అంతా కొట్టేసి - "తెలివిగా సేవించినా, తెలివి తక్కువగా సేవించినా వీటివల్ల దుఃఖసంభారమే కాని స్వార్థలాభం ఉండదు" అనే విషయాన్ని స్థిరీకరిస్తున్నది. అదే విధంగా ఇక్కడ 'వా' శబ్దం ఈ పక్షమే చివరికి నిలిచే పక్షం అన్నట్లు సూచిస్తున్నది. అని భావం.

కారికను వ్యాఖ్యానిస్తున్నాడు - రచనా అనగా సంఘటన. తర్హీతి - అయితే విషయౌచిత్యాన్ని పూర్తిగా విడిచిపెట్టినట్లేనా? కాదంటున్నాడు - తదితి. ఆ రసౌచిత్యమే తనకు సహకారిగా విషయాన్ని అపేక్షించి, కించిత్= కొంచెం, విభేదః.= అవాంతరవైచిత్ర్యం, సంపాదించదగినదిగా దేనికి ఉన్నదో (దేనిచేత సంపాదించవలసి ఉందో) అలాంటిదిగా అవుతుంది. ఏతదితి - దీనినే (వృత్తికారుడు) 'తత్తు' ఇత్యాదికంచేత వివరిస్తున్నాడు. 'సర్వాకారమ్' అనేది క్రియావిశేషణం. అసమాసైవేతి - సర్వత్ర (అంతటా కూడ) అని

అధ్యాహారం. అందుచేత వాక్యాభినయలక్షణంలో ముని "స్పష్టార్థాలైన విడివిడిగా ఉండే పాదాలచేతనే" అని చెప్పాడు. ఇందుకు న చ ఇత్యాదికంచేత అపవాదం చెపుతున్నాడు. నాటకాదావితి "స్వవిషయేఽపి" అనేది దీనితో కూడ సంబంధిస్తుంది.9

## ధ్వన్యాలోకం

ఇదానీమలక్ష్యక్రమవ్యఙ్గ్యో ధ్వనిః ప్రబన్ధాత్మా రామాయణమహాభారతాదౌ ప్రకాశమానః ప్రసిద్ధ ఏవ. తస్య తు యథా ప్రకాశనం తత్ ప్రతిపాద్యతే -

కా. విభావభావానుభావసంచార్యౌచిత్యచారుణః,
విధిః కథాశరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య వా. 10
ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిమ్,
ఉత్ప్రేక్ష్యాప్యన్తరాభీష్టరసోచితకథోన్నయః. 11
సన్ధిసన్ధ్యఙ్గఘటనం రసాభివ్యక్త్యపేక్షయా,
న తు కేవలయా శాస్త్రస్థితిసమ్పాదనేచ్ఛయా. 12
ఉద్దీపనప్రశమనే యథావసరమన్తరా,
రసస్యారబ్ధవిశ్రాన్తేరనుసన్ధానమఙ్గినః. 13
అలఙ్కృతీనాం శక్తావప్యానురూప్యేణ యోజనమ్,
ప్రబన్ధస్య రసాదీనాం వ్యఞ్జకత్వే నిబన్ధనమ్. 14

### బాలానందిని

ఇదానీమితి - ప్రబంధరూపమైన అలక్ష్యక్రమధ్వని రామాయణమహాభారతాదులలో ప్రసిద్ధ మైనదే. దాని ప్రకాశనం ఎట్లు చెయ్యాలో ఇప్పుడు ప్రతిపాదించబడుతున్నది.

విభావేతి - విభావభావానుభావసంచార్యౌచిత్యచారుణః = విభావ-భావ-అనుభావ-సంచారిభావాల ఔచిత్యంచేత సుందరమైన, వృత్తస్య= జరిగినది గాని, ఉత్ప్రేక్షితస్య వా= కల్పించబడినది కాని అయిన, కథాశరీరస్య= కథాశరీరంయొక్క, విధిః= ఏర్పాటు, ఇతివృత్తవశాయాతామ్= ఇతివృత్తాన్ని పట్టి వచ్చిన, అననుగుణామ్= తగని, స్థితిమ్= స్థితిని, త్యక్త్వా= విడిచి, అన్తరా= మధ్యయందు, ఉత్ప్రేక్ష్యాపి=

కల్పించియైనా, అభీష్టరసోచితకథోన్నయః= ఇష్టమైన రసానికి తగిన కథయొక్క కూర్పు, రసాభివ్యక్త్యపేక్షయా= రసాన్ని అభివ్యక్తీకరించడంకోసం, తు= కాని, కేవలయా= కేవలమైన, శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా= శాస్త్రస్థితియొక్క సంపాదనమునందు ఇచ్ఛచేత, న = కాదు. సన్ధిసన్ధ్యఙ్గఘటనమ్= సంధులయొక్క, సంధ్యంగాలయొక్క కూర్పు, అఙ్గినః రసస్య= అంగియైన రసంయొక్క, అన్తరా= మధ్య మధ్య, యథావసరమ్= సమయానుకూలంగా, ఉద్దీపనప్రశమనే= ఉద్దీపనం చేయడం శాంతింపచేయడం, ఆరబ్ధవిశ్రాన్తేః= ప్రారంభించబడిన విశ్రాంతి గల ఆ రసంయొక్క, అనుసంధానమ్= అనుసంధానం, దానిని మళ్లీ స్పృశించడం, శక్తౌ అపి= సామర్థ్యం ఉన్నా కూడ, ఆనురూప్యేణ= రసానుగుణంగా ఉండే టట్లు మాత్రమే, అలంకృతీనామ్= అలంకారాలయొక్క, యోజనమ్= కూర్చడం, ఇది, ప్రబన్ధస్య = ప్రబంధంయొక్క, రసాదీనాం వ్యఞ్జకత్వే = రసాదుల వ్యంజకత్వమునందు, నిబన్ధనమ్ = కారణం. ప్రబంధం రసాదులను వ్యంజింపచెయ్యాలంటే ఈ విధంగా చెయ్యాలి అని అర్థం.

10 -14

లోచనం

ఏవం సంఘటనాయాం చ అలక్ష్యక్రమః దీప్యతే ఇతి నిర్ణీతమ్. ప్రబన్ధే దీప్యత ఇతి తు నిర్వివాదోఽయమర్థః ఇతి నాత్ర వక్తవ్యం కించిదస్తి. కేవలం కవిసహృదయాన్ వ్యుత్పాదయితుం రసవ్యఞ్జనే యా ఇతికర్తవ్యతా ప్రబన్ధస్య సా నిరూప్యా ఇత్యాశయేనాహ - ఇదానీమితి. ఇదానీం 'తత్ప్రకారజాతం ప్రతిపాద్యతే ఇతి సంబన్ధః.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా అలక్ష్యక్రమం సంఘటనలో కూడ ప్రకాశిస్తుంది అని నిర్ణయించబడింది. ప్రబంధంలో అది ప్రకాశిస్తుంది అనేది వివాదం ఏమీ లేకుండా సిద్ధమైన విషయమే; అందుచేత ఆ విషయంలో చెప్పవలసింది ఏదీ లేదు. కేవలం కవులకు సహృదయులకు వ్యుత్పత్తి కలిగించడంకోసం, వాళ్లకి మార్గదర్శనం చేయడం కోసం, రసవ్యంజన విషయంలో ప్రబంధంలో ఏమి చెయ్యాలో అది నిరూపించబడుతూన్నది అనే అభిప్రాయంతో అంటున్నాడు - ఇదానీమ్ ఇతి : ఇప్పుడు, తత్= ఆ పద్ధతి అంతా ప్రతిపాదించబడుచున్నది అని అన్వయం.

## ధ్వన్యాలోకం

ప్రబన్ధోఽపి రసాదీనాం వ్యఞ్జక ఇత్యుక్తమ్; తస్య వ్యఞ్జకత్వే నిబన్ధనమ్ - ప్రథమం తావత్ విభావభావానుభావసంచార్యౌచిత్య చారుణః కథాశరీరస్య విధిః యథాయథం ప్రతిపిపాదయిషిత రసభావాద్యపేక్షయా య ఉచితో విభావః, భావః, అనుభావః, సంచారీ వా తదౌచిత్యచారుణః కథాశరీరస్య విధిః వ్యఞ్జకత్వే నిబన్ధనమేకమ్. భావౌచిత్యం తు ప్రకృత్యౌచిత్యాత్. ప్రకృతిర్హి ఉత్తమమధ్యమాధమ భావేన దివ్యమానుషాదిభావేన చ విభేదినీ. తాం యథా యథమనుసృత్య అసఙ్కీర్ణః స్థాయీ భావః ఉపనిబధ్యమానః ఔచిత్యభాగ్ భవతి. అన్యథా తు కేవలమానుషాశ్రయేణ దివ్యస్య, కేవలదివ్యాశ్రయేణ వా కేవలమానుషస్య ఉత్సాహాదయః ఉపనిబధ్యమానా అనుచితా భవన్తి. తథా చ కేవలమానుషస్య రాజాదేర్వర్ణనే సప్తార్ణవలఙ్ఘనాదిలక్షణా వ్యాపారాః ఉపనిబధ్యమానాః సౌష్ఠవభృతోఽపి నీరసా ఏవ నియమేన భవన్తి; తత్ర తు అనౌచిత్యమేవ హేతుః.

బాలానందిని

ప్రబన్ధోఽపీతి - ప్రబంధం కూడ రసాదివ్యంజకం అని చెప్పబడింది. దానికి (ప్రబంధానికి) ఉన్న వ్యంజకత్వానికి కారణం ఏమనగా - ముందుగా, విభావ-భావ-అనుభావ-సంచారిభావాల ఔచిత్యంచేత సుందరమైన కథాశరీరంయొక్క విధి, అనగా నిర్మాణం. తగువిధంగా ప్రతిపాదించదలచిన రసభావాదుల దృష్ట్యా ఏ విభావం, ఏ భావం, ఏ అనుభావం, లేదా ఏ సంచారిభావం ఉచితంగా ఉంటుందో వాటి ఔచిత్యంచేత అందంగా ఉన్న కథాశరీరాన్ని నిర్మించుకోవడం వ్యంజకత్వంలో ఒక నిబంధనం, కారణం.

తత్రేతి :- వాటిలో విభావౌచిత్యం అనేది ప్రసిద్ధమే. భావౌచిత్యం ప్రకృత్యౌచిత్యాన్ని పట్టి లభిస్తుంది. ప్రకృతి ఉత్తమత్వ - మధ్యమత్వ - అధమత్వాలచేత, దివ్యత్వ -

మానుషత్వాదులచేత వేరు వేరుగా ఉంటుంది. (అనగా ఉత్తమత్వ-దివ్యత్వాదులు ప్రకృతిభేదా లని అర్థం). ఆ ప్రకృతిని తగిన విధంగా అనుసరించి అసంకీర్ణమైన, ఏ విధమైన అనిశ్చితత్వానికీ తావు లేని, స్థాయిభావం కూర్చబడినట్లయితే అది ఔచిత్యం కలదై (ఉచితంగా) ఉంటుంది. అలా కాకుండా దివ్యప్రకృతికి కేవలమానుష వ్యవహారాలను ఆశ్రయించడం చేత, కేవలమానుషునికి కేవలదివ్యవ్యవహారాశ్రయణం చేత కూర్చబడిన ఉత్సాహాదులు అనుచితంగా ఉంటాయి. అందుచేతనే కేవలమానుషుడైన రాజాదిపురుషుణ్ణి వర్ణించేటప్పుడు సప్తార్ణవాలను దాటడంమొదలైన వ్యాపారాలు కూర్చబడినట్లయితే అవి పైకి అందంగానే ఉన్నా తప్పకుండా నీరసాలే అవుతాయి. అందుకు కారణం అనౌచిత్యమే.

లోచనం

ప్రథమం తావదితి:- ప్రబన్ధస్య వ్యఞ్జకత్వే యే ప్రకారాః తే క్రమేణైవ ఉపయోగినః. పూర్వం హి కథాపరీక్షా. తత్ర అధికావాపః, ఫలపర్యన్తతానయనమ్, రసం ప్రతి జాగరణమ్. తదుచితవిభావాదివర్ణనే అలంకారౌచిత్యమితి. తత్ క్రమేణ పఞ్చకం వ్యాచష్టే - విభావేత్యాదినా. తదౌచిత్యేతి - శృఙ్గారవర్ణనేచ్ఛునా తాదృశీ కథా సంశ్రయణీయా యస్యామ్ ఋతుమాల్యాదేః విభావస్య, లీలాదేః అనుభావస్య, హర్షధృత్యాదేః సంచారిణః, స్ఫుట ఏవ సద్భావ ఇత్యర్థః. ప్రసిద్ధమితి లోకే భరతశాస్త్రే చ. వ్యాపారా ఇతి:- తద్విషయోత్సాహోపలక్షణమేతత్. స్థాయ్యౌచిత్యం హి వ్యాఖ్యేయత్వేన ఉపక్రాన్తం నానుభావౌచిత్యమ్. సౌష్ఠవభృతోఽపీతి:- వర్ణనామహిమ్నేత్యర్థః. తత్ర తు ఇతి :- నీరసత్వే.

బాలానందిని

ప్రథమం తావదితి - ప్రబంధానికి ఉన్న వ్యజకత్వంలో ఏ ప్రకారాలు, పద్ధతులు, ఉన్నాయో అవి చెప్పిన క్రమంలోనే ఉపయోగిస్తాయి. ముందు కథాపరీక్ష చేసుకోవాలి. ఆ కథలో అధికంగా కొన్ని చేర్పులు, మార్పులు (అధికావాపః) చేసి, ఫలం దాకా దానిని నడిపించాలి. రసం విషయంలో మెలకువతో ఉండాలి. రసానికి ఉచితమైన విభావాదుల వర్ణనంలో అలంకారప్రయోగం ఉచితంగా ఉండాలి. ఈ ఐదింటిని క్రమంగా విభావేత్యాదికారికలచేత వివరిస్తున్నాడు. తదౌచిత్యేతి - శృంగారాన్ని వర్ణించాలని

అనుకునేవాడు ఏ కథలో ఋతువులు, మాలలు మొదలైన విభావాలు, లీలాద్యనుభావాలు, హర్షధృత్యాదిసంచారిభావాలు స్పష్టంగా ఉంటాయో అలాంటి కథనే ఎంచుకోవాలి. ప్రసిద్ధమితి. లోకంలోను భరతశాస్త్రంలోనూ కూడ ప్రసిద్ధమైనది. వ్యాపారాః ఇతి. ఇది సప్తసముద్రలంఘనాదివ్యాపారం చేసే ఉత్సాహానికి ఉపలక్షణం. స్థాయిభావౌచిత్యాన్ని గూర్చి వివరించడానికి ఉపక్రమించడం జరిగింది గాని అనుభావాల ఔచిత్యాన్ని గూర్చి కాదు కదా. సౌష్ఠవభృతోఽపి ఇతి :- వర్ణనామహిమచేత అందంగానే ఉన్నా అని అర్థం. తత్ర తు ఇతి - నీరసత్వంలో అని అర్థం.

## ధ్వన్యాలోకం

ననుు నాగలోకగమనాదయః సాతవాహనప్రభృతీనాం శ్రూయన్తే, తదలోకసామాన్యప్రభావాతిశయవర్ణనే కిమనౌచిత్యం సర్వోర్వీ భరణక్షమాణాం క్షమాభుజామితి; నైతదస్తి; న వయం బ్రూయో యత్ ప్రభావాతిశయనవర్ణనమనుచితం రాజ్ఞామ్; కిం తు కేవలమానుషాశ్రయేణ యా ఉత్పాద్యవస్తుకథా క్రియతే తస్యాం దివ్యమౌచిత్యం న యోజనీయమ్. దివ్యమానుష్యాయాం తు కథాయామ్ ఉభయౌచిత్యయోజనమవిరుద్ధమేవ. యథా పాణ్డవాదికథాయామ్. సాతవాహనాదిషు తు యేషు యావదవదానం శ్రూయతే తేషు తావన్మాత్రమనుగమ్యమానమ్ అనుగుణత్వేన ప్రతిభాసతే. వ్యతిరిక్తం తు తేషామేవ ఉపనిబధ్యమానమ్ అనుచితమ్. తదయమత్రపరమార్థః -

అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబన్ధస్తు రసస్యోపనిషత్పరా.

అత ఏవ చ భరతే ప్రఖ్యాతవస్తువిషయత్వం, ప్రఖ్యాతో దాత్తనాయకత్వం చ నాటకస్య అవశ్యకర్తవ్యతయా ఉపన్యస్తమ్. తేన హి నాయకౌచిత్యానౌచిత్యవిషయే కవిర్న వ్యాముహ్యతి.

యం నత్వాత్పాద్యవస్తు నాటకాది కుర్యాత్ తస్య అప్రసిద్ధానుచితనాయకస్వభావవర్ణనే మహాన్ ప్రమాదః.

బాలానందిని

నన్వితి (ఆశంక) సాతవాహనాదులు నాగలోకాదులకు వెళ్లినట్లు వింటున్నాం. అందుచేత సకలభూభారాన్ని భరించడంలో సమర్థులైన రాజులయొక్క లోకసామాన్యం కాని ప్రభావాతిశయాన్ని వర్ణించడంలో అనౌచిత్యం ఏముంది? నైతదస్తీతి:- అది కాదు విషయం. రాజుల ప్రభావాతిశయాన్ని వర్ణించడం అనుచితం అని మేం అనడం లేదు. మేం అనేదల్లా ఏమి టనగా - కేవలమానుషాశ్రయం గల ఏ ఉత్పాద్య(కల్పిత) కథ కూర్చబడుతుందో దానిలో దివ్యమైన(దేవతాపురుషులకే సాధ్యం అయిన) ఔచిత్యం కూర్చకూడదు అని మాత్రమే. దివ్య-మానుష్యకథలో అయితే రెండింటికీ సంబంధించిన ఔచిత్యాన్ని కూర్చడం విరుద్ధం కాదు. ఉదాహరణకి పాండవాదుల కథలో వలె. సాతవాహనాదుల విషయంలో వాళ్లు చేసిన ఘనకార్యం (అవదానం) ఎంతైతే ప్రసిద్ధంగా వినబడుతుందో అంతమాత్రం అనుసరించినా కూడ అనుగుణంగానే భాసిస్తుంది. అంతకు మించి వాళ్ల వ్యవహారమే ఏదైనా కూర్చబడిన ట్లయితే అది అనుచితం. అందువల్ల ఈ విషయంలో (గుర్తుంచుకొనదగిన) పరమార్థం ఇది.

అనౌచిత్యాదితి - అనౌచిత్యాత్ ఋతే= అనౌచిత్యం తప్ప, రసభఙ్గస్య కారణమ్= రసభంగానికి కారణం, అన్యత్= మరొకటి ఏదీ, న= లేదు. ప్రసిద్ధౌచిత్యబన్ధస్తు= లోకశాస్త్రాదులలో ప్రసిద్ధమైన ఔచిత్యాన్ని కూర్చడం అయితే, రసస్య= రసంయొక్క, పరా= గొప్ప, ఉపనిషత్= రహస్యం.

అత ఏవేతి - అందువల్లనే నాటకంలో తప్పకుండా ప్రసిద్ధమైన కథావస్తువు ఉండాలనీ ప్రసిద్ధుడైన ఉత్తమనాయకుడు ఉండాలనీ భరతనాట్యశాస్త్రంలో చెప్పబడింది. ఆ విధంగా ఉంటే నాయకుని ఔచిత్య-అనౌచిత్యాల విషయంలో కవి వ్యామోహం చెందడు. ఏ కవి కల్పితకథావస్తువు గల నాటకాదుల్ని రచిస్తాడో అతడు అప్రసిద్ధుడు. అనుచితుడూ అయిన నాయకుని స్వభావాన్ని వర్ణించడంలో పెద్ద పొరబాటు జరుగుతుంది.

లోచనం

వ్యతిరిక్తం త్వితి :- అధికమిత్యర్థః. ఏతదుక్తం భవతి - యత్ర వినేయానాం ప్రతీతిఖణ్డనా న జాయతే తాదృగ్వర్ణనీయమ్. తత్ర కేవలమానుషస్య ఏకపదే

సప్తార్ణవలఙ్ఘనమసంభావ్యమానతయా అనృతమితి హృదయే స్ఫురత్ ఉపదేశ్యస్య చతుర్వర్గోపాయస్యాపి అలీకతాం బుద్ధౌ నివేశయతి. రామాదేస్తు తథావిదమపి చరితం పూర్వప్రసిద్ధిపరంపరోపచిత సంప్రత్యయోపారూఢ మసత్యతయా న చకాస్తి. అత ఏవ తస్యాపి యదా ప్రభావాన్తరముత్రేక్ష్యతే తదా తాదృశమేవ. న త్వసంభావనాపదం వర్ణనీయమితి. తేన హీతి - ప్రఖ్యాతోదాత్తనాయకవస్తుత్వేన. వ్యాముహ్యతీతి - కిం వర్ణయేయమ్ ఇతి. యస్తు ఇతి - కవిః. మహాన్ ప్రమాద ఇతి - తేన ఉత్పాద్యవస్తు నాటకాది న నిరూపితం మునినేతి న కర్తవ్యమితి తాత్పర్యమ్. ఆదిశబ్దః ప్రకారే, డిమాదేః ప్రసిద్ధదేవచరితస్య సంగ్రహార్థః.

బాలానందిని

వ్యతిరిక్తం త్వితి :- అధికము అని అర్థం. ఇక్కడ చెప్పిన విషయం ఇది - విధేయులకు (బుద్ధిగఅపవలసినవాళ్లకి) దేని విషయంలో (నిజంగా ఇది ఇలా జరిగి ఉంటుందా అనే భావం కలగడంచేత) జ్ఞానంయొక్క ఖండనం జరగదొ అలాంటిదే వర్ణించాలి. కేవలమానవుడు ఒక్క ఊపులో ఏడు సముద్రాలు దాటడం అసంభావ్యం, అందుచేత ఇది అసత్యం అని ఉపదేశ్యుని (వినేయుని) హృదయంలో స్ఫురిస్తే చతుర్వర్గోపాయం కూడ (కావ్యాలలో బోధించే చతుర్విధపురుషార్థాలను గూర్చిన ఉపదేశం కూడ) అసత్యమే అన్న భావం బుద్ధిలో ఏర్పడుతుంది. రామాదుల విషయంలో అయితే ఆ విధమైన (లోకోత్తరమైన) చరితం కూడ పూర్వంనుంచీ వస్తూన్న ప్రసిద్ధిపరంపరచేత పోషించబడిన నమ్మకంలో ప్రవేశించి అసత్యంగా కనబడదు. అందువల్లనే ఆ రామాదుల విషయంలో కూడ మరొక ప్రభావం కల్పించబడినట్లయితే అది కూడ అలాంటిదే (నమ్మబడనిదే) అయిపోతుంది. అందువల్ల అలా జరగవచ్చు అని ఊహించడానికి వీలుకాని దానిని వర్ణించకూడదు అని తాత్పర్యం. తేన హీతి - ప్రసిద్ధమైన ఉదాత్తనాయకుడు గల వస్తువు అవడంచేత (న) వ్యాముహ్యతీతి:- ఏమి వర్ణించాలా అని (వ్యామోహం చెందదు). యస్తు ఇతి : ఏ కవి. మహాన్ ప్రమాదః ఇతి. అందుచేతనే భరతముని ఉత్పాద్యవస్తువుగల (కల్పితకథావస్తువు గల) నాటకాదికాన్ని నిరూపించలేదు గాన అలాంటి దానిని రచించకూడదు అని తాత్పర్యం. 'నాటకాది' లోని 'ఆది' శబ్దం ప్రకారార్థకం. (ఈ రకమైనవి, ఈ కోవకు చెందినవి అనే అర్థాన్ని

బోధిస్తుంది). డిమం మొదలైన ప్రసిద్ధదేవచరితం గల రూపకాలను సంగ్రహించడానికి ఉపయోగించబడింది.

లోచనం

అన్యస్తు - "ఉపలక్షణముక్తో బహువ్రీహిరితి ప్రకరణమత్రోక్తమ్" ఇత్యాహ. "నాటికాది" ఇతి హి పాఠః. తత్రాదిగ్రహణం ప్రకారసూచకమ్ - తేన మునినిరూపితే నాటికాలక్షణే "ప్రకరణనాటకయోగాదుత్పాద్యం వస్తు నాయకో నృపతిః" ఇత్యత్ర యథాసంఖ్యేన ప్రఖ్యాతోదాత్తనృపతినాయకత్వం బోద్ధవ్యమ్ ఇతి భావః.

బాలానందిని

అన్యస్తు ఇతి - "యస్తు ఉత్పాద్యవస్తు నాటకాది" అనే వృత్తివాక్యంలోని 'నాటకాది' లోని 'ఆది' పదానికి 'మొదలైన' అనే అర్థం కాకుండా 'నాటకంవంటివి' అని పైన వ్యాఖ్య చేయబడింది. ఆ వ్యాఖ్యను అనుసరించి నాటకంలో ఏ విధంగా ప్రసిద్ధమైన కథావస్తువు ఉంటుందో ఆ విధంగా ప్రఖ్యాతకథావస్తువు గల డిమ - వ్యాయోగాదులు మాత్రమే గ్రహించబడతాయి. అందుకొరకే ఆ విధంగా వ్యాఖ్యానం చేయబడింది. కాని కొందరు వ్యాఖ్యాతలు "పైన చెప్పబడిన బహువ్రీహి ఉపలక్షణం; అందుచేత ఇక్కడ ప్రకరణాన్ని గ్రహించాలి" అని వ్యాఖ్యానించారు. (నాటకం ఉత్పాద్యవస్తువు అవడానికి వీలులేదు గాన ఇక్కడ 'నాటక' శబ్దం ఉత్పాద్యవస్తువైన ప్రకరణాన్ని చెపుతుంది అని ఆ వ్యాఖ్యాత అభిప్రాయం).

నాటికాదీతి : లేదా 'నాటికాది' అని పాఠం ఉండి ఉంటుంది. అప్పుడు 'ఆది' శబ్దం ప్రకారసూచకం (నాటికమాదిరి అని అర్థం; అందుచేత ప్రకరణాదికం గ్రహించవచ్చు). ముని చెప్పిన - "ప్రకరణనాటకయోగాదుత్పాద్యం వస్తు నాయకో నృపతిః" (నాటిక ప్రకరణనాటకాల కలయికవల్ల ఏర్పడుతుంది. వస్తువు ఉత్పాద్యం; నాయకుడు మాత్రం ప్రసిద్ధుడైన రాజు) అనే నాటికాలక్షణంలో యథాసంఖ్యంచేత ప్రఖ్యాతోదాత్తనృపతి నాయకత్వం ఉంటుందని గ్రహించాలి.

వివరణ:- పై లక్షణంలో చెప్పినట్లు నాటికలో ప్రకరణలక్షణా లుండడంచేత వస్తువు ఉత్పాద్యం అని, నాయకుడు ప్రఖ్యాతు డనీ యథాసంఖ్యంగా గ్రహించాలి. ఆ విధంగా 'నాటికాది' పదంచేత నాటికవలె ఉత్పాద్యవస్తువైన ప్రకరణాదికం అనే అర్థం లభిస్తుంది అని భావం.

ధ్వన్యాలోకం

నను యద్యుత్సాహాదివర్ణనే కథం చిత్ దివ్యమానుష్యాద్యౌచిత్య పరీక్షా క్రియతే తత్ క్రియతామ్, రత్యాదౌ తు కిం తయా ప్రయోజనమ్? రతిర్హి భారతవర్షోచితేనైవ వ్యవహారేణ దివ్యానామపి వర్ణనీయా ఇతి స్థితిః. నైవమ్; తత్రౌచిత్యాతిక్రమేణ సుతరాం దోషః. తథాహి - అధమప్రకృత్యౌచిత్యేన ఉత్తమప్రకృతేః శృఙ్గారోపనిబన్ధనే కా భవేన్నోపహాస్యతా?

త్రివిధం ప్రకృత్యౌచిత్యం భారతవర్షేఽప్యస్తి శృఙ్గారవిషయమ్. యత్తు దివ్యమౌచిత్యం తత్ తత్ర అనుపకారకమేవ ఇతి చేత్ - న వయం దివ్యమౌచిత్యం శృఙ్గారవిషయమ్ అన్యత్ కించిద్ బ్రూమః; కిం తర్హి? భారతవర్షవిషయే యథా ఉత్తమనాయకేషు ఽ జాదిషు శృఙ్గారోపనిబన్ధః తథా దివ్యాశ్రయోఽపి శోభతే. న చ రాజాదిషు ప్రసిద్ధగ్రామ్యశృఙ్గారోపనిబన్ధనం ప్రసిద్ధం నాటకాదౌ; తథైవ దేవేషు తత్ పరిహర్తవ్యమ్, నాటకాదేః అభినేయార్థత్వాత్ అభినయస్య చ సంభోగశృఙ్గారవిషయస్య అసభ్యత్వాత్ తత్ర పరిహార ఇతి చేత్ - న. యద్యభినయస్య ఏవం విషయస్యాసభ్యతా తత్కావ్యస్యైవంవిధస్య సా కేన నివార్యతే? తస్మాత్ అభినేయార్థే అనభినేయార్థే వా కావ్యే యదుత్తమప్రకృతేః రాజాదేః ఉత్తమప్రకృతిభిః నాయికాదిభిః సహ గ్రామ్యసంభోగవర్ణనం తత్ పిత్రోః సంభోగవర్ణనమివ సుతరామసభ్యమ్. తథైవ ఉత్తమదేవతాదివిషయమ్.

బాలానందిని

నన్వితి (ఆశంక) ఉత్సాహాదిభావాల వర్ణన విషయంలో దివ్యమానుష్యాదులకు సంబంధించిన ఔచిత్యపరీక్ష చేస్తే చేయవచ్చు; కాని రత్యాదుల విషయంలో ఆ

పరీక్షచేత ఏమి ప్రయోజనం? దివ్యపురుషుల రతి కూడ భారతవర్షానికి ఉచితమైన వ్యవహారంచేతనే వర్ణించాలి అని కదా పద్ధతి? నైవమితి (సమాధానం) ఇట్లు కాదు. రతివిషయంలో ఔచిత్యాన్ని అధమప్రకృతులకు ఉచితమైన రీతిలో నిబంధిస్తే హాస్యాస్పదం కాకుండా ఉంటుందా? త్రివిధమితి (ఆశంక) భారతవర్షంలో కూడా శృంగారవిషయమైన మూడు విధాలైన ఔచిత్యం ఉంటుంది; దివ్యమైన ఔచిత్యం ఏదైతే ఉందో అది శృంగారం విషయంలో ఉపకారకం కాదు కదా? నేతి (సమాధానం) శృంగారవిషయంలో దివ్యమైన ఔచిత్యం అనేది వేరుగా ఒకటి ఉందని మేం అనడంలేదు. మరేమనగా - భారతవర్షంలో ఉత్తనాయకులైన రాజాదులలో ఏ విధమైన శృంగారోపనిబంధం చేయబడుతుందో, దివ్యాశ్రయం కూడా అలాగే ఉంటే శోభిస్తుంది. రాజాదుల విషయంలో ప్రసిద్ధగ్రామ్యశృంగారాన్ని నిబంధించడం నాటకాదులలో ప్రసిద్ధం కాదు కదా? అదే విధంగా దేవాదుల విషయంలో కూడ దానిని పరిహరించాలి. నాటకాదేరితి:- (ఆశంక) నాటకాదికం లోని వస్తువు అభినయించదగిన దవడంచేత సంభోగశృంగారాభినయం అసభ్యంగా ఉంటుంది. అందుచేత వాటిలో మాత్రమే దానిని పరిహరించడం జరుగుతుంది అని అంటే - (సమాధానం) అది యుక్తం కాదు.

ఇలాంటి విషయం ఉన్న అభినయం అసభ్యం అవుతే ఇలాంటి విషయమే ఉన్న కావ్యంలో కూడా దాని అసభ్యత్వం ఎవరు కాదనగలరు? అందువల్ల అభినేయార్థ కావ్యమైనా (దృశ్యకావ్యమైనా), అనభినేయార్థకావ్యం (శ్రవ్యకావ్యం) అయినా ఉత్తమప్రకృతులైన రాజాదులకు ఉత్తమప్రకృతులైన నాయికలతో గ్రామ్యసంభోగం వర్ణించడం జననీజనకుల సంభోగాన్ని వర్ణించడం వలె చాల అసభ్యం. ఉత్తమదేవతాది విషయసంభోగవర్ణనం కూడ అట్లే.

## ధ్వన్యాలోకం

న చ సంభోగశృఙ్గారస్య సురతలక్షణ ఏవైకః ప్రకారః; యావదన్యేఽపి ప్రభేదాః పరస్పరప్రేమదర్శనాదయః సంభవన్తి. తే కస్మాదుత్తమప్రకృతివిషయే న వర్ణ్యన్తే? తస్మాదుత్సాహవద్రతావపి ప్రకృత్యౌచిత్యమ్ అనుసర్తవ్యమ్. తథైవ విస్మయాదిషు. యత్త్వేవంవిధే విషయే మహాకవీనామపి అసమీక్ష్యకారితా లక్ష్యే దృశ్యతే స దోష

ఏవ. స తు శక్తితిరస్కృతత్వాత్తేషాం న లక్ష్యత ఇత్యుక్తమేవ. అనుభావౌచిత్యం తు భరతాదౌ ప్రసిద్ధమేవ.

బాలానందిని

న చేతి - సంభోగశృంగారానికి సురతరూపమైన ఒకే ప్రకారం కాదు; ప్రేమతో పరస్పరం చూచుకోవడం మొదలైనవి ఇతరమైన ప్రభేదాలు కూడా ఉంటాయి. ఉత్తమప్రకృతుల విషయంలో వాటిని కూడా వర్ణించవచ్చును కదా? అందువల్ల ఉత్సాహం విషయంలో వలె రతివిషయంలో కూడా ప్రకృత్యౌచిత్యం అనుసరించదగినదే. విస్మయం మొదలైన వాటిలో కూడా ఇంతే. ఇలాంటి విషయాలలో మహాకవులు కూడ సరిగా ఆలోచించకుండా చేయడం లక్ష్యాలలో కనబడితే అది దోషమే. అయితే అది వాళ్ల ప్రతిభచేత కప్పబడిపోవడంవల్ల గుర్తించబడదు అనే విషయం వెనక చెప్పే ఉన్నాం. అనుభావాల ఔచిత్యం భరతనాట్యశాస్త్రాదులలో ప్రసిద్ధమే.

లోచనం

కథం తర్హి సంభోగశృఙ్గారః కవినా నిబధ్యతామ్ ఇత్యాశఙ్క్యాహ - **న చేతి. తథైవేతి.** మునినాపి స్థానే స్థానే ప్రకృత్యౌచిత్యమేవ విభావానుభావాదిషు బహుతరం ప్రమాణీకృతమ్ "స్థైర్యేణోత్తమమధ్యమానాం నీచానాం సంభ్రమేణ" ఇత్యాది వదతా.

బాలానందిని

కథమితి :- అయితే ఉత్తమప్రకృతుల విషయంలో సంభోగశృంగారం ఎలా నిబంధించాలి అని ఆశంకించుకొని న చేత్యాదికంచేత సమాధానం చెపుతున్నాడు. **తథైవేతి:-** భరతముని కూడ అడుగడుగునా - "ఉత్తమమధ్యమఅధమప్రకృతుల భావావిష్కరణం స్థైర్యంతో జరిగినట్లు, నీచులది తొందరతో జరిగినట్లు ఇత్యాది విధంగా చెపుతూ విభావానుభావాదివిషయంలో అత్యధికంగా ప్రకృత్యౌచిత్యమే ప్రమాణంగా గ్రహించాడు.

## ధ్వన్యాలోకం

ఇయత్తూచ్యతే - భరతాదివిరచితాం స్థితిం చానువర్తమానేన మహాకవిప్రబన్ధాంశ్చ పర్యాలోచయతా, స్వప్రతిభాం చానుసరతా కవినా అవహితచేతసా భూత్వా విభావాద్యౌచిత్యభ్రంశపరిత్యాగే పరః

ప్రయత్నో విధేయః. ఔచిత్యవతః కథాశరీరస్య, వృత్తస్య ఉత్ప్రేక్షితస్య వా గ్రహో వ్యఞ్జక ఇత్యనేన ఏతత్ప్రతిపాదయతి - యదితిహాసాదిషు కథాసు రసవతీషు వివిధాసు సతీష్వపి యత్తత్ర విభావాద్యౌచిత్యవత్ కథాశరీరం తదేవ గ్రాహ్యం నేతరత్. వృత్తాదపి చ కథాశరీరాత్ ఉత్ప్రేక్షితే విశేషతః ప్రయత్నవతా భావ్యమ్.

తత్ర హ్యనవధానాత్ స్ఖలతః కవేః అవ్యుత్పత్తిసంభావనా మహతీ భవతి. పరికరశ్లోకశ్చాత్ర-

శ్లో. కథాశరీరముత్పాద్యవస్తు కార్యం తథా తథా,
యథా రసమయం సర్వమేవ తత్ప్రతిభాసతే.

బాలానందిని

ఇయదితి - ఇంతమాత్రం అయితే చెప్పబడూతున్నది - కవి భరతాదులు చేసిన మర్యాదను అనుసరిస్తూ, మహాకవుల ప్రబంధాలను బాగా పరిశీలిస్తూ, తన ప్రతిభను అనుసరిస్తూ, సావధానచిత్తుడై విభావాదుల ఔచిత్యంయొక్క భ్రంశను విడిచిపెట్టడానికి (ఔచిత్యం చెడిపోకుండా ఉండడానికి) చాలా ప్రయత్నం చెయ్యాలి. 'జరిగినది కాని కల్పితం కాని అయిన ఔచిత్యం గల కథాశరీరాన్ని గ్రహించడం రసవ్యంజకం అవుతుంది' అని చెప్పడంచేత ఈ విషయాన్ని ప్రతిపాదిస్తున్నాడు - ఏమనగా - ఇతిహాసాదులలో పైకి రసవంతాలుగా కనబడే అనేకవిధాలైన కథలు ఉన్నా కూడ వాటిలో ఏ కథాశరీరంలో విభావాద్యౌచిత్యం ఉంటుందో దానిని గ్రహించాలి. జరిగిన కథాశరీరంకంటె కల్పితకథాశరీరం విషయంలో విశేషించి ప్రయత్నవంతుడై ఉండాలి. అక్కడ ఏకాగ్రత లేకపోవడంవల్ల తొట్రుపడిన కవి విషయంలో ఈతనికి వ్యుత్పత్తి చాలా తక్కువ అని అనుకోవడానికి తగిన అవకాశం అత్యధికంగా ఉంటుంది. ఈ విషయంలో ఒక పరికరశ్లోకం -

కథాశరీరమితి:- ఉత్పాద్యవస్తు= ఉత్పాద్యవస్తువుగల, కథాశరీరమ్= కథాశరీరం, తథా తథా= ఆ యా విధంగా, కార్యమ్= చేయదగినది; తత్ సర్వమేవ= అది అంతా కూడ, యథా= ఏ విధంగా, రసమయమ్= రసమయంగా, ప్రతిభాసతే= భాసిస్తుందో.

లోచనం

ఇయత్త్వితి - లక్షణజ్ఞత్వం, లక్ష్యపరిశీలనమ్, అదృష్టప్రసాదోదితస్వప్రతిభాశాలిత్వం చానుసర్తవ్యమితి సంక్షేపః. రసవతీష్విత్యనాదరే సప్తమీ. రసవత్త్వం చ అవివేచకజనాభిమానాభిప్రాయేణేతి మన్తవ్యమ్. విభావాద్యౌచిత్యేన హి వినా కా రసవత్తా? కవేరితి - న హి తత్ర ఇతిహాసవశాదేవ మయా నిబద్ధమితి జాత్యుత్తరమపి సంభవతి.

బాలానందిని

ఇయత్త్వితి - టూకీగా చెప్పాలంటే - లక్షణం బాగా తెలిసి ఉండడం, లక్ష్యాలను పరిశీలించడం, అదృష్టం (పూర్వపుణ్యవశం)చేత, దేవతామహాపురుషాదిప్రసాదంచేతా లభించిన ప్రతిభ కలిగి ఉండడం - వీటిని అనుసరించాలి. రసవతీషు అనేది అనాదరార్థంలో సప్తమి. వాటికి రసవత్త్వం అనేది వివేచన చేయజాలని జనుల అభిమానాన్ని(పట్టుదలను) పట్టి అనే అభిప్రాయంచేత అని గ్రహించాలి. విభావాద్యౌచిత్యం లేకపోతే రసవత్త ఏమిటి? కవేరితి - కథాశరీరాన్ని స్వయంగా కల్పించి నప్పుడు "నేనేం చెయ్యాలి; ఇతిహాసంలో ఉన్నదాన్ని పట్టి నేను నిబంధించాను" అని జాత్యుత్తరం (సమీచీనం కాని ఉత్తరం) ఇవ్వడం కూడా కుదరదు కదా?

ధ్వన్యాలోకం

తత్ర చాభ్యుపాయః సమ్యగ్విభావాద్యౌచిత్యానుసరణమ్. తచ్చ దర్శితమేవ. కిం చ -

శ్లో. సన్తి సిద్ధరసప్రఖ్యా యే చ రామాయణాదయః,
కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ.

తేషు హి కథాశ్రయేషు తావతీ స్వేచ్ఛైవ యోజ్యా. యదుక్తమ్ - "కథా మార్గే న చాల్పోఽపి వ్యతిక్రమః". స్వేచ్ఛాపి యది యోజ్యా తద్రసవిరోధినీ న యోజ్యా.

బాలానందిని

తత్రేతి - విభావాదుల ఔచిత్యాన్ని బాగా అనుసరించడం అందుకు (రసమయత్వసంపాదనానికి) ఉపాయం. ఆ విషయం వెనకనే చూపించబడింది.

మరొక విషయం ఏమనగా -

సన్తీతి - సిద్ధరసప్రఖ్యాః= సిద్ధంగా ఉన్న రసాలు గలవిగా ప్రసిద్ధమైన, యే= ఏ, రామాయణాదయః= రామాయణాదులు కలవో, తైః= వాటితో, రసవిరోధినీ= రసానికి విరుద్ధం అయిన, కథాశ్రయా= కథకు సంబంధించిన, స్వేచ్ఛా= స్వేచ్ఛ, న యోజ్యా= చేయదగినది కాదు.

తేషు ఇతి - కథకు ఆశ్రయాలైన వాటి విషయంలో స్వేచ్ఛయే చేయదగినది కాదు. "కథామార్గంలో అల్పమైన అతిక్రమణం కూడ చేయగూడదు" అని చెప్పబడింది కదా? ఏమైన స్వేచ్ఛను అవలంబించినా రసవిరుద్ధమైన స్వేచ్ఛ అవలంబించతగదు.

లోచనం

తత్ర చేతి - రసమయత్వసంపాదనే. సిద్ధేతి - సిద్ధః ఆస్వాదమాత్రశేషః న తు భావనీయః రసో యేషు. కథానామాశ్రయాః ఇతిహాసాః. తైరితిహాసార్థైః తైః సహ స్వేచ్ఛా న యోజ్యా. సహార్థశ్చాత్ర విషయవిషయిభావ ఇతి వ్యాచష్టే - తేష్వితి సప్తమ్యా. స్వేచ్ఛా తేషు న యోజ్యా, కథం చిద్వా యది యోజ్యతే తత్తత్ప్రసిద్ధరసవిరుద్ధా న యోజ్యా. యథా రామస్య ధీరలలితత్వయోజనేన నాటికానాయకత్వం కశ్చిత్ కుర్యాత్ ఇతి తు అత్యన్తాసమఞ్జసమ్. యదుక్తమ్ ఇతి - రామాభ్యుదయే యశోవర్మణా - "స్థితమితి యథా శయ్యామ్"

బాలానందిని

తత్ర చేతి - రసమయత్వసంపాదనంలో. సిద్ధేతి - సిద్ధః= ఆస్వాదించడం మాత్రమే మిగిలి ఉన్న, అంతే కాని సంపాదించవలసినది కాని, రసం వేటియందో అవి. కథలకు ఆశ్రయాలైన ఇతిహాసాలు. తైః= ఆ ఇతిహాసవిషయాలతో కూడ, స్వేచ్ఛ చేయదగినది కాదు, తైః= (వాటితో) అనే పదం చేత బోధించబడే సహార్థం, (కూడా అనే అర్థం) ఇక్కడ విషయవిషయిభావం అని చెప్పడానికి తేషు అని సప్తమిని ఉపయోగించి వ్యాఖ్యానిస్తున్నాడు. వాటివిషయంలో స్వేచ్ఛను ఉపయోగించకూడదు; అథవా ఉపయోగించినా ఆ యా ప్రసిద్ధరసాలకి విరుద్ధమైన స్వేచ్ఛ ఉపయోగించకూడదు. ఉదాహరణకి - రాముణ్ణి ధీరలలితుణ్ణిగా చిత్రించి ఎవడైనా ఆతనిని నాటికకి నాయకుణ్ణిగా చేసినట్లయితే అది చాలా అసమంజసమైన పని (రామాయణంలో రామునికి సంబంధించిన రసం వీరరసం కదా?) యదుక్తమితి : రామాభ్యుదయంలో యశోవర్మ "స్థితమితి యథాశయ్యామ్" అని అన్నాడు.

వివరణ: దీని భావం ఏమిటో తెలియలేదు. 'కథామార్గే న చాల్పోఽప్యతిక్రమః' 'అనే వాక్యం రామాభ్యుదయంలోనిదేమో? ఇది ఆ సందర్భంలో చెప్పిన మరొక వాక్యమేమో!

భోజమహారాజు శృంగారప్రకాశలో -

"ఔచిత్యం వచసాం ప్రకృత్యనుగతం సర్వత్ర పాత్రోచితా

పుష్టిః స్వావసరే రసస్య చ కథామార్గే న చాతిక్రమః,

శుద్ధిః ప్రస్తుతసంవిధానకవిధౌ ప్రౌఢిశ్చ శబ్దార్థయోః

విద్వద్భిః పరిభావ్యతామవహితైః ఏతావదేవాస్తు నః".

అనే శ్లోకం ఉదాహరించి ఉన్నాడు. ఈ శ్లోకం యశోవర్మ రచించిన రామాభ్యుదయనాటకం ప్రస్తావనలోనిది (డా. రఘువన్, శృంగారప్రకాశ పేజి 402)

"విద్వాంసులు (మేం ప్రయోగించే ఈ నాటకంలోని) ప్రకృతులను అనుసరించిన వాక్కుల ఔచిత్యాన్ని, అంతటా కూడ పాత్రలకు ఉచితమూ తగిన సమయాలలో చేయబడినదీ అయిన రసపుష్టినీ, కథామార్గాన్ని అతిక్రమించకపోవడాన్నీ, ప్రస్తుతమైన కథానిర్వహణంలో శుద్ధినీ, శబ్దార్థాల ప్రౌఢత్వాన్ని సావధానచిత్తులై పరిశీలింతురుగాక. మా కింతమాత్రమే చాలును" అని దీని భావం.

ఆనందవర్ధనుడు ద్వితీయపాదాంతంలో ఉన్న మాటలకు "అల్పోఽపి" అని కూడ చేర్చి "కథామార్గే న చాల్పోఽప్యతిక్రమః" అని ఇక్కడ ఉదాహరించాడు. అభినవగుప్తుడు 'యదుక్తమ్ ఇతి' అని ప్రతీక గ్రహించి "రామాభ్యుదయే యశోవర్మణా" అని పూరించాడు. ఈ మాటలు యశోవర్మ రచించిన రామాభ్యుదయంలోనివి అని అర్థం. యశోవర్మ అష్టమశతాబ్దిలో కన్నౌజ్‌లో రాజుగా ఉండేవాడు. అతని రామాభ్యుదయం ఇప్పుడు అలభ్యం. భవభూతి ఈతని ఆస్థానంలోనే ఉండేవాడు. యశోవర్మ రామాభ్యుదయం వ్రాశాడనటానికి ఈ లోచనకారుని వాక్యమే ఆధారం అని రాఘవన్ వ్రాశాడు.

ముద్రితమైన (చౌఖాంబాప్రతిలో) లోచనంలో "యదుక్తమితి. రామాభ్యుదయే యశోవర్మణా - "స్థితమితి యథా శయ్యామ్" అని ఉద్ధృతిచిహ్నాలతో '(quotation marks)'ముద్రించబడింది. పైన సూచించినట్లు ఇదేమీ అర్థం అవడం లేదు. లేఖకప్రమాదం అయి ఉంటుంది. "యదుక్తమితి. రామాభ్యుదయే యశోవర్మణా" దానితో ఆ విషయం పూర్తి అయిపోయింది. తరవాతిపేరాలో "కథంచిద్రసాననుగుణాం

స్థితిం త్యక్త్వా'' ఇత్యాదివృత్తివాక్యంలోని 'స్థితిమ్' అనే దానిని 'స్థితిమితి' అని ప్రతీకగా తీసికొని అభినవగుప్తుడు దానికి ''కథాశ్రయామ్'' అని అర్థం వ్రాసి (స్థితిమితి - కథాశ్రయామ్'' కథకు సంబంధించిన స్థితిని అని అర్థం) ఉంటాడు. దానిని ఈ వికృతరూపంలో లేఖకులు మన కందించారు.

## ధ్వన్యాలోకం

ఇదమపరం ప్రబన్ధస్య రసాభివ్యఞ్జకత్వే నిబన్ధనమ్ - ఇతివృత్తవశాయాతాం కథంచిద్రసాననుగుణాం స్థితిం త్యక్త్వా పునరుత్ప్రేక్ష్యాప్యన్తరాభీష్టరసోచితకథోన్నయో విధేయః. యథా కాలిదాసప్రబన్ధేషు. యథా చ సర్వసేనవిరచితే హరివిజయే. యథా చ మదీయ ఏవ అర్జునచరితే మహాకావ్యే. కవినా కావ్యముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతన్త్రేణ భవితవ్యమ్. తత్ర ఇతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్ తదా ఇమాం భఙ్క్త్వాపి స్వతన్త్రతయా రసానుగుణం కథాన్తరమ్ ఉత్పాదయేత్. నహి కవేరితి వృత్త మాత్రనిర్వహణేన కిం చిత్ ప్రయోజనమ్. ఇతిహాసాదేవ తత్సిద్ధేః.

### బాలానందిని

ఇదమితి - ప్రబంధం రసాభివ్యంజకం కావడానికి మరొక నిబంధనం (కారణం) ఏమనగా - ఇతివృత్తాన్ని పట్టి వచ్చినా ఏదో విధంగా రసానికి అనుగుణంగా లేని స్థితిని విడిచి, మళ్లీ ఊహించి (కల్పించి) యైనా మధ్యయందు ఇష్టమైన రసానికి ఉచితమైన కథను చేర్చాలి. ఉదాహరణకి కాలిదాసుని ప్రబంధాలలో వలె; సర్వసేనుడు రచించిన హరివిజయంలో వలె; నాదే అయిన అర్జునచరితమహాకావ్యంలో వలె. కావ్యం రచిస్తున్న కవి అన్ని విధాలా రసపరతంత్రుడై ఉండాలి. ఇతివృత్తంలో రసానికి అనుగుణంగా లేని స్థితి కనబడితే దానిని భగ్నం చేసియైనా స్వతంత్రంగా రసానుగుణమైన మరొక కథను పుట్టించాలి. కవి కేవలం ఇతివృత్తాన్ని నిర్వహించినంతమాత్రాన ప్రయోజనం ఏమీ లేదు. ఆ పని ఇతిహాసంనుంచే జరుగుతుంది కదా?

లోచనం

స్థితిమితి - కథాశ్రయామ్. కాలిదాసేతి - రఘువంశే అజాదీనాం రాజ్ఞాం వివాహాదివర్ణనం నేతిహాసేషు నిరూపితమ్. హరివిజయే కాన్తానునయనాఙ్గత్వేన పారిజాతహరణాది నిరూపితమితిహాసేష్వదృష్టమపి. తథా అర్జునచరితే అర్జునస్య పాతాలవిజయాది వర్ణితమితిహాసాప్రసిద్ధమ్. ఏతదేవ యుక్తమిత్యాహ - కవినా ఇతి.

బాలానందిని

స్థితిమితి - కథకు సంబంధించిన స్థితిని. కాలిదాసేతి - రఘువంశంలో ఉన్న అజాదిరాజుల వివాహాదివర్ణనం ఇతిహాసాలలో చెప్పబడలేదు. హరివిజయంలో ప్రియురాలిని బ్రతిమాలడానికి అంగంగా పారిజాతహరణాదికం, ఇతిహాసాలలో లేకపోయినా, వర్ణించబడింది. అదే విధంగా అర్జునచరితంలో ఇతిహాసాప్రసిద్ధమైన, అర్జునుని పాతాలవిజయాదికం వర్ణించబడింది. ఇలా చేయడమే యుక్తం అని కవినా ఇత్యాదికం చేత చెపుతున్నాడు.

## ధ్వన్యాలోకం

రసాదివ్యఞ్జకత్వే ప్రబన్ధస్య చేదమన్యన్ముఖ్యం నిబన్ధనం, యత్ సన్ధీనాం ముఖప్రతిముఖగర్భావమర్శనిర్వహణాఖ్యానాం తదఙ్గానాం చ ఉపక్షేపాదీనాం ఘటనం రసాభివ్యక్త్యపేక్షయా; యథా రత్నావల్యామ్, న తు కేవలం శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా. యథా వేణీసంహారే విలాసాఖ్యస్య ప్రతిముఖసన్ధ్యఙ్గస్య ప్రకృత రసాననుగుణమపి ద్వితీయేఽఙ్కే భరతమతానుసరణమాత్రేచ్ఛయా ఘటనమ్.

బాలానందిని

ప్రబంధం రసాభివ్యంజకం కావడానికి మరొక ముఖ్యమైన నిబంధనం ఏదనగా - రత్నావళిలో వలె, రసాభివ్యక్త్యపేక్షచేత (రసాభివ్యక్తికోసం) ముఖ-ప్రతిముఖ-గర్భ-అవమర్శ-నిర్వహణా లనే పేర్లు గల సంధులను వాటి అంగాలైన ఉపక్షేపాదులను కూర్చడం. అయితే వీటిని కేవలం శాస్త్రంలో ఉన్న స్థితిని సంపాదించా లనే ఇచ్ఛచేత,

(శాస్త్రంలో చెప్పారు కదా అని రసోపకారకాలు కాకపోయినా) కూర్చకూడదు. ఎట్లనగా - వేణీసంహారంలోని ద్వితీయాంకంలో కేవలం భరతుని మతాన్ని అనుసరించాలనే ఇచ్ఛచేత, ప్రకృతరసానికి అనుగుణం కాకపోయినా విలాసం అనే ప్రతిముఖసంధ్యంగం చేర్చబడింది.

లోచనం

సన్ధీనామితి - ఇహ ప్రభుసంమితేభ్యః శ్రుతిస్మృతిప్రభృతిభ్యః కర్తవ్యమిదమిత్యాజ్ఞామాత్రపరమార్థేభ్యః శాస్త్రేభ్యః యే న వ్యుత్పన్నాః, న చాప్యస్య ఇదం వృత్తమ్ అముష్మాత్ కర్మణః ఇత్యేవం యుక్తియుక్త కర్మఫలసంబన్ధప్రకటనకారిభ్యః మిత్రసంమితేభ్యః ఇతిహాసశాస్త్రేభ్యః, లఘువ్యుత్పత్తయః, అథ చ అవశ్యం వ్యుత్పాద్యాః ప్రజార్థసంపాదనయోగ్యతా క్రాన్తాః రాజపుత్రప్రాయాః తేషాం హృదయానుప్రవేశముఖేన చతుర్వర్గోపాయవ్యుత్పత్తిరాధేయా. హృదయానుప్రవేశశ్చ రసాస్వాదమయ ఏవ.

బాలానందిని

సంధీనామితి - ''ఇతి చెయ్యాలి'' అని ఆజ్ఞ ఇవ్వడంలోనే పరమతాత్పర్యం గలవి, ప్రభువువంటివీ అయిన శ్రుతిస్మృత్యాది శాస్త్రాలవల్ల ఏ రాజపుత్రాదులవంటి వాళ్లు వ్యుత్పన్నులు కాజాలరో, ''ఈ పనిచేయడంవల్ల ఫలానావానికి ఇది జరిగింది'' అని యుక్తియుక్తంగా చేసే పనికీ దానివల్ల కలిగే ఫలానికీ ఉన్న సంబంధాన్ని బోధించే ఇతిహాసశాస్త్రాలవల్ల కూడా ఎవరు వ్యుత్పత్తి సంపాదించజాలరో, అయితే ప్రజల ప్రయోజనాలను సంపాదించవలసిన యోగ్యత సంపాదించుకొనవలసినవాళ్ళవడంచేత తప్పకుండా వ్యుత్పత్తి కలిగించవలసినవాళ్లుగా ఉంటారో వాళ్ల హృదయంలో ప్రవేశింపచేయడం ద్వారా వాళ్లకి ధర్మార్థకామమోక్షాలనే చతుర్వర్గాన్ని సాధించే ఉపాయాల విషయంలో వ్యుత్పత్తి కలిగించాలి. హృదయంలో ప్రవేశించడం అంటే అది రసాస్వాదమయమే.

లోచనం

స చ రసః చతుర్వర్గోపాయవ్యుత్పత్తినాన్తరీయకవిభావాది సంయోగ ప్రసాదోపనత ఇత్యేవం రసోచితవిభావాద్యుపనిబన్ధే రసాస్వాద వైవశ్యమేవ

స్వరసభావిన్యాం వ్యుత్పత్తౌ ప్రయోజకమితి ప్రీతిరేవ వ్యుత్పత్తేః ప్రయోజికా. ప్రీత్యాత్మా చ రసః. తదేవ నాట్యమ్, నాట్యమేవ వేదః ఇత్యస్మదుపాధ్యాయః. న చైతే ప్రీతివ్యుత్పత్తీ భిన్నరూపే ఏవ, ద్వయోరప్యేకవిషయత్వాత్. విభావాద్యౌచిత్యమేవ హి సత్యతః ప్రీతేర్నిదానమితి అసకృదవోచామ. విభావాదీనాం తద్రసోచితానాం యథాస్వరూపవేదనం ఫలపర్యన్తీభూతతయా వ్యుత్పత్తిరిత్యుచ్యతే. ఫలం చ నామ యదదృష్ట వశాద్దేవతాప్రసాదాదన్యతో వా జాయతే. న చ తదుపదేశ్యమ్. తతః ఉపాయే వ్యుత్పత్త్యయోగాత్. తేనోపాయక్రమేణ ప్రవృత్తస్య సిద్ధిః, అనుపాయద్వారేణ ప్రవృత్తస్య నాశః ఇత్యేవం నాయకప్రతినాయకగతత్వేన అర్థానర్థోపాయవ్యుత్పత్తిః కార్యా.

బాలానందిని

స చేతి :- ఆ రసం చతుర్వర్గోపాయవ్యుత్పత్తికి తప్పనిసరిగా ఉండవలసిన విభావాదుల సంయోగంయొక్క అనుగ్రహంచేత లభిస్తుంది. ఈ విధంగా రసానికి ఉచితమైన విభావాదులను కూర్చడంతో రసాస్వాదంవల్ల కలిగే వివశత్వమే తదనుగుణంగా కలిగే వ్యుత్పత్తికి ప్రయోజకం (కారణం, సంపాదకం). అందువల్ల వ్యుత్పత్తిని ప్రవర్తింపచేసేది అనగా వ్యుత్పత్తికి కార్యం, ప్రీతియే. ప్రీతిస్వరూపమైనదే రసం. రసమే నాట్యం. నాట్యమే వేదం అని మా ఉపాధ్యాయులు చెప్పి ఉన్నారు. ఈ ప్రీతివ్యుత్పత్తుల రూపాలు వేరు వేరైనవి కాదు. ఎందువల్ల ననగా - రెండింటికీ విషయం ఒకటే. నిజానికి ప్రీతికి మూలకారణం విభావాదులౌచిత్యమే అని చాలా పర్యాయాలు చెప్పి ఉన్నాం. ఆ రసాలకు ఉచితమైన విభావాదుల యథార్థస్వరూపజ్ఞానమే ఫలంవరకూ తీసికొని వెడుతుంది గాన వ్యుత్పత్తి అని చెప్పబడుతుంది. ఫలం అనగా - ఏదైతే అదృష్టవశంచేత గాని, దేవతాప్రసాదం వల్ల గాని, మరి ఇతరకారణాలవల్ల గాని కలుగుతుందో అది. అది (ఫలం) ఉపదేశించవలసిన పని లేదు. దానివల్ల (ఫలాన్ని గూర్చి ఉపదేశించడంవల్ల) ఉపాయం విషయంలో వ్యుత్పత్తి కలగదు కదా? అందుచేత "ఉపాయాలను అనుసరించి వ్యవహరించినవానికి సిద్ధి లభిస్తుంది, ఉపాయాలద్వారా కాక మరొక విధంగా వ్యవహరించినవానికి నాశం కలుగుతుంది" ఇత్యాదివిధంగా నాయకప్రతినాయకులలో ఉన్నట్లు అర్థానర్థోపాయాల వ్యుత్పత్తి కలిగించాలి. అనగా - అర్థకరమైన, ప్రయోజనసంపాదకాలైన ఉపాయాలను అవలంబించి నాయకుడు కార్యసిద్ధి

సాధించాడు, అనర్థకరమైన ఉపాయాలను అవలంబించి ప్రతినాయకుడు నశించాడు అని సదసదుపాయాల విషయంలో వ్యుత్పత్తిని కలిగించాలి.

లోచనం

ఉపాయశ్చ కర్త్రా ఆశ్రీయమాణః పఞ్చ అవస్థాః భజతే. తద్యథా - స్వరూపమ్, స్వరూపాత్ కించిత్ ఉచ్ఛూనతామ్, కార్యసంపాదనయోగ్యతామ్, ప్రతిబన్ధోపనిపాతేన ఆశఙ్క్యమానతామ్, నివృత్తప్రతిపక్షతాయాం బాధకబాధనేన సుధృఢఫలపర్యన్తతామ్. ఏవమార్తిసహిష్ణూనామ్, విప్రలమ్భభీరూణామ్, ప్రేక్షాపూర్వకారిణాం తావదేవం కారణోపాదానమ్. తా ఏవంవిధాః పఞ్చావస్థాః కారణగతాః మునినోక్తాః -

"సంసాధ్యే ఫలయోగే తు వ్యాపారః కారణస్య యః,
తస్యానుపూర్వ్యా విజ్ఞేయాః పఞ్చావస్థాః ప్రయోక్తృభిః.
ప్రారమ్భశ్చ ప్రయత్నశ్చ తథా ప్రాప్తేశ్చ సంభవః,
నియతా చ ఫలప్రాప్తిః ఫలయోగశ్చ పఞ్చమః. (నా.శా.27- 7, 9) ఇతి.

బాలానందిని

ఉపాయశ్చేతి - కర్తచేత ఆశ్రయించబడే ఉపాయం ఐదు అవస్థలను పొందుతుంది. (ఆ ఉపాయానికి ఐదు అవస్థలు ఉంటాయి). ఎట్లనగా - స్వరూపాన్ని (అనగా ఉపాయాన్ని అనుష్ఠించడానికి ప్రారంభించడాన్ని) స్వరూపంనుంచి కొంచెం ఉబకడాన్ని (అనగా పుష్టిచెందడాన్ని), కార్యసంపాదనయోగత్వాన్నీ, విఘ్నాలు వచ్చిపడడంచేత ఏమౌతుందా అని ఆశంకించబడడాన్నీ. శత్రువులు (విఘ్నాలు) తొలగిపోవడంతో బాధకమైన దానిని బాధించడంచేత సునిశ్చితమైన ఫలపర్యంతత్వాన్ని (తప్పకుండా పలం లభిస్తుందనే నిశ్చయాన్నీ) ఈ ఐదు అవస్థలనూ పొందుతుంది. ఎంతటి శ్రమనైనా సహించగలవాళ్లూ, కార్యానికి విఘ్నా లేవీ రావు కదా అని భయపడుతూండేవాళ్లూ అయిన, బాగా ఆలోచించి పనిచేసేవాళ్లందరూ ఈ విధంగానే కారణాలను (ఉపాయాలను) అవలంబిస్తారు. కారణాలకి సంబంధించిన ఈ విధమైన ఐదు అవస్థలనూ ముని చెప్పి ఉన్నాడు.

సంసాధ్యే ఇతి - ఫలయోగే = ఫలసంబంధం సంసాధ్యే= సాధింప దగినదై ఉండగా, కారణస్య= నాయకాదులయొక్క, యః వ్యాపారః = ఏ వ్యాపారం ఉన్నదో,

తస్య= దానియొక్క. పఞ్చ అవస్థాః= ఐదు అవస్థలు, ప్రయోక్తృభిః= ఉపాయాలను ప్రయోగించేవాళ్లచేత, అనుపూర్వ్యా= వరుసగా, విజ్ఞేయాః= తెలియదగినవి. ప్రారమ్భశ్చ= ప్రారంభమూ, ప్రయత్నశ్చ= ప్రయత్నము, తథా= మరియు, ప్రాప్తేః= ఫలప్రాప్తియొక్క, సంభవః= సంభవం (లభించవచ్చుననే ఊహ), నియతా= తప్పనిసరియైన, ఫలప్రాప్తిః= ఫలలాభం (తప్పక లభిస్తుందనే అభిప్రాయం) పఞ్చమః= ఐదవదైన, ఫలయోగశ్చ= ఫలసంబంధము.

లోచనం

ఏవం యా ఏతాః కారణస్యావస్థాః తత్సంపాదకం యత్ కర్తురితివృత్తం పఞ్చధా విభక్తం, త ఏవ ముఖప్రతిముఖగర్భావమర్శనిర్వహణాఖ్యాః అన్వర్థనామానః పఞ్చ సంధయః ఇతివృత్తఖణ్డాః, సంధీయన్తే ఇతి కృత్వా. తేషామపి సంధీనాం స్వనిర్వాహ్యం ప్రతి తథా క్రమదర్శనాత్ అవాన్తరభిన్నాః ఇతివృత్తభాగాః సంధ్యఙ్గాని - "ఉపక్షేపః పరికరః పరిన్యాసో విలోభనమ్" ఇత్యాదీని.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ఏ ఈ కారణానికి సంబంధించిన అవస్థలు ఉన్నాయో, వాటిని సంపాదించే కర్తయొక్క ఏ ఇతివృత్తం ఐదు విధాలుగా విభజించబడుతుందో అవే ముఖ-ప్రతిముఖ-గర్భ-అవమర్శ-నిర్వహణా లనే సార్థకనామధేయాలు గల ఐదు సంధులు; ఇతివృత్తఖండాలు. (అవి ఒకదాని తరవాత ఒకటి) సంధించబడతాయి గాన సంధులు. ఆ సంధులకు కూడ తమచేత నిర్వహించబడదగిన. తాము నిర్వహించవలసి ఉన్న, ఫలాన్ని గూర్చి ఆ విధమైన క్రమం ఉండడంవల్ల వాటి అవాంతరభిన్నాలైన ఇతివృత్తభాగాలు సంధ్యంగాలు - ఉపక్షేపం, పరికరం, పరిన్యాసం, విలోభనం మొదలైనవి.

లోచనం

అర్థప్రకృతయోఽత్రైవాన్తర్భూతాః తథాహి - స్వాయత్తసిద్ధేః బీజమ్, బిన్దుః, కార్యమ్ ఇతి తిస్రః. బీజేన సర్వవ్యాపారాః, బిన్దునా అనుసంధానం, కార్యేణ నిర్వాహః, సందర్శనప్రార్థనావ్యవసాయరూపా హ్యేతాస్తిస్రః అర్థే సంపాద్యే కర్తుః ప్రకృతయః స్వభావవిశేషాః. సచివాయత్తసిద్ధిత్వే తు సచివస్య

తదర్థమేవ వా, స్వార్థమేవ వా, స్వార్థమపి వా ప్రకృతత్వేన ప్రకీర్ణత్వప్రసిద్ధత్వాభ్యాం ప్రకరీపతాకావ్యపదేశ్యతయా ఉభయప్రకారసంబన్ధీ వ్యాపారవిశేషః ప్రకరీపతాకాశబ్దాభ్యాముక్త ఇతి. ఏవం ప్రస్తుతఫలనిర్వాహణాన్తస్య ఆధికారికస్య వృత్తస్య పఞ్చసంధిత్వం పూర్ణసంధ్యఙ్గతా చ సర్వజనవ్యుత్పత్తి దాయినీ నిబన్ధనీయా. ప్రాసఙ్గికేత్వితివృత్తే నాయం నియమ ఇత్యుక్తమ్ -

"ప్రాసఙ్గికే పరార్థత్వాన్న హ్యేష నియమో భవేత్" ఇతి మునినా.

బాలానందిని

అర్థప్రకృతయ ఇతి - అర్థప్రకృతులు కూడ దీనిలోనే (సంధులలోనే) అంతర్గతాలు. ఎట్లనగా - స్వాయత్తసిద్ధికి (తన కార్యాన్ని తానే సాధించుకొనగలిగిన నాయకునికి) బీజం, బిందువు, కార్యం అని మూడు అర్థసిద్ధులు. 'బీజం' అనేదాని చేత సర్వవ్యాపారాలు గ్రహించబడతాయి. (సర్వవ్యాపారాలకి 'బీజం' అని పేరు). 'బిందువు' అనేదానిచేత అనుసంధానం (చేయవలసిన పనులను గూర్చిన పునర్విమర్శ) చెప్పబడుతుంది. 'కార్యం' చేత పనిని పూర్తి చేయడం చెప్పబడుతుంది. ఈ విధంగా విషయాలను జాగర్తగా పరిశీలించడం, వాటిని గూర్చిన కోరిక, సాధించడానికి ఉద్యమించడం అనే రూపం గల ఈ మూడూ, అర్థే= సంపాదించవలసినదానియందు, కర్తయొక్క, ప్రకృతయః= స్వభావాలు. నాయకుడు సచివాయత్తసిద్ధి అయితే (కార్యసాధనానికి మంత్రి మొదలైన ఇతరులమీద ఆధారపడినవా డైతే) ఆ సచివుడు నాయకుని కోసమో, తనకోసమో, తనకోసం కూడానో (అనగా తనకోసమూ నాయకునికోసమూ కూడానో) ప్రవర్తిస్తాడు గాన ఆ వ్యాపారవిశేషం ప్రకీర్ణత్వ (ఇతరవ్యాపారాలతో కలిసిపోవడం) ప్రసిద్ధత్వాలచేత 'ప్రకరి' 'పతాక' అని చెప్పబడుచు రెండు విధాలకు (నాయకార్థత్వస్వార్థత్వాలకు) సంబంధించి ఉంటుంది. అందుచేత ఇది 'ప్రకరీ' 'పతాక' శబ్దాలచేత చెప్పబడుతుంది. ఈ విధంగా ప్రస్తుతమైన ఫలాన్ని నిర్వహించే వరకూ గూడ ఆధికారికమై (ప్రధానంగా ప్రారంభంనుంచి చివరిదాకా ఉన్న) వృత్తానికి ఐదు సంధులనూ, పూర్ణమైన సంధ్యంగాలను కూర్చాలి. ఇది సర్వజనులకు వ్యుత్పత్తిని కలిగించేదిగా ఉంటుంది. ప్రాసంగికమైన ఇతివృత్తం విషయంలో ఈ నియమం లేదు అని ముని చెప్పి ఉన్నాడు- 'ప్రాసంగిక ఇతివృత్తంలో అది పరార్థం గాన ఈ నియమం ఉండదు".

లోచనం

ఏవం స్థితే రత్నావల్యాం ధీరలలితస్య నాయకస్య ధర్మావిరుద్ధ సంభోగసేవాయామ్ అనౌచిత్యాభావాత్, ప్రత్యుత "న నిఃసుఖః స్యాత్" ఇతి శ్లాఘ్యత్వాత్ పృథ్వీరాజ్యమహాఫలానుబన్ధి కన్యాలాభఫలోద్దేశేన ప్రస్తావనోపక్రమే పఞ్చాపి సంధయః అవస్థాపఞ్చకసహితాః సముచితసన్ధ్యఙ్గపరిపూర్ణాః అర్థప్రకృతియుక్తాః దర్శితా ఏవ. "ప్రారమ్భేఽస్మిన్ స్వామినో వృద్ధిహేతౌ" ఇతి హి బీజాదేవ ప్రభృతి "విశ్రాన్తవిగ్రహకథః" ఇతి, "రాజ్యం నిర్జితశత్రు" ఇతి చ వచోభిః "ఉపభోగసేవావసరోఽయమ్" ఇత్యుపక్షేపాత్ ప్రభృతి హి నిరూపితమ్. ఏతత్తు సమస్తసన్ధ్యఙ్గస్వరూపం తత్పాఠపృష్ఠే ప్రదర్శ్యమానమ్ అతితమాం గ్రన్థగౌరవమావహతి. ప్రత్యేకేన తు ప్రదర్శ్యమానం పూర్వాపరాను సన్ధానవన్ధ్యతయా కేవలం సంమోహదాయి భవతీతి న వితతమ్.

బాలానందిని

ఈ విషయాలను "యథా రత్నావల్యామ్" అని వృత్తికారుడు చూపిన లక్ష్యంలో సమన్వయిస్తున్నాడు - ఏవమితి. ఇలా ఉండగా - రత్నావళిలో ధీరలలితుడైన నాయకుడు ధర్మావిరుద్ధమైన సంభోగాన్ని సేవించడంలో అనౌచిత్యం ఏదీ లేదు గాన, మీదుమిక్కిలి "న నిఃసుఖః స్యాత్" (కౌటిల్యుని అర్థశాస్త్రం) (సుఖాలు అనుభవించకుండా ఉండకూడదు) అనే శాస్త్రవచనానుసారం అది శ్లాఘనీయం గాన, సమస్తభూమండలరాజ్యలాభరూపమైన మహాఫలంతో సంబంధించిన కన్యాలాభం అనే ఫలాన్ని ఉద్దేశించి ప్రస్తావనాప్రారంభంలోనే ఐదు అవస్థలతో కూడిన, తగిన సంధ్యంగాలతో పరిపూర్ణాలైన ఐదు సంధులు అర్థప్రకృతులతో సహా చూపబడ్డాయి. "ప్రారంభేఽస్మిన్ స్వామినో వృద్ధి హేతౌ" అనే బీజం నుండి ప్రారంభించి "విశ్రాన్తవిగ్రహకథః' అని, "రాజ్యం నిర్జితశత్రు" అనే మాటలచేత "ఉపభోగసేవావసరోఽయమ్" అని ఉపక్షేపం మొదట నిరూపించబడింది. ఈ సమస్తసంధ్యంగాల స్వరూపాన్ని ఆ నాటికలోని మాట లన్నీ ఉదాహరిస్తూ (తత్పాఠపృష్ఠే) చూపించడం ప్రారంభిస్తే దానివల్ల గ్రంథగౌరవం చాల ఎక్కువ అయిపోతుంది. ఆ వాక్యా లేవీ ఉదాహరించకుండా వేరువేరుగా చూపిస్తే పూర్వాపరసందర్భాలు తెలియక పఠితకు కేవలం సంమోహాన్ని కలిగిస్తుంది. అందుచేత విస్తృతంగా చూపబడలేదు. (ఈ విషయం అంతా అర్థం కావాలంటే ఆ నాటిక

చదువుకుంటూ ఈ సంధిసంధ్యంగాదుల సమన్వయం చేసుకోవడం ఒకటే ఉపాయం అని అభినవగుప్తపాదుల అభిప్రాయం)

లోచనం

అస్యార్థస్య యత్నావధేయత్వేన ఇష్టత్వాత్ స్వకణ్ఠేన యో వ్యతిరేక ఉక్తః "న తు కేవలయా" ఇతి తస్యోదాహరణమాహ - న త్వితి. కేవలశబ్దమ్ ఇచ్ఛాశబ్దం చ ప్రయుఞ్జానస్య అయమాశయః - భరతమునినా సన్ధ్యఙ్గానాం రసాఙ్గభూతమితివృత్తప్రాశస్త్యోత్పాదనమేవ ప్రయోజనముక్తమ్. న తు పూర్వరఙ్గాఙ్గవత్ అదృష్టసంపాదనం, విఘ్నాదినివారణం వా. యథోక్తమ్ -

"ఇష్టస్యార్థస్య రచనా వృత్తాన్తస్యానపక్షయః,

రాగప్రాప్తిః ప్రయోగస్య గుహ్యానాం చైవ గూహనమ్,

ఆశ్చర్యవదభిఖ్యానం ప్రకాశ్యానాం ప్రకాశనమ్,

అఙ్గానాం షడ్విధం హ్యేతద్దృష్టం శాస్త్రే ప్రయోజనమ్. (నా.శా.2153). ఇతి తతశ్చ -

"సమీహా రతిభోగార్థా విలాసః పరికీర్తితః" (నా.శా.21.78)

ఇతి ప్రతిముఖసంధ్యఙ్గవిలాసలక్షణే 'రతిభోగ' శబ్దః ఆధికారికరసస్థాయి భావోపవ్యఞ్జకవిభావాద్యుపలక్షణార్థత్వేన ప్రయుక్తః యథాతత్త్వం నాధిగతార్థ ఇతి; ప్రకృతో హ్యత్ర వీరరసః.

బాలానందిని

అస్యేతి :- ఈ విషయంలో ప్రయత్నపూర్వకంగా సావధానచిత్తులై ఉండడం అవసరం అవడంచేత "కేవలం శాస్త్రంలో చెప్పారు కదా అని సంధ్యంగాదులు కూర్చకూడదు" అని స్వకంఠంతో ఏ వ్యతిరేకం చెప్పబడిందో దానికి న తు ఇత్యాదికంచేత ఉదాహరణం చూపుతున్నాడు. "కేవల" శబ్దాన్ని 'ఇచ్ఛా' శబ్దాన్నీ ప్రయోగించడంలో వృత్తికారుని అభిప్రాయం ఇది - రసానికి అంగం అయేటట్లు ఇతివృత్తంయొక్క ప్రాశస్త్యాన్ని పుట్టించడమే సంధ్యంగాల ప్రయోజనం అని భరతుడు చెప్పాడు. అంతేనే కాని పూర్వరంగాంగాలకు వలె అదృష్టాన్ని సంపాదించడం గాని, విఘ్నాదుల నివారణం కాని వీటి ప్రయోజనం కాదు. ఇతడు ఏమని చెప్పినా డనగా -

ఇష్టస్యేతి - ఇష్టస్య అర్థస్య = ఇష్టమైన విషయంయొక్క, రచనా= రచన, వృత్తాన్తస్య= వృత్తాంతంయొక్క, అనపక్షయః= క్షీణించకపోవడం, ప్రయోగస్య= నాట్యప్రయోగానికి, రాగప్రాప్తిః= రాగంయొక్క ప్రాప్తి, గుహ్యానామ్= రహస్యంగా ఉంచవలసినవాటియొక్క, గూహనమ్ = కప్పిపుచ్చడం, ఆశ్చర్యవదభిఖ్యానమ్= ఆశ్చర్యకరమైనవాటిని చెప్పడం, ప్రకాశ్యానామ్ = ప్రకాశించదగినవాటియొక్క, ప్రకాశనమ్= ప్రకాశింపచేయడం, ఏతత్ = ఇది, అఙ్గానామ్= అంగాలయొక్క, ఫలమ్= ఫలంగా, శాస్త్రే= శాస్త్రమునందు, దృష్టమ్= చూడబడినది.

అందువలన - "రతిభోగం కోసం అభిలాష విలాస అని చెప్పబడినది" అని చెప్పిన ప్రతిముఖసంధ్యంగమైన విలాసయొక్క లక్షణంలో "రతిభోగ" శబ్దం ఆధికారికమైన (కావ్యం మొదటినుంచి చివరి వరకూ ఉండే) రసంయొక్క స్థాయిభావాన్ని వ్యంజింపచేసే విభావాదులకు ఉపలక్షణంగా ప్రయోగించబడింది. కవి దాన్ని సరిగా అర్థం చేసుకొనలేదు. ఇక్కడ ప్రకృతరసం వీరరసం కదా? అనగా 'రతి' శబ్దాన్ని ప్రసిద్ధరత్యర్థంలోనే గ్రహించి శృంగారానికి సంబంధించిన విలాసను పొరబాటున ఘటించినాడు అని భావం.

## ధ్వన్యాలోకం

ఇదం చాపరం ప్రబన్ధస్య రసవ్యఞ్జకత్వే నిమిత్తం యదుద్దీపనప్రశమనే యథావసరమన్తరా రసస్య - యథా రత్నావల్యామేవ. పునరారబ్ధవిశ్రాన్తే రసస్యాఙ్గినః అనుసంధిశ్చ. యథా తాపసవత్సరాజే.

### బాలానందిని

ఇదమితి - ప్రబంధం రసవ్యంజకం అవడానికి మరొక నిమిత్తం ఏదనగా - సమయానుకూలంగా రసాన్ని ఉద్దీపింపచేయడం, శాంతింపచేయడం అనేవి. ఉదాహరణకి రత్నావళిలోనే. ప్రారంభించిన విశ్రాంతిగల అంగియైన రసంయొక్క అంగాలను అనుసంధించడం - మళ్లా కూర్చడం ఉదాహరణకి - తాపసవత్సరాజంలో.

### లోచనం

ఉద్దీపన ఇతి - ఉద్దీపనం విభావాదిపరిపూరణయా, యథా - "అయం స రాజా ఉదయనోత్తి" ఇత్యాది సాగరికాయాః. ప్రశమనం వాదవదత్తాయాః పలాయనే. పునరుద్దీపనం చిత్రఫలకోల్లేఖే. ప్రశమనం సుసంగతాప్రవేశే

ఇత్యాది. గాఢం హ్యనవరతపరిమృదితః రసః సుకుమారమాలతీకుసుమవత్ ఝుటిత్యేవ మ్లానిమవలమ్బేత. విశేషతస్తు శృఙ్గారః. యదాహ మునిః-

"యద్వామాభినివేశిత్వం యతశ్చ వినివార్యతే,

దుర్లభత్వం యతో నార్యా కామినః సాపరా రతిః" (నా.శా.24.199)ఇతి.

వీరరసాదావపి యథావసరముద్దీపనప్రశమనాభ్యాం ఝుటిత్యేవ అద్భుత ఫలకల్పే సాధ్యే లబ్ధే ప్రకటీచికీర్షిత ఉపాయోపేయభావః న ప్రదర్శిత ఏవ స్యాత్.

బాలానందిని

ఉద్దీపన ఇతి - విభావాదులను పూరించడంచేత (రసాన్ని) ఉద్దీప్తం చేయడం (రగుల్కొల్పడం). ఎట్లనగా - ''అయం స రాఅ ఉదయణోత్తి'' ఇత్యాది సాగరికా వచనాలు (ఇవి ఉద్దీపకాలు). వాసవదత్తనుండి పారిపోవడంలో ప్రశమనం. చిత్రఫలకవర్ణనంలో మళ్లీ ఉద్దీపనం. సుసంగత వచ్చినప్పుడు ప్రశమనం - ఇత్యాదికం (రత్నావళిలో). గాఢంగా, నిరంతరంగా ఒకే రసాన్ని పట్టుకుని మర్దిస్తే (అవిచ్ఛిన్నంగా ఒకే రసాన్ని నిబంధిస్తే) అది సుకుమారమాలతీకుసుమం వలె వాడిపోతుంది. శృంగారం అసలేను. అందుచేతనే ముని ఇలా అన్నాడు -

యదితి:- యత్= ఏ కారణంవల్ల, వామాభినివేశిత్వమ్= స్త్రీ ప్రతికూలంగా ప్రవర్తించడానికి అభిలషిస్తుందో, యతః చ = ఎందువల్ల, వినివార్యతే= స్త్రీచేత సంభోగం నివారించబడుతుందో, నార్యా= స్త్రీచేత, కామినః= ప్రియునియొక్క, యతః= ఎందువలన, దుర్లభత్వమ్= దుర్లభత్వమో, సా = అదే, పరా= ఉత్కృష్టమైన, రతిః= రతి. సంభోగానికి అనేకవిఘ్నాలు కలిగించిన కొలదీ అలాంటి స్త్రీయొక్క సంభోగం పరమానందసంధాయకం అని భావం.

వీరేతి - వీరరసాదులలో కూడ సమయానుసారంగా ఉద్దీపనప్రశమనాలు లేని పక్షంలో ఆశ్చర్యకరమైన ఫలంవలె సాధ్యం హటాత్తుగా లభిస్తే వీరుని ఉత్సాహానికీ ఫలానికీ మధ్య ఉన్న ఏ ఉపాయోపేయభావం ప్రకటింప నిచ్ఛయించబడిందో అది ప్రదర్శితం కాకుండానే ఉండిపోతుంది. ఉద్దీపనప్రశమనలు లేకుండా ఒక్క ప్రయత్నంలోనే హటాత్తుగా లభిస్తే అదేదో ఆశ్చర్యకరమైన, ఇంద్రజాలాదికల్పితమైన, ఫలంలా కనబడుతుంది. వీరుని ఉత్సాహం అనే ఉపాయంచేత ఇది సాధించబడింది అనే భావం కలగదు అని భావం.

లోచనం

పునరితి - ఇతివృత్తవశాదారబ్ధా ఆశఙ్క్యమానప్రాయా, న తు సర్వథైవోపనతా విశ్రాన్తిః విచ్ఛేదః యస్య స తథా. రసస్య రసాఙ్గభూతస్య కస్యాపీతి యావత్. తాపసవత్సరాజే హి వాసవదత్తావిషయః జీవితసర్వస్వాభిమానాత్మా ప్రేమబన్ధః తద్విభావాద్యౌచిత్యాత్ కరుణవిప్రలమ్భాదిభూమికాః గృహ్ణన్ సమస్తేతివృత్తవ్యాపీ. రాజ్యప్రత్యాపత్త్యా హి సచివనీతిమహిమోపనతయా తదఙ్గభూతపద్మావతీలాభానుగతయా అనుప్రాణ్యమానరూపా పరమామ్ అభిలషణీయతమతాం ప్రాప్తా వాసవదత్తాధిగతిరేవ తత్ర ఫలమ్. నిర్వహణే హి - "ప్రాప్తా దేవీ భూతధాత్రీ చ భూయః సంబన్ధోఽభూద్దర్శకేన" ఇత్యేవం దేవీలాభప్రాధాన్యం నిర్వాహితమ్. ఇయతి చ ఇతివృత్తవైచిత్ర్యచిత్రే భిత్తిస్థానీయః వాసవదత్తాప్రేమబన్ధః ప్రథమమన్త్రారమ్భాత్ ప్రభృతి; పద్మావతీవివాహాదౌ తస్యైవ వ్యాపారాత్. తేన స ఏవ వాసవదత్తావిషయః ప్రేమబన్ధః కథావశాదాశఙ్క్యమానవిచ్ఛేదోఽప్యనుసంహితః. తథాహి - ప్రథమే తావదఙ్కే స్ఫుటం స ఏవోపనిబద్ధః "తద్వక్త్రేన్దువిలోకనేన దివసో నీతః ప్రదోషస్తథా తద్గోష్ఠ్యైవ" ఇత్యాదినా, "బద్ధోత్కణ్ఠమిదం మనః కిమథవా ప్రేమాసమాప్తోత్సవమ్" ఇత్యన్తేన. ద్వితీయేఽపి - "దృష్టిర్నామృతవర్షిణీ స్మితమధు ప్రస్యన్ది వక్త్రం న కిమ్" ఇత్యాదినా స ఏవ విచ్ఛిన్నోఽప్యనుసంహితః. తృతీయేఽపి-

"సర్వత్ర జ్వలితేషు వేశ్మసు భయాదాలీజనే విద్రుతే
శ్వాసోత్కమ్పవిహస్తయా ప్రతిపదం దేవ్యా పతన్త్యా తథా,
హా నాథేతి ముహుః ప్రలాపపరయా దగ్ధం వరాక్యా తయా
శాన్తేనాపి వయం తు తేన దహనేనాద్యాపి దహ్యామహే".

ఇత్యాదినా.

బాలానందిని

పునరితి : ఇతివృత్తవశంవల్ల ఆరంభించబడినది, ఆశంకించబడేటట్లుగా ఉన్నది, కాని పూర్తిగా రానిది అయిన, విశ్రాన్తిః= విచ్ఛేదం, దేనికో అది అనగా - ఇతివృత్తాన్ని పట్టి

రసానికి విచ్ఛేదం ప్రారంభం అవుతూన్నది; విచ్ఛేదం కలగుతుందా అన్న ఆశంక కలగూతూన్నది కాని పూర్తిగా అది (విచ్ఛేదం) రాలేదు. అలాంటి రసంయొక్క అని 'ఆరబ్ధవిశ్రాన్తేః' అనే వృత్తిగతశబ్దానికి అర్థం. రసస్య అనగా ఇక్కడ "రసాంగం అయిన ఏదైన ఒకదానియొక్క" అని అర్థం. (దాని అనుసంధి - మళ్లీకూర్చడం).

తాపసవత్సరాజే ఇతి:- తాపసవత్సరాజంలో ఈమె నా జీవితసర్వస్వం అనే అభిమానం స్వరూపంగా గల వాసవదత్తను గూర్చిన (వత్సరాజులో ఉన్న) ప్రేమబంధం దాని విభావాదుల ఔచిత్యంవల్ల కరుణ - విప్రలంభాదిభూమికలను ధరిస్తూ సమస్తమైన ఇతివృత్తాన్ని వ్యాపించి ఉంది. సచివుని నీతిమహిమచేత తీసికొనిరాబడినదీ, దానికి (సచివనీతికి లేదా రాజ్యప్రాప్తికి) అంగమైన పద్మావతీలాభంతో కూడినదీ అయిన రాజ్యపునఃప్రాప్తిచేత జీవింపచేయబడిన రూపం గలదై మిక్కిలి అభిలషింపదగి ఉండడాన్ని పొందిన వాసవదత్తాప్రాప్తియే ఈ నాటకానికి ఫలం. నిర్వహణసంధిలో 'ప్రాప్తా' ఇత్యాదికంచేత దేవీలాభానికే ప్రాధాన్యం నిర్వహించబడింది. పూర్తిశ్లోకం ఇది -

"దృష్టా యూయం నిర్జితా విద్విషశ్చ ప్రాప్తా దేవీ భూతధాత్రీ చ భూయః,
సంబన్ధోఽభూద్దర్శకేనాపి సార్ధం కిం తే దుఃఖం యత్తతః శాన్తమద్య".

"మీరు కనబడ్డారు. శత్రువులు జయించబడ్డారు. దేవి, భూమీ కూడ పొందబడ్డాయి. దర్శకునితో సంబంధం (బాంధవ్యం) ఏర్పడింది. ఇంక దుఃఖం ఏముంది. ఇప్పుడు అంతా శాంతించింది". అంతటి ఇతివృత్తవైచిత్ర్యం అనే చిత్రంలో ప్రథమమంత్రణం మొదలు వాసవదత్తాప్రేమబంధం భిత్తివలె (చిత్రాలు చిత్రించే గోడవలె) ఉంది. పద్మావతీవివాహాదులు కూడ ఇదే నడిపించింది కదా? అందుచేత కథావశంవల్ల విచ్ఛిన్నమైపోతున్నట్లు ఆశంకింపబడుతున్నా కూడా వాసవదత్తావిషయకమైన ఆ ప్రేమబంధమే మళ్లీ అనుసంధించబడింది (కూర్చబడింది). ఎట్లనగా - ప్రథమాంకంలో - "ఆమెముఖపద్మాన్ని చూస్తూ పగలు గడపబడింది; ఆమె మాటలే చెప్పుకుంటూ సాయం సమయం గడపబడింది" మొదలు, 'ఈమనస్సు బెంగగొని ఉంది. ఐతేమాత్రం ఏమిటి? ప్రేమ అసమాప్తమైన ఉత్సవం కలదిగానే ఉండిపోతుంది' వరకు స్పష్టంగా అదే (ప్రేమబంధమే) నిబంధించబడింది. రెండవ అంకంలో కూడా విచ్ఛిన్నమైన అదే - 'దృష్టిః' ఇత్యాదికంచేత అనుసంధింపబడింది. పూర్తి శ్లోకం ఇది -

"దృష్టిర్నామృతవర్షిణీ స్మితమధుప్రస్యన్ది వక్త్రం న కిం
నో వార్ద్రం హృదయం న చన్దనరసస్పర్శాని చాఙ్గాని వా -

కస్మిన్ లబ్ధపదేన తే కృతమిదం క్రూరేణ పీతాగ్నినా
నూనం వజ్రమయోఽన్య ఏవ దహనస్త్వేదమాచేష్టితమ్".

"నీ దృష్టి అమృతం వర్షించేది కాదా? నీ ముఖం చిరునవ్వు అనే తేనెను జాలువార్చేది కాదా? నీ హృదయం ఆర్ద్రం కాదా? నీ అవయవాలు చందనరసం వంటి స్పర్శ కలవి కావా? ఏ అవయవంమీద అడుగు పెట్టి క్రూరమైన పచ్చని (మద్యపానం చేసిన అని మరొక అర్థం) అగ్నిచేత ఈ పని చేయబడింది? ఈ అగ్ని వజ్రమయమైన మరొక అగ్నియే. ఇది ఆ అగ్ని చేసిన పనే".

మూడవ అంకంలో కూడా సర్వత్రేత్యాదికం చేత అనుసంధించబడింది.

సర్వత్రేతి - "అంతటా ఇళ్లు మండిపోతూండగా, సఖురాండ్రందరూ భయపడి పారిపోగా, శ్వాసవల్ల కలిగిన వణకుచేత దుర్బలురాలై అడుగడుగునా ఆ విధంగా పడిపోతూ హా నాథా! అని మాటి మాటికీ కేకలు వేస్తూ దీనురాలైన ఆ దేవి కాలిపోయింది. మేమైతే ఆ శాంతించిన అగ్నిచేత కూడా ఇప్పటికీ కాల్చివేయబడు తున్నాం". "దేవ్యా దగ్ధమ్" అనేది భావే ప్రయోగం.

లోచనం

చతుర్థేఽపి -

దేవీస్వీకృతమానసస్య నియతం స్వప్నాయమానస్య మే
తద్గోత్రగ్రహణాదియం సువదనా యాయాత్కథం న వ్యథామ్,
ఇత్థం యన్త్రణయా కథం కథమపి క్షీణా నిశా జాగ్రతో
దాక్షిణ్యోపహతేన సా ప్రియతమా స్వప్నేఽపి నాసాదితా.

ఇత్యాదినా. పఞ్చమేఽపి సమాగమప్రత్యాశయా కరుణే నివృత్తే, విప్రలమ్భేఽఙ్కురితే -

"తథాభూతే తస్మిన్ మునివచసి జాతాగసి మయి
ప్రయత్నాన్తర్గూఢాం రుషముపగతా మే ప్రియతమా,
ప్రసీదేతి ప్రోక్తా న ఖలు కుపితేత్యుక్తిమధురం
సముద్భిన్నా పీతైర్నయనసలిలైః స్థాస్యతి పురః."

ఇత్యాదినా. షష్ఠేఽపి "త్వత్సంప్రాప్తివిలోభితేన సచివైః ప్రాణా మయా ధారితాః" ఇత్యాదినా.

బాలానందిని

చతుర్థేఽపీతి:- నాల్గవ అంకంలో కూడ ''దేవీ'' ఇత్యాదిశ్లోకంచేత అనుసంధించబడింది.

దేవీతి :- దీవేస్వీకృతమానసస్య= వాసవదత్తచేత స్వీకరించబడిన మనస్సు గల, నిరంతరము వాసవదత్తనే తలుస్తూన్న, స్వప్నాయమానస్య= స్వప్నం చూస్తూన్న, మే = నాయొక్క, తద్గోత్రగ్రహణాత్= ఆమె పేరును గ్రహించడంవల్ల, ఇయమ్= ఈ, సువదనా= సుందరవదన (పద్మావతి), కథమ్= ఎట్లు, వ్యథామ్= వ్యథను, న యాయాత్= పొందకుండా ఉంటుంది? ఇత్థమ్= ఇట్లు, యన్త్రణయా= నియంత్రణచేత, బలవంతంగా నిద్ర ఆపుకొనడంచేత, జాగ్రతః= నేను మేల్కొని ఉండగానే, నిశా = రాత్రి, కథం కథమపి= ఎట్లో, క్షీణా= గడచింది. దాక్షిణ్యోపహతేన= దాక్షిణ్యంచేత పీడితుడనైన (దెబ్బతీయబడిన) నాచేత, సా ప్రియతమా= ఆ ప్రియతమ, స్వప్నేఽపి=స్వప్నంలో కూడ, నాసాదితా = పొందబడలేదు.

ఐదవ అంకంలో కూడ సమాగమం జరగవచ్చు నని ఎదురు చూడడంచేత కరుణ విస్తరించి విప్రలంభం అంకురించగా "తథాభూతే" ఇత్యాదిశ్లోకంచేత అనుసంధానం చేయబడింది.

తథాభూతే ఇతి: తస్మిన్ మునివచసి= ఆ మునివాక్యం, తథాభూతే= అలాంటిదై ఉండగా, మయి= నేను, జాతాగసి= కలిగిన అపరాధం కలవాడనై ఉండగా, అపరాధంచేసిన వాడనై ఉండగా, ప్రయత్నాన్తర్గూఢామ్= ప్రయత్నపూర్వకంగా లోపల గూఢమైన, రుషమ్= కోపాన్ని, ఉపగతా= పొందిన, మే ప్రియతమా= నా ప్రియతమ, ప్రసీద= అనుగ్రహించుము, ఇతి= అని, ప్రోక్తా= పలకబడినదై, న ఖలు కుపితా = నేను కోపించలేదు కదా, ఇతి = అని, ఉక్తిమధురమ్= మాటచేత మధురంగా, సముద్భిన్నా= ఒక్కమాటు బ్రద్దలై, ఒక్కమాటు హటాత్తుగా పైకి ఉబికివచ్చిన దుఃఖం గలదై, పీతైః= త్రాగివేయబడిన, లోలోన అణచుకొనబడిన, లేదా సముద్భిన్నాపీతైః= ఒక్కమారుపెల్లుబికి దిగమ్రింగబడిన, నయనసలిలైః= కన్నీళ్లతో, పురః =నా ముందు, స్థాస్యతి = నిలబడగలదు.

ఆరవ అంకంలో కూడ "త్వత్సంప్రాప్తి" ఇత్యాదికంచేత అనుసంధానం చేయబడింది. పూర్తి శ్లోకం ఇది -

"త్వత్సంప్రాప్తివిలోభితేన సచివైః ప్రాణా మాయా ధారితాః
తన్మత్వాఽత్యజతః శరీరకమిదం నైవాస్తి నిఃస్నేహతా,

ఆసన్నో ఽవసరస్తవానుగమనే జాతా ధృతిః కిం త్వయం
ఖేదో యచ్చ తవానుగం న హృదయం తస్మిన్ క్షణే దారుణే".

సచివులచేత నీ సంప్రాప్తిని గూర్చి ఆశపెట్టబడిన నాచేత ప్రాణాలు ధరించబడ్డాయి. దానిని తలచి (వాళ్లమాటనుపట్టి) ఈ శరీరాన్ని నేను విడవలేదు. అయినా స్నేహం లేక పోవడం అనేది లేదు. అయితే ఇప్పుడు నిన్ను అనుసరించడానికి సమయం సమీపించింది. ధైర్యం (నిశ్చయం) కలిగింది. కాని ఇప్పుడు నాకున్న ఖేదం అల్లా అదే - ఆ దారుణమైన క్షణంలో నా హృదయం నిన్ను అనుసరించి వెళ్లలేదు.

## ధ్వన్యాలోకం

ప్రబన్ధవిశేషస్య నాటకాదే రసవ్యక్తినిమిత్తమిదం చాపరమవగన్తవ్యం యదలంకృతీనాం శక్తావప్యానురూప్యేణ యోజనమ్. శక్తో హి కవిః కదాచిదలంకారనిబన్ధనే తదాక్షిప్తతయైవ అనపేక్షితరసబన్ధః ప్రబన్ధమారభతే. తదుపదేశార్థమిదముక్తమ్. దృశ్యన్తే ˆచ కవయః అలఙ్కారనిబన్ధనైకరసాః అనపేక్షితరసాః ప్రబన్ధేషు.

### బాలానందిని

ప్రబన్ధస్యేతి:- నాటకాదిప్రబంధవిశేషంయొక్క రసాభివ్యక్తికొరకు మరొక నిమిత్తం ఇది కూడా తెలుసుకోవాలి; అదే మనగా శక్తి ఉన్నా కూడా అలంకారాలను అనురూపంగా ఉండేటట్లే (తగు మోతాదులోనే) ఉపయోగించడం. ప్రతిభావంతుడైన కవికూడ ఒకప్పుడు అలంకారాలను కూర్చడం విషయంలో దానిమీదనే ఎక్కువ దృష్టి పెట్టుకొని రసబంధంమీద అశ్రద్ధ చూపుతూ ప్రబంధం ప్రారంభిస్తాడు. అలాంటి ప్రతిభావంతుడైన కవికి ఉపదేశించడంకోసం ఇది చెప్పబడింది. ఎందువల్ల ననగా ప్రబంధాలలో అలంకారాలు కూర్చడంలోనే అధికమైన అభిరుచికలవారై రసాన్ని గూర్చి పట్టించుకొనని కవులు కనబడుతున్నారు.

### లోచనం

'అలంకృతీనామ్' ఇతి యోజనాపేక్షయా కర్మణి షష్ఠీ. దృశ్యన్తే చేతి - యథా స్వప్నవాసవదత్తాఖ్యే నాటకే -

"స్వఙ్చ్ఛితపక్ష్మకపాటం నయనద్వారం స్వరూపతాడేన,
ఉద్ఘాట్య సా ప్రవిష్టా హృదయగృహం మే నృపతనూజా". ఇతి. 14

బాలానందిని

అలంకృతీనామితి : యోజనను అపేక్షించి కర్మణి షష్ఠి అనగా యోజనంలో కర్మ అలంకారాలు. అందుచేత 'అలంకృతీనామ్' అన్నప్పుడు కర్మార్థకషష్ఠి ప్రయోగించబడింది అని అర్థం. దృశ్యన్తే చేతి - ఉదాహరణకి స్వప్నవాసవదత్తనాటకంలో -

స్వఙ్చ్ఛితేతి - సా నృపతనూజా= ఆ రాజకుమారి (వాసవదత్త), స్వఙ్చ్ఛితపక్ష్మక పాటమ్= బాగా దగ్గరిగా నొక్కబడి ఉన్న రెప్ప లనే తలుపులు గల, నయనద్వారమ్= నేత్రాలనే ద్వారాన్ని, స్వరూపతాడేన= తన రూపం అనే తాడనంచేత (తలుపు తట్టడంచేత), ఉద్ఘాట్య= తెరచి, మే హృదయగృహమ్= నా హృదయం అనే గృహాన్ని, ప్రవిష్టా= ప్రవేశించింది.

వివరణ. ఇక్కడ 'నయనద్వారమ్' అనే రూపకం శృంగారానికి అనుగుణంగా ఉంది. అంతటితో ఆపకుండా ఇంకా రెండు మూడు రూపకాల ప్రయోగం రసానుగుణంగా లేదని భావం.

ధ్వన్యాలోకం

కిం చ -

కా. అనుస్వానోపమాత్మాపి ప్రభేదో య ఉదాహృతః,
ధ్వనేరస్య ప్రబన్ధేషు భాసతే సోఽపి కేషు చిత్. 15

అస్య వివక్షితాన్యపరవాచ్యస్య ధ్వనేః అనురణనరూపవ్యఙ్గ్యోఽపి యః ప్రభేదః ఉదాహృతః ద్విప్రకారః సోఽపి ప్రబన్ధేషు కేషు చిత్ ద్యోతతే. తద్యథా మధుమథనవిజయే పాఞ్చజన్యోక్తిషు. యథా వా మమైవ కామదేవస్య సహచరసమాగమే విషమబాణలీలాయామ్. యథా చ గృధ్రగోమాయుసంవాదాదౌ మహాభారతే.

బాలానందిని

కిం చేతి - మరియు -

అనుస్వానేతి - అనుస్వానోపమాత్మాపి= అనుస్వానంవంటి స్వరూపం గల, అస్య ధ్వనేః= ఈ ధ్వనికావ్యముయొక్క, యః ప్రభేదః= ఏ ప్రభేదం, ఉదాహృతః= చెప్పబడిందో, సోఽపి= అది కూడ, కేషుచిత్ = కొన్ని, ప్రబన్ధేషు= ప్రబంధాలలో, భాసతే= భాసిస్తుంది.

అస్యేతి - ఈ వివక్షితాన్యపరవాచ్యధ్వనికావ్యానికి సంబంధించిన ఏ అనురణన రూపవ్యంగ్యం అనే ప్రభేదం చెప్పబడిందో, రెండు విధాలైన అది కూడ కొన్ని ప్రబంధాలలో రసాదివ్యంజకంగా భాసిస్తున్నది.

తదితి:- అదెట్లనగా - మధుమథనవిజయంలో పాంచజన్యుని మాటలలో అదే విధంగా నా విషమబాణలీలలోనే కామదేవుని సహచరుల సమాగమంలో ఇంకా - మహాభారతంలోని గృధ్రగోమాయుసంవాదంలో.

లోచనం

న కేవలం ప్రబన్ధేన సాక్షాద్వ్యఙ్గ్యో రసః యావత్పారంపర్యేణాపీతి దర్శయితుముపక్రమతే - కిం చేతి. అనుస్వానోపమః - శబ్దశక్తిమూలః అర్థశక్తిమూలశ్చ యో ధ్వనేః ప్రభేదః ఉదాహృతః సః కేషు చిత్ ప్రబన్ధేషు నిమిత్తభూతేషు వ్యఞ్జకేషు సత్సు వ్యఙ్గ్యతయా స్థితః సన్. అస్యేతి రసాదిధ్వనేః ప్రకృతస్య. భాసతే వ్యఞ్జకతయేతి శేషః. వృత్తిగ్రన్థోఽప్యేవమేవ యోజ్యః. అథవా అనుస్వానోపమః ప్రభేదః ఉదాహృతః యః ప్రబన్ధేషు భాసతే అస్యాపి "ద్యోత్యోఽలక్ష్యక్రమః కశ్చిత్" ఇత్యుత్తరశ్లోకేన కారికావృత్త్యోః సంగతిః.

ఏతదుక్తం భవతి - ప్రబన్ధేన కదాచిదనురణనరూపవ్యఙ్గ్యో ధ్వనిః సాక్షాద్వ్యజ్యతే స తు రసాదిధ్వనౌ పర్యవస్యతీతి. యది తు స్పష్టమేవ వ్యాఖ్యాయతే తదా గ్రన్థస్య పూర్వోత్తరాలక్ష్యక్రమవిషయస్య మధ్యే గ్రన్థోఽయమసంగతః స్యాత్. నీరసత్వం చ పాఞ్చజన్యోక్త్యాదీనాముక్తం స్యాత్ ఇత్యలమ్.

బాలానందిని

న కేవలమితి - ప్రబంధంచేత రసం సాక్షాత్తుగానే కాకుండా పారంపర్యంచేత కూడా వ్యంజించబడుతుంది అని చూపడానికి ఉపక్రమిస్తున్నాడు - కిం చేతి. శబ్దశక్తిమూలమూ, అర్థశక్తిమూలమూ అయిన ఏ అనుస్వానోపమధ్వనిప్రభేదం చెప్పబడిందో, అది, కేషుచిత్ ప్రబన్ధేషు= కొన్ని ప్రబంధాలు నిమిత్తాలుగా ఉండి వ్యంజకా లవుతూండగా తాను వ్యంగ్యంగా భాసిస్తుంది. వృత్తిగ్రంథం కూడా ఈ విధంగానే అన్వయించాలి. లేదా - పూర్వం చెప్పబడిన ఏ అనుస్వానోపమప్రభేదం ప్రబంధాలలో ఉన్నదో దానికి కూడ; "ద్యోత్యః అలక్ష్యక్రమః కశ్చిత్" అనే రాబోయే

కారికతో కారికావృత్తులు రెండింటికీ అన్వయం. ("కొన్నిచోట్ల అలక్ష్యక్రమం ద్యోత్యం, వ్యంగ్యం అవుతుంది" అని అర్థం). ఏతదితి : ఇది చెప్పినట్లయింది - ఒకప్పుడు ప్రబంధంచేత అనురణనరూపవ్యంగ్యం సాక్షాత్తుగా వ్యంజింపచేయబడుతుంది. అది చివరికి రసాదిధ్వనిలో పర్యవసానం చెందుతుంది. ఇలా కాకుండా పైకి స్పష్టంగా కనబడే అర్థమే గ్రహిస్తే వెనకా ముందూ కూడ అలక్ష్యక్రమాన్ని గూర్చి చర్చిస్తూన్న గ్రంథం మధ్య ఈ గ్రంథానికి అర్థం అసంగతంగా ఉంటుంది. పాంచజన్యాదుల మాటలు రసశూన్యా లని చెప్పినట్లు అవుతుంది. ఇంక చాలు.

వివరణ :- ఇక్కడ కూడ అభినవగుప్తుడు తన మామూలు ధోరణిలో మూలగ్రంథానికి స్వమతానుగుణంగా వ్యాఖ్య చేశాడు. ఎక్కడైనా సరే రసం ఉండితీరాలని ఈయన వాదం. ఇది కేవలం ప్రౌఢవాదంమాత్రమే. "కొన్ని ప్రబంధాలలో అనుస్వానోపమధ్వని కూడ భాసిస్తుందని చెప్పడమే కారికా - వృత్తికారుల అభిప్రాయం అనేది స్పష్టం. ఈ విషయం ఈయనకీ తెలుసు. అలక్ష్యక్రమధ్వనిని గూర్చి చర్చించే ఘట్టంలో లక్ష్యక్రమధ్వనిప్రసంగం అసంగతం అనే వాదం అయుక్తం. అలక్ష్యక్రమధ్వనిప్రసంగంలో "ఇదానీమ్ అలక్ష్యక్రమవ్యఙ్గ్యః ధ్వనిః ప్రబన్ధాత్మా" అని ఉపక్రమించి వృత్తిలోను, "ప్రబన్ధస్య రసాదీనాం వ్యఞ్జకత్వే నిబన్ధనమ్" అని కారికలోను ప్రబంధగతఅలక్ష్యక్రమధ్వనిచర్చ చేయబడింది. ప్రబంధంలో అలక్ష్య క్రమమే కాదు సంలక్ష్యక్రమం కూడా ఉండవచ్చు అని ఇక్కడ కారికావృత్తులలో చెప్పడంలో దోషం ఏముంది? పాంచజన్యాదుల వాక్యాలు నీరసాలు అన్నట్లు అవుతుంది అనే వాదం కూడ దృఢం కాదు. ప్రతిచోటా రసం ఉండా లని ముందు నిర్ణయించుకోవడంవల్ల ఈ ఆపత్తి వస్తుంది. సర్వత్ర రసం ఉండా లని పట్టు పట్టినా, ఏదో విధంగా ప్రతీదీ రసంలోనే పర్యవసిస్తుంది అని అన్నా పండితరాయలు చెప్పినట్లు ఆనందజనకాలుగా మహాకవులు వర్ణించిన జలప్రవాహవేగాలు, జలోత్పతనపతనాదులు, కపి-బాలాదిచేష్టలు మొదలైనవాటికి అర్థం లేకుండా పోతుంది. వాటికి చివరికి ఏదో ఒక రసంలో పర్యవసానం ఉంటుం దని వాదిస్తే "గౌః చలతి" "మృగో ధావతి" ఇత్యాదులు కూడా ఏదో విధంగా రసవంతాలైన వాక్యాలే అని చెప్పవలసి వస్తుంది. ప్రతీ అర్థమూ కూడ ఏదో రసానికి విభావంగానో, అనుభావంగానో, వ్యభిచారిభావంగానో ఉపయోగిస్తుంది కదా? "యత్తు రసవదేవ కావ్యమ్" ఇతి సాహిత్యదర్పణే నిర్ణీతం తన్న; వస్త్వలంకార ప్రధానానాం కావ్యానామ్ అకావ్యత్వాపత్తేః. న చేష్టాపత్తిః; మహాకవిసంప్రదాయస్యాకులీభావ

ప్రసంగాత్. తథా చ జలప్రవాహవేగనిపతనోత్పతనభ్రమణాని కవిభిర్వర్ణితాని కపిబాలాదివిలసితాని చ, న చ తత్రాపి యథాకథంచిత్ పరమ్పరయా రసస్పర్శోఽస్తీత్యేవేతి వాచ్యమ్. ఈదృశ్యరసస్పర్శస్య 'గౌః చలతి' "మృగో ధావతి" ఇత్యాదావతిప్రసక్తత్వేన అప్రయోజకత్వాత్. అర్థమాత్రస్య విభావానుభావవ్యభిచార్యన్యతమత్వాత్" (ర.గం. 9 పేజీ).

అందుచేత కావ్యాలలో రసానికి అగ్రస్థానం ఇచ్చినా ఆనందవర్ధనుడు కొన్ని ప్రబంధాలలో సంలక్ష్యక్రమధ్వనిప్రాధాన్యాన్ని కూడ అంగీకరించా డనే విషయం ఆ యా ఘట్టాలను పరిశీలిస్తే స్పష్టం అవుతుంది.

లోచనం

గాథ. "లీలాదాఢ శుధ్యూడ్ఢాసఅలమహిమణ్డలసశ్చిఅ అజ్జ,

కీస్మసుణాలాహరతుజ్జఆఇ అఙ్గమ్మి".

(ఇది లోచనంలో ఉన్న పాఠం. కాని బాలప్రియావ్యాఖ్యాత 'ఇతి పాఠః' అని మరొక పాఠం ఇచ్చి దాని సంస్కృతచ్ఛాయకూడా ఇచ్చాడు. దీని తరవాత వచ్చే 'మివఅహణ్ణి' ఇత్యాది గాథ విషయంలో కూడ ఇట్లే చేశాడు. ఆయన మూలగ్రంథం చూచి ఈ విధంగా సవరించాడో లేక గాథలో లేఖకదోషాదులున్నా యని సవరించాడో తెలియదు. ప్రాకృతజ్ఞులు నిర్ణయించాలి).

("లీలాదాఢగ్గుద్ధరిఅస అలమహీమణ్డలస్సవిఅఅజ్జ,

కీసముణాలహరణం వితురుఘుగురు ఆఇ అఙ్గమ్మి")

లీలాదంష్ట్రోద్ధృతసకలమహీమణ్డలస్యైవాద్య,

కస్మాన్మృణాలాభరణమపి తవ గురు భవత్యఙ్గే. ఇతి చ్ఛాయా.

ఇత్యాదయః పాఞ్చజన్యోక్తయః రుక్మిణీవిప్రలబ్ధవాసుదేవాశయప్రతిభేదనాభిప్రాయమ్ అభివ్యఞ్జయన్తి. సోఽభివ్యక్తః ప్రకృతరసస్వరూపపర్యవసాయీ.

సహచరాః వసన్తయౌవనమలయానిలాదయః. తైః సహ సమాగమే.

గాథ. మిఅవహణ్ణిఅరోరోణిరజ్కుసో అవివేఅరహిఒ వి,

సవిణ వి తుమమ్మి పుణోవన్తి అ అతన్తి పంముసిమ్మి.

(హుమ్మి అవమత్థిఅరేహో ణిరజ్కుసో అహవివేఅరహిఓవి,

సివిణేవి తుమమ్మి పుణో (వత్తిహి) భన్తిం ణ పసుమరామి.)

"భవామ్యపహస్తితరేఖో నిరఙ్కుశోఽథ వివేకరహితోఽపి,

స్వప్నేఽపి తవ పునః (ప్రతీహి) భక్తిం న ప్రస్మరామి". ఇతి చ్ఛాయా.

ఇత్యాదయో యౌవనస్య ఉక్తయః తత్తన్నిజస్వభావవ్యఞ్జకాః; సరసః ప్రకృతరసపర్యవసాయీ. యథా చేతి - శ్మశానావతీర్ణం పుత్రదాహార్థముద్యోగినం జనం విప్రలబ్ధుం గృధ్రో దివా శవశరీరభక్షణార్థీ శీఘ్రమేవాపసరత యూయమిత్యాహ -

అలం స్థిత్వా శ్మశానేఽస్మిన్ గృధ్రగోమాయుసంకులే,

కఙ్కాలబహులే ఘోరే సర్వప్రాణిభయంకరే.

న చేహ జీవితః కశ్చిత్ కాలధర్మముపాగతః,

ప్రియో వా యది వా ద్వేష్యః ప్రాణినాం గతిరీదృశీ.

ఇత్యాద్యవోచత్. గోమాయుస్తు నిశోదయావధి అమీ తిష్ఠన్తు, తతః గృధ్రాదపహృత్యాహం భక్షయిష్యామీత్యభిప్రాయేణావోచత్ -

ఆదిత్యోఽయం స్థితో మూఢాః స్నేహం కురుత సాంప్రతమ్,

బహువిఘ్నో ముహూర్తోఽయం జీవేదపి కదాచన,

అముం కనకవర్ణాభం బాలమప్రాప్తయౌవనమ్,

గృధ్రవాక్యాత్కథం బాలాస్త్యక్ష్యధ్వమవిశఙ్కితాః.

ఇత్యాది. స చాభిప్రాయో వ్యక్తః శాన్తరస ఏవ పరినిష్ఠితతాం ప్రాప్తః.

బాలానందిని

లీలేతి: లీలాదంష్ట్రాగ్రోద్ధృతసకలమహీమణ్డలస్యైవ= విలాసపూర్వకంగా కోర చివరి భాగంమీద ఎత్తబడిన సమస్తభూమండలం కలవాడే అయిన, తవ= నీకు, అద్య= ఇప్పుడు, మృణాలాభరణమపి= తామరతూడు అనే ఆభరణం కూడ, అఙ్గే= శరీరంమీద, కస్మాత్= ఎందువలన, గురు= బరువుగా, భవతి= అగుచున్నది?

ఇత్యాదయ ఇతి. ఈ మొదలైన పాంచజన్యుని మాటలు రుక్మిణీవియోగం గల వాసుదేవుని ప్రేమను ఆవిష్కరించే అభిప్రాయాన్ని వ్యంజింపచేస్తున్నాయి. వ్యంజింపచేయబడిన అది ప్రకృతస్వరూపంలో (విప్రలంభంలో) పర్యవసానం చెందుతున్నది. సహచరాః= వసంతయౌవనమలయానిలాదులు, వారితో సమాగమంలో.

మిఅవ ఇత్యాది: పైన చెప్పినట్లు బాలప్రియాకారుడు దీనికి మరొక పాఠం ఇచ్చినాడు. ఈగాథయే కావ్యప్రకాశలో కూడ ఉదాహరించబడింది. అది రెండవదానికి దగ్గరగా ఉంది. ఒక పదం అధికంగా ఉంది. దానిని బ్రాకెట్టులో ఇచ్చినాము. అపహస్తితలేఖః= తొలగించబడిన మర్యాదలు (కట్టుబాట్లు)కలవాడను, నిరఙ్కుశః= నిరంకుశుడను, అథ= మరియు, వివేకరహితః అపి= వివేకం లేనివాడను, భవామి= అగుదును. ఇలాంటివాడను అయితే కావచ్చు. స్వప్నేఽపి= స్వప్నంలో కూడ, త్వయి= నీయందు, భక్తిం పునః= భక్తినైతే, న ప్రస్మరామి= మరువను, ప్రతీహి= తెలుసుకొనుము.

ఇత్యాదయః ఇతి: ఈ మొదలైన యౌవనంయొక్క మాటలు ఆ యా నైజస్వభావ వ్యంజనం చేస్తున్నాయి. ఆ స్వభావం ప్రకృతరసంలో పర్యవసానం చెందుతుంది. యథాచేతి. ఇంకొక ఉదాహరణం ఎట్లనగా - శ్మశానానికి వచ్చి మరణించిన పుత్రుణ్ణి దహించడంకొరకు ఉద్యమిస్తూన్న జనాన్ని మోసంచేయడం కోసం, పగలు శవశరీరం భుజించాలని కోరుతూన్న గ్రధ్ర - "మీరందరూ శీఘ్రంగా వెళ్లి పొండి" అని చెపుతున్నది.

అలమితి - గృధ్రగోమాయుసంకులే= గ్రద్దలతోను నక్కలతోను వ్యాకులంగా ఉన్న, కఙ్కాలబహలే= అస్థిపంజరాలు అధికంగా ఉన్న, ఘోరే= ఘోరమైన, సర్వప్రాణిభయంకరే= సకలప్రాణులకూ భయంకరమైన, అస్మిన్ శ్మశానే= ఈ శ్మశానంలో, స్థిత్వా= ఉండి, అలమ్= చాలును (వెనుకకు వెళ్లిపొండి). కాలధర్మమ్= మరణాన్ని, ఉపాగతః= పొందినవాడు, కశ్చిత్= ఎవడూ కూడ, ప్రియో వా= ఇష్టుడైనా, ద్వేష్యః వా= శత్రు వైనా, ఇహ= ఈ లోకంలో, న జీవితః= జీవించలేదు. ప్రాణినామ్= ప్రాణుల యొక్క, గతిః= గతి, ఈదృశీ= ఇట్టిదే.

ఇత్యాదీతి - ఇత్యాదికం పలికింది. నక్క అయితే "వీళ్లు రాత్రి అయ్యేవరకు ఉంటే అప్పుడు నేను గ్రద్దనుంచి లాగికొని భక్షిస్తాను" అనే అఈభిప్రాయంతో ఇలా అంది -

ఆదిత్య ఇతి:- మూఢాః = మూఢులారా! అయమ్ ఆదిత్యః= ఈ సూర్యుడు, స్థితః= ఇంకా ఉన్నాడు, సాంప్రతమ్= ఇప్పుడు, స్నేహమ్= స్నేహమును, కురుత= చెయ్యండి, అయం ముహూర్తః= ఈ ముహూర్తం, అనగా ఈ సంధ్యాకాలం, బహువిఘ్నః= అనేక విఘ్నాలు కలది. ఇది రాక్షసవేళ అవడంచేత ఈ బాలునికి ఏ భూతావేశమైనా ఉన్నట్లయితే ఈ సమయం దాటగానే ఆ భూతావేశాదులు తొలగి ఇతడు లేవవచ్చును అని భావం. బాలాః= మూఢులారా! కనకవర్ణాభమ్= బంగారం వంటి వర్ణంగల, అప్రాప్తయౌవనమ్= పొందబడని యౌవనం గల, అముమ్=ఈ: బాలమ్= బాలుణ్ణి, అవిశఙ్కితాః= సందేహం లేనివాళ్లై, గృధ్రవాక్యాత్= గ్రద్దమాటవలన, కథమ్= ఎట్లు

త్యక్ష్యధ్వమ్= విడచెదరు?

ఇత్యాది - ఈ మొదలైనవి. వ్యక్తమైన ఆ అభిప్రాయం శాంతరసంలోనే పరినిష్ఠితత్వాన్ని పొందింది. 15

ధ్వన్యాలోకం

కా. సుప్తిఙ్‌వచనసంబన్ధైస్తథా కారకశక్తిభిః,

కృత్తద్ధితసమాసైశ్చ ద్యోత్యోఽలక్ష్యక్రమః క్వచిత్. 16

అలక్ష్యక్రమో ధ్వనేరాత్మారసాదిః సుబ్విశేషైః, తిఙ్విశేషైః, వచనవిశేషైః, సంబన్ధవిశేషైః, కారకశక్తిభిః, కృద్విశేషైః, తద్ధితవిశేషైః, సమాసైశ్చేతి చశబ్దాన్నిపాతోపసర్గకాలాదిభిః ప్రయుక్తైః అభివ్యజ్యమానో దృశ్యతే. యథా -

శ్లో. న్యక్కారో హ్యయమేవ మే యదరయస్తత్రాప్యసౌ తాపసః

సోఽప్యత్రైవ నిహన్తి రాక్షసకులం జీవత్యహో రావణః,

ధిగ్ధిక్ఛక్రజితం ప్రబోధితవతా కిం కుమ్భకర్ణేన వా

స్వర్గగ్రామటికావిలుణ్ఠనవృథోచ్ఛూనైః కిమేభిర్భుజైః. (81)

అత్ర హి శ్లోకే భూయసా సర్వేషామపేషాం స్ఫుటమేవ వ్యఞ్జకత్వం దృశ్యతే. తత్ర "మే యదరయః" ఇత్యనేన సుప్‌సంబన్ధ వచనా నామభివ్యఞ్జకత్వమ్. "తత్రాప్యసౌ తాపసః" ఇత్యత్ర తద్ధితనిపాతయోః. "సోఽప్యత్రైవ నిహన్తి రాక్షసకులం జీవత్యహో రావణః" ఇత్యత్ర తిఙ్ కారకశక్తీనామ్. "ధిగ్ధిక్ఛక్రజితమ్" ఇత్యాదౌ శ్లోకార్ధే కృత్తద్ధితసమాసోప సర్గాణామ్. ఏవంవిధస్య వ్యఞ్జకభూయస్త్వే చ ఘటమానే కావ్యస్య సర్వాతిశాయినీ బన్ధచ్ఛాయా సమున్మీలతి. యత్ర హి వ్యఙ్గ్యావభాసినః పదస్యైకస్యైవ తావదావిర్భావః తత్రాపి కావ్యే కాపి బన్ధచ్ఛాయా, కిముత యత్ర తేషాం బహూనాం సమవాయః.

యథాత్ర అనన్తరోదితే శ్లోకే. అత్ర హి రావణ ఇత్యస్మిన్ పదే అర్థాన్తరసంక్రమితవాచ్యేన ధ్వనిప్రభేదేన అలంకృతేఽపి పునరనన్తరోక్తానాం వ్యఞ్జకప్రకారాణా ముద్భాసనమ్. దృశ్యన్తే చ మహాత్మనాం ప్రతిభావిశేషభాజాం బాహుల్యేనైవంవిధాః బన్ధప్రకారాః.

బాలానందిని

సుప్తిఙితి - క్వచిత్ = కొన్ని చోట్ల, సుప్తిఙ్వచనసంబన్ధైః= సుప్ప్రత్యయాలచేత, తిఙ్ప్రత్యయాలచేత సంబంధాలచేత (షష్ఠిచేత బోధించబడే సంబంధాలచేత), కారకశక్తిభిః= కర్మత్వకరణత్వాది కారకశక్తులచేత, కృత్తద్ధితసమాసైశ్చ= కృత్ప్రత్యయ, తద్ధితప్రత్యయ- సమాసాలచేత, అలక్ష్యక్రమః= అలక్ష్యక్రమం, ద్యోత్యః= వ్యంగ్యమైనది.

అలక్ష్యేతి - ధ్వనికావ్యానికి ఆత్మయైన రసాదికమైన అలక్ష్యక్రమం ప్రయోగించబడిన సుబ్విశేషాలచేత, తిఙ్విశేషాలచేత, వచనవిశేషాలచేత, సంబంధవిశేషాలచేత, కారకశక్తులచేత, కృద్విశేషాలచేత, సమాసాలచేత, 'సమాసైశ్చ' లోని 'చ' శబ్దంచేత, నిపాత - ఉపసర్గ - కాలాదులచేత, వ్యంజింపచేయబడుచు కనబడుతున్నది.

వివరణ : 'రామ' 'కృష్ణ' ఇత్యాది నామవాచకాలకి చేర్చే 'సు-ఔ-జస్' మొదలైనవి సుప్ ప్రత్యయాలు. భవతి - భవతః - భవన్తి ఇత్యాది క్రియాపదాలలోని 'తి-తః-అన్తి' మొదలైనవి తిఙ్ప్రత్యయాలు. ఏకవచన - ద్వివచనాదులు వచనాలు. షష్ఠిచేత బోధించబడే స్వస్వామిభావాదులు సంబంధాలు. కర్త, కర్మ, కరణం, సంప్రదానం, అపాదానం, అధికరణం అనేవి కారకశక్తులు. ధాతువులకు చేర్చే 'య' 'తవ్య' 'క్త', 'త్వా' మొదలైనవి కృత్ప్రత్యయాలు. నామవాచకాలకు చేర్చే అణ్, త్వ, ఇన్ మొదలైనవి తద్ధితప్రత్యయాలు. తత్పురుషబహువ్రీహ్యాదులు సమాసాలు. 'చ', 'వా' మొదలైనవి నిపాతాలు. 'ప్ర' 'పర' మొదలైనవి ఉపసర్గలు. భూత-వర్తమానాదులు కాలాలు.

యథా ఇతి:- ఉదాహరణం ఎట్లనగా-

న్యక్కార ఇతి:- రాముడు రాక్షససంహారం చేస్తున్న సమయంలో రావణుడు తనలో అనుకుంటున్న మాటలు. ఈ శ్లోకం హనుమన్నాటకంలోనిది. మే= నాకు, అరయః ఇతి యత్= శత్రువు లుండడం అనే మాట ఏది కలదో, అయమేవ= ఇదే, న్యక్కారః= అవమానం. తత్రాపి= అందులోనూ, తాపసః= తాపసుడైన, అసౌ= ఈ మానవుడు శత్రువు. సోఽపి= అతడు కూడ, అత్రైవ= ఇక్కడనే, రాక్షసకులమ్=

రాక్షససముదాయాన్ని, నిహన్తి= చంపుతున్నాడు. అహో= ఏమి ఆశ్చర్యం! రావణః= రావణుడు, జీవతి= జీవించియే ఉన్నాడు! శక్రజితమ్= ఇంద్రజిత్తును గూర్చి, ధిక్ ధిక్= నింద అగుగాక; ప్రబోధితవతా= మేల్కొలపబడిన, కుమ్భకర్ణేన= కుంభకర్ణునిచేత, కిమ్= ఏమి ప్రయోజనం? స్వర్గగ్రామటికావిలుణ్ఠనవృథోచ్ఛూనైః= స్వర్గం అనే చిన్న గ్రామాన్ని దోచుకొన్నవి, వ్యర్థంగా బలిసినవీ అయిన, ఏభిః= ఈ, భుజైః= భుజాలచేత, కిమ్= ఏమి ప్రయోజనం?

అత్ర హీతి - ఈ శ్లోకంలో చాలవరకు ఇవి అన్నీ వ్యంజకాలుగా ఉండడం కనబడుతుంది. 'మే యత్ అరయః' అన్నప్పుడు 'మే' అనే సుబంతం, దానిచేత బోధించబడే సంబంధం, 'అరయః' అనే బహువచనం దానిచేత బోధించబడే బహుత్వం ఇవన్నీ అభివ్యంజకాలు. "తత్రాపి అసౌ తాపసః" అన్నప్పుడు 'అపి' అనే నిపాత, 'తాపస' 'తత్ర' అనేచోట తద్ధితప్రత్యయాలు వ్యంజకాలు. "సోఽప్యత్రైవ నిహన్తి రాక్షసకులం జీవత్యహో రావణః" అన్నప్పుడు 'నిహన్తి' 'జీవతి' అన్నచోట వర్తమానార్థకతిఙ్ప్రత్యయాలు, కర్తృ-కర్మ-కారకాలు వ్యంజకాలు. "ధిగ్ ధిక్ శక్రజితమ్" ఇత్యాది శ్లోకార్థంలో 'శక్రజితమ్' 'ప్రబోధితవతా', అనేవాటిలోని కృత్ప్రత్యయాలు, 'గ్రామటికా' లోని తద్ధితప్రత్యయం స్వర్గేత్యాదిసమాసం వ్యంజకాలు. వ్యంజకాలు అధికసంఖ్యలో ఉన్న ఈ విధమైన కావ్యంయొక్క బంధసౌందర్యం అన్నింటినీ మించి వికసిస్తుంది. ఏ కావ్యంలో వ్యంగ్యాన్ని భాసింపచేసే ఒక్కపదం మాత్రమే కనబడుతుందో ఆ కావ్యంలోనే ఒకానొక అనిర్వాచ్యమైన బంధసౌందర్యం ఉంటుంది. అలాంటివి చాలా ఒక చోట కలిసినప్పుడు వేరే చెప్పాలా? ఇందుకు ఇప్పుడే చూపిన ఈ శ్లోకమే ఉదాహరణం. ఈ శ్లోకంలో 'రావణః' అనే పదం అర్థాంతరసంక్రమితతవాచ్యమైన ధ్వనిభేదంచేత అలంకరించబడే ఉన్నా ఇంకా తరవాత చెప్పిన వ్యంజకప్రకారా లన్నీ సొంపు తెస్తున్నాయి. ప్రతిభావిశేషవంతులైన మహాత్ములయొక్క ఈ విధమైన బంధవిధానాలు అత్యధికంగా కనబడుతున్నాయి.

లోచనం

ఏవలమక్ష్యక్రమవ్యఙ్గ్యస్య రసాదిధ్వనేః యద్యపి వర్ణేభ్యః ప్రభృతి ప్రబన్ధపర్యన్తే వ్యఞ్జకవర్గే నిరూపితే న నిరూపణీయాన్తరమవశిష్యతే, తథాపి కవిసహృదయానాం శిక్షాం దాతుం పునరపి సూక్ష్మదృశా అన్వయవ్యతిరేకా వాశ్రిత్య వ్యఞ్జకవర్గమాహ - సుప్తిఙిత్యాది. వయం తు ఇత్థమేతదనన్తరం సవృత్తికం వాక్యం బుధ్యామహే - సుబాదిభిః. యోఽనుస్వానోపమః భాసతే

వక్త్రభిప్రాయాదిరూపః అస్యాపి సుబాదిభిర్వ్యక్తస్య అనుస్వానోపమస్య అలక్ష్యక్రమవ్యఙ్గ్యో ద్యోత్యః; క్వచిదితి పూర్వకారికయా సహ సంమీల్య సంగతిరితి. సర్వత్ర హి సుబాదీనామభిప్రాయవిశేషాభివ్యఞ్జకత్వమేవ. ఉదాహరణే స తు అభివ్యక్తప్రాయః యథాస్వం విభావాదిరూపతాద్వారేణ రసాదీన్వ్యనక్తి.

ఏతదుక్తం భవతి - వర్ణాదిభిః ప్రబన్ధాన్తైః సాక్షాద్వా రసోఽభివ్యజ్యతే విభావాదిప్రతిపాదనద్వారేణ, యది వా విభావాదివ్యఞ్జనద్వారేణ పరమ్పరయేతి. తత్ర బన్ధస్యైతత్ పరమ్పరయా వ్యఞ్జకత్వం ప్రసఙ్గాదాదావుక్తమ్. అధునా తు వర్ణపదాదీనాముచ్యత ఇతి. తేన వృత్తావపి "అభివ్యజ్యమానో దృశ్యతే" ఇతి, "వ్యఞ్జకత్వం దృశ్యతే" ఇత్యాదౌ చ వాక్యశేషః అధ్యాహార్యః "విభావాదివ్యఞ్జనద్వారా పారమ్పరేణ" ఇత్యేవంరూపః.

బాలానందిని

ఏవమితి - అలక్ష్యక్రమమైన రసాదిధ్వనికి వ్యంజకాలైన వర్ణాలు మొదలు ప్రబంధం వరకూ ఉన్న వాటిని అన్నింటినీ నిరూపించిన తరవాత ఇంక నిరూపించవలసిన విషయ మేదీ మిగలకపోయినా కవులకు, సహృదయులకు శిక్షను ఇవ్వడంకొరకై, సూక్ష్మదృష్టిచేత అన్వయవ్యతిరేకాలను ఆశ్రయించి, మళ్లీ రసాదిధ్వనివ్యంజకవర్గాన్ని గూర్చి సుప్తిజిత్యాదికంతో చెపుతున్నాడు.

ఈ కారికలోను, వృత్తిలోను కూడ సుబాదులు కొన్ని చోట్ల అలక్ష్యక్రమవ్యంజకాలు కావచ్చును అని చెప్పబడింది. కాని అవి అలక్ష్యక్రమాలైన రసాదులను వ్యంజింపజాలవు. అవి లక్ష్యక్రమాలైన ఆ యా విషయాలను వ్యంజింపచేసి తద్ద్వారా అలక్ష్యక్రమవ్యంజకాలవుతాయి కాని, సాక్షాత్తు అలక్ష్యక్రమవ్యంజకాలు కాజాలవు అని అభినవగుప్తుని అభిప్రాయం. అందుచేత ఈ కారికావృత్తుల్ని తదనుగుణంగా వ్యాఖ్యానించాలి అని ప్రతిపాదిస్తున్నాడు - వయం తు ఇతి. మేమైతే దీని తరవాత వచ్చే వృత్తిసహితమైన వాక్యాన్ని ఈ విధంగా అర్థం చేసుకుంటున్నాం. సుబాదులచేత వక్తయొక్క అభిప్రాయం మొదలైనవాటి రూపంలో ఉన్న ఏ అనుస్వానోపమవ్యంగ్యం భాసిస్తుందో, సుబాదులచేత వ్యంగ్యమైన ఈ అనుస్వానోపమవ్యంగ్యం కూడ అలక్ష్యక్రమవ్యంగ్యాన్నే వ్యంజింపచేస్తుంది. ఈ కారికలో ఉన్న 'క్వచిత్' అనే దాన్ని పూర్వకారికతో కలిపి

అన్వయం చెప్పుకోవాలి.

అనగా అభినవగుప్తుని ప్రకారం ఈ కారికలో ఉన్న "సుప్తిఙ్వచనసంబన్ధైః" ఇత్యాది తృతీయాంతపదాలను వెనుకటి కారికలో 'ఉదాహృతః' వరకు ఉన్న వాక్యంతో కలిపి అన్వయించి ఆ కారికలో ఉన్న "అస్య ధ్వనేః భాసతే" అనే పదాలను ఈకారికలోని "క్వచిదలక్ష్యక్రమః" "ద్యోత్యః" అనే వాటితో కలిపి అన్వయించుకోవాలి. అప్పుడు - "సుప్తిఙ్వచనసంబన్ధైః, కారకశక్తిభిః, కృత్తద్ధితసమాసైశ్చ యః అనుస్వానోపమాత్మా ప్రభభేదః ఉదాహృతః సోఽపి అస్య ధ్వనేః వ్యఞ్జకతయా భాసతే; ఏవం సుప్తిఙాదిభిః క్వచిత్ అలక్ష్యక్రమః ద్యోతః" అనే వాక్యం లభిస్తుంది. "సుప్తిఙాదులచేత వ్యంగ్యమైనదిగా ఏ అనుస్వానోపమరూపభేదం చెప్పబడిందో అది కూడ ఈ ధ్వనికి (అలక్ష్యక్రమధ్వనికి) వ్యంజకంగా భాసిస్తుంది. ఈ విధంగా సుప్తిఙాదులు కొన్ని చోట్ల (పరంపరయా) అలక్ష్యక్రమద్యోతకా లవుతాయి" అని అర్థం.

సర్వత్రహీతి - ఎందుచేత ననగా - సుభ్గాదులు ప్రతిచోటా అభిప్రాయవిశేషాన్నే వ్యంజింపచేస్తాయి. ఉదాహరణంలో అభివ్యక్తమైన ఆ అభిప్రాయం తన స్వరూపాన్ని పట్టి విభావాదిరూపతాద్వారా (విభావాదులుగా అయి) రసాదులను వ్యంజింపచేస్తుంది.

ఏతదితి :- దీని తాత్పర్యం ఏమనగా - వర్ణాలు మొదలు ప్రబంధం వరకూ ఉన్నవి విభావాదులను ప్రతిపాదించడం ద్వారా సాక్షాత్తు రసాన్ని వ్యంజింపచేస్తాయి, లేదా విభావాదులను వ్యంజింపచేయడం ద్వారా పరంపరయా వ్యంజింపచేస్తాయి. బంధం పరంపరయా ఎలా వ్యంజకం అవుతుందో అది ప్రసంగశంవల్ల ముందుగానే ఛెప్పబడింది. ఇప్పుడు వర్ణపదాదుల విషయంలో అది చెప్పబడుతున్నది. అందుచేత వృత్తిలో ఉన్న "అభివ్యజ్యమానో దృశ్యతే" "వ్యఞ్జకత్వం దృశ్యతే" ఇత్యాదివాక్యాలకు "విభావాదివ్యఞ్జనద్వారతయా పారమ్పర్యేణ" "విభావాదులను వ్యంజింపచేయడానికి ద్వారంగా పారంపర్యంచేత" అనే పదాలు చేర్చి అర్థం చెప్పుకోవాలి.

లోచనం

మమారయ ఇతి. మమ శత్రుసద్భావో నోచిత ఇతి సమ్బన్ధానౌచిత్యం క్రోధవిభావం వ్యనక్తి అరయః ఇతి బహువచనమ్. తపో విద్యతే యస్యేతి పౌరుషకథాహీనత్వం తద్ధితేన మత్వర్థీయేన అభివ్యక్తమ్. తత్రాపిశబ్దేన నిపాతసముదాయేన అత్యన్తాసంభావనీయత్వమ్. మత్కర్తృకా యది జీవన

క్రియా తదా హననక్రియా తావదనుచితా. తస్యాం చ స కర్తా; అపిశబ్దేన మనుష్యమాత్రకమ్. అత్రైవేతి - మదధిష్ఠితో దేశః అధికరణమ్. నిఃశేషేణ హన్యమానతాయా రాక్షసబలం కర్మేతి తదిదమసంభావ్యమానముపనతమితి పురుషకారాసంపత్తిః ధ్వన్యతే తిఙ్కారకశక్తిప్రతిపాదకైశ్చ శబ్దైః. రావణ ఇతి తు అర్థాన్తరసంక్రమితవాచ్యత్వం పూర్వమేవ వ్యాఖ్యాతమ్. ధిగ్ధిగితి నిపాతస్య శక్రం జితవానిత్యాఖ్యాయికేయమితి ఉపపదసమాసేన సహకృతః. స్వర్గేత్యాదిసమాసస్య స్వపౌరుషానుస్మరణం ప్రతి వ్యఞ్జకత్వమ్. గ్రామటికేతి స్వార్థికతద్ధితప్రయోగస్య స్త్రీప్రత్యయసహితస్య అబహుమానాస్పదత్వం ప్రతి, విలుణ్ఠనశబ్దే విశబ్దస్య నిర్దయావస్కన్దనం ప్రతి వ్యఞ్జకత్వమ్. వృథాశబ్దస్య నిపాతస్య స్వాత్మపౌరుషనిన్దాం ప్రతి వ్యఞ్జకతా. భుజైరితి బహువచనేన ప్రత్యుత భారమాత్రమేతదితి వ్యజ్యతే. తేన తిలశస్తిలశోఽపి విభజ్యమానేఽత్ర శ్లోకే సర్వ ఏవాంశః వ్యఞ్జకత్వేన భాతీతి కిమన్యత్? ఏతదర్థప్రదర్శనస్య ఫలం దర్శయతి - ఏవమితి. ఏకస్య పదస్య ఇతి యదుక్తం తదుదాహరతి - యథాత్రేతి.

బాలానందిని

మమేతి - 'అరయః' అనే బహువచనం నాకు శత్రువు లుండడమే అనుచితం అనే క్రోధవిభావమైన సంబంధానౌచిత్యాన్ని వ్యంజింపచేస్తున్నది. తాపసః అన్నప్పుడు "ఎవనికి తపస్సు ఉన్నదో అతడు'' అని మతుప్ ప్రత్యయార్థంలో వచ్చిన తద్ధితప్రత్యయంచేత అతనిలో పౌరుషం అనే మాటే లేదు అని సూచించబడింది. 'తత్రాపి' అనే నిపాతసముదాయరూపమైన శబ్దంచేత ఏ మాత్రమూ ఊహించడానికి శక్యం కాకపోవడం వ్యంజింపబడుతున్నది. నేను కర్తగా గల జీవనక్రియ ఉన్నప్పుడు (నేను జీవించి ఉండగానే) హననక్రియ అనుచిత మైనది. ఆ హననక్రియలో అతడు కర్తగా ఉన్నాడు. 'అపి' శబ్దంచేత మనుష్యమాత్రుడైన అతడు కర్తగా ఉన్నాడు అని వ్యంగ్యం. అత్రైవేతి. నాచేత అధిష్ఠించబడిన దేశమే అధికరణంగా ఉంది. నిశ్శేషంగా చంపబడడంలో రాక్షససేన కర్మ. ఇదంతా ఊహించరానిదిగా ఉంది. అలాంటిది వచ్చిపడింది అని తిఙ్ - కారకశక్తిప్రతిపాదకశబ్దాలచేత తనకు పురుషకారసంపత్తి లేకపోవడం వ్యంజింపబడుతున్నది - 'రావణః' అన్నప్పుడు అది అర్థాంతర

సంక్రమితవాచ్యం అవడం, (మహేంద్రపురీమర్ధనాదికంచేసినవాడు అనే అర్థం) పూర్వమే వ్యాఖ్యానించబడింది. 'శక్రజితమ్' అనే ఉపపదసమాసంతో సహకృతమైన 'ధిక్ ధిక్' అనే నిపాతచేత అతడు శక్రుణ్ణి జయించా డన్నది ఆఖ్యాయిక మాత్రమే అని వ్యంజింపబడుతుంది. (సహకృతః' అనేది షష్ఠీవిభక్తి. 'నిపాతస్య'కు విశేషణం). స్వర్గేత్యాదిసమాసం తన పౌరుషాన్ని స్మరింపచేయడాన్ని గూర్చి వ్యంజకం. స్త్రీప్రత్యయం చేర్చిన 'గ్రామటికా' అనే స్వార్థంలో వచ్చిన కప్రత్యయరూపతద్ధితప్రయోగం స్వర్గం బహుమానాస్పదం కాదు అని వ్యంజింపచేస్తున్నది. విలుణ్ఠనశబ్దంలోని 'వి' శబ్దం నిర్దయంగా ఆక్రమణాన్ని వ్యంజింపచేస్తున్నది. నిపాత అయిన 'వృథా' శబ్దం తన పౌరుషనిందను వ్యంజింపచేస్తూన్నది. 'భుజైః' అని బహువచనంచేత ఇవి ఉపయోగించడానికి బదులు భారమాత్రమే అని వ్యంజింపబడుతున్నది. ఈ విధంగా ఈ శ్లోకాన్ని నువ్వుగింజంత చిన్న చిన్న ముక్కలుగా విభజించగా ప్రతి అంశమూ వ్యంజకంగానే ప్రకాశిస్తూన్నది; ఇంకేం కావాలి! ఈ అర్థాన్ని చూపినందుకు ఫలాన్ని 'ఏవంవిధస్య' ఇత్యాదికంచేత చూపుతున్నాడు. "వ్యఙ్గ్యావభాసినః ఏకస్యైవ పదస్య" అని చెప్పినదానికి యథా అత్ర అని ఉదాహరణం చూపుతున్నాడు.

## ధ్వన్యాలోకం

యథా మహర్షేః వ్యాసస్య -

శ్లో. అతిక్రాన్తసుఖాః కాలాః ప్రత్యుపస్థితదారుణాః,
శ్వః శ్వః పాపీయదివసా పృథివీ గతయౌవనా. (82)

అత్ర హి కృత్తద్ధితవచనైః అలక్ష్యక్రమవ్యఙ్గ్యః, 'పృథివీ గతయౌవనా' ఇత్యనేన చ అత్యన్తతిరస్కృతవాచ్యో ధ్వనిః ప్రకాశితః.

### బాలానందిని

యథా ఇతి - మహర్షియైన వ్యాసుని శ్లోకం ఉదాహరణగా ఎట్లనగా -

అతిక్రాన్తేతి - అతిక్రాన్తసుఖాః= అతిక్రమించిన (గడచిపోయిన) సుఖం గల, కాలాః= కాలాలు, ప్రత్యుపస్థితదారుణాః= వచ్చిపడిన దారుణమైన కష్టాలుగలవి. శ్వః శ్వః= రేపు రేపు, పాపీయదివసా= అత్యధికంగా పాపములైన రోజులు గల, పృథివీ= భూమి, గతయౌవనా= పోయినా యౌవనం గలది.

అత్రేతి - ఇక్కడ కృతద్ధితవచనాలచేత అలక్ష్యక్రమవ్యంగ్యం ప్రకాశించబడింది. "పృథివీ గతయౌవనా" అనేదానిచేత అత్యంతతిరస్కృతవాచ్యధ్వని ప్రకాశితమైనది.

లోచనం

అతిక్రాన్తం న తు కదాచన వర్తమానతామవలమ్బమానం సుఖం యేషు కాలాః ఇతి సర్వ ఏవ; న తు సుఖం ప్రతి వర్తమానః స కోఽపి కాలలేశ ఇత్యర్థః. ప్రతీపాన్యుపస్థితాని వృత్తాని ప్రత్యావర్తమానాని, తథా దూరభావీన్యపి ప్రత్యుపస్థితాని నికటతయా వర్తమానాని భవన్తి, దారుణాని దుఃఖాని యేషు తే. దుఃఖం బహుప్రకారమేవ ప్రతివర్తమానాః సర్వే కాలాంశాః ఇత్యనేన కాలస్య తావన్నిర్వేదమభివ్యఞ్జయతః శాన్తరసవ్యఞ్జకత్వమ్. దేశస్యాప్యాహ - పృథివీ శ్వః శ్వః ప్రాతః ప్రాతః. దినాద్దినం, పాపీయదివసా పాపానాం సంబన్ధినః పాపిష్ఠజనస్వామికాః దివసా యస్యాం సా తథోక్తా. స్వభావత ఏవ తావత్కాలో దుఃఖమయః, తత్రాపి పాపిష్ఠజనస్వామికపృథివీలక్షణ దేశదౌరాత్మ్యాత్ విశేషతః దుఃఖమయః ఇత్యర్థః. తథా హి - శ్వః శ్వః దినాద్ధినం గతయౌవనా వృద్ధస్త్రీవత్ అసంభావ్యమానసంభోగా, గతయౌవన తయా హి యో యః దివసః ఆగచ్ఛతి స స పూర్వపూర్వాపేక్షయా పాపీయాన్, నికృష్టత్వాత్. యది వా ఇయసునన్తః అయం శబ్దః మునినైవం ప్రయుక్తః ణిజన్తో వా. అత్యన్తేతి:-సోఽపి ప్రకారః అస్యైవ (రసస్య)అఙ్గతామేతీతి భావః.

బాలానందిని

అతిక్రాన్తమితి - గడచిపోయిన, ఎప్పుడూ కూడ వర్తమానత్వాన్ని అవలంబించని, సుఖం ఏ కాలాలలోనో అవి; అన్ని కాలాలూ అలాగే ఉన్నాయి. సుఖాన్ని గూర్చి ఉంటూన్న (సుఖం ఉన్న) ఒక్క కాలలేశం కూడా లేదు అని అర్థం. ప్రతీపాని= ప్రతికూలంగా ఉన్న (ఇది 'ప్రతి' అన్నదాని అర్థం), ఉపస్థితాని= గడచిపోయినా కూడ మళ్లీ తిరిగి వచ్చినవి, దూరం అవుతూన్నా, ప్రత్యుపస్థితాని= దగ్గరగా ఉంటూన్నవి అయిన, దారుణాని= దుఃఖాలు వేటియందో అవి. సమస్తమైన కాలాంశాలు కూడ అనేకవిధాలైన దుఃఖాన్ని కలిగించడంకోసమే ఉంటున్నాయి అని కాలం నిర్వేదాన్ని వ్యంజింపచేస్తూ శాంతరసాన్ని వ్యంజింపచేస్తూన్నది. దేశం విషయం కూడ చెపుతున్నాడు - పృథివీ= భూమి, శ్వః శ్వః, ప్రతిప్రాతఃకాలమూ, దినం తరవాత దినం, పాపీయదివసా= పాపాత్ములకు సంబంధించిన ('పాపీయ' శబ్దానికి అర్థం) అనగా పాపిష్ఠులైన జనులు ప్రభువులుగా గల దివసములు దేనియందో అది. సహజంగానే

కాలం దుఃఖమయం. అందులోను పాపిష్ఠులైన జనులు ప్రభువులుగా ఉన్న పృథివీరూపమైన దేశంయొక్క దుష్టత్వంవల్ల ఇంకా దుఃఖమయ మైనది అని అర్థం. "శ్వః శ్వః" అనే పదాలకి 'గతయౌవనా' అనే దానితో కూడ అన్వయం చూపుతున్నాడు - తథాహీతి. శ్వః శ్వః= దినం తరవాత దినం, (రోజు రోజుకీ), గతయౌవనా= గడిచిపోయిన యౌవనం కలదవడంచేత వృద్ధస్త్రీ వలె సంభావ్యం కాని సంభోగం కలది. ఏ ఏ దివసం వస్తూన్నదో అది ప్రతిదీ పూర్వపూర్వదివసం కంటె, పాపీయాన్= నికృష్టమైనది అవడంవల్ల ఎక్కువ పాపమైనది.

పైన 'పాపీయ' శబ్దానికి పాపులకు సంబంధించినది అని అర్థం చెప్పబడింది. ఇక్కడ 'ఎక్కువ పాపం గలది' అని అర్థం చెప్పబడింది. 'పాప' శబ్దానికి ఛప్రత్యయం చేర్చగా 'పాపీయ' అని అకారాంతరూపం సిద్ధిస్తుంది. అది మొదట గ్రహించబడింది. ఇక్కడ 'పాప' శబ్దానికి 'ఇయసున్' (ఇయస్) ప్రత్యయం చేర్చగా 'పాపీయస్' శబ్దం సిద్ధిస్తుంది. 'అధిక పాపం గల' అని అర్థం. అప్పుడు 'పాపియస్' అనేది సకారాంతశబ్దం. ఈ విషయాన్ని విశదీకరిస్తున్నాడు - యది వా ఇతి. లేదా ముని చేత ఇయసునంతశబ్దం ప్రయోగించబడింది. ( ఆ విధంగా అది ఆర్షప్రయోగం గాన సాధువు) లేదా ణిజన్తం ప్రయోగించబడింది.

వివరణ:- ఇయసున్ ప్రత్యయాంత మైతే 'పాపియస్' సకారాంతం గాన 'పాపీయదివసాః' కాకుండా 'పాపియోదివసాః' కావాలి. అందుచేత 'లోకాన్ పాపీయసః కరోతి' అనే అర్థంలో పాపీయశ్శబ్దానికి ణిచ్ ప్రత్యయం చేర్చగా, తరవాత కర్త్రర్థంలో అచ్ ప్రత్యయం చేయగా 'పాపీయ' అని అకారాంతశబ్దం కావచ్చును. 'లోకులను పాపాత్ములనుగా చేసేది' అని అర్థం. అప్పుడు 'పాపీయదివసాః' అనే ప్రయోగం కుదురుతుంది అని భావం.

అత్యన్తేతి. ఆ ప్రకారం కూడ (అత్యంతతిరస్కృతవాచ్యం కూడ) దీనికే (ఈ శాంతానికే) అంగం అవుతుంది అని భావం.

## ధ్వన్యాలోకం

ఏషాం చ సుబాదీనామేకైకశః, సముదితానాం చ వ్యఞ్జకత్వం మహాకవీనాం ప్రబన్ధేషు ప్రాయేణ దృశ్యతే. సుబన్తస్య వ్యఞ్జకత్వం యథా -

తాలైః శిఞ్జద్వలయసుభగైః కాన్తయా నర్తితో మే
యామధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః. (83)

బాలానందిని

ఏషామితి:- సాధారణంగా ఈ సుప్ప్రత్యయాదులు ఒక్కొక్కటిగాను (రెండు మూడు) కలిసి వ్యంజకాలుగా ఉండడం మహాకవుల ప్రబంధాలలో చూడబడుతున్నది. సుబంతం వ్యంజకంగా ఉండటానికి ఉదాహరణం ఎట్లనగా -

తాలైః ఇతి. ఇది మేఘదూతంలోనిది. దీని పూర్వార్ధం -

"తన్మధ్యే చ స్ఫటికఫలకా కాఞ్చనీ వాసయష్టి
ర్మూలే బద్ధా మణిభిరనతిప్రౌఢవంశప్రకాశైః"

తన్మధ్యే= ఆ వృక్షముల మధ్య, స్ఫటికఫలకా= స్ఫటికమాణిక్యవికారమైన ఫలకం గలదీ, అనతిప్రౌఢవంశప్రకాశైః= అంతగా ముదరని వెదురు కఱ్ఱ వంటి కాంతి గల, మణిభిః= మణులచేత, మూలే= మూలమునందు, బద్ధా= కట్టబడినది, కాఞ్చనీ= బంగారువికారమైన, వాసయష్టిః= నివసించే దండం ఉన్నది. శిఞ్జద్వలయసుభగైః= ధ్వనిచేస్తూన్న వలయాలచేత సుందరములైన, తాలైః= తాళాలచేత, మే కాన్తయా= నా ప్రియురాలిచేత, నర్తితః= నాట్యం చేయించబడిన, వః సుహృత్= మీ మిత్రుడైన, నీలకణ్ఠః= నెమలి, దివసవిగమే= రాత్రియందు, యామ్= ఏ యష్టిని, అధ్యాస్తే= అధిష్ఠించి ఉంటుందో.

లోచనం

సుబన్తస్యేతి:- సముదితత్వే తూదాహరణం దత్తం; వ్యస్తత్వే చోచ్యతే ఇతి భావః. తాలైరితి బహువచనమనేకవిధం వైదగ్ధ్యం ధ్వనత్ విప్రలమ్భోద్దీపకతామేతి.

బాలానందిని

సుబన్తస్యేతి. వీటిలో కొన్ని కలిసి వ్యంగ్యాలుగా ఉండడానికి ఉదాహరణం వెనక చూపబడింది. ఇవి విడి విడిగా వ్యంజకాలుగా ఉండడానికి చూపబడుతుంది అని భావం. 'తాలైః' అని బహువచనం ఆ నెమలిని వివిధభంగులలో నాట్యం ఆడించడానికి యక్షిణి కున్న వేరు వేరు విధాల తాళాలు వేసే నేర్పును ధ్వనింపచేస్తూ విప్రలంభాన్ని ఉద్దీప్తం చేస్తూన్నది.

ధ్వన్యాలోకం

తిజన్తస్య యథా-

గాథ.అవసర రోఉం చిఅ ణిమ్మిఆఇం మా పుంస మే హఅచ్ఛీఇం,

దంసంణమేత్తుమ్మత్తేహిం జహిం హిఅఅం తుహ ణ ణాఅమ్. (84)

యథా వా-

గాథ.మా పన్థం రున్ధీఓ అవేహి బాలఅ అహోసి అహిరీఓ,

అమ్హే అ ణిరిచ్ఛాఓ సుణ్ణఘరం రక్ఖిదవ్వం ణో. (85)

బాలానందిని

తిజంతానికి వ్యంజకత్వం ఎట్లనగా - (ఈ రెండింటి సంస్కృతచ్ఛాయలు వ్యాఖ్యలో ఇవ్వబడ్డాయి). అపసరేతి. అపసర= తొలగిపో. రోదితుమేవ= ఏడవడానికే, నిర్మితే= పుట్టించబడిన, హతే= కుత్సితములైన, మే అక్షిణీ= నా నేత్రాలను, మా పుంసయ= (నిన్ను చూడడం కోసం) పెద్దవి అయేటట్లు చెయ్యకు. దర్శనమాత్రోన్మత్తాభ్యామ్= చూడగానే ఉన్మత్తములైన, యాభ్యామ్= వేటిచేత, తవ హృదయమ్= నీ హృదయం, ఏవంరూపమ్= ఈ విధమైనదిగా, న జ్ఞాతమ్= తెలియబడలేదో.

మరొక ఉదాహరణం ఎట్లనగా -

మా ఇతి - అప్రౌఢ= ప్రౌఢుడవు కాని, బాలక= ఓ! చిన్నవాడా! పన్థానమ్= మార్గాన్ని, మా రుధః= అడ్డుపెట్టకుము. అపేహి= తొలగుము. అహో= ఏమి ఆశ్చర్యం! అహ్రీకః అసి= సిగ్గులేనివాడవుగా ఉన్నావు. వయమ్= మేము, పరతన్త్రాః= పరాధీనలము. యతః = ఎందువలన అనగా, మామకమ్= నా సంబంధమైన, శూన్యగృహమ్= ఎవరూ లేని ఇల్లు, రక్షణీయమ్= రక్షించదగినదిగా, వర్తతే= ఉన్నది.

లోచనం

"అపసర రోదితుమేవ నిర్మితే మా పుంసయ హతే అక్షిణీ మే,

దర్శనమాత్రోన్మత్తాభ్యాం యాభ్యాం తవ హృదయమేవంరూపం న జ్ఞాతమ్".

(సంస్కృతచ్ఛాయ).

ఉన్మత్తో హి న కించిజ్జానాతీతి న కస్యాప్యత్రాపరాధః. దైవేనేత్థమేవ

నిర్మాణం కృతమితి అపసర మా వృథా ప్రయాసం కార్షీః దైవస్య విపరివర్తయితుమశక్యత్వాదితి తిఙ్గన్తో వ్యఞ్జకః, తదనుగృహీతాని పదాన్తరాణ్యపీతి భావః.

"మా పన్థానం రుధః అపేహి బాలక అప్రౌఢ అహో అసి అహ్రీకః,

వయం పరతన్త్రా యతః శూన్యగృహం మామకం రక్షణీయం వర్తతే".

(సంస్కృతచ్ఛాయ)

ఇత్యత్ర అపేహీతి తిఙన్తమిదం ధ్వనతి. త్వం తావదప్రౌఢః, లోకమధ్యే యదేవం ప్రకాశయసి, అస్తి తు సంకేతస్థానం శూన్యగృహం తత్రైవాగన్తవ్యమితి.

బాలానందిని

ఉన్మత్తో హి ఇతి :- ఉన్మత్తునికి ఏమీ తెలియదు కదా? అందుచేత ఈ విషయంలో ఎవరి తప్పూ లేదు. ఇదంతా దైవకృతమే. తొలగిపో, అనవసరంగా ప్రయాస పడకు. దైవాన్ని ఎవరూ మార్చజాలరు కదా అని 'అపసర' అనే తిఙంతం, దానిచేత అనుగ్రహించబడిన ఇతరపదాలూ కూడ వ్యంజకాలు అని భావం.

మా పన్థానమ్ ఇత్యాది శ్లోకంలో అపేహి అనే తిఙంతం - "నువ్వు ఇంకా ప్రౌఢుడవు (లోకజ్ఞానం ఉన్న యువకుడవు) కావు. అందుచేతనే పదిమందిలోనూ ఈ విధంగా అందరికీ తెలిసే టట్లు ప్రవర్తిస్తున్నావు. శూన్యగృహం సంకేతస్థానంగా ఉంది; అక్కడికి రా'' అని వ్యంజింపచేస్తున్నది.

ధ్వన్యాలోకం

సమ్బన్ధస్య యథా-

గాథ. అణ్ణత్త వచ్చ బాలఅ ణ్హాఅన్తిం కిం మం పులోఏసి ఏఅమ్,

భో జాఆభీరుఆణం తడం విఅ ణ హోఈ. (86)

"అన్యత్ర వ్రజ బాలక స్నాన్తీం కిం మాం ప్రలోకయస్యేతత్,

భో! జాయాభీరుకాణాం తటమేవ న భవతి" (సంస్కృతచ్ఛాయ)

బాలానందిని

సంబన్ధస్యేతి - సంబంధానికి ద్యోతకత్వం ఎట్లనగా -

అన్యత్రేతి - బాలక= ఓ చిన్నవాడా! అన్యత్ర= మరొక చోటికి, వ్రజ= వెళ్లుము.

స్నాన్తీమ్= స్నానం చేస్తూన్న, మామ్= నన్ను, కిం ప్రలోకయసి= ఎందుకు చూస్తావు? భోః= ఓయీ! ఏతత్= ఈ, తటమ్= ఒడ్డు, జాయాభీరుకాణామ్= భార్యకి భయపడేవాళ్లకి. న భవతి ఏవ= కానేకాదు, అలాంటివాళ్లు ఇక్కడికి రాకూడదు.

లోచనం

"అన్యత్ర వ్రజ బాలక" - అప్రౌఢబుద్ధే! స్నాన్తీం మాం కిం ప్రకర్షేణ ఆలోకయసి? ఏతత్, భో ఇతి సోల్లుణ్ఠనమాహ్వానమ్; జాయాభీరుకాణా సంబన్ధి తటమేవ న భవతి. అత్ర జాయాతో యే భీరవః తేషామేతత్ స్థానమితి (తేషాం నైతత్ స్థానమితి) దూరాపేతః సమ్బన్ధః ఇత్యనేన సమ్బన్ధేన ఈర్ష్యాతిశయః ప్రచ్ఛన్నకామిన్యాభివ్యక్తః.

బాలానందిని

అన్యత్రేతి - బాలక= ప్రౌఢం కాని బుద్ధికలవాడా! (పిరికివాడా) స్నానం చేస్తూన్న నన్ను ఎందుకు అలా ఎగా దిగా చూస్తావు? 'భో' అనేది అవహేళనతో కూడిన పిలుపు. ఇది భార్యలకి భయపడేవాళ్లకు సంబంధించిన తీరం కాదు. అత్రేతి - "ఈ స్థానం భార్యలకు భయపడేవాళ్లది కాదు" అని చెప్పడంచేత, "నాతో సంబంధం అనేదే కుదరదు" అని సంబంధంచేత (జాయాభీరుకాణామ్ అనే షష్ఠికి అర్థమైన సంబంధంచేత) ప్రచ్ఛన్నకామిని (జారిణి) (అతడు అంతగా భార్యాసక్తుడై ఉన్నందుకు) తన అత్యధికమైన ఈర్ష్యను వ్యంజింపచేస్తూన్నది.

ధ్వన్యాలోకం

కృతకప్రయోగేషు ప్రాకృతేషు తద్ధితవిషయే వ్యఞ్జకత్వమావేద్యత ఏవ. అవజ్ఞాతిశయే కః. సమాసానాం చ వృత్త్యౌచిత్యేన వినియోజనే. నిపాతానాం వ్యఞ్జకత్వం యథా -

శ్లో. అయమేకపదే తయా వియోగః ప్రియయా చోపనతః సుదుఃసహో మే,
నవవారిధరోదయాదహోభిర్భవితవ్యం చ నిరాతపార్ద్రరమ్యైః. (87)

ఇత్యత్ర చశబ్దః. యథా వా-

శ్లో. ముహురఙ్గులిసంవృతాధరోష్ఠం ప్రతిషేధాక్షరవిక్లబాభిరామమ్,
ముఖమంసవివర్తి పక్ష్మలాక్ష్యాః కథమప్యున్నమితం న చుమ్బితం తు(88)

అత్ర తుశబ్దః. నిపాతానాం ప్రసిద్ధమపీహ ద్యోతకత్వం రసాపేక్షయా ఉక్తమితి ద్రష్టవ్యమ్.

బాలానందిని

"కృతేతి"- చేయబడిన 'క' ప్రయోగం గల ('క' ప్రత్యయం చేర్చిన) ప్రాకృతశబ్దాలలో తద్ధిత ప్రత్యయవిషయంలో వ్యంజకత్వం తెలుస్తూనే ఉంది. అత్యధికమైన అనాదరాన్ని బోధించడంకొరకు 'క' ప్రత్యయం చేర్చబడుతుంది (ఉదా. బాలక, జాయాభీరుక ఇత్యాదులు). వృత్తుల ఔచిత్యాన్ని పాటిస్తూ సమాసాలను వినియోగించడంలో వ్యంజకత్వం స్పష్టంగా తెలుస్తుంది. నిపాతలకు వ్యంజకత్వం ఎట్లనగా-

అయమితి - విక్రమోర్వశీయంలో పురూరవుని మాటలు, మే= నాకు, ఏకపదే= హఠాత్తుగా, సుదుఃసహః= చాల సహించశక్యం కాని, తయా ప్రియయా వియోగః= ఆ ప్రియురాలితో వియోగం, ఉపనతః= వచ్చినది. అహోభిః= దివసాలచేత, నవవారిధరోదయాత్= నూత్నమేఘాల ఉదయంవల్ల, నిరాతపత్వరమ్యైః= ఎండ లేకపోవడంచేత రమ్యాలుగా, భవితవ్యం చ= అవడంకూడ (జరిగింది).

ఇక్కడ చశబ్దం వ్యంజకం, మరొక ఉదాహరణం ఎట్లనగా-

ముహురితః- అభిజ్ఞానశాకుంతలంలో దుష్యంతుని మాటలు. పక్ష్మలాక్ష్యాః= అందమైన (దట్టంగా వక్రంగా ఉన్న) రెప్పలు గల నేత్రాలు ఆ శకుంతలయొక్క, ముహుః= మాటిమాటికి, అఙ్గులిసంవృతాధరోష్ఠమ్= వేళ్లచేత కప్పబడిన అధరోష్ఠంకలదీ, ప్రతిషేధాక్షరవిక్లబాభిరామమ్= 'వద్దు, వద్దు' అని నిషేధాక్షరాలచేత వ్యాకులంగానూ మనోహరంగానూ ఉన్న, అంసవివర్తి= బుజంవైపు తిరిగిన, ముఖమ్= ముఖము, కథమపి ఎలాగో, ఉన్నమితమ్= పైకి ఎత్తబడింది; తు= కాని, న చుమ్బితమ్= ముద్దుపెట్టుకొనబడలేదు.

ఇక్కడ తుశబ్దం వ్యంజకం, 'చ' 'తు', 'వా' మొదలైన నిపాతలు, ఇతరనామవాచకాదుల వలె తమ అర్థాన్ని బోధిస్తాయా, లేక సూచిస్తాయా (అనగా అక్కడ ఉన్న అర్థాన్నే సూచిస్తాయా) అని విమర్శ ఉంది. బోధిస్తాయి అనగా అవి తత్తదర్థవాచకాలు అని అర్థం. సూచిస్తాయి అంటే అవి కొత్తగా ఏ అర్థమూ బోధించవు; అక్కడ ఉన్న పదవిన్యాసాన్ని పట్టి లభించే అర్థాన్నే ద్యోతింపచేస్తాయి అని అర్థం. ఈ రెండవ పక్షాన్ని దృష్టిలో ఉంచుకొని చెపుతున్నాడు - నిపాతానామితి - నిపాతలు ద్యోతకాలు అనే విషయం ప్రసిద్ధమే అయినా వాటికి ఇక్కడ చెప్పిన ద్యోతకత్వం

రసాపేక్షయా చెప్పినది. అనగా అవి ఆ యా అర్థాలను సూచిస్తాయి అనే ఉద్దేశ్యంతో వాటిని మేం ద్యోతకాలు అనడంలేదు; రసాదులను వ్యంజింపచేస్తాయి కాబట్టి ద్యోతకాలు అంటున్నాం అని భావం.

లోచనం

కృతకేతి కగ్రహణం తద్ధితోపలక్షణార్థమ్ కృతః కప్రత్యయప్రయోగో యేషు కావ్యవాక్యేషు. యథా - 'జాయాభీరుకాణామ్' ఇత్యాది. యే హ్యరసజ్ఞాః ధర్మపత్నీషు ప్రేమపరతన్త్రాః తేభ్యః కోఽన్యో జగతి కుత్సితః స్యాదితి కప్రత్యయః అవజ్ఞాతిశయద్యోతకః. సమాసానాం చేతి. కేవలానామేవ వ్యఞ్జకత్వమావేద్యతే ఇతి సంబన్ధః.

చశబ్ద ఇతి - జాతావేకవచనమ్. ద్వౌ చశబ్దౌ ఏవమాహతుః. కాకతాలీయన్యాయేన గణ్డస్యోపరి స్ఫోట ఇతి వత్ తద్వియోగశ్చ వర్షసమయశ్చ సముపనతౌ, ఏతదలం ప్రహరణాయ. అత ఏవ రమ్యపదేన సుతరాముద్దీపనవిభావత్వముక్తమ్. తుశబ్ద ఇతి. పశ్చాత్తాపసూచకః సన్ తావన్మాత్రపరిచుమ్బనలాభేనాపి కృతకృత్యతా స్యాదితి ధ్వనతీతి భావః. ప్రసిద్ధమపీతి. వైయాకరణాదిగృహేషు ప్రాక్ప్రయోగస్వాతన్త్ర్యప్రయోగాభావాత్, షష్ఠ్యాద్యశ్రవణాత్, లిఙ్గసంఖ్యావిరహాచ్చ వాచ్యవైలక్షణ్యేన ద్యోతకా నిపాతా ఇత్యుద్ఘోష్యతే ఏవేతి భావః.

బాలానందిని

కృతకేతి - 'కృతక' అని 'క'ను గ్రహించడం తద్ధితప్రత్యయాలన్నింటికి ఉపలక్షణం అవడంకోసం. "జాయాభీరుకాణామ్" మొదలైన ఏ కావ్యవాక్యాలలో 'క' ప్రత్యయ ప్రయోగం చేయబడిందో అవి కృత ప్రయోగాలు. ఎవరు రసజ్ఞులు కాక కేవలం ధర్మపత్నులందు మాత్రమే ప్రేమకు పరాధీనులో వాళ్లకంటె కుత్సితుడు ఈ జగత్తులో ఎవడుంటాడు అని 'క' ప్రత్యయం అత్యధికమైన అనాదరాన్ని సూచిస్తూన్నది. సమాసానాం చేతి. కేవలసమాసాలకే వ్యంజకత్వం తెలియబడుతున్నది అని అన్వయం.

చశబ్దః ఇతి:- ఇది 'జాతౌ ఏకవచనం'. పై శ్లోకంలో రెండు చకారాలున్నాయి గాన 'చశబ్దః' అని ఏకవచనం ప్రయోగించినా ఇది చ జాతికి చెందినవి అని జాత్యర్థకం అని గ్రహించాలి. "గోవు సాధుజంతువు" అన్నప్పుడు గోవు అని ఏకవచనం ప్రయోగించినా

గోజాతికి చెందిన పన్నీ అని గ్రహించినట్లు అని భావం. ద్వౌ ఇతి - ఇక్కడ ఉన్న రెండు చశబ్దాలు ఈ అర్థం చెపుతున్నాయి - కంతిమీద కురుపు లేచినట్లు ఆమె వియోగమూ, పర్షాసమయమూ రెండూ కూడ కాకతాలీయన్యాయంచేత ఒకే మాటు వచ్చిపడ్డాయి. నా ప్రాణాలు తీయడానికి ఇది చాలు. అందువల్లనే రమ్యపదంచేత పూర్తిగా ఉద్దీపన విభావంగా ఉన్నది అని చెప్పబడింది. తుశబ్ద ఇతి – 'తు' శబ్దం పశ్చాత్తాపాన్ని సూచిస్తూ ఆ మాత్రం పరిచుంబన లభించినా కృతకృత్యత కలిగి ఉండేది అని ధ్వనిస్తూన్నది అని భావం. ప్రసిద్ధమపీతి :- వాక్యానికి ప్రారంభంలో కొన్ని నిపాతలకు ప్రయోగం ఉండకపోవడంచేత, వాటిని స్వతంత్రంగా ప్రయోగించకపోవడంచేత, షష్ఠ్యాదివిభక్తులు చేర్చకపోవడంచేత, లింగం, సంఖ్య లేకపోవడంచేత నిపాతలు వాచకాలు కాక (వాచకవైలక్షణ్యేన)ద్యోతకాలు అని వైయాకరణాదుల ఇళ్లల్లో ఘోషిస్తూనే ఉంటారు అని భావం.

వివరణ. 'చ రామః లక్ష్మణః ఆగతౌ' "వా రామః లక్ష్మణః ఆగతః" 'తు ముఖం న చుమ్బితమ్' ఇత్యాదివిధంగా వాక్యానికి ముందు కొన్ని నిపాతలను ప్రయోగించరు. నిపాతలను వేటినీ ఇతరపదాలతో కలిపి మాత్రమే తప్ప స్వతంత్రంగా ప్రయోగించరు. లింగవిభక్తివచనాదులు కూడ వీటికి ఉండవు. అందుచేత ఇవి ద్యోతకాలే కాని వాచకాలు కావు అని అర్థం.

## ధ్వన్యాలోకం

ఉపసర్గాణాం వ్యఞ్జకత్వం యథా-

శ్లో. నీవారాః శుకగర్భకోటరముఖభ్రష్టాస్తరూణామధః
ప్రస్నిగ్ధాః క్వచిదిఙ్గుదీఫలభిదః సూచ్యన్త ఏవోపలాః,
విశ్వాసోపగమాదభిన్నగతయః శబ్దం సహన్తే మృగా
స్తోయాధారపథాశ్చ వల్కలశిఖానిష్యన్దలేఖాఙ్కితాః. (89)

ఇత్యాదౌ.

### బాలానందిని

ఉపసర్గలకు వ్యంజకత్వం ఎట్లనగా -

నీవారా ఇతి : నీవారాః = నెవరు ధాన్యపు గింజలు, తరూణామ్ అధః = చెట్లక్రింద, శుకగర్భకోటరముఖభ్రష్టాః= చిలుకలు గర్భములందు గల తొఱ్ఱల

ముఖాలనుండి జారినవి. క్వచిత్ = కొన్నిచోట్ల, ప్రస్నిగ్ధాః= బాగా నున్నగా ఉన్న, ఉపలాః= రాళ్లు, ఇఙ్గుదీఫలభిదః= గారకాయలను నలగకొట్టినవిగా, సూచ్యన్త ఏవ= సూచించబడుతున్నాయి. విశ్వాసోపగమాత్= విశ్వాసాన్ని పొందడం వలన, అభిన్నగతయః= మార్చబడని నడక గల, మృగాః= లేళ్లు, శబ్దమ్= శబ్దాన్ని, సహన్తే= సహిస్తున్నవి. తోయాధారవథాశ్చ = జలాశయమార్గాలు కూడ, వల్కల శిఖానిష్యన్దలేఖాన్వితాః= నారచీరల అగ్రభాగాలనుండి కారిన నీళ్లయొక్క రేఖలచేత చిహ్నితాలైనవి. ఇత్యాదులలో.

### లోచనం

ప్రకర్షేణ స్నిగ్ధాః ఇతి ప్రశబ్దః ప్రకర్షం ద్యోతయన్ ఇఙ్గుదీఫలానాం సరసత్వమాచక్షాణః ఆశ్రమస్య సౌన్దర్యాతిశయం ధ్వనతి. "తాపసస్య ఫలవిశేషవిషయః అభిలాషాతిరేకః ధ్వన్యతే" ఇతి త్వసత్. అభిజ్ఞానశాకున్తలే హి రాజ్ఞః ఇయముక్తిః న తాపసస్యేత్యలమ్.

### బాలానందిని

ప్రకర్షచేత (మిక్కిలి) నున్నగా ఉన్నాయి అని 'ప్ర' శబ్దం ప్రకర్షను ద్యోతింపచేస్తూ. ఇంగుదీఫలాలు సరసాలుగా (నూనెతో నిండి) ఉన్నాయని చెపుతూ ఆశ్రమంయొక్క సౌందర్యాతిశయాన్ని ధ్వనింపచేస్తున్నది. "తాపసునికి ఫలాల విషయంలో ఉన్న అత్యధికాభిలాష ధ్వనించబడుతున్నది" అని (ఇతరులు చేసిన) వ్యాఖ్య సరియైనది కాదు. ఇది అభిజ్ఞానశాకుంతలంలో రాజు అన్న మాట కాని తాపసుని మాట కాదు; సరే చాలు.

## ధ్వన్యాలోకం

ద్విత్రాణాం చోపసర్గాణామేకత్ర పదే యః ప్రయోగః సోఽపి రసవ్యక్త్యనుగుణతయైవ నిర్దోషః. యథా - "ప్రభ్రశ్యత్యుత్తరీయత్విషి తమసి సముద్వీక్ష్య వీతావృతీన్ ద్రాగ్ జన్తూన్" ఇత్యాదౌ. యథా వా - "మనుష్యవృత్త్యా సముపాచరన్తమ్" ఇత్యాదౌ.

### బాలానందిని

ఒక పదంలో రెండు మూడు ఉపసర్గల ప్రయోగం కూడ రసాభివ్యక్తికి అనుగుణంగా ఉండడంచేతనే నిర్దోషము. ఎట్లనగా-ప్రభ్రశ్యదితి. "ఉత్తరీయం వంటి కాంతి

గల చీకటి జారిపోతూండగా వెంటనే తొలగిన ఆవరణ గల ప్రాణులను చూచి" ఇత్యాదులలో (మయూరుని సూర్యశతకం. 4) మరొక ఉదాహరణం ఎట్లనగా - మనుష్యేతి. "మనుష్యవృత్తిలో (మానవుడుగా) ప్రవర్తిస్తూన్న" ఇత్యాదులలో.

లోచనం

ద్విత్రాణామిత్యనేన ఆధిక్యం నిరస్యతి. సమ్యగుచ్చైః విశేషేణ ఈక్షిత్వే భగవతః కృపాతిశయో వ్యక్తః.

శ్లో. మనుష్యవృత్త్యా సముపాచరన్తం స్వబుద్ధిసామాన్యకృతాను(భి)మానాః,
యోగీశ్వరైరప్యనుబోధమీశ త్వాం బోద్ధుమిచ్ఛన్త్యబుధాః స్వతర్కైః.

సమ్యగ్ భూతమ్ ఉపాంశు కృత్వా ఆ సమన్తాత్ చరన్త మిత్యనేన లోకాను జిఘృక్షాతిశయః తదాచరతః పరమేశ్వరస్య ధ్వనితః.

బాలానందిని

ద్విత్రాణామ్ అనడం చేత అంతకంటె అధికంగా ఉపయోగించడాన్ని నిషేధిస్తున్నాడు. ('సముద్వీక్ష్య'లో 'సమ్', 'ఉద్' అని రెండు ఉపసర్గలు ప్రయోగించడం చేత) బాగా, ఎత్తుగా విశేషరూపంలో చూడడంలో బగవంతుడైన సూర్యుని కృపాతిశయం అభివ్యక్తం అవుతున్నది.

మనుష్యేతి. స్వబుద్ధిసామాన్యకృతాభిమానాః= తమ సామాన్యబుద్ధిచేత చేయబడిన అహంకారం గల, అబుధాః= అపండితులు, మనుష్యవృత్త్యా= మానవవృత్తిలో (సాధారణమానవుడువలె), సముపాచరన్తమ్= ప్రవర్తిస్తూన్నవాడవు, యోగీశ్వరైరపి= యోగీశ్వరులచేత కూడ, అనుబోధమ్= తేలికగా తెలియశక్యుడవు కాని, త్వామ్= నిన్ను, స్వతర్కైః= తమ తర్కాలచేత, బోద్ధుమ్= తెలుసుకొనుటకు, ఇచ్ఛన్తి= కోరుచున్నారు.

("సముపాచరన్తమ్' లో 'సమ్' 'ఉప' 'ఆ' అను మూడు ఉపసర్గలున్నాయి.) బాగుగా, రహస్యంగా, ఆ= అంతటా, సంచరిస్తూన్న అనడం చేత ఆ విధంగా చేస్తూన్న పరమేశ్వరుని కున్న లోకాలను అనుగ్రహించాలనే ఇచ్ఛయొక్క అతిశయం ధ్వనించబడింది.

## ధ్వన్యాలోకం

నిపాతానామపి తథైవ - యథా - "అహో బతాసి స్పృహణీయవీర్యః" ఇత్యాదౌ. యథా వా-

శ్లో. యే జీవన్తి న మాన్తి యే స్మ వపుషి ప్రీత్యా ప్రనృత్యన్తి చ
ప్రస్యన్ది ప్రమదాశ్రవః పులకితా దృష్టే గుణిన్యూర్జితే,
హా ధిక్కష్టమహో క్వ యామి శరణం తేషాం జనానాం కృతే
నీతానాం ప్రలయం శఠేన విధినా సాధుద్విషః పుష్యతా. (90)

ఇత్యాదౌ.

బాలానందిని

నిపాతలయొక్క కూడ అట్లే (రెండు మూడు నిపాతల ప్రయోగం కూడ రసాభివ్యక్తికి అనుగుణంగా ఉంటేనే నిర్దోషం). ఎట్లనగా. అహో ఇతి - "అహా! శబాస్! శ్లాఘించతగిన పరాక్రమం కలవాడవుగా ఉన్నావు" ఇత్యాదులలో. (ఇక్కడ 'అహో' 'బత' అని రెండు నిపాతల ప్రయోగం). మరొక ఉదాహరణం ఎట్లనగా -

యే ఇతి - ఊర్జితే = ఉత్కృష్టుడైన, గుణిని= గుణవంతుడు, దృష్టే= చూడబడిన వాడగుచుండగా, యే= ఎవరు, జీవన్తి స్మ= ఉత్తమజీవనం కలవారుగా ఉండేవారో, యే= ఎవరు, ప్రీత్యా= ఆనందంతో, వపుషి =శరీరంలో, న మాన్తి స్మ= ఇమిడేవారు కారో, ప్రస్యన్దిప్రమదాశ్రవః= స్రవిస్తున్న ఆనందబాష్పం కలవారై, పులకితాః= పులకించినవారై, ప్రనృత్యన్తి = నృత్యం చేస్తూండేవారో, సాధుద్విషః= సత్పురుషులను ద్వేషించేవాళ్లను, పుష్యతా= పోషించే, వఠేన విధినా= దుష్టదైవంచేత, ప్రలయం నీతానామ్= నశింపచేయబడిన, తేషాం జనానాం కృతే= = ఆ జనులకొరకై, క్వ= ఎక్కడికి, శరణం యామి= శరణుజొచ్చెదను. హా= అయ్యో! ధిక్ = ఛీ! అహో = ఆహా!. ఇత్యాదులలో (హా, ధిక్, అహో, అని మూడు నిపాతల ప్రయోగం).

లోచనం

తథైవేతి. రసవ్యఞ్జకత్వేన ద్విత్రాణామపి ప్రయోగో నిర్దోష ఇత్యర్థః. శ్లాఘాతిశయః నిర్వేదాతిశయశ్చ అహో, బత, హా, ధిక్ ఇతి చ ధ్వన్యతే.

బాలానందిని

తథైవేతి - రసవ్యంజకాలుగా రెండు మూడు నిపాతల ప్రయోగం నిర్దోషం అని అర్థం. 'అహో' 'బత' అనే రెండు నిపాతలు పై వాక్యంలో శ్యాఘాతిశయాన్ని. హా, ధిక్, అహో అనేవి (శ్లోకంలో) నిర్వేదాన్ని ధ్వనింప చేస్తున్నాయి.

ధ్వన్యాలోకం

పదపౌనరుక్త్యం చ వ్యఞ్జకత్వాపేక్షయైవ కదాచిత్ ప్రయుజ్యమానం శోభామావహతి. యథా -

శ్లో. యద్వఞ్చనాహితమతిర్బహుచాటుగర్భం
కార్యోన్ముఖః ఖలజనః కృతకం బ్రవీతి,
తత్సాధవో న న విదన్తి విదన్తి కిం తు
కర్తుం వృథా ప్రణయమస్య న పారయన్తి. (91)

ఇత్యాదౌ.

బాలానందిని

వ్యంజకత్వాపేక్షచేతనే ఒకప్పుడు ప్రయోగించబడే పదాల పౌనరుక్త్యం కూడ శోభను కలిగిస్తుంది. ఎట్లనగా -

యదితి - వఞ్చనాహితమతిః= వంచనయందు ఉంచబడిన బుద్ధి గల, వంచించాలనే కోరిక గల, కార్యోన్ముఖః= తన పని సాధించుకొనడంలో ఉన్ముఖుడైన, ఖలజనః= దుష్టుడు, కృతకమ్ = కృత్రిమమైన, అసత్యమైన వాక్యమును, బహుచాటుగర్భమ్= అధికమైన చాటువు (మంచి పొగడ్త) గర్భమునందు కలుగునట్లుగా, యత్ బ్రవీతి= పలుకుచున్నాడు అనేది ఏది కలదో, తత్= దానిని, సాధవః= సత్పురుషులు, న న విదన్తి = అర్థం చేసుకొన రనే మాట లేదు. విదన్తి = అర్థం చేసుకుంటారు; కిం తు = కాని, అస్య = వీనియొక్క, ప్రణయమ్= పైకి కనపరచే ప్రణయాన్ని, వృథాకర్తుమ్= వ్యర్థం చేయడానికి, కాదనడానికి, న పారయన్తి= సమర్థులు కారు. ఇత్యాదులలో, (ఇక్కడ 'విదన్తి' అనే పదం పునరుక్తమైనది).

లోచనం

ప్రసఙ్గాత్ పౌనరుక్త్యాన్తరమపి వ్యఞ్జకమాహ - పదపౌనరుక్త్యమితి - పదగ్రహణం వాక్యాదేరపి యథాసంభవముపలక్షణమ్. విదన్తీతి - త ఏవ హి సర్వం విదన్తి సుతరామితి ధ్వన్యతే. వాక్యపౌనరుక్త్యం యథా - "పశ్య; ద్వీపాదన్యస్మాదపి" ఇతి వాక్యానన్తరం 'కః సందేహః, ద్వీపాదన్యస్మాదపి' ఇత్యనేన ఈప్సితప్రాప్తిరవిఘ్నితైవ ధ్వన్యతే. "కిమ్ కిమ్? స్వస్థాః భవన్తి

మయి జీవతి'' ఇత్యనేనామర్షాతిశయః. ''సర్వక్షితిభృతాం నాథ దృష్టా సర్వాఙ్గసున్దరీ'' ఇత్యున్మాదాతిశయః.

బాలానందిని

ప్రసంగంవల్ల, వ్యంజకమైన మరొక పౌనరుక్త్యాన్ని గూర్చి కూడ చెపుతున్నాడు - పదపౌనరుక్త్యమితి 'పద' గ్రహణం యథాసంభవంగా వాక్యాదులకు కూడ ఉపలక్షణం. అనగా కొన్ని చోట్ల వాక్యాదుల పౌనరుక్త్యం కూడ వ్యంజకం కావచ్చును అని అభిప్రాయం. వాక్యపౌనరుక్త్యం(రత్నావళిలో)ఎట్లనగా-''పశ్య; ద్వీపాదన్యస్మాదపి'' అని చెప్పిన తరవాత మళ్లీ ''కః సందేహః, ద్వీపాదన్యస్మాదపి'' అని చెప్పడంచేత అభీష్టప్రాప్తి నిర్విఘ్నంగా జరగగలదని ధ్వనించబడుతున్నది. (వేణీసంహారంలో) ''కిమ్ కిమ్? స్వస్థా భవన్తి మయి జీవతి'' అనే దాని పౌనరుక్త్యంచేత (భీమసేనుని) కోపాతిశయం ధ్వనించబడుతున్నది (విక్రమోర్వశీయంలో) ''సర్వక్షితిభృతాం నాథ దృష్టా సర్వాఙ్గసున్దరీ'' అనేదాని పౌనరుక్త్యంచేత (పురూరవుని) ఉన్మాదాతిశయం ధ్వనించబడుతుంది. (ధ్వన్యాలోకపఠితలు ఆ యా రూపకాలలోని ఆ యా ఘట్టాలతో పరిచితులే అయి ఉంటారు గాన విస్తరభయంచేత ఈ వాక్యాలు ఏ సందర్భాలలో వచ్చాయో వివరించలేదు).

## ధ్వన్యాలోకం

కాలస్య వ్యఞ్జకత్వం యథా-

గాథ - సమవిసమణివ్విసేసా సమన్తఓ మన్దమన్దసంఆరా,
అఇరా హోహిన్తి పహా మణోరహాణం పి దుల్లఙ్ఘా. (92)
''సమవిషమనిర్విశేషాః సమన్తతో మన్దమన్దసంచారాః,
అచిరాద్భవిష్యన్తి పన్థానో మనోరథానామపి దుర్లఙ్ఘ్యాః.
(ఇతి ఛ్ఛాయా)

అత్ర హ్యచిరాద్భవిష్యన్తి పన్థాన ఇత్యత్ర భవిష్యన్తీత్యస్మిన్ పదే ప్రత్యయః కాలవిశేషాభిధాయీ రసపరిపోషహేతుః ప్రకాశతే. అయం హి గాథార్థః ప్రవాసవిప్రలమ్భశృఙ్గారవిభావతయా విభావ్యమానో రసవాన్.

బాలానందిని

కాలం వ్యంజకం అవడానికి ఉదాహరణం ఎట్లనగా -

సమవిషమేతి - పన్థానః = మార్గాలు, సమవిషమనిర్విశేషాః= ఎత్తుపల్లాల భేదాలు లేనివి, సమన్తతః= అంతటా, మన్దమన్దసంచారాః= మందమందంగా ఉండే మనుష్య సంచారం గలవీ, మనోరథానామపి= మనోరథాలకు కూడ, దుర్లఙ్ఘ్యాః= దాట శక్యం కానివీ, అచిరాత్= కొద్ది కాలంలో, భవిష్యన్తి= కాగలవు.

అత్రేతి - ఇక్కడ ''అచిరాద్భవిష్యన్తి పన్థానః'' అనే చోట 'భవిష్యన్తి' అనే పదంలో ప్రత్యయం (స్య) కాలవిశేషాన్ని (భవిష్యత్కాలాన్ని) చెపుతూ రసపరిపోషణానికి హేతువుగా ప్రకాశిస్తూన్నది. ఈ గాథార్థం ప్రవాసవిప్రలంభశృంగారానికి విభావంగా భావించబడినదై రసవంతంగా ఉన్నది.

లోచనం

కాలస్యేతి - తిఙన్తపదానుప్రవిష్టస్యావ్యర్థకలాపస్య కారకకాల సంఖ్యోపగ్రహరూపస్య మధ్యే అన్వయవ్యతిరేకాభ్యాం సూక్ష్మదృశా భాగగతమపి వ్యఞ్జకత్వం విచార్యమితి భావః. రసపరిపోషేతి : ఉత్ప్రేక్ష్యమాణః వర్షాసమయః కమ్పకారీ కిముత వర్తమాన ఇతి ధ్వన్యతే.

బాలానందిని

తిఙన్తేతి - తిఙంతపదంలో చేరిన కారకం, కాలం, సంఖ్య (వచనం), ఉపగ్రహం (కర్తృగామి ఫలబోధకమైన ఆత్మనేపదం, పరగామిఫలాన్ని బోధించే పరస్మైపదం) ఏతద్రూపమైన విషయసముదాయం మధ్య సూక్ష్మదృష్టితో అన్వయవ్యతిరేకాలను ఉపయోగించి ఆ యా భాగాలలో ఉన్న వ్యంజకత్వాన్ని పరిశీలించాలి అని భావం. రసపరిపోషేతి వర్షాకాలం రాబోతుందంటేనే వణుకు పట్టిస్తూన్నది; అది వర్తమానం అయితే ఏం చెప్పాలి అని ధ్వనించబడుతున్నది.

## ధ్వన్యాలోకం

యథాత్ర ప్రత్యయాంశో వ్యఞ్జకః తథా క్వచిత్ప్రకృత్యంశోఽపి దృశ్యతే. యథా -

శ్లో. తద్గేహం నతభిత్తి మన్దిరమిదం లబ్ధావగాహం దివః

సా ధేనుర్జరతీ చరన్తి కరిణామేతా ఘనాభా ఘటాః,

స క్షుద్రో ముసలధ్వనిః కలమిదం సంగీతకం యోషితా
మాశ్చర్యం దివసైర్ద్విజోయమియతీం భూమిం సమారోపితః(93)

అత్ర శ్లోకే దివసై రిత్యస్మిన్ పదే ప్రకృత్యంశోఽపి ద్యోతకః. సర్వనామ్నాం చ వ్యఞ్జకత్వం యథా అనన్తరోక్తశ్లోకే. అత్ర చ సర్వనామ్నామేవ వ్యఞ్జకత్వం హృది వ్యవస్థాప్య కవినా క్వేత్యాదిశబ్దప్రయోగో న కృతః. అనయా దిశా సహృదయైరన్యేఽపి వ్యఞ్జకవిశేషాః స్వయముత్ప్రేక్షణీయాః. ఏతచ్చ సర్వం పదవాక్య రచనాద్యోతనోక్త్యైవ గతార్థమపి వైచిత్ర్యేణ వ్యుత్పత్తయే పునరుక్తమ్.

బాలానందిని

యథా ఇతి. ఇక్కడ (భవిష్యన్తి అన్నప్పుడు) ప్రత్యయరూపమైన భాగం (స్య అనేది) ఎలా వ్యంజకమో అట్లే కొన్నిచోట్ల ప్రకృత్యంశం (ప్రకృతిరూపపదభాగం కూడ) వ్యంజకంగా కనబడుచున్నది. ఎట్లనగా -

తద్గేహమితి - తత్ గేహమ్ = ఆ ఇల్లు, నతభిత్తి = వంగిపోయిన గోడలు కలది, ఇదం మన్దిరమ్= ఈ భవనం, దివః= ఆకాశంనుంచి, లబ్ధావకాశమ్= పొందబడిన అవకాశం గలది; సా= ఆ, ధేనుః= ఆవు, జరతీ= ముసలిది. కరిణామ్ = ఏనుగుల యొక్క, ఏతాః= ఈ, ఘనాభాః= మేఘాలవంటి కాంతి గల, ఘటాః= సమూహాలు, నదన్తి= ధ్వని చేస్తున్నాయి. సః= ఆ, క్షుద్రః= నికృష్టమైన, ముసలధ్వనిః= రోకళ్ల చప్పుడు; ఇదమ్= ఈ, కలమ్= మధురమైన, యోషితాం సంగీతకమ్= స్త్రీల సంగీతకం (గీత నృత్తవాద్యాలు మూడింటికీ కలసి 'సంగీతకం' అని పేరు). అయం ద్విజః= ఈ బ్రాహ్మణుడు, దివసైః = కొన్ని దివసాలచేతనే, ఇయతీమ్ = ఇంతటి, భూమిమ్= సమృద్ధిసీమను, సమారోపితః= అధిష్ఠింపచేయబడ్డాడు.

అత్రేతి - ఈ శ్లోకంలో 'దివసైః' అనే పదంలోని 'దివస' అనే ప్రకృత్యంశం వ్యంజకం. సర్వనామశబ్దాలు ఎలా వ్యంజకాలో ఇప్పుడే చెప్పిన శ్లోకంలోనే (చూడవచ్చు). ఇక్కడ సర్వనామశబ్దాలు (తత్, ఇదమ్, సా, ఏతాః, సః, ఇదమ్) వ్యంజకాలు అనే విషయాన్ని హృదయంలో ఉంచుకొని (సర్వనామాలే వ్యంజకాలుగా ఉన్నాయి కదా అనే అభిప్రాయంతో) కవి 'క్వ', ఇత్యాదిశబ్దాలు (తద్ గేహం క్వ, ఇదం మన్దిరం క్వ

ఇత్యాది విధంగా) ప్రయోగించలేదు. అనయా ఇతి. ఈ పద్ధతినే అనుసరించి సహృదయులు ఇతరమైన వ్యంజకవిశేషాలను కూడ స్వయంగా ఊహించుకోవాలి. పద-వాక్య- రచనలు ద్యోతకాలు అని చెప్పడంచేతనే ఇది అంతా గతార్థమే (చెప్పినట్లే) అయినా వైచిత్ర్యంచేత వ్యుత్పత్తికోసం మళ్లీ చెప్పబడింది.

లోచనం

దివసార్థో హ్యత్రాత్యన్తాసంభావ్యమానతామస్యార్థస్య ధ్వనతి. సర్వనామ్నాం చేతి. ప్రకృత్యంశస్య చేత్యర్థః. తేన ప్రకృత్యంశేన సంభూయ సర్వనామవ్యఞ్జకం దృశ్యతే ఇత్యుక్తం భవతీతి న పౌనరుక్త్యమ్. తథా హి - తదితి పదం నతభిత్తీత్యేతత్ప్రకృత్యంశసహాయం సమస్తామఙ్గలనిధానభూతాం మూషకాద్యాకీర్ణతాం ధ్వనతి. తదితి హి కేవలముచ్యమానే సముత్కర్షాతిశయోఽపి సంభావ్యేత. న చ నతభిత్తిశబ్దేనాప్యేతే దౌర్భాగ్యాయతనత్వసూచకాః విశేషాః ఉక్తాః. ఏవం సా ధేనురిత్యాదావపి యోజ్యమ్. ఏవంవిధే చ విషయే స్మరణాకారద్యోతకతా తచ్ఛబ్దస్య, న తు యచ్ఛబ్దసంబద్ధతేత్యుక్తం ప్రాక్. అత ఏవాత్ర తదిదంశబ్దాదినా స్మృత్యనుభవయోరత్యన్తవిరుద్ధవిషయతాసూచనేన ఆశ్చర్యవిభావతా యోజితా. తదిదంశబ్దాద్యభావే తు సర్వమసఙ్గతం స్యాదితి తదిదమంశయోరేవ ప్రాణత్వం యోజ్యమ్. ఏతచ్చ ద్విశః సామస్త్యం త్రిశః సామస్త్యమితి వ్యఞ్జకమిత్యుపలక్షణపరమ్. తేన లోష్టప్రస్తారన్యాయేన అనన్తవైచిత్ర్యముక్తమ్. యద్వక్ష్యత్యన్యేఽపీతి. అతివిక్షిప్తతయా శిష్యబుద్ధిసమాధానం న భవేదిత్యభి ప్రాయేణ సంక్షిపతి - ఏతచ్చేతి. వితత్యాభిధానే ప్రయోజనం స్మారయతి వైచిత్ర్యేణేతి.

బాలానందిని

దివసార్థః ఇతి - ఇక్కడ దివసం అనే అర్థం (సంవత్సరాలలో కాదు, మాసాలలో కాదు, దివసాలలో అనే అర్థం) ఈ విషయం ఏ మాత్రమూ ఊహింప శక్యం కాకుండా ఉంది అని ధ్వనింపచేస్తూన్నది. సర్వనామ్నాం చేతి :- సర్వనామాలు, ప్రకృత్యంశం ఈ రెండూ కలిసి అని అర్థం. ఈ విధంగా వ్యాఖ్యానించడంచేత - "సర్వనామం ప్రకృత్యంశంతో కలిసి వ్యంజకంగా కనబడుతూన్నది" అని చెప్పినట్లయింది. ఇలా

చెప్పడంచేత పౌనరుక్త్యం లేదు? అనగా "ప్రకృత్యంశోఽపి ద్యోతకః" అనేదానిచేతనే సర్వనామం కూడా ప్రకృత్యంశమే గాన అది కూడ ద్యోతకం అవుతుంది అని చెప్పినట్లే అయింది గాన మళ్లీ "సర్వనామ్నాం ద్యోతకత్వం" అని చెప్పడంలో పౌనరుక్త్యం లేదు అని భావం.

**తథాహీతి** - అది ఎట్లనగా - 'తత్' అనే పదం 'నతభిత్తి' అనే ప్రకృత్యంశంయొక్క సహాయంతో సమస్త అమంగాళలకీ స్థానమైన మూషకాదులతో నిండి ఉండడాన్ని సూచిస్తూన్నది. 'తత్' అని మాత్రమే అంటే సముత్కర్షయొక్క అతిశయం కూడ (అంతటి ఇల్లు అన్నట్లు) ఊహించబడవచ్చును. దౌర్భాగ్యానికి స్థానం అని సూచించే ఈ విశేషాలను 'నతభిత్తి' శబ్దం కూడ బోధించదు. 'సా ధేనుః' ఇత్యాదులలో కూడా ఈ విధంగానే అన్వయించుకోవాలి. ఇలాంటి ప్రదేశాలలో తచ్ఛబ్దం స్మరణాకారాన్ని ద్యోతింపచేస్తుంది కాని దీనికి యచ్ఛబ్దంతో సంబంధం ఉండదు అని ("తే లోచనే" అనే చోట, చూ. శ్లో. 78) పూర్వం చెప్పబడింది. అందుచేతనే ఇక్కడ తదిదం శబ్దాదులచేత స్మృత్యనుభవాల విషయాలు అత్యంతవిరుద్ధమైనవి అని సూచించడంచేత ఆశ్చర్యానికి విభావం అని చెప్పబడింది. తదిదంశబ్దాదులు లేకపోతే అంతా అసంగతంగానే ఉంటుంది గాన తదిదమంశాలు ఇక్కడ ప్రాణం వంటివి అని అర్థం చేసుకోవాలి.

వివరణ. 'తత్ గేహమ్' ( ఆ ఇల్లు), 'సా ధేనుః' ( ఆ ఆవు), 'స ముసలధ్వనిః' (ఆ రోకళ్ళ చప్పుడు) అని తచ్ఛబ్దాలచేత స్మరింపచేయబడుతూన్న ఇల్లూ, ఆవూ, ముసలధ్వనీ 'ఇదమ్ మన్దిరమ్' (ఈ భవనం) 'ఏతాః కరిణాం ఘటాః' (ఈ ఏనుగుల గుంపులు) 'ఇదం సంగీతకమ్' (ఈ సంగీతకం) అని ఇదమ్-ఏతచ్ఛబ్దాలచేత ప్రత్యక్షంగా అనుభవిస్తూన్నట్లు (చూస్తూన్నట్లు) చెప్పబడే భవన - గజ - సంగీతాలూ పరస్పరం అత్యంతవిరుద్ధాలు. పై మూడూ స్మృతివిషయాలు, తరువాతి మూడూ అనుభవవిషయాలు. ఈ విధంగా ఈ శబ్దాలు అత్యంతవిరుద్ధవిషయాలు అని చెప్పడం ద్వారా ఆశ్చర్యానికి విభావాలను కూర్చడం జరిగింది. అందుచేత ఈ శబ్దాలు (తదిదమంశాలే) ఇక్కడ ప్రాణంవంటివి అని అర్థం.

ఏతచ్చేతి-ఇది ఈ ఘట్టంలో వ్యంజకాలుగా చెప్పినవి రెండు కలిసి వ్యంజింపచేయడం మూడు కలిసి వ్యంజింపచేయడం ఇత్యాదులకు ఉపలక్షణం. అందుచేత ఇటుకలను పరిచిన పద్ధతిలో అనంతమైన వైచిత్ర్యం చెప్పబడింది. అందుచేతనే "అన్యేఽపి వ్యఞ్జకవిశేషాః" అని చెప్పనున్నాడు. ఇంకా ఇంకా చెప్పుకుంటూ పోతూన్నకొలదీ విక్షేపం కలిగి శిష్యుల బుద్ధికి ఏకాగ్రత ఉండదు అనే అభిప్రాయంచేత సంక్షేపిస్తున్నాడు

- ఏతచ్చేతి. అయితే విస్తరించి చెప్పడంలో ఉన్న ప్రయోజనాన్ని స్మరింపచేస్తున్నాడు - వైచిత్ర్యేణేతి.

## ధ్వన్యాలోకం

నను చార్థసామర్థ్యాక్షేప్యా రసాదయ ఇత్యుక్తమ్? తథా చ సుబాదీనాం వ్యంజకత్వవైచిత్ర్యకథనమ్ అనన్వితమేవ. ఉక్తమత్ర పదానాం వ్యఞ్జకత్వోక్త్యవసరే. కిం చ అర్థవిశేషాక్షేప్యత్వేఽపి రసాదీనాం తేషామర్థవిశేషాణాం వ్యఞ్జకశబ్దావినాభావిత్వాత్ యథా ప్రదర్శితం వ్యఞ్జకస్వరూపపరిజ్ఞానం విభజ్య ఉపయుజ్యతే ఏవ. శబ్దవిశేషాణాం చాన్యత్ర చ చారుత్వం యద్విభాగేనోపదర్శితం తదపి తేషాం వ్యఞ్జకత్వేనైవావస్థితమిత్యవగన్తవ్యమ్.

### బాలానందిని

నన్వితి:- (ఆశంక) రసాదులు అర్థసామర్థ్యంచేత ఆక్షేపించబడతాయి అని చెప్పబడింది కదా? అలాంటప్పుడు సుబాదులకు వ్యంజకత్వంలో ఒక వైచిత్ర్యం ఉంది అని చెప్పడం అసంగతమే కదా? ఉక్తమితి:- (సమాధానం). ఈ విషయాన్ని గూర్చి పదాలు వ్యంజకాలు అని చెప్పిన సందర్భంలో (సమాధానం) చెప్పబడే ఉంది. మరొక విషయం ఏమనగా - రసాదులు అర్థవిశేషంచేత ఆక్షేపించబడినా కూడ ఆ అర్థవిశేషాలు వ్యంజకాలైన శబ్దాలతో అవినాభావం కలవై ఉండడంవల్ల (ఆ అర్థవిశేషాలు బోధించడానికి శబ్దాలు తప్పకుండా ఉండాలి గాన) పైన చూపిన విధంగా ఎక్కడి కక్కడికి విభజించి (విడగొట్టి) వ్యంజకాల స్వరూపంయొక్క పరిజ్ఞానం తప్పక ఉపయోగిస్తుంది. ఇతరగ్రంథంలో (భామహవివరణంలో) కొన్ని శబ్దాలకు ఉన్న సౌందర్యం వేరు వేరుగా చూపబడిం దంటే అది కూడా ఆ శబ్దాల కున్న వ్యంజకత్వం మీదనే ఆధారపడి ఉందని గ్రహించాలి.

### లోచనం

నన్వితి - పూర్వనిర్ణీతమప్యేతత్ అవిస్మరణార్థమ్, అధికాభిధానార్థం చ . ఆక్షిప్తమ్. ఉక్తమత్రేతి. న వాచకత్వం ధ్వనివ్యవహారోపయోగి యేన అవాచకస్య వ్యఞ్జకత్వం న స్యాత్ ఇతి ప్రాగేవోక్తమ్. న తు న

గీతాదివద్రసాభివ్యఞ్జకత్వేఽపి శబ్దస్య తత్ర వ్యాపారోఽస్త్యేవ; స చ వ్యఞ్జనాత్మైవేతి భావః. ఏతచ్చాస్మాభిః ప్రథమోద్యోతే నిర్ణీతచరమ్. న చేదమస్మాభిరపూర్వముక్తమిత్యాహ - శబ్దవిశేషాణాం చేతి. అన్యత్రేతి. భామహవివరణే. విభాగేనేతి:- స్రక్చన్దనాదయః శబ్దాః శృఙ్గారే చారవః, బీభత్సే త్వచారవ ఇతి రసకృత ఏవ విభాగః. రసం ప్రతి చ శబ్దస్య వ్యఞ్జకత్వమేవేత్యుక్తం ప్రాక్.

బాలానందిని

నన్వితి. ఈ విషయం పూర్వం నిర్ణయించబడినా కూడ, మరిచిపోకుండా ఉండడంకోసం, ఇంకా కొంత అధికమైన విషయం చెప్పడంకోసమూ ఈ ఆక్షేపం లేవదీయబడింది. ఉక్తమత్రేతి. ధ్వని అనే వ్యవహారానికి ఉపయోగించేది వాచకత్వం కాదు; అలా చెప్పిన పక్షంలో వాచకం కానిది వ్యంజకం కాదు అని అనడానికి వీలుండేది అని వెనుకనే చెప్పబడింది. రసాన్ని అభివ్యంజింపచేయడంలో, గీతాదులకు వలె, శబ్దానికి వ్యాపారం లేదనే మాట లేదు. (తప్పకుండా ఉంది). ఆ వ్యాపారం వ్యంజనా రూపమే, (వాచకత్వం కాదు) అని భావం. ఈ విషయం మాచేత ప్రథమోద్యోతంలో పూర్వమే నిర్ణయించబడింది. నేతి. ఈ విషయం మేం కొత్తగా చెప్పిన దేమీ కాదు అని శబ్దవిశేషాణాం చేత్యాదికంచేత చెపుతున్నాడు. అన్యత్ర ఇతి. భామహవివరణంలో (ఇది భామహుని కావ్యాలంకారానికి ఉద్భటుడు రచించిన వ్యాఖ్య. నాలుగైదు ఖండితపత్రాలు మాత్రమే ఆ మధ్య కొందరికి లభించాయి). విభాగేనేతి. స్రక్చందనాదిశబ్దాలు శృంగారరసంలో అందంగా ఉంటాయి, బీభత్సంలో అయితే అందంగా ఉండవు అనే ఈ విభాగం రసాన్ని పట్టి చేసినదే (ఈ విభాగం భామహవివరణంలో ఉండి ఉంటుంది). రసాన్ని గూర్చి శబ్దానికి వ్యంజకత్వమే (వాచకత్వం కాదు) అని వెనకనే చెప్పబడింది.

## ధ్వన్యాలోకం

యత్రాపి తత్సంప్రతి న ప్రతిభాసతే తత్రాపి వ్యఞ్జకే రచనాన్తరే యద్దృష్టం సౌష్ఠవం తేషాం ప్రవాహపతితానాం తదేవ అభ్యాసాత్ అపోద్ధృతానామపి అవభాసతే ఇతి అవసాతవ్యమ్. కోఽన్యథా తుల్యే వాచకత్వే శబ్దానాం చారుత్వవిషయః విశేషః స్యాత్? అన్య ఏవాసౌ

సహృదయసంవేద్య ఇతి చేత్? కిమిదం సహృదయత్వం నామ? కిం రసభావానపేక్షకావ్యాశ్రితసమయవిశేషాభిజ్ఞత్వమ్, ఉత రస భావాదిమయకావ్యస్వరూపపరిజ్ఞాన నైపుణ్యమ్? పూర్వస్మిన్ పక్షే తథావిధసహృదయవ్యవస్థాపితానాం శబ్దవిశేషాణాం చారుత్వనియమో న స్యాత్ - పునః సమయాన్తరేణాన్యథాపి వ్యవస్థాపనసంభవాత్. ద్వితీయస్మింస్తు పక్షే రసజ్ఞతైవ సహృదయత్వమితి. తథావిధైః సహృదయైః సంవేద్యః రసాదిసమర్పణసామర్థ్యమేవ నైసర్గికం శబ్దానాం విశేష ఇతి వ్యఞ్జకత్వాశ్రయ్యేవ తేషాం ముఖ్యం చారుత్వమ్. వాచకత్వాశ్రయాణాం తు ప్రసాద ఏవార్థాపేక్షాయాం తేషాం విశేషః. అర్థానపేక్షాయాం తు అనుప్రాసాదిరేవ.

బాలానందిని

యత్రాపీతి:- ఆ శబ్దాలకి ఇప్పుడు ఎక్కడైనా రసవ్యంజకత్వం భాసించకపోయినా, రసవ్యంజకం అయిన ఇతరరచనలో ఆ శబ్దాల కున్న ఏ సౌష్ఠవం చూడబడిందో ఆ సౌష్ఠవమే, ఆ ప్రవాహంలో పడిన (రసద్యోతకాలుగా కొన్ని చోట్ల చూడబడిన) ఆ శబ్దాలను వేరు చేసినా కూడ (అపోద్ధృతానామ్) వాటిలో కనబడుతుంది అని నిర్ణయించాలి. అలా కాకపోతే శబ్దాలన్నింటికీ వాచకత్వం తుల్యమే అయినప్పుడు చారుత్వవిషయంలో ఏమి విశేషం ఉంటుంది?

వివరణ:- ఏ శబ్దాలు రసవ్యంజకాలు అని అంటున్నామో అవి కొన్ని వాక్యాలలో రసవ్యంజకాలు కాకపోవచ్చు. అయినా కూడ కొన్ని చోట్ల అవి రసవ్యంజకాలు అయి ఉండడం చూచి ఉన్నాం కాబట్టి అలాంటి పదాలన్నింటిని ఏరి ఇవన్నీ రసవ్యంజకాలు అని నిర్ణయించుకోవాలి. ఇలా చేయకపోతే అన్ని శబ్దాలూ వాచకాలే అయి ఉన్నప్పుడు ఈ శబ్దాలలో చారుత్వం ఉంది, వీటిలో లేదు అని నిర్ణయించడానికి ఏమి విశేషం చూపకలుగుతాం అని భావం.

అన్య ఇతి :- (ఆశంక) ఈ విశేషమే వేరు. దీనిని సహృదయులు మాత్రమే గ్రహించకలుగుతారు అని అంటారా - (సమాధానం) ఏమి టీ సహృదయత్వం అంటే? రసభావాలతో పని లేని, కావ్యగతనియమవిశేషాలను (కావ్యాలలో ఉండే కొన్ని

పద్ధతులను) తెలిసికొని ఉండడమా లేక రసభావాదిమయమైన కావ్యం స్వరూపాన్ని గుర్తించగలిగిన నేర్పా? మొదటి పక్షంలో అలాంటి సహృదయులు నిర్ణయించిన శబ్దవిశేషాలు తప్పకుండా సుందరంగా ఉంటాయి అని చెప్పడం కుదరదు. ఎందువల్ల ననగా మళ్లీ కొన్ని పద్ధతులు, కట్టుబాట్లు (సమయాన్తరేణ) అవలంబించి మరొక విధంగా కూడ నిర్ణయించడానికి అవకాశం ఉండవచ్చు. రెండవ పక్షంలో సహృదయత్వం అంటే రసజ్ఞత్వమే అని చెప్పిన ట్లవుతుంది. శబ్దాలలో సహజంగా ఉండే రసాదిసమర్పణ సామర్థ్యమే అలాంటి సహృదయులచేత తెలియదగిన, వాటిలో ఉన్న విశేషం; అది వ్యంజకత్వాన్నే ఆశ్రయించి ఉంటుంది; అందుచేత ముఖ్యమైన చారుత్వం అలాంటి శబ్దాలకే. వాచకత్వాన్ని ఆశ్రయించిన శబ్దాలకైతే, అర్థం బోధించడం విషయంలో (వాటికి) కావలసిన విశేషం ప్రసాదమే. వాటికి అర్థాపేక్ష లేని పక్షంలో అనుప్రాసాద్యలంకారాలే అవుతాయి.

వివరణ:- ఏ శబ్దాలు వ్యంజనావ్యాపారం కలవై రసాదులను సమర్పించడానికి సమర్థములై ఉంటాయో వాటిలోనే ముఖ్యమైన చారుత్వం ఉంటుంది. ఆ విధమైన రసాదిసమర్పణసామర్థ్యమే ఆ శబ్దాలలో విశేషం. కేవలం వాచకత్వం మాత్రమే ఉన్న శబ్దాలలో ఉండే విశేషం ప్రసాదం. అప్పు డవి వాచ్యార్థాన్ని సుగ్రాహ్యంగా బోధించకలుగుతాయి. అర్థం అవసరమే లేకపోతే అక్కడ శబ్దాలంకారాలే అని భావం.

లోచనం

యత్రాపీతి:- ప్రచ్ఛన్నాదిశబ్దానాం తదానీం శృఙ్గారాదివ్యఞ్జకత్వాభావేఽపి వ్యఞ్జకత్వశక్తే ర్భూయసా దర్శనాత్ తదధివాససున్దరీభూతమర్థం ప్రతిపాదయితుం సామర్థ్యమస్తి. తథాహి - 'తటీ తారం తామ్యతి' ఇత్యత్ర తటశబ్దస్య పుంస్త్వనపుంసకత్వే అనాదృత్య స్త్రీత్వమేవాశ్రితం సహృదయైః "స్త్రీతి నామాపి మధురమ్" ఇతి కృత్వా. యథా వా అస్మదుపాధ్యాయస్య విద్వత్కవిసహృదయచక్రవర్తినః భట్టేన్దురాజస్య -

శ్లో. ఇన్దీవరద్యుతి యదా బిభృయాన్న లక్ష్మ
స్యుర్విస్మయైకసుహృదోఽస్య యదా విలాసాః,
స్యాన్నామ పుణ్యపరిణామవశాత్తథాపి
కిం కిం కపోలతలకోమలకాన్తిరిన్దుః.

అత్ర హి - ఇన్దీవరలక్ష్మవిస్మయసుహృద్విలాసనామపరిణామ కోమలాదయః శబ్దాః శృఙ్గారాభివ్యఞ్జనదృష్టశక్తయః అత్ర పరం సౌన్దర్యమావహన్తి. అవశ్యం చైతదభ్యుపగన్తవ్యమిత్యాహ - కోఽన్యథేతి. అసంవేద్యస్తావదసౌ న యుక్త ఇత్యాశయేనాహ - సహృదయేతి. పునరితి :- అనియన్త్రితపురుషేచ్ఛాయత్తో హి సమయః కథం నియతః స్యాత్? ముఖ్యం చారుత్వమితి. విశేష ఇతి పూర్వేణ సంబన్ధః. అర్థాపేక్షాయామితి. వాచ్యాపేక్షాయామిత్యర్థః. అనుప్రాసాదిరేవేతి. శబ్దాన్తరేణ సహ యా రచనా తదపేక్షోఽసౌ విశేష ఇత్యర్థః. ఆదిగ్రహణాత్ శబ్దగుణాలంకారాణాం సంగ్రహః, అత ఏవ రచనయా ప్రసాదేన చారుత్వేన చోపబృంహితా ఏవ శబ్దాః కావ్యే యోజ్యా ఇతి తాత్పర్యమ్. 15, 16.

బాలానందిని

యత్రాపీతి - అప్పుడు (ఆ వాక్యంలో) స్రక్చందనాదిశబ్దాలు శృంగారాది వ్యంజకాలు కాకపోయినా వీటికి అలాంటి వ్యంజకత్వశక్తి ఉన్నట్లు చాలా చోట్ల చూచి ఉండడంవల్ల ఆ శృంగారాదుల సుగంధం అంటుకొని ఉండడంచేత సుందరమైన అర్థాన్ని ప్రతిపాదించడానికి సామర్థ్యం ఉంది. అది ఎట్లనగా - 'తటీ తారం తామ్యతి' (తీరం అధికంగా సంతాపం చెందుతున్నది) అనే చోట తటశబ్దానికి పుంలింగనపుంసక లింగాలు కూడా ఉన్నా వాటిని ఆదరించక "స్త్రీ అనే పేరు కూడ మధురమే" అవడంచేత సహృదయులు స్త్రీలింగమే ఆశ్రయించారు. విద్వత్కవిసహృదయచక్రవర్తి అయిన మా ఉపాధ్యాయుడు భట్టేందురాజు శ్లోకం మరొక ఉదాహరణగా ఎట్లనగా ఇన్దీవరద్యుతీతి: యదా= ఎప్పుడు, ఇన్దీవరద్యుతి= నల్లకలువ కాంతి వంటి కాంతి గల, లక్ష్మ= కలంకాన్ని, న బిభృయాత్= ధరించడో, యదా= ఎప్పుడు, అస్య విలాసాః= వీని విలాసాలు, విస్మయైకసుహృదః= ఆశ్చర్యానికి లేదా వికాసానికి ఏకైక మిత్రులుగా, స్యుః= అగునో, తథాపి= అట్టైనా కూడ, ఇన్దుః= చంద్రుడు, పుణ్యపరిపాకవశాత్= పుణ్యపరిపాకంవల్ల, పుణ్యం పంచడంవల్ల, కపోలతలకోమలకాన్తిః= చెక్కిలివంటి కోమలమైన కాంతి గలవాడు, స్యాన్నామ కిం కిమ్ = అవుతాడా!

అత్రేతి. ఇక్కడ ఇన్దీవర-లక్ష్మ-విస్మయసుహృద్-విలాస-నామ-పరిణామ - కోమలాది శబ్దాలు శృంగారరసాన్ని వ్యంజింపచేయడంలో (పూర్వం) చూడబడిన శక్తి

గలవి. అవి ఇక్కడ అధికమైన సౌందర్యాన్ని కలిగిస్తున్నాయి. ఈ విషయం తప్పక అంగీకరించాలి అని కోఽన్యథా ఇత్యాదికంచేత చెపుతున్నాడు. అయితే ఇది తెలియబడనిది, గుర్తింపరానిది మాత్రం కాదు అనే అభిప్రాయంతో చెపుతున్నాడు-సహృదయేతి. పునరితి:- సమయం అనేది (ఇది ఇలా ఉండాలి అని చేసుకునే నిర్ణయం) అనియంత్రితం అయిన, ఎలాంటి నియంత్రణా లేని, పురుషేచ్ఛమీద ఆధారపడి ఉంటుంది; అది నిశ్చితరూపంలో ఎలా ఉంటుంది? ఈ రోజున చేసిన ఒక సమయాన్ని రేపు మరొకరు మార్చివేయవచ్చు కదా అని భావం. ముఖ్యం చారుత్వమితి:- దీనికి విశేషః అనే వెనక ఉన్న పదంతో అన్వయం. అర్థాపేక్షాయామితి. వాచ్యార్థాపేక్షయందు అని అర్థం. **అనుప్రాసాదిరేవ ఇతి.** ఈ విశేషం శబ్దాంతరంతో ఉన్న రచనను అపేక్షిస్తుంది అని అర్థం. (అనుప్రాసాదికం కొన్ని శబ్దాల కూర్పువల్లనే కలుగుతుంది కదా?) అందువల్ల రచనతోను, ప్రసాదంతోను, చారుత్వంతోను పరిపుష్టాలైన శబ్దాలే కావ్యంలో కూర్చదగినవి అని తాత్పర్యం. 15, 16.

## ధ్వన్యాలోకం

ఏవం రసాదీనాం వ్యఞ్జకస్వరూపమభిధాయ తేషామేవ విరోధిరూపం లక్షయితుమిదముపక్రమ్యతే -

కా. ప్రబన్ధే ముక్తకే వాపి రసాదీన్బన్ధుమిచ్ఛతా,
యత్నః కార్యః సుమతినా పరిహారే విరోధినామ్. 17

ప్రబన్ధే ముక్తకే వాపి రసభావనిబన్ధనం ప్రత్యాదృతమనాః కవిర్విరోధిపరిహారే పరం యత్నమాదధీత. అన్యథా త్వస్య రసమయః శ్లోకః ఏకోఽపి న సంపద్యతే.

### బాలానందిని

ఈ విధంగా రసాదులను వ్యంజింపచేసేవాటి స్వరూపం చెప్పి ఆ రసాదుల విరోధిరూపాన్ని గుర్తించడానికి ఇది ఉపక్రమించబడుతున్నది:-

ప్రబన్ధే ఇతి:- ప్రబన్ధే= ప్రబంధంలో కాని, ముక్తకే వాపి= ముక్తకంలో గాని, రసాదీన్= రసాదులను, బన్ధుమ్= కూర్చుటకు, ఇచ్ఛతా= కోరుచున్న, సుమతినా= మంచి బుద్ధికలవానిచేత, విరోధినామ్= విరోధులయొక్క, పరిహారే= పరిహారమునందు, యత్నః= ప్రయత్నం, కార్యః= చేయదగినది.

ప్రబన్ధే ఇతి:- ప్రబంధంలో నైనా, ముక్తకంలో నైనా రసభావాల కూర్పును గూర్చి ఆదరంతో కూడిన మనస్సు గల కవి విరోధులను పరిహరించడంలో ప్రయత్నం చెయ్యాలి. అట్లు కాక పోతే ఈతని శ్లోకం ఒక్కటి కూడా బాగా రసమయం కాజాలదు.

లోచనం

రసాదీనాం యద్ వ్యఞ్జకం వర్ణపదాదిప్రబన్ధాన్తం తస్య స్వరూపమభిధాయేతి సంబన్ధః. ఉపక్రమ్యత ఇతి:- విరోధినామపి లక్షణకరణే ప్రయోజనముచ్యతే శక్యహానత్వం నామ అనయా కారికయా; లక్షణం తు విరోధిరససంబన్ధీత్యాదినా భవిష్యతీత్యర్థః. 17

బాలానందిని

రసాదీనామితి - వర్ణపదాదులు మొదలు ప్రబంధం వరకు రసాదివ్యంజక మైనది ఏది ఉన్నదో దాని స్వరూపం చెప్పి అని సంబంధం. ఉపక్రమ్యతే ఇతి. విరోధుల లక్షణం కూడా చెప్పడానికి ప్రయోజనం ఏమనగా - వాటిని పరిహరించడానికి శక్యం అవడమే అని ఈ కారికలో చెప్పబడుతున్నది. విరోధిరసలక్షణమైతే "విరోధిరససంబన్ధి" ఇత్యాదికారికలలో చెప్పబడగలదు అని అర్థం.

## ధ్వన్యాలోకం

కాని పునస్తాని విరోధీని యాని యత్నతః కవేః పరిహర్తవ్యానీత్యుచ్యతే -

కా. విరోధిరససంబన్ధివిభావాదిపరిగ్రహః,
విస్తరేణాన్వితస్యాపి వస్తునోఽన్యస్య వర్ణనమ్. 18
అకాణ్డ ఏవ విచ్ఛిత్తిరకాణ్డే చ ప్రకాశనమ్,
పరిపోషం గతస్యాపి పౌనఃపున్యేన దీపనమ్,
రసస్య స్యాద్విరోధాయ వృత్త్యనౌచిత్యమేవ చ. 19

బాలానందిని

కానీతి. కవి ప్రయత్నపూర్వకంగా పరిహరించవలసిన ఆ విరోధులు ఏవి అనగా చెపుతున్నాడు - విరోధీతి - విరోధిరససంబన్ధివిభావాదిపరిగ్రహః= విరోధిరసాలకి సంబంధించిన విభావాదులను పరిగ్రహించడం, అన్వితస్యాపి= ప్రధానకథతో సంబంధం

ఉన్నదైనా, అన్యస్య వస్తునః= మరియొక వస్తువుయొక్క, విస్తరేణ వర్ణనమ్= విస్తృతంగా (అధికంగా) వర్ణించడం, అకాణ్డే ఏవ= సమయం కాని సమయంలో, హటాత్తుగా, విచ్ఛిత్తిః= రసాన్ని విచ్ఛిన్నం చేయడం, అకాణ్డే= అసమయంలో, ప్రకాశనమ్= ప్రకాశింపచేయడం, పరిపోషమ్= పరిపోషణను, గతస్యాపి= పొందినదానికి (ని) కూడ, పౌనఃపున్యేన= మాటి మాటికి, దీపనమ్= ప్రజ్వలింపచేయడం, రగుల్కొల్పడం, వృత్త్యనౌచిత్యమేవ= వృత్తుల, వ్యవహారాల, అనౌచిత్యమూ, రసస్య= రసంయొక్క విరోధాయ= విరోధంకొరకు, స్యాత్= అగును.

లోచనం

నను "విభావభావానుభావసంచార్యౌచిత్యచారుణః" ఇతి యదుక్తం తత ఏవ వ్యతిరేకముఖేన ఏతదప్యవగంస్యతే? మైవమ్; వ్యతిరేకేణ హి తదభావమాత్రం ప్రతీయతే, నతు తద్విరుద్ధమ్. తదభావమాత్రం చ న తథా దూషకం యథా తద్విరుద్ధమ్. పథ్యానుపయోగో హి న తథా వ్యాధిం జనయతి యద్వదపథ్యోపయోగః. తదాహ - యత్నత ఇతి. విభావేత్యాదినా శ్లోకేన యదుక్తం తద్విరుద్ధం విరోధీత్యాదినా అర్ధశ్లోకేనాహ. ఇతివృత్తేత్యాదినా శ్లోకద్వయేన యదుక్తం తద్విరుద్ధం విస్తరేణేత్యర్ధశ్లోకేనాహ. ఉద్దీపనేత్యర్ధశ్లోకస్య విరుద్ధం అకాణ్డ ఇత్యర్ధశ్లోకేన. రసస్యేత్యర్ధశ్లోకోక్తస్య విరుద్ధం పరిపోషం గతస్యేత్యర్ధశ్లోకేన. అలంకృతీనామిత్యనేన యదుక్తం తద్విరుద్ధమ్, అన్యదపి చ విరుద్ధం వృత్త్యనౌచిత్యమిత్యనేన.

బాలానందిని

నన్వితి '(ఆశంక) 'విభావభావ' ఇత్యాది (కా.10-14) కారికలలో ఏదైతే చెప్పబడిందో దానికి వ్యతిరేకముఖేన చూచుకుంటే ఇది తెలుస్తుంది కదా? అనగా రసవ్యంజన విషయంలో ఏ జాగ్రత్తలు తీసికోవాలో ఆ కారికలలో చెప్పబడింది. అందుకు వ్యతిరేకంగా ఉండకూడదు అనే విషయం తెలుస్తూనే ఉన్నది కదా. మళ్లీ విరోధిలక్షణాలని గూర్చి చెప్పడం ఎందుకు అని ప్రశ్న. మైవమితి - (సమాధానం) అలా కాదు. వ్యతిరేకంచేత అవి (ఉండవలసిన లక్షణాలు) లేకపోవడం అనేది మాత్రమే తెలుస్తుంది కాని దానికి ఏది విరుద్ధమో తెలియదు. దానికి విరుద్ధమైనది ఏ విధంగా దూషకమో తదభావమాత్రం (కేవలం ఉండవలసిన లక్షణం లేకపోవడం) అంత దూషకం కాదు. అపథ్యవస్తువుల

ప్రయోగం ఎలా వ్యాధిని కలిగిస్తుందో పథ్యవస్తువులను సేవించకపోవడం అంతగా గించదు. ఆ విషయమే యత్నతః ఇత్యాదికంచేత చెపుతున్నాడు. 'విభావ' ఇత్యాది ంచేత (కా.10) చెప్పబడినదానికి విరుద్ధమైనదానిని 'విరోధి' ఇత్యాది అర్ధశ్లోకంలో 18) చెపుతున్నాడు. "ఇతివృత్త" ఇత్యాదిశ్లోకద్వయంచేత (కా. 11,12) చెప్పబడినదానికి ద్ధమైనదానిని 'విస్తరేణ' అనే అర్ధశ్లోకంలో (18, 1/2) చెపుతున్నాడు. "ఉద్దీపన" త్యాద్యర్ధశ్లోకంలో (1/2, 13) చెప్పబడినదానికి విరుద్ధమైనదానిని 'అకాణ్డే' ఇత్యా ర్ధశ్లోకంలో(1/2,19)చెపుతున్నాడు. 'రసస్య'ఇత్యాద్యర్ధశ్లోకం(1/2,1ఈ)లో చెప్పినదానికి రుద్ధమైనదానిని 'పరిపోషంగతస్య' ఇత్యాద్యర్ధశ్లోకం (1/2, 19) లో చెపుతున్నాడు. లంకృతీనామ్' ఇత్యాది శ్లోకంలో (కా. 14) చెప్పినదానికి విరుద్ధమైనదానినీ, రవిరుద్ధవిషయాన్నీ 'వృత్త్యనౌచిత్యమ్' (కా. 19) అనే మాటలో చెపుతున్నాడు.

## ధ్వన్యాలోకం

ప్రకృతరసాపేక్షయా విరోధీ యో రసః తస్య సమ్బన్ధినాం భావభావానుభావానాం పరిగ్రహో రసవిరోధహేతుకః సమ్భావనీయః. త్ర విరోధిరసవిభావపరిగ్రహో యథా - శాన్తరసవిభావేషు ద్విభావతయైవ నిరూపితేషు అనన్తరమేవ శృఙ్గారాదివిభావవర్ణనే. రోధిరసభావపరిగ్రహో యథా- ప్రియం ప్రతి ప్రణయకలహకుపితాసు మినీషు వైరాగ్యకథాభిరనునయే. విరోధిరసానుభావపరిగ్రహో యథా ప్రణయకుపితాయాం ప్రియాయాం అప్రసీదన్త్యాం నాయకస్య పావేశవివశస్య రౌద్రానుభావవర్ణనే.

### బాలానందిని

ప్రస్తుతేతి - ప్రస్తుతమైన రసం దృష్ట్యా విరోధియైన ఏ రసం ఉంటుందో దానికి ంబంధించిన విభావ-భావ-అనుభావాలను స్వీకరించడం (కూర్చడం) రసవిరోధానికి తువుగా తెలియదగింది. వాటిలో విరోధిరసంయొక్క విభావాలను పరిగ్రహించడం ట్లనగా - శాంతరసవిభావాలు ఆ శాంతరసానికి సంబంధించిన విభావాలుగానే రూపించబడిన తరవాత వెంటనే శృంగారరసవిభావాలను వర్ణించినప్పుడు విరోధిరసానికి ంబంధించిన వ్యభిచారిభావాల పరిగ్రహం ఎట్లనగా - కామినులు ప్రియుని విషయంలో

ప్రణయకలహంచేత కోపంతో ఉన్నప్పుడు వైరాగ్యానికి సంబంధించిన విషయాలు చెప్పి బ్రతిమాలుకొనడంలో విరోధియైన రసానికి చెందిన అనుభావాల పరిగ్రహం ఎట్లనగా - ప్రణయకుపిత అయిన ప్రియురాలు ప్రసన్నురాలు కానప్పుడు కోపావేశవివశుడైన నాయకుని రౌద్రానికి సంబందించిన అనుభావాలను వర్ణించడంలో

లోచనం

ఏతత్ క్రమేణ వ్యాచష్టే-ప్రస్తుతరసాపేక్షయేత్యాదినా. హాస్యశృఙ్గారయోః, వీరాద్భుతయోః, రౌద్రకరుణయోః, భయానకబీభత్సయోః (శాన్తబీభత్సయోః) న విభావవిరోధ ఇత్యభిప్రాయేణ శాన్తశృఙ్గారావుపన్యస్తౌ; ప్రశమ రాగయోర్విరోధాత్. విరోధినో రసస్య యో భావః వ్యభిచారీ తస్య పరిగ్రహః. విరోధినస్తు యః స్థాయీ, స్థాయితయా తత్పరిగ్రహః అసంభావనీయ ఏవ, తదనుత్థానప్రసంగాత్. వ్యభిచారితయా తు పరిగ్రహః భవత్యేవ. అత ఏవ సామాన్యేన భావగ్రహణమ్. వైరాగ్యకథాభిరితి:- వైరాగ్యశబ్దేన నిర్వేదః శాన్తస్య యః స్థాయీ స ఉక్తః. యథా - "ప్రసాదే వర్తస్వ ప్రకటయ ముదం సంత్యజ రుషమ్" ఇత్యాద్యుపక్రమ్య అర్థాన్తరన్యాసః "న ముగ్ధే ప్రత్యేతుం ప్రభవతి గతః కాలహరిణః" ఇతి. మనాగపి నిర్వేదానుప్రవేశే సతి రతేః విచ్ఛేదః. జ్ఞాతవిషయసతత్త్వో హి జీవితసర్వస్వాభిమానం కథం భజేత? న హి జ్ఞాతశుక్తికారజతతత్త్వః తదుపాదేయధియం భజతే ఋతే సంవీతిమాత్రాత్. కథాభిః ఇతి బహువచనం శాన్తరసస్య వ్యభిచారిణః ధృతిమతిప్రభృతీన్ సంగృహ్ణాతి.

బాలానందిని

దీనిని క్రమంగా ప్రస్తుతరసాపేక్షయా ఇత్యాదికంతో వ్యాఖ్యానిస్తున్నాడు. హాస్య - శృంగారాలు, వీర-అద్భుతాలు, రౌద్ర-కరుణలు, భయానక-బీభత్సాలు (శాంత-బీభత్సాలు) వీటిలో విభావాలకి విరోధం ఉండదు; అనగా ఒకదాని విభావం మరొకదానికి కూడా విభావం కావచ్చు, అనే అభిప్రాయంచేత శాంత-శృంగారాలు పేర్కొనబడ్డాయి. ప్రశమానికీ రాగానికీ విరోధం కదా? విరోధియైన రసంయొక్క ఏ భావం, వ్యభిచారిభావం, ఉన్నదో దానిని స్వీకరించడం అని అర్థం. అంతే కాని విరోధిరసం యొక్క స్థాయిని స్వీకరించడం అని కాదు. ఎందుచేత ననగా దానిని స్థాయిభావంగా గ్రహించడం

సంభావ్యం (ఊహించశక్యం) కాదు. ఆ స్థాయిభావం లేచే ప్రసంగమే లేదు కదా? అనగా ఆ స్థాయిబావం లేస్తే ప్రకృతస్థాయి పూర్తిగా మరుగున పడి పోతుంది అని అర్థం. అయితే విరోధిరసస్థాయిని స్థాయిగా కాకుండా వ్యభిచారిభావంగా గ్రహించడం కుదురుతుంది. అందువల్లనే సామాన్యరూపేణ 'భావ' పదం ప్రయోగించడం జరిగింది.

వివరణ:- ముప్పైమూడు వ్యభిచారిభావాలు చెప్పబడ్డాయి. అయితే తొమ్మిది స్థాయిభావాలు కూడా పరిపుష్టాలు కానప్పుడు వ్యభిచారిభావాలు కావచ్చును అని సిద్ధాంతం. ఇక్కడ వృత్తిలో 'విభావవ్యభిచారిభావానుభావానామ్' అనకుండా 'విభావభావ' అనడంచేత ఆ ముప్పైమూడు ప్రసిద్ధవ్యభిచారిభావాలే కాకుండా ఈ స్థాయిత్వానాపన్న రత్యాదిభావాలను కూడా గ్రహించడానికి వీలవుతున్నది అని భావం.

వైరాగ్యకథాభిః అని వైరాగ్యశబ్దంచేత శాంతస్థాయి అయిన ఏ నిర్వేదం ఉన్నదో అది గ్రహించబడుతుంది. ఉదాహరణకి.- 'ప్రసాదే వర్తస్వ' ఇత్యాదికంతో ప్రారంభించి "న ముగ్ధే" ఇత్యాద్యర్థాంతరన్యాసం. పూర్తిశ్లోకం ఇది -

శ్లో. ప్రసాదే వర్తస్వ ప్రకటయ ముదం సంత్యజ రుషం
ప్రియే శుష్యన్త్యఙ్గాన్యమృతమివ తే సిఞ్చతు వచః,
నిధానం సౌఖ్యానాం క్షణమభిముఖం స్థాపయ ముఖం
న ముగ్ధే ప్రత్యేతుం ప్రభవతి గతః కాలహరిణః.

ప్రసాదే ఇతి - ప్రణయకోపంతో ఉన్న నాయికతో నాయకుడు అంటూన్న మాటలు, ప్రియే= ఓ! ప్రియురాలా! ప్రసాదే= ప్రసాదమునందు, వర్తస్వ= ఉండుము, అనుగ్రహించుము. ముదమ్= సంతోషమును, ప్రకటయ= ప్రకటించుము, రుషమ్= రోషమును, సంత్యజ= విడువుము. తే = నీయొక్క, అమృతమివ= అమృతం వంటి, వచః= వచనము, శుష్యన్తి= ఎండిపోతూన్న, అఙ్గాని= నా అవయవాలను, సిఞ్చతు= తడుపుగాక. సౌఖ్యానామ్= సౌఖ్యాలకు, నిధానమ్= నిధి అయిన, ముఖమ్= ముఖమును, క్షణమ్= క్షణకాలంపాటు, అభిముఖమ్= అభిముఖమైన దానినిగా, స్థాపయ= ఉంచుము, ముగ్ధే= తెలివితక్కువదానా! గతః= వెళ్లిపోయిన, కాలహరిణః= కాలం అనే లేడి, ప్రత్యేతుమ్= తిరిగి వచ్చుటకు, న ప్రభవతి= సమర్థం కాదు.

మనాగపీతి :- ఏ కొంచెమైనా నిర్వేదం ప్రవేశించిం దంటే రతి విచ్ఛిన్నం అయి పోతుంది. విషయయథార్థస్వరూపం తెలిసినవాడు "ఈమెయే నా జీవితసర్వస్వం" అనే అభిమానాన్ని ఎలా పొందుతాడు? ముత్యపు చిప్పమీద కనబడిన వెండి తత్త్వాన్ని గ్రహించినవాడు, భ్రాంతిలో ఉన్నప్పుడు తప్ప, అది గ్రహించదగినది అని అనుకొనడు

కదా? కథాభిః అనే బహువచనం శాంతరసానికి వ్యభిచారులైన ధృతి-మత్యాదులను సంగ్రహిస్తుంది.

ధ్వన్యాలోకం

అయం చాన్యో రసభఙ్గహేతుః యత్ ప్రస్తుతరసాపేక్షయా వస్తునోఽన్యస్య కథం చిదన్వితస్యాపి విస్తరేణ కథనమ్. యథా విప్రలమ్భశృఙ్గారే నాయకస్య కస్య చిద్వర్ణయితుముపక్రాన్తే కవేర్యమకాద్యలఙ్కారనిబన్ధనరసికతయా మహతా ప్రబన్ధేన పర్వతాదివర్ణనే.

అయం చాపరో రసభఙ్గహేతురవగన్తవ్యః యదకాణ్డ ఏవ విచ్ఛిత్తిః రసస్య, అకాణ్డ ఏవ చ ప్రకాశనమ్. తత్రానవసరే విరామో రసస్య యథా - నాయకస్య కస్యచిత్ స్పృహణీయసమాగమయా నాయికయా కయా చిత్ పరాం పరిపోషపదవీమ్ ప్రాప్తే శృఙ్గారే, విదితే చ పరస్పరానురాగే సమాగమచిన్తోచితం వ్యవహారముత్సృజ్య స్వతన్త్రతయా వ్యాపారాన్తరవర్ణనే. అనవసరే చ ప్రకాశనం రసస్య యథా - ప్రవృత్తే ప్రవృత్తవివిధవీరసంక్షయే కల్పసంక్షయకల్పే సంగ్రామే రామదేవప్రాయస్యాపి తావన్నాయకస్య అనుపక్రాన్తవిప్రలమ్భశృఙ్గారస్య నిమిత్తముచితమన్తరేణైవ శృఙ్గారకథాయామవతారవర్ణనే. న చైవం విధే విషయే దైవవ్యామోహితత్వం కథాపురుషస్య పరిహారః, యతః రసబన్ధ ఏవ కవేః ప్రాధాన్యేన ప్రవృత్తినిబన్ధనం యుక్తమ్. ఇతివృత్తవర్ణనం తదుపాయ ఏవ ఇత్యుక్తం ప్రాక్ - "ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః" ఇత్యాదినా.

బాలానందిని

అయమితి - రసభంగానికి హేతువైన మరొక విషయం ఏమనగా - ప్రకృతరసాపేక్షచేత (ప్రకృతరసం దృష్ట్యా) వేరైన ఏదైనా ఒక విషయాన్ని, అది ఏదో

విధంగా ప్రకృతకథతో సంబంధం ఉన్నది అయితే కావచ్చును, సవిస్తరంగా వర్ణించడం ఎట్లనగా - ఒక నాయకుని విప్రలంభశృంగారం వర్ణించడానికి ఉపక్రమించినప్పుడు, కవికి యమకాద్యలంకారాలను కూర్చడంలో అభిరుచి ఉండడంచేత ఎంతో ఆడంబరంతో (మహతా ప్రబన్ధేన) పర్వతాదులను వర్ణించడం.

రసాన్ని సమయం కాని సమయంలో విచ్ఛిన్నం చేయడం, సమయం కాని సమయంలో ప్రకాశింపచేయడం - ఇది కూడా మరొక రసభంగహేతువు అని తెలుసుకోవాలి. సమయం కాని సమయంలో (అనవసరే) రసం విరమించడానికి ఉదాహరణం ఎట్లనగా - ఒకానొక నాయకునికి, శ్లాఘ్యమైన సమాగమం గల ఒక నాయిక విషయంలో శృంగారం పరిపుష్టం అయి, పరస్పరానురాగం తెలియబడిన దగుచుండగా సమాగమోపాయచింతకు తగిన వ్యవహారం విడిచిపెట్టి స్వతంత్రంగా (దానితో సంబంధంలేని) మరొక వ్యాపారాన్ని వర్ణించడం.

అనవసరంలో రసాన్ని ప్రకాశింపచేయడం ఎట్లనగా - ఎంతోమంది వీరులు నశిస్తున్న మహాప్రలయంవంటి యుద్ధం ఒక ప్రక్క జరుగుతూండగా, విప్రలంభశృంగారప్రసంగమే లేని మహాధీరోదాత్తుడైన శ్రీరాముని వంటి నాయకుడు కూడ, తగిన కారణం ఏదీ లేకుండానే శృంగారకథలో ప్రవేశించి నట్లు వర్ణించడం. ఇలాంటప్పుడు - కథాపురుషుడు దైవవ్యామోహితు డయ్యాడు అని చెప్పడం కవి అభిప్రాయం అనడం సరియైన పరిహారం (సమాధానం) కాదు. ఎందువలన అనగా- కవి ప్రధానంగా రసాన్ని నిబంధించడంలోనే ప్రవృత్తుడై ఉండడం యుక్తం; కథ చెప్పడం కేవలం దానికి (రసనిబంధనానికి) ఉపాయం మాత్రమే అని "ఆలోకార్థీ...." ఇత్యాదికంలో (కా. 19) వెనక చెప్పబడింది కదా?

లోచనం

నన్వన్యదనున్మత్తః కథం వర్ణయేత్, కిముత విస్తరత ఇత్యాహ - కథం చిదన్వితస్యేతి. వ్యాపారాన్తరేతి. యథా వత్సరాజచరితే చతుర్థేఙ్కే - రత్నావలీనామధేయమప్యగృహ్ణతః విజయవర్మవృత్తాన్తవర్ణనే. అపి తావదితి శబ్దాభ్యాం దుర్యోధనాదేస్తద్వర్ణనం దూరాపాస్తమితి వేణీసంహారే ద్వితీయాఙ్క మేవోదాహరణత్వేన ధ్వనతి. అత ఏవ వక్ష్యతి "దైవవ్యామోహితత్వమ్" ఇతి. పూర్వం తు సంధ్యఙ్గాభిప్రాయేణ ప్రత్యుదాహరణముక్తమ్. కథాపురుషస్యేతి ప్రతినాయకస్యేతి యావత్.

బాలానందిని

నన్వితి - ఉన్మత్తుడు కాని వాడెవడైనా మరొక విషయం వర్ణిస్తాడా? అందులోనూ సవిస్తరంగానా? అని ఆశంకించుకొని కథంచిదన్వితస్య అని చెపుతున్నాడు. వ్యాపారాన్తరేతి - ఉదాహరణకి - వత్సరాజచరితం చతుర్థాంకంలో రత్నావలి పేరు కూడా ఎత్తకుండా విజయవర్మ వృత్తాంతం వర్ణించడం. అపి తావత్ అనే శబ్దాలచేత దుర్యోధనాదులకు సంబంధించిన ఆ శృంగారవర్ణన అసలే అనుచితం అని వేణీసంహారంలోని ద్వితీయాంకాన్నే ఉదాహరణగా ధ్వనింపచేస్తున్నాడు. అందుచేతనే "దైవవ్యామోహితత్వమ్" అని చెప్పనున్నాడు. పూర్వం సంధ్యంగం దృష్ట్యా ఈ ఘట్టం ప్రత్యుదాహరణంగా చూపబడింది. కథాపురుషస్యేతి - ప్రతినాయకునియొక్క అని అర్థం.

వివరణ:- విప్రలంభశృంగారంతో సంబంధం ఉన్నట్లు ప్రసిద్ధుడైన శ్రీరాముణ్ణే యుద్ధఘట్టంలో విప్రలంభశృంగారసంబద్ధుణ్ణిగా వర్ణించకూడదు అని అంటే దుర్యోధనుని మాట చెప్పాలా. అంతవరకు శృంగారస్పర్శే లేని ఘట్టంలో శృంగారాన్ని ప్రవేశపెట్టడం చాల అనుచితం. అందుచేత ఇక్కడ వృత్తికారుడు 'రామదేవప్రాయస్యాపి నాయకస్య' అని అన్నా అతని మనస్సులో ఉన్నది వేణీసంహారద్వితీయాంకంలోని భానుమతీదుర్యోధనుల శృంగారవర్ణనయే. అందుచేతనే "దైవవ్యామోహితత్వం కథాపురుషస్య" అని అన్నాడు. ఇది దుర్యోధనుని విషయంలోనే కుదురుతుంది కాని రాముని విషయంలో కుదరదుకదా అని భావం.

ధ్వన్యాలోకం

అత ఏవ చ ఇతివృత్తమాత్రవర్ణనప్రాధాన్యే అఙ్గాఙ్గిభావ రహితరసభావనిబన్ధనే చ కవీనామేవంవిధాని స్ఖలితాని భవన్తీతి రసాదిరూపవ్యఙ్గ్యతాత్పర్యమేవైషాం యుక్తమితి యత్నః అస్మాభిః ఆరబ్ధః న ధ్వనిప్రతిపాదనమాత్రాభినివేశేన.

పునశ్చాయమన్యః రసభఙ్గహేతురవధారణీయః యత్ పరిపోషం గతస్యాపి రసస్య పౌనఃపున్యేన దీపనమ్. ఉపభుక్తో హి రసః స్వసామగ్రీలబ్ధపరిపోషః పునః పునః పరామృశ్యమానః పరిమ్లానకుసుమకల్పః కల్పతే.

తథా వృత్తేః వ్యవహారస్య యదనౌచిత్యం తదపి రసభఙ్గహేతు రేవ. యథా - నాయకం ప్రతి నాయికాయాః కస్యాశ్చిదుచితాం భఙ్గీమన్తరేణ స్వయం సంభోగాభిలాషకథనే. యది వా వృత్తీనాం భరతప్రసిద్ధానాం కైశిక్యాదీనాం కావ్యాలంకారాన్తర ప్రసిద్ధానాముపనాగరికాద్యానాం వా యదనౌచిత్యమ్ అవిషయే నిబన్ధనం తదపి రసభఙ్గహేతుః. ఏవమేషాం రసవిరోధినామ్ అన్యేషాం చ అనయా దిశా స్వయముత్ప్రేక్షితానాం పరిహారే సత్కవిభిః అవహితైః భవితవ్యమ్.

బాలానందిని

**అత ఏవ ఇతి** :- అందుచేతనే ఇతివృత్తవర్ణనమాత్రానికే ప్రాధాన్యం ఇవ్వడంచేత, అంగాంగిభావం లేని రసభావాదుల్ని నిబంధించడంచేత కవులు ఇలాంటి పొరబాట్లు చేస్తూ ఉంటారు. అందుచేత వీళ్లు రసాదిరూపమైన వ్యంగ్యం విషయంలో తాత్పర్యంతో (శ్రద్ధతో) ఉండడం యుక్తం అని చెప్పడానికే మేం ఈ ప్రయత్నం అంతా ప్రారంభించాం కాని కేవలం ధ్వనిని ప్రతిపాదించాలనే పట్టుదలచేత కాదు.

**పునశ్చేతి**:- ఇంకా మరొక రసభంగహేతువును తెలుసుకోవాలి - అదే మనగా - పరిపుష్టిని పొందిన, పరిపుష్టిని పొంది అనుభవించబడిన, రసాన్నే మళ్లీ మళ్లీ పరామర్శిస్తే అది వాడిపోయిన పువ్వువంటిది అయిపోతుంది.

**తథా ఇతి**:- మరియు, వృత్తేః= వ్యవహారంయొక్క ఏ అనౌచిత్యం ఉన్నదో అది కూడ రసభంగానికి హేతువే. అదెట్లనగా - ఎవరైనా ఒక నాయిక ఉచితమైన భంగిని (రీతిని) విడిచిపెట్టి ఒక నాయకునితో తనకున్న సంభోగాభిలాషను స్వయంగా తెలియపర్చడం లేదా -వృత్తీనామ్= భరతనాట్యశాస్త్రంలో ప్రసిద్ధాలైనకైశిక్యాదివృత్తులను గాని, ఇతర కావ్యాలంకారగ్రంథాలలో ప్రసిద్ధమైన ఉపనాగరిక మొదలైన వృత్తులను గాని అనుచితవిషయంలో కూర్చడం కూడ రసభంగానికి హేతువు. సత్కవులు ఈ విధమైన రసవిరోధుల్నీ, ఈ పద్ధతిని అనుసరించి స్వయంగా ఊహించుకొన్న రసవిరోధుల్నీ పరిహరించడానికి సావధానచిత్తులై ఉండాలి.

లోచనం

**అత ఏవ చేతి** - యతో రసబన్ధ ఏవ ముఖ్యః కవివ్యాపారవిషయః, ఇతివృత్తమాత్రవర్ణనప్రాధాన్యే సతి యదఙ్గాఙ్గీభావరహితానామ్,

అవిచారితగుణప్రధానభావానాం రసభావానాం నిబన్ధనం తన్నిమిత్తాని స్ఖలితాని సర్వే దోషా ఇత్యర్థః. న ధ్వనిప్రతిపాదనమాత్రేతి. వ్యఙ్గ్యోఽర్థో భవతు మా వా భూత్, కస్తత్రాభినివేశః? కాకదన్తపరీక్షాప్రాయమేవ తత్ స్యాదితి భావః. వృత్త్యనౌచిత్యమేవ చేతి బహుధా వ్యాచష్టే. తదపీత్యనేన చశబ్దం కారికాగతం వ్యాచష్టే రసభఙ్గహేతురేవ ఇత్యనేన ఏవకారస్య కారికాగతస్య భిన్నక్రమత్వముక్తమ్. రసస్య విరోధాయైవేత్యర్థః. నాయకం ప్రతీతి- నాయకస్య హి ధీరోదాత్తాదిభేదభిన్నస్య సర్వథా వీరరసాను వేధేన భవితవ్యమితి తం ప్రతి కాతరపురుషోచితమ్ అధైర్యయోజనం దుష్టమేవ.

బాలానందిని

అత ఏవ చేతి:- రసబంధమే ముఖ్యమైన కవివ్యాపారవిషయం కావాలి; అందుచేతను, ఇతివృత్తవర్ణనానికి మాత్రమే ప్రాధాన్యం ఇచ్చే పక్షంలో అంగాంగిభావం లేకుండా, ఏది ప్రధానం ఏది అప్రధానం అనే ఆలోచన లేకుండా, రసభావాలను నిబంధించడం మూలాన సమస్తమైన స్ఖలితాలు, దోషాలు కలుగుతాయి; అందువల్లనూ అని అర్థం. న ధ్వనిప్రతిపాదనమాత్రేతి:- వ్యంగ్యార్థం ఉంటే ఉండవచ్చు లేకపోతే లేకపోవచ్చును. ఆ విషయంలో పట్టుదల ఎందుకు? అది కాకదంతపరీక్షవంటిది; కాకికి దంతాలు ఉంటాయా ఉండవా, ఉంటే ఎన్ని ఉంటాయి అనే పరీక్ష ఎలా వ్యర్థమో ఇది కూడా అంతే అని అర్థం. అనగా ఈ ఘట్టంలో మేం ప్రతిపాదించదలచినది రసభంగం లేకుండా ఏ ఉపాయాలు అవలంబించాలి అని మాత్రమే; ఇక్కడ ధ్వనిని గూర్చి చర్చించడం మా ధ్యేయం కాదు అని భావం.

వృత్తీతి : "వృత్త్యనౌచిత్యమేవ చ" అనే కారికాగతభాగాన్ని అనేకవిధాల వ్యాఖ్యానిస్తున్నాడు. తదపి అనేదానిచేత కారికలో ఉన్న 'చ' శబ్దాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. రసభఙ్గహేతురేవ అనేదానిచేత కారికలో ఏవకారం ("వృత్త్యనౌచిత్యమేవ" లోని ఏవకారం) భిన్నక్రమం (దీనిని 'విరోధాయ'తో అన్వయించాలి) అని చెప్పబడింది. "రసస్య విరోధాయైవ" అని అర్థం. నాయకం ప్రతీతి:- ధీరోదాత్తాదిభేదభిన్నుడైన నాయకునిలో సర్వవిధాల వీరరససంబంధం ఉండాలి గాన వాని విషయంలో పిరికివానికి తగిన అధైర్యం కూర్చడం దుష్టమే అని అర్థం.

వివరణ:- నాయిక నాయకునితో సంభోగాభిలాషను స్వయంగా వ్యక్తంచేసింది అనగా నాయకునికి ధైర్యం లేకపోవడంచేత అలా చేయవలసి వచ్చింది అని అర్థం.

ధీరోదాత్తాదిచతుర్విధనాయకులు కూడ వీరరససంబంధం ఉన్నవాళ్లవడం చేత వాళ్లని పిరికివాళ్లనుగా చిత్రించడం అయుక్తం అని వ్యాఖ్యాత అభిప్రాయం.

## ధ్వన్యాలోకం

పరికరశ్లోకాశ్చాత్ర -

ముఖ్యా వ్యాపారవిషయాః సుకవీనాం రసాదయః,
తేషాం నిబన్ధనే భావ్యే (వ్యం) తైః సదైవాప్రమాదిభిః.
నీరసస్తు ప్రబన్ధో యః సోఽపశబ్దో మహాన్ కవేః,
స తేనాకవిరే స్యాదన్యేనాస్మృతలక్షణః.
పూర్వే విశృఙ్ఖలగిరః కవయః ప్రాప్తకీర్తయః,
తాన్ సమాశ్రిత్య న త్యాజ్యా నీతిరేషా మనీషిణా.
వాల్మీకివ్యాసముఖ్యాశ్చ యే ప్రఖ్యాతాః కవీశ్వరాః.
తదభిప్రాయబాహ్యోఽయం నాస్మాభిర్దర్శితో నయః. ఇతి.

### బాలానందిని

ఈ విషయంలో పరికరశ్లోకాలు -

"సుకవుల ముఖ్యమైన వ్యాపారవిషయాలు రసాదులు. అందుచేత వాళ్లు ఎల్లప్పుడు ఆ రసాదుల నిబంధనం విషయంలో ప్రమాదం (పొరబాటు) లేకుండా ఉండాలి"

"నీరసమైన ప్రబంధం కవికి గొప్ప అపశబ్దం (అపకీర్తి హేతువు). అలాంటి ప్రబంధం రచించినా అతడు అకవియే అవుతాడు. ఇతరులెవరూ అతడు చూపిన మార్గాన్ని స్మరించరు కూడ".

"ప్రాచీనులైన కొందరు కవులు విశృంఖలమైన వాక్కు కలవారే అయినా వాళ్లకి కీర్తి లభించేసింది. బుద్ధిమంతుడెవడూ వాళ్లని అనుకరిస్తూ ఈ నీతిని విడవగూడదు.

"మేం చూపించిన ఈ నీతి (మారగం) వాల్మీకి వ్యాసుడు మొదలైన ప్రసిద్ధులైన ఏ కవులున్నారో వాళ్ల అభిప్రాయానికి బాహ్యం కాదు". వాళ్ల అభిప్రాయాన్ని అనుసరించినదే అని అర్థం.

లోచనం

తేషామితి - రసాదీనామ్. తైరితి - సుకవిభిః. సోఽపశబ్ద ఇతి - దుర్యశ ఇత్యర్థః. నను కాలిదాసః పరిపోషం గతస్యాపి కరుణస్య రతివిలాపేషు పౌనఃపున్యేన దీపనమకార్షీత్, తత్కోఽయం రసవిరోధినాం పరిహారనిర్బన్ధ ఇత్యాశఙ్క్యాహ - పూర్వ ఇతి. న హి వసిష్ఠాదిభిః కథం చిద్యది స్మృతిమార్గః త్యక్తః తద్వయమపి తథా త్యజామః. అచిన్త్యహేతుకత్వాత్ ఉపచరితానామితి భావః. ఇతిశబ్దేన పరికరశ్లోకసమాప్తిం సూచయతి. 19

బాలానందిని

తేషామితి - రసాదులయొక్క. తైరితి - సుకవులచేత. సోఽపశబ్ద ఇతి - అపకీర్తి అని అర్థం. నన్వితి - కాలిదాసు రతివిలాపఘట్టంలో కరుణరసం పరిపోషాన్ని పొందినా కూడ మళ్ళీ మళ్ళీ దానిని ఉద్దీపింపచేశాడు. అలాంటప్పుడు రసవిరోధుల్ని పరిహరించాలంటూ ఈ నిర్బంధం ఏమిటి? అని ఆశంకించుకొని పూర్వే ఇత్యాదికం చెపుతున్నాడు. వసిష్ఠాదులు ఎందుచేతనో స్మృతివిహితమైన మార్గం త్యజించారు కదా అని మనం కూడ అలా త్యజించం కదా? ఉన్నతచరిత్రవంతులు చేసే పనికి హేతువును మనం ఊహించజాలం అని భావం. 'ఇతి' శబ్దంచేత పరికరశ్లోకాల సమాప్తిని సూచిస్తున్నాడు.

ధ్వన్యాలోకం

కా. వివక్షితే రసే లబ్ధప్రతిష్ఠే తు విరోధినామ్,
బాధ్యానామఙ్గభావం వా ప్రాప్తానాముక్తిరచ్ఛలా. 20

స్వసామగ్ర్యా లబ్ధపరిపోషే తు వివక్షితే రసే విరోధినాం విరోధిరసాఙ్గా నాం బాధ్యానామ్, అఙ్గబావం వా ప్రాప్తానాం సతామ్ ఉక్తిర్న దోషాయ. బాధ్యత్వం హి విరోధినాం శక్యాభిభవత్వే సతి; నాన్యథా, తథా చ తేషాముక్తిః ప్రస్తుతరసపరిపోషాయైవ సంపద్యతే, అఙ్గభావం ప్రాప్తానాం చ తేషాం విరోధిత్వమేవ నివర్తతే. అఙ్గభావప్రాప్తిర్హి తేషాం స్వాభావికీ సమారోపకృతా వా. తత్ర యేషాం నైసర్గికీ తేషాం తావదుక్తావ విరోధః ఏవ. యథా విప్రలమ్భశృఙ్గారే

తదఙ్గానాం వ్యాధ్యాదీనామ్. తేషాం చ తదఙ్గానామేవ అదోషో నాతదఙ్గానామ్. తదఙ్గత్వే చ సంభవత్యపి మరణస్యోపన్యాసో న జ్యాయాన్. ఆశ్రయవిచ్ఛేదే రసస్యాత్యన్తవిచ్ఛేదప్రాప్తేః. కరుణస్య తు తథావిధే విషయే పరిపోషో భవిష్యతీతి చేత్ - న; తస్య అప్రస్తుతత్వాత్. ప్రస్తుతస్య చ విచ్ఛేదాత్. యత్ర తు కరుణరసస్యైవ కావ్యార్థత్వం తత్రావిరోధః. శృఙ్గారే వా మరణస్య అదీర్ఘకాలప్రత్యాపత్తిసంభవే కదాచిదుపనిబన్ధః నాత్యన్తవిరోధీ. దీర్ఘకాలప్రత్యాపత్తౌ తు తస్యాన్తరా ప్రవాహవిచ్ఛేద ఏవేతి ఏవంవిధేతివృత్తనిబన్ధనం రసబన్ధప్రధానేన కవినా పరిహర్తవ్యమ్.

బాలానందిని

వివక్షితే ఇతి :- వివక్షితే= ప్రతిపాదించదలచిన, రసే= రసం, లబ్ధప్రతిష్ఠే= పొందబడిన ప్రతిష్ఠ కలదగుచుండగా, బాధ్యానామ్= బాధ్యములు కాని, అఙ్గభావం ప్రాప్తానాం వా= అంగత్వాన్ని పొందినవి గాని అయిన, విరోధినామ్= విరోధిరసాల, ఉక్తిః= చెప్పడం, అచ్ఛలా= నిర్దుష్టమైనది.

స్యేతి. ప్రతిపాదించదలచిన రసం తన సామగ్రిచేత పరిపుష్టిని పొందిన తరవాత, విరోధినామ్= విరోధిరసాంగాలయొక్క (ను) బాధ్యాలుగా గాని, వా= అంగత్వం పొంధినవిగా గాని చెప్పడంలో దోషం లేదు. విరోధులు తిరస్కరించడానికి శక్యం అవుతేనే అవి బాధ్యములవుతాయి; మరొక విధంగా కావు. తిరస్కరించడానికి, అణచివేయడానికి, శక్యమైన విరోధుల్నే బాధ్యాలు అంటారు అని అర్థం. అందుచేత అలాంటివాటిని చెప్పడం ప్రస్తుతరసాన్ని పోషించడానికే ఉపయోగిస్తుంది. అవి (విరోధులు) అంగత్వం పొందుతే వాటి విరోధిత్వమే తొలగిపోతుంది. వాటికి అంగభావం లభించడం స్వాభావికంగా జరగవచ్చు, సమారోపంచేత జరగవచ్చు. వేటికి స్వాభావికమైన అంగత్వమో వాటిని చెప్పినా విరోధం లేదు. అయితే దాని అంగాలను చెపితేనే దోషం లేదు కాని దాని అంగాలు కానివాటిని చెపితే అదోషం కాదు (దోషమే). మరణం విప్రలంభశృంగారాంగం అవడానికి అవకాశం ఉన్నా దాన్ని చెప్పడం అంత మంచిది కాదు, ఆశ్రయం విచ్ఛిన్నం అయిపోతుంది కదా? అలాంటి విషయంలో (మరణం

వర్ణిస్తే) కరుణకు పోషణం కలుగుతుంది కదా అని ప్రశ్నించవచ్చు కాని అది యుక్తం కాదు. అది ఇక్కడ ప్రస్తుతం కాదు కదా? ప్రస్తుతమైన విప్రలంభం విచ్ఛిన్నమైపోయింది కదా? ఎక్కడైతే కరుణరసమే కావ్యార్థమో (ప్రస్తుతరసమో) అక్కడ (మరణం వర్ణించినా) విరోధం ఉండదు. అదీర్ఘకాలంలో పునఃసమాగమం కలుగుతుంది అనే సంభావన ఉన్నట్లయితే ఒకప్పుడు శృంగారంలో (మరణాన్ని) ఉపనిబంధించినా అంతగా విరోధి కాదు. దీర్ఘకాలానికి కాని పునఃసమాగమం లేనప్పుడు ఆ శృంగారరసప్రవాహం మధ్యలో విచ్ఛిన్నం అయిపోతుంది. అందుచేత రసప్రధానుడైన కవి ఈ విధమైన ఇతివృత్తాన్ని నిబంధించడాన్ని పరిహరించాలి.

లోచనం

ఏవం విరోధినాం పరిహారే సామాన్యేనోక్తే ప్రతిప్రసవం నియతవిషయమాహ - వివక్షిత ఇతి. బాధ్యానామితి - బాధ్యత్వాభిప్రాయేణ అఙ్గత్వాభిప్రాయేణ వేత్యర్థః. అచ్ఛలా నిర్దోషేత్యర్థః. బాధ్యత్వాభిప్రాయం వ్యాచష్టే - బాధ్యత్వం హీతి. అఙ్గభావాభిప్రాయముభయథా వ్యాచష్టే. తత్ర ప్రథమం స్వాభావికప్రకారం నిరూపయంతి - తదఙ్గానామితి. నిరపేక్షభావతయా సాపేక్షభావవిప్రలమ్భశృఙ్గారవిరోధిన్యపి కరుణే యే వ్యాధ్యాదయః సర్వథాఙ్గత్వేన దృష్టాః తేషామితి. తే హి కరుణే భవన్త్యేవ, త ఏవ చ భవన్తీతి. శృఙ్గారే తు భవన్త్యేవ, నాపి త ఏవేతి. అతదఙ్గానామితి:- యథా అలస్యౌగ్ర్యజుగుప్సానామిత్యర్థః. తదఙ్గత్వే చేతి. "సర్వ ఏవ శృఙ్గారే వ్యభిచారిణః" ఇత్యుక్తత్వాదితి భావః. ఆశ్రయస్య స్త్రీపురుషాన్యతరస్య అధిష్ఠానస్య అపాయే రతిరేవ ఉచ్ఛిద్యేత తస్య జీవితసర్వస్వాభిమానరూపత్వేన ఉభయాధిష్ఠానత్వాత్. ప్రస్తుతస్యేతి - విప్రలమ్భస్యేత్యర్థః. కావ్యార్థత్వమితి - ప్రస్తుతత్వమితి. నన్వేవం సర్వ ఏవ వ్యభిచారిణః ఇత్యేతద్విఘటితమ్ ఇత్యాశఙ్క్యాహ - శృఙ్గారే వేతి అదీర్ఘకాలే యత్ర మరణే విశ్రాన్తిపదబన్ధ ఏవ నోత్పద్యతే తత్రాస్య వ్యభిచారిత్వమ్. కదాచిదితి. యది తాదృశీం భఙ్గీం ఘటయితుం సుకవేః కౌశలం భవతి; యథా -

"తీర్థే తోయవ్యతికరభవే జహ్నుకన్యాసరయ్వోః
దేహన్యాసాదమరగణనాలేఖ్యమాసాద్య సద్యః,
పూర్వాకారాధికచతురయా సంగతః కాన్తయాసౌ
లీలాగారేష్వరమత పునర్నన్దనాభ్యన్తరేషు". (రఘు 8. 95)

అత్ర స్ఫుటైవ రత్యఙ్గతా మరణస్య. అత ఏవ సుకవినా మరణే పద బన్ధమాత్రం న కృతమ్, అనూద్యమానత్వేనైవ ఉపనిబన్ధనాత్. పదబన్ధనివేశే తు సర్వథా శోకోదయ ఏవ అతిపరిమితకాలప్రత్యాపత్తిలాభేఽపి.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా విరోధులను పరిహరించాలి అని సామాన్యరూపంలో చెప్పి నియతవిషయమైన (ప్రత్యేకం కొన్నింటికి సంబంధించిన) ప్రతిప్రసవాన్ని (నిషేధాన్ని) చెపుతున్నాడు - వివక్షిత ఇతి. బాధ్యానామితి - బాధ్యత్వాభిప్రాయం చేత గాని, అంగాత్వాప్రాయం చేత గాని అని అర్థం. అచ్ఛలా దోషరహితం అని అర్థం. బాధ్యత్వం అనేదాని అభిప్రాయాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు. బాధ్యత్వం హీతి. అఙ్గభావానికి అభిప్రాయాన్ని రెండు విధాల వ్యాఖ్యానిస్తున్నాడు. వాటిలో ముందుగా స్వాభావికమైన ప్రకారాన్ని నిరూపిస్తున్నాడు - తదఙ్గానామితి. కరుణరస పునఃసమాగమాశ లేకపోవడంచేత, పునఃసమాగమాశ ఉన్న విప్రలంభశృంగారానికి విరోధి అయినా దానియందు (కరుణయందు) ఏ వ్యాధ్యాదులు సర్వథా అంగాలుగా చూపబడుతున్నాయో వాటి యొక్క అని అర్థం. అవి కరుణరసంలో తప్పకుండా ఉంటాయి. అవే ఉంటాయి. శృంగారంలో నైతే అవి తప్పకుండా ఉంటాయి. అయితే అవి మాత్రమే కాదు. అతదఙ్గానామితి. ఉదాహరణకి - ఆలస్య - ఔగ్ర్య - జుగుప్సలు అని అర్థం. తదఙ్గత్వే చేతి. "శృంగారంలో అన్ని వ్యభిచారులూ కూడ ఉంటాయి" అని చెప్పడంవల్ల అని భావం. ఆశ్రయస్య= అధిష్ఠానమైన స్త్రీపురుషులలో ఒకరియొక్క మరణం కలగగా రతియే పూర్తిగా తొలగిపోతుంది. ఎందుచేత ననగా అది (రతి) జీవిత సర్వస్వాభిమానరూపం అవడంచేత ఇద్దరినీ ఆశ్రయించుకొని ఉంటుంది. ప్రస్తుతస్యేతి - విప్రలంభంయొక్క అని అర్థం. కావ్యార్థత్వమితి. ప్రస్తుతం అయి ఉండడం అని అర్థం. అయితే మరి "అన్ని వ్యభిచారులూ ఉంటాయి". అనే మాట విఘటితం అయిపోయింది కదా అని ఆశంకించి చెపుతున్నాడు -శృఙ్గారే వేతి. ఎక్కడైతే మరణం (మరణవర్ణనం) దీర్ఘకాలం ఉండదో అక్కడ మరణించినట్లు ఆలోచనయే విశ్రాంతిపదాన్ని పొందదు;

అనగా మనస్సులో ధృఢంగా నాటుకొనదు. అలాంటి చోట ఇది వ్యభిచారి అవుతుంది. కదాచిదితి - అలాంటి భంగిని (రీతిని) కూర్చేశక్తి కవికి ఉంటే. ఎట్లనగా-

తీర్థే ఇతి. రఘువంశంలో ఇందుమతీవిరహతప్తుడైన అజుని దేహత్యాగాది వర్ణనం. జహ్నుకన్యాసరయ్వోః= గంగాసరయూనదులయొక్క, తోయవ్యతికరభవే= జలాల కలయిక చేత ఏర్పడిన, తీర్థే తీర్థమునందు, దేహన్యాసాత్= దేహాన్ని ఉంచడం వల్ల, అమరగణనాలేఖ్యమ్= దేవతాపురుషుల లెక్కలో లేఖనాన్ని, ఆసాద్య= పొంది, పూర్వాకారాధికచతురయా= పూర్వపు ఆకారం కంటె ఎక్కువ నేర్పుగల (సుందరియైన) కాన్తయా= ప్రియురాలితో, పునః= మళ్లీ, సంగతః= కూడినవాడై, అసౌ= ఇతడు, (అజుడు), నన్దనాభ్యన్తరేషు - నందనవనమధ్యప్రదేశాలలో, లీలాగారేషు= విలాసగృహాలలో, అరమత= రమించెను.

అత్రేతి :- ఇక్కడ మరణం రతికి అంగంగా ఉండడం స్పష్టంగానే తెలుస్తూన్నది. అందువల్లనే ఈ సుకవి మరణంలో పదబంధం మాత్రం అనగా ఆతడు మరణించినట్లు మనస్సులో స్థిరంగా ఉండిపోవడాన్ని, చెయ్యలేదు. ఎందుచేతననగా మరణాన్ని అనువదిస్తున్నట్లు నిబంధించాడు. పదబంధం కూర్చినట్లయితే, అతిపరిమితమైన కాలంలో పునఃసమాగమం జరిగినా, తప్పకుండా శోకోదయం కలుగుతుంది.

వివరణ : "గంగాసరయూసంగమంలో పడి మరణించాడు" అని చెప్పి తరవాత ఏ విధగా వర్ణించినా మరణించాడు అనే విషయం మనస్సులో నాటుకుపోతుంది. అచిరకాలంలో పునఃసమాగమం జరిగినా కూడ శోకోదయం తప్పదు. అలా కాకుండా ఒక జరిగిన విషయాన్ని మామూలుగా పేర్కొన్నట్లు "దేహం ఆ తీర్థంలో ఉంచడంవల్ల దేవతల గణనలో చేరిపోయాడు" అని చెప్పడంలో పదబంధం లేదు గాన (సహృదయహృదయాలలో) శోకోదయానికి అవకాశం లేదు అని భావం.

లోచనం

అథ దూరపరామర్శకసహృదయసామాజికాభిప్రాయేణ మరణస్య అదీర్ఘకాలప్రత్యాపత్తేరఙ్గతా ఉచ్యతే, హన్త, తాపసవత్సరాజే ఽపి యౌగన్ధరాయణాదినీతిమార్గాకర్ణనసంస్కృతమతీనాం వాసవదత్తామరణ బుద్ధేరేవ అభావాత్ కరుణస్య నామాపి న స్యాదితి అలమవాన్తరేణ బహునా. తస్మాత్ దీర్ఘకాలతాత్ర పదబన్ధలాభ ఏవేతి మన్తవ్యమ్. ఏవం నైసర్గికాఙ్గతా వ్యాఖ్యాతా. సమారోపితత్వే తద్విపరీతేత్యర్థలబ్ధత్వాత్ స్వకణ్ఠేన న వ్యాఖ్యాతా.

బాలానందిని

"అదీర్ఘకాలప్రత్యాపత్తిసంభవే" అనే వృత్తివాక్యానికి "అదీర్ఘకాలమైన ఏ మరణంలో (సహృదయుల మనస్సుకు) విశ్రాంతిపదబంధమే ఉండదో, అనగా మరణించాడన్న భావం మనస్సులో బాగా నాటుకొనదో అక్కడ" అని వ్యాఖ్యానించబడింది. కొందరు దీనిని మరొక విధంగా వ్యాఖ్యానించారు. దానిని నిరాకరిస్తున్నాడు - అథేతి. దూరం వరకు ఆలోచించగలిగిన సహృదయులైన సామాజికుల దృష్ట్యా అదీర్ఘకాలప్రత్యాపత్తి అయిన మరణం అంగం అవుతుంది అని అర్థం చెప్పే పక్షంలో, ఆహా! తాపసవత్సరాజంలో కూడా యౌగంధరాయణాదుల నీతిమార్గాన్ని విని ఉండడంచేత సంస్కృతములైన బుద్ధిగలవాళ్లకు వాసవదత్త మరణించిందనే బుద్ధియే కలగదు గాన అక్కడ కరుణరసం పేరుకు కూడా ఉండదు. సరే అధికమైన ఈ అవాంతరచర్చ చాలు. అందువల్ల ఇక్కడ దీర్ఘకాలత్వం (ప్రతీతి విశ్రాంతి) పదబంధలాభం విషయంలోనే అని గ్రహించాలి. ఏవమితి. ఈ విధంగా నైసర్గికాంగత్వం విశదీకరించబడింది. సమారోపితం అయినప్పుడు అంగత్వం దీనికి (నైసర్గికాంగత్వానికి) విపరీతంగా ఉంటుంది. ఈ విధంగా దాని స్వరూపం అర్థాల్లభ్యం కాబట్టి (చెప్పక పోయినా ముందే చెప్పిన మరొక విషయాన్ని పట్టి తెలుస్తుంది కాబట్టి) తన మాటలలో (వృత్తికారునిచేత) వ్యాఖ్యానించబడలేదు.

ధ్వన్యాలోకం

తత్ర లబ్ధప్రతిష్ఠే తు వివక్షితే రసే విరోధిరసాఙ్గానాం బాధ్యత్వేన ఉక్తావదోషః యథా -

శ్లో. క్వాకార్యం శశలక్ష్మణః క్వ చ కులం భూయోఽపి దృశ్యేత సా
దోషాణాం ప్రశమాయ మే శ్రుతమహో కోపేఽపి కాన్తం ముఖమ్,
కిం వక్ష్యన్త్యపకల్మషాః కృతధియః స్వప్నేఽపి సా దుర్లభా
చేతః స్వాస్థ్యముపైహి కః ఖలు యువా ధన్యోఽధరం పాస్యతి.

(94)

యథా వా- పుణ్డరీకస్య మహాశ్వేతాం ప్రతి ప్రవృత్తనిర్భరానురాగస్య ద్వితీయమునికుమారోపదేశవర్ణనే.

బాలానందిని

తత్రేతి:- ప్రతిపాదింపదలచిన రసం ప్రతిష్ఠ పొందిన తరవాత నైతే విరోధి రసాంగాలను బాధ్యాలుగా చెప్పినా (కూర్చినా) దోషం లేదు. ఎట్లనగా -

క్వేతి - ఈ శ్లోకం కావ్యప్రకాశలో కూడ ఉదాహరించబడింది. అకార్యమ్= మునికన్యాభిలాషరూపమైన అకార్యం, క్వ= ఎక్కడ? శశలక్ష్మణః= చంద్రునియొక్క, కులమ్= కులము, క్వ చ = ఎక్కడ? (వితర్కం) సా= ఆమె, భూయః = మరల, అపి దృశ్యేత= చూడబడునా? (ఔత్సుక్యం). నః= మనయొక్క, శ్రుతమ్= శాస్త్రశ్రవణం, దోషాణామ్= దోషాలయొక్క, ప్రశమాయ= నాశనం కొరకే కదా? (మతి). అహో= ఏమి ఆశ్చర్యం? కోపేఽపి= కోపంలో కూడ, ముఖమ్= ఆమె ముఖం, కాన్తమ్= మనోహరంగా ఉంది (స్మరణం). అపకల్మషాః= తొలగిన పాపాలు గల, కృతధియః= పండితులు, కిమ్= ఏమి, వక్ష్యన్తి= చెప్పగలరో (అంటారో) (శంక). సా= ఆమె, స్వప్నేఽపి= స్వప్నంలో కూడ, దుర్లభా= దుర్లభ అయినది (దైన్యం). చేతః= చిత్తమా! స్వాస్థ్యమ్= స్వస్థతను, ఉపైహి= పొందుము (ధృతి). ధన్యః= ధన్యుడైన, కః యువా= ఏ యువకుడు, అధరమ్= అధరోష్ఠమును, పాస్యతి= పానం చెయ్యగలడో! (చింత).

మరొక ఉదాహరణం ఎట్లనగా - మహాశ్వేతయందు ప్రవర్తించిన అత్యధికమైన అనురాగం గల పుండరీకునికి రెండవ మునికుమారుడు చేసిన ఉపదేశాన్ని వర్ణించడం.

లోచనం

ఏవం ప్రకారత్రయం వ్యాఖ్యాయ క్రమేణోదాహరతి - తత్రేత్యాదినా. క్వాకార్యమితి - వితర్క ఔత్సుక్యేన, మతిః స్మృత్యా, శఙ్కా దైన్యేన, ధృతిః చిన్తయా చ బాధ్యతే. ఏతచ్చ ద్వితీయోద్యోతారమ్భ ఏవోక్తమస్మాభిః ద్వితీయేతి - విపక్షీభూతవిభావాద్యవధారణేఽపి హి అశక్యవిచ్ఛేదత్వేన దార్ఢ్యమేవ అనురాగస్య ఉక్తం భవతీతి భావః.

బాలానందిని

ఏవమితి - ఈవిధంగా ప్రకారత్రయాన్ని వ్యాఖ్యానించి క్రమంగా ఉదాహరిస్తున్నాడు - క్వాకార్యమితి. వితర్కం ఔత్సుక్యంచేత, మతి స్మృతిచేత, శంక దైన్యంచేత ధృతి చింతచేత బాధించబడుతున్నది. ఈ విషయం మేం ద్వితీయోద్యోతప్రారంభంలోనే చెప్పి ఉన్నాం. ద్వితీయేతి. విపక్షములైన వైరాగ్యానికి చెందిన విభావాదుల అవధారణం ఉన్నా కూడా అనురాగానికి విచ్ఛేదం కలిగించడం శక్యం కాలేదు గాన అనురాగానికి

దార్ఢ్యమే చెప్పబడింది (అనురాగం చాలా దృఢంగా ఉన్నట్లే చెప్పబడింది) అని భావం.

## ధ్వన్యాలోకం

స్వాభావిక్యామఙ్గభావప్రాప్తావదోషో యథా-

శ్లో. భ్రమిమరతిమలసహృదయతాం ప్రలయం మూర్ఛాం తమః శరీరసాదమ్,
మరణం చ జలదభుజగజం ప్రసహ్య కురుతే విషం వియోగినీనామ్. (95)

ఇత్యాదౌ.

### బాలానందిని

అంగత్వప్రాప్తి స్వాభావిక మైనప్పుడు దోషం లేకపోవడానికి ఉదాహరణం ఎట్లనగా - 'భ్రమిమ్' ఇత్యాదులలో (ఈ శ్లోకం ద్వితీయోద్యోతంలో 41వ శ్లోకంగా వచ్చినది. అర్థాదులు అక్కడ ఇవ్వబడ్డాయి). ఇక్కడ కరుణలో ఉచితమైన వ్యాధికి అనుభావాలైన తల తిరగడం మొదలైనవి విప్రలంభంలో కూడా ఉంటాయి. అందుచేత వీటి అంగత్వం స్వాభావికం

## ధ్వన్యాలోకం

సమారోపితాయామప్యవిరోధో యథా - "పాణ్డు క్షామమ్" ఇత్యాదౌ. యథా వా - "కోపాత్కోమలలోలబాహులతికాపాశేన" ఇత్యాదౌ.

### బాలానందిని

ఆరోపించబడిన అంగత్వప్రాప్తిలో కూడ విరోధాభావం ఎట్లనగా - 'పాణ్డు' ఇత్యాదులలో. పూర్తి శ్లోకం లోచనంలో ఇవ్వబడింది.

పాణ్డు ఇతి - సఖి= ఓ సఖీ! తవ= నీయొక్క, నితాన్తమ్= మిక్కిలి, ఈ క్రియావిశేషణం పాణ్డు మొదలైన అన్ని విశేషణాలకీ అన్వయిస్తుంది. పాణ్డు= తెల్లనైన, క్షామమ్= చిక్కిన, వదనమ్= ముఖమూ, సరసమ్= అనురాగంతో కూడిన (అన్న రసంతో కూడిన అని మరొక అర్థం), హృదయమ్= హృదయమూ, అలసమ్= ఏ పనులూ చేయజాలని, వపుః చ= శరీరమూ, హృదన్తః= హృదయం లోపల, క్షేత్రియరోగమ్= ఈ శరీరంలో చికిత్స చేయ శక్యం కాని రోగాన్ని, విరహరూపమైన అసాధ్యరోగాన్ని అని అర్థం, ఆవేదయతి= సూచిస్తున్నది.

యథా వా ఇతి :- మరొక ఉదాహరణం ఎట్లనగా 'కోపాత్కోమల' ఇత్యాదియందు (ఈ శ్లోకం ద్వితీయోద్ద్యోతంలో 36వ శ్లోకంగా వచ్చినది).

లోచనం

సమారోపితాయామితి : అఙ్గభావప్రాప్తావితి శేషః.

పాణ్డు క్షామం వదనం హృదయం సరసం తవాలసం చ వపుః,

ఆవేదయతి నితాన్తం క్షేత్రియరోగం సఖి హృదన్తః.

అత్ర కరుణోచితో వ్యాధిః శ్లేషభఙ్గ్యా స్థాపితః. కోపాదితి బద్ధ్వేతి హన్యత ఇతి చ రౌద్రానుభావానాం రూపకబలాదారోపితానాం తదనిర్వాహాదేవాఙ్గత్వమ్. తచ్చ పూర్వమేవోక్తం "నాతినిర్వహణైషితా" ఇత్యత్రాన్తరే.

బాలానందిని

సమారోపితాయామితి. 'అఙ్గభావప్రాప్తౌ' అని అధ్యాహారం. ఆరోపించబడిన అంగత్వప్రాప్తియందు అని అర్థం. అత్రేతి. 'పాణ్డు' ఇత్యాది శ్లోకంలో కరుణకు ఉచితమైన వ్యాధి శ్లేషపద్ధతిలో స్థాపించబడింది. అనగా రెండింటికి సాధారణమైన అనుభావాలను చూపడంచేత, విప్రలంభంలో ఆరోపించబడి దానికి అంగమైనది. కోపాదితి. 'కోపంవల్ల', 'కట్టి', 'కొట్టబడతాడు' అని రూపకబలంచేత ఆరోపించబడిన రౌద్రానుభావాలు, ఆ రూపకాన్ని చివరివరకు నడిపించకపోవడంచేతనే శృంగారాంగాలయ్యాయి. ఈవిషయం 'నాతినిర్వహణైషితా' అనే ఘట్టంలో వెనుకనే చెప్పబడింది.

ధ్వన్యాలోకం

ఇయం చాఙ్గభావప్రాప్తిరన్యా యదాధికారికత్వాత్ ప్రధానే ఏకస్మిన్ వాక్యార్థే రసయోర్భావయోర్వా పరస్పరవిరోధినోః ద్వయోః అఙ్గభావగమనం తస్యామపి న దోషః. యథోక్తం 'క్షిప్తో హస్తావలగ్నః' ఇత్యాదౌ. కథం తత్ర అవిరోధ ఇతి చేత్ - ద్వయోరపి తయోరన్యపరత్వేన వ్యవస్థానాత్. అన్యపరత్వేఽపి విరోధినోః కథం విరోధనివృత్తి రితి చేత్, ఉచ్యతే - విధౌ విరుద్ధసమావేశస్య దుష్టత్వం నానువాదే. యథా -

ఏహి గచ్ఛ పతోత్తిష్ఠ వద మౌనం సమాచర,
ఏవమాశాగ్రహగస్తైః క్రీడన్తి ధనినోర్థిభిః. (96)

ఇత్యాదౌ. అత్ర హి విధిప్రతిషేధయోరనూద్యమానత్వేన సమావేశే న విరోధః, తథా ఇహాపి భవిష్యతి. శ్లోకే హ్యస్మిన్ ఈర్ష్యావిప్రలమ్భ శృఙ్గారకరుణవస్తునోః న విధీయమానత్వమ్. త్రిపురిపుప్రభావాతి శయస్య వాక్యార్థత్వాత్, తదఙ్గత్వేన చ తయోః వ్యవస్థానాత్.

బాలానందిని

ఇయం చేతి - ఈ మరియొక అంగత్వప్రాప్తి ఏదనగా - ఆధికారికం (వర్ణించడానికి ఉద్దిష్టం) అవడం చేత ప్రధానమైన ఒక వాక్యార్థంలో పరస్పరవిరోధులైన రెండు రసాలు గాని, భావాలు గాని అంగత్వాన్ని పొందడం; అలాంటి అంగభావప్రాప్తిలో కూడ దోషం లేదు. "క్షిప్తో హస్తావలగ్నః" ఇత్యాదులలో చెప్పినట్లు. (ఈ శ్లోకం వెనక ద్వితీయోద్యోతంలో 23వ శ్లోకంగా వచ్చినది). అక్కడ విరోధం ఎందుకు లేదు అంటే, అక్కడ ఆ రెండూ మరొకదానికి అధీనాలుగా స్థాపించబడడంవల్ల. అన్యపరాలైనంత మాత్రాన విరోధుల మధ్య విరోధం ఎలా నివర్తిస్తుంది? చెపుతున్నాం, విను- విరుద్ధమైనవాటి సమావేశం విధిలోనే దుష్టం కాని, అనువాదంలో కాదు. ఎట్లనగా -

ఏహీతి - ఏహి = రమ్ము, గచ్ఛ= వెళ్ళుము, పత= క్రింద పడుము, (పాదాలకి నమస్కారం చేయుము) ఉత్తిష్ఠ= లెమ్ము, వద= (ఏమి చెప్పాలో) చెప్పుము. మౌనం సమాచర= నోరు మూసికొని కూర్చొనుము. ఏవమ్= ఇట్లు, ధనినః= ధనవంతులు, ఆశాగ్రహగ్రస్తైః= ఆశ అనే గ్రహంచేత ఆవహించబడిన. అర్థిభిః= యాచకులతో, క్రీడన్తి= ఆడుకొనుచున్నారు. ఇక్కడ విధిప్రతిషేధాలు అనువదించబడుతున్నట్లుగా కూర్చబడడంచేత ఏ విధంగా విరోధం లేదో అదేవిధంగా ఇక్కడ కూడా ఉంటుంది. ఈ శ్లోకంలో ఈర్ష్యా-విప్రలంభశృంగార - కరుణరసా లనే వస్తువులు విధించబడడం లేదు. త్రిపురసంహారకుని ప్రభావాతిశయం ఇక్కడ ప్రధానంగా చెప్పదలచిన (విధేయమైన) వాక్యార్థం. దానికి అంగంగా ఆ రెండూ ఉన్నాయి.

వివరణ : ఏహీత్యాదిశ్లోకంలో వాక్యార్థం (విధేయం) 'ధనినః క్రీడన్తి' అనేది. "ఏహీతి క్రీడన్తి" "గచ్ఛేతి క్రీడన్తి" ఇత్యాదివిధంగా గమనాగమనాదులు క్రీడకు అంగంగా

చెప్పబడ్డాయి. అవి పరస్పరవిరుద్ధాలైనా మరొక దానికి అంగాలవడంచేత ఏ విధంగా దోషం లేదో అట్లే ఇక్కడ కూడ.

లోచనం

అన్యేతి. చతుర్థోఽయం ప్రకారః ఇత్యర్థః. పూర్వం హి విరోధినః ప్రస్తుతరసాన్తరే అఙ్గతా ఉక్తా; అధునా తు ద్వయోర్విరోధినోః వస్త్వన్తరే అఙ్గభావః ఇతి విశేషః. 'క్షిప్త' ఇతి. వ్యాఖ్యాతమేతత్ "ప్రధానేఽన్యత్ర వాక్యార్థే" ఇత్యత్ర. నను అన్యపరత్వేఽపి స్వభావః న నివర్తతే, స్వభావకృత ఏవ చ విరోధః ఇత్యభిప్రాయేణాహ - అన్యపరత్వేఽపీతి. విరోధినోరితి. తత్స్వభావయోరితి హేతుత్వాభిప్రాయేణ విశేషణమ్. ఉచ్యత ఇతి. అయం భావః - సామగ్రీవిశేషపతితత్వేన భావానాం విరోధావిరోధౌ, న స్వభావమాత్రనిబన్ధనౌ శీతోష్ణయోరపి విరోధాభావాత్. విధావితి. "తదేవ కురు; మా కార్షీః" ఇతి యథా. విధిశబ్దేనాత్ర ఏకదా ప్రాధాన్యముచ్యతే. అత ఏవ "అతిరాత్రే షోడశినం గృహ్ణన్తి. న గృహ్ణన్తి" ఇతి విరుద్ధవిధిః వికల్పపర్యవసాయీతి వాక్యవిదః. అనువాద ఇతి. అన్యాఙ్గతాయామిత్యర్థః. క్రీడాఙ్గత్వేన హ్యత్ర విరుద్ధానామర్థానామభిధానమితి రాజనికట వ్యవస్థితాతతాయిద్వయన్యాయేన విరుద్ధానామప్యన్యముఖప్రేక్షితాపరత స్త్రీకృతానాం శ్రౌతేన క్రమేణ స్వాత్మపరామర్శేఽ ప్యవిశ్రామ్యతామ్, కా కథా పరస్పరరూపచిన్తాయాం యేన విరోధః స్యాత్. కేవలం విరుద్ధత్వాత్ అరుణాధికరణస్థిత్యా యో వాక్యీయ ఏషాం పాశ్చాత్యః సంబన్ధః సంభావ్యతే స విఘటతామ్.

బాలానందిని

అన్యేతి - ఇది నాల్గవ ప్రకారం అని అర్థం. పూర్వం విరోధిరసంయొక్క అంగం ప్రస్తుతమైన మరొక రసానికి అంగం ఎలా అవుతుందో చెప్పబడింది. ఇప్పుడైతే విరోధులైన రెండు మరొక వస్తువునకు అంగాలుగా ఎలా అవుతాయో చెప్పబడుతున్నది అనేది విశేషం. "క్షిప్తః" ఇతి. "ప్రధానేఽన్యత్ర వాక్యార్థే" అనే కారిక దగ్గర ఇది వ్యాఖ్యానించబడింది. నన్వితి - (ఆశంక) అన్యపరం అయినంత మాత్రాన స్వభావం

ఎలా మారుతుంది? విరోధం అనేది స్వభావసిద్ధంగా వచ్చినదే కదా అనే అభిప్రాయంతో అన్యపరత్వేఽపీత్యాదికం చెపుతున్నాడు. విరోధినోరితి. విరోధినోః అనగా 'విరుద్ధస్వభావం గలవైనప్పటి'కీ అని విరోధనివృత్తి కలగదు అనడానికి హేతుత్వాన్ని చెప్పే అభిప్రాయంచేత ఉపయోగించిన విశేషణం (ద్వయోః అనే దానికి విశేషణం). ఉచ్యతే ఇతి. దీని భావం ఇది - పదార్థాలకు విరోధావిరోధాలు కేవలం స్వభావమాత్రంచేత ఏర్పడవు; సామగ్రీవిశేషంలో పడడంచేత, అనగా చేరడంచేత, కలుగుతాయి. అందుచేత ఒకప్పుడు శీతోష్ణస్పర్శలకు కూడ విరోధం ఉండదు.

వివరణ: పదార్థాలలో ఒకదానికి మరొక దానితో విరోధం ఉంటుంది; మరొక దానితో విరోధం ఉండదు అంటే ఈ విరోధావిరోధాలు కేవలం వాటి స్వభావాన్ని పట్టిమాత్రమే కాక విశిష్టసామగ్రితో వాటికి అనుప్రవేశం (సంబంధం) ఉండడంచేత కలుగుతాయి. ఘటత్వానికీ పటత్వానికీ సామానాధికరణ్యం ఉండదు - అనగా రెండూ ఒక వస్తువులో ఉండవు. అదే విధంగా శీతస్పర్శకీ ఉష్ణస్పర్శకీ సామానాధికరణ్యం ఉండదు. అందుచేత వీటికి సామానాధికరణ్యం లేకపోవడం అనే విరోధం స్వాభావికం (స్వభావాన్ని పట్టి ఏర్పడినది). శీతస్పర్శ ఏ పదార్థంలో ఉందో ఆ పదార్థం కొన్ని ద్రవ్యాలచేత ఏర్పడుతుంది. ఆ ద్రవ్యాలలో ఉష్ణస్పర్శను అడ్డుకునే శక్తి (ప్రతిబంధకత్వం) ఉంది గాన ఆ ద్రవ్యాలవల్ల పుట్టిన పదార్థంలో ఉష్ణస్పర్శ ఉండదు. శీతస్పర్శే ఉంటుంది. ఒక పదార్థంలో సుగంధం ఉంది. ఆ పదార్థం ఏ ద్రవ్యాలతో తయారవుతుందో వాటిలో సుగంధాభావాన్ని అడ్డుకునే శక్తి ఉంటుంది. అందుచేత ఆ ద్రవ్యాలతో తయారయిన పదార్థంలో సుగంధమే కాని సుగంధాభావం ఉండదు. ఇలాంటి స్థలాలలో శీతస్పర్శ సురభిగంధాలకీ ఉష్ణస్పర్శ-అసురభిగంధాలకీ విరోధం ఏర్పడిందంటే అది (ఆ విరోధం) ఉత్పత్తిప్రతిబంధరూపమైనది. కొన్నిచోట్ల ఒక పదార్థాన్ని పుట్టించే సామగ్రిలో (ఉదా. శీతస్పర్శ గల జలం, ఉష్ణస్పర్శగల తేజస్సు సహకారులుగా ఉన్న తండులాదులతో అన్నం మొదలైనవి వండేటప్పుడు) ఉష్ణస్పర్శ ప్రతిబంధకత్వమూ ఉండకపోవచ్చు, శీతస్పర్శ ప్రతిబంధకత్వమూ ఉండకపోవచ్చు. అలాంటప్పుడు ఆ పదార్థంలో శీతోష్ణస్పర్శలకి విరోధమే లేదు. విధిస్థలంలో ప్రవృత్తిసామగ్ర్యనుప్రవేశం ఉంటుంది. (ప్రవర్తింపచేసే సామగ్రియొక్క అనుప్రవేశం ఉంటుంది) నిషేధస్థలంలో నివృత్తిసామగ్ర్యనుప్రవేశం ఉంటుంది. అందుచేత విరుద్ధసామగ్ర్యనుప్రవేశాన్ని పట్టి విధినిషేధాలకి విరోధం అని భావం.

విధావితి - రెండు విరుద్ధాంశాలు ఒక విధిలో కలవవు కాని అనువాదంలో అవి కలవవచ్చు అని వృత్తికారుడు "విధౌ విరుద్ధసమావేశస్య దుష్టత్వం, నానువాదే" అనే వాక్యంలో చెప్పిన దానిని వివరిస్తున్నాడు-తదేవేతి. ఎట్లనగా-"ఆ పనియే చేయుము" "ఆ పని చేయవద్దు" అన్నట్లు. ఒకే పనిని నిర్దేశిస్తూ ఈ పని చేయుము; ఈ పని చేయకుము అని విధిస్తున్నాడు. ఒకే పనిని చేయడం చేయకపోవడం అనేది ఒకే సమయంలో కుదరవు గాన ఇది దుష్టమైన వాక్యం అని అర్థం. **విధిశబ్దేనేతి.** ఇక్కడ విధిశబ్దంచేత ఒకే సమయంలో ప్రాధాన్యం అనే అర్థం చెప్పబడుతుంది. "కురు మాకార్షీః" అనే వాక్యంలో ఒకే సమయంలో ఒకే వ్యక్తి చేయడానికి చేయకుండా ఉండడానికీ ప్రాధాన్యం ఇవ్వజాలడు గాన ఇది దుష్టమైనది అని అర్థం.

అత ఏవేతి - అందువలననే, అనగా ఒకే సమయంలో రెండింటికి ప్రాధాన్యం కుదరదు గాన, అతిరాత్రంలో షోడశిని గ్రహిస్తారు. 'అతిరాత్రంలో షోడశిని గ్రహించరు' అని విరుద్ధమైనవాటియొక్క విధి వికల్పంలో పర్యవసన్నం అవుతుంది అని వాక్య శాస్త్రజ్ఞులు (మీమాంసకులు) చెప్పారు.

వివరణ : జ్యోతిష్టోమయాగఘట్టంలో "నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి" (అతిరాత్రంలో షోడశిని గ్రహించకూడదు) "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి" (అతిరాత్రంలో షోడశిని గ్రహించాలి) అని రెండు వాక్యాలు ఉన్నాయి. ఈ రెండు వాక్యాలు రెండు విరుద్ధమైన విషయాలు చెపుతున్నాయి. రెండూ శ్రుతివాక్యాలే అవడంచేత సమానమైన ప్రామాణ్యం కలవే. అందుచేత షోడశిగ్రహణం వైకల్పికం, అనగా చేయవచ్చు, అవసరం లేదనుకుంటే మానివేయవచ్చు అని మీమాంసాశాస్త్రంలో నిర్ణయించారు. 'అతిరాత్రం' అంటే ఏమిటి, 'షోడశి' అంటే ఏమిటి ఈ విషయాలన్నీ ఆ శాస్త్రంలో చర్చించబడ్డాయి. ప్రస్తుతం మనకు వాటి ఉపయోగం లేదు. ఇక్కడ మనకు ఉపయోగించే విషయం - 'సమప్రాధాన్యం గల రెండు పరస్పరవిరుద్ధాలైనవి ఒక చోట ఉండవు', అనేది మాత్రమే.

**అనువాదే ఇతి-** మరొకదానికి అంగం అయినప్పుడు అని అర్థం. ఈ శ్లోకంలో విరుద్ధాలైన అర్థాలు (వాక్యార్థం అవడంచేత ప్రధానమైన) క్రీడకు అంగంగా చెప్పబడ్డాయి. అందుచేత ఒక రాజు దగ్గర ఉన్న ఇద్దరు ఆతతాయులవలె (పరస్పరద్వేషంతో ఒకరి నొకరు చంపాలనుకునే దుష్టులవలె) ఇవి విరుద్ధాలే అయినా మరొకదాని ముఖం కేసి చూస్తూ ఉండవలసినవి (అప్రధానమైనవి) అవడంచేత తాము ఏ క్రమంలో వినబడుతున్నాయో (చెప్పబడ్డాయో) ఆ క్రమంచేత తమను తామే స్వతంత్రంగా

గుర్తించుకొనలేని పరిస్థితిలో ఉన్నాయి. ఇంక అవి ఒకదాని స్వరూపాన్ని మరొకటి ఎలా గుర్తిస్తాయి? వాటికి అలాంటి విరోధం ఏమిటి? అయితే ఇవి విరుద్ధాలవడంచేత అరుణాధికరణన్యాయంచేత వాక్యంలో వీటి పాశ్చాత్యసంబంధం (తరవాత ఏర్పడే సంబంధం) ఏదైతే ఉండడానికి అవకాశం ఉందో అది విఘటితం అయితే కావచ్చును.

వివరణ- "అరుణయా పిఙ్గాక్ష్యా ఏకహాయన్యా గవా సోమం క్రీణాతి" అనే వాక్యం ఉంది. మీమాంసా సిద్ధాంతం ప్రకారం శాబ్దబోధలో భావన ముఖ్యవిశేష్యంగా ఉంటుంది. అందుచేత "సోమక్రయణం భావయేత్" అని ప్రధానవాక్యార్థం. భావనలో తృతీయాంతా లన్నీ కరణంగా అన్వయిస్తాయి. అరుణాదిశబ్దాలకి అరుణత్వాదులలో లక్షణ, అరుణత్వంచేత, పచ్చని కళ్లు ఉండడం (పింగాక్షీత్వం) చేత, ఏకహాయనీత్వం (ఒక సంవత్సరం వయస్సు కలిగి ఉండడంచేత) సోమక్రయణాన్ని భావించాలి. అని అర్థం ముందు ఏర్పడుతుంది. కాని అరుణత్వాదుల్నిచ్చి కొనడం కుదరదు గాన తరవాత ('అరుణయా' ఇత్యాదులన్నీ 'గవా'కి విశేషణాలుగా గ్రహించబడి - అరుణవర్ణ-పింగాక్షీత్వ-ఏకహాయనీత్వాదులతో కూడిన గోవుచేత సోమక్రయణం సాధించాలి అని అన్వయం ఏర్పరచుకోవాలి. ఇదే పాశ్చాత్యసంబంధం. తరవాత వచ్చిన అన్వయం. అదే విధంగా ఇక్కడ "యః అగచ్ఛతి న ఏవ గచ్ఛతి" ఇత్యాదివిధంగా ఏర్పడే పాశ్చాత్యాన్వయంలో విరోధం కనబడితే కనబడవచ్చును అని భావం.

## ధ్వన్యాలోకం

న చ రసేషు విధ్యనువాదవ్యవహారో నాస్తీతి శక్యం వక్తుమ్; తేషాం వాక్యార్థత్వేనాభ్యుపగమాత్; వాక్యార్థస్య వాచ్యస్య చ యౌ విధ్యనువాదౌ తౌ తదాక్షిప్తానాం రసానాం కేన వార్యేతే? యైర్వా సాక్షాత్కావ్యార్థతా రసాదీనాం నాభ్యుపగమ్యతే, తైస్తేషాం తన్నిమిత్తతా తావదవశ్యాభ్యుపగన్తవ్యా. తథాప్యత్ర శ్లోకే న విరోధః. యస్మాద నూద్యమానాఙ్గనిమిత్తోభయరసవస్తుసహకారిణో విధీయమానాంశాద్భావ విశేషప్రతీతిరుత్పద్యతే, తతశ్చ న కశ్చిద్విరోధః. దృశ్యతే హి విరుద్ధోభయసహకారిణః కారణాత్ కార్యవిశేషోత్పత్తిః. విరుద్ధఫలోత్పాదనహేతుత్వం హి యుగపదేకస్య కారణస్య విరుద్ధం

న తు విరుద్ధోభయసహకారిత్వమ్. ఏవంవిధవిరుద్ధపదార్థవిషయః కథమభినయః ప్రయోక్తవ్య ఇతి చేత్ - అనూద్యమానైవంవిధ వాచ్యవిషయే యా వార్తా సాత్రాపి భవిష్యతి. ఏవం విధ్యనువాదాశ్రయేణాత్ర శ్లోకే పరిహృతస్తావద్విరోధః.

బాలానందిని

న చేతి - రసాల విషయంలో విధి అనువాదం అనే వ్యవహారం ఉండదు అని చెప్పడానికి వీలు లేదు; రసాలు కూడ వాక్యార్థమే అని అంగీకరించబడింది కదా? వాచ్యమైన వాక్యార్థానికి ఏ విధిత్వానువాదత్వాలు ఉన్నాయో అవి వాచ్యార్థంచేత ఆక్షిప్తాలైన (వ్యంగ్యాలైన) రసాలకు ఉండవు అని ఎవరు నిరాకరించగలరు? రసాదులు సాక్షాత్తుగా కావ్యార్థాలు అని అంగీకరించనివారు కూడా వాటికి కావ్యార్థం నిమిత్తం అని అంగీకరించితీరాలి. ఆ పద్ధతిలో కూడ ఈ శ్లోకంలో విరోధం లేదు. ఎందువల్లననగా అనువదించబడుతూన్న అంగాలు (క్షిప్తత్వాదులు) నిమిత్తంగా గల రెండు రసాలనే వస్తువు సహకారిగా గల విధీయమానాంశంవల్ల ఒకానొక విశిష్టభావంయొక్క ప్రతీతి కలుగుతుంది. అందువల్ల విరోధం ఏదీ లేదు. పరస్పరవిరుద్ధాలైన రెండు సహకారులుగా గల కారణంనుంచి కార్యవిశేషంయొక్క ఉత్పత్తి కనబడుతున్నది కదా? ఒక కారణం ఒకే సమయంలో విరుద్ధాలైన ఫలాలను పుట్టించడం విరుద్ధం కాని ఒక కారణం రెండు విరుద్ధవస్తువులను సహకారులుగా తీసికోవడం విరుద్ధం కాదు కదా? ఏవంవిధేతి:- (ప్రశ్న) ఈ విధమైన విరుద్ధములైన పదార్థాలు విషయంగా గల అభినయం ఎలా ప్రయోగించడం కుదురుతుంది అని ప్రశ్నిస్తే - (సమాధానం) ఈ విధమైన వాచ్యార్థాలను అనువదించేటప్పుడు ఏమి సమాధానమో, ఏ పద్ధతో, అదే వార్త, పద్ధతి, ఇక్కడ కూడా ఉంటుంది. ఈ విధంగా విధ్యనువాదనయాన్ని (పద్ధతిని) ఆశ్రయించడంచేత ఈ శ్లోకంలో విరోధం పరిహరించబడింది.

లోచనం

నను ప్రధానతయా యద్వాచ్యం తత్ర విధిః. అప్రధానత్వేన తు వాచ్యే అనువాదః. న చ రసస్య వాచ్యత్వం త్వయైవ సోఢమిత్యాశఙ్క్యమానః పరిహరతి - న చేతి. ప్రధానాప్రధానత్వమాత్రకృతౌ విధ్యనువాదౌ. తౌ చ వ్యఙ్గ్యతాయామపి భవత ఏవేతి భావః. ముఖ్యతయా చ రస ఏవ కావ్య

వాక్యార్థ ఇత్యుక్తమ్. తేన అముఖ్యతయా యత్ర సోఽర్థః తత్ర అనూద్యమాన విభావాదిసమాక్షిప్తత్వాద్రసస్య అనూద్యమానతా; తదాహ - వాక్యార్థస్యేతి. యది వా మా భూదనూద్యమానతయా విరుద్ధయోః రసయోః సమావేశః, సహకారితయా తు భవిష్యతి ఇతి సర్వథా విరుద్ధయోః యుక్తియుక్తో ఙ్గాఙ్గిభావః, నాత్ర ప్రయాసః కశ్చిదితి దర్శయతి - యైర్వేతి. తన్నిమిత్తేతి. కావ్యార్థః విభావాదిర్నిమిత్తం యేషాం రసాదీనాం తే తథా, తేషాం భావస్తత్తా. అనూద్యమానాః యే హస్తక్షేపాదయః రసాఙ్గభూతాః విభావాదయః తన్నిమిత్తం యదుభయం కరుణవిప్రతిమ్భాత్మకం రసవస్తు, రససజాతీయం, తత్సహకారి యస్య విధీయమానస్య శామ్భవశరవహ్నిజనితదురితదాహలక్షణస్య తస్మాద్భావవిశేషే ప్రేయోలఙ్కారవిషయే భగవత్ప్రభావాతిశయలక్షణే ప్రతీతిరితి సంగతిః. విరుద్ధం యదుభయం వారితేజోగతం శీతోష్ణం తత్సహకారి యస్య తణ్డులాదేః కారణస్య తస్మాత్కార్యవిశేషస్య కోమలభక్తకరణలక్షణస్య ఉత్పత్తిః దృశ్యతే. సర్వత్ర హీత్థమేవ కార్యకారణ భావః బీజాఙ్కురాదౌ, నాన్యథా.

బాలానందిని

నన్వితి - ఏది ప్రధానంగా వాచ్యమో అక్కడ విధి ఉంటుంది. వాచ్యం అప్రధానం అయితే అక్కడ అనువాదం. రసం వాచ్యం అని నువ్వే సహించలేదు కదా? అని ఆశంకించుకొని పరిహరిస్తున్నాడు - న చేతి :- విధిత్వ అనువాదత్వాలు ప్రధానత్వా అప్రధానత్వాలచేత ఏర్పడతాయి. అవి వ్యంగ్యత్వంలో (వ్యంగ్యార్థం విషయంలో కూడ) ఉండవచ్చును అని భావం. రసం ముఖ్యం అవడంచేత అదే కావ్యంలో వాక్యార్థం అని చెప్పబడింది. అందుచేత ఎక్కడ ఆ అర్థం (వాక్యార్థం) అముఖ్యంగా ఉంటుందో అక్కడ రసానికి కూడ అనూద్యమానత్వం (రసం కూడా అనువదించబడుతుంది అని చెప్పడం) యుక్తమే. యదివా ఇతి లేదా అనువదించ బడుతున్న విభావాదులచేత ఆక్షిప్తం అవడంవల్ల రసం అనువదించబడుతున్నది అని చెప్పవచ్చును. ఆ విషయమే వాక్యార్థస్య ఇత్యాదికంచేత చెపుతున్నాడు. యదివా ఇతి:- లేదా విరుద్ధాలైన రసాలు అనువదించబడుతున్నాయి గాన ఒక చోట వాటి సమావేశం కుదురుతుంది అని చెప్పకపోయినా సహకారులుగా, అనగా ప్రధానవాక్యార్థానికి

సహకరించేవిగా, వాటిని ఒక చోట చేర్చవచ్చును. ఈ విధంగా విరుద్ధాలైన రసాదుల మధ్య అన్ని విధాలా అంగాంగిభావం కుదురుతుంది. ఈ విషయంలో ప్రయాస ఏదీ లేదు అని చెపుతున్నాడు - యైర్వా ఇతి. తన్నిమిత్తతేతి :- కావ్యార్థమైన విభావాదికం ఏ రసాదులకు నిమిత్తమో వాటి ధర్మం "తన్నిమిత్తతా". అనగా కావ్యార్థమైన విభావాదికం రసాదులకు నిమిత్తంగా ఉండడం అని అర్థం. యస్మాత్ ఇత్యాదివృత్తివాక్యాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు - అనూద్యమానా ఇతి. అనువదించబడుతున్న, రసాంగాలైన ఏ హస్తక్షేపాదివిభావాలు గలవో అవి నిమిత్తంగా గల ఏ ఉభయవిధమైన, కరుణ విప్రలంభాత్మకమైన, రసవస్తు= రససజాతీయమైనది ఉన్నదో, (ఇది అప్రధానం అవడంచేత రససజాతీయమే కాని రసం కాదు అనే అభిప్రాయంతో "రససజాతీయమ్" అన్నాడు) అది విధించబడే ఈశ్వరునిబాణాగ్నివల్ల జరిగే పాపదహనానికి సహకారిగా ఉండడంవల్ల ప్రేయోలంకారానికి స్థానమైన భగవంతుని ప్రభావాతిశయం అనే స్వరూపం గల భావవిశేషంయొక్క ప్రతీతి అని అన్వయం.

వివరణ: ఈ శ్లోకంలో ప్రధానంగా విధించబడేది శివుని బాణాగ్ని పాపాలను దహించడం అనేది. హస్తక్షేపం మొదలైన విభావాలచేత కరుణ - విప్రలంభరసాలు వ్యక్తం అవుతూన్నయి. అవి అప్రధానమై దురితదాహానికి సహకారులుగా ఉన్నాయి. అట్టి రసాలచేత ప్రేయోలంకారానికి స్థానమైన భగవత్ప్రభావాతిశయం ప్రతీతం అవుతున్నది.

విరుద్ధమితి - జలంలోను, తేజస్సులోను ఉన్న శీతోష్ణాలు రెండూ పరస్పరవిరుద్ధాలు. అలాంటి విరుద్ధాలైన శీతోష్ణాల సహాయంచేత తండులాదికారణాలు కోమలమైన అన్నం అనే కార్యాన్ని పుట్టించడం చూడబడుతుంది. బీజాంకురాదులైన అన్నింటిలోనూ కూడ ఈ విధంగానే కార్యకారణభావం ఉంటుంది; మరొక విధంగా కాదు. అనగా తేజస్సు, జలం మొదలైన వస్తువులు సహకారులుగా ఉన్న బీజాదులవల్ల అంకురరూపమైన కార్యం పుడుతుంది అని భావం.

లోచనం

నను విరోధస్తర్హి సర్వత్ర అకించిత్కరః స్యాదిత్యాశఙ్క్యాహ - విరుద్ధఫలేతి. తథా చాహుః - "నోపాదానం విరుద్ధస్య" ఇతి. నన్వభినేయార్థే కావ్యే యది ఈదృశం వాక్యం భవేత్తదా యది సమస్తాభినయః క్రియతే తదా విరుద్ధార్థవిషయః కథం యుగపదభినయః కర్తుం శక్య ఇత్యాశయే నాశఙ్క్యమాన ఆహ - ఏవమితి. ఏతత్పరిహరతి - అనూద్యమానేతి. అనూద్యమానమేవంవిధం

విరుద్ధాకారం వాచ్యం యత్ర తాదృశో యో విషయః - 'ఏహి గచ్ఛ పతోత్తిష్ఠ' ఇత్యాదిః తత్ర యా వార్తా సా అత్రాపీతి.

బాలానందిని

నన్వితి - అయితే విరోధంవల్ల ఎక్కడా కూడ ఏ బాధాలేదన్నట్లు అవుతుంది కదా అని ఆశంకించుకొని విరుద్ధఫలేత్యాదికం చెపుతున్నాడు. అందుచేతనే "ఒక వస్తువు విరుద్ధకార్యాలకి ఉపాధానం కాదు" అని అంటారు.

వివరణ - ఇక్కడ "నోపాదానం విరుద్ధస్య"కు బదులు 'నోత్పాదనం విరుద్ధస్య' అని పాఠం ఉండవచ్చును అని బాలప్రియాకారుడు వ్రాశాడు. "విరుద్ధఫలాలను పుట్టించదు" అని అర్థం స్పష్టంగా ఉంటుంది గాన అది యుక్తమే.

నన్వితి - (ఆశంక) అభినయించదగిన అర్థం కల కావ్యంలో (రూపకంలో) ఈ విధమైన వాక్యం ఉంటే, మొత్తం ఆ వాక్యం భావాన్నంతా అభినయించవలసి ఉంటే ఒకే సమయంలో విరుద్ధార్థాలను అభినయించడం ఎలా కుదురుతుంది అనే అభిప్రాయంతో ఆశంకిస్తూ ఏవమిత్యాదికం చెపుతున్నాడు. ఈ ఆశంకను పరిహరిస్తున్నాడు - అనూద్యమానేతి - అనువదించబడే ఈ విధమైన, విరుద్ధస్వరూపం గల వాచ్యం ఉన్న - "ఏహి గచ్ఛ పతోత్తిష్ఠ" ఇత్యాదివాక్యాలలో ఎట్లో అదే విధంగా చెయ్యాలి.

లోచనం

ఏతదుక్తం భవతి - "క్షిప్తో హస్తావలగ్నః" ఇత్యాదౌ ప్రాధాన్యేన భీతవిప్లుతాదిదృష్ట్యుపపాదనక్రమేణ ప్రాకరణికస్తావదర్థః ప్రదర్శయితవ్యః. యద్యప్యత్ర కరుణోఽపి పరాఙ్గమేవ తథాపి విప్రలమ్భాపేక్షయా తస్య తావన్నికటం ప్రాకరణికత్వం; మహేశ్వరప్రభావం ప్రతి సోపయోగత్వాత్. విప్రలమ్భస్య తు 'కామీవ' ఇత్యుత్ప్రేక్షోపమాబలేన ఆయాతస్య దూరత్వాత్. ఏవం చ "సాస్రనేత్రోత్పలాభిః" ఇత్యన్తం ప్రాధాన్యేన కరుణోపయోగాభినయ క్రమేణ, లేశతస్తు విప్రలమ్భస్య కరుణేన సాదృశ్యాత్ సూచనాం కృత్వా, "కామీవ" ఇత్యత్ర యద్యపి ప్రణయకోపోచితః అభినయః కృతః తథాపి తతః ప్రతీయమనోఽప్యసౌ విప్రలమ్భః సమనన్తరమభినీయమానే - "స దహతు దురితమ్" ఇత్యాదౌ సాటోపాభినయసమర్పితః యో భగవత్ప్రభావః

తత్రాఙ్గతాయాం పర్యవస్యతీతి న కశ్చిద్విరోధః. ఏతం విరోధపరిహారముపసంహరతి - ఏవమితి.

బాలానందిని

"క్షిప్తో హస్తావలగ్నః" ఇత్యాది శ్లోకాలలోని విరుద్ధార్థాభినయం చేయవలసి వచ్చినప్పుడు ఎట్లు చెయ్యాలో చూపుతున్నాడు - ఏతదితి :- ఇది చెప్పినట్లయింది - "క్షిప్తో హస్తావలగ్నః" ఇత్యాదులలో ప్రధానంగా భీతదృష్టి - విప్లుతదృష్టి మొదలైన దృష్టులను ఉపపాదించి ఆ క్రమంచేత ముందు ప్రాకరణికార్థాన్ని ప్రదర్శించాలి (ఈ దృష్టిభేదాలు నాట్యశాస్త్రప్రసిద్ధాలు. భయపడినవాళ్లు ఎలా చూస్తారో, కంగారు పడుతున్నవాళ్లు ఎలా చూస్తారో ఇలాంటి దృష్టులన్నీ దానిలో ప్రతిపాదించబడ్డాయి). ఇక్కడ కరుణరసం కూడ (విప్రలంభశృంగారం వలె) పరాంగమే అయినా అది మహేశ్వరుని ప్రభావాన్ని సూచించడం విషయంలో విప్రలంభంకంటె దగ్గరగా ఉంటుంది. అందుచేత దాని ప్రాకరణికత్వం (ప్రకృతసంబంధిత్వం) అధికమైనది ఎక్కువగా ఉపయోగకరంగా (మహేశ్వరప్రభావిష్కరణంలో) ఉంటుంది. 'కామీవ' అన్నప్పుడున్న ఉత్ప్రేక్షనో, ఉపమనో పట్టి వచ్చిన (అవగతమైన) విప్రలంభమైతే దూరమైనది. అందుచేత "సాస్రనేత్రోత్పలాభిః" వరకూ కూడ ప్రధానంగా కరుణకు అనుగుణమైన అభినయం నడిపిస్తూ, విప్రలంభానికి కరుణతో సాదృశ్యం ఉంది గాన లేశంగా దాని (విప్రలంభంయొక్క) సూచన కూడా చేసి "కామీవ" అన్నప్పుడు ప్రణయకోపానికి ఉచితమైన అభినయం చేసినా, ఆ అభినయంవల్ల ఈ విప్రలంభం ప్రతీయమానం అయినా, వెంటనే అభినయించవలసి ఉన్న "స దహతు దురితమ్" ఇత్యాదికంలో సాటోపంగా అభినయంచేత సమర్పితమైన భగవత్ప్రభావంలో అది (విప్రలంభం) అంగంగా పర్యవసానం చెందుతుంది గాన విరోధం ఏమీ లేదు. ఈ విరోధపరిహారాన్ని ఏవమ్ ఇత్యాదివాక్యం చేత ఉపసంహరిస్తున్నాడు.

ధ్వన్యాలోకం

కిం చ నాయకస్యాభినన్దనీయోదయస్య కస్యచిత్ ప్రభావాతిశయవర్ణనే తత్ప్రతిపక్షాణాం యః కరుణో రసః సః పరీక్షకాణాం న వైక్లబ్యమాదధాతి, ప్రత్యుత ప్రీత్యతిశయనిమిత్తతాం ప్రతిపద్యత ఇత్యతస్తస్య కుణ్ఠశక్తికత్వాత్ తద్విరోధవిధాయినః న

కశ్చిద్దోషః. తస్మాద్వాక్యార్థీభూతస్య రసస్య భావస్య వా విరోధీ రసవిరోధీతి వక్తుం న్యాయ్యః, న త్వఙ్గభూతస్య కస్య చిత్.

బాలానందిని

కించేతి - మరొక విషయం ఏమనగా - అభినందించదగిన అభ్యుదయం గల ఒకానొక నాయకుని ప్రభావాతిశయాన్ని వర్ణించేటప్పుడు అతని శత్రువులకు సంబంధించిన కరుణరసం పరీక్షకులకు మనఃక్లేశం కలిగించకపోవడం సరికదా ఆనందాతిశయానికి నిమిత్తంకూడ అవుతుంది. అందుచేత దానికి (వీరానికి లేదా రౌద్రానికి) విరోధాన్ని కలిగించే ఆ కరుణరసం శక్తి కుంఠితం అయిపోతుంది గాన (దీన్ని నిబంధించినా) దోషం ఏమీ లేదు. అందుచేత ఏదైతే వాక్యార్థమైన రసానికి గాని, భావానికి గాని విరోధిగా ఉంటుందో అదే రసవిరోధి అని చెప్పడం న్యాయం (యుక్తం) కాని అంగమైన మరొకదానికి దేనికో విరోధియైనది రసవిరోధి కాదు.

లోచనం

విషయాన్తరే తు ప్రకారాన్తరేణ విరోధపరిహారమాహ - కించేతి - పరీక్షకాణామితి సామాజికానాం వివేకశాలినామ్. న వైక్లబ్యమితి. న తాదృశే విషయే చిత్తద్రుతిరుత్పద్యతే, కరుణాస్వాదవిశ్రాన్త్యభావాత్, కిం తు వీరస్య యోఽసౌ క్రోధో వ్యభిచారితాం ప్రతిపద్యతే తత్ఫలరూపోఽసౌ కరుణరసః స్వకారణాభివ్యఞ్జనద్వారేణ వీరాస్వాదాతిశయ ఏవ పర్యవస్యతి. యథోక్తమ్ - "రౌద్రస్య చైవ యత్కర్మ స జ్ఞేయః కరుణో రసః" ఇతి. తదాహ - ప్రీత్యతిశయేతి. అత్రోదాహరణమ్-

కురవక కుచాఘాతక్రీడారసేన వియుజ్యసే
బకులవిటపిన్ స్మర్తవ్యం తే ముఖాసవసేచనమ్,
చరణఘటనాశూన్యో యాస్యస్యశోక సశోకతా
మితి నిజపురత్యాగే యస్య ద్విషాం జగదుః స్త్రియః.

భావస్య వేతి. తస్మిన్ రసే స్థాయినః ప్రధానభూతస్య వ్యభిచారిణో వా. యథా విప్రలమ్భశృఙ్గారే ఔత్సుక్యస్య.

## బాలానందిని

విషయేతి - మరొక విషయంలో ప్రకారాంతరంచేత (మరొకవిధంగా) విరోధపరిహారం చెపుతున్నాడు- కించేతి. పరీక్షకానామితి. వివేకవంతులైన సామాజికులకు అని అర్థం. న వైక్లబ్యమితి. అలాంటి విషయంలో కరుణరసాస్వాదంలో చిత్తం విశ్రమించదు గాన చిత్తద్రుతి కలగదు. మరేమనగా - వీరరసానికి వ్యభిచారి అయిన క్రోధానికి ఫలం ఈ కరుణరసం; అందుచేత ఇది తన కారణాన్ని (క్రోధాన్ని) వ్యంజింపచేయడం ద్వారా వీరరసాస్వాదాతిశయంలోనే పర్యవసానం చెందుతుంది. అందుచేతనే - "రౌద్రం యొక్క కార్యమే కరుణరసం" అని అన్నాడు. ఈ విషయాన్నే ప్రీత్యతిశయేత్యాదికం చేత చెపుతున్నాడు ఇందుకు ఉదాహరణం -

కురవకేతి - యస్య = ఎవనియొక్క, ద్విషాం స్త్రియః= శత్రువుల స్త్రీలు, నిజపురత్యాగే = తమ పట్టణాలను విడిచి వెళ్లిపోయేటప్పుడు, - "కురవక = ఓ! కురవకవృక్షమా! (గోరింటచెట్టా!) కుచాఘాతక్రీడాసుఖేన= కుచములతో కొట్టడం అనే క్రీడాసుఖం నుండి, వియుజ్యసే= దూరం అవుతున్నావు. వకులవిటపిన్= ఓ! పొగడచెట్టా! ముఖాసవసేచనమ్= ముఖాసవంతో తడపడం, తే = నీకు (నీచేత), స్మర్తవ్యమ్= స్మరించదగినది. అశోక= అశోకవృక్షమా! చరణఘటనాశూన్యః= పాదస్పర్శతో శూన్యమైనదానవై, సశోకతామ్= సశోకత్వాన్ని (శోకాన్ని), యాస్యసి= పొందగలవు, ఇతి = అని, జగదుః= పలికిరో.

వివరణ : ఇక్కడ కరుణరసం వర్ణ్యమాననాయకగతవీరరసానికి పోషకంగానే ఉండి వీరరసాస్వాదంలో అతిశయాన్ని కలిగిస్తూన్నది. అందుచేత విరోధం లేదు అని భావం.

భావస్య వేతి. ఆ రసంలోని స్థాయిభావానికి గాని, ప్రధానమైన (వాక్యార్థమైన) వ్యభిచారి భావానికి గాని విరోధియైన అని అర్థం. ఉదాహరణకు - విప్రలంభశృంగారంలో ఔత్సుక్యానికి (విరుద్ధమైనది రసవిరోధి).

## ధ్వన్యాలోకం

అథవా వాక్యార్థీభూతస్యాపి కస్యచిత్కరుణరసవిషయస్య తాదృశేన శృఙ్గారవస్తునా భఙ్గివిశేషాశ్రయేణ సంయోజనం రసపరిపోషాయైవ జాయతే యతః ప్రకృతిమధురాః పదార్థాః

శోచనీయతాం ప్రాప్తాః ప్రాగవస్థాభావిభిః సంస్మర్యమాణైః విలాసైః అధికతరం శోకావేశముపజనయన్తి. యథా -

శ్లో. అయం స రశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః,
నాభ్యూరుజఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః. (97)

ఇత్యాదౌ. తదత్ర త్రిపురయువతీనాం శామ్భవః శరాగ్నిః ఆర్ద్రాపరాధః కామీ యథా వ్యవహరతి స్మ తథా వ్యవహృతవానిత్యనేవాపి ప్రకారేణ అస్త్యేవ నిర్విరోధత్వమ్. తస్మాద్యథా యథా నిరూప్యతే తథా తథాత్ర దోషాభావః.

బాలానందిని

అథవా ఇతి - లేదా - ఒకానొక కరుణరసవిషయం వాక్యార్థం (ప్రధానం) అయినా కూడ, భంగివిశేషాన్ని, (విశిష్టమైన ఒక పద్ధతిని) ఆశ్రయించి శృంగారవస్తువుతో కలపడం రసపోషణానికే ఉపయోగిస్తుంది. ఎందువల్ల ననగా - స్వభావతః మధురాలైన కొన్ని పదార్థాలు విచారించవలసినవి (శోచనీయములు) అయినప్పుడు పూర్వావస్థకు సంబంధించిన విలాసాలతో స్మరించబడుచు అత్యధికమైన శోకావేశాన్ని కలిగిస్తాయి. ఎట్లనగా-

అయమ్ ఇత్యాది. మహాభారతంలో భూరిశ్రవస్సు హస్తం తెగి రణభూమిలో పడి ఉండగా దానిని పట్టుకొని విలపిస్తూన్న అతని భార్యలు అంటూన్న మాటలు - రశనోత్కర్షీ= వడ్డాణాలను లాగినదీ, పీనస్తనవిమర్దనః = పీనస్తనములను మర్దించినదీ, విస్రంసనః= పోకముడిని శిథిలం చేసినదీ అయిన, సః కరః= ఆ చెయ్యి, అయమ్= ఇదే.

ఇత్యాదులలో (ఇక్కడ శృంగారరసానికి సంబంధించిన పూర్వపు అనుభవాలు స్మరించబడి కరుణకు పోషకంగా ఉన్నాయి అని భావం). తదితి - అందువలన ఇక్కడ శివుని శరాగ్ని త్రిపురయువతుల విషయంలో ఆర్ద్రాపరాధుడైన (అంతక్రితమే అపరాధం చేసి ఉన్న) కాముకుడు ఏ విధంగా వ్యవహరిస్తాడో ఆ విధంగా వ్యవహరిస్తూన్నది అని అన్వయించుకున్నా కూడ విరోధం ఏమీ లేదు. అందుచేత ఈ విషయాన్ని పరిశీలించిన కొలదీ దోషం లేకపోవడమే కనబడుతున్నది.

లోచనం

అధునా పూర్వస్మిన్నేవ శ్లోకే క్షిప్త ఇత్యాదౌ ప్రకారాన్తరేణ విరోధం పరిహరతి - అథవా ఇతి. అయం చాత్ర భావః= పూర్వం విప్రలమ్భకరుణయోః అన్యత్రాఙ్గభావగమనాత్ నిర్విరోధత్వముక్తమ్. అధునా తు స విప్రలమ్భః కరుణస్యైవ అఙ్గతాం ప్రతిపన్నః కథం విరోధీతి వ్యవస్థాప్యతే. తథా హి - కరుణో రసో నామ ఇష్టజనవినిపాతాదేర్విభావాదిత్యుక్తమ్. ఇష్టతా చ నామ రమణీయతామూలా. తథా చ "కామీవార్ద్రాపరాధః" ఇత్యుత్ప్రేక్షయా ఇదముక్తమ్ - శామ్భవశరవహ్నిచేష్టితావలోకనే ప్రాక్తనప్రణయకలహవృత్తాన్తః స్మర్యమాణః ఇదానీం విధ్వస్తతయా శోకవిభావతాం ప్రతిపద్యతే. తదాహ- భఙ్గివిశేషేతి. అగ్రామ్యతయా విభావానుభావాదిరూపతాప్రాపణయా గ్రామ్యోక్తి రహితయేత్యర్థః - అత్రైవ దృష్టాన్తమాహ- యథా అయమితి. అత్ర భూరిశ్రవసః సమరభువి నిపతితం బాహుం దృష్ట్వా తత్కాన్తానామేత దనుశోచనమ్. రశనాం మేఖలాం సంభోగావసరేషూర్ధ్వం కర్షతీతి రశనోత్కర్షీ.

బాలానందిని

అధునేతి - ఇప్పుడు 'క్షిప్తః' ఇత్యాది పూర్వోదాహృతశ్లోకంలోనే మరొక విధంగా విరోధపరిహారాన్ని చెపుతున్నాడు - అథవేతి. ఇక్కడ భావం ఇది - విప్రలంభ - కరుణలు రెండూ ప్రధానవాక్యార్థమైన శంభుప్రభావాతిశయానికి అంగం అవడంచేత విరోధం లేదని వెనక చెప్పబడింది. విప్రలంభం కరుణకే అంగం అవుతుంది; అలా అవడంలో విరోధం ఏముంది అని ఇప్పుడు స్థాపించబడుతున్నది. ఎట్లనగా - కరుణరసం అనేది ఇష్టజనవినాశం మొదలైన విభావంవల్ల కలుగుతుంది అని చెప్పబడింది. ఇష్టత్వం అనేదానికి రమణీయత్వం మూలం. అందుచేత - 'కామీవార్ద్రాపరాధః' అనే ఉత్ప్రేక్షచేత ఇది చెప్పబడింది - శాంభవశరాగ్ని చేస్తూన్న చేష్టలు చూస్తూంటే (త్రిపురకాంతలకు) పూర్వపు ప్రణయకలహవృత్తాంతం స్మృతికి వచ్చి, ఇప్పుడు అది నశించిపోవడంచేత శోకానికి విభావం అవుతూన్నది. ఆ విషయాన్నే - భఙ్గివిశేషేణ అనే మాటతో చెపుతున్నాడు. భంగివిశేషాన్ని ఆశ్రయించడంచేత అనగా గ్రామ్యత్వం లేకపోవడంచేత అని అర్థం. అనగా గ్రామోక్త్యులు లేకుండగా విభావానుభావాదియాపాలను పొందించడంచేత అని

అర్థం. ఇందుకు దృష్టాంతం చెపుతున్నాడు - యథా అయమితి. ఇక్కడ - యుద్ధభూమిలో పడి ఉన్న భూరిశ్రవస్సు బాహువును చూచి అతని కాంతల విలాపం ఇది. రశనామ్= వడ్డాణమును, సంభోగసమయాలలో పైకి లాగేది రశనోత్కర్షి.

## ధ్వన్యాలోకం

ఇత్థం చ -

శ్లో. క్రామన్త్యః క్షతకోమలాఙ్గులిగలద్రక్తైః సదర్భాః స్థలీః
పాదైః పాతితయావకైరివ పతద్బాష్పామ్బుధౌతాననాః,
భీతా భర్తృకరావలమ్బితకరాస్త్వద్వైరినార్యోఽధునా
దావాగ్నిం పరితో భ్రమన్తి పునరప్యుద్యద్వివాహా ఇవ. (౯౪)

ఇత్యేవమాదీనాం సర్వేషామేవ నిర్విరోధత్వమవగన్తవ్యమ్. ఏవం తావద్రసాదీనాం విరోధిరసాదిభిః సమావేశాసమావేశయోః విషయవిభాగో దర్శితః.

### బాలానందిని

ఈ విధంగానే -

క్రామన్త్యః ఇత్యాది :- ఒక కవి రాజును స్తుతిస్తున్నాడు. క్షతకోమలాఙ్గులిగలద్రక్తైః = గాయపడిన కోమలములైన వ్రేళ్లనుండి కారుతున్న రక్తం కల, పాతితయావకైః ఇవ= పూయబడిన లత్తుక కలవి వలె ఉన్న, పాదైః= పాదాలతో, సదర్భాః= దర్భలతో కూడిన, స్థలీ= స్థలాలను, మెట్ట ప్రదేశాలను, క్రామన్త్యః= నడచి దాటుచున్న, గలదాబష్పామ్బు ధౌతాననాః= కారుతున్న కన్నీటిచేత కడిగివేయబడిన ముఖాలు గల, భీతాః= భయపడిన, త్వచ్ఛత్రునార్యః=నీ శత్రువుల స్త్రీలు, అధునా= ఇప్పుడు, భర్తృకరావలమ్బితకరాః= భర్తలచేత పట్టుకొనబడిన హస్తాలు కలవారై, పునః అపి= మరల, ఉద్యద్వివాహా ఇవ = జరుగుతూన్న వివాహం కలవాళ్లు వలె, దావాగ్నిం పరితః= దావాగ్ని చుట్టూ, భ్రమన్తి= తిరుగుతున్నారు. పాదాలకు పారాణి పెట్టుకొని వధువు వివాహంలో లాజహోమానంతరం భర్త తన చెయ్యి పట్టుకొని ముందు నడుస్తూండగా అగ్నిప్రదక్షిణం చేస్తుంది. ఆ సమయంలో పొగకి కన్నీళ్లు రావడం సహజం. ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకొని చేసిన వర్ణన ఇది.

ఈ మొదలైన వాటిలో అన్నింటిలోనూ విరోధం లేకపోవడం గ్రహించాలి. ఏవమితి - ఏ విధంగా రసాదులకు విరోధిరసాదులతో సమావేశం ఎలా చెయ్యాలి, ఎలా చేయగూడదు అని విషయవిభాగం చూపబడింది.

లోచనం

అమునా విరోధోద్ధరణప్రకారేణ బహుతరం లక్ష్యముపపాదితం భవతీత్యభిప్రేయేణాహ ఇత్థం చేతి. హోమాగ్నిధూమకృతం బాష్పామ్బు, యది వా బన్ధుగృహత్యాగదుఃఖోద్భవమ్, భయం కుమారీజనోచితః సాధ్వసః. ఏవమియతా "అఙ్గభావం ప్రాప్తానాముక్తిరచ్ఛలా" ఇతి కారికాభాగోపయోగి నిరూపితమిత్యుపసంహరతి - ఏవమితి. తావద్గ్రహణేన వక్తవ్యాన్తరమప్యస్తీతి సూచయతి. 20

బాలానందిని

అమునా ఇతి - ఈ విరోధోద్ధరణప్రకారంచేత, విరోధాన్ని ఎలా పరిహరించాలో ఇక్కడ చెప్పిన పద్ధతిచేత, ఎన్నో లక్ష్యాలను సమర్థించినట్లయింది అనే అభిప్రాయంతో ఇత్థం చ ఇత్యాదివాక్యం చెపుతున్నాడు. కన్నీరు హోమాగ్నిధూమంచేత కలిగినది లేదా బంధుగృహాన్ని విడవడంవల్ల కలిగినది. భయం అనగా ఆడపిల్లలలో సహజంగా ఉండే జంకు. ఏవమితి. ఈ విధంగా, ఇంతవరకు - "అఙ్గభావం ప్రాప్తానాముక్తిరచ్ఛలా" అనే కారికాభాగానికి ఉపయోగించే విషయం నిరూపించబడింది అని ఉపసంహరిస్తున్నాడు. 'తావత్' అనడంచేత ఇంకా చెప్పవలసినది ఉన్నది అని సూచిస్తున్నాడు.

## ధ్వన్యాలోకం

ఇదానీం తేషామేకప్రబన్ధనివేశనే న్యాయ్యో యః క్రమః తం ప్రతిపాదయితుమ్ ఉచ్యతే -

కా. ప్రసిద్ధేఽపి ప్రబన్ధానాం నానారసనిబన్ధనే,
ఏకో రసోఽఙ్గీకర్తవ్యస్తేషాముత్కర్షమిచ్ఛతా. 21

ప్రబన్ధేషు మహాకావ్యాదిషు నాటకాదిషు వా విప్రకీర్ణతయా అఙ్గాఙ్గిభావేన బహవః రసాః ఉపనిబధ్యన్తే ఇత్యత్ర ప్రసిద్ధౌ సత్యామపి యః రసబన్ధానాం ఛాయాతిశయయోగమిచ్ఛతి తేన తేషామన్యతమః

కశ్చిద్వివక్షితః రసః అఙ్గిత్వేన వినివేశయితవ్య ఇత్యయం యుక్తతరః మార్గః.

బాలానందిని

ఇదానీమితి - ఇప్పుడు ఆ రసాలను ఒక ప్రబంధంలో కూర్చడంలో యుక్తమైన మార్గాన్ని ప్రతిపాదించడం కోసం చెప్పబడుతున్నది -

ప్రసిద్ధే ఇతి :- ప్రబన్ధానామ్ - ప్రబంధాలలో, నానారసనిబన్ధనే= అనేకవిధాలైన రసాలను కూర్చడం, ప్రసిద్ధేఽపి= ప్రసిద్ధమైనను, తేషామ్= ఆ ప్రబంధాలయొక్క, ఉత్కర్షమ్= ఉత్కర్షను, ఇచ్ఛతా= కోరుచున్నవానిచేత, ఏకః రసః= ఒక రసం, అఙ్గీ కర్తవ్యః= అంగిగా చేయదగినది.

ప్రబన్ధేష్వితి - మహాకావ్యాదులు గాని, నాటకాదులు గాని అయిన ప్రబంధాలలో అనేక రసాలు ఇక్కడొకటి అక్కడొకటి అనే రీతిలో (విప్రకీర్ణతయా) అంగాంగిభావంతో నిబంధించబడతాయి అనే ప్రసిద్ధి ఉన్నా కూడ ఏ కవి ప్రబంధాలకు శోభాతిశయం రావాలని కోరతాడో అతడు ఆ రసాలలో తాను చెప్పదలచిన ఒక రసాన్ని అంగిగా కూర్చాలి అనేది చాలా యుక్తమైన మార్గం.

లోచనం

తదేవావతారయతి - ఇదానీమిత్యాదినా. తేషాం రసానాం క్రమః ఇతి యోజనా. ప్రసిద్ధేఽపీతి భరతమునిప్రభృతిభిర్నిరూపితేఽపీత్యర్థః. తేషామితి ప్రబన్ధానామ్. మహాకావ్యాదిష్విత్యాదిశబ్దః ప్రకారే, అనభినేయాన్ భేదానాహ; ద్వితీయస్తు అభినేయాన్. విప్రకీర్ణతయేతి - నాయకప్రతినాయక పతాకాప్రకరీనాయకాదినిష్ఠతయేత్యర్థః. అఙ్గాఙ్గిభావేనేత్యేకనాయకనిష్ఠత్వేన. యుక్తతర ఇతి - యద్యపి సమవాకారాదౌ, పర్యాయబన్ధాదౌ చ నైక స్యాఙ్గత్వం తథాపి నాయుక్తతా తస్యాపి. ఏవంవిధో యః ప్రబన్ధః తద్యథా నాటకం, మహాకావ్యం వా తదుత్కృష్టతరమితి తరశబ్దస్యార్థః. 21

బాలానందిని

తదేవేతి - దానినే (ఇంకా చెప్పవలసి ఉన్న విషయాన్నే) ఇదానీమ్ ఇత్యాదివాక్యం చేత ప్రవేశపెడుతున్నాడు (అవతారయతి). "ఆ రసములయొక్క క్రమం" అని అన్వయం. ప్రసిద్ధేఽపీతి - భరతమున్యాదులచేత నిరూపించబడినా కూడ అని అర్థం.

తేషామ్ అనగా ప్రబంధాలయొక్క అని అర్థం. 'మహాకావ్యాదిషు' అనేదానిలోని 'ఆది' శబ్దం ప్రకారార్థం. (వంటివి అని అర్థం). అందుచేత ఇది (ఈ పదం) అభినయింప వీలుకాని అర్థం కలవాటిని (శ్రవ్యకావ్యాలను) బోధిస్తుంది. రెండవపదం అభినేయార్థాలను (దృశ్యకావ్యాలను) బోధిస్తుంది. విప్రకీర్ణతయా ఇతి. నాయకునియందు ప్రతినాయకునియందు, పతాకానాయకునియందు, ప్రకరీనాయకునియందు ఉన్నట్లుగా అని అర్థం. అఙ్గాఙ్గిభావేనేతి - ఒకనాయకునియందు ఉన్నట్లుగా అని అర్థం. యుక్తతరః ఇతి :- సమవకారాదులలోను పర్యాయబంధాదులలోనూ కూడ ఒక రసం అంగిగా ఉండడం కుదరకపోయినా వాటిలో అయుక్తత్వం లేదు. ఈ విధమైన ప్రబంధం ఉదాహరణకి నాటకం గాని, మహాకావ్యం గాని చాలా ఉత్కృష్టమైనది అని 'తర' శబ్దానికి అర్థం. 21

## ధ్వన్యాలోకం

నను రసాన్తరేషు బహుషు ప్రాప్తపరిపోషేషు సత్సు కథమేకస్య అఙ్గితా న విరుధ్యతే ఇత్యాశఙ్క్య ఇదముచ్యతే -

కా. రసాన్తరసమావేశః ప్రస్తుతస్య రసస్య యః,

నోపహన్త్యఙ్గతాం సోఽస్య స్థాయిత్వేనావభాసినః. 22

ప్రబన్ధేషు ప్రథమతరం ప్రస్తుతః పునః పునరను సంధీయమానత్వేన స్థాయీ యో రసః తస్య సకలప్రబన్ధవ్యాపినః రసాన్తరైరన్తరాలవర్తిభిః సమావేశో యః స నాఙ్గితాముపహన్తి.

### బాలానందిని

నన్వితి :- అనేకములైన ఇతరరసాలు పరిపుష్టి చెంది ఉంటూండగా ఒక రసానికే అంగిత్వం అనేది విరుద్ధం కాకుండా ఎట్లుంటుంది అని ఆశంకించుకొని ఇది చెప్పబడుచున్నది - రసాన్తరేతి. యః= ఏ, రసాన్తరసమావేశః= ఇతరరసాల కూర్పు గలదో అది, స్థాయిత్వేన= స్థాయిగా, అవభాసినః= భాసిస్తూన్న, ప్రస్తుతస్య= ప్రస్తుతమైన, అస్య రసస్య= ఈ రసంయొక్క, అఙ్గితామ్= అంగిత్వాన్ని, న ఉపహన్తి = చెడగొట్టదు.

ప్రబన్ధేష్వితి : ప్రబంధాలలో ఏ రసం ముందుగా ప్రస్తుతమై (ప్రారంభించబడి, ప్రవేశపెట్టబడి) మాటి మాటికీ అనుసంధానం చేయబడుతూ స్థాయిగా (మొదటినుంచి

చివరిదాకా స్థిరంగా) ఉంటుందో, మొత్తం ప్రబంధాన్నంతనీ వ్యాపించి ఉన్న దాని అంగిత్వాన్ని,, మధ్య ఉండే ఇతర రసాలతో సమావేశం తొలగించజాలదు.

లోచనం

నన్వితి - స్వయం లబ్ధ పరిపోషత్వే కథమఙ్గత్వమ్? అలబ్ధపరిపోషత్వే వా కథం రసత్వమ్ ఇతి రసత్వమఙ్గత్వం చాన్యోన్యవిరుద్ధమ్. తేషాం చాఙ్గత్వాయోగే కథమేకస్య అఙ్గత్వముక్తమ్ ఇతి భావః. రసాన్తరేతి. ప్రస్తుతస్య సమస్తేతివృత్తవ్యాపినః తత ఏవ వితతవ్యాప్తికత్వేన అఙ్గిభావోచితస్య రసస్య రసాన్తరైః ఇతివృత్తవశాయాతత్వేన పరిమితకథాశకలవ్యాపిభిః యః సమావేశః, సముపబృంహణం, స తస్య స్థాయిత్వేనేతివృత్తవ్యాపితయా భాసమానస్య నాఙ్గితాముపహన్తి; అఙ్గితాం పోషయత్యేవేత్యర్థః.

బాలానందిని

నన్వితి. ఒక రసం తాను పరిపుష్టిని పొందితే అది అంగం ఎలా అవుతుంది? పరిపోషం పొందకపోతే అది రసం ఎలా అవుతుంది? అందుచేత రసత్వం, అఙ్గత్వం అనేవి పరస్పరవిరుద్ధాలు. రసాలకి అంగత్వం కుదరకపోతే వాటిలో ఒకటి అంగి అని ఎలా చెప్పబడుతుంది? అని (పూర్వపక్షి) భావం. రసాన్తరేతి. ప్రస్తుతమూ, సమస్త ఇతివృత్తాన్నీ వ్యాపించి ఉన్నదీ, ఈ విధంగా విస్తృతమైన వ్యాప్తికల దవడంచేతనే అంగిత్వానికి తగినదీ అయిన రసానికి, ఇతివృత్తవశంచేత వచ్చినవి అవడంచేత పరిమిత కథాఖండాన్ని మాత్రమే వ్యాపించి ఉండే ఇతరరసాలతో, సమావేశం, వాటి ద్వారా ఒక విధమైన పరిపుష్టి (సముపబృంహణం), మొత్తం ఇతివృత్తాన్నంతనీ వ్యాపించి ఉండడం చేత స్థాయిగా భాసిస్తూన్న ఆ రసానికి ఉన్న అంగిత్వాన్ని బాధించజాలదు; మీదు మిక్కిలి అంగిత్వాన్ని పోషిస్తుంది అని అర్థం.

లోచనం

ఏతదుక్తం భవతి - అఙ్గభూతాన్యపి రసాన్తరాణి స్వవిభావాదిసామగ్ర్యా స్వావస్థాయాం యద్యపి లబ్ధపరిపోషాణి చమత్కారగోచరతాం ప్రతిపద్యన్తే తథాపి స చమత్కారః తావత్యేన న పరితుష్య విశ్రామ్యతి, కిం తు చమత్కారాన్తరమనుధావతి. సర్వత్రైవాఙ్గాఙ్గిభావే అయమేవోదన్తః, యదాహ తత్రభవాన్ -

గుణః కృతాత్మసంస్కారః ప్రధానం ప్రతిపద్యతే,

ప్రధానస్యోపకారే హి తథా భూయసి వర్తతే. ఇతి.

బాలానందిని

ఏతదితి. ఇక్కడ ఈ విషయం చెప్పినట్లవుతుంది - అంగాలైన ఇతరరసాలు తమ తమ విభావాదిసామగ్రిచేత, తమ పరిధిలో (స్వావస్థాయాం) పరిపుష్టిని పొంది చమత్కారగోచరాలైనా కూడ ఆ చమత్కారం అంతటితో సంతోషించి (సంతృప్తి) చెంది విశ్రమించేదు. మరేమనగా మరొక చమత్కారం వైపు పరుగెడుతుంది. అంగాంగి భావం ఉన్న ప్రతిచోటా ఇదే వృత్తాంతం (పరిస్థితి). అందుచేతనే పూజ్యుడు ఇలా అన్నాడు -

గుణ ఇతి - గుణః= అంగమైనది (అప్రధానమైనది) కృతాత్మసంస్కారః= చేసుకొనబడిన ఆత్మసంస్కారం గలదై (తనను తాను సంస్కరించుకుని), ప్రధానమ్= ప్రధానమును, ప్రతిపద్యతే= పొందును. తథా= ఆ విధంగా (ముందు తనను తాను సంస్కరించుకుంటే) ప్రధానస్య= ప్రధానానికి, భూయసి= అధికమైన, ఉపకారే= ఉపకారమునందు, వర్తతే= ఉండును.

వివరణ:- ఇక్కడ చెప్పినట్లు అంగరసం ముందుగా తాను పరిపుష్టి చెందిన తరవాత ప్రధానరసానికి ఉపకారకం అవుతుంది అని భావం. ఈ శ్లోకం ఎక్కడిదో తెలియలేదు. శ్లోకసూచికలో (ధ్వన్యాలోకం చివర) నాట్యశాస్త్రంలోనిది అని వ్రాశారు. కాని అక్కడ కనబడలేదు. ఇలాంటి శ్లోకం నాట్యశాస్త్రంలో ఉంటుందా అనేది కూడ సందేహాస్పదమే. దీని పద్ధతిని పట్టి చూస్తే పతంజలి-భర్తృహరి-కుమారిలభట్టులలో ఒకరిదై ఉండాలని తోస్తుంది. అభినవగుప్తాచార్యులు తత్రభవాన్ అని నిర్దేశించాడంటే ఈయన ముగ్గురిలో ఒకరై ఉండాలి. పరిశీలనీయం. 22

ధ్వన్యాలోకం

ఏతదేవోపపాదయితు మిదముచ్యతే -

కా. కార్యమేకం యథా వ్యాపి ప్రబన్ధస్య విధీయతే,

తథా రసస్యాపి విధౌ విరోధో నైవ విద్యతే. 23

సంధ్యాదిమయస్య ప్రబన్ధశరీరస్య యథా కార్యమేక మనుయాయి వ్యాపకం కల్ప్యతే న చ తత్ కార్యాన్తరైః న సంకీర్యతే,

న చ తైః సంకీర్యమాణస్యాపి తస్య ప్రాధాన్యమపచీయతే, తథైవ రసస్యాప్యేకస్య సంనివేశే క్రియమాణే విరోధో న కశ్చిత్, ప్రత్యుత ప్రత్యుదితవివేకానామనుసంధానవతాం సచేతసాం తథావిధే విషయే ప్రహ్లాదాతిశయః ప్రవర్తతే.

బాలానందిని

ఏతవేదితి. ఈ విషయాన్నే ఉపపాదించడానికి ఇది చెప్పబడుచున్నది.

కార్యమితి - ప్రబన్ధస్య = ప్రబంధానికి, వ్యాపి= వ్యాపించిన (ప్రారంభంనుంచి చివరిదాక వ్యాపించిన), ఏకకార్యమ్= ఒక కార్యం, యథా= ఎట్లు, విధీయతే= విధించబడుతుందో, తథా= అట్లే (ప్రబంధా న్నంతనీ వ్యాపించేటట్లు), రసస్య = రసంయొక్క, విధౌ అపి= విధియందు, (కూర్చడంలో) కూడ, విరోధః= విరోధం, న విద్యతే= లేదు.

సంధ్యాదీతి - సంధ్యాదిమయమైన, (ముఖ ప్రతిముఖాది సంధుల రూపంలో ఉన్న) ప్రబంధశరీరాన్నంతనీ వ్యాపించి ఉండేటట్లు ఒక కార్యం ఏ విధంగా ఏర్పరచబడుతుందో, అది ఇతరకార్యాలతో కలవదనే మాట ఏ విధంగా లేదో, వాటితో కలిసినా కూడ దాని ప్రాధాన్యం ఏ విధంగా తగ్గదో అదే విధంగా ఒక (ప్రధానమైన) రసం యొక్క సంనివేశం చేసినా కూడ విరోధం ఏదీ ఉండదు. విరోధం లేకపోవడమే కాకుండా వివేకవంతులైన పూర్వాపరానుసంధానం గల సహృదయులకు ఆ విధమైన విషయంలో ఆనందాతిశయం కూడ కలుగుతుంది.

లోచనం

**ఉపపాదయితుమితి** - దృష్టాన్తస్య సముచితస్య నిరూపణేనేతి భావః. న్యాయేన చైతదేవోపపద్యతే; కార్యం హి తావదేకాధికారికం వ్యాపకం ప్రాసఙ్గికకార్యాన్తరోపక్రియమాణమ్ అవశ్యమఙ్గీకర్తవ్యమ్. తత్పృష్ఠవర్తినీనాం నాయకచిత్తవృత్తీనాం తద్బలాదేవ అఙ్గాఙ్గిభావః ప్రవాహోపతిత ఇతి కిమత్రాపూర్వమితి తాత్పర్యమ్. తథేతి వ్యాపితయా. యది వా ఏవకారః భిన్న క్రమః. తథైవ తేనైవ ప్రకారేణ కార్యాఙ్గాఙ్గిభావరూపేణ రసానామపబలాదేవ అసావాపతతీత్యర్థః. తథా చ వృత్తౌ వక్ష్యతి - "తథైవేతి".

కార్యమితి. "స్వల్పమాత్రం యదుత్సృష్టం బహుధా యద్విసర్పతి" (నా.శా.19.22) ఇతి లక్షితం బీజమ్; బీజాత్ ప్రభృతి "ప్రయోజనానాం విచ్ఛేదే యదవిచ్ఛేదకారణమ్; యావత్సమాప్తిర్బన్ధస్య స తు బిన్దుః" (నా.శా.19.23) ఇతి బిన్దురూపార్థప్రకృత్యా నిర్వహణపర్యన్తం వ్యాప్నోతి:తదాహ- అనుయాయీతి. అనేన బీజం బిన్దుశ్చే త్యర్థప్రకృతీ సంగృహీతే. కార్యాన్తరైరితి "ఆ గర్భాదావిమర్శాద్వాపతాకా వినివర్తతే" (నా.శా.19.29) ఇతి ప్రాసఙ్గికం యత్ పతాకాలక్షణార్థప్రకృతినిష్ఠం కార్యం, యాని చ తతోఽపి ఊన వ్యాప్తితయా ప్రకరీలక్షణాని కార్యాణి తైరిత్యేవం పఞ్చానామర్థప్రకృతీనాం వాక్యైకవాక్యతయా నివేశ ఉక్తః. తథావిధ ఇతి - యథా తాపసవత్సరాజే. ఏవమనేన శ్లోకేన అఙ్గాఙ్గితాయాం దృష్టాన్తనిరూపణమితివృత్తబలాపతితత్వం చ రసాఙ్గాఙ్గిభావ స్యేతి ద్వయం నిరూపితమ్. వృత్తిగ్రన్థోఽప్యుభయాభి ప్రాయేణైవ నేయః.

బాలానందిని

ఉపపాదయితుమితి - తగిన దృష్టాంతం చూపించి ఉపపాదించుటకు అని అర్థం. న్యాయేనేతి - న్యాయం (యుక్తి) చేత కూడ ఇది ఉపపన్నం అవుతుంది (కుదురుతుంది). ఆధికారికమూ (ముఖ్యమూ) సర్వప్రబంధశరీరవ్యాపకమూ, ప్రాసంగికాలైన ఇతర కార్యాలచేత ఉపకరించబడేదీ అయిన ఒకే కార్యాన్ని తప్పకుండా (ప్రబంధాదులలో) అంగీకరించాలి. నాయకుని చిత్తవృత్తు లన్నీ ఆ కార్యం వెనకనే నడుస్తాంటాయి; అందుచేత దాని బలంవల్లనే (నాయకచిత్తవృత్తులు ఆధికారికమైన కార్యం వెనుకనే నడుస్తాయి కావుననే) వాటికి (ఆ వివిధ చిత్తవృత్తులకు) అంగాంగిభావం ప్రవాహపద్ధతిలో వచ్చేస్తుంది; దీనిలో కొత్త విశేషం ఏముంది; అని తాత్పర్యం. **తథేతి** - వ్యాపకంగా అని అర్థం. లేదా ఏవకారం భిన్నక్రమం. అనగా 'నైవ' లోని 'ఏవ' కారాన్ని తీసికొని వచ్చి 'తథా' తో అన్వయించాలి. 'తథైవ' అవుతుంది. ఆ ప్రకారంచేతనే, కార్యంలో ఉండే అంగాంగిభావరూపంచేతనే, రసాలకు కూడా, తప్పనిసరిగా (బలాత్) ఇది (అంగాంగిభావం) వచ్చిపడుతుంది అని అర్థం. అందుచేతనే ('ఏవ' ను 'తథా' తో అన్వయించి) 'తథైవ' అని వృత్తిలో చెప్పనున్నాడు.

కార్యమితి. "స్వల్పంగా విడవబడినదై (చల్లబడినదై, ఉంచబడినదై) ఏది బహువిధాల విస్తరిస్తుందో అది బీజం" అని బీజం నిర్వచించబడింది, ఆ బీజం

మొదలు - "ప్రయోజనాలకు విచ్ఛేదం కలిగినప్పుడు, ఏది ప్రబంధసమాప్తి వరకు, అవి విచ్ఛిన్నం కాకుండడానికి కారణమో అది బిందువు" అని చెప్పిన బిందువనే అర్థ ప్రకృతితో కలిసి నిర్వహణసంధివరకూ వ్యాపించేది కార్యం. ఆ విషయమే 'అనుయాయి' అనే మాటలో చెపుతున్నాడు. ఈ విధంగా 'బీజం' 'బిందువు' అనే రెండు అర్థప్రకృతులు చెప్పబడ్డాయి. కార్యాన్తరైరితి. "పతాక గర్భసంధివరకు గాని, విమర్శసంధివరకు గాని వ్యాపించి ఉండి మరలుతుంది" అని ప్రాసంగికమైన 'పతాక' అనే అర్థప్రకృతితో సంబంధించిన కార్యమూ, దానికంటె తక్కువ వ్యాప్తి కలవి అవడంచేత "ప్రకరి" అని చెప్పబడే కార్యాలు, వాటితో (కలుస్తున్న) అని చెప్పడంచేత అయిదు అర్థప్రకృతులూ కూడ వాక్యైకవాక్యత్వంతో (ప్రధానమైన వాక్యార్థంతో సంబంధించేవిగా) కూర్చాలి అని చెప్పబడింది. తథావిధే ఇతి : ఉదాహరణకు తాపసవత్సరాజం. ఏవమితి. ఈ విధంగా ఈ శ్లోకంచేత అంగాంగిభావం విషయంలో దృష్టాంతాన్ని చూపడం, రసాలకు ఉండే అంగాంగిభావం ఇతివృత్తబలంచేతనే వస్తుంది అని చెప్పడం అనే రెండు పనులు చేయబడ్డాయి. వృత్తిగ్రంథాన్ని కూడ ఈ అభిప్రాయంతోనే సమన్వయించుకోవాలి.

వివరణ:- రసాల మధ్య అంగాంగిభావం ఏ విధంగా ఉంటుంది అనే దానికి దృష్టాంతం చూపుతున్నట్లు మాత్రమే పైకి కనబడినా, రసాలకు ఆ విధంగా అంగాంగిభావం ఎందుకు ఏర్పడుతుందో కారణం కూడా ఈ శ్లోకంలోను, వృత్తిలోనూ చెప్పబడింది అని భావం. కావ్యనాటకాదులలో కథ ఆధికారికం, పతాక, ప్రకరి అని మూడు విధాలుగా ఉంటుంది. ఉదాహరణకి - రామాయణంలో మొదటి నుంచి చివరి దాకా నడిచే ప్రధానేతివృత్తమైన సీతారామకథ ఆధికారికం. ప్రధానకథతో చాలా దూరం నడిచే సుగ్రీవవృతాంతం పతాక. అంతకంటె తక్కువ దూరం ప్రధానకథతో సంబంధించి నడిచే శబరీవృత్తాంత - విభీషణవృత్తాంతాదులు 'ప్రకరి'.

## ధ్వన్యాలోకం

నను యేషాం రసానాం పరస్పరావిరోధః యథా - వీరశృఙ్గారహాస్యయోః, రౌద్రశృఙ్గారయోః, వీరాద్భుతయోః, వీరరౌద్రయోః, రౌద్రకరుణయోః, శృఙ్గారాద్భుతయోర్వా, తత్ర భవతు అఙ్గాఙ్గిభావః. తేషాం తు స కథం భవేద్యేషాం పరస్పరం బాధ్యబాధకభావః? యథా - శృఙ్గారబీభత్సయోః, వీరభయానకయోః,

శాన్తరౌద్రయోః, శాన్తశృఙ్గారయోర్వా? ఇత్యాశఙ్క్య ఇదముచ్యతే -

కా. అవిరోధీ విరోధీ వా రసోఽఙ్గిని రసాన్తరే,

పరిపోషం న నేతవ్యస్తథా స్యాదవిరోధితా. 24

అఙ్గిని రసాన్తరే శృఙ్గారాదౌ ప్రబన్ధవ్యఙ్గ్యే సతి అవిరోధీ విరోధీ వా రసః పరిపోషం న నేతవ్యః. తత్ర అవిరోధినో రసస్య అఙ్గిరసాపేక్షయా అత్యన్తమాధిక్యం న కర్తవ్యమితి ప్రథమః పరిపోషపరిహారః. ఉత్కర్షసామ్యేఽపి తయోర్విరోధాసంభవాత్. యథా -

గాథ. ఏకన్తో రుఅఇ పిఆ అణ్ణన్తో సమరతూరణిగ్ఘోసో,

ణేహేణ రణరసేణ అ భడస్స దోలాఇఅం హిఅఅమ్. (99)

యథా వా -

శ్లో. కణ్ఠాచ్ఛిత్త్వాక్షమాలావలయమివ కరే హారమావర్తయన్తీ

కృత్వా పర్యఙ్కబన్ధం విషధరపతినా మేఖలాయా గుణేన,

మిథ్యామన్త్రాభిజాపస్ఫురదధరపుటవ్యఞ్జితావ్యక్తహాసా

దేవీ సన్ధ్యాభ్యసూయాహసితపశుపతిస్తత్ర దృష్టా తు వోఽవ్యాత్.

ఇత్యత్ర. (100)

బాలానందిని

నన్వితి (ఆశంక) - ఏ రసాలకు పరస్పరవిరోధం లేదో, ఎట్లనగా వీర - శృంగారాలకీ, శృంగార - హాస్యాలకీ, రౌద్ర - శృంగారాలకీ, వీర - అద్భుతాలకీ, వీర - రౌద్రాలకీ, రౌద్ర - కరుణలకీ, శృంగార - అద్భుతాలకీ, అక్కడ (రెండు రసాలమధ్య) అంగాంగిభావం ఉంటే ఉండవచ్చు. కాని వేటికైతే పరస్పరం బాధ్యబాధకభావం ఉందో (ఒకటి రెండవ దాన్ని బాధించేదిగా ఉంటుందో) వాటికి ఎట్లు కుదురుతుంది? ఎట్లనగా - శృంగార-భీభత్సాలకీ, వీర- భయానకాలకీ, శాంత - రౌద్రాలకీ, శాంత - శృంగారాలకీ, అని ఆశంకించుకొని ఇది చెప్పబడుచున్నది -

అవిరోధీ ఇతి - రసాన్తరే = మరొక రసం, అఙ్గిని= అంగిగా ఉంటూండగా, అవిరోధీ= అవిరోధిగాని, విరోధీ వా= విరోధి గాని అయిన, రసః= రసం, పరిపోషమ్=

పరిపోషాన్ని, న నేతవ్యః= పొందించదగినది కాదు. తథా= ఆవిధంగా, అవిరోధితా= విరోధాభావం, స్యాత్ = కలుగును.

అఙ్గినీతి :- శృంగారాదిరసాంతరం అంగిగా ప్రబంధంలో వ్యంగ్యం అవుతూండగా దానికి విరోధియైన రసాన్ని కాని, అవిరోధియైన రసాన్ని గాని పరిపుష్టి చెందించగూడదు. వాటిలో అవిరోధియైన రసానికి అంగిరసంకంటె చాలా ఆధిక్యం ఇవ్వకూడదు అనేది మొదటి పరిపోషపరిహారం; పరిపోషాన్ని పరిహరించడంలో మొదటి పద్ధతి. ఎందువలన అనగా - ఉత్కర్ష సమంగా ఉన్నా కూడ వాటికి విరోధం ఉండదు. సహజంగా అవిరోధులైన రెండు రసాలకూ సమానమైన ఉత్కర్ష ఉన్నా విరోధం ఉండదు గాని అంగిరసంకంటె అంగరసానికి ఉత్కర్ష ఇస్తే మాత్రం దోషం (విరోధం) అని భావం. ఎట్లనగా -

ఏకన్తో ఇతి - దీని ఛాయ వ్యాఖ్యానంలో ఇవ్వబడింది. ఏకతః= ఒక ప్రక్క ప్రియా= ప్రియురాలు, రోదితి= ఏడ్చుచున్నది. అన్యతః= మరొక ప్రక్క, సమరతూర్యని ర్ఘోషః= యుద్ధవాద్యధ్వని. భటస్య= భటునియొక్క, హృదయమ్= హృదయం, స్నేహేన= స్నేహంచేతా, రణరసేన= యుద్ధోత్సాహంచేతా, దోలాయితమ్= ఊగులాడినది.

మరొక ఉదాహరణం ఎట్లనగా -

కణ్ఠాదితి - కణ్ఠాత్ - కంఠంనుంచి, హారమ్= హారమును, ఛిత్త్వా= ఛేదించి, కరే= హస్తమునందు, అక్షమాలావలయమివ= జపమాలావలయమును వలె, ఆవర్తయన్తీ= త్రిప్పుచున్నదీ, మేఖలాగుణేన= వడ్డాణంచేత, విషధరపతినా(ఇవ)= వాసుకిచేత వలె, పర్యఙ్కబన్ధమ్= పర్యంకబంధాన్ని (జపం చేసుకునేటప్పుడు మోకాళ్లు పైకెత్తి వాటికీ నడుముకీ కలిపి చుట్టి వస్త్రాదికంతో కట్టడం పర్యంకబంధం). కృత్వా= చేసి, మిథ్యా మన్త్రాభిజాపస్ఫురదధరపుటవ్యఞ్జితావ్యక్తహాసా= అసత్యమైన (ఉట్టుట్టిగా) మంత్రజపం చేత కదలుతూన్న అధరపుటమునుండి సూచించబడుతూన్న అస్పష్టమైన నవ్వు గలదిగా, తత్ర = అక్కడ, దృష్టా= చూపబడిన, సన్ధ్యాభ్యసూయాహసితపశుపతిః= (శివునిచేత అర్చించబడుతూన్న) సంధ్యయందు అసూయచేత నవ్వించబడిన శివుడు గల, దేవీ= దేవి, వః= మిమ్ములను, అవ్యాత్= రక్షించుగాక. అనే చోట.

వివరణ :- మొదటి శ్లోకంలో వీరరసం అంగి, విప్రలంభం అంగం. ఈ రెండింటికి సహజవిరోధం లేదు. ఇక్కడ రెండింటికీ సమానమైన పరిపోషమే చేయబడింది గాన విరోధం లేదు. రెండవ శ్లోకంలో విప్రలంభం అంగి, హాస్యం అంగం. సహజంగా విరోధం లేని ఈ రెండింటికీ ఇక్కడ సమానమైన పరిపోష చేయబడింది.

లోచనం

శృఙ్గారేణ వీరస్య అవిరోధః, యుద్ధనయపరాక్రమాదినా కన్యారత్న లాభాదౌ. హాస్యస్య తు స్పష్టమేవ తదఙ్గత్వమ్. హాసస్య స్వయమపురుషార్థ స్వభావత్వేఽపి సమధికతరరఞ్జనోత్పాదనేన శృఙ్గారాఙ్గతయైవ తథాత్వమ్. రౌద్రస్యాపి తేన కథఞ్చిదవిరోధః. యథోక్తమ్ - "శృఙ్గారశ్చ తైః ప్రసభం సేవ్యతే". తైరితి రౌద్రప్రకృతిభిః రక్షోదానవోద్ధతమనుష్యైరిత్యర్థః. కేవలం నాయికావిషయమౌగ్ర్యం తత్ర పరిహర్తవ్యమ్. అసమ్భావ్యపృథివీసమార్జనాది జనితవిస్మయతయా తు వీరాద్భుతయోః సమావేశః. యథాహ మునిః - "వీరస్య చైవ యత్కర్మ సోఽద్భుతః" ఇతి. వీరరౌద్రయోః ధీరోద్ధతే భీమసేనాదౌ సమావేశః. క్రోధోత్సాహయోః అవిరోధాత్. రౌద్రకరుణయోరపి మునినైవోక్తః-

"రౌద్రస్యైవ చ యత్కర్మ స జ్ఞేయః కరుణో రసః" ఇతి.

శృఙ్గారాద్భుతయోరితి - యథా రత్నావల్యామైన్ద్రజాలికదర్శనే. శృఙ్గారబీభత్సయోరితి:- యయోర్హి పరస్పరోన్మూలనాత్మకతయైవ ఉద్భవః తత్ర కః అఙ్గాఙ్గీభావః? ఆలమ్బననిమగ్నరూపతయా చ రతిరుత్తిష్ఠతి, తతః పలాయమానరూపతయా జుగుప్సేతి సమానాశ్రయత్వేన తయోరన్యోన్య సంస్కారోన్మూలనత్వమ్. భయోత్సాహవప్యేవమేవ విరుద్ధౌ వాచ్యౌ. శాన్తస్యాపి తత్త్వజ్ఞానసముత్థితసమస్తసంసారవిషయనిర్వేదప్రాణత్వేన సర్వతః నిరీహస్వభావస్య విషయాసక్తిజీవితాభ్యాం రతిక్రోధాభ్యాం విరోధ ఏవ.

బాలానందిని

శృఙ్గారస్యేతి - యుద్ధం, నీతిప్రయోగం, పరాక్రమం మొదలైనవాటిచేత కన్యారత్నాన్ని పొందడం మొదలైన సందర్భాలలో వీరానికి శృంగారంతో విరోధం ఉండదు. హాస్యం శృంగారాంగం అనే విషయం స్పష్టమే. హాస్యం స్వతంత్రంగా పురుషార్థస్వభావం కలది కాకపోయినా అత్యధికమైన మనోరంజనం కలిగించడం ద్వారా శృంగారానికి అంగంగా ఉంటూ పురుషార్థోపయోగిగా ఉంటుంది. రౌద్రానికి శృంగారంతో ఏదో విధంగా విరోధం లేదని చెప్పాలి. "వాళ్లచేత శృంగారం కూడ

బలాత్కారంగానే సేవించబడుతుంది" అని భరతముని చెప్పాడు. వాళ్లు అనగా - రౌద్రప్రకృతులైన రాక్షస - దానవ-ఉద్ధతమనుష్యులు అని అర్థం. అయితే నాయిక విషయంలో మాత్రం వాళ్లు ఉగ్రంగా ప్రవర్తిస్తున్నట్లు చూపకూడదు. ఊహింప శక్యం కాని పృథివీసంపాదనాదులవల్ల విస్మయ కలుగుతుంది గాన వీర-అద్భుతాలకు కలయిక కుదురుతుంది. "వీరుడు చేసే పనియే అద్భుతం" అని ముని అన్నాడు. క్రోధానికీ ఉత్సాహానికీ విరోధం లేదు గాన భీమసేనాదులలో వీరరౌద్రాదుల కలయిక ఉంటుంది. రౌద్రకరుణల కలయిక కూడ - "రౌద్రంయొక్క కర్మయే కరుణరసం" అని మునిచేతనే ప్రతిపాదించబడింది. శృంగారాద్భుతయోరితి. రతావళిలో ఐంద్రజాలికదర్శన ఘట్టంలో వలె. ఇప్పుడు విరుద్ధరసాలను గూర్చి చెపుతున్నాడు - శృఙ్గారబీభత్సయోరితి. ఒకదాని నొకటి పెకిలించివేస్తూనే పుట్టేవాటి మధ్య అంగాంగిభావం ఏమిటి? రతి ఆలంబనంలో మునిగిపోతూన్న స్వరూపంతో ఆవిర్భవిస్తుంది; జుగుప్స ఆలంబనంనుంచి దూరంగా పారిపోతూన్న స్వరూపంతో ఆవిర్భవిస్తుంది. అందుచేత ఈ రెండింటికీ ఆశ్రయం ఒకటే అయిన పక్షంలో ఒకదాని సంస్కారాన్ని మరొకటి పెకిలించివేస్తుంది. భయోత్సాహాలు కూడ ఈ విధంగానే విరుద్ధాలని చెప్పాలి. తత్త్వజ్ఞానంచేత కలిగిన, సమస్తసంసారవిషయాలమీద నిర్వేదమే శాంతానికి ప్రాణం. దేనిమీదా ఆసక్తి లేకపోవడం అనే స్వభావం గల ఈ శాంతానికి రతిక్రోధాలతో విరోధమే.

### లోచనం

అవిరోధీ విరోధీ వేతి. వాగ్రహణస్య అయమభిప్రాయః- అఙ్గిరసాపేక్షయా యస్య రసాన్తరస్యోత్కర్షో నిబధ్యతే తదా తదవిరుద్ధోఽపి రసో నిబద్ధః చోద్యావహః. అథ తు యుక్త్యా అఙ్గిని రసే అఙ్గభావతానయేన ఉపపత్తిర్ఘటతే తద్విరుద్ధోఽపి రసో వక్ష్యమాణేన విషయభేదాదియోజనేన ఉపనిబధ్యమానః న దోషావహ ఇతి విరోధావిరోధౌ అకించిత్కరౌ. వినివేశనప్రకార ఏవ త్వవధాతవ్యమ్ ఇతి. అఙ్గినీతి సప్తమ్యనాదరే. అఙ్గినం రసవిశేషమనాదృత్య న్యక్కృత్య అఙ్గరసః న పోషయితవ్య ఇత్యర్థః. అవిరోధితేతి నిర్దోషతేత్యర్థః. పరిపోషప్రకారే త్రీన్ ప్రకారానాహ -- తత్రేత్యాదినా తృతీయ ఇత్యన్తేన. నను న్యూనత్వం కర్తవ్యమితి వాచ్యే ఆధిక్యస్య కా సంభావనా, యేనోక్తమాధిక్యం న కర్తవ్యమ్ ఇత్యాశఙ్క్యాహ - ఉత్కర్షసామ్య ఇతి.

"ఏకతో రోదితి ప్రియా అన్యతః సమరతూర్యనిర్ఘోషః,

స్నేహేన రణరసేన చ భటస్య దోలాయితం హృదయమ్" ఇతి చ్ఛాయా. రోదితి ప్రియేత్యతః రత్యుత్కర్షః. సమరతూర్యేతి భటస్యేతి చ ఉత్సాహోత్కర్షః. దోడాయితమితి తయోరన్యూనాధికతయా సామ్యముక్తమ్. ఏతచ్చ ముక్తకవిషయమేవ భవతి న తు ప్రబన్ధవిషయమితి కేచిదాహుః, తచ్చాసత్, ఆధికారికేష్వితివృత్తేషు త్రివర్గఫలసమప్రాధాన్యస్య సంభవాత్. తథా హి - రత్నావవాల్యాం సచివాయత్తసిద్ధిత్వాభిప్రాయేణ పృథివీరాజ్యలాభ ఆధికారికం ఫలమ్; కన్యారత్నలాభః ప్రాసఙ్గికం ఫలమ్. నాయకాభిప్రాయేణ తు విపర్యయ ఇతి స్థితే మన్త్రిబుద్ధౌ నాయకబుద్ధౌ చ స్వామ్యమాత్యబుద్ధ్యైకత్వాత్ ఫలమితి నీత్యా ఏకీక్రియమాణాయాం సమప్రాధాన్యమేవ పర్యవస్యతి. యథోక్తమ్ - "కవేః ప్రయత్నాన్నేతౄణాం యుక్తానామ్" ఇత్యలమవాన్తరేణ బహునా.

అవిరోధీ విరోధీ వా ఇతి. 'వా' అనడంలో అభిప్రాయం ఇది - అంగియైన రసంకంటె మరొక రసానికి ఉత్కర్షనిబంధించే పక్షంలో ఆ విధంగా అంగిరసావిరుద్ధమైన రసాన్ని నిబంధించినా అది చోద్యానికి (ఇలా ఎలా చేశారు అనే ప్రశ్నకు) దారి తీస్తుంది. అందుకు సమాధానంగా ఏదైన ఒక యుక్తి ప్రదర్శించడంచేత అంగియైన రసంలో మరొక రసం అంగంగా అవడానికి ఉపపత్తి కుదిరితే, అలాంటప్పుడు విరుద్ధరసాన్ని కూడా, చెప్పబోయే విధానంలో, విషయభేదాల యోజనచేత, (ఈ రసానికి ఆశ్రయం వేరు దానికి ఆశ్రయం వేరు ఇత్యాదివివిధోపపత్తులు చూపడం చేత) కూర్చడంలో దోషం ఏమీ ఉండదు. అందుచేత ఈ సందర్భంలో విరోధావిరోధాలు ఎందుకూ ఉపయోగించవు. (అవి విరుద్ధరసాలైనా అవిరుద్ధరసాలైనా ఈ సందర్భంలో భేదం ఏమీ లేదు. అవిరుద్ధరసాల్నీ అంగాలుగా నిబంధించవచ్చు విరుద్ధరసాల్నీ వేరుగా సమర్థించి నిబంధించవచ్చు). అయితే వాటిని ఏ విధంగా కూర్చాలి అనే విషయంలో మాత్రమే సావధానంగా ప్రవర్తించాలి. అఙ్గినీతి. ఈ సప్తమి అనాదరార్థకం. అంగియైన రసాన్ని అనాదరించి దానిని అణగద్రొక్కి, అంగరసాన్ని పోషించకూడదు అని అర్థం. **అవిరోధితేతి** :- నిర్దోషత్వం అని అర్థం. పరిపోషపరిహారానికి తత్ర అనేది మొదలు 'తృతీయః' వరకు ఉన్న వాక్యాలచేత, మూడు పద్ధతులు చూపుతున్నాడు. నన్వితి

ఆశంక) (అంగరసానికి) న్యూనత్వం చెయ్యాలి అని చెప్పవలసి ఉండగా దానికి ఆధిక్యం ఇచ్చే సంభావనయే లేదు కదా, "ఆధిక్యం న కర్తవ్యమ్" అని అన్నావేమి అని శంకించుకొని చెపుతున్నాడు - ఉత్కర్షసామ్యే ఇతి. ఏకతః ఇత్యాది. "రోదితి ప్రియా' అనడంచేత రతియొక్క ఉత్కర్ష. "సమరతూర్య" "భటస్య" అనడంచేత ఉత్సాహోత్కర్ష. దోలాయితమ్' అని ఆ రెండూ (రత్యుత్సాహాలు రెండూ) హెచ్చుతగ్గులు లేకుండా సమంగా ఉన్నా యని చెప్పబడింది.

ఏతచ్చేతి :- ఇది (ఉత్కర్షసామ్యం) ముక్తకాలలోనే కాని ప్రబంధాలలో ఉండదు అని కొందరు అంటున్నారు. అది అయుక్తం. ఆధికారికారికాలైన (ప్రధానమైన) ఇతివృత్తాలలో త్రివర్గఫలాలకు సమానమైన ప్రాధాన్యం సంభవిస్తుంది కదా? అది ఎట్లనగా - రత్నావలిలో సచివాయత్తసిద్ధిత్వాభిప్రాయంచేత, (నాయకుని కార్యసిద్ధి సచివునిమీద ఆధారపడి ఉంది అనే దృష్టితో చూస్తే) పృథివీరాజ్యలాభం ఆధికారిక (ప్రధాన) ఫలం; కన్యారత్నలాభం ప్రాసంగికమైన ఫలం, అయితే నాయకాభిప్రాయంచేత (నాయకుని దృష్ట్యా చూస్తే) దీనికి విపర్యయం; అనగా కన్యారత్నలాభం ఆధికారికం, రాజ్యలాభం ప్రాసంగికం. ఇలా ఉండగా-"స్వామి-అమాత్యుల బుద్ధి కలిస్తేనే ఫలం" అనే నీతిచేత మంత్రిబుద్ధినీ, నాయకబుద్ధినీ ఏకంచేసి చూడగా (రెండు ఫలాలకీ మూలభూతవీరశృంగారాలకీ) సమానమైన ప్రాధాన్యమే అని పర్యవసిస్తుంది (చివరికి తేలుతుంది). అందుచేతనే - "కవియొక్క ప్రయత్నంవల్ల యుక్తులైన నేతలకు ......" అని చెప్పబడింది. ఇంతటితో అవాంతర చర్చ చాలు.

## ధ్వన్యాలోకం

అఙ్గిరసవిరుద్ధానాం వ్యభిచారిణాం ప్రాచుర్యేణ అనివేశనమ్; నివేశనే వా క్షిప్రమేవ అఙ్గిరసవ్యభిచార్యనువృత్తిరితి ద్వితీయః. అఙ్గత్వేన పునః పునః ప్రత్యవేక్షా పరిపోషం నీయమానస్యాపి అఙ్గభూతస్య రసస్యేతి తృతీయః. అనయా దిశా అన్యేఽపి ప్రకారాః ఉత్ప్రేక్షణీయాః. విరోధినస్తు రసస్య అఙ్గిరసాపేక్షయా కస్యచిన్న్యూనతా సంపాదనీయా. యథా శాన్తే అఙ్గిని శృఙ్గారస్య, శృఙ్గారే వా శాన్తస్య. పరిపోషరహితస్య రసస్య కథం రసత్వమితి చేత్ - ఉక్తమత్రాఙ్గిరసాపేక్షయేతి - అఙ్గినో

వా రసస్య యావాన్ పరిపోషః తావాన్ తస్య న కర్తవ్యః, స్వతస్తు సంభవీ పరిపోషః కేన వార్యతే? ఏతచ్చాపేక్షికం ప్రకర్షయోగిత్వమేకస్య రసస్య బహురసేషు ప్రబన్ధేషు రసానామ్ అఙ్గాఙ్గిభావ మనభ్యుపగచ్ఛతాప్యశక్యప్రతిక్షేపమిత్యనేన ప్రకారేణ అవిరోధినాం విరోధినాం చ రసానామ్ అఙ్గాఙ్గిభావేన సమావేశే ప్రబన్ధేషు స్యాదవిరోధః. ఏతచ్చ సర్వం యేషాం రసో రసాన్తరస్య వ్యభిచారీభవతి ఇతి దర్శనం తన్మతేనోచ్యతే. మతాన్తరే తు రసానాం స్థాయినో భావా ఉపచారాద్రసశబ్దేనోక్తాః, తేషామ్ అఙ్గత్వం నిర్విరోధమేవ.

బాలానందిని

అఙ్గీతి. అంగిరసానికి విరుద్ధాలైన వ్యభిచారిభావాలను ఎక్కువగా కూర్చకపోవడం, కూర్చినా కూడ వెంటనే అంగిరసానికి సంబంధించిన వ్యభిచారిభావాలను అనువర్తించడం (తీసికొని రావడం) అనేది రెండవ ప్రకారం. అంగమైన రసాన్ని పరిపోషం పొందిస్తున్నా అది అంగంగానే ఉండే టట్లు మాటిమాటికి పరిశీలించుకుంటూ ఉండడం మూడవ ప్రకారం. ఈ మార్గంలో మరి కొన్ని ఇతరప్రకారాలు కూడా ఊహించుకోవాలి.

విరోధినః ఇతి. ఏదైనా అంగరసం (అంగికి) విరోధి అయితే దానికి కొంచెం న్యూనత్వం సంపాదించాలి. ఉదాహరణకి - శాంతం అంగిగా ఉన్నప్పుడు శృంగారానికి న్యూనత్వం, శృంగారం అంగిగా ఉన్నప్పుడు శాంతానికి న్యూనత్వం. పరిపోషం లేని రసం రసం ఎలా అవుతుంది అని ప్రశ్నించవచ్చు. అంగిరసాపేక్షయా (తక్కువపరిపోషం) అని సమాధానం ఇదివరకే చెప్పబడింది. అంగిరసానికి ఎంత పరిపుష్టి చేయబడుతుందో అంత పరిపుష్టి అంగరసానికి చేయకూడదు; కాని దానికి ఎంతవరకు పరిపోషం ఉండాలో దానిని చేయకూడదని ఎవరు నివారిస్తారు? (అంటారు). అనేకరసాలుండే ప్రబంధంలో ఆ రసాలకు అంగాంగిభావాన్ని అంగీకరించనివాళ్లు కూడా, ఒక రసానికి ఇతరరసాపేక్షయా ప్రకర్షం ఉంటుంది అనే విషయం నిరాకరించజాలరు. ఈ విధంగా విరోధిరసాలనైనా, అవిరోధిరసాలనైనా అంగాంగిభావంతో ప్రబంధాలలో కూర్చడంలో దోషం ఉండదు. ఇదంతా - ఒక రసం ఇతరరసానికి వ్యభిచారిభావంగా పని చేస్తుంది అని అంగీకరించేవాళ్ల మతం ప్రకారం చెప్పినది. మతాంతరంలో అయితే - రసాల

స్థాయిభావాలనే ఉపచారంచేత రసం అని అంటారు అని అంగీకరించడంచేత వాటికి అంగత్వం అవిరుద్ధమే.

లోచనం

ఏవం ప్రథమం ప్రకారం నిరూప్య ద్వితీయమాహ అఙ్గీతి. అనివేశనమితి - అఙ్గభూతే రసే ఇతి శేషః. నన్వేవం నాసౌ పరిపుష్టో భవేదిత్యాశఙ్క్య మతాన్తరమాహ - నివేశనే వేతి. అత ఏవ వాగ్రహణమ్ ఉత్తరపక్షదార్ఢ్యం సూచయతి న వికల్పమ్. తథా చ ఏక ఏవాయం ప్రకారః. అన్యథా తు ద్వౌ స్యాతామ్. అఙ్గినో రసస్య యః వ్యభిచారీ తస్యానువృత్తిః అనుసంధానమ్. యథా - "కోపాత్కోమలలోల" ఇతి శ్లోకే అఙ్గీభూతాయాం రతావఙ్గత్వేన యః క్రోధః ఉపనిబద్ధః తత్ర "బద్ధ్వా దృఢమ్" ఇత్యమర్షస్య నివేశితస్య క్షిప్రమేవ 'రుదత్యా' ఇతి 'హసన్' ఇతి చ రత్యుచితేర్ష్యౌత్సుక్యహర్షానుసంధానమ్.

బాలానందిని

ఈ విధంగా మొదటి పరిహారాప్రకారాన్ని చెప్పి రెండవదానిని చెపుతున్నాడు - **అఙ్గీతి**. అనివేశనమితి. 'అంగమైన రసమునందు' అని అధ్యాహారం. అట్లయితే ఇది పరిపుష్టమే కాదు కదా అని ఆశంకించుకొని మరొక మతం చెపుతున్నాడు - నివేశనే వా ఇతి. అందువల్లనే 'వా' అని చెప్పడం ఈ రెండవ పక్షం దృఢమైనది అని సూచిస్తున్నది గాని వికల్పాన్ని బోధించడం లేదు. అందుచేత ఇదంతా ఒకటే ప్రకారం. 'వా' అనేది వికల్పాన్ని బోధించే పక్షంలో ఇవి రెండు ప్రకారాలు అవుతాయి. అఙ్గినః ఇతి:- అంగియైన రసంయొక్క ఏ వ్యభిచారిభావం ఉంటుందో దాని అనువృత్తి, అనగా అనుసంధానం (మళ్లీ కూర్చడం). ఎట్లనగా - 'కోపాత్కోమలలోల' అనే శ్లోకంలో అంగియైన రతిలో అంగంగా క్రోధం కూర్చబడింది. దానిలో (ఆ క్రోధంలో) (వ్యభిచారిగా) "బద్ధ్వా దృఢమ్" అని అమర్షం కూర్చబడింది. వెంటనే 'రుదత్యా' 'హసన్' అనే మాటలచేత రతికి ఉచితాలైన ఈర్ష్యా - ఔత్సుక్య-హర్షాల అనుసంధానం చేయబడింది.

లోచనం

తృతీయం ప్రకారమాహ - అఙ్గత్వేనేతి. అత్ర చ తాపసవత్సరాజే వత్సరాజస్య పద్మావతీవిషయః సంభోగశృఙ్గారః ఉదాహరణీకర్తవ్యః. అన్యే ఽపీతి. విభావానుభావానాం చాపి ఉత్కర్షః న కర్తవ్యః, అఙ్గిరసవిరోధినాం

నివేశనమేవ వా న కార్యమ్, కృతమపి చ అఙ్గిరసవిభావానుభావైః ఉపబృంహణీయమ్. పరిపోషితా అపి విరుద్ధరసవిభావానుభావాః అఙ్గత్వం ప్రతి జాగరయితవ్యాః ఇత్యాది స్వయం శక్యముత్ప్రేక్షితుమ్.

ఏవం విరోధ్యవిరోధిసాధారణం ప్రకారమభిధాయ విరోధివ విషయాసాధారణదోషపరిహారప్రకారగతత్వేనై విశేషాన్తరమప్యాహ - విరోధిన ఇతి. సంభవీతి. ప్రధానవిరోధిత్వేనేతి శేషః.

బాలానందిని

మూడవ ప్రకారం చెపుతున్నాడు - అఙ్గత్వేనేతి. దీనికి తాపసవత్సరాజంలో వత్సరాజుయొక్క పద్మావతీ విషయమైన సంభోగశృంగారం ఉదాహరణంగా చెప్పుకోవాలి. అన్యేఽపీతి. (1) విభావానుభావాల ఉత్కర్షం కూడ చేయకూడదు (2) అంగిరసానికి విరనోధులైన విభావానుభావాలనే కూర్చకూడదు. (3) అలాంటివాటిని కూర్చినా అంగిరసానికి సంబంధించిన విభావానుభావాలచేత ఉపబృంహణం (సంవర్ధనం) చెయ్యాలి. (4) విరుద్ధరసానికి సంబంధించిన విభావానుభావాలను పోషించినా కూడ వాటిని అంగత్వం విషయంలో జాగరూకంగా ఉండే టట్లు చెయ్యాలి, అనగా అంగాలుగా మాత్రమే ఉండే టట్లు చూచుకోవాలి - ఈ విధమైన ప్రకారాంతరాలను స్వయంగానే ఊహించుకొనవచ్చు. ఏవమితి. ఈ విధంగా (అంగంగా కూర్చే) విరోధిరసానికీ, అవిరోధిరసానికీ కూడ సాధారణమైన (రెండిటికీ సమంగా వర్తించే) ప్రకారం చెప్పి విరోధిరసం విషయంలో అసాధారణమైన దోషపరిహారప్రకారానికి సంబందించిన మరొక విశేషం కూడ చెపుతున్నాడు - విరోధినః ఇతి. సంభవీతి - 'ప్రధానావిరోధిత్వేన' అని అధ్యాహారం. అనగా ప్రధానరసానికి విరుద్ధం కాకుండా సంబంధించే అని అర్థం.

లోచనం

ఏతచ్చేతి. ఉపకార్యోపకారకభావో రసానాం నాస్తి, స్వచమత్కారవిశ్రాన్తత్వాత్. అన్యథా రసత్వాయోగాత్; తదభావే చ కథమఙ్గాఙ్గితా ఇత్యపి యేషాం మతం తైరపి కస్య చిత్ రసస్య ప్రకృష్టత్వం, భూయః ప్రబన్ధవ్యాపకత్వమ్, అన్యేషాం చ అల్పప్రబన్ధానుగామిత్వమ్ అభ్యుపగన్తవ్యమ్; ఇతివృత్త సంఘటనాయా ఏవ అన్యథా అనుపపత్తేః. భూయః ప్రబన్ధవ్యాపకస్య చ రసస్య రసాన్తరైర్యది న కాచిత్ సంగతిః తదితివృత్తస్యాపి న స్యాత్.

సంగతిశ్చేదయమేవ ఉపకార్యోకారకభావః. న చ చమత్కారవిశ్రాన్తేః విరోధః కశ్చిదితి సమనన్తరమేవోక్తమ్. తదాహ - అనభ్యుపగచ్ఛతాపీతి. శబ్దమాత్రేణాసౌ నాభ్యుపగచ్ఛతి. అకామ ఏవాభ్యుపగమయితవ్య ఇతి భావః.

అన్యస్తు వ్యాచష్టే - "ఏతచ్చాపేక్షికమ్" ఇత్యాదిగ్రన్థః ద్వితీయమతమభి ప్రేత్య, యత్ర రసానాముపకార్యోపకారకభావః నాస్తి. తత్రాపి హి భూయో వృత్త వ్యాప్తత్వమేవాఙ్గిత్వమితి; ఏతచ్చాసత్; ఏవం హి "ఏతచ్చ సర్వమ్" ఇతి సర్వశబ్దేన ఉపసంహారః ఏకపక్షవిషయః, మతాన్తరేపీత్యాదినా చ యః ద్వితీయపక్షోపక్రమః సః అతీవ దుఃశ్లిష్టః ఇత్యలం పూర్వవంశ్యైః సహ బహునా సంలాపేన.

బాలానందిని

ఏతచ్చేతి. "రసాలు వేటి కవి తమ చమత్కారంలో విశ్రమిస్తాయి; అందుచేత రసాలకు పరస్పరం ఉపకార్యోపకారకభావం ఉండదు. అవి స్వచమత్కారవిశ్రాంతాలు కాకపోతే రసాలే కావు. వాటికి రసత్వం లేకపోతే రసాలు పరస్పరం అంగాంగిభావంతో ఉంటాయి అనేదేలేదు" అనే వాళ్లు కూడ ఒక రసం ప్రబంధంలోని అత్యధికమైన భాగంలో వ్యాపించి ప్రకృష్టంగా ఉంటుందనీ, మిగిలినవి ప్రబంధంలో అల్పభాగాన్నే ఆశ్రయించి ఉంటా యనీ అంగీకరించి తీరాలి. అలా కాకపోతే ఇతివృత్తం కూర్పే కుదరదు. ప్రబంధంలోని అధికభాగంలో వ్యాపించి ఉన్న రసానికి ఇతరరసాలతో ఏమీ సంగతి (సంబంధం) లేకపోతే ఇతివృత్తానికి కూడా సంబంధం ఉండదు. (అనగా విస్తృతమైన ఇతివృత్తానికీ అల్పమైన ఇతివృత్తాలకీ పరస్పరం సంబంధమే ఉండదు అని అర్థం). ఈ సంగతి ఉందా - అదే కదా ఉపకార్యోపకారకభావం అంటే? చమత్కారవిశ్రాంతికి కూడా ఏమీ విరోధం ఉండదని ఇంత క్రితమే చెప్పి ఉన్నాం. ఈ విషయాన్నే అనభ్యుపగచ్ఛతాపి ఇత్యాదికంచేత చెపుతున్నాడు. ఇలా చెప్పేవాడు మాటకి మాత్రమే అంగీకరించడం లేదు. ఇష్టం ఉన్నా లేకపోయినా ఇతన్ని ఒప్పించవలసిందే అని భావం.

అన్యస్తు ఇతి :- మరొకడు ఈ విధంగా వ్యాఖ్యానించాడు-"ఏతచ్చ ఆపేక్షికమ్" ఇత్యాదిగ్రంథం 'మతాన్తరే తు' అని చెప్పబోయే రెండవ దృష్టిలో ఉంచుకొని చెప్పబడింది. రసాలకి ఉపకార్యోపకారకభావం లేనిచోట కూడ ఇతివృత్తంలోని అధికభాగంలో వ్యాపించి ఉండడమే అంగిత్వం అనగా " అని. ఈ వ్యాఖ్యానం అయుక్తం. ఇలా

చెప్పినట్లయితే 'ఏతచ్చ సర్వమ్' అని సర్వశబ్దంచేత ఒక పక్షాన్ని ఉపసంహరించడమూ, 'మతాన్తరేఽపి' ఇత్యాదికంచేత రెండవ పక్షాన్ని ఉపక్రమించడమూ ఇదంతా కలపడానిక శక్యం కాకుండా ఉంటుంది (కుదరదు). సరే మన పూర్వవంశ్యులతో ఎక్కువగా మాటలాడి చాలు.

లోచనం

యేషామితి - భావాధ్యాయసమాప్తావస్తి శ్లోకః -

బహూనాం సమవేతానాం రూపం యస్య భవేద్బహు,

స మన్తవ్యో రసః స్థాయీ శేషాః సంచారిణో మతాః. ఇతి.

తత్రోక్తక్రమేణ అధికారికేతివృత్తవ్యాపికా చిత్తవృత్తిరవశ్యమేవ స్థాయిత్వేన భాతి. ప్రాసఙ్గికవృత్తాన్తగామినీ తు వ్యభిచారితయేతి రస్యమానతాసమయే స్థాయివ్యభిచారిభావస్య న కశ్చిద్విరోధ ఇతి కేచిద్వ్యాచచక్షిరే. తథా చ భాగురిరపి "కిం రసానామపి స్థాయిసంచారితా అస్తి" ఇత్యాక్షిప్య అభ్యుపగమేనైవ ఉత్తరమవోచత్ "బాఢమస్తి" ఇతి.

అన్యే తు స్థాయితయా పఠితస్యాపి రసస్య రసాన్తరే వ్యభిచారిత్వమస్తి; యథా క్రోధస్య వీరే వ్యభిచారితయా పఠితస్యాపి స్థాయిత్వమేవ రసాన్తరే; యథా తత్త్వజ్ఞానవిభావకస్య నిర్వేదస్య శాన్తే, వ్యభిచారిణో వా సత ఏవ వ్యభిచార్యన్తరాపేక్షయా స్థాయిత్వమేవ; యథా విక్రమోర్వశ్యామ్ ఉన్మాదస్య చతుర్థేఽఙ్కే ఇతి, ఇయన్తమర్థం బోధయితుమయం శ్లోకః. "బహూనాం చిత్తవృత్తిరూపాణాం భావానాం మధ్యే యస్య బహులం రూపం యథోపలభ్యతే స స్థాయీ భావః; స చ రసః రసీకరణయోగ్యః, శేషాస్తు సంచారిణ" ఇతి వ్యాచక్షతే. న తు రసానాం స్థాయిసంచారిభావేన అఙ్గాఙ్గితోక్తేతి. అత ఏవాన్యే రసస్థాయీతి షష్ఠ్యా, సప్తమ్యా, ద్వితీయయా వాశ్రితాదిషు గమిగామ్యాదీనామితి సమాసం పఠన్తి. తదహ - మతాన్తరేఽపీతి. రసశబ్దేనేతి:- "రసాన్తరసమావేశః ప్రస్తుతస్య రసస్య యః" ఇత్యాదిప్రాక్తనకారికానివిష్టేనేత్యర్థః. 24

బాలానందిని

యేషామితి - భావాధ్యాయసమాప్తిలో ఒక శ్లోకం ఉంది. బహూనామితి.

సమవేతానామ్= ఆత్మయందున్న, బహూనామ్= అనేకభావాలలో, చిత్తవృత్తులలో, యస్య రూపమ్= ఏ భావం యొక్క రూపం, బహు= అధికమైన ప్రబంధాన్ని వ్యాపించేదిగా ఉంటుందో, సః= ఆ, రసః= రసం, స్థాయీతి= స్థాయి అని, మన్తవ్యః= తెలియదగినది. శేషాః= మిగిలినవి, సంచారిణః= సంచారిభావాలుగా, మతాః= చెప్పబడినవి.

ఈ శ్లోకంలో చెప్పిన క్రమంచేత (పద్ధతిలో) ఆధికారికమైన ఇతివృత్తాన్ని వ్యాపించి ఉన్న చిత్తవృత్తి తప్పక స్థాయిగా భాసిస్తుంది. ప్రాసంగికవృత్తాంతానికి సంబంధించినది మాత్రం వ్యభిచారిగా భాసిస్తుంది. ఈ విధంగా రస్యమానతా (ఆస్వాద) సమయంలో కూడ స్థాయిత్వానికీ, వ్యభిచారిత్వానికీ ఏమీ విరోధం లేదు అని కొందరు వ్యాఖ్యానించారు. భాగురి కూడ - "రసాలకి కూడ స్థాయిత్వం, సంచారిత్వం ఉంటుందా" అని ప్రశ్నించుకొని - 'తప్పక ఉంటుంది' అని అంగీకారరూపమైన ఉత్తరమే ఇచ్చాడు (మొదటిమతం ఈ వ్యాఖ్యానాన్ని అనుసరించిన దని భావం).

**అన్యే తు ఇతి:** మరి కొందరైతే - స్థాయిగా చెప్పబడిన రసానికి కూడా రసాంతరంలో వ్యభిచారిత్వం ఉండవచ్చును. ఉదాహరణకి - క్రోధం వీరరసంలో వ్యభిచారిగా చెప్పబడినా దానికి రసాంతరంలో (రౌద్రంలో) స్థాయిత్వం ఉంది. తత్త్వజ్ఞానం విభావంగా గల నిర్వేదానికి శాంతంలో స్థాయిత్వం ఉంది. ఒకప్పుడు వ్యభిచారిగా భావంగా ఉంటూనే ఒక భావం మరొక వ్యభిచారిబావం దృష్ట్యా స్థాయి అవుతుంది. ఉదాహరణకి - విక్రమోర్వశిలో నాల్గవ అంకంలో ఉన్మాదం వితర్కాపేక్షయా స్థాయి అయింది. ఈ శ్లోకం ఇంత అర్థాన్ని బోధించడం కోసం చెప్పబడింది. శ్లోకార్థం వివరిస్తున్నాడు - **బహూనామితి.** చిత్తవృత్తిరూపాలైన అనేకభావాల మధ్య ఏ చిత్తవృత్తికి ఏ విధంగా అధికమైన రూపం కనబడుతుందో అది స్థాయిభావం. అదే సరసం, అనగా రసీకరణానికి యోగ్యం. మిగిలినవన్నీ సంచారిభావాలే అని వ్యాఖ్యానిస్తున్నారు. అంతేనే కాని రసాలకు (కొన్నిటికి) స్థాయిత్వంచేత (కొన్నింటికి) సంచారిత్వంచేత అంగాంగిభావం చెప్పబడలేదు. అందువలననే ఇతరులు 'రసస్థాయీ' అనే పదాన్ని 'రసంయొక్క స్థాయి' అని లేదా "రసమునందు స్థాయి" అని లేదా "ద్వితీయాశ్రితాతీతపతితగతాత్యస్త ప్రాప్తాపన్నైః" అనే పాణిని సూత్రం (2. 124) దగ్గర ఉన్న "గమ్యాదీనాముప సంఖ్యానమ్" అనే వార్తికంలో చెప్పిన గమ్యాదులలో ఈ స్థాయిపదాన్ని చేర్చి "రసమును స్థాయి" అని కాని (రసస్య స్థాయీ, రసే స్థాయీ, రసం స్థాయీ అని విగ్రహాలు) సమాసంగా

పఠిస్తున్నారు. రసః స్థాయీ అని వ్యస్తపదాలు కాకుండా సమస్తపదంగా గ్రహిస్త
అని అర్థం. ఈ విషయమే మతాన్తరేపీతీత్యాదికంచేత చెపుతున్నాడు. రసశ
"రసాన్తరసమావేశః ప్రస్తుతస్య రసస్య యః" ఇత్యాది పూర్వకారికలోని రసశబ్దం చే
అర్థం. 24

## ధ్వన్యాలోకం

ఏవమవిరోధినాం విరోధినాం చ ప్రబన్ధస్థేన అఙ్గినా ర
సమావేశే సాధారణమవిరోధోపాయం ప్రతిపాద్య ఇద
విరోధివిషయమేవ తం ప్రతిపాదయితుమిదముచ్యతే -

కా. విరుద్ధైకాశ్రయో యస్తు విరోధీ స్థాయినో భవేత్,
స విభిన్నాశ్రయః కార్యస్తస్య పోషేఽప్యదోషతా.

ఐకాధికరణ్యవిరోధీ, నైరన్తర్యవిరోధీ చేతి ద్వివిధో విరోధీ. ప్రబన్ధస్థేన స్థాయినా అఙ్గినా రసేన ఔచిత్యాపేక్షయా వి కాశ్రయో యో విరోధీ యథా వీరేణ భయానకః, స విభిన్నాశ్ర కార్యః. తస్య వీరస్య య ఆశ్రయః కథానాయకః తద్విపక్షవిష సంనివేశయితవ్యః. తథా సతి చ తస్య విరోధినోఽపి యః పరిప స నిర్దోషః. విపక్షవిషయే హి భయాతిశయవర్ణనే నాయక నయపరాక్రమాది సంపత్సుతరాముద్ద్యోతితా భవతి. ఏతచ్చ మదీ అర్జునస్య పాతాలావతరణప్రసఙ్గే వైశద్యేన ప్రదర్శితమ్.

### బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ప్రబంధంలో ఉన్న అంగి యైన రసంతో, అవిరోధిరసాల విరోధిరసాలను కూర్చడంలో సాధారణమైన అవిరోధోపాయాన్ని చెప్పి ఇప్పుడు విరోధిర కూర్పు విషయానికి మాత్రమే చెందిన అవిరోధోపాయాన్ని ప్రతిపాదించడానికి చెప్పబడుతున్నది. విరుద్ధేతి :- స్థాయినః= స్థాయి రసానికి, విరోధీ= విరోధియైన; య ఏది, విరుద్ధైకాశ్రయః= విరుద్ధమైన ఒక ఆశ్రయం కలదిగా, భవేత్= అవుతుందో, ఆది, విభిన్నాశ్రయః= విభిన్నములైన ఆశ్రయాలు కలదిగా, కార్యః= చేయదగి

తస్య= దానియొక్క, పోషేఽపి= పోసణం చేసినా కూడ, అదోషతా= దోషం లేదు. 25

ఐకాధికరణ్యేతి. ఒకే అధికరణంలో ఉండడంలో విరోధం గలది, వెనువెంటనే రావడంలో విరోధం గలది అని విరోధి రెండు విధాలు. వాటిలో ప్రబంధంలో ఉన్న స్థాయి అయిన, అంగి అయిన, రసంతో, ఔచిత్యాపేక్షచేత విరుద్ధమైన ఏకాశ్రయం గల (ఒకే ఆశ్రయంలో ఉండడంలో విరుద్ధమైన) ఏ విరోధిరసం ఉన్నదో, ఉదాహరణకి వీరరసంతో భయానకం, అది వేరు వేరు ఆశ్రయాలు కలదిగా చేయదగినది; ఆ వీరానికి ఆశ్రయుడైన కథానాయకుని శత్రువుతో సంబంధంచినట్లు భయానకాన్ని కూర్చాలి. అలా చేసిన ట్లయితే విరోధియైనా ఆ రసాన్ని పోషించడంలో దోషం లేదు. శత్రువు విషయంలో (శత్రువుకు) అత్యధికమైన భయం ఉన్నట్లు వర్ణించిన ట్లయితే నాయకుని నీతి పరాక్రమాదిసంపద పూర్తిగా ప్రకాశింపచేయబడినది అవుతుంది. ఇది నా అర్జునచరితకావ్యంలో అర్జునుడు పాతాలంలో ప్రవేశించే సందర్భంలో స్పష్టంగా చూపబడింది.

లోచనం

అథ సాధారణం ప్రకారముపసంహరన్ అసాధారణమాసూత్రయతి- ఏవమితి. తమిత్యవిరోధోపాయమ్. విరుద్ధేతి విశేషణం హేతుగర్భమ్. యస్తు స్థాయీ స్థాయ్యంతరేణ అసంభావ్యమానైకాశ్రయత్వాత్ విరోధీ భవేత్, యథా ఉత్సాహేన భయం, స విభిన్నాశ్రయత్వేన, నాయకవిపక్షాదిగతత్వేన కార్యః. తస్యేతి. తస్య విరోధినోఽపి తథా నిబద్ధస్య పరిపుష్టతాయాః ప్రత్యుత నిర్దోషనాయకోత్కర్షాధానాత్. అపరిపోషణం తు దోష ఏవేతి యావత్. అపిశబ్దః భిన్నక్రమః. ఏవమేవ వృత్తావపి వ్యాఖ్యానాత్. ఐకాధికరణ్యమ్ ఏకాశ్రయేణ సంబన్ధమాత్రమ్; తేన విరోధీ యథా - భయేనోత్సాహః. ఏకాశ్రయత్వేఽపి సంభవతి కశ్చిన్నిరన్తరత్వేన నిర్వ్యవధానత్వేన విరోధీ, యథా రత్యా నిర్వేదః. ప్రదర్శితమితి - "సముత్థితే ధనుర్ధ్వనౌ భయావహే కిరీటినో మహా పప్లవోఽభవత్పురే పురన్దరద్విషామ్" ఇత్యాదినా. 25

బాలానందిని

**అథేతి** - ఇప్పుడు సాధారణమైన (విరోధ్యవిరోధిరససాధారణమైన) ప్రకారాన్ని (విరోధపరిహారప్రకారాన్ని) ఉపసంహరిస్తూ అసాధారణప్రకారాన్ని సూత్రిస్తున్నాడు -

ఏవమితి. 'విరుద్ధైకాశ్రయం' లోని విరుద్ధపదం హేతుగర్భం. హేతువును సూచిస్తుంది. ఏ స్థాయి మరొక స్థాయితో కలిసి ఒకే ఆశ్రయంలో ఉండడం అసంభావ్యం అవడంచేత (కుదరకపోవడంచేత) విరోధియో, ఉదాహరణకి - భయం ఉత్సాహంతో కలిసి ఒకే పురుషునిలో ఉండడం కుదరనట్లు, దానికి ఆశ్రయం వేరు అన్నట్లు, అది నాయకుని శత్రువు మొదలైన వాళ్లలో ఉన్నట్లు, నిబంధించాలి. తస్యేతి. ఆ విధంగా చేయబడిన, ఆ విధంగా నిబద్ధమైన అది, విరోధియే అయినా కూడ దాని పరిపుష్టత్వం నాయకుని ఉత్కర్షను కలిగించడంచేత దోషం కాదు. పోషించకపోతే అది దోషమే అవుతుంది కూడ అని భావం. "పోషేఽప్యదోషతా" లోని 'అపి' శబ్దం భిన్నక్రమం. అనగా దానిని 'తస్య' తో చేర్చాలి: అందుచేతనే వృత్తిలో 'తస్య విరోధినోఽపి' అని వ్యాఖ్యానం చేయబడింది.

ఐకాధికరణ్యమితి. ఐకాధికరణ్యమ్ అనగా ఒకే ఆశ్రయంతో సంబంధమాత్రం. దానిచేత (ఒకే ఆశ్రయంతో సంబంధంచేత) విరోధి ఎట్లనగా - భయంతో ఉత్సాహం (ఒకే ఆశ్రయంలో ఉండడం). ఏకాశ్రయత్వేఽపీతి. ఏకాశ్రయత్వం సంభవించినా ఒక్కొక్కటి నిరంతరత్వంచేత, వ్యవధానం లేకుండా కూర్చడంచేత విరోధి అవుతుంది. ఉదాహరణకి రతితో నిర్వేదం. రతి, నిర్వేదం ఒకే ఆశ్రయంలో ఉండవచ్చును గాని ఒకదాని తరవాత వెంటనే మరొకటి రాకూడదు. మధ్య మరొక దానిని చేర్చాలి అని భావం. ప్రదర్శితమితి. సముత్థితే ఇత్యాది:- "శ్రవేణ తస్య తు ధ్వనేర్విలుప్తమూలబన్ధనమ్ అశేషదైత్యయోషితాం శ్లథీబభూవ జీవితమ్" అనేది ఉత్తరార్ధం.

"అర్జునుని భయంకరమైన ధనుర్ధ్వని బయలువెడలగానే దైత్యుల పురంలో గొప్ప ఉపద్రవం చెలరేగింది. ఆ ధ్వని వినగానే సకలదైత్యస్త్రీల జీవితం మూలబంధం కదిలిపోయి శిథిల మైపోయింది". ఇక్కడ వీరరసం (ఉత్సాహం) అర్జునునిలో ఉన్నట్లు, భయానకం (భయం) శత్రువులలో ఉన్నట్లూ వర్ణించబడింది గాన దోషం లేదని భావం.

## ధ్వన్యాలోకం

ఏవమైకాధికరణ్యవిరోధినః ప్రబన్ధస్థేన స్థాయినా రసేన అఙ్గభావగమనే నిర్విరోధిత్వం యథా తథా తద్దర్శితమ్. ద్వితీయస్య తు తత్ప్రతిపాదయితుముచ్యతే -

కా. ఏకాశ్రయత్వే నిర్దోషో నైరన్తర్యే విరోధవాన్,
రసాన్తరవ్యవధినా రసో వ్యఙ్గ్యః సుమేధసా. 26

యః పునరేకాధికరణత్వే నిర్విరోధో, నైరన్తర్యే తు విరోధీ స రసాన్తరవ్యవధానేన ప్రబన్ధే నివేశయితవ్యః. యథా శాన్తశృఙ్గారౌ నాగానన్దే నివేశితౌ.

బాలానందిని

ఏవమితి. ప్రబంధంలో ఉన్న స్థాయిరసానికి ఏకాధికరణత్వవిరోధం గలదానిని అంగంగా చేసినా ఏ విధంగా విరోధం ఉండదో చూపించబడింది. రెండవ విధమైన దానికి విరోధాభావం చూపడానికి ఇది చెప్పబడుతున్నది-

ఏకేతి. ఏకాశ్రయత్వే= ఒకే ఆశ్రయం కలిగి ఉన్నా, నిర్దోషః= దోషం లేనిది, నైరన్తర్యే= వ్యవధానం లేకపోతే, విరోధవాన్= విరోధం కలదీ అయిన, రసః= రసం, సుమేధసా= మంచి బుద్ధి గలవానిచేత, రసాన్తరవ్యవధినా= మరొక రసంతో వ్యవధిచేత, వ్యఙ్గ్యః= వ్యంజింపదగినది. 26

య ఇతి. ఏ రసమైతే ఏకాధికరణత్వం ఉన్నా కూడ విరోధం లేనిదో, వ్యవధానం లేకపోతే మాత్రం విరోధియో అది మరొక రసంయొక్క వ్యయధానం చేత కూర్చదగినది. నాగానందంలో శాంతశృంగారాలు కూర్చినట్లు.

లోచనం

ద్వితీయస్యేతి :- నైరన్తర్యవిరోధినః. తదితి. నిర్విరోధిత్వమ్. ఏకాశ్రయత్వేన నిమిత్తేన యో నిర్దోషః, న విరోధీ, కిం తు నిరన్తరత్వేన నిమిత్తేన విరోధమేతి స తథావిధవిరుద్ధరసద్వయావిరుద్ధేన రసాన్తరేణ మధ్యే నివేశితేన యుక్తః కార్యః ఇతి కారికార్థః. ప్రబన్ధ ఇతి బాహుల్యాపేక్షమ్. ముక్తకేఽపి కదాచిదేవం భవేదపి. యద్వక్ష్యతి. - "ఏకవాక్యస్థయోరపి" ఇతి. యథేతి. తత్ర హి - "రాగస్యాస్పదమిత్యవైమి న హి మే ధ్వంసీతి న ప్రత్యయః" ఇత్యాదినా ఉపక్షేపాత్ ప్రభృతి పరార్థశరీరవితరణాత్మక నిర్వహణపర్యన్తః శాన్తో రసః తస్య విరుద్ధో మాల్యవతీవిషయః శృఙ్గారః తదుభయావిరుద్ధమద్భుత మన్తరీకృత్య క్రమప్రసరసంభావనాభిప్రాయేణ కవినా నిబద్ధః. "అహో గీతమహో వాదిత్రమ్" ఇతి. ఏతదర్థమేవ - "వ్యక్తిర్వ్యఞ్జనధాతునా" ఇత్యాది నీరసప్రాయమప్యత్ర నిబద్ధమత్ర అద్భుతరస

పరిపోషకతయాత్యన్తసరసతావహమితి. "నిర్దోషదర్శనాః కన్యకాః" ఇతి చ క్రమప్రసరో నిబద్ధః. యథాహుః - చిత్తవృత్తిప్రసరప్రసంఖ్యానధనాః సాంఖ్యాః "పురుషార్థహేతుకమిదం నిమిత్తనైమిత్తిక ప్రసంగేన" ఇతి. అనన్తరం చ నిమిత్తనైమిత్తికప్రసంగాగతః యః శేఖరకవృత్తాన్తోదితహాస్యోపకృతః శృఙ్గారః తస్య విరుద్ధో యః వైరాగ్యశమపోషకః నాగీయంకలే బరాస్థి జాలావలోకనాదివృత్తానః మిత్రావసోః ప్రవిష్టస్య మలయవతీనిర్గమన కారిణః "సంసర్పద్భిః సమన్తాత్" ఇత్యాదికావ్యోపనిబద్ధక్రోధవ్యభిచార్యుపకృత వీరరసాన్తరితో నివేశితః.

బాలానందిని

ద్వితీయస్యేతి - నైరంతర్యంచేత విరోధి అయినదానియొక్క తదితి..నిర్విరోధిత్వం (విరోధం లేకపోవడం). ఒకే ఆశ్రయం కలిగి ఉండడం అనే నిమిత్తంచేత ఏది నిర్దోషమో, విరోధి కాదో, కాని నిరంతరత్వం అనే నిమిత్తంచేత విరోధాన్ని పొందుతుందో, అది, మధ్యలో ఆ విధములైన రెండు విరుద్ధరసాలను అవిరుద్ధమైన మరొక రసంతో కూడేటట్లు చెయ్యాలి. అనగా ఆ రెండు విరుద్ధరసాల మధ్య, రెండింటికీ విరోధం లేని మరొక మూడవ రసం కూర్చాలి అని అర్థం. ప్రబన్ధ ఇతి. ఇది ప్రబంధంలో ఎక్కువగా వీలవుతుందిగాన "ప్రబన్ధే" అని చెప్పబడింది. అప్పుడప్పుడు ఇది ముక్తకంలో కూడ జరగవచ్చును. అందుచేతనే "ఏకవాక్యస్థయోరపి" (ఒక వాక్యంలో ఉన్న రెండు రసాలకు కూడా) అని చెప్పనున్నాడు (కా. 3. 27). యథా ఇతి. నాగానందంలో "ఈ శరీరం రాగానికి స్థానం; ఇది నశించదు అనే నమ్మకం నాకు లేదు" ఇత్యాదికంచేత ముఖసంధ్యంగమైన ఉపక్షేపం మొదలు ఇతరులకొరకై శరీరాన్ని అర్పించడం అనే రూపం గల నిర్వహణసంధివరకు శాంతరసం నడిపించబడింది. దానికి విరుద్ధమైన మలయవతీవిషయకమైన శృంగారం - "అహో గీతమ్! అహో వాదిత్రమ్!" (ఆహా! ఏమి గీతం! ఏమి వాద్యం) అని ఆ రెండింటికీ (శాంతశృంగారాలు రెండింటికీ) విరుద్ధం కాని అద్భుతరసాన్ని మధ్యలో చేర్చి క్రమంగా ప్రసరించే సంభావనయొక్క అభిప్రాయంచేత (క్రమంగా ప్రసరించే విధంగా) నిబంధించబడింది. ఇందు నిమిత్తమే ఇక్కడ కూర్చిన - "వ్యక్తిర్వ్యఞ్జనధాతునా" ఇత్యాదికం నీరసం వంటిదే అయినా అద్భుతరసాన్ని పోషించేది అవడంచేత అత్యంతసరసత్వాన్ని కలిగిస్తున్నది. ఈ విధంగా "నిర్దోష

దర్శనాః కన్యకాః'' (కన్యలను చూచినా దోషం లేదు) అని నాయకనిష్ఠరతిభావం క్రమంగా ప్రవరించేటట్లు నిబద్ధమైనది. యథా ఇతి - చిత్తవృత్తుల ప్రసారంయొక్క వర్జనమే లేదా నిరోధమే ధనంగా గల సాంఖ్యులు ఇట్లే చెప్పి ఉన్నారు కదా? (సాంఖ్యకారికలోని పూర్తి శ్లోకం ఇది) -

పురుషార్థహేతుకమిదం నిమిత్తనైమిత్తికప్రసంగేన,
ప్రకృతేర్విభుత్వయోగాన్నటవద్ వ్యవతిష్ఠతే లిఙ్గమ్. (సాం. కా. 42)

పురుషార్థేతి. ఇదం లిఙ్గమ్= ఈ లింగశరీరం, పురుషార్థహేతుకమ్= పురుషునకు భోగమోక్షాలను సంపాదించిపెట్టడమే హేతువుగా కలదై, (పురుషునకు భోగాదులను సంపాదించడం కోసమే) నిమిత్తనైమిత్తికప్రసంగేన= నిమిత్తాలైన ధర్మాధర్మాదులయొక్క, నైమిత్తికాలైన స్థూలశరీరాదులయొక్క సంబంధంచేత, నటవత్= నటుడువలె, ప్రకృతేః= ప్రకృతియొక్క, విభుత్వయోగాత్= ప్రభుత్వంయొక్క సంబంధంవల్ల (ప్రకృతిశక్తివల్ల), వ్యవతిష్ఠతే= ప్రవర్తిస్తూన్నది.

ధర్మాధర్మాలు వాటివల్ల వచ్చిన స్థూలదేహాదులు వీటి సంబంధంవల్ల సూక్ష్మశరీరం దేవమనుష్య పశుపక్ష్యాది వివిధశరీరాలు ధరిస్తూ ఉంటుంది అని సాంఖ్యులు చెప్పినట్లు వివిధనిమిత్తాలయొక్క, వాటి కార్యాలయొక్క సంబంధంచేత ఒకదాని తరవాత ఒకటిగా చిత్తవృత్తులు ప్రసరిస్తూంటాయి అని ఈ కారికను ఉదాహరించడంలో భావం.

అనన్తరమితి:- అనంతరం నిమిత్తనైమిత్తికప్రసంగంచేత శృంగారరసం వచ్చింది. దానికి శేఖరవృత్తాంతంలోని హాస్యరసం ఉపకారకంగా ఉంది. దీని తరవాత మలయవతి అక్కడినుండి వెళ్లడానికి వీలు కల్పిస్తూ మిత్రావసువును ప్రవేశింపచేసి, ''సంసర్పద్భిః సమన్తాత్'' ఇత్యాదికావ్యంలో నిబద్ధమైన క్రోధరూపవ్యభిచారిభావంచేత ఉపకృతమైన వీరరసాన్ని మధ్యలో కూర్చి శృంగారానికి విరుద్ధమైనదీ, వైరాగ్యశమాలను పోషించేదీ అయిన సర్పకలేబర-అస్థిసముదాయాలను చూడడం మొదలైన వృత్తాంతం చేర్చబడింది. (నాగానందం చదువుతే ఈ విషయాలన్నీ స్పష్టం అవుతాయి).

## ధ్వన్యాలోకం

శాన్తశ్చ తృష్ణాక్షయసుఖస్య యః పరిపోషః తల్లక్షణో రసః ప్రతీయత ఏవ. తథా చోక్తమ్ -

యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్,
తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్. (101)

యది నామ సర్వజనానుభవయోగ్యతా అస్య నాస్తి నైతావతా అసౌ అలోకసానున్య మహాభావచిత్తవృత్తివిశేషః ప్రతిక్షేప్తుం శక్యః. న చ వీరే తస్యాన్తర్భావః కర్తుం యుక్తః. తస్యాభిమానమయత్వేన వ్యవస్థాపనాత్. అస్య చ అహఙ్కారప్రశమైకరూపతయా స్థితేః. తయోశ్చైవంవిధవిశేషసద్భావేఽపి యద్యైక్యం పరికల్ప్యతే తద్వీర రౌద్రయోరపి తథా ప్రసఙ్గః. దయావీరాదీనాం చ చిత్తవృత్తివిశేషాణాం సర్వాకారమహంకారరహితత్వేన శాన్తరసప్రభేదత్వమ్; ఇతరథా తు వీరప్రభేదత్వమితి వ్యవస్థాప్యమానే న కశ్చిద్విరోధః. తదేవమస్తి శాన్తో రసః. తస్య చ అవిరుద్ధరసవ్యవధానేన ప్రబన్ధే విరోధిరససమావేశే ఽపి నిర్విరోధత్వమ్, యథా ప్రదర్శితే విషయే.

బాలానందిని

శాన్తశ్చేతి - ఆశాక్షయసుఖంయొక్క ఏ పరిపోషం ఉన్నదో తద్రూపమైన శాంతరసం అనుభవగోచరమే. ఈ విషయమే చెప్పబడింది -

యచ్చేతి "ఈ లోకంలో వివిధకామాల అనుభవంవల్ల కలిగే ఏ సుఖం ఉన్నదో, దేవలోకసంబంధియైన ఏ గొప్ప సుఖం ఉన్నదో ఈ రెండు సుఖాలూ కూడ ఆశను విడిచిపెట్టడంవల్ల కలిగే సుఖంయొక్క పదహారవ అంశానికి కూడ పోలవు".

యదీతి. ఈ శాంతరసం సకలజనుల అనుభవానికి గోచరం కాకపోతే తావన్మాత్రంచేత లోకసాధారణం కాని మహానుభావులలో ఉండే ఈచిత్త విశేషమే లేదని నిరాకరించడానికి శక్యం కాదు. దీనిని వీరరసంలో అంతర్గతం చేయడం యుక్తం కాదు. అది (వీరరసం) అహంకారప్రధానం అని స్థాపించబడింది. అహంకారప్రశమమే దీని (శాంతరసంయొక్క) ప్రధానస్వరూపంగా ఉంటుంది. ఈ విధమైన భేదం ఉన్నా కూడ ఈ రెండూ ఒకటే అన్నట్లయితే వీరరౌద్రాలు కూడా ఒకటే అని చెప్పవలసి వస్తుంది. దయావీరం మొదలైన చిత్తవృత్తివిశేషాలలో పూర్తిగా అహంకారం అనేది లేకపోతే అవి కూడ

శాంతరసభేదాలే. అలా కాకపోతే (అహంకారస్పర్శ ఉంటే) వీరరసభేదాలు అని వ్యవస్థ చేస్తే విరోధం ఏమీ లేదు. అందుచేత ఈ విధంగా శాంతరసం ఉంది. విరోధిరసాలతో సమావేశం ఉన్నా కూడ మధ్యలో అవిరుద్ధరసాల వ్యవధానం కల్పిస్తే, పైన చూపినట్లు (నాగానందోహరణంలో వలె) విరోధం ఉండదు.

లోచనం

నను నాస్త్యేవ శాన్తరసః, తస్య తు స్థాయ్యేవ నోపదిష్టో మునినా ఇత్యాశఙ్క్యాహ - శాన్తశ్చేతి. తృష్ణానాం విషయాభిలాషాణాం యః క్షయః, సర్వతో నివృత్తిరూపః నిర్వేదః తదేవ సుఖం, తస్య స్థాయిభూతస్య యః పరిపోషో రస్యమానతాకృతః తదేవ లక్షణం యస్య స శాన్తో రసః. ప్రతీయత ఏవేతి. స్వానుభవేనాపి నివృత్తభోజనాద్యశేషవిషయేచ్ఛాప్రసరత్వకాలే సంభావ్యత ఏవ.

అన్యే తు సర్వచిత్తవృత్తిప్రశమ ఏవాస్య స్థాయీతి మన్యన్తే. తృష్ణాసద్భావస్య ప్రసజ్యప్రతిషేధరూపత్వే చేతోవృత్తిత్వాభావేన భావత్వాయోగాత్. పర్యుదాసే త్వస్మత్పక్ష ఏవ అయమ్.

అన్యే తు -

స్వం స్వం నిమిత్తమాసాద్య శాన్తాద్భావః ప్రవర్తతే,

పునర్నిమిత్తాపాయే తు శాన్త ఏవ ప్రలీయతే.

ఇతి భరతవాక్యం దృష్టవన్తః సర్వరససామాన్యస్వభావం శాన్తమాచక్షాణాః అనుపజాతవిశేషాన్తరచిత్తవృత్తిరూపం శాన్తస్య స్థాయిభావం మన్యన్తే. ఏతచ్చ నాతీవ అస్మత్పక్షాద్దూరమ్. ప్రాగభావప్రధ్వంసాభావకృతస్తు విశేషః. యుక్తశ్చ ప్రధ్వంస ఏవ తృష్ణానామ్. యథోక్తం "వీతరాగజన్మాదర్శనాత్" ఇతి.

బాలానందిని

నన్వితి - (ఆశంక) శాంతం అనే రసమే లేదు; దానికి ముని స్థాయిభావం ఏదీ చెప్పలేదు కదా? అని ఆశంకించుకొని శాన్తశ్చ ఇత్యాదికం చెపుతున్నాడు. తృష్ణానామ్= విషయాభిలాషలయొక్క, యః= ఏ, క్షయః= అన్ని విధాలా, అన్నింటినుండీ, నివర్తించడం అనే రూపం గల నిర్వేదం గలదో, అదే సుఖం, స్థాయి యైన దానియొక్క, ఏ, పరిపోషః=

రస్యమానత్వం వల్ల ఏర్పడిన పరిపుష్టి గలదో, అదే లక్షణంగా గల శాంతరసం. ప్రతీయతే ఏవేతి. భోజనాదులైన సమస్తవిషయాలయందు ఇచ్ఛ ప్రసరించడం నివర్తించిన సమయంలో స్వానుభవంచేత కూడ ఇది (నిర్వేదరూపసుఖం) ఉండడానికి అవకాశం ఉన్నదని తెలియబడుతుంది.

అన్యే ఇతి - కొందరు సమస్తచిత్తవృత్తుల ప్రశమమే దీనికి స్థాయి అని అంటున్నారు. ('తృష్ణాక్షయ' శబ్దానికి కూడ ఇదే అర్థం అని వారి అభిప్రాయం). కాని తృష్ణాసద్భావంయొక్క, అనగా సమస్తచిత్తవృత్తులప్రసారంయొక్క, ప్రసజ్యప్రతిషేధరూపం అని అంగీకరిస్తే, అనగా చిత్తవృత్తుల అత్యంతాభావం అని అన్నట్లయితే అది (అభావం) చేతోవృత్తి కాదు గాన భావం (స్థాయిభావం) అనడం కుదరదు. పర్యుదాస అయితే, అనగా అధర్మాదిపదాలకి ధర్మవిరుద్ధమైన పాపాదులు అని అర్థం చెప్పినట్లు సర్వచిత్తవృత్తులకూ విరోధియైన చిత్తవృత్తివిశేషం అని చెప్పినట్లయితే, అప్పుడు అది మా పక్షమే అవుతుంది. అనగా నిర్వేదరూపమైన చిత్తవృత్తివిశేషం అని చెప్పి నట్లవుతుంది.

ప్రసజ్యప్రతిషేధ పర్యుదాస అనేవి పారిభాషికపదాలు. నిషేధార్థకమైన 'నఞ్' క్రియతో అన్వయిస్తే ప్రసజ్యప్రతిషేధ; ఉత్తరపదంతో అన్వయిస్తే పర్యుదాస. ఉదాహరణకి - "అనశ్వారోహణమ్" అన్నప్పుడు 'నఞ్'కు ఆరోహణక్రియతో అన్వయం చెపితే 'అశ్వాన్ని ఎక్కకపోవడం' అని అర్థం. ఉత్తరపదంతో అన్వయం చెపితే "గుఱ్ఱం కాని దానిపైన (ఏనుగువంటిదానిపైన) ఎక్కడం" అని అర్థం. ఇక్కడ నఞ్ప్రయోగం లేకపోయినా కొంతవరకు తత్సదృశార్థమైన 'క్షయ' శబ్దాన్ని ప్రయోగించడంచేత ఈ పారిభాషికపదాలు ఉపయోగించబడ్డాయి.

అన్యే తు ఇతి - మరి కొందరైతే - "ప్రతిభావమూ కూడ తన తన నిమిత్తాన్ని పొంది శాంతం నుంచి పుడుతుంది; ఆ నిమిత్తం తొలగగానే తిరిగి శాంతంలోనే అణిగిపోతుంది' ' అనే భరతవాక్యం చూచి "సమస్తమైన రసాల అభావమే శాంతం అని అంటూ, ఏ విశేషమూ (ఏ భావవిశేషమూ) పుట్టని ఆంతరమైన (లోపలిదైన) చిత్తవృత్తియే శాంతానికి స్థాయిభావం అని అంటున్నారు. ఇది కూడా మా పక్షానికి చాలా దూరం కాదు. భేదం అల్లా ప్రాగభావప్రధ్వంసాభావాలను పట్టి మాత్రమే.

వివరణ:- ఒక వస్తువు పుట్టే క్షణం వరకూ ఆ వస్తువు లేదు. అలా లేకపోవడం ప్రాగభావం. పుట్టిన ఒక వస్తువు కాలాంతరంలో నశిస్తే అది ప్రధ్వసాభావం. ఏ చిత్తవృత్తీ పుట్టకపోవడమే (చిత్తవృత్తిప్రాగభావమే) స్థాయి అని వాళ్లు అంటున్నారు. పుట్టిన

చిత్తవృత్తులన్నీ నశించడం (ప్రధ్వంసాభావం) స్థాయిభావం అని మేం అంటున్నాం. చిత్తవృత్తులు లేకపోవడం ఇద్దరికీ సమానమే అని భావం.

యుక్తశ్చేతి. తృష్ణల ప్రధ్వంసయే స్థాయిభావం అని చెప్పడం యుక్తం. అందువల్లనే న్యాయదర్శనంలో "వీతరాగజన్మాదర్శనాత్" (న్యా.సూ. 3.1.24) (రాగం నశించిన వాళ్లకు పునర్జన్మ కనబడడం లేదు) అని చెప్పబడింది. (రాగప్రాగభావం కాకుండా రాగప్రధ్వంసాభావం చెప్పబడింది అని అర్థం).

లోచనం

ప్రతీయత ఏవేతి. మునినాప్యఙ్గీక్రియత ఏవ "క్వచిచ్ఛమః" ఇత్యాది వదతా. న చ పర్యన్తావస్థా వర్ణనీయా యేన సర్వచేష్టోపరమాదనుభావాభావేన అప్రతీయమానతా స్యాత్. శృఙ్గారాదేరపి ఫలభూమౌ అవర్ణనీయతైవ; పూర్వభూమౌ తు - "తస్య ప్రశాన్తవాహితా సంస్కారాత్" "తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః" ఇతి సూత్రద్వయనీత్యా చిత్రాకారా యమనియమాదిచేష్టా రాజ్యధురోద్వనాదిలక్షణా వా శాన్తస్యాపి జనకాదేర్దృష్టైవేతి. అనుభావసద్భావాద్యమనియమాదిమధ్యసంభావ్యమాన భూయోవ్యభిచారిసద్భావాచ్చ ప్రతీయత ఏవ.

బాలానందిని

ప్రతీయత ఏవేతి. "క్వచిచ్ఛమః" (కొన్నిచోట్ల శమం) అని అంటూన్న మునిచేత కూడ అంగీకరించబడింది. చేష్టలన్నీ ఉడుగుట మొదలైనవి శాంతానికి అనుభావా లని చెప్పాలి. అవి ప్రయోగయోగ్యాలు కాదు. అందుచేత అనుభావాల ద్వారా శాంతాన్ని వ్యంజింపచేయడం కుదరదు అనే ఆశంకకి సమాధానం చెపుతున్నాడు - న చేతి. దాని పర్యంతావస్థను, చివరి అవస్థను, వర్ణించవలసిన పని లేదు; అలాంటి అవసరం ఉంటే సకలచేష్టలు ఉపరమించడంవల్ల అనుభావాలు లేకపోవడంచేత శాంతం ప్రతీయమానం కాదు అనే ఆక్షేపానికి అవకాశం ఉండేది. ఫలభూమిలో, చివరిభూమికలో, శృంగారాదులు కూడ అవర్ణనీయాలే.

సురతం వర్ణించకూడదు కదా అని బాలప్రియాకారుడు వ్రాశాడు. కాని ఇక్కడ 'శృంగారాదేః' అనడంచేత ఇతరరసాలు కూడా గ్రహించాలి కదా? అందుచేత ఏ రసమైనా "పరాకాష్ఠ" చెందినప్పుడు అది అనుభవైకవేద్యమే; వర్ణింప శక్యం కాదు అని భావం బాగుంటుంది.

**పూర్వభూమౌ ఇతి** - ఫలభూమిలో అవర్ణనీయమైనా పూర్వభూమికలో **తస్య ఇత్యాది** సూత్రద్వయంలో చెప్పిన రీతిలో చిత్రాకారమైన యమనియమాది చేష్ట, **లేదా శాంతుడై**నా జనకునివంటివానికి రాజ్యభారవహనాదిరూపమైన చేష్ట కనబడుతూనే ఉన్నాయి. అందుచేత అనుభావాలు ఉంటాయి. ఇవి కాక యమనియమాదుల మధ్య ఉండడానికి అవకాశం ఉన్న అనేకవ్యభిచారిభావాలు కూడా ఉంటాయి. అందుచేత శాంతం తప్పక ప్రతీతిగోచరం అవుతుంది.

వివరణ:- "తస్య ప్రశాన్తవాహితా సంస్కారాత్" (3.10) "తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః" (4.27) ఈ రెండూ పాతంజలయోగదర్శనంలోని సూత్రాలు. చిత్తవృత్తులను నిరోధించడంవల్ల నిరోధసంస్కారం కలుగుతుంది. మనస్సు ఆ స్థితినుండి బైటకు రావడానికి వ్యుత్థానం అని పేరు. ఈ వ్యుత్థానానికి సంబంధించిన సంస్కారం వ్యుత్థానసంస్కారం. నిరోధసంస్కారం బలీయమైన వ్యుత్థానసంస్కారాలను అణచివేస్తుంది. "సంస్కారాత్= నిరోధసంస్కారంవల్ల, తస్య= చిత్తానికి, ప్రశాంతవాహితా= ప్రశాంతంగానే **అనగా ఆ** నిరోధంతోనే, నిరంతరం ఉండడం జరుగతుంది" అని మొదటి **సూత్రానికి అర్థం. అనగా** నిరోధసంస్కారం దృఢంగా ఉన్న చిత్తం ఎల్లప్పుడూ వ్యుత్థానాలు **లేకుండా ప్రశాంతం**గా ఉంటుంది అని భావం. చిత్తానికి పురుషునికీ ఉన్న విశేషాన్ని **గుర్తించ కలిగినవాని** మనస్సు వివేకం వైపు మొగ్గుదల చూపుతూ కైవల్యాభిముఖమై ఉంటుంది. **అయితే** - "తచ్ఛిద్రేషు= వివేకం వైపు మొగ్గుదల చూపేటప్పుడు మధ్య **మధ్య సమయాలలో**, సంస్కారేభ్యః= సంస్కారాలవల్ల, ప్రత్యయాన్తరాణి= ఇతరప్రత్య**యాలు కలుగుతుంటాయి**" అని రెండవ సూత్రానికి అర్థం. వివేకం వైపు మొగ్గిన **చిత్తం** కలవానికి కూడ మధ్య మధ్య, పూర్వం ఉన్న వ్యుత్థానసంస్కారాలను పట్టి 'నేను' 'నాది' 'తెలుసుకుంటున్నాను' "తెలుసుకొనలేకున్నాను" ఇత్యాదివిధాలైన జ్ఞానాలు కలుగుతూంటాయి అని భావం. అందుచేత శాంతరసాశ్రయుడైన వ్యక్తిలో కూడ విశిష్టమైన కొన్ని చేష్టలు కనబడుతూ ఉంటాయి. అందుచేత అవన్నీ అనుభావాలుగా ఉండడంచేత శాంతరసవ్యంజనం అసంభావ్యం కాదు అని ఈ సూత్రాలను ఉదాహరించడంలో అభినవగుప్తుని అభిప్రాయం.

లోచనం

నను న ప్రతీయతే; నాస్య విభావాః సన్తీతి చేత్ - న; ప్రతీయతే ఏవ తావదసౌ. తస్య చ భవితవ్యమేవ ప్రాక్తనకుశలపరిపాకపరమేశ్వరాను

గ్రహాధ్యాత్మరహస్యశాస్త్రవీతరాగపరిశీలనాదిభిః విభావైః ఇతి ఇయతైవ విభావానుభావవ్యభిచారిసద్భావః స్థాయీ చ దర్శితః. నను తత్ర హృదయసంవాదాభావాద్రస్యమానతైవవానుపపన్నా. క ఏవ మాహ స నాస్తీతి? యతః ప్రతీయత ఏవేత్యుక్తమ్. నను ప్రతీయతే; సర్వస్య శ్లాఘాస్పదం న భవతి. తర్హి వీతరాగాణాం శృఙ్గారో న శ్లాఘ్య ఇతి సోఽపి రసత్వాత్ చ్యవ్యతామితి, తదాహ - యది నామేతి. నను ధర్మప్రధానోఽసౌ వీర ఏవేతి సమ్భావయమాన ఆహ - స చేతి. తస్యేతి వీరస్య. అభిమానమయత్వేనేతి. ఉత్సాహో హ్యహమేవంవిధ ఇత్యేవంప్రాణ ఇత్యర్థః. అస్య చేతి శాన్తస్య. తయోశ్చేతి. ఈహామయత్వనిరీహామయత్వాభ్యామత్యన్తవిరుద్ధయోరపీతి చశబ్దార్థః. వీరరౌద్రయోస్తు అత్యన్తవిరోధోఽపి నాస్తి. సమానం రూపం చ ధర్మార్థకామోపార్జనోపయోగిత్వమ్.

బాలానందిని

నన్వితి:- (ఆశంక) శాంతరసానికి విభావాలే లేవు; అందుచేత దీని ప్రతీతి కలగదు. (సమాధానం) అది యుక్తం కాదు. దీని ప్రతీతి కలుగుతూనే ఉంది. దానికి పూర్వజన్మకృతపుణ్యకర్మ, పరమేశ్వరానుగ్రహం, అధ్యాత్మరహస్యాలను బోధించే శాస్త్రాలను పరిశీలించడం, రాగరహితులైన మహాపురుషుల పరిశీలన మొదలైన విభావాలు ఉండి తీరాలి. అందుచేత ఇంతవరకు చెప్పినదానిని పట్టి శాంతానికి విభావ-అనుభావ-వ్యభిచారులు ఉన్నా యనీ, స్థాయి కూడ ఉన్నదనీ చూపబడింది. నన్వితి:- (ఆశంక) ఈ శాంతరసం విషయంలో హృదయసంవాదం ఉండదు; అందుచేత దీనిని ఆస్వాదించడమే అనుపపన్నం కదా? (సమాధానం) ఎవరన్నారు హృదయసంవాదం లేదని? ఇది ప్రతీయమానం అవుతున్న దని చెప్పేం కదా? నన్వితి (శంక). నిజమే; ప్రతీయమానం అవుతూన్నది; కాని అందరికీ శ్లాఘావిషయం కాదు. (సమాధానం) అట్లయితే వీతరాగులకు (వైరాగ్యవంతులైన జ్ఞానులకు) శృంగారం కూడా శ్లాఘ్యం కాదు; అందుచేత దానిని కూడా రసత్వంనుంచి తొలగించండి. ఈ విషయమే యది నామేత్యాది వాక్యంలో చెపుతున్నాడు. నన్వితి. ధర్మప్రధానమైన ఈ శాంతరసం వీరరసమే అని సంభావన చేస్తూ దానిని పరిహరించడం కోసం చెపుతున్నాడు - స చేతి. తస్యేతి. వీరరసంయొక్క అభిమానమయత్వేనేతి. "నేను ఇంతటివాణ్ణి" అనే భావమే ఉత్సాహానికి

ప్రాణం కదా అని అర్థం. అస్య చేతి వాంతరసంయొక్క. ఒకటి ఈహామయం (కోరికలతో నిండినది), రెండవది అనీహామయం. ఈ విధంగా అత్యంతవిరుద్ధాలైనా అని 'చ' శబ్దానికి అర్థం. వీరరౌద్రాలకైతే అత్యంతవిరోధం కూడ లేదు. ధర్మార్థకామోపయోగిత్వం అనే రూపం కూడ సమానం.

లోచనం

నన్వేవం దయావీరో, ధర్మవీరో, దానవీరో వా నాసౌ కశ్చిత్. శాన్తస్యైవేదం నామాన్తరకరణమ్. తథా చ మునిః-

దానవీరం ధర్మవీరం యుద్ధవీరం తథైవ చ,

రసం వీరమపి ప్రాహ బ్రహ్మా త్రివిధసంమితమ్.

ఇత్యాగమపురఃసరం త్రైవిధ్యమేవాభ్యధాత్. తదాహ - దయావీరాదీనాం చేతి. ఆదిగ్రహణేన ధర్మవీరదానవీరయోః గ్రహణమ్. విషయజుగుప్సారూపత్వాత్ బీభత్సేఽన్తర్భావః శఙ్క్యతే. సా త్వస్య వ్యభిచారిణీ భవతి న తు స్థాయితామేతి. పర్యన్తనిర్వాహే తస్యా మూలత ఏవ విచ్ఛేదాత్.

ఆధికారికత్వేన తు శాన్తో రసో న నిబద్ధవ్య ఇతి చన్ద్రికాకారః. తచ్చేహాస్మాభిః న పర్యాలోచితమ్; ప్రసఙ్గాన్తరాత్. మోక్షఫలత్వేన చాయం పరమపురుషార్థ నిష్ఠత్వాత్ సర్వరసేభ్యః ప్రధానతమః. స చాయమస్మదుపాధ్యా భట్టతౌతేన కావ్యకౌతుకే, అస్మాభిశ్చ తద్వివరణే బహుతరకృతనిర్ణయపూర్వపక్షసిద్ధాన్త ఇత్యలం బహునా.

బాలానందిని

నన్వితి - (ఆశంక) దయావీరం అనేది ఒక టుంది కదా - ఇది ధర్మవీరం కాని దానవీరం కాని కాజాలదు. ఇది శాంతానికే పెట్టిన మరొక పేరు. అందుచేతనే ముని - "బ్రహ్మదేవుడు దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం అని మూడు విధాలైన వీరరసాన్ని చెప్పాడు" అని ఆగమపూర్వకంగా (బ్రహ్మవచననిర్దేశపూర్వకంగా) వీరరసానికి త్రివిధత్వమే చెప్పాడు. ఈ విషయాన్నే దయావీరాదీనాం చ అని చెపుతున్నాడు. 'ఆది' శబ్దం ప్రయోగించడంచేత ధర్మవీరదానవీరాలను గ్రహించాలి. విషయేతి. కొందరు విషయజుగుప్సారూపం అవడంచేత శాంతాన్ని బీభత్సంలో అంతర్గతం చేయవచ్చు అని శంకిస్తున్నారు. కాని విషయజుగుప్స దీనికి వ్యభిచారిభావం కావచ్చును కాని స్థాయి

కాజాలదు. శాంతరసాన్ని చివరిదాకా నిర్వహించేటప్పటికి ఈ జుగుప్స కూడా సమూలంగా పోతుంది కదా? అనగా దేనినిగూర్చీ రాగద్వేషాదులు లేకపోవడమే శాంతానికి పరమావధి. ఆ స్థితిలో జుగుప్స కూడా పూర్తిగా నశిస్తుంది అని బావం. ఆధికారిత్వేనేతి:- శాంతరసాన్ని ప్రధానరసంగా (ఆధికారికత్వేన) నిబంధించకూడదు అని చంద్రికాకారుడు. దీనిని గూర్చి మేము ఇక్కడ చర్చించలేదు. అది వేరే ప్రసంగం అవుతుంది కదా? శాంతరసం మోక్షఫలం అవడంచేత పరమపురుషార్థానికి సంబంధం ఉన్న దవడంచేత ఇది అన్ని రసాలకంటె ఎక్కువ ప్రధానమైనది. ఈ విషయం మా ఉపాధ్యాయడైన భట్టతౌతుడు కావ్యకౌతుకంలోను, దాని వివరణంలో మేమూ అనేక విధాల పూర్వపక్షసిద్ధాంతాలలో నిర్ణయం చేసి ఉన్నాం. ఇంతటితో ఈ విషయం ముగించుదాం.

## ధ్వన్యాలోకం

ఏతదేవ స్థిరీకర్తుమిదముచ్యతే -

కా. రసాన్తరాన్తరితయోరేకవాక్యస్థయోరపి,
నివర్తతే హి రసయోః సమావేశే విరోధితా. 27

రసాన్తరవ్యవహితయోః ఏకప్రబన్ధస్థయోర్విరోధితా నివర్తత ఇత్యత్ర న కాచిత్ భ్రాన్తిః. యస్మాదేకవాక్యస్థయోదపి రసయోరుక్తయా నీత్యా విరుద్ధతా నివర్తతే. యథా -

భూరేణుదిగ్ధాన్నవపారిజాతమాలారజోవాసితబాహుమధ్యాః,
గాఢం శివాభిః పరిరభ్యమాణాన్ సురాఙ్గనాశ్లిష్టభుజాన్తరాలాః.(102)
సశోణితైః క్రవ్యభుజాం స్ఫురద్భిః పక్షైః ఖగానాముపవీజ్యమానాన్,
సంవీజితాశ్చన్దనవారిసేకైః సుగన్ధిభిః కల్పలతాదుకూలైః (103)

విమానపర్యఙ్కతలే నిషణ్ణాః కుతూహలావిష్టతయా తదానీమ్,
నిర్దిశ్యమానాన్ లలనాఙ్గులీభిర్వీరాః స్వదేహాన్ పతితానపశ్యన్.(104)

ఇత్యాదౌ. అత్ర హి శృఙ్గారబీభత్సయోః తదఙ్గయోర్వా వీరరసవ్యవధానేన సమావేశో న విరోధీ.

బాలానందిని

ఏతదేవేతి- ఈ విషయాన్నే స్థిరం చేయడం కోసం ఇది చెప్పబడుతున్నది-

రసేతి. ఏకవాక్యస్థయోరపి= ఒక వాక్యంలో ఉన్నవైనా, రసాన్తరాన్తరితయోః= మరొక రసంచేత అంతరితాలైన (వ్యవధానం కల్పించిన), రసయోః= రెండు రసాల యొక్క, సమావేశే= ఒక చోట కూర్చడం జరిగినా కూడ, విరోధితా= విరోధిత్వం, నివర్తతే= తొలగును. 27

రసాన్తరేతి. ఒకే ప్రబంధంలో ఉండి మరొక రసంచేత వ్యవహితాలైన (రెండు విరుద్ధరసాల విరోధిత్వం) నివర్తిస్తుంది అనే విషయంలో భ్రాంతి ఏమీ లేదు. ఎందువల్ల ననగా - ఒక వాక్యంలో ఉన్న రసాల విరోధం కూడ చెప్పిన రీతిచేత (మధ్య మరొక రసం చేర్చడం చేత) నివర్తిస్తుంది. వాక్యంలోనే విరోధం లేనప్పుడు ప్రబంధం విషయం చెప్పాలా అని భావం. ఎట్లనగా - భూరేణుదిగ్ధానిత్యాది వాక్యంలో. (ఇక్కడ శ్లోకాలు మూడైనా వాక్యం ఒకటే).

భూరేణు ఇత్యాది :- ఈ శ్లోకాలే కావ్యప్రకాశలో కూడ ఉదాహరించబడ్డాయి. యుద్ధంలో ప్రాణాలు త్యజించిన వీరులు ఆ పుణ్యంచేత వెంటనే స్వర్గానికి వెళ్లి విమానాధిరూఢులై తమ ప్రక్క చేరిన అప్సరసలతో ఆనందిస్తూ క్రిందపడి ఉన్న తమ దేహాలను, వాళ్ల వ్రేళ్లతో చూపుతుండగా, చూస్తున్నట్లు వర్ణిస్తున్న శ్లోకాలు. తదా= అప్పుడు, విమానపర్యఙ్కతలే= విమానాలలో ఉన్న పరుపులమీద (సోఫాలమీద) నిషణ్ణాః= కూర్చున్న, నవపారిజాతమాలారజోవాసితబాహుమధ్యాః= నూతనములైన పారిజాతపుష్పమాలలోని పుప్పొడిచేత సువాసన కలవిగా చేయబడిన భుజమధ్యప్రదేశాలు కలవారు, సురాఙ్గనాశ్లిష్టభుజాన్తరాలాః= అప్సరసలచేత కౌగలించుకొనబడిన వక్షఃస్థలాలు కలవారు, చన్దనవారిసేకైః= మంచిగంధపు నీళ్ల తడుపు గల, సుగన్ధిభిః= మంచి వాసన గల, కల్పలతాదుకూలైః= కల్పలతలయం దున్న వస్త్రాలచేత, సంవీజితాః= వీచబడినవారూ అయిన, వీరాః= వీరులు, భూరేణుదిగ్ధాః= భూమియందున్న పరాగంచేత పూయబడినవీ, శివాభిః= ఆడనక్కలచేత, గాఢమ్= గాఢంగా, పరిరభ్యమాణాన్= కౌగలించుకొనబడుచున్నవీ, క్రవ్యభుజామ్= మాంసం తినే, ఖగానామ్= పక్షులయొక్క, పక్షైః= రెక్కలచేత, ఉపవీజ్యమానాన్= వీచబడుచున్నవి. లలనాఙ్గులీభిః= స్త్రీల వ్రేళ్లచేత, నిర్దిశ్యమానాన్= చూపబడుచున్నవీ అయిన, పతితాన్= పడిన, స్వదేహాన్= తమ దేహాలను, కుతూహలావిష్టతయా= కుతూహలంచేత ఆవేశించబడడంతో, కౌతూకావేశంతో, అపశ్యన్ = చూచిరి.

అత్ర హీతి. ఇక్కడ శృంగారబీభత్సాల మధ్య లేదా వాటి అంగాల మధ్య వీరరసవ్యవధానం చేసి వాటి సమావేశం చేయడం విరోధి కాదు.

లోచనం

స్థిరీకర్తుమితి. శిష్యబుద్ధావిత్యర్థః. అపిశబ్దేన ప్రబన్ధవిషయతయా సిద్ధోఽయమర్థ ఇతి దర్శయతి. భూరేణ్వితి. విశేషణైరతీవ దూరాపేతత్వ మసమ్భావనాస్పదముక్తమ్. స్వదేహానిత్యనేన దేహాత్మాభిమానాదేవ తాదాత్మ్యసంభావనానిష్పత్తేః ఏకాశ్రయత్వమస్తి. అన్యథా విభిన్నవిషయత్వాత్ కో విరోధః? నను వీర ఏవాత్ర రసః, న శృఙ్గారో న బీభత్సః, పరం తు రతిజుగుప్సే హి వీరం ప్రతి వ్యభిచారిభూతే. భవత్వేవమ్; తథాపి ప్రకృతోదాహరణతా తావదుపపన్నా. తదాహ - తదఙ్గయోర్వా ఇతి. తయోః అఙ్గే తత్స్థాయి భావావిత్యర్థః. వీరరసేతి. "వీరాః స్వదేహాన్" ఇత్యాదినా తదీయోత్సాహాద్యవగత్యా కర్తృకర్మణోః సమస్తవాక్యార్థానుయాయితయా ప్రతీతిరితి మధ్యపాఠాభావేఽపి సుతరాం వీరస్య వ్యవధాయకతేతి భావః.

బాలానందిని

స్థిరీకర్తుమితి. శిష్యుల బుద్ధిలో అని అర్థం. 'అపి' శబ్దంచేత ప్రబంధవిషయకంగా, ఈ అర్థం (విషయం) సిద్ధమే అని చూపుతున్నాడు. వాక్యంలోనే ఇలా ఉన్నప్పుడు ప్రబంధం విషయం చెప్ప పని లేదు అని సూచించడంకోసం 'అపి' శబ్దం ప్రయోగించబడింది అని అర్థం. భూరేణ్వితి. "భూరేణుదిగ్ధాన్" ఇత్యాదిదేహవిశేషణాలచేత ఆ దేహాలు తమవే అని ఊహించడానికి శక్యం కాని రీతిలో దూరంగా తొలగిపోవడం, విలక్షణత్వం వ్యంజింపబడింది.

ఇక్కడ ఒక ఆశంక కలుగుతుంది. ఆలంబనం ఒక్కటైనప్పుడే శృంగారబీభత్సాలకు విరోధం. ఒకే వస్తువు విషయంలో రతి, జుగుప్సా ఒకే సమయంలో కలగవు గాన వాటికి విరోధం. ఇక్కడ బీభత్సానికి ఆలంబనం నేలమీద పడి ఉన్న శరీరాలు. శృంగారానికి ఆలంబనం విమానారూఢాలైన దివ్యశరీరాలు. ఈ విధంగా ఆలంబనం వేరువేరుగా ఉన్నప్పుడు విరోధం ఏముంది? దీనికి సమాధానం చెపుతున్నాడు - స్వదేహేతి - "స్వదేహాన్" అనడంచేత దేహాత్మాభిమానంచేతనే ఈ దేహాలకీ ఆ దేహాలకీ తాదాత్మ్యంయొక్క సంభావన సిద్ధిస్తుంది గాన ఏకాశ్రయత్వం ఉంది. ఈ తాదాత్మ్యబుద్ధి

లేకపోతే రెండు రసాల విషయాలు వేరువేరైనప్పుడు విరోధం ఎక్కడుంటుంది? అనగా అప్సరోగతమైన శృంగారబీభత్సాలకి దేహద్వయాభిమాని యైన వీరు డొక్కడే ఆలంబనం గాన విరోధం అని భావం.

నన్వితి - (ఆశంక) ఇక్కడ రసం వీరరసమే; శృంగారమూ లేదు బీభత్సమూ లేదు. అయితే రతిజుగుప్సలు ఆ వీరానికి వ్యభిచారులుగా ఉన్నాయి. భవతు ఇతి. నువ్వు చెప్పినది సత్యమే కావచ్చు. అయినా ప్రకృతవిషయం ప్రతిపాదించడంలో దీన్ని ఉదాహరణంగా చెప్పడం అనుపపన్నం (అయుక్తం) కాదు. ఆ విషయాన్నే తదఙ్గయోర్వా అని చెపుతున్నాడు. తదఙ్గయోః అనగా ఆ బీభత్సశృంగారాల స్థాయిభావాలు అని అర్థం. వీరరసేతి. "వీరాః స్వదేహాన్" ఇత్యాదికంచేత వాళ్ల ఉత్సాహం తెలియడంచేత వ్యంగ్యమైన వీరరసం, కర్తృకర్మలు ('నవ....మధ్యాః' ఇత్యాది కర్తలు, 'భూరేణుదిగ్ధాన్' ఇత్యాదికర్మలు) సమస్తవాక్యార్థాన్నీ అనుసరిస్తూ కనబడడంచేత మధ్యలో, (ఉత్సాహోద్యోతకాన్ని దేనినీ) పఠించకపోయినా సర్వథా వ్యవధాయకంగా (రెండు రసాలకీ లేదా వాటి స్థాయిభావాలకీ మధ్య) ఉంది అని భావం.

వివరణ:- వాక్యంలోని పదాల కూర్పులో క్రమం ఎలా ఉన్నా "వీరాః స్వదేహాన్ పతితాన్" అనే మాటలచేత సాహసంతో యుద్ధభూమిలోనికి దూకడం, ఆక్షిప్తాలైన గర్వాదులు, వీటితో సంవలితమైన ఉత్సాహం గమ్యం అవుతున్నది గాన వీరరసస్ఫూర్తి స్పష్టంగా ఉంది. వాక్యనిర్మాణపద్ధతిని పట్టి దీనిని మధ్య మధ్య కూర్చకపోయినా దీని స్ఫూర్తి ద్వితీయాంతాలచేత వ్యంగ్యమైన బీభత్సానికి, ప్రథమాంతాలచేత వ్యంగ్యమైన శృంగారానికీ మధ్య కలుగుతూనే ఉంది అని భావం. 27

## ధ్వన్యాలోకం

కా. విరోధమవిరోధం వా సర్వత్రేత్థం నిరూపయేత్,
విశేషతస్తు శృఙ్గారే సుకుమారతరో హ్యసౌ. 28

యథోక్తలక్షణానుసారేణ విరోధావిరోధౌ సర్వేషు రసేషు ప్రబన్ధే అన్యత్ర చ నిరూపయేత్ సహృదయః., విశేషతస్తు శృఙ్గారే. స హి రతిపరిపోషాత్మకత్వాత్, రతేశ్చ స్వల్పేనాపి నిమిత్తేన భఙ్గసంభవాత్ సుకుమారతమః సర్వేభ్యో రసేభ్యః మనాగపి విరోధిసమావేశం న సహతే.

బాలానందిని

విరోధమితి - సర్వత్ర= అన్ని రసాల విషయంలోను, విరోధమ్= విరోధాన్ని గాని, అవిరోధం వా= అవిరోధాన్ని గాని, ఇత్థమ్= ఈ విధంగా, నిరూపయేత్= పరీక్షించవలెను. శృఙ్గారే తు= శృంగారంలో అయితే, విశేషతః= విశేషించి పరీక్షించవలెను. అసౌ= అది, సుకుమారతమః= అత్యంతసుకుమారం కూడా. 28

యథోక్తేతి. ఇంతవరకు చెప్పిన లక్షణాలను అనుసరించి, ప్రబంధంలో నైనా అన్య కావ్యాలలో అయినా, సర్వరసాలలోనూ కూడ, సహృదయుడు, విరోధావిరోధాలను పరిశీలించాలి. శృంగారంలో అయితే బాగా పరిశీలించాలి. ఎందువల్ల ననగా శృంగారం రతిపరిపోషస్వరూపం. ఏ చిన్న నిమిత్తంచేతనైనా కూడ రతికి భంగం వాటిల్లవచ్చు. అందువల్ల శృంగారం అన్ని రసాలకంటె ఎక్కువ సుకుమార మైనది; విరోధిసమావేశాన్ని ఏ మాత్రమూ సహించదు.

లోచనం

అన్యత్ర చేతి - ముక్తకాదౌ. స హి శృఙ్గారః సుకుమారతమః ఇతి సంబన్ధః. సుకుమారస్తావద్రసజాతీయః. తతో౽పి కరుణః, తతో౽పి శృఙ్గార ఇతి తమప్రత్యయః. 28

బాలానందిని

అన్యత్ర చేతి - ముక్తకాదులలో. "స హి శృఙ్గారః సుకుమారతమః" అని అన్వయం. రసజాతికి చెందినది ప్రతీదీ (ప్రతిరసమూ) సుకుమారమే. వాటిలో (మిగిలినవాటికంటె) కరుణ సుకుమారం (సుకుమారతరం). దానికంటె కూడ ఎక్కువ సుకుమారం శృంగారం. అందుచేత 'సుకుమారతమః' అని 'తమ' ప్రత్యయం ప్రయోగించబడింది. 28

## ధ్వన్యాలోకం

కా. అవధానాతిశయవాన్ రసే తత్రైవ సత్కవిః,
భవేత్తస్మిన్ ప్రమాదో హి ఝటిత్యేవోపలక్ష్యతే.

తత్రైవ చ రసే సర్వేభ్యో౽పి రసేభ్యః సౌకుమార్యాతిశయ యోగిని కవిః అవధానవాన్ ప్రయత్నవాన్ స్యాత్. తత్ర హి ప్రమాద్యతస్తస్య సహృదయమధ్యే క్షిప్రమేవావజ్ఞానవిషయతా భవతి.

శృఙ్గారరసో హి సంసారిణాం నియమేన అనుభవవిషయత్వాత్ సర్వరసేభ్యః కమనీయతయా ప్రధానభూతః.

బాలానందిని

**అవధానేతి** :- సత్కవిః= మంచి కవి, తత్ర రసే ఏవ= ఆ శృంగారరసమునందే, అవధానాతిశయవాన్= ఎక్కువ ఏకాగ్రత కలవాడుగా, భవేత్= ఉండవలెను. తస్మిన్= ఆ రసం విషయంలో, ప్రమాదః= పొరబాటు, ఝటిత్యేవ= వెంటనే, ఉపలక్ష్యతే= చూడబడును. 29

**తత్రైవేతి.** కవి అన్ని రసాలకంటె సౌకుమార్యాతిశయం ఉన్న ఆ రసంవిషయంలోనే, అవధానవంతుడై, అనగా ప్రయత్నవంతుడై ఉండాలి. దాని విషయంలో అతడు పొరబాటు చేసినట్లయితే వెంటనే అతడు సహృదయుల మధ్య అవమానానికి గురి అవుతాడు. ఎందువల్ల ననగా శృంగారరసం ప్రాణు లందరికీ తప్పక అనుభవవిషయం అవడంచేత అన్ని రసాలకంటె సుందరమై ప్రధాన మైనది. (దీనికి స్పష్టార్థం అవడంచేత లోచనం లేదు).

## ధ్వన్యాలోకం

ఏవం చ సతి -

కా. వినేయానున్ముఖీకర్తుం కావ్యశోభార్థమేవ వా,
తద్విరుద్ధరసస్పర్శస్తదఙ్గానాం న దుష్యతి. 30

శృఙ్గారవిరుద్ధరసస్పర్శః శృఙ్గారాఙ్గానాం యః స న కేవలమవిరోధలక్షణయోగే సతి న దుష్యతి, యావద్వినేయానున్ముఖీకర్తుం కావ్యశోభార్థమేవ వా క్రియమాణో న దుష్యతి. శృఙ్గారరసాఙ్గైరున్ముఖీకృతాః సన్తో హి వినేయాః సుఖం వినయోపదేశాన్ గృహ్ణన్తి. సదాచారోపదేశరూపా హి నాటకాదిగోష్ఠీ వినేయజనహితార్థమేవ మునిభిరవతారితా.

బాలానందిని

ఏవం చ ఇతి. ఇది ఇలా ఉండగా -

వినేయానితి. వినేయాన్= శిష్యులను, ఎవరికి వినయం నేర్పాలో వాళ్లను, ఉన్ముఖీకర్తుమ్= ఉన్ముఖులనుగా, చెప్పే విషయంమీద శ్రద్ధ కలవాళ్లనుగా, చేయుటకు గాని, కావ్యశోభార్థమేవ వా= కావ్యంయొక్క శోభకొరకు గాని, తదఙ్గానామ్= శృంగారం యొక్క అంగాలకు, తద్విరుద్ధరసస్పర్శః= శృంగారానికి విరుద్ధమైన రసాల స్పర్శ, న దుష్యతి= దుష్టం కాదు. 30

శృఙ్గారేతి. శృంగారాంగాలకు శృంగారవిరుద్ధరసాలతో సంబంధం కేవలం అవిరోధలక్షణాలు ఉండడంమాత్రంచేతనే దోషం లేనిది కాకుండా, వినేయులను ఉన్ముఖులనుగా చేయడంకొరకు, లేదా కావ్యశోభను పెంచడంకొరకూ చేయబడినా కూడ దుష్టం కాదు. అనగా శృంగారవిరుద్ధాలైన రసాలతో శృంగారానికి సంబంధించిన అంగాలకు వేటికైనా సంబంధం ఏర్పరచినప్పుడు పైన చెప్పిన అవిరోధోపాయాలను అవలంబిస్తే విరోధం తొలగిపోతుంది. ఇంతే కాదు; వినేయులను ఉపదేశ్య విషయోన్ముఖుల్నిగా చేయడంకోసం కాని, లేదా కావ్యశోభను పెంచడంకోసం గాని కూడా శృంగారాంగాలను విరుద్ధరసాలకి చేర్చినా కూడ దోషం లేదు అని భావం. శృఙ్గారరసాఙ్గైరితి. వినేయులు శృంగారరసాంగాలచేత ఉన్ముఖులుగా చేయబడి వినయోపదేశాలను సుఖంగా, సంతోషపూర్వకంగా, గ్రహిస్తారు. సదాచారోపదేశరూపమైన నాటకాదిగోష్ఠి వినేయులహితంకోసమే మునులచేత లోకంలో ప్రవేశపెట్టబడింది.

లోచనం

ఏవం చేతి - యతోఽసౌ సర్వసంవాదీత్యర్థః. తదితి. శృఙ్గారస్య విరుద్ధా యే శాన్తాదయః తేష్వపి తదఙ్గానాం శృఙ్గారాఙ్గానాం సమ్బన్ధీ స్పర్శః న దుష్టః. తయా భఙ్గ్యా రసాన్తరగతా అపి విభావానుభావాద్యాః వర్ణనీయా యయా శృఙ్గారాఙ్గభావముపాగమన్. యథా మమైవ స్తోత్రే -

త్వాం చన్ద్రచూడం సహసా స్పృశన్తీ ప్రాణేశ్వరం గాఢవియోగతప్తా,

సా చన్ద్రకాన్తాకృతిపుత్రికేవ సంవిద్విలీయాపి విలీయతే మే.

ఇత్యత్ర శాన్తవిభావానుభావానామపి శృఙ్గారభఙ్గ్యా నిరూపణమ్. వినేయానున్ముఖీకర్తుం యా కావ్యశోభా తదర్థం నైవ దుష్యతీతి సమ్బన్ధః. వా

శబ్దేన పక్షాన్తరముచ్యతే. తదేవ వ్యాచష్టే - న కేవలమితి. వాశబ్ద స్యైతద్వ్యాఖ్యానమ్. అవిరోధలక్షణం పరిపోషపరిహారాది పూర్వోక్తమ్. వినేయానున్మఖీకర్తుం యా కావ్యశోభా తదర్థమపి వా విరుద్ధసమావేశః న కేవలం పూర్వోక్తైః ప్రకారైః, న తు కావ్యశోభా వినేయోన్ముఖీకరణమన్తరేణ ఆస్తే, వ్యవధానావ్యవధానే నాపి లభ్యేతే యథాన్యైర్వ్యాఖ్యానే. సుఖమతి-రఞ్జనాపురఃసరమిత్యర్థః. నను (క్వ) కావ్యం క్రీడారూపమ్; క్వ చ వేదాదిగోచరా ఉపదేశకథా ఇత్యాశఙ్క్యాహ - సదాచారేతి. మునిభిరితి. భరతాదిభిరిత్యర్థః. ఏతచ్చ ప్రభుమిత్రసంమితేభ్యః శాస్త్రేతిహాసేభ్యః ప్రీతిపూర్వకం జాయాసంమితత్వేన నాటకకావ్యగతం వ్యుత్పత్తికారిత్వం పూర్వమేవ నిరూపితమస్మాభిరితి న పునరుక్తభయాదిహ లిఖితమ్.

బాలానందిని

ఏవం చేతి - శృంగారం సర్వహృదయసంవాది అవడంవల్ల అని అర్థం. తదితి. శృంగారానికి విరుద్ధాలైన ఏ శాంతాదులు ఉన్నాయో వాటిలో కూడ, తదఙ్గానామ్= శృంగారాంగాలకు సంబంధించిన స్పర్శ దుష్టం కాదు. రసాంతరాలకి సంబంధించిన విభావానుభావాదులను కూడ అవి ఏ భంగిచేత (పద్ధతిలో) శృంగారానికి అంగత్వం పొందాయో అదే భంగిచేత వర్ణించాలి. ఉదాహరణకు నా స్తోత్రంలోనే "త్వాం చన్ద్ర చూడమ్" ఇత్యాది శ్లోకంలో శాంతానికి సంబంధించిన విభావానుభావాలు కూడ శృంగారానికి సంబంధించిన విభావానుభావాల పద్ధతిలో నిరూపించబడ్డాయి. త్వామితి. గాఢవియోగతప్తా= వియోగంచేత అత్యధికంగా తపింపచేయబడిన, మే= నాయొక్క, సంవిత్= అంతఃకరణవృత్తి, జ్ఞానం, చన్ద్రచూడమ్= చంద్రుడు శిరోభూషణంగా గల, త్వామ్= నిన్ను, సహసా= హటాత్తుగా, స్పృశన్తీ= స్పృశిస్తూన్నదై, సా= ఆ, చన్ద్రకాన్తాకృతిపుత్రికేవ= చంద్రకాంతమణులతో చేయబడిన బొమ్మవలె, విలీయాపి= కరిగిపోయి కూడ, విలీయతే= విలీనం అవుతున్నది.

కారికను వ్యాఖ్యానిస్తున్నాడు - వినేయానితి. వినేయులను ఉన్ముఖులనుగా చేయడానికి ఏ కావ్యశోభ ఉన్నదో దానికొరకు చేయబడినది దుష్టం కాదు అని సంబంధం. (కావ్యశోభార్థమేవ లోని 'ఏవ'ను 'న' తో చేర్చి 'నైవ' అని అర్థం చెప్పబడింది). 'వా' శబ్దాన్ని గ్రహించడంచేత మరొక పక్షం, అనగా విరోధపరిహారంకొరకు వెనక

చెప్పినవాటికంటె భిన్నమైన పక్షం చెప్పబడుతున్నది. దీనినే వ కేవలమ్ ఇత్యాదికంచేత వ్యాఖ్యానిస్తున్నాడు. పరిపోషపరిహారాదికమైన అవిరోధలక్షణం పూర్వం చెప్పబడింది. విరుద్ధరససమావేశం కేవలం పూర్వోక్తప్రకారాలచేతనే కాదు, వినేయులను ఉన్ముఖులను చేయడానికి ఏ కావ్యశోభ అవసరమో దానికొరకు కూడ చేయబడుతుంది. వినేయులను ఉన్ముఖులను చేయకుండా కావ్యశోభ అనేది ఉండదు.

వివరణ: "వ్యవధానావ్యవధానే నాపి లభ్యతే యథాన్యైః వ్యాఖ్యాతే" అనే వాక్యానికి అర్థం స్పష్టంగా లేదు. బాలప్రియలో 'క్వచిల్లభ్యత ఇతి' అని ప్రతీక ఇవ్వబడింది. కాని పై వాక్యంలో గాని, ముందువెనకలలో గాని అది లేదు. అందుచేత "వ్యవధానావ్యవధానే నా క్వచిల్లభ్యతే, యథా అన్యైః వ్యాఖ్యాతే" అని వాక్యం ఉండి ఉంటుంది. "కొన్నిచోట్ల రసాంతరవ్యవధాన అవ్యవధానాలలో కూడ కావ్యశోభ లభించదు' 'యథాన్యైః వ్యాఖ్యాతే' అనేది ఎక్కడ అన్వయిస్తుందో తెలియదు. "వినేయులను ఉన్ముఖులను చేయడానికి గాని, కావ్యశోభ కోసం గాని అని ఇతరులు చేసిన వ్యాఖ్య" అని బాలప్రియకారుడు వ్రాసినాడు. సమన్వయం చూపలేదు. వికల్పార్థం చెప్పిన పక్షంలో వినేయోన్ముఖీకరణం కోసం చేసిన శృంగారాంగసమావేశంలో కావ్యశోభ ఉండకపోవచ్చు అని అర్థం వస్తుంది. కావ్యశోభ లేక పోతే వినేయోన్ముఖీకరణం ఎలా కుదుకుతుంది? అందుచేత వినేయోన్ముఖీకరణం కోసం కావ్యశోభను పెంచాలంటే శృంగారాంగసమావేశం చెయ్యాలి అని ఈ విధంగా వ్యాఖ్యానించాలి అని అభినవగుప్తుని అభిప్రాయం అయి ఉంటుంది. కాని కావ్యశోభాతిశయపోషణం లేకపోయినా కావ్యశోభ చెడకుండా ఉంటే వినేయోన్ముఖీకరణం కుదురుతుంది గాన వికల్పార్థంలో దోషం ఏమీ లేదు.

కారికను చూచినా వృత్తిని పరిశీలించినా కూడ మేము ధ్వన్యాలోక భాగవ్యాఖ్యలో చూపిన - "వినేయులను ఉన్ముఖులను చేయడంకోసంగాని, లేదా కావ్యశోభకొరకు గాని శృంగారాంగాలకు విరుద్ధరసాలతో సంబంధం ఏర్పరచవచ్చు" అనే అర్థమే లభిస్తుంది. వృత్తికారుడు - "శృఙ్గారాఙ్గైః" మొదలు "మునిభిరవతారితా" అనే వాక్యాలచేత "వినేయానున్ముఖీకర్తుమ్" అనే అంశాన్ని వివరించి "కిం చ" మొదలు "న విరోధీ" వరకు ఉన్న వాక్యంచేత 'కావ్యశోభార్థమేవ వా" అనే దానిని వివరించాడు. కాని అభినవగుప్తుడు - 'వా' అనేది పూర్వం చెప్పిన అవిరోధాపాయాలను దృష్టిలో పెట్టుకొని మరొక "వినేయులను ఉన్ముఖులను చేయడంకొరకై కావ్యశోభ సంపాదించడం కోసం" అనే వికల్పాన్ని చెపుతున్నది. 'ఉన్ముఖీకరణంకోసంగాని, కావ్యశోభకోసంగాని'

అని అర్థం కాదు అని వ్యాఖ్యానించాడు. పైన సూచించినట్లు దీనివల్ల ఏమి ప్రయోజనమో తెలియదు. ఇలాంటి ప్రౌఢవాదాలు అభినవగుప్తునిలో క్రొత్త కాదు.

సుఖమితి. రంజనాపురస్సరంగా, వినేయుల మనస్సులను రంజింపచేస్తూ అని అర్థం. నన్వితి. కావ్యం అనేది క్రీడ వంటిది. (వినోదంవంటిది). అలాంటి కావ్యం ఎక్కడ, వేదాదులకు సంబంధించిన ఉపదేశకథ ఎక్కడ అని ఆశంకించుకొని చెపుతున్నాడు- సదాచారేతి. మునిభిరితి - భరతాదులచేత అని అర్థం. ప్రభుమిత్రసంమితాలైన శాస్త్రేతిహాసాలకంటె (అధికంగా) ప్రీతిపూర్వకంగా జాయాసమ్మితాలైన, నాట్యకావ్యాలలో ఉన్న వ్యుత్పత్తిజనకత్వాన్ని గూర్చి పూర్వమే నిరూపించి ఉన్నాం. పునరుక్తదోషభయంవల్ల ఇక్కడ మళ్లీ వ్రాయలేదు.

## ధ్వన్యాలోకం

కిం చ శృఙ్గారస్య సకలజనమనోహరాభిరామత్వాత్ తదఙ్గసమావేశః కావ్యే శోభాతిశయం పుష్ణాతీత్యనేనాపి ప్రకారేణ విరోధిని రసే శృఙ్గారాఙ్గసమావేశః న విరోధీ. తతశ్చ -

సత్యం మనోరమా రామాః సత్యం రమ్యా విభూతయః,
కిం తు మత్తాఙ్గనాపాఙ్గభఙ్గలోలం హి జీవితమ్. (105)

ఇత్యాదిషు నాస్తి రసవిరోధదోషః.

### బాలానందిని

కిం చేతి. మరియు శృంగారం సకలజనులకు మనోహరంగా, సుందరంగా ఉంటుంది గాన దాని అంగాలను కావ్యంలో కూర్చడం శోభాతిశయాన్ని పోషిస్తుంది. ఈ ప్రకారంచేత కూడ విరోధిరసంలో శృంగారాంగాల సమావేశం విరోధి కాదు. అందువల్ల "సత్యం మనోరమాః" ఇత్యాదులలో రసవిరోధదోషం లేదు.

వివరణ:- పై శ్లోకం, వెనక లోచనంలో (తృతీయోద్ద్యోతం మొదటి కారిక వృత్తి దగ్గర) ఉదాహరించబడింది. అక్కడ 'రామాః'కు బదులు 'కామాః' అనే పాఠం ఉన్నది. ఇక్కడ ఉన్న వృత్తిని పట్టి పై కారికలో వినేయోన్ముఖీకరణ - కావ్యశోభార్థత్వాల మధ్యనే వికల్పం అని పైన మేము చెప్పినట్లు స్పష్టం అవుతున్నది.

లోచనం

నను శృఙ్గారాఙ్గతాభఙ్గ్యా యద్విభావాదినిరూపణమ్ ఏతావతైవ కిం వినేయోన్ముఖీకారః? న; అస్తి ప్రకారాన్తరమ్. తదాహ - కిం చేతి. శోభాతిశయ మితి. అలంకారవిశేషముపమాప్రభృతిం పుష్యతి సున్దరీకరోతీత్యర్థః. యథోక్తమ్ - ''కావ్యశోభాయాః కర్తారః ధర్మాః గుణాః, తదతిశయహేతవ స్త్వలంకారాః'' (కా. సూత్రం. 3.1.1, 2) ఇతి. మత్తాఙ్గనేతి. అత్ర హి శాన్తవిభావే సర్వస్యానిత్యత్వే వర్ణ్యమానే న కస్య చిద్విభావస్య శృఙ్గారభఙ్గ్యా నిబన్ధః కృతః, కిం తు సత్యమితి పరహృదయానుప్రవేశేనోక్తమ్. న ఖలు అలీకవైరాగ్యకాతుక రుచిం ప్రకటయామః, అపి తు యస్య కృతే సర్వమభ్యర్థ్యతే తదేవేదం చలమితి; తత్ర మత్తాఙ్గనాపాఙ్గభఙ్గస్య శృంగారం ప్రతి సంభావ్యమాన విభావాను భావత్వేనాఙ్గస్య లోలతాయాముపమానతా ఉక్తేతి, ప్రియతమా కటాక్షో హి సర్వస్యాభిలషణీయ ఇతి చ తత్ప్రీత్యా ప్రవృత్తిమాన్ గుడ జిహ్వికయా ప్రసక్తానుప్రసక్తవస్తుతత్త్వసంవేదనేన వైరాగ్యే పర్యవస్యతి వినేయః.

బాలానందిని

నన్వితి - శృంగారాంగత్వరీతిచేత విభావాదుల నిరూపణంమాత్రంచేతనే వినేయోన్ముఖీకరణం జరుగుతుందా? కాదు, మరొక ప్రకారం కూడా ఉంది. దానిని చెపుతున్నాడు - కిం చేతి. శోభాతిశయమితి. ఉపమ మొదలైన అలంకారవిశేషాన్ని కూడ పోషిస్తుంది; సుందరంగా ఉండేటట్లు చేస్తుంది. ''కావ్యశోభను కూర్చే ధర్మాలు గుణాలు, ఆ శోభను అతిశయింపచేసేవి అలంకారాలు'' అని వామనుడు చెప్పి ఉన్నాడు కదా? మత్తాఙ్గనేతి. సర్వమూ అనిత్యము అని శాంతవిభావం వర్ణించబడుచున్నది; అంతే కాని శృంగారపద్ధతిలో ఏ విభావాన్నీ కూడ నిబంధించలేదు. కాని సత్యమ్ అని పరులహృదయాలను ప్రవేశించి చెప్పబడింది. అనగా అందరూ అనుకునే విషయం చెప్పబడింది. మేము వైరాగ్యకౌతుకంమీద ఏదో అసత్యమైన రుచిని మాత్రం ప్రకటించడంలేదు; మరే మనగా దేనికొరకై (ఏజీవితంకొరకై) ఇదంతా కోరబడుతూన్నదో అదే చంచల మైనది. ఆ జీవితంలో శృంగారానికి విభావంగాను, అనుభావంగాను ఉండే అవకాశం కలదవడంచేత దానికి అంగమైన మత్తాంగనాపాంగభంగం (మత్తెక్కి ఉన్న యువతియొక్క క్రీకంటి చూపు విరుపు) చంచలత్వానికి ఉపమానంగా చెప్పబడింది.

ప్రతివానికీ ప్రియురాలి కటాక్షం అభిలషణీయమే గాన దానియందు ( ఈ విధమైన ఉపమానమునందు) ప్రీతి గల వినేయుడు దానియందు ప్రవర్తించి గుడజిహ్వికాన్యాయంచేత (చేదుమందు త్రాగించే ముందు బెల్లం తినిపించి నాలుకకు తీపి కలిగించడం గుడజిహ్వికాన్యాయం) ప్రసక్తానుప్రసక్తమైన (ఒకదాని తరవాత ఒకటిగా గొలుసుకట్టుగా వచ్చే) షస్తుత్త్వంయొక్క బోధచేత వైరాగ్యంలో పర్యవసానం చెందుతాడు.

ఇక్కడ "శోభాతిశయం పుష్ణాతి"కి ఈయన చేసిన వ్యాఖ్య ఎంతవరకు అక్షరానుగుణంగా ఉన్నదో ఆలోచిస్తే తెలుస్తుంది. 31.

## ధ్వన్యాలోకం

కా. విజ్ఞాయేత్థం రసాదీనామవిరోధవిరోధయోః,

విషయం సుకవిః కావ్యం కుర్వన్ముహ్యతి న క్వచిత్. 32

ఇత్థమనేన అనన్తరోక్తేన ప్రకారేణ రసాదీనాం రసభావతదాభాసానాం పరస్పరం విరోధస్య అవిరోధస్య చ విషయం విజ్ఞాయ సుకవిః కావ్యవిషయే ప్రతిభాతిశయయుక్తః కావ్యం కుర్వన్ న క్వచిన్ముహ్యతి.

### బాలానందిని

విజ్ఞాయేతి:- సుకవిః= మంచి కవి, ఇత్థమ్= ఇట్లు, రసాదీనామ్= రసాదులయొక్క, అవిరోధవిరోధయోః= అవిరోధవిరోధాలయొక్క, విషయమ్= విషయమును, విజ్ఞాయ= తెలుసుకొని, కావ్యం కుర్వన్= కావ్యం రచిస్తూ, క్వచిత్= ఎక్కడా కూడ, న ముహ్యతి= మోహం చెందడు. 31

ఇత్థమితి. ఇంతక్రితమే చెప్పిన ఈ పద్ధతిచేత రసాదులకు, అనగా రస-భావ-రసాభాస-భావాభాసలకు, పరస్పరం ఉన్న విరోధంయొక్క, అవిరోధంయొక్క విషయాన్ని తెలుసుకొని సుకవి, కావ్యవిషయంలో ప్రతిభాతిశయంతో కూడినవాడై కావ్యం రచించినట్లయితే ఎక్కడా కూడ పొరపాటు చేయడు.

### లోచనం

తదేతదుపసంహరన్ అస్య ఉక్తస్య ప్రకరణస్య ఫలమాహ - విజ్ఞాయేత్థమితి.

బాలానందిని

తదితి. ఈ విషయాన్ని ఉపసంహరిస్తూ ఇంతవరకూ చెప్పిన ప్రకరణంయొక్క ఫలాన్ని విజ్ఞాయేత్థమ్ ఇత్యాదికంచేత చెపుతున్నాడు. 31

ధ్వన్యాలోకం

ఏవం రసాదిషు విరోధావిరోధనిరూపణస్య ఉపయోగిత్వం ప్రతిపాద్య వ్యఞ్జకవాచ్యవాచకనిరూపణస్యాపి తద్విషయస్య తత్ ప్రతిపాద్యతే -

**కా. వాచ్యానాం వాచకానాం చ యదౌచిత్యేన యోజనమ్,**
**రసాదివిషయేణైతత్ కర్మ ముఖ్యం మహాకవేః. 32**

వాచ్యానామ్ ఇతివృత్తవిశేషాణాం వాచకానాం చ తద్విషయాణాం రసాదివిషయేణ ఔచిత్యేన యద్యోజనమేతన్మహాకవేః ముఖ్యం కర్మ. అయమేవ హి మహాకవేః ముఖ్యః వ్యాపారః యద్రసాదీనేవ ముఖ్యతయా కావ్యార్థీకృత్య తద్వ్యక్త్యనుగుణత్వేన శబ్దానామర్థానాం చ ఉపనిబన్ధనమ్.

బాలానందిని

ఏవమితి. రసాదులకు సంబంధించిన విరోధావిరోధాల నిరూపణం ఏ విధంగా ఉపయోగకరమో ప్రతిపాదించి రసాదివిషయకమైన వ్యంజక - వాచ్య - వాచక నిరూపణం కూడ ఏ విధంగా ఉపయోగకరమో చెపుతున్నాడు -

వాచ్యానామితి. వాచ్యానామ్= వాచ్యములయొక్క, వాచకానాం చ= వాచకాలయొక్క, రసాదివిషయేణ= రసాదులు విషయంగా గల, రసాదులకు సంబంధించిన, ఔచిత్యేన= ఔచిత్యంతో, యత్=ఏ, యోజనమ్= కూర్చడం కలదో, ఏతత్= ఇది, మహాకవేః= మహాకవియొక్క, ముఖ్యం కర్మ= ముఖ్యమైన పని.

వాచ్యానామితి. రసాదులు విషయంగా గల వాచ్యాలను, అనగా ఇతివృత్త విశేషాలను, వాచకాలను, రసాదులకు సంబంధించిన ఔచిత్యంతో (రసాదుల ఔచిత్యం చెడిపోకుండా ఉండేటట్లు) కూర్చడం అనేది మహాకవి చేయవలసిన ముఖ్యమైన కర్మ. రసాదులను కావ్యంలో ముఖ్యమైన వాక్యార్థంగా చేసికొని వాటిని వ్యంజింపచేయడానికి

అనుగుణంగా ఉండేటట్లు శబ్దాలను, అర్థాలను కూర్చడమే మహాకవియొక్క ముఖ్యవ్యాపారం కదా?

లోచనం

రసాదిషు రసాదివిషయే వ్యఞ్జకాని యాని వాచ్యాని విభావాదీని, వాచకాని సుప్తిఙ్గాదీని తేషాం యన్నిరూపణం తస్యేతి. తద్విషయస్యేతి - రసాదివిషయస్య. తదితి - ఉపయోగిత్వమ్. ముఖ్యమితి. "ఆలోకార్థీ" ఇత్యత్ర యదుక్తం తదేవ ఉపసంహృతమ్, మహాకవేరితి సిద్ధవత్ఫలనిరూపణమ్. ఏవం హి మహాకవిత్వం నాన్యథేత్యర్థః. ఇతివృత్తవిశేషాణామితి. ఇతివృత్తం హి ప్రబన్ధవాచ్యం తస్య విశేషాః ప్రాగుక్తాః - "విభావభావానుభావసంచార్యౌచిత్యచారుణః, విధిః కథాశరీరస్య" ఇత్యాదినా. కావ్యార్థీకృత్యేతి. అన్యథా లౌకికశాస్త్రీయవాక్యార్థేభ్యః కః కావ్యార్థస్య విశేషః? ఏతచ్చ నిర్ణీతమాద్యోద్ద్యోతే - "కావ్యస్యాత్మా స ఏవార్థః" ఇత్యత్రాన్తరే.

బాలానందిని

రసాదిష్వితి - రసాదివిషయమునందు ఏ వాచ్యాలైన విభావాదులు, వాచకాలైన సుబంతతిజంతాదులు గలవో, వాటి ఏ నిరూపణమో దానియొక్క (వాటి నిరూపణం యొక్క). తద్విషయస్యేతి. రసాదివిషయకమైన. తదితి - ఉపయోగిత్వము. ముఖ్యమితి "ఆలోకార్థీ" (కా. 1.19) అనే కారికలో చెప్పబడిన విషయమే ఉపసంహరించబడింది. మహాకవేరితి. అలాంటివాడు మహాకవి కాబోతాడు గాన ఆ ఫలం సిద్ధించినట్లుగా భావించి "మహాకవి" అని నిర్దేశం చేయబడింది (అన్నం వండుతున్నాడు అన్నట్లు). మహాకవిత్వం అనేది ఈ విధంగానే లభిస్తుంది కాని మరొక విధంగా కాదు అని అర్థం. ఇతివృత్తవిశేషాణామితి. ఇతివృత్తం ప్రబంధానికి వాచ్యం. ప్రబంధంలో చెప్పబడేది. దాని విశేషాలు - "విభావభావ" (3.10) ఇత్యాదికారికచేత చెప్పబడినవి. కావ్యార్థీకృత్యేతి. అలా కాకపోతే లౌకికశాస్త్రీయవాక్యార్థాలకంటె కావ్యార్థానికి విశేషం ఏముంటుంది? ఈ విషయం మొదటి ఉద్ద్యోతంలో "కావ్యస్యాత్మా స ఏవార్థః" (1-5) అనే కారిక దగ్గర నిర్ణయించబడింది. 32

## ధ్వన్యాలోకం

ఏతచ్చ రసాదితాత్పర్యేణ కావ్యనిబన్ధనం భరతాదావపి సుప్రసిద్ధమేవేతి ప్రతిపాదయితుమాహ -

కా. రసాద్యనుగుణత్వేన వ్యవహారోఽర్థశబ్దయోః,
ఔచిత్యవాన్ యస్తా ఏతా వృత్తయో ద్వివిధాః స్థితాః. 33

వ్యవహారో హి వృత్తి రిత్యుచ్యతే. తత్ర రసానుగుణ ఔచిత్యవాన్ వాచ్యాశ్రయః యో వ్యవహారః తా ఏతాః కైశిక్యాద్యాః వృత్తయః. వాచకాశ్రయాశ్చ ఉపనాగరికాద్యాః. వృత్తయో హి రసాదితాత్పర్యేణ సంనివేశితాః కామపి నాట్యస్య కావ్యస్య చ చ్ఛాయామావహన్తి. రసాదయో హి ద్వయోరపి తయోః జీవభూతాః. ఇతివృత్తాది తు శరీరభూతమేవ.

### బాలానందిని

ఏతచ్చేతి. రసాదులయందు తాత్పర్యంతో కావ్యం రచించడం భరతాదులలో కూడ సుప్రసిద్ధమే అని ప్రతిపాదించడానికి చెపుతున్నాడు రసేతి. రసాద్యనుగుణత్వేన - రసాదులకు అనుగుణంగా, ఔచిత్యవాన్= ఔచిత్యం గల, అర్థశబ్దయోః= అర్థశబ్దాలయొక్క, వ్యవహారః= వ్యవహారమే, ద్వివిధాః= రెండువిధాలైన, ఏతాః= ఈ, వృత్తయః= వృత్తులుగా, స్థితాః= ఉన్నవి. 33

వ్యవహారానికే వృత్తి అని పేరు. దానిలో రసానుగుణమైన, ఔచిత్యం గల, వాచ్యానికి సంబంధించిన ఏ వ్యవహారం ఉన్నదో అదే కైశిక్యాదివృత్తులు. వాచకాన్ని (శబ్దాన్ని) ఆశ్రయించినవి ఉపనాగరికాదివృత్తులు. రసాదులందు తాత్పర్యంచేత కూర్చబడిన వృత్తులు నాట్యానికి కావ్యానికీ కూడ ఒకానొక (వర్ణింప శక్యం కాని) సౌందర్యాన్ని కలిగిస్తాయి. ఎందుచేత ననగా - ఆ రెండింటికీ రసాదులు జీవులు. ఇతివృత్తాదికం అయితే శరీరం మాత్రమే.

### లోచనం

ఏతచ్చేతి:- యదస్మాభిరుక్తమిత్యర్థః. భరతాదావిత్యాదిగ్రహణాత్ అలఙ్కారశాస్త్రేషు పరుషాద్యా వృత్తయ ఇత్యుక్తం భవతి. ద్వయోరపి తయోరితి.

వృత్తిలక్షణయోర్వ్యవహారయోరిత్యర్థః. జీవభూతా ఇతి. "వృత్తయః కావ్య మాతృకాః" ఇతి బ్రువాణేన మునినా రసోచితేతివృత్తసమాశ్రయణోపదేశేన రసస్యైవ జీవత్వముక్తమ్. భామహాదిభిశ్చ -

స్వాదుకావ్యరసోన్మిశ్రం వాక్యార్థముపయుఞ్జతే,

ప్రథమాలీఢమధవః పిబన్తి కటు భేషజమ్. (భామహ కావ్యా. 5.3)

ఇత్యాదినా రసోపయోగజీవితః శబ్దవృత్తిలక్షణో వ్యవహారః ఉక్తః. శరీరభూత ఇతి - "ఇతివృత్తం హి నాట్యస్య శరీరమ్" ఇతి మునిః. నాట్యం చ రస ఏవేత్యుక్తం ప్రాక్.

## బాలానందిని

ఏతచ్చేతి= మేము ఏది చెప్పామో అది అని అర్థం. 'భరతాదౌ' అని 'ఆది' శబ్దం ప్రయోగించడంవల్ల పరుషాదివృత్తులు అలంకారశాస్త్ర గ్రంథాలలో చెప్పబడ్డాయి అని చెప్పినట్లయింది. ద్వయోరపి తయోః ఇతి. వృత్తిరూపములైన రెండు వ్యవహారాలయొక్క అని అర్థం. జీవభూతా ఇతి. "వృత్తులు కావ్యానికి తల్లులు" అని చెప్పిన భరతుడు, రసానికి తగిన ఇతివృత్తాన్ని గ్రహించా లని ఉపదేశించడంచేత రసమే జీవితం అని చెప్పాడు.

"మధురమైన కావ్యరసంతో కలిసిన వాక్యార్థాన్ని ఆస్వాదిస్తారు. ముందుగా కొంచెం తేనె నాకిన వాళ్లు (ముందు తేనె నాకి) చేదైన మందు త్రాగుతారు".

ఇత్యాది వాక్యాలచేత భామహాదులు కూడ శబ్దవృత్తిరూపమైన వ్యాపారానికి రసోపయోగమే జీవితం అని చెప్పి ఉన్నారు. శరీరభూతమితి. "నాట్యానికి శరీరం ఇతివృత్తమే కదా" అని భరతుడు చెప్పాడు. నాట్యం అంటే రసమే అని వెనక చెప్పబడింది.

## ధ్వన్యాలోకం

అత్ర కేచిదాహుః - "గుణగుణివ్యవహారో రసాదీనామితి వృత్త్యాదిభిః సహ యుక్తః, న తు జీవశరీరవ్యవహారః. రసాదిమయం హి వాచ్యం ప్రతిభాసతే, న తు రసాదిభ్యః పృథగ్భూతమ్" ఇతి. అత్రోచ్యతే - యది రసాదిమయమేవ కావ్యం యథా గౌరత్వమయం శరీరం,

ఏవం సతి యథా శరీరే ప్రతిభాసమానే నియమేనైవ గౌరత్వం ప్రతిభాసతే సర్వస్య తథా వాచ్యేన సహైవ రసాదయోఽపి సహృదయస్య అసహృదయస్య చ ప్రతిభాసేరన్. న చైవమ్; తథా చైతత్ప్రతిపాదితమేవ ప్రథమోద్ద్యోతే.

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ కొందరు ఇలా అంటున్నారు - "రసాదులకు ఇతివృత్తాదులతో గుణగుణిభావమే యుక్తం కాని జీవశరీరవ్యవహారం యుక్తం కాదు. అనగా ఇతివృత్తాదికం గుణి, రసం దానిలో ఉండే గుణం అని చెప్పాలి కాని రసం జీవితం, ఇతివృత్తం శరీరం అనడం యుక్తం కాదు. వాచ్యం రసాదిమయంగా భాసిస్తుంది గాని రసాదులకంటె వేరుగా భాసించడం లేదు కదా? ఇక్కడ (సమాధానం) చెప్పబడుతున్నది - శరీరం గౌరత్వమయం (తెలుపు) అన్నట్లు వాచ్యం రసాదిమయం అయితే, శరీరం కనబడినప్పుడు తప్పకుండా అందరికీ తెలుపు కూడా కనబడినట్లు, సహృదయునికి, కానివానికీ కూడ వాచ్యంతో పాటు రసాదులు కూడా భాసించాలి. అలా భాసించడం లేదు. ఈ విషయం ప్రథమోద్ద్యోతంలో ప్రతిపాదించియే ఉన్నాం.

లోచనం

గుణగుణివ్యవహార ఇతి. అత్యన్తసరమిశ్రితతయా ప్రతిభాసనాత్ ధర్మధర్మివ్యహారో యుక్తః. నత్వితి. క్రమస్యాసంవేదనాదితి భావః. ప్రథమేతి:- "శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే" ఇత్యాదినా ప్రతిపాదితమదః.

బాలానందిని

గుణగుణివ్యవహార ఇతి. పూర్తిగా కలిసిపోయినట్లు భాసించడంచేత ధర్మధర్మివ్యవహారమే యుక్తం. నత్వితి. ఇతివృత్తాదులకీ రసానికీ మధ్య క్రమం ఏదీ గోచరించడం లేదు గాన అని భావం. ప్రథమేతి. 'శబ్దార్థశాసన' (1.7) ఇత్యాదికారికలో ఈ విషయం ప్రతిపాదించబడింది.

## ధ్వన్యాలోకం

స్యాన్మతమ్ -రత్నానామివ జాత్యత్వం ప్రతిపత్తృవిశేషతః సంవేద్యం వాచ్యానాం రసాదిరూపత్వమితి. నైవమ్; యతః యథా జాత్యత్వేన

ప్రతిభాసమానే రత్నే రత్నస్వరూపానతిరిక్తత్వమేవ తస్య లక్ష్యతే తథా రసాదీనామపి విభావానుభావాదిరూపవాచ్యావ్యతిరిక్తత్వమేవ లక్ష్యేత. న చైవమ్; న హి విభావానుభావవ్యభిచారిణ ఏవ రసాః ఇతి కస్యచిదవగమః. అత ఏవ చ విభావాదిప్రతీత్యవినాభావినీ రసాదీనాం ప్రతీతిరితి తత్ప్రతీత్యోః కార్యకారణభావేన వ్యవస్థానాత్ క్రమః అవశ్యంభావీ. స తు లాఘవాత్ న ప్రకాశ్యతే "ఇత్యలక్ష్యక్రమా ఏవ సన్తః వ్యఙ్గ్యా రసాదయః" ఇత్యుక్తమ్.

బాలానందిని

స్యాన్మతమితి - రత్నాల జాత్యత్వం (ఉత్తమజాతికి చెంది ఉండడం) వలె, వాచ్యాల రసాదిరూపత్వం జ్ఞాతృవిశేషం వల్ల, (తెలుసుకొనేవానిలో ఉన్న విశేషం వల్ల లేదా విశిష్టబుద్ధి గల జ్ఞాతచేత) తెలియబడుతుంది. అని మీ మతం కావచ్చు; అది కూడ యుక్తం కాదు. ఎందువల్ల ననగా - జాత్యంగా కనబడే రత్నంలో జాత్యత్వం ఆ రత్న స్వరూపం కంటె అభిన్నమే (భిన్నం కాదు) అన్నట్లు ఏ విధంగా తెలుస్తూన్నదో అదే విధంగా రసాదులు కూడ విభావానుభావాదిరూపవాచ్యంకంటె అవ్యతిరిక్తములుగా (వేరుకానివిగా) కనబడాలి; అలా కనబడడంలేదు. విభావానుభావవ్యభిచారులే రసాలని ఎవరూ అనుకొనడంలేదు కదా? అందువల్లనే రసాదుల ప్రతీతి విభావాదుల ప్రతీతికంటె అవినాభావి, అనగా విభావాదిప్రతీతి కలిగిన తరవాత తప్పక రసాది ప్రతీతి కలుగుతుంది, అని ఆ రెండు ప్రతీతులకు (విభావాదిప్రతీతి - రసాదిప్రతీతులకు) కార్యకారణభావం నిర్ణీతమై ఉండడంవల్ల వాటికి తప్పక క్రమం ఉంటుంది. అయితే లాఘవంవల్ల (శీఘ్రత్వంవల్ల) ఆ క్రమం ప్రకాశించబడడంలేదు అని "రసాదులు వాటి క్రమం గుర్తించబడకుండానే వ్యంగ్యాలు" అని (వెనక) చెప్పబడింది.

లోచనం

నను యద్యస్య ధర్మరూపం తత్తత్ప్రతిభానే సర్వస్య నియమేన భాతీత్యనైకాన్తికమేతత్. మాణిక్యధర్మో హి జాత్యత్వలక్షణః విశేషః న తత్ప్రతిభాసేఽపి నియమేన భాతీత్యాశఙ్కతే - స్యాదితి. ఏతత్పరిహరతి - నైవమితి. ఏతదుక్తం భవతి - అత్యన్తోన్మగ్నస్వభావత్వే సతి తద్ధర్మత్వాదితి

విశేషణమస్మాభిః కృతమ్. ఉన్మగ్నరూపతా చ న రూపవజ్జాత్యత్వస్య అత్యన్తలీనస్వభావత్వాత్. రసాదీనాం చోన్మగ్నతా అస్త్యేవేత్యేవం కేచిదేతం గ్రన్థమనైషుః.

బాలానందిని

నన్వితి - ఏది దేని ధర్మమో అది ఆ ధర్మి భాసించినప్పుడు ప్రతివానికీ కూడ తప్పక భాసిస్తుంది (కనబడుతుంది) అనే ఈ నియమం అనైకాంతికం; వ్యభిచారదోషదుష్టం. ఎందువల్ల ననగా మాణిక్యంయొక్క ధర్మమైన జాత్యం అనే విశేషం ఆ మాణిక్యం భాసించినా కూడ ప్రతివానికీ (ఆ మాణిక్యం చూచే ప్రతివానికీ) తప్పకుండా కనబడదు కదా అని ఆశంకిస్తున్నాడు - స్యాదితి. ఈ ఆశంకను పరిహరిస్తున్నాడు - నైవమితి. ఇక్కడ చెప్పిన విషయం ఇది - 'తద్ధర్మత్వాత్' అనేదానికి అత్యన్తోన్మగ్నస్వభావత్వే సతి అని విశేషణం మాచేత చేయబడింది, అనగా మాకు అభిమతమైనది. జాత్యత్వం రూపం వలె, ఉన్మగ్నరూపం కాదు; ఎందువల్ల ననగా అది చాలా లీనమైన స్వభావం గలది. రసాదులకైతే ఉన్మగ్నత్వం ఉండనే ఉంది - అని కొందరు ఈ గ్రంథాన్ని (నైవమ్ మొదలు "న చైవమ్" వరకు ఉన్న గ్రంథాన్ని) వివరించారు.

వివరణ: "ధర్మిణః ప్రతిభానే తస్య ధర్మోఽపి ప్రతిభాసతే, తద్ధర్మత్వాత్, శరీరధర్మగౌరత్వాదివత్" అని అనుమానప్రయోగం. ధర్మి భాసించినప్పుడు (తెలిసినప్పుడు) ధర్మం కూడ తెలుస్తుంది, దాని ధర్మం కాబట్టి, శరీరధర్మమైన తెలుపు మొదలైనవి వలె అని దీని అర్థం. దీనిపైన పూర్వపక్షి చేసిన ఆక్షేపణ ఏమనగా రత్నం అందరికీ కనబడుతున్నా దానిలో ఉన్న జాత్యత్వం అనే ధర్మం అందరికీ కనబడడం లేదు; అందుచేత 'తద్ధర్మత్వాత్' అనే హేతువు వ్యభిచారదోషదుష్టం. అందుచేత ఇతివృత్తాది ధర్మమైనా రసం అందరికీ తెలియబడకపోవచ్చు. అందుచేత మా ప్రశ్న అలాగే ఉంది. దీనికి సమాధానంగా సిద్ధాంతి - 'తద్ధర్మత్వాత్' అనే దానికి 'ఉన్మగ్నస్వభావత్వే సతి' (స్పష్టంగా కనబడేస్వభావం కలిగియున్న ధర్మంఅవడంవలన అని అర్థం) అని విశేషణం తగిలిస్తాం. శరీరంలో ఉన్న గౌరత్వాదిధర్మం ఉన్మగ్నస్వభావం; అందుచేత శరీరం చూచినవాళ్లందరికీ గౌరత్వాదిధర్మం కనబడుతుంది. అలాగే రసం కూడా ఉన్మగ్న స్వభావమే. అందుచేత ఇతివృత్తాదులు తెలుసుకొన్న వాళ్లకందరికీ, వాళ్లు సహృదయులైనా కాకపోయినా అది తెలియవలసి ఉంటుందనే మా ఆక్షేపణ యథాస్థితంగానే ఉంది అని అన్నాడు అని ఈ గ్రంథానికంతకీ భావమని కొందరు వ్యాఖ్యానించారు అని తాత్పర్యం.

లోచనం

అస్మద్గురవస్తు - అత్రోచ్యత ఇత్యనేన ఇదముచ్యతే - యది రసాదయో వాచ్యానాం ధర్మాః తథా సతి ద్వౌ పక్షౌ - రూపాదిసదృశా వా స్యుః, మాణిక్యగత జాత్యత్వసదృశా వా. న తావత్ ప్రథమః పక్షః, సర్వాన్ ప్రతి తథా అనవభాసాత్ నాపి ద్వితీయః జాత్యత్వవత్ అనతిరిక్తత్వేన అప్రకాశనాత్. ఏష చ హేతురాద్యేఽపి పక్షే సంగచ్ఛత ఏవ. తదాహ - స్యాన్మతమిత్యాదినా నచైవమిత్యన్తేన. ఏతదేవ సమర్థయతి - న హీతి. అత ఏవ చేతి. యతో న వాచ్యధర్మత్వేన రసాదీనాం ప్రతీతిః, యతశ్చ తత్ప్రతీతౌ వాచ్యప్రతీతిః (న) సర్వథా అనుపయోగినీ తత ఏవ హేతోః క్రమేణ అవశ్యం భావ్యమ్; సహభూతయోరుపకారాయోగాత్. స తు సహృదయభావనాభ్యాసాన్న లక్ష్యతే, అన్యథా తు లక్ష్యేతాపి ఇత్యుక్తం ప్రాక్. యస్యాపి ప్రతీతివిశేషాత్మైవ రస ఇత్యుక్తిః ప్రాక్ తస్యాపి వ్యపదేశివత్వాత్ రసాదీనాం ప్రతీతిరిత్యేవమన్యత్ర.

బాలానందిని

అస్మద్గురవస్తు ఇతి - మా గురువులైతే ఇలా అన్నారు - 'అత్రోచ్యతే' అనేదానిచేత ఇది చెప్పబడుతున్నది - రసాదులు వాచ్యాల ధర్మాలైన ట్లయితే అప్పుడు రెండు పక్షాలకి అవకాశం ఉంది - అవి రూపాదుల వంటివైనా అయి ఉండాలి, మాణిక్యాలలో ఉన్న జాత్యత్వంతో సమానమైనవైనా అయి ఉండాలి. మొదటిపక్షం అయితే కుదరదు. అందరికీ ఆ విధంగా కనబడడంలేదు కదా? రెండవ పక్షమూ కుదరదు, ఎందుచేత ననగా జాత్యత్వం వలె అతిరిక్తం కానిదిగా ప్రకాశించడం లేదు. (అనగా వాచ్యంకంటె అతిరిక్తంగానే ప్రకాశిస్తూన్నది అని అర్థం). ఈ హేతువు మొదటి పక్షంలో కూడ సంగతం అవుతుంది. (అనగా రూపాదులు శరీరాదులకంటె భిన్నంగా ఎలా కనబడడంలేదో ఆ విధంగా రసాదులు వాచ్యం కంటె భిన్నంగా కనబడకపోవడం అనేది లేదు). ఈ విషయాన్నే "స్యాన్మతమ్" అనేదానితో ప్రారంభించి "న చైవమ్" వరకు ఉన్న గ్రంథంలో చెపుతున్నాడు. దీనినే సమర్థిస్తున్నాడు -న హీతి. అత ఏవ చేతి:- రసాదులు వాచ్యధర్మంగా ప్రకాశించకపోవడంవల్లా, వాటి ప్రతీతియందు వాచ్యప్రతీతి పూర్తిగా అనుపయుక్త మైనది కాకపోవడంవల్లా, ఈ కారణంవల్లనే ఈ రెండింటికీ క్రమం తప్పకుండా ఉండాలి. ఒకే సమయంలో పుట్టినవాటి మధ్య ఉపకారం ఉండదు. (అనగా కారణం

ముందు ఉండాలి తరవాత కార్యం పుట్టాలి) కాని ఆ క్రమం సహృదయుల భావనాభ్యాసం వల్ల గుర్తించబడడంలేదు. అలా కాకపోతే గుర్తించబడవచ్చును కూడ అని వెనక చెప్పబడింది. రసం అనేది ఒకానొక ప్రతీతివిశేషంమాత్రమే అని చెప్పేవాడు కూడ (రాహోః శిరః ఇత్యాదులలో వలె) వ్యపదేశివత్త్వంచేత రసాదుల ప్రతీతి అని చెప్పాలి; ఈ విషయం మరొక చోట విశదీకరించబడింది.

## ధ్వన్యాలోకం

నను శబ్ద ఏవ ప్రకరణాద్యవచ్ఛిన్నః వాచ్యవ్యఙ్గ్యయోః సమమేవ ప్రతీతిముపజనయతీతి కిం తత్ర క్రమకల్పనయా? న హి శబ్దస్య వాచ్యప్రతీతిపరామర్శ ఏవ వ్యఞ్జకత్వే నిబన్ధనమ్, తథాహి - గీతాదిశబ్దేభ్యోఽపి రసాభివ్యక్తిరస్తి. న చ తేషామన్తరా వాచ్యపరామర్శః. అత్రాపి బ్రూమః - ప్రకరణాద్యవచ్ఛేదేన వ్యఞ్జకత్వం శబ్దానామితి అనుమతమేవైతదస్మాకమ్. కిన్తు తద్ వ్యఞ్జకత్వం తేషాం కదాచిత్ స్వరూపవిశేషనిబన్ధనమ్, కదాచిద్వాచకశక్తినిబన్ధనమ్. తత్ర యేషాం వాచకశక్తినిబన్ధనం తేషాం యది వాచ్యప్రతీతిమన్తరేణైవ స్వరూపప్రతీత్యా నిష్పన్నం తద్భవేత్ న తర్హి వాచకశక్తినిబన్ధనమ్. అథ తన్నిబన్ధనమ్ - తన్నియమేనైవ వాచ్యవాచకప్రతీత్యుత్తరకాలత్వం వ్యఙ్గ్యప్రతీతేః ప్రాప్తమేవ. స తు క్రమో యది లాఘవాన్న లక్ష్యతే తత్ కిం క్రియతే?

### బాలానందిని

నన్వితి:- (ఆశంక) ప్రకరణాదులచేత అవిచ్ఛిన్నమైన (సహకరించబడిన) శబ్దమే వాచ్యవ్యంగ్యాల రెండింటి ప్రతీతినీ సమంగానే (ఒకే సమయంలో) కలగజేస్తుంది. దీనిలో (ముందు వాచ్యప్రతీతి కలుగుతుంది, తరవాత వ్యంగ్యప్రతీతి కలుగుతుంది అని) క్రమాన్ని కల్పించడం ఎందుకు? శబ్దం వాచ్యప్రతీతిని పరామర్శిస్తేనే (ముందు వాచ్యాన్ని బోధిస్తేనే) వ్యంజకం అవుతుంది అనడానికి వీలు లేదు కదా? ఎందువలన అనగా - గీతాదిశబ్దాలనుండి కూడ రసాభివ్యక్తి కలుగుతున్నది. గీతాదిశబ్దాలకు

మధ్యలో (రసప్రతీతి కలిగించడానికి ముందు) వాచ్యార్థపరామర్శ ఏదీ లేదు కదా? అత్రాపీతి:- ఈ విషయంలో కూడ చెపుతున్నాం - శబ్దాలు ప్రకారణాద్యవచ్ఛేదంచేతనే, ప్రకరణాదుల నిర్ణయంచేతనే, వ్యంజకాలు అనే విషయం మాకు కూడా అనుమతమే. అయితే - శబ్దాలకున్న ఆ వ్యంజకత్వం ఒకప్పుడు స్వరూపవిశేషంమీద (ఆ శబ్దాల స్వరూపవిశేషం మీద మాత్రమే) ఆధారపడి ఉంటుంది. ఒకప్పుడు వాచకశక్తిమీద ఆధారపడి ఉంటుంది. ఏ శబ్దాల వ్యంజకత్వం వాచకశక్తిమీద (అర్థబోధకత్వంమీద) ఆధారపడి ఉంటుందో వాటి వ్యంజకత్వం వాచ్యప్రతీతితో పని లేకుండా స్వరూపప్రతీతిచేతనే (శబ్దాల శ్రవణ మాత్రంచేతనే) నిష్పన్నం అయితే అప్పుడు అది (ఆ వ్యంజకత్వం) వాచకశక్తనిబంధనం (వాచకశక్తిచేత ఏర్పడినది) కాదు. అలా కాక వాచకశక్తినిబంధనమే అని అంటామా - అప్పుడు వ్యంగ్యార్థప్రతీతి తప్పక వాచ్యవాచకభావప్రతీతి తరవాతనే జరుగుతుంది అనేది సిద్ధించనే సిద్ధిస్తుంది. అయితే లాఘవంవల్ల, శీఘ్రాతిశయంవల్ల, ఆ క్రమం గుర్తించబడకపోతే ఏమి చెయ్యాలి?

లోచనం

నను భవన్తు వాచ్యాదతిరిక్తాః రసాదయః, తత్రాపి క్రమో న లక్ష్యతే ఇతి తావత్ త్వయైవోక్తమ్. తత్కల్పనే చ ప్రమాణం నాస్తి. అన్వయవ్యతిరేకాభ్యా మర్థప్రతీతిమన్తరేణ రసప్రతీత్యుదయస్య పదవిరహితస్వరాలాపగీతాదౌ శబ్దమాత్రోపయోగకృతస్య దర్శనాత్. తతశ్చ ఏకయైవ సామగ్ర్యా సహైవ వాచ్యం వ్యఙ్గ్యాభిమతం చ రసాది భాతీతి వచనవ్యఞ్జనవ్యాపారద్వయేన న కించిదితి; తదాహ - నన్వితి. యత్రాపి గీతశబ్దానామర్థోఽస్తి తత్రాపి తత్ప్రతీతిరనుప యోగినీ; గ్రామరాగానుసారేణ అపహస్తితవాచ్యానుసారతయా రసోదయ దర్శనాత్. న చాపి సా సర్వత్ర భవన్తీ దృశ్యతే; తదేతదాహ - న చేతి. తేషామితి గీతాదిశబ్దానామ్. ఆదిశబ్దేన వాద్యవిలపితశబ్దాదయో నిర్దిష్టాః. అనుమతమితి. "యత్రార్థః శబ్దో వా" ఇతి హ్యవోచామేతి భావః. న తర్హీ తి. తతశ్చ గీతవదేవ అర్థావగమం వినైవ రసాభాసః స్యాత్ కావ్యశబ్దేభ్యః, న చైవమితి వాచకశక్తిరపి తత్రాపేక్షణీయా; సా చ వాచ్యనిష్ఠైవ ఇతి ప్రాగ్వాచ్యే ప్రతిపత్తిరిత్యుపగన్తవ్యమ్. తదాహ - అథేతి. తదితి వాచకశక్తిః. వాచ్యవాచకభావేతి. సైవ వాచకశక్తి రిత్యుచ్యతే. ఏతదుక్తం భవతి - మా

ఘూద్వాచ్యం రసాదివ్యఞ్జకమ్. అస్తు శబ్దాదేవ తత్ప్రతీతిః, తథాపి తేన స్వవాచకశక్తిః తస్యాం కర్తవ్యాయాం సహకారితయా అవశ్యాపేక్షణీయా ఇత్యాయాతం వాచ్యప్రతీతేః పూర్వభావిత్వమితి.

బాలానందిని

నన్వితి:- (పూర్వపక్షవివరణం) రసాదులు వాచ్యకంటె అతిరిక్తాలు అయితే కావచ్చును. వాటి విషయంలో క్రమం గుర్తించబడడంలేదు అని నువ్వే చెప్పావు. అలా కల్పించడంలో ప్రమాణం లేదు. ఎందువల్ల ననగా - పదాలు లేని స్వరాలాపరూపమైన గీతాదులలో అర్థప్రతీతి లేకుండగానే, శబ్ద (ధ్వని) ప్రయోగమాత్రంచేతనే, రసప్రతీతి కలగడం అన్వయవ్యతిరేకాలచేత తెలుస్తూన్నది. (అన్వయవ్యతిరేకాలను పట్టి అర్థప్రతీతి లేకుండానే అని కూడ అన్వయించవచ్చు). అందుచేత - వాచ్యార్థము, వ్యంగ్యం అని చెప్పే రసాదికమూ కూడ ఒకే సామగ్రిచేత భాసిస్తూన్నది గాన వాచకత్వం వ్యంజకత్వం అనే రెండు వ్యాపారాలను అంగీకరించడంవల్ల ప్రయోజనం ఏదీ లేదు. ఈ విషయాన్నే నన్విత్యాదికంచేత చెపుతున్నాడు. గీతశబ్దాలకి అర్థం ఉన్నచోట్ల కూడ అర్థప్రతీతి నిరుపయోగ మైనదే. ఎందువల్ల ననగా - ఆ యా గ్రామరాగాలను అనుసరించడంలో అర్థానుసరణం తొలగించబడినా, విచ్ఛిన్నం అయిపోయినా, రసోదయం కనబడుతూన్నది. మరొక విషయం ఏమనగా ఆ రసప్రతీతి కూడా అన్ని చోట్లా కలగడంలేదు. ఈ విషయమే న చేత్యాదికంచేత చెపుతున్నాడు. తేషామితి. గీతాదిశబ్దాలయొక్క, "గీతాదిశబ్దేభ్యః" లోని 'ఆది' శబ్దంచేత వాద్యశబ్ద - విలాపశబ్దాదులు నిర్దేశించబడ్డాయి. (సిద్ధాంతం వివరిస్తున్నాడు) - అనుమతమితి. "యత్రార్థః శబ్దో వా" (1.13) ఇత్యాది కారికలో చెప్పి ఉన్నాం అని భావం. న తర్హీతి. అలా చెప్పిన ట్లయితే అర్థజ్ఞానం లేకుండానే గీతాదులనుంచి వలె, కావ్యశబ్దాలవల్ల రసప్రతీతి కలిగి ఉండేది. కాని అలా కలగడంలేదు. అందువల్ల ఆ విషయంలో వాచకశక్తిని కూడ అపేక్షింపవలసి ఉంది. ఆ వాచకశక్తి వాచ్యానికి సంబంధించినది గాన ముందుగా దాని ప్రతిపత్తి ఉంటుందని అంగీకరించాలి. ఆ విషయమే అథేత్యాదికంచేత చెపుతున్నాడు. ('తన్నిబన్ధనమ్'లోని) 'తత్' అనగా వాచకశక్తి అని అర్థం. వాచ్యవాచకభావేతి. ఈ వాచ్యవాచకభావమే 'వాచకశక్తి' అని చెప్పబడుతుంది. ఇక్కడ చెప్పిన విషయం ఇది - వాచ్యం రసాదివ్యంజకం కాకపోతే కాకపోనీ; శబ్దంవల్లనే రసాదిప్రతీతి కలగనీ, అయినా కూడ శబ్దం రసాదిప్రతీతిని చేయవలసి ఉన్నప్పుడు, అందుకు సహకారిగా తన వాచకశక్తిని కూడా అపేక్షిస్తుంది. ఈ

విధంగా రసాదిప్రతీతికి ముందు వాచ్యప్రతీతి ఉండాలి అనేది వచ్చేసింది (ఉండాలి అని చెప్పినట్లే అయింది).

## ధ్వన్యాలోకం

యది చ వాచ్యప్రతీతిమన్తరేణైవ ప్రకరణాద్యవచ్ఛిన్న శబ్దమాత్రసాధ్యా రసాదిప్రతీతిః స్యాత్ తదనవధారితప్రకరణానాం వాచ్యవాచకభావే చ స్వయమవ్యుత్పన్నానాం ప్రతిపత్తౄణాం కావ్యమాత్రశ్రవణాదేవాసౌ భవేత్. సహభావే చ వాచ్యప్రతీతేరనుపయోగః. ఉపయోగే వా న సహభావః. యేషామపి స్వరూపవిశేషప్రతీతి నిమిత్తం వ్యఞ్జకత్వం, యథా గీతాదిశబ్దానాం, తేషామపి స్వరూపప్రతీతేః వ్యఙ్గ్యప్రతీతేశ్చ నియమభావీ క్రమః. తత్తు శబ్దస్య క్రియాపౌర్వాపర్యమనన్యసాధ్యతత్ఫలఘటనాస్వాశుభావినీషు వాచ్యేనావిరోధినీ, అభిధేయాన్తరవిలక్షణే రసాదౌ న ప్రతీయతే.

### బాలానందిని

యది చేతి - రసాదిప్రతీతి వాచ్యప్రతీతితో పని లేకుండా ప్రకరణాద్యవచ్ఛిన్నమైన శబ్దమాత్రంచేతనే సాధ్యం అయితే, అప్పుడు ప్రకరణం తెలిసి ఉండి, వాచ్యవాచకభావంలో స్వయంగా వ్యుత్పన్నులు కాని ప్రతిపత్తలకు కూడా (జ్ఞాతలకు కూడా) కావ్యశ్రవణమాత్రంచేతనే ఇది (రసాదిప్రతీతి) కలగాలి. రెండు ప్రతీతులు ఒకేసారి కలిగే పక్షంలో వాచ్యప్రతీతివల్ల ఉపయోగం ఏమీ ఉండదు. ఉపయోగం ఉంటుంది అంటే రెండూ ఒకే సమయంలో కలగవు. గీతాదికశబ్దాలవిషయంలో వలె శబ్దాల స్వరూపవిశేషంయొక్క ప్రతీతియే వ్యంజకత్వానికి కారణం అని అనేవాళ్లు కూడ స్వరూపప్రతీతికీ, వ్యంగ్యప్రతీతికీ మధ్య క్రమం తప్పక ఉంటుందని అంగీకరించాలి. శబ్దం చేయవలసిన, ఇతర ఉపాయాలు వేటిచేతా సాధ్యం కాని, ఆ రసాది ప్రతీతియే ఫలంగా గల శబ్దంయొక్క సంఘటనలు అతిశీఘ్రంగా జరిగిపోతూన్నప్పుడు, వాచ్యంతో విరోధంలేనిది, ఇతరవాచ్యార్థంకంటె విలక్షణమూ అయిన రసాదికం విషయంలో ఆ క్రియాపౌర్వాపర్యం (ప్రతీతి క్రమం) గుర్తించబడడంలేదు.

లోచనం

నను గీతశబ్దవదేవ వాచకశక్తిరత్రాప్యనుపయోగినీ, యత్తు క్వచిత్ శ్రుతేఽపి కావ్యే రసప్రతీతిర్న భవతి తత్ర ఉచితః ప్రకరణావగమాదిః సహకారీ నాస్తీత్యాశఙ్క్యాహ - యది చేతి. ప్రకరణావగమో హి క ఉచ్యతే? కిం వాక్యాన్తరసహాయత్వమ్? అథ వాక్యాన్తరాణాం సంబన్ధి వాచ్యమ్? ఉభయపరిజ్ఞానేఽపి న భవతి ప్రకృతవాక్యార్థావేదనే రసోదయః. స్వయమితి. ప్రకరణమాత్రమేవ పరేణ కేనచిద్యేషాం వ్యాఖ్యాతమితి భావః. న చ అన్వయవ్యతిరేకవతీం వాచ్యప్రతీతిమపహ్నుత్య అదృష్టసద్భావాసద్భావౌ శరణత్వేనాశ్రితౌ మాత్సర్యాదధికం కించిత్ పుష్ణీత ఇత్యభిప్రాయః.

బాలానందిని

నన్వితి. గీతశబ్దంలో వలెనే ఇక్కడ కూడా వాచకశక్తి అనుపయుక్తమైనదే. ఎక్కడైనా కావ్యం వినిన తరవాత కూడ రసప్రతీతి కలగలేదంటే అందుకు కారణం తగిన, సహకారియైన, ప్రకరణాదిజ్ఞానం లేకపోవడమే అని ఆశంకించి చెపుతున్నాడు - యది చేతి. ప్రకరణావగమం అని దేనిని అంటావు? వాక్యాంతరం సహాయంగా ఉండడం ప్రకరణావగమమా లేదా వాక్యాంతరాలకు సంబంధించిన వాచ్యార్థమా? ఆ రెండింటి జ్ఞానం ఉన్నా కూడ ప్రకృతవాక్యార్థం తెలియనంతవరకు రసోదయం కలగదు. స్వయమితి. ఎవరికైతే మరొక డెవడో ప్రకరణాన్ని మాత్రమే విశదీకరించి చెప్పి ఉంటాడో వాళ్లకు (అర్థజ్ఞానం లేకుండా రసప్రతీతి కలగదు) అని భావం.

వాక్యంవల్ల రసాదిప్రతీతి కలగాలంటే అదృష్టవిశేషం కూడా సహకారిగా ఉండాలి; అది లేక పోవడం చేతనే వాచ్యప్రతీతి లేనప్పుడు రసాదిప్రతీతి కలగడంలేదు అని ఆశంకించుకొని సమాధానం చెపుతున్నాడు - న చేతి. అన్వయవ్యతిరేకాలున్న వాచ్యార్థప్రతీతిని కప్పిపుచ్చి (కాదని) శరణగా ఆశ్రయించబడిన అదృష్టం ఉండడం లేకపోవడం అనేవి మాత్సర్యాన్ని పెంచడం తప్ప మరి దేన్నీ పోషించవు అని అభిప్రాయం. ఇది బాలప్రియాకారుడు చూపిన అర్థం. రసప్రతీతికి అదృష్టం కూడా సహకారిగా ఉండాలి అని పూర్వపక్షి అన్నట్లు ఊహించుకొని చెప్పిన సమాధానంగా ఉంది ఇది. కాని దీనికి - "అన్వయవ్యతిరేకాలచేత రసప్రతీతికి కారణంగా నిర్ధారితమై ఎదుట ఉన్న వాచ్యార్థప్రతీతిని కాదని కనబడని ప్రకరణాదిప్రతీతియొక్క సత్త్వాసత్త్వాలను

శరణుచెందడం ఏదో విధంగా మా వాదం కాదనాలనే అసూయను పెంచుతుంది తప్ప విషయప్రతిపాదనకు ఉపయోగించదు అని అర్థం చెపితే బాగుంటుందేమో.

లోచనం

నన్వస్తు వాచ్యప్రతీతేరుపయోగః, క్రమాశ్రయేణ కిం ప్రయోజనమ్? సహభావమాత్రమేవ హ్యుపయోగ ఏకసామగ్ర్యధీనతాలక్షణమిత్యాశఙ్క్యాహ - సహేతి. ఏవం హ్యుపయోగ ఇతి అనుపకారకే సంజ్ఞాకరణమాత్రం వస్తుశూన్యం స్యాదితి భావః. ఉపకారిణో హి పూర్వభావితా ఇతి త్వయాప్యఙ్గీకృతమిత్యాహ - యేషామితి. తద్దృష్టాన్తేనైవ వయం వాచ్యప్రతీతేరపి పూర్వభావితాం సమర్థయిష్యామ ఇతి భావః. నను సంశ్చేత్ క్రమః కిం న లక్ష్యతే ఇత్యాశఙ్క్యాహ - తత్త్వితి. క్రియాపౌర్వాపర్యమిత్యనేన క్రమస్య స్వరూపమాహ. క్రియతే ఇతి. క్రియే వాచ్యవ్యఙ్గ్యప్రతీతీ. యది వా అభిధావ్యాపారో వ్యఞ్జనాపరపర్యాయః ధ్వననవ్యాపారశ్చేతి క్రియే. తయోః పౌర్వాపర్యం న ప్రతీయతే. క్వేత్యాహ - రసాదౌ విషయే. కీదృశి? అభిధేయాన్తరాత్ తదభిధేయవిశేషాత్ విలక్షణే సర్వథైవ అనభిధేయే; అనేన భవితవ్యం తావత్క్రమేణేత్యుక్తమ్. తథా వాచ్యేన అవిరోధిని; విరోధిని తు లక్ష్యత ఏవేత్యర్థః. కుతో న లక్ష్యతే ఇతి నిమిత్తసప్తమీనిర్దిష్టం హేత్వన్తరగర్భం హేతుమాహ - ఆశుభావినీష్వితి. అనన్యసాధ్యతత్ఫలఘటనాసు, ఘటనాః పూర్వం మాధుర్యాదిలక్షణాః ప్రతిపాదితాః గుణనిరూపణావసరే; తాశ్చ తత్ఫలాః. రసాదిప్రతీతిః ఫలం యాసామ్, తథా అనన్యత్రైవ సాధ్యం యాసామ్. న హ్యోజోఘటనాయాః కరుణాదిప్రతీతిః సాధ్యా.

ఏతదుక్తం భవతి - యతో గుణవతి కావ్యే అసంకీర్ణవిషయతయా సంఘటనాప్రయుక్తా తతః క్రమో న లక్ష్యతే. నను భవత్వేవం సంఘటనానాం స్థితిః, క్రమస్తు కిం న లక్ష్యతే, అత ఆహ - ఆశుభావినీషు. వాచ్యప్రతీతికాలప్రతీక్షణేన వినైవ ఝటిత్యేవ తా రసాదీన్ భావయన్తి, తదాస్వాదం విదధతీత్యర్థః.

బాల-నందిని

నన్వితి. వాచ్యప్రతీతికి ఉపయోగం ఉంటే ఉండవచ్చు; క్రమాన్ని ఆశ్రయించడంచేత ఏమి ప్రయోజనం? ఒకే సామగ్రిమీద ఆధారపడి ఉండడం అనే లక్షణం గల సహభావంమాత్రమే (కూడా ఉండడం మాత్రమే) కదా ఉపయోగం అంటే అర్థం? అని ఆశంకించుకొని చెపుతున్నాడు - సహేతి. ఉపకారకం కానిదానిని చూపించి ఇదే 'ఉపయోగం' అనగా అది పేరు మాత్రం పెట్టడం అవుతుంది కాని వస్తువు శూన్యమే లేదా వస్తుశూన్యమైన పేరుపెట్టడం మాత్రమే అవుతుంది. ఉపకారకం ముందు ఉండాలి అని నువ్వుకూడా అంగీకరించిన విషయమే అని చెపుతున్నాడు - యేషామితి. ఆ దృష్టాంతంచేతనే మేము వాచ్యప్రతీతి కూడ ముందు ఉంటుంది అని సమర్థిస్తాము అని భావం. నన్వితి. క్రమం ఉంటే ఎందువలన గుర్తించబడడంలేదు అని ఆశంకించుకొని చెపుతున్నాడు - తత్త్వితి. క్రియాపౌర్వాపర్యే అనేదానిచేత క్రమంయొక్క స్వరూపాన్ని చెపుతున్నాడు. "క్రియేతే ఇతి క్రియే" (చేయబడేవి గాన క్రియలు) అనే విగ్రహంచేత వాచ్యప్రతీతివ్యంగ్యప్రతీతులు. లేదా అభిధావ్యాపారము, 'వ్యంజన' అనే మరొక పర్యాయపదం గల ధ్వననవ్యాపారమూ క్రియలు. ఆ రెండింటి పౌర్వాపర్యం ప్రతీతం అవడంలేదు (తెలియడంలేదు). ఎక్కడ అనగా చెపుతున్నాడు - రసాదౌ - రసదివిషయమునందు. ఎలాంటిది? అభిధేయాన్తరాత్= ఆ శబ్దంచేత చెప్పబడే అభిధేయవిశేషంకంటె విలక్షణ మైనది; ఏ విధంగానూ కూడ అభిధేయం, వాచ్యం, కానిది. దీనిచేత క్రమం అనేది ఒకటి ఉండాలని చెప్పినట్లయింది. మరియు వాచ్యంతో విరోధం లేనిది. వాచ్యవిరోధి అయితే మాత్రం క్రమం గుర్తించబడుతుంది అని అర్థం. ఎందుచేత గుర్తించబడదు, నిమిత్తసప్తమిచేత నిర్దిష్టమైన (ఘటనాసు ఆశుభావినీషు" అనేచోట సప్తమి హేతువును సూచించే సప్తమి అని అభిప్రాయం) మరొక హేతువు గర్భమునందు గల హేతువును చెవుతున్నాడు - ఆశుభావినీష్వితి. అనన్యసాధ్యతత్ఫలఘటనాసు - ఘటనాః అనగా వెనుక గుణనిరూపణసందర్భంలో ప్రతిపాదించబడిన మాధుర్యాదిలక్షణములు గల ఘటనలు అని అర్థం. అవి, తత్ఫలాః= ఆ రసాదిప్రతీతియే ఫలం గలవి. మరియు అవి అనన్యసాధ్యాలు, అనగా రసాదికం తప్ప మరొకటి ఏవీ వాటికి సాధ్యం కాదు అని అర్థం. ఓజోఘటనకు కరుణాదిప్రతీతి సాధ్యం కాదు కదా?

ఈ విషయం చెప్పినట్లయింది - గుణాలు ఉన్న కావ్యంలో సంకరానికి అవకాశం లేకుండా (ఆ యా శబ్ద) సంఘటనలు ప్రయోగించబడినవి గాన క్రమం గుర్తించబడదు.

సరే; సంఘటనలు ఈ విధంగా ఉంటే ఉండవచ్చు, క్రమం ఎందుచేత గుర్తించబడదు? ఇందుకు సమాధానంగా చెపుతున్నాడు ఆశుభావినీషు. వాచ్యప్రతీతికాలంకోసం నిరీక్షించకుండానే వెంటనే అవి రసాదుల్ని భావింపచేస్తాయి; వాటి ఆస్వాదం కలిగిస్తాయి అని అర్థం.

లోచనం

ఏతదుక్తం భవతి - సంఘటనావ్యఙ్గత్వాద్రసాదీనాం అనుపయుక్తేఽప్యర్థవిజ్ఞానే పూర్వమేవ ఉచితసంఘటనాశ్రవణ ఏవ యత ఆనూాత్రితో రసాస్వాదః తేన వాచ్యప్రతీత్యుత్తరకాలభవేన పరిస్ఫుటాస్వాదయుక్తోఽపి పశ్చాదుత్పన్నత్వేన న భాతి. అభ్యస్తే హి విషయే అవినాభావప్రతీతిక్రమః ఇత్థమేవ న లక్ష్యతే. అభ్యాసో హ్యాయమేవ యత్ ప్రణిధానాదినాపి వినైవ సంస్కారస్య బలవత్త్వాత్ సదైవ ప్రభుభుత్సుతయా అవస్థాపనమ్ ఇతి. ఏవం యత్ర ధూమస్తత్రాగ్నిరితి హృదయస్థత్వాద్ వ్యాప్తేః పక్షధర్మజ్ఞానమాత్రమేవోపయోగి భవతీతి పరామర్శస్థానమాక్రమతి; ఝటిత్యుత్పన్నే హి ధూమజ్ఞానే తద్వ్యాప్తిస్మృత్యుప్రకృతే తద్విజాతీయ ప్రణిధానానుసరణాదిప్రతీత్యన్తరానుప్రవేశవిరహాత్ ఆశుభావిన్యామగ్నిప్రతీతౌ క్రమో న లక్ష్యతే తద్వదిహాపి. యది తు వాచ్యావిరోధీ రసో న స్యాత్ ఉచితా చ ఘటనా న భవేత్ తల్లక్ష్యైతైవ క్రమ ఇతి.

చన్ద్రికాకారస్తు పఠితమనుపఠతి ఇతి న్యాయేన గజనిమీలికయా వ్యాచచక్షే - తస్య శబ్దస్య ఫలం, తద్వా ఫలం వాచ్యవ్యఙ్గ్యప్రతీత్యాత్మకం తస్య ఘటనా నిష్పాదనా యతః అనన్యసాధ్యా శబ్దవ్యాపారైకజన్యేతి. న చాత్రార్థసతత్త్వం వ్యాఖ్యానే కించిదుత్పశ్యామ ఇతి అలం పూర్వవంశ్యైః సహ వివాదేన బహునా.

బాలానందిని

ఇక్కడ చెప్పిన విషయం ఇది - రసాదులు సంఘటనావ్యంగ్యాలు. అందువల్ల అర్థజ్ఞానం ఉపయుక్తం కాకపోయినా (వాచ్యార్థం తెలియబడకపోయినా) అంతకు పూర్వమే సంఘటనను వినగానే రసాస్వాదం కొంచెం స్ఫురిస్తుంది. అందుచేత

వాచ్యార్థప్రతీతి కలిగిన తరవాత పుట్టిన దవడంచేత స్పష్టమైన ఆస్వాదంతో కూడినదైనా అది తరవాత పుట్టినట్లుగా భాసించదు. బాగా అలవాటుపడిన విషయంలో అవినాభావప్రతీతిక్రమం - (ఒకదానిని ఒకటి విడవకుండా ఉండేవాటి ప్రతీతి కలిగే క్రమం) ఇలాగే ఉంటుంది. అభ్యాసం అనగా ఇదే - ఏమనగా, మనస్సును నిలపడం మొదలైనది ఏదీ లేకపోయినా, సంస్కారం బలంగా ఉండడంవల్ల ఎల్లప్పుడూ కూడ స్మృతిని ప్రబుద్ధం చేసే ఇచ్ఛ కలదానినిగా ఉంచడం. అనగా ఏదైనా విషయాన్ని గూర్చిన సంస్కారం బలవత్తరంగా ఉంటే దానిని స్మరించడంకోసం మనస్సును ఏకాగ్రం చేయకపోయినా అది ఎప్పుడు పైకి వద్దామా ఎప్పుడు పైకి వద్దామా అన్నట్లు ఉండేటట్లు ఆ సంస్కారం చేస్తుంది అని అర్థం. ఏవమితి. ఎక్కడెక్కడ ధూమం ఉంటుందో అక్కడలా అగ్ని ఉంటుంది అనే వ్యాప్తి హృదయంలో (స్థిరంగా) ఉండడంచేత వహ్న్యనుమితి కలగడానికి పక్షధర్మతాజ్ఞానం మాత్రం ఉంటే చాలు, అది పరామర్శస్థానాన్ని ఆక్రమిస్తుంది. అనగా పరామర్శతో పని లేకుండా అదే (పక్షధర్మతాజ్ఞానమే) అది చేసే పని చేస్తుంది. దాని (వ్యాప్తియొక్క) స్మృతిచేత ఉపకృతమైన ధూమజ్ఞానం వెంటనే పుట్టగా దానికి (ధూమజ్ఞానానికి) విజాతీయమైన ప్రణిధానాన్ని (మనస్సును ఏకాగ్రం చేయడాన్ని) అనుసరించడం మొదలైన ప్రతీతులు మధ్యలో ప్రవేశించకపోవడంవల్ల అగ్నిప్రతీతి వెంటనే కలుగుతుంది గాన క్రమం గుర్తించబడదు. ఇక్కడ కూడా అట్లే. అయితే రసం వాచ్యానికి అవిరోధి కాకపోతే ఘటన ఉచితంగా లేకపోతే క్రమం గుర్తించబడుతుంది.

వివరణ:- దూరం నుంచి పర్వతంమీద పొగ ఉన్నట్లు చూచినవానికి "పర్వతో వహ్నిమాన్" (ఈ పర్వతంమీద అగ్ని ఉంది) అనే జ్ఞానం కలుగుతుంది. దీనికి 'అనుమితి' అని పేరు. ఈ జ్ఞానం కలగాలంటే ముందుగా కొన్ని జ్ఞానాలు ఉండాలి. "యత్ర యత్ర ధూమః, తత్ర తత్రాగ్నిః" (ఎక్కడెక్కడ ధూమం ఉంటుందో అక్కడల్లా నిప్పు ఉంటుంది) అనే జ్ఞానం ముందుగా ఉండాలి. దీనికి వ్యాప్తిజ్ఞానం అని పేరు. రోజూ చూస్తూ ఉండడంవల్ల ఈ జ్ఞానం వాని మనస్సులో దృఢంగా పాతుకొని పోయి ఉంటుంది. 'పర్వతంమీద ధూమం ఉంది' అనే జ్ఞానం (దీనికి పక్షధర్మతాజ్ఞానం అని పేరు) కలగగానే మనస్సులో సంస్కారరూపంలో ఉన్న వ్యాప్తి స్మరణకి వస్తుంది. అప్పుడు 'వహ్నివ్యాప్యధూమవానయం పర్వతః" (ఈ పర్వతంమీద వహ్నివ్యాప్యమైన ధూమం ఉంది) అనే జ్ఞానం కలుగుతుంది. ఎక్కడైనా కూడ అనుమితి జ్ఞానం కలిగిందంటే ఇన్ని జ్ఞానాలు వరసగా ఉన్నాయనే అర్థం. వ్యాప్తిజ్ఞానసంస్కారం బలీయంగా

ఉన్నప్పుడు ధూమజ్ఞానం కలగగానే వ్యాప్తిస్మృతి కలుగుతుంది. పక్షధర్మతాజ్ఞానం కలిగిన వెంటనే పరామర్శమీద బుద్ధిని నిలపకుండానే అనుమితి కలుగుతుంది. అయితే అన్ని జ్ఞానాలూ వరసగా లేకపోలేదు, ఉన్నాయి. ఉన్నా వాటి క్రమం తెలియదు. ఇందుకు కారణం అనుమితి జ్ఞానం అతిశీఘ్రంగా కలగడం. అదే విధంగా ఇక్కడ కూడా అని భావం.

చన్ద్రికాకారస్తు ఇతి- చంద్రికాకారుడైతే - "ఉన్నది ఉన్నట్లుగానే చదువుతాడు" అనే న్యాయంచేత గజనిమీలికతో (మదించిన ఏనుగ కళ్లు సగం సగం మూసికొని చుట్టు ప్రక్కల ఏమవుతుందో పట్టించుకొనకుండా అలా నడుస్తూనే ఉంటుంది. అది గజనిమీలిక) దీనిని "ఆ శబ్దంయొక్క ఫలంయొక్క లేదా వాచ్యవ్యంగ్యార్థప్రతీతి రూపమైన ఆ ఫలం యొక్క ఘటన, అనగా నిష్పాదన, అనన్యసాధ్యమైనది; కేవలం శబ్దవ్యాపారంచేతనే కలిగేది. అందువలన" అని వ్యాఖ్యానించాడు. ఈ వ్యాఖ్యానంలో ఏ మాత్రము అర్థసంగతి మాకు కనబడడంలేదు. ఇంతటితో మన పూర్వవంశ్యులతో అధికంగా వివాదం పెంచుకొని చాలును.

వివరణ : సిద్ధాంతకౌముదిలో (అవ్యయీభావప్రకరణంలో) భట్టోజీదీక్షితులు చెప్పినట్లు వంశం జన్మచేత, విద్యచేత రెండు విధాలు (వంశో ద్విధా విద్యయా జన్మనా చ). అలంకార శాస్త్రాధ్యయనం చేసినవాళ్లందరూ ఒకే విద్యావంశానికి చెందుతారు అనే అభిప్రాయంతో ఈయన వెనక కూడ ఒక చోట 'పూర్వవంశ్యైః' అంటాడు.

అభినవగుప్తుడు "తత్తు" మొదలు "ప్రతీయతే" వరకు ఉన్న వృత్తివాక్యానికి చేసిన వ్యాఖ్య ప్రౌఢివాదమే అని తోస్తుంది. వాచ్యవ్యంగ్యాల ప్రతీతులలో క్రమం ఉన్నా అది గుర్తించబడడం లేదు అనే విషయం ప్రస్తుతం. వాటికి క్రమం లేదు సహభావమే, అనే పూర్వపక్షి వాదాన్ని నిరాకరిస్తూన్న సందర్భంలో వ్రాసిన వాక్యం ఇది. "శబ్దస్య అనన్యసాధ్యతత్ఫలఘటనాసు, ఆశుభావినీషు తత్తు క్రియాపౌర్వాపర్యం న ప్రతీయతే" అని అన్వయం. "శబ్దం మాత్రమే చేయకలిగిన, ఇతరమైనవాటిచేత చేయ శక్యం కాని ఆ రసాదిరూపఫలంయొక్క ఘటనలు అతి శీఘ్రంగా జరిగిపోవడంవల్ల క్రియాపౌర్వాపర్యం - అభిధావ్యంజనారూపక్రియల క్రమం, గుర్తించబడడంలేదు" అని అర్థమే ఇక్కడ యుక్తం. ఇలా ఉండగా శబ్దసంఘటనలు, గుణాలు వీటి ప్రసంగాన్ని తీసుకొని రావడానికి ఇక్కడ అవకాశం లేదు. శబ్దసంఘటన వినగానే కొంచెం రసస్ఫూర్తి కలుగుతుంది. వాచ్యార్థం తెలియగానే వెంటనే జరుగుతుంది అని అభినవగుప్తుడు చెప్పదలచిన విషయం. 'యో యః శస్త్రం బిభర్తి' ఇత్యాదులలో ఓజోగుణం లేకపోయినా

రసప్రతీతి కలుగుతుందని అంగీకరించి ఉన్నారు కదా? సూర్యశతకంలోని ఓజోభరితసంఘటనలో రౌద్ర - వీరాదులు వ్యంగ్యం అవుతున్నాయా? ఆనందవర్ధనుడు ఈ సందర్భంలో శబ్దసంఘటన ఎక్కడా ఎత్తలేదు. అభినవగుప్తుడే దానిని ప్రవేశపెట్టి రెండు మూడు పర్యాయాలు నిర్దేశిస్తూ వెళ్లాడు. అందుచేత చంద్రికాకారుని వ్యాఖ్యానమే వృత్తిగ్రంథవివక్షితార్థానికి దగ్గరగా ఉన్నట్లు తోస్తుంది. అభినవగుప్తుడు తన భావాలను ఏదో విధంగా మూలగ్రంథంలో చొప్పించడానికి వెనుకాడడు అనేది బాగా పరిశీలిస్తే అందరికీ తెలుస్తుంది. ఏమైనా ఆయన మహాపండితవిమర్శకుడు. అందుచేత మనం కూడ "ఇత్యలం పరమపూజ్యైః సహ వివాదేన బహునా" అనే మాటలతో ఈ చర్చ ముగించడం మంచిది.

## ధ్వన్యాలోకం

క్వచిత్తు లక్ష్యత ఏవ. యథానురణనరూపవ్యఙ్గ్యప్రతీతిషు. తత్రాపి కథమితి చేత్, ఉచ్యతే - అర్థశక్తిమూలానురణనరూపవ్యఙ్గ్యే ధ్వనౌ తావదభిధేయస్య తత్సామర్థ్యాక్షిప్తస్య చ అర్థస్య అభిధేయాన్తరవిలక్షణతయా అత్యన్తవిలక్షణే యే ప్రతీతీ తయోః అశక్యనిహ్నవః నిమిత్తనిమిత్తిభావ ఇతి స్ఫుటమేవ తత్ర పౌర్వాపర్యమ్. యథా ప్రథమోద్ద్యోతే ప్రతీయమానార్థసిద్ధ్యర్థముదాహృతాసు గాథాసు. తథావిధే చ విషయే వాచ్యవ్యఙ్గ్యయోరత్యన్తవిలక్షణత్వాత్ యైవ ఏకస్య ప్రతీతిః సైవ ఇతరస్యేతి న శక్యతే వక్తుమ్. శబ్దశక్తిమూలానురణనరూపవ్యఙ్గ్యే తు ధ్వనౌ-

"గావో వః పావనానాం పరమపరిమితాం ప్రీతిముత్పాదయన్తు"

ఇత్యాదౌ అర్థద్వయప్రతీతౌ శాబ్ద్యామ్, అర్థద్వయస్యోపమానోపమేయభావప్రతీతిరుపమావాచకపదవిరహే సతి అర్థసామర్థ్యాదాక్షిప్తేతి, తత్రాపి సులక్షమభిధేయవ్యఙ్గ్యాలంకారప్రతీత్యోః పౌర్వాపర్యమ్.

బాలానందిని

క్వచిదితి - కొన్ని చోట్లలో అయితే (వస్తుధ్వన్యలంకారధ్వన్యాదులలో) పౌర్వాపర్యం

గుర్తింపబడుతూనే ఉంటుంది. ఉదాహరణకి అనురణనరూపవ్యంగ్యప్రతీతులలో అక్కడమాత్రం ఎలా గుర్తింపబడుతుంది అంటారా - చెపుతాం వినండి - అర్థశక్తి మూలానురణనరూపవ్యంగ్యమైనధ్వనికావ్యంలో వాచ్యార్థమూ, దాని సామర్థ్యంచేత ఆక్షిప్తమైన (లాగబడిన అర్థమూ (వ్యంగ్యార్థమూ) ఇతరవాచ్యార్థాలకంటె విలక్షణంగా గోచరిస్తూంటాయి. అలాంటి ఈ రెండు అర్థాల ప్రతీతుల మధ్య ఉన్న నిమిత్తనిమిత్తి భావం (వాచ్యార్థం నిమిత్తం, వ్యంగ్యార్థం నిమిత్తి) కప్పిపుచ్చడానికి శక్యం కానిది. అందుచేత అక్కడ పౌర్వాపర్యం స్ఫుటంగానే కనబడుతుంది. ఇందుకు ప్రథమోద్ద్యోతంలో ప్రతీయమానార్థం అనేది ఒకటి ఉన్నది అని స్థాపించే ఘట్టంలో ఇచ్చిన ("భ్రమ ధార్మిక" ఇత్యాది) గాథలు ఉదాహరణం. అలాంటి స్థలాలలో వ్యాచ్యార్థవ్యంగార్థాలు చాలా విలక్షణంగా (పరస్పరభిన్నంగా, విరుద్ధంగా) ఉండడంవల్ల ఒక అర్థంయొక్క ప్రతీతియే రెండవ అర్థంయొక్క ప్రతీతికూడా అని చెప్పడానికి వీలు లేదు. శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యం అయిన ధ్వనికావ్యంలో అయితే - "గావో వః పావనామ్" (చూ. 44వ శ్లోకం) ఇత్యాదులలో శబ్దంవల్ల రెండు అర్థాల ప్రతీతి కలిగిన తరవాత, ఉపమావాచకపదం ఏదీ లేకపోయినా ఆ రెండు అర్థాల మధ్య ఉపమానోపమేయభావప్రతీతి అర్థసామర్థ్యంచేత ఆక్షిప్తం అవుతున్నది. అందువల్ల అక్కడ కూడా వాచ్యార్థప్రతీతికి, అలంకారప్రతీతికీ మధ్య ఉన్న పౌర్వాపర్యం అనాయాసంగా గుర్తించవచ్చు.

లోచనం

యత్ర తు సంఘటనావ్యఙ్గ్యత్వం నాస్తి తత్ర లక్ష్యత ఏవేత్యాహ - క్వచిత్త్వితి. తుల్యే వ్యఙ్గ్యత్వే కుతో భేద ఇత్యాశఙ్క్యతే - తత్రాపీతి. స్ఫుటమేవేతి -

అవివక్షితవాచ్యస్య పదవాక్యప్రకాశతా,

తదన్యస్యానురణనరూపవ్యఙ్గ్యస్య చ ధ్వనేః. (కా. 3.1)

ఇతి హి పూర్వం వర్ణసంఘటనాదికం నాస్య వ్యఞ్జకత్వేనోక్తమితి భావః. గాథాస్వితి. "భమధ మ్మిఅ" ఇత్యాదికాసు. తాశ్చ తత్రైవ వ్యాఖ్యాతాః. శాబ్ద్యామితి. శాబ్ద్యామపీత్యర్థః. ఉపమావాచకం యథేవాది. అర్థసామర్థ్యాదితి. వాక్యార్థసామర్థ్యాదితి యావత్.

"ఉత్పథజాతాయా అశోభనాయాః ఫలకుసుమపత్రరహితాయాః
బదర్యా వృతిం దదత్ పామర భో అవహసిష్యసే"

(ఇతి చ్ఛాయా)

అత్ర హి వాచ్యార్థో నాత్యన్తం సంభవీ న చాసంభవీ. తస్మాద్వాచ్యవ్యఙ్గ్యయోః ప్రాధాన్యాప్రాధాన్యే యత్నతో నిరూపణీయే.

బాలానందిని

అవివక్షితత్వమితి. వాచ్యార్థానికి అవివక్షితత్వం ఎట్లనగా-

క ఇతి :- భోః= ఓయీ! త్వమ్= నువ్వు, కః= ఎవడవు? కథయామి= చెపుతున్నాను. మామ్= నన్ను, దైవహతకమ్= దైవోపహతుడనైన, శాఖోటకమ్= శాఖోటకవృక్షమునుగా, భూతాలు నివసించే ఒక వృక్షం అని కొందరు. ఎక్కువ నీడ ఉండని (హిందీలో 'సాహోర్') అనే పేరుగల) చిన్న చెట్టు అని కొందరు. మరొక విధంగా లోచనకారుడు. విద్ధి= తెలుసుకొనుము. వైరాగ్యాదివ= వైరాగ్యంవలన వలె, ఏదో నిరాశతో వలె, వక్షి= మాటలాడుతున్నావే? సాధు= బాగా, విదితమ్= తెలియబడినది. కస్మాత్= ఎందువల్ల? ఇదం కథ్యతే= ఇదిగో చెప్పబడుతూన్నది. అత్ర= ఇక్కడ, వామేన= ఎడమ ప్రక్క, వటః= మఱ్ఱిచెట్టు ఉంది. అధ్వగజనః= బాటసారుల సముదాయం, తమ్= దానిని, సర్వాత్మనా= అన్ని విధాలా, సేవతే= సేవిస్తూన్నది. మార్గస్థితస్యాపి= మార్గంలోనే ఉన్న, మే= నాయొక్క, ఛాయాపి= నీడ కూడ, పరోపకారకరణే= పరోపకారం చేయడంలో, న= ఉపయుక్తం కాదు.

న హీతి. చెట్టుతో ఉక్తి - ప్రత్యుక్తులు సంభవించేవి కాదు గాన వివక్షితం కాని వాచ్యార్థం గలదే అయిన ఈ శ్లోకంచేత సమృద్ధుడైన ఒక అసత్పురుషుని సమీపంలోనే ఉన్న, ఆత్మాభిమానవంతుడైన ఒక నిర్ధనుని పరిదేవితం (శోకభరితవచనం) తాత్పర్యంచేత వాక్యార్థంగా చేయబడింది అని ప్రతీయమానం (గమ్యం) అవుతున్నది.

వివక్షితేతి. వివక్షితత్వావివక్షితత్వం ఎట్లనగా-

ఉత్పథేతి:- "ఓ! అమాయకుడా! చెడ్డదారిలో పుట్టినదీ, ఫలాలు కాని, పుష్పాలు కాని, ఆకులు కాని లేనిదీ అయిన ఈ రేగిచెట్టుకు కంచె వేస్తున్న నువ్వు (అందరిచేత) పరిహసించబడతావు"

అత్ర హీతి. ఇక్కడ వాచ్యార్థం పూర్తిగా సంభవి కాదు; అసంభవి కూడ కాదు. అందువల్ల వాచ్యవ్యంగ్యాల ప్రాధాన్యాప్రాధాన్యాలను ప్రయత్నంచేత గుర్తించాలి.

బాలానందిని

యత్ర తు ఇతి. ఎక్కడైతే సంఘటనావ్యంగ్యత్వం లేదో అక్కడ (క్రమం) తప్పక గుర్తించబడుతుంది అని చెపుతున్నాడు - క్వచిత్త్వితి. వ్యంగ్యత్వం (రసాదులకీ వస్త్వలంకారాలకీ) తుల్యమే అయినప్పుడు ఈ భేదం ఎట్లు అని ఆశంకిస్తున్నాడు- తత్రాపీతి. స్ఫుటమేవేతి. వెనక చెప్పిన ''అవివక్షితవాచ్యస్య'' ఇత్యాదికారికలో వర్ణసంఘటనాదికం దీనికి (వస్త్వలంకారవ్యంగ్యానికి) వ్యంజకంగా చెప్పబడలేదు అని భావం.

వివరణ:- ఇది కూడ అభినవగుప్తుని స్వతంత్రవ్యాఖ్యానమే. వెనకటి వలెనే ఇక్కడ కూడా వృత్తిలో లేని సంఘటన ప్రసంగం తీసికొనివచ్చి వ్యాఖ్యానించాడు. ఇవి వర్ణసంఘటనాదివ్యంగ్యాలుగా చెప్పబడలేదు గాన ఇవి సంలక్ష్యక్రమాలు అని ఈయన వ్యాఖ్య. వ్యంగ్యార్థం వాచ్యవిరుద్ధమైనది గాన ఇక్కడ సంలక్ష్యక్రమత అని వృత్తికారుడు - "వాచ్యేనావిరోధిని రసాదౌ న ప్రతీయతే" అనే వాక్యంలో ముందు సూచించాడు. ఆ విషయమే ఇక్కడ 'ఉచ్యతే' ఇత్యాదికంచేత వివరించాడు.

గాథాస్వితి. "భమ ధమ్మిఅ" ఇత్యాదిగాథలలో. అవి అక్కడనే వ్యాఖ్యానించ బడ్డాయి. శాబ్ద్యామితి. శబ్దంవల్ల కలిగినదైనా అని అర్థం. ('అపి' శబ్దం చేర్చి అర్థం చెప్పుకోవాలి). ఉపమావాచకం అనగా 'యథా' 'ఇవ' మొదలైనది. అర్థసామర్థ్యాత్ - వాక్యార్థసామర్థ్యంవల్ల అని భావం.

## ధ్వన్యాలోకం

పదప్రకాశశబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యేఽపి ధ్వనౌ విశేషణపదస్య ఉభయార్థసంబన్ధయోగ్యస్య యోజకం పదమన్తరేణ యోజనమశాబ్దమప్యర్థాదవస్థితమితి అత్రాపి పూర్వవదభిధేయతత్సామర్థ్యాక్షిప్తాలంకారమాత్రప్రతీత్యోః సుస్థితమేవ పౌర్వాపర్యమ్. ఆర్థ్యపి చ ప్రతిపత్తిః తథావిధే విషయే ఉభయార్థసంబన్ధయోగ్యశబ్దసామర్థ్యప్రసావితేతి శబ్దశక్తిమూలా కల్ప్యతే.

బాలానందిని

పదప్రకాశశబ్దమూలానురణనరూపవ్యంగ్యమైన ధ్వనిలో కూడ (''ప్రాతుం ధనైః' ' ఇత్యాదియైన 74 శ్లోకంలో) రెండు అర్థాలతోను అనగా 'కూప' 'అహం' పదార్థాలతో,

సంబంధానికి తగిన విశేషణపదాన్ని ('జడ' శబ్దాన్ని) యోజకమైన (ఇవాది) పదం లేకపోయినా, వాటితో కూర్చడం శబ్దసిద్ధం కాదు; అర్థంవల్ల ఏర్పడింది. అందుచేత ఇక్కడ కూడ వెనుకటి వలెనే వాచ్యాలంకార (దీపక) ప్రతీతికీ, దాని సామర్థ్యంచేత ఆక్షిప్తమైన ఉపమాలంకారప్రతీతికీ పౌర్వాపర్యం బాగుగానే (స్పష్టంగా) ఉన్నది. ఆర్థ్యపీతి. ఇలాంటి స్థలాలలో వ్యంగ్యార్థప్రతిపత్తి అర్థంవల్ల కలిగినది (ఆర్థ్యపి) అయినా కూడ, రెండు అర్థాలతో (వాచ్యవ్యంగ్యార్థాలతో) సంబంధానికి తగిన (జడాది) శబ్దాల సామర్థ్యంచేత కలిగినది గాన శబ్దశక్తిమూల మని చెప్పబడుతున్నది.

లోచనం

ఏవం వాక్యప్రకాశశబ్దశక్తిమూలం విచార్య పదప్రకాశం విచారయతి - పదప్రకాశేతి. విశేషణపదస్యేతి. జడ ఇత్యస్య. యోజకమితి కూప ఇతి చ అహమితి చ ఉభయసమానాధికరణతయా సంవలనమ్. అభిధేయం చతత్సామర్థ్యాక్షిప్తం చ తయోరలఙ్కారమాత్రయోః యో ప్రతీతీ తయోః పౌర్వాపర్యం క్రమః. సుస్థితమ్ సులక్షితమిత్యర్థః. మాత్రగ్రహణేన రసప్రతీస్త్రత్రాప్య లక్ష్యక్రమైవేతి దర్శయతి. నన్వేవమార్థత్వం శబ్దశక్తిమూలత్వం చేతి విరుద్ధమిత్యాశఙ్క్యాహ ఆర్థ్యపీతి. నాత్ర విరోధః కశ్చిదితి భావః ఏతచ్చ వితత్య పూర్వమేవ నిర్ణీతమితి న పునరుచ్యతే.

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా వాక్యప్రకాశశబ్దశక్తిమూలాన్ని గూర్చి విచారించి పదప్రకాశాన్ని విచారిస్తున్నాడు - పదప్రకాశేతి. వశేషణపదత్యేతి. 'జడ' అనేదానియొక్క. యోజకమితి. 'కూపః' అనీ, 'అహమ్'అనీ రెండింటికీ సమానాధికరణంగా కూర్చేది. అభిధేయమితి. అభిధేయమైన అలంకారమూ దాని సామర్థ్యంచేత ఆక్షిప్తమైన అలంకారము ఈ రెండింటిమాత్రంయొక్క ఏ ప్రతీతులు గలవో వాటి పౌర్యాపర్యం, క్రమం. సుస్థితమ్ - బాగా గుర్తించబడినది అని అర్థం. 'మాత్ర' అనే పదాన్ని ప్రయోగించడంచేత అక్కడ కూడ రసప్రతీతి అలక్ష్యక్రమమే అని చూపుతున్నాడు. నన్వితి. ఈ విధంగా ఆర్థత్వం (అర్థంచేత ఆక్షేపించబడడం) శబ్దశక్తిమూలత్వం అనేవి విరుద్ధం కదా అని ఆశంకించుకొని ఆర్థ్యపి ఇత్యాదికం చెపుతున్నాడు. ఇందులో విరోధం ఏదీ లేదని భావం. ఈ విషయం విస్తరించి వెనకనే నిర్ణయించబడింది; మళ్ళీ ఇక్కడ చెప్పబడడం లేదు.

## ధ్వన్యాలోకం

అవివక్షితవాచ్యస్య తు ధ్వనేః ప్రసిద్ధస్వవిషయవైముఖ్య ప్రతీతిపూర్వకమేవ అర్థాన్తరప్రకాశనమితి నియమభావీ క్రమః. తత్ర అవివక్షితవాచ్యత్వాదేవ వాచ్యేన సహ వ్యఙ్గ్యస్య క్రమప్రతీతివిచారో న కృతః. తస్మాదభిధానాభిధేయప్రతీత్యోరివ వాచ్యవ్యఙ్గ్యప్రతీత్యోః నిమిత్తనిమిత్తిభావాత్ నియమభావీ క్రమః. స తూక్తయుక్త్యా క్వచిల్లక్ష్యతే క్వచిన్న లక్ష్యతే.

### బాలానందిని

అవివక్షితేతి. అవివక్షితవాచ్యధ్వనిలో అయితేప్రసిద్ధమైన తన అర్థం విషయంలో వైముఖ్యంయొక్క ప్రతీతి ముందుగా కలుగుతూండగా (వాచ్యార్థాన్ని విడిచివేసి) మరొక అర్థం ప్రకాశింపచేయబడుతున్నది గాన క్రమం తప్పకుండా ఉంటుంది. దాని పేరే 'అవివక్షితవాచ్యం' గాన వాచ్యంతో వ్యంగ్యంయొక్క క్రమప్రతీతిని గూర్చిన విచారం చేయబడలేదు. అందుచేత శబ్దప్రతీతి - వాచ్యార్థప్రతీతులక్కు వలె వాచ్యప్రతీతివ్యంగ్యప్రతీతులకు కూడ నిమిత్తనైమిత్తికభావం ఉంది గాన, (నిమిత్తం నిమిత్తికంటె తప్పకుండా ముందు ఉండాలి గాన) క్రమం తప్పనిసరి యైనది. అయితే - పైన చెప్పిన యుక్తి ప్రకారం ఆక్రమం కొన్ని చోట్ల గుర్తించబడుతుంది, కొన్ని చోట్ల గుర్తించబడదు.

### లోచనం

స్వవిషయేతి. అన్ధశబ్దాదేరపి ఉపహతచక్షుష్కాదిః స్వో విషయః తత్ర యద్వైముఖ్యమ్, అనాదరః ఇత్యర్థః విచారో న కృత ఇతి. నామధేయనిరూపణద్వారేణేతి శేషః సహభావస్య శఙ్కితుమత్రాయుక్తత్వాదితి భావః. ఏవం రసాదయః కైశిక్యాదీనామ్, ఇతివృత్తభాగరూపాణాం, వృత్తీనాం జీవితముపనాగరికాద్యానాం చ సర్వస్యాస్యోభయస్యాపి వృత్తివ్యవహారస్య రసాదినియన్త్రితవిషయత్వాదితి యత్ప్రస్తుతం తత్ప్రసఙ్గేన రసాదీనాం వాచ్యాతిరిక్తత్వం సమర్థయితుం క్రమో విచారిత ఇత్యేతదుపసంహరతి - తస్మాదితి. అభిధానస్య శబ్దరూపస్య పూర్వం ప్రతీతిః తతః అభిధేయస్య.

తదాహ తత్రభవాన్-

"విషయత్వమనాపన్నైః శబ్దైర్నార్థః ప్రకాశ్యతే" ఇత్యాది.

"అతోఽనిర్జ్ఞాతరూపత్వాత్ కిమాహేత్యభిధీయత"ఇతిచ.

అత్రాపి చావినాభావవత్ సమయస్య అభ్యస్తత్వాత్ క్రమో న లక్ష్యేతాపి.

బాలానందిని

స్వవిషయేతి. "నిఃశ్వాసాన్ధ ఇవాదర్శః" ఇత్యాదులలో (శ్లో.20)'అన్ధ' శబ్దాదులకు "కళ్లు చెడిపోయినవాడు" ఇత్యాదులు స్వవిషయం (స్వార్థం).దానియందు దానికి వైముఖ్యం అనగా అనాదరం. విచారో న కృతః ఇతి. "నామధేయాన్ని నిరూపించడం ద్వారా" అని అధ్యాహారం. వాచ్యం వివక్షితమే కానప్పుడు సహభావం (వాచ్యవ్యంగ్యార్థాలప్రతీతి ఒకే సమయంలో జరుగుతుంది అనేది) శంకించడానికి కూడ అయుక్తం అని భావం. ఏవమితి. ఈ విధంగా - రసాదులు ఇతివృత్తభాగరూపాలైన కైశిక్యాదివృత్తులకీ, ఉపనాగరికాదివృత్తులకీ జీవితం, ఉభయవిధమైన ఈ సమస్తవృత్తివ్యవహారం కూడా రసాదులచేత నియంత్రితమైన విషయం కలది కదా; (అనగా ఉభయవిధవృత్తుల్లో ప్రయోగం కూడ రసాదులను ఆధారంగా తీసుకొని చేయబడుతుంది అనే విషయం ప్రస్తుతం. ఆ విషయాన్ని గూర్చి చర్చించే సందర్భంలో ప్రసంగవశంచేత, రసాదులు వాచ్యంకంటె అతిరిక్తమైనవి అనే విషయాన్ని సమర్థించడం కోసం వాటి క్రమం కూడా విచారించబడింది. ఈ విషయాన్ని తస్మాదిత్యాదికంచేత ఉపసంహరిస్తున్నాడు. అభిధానం, అనగా శబ్దం, ముందుగా తెలుస్తుంది. తరవాత అర్థం తెలుస్తుంది. అందుచేతనే పూజ్యుడు ఇలా అన్నాడు - "శబ్దాలు విషయత్వాన్ని పొందకపోతే, అనగా అవి బుద్ధిగోచరాలు కాకపోతే, అలాంటి శబ్దాలచేత అర్థం ప్రకాశింపబడదు". అందుచేతను శబ్దరూపం తెలియనప్పుడు "ఏమన్నావు?' అనిప్రశ్నించడం జరుగుతుందా" అని కూడ చెప్పాడు. (అనగా ఎవరైనా ఒక వాక్యం పలికినప్పుడు ఆ మాటలు సరిగా వినబడకపోతే శ్రోత "ఏమన్నావు?" అని మళ్లీ ప్రశ్నిస్తాడు. దీనిని పట్టి శబ్దం తెలిస్తేనే అర్థం తెలుస్తుంది అనేది స్పష్టం). అయితే శబ్దార్థాల విషయంలో కూడ వినాభావం వలె సమయం (సంకేతం)అభ్యస్తం అయి ఉండడంచేత ఒకప్పుడు క్రమం గుర్తించబడదు కూడ. అనగా ధూమాగ్న్యాదులకు అవినాభావ సంబంధం తెలిసినవాళ్లకి ధూమం చూడగానే వహ్నిజ్ఞానం వెంటనే, క్రమం గుర్తింపజాలనంత శీఘ్రంగా ఎలా కలుగుతుందో; శబ్దానికి అర్థం విషయంలో ఉన్న

సంకేతంయొక్క జ్ఞానం దృఢంగా ఉన్నవానికి అదే విధంగా శీఘ్రంగా అర్థజ్ఞానం కలుగుతుంది అని అర్థం.

## ధ్వన్యాలోకం

తదేవం వ్యఞ్జకముఖేన ధ్వనిప్రకారేషు నిరూపితేషు కశ్చిద్ బ్రూయాత్- కిమిదం వ్యఞ్జకత్వం నామ? వ్యఙ్గ్యార్థప్రకాశనం న హి వ్యఞ్జకత్వం, వ్యఙ్గ్యత్వం చార్థస్య; వ్యఞ్జకసిద్ధ్యధీనం వ్యఙ్గ్యత్వమ్, వ్యఙ్గ్యాపేక్షయా చ వ్యఞ్జకత్వసిద్ధిరితి అన్యోన్యసంశ్రయాద వ్యవస్థానమ్.

### బాలానందిని

తదేవమ్ ఇతి:-ఈ విధంగా వ్యంజకముఖంగా ధ్వనిప్రకారాలు నిరూపించబడిన తరవాత ఎవరైనా ఈ విధంగా ప్రశ్నించవచ్చు- "ఏమిటి ఈ వ్యంజకత్వం అంటే?" వ్యంగ్యార్థాన్ని ప్రకాశింపచేయడమే వ్యంజకత్వం; అర్థం వ్యంగ్యం, అని చెప్పడం కుదరదు కదా? ఎందుచేత ననగా - వ్యంజకం అనేది ఒకటి సిద్ధిస్తే వ్యంగ్యత్వం సిద్ధిస్తుంది; వ్యగ్యం అనేది ఒకటి ఉంటే దానిని పట్టి వ్యంజకత్వం సిద్ధిస్తుంది. ఈ విధంగా ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉండడంచేత వ్యవస్థ ఉండదు. అనగా - వ్యంజకం అంటే ఏమిటి అని ప్రశ్నిస్తే వ్యంగ్యాన్ని బోధించేది అనీ, వ్యంగ్యం అంటే ఏమిటి అని ప్రశ్నిస్తే వ్యంజింపబడేది అనే సమాధానం చెపితే అన్యోన్యాశ్రయదోషం అని అర్థం.

### లోచనం

ఉద్ద్యోతారమ్భే యదుక్తం వ్యఞ్జకముఖేన ధ్వనేః స్వరూపం ప్రతిపాద్యత ఇతి తదిదానీముపసంహరన్ వ్యఞ్జకభావం ప్రథమోద్ద్యోతే సమర్థితమపి శిష్యాణామేకప్రఘట్టకేన హృది నివేశయితుం పూర్వపక్షమాహ - తదేవమితి. కశ్చిదితి - మీమాంసకాదిః. కిమిదమితి. వక్ష్యమాణః చోదకస్యాభిప్రాయః.

### బాలానందిని

**ఉద్ద్యోతేతి** - వ్యంజకముఖంచేత ధ్వనిస్వరూపం ప్రతిపాదించబడుతుంది అని తృతీయోద్ద్యోతప్రారంభంలో చెప్పబడినది. ఆ విషయాన్ని ఉపసంహరిస్తూ

ప్రథమోద్యోతంలో సమర్థించబడినదైనా వ్యంజకభావాన్ని(వ్యంజకత్వాన్ని) గూర్చి ఒక్కప్రఘట్టకంలో చెపితే శిష్యుల హృదయాలలో స్థిరంగా నిలిచిపోతుంది అనే అభిప్రాయంతో పూర్వపక్షం చెపుతున్నాడు - తదేవమితి. కశ్చిదితి - మీమాంసకాదులు. కిమిదమితి. చోదకుని (పూర్వపక్షి) అభిప్రాయం చెప్పబడబోతున్నది.

## ధ్వన్యాలోకం

నను వాచ్యవ్యతిరిక్తస్య వ్యఙ్గ్యస్య సిద్ధిః ప్రాగేవ ప్రతిపాదితా, తత్సిద్ధ్యధీనా చ వ్యఞ్జకసిద్ధిరితి కః పర్యనుయోగావసరః? సత్యమేతత్; ప్రాగుక్తయుక్తిభిః వాచ్యవ్యతిరిక్తస్య వస్తునః సిద్ధిః కృతా; స త్వర్థో వ్యఙ్గ్యతయైవ కస్మాద్వ్యపదిశ్యతే? యత్ర చ ప్రాధాన్యేనావస్థానం తత్ర వాచ్యతయైవాసౌ వ్యపదేష్టుం యుక్తః, తత్పరత్వాద్వాక్యస్య. అతశ్చ తత్ప్రకాశినో వాక్యస్య వాచకత్వమేవ వ్యాపారః. కిం తస్య వ్యాపారాన్తరకల్పనయా? తస్మాత్తాత్పర్య విషయో యోర్థః స తావన్ముఖ్యతయా వాచ్యః. యా త్వన్తరా తథావిధే విషయే వాచ్యాన్తర ప్రతీతిః సా తత్ప్రతీతేః ఉపాయమాత్రం పదార్థప్రతీతిరివ వాక్యార్థప్రతీతేః

### బాలానందిని

నన్వితి. వాచ్యంకంటె వ్యతిరిక్తమైన వ్యంగ్యం ఉన్నదని వెనుకనే ప్రతిపాదించబడింది కదా? అందుచేత వ్యంగ్యం అంటూ ఒకటుందని సిద్ధిస్తే వ్యంజకం సిద్ధిస్తుంది అని అంటూ ప్రశ్నకు అవకాశం ఎక్కడ ఉంది? ఇది నిజమే - పూర్వం చూపిన యుక్తులచేత వాచ్యం కంటె భిన్నమైన వస్తువు ఒకటి ఉందని సాధించబడింది. కాని అర్థం వ్యంగ్యం అని ఎందుకు చెప్పబడుతున్నది? అది ఎక్కడ ప్రధానంగా ఉంటుందో అక్కడ అదే వాచ్యం అని చెప్పడం యుక్తం. ఎందుచేత ననగా వాక్యం తత్పరమైనది; అనగా ఆ అర్థాన్ని బోధించడానికే ఉద్దిష్టమైనది. అందువల్ల ఆ అర్థాన్ని ప్రకాశింపచేసే వాక్యంయొక్క వ్యాపారం వాచకత్వమే. దానికి మరొక వ్యాపారం కల్పించడం ఎందుకు? అందుచేత ఏ అర్థం తాత్పర్యవిషయమో అదే ముఖ్యం అవడంచేత వాచ్యం. అలాంటి స్థలాలలో మధ్య మరొక అర్థం ఏదైతే గోచరిస్తూన్నదో అది దానియొక్క (రెండవఅర్థంయొక్క)

ప్రతీతికి, పదార్థజ్ఞానం వాక్యార్థజ్ఞానానికి ఉపాయం అయినట్లు ఉపాయం మాత్రమే.

లోచనం

ప్రాగేవేతి. ప్రథమోద్ద్యోతే అభావవాదనిరాకరణే. అతశ్చ న వ్యఞ్జకసిద్ధ్యా తత్సిద్ధిః యేన అన్యోన్యాశ్రయః శఙ్క్యేత; అపి తు హేత్వన్తరైస్తస్య సాధితత్వాదితి భావః. తదాహ - తత్సిద్ధీతి. సత్వితి - అస్త్యసౌ ద్వితీయోఽర్థః, తస్య యది వ్యఙ్గ్య ఇతి నామ కృతమ్ వాచ్య ఇత్యపి కస్మాన్న క్రియతే? వ్యఙ్గ్యఇతి వా వాచ్యాభిమతస్యాపి కస్మాన్న క్రియతే? అవగమ్యమానత్వేన హి శబ్దార్థత్వమ్;తదేవ వాచకత్వమ్. అభిధా హి యత్పర్యన్తా తత్రైవాభిధాయకత్వముచితమ్;తత్పర్యన్తతా చ ప్రధానీభూతే తస్మిన్నర్థే ఇతి మూర్ధాభిషిక్తం ధ్వనేః యద్రూపం నిరూపితం తత్రైవ అభిధావ్యాపారేణ భవితుం యుక్తమ్. తదాహ – యత్ర చేతి. తత్ప్రకాశిన ఇతి - తద్ వ్యఙ్గ్యాభిమతం ప్రకాశయత్యవశ్యం యద్వాక్యం. తస్యేతి. ఉపాయమాత్రమిత్యనేన సాధారణ్యోక్త్యా భాట్టం, ప్రాభాకరం, వైయాకరణం చ పూర్వపక్షం సూచయతి - భాట్టమతే హి -

"వాక్యార్థమితయే యేషాం ప్రవృత్తౌ నాన్తరీయకమ్,
పాకే జ్వాలేవ కాష్ఠానాం పదార్థప్రతిపాదనమ్"

(శ్లోకవార్తికం, వాక్యాధికరణం. 343)

ఇతి శబ్దావగతైః పదార్థైః తాత్పర్యేణ యోఽర్థ ఉత్పాద్యతే స ఏవ వాక్యార్థః; స ఏవ చ వాచ్య ఇతి. ప్రాభాకరదర్శనేఽపి దీర్ఘదీర్ఘో వ్యాపారః నిమిత్తిని వాక్యార్థే, పదార్థానా తు నిమిత్తభావః పారమార్థిక ఏవ. వైయాకరణానాం తు సః అపారమార్థిక ఇతి విశేషః. ఏతచ్చ అస్మాభిః ప్రథమోద్ద్యోత ఏవ వితత్య నిర్ణీతమితి న పునరాయస్యతే; గ్రన్థయోజనైవ తు క్రియతే. తదేతన్మతత్రయం పూర్వపక్షే యోజ్యమ్.

బాలానందిని

ప్రాగేవేతి. ప్రథమోద్ద్యోతంలో అభావవాదనిరాకరణఘట్టంలో. అందువల్ల వ్యంజకం సిద్ధిస్తే వ్యంగ్యం సిద్ధిస్తుంది అనే మాట లేదు. అలా అయితే అన్యోన్యాశ్రయం శంకించడానికి అవకాశం ఉండేది. ఇతరహేతువులచేతనే వ్యంగ్యాన్ని సాధించడం

జరిగింది కదా అని భావం. ఆ విషయమే తత్సిద్ధీత్యాదికం చేత చెపుతున్నాడు. స త్వితి - రెండవ అర్థం కూడా ఉంటే ఉండనీ; దానికి వ్యంగ్యం అని పేరు పెట్టారు కదా? వాచ్యం అనే పేరు మాత్రం ఎందుకు పెట్టకూడదు? లేదా నువ్వు వాచ్యం అని దేనిని అంటున్నావో దానికి వ్యంగ్యం అని మాత్రం పేరు ఎందుకు పెట్టకూడదు? శబ్దార్థత్వం(ఒక శబ్దానికి అర్థం అవడం) అనగా ఏమిటి? ఆ శబ్దంవల్ల తెలియబడడమే కదా? శబ్దానికున్న వాచకత్వం అంటే అదే. అభిధ ఎంతవరకు ఉంటుందో(పనిచేస్తుందో) అంతవరకు ఆ శబ్దానికి అభిధాయకత్వం చెప్పాలి. ఏ అర్థం ప్రధానమైనదో అంతవరకు అభిధ పనిచేస్తుంది. అందుచేత ధ్వనియొక్క ఏ రూపం మూర్ధాభిషేకం చేసి చూపబడిందో అభిధావ్యాపారం దాని విషయంలోనే ఉంటుంది అనడం యుక్తం. ఆ విషయమే - యత్ర చేత్యాదికంచేత చెపుతున్నాడు. ఉపాయమాత్రం అని సాధారణంగా(అన్నింటికీ అన్వయించేటట్లు)అనడం చేత పూర్వపక్షం భాట్టమతప్రకారం, ప్రాభాకరమతం ప్రకాకం, వైయాకరణమతం ప్రకారం ఉందని సూచిస్తున్నాడు. భాట్టమతంలో-

"వాక్యార్థేతి -వాక్యార్థమితయే=వాక్యార్థజ్ఞానంకొరకు, తేషామ్=ఆ పదాలకు, పదార్థప్రతిపాదనమ్=పదార్థాలను ప్రతిపాదించడం, పాకే=వంటయందు, కాష్ఠానామ్=కట్టెలకు, జ్వాలేవ=జ్వాలవలె, నాన్తరీయకమ్ = తప్పనిసరి అయినది". అని శబ్దాలవల్ల తెలియబడిన పదార్థాలచేత, తాత్పర్యంచేత, ఏ అర్థం పైకి తీయబడుతుందో అదే వాక్యార్థం; అదే వాచ్యం. ప్రాభాకరమతంలో కూడ నిమిత్తియైన వాక్యార్థం విషయంలో వ్యాపారం(అభిధావ్యాపారం) దీర్ఘదీర్ఘంగా ఉంటుంది. పదార్థాలకు ఉన్న(వ్యాక్యార్థ) నిమిత్తత్వం సత్యం కాదు, అంతే విశేషం. ఇదంతా మాచేత ప్రథమోద్యోతంలోనే సవిస్తరంగా నిర్ణయించబడింది. అందుచేత మళ్లీ శ్రమపడకుండా కేవలం గ్రంథసమన్వయం మాత్రమే చేయబడుతున్నది. పూర్వపక్షంలో ఈ మూడు మతాలూ సమన్వయించుకోవాలి.

## ధ్వన్యాలోకం

అత్రోచ్యతే - యత్ర శబ్దః స్వార్థమభిదధానః అర్థాన్తరమవగమయతి తత్ర యత్తస్య స్వార్థాభిధాయిత్వం, యచ్చ తదర్థాన్తరావగమహేతుత్వం తయోరవిశేషో విశేషో వా? తావదవశేషః, యస్మాత్తౌ ద్వౌ వ్యాపారౌ భిన్నవిషయౌ భిన్నరూపౌ చ ప్రతీయేతే ఏవ.

తథా హి వాచకత్వలక్షణో వ్యాపారః శబ్దస్య స్వార్థవిషయః, గమకత్వలక్షణస్త్వర్థాన్తరవిషయః, న చ స్వపరవ్యవహారో వాచ్యవ్యఙ్గ్యయోరపహ్నోతుం శక్యః, ఏకస్య సంబన్ధిత్వేన ప్రతీతేః, అపరస్య సంబన్ధిసంబన్ధిత్వేన. వాచ్యో హ్యర్థః సాక్షాచ్ఛబ్దస్య సంబన్ధీ; తదితరస్తు అభిధేయసామర్థ్యాక్షిప్తః సంబన్ధిసంబన్ధీ. యది చ స్వసంబన్ధిత్వం సాక్షాత్తస్య స్యాత్తదా అర్థాన్తరత్వవ్యవహార ఏవ న స్యాత్. తస్మాద్విషయభేదస్తావత్తయోః వ్యాపారయోః సుప్రసిద్ధః. రూపభేదోఽపి ప్రసిద్ధ ఏవ. న హియైవ అభిధానశక్తిః సైవ అవగమన శక్తిః. అవాచకస్యాపి గీతశబ్దాదే రసాదిక్షనార్థావగమదర్శనాత్. అశబ్దస్యాపి చేష్టాదేః అర్థవిశేషప్రకాశనప్రసిద్ధేః. తథా హి - "వ్రీడా యోగాన్నతవదనయా"ఇత్యాదిశ్లోకే చేష్టావిశేషః సుకవినా అర్థప్రకాశన హేతుః ప్రదర్శిత ఏవ. తస్మాద్భిన్నవిషయత్వాత్, భిన్నరూపత్వాచ్చ స్వార్థాభిధాయిత్వమ్, అర్థాన్తరహేతుత్వం చ శబ్దయోః యత్తయోః స్పష్ట ఏవ భేదః. విశేషశ్చేన్న తర్హీదానీమవగమ్యమానస్య అభిధేయసామర్థ్యాక్షిప్తస్య అర్థాన్తరస్య వాచ్యత్వవ్యపదేశ్యతా. శబ్దవ్యాపారగోచరత్వం తు తస్య అస్మాభిః ఇష్యత ఏవ; తత్తు వ్యఙ్గ్యత్వేనైవ న వాచ్యత్వేన. ప్రసిద్ధాభిధానాన్తరసంబన్ధయోగ్యత్వేన చ తస్యార్థాన్తరస్య ప్రతీతేః శబ్దాన్తరేణ స్వార్థాభిధాయినా యద్విషయీకరణం తత్ర ప్రకాశనోక్తిరేవ ఉచితా.

బాలానందిని

అత్రేతి:- ఇక్కడ చెప్పబడుచున్నది - ఏ స్థలంలో ఒక శబ్దం తన అర్థాన్ని బోధిస్తూ మరొక అర్థాన్ని కూడా తెలుపుతుందో అక్కడ ఆ శబ్దాని కున్న స్వార్థాభిధాయకత్వానికి, అర్థాంతరాన్ని తెలపడంలో హేతువు అవడానికి విశేషం (భేదం) ఉందా లేదా? విశేషం

లేదనడానికి వీలులేదు. ఎందువల్ల ననగా ఆ రెండు వ్యాపారాలు వేరు వేరు విషయాలు కలవిగాను, వేరు వేరు రూపాలు కలవిగాను కనబడుతూనే ఉన్నాయి. ఎందువల్లననగా - శబ్దంలో ఉన్న వాచకత్వం అనే వ్యాపారం స్వార్థవిషయకమైనది. అనగా ఆ వ్యాపారంచేత ఆ శబ్దం స్వార్థాన్ని బోధిస్తుంది. గమకత్వం అనే వ్యాపారం అయితే మరొక అర్థం విషయంగా గలది. అనగా ఆ శబ్దం గమకత్వ (వ్యంజనా) వ్యాపారంచేత మరొక అర్థాన్ని బోధిస్తుంది. వాచ్యవ్యంగార్థాల కున్న స్వపరవ్యవహారం, అనగా వాచ్యార్థం శబ్దంయొక్క స్వార్థం అనీ, వ్యంగార్థం దానియొక్క పరార్థం (మరియొక అర్థం అనీ ఉన్న వ్యవహారం)కప్పిపుచ్చడానికి శక్యమైనది కాదు; ఎందుచేతననగా ఒకటి (వాచ్యార్థం) శబ్దంతో(ప్రత్యక్షంగా) సంబంధించినట్లు కనబడుతున్నది, రెండవది సంబంధించినదానితో సంబంధించినదిగా కనబడుతున్నది. ఎందువల్లననగా - వ్యాచ్యార్థం సాక్షాత్తు శబ్దంతో సంబంధించినది; వాచ్యార్థసామర్థ్యం చేత ఆక్షిప్తమైన , లాగబడిన, రెండవది; సంబంధించిన దానితో సంబంధించినది. రెండవది కూడా స్వసంబంధి (శబ్దసంబంధి) అయితే అప్పుడు అర్థాంతరం అని వ్యవహరించడమే కుదరదు. అందువల్ల ఆ వ్యాపారాల విషయభేదం సుప్రసిద్ధమే. వాటి రూపభేదం కూడా ప్రసిద్ధమే. ఏది అభిధానశక్తియో అదే అవగమనశక్తికాదు కదా? గీతాదిశబ్దం వాచకం (అర్థబోధకం) కాకపోయినా దానినుండి రసాదిరూపమైన అర్థంయొక్క అవగమనం కనబడుతున్నది; చేష్టాదికం శబ్దం కాకపోయినా దానివల్ల అర్థవిశేషంయొక్క ప్రకాశనం ప్రసిద్ధమైనదే. అందుచేతనే " ప్రీడాయోగాన్నతవదనయా" (శ్లో.79)అనే శ్లోకంలో చేష్టావిశేషం అర్థప్రకాశనంలో హేతువు అని సుకవిచేత చూపబడియే ఉన్నది. అందుచేత శబ్దంయొక్క విషయం వేరు; రూపం వేరు అవడం వల్ల, దానికి ఉన్న స్వార్థాభిధాయిత్వానికి అర్థాంతరావగమహేతుత్వానికీ భేదం స్పష్టమే. ఆ రెండింటికీ విశేషం లేదన్నట్లయితే అర్థసామర్థ్యంచేత ఆక్షిప్తమై ఇప్పుడు తెలియబడుతూన్న అర్థాంతరం కూడా వాచ్యమే అని చెప్పవలసి ఉంటుంది. ఆ రెండవ అర్థం శబ్దవ్యాపారానికి గోచరం అనే విషయం మాకూ అంగీకార్యమే; అయితే వ్యంగ్యంగా అది శబ్దవ్యాపారగోచరం కాని వాచ్యంగా కాదు. ప్రసిద్ధేతి - ఆ అర్థాంతరం ప్రసిద్ధమైన శబ్దాంతరంతో సంబంధానికి యోగ్యంగా ప్రతీయమానం అవుతూండడంవల్ల తన వాచ్యార్థాన్ని బోధించే మరొక శబ్దంచేత విషయంగా చేసుకొనబడుతున్నది, అవగమింపచేయబడుతూన్నదనగా, ఆ విషయంలో ప్రకాశనం (వ్యంజింపచేయడం) అనడమే యుక్తం.

లోచనం

అత్రేతి పూర్వపక్షే. ఉచ్యతే ఇతి - సిద్ధాన్తః వాచకత్వం గమకత్వం చేతి స్వరూపతో భేదః. స్వార్థే అర్థాన్తరే చేతి క్రమేణేతి విషయతో భేదః. నను తస్మాచ్చేద్గమ్యతేఽసావర్థః కథం తర్హి ఉచ్యతే అర్థాన్తరమితి? నోచేత్ స తస్య కశ్చిదితి కో విషయార్థః ఇత్యాశఙ్క్యాహ న చేతి. న సా దితి. ఏవకారో భిన్నక్రమః. నైవ సాదిత్యర్థః. యావతా న సాక్షాత్సంబన్ధిత్వం తేన యుక్త ఏవ అర్థాన్తరవ్యవహార ఇతి విషయభేద ఉక్తః. నను భిన్నేఽపి విషయే అక్షశబ్దాదేర్బహ్వర్థస్య ఏక ఏవ అభిధాలక్షణో వ్యాపారః ఇత్యాశఙ్క్య రూపభేదముపపాదయతి- క్రమభేదోఽపీతి. ప్రసిద్ధిమేవ దర్శయతి - న హీతి. విప్రతిపన్నం ప్రతి హేతుమాహ-అవాచకస్యాపీతి: యదేవ వాచకత్వం తదేవ గమకత్వం యది స్యాదవాచకస్య గమకత్వమపి న స్యాత్, గమకత్వే నైవ వాచకత్వమపి స్యాత్. న చైతదుభయమపి గీతశబ్దే, శబ్దవ్యతిరిక్తే చాధోవక్త్రత్వ కుచకమ్పబాష్పావేశాదౌ; తస్య అవాచకస్యాపి అవగమకారిత్వదర్శనాత్, అవగమకారిణోఽప్యవాచకత్వేన ప్రసిద్ధత్వాదితి తాత్పర్యమ్. ఏతదుపసంహరతి - **తస్మాద్భిన్నేతి.** వాచ్యత్వం హ్యభిధావ్యాపారవిషయతా, న తు వ్యాపారమాత్రవిషయతా. తథాత్వే తు సిద్ధసాధన మిత్యేతదాహ - శబ్దవ్యాపారేతి.

బాలానందిని

అత్రేతి - ఈ పూర్వపక్షం విషయంలో, ఉచ్యతే ఇతి. సిద్ధాంతం చెప్పబడుతుంది అని అర్థం. వాచకత్వం అనీ గమకత్వం అనీ(ఆ వ్యాపారాలకు) స్వరూపతః భేదం ఉంది. క్రమంగా మొదటిది స్వార్థంబోధించడంలోను, రెండవది మరొక అర్థాన్ని బోధించడంలోను - అని విషయాన్ని పట్టి భేదం. నన్వితి(ఆశంక) ఆ అర్థం ఆ శబ్దం వల్లనే గమ్యం అవుతే దానిని అర్థాంతరం ఎలా అంటారు? అలా కాకపోతే (దానిచేత గమ్యం కాకపోతే) దానికి ఇదేమీ అవదు. అలాంటప్పుడు(దాని వ్యాపారానికి)విషయం అనే మాటకి అర్థం ఏమిటి అని ఆశంకించుకొని చెపుతున్నాడు - న చేతి. న స్యాదితి. 'ఏవ'కారం భిన్నక్రమం "నైవ స్యాత్"(కానే కాదు) అని అర్థం. "అర్థాన్తరవ్యవహార ఏవ లోని ఏవ ను'న'తో చేర్చాలి" అని అర్థం. (అర్థాంతరానికి శబ్దంతో) సాక్షాత్సంబంధిత్వంలేదు గాన అర్థాంతరం

అని వ్యవహరించడం యుక్తమే అని విషయభేదం చెప్పబడింది. నన్వితి. విషయం భిన్నమైనా కూడా అనేకార్థాలైన 'అక్ష' మొదలేన శబ్దాలకి అభిధారూపవ్యాపారం ఒకటే కదా అని ఆశంకించి రూపభేదాన్ని ఉపపాదిస్తున్నాడు రూపభేదోఽపీతి. ప్రసిద్ధినే చూపుతున్నాడు - న హీతి. విప్రతిపన్నుణ్ణి(ఈవిషయం అంగీకరించనివానినిగూర్చి) హేతువు చెపుతునాడు - అవాచకస్యాపీతి. వాచకత్వమే గమకత్వం అని అన్నట్లయితే అప్పుడు వాచకం కానిది గమకం అవడానికి వీలుండదు. గమకత్వం ఉంటే వాచకత్వం ఉండకూడదు. (వాచకంకాని) గీతశబ్దంలోను, శబ్దవ్యతిరిక్తమైన అధోముఖత్వ - కుచకంపన - బాష్పావేశాదికంలోను ఈ ఉభయం కూడ లేదు. గీతశబ్దం వాచకం కాకపోయినా రసాద్యవగమం చేస్తూన్నది. (అధోముఖత్వాదిచేష్ట) అవగమం చేస్తూన్నా అది వాచకం కాదనే విషయం ప్రసిద్ధం అని తాత్పర్యం. తస్మాద్ధ్వన్నేత్యాదికంచేత దీనిని ఉపసంహరిస్తున్నాడు. న తర్హీతి. వాచ్యత్వం అనగా అభిధావ్యాపారానికి గోచరం అవడం; అంతేనే కాని ఏదో ఒక వ్యాపారానికి విషయం అవడం కాదు. అలా అయితే సిద్ధసాధనతాదోషం(మేం అంగీకరించిన దానినే ఏదో కొత్త విషయం అన్నట్లు సాధించడం) అనే దోషం వస్తుంది అని శబ్దవ్యాపారేత్యాదికంచేత చెపుతున్నాడు.

లోచనం

నను గీతాదౌ మా భూద్వాచకత్వమ్. ఇహ త్వర్థాన్తరేఽపి శబ్దస్య వాచకత్వమేవోచ్యతే; కిం హి తద్వాచకత్వం సంకోచ్యతే ఇత్యాశఙ్క్యాహ- ప్రసిద్ధేతి. శబ్దాన్తరేణ తస్యార్థాన్తరస్య యద్విషయీకరణం తత్ర ప్రకాశనోక్తిరేవ యుక్తా న వాచకత్వోక్తిః శబ్దస్య; నాపి వాచ్యత్వోక్తి రర్థస్య తత్ర యుక్తా. వాచకత్వం హి సమయవశాదవ్యవధానేన ప్రతిపాదకత్వమ్; యథా తస్యైవ శబ్దస్య స్వార్థే. తదాహ - స్వార్థాభిధాయినేతి. వాచ్యత్వం హి సమయబలేన నిర్వ్యవధానం ప్రతిపాద్యత్వం; యథా తస్యైవార్థస్య శబ్దాన్తరం ప్రతి. తదాహ ప్రసిద్ధేతి. ప్రసిద్ధేన వాచకతయా అభిధానాన్తరేణ యః సంబన్ధః వాచ్యత్వం తదేవ, తత్ర వా యత్ యోగ్యత్వం తేనోపలక్షితస్య. న చైవంవిధం వాచకత్వమర్థం ప్రతి శబ్దస్యేహాస్తి. నాపి తం శబ్దం ప్రతి తస్యార్థస్య ఉక్తరూపం వాచ్యత్వమ్. యది నాస్తి తర్హి కథం తస్య విషయీకరణముక్తమిత్యాశఙ్క్యాహ- ప్రతీతేరితి. అథ చ ప్రతీయతే సోఽర్థః, న చ వాచ్యవాచకత్వవ్యాపారేణేతి

విలక్షన ఏవాసౌ వ్యాపార ఇతి యావత్.

బాలానందిని

నన్వితి:- గీతాదులలో వాచకత్వం లేకపోతే లేకపోనీ ఇక్కడైతే, అర్థాంతరం విషయంలో కూడ శబ్దానికి వాచకత్వమే చెప్పబడుతుంది. దాని వాచకత్వాన్ని ఎందుకు సంకుచితం చెయ్యాలి అని ఆశంకించుకొని చెపుతున్నాడు - ప్రసిద్ధేతి. శబ్దాంతరం '(గఙ్గాయాం ఘోషః'ఇత్యాదులలో ''గఙ్గా' శబ్దం)ఆ అర్థాంతరాన్ని (శైత్యపావనత్వాద్యర్థాన్ని) విషయంగా చేసుకోవడాన్ని ప్రకాశనం అని చెప్పడమే యుక్తం, అంతేనే కాని శబ్దాన్ని వాచకం అని, అర్థాన్ని వాచ్యం అనీ అనడం యుక్తం కాదు. సంకేతాన్ని పట్టి, ఒక శబ్దం ఒక అర్థాన్ని వ్యవధానం లేకుండా(సాక్షాత్తుగా) ప్రతిపాదించడం వాచకత్వం- ఆ శబ్దమే (గఙ్గాశబ్దమే ప్రవాహరూపమైన) స్వార్థాన్ని బోధించి నట్లు. ఆ విషయమే స్వార్థాభిధాయినా ఇత్యాదికం చేత చేపుతున్నాడు. వాచ్యత్వమితి - వాచ్యత్వం అనగా సంకేత బలంచేత వ్యవధానం లేకుండా బోధించబడడం. అదే అర్థం (శీతత్వపావనత్వాది రూపార్థం) శబ్దాంతరానికి (శీతపావనశబ్దాలకి) వాచ్యం అయినట్లు. ఆ విషయమే ప్రసిద్ధేత్యాదికంచేత చేపుతున్నాడు. ప్రసిద్ధేన = వాచకంగా ప్రసిద్ధమైన మరొక శబ్దంతో, ఏ, సంబన్ధః=వాచ్యత్వరూపసంబంధం గలదో, అదే లేదా దానియందు ఏ యోగ్యత్వం ఉన్నదో దానితో కూడిన . న చేతి:-ఇక్కడ శబ్దానికి అర్థం విషయంలో ఈ విధమైన వాచకత్వం లేదు; ఆ శబ్దం విషయంలో ఆ అర్థానికి పైన చెప్పిన వాచ్యత్వం వంటి వాచ్యత్వమూ లేదు. యదీతి. లేకపోతే దానికి (శబ్దానికి) విషయీకరణం ఎలా చెప్పబడింది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - ప్రతీతేరితి. అయినా కూడ (శబ్దవాచ్యం కాకపోయినా కూడ) అర్థం ప్రతీయమానం అవుతున్నది; అయితే వాచ్యవాచక వ్యాపారంచేత తెలియబడడంలేదు. అందుచేత ఈవ్యాపారం విలక్షణమైనది అని భావం.

వివరణ: ప్రపసిద్ధేత్యాదివృత్తిగతవాక్యం భావం మామూలు మాటలో చెప్పాలంటే ఇది - "గఙ్గాయాం ఘోషః" ఇత్యాదులలోని గంగాదిశబ్దాలకి వాటి ప్రవాహాది వాచ్యార్థాలు ఉండనే ఉన్నాయి. అయినా ఆ పదాలు తమ వాచ్యార్థాలతో పాటు శీతలత్వా ద్యర్థాంతరాలను కూడా బోధిస్తున్నాయి. ఈ అర్థాలని కూడా వాచ్యాలే అనాలా మరొక పేరు ఏదైనా పెట్టాలా అనేది ప్రశ్న. శీతత్వాద్యర్థాలను సాక్షాత్తుగా బోధించే పదాలు 'శీత' ఇత్యాదులు ఉన్నాయి. ఆ పదాలకి ఆ అర్థాలు వాచ్యాలే. ఆ పదాలకి వాచ్యాలైన

శీతత్వాద్యర్థాలను గంగాదిపదాలు తెలుపుతున్నాయంటే ఈ అర్థాలు గంగాదిపదాలకి కూడా వాచ్యాలవడం కుదరదు. అందుచేత ఈ అర్థాలు ఈ పదాలచేత ప్రకాశింపచేయబడుతున్నాయి, వ్యంజింపచేయబడుతున్నాయి. అని మాత్రమే అనాలి. దీన్ని పట్టి వాచకత్వం వేరు వ్యంజకత్వం వేరు అనీ, వాచ్యత్వం వేరు వ్యంగ్యత్వం వేరు అనీ చెప్పక తప్పదు.

## ధ్వన్యాలోకం

న చ పదార్థవాక్యార్థన్యాయో వాచ్యవ్యఙ్గ్యయోః. యతః పదార్థప్రతీతిః అసత్యైవేతి కైశ్చిద్విద్వద్భిరాస్థితమ్. యైరప్యసత్యత్వమస్యా నాభ్యుపేయతే తైర్వాక్యార్థపదార్థయోః ఘటతదుపాదానకారణన్యాయః అభ్యుపగన్తవ్యః. యథా హి ఘటే నిష్పన్నే తదుపాదానకారణానాం న పృథగుపలమ్భః తథైవ వాక్యే తదర్థే వా ప్రతీతే పదతదర్థానామ్. తేషాం తదా విభక్తతయోపలమ్భే వాక్యార్థబుద్ధిరేవ దూరీభవేత్. న త్వేష వాచ్యవ్యఙ్గ్యయోర్న్యాయః, న హి వ్యఙ్గ్యే ప్రతీయమానే వాచ్యబుద్ధిర్దూరీభవతి, వాచ్యావభాసావినాభావేన తస్య ప్రకాశనాత్. తస్మాద్ఘటప్రదీపన్యాయస్తయోః. యథైవ హి ప్రదీపద్వారేణ ఘటప్రతీతావుత్పన్నాయాం న ప్రదీపప్రకాశో నివర్తతే తద్వ ద్వ్యఙ్గ్యప్రతీతౌ వాచ్యావభాసః. యత్తు ప్రథమోద్ద్యోతే ''యథా పదార్థద్వారేణ'' ఇత్యాద్యుక్తం తదుపాయమాత్రత్వాత్ సామ్యవివక్షయా.

### బాలానందిని

న చేతి - వాచ్యవ్యంగ్యాల విషయంలో పదార్థవాక్యార్థన్యాయం యుక్తం కాదు. ఎందువల్ల ననగా పదార్థజ్ఞానం అసత్యమే అని కొందరు పండితులు గట్టిగా చెప్పారు. పదార్థప్రతీతి అసత్యం అని అంగీకరించని వాళ్లు కూడా వాక్యార్థపదార్థాలవిషయంలో ఘటతదుపాదానన్యాయం అంగీకరించాలి. ఘటం తయారైన తరవాత దాని ఉపాదానకారణాలు వేరుగా ఏ విధంగా గ్రహించబడవో అదే విధంగా వాక్యం కాని,

దాని అర్థం కాని తెలిసిన తరవాత పదాలు, వాటి అర్థాలు వేరుగా గ్రహించబడవు. అప్పుడు కూడ పదపదార్థాలు వేరుగా కనబడే పక్షంలో వాక్యార్థబుద్ధియే దూరం అయిపోతుంది. కాని వాచ్యవ్యంగ్యాల విషయంలో ఈ పద్ధతి లేదు. వ్యంగ్యం ప్రతీయమానం అవుతున్నప్పుడు వాచ్యబుద్ధి దూరం కాదు కదా? ఎందువల్ల ననగా- అది (వ్యంగ్యం) వాచ్యార్థభావంతో అవినాభూతంగా (విడదీయరానిదిగా) ప్రకాశిస్తుంది. అందువల్ల వీటి విషయంలో ఘటప్రదీప న్యాయం ప్రవర్తిస్తుంది. దీపసాహాయ్యంచేత ఘటజ్ఞానం కలిగిన తరవాత కూడా దీపప్రకాశం ఏ విధంగా నివర్తించదో అట్లే వ్యంగ్యప్రతీతి కలిగిన తరవాత కూడ వాచ్యజ్ఞానం నివర్తించదు. ప్రథమోద్ద్యోతంలో "యథాపదార్థద్వారేణ" (కా - 1-10) ఇత్యాదికం ఉపాయ మాత్రత్వంచేత ఉన్న సామ్యాన్ని చూపడం కోసం మాత్రమే చెప్పబడింది.

లోచనం

నన్వేవం మా భూద్వాచకశక్తిః, తథాపి తాత్పర్యశక్తి ర్భవిష్యతీత్యాశఙ్క్యాహ - న చేతి. కైశ్చిదితి వైయాకరణైః. యైరపీతి భాట్టప్రభృతిభిః. తమేవ న్యాయం వ్యాచష్టే - యథా హీతి. **తదుపాదానకారణానామితి** - సమవాయికారణాని కపాలాని అనయోక్త్యా నిరూపితాని. సౌగతకాపిలమతే తు యద్యప్యుపాదాతవ్యఘటకాలే ఉపాదానానాం న సత్తా, ఏకత్ర క్షణక్షయిత్వేన, పరత్ర తిరోభూతత్వేన, తథాపి పృథక్తయా నాస్త్యుపలమ్భ ఇతీయత్యంశే దృష్టాన్తః. దూరీభవేదితి. అర్థైకత్వస్యాభావాదితి భావః ఏవం పదార్థవాక్యార్థన్యాయం తాత్పర్యశక్తి సాధకం ప్రకృతే విషయే నిరాకృత్య అభిమతాం ప్రకాశశక్తిం సాధయితుం తదుచితం ప్రదీపఘటన్యాయం ప్రకృతే యోజయన్నాహ - తస్మాదితి. యతోऽసౌ పదార్థవాక్యార్థన్యాయోః నేహ యుక్తః తస్యాత్ ప్రకృతం న్యాయం వ్యాకరణపూర్వకం దార్ష్టాన్తికే యోజయతి - యథైవ హీతి. నను పూర్వముక్తమ్-

యథా పదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే,
వాక్యార్థపూర్వికా తద్వత్ ప్రతిపత్తస్య వస్తునః.

ఇతి తత్కథం స ఏవ న్యాయః ఇహ యత్నేన నిరాకృతః ఇత్యాశఙ్క్యాహ యత్త్వితి. తదితి. న తు సర్వథా సామ్యేనేత్యర్థః.

బాలానందిని

నన్వితి:- ఈ విధంగా వాచకశక్తి కుదరకపోతే కుదరకపోవచ్చు, తాత్పర్యశక్తి, ఉండవచ్చు కదా అని ఆశంకించి, న చేత్యాదికం చెపుతున్నాడు. కైశ్చిదితి - వైయాకరణులచేత. యైరపీతి. భాట్టాదులచేత. ఆ న్యాయాన్నే వివరిస్తున్నాడు- యథాహీతి. తదుపాదానకారణానామితి. ఈ మాటచేత సమవాయికారణాత్మైన కపాలాదులు చెప్పబడ్డాయి.

వివరణ : నైయాయికులు సమవాయికారణం అని దేన్ని అంటారో దానినే వేదాంతులు మొదలైన వాళ్లు ఉపాదానకారణం అంటారు. కుండకి మట్టి సమవాయికారణం, అదే ఉపాదానకారణం. అయితే కుండ తయారయిన తరవాత మట్టి కనపడదు అనడానికి వీలులేదు. అందుచేత వ్యాఖ్యాత నైయాయికులు చెప్పిన సమవాయికారణం గ్రహించాడు. నైయాయికులు మట్టితో పాటు కపాలాదుల్ని కూడా సమవాయికారణం అంటారు. రెండు మూడు భాగాలు మట్టితో చేసి వాటిని అతికి కుండ తయారుచేస్తారు. ఆ భాగాలకి కపాలాలని పేరు. అవి కుండకి సమవాయికారణం. కుండ తయారైన తరవాత ఆ కపాలాలు వేరుగా కనబడనట్లు అని అభిప్రాయం. ఉపాదానం మట్టి మొదలైన వైతే వాటి కార్యమైన ఘటాదులు ఉపాదాతవ్యాలు, తయారుచేసి గ్రహించదగినవి అని అర్థం.

సౌగతేతి. బౌద్ధ - సాంఖ్యుల మతంలో ఉపాదాతవ్యమైన ఘటం తయారైన కాలంలో ఉపాదానాలు ఉండవు. ఎందుచేత ననగా బౌద్ధమతం ప్రకారం సర్వం క్షణికమే గాన ఉపాదానకారణం కుండ తయారైన తరవాత కూడా ఉండే ప్రసక్తియే లేదు. సాంఖ్యమతం ప్రకారం కార్యం పుట్టిన తరవాత కారణం తిరోహితం అయిపోతుంది; కనబడదు. అందుచేత ఈ రెండు మతాలప్రకారం ఘటజ్ఞానకాలంలో దాని ఉపాదానం ఉండే ప్రసక్తియే లేకపోయినా వేరుగా కారణం కనబడకపోవడం అనే విషయంలో మాత్రమే ఇది దృష్టాంతంగా చూపబడింది.దూరీభవేదితి:- అద్వైకత్వం ఉండకపోవడం వల్ల అని భావం. ఏవమితి :- ఈ విధంగా తాత్పర్యశక్తిని సాధించే పదార్థవాక్యార్థన్యాయం ప్రకృతవిషయంలో (వాచ్యవ్యంగ్యార్థాల విషయంలో) కుదరదని చెప్పి తనకు

అంగీకార్యమైన ప్రకాశశక్తిని సాధించడంకొరకు దానికి తగిన ప్రదీపఘటన్యాయాన్ని సమన్వయిస్తూ చెపుతున్నాడు - తస్మాదితి. ఇక్కడ ఏ కారణంవల్ల పదార్థవాక్యార్థన్యాయం యుక్తం కాదో అందువల్ల ప్రకృతమైన న్యాయాన్ని (ఘటప్రదీపన్యాయాన్ని) విశదీకరిస్తూ దార్ష్టాంతికంలో పదార్థవాక్యార్థన్యాయం చెప్పబడింది కదా; ఆ న్యాయమే ఇక్కడ ప్రయత్నపూర్వకంగా ఎందుకు నిరాకరించబడుతున్నది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - యత్త్వితి. తదితి:- పూర్తిగా సామ్యం ఉండడంచేత అలా చెప్పలేదు అని అర్థం.

## ధ్వన్యాలోకం

నన్వేవం యుగపదర్థద్వయయోగిత్వం వాక్యస్య ప్రాప్తమ్, తద్భావే చ తస్య వాక్యతైవ విఘటతే, తస్యా ఐకార్థ్యలక్షణత్వాత్, నైష దోషః; గుణప్రధానభావేన తయోః వ్యవస్థానాత్. వ్యఙ్గ్యస్య హి క్వచిత్ ప్రాధాన్యం వాచ్యస్య ఉపసర్జనభావః; క్వచిద్వాచ్యస్య ప్రాధాన్యమపరస్య గుణభావః. తత్ర హి వ్యఙ్గ్యప్రాధాన్యే ధ్వనిరిత్యుక్తమేవ. వాచ్యప్రాధాన్యే తు ప్రకారాన్తరం నిర్దేక్ష్యతే, తస్మాత్ స్థితమేతత్ - వ్యఙ్గ్యపరత్వేఽపి కావ్యస్య న వ్యఙ్గ్యస్యాభిధేయత్వమ్, అపి తు వ్యఙ్గ్యత్వమేవ.

### బాలానందిని

నన్వితి:- ఇలా చెప్పినట్లయితే ఒక వాక్యానికి ఒకే సమయంలో రెండు అర్థాలతో సంబంధం ఉందని చెప్పినట్లవుతుంది. అలా రెండర్థాలు ఉంటే అది 'వాక్యం' అనడమే కుదరదు. ఒక అర్థం ఉండడం అనేది వాక్యానికి లక్షణం కదా? ఈ దోషం లేదు; ఎందుచేత ననగా వాటిలో ఒకటి అప్రధానంగాను, మరొకటి ప్రధానంగాను ఉంటాయి. కొన్నిచోట్ల వ్యంగ్యానికి ప్రాధాన్యం ఉంటుంది, వాచ్యానికి అప్రాధాన్యం ఉంటుంది. కొన్ని చోట్ల వ్యంగ్యానికి ప్రాధాన్యం ఉంటుంది. రెండవ దానిని అప్రాధాన్యం ఉంటుంది. వ్యంగ్యం ప్రధానంగా ఉంటే అది (ఆ కావ్యం) ధ్వని అని చెప్పబడే ఉంది. వాచ్యానికి ప్రాధాన్యం ఉంటే మరొక ప్రకారం నిర్దేశించబడుతుంది. అందువల్ల - కావ్యం వ్యంగ్యపరమైనా కూడ వ్యంగ్యార్థం అభిధేయం కాదు అనే విషయం నిశ్చితమైనది.

లోచనం

ఏవమితి:- ప్రదీపఘటవత్ యుగపదుభయావభాసప్రకారేణేత్యర్థః. తస్యా ఇతి వాక్యతాయాః. ఐకార్థ్యలక్షణమ్, అర్థైకత్వాద్ధి వాక్యమేకమిత్యుక్తమ్. సకృత్ శ్రుతో హి శబ్దః యత్రైవ సమయస్మృతిం కరోతి స చేదనేనైవావగమితః తద్విరమ్యవ్యాపారాభావాత్ నమయన్మరణానాం బహూనాం యుగపదయోగాత్ క్వోఽర్థభేదస్య అవసరః? పునః శ్రుతస్తు స్మృతో వాపి నాసావితి భావః. తయోరితి. వాచ్యవ్యఙ్గ్యయోః. తత్రేతి ఉభయోః ప్రకారయోర్మధ్యాత్ యదా ప్రథమః ప్రకారః ఇత్యర్థః. ప్రకారాన్తరమితి - గుణీభూతవ్యఙ్గ్యసంజ్ఞితమ్. వ్యఙ్గ్యత్వమేవేతి - ప్రకాశ్యత్వమేవేత్యర్థః.

బాలానందిని

ఏవమితి - దీపమూ ఘటమూ ఒకే సమయంలో భాసించినట్లు భాసిస్తే అని అర్థం. తస్యాః అనగా వాక్యత్వంయొక్క. ఐకార్థ్యం అనే లక్షణం. బోధించబడే అర్థం ఒకటి అయినప్పుడు అలా బోధించేది ఒక వాక్యం అని (అర్థైకత్వాదేకం వాక్యం సాకాఙ్క్షం చేద్విభాగే స్యాత్". (జైమినిసూత్రం 2-1-46) చెప్పబడింది కదా. ఒకమాటు విన్న శబ్దం ఏ అర్థానికి సంబంధించిన సంకేతాన్ని స్మరింపచేస్తుందో ఆ అర్థం ఆ శబ్దంచేత బోధించబడిన తరవాత, విరమ్యవ్యాపారం లేకపోవడంవల్ల, అనేక సంకేతస్మృతులు ఒకే సమయంలో కలగకపోవడంవల్ల, అర్థభేదానికి అవకాశం ఎక్కడుంటుంది? మళ్ళీ ఆ శబ్దాన్ని విన్నా, స్మరించినా అది అది కాదు అని భావం.

వివరణ: ఒక శబ్దాన్ని ఒక మారు విన్నప్పుడు దానికి ఒక అర్థంలో ఉన్న సంకేతం స్మరించబడుతుంది. ఆ అర్థం తెలుస్తుంది. ఆ శబ్దానికి ఉన్న అభిధాశక్తి కొంతసేపు ఆగి మళ్ళీ పనిచేయడం ప్రారంభించడం అనేది ఉండదు. ఆ శబ్దానికి అనేకార్థాల విషయంలో సంకేతాలున్నా వాటి స్మృతు లన్నీ ఒక్క సమయంలో కలగవు. ఆ శబ్దాన్నే మళ్ళీ ఉచ్చరించినా స్మృతి కలిగినా అది ఆ శబ్దం కాదు, అది దాని స్మృతి కాదు. అది వేరే శబ్దం, అది వేరే స్మృతి. అందుచేత ఒక వాక్యానికి రెండు అర్థాలు ఉండడానికి వీలులేదు అని అభిప్రాయం.

తయోరితి. వాచ్యవ్యంగ్యాలయొక్క. తత్రేతి. ఆ రెండు ప్రకారాల మధ్యనుండి మొదటిప్రకారం ఎప్పుడుంటుందో అప్పుడు అని అర్థం. ప్రకారాన్తరమితి.

గుణీభూతవ్యంగ్యం అనే పేరు గల మరొక ప్రకారం. వ్యఙ్గ్యత్వమేవేతి. ప్రకాశ్యత్వమే అని అర్థం.

## ధ్వన్యాలోకం

కించ వ్యఙ్గ్యస్య ప్రాధాన్యేనావివక్షాయాం వాచ్యత్వం తావద్భవద్భిర్నాభ్యుపగన్తవ్యమ్, అతత్పరత్వాచ్ఛబ్దస్య. తదస్తి తావద్వ్యఙ్గ్యః శబ్దానాం కశ్చిద్విషయ ఇతి. యత్రాపి తస్య ప్రాధాన్యం తత్రాపి కిమితి తస్య స్వరూపమపహ్నూయతే? ఏవం తావద్వాచకత్వాదన్యదేవ వ్యఞ్జకత్వమ్; ఇతశ్చ వాచకత్వాద్వ్యఞ్జకత్వస్య అన్యత్వం యద్వాచకత్వం శబ్దైకాశ్రయమ్, ఇతరత్తు శబ్దాశ్రయమర్థాశ్రయం చ. శబ్దార్థయోర్ద్వయోరపి వ్యఞ్జకత్వస్య ప్రతిపాదితత్వాత్.

## బాలానందిని

కించేతి- మరొక విషయం ఏమనగా - వ్యంగ్యం ప్రధానంగా వివక్షితం కానప్పుడు శబ్దం తత్పరం కాదు గాన, అనగా వాక్యంయొక్క తాత్పర్యం వ్యంగ్యాన్ని బోధించడానికి కాదు గాన, మీరు దానిని వాచ్యం అనడానికి వీలులేదు అంటున్నారు. అందువల్ల శబ్దాలకు విషయమైన వ్యంగ్యం అనేది ఒకటి ఉంది అని మీరూ అంగీకరించినట్లయింది. దానికి ప్రాధాన్యం ఉన్నచోట కూడ దాని స్వరూపం ఎందుకు కప్పివేయబడుతుంది, అనగా ఆ వ్యంగ్యం ఉన్నట్లు మీరు ఎందుకు అంగీకరించడంలేదు? (అది వాచ్యమే అని ఎందుకు అంటారు?) ఈ విధంగా వ్యంజకత్వం అనేది వాచకత్వం కంటె భిన్నమే. ఈ కారణంవల్ల కూడ వ్యంజకత్వం వాచకత్వంకంటె భిన్నమైనది. అది ఏమనగా - వాచకత్వం అనేది కేవలం శబ్దంలో మాత్రమే ఉంటుంది. రెండవదైతే (వ్యంజకత్వం అయితే) శబ్దంలోను అర్థంలోనూ కూడా ఉంటుంది. శబ్దార్థములు రెండూ వ్యంజకాలని ప్రతిపాదించి ఉన్నాం కదా?

## లోచనం

నను "యత్పరః శబ్దః స శబ్దార్థః" ఇతి వ్యఙ్గ్యస్య ప్రాధాన్యే వాచ్యత్వమేవ న్యాయ్యమ్. తర్హి అప్రాధాన్యే కిం యుక్తం వ్యఙ్గ్యత్వమ్ ఇతి చేత్, సిద్ధో నః పక్షః, ఏతదాహ -కించేతి. నను ప్రాధాన్యే మా భూద్వ్యఙ్గ్యత్వ మిత్యాశఙ్క్యాహ

- యత్రాపీతి. అర్థాన్తరత్వం సంబన్ధిసంబన్ధిత్వమనుపయుక్త సమయత్వమితి వ్యఙ్గ్యతాయాం నిబన్ధనం, తచ్చ ప్రాధాన్యేఽపి విద్యత ఇతి స్వరూపమహేయ మేవేతి భావః. ఏతదుపసంహరతి - ఏవమితి. విషయభేదేన స్వరూపభేదేన చేత్యర్థః. తావదితి వక్తవ్యాన్తరమాసూత్రయతి. తదేవాహ - ఇతశ్చేతి. అనేన సామగ్రీభేదాత్ కారణభేదోఽప్యస్తీతి దర్శయతి. ఏతచ్చ వితత్య ధ్వనిలక్షణే - "యత్రార్థః శబ్దో వా" ఇతి 'వా' గ్రహణం, 'వ్యఙ్క్తః' ఇతి ద్వివ్వచనం వ్యాచక్షాణైరస్మాభిః ప్రథమోద్ద్యోత ఏవ దర్శిత మితి పునర్న విస్తార్యతే.

బాలానందిని

నన్వితి (ఆశంక) "శబ్దం ఏ అర్థం బోధించడం కోసం ప్రయోగించబడుతుందో అదే ఆ శబ్దానికి అర్థం" అనే న్యాయం ప్రకారం వ్యంగ్యం ప్రధానం అయితే (ఆ వాక్యాన్ని ఆ అర్థం బోధించడానికే ప్రయోగించడం జరిగింది గాన) అదే వాచ్యార్థం అనడం న్యాయసంమతం. (సమాధానం) అయితే అప్రధానం అయితే అది వ్యంగ్యం అని చెప్పడం యుక్తమే అని కదా అర్థం? అప్పుడు మా పక్షం సిద్ధించినట్లే (వాచ్యం కంటె భిన్నంగా వ్యంగ్యం అనేది ఉంది అని కదా మేం చెప్పేది. ఎక్కడో అక్కడ వ్యంగ్యం ఉన్నట్లు నువ్వు అంగీకరించావంటే మా పక్షం గెలిచినట్లే అని భావం) ఈ విషయమే కించేత్యాదికంచేత చెపుతున్నాడు. నన్వితి. ప్రాధాన్యం ఉన్నట్లైతే వ్యంగ్యత్వం ఉండదు అని ఆశంకించుకొని చెపుతున్నాడు - యత్రాపీతి. ఒక అర్థం వ్యంగ్యం అనడానికి అది మరొక అర్థం. (వాచ్యభిన్నమైన అర్థం) అయి ఉండడం, శబ్దంతో ప్రత్యక్షంగా సంబంధించిన అర్థంతో సంబంధించి ఉండడం, సంకేతంతో పని లేకపోవడం అనేవి కారణాలు. ఇవన్నీ ప్రధానవ్యంగ్యంలో కూడ ఉండనే ఉన్నాయి. అందుచేత వ్యంగ్యస్వరూపం కాదనడానికి వీలు లేదు అని భావం. ఈ విషయాన్ని ఉపసంహరిస్తున్నాడు - ఏవమితి. విషయభేదంచేత స్వరూపభేదంచేతా కూడా అని అర్థం. 'తావత్' అనే పదంచేత ఇంకా చెప్పవలసిన మరొక విషయం ఉన్నదని సూచిస్తున్నాడు. ఈ విషయం అంతా ధ్వనిలక్షణంలో "యత్రార్థః శబ్దో వా" అని 'వా' శబ్దగ్రహణాన్నీ, "వ్యఙ్క్తః" అని ద్వివచనాన్నీ వ్యాఖ్యానిస్తూ మాచేత ప్రథమోద్ద్యోతంలోనే సవిస్తరంగా చూపబడింది గాన మళ్లీ విస్తరించబడడం లేదు.

## ధ్వన్యాలోకం

గుణవృత్తిస్తు ఉపచారేణ లక్షణయా చ ఉభయాశ్రయాపి భవతి - కింతు తతోఽపి వ్యఞ్జకత్వం స్వరూపతః విషయతశ్చ భిద్యతే. రూపభేదస్తావదయమ్ - యదముఖ్యతయా వ్యాపారః గుణవృత్తిః ప్రసిద్ధా. వ్యఞ్జకత్వం తు ముఖ్యతయైవ శబ్దస్య వ్యాపారః. న హ్యర్థాత్ వ్యఙ్గ్యత్రయప్రతీతిః యా తస్యా అముఖ్యత్వం మనాగపి లక్ష్యతే.

### బాలానందిని

గుణవృత్తి అయితే ఉపచారంచేత, లక్షణచేతా కూడా ఏర్పడి శబ్దార్థాలను రెండింటిని ఆశ్రయించి కూడ ఉంటుంది. కాని వ్యంజకత్వం స్వరూపాన్ని పట్టి, విషయాన్నీ పట్టీ కూడ ఆ గుణవృత్తికంటె కూడ భిన్నంగా ఉంటుంది. స్వరూపం భేదం అయితే ఇది - గుణవృత్తి అముఖ్యమైన వ్యాపారంగా ప్రసిద్ధమైనది. వ్యంజకత్వం అయితే శబ్దంయొక్క ముఖ్యంగా ఉండే వ్యాపారమే. అర్థంవల్ల ఏ మూడు వ్యంగ్యాల ప్రతీతి కలుగుతున్నదో అది ముఖ్యం కాదని కొంచెం కూడ గుర్తించబడడం లేదు. (అముఖ్యంగా కనబడడంలేదు కదా).

### లోచనం

ఏవం విషయభేదాత్, స్వరూపభేదాత్, కారణభేదాచ్చ వాచకత్వాన్ముఖ్యాత్ ప్రకాశకత్వస్య భేదం ప్రతిపాద్య ఉభయాశ్రయత్వావిశేషాత్తర్హి వ్యఞ్జకత్వగౌణత్వయోః కో భేద ఇత్యాశఙ్క్య అముఖ్యాదపి ప్రతిపాదయితుమాహ - గుణవృత్తిరితి ఉభయాశ్రయాపీతి. శబ్దార్థాశ్రయా. ఉపచారలక్షణయోః ప్రథమోద్యోత ఏవ విభజ్య నిర్ణీతం స్వరూపమితి న పునర్లిఖ్యతే. ముఖ్యతయైవేతి. అస్ఖలితగతిత్వేనేత్యర్థః. వ్యఙ్గ్యత్రయమితి వస్త్వలఙ్కారరసాత్మకమ్.

### బాలానందిని

ఏవమితి. ఈ విధంగా విషయభేదంవల్ల, స్వరూపభేదంవల్ల, కారణభేదం వల్ల కూడ ముఖ్యమైన వాచకత్వంకంటె ప్రకాశకత్వానికి ఉన్న భేదాన్ని ప్రతిపాదించి, ఉభయాశ్రితత్వాన్ని పట్టి విశేషం ఏదీ లేదు గాన వ్యంజకత్వగౌణత్వాలకు భేదం ఏమిటి;

అనగా వ్యంజకత్వం శబ్దార్థాలను రెండింటినీ ఆశ్రయించి ఉంటుంది, గౌణత్వం కూడా ఆ రెండింటినీ ఆశ్రయించి ఉంటుంది; అలాంటప్పుడు ఆ రెండింటికి భేదం ఏమిటి, అని ఆశంకించి అముఖ్యం అయిన గౌణికంటె కూడ వ్యంగ్యానికున్న భేదాన్ని ప్రతిపాదించడం కోసం చెపుతున్నాడు - గుణవృత్తిరితి. ఉభయాశ్రయాపి - శబ్దార్థాలను ఆశ్రయించినది. ఉపచారంయొక్క లక్షణంయొక్క స్వరూపాన్ని విభజించి ప్రథమోద్ద్యోతంలోనే నిర్ణయించబడింది. అందుచేత మళ్లీ వ్రాయడం లేదు. ముఖ్యతయైవేతి. స్ఖలద్గతి కానిదిగానే అని అర్థం. (స్ఖలద్గతిత్వాదుల భావం ప్రథమోద్ద్యోతంలో వివరించబడింది). వ్యఙ్గ్యత్రయమితి. వస్త్వలంకారరసరూపమైన వ్యంగ్యాల త్రయం.

## ధ్వన్యాలోకం

అయం చాన్యః స్వరూపభేదః - యద్గుణవృత్తిరముఖ్యత్వేన వ్యవస్థితం వాచకత్వమేవోచ్యతే. వ్యఞ్జకత్వం తు వాచకత్వాదత్యన్తం విభిన్నమేవ. ఏతచ్చ ప్రతిపాదితమ్.

అయం చాపరో రూపభేదః యద్గుణవృత్తౌ యదార్థః అర్థాన్తరముపలక్షయతి - తదా ఉపలక్షణీయార్థాత్మనా పరిణత ఏవాసౌ సంపద్యతే. యథా "గఙ్గాయాం ఘోషః" ఇత్యాదౌ. వ్యఙ్గ్యత్వమార్గే తు యదార్థోఽర్థాన్తరం ద్యోతయతి తదా స్వరూపం ప్రకాశయన్నేవ అసావన్యస్య ప్రకాశకః ప్రతీయతే, ప్రదీపవత్. యథా - "లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ" ఇత్యాదౌ. యది చ యత్ర అతిరస్కృతస్వప్రతీతిరర్థః అర్థాన్తరం లక్షయతి తత్ర లక్షణా వ్యవహారః క్రియతే. తదేవం సతి లక్షణైవ ముఖ్యః శబ్దవ్యాపారః ఇతి ప్రాప్తమ్. యస్మాత్ ప్రాయేణ వాక్యానాం వాచ్యవ్యతిరిక్త తాత్పర్యవిషయార్థావభాసిత్వమ్.

### బాలానందిని

అయమితి. ఇది కూడ మరొక స్వరూపభేదం - అదేమనగా అముఖ్యంగా ఉన్న

వాచకత్వమే గుణవృత్తి అని చెప్పబడుతుంది. వ్యంజకత్వం అయితే వాచకత్వం కంటె అత్యంతం భిన్నమైనది. ఈ విషయం ఇప్పుడే ప్రతిపాదించబడింది. ఇది మరొక రూపభేదం, అదేదనగా - గుణవృత్తిలో ఒక అర్థం మరొక అర్థాన్ని ఉపలక్షించినప్పుడు, చెప్పినప్పుడు, అది (ఆ అర్థం) ఉపలక్షితమైన అర్థం రూపంలో మారిపోతుంది. ఉదాహరణకి - "గఙ్గాయాం ఘోషః" ఇత్యాదులలో. కాని వ్యంజకత్వమార్గంలో ఒక అర్థం మరొక అర్థాన్ని ప్రకాశింప చేసినప్పుడు, దీపం వలె, తన స్వరూపాన్ని ప్రకాశింపచేస్తూనే మరొక అర్థాన్ని ప్రకాశింపచేస్తూ కనబడుతుంది. ఉదాహరణకి - "లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ" ఇత్యాదులలో. (ఆశంక) అత్యంతతిరస్కృతవాచ్యస్థలంలో గుణవృత్తికీ వ్యంజకత్వానికీ స్వరూపాభేదం లేకపోయినా ఇతరస్థలాలలో రెండింటికీ స్వరూపాభేదం అంగీకరించవచ్చును కదా అని ఆశంకించుకొని (సమాధానం) చెపుతున్నాడు - యది చేతి. తిరస్కరించబడని తన ప్రతీతి గల అర్థం మరొక అర్థాన్ని బోధించినచోట అది లక్షణచేతనే బోధిస్తుంది అని చెప్పినట్లయితే అప్పుడు లక్షణయే ముఖ్యవ్యాపారం, అని చెప్పినట్లవుతుంది. ఎందువల్ల ననగా - వాక్యాలు వాచ్యంకంటె అతిరక్తమైన, తాత్పర్యవిషయమైన, అర్థాన్నే బోధిస్తూ ఉంటాయి కదా? అనగా "ఏవం వాదిని" ఇత్యాదులలోని వాచ్యార్థం తన స్వరూపం తిరస్కరించబడకుండానే, స్వార్థబాధాదికం లేకుండానే, లజ్జారూపార్థాన్ని బోధిస్తున్నది. అలాంటి చోట కూడ అది లక్షణయే అని చెప్పినట్లయితే అంతటా లక్షణయే ప్రధానం (ముఖ్యం) అని చెప్పవలసివస్తుంది. ఎందువల్లననగా వాక్యాలు సాధారణంగా వాచ్యార్థంకంటె భిన్నమైన తాత్పర్యార్థాన్నే బోధిస్తాయి కదా అని భావం.

## లోచనం

వాచకత్వమేవేతి. తత్రాపి హి తథైవ సమయోపయోగః అస్త్యేవేత్యర్థః. ప్రతిపాదితమితి. ఇదానీమేవ, పరిణత ఇతి - స్వేన రూపేణ అనిర్భాసమాన ఇత్యర్థః.

## బాలానందిని

వాచకత్వమేవేతి. గుణవృత్తిలో కూడ వాచకత్వంలో వలె సంకేతంయొక్క ఉపయోగం, ఉన్నది కదా అని అర్థం. ప్రతిపాదితమితి - ఇప్పుడే ప్రతిపాదించబడింది. పరిణత ఇతి. తన రూపంలో భాసించనిది అని అర్థం.

ధ్వన్యాలోకం

నను త్వత్పక్షేఽపి యదార్థః వ్యఙ్గ్యత్రయం ప్రకాశయతి తదా శబ్దస్య కీదృశో వ్యాపారః? ఉచ్యతే - ప్రకరణాద్యవచ్ఛిన్నశబ్దవశేనైవ అర్థస్య తథావిధం వ్యఞ్జకత్వమితి శబ్దస్య తత్రోపయోగః కథమపహ్నూయతే? విషయభేదోఽపి గుణవృత్తివ్యఞ్జకత్వయోః స్పష్ట ఏవ. యతః వ్యఞ్జకత్వస్య రసాదయః, అలఙ్కారవిశేషాః, వ్యఙ్గ్యరూపావిచ్ఛిన్నం వస్తు చ ఇతి త్రయం విషయః. తత్ర రసాదిప్రతీతిః గుణవృత్తిరితి న కేన చిదుచ్యతే, న చ శక్యతే వక్తుమ్. వ్యఙ్గ్యాలంకారప్రతీతిరపి తథైవ. వస్తుచారుత్వప్రతీతయే స్వశబ్దానభిధేయత్వేన యత్ ప్రతిపాదయితుమిష్యతే తద్ వ్యఙ్గ్యమ్. తచ్చ సర్వం న గుణవృత్తేర్విషయః. ప్రసిద్ధ్యనురోధాభ్యామపి గౌణానాం శబ్దానాం ప్రయోగదర్శనాత్. తథోక్తం ప్రాక్. యదపి చ గుణవృత్తేః విషయః తదపి చ వ్యఞ్జకత్వానుప్రవేశేన. తస్మాద్గుణవృత్తేరపి వ్యఞ్జకత్వస్యాత్యన్తవిలక్షణత్వమ్. వాచకత్వ గుణవృత్తివిలక్షణస్యాపి తస్య తదుభయాశ్రితత్వేన వ్యవస్థానమ్.

బాలానందిని

నన్వితి. నీ పక్షంలో కూడా ఒక అర్థం మూడు వ్యంగ్యాలను ప్రకాశింపచేసి నప్పుడు శబ్దంయొక్క వ్యాపారం ఎటువంటిది? (సమాధానం) చెప్పబడుతున్నది:- అర్థం ప్రకరణాద్యవిచ్ఛిన్నమైన (ప్రకరణాదులచేత ఉపకృతమైన) శబ్దవశంచేతనే అలాంటి అర్థాన్ని వ్యంజింపచేస్తున్నప్పుడు ఆ విషయంలో శబ్దానికున్న ఉపయోగాన్ని కప్పిపుచ్చడం ఎలా కుదురుతుంది? గుణవృత్తి - వ్యంజకత్వాల విషయభేదం కూడ స్పష్టమే. రసాదులు, అలంకారవిశేషాలు, వ్యంగ్యరూపావచ్ఛిన్నమైన వస్తువు ఈ మూడూ వ్యంజకత్వానికి విషయం. వాటిలో రసాదిప్రతీతి గుణవృత్తి అని ఎవ్వడూ అనడు, అనడానికి శక్యంకాదు కూడ. వ్యంగ్యాలైన అలంకారాల ప్రతీతి కూడ అట్లే. వస్తువులో

చారుత్వం కనబడడంకొరకు ఏది వాచ్యం కాకుండా ప్రతిపాదించడానికి ఇచ్ఛయించ బడుతుందో అది వ్యంగ్యం. అదంతా గుణవృత్తికి విషయం కాదు. ప్రసిద్ధిచేతను, అనురోధంచేతనూ కూడ గౌణశబ్దాలు ప్రయోగించడం కనబడుతున్నది. ఈ విషయం పూర్వమే చెప్పబడింది. గుణవృత్తికి విషయం అవడం అనేది కూడ వ్యంజకత్వంయొక్క సంబంధంచేతనే. అందువల్ల గుణవృత్తికంటె కూడ వ్యంజకత్వం చాల విలక్షణమైనది. అది వాచకత్వంకంటె గుణవృత్తికంటె విలక్షణంగా ఉన్నా కూడ ఆ రెండింటిని ఆశ్రయించుకొని ఉంటుంది.

లోచనం

కీదృశ ఇతి. ముఖ్యో వా న వా? ప్రకారాన్తరాభావాత్. ముఖ్యత్వే వాచకత్వమ్; అన్యథా గుణవృత్తిః. గుణః నిమిత్తం సాదృశ్యాది. తద్ద్వారికా వృత్తిః శబ్దస్య వ్యాపారః గుణవృత్తిరితి భావః. ముఖ్య ఏవాసౌ వ్యాపారః; సామగ్రీభేదాచ్చ వాచకత్వాద్వ్యతిరిచ్యతే ఇత్యభిప్రాయేణాహ- ఉచ్యత ఇతి. ఏవమస్ఖలద్గతిత్వాత్ కథంచిదపి నమయానువయోగాత్ పృథగాభాసమానత్వాచ్చేతి త్రిభిః ప్రకారైః ప్రకాశకత్వస్య ఏతద్విపరీతరూప త్రయాయాశ్చ గుణవృత్తేః, స్వరూపభేదం వ్యాఖ్యాయ విషయభేదమప్యాహ - విషయభేదోఽపీతి. వస్తుమాత్రం గుణవృత్తేరపి విషయ ఇత్యభిప్రాయేణ విశేషయతి - వ్యఙ్గ్యరూపావచ్ఛిన్నమితి. వ్యఞ్జకత్వస్య యో విషయః స గుణవృత్తేః న విషయః, అన్యశ్చ తస్యా విషయభేదో యోజ్యః. తత్ర ప్రథమం ప్రకారమాహ - తత్రేతి. న చ శక్యత ఇతి - లక్షణాసామగ్ర్యాస్తత్రా విద్యమానత్వాదితి హి పూర్వమేవోక్తమ్. తథైవేతి. న తత్ర గుణవృత్తిర్యుక్తేత్యర్థః.

బాలానందిని

కీదృశ ఇతి. ముఖ్యమైనదా, కాదా? మరొక ప్రకారం లేదు కదా? ముఖ్యం అయితే వాచకత్వమే, అలా కాకపోతే గుణవృత్తి. నిమిత్తమైన సాదృశ్యాదికం గుణం. అది ద్వారంగా గల శబ్దంయొక్క వ్యాపారం గుణవృత్తి అని భావం. ఈ వ్యాపారం (వ్యంజనావ్యాపారం) ముఖ్యమే. అయితే సామగ్రీభేదాన్ని పట్టి ఇది వాచకత్వంకంటె వ్యతిరక్తంగా (భిన్నంగా) ఉంటుంది అనే అభిప్రాయంతో ఉచ్యతే అని సమాధానం చెపుతున్నాడు. ఈ విధంగా స్ఖలద్గతి కాకపోవడంవ [illegible] విధంగానూ కూడ సంకేతంయొక్క

ఉపయోగం లేనిదవడంవల్ల, వేరుగా భాసిస్తూండడంవల్ల - ఈ మూడు ప్రకారాలచేత ప్రకాశకత్వానికీ (వ్యంజకత్వానికీ), వీటికి విపరీతమైన రూపత్రయం గల గుణవృత్తికీ స్వరూపభేదం విశదీకరించి విషయభేదం కూడ చెపుతున్నాడు - విషయభేదోఽపీతి. వస్తుమాత్రం గుణవృత్తికి కూడ విషయం కావచ్చు అనే అభిప్రాయంచేత వ్యఙ్గ్యరూపావచ్ఛిన్నమ్ అని విశేషణం చేర్చుచున్నాడు. వ్యంజకత్వానికి ఏది విషయమో అది గుణవృత్తికి విషయం కాదు. (ప్రథమోద్ద్యోతంలో చెప్పిన) ఇతరవిషయభేదం కూడ సమన్వయించుకోవాలి. వాటిలో మొదటి ప్రకారం చెపుతున్నాడు. తత్రేతి. న చ శక్యత ఇతి. అక్కడ లక్షణకు కావలసిన సామగ్రి లేదని వెనుకనే చెప్పబడింది. తథైవేతి. అక్కడ గుణవృత్తి యుక్తం కాదు అని అర్థం.

లోచనం

వస్తునో యత్పూర్వం విశేషణం కృతం తద్వ్యాచష్టే - చారుత్వప్రతీతయే ఇతి. న సర్వమితి. కించిత్తు భవతి, యథా - "నిఃశ్వాసాన్ధ ఇవాదర్శః" ఇతి. యదుక్తమ్ - "కస్యచిద్ధ్వనిభేదస్య సా తు స్యాదుపలక్షణమ్" ఇతి. ప్రసిద్ధితో లావణ్యాదయః శబ్దాః, వృత్తానురోధవ్యవహారానురోధాదేః "వదతి బిసినీ పత్రశయనమ్" ఇత్యేవమాదయః. ప్రాగితి. ప్రథమోద్ద్యోతే. "రూఢా యే విషయేఽన్యత్ర" ఇత్యత్రాన్తరే. న సర్వమితి యథాస్మాభిః వ్యాఖ్యాతం తథా స్ఫుటయతి- యదపి చేతి. గుణవృత్తే రితి పఞ్చమీ. అధునా ఇతర రూపోపజీవకత్వేన తదితరస్మాత్ తదితరరూపోపజీవకత్వేన చ తదితరస్మాదిత్యనేన పర్యాయేణ వాచకత్వాత్ గుణవృత్తేశ్చ ద్వితయాదపి భిన్నం వ్యఞ్జకత్వమిత్యుపపాదయతి - వాచకత్వేతి. చోఽవధారణే భిన్నక్రమః. అపిశబ్దోఽపి న కేవలం పూర్వోక్తో హేతుకలాపః యావత్తదుభయాశ్రయత్వేన ముఖ్యోపచారాశ్రయత్వేన యద్ వ్యవస్థానం తదపి వాచకగుణవృత్తి విలక్షణస్యైవేతి వ్యాప్తిఘటనమ్. తేనాయం తాత్పర్యార్థః - తదుభయాశ్రయత్వేన వ్యవస్థానాత్ తదుభయవైలక్షణ్యమితి.

బాలానందిని

వస్తువుకు పూర్వం ఉపయోగించిన (వ్యఙ్గ్యరూపావచ్ఛిన్నమ్) విశేషణాన్ని వివరిస్తున్నాడు - చారుత్వప్రతీతయే ఇతి. న సర్వమితి. ఏదైనా ఒకటి కావచ్చును - "నిఃశ్వాసాన్ధ ఇవాదర్శః" ఇత్యాదులలో చెప్పినట్లు. అందుచేతనే "కస్య చిద్ధ్వనిభేదస్య' ' (కా.1.19) అని వెనక చెప్పబడింది. ప్రసిద్ధివల్ల 'లావణ్య' మొదలైన శబ్దాలు ప్రయోగించబడతాయి. వృత్తానురోధం, వ్యవహారానురోధం మొదలైనవాటివల్ల "వదతి బిసినీపత్త్రశయనమ్' ఇత్యాదులు ప్రయోగించబడతాయి. ప్రాగితి - ప్రథమోద్ద్యోతంలో "రూఢా యే విషయేఽన్యత్ర" (కా.1.16) అనే కారికదగ్గర. "న సర్వమ్" అనే దానిని మేము ఏ విధంగా వ్యాఖ్యానించి ఉన్నామో దానినే స్పష్టీకరిస్తున్నాడు - యదపి చేతి. గుణవృత్తేః - ఇది పంచమ్యంతం. అధునేతి. ఇతరరూపం ఉపజీవకంగా కలదగుటచేత, అనగా గుణవృత్తిని ఆశ్రయించి ఉండడంచేత, తదితరంకంటె, అనగా వాచకత్వంకంటె, తదితరరూపం ఉపజీవకంగా కలిగి ఉండడంచేత, అనగా వాచకత్వాన్ని ఆశ్రయించడంచేత, తదితరంకంటె, అనగా గుణవృత్తి ప్రకారం కంటె - ఈ విధంగా పర్యాయంచేత, వాచకత్వంకంటె, గుణవృత్తికంటె, ఈ రెండింటికంటె కూడ వ్యంజకత్వం భిన్నమైనది అని ఉపపాదిస్తున్నాడు - వాచకత్వేతి. 'చ'కు అవధారణం (నిశ్చితత్వం) అర్థం. ఇది భిన్నక్రమం. 'విలక్షణస్య'తో అన్వయిస్తుంది. అనగా "వాచకత్వగుణవృత్తిత్వ విలక్షణస్యైవ" అని అర్థం. 'అపి' శబ్దం కూడ భిన్నక్రమం ('వ్యవస్థానమ్' తో అన్వయిస్తుంది) కేవలం వెనక చెప్పిన హేతుసముదాయమే కాదు - ఆ రెండింటిని ఆశ్రయించుకొని, అనగా ముఖ్యమైన వాచకత్వాన్ని, ఉపచారరూపమైన గుణవృత్తినీ, ఆశ్రయించుకొని ఉండడం అనేది కూడ వాచక - గుణవృత్తి విలక్షణమైనదానికే కుదురుతుంది అని వ్యాప్తిని చెప్పినట్లయింది. "ఏది దేనిని ఆశ్రయించుకొని ఉంటుందో అది దానికంటె విలక్షణమైనది" అని వ్యాప్తి. అందుచేత ఇక్కడ తాత్పర్యార్థం ఇది - ఆ రెండింటినీ ఆశ్రయించుకుని ఉండడంవల్ల ఆ రెండింటికంటె దీనికి వైలక్షణ్యం ఉన్నది.

ధ్వన్యాలోకం

వ్యఞ్జకత్వం హి క్వచిద్వాచకత్వాశ్రయేణ వ్యవతిష్ఠతే, యథా వివక్షితాన్యపరవాచ్యే ధ్వనౌ, క్వచిత్తు గుణవృత్త్యాశ్రయేణ - యథా అవివక్షితవాచ్యే ధ్వనౌ. తదుభయాశ్రితత్వప్రతిపాదనాయైవ చ ధ్వనేః ప్రథమతరం ద్వౌ ప్రభేదావుపన్యస్తౌ. తదుభయాశ్రితత్వాచ్చ

తదేకరూపత్వం తస్య న శక్యతే వక్తుమ్. యస్మాత్ న తద్వాచకత్వైకరూపమేవ, క్వచిల్లక్షణాశ్రయేణ వృత్తేః. న చ లక్షణైకరూపమేవ, అన్యత్ర వాచకత్వాశ్రయేణ వ్యవస్థానాత్. న చోభయధర్మత్వేనైవ తదేకైకరూపం న భవతి, యావద్వాచకత్వలక్షణాదిరూపరహితశబ్ధధర్మత్వేనాపి. తథా హి - గీతధ్వనీనామపి వ్యఞ్జకత్వమస్తి రసాదివిషయమ్. న చ తేషామ్ వాచకత్వం లక్షణా వా కథంచిల్లక్ష్యతే. శబ్దాదన్యత్రాపి విషయే వ్యఞ్జకత్వస్య దర్శనాత్, వాచకత్వాదిశబ్దధర్మప్రకారత్వమయుక్తం వక్తుమ్. యది చ వాచకత్వలక్షణాదీనాం శబ్దప్రకారాణాం ప్రసిద్ధప్రకారవిలక్షణత్వేఽపి వ్యఞ్జకత్వం ప్రకారత్వేన పరికల్ప్యతే తచ్ఛబ్దస్యైవ ప్రకారత్వేన కస్మాన్న పరికల్ప్యతే. తదేవం శాబ్దే వ్యవహారే త్రయః ప్రకారాః - వాచకత్వం, గుణవృత్తిః, వ్యఞ్జకత్వం చ. తత్ర వ్యఞ్జకత్వే యదా వ్యఙ్గ్యప్రాధాన్యం తదా ధ్వనిః, తస్య చ అవివక్షితవాచ్యః వివక్షితాన్యపరవాచ్యశ్చేతి ద్వౌ ప్రభేదౌ అనుక్రాన్తౌ ప్రథమతరం తౌ సవిస్తరం నిర్ణీతౌ.

బాలానందిని

వ్యఞ్జకత్వం హీతి. వ్యంజకత్వం కొన్ని చోట్ల వాచకత్వాన్ని ఆశ్రయించి ఉంటుంది - ఉదాహరణకి వివక్షితాన్యపరవాచ్యధ్వనిలో. కొన్ని చోట్ల గుణవృత్తిని ఆశ్రయించి ఉంటుంది, ఉదాహరణకి - అవివక్షితవాచ్యధ్వనిలో ధ్వని ఆ రెండింటినీ ఆశ్రయించి ఉంటుందని ప్రతిపాదించడం కొరకే మొట్టమొదట రెండు ధ్వని భేదాలు చెప్పబడ్డాయి. ఆ రెండింటినీ ఆశ్రయించి ఉండడంచేత అది (వ్యంజకత్వం) తద్రూపమే (వాచకరూపమే లేదా గుణవృత్తిరూపమే) అని చెప్పడానికి శక్యం కాదు. ఎందువల్లననగా - అది వాచకత్వైకరూపం (కేవలవాచకత్వరూపం) కాదు; కొన్ని చోట్ల లక్షణని ఆశ్రయించి ఉంటూన్నది కదా? లక్షణైకరూపమే కాదు; వాచకత్వాన్ని ఆశ్రయించి కూడ ఉంటూన్నది కదా? ఇది ఉభయధర్మం అవడంచేత ఏ ఒక్కదాని స్వరూపం కలదీ కాదు అని కూడా

అనడానికి వీలులేదు; ఎందుచేత ననగా (యావత్) ఇది వాచకత్వం, లక్షణ మొదలైన రూపాలు లేని శబ్దంయొక్క ధర్మంగా కూడ ఉంది. అదెట్లనగా - గీతధ్వనులకు కూడ రసాదివిషయకమైన వ్యంజకత్వం ఉంది. ఆ గీతధ్వనులకు ఏ విధంగానూ కూడ వాచకత్వం కాని, లక్షణ కాని కనబడడంలేదు. శబ్దంకంటె భిన్నమైనవాటిలో (చేష్టాదులలో) కూడ వ్యంజకత్వం కనబడుతున్నది. అందువల్ల ఇది వాచకత్వాది శబ్దధర్మాలలో ఒక ప్రకారం అని చెప్పడం అయుక్తం. వ్యంజకత్వం ప్రసిద్ధమైన ప్రకారాలకంటె విలక్షణమైనా కూడ వాచకత్వం, లక్షణ మొదలైన శబ్దప్రకారాలలోని ఒక ప్రకారంగా కల్పించబడితే, (అలా కల్పించడానికి బదులు) శబ్దంయొక్క ప్రకారంగానే ఎందుకు కల్పించబడడంలేదు? అందుచేత - ఇంతవరకు చెప్పిన విధంగా శబ్దానికి సంబంధించిన వ్యవహారంలో వాచకత్వం, గుణవృత్తి, వ్యంజకత్వం అని మూడు ప్రకారాలు ఉంటాయి. వ్యంజకత్వం ఉన్నప్పుడు వ్యంగ్యానికి ప్రాధాన్యం ఉన్నట్లయితే అప్పుడు అది ధ్వనికావ్యం. అవివక్షిత వాచ్యం, వివక్షితాన్యపరవాచ్యం అని దాని రెండు ప్రభేదాలు ముందుగానే ఉపక్రమించి సవిస్తరంగా నిర్ణయించబడ్డాయి.

లోచనం

ఏతదేవ విభజతే - వ్యఞ్జకత్వం హీతి. ప్రథమతరమితి. ప్రథమోద్యోతే 'స' చ ఇత్యాదినా గ్రన్థేన. హేత్వన్తరమపి సూచయతి - న చేతి. వాచకత్వే గౌణత్వోభయవృత్త్యాన్యవైలక్షణ్యాదితి హేతుః సూచితః. తమేవ ప్రకాశయతి - తథాహీత్యాదినా. తేషామితి - గీతాదిశబ్దానామ్. హేత్వన్తరమపి సూచయతి - శబ్దాదన్యత్రేతి. వాచకత్వగౌణత్వాభ్యామన్యద్వ్యఞ్జకత్వం శబ్దాదన్యత్రాపి వర్తమానత్వాత్, ప్రమేయత్వాదివత్ ఇతి హేతుః సూచితః. నన్వన్యత్ర అవాచకే యద్వ్యఞ్జకత్వం తద్భవతు వాచకత్వాదేర్విలక్షణమ్, వాచకే తు యత్ వ్యఞ్జకత్వం తదవిలక్షణమేవాస్త్విత్యాశఙ్క్యాహ - యదీతి. ఆదిపదేన గౌణం గృహ్ణాతి. శబ్దస్యైవేతి. వ్యఞ్జకత్వం వాచకత్వమితి యది పర్యాయే కల్ప్యేతే తర్హి వ్యఞ్జకత్వం శబ్ద ఇత్యపి పర్యాయతా కస్మాన్న కల్ప్యతే; ఇచ్ఛాయా అవ్యాహతత్వాత్, వ్యఞ్జకత్వస్య తు వివిక్తం స్వరూపం దర్శితం తద్విషయాన్తరే కథం విపర్యస్యతామ్. ఏవం హి పర్వతగతః ధూమః అనగ్నిజోఽపి స్యాదితి

భావః. అధునా ఉపపాదితం విభాగముపసంహరతి - తదేవమితి. వ్యవహారగ్రహణేన సముద్రఘోషాదీన్ వ్యుదస్యతి.

బాలానందిని

ఏతదితి. దీనినే వ్యఞ్జకత్వం హి ఇతి అని విభజిస్తున్నాడు. ప్రథమతరమితి. ప్రథమోద్ద్యోతంలో 'స చ' ఇత్యాది గ్రంథంచేత. మరొక హేతువును కూడ సూచిస్తున్నాడు. - న చేతి. వాచకత్వం, గౌణత్వం అనే రెండింటి వృత్తాంతంకంటె వైలక్షణ్యంవల్ల; అనగా వాచ్యత్వం గౌణత్వం అనే రెండు వృత్తులకంటె భిన్నమైన దవడంచేత అని అర్థం. ఆ విషయాన్నే తథాహి ఇత్యాది గ్రంథంచేత విశదీకరిస్తున్నాడు తేషామితి - గీతాదిశబ్దాలకు. మరొక హేతువును సూచిస్తున్నాడు - శబ్దాదన్యత్రేతి. "వ్యంజకత్వం వాచకత్వ - గౌణత్వాలకంటె భిన్నమైనది; శబ్దం కానివాటిలో కూడ ఉన్నది కాబట్టి; ప్రమేయత్వాదికం వలె" అని హేతువు సూచించబడింది. నన్వితి. (ఆశంక). వాచకం కాని గీతాదిశబ్దంలో ఉన్న వ్యంజకత్వం వాచకత్వాదికంకంటె విలక్షణం అయితే కావచ్చు. వాచకంలో ఉన్న ఆ వ్యంజకత్వం ఆ వాచకత్వంకంటె విలక్షణం కానిదే కావచ్చు కదా అని ఆశంకించుకొని చెపుతున్నాడు - యదీతి. 'ఆది' పదంచేత గౌణం గ్రహించబడుతుంది. శబ్దస్యైవేతి. వ్యంజకత్వం, వాచకత్వం అనేవి పర్యాయపదాలు అని కల్పించే పక్షంలో వ్యంజకత్వం, శబ్దం పర్యాయా లని ఎందుకు కల్పించడం లేదు? మీ ఇచ్ఛకి అడ్డు ఏముంది! వ్యంజకత్వానికి వివిక్తమైన, అనగా వాచకత్వంతో సంబంధంలేని, స్వరూపం (గీత ధ్వన్యాదులలో) చూపబడింది. అది విషయాంతరంలో (వాచకత్వం ఉన్న చోట) మాత్రం ఎందుకు మార్పుచెందాలి? ఇలా అయితే, అనగా వాచకత్వాదిమూలకమైన వ్యంజకత్వం వాచకత్వాదిమూలం కాకపోతే, వాచకత్వాది స్వరూపమే అయితే, పర్వతం మీద ఉన్న ధూమం అగ్నివల్ల పుట్టినది కాదని కూడ అనవచ్చు. ఇప్పుడు ఉపపాదించబడిన విభాగాన్ని ఉపసంహరిస్తున్నాడు - తదేవమితి. 'వ్యవహార' శబ్దం ప్రయోగించడంచేత సముద్రఘోషాదుల్ని వ్యావర్తింప చేస్తున్నాడు. అవి శబ్దాలైనా వాటితో వ్యవహారం చేయబడదు కదా అని భావం.

ధ్వన్యాలోకం

అన్యో బ్రూయాత్ - నను వివక్షితాన్యపరవాచ్యే ధ్వనౌ గుణవృత్తితా నాస్తీతి యదుచ్యతే తద్యుక్తమ్. యస్మాద్వాచ్యవాచకప్రతీతిపూర్వికా

యత్రార్థాన్తరప్రతిపత్తిః తత్ర కథం గుణవృత్తివ్యవహారః? న హి గుణవృత్తౌ యదా నిమిత్తేన కేన చిద్విషయాన్తరే శబ్ద ఆరోప్యతే అత్యన్తతిరస్కృతస్వార్థః, యథా "అగ్నిర్మాణవకః" ఇత్యాదౌ, యదా వా స్వార్థమంశేనాపరిత్యజన్ తత్సమ్బన్ధద్వారేణ విషయాన్తరమాక్రామతి, యథా - "గఙ్గాయాం ఘోషః" ఇత్యాదౌ తదా వివక్షితవాచ్యత్వముపపద్యతే. అత ఏవ చ వివక్షితాన్యపరవాచ్యే ధ్వనౌ వాచ్యవాచకయోర్ద్వయోరపి స్వరూపప్రతీతిరర్థావగమనం చ దృశ్యత ఇతి వ్యఞ్జకత్వవ్యవహారో యుక్త్యనురోధీ. స్వరూపం ప్రకాశయన్నేవ పరావభాసకః వ్యఞ్జక ఇత్యుచ్యతే; తథావిధే విషయే వాచకత్వస్యైవ వ్యఞ్జకత్వమితి గుణవృత్తివ్యవహారో నియమేనైవ న శక్యతే కర్తుమ్.

బాలానందిని

**అన్య ఇతి.** మరొకడు ఇట్లు చెప్పవచ్చును - (ఆశంక) వివక్షితాన్యపరవాచ్యధ్వనిలో గుణవృత్తిత్వం లేదు అని చెప్పడం యుక్తమే. కారణం ఏమనగా ఎక్కడ మరొక అర్థం యొక్క ప్రతీతి వాచ్యవాచకప్రతీతిపూర్వకమైనదో, (వాచ్యవాచకజ్ఞానం కలిగిన తరవాత కలుగుతుందో) అక్కడ గుణవృత్తి వ్యవహారం ఎలా కుదురుతుంది? "అగ్నిర్మాణవకః"(పిల్లవాడు అగ్ని)ఇత్యాదులలో వలె ఏదైన నిమిత్తంచేత ఒక శబ్దం ఎక్కడైతే పూర్తిగా తన అర్థాన్ని కప్పిపుచ్చివేసి మరొక విషయంలో ఆరోపించబడుతుందో (పై ఉదాహరణలో 'అగ్ని' శబ్దం తన అర్థాన్ని పూర్తిగా విడిచివేసి పిల్లవానియందు ఆరోపించబడినట్లు), లేదా "గఙ్గాయాం ఘోషః" ఇత్యాదులందు వలె ఎప్పుడైతే ఒక శబ్దం తన అర్థాన్ని ఒక అంశంచేత విడవకుండా ఆ అర్థంతో ఉన్న సంబంధం ద్వారా మరొక విషయాన్ని (అర్థాన్ని) ఆక్రమిస్తుందో, (పై ఉదాహరణంలో 'గఙ్గా' శబ్దం తన ప్రవాహరూపార్థాన్ని కొంతవరకు విడిచివేసి ప్రవాహానికి దగ్గర ఉన్నతీరాన్ని బోధించినట్లు) అలాంటి గుణవృత్తియందు వివక్షితవాచ్యత్వం కుదరదు కదా? అందువల్లనే వివక్షితాన్యపరవాచ్యధ్వనిలో వాచ్యవాచకాల రెండింటియొక్క స్వరూపప్రతీతి కలుగుతుంది, అర్థావగమనం (ద్వితీయార్థావగమనం) కూడ కనబడుతుంది గాన

వ్యంజకత్వవ్యవహారం యుక్తియుక్తంగా ఉంటుంది. ఏది తన స్వరూపాన్ని ప్రకాశింపచేస్తూనే మరొకదానిని ప్రకాశింపచేస్తుందో అదే వ్యంజకం అని చెప్పబడుతుంది. అలాంటి విషయంలో వాచకత్వమే వ్యంజకంగా ఉంది గాన గుణవృత్తి అని వ్యవహరించడం కుదరదు అనే విషయం నిశ్చితమే.

లోచనం

నను వాచకత్వరూపోపజీవకత్వాత్ గుణవృత్త్యనుజీవకత్వాదితి చ హేతుద్వయం యదుక్తం తదవివక్షితవాచ్యభాగే సిద్ధం న భవతి; తస్య లక్షణైకశరీరత్వాదిత్యభిప్రాయేణ ఉపక్రమతే-అన్యో బ్రూయాదితి. యద్యపి చ తస్య తదుభయాశ్రయత్వేన వ్యవస్థానాదితి బ్రువతా నిర్ణీతచరమేవైతత్, తథాపి గుణవృత్తేః అవివక్షితవాచ్యస్య చ దుర్నిరూపం వైలక్షణ్యం యః పశ్యతి తం ప్రత్యాశఙ్కానివారణార్థోఽయముపక్రమః. అత ఏవాద్యభేదస్యాఙ్గీకరణపూర్వకమయం ద్వితీయభేదాక్షేపః. వివక్షితాన్యపరవాచ్య ఇత్యాదినా పరాభ్యుపగమస్య స్వాఙ్గీకారో దర్శ్యతే. గుణవృత్తివ్యవహారాభావే హేతుం దర్శయితుం తస్యా ఏవ గుణవృత్తేస్తావద్వృత్తాన్తం దర్శయతి - న హీతి. గుణతయా వృత్తిః వ్యాపారః గుణవృత్తిః. గుణేన నిమిత్తేన సాదృశ్యాదినా చ వృత్తిః అర్థాన్తరవిషయేఽపి శబ్దస్య సామానాధికరణ్యమితి గౌణం దర్శయతి. యదా వా స్వార్థమితి లక్షణాం దర్శయతి. అనేన భేదద్వయేన చ స్వీకృతమవివక్షితవాచ్యభేదద్వయాత్మకమితి సూచయతి. అత ఏవ అత్యన్తతిరస్కృతవాచ్యశబ్దేన, విషయాన్తరమాక్రామతి చ ఇత్యనేన శబ్దేన తదేవ భేదద్వయం దర్శయతి. అత ఏవ చేతి - యత ఏవ న తత్ర ఉక్తహేతుబలాద్గుణవృత్తివ్యవహారో న్యాయస్తత ఇత్యర్థః. యుక్తిం లోకప్రసిద్ధిరూపామబాధితాం దర్శయతి - స్వరూపమితి. ఉచ్యత ఇతి ప్రదీపాదిః. ఇన్ద్రియాదేస్తు కరణత్వాత్ న వ్యఞ్జకత్వం ప్రతీత్యుత్పత్తౌ.

బాలానందిని

నన్వితి. వాచకత్వరూపాన్ని అపేక్షించే దవడం, గుణవృత్తిని అపేక్షించడం అనే,

ైన చెప్పిన హేతుద్వయ (వ్యంగ్యత్వం వాచ్యత్వగౌణత్వాలకంటె భిన్నమైనది అని ్థాపించడానికి చెప్పిన హేతుద్వయం) అవివక్షితవాచ్యభాగంలో సిద్ధం కాదు; కుదరదు, ందుచేత ననగా అది లక్షణారూపమైనది అనే అభిప్రాయంచేత ఉపక్రమిస్తున్నాడు - న్యో బ్రూయాదితి. యద్యపీతి. అది (వ్యంజకత్వం) ఆ రెండింటినీ (వాచకత్వగౌణత్వాలను) శ్రయించి ఉన్నది కదా అని చెప్పడం ద్వారా ఈ విషయం వెనుకనే నిర్ణయించబడినా, అందుచేత ఈ ఆశంకకు అవకాశం లేకపోయినా), గుణవృత్తికీ, అవివక్షితవాచ్య ధ్వనికీ న్న వైలక్షణ్యం (భేదం) నిరూపించబడడానికి శక్యం కానిది అని అనుకొనే వాని శంకను నివారించడం కోసమే ఈ ఉపక్రమం. అందువల్లనే ఆ మొదటి భేదాన్ని వివక్షితాన్యపరవాచ్యాన్ని) అంగీకరిస్తూ ఈ రెండవభేదం (అవివక్షితవాచ్యం) విషయంలో క్షేపం చేయబడుతున్నది. వివక్షితాన్యపరవాచ్యే ఇత్యాదికంచేత పరులు అంగీకరించిన ానిని తాను కూడా అంగీకరించి నట్లు చూపబడుతున్నది. గుణవృత్తివ్యవహారం ేకపోవడానికి (వివక్షితవాచ్యధ్వని గుణవృత్తి కాదనడానికి) హేతువును చూపడం కోసం ుందు ఆ గుణవృత్తియొక్క వృత్తాంతాన్ని చూపుతున్నాడు - న హీతి. గుణతయా= ప్రధానంగా, వృత్తిః= శబ్దవ్యాపారం, 'గుణవృత్తి' నిమిత్తమైన సాదృశ్యాదిగుణంచేత, ృత్తిః= శబ్దం మరొక అర్థం విషయంలో కూడ, ప్రవర్తించడం, దానితో సామానాధికరణ్యం, గుణవృత్తి', అని గౌణాన్ని చూపుతున్నాడు. యదా వా స్వార్థమ్ అని లక్షణను చూపుతున్నాడు. అనగా 'యదా నిమిత్తేన' ఇత్యాదికంచేత గుణవృత్తినీ, "యదా వా" ఇత్యాదికం చేత లక్షణావృత్తిని నిర్దేశిస్తున్నాడు అని అర్థం. అవివక్షితవాచ్యభేదద్వయ రూపమైన వ్యంగ్యం ఈ భేదద్వయంచేత స్వీకరించబడింది, అనగా అది దీనిలో అంతర్గతం అయిపోతుంది అని సూచిస్తున్నాడు. అందుచేతనే "అత్యంతతిరస్కృత స్వార్థః" అనే పదంచేత "విషయాన్తరమాక్రామతి" అనే దానిచేత ఆ భేదద్వయాన్నే చూపుతున్నాడు. అత ఏవ చేతి - పైన చెప్పిన హేతువుల బలంవల్ల గుణవృత్తి అనే వ్యవహారం యుక్తం కాదు గాన అని అర్థం. లోకప్రసిద్ధిరూపమైన, అబాధితమైన (కాదనడానికి వీలులేని) యుక్తిని చూపుతున్నాడు - స్వరూపమితి. ఉచ్యత ఇతి. ప్రదీపాదికం (చెప్పబడుతుంది). ఇంద్రియాదికం అయితే కరణం (సాధనం) గాన ప్రతీతి కలగడంలో వ్యంజకం కాదు. అనగా "స్వరూపం వ్యఞ్జయన్నేవ" ఇత్యాదివాక్యంలో దృష్టాంతంగా చూపబడినది ప్రదీపాదికమే కాని ఇంద్రియాదికం కాదు అని భావం.

ధ్వన్యాలోకం

అవివక్షితవాచ్యస్తు ధ్వనిః గుణవృత్తేః కథం భిద్యతే? తస్య ప్రభేదద్వయే గుణవృత్తి ప్రభేదద్వయరూపతా లక్ష్యత ఏవ యతః; అయమపి న దోషః, యస్మాదవివక్షితవాచ్యో ధ్వనిః గుణవృత్తిమార్గాశ్రయోఽపి భవతి, న తు గుణవృత్తిరూప ఏవ. గుణవృత్తిర్హి వ్యఞ్జకత్వశూన్యాపి దృశ్యతే. వ్యఞ్జకత్వం చ యథోక్త చారుత్వహేతుం వ్యఙ్గ్యం వినా న వ్యవతిష్ఠతే. గుణవృత్తిస్తు వాచ్యధర్మాశ్రయేణైవ వ్యఙ్గ్యమాత్రాశ్రయేణ చ అభేదోపచారరూపా సంభవతి; యథా తీక్ష్ణత్వాత్ అగ్నిః మాణవకః, ఆహ్లాదకత్వాచ్చన్ద్ర ఏవాస్యా ముఖమ్ ఇత్యాదౌ. యథా చ "ప్రియే జనే నాస్తి పునరుక్తమ్" ఇత్యాదౌ. యాపి లక్షణారూపా గుణవృత్తిః సాపి ఉపలక్షణీయార్థసంబన్ధమాత్రాశ్రయేణ చారురూపవ్యఙ్గ్యప్రతీతిం వినాపి సంభవత్యేవ, యథా - "మఞ్చాః క్రోశన్తి" ఇత్యాదౌ విషయే.

బాలానందిని

అవివక్షితేతి. కాని అవివక్షితవాచ్యధ్వని గుణవృత్తికంటె ఏట్లా భిన్నం అవుతుంది? ఎందువల్లననగా - అవివక్షితవాచ్యధ్వనిభేదాలు రెండింటిలోనూ గుణవృత్తి భేదద్వయరూపం కనబడుతున్నది. (సమాధానం చెపుతున్నాడు) - ఇది కూడ దోషం కాదు; ఎందువల్ల ననగా - అవివక్షితవాచ్యధ్వని గుణవృత్తిమార్గాన్ని ఆశ్రయించి కూడా ఉంటుంది; అంతే కాని అది గుణవృత్తిరూపమే అయిపోదు. ఎందుచేతననగా వ్యంజకత్వంలేని గుణవృత్తి కూడా కనబడుతున్నది. వ్యంజకత్వం అయితే పైన చెప్పిన చారుత్వానికి హేతువైన వ్యంగ్యం లేకపోతే ఉండదు. కాని అభేదారోపరూపమైన గుణవృత్తి వాచ్యానికి సంబంధించిన ధర్మాన్ని అనగా వ్యాపారాన్ని మాత్రమే ఆశ్రయించి, వ్యంగ్యాన్ని మాత్రమే ఆశ్రయించి (రెండు విధాలుగా) ఉండవచ్చు. ఉదాహరణకి - తీక్ష్ణత్వాన్ని పట్టి 'అగ్నిర్మాణవకః" అని, ఆనందం కలిగించేది అవడంచేత "ఈమె ముఖమే చంద్రుడు" అని ఇత్యాదులలో ఇంకా "ప్రియే జనే నాస్తి పునరుక్తమ్" (చూ.

ా.14) ఇత్యాదులలో కూడ. (వీటిలో గుణవృత్తి మాత్రమే కాని వ్యంజకత్వం లేదు అని భావం). లక్షణారూపమైన గుణవృత్తి కూడ సుందరమైన వ్యంగ్యంయొక్క ప్రతీతి లేకపోయినా ఉపలక్షింపతగిన (వాచ్యార్థంకంటె అధికంగా గ్రహించడానికి తగిన) అర్థంతో సంబంధాన్ని ఆశ్రయించడం మాత్రంచేతనే సంభవిస్తుంది. ఉదాహరణకి - 'మఞ్చాః క్రోశన్తి" ఇత్యాది విషయంలో. ఇక్కడ వ్యంగ్యార్థం ఏదీ లేకపోయినా 'మఞ్చ' పదం లక్షణచేత మంచాలమీద ఉన్నవాళ్లని ఉపలక్షిస్తున్నది అని అర్థం.

లోచనం

ఏవమభ్యుపగమం ప్రదర్శ్య ఆక్షేపం దర్శయతి - అవివక్షితేతి. తు శబ్దః పూర్వస్మాద్విశేషం ద్యోతయతి. తస్యేతి. అవివక్షితవాచ్యస్య యత్ ప్రభేదద్వయం తస్మిన్ గౌణలాక్షణికత్వాత్మకం ప్రకారద్వయం లక్ష్యతే నిర్భాస్యతే ఇత్యర్థః, ఏతత్ పరిహరతి - అయమపీతి. గుణవృత్తేః యో మార్గః ప్రభేదద్వయం స ఆశ్రయో నిమిత్తతయా ప్రాక్కక్ష్యానివేశీ యస్యేత్యర్థః. ఏతచ్చ పూర్వమేవ నిర్ణీతమ్. తాద్రూప్యాభావే హేతుమాహ - గుణవృత్తిరితి. గౌణలాక్షణికరూపా ఉభయీ అపీత్యర్థః. నను వ్యఞ్జకత్వేన కథం శూన్యా గుణవృత్తిర్భవతి? యతః పూర్వమేవోక్తమ్ -

ముఖ్యాం వృత్తిం పరిత్యజ్య గుణవృత్త్యార్థదర్శనమ్,
యదుద్దిశ్య ఫలం తత్ర శబ్దో నైవ స్ఖలద్గతిః. (కా. 1.17) ఇతి.

న హి ప్రయోజనశూన్య ఉపచారః, ప్రయోజనాంశనివేశీ చ వ్యఞ్జనవ్యాపారః ఇతి భవద్భిరేవాభ్యధాయి ఇత్యాశఙ్క్యాభిమతం వ్యఞ్జకత్వం విశ్రాన్తిస్థానరూపం తత్ర నాస్తీత్యాహ - వ్యఞ్జకత్వం చేతి. వాచ్యధర్మేతి. వాచ్యవిషయః యః ధర్మ అభిధావ్యాపారః తస్యాశ్రయేణ, తదుపబృంహణాయేత్యర్థః. శ్రుతార్థాపత్తావివ అర్థాన్తరస్య అభిధేయార్థోపపాదన ఏవ పర్యవసానాదితి భావః. తత్ర గౌణస్యోదాహరణమాహ - యథేతి. ద్వితీయమపి ప్రకారం వ్యఞ్జకత్వశూన్యం నిదర్శయితుముపక్రమతే - యాపీతి. చారురూపం విశ్రాన్తిస్థానమ్. తదభావే స వ్యఞ్జకత్వవ్యాపారో నైవోన్మీలతి, ప్రత్యావృత్త్య వాచ్య ఏవ విశ్రాన్తేః. క్షణదృష్టనష్టవిభవప్రాకృతపురుషవత్.

బాలానందిని

ఏమితి. (పూర్వపక్షి) ఈ విధంగా (వివక్షితాన్యపరవాచ్యధ్వనివిషయంలో) తన అంగీకారాన్ని చూపి ఇప్పుడు ఆక్షేపం చూపుతున్నాడు - **అవివక్షితేతి.** 'తు' శబ్దం వెనుకటిదానికన్న దీని విశేషాన్ని సూచిస్తున్నది. తస్యేతి. అవివక్షితవాచ్యంయొక్క ఏ ప్రభేదద్వయం ఉన్నదో దానియందు గౌణత్వ - లాక్షణికత్వరూపమైన ప్రకారద్వయం, లక్ష్యతే= గుర్తించబడుతున్నది అని అర్థం. దీనిని పరిహరిస్తున్నాడు - **అయమపీతి.** గుణవృత్తియొక్క ఏ మార్గం, భేదద్వయం, దేనికి ఆశ్రయమో, అనగా మొదటి కక్ష్యలో ఉంటుందో అది గుణవృత్తిమార్గాశ్రయం అని అర్థం. ఈ విషయం పూర్వమే నిర్ణయించబడినది. తాద్రూప్యం లేకపోవడానికి (ఇది అదీ ఒకటే అని చెప్పడానికి వీలులేకపోవడానికి) హేతువును చెపుతున్నాడు - గుణవృత్తిరితి. గౌణ - లాక్షణిక రూపాలు గల రెండు విధాలైనదో కూడ అని అర్థం.

(ఆశంక) వెనుక "ముఖ్యాం వృత్తిమ్" ఇత్యాదికం చెప్పబడింది కదా? **గుణవృత్తి** వ్యంజకత్వశూన్యం ఎలా అవుతుంది? ఉపచారం ప్రయోజనం లేకుండా ఉండదు; వ్యంజనావ్యాపారం ప్రయోజనాంశానికి సంబంధించినది అని మీరే చెప్పారు కదా? **అని ఆశంకించి,** విశ్రాంతి స్థానరూపమైన ఏ వ్యంజకత్వం మాకు అభిమతమో అది **అక్కడ లేదు** అని చెపుతున్నాడు - వ్యఞ్జకత్వం చేతి. వాచ్యధర్మేతి - వాచ్యవిషయమైన ఏ ధర్మం, **అభిధావ్యాపారం** ఉన్నదో దానియొక్క ఆశ్రయంచేత అనగా, దానిని బలపరచడం **కొరకు** అని అర్థం, శ్రుతార్థాపత్తిలో వలె రెండవ అర్థం వాచ్యార్థాన్ని సమర్థించడం **కోసమే** పర్యవసానం చెందుతుంది; అందువల్ల అని భావం.

"పీనో దేవదత్తః దివా న భుజ్క్తే'అనే అర్థాపత్తిస్థలంలో "రాత్రౌ భుజ్క్తే" అనే గమ్యమానార్థం కేవలం వాచ్యార్థాన్ని సమర్థించినట్లు కొన్ని గౌణస్థలాలలో ద్వితీయార్థప్రతీతి ఉన్నా అది వాచ్యార్థోపకారకంగా మాత్రమే ఉండడంవల్ల అక్కడ వ్యంజకత్వానికి ప్రాధాన్యం ఏమీ లేదని భావం.

వాటిలో గౌణానికి ఉదాహరణం చూపుతున్నాడు - యథేతి. వ్యంజకత్వశూన్యమైన రెండవ ప్రకారాన్ని కూడ చూపడానికి ఉపక్రమిస్తున్నాడు - యాపీతి. చారురూపం అనగా విశ్రాంతికి స్థానమైన సౌందర్యం. అది లేకపోతే వ్యంజకత్వవ్యాపారం వికసించనే వికసించదు. ఎందుచేతననగా అది తిరిగివచ్చి వాచ్యార్థంలోనే విశ్రమిస్తుంది. దాని **స్థితి** క్షణకాలం కనబడి నశించిపోయిన దివ్య వైభవం గల ప్రాకృతపురుషుని స్థితి వంటిది.

## ధ్వన్యాలోకం

యత్ర తు సా చారురూపవ్యఙ్గ్యప్రతీతిహేతుః తత్రాపి వ్యఞ్జకత్వానుప్రవేశేనైవ, వాచకత్వవత్. అసమ్భావినా చార్థేన యత్ర వ్యవహారః, యథా - 'సువర్ణపుష్పాం పృథివీమ్' ఇత్యాదౌ తత్ర చారు రూపవ్యఙ్గ్యప్రతీతిరేవ ప్రయోజికేతి తథావిధేఽపి విషయే గుణవృత్తౌ సత్యామపి ధ్వనివ్యవహార ఏవ యుక్త్యనురోధీ. తస్మాదవివక్షితవాచ్యే ధ్వనౌ ద్వయోరపి ప్రభేదయోః వ్యఞ్జకత్వవిశేషావిశిష్టా గుణవృత్తిః న తు తదేకరూపా, సహృదయహృదయాహ్లాదినీ ప్రతీయమానా ప్రతీతిహేతుత్వాద్విషయాన్తరే తద్రూపశూన్యాయా దర్శనాత్. ఏతచ్చ సర్వం ప్రాక్ సూచితమపి స్ఫుటతరప్రతీతయే పునరుక్తమ్.

### బాలానందిని

యత్రేతి - ఎక్కడైతే ఆ గుణవృత్తి చారురూపమైన వ్యంగ్యంయొక్క ప్రతీతికి హేతువుగా ఉంటుందో అక్కడ కూడ వాచకత్వం వలె, వ్యంజకత్వంయొక్క అనుప్రవేశంచేతనే, సంబంధంచేతనే. "సువర్ణపుష్పాం పృథివీమ్" ఇత్యాదులలో వలె ఎక్కడ అసంభవియైన విషయంలో వ్యవహారం చేయబడుతుందో అక్కడ చారురూపవ్యంగ్యప్రతీతియే వ్యంగ్యవ్యవహారానికి నిమిత్తం. అందువల్ల ఆ విధమైన విషయంలో కూడ గుణవృత్తి ఉన్నా కూడ ధ్వని అని వ్యవహారమే యుక్తియుక్తంగా ఉంటుంది. అందువల్ల అవివక్షితవాచ్యధ్వనిలోని రెండు ప్రభేదాలలో కూడ గుణవృత్తి వ్యంజకత్వవిశేషంతో, అనగా వ్యంజకత్వం అనే భేదకధర్మంతో, కూడినది కాదు. తదేకరూపం, అనగా వ్యంజకత్వంతో అభిన్నమైన రూపం కలది కాదు. ఎందుచేత ననగా అది సహృదయహృదయాహ్లాదినియైన ప్రతీయమానవృత్తి కాదు. ('న') దీనితో కూడ అన్వయించుకొని ఈ అర్థం చెప్పబడింది) అది వ్యంగ్యం ప్రతీతికి హేతువు కదా? ఇతరవిషయాలలో (స్థలాలలో) వ్యంగ్యం లేని గుణవృత్తి కనబడుతున్నది కదా?

వివరణ:- వృత్తిలోని "తస్మాత్" మొదలు "దర్శనాత్" వరకు ఉన్న వాక్యం సరిగా అన్వయించడం లేదు. భావం స్పష్టంగానే ఉన్నది. లోచనకారుడు బాలప్రియాకారుడూ కూడ శ్రమపడి ఏదో సమన్వయం సూచించారు. "వ్యఞ్జకత్వవిశేషావిశిష్టా"కు బదులు

"వ్యఞ్జకత్వవిశేషావిష్టా" అనే పాఠం, "సహృదయహృదయాహ్లాదినీ ప్రతీయమానా ప్రతీతిహేతుత్వాత్" కు బదులు "సహృదయహృదయాహ్లాదిప్రతీయమానప్రతీతి హేతుత్వాత్" అని పాఠం ఉంటే బాగుంటుంది. అపుడు దీని అర్థం - "ఈ రెండు ప్రభేదాలలోనూ కూడ గుణవృత్తి వ్యంజకత్వవిశేషంతో ఆవిష్టమైనది, కూడినది, అంతే కాని వ్యంజకత్వైకరూపం కాదు. ఇది సహృదయహృదయాహ్లాదిప్రతీయమానార్థ ప్రతీతికి హేతువు కదా?" అని అర్థం.

'ఏతచ్చేతి - ఇదంతా పూర్వం సూచించబడినా కూడ స్పష్టతరమైన జ్ఞానంకొరకు మళ్లీ చెప్పబడింది.

లోచనం

నను యత్ర వ్యఙ్గ్యేఽర్థే విశ్రాన్తిః తత్ర కిం కర్తవ్యమిత్యాశఙ్క్యాహ - యత్ర త్వితి, అస్తి తత్ర వ్యఞ్జనవ్యాపారః పరిస్ఫుట ఏవేత్యర్థః. దృష్టాన్తం పరాఙ్గీకృతమేవాహ - వాచకత్వవదితి. వాచకత్వే హి త్వయైవాఙ్గీకృతో వ్యఞ్జన వ్యాపారః ప్రథమం ధ్వనిప్రభేదమ్ అప్రత్యాచక్షాణేనేత్యర్థః. కిం చ వస్త్వన్తరే ముఖ్యే సంభవతి సంభవదేవ వస్త్వన్తరం ముఖ్యమేవారోప్యతే, విషయాన్తరమాత్రతస్తు ఆరోపవ్యవహార ఇతి జీవితముపచారస్య. సువర్ణ పుష్పాణాం తు మూలత ఏవ అసంభవాత్ తదుచ్చయనస్య తత్ర క ఆరోపవ్యవహారః? 'సువర్ణపుష్పామ్ పృథివీమ్ ' ఇతి హి స్యాదారోపః. తస్మాదత్ర వ్యఞ్జనవ్యాపార ఏవ ప్రధానభూతో నారోపవ్యవహారః. స పరం వ్యఞ్జనావ్యాపారానురోధితయా ఉత్తిష్ఠతి. తదాహ అసంభవినా ఇతి. ప్రయోజికేతి - వ్యఙ్గ్యమేవ హి ప్రయోజనరూపం ప్రతీతివిశ్రామస్థానమ్; ఆరోపితే త్వసంభవతి ప్రతీతివిశ్రాన్తిరాశఙ్కనీయాపి న భవతి. సత్యామపీతి. వ్యఞ్జనవ్యాపారసంపత్తయే క్షణమాత్రమవలమ్బితాయా మితి భావః. తస్మాదితి - వ్యఞ్జకత్వలక్షణో యో విశేషః తేన అవిశిష్టా అవిద్యమానం విశిష్టం విశేషః భేదనం యస్యాః, వ్యఞ్జకత్వం న తస్యా భేద ఇత్యర్థః. యది వా వ్యఞ్జకత్వ లక్షణేన వ్యాపారవిశేషేణ అవిశిష్టా న్యక్కృస్వతభావా; ఆ సమన్తాత్ వ్యాప్తా. **తదేకేతి** - తేన వ్యఞ్జకత్వలక్షణేన సహ ఏకం రూపం యస్యాః సా తథావిధా

న భవతి. అవివక్షితవాచ్యే వ్యఞ్జకత్వం గుణవృత్తేః పృథక్, చారుప్రతీతి హేతుత్వమస్తీతి దర్శయతి - విషయాన్తరే ఇతి. అగ్నిర్వటురిత్యాదౌ. ప్రాగితి. ప్రథమోద్ద్యోతే.

బాలానందిని

నన్వితి:- వ్యంగ్యాంతరంలోనే విశ్రాంతి ఎక్కడ ఉంటుందో అక్కడ ఏమి చేయాలి అని ఆశంకించుకొని చెపుతున్నాడు - యత్ర త్వితి. అక్కడ వ్యంజనావ్యాపారం అనే మరొక వ్యాపారం స్పష్టంగా ఉన్నది అని అర్థం. పరునిచేత అంగీకరించబడిన దృష్టాంతమే చెపుతున్నాడు - వాచకత్వవదితి - మొదటి ధ్వనిప్రభేదాన్ని ప్రత్యాఖ్యానించని నువ్వు వాచకత్వంలో వ్యంజనవ్యాపారాన్ని అంగీకరించియే ఉన్నావు కదా అని భావం. మరొక విషయం ఏమనగా - సంభవించే (అనగా లోకంలో ఉండడానికి అవకాశం ఉన్న) ముఖ్యమైన ఒక వస్తువునందు, సంభవించేదే అయిన ముఖ్యమైన మరొక వస్తువు ఎప్పుడు ఆరోపించబడుతుందో అప్పుడు, ఆ రెండూ వేరు వేరు విషయాలవడం మాత్రంచేత, దానిని ఆరోపం అంటారు, అదే ఉపచారానికి జీవితం. సువర్ణపుష్పాలనేవే అసలు లేవు. అలాంటప్పుడు వాటిని ప్రోగుచేసుకోవడం విషయంలో ఆరోపవ్యవహారం ఎక్కడిది? "సువర్ణపుష్పాం పృథివీమ్" అని ఇక్కడ ఆరోపం (కవిచేత చెప్పబడుతున్నది గాన) అది ఒక విధంగా ఆరోపం అని చెప్పవలసి ఉంటుంది. అనగా ఉచ్చయనంలో ఆరోపం లేకపోయినా పృథివిమీద సువర్ణపుష్పత్వం ఆరోపించబడుతున్నది అని మాత్రం ఏదో విధంగా చెప్పాలి. అందువల్ల ఇక్కడ వ్యంజనావ్యాపారమే ప్రధానమైనది; ఆరోపవ్యవహారం ప్రధానం కాదు. కేవలం అది (ఆరోపం) వ్యంజనావ్యాపారాన్ని అనుసరించి బయలుదేరుతుంది. ఆ విషయమే అసంభావినా ఇత్యాది వాక్యంలో చెపుతున్నాడు. ప్రయోజికేతి. ప్రయోజనరూపమైన వ్యంగ్యమే ప్రతీతివిశ్రాంతికి స్థానం కదా? అసంభవమైన ఆరోపంలో ప్రతీతివిశ్రాంతి ఉంటుంది అని ఆశంకించడానికి కూడ ఉండదు అని భావం. సత్యామపీతి. వ్యంజనవ్యాపారనిష్పత్తికోసం అది క్షణకాలంపాటు అవలంబించబడినా కూడ అని అర్థం. తస్మాదితి. వ్యంజకత్వం అనే ఏ విశేషం ఉన్నదో దానిచేత, అవిశిష్టా= దేనికి విశిష్టం, అనగా భేదనం, లేదో అది. వ్యంజకత్వం దాని భేదం కాదు అని అర్థం. లేదా వ్యంజకత్వం అనే వ్యాపారంచేత, అవిశిష్టా= తిరస్కరించబడిన స్వభావం గలది; అంతటా వ్యాపించబడినది. (ఆవిష్టా) అనే పాఠం గ్రహిస్తే ఈ అర్థం అనాయాసంగా లభిస్తుంది) తదేకేతి - ఆ వ్యంజకత్వంతో

ఒకే రూపం కలది కాదు. అనుమానప్రయోగం చూపుతున్నాడు - అవివక్షితవాచ్యంలో ఉన్న వ్యంజకత్వం గుణవృత్తికంటె భిన్నమైనది, అది సుందరవ్యంగ్యప్రతీతికి హేతువు అవుతున్నది కదా? వివక్షితవాచ్యంలో ఉన్న వ్యంజకత్వం వలె. గుణవృత్తిలో సుందరప్రతీతిహేతుత్వం లేదు కదా అనే విషయాన్ని చూపుతున్నాడు - విషయాంతరే ఇతి. "అగ్నిర్వటుః" ఇత్యాదులలో. ప్రాగితి. ప్రథమోద్యోతంలో.

## ధ్వన్యాలోకం

అపి చ వ్యఞ్జకత్వలక్షణో యః శబ్దార్థయోర్ధర్మః స ప్రసిద్ధ సంబన్ధానురోధీతి న కస్యచిద్విమతివిషయతామర్హతి. శబ్దార్థయోర్హి ప్రసిద్ధో యః సంబన్ధః వాచ్యవాచకభావాఖ్యః తమనురున్ధాన ఏవ వ్యఞ్జకత్వలక్షణో వ్యాపారః సామగ్ర్యన్తరసంబన్ధాత్ ఔపాధికః ప్రవర్తతే. అత ఏవ వాచకత్వాత్తస్య విశేషః. వాచకత్వం హి శబ్దవిశేషస్య నియత ఆత్మా; వ్యుత్పత్తికాలాదారభ్య తదవినాభావేన తస్య ప్రసిద్ధత్వాత్. స త్వనియతః ఔపాధికత్వాత్; ప్రకరణాద్యవచ్ఛేదేన తస్య ప్రతీతేః, ఇతరథా తు అప్రతీతేః.

### బాలానందిని

అపి చేతి. మరొక విషయం ఏమనగా - వ్యంజకత్వరూప మైన, శబ్దార్థాలలో ఉన్న ఏ ధర్మం ఉన్నదో అది ప్రసిద్ధమైన సంబంధాలను అనుసరించియే ఉంటుంది గాన ఎవరికీ విమతి విషయం అవడానికి తగదు (ఎవరూ లేదనడానికి వీలైనది కాదు). ప్రసిద్ధమైన వాచ్యవాచకభావం అనే ఏ శబ్దార్థాల సంబంధం గలదో దానినే అనుసరించి వ్యంజకత్వవ్యాపారం కూడ ఉంటుంది. అయితే ఈ వ్యాపారం ఇతరసామగ్రితో సంబంధం ఉండడంవల్ల ఔపాధికంగా ప్రవర్తిస్తుంది. (ఉపాధి అనగా ఇక్కడ బాహ్యనిమిత్తం. దానిని ఆధారంగా చేసుకొని ఏర్పడినది ఔపాధికం). అందువల్లనే దానికి వాచకత్వం కంటె విశేషం (భేదం). వాచకత్వం అనేది శబ్దవిశేషానికి ఉన్న నిశ్చితమైన స్వరూపం. ఎందువల్ల ననగా - వ్యుత్పత్తికాలంనుంచీ కూడ (బాల్యంలో ఆ శబ్దార్థాలను అభ్యసించిననాటినుంచీ కూడ) అది (వాచకత్వం) దానితో (శబ్దంతో) అవినాభావంతో (విడదీయశక్యంకాని రీతిలో) ప్రసిద్ధంగా ఉంటుంది; అదైతే

(వ్యంజకత్వమైతే) ఔపాధికం అవడంచేత అనియతం; అనిశ్చితం, అది ప్రకరణాద్యవచ్ఛేదంచేత (ప్రకరణాదిసాహాయ్యంచేత) భాసిస్తుంది; అవి లేకపోతే భాసించదు.

లోచనం

నియతస్వభావాచ్చ వాచ్యవాచకత్వాత్ ఔపాధికత్వేన అనియతం వ్యఞ్జకత్వం కథం న భిన్ననిమిత్తమితి దర్శయతి - అపి చేతి. ఔపాధిక ఇతి. వ్యఞ్జకత్వవైచిత్ర్యం యత్పూర్వముక్తం తత్కృత ఇత్యర్థః. అత ఏవ సమయనియమితాదభిధావ్యాపారాద్విలక్షణ ఇతి యావత్. ఏతదేవ స్ఫుటయతి - అత ఏవేతి. ఔపాధికత్వం దర్శయతి - ప్రకరణాదీతి.

బాలానందిని

నియతేతి. నియతస్వభావంగల వాచ్యవాచకత్వంకంటె, ఔపాధికం అవడంచేత అనియతమైన వ్యంజకత్వం భిన్ననిమిత్తం కానిది ఎలా అవుతుంది అని చూపుతున్నాడు - అపి చేతి. ఔపాధిక ఇతి - పూర్వం చెప్పిన వ్యంజకత్వవైచిత్ర్యంచేత ఏర్పడినది అని అర్థం. అందువల్లనే ఇది సమయం (సంకేతం) చేత నియమితమైన అభిధావ్యాపారంకంటె విలక్షణమైనది అని భావం. ఈ విషయాన్నే స్పష్టీకరిస్తున్నాడు - అత ఏవేతి. ఔపాధికత్వాన్ని చూపుతున్నాడు - ప్రకరణాదీతి.

## ధ్వన్యాలోకం

నను యద్యనియతః తత్కిం తస్య స్వరూపపరీక్షయా? నైష దోషః. యతః శబ్దాత్మని తస్య అనియతత్వమ్; న తు స్వే విషయే వ్యఙ్గ్యలక్షణే. లిఙ్గత్వన్యాయశ్చాస్య వ్యఞ్జకభావస్య లక్ష్యతే, యథా లిఙ్గత్వమాశ్రయేషు అనియతాభాసమ్, ఇచ్ఛాధీనత్వాత్; స్వవిషయావ్యభిచారి చ, తథైవేదం యథా దర్శితం వ్యఞ్జకత్వమ్. శబ్దాత్మన్యనియతత్వాదేవ చ తస్య వాచకత్వప్రకారతా న శక్యా కల్పయితుమ్. యది హి వాచకత్వప్రకారతా తస్య భవేత్తచ్ఛబ్దాత్మని నియతతాపి స్యాత్ వాచకత్వవత్.

బాలానందిని

నన్వితి - ఈ వ్యంజకత్వం అనియతం అయితే దీని స్వరూపాన్ని పరీక్షించడం ఎందుకు?; ఈ దోషం లేదు. ఎందువల్ల ననగా అది శబ్దరూపంలో (శబ్దానికి సంబంధించినంతవరకు) అనియతం కాని వ్యంగ్యరూపమైన తన విషయంలో అనియతం కాదు. ఈ వ్యంజకభావానికి లింగత్వన్యాయం కనబడుతుంది. అనగా లింగానికీ (వహ్న్యాదిసాధకమైన ధూమాదిలింగానికీ) దీనికీ కొంత సామ్యం ఉంది. ఇచ్ఛాధీనం అవడంచేత లింగత్వం ఏ విధంగా తన ఆశ్రయంలో అనియతమైన అవభాసం కలదో, అయితే తన విషయంలో వ్యభిచారి కాదో, పూర్వం వివరించబడిన వ్యంజకత్వం కూడా అదే విధంగా ఉంటుంది. శబ్దస్వరూపం విషయంలో అది అనియతమైనది గాన అది కూడ వాచకత్వంలో ఒక ప్రకారమే (వాచకత్వభేదమే) అని కల్పించడానికి శక్యం కాదు. అది వాచకత్వప్రకారమే అయితే అప్పుడు, వాచకత్వం వలె, శబ్దస్వరూపంలో నియతంగా ఉండేది.

లోచనం

కిం తస్యేతి - అనియతత్వాద్యథారుచి కల్ప్యేత, పారమార్థికం రూపం నాస్తీతి. న చ అవస్తునః పరీక్షా ఉపపద్యతే ఇతి భావః. శబ్దాత్మనీతి - సఙ్కేతాస్పదే పదస్వరూపమాత్రే ఇత్యర్థః. ఆశ్రయేష్వితి - న హి ధూమే వహ్నిగమకత్వం సదాతనమ్; అన్యగమకత్వస్య, వహ్న్యగమకత్వస్య చ దర్శనాత్. ఇచ్ఛాధీనత్వాదితి - ఇచ్ఛాత్ర పక్షధర్మత్వజిజ్ఞాసా - వ్యాప్తిసుస్మూర్షాప్రభృతిః. స్వవిషయేతి - స్వస్మిన్ విషయే చ గృహీతే త్రైరూప్యాదౌ న వ్యభిచరతి.

బాలానందిని

కిమితి - అనియతం అవడంవల్ల, పారమార్థికమైన (నిజమైన) రూపం ఏదీ లేకపోవడంచేత, ఇష్టానుసారం కల్పించబడవచ్చును. లేనిదాని పరీక్ష యుక్తం కాదు కదా అని భావం. శబ్దాత్మనీతి - సంకేతానికి స్థానమైన పదస్వరూపం విషయంలో మాత్రమే అని అర్థం. ఆశ్రయేష్వితి. ధూమం ఎల్లప్పుడూ వహ్నిని ఊహింపచేస్తుంది అనడానికి వీలులేదు కదా? ఒకప్పుడు అది మరొక దానిని ఊహింపచెయ్యడం (మండుతున్న కట్టెలు ఫలానావి అయి ఉంటాయి, తడివి అయి ఉంటాయి ఇత్యాది విషయాలను ఊహింపచేయడం) వహ్నిని ఊహింపచేయకపోవడం మొదలైనవి

ఉండవచ్చు కదా? ఇచ్ఛాధీనత్వాదితి - ఇక్కడ ఇచ్ఛ అనగా పక్షధర్మత్వాన్ని (ధూమం పర్వతంమీద ఉన్నదని) తెలుసుకోవాలని ఇచ్ఛ, వ్యాప్తిని స్మరించాలని ఇచ్ఛ మొదలైనది. అనగా ధూమం చూసినంతమాత్రాన ప్రతీవానికీ, ఎల్లప్పుడూ వహ్నిజ్ఞానం కలగాలనే నియమం లేదు. ఒకడు యాదృచ్ఛికంగా ధూమాన్ని చూచినా మరొక ఆలోచనలోనికి వెళ్ళవచ్చు అని అర్థం. స్వవిషయేతి. (వహ్నిని ఊహింపచేయవలసివస్తే మాత్రం) (లింగత్వం) గ్రహించబడినం తనకు సంబంధించిన లింగం (ధూమాదికం) విషయంలోను, తనకు విషయమైన సాధ్యం (వహ్న్యాదివిషయంలోను), త్రైరూప్యాదులలోను వ్యభిచరించదు.

వివరణ:- ధూమాదిలింగాన్ని పట్టి వహ్న్యాధిని ఊహించడానికి ఆ లింగంలో పక్షవృత్తిత్వం, సపక్షవృత్తిత్వం, విపక్షావృత్తిత్వం అనే మూడు అంశాలు ఉండాలి. దేనిమీద సాధ్యం ఉన్నట్లు ఊహిస్తామో అది (పర్వతాదికం) పక్షం. దానితో సమానమైనది సపక్షం; వంటయిల్లు మొదలైనది. దానిక విరుద్ధమైనది విపక్షం; చెరువు మొదలైనది. ధూమం పర్వతంమీద ఉండాలి, (పక్షవృత్తిత్వం); వంటయిల్లు మొదలైనవాటిలో కూడ ధూమం ఉండాలి (సపక్షవృత్తిత్వం). చెరువులో ఉండకూడదు (విపక్షావృత్తిత్వం). ఈ మూడు రూపాలు ఉన్నదే నిర్దుష్టమైన లింగం. ఈ విషయాలు వేటిలోను లింగం వ్యభిచరించకపోయినా ఇచ్ఛాదులు లేకపోతే సాధ్యజ్ఞానం కలగదు. అట్లే వ్యంగ్యం విషయం కూడ అని భావం.

## ధ్వన్యాలోకం

స చ తథావిధ ఔపాధికో ధర్మః శబ్దానామౌత్పత్తిక శబ్దార్థ సంబన్ధవాదినా వాక్యతత్త్వవిదా పౌరుషాపౌరుషేయయోర్వాక్యయోః విశేషమబిదతా పనియమేనాభ్యుపగన్తవ్యః; తదనభ్యుపగమే హి తస్య శబ్దార్థసంబన్ధనిత్యత్వే సత్యపి అపౌరుషేయ పౌరుషేయయోర్వాక్యయోః అర్థప్రతిపాదనే నిర్విశేషత్వం స్యాత్. తదభ్యుపగమే తు పౌరుషేయాణాం వాక్యానాం పురుషేచ్ఛానువిధానమారోపితౌపాధికవ్యాపారాన్తరాణాం సత్యపి స్వాభిధేయసంబన్ధాపరిత్యాగే మిథ్యార్థతాపి భవేత్.

బాలానందిని

స చేతి :- శబ్దాలకు అర్థాలకు ఉన్న సంబంధం నిత్యం అని చెప్పేవాడూ, వాక్యాలు పౌరుషేయా లనీ అపౌరుషేయా లనీ రెండు విధా లని విశేషాన్ని చెప్పేవాడూ అయిన వాక్యతత్త్వవేత్త (మీమాంసకుని) చేత కూడ శబ్దాలకు ఆ విధమైన ఔపాధికమైన ధర్మం తప్పక అంగీకరించ తగినదే. అది అంగీకరించకపోతే ఆతనికి శబ్దార్థసంబంధనిత్యత్వం ఉన్నా కూడ అపౌరుషేయ - పౌరుషేయ వాక్యాల అర్థ ప్రతిపాదనంలో భేదం ఏమీ ఉండదు. దాన్ని (ఔపాధికధర్మాన్ని) అంగీకరించే పక్షంలో పురుషేచ్ఛానుసరణంచేత ఆరోపించబడిన ఔపాధికమైన వ్యాపారాంతరం గల పౌరుషేయవాక్యాలకు తమ అర్థంతో సంబంధాన్ని త్యజించకపోయినా మిథ్యార్థప్రతిపాదకత్వం కూడ ఉంటుంది.

లోచనం

న కస్య చిద్విమతిమేతీతి యదుక్తం తత్ స్ఫుటయతి - స చేతి. వ్యఞ్జకత్వలక్షణ ఇత్యర్థః. ఔత్పత్తికేతి - జన్మనా ద్వితీయో భావవికారః సత్తారూపసామీప్యాల్లక్ష్యతే; విపరీతలక్షణాతో వానుత్పత్తిః; రూఢ్యా వా ఔత్పత్తికశబ్దః నిత్యపర్యాయః. తేన నిత్యం యః శబ్దార్థయోః శక్తిలక్షణం సమ్బన్ధమిచ్ఛతి జైమినేయః తేనేత్యర్థః. నిర్విశేషత్వమితి. తతశ్చ పురుషదోషానుప్రవేశస్య అకించిత్కరత్వాత్ తన్నిబన్ధనం పౌరుషేయేషు వాక్యేషు యదప్రామాణ్యం తన్న సిద్ధ్యేత్. ప్రతిపత్తురేవ హి యది తథా ప్రతిపత్తిః తర్హి వాక్యస్య న కశ్చిదపరాధ ఇతి కథమప్రామాణ్యమ్? అపౌరుషేయే వాక్యేఽపి ప్రతిపత్తృదౌరాత్మ్యాత్ తథా స్యాత్.

బాలానందిని

నేతి. వ్యంజకత్వం ఎవనికీ కూడ విమతివిషయత్వాన్ని పొందదు (అందరూ దీనిని అంగీకరించాలి) అని చెప్పినదానినే విశదీకరిస్తున్నాడు - స చేతి. వ్యఞ్జకత్వలక్షణమైన ఔపాధికధర్మం అని అర్థం. ఔత్పత్తికేతి. జన్మచేత సామీప్యాన్ని పట్టి సత్తారూపమైన రెండవ భావవికారం లక్షణయా బోధించబడుతుంది. లేదా విపరీతలక్షణచేత అనుత్పత్తి బోధించబడుతుంది. లేదా రూఢిచేత 'ఔత్పత్తిక' శబ్దం నిత్యపర్యాయం. అందుచేత ఏ జైమినేయుడు (మీమాంసకుడు) శబ్దార్థాల శక్తిరూపమైన సంబంధం నిత్యమైన దని

అంగీకరిస్తాడో వానిచేత అని అర్థం. నిర్విశేషత్వమితి. అలా అయితే పురుషదోషానుప్రవేశం ఏమీ చేయజాలదు కాబట్టి దానిని పట్టి పౌరుషేయవాక్యాలకు ఏ అప్రామాణ్యం చెప్పబడుతున్నదో అది సిద్ధించదు. తెలుసుకొనేవాడే అలా తెలుసుకుంటున్నాడు అంటే అందులో వాక్యం అపరాధం ఏదీ లేదు గాన దానికి అప్రామాణ్యం ఎలా కలుగుతుంది? అపౌరుషేయవాక్యంలో కూడా ప్రతిపత్తయొక్క దోషంవల్ల అప్రామాణ్యం చెప్పవలసి వస్తుంది.

వివరణ:- "ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబన్ధః" ఇత్యాదిజైమిని సూత్రంలో శబ్దార్థాల సంబంధం ఔత్పత్తికం అని చెప్పబడింది. ఇక్కడ 'ఔత్పత్తిక' శబ్దానికి నిత్యం అని అర్థం. ఈ అర్థం ఎలా వచ్చిందో అభినవగుప్తుడు మూడు విధాలు ప్రతిపాదించాడు. ప్రతివస్తువుకు ఆరు వికారాలు ఉంటా యని నిరుక్తంలో ప్రతిపాదించబడింది. జాయతే (పుడుతుంది), అస్తి(ఉంటుంది), వర్ధతే (పెరుగుతుంది), విపరిణమతే (మార్పుచెందుతుంది), అపక్షీయతే (క్షీణిస్తుంది), నశ్యతి (నశిస్తుంది). వీటికి షడ్భావవికారాలని పేరు. ఉత్పత్తి అనగా జన్మ. అందుచేత ఇక్కడ ఈ పదంచేత దాని దగ్గరనే ఉన్న రెండవ భావవికారం, ఉండడం (సత్త) లక్షణయా బోధింపబడుతుంది. మొదటి పక్షంలో ఎల్లప్పుడూ ఉంటుందని, రెండవ పక్షంలో కొత్తగా పుట్టేది కాదు అని భావం. లేదా ఔత్పత్తికశబ్దానికి రూఢిచేత నిత్యం అని అర్థం.

పురుషుని వాక్యాలలో భ్రమప్రమాదాలకి అవకాశం ఉంటుంది. అందుచేత పౌరుషేయవాక్యాలకు పూర్తిగా ప్రామాణ్యం ఉండదు. వేదాలు అపౌరుషేయాలు, పురుషులచేత నిర్మించబడినవి కావు. అందుచేత భ్రమప్రమాదాదిదోషాలు ఉండడానికి అవకాశం లేదు గాన అవి పరమప్రమాణాలు అని మీమాంసకుల మతం. శబ్దానికి అర్థానికీ ఉన్న సంబంధం నిత్యమైనదని అంగీకరించే ఈ మీమాంసకులు కూడా పౌరుషేయవాక్యాలలో ఔపాధికాలైన వ్యంజకత్వాదివ్యాపారాంతరాలు కూడా ఉంటాయి అని అంగీకరించి తీరాలి. అందుచేతనే వాటి ప్రామాణ్యం సందిగ్ధమైనది. అలా అంగీకరించకపోతే శబ్దార్థసంబంధనిత్యత్వం పౌరుషేయవాక్యాలకీ అపౌరుషేయవాక్యాలకీ సమానమే అయినప్పుడు పౌరుషేయవాక్యాలు ప్రమాణం కావు అని చెప్పడానికి కారణం ఏమిటి? వాక్యాలలో ఏమీ లేదు; అర్థం చేసుకొనేవాళ్లల్లో ఉండే లోపాన్ని పట్టే పౌరుషేయవాక్యాలకి అప్రామాణ్యం; అందుచేత ఈ ఉపాధిసంబంధాదులేవీ అంగీకరించవలసిన పని లేదు అని అంటే అప్పుడు అర్థం చేసుకొనేవాళ్లల్లోని లోపాలను పట్టి

అపౌరుషేయవాక్యాలకి కూడా అప్రామాణ్యం చెప్పవలసివస్తుంది అని ఈ ప్రఘట్టకానికి భావం.

## ధ్వన్యాలోకం

దృశ్యతే హి భావానామపరిత్యక్తస్వభావానామపి సామగ్ర్యన్తర సంపాతసంపాదితౌపాధికవ్యాపారాన్తరాణాం విరుద్ధక్రియత్వమ్. తథాహి - హిమమయూఖప్రభృతీనాం నిర్వాపితసర్వజీవలోకం శీతలత్వముద్వహతామేవ ప్రియావిరహదహనదహ్యమానమానసైః జనైః ఆలోక్యమానానాం సతాం సంతాపకారిత్వం ప్రసిద్ధమేవ. తస్మాత్పౌరుషేయాణాం వాక్యానాం సత్యపి నైసర్గికే అర్థసంబన్ధే మిథ్యార్థత్వం సమర్థయితుమిచ్ఛతా వాచకత్వవ్యతిరిక్తం కించిద్రూపమౌపాధికం వ్యక్తమేవ అభిధానీయమ్. తచ్చ వ్యఞ్జకత్వాదృతే నాన్యత్. వ్యఙ్గ్యప్రకాశనం హి వ్యఞ్జకత్వమ్. పౌరుషేయాణి చ వాక్యాని ప్రాధాన్యేన పురుషాభిప్రాయమేవ ప్రకాశయన్తి. స చ వ్యఙ్గ్య ఏవ న త్వభిధేయః. తేన సహ అభిధానస్య వాచ్యవాచకభావలక్షణసమ్బన్ధాభావాత్.

### బాలానందిని

దృశ్యతే ఇతి. భావాలు (పదార్థాలు)తమ స్వభావాన్ని విడవకపోయినా కొన్ని ఇతర సామగ్రుల కలయికచేత ఏర్పడిన ఔపాధికమైన వ్యాపారాంతరం కలవి అవడంచేత విరుద్ధమైన పని చేయడం చూస్తున్నాం కదా? ఎట్లనగా - సకలప్రాణుల సంతాపాన్నీ తొలగించే శీతలత్వం ఉన్న చంద్రాదులనే, ప్రియావిరహాగ్నిచేత దహించుకొనిపోతూన్న మనస్సు గల జనులు చూచినప్పుడు అవి వాళ్లకు సంతాపం కలిగించడం ప్రసిద్ధమే కదా? అందువల్ల పౌరుషేయవాక్యాలకు నిత్యమైన అర్థసంబంధం ఉన్నా కూడ వాటి అర్థం మిథ్య(అప్రమాణం) అనే విషయాన్ని సమర్థించాలని కోరేవాడు (మీమాంసకుడు) వాటికి వాచకత్వంకంటె అతిరిక్తమైన ఔపాధికమైన ఏదో ఒక రూపం ఉంటుం దని స్పష్టంగా చెప్పవలసి ఉంటుంది. ఆ ఔపాధికరూపం వ్యంజకత్వమే గాని మరొకటి

కాదు. వ్యంగ్యాన్ని ప్రకాశింపచేయడమే కదా వ్యంజకత్వం అనగా. పౌరుషేయవాక్యాలు ప్రధానంగా పురుషాభిప్రాయాన్నే ప్రకాశింపచేస్తాయి. అది వ్యంగ్యమే కాని అభిధేయం కాదు. దానితో (అభిప్రాయంతో) శబ్దానికి వాచ్యవాచకత్వసంబంధం లేదు కదా?

లోచనం

నను ధర్మాన్తరాభ్యుపగమేఽపి కథం మిథ్యార్థతా? న హి ప్రకాశకత్వలక్షణం స్వధర్మం జహాతి శబ్ద ఇత్యాశఙ్క్యాహ - దృశ్యత ఇతి. ప్రాధాన్యేనేతి - యదాహ - "ఏవమయం పురుషో వేద" ఇతి భవతి ప్రత్యయః, న త్వేవమయమర్థః" (శాబరభాష్యం. మొ. సం. పేజి. 4) ఇతి. తథా ప్రమాణాన్తరదర్శనమత్ర బాధ్యతే, న తు శాబ్దోఽన్వయ ఇత్యనేన పురుషాభిప్రాయానుప్రవేశాదేవ అఙ్గుల్యగ్రవాక్యాదౌ మిథ్యార్థత్వముక్తమ్. తేన సహేతి; అనియతతయా నైసర్గికత్వాభావాదితి భావః.

బాలానందిని

నన్వితి. ధర్మాంతరాన్ని అంగీకరించినా అసత్యార్థత్వం ఎందువల్ల? శబ్దం తన కున్న ప్రకాశకత్వం (బోధకత్వం) అనే తన ధర్మాన్ని విడవదు కదా అని ఆశంకించి చెపుతున్నాడు-దృశ్యతే ఇతి. ప్రాధాన్యేనేతి-"ఈ పురుషుడు ఇలా అనుకుంటున్నాడు" అనే జ్ఞానం కలుగుతుంది కాని "ఈ విషయం ఇంతే అనే జ్ఞానం (పురుషవాక్యాలవల్ల) కలగదు కదా" అని అందుచేతనే శాబరభాష్యంలో శబరాచార్యులు అన్నారు. అట్లే ప్రమాణాంతరంచేత దర్శనం (ఈవాక్యార్థాన్ని ప్రత్యక్షాదిప్రమాణాంతరంచేత పరిశీలించడం) కొన్నిచోట్ల బాధించబడుతుంది; అంతేకాని శబ్దంవల్ల కలిగే అన్వయం బాధించబడదు. ఈ విధంగా ఆ వాక్యార్థంలో పురుషాభిప్రాయప్రవేశం ఉండడంవల్లనే "అఙ్గుల్యగ్రే కరివరకులమ్" (ఏనుగుల గుంపు వ్రేలిచివర ఉన్నది) ఇత్యాదివాక్యాలు అసత్యార్థాలని చెప్పబడింది. అనగా - "అఙ్గుల్యగ్రే కరివరశతమ్" ఇత్యాది వాక్యాలలో కూడ పదాల పరస్పరాన్వయం జరిగి వాక్యార్థజ్ఞానం కలగడానికి అభ్యంతరం ఏదీ లేదు. ఆ వాక్యార్థాన్ని ప్రత్యక్షాదుల ద్వారా పరిశీలిస్తేనే అది అసత్యం అని తెలుతుంది అని భావం.

తేన సహేతి. పురుషాభిప్రాయం అనియతం (ఇలాగే ఉండాలి అనే నియమం ఏదీ లేనిది) అవడంచేత సహజత్వం (నిత్యత్వం) లేకపోవడంవల్ల అని భావం.

## ధ్వన్యాలోకం

నన్వనేన న్యాయేన సర్వేషామేవ లౌకికానాం వాక్యానాం ధ్వనివ్యవహారః ప్రసక్తః? సర్వేషామప్యనేన న్యాయేన వ్యఞ్జకత్వాత్. సత్యమేతత్; కిం తు వక్త్రభిప్రాయప్రకాశనేన యద్వ్యఞ్జకత్వం తత్సర్వేషామేవ లౌకికానాం వాక్యానామవిశిష్టమ్. తత్తు వాచకత్వాన్న భిద్యతే; వ్యఙ్గ్యం హి తత్ర నాన్తరీయకతయా వ్యవస్థితమ్; న తు వివక్షితత్వేన. యస్య తు వివక్షితత్వేన వ్యఙ్గ్యస్య స్థితిః తద్వ్యఞ్జకత్వం ధ్వనివ్యవహారస్య ప్రయోజకమ్.

### బాలానందిని

నన్వితి. ఈ న్యాయంచేత లౌకికవాక్యా లన్నింటినీ 'ధ్వని' అనవలసివస్తుంది కదా? ఈ న్యాయంచేత అన్ని వాక్యాలూ వ్యంజకాలే కదా? ఈ మాట నిజమే. సమస్త లౌకికవాక్యాలూ వక్తయొక్క అభిప్రాయాన్ని వ్యంజింపచేస్తాయి గాన వాటి కన్నింటికీ వ్యంజకత్వంలో భేదం లేదు; (అన్నీ వ్యంజకాలే). అయితే ఆ వ్యంజకత్వం వాచకత్వం కంటె భిన్నం కాదు. ఎందుచేత ననగా అక్కడ వ్యంగ్యం నాంతరీయకంగా (తప్పనిసరియైనదిగా) ఉంది. అంతేకాని వివక్షితంగా కాదు. (అనగా వాక్యం వినగానే తప్పనిసరిగా వక్తయొక్క అభిప్రాయం తెలుస్తుంది. ఆ విధంగా అది ఆ వాక్యానికి వ్యంగ్యమే. ఇది అన్ని వాక్యాలలోనూ ఉంటుంది. కాని ఈ వ్యంగ్యం వ్యంజింపచెయ్యాలి అనే అభిప్రాయంతో విశేషించి వ్యంజింపచేయబడినది కాదు అని అర్థం.) యస్యేతి. అయితే ఏ వ్యంగ్యం వివక్షితమై ఉంటుందో, వ్యంజింపచెయ్యా లనే అభిలాషతో వ్యంజింపచేయబడుతుందో ఆలాంటి వ్యంజకత్వమే ధ్వనివ్యవహారానికి ప్రయోజకం (నిమిత్తం).

### లోచనం

నాన్తరీయకతయేతి - 'గామానయ' ఇతి శ్రుతేఽప్యభిప్రాయే. వ్యక్తే తదభిప్రాయవిశిష్టోఽర్థః ఏవ అభిప్రేతానయనాదిక్రియాయోగ్యో, న త్వభిప్రాయమాత్రేణ కించిత్ కృత్యమితి భావః. వివక్షితత్వేనేతి - ప్రాధాన్యేనేత్యర్థః. యస్య త్వితి. ధ్వన్యుదాహరణేష్వితి భావః. కావ్యవాక్యేభ్యో

హి న నయనానయనాద్యుపయోగినీ ప్రతీతిరభ్యర్థ్యతే; అపి తు ప్రతీతివిశ్రాన్తికారిణీ; సా చ అభిప్రాయనిష్ఠైవ. నాభిప్రేతవస్తుపర్యవసానా.

బాలానందిని

నాన్తరీకకతయా ఇతి:- "గామానయ" (గోవును తీసికొనిరా) అన్న వాక్యం విన్న తరవాత అభిప్రాయం వ్యక్తమైనా కూడ ఆ అభిప్రాయంతో కూడిన అర్థమే ఇష్టమైన ఆనయనాదిక్రియకు యోగ్యం అవుతుంది; అంతేకాని అభిప్రాయమాత్రంచేత ఏమీ ప్రయోజనం లేదు అని భావం. వివక్షితత్వేనేతి - ప్రధానంగా వివక్షితం అవడంచేత అని అర్థం. యస్య త్వితి. ధ్వన్యుదాహరణాలలో అని అర్థం. కావ్యవాక్యాలవల్ల తీసికొనివెళ్ళడానికీ, తీసికొని రావడానికీ తదితరక్రియలకీ ఉపయోగించే ప్రతీతి అపేక్షించబడడం లేదు. మరేమనగా (వాచ్య) ప్రతీతికి విశ్రాంతిని కలిగించే ప్రతీతి అపేక్షించబడుతుంది. అది (విశ్రాంతి) అభిప్రాయంలోనే ఉన్నది గాని ఇష్టమైన వస్తువునందు (వస్త్వానయనాదులందు) పర్యవసించేది కాదు.

వివరణ:- అన్ని వాక్యాలూ కూడ వక్తయొక్క అభిప్రాయాన్నే ఆవిష్కరిస్తాయి. ఆ విషయంలో (అభిప్రాయవ్యంజకత్వంలో) అన్ని వాక్యాలూ సమానమే. లౌకికవాక్యాలలో అభిప్రాయవ్యంజనంతో ఆగిపోవడానికి వీలులేదు. ఆ అభిప్రాయం నయన అనయనాదిక్రియలకు అనుకూలమైన అర్థాన్ని బోధించాలి. కావ్యవాక్యాలలో ఇట్లు కాదు. వాచ్యార్థ ప్రతీతితోనే విశ్రాంతి కలుగుతుంది. వాచ్యార్థప్రతీతిని కలిగించి దానితో వాక్యం ఆగిపోతుంది. అయితే ఆ వాచ్యవిశ్రాంతి అంతటితో ఆగిపోక అభిప్రాయనిష్ఠమై ఉంటుంది. అనగా రసాదివ్యంగ్యంలో పర్యవసానం చెందుతుంది. అంతే కాని వాచ్యవస్తుమాత్రపర్యవసన్నం కాదు అని అర్థం. ఇది బాలప్రియానుసారం వ్రాసిన భావం. కాని 'అభిప్రాయనిష్ఠైవ' అనేదానికి రసాదిపర్యవసాయిని అనే అర్థం క్లిష్టకల్పన. పైన చూపినట్లే దీని అర్థం యుక్తం అని తోచుచున్నది.

ధ్వన్యాలోకం

యత్తు అభిప్రాయవిశేషరూపం వ్యఙ్గ్యం శబ్దార్థాభ్యాం ప్రకాశతే తద్భవతి వివక్షితం తాత్పర్యేణ ప్రకాశమానం సత్. కింతు తదేవ కేవలమపరిమితవిషయస్య ధ్వనివ్యవహారస్య న ప్రయోజకమ్; అవ్యాపకత్వాత్. తథా దర్శితభేదత్రయరూపం తాత్పర్యేణ

ద్యోత్యమానమభిప్రాయరూపమనభిప్రాయరూపం చ సర్వమేవ ధ్వనివ్యవహారస్య ప్రయోజకమితి యథోక్త వ్యఞ్జకత్వవిశేషే ధ్వనిలక్షణే నాతివ్యాప్తిః న చ అవ్యాప్తిః. తస్మాద్వాక్యతత్త్వవిదాం మతేన తావద్వ్యఞ్జకత్వలక్షణః శాబ్దో వ్యాపారో న విరోధీ; ప్రత్యుత అనుగుణ ఏవ లక్ష్యతే.

పరినిశ్చితనిరపభ్రంశబ్రహ్మణాం విపశ్చితాం మతమాశ్రిత్యైవ ప్రవృత్తోఽయం ధ్వనివ్యవహార ఇతి తైః సహ కిం విరోధావిరోధౌ చిన్త్యేతే. కృత్రిమశబ్దార్థసంబన్ధవాదినాం తు యుక్తివిదామనుభవసిద్ధ ఏవాయం వ్యఞ్జకభావః, శబ్దానామర్థాన్తరాణామివ అవిరోధశ్చేతి న ప్రతిక్షేప్యపదవీమవతరతి.

బాలానందిని

యత్త్వితి. అభిప్రాయవిశేషరూపమైన ఏ వ్యంగ్యం శబ్దార్థాలనుండి ప్రకాశిస్తుందో అది తాత్పర్యంచేత ప్రకాశింపచేయబడినదై వివక్షితం అవుతుంది. అనగా దీనిని ప్రకాశింపచెయ్యాలి అనే అభిప్రాయంతో ప్రకాశింపచేయబడినట్లయితే దానిని వివక్షితం అనవచ్చు. అయితే ధ్వనివ్యవహారం అపరిమితమైన, అతివిస్తృతమైన వ్యవహారం గలది. అందుచేత ఈ అభిప్రాయవిశేషరూపమైన వ్యంగ్యం ఒక్కటే ధ్వనివ్యవహారానికి ప్రయోజకం కాదు. తాత్పర్యంచేత వ్యంజింపబడే, పూర్వం చూపబడిన భేదత్రయరూపమైనదీ, అభిప్రాయరూపమైనదీ, అనభిప్రాయరూపమైనదీ అంతా కూడ ధ్వనివ్యవహారానికి ప్రయోజకం గాన ధ్వనిరూపమైన వ్యంజకత్వ విశేషంలో అతివ్యాప్తి లేదు. అవ్యాప్తి లేదు.

అనగా కొన్ని గుణీభూతవ్యంగ్యస్థలాలలో అభిప్రాయవిశేషరూపవ్యంగ్యం ధ్వనివ్యవహారానికి కారణం, కొన్నిచోట్ల, రసాదిధ్వనులలో అనభిప్రాయరూపవ్యంగ్యం ధ్వనివ్యవహారకారణం. అందుచేత వెనుక చెప్పిన ధ్వనిలక్షణం అన్నింటికీ వర్తిస్తుంది గాన అతివ్యాప్తి గాని అవ్యాప్తి గాని లేదు అని అర్థం.

తస్మాదితి. అందువల్ల వాక్యతత్త్వవేత్తలైన మీమాంసకుల మతం ప్రకారం కూడ వ్యంజకత్వరూపమైన శబ్దవ్యాపారం విరోధి కాదు; పైగా అది దానికి అనుగుణంగానే కనబడుతున్నది.

వైయాకరణులకు కూడ ధ్వని అంగీకార్యమే అని చెపుతున్నాడు - పరినిశ్చితేతి :-ఏ వైయాకరణులతో కూడ విరోధావిరోధాలు చింతింవబడతాయో (చింతింపబడవలసిఉన్నాయో) ఆ నిశ్చితమైన నిర్దుష్టశబ్దబ్రహ్మ గల పండితుల మతాన్ని ఆశ్రయించే ఈ ధ్వనివ్యవహారం ప్రవర్తించినది. అనగా వారితో పూర్వపక్షసిద్ధాంతాలు చేసే పని లేదని అర్థం.

తార్కికులకు కూడ ఈ విషయంలో విరోధం ఉండడానికి వీలులేదని చెపుతున్నాడు - కృత్రిమేతి. దీపాదులకు (అర్థాన్తరాణామ్) వలె శబ్దాలకున్న ఈ వ్యంజకత్వం శబ్దార్థసంబంధం కృత్రిమం అని అంగీకరించేవారికి కూడ అనుభవసిద్ధమే గాన, విరోధం లేదు గాన, వాళ్లు కూడ దీనిని నిరాకరించవలసిన పని లేదు.

లోచనం

నన్వేవమభిప్రాయస్యైవ వ్యఙ్గ్యత్వాత్ త్రివిధం వ్యఙ్గ్యమితి యదుక్తం తత్ కథమ్ ఇత్యాహ - యత్త్వితి. ఏవం మీమాంసకానాం నాత్ర విమతిర్యుక్తేతి ప్రదర్శ్య వైయాకరణానాం సా నాస్తీతి దర్శయతి - పరినిశ్చితేతి. పరితః నిశ్చితం ప్రమాణేన స్థాపితం నిరపభ్రంశం గలితభేదప్రపఞ్చతయా అవిద్యాసంస్కారరహితం, శబ్దార్థాఖ్యం ప్రకాశపరామర్శస్వభావం బ్రహ్మ వ్యాపకత్వేన, బృహద్విశేషశక్తినిర్భరతయా చ బృంహితం విశ్వనిర్మాణశక్తీశ్వరత్వాచ్చ బృంహణం యైరితి. ఏతదుక్తం భవతి - వైయాకరణాస్తావత్ బ్రహ్మపదేన అన్యత్ కించిదిచ్ఛన్తి, తత్ర కా కథా వాచకత్వవ్యఞ్జకత్వయోః? అవిద్యాపదే తు తైరపి వ్యాపారాన్తరమభ్యుప గతమేవ. ఏతచ్చ ప్రథమోద్ద్యోతే వితత్య నిరూపితమ్. ఏవం వాక్యవిదాం పదవిదాం చ అవిమతివిషయత్వం ప్రదర్శ్య ప్రమాణతత్త్వవిదాం తార్కికాణామపి న యుక్తాత్ర విమతిరితి దర్శయితుమాహ కృత్రిమేతి. కృత్రిమః సంకేతమాత్రస్వభావః పరికల్పితః శబ్దార్థయోః సంబన్ధ ఇతి యే వదన్తి నైయాయికసౌగతాదయః. యథోక్తమ్ - "న సామయికత్వాచ్ఛబ్దార్థసంబన్ధస్య" (న్యా.సూ. 1.2.56) ఇతి. తథా "శబ్దాః సంకేతితం ప్రాహుః" ఇతి. అర్థాన్తరాణామితి - దీపాదీనామ్. నన్వనుభవేన ద్విచన్ద్రాద్యపి సిద్ధమ్, తచ్చ విమతిపదమిత్యాశఙ్క్యాహ - అవిరోధశ్చేతి. అవిద్యమానో విరోధో నిరోధో

బాధకాత్మకో ద్వితీయేన జ్ఞానేన యస్య తేన అనుభవసిద్ధశ్చాబాధితశ్చేత్యర్థః. అనుభవసిద్ధం న ప్రతిక్షేప్యం యథా వాచకత్వమ్.

బాలానందిని

నన్వితి. ఈ విధంగా అభిప్రాయమే వ్యంగ్యం అనే పక్షంలో వ్యంగ్యం మూడు విధాలు (వస్త్వలంకారరసరూపం) అని వెనుక చెప్పినది ఎలా కుదురుతుంది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - యత్త్వితి. ఏవమితి - ఈ విధంగా వ్యంజకత్వం విషయంలో మీమాంసకులకు విమతి యుక్తం కాదు అని చూపించి ఈ విషయంలో వైయాకరణులకు విమతియే లేదని చూపుతున్నాడు - పరినిశ్చితేతి. పరితః= అన్ని విధాలా, నిశ్చితమ్= ప్రమాణంచేత స్థాపించబడిన, నిరపభ్రంశమ్= సకలభేదాలు తొలగిపోయినదవడంచేత అవిద్యాసంస్కారం లేని, శబ్దార్థస్వరూపమైన, అనగా నామరూపాత్మకమైన, లేదా నామరూపాలకు అధిష్ఠానమైన, ప్రకాశపరామర్శస్వభావమైన, అనగా స్వప్రకాశజ్ఞానస్వరూపమైన, బ్రహ్మ= వ్యాపకం అయి ఉండడంచేత పెద్దది (వ్యాపకత్వేన బృహత్), విశేషశక్తులతో నిండి ఉండడంచేత కూడ అతివిస్తృతమైన (అనంతప్రమాణంగలది) అయిన బ్రహ్మ. ఇక్కడ బృంహణం అనగా విశ్వనిర్మాణశక్తులచేత పరిణామసమర్థమై ఉండడం, అనగా వివిధశక్తులచేత ప్రపంచరూపంలో పరిణమించడానికి సమర్థమైనది, లేదా ప్రపంచనిర్మాణశక్తికి, మాయకు, అధిష్ఠానమైనది అని అర్థం. అలాంటి బ్రహ్మ ఎవరిచేత పరినిశ్చిత మైనదో వారు అని "పరినిశ్చితనిరపభ్రంశశబ్దబ్రహ్మణామ్" అనే పదానికి అర్థం.

వివరణ:- "బృహ, బృహి వృద్ధౌ" అని వృద్ధ్యర్థకమైన బృహధాతువునుండి గాని, బృహి ధాతువునుండి గాని బ్రహ్మశబ్దం నిష్పన్నమైనది. ఆ బృహత్త్వానికి పరిమితిని చెప్పడానికి నిమిత్తం ఏదీ లేదు గాన దేనిని మించినది మరొకటి లేదో అది బ్రహ్మ. కాల్పనికనామరూపాత్మకజగత్తుకు కారణంగా అది సగుణం అని, కల్పనారహితంగా నిర్గుణం అనీ ఆ బ్రహ్మయే చెప్పబడుతున్నది. 'వ్యాపకత్వేన బృహత్' అనే పదాలచేత నిర్గుణబ్రహ్మ, "విశేషశక్తిభరితతయా చ బృంహితమ్" అనే పధాలచేత సగుణబ్రహ్మ చెప్పబడ్డాయి.

ఏతదితి. ఇక్కడ చెప్పిన విషయం ఇది. వైయాకరణులు బ్రహ్మపదంచేత (మామూలు శబ్దాలకంటె భిన్నమైన) మరొకదానిని కోరుతున్నారు. పారమార్థికసత్యంగా ప్రతిపాదిస్తున్నారు. అలాంటప్పుడు వాచకత్వానికి గాని వ్యంజకత్వానికి గాని అవకాశం ఎక్కడ ఉంది? అయితే అవిద్యావస్థలో అనగా వ్యావహారికదశలో వాళ్లు కూడ

వ్యంజకత్వరూపమైన మరొక వ్యాపారం అంగీకరించియే ఉన్నారు. ఈ విషయం ప్రథమోద్ద్యోతంలో సవిస్తరంగా నిరూపించబడింది.

వివరణ:- పరినిశ్చితేత్యాదివృత్తివాక్యంలో 'యైః'కి బదులు "తైః" అని ఉండి ఉంటుంది. 'యైః' శబ్దంతో అన్వయం సరిగా కుదరదు. "ఆ పండితుల మతాన్ని ఆశ్రయించే ఈ ధ్వనివ్యవహారం వచ్చింది గాన వాళ్లతో విరోధావిరోధచింతతో పని లేదు" అని అర్థం చక్కగా కుదురుతుంది. లోచనకారుడు "పరినిశ్చితనిరపభ్రంశశబ్ద బ్రహ్మణామ్" అనే పదానికి అర్థవివరణపూర్వకంగా చూపించిన విగ్రహవాక్యాన్ని 'యైరితి' అని పూర్తి చేశాడు. దానిని పట్టి 'యైః' అనేది వృత్తిగతమైన శబ్దం అని భ్రాంతిచేత ఎవరో 'తైః'కి బదులు 'యైః' చేర్చి ఉంటారు.

ఏవమితి. ఈ విధంగా వ్యంజకత్వం వాక్యవేత్తలకూ, పదవేత్తలకూ కూడ విమతివిషయం (అనంగీకార్యం) కాదని చూపించి ప్రమాణతత్త్వవేత్తలైన తార్కికులకు కూడ ఈ విషయంలో విమతి యుక్తం కాదు అని చూపడానికి చెపుతున్నాడు - కృత్రిమేతి. శబ్దార్థాల సంబంధం, కృత్రిమం అనగా సంకేతమాత్రస్వరూప మైనది, కల్పించబడినది అని ఏ నైయాయికబౌద్ధాదులు అంటారో వారు. (నైయాయికులు) ఇలా చెప్పి ఉన్నారు - "శబ్దం లింగంగా ఉండీ అర్థాన్ని బోధించేది కాదు(న); శబ్దంనుండి అర్థజ్ఞానం సమయంచేత (సంకేతంచేత) కలుగుతుంది". అట్లే (సౌగతులు) "శబ్దాలు సంకేతిత మైన అర్థాన్ని బోధిస్తాయి" అని అన్నారు. అర్థాన్తరాణామితి. దీపాదులకు, నన్వితి - ద్విచంద్రాదికం (ఒక చంద్రుడు రెండు చంద్రులుగా కనబడడం) అనుభవసిద్ధమే. కాని అది విమతికి స్థానం కదా అని ఆశంకించుకొని చెపుతున్నాడు - అవిరోధశ్చేతి. దేనికి రెండవ జ్ఞానంచేత విరోధం, అనగా బాధకరూపమైన (ఇదికాదు అనే) నిరోధం, లేదో అది. అనగా అనుభవసిద్ధము, బాధితం కానిది అని అర్థం. అనుభవసిద్ధమైనదానిని, వాచకత్వాన్నివలె, కాదనడానికి వీలు లేదు.

## ధ్వన్యాలోకం

వాచకత్వే హి తార్కికాణాం విప్రతిపత్తయః ప్రవర్తన్తామ్ - కిమిదం స్వాభావికం శబ్దానామ్ ఆహోస్విత్ సామయికమిత్యాద్యాః. వ్యఞ్జకత్వే తు తత్పృష్ఠభావిని భావాన్తరసాధారణే లోకప్రసిద్ధ ఏవ అనుగమ్యమానే కో విమతీనామవసరః? అలౌకికే హ్యర్థే తార్కికాణాం

విమతయో నిఖిలాః ప్రవర్తన్తే, న తు లౌకికే. న హి నీలమధురాదిషు అశేషలోకేన్ద్రియగోచరే బాధారహితే తత్త్వే పరస్పరం విప్రతిపన్నా దృశ్యన్తే. న హి బాధారహితం నీలం నీలమితి బ్రువన్నపరేణ ప్రతిషిధ్యతే - నైతన్నీలం పీతమితి. తథైవ వ్యఞ్జకత్వం వాచకానాం శబ్దానామ్, అవాచకానాం చ గీతధ్వనీనామ్, అశబ్దరూపాణాం చ చేష్టాదీనాం యత్ సర్వేషామనుభవసిద్ధమేవ తత్కేనాపహ్నూయతే? అశబ్దమర్థం రమణీయం హి సూచయన్తః వ్యాహారాః తథా వ్యాపారాః నిబద్ధాశ్చానిబద్ధాశ్చ విదగ్ధపరిషత్సు వివిధా విభావ్యన్తే. తానుపహాస్యతామాత్మనః పరిహారన్ కోఽతిసందధీత సచేతాః?

బాలానందిని

వాచకత్వే ఇతి - శబ్దాల కున్న వాచకత్వం స్వాభావికమా లేదా సంకేతంచేత ఏర్పరచినదా అని వాచకత్వం విషయంలో తార్కికుల మధ్య విప్రతిపత్తులు (అభిప్రాయభేదాలు) ప్రవర్తిస్తే ప్రవర్తించవచ్చును. కాని దాని (వాచకత్వంయొక్క) వెనకనే ఉండేది, భావాన్తరములకు అనగా దీపం మొదలైన అన్యపదార్థాలకు సాధారణమూ, లోకప్రసిద్ధమూ, అయిన వ్యంజకత్వం అనుసరించబడుతున్నప్పుడు విమతులకు అవకాశం ఏది? అలౌకికాలైన విషయాలలో తార్కికుల అన్ని విమతులు ప్రవర్తిస్తాయి; అంతే కాని లౌకికవిషయాలలో విమతులు ప్రవర్తించవు. సమస్తజనుల ఇంద్రియాలకీ గోచరమైన నీలము (రంగు) మధురం మొదలైన, బాధారహితమైన (ఇది నీలం కాదు ఇత్యాదివిధంగా బాధించడానికి, నిషేధించడానికి వీలులేని) తత్త్వం విషయంలో విప్రతిపత్తి చెందేవారు కనబడరు కదా? బాధారహితమైన నీలాన్ని (చూపి) "ఇది నీలం" అన్నవానిని ఎవడూ కూడ 'ఇది నీలం కాదు; ఇది పచ్చనిది' అని అంటూ నిషేధించడుకదా? అదే విధంగా వాచకాలైన సమస్తశబ్దాలలోను, వాచకాలు కాని గీత ధ్వనులలోను, శబ్దరూపాలే కాని చేష్టాదులలోను అందరికీ అనుభవసిద్ధంగా కనబడుతూన్న వ్యంజకత్వాన్ని ఎవడూ కప్పిపుచ్చడు. అశబ్దమైన అనగా శబ్దంచేత వాచ్యం కాని, సుందరమైన విషయాన్ని సూచిస్తూన్న పలుకులు, ప్రసిద్ధములు, అప్రసిద్ధములు అయిన ఇతర వ్యాపారాలు అనేకవిధము లైనవి పండితుల పరిషత్తులలో

కనబడుతున్నాయి. తనకు పరిహాసాస్పదత్వాన్ని పరిహరించాలనుకునే బుద్ధిమంతుడు ఎవడు వాటిని అన్నింటినీ కాదంటాడు? (అలా అనేవాడు అందరికీ పరిహాసాస్పదు డవుతాడు అని భావం).

లోచనం

నను తత్రాప్యేషాం విమతిః. నైతత్; న హి వాచకత్వే విమతిః సా; అపి తు వాచకత్వస్య నైసర్గికత్వకృత్రిమత్వాదౌ. తదాహ - వాచకత్వే హీతి. నన్వేవం వ్యఞ్జకత్వస్యాపి ధర్మాన్తరముఖేన విప్రతిపత్తివిషయతాపి స్యాదిత్యాశఙ్క్యాహ - వ్యఞ్జకత్వే తు ఇతి. భావాన్తరేతి. అక్షినికోచాదేః సాఙ్కేతికత్వం చక్షురాదేః అనాదిః యోగ్యతా ఇతి దృష్ట్వా కామమస్తు సంశయః శబ్దస్యాభిధేయప్రకాశనే, వ్యఞ్జకత్వం తు యాదృశమేకరూపం భావాన్తరేషు తాదృగేవ ప్రకృతేఽపీతి నిశ్చితైకరూపే కః సంశయస్యావకాశః ఇత్యర్థః. నైతన్నీలమితి నీలే హి న విప్రతిపత్తిః, అపి తు ప్రాధానికమిదమ్, పారమాణవమిదమ్, జ్ఞానమాత్రమిదమ్, తుచ్ఛమిదమ్ ఇతి తత్స్పృష్టావలౌకిక్య ఏవ విప్రతిపత్తయః. వాచకానామితి. ధ్వన్యుదాహరణేష్వితి భావః. అశబ్దమితి - అభిధావ్యాపారేణ అస్పృష్టమిత్యర్థః. రమణీయమితి - యద్గోప్యమానతయైవ సున్దరీభవతీత్యనేన ధ్వన్యమానతాయామసాధారణప్రతీతిలాభః ప్రయోజనముక్తమ్. నిబద్ధాః ప్రసిద్ధాః. తానితి వ్యవహారాన్. కః సచేతాః అతిసందధీత, నాద్రియేతేత్యర్థః. లక్షణే శత్రాదేశః. ఆత్మనః కర్మభూతస్య యోపహసనీయతా తస్యాః పరిహారేణ ఉపలక్షితః, తాం పరిజిహీర్షురిత్యర్థః.

బాలానందిని

నన్వితి. వాళ్లకు దాని విషయంలో (వాచకత్వం విషయంలో) కూడ విప్రతిపత్తి ఉంది కదా? అది కాదు; ఆ విమతి వాచకత్వం విషయంలో కాదు, మరేమనగా వాచకత్వం సహజమా లేక కృతిమమా ఇత్యాదివిషయంలోనే. ఆ విషయమే చెపుతున్నాడు - వాచకత్వే హీతి. నన్వితి. అట్లైతే ఏదైన మరొకధర్మాన్ని పట్టి వ్యంజకత్వం కూడ విప్రతిపత్తి విషయం కావచ్చు కదా అని ఆశంకించుకొని చెపుతున్నాడు - వ్యఞ్జకత్వే త్వితి. భావాన్తరేతి. అక్షీతి. కండ్లు వికసింపచేయడం మొదలైనదానికి సాంకేతికత్వాన్ని, చక్షురాదీంద్రియాలకు అనాదిగా ఉన్న విషయజ్ఞానజననయోగ్యతను చూచి శబ్దానికి

ఉన్న అర్థప్రకాశనం విషయంలో సంశయం ఉంటే ఉండవచ్చు. వ్యంజకత్వం అయితే ఇతరవస్తువులలో (ప్రదీపాదులలో) ఎలా ఒకే విధంగా ఉంటుందో ప్రకృతంలో కూడ అలాగే ఉంటుంది. ఈ విధంగా నిశ్చితమైన ఒకే రూపం కలదాని విషయంలో సంశయానికి అవకాశం ఏముంది అని అర్థం. నీలం విషయంలో ఇది నీలం కాదు అని విప్రతిపత్తి ఉండదు. మరేమనగా - (సాంఖ్యులు చెప్పినట్లు) ఇది ప్రధానం నుంచి పుట్టినదా, (వైశేషికాదులు చెప్పినట్లు) పరమాణువులనుంచి పుట్టిందా, (విజ్ఞానవాదులైన బౌద్ధులు చెప్పినట్లు) ఇది విజ్ఞానరూపమా, (శూన్యవాదులైన బౌద్ధులు చెప్పినట్లు) తుచ్ఛమా, అసలే లేనిదా, అని దాని సృష్టి విషయంలో ఇలాంటి విప్రతిపత్తు లన్నీ అలౌకికములే. అనగా లోకంలో ప్రసిద్ధమైన విషయాలను గూర్చి కాదు.

వివరణ:- అక్షినికోచాదేః అనేదానికి భావం ఇది. కళ్లుతెరిస్తే ఈ అర్థం, మూస్తే ఈ అర్థం, ఇలా చూస్తే ఈ అర్థం అని కొన్ని సంకేతాలు ఏర్పరచుకొన్నవాళ్లకే అక్షినికోచాదులవల్ల అర్థాలు తెలుస్తాయి. నేత్రాది ఇంద్రియాలవల్ల అనాదిగా ఒకే విధమైన జ్ఞానం కలుగుతుంది. ఈ విధంగా అక్షినికోచాదులవల్లా, నేత్రాదీంద్రియాలవల్లా జ్ఞానం కలుగుతున్నా మొదటిది సాంకేతికం, రెండవది స్వాభావికం. అదే విధంగా శబ్దంవల్ల కలిగే వాచ్యార్థజ్ఞానం సాంకేతికమా, స్వాభావికమా అని విప్రతిపత్తి ఉండవచ్చు.

వాచకానామితి - ధ్వన్యుదాహరణలలో అని అర్థం. అశబ్దమితి. అభిధావ్యాపారంచేత స్పృశించబడనిది అని అర్థం. రమణీయమితి - ఏది గుప్తంగా ఉంచుతేనే సుందరంగా ఉంటుందో అని చెప్పడంచేత ధ్వనింపచేయబడడంలో అసాధారణమైన ప్రతీతి (జ్ఞానం) యొక్క లాభం ప్రయోజనంగా చెప్పబడింది. నిబద్ధాః- ప్రసిద్ధమైనవి. తానితి - వ్యవహారాలను. ఏ తెలివైనవాడు, అతిసందధీత= ఆదరించకుండా ఉంటాడు అని అర్థం. 'పరిహరన్' అనే పదంలో "లక్షణహేత్వోః క్రియాయాః" (పా.సూ.3.2.126) అనే పాణినిసూత్రంచేత లక్షణార్థంలో 'శతృ' ప్రత్యయం. వ్యవహారాలను ఆదరించడానికి లక్షణం ఉపహాస్యతాపరిహారం. ఉపహసనంలో కర్మయైన తనయొక్క ఏ ఉపహసనీయత్వం ఉన్నదో దాని పరిహారంతో కూడినవాడు, అనగా ఉపహసనీయత్వాన్ని పరిహరించ దలచుచున్నవాడు అని అర్థం.

## ధ్వన్యాలోకం

బ్రూయాత్ - అస్త్యతిసంధానావసరః; వ్యఞ్జకత్వం శబ్దానాం గమకత్వమ్; తచ్చ లిఙ్గత్వమ్; అతశ్చ వ్యఙ్గ్యప్రతీతిః లిఙ్గిప్రతీతిరేవేతి

లిఙ్గిలిఙ్గభావ ఏవ తేషాం వ్యఙ్గ్యవ్యఞ్జకభావః, నాపరః కశ్చిత్. అతశ్చైతదవశ్యమేవ బోద్ధవ్యం యస్మాద్వక్త్రభిప్రాయాపేక్షయా వ్యఞ్జకత్వమిదానీమేవ త్వయా ప్రతిపాదితమ్; వక్త్రభిప్రాయశ్చ అనుమేయరూప ఏవ.

అత్రోచ్యతే - నన్వేవమపి యది నామ స్యాత్ కిం నశ్ఛిన్నమ్? వాచకత్వగుణవృత్తివ్యతిరిక్తో వ్యఞ్జకత్వలక్షణః శబ్దవ్యాపారోఽస్తీత్య స్మాభిరభ్యుపగతమ్. తస్య చైవమపి న కాచిత్ క్షతిః. తచ్చ వ్యఞ్జకత్వం లిఙ్గత్వమస్తు అన్యద్వా. సర్వథా ప్రసిద్ధశాబ్దప్రకారవిలక్షణత్వం శబ్దవ్యాపారవిషయత్వం చ తస్యాస్తీతి నాస్త్యేవ ఆవయోర్వివాదః. న పునరయం పరమార్థః యద్ వ్యఞ్జకత్వం లిఙ్గత్వమేవ; సర్వత్ర వ్యఙ్గ్యప్రతీతిశ్చ లిఙ్గిప్రతీతిరేవేతి.

బాలానందిని

బ్రూయాదితి - ఎవరైనా ఇలా అనవచ్చు - నిరాకరించడానికి అవకాశం ఉంది. శబ్దాల కున్న వ్యంజకత్వం అనగా గమకత్వం (ఊహింపచేయడం). గమకత్వం అనగా లింగత్వమే. వ్యంగ్యప్రతీతి లింగిప్రతీతియే. అందుచేత వాటికి లింగలింగిభావమే కాని వ్యంగ్యవ్యంజకభావం అంటూ మరొకటి ఏదీ లేదు. ఈ కారణంచేత కూడా ఈ విషయాన్ని ఈ విధంగానే గ్రహించాలి; ఎందువల్ల ననగా వక్తయొక్క అభిప్రాయం దృష్ట్యా శబ్దాలకి వ్యంజకత్వం ఉంది అని నువ్వు ఇంత క్రితమే ప్రతిపాదించి ఉన్నావు. వక్తయొక్క అభిప్రాయం (ఆతడు పలికే మాటలను పట్టి) అనుమేయమే కదా?

వివరణ:- లింగం అనగా సాధనం - ధూమాదికం. లింగి అనగా సాధ్యం. వహ్న్యాదికం. శబ్దానికీ నువ్వు చెప్పే రెండవ అర్థానికీ సంబంధం లింగలింగిభావమే కాని వ్యంగ్యవ్యంజకభావం కాదు. అందుచేత రమణీయసూచకాలైన వ్యవహారాలను ఎవరైనా నిరాకరించడానికి అవకాశం లేకపోలేదు అని భావం.

అత్రోచ్యతే ఇతి:- ఇక్కడ (సమాధానం) చెప్పబడుతున్నది. ఇలా అయితే మాత్రం మాకేమి పోయింది? మేము అంగీకరించిన దల్లా వాచకత్వంకంటె, గుణవృత్తికంటె వ్యతిరిక్తమైన (వేరైన) వ్యంజకత్వం అనే శబ్దవ్యాపారం ఒకటి ఉన్నదని మాత్రమే. ఇలా

అయినా కూడ మేము అంగీకరించినదానికి క్షతి (నష్టం) ఏమీ లేదు. ఆ వ్యంజకత్వం లింగత్వం కానీ మరొకటి ఏదైనా కానీ. అది (వ్యంజకత్వం)అన్ని విధాలా ప్రసిద్ధమైన శాబ్దప్రకారాలకంటె (వాచకత్వగౌణత్వాదులకంటె) భిన్నమైనది. శబ్దవ్యాపారవిషయమైనది అనే అంశంలో మనిద్దరికీ వివాదం లేదు. అయితే - వ్యంజకత్వం అంటే లింగత్వమే, ఎక్కడైనా వ్యంగ్యప్రతీతి కలిగినదంటే అది లింగిప్రతీతియే అని చెప్పడం పరమార్థం కాదు.

లోచనం

అస్తీతి - వ్యఞ్జకత్వం నాపహ్నూయతే; తత్త్వతిరిక్తం న భవతి, అపి తు లిఙ్గలిఙ్గిభావ ఏవాయమ్. ఇదానీమేవేతి -జైమినీయమతోపక్షేపే. యది నామ స్యాదితి – ప్రౌఢవాదితయా అభ్యుపగమేఽపి స్వపక్షస్తావన్న సిధ్యతీతి దర్శయతి - శబ్దేతి. శబ్దస్య వ్యాపారః సన్ విషయః శబ్దవ్యాపారవిషయః. అన్యే తు శబ్దస్య యో వ్యాపారః తస్య విషయః విశేషః ఇత్యాహుః. న పునరితి - ప్రదీపాలోకాదౌ లిఙ్గిలిఙ్గభావశూన్యేఽపి హి వ్యఙ్గ్యవ్యఞ్జకభావః అస్తీతి వ్యఙ్గ్యవ్యఞ్జకభావస్య లిఙ్గిలిఙ్గభావః అవ్యాపకః ఇతి కథం తాదాత్మ్యమ్?

బాలానందిని

**అస్తీతి.** వ్యంజకత్వాన్ని కప్పిపుచ్చడంలేదు. కాని అది లింగలింగిభావమే కాని **దానికంటె భిన్నమైనది కాదు.** ఇదానీమేవేతి - జైమినీయమతాన్ని నిరాకరించేటప్పుడు. **యది నామ స్యాదితి .** ప్రౌఢివాదంచేత (నీమాట) అంగీకరించినా మా పక్షం సిద్ధిస్తుంది **అని చూపుతున్నాడు - శబ్దేతి.** వ్యంజకత్వం శబ్దవ్యాపారమే కాని శబ్దవ్యాపారవిషయం కాదు. **అందుచేత ఆ పదానికి సరియైన** అర్థం చెపుతున్నాడు - శబ్దంయొక్క వ్యాపారం **అవుతూ (సహృదయహృదయానికి) విషయమైనది** శబ్దవ్యాపారవిషయం. కొందరైతే శబ్దంయొక్క ఏ వ్యాపారం **ఉన్నదో దాని విషయం, అనగా విశేషం** అని అర్థం చెప్పారు. న పునరితి. దీపకాంతి మొదలైన**వాటిలో లింగిలింగభావం లేకపోయినా** వ్యంగ్యవ్యంజక భావం ఉన్నది గాన వ్యంగ్యవ్యంజ**కభావానికి లింగిలింగభావం** అవ్యాపకం. అలాంటప్పుడు ఆ రెండింటికీ తాదాత్మ్యం (అభేదం) **ఎలా కుదురుతుంది?**

వివరణ:- "యత్ర యత్ర వ్యఙ్గ్యవ్యఞ్జకభావః తత్ర తత్ర లిఙ్గిలిఙ్గభావః" (వ్యంగ్యవ్యంజకభావం ఉన్న ప్రతిచోటా లింగిలింగభావం ఉంది) అని చెప్పడం కుదరదు. వ్యంగ్యవ్యంజకభావం ఉన్న ఘటప్రదీపప్రభాదులలో లింగిలింగభావం లేదు కదా? అవ్యాపకం అనగా అది ఉన్న ప్రతిచోటా ఇది ఉండకపోవడం.

## ధ్వన్యాలోకం

యదపి స్వపక్షసిద్ధయే అస్మదుక్తమనూదితం త్వయా వక్త్రభిప్రాయస్య వ్యఙ్గ్యత్వేనాభ్యుపగమాత్ తత్ప్రకాశనే శబ్దానాం లిఙ్గత్వమేవేతి తదేతద్యథాస్మాభిరభిహితం తద్విభజ్య ప్రతిపాద్యతే; శ్రూయతామ్ - ద్వివిధో విషయః శబ్దానామ్ - అనుమేయః ప్రతిపాద్యశ్చ. తత్ర అనుమేయః వివక్షాలక్షణః వివక్షా చ శబ్దస్వరూపప్రకాశనేచ్ఛా, శబ్దేనార్థప్రకాశనేచ్ఛా చేతి ద్విప్రకారా. తత్ర ఆద్యా న శబ్దవ్యవహారాఙ్గమ్. సా హి ప్రాణిత్వమాత్రప్రతిపత్తిఫలా. ద్వితీయా తు శబ్దవిశేషావధారణావసితవ్యవహితాపి శబ్దకరణవ్యవహార నిబన్ధనమ్. తే తు ద్వే అప్యనుమేయో విషయః శబ్దానామ్. ప్రతిపాద్యస్తు ప్రయోక్తురర్థప్రతిపాదనసమీహావిషయీకృతోఽర్థః. స చ ద్వివిధః - వ్యఙ్గ్యో వాచ్యశ్చ. ప్రయోక్తా హి కదాచిత్ స్వశబ్దేనార్థం ప్రకాశయితుం సమీహతే; కదాచిత్ స్వశబ్దానభిధేయత్వేన ప్రయోజనాపేక్షయా కయాచిత్.

### బాలానందిని

యదపీతి. వక్తయొక్క అభిప్రాయం వ్యంగ్య మని చెప్పడంచేత దానిని ప్రకాశింపచేయడంలో శబ్దాలకు లింగత్వమే అని అంటూ నువ్వు నీ పక్షాన్ని సిద్ధింపచేసుకోవడంకొరకు, మా మాటలను అనువదించి ఉన్నావు కదా? ఆ విషయంలో మేము చెప్పిన విషయాన్ని విభజించి ప్రతిపాదిస్తున్నాం; విను. అనుమేయం, ప్రతిపాద్యం అని శబ్దాల విషయం రెండు విధాలు. వాటిలో అనుమేయం వివక్షారూప మైనది. శబ్దాలని ప్రకాశింపచేయా లనే ఇచ్ఛ అనీ, అర్థాన్ని ప్రకాశింపచేయా లనే ఇచ్ఛ అనీ వివక్ష కూడ రెండు విధాలు. వీటిలో మొదటిది శాబ్దవ్యవహారానికి (ఇది శబ్దంవల్ల కలిగిన జ్ఞానం అని వ్యవహరించడానికి) అంగం కాదు. దీనిని శబ్దప్రయోగంవల్ల కలిగిన జ్ఞానం అని అన రని భావం. అది కేవలం ఈ శబ్దప్రయోగం చేసినవాడు జీవించి ఉన్న వ్యక్తి అనే జ్ఞానం వినేవాళ్లకి కలగడానికి మాత్రమే ఉపయోగిస్తుంది. రెండవదైతే (అర్థప్రకాశనేచ్ఛ

అయితే) శబ్దవిశేషంయొక్క నిశ్చయం చేయడంలో పరిసమాప్తమై వ్యవహితమైనా కూడ శబ్దం కరణంగా (సాధనంగా) కల వ్యవహారానికి (శాబ్దబోధకు) కారణం. అనగా వక్తయొక్క అర్థప్రతిపాదనేచ్ఛను తెలుసుకున్న తరవాత అర్థజ్ఞానం కలుగుతుంది. ఈ అర్థజ్ఞానం కలగడానికి ముందు శబ్దస్వరూపం ఏమిటి అని నిర్ధారణ చేసుకోవలసి ఉంటుంది. ఈ విధంగా వక్తృగతార్థప్రతిపాదనేచ్ఛను తెలుసుకొనడానికీ, అర్థజ్ఞానానికీ మధ్య శబ్దస్వరూపావధారణం ఉంటుంది. అర్థజ్ఞానంలో శబ్దం కరణం అని భావం. తే తు ఇతి. ఈ విధంగా ఆ రెండూ కూడ (శబ్దప్రకాశనేచ్ఛ, అర్థప్రకాశనేచ్ఛ - ఈ రెండూ కూడ) శబ్దాలకు అనుమేయమైన విషయం; అనగా శబ్దం వినగానే ఈ రెండు వివక్షలూ ఊహించబడతాయి. వాటికి సంబంధించినంతవరకు శబ్దం లింగం అని భావం.

ప్రతిపాద్య ఇతి. ప్రయోక్తయొక్క అర్థప్రతిపాదనేచ్ఛ విషయమైన అర్థం, అనగా -ప్రయోక్త (శబ్దం ప్రయోగించినవాడు) ఏ అర్థాన్ని ప్రతిపాదించాలని అనుకుంటాడో ఆ అర్థం ప్రతిపాద్యం. అది వాచ్యం, వ్యంగ్యం అని రెండు విధాలు. ఎందువల్ల ననగా ఒకప్పుడు ప్రయోక్త తన శబ్దంచేత అర్థాన్ని (ప్రత్యక్షంగా) తెలపాలని అనుకుంటాడు. ఒకప్పుడు ఏదో ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని తాను ప్రయోగించే శబ్దాలచేత వాచ్యం కాని విధంగా అర్థాన్ని ప్రకటింపచేయాలని కోరుకుంటాడు.

లోచనం

విషయ ఇతి - శబ్ద ఉచ్చరితే యావతి ప్రతిపత్తిః తావాన్ విషయ ఇత్యుక్తః. తత్ర శబ్దప్రయు యుక్షా, అర్థప్రతిపిపాదయిషా చేత్యుభయ్యపి వివక్షా అనుమేయా తావత్. యస్తు ప్రతిపిపాదయిషాయాం కర్మభూతః అర్థః తత్ర శబ్దః కరణత్వేన వ్యవస్థితః, న త్వసావనుమేయః; తద్విషయా హి ప్రతిపిపాదయిషైవ కేవలమనుమీయతే. న చ తత్ర శబ్దస్య కరణత్వే, యైవ లిఙ్గస్య ఇతికర్తవ్యతా, పక్షధర్మత్వగ్రహణాదికా సాస్తి; అపి త్వన్యైవ సంకేత స్ఫురణాదికా; తన్న తత్ర శబ్దో లిఙ్గమ్. ఇతికర్తవ్యతా చ ద్విధా - ఏకయా అభిధావ్యాపారం కరోతి, ద్వితీయయా వ్యఞ్జనావ్యాపారమ్. తదాహ - తత్రేత్యాదినా. కయా చిదితి - గోపనకృతసౌన్దర్యాదిలాభాభిసంధానాదికయేత్యర్థః.

బాలానందిని

విషయ ఇతి:- శబ్దం ఉచ్చరించగానే ఎంతవరకు (ఎంతటి) జ్ఞానం కలుగుతుందో అది దాని విషయం అని చెప్పబడుతుంది. శబ్దాన్ని ప్రయోగించాలనే ఇచ్ఛ, అర్థాన్ని

ప్రతిపాదించాలనే ఇచ్ఛ - ఈ రెండు విధాలైన వివక్షా కూడ అనుమేయమే (అనుమానప్రమాణం ద్వారా ఊహింపదగినదే). ప్రతిపాదించాలి అనే ఇచ్ఛలో కర్మగా ఉన్న (ప్రతిపాదించాలి అని అభిలషించబడిన) ఏ అర్థం ఉందో దాని విషయంలో శబ్దం కరణంగా ఉంటుంది. అనగా ఆ అర్థాన్ని బోధించడానికి కరణం (సాధనం) శబ్దం. అంతేనే కాని ఇది (అర్థం) అనుమేయం కాదు; ఆ అర్థాన్ని ప్రతిపాదించాలనే ఇచ్ఛ మాత్రమే అనుమేయం. అర్థాన్ని బోధించడానికి కరణంగా ఉన్న శబ్దంలో, లింగంలో పక్షధర్మత్వజ్ఞానం మొదలైన ఏ విధమైన ఇతికర్తవ్యత ఉంటుందో అలాంటిది లేదు. మరేమనగా - శబ్దంలో సంకేతాన్ని స్మరించడం మొదలైన మరొక విధమైన ఇతికర్తవ్యతయే ఉంటుంది. అందుచేత అర్థజ్ఞానం విషయంలో శబ్దం లింగం కాదు. ఇతికర్తవ్యత కూడ రెండు విధాలు - (శబ్దం) ఒక ఇతికర్తవ్యతచేత (సంకేతస్ఫురణాదికంచేత) అభిధావ్యాపారాన్ని అనగా సంకేతితమైన అర్థంయొక్క బోధను చేస్తుంది. రెండవ ఇతికర్తవ్యతచేత (వక్తృవైశిష్ట్య - ప్రకరణాదిజ్ఞానరూపమైనదానిచేత) వ్యంజనావ్యాపారాన్ని చేస్తుంది (వ్యంజింపచేస్తుంది).

వివరణ:- 'ఇతికర్తవ్యత' అనేది మీమాంసకులు ఉపయోగించే పదం. ఒక పనిని సాధించడానికి చేయవలసిన విధానాలకి ఇతికర్తవ్యత అని పేరు. కత్తితో కొమ్మ నరుకుతున్నాడు అన్నప్పుడు ఆ కత్తిని పైకి ఎత్తడం, కొమ్మమీద వేయడం, మళ్లీ పైకి ఎత్తడం, మళ్లీ కొమ్మమీద వేయడం మొదలైనవి ఇతికర్తవ్యత. లింగం (ధూమం) అనుమితిని కలిగించాలంటే, దూమజ్ఞానం కలిగిన తరవాత ఆ ధూమం పర్వతంమీద ఉంది అనే జ్ఞానం(అదే పక్షధర్మత్వగ్రహణం) వ్యాప్తిస్మరణం ఇవన్నీ కావాలి. ఇది లింగం సాధ్య (వహ్ని) జ్ఞానాన్ని కలిగించడంలో అవసరమైన ఇతికర్తవ్యత. శబ్దంవల్ల అర్థం ఊహించబడుతుంది, అందుచేత అది అర్థానికి లింగం అని చెపితే ఈ విధమైన ఇతికర్తవ్యత ఉందని చెప్పాలి. కాని అలాంటి ఇతికర్తవ్యత ఏదీ లేదు. ఇక్కడ ఉండే ఇతికర్తవ్యత సంకేతస్మరణాదికం. అందుచేత శబ్దార్థాల సంబంధం లింగలింగిసంబంధం కాదు.

## ధ్వన్యాలోకం

స తు ద్వివిధో ఽపి ప్రతిపాద్యః విషయః శబ్దానాం న లిఙ్గితయా స్వరూపేణ ప్రకాశతే, అపి తు కృత్రిమేణ అకృత్రిమేణ వా సంబన్ధాన్తరేణ. వివక్షావిషయత్వం హి తస్యార్థస్య శబ్దైః లిఙ్గితయా ప్రతీయతే న తు

స్వరూపమ్. యది హి లిఙ్గితయా తత్ర శబ్దానాం వ్యాపారః స్యాత్ తచ్ఛబ్దార్థే సమ్యఙ్మిథ్యాత్వాదివివాదా ఏవ న ప్రవర్తేరన్, ధూమాదిలిఙ్గానుమితానుమేయాన్తరవత్. వ్యఙ్గ్యశ్చార్థో వాచ్య సామర్థ్యాక్షిప్తతయా వాచ్యవచ్ఛబ్దస్య సంబన్ధీ భవత్యేవ. సాక్షాదసాక్షాద్భావో హి సంబన్ధస్యాప్రయోజకః. వాచ్యవాచక భావాశ్రయత్వం చ వ్యఙ్గ్యస్య ప్రాగేవ దర్శితమ్. తస్మాద్వక్త్రభిప్రాయరూప ఏవ వ్యఙ్గ్యే లిఙ్గతయా శబ్దానాం వ్యాపారః. తద్విషయీకృతే తు ప్రతిపాద్యతయా. ప్రతీయమానే తస్మిన్ అభిప్రాయరూపే అనభిప్రాయరూపే చ వాచకత్వేనైవ వ్యాపారః సంబన్ధాన్తరేణ వా? న తావద్వాచకత్వేన, యథోక్తం ప్రాక్. సంబన్ధాన్తరేణ వ్యఞ్జకత్వమేవ. న చ వ్యఞ్జకత్వం లిఙ్గరూపమేవ, ఆలోకాదిష్వన్యథా దృష్టత్వాత్. తస్మాత్ ప్రతిపాద్యో విషయః శబ్దానాం న లిఙ్గిత్వేన సంబన్ధీ వాచ్యవత్. యో హి లిఙ్గిత్వేన తేషాం సంబన్ధీ యథాదర్శితో విషయః స న వాచ్యత్వేన ప్రతీయతే, అపి తూపాధిత్వేన. ప్రతిపాద్యస్య చ విషయస్య లిఙ్గిత్వే తద్విషయాణాం విప్రతిపత్తీనాం లౌకికైరేవ క్రియమాణానామభావః ప్రసజ్యేతేతి ఏతచ్చ ఉక్తమేవ.

బాలానందిని

స త్వితి. (వాచ్యవ్యంగ్యరూపమైన) రెండు విధాలైన ఆ శబ్దప్రతిపాద్యవిషయం స్వరూపంలో లింగిగా ప్రకాశించదు. మరేమనగా - కృత్రిమం కాని, అకృత్రిమం కాని అయిన మరొక సంబంధంచేత భాసిస్తుంది. ఆ అర్థం వివక్షకు విషయం అనేది మాత్రమే శబ్దాలద్వారా లింగిగా తెలుస్తుంది కాని (ఆ అర్థాని కున్న వివక్షావిషయత్వమే లింగిగా తెలుస్తుంది కాని) ఆ అర్థస్వరూపం లింగిగా తెలియదు. ఆ అర్థం విషయంలో శబ్దాలు లింగంగా వ్యాపారం చేస్తాయి (వ్యవహరిస్తాయి) అన్నట్లయితే, ధూమాదిలింగాలచేత అనుమితమైన వహ్న్యాద్యనుమేయాల విషయంలో ఏ విధంగా ఉండవో అదే విధంగా

శబ్దార్థం (శబ్దంచేత బోధించబడే అర్థం) విషయంలో కూడా ఇది యథార్థమా అయథార్థమా ఇత్యాది వివాదాలే చెలరేగేవి కాదు. వ్యంగ్యార్థం వాచ్యార్థసామర్థ్యంచేత ఆక్షిప్తం అవడంచేత వాచ్యంవలెనే శబ్దానికి సంబంధించే ఉంటుంది. ఉన్న సంబంధం సాక్షాత్సంబంధమా అసాక్షాత్సంబంధమా (పరంపరాసంబంధమా) అనేది ప్రధానం కాదు. వ్యంజకత్వం వాచ్యవాచకభావాశ్రితం అనే విషయం పూర్వమే చూపబడింది. అందువల్ల వక్తయొక్క అభిప్రాయం అనే వ్యంగ్యం విషయంలోనే శబ్దాలకు లింగంగా వ్యాపారం. (శబ్దాలు లింగంగా పనిచేస్తాయి). దానిచేత (వక్త్రభిప్రాయంచేత) విషయంగా చేసికొనబడిన అర్థం విషయంలో మాత్రం ప్రతిపాద్యంగానే ( ఆ అర్థాన్ని ప్రతిపాద్యంగానే తీసికొని) శబ్దాల వ్యాపారం ఉంటుంది.

ప్రతీయమానే ఇతి :- వ్యంగ్యమైన అ అర్థం అభిప్రాయరూపమైనా, అనభిప్రాయరూపమైనా, దాని విషయంలో శబ్దానికున్న వ్యాపారం వాచకత్వంచేతనేనా లేదా మరొక సంబంధం చేతనా? పూర్వమే చెప్పినట్లు వాచకత్వంచేత కాదు; మరి సంబంధాంతరంచేతనే; అది వ్యంజకత్వమే. వ్యంజకత్వం అనేది లింగత్వరూపమే కావలసిన పని లేదు, ఎందువల్ల ననగా దీపాలోకాదులలో మరొక విధంగా (లింగత్వభిన్నంగా) కనబడుతూన్నది. అందువల్ల ప్రతిపాద్యమైన విషయం, వాచ్యం, ఏ విధంగా శబ్దంతో లింగిగా సంబంధించడం లేదో అదే విధంగా లింగిగా సంబంధించదు. పూర్వం చూపించిన విషయంవలె (వివక్షవలె) ఏది వాటితో లింగిగా సంబధిస్తుందో అది వాచ్యంగా తెలియబడడంలేదు; ఉపాధిగా మాత్రమే అనగా విశేషణంగా, వ్యావర్తకంగా మాత్రమే, భాసిస్తుంది. అనగా శబ్దం అనే లింగంచేత అనుమితమైన వక్తృవివక్ష వాచ్యార్థానికి విశేషణంగా, ఇదే ఇతడు అనుకొన్నది అని ఇతరవ్యావర్తకంగా, ఉపయోగిస్తుంది అని అర్థం. ప్రతిపాద్యమైన విషయం లింగియే అయిన పక్షంలో లౌకికులే (మాటిమాటికీ) చేసే, దానిని గూర్చిన (ప్రతిపాద్యార్థాన్ని గూర్చిన) విప్రతిపత్తులే అసల్లు లేకుండా ఉండేవి. ఈ విషయం (ఇంత క్రితమే) చెప్పబడింది.

లోచనం

శబ్దార్థ ఇతి:- అనుమానం హి నిశ్చయస్వరూపమేవేతి భావః. ఉపాధిత్వేనేతి - వక్త్రిచ్ఛా హి వాచ్యాదేరర్థస్య విశేషణత్వేన భాతి. ప్రతిపాద్యస్యేతి. అర్థాత్ వ్యఙ్గ్యస్య. లిఙ్గిత్వ ఇతి. అనుమేయత్వ ఇత్యర్థః. లౌకికైరేవేతి. ఇచ్ఛాయాం లోకో న విప్రతిపద్యతే, అర్థే తు విప్రతిపత్తిమానేవ.

బాలానందిని

శబ్దార్థ ఇతి - అనుమానం నిశ్చయరూపమే కదా; అందుచేత వివాదాలు ఉండకూడదు అని భావం. ఉపాధిత్వేనేతి - వక్తయొక్క ఇచ్ఛ వాచ్యాద్యర్థాలకి విశేషణంగా భాసిస్తుంది. ప్రతిపాద్యస్యేతి - వ్యంగ్యమైన అర్థంయొక్క అని అర్థం. లిఙ్గిత్వే ఇతి - అనుమేయం అయితే అని అర్థం. లౌకికైరేవేతి. జనులు ఇచ్ఛ విషయంలో అభిప్రాయభేదం చూపరు; అర్థం విషయంలో నైతే విప్రతిపత్తితోనే ఉంటారు.

ధ్వన్యాలోకం

యథా చ వాచ్యవిషయే ప్రమాణాన్తరానుగమేన సమ్యక్త్వప్రతీతౌ క్వచిత్ క్రియమాణాయాం తస్య ప్రమాణాన్తరవిషయత్వే సత్యపి న శబ్దవ్యాపారవిషయతాహానిః తద్వ్యఙ్గ్యస్యాపి. కావ్యవిషయే చ వ్యఙ్గ్యప్రతీతీనాం సత్యాసత్యనిరూపణస్య అప్రయోజకత్వమేవేతి తత్ర ప్రమాణాన్తరవ్యాపారపరీక్షా ఉపహాసాయైవ సంపద్యతే. తస్మాత్ లిఙ్గిప్రతీతిరేవ సర్వత్ర వ్యఙ్గ్యప్రతీతిరితి న శక్యతే వక్తుమ్.

బాలానందిని

యథా చేతి - మరొక ప్రమాణాన్ని అనుసరించి ఇది యథార్థం అవునా కాదా అని వాచ్యం విషయంలో పరీక్ష చేసినప్పుడు ఆ వాచ్యార్థం ప్రమాణాంతరానికి విషయం అయినా కూడ దానిని శబ్దవ్యాపారానికి విషయం అనడంలో హాని ఏ విధంగా లేదో అట్లే వ్యంగ్యం విషయంలో కూడ. కావ్యం విషయంలో వ్యంగ్యార్థప్రతీతులు సత్యమైనవా అసత్యమైనవా అని నిరూపించడం అప్రయోజకం గాన, అనగా ఎందుకూ ఉపయోగించేది కాదు గాన, వాటి విషయంలో ఇతరప్రమాణాల వ్యాపారంచేత పరీక్షచేయడం హాస్యాస్పదమే అవుతుంది. అందువల్ల వ్యంగ్యప్రతీతి ఎక్కడున్నా అది లింగిప్రతీతియే అని చెప్పడానికి శక్యం కాదు.

లోచనం

నను యదా వ్యఙ్గ్యః అర్థః ప్రతిపన్నః తదా సత్యత్వనిశ్చయో ఽస్య అనుమానాదేవ ప్రమాణాన్తరాత్ క్రియత ఇతి పునరప్యనుమేయ ఏవాసౌ? మైవమ్; వాచ్యస్యాపి హి సత్యత్వనిశ్చయః అనుమానాదేవ. యదాహుః -

అప్తవాదావిసంవాదాదత్ర చేదనుమానతా

(శ్లోకవార్తికం - వాక్యాధికరణం. 243)

ఇతి. న చైతావతా వాచ్యస్య ప్రతీతిరానుమానికీ, కింతు తద్గతస్య తతోఽధికస్య సత్యత్వస్య. తద్వ్యఙ్గ్యేఽపి భవిష్యతి. ఏతదాహ - యథా చేత్యాదినా. ఏతచ్చ అభ్యుపగమ్యోక్తమ్; న త్వనేన నః ప్రయోజనమిత్యాహ - కావ్యవిషయే చేతి. అప్రయోజకత్వమితి. న హి తేషాం వాక్యానామ్ అగ్నిష్టోమాదివాక్యవత్ సత్యార్థప్రతిపాదనద్వారేణ ప్రవర్తకత్వాయ ప్రామాణ్యమన్విష్యతే; ప్రీతిమాత్రపర్యవసాయిత్వాత్. ప్రీతేరేవ చ అలౌకికచమత్కారరూపాయాః వ్యుత్పత్త్యఙ్గత్వాత్. ఏతచ్చోక్తం వితత్య ప్రాక్. ఉపహాసాయైవేతి. నాయం సహృదయః; కేవలం శుష్కతర్కోపక్రమకర్కశహృదయః ప్రతీతిం పరామర్ష్టుం నాలమిత్యేష ఉపహాసః.

బాలానందిని

నన్వితి. (ఆశంక) వ్యంగ్యార్థం గ్రహించబడిన తరవాత అది సత్య మనే నిశ్చయం ప్రమాణాంతరమైన అనుమానంవల్లనే చేయబడుతుంది గాన మళ్లీ ఇది అనుమేయమే అయింది కదా? మైవమితి (సమాధానం) వాచ్యం కూడ సత్యం అని అనుమానప్రమాణంవల్లనే నిశ్చయించబడుతుంది. అందువల్లనే (కుమారిలభట్టు) ఇలా అన్నారు - ఆప్తేత్యాది. శ్లోకవార్తికంలో వాక్యాధికరణంలోని మూడు శ్లోకాలలో ఈ విషయం చర్చించబడింది.

ఆప్తవాదావిసంవాదాదత్ర చేదనుమానతా,<br>
నిర్ణయస్తావతా సిద్ధ్యేత్ బుద్ధ్యుత్పత్తిర్న తత్కృతా. 243<br>
అన్యదేవ హి సత్యత్వమాప్తవాదత్వహేతుకమ్,<br>
వాక్యార్థశ్చాన్య ఏవేతి జ్ఞాతః పూర్వతరం తతః. 244<br>
తత్ర చేదాప్తవాదేన సత్యత్వమనుమీయతే,<br>
వాక్యార్థప్రత్యయస్యాత్ర కథం స్యాదనుమానతా. 245

ఒక వాక్యంవల్ల వాక్యార్థబుద్ధి కలుగుతుంది. కాని అది కూడా అనుమానం క్రిందికే వస్తుంది. ఆ కలిగిన వాక్యార్థజ్ఞానం "అప్తుల అభిప్రాయానికి ఇది విరుద్ధంగా లేదు గాన ఇది సత్య మైనది" అని చెప్పవలసి ఉంది. అందుచేత ఆప్తవాదావిసంవాదం

హేతువుగా గ్రహించి వాక్యార్థబుద్ధియొక్క సత్యత్వం సాధించబడుచున్నది గాన ఇది అనుమానమే అని పూర్వపక్షి అభిప్రాయం. దీనికి సమాధానం రెండున్నర శ్లోకాలలో చెప్పబడింది. ఆ అనుమానం వల్ల కేవలం సత్యత్వం సిద్ధిస్తున్నదే కాని వాక్యార్థజ్ఞానం కలగడానికి ఆ అనుమానం కారణం కాదు కదా? వాక్యార్థజ్ఞానం అంతకు ముందే కలిగింది కదా? ఆప్తవాదత్వాన్ని హేతువుగా చూపి సాధించిన సత్యత్వం వేరు అంతకుముందే తెలిసిన వాక్యార్థం వేరు. ఆప్తవాదంచేత అనుమేయమైనది సత్యత్వం అయితే వాక్యార్థజ్ఞానం అనుమానం ఎలా అవుతుంది? ఇక్కడ అబినవగుప్తుడు కుమారిలభట్టు వాక్యాలనే ప్రమాణంగా చూపించాడు.

న చేతి. ఇంతమాత్రంచేత వాచ్యార్థజ్ఞానం అనుమానప్రమాణజనితం కాదు. మరే మనగా ఆ వాచ్యార్థజ్ఞానానికి సంబంధించిన, అంతకంటె అధికమైన సత్యత్వం అనుమానజనితం. వ్యంగ్యం విషయంలో కూడ ఇట్లే కాగలదు. ఈ విషయాన్నే- యథా చేత్యాది వాక్యంలో చెపుతున్నాడు. ఇది కేవలం మీ వాదాన్ని అంగీకరించి చెప్పిన సమాధానం. నిజానికి దీనివల్ల మాకు ప్రయోజనం లేదు అని చెపుతున్నాడు కావ్యవిషయే చేతి. అప్రయోజకత్వమితి - సత్యమైన అర్థాన్ని ప్రతిపాదించడం ద్వారా పురుషుణ్ణి ఆ యా కర్మలయందు ప్రవర్తింపచేయడానికై "అగ్నిష్టోమేన స్వర్గకామో యజేత" (స్వర్గం కావాలనుకున్నవాడు అగ్నిష్టోమయాగం చెయ్యాలి) ఇత్యాది వాక్యాల ప్రామాణ్యాన్ని స్థాపించడంకోసం ప్రయత్నించి నట్లు కావ్యవాక్యాల ప్రామాణ్యాన్ని స్థాపించడంకోసం ప్రయత్నంచేయడం అనేది ఉండదు. అవి (కావ్యాలు) ఆనందం కలిగించడంలో మాత్రమే పర్యవసానం చెందుతాయి. (ఆనందం కలిగించడమే వాటి ప్రధానలక్ష్యం). అలౌకికచమత్కారరూపమైన ఆనందమే వ్యుత్పత్తికి అంగం. ఈ విషయం వెనుకనే సవిస్తరంగా చెప్పబడింది. ఉపహాసాయైవేతి - "ఇతడు సహృదయుడు కాడు. కేవలం శుష్కతర్కంచేత కర్కశమైన హృదయం కలవాడు. కావ్యజన్యప్రతీతిని స్పృశించజాలడు" అని ఉపహాసం.

ధ్వన్యాలోకం

యత్త్వనుమేయరూపవ్యఙ్గ్యవిషయం శబ్దానాం వ్యఞ్జకత్వం తత్ ధ్వనివ్యవహారస్య అప్రయోజకమ్. అపి తు వ్యఞ్జకత్వలక్షణః శబ్దానాం వ్యాపారః ఔత్పత్తికశబ్దార్థసంబన్ధవాదినాపి అభ్యుపగన్తవ్యః

ఇతి ప్రదర్శనార్థముపన్యస్తమ్. తద్ధి వ్యఞ్జకత్వం కదాచిత్ లిఙ్గత్వేన కదాచిద్రూపాన్తరేణ శబ్దానాం వాచకానామవాచకానాం చ సర్వవాదిభిరప్రతిక్షేప్యమిత్యయమస్మాభిర్యత్న ఆరబ్ధః. తదేవం గుణవృత్తివాచకత్వాదిభ్యః శబ్దప్రకారేభ్యో నియమేనైవ తావద్విలక్షణం వ్యఞ్జకత్వమ్. తదన్తఃపాతిత్వేఽపి తస్య హఠాదభిధీయమానే తద్విశేషస్య ధ్వనేః యత్ ప్రకాశనం విప్రతిపత్తినిరాసాయ సహృదయవ్యుత్పత్తయే వా తత్ క్రియమాణమనతిసంధేయమేవ. న హి సామాన్యమాత్రలక్షణేన ఉపయోగివిశేషలక్షణానాం ప్రతిక్షేపః శక్యః కర్తుమ్. ఏవం హి సతి సత్తామాత్రలక్షణే కృతే సకలసద్వస్తులక్షణానాం పౌనరుక్త్యప్రసంగః. తదేవమ్ -

శ్లో. విమతివిషయో య ఆసీన్మనీషిణాం సతతమవిదితసతత్త్వః,
ధ్వనిసంజ్ఞితఃప్రకారః కావ్యస్య వ్యఞ్జితః సోఽయమ్.

బాలానందిని

యత్త్వితి. శబ్దాలకు అనుమేయరూపమైన వ్యంగ్యాన్ని గూర్చిన ఏ వ్యంజకత్వం ఉన్నదో (అనగా పురుషుని వివక్ష అనే అనుమేయమైన వ్యంగ్యాన్ని గూర్చిన వ్యంజకత్వం అని అర్థం) అది 'ధ్వని' అనే వ్యవహారానికి నిమిత్తం కాదు. (దానిని ధ్వని అనకూడదు). శబ్దార్థాల సంబంధం నిత్యం అని చెప్పేవాళ్లు కూడా శబ్దాల కున్న వ్యంజకత్వం అనే వ్యాపారాన్ని అంగీకరించాలి అని చూపడంకొరకే అది చెప్పబడింది. ఆ వ్యంజకత్వం ఒకప్పుడు లింగత్వం గాను, ఒకప్పుడు మరొక రూపంచేత వాచకశబ్దాలలోను, అవాచకాలైన గీతాదిశబ్దాలలోను కూడ ఉన్నది; అది అందరు వాదులచేత కూడ నిరాకరింప శక్యం కానిది అని చెప్పడంకొరకు మాచేత ఈ ప్రయత్నం ప్రారంభించబడింది. ఈ విధంగా వ్యంజకత్వం అనేది గుణవృత్తి. వాచకత్వం మొదలైన అన్ని శబ్దప్రకారాలకంటె కూడ తప్పక విలక్షణమైనది. ఎవరైనా అది గుణవృత్త్యాదులలో అంతర్గతం అని హఠవాదం (పిడివాదం) చేసి చెప్పినా వాటిలో విశేషం అయిన ధ్వనిని విప్రతిపత్తులను తొలగించడం కొరకు సహృదయుల వ్యుత్పత్తికొరకు ప్రకాశింపచేయడం నిరాకరించదగినది కాదు.

సామాన్యలక్షణం మాత్రం ఉంది కదా అని ఉపయుక్తమైన వాటి విశేషాల లక్షణాలు నిరాకరించడం శక్యం కాదు కదా? అలా అయిన పక్షంలో సత్తకు (ఉండడం అనేదానికి) మాత్రం లక్షణం చెప్పిన తరవాత ఉన్న సమస్తవస్తువుల లక్షణాలను చెప్పడం పౌనరుక్త్యం అవుతుంది.

వివరణ:- ఎవరైనా వచ్చి గుణవృత్తికీ, వాచకత్వానికీ, వ్యంజకత్వానికీ అన్నింటికీ అన్వయించే ఒక లక్షణం చెప్పి వ్యంజకత్వం ఆ లక్షణం క్రిందికి వస్తుంది కాబట్టి దీనికి వేరే లక్షణం చెప్పడం అనావశ్యకం అనవచ్చు. అది యుక్తం కాదు. దీని విషయంలో విప్రతిపత్తిని తొలగించడంకోసం దీనికి మాత్రమే సంబంధించిన విశేషలక్షణం చెప్పడం ఆవశ్యకమే. అలా కాకపోతే ప్రపంచకం అన్ని వస్తువులలోనూ ఉన్న 'సత్త' అనే దాని లక్షణం చెప్పివేసి అన్ని పదార్థాల లక్షణాలు చెప్పడం అయిపోయింది కాబట్టి ఒక్కొక్క పదార్థం తీసికొని దానికి విశేషలక్షణం చెప్పడం పునరుక్తి అవుతుంది అన్నట్లుంటుంది అని భావం.

తదేవమితి. అందుచేత ఈ విధంగా -

విమతివిషయ ఇతి : అవిదితసతత్త్వః= తెలియబడని తత్త్వం గల, యః= ఏది, సతతమ్= ఎల్లప్పుడూ, మనీషిణామ్= పండితులయొక్క, విమతివిషయః= విమతికి విషయం, ఆసీత్= అయినదో, సః అయమ్= అట్టి ఈ, కావ్యస్య= కావ్యంయొక్క, ధ్వనిసంజ్ఞితః= ధ్వని అనే పేరు గల, ప్రకారః= ప్రకారం, వ్యఞ్జితః= సూచించబడినది.

లోచనం

నన్వేవం తర్హి మా భూత్ యత్ర యత్ర వ్యఞ్జకతా తత్ర తత్రానుమానత్వమ్; యత్ర యత్రానుమానత్వం తత్ర తత్ర వ్యఞ్జకత్వమితి కథమపహ్నూయతే ఇత్యాశఙ్క్యాహ - యత్త్వనుమేయేతి. తద్వ్యఞ్జకత్వం న ధ్వనిలక్షణమ్; అభిప్రాయవ్యతిరిక్తవిషయవ్యాపారాదితి భావః. నన్వభిప్రాయవిషయం యద్వ్యఞ్జకత్వమ్ అనుమానైకయోగక్షేమం తచ్చేన్న ప్రయోజకం ధ్వనివ్యవహారస్య తర్హి కిమర్థం తత్ పూర్వముపక్షిప్త మిత్యాశఙ్క్యాహ - అపి త్వితి. ఏతదేవ సంక్షిప్య నిరూపయతి - తద్ధీతి. యత ఏవ హి క్వచిదనుమానేనాభిప్రాయాదౌ, క్వచిత్ప్రత్యక్షేణ దీపాలోకాదౌ, క్వచిత్కారణత్వేన గీతధ్వన్యాదౌ, క్వచిదభిధయా వివక్షితాన్యపరే,

క్వచిద్గుణవృత్త్యా అవివక్షితవాచ్యే అనుగృహ్యమాణం వ్యఞ్జకత్వం దృష్టమ్; తత ఏవ తేభ్యః సర్వేభ్యో విలక్షణమస్య రూపం నః సిధ్యతి తదేతదాహ - తదేవమితి.

బాలానందిని

నన్వితి. అట్లైతే "ఎక్కడెక్కడ వ్యంజకత్వం ఉంటుందో అక్కడల్లా అనుమానత్వం ఉంటుంది" అని కాకపోయినా, "ఎక్కడెక్కడ అనుమానత్వం ఉంటుందో అక్కడల్లా వ్యంజకత్వం ఉంటుంది" అనేది ఎలా కప్పిపుచ్చబడుతుంది అని ఆశంకించి చెపుతున్నాడు - యత్త్వనుమేయేతి. ఆ వ్యంజకత్వం ధ్వనిలక్షణమైనది (ధ్వనిరూపమైనది) కాదు; కారణం ఏమనగా అభిప్రాయం(వివక్ష) కంటె వ్యతిరిక్తమైన రసాదులందు వ్యాపారం కాదు అని భావం. నన్వితి- అనుమానంతో సమానమైన అభిప్రాయవిషయకమైన వ్యంజకత్వం ధ్వనివ్యవహారానికి ప్రయోజకం కాకపోతే అలాంటప్పుడు అది పూర్వం ఎందుకు ప్రతిపాదించబడింది అని ఆశంకించి చెపుతున్నాడు - అపి త్వితి. ఈ విషయమే సంక్షేపించి నిరూపిస్తున్నాడు తద్ధీతి- వ్యంజకత్వం కొన్ని చోట్ల అభిప్రాయాదులలో అనుమానంచేత, కొన్ని చోట్ల దీపాలోకాదులలో ప్రత్యక్షంచేతా, కొన్నిచోట్ల గీతధ్వన్యాదులలో కరణత్వంచేత, కొన్ని చోట్ల వివక్షితాన్యపరంలో అభిధచేత, కొన్ని చోట్ల అవిక్షితవాచ్యంలో గుణవృత్తిచేత అనుగ్రహించబడుచున్నదిగా చూడబడుతున్నది. (వీటి అన్నింటిలోను వ్యంజకత్వం ఉంది). అందువల్ల వీటి అన్నింటికంటె విలక్షణమైన దీని స్వరూపం మాకు సిద్ధిస్తుంది. ఈ విషయమే చెపుతున్నాడు తదేవమితి.

లోచనం

నను ప్రసిద్ధస్య కిమర్థం రూపసంకోచః క్రియతే అభిధావ్యాపారగుణవృత్త్యాదేః? తస్యైవ సామగ్ర్యన్తరోపనిపాతాత్ యద్విశిష్టం రూపం తదేవ వ్యఞ్జకత్వముచ్యతామ్, ఇత్యాశఙ్క్యాహ - తదన్తఃపాతిత్వేఽపీతి. న వయం సంజ్ఞానివేశనాది నిషేధామ ఇతి భావః. విప్రతిపత్తిః - తాదృగ్విశేషో నాస్తీతి. వ్యుత్పత్తిః- సంశయాజ్ఞాననిరాసః. న హీతి. ఉపయోగిషువిశేషేషు యాని లక్షణాని తేషామ్. ఉపయోగిపదేన అనుపయోగినాం కాకదన్తాదీనాం వ్యుదాసః. ఏవం హీతి - త్రిపదార్థసంకరీ సత్తేత్యనేనైవ ద్రవ్యగుణకర్మణాం

లక్షితత్వాత్, శ్రుతిస్మృత్యాయుర్వేదధనుర్వేదప్రభృతీనాం సకల లోకయాత్రోపయోగి నామనారమ్భః.స్యాదితి భావః. విమతివిషయత్వే హేతుః- అవిదితసతత్త్వ ఇతి. అత ఏవాధునా న కస్య చిద్విమతిరేతస్మాత్ క్షణాత్ ప్రభృతీతి ప్రతిపాదయితుమ్ ఆసీదిత్యుక్తమ్. 33

బాలానందిని

నన్వితి (వ్యంజకత్వాన్ని అంగీకరించడం ద్వారా) ప్రసిద్ధమైన అభిధా వ్యాపారగుణవృత్త్యాదుల స్వరూపానికి సంకోచం ఎందుకు చేయబడుతున్నది? ఆ అభిధావ్యాపారగుణవృత్త్యాదికానికే విశిష్టమైన సామగ్రితో సంబంధం ఏర్పడినప్పుడు ఆ విశిష్టరూపమే వ్యంజకత్వం అని చెప్పబడుతుంది అని అనవచ్చు కదా అని ఆశంకించుకొని చెపుతున్నాడు - తదన్తఃపాతిత్వేఽపీతి. అభిధావ్యాపారాదులకే ఏదైన క్రొత్త పేరు పెట్టడాన్ని మేమూ నిషేధించము అని భావం. (విషయం అంగీకరిస్తే చాలు, పేరు ఏదైతే నేమి అని భావం) విప్రతిపత్తి అనగా అలాంటి విశేషం ఏదీ లేదనే బుద్ధి. వ్యుత్పత్తి అనగా సంశయాన్ని అజ్ఞానాన్ని పోగొట్టడం. న హీతి. ఉపయోగివిశేషలక్షణానామ్ అనగా ఉపయోగించే విశేషాలలో ఏ లక్షణాలు ఉన్నాయో వాటియొక్క అని అర్థం. "ఉపయోగి" అనే పదంచేత ఎందుకూ ఉపయోగించని కాకదంతాదులు నిరాకరించ బడుతున్నాయి. అనగా కాకదంతాదులు ఉపయోగించేవి కావు గాన అలాంటివాటి లక్షణాలు చెప్పకపోయినా నష్టం లేదు అని భావం. ఏవం హీతి. సత్త ద్రవ్యగుణకర్మలు మూడింటిలోనూ వ్యాపించి (సంబంధించి) ఉన్నది అని చెప్పడం చేతనే ద్రవ్యగుణకర్మల లక్షణం చెప్పినట్లు అయిపోయింది గాన సకలలోకయాత్రకు అవసరమైన శ్రుతి స్మృతి ఆయుర్వేద ధనుర్వేదాదుల విశేషలక్షణా లేవీ చెప్పడం అవసరం ఉండదు, వాటిని ప్రారంభించవలసిన పని ఉండదు అని భావం.

వివరణ :- వైశేషికదర్శనంలో ద్రవ్యాదిపదార్థాలను పేర్కొన్న తరవాత "సదనిత్యమ్" ఇత్యాదిసూత్రంలో ద్రవ్యగుణకర్మలు మూడింటికీ సత్తావత్త్వం మొదలైనది లక్షణం అని చెప్పబడింది. దానిని దృష్టిలో పెట్టుకొని వృత్తికారుడు సత్తామాత్రేత్యాదికం వ్రాశాడు.

విమతీతి. వ్యంజకత్వం విమతివిషయం అవడానికి హేతువు. అవిదితసతత్త్వ ఇతి. అందువల్లనే ఈ క్షణం మొదలు ఎవనికీ విమతి ఉండదు అని ప్రతిపాదించడానికి 'ఆసీత్' అని (భూతకాలవాచకం) ప్రయోగించబడింది. 33

## ధ్వన్యాలోకం

కా. ప్రకారోఽన్యో గుణీభూతవ్యఙ్గ్యః కావ్యస్య దృశ్యతే,
యత్ర వ్యఙ్గ్యాన్వయే వాచ్యచారుత్వం స్యాత్ ప్రకర్షవత్. 34.

వ్యఙ్గ్యోఽర్థో లలనాలావణ్యప్రఖ్యః యః ప్రతిపాదితస్తస్య ప్రాధాన్యే ధ్వనిరిత్యుక్తమ్, తస్య తు గుణీభావేన వాచ్యచారుత్వప్రకర్షే గుణీభూతవ్యఙ్గ్యో నామ కావ్యప్రభేదః ప్రకల్ప్యతే. తత్ర వస్తుమాత్రస్య వ్యఙ్గ్యస్య తిరస్కృతవాచ్యేభ్యః ప్రతీయమానస్య కదాచిద్వాచ్యరూప వాక్యార్థాపేక్షయా గుణీభావే సతి గుణీభూతవ్యఙ్గ్యతా. యథా -

శ్లో. లావణ్యసిన్ధురపరైవ హి కేయమత్ర
యత్రోత్పలాని శశినా సహ సంప్లవన్తే,
ఉన్మజ్జతి ద్విరదకుమ్భతటీ చ యత్ర
యత్రాపరే కదలికాణ్డమృణాలదణ్డాః. *(106)*

### బాలానందిని

ప్రకారేతి. యత్ర= దేనియందు, వ్యఙ్గ్యాన్వయే= వ్యంగ్యసంబంధం ఉంటూండగా, వాచ్యచారుత్వమ్= వాచ్యంయొక్క సౌందర్యం, ప్రకర్షవత్= ఆధిక్యం కలదై ఉంటుందో, అట్టి, గుణీభూతవ్యఙ్గ్యః= గుణీభూతవ్యంగ్యం అనే, అన్యః మరియొక, కావ్యస్య ప్రకారః= కావ్యభేదం, దృశ్యతే= కనబడుచున్నది. 34.

వ్యఙ్గ్యః ఇతి. లలనాలావణ్యంతో సమానమైన ఏ వ్యంగ్యార్థం ప్రతిపాదించబడినదో దానికి ప్రాధాన్యం ఉన్నప్పుడు 'ధ్వని' అని చెప్పబడింది. ఆ వ్యంగ్యం అప్రధానంగా ఉండి వాచ్యంయొక్క చారుత్వానికి ఆధిక్యం ఉన్నప్పుడు గుణీభూతవ్యంగ్యం అనే కావ్యభేదం కల్పించబడుతుంది (ఏర్పడుతుంది). ఒకప్పుడు, తిరస్కరించబడిన వాచ్యాలనుండి వ్యంగ్యమైన వస్తుమాత్రం వాచ్యరూపమైన వాక్యార్థం దృష్ట్యా అప్రధానం అయితే అది గుణీభూతవ్యంగ్యం. ఎట్లనగా -

లావణ్యసిన్ధుః ఇతి - అత్ర= ఇక్కడ, ఇయమ్= ఈ, అపరైవ= అపూర్వమైన, లావణ్యసిన్ధుః= లావణ్యనది, కా= ఏమిటి! యత్ర= దేనియందు, ఉత్పలాని=

కలవలు, శశినా సహ= చంద్రునితో కలిసి, సంప్లవన్తే= తేలుచున్నాయో; యత్ర= దేనియందు, ద్విరదకుమ్భతటీ = ఏనుగు యొక్క కుంభస్థలం, ఉన్మజ్జతి= పైకి వస్తూన్నదో; యత్ర= దేని యందు, అపరే= క్రొత్త రకాలైన, కదలికాణ్డమృణాలదణ్డాః= అరటిచెట్ల కాండాలు, తామరతూడులు ఉన్నాయో.

లోచనం

ఏవం యావద్ధ్వనేరాత్మీయం రూపం భేదోపభేదసహితం, యచ్చ వ్యఞ్జకభేదముఖేన రూపం తత్సర్వం ప్రతిపాద్య ప్రాణభూతం వ్యఙ్గ్యవ్యఞ్జకభావమేకప్రఘట్టకేన శిష్యబుద్ధౌ వినివేశయితుం వ్యఞ్జకవాదస్థానం రచితమితి ధ్వనిం ప్రతి యద్వక్తవ్యం తదుక్తమేవ. అధునా తు గుణీభూతోఽప్యయం వ్యఙ్గ్యః కవివాచః పవిత్రయతీతి అమునా ద్వారేణ తస్యైవాత్మత్వం సమర్థయితుమాహ - ప్రకార ఇతి. వ్యఙ్గ్యేనాన్వయో వాచ్యస్యోపస్కార ఇత్యర్థః. ప్రతిపాదిత ఇతి - "ప్రతీయమానం పునరన్యదేవ" ఇత్యత్ర. ఉక్తమితి. "యత్రార్థః శబ్దో వా" ఇత్యత్రాన్తరే. వ్యఙ్గ్యం చ వస్త్వాది త్రయమ్. తత్ర వస్తునః వ్యఙ్గస్య యే భేదాః ఉక్తాః తేషాం క్రమేణ గుణభావం దర్శయతి - తత్రేతి. లావణ్యేతి - అభిలాషవిస్మయగర్భేయం కస్య చిత్తరుణస్య ఉక్తిః.

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా భేదాలతోనూ అవాంతరభేదాలతోనూ కూడిన ధ్వనియొక్క స్వరూపం ఎంత ఉన్నదో అదీ, వ్యంజకముఖేన ఏ స్వరూపం ఉన్నదో దాని నంతనీ ప్రతిపాదించి ఒక్క ప్రఘట్టకంచేత ప్రాణమైన వ్యంగ్యవ్యంజకభావాన్ని శిష్యులబుద్ధిలో ప్రవేశింపచేయడానికి వ్యంజకాన్ని గూర్చిన వాదస్థానం (వివాదం ఉండడానికి తగిన అంశం) రచింపబడింది. ఈ విధంగా ధ్వనిని గూర్చి చెప్పవలసిన దంతా చెప్పబడింది. అయితే ఇప్పుడు ఈ వ్యంగ్యం అప్రధానమైనా కూడ కవుల వాక్కులను పవిత్రింపచేస్తుంది అనే ఈ ద్వారంచేత దానికే ఆత్మత్వాన్ని సమర్థించడంకొరకు చెపుతున్నాడు - ప్రకార ఇతి. వ్యంగ్యంతో అన్వయం అనగా దానిచేత వాచ్యానికి ఉపస్కారం (అందం కలిగించడం) అని అర్థం. ప్రతిపాదిత ఇతి- "ప్రతీయమానం పునరన్యదేవ" (కా.1.4) అనే కారికలో. ఉక్తమితి. "యత్రార్థః శబ్దో వా" (కా. 1. 13) అనే కారికదగ్గర.

వస్త్వాదిత్రయం వ్యంగ్యం. దానిలో వస్తువుయొక్క ఏ భేదాలు చెప్పబడ్డాయో వాటియొక్క గుణత్వాన్ని (అప్రాధాన్యాన్ని) క్రమంగా చూపుతున్నాడు - తత్రేతి. లావణ్యేతి- ఇది అభిలాష, ఆశ్చర్యమూ గర్భమునందు గల ఒక యువకుని వాక్యం (ఒక యువకుని అభిలాషాశ్చర్యభరితమైన వాక్యం)

లోచనం

అత్ర సిన్ధుశబ్దేన పరిపూర్ణతా, ఉత్పలశబ్దేన కటాక్షచ్ఛటాః, శశిశబ్దేన వదనమ్, ద్విరదకుమ్భతటీశబ్దేన స్తనయుగలమ్, కదలికాణ్డశబ్దేన ఊరుయుగలమ్, మృణాలదణ్డశబ్దేన దోర్యుగలమితి ధ్వన్యతే. తత్ర చైషాం స్వార్థస్య సర్వథా అనుపపత్తేః అన్ధశబ్దోక్తేన న్యాయేన తిరస్కృతవాచ్యత్వమ్. స చ ప్రతీయమానోఽప్యర్థః "అపరైవ హి కేయమ్" ఇత్యుక్తిగర్భీకృతే వాచ్యేఽంశే చారుత్వచ్ఛాయాం విధత్తే; వాచ్యస్యైవ స్వాత్మోన్మజ్జనయా నిమజ్జితవ్యఙ్గ్యజాతస్య సున్దరత్వేనావభానాత్. సున్దరత్వం చాస్య అసంభావ్యమానసమాగమసకలలోకసారభూతకువలయాదిభావవర్గస్య అతిసుభగాధికరణవిశ్రాన్తిలబ్ధసముచ్చయరూపతయా విస్మయవిభావతాప్రాప్తి పురస్కారేణ వ్యఙ్గ్యార్థోపస్కృతస్య తథా విచిత్రస్యైవ వాచ్యరూపోన్మజ్జనేన అభిలాషాదివిభావత్వాత్. అత ఏవేయతి వాచ్యస్య ప్రాధాన్యం; తథాపి రసధ్వనౌ తస్యాపి గుణతేతి సర్వస్య గుణీభూతవ్యఙ్గ్యస్య ప్రకారే మన్తవ్యమ్. అత ఏవ ధ్వనేరాత్మత్వమిత్యుక్తచరం బహుశః. అన్యే తు జలక్రీడావతీర్ణతరుణీ జనలావణ్యద్రవసున్దరీకృతనదీవిషయేయముక్తిరితి సహృదయాః. తత్రాపి చైవోక్తప్రకారేణైవ యోజనా. యది వా నదీసంనిధౌ స్నానావతీర్ణ యువతివిషయా, సర్వథా తావద్విస్మయముఖేన ఇయతి వ్యాపారాత్ గుణతా వ్యఙ్గ్యస్య.

బాలానందిని

అత్రేతి - ఇక్కడ సింధుశబ్దంచేత పరిపూర్ణత్వం, ఉత్పలశబ్దంచేత కటాక్షవీక్షణకాంతులు, శశిశబ్దంచేత ముఖం, ద్విరదకుమ్భతటీశబ్దంచేత స్తనద్వయం, కదలికాండశబ్దంచేత ఊరుద్వయం, మృణాలదణ్డశబ్దంచేత బాహుద్వయం అని

ధ్వనించబడుతున్నది. ఈ పదాల వాచ్యార్థం ఏ విధంగాను కూడ (ఇక్కడ) కుదరదు గాన ('నిఃశ్వాసాన్ధ ఇవాదర్శః' అనే శ్లోకంలో) అంధశబ్దం విషయంలో చెప్పిన న్యాయంచేత తిరస్కృతవాచ్యత్వం. వ్యంగ్యమైన ఈ అర్థవిశేషం "అపరైవ హి కేయమ్" అని ఉక్తిలో అంతర్గతమైన వాచ్యాంశానికి సౌందర్యచ్ఛాయను కలిగిస్తున్నది. ఎందువల్ల ననగా వాచ్యార్థమే వ్యంగ్యార్థా లన్నింటినీ ముంచివేసి (అణగద్రొక్కి) తాను పైకి వచ్చి సుందరంగా భాసిస్తున్నది. ఒక చోట కలుస్తాయని ఊహించడానికి కూడా శక్యం కాని, సమస్తలోకంలో సారమైన కువలయాదివస్తుసముదాయం అతిసుందరమైన అధికరణం (స్థానం)లో పొందబడిన కలయిక కలదవడంచేత విస్మయానికి విభావంగా అవడం ద్వారా వ్యంగ్యార్థంచేత ఇది (వాచ్యార్థం) ఉపస్కృతం అవడంవల్లనే దీనికి చారుత్వం కలిగింది. ఆ విధంగా విచిత్రమైన (వ్యంగ్యార్థోపస్కారంచేత విచిత్రమైన) వాచ్యార్థమే వాచ్యరూపాలను (కువలయచంద్రాదులను) పైకి తీసికొని వచ్చి అభిలాషాదులకు విభావం అవుతున్నది. అందువల్లనే వాచ్యానికి ఉన్న ప్రాధాన్యం ఇంతమాత్రంలోనే. అనగా విస్మయాదులకు విభావంగా అయి అభిలాషాదులకు విభావం అయేవరకే వాచ్యార్థానికి ప్రాధాన్యం. అయినా కూడ తరవాత గోచరించే శృంగారరసధ్వనిలో ఆ వాచ్యార్థానికి కూడ గుణత్వమే. గుణీభూతవ్యంగ్యభేదా లన్నింటిలోనూ కూడ ఈ విధంగా వాచ్యార్థం చివరికి గుణీభావాన్నే చెందుతుంది అని తెలుసుకోవాలి. అందుచేతనే ఆత్మత్వం ధ్వనికి మాత్రమే అని అనేకపర్యాయాలు చెప్పబడింది.

అన్యే త్వితి. మరికొందరు సహృదయులైతే - ఈ వచనం జలక్రీడకొరకు దిగిన తరుణుల లావణ్యద్రవంచేత సుందరంగా చేయబడిన నదిని గూర్చినది అని అన్నారు. అలా చెప్పినా కూడ అన్వయం చెప్పిన పద్ధతిలోనే. లేదా నదిదగ్గర స్నానంకోసం దిగిన యువతిని గూర్చి కూడ కావచ్చును. ఎలా చెప్పినా కూడ విస్మయం ద్వారా ఇంత అర్థంలో వాక్యానికి వ్యాపారం ఉంది గాన వ్యంగ్యం గుణం అని చెప్పబడింది.

## ధ్వన్యాలోకం

అతిరస్కృతవాచ్యేభ్యోఽపి శబ్దేభ్యః ప్రతీయమానస్య వ్యఙ్గ్యస్య కదాచిద్వాచ్యప్రాధాన్యేన కావ్యచారుత్వాపేక్షయా గుణీభావే సతి గుణీభూతవ్యఙ్గ్యతా. యథా ఉదాహృతమ్-"అనురాగవతీ సంధ్యా" ఇత్యేవమాది. తస్యైవ స్వయముక్త్యా ప్రకాశీకృతత్వేన గుణీభావః;

యథా ఉదాహృతమ్ - "సంకేతకాలమనసమ్" ఇత్యాది. రసాదిరూపవ్యఙ్గ్యస్య గుణీభావః రసవదలఙ్కారే దర్శితః. తత్ర చ తేషామాధికారికవాక్యాపేక్షయా గుణీభావః, వివహనప్రవృత్తభృత్యానుయాయిరాజవత్. వ్యఙ్గ్యాలంకారస్య గుణీభావః దీపకాదివిషయః.

బాలానందిని

అతిరస్కృతేతి - అతిరస్కృతవాచ్యాలైన శబ్దాలవల్ల ప్రతీయమానమైన వ్యంగ్యం కూడ, ఒకప్పుడు కావ్యంయొక్క సౌందర్యం దృష్ట్యా చూచినప్పుడు వాచ్యానికే ప్రాధాన్యం కనబడడంచేత, అప్రధానం అవుతుంది. అప్పుడు కూడ గుణీభూతవ్యంగ్యత్వమే. వెనుక చూపిన "అనురాగవతీ సంధ్యా" (శ్లో.9) ఇత్యాదిశ్లోకం ఉదాహరణం. అదే, (వస్తువే) ఒక పదంచేత స్వయంగా ప్రకటించబడితే, వెనక ఉదాహరించిన "సంకేతకాలమనసమ్" (శ్లో.48) ఇత్యాదిశ్లోకంలో వలె, గుణీభూతత్వమే. రసాదిరూపవ్యంగ్యానికి గుణీభావం రసవదలంకారంలో చూపబడింది. అక్కడ వాటికి (రసాలకు) ప్రధానమైన ప్రకృతవాక్యార్థం దృష్ట్యా అప్రాధాన్యం. ఈ అప్రాధాన్యం వివాహం చేసుకుంటూన్న భృత్యుని వెనక వెడుతూన్న రాజుకున్న అప్రాధాన్యం వంటిది. అనగా నిజానికి రసాదుల కున్న ప్రాధాన్యం తగ్గి నట్లు కనబడినా ఏ మాత్రం తగ్గదు అని భావం. వ్యంగ్యాలంకారానికి గుణీభావం దీపకాదులలో కనబడుతుంది.

లోచనం

ఉదాహృతమితి. ఏతచ్చ ప్రథమోద్ద్యోత ఏవ నిరూపితమ్. అనురాగశబ్దస్య చాభిలాషే తదుపరక్తత్వలక్షణయా లావణ్యశబ్దవత్ ప్రవృత్తిరిత్యభిప్రాయేణాతిరస్కృత వాచ్యత్వముక్తమ్. తస్యైవేతి - వస్తుమాత్రస్య. రసాదీతి - ఆదిశబ్దేన భావాదయః రసవచ్ఛబ్దేన ప్రేయస్విప్రభృతయః అలంకారాః ఉపలక్షితాః. నన్వత్ర ప్రధానభూతస్య రసాదేః కథం గుణీభావః? గుణీభావే వా కథమచారుత్వం న స్యాదిత్యాశఙ్క్య ప్రత్యుత సున్దరతా భవతీతి ప్రసిద్ధదృష్టాన్తముఖేన దర్శయతి - తత్ర చేతి. రసవదాద్యలంకారవిషయే. ఏవం వస్తునో రసాదేశ్చ గుణీభావం ప్రదర్శ్య అలంకారాత్మనోఽపి తృతీయస్య వ్యఙ్గ్యప్రకారస్య తం దర్శయతి - వ్యఙ్గ్యాలంకారస్యేతి. ఉపమాదేః. 34

బాలానందిని

ఉదాహృతమితి. ఇది ప్రథమోద్ద్యోతంలోనే నిరూపించబడినది. దానిచే పూయబడినది అనే నిమిత్తంచేత లక్షణచేత అనురాగశబ్దం కూడ, లావణ్యశబ్ద కాంతివిశేషాన్ని బోధించినట్లు, అభిలాష అనే అర్థాన్ని బోధిస్తుంది అనే అభిప్రాయంచే అతిరస్కృతవాచ్యత్వం చెప్పబడింది.

వివరణ:- 'సంధ్యా' ఇత్యాది పదాలలో వాచ్యార్థం తిరస్కృతం కాకపోయిన 'అనురాగ' శబ్దానికి ప్రేమ అనే అర్థంలో రూఢి ఉండడంచేత ఎరుపు అనే అర్థ జహత్స్వార్థలక్షణచేత మాత్రమే చెప్పాలి కదా? అప్పుడు ఆ పదం తిరస్కృతవాచ్య అయిపోయింది కదా అని ఆశంక కలగవచ్చును. అందుకు సమాధానంగా - 'అనురాగ పదం యోగరూఢిచేత ఎరుపు అనే అర్థాన్నే బోధిస్తుంది; అనురాగం అనే అర్థాన్ని నిరూఢలక్షణచేతనే బోధిస్తుంది. అందుచేత ఈ పదం కూడ తిరస్కృతవాచ్యం కాదు ఎరుపు అనేదే దీని వాచ్యార్థం అని చెప్పబడింది.

తస్యైవేతి. వస్తుమాత్రంయొక్క. రసాదీతి. ఆదిశబ్దంచేత భావాదులు రసవచ్ఛబ్దంచేత ప్రేయస్విమొదలైన అలంకారాలు ఉపలక్షణచేత గ్రహించబడతాయి (ప్రేయస్విప్రభృతయః కు బదులు ప్రేయఃప్రభృతయః అనే పాఠం ఉండి ఉంటుంది) నన్వితి. ఎంతో ప్రధానమైన రసాదులకు గుణీభావం ఎట్లు? గుణీభావమే ఉన్నట్లయితే అసుందరత్వం లేకుండా ఎలా ఉంటుంది అని ఆశంకించుకొని అసుందరత్వం కాదు కదా పైగా సుందరత్వమే ఉంటుంది అని ప్రసిద్ధదృష్టాంతం ద్వారా చెపుతున్నాడు - తత్ర చేతి. రసవదాద్యలంకారవిషయంలో అని అర్థం. ఈ విధంగా వస్తువుకు, రసాదులకు గుణీభావాన్ని చూపి అలంకారరూపమైన మూడవ వ్యంగ్యప్రకారానికి కూడ దాని చూపుతున్నాడు - వ్యఙ్గ్యాలంకారస్యేతి. ఉపమాదికి. 34

## ధ్వన్యాలోకం

తథా -

కా. ప్రసన్నగమ్భీరపదాః కావ్యబన్ధాః సుఖావహాః,
యే చ తేషు ప్రకారోఽయమేవ యోజ్యః సుమేధసా. 35

యే చైతే అపరిమితస్వరూపా అపి ప్రకాశమానాః, తథావిధార్థరమణీయాః సన్తః వివేకినాం సుఖావహాః కావ్యబన్ధాః తే

షు సర్వేష్వేవాయం ప్రకారో గుణీభూతవ్యఙ్గ్యో నామ యోజనీయః.
యథా -

గాథ- లచ్ఛీ దుహిఆ జామాఉఓ హరీ తంస ఘరణీఆ గఙ్గా,
అమిఅమిఅఙ్కా అ సుఆ అహో కుడుమ్బం మహోఅహిణో.
(107)

"లక్ష్మీర్దుహితా జామాతా హరిస్తస్య గృహిణీ గఙ్గా,
అమృతమృగాఙ్కౌ చ సుతావహో కుటుమ్బం మహోదధేః"
(సంస్కృతచ్ఛాయ)

బాలానందిని

**తథా ఇతి.** ఆ విధంగా - ప్రసన్నేతి - "ప్రసన్నములు గంభీరములు అయిన పదాలు గల, సుఖజనకాలైన ఏ కావ్యబంధాలు గలవో వాటిలో కూడ బుద్ధిమంతునిచేత ఈ ప్రకారమే (పద్ధతియే) కూర్చదగినది"

**యే చేతి:-** అపరిమితమైన స్వరూపం కలవైనా ఆ విధమైన అర్థంతో సుందరములై ప్రకాశిస్తున్న ఏ కావ్యబంధాలు వివేకవంతులకు సుఖకరములై ప్రకాశిస్తున్నాయో వాటి అన్నింటిలోనూ కూడ ఈ గుణీభూతవ్యంగ్యం అనే ప్రకారం సమన్వయించుకొనదగినది. ఎట్లనగా -

లచ్ఛీ ఇతి. "లక్ష్మి కూతురు; మహావిష్ణువు అల్లుడు; భార్య గంగ; అమృత - చంద్రులు పుత్రులు. మహాసముద్రంయొక్క కుటుంబం ఎంత ఆశ్చర్యకరమైనది!"

లోచనం

ఏవం ప్రకారత్రయస్యాపి గుణభావం ప్రదర్శ్య బహుతరలక్ష్యవ్యాపకతా అస్యేతి దర్శయితుమాహ - తథేతి. ప్రసన్నాని ప్రసాదగుణయోగాత్ గభీరాణి చ వ్యఙ్గ్యార్థాక్షేపకత్వాత్ పదాని యేషు. సుఖావహాః ఇతి చారుత్వహేతుః తత్ర అయమేవ ప్రకార ఇతి భావః. యస్త్వేతం ప్రకారం తత్ర యోజయితుం న శక్తః స పరమలీకసహృదయభావనాముకులితలోచనోక్త్యా ఉపహసనీయః స్యాదితి భావః.

లక్ష్మీః సకలజనాభిలాషభూమిః దుహితా. జామాతా హరిః యః సమస్తభోగాపవర్గదానసతతోద్యమీ. తథా గృహిణీ గఙ్గా యస్యాః సమభిలషణీయే సర్వస్మిన్వస్తుని అనుపహతః ఉపాయభావః. అమృతమృగాఙ్కౌ చ సుతౌ అమృతమిహ వారుణీ. తేన గఙ్గాస్నానహరి చరణారాధనాద్యుపాయశతలబ్ధాయా లక్ష్మ్యాః చన్ద్రోదయపానగోష్ఠ్యుపభోగ లక్షణం ముఖ్యం ఫలమితి త్రైలోక్యసారభూతతా ప్రతీయమానా సతీ "అహో కుటుమ్బం మహోదధేః" ఇతి అహోశబ్దాచ్చ గుణీభావమనుభవతి. 35

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా మూడు వ్యంగ్యభేదాలయొక్క గుణభావాన్ని చూపి ఇది (గుణీభూతవ్యంగ్యత్వం) అత్యధికమైన లక్ష్యాలలో వ్యాపించి ఉన్నది అని చూపడానికి చెపుతున్నాడు - తథేతి. ప్రసన్నాని= ప్రసాదగుణంతో కూడినవి అవడంచేత ప్రసన్నమైనవి, గభీరాణి చ= వ్యంగ్యార్థాన్ని ఆక్షేపించే వవడంచేత గంభీరములు అయిన పదాలు వేటియందో అవి. సుఖావహాః ఇతి. ఆ కావ్యబంధంలో ఈ ప్రకారమే చారుత్వానికి హేతువు అని భావం. సుమేధసా ఇతి. ఎవడు కావ్యబంధంలో ఈ ప్రకారాన్ని కూర్చడానికి సమర్థుడు కాడో అతడు "కేవలం అసత్యమైన సహృదయుడ ననే భావనచేత కళ్లు మూసికొని (అరమోడ్పు కళ్లతో) ఆనందిస్తున్నట్లు కూర్చున్నాడు" అనే మాటచేత పరిహసించదగినవాడు అని భావం.

లక్ష్మీః= సకలజనుల అభిలాషకు స్థానమైన లక్ష్మి, కుమార్తె. ఏ హరి సమస్త భోగాలను మోక్షాన్ని ఇవ్వడంలో ఎల్లప్పుడూ ఉద్యమిస్తూ ఉంటాడో అలాంటి శ్రీహరి అల్లుడు. కోరదగిన ప్రతివస్తువు విషయంలోను ఉపాయంగా ఉండడం అనేది ఏ గంగయందు ఉపహతం కాదో (అడ్డుకొనబడదో, అడ్డులేనిదో) ఆ గంగ భార్య. అమృతమృగాంకులు సుతులు. ఇక్కడ అమృతం అనగా మద్యం. (అమృతం సర్వసాధారణం కాదు గాన ఈ అర్థం చెప్పబడిందని బాలప్రియాకారుడు వ్రాశాడు గాని ఈ అర్థం చెప్పడంలో అంత విశిష్టమైన ఔచిత్యం ఏదీ కనబడదు. లక్ష్మీ-హర్యాదులు మాత్రం సర్వసాధారణులా? ముందు చెప్పబోయే పానగోష్ఠిని దృష్టిలో పెట్టుకొని ఈ అర్థం చెప్పి ఉండవచ్చు. ఆ అర్థం కూడా ఏదో చెప్పాలని చెప్పినదే). తేనేతి. అందుచేత గంగాస్నానం, హరిచరణారాధనం మొదలైన ఉపాయశతాలచేత లక్ష్మిని పొందినందుకు ముఖ్యమైనఫలం చంద్రోదయసమయంలో పానగోష్ఠిని అనుభవించడమే. (వాళ్లందరూ

ఈయన కుటుంబానికి చెందినవాళ్లే). ఈ విధంగా సముద్రంయొక్క త్రిలోకసారభూతత్వం (మూడు లోకాలలోను అందరికంటె శ్రేష్ఠత్వం) ధ్వనింపబడుచున్నది. ఆ వ్యంగ్యార్థం "అహో కుటుమ్బం మహోదధేః" అని 'అహో' శబ్దంవల్ల అప్రాధాన్యాన్ని అనుభవిస్తున్నది. అనగా ఈ అర్థమే 'అహో' అనే పదంచేత వాచ్యంగా చెప్పబడిపోవడంచేత గౌణత్వాన్ని పొందినది అని భావం. 35

## ధ్వన్యాలోకం

కా. వాచ్యాలంకారవర్గోఽయం వ్యఙ్గ్యాంశానుగమే సతి,
ప్రాయేణైవ పరాం ఛాయాం బిభ్రల్లక్ష్యే నిరీక్ష్యతే. 36.

వాచ్యాలంకారవర్గోఽయం వ్యఙ్గ్యాంశస్య అలంకారస్య వస్తుమాత్రస్య వా యథాయోగమనుగమే సతి చ్ఛాయాతిశయం బిభ్రల్లక్షణకారైరేకదేశేన దర్శితః. స తు తథారూపః ప్రాయేణ సర్వ ఏవ పరీక్ష్యమాణో లక్ష్యే నిరీక్ష్యతే. తథాహి - దీపకసమాసోక్త్యాది వదన్యేఽప్యలంకారాః ప్రాయేణ వ్యఙ్గ్యాలంకారాన్తరవస్త్వన్తరసం స్పర్శినో దృశ్యన్తే. యతః ప్రథమం తావదతిశయోక్తిగర్భతా సర్వాలంకారేషు శక్యక్రియా; కృతైవ చ సా మహాకవిభిః కామపి కావ్యచ్ఛవిం పుష్యతి, కథం హ్యతిశయయోగితా స్వవిషయౌచిత్యేన క్రియమాణా సతీ కావ్యే నోత్కర్షమావహేత్?

### బాలానందిని

వాచ్యేతి:- " ఈ వాచ్యాలంకారాల సముదాయం వ్యంగ్యాంశంతో సంబంధం ఉన్నట్లయితే సాధారణంగా అధికమైన శోభను వహిస్తున్నట్లుగా లక్ష్యంలో కనబడు తూన్నది" 36

వాచ్యేతి. ఈ వాచ్యాలంకార సముదాయం వీలును అనుసరించి వ్యంగ్యాంశమైన అలంకారంయొక్క గాని, వస్తువుయొక్క గాని సంబంధం ఉన్నట్లయితే శోభాతిశయాన్ని వహిస్తూన్నట్లుగా లక్షణకారులు కొంతవరకు (ఏకదేశేన) చూపించి ఉన్నారు. లక్ష్యంలో పరీక్షింపబడిన ట్లయితే ప్రతీ అలంకారం కూడ సాధారణంగా ఆ విధంగానే ఉన్నట్లు

కనబడుతుంది. ఎందువలన అనగా - దీపక - సమాసోక్త్యాద్యలంకారాల వలె ఇతరమైన అలంకారాలు కూడ సాధారణంగా వ్యంగ్యమైన మరొక అలంకారంయొక్క లేదా వస్తువుయొక్క స్పర్శ ఉన్నవిగా కనబడుతున్నాయి. ఎందువల్ల ననగా - మొట్టమొదటి విషయం - అన్ని అలంకారాల గర్భంలోను అతిశయోక్తి ఉండేటట్లు చేయవచ్చును. మహాకవులచేత ఆ విధంగా చేయబడింది కూడ; చేయబడి కావ్యశోభను పోషిస్తూన్నది. తన విషయం యొక్క ఔచిత్యాన్ని పాటిస్తూ అతిశయసంబంధం చేయబడినట్లయితే కావ్యంలో శోభకు ఉత్కర్షను కలిగించకుండా ఎలాఉంటుంది?

లోచనం

ఏవం నిరలంకారేషు ఉత్తానతాయాం తుచ్ఛతయా భాసమానమ్ అమునా అన్తఃసారేణ కావ్యం పవిత్రీకృతమ్ ఇత్యుక్త్వా అలంకారస్యాప్యనేనైవ రమ్యతరత్వమితి దర్శయతి - వాచ్యేతి. అంశత్వమ్ గుణమాత్రత్వమ్. ఏకదేశేనేతి. ఏకదేశవివర్తిరూపక మనేన దర్శితమ్. తదయమర్థః- ఏకదేశవివర్తిరూపకే-

"రాజహంసైరవీజ్యన్త శరదైవ సరోనృపాః"

ఇత్యత్ర హంసానాం యత్ చామరత్వం ప్రతీయమానం తత్ 'నృపాః' ఇతి వాచ్యే ఽర్థే గుణతాం ప్రాప్తమలఙ్కారకారైః యావదేవ దర్శితం తావదమునా ద్వారేణ సూచితోఽయం ప్రకార ఇత్యర్థః. అన్యే త్వేకదేశేన వాచ్యభాగవైచిత్ర్యమాత్రేణ ఇత్యనుద్భిన్నమేవ వ్యాచచక్షిరే. వ్యఙ్గ్యం యదలంకారాన్తరం వస్త్వన్తరం చ సంస్పృశన్తి యే స్వాత్మనః సంస్కారాయాశ్లిష్యన్తీతి తే తథా. మహాకవిభిరితి. కాలిదాసాదిభిః. కావ్యశోభాం పుష్యతీతి యదుక్తం తత్ర హేతుమాహ - కథం హీతి. హిశబ్దో హేతౌ. అతిశయ యోగితా కథం నోత్కర్షమావహేత్, కావ్యే? నాస్త్యేవాసౌ ప్రకార ఇత్యర్థః; స్వవిషయే యదౌచిత్యం తేన చేత్ హృదయస్థితేన తామతిశయోక్తిం కవిః కరోతి. యథా భట్టేన్దురాజస్య -

శ్లో. యద్విశ్రమ్య విలోకితేషు బహుశో నిఃస్థేమనీ లోచనే
యద్గాత్రాణి దరిద్రతి ప్రతిదినం లూనాబ్జినీనాలవత్,

దూర్వాకాణ్డవిడమ్బకశ్చ నిబిడో యత్పాణ్డిమా గణ్డయోః
కృష్ణే యూని స యౌవనాసు వనితాస్వేషైవ వేషస్థితిః.

అత్ర హి భగవతో మన్మథవపుషః సౌభాగ్యవిషయః సంభావ్యత ఏవ అయమతిశయ ఇతి తత్కావ్యే లోకోత్తరైవ శోభోల్లసతి. అనౌచిత్యేన తు శోభా లీయత ఏవ. యథా -

శ్లో. అల్పం నిర్మితమాకాశమనాలోచ్యైవ వేధసా,
ఇదమేవంవిధం భావి భవత్యాః స్తనజృమ్భణమ్. ఇతి

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా, అలంకారాలు లేనిది, పైకి చూడడానికి సారం లేనిదిగా కనబడేదీ అయిన కావ్యం లోపలి సారమైన దీనిచేత (గుణీభూతవ్యంగ్యంచేత) పవిత్రం చేయబడింది అని చెప్పి అలంకారానికి కూడా దానిచేత అధికమైన రమ్యత్వం కలుగుతుంది అని చూపుతున్నాడు - వాచ్యేతి. అంశత్వం అనగా గుణంగా (అప్రధానంగా) మాత్రమే ఉండడం. ఏకదేశేనేతి. దీనిచేత ఏకదేశవివర్తిరూపకం చూపబడింది. అందుచేత అర్థం ఇది - "రాజహంసైరవీజ్యన్త శరదైవ సరోన్నృపాః" (సరస్సు లనే రాజులు శరత్కాలంచేతనే, రాజహంసలతో వీచబడిరి) అనే ఏకదేశవివర్తిరూపకంలో హంసలకు ఏ చామరత్వం ప్రతీయమానం అవుతున్నదో (హంసలే చామరాలని వ్యంగ్యమైన అర్థం) వాచ్యార్థంలో అప్రధానత్వాన్ని పొందినదిగా ఎంతవరకు అలంకారకారులచేత చూపబడినదో అంతవరకు (వాళ్లు చూపినంతవరకు) ఈ ప్రకారం ఈ ద్వారం చేతనే సూచించబడినది అని అర్థం. అనగా ప్రాచీనాలంకారికులు కూడ ఏకదేశ వివర్తిరూపకాదులలో వ్యంగ్యార్థం వాచ్యార్థానికి అంగంగా ఉన్నదని అంగీకరించి నట్లే అని అర్థం. అన్యే త్వితి. కొందరు వ్యాఖ్యాతలైతే 'ఏకదేశేన' అనేదానికి 'వాచ్యభాగానికి వైచిత్ర్యమాత్రంచేత' అని అస్పష్టంగా వ్యాఖ్యానించారు. ఏవి తమను సంస్కరించుకొనడంకొరకు వ్యంగ్యమైన మరొక అలంకారాన్ని, మరొక వస్తువును ఆశ్లేషిస్తాయో అవి "వ్యఙ్గ్యాలంకారాన్తరవస్త్వన్తరసంస్పర్శినః" అని అర్థం. మహాకవిభిరితి - కాలిదాసాదులచేత. కావ్యశోభను పోషిస్తుంది అని చెప్పబడింది. దానికి హేతువును చెపుతున్నాడు - కథం హీతి. 'హి' శబ్దం హేత్వర్థకం. అతిశయంతో సంబంధించి ఉండడం కావ్యంలో ఉత్కర్షను ఎందుకు సంపాదించదు? స్వవిషయంలో అనగా అతిశయం విషయంలో ఉన్న ఔచిత్యాన్ని హృదయంలో ఉంచుకొని (దృష్టిలో ఉంచుకొని)

కవి ఆ అతిశయోక్తిని చేసినట్లయితే ఉత్కర్షను కలిగించని ప్రకారం ఉండనే ఉండదు అని అర్థం. ఉదాహరణకు భట్టేందురాజు శ్లోకం -

యద్విశ్రమ్య ఇతి:- ఇది ప్రథమోద్ద్యోతంలో నాల్గవ కారిక వ్యాఖ్యలో లోచనంలో ఇవ్వబడింది.

అత్ర హీతి. ఇక్కడ మన్మథుని వంటి శరీరం గల భగవంతుని సౌభాగ్యాన్ని గూర్చిన ఈ అతిశయం సంభావ్యమే (ఉచితమే) గాన కావ్యంలో లోకోత్తరమైన శోభ ఉల్లసిస్తూన్నది. అనౌచిత్యం ఉన్నట్లయితే మాత్రం శోభ అణగిపోతుంది. ఎట్లనగా-

అల్పమితి. భవత్యాః= నీయొక్క, ఇదమ్= ఈ, స్తనజృమ్భణమ్= స్తనాల విజృంభణం, ఏవంవిధమ్= ఈ విధంగా, భావి= కాగలదు అని, అనాలోచ్యైవ= ఆలోచించకుండానే, వేధసా= బ్రహ్మచేత, అల్పమ్= అల్పమైన, ఆకాశమ్= ఆకాశం, నిర్మితమ్= నిర్మించబడింది. ఇది ఔచిత్యబాహ్యమైన అతిశయం అని భావం.

## ధ్వన్యాలోకం

భామహేనాప్యతిశయోక్తిలక్షణే యదుక్తమ్ -

శ్లో. సైషా సర్వైవ వక్రోక్తిరనయార్థో విభావ్యతే,
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽనయా వినా .
(కావ్యాలంకారం 2.85)

ఇతి. తత్రాశయోక్తిః యమలంకారమధితిష్ఠతి కవిప్రతిభావశాత్తస్య చారుత్వాతిశయయోగః, అన్యస్య త్వలంకారమాత్రతైవేతి సర్వాలంకారశరీరస్వీకరణయోగ్యత్వేన అభేదోపచారాత్సైవ సర్వాలంకారరూపేత్యయమేవార్థః అవగన్తవ్యః.

తస్యాశ్చాలంకారాన్తరాసంకీర్ణత్వం కదాచిద్వాచ్యత్వేన, కదాచిద్వ్యఙ్గ్యత్వేన. వ్యఙ్గ్యత్వమపి కదాచిత్ ప్రాధాన్యేన కదాచిద్గుణభావేన. తత్రాద్యే పక్షే వాచ్యాలంకారమార్గః. ద్వితీయే తు ధ్వనావన్తర్భావః. తృతీయే తు గుణీభూతవ్యఙ్గ్యరూపతా. అయంచ ప్రకారః అన్యేషామప్యలంకారాణామస్తి; తేషాం తు న సర్వవిషయః. అతిశయోక్తేస్తు సర్వాలంకారవిషయోఽపి సంభవతీత్యయం విశేషః.

బాలానందిని

భామహేనేతి. భామహుడు అతిశయోక్తిలక్షణంలో - "సమస్తవక్రోక్తి (అలంకారమూ) కూడ ఈ అతిశయోక్తియే. దీనిచేత అర్థానికి సొంపు చేకూరుతుంది. కవి దీని విషయంలో ప్రయత్నం చెయ్యాలి. ఇది లేకపోతే అలంకారం ఏమిటి?" అని ఏదైతే చెప్పాడో అక్కడ - అతిశయోక్తి ఏ అలంకారాన్ని అధిష్ఠిస్తుందో దానికి కవిప్రతిభావశంచేత సౌందర్యాతిశయం కలుగుతుంది; ఇతర మైనది (అతిశయోక్తిసంబంధం లేనిది) అలంకారంమాత్రమే; అందువల్ల ఇది (అతిశయోక్తి) సకలాలంకారాల శరీరంలో స్వీకరించడానికి యోగ్యం అవడంచేత, అభేదోపచారంచేత, (అభేదాన్ని ఆరోపించడం చేత) అదే సర్వాలంకారరూపమైనది అని మాత్రమే అర్థం గ్రహించాలి. ఆ అతిశయోక్తి ఒకప్పుడు వాచ్యంగాను, ఒకప్పుడు వ్యంగ్యం గాను ఉంటూ ఇతరాలంకారాలతో కలవకుండా కూడ ఉంటుంది. వ్యంగ్యత్వం కూడ ఒకప్పుడు ప్రాధాన్యంచేత, మరొకప్పుడు గుణభావంచేత ఉండవచ్చు. వాటిలో మొదటి పక్షంలో వాచ్యాలంకారమార్గంలో చేరుతుంది. రెండవ పక్షంలో ధ్వనిలో అంతర్గతం అవుతుంది. మూడవ పక్షంలో గుణీభూతవ్యంగ్యరూపం అవుతుంది.

లోచనం

నను అతిశయోక్తిః సర్వాలంకారేషు వ్యఙ్గ్యతయా అన్తర్లీనైవాస్త ఇతి యదుక్తం తత్కథమ్? యతః భామహః అతిశయోక్తిం సర్వాలంకార సామాన్యామవాదీత్. న చ సామాన్యం శబ్దాద్విశేషప్రతీతేః పృథగ్భూతతయా పశ్చాత్తనత్వేన చకాస్తి ఇతి కథమస్య వ్యఙ్గ్యత్వమ్ ఇత్యాశఙ్క్యాహ - భామహేనేతి. "భామహేనాపి 'యదుక్తం తత్ర అయమేవార్థః అవగన్తవ్యః" ఇతి దూరేణ సంబన్ధః. కిం 'తదుక్తమ్ - సైవేతి. యా అతిశయోక్తిర్లక్షితా సైవ సర్వా వక్రోక్తిరలఙ్కారప్రకారః సర్వః.

"వక్రాభిధేయశబ్దోక్తిరిష్టా వాచామలంకృతిః" ( కా.అ.1.36).

ఇతి వచనాత్. శబ్దస్య వక్రతా, అభిధేయస్య చ వక్రతా, లోకోత్తీర్ణేన రూపేణావస్థానమితి అయమేవ అసావలంకారస్యాలంకారతా; లోకోత్తరతైవ చ అతిశయః. తేన అతిశయోక్తిః సర్వాలంకారసామాన్యమ్. తథాహి - అనయా అతిశయోక్త్యా అర్థః సకలజనోపభోగపురాణీకృతోఽపి విచిత్రతయా

భావ్యతే. తథా ప్రమదోద్యానాదిః విభావతాం నీయతే విశేషేణ చ భావ్యతే రసమయీక్రియతే; ఇతి తావత్తేనోక్తమ్. తత్ర కోఽసావర్థ ఇత్యత్రాహ - అభేదోపచారాత్ సైవ సర్వాలంకారరూపేతి. ఉపచారే నిమిత్తమాహ - సర్వాలంకారేతి. ఉపచారే ప్రయోజనమాహ - అతిశయోక్తిరిత్యాదినా అలంకారమాత్రతైవ ఇత్యన్తేన. ముఖ్యార్థబాధోఽప్యత్రైవ దర్శితః - కవిప్రతిభావశాదిత్యాదినా.

బాలానందిని

నన్వితి. అన్ని అలంకారాలలోను వ్యంగ్యంగా అతిశయోక్తి లోపల లీనమై (దాగి) ఉంటుం దని చెప్పినది ఎట్లు కుదురుతుంది? ఎందువల్ల ననగా భామహుడు అతిశయోక్తి సమస్తాలంకారసాధారణమైనది (అన్ని అలంకారాలకీ సంబంధించినది) అని అన్నాడు. సామాన్యమైనది విశేషప్రతీతికంటె భిన్నంగా, తరవాత కలిగేదిగాన శబ్దంవల్ల భాసించదు కదా? అలాంటప్పుడు ఇది వ్యంగ్యం ఎట్లు అవుతుంది? అని ఆశంకించుకొని చెపుతున్నాడు - భామహేనేతి. "భామహేనాపి యదుక్తమ్" అనేది "తత్ర అయమేవార్థః అవగన్తవ్యః" అనే దూరంగా ఉన్నదానితో అన్వయిస్తుంది. భామహుడు చెప్పినది ఏమిటి? సైషేతి. లక్షితమైన(లక్షణం చెప్పిన) ఏ అతిశయోక్తి ఉన్నదో అదే సమస్తవక్రోక్తి, సమస్తమైన అలంకారప్రకారం. "వక్రమైన అర్థంయొక్క శబ్దంయొక్క ఉక్తియే కావ్యాల అలంకారంగా అభీష్టమైనది" అని చెప్పబడింది కదా? లోకాతీతమైన (లోకవ్యవహారంలో సాధారణంగా కనబడని) రూపంలో ఉండడమే శబ్దవక్రత అయినా, అర్థవక్రత అయినా కూడ; లోకోత్తరత్వమే అతిశయం అనగా. అందుచేత అతిశయోక్తి సమస్తాలంకారాలకి సాధారణమైనది. ఎందువల్ల' ననగా - సకలజనులచేత అనుభవించబడడం చేత పాతబడిపోయిన విషయం కూడ ఈ అతిశయోక్తిచేతనే విచిత్రంగా చేయబడుతుంది; ప్రమదోద్యానాదికం విభావత్వాన్ని పొందించబడుతుంది. విభావ్యతే= విశేషంచేత (అధికంగా) రసమయం చేయబడుతుంది అని కదా అతడు చెప్పాడు? దాని అర్థం ఏమిటి? ఈ విషయంలో చెపుతున్నాడు - అభేదోపచారాత్ సైవ సర్వాలంకారరూపా ఇతి. ఉపచారానికి నిమిత్తం చెపుతున్నాడు - సర్వాలంకారేతి. ఉపచారానికి ప్రయోజనం ఏమిటో - "అతిశయోక్తిః" మొదలు "అలంకారమాత్రతా" వరకు ఉన్న వాక్యభాగంచేత చెపుతున్నాడు. "కవిప్రతిభావశాత్" ఇత్యాదికంచేత ముఖ్యార్థబాధకూడ ఇక్కడనే చూపబడింది.

లోచనం

అయం భావః - యది తావదతిశయోక్తేః సర్వాలంకారేషు సామాన్యరూపతా తర్హి తాదాత్మ్యపర్యవసాయినీతి తద్వ్యతిరిక్తో నైవ అలంకారః దృశ్యత ఇతి కవిప్రతిభానం న తత్రాపేక్షణీయం స్యాత్. అలంకారమాత్రం చ న కించిద్దృశ్యేత. అథ సా కావ్యజీవితత్వేన ఇత్థం వివక్షితా తథాప్యనౌచిత్యేనాపి నిబధ్యమానా తథా స్యాత్. ఔచిత్యవత్ జీవితమితి చేత్ ఔచిత్యనిబన్ధనం రసభావాది ముక్త్వా నాన్యత్కించిదస్తీతి తదేవాన్తర్యామి ముఖ్యం జీవితమిత్యభ్యుపగన్తవ్యమ్, న తు సా.

ఏతేన యదాహుః కేచిత్ - ఔచిత్యఘటితసున్దరశబ్దార్థమయే కావ్యే కిమన్యేన ధ్వనినాత్మభూతేనేతి తే స్వవచనమేవ ధ్వనిసద్భావాభ్యుపగమ సాక్షిభూతమమన్యమానాః ప్రత్యుక్తాః. తస్మాత్ ముఖ్యార్థబాధాత్, ఉపచారే చ నిమిత్తప్రయోజనసద్భావాత్ అభేదోపచార ఏవాయమ్. తతశ్చ ఉపపన్నమతిశయోక్తేః వ్యఙ్గ్యత్వమితి. యదుక్తమలఙ్కారాన్తరస్వీకరణం తదేవ త్రిధా విభజతే - తస్యాశ్చేతి. వాచ్యత్వేనేతి. సా పి వాచ్యా భవతి. యథా - "అపరైవ హి కేయమత్ర" ఇతి. అత్ర రూపకేఽవ్యతిశయః శబ్దస్పృగేవ. అస్య త్రైవిధ్యస్య విషయవిభాగమాహ - తత్రేతి. తేషు ప్రకారేషు మధ్యే య ఆద్యః ప్రకారః తస్మిన్. నన్వతిశయోక్తిరేవ చేదేవంభూతా తత్క్రమపేక్షయా ప్రథమం తావదితి క్రమః సూచితః ఇత్యాశఙ్క్యాహ - అయం చేతి. యోఽతిశయోక్తౌ నిరూపితః అలంకారాన్తరేఽప్యనుప్రవేశాత్మకః. నన్వేవమపి ప్రథమమితి కేనాశయేనోక్తమిత్యాశఙ్క్యాహ - తేషామితి.

బాలానందిని

అయమితి:- దీని భావం ఇది - అతిశయోక్తి అన్ని అలంకారాలలోను సామాన్యరూపంగా ఉంటుందన్న ట్లయితే దీనికీ ఆ అలంకారాలకీ తాదాత్మ్యం (అభేదం) అని చెప్పిన ట్లవుతుంది. అప్పుడు అతిశయోక్తికంటె భిన్నమైన మరొక అలంకారం ఏదీ కనబడదు గాన వాటి విషయంలో (వాటిని కూర్చడానికి) కవిప్రతిభ అపేక్ష ఏమీ ఉండదు. అసలు మరొక అలంకారమే కనబడదు. అథేతి. అసలు

విషయం ఏమనగా ఇలా చెప్పడంలో ఉద్దేశ్యం అతిశయోక్తి కావ్యజీవితం అని చెప్పాలనే అభిలాషయే అన్నట్లయితే - అనౌచిత్యంతో కూర్చబడిన అతిశయోక్తి కూడ జీవితం అని చెప్పవలసి ఉంటుంది. ఔచిత్యం ఉన్నదే జీవితం అని అన్నట్లయితే (అది యుక్తం కాదు) - ఔచిత్యాన్ని నిర్ణయించకలిగినది రసభావాదికం తప్ప మరొక టేదీ లేదు; అందుచేత కావ్యాంతర్యామిగా ఉండే ఆ రసభావాధికమే జీవితం అని అంగీకరించాలి గాని దానిని (అతిశయోక్తిని) జీవితం అనడానికి వీలులేదు. దీనిచేత - "ఔచిత్యంతో కూడిన సుందరశబ్దార్థమయమైన కావ్యంలో ఆత్మ అయిన ధ్వని అనేది ఒకటుం దని చెప్పడం ఎందుకు?" అని ఎవరైతే అంటున్నారో, ధ్వనియొక్క ఉనికికి సాక్షియైన తమ వచనాన్నే లెక్కచేయని వాళ్లు నిరాకరించబడినారు.

వివరణః- ఔచిత్యఘటితాలైన శబ్దాలే కావ్యం అని 'ఔచిత్య'శబ్దాన్ని ఎప్పుడైతే ప్రయోగించారో అప్పుడు వాళ్లుకూడ ధ్వనిని అంగీకరించినట్లే. ఔచిత్యానౌచిత్యాలను నిర్ణయించేది ధ్వనిని పట్టే కదా? ఈ విధంగా వాళ్లు తమ మాటను తామే కాదంటున్నారు అని భావం. "సాక్షిభూతం మన్యమానాః" అనేదానికి అర్థం కుదరడం లేదు. అందుచేత "సాక్షీభూతమమన్యమానాః" అనేది సాధుపాఠం అయి ఉంటుందని అట్లు మార్చబడింది.

తస్మాదితిః- అందువల్ల ముఖ్యార్థబాధ ఉండడంవల్లా, ఉపచారం చేయడానికి నిమిత్తప్రయోజనాలు ఉండవల్లా ఇది అభేదోపచారమే. అందుచేత అతిశయోక్తి వ్యంగ్యం అని చెప్పినది యుక్తమే. అలంకారాంతరస్వీకరణం, అనగా అలంకారాంతరాలతో కలిసి ఉండడం, అనేది ఏది చెప్పబడిందో దానినే మూడు విధాలుగా విభజిస్తున్నాడు - తస్యాశ్చేతి. వాచ్యత్వేనేతి. ఆ అతిశయోక్తి కూడ వాచ్యం అవుతుంది. ఉదాహరణకి - "అపరైవ హి కేయమత్ర" (శ్లో. 107) అనేచోట. ఇక్కడ రూపకాలంకారంతో కలిసి ఉన్న అతిశయోక్తి కూడ శబ్దాన్ని స్పృశిస్తూన్నది (వాచ్యంగానే ఉన్నది). ఈ త్రైవిధ్యానికి విషయవిభాగం చెపుతున్నాడు - తత్రేతి. ఆ ప్రకారాలలో మొదటి ప్రకారం ఏది ఉందో దానియందు. నన్వితి. అతిశయోక్తి కూడా ఈ విధంగానే ఉంటే దేనిని పట్టి "ప్రథమం తావత్" అని అంటూ క్రమం సూచించబడింది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - అయం చేతి. అలంకారాంతరాలలో ప్రవేశించడం అనే ఏ ప్రకారం అతిశయోక్తి విషయంలో చెప్పబడిందో అది అని అర్థం. నన్వితి. అయితే మాత్రం "ప్రథమమ్" అని చెప్పడంలో అభిప్రాయం ఏమిటి అని ఆశంకించుకొని చెపుతున్నాడు. తేషామితి.

## ధ్వన్యాలోకం

యేషు చాలంకారేషు సాదృశ్యముఖేన తత్త్వప్రతిలమ్భః, యథా రూపకోపమాతుల్యయోగితానిదర్శనాదిషు తేషు గమ్యమానధర్మ ముఖేనైవ యత్సాదృశ్యం తదేవ శోభాతిశయశాలి భవతీతి తే సర్వేఽపి చారుత్వాతిశయయోగినః సన్తః గుణీభూతవ్యఙ్గ్యస్యైవ విషయాః. సమాసోక్త్యాక్షేపపర్యాయోక్తాదిషు తు గమ్యమానాంశావినాభావేనైవ తత్త్వవ్యవస్థానాత్ గుణీభూతవ్యఙ్గ్యతా నిర్వివాదైవ. తత్ర చ గుణీభూతవ్యఙ్గ్యతాయామలంకారాణాం కేషాంచిదలంకార విశేషగర్భతాయాం నియమః. యథా వ్యాజస్తుతేః ప్రేయోలంకార గర్భత్వే. కేషాం చిదలంకారమాత్రగర్భతాయాం నియమః. యథా సన్దేహాలంకారాదీనాముపమాగర్భత్వే. కేషాం చిదలంకారాణాం పరస్పరగర్భతాపి సంభవతి; యథా దీపకోపమయోః. తత్ర దీపకముపమాగర్భత్వేన ప్రసిద్ధమ్. ఉపమాపి కదాచిద్దీపకచ్ఛాయానుయాయినీ. యథా మాలోపమా. తథాహి - 'ప్రభామహత్యా శిఖయేవ దీపః' ఇత్యాదౌ స్ఫుటైవ దీపకచ్ఛాయా లక్ష్యతే.

### బాలానందిని

యేష్వితి. రూపకం, ఉపమ, తుల్యయోగిత, నిదర్శన మొదలైన ఏ అలంకారాలలో సాదృశ్యముఖంచేతనే (సాదృశ్యంద్వారానే) రూపకత్వాదికం పొందబడుతుందో వాటిలో గమ్యమానధర్మముఖంచేతనే (వ్యంగ్యం అయిన ధర్మంద్వారానే) ఏ సాదృశ్యం ఏర్పడుతుందో అదే అధికమైన శోభతో ప్రకాశించేది అవుతుంది. అందుచేత అవన్నీ చారుత్వాతిశయంతో కూడినవై గుణీభూతవ్యంగ్యానికే విషయాలు. (అవన్నీ గుణీభూతవ్యంగ్యాలే). సమాసోక్తి, ఆక్షేపం, పర్యాయోక్తం మొదలైనవాటిలో అయితే వాటికి సమాసోక్తిత్వాదికం గమ్యమానమైన అంశంతో అవినాభావంచేతనే ఏర్పడుతుంది గాన (వ్యంగ్యమైన అంశం ఉంటేనే వాటికి ఆ పేర్లు వచ్చాయి కాబట్టి) అవి గుణీభూతవ్యంగ్యా లనడంలో వివాదమే లేదు. వాటిలో కొన్ని అలంకారాలన

గుణీభూతవ్యంగ్యా లనడానికి వాటిలో అలంకారవిశేషం ఇమిడి ఉండడంవిషయంలో నియమం ఉంది. ఉదాహరణకి - వ్యాజస్తుతి గర్భంలో ప్రేయోలంకారం ఉంటుంది.కొన్నింటికి ఏదో ఒక అలంకారం గర్భంలో ఉండా లని మాత్రమే నియమం. ఉదాహరణకి - సందేహాదుల గర్భంలో ఉపమ ఉంటుంది. కొన్ని అలంకారాలు పరస్పరగర్భాలుగా కూడ ఉంటాయి, అనగా దాని గర్భంలో ఇది, దీని గర్భంలో అదీ ఉంటాయి. ఉదాహరణకి - దీపకోపమాలంకారాలు. వాటిలో దీపకం ఉపమాగర్భం అనే విషయం ప్రసిద్ధమే. ఒకప్పుడు ఉపమ కూడ దీపకచ్ఛాయను అనుసరించి ఉంటుంది. ఉదాహరణకి మాలోపమ. ఎందువల్ల ననగా - "ప్రభామహత్యా శిఖయేవ దీపః" ఇత్యాదులలో దీపకచ్ఛాయ స్పష్టంగా కనబడుతున్నది.

లోచనం

ఏవమలంకారేషు తావద్వ్యఙ్గ్యస్పర్శోఽస్తీత్యుక్త్వా తత్ర కిం వ్యఙ్గ్యత్వేన భాతీతి విభాగం వ్యుత్పాదయతి - యేషు చేతి. రూపకాదీనాం పూర్వమేవోక్తం స్వరూపమ్. నిదర్శనాయాస్తు-

"క్రియయైవ తదర్థస్య విశిష్టస్యోపదర్శనమ్,

ఇష్టా నిదర్శనా (నామ యథేవవతిభిర్వినా)" (భామహ. కావ్యా. 3.33)

ఇతి. ఉదాహరణమ్

అయం మన్దద్యుతిర్భాస్వానస్తం ప్రతి యియాసతి,

ఉదయః పతనాయేతి శ్రీమతో బోధయన్నరాన్. (భామహ. కావ్యా. 3.34)

ప్రేయోలంకారేతి:- చాటుపర్యవసాయిత్వాత్తస్యాః. సా చోదాహృతైవ ద్వితీయోద్ద్యోతేఽస్మాభిః. ఉపమాగర్భత్వ ఇత్యుపమాశబ్దేన సర్వ ఏవ తద్విశేషాః రూపకాదయః; అథవా ఔపమ్యం సర్వసామాన్యమితి తేన సర్వమాక్షిప్తమేవ. స్ఫుటైవేతి. "తయా స పూతశ్చ విభూషితశ్చ" ఇత్యేతేన దీపస్థానీయేన దీపనాత్ దీపకమత్రానుప్రవిష్టం ప్రతీయమానతయా. సాధారణధర్మాభిధానం హ్యేతదుపమాయాం స్పష్టేనాభిధాప్రకారేణైవ.

బాలానందిని

ఏవమితి:- ఈ విధంగా అలంకారాలలో వ్యంగ్యస్పర్శ ఉంటుంది అని చెప్పి, వాటిలో ఏది వ్యంగ్యంగా భాసిస్తుంది అనే విభాగాన్ని విశదీకరిస్తున్నాడు - **యేషు చేతి.** రూపకాదుల సంగ్రహం పూర్వమే చెప్పబడింది. నిదర్శనాస్వరూపమైతే -

క్రియయా ఇతి:- 'యథా' 'ఇవ' శబ్దాలు కాని, 'వతి' ప్రత్యయం కాని లేకుండానే క్రియచేతనే వాటి (ఇవాదుల) అర్థం చూపడంవల్ల నిదర్శనాలంకారం'' ఇది నిదర్శనాలక్షణం. ఉదాహరణం- ''ఈ సూర్యుడు మందమైన కాంతి గలవాడై, ఉదయం (ఉదయించడం, అధికమైన అభివృద్ధి అని రెండర్థాలు) పతనానికే దారితీస్తుంది అని శ్రీమంతులైన మానవులకు బోధిస్తూ అస్తాద్రికి వెళ్లబోతున్నాడు''. (ఇక్కడ ఉదయ-అభ్యుదయాలకీ, పతనవినాశాలకీ, సూర్యశ్రీమంతులకీ ఉపమానోపమేయభావం వ్యంగ్యం).

ప్రేయోలంకారేతి. అది చాటువులో పర్యవసానం చెందుతుంది గాన వ్యాజస్తుతి ప్రేయోలంకారగర్భం అని భావం. వ్యాజస్తుతి మాచేత ద్వితీయోద్యోతంలో ఉదాహరించబడింది. ఉపమాగర్భత్వే అని 'ఉపమా' శబ్దంచేత దాని విశేషాలైన రూపకాదిసర్వాలంకారాలు గ్రహించబడతాయి. లేదా ఔపమ్యం సర్వసామాన్యం(వాటి అన్నింటిలోనూ ఉండేది) గాన దానిచేత అన్నీ గ్రహించినట్లే. స్ఫురితైవేతి. దీపస్థానీయమైన (దీపంవంటి) ''తయా స పూతశ్చ విభూషితశ్చ'' అనేదానిచేత దీపనంవల్ల ఇక్కడ దీపకాలంకారం వ్యంగ్యంగా అనుప్రవిష్టమైనది. ఇది స్పష్టమైన అభిధాప్రకారంచేతనే సాధారణధర్మంగా చెప్పబడింది.

వివరణ:- 'ప్రభామహత్యా' ఇత్యాదికం కుమారసంభవంలోని శ్లోకం.

''ప్రభామహత్యా శిఖయేవ దీపః త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః,
సంస్కారవత్యేవ గిరా మనీషీ తయా స పూతశ్చ విభూషితశ్చ'' (కు. 1. 28)

''గొప్ప కాంతి గల శిఖచేత దీపంవలె, గంగచేత స్వర్గమార్గం వలె, సంస్కారం గల వాక్కుచేత పండితుడు వలె అతడు (హిమవంతుడు) ఆమెచేత (పార్వతిచేత) పవిత్రింపచేయబడ్డాడు, అలంకరించబడ్డాడు'' అని అర్థం.

## ధ్వన్యాలోకం

తదేవం వ్యఙ్గ్యాంశసంస్పర్శే సతి చారుత్వాతిశయయోగినో రూపకాదయోఽలఙ్కారాః సర్వ ఏవ గుణీభూతవ్యఙ్గ్యస్య మార్గః. గుణీభూతవ్యఙ్గ్యత్వం చ తేషాం తథాజాతీయానాం సర్వేషామేవోక్తానా మనుక్తానాం సామాన్యమ్. తల్లక్షణే సర్వ ఏవైతే సులక్షితా భవన్తి. ఏకైకస్య స్వరూపవిశేషకథనేన తు సామాన్యలక్షణరహితేన

ప్రతిపదపాఠేనేవ శబ్దాః న శక్యన్తే తత్త్వతో నిర్జ్ఞాతుమ్, ఆనన్త్యాత్. అనన్తా హి వాగ్వికల్పాః, తత్ప్రకారా ఏవ చాలంకారాః. గుణీభూతవ్యఙ్గ్యస్య చ ప్రకారాన్తరేణాపి వ్యఙ్గ్యార్థానుగమలక్షణేన విషయత్వమస్త్యేవ. తదయం ధ్వనినిష్యన్దరూపో ద్వితీయోఽపి మహాకవివిషయోఽతిరమణీయః లక్షణీయః సహృదయైః. సర్వథా నాస్త్యేవ సహృదయహృదయహారిణః కావ్యస్య స ప్రకారః యత్ర న ప్రతీయమానార్థసంస్పర్శేన సౌభాగ్యమ్. తదిదం కావ్యరహస్యం పరమితి సూరిభిః భావనీయమ్.

బాలానందిని

తదేవమితి. ఈ విధంగా వ్యంగ్యాంశంయొక్క సంస్పర్శ కలిగినప్పుడు అధికమైన చారుత్వంతో కూడిన రూపకాద్యలంకారాలు అన్నీ కూడ గుణీభూతవ్యంగ్యానికి మార్గాలు. ఇక్కడ చెప్పబడినవి, చెప్పబడనివి అయిన ఆ జాతికి చెందిన అన్నింటికీ కూడ గుణీభూతవ్యంగ్యత్వం అనేది సమానమే. ఆ గుణీభూతవ్యంగ్యాన్ని గుర్తిస్తే ఈ భేదాలన్నీ గుర్తించబడతాయి. సామాన్యలక్షణం (అన్నింటికీ సమంగా వర్తించే ఒక లక్షణం) చెప్పకుండా ఒక్కొక్కదాని స్వరూపవిశేషాలను చెప్పడంచేత ప్రతిపదపాఠంచేత శబ్దాల వలె, అవి యథార్థస్వరూపంచేత తెలుసుకొనడానికి శక్యం కావు. ఎందువల్ల ననగా వాటికి అంతం అనేది లేదు. వాక్కుకు సంబంధించిన వికల్పాలు (రూపాలు)అనంతాలు కదా? వాగ్వికల్పాల ప్రకారాలే అలంకారా లనగా.

వివరణః- గుణీభూతవ్యంగ్యం అంటే ఏమిటో అన్ని గుణీభూతవ్యంగ్యాలకీ వర్తించే ఒక లక్షణం చెప్పి ఒకటి రెండు ఉదాహరణలు చూపితే మిగిలిన వాటి అన్నింటి స్వరూపాన్నీ తెలుసుకొనడానికి సులువుగా ఉంటుంది. ఒక భాషలోని శబ్దాలను గూర్చి వివరించడానికి ఒక్కొక్కశబ్దమే తీసికొని దాన్ని వివరిస్తూంటే అది ఎప్పటికీ తెమిలే పని కాదు. అలా ప్రతీశబ్దాన్నీ చెప్పకుంటూ పోవడానికి 'ప్రతిపదపాఠం' అని పేరు. అలా కాకుండా ప్రకృతిప్రత్యయాదివిభాగం చేసి ఒకటి రెండు ఉదాహరణలు చూపితే దానిని పట్టి మేధావులు అన్ని శబ్దాల స్వరూపాల్ని తెలుసుకొన కలుగుతారు. అలాగే ఇక్కడ కూడ అని భావం.

గుణీభూతేతి. వ్యంగ్యార్థం అనుగతంగా ఉండడం అనే ప్రకారాంతరంచేత కూడ గుణీభూతవ్యంగ్యానికి విషయత్వం (లక్షణగోచరత్వం) ఉండనే ఉంటుంది. అందుచేత

మహాకవులకు విషయమూ, అతిరమణీయమూ అయిన ధ్వనినిష్యంద రూపమైన ఈ రెండవది కూడ (గుణీభూతవ్యంగ్యం కూడ) సహృదయులచేత గుర్తించదగినదే. ఏ విధంగా చూసినా కూడ దేనిలో అయితే వ్యంగ్యార్థసంస్పర్శచేత సౌభాగ్యం కలగదో అలాంటి సహృదయహృదయహారియైన కావ్యంయొక్క ప్రకారం లేనే లేదు. చాల గొప్పదైన ఈ కావ్యరహస్యాన్ని పండితులు గుర్తించాలి.

లోచనం

తథాజాతీయానామితి. చారుత్వాతిశయవతామిత్యర్థః. సులక్షితా ఇతి. యత్కిలైషాం తద్ధ్వనిర్ముక్తం రూపం న తత్కావ్యే అభ్యర్థనీయమ్. ఉపమా హి - "యథా గౌస్తథా గవయః" ఇతి. రూపకం "ఖలేవాలీ యూపః" ఇతి, శ్లేషః "ద్విర్వచనేఽచి" ఇతి తన్త్రాత్మకః, యథాసంఖ్యం "తుదీశాలాతురేతి", దీపకం "గామశ్వమ్" ఇతి, ససన్దేహః "స్థాణుర్వా స్యాత్" ఇతి, అపహ్నుతిః "నేదం రజతమ్" ఇతి, పర్యాయోక్తం "పీనో దివా నాత్తి" ఇతి, తుల్యయోగితా "స్థాఘ్వోరిచ్చ"ఇతి, అప్రస్తుతప్రశంసా సర్వాణి జ్ఞాపకాని, యథా పదసంజ్ఞాయా మన్తవచనమ్ - "అన్యత్ర సంజ్ఞావిధౌ ప్రత్యయగ్రహణే తదన్తవిధిర్న" ఇతి, ఆక్షేపశ్చోభయత్రవిభాషాసు వికల్పనాత్మకవిశేషాభిధిత్సయా ఇష్టస్యాపి విధేః పూర్వం నిషేధనాత్ ప్రతిషేధేన సమీకృత ఇతి న్యాయాత్, అతిశయోక్తిః 'సముద్రః కుణ్డికా', "విన్ధ్యో వర్ధితవానర్కవర్త్మాగృహ్ణాత్" ఇతి. ఏవమన్యత్. న చైవమాది కావ్యోపయోగీతి. గుణీభూతవ్యఙ్గకత్వైవాత్రాలంకారతాయాం మర్మభూతా లక్షితా తాన్ సుష్ఠు లక్షయతి. యయా సుపూర్ణం కృత్వా లక్షితాః సంగృహీతా భవన్తి, అన్యథా త్వవశ్యమవ్యాప్తిర్భవేత్. తదాహ - ఏకైకస్యేతి.

బాలానందిని

తథాజాతీయనామితి. చారుత్వాతిశయానికి హేతువులైన అని అర్థం. సులక్షితా ఇతి:- దానితో (గుణీభూతవ్యంగ్యంతో) శూన్యమైన ఆ అలంకారాల రూపం కావ్యంలో వాంఛనీయమైనది కాదు. వ్యంగ్యసంస్పర్శ లేని అలంకారాలు అలంకారాలే కావని చెప్పడానికి అలంకారా లున్నట్లు కనబడే ఆ యా శాస్త్రీయవాక్యాలను, లౌకికవాక్యాలను ఉదాహరిస్తున్నాడు - ఉపమా ఇత్యాది:- "గవయమృగం ఎద్దువలె ఉంటుంది" (ఇది నైయాయికులు ఇచ్చే ఉదాహరణం) అనే వాక్యంలో ఉపమ, "ఖలేవాలి యూపం"

అనే వాక్యంలో రూపకం (దీని అర్థం స్పష్టంగా తెలియలేదు. 'రలయోరభేదః' అనేన్యాయంచేత 'వాలీ' అనగా 'వారీ' అయి ఉంటుంది. వారీ అనగా ఏనుగును కట్టే స్తంభం. "కళ్లం మధ్యలో ఉన్న గజబంధనస్తంభమే యూపస్తంభం" అని అర్థం కావచ్చు. ఒకప్పుడు ధాన్యం వెన్నులు ఎడ్లచేత తొక్కించి నట్లు ఏనుగును కళ్లం మధ్య కట్టి దానిచేత తొక్కించే వారేమో. ఇది ఊహమాత్రమే), "ద్విర్వచనేఽచి" (పా.సూ.1-1-59) అనే సూత్రంలో తంత్రరూపమైన శ్లేష ("ద్విర్వచనేఽచి" అనే సూత్రంలోని 'ద్విర్వచనే' అనే పదాన్ని ఆవృత్తి చేసి - ఇలా ఒక పదాన్ని ఆవృత్తి చేసి రెండర్థాలు చెప్పడానికి "తంత్రం" అని పేరు- ఒక ద్విర్వచనే అనే దానికి 'ద్విత్వానికి నిమిత్తమైన' అనీ, రెండవ "ద్విర్వచనే" అనేదానికి 'ద్విత్వం చేయవలసి ఉండగా' అని ఒకే పదానికి రెండర్థాలు చెప్పడంచేత శ్లేష అని భావం), "తు (తూ)దీస(శా)లాతురవర్మతీకూచవారాడ్ ఢక్ఛణ్ ఢఞ్యకః" (పా.సూ. 4. 3.94) అనే పాణిని సూత్రంలో తుదీ-సలాతుర-వర్మతీ- కూచవార శబ్దాలకు నాల్గింటికీ వరసగా ఢక్, ఛణ్, ఢఞ్, యక్ ప్రత్యయాలు నాలుగు విధించబడ్డాయి. అందుచేత యథాసంఖ్యం. "యస్యాం హిరణ్యం విన్దేయం గామశ్వం పురుషానహమ్" అనే శ్రీసూక్తంలోని వాక్యంలో హిరణ్య--గో-అశ్వ-పురుష శబ్దాలకి "విన్దేయమ్" అనే దానితో అన్వయంవల్ల దీపకం. "స్థాణుర్వా స్యాత్"(ఇది ఎండిపోయిన చెట్టుమాను అయి ఉంటుందా) అని సందేహం, "నేదం రజతమ్" (ఇది రజతం కాదు)'అన్నచోట అపహ్నుతి "పీనో దివా నాత్తి" (బలిసి ఉన్నాడు; పగలు తినడు) అనే వాక్యంలో పర్యాయోక్తం, "స్థాఘ్వోరిచ్చ" (పా.సూ.1.2.17) అనే పాణినిసూత్రంలో తుల్యయోగిత ("స్థాధాతువుకు ఘుసంజ్ఞకధాతువులకు ఇత్ వచ్చును" అని దీని అర్థం); సమస్త జ్ఞాపకాలు, ఎట్లనగా పదసంజ్ఞలో 'అన్త' అని చెప్పడంచేత "ఇతరస్థలాలలో సంజ్ఞావిధిలో తదంతవిధి లేదు" అనేది, ఇలాంటిచోట్ల అప్రస్తుతప్రశంస (పాణిని కొన్ని నియమాలను ప్రత్యక్షంగా విధించాడు. కొన్నింటిని అక్కడక్కడ ఆయన చేసిన ప్రయోగాలను పట్టి వ్యాఖ్యాతలు ఊహించి నిర్మించారు. ఇలాంటి నియమాలను సూచించే పాణినిప్రయోగాలకు జ్ఞాపకాలు అని పేరు. "ప్రత్యయగ్రహణే తదన్తాః గ్రాహ్యాః" అనే ఒక నియమం (పరిభాష) ఉంది. "ప్రత్యయాన్ని గ్రహిస్తే ఆ ప్రత్యయాంతాన్ని గ్రహించినట్లు భావించాలి" అని దాని అర్థం. కాని సంజ్ఞను విధించే సూత్రంలో మాత్రం ఈ పరిభాష వర్తించదు. కారణం ఏమనగా - "సుప్తిఙన్తం పదమ్" అనే సూత్రంలో (1.4.14) సుబంతాలకు తీతిజంతాలకు పదసంజ్ఞ విధించబడినది. ఇక్కడ నిజానికి "సుప్తిఙ్పదమ్" అంటే చాలు. 'సుప్', 'తిఙ్' అనేవి ప్రత్యయాలు గాన పై పరిభాషచేత

సుబంతం, తిజంతం అనే అర్థాలు లభిస్తాయి. అయినా పాణిని 'అన్త' శబ్దం ప్రయోగించాడు. దీనిని పట్టి "సంజ్ఞావిధౌ ప్రత్యయగ్రహణే తదన్తగ్రహణం నాస్తి" "సంజ్ఞను విధించే చోట ప్రత్యయాన్ని గ్రహించినా తదంతగ్రహణం చేయకూడదు" అని జ్ఞాపితం అవుతుంది. ఇది ఒక అర్థంచేత మరొక ప్రస్తుతార్థం సూచించే అప్రస్తుతప్రశంస వంటిది); ఉభయత్రవిభాషలయందు వికల్పాత్మకవిశేషాన్ని చెప్పడంకొరకు ఇష్టమైన విధిని కూడ ముందు నిషేధించడంవల్ల, "ప్రతిషేధంచేత సమం చేయబడగా" అనే న్యాయంవల్ల ఆక్షేపం; (ఏదైన ఒక కార్యం కొన్ని చోట్ల ఒక సూత్రం ప్రకారం తప్పకుండా రావలసి ఉంటుంది; కొన్ని చోట్ల అసలే రాదు. అలాంటి పరిస్థితిలో 'విభాషా' అనే పదం ఉపయోగిస్తూ ఒక కార్యం విధించబడుతుంది. 'విభాషా' అనే దానికి 'న' 'వా' అని అర్థం. (న వేతి విభాషా పా.సూ.1.1.44) అనగా ముందు 'న' అని చెప్పాలి. దానితో "మరొకసూత్రంచేత చెప్పబడిన ఆ కార్యం ప్రస్తుతలక్ష్యాలలో దేనికీ కూడ రాదు" అని అర్థం వస్తుంది. దీనితో రావడానికి వీలున్నవాటినీ, వీలులేనివాటినీ రెండింటినీ కూడ సమం చేసి నట్లు అయిపోతుంది. తరవాత 'వా' (వికల్పంగా వస్తుంది) అని చెప్పబడుతుంది. దానితో నిత్యంగా రావలసిన వాటికీ, అసలే రావడానికి అవకాశంలేని వాటికీ కూడ ఆ కార్యం వికల్పంగా వస్తుంది అని అర్థం లభిస్తుంది. దీనికి ఉభయత్రవిభాష అని పేరు. ఉదాహరణకి - "విభాషా శ్వేః" (6.1.30) అనే సూత్రంచేత శ్విధాతువుకు లిట్టులో సంప్రసారణం విధించబడుతుంది. ఈ ధాతువుకు "వచిస్వపియజాదీనాం కితి" అనే సూత్రంచేత (6.1.15) లిట్‌లోని కొన్ని ప్రత్యయాలు పరంగా ఉన్నప్పుడు సంప్రసారణ తప్పకుండా వస్తుంది; కొన్ని పరంగా ఉన్నప్పుడు అసలే రాదు. ఇప్పుడు ఈ సూత్రంలో 'విభాషా' అని ప్రయోగించి సంప్రసారణం విధించబడంది. అందుచేత "లిట్‌లో ఏ ప్రత్యయం పరంగా ఉన్నా కూడ సంప్రసారణ రాదు" అని ముందు నిషేధించి, అన్నింటినీ సమం చేసివేసి, తరవాత - "ఏ ప్రత్యయం పరంగా ఉన్నా వికల్పంగా వస్తుంది" అని అర్థం చెప్పబడుతుంది. ఈ విషయం మనస్సుకు పట్టాలంటే వ్యాకరణశాస్త్రపరిచయం అవసరం). "ఈ చెరువు సముద్రం" "వింధ్యపర్వతం పెరిగి సూర్యమార్గం అడ్డుకొంది" అని అతిశయోక్తి. ఇట్లే ఇతరమైనవి కూడ. న చైవమాదీతి:- ఈ మొదలైనవి (ఉపమా రూపకాదులు) కావ్యానికి ఉపయోగించేవి కావు. అందుచేత ఇవి అలంకారాలు అనడానికి గుణీభూతవ్యంగ్యత్వమే ప్రధానరహస్యం అనే విషయం గుర్తించబడినదై వాటిని బాగా గుర్తిస్తుంది, (వాటి లక్షణాలను సమకూరుస్తుంది). దానిచేత (గుణీభూతవ్యంగ్యతచేత) సు= చక్కగా, పూర్తిగా, లక్షితాః= లక్షితములై, అవి

(అలంకారాలు) సంగ్రహించబడినవి అవుతాయి. ఈ విషయమే చెపుతున్నాడు - ఏతైరస్యేతి.

లోచనం

న చ అతిశయోక్తివక్రోక్త్యుపమాదీనాం సామాన్యరూపత్వం చారుతాహీనానాముపపద్యతే; చారుతా చ ఏతదాయత్తా ఇత్యేతదేవ గుణీభూతవ్యఙ్గ్యత్వం సామాన్యలక్షణమ్. వ్యఙ్గ్యస్య చ చారుత్వం రసాభివ్యక్తియోగ్యతాత్మకమ్; రసస్య స్వాత్మనైవ విశ్రాన్తిధామ్నః ఆనన్దాత్మకత్వమితి నానవస్థా కాచిదితి తాత్పర్యమ్. అనన్తా హీతి. ప్రథమోద్ద్యోత ఏవ వ్యాఖ్యాతమేతత్ - "వాగ్వికల్పానామానన్త్యాత్" ఇత్యత్రాన్తరే.

నను సర్వేష్వలంకారేషు నాలంకారాన్తరం చకాస్తి; తత్కథం గుణీభూతవ్యఙ్గ్యేన లక్షితేన సర్వేషాం సంగ్రహః? మైవమ్; వస్తుమాత్రం రసో వా వ్యఙ్గ్యం సత్ గుణీభూతం భవిష్యతి; తదేతదాహ - గుణీభూతవ్యఙ్గ్యస్య చేతి. ప్రకారాన్తరేణ వస్తురసాత్మనా ఉపలక్షితస్య. యది వా ఇత్థమవతరణికా - నను గుణీభూతవ్యఙ్గేన అలఙ్కారాః యది లక్షితాః తర్హి తస్య లక్షణం వక్తవ్యం కిమితి నోక్తమ్ ఇత్యాశఙ్క్యాహ - గుణీభూతేతి. విషయత్వమితి లక్షణీయత్వమితి యావత్. కేన లక్షణీయత్వమ్? ధ్వనివ్యతిరిక్తో యః ప్రకారః వ్యఙ్గ్యత్వేనార్థానుగమో నామ తదేవ లక్షణమ్, తేనేత్యర్థః. వ్యఙ్గ్యే లక్షితే తద్గుణీభావే చ నిరూపితే కిమన్యదస్య లక్షణం క్రియతామ్ ఇతి తాత్పర్యమ్. ఏవం "కావ్యస్యాత్మా ధ్వనిః" ఇతి నిర్వాహ్య ఉపసంహరతి - తదయమిత్యాదినాసౌభాగ్యమిత్యన్తేన.యత్ప్రాగుక్తం సకలసత్కవికావ్యోపనిషద్భూతమితి తన్న ప్రతారణమాత్రమర్థవాదరూపం మన్తవ్యమితి దర్శయితుమ్ - తదిదమితి. 36

బాలానందిని

న చేతి చారుత్వం లేని అతిశయోక్తి - వక్రోక్తి- ఉపమాదులు సామాన్యరూపం కాజాలవు. (అలంకారాల) చారుత్వం గుణీభూతవ్యంగ్యత్వంమీదనే ఆధారపడి ఉంది. అందుచేత ఈ గుణీభూతవ్యంగ్యమే సర్వాలంకారసామాన్యలక్షణం. వ్యంగ్యంయొక్క

చారుత్వం అనగా రసాభివ్యక్తికి యోగ్యంగా ఉండడమే. రసానికి తనలోనే విశ్రాంతి; అందుచేత అదే ఆనందాత్మకం. ఈ విధంగా ఏ విధమైన అనవస్థా కూడ లేదు అని తాత్పర్యం. అనన్తా హీతి. ఈ విషయం "వాగ్వికల్పానామానన్త్యాత్" అన్న చోట ప్రథమోద్ద్యోతంలోనే వ్యాఖ్యానించబడింది.

నన్వితి (ఆశంక) అన్ని అలంకారాలలోను మరొక అలంకారం వ్యంగ్యంగా ఉండదు. అలాంటప్పుడు గుణీభూతవ్యంగ్యాన్ని గుర్తించినంతమాత్రంచేత అన్ని అలంకారాలను సంగ్రహించి నట్లు ఎలా అవుతుంది? (సమాధానం) - ఇట్లు కాదు. అలాంటి చోట్ల వస్తుమాత్రం కాని, రసం కాని వ్యంగ్యమై గుణం (అప్రధానం) అవుతుంది. ఆ విషయమే చెపుతున్నాడు - గుణీభూతవ్యఙ్గ్యస్య చేతి. ప్రకారాన్తరేణ - వస్తురూపంతో కాని, రసరూపంతో కాని కూడినది అని అర్థం.

లేదా అవతరణిక ఈ విధంగా చేయవచ్చును - నన్వితి - గుణీభూతవ్యంగ్యంచేత అలంకారాలను గుర్తించవలసి ఉన్నట్లయితే దాని లక్షణం చెప్పాలి కదా? ఎందుకు చెప్పలేదు? అని ఆశంకించుకొని చెపుతున్నాడు - గుణీభూతేతి. విషయత్వమితి. లక్షణీయత్వం, అనగా గుర్తింపదగి ఉండడం, అని భావం. దేనిచేత లక్షింపబడాలి? ధ్వనికంటె (వ్యంగ్యం ప్రధానంగా ఉన్న 'ధ్వని' కంటె) వ్యతిరిక్తమైన ఏ ప్రకారం ఉన్నదో, వ్యంగ్యంగా అర్థంలో అనుగతమై ఉండడం అనే ఏ ప్రకారం కలదో, అదే లక్షణం; దానిచేత అని అర్థం. వ్యంగ్యానికి లక్షణం చెప్పిన తరవాత, ఆ వ్యంగ్యానికి గుణీభావం ఎలా కలుగుతుందో కూడ చెప్పిన తరవాత దీనికి మరొకలక్షణం ఏది చెప్పాలి అని తాత్పర్యం. ఈ విధంగా "కావ్యస్యాత్మా ధ్వనిః" అనే విషయాన్ని నిర్వహించి తదయమ్ మొదలు సౌభాగ్యమ్ వరకూ ఉన్న వాక్యంచేత ఉపసంహరిస్తున్నాడు. సకలసత్కవుల కావ్యాల రహస్యమైనది అని వెనుక ఏది చెప్పబడిందో అది కేవలం మోసంకోసం చెప్పిన అర్థంవాదం మాత్రం అని అనకొనకూడదు అని చూపడానికి తదిదమితి అని చెపుతున్నాడు.

వివరణ:- 'అర్థవాద' అనేది మీమాంసకులు ప్రయోగించే పదం. ఏదైన ఒక కర్మ చెయ్యమని విధించి దానిని ఎక్కువగా స్తుతించడం అర్థవాద. దానిలో అంతా సత్యమే అని చెప్పడానికి వీలు ఉండదు. అదే విధంగా ఒక కార్యాన్ని నిషేధించి దాని దుష్ఫలితాలను గూర్చి అతిగా వర్ణించి చెప్పేది కూడా అర్థవాదమే. ఇంతవరకూ ధ్వనియొక్క గొప్పతనాన్ని గూర్చి చెప్పిన దంతా అర్థవాదం కాదు; యథార్థమే అని అర్థం. 36

# ధ్వన్యాలోకం

కా. ముఖ్యా మహాకవిగిరామలంకృతిభృతామపి,

ప్రతీయమానచ్ఛాయైషా భూషా లజ్జేవ యోషితామ్. 37

అనయా సుప్రసిద్ధోఽర్థః కిమపి కామనీయకమానీయతే. తద్యథా -

శ్లో. విస్రమ్భోత్థా మన్మథాజ్ఞావిధానే యే ముగ్ధాక్ష్యాః కేఽపి లీలావిశేషాః,

అక్షుణ్ణాస్తే చేతసా కేవలేన స్థిత్వైకాన్తే సన్తతం భావనీయాః.(108)

ఇత్యత్ర కేఽపీత్యనేన పదేన వాచ్యమస్పష్టమభిదధతా ప్రతీయమానం వస్తు అక్లిష్టమనన్తమర్పయతా కా ఛాయా నోపపాదితా?

బాలానందిని

ముఖ్యా ఇతి - అలంకృతిభృతామపి=ఇతరాలంకారాలు కలవైనను, మహాకవిగిరామ్= మహాకవుల వాక్కులకు, ఏషా= ఈ, ప్రతీయమానచ్ఛాయా= వ్యంగ్యార్థశోభ, యోషితామ్= స్త్రీలకు, లజ్జేవ=లజ్జవలె, ముఖ్యా భూషా= ముఖ్యమైన అలంకారం. 37

అనయేతి. సుప్రసిద్ధమైన విషయం కూడ దీనిచేత ఒకానొక సౌందర్యాన్ని పొందించబడుతుంది. అదెట్లనగా -

విస్రమ్భేతి. మన్మథాజ్ఞావిధానే= మన్మథుని ఆజ్ఞను ఆచరించడంలో, ముగ్ధాక్ష్యాః= ఆ సుందరనయనయొక్క, విస్రమ్భోత్థాః= విశ్వాసంచేత బయలుదేరిన, కేఽపి= చెప్పడానికి(వర్ణించడానికి) శక్యం కాని, యే= ఏ, లీలావిశేషాః= విలాసవిశేషములు గలవో, అక్షుణ్ణాః= అప్రతిహతములైన, తే= అవి, ఏకాన్తే స్థిత్వా= ఏకాంతప్రదేశంలో ఉండి, కేవలేన= కేవలమైన, చేతసా= చిత్తంచేత, సన్తతమ్= నిరంతరమూ, భావనీయాః= భావింపదగినవి.

ఈ శ్లోకంలో వాచ్యార్థాన్ని అస్పష్టంగా బోధించే 'కేఽపి' అనే పదం అనంతమైన అక్లిష్టమైన (సుందరమైన) వ్యంగ్యార్థాన్ని సమర్పిస్తూ ఒకానొక శోభను సమకూర్చింది.

లోచనం

ముఖ్యా భూషేతి. అలంకృతిభృతామ్ అపి శబ్దాదలంకారశూన్యానామపీత్యర్థః. ప్రతీయమానకృతా శోభా, సా చ లజ్జాసదృశీ గోపనాసారసౌన్దర్యప్రాణత్వాత్. అలంకారధారిణీనామపి నాయికానాం లజ్జా ముఖ్యం భూషణమ్.

ప్రతీయమానా ఛాయా అన్తర్మదనోద్భేదజసౌన్దర్యరూపా యయా లజ్జా హ్యన్తరుద్భిన్నమాన్మథవికారజుగోపయిషారూపా మదనవిజృమ్భైవ. వీతరాగాణాం యతీనాం కౌపీనాపసరణేఽపి త్రపాకలజ్జాఽదర్శనాత్. తథాహి - కస్యాపి కవేః "కురఙ్గీవాఙ్గాని" ఇత్యాదిః శ్లోకః. తథా ప్రతీయమానస్య ప్రియతమాభిలాషానునాథనమానప్రభృతేః ఛాయా కాన్తిః యయా. శృఙ్గారరసతరఙ్గిణీ హి లజ్జావరుద్ధా నిర్భరతయా తాంస్తాన్ విలాసాన్నేత్రగాత్ర వికారపరమ్పరారూపాన్ ప్రసూత ఇతి గోపనాసారసౌన్దర్యలజ్జావిజృమ్భితమే తదితి భావః.

బాలానందిని

అలంకృతిభృతామపీతి. 'అలంకృతిభృతామపి' అని 'అపి' శబ్దంవల్ల అలంకారాలు లేనివాటికి కూడా అని అర్థం. ప్రతీయమానం (వ్యంగ్యం) వల్ల కలిగే శోభ దాచడమే సారంగా గల సౌందర్యం ప్రాణం కల దవడం వల్ల లజ్జతో సమాన మైనది. స్త్రీలు అలంకారాలు ధరించినా కూడ వాళ్లకు ముఖ్యమైన భూషణం లజ్జయే. (ఆ స్త్రీలకు సంబంధించిన) "ప్రతీయమానచ్ఛాయా" అనగా లోపల (హృదయంలో) మన్మథుడు అంకురించడంవల్ల కలిగిన హృదయసౌందర్యరూప మైన ఛాయ, దేనిచేత సూచించబడుతుందో (ప్రతీయమానా) అది (ఇది 'లజ్జా'కు విశేషణం). అనగా ఇలాంటి హృదయసౌందర్యం లజ్జను సూచిస్తుంది అని అర్థం. లోపల అంకురించిన మన్మథవికారాన్ని కప్పిపుచ్చుకోవా లనే ఇచ్ఛయే లజ్జ; అది మదనవిజృంభమే కదా? ఏ విధమైన రాగమూ లేని యతులకు కౌపీనం జారిపోయినా కూడ లజ్జాకలంకం కనబడదు కదా? అందుచేతనే ఒకానొక కవి వ్రాసిన "కురఙ్గీవాఙ్గాని" ఇత్యాదిశ్లోకం.

వివరణ:- ఈ శ్లోకంలో లజ్జానుభావాల వర్ణన చేసి కవి ఈమె మనస్సులో మన్మథుడు ప్రేమలతను నాటే ప్రయత్నంలో ఉన్నాడు' అని అంటాడు. ఈ శ్లోకం కావ్యప్రకాశంలో రూపకాలంకారంలో ఉదాహరించబడింది (అస్మదీయ బాలానందినీ వ్యాఖ్యాసహిత కావ్యప్రకాశ పేజి. 618)

'ప్రతీయమానచ్ఛాయా'కు మరొక అర్థం చెపుతున్నాడు - తథా ఇతి. దేనిచేత, ప్రియతముని అభిలాష, అనునయం, మానం మొదలైనదాని ఛాయ, అనగా కాంతి ప్రతీతం అవుతుందో (అట్టి లజ్జ) అని కూడ అర్థం. శృంగారరసనది లజ్జచేత అడ్డుకొనబడినదై బాగా నిండి ఉండడంచేత నేత్ర-గాత్ర వికారాల పరంపరల రూపమైన ఆ యా

విలాసాలను ఆవిర్భవింపచేస్తుంది. అందుచేత ఇదంతా కూడ గోపనాసౌందర్యం గల లజ్జయొక్క విజృంభణమే అని భావం.

లోచనం

విశ్రమ్భేతి. మన్మథాచార్యేణ త్రిభువనవన్ద్యమానశాసనేన అత ఎవ లజ్జాసాధ్వసధ్వంసినా దత్తా యేయమలఙ్ఘనీయా ఆజ్ఞా తదనుష్ఠానే ఽవశ్యకర్తవ్యే సతి సాధ్వసలజ్జాత్యాగేన విస్రమ్భసంభోగకాలోపనతాః. ముగ్ధాక్ష్యా ఇతి అకృతకసంభోగపరిభావనోచితదృష్టిప్రసరపవిత్రితా యేఽన్యే విలాసాః గాత్రనేత్రవికారాః అత ఏవ అక్షుణ్ణాః నవనవరూపతయా ప్రతిక్షణమున్మిషన్తః తే, కేవలేన అన్యత్రావ్యగ్రేణ ఏకాన్తావస్థానపూర్వం సర్వేన్ద్రియోపసంహారేణ భావయితుం శక్యాః, అర్హాః, ఉచితాః. యతః కేఽపి నాన్యేనోపాయేన శక్యనిరూపణాః. 37

బాలానందిని

విశ్రమ్భేతి. మన్మథాచార్యుని శాసనం మూడు లోకాలచేతా కూడ నమస్కరింపదగినది. లజ్జను, జంకును ధ్వంసింపచేయ గల ఆ మన్మథాచార్యు డిచ్చిన ఈ ఆజ్ఞ దాటశక్యం కానిది. ఆ ఆజ్ఞను తప్పక పాటించవలసి ఉన్నప్పుడు జంకును లజ్జను విడిచివేసి పరిపూర్ణవిశ్వాసంతో జరిగే సంభోగకాలంలో, కృత్రిమము కానివి, సంభోగాస్వాదానికి తగినవి అయిన దృష్టిప్రసారాలచేత పవిత్రితములైన ఏ ఇతరములైన విలాసాలు, గాత్రనేత్ర వికారాలు ఉన్నవో (ఇది 'ముగ్ధాక్ష్యాః' అనే పదంవల్ల లభించే అర్థం), అవి, అక్షుణ్ణాః= క్షణక్షణానికీ కొంగ్రొత్తరూపాలలో వికసిస్తూంటాయి. అవి కేవలేన= మరొకవిషయంలో లగ్నం కాని మనస్సుతో, ఒక ఏకాంతప్రదేశంలో కూర్చుండి, సకలేంద్రియాలను ఏకాగ్రం చేసి భావన చేయడానికి శక్యమైనవి, భావనచేయతగినవి. అవి 'కేఽపి'(అనిర్వచనీయాలు) గాన మరొక ఉపాయంచేత దేనిచేతా నిరూపింప శక్యం కానివి. 37

## ధ్వన్యాలోకం

కా. అర్థాన్తరగతిః కాక్వా యా చైషా పరిదృశ్యతే,
సా వ్యఙ్గ్యస్య గుణీభావే ప్రకారమిమమాశ్రితా. 38

యా చైషా కాక్వా క్వచిదర్థాన్తరప్రతీతిః దృశ్యతే సా వ్యఙ్గ్యస్యార్థస్య గుణీభావే సతి గుణీభూతవ్యఙ్గ్యలక్షణం కావ్యప్రభేదమాశ్రయతే. యథా - "స్వస్థా భవన్తి మయి జీవతి ధార్తరాష్ట్రాః"

బాలానందిని

అర్థాన్తరేతి. కాక్వా= కాకుస్వరంచేత, యా = ఏ, ఏషా = ఈ, అర్థాన్తరగతిః= మరియొక అర్థంయొక్క జ్ఞానం, పరిదృశ్యతే= కనబడుచున్నదో, సా= అది, వ్యఙ్గ్యస్య గుణీభావే= వ్యంగ్యం అప్రధాన మైనప్పుడు, ఇమం ప్రకారమ్= ఈ ప్రకారమును, ఆశ్రితా= ఆశ్రయించినది. 38

యేతి- కొన్ని చోట్ల కాకుస్వరంచేత ఏ అర్థాంతరజ్ఞానం కలుగుతూన్నదో అది వ్యంగ్యార్థం గుణీభావం చెందినప్పుడు గుణీభూతవ్యంగ్యం అనే కావ్యప్రభేదాన్ని ఆశ్రయిస్తుంది. ఎట్లనగా - "నేను జీవించి ఉండగా ధృతరాష్ట్రకుమారులు స్వస్థులుగా ఉంటారా!" (ఇది వేణీసంహారంలో భీమసేనుడు సహదేవునితో అన్న మాటలు).

లోచనం

గుణీభూతవ్యఙ్గ్యస్యార్థాన్తరమాహ - అర్థాన్తరేతి. "కక లౌల్యే" ఇత్యస్య ధాతోః కాకుశబ్దః. తత్ర హి సాకాఙ్క్షనిరాకాఙ్క్షాదిక్రమేణ పఠ్యమానోఽసౌ శబ్దః ప్రకృతార్థాతిరిక్తమపి వాఞ్ఛతీతి లౌల్యమస్యాభిధీయతే. యది వా ఈషదర్థే కుశబ్దః, తస్య కాదేశః. తేన హృదయస్థవస్తుప్రతీతేరీషద్భూమిః కాకుః. తయా చార్థాన్తరగతిః, స కావ్యవిశేషః ఇమం గుణీభూతవ్యఙ్గ్య ప్రకారమాశ్రితః. అత్ర హేతుః వ్యఙ్గ్యస్య తత్ర గుణీభావ ఏవ భవతి: అర్థాన్తరగతిశబ్దేనాత్ర కావ్యమేవోచ్యతే న తు ప్రతీతేరత్ర గుణీభూతవ్యంగ్యత్వం వక్తవ్యమ్; ప్రతీతిద్వారేణ వా కావ్యస్య నిరూపితమ్.

బాలానందిని

గుణీతి. గుణీభూతవ్యంగ్యానికి మరొక ఉదాహరణం చెపుతున్నాడు - అర్థాన్తరేతి. 'కాకు' శబ్దం "కక లౌల్యే" అను ధాతువునకు సంబంధించినది. ఈ శబ్దం ఆకాంక్షతో కూడిన క్రమంచేత, ఆకాంక్ష లేని పద్ధతిలోను చదవబడుతూ ప్రకృతార్థంకంటె వ్యతిరిక్తమైన అర్థాన్ని కూడ కోరుతుంది గాన లౌల్యం (చాపల్యం) అని చెప్పబడుతుంది. లేదా 'కు' శబ్దానికి కొంచెం అని అర్థం. దానికి 'కా' ఆదేశం. అందుచేత హృదయంలో ఉన్న వస్తువు

ప్రతీతికి కాకువు కొంచెం స్థానం. దానిచేత అర్థం తెలుస్తుంది. ఆ కావ్యవిశేషం ఈ గుణీభూతవ్యంగ్యవిశేషాన్ని ఆశ్రయించినది. వ్యంగ్యం అప్రధానంగా ఉండడమే ఇందుకు హేతువు. 'అర్థాన్తరగతి' శబ్దంచేత ఇక్కడ (దేనిలో అర్థాంతరప్రతీతి ఉంటుందో అట్టి) కావ్యమే చెప్పబడుతుంది., అంతేనే కాని ఇక్కడ ప్రతీతికే (అర్థాంతరప్రతీతికే) గుణీభూతవ్యంగ్యత్వం చెప్పకూడదు. లేదా ప్రతీతి ద్వారా కావ్యంయొక్క గుణీభూత వ్యంగ్యత్వం నిరూపించబడింది.

లోచనం

అన్యే త్వాహుః- వ్యఙ్గ్యస్య గుణీభావేఽయం ప్రకారః, అన్యథా తు తత్రాపి ధ్వనిత్వమేవేతి. తచ్చాసత్; కాకుప్రయోగే సర్వత్ర శబ్దస్పృష్టత్వేన వ్యఙ్గ్యస్యోన్మీలితస్యాపి గుణీభావాత్. కాకుర్హి శబ్దస్యైవ కశ్చిద్ధర్మః, తేన స్పృష్టం "గోప్యైవం గదితః సలేశమ్" ఇతి, "హసన్నేత్రార్పితాకూతమ్" ఇతివత్ శబ్దేనైవ అనుగృహీతమ్. అత ఏవ "భమ ధమ్మిఅ" ఇత్యాదౌ కాకుయోజనే గుణీభూతవ్యఙ్గ్యతైవ, వ్యక్తోక్తత్వేన తదభిమానాల్లోకస్య. 'స్వస్థాః' ఇతి, 'భవన్తి' ఇతి "మయి జీవతి" ఇతి, "ధార్తరాష్ట్రాః" ఇతి చ సాకాఙ్క్షదీప్తగద్గదతార ప్రశమనోద్దీపనచిత్రితా కాకురసమ్భావ్యోఽయమర్థః, అత్యర్థమనుచితశ్చేత్యముం వ్యఙ్గ్యమర్థం స్పృశన్తీ తేనైవోపకృతా సతీ క్రోధానుభావారూపతాం వ్యఙ్గ్యస్య వాచ్యోపస్కృతస్యైవాధత్తే.

బాలానందిని

అన్యే ఇతి. "వ్యంగ్యం గుణీభావాన్ని పొందుతేనే ఈ ప్రకారం; అలా కాకపోతే అక్కడ కూడా (కాకుస్థలంలో కూడ) ధ్వనిత్వమే" అని కొందరు అంటున్నారు. అది అయుక్తం. కాకుప్రయోగం ఉన్న ప్రతీ చోటా కూడ వ్యంగ్యం వికసింపచేయబడినా అది శబ్దంచేత స్పృశించబడడంచేత గుణీభావమే ఉంటుంది. కాకువు అనేది శబ్దానికి సంబంధించిన ఒక ధర్మం కదా? అలాంటి కాకువుచేత స్పృశించబడినది "గోప్యేవం గదితః సలేశమ్" (శ్లో. 42), "హసన్నేత్రార్పితాకూతమ్" (శ్లో. 48) ఇత్యాదులలోవలె శబ్దంచేతనే అనుగ్రహించబడినది అవుతుంది. అందుచేత "భమ ధమ్మిఅ" (శ్లో. 3) ఇత్యాదులలో కాకుస్వరం చేర్చినట్లయితే గుణీభూతవ్యంగ్యత్వమే. ఎందువల్ల ననగా అక్కడ విషయం స్పష్టంగా చెప్పబడింది అనే జనులు అనుకుంటారు. 'స్వస్థాః' అనీ,

'భవన్తి' అనీ, 'మయి జీవతి' అనీ, ''ధార్తరాష్ట్రాః'' అనీ ఈ నాలుగు స్థలాలలోనూ కూడ ఆకాంక్షతో కూడినది. దీప్తమూ (జోరుగా ఉన్నదీ) గద్గదస్వరంతోను, తారధ్వనిని తగ్గించడంచేత హెచ్చించడంచేతా చిత్రితమూ అయిన కాకువు ఈ విషయం (ధార్తరాష్ట్రులు జీవించి ఉండడం అనేది) సంభావ్యం కానిది, అనుచితమూ కూడ అనే ఈ వ్యంగ్యార్థాన్ని స్పృశిస్తూ ఆ వ్యంగ్యార్థంచేత ఉపకృతమై వ్యంగ్యంచేత ఉపస్కృతమైన వాచ్యార్థానికే క్రోధానుభావరూపత్వాన్ని కల్పిస్తూన్నది(వాచ్యాన్నే క్రోధానుభావంగా చేస్తూన్నది).

## ధ్వన్యాలోకం

యథా వా-.

ఆమ అసఇఓఓరమ పఇవ్వఏ తుఏ మలిణిఅం సీలమ్,

కిం ఉణ జణస్స జాఅ వ్వ చన్దిలం తం ణ కామేమో. (109)

శబ్దశక్తిరేవ హి స్వాభిధేయసామర్థ్యాక్షిప్తకాకుసహాయా సత్యర్థవిశేషప్రతిపత్తిహేతుః, న కాకుమాత్రమ్. విషయాన్తరే స్వేచ్ఛాకృతాత్ కాకుమాత్రాత్తథావిధార్థప్రతిపత్త్యసంభవాత్. స చార్థః కాకువిశేషసహాయశబ్దవ్యాపారోపారూఢోఽపి అర్థసామర్థ్యలభ్య ఇతి వ్యఙ్గ్యరూప ఏవ. వాచకత్వానుగమేనైవ తు యదా తద్విశిష్ట వాచ్యప్రతీతిః తదా గుణీభూతవ్యఙ్గ్యతయా తథావిధార్థద్యోతినః కావ్యస్య వ్యపదేశః. వ్యఙ్గ్యవిశిష్టవాచ్యాభిధాయినో హి గుణీభూత వ్యఙ్గ్యత్వమ్.

## బాలానందిని

మరొక ఉదాహరణం ఎట్లనగా-

ఆమ ఇతి - (సంస్కృతచ్ఛాయ వ్యాఖ్యానంలో ఇవ్వబడింది). పతివ్రతే= పతివ్రతా! ఆమ= ఔను, అసత్యః= మేం కులటలమే. ఉపరమ= ఊరుకో, త్వయా = నీచేత, శీలమ్= శీలం, న మలినితమ్= మలినం చేయబడలేదు. కిం పునః = మరే మనగా, జనస్య జాయేవ= సాధారణజనుని భార్య వలె, తం నాపితమ్= ఆ మంగలివానిని, న కామయామహే= మేం కోరడం లేదు.

శబ్దేతి. తన వాచ్యార్థంయొక్క సామర్థ్యంచేత ఆక్షిప్తమైన కాకువుయొక్క సహాయం కలదై శబ్దశక్తియే అర్థవిశేషజ్ఞానానికి హేతువు అవుతుంది కాని కేవలం కాకువు ఒక్కటే కాదు. ఇతరస్థలాలలో (వక్త) తన ఇష్టం ప్రకారం చేసిన కాకుమాత్రంవల్ల ఆ విధమైన అర్థజ్ఞానం కలగడంలేదు కదా? ఆ అర్థం (వ్యంగ్యార్థం) కాకువిశేషం సహాయంగా గల శబ్దవ్యాపారంలోనే ఉన్నా కూడ అర్థ(వాచ్యార్థ) సామర్థ్యంచేత లభ్యం అవుతున్నది గాన వ్యంగ్యరూప మైనదే. అలాంటి వ్యంగ్యార్థంతో కూడిన వాచ్యార్థంయొక్క ప్రతీతి వాచకత్వాన్ని అనుసరించియే జరిగినట్లయితే అలాంటి అర్థాన్ని బోధించే కావ్యాన్ని 'గుణీభూతవ్యంగ్యం' అని అనడం జరుగుతుంది. వ్యంగ్యంతో కూడిన వాచ్యార్థాన్ని బోధించేదే కదా గుణీభూతవ్యంగ్యం అనగా?

లోచనం

ఆమేతి.

"ఆమ అసత్యః ఉపరమ పతివ్రతే న త్వయా మలినితం శీలమ్,
కిం పునర్జనస్య జాయేవ నాపితం తం న కామయామహే".

(ఇతి చ్ఛాయా)

"ఆమ;అసత్యో భవామః" ఇత్యభ్యుపగమకాకుః సాకాఙ్క్షోపహాసా.'ఉపరమ' ఇతి నిరాకాఙ్క్షతయా సూచనగర్భా. "పతివ్రతే" ఇతి దీప్తస్మితయోగినీ. "న త్వయా మలినితం శీలమ్" ఇతి సగద్గదాకాఙ్క్షా. "కింపునర్జనస్య జాయేవ" మన్మథాన్ధీకృతా, చన్దిలం నాపితమితి పామరప్రకృతిం "న కామయామహే" ఇతి నిరాకాఙ్క్షగద్గదోపహాసగర్భా.

ఏషా హి కయా చిత్ నాపితానురక్తయా కులవధ్వా దృష్టావినయాయా ఉపహాస్యమానాయాః ప్రత్యుపహాసావేశగర్భోక్తిః కాకుప్రధానైవేతి. గుణీభావం దర్శయితుం శబ్దస్పృష్టతాం తావత్సాధయతి - శబ్దశక్తిరేవేత్యాదినా. నన్వేవం వ్యఙ్గ్యత్వం కథమిత్యాశఙ్క్యాహ - స చేతి. అధునా గుణీభావం దర్శయతి - వాచకత్వేతి. వాచకత్వే అనుగమః గుణత్వం వ్యఙ్గ్యవ్యఞ్జకభావస్య వ్యఙ్గ్యవిశిష్టవాచ్యప్రతీత్యా తత్రైవ కావ్యస్య ప్రకాశకత్వం కల్ప్యతే. తేన చ తథా వ్యపదేశ ఇతి కాకుయోజనాయాం సర్వత్ర గుణీభూతవ్యఙ్గ్యతైవ.

అత ఏవ "మథ్నామి కౌరవశతం సమరే న కోపాత్" ఇత్యాదౌ విపరీతలక్షణాం య ఆహుస్తే న సమ్యక్పరామమృశుః. యతోఽత్రోచ్చారణ కాల ఏవ "న కోపాత్" ఇతి దీప్తతారగద్గదసాకాఙ్క్షకాకుబలాత్ నిషేధస్య నిషేధ్యమానతయైవ యుధిష్ఠిరాభిమతసంధిమార్గాక్షమారూపత్వాభిప్రాయేణ ప్రతిపత్తిరితి ముఖ్యార్థబాధాద్యనుసరణవిఘ్నాభావాత్ కో లక్షణాయాః అవకాశః? "దర్శే యజేత" ఇత్యత్ర తు తథావిధకాక్వాద్యుపాయాన్తరాభావాత్ భవతు విపరీతలక్షణా ఇత్యలమవాన్తరేణ బహునా. 38

బాలానందిని

"ఆమ అసత్యః భవామః" (ఔను; మేం కులటలమే) అని ఆకాంక్షతోను, ఉపహాసంతోను కూడిన అంగీకారసూచకకాకుస్వరం. 'ఉపరమ' (చాల్లే ఊరుకో) అని నిరాకాంక్షత్వంతో ఆమెయొక్క కులటాత్వాన్ని సూచించడం గర్భంలో ఉన్న కాకుస్వరం. 'పతివ్రతే' (ఓ! మహాపతివ్రతా!) అని దీప్తమైన చిరునవ్వుతో కూడిన కాకువు. "న త్వయా మలినితం శీలమ్" (నువ్వు నీ శీలాన్ని మలినం చేసుకోలేదులే!) అని గద్గదస్వరంతోను ఆకాంక్షతోను కూడినది. కిం పునః= మరేమంటే, మన్మథునిచేత అంధీకృతురాలైన (ఒళ్లు తెలియనిదిగా చేయబడిన) జనస్య జాయేవ= వాడి పెళ్లాం వీడి పెళ్లాం వలె, పామరప్రకృతియైన ఆ మంగలిని కోరడం లేదులే (నీవలె అనే దెప్పిపొడుపు) అని నిరాకాంక్షమూ, గద్గదంతో కూడినదీ, ఉపహాసగర్భమూ అయిన కాకువు. ఏషా ఇతి. ఎవడో నాపితుని మీద అనురాగం గల (నాపితునితో సంబంధం ఉన్న) ఒకానొక కులవధువు మరొకస్త్రీ చేసిన అవినయం (చెడ్డపని) చూచి ఆమెను పరిహసిస్తూండగా ఆ స్త్రీ అంటూన్న ప్రత్యుపహాసావేశం గర్భమందు గల (ప్రత్యుపహాసావేశంతో నిండిన) కాకుప్రధానమైన మాటలు ఇవి.

గుణీభావమితి:- ఇక్కడ వ్యంగ్యం గుణీభూతము అని చూపడానికి, అది శబ్దం చేత స్పృశించబడినది అనే విషయాన్ని శబ్దశక్తి రేవేత్యాదివాక్యంచేత సాధిస్తున్నాడు. అట్లైతే (శబ్దశక్తియే ద్వితీయార్థజ్ఞానానికి హేతువైతే) ఇది వ్యంగ్యం ఎలా అవుతుంది అని ఆశంకించి చెపుతున్నాడు - స చేతి. ఇప్పుడు గుణీభావాన్ని చూపుతున్నాడు - వాచకత్వేతి. వాచకత్వానుగమః అనగా వ్యంగ్యవ్యంజకభావం వాచకత్వంలో గుణంగా (అప్రధానంగా) ఉండడం. వ్యంగ్యంతో కూడిన వాచ్యార్థంయొక్క జ్ఞానం కలుగుతున్నది గాన కావ్యం అలాంటి అర్థాన్నే బోధిస్తున్న దని కల్పించబడుతుంది. అందుచేత అది

అలా (గుణీభూతవ్యంగ్యంగా) చెప్పబడుతున్నది. ఈ విధంగా కాకువును కూర్చిన ప్రతిచోటా కూడ గుణీభూతవ్యంగ్యత్వమే ఉంటుంది.

అత ఏవేతి. అందువలన - "మథ్నామి కౌరవశతం సమరే న రోషాత్" ("యుద్ధంలో కోపంవలన కౌరవశతాన్ని మథించనూ") ఇత్యాదులలో ఎవరు విపరీత లక్షణ అని చెప్పినారో వాళ్లు బాగా ఆలోచించలేదు. ఎందువలన అనగా - ఇక్కడ ఉచ్చారణసమయంలోనే "న కోపాత్" అని దీప్తము, ఉచ్చైఃస్వరంలో ఉన్నది, గద్గదమూ అయిన కాకువుయొక్క బలంవల్లనే నిషేధం ("న మథ్నామి" అనే నిషేధం) నిషేధించబడేదిగానే, యుధిష్ఠిరునకు అభిమతమైన సంధిమార్గంవిషయంలో ఓర్పు లేకపోవడం అనే అభిప్రాయంతో తెలుస్తూన్నది గాన ముఖ్యార్థబాధాదులను అనుసరించడం అనే విఘ్నం లేకపోవడంవల్ల లక్షణకు అవకాశం ఏమి ఉన్నది? 'దర్శే యజేత' (అమావాస్యనాడు యాగం చెయ్యాలి) అనేచోటనైతే అలాంటి కాక్వాదులైన ఇతరోపాయా లేవీ లేకపోవడంచేత విపరీతలక్షణ ఉండుగాక. ఇంక అవాంతరమైన ఈ అధికచింత చాలును.

వివరణ:- 'దర్శ' శబ్దానికి అమావాస్య అని అర్థం. "న దృశ్యతే చన్ద్రః అస్యామ్" (దీనియందు చంద్రుడు చూడబడడు) అనే అర్థంలో ఈ శబ్దం ప్రయోగించబడుచున్నది. అనగా 'దృశ' ధాతువునకు ఇక్కడ విపరీతలక్షణచేత దర్శనాభావం అని అర్థం. ఇలాంటిచోట్ల కాక్వాదిసహాయం లేదు గాన విపరీతలక్షణ చెపితే చెప్పవచ్చును గాని 'మథ్నామి' ఇత్యాది కాకుస్థలాలలో విపరీతలక్షణ ఎందుకు అని భావం. 38

## ధ్వన్యాలోకం

కా. ప్రభేదస్యాస్య విషయో యశ్చ యుక్త్యా ప్రతీయతే,
విధాతవ్యా సహృదయైర్న తత్ర ధ్వనియోజనా. 39

సంకీర్ణో హి కశ్చిద్ధ్వనేః గుణీభూతవ్యఙ్గ్యస్య చ లక్ష్యే దృశ్యతే మార్గః. తత్ర యస్య యుక్తిసహాయతా తత్ర తేన వ్యపదేశః కర్తవ్యః. న సర్వత్ర ధ్వనిరాగిణా భవితవ్యమ్. యథా -

శ్లో. "పత్యుః శిరశ్చన్ద్రకలామనేన స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వమ్,
సా రఞ్జయిత్వా చరణౌ కృతాశీర్మాల్యేన తాం నిర్వచనం జఘాన.
(కు. 7.) (110)

యథా చ -

శ్లో. ప్రాయచ్ఛతోచ్చైః కుసుమాని మానినీ విపక్షగోత్రం దయితేన లమ్భితా,
న కించిదూచే చరణేన కేవలం లిలేఖ బాష్పాకులలోచనా భువమ్.
(111)

ఇత్యత్ర "నిర్వచనం జఘాన" "న కించిదూచే" ఇతి ప్రతిషేధముఖేన వ్యఙ్గ్యస్యార్థస్యోక్త్యా కించిద్విషయీకృతత్వాత్ గుణీభావ ఏవ శోభతే. యదా వక్రోక్తిం వినా వ్యఙ్గ్యోఽర్థః తాత్పర్యేణ ప్రతీయతే తదా తస్య ప్రాధాన్యమ్. యథా - "ఏవం వాదిని దేవర్షౌ" ఇత్యాదౌ. ఇహ పునరుక్తిః భఙ్గ్యాస్తీతి వాచ్యస్యాపి ప్రాధాన్యమ్. తస్మాత్ నాత్ర అనురణనరూపవ్యఙ్గ్యధ్వనివ్యపదేశో విధేయః.

బాలానందిని

ప్రభేదస్యేతి. యశ్చ= ఏది, యుక్త్యా= యుక్తిచేత, అస్య ప్రభేదస్య= ఈ ప్రభేదంయొక్క, విషయః= విషయంగా, ప్రతీయతే= తెలియబడుతుందో, తత్ర= అక్కడ, సహృదయైః= సహృదయులచేత, ధ్వనియోజనా=ధ్వనియొక్కయోజన(కూర్పు), న విధాతవ్యా= చేయదగినది కాదు. దానిని ధ్వని అనకూడదు అని భావం. 39

సంకీర్ణ ఇతి:- లక్ష్యంలో ధ్వనియొక్క, గుణీభూతవ్యంగ్యంయొక్క ఒకానొక సంకీర్ణమైన (ఆ రెండూ కలిసిన) మార్గం కనబడుతున్నది. అలాంటి లక్ష్యంలో దేనికి యుక్తిసాహాయ్యం ఉంటుందో దానిచేత వ్యపదేశం చెయ్యాలి (ఆ పేరు పెట్టాలి). అంతేనే కాని అన్ని చోట్లా కూడ ధ్వనియందు ఆసక్తి కలవాడు కాకూడదు (అన్నింటినీ ధ్వనే అనకూడదు). ఎట్లనగా -

పత్యుః ఇతి :- ఇది కుమారసంభవంలో సప్తమసర్గలో పార్వతిని పెండ్లికూతురు చేసే ఘట్టంలోని శ్లోకం. చరణౌ= పాదాలను, రంజయిత్వా= రంజింపచేసి (రంగు పూసి), అనేన= ఈ పాదంచేత, పత్యుః= భర్తయొక్క, శిరశ్చన్ద్రకలామ్= శిరస్సునందలి చంద్రకళను, స్పృశ= స్పృశించుము, ఇతి= అని, సఖ్యా= సఖురాలిచేత, పరిహాసపూర్వమ్= పరిహాసపూర్వకముగా, కృతాశీః= చేయబడిన ఆశీర్వాదం గల, సా= ఆ పార్వతి, తామ్= ఆమెను, మాల్యేన= మాలికచేత, నిర్వచనమ్= ఏమీ మాటలాడకుండా, జఘాన= కొట్టెను.

ఇంకొక ఉదాహరణం ఎట్లనగా-

ప్రాయచ్ఛతా ఇతి:- ఉచ్చైః కుసుమాని= ఎత్తుగా ఉన్న పుష్పాలను, ప్రాయచ్ఛతా= (కోసి) ఇస్తూన్న, దయితేన= ప్రియునిచేత, విపక్షగోత్రమ్= సవతి పేరును, లమ్భితా= పొందించబడిన, మానినీ= మానిని, కించిత్= ఏమీ, న ఊచే= పలకలేదు. కేవలమ్= కేవలం, బాష్పాకులలోచనా= కన్నీటిచేత వ్యాకులమైన నేత్రాలు గలదై, భువమ్= నేలను, చరణేన= పాదంచేత, లిలేఖ= వ్రాసెను.

ఇత్యత్రేతి. ఈ శ్లోకాల్లో "నిర్వచనం జఘాన" "న కించిదూచే" అని ప్రతిషేధముఖంచేత (మాట్లాడడాన్ని నిషేధించడం ద్వారా) వ్యంగ్యార్థం (లజ్జాకోపాదికం) కొంతవరకు మాటచేతనే విషయంగా చేసికొనబడింది (వాచ్యంగా చెప్పబడిన ట్లయింది) గాన గుణీభావమే శోభిస్తుంది (బాగున్నది). వక్రోక్తి ('నిర్వచనం జఘాన'ఇత్యాదికం) లేకుండా వ్యంగ్యార్థం ఎప్పుడు తాత్పర్యంచేత ప్రకాశింపచేయబడుతుందో అప్పుడు వ్యంగ్యార్థానికి ప్రాధాన్యం. ఉదాహరణకి - "ఏవంవాదిని దేవర్షౌ" ఇత్యాదులలో. ఇక్కడైతే ఉక్తి (వచనం) ఒక భంగిలో (అందమైన రీతిలో) ఉంది గాన వాచ్యానికి కూడ ప్రాధాన్యం ఉంది. అందుచేత ఇక్కడ అనురణనరూపవ్యంగ్యధ్వని అనే పేరు పెట్టకూడదు.

లోచనం

అధునా సంకీర్ణం విషయం విభజతే - ప్రభేదస్యేతి. యుక్త్యేతి. చారుత్వప్రతీతిరేవాత్ర యుక్తిః. పత్యురితి. అనేనేతి. అలక్తకోపరక్తస్య హి చన్ద్రమసః పరభాగలాభః. అనవరతపాదపతనప్రసాదనైర్వినా న పత్యుర్ఘటితి యథేష్టానువర్తిన్యా భావ్యమితి చోపదేశః. శిరోధృతా యా చన్ద్రకలా తామపి పరిభవేతి సపత్నీలోకాపజయ ఉక్తః. నిర్వచనమితి:- అనేన లజ్జావహిత్థా హర్షేర్ష్యాసాధ్వససౌభాగ్యాభిమానప్రభృతి యద్యపి ధ్వన్యతే తథాపి తత్ నిర్వచన శబ్దార్థస్య కుమారీజనోచితస్య అప్రతిపత్తిలక్షణస్య అర్థస్య ఉపస్కారకతాం కేవలమాచరతి. ఉపస్కృతస్త్వర్థః శృఙ్గారాఙ్గతామేతీతి.

బాలానందిని

అధునా ఇతి. ఇప్పుడు సంకీర్ణమైన (వ్యంగ్యగుణీభూతవ్యంగ్యాలు కలిసిన) విషయాన్ని విభజిస్తున్నాడు - ప్రభేదస్యేతి. యుక్త్యా ఇతి. ఇక్కడ ఉపయోగించవలసిన యుక్తి చారుత్వప్రతీతియే. దేనికి చారుత్వం కనబడితే ఆ పేరు పెట్టా లని భావం

లత్తుకచేత పూయబడిన చంద్రునికి సౌందర్యాతిశయం లభిస్తుంది. నిరంతరమూ పాదాలమీదపడి అనుగ్రహింపచేసికొంటేనే కాని వెంటనే భర్త ఇష్టం ప్రకారం ప్రవర్తించవద్దు అని ఉపదేశం. చంద్రకళ శిరస్సుమీద ధరించబడింది. దానిని కూడ తిరస్కరించుము అని సవతుల పరాజయం చెప్పబడింది (చంద్రకల ఒక సవతి అన్నట్లు ఊహ). నిర్వచనమితి. దీనిచేత లజ్జ, అవహిత్థ (ఆకారగుప్తి), హర్షం, కోపం, సాధ్వసం, సౌభాగ్యాభిమానం మొదలైనవి కూడ ధ్వనింపబడుతున్నా అవన్నీ కూడ 'నిర్వచన' శబ్దానికి అర్థమూ, కుమారీజనులకు ఉచితమూ అయిన అప్రతిపత్తిరూపమై (గ్రహించి కూడ దానికి ఎదురుచెప్పకపోవడం అనే) విషయానికి కేవలం ఉపస్కారకాలుగా ఉన్నాయి. ఉపస్కృతమైన అర్థం శృంగారానికి అంగం అవుతున్నది.

లోచనం

ప్రాయచ్ఛతేతి. ఉచ్చైరితి ఉచ్చైర్యాని కుసుమాని కాన్తయా స్వయం గ్రహీతుమశక్యత్వాద్యాచితానీత్యర్థః. అస్మదుపాధ్యాయాస్తు హృద్యతమాని పుష్పాణి అముకే గృహాణ గృహాణ ఇత్యుచ్చైః తారస్వరేణ ఆదరాతిశయార్థం ప్రయచ్ఛతా. అత ఏవ లమ్భితేతి. న కించిదితి. ఏవంవిధేషు శృఙ్గారావసరేషు తామేవాయం స్మరతీతి మానప్రదర్శనమేమాత్ర న యుక్తమితి సాతిశయమన్యుసంభారో వ్యఙ్గ్యః వచననిషేధస్యైవ వాచ్యస్య సంస్కారః. తద్వక్ష్యతి - ఉక్తిర్భఙ్గ్యాస్తీతి. తస్యేతి - వ్యఙ్గ్యస్య. ఇహేతి - పత్యురిత్యాదౌ. వాచ్యస్యాపీతి. అపిశబ్దో భిన్నక్రమః. ప్రాధాన్యమపి భవతి వాచ్యస్య; రసాద్యపేక్షయా తు గుణతాపీత్యర్థః. అత ఏవ ఉపసంహారే ధ్వనిశబ్దస్య విశేషణముక్తమ్. 39

బాలానందిని

ప్రాయచ్ఛతేతి. ఉచ్చైరితి. ఉచ్చైః= ఎత్తైన, ఏ పుష్పాలు ప్రియురాలిచేత స్వయంగా అందుకొనడానికి అశక్యమైనవి అవడంచేత, కోసి ఇమ్మని యాచించబడినవో. మా ఉపాధ్యాయులైతే- ఓ! ఫలానాదానా! పువ్వులు చాలా మనోహరంగా ఉన్నాయి, తీసికో, తీసికో అని ఆదరాతిశయంకొరకు ఉన్నతస్వరంచేత ఇచ్చుచున్నవాడు; అందుచేతనే పొందింపబడినది అని చెప్పబడినది అని వ్యాఖ్యానించినారు. న కించిదితి ఈ విధములైన శృంగారసమయాలలో కూడ ఆమెనే ఇతడు స్మరిస్తున్నాడు. అందుచేత

ఇప్పుడు మాన (కోప)ప్రదర్శనమే యుక్తం కాదు అని వ్యంగ్యమైన అత్యధికమైన కోపసంభారం వాచ్యమైన వచననిషేధానికే (మాటలాడకుండడానికే) సంస్కారం. ఈ విషయమే ఉక్తిర్భఙ్గ్యాస్తి అని చెప్పగలడు. తస్యేతి - వ్యంగ్యంయొక్క. ఇహేతి - 'పత్యుః' ఇత్యాదిశ్లోకాలలో. వాచ్యస్యాపీతి. 'అపి' శబ్దం భిన్నక్రమం. అనగా 'వాచ్యస్యాపి' లోని 'అపి' శబ్దాన్ని 'ప్రాధాన్యమ్'తో అన్వయించాలి అని అర్థం. వాచ్యానికి ప్రాధాన్యం కూడ కలుగుతుంది; రసాద్యపేక్షచేత అప్రధానత్వం కూడ అని అర్థం. అందువల్లనే ఉపసంహారంలో 'ధ్వని' శబ్దానికి విశేషణం ('అనురణనరూపవ్యఙ్గ్య' అనే విశేషణం) ప్రయోగించబడింది. అనగా ఇక్కడ గుణీభూతధ్వనిని అంగీకరించవలసి ఉంది గాన అనురణనవ్యంగ్యరూపధ్వని అని అనకూడదు కాని వ్యంగ్యమైన రసాదులను పట్టి రసాదిధ్వని అనడం తప్పు కాదు అని భావం. 39.

## ధ్వన్యాలోకం

కా. ప్రకారోఽయం గుణీభూతవ్యఙ్గ్యోఽపి ధ్వనిరూపతామ్,
ధత్తే రసాదితాత్పర్యపర్యాలోచనయా పునః. 40

గుణీభూతవ్యఙ్గ్యోఽపి కావ్యప్రకారః రసభావాదితాత్పర్యాలోచనే పునర్ధ్వనిరేవ సంపద్యతే. యథాత్రైవ అనన్తరోదాహృతే శ్లోకద్వయే. యథా చ-

శ్లో. దురారాధా రాధా సుభగ యదనేనాపి మృజత
స్తవైతత్ ప్రాణేశాజఘనవసనేనాశ్రు పతితమ్,
కఠోరం స్త్రీచేతస్తదలముపచారైర్విరమ హే
క్రియాత్ కల్యాణం వో హరిరనునయేష్వేవముదితః. (112)

## బాలానందిని

ప్రకార ఇతి:- అయమ్= ఈ, గుణీభూతవ్యఙ్గ్యః ప్రకారః అపి= గుణీభూత వ్యంగ్యకావ్యప్రకారం కూడ, రసాదితాత్పర్యపర్యాలోచనయా పునః= రసాదులయందు తాత్పర్యంయొక్క పర్యాలోచనచేతనైతే, ధ్వనిరూపతామ్= ధ్వనిరూపత్వాన్ని, ధత్తే= ధరించును. 40

గుణీతి. గుణీభూతవ్యంగ్యమైన కావ్యప్రకారం కూడ రసభావాదులవిషయంలో
తాత్పర్యాన్ని పర్యాలోచిస్తే ధ్వనియే అవుతుంది. ఉదాహరణకు - ఇప్పుడే
రించిన శ్లోకద్వయంలో వలె. మరొక ఉదాహరణం కూడ ఎట్లనగా-
దురారాధా ఇతి:- హే సుభగ - ఓ! సుందరుడా! పతితమ్= పడిన, అశ్రు=
, అనేన= ఈ, ప్రాణేశాజఘనవసనేన= ప్రాణేశ్వరియొక్క జఘనవస్త్రంచేత,
: అపి= తుడుచుచున్నవాడ వైనను, తవ= నీకు, రాధా= రాధ, దురారాధా=
ప శక్యంకానిది. స్త్రీచేతః= స్త్రీచిత్తం, కఠోరమ్= కఠినమైనది. తత్= ఆ కారణంవలన,
ైః= ఉపచారాలచేత, అలమ్= చాలును. హే= ఓయీ! విరమ= విరమించుము.
ేషు= అనునయం చేసే సమయాలలో, ఏవమ్= ఇట్లు, ఉదితః= పలకబడిన,
శ్రీకృష్ణుడు, వః= మీకు, కల్యాణమ్= కల్యాణమును, క్రియాత్= చేయుగాక.

లోచనం

ఏతదేవ నిర్వాహయన్ కావ్యాత్మత్వం ధ్వనేరేవ పరిదీపయతి - ప్రకార
కద్వయ ఇతి. తుల్యచ్ఛాయం యదుదాహృతం పత్యురిత్యాది తత్రేతి.
శబ్దాత్ ఏవంవాదిని ఇత్యస్యానవకాశః. దురారాధేతి. "అకారణకుపితా
ఇతే మయి న ప్రసీదసి, అహో దురారాధాసి, మా రోదీః" ఇత్యుక్తిపూర్వకం
తమే అశ్రూణి మార్జయతి ఇయమస్యా అభ్యుపగమగర్భా ఉక్తిః.
తి. ప్రియయా యః స్వసంభోగభూషణవిహీనః క్షణమపి మోక్తుం న
ం. అనేనాపీతి. పశ్యేదం ప్రత్యక్షేణేత్యర్థః. తదేవ చ యదేవమాదృతం
లజ్జాదిత్యాగేనాప్యేవం ధార్యతే. మృజత ఇత్యనేన హి ప్రత్యుత
సహస్రవాహీ బాష్పో భవతి. ఇయచ్చ త్వం హతచేతనః యత్ మాం
క్య తామేవ కుపితాం మన్యసే; అన్యథా కథమేవం కుర్యాః? పతితమితి.
దానీం రోదనావకాశోఽపీత్యర్థః. యది తూచ్యతే ఇయతా ప్యాదరేణ
కోపం న ముఞ్చసి, తత్కిం క్రియతే? కఠోరస్వభావం స్త్రీచేతః. స్త్రీతి హి
ద్యయోగాద్వస్తువిశేషమాత్రమేతత్; తస్య చైష స్వభావః. ఆత్మని చైతత్
కుమారహృదయా యోషిత ఇతి న కించిద్వజ్రసారాధికమాసాం
యమ్; యదేవంవిధవృత్తాన్త సాక్షాత్కారేఽపి సహస్రధా న దలతి.
ారైరితి - దాక్షిణ్యప్రయుక్తైః. అనునయేష్వితి బహువచనేన

వారంవారమస్య బహువల్లభస్యేయమేవ స్థితిరితి సౌభాగ్యాతిశయ ఉక్తః. ఏవమేష వ్యఙ్గ్యార్థసారః వాచ్యం భూషయతి. తత్తు వాచ్యం భూషితం సత్ ఈర్ష్యావిప్రలమ్భాఙ్గత్వమేతీతి. యస్తు త్రిషశపి శ్లోకేషు ప్రతీయమానస్యైవ రసాఙ్గత్వం వ్యాచష్టే స్మ, స దేవం విక్రీయ తద్యాత్రోత్సవమకార్షీత్. ఏవం హి వ్యఙ్గ్యస్య యా గుణీభూతతా ప్రకృతా సైవ సమూలం త్రుట్యేత్. రసాదివ్యతిరిక్తస్య హి వ్యఙ్గ్యస్య రసాఙ్గయోగిత్వమేవ హి ప్రాధాన్యమ్, నాన్యత్కించిదిత్యలం పూర్వవంశ్యైః సహ వివాదేన.

బాలానందిని

ఏతదేవేతి. దీనినే, అనగా గుణీభూతవ్యంగ్యం రసాదిధ్వనిరూపం అనే విషయాన్నే నిర్వహింపచేస్తూ ధ్వనికే ఉన్న కావ్యాత్మత్వాన్ని ప్రకాశింపచేస్తున్నాడు- ప్రకార ఇతి శ్లోకద్వయ ఇతి. సమానచ్ఛాయ గల ఏ, 'పత్యుః' ఇత్యాదిశ్లోకద్వయం ఉదాహరించబడిందో దానిలో. ద్వయశబ్దంచేత 'ఏవంవాదిని' అనే శ్లోకాన్ని (ఈ విషయంలో గ్రహించడానికి) అవకాశం లేదు. దురారాధేతి:- "నువ్వు ఏ కారణమూ లేకుండా కోపించి పాదాలమీద పడిన నామీద అనుగ్రహం చూపడం లేదు. ఆహా! నిన్ను బ్రతిమాలుకొని ప్రసన్నురాలిని చేసుకొనడం ఎంత కష్టమో కదా! ఏడవకు" అని అంటూ ప్రియతముడు కన్నీళ్లు తుడుస్తూండగా ఆమె (రాధ) అంటూన్న "ఔను, నువ్వు చెప్పినది నిజమే" అని అంగీకారం గర్భమునందు గల మాట.

సుభగేతి. ఏ నిన్ను నీ ప్రియురాలు స్వసంభోగభూషణం లేకుండా క్షణకాలం కూడా విడవడానికి సమర్థురాలు కాదో అలాంటి ఓ సుందరుడా! అని రాధ మాటలోని వ్యంగ్యం., అనేనాపీతి. చూడు ప్రత్యక్షంగా నీ కళ్లతోనే చూడు అని అర్థం. ఇదే నీ ప్రియురాలి జఘనవస్త్రం, దేనిని నీవు ఇంతగా ఆదరిస్తున్నావో, సిగ్గు కూడ లేకుండ ఏది నీచేత ధరించబడినదో అని వ్యంగ్యం. (పొరబాటున మరొక నాయిక ధరించిన వస్త్రాన్ని ధరించి శ్రీకృష్ణుడు రాధ దగ్గరికి వచ్చినా డని, ఆ వస్త్రంతో ఆమె కన్నీళ్లు తుడుస్తున్నా డనీ గుర్తించవలసిన విషయం) మృజతః తుడుస్తూనే ఉన్నావు అనడంచేత నువ్వు చేస్తూన్న పనికి పైపెచ్చు కన్నీరు ధారాసహస్రంతో స్రవిస్తుంది అని వ్యంగ్యం. నీ బుద్ధి ఎంతగా చెడిపోయిం దనగా ఇక్కడ ఉన్నది నే ననె మాట మరచి ఆ ప్రియురాలే కోపించిం దని అనుకొంటున్నావు. అలా కాకపోతే ఇలా ఎందుకు చేస్తావు? అని వ్యంగ్యం. పతితమితి - (పడిన కన్నీరు అనడంచేత) ఇప్పుడు ఇంక ఏడవడానికి

అవకాశం కూడా పోయింది అని అర్థం. ఇంత ఆదరం చూపుతున్నా కోపం విడవకున్నా వేమి అని అంటావా - మరేం చెయ్యాలి? స్త్రీల చిత్తం చాల కఠోరస్వభావం గలది.. స్త్రీ అంటే ఏమిటి? దానికి ప్రేమాదు లేవీ ఉండేవు. అందుచేత అది ఒకానొక వస్తువు. ఇదే ఆ వస్తువుయొక్క స్వభావం (ఇదంతా కృష్ణుణ్ణి ఉద్దేశించిన వ్యంగ్యం). ఇంక రాధ తనలో అనుకుంటూన్నది - స్త్రీలు సుకుమారహృదయలు అనేది ఏదీ లేదు. వాళ్ల హృదయం వజ్రంయొక్క సారంకంటె కూడ అధికమైన సారం గలది; ఇలాంటి వృత్తాంతాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నా కూడ ఇది వేయి ముక్కలు అవడం లేదు అని వ్యంగ్యం. అనునయేషు అని బహువచనంచేత ఎంతోమంది ప్రేయసులు గల ఇతనికి మాటిమాటికి ఇలాంటి స్థితియే ఏర్పడుతుంది అని ఆతని సౌభాగ్యాతిశయం చెప్పబడింది. ఈ విధంగా ఈ వ్యంగ్యార్థసారం వాచ్యార్థాన్ని అలంకరిస్తూన్నది. ఈ విధంగా అలంకరించబడినదై ఆ వాచ్యార్థం ఈర్ష్యాదివిప్రలంభానికి అంగత్వాన్ని పొందుతుంది.

యస్తు ఇతి:- ఈ మూడు శ్లోకాలలోనూ కూడ ప్రతీయమానార్థమే రసాంగంగా ఉంది అని ఎవడు వ్యాఖ్యానించాడో అతడు దేవుణ్ణి అమ్మేసి ఆ దేవుని యాత్రోత్సవం జరుపుకున్నాడు! ఇలా చెప్పే పక్షంలో వ్యంగ్యంయొక్క ఏ గుణీభూతత్వం ప్రస్తుతమో(ఏ గుణీభూతవ్యంగ్యాన్ని గూర్చిన చర్చ ఈ ఘట్టంలో జరుగుతున్నదో) అదే సమూలంగా ఛిన్నం అయిపోతుంది.

వ్యంగ్యం రసాదులకు అంగం అవుతుం దనే విషయం అంగీకరించబడినదే కదా? మేం చెప్పినదానిలో దోషం ఏముంది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - **రసాదీతి**- రసాదివ్యతిరిక్తమైన వ్యంగ్యం(వస్త్వలంకారరూపమైన వ్యంగ్యం) రసానికి అంగంగా ఉండడం అనేది దానికున్న ప్రాధాన్యం; అంతకంటె మరేమీ లేదు. సరే, ఇంతటితో మన పూర్వవంశ్యులతో వివాదం చాలు.

వివరణ:- రసాదులు కేవలం వ్యంగ్యాలే. అందుచేత వాటి ప్రాధాన్యం సహజమైనది. రసాదిభిన్నవస్త్వలంకారవ్యంగ్యాలు రసాలకు అంగం అవడంచేత ప్రధానమైనవి అవుతాయి. అందుచేత వీటిని రసాంగాలు అని చెపితే వాటికి ప్రాధాన్యం అంగీకరించినట్లే. అవి వాచ్యానికి అంగం అవుతేనే గుణీభూతత్వం అని భావం.

## ధ్వన్యాలోకం

ఏవం స్థితే "న్యక్కారో హ్యయమేవ" ఇత్యాదిశ్లోకనిర్దిష్టానాం పదానాం వ్యఙ్గ్యవిశిష్టవాచ్యప్రతిపాదనేఽపి ఏతద్వాక్యార్థీభూతరసా

పేక్షయా వ్యఞ్జకత్వముక్తమ్. న తేషాం పదానామర్థాన్తరసంక్రమిత వాచ్యధ్వనిభ్రమో విధాతవ్యః; వివక్షితవాచ్యత్వాత్తేషామ్. తేషు హి వ్యఙ్గ్యవిశిష్టత్వం వాచ్యస్య ప్రతీయతే, న తు వ్యఙ్గ్యరూపపరిణతత్వమ్. తస్మాద్వాక్యం తత్ర ధ్వనిః; పదాని తు గుణీభూతవ్యఙ్గ్యాని. న చ కేవలం గుణీభూతవ్యఙ్గ్యాన్యేవ పదాన్యలక్ష్యక్రమవ్యఙ్గ్యధ్వనేర్వ్యఞ్జకాని, యావదర్థాన్తరసంక్రమితవాచ్యాని ధ్వనిప్రభేదరూపాణ్యపి. యథాత్రైవ శ్లోకే 'రావణ' ఇత్యస్య ప్రభేదాన్తరరూపవ్యఞ్జకత్వమ్. యత్ర తు వాక్యే రసాదితాత్పర్యం నాస్తి గుణీభూతవ్యఙ్గ్యైః పదైరుద్భాసితేఽపి తత్ర గుణీభూతవ్యఙ్గ్యతైవ సముదాయధర్మః. యథా-

శ్లో. రాజానమపి సేవన్తే విషమప్యుపభుఞ్జతే,
రమన్తే చ సహ స్త్రీభిః కుశలాః ఖలు మానవాః. (113)

ఇత్యాదౌ.

బాలానందిని

ఏవమితి. ఇది ఇలా ఉండగా "న్యక్కారో హ్యయమేవ" (శ్లో 81) ఇత్యాది శ్లోకంలో నిర్దేశించబడిన పదాలు వ్యంగ్యవిశిష్టవాచ్యార్థాన్ని ప్రతిపాదిస్తున్నా ఈ వాక్యానికి అర్థమైన రసాపేక్షచేత (రసం దృష్ట్వా) వ్యంజకత్వం చెప్పబడింది. ఈ పదాలు అర్థాంతరసంక్రమితవాచ్యాలు అని భ్రమ చెందకూడదు. ఎందువల్ల ననగా వీటి అర్థాలు వివక్షితాలే (చెప్పా లని ఉద్దేశించబడినవే). వాటి వాచ్యం వ్యంగ్యవిశిష్టంగా భాసిస్తూన్నది గాని వ్యంగ్యరూపంలో పరిణమించినట్లు భాసించడం లేదు. అందువల్ల అక్కడ మొత్తం వాక్యం ధ్వని. పదాలు మాత్రం గుణీభూతవ్యంగ్యాలు.

న చేతి:- అలక్ష్యక్రమవ్యంగ్యధ్వనిని కేవలం గుణీభూతవ్యంగ్యాలైన పదాలే కాదు, అర్థాంతరసంక్రమితవాచ్యాలైన ధ్వనిప్రభేదరూపాలైన పదాలు కూడా వ్యంజింపచేస్తాయి. ఉదాహరణకి - ఈ శ్లోకంలోనే 'రావణః' అనే పదం (అర్థాంతరసంక్రమితవాచ్యమైన పదం) ప్రభేదాంతరరూపవ్యంజకంగా ఉంది. అనగా

అర్థాంతరసంక్రమితవాచ్యమైన ధ్వనిప్రభేదం అలక్ష్యక్రమవ్యంజకం అని చెప్పడానికి 'రావణః' అనే పదం ఉదాహరణం అని భావం. అయితే ఏ వాక్యంలో రసాదితాత్పర్యం ఉండదో, గుణీభూతవ్యంగ్యాలచేత ప్రకాశింపచేయబడినదైనా కూడ, ఆ వాక్యంలో సముదాయధర్మం కూడా గుణీభూతవ్యంగ్యత్వమే. ఎట్లనగా- రాజానమితి - "రాజును కూడ సేవిస్తారు; విషంకూడ తింటారు; స్త్రీలతో కూడ రమిస్తారు; మానవులు మంచి నేర్పు కలవారు కదా" ఇత్యాదులలో

లోచనం

ఏవం స్థిత ఇతి - అనన్తరోక్తేన ప్రకారేణ ధ్వనిగుణీభూతవ్యఙ్గ్యయోః విభాగే స్థితే సతీత్యర్థః. కారికాగతమపిశబ్దం వాఖ్యాతుమాహ - న చేతి. ఏష చ శ్లోకః పూర్వమేవ వ్యాఖ్యాత ఇతి న పునర్లిఖ్యతే. యత్ర త్వితి. యద్యపి చాత్ర విషయనిర్వేదాత్మకశాన్తరసప్రతీతిరస్తి తథాపి చమత్కారోఽయం వాచ్యనిష్ఠ ఏవ;వ్యఙ్గ్యం తు అసంభావ్యత్వవిపరీతకారిత్వాది తస్యైవానుయాయి. తచ్చాపి శబ్దాభ్యాముభయతో యోజితాభ్యాం, చశబ్దేన స్థానత్రయయోజితేన, ఖలు శబ్దేన చోభయతో యోజితేన, మానవశబ్దేన (చ) స్పృష్టమేవేతి గుణీభూతమ్.

బాలానందిని

ఏవం స్థితే ఇతి. ఇప్పుడే చెప్పిన ప్రకారంచేత ధ్వని- గుణీభూతవ్యంగ్యాల విభాగం ఇలా ఉండగా అని అర్థం. కారికలోని 'గుణీభూతవ్యఙ్గ్యోఽపి' లోని 'అపి' శబ్దాన్ని వ్యాఖ్యానించడానికి చెపుతున్నాడు - న చేతి. ఈ శ్లోకం పూర్వమే వ్యాఖ్యానించబడింది గాన మళ్లీ వ్రాయడంలేదు. యత్ర త్వితి. ఇక్కడ విషయాలమీద నిర్వేదం కలగడం అనే శాంతరసంయొక్క ప్రతీతి ఉన్నా కూడ చమత్కారం వాచ్యంలోనే ఉంది. అసంభావ్యత్వం (ఊహించడానికి శక్యం కాకపోవడం) విపరీతఫలం ఇవ్వడం మొదలైన వ్యంగ్యార్థం వాచ్యార్థాన్నే అనుసరించి ఉంటుంది. రెండు వైపులా (అన్వయించేటట్లు) కూర్చబడిన రెండు 'అపి' శబ్దాలచేత, మూడు స్థానాలలో కూర్చబడిన 'చ' శబ్దంచేత, రెండు ప్రక్కలా చేర్చిన 'ఖలు' శబ్దంచేత, 'మానవ' శబ్దంచేత ఈ వ్యంగ్యం స్పృశించబడింది గాన గుణీభూతం.

వివరణ:- రాజసేవ చేయడం అనేది అసంభావ్యం. చాల కష్టమైన దని, వ్యంగ్యం. విషం కూడ అది మామూలుగా ఇచ్చే ఫలానికి విపరీతమైన ఫలం ఇస్తుంది

(ఔషధాదులలో)అని వ్యంగ్యం. 'రాజానమపి సేవన్తే' అనే చోట ఉన్న 'అపి' శబ్దం 'రాజానమ్' తోను, 'సేవన్తే' తోను కూడ అన్వయిస్తుంది. అట్లే రెండవ 'అపి' శబ్దం కూడ రెండింటితోను అన్వయిస్తుంది. 'రమన్తే చ' అనే చోట ఉన్న 'చ' శబ్దాన్ని మూడు వాక్యాలలోను అన్వయించాలి. 'ఖలు' అనేది 'మానవాః' తోను, 'కుశలాః'తోను కూడ అన్వయిస్తుంది అని అర్థం.

## ధ్వన్యాలోకం

వాచ్యవ్యఙ్గ్యయోః ప్రాధాన్యాప్రాధాన్యవివేకే పరః ప్రయత్నో విధాతవ్యః, యేన ధ్వనిగుణీభూతవ్యఙ్గ్యయోః అలంకారాణాం చ అసంకీర్ణః విషయః సుజ్ఞాతో భవతి. అన్యథా తు ప్రసిద్ధాలంకారవిషయ ఏవ వ్యామోహః ప్రవర్తతే. యథా -

శ్లో. లావణ్యద్రవిణవ్యయో న గణితః క్లేశో మహాన్ స్వీకృతః
స్వచ్ఛన్దస్య సుఖం జనస్య వసత శ్చిన్తానలో దీపితః,
ఏషాపి స్వయమేవ తుల్యరమణాభావాద్వరాకీ హతా
కోఽర్థశ్చేతసి వేధసా వినిహితస్తన్వ్యాస్తనుం తన్వతా. (114)

ఇత్యత్ర వ్యాజస్తుతిరలఙ్కార ఇతి వ్యాఖ్యాయి కేనచిత్; తన్న చతురస్రమ్. యతః అస్య అభిధేయస్య ఏతదలంకారస్వరూప మాత్రపర్యవసాయిత్వే న సుశ్లిష్టతా. యతో న తావదయం రాగిణః కస్యచిద్వికల్పః; తస్య - "ఏషాపి స్వయమేవ తుల్యరమణాభావాద్వరాకీ హతా'' ఇత్యేవంవిధోక్త్యనుపపత్తేః. నాపి నీరాగస్య; తస్యైవంవిధవికల్పపరిహారైకవ్యాపారత్వాత్. న చాయం శ్లోకః క్వచిత్ ప్రబన్ధ ఇతి శ్రూయతే, యేన తత్ప్రకరణానుగతార్థతాస్య పరికల్ప్యతే. తస్మాదప్రస్తుతప్రశంసేయమ్. యస్మాదనేన వాచ్యేన గుణీభూతాత్మనా నిఃసామాన్యగుణావలేపాధ్మాతస్య, నిజమహిమోత్కర్షజనితసమత్సర జనజ్వరస్య, విశేషజ్ఞమాత్మనో న కంచిదేవాపరం పశ్యతః

పరిదేవితమేతదితి ప్రకాశ్యతే. తథా చాయం ధర్మకీర్తేః శ్లోక ఇతి ప్రసిద్ధిః సంభావ్యతే చ తస్యైవ; యస్మాత్

శ్లో. అనధ్యవసితావగాహనమనల్పధీశక్తినా
ప్యదృష్టపరమార్థతత్త్వమధికాభియోగైరపి,
మతం మమ జగత్యలబ్ధసదృశప్రతిగ్రాహకం
ప్రయాస్యతి పయోనిధేః పయ ఇవ స్వదేహే జరామ్. (115)

ఇత్యనేనాపి శ్లోకేనైవంవిధః అభిప్రాయః ప్రకాశిత ఏవ.

బాలానందిని

వాచ్యవ్యఙ్గ్యయోరితి:- వాచ్యవ్యంగ్యాల ప్రాధాన్యాప్రధాన్యాలవిషయంలో ఎక్కువ ప్రయత్నం చేయడం అవసరం. దానివల్ల ధ్వని-గుణీభూతవ్యంగ్యాలకీ, అలంకారాలకీ సాంకర్యం లేని విషయం బాగా తెలుస్తుంది. అలా కాకపోతే ప్రసిద్ధాలైన అలంకారాల విషయంలోనే వ్యామోహం కలుగుతుంది. ఎట్లనగా- లావణ్యేతి. లావణ్యద్రవిణవ్యయః= లావణ్యం అనే ధనంయొక్క వ్యయం, న గణితః= లెక్కచేయబడలేదు. మహాన్= గొప్ప, క్లేశః= శ్రమ, స్వీకృతః= స్వీకరించబడినది. సుఖమ్= సుఖంగా, వసతః= నివసిస్తూన్న, స్వచ్ఛన్దస్య= స్వేచ్ఛ గల, జనస్య= యువకజనంయొక్క, చిన్తానలః= చింతాగ్ని, దీపితః= ప్రజ్వలింపచేయబడింది. తుల్యరమణాభావాత్= తగిన ప్రియుడు లేకపోవడంవల్ల, ఏషా వరాకీ అపి= ఈ దీనురాలు కూడ, స్వయమేవ= స్వయంగానే, హతా= వ్యర్థురాలుగా చేయబడినది. తన్వ్యాః= ఈ రమణియొక్క, తనుమ్= శరీరమును, తన్వతా= నిర్మించిన, వేధసా= బ్రహ్మచేత, కః అర్థః = ఏమి ప్రయోజనం, చేతసి= చిత్తమునందు, వినిహితః= ఉంచబడినదో!

ఇత్యత్రేతి - ఈ శ్లోకంలో వ్యాజస్తుత్యలంకారం అని ఒకడు వ్యాఖ్యానించాడు. (బ్రహ్మను నిందించడం ద్వారా యువతీలావణ్యస్తుతి అని అతని అభిప్రాయం. అది బాగుగా లేదు. ఎందువలన అనగా దీని అర్థం ఈ అలంకారంయొక్క స్వరూపమాత్రంలో పర్యవసానం చెందుతుంది అని చెపితే సరిగా కుదరదు. ఎందువల్ల ననగా - ఇది ఎవడో రాగి చేసే వికల్పం కాదు. అలాంటి అనురాగవంతుడు - "ఏషాపి స్వయమేవ తుల్యరమణాభావాద్వరాకీ హతా" అని అనడం ఉపపన్నం కాదు. (ఆమెకు తాను తగినవాడ నని అతడు అనుకుంటూంటాడు కదా అని భావం). వీతరాగుడు చేసే

వికల్పం అవడానికి వీలు లేదు. ఇలాంటి వికల్పాలేవీ తన మనస్సులో ప్రవేశించకుండా ఉండే టట్లు చూసుకోవడమే అతని ముఖ్యవ్యాపారం కదా? ఇది ఏదో ప్రబంధంలో ఉన్న శ్లోకం అని వినబడడంలేదు; అలా అయితే ఆ ప్రకరణానికి తగిన అర్థాన్ని కల్పించడానికి వీలు ఉండేది. అందువల్ల ఇది అప్రస్తుతప్రశంస. ఎందువల్ల ననగా గుణీభూతస్వరూపం గల ఈ వాచ్యార్థంచేత, ఇది తనలో అసాధారణములైన గుణా లున్నాయి అనే గర్వంచేత పూర్తిగా నింపబడినవాడు, తన మహిమయొక్క ఉత్కర్షచేత పుట్టించబడిన మాత్సర్యంతో కూడిన జనుల జ్వరం కలవాడు, (అనగా తన గొప్పతనాన్ని చాటుకోవడం ద్వారా జనులలో కోపజ్వరాన్ని పుట్టించినవాడు అని అర్థం). తాను తప్ప ఇతరు డెవ్వడూ విశేషజ్ఞానం కలవాడు కాడు అని భావించేవాడు అయిన ఒకానొకని పరిదేవనం (ఏడ్పు) అని ప్రకాశింపచేయబడుతుంది. అట్లే ఇది ధర్మకీర్తి శ్లోకం అని ప్రసిద్ధి. ఇది ఆతనిదే అనడానికి కూడ అవకాశం ఉంది. ఎందువలన అనగా అనధ్యవసితేత్యాదిశ్లోకంచేత కూడ ఇలాంటి అభిప్రాయమే (ఆతనిచేత) ప్రకాశింపబడి ఉంది.

అనధ్యవసితేతి. అనల్పధీశక్తినాపి= అధికమైన బుద్ధిబలం కలవానిచేత కూడ, అనధ్యవసితావగాహనమ్= లోపల ప్రవేశించడానికి నిశ్చయించబడనిది, దీనిలోనికి ప్రవేశించాలని అనుకోవడానికి కూడ మహాబుద్ధిశాలులు కూడ జంకుతారు అని భావం, అధికాభియోగైరపి= అత్యధికమైన నిరంతరప్రయత్నం కలవారిచేత కూడ, అదృష్టపరమార్థతత్త్వమ్= చూడబడని యథార్థతత్త్వం కలదీ, జగతి= ఈ జగత్తులో, అలబ్ధసదృశప్రతిగ్రాహకమ్= పొందబడని తగిన గ్రహీతలు కలదీ అయిన, మమ మతమ్= నా మతం, పయోనిధేః పయః ఇవ= సముద్రజలం వలె, స్వదేహే= తన దేహంలోనే, జరామ్= జీర్ణత్వాన్ని, ప్రయాస్యతి= పొందగలదు.

లోచనం

వివేకదర్శనా చేయం న నిరుపయోగీతి దర్శయతి - వాచ్యవ్యఙ్గ్యయోరితి. - అలంకారాణాం చేతి. యత్ర వ్యఙ్గ్యం నాస్త్యేవ తత్ర తేషాం శుద్ధానాం ప్రాధాన్యమ్. అన్యథా త్వితి. యది ప్రయత్నవతా న భూయతే ఇత్యర్థః. వ్యఙ్గ్యప్రకారస్తు యో మయా పూర్వముత్ప్రేక్షితస్తస్య అసందిగ్ధమేవ వ్యామోహస్థానత్వమితి ఏవకారాభిప్రాయః. ద్రవిణశబ్దేన సర్వస్వప్రాయత్వమ్, అనేకస్వకృత్యోపయోగిత్వముక్తమ్. గణిత ఇతి. చిరేణ హి యో వ్యయః

సంపద్యతే, న తు విద్యుదివ ఝుటితి; తత్రావశ్యం గణనయా భవితవ్యమ్. అనన్తకాలనిర్మాణకారిణోఽపి తు విధేః న వివేకలేశోఽప్యభూదితి పరమస్యాప్రేక్షావత్త్వమ్. అత ఏవ ఆహ - క్లేశో మహానితి. స్వచ్ఛన్దస్యేతి - విశృఙ్ఖలస్యేత్యర్థః. ఏషాపీతి. యత్ స్వయం నిర్మీయతే తదేవ చ నిహన్యతే ఇతి మహద్వైశసమపిశబ్దేన ఏవకారేణ చ ఉక్తమ్. కోఽర్థ ఇతి. న స్వాత్మనః, న లోకస్య, న నిర్మితస్య ఇత్యర్థః. తస్యేతి. రాగిణో హి 'వరాకీ హతా' ఇతి కృపణతాలిఙ్గితమమఙ్గలోపహతం చ అనుచితం వచనమ్. తుల్యరమణాభావాదితి స్వాత్మని అత్యన్తమనుచితమ్. ఆత్మన్యపి తద్రూపాసంభావనాయాం రాగితాయాం చ పశుప్రాయత్వం స్యాత్.

బాలానందిని

వివేకేతి. ఈ వివేకప్రదర్శనం నిరుపయుక్తం కాదు అని చూపుతున్నాడు - వాచ్యవ్యఙ్గ్యయోరితి. ఎక్కడైతే వ్యంగ్యం లేదో అక్కడ శుద్ధమైన ఆ అలంకారాలకే ప్రాధాన్యం. అన్యథా త్వితి. ప్రయత్నవంతుడు కాకపోతే అని అర్థం. వెనుక నేను ఊహించి, పరీక్షించి, ఏ వ్యంగ్యప్రకారం చూపి ఉన్నానో అది వ్యామోహస్థానం అని చెప్పడంలో సందేహం లేదు అని ("ప్రసిద్ధాలంకారవిషయ ఏవ" లోని) 'ఏవ'కారానికి అభిప్రాయం. 'ద్రవిణ' శబ్దంచేత అనగా లావణ్యమే ధనం అని లావణ్యంమీద ధనత్వాన్ని ఆరోపించడంచేత అది (లావణ్యం) సర్వస్వం వంటి దనీ, అనేకమైన తాను చేయవలసిన పనులకు ఉపయోగించే దనీ చెప్పబడింది. గణిత ఇతి. ఏ వ్యయం మెరుపు వలె హటాత్తుగా ఒక్క మాటు కాకుండా చాలా కాలం పాటు చేయవలసినదో దాని విషయంలో తప్పకుండా లెక్కపెట్టడం ఉండాలి. అనంతకాలంనుంచి నిర్మాణం (సృష్టి) చేస్తున్నా బ్రహ్మకు వివేకలేశం కూడా లేకపోయింది అని ఇతని ఆలోచన లేని పని చేయడం, దూరదృష్టిరాహిత్యం, అత్యధికమైనది. అందుచేతనే క్లేశో మహాన్ అని అంటున్నాడు. స్వచ్ఛన్దస్యేతి: ఏ బంధనాలు లేని అని అర్థం. ఏషాపీతి. స్వయంగా నిర్మించబడినదే చేతులారా నశింపచేయబడుతున్నది అని 'అపి' శబ్దంచేత, 'ఏవ' కారంచేత అధికమైన క్రూరత్వం చెప్పబడింది. కోఽర్థః - తనకూ ప్రయోజనం లేదు, లోకానికీ లేదు, నిర్మించబడినదానికీ లేదు అని అర్థం. తస్యేతి - రాగవంతుడు "వరాకీ హతా" అని దైన్యంతో కూడినదీ, అమంగలోపహతమూ అయిన వచనం పలకడం అనుచితం. 'తుల్యరమణాభావాత్" అని అనడం తన విషయంలో అత్యంతం అనుచితం.

తనకు ఆమెకు తగిన రూపం లేదని అనుకుంటూనే అనురాగవంతుడై ఉండడం పశుప్రాయత్వమే అవుతుంది.

లోచనం

ననుచ రాగిణోఽపి కుతశ్చిత్కారణాత్ పరిగృహీతకతిపయకాలవ్రతస్య వా, రావణప్రాయస్య వా సీతాదివిషయే, దుష్యన్తప్రాయస్య వా అనిర్జ్ఞాతజాతివిశేషే శకున్తలాదౌ కిమియం స్వసౌభాగ్యాభిమానగర్భా, తత్స్తుతిగర్భా చోక్తిర్న భవతి? వీతరాగస్య వా అనాదికాలాభ్యస్తరాగవాసనావాసితతయా మధ్యస్థత్వేనాపి తాం వస్తుతః తథా పశ్యతః నేయముక్తిః న సంభావ్యా. న హి వీతరాగో విపర్యస్తాన్ భావాన్ పశ్యతి. న హ్యస్య వీణారణితం కాకరటితకల్పం ప్రతిభాతి. తస్మాత్ ప్రస్తుతానుసారేణ ఉభయస్యాపీయముక్తిరుపపద్యతే. అప్రస్తుతప్రశంసాయామపి హి అప్రస్తుతః సంభవన్నేవార్థః వక్తవ్యః; న హి తేజసి ఇత్థమప్రస్తుతప్రశంసా సంభవతి - "అహో తే కార్ష్ణ్యమ్" ఇతి. సా పరం ప్రస్తుతపరతయా ఇతి నాత్రాసంభవః ఇత్యాశఙ్క్యాహ - న చేతి. నిఃసామాన్యేతి, నిజమహిమేతి, విశేషజ్ఞమితి, పరిదేవితమితి ఏతైశ్చతుర్భిర్వాక్యఖణ్డైః క్రమేణ పాదచతుష్టయస్య తాత్పర్యం వ్యాఖ్యాతమ్. నన్వత్రాపి కిం ప్రమాణమిత్యాశఙ్క్యాహ - తథా చేతి. నను కిమియతా ఇత్యాశఙ్క్య తదాశయేన నిర్వివాదతదీయశ్లోకార్పితేన అస్యాశయం సంవాదయతి - సంభావ్యత ఇతి. అవగాహనమధ్యవసితమపి న యత్ర, ఆస్తాం తస్య సంపాదనమ్. పరమం యదర్థతత్త్వం కౌస్తుభాదిభ్యోఽప్యుత్తమమ్. అలబ్ధప్రయత్నపరీక్షితమపి న ప్రాప్తం సదృశం యస్య తథాభూతం, ప్రతిగ్రాహమేవైకో గ్రాహో జలచరః ప్రాణీ ఐరావతోచ్చైఃశ్రవోధన్వన్తరిప్రాయః యత్ర తత్ అలబ్ధసదృశప్రతిగ్రాహకమ్. ఏవంవిధ ఇతి. పరిదేవితవిషయ ఇత్యర్థః.

ఇయతి చార్థే అప్రపస్తుతప్రశంసోపమాలక్షణమలంకారద్వయమ్. అనన్తరం తు స్వాత్మని విస్మయధామతయా అద్భుతే విశ్రాన్తిః. పరస్య చ శ్రోతృజనస్యాత్యాదరాస్పదతయా ప్రయత్నగ్రాహ్యతయా చోత్సాహజననేన ఏవంభూతమత్యన్తోపాదేయం సత్ కతిపయజనానుగ్రాహకం కృతమితి స్వాత్మని

కుశలకారితాప్రదర్శనయా ధర్మవీరస్పర్శనేన వీరరసే విశ్రాన్తిరితి మన్తవ్యమ్. అన్యథా పరిదేవితమాత్రేణ కిం కృతం స్యాత్? అప్రేక్షాపూర్వకారిత్వమాత్మన్యావేదితం చేత్ కిం తతః? స్వార్థపరార్థాసంభవాత్ ఇత్యలం బహునా.

బాలానందిని

నన్వితి. రాగి కూడ ఏదైన కారణంచేత కొంత కాలంపాటు ఏదైన వ్రతం తీసుకున్నప్పుడు ఆ రాగికైనా, సీతాదివిషయంలో రావణుడు వంటి వానికైనా, జాతిని గూర్చి సరిగా తెలియనప్పుడు శకుంతలాదివిషయంలో దుష్యంతుడు వంటివానికైనా, తన సౌభాగ్యాతిశయాభిమానం గర్భమందు కలదీ, ఆ స్త్రీయొక్క స్తుతి గర్భమందు కలదీ అయిన ఇలాంటి ఉక్తి సంభావ్యం కాదా? అనాదికాలంనుచి అభ్యస్తమైన (అలవాటులో ఉన్న) రాగవాసనచేత వాసితుడైన వీతరాగుడు కూడ, మధ్యస్థుడుగానైనా (ఆమెయందు అభిలాష లేకపోయినా వస్తుస్థితిదృష్టితో నైనా) ఆమెను యథార్థంగా అలా చూచినప్పుడు ఈ విధమైన ఉక్తి అసంభావ్యం కాదు. వీతరాగుడైనంతమాత్రాన ఒకడు లోకంలోని పదార్థాలను విపరీతంగా చూడడు కదా? వీనికి వీణాధ్వని కాకి అరపులాగ అనిపించదు కదా? అందుచేత (ఈ శ్లోకం ఏదైనా ఒక ఘట్టంలో ఉన్న పక్షాన) ప్రస్తుతాన్ని అనుసరించి రెండు రకాల మనుష్యులూ కూడ ఈ విధంగా మాటలాడడం ఉపపన్నమే. అప్రస్తుతప్రశంసలో కూడ లోకంలో ఉండడానికి అవకాశం ఉన్న అప్రస్తుతవిషయాన్నే చెప్పాలి. తేజస్సును గూర్చి-"ఛీ! ఏమిటి నీ కింత నలుపు" అని అప్రస్తుతప్రశంస ఉండదు కదా? అయితే ఆ అప్రస్తుతవిషయకథనం ప్రస్తుతపరంగా ఉండాలి: ఈ దృష్టితో చూస్తే కూడ ఇక్కడ అసంభవం అవడం అనేది లేదు అని ఆశంకించుకొని చెపుతున్నాడు - న చేతి.

వివరణ:- రాగి కాని వీతరాగి కాని ఈ విధంగా మాటలాడే డనడం కుదరదు గాన ఇది అప్రస్తుతప్రశంస అని వృత్తికారుడు చెప్పినట్లయింది. అయితే అప్రస్తుతప్రశంసలో కూడ చెప్పే అప్రస్తుతాంశం సంభావ్యమే అయి ఉండాలి; అందుచేత అప్రస్తుతప్రశంసను అంగీకరించినంతమాత్రంచేత ఇది అసంభావ్యమైనా దోషం లేదు అని చెప్పడం కుదరదు. రాగి యైనా, విరాగి యైనా ఈ మాటలు మాట్లాడడం అసంభావ్యం కాదని మేం ప్రతిపాదించే ఉన్నాం అని పూర్వపక్షి అభిప్రాయం. దీనికి సమాధానంగా - అప్రస్తుతప్రశంసలోని అప్రస్తుతాంశం సంభావ్యమా కాదా అనే విషయంతో ఇక్కడ

సంబంధం లేదు. ఈ శ్లోకం ఏ ప్రబంధంలోనూ ఉన్నట్లు మేం వినలేదు; అందుచేత దీనిని అప్రస్తుతప్రశంసగా గ్రహిస్తున్నాం అని సిద్ధాంతి అభిప్రాయం.

నిఃసామాన్యేతి. వృత్తిలోని 'నిఃసామాన్య' 'నిజమహిమా' 'విశేషజ్ఞమ్' 'పరిదేవితమ్' అనే పదాలచేత క్రమంగా శ్లోకంలోని నాలుగు పాదాల తాత్పర్యం వ్యాఖ్యానించబడింది. నన్వితి. దీనికి ప్రమాణం ఏమిటి అని ఆశంకించి తథా చ అని చెపుతున్నాడు. నన్వితి. ఇది ధర్మకీర్తి శ్లోకం అయితే మాత్రం దీని భావం ఇదని ఎందుకు చెప్పాలి అని ఆశంకించుకొని వివాదం లేని (అతనిదేనా కాదా అనే వివాదం లేని) అతని శ్లోకంలోనే ఉన్న ఆతని అభిప్రాయంతో ఈ శ్లోకంలో చెప్పిన అభిప్రాయానికి సంవాదం (కలయిక - ఏకత్వం) చూపుతున్నాడు - సంభావ్యతే ఇతి. దానిని సంపాదించడం మాట అటుంచి దానిని సంపాదించా లనే నిశ్చయం కూడ లేదని (మొదటి పాదం భావం). పరమమైన ఏ అర్థతత్త్వం, కౌస్తుభాదులకంటె కూడ అధికమైనదో అది. 'అలబ్ధసదృశప్రతిగ్రాహకమ్' అనే పదానికి స్వసహజరీతిలో అర్థం చెపుతున్నాడు. అలబ్ధమ్= ప్రయత్నపూర్వకంగా పరీక్షించబడినా కూడ దేనితో సదృశమైనది పొందబడలేదో అట్టి, ప్రతిగ్రాహమ్= ఒక్కొక్క గ్రాహం, అనగా జలచరప్రాణి ఐరావతం, ఉచ్చైఃశ్రవస్సు, ధన్వంతరి వంటిది దేనియందో అది అని సముద్రపక్షంలో అర్థం.

ఏవంవిధ ఇతి: పరిదేవితవిషయం అని అర్థం. ఈ (ఇంతవరకు చెప్పిన) అర్థంలో (ఈ రెండు శ్లోకాలలో వరసగా) అప్రస్తుతప్రశంస, ఉపమాలంకారం రెండూ ఉన్నాయి. తరవాత స్వాత్మయందు అనగా ఈ శ్లోకాలను రచించిన ధర్మకీర్తియందు, ఆశ్చర్యానికి స్థానం అవడం అనేది ఉండడంవల్ల అద్భుతరసంలో విశ్రాంతి. ధర్మకీర్తి యొక్క గొప్పతనం విషయంలో విస్మయం కలగడంవల్ల శ్రోతలకు అద్భుతరసానుభూతి కలుగుతుంది అని అర్థం. ఇది మొదటి శ్లోకంలో. ఇంక రెండవ శ్లోకంలో ఇతరులైన శ్రోతలకు, అత్యాదరానికి స్థానం అవడంచేత, ప్రయత్నపూర్వకంగా తెలుసుకొనవలసినది అవడంచేత దీని విషయంలో (అతడు స్థాపించిన మతం విషయంలో) ఉత్సాహం కలిగించడంచేత, నాచేత ఈ విధమైన, అత్యంతము గ్రాహ్యమైన, కొంతమంది యోగ్యత గల జనులకే అనుగ్రాహకమైన మతం నిర్మించబడింది అని తాను గొప్ప నేర్పుతో కూడిన పనిని చేసినట్లు చూపడంచేత, ధర్మవీరస్పర్శ ఉండడంచేత వీరరసంలో విశ్రాంతి అని కూడ గ్రహించవలెను. ఈ విధమైన అద్భుతవిశ్రాంతి, వీరవిశ్రాంతి లేకపోతే పరిదేవితమాత్రంచేత ఏమి చేసినట్లవుతుంది? తాను సరిగ్గా ఆలోచించకుండా చేసినట్లు చెప్పబడింది అన్నట్లయితే దానివల్ల ప్రయోజనం ఏమిటి? దీనివల్ల స్వార్థమూ

లేదు పరార్థమూ లేదు కదా. ఇంక అధిక చర్చ చాలును. (ఏదో విధంగా రసంతో ముడిపెట్టే విధానం ఇది)

## ధ్వన్యాలోకం

అప్రస్తుతప్రశంసాయాం చ యద్వాచ్యం తస్య కదాచిద్వివక్షితత్వమ్, కదాచిదవివక్షితత్వమ్, కదాచిద్వివక్షితావివక్షితత్వమితి త్రయీ బన్ధచ్ఛాయా. తత్ర వివక్షితత్వం యథా -

శ్లో. పరార్థే యః పీడామనుభవతి భఙ్గేఽపి మధురో
యదీయః సర్వేషామిహ ఖలు వికారోఽప్యభిమతః,
న సంప్రాప్తో వృద్ధిం యది స భృశమక్షేత్రపతితః
కిమిక్షోర్దోషోఽసౌ న పునరగుణాయా మరుభువః. (116)

యథా వా మమైవ -

శ్లో. అమీ యే దృశ్యన్తే నను సుభగరూపాః సఫలతా
భవత్యేషాం యస్య క్షణముపగతానాం విషయతామ్,
నిరాలోకే లోకే కథమిదమహో చక్షురధునా
సమం జాతం సర్వైర్న సమమథవాన్యైరవయవైః. (117)

అనయోర్హి ద్వయోః శ్లోకయోః ఇక్షుచక్షుషీ వివక్షితస్వరూపే ఏవ న చ ప్రస్తుతే. మహాగుణస్య అవిషయపతితత్వాదప్రాప్తపరభాగస్య కస్యచిత్ స్వరూపముపవర్ణయితుం ద్వయోరపి శ్లోకయోస్తాత్పర్యేణ ప్రస్తుతత్వాత్.

### బాలానందిని

అప్రస్తుతేతి:- అప్రస్తుతప్రశంసలో వాచ్యం ఒకప్పుడు వివక్షితం (చెప్పడానికి ఇచ్ఛయించబడినది) కావచ్చు, ఒకప్పుడు అవివక్షితం కావచ్చు, ఒకప్పుడు వివక్షితమూ అవివక్షితమూ కూడ కావచ్చు. ఈ విధంగా (అప్రస్తుతప్రశంసలో) వాచ్యార్థనిబంధచ్ఛాయ మూడు విధాలు. వాటిలో వాచ్యం వివక్షితం అవడానికి ఉదాహరణం ఎట్లనగా- పరార్థే

ఇతి. భఙ్గేఽపి= విరచినప్పుడు కూడ, మధురః= మధురమైన, యః= ఏది, పరార్థే= పరులకొరకై, పీడామ్= పీడను, అనుభవతి= అనుభవించునో, యదీయః= దేని సంబంధమైన, వికారోఽపి= వికారం కూడ, దాని మార్పులైన గుడాదులు కూడ, ఇహ = ఇక్కడ, సర్వేషామ్= అందరికీ, అభిమతః= ఇష్టమో, సః= అట్టి చెరుకు, అక్షేత్ర పతితః= తగని పొలంలో పడినదై, భృశమ్= మిక్కిలి, వృద్ధిమ్= వృద్ధిని, న సంప్రాప్తః యది= పొందకపోయినచో, అసౌ= అది, ఇక్షోః= చెరకుయొక్క, దోషః కిమ్= దోషమా, పునః= కాని, అగుణాయాః= గుణాలు లేని, మరుభువః= మరుభూమియొక్క దోషం కాదా?

యథా వా ఇతి:- మరొక ఉదాహరణం నా శ్లోకమే ఎట్లనగా -

అమీ ఇతి :- సుభగరూపాః= సుందరమైన రూపం గల, అమీ= ఈ, యే భావాః= ఏ పదార్థాలు, దృశ్యన్తే= కనబడుచున్నవో, క్షణమ్= క్షణకాలం, యస్య= దేనికి (ఏ నేత్రానికి), విషయతామ్= విషయత్వాన్ని, ఉపగతానామ్= పొందిన, ఏషామ్= వీటికి, సఫలతా= సఫలత్వం, భవతి నను= కలుగునో, ఇదం చక్షుః= అట్టి ఈ నేత్రం, అధునా= ఇప్పుడు, లోకే= లోకం, నిరాలోకే= వెలుతురు లేనిది అగుచుండగా, సర్వైః= సమస్తమైన, అన్యైః= ఇతరములైన, అవయవైః= కరచరణాద్యవయవాలతో, సమం జాతమ్= సమం అయిపోయింది; అథవా= లేదా, న జాతమ్= కాలేదు.

అనయోః ఇతి. ఈ రెండు శ్లోకాలలో చెరకుకఱ్ఱ నేత్రమూ కూడ వివక్షితమైన స్వరూపం గలవే; కాని ప్రస్తుతాలు కావు. ఈ రెండు శ్లోకాలూ కూడ, తగని స్థానంలో పడిపోవడంచేత పొందబడని కీర్త్యాద్యాధిక్యం గల ఒకానొక మహాగుణవంతుని స్వరూపం తాత్పర్యంతో వర్ణించడానికి ప్రస్తుతాలైనవి.

## లోచనం

నను యథాస్థితస్యార్థస్యాసఙ్గతౌ భవత్యప్రస్తుతప్రశంసా, ఇహ తు సంగతిరస్త్యేవేత్యాశఙ్క్య సంగతావపి భవత్యేషైవేతి దర్శయితుముపక్రమతే. అప్రస్తుతేతి. నన్వితి. యైరిదం జగద్భూషితమిత్యర్థః. యస్య చక్షుషో విషయతాం క్షణం గతానామేషాం సఫలతా భవతి తదిదం చక్షురితి సంబన్ధః. ఆలోకో వివేకోఽపి. న సమమితి. హస్తౌ హి పరస్పర్శాదానాదావప్యుపయోగీ. అవయవైరితి. అతితుచ్ఛప్రాయైరిత్యర్థః. అప్రాప్తః పరః భాగః అర్థలాభాత్మకః స్వరూపప్రథనలక్షణో వా యేన తస్య.

బాలానందిని

నన్వితి (ఆశంక) ఉన్న అర్థం కుదరకపోతే అప్రస్తుతప్రశంస అయితే కావచ్చు. ఇక్కడైతే అర్థానికి సంగతి (కుదరడం) ఉంది కదా అని ఆశంకించుకొని అర్థసంగతి ఉన్నా కూడ ఇదే అవుతుంది అని చెపుతున్నాడు - అప్రస్తుతేతి. నన్వితి. వేటిచేత ఈ జగత్తు అలంకరించబడినదో అని అర్థం. క్షణకాలంపాటు ఏ నేత్రానికి విషయమైన వీటికి సఫలత్వం కలుగుతుందో అట్టి ఈ నేత్రం అని సంబంధం (అన్వయం). ఆలోకః అనగా వివేకం అని కూడా అర్థం. న సమమితి. హస్తం. ఇతరవస్తువులను స్పృశించడం, గ్రహించడం మొదలైనవాటికి ఉపయోగిస్తుంది కదా? అవయవైరితి. చాలా తుచ్ఛములు వంటివి అని అర్థం. అప్రాప్తః= పొందబడని, పరః= ఉత్కృష్టమైన, భాగః= ధనలాభాత్మకమైన భాగం లేదా స్వరూపం ప్రసిద్ధి చెందడం అనే భాగం. దేనిచేతనో అది అప్రాప్తపరభాగం (పరభాగశబ్దానికి ఉత్కర్ష అని అర్థం).

ధ్వన్యాలోకం

అవివక్షితత్వం యథా -

శ్లో. కస్త్వం భోః కథయామి దైవహతకం మాం విద్ధి శాఖోటకం
వైరాగ్యాదివ వక్షి సాధు విదితం, కస్మాదిదం, కథ్యతే,
వామేనాత్ర వటస్తమధ్వగజనః సర్వాత్మనా సేవతే
న చ్ఛాయాపి పరోపకారకరిణీ మార్గస్థితస్యాపి మే. (118)

న హి వృక్షవిశేషేణ సహ ఉక్తిప్రత్యుక్తీ సంభవత ఇతి అవివక్షితాభిధేయేనైవ అనేన శ్లోకేన సమృద్ధాసత్పురుషసమీపవర్తినః నిర్ధనస్య కస్యచిన్మనస్వినః పరిదేవితం తాత్పర్యేణ వాక్యార్థీకృతమితి ప్రతీయతే.

వివక్షితావివక్షితత్వం యథా -

గాథ. ఉప్పహజాఆఏం అసోహిణీఏం ఫలకుసుమపత్తరహిఆఏ,
వేరీఏం వఇం దేన్తో పామర హో ఓహసిజ్జహసి. (119)

లోచనం

కథయామీత్యాది ప్రత్యుక్తిః. అనేన పదేన ఇదమాహ - అకథనీయమేతత్; శ్రూయమాణం హి నిర్వేదాయ భవతి. తథాపి తు యది నిర్బన్ధః తత్ కథయామి. వైరాగ్యాదితి. కాక్వా దైవహతకమిత్యాదినా చ సూచితం తే వైరాగ్యమితి యావత్. సాధువిదిత మిత్యుత్తరమ్. కస్మాదితి. వైరాగ్యే హేతు ప్రశ్నః. ఇదం కథ్యతే ఇత్యాది సనిర్వేదోపక్రమం కథం కథమపి నిరూపిణీయతయా ఉత్తరమ్. వామేనేతి అనుచితేన కులాదినా ఉపలక్షిత ఇత్యర్థః. వట ఇతి - ఛాయామాత్రకరణాదేవ ఫలదానాదిశూన్యాత్ ఉద్ధురకన్ధర ఇత్యర్థః. ఛాయాపీతి. శాఖోటకోహి శ్మశానాగ్నిజ్వాలాలీఢలతాపల్లవాదిస్తరువిశేషః. అత్రావివక్షాయాం హేతుమాహ - న హీతి. సమృద్ధః యః అసత్పురుషః- "సమృద్ధ సత్పురుష" ఇతి పాఠే సమృద్ధేన బుద్ధిమాత్రేణ సత్పురుషః న తు గుణాదినేతి వ్యాఖ్యేయమ్. నాత్యన్తమితి - వాచ్యభావనియమో నాస్తి, నాస్తీతి న శక్యం వక్తుమ్. వ్యఙ్గ్యస్యాపి భావాదితి తాత్పర్యమ్. తథాహి - ఉత్పథజాతాయా ఇతి. న తథా కులోద్భూతాయాః. అశోభనాయా ఇతి - లావణ్యరహితాయాః ఫలకుసుమ పత్రరహితాయా ఇతి. ఏవంభూతాపి కాచిత్పుత్రిణీ వా భ్రాత్రాదిపక్షపరిపూర్ణతయా సంబన్ధివర్గపోషితా వా పరిరక్ష్యతే, బదర్యాః వృత్తిం దదత్ పామర భోః హసిష్యసే సర్వలోకైరితి భావః ఏవమప్రస్తుతప్రశంసాం ప్రసంగతో నిరూప్య ప్రకృతమేవ యన్నిరూపణీయం తదుపసంహరతి - తస్మాదితి. అప్రస్తుతప్రశంసాయామపి లావణ్యేత్యత్ర శ్లోకే యస్మాత్ వ్యామోహః లోకస్య దృష్టః తతో హేతోరిత్యర్థః. 40

బాలానందిని

'కథయామి' ఇత్యాదికం ప్రతివచనం. ఈ పదంచేత ఈ విషయం చెపుతున్నాడు - ఇది చెప్పదగిన విషయం కాదు; ఇది వింటే నిర్వేదం కలుగుతుంది. అయినా నువ్వు నిర్బంధం చేస్తే చెపుతాను. వైరాగ్యాదితి. కాకుస్వరంచేత, 'దైవహతకమ్' ఇత్యాదికంచేతా నీ వైరాగ్యం సూచించబడింది అని భావం. సాధు విదితమ్ అనేది ప్రత్యుత్తరం. కస్మాత్ అనేది వైరాగ్యానికి హేతువును గూర్చిన ప్రశ్న. ఇదం కథ్యతే ఇత్యాదికం నిర్వేదంతో

"ఉత్పథజాతాయా అశోభనాయాః ఫలకుసుమపత్రరహితాయాః
బదర్యా వృతిం దదత్ పామర భో అవహసిష్యసే"
(ఇతి చ్ఛాయా)

అత్ర హి వాచ్యార్థో నాత్యన్తం సంభవీ న చాసంభవీ. తస్మాద్వాచ్యవ్యఙ్గ్యయోః ప్రాధాన్యాప్రాధాన్యే యత్నతో నిరూపణీయే.

బాలానందిని

అవివక్షితత్వమితి. వాచ్యార్థానికి అవివక్షితత్వం ఎట్లనగా-

క ఇతి :- భోః= ఓయీ! త్వమ్= నువ్వు, కః= ఎవడవు? కథయామి= చెపుతున్నాను. మామ్= నన్ను, దైవహతకమ్= దైవోపహతుడనైన, శాఖోటకమ్= శాఖోటకవృక్షమునుగా, భూతాలు నివసించే ఒక వృక్షం అని కొందరు. ఎక్కువ నీడ ఉండని (హిందీలో 'సాహోర్') అనే పేరుగల) చిన్న చెట్టు అని కొందరు. మరొక విధంగా లోచనకారుడు. విద్ధి= తెలుసుకొనుము. వైరాగ్యాదివ= వైరాగ్యంవలన వలె, ఏదో నిరాశతో వలె, వక్షి= మాటలాడుతున్నావే? సాధు= బాగా, విదితమ్= తెలియబడినది. కస్మాత్= ఎందువల్ల? ఇదం కథ్యతే= ఇదిగో చెప్పబడుతూన్నది. అత్ర= ఇక్కడ, వామేన= ఎడమ ప్రక్క, వటః= మఱ్ఱిచెట్టు ఉంది. అధ్వగజనః= బాటసారుల సముదాయం, తమ్= దానిని, సర్వాత్మనా= అన్ని విధాలా, సేవతే= సేవిస్తూన్నది. మార్గస్థితస్యాపి= మార్గంలోనే ఉన్న, మే= నాయొక్క, ఛాయాపి= నీడ కూడ, పరోపకారకరణే= పరోపకారం చేయడంలో, న= ఉపయుక్తం కాదు.

న హీతి. చెట్టుతో ఉక్తి - ప్రత్యుక్తులు సంభవించేవి కాదు గాన వివక్షితం కాని వాచ్యార్థం గలదే అయిన ఈ శ్లోకంచేత సమృద్ధుడైన ఒక అసత్పురుషుని సమీపంలోనే ఉన్న, ఆత్మాభిమానవంతుడైన ఒక నిర్ధనుని పరిదేవితం (శోకభరితవచనం) తాత్పర్యంచేత వాక్యార్థంగా చేయబడింది అని ప్రతీయమానం (గమ్యం) అవుతున్నది.

వివక్షితేతి. వివక్షితత్వావివక్షితత్వం ఎట్లనగా-

ఉత్పథేతి:- ''ఓ! అమాయకుడా! చెడ్డదారిలో పుట్టినదీ, ఫలాలు కాని, పుష్పాలు కాని, ఆకులు కాని లేనిదీ అయిన ఈ రేగిచెట్టుకు కంచె వేస్తున్న నువ్వు (అందరిచేత) పరిహసించబడతావు''

అత్ర హీతి. ఇక్కడ వాచ్యార్థం పూర్తిగా సంభవి కాదు; అసంభవి కూడ కాదు. అందువల్ల వాచ్యవ్యంగ్యాల ప్రాధాన్యాప్రాధాన్యాలను ప్రయత్నంచేత గుర్తించాలి.

లోచనం

కథయామీత్యాది ప్రత్యుక్తిః. అనేన పదేన ఇదమాహ - అకథనీయమేతత్; శ్రూయమాణం హి నిర్వేదాయ భవతి. తథాపి తు యది నిర్బన్ధః తత్ కథయామి. వైరాగ్యాదితి. కాక్వా దైవహతకమిత్యాదినా చ సూచితం తే వైరాగ్యమితి యావత్. సాధువిదిత మిత్యుత్తరమ్. కస్మాదితి. వైరాగ్యే హేతు ప్రశ్నః. ఇదం కథ్యతే ఇత్యాది సనిర్వేదోపక్రమం కథం కథమపి నిరూపిణీయతయా ఉత్తరమ్. వామేనేతి అనుచితేన కులాదినా ఉపలక్షిత ఇత్యర్థః. వట ఇతి - ఛాయామాత్రకరణాదేవ ఫలదానాదిశూన్యాత్ ఉద్ధురకన్ధర ఇత్యర్థః. ఛాయాపీతి. శాఖోటకో హి శ్మశానాగ్నిజ్వాలాలీఢలతాపల్లవాది స్తరువిశేషః. అత్రావివక్షాయాం హేతుమాహ - న హీతి. సమృద్ధః యః అసత్పురుషః- "సమృద్ధ సత్పురుష" ఇతి పాఠే సమృద్ధేన బుద్ధిమాత్రేణ సత్పురుషః న తు గుణాదినేతి వ్యాఖ్యేయమ్. నాత్యన్తమితి - వాచ్యభావనియమో నాస్తి, నాస్తీతి న శక్యం వక్తుమ్. వ్యఙ్గ్యస్యాపి భావాదితి తాత్పర్యమ్. తథాహి - ఉత్పథజాతాయా ఇతి. న తథా కులోద్భూతాయాః. అశోభనాయా ఇతి - లావణ్యరహితాయాః ఫలకుసుమ పత్రరహితాయా ఇతి. ఏవంభూతాపి కాచిత్పుత్రిణీ వా భ్రాత్రాదిపక్షపరిపూర్ణతయా సంబన్ధివర్గపోషితా వా పరిరక్ష్యతే, బదర్యాః వృత్తిం దదత్ పామర భోః హసిష్యసే సర్వలోకైరితి భావః ఏవమప్రస్తుతప్రశంసాం ప్రసంగతో నిరూప్య ప్రకృతమేవ యన్నిరూపణీయం తదుపసంహరతి - తస్మాదితి. అప్రస్తుతప్రశంసాయామపి లావణ్యేత్యత్ర శ్లోకే యస్మాత్ వ్యామోహః లోకస్య దృష్టః తతో హేతోరిత్యర్థః. 40

బాలానందిని

'కథయామి' ఇత్యాదికం ప్రతివచనం. ఈ పదంచేత ఈ విషయం చెపుతున్నాడు - ఇది చెప్పదగిన విషయం కాదు; ఇది వింటే నిర్వేదం కలుగుతుంది. అయినా నువ్వు నిర్బంధం చేస్తే చెపుతాను. వైరాగ్యాదితి. కాకుస్వరంచేత, 'దైవహతకమ్' ఇత్యాదికంచేతా నీ వైరాగ్యం సూచించబడింది అని భావం. సాధు విదితమ్ అనేది ప్రత్యుత్తరం. కస్మాత్ అనేది వైరాగ్యానికి హేతువును గూర్చిన ప్రశ్న. ఇదం కథ్యతే ఇత్యాదికం నిర్వేదంతో

స్మరిస్తూ ఉపక్రమించిన, ఏదో విధంగా చెప్పాలి కదా అనే అభిప్రాయంతో చెప్పిన ప్రత్యుత్తరం. వామేన ఇతి (వ్యంగ్యార్థంలో) అనుచితకులాదికంతో కూడినవాడు అని అర్థం. వట ఇతి - ఫలాదు లేవీ ఇవ్వకుండా కేవలం నీడ ఇచ్చినంతమాత్రంచేత మెడ పైకి ఎత్తుకొని ఉన్నవాడు, విఱ్ఱవీగుతున్నవాడు అని అర్థం. ఛాయాపీతి. శాఖోటకం అనగా శ్మశానంలోని అగ్నిజ్వాలలచేత నాకివేయబడిన (మాడ్చివేయబడిన) లతాపల్లవాదులు గల ఒక చెట్టు. ఈ శ్లోకంలో వాచ్యం వివక్షితం కాకపోవడానికి హేతువును చెపుతున్నాడు - న హీతి. సమృద్ధుడైన ఏ అసత్పురుషుడో అని అర్థం. 'సమృద్ధసత్పురుష'' అనే పాఠంలో - సమృద్ధేన= ఐశ్వర్యంమాత్రంచేతనే సత్పురుషుడు, అంతే కాని గుణాదులచేత కాదు అని వ్యాఖ్యానం చెయ్యాలి.

వివరణ:- నిజానికి 'సమృద్ధసత్పురుష' అనే పాఠమే యుక్తంగా ఉంది. మొదటి పాఠంలో మనస్వి అని చెప్పుకొనే ఈ నిర్ధనునికి అసూయ కూడ ఉన్నట్లు కనబడుతుంది. '' ఆ ధనికుడు అన్ని విధాల అందరికీ ఉపకారం చేస్తున్నాడు. అలా పరోపకారం చేసే అదృష్టం నాకు లేదు కదా!'' అని కదా ఇతని నిర్వేదం ?

నాత్యన్తమితి. వాచ్యత్వనియమం లేదు; లేదని చెప్పడానికీ శక్యం కాదు; కారణం ఏమనగా- ఇక్కడ ఒక వ్యంగ్యార్థం కూడ ఉంది. (ఇలాంటి చెట్టుకి చుట్టూ ముళ్లకంచె వేసి రక్షించడానికి ప్రయత్నించే ప్రబుద్ధుడు కూడ ఉండడానికి అవకాశం లేకపోలేదు గాన "న చ అసంభవీ'' అని చెప్పబడింది అని గ్రహిస్తే బాగుంటుంది). ఆ వ్యంగ్యార్థం ఎట్లనగా (తథాహి)- ఉత్పథజాతాయాః అనడంచేత అలాంటి సత్కులంలో పుట్టినది కాదు అని, అశోభనాయాః అనడంచేత లావణ్యశూన్యురాలనీ, ఫలకుసుమపత్రరహితాయాః అనడంచేత- ఒక స్త్రీ ఇలాంటి దైనా కూడ పుత్రవతి యైనా, సోదరులు మొదలైనవాళ్లపక్షం అధికంగా ఉండడంచేత బంధువర్గంచేత పోషించబడవచ్చును అని (వ్యంగ్యార్థం). రేగిచెట్టుకు కట్టవ వేస్తూన్న ఓ! అమాయకుడా! నిన్ను అందరూ పరిహసిస్తారు అని భావం. ఏవమితి- ఈ విధంగా ప్రసంగవశంచేత అప్రస్తుతప్రశంసను నిరూపించి, ప్రకృతమైన ఏ విషయం నిరూపించవలసి ఉన్నదో దానిని ఉపసంహరిస్తున్నాడు - తస్మాదితి. లావణ్యేత్యాది శ్లోకంలోని అప్రస్తుతప్రశంస విషయంలో లోకానికి వ్యామోహం ఉన్నట్లు కనబడుతూన్నది గాన, ఆ కారణంవల్ల అని అర్థం. 40

## ధ్వన్యాలోకం

కా. ప్రధానగుణభావాభ్యాం వ్యఙ్గ్యస్యైవం వ్యవస్థితే,
కావ్యే ఉభే తతోఽన్యద్యచ్చిత్రమిత్యభిధీయతే. 41
చిత్రం శబ్దార్థభేదేన ద్వివిధం చ వ్యవస్థితమ్,
తత్ర కించిచ్ఛబ్దచిత్రం వాచ్యచిత్రమతః పరమ్. 42

వ్యఙ్గ్యస్యార్థస్య ప్రాధాన్యే ధ్వనిసంజ్ఞితకావ్యప్రకారః, గుణభావే తు గుణీభూతవ్యఙ్గ్యతా. తతోఽన్యద్రసభావాదితాత్పర్యరహితం వ్యఙ్గ్యార్థప్రకాశనశక్తిశూన్యం చ కావ్యం కేవలవాచ్యవాచకవైచిత్ర్యమాత్రాశ్రయేణ ఉపనిబద్ధమ్, ఆలేఖ్యప్రఖ్యం యదాభాసతే తచ్చిత్రమ్. న తన్ముఖ్యం కావ్యమ్. కావ్యానుకారో హ్యసౌ. తత్ర కించిచ్ఛబ్దచిత్రం యథా దుష్కరయమకాది. వాచ్యచిత్రం తతః శబ్దచిత్రాదన్యత్ వ్యఙ్గ్యార్థసంస్పర్శరహితం ప్రాధాన్యేన వాక్యార్థతయా స్థితం రసాదితాత్పర్యరహితముత్ప్రేక్షాది.

### బాలానందిని

ప్రధానేతి: ఏవమ్= ఈ విధంగా, వ్యఙ్గ్యస్య=వ్యంగ్యం యొక్క, ప్రధానగుణభావాభ్యామ్=ప్రాధాన్యాప్రాధాన్యాలచేత, ఉభే=రెండు విధాలైన, కావ్యే=కావ్యాలు, వ్యవస్థితే=వేరువేరుగా నిశ్చితరూపంలో ఉన్నాయి. యత్=ఏది, తతః=దానికంటె, అన్యత్=భిన్నమైనదో, తత్=అది, చిత్రమ్=చిత్రకావ్య మని, అభిధీయతే=చెప్పబడుతున్నది. 41

చిత్రమితి. చిత్రమ్=చిత్రకావ్యం, శబ్దార్థభేదేన=శబ్దార్థాల భేదంచేత, ద్వివిధమ్= రెండు విధాలుగా, వ్యవస్థితమ్=ఉన్నది. తత్ర=వాటిలో, కించిత్=ఒకటి, శబ్దచిత్రమ్= శబ్దచిత్రం; అతః పరమ్=దాని తరవాతది, వాచ్యచిత్రమ్=వాచ్యచిత్రం. 42

వ్యఙ్గ్యస్యేతి : - వ్యంగ్యమైన అర్థానికి ప్రాధాన్యం ఉన్నప్పుడు ధ్వని అనే పేరు గల కావ్యప్రకారం. దానికి అప్రాధాన్యం అయితే అది గుణీభూతవ్యంగ్యం అనే కావ్యప్రకారం. ఈ రెండింటికంటె భిన్నమైనది, రసభావాదులయందు తాత్పర్యం

లేనిదీ, వ్యంగ్యార్థవిశేషాన్ని ప్రకాశింపచేసే శక్తిలేనిదీ అయిన ఏ కావ్యం కేవలం వాచ్యవాచకాల వైచిత్ర్యాన్నిమాత్రమే ఆశ్రయించి నిర్మించబడినదై చిత్తరువు వలె భాసిస్తుందో అది చిత్రకావ్యం. అది ముఖ్యమైన కావ్యం కాదు. అది కేవలం కావ్యానుకరణమాత్రమే. దానిలో ఒకటి శబ్దచిత్రం; ఉదాహరణకి దుష్కర్మయమకాదికం. ఆ శబ్దచిత్రంకంటె భిన్నమైనదీ, వ్యంగ్యార్థస్పర్శ లేనిదీ, రసాదులందు తాత్పర్యం లేనిదీ, అయిన ప్రధానవాక్యార్థంగా ఉన్న ఉత్ప్రేక్షాదికం వాచ్యచిత్రం.

లోచనం

ఏవం వ్యఙ్గ్యస్వరూపం నిరూప్య సర్వథా యత్ తచ్ఛూన్యం తత్ర కా వార్తేతి నిరూపయితుమాహ - ప్రధానేత్యాదినా కారికాద్వయేన. శబ్దచిత్రమితి. యమకచక్రబన్ధాది చిత్రతయా ప్రసిద్ధమేవ. తత్తుల్యమేవ అర్థచిత్రం మన్తవ్యమితి భావః. ఆలేఖ్యప్రఖ్యమితి: రసాదిజీవితరహితం ముఖ్యప్రతికృతిరూపం చేత్యర్థః.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా వ్యంగ్యస్వరూపం నిరూపించి దేనిలో ఏ మాత్రమూ ఆ వ్యంగ్యం ఉండదో దాని విషయం (వార్తా) ఏమిటి అని నిరూపించడానికి ప్రధానేత్యాదికారికాద్వయంచేత చెపుతున్నాడు. శబ్దచిత్రమితి - యమక చక్రబంధాదికం చిత్రం అనే మాట ప్రసిద్ధమే. అర్థచిత్రం కూడా అలాంటిదే అని గ్రహించాలి అని భావం. ఆలేఖ్యప్రఖ్యమితి. రసాదికమైన ప్రాణం (జీవం) లేనిది ముఖ్యమైన ధ్వనికావ్యంయొక్క ప్రతికృతి (చిత్తరువు) వంటిది అని అర్థం.

ధ్వన్యాలోకం

అథ కిమిదం చిత్రం నామ? యత్ర న ప్రతీయమానార్థసంస్పర్శః. ప్రతీయమానో హ్యర్థః త్రిభేదః ప్రాక్ ప్రదర్శితః. తత్ర యత్ర వస్తు, అలంకారాన్తరం వా వ్యఙ్గ్యం నాస్తి స నామ కల్ప్యతాం చిత్రస్య విషయః. యత్ర తు రసాదీనామవిషయత్వం స కావ్యప్రకారః న సంభవత్యేవ, యస్మాదవస్తుసంస్పర్శితా కావ్యస్య నోపపద్యతే. వస్తు చ సర్వమేవ జగద్గతమ్ అవశ్యం కస్య చిద్రసస్య భావస్య వా

అఙ్గత్వం ప్రతిపద్యతే, అన్తతో విభావత్వేన. చిత్తవృత్తివిశేషా హి రసాదయః, న చ తదస్తి వస్తు కించిత్ యన్న చిత్తవృత్తివిశేషముప జనయతి తదనుత్పాదనే. వా కవివిషయతైవ తస్య న స్యాత్. కవివిషయశ్చ చిత్రతయా కశ్చిన్నిరూప్యతే.

బాలానందిని

అథేతి. (ప్రశ్న) సరే; ఈ చిత్రం అంటే ఏమిటి (సమాధానం) - ఎక్కడైతే వ్యంగ్యార్థసంస్పర్శ ఉండదో అది చిత్రం. ఇప్పుడు పూర్వపక్షి అంటున్నాడు - ప్రతీయమాన ఇతి. వెనుక మూడు విధాలైన ప్రతీయమానార్థం చూపబడింది కదా? ఆ మూడింటిలో వ్యంగ్యం అయిన వస్తువు కాని, మరొక అలంకారం గాని ఎక్కడ లేదో అది చిత్రానికి విషయంగా కల్పించబడుగాక. అనగా వస్తువ్యంజనం గాని అలంకారవ్యంజనం గాని లేనిదానికి 'చిత్రం' అని పేరు పెడితే పెట్టండి. కాని రసాదులకు విషయం కాని (రసాదులలో ఏదో ఒకటి ఉండని) కావ్యప్రకారమే సంభావ్యం కాదు. ఎందువల్ల ననగా కావ్యం ఏదో ఒక వస్తువును స్పృశించకుండా ఉండడానికి వీలులేదు. జగత్తులో ఉన్న ప్రతివస్తువూ కూడ తప్పకుండా ఏదో ఒక రసానికి గాని భావానికి గాని అంగం అయితీరుతుంది. చివరికి విభావంగా అయినా అంగం అవుతుంది. రసాదు లనగా చిత్తవృత్తివిశేషాలే కదా? చిత్తవృత్తివిశేషాన్ని పుట్టించని వస్తువేదీ ఉండదు. చిత్తవృత్తిని పుట్టించకపోతే అది కవివిషయమే కాదు (దానిని కవి పరిగ్రహించనే పరిగ్రహించడు). ఆ విధంగా కవివిషయమైనదానినే ఒక విధమైనదానిని (మీరు) 'చిత్రం' అని ప్రతిపాదిస్తున్నారు.

లోచనం

అథ కిమిదమితి ఆక్షేపే. వక్ష్యమాణ ఆశయః. అత్రోత్తరమ్-యత్ర నేతి. ఆక్షేప్తా స్వాభిప్రాయం దర్శయతి - ప్రతీయమాన ఇతి. అవస్తుసంస్పర్శితేతి. క చ ట త పా దివన్నిరర్థకత్వం, దశదాడిమాదివదసంబద్ధార్థత్వం వా ఇత్యర్థః. నను మా భూత్కవివిషయ ఇత్యాశఙ్క్యాహ - కవివిషయశ్చేతి. కావ్యరూపతయా యద్యపి న నిర్దిష్టః తథాపి కవిగోచరీకృత ఏవాసౌ వక్తవ్యః. అన్యస్య వాసుకి వృత్తాన్తతుల్యస్య ఇహాభిధానాయోగాత్. కవేశ్చేద్గోచరా నూనమమునా ప్రీతిర్జన యితవ్యా. సా చావశ్యం విభావానుభావవ్యభిచారి పర్యవసాయినీతి భావః.

బాలానందిని

అథేతి. అథ కిమిదమ్ అనేది ఆక్షేపార్థకం. (చెప్పినవిషయాన్ని గూర్చి సందేహం వెలిబుచ్చుతూ ప్రశ్నించడం ఆక్షేపం). ముందు చెప్పబడబోయేది ఆక్షేప్తయొక్క ఆశయం. దీనికి సమాధానం - యత్ర నేతి. ఆక్షేప్త తన అభిప్రాయాన్ని విశదీకరిస్తున్నాడు- ప్రతీయమాన ఇతి. (వస్తుసంస్పర్శిత్వం లేకపోతే) అది 'క చ ట త ప' ఇత్యాదుల వలె అర్థరహితమైనా అవుతుంది, దశదాడిమాదివాక్యం వలె అసంబద్ధమైన అర్థం కలదైనా అవుతుంది. ("దశదాడిమాని" "షడపూపాః" పది దానిమ్మపళ్లు, ఆరు అప్పాలుఇత్యాది పదాలకి అర్థం ఉన్నా ఆ చెప్పే మాటలకి పరస్పరసంబంధం ఏదీ లేదు. ఇలాంటివి అప్రమాణాలు అని చెప్పడానికి 'దశదాడిమాదివాక్యాలవలె' అని శాస్త్రకారులు ఉదాహరిస్తూంటారు. ఈ విషయం వెనక కూడా చెప్పబడింది.)

నన్వితి. కవివిషయం కాకపోతే కాకపోనీ అని ఆశంకించి చెపుతున్నాడు - కవి విషయశ్చేతి. కావ్యరూపంగా (ఇది కావ్యమే అని) మీచేత చెప్పబడకపోయినా ఇది కవి గోచరీకృతమే (కవిచేత గ్రహించబడినదే) అని చెప్పాలి. వాసుకివృత్తాంతంవంటి మరొకదానిని దేనినీ ఇక్కడ చెప్పడం యుక్తంకాదు కదా? కవికి గోచరం అయితే తప్పక దీనిచేత ఆనందం కలిగించబడాలి. అది (ఆనందం) తప్పక విభావానుభావవ్యభిచారి భావాలలో పర్యవసానం చెందేదిగానే ఉంటుంది.

వివరణ:- ఏదో విషయాన్ని గూర్చి మాటలాడేటప్పుడు దానితో ఏమీ సంబంధం లేని విషయాన్ని తీసికొనివచ్చి చెప్పడం ప్రారంభిస్తే దానికి వాసుకికథ చెప్పడం అని - "రామాయణంలో పిడకల వేట్లాట" అన్నట్లు - లోకోక్తి ఏదో ఉండి ఉంటుంది. అందుచేతనే "వాసుకివృత్తాన్తతుల్యస్య" అని అన్నాడు. రామాయణం ప్రవచనం చేస్తూ అందులో బౌద్ధమతానికి చెందిన త్రిపిటకాల ప్రసంగం తీసికొనిరావడమే 'రామాయణంలో పిటకాల వేట్లాట' 'పిడకలవేట్లాట' అయిందని అంటారు.

ధ్వన్యాలోకం

అత్రోచ్యతే - సత్యం న తాదృక్కావ్యవ్యాపారోఽస్తి యత్ర రసాదీనామప్రతీతిః; కిం తు యదా రసభావాదివివక్షాశూన్యః కవిః శబ్దాలంకారమ్ అర్థాలంకారం వా ఉపనిబధ్నాతి తదా తద్వివక్షా పేక్షయా రసాదిశూన్యతా అర్థస్య పరికల్ప్యతే. వివక్షోపారూఢ ఏవ హి

కావ్యే శబ్దానామర్థః. వాచ్యసామర్థ్యవశేన చ కవివివక్షావిరహేఽపి తథావిధే విషయే రసాదిప్రతీతిర్భవన్తీ పరిదుర్బలా భవతీత్యనేనాపి ప్రకారేణ నీరసత్వం పరికల్ప్య చిత్రవిషయో వ్యవస్థాప్యతే. తదిదముక్తమ్-

"రసభావాదివిషయవివక్షావిరహే సతి,
అలంకారనిబన్ధో యః స చిత్రవిషయో మతః.
రసాదిషు వివక్షా తు స్యాత్తాత్పర్యవతీ యదా,
తదా నాస్త్యేవ తత్కావ్యం ధ్వనేర్యత్ర న గోచరః.

బాలానందిని

అత్రోచ్యతే ఇతి : ఈ విషయంలో (సమాధానం) చెప్పబడుచున్నది - రసాదుల ప్రతీతి ఉండని కావ్యప్రకారం ఉండ దనే విషయం సత్యమే. కాని రసభావాదుల వివక్ష లేని కవి ఎప్పుడు శబ్దాలంకారం గాని, అర్థాలంకారం గాని కూరుస్తాడో అప్పుడు ఆతని వివక్షను పట్టి అర్థం రసాదిశూన్యం అని కల్పించబడుతుంది. ఎందువల్ల ననగా కావ్యంలో వివక్షను అధిష్ఠించినదే (కవిచేత ఏది చెప్పడానికి ఉద్దేశించబడిందో అదే) శబ్దాల అర్థంగా గ్రహించబడుతుంది. అలాంటి ప్రదేశాలలో కవివివక్ష లేకపోయినా కూడ వాచ్యసామర్థ్యవశంచేత రసాదిప్రతీతి కలిగినా కూడ చాల దుర్బలంగా ఉంటుంది; ఈ ప్రకారంచేత కూడ నీరసత్వాన్ని కల్పించి చిత్రకావ్యాల విషయం(స్థానం) నిర్ణయించబడుతుంది. ఈ విషయమే (ఈ క్రింది పరికరశ్లోకాలలో) చెప్పబడింది-

రసేతి. రసభావాదివిషయవివక్షావిరహే సతి= రసభావాదులనుగూర్చిన వివక్ష లేనిదగుచుండగా, యః= ఏ, అలంకారనిబన్ధః= అలంకారాల కూర్పు ఉంటుందో, సః= అది, చిత్రవిషయః= చిత్రకావ్యానికి స్థానంగా, మతః= చెప్పబడింది.

రసాదిష్వితి. తు= కాని, యదా= ఎప్పుడు, వివక్షా= వివక్ష, రసాదిషు= రసాదుల యందు, తాత్పర్యవతీ= తాత్పర్యం కలదో, తదా= అప్పుడు, యత్ర= ఏది, ధ్వనేః= ధ్వనికి, గోచరః న= గోచరం కాదో, తత్ కావ్యమ్= అట్టి కావ్యం, నాస్త్యేవ= లేదు. అప్పుడది ధ్వనికావ్యమే అని భావం.

లోచనం

కిం. త్వితి. "వివక్షా తత్పరత్వేన నాఙ్గిత్వేన కథం చన"ఇత్యాదిరో్యలంకారనివేశనే సమీక్షాప్రకార ఉక్తః తం యదా నానుసరతీత్యర్థః. రసాదిశూన్యతేతి. నైవ తత్ర రసప్రతీతిరస్తి యథా పాకానభిజ్ఞసూదవిరచితే మాంసపాకవిశేషే. నను వస్తుసౌన్దర్యాదవశ్యం భవతి కదాచిత్తథాస్వాదః అకుశలకృతాయామపి శిఖరిణ్యామివేత్యాశఙ్క్యాహ - వాచ్యేత్యాది. అనేనాపీ. పూర్వం సర్వథా తచ్ఛూన్యత్వముక్తమ్, అధునా తు దౌర్బల్యమితి అపి శబ్దస్యార్థః. అజ్ఞకృతాయాం చ శిఖరిణ్యామ్ "అహో!శిఖరిణీ!" ఇతి న తద్జ్ఞానాం చమత్కారః; అపి తు ధధిగుడమరిచం చైతదసమఞ్జసమాయోజితమితి వక్తారో భవన్తి. ఉక్తమితి. మయైవేత్యర్థః. అలఙ్కారాణాం శబ్దార్థగతానాం నిబన్ధ ఇత్యర్థః.

బాలానందిని

కిం త్వితి. అలంకారాలను కూర్చేటప్పుడు ఏ సమీక్ష చేసే ప్రకారం - "వివక్షా' ' ఇత్యాదికారికలో (2.18) చెప్పబడిందో దానిని ఎప్పుడు అనుసరించడో అప్పుడు అని అర్థం. రసాదిశూన్యతేతి. వంట చేతకాని వంటవాడు వండిన మాంసపాకవిశేషంలో వలె దానిలో రసప్రతీతి ఉండదు. (బహుశా ఈ విషయం విప్రపండితులలో కాశ్మీరీయులకే తెలియాలి). నన్వితి. అంతగా నేర్పు లేని వాడు తయారుచేసిన శిఖరిణి కూడా రుచిగానే ఉన్నట్లు ఒకప్పుడు వస్తుసౌందర్యాన్ని పట్టి తప్పకుండా రసాస్వాదం కలగవచ్చును కదా అని ఆశంకించుకొని చెపుతున్నాడు - వాచ్యేత్యాది. అనేనాపీతి - వెనక పూర్తిగా రసశూన్యత్వం చెప్పబడింది. ఇప్పుడైతే దానికి దౌర్బల్యం చెప్పబడింది అని 'అపి' శబ్దార్థం. చేతకానివాడు తయారుచేసిన శిఖరిణి విషయంలో కూడ దాని అసలు రుచి తెలిసినవాళ్లు "ఆహా!శిఖరిణి ఎంత బాగుంది!" అని దానిని తినగానే చమత్కారం ప్రదర్శించరు (మెచ్చరు). మరేమనగా దీనిలో పెరుగు, బెల్లం, మిరియం తగని విధంగానే కూర్చబడింది (సరియైన పాళ్లలో వేయలేదు) అనే అంటారు.

వివరణ:- శిఖరిణి అనేది మహారాష్ట్రులు పెరుగు, చక్కెర లేక బెల్లం, సుగంధద్రవ్యాలు వేసి తయారుచేసే మధురచోష్యం. అయితే దీన్ని వాళ్లు శ్రీఖండ్ అంటారు. ఇది బహుశా కాశ్మీరదేశంలో కూడ పదవ శతాబ్దికే ప్రసిద్ధమై ఉండాలి. దీనిలో

వేసే పదార్థాలు సహజంగా రుచి కలవి అవడంచేత ఎలా చేసినా మామూలు వాళ్లకి బాగున్నట్లే కనబడినా దాని అసలు రుచి తెలిసినవాళ్లు పెదవి విరిచేస్తారు. అదే విధంగా వస్తుసౌందర్యాన్ని పట్టి రసప్రతీతి కలిగినా అది సహృదయులకు చమత్కారభూమి కాదు అని భావం.

ఉక్తమితి. నాచేతనే అని అర్థం. బాలప్రియాకారుడు 'మయా' కు'వృత్తికారేణ' విశేషణం చేర్చి "వృత్తికారేణ మయేత్యర్థః" అని వ్రాశాడు. వృత్తికారుడనైన నేను చెప్పాను అని అర్థం. అలఙ్కారనిబన్ధః అనగా శబ్దార్థగతాలైన అలంకారాల కూర్పు అని అర్థం.

## ధ్వన్యాలోకం

ఏతచ్చ చిత్రం కవీనాం విశృఙ్ఖలగిరాం రసాదితాత్పర్యమనపేక్ష్యైవ కావ్యప్రవృత్తిదర్శనాదస్మాభిః పరికల్పితమ్. ఇదానీంతనానాం తు న్యాయ్యే కావ్యనయవ్యవస్థాపనే క్రియమాణే నాస్త్యేవ ధ్వనివ్యతిరిక్తః కావ్యప్రకారః. యతః పరిపాకవతాం కవీనాం రసాదితాత్పర్యవిరహే వ్యాపార ఏవ న శోభతే. రసాదితాత్పర్యే చ నాస్త్యేవ తద్వస్తు యదభిమతరసాఙ్గతాం నీయమానం న ప్రగుణీభవతి. అచేతనా అపి హి భావాః యథాయథముచితరసవిభావతయా చేతనవృత్తాన్తయోజనయా వా న సన్త్యేవ తే యే యాన్తి న రసాఙ్గతామ్. తథా చేదముచ్యతే-

అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః,
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే.
శృఙ్గారీ చేత్ కవిః కావ్యే జాతం రసమయం జగత్,
స ఏవ వీతరాగశ్చేన్నీరసం సర్వమేవ తత్.
భావానచేతనానపి చేతనవచ్చేతనానచేతనవత్,
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా.

బాలానందిని

ఏతచ్చేతి:- విశృంఖలమైన (అడ్డులేని) వాక్కులు గల కవులు రసాదితాత్పర్యాన్ని అపేక్షించకుండగానే కావ్యరచనకు పూనుకోవడం చూచి మేము చిత్రకావ్యం అనేదాన్ని కల్పించాం. న్యాయసంమతమైన (యుక్తియుక్తమైన) కావ్యమార్గస్థాపన చేయబడుతున్నది గాన ఆధునికకవులకు ధ్వనికంటె భిన్నమైన కావ్యప్రకారం లేనే లేదు - ఉండడానికి అవకాశం లేదు. ఎందువల్ల ననగా - పరిపాకం ఉన్న కవులకు రసాదితాత్పర్యం లేకపోవడంలో వ్యాపారమే శోభించదు. లేదా రసాదితాత్పర్యం లేకపోతే కావ్యరచనా వ్యాపారమే శోభాకరంగా ఉండదు. రసాదితాత్పర్యం ఉందా అప్పుడు అభిమతమైన రసానికి అంగంగా చేయబడి మంచి గుణం కలది కాని వస్తువే లేదు. తగువిధంగా ఉచితమైన రసానికి విభావాలుగా గాని, చేతనవృత్తాంతం కూర్చడం(ఆరోపించడం)చేత గాని రసాంగత్వాన్ని పొందని అచేతనాలైన పదార్థాలు కూడ లేవు. ఈ విషయమే చెప్పబడుతున్నది-

అపారే ఇతి. అపారే= అనంతమైన, కావ్యసంసారే= కావ్యప్రపంచకంలో, ఏకః= ఒక్క, కవిః= కవియే, ప్రజాపతిః= సృష్టికర్త. ఇదం విశ్వమ్= ఈ ప్రపంచం, అస్మై= వీనికి, యథా= ఎట్లు, రోచతే= ఇష్టం అవుతుందో, తథా= అట్లే, పరివర్తతే= మార్పు చెందుతుంది.

శృఙ్గారీతి,. కవిః= కవి, శృఙ్గారీ చేత్= భావుకుడు, సహృదయుడు అయితే, కావ్యే= కావ్యంలో, జగత్= జగత్తు, రసమయమ్= రసమయంగా, జాతమ్= అయినది; అవుతుంది. స ఏవ= అతడే, వీతరాగశ్చేత్= లౌకికవిషయాలలో ఆసక్తి లేని వైరాగ్యవంతుడైతే, లేదా భావుకుడు కాకపోతే, తత్= ఆ కావ్యప్రపంచం, సర్వమేవ= సమస్తమూ కూడ, నీరసమ్= రసవిహీనం అవుతుంది.

భావానితి - సుకవిః= గొప్ప కవి, స్వతన్త్రతయా= స్వతంత్రుడవడంచేత లేదా స్వాతంత్ర్యంతో, అచేతనాన్= అచేతనాలైన, భావానపి= పదార్థాలను కూడ, చేతనవత్= చేతన పదార్థాలను వలె, చేతనాన్= చేతనములను, చైతన్యం ఉన్నవాటిని, అచేతనవత్= అచేతనములను వలె, యథేష్టమ్= తన కిష్టం వచ్చినట్లు, కావ్యే= కావ్యంలో, వ్యవహారయతి= వ్యవహరింపచేస్తాడు.

లోచనం

నను "తచ్చిత్రమభిధీయతే" ఇతి కిమనేనోపదిష్టేన? అకావ్యరూపం హి తదితి కథితమ్. హేయతయా తదుపదిశ్యతే ఇతి చేత్ - ఘటే కృతే కవిర్న

భవతీత్యేతదపి వక్తవ్యమ్ ఇత్యాశఙ్క్య కవిభిః ఖలు తత్ కృతమ్; అతః హేయతయా ఉపదిశ్యతే ఇత్యేతన్నిరూపయతి- ఏతచ్చేత్యాదినా. పరిపాకవతామితి - శబ్దార్థవిషయః, రసౌచిత్యలక్షణః పరిపాకః విద్యతే యేషామ్. "యత్పదాని త్యజన్త్యేవ పరివృత్తిసహిష్ణుతామ్" ఇత్యపి రసౌచిత్యశరణమేవ వక్తవ్యమ్. అన్యథా నిర్హేతుకం తత్. అపార ఇతి - అనాద్యన్త ఇత్యర్థః. యథారుచి పరివృత్తిమాహ - శృఙ్గారీతి. శృఙ్గారోక్తవిభావానుభావవ్యభిచారిచర్వణారూపప్రతీతిమయః; న తు స్త్రీవ్యసనీతి మన్తవ్యమ్. అత ఏవ భరతమునిః - "కవేరన్తర్గతం భావమ్" "కావ్యార్థాన్ భావయతి" ఇత్యాదిషు కవిశబ్దమేవ మూర్ధాభిషిక్తతయా ప్రయుఙ్క్తే. నిరూపితం చైతద్రసనిరూపణావసరే. జగదితి - తద్రసనిమజ్జనాదిత్యర్థః. శృఙ్గారపదం రసోపలక్షణమ్. స ఏవేతి - యావద్రసికో న భవతి తదా పరిదృశ్యమానోఽప్యయం భావవర్గః యద్యపి సుఖదుఃఖ మోహమాధ్యస్థ్య మాత్రం లౌకికం వితరతి, తథాపి కవివర్ణనోపారోహం వినా లోకాతిక్రాన్త రసాస్వాదానుభవం నాధిశేత ఇత్యర్థః.

బాలానందిని

నన్వితి - (ఆశంక) "తచ్చిత్రమభిధీయతే" అని అంటూ చిత్రకావ్యాన్ని గూర్చి ఉపదేశించి ఏమి ప్రయోజనం? అది కావ్యం కాదు అని చెప్పబడింది కదా? అలాంటిదాన్ని విడిచిపెట్టాలి (అలాంటి చిత్రకావ్యరచన చేయగూడదు) అని చెప్పడం కోసం అది ఉపదేశించబడుతున్నది అనడం కూడ యుక్తం కాదు. "కుండ తయారుచేసేవాడు కవి కాడు" అని కూడ చెప్పాలా? అని ఆశంకించుకొని - అది (చిత్రకావ్యం) కవులచేత రచింపబడింది కదా? అందుచేత అది హేయంగా ఉపదేశించబడుతున్నది అనే విషయాన్ని ఏతచ్చ ఇత్యాది గ్రంథంచేత నిరూపిస్తున్నాడు. పరిపాకవతామితి:- శబ్దార్థాల విషయాల రసౌచిత్యరూపమైన పరిపాకం ఎవరికి ఉన్నదో అట్టివాళ్లు, 'యత్పదాని" ఇత్యాదిశ్లోకంలో చెప్పిన పాకానికి కూడా రసౌచిత్యమే శరణం అని చెప్పాలి; అట్లు చెప్పకపోతే దానికి సరియైన హేతువు ఉండదు.

వివరణ:- యత్పదాని త్యజన్త్యేవ పరివృత్తిసహిష్ణుతామ్,
తం శబ్దన్యాసనిష్ణాతాః శబ్దపాకం ప్రచక్షతే.
(వామనుని కావ్యాలంకారసూత్రవృత్తి 1.3.15)

అని పాకానికి లక్షణం చెప్పబడింది. "ఒక శ్లోకంలో ఉపయోగించిన పదాలలో ఒకదానిని తీసివేసి మరొకదానిని దాని స్థానంలో చేర్చడం శక్యం కాని స్థితిని, శబ్దాల బిగింపును, శబ్దాల కూర్పులో నిష్ణాతులైనవారు శబ్దపాకం అని అంటారు" అని దీని అర్థం. ఆ విధంగా శబ్దాల మార్పును (శబ్దపరివృత్తిని) చేయడానికి వీలుండడం వీలు లేకపోవడం అనే విషయాన్ని కూడా రసౌచిత్యాన్ని పట్టి మాత్రమే నిర్ణయించడానికి శక్యం అవుతుంది. అలా కాకపోతే ఆ నిర్ణయం హేతుశూన్యం అవుతుంది. అందుచేతనే "శబ్దార్థవిషయః రసౌచిత్యలక్షణః పరిపాకః"అని చెప్పడం జరిగింది అని భావం.

అపార ఇతి - ఆద్యంతాలు లేనిది అని అర్థం. కవి రుచిని పట్టి ఎలా మారుతుందో చెపుతున్నాడు - శృఙ్గారీతి. 'శృఙ్గారి' అనగా శృంగారానికి చెప్పిన విభావానుభావవ్యభిచారుల చర్వణారూపమైన ప్రతీతితో నిండినవాడు అని అర్థం. అంతే కాని స్త్రీలంపటు డని అనుకొనకూడదు. అందుచేతనే భరతముని "కవేరన్తర్గతం భావమ్" "కావ్యార్థాన్ భావయతి" ఇత్యాదివాక్యాలలో కవిశబ్దాన్నే మూర్ధాభిషిక్తంగా ప్రయోగించాడు. ఈ విషయం రసనిరూపణసమయంలో నిరూపించబడింది.

వివరణ:- పై రెండు వాక్యాలు నాట్యశాస్త్రం సప్తమాధ్యాయంలో ఉన్నాయి.
"వాగఙ్గముఖరాగేణ సత్త్వేనాభినయేన చ,
కవేరన్తర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే". (నా. శా.7.2)

అని పూర్తి శ్లోకం. "కవిహృదయంలో ఒక భావం ఉంటుంది. అది అనాదియైన పూర్వజన్మసంస్కారప్రతిభారూప మైనది. దేశకాలాదిభేదం లేకుండా సర్వ సాధారణీభావంచేత ఆస్వాదించడానికి తగిన చిత్తవృత్తివిశేషమే ఆ భావం. వర్ణనానిపుణుడైన కవిలో ఉండే ఆ భావాన్ని వాక్-అంగ-ముఖరాగాదుల ద్వారా; సాత్త్వికాభినయం ద్వారా భావింప చేసేదే భావం అని ఈ శ్లోకానికి అర్థం.

"వాగఙ్గసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయన్తీతి భావాః" (సప్తమాధ్యాయప్రారంభం) 'కావ్య' శబ్దం 'కు' ధాతువునుండి గాని 'కవ'ధాతునుండి గాని నిష్పన్న మైనది. పదార్థాలకైనా వాక్యార్థాలకైనా చివరికి రసంలోనే పర్యవసానం. అందుచేత కావ్యార్థం అనగా రసమే. "వాచికాంగిక సాత్త్వికాభినయోపేతాలైన ఈ కావ్యార్థాలను భావింపచేసేవి

భావాలు" అని అభినవగుప్తుడు ఈ వాక్యానికి చెప్పిన అర్థం. ఈ విధంగా భరతుడు కవిశబ్దానికి అనగా కవిశబ్దవాచ్యుడైన కవికి చాలా ప్రాధాన్యం ఇచ్చాడు అని అర్థం.

జగదితి - ఆ రసంలో మునిగిపోవడంచేత అని అర్థం. 'శృఙ్గార'పదం ఉపలక్షణచేత ఇతరరసాలను కూడ గ్రహిస్తుంది(అందుచేత 'శృఙ్గారీ' అనగా రసావేశం కలవాడు అని అర్థం) స ఏవేతి. ప్రత్యక్షంగా కనబడే ఈ పదార్థజాతం లౌకికాలైన(త్రిగుణకార్యాలైన) సుఖ-దుఃఖ-మోహాల మధ్య ఉండడాన్ని మాత్రమే ఇస్తున్నా కవి రసికుడు కానంతవరకు, అలాంటి కవియొక్క వర్ణనలో ప్రవేశించనంతవరకు లోకాతిక్రాంత(అలౌకిక) రసాస్వాదభూమిని అధిష్ఠించజాలదు అని అర్థం. (అనగా రసికుడైన కవి తన వర్ణన ద్వారా సర్వసాధారణమైన పదార్థజాతాన్ని కూడ అలౌకికరసాస్వాదస్థానంగా చేస్తాడు అని అర్థం).

## ధ్వన్యాలోకం

తస్మాన్నాస్త్యేవ తద్వస్తు యత్ సర్వాత్మనా రసతాత్పర్యవతః కవేః తదిచ్ఛయా తదభిమతరసాఙ్గతాం న ధత్తే. తథోపనిబధ్యమానం వా న చారుత్వాతిశయం పుష్ణాతి. సర్వమేతచ్చ మహాకవీనాం కావ్యేషు దృశ్యతే. అస్మాభిరపి స్వేషు కావ్యప్రబన్ధేషు యథాయథం దర్శితమేవ. స్థితే చైవం సర్వ ఏవ కావ్యప్రకారః న ధ్వనిధర్మతామతిపతతి. రసాద్యపేక్షాయాం కవేః గుణీభూతవ్యఙ్గ్యలక్షణోఽపి ప్రకారః తదఙ్గతామవలమ్బత ఇతి ఉక్తం ప్రాక్. యదా తు చాటుషు దేవతాస్తుతిషు వా రసాదీనామఙ్గతయా వ్యవస్థానం హృదయవతీషు చ సప్రజ్ఞకగాథాసు కాసుచిత్ వ్యఙ్గ్యవిశిష్టవాచ్యే ప్రాధాన్యం తదపి గుణీభూతవ్యఙ్గ్యస్య ధ్వనినిష్యన్దభూతత్వమేవేత్యుక్తం ప్రాక్. తదేవమిదానీంతనకవికావ్యనయోపదేశే క్రియమాణే ప్రాథమికానామభ్యాసార్థినాం యది పరం చిత్రేణ వ్యవహారః, ప్రాప్తపరిణతీనాం తు ధ్వనిరేవ కావ్యమితి స్థితమేతత్. తదయమత్ర సంగ్రహః-

శ్లో. యస్మిన్ రసో వా భావో వా తాత్పర్యేణ ప్రకాశతే,
సంవృత్త్యాభిహితో వస్తు యత్రాలంకార ఏవ వా,
కావ్యాధ్వని ధ్వనిర్వ్యఙ్గ్యప్రాధాన్యైకనిబన్ధనః,
సర్వత్ర తత్ర విషయీ జ్ఞేయః సహృదయైర్జనైః.

బాలానందిని

తస్మాదితి:- అందువల్ల, రసతాత్పర్యం గల కవికి, ఏ వస్తువు, ఆతని ఇచ్ఛ ప్రకారం ఆతని కిష్టమైన రసానికి సర్వవిధాలా అంగంగా కాజాలదో అలాంటి వస్తువు లేనేలేదు. ఆ విధంగా కూర్చబడినదై ఆ వస్తువు చారుత్వాతిశయాన్ని పోషించదు అనే మాట కూడ లేదు. ఇదంతా మహాకవుల కావ్యాలలో చూడబడుతున్నది. మాచేత కూడ మా కావ్యప్రబంధాలలో అవకాశానుసారం చూపబడింది. ఇది ఇలా ఉండగా- సమస్తమైన కావ్యప్రకారమూ కూడ ధ్వనిధర్మత్వాన్ని, ధ్వని అనే ధర్మం కలిగి ఉండడాన్ని, అతిక్రమించదు. (వివిధకావ్యభేదాలలోనూ కూడ ధ్వనికావ్యత్వం తప్పక ఉంటుంది అని అర్థం). కవికి రసాపేక్ష (రసంమీద తాత్పర్యం) ఉంటే గుణీభూతవ్యంగ్యలక్షణమైన కావ్యప్రకారం కూడ ధ్వన్యంగం అవుతుంది అని వెనకచెప్పబడింది. చాటువులలో గాని దేవతాస్తుతులలో గాని రసాదులు ఎప్పుడు అంగాలుగా ఉంటాయో, హృదయవంతులైన సత్ప్రజ్ఞ(సహృదయ) గాథలలో కొన్నింటిలో వ్యంగ్యవిశిష్టవాచ్యానికి ప్రాధాన్యమో, అప్పుడు కూడ గుణీభూతవ్యంగ్యం ధ్వనియొక్క నిష్యందమే (క్రిందికి జాలువారిన ధ్వనియే) అని వెనుక చెప్పబడింది. అందుచేత ఈ విధంగా ఆధునికకవులకు కావ్యమార్గంయొక్క ఉపదేశం చేయబడుచున్నప్పుడు ప్రారంభదశలో ఉన్న అభ్యాసార్థులు చిత్రంతో వ్యవహారం చేసినా (చిత్రకావ్యనిర్మాణ ప్రయత్నంలో ఉన్నా) పరిణతి పొందిన కవులకు మాత్రం కావ్యం అంటే 'ధ్వని' అనేది మాత్రమే అనే విషయం నిర్ధారితమైనది. అందుచేత ఈ విషయంలో సంగ్రహం ఇది-

యస్మిన్ ఇతి. యస్మిన్= ఏ, కావ్యాధ్వని= కావ్యమార్గంలో, రసో వా= రసం గాని, భావో వా= భావం కాని, తాత్పర్యేణ= తాత్పర్యంచేత, ప్రకాశతే= ప్రకాశిస్తుందో, యత్ర= ఏ కావ్యమార్గంలో, వస్తు= వస్తువు, అలంకార ఏవ వా= లేదా అలంకారం, సంవృత్యా= గూఢంగా (వ్యంగ్యంగా), అభిహితౌ= చెప్పబడినవో, తత్ర= అక్కడ, సర్వత్ర= అంతటా కూడ, వ్యఙ్గ్యప్రాధాన్యైకనిబన్ధనః=కేవలం వ్యంగ్యంయొక్క ప్రాధాన్యమే

మూలకారణంగా గల, ధ్వనిః= ధ్వని, విషయీ= అంగిగా, సహృదయైః జనైః= సహృదయులైన జనుల చేత, జ్ఞేయః= తెలియదగినది.

లోచనం

చారుత్వాతిశయం యన్న పుష్ణాతి తన్నాస్త్యేవేతి సంబన్ధః. స్వేష్వితి - విషమబాణలీలాదిషు. హృదయవతీష్వితి "హిఅఅలలిఆ" ఇతి ప్రాకృతకవిగోష్ఠ్యాం ప్రసిద్ధాసు. త్రివర్గోపాయోపేయకుశలాః సప్రజ్ఞకాః సహృదయా ఉచ్యన్తే. తద్గాథా యథా భట్టేన్దురాజస్య-

గాథ. లఙ్ఘిఅగఅణా ఫలహీలఆఓ హోన్తుత్తి వడ్ఢఅన్తీఅ,

హాలి అస్స ఆసిసం పాలివేసవతుఅ విణిట్ఠవిఆ.

అత్ర లఙ్ఘితగగనా కార్పాసలతా భవన్త్వితి హాలికస్యాశిషం వర్ధయన్త్యా ప్రాతివేశికవధుకా నిర్వృతిం ప్రాపితా ఇతి చౌర్యసంభోగాభిలాషిణీయమిత్యనేన వ్యఙ్గ్యేన విశిష్టం వాచ్యమేవ సున్దరమ్.

గాథ. గోలాకచ్ఛకుడఙ్గే భరేణ జమ్బూసు పచ్చమాణాసు,

హలిఅబహూఅ ణిఅంసఇ జమ్బూరసరత్తఅం సిఅఅమ్.

అత్ర గోదావరీకచ్ఛలతాగహనే భరేణ జమ్బూఫలేషు పచ్యమానేషు హాలికవధూః పరిధత్తే జమ్బూఫలరసరక్తం నివసనమితి త్వరితచౌర్య సంభోగసంభావ్యమానజమ్బూఫలరక్తత్వపరభాగనిహ్నవనం గుణీభూతవ్యఙ్గ్య మిత్యలం బహునా.

ధ్వనిరేవ కావ్యమితి. ఆత్మాత్మినోరభేద ఏవ వస్తుతః; వ్యుత్పత్తయే తు విభాగః కృత ఇత్యర్థః. వాగ్రహణాత్తదాభాసాదేః పూర్వోక్తస్య గ్రహణమ్. సంవృత్త్యేతి. గోప్యమానతయా లబ్ధసౌన్దర్య ఇత్యర్థః. కావ్యాధ్వనీతి - కావ్యమార్గే. విషయీతి. స త్రివిధస్య ధ్వనేః కావ్యమార్గః విషయ ఇతి యావత్. 41, 42

బాలానందిని

"చారుత్వాతిశయాన్ని ఏది పోషించదో అట్టిది (వస్తువు) లేదు" అని అన్వయం. స్వేష్వితి. విషమబాణలీల మొదలైన కావ్యాలలో అని అర్థం. హృదయవతీష్వితి - 'హిఅఅలలిఆ' అని ప్రాకృతకవిగోష్ఠిలో ప్రసిద్ధమైన (గాథలలో). ధర్మార్థకామా లనే

త్రివర్గమునందు, వివిధ ఉపాయాలయందు, ఉపేయములయందు (ఉపాయాలచేత సాధింపదగినవాటియందు) కుశలులైన సహృదయులు 'సంప్రజ్ఞకాః' అని చెప్పబడుదురు.

వివరణ:- ప్రాకృతకవుల గోష్ఠులు జరిగే వనీ వాటిలో ఈ విధమైన గాథలే ఎక్కువగా కవులు చదివేవారనీ దీనిని పట్టి తెలుస్తున్నది. 'త్రివర్గోపాయోపేయకుశలాసు' అని ముద్రితపాఠం భాగాలేదు. కవులకు కుశలత్వం కాని గాథలకు కుశలత్వం ఎలా ఉంటుంది? అందుచేత 'కుశలాః' అని 'సహృదయాః'కు విశేషణమైన పాఠం అయి ఉంటుందని అలా మార్చబడింది. ధ్వన్యాలోకంలోనే "షట్ప్రజ్ఞకగాథాసు" అని పాఠాంతరం ఉన్నదట. ఈ పాఠాన్ని చూపుతూ 'దీపశిఖ' అనే ధ్వన్యాలోకవ్యాఖ్యానం వ్రాసిన వ్యాఖ్యాత-

"ధర్మార్థకామమోక్షేషు లోకతత్త్వార్థయోరపి,
షట్సు ప్రజ్ఞాస్తి యస్యోచ్చైః షట్ప్రజ్ఞ ఇతి స స్మృతః"

అని త్రికాండకోషం నుంచి - (కోషమా శేషమా?) - ఉదాహరించినాడు.

తద్గాథా ఇతి. అలాంటి గాథ భట్టేందురాజుది ఎట్లనగా-

"లఙ్ఘితగగనాః కార్పాసలతాః భవన్త్వితి వర్ధయన్త్యా,
హాలికస్యాశిషం ప్రాతివేశ్యవధుకా నిర్వాపితా. (సంస్కృతచ్ఛాయ)

కార్పాసలతికాః= పత్తిలతలు (చెట్లు), లఙ్ఘితగగనాః= దాటబడిన ఆకాశంగలవి, భవన్తు= అగుగాక, ఇతి= అని, హాలికస్య= వ్యవసాయదారునియొక్క, ఆశిషః= కోరికలను, వర్ధయన్త్యా= వృద్ధిపొందిస్తూన్న ఒక స్త్రీ చేత, ప్రాతివేశ్యవధుకా= పొరుగింటి వధువు (యువతి), నిర్వాపితా= సంతోషంకలదిగా చేయబడ్డింది.

అత్రేతి. ఇక్కడ "నీవు నాటుతూన్న పత్తిమొక్కలు ఆకాశాన్ని దాటుగాక" అని హాలికుని కోరికను వృద్ధిపొందిస్తూన్న స్త్రీచేత పొరుగింటి యువతి ఆనందం పొందించబడింది" అని చెప్పడంలో 'ఈమె పెరిగిన చెట్ల మధ్య చౌర్యసంభోగాభిలాషిణి అనే వ్యంగ్యంతో కూడిన వాచ్యమే సుందరంగా ఉంది.

గోలా ఇతి. గోలాకచ్ఛకుడఙ్గే భరేణ జమ్బూసు పచ్యమానాసు,
సుహాలికవధూర్నియచ్ఛతి జమ్బూరసరక్తం సిచయమ్. (సంస్కృతచ్ఛాయ)

"గోదావరీజలప్రాయభూమిలో ఉన్న చెట్ల తోపులో నేరేడు పండ్లు అత్యధికంగా (భరేణ) ముగ్గుతూండగా హాలికుని వధువు నేరేడుపండ్లరసంచేత ఎఱ్ఱనైన వస్త్రం ధరిస్తూన్నది"

అత్రేతి. ఇక్కడ - గోదావరీకచ్ఛంలోని లతాగహనంలో (పొదలో)జంబూఫలాలు అత్యధికంగా ముగ్గి పడుతూండగా హాలికవధువు నేరేడుపండ్ల రసంచేత తడపబడిన వస్త్రాన్ని ధరిస్తూన్నది అని చెప్పడంచేత - తొందర తొందరగా చౌర్యరతంలో సంభావ్యమైన (అలా జరగడానికి అవకాశం ఉన్న) జంబూఫలరసరక్తత్వశోభను కప్పిపుచ్చుకోవడం (మొత్తం వస్త్రం అంతా జంబూఫలరసంచేత రక్తవర్ణంగా చేస్తే ఎవరికీ సందేహం కలగదనే అభిప్రాయంతో అలాంటి వస్త్రం ధరించడంచేత) గుణీభూతవ్యంగ్యం. సరే!ఇంక అధికంగా చెప్పి చాలును. ధ్వనిరేవ కావ్యమితి. నిజానికి ఆత్మకీ ఆత్మికీ (ఆత్మకలదానికీ) అభేదమే కాని వ్యుత్పత్తికోసం (తెలియడంకోసం) విభాగం చేయబడింది అని అర్థం. "రసో వా భావో వా" అన్నప్పుడు 'వా' అనడంచేత వెనక చెప్పిన రసాభాసాదులు గ్రహించబడతాయి. సంవృత్యా ఇతి - గుప్తంగా ఉంచడంచేత పొందబడిన సౌందర్యం గలది అని అర్థం. కావ్యాధ్వనీతి. కావ్యమార్గంలో. విషయీతి (ధ్వనివిషయి అని చెప్పడంచేత) మూడు విధాలైన ధ్వనికి కావ్యమార్గం విషయం (స్థానం) అని భావం.

## ధ్వన్యాలోకం

కా. సగుణీభూతవ్యఙ్గ్యైః సాలఙ్కారైః సహప్రభేదైః స్వైః,
సంకరసంసృష్టిభ్యాం పునరప్యుద్ద్యోతతే బహుధా. 43.

తస్య చ ధ్వనేః స్వప్రభేదైః, గుణీభూతవ్యఙ్గ్యేన, వాచ్యాలంకారైశ్చ సంకరసంసృష్టివ్యవస్థాయాం క్రియమాణాయాం బహుప్రభేదతా లక్ష్యే దృశ్యతే. తథాహి. స్వప్రభేదసంకీర్ణః, స్వప్రభేదసంసృష్టః, గుణీభూతవ్యఙ్గ్యసంకీర్ణః, గుణీభూతవ్యఙ్గ్యసంసృష్టః, వాచ్యాలంకారాన్తరసంకీర్ణః, వాచ్యాలంకారాన్తరసంసృష్టః, సంసృష్టాలంకారసంకీర్ణః, సంసృష్టాలంకారసంసృష్టశ్చేతి బహుధా ధ్వనిః ప్రకాశతే.

### బాలానందిని

సగుణీభూతేతి. సగుణీభూతవ్యఙ్గ్యైః= గుణీభూతవ్యంగ్యాలతో కూడినవి, సాలంకారైః= అలంకారాలతో కూడినవీ అయిన, స్వైః ప్రభేదైః సహ= తన భేదాలతో కూడ, సంకరసంసృష్టిభ్యామ్= సంకరసంసృష్టులచేత, పునరపి= ఇంకనూ, బహుధా= అనేకవిధాలుగా, ఉద్ద్యోతతే= ప్రకాశిస్తూన్నది.

తస్యేతి. ఆ ధ్వనికి తన భేదాలతోను, గుణీభూతవ్యంగ్యంతోను, వాచ్యాలంకారాలతోను సంకరసంసృష్టుల వ్యవస్థ చేయబడిన ట్లయితే అనేకభేదాలు లక్ష్యంలో కనబడుతున్నాయి. ఎట్లనగా - తన భేదాలతో సంకీర్ణం (సంకరం పొందినది), తన భేదాలతో సంసృష్టం(సంసృష్టి చెందినది), గుణీభూతవ్యంగ్యంతో సంకీర్ణం, గుణీభూతవ్యంగ్యంతో సంసృష్టం, వాచ్యమైన మరొక అలంకారంతో సంకీర్ణం, వాచ్యమైన మరొక అలంకారంతో సంసృష్టం, పరస్పరం సంసృష్టాలైన అలంకారాలతో సంకీర్ణం, సంసృష్టాలంకారసంసృష్టం అని ధ్వని అనేకవిధాల ప్రకాశిస్తున్నది.

లోచనం

ఏవం శ్లోకద్వయేన సంగ్రహార్థమభిధాయ బహుప్రకారదర్శికాం పఠతి - సగుణీతి. సహ గుణీభూతవ్యఙ్గేన, సహాలంకారైః యే వర్తన్తే స్వే ధ్వనేః ప్రభేదాః తైః సంకీర్ణతయా సంసృష్టతయా వా అనన్తప్రకారః ధ్వనిరితి తాత్పర్యమ్. బహుప్రకారతాం దర్శయతి - తథాహీతి. స్వభేదైః గుణీభూత వ్యఙ్గ్యేన, అలంకారైః ప్రకాశతే ఇతి త్రయో భేదాః. తత్రాపి ప్రత్యేకం సంకరేణ సంసృష్ట్యా చేతి షట్. సంకరస్యాపి త్రయః ప్రకారాః, అనుగ్రాహ్యానుగ్రాహక భావేన సందేహాస్పదత్వేన, ఏకపదానుప్రవేశేనేతి ద్వాదశ భేదాః. పూర్వం చ యే పఞ్చత్రింశద్భేదాః ఉక్తాః తే గుణీభూతవ్యఙ్గ్యస్యాపి మన్తవ్యాః. స్వప్రభేదాస్తావన్తోఽలంకార ఇత్యేకసప్తతిః. తత్ర సంకరత్రయేణ సంసృష్ట్యా చ గుణనే ద్వే శతే చతురశీత్యధికే. తావతా పఞ్చత్రింశతో ముఖ్యభేదానాం గుణనేసప్తసహస్రాణి, చత్వారి శతాని వింశత్యధికాని భవన్తి. అలంకారాణామాన న్త్యాత్త్వసంఖ్యత్వమ్.

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా రెండు శ్లోకాలలో విషయం సంగ్రహించి చెప్పి ధ్వనియొక్క బహుప్రకారత్వాన్ని ప్రదర్శించే కారికను పఠిస్తున్నాడు - సగుణీతి. ధ్వనికి సంబంధించిన ఏ భేదాలు గుణీభూతవ్యంగ్యంతోను, అలంకారాలతోను సంకీర్ణత్వరూపంలో గాని, సంసృష్టత్వరూపంలో కాని కలిసి ఉంటాయో వాటిని ఎట్టి ధ్వని అనంతప్రకార మైనది అని తాత్పర్యం. బహుప్రకారత్వాన్ని చూపుతున్నాడు -తథాహీతి. (ధ్వని) తన అవాంతరభేదాలతోను, ఆ మూడింటిలో కూడ ఒక్కొక్కటి సంకరంచేత సంసృష్టిచేత

రెండేసి భేదా లవడంచేత ఆరు భేదాలు. అనుగ్రాహ్యానుగ్రాహకభావం, సందేహాస్పదత్వం, ఏకపదానుప్రవేశం అని సంకరంలో మూడు విధాలు ఉంటాయి. (వీటి వివరణ కావ్యప్రకాశలో చూడవచ్చును). పైని చెప్పిన సంకరభేదాలను ఈ మూడు సంకరప్రకారాలతో గుణించగా తొమ్మిది భేదాలు, సంసృష్టిభేదాలు మూడు, మొత్తం పన్నెండు భేదాలు. పూర్వం(ద్వితీయోద్యోతం చివర-'ఏవం ధ్వనేః ప్రభేదాన్ ప్రతిపాద్య' అనే వృత్తిగ్రంథాన్ని వ్యాఖ్యానించే సందర్భంలో) ఏ ముప్పైఐదు ధ్వనిభేదాలు చెప్పబడ్డాయో అవి గుణీభూతవ్యంగ్యానికి కూడ ఉంటా యని తెలుసుకోవాలి, అన్నే (ముప్పైఐదు) స్వప్రభేదాలు, (ధ్వనిప్రభేదాలు), అలంకారమిశ్రధ్వని అని (35+35+1=71)డెబ్బైఒక్క భేదాలు. వాటిని త్రివిధసంకరభేదాలచేత, సంసృష్టిచేత గుణించగా రెండువందల ఎనభైనాలుగు (284) భేదాలు. దీనిలో ముప్పైఐదు ముఖ్యభేదాలనుగుణించగా ఏడువేల నాలుగు వందల ఇరవైభేదాలు.

ముప్పైఐదుని రెండువందలఎనభైనాలుగుచేత గుణిస్తే తొమ్మిది వేల తొమ్మిదివందల నలభై భేదాలు వస్తాయి కాని 7420 భేదాలు రావు. అందుచేత ఈ పాఠంలో ఏదో పొరబాటు ఉండి ఉండాలి. ఈ విషయం బాలప్రియాకారుడు కూడ గుర్తించాడు. ఇలాంటి భేదపరిగణనం కావ్యప్రకాశలో కూడ చేయబడింది. ఇదంతా ఎందుకూ పనికిరాని గణితప్రదర్శనమే. కావ్యప్రకాశకారుడు చూపిన భేదగణనంలో రత్నాపణకారుడైన కుమారస్వామిసోమపీథి తప్పు పట్టినాడు. అస్మదీయబాలానందినీసహిత కావ్యప్రకాశ పంచమోల్లాసంలో ఈ విషయం విశదీకరించబడింది. ఏమైనా ఇదంతా బుద్ధివ్యామోహజనక మైన, ప్రయోగానుపయుక్తమైన చర్చమాత్రమే. ఆనందవర్ధనుడు ఈ గుణకారాల జోలికి వెళ్లలేదు. పండితరాజ జగన్నాథుడు కూడా మొత్తం ధ్వని భేదాలు ఇరవైఆరు అని అంతటితో సరిపెట్టివేశాడు.

అలంకారాణామితి. అలంకారాలే అనంతాలు గాన వేరు వేరు అలంకారాలు తీసికొని వాటితో సంకరసంసృష్ట్యాదులు చెప్పడం ప్రారంభిస్తే అంతం ఉండదు. అందుచేత 'అలంకారం' అనే పేరుతో ఒకదానినే గ్రహించడం జరిగింది.

## ధ్వన్యాలోకం

తత్ర స్వభేదసంకీర్ణత్వం క్వచిదనుగ్రాహ్యానుగ్రాహకభావేన, యథా - "ఏవం వాదిని దేవర్షౌ" ఇత్యాదౌ. అత్ర హ్యర్థశక్త్యుద్భవాను రణనరూపవ్యఙ్గ్యధ్వనిప్రభేదేన అలక్ష్యక్రమధ్వనిప్రభేదః అనుగృహ్యా

మాణః ప్రతీయతే. ఏవం కదాచిత్ ప్రభేదద్వయసంపాత సందేహేన. యథా -

గాథ. ఖణపాహుణిఆ దేఅర ఏసా జాఆఏం కింపి దే భణిదా,
రుఅఇ పడోహరవలహీఘరమ్మి అణుణిజ్జఉ వరాఈ. (120)
"క్షణప్రాఘుణికా దేవర ఏషా జాయయా కిమపి తే భణితా,
రోదితి శూన్యవలభీగృహే ఽనునీయతాం వరాకీ". (ఇతి చ్ఛాయా)

అత్ర హ్యనునీయతామిత్యేతత్పదమ్ అర్థాన్తరసంక్రమిత వాచ్యత్వేన వివక్షితాన్యపరవాచ్యత్వేన చ సంభావ్యతే. న చ అన్యతరపక్షనిర్ణయే ప్రమాణమస్తి. ఏకవ్యఞ్జకానుప్రవేశేన తు వ్యఙ్గ్యత్వమలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య స్వప్రభేదాన్తరాపేక్షయా బాహుల్యేన సంభవతి. యథా - "స్నిగ్ధశ్యామల" ఇత్యాదౌ. స్వప్రభేదసంసృష్టత్వం చ యథా పూర్వోదాహరణ ఏవ. అత్ర హ్యర్థాన్తరసంక్రమితవాచ్యస్య అత్యన్తతిరస్కృతవాచ్యస్య చ సంసర్గః.

బాలానందిని

తత్రేతి - వాటిలో స్వప్రభేదసంకీర్ణత్వం (ధ్వని తన ప్రభేదాలతో సంకరం చెందడం) ఎట్లనగా "ఏవంవాదిని" (శ్లో.47) ఇత్యాదిశ్లోకంలో. ఇక్కడ అలక్ష్యక్రమవ్యంగ్య ధ్వనిప్రభేదం (అభిలాషశృంగారం) అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యధ్వనిప్రభేదంచేత (లజ్జచేత) అనుగ్రహించబడుతూ ప్రతీతం అవుతూన్నది. ఇట్లే కొన్ని చోట్ల రెండు ప్రభేదాల సంపాతాన్ని (రావడాన్ని) గూర్చిన సందేహంచేత స్వప్రభేదసంకీర్ణత్వం ఉంటుంది. ఎట్లనగా - క్షణప్రాఘుణికా ఇతి:- సుభగ - సుందరుడా! దేవర= ఓ! మరిదీ! తే జాయయా= నీ భార్యచేత, కిమపి= ఏమో, భణితా= పలకబడిన, క్షణప్రాఘుణికా= ఉత్సవంలో అతిథిగా వచ్చిన, వరాకీ= ఆ దీనురాలు, శూన్యవలభీగృహే= శూన్యమైన డాబాఇంట్లో, రోదితి= ఏడుస్తూన్నది. అనునీయతామ్= అనునయించబడుగాక.

అత్రేతి. ఇక్కడ 'అనునీయతామ్' అనే పదం అర్థాంతరసంక్రమితవాచ్యం గాను, వివక్షితాన్యపరవాచ్యం గాను కూడ సంభావించబడుతుంది. (రెండువిధాలా

చెప్పవచ్చును) ఒక పక్షాన్ని నిర్ణయించడానికి తగిన ప్రమాణం లేదు. (అందుచేత రెండు ధ్వనిప్రభేదాలకు సందేహరూపసంకరం అని అర్థం). అలక్ష్యక్రమవ్యంగ్యం తన మరొక ప్రభేదాన్ని పట్టి ఏకవ్యంజకానుప్రవేశంచేత (ఒకే వ్యంజకంలో ప్రవేశించడంచేత) వ్యంగ్యం అవడం అధికంగా జరుగుతుంది. ఉదాహరణకి "స్నిగ్ధశ్యామల" (శ్లో. 18) ఇత్యాదిశ్లోకంలో. తన ప్రభేదంతో సంసృష్టం అవడం పూర్వోదాహరణంలోనే. దీనిలో అర్థాంతరసంక్రమితవాచ్యానికీ అత్యంతతిరస్కృతవాచ్యానికీ సంబంధం ఉన్నది.

లోచనం

తత్ర వ్యుత్పత్తయే కతిపయభేదేషు ఉదాహరణాని దిత్సుః స్వప్రభేదానాం కారికాయామ్ అన్యపదార్థత్వేన ప్రధానతయా ఉక్తత్వాత్ తదాశ్రయాణ్యేవ చత్వారి ఉదాహరణాన్యాహ - తత్రేతి. అనుగృహ్యమాణ ఇతి. లజ్జయా హి ప్రతీతయా అభిలాషశృఙ్గారోఽత్రానుగృహ్యతే వ్యభిచారిభూతత్వేన. క్షణః ఉత్సవః తత్ర నిమన్త్రణేన ఆనీతా హే దేవర! ఏషా తే జాయయా కిమపి భణితా రోదితి. పడోహరే శూన్యే వలభీగృహే అనునీయతాం వరాకీ. సా తావద్దేవరానురక్తా తజ్జాయయా విదితవృత్తాన్తయా కిమపి ఉక్తా ఇత్యేషా ఉక్తిః తద్వృత్తాన్తం దృష్టవత్యా అన్యస్యాః తద్దేవరచౌరకామిన్యాః. తత్ర తవ గృహిణ్యాయం వృత్తాన్తో జ్ఞాతః ఇతి ఉభయతః కలహాయితుమిచ్ఛన్తీ ఏవమాహ. తత్ర అర్థాన్తరే సంభోగేన ఏకాన్తోచితేన పరితోష్యతామిత్యేవంరూపే వాచ్యస్య సంక్రమణమ్. యది వా త్వం తాపదేతస్యామేవ అనురక్త ఇతి ఈర్ష్యాకోపతాత్పర్యాత్ అనునయనమన్యపరం వివక్షితమ్. ఏషా తవేదానీ ముచితమగర్హణీయం ప్రేమాస్పదమిత్యనునయో వివక్షితః, వయం త్విదానీం గర్హణీయాః సంవృత్తాః ఇత్యేతత్పరతయా ఉభయథాపి చ స్వాభిప్రాయ ప్రకాశనాత్ ఏకతరనిశ్చయే ప్రమాణాభావ ఇత్యుక్తమ్. వివక్షితస్య హి స్వరూపస్థస్యైవ అన్యపరత్వమ్; సంక్రాన్తిస్తు తస్య ఏతద్రూపతాపత్తిః. యది వా దేవరానురక్తాయా ఏవ తం దేవరమన్యయా సహ అవలోకితసంభోగ వృత్తాన్తం ప్రతీయముక్తిః, దేవరేత్యామన్త్రణాత్. పూర్వవ్యాఖ్యానే తు తదపేక్షయా దేవరేత్యామన్త్రణం వ్యాఖ్యాతమ్. బాహుల్యేనేతి - సర్వత్ర కావ్యే రసాదితాత్పర్యం

తావదస్తి. తత్ర రసధ్వనేః భావధ్వనేశ్చ ఏకేన వ్యఞ్జకేన అభివ్యఞ్జనం స్నిగ్ధశ్యామలేత్యత్ర విప్రలమ్భశృఙ్గారస్య తద్వ్యభిచారిణశ్చ శోకావేగాత్మనః చర్వణీయత్వాత్. ఏవం త్రివిధం సంకరం వ్యాఖ్యాయ సంసృష్టిముదాహరతి - స్వప్రభేదేతి. అత్ర హీతి - లిప్తశబ్దాదౌ తిరస్కృతవాచ్యః, రామాదౌ తు సంక్రాన్త ఇత్యర్థః.

బాలానందిని

తత్రేతి - వ్యుత్పత్తికొరకై వాటిలోని కొన్ని భేదాలలో ఉదాహరణలు ఇవ్వదలచినవాడై కారికలో స్వప్రభేదాలు (ధ్వనిప్రభేదాలు) ("సగుణీభూతవ్యఙ్గ్యైః" ఇత్యాదిబహువ్రీహిసమాసాలలో) అన్యపదార్థాలుగా ప్రధానంగా చెప్పబడడంచేత వాటికే సంబంధించిన నాలుగు ఉదాహరణలు చెపుతున్నాడు - తత్రేతి. అనుగృహ్యమాణ ఇతి - వ్యంగ్యమైన లజ్జ ఇక్కడ వ్యభిచారిగా అయి అభిలాషశృంగారాన్ని అనుగ్రహిస్తూన్నది.

క్షణేతి - క్షణః= ఉత్సవం. దానికి ఆహ్వానించి తీసికొనిరాబడిన ఈమెను, ఓ! దేవరా! నీ భార్య ఏమేమో అంది. అందుచేత ఈమె ఏడుస్తూన్నది - పడోహరే= జనశూన్యమైన, డాబాగదిలో ఈ దీనురాలిని అనునయించుము. ఆమె దేవరునియందు అనురాగవంతురా లని తెలిసి ఆతని భార్య ఏమేమో అంది. ఇది ఈ వృత్తాంతం అంతా చూసి ఆ దేవరుని చౌరకామిని యైన మరొక స్త్రీ అంటూన్న మాటలు. "నీ భార్యకు ఈ విషయం తెలిసిపోయిందిలే" అని రెండు వైపులా కలహం పుట్టించడంకోసం ఆమె ఇలా అంటూన్నది. అనునయన శబ్దవాచ్యార్థం - "ఏకాంతస్థానానికి తగిన సంభోగంచేత ఆమెను సంతోషపెట్టుము" అనే అర్థాంతరంలో సంక్రమించిందా, లేదా "నువ్వు ఈమె యందే అనురాగవంతుడవై ఉన్నావు" అని ఈర్ష్యాకోపాలయందు తాత్పర్యం ఉండడంవల్ల అనునయనం అన్యపరంగా, ఈర్ష్యాదివ్యంగ్యపరంగా వివక్షితమా? ఇప్పు డీమె నీకు తగిన, గర్హింపరాని ప్రేమస్థానం అయింది అని అనునయం వివక్షితమా, మేమైతే ఇప్పుడు గర్హింపతగినవాళ్లం అయిపోయాం అనే అర్థం బోధించడానికి వివక్షితమా? రెండు విధాల కూడ స్వాభిప్రాయాన్ని ప్రకాశింపచేయడంవల్ల ఒక అర్థాన్ని నిశ్చయించడంలో ప్రమాణం లేదు అని చెప్పబడింది. వివక్షితమైన అర్థం స్వస్వరూపంలో ఉంటూనే (వాచ్యంగా తెలుస్తూనే) అన్యార్థపరం అవుతుంది (వివక్షితాన్యపరవాచ్యంలో). అది (వాచ్యార్థం) మరొక అర్థంగా మారిపోతుంది (అర్థాంతరసంక్రమితవాచ్యంలో). లేదా 'దేవర' అని సంబోధించడంవల్ల, ఇది ఆ దేవరుడు మరొకతెతో సంబంధం కలిగి

ఉండడం చూచిన దేవరానురక్తయైన స్త్రీ పలికిన మాటయే. అనగా ఈ మాటలు పలికిన స్త్రీకే అతడు దేవరు డని అర్థం. వెనుకటి వ్యాఖ్యానంలో ఇతడు ఆ ప్రాఘుణికకు దేవరుడు గాన ఈ విధంగా పిలిచినట్లు చెప్పబడింది. అనగా ఈ మాటలు పలుకుతున్న వనితకు అతడు దేవరుడు కాడు, ఈ ప్రాఘుణికకు దేవరుడు. ఆమెకు దేవరు డవడంచేత ఈమె ఆతనిని అలా సంబోధించింది అని మొదటి వ్యాఖ్యానంలో చెప్పుకోవాలి అని అర్థం.

బాహుల్యేనేతి - అన్ని కావ్యాలలో రసాదితాత్పర్యం ఉంటుంది. 'స్నిగ్ధశ్యామల' ఇత్యాదిశ్లోకంలో విప్రలంభశృంగారం, దాని వ్యభిచారులైన శోకావేగాలు కూడ చర్వణీయాలుగా ఉన్నాయి. అందుచేత ఇక్కడ రసధ్వని, భావధ్వనీ కూడ ఒకే వ్యంజకంచేత వ్యంజింపబడ్డాయి. ఈ విధంగా (అనుగ్రాహ్యానుగ్రాహకరూపం, సందిగ్ధరూపం, ఏకవ్యంజకగతం అయిన) త్రివిధసంకరాన్ని వ్యాఖ్యానించి సంసృష్టిని ఉదాహరిస్తున్నాడు - స్వప్రభేదేతి. అత్ర హీతి. లిప్తాదిశబ్దాలలో తిరస్కృతవాచ్యం, రామాదిశబ్దాలలో అర్థాంతరసంక్రమణం అని అర్థం.

## ధ్వన్యాలోకం

గుణీభూతవ్యఙ్గ్యసంకీర్ణత్వం యథా - "న్యక్కారో హ్యయమేవ మే యదరయః" ఇత్యాదౌ. యథా వా -

శ్లో. కర్తా ద్యూతచ్ఛలానాం జతుమయశరణోద్దీపనః సోఽభిమానీ
కృష్ణాకేశోత్తరీయవ్యపనయనపటుః పాణ్డవా యస్య దాసాః,
రాజా దుఃశాసనాదేర్గురురనుజశతస్యాఙ్గరాజస్య మిత్రం
క్వాస్తే దుర్యోధనోఽసౌ కథయత న రుషా ద్రష్టుమభ్యాగతౌ స్వః.
(121)

అత్ర హ్యలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య వాక్యార్థీభూతస్య వ్యఙ్గ్య విశిష్టవాచ్యాభిధాయిభిః పదైః సంమిశ్రతా. అత ఏవ చ పదార్థాశ్రయత్వే గుణీభూతవ్యఙ్గ్యస్య, వాక్యార్థాశ్రయత్వే చ ధ్వనేః సంకీర్ణతాయామపి న విరోధః స్వప్రభేదాన్తరవత్. యథా హి ధ్వనిప్రభేదాన్తరాణి పరస్పరం సంకీర్యన్తే పదార్థవాక్యార్థాశ్రయత్వేన చ న విరుద్ధాని.

బాలానందిని

గుణీతి. గుణీభూతవ్యంగ్యంతో (ధ్వనియొక్క) సంకీర్ణత్వం ఎట్లనగా - "న్యక్కారో హ్యాయమేవ మే యదరయః" (శ్లో. 81) ఇత్యాదిశ్లోకంలో. ఇంకా ఎట్లనగా-

కర్తా ఇతి. ఇది వేణీసంహారంలోని శ్లోకం. ద్యూతచ్ఛలానామ్= ద్యూత కపటాలకు(ను), కర్తా= చేసేవాడు, జతుమయశరణోద్దీపనః = లక్క ఇల్లు కాల్చినవాడు, అభిమానీ= అహంకారవంతుడు, కృష్ణాకేశోత్తరీయవ్యపనయనపటుః= ద్రౌపదికేశాలను, ఉత్తరీయాన్ని తొలగించడంలో సమర్థుడూ, యస్య= ఎవనికి, పాణ్డవాః= పాండవులు, దాసాః= దాసులో, సః= అట్టివాడు, దుఃశాసనాదేః= దుఃశాసనుడుమొదలైన, అనుజశతస్య= నూర్గురు తమ్ముళ్ళకు, గురుః= అన్న, అఙ్గరాజస్య= కర్ణునియొక్క, మిత్రమ్= మిత్రుడు, రాజా= రాజు అయిన, అసౌ= ఈ, దుర్యోధనః= దుర్యోధనుడు, క్వ = ఎక్కడ, ఆస్తే= ఉన్నాడు? కథయత= చెప్పండి. ద్రష్టుమ్= చూడడానికై, అభ్యాగతౌ స్వః= (మే మిద్దరం) వచ్చాం. రుషా= కోపంతో , న = రాలేదు.

అత్రేతి. ఇక్కడ వాక్యార్థమైన అలక్ష్యక్రమవ్యంగ్యానికి వ్యంగ్యవిశిష్టవాచ్యాన్ని బోధించే పదాలతో కలయిక ఉన్నది. అందువలననే గుణీభూతవ్యంగ్యం పదార్థాలను ఆశ్రయించి ఉండి, ధ్వని వాక్యార్థాన్ని ఆశ్రయించి ఉన్నప్పుడు అది తన ప్రభేదాలతో వలె సంకీర్ణత్వాన్ని పొందినా కూడ విరోధం లేదు. (ఇలాంటి పరిస్థితిలో ధ్వనికి గుణీభూతవ్యంగ్యంతో సంసృష్టియే కాకుండా సంకరం కూడా ఉండవచ్చును అని భావం). ధ్వనియొక్క ఇతరప్రభేదాలు ఏ విధంగా పదార్థవాక్యార్థాలను ఆశ్రయించి ఉండడంచేత పరస్పరవిరుద్ధాలు కావో, అందుచేత సంకీర్ణత్వాన్ని పొందుతాయో అదే విధంగా (ధ్వనిగుణీభూతవ్యంగ్యాల విషయంలో కూడ).

లోచనం

ఏవం స్వప్రభేదం ప్రతి చతుర్భేదానుదాహృత్య గుణీభూతవ్యఙ్గ్యం ప్రతి ఉదాహరతి - గుణీభూతేతి. అత్ర హీతి - ఉదాహరణద్వయేఽపి. అలక్ష్యక్రమవ్యఙ్గ్యస్యేతి - రౌద్రస్య. వ్యఙ్గ్యవిశిష్టేత్యనేన గుణతా వ్యఙ్గ్యస్యోక్తా. పదైః ఇతి ఉపలక్షణే తృతీయా. తేన తదుపలక్షితా. యోఽర్థః వ్యఙ్గ్యగుణీభావేన వర్తతే తేన సంమిశ్రతా సంకీర్ణతా సా చానుగ్రాహ్యానుగ్రాహకభావేన, సందేహయోగేన, ఏకవ్యఞ్జకానుప్రవేశేన చేతి యథాసంభవముదాహరణద్వయే

యోజ్యా. తథాహి - 'మే యదరయః' ఇత్యాదిభిః సర్వైరేవ పదార్థైః కర్తేత్యాదిభిశ్చ విభావాదిరూపతయా రౌద్ర ఏవానుగృహ్యతే.

కర్తేత్యాదౌ చ ప్రతిపదం, ప్రత్యవాన్తరవాక్యం, ప్రతిసమాసం చ వ్యఙ్గ్యముత్ప్రేక్షితుం శక్యమేవేతి న లిఖితమ్. 'పాణ్డవా యస్య దాసాః' ఇతి తదీయోక్త్యనుకారః. తత్ర గుణీభూతవ్యఙ్గ్యతాపి యోజయితుం శక్యా; వాచ్యస్యైవ క్రోధోద్దీపకత్వాత్. దాసైశ్చ కృతకృత్యైః స్వామీ అవశ్యం ద్రష్టవ్య ఇతి అర్థశక్త్యనురణనరూపతాపి. ఉభయథాపి చారుత్వాదేకపక్షగ్రహే ప్రమాణాభావః. ఏకవ్యఞ్జకానుప్రవేశస్తు తైరేవ పదైః గుణీభూతస్య వ్యఙ్గ్యస్య ప్రధానీభూతస్య చ రసస్య విభావాదిద్వారతయా అభివ్యఞ్జనాత్. అత ఏవేతి. యతోఽత్ర లక్ష్యే దృశ్యతే తత ఇత్యర్థః. నను వ్యఙ్గ్యం గుణీభూతం ప్రధానం చేతి విరుద్ధమేవ. తత్ దృశ్యమానమపి అయుక్తత్వాన్న శ్రద్ధేయమిత్యాశఙ్క్య వ్యఞ్జకభేదాత్తావన్న విరోధ ఇతి దర్శయతి - అత ఏవేతి. స్వేతి - స్వప్రభేదాన్తరాణి సంకీర్ణతయా పూర్వముదాహృతాని, తాన్యేవ దృష్టాన్తయతి. తదేవ వ్యాచష్టే - **యథాహీతి**. తథాత్రాపీత్యధ్యాహారోఽత్ర కర్తవ్యః. తథా హి ఇతి వా పాఠః.

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా ధ్వనియొక్క స్వప్రభేదాలను గూర్చి నాలుగు భేదాలను ఉదాహరించి ఇప్పుడు గుణీభూతవ్యంగ్యాన్ని గూర్చి ఉదాహరిస్తున్నాడు - గుణీభూతేతి. అత్రహీతి - ఈ రెండు ఉదాహరణలలోను కూడ. అలక్ష్యక్రమవ్యఙ్గస్యేతి - రౌద్రరసం యొక్క. వ్యఙ్గవిశిష్ట అని చెప్పడంచేత వ్యంగ్యం గుణ మని చెప్పబడినది. పదైః అనేది ఉపలక్షణార్థంలో తృతీయ. అందుచేత ఆ పదాలచేత ఉపలక్షితమైన, అనగా జ్ఞాప్యమైన (గుర్తించబడిన) (ఇది 'సంకీర్ణతా'కి విశేషణం) ఏ అర్థం గుణీభావంతో ఉంటుందో దానితో, సంమిశ్రతా= సంకీర్ణత్వం. ఈ సంకరం అనుగ్రాహ్యానుగ్రాహకభావంచేత, సందేహయోగంచేత, ఏకవ్యంజకానుప్రవేశంచేత మూడు విధాలుగా ఉన్నట్లు యథాసంభవంగా (ఎంతవరకు వీలు అవుతుందో అంతవరకు) రెండు ఉదాహరణలలోను అన్వయించాలి. ఎట్లనగా - 'మే యదరయః' ఇత్యాదిసమస్తపదార్థాలచేత, (రెండవ శ్లోకంలో) 'కర్తా' ఇత్యాదులచే విభావాదిరూపంలో ఉండి రౌద్రమే అనుగ్రహించ బడుచున్నది. ( ఈ విధంగా అనుగ్రాహ్యానుగ్రాహకరూపసంకరం).

'కర్తా' ఇత్యాదిశ్లోకంలో ప్రతిపదంలోను, ప్రతి అవాంతరవాక్యంలోను, ప్రతి సమాసంలోను కూడ వ్యంగ్యాన్ని ఊహించడానికి శక్యమే గాన వేరుగా వ్రాయలేదు. "పాణ్డవా యస్య దాసాః" అనేది ఆ దుర్యోధనుని మాటల అనుకరణం. వాచ్యమే క్రోధోద్దీపకంగా ఉండడంవల్ల అక్కడ గుణీభూతవ్యంగ్యత్వాన్ని కూడ నిరూపించవచ్చు. కృతకృత్యులైన దాసులు తప్పక ప్రభువుల్ని చూడాలి అని అర్థశక్త్యుద్భవానురణనరూపధ్వని కూడ అక్కడనే చెప్పవచ్చు. రెండు విధాలా సుందరంగానే ఉంది గాన ఒక పక్షాన్ని గ్రహించడంలో ప్రమాణం లేదు. ( ఈ విధంగా ఇక్కడ సందేహసంకరం). అవే పదాలు గుణీభూతవ్యంగ్యాన్నీ, విభావాదిద్వారా ప్రధానమైన రసాన్నీ వ్యంజింపచేయడంచేత ఏకవ్యంజకానుప్రవేశం ఉంది. (ఇది మూడవ రకమైన సంకరం). అత ఏవ చేతి - ఈ లక్ష్యంలో కనబడుతూన్నది గాన అని అర్థం. నన్వితి - (ఆశంక) వ్యంగ్యం గుణీభూతం, ప్రధానమైనదీ అనేది విరుద్ధమే. అందువల్ల లక్ష్యంలో కనబడినా అది అయుక్తం అవడంచేత విశ్వసించతగినది కాదు, అని ఆశంకించి వ్యంజకాలు వేరైనవి అవడం వల్ల విరోధం లేదు అని చూపుతున్నాడు - అత ఏవేతి. స్వేతి – స్వ(ధ్వని) ప్రభేదాంతరాలు సంకీర్ణము లయినట్లు వెనుక ఉదాహరించబడినవి గాన వాటినే దృష్టాంతంగా చూపుతున్నాడు. దానినే విశదీకరిస్తున్నాడు - యథా హీతి. ఇక్కడ "తథా అత్రాపి" అని అధ్యాహారం తెచ్చుకోవాలి. లేదా 'యథాహి' కి బదులు 'తథాహి' అని పాఠం ఉండి ఉండాలి.

## ధ్వన్యాలోకం

కిం చ ఏకవ్యఙ్గ్యాశ్రయత్వే తు ప్రధానగుణభావః విరుధ్యతే, న తు వ్యఙ్గ్యభేదాపేక్షయా; తతోఽప్యస్య న విరోధః. అయం చ సంకరసంసృష్టివ్యవహారో బహూనామేకత్ర వాచ్యవాచకభావ ఇవ వ్యఞ్జకభావేఽపి నిర్విరోధ ఏవ మన్తవ్యః. యత్ర తు పదాని కానిచిత్ అవివక్షితవాచ్యాని అనురణనరూపవ్యఙ్గ్యవాచ్యాని వా తత్ర ధ్వనిగుణీభూతవ్యఙ్గ్యయోః సంసృష్టత్వమ్. యథా-"తేషాం గోపవధూవిలాససుహృదామ్" ఇత్యాదౌ. అత్ర హి 'విలాససుహృదామ్' "రాధారహఃసాక్షిణామ్" ఇత్యేతే పదే ధ్వనిప్రభేదరూపే; 'తే', 'జానే'

ఇత్యేతే చ పదే గుణీభూతవ్యఙ్గ్యరూపే.

బాలానందిని

కించేతి. మరొక విషయం ఏమనగా - ఒకే వ్యంగ్యాన్ని ఆశ్రయించి ఉన్న ట్లయితే, అనగా ఒకే వ్యంగ్యార్థాన్ని ధ్వని అనీ గుణీభూతవ్యంగ్యం అనీ అన్నట్లయితే ప్రధానత్వగుణత్వాలకి విరోధం ఉంటుంది; కాని వ్యంగ్యాలు వేరైనప్పుడు విరోధం ఉండదు. ఆ కారణంవల్ల కూడ దీనికి విరోధం లేదు. వాచ్యవాచకభావంలో వలె వ్యంగ్యవ్యంజకభావంలో కూడ అనేకములు ఒక చోట కలిసినప్పుడు ఈ సంకర సంసృష్టివ్యవహారం విరోధరహితమే అని గ్రహించాలి. ఎక్కడైతే కొన్ని పదాలు అవివక్షితవాచ్యాలో కొన్ని అనురణనరూపవ్యంగ్యవాచ్యాలో అక్కడ ధ్వని గుణీభూతవ్యంగ్యాలకి సంసృష్టత్వం ఉంటుంది. ఎట్లనగా - "తేషాం గోపవధూ విలాససుహృదామ్" 'రాధారహః సాక్షిణామ్" అనే పదాలు ధ్వని ప్రభేదరూపాలు. 'తే' 'జానే' అనే పదాలు గుణీభూతవ్యంగ్యరూపాలు.

లోచనం

నను వ్యఞ్జకభేదాత్ ప్రథమభేదయోః పరిహారోఽస్తు. ఏకవ్యఞ్జకానుప్రవేశే తు కిం వక్తవ్యమిత్యాశఙ్క్య పారమార్థికం పరిహారమాహ - కిం చేతి.యతః అన్యద్వ్యఙ్గ్యం గుణీభూతమ్, అన్యచ్చ ప్రధానమితి కో విరోధః? నను వాచ్యాలంకారవిషయే శ్రుతోఽయం సంకరాదివ్యవహారః, న తు వ్యఙ్గ్య విషయే ఇత్యాశఙ్క్యాహ-అయం చేతి. మన్తవ్య ఇతి మననేన ప్రతీత్యా తథా నిశ్చేయః; ఉభయత్రాపి ప్రతీతేరేవ శరణత్వాదితి భావః. ఏవం గుణీభూతవ్యఙ్గ్య సంకరభేదాన్ త్రీనుదాహృత్య సంసృష్టిముదాహరతి - ,యత్ర తు పదానీతి. కాని చిదిత్యనేన సంకరావకాశం నిరాకరోతి. సుహృచ్ఛబ్దేన సాక్షిశబ్దేన చ అవివక్షితవాచ్యో ధ్వనిః, 'తే' ఇతి పదేన అసాధారణ గుణగణోఽభివ్యక్తోఽపి గుణత్వమవలమ్బతే; వాచ్యస్యైవ స్మరణస్య ప్రాధాన్యేన చారుత్వహేతుత్వాత్. 'జానే' ఇత్యనేన ఉత్ప్రేక్ష్యమాణానన్తధర్మవ్యఞ్జకేనాపి వాచ్యమేవ ఉత్ప్రేక్షణరూపం ప్రధానీక్రియతే - ఏవం గుణీభూతవ్యఙ్గ్యే ఽపి చత్వారః భేదాః ఉదాహృతాః.

బాలానందిని

నన్వితి. మొదటి రెండు భేదాలలో అనగా అనుగ్రాహ్యానుగ్రాహకభావం చేత, సందేహయోగంచేత సంకరాలలో, వ్యంజకముల భేదాన్ని పట్టి దోషపరిహారం జరిగినా ఏకవ్యంజకానుప్రవేశసంకరంలో ఏమి చెప్పాలి అని ఆశంకించి పారమార్థికమైన (అన్నింటికీ వర్తించే) దోషపరిహారం చెపుతున్నాడు - కించేతి. తతోఽపీతి - గుణీభూతవ్యంగ్యం వేరు; ప్రధానమైనది వేరు అయినప్పుడు విరోధం ఏముంది? నన్వితి. ఈ సంకరాదివ్యవహారం వాచ్యాలంకారాల విషయంలో విన్నాంకాని వ్యంగ్యం విషయంలో వినలేదే - అని ఆశంకించుకొని చెపుతున్నాడు - అయం చేతి. మన్తవ్య ఇతి - మననం చేత, ప్రతీతిచేత (స్పష్టంగా తెలుస్తూండడంచేత) ఆ విధంగా నిశ్చయించదగినది. రెండు స్థలాలలోనూ కూడ సంకరసంసృష్టులను అంగీకరించడానికి ప్రతీతియే శరణం అని భావం. ఏవమితి. ఈ విధంగా మూడు గుణీభూతసంకరభేదాలు ఉదాహరించి సంసృష్టిని ఉదాహరిస్తున్నాడు - యత్ర తు పదానీతి. 'కాని చిత్' అనడం చేత (కొన్ని అవివక్షితవాచ్యాలు కొన్ని అనురణనరూపవ్యంగ్యవాచ్యాలు అనడంచేత) సంకరానికి అవకాశాన్ని నిరాకరిస్తున్నాడు. 'సుహృత్' శబ్దంచేత 'సాక్షి' శబ్దంచేత అవివక్షితవాచ్యధ్వని. 'తే' అనే పదంచేత అసాధారణగుణగణం వ్యంగ్యం అయినా వాచ్యమైన స్మరణమే అక్కడ ప్రధానంగా చారుత్వానికి హేతువు అవడంవల్ల అది గుణత్వాన్నే (అప్రాధాన్యాన్నే) పొందుతుంది. 'జానే' అనేది ఊహింపబడే అనంతధర్మాలను వ్యంజింపచేసినా ఉత్ప్రేక్షణరూపమైన వాచ్యమే ప్రధానం చేయబడుతుంది. ఈ విధంగా గుణీభూతవ్యంగ్యంలో కూడ నాలుగు భేదాలు ఉదాహరించబడ్డాయి.

## ధ్వన్యాలోకం

వాచ్యాలంకారసంకీర్ణత్వమలక్ష్య క్రమవ్యఙ్గ్యాపేక్షయా రసవతి సాలంకారే కావ్యే సర్వత్ర సువ్యవస్థితమ్. ప్రభేదాన్తరాణామపి కదాచిత్సంకీర్ణత్వం భవత్యేవ. యథా మమైవ - -

శ్లో. యా వ్యాపారవతీ రసాన్ రసయితుం కా చిత్కవీనాం నవా
దృష్టిర్యా పరినిష్ఠితార్థవిషయోన్మేషా చ వైపశ్చితీ,
తే ద్వే అప్యవలమ్బ్య విశ్వమనిశం నిర్వర్ణయన్తో వయం
శ్రాన్తా నైవ చ లబ్ధమబ్ధిశయన త్వద్భక్తితుల్యం సుఖమ్. (122)

ఇత్యత్ర విరోధాలంకారేణ అర్థాన్తరసంక్రమితవాచ్యస్య ధ్వనిప్రభేదస్య సంకీర్ణత్వమ్.

బాలానందిని

వాచ్యేతి. రసవత్తులూ అలంకారసహితములూ అయిన అన్ని కావ్యాలలోను అలక్ష్యక్రమవ్యంగ్యాపేక్షచేత, అనగా దాని దృష్ట్యా, వాచ్యాలంకారసంకీర్ణత్వం చక్కగా వ్యవస్థితమై ఉంది. ప్రభేదాంతరాలకి కూడా (అలక్ష్యక్రమాలు కాని ఇతర ధ్వని ప్రభేదాలకు కూడా) ఒకప్పుడు సంకీర్ణత్వం ఉంటుంది. ఉదాహరణకు నా శ్లోకమే ఎట్లనగా -

యా ఇతి - రసాన్ = రసములను, రసయితుమ్=రసింపచేయడానికి, వ్యాపారవతీ=వ్యాపారం గల, కవీనామ్= కవులయొక్క, కా చిత్=ఒకానొక, నవా=నూతనమైన, యా=ఏ, దృష్టిః=దృష్టికలదో, పరినిష్ఠితార్థవిషయోన్మేషా= పరినిష్ఠితమైన (నిశ్చితమైన) అర్థాల విషయంలో వికాసం గల, వైపశ్చితీ= పండితుల సంబంధమైన, యా= ఏ దృష్టి ఉన్నదో, తే ద్వే అపి= ఆ రెండు దృష్టులను కూడ, అవలమ్బ్య=అవలంబించి, అనిశమ్= ఎల్లప్పుడూ, విశ్వమ్=ప్రపంచాన్ని, నిర్వర్ణయన్తః= చూస్తున్న, వయమ్=మేము, శ్రాన్తాః=అలిసిపోయినాము. అబ్ధిశయన=ఓ! క్షీరాబ్ధిశయనా! త్వద్భక్తితుల్యమ్=నీ భక్తితో సమానమైన, సుఖమ్=సుఖము, నైవ చ లబ్ధమ్=పొందబడలేదు.

ఇత్యత్రేతి - దీనిలో అర్థాంతరసంక్రమితవాచ్యం అనే ధ్వనిభేదానికి విరోధాలంకారంతో సంకీర్ణత్వం.

లోచనం

అధునా అలంకారగతాన్, తాన్ దర్శయతి- వాచ్యాలంకారేతి. వ్యఙ్గ్యత్వే త్వలంకారాణాముక్తభేదాష్టక ఏవాన్తర్భావ ఇతి వాచ్యశబ్దస్యాశయః. కావ్య ఇతి. ఏవంవిధమేవ హి కావ్యం భవతి. సువ్యవస్థితమితి - "వివక్షా తత్పరత్వేన" ఇతి ద్వితీయోద్యోతమూలోదాహరణేభ్యః సంకరత్రయం సంసృష్టిశ్చ లభ్యత ఏవ. "చలాపాఙ్గాం దృష్టిమ్" ఇత్యత్ర హి రూపకవ్యతిరేకస్య ప్రాగ్వ్యాఖ్యాతస్య శృఙ్గారానుగ్రాహకత్వమ్. స్వభావోక్తేః శృఙ్గారస్య చ ఏకానుప్రవేశః. "ఉప్పహజాయా" ఇతి గాథాయాం పామరస్వభావోక్తిర్వా

ధ్వనిర్వా ఇతి ప్రకరణాద్యభావే ఏకతరగ్రాహకం ప్రమాణం నాస్తి. యద్యప్యలంకారః రసమ్ అవశ్యమనుగృహ్ణాతి, తథాపి 'నాతినిర్వహణైషితా' ఇతి యదభిప్రాయేణోక్తం తత్ర సంకరాసంభవాత్ సంసృష్టిరేవ అలంకారేణ రసధ్వనేః. యథా - "బాహులతికాపాశేన బద్ధ్వా దృఢమ్" ఇత్యత్ర. ప్రభేదాన్తరాణామపీతి. రసాదిధ్వనివ్యతిరిక్తానామ్.

బాలానందిని

అధునేతి. ఇప్పుడు అలంకారగతాలైన భేదాలను చూపుతున్నాడు - వాచ్యాలంకారేతి. అలంకారాలు వ్యంగ్యాలయితే వాటికి పైన చెప్పిన ఎనిమిది భేదాలలోనే అంతర్భావం, అని 'వాచ్య' శబ్దం ప్రయోగించడంలో అభిప్రాయం. కావ్య ఇతి. ఇలాంటిదే కదా 'కావ్యం' అవుతుంది అని భావం. సువ్యవస్థితమితి. "వివక్షా తత్పరత్వేన" (కా.2.18) అనే సందర్భంలో ఇచ్చిన మూలోదాహరణాలలోనే సంకరత్రయమూ, సంసృష్టి కూడ లభిస్తుంది. "చలాపాఙ్గామ్" (శ్లో.30) అనే చోట పూర్వం వివరించబడిన రూపకవ్యతిరేకం (రూపకసహితవ్యతిరేకం) శృంగారాను గ్రాహకంగా ఉంది. స్వభావోక్తి శృంగారం ఈ రెండింటికీ ఒక చోట (శ్లోకంలో) అను ప్రవేశం. (ఈ విధంగా రెండు విధాలైన సంకరాలున్నా యని భావం) "ఉప్పహజాయా" (శ్లో. 121) అనే గాథలో పామరస్వభావోక్తియా లేక ధ్వనియా అని ఒకదాన్ని నిర్ణయించడానికి ప్రకరణాదు లేవీ లేక పోవడం చేత ప్రమాణం ఏదీ లేదు. (ఇది సందేహసంకరానికి ఉదాహరణం). యద్యపీతి. అలంకారం తప్పకుండా రసాన్ని అనుగ్రహిస్తుంది. అయినా కూడ "నాతినిర్వహణైషితా" (కా.2.18) అని ఏ అభిప్రాయంచేత చెప్పబడిందో (అనుగ్రాహ్యానుగ్రాహకభావం అలంకారానికీ రసానికీ మధ్య లేదనే ఏ అభిప్రాయంఛేత చెప్పబడిందో) దానిని అనుసరించి సంకరం అసంభవం గాన రసధ్వనికి అలంకారంతో సంసృష్టిమాత్రమే. ఎట్లనగా - "బాహులతికాపాశేన బద్ధ్వా దృఢమ్" (శ్లో.36) అనే శ్లోకంలో. (దీనిలో రూపకాలంకారంతో రసానికి సంసృష్టియే అని భావం) ప్రభేదాన్తరాణామపీతి: రసాదిధ్వనివ్యతిరిక్తమైనవాటికి

లోచనం

వ్యాపారవతీతి. నిష్పాదనప్రాణో హి రస ఇత్యుక్తమ్. తత్ర విభావాదియోజనాత్మికా వర్ణనా తతః ప్రభృతి ఘటనాపర్యన్తా క్రియా వ్యాపారః,

తేన సతతయుక్తా. రసానితి - రస్యమానతాసారాన్ స్థాయిభావాన్, రసయితుమ్ రస్యమానతాపత్తియోగ్యాన్ కర్తుమ్ కాచిదితి లోకవార్తా పతితబోధావస్థాత్యాగేన ఉన్మీలన్తీయ అత ఏవ తే కవయః, వర్ణనాయోగా త్తేషామ్. **నవేతి**. క్షణే క్షణే నూతనైర్నూతనైః వైచిత్ర్యైః జగన్తి ఆసూత్రయన్తీ. దృష్టిరితి - ప్రతిభారూపా. తత్ర దృష్టిః చాక్షుషం జ్ఞానం షాడబాది రసయతీతి విరోధాలంకారః. అత ఏన నవా. తదను గృహీతశ్చ ధ్వనిః. తథాహి - చాక్షుషం జ్ఞానం న అవివక్షితమ్; అత్యన్తమసంభవాభావాత్. న చాన్యపరమ్; అపి త్వర్థాన్తరే ఐన్ద్రియికవిజ్ఞానాభ్యాసోల్లసితే ప్రతిభానలక్షణేఽర్థే సంక్రాన్తమ్. సంక్రమణే చ విరోధః అనుగ్రాహక ఏవ, తద్వ్యక్త్యతి- విరోధాలంకారేణేత్యాదినా. యా చైవం విధా దృష్టిః. పరినిష్ఠితః అచలః అర్థవిషయే నిశ్చేతవ్యే విషయే ఉన్మేషో యస్యాః. తథా పరినిష్ఠితే లోకప్రసిద్ధేఽర్థే న తు కవివదపూర్వస్మి న్నర్థే ఉన్మేషో యస్యాః సా. విపశ్చితామియం వైపశ్చితీ. తే అవలమ్బ్యేతి. కవీనామితి, వైపశ్చితీ ఇతి వచనేన నాహం కవిః, న పణ్డితః ఇత్యాత్మనః అనౌద్ధత్యం ధ్వన్యతే. అనాత్మీయమపి దరిద్రగృహ ఇవ ఉపకరణతయా అన్యత ఆహృతమేతన్మయా దృష్టిద్వయమిత్యర్థః. తే ద్వే అపీతి - న హ్యేకయా దృష్ట్యా సమ్యక్ నిర్వర్ణనం నిర్వహతి.

బాలానందిని

వ్యాపారవతీతి. రసానికి ప్రాణం నిష్పాదనమే అని చెప్పబడింది కదా? విభావాదులను కూర్చడమనే స్వరూపం గల వర్ణన, అది మొదలు శబ్దార్థాల ఘటన (కూర్పు) వరకు ఉన్న క్రియ 'వ్యాపారం'. ఆ వ్యాపారంతో ఎల్లప్పుడూ కూడినది. రసానితి. 'రసాన్' అనగా - రస్యమానత్వమే (ఆస్వాదించబడడమే) సారంగా గల స్థాయిభావాలను. రసయితుమ్= రస్యమానత్వాన్ని పొందడానికి యోగ్యమైన వాటినిగా చేయుటకు. కాచిదితి - లోకవార్తకు చెందిన (లౌకికమైన) బోధావస్థను (జ్ఞానాన్ని) విడవడంచేత వికసించేది. అందువల్లనే వాళ్లు కవులు. వాళ్లలో వర్ణనం ఉంటుంది కదా? నవేతి- క్షణక్షణంలోను నూత్నవినూత్నాలైన వైచిత్ర్యాలతో జగత్తులను బంధిస్తుంది. (వైచిత్ర్యాలను సమకూరుస్తుంది). దృష్టిః - ప్రతిభారూపమైన దృష్టి.

ఇక్కడ దృష్టి అనగా నేత్రాలవల్ల కలిగే జ్ఞానం. దృష్టి షాడబాదులను (షాడబం అనగా అనేకసుగంధద్రవ్యాదులు చేర్చి తయారుచేసిన మధురచోష్యం లేదా పేయం) ఆస్వాదిస్తుంది అనిచెప్పడంచేత విరోధాలంకారం. అందుచేతనే ఇది 'న వా' అని చెప్పబడింది. దానిచేత ధ్వని అనుగ్రహించబడింది. ఎట్లనగా - చాక్షుషజ్ఞానం అత్యంతం అసంభావ్యం కాదు గాన అవివక్షితం కాదు. (కవిలో ఉన్న చంద్రోదయాది చాక్షుషజ్ఞానం కూడ రసనిష్పాదనానికి ఉపయోగిస్తుంది కదా?) అన్యపరం(వ్యంగ్యపరం) గా వివక్షితం కూడ కాదు. మరేమనగా ఇది - ఆ యా ఇంద్రియాలవల్ల కలిగే జ్ఞానం యొక్క అభ్యాసంచేత ప్రకాశితమైన ప్రతిభారూపమైన అర్థంలో సంక్రమించింది. (ఇక్కడ దృష్టి (చాక్షుషిజ్ఞానం) అనగా ప్రతిభ అని అర్థం అని భావం). ఈ విధంగా అర్థాంతరసంక్రమణానికి విరోధం అనుగ్రాహకం. (విరోధం ఉండడంవల్లనే ఈ అర్థం చెప్పబడింది అని అర్థం). ఈ విషయమే "విరోధాలంకారేణ" ఇత్యాదికంచేత చెప్పబోతున్నాడు యేతి:- ఈ విధమైన ఏ దృష్టి ఉన్నదో అదీ, - పరినిష్ఠితః = నిశ్చయించవలసి ఉన్న అర్థం (తత్త్వం) విషయంలో నిశ్చలమైన, ఉన్మేషం కలది- పరినిష్ఠితార్థవిషయోన్మేషం. మరొక అర్థం చెపుతున్నాడు - తథా ఇతి. పరినిష్ఠితమైన అనగా ఒక ప్రసిద్ధమైన అర్థంలో అంతే కాని కవుల వలె అపూర్వమైన (నూతనమైన) అర్థంలో కాదు, ఉన్మేషం (వికాసం) దేనికో అట్టి , వైపశ్చితీ = పండితులకు సంబంధించిన దృష్టి. తే అవలమ్బ్యేతి - 'కవీనామ్' అని, 'వైపశ్చితీ' అనీ అనడం చేత నేను కవినీ కాను, పండితుడనూ కాను అని తన అనౌద్ధత్యం (గర్వరాహిత్యం) ధ్వనించబడుతున్నది. ఈ దృష్టిద్వయం నాది కాకపోయినా, దరిద్రుడు ఇతరుల ఉపకరణాలు తన ఇంటికి తీసికొనివచ్చి (ఎరువుతెచ్చికొని) ఉపయోగించుకొన్నట్లు, నేను మరొకరినుండి తీసుకున్నాను అని అర్థం. తే ద్వే అపి ఇతి - ఒక దృష్టితో (కంటితో) బాగా చూడడం జరగదు కదా?

## లోచనం

విశ్వమితి - అశేషమ్. అనిశమితి - పునః పునః, అనవరతమ్, నిర్వర్ణయన్తః వర్ణనయా తథా నిశ్చితార్థం వర్ణయన్తః ఇద మిత్థమితి పరామర్శానుమానాదినా నిర్భుజ్య నిర్వర్ణనం కిమత్ర సారం స్యాదితి తిలశస్తిలశః విచయనమ్. యచ్చ నిర్వర్ణ్యతే తత్ ఖలు మధ్యే వ్యాపార్యమాణయా మధ్యే చార్థవిశేషేషు నిశ్చితోన్మేషయా నిశ్చలయా దృష్ట్యా సమ్యఙ్నిర్వర్ణితం భవతి. వయమితి - మిథ్యాతత్త్వదృష్ట్యాహరణవ్యసనినః ఇత్యర్థః. శ్రాన్తా ఇతి - న కేవలం సారం న లబ్ధం యావత్ ప్రత్యుత ఖేదః ప్రాప్త ఇతి

భావః. చశబ్దస్తుశబ్దస్యార్థే. అబ్ధిశయనేతి - యోగనిద్రయా త్వమత ఏవ సారస్వరూపవేదీ స్వరూపావస్థిత ఇత్యర్థః. శ్రాన్తస్య శయనస్థితం ప్రతి బహుమానో భవతి. త్వద్భక్తీతి. త్వమేవ పరమాత్మస్వరూపః విశ్వసారః తస్య భక్తిః శ్రద్ధాపూర్వక ఉపాసనాక్రమజః తదావేశః తేన తుల్యమపి న లబ్ధమ్. ఆస్తాం తావత్తజ్జాతీయమ్.

బాలానందిని

విశ్వమితి - సమస్తమైన. అనిశమ్ ఇతి - మాటిమాటికి, నిరంతరమూ, నిర్వర్ణయన్తః= వర్ణనచేత చూస్తున్నవారమై ( ఇది మొదటి దృష్టి) అట్లే నిశ్చితార్థరూపంలో ఇది ఇట్లు అని పరామర్శ- అనుమానాదులచేత విభజించి చూస్తున్న వాళ్లమై (ఇది రెండవదృష్టి) నిర్వర్ణనం అనగా "ఇక్కడ సారం ఏది అయి ఉంటుంది" అని తిలశః తిలశః చేసి, (చిన్నచిన్న ముక్కలు చేసి) అన్వేషించడం. ఏదైతే పరిశీలించబడుతుందో అది మధ్యమధ్య ప్రసరింపచేయబడేదీ, మధ్య మధ్య అర్థవిశేషాలలో నిశ్చితమైన వికాసం కలదీ అయిన దృష్టిచేత బాగా చూడబడుతుంది కదా? వయమితి. మిథ్యాదృష్టి తత్త్వదృష్టులను గ్రహించడంలో వ్యసనం గల మేము, (కవిదృష్టి మిథ్యాదృష్టి. విపశ్చిద్దృష్టి తత్త్వదృష్టి). శ్రాన్తా ఇతి - సారం పొందబడకపోవడమే కాకుండా పైగా అలసట పొందబడింది అని భావం. 'చ' శబ్దం 'తు' శబ్దార్థంలో ప్రయోగించబడింది. (నైవ తు లబ్ధమ్ - కాని సుఖం పొందబడలేదు అని అర్థం). అబ్ధిశయనేతి. నువ్వు యోగనిద్రతో, అందువల్లనే సారస్వరూపం తెలిసినవాడవై, స్వస్వరూపంలో ఉన్నావు అని అర్థం. అలిసిపోయిన వానికి శయనంమీద ఉన్నవాని విషయంలో బహుమానబుద్ధి - ఇతడు ఎంత అదృష్టవంతుడు అనే బుద్ధి - కలుగుతుంది. త్వద్భక్తీతి - పరమాత్మ స్వరూపుడవైన నువ్వే ప్రపంచసారభూతుడవు. అట్టివానియందు భక్తి అనగా శ్రద్ధాపూర్వమైన ఉపాసనాక్రమంవల్ల కలిగిన తత్స్వరూపావేశం; అంతఃకరణవృత్తి తదాకారంగా అవడం. దానితో సజాతీయమైనది లభించకపోవడం మాట అటుంచి దానితో తుల్యమైనది కూడ పొందబడలేదు.

లోచనం

ఏవం ప్రథమమేవ పరమేశ్వరభక్తిభాజః కుతూహలమాత్రావలమ్బిత కవిప్రామాణికోభయవృత్తేః పునరపి పరమేశ్వరభక్తివిశ్రాన్తిరేవ యుక్తేతి మన్వానస్యేయముక్తిః. సకలప్రమాణపరినిశ్చితదృష్టాదృష్టవిశేషజం యత్ సుఖం, యదపి వా లోకోత్తరం రసచర్వణాత్మకం తత ఉభయతోఽపి

పరమేశ్వరవిశ్రాన్త్యానన్దః ప్రకృష్యతే. తదానన్దవిప్రుణ్మాత్రావభాసో హి రసాస్వాద ఇత్యుక్తం ప్రాగస్మాభిః. లౌకికం తు సుఖం తతో ఽపి నికృష్టప్రాయం బహుతరదుఃఖానుషఙ్గాదితి తాత్పర్యమ్. తత్రైవ దృష్టిశబ్దాపేక్షయా ఏకపదానుప్రవేశః. దృష్టిమవలమ్బ్య నిర్వర్ణనమితి విరోధాలంకారో వా ఆశ్రీయతామ్, అన్ధపదన్యాయేన దృష్టిశబ్దః అత్యన్తతిరస్కృతవాచ్యో వాస్తు. ఇత్యేకతరనిశ్చయే నాస్తి ప్రమాణమ్. ప్రకారద్వయేనాపి హృద్యత్వాత్. న చ పూర్వత్రాప్యేవం వాచ్యమ్; న వా శబ్దేన శబ్దశక్త్యనురణనయా విరోధస్య సర్వథావలమ్బనాత్.

బాలానందిని

ఏవమితి : ఈ విధంగా మొదటినుంచీ పరమేశ్వరభక్తి ఉన్నవాడై కుతూహలమాత్రం చేత కవివృత్తినీ, ప్రామాణికవృత్తినీ రెండింటినీ అవలంబించి, చివరికి పరమేశ్వరభక్తి యందు విశ్రాంతియే యుక్తమైనది అనుకొనే వాని మాట ఇది. సకలప్రమాణాలచేత నిశ్చితమైన, దృష్టములూ అదృష్టములూ అయిన విషయవిశేషాలవల్ల ఏ సుఖం కలుగుతుందో, రసచర్వణాత్మకమైన లోకోత్తరమైన ఏ సుఖం ఉన్నదో ఆ రెండింటికంటె కూడ పరమేశ్వర విశ్రాంత్యానందం ప్రకృష్టంగా ఉంటుంది. రసాస్వాదం పరమాత్మానందం యొక్క తుంపర్ల అవభాసం మాత్రమే అని వెనుక మేము చెప్పి ఉన్నాము. అనేకదుఃఖాలతో సంబంధించి ఉండడంవల్ల లౌకికం దానికంటె కూడ నికృష్టప్రాయమైనది అని తాత్పర్యం. శ్లోకంలో 'దృష్టి' శబ్దాపేక్షచేత ఏకపదానుప్రవేశం. అనగా 'దృష్టి' పదంలో అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనికి విరోధాలంకారంతో ఏకపదానుప్రవేశరూపసంకరం అని అర్థం. ఈ విధంగా ఇక్కడ వెనక చెప్పినట్లు అనుగ్రాహ్యానుగ్రాహకభావరూపసంకరం, ఏకపదానుప్రవేశరూపసంకరం కూడా ఉన్నాయి. దృష్టీతి - దృష్టిని అవలంబించి చూడడం అని విరోధాలంకారమైన గ్రహించవచ్చును. అనగా "తే ద్వే అప్యవలమ్బ్య" "ఆ రెండు దృష్టులను అవలంబించి" అన్నప్పుడు దృష్టి అనగా చూడడం గాన "చూడడం చేత చూస్తున్నాము" అని విరోధం అని భావం. లేదా "నిః శ్వాసాన్ధః" అన్నప్పుడు 'అన్ధ' పదం విషయంలో చెప్పినట్లు 'దృష్టి' శబ్దం అత్యంతతిరస్కృతవాచ్యం అయినా కావచ్చు. అట్లయినా 'ప్రతిభ' అనే అర్థాన్ని బోధించవచ్చును అని అర్థం. ఈ విధంగా రెండు ప్రకారాలలోను మనోహరంగానే ఉంది గాన ఒక దానిని నిశ్చయించడానికి ప్రమాణం ఏది లేదు. (అందుచేత సందేహసంకరం అని అర్థం) . న

చేతి. వెనక కూడ ("యా దృష్టిః రసాన్ రసయితుం వ్యాపారవతీ" అన్నప్పుడు కూడ) ఇట్లే అని చెప్పడం కుదరదు. ఎందువల్లననగా - 'న వా' శబ్దం శబ్దశక్త్యనురణనచేత అన్ని విధాలా విరోధాన్ని ఆధారంగా చేసుకున్నది.

## ధ్వన్యాలోకం

వాచ్యాలంకారసంసృష్టత్వం పదాపేక్షయైవ - యత్ర హి కానిచిత్పదాని వాచ్యలంకారభాఞ్జి కానిచిచ్చ ధ్వనిప్రభేదయుక్తాని. యథా-

శ్లో. దీర్ఘీకుర్వన్ పటు మదకలం కూజితం సారసానాం
ప్రత్యూషేషు స్ఫుటితకమలామోదమైత్రీకషాయః,
యత్ర స్త్రీణాం హరతి సురతగ్లానిమఙ్గానుకూలః.
సిప్రావాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః. (మేఘ.1.31)
(123)

అత్ర హి మైత్రీపదమవివక్షితవాచ్యో ధ్వనిః. పదాన్తరేష్వలంకారాన్తరాణి.

### బాలానందిని

వాచ్యాలంకారేతి. వాచ్యాలంకారసంసృష్టత్వం (వ్యంగ్యం వాచ్యాలంకారంతో సంసృష్టి పొందడం) పదాపేక్షచేతనే (పదాలను పట్టి మాత్రమే). ఎక్కడ కొన్ని పదాలు వ్యాచ్యాలంకారాలను పొంది ఉంటాయో, కొన్ని పదాలు ధ్వనిభేదాలతో కూడి ఉంటాయో అక్కడనే వీటి సంసృష్టి. ఎట్లనగా -

దీర్ఘీకుర్వన్నితి. యత్ర =ఎక్కడ, సారసానామ్=సారసపక్షులయొక్క, మదకలమ్= మదంచేత మధురమైన, కూజితమ్= కూతను, పటు=అధికంగా, దీర్ఘీకుర్వన్=దీర్ఘం చేస్తూన్నదీ, స్ఫుటితకమలామోదమైత్రీకషాయః=వికసించిన పద్మాల సువాసనచేత కషాయమూ, అఙ్గానుకూలః=శరీరానికి అనుకూలంగా ఉండేదీ అయిన, సిప్రావాతః= సిప్రానదిమీదినుండి వచ్చే గాలి, ప్రత్యూషేషు=ఉషఃకాలములయందు, ప్రార్థనా చాటుకారః=ప్రార్థనారూపమైన చాటువాక్యములు(ప్రీతికరమైన మాటలు) పలుకుచున్న, ప్రియతమః ఇవ=ప్రియతముడు వలె, స్త్రీణామ్=స్త్రీలయొక్క, సురతగ్లానిమ్= సురతశ్రమను, హరతి=హరించుచున్నదో.

అత్రేతి - ఇక్కడ 'మైత్రీ' పదం అవివక్షితవాచ్యధ్వని. ఇతరపదాలలో అలంకారాంతరాలు ఉన్నాయి.

లోచనం

ఏవం సంకరం త్రివిధముదాహృత్య సంసృష్టిముదాహరతి - వాచ్యేతి. సకలవాక్యే హి యద్యలంకారోఽపి వ్యఙ్గ్యార్థోఽపి ప్రధానం తదానుగ్రాహ్యానుగ్రాహకత్వసంకరః. తదభావే తు అసంగతిరితి అలంకారేణ వా ధ్వనినా వా పర్యాయేణ ద్వాభ్యామపి వా యుగపత్ పదవిశ్రాన్తాభ్యాం భావ్యమితి త్రయో భేదాః. ఏతద్గర్భీకృత్య సావధారణ మాహ - పదాపేక్షయైవేతి. యత్ర అనుగ్రాహ్యానుగ్రాహకభావం ప్రత్యాశంకాపి నావతరతి తం తృతీయమేవ ప్రకారముదాహర్తుముపక్రమతే - యత్ర హీతి. యస్మాద్యత్ర కాని చిదలంకారభాఞ్జి, కాని చిత్ ధ్వనియుక్తాని యథా దీర్ఘీకుర్వన్నిత్యత్రేతి. తథావిధపదాపేక్షయైవ వాచ్యాలంకారసంసృష్టత్వమితి ఆవృత్త్యా పూర్వగ్రన్థేన సంబన్ధః. అత్ర హీతి - అత్రత్యః హిశబ్ద ః మైత్రీపదమిత్యస్యానన్తరం యోజ్య ఇతి గ్రన్థసంగతిః.

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా త్రివిధసంకరాన్ని ఉదాహరించి సంసృష్టిని ఉదాహరిస్తున్నాడు - వాచ్యేతి. సకలవాక్యంలో అలంకారం ప్రధానం అయి వ్యంగ్యార్థం కూడ ప్రధానమైతే అప్పుడు అనుగ్రాహ్యానుగ్రాహకత్వసంకరం ఉంటుంది. అది (సంకరం) లేకపోతే అసంగతంగా ఉంటుంది. అందుచేత అలంకారం కాని, ధ్వని కాని పర్యాయంచేత (ఒకసారి అలంకారం, ఒకసారి ధ్వని) లేదా రెండూ కలిసి ఒకే పర్యాయం కాని పదాలలో విశ్రాంతాలు కావాలి. ఈ విధంగా మూడు భేదాలు. ఈ విషయాన్ని గర్భంలో ఉంచుకొని నిశ్చయపూర్వకంగా పదాపేక్షయైవ అని చెపుతున్నాడు. సకలవాక్యంలో అయితే సంకరమే కాబట్టి సంసృష్టి పదాలను పట్టి మాత్రమే ఏర్పడుతుంది అని అర్థం. ఆ సంసృష్టి, అలంకారం పదవిశ్రాంతం అవడం, ధ్వని పదవిశ్రాంతం అవడం, రెండూ పదవిశ్రాంతా లవడం అనే భేదాన్ని పట్టి త్రివిధాలని అర్థం.

యత్రేతి . ఏ కారణం వల్ల ఎక్కడైతే అనుగ్రాహ్యానుగ్రాహకభావం ఉంటుందనే ఆశంకకు కూడా అవకాశం ఉండదో అలాంటి మూడవ ప్రకారాన్నే ఉదాహరించడానికి

ఉపక్రమిస్తున్నాడు - యత్ర హీతి. 'దీర్ఘీకుర్వన్' ఇత్యాదిశ్లోకంలో వలె ఎక్కడ కొన్ని పదాలు అలంకారాలు కలవై ఉంటాయో, కొన్ని ధ్వనితో కూడినవి అయి ఉంటాయో అక్కడ, ఆ కారణంవల్ల, ఆ విధమైన పదాల అపేక్షచేతనే వాచ్యాలంకారసంసృష్టత్వం అని ఆవృత్తిచేత పూర్వగ్రంథంతో సంబంధం (అన్వయం) చెయ్యాలి.

అత్రహీతి. ఇక్కడ ఉన్న 'హి' శబ్దం 'మైత్రీపదం' తరవాత చేర్చాలి అని గ్రంథసంగతి. "అత్ర మైత్రీపదం హి" అని అన్వయించుకోవాలని అర్థం.

లోచనం

దీర్ఘీకుర్వన్నితి - సిప్రావాతేన హి దూరమప్యసౌ శబ్దో నీయతే. తథా సుకుమారపవనస్పర్శజాతహర్షాః చిరం కూజన్తి; తత్కూజితం చ వాతాన్దోలిత సిప్రాతరంగజమధురశబ్దమిశ్రం భవతీతి దీర్ఘత్వమ్. పట్వీతి. తథాసౌ సుకుమారో వాయుః యేన తజ్జః శబ్దః సారసకూజితమపి నాభిభవతి, ప్రత్యుత తత్సబ్రహ్మచారీ తదేవ దీపయతి. న చ దీపనం తదీయమనుపయోగి యతః తన్మదేన కలం మధురమాకర్ణనీయమ్. ప్రత్యూషేష్వితి. ప్రభాతస్య తథావిధసేవావసరత్వమ్. బహువచనం సదైవ తత్రైషా హృద్యతేతి నిరూపయతి. స్ఫుటితాన్యన్తర్వర్తమానమకరన్దభరేణ. తథా స్ఫుటితాని వికసితాని నయన హారీణి యాని కమలాని తేషాం యః ఆమోదః తేన యా మైత్రీ అభ్యాసాజ్ఞావియోగపరస్పరానుకూల్యలాభః తేన కషాయః ఉపరక్తః, మకరన్దేన చ కషాయవర్ణీకృతః, స్త్రీణామితి:- సర్వస్య తథావిధస్య త్రైలోక్య సారభూతస్య య ఏవం కరోతి సురతకృతాం గ్లానిం తాన్తిం హరతి. అథ చ తద్విషయాం గ్లానిం పునఃసంభోగాభిలాషోద్దీపనేన హరతి.

బాలానందిని

దీర్ఘీకుర్వన్నితి - సిప్రానదీవాతంచేత ఆ శబ్దం దూరంగా కూడ తీసికొని వెళ్లబడుతున్నది. అట్లే (మరొక అర్థం) సుకుమారమైన పవనంయొక్క స్పర్శచేత సంతోషాతిశయం కలగగా అవి చాలసేపు కూస్తున్నాయి. ఆ కూజితం గాలిచేత కదల్చబడిన సిప్రాతరంగాలనుండి పుట్టిన మధురశబ్దంతో కలుస్తూండడంచేత దీర్ఘం అవుతున్నది. పట్వీతి - ఆ వాయువు ఎంత సుకుమారమైన దనగా - దాని వలన కలిగిన శబ్దం సారసపక్షుల కూజితాన్ని కప్పివేయకుండడమే కాకుండా దానితో సమానమై

దానినే ఉద్దీపింపచేస్తూన్నది. అవి చేసే దీపనం అనుపయోగి కాదు ఎందువలన అనగా అది మదంచేత కలమై, మధురమై వినడానికి సొంపుగా ఉన్నది. ప్రత్యూషేష్వితి. ప్రభాతసమయమే ఆ విధమైన సేవ చేయడానికి సమయం. 'ప్రత్యూషేషు' అని బహువచనం అక్కడ ఎల్లప్పుడు ఇలాంటి మనోహరత్వం ఉన్నదని నిరూపిస్తూన్నది స్ఫుటితాని - లోపల నున్న మకరందభారంచేత చిట్లినవి. అట్లే (మరొక అర్థం) వికసించినవి, నేత్రమనోహరాలు అయిన ఏ కమలాలు కలవో వాటి ఏ సువాసన గలదో దానితో ఏ మైత్రి గలదో, అనగా అభ్యాసంగం (కలిసి ఉండడం) యొక్క వియోగం లేకపోవడంచేత (అది అవిచ్ఛిన్నంగా ఉండడంచేత) పరస్పరము అనుకూలత్వలాభం గలదో దానిచేత, కషాయః = పూయబడినది, (మరొక అర్థం) మకరందంచేత కషాయవర్ణం కలదిగా చేయబడినది. స్త్రీణామితి. ముల్లోకాలలో సారమైన ఆ విధమై సకలస్త్రీ జనానికీ ఏది ఈ విధంగా చేస్తుందో, సురతంవల్ల కలిగిన గ్లానిని, అలసటను, హరిస్తుందో, మరియు (మరొక అర్థం) సురతాన్ని గూర్చిన గ్లానిని పునఃసంభోగేచ్ఛను ఉద్దీప్తం చేయడంచేత హరిస్తుందో.

లోచనం

న చ ప్రసహ్య ప్రభుతయా, అపి తు అఙ్గానుకూలః హృద్యస్పర్శః, హృదయాన్తర్భూతశ్చ. ప్రియతమే తద్విషయే ప్రార్థనార్థం చాటూని కారయతి - ప్రియతమోఽపి తత్పవనస్పర్శప్రబుద్ధసంభోగాభిలాషః ప్రార్థనార్థం చాటూని కరోతీతి తేన తథా కార్యత ఇతి పరస్పరానురాగప్రాణశృఙ్గారసర్వస్వభూతోఽసౌ పవనః. యుక్తం చైతత్తస్య, యతః సిప్రాపరిచితోఽసౌ వాత ఇతి నాగరికో న త్వవిదగ్ధో గ్రామ్యప్రాయ ఇత్యర్థః. ప్రియతమోఽపి రతాన్తే అఙ్గానుకూలః సంవాహనాదినా. ప్రార్థనార్థం చాటుకారః ఏవమేవ సురతగ్లానిం హరతి. కూజితం చానఙ్గీకరణవచనాది మధురధ్వనితం దీర్ఘీకరోతి చాటు కరణావసరే చ స్ఫుటితం వికసితం యత్కమలకాన్తి ధారి వదనం తస్య యా ఆమోదమైత్రీ, సహజసౌరభపరిచయః తేన కషాయః ఉపరక్తః భవతి. అఙ్గేషు చాతుష్షష్టిక ప్రయోగేషు అనుకూలః. ఏవం శబ్దరూపగన్ధస్పర్శాః యత్ర హృద్యాః, యత్ర చ పవనోఽపి తథా నాగరికః, స త వావశ్యమభిగన్తవ్యో దేశ ఇతి మేఘదూతే మేఘం ప్రతి కామిన ఇయముక్తిః. ఉదాహరణే లక్షణం యోజయతి -

మైత్రీపదమితి. 'హి' శబ్దః అనన్తరం పఠనీయ ఇత్యుక్తమేవ. అలంకారాన్తరాణీతి - ఉత్ప్రేక్షాస్వభావోక్తిరూపకోపమాః క్రమేణేత్యః.

బాలానందిని

న చేతి. సమర్థుడవడంచేత బలాత్కారంగా కాదు; మరేమనగా - అఙ్గానుకూలః=మనోహరమైన స్పర్శగలది; హృదయంలో అంతర్భూతమైనది కూడ. ప్రియతముని యందు, వానివిషయంలో ప్రార్థనకొరకు చాటువులను చేయిస్తుంది. ('ప్రియతమే' అని సప్తమిని గ్రహించి ఈ అర్థం చెప్పబడింది) ప్రియతముడు కూడ ఆ పవనస్పర్శచేత ఉద్బుద్ధమైన సంభోగాభిలాష గలవాడై ప్రార్థనకొరకై చాటువులను చేస్తాడు. వాయువు ఆతనిచేత అలా చేయిస్తుంది. ఈ విధంగా ఈ పవనం పరస్పరానురాగప్రాణమైన శృంగారానికి సర్వస్వమైనది. ఆ పవనం అలా ఉండడం యుక్తమే కూడ . ఎందువల్లననగా ఈ పవనానికి సిప్రతో పరిచయం ఉంది అందుచేత నాగరికుడు, అంతే కాని వైదగ్ధ్యం లేని గ్రామ్యజనుడు వంటివాడు కాదు.

ఉపమానమైన ప్రియతమునికి విశేషణాలు అన్వయిస్తున్నాడు - ప్రియతమోఽపీతి. ప్రియతముడు కూడ రతాంతంలో సంవాహనాదులచేత శరీరానికి అనుకూలుడై ప్రార్థనకోసం చాటువాక్యాలు పలుకుతూ ఈ విధంగానే సురతగ్లానిని పోగొడతాడు, కూజితాన్ని, అనంగీకారవచనాది మధురధ్వనిని కూడ దీర్ఘం చేస్తాడు. చాటువాక్యాలు పలికేటప్పుడు వికసించిన, కమలకాంతిని ధరించిన ముఖంయొక్క ఆమోదమైత్రిచేత, సహజసౌరభసంబంధంచేత, వ్యాప్తుడవుతాడు ('అఙ్గానుకూలః'కు మరొక అర్థం) అంగాలలో, చతుఃషష్టికళల ప్రయోగంలో, అనుకూలుడుగా ఉంటాడు. ఈ విధంగా ఏ దేశంలో (ఉజ్జయినిలో) శబ్దరూపగంధస్పర్శలు మనోహరంగా ఉంటాయో, వాయువు కూడ నాగరికుడో ఆ దేశానికి నువ్వు తప్పక వెళ్ళాలి అని మేఘదూతంలో కామియైన యక్షుని వచనం ఇది. ఉదాహరణలో లక్షణాన్ని కూరుస్తున్నాడు - మైత్రీపదమ్ ఇతి. 'హి' శబ్దాన్ని 'మైత్రీపదం' తరవాత చేర్చాలని వెనకనే చెప్పబడింది. అలంకారాన్తరాణీతి. వరసగా ఉత్ప్రేక్షా - స్వభావోక్తి- రూపక-ఉపమలు అని అర్థం.

వివరణ - 'పటు దీర్ఘీకుర్వన్' అన్నచోట గమ్యోత్ప్రేక్ష. ప్రత్యూషస్వభావోక్తి. "అఙ్గానుకూలః" అని వాయువునందు అరోపించడంచేత రూపకం. లేదా కమలపదంచేత ముఖాన్ని బోధించడంచేత రూపకాతిశయోక్తి. 'ప్రియతమ ఇవ' అని ఉపమ అని అర్థం.

## ధ్వన్యాలోకం

సంసృష్టాలంకారాన్తరసంకీర్ణో ధ్వనిర్యథా -

శ్లో. దన్తక్షతాని కరజైశ్చ విపాటితాని
ప్రోద్భిన్నసాన్ద్రపులకే భవతః శరీరే,
దత్తాని రక్తమనసా మృగరాజవధ్వా
జాతస్పృహైర్మునిభిరప్యవలోకితాని (124)

అత్ర హి సమాసోక్తిసంసృష్టేన విరోధాలంకారేణ సంకీర్ణస్య అలక్ష్యక్రమవ్యఙ్గ్యస్య ధ్వనేః ప్రకాశనమ్. దయావీరస్య పరమార్థతో వాక్యార్థీభూతత్వాత్.

### బాలానందిని

సంసృష్టేతి - సంసృష్టమైన ఇతరాలంకారంతో సంకీర్ణమైన (సంకరం చెందిన) ధ్వని ఎట్లనగా - దన్తేతి. ప్రోద్భిన్నసాన్ద్రపులకే=బయల్వెడలిన దట్టమైన పులకములు గల, భవతః శరీరే=నీశరీరంమీద, రక్తమనసా=రక్తమునందు మనస్సు గల (అనురక్తమైన మనస్సుగల అని రెండవ అర్థం). మృగరాజవధ్వా =ఆడసింహంచేత (రాజభార్య అని గమ్యమానార్థం) దత్తాని - ఇవ్వబడిన, దన్తక్షతాని - దంతక్షతాలు, కరజైః=గోళ్లతో, విపాటితాని చ = చీల్చుటలు, జాతస్పృహైః= పుట్టిన ఆసక్తి గల, మునిభిరపి=మునులచేత కూడ, అవలోకితాని=చూడబడినవి. అత్రేతి. ఈ శ్లోకంలో సమాసోక్తితో సంసృష్టమైన విరోధాలంకారంతో సంకరం చెందిన అలక్ష్యక్రమధ్వని ప్రకాశిస్తూన్నది. (వ్యక్తమవుతున్నది). వాస్తవంలో దయావీరం వాక్యార్థం కదా?

### లోచనం

ఏవమియతా -
"సగుణీభూతవ్యఙ్గ్యైః సాలంకారైః సహ ప్రభేదైః స్వైః,
సంకరసంసృష్టిభ్యామ్"

ఇత్యేతదన్తం వ్యాఖ్యాయ ఉదాహరణాని చ నిరూప్య 'పునరపి' ఇతి యత్కారికాభాగే పదద్వయం తస్యార్థం ప్రకాశయత్యుదాహరణద్వారేణైవ.

సంసృష్టేత్యాది. పునఃశబ్దస్యాయమర్థః- న కేవలం ధ్వనేః స్వప్రభేదాదిభిః సంసృష్టిసంకరౌ వివక్షితౌ, యావత్ తేషామన్యోన్యమపి, స్వప్రభేదానాం స్వప్రభేదైః, గుణీభూతవ్యఙ్గ్యేన వా సంకీర్ణానాం సంసృష్టానాం చ ధ్వనినా సంకీర్ణత్వం సంసృష్టత్వం చ దుర్లక్షమితి విస్పష్టోదాహరణం న భవతీత్యభిప్రాయేణ అలంకారస్యాలంకారేణ సంసృష్టస్య సంకీర్ణస్య వా ధ్వనౌ సంకరసంసర్గౌ ప్రదర్శనీయౌ.

బాలానందిని

ఏవమితి. ఏ విధంగా ఇంత గ్రంథం చేత "సగుణీభూత... సంసృష్టిభ్యామ్" వరకు ఉన్న కారికను వ్యాఖ్యానించి, ఉదాహరణలు చూపి. ఇప్పుడు కారికా భాగంలో ఉన్న 'పునః' 'అపి' అనే పదద్వయాన్ని ఉదాహరణల ద్వారా ప్రకాశింపచేస్తున్నాడు.

సంసృష్టేత్యాది. పునఃశబ్దానికి అర్థం ఏమనగా - ధ్వనికి కేవలం తన ప్రభేదాదులతో మాత్రమే సంసృష్టిసంకరాలు వివక్షితాలు కావు. మరేమనగా స్వప్రభేదాదులకు కూడా పరస్పరం సంసృష్టిసంకరాలు వివక్షితాలైనవి. అయితే - స్వప్రభేదాలతో గాని, గుణీభూతవ్యంగ్యంతో గాని సంకీర్ణాలు లేదా సంసృష్టాలు అయిన స్వప్రభేదాలకు ధ్వనితో సంకీర్ణత్వాన్ని గాని, సంసృష్టత్వాన్ని గాని గుర్తించడం కష్టం అవడంచేత దానికి విస్పష్టమైన ఉదాహరణం ఉండదు అనే అభిప్రాయంచేత అలంకారంతో సంసృష్టం కాని, సంకీర్ణం కాని అయినదానికి ధ్వనిలో సంకరసంసర్గాలు చూపదగి ఉన్నాయి.

లోచనం

తస్మిన్ భేదచతుష్టయే ప్రథమం భేదముదాహరతి - దన్తక్షతానీతి. బోధిసత్త్వస్య స్వకిశోరభక్షణప్రవృత్తాం సింహీం ప్రతి నిజశరీరం వితీర్ణవతః కేనచిత్ చాటుకం క్రియతే. ప్రోద్భూతః సాన్ద్రః పులకః పరార్థసంపత్తిజేన ఆనన్దభరేణ యత్ర. రక్తే రుధిరే మనః అభిలాషః యస్యాః, అనురక్తం చ మనో యస్యాః. మునయశ్చోద్బోధితమదనావేశాశ్చేతి విరోధః. జాతస్పృహైరితి చ వయమపి కదాచిదేవం కారుణికపదవీమధిరోక్ష్యామస్తదా సత్యతో మునయః భవిష్యామ ఇతి మనోరాజ్యయుక్తైః. సమాసోక్తిశ్చ నాయికా వృత్తాన్తప్రతీతేః. దయావీరస్యేతి. దయాప్రయుక్తత్వాదత్ర ధర్మస్య ధర్మవీర ఏవ దయావీరశబ్దేనోక్తః. వీరశ్చాత్ర రసః. ఉత్సాహస్యైవ స్థాయిభావత్వాదితి

భావః. దయావీరశబ్దేన వా శాన్తం వ్యపదిశతి. సోఽత్ర సంసృష్టాలంకారేణాను గృహ్యతే. సమాసోక్తిమహిమ్నా హ్యయమర్థః సంపద్యతే - యథా కశ్చిన్మనోరథ శతప్రేయసీసంభోగావసరే జాతపులకస్తథా త్వం పరార్థసంపాదనాయ స్వశరీరదాన ఇతి కరుణాతిశయః అనుభావవిభావసంపదా ఉద్దీపితః.

బాలానందిని

తదస్మిన్ ఇతి - ఈ భేదచతుష్టయంలో (సంసృష్టాలంకారానికి ధ్వనితో సంసృష్టి లేదా సంకరం, సంకీర్ణాలంకారానికి ధ్వనితో సంసృష్టి లేదా సంకరం అనే నాలుగు భేదాలలో) మొదటి భేదాన్ని ఉదాహరిస్తున్నాడు - దన్తక్షతానీతి. ఆడసింహం తన పిల్లల్ని తినబోతున్నప్పుడు బోధిసత్త్వుడు తన శరీరాన్ని ఆ సింహానికి ఇస్తూండగా ఎవరో ఈ చాటువచనం పలుకుతున్నారు. ఇతరులకు ఉపకారం చేయడం వల్ల కలిగిన ఆనందభారంచేత పుట్టినట్టి దట్టమైన పులకలు గలది. రక్తే=రక్తమునందు, మనః= అభిలాష దేనికో అది. అనురక్తమైన మనస్సు కలది (గమ్యమానార్థం). మునులు అయి ఉండి ఉద్బుద్ధమైన మన్మథావేశం కలవారవడం అనే దానిలో విరోధం. 'జాతస్పృహైః' అనగా (మరొక అర్థం) ''మనం కూడ ఏనాడైనా ఈ విధంగా కారుణికస్థానాన్ని అధిష్ఠించినట్లయితే అప్పుడు నిజంగా మునులం అవుతాం '' అని మనోరాజ్యంతో కూడినవారు (లో విహరిస్తున్నవారు). నాయికావృత్తాంతం గమ్యం అవడంచేత సమాసోక్త్యలంకారం. దయావీరస్యేతి. ఇక్కడ ధర్మం దయాప్రేరితం అవడంచేత ధర్మవీరమే దయావీరశబ్దంచేత చెప్పబడింది. ఏమైనా ఇక్కడ ఉత్సాహమే స్థాయిభావం గాన వీరరసం. లేదా 'దయావీర' శబ్దంచేత శాంతరసాన్ని నిర్దేశిస్తున్నాడు. ఇక్కడ ఆ రసం (అలంకారాంతర) సంసృష్టమైన అలంకారంచేత (సమాసోక్తి సంసృష్ట విరోధాలంకారంచేత) అనుగ్రహించబడుతున్నది. ఎందువల్ల ననగా సమాసోక్తిమహిమ చేత - ''ఎవరైనా ఒక పురుషుడు మనోరథశతాలచేత ప్రార్థింపబడిన ప్రేయసియొక్క సంభోగసమయంలో ఎట్లు పులకించిన శరీరం కలవాడు అవుతాడో అట్లే నువ్వు కూడ పరార్థసంపాదనం కొరకు నీ శరీరాన్ని ఇస్తూన్నప్పుడు జాతపులకుడవు అవుతున్నావు'' అనే అర్థం సిద్ధిస్తుంది.ఈ విధంగా అనుభావవిభావసంపదచేత కరుణాతిశయం ఉద్దీపితం అవుతున్నది. (ఇది సంసృష్టాలంకారంతో ధ్వనికి సంకరం)

## ధ్వన్యాలోకం

సంసృష్టాలంకారసంసృష్టత్వం చ ధ్వనేర్యథా -

గాథ -అహిణఅపఓఅరసిఏసు పహిఅసామాఇఏసు దిఅహేసు,
సోహఇ పసారిఅగిఆణం ణచ్చిఅం మోరవన్దాణమ్.(125)

అత్ర హ్యుపమారూపకాభ్యాం శబ్దశక్త్యుద్భవానురణనరూపవ్యఙ్గ్యస్య ధ్వనేః సంసృష్టత్వమ్.

### బాలానందిని

సంసృష్టేతి. ధ్వని సంసృష్టమైన అలంకారంతో సంసృష్టం అవడానికి ఉదాహరణం ఎట్లనగా - 'అహిణ' ఇతి.

"అభినవపయోదరసితేషు పథికశ్యామాయితేషు (పథికసామాజికేషు), దివసేషు
శోభతే ప్రసారితగ్రీవాణాం నృత్తం మయూరవృన్దానామ్"

(సంస్కృతచ్ఛాయ)

అభినవపయోదరసితేషు=నూతనమైన మేఘధ్వనులు కలవి, పథికశ్యామాయితేషు=పథికులకు రాత్రుల వలె అయినవి (పథికసామాజికేషు=పథికులే నృత్యం చూచే సామాజికాలుగా కలవీ అయిన) దివసేషు=దివసములయందు, ప్రసారితగ్రీవాణామ్=చాపబడిన కంఠాలు గల, మయూరవృన్దానామ్=నెమళ్ల సముదాయాలయొక్క, నృత్తమ్=నృత్తము, శోభతే= ప్రకాశిస్తున్నది.

అత్రేతి. ఇక్కడ ఉపమారూపకాలతో శబ్దశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యధ్వని సంసృష్టం.

### లోచనం

ద్వితీయం భేదముదాహరతి - సంసృష్టేతి. అభినవం హృద్యం పయోదానాం మేఘానాం రసితం యేషు దివసేషు. తథా పథికాన్ ప్రతి శ్యామాయితేషు. మోహజనకత్వాత్ రాత్రిరూపతామాచరత్సు, యది వా పథికానాం శ్యామాయితం దుఃఖవశేన శ్యామికా యేభ్యః.శోభతే ప్రసారిత గ్రీవాణాం మయూరవృన్దానాం నృత్తమ్. అభినయప్రయోగరసికేషు పథిక సామాజికేషు సత్సు మయూరవృన్దానాం ప్రసారితగీతానాం ప్రకృష్టసారణానుసారి

గీతానాం తథా గ్రీవారేచకాయ ప్రసారితగ్రీవాణాం నృత్తం శోభతే. పథికాన్ ప్రతి శ్యామా ఇవాచరన్తీతి క్యచ్‌ప్రత్యయేన లుప్తోపమా నిర్దిష్టా. పథిక సామాజికేష్వితి కర్మధారయస్య స్పష్టత్వాత్ రూపకమ్. తాభ్యాం ధ్వనేః సంసర్గ ఇతి గ్రన్థకారస్యాశయః.

బాలానందిని

ద్వితీయమితి - రెండవభేదాన్ని ఉదాహరిస్తున్నాడు - సంసృష్టేతి. అభినవమ్=మనోహరమైన, పయోదానామ్=మేఘములయొక్క ధ్వని వేటియందో అట్టి దివసములయందు, మరియు పథికులను గూర్చి (వాళ్లవిషయంలో) శ్యామాయితేషు- మోహాన్ని కలిగించేవి అవడంచేత రాత్రిరూపత్వాన్ని ఆచరిస్తూన్న. లేదా పథికులకు శ్యామాయితం అనగా దుఃఖంచేత శ్యామత్వం వేటివలన కలుగుచున్నదో అట్టివి. చాపబడిన కంఠాలు గల మయూరసముదాయాల నృత్తం (ఇది వాచ్యార్థం) నూతనప్రయోగాలలో రసికులైన పథికులనే సామాజికులు ఉంటూండగా, ప్రసారిత గీతానామ్=ప్రకృష్టమైన సారణమును అనుసరించే గీతాలు గల, మరియు 'గ్రీవా' అని కూడ. (అనగా 'ప్రసారితగీతానామ్' "ప్రసారితగ్రీవాణామ్" అని రెండు విధాల సంస్కృతచ్ఛాయ అని భావం) రేచకధ్వనికొరకు చాపబడిన కంఠములు గల మయూరబృందముల నృత్తం శోభిస్తూన్నది(ఇది వ్యంగ్యార్థం) "పహిఅసామాఇఏసు" అనే ప్రాకృతపదానికి "పథికశ్యామాయితేషు" అని, "పథికసామాజికేషు" అని రెండు విధాల సంస్కృతచ్ఛాయ) "పథికాన్ ప్రతి శ్యామా ఇవ ఆచరన్తి" అని 'క్యచ్' ప్రత్యయంచేత లుప్తోపమ చూపబడినది. 'పథికా ఏవ సామాజికాః' అని కర్మధారయసమాసం స్పష్టంగా ఉన్నది గాన రూపకాలంకారం. వాటితో (ఉపమారూపకాలతో) ధ్వనికి (అభినవప్రయోగేత్యాది ధ్వనికి) సంసృష్టి అని గ్రంథకారుని ఆశయం.

లోచనం

అత్రైవోదాహరణే అన్యద్భేదద్వయముదాహర్తుం శక్యమిత్యాశయేన ఉదాహరణాన్తరం న దత్తమ్. తథాహి - వ్యాఘ్రాదేః అకృతిగణత్వే పథికసామాజికేష్వితి ఉపమారూపకాభ్యాం సన్దేహాస్పదత్వేన సంకీర్ణాభ్యాం అభినయప్రయోగే, అభినవప్రయోగే చ రసికేష్వితి ప్రసారితగీతానామితి యః శబ్దశక్త్యుద్భవః తస్య సంసర్గమాత్రమ్, అనుగ్రాహ్యత్వాభావాత్ -

"పహిఅసామాఇఏసు' ఇత్యత్ర తు పదే సంకీర్ణాభ్యాం తాభ్యాము పమారూపకాభ్యాం శబ్దశక్తిమూలస్య ధ్వనేః సంకీర్ణత్వమ్; ఏకవ్యఞ్జకాను ప్రవేశాదితి సంకీర్ణాలంకారసంసృష్టః, సంకీర్ణాలంకారసంకీర్ణశ్చేత్యపి భేదద్వయం మన్తవ్యమ్. 43

బాలానందిని

అత్రేతి. ఈ ఉదాహరణలోనే మిగిలిన భేదద్వయాన్ని కూడ ఉదాహరించడానికి (చూపడానికి) శక్యం అవుతుంది అనే అభిప్రాయంచేత మరొక ఉదాహరణం ఇవ్వబడలేదు. అది ఎట్లనగా - వ్యాఘ్రాది అకృతిగణంగా గ్రహిస్తే 'పథికసామాజికేషు' అన్న చోట సందేహాస్పదాలవడంచేత సంకీర్ణాలైన ఉపమారూపకాలచేత 'అభినయప్రయోగే' అభినవప్రయోగే చ రసికేషు'' 'ప్రసారితగీతానామ్ ' అనీ ఏ శబ్దశక్త్యుద్భవం (ధ్వని) ఉన్నదో దానికి సంసర్గం (సంసృష్టి ) మాత్రమే. అనుగ్రాహ్యానుగ్రాహకభావం లేదు కదా? 'పహిఅసామాఇఏసు' అనేదానిలోని శబ్దశక్తిమూలధ్వనికి, సంకీర్ణాలైన ఆ ఉపమారూపకాలతో ఏకవ్యంజకానుప్రవేశం ఉంది గాన సంకీర్ణత్వం (సంకరం). ఈ విధంగా సంకీర్ణాలంకారసంసృష్టం, సంకీర్ణాలంకారసంకీర్ణం అనే భేదద్వయం కూడ తెలియదగినది.

వివరణ - "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే" అనే పాణిని సూత్రం (2.1.56) చేత ఉపమేయవాచకపదం ఉపమానవాచకాలైన వ్యాఘ్రాదిగణపఠితశబ్దాలతో సమసిస్తుంది అని చెప్పబడింది. వ్యాఘ్రాదిగణంలో సామాజికశబ్దం కూడ చేర్చుకొని సమాసం చేస్తే "పథికాః సామాజికా ఇవ" (పథికులు సామాజికులవంటివారు) అని ఉపమాలంకారం లభిస్తుంది. 'పథికా ఏవ సామాజికాః అని విగ్రహం చెప్పుకుంటే (పథికులే సామాజికులు అనే అర్థంలో) రూపకాలంకారం అవుతుంది. ఇక్కడ ఏ విగ్రహం చెప్పాలో నిర్ణాయకప్రమాణం లేదు గాన ఈ రెండు అలంకారాలకీ సందేహసంకరం. ఈ సంసృష్టాలంకారాలకి "అభినవప్రయోగే చ రసికేషు" "ప్రసారితగీతానామ్" అనే శబ్దశక్త్యుద్భవధ్వనులతో సంసృష్టి. "పథికసామాజికేషు" అనే శబ్దశక్తిమూలధ్వనితో సంకరం అని అర్థం. ఈ విధంగా ఇక్కడ మూడు భేదాలకి ఉదాహరణలు ఉన్నాయి. ఈ గాథలోని "పహిఅసామాఇఏసు" అనే దానికి "పథిక శ్యామాయితేషు" అనీ 'పథికసామాజికేషు' అనీ రెండు విధాల సంస్కృతచ్ఛాయలు. "అహిణఅపఓఅరసిఏసు'' కు "అభినవపయోదరసితేషు' అనీ, "అభినవప్రయోగ

రసికేషు" అనీ రెండు విధాల ఛాయలు, 'పసారిఅగిఆణం'కు 'ప్రసారితగ్రీవాణామ్' అనీ "ప్రసారితగీతానామ్" అనీ రెండు విధాల ఛాయలు. 'అహిణఅపయోఅ' అనేదానికి కూడ" అభినవపయోద' అనీ, 'అభినవప్రయోగ' అనీ రెండు విధాల ఛాయలు. ఈ ఛాయాభేదాలను పట్టి ఏర్పడినవే ఈ గాథలోని శబ్దశక్త్యుద్భవానురణనధ్వనులన్నీ. 43

## ధ్వన్యాలోకం

కా. ఏవం ధ్వనేః ప్రభేదాః ప్రభేదభేదాశ్చ కేన శక్యన్తే,
సంఖ్యాతుం దిఙ్మాత్రం తేషామిదముక్తమస్మాభిః. 44

అనన్తా హి ధ్వనేః ప్రకారాః. సహృదయానాం వ్యుత్పత్తయే తేషాం దిఙ్మాత్రం కథితమ్.

కా. ఇత్యుక్తలక్షణో యో ధ్వనిర్వివేచ్యః ప్రయత్నతః సద్భిః,
సత్కావ్యం కర్తుం వా జ్ఞాతుం వా సమ్యగభియుక్తైః. 45

ఉక్తస్వరూపధ్వనిరూపణనిపుణా హి సత్కవయః సహృదయాశ్చ నియతమేవ కావ్యవిషయే పరాం ప్రకర్షపదవీమాసాదయన్తి.

కా. అస్ఫుటస్ఫురితం కావ్యతత్త్వమేతద్యథోదితమ్,
అశక్నువద్భిర్వ్యాకర్తుం రీతయః సంప్రవర్తితాః. 46

ఏతద్ధ్వనిప్రవర్తనేన నిర్ణీతం కావ్యతత్త్వమ్ అస్ఫుటస్ఫురితం సత్ అశక్నువద్భిః ప్రతిపాదయితుం, వైదర్భీ, గౌడీ, పాఞ్చాలీ చేతి రీతయః ప్రవర్తితాః. రీతిలక్షణవిధాయినా హి కావ్యతత్త్వమేతదస్ఫుటతయా మనాక్ స్ఫురితమాసీత్ ఇతి లక్ష్యతే. తదత్ర స్ఫుటతయా సంప్రదర్శితేన అన్యేన రీతిలక్షణేన న కించిత్.

### బాలానందిని

ఏవమితి - "ఈ విధంగా ధ్వనిప్రభేదాలు, ధ్వనిప్రభేదాల భేదాలు లెక్కించడానికి ఎవనికి శక్యం అవుతాయి? మా చేత వాటి ఈ దిఙ్మాత్రం చెప్పబడింది". 44

అనన్తా ఇతి. ధ్వనిభేదాలు అనంతమైనవి. సహృదయుల వ్యుత్పత్తి కోసం వాటి దిఙ్మాత్రం చెప్పబడింది.

ఇత్యుక్తేతి - ఇతి = ఈ విధంగా, యః ధ్వనిః = ఏ ధ్వని, ఉక్తలక్షణః=చెప్పబడిన లక్షణం కలదో, అది, సత్కావ్యమ్=సత్కావ్యాన్ని, కర్తుం వా= రచించడానికి గాని, జ్ఞాతుం వా= తెలిసికొనడానికి గాని, సమ్యక్= బాగా, అభియుక్తైః=శ్రద్ధ (పట్టుదల) గల, సద్భిః= పండితులచేత, ప్రయత్నతః=ప్రయత్నంవల్ల, వివేచ్యః=వివేచింపదగినది. 45

ఉక్తేతి - చెప్పబడిన స్వరూపం గల ధ్వనిని నిరూపించడంలో నేర్పు గల సత్కవులు, సహృదయులూ కూడ తప్పకుండా కావ్యం విషయంలో గొప్ప ప్రకర్షస్థితిని పొందుతారు.

అస్ఫుటేతి - అస్ఫుటస్ఫురితమ్=అస్పష్టమైన స్ఫురణం గల, ఏ తత్=ఈ, కావ్య తత్త్వమ్= కావ్యతత్త్వమును, యథోదితమ్= చెప్పిన విధంగా, వ్యాకర్తుమ్=విభజించి విశదీకరించడానికి, అశక్నువద్భిః=అశక్తులైనవారిచేత, రీతయః=రీతులు, సంప్రవర్తితాః= ప్రవర్తింపచేయబడినవి. 46

ఏతదితి. అస్ఫుటస్ఫురితమై ఉండి, ధ్వనిని ప్రవర్తింపచేయడంచేత (ప్రతిపాదించడంచేత) నిర్ణయించబడిన ఈ కావ్యతత్త్వాన్ని ప్రతిపాదించడానికి సమర్థులు కానివారు వైదర్భి, గౌడి, పాంచాలి అను రీతులను ప్రవర్తింపచేశారు. ఈ కావ్యతత్త్వం రీతిలక్షణం ప్రతిపాదించినవారికి అస్పష్టంగా, కొంచెం స్ఫురించిందన్నట్లు కనబడుతుంది. అందువల్ల ఇక్కడ స్పష్టంగా చూపబడిన కావ్యతత్త్వంచేత, (కావ్యతత్త్వం స్పష్టంగా ప్రదర్శించబడిన తరవాత) మరొక రీతిలక్షణంచేత ఏమీ ప్రయోజనం లేదు. అది ధ్వనిలోనే అంతర్గతం అవుతుంది అని భావం.

## లోచనం

ఏతదుపసంహరతి - ఏవమితి. స్పష్టమ్. 44

అథ "సహృదయమనఃప్రీతయే" ఇతి యత్సూచితం తదిదానీం న శబ్దమాత్రమ్, అపి తు నిర్వ్యూఢ మిత్యాశయేనాహ - ఇత్యుక్తేతి. యః ప్రయత్నతః వివేచ్యః అస్మాభిశ్శోక్తలక్షణః ధ్వనిః ఏతదేవ కావ్యతత్త్వం యథోదితేన ప్రపఞ్చనిరూపణాదినా వ్యాకర్తుమశక్నువద్భిరలంకారైః రీతయః ప్రవర్తితాః ఇత్యుత్తరకారికయా సంబన్ధః. అన్యే తు యచ్ఛబ్దస్థానే 'అయమ్'

ఇతి పఠన్తి. ప్రకర్షపదవీమితి - నిర్మాణే బోధే చేతి భావః. వ్యాకర్తు మశక్నువద్భిరిత్యత్ర హేతుః - అస్ఫుటం కృత్వా స్ఫురితమితి. లక్ష్యత ఇతి. రీతిర్హి గుణేష్వేవ పర్యవసితా. యదాహ - "విశేషో గుణాత్మా" (కా.సూ.1-2-8). గుణాశ్చ రసపర్యవసాయిన ఏవేతి హ్యుక్తం ప్రాగ్గుణనిరూపణే - 'శృఙ్గార ఏవ మధురః' ఇత్యత్రేతి. 45,46

బాలానందిని

ఏతదితి - దీనిని ఉపసంహరిస్తున్నాడు - ఏవమితి. అర్థం స్పష్టం. 44

అథేతి - "సహృదయమనః ప్రీతయే" అని ఏది సూచించబడిందో అది కేవలం మాటమాత్రం కాదు, ప్రతిపాదించి సాధించబడింది అనే అభిప్రాయంతో అంటున్నాడు ఇత్యుక్తేతి. 45, 46 కారికలకు ఒకే అన్వయం అని చూపుతున్నాడు - యః ఇతి. ఏది ప్రయత్నపూర్వకంగా వివేచించదగినదో, మాచేత చెప్పబడిన లక్షణం కలదో అట్టి ఈ ధ్వనియే కావ్యతత్త్వం. దానిని మేము చెప్పిన విధంగా విస్తృతంగా నిరూపించడం మొదలైనవాటిచేత వివరించడానికి అశక్తులైన అలంకారగ్రంథరచయితలు రీతులను ప్రవర్తింపచేశారు అని రాబోయే కారికతో అన్వయం. కొందరైతే 'యః' కు బదులు 'అయమ్' అని పఠిస్తున్నారు. (అయమ్' అనే పాఠం అంగీకరించిన పక్షంలో ఉత్తరకారికతో సంబంధం చెప్ప నవసరం లేదు. 'యః' అనే పాఠం ఉన్నా కూడ కారికకు (45) మేము చెప్పినట్లు సమన్వయం చెపితే కూడ ఉత్తరకారికతో అన్వయించవలసిన పని ఉండదు). ప్రకర్షపదవీమితి. కావ్యనిర్మాణంలోను, తెలుసుకొనడంలోనూ కూడ. వారు వివరించడానికి అశక్తులైనారు అనడానికి హేతువు- అస్ఫుటం కృత్వా స్ఫురితమితి. లక్ష్యతే ఇతి - రీతి గుణాలలోనే పర్యవసానం చెందుతుంది కదా? (వామనుడు) "విశేషో గుణాత్మా" (1.2.8) అని చెప్పియే ఉన్నాడు కదా? గుణాలు రసాలలోనే పర్యవసానం పొందుతాయి అని "శృఙ్గార ఏవ మధురః' (కా.2.7) అనే చోట గుణనిరూపణప్రసంగంలో చెప్పబడింది కదా?

వివరణ : వామనుడు కావ్యాలంకారసూత్రంలో "రీతిరాత్మా కావ్యస్య" (1.2.6) (కావ్యానికి రీతి ఆత్మ) అని చెప్పి "విశిష్టా పదరచనా రీతిః" (1.2.7) (విశిష్టమైన పదరచన రీతి) అని రీతికి లక్షణం చెప్పాడు. తరవాత "విశేషో గుణాత్మా (1.2.8) (విశేషం గుణస్వరూప మైనది) అని చెప్పాడు. ఈ విధంగా రీతి చివరికి గుణాలలోనే పర్యవసానం చెందుతుంది అని అర్థం.

ధ్వన్యాలోకం

కా. శబ్దతత్త్వాశ్రయాః కాశ్చిదర్థతత్త్వయుజోఽ పరాః,
వృత్తయో ఽపి ప్రకాశన్తే జ్ఞాతేఽ స్మిన్ కావ్యలక్షణే. 47

అస్మిన్ వ్యఙ్గ్యవ్యఞ్జకభావవివేచనమయే కావ్యలక్షణే జ్ఞాతే సతి యాః కాశ్చిత్ ప్రసిద్ధాః ఉపనాగరికాద్యాః శబ్దతత్త్వాశ్రయా వృత్తయో దృశ్యన్తే యాశ్చ అర్థతత్త్వసంబద్ధాః కైశిక్యాదయః తాః సమ్యగ్రీతిపదవీమవతరన్తి. అన్యథా తు తాసామదృష్టార్థానామివ వృత్తీనామ్ అశ్రద్ధేయత్వమేవ స్యాత్, న అనుభవసిద్ధత్వమ్. ఏవం స్ఫుటతయైవ లక్షణీయం స్వరూపమస్య ధ్వనేః. యత్ర శబ్దానామర్థానాం చ కేషాంచిత్ ప్రతిపత్తృవిశేషసంవేద్యం, జాత్యత్వ మివరత్నవిశేషాణాం చారుత్వమనాఖ్యేయమవభాసతే కావ్యే తత్ర ధ్వనివ్యవహార ఇతి యల్లక్షణం ధ్వనేరుచ్యతే కేన చిత్తదయుక్తమితి నాభిధేయతామర్హతి. యతః శబ్దానాం స్వరూపాశ్రయస్తావదక్లిష్టత్వే సత్యప్రయుక్తప్రయోగః. వాచకాశ్రయస్తు ప్రసాదః వ్యఞ్జకత్వం చేతి విశేషః. అర్థానాం చ స్ఫుటత్వేనావభాసనం వ్యఙ్గ్యపరత్వం వ్యఙ్గ్యాంశవిశిష్టత్వం చేతి విశేషః.

బాలానందిని

శబ్దేతి. అస్మిన్= ఈ, కావ్యలక్షణే=కావ్యలక్షణం, జ్ఞాతే= తెలియబడిన దగుచుండగా, శబ్దతత్త్వాశ్రయాః=శబ్దతత్త్వాన్ని ఆశ్రయించి ఉన్న, కాశ్చిత్=కొన్ని, వృత్తయః= వృత్తులు, అర్థతత్త్వయుజః=అర్థతత్త్వంతో సంబంధించిన, అపరాః= ఇతరవృత్తులు,. ప్రకాశన్తే=ప్రకాశించును. 47

అస్మిన్నితి. వ్యంగ్యవ్యంజకభావవివేచనరూపమైన ఈ కావ్యలక్షణం తెలియబడినట్లయితే శబ్దతత్త్వాన్ని ఆశ్రయించి ఉన్న ఏ ప్రసిద్ధమైన ఉపనాగరికాది వృత్తులు గలవో అవీ, అర్థతత్త్వానికి సంబంధించిన ఏ కైశిక్యాదివృత్తులు ఉన్నాయో

అవీ బాగుగా రీతియొక్క మార్గాన్నే (రీతులు ఏ మార్గాన్ని అనుసరిస్తాయో అదే మార్గాన్ని అనగా రసోపకారకత్వాన్ని )పొందుతాయి. అలా కాకపోతే ఆ వృత్తులు, ఏదో అదృష్టప్రయోజనంకొరకు (కొన్ని కర్మలలో ఇది ఇలా చేస్తే పుణ్యం వస్తుందని చెప్పినట్లు) ఉద్దిష్టమైనవి వలె నమ్మడానికి శక్యం కానివే అవుతాయి; ఎందుచేత ననగా వాటి స్వరూపం అనుభవానికి అందేదిగా ఉండదు. ఈవిధంగా ఈ ధ్వనియొక్క స్వరూపం స్పష్టంగానే నిరూపించడానికి శక్యమైనదిగానే ఉంది.

యత్రేతి - "ఏ కావ్యంలో కొన్ని శబ్దాలయొక్క, అర్థాలయొక్క చారుత్వం, మాటలలో చెప్పడానికి శక్యం కానిదై, రత్నవిశేషాల జాత్యత్వం (ఉత్తమజాతికి చెందినవి అయి ఉండడం వలె, కొంతమంది ప్రతిపత్తలకు (జ్ఞాతలకు) మాత్రమే సంవేద్యమై భాసిస్తుందో ఆ కావ్యంలో ధ్వని అని వ్యవహారం చెయ్యబడుతుంది " అని, ఒకరు ధ్వనికి చెప్పిన లక్షణం అయుక్తమే గాన అది చెప్పడానికి తగినది కాదు (అనగా ఆ లక్షణం ఉపేక్షణీయం అని భావం). ఎందువల్లననగా శబ్దాల స్వరూపంలో క్లిష్టత్వం (శ్రుతికష్టత్వం మొదలైనది) లేకపోవడం, ప్రయోగించబడనిదానిని ప్రయోగించడం, అనగా పౌనరుక్త్యం లేకపోవడం, అని (రెండు విధాలైన) విశేషం ఉంటుంది. శబ్దాలలోని వాచకత్వాన్ని ఆశ్రయించుకొని ప్రసాదమూ, వ్యంజకత్వమూ అని (రెండు విధాలైన ) విశేషం ఉంటుంది. అర్థాలకు సంబంధించి స్ఫుటంగా భాసించడం, వ్యంగ్యార్థతాత్పర్యం, వ్యంగ్యాంశాలతో కూడుకొని ఉండడం అనే(మూడు విధాలైన) విశేషం ఉంటుంది.

లోచనం

ప్రకాశన్త ఇతి. అనుభవసిద్ధతాం కావ్యజీవితత్వే ప్రయాన్తీత్యర్థః. రీతిపదవీమితి. తద్వదేవ రసపర్యవసాయిత్వాత్,. 'ప్రతీతిపదవీమ్' ఇతి వా పాఠః. నాగరికయా హ్యుపమితేతి అనుప్రాసవృత్తిః శృఙ్గారాదౌ విశ్రామ్యతి. పరుషేతి దీప్తేషు రౌద్రాదిషు. కోమలేతి హాస్యాదౌ. తథా "వృత్తయః కావ్యమాతృకాః" ఇతి యదుక్తం మునినా తత్ర రసోచితః చేష్టావిశేష ఏవ వృత్తిః. యదాహ -

"కైశికీ శ్లక్ష్ణనేపథ్యా శృఙ్గారరససంభవా" ఇత్యాది.

ఇయతా "తస్యాభావం జగదురపరే" ఇత్యాదావభావవికల్పేషు-"వృత్తయో

రీతయశ్చ గతాః శ్రవణగోచరమ్, తదతిరిక్తః కోఽయం ధ్వనిరితి", తత్ర కథం చిదభ్యుపగమః కృతః, కథంచిచ్చ దూషణం దత్త 'మస్ఫుటస్ఫురితమ్' ఇతి వచనేన. ఇదానీం "వాచాం స్థితమవిషయే" ఇతి యదూచే తత్తు ప్రథమోద్ద్యోతే దూషితమపి దూషయతి. సర్వప్రపఞ్చకథనే హి అసంభావ్యమేవ అనాఖ్యేయత్వమిత్యభిప్రాయేణ. అక్లిష్టత్వ ఇతి - శ్రుతికష్టాద్యభావ ఇత్యర్థః. అప్రయుక్తస్య ప్రయోగ ఇతి అపౌనరుక్త్యమ్.

బాలానందిని

ప్రకాశన్తే ఇతి - కావ్యజీవితత్వంవిషయంలో అనుభవసిద్ధత్వాన్ని పొందుతాయి అని అర్థం. అనగా కావ్యజీవితత్వం విషయంలో వాటికి ఉన్న స్థానం స్పష్టంగా తెలుస్తుంది అని భావం. రీతిపదవీమితి. వాటి వలెనే ఇవి కూడ రసంలో పర్యవసానం చెందేవి అవడంవల్ల. లేదా 'ప్రతీతిపదమ్' అని పాఠం ఉండవచ్చును. (ప్రతీతి పదవీమవతరన్తి' అనగా బుద్ధిగోచరాలవుతాయి అని అర్థం). అనుప్రాసవృత్తి నాగరికస్త్రీతో పోల్చబడింది. అందుచేత ఇది శృంగారాదులలో విశ్రమిస్తుంది. పరుష అనే వృత్తి రౌద్రాదులలోను, కోమల అనే వృత్తి హాస్యాదులలోను విశ్రమిస్తుంది. తథా ఇతి - "వృత్తయః కావ్యమాతృకాః" అని మునిచేత ఏది చెప్పబడిందో అక్కడ రసోచితమైన చేష్టావిశేషమే వృత్తి. అందుచేతనే - "మృదువైన నేపథ్యం (వేషాదికం) గల కైశికి శృంగార రససంభవహేతువు" ఇత్యాదికం (ఆతడే) చెప్పినాడు.

ఇయతా ఇతి - ఇంతవరకు ఉన్న గ్రంథంచేత "తస్యాభావం జగదురపరే" ఇత్యాది ధ్వన్యభావవికల్పాలలో - "వృత్తుల్నీ రీతుల్నీ గూర్చి విన్నాం. వాటికంటె అతిరిక్తంగా ఈ ధ్వని అనేది ఏమిటి?" అనే (అభావవాది) మాటలలో కొంత వరకు అంగీకారం కొంతవరకు దూషణం "అస్ఫుటస్ఫురితమ్" అనే కారికచేత చేయబడింది. ఇప్పుడు "వాచాం స్థితమవిషయే" అని ఏది చెప్పబడిందో అది ప్రథమోద్ద్యోతంలో దూషించబడినా ధ్వనికి సంబంధించిన అన్ని విషయాలు విస్తృతంగా చెప్పిన తరవాత "ధ్వని వర్ణింప శక్యం కానిది" అనడం అసంభావ్యం అనే అభిప్రాయంచేత మళ్లీ దూషిస్తున్నాడు. అక్లిష్టత్వ ఇతి - శ్రుతికష్టాదులు లేనప్పుడు అని అర్థం. అప్రయుక్తస్య ప్రయోగః అనగా అపౌనరుక్త్యం.

ధ్వన్యాలోకం

తౌ చ విశేషౌ వ్యాఖ్యాతుం శక్యేతే, వ్యాఖ్యాతౌ చ బహుప్రకారమ్. తద్వ్యతిరిక్తానాఖ్యేయవిశేషసంభావనా తువివేకావసాదభావమూలైవ. యస్మాదనాఖ్యేయత్వం సర్వశబ్దా గోచరత్వేన న కస్య చిత్సంభవతి - అన్తతః అనాఖ్యేయ శబ్దేనతస్యాభిధానసంభవాత్. సామాన్యసంస్పర్శి వికల్పశబ్దాగోచరత్వే సతి ప్రకాశమానత్వం తు యదనాఖ్యేయత్వ ముచ్యతే క్వచిత్ తదపి కావ్యవిశేషాణాం రత్న విశేషాణామివ, న సంభవతి, తేషాం లక్షణకారైః వ్యాకృతరూపత్వాత్. రత్నవిశేషాణాం చ సామాన్యసంభావనయైవ ` మూల్యస్థితిపరికల్పనాదర్శనాచ్చ. ఉభయేషామపి తేషాం ప్రతిపత్తృవివేషసంవేద్యత్వమస్త్యేవ.. వైకటికా ఏవ హి రత్న తత్త్వవిదః, సహృదయా ఏవ హి కావ్యానాం రసజ్ఞాః ఇతి కస్యాత్ర విప్రతిపత్తిః?

బాలానందిని

తౌ చేతి. శబ్దార్థాలకి సంబంధించిన ఆ విశేషాలు వ్యాఖ్యానించడానికి శక్యమైనవే; అనేక ప్రకారాలుగా (మాచేత ఇంతవరకు) వ్యాఖ్యానింపబడ్డాయి కూడ. వాటికంటె (మేం చెప్పిన విశేషాలకంటె) భిన్నమైన, చెప్పడానికి శక్యం కాని విశేషాల సంభావన (ఇంకా ఏవో విశేషాలు ఉన్నాయి అనుకోవడం) వివేకవినాశంవల్ల కలిగినదే. ఎందువల్ల ననగా - దేనికీ కూడ అనాఖ్యేయత్వం సర్వశబ్దాగోచరత్వం చేత సంభవించదు. (అనగా ప్రపంచంలో ఒక వస్తువు ఉన్నదంటే అది ఏదో ఒక శబ్దంచేత తప్పకుండా చెప్పబడవలసిందే; ఏ శబ్దంచేతా కూడా అది చెప్పబడదు అనడం సంభవించదు. కుదరదు అని భావం) చివరికి 'అనాఖ్యేయ' శబ్దంచేత దానిని చెప్పవచ్చును కదా? సామాన్యాన్ని స్పృశించే జ్ఞానం (వికల్పం) గల శబ్దానికి గోచరం కాకుండా ఉండి ప్రకాశించడం అనాఖ్యేయత్వం అని కొన్నింటి విషయంలో ఏది చెప్పబడుతుందో అది కూడ, రత్నవిశేషాలకి వలె, కావ్యవిశేషాలకి కూడ సంభవించదు. (అనగా ఏదో వస్తువు ఉన్నట్లు భాసించినా దాని సామాన్యం (జాతి) మొదలైనవి భాసించకపోవడంవల్ల అనగా

నిర్వికల్పజ్ఞానమాత్రవిషయం అవడం వల్ల, 'అనాఖ్యేయం' అని కొన్ని వస్తువులను గూర్చి అంటే అనవచ్చు. కావ్యవిషయంలో అలాంటి అనాఖ్యేయత్వం లేదు అని భావం). ఎందువల్లనగా వాటిని (కావ్యవిశేషాలను, రత్నవిశేషాలను కూడ) లక్షణ కారులు స్పష్టంగా విశదీకరించి ఉన్నారు. ఆ యా రత్నాల మూల్యం, వాటి స్థితి (ఉపయోగయోగ్యత) మొదలైనది వాటికి సంబంధించిన సామాన్య (జాతుల) సంభావనచేతనే (ఊహచేతనే, జ్ఞానం చేతనే) కల్పించబడడం చూడబడుతున్నది కదా? అయితే ఈ రెండు విధాలైన వస్తువులు కావ్యవిశేష - రత్నవిశేషాలు) జ్ఞాతృవిశేషవేద్యములు (ఒకానొక వైశిష్ట్యం ఉన్న జ్ఞాతలు మాత్రమే తెలుసుకొనకలుగుతారు) అనేది ఉండనే ఉంది. రత్నపరీక్షకులే రత్నతత్త్వాన్ని తెలుసుకొనకలుగుతారు; సహృదయులు మాత్రమే కావ్యరసాస్వాదం చేయకలుగుతారు అనే విషయంలో ఎవరికీ విప్రతిపత్తి (అభిప్రాయభేదం) లేదు.

లోచనం

తావితి - శబ్దగతః అర్థగతశ్చ. వివేకస్యావసాదో యత్ర తస్య భావః నిర్వివేకత్వమ్. సామాన్యస్పర్శీ యో వికల్పః తతః యః శబ్దః. దృష్టాన్తే ఽపి అనాఖ్యేయత్వం నాస్తీతి దర్శయతి - రత్నవిశేషాణాం చేతి. నను సర్వేణ తన్న సంవేద్యతే ఇత్యాశఙ్క్యాభ్యుపగమేనైవోత్త యతి - ఉభయేషామ్ ఇతి - రత్నానాం కావ్యానాం చ.

బాలానందిని

తావితి - శబ్దగతమూ అర్థగతమూ అయిన విశేషాలు. ఎవనియందు వివేకం యొక్క నాశమో వాని ధర్మం - నిర్వివేకత్వం. సామాన్యేతి. సామాన్యాన్ని (జాతిని) స్పృశించే (గ్రహించే) ఏ వికల్పం (జ్ఞానం) ఉందో, దానివల్ల ఏ శబ్దమో (శబ్ద ప్రయోగమో) (అని "సామాన్య సంస్పర్శివికల్పశబ్ద" అనే దాని అర్థం). దృష్టాంతంలో కూడ అనాఖ్యేయత్వం లేదు అని చెపుతున్నాడు - రత్నవిశేషాణాం చేతి. మరి అందరికీ అది తెలియడంలేదు కదా- అని ఆశంకించుకొని అంగీకారపూర్వకంగానే సమాధానం చెపుతున్నాడు - ఉభయేషామితి. రత్నాలకు కావ్యాలకు కూడ.

## ధ్వన్యాలోకం

యత్త్వనిర్దేశ్యత్వం స్వలక్షణవిషయం బౌద్ధానాం ప్రసిద్ధం తత్ తన్మతపరీక్షాయాం గ్రన్థాన్తరే నిరూపయిష్యామః. ఇహ తు గ్రన్థాన్తర

శ్రవణలవప్రకాశనం సహృదయవైమనస్యప్రదాయీతి న క్రియతే. బౌద్ధమతేన వా యథా ప్రత్యక్షాదిలక్షణం తథాస్మాకం ధ్వనిలక్షణం భవిష్యతి. తస్మాల్లక్షణాన్తరస్యాఘటనాత్ అశబ్దార్థత్వాచ్చ తస్య ఉక్తమేవ ధ్వనిలక్షణం సాధీయః. తదిదముక్తమ్ -

అనాఖ్యేయాంశభాసిత్వం నిర్వాచ్యార్థతయా ధ్వనేః,
న లక్షణం, లక్షణం తు సాధీయోఽస్య యథోదితమ్.

ఇతి శ్రీరాజానకానన్దవర్ధనాచార్యవిరచితే ధ్వన్యాలోకే
తృతీయ ఉద్ద్యోతః.

బాలానందిని

యత్త్వితి - సకలపదార్థాల లక్షణాల విషయంలో బౌద్ధులు చెప్పిన ఏ అనిర్దేశ్యత్వం (నిర్దేశించడానిక శక్యం కాకపోవడం, అనిర్వచనీయత్వం) ప్రసిద్ధమో (ప్రతివస్తువు క్షణికమే గాన దేనికీ లక్షణం చెప్పడం కుదరదు అని ఏ బౌద్ధవాదం ఉన్నదో) దానిని గూర్చి గ్రంథాంతరంలో ఆ మతాన్ని పరీక్షించే సందర్భంలో నిరూపించగలం. ఇతర గ్రంథాలనుగూర్చి శ్రవణలవాన్ని ప్రకాశింపచేసినా (ఏ మాత్రం ఆ గ్రంథాలను గూర్చి వినిపించడానికి ప్రయత్నించినా) అది సహృదయులకు వైమనస్యాన్ని కలిగిస్తుంది; అందుచేత ఇక్కడ ఆ విషయం వివరించబడడంలేదు.

బౌద్ధమతేన ఇతి - లేదా (ప్రతీదీ అనిర్వాచ్యమే, దేనికీ లక్షణం చెప్పడం కుదరదు అని అంటూనే) బౌద్ధులు (తమ గ్రంథాలలో) ఏవిధంగా ప్రత్యక్షాదిలక్షణాలు ఇచ్చారో మా ధ్వనిలక్షణం కూడ ఆ విధంగానే ఉంటుంది. అందువల్ల (ఇతరులు చెప్పిన) మరొక లక్షణం కుదరకపోవడంవల్ల, అది (ధ్వని) శబ్దార్థం (శబ్దవాచ్యం) కాకపోవడంవల్ల మేము చెప్పిన ధ్వనిలక్షణమే మంచిది. ఈ విషయమే కింది శ్లోకంలో చెప్పబడింది.

అనాఖ్యేయేతి - ధ్వనేః = ధ్వని, నిర్వాచ్యార్థతయా = నిర్వచించడానికి శక్యమైన అర్థం కలదవడంచేత, అనాఖ్యేయాంశభాసిత్వమ్=చెప్పడానికి శక్యం కాని అంశం కలిగి ఉండడం, లక్షణం న=లక్షణం కాదు, తు = కాని, యథోదితమ్=చెప్పిన విధంగా, అస్య లక్షణమ్=దీని లక్షణం, సాధీయః=యుక్తమైనది.

శ్రీరాజానక ఆనందవర్ధనాచార్యులు రచించిన ధ్వన్యాలోకంలో
తృతీయోద్ద్యోతం సమాప్తం.

లోచనం

నను "నార్థం శబ్దాః స్పృశన్త్యపి" ఇతి "అనిర్దేశ్యస్య వేదకమ్" ఇత్యాదౌ కథమనాఖ్యేయత్వం వస్తూనాముక్తమ్ ఇతి చేదత్రాహ - యత్త్వితి. ఏవం హి సర్వభావవృత్తాన్తతుల్య ఏవ ధ్వనిరితి ధ్వనిస్వరూపమనాఖ్యేయమితి అతివ్యాపకం లక్షణం స్యాదితిభావః. గ్రన్థాన్తర ఇతి:- వినిశ్చయటీకాయాం ధర్మోత్తర్యాం యా వివృతిరమునా గ్రన్థకృతా కృత తత్రైవ తద్వ్యాఖ్యాతమ్. ఉక్తమితి - సంగ్రహార్థం మయైవేత్యర్థః. అనాఖ్యేయాంశస్య ఆభాసః విద్యతే యస్మిన్ కావ్యే తస్య భావః, తన్న లక్షణం ధ్వనేరితి సంబన్ధః. అత్ర హేతుః- నిర్వాచ్యార్థతయేతి. నిర్విభజ్య వక్తుం శక్యత్వాదిత్యర్థః. అన్యస్తు నిర్వాచ్యతయా' ఇత్యత్ర నిసో నఞర్థత్వం పరికల్ప్య అనాఖ్యేయాంశభాసిత్వే అయం హేతు రితి వ్యాచష్టే; తత్తు క్లిష్టమ్. హేతుశ్చ సాధ్యావిశిష్ట ఇత్యుక్తవ్యాఖ్యానమేవేతి శివమ్.

శ్లో. కావ్యాలోకే ప్రథాం నీతాన్ ధ్వనిభేదాన్ పరామృశత్,
ఇదానీం లోచనం లోకాన్ కృతార్థాన్ సంవిధాస్యతి.
ఆసూత్రితానాం భేదానాం స్ఫుటతాపత్తిదాయినీమ్,
త్రిలోచనప్రియాం వన్దే మధ్యమాం పరమేశ్వరీమ్.

ఇతి శ్రీమహామాహేశ్వరాచార్యాభినవగుప్తోన్మీలితే సహృదయాలోకలోచనే ధ్వనిసంకేతే తృతీయ ఉద్ద్యోతః.

బాలానందిని

నన్వితి - "శబ్దాలు అర్థంయొక్క స్పర్శ చేయజాలవు", "నిర్దేశింప శక్యం కాని దాన్ని తెలిపేది", ఇత్యాదివాక్యాలలో వస్తువులు అనాఖ్యేయములు అని ఎట్లు చెప్పబడింది? అనే ప్రశ్నకు సమాధానం చెపుతున్నాడు - యత్త్వితి. ఈ విధంగా ధ్వని కూడ సకలభావ (పదార్థాల) వృత్తాంతంతో తుల్యమైనదే గాన "ధ్వనిస్వరూపమ్ అనాఖ్యేయమ్" అనే లక్షణం అతివ్యాప్తిదోషదుష్టం అవుతుంది అని భావం. గ్రన్థాన్తర ఇతి. 'వినిశ్చయ'టీక అయిన 'ధర్మోత్తరి'లో ఈ గ్రంథకర్తచేతనే ఏ వివృతి చేయబడిందో అక్కడనే ఆ విషయం వాఖ్యానించబడింది. ఉక్తమితి. సంగ్రహంకొరకు నా చేతనే

చెప్పబడింది అని అర్థం. ఏ కావ్యంలో అనాఖ్యేయమైన అంశంయొక్క ఆభాస ఉంటుందో దానిధర్మం 'అనాఖ్యేయాంశభాసిత్వం' అది ధ్వనికి లక్షణం కాదు అని సంబంధం. ఇందుకు హేతువు - నిర్వాచ్యార్థతయా అనేది. బాగా విభజించి చెప్పడానికి శక్యం అవడం వల్ల అని అర్థం. మరొకడు 'నిర్వాచ్యార్థతయా' లోని 'నిస్'కు నఞర్థత్వం కల్పించి (నిస్' అనే ఉపసర్గకు అభావార్థం కల్పించి) అది అనాఖ్యేయాంశభాసిత్వానికి హేతువు అని వ్యాఖ్యానించాడు. (దాని అర్థం చెప్పడం శక్యం కాదు గాన అది అనాఖ్యేయాంశభాసి అని అర్థం చెప్పాడు). అది క్లిష్టవ్యాఖ్యానం. అంతే కాకుండా హేతువు (దాని అర్థం చెప్పడానికి శక్యం కాదు గాన అనేది) సాధ్యం (అనాఖ్యేయం అనేది) రెండూ ఒకటే అయిపోయాయి. అందుచేత చెప్పిన వ్యాఖ్యానమే శివం.

కావ్యాలోకే ఇతి - కావ్యాలోకే - కావ్యాలోకంలో (ధ్వన్యాలోకానికి కావ్యాలోకం అనీ సహృదయాలోకం అనీ నామాంతరాలు), ప్రథామ్ - ప్రసిద్ధిని, విస్తృతిని, నీతాన్=పొందింపబడిన, ధ్వనిభేదాన్=ధ్వనిభేదాలను, పరామృశత్ - పరామర్శిస్తూన్న (వివరిస్తూన్న), లోచనమ్ = ఈ లోచనం, ఇదానీమ్ = ఇప్పుడు, లోకాన్ = లోకులను, కృతార్థాన్ =కృతార్థులనుగా, సంవిధాస్యతి= చేయగలదు.

ఆసూత్రితానామ్ ఇతి - ఆ సూత్రితానామ్ =మనసా భావించబడిన (గ్రంథపక్షంలో నిరూపించబడిన) భేదానామ్=విభిన్నవస్తువులకు (ధ్వనిభేదాలకు ) స్ఫుటతాపత్తి దాయినీమ్ = స్ఫుటత్వప్రాప్తిని ఇచ్చే, త్రిలోచనప్రియామ్= త్రిలోచన ప్రియురాలైన, మధ్యమామ్= మధ్యమారూపిణియైన, పరమేశ్వరీమ్= పరమేశ్వరిని, వన్దే = నమస్కరిస్తున్నాను.

శ్రీమహామాహేశ్వరాచార్యవర్యుడైన అభినగుప్తునిచేత వికసింపచేయబడిన (తెరవబడిన) ధ్వనిస్వరూపప్రతిపాదకమైన సహృదయాలోకలోచనంలో మూడవ ఉద్యోతం సమాప్తం.

సలోచన ధ్వన్యాలోకాంధ్రవ్యాఖ్యయైన బాలానందినిలో

తృతీయోద్యోతం సమాప్తం

# చతుర్థోద్యోతః

## ధ్వన్యాలోకం

ఏవం ధ్వనిం సప్రపఞ్చం విప్రతిపత్తినిరాసార్థం వ్యుత్పాద్య తద్వ్యుత్పాదనే ప్రయోజనాన్తరముచ్యతే -

కా. ధ్వనేర్యః సగుణీభూతవ్యఙ్గ్యస్యాధ్వా ప్రదర్శితః,
అనేనానన్త్యమాయాతి కవీనాం ప్రతిభాగుణః. 1.

య ఏష ధ్వనేర్గుణీభూతవ్యఙ్గ్యస్య చ మార్గః ప్రకాశితః తస్య ఫలాన్తరం కవిప్రతిభానన్త్యమ్.

### బాలానందిని

ఏవమితి - ఈ విధంగా ధ్వనిని గూర్చిన విప్రతిపత్తులన్నీ తొలగడం కోసం ధ్వనిని వివిధభేదసహితంగా నిరూపించి ఆ ధ్వనిని గూర్చిన వ్యుత్పత్తి కలిగించడంలో మరొక ప్రయోజనం చెప్పబడుతూన్నది -

ధ్వనేరితి - సగుణీభూతవ్యఙ్గ్యస్య =గుణీభూతవ్యంగ్యంతో కూడిన, ధ్వనేః=ధ్వని యొక్క, యః=ఏ, అధ్వా=మార్గం, ప్రదర్శితః=చూపబడినదో, అనేన=దీనిచేత, కవీనామ్=కవులయొక్క, ప్రతిభాగుణః=ప్రతిభారూపమైన గుణం, ఆనన్త్యమ్= అనంతత్వాన్ని, యాతి=పొందును.

య ఇతి - ధ్వనియొక్క, గుణీభూతవ్యంగ్యంయొక్క, ఈ ఏ మార్గం చూపబడిందో దీనికి కవిప్రతిభ అనంతం అవడం మరొక ఫలం.

### లోచనం

శ్లో. కృత్యపఞ్చకనిర్వాహయోగేఽపి పరమేశ్వరః,
నాన్యోపకరణాపేక్షో యయా తాం నౌమి శాఙ్కరీమ్.

ఉద్యోతాన్తరసంగతిం విరచయితుం వృత్తికార ఆహ - ఏవమితి. ప్రయోజనాన్తరమితి - యద్యపి "సహృదయమనఃప్రీతయే" ఇత్యనేన ప్రయోజనం ప్రాగేవోక్తం తృతీయోద్యోతావధౌ చ "సత్కావ్యం కర్తుం వా జ్ఞాతుం వా" ఇతి తదేవ ఈషత్ స్ఫుటీకృతం, తథాపి స్ఫుటతరీకర్తుమిదానీం

యత్నః. యతః సుస్పష్టరూపత్వేన విజ్ఞాయతే అతః అస్పష్టనిరూపితాత్ స్పష్టనిరూపణమ్ అన్యథైవ ప్రతిభాతీతి ప్రయోజనాన్తరమిత్యుక్తమ్. అథవా పూర్వోక్తయోః ప్రయోజనయోరనన్తరం విశేషః అభిధీయతే, కేన విశేషేణ సత్కావ్యకరణమస్య ప్రయోజనమ్, కేన చ సత్కావ్యబోధ ఇతి విశేషో నిరూప్యతే. తత్ర సత్కావ్యకరణే కథమస్య వ్యాపార ఇతి పూర్వం వక్తవ్యం నిష్పాదితస్య జ్ఞేయత్వాత్, ఇతి తదుచ్యతే - ధ్వనేర్య ఇతి. 1

బాలానందిని

కృత్యేతి. పరమేశ్వరః =పరమేశ్వరుడు, కృత్యపఞ్చకనిర్వాహయోగేఽపి =సృష్టి, స్థితి, సంహారం, తిరోభావం, అనుగ్రహకరణం అనే ఐదు కృత్యాల నిర్వహణంలో కూడ, యయా = ఏ పరమేశ్వరిచేత, అన్యోపకరణాపేక్షః=ఇతరోపకరణాల అపేక్ష ఉన్నవాడు, న =కాడో, ఈ కృత్యపంచకనిర్వహణంలో ఆమెయే తోడ్పడుతుంది గాన మరొక ఉపకరణం ఏదీ పరమేశ్వరునికి అవసరం లేదని అర్థం, తాం శాఙ్కరీమ్=ఆ పరమేశ్వరిని, నౌమి=స్తుతిస్తున్నాను.

ఉద్ద్యోతేతి - వృత్తికారుడు మరొక ఉద్ద్యోతంతో (పూర్వోద్ద్యోతంతో) సంగతి చేయడానికి చెపుతున్నాడు - ఏవమితి. ప్రయోజనాన్తరమితి. ప్రయోజనం "సహృదయమనఃప్రీతయే" అని పూర్వమే చెప్పబడినా, తృతీయోద్ద్యోతావధిలో "సత్కావ్యాన్ని రచించడానికి గాని, తెలుసుకొనడానికి గాని' అని అంటూ అదే కొంచెం స్పష్టీకరించబడినా, ఈ విషయాన్ని ఇంకా అధికంగా స్ఫుటంచేయడంకొరకే ఇప్పుడీ ప్రయత్నం. సుస్పష్టరూపంలో తెలియబడుతుంది గాన, అస్పష్టంగా నిరూపించిన ప్రయోజనంకంటె స్పష్టనిరూపణం మరొక విధంగానే ప్రతిభాసిస్తుంది. లేదా - పూర్వం చెప్పిన రెండు ప్రయోజనాల అనంతరం విశేషం ప్రతిపాదించబడుతుంది - ఏ విశేషాన్ని పట్టి సత్కావ్యకరణం దీని ప్రయోజనమో, ఏ విశేషాన్ని పట్టి సత్కావ్యజ్ఞానం దీని ప్రయోజనమో, ఆ విశేషం, నిరూపించబడుతున్నది. అందులో సత్కావ్యకరణంలో ఏ విధంగా ఉపయోగిస్తుంది అనే విషయం ముందు చెప్పాలి. రచించబడిన (తయారు చేయబడిన) దానినే కదా తెలుసుకోవడం అనేది? అందుచేత "ధ్వనేర్యః" ఇత్యాదికం చేత అది చెప్పబడుతున్నది. 1.

ధ్వన్యాలోకం

కథమితి చేత్ -

శ్లో. అతో హ్యన్యతమేనాపి ప్రకారేణ విభూషితా,

వాణీ నవత్వమాయాతి పూర్వార్థాన్వయవత్యపి . 2

అతః ధ్వనేః ఉక్తప్రభేదమధ్యాత్ అన్యతమేనాపి ప్రకారేణ విభూషితా సతీ వాణీ పురాతననిబద్ధార్థసంస్పర్శవత్యపి నవత్వమాయాతి. తథాహి - అవివక్షితవాచ్యస్య ధ్వనేః ప్రకారద్వయసమాశ్రయణేన నవత్వం పూర్వార్థానుగమే ఽపి యథా-

శ్లో. స్మితం కించిన్ముగ్ధం తరలమధురో దృష్టివిభవః

పరిస్పన్దో వాచామభినవవిలాసోర్మిసరసః,

గతానామారమ్భః కిసలయితలీలాపరిమలః

స్పృశన్త్యాస్తారుణ్యం కిమివ హి న రమ్యం మృగదృశః. (126)

ఇత్యస్య,

శ్లో. సవిభ్రమస్మితోద్భేదా లోలాక్ష్యః ప్రస్ఖలద్గిరః,

నితమ్బాలసగామిన్యః కామిన్యః కస్య న ప్రియాః. (127)

ఇత్యేమాదిషు శ్లోకేషు సత్స్వపి తిరస్కృతవాచ్యధ్వనిసమాశ్రయేణ అపూర్వమేవ ప్రతిభాసతే.

బాలానందిని

ఎట్లనగా -

అత ఇతి. అతః=ఈ ధ్వనిభేదసముదాయంనుంచి, ఏకతమేనాపి ప్రకారేణ=ఒక ప్రకారం చేతనైనా, విభూషితా = అలంకరించబడి, వాణీ=వాక్కు, పూర్వార్థాన్వయవత్యపి= ప్రాచీనార్థంతో సంబంధం గలదైనా, నవత్వమ్=నూతనత్వాన్ని, ఆయాతి= పొందుచున్నది.

అత ఇతి . అతః=చెప్పబడిన ధ్వనిప్రభేదాలమధ్యనుండి, ఏ ఒక్క ప్రకారంచేత అలంకరించబడినదైనా వాణి, ప్రాచీనకవులు కూర్చిన అర్థంయొక్క సంస్పర్శ

కలదైనా కూడ నవత్వాన్ని పొందుతుంది. ఎట్లనగా -పూర్వార్థసంస్పర్శ ఉన్నా కూడ అవివక్షిత వాచ్యధ్వనియొక్క రెండు ప్రకారాలను ఆశ్రయించడంచేత నవత్వం ఎట్లనగా - "సవిభ్రమస్మిత" ఇత్యాదిశ్లోకాలు ఉన్నా కూడ తిరస్కృతవాచ్యధ్వనిని ఆశ్రయించడం చేత "స్మితం కించిత్" ఇత్యాదిశ్లోకంలో అపూర్వత్వమే భాసిస్తున్నది.

స్మితమ్ ఇతి - కించిత్ స్మితమ్=చిరునవ్వు, ముగ్ధమ్=ముగ్ధంగా మనోహరంగా ఉన్నది. దృష్టివిభవః=దృష్టివైభవం, తరలమధురః=చంచలంగాను మధురంగాను ఉన్నది. వాచామ్=వాక్కులయొక్క, పరిస్పన్దః=ప్రసారము, అభినవవిలాసోర్మి సరసః=నూతనవిలాసతరంగాలచేత సరసమైనది. గతానామ్=నడకలయొక్క, ఆరమ్భః=ప్రారంభం, కిసలయితలీలాపరిమలః=చిగిర్చిన విలాసపరిమళం గలది. తారుణ్యమ్=యౌవనమును, స్పృశన్త్యాః=స్పృశిస్తున్న, మృగదృశః=మృగనయనయొక్క, కిమివ=ఏది, న హి రమ్యమ్=రమ్యం కాదు?

సవిభ్రమేతి - సవిభ్రమస్మితోద్భేదాః=విలాసలతో కూడిన స్మితాంకురములు కలవారు, లోలాక్ష్యః=చంచలమైన నేత్రాలు కలవారు, ప్రస్ఖలద్గిరః=తొట్రుపడుచున్న మాటలు గలవారు, నితమ్బాలసగామిన్యః=నితంబభారంచేత మందంగా నడిచేవారు అయిన, కామిన్యః=కామినులు, కస్య=ఎవనికి, న ప్రియాః=ప్రియమైనవారు కారు?

లోచనం

నను ధ్వనిభేదాత్ ప్రతిభానామానన్త్యమితి వ్యధికరణమేతదిత్యభిప్రాయేణ శఙ్కతే - కథమితీతి. అత్రోత్తరమ్ - **అతో హీతి.** ఆసతాం తావద్బహవః ప్రకారాః, ఏకేనాప్యేవం భవతీత్యపిశబ్దార్థః. ఏతదుక్తం భవతి - వర్ణనీయవస్తునిష్ఠః ప్రజ్ఞావిశేషః ప్రతిభానమ్. తత్ర వర్ణనీయస్య పారిమిత్యాత్ ఆద్యకవినైవ స్పృష్టత్వాత్ సర్వస్య తద్విషయం ప్రతిభానం తజ్జాతీయమేవ స్యాత్. తతశ్చ కావ్యమపి తజ్జాతీయమేవేతి భ్రష్ట ఇదానీం కవిప్రయోగః. ఉక్తవైచిత్ర్యేణ తే ఏవార్థాః నిరవధయో భవన్తీతి తద్విషయాణాం ప్రతిభానామానన్త్యముపపన్నమితి. నను ప్రతిభానన్త్యస్య కిం ఫలమితి నిర్ణేతుం వాణీ నవత్వమాయాతి ఇత్యుక్తమ్. తేన వాణీనాం కావ్యవాక్యానాం తావన్నవత్వమాయాతి. తచ్చ ప్రతిభానన్త్యే సత్యుపపద్యతే, తచ్చార్థానన్త్యే తచ్చ ధ్వనిప్రభేదాదితి.

బాలానందిని

నన్వితి - ధ్వనిభేదంవల్ల ప్రతిభలు అనంతం అవుతాయి అని అంటే ఇది వ్యధికరణం కదా? (ధ్వనిభేదాలు ఎక్కువ అవుతే అవి అనంతం అవాలి కాని ప్రతిభ అనంతం అవడం ఏమిటి? అని అర్థం) అనే అభిప్రాయంతో ఆశంకిస్తున్నాడు - కథమితీతి. అతో హి ఇత్యాదికం దీనికి సమాధానం. అనేక ప్రకారాల మాట అటుంచు, ఒక్కదానిచేత కూడ ఈవిధంగా అవుతుంది అని 'అపి' శబ్దానికి ('అన్యతమేనాపి'లో) అర్థం. ఇక్కడ చెప్పిన విషయం ఇది - వర్ణించదగిన వస్తువుతో సంబంధించిన ప్రజ్ఞావిశేషం ప్రతిభానం. వర్ణనీయవస్తువు పరిమితమైనది. అది ఆదికవిచేతనే స్పృశించబడింది. అందుచేత దానిని గూర్చిన ప్రతిభానం ఎవనికి కలిగినా తజ్జాతీయంగానే (ఆదికవిచేత ఏది స్పృశించబడిందో దాని జాతికి చెందినదే) అవుతుంది. కావ్యం కూడా తజ్జాతీయమే అవుతుంది. అందుచేత - ఇంకేముంది! 'కవి' అనే ప్రయోగానికే ముప్పు వచ్చింది. అయితే ఇప్పుడు చెప్పిన వైచిత్ర్యాన్ని పట్టి అవే అర్థాలు (విషయాలు) అనంతాలు అవుతాయి. అందుచేత వాటిని గూర్చిన ప్రతిభల ఆనంత్యం ఉపపన్నమే. నన్వితి. ప్రతిభ అనంతం అయినందువల్ల ఫలం ఏమిటి అని నిర్ణయించడానికి వాణి నూతనత్వాన్ని పొందుతుంది అని చెప్పబడింది. దానిచేత వాణులకు, కవివాక్యాలకు, నూతనత్వం వస్తుంది. అది ప్రతిభ అనంతమైనప్పుడే కుదురుతుంది. ప్రతిభ అనంతం కావాలంటే అర్థాలు అనంతంగా ఉండాలి. అర్థాలు అనంతాలు కావాలంటే అది ధ్వనిప్రభేదాలను పట్టి ఏర్పడుతుంది.

లోచనం

తత్ర ప్రథమమత్యన్తతిరస్కృతవాచ్యాన్వయమాహ - స్మితమితి - ముగ్ధమధురవిభవసరసకిసలయితపరిమలస్పర్శనాని అత్యన్తతిరస్కృతాని - తైః అనాహృతసౌందర్యసర్వజనవాల్లభ్యాక్షీణప్రసరత్వసంతాపప్రశమన తర్పకత్వసౌకుమార్యసార్వకాలికతత్సంస్కారానువృత్తిత్వయత్నాభిలాషణీయ సంగతత్వాని ధ్వన్యమానాని యాని, తైః స్మితాదేః ప్రసిద్ధస్య అర్థస్య స్థవిరవేధోవిహితధర్మవ్యతిరేకేణ ధర్మాన్తరపాత్రతా యావత్ క్రియతే తావత్తదపూర్వమేవ సంపద్యత ఇతి సర్వత్ర ఇతి మన్తవ్యమ్. అస్యేతి. అపూర్వత్వమేవ భాసత ఇతి దూరేణ సంబన్ధః.

బాలానందిని

తత్రేతి. వాటిలో ముందు అత్యంతతిరస్కృతవాచ్యంయొక్క అన్వయం చెపుతున్నాడు - స్మితమితి. ముగ్ధ - మధుర- విభవ- సరస- కిసలయిత- పరిమల- స్పర్శన పదాలు అత్యంతతిరస్కృతవాచ్యాలు. (అనగా 'ముగ్ధ' శబ్దానికి మోహకారి అని ముఖ్యార్థం. ఇట్లే 'మధుర' శబ్దానికి తియ్యనైనది అని ముఖ్యార్థం. 'విభవ' శబ్దానికి ఐశ్వర్యం అని అర్థం. ఆ ముఖ్యార్థాలు కుదరకపోవడంచేత ముగ్ధాది శబ్దాలు సాదృశ్యనిమిత్తకమైన లక్షణచే స్మితాదులను బోధిస్తున్నాయి. దానిచేత స్మితాదుల కున్న సౌందర్యవిశేషాధిక్యం వ్యంజింపబడుతున్నది అని అర్థం). ఈ పదాలచేత వరసగా (1) అకృత్రిమమైన సౌందర్యం (ముగ్ధ) (2) (దృష్టికి) సకలజనేష్టత్వం (మధుర) (3) అక్షీణ (అగని, తగ్గని) ప్రసారాలు (విభవ), (4) సంతాపప్రశమనం, తర్పకత్వం (సరస) (5) సౌకుమార్యంచేత నడకలో మాంద్యం (కిసలయిత) (6) ఆ లీలలు సర్వదా అనువర్ణించడం (పరిమల)(7) ప్రయత్నపూర్వకంగా సంగమం అభిలషించదగి ఉండడం (స్పర్శన) అనే అర్థాలు వ్యంజింపబడుతున్నాయి. ఈ వ్యంగ్యార్థాలు ప్రసిద్ధమైన స్మితాదిపదార్థాలను వృద్ధుడైన బ్రహ్మదేవుడు కల్పించిన ధర్మాలకంటె భిన్నమైన ధర్మాంతరాలకు స్థానం అయేటట్లు చేస్తున్నాయి. ఈ విధంగా కల్పించడంతో అదంతా క్రొత్తదిగానే అవుతుంది. ఈ విధంగా అంతటా (అన్ని ఉదాహరణలలోను) గ్రహించాలి. అస్య అనే పదానికి 'భాసతే' అనే దూరంగా ఉన్న పదంతో సంబంధం.

ధ్వన్యాలోకం

తథా -

శ్లో. యః ప్రథమః ప్రథమః స తు తథాహి హతహస్తిబహలపలలాశీ,
శ్వాపదగణేషు సింహః సింహః కేనాధరీక్రియతే. (128)

ఇత్యస్య-

శ్లో. స్వతేజఃక్రీతమహిమా కేనాన్యేనాతిశయ్యతే,
మహద్భిరపి మాతఙ్గైః సింహః కిమభిభూయతే. (129)

ఇత్యేవమాదిషు శ్లోకేషు సత్స్వపి అర్థాన్తరసంక్రమితవాచ్యధ్వని సమాశ్రయేణ నవత్వమ్.

బాలానందిని

అట్లే - "స్వతేజః" ఇత్యాది శ్లోకాలు ఉన్నా కూడ "యః ప్రథమః" ఇత్యాది శ్లోకానికి అర్థాంతరసంక్రమితవాచ్యధ్వనిని ఆశ్రయించడంచేత నవత్వం లభిస్తుంది.

యః ఇతి :- యః=ఎవడు, ప్రథమః=ప్రథముడో, సః=అతడు, ప్రథమః= ప్రథముడే, తథాహి = అది యుక్తమే కదా. హతహస్తిబహలపలలాశీ = చంపబడిన ఏనుగుయొక్క అధికమైన మాంసం తినే, సింహః=సింహం, శ్వాపదగణేషు=క్రూరమృగాల సముదాయాలలో, సింహః=సింహమే, కేత=దేనిచేత, ('శ్వాపదగణేషు' అనేది దీనికి ముందు అన్వయించవచ్చును) అధరీక్రియతే =క్రిందిదిగా చేయబడుతుంది?

స్వతేజః ఇతి : స్వతేజఃక్రీతమహిమా = తన తేజస్సుచేత కొనబడిన మహిమ గలవాడు, అన్యేన =ఇతరుడైన, కేన=ఎవనిచేత, అతిశయ్యతే=అతిశయించబడుతాడు? మహద్భిరపి=పెద్దవే అయినా, మాతఙ్గైః=ఏనుగులచేత, సింహః=సింహం, అభిభూయతే కిమ్=తిరస్కరించబడుతుందా?

లోచనం

సర్వత్రైవాస్య నవత్వమితి సంగతిః. ద్వితీయః ప్రథమశబ్దః అర్థాన్తరే అనపాకరణీయ ప్రధానత్వాసాధారణత్వాదివ్యఙ్గ్యధర్మాన్తరే సంక్రాన్తం స్వార్థం వ్యనక్తి. ఏవం సింహశబ్దోఽపి వీరత్వానపేక్షత్వవిస్మయనీతయత్వాదౌ వ్యఙ్గ్యధర్మాన్తరే సంక్రాన్తం స్వార్థం ధ్వనతి.

బాలానందిని

సర్వత్రైవ ఇతి - (ఈ ఘట్టంలో) అంతటా కూడ "అస్య..... నవత్వమ్" అని అన్వయం. రెండవ 'ప్రథమ' శబ్దం తొలగింపరాని ప్రధానత్వం కలిగి ఉండడం, అసాధారణత్వం మొదలైన ధర్మాంతరాలయందు సంక్రమించిన స్వార్థాన్ని బోధిస్తుంది. అదే విధంగా రెండవ సింహశబ్దం కూడ వీరత్వం, ఇతరసహాయానపేక్షత్వం, ఆశ్చర్యజనకత్వం మొదలైన వ్యంగ్యాలైన ఇతరధర్మాలలో సంక్రమించిన స్వార్థాన్ని ధ్వనింపచేస్తుంది.

## ధ్వన్యాలోకం

వివక్షితాన్యపరవాచ్యస్యాపి ఉక్తప్రకారసమాశ్రయేణ నవత్వం యథా -

శ్లో. నిద్రాకైతవినః ప్రియస్య వదనే విన్యస్య వక్త్రం వధూః
బోధత్రాసనిరుద్ధచుమ్బనరసాప్యాభోగలోలం స్థితా,
వైలక్ష్యాద్విముఖీభవేదితి పునస్తస్యాప్యనారమ్భిణః
సాకాఙ్క్ష ప్రతిపత్తి నామ హృదయం యాతం తు పారం రతేః.
(130)

ఇత్యాదేః శ్లోకస్య-

శ్లో. శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనై
ర్నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్,
విస్రబ్ధం పరిచుమ్బ్య జాతపులకామాలోక్య గణ్డస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుమ్బితా. (131)

ఇత్యాదిషు శ్లోకేషు సత్స్వపి నవత్వమ్. యథా వా - "తరఙ్గ భ్రూభఙ్గా" ఇత్యాది శ్లోకస్య "నానాభఙ్గిభ్రమద్భ్రూః" ఇత్యాది శ్లోకాపేక్షయా అన్యత్వమ్.

బాలానందిని

వివక్షితేతి-పైన చెప్పిన విధంగా వివక్షితాన్యపరవాచ్యవ్యంగాన్ని ఆశ్రయించడం చేత నవత్వం ఎట్లనగా-"శూన్యం వాసగృహమ్" ఇత్యాదిశ్లోకాలున్నా కూడ 'నిద్రాకైతవినః' ఇత్యాది శ్లోకానికి నవత్వం కనబడుతున్నది.

నిద్రా ఇతి. వధూః = నవవధువు, నిద్రాకైతవినః=నిద్ర అనే మిష గల, (నిద్రిస్తున్నట్లు అభినయిస్తూన్న) ప్రియస్య = ప్రియునియొక్క, వదనే = ముఖమునందు, వక్త్రమ్=ముఖమును, విన్యస్య = ఉంచి, బోధ త్రాసనిరుద్ధచమ్బనరసాపి = మెలకువ వల్ల భయంచేత, (మేల్కొటాడేమో అనే భయంచేత) అడ్డుకొనబడిన చుంబనాసక్తి కలదైనా కూడ, ఆభోగలోలమ్=(నిద్రను గూర్చిన ఆలోచనతో) చూడడంలో చంచలంగా, (చంచలమైన మనస్సు కలుగు నట్లుగా) స్థితా=ఉండిపోయింది. వైలక్ష్యాత్=సిగ్గువలన, విముఖీ భవేత్ ఇతి = విముఖురాలగును అని, తస్యాపి=అతడు కూడ, అనారమ్భిణః=ఏమీచేయకుండా ఉండగా, హృదయం పునః =(అతని) హృదయం

అయితే, సాకాఙ్క్షప్రతిపత్తి నామ=అభిలాషతో కూడిన స్థితి గలదైతే అయింది, తు=కాని, రతేః=రతియొక్క, పారమ్=పారం, యాతమ్=పొందబడినది.

శూన్యమితి - ఇది అమరుకంలోని పద్యం. "ముగ్ధనాయిక శయనగృహంలో ఇతరులెవ్వరూ లేరని చూచింది. పక్క మీదనుంచి కొంచెం మెల్లగా లేచింది. భర్త నిద్రపోతున్నట్లు అభినయిస్తున్నాడు. అతని ముఖం తదేకదీక్షగా కొంతసేపు చూచింది. నిర్భయంగా చుంబనం చేసింది అప్పుడు అతని చెక్కిళ్ల మీద గగుర్పాటు కలగడం చూచి సిగ్గుతో తల వంచుకుంది. అలాంటి స్థితిలో ఆమెను ప్రియుడు నవ్వుతూ చాలా సేపు ముద్దుపెట్టుకున్నాడు"

యథా వా ఇతి :- మరొక ఉదాహరణం ఎట్లనగా - తరఙ్గభ్రూభఙ్గా" ఇత్యాదిశ్లోకం (శ్లో.25) "నానాభఙ్గిభ్రమద్భ్రూః" ఇత్యాది శ్లోకంకంటె భిన్నంగానే కనబడుతుంది. ('నానాభఙ్గి' ఇత్యాదిశ్లోకం ఎక్కడిదో తెలియదు. పూర్తి శ్లోకం కూడ లభ్యం కాలేదు).

### లోచనం

ఏవం ప్రథమస్య ద్వౌ భేదావుదాహృత్య ద్వితీయస్యాపి ఉదాహర్తుమాసూత్రయతి - వివక్షితేతి - నిద్రాయాం కైతవీ కృతకసుప్త ఇత్యర్థః. వదనే విన్యస్య వక్త్రమ్ ఇతి - వదనస్పర్శజమేవ తావద్దివ్యం సుఖం త్యక్తుం న పారయతీతి. అత ఏవ ప్రియస్యేతి. వధూః నవోఢా. బోధత్రాసేన ప్రియతమబోధభయేన నిరుద్ధః. హఠాత్ ప్రవర్తమానః, ప్రవర్తమానో ఽపి కథంచిత్కథంచిత్ క్షణమాత్రం ధృతఃచుమ్బనాభిలాషః యయా.అత ఏవ ఆభోగేన పునః పునర్నిద్రావిచారనిర్వర్ణనయా విలోలం కృత్వా స్థితా; న తు సర్వథైవ చుమ్బనాత్ నివర్తితుం శక్నోతీత్యర్థః. ఏవం భూతైషా యది మయా పరిచుమ్బ్యతే తద్వ్రీలక్షా విముఖీ భవేదితి తస్యాపి ప్రియస్య చుమ్బనవిషయే నిరారమ్భస్య.హృదయం సాకాఙ్క్షప్రతిపత్తి నామేతి.సాకాంక్షాసాభిలాషా ప్రతిపత్తిః స్థితిః యస్య తాదృశం రుహరుహికాకదర్థితం న తు మనోరథసంపత్తి చరితార్థమ్. కిం తు రతేః పరస్పరజీవితసర్వస్వాభిమానరూపాయాః పరనిర్వృతేః కేన చిదప్యనుభవేన అలబ్ధావగాహనాయాః పారం గతమితి పరిపూర్ణ ఏవ శృఙ్గారః.

ద్వితీయశ్లోకే తు పరిచుమ్బనం సంపన్నమ్. లజ్జా స్వశబ్దేనోక్తా. తేనాపి సా పరిచుమ్బితేతి యద్యపి పోషిత ఏవ శృఙ్గారః తథాపి ప్రథమశ్లోకే పరిస్పరాభిలాషప్రసరనిరోధపరంపరాపర్యవసానాసంభవేన యా రతిరుక్తా సా ఉభయోరప్యేకస్వరూపచిత్తవృత్త్యనుప్రవేశమాచక్షాణా రతిం సుతరాం పోషయతి. 2

బాలానందిని

ఏవమితి - ఈ విధంగా మొదటిదాని యొక్క (అవివక్షితవాచ్యధ్వనియొక్క రెండు భేదాలను ఉదాహరించి రెండవదానికి ఉదాహరించుటకు ప్రసంగం ఏర్పరుస్తున్నాడు (ఆసూత్రయతి) - వివక్షితేతి - నిద్రాయాం కైతవీ - నిద్రిస్తున్నట్లు అభినయిస్తున్నాడు అని అర్థం - వదనే విన్యస్య వక్త్రమ్ ఇతి- ముఖస్పర్శమాత్రంచేతనే కలిగిన దివ్యమైన సుఖాన్ని విడవడానికి సమర్థురాలుగా లేదు అని అర్థం . అందువల్లనే ప్రియస్య అని చెప్పబడింది. వధూః=క్రొత్తగా వివాహం చేసికొనబడిన వధువు, బోధత్రాసేన =ప్రియతముడు మేల్కొంటాడేమో అనే భయంచేత, నిరుద్ధః- హటాత్తుగా ప్రవర్తిస్తున్నదీ, ప్రవర్తిస్తున్నా కూడ ఎలాగో ఎలాగో క్షణకాలం పాటు నిలుపుకొనబడినది అయిన చుంబనాభిలాష ఎవతెచేతనో అట్టిది - అందువలననే, ఆభోగేన - మళ్లీ నిద్రను గూర్చి ఆలోచిస్తూ చూస్తుండడంచేత చాంచల్యంతో (చుంబనసంశయతో) ఉన్నది; అంతేనే కాని పూర్తిగా, చుంబనం చేయకుండా ఉండడానికి సమర్థురాలు కాదు అని అర్థం. ఇలాంటి ఈమెను నేను చుంబించినట్లయితే అప్పుడు సిగ్గుపడి విముఖురాలవుతుంది అని ఆ ప్రియుడుకూడ చుంబనం విషయంలో ప్రారంభం (ప్రయత్నం) లేకుండా ఉన్నాడు. ఆలాంటి వాని హృదయం, సాకాంక్ష ప్రతిపత్తి నామ - అభిలాషతో కూడిన స్థితి కలది; రుహరుహికచేత (ఉబలాటంచేత) పీడింపబడింది, కాని మనోరథం సంపన్నం అవడం ద్వారా చరితార్థం కాలేదు. కాని, రతేః= పరస్పరమూ జీవితసర్వస్వాభిమానరూప మైన గొప్ప ఆనందం, ఏ విధమైన అనుభవంచేతనూ కూడ పొందబడని ప్రవేశం కలదైనా (ప్రవేశించబడకపోయినా కూడ) దానియొక్క (రతియొక్క) పారం పొందబడింది. (చుంబనమాత్రం కూడా జరగపోయినా మహానందం పొందబడింది అని భావం) ఈ విధంగా ఇక్కడ శృంగారం పరిపూర్ణమైనది. రెండవ శ్లోకంలో అయితే పరిచుంబనం సంపన్నం అయింది. లజ్జ స్వశబ్దంచేత ("లజ్జానమ్రముఖీ" అనే పదంచేత) వాచ్యంగా చెప్పబడింది. ఆతనిచేత కూడ ఆమె

చుంబించబడింది; ఈ విధంగా శృంగారం పోషించబడినా మొదటి శ్లోకంలో పరస్పరాభిలాష, దాని నిరోధం వీటి పరంపర పర్యవసానం సంభవించకపోవడం చేత (చుంబనాదికం జరగకపోయినా కూడ అని అర్థం) ఏ రతి చెప్పబడిందో అది ఇద్దరికీ కూడ ఏకరూపమైన చిత్తవృత్తిలో ప్రవేశాన్ని చెపుతూన్నదై, రతిని నిర్వృతిని అధికంగా, చక్కగా పోషిస్తూన్నది. 2

## ధ్వన్యాలోకం

కా. యుక్త్యానయానుసర్తవ్యో రసాదిర్బహువిస్తరః,
మిథో ఽప్యనన్తతాం ప్రాప్తః కావ్యమార్గో యదాశ్రయాత్. 3

బహువిస్తరో ఽయం రసభావతదాభాస తత్ప్రశమలక్షణః మార్గః యథాస్వం విభావానుభావప్రభేదకలనయా యథోక్తం ప్రాక్. స సర్వ ఏవ అనయా యుక్త్యా అనుసర్తవ్యః. యస్య రసాదేరాశ్రయాదయం కావ్యమార్గః పురాతనైః కవిభిః సహస్రసంఖ్యైరసంఖ్యైర్వా బహుప్రకారం క్షుణ్ణత్వాత్ మిథో ఽప్యనన్తతామేతి. రసభావాదీనాం హి ప్రత్యేకం విభానుభావవ్యభిచారిసమాశ్రయాత్ అపరిమితత్వమ్. తేషాం చైకైక ప్రభేదాపేక్షయాపి తావత్ జగద్వృత్తముపనిబధ్యమానం సుకవిభిః తదిచ్ఛావశాత్ అన్యథా స్థితమపి అన్యథైవ వివర్తతే. ప్రతిపాదితం చైతచ్చిత్రవిచారావసరే. గాథా చాత్ర కృతా మహాకవినా -

గాథ. అతహట్ఠిఏ వి తహసణ్ఠిఏ వ్వ హిఅఅమ్మి జా ణివేసేఇ,
అత్థవిసేసే జఅఇ వికడకఇగోఅరా వాణీ. (132)
"అతథాస్థితానపి తథాసంస్థితానివ హృదయే యా నివేశయతి.
అర్థవిశేషాన్ సా జయతి వికటకవిగోచరా వాణీ" (ఇతి ఛాయా.)

బాలానందిని

యుక్త్యా ఇతి - బహువిస్తరః = అధికవిస్తృతమైన, రసాదిః= రసాదికం, అనయా=ఈ, యుక్త్యా=యుక్తిచేత, అనుసర్తవ్యః=అనుసరించదగినది; యదాశ్రయాత్=దేనిని

ఆశ్రయించడంవల్ల, కావ్యమార్గః=కావ్యమార్గం, మిథః అపి= పరస్పరమూ కూడ, అనన్తతామ్=అనంతత్వాన్ని, ప్రాప్తః=పొందినదో.

బహ్వీతి - రస - భావ- తదాభాస - తత్ప్రశమనరూపమైన ఈ మార్గం వెనుక చెప్పినట్లు తగిన విధంగా ఆ యా రసాదుల విభావానుభావ ప్రభేదాల కూర్పుచేత చాల విస్తృతమైనది. అదంతా ఈ యుక్తిచేత (ఈ పద్ధతిచేత) అనుసరింపదగినది. వేలకొలది లేదా లెక్కింపశక్యంకాని ప్రాచీనకవులు ఈ రసాదులను ఆశ్రయించి ఈ కావ్యమార్గాన్ని అనేక విధాల త్రొక్కి ఉన్నారు. అందుచేత ఇది పరస్పరం అనంతత్వాన్ని పొందుతుంది. రసభావాదులలో ప్రతి ఒక్కటీ కూడ విభావ - అనుభావ - వ్యభిచారులను ఆశ్రయించడంవల్ల అపరిమితభేదాలు కలది అవుతుంది . వాటిలోని ఒక్కొక్క భేదాన్ని మాత్రమే తీసికొని సుకవులు తమ ఇచ్ఛావశంచేత జగచ్చరిత్రను నిబంధిస్తే అది ఒక విధంగా ఉన్నది మరొక విధంగా పరిణమిస్తుంది. ఈ విషయం చిత్రాన్ని గూర్చి విచారించే సమయంలో ప్రతిపాదించబడింది. ఈ విషయంలో మహాకవి గాథ రచించియే ఉన్నాడు -

అతథేతి - "అతినిపుణుడైన కవికి గోచరమైన ఏ వాణి అలా లేని అర్థవిశేషాలను అలా ఉన్నట్లు హృదయంలో నిలుపుతుందో అట్టి వాణి సర్వోత్కర్షతో ఉన్నది".

లోచనం

ఏవం మౌలం భేదచతుష్టయముదాహృత్య అలక్ష్యక్రమభేదేష్వతి దేశముఖేన సర్వోపభేదవిషయం నిర్దేశం కరోతి - యుక్త్యానయేతి. అనుసర్తవ్య ఇతి - ఉదాహర్తవ్య ఇత్యర్థః. యథోక్తమితి -

"తస్యాఙ్గానాం ప్రభేదా యే ప్రభేదాః స్వగతాశ్చ యే,
తేషామానన్త్యమన్యోన్యసంబన్ధపరికల్పనా." (కా.2.12)

ఇత్యత్ర. ప్రతిపాదితం చైతదితి : చశబ్దో ఽపిశబ్దార్థే భిన్నక్రమః. ఏతదపి ప్రతిపాదితం "భావానచేతనానపి చేతనవచ్చేతనానచేతనవత్"(ప.శ్లో.కా.3.41) ఇత్యత్ర. అతథాస్థితానపి బహిః తథాసంస్థితానివేతి: ఇవశబ్దేన ఏకతరత్ర విశ్రాన్తియోగాభావాదేవ సుతరాం విచిత్రరూపానిత్యర్థః. హృదయ ఇతి -

ప్రధానే సమస్తభావకనకనికషస్థానే ఇత్యర్థః. నివేశయతి - యస్య యస్య హృదయమస్తి తస్య తస్య అచలతయా తత్ర స్థాపయతీత్యర్థః. అత ఏవ తే ప్రసిద్ధార్థేభ్యః అన్య ఏవేత్యర్థవిశేషాః సంపద్యన్తే. హృదయనివిష్టా ఏవ చ తథా భవన్తి నాన్యథేత్యర్థః. సా జయతి పరిచ్ఛిన్నశక్తిభ్యః ప్రజాపతిభ్యోఽప్యుత్కర్షేణ వర్తతే. తత్ప్రసాదాదేవ కవిగోచరో వర్ణనీయోఽర్థః వికటః నిఃసీమా సంపద్యతే. 3

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా మౌలికమైన భేదచతుష్టయాన్ని ఉదాహరించి. అలక్ష్యక్రమభేదాలలోకూడ, అతిదేశం ద్వారా, సమస్తమైన ఉపభేదాలకు సంబందించిననిర్దేశం చేస్తున్నాడు యుక్త్యానయేతి. (ఒకదానికి సంబంధించిన కొన్ని విషయాలు లేదా విశేషాలు చెప్పి ఇవి మరొకదానికి కూడా వర్తిస్తాయి అని చెప్పడం అతిదేశం). అనుసర్తవ్య ఇతి- ఉదాహరించదగినది అని అర్థం. యథోక్తమ్ ఇతి. "తస్యాఙ్గానామ్" (కా.2-12) ఇత్యాదికారిక దగ్గర చెప్పబడిన విధంగా. ప్రతిపాదితం చైతదితి. 'చ' శబ్దం 'అపి' శబ్దార్థంలో ప్రయోగించబడింది. ఇది భిన్నక్రమం. "ఏతదపి ప్రతిపాదితమ్" అని గ్రహించాలి - ఇది కూడ "భావానచేతనానపి" ఇత్యాది పరికరశ్లోకంలో చెప్పబడింది(42వ కారిక వృత్తిలో). అతథాస్థితానిత్యాది - బైట ఆ విధంగా లేకపోయినా ఆవిధంగా ఉన్నట్లు - 'ఇవ' శబ్దంచేత ఒక చోట విశ్రాంతిసంబంధం లేకపోవడం చేత, అనగా ఇది ఇట్లే అని నిర్ధారితరూపంలో లేకపోవడంచేత, విచిత్రరూపములైనవి అని అర్థం. హృదయ ఇతి - సమస్తభావా లనే బంగారాన్ని పరీక్షించే అత్యంతప్రధానమైన గీటురాయి అయిన హృదయంలో అని అర్థం. నివేశయతి - ఎవరెవరికి హృదయం ఉంటుందో అలాంటి ప్రతి ఒక్కని హృదయంలోను స్థిరంగా స్థాపిస్తుంది అని అర్థం. అందువలననే అవి ప్రసిద్ధములైన అర్థాలకంటె భిన్నములే గాన 'అర్థవిశేషాలు' అవుతాయి. ఇవన్నీ హృదయనివిష్టాలయినప్పుడే అలా అవుతాయి; మరొక విధంగా కావు అని అర్థం. సా జయతి - పరిమితమైన శక్తి గల ప్రజాపతులకంటె కూడ ఉత్కర్షతో ఉన్నదిఆ వాణి యొక్క అనుగ్రహంచేతనే కవిగోచరమైన వర్ణింపదగిన అర్థం, వికటః=అనంతం అవుతుంది. 3

# ధ్వన్యాలోకం

తదిత్థం రసభావాద్యాశ్రయేణ కావ్యార్థానామానన్త్యం సుప్రతిపాదితమ్. ఏతదేవ ఉపపాదయితుముచ్యతే -

కా. దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్,
సర్వే నవా ఇవాభాన్తి మధుమాస ఇవ ద్రుమాః. 4

తథాహి- వివక్షితాన్యపరవాచ్యస్యైవ శబ్దశక్త్యుద్భవానురణన రూపవ్యఙ్గ్యప్రకారసమాశ్రయేణ నవత్వమ్. యథా - "ధరణీధారణాయాధునా త్వం శేషః" ఇత్యాదేః.

శ్లో. శేషో హిమగిరిస్త్వం చ మహాన్తో గురవః స్థిరాః,
యదలఙ్ఘితమర్యాదాశ్చలన్తీం బిభ్రతే భువమ్. (133)

ఇత్యాదిషు సత్స్వపి.

బాలానందిని

తదితి. ఈ విధంగా రసభావాదులను ఆశ్రయించడంచేత కావ్యార్థముల అనంతత్వం బాగా ప్రతిపాదించబడింది. దీనినే ఉపపాదించడానికి చెప్పబడుతున్నది-

దృష్టేతి - "కావ్యంలో రసాన్ని స్వీకరించడంవల్ల పూర్వం చూడబడినవే అయినా అన్ని పదార్థాలు కూడ, వసంతర్తువులో వృక్షాలవలె, క్రొత్తవి వలె భాసిస్తాయి." 4

తథా హీతి - అది యుక్తమే కదా - శబ్దశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యాన్ని ఆశ్రయించడంచేత వివక్షితాన్యపరవాచ్యం నూతనంగా కనబడుతుంది. ఎట్లనగా - "శేషో హిమగిరిః" ఇత్యాదిశ్లోకాలు ఉన్నా కూడ "ధరణీధారణాయ" ఇత్యాదివాక్యం (నవంగా కనబడుతుంది).

ధరణీతి - "ఇప్పుడు ధరణిని ధరించడానికి నువ్వు శేషుడవు." (మిగిలినావు అని రెండవ అర్థం).

శేష ఇతి: "ఆదిశేషుడు, హిమవత్పర్వతం, నువ్వు, మీరందరూ గొప్పవారు, బరువైనవారు, స్థిరులు. ఎందువల్లననగా కట్టుబాట్లను దాటనివారై (మీరందరూ) కదిలిపోతూన్న భూమిని ధరిస్తున్నారు". (ఇది భామహుని కావ్యాలంకారంలోని శ్లోకం. 3.28)

ధ్వన్యాలోకం

తస్యైవార్థశక్త్యుద్భవానురణనరూపవ్యఙ్గ్యసమాశ్రయేణ నవత్వమ్. యథా - "ఏవంవాదిని దేవర్షౌ" ఇత్యాదిశ్లోకస్య.

శ్లో. కృతే వరకథాలాపే కుమార్యః పులకోద్గమైః,
సూచయన్తి స్పృహామన్తర్లజ్జయానవతాననాః. (134)

ఇత్యాదిషు సత్సు. అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యఙ్గ్యస్య కవిప్రౌఢోక్తినిర్మితశరీరత్వేన నవత్వమ్. యథా-'సజ్జేహి సురహిమాసో' ఇత్యాదేః -

శ్లో. సురభిసమయే ప్రవృత్తే సహసా ప్రాదుర్భవన్తి రమణీయాః,
రాగవతాముత్కలికాః సహైవ సహకారకలికాభిః. (135)

ఇత్యాదిషు సత్స్వప్యపూర్వత్వమేవ.

బాలానందిని

తస్యేతి :- అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యాన్ని ఆశ్రయించడంచేత వివక్షితాన్యపరవాచ్యానికే నవత్వం లభిస్తుంది. ఎట్లనగా -

కృతే ఇతి పెండ్లికుమారుణ్ణి గూర్చి చెప్పకొంటూన్నప్పుడు, (వివాహం కావలసిన) బాలికలు లజ్జచేత వంగిన ముఖాలు కలవారై పులకాంకురాలచేత మనసులో ఉన్న ఆసక్తిని సూచిస్తూంటారు" ఇత్యాదులు ఉన్నా "ఏవంవాదిని దేవర్షౌ" ఇత్యాదిశ్లోకానికి (47) నవత్వం ఉంది.

అర్థేతి. అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యానికి కవిప్రౌఢోక్తినిర్మితశరీరత్వంచేత నవత్వం లభిస్తుంది. ఎట్లనగా -

సురభీతి - "వసంతకాలం ప్రారంభం అయిన వెంటనే మామిడిచెట్ల మొగ్గలతో పాటు, రాగవంతులకు సుందరమైన ఉత్కంఠలు ఆవిర్భవిస్తాయి" ఇత్యాదులు ఉన్నా "సజ్జేహి సురహిమాసో" (గాథ 51) ఇత్యాదులకు అపూర్వత్వం ఉంది.

ధ్వన్యాలోకం

అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యఙ్గ్యస్య కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తిమాత్రనిష్పన్నశరీరత్వేన నవత్వమ్. యథా 'వాణిఅఅ హత్థిదన్తా' ఇత్యాదిగాథార్థస్య -

గాథ. కరిణీవేహవ్వఅరో మహ పుత్తో ఏక్కకాణ్డ విణివాఇ.

హఅసోన్హా ఏం తహ కహో జహ కణ్డకరణ్డఅం వహఇ. (136)

"కరిణీవైధవ్యకరో మమ పుత్ర ఏకకాణ్డవినిపాతీ,

హతస్నుషయా తథా కృతో యథాకాణ్డకరణ్డకం వహతి" ఇతిచ్ఛాయా.

ఏవమాదిష్వర్థేషు సత్స్వపి అనాలీఢతైవ.

యథా వ్యఙ్గ్యభేదసమాశ్రయేణ ధ్వనేః కావ్యార్థానాం నవత్వముత్పద్యతే తథా వ్యఞ్జకభేదసమాశ్రయేణాపి. తత్తు గ్రన్థవిస్తరభయాత్ న లిఖ్యతే. స్వయమేవ సహృదయైః అభ్యూహ్యమ్.

బాలానందిని

అర్థేతి. - అర్థశక్త్యుద్భవానురణనరూపవ్యంగ్యం కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తి నిష్పన్నశరీరం అవడంచేత నూతనంగా ఉంటుంది. ఎట్లనగా -

కరిణీతి. "ఒక్క బాణంచేతనే (ఏనుగును) పడగొట్టేవాడు, ఆడ ఏనుగులకు వైధవ్యం కలిగించేవాడు అయిన నా పుత్రుడు అంబులపొది మోసుకొనిపోయేటట్లు చేసింది మా చెడ్డ కోడలు" ఇత్యాద్యర్థాలు ఉన్నా కూడ "వాణిఅఅ" (గాథ .76) ఇత్యాది గాథలోని అర్థం అనాలీఢమే; అనగా క్రొత్తది.

యథా ఇతి. ధ్వనివ్యంగ్యభేదాలను ఆశ్రయించడంచేత కావ్యార్థాలకు నవత్వం ఏ విధంగా లభిస్తుందో వ్యంజకభేదాలను ఆశ్రయించడంచేత కూడ అట్లే లభిస్తుంది. గ్రంథవిస్తరభయంవల్ల అదంతా వ్రాయడం లేదు. సహృదయులు స్వయంగానే ఊహించుకోవాలి.

లోచనం

ప్రతిభానాం వాణీనాం చ ఆనన్త్యం ధ్వనికృతమితి యదనుద్భిన్నముక్తం, తదేవ కారికయా భఙ్గ్యా నిరూప్యతే ఇత్యాహ - ఉపపాదయితుమితి. ఉపపత్త్యా

నిరూపయితుమిత్యర్థః. యద్యప్యర్థానన్త్యమాత్రే హేతుః వృత్తికారేణోక్తః, తథాపికారికా కారేణ నోక్త ఇతి భావః. యదివా ఉచ్యతి. సంగ్రహశ్లోకోఽయమితి భావః. అత ఏవాస్య శ్లోకస్య వృత్తిగ్రన్థే వ్యాఖ్యానం న కృతమ్.

దృష్టపూర్వా ఇతి :- బహిః ప్రత్యక్షాదిభిః ప్రమాణైః ప్రాక్తనైశ్చ కవిభిః ఇతి ఉభయథా నేయమ్. కావ్యం మధుమాసస్థానీయమ్. స్పృహామ్ లజ్జామితి, రాగవతామ్ ఉత్కలికా ఇతి చ శబ్దస్పృష్టేఽర్థే కా హృద్యతా? ఏతాని చ ఉదాహరణాని వితత్య పూర్వమేవ వ్యాఖ్యాతానీతి కిం పునరుక్త్యా? సత్యపి ప్రాక్తన కవిస్పృష్టత్వే నూతనత్వం భవత్యేవ ఏతత్ప్రకారానుగ్రహాదిత్యే తావతి తాత్పర్యం హి గ్రన్థస్య; అధికం నాన్యత్. కరిణీవైధవ్యకరో మమ పుత్రః ఏకేన కాణ్డేన వినిపాతనసమర్థః హతస్నుషయా తథాకృతః యథా కాణ్డ కరణ్డకం వహతీతి ఉత్తాన ఏవాయమర్థః; గాథార్థస్య అనాలీఢతైవ ఇతి సబన్ధః. 4

బాలానందిని

ప్రతిభానామితి. ప్రతిభలయొక్క, వాణులయొక్క, ఆనంత్యం ధ్వనివల్ల ఏర్పడుతుంది అని అస్పష్టంగా చెప్పిన విషయమే మరొక భంగిచేత నిరూపించబడుతున్నది అని చెపుతున్నాడు - ఉపపాదయితుమితి. ఉపపత్తిచేత (యుక్తిచేత) నిరూపించడం కొరకు అని అర్థం. యద్యపీతి:- వృత్తికారుడు అర్థాల ఆనంత్యం విషయంలో మాత్రం హేతువును ("యుక్త్యానయానుసర్తవ్యః"ఇత్యాదికారికావ్యాఖ్యానంలో చెప్పినా కారికాకారుడు చెప్పలేదు అని భావం. యది వా ఇతి - లేదా 'ఉచ్యతే' అనగా ఈ సంగ్రహశ్లోకం చెప్పబడుచున్నది అని అర్థం. అందువల్లనే (ఇది సంగ్రహశ్లోకమే కాని కారిక కాదు గాన) ఈ శ్లోకానికి వృత్తిగ్రంథంలో వ్యాఖ్యానం చేయబడలేదు. దృష్టపూర్వా ఇతి - బైట ప్రపంచంలో ప్రత్యక్షాదిప్రమాణాలచేత పూర్వం చూడబడినవి, ప్రాచీనులైన కవులచేత చూడబడినవి అని రెండు విధాల అర్థం చెప్పుకోవాలి. కావ్యం మధుమాసస్థానీయము. మధుమాసం వంటిది. స్పృహామ్=లజ్జను అనీ, రాగవంతులకు ఉత్కంఠలు అనీ శబ్దంచేత స్పశించబడిన (వాచ్యంగా చెప్పబడిన) అర్థంలో మనోహరత్వం ఏముంది? అందుచేత 'కృతే' ఇత్యాది శ్లోకంకంటె 'ఏవం వాదిని' ఇత్యాదిశ్లోకం

'సురభిసమయే' ఇత్యాదిశ్లోకంకంటె 'సజ్జేఇ' ఇత్యాదిశ్లోకమూ నవత్వంతో భాసిస్తున్నాయి అని భావం.

ఏతానీతి:- ఈ ఉదాహరణ లన్నీ వెనుక సవిస్తరంగా వ్యాఖ్యానించబడ్డాయి. ఇంక మళ్లీ వ్యాఖ్యానించడం (పునరుక్తి) ఎందుకు? ఈ ధ్వనిప్రకారాల అనుగ్రహంవల్ల ప్రాచీనకవులు స్పృశించినా కూడ కావ్యంలో నూతనత్వం ఉంటుంది అని, ఇంతమాత్రంలో ఈ గ్రంథానికి తాత్పర్యం; అంతకంటె అధికం ఏదీ లేదు. కరిణీతి - "ఒక్కబాణంచేతనే పడగొడ్డడానికి సమర్థుడై కరిణులకు వైధవ్యం కలిగించే నా పుత్రుణ్ణి, ఈచెడ్డకోడలు అంబులపొది మోసికొని పోయేవాణ్ణిగా చేసింది" అనే ఈ అర్థం అతిస్పష్టంగా (ఉత్తానః = వెల్లగితలా ఉన్నది) ఉందిగాన గాథలోని అర్థానికి అనాలీఢత్వమే (నాకి రుచి చూడబడనిది 'అనాలీఢం'; క్రొత్తది) అని అన్వయం. 4

## ధ్వన్యాలోకం

అథ చ పునః పునరుక్తమపి సారతయా ఇదముచ్యతే-

కా వ్యఙ్గ్యవ్యఞ్జకభావే ఽస్మిన్ వివిధే సంభవత్యపి,
రసాదిమయ ఏకస్మిన్ కవిః స్యాదవధానవాన్. 5

అస్మిన్నర్థానన్త్యహేతౌ వ్యఙ్గ్యవ్యఞ్జకభావే విచిత్రే శబ్దానాం సంభవత్యపి కవిరపూర్వార్థలాభార్థీ రసాదిమయ ఏకస్మిన్ వ్యఙ్గ్యవ్యఞ్జకభావే యత్నాదవదధీత. రసభావతదాభాసరూపే హి వ్యఙ్గ్యే తద్వ్యఞ్జకేషు చ యథానిర్దిష్టేషు వర్ణపదవాక్యరచనాప్రబన్ధేష్వవహితమనసః కవేః సర్వమపూర్వం సంపద్యతే. తథా చ రామాయణమహాభారతాదిషు సంగ్రామాదయః పునఃపునరభిహితా అపి నవనవాః ప్రకాశన్తే.

### బాలానందిని

అత్రేతి. మాటిమాటికీ చెప్పబడినదే అయినా సారమైన విషయం అవడంచేత ఇక్కడ మళ్లీ ఇది చెప్పబడుతున్నది

వ్యఙ్గ్యేతి:- "అనేకవిధాలైన ఈ వ్యంగ్యవ్యంజకభావం సంభవించినా (ఉండడానికి

అవకాశం ఉన్నా) కవి ఒక్క రసాదిమయమైన వ్యంగ్యవ్యంజకభావం విషయంలో అవధానం (ప్రధానప్రవృత్తి) కలవాడు అయి ఉండాలి". 5

అస్మిన్నితి:- అర్థాల అనంతత్వానికి హేతువైన విచిత్రమైన ఈ వ్యంగ్యవ్యంజకభావం శబ్దాలకు సంభవించినా అపూర్వమైన (నూతనమైన) అర్థం యొక్క లాభాన్ని కోరే కవి రసాదిమయమైన ఒక్క వ్యంగ్యవ్యంజకభావం విషయంలో అవధానం చెయ్యాలి. రసభావ - తదాభాసరూపమైన వ్యంగ్యంమీదా, దానిని వ్యంజింప చేసే, పూర్వం నిర్దేశించబడిన, వర్ణపదవాక్యరచనాప్రబంధాలమీదా అవహితమైన మనస్సు గల (మనస్సు నిలిపిన) కవి రచించిన కావ్యం అంతా నూతనంగా అవుతుంది (ఉంటుంది). అందుచేతనే రామాయణమహాభారతాదులలో యుద్ధాదులు మాటి మాటికీ వర్ణించబడినా కొత్త కొత్తవిగా ప్రకాశిస్తాయి

## ధ్వన్యాలోకం

ప్రబన్ధే చ అఙ్గీ రస ఏక ఏవ ఉపనిబధ్యమానః అర్థవిశేషలాభం ఛాయాతిశయం చ పుష్ణాతి. కస్మిన్నివేతి చేత్ - యథా రామాయణే, యథా వా మహాభారతే. రామాయణే హి కరుణో రసః స్వయమాదికవినా సూచితః "శోకః శ్లోకత్వమాగతః" ఇత్యేవంవాదినా. నిర్వ్యూఢశ్చ స ఏవ సీతాత్యన్తవియోగపర్యన్తమేవ స్వప్రబన్ధం రచయతా.

మహాభారతేఽపి శాస్త్రరూపకావ్యచ్ఛాయానుకారిణి వృష్ణి పాణ్డవవిరసావసానవైమనస్యదాయినీం సమాప్తిముపనిబధ్నతా మహామునినా వైరాగ్యజననతాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబన్ధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః, శాన్తో రసశ్చ ముఖ్యతయా వివక్షావిషయత్వేన సూచితః. ఏతచ్చాంశేన వివృతమేవ అన్యైః వ్యాఖ్యావిధాయిభిః. స్వయమేవ చైతదుద్గీర్ణం తేన ఉదీర్ణమహామోహ మగ్నముజ్జిహీర్షతా లోకమ్ అతివిమలజ్ఞానాలోకదాయినా లోకనాథేన -

శ్లో. యథా యథా విపర్యేతి లోకతన్త్రమసారవత్,
తథా తథా విరాగోఽత్ర జాయతే నాత్ర సంశయః. (137)

ఇత్యాది బహుశః కథయతా. తతశ్చ శాన్తో రసః రసాన్తరైః, మోక్షలక్షణః పురాషార్థః పురుషార్థాన్తరైః తదుపసర్జనత్వేన అనుగమ్యమానః అఙ్గిత్వేన వివక్షావిషయ ఇతి మహాభారతతాత్పర్యం సువ్యక్తమేవ అవభాసతే. అఙ్గాఙ్గిభావశ్చ యథా రసానాం తథా ప్రతిపాదితమేవ.

బాలానందిని

ప్రబన్ధే ఇతి - ప్రబంధంలో ఒకే రసాన్ని అంగిరసంగా నిబంధిస్తే ప్రయోజన విశేషలాభాన్ని, సౌందర్యాతిశయాన్ని పోషిస్తుంది. ('అర్థవిశేషలాభం' అనగా వాచ్యార్థంలో విశేషంయొక్క లాభాన్ని అని కూడ చెప్పవచ్చు). దేనిలో వలె అని ప్రశ్నిస్తే - రామాయణంలో వలె, మహాభారతంలో వలె. రామాయణంలో ఆదికవియే స్వయంగా "శోకః శ్లోకత్వమాగతః" ఇత్యాదికంచేత కరుణరసం సూచించాడు. తన ప్రబంధాన్ని సీతాత్యన్తవియోగపర్యంతం వరకే రచించి ఆతడు కరుణరసాన్నే (చివరిదాకా) నిర్వహించాడు. శాస్త్రరూపకావ్యచ్ఛాయతో కూడిన (అనగా ఇది అనేకధర్మాలు శాసించడంచేత శాస్త్రరూపం, కావ్యసౌందర్యం ఉండడంచేత కావ్యం, ఈ విధంగా 'శాస్త్రకావ్యం' అని అర్థం) మహాభారతంలో కూడ యాదవులయొక్క పాండవుల యొక్క విరసమైన అవసానంచేత వైమనస్యాన్ని (మనస్సుకు నిర్వేదాన్ని) కలిగించే సమాప్తిని కూర్చిన మహామునిచేత కూడ, తన ప్రబంధానికి ప్రధానంగా వైరాగ్యాన్ని కలిగించడంలోనే తాత్పర్యం అని చూపుతూ, మోక్షలక్షణమైన పురుషార్థమూ, శాంతరసమూ కూడ ముఖ్యంగా వివక్షకు విషయములు (తనచేత ప్రతిపాదించడానికి ఉద్దేశించబడినవి) అని సూచించబడింది. ఇతరులైన వ్యాఖ్యారచయితలు ఈ విషయాన్ని కొంతవరకు వివరించే ఉన్నారు. అత్యధికమైన మహామోహంలో మునిగిపోయి ఉన్న లోకాన్ని ఉద్ధరించగోరుచున్నవాడు, అతిస్వచ్ఛమైన జ్ఞానప్రదీపాన్ని ఇచ్చినవాడూ అయిన లోకనాథుడైన (విష్ణ్వవతారం అవడంచేత లోకప్రభువైన) ఆ వ్యాసునిచేతనే -

"సారరహితమైన ఈ లోకతంత్రం, లోకవ్యవహారం, లేదా లౌకికపదార్థజాతం, విపరీతస్వరూపం పొందుతూన్న కొలదీ దీని విషయంలో వైరాగ్యం పుడుతుంది; ఈ విషయంలో సందేహం లేదు" ఇత్యాది రీతిలో అనేక పర్యాయాలు చెపుతూ స్వయంగానే

ఈ విషయం చెప్పబడింది. అందువల్ల , అంగములుగా ఏర్పడిన ఇతరరసాలచేత అనుసరించబడుతూన్న శాంతరసమూ, అంగాలుగా ఉన్న ఇతరపురుషార్థాలతో కూడిన మోక్షరూపపురుషార్థమూ అంగిగా వివక్షావిషయమైనది (ప్రతిపాదించడానికి ఉద్దిష్టమైనది) అని మహాభారతతాత్పర్యం అతిస్పష్టంగానే తెలూస్తూన్నది. రసాలకు పరస్పరం అంగాంగిభావం ఎలా ఉంటుందో ప్రతిపాదించబడియే ఉంది.

లోచనం

అత్యన్తగ్రహణేన నిరపేక్షభావతయా విప్రలమ్భశఙ్కాం పరిహరతి. వృష్ణీనాం పరస్పరక్షయః, పాణ్డవానామపి మహాపథక్లేశేన అనుచితా విపత్తిః, కృష్ణస్యాపి వ్యాధాద్విధ్వంసః ఇతి సర్వస్యాపి విరసమేవ అవసానమితి. ముఖ్యతయేతి - యద్యపి "ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ " ఇత్యుక్తం తథాపి చత్వారః చకారాః ఏవమాహుః - యద్యపి ధర్మార్థకామానాం సర్వస్వం తాదృక్ నాస్తి యదన్యత్ర న విద్యతే, తథాపి పర్యన్త విరసత్వమత్రైవావలోక్యతామ్. మోక్షే తు యద్రూపం తస్య సారతా అత్రైవ విచార్యతామ్ ఇతి. యథా యథేతి. లోకైః తన్త్ర్యమాణం, యత్నేన సంపాద్యమానం ధర్మార్థకామసాధనలక్షణం వస్తుభూతతయా అభిమతమపి; యేన యేన ఆర్జనరక్షణక్షయాదినా ప్రకారేణ, అసారవత్ తుచ్ఛేన్ద్రజాలాదివత్. విపర్యేతి ప్రత్యుత విపరీతం సంపద్యతే; ఆస్తాం తస్య స్వరూపచిన్తేత్యర్థః. తేన తేన ప్రకారేణ అత్ర లోకతన్త్రే, విరాగః జాయతే ఇత్యనేన తత్త్వజ్ఞానోత్థితం నిర్వేదం శాన్తరసస్థాయినం సూచయతా తస్యైవ చ సర్వేతరాసారత్వ ప్రతిపాదనేన ప్రాధాన్యముక్తమ్.

బాలానందిని

అత్యన్తేతి - అత్యంతవియోగం అని చెప్పడంచేత పునఃసమాగమాశ లేకపోవడంచేత విప్రలంభం అనే శంకను పరిహరిస్తున్నాడు. యాదవులు పరస్పరం చంపుకొని నశించడం, పాండవులు కూడ మహాప్రస్థానక్లేశంచేత అనుచితమైన ఆపత్తుకు లోనుకావడం, కృష్ణుడు కూడ బోయవానివల్ల మరణించడం - ఈ విధంగా అంతా కూడ విరసంగానే సమాప్తమయింది.

ముఖ్యతయేతి - ''ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ'' అని చెప్పబడినా కూడ నాలుగు 'చ' కారాలు ఇలా చెపుతున్నాయి - ''ఇతర గ్రంథాలలో లేని ధర్మార్థకామాల సర్వస్వం (సారం) దానిలో లేకపోయినా, చివరకి అంతా విరసమే అనే విషయం దీనినుంచే గ్రహించబడుగాక, మోక్షంలో అయితే ఏ రూపం ఉన్నదో దాని సారత్వం దీనినుంచే గ్రహించబడుగాక''

వివరణ :- "ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ,

యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్".

అని మహాభారతంలోనే - ''ఈ గ్రంథంలో ధర్మార్థ కామమోక్షాలకి సంబంధించిన ఏ విషయం ప్రతిపాదించబడిందో అది ఇతరగ్రంథాలలో కూడ ఉండవచ్చు. ఇక్కడ లేనిది మాత్రం మరెక్కడా లభించదు'' అని చెప్పబడింది. అయినా ప్రాధాన్యం మోక్షానికే ఇవ్వబడింది ఈ గ్రంథంలో అని భావం.

యథా యథా ఇతి - లోకతంత్రం అనగా లోకాలచేత తంత్ర్యమాణమైన, అనగా ప్రయత్నపూర్వకంగా సంపాదింపబడుతూన్న ధర్మార్థకామాలు, వాటి సాధనాలు - ఏతత్స్వరూపపమైన విషయం, అది యథార్థ మైనదిగా తలపబడుతున్నా; యథా యథా =సంపాదించడం, సంరక్షించుకోవడం మొదలైన ఏ యే ప్రకారంచేత; అసారవత్= తుచ్ఛమైన ఇంద్రజాలాదికం వలె సారం లేనిది. (అసలు లేని వస్తువుకు 'తుచ్ఛం' అని పేరు. చెవులపిల్లి కొమ్ము, ఎండమావుల నీళ్లు మొదలైనది). విపర్యేతి - దాని స్వరూపస్వభావాలను గూర్చిన చింత మాట అటుండగా ఇది అనుకున్నదానికి విపరీతం అవుతుంది. ఆ యా ప్రకారంచేత (తథా తథా) . అత్ర = ఈ లోకతంత్రంలో, వైరాగ్యం పుడుతుంది, అనడంచేత శాంతరసస్థాయియైన, తత్త్వజ్ఞానజన్యనిర్వేదాన్ని సూచిస్తూన్న ఆ మహామునిచేత, ఇతర సమస్తవస్తువుల అసారత్వాన్ని ప్రాతిపాదించడం ద్వారా, దానికే (శాంతానికే) ప్రాధాన్యం చెప్పబడింది.

## ధ్వన్యాలోకం

పారమార్థికాన్తస్తత్త్వానపేక్షయా శరీరస్యేవ అఙ్గభూతస్య రసస్య పురుషార్థస్య చ స్వప్రాధాన్యేన చారుత్వమప్యవిరుద్ధమ్. నను మహాభారతే యావాన్ వివక్షావిషయః సః అనుక్రమణ్యాం సర్వ ఏవ అనుక్రాన్తః; న చైతత్తత్ర దృశ్యతే, ప్రత్యుత సర్వపురుషార్థ

ప్రబోధహేతుత్వం, సర్వరసగర్భత్వం చ మహాభారతస్య తస్మిన్నుద్దేశే స్వశబ్దనివేదితత్వేన ప్రతీయతే. అత్రోచ్యతే - సత్యమ్ -; శాన్తస్యైవ రసస్యాఙ్గిత్వం మహాభారతే మోక్షస్య చ సర్వపురుషార్థేభ్యః ప్రాధాన్య మిత్యేతత్ న స్వశబ్దాభిధేయత్వేన అనుక్రమణ్యా దర్శితమ్. దర్శితం తు వ్యఙ్గ్యత్వేన -

"భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః"

ఇత్యస్మిన్ వాక్యే. అనేన హ్యాయమర్థో వ్యఙ్గ్యత్వేన వివక్షితః యదత్ర మహాభారతే పాణ్డవాదిచరితం యత్ కీర్త్యతే తత్సర్వమ్ అవసానవిరసమ్ అవిద్యాప్రపఞ్చరూపం చ, పరమార్థసత్యస్వరూపస్తు భగవాన్ వాసుదేవః అత్ర కీర్త్యతే. తస్మాత్తస్మిన్నేవ పరమేశ్వరే భగవతి భవత భావితచేతసః, మా భూత విభూతిషు నిఃసారాసు రాగిణః గుణేషు వా నయవినయపరాక్రమాదిష్వమీషు కేవలేషు కేషుచిత్ సర్వాత్మనా ప్రతినివిష్టధియః. తథా చాగ్రే పశ్యత నిఃసారతాం సంసారస్యేత్యముమేవార్థం ద్యోతయన్ స్ఫుటమేవావభాసతే వ్యఞ్జకశక్త్యనుగృహీతశ్చ శబ్దః. ఏవంవిధమేవార్థం గర్భీకృతం సందర్శయన్తః అనన్తరశ్లోకాః లక్ష్యన్తే - "స హి సత్యమ్" ఇత్యాదయః.

బాలానందిని

పారమార్థికేతి : పారమార్థికమైన అంతస్తత్త్వాన్ని (శరీరంలోని ఆత్మస్వరూపాన్ని) అపేక్షించకపోవడంచేత (దానిని పరిగణనంలోనికి తీసికొననంతవరకు) శరీరానికి ఏ విధంగా చారుత్వం అవిరుద్ధమో (శరీరం సుందరగా ఉంది అని చెప్పడంలో దోషం లేదో) అట్లే అంగమైన రసానికీ, ఇతరపురుషార్థాలకీ, స్వప్రాధాన్యాన్ని పురస్కరించుకొని చారుత్వం అవిరుద్ధం.

వివరణ : ఆత్మ లేకపోతే శరీరానికి చారుత్వం అనేదే లేదు. అయినా ఆత్మని పరిగణనలోనికి తీసికొనకుండా శరీరానికి మాత్రమే ప్రాధాన్యం ఇచ్చి 'శరీరం అందంగా

ఉంది' అంటున్నాం. అదే విధంగా మహాభారతంలో శాంతరసం అంగిగా ఉన్నా దాని ప్రాధాన్యాన్ని పరిగణనలోనికి తీసికొనకుండా ఎక్కడి కక్కడ అంగంగా ఉన్న రసాన్ని మాత్రమే దృష్టిలో ఉంచుకొని దాని చారుత్వాన్ని ఆస్వాదించడం అనుచితం కాదు.

నన్వితి - (ఆశంక) మహాభారతంలో చెప్పదలచిన విషయాలన్నీ అనుక్రమణిలో (మహాభారతప్రారంభంలో ఉన్న విషయసూచిక వంటి ఒక అధ్యాయంలో) చెప్పబడ్డాయి కాని, ఇది (శాంతం దీనిలో ప్రధానరసం అనే విషయం) కనబడడంలేదు. ఇది కనబడకపోవడం సరికదా - "మహాభారతం సర్వపురుషార్థాలకీ హేతువు; అన్ని రసాలూ దీనిలో ఉన్నాయి" అని స్పష్టమైన మాటలలో చెప్పినట్లు కనబడుతున్నది. అత్రోచ్యతే ఇతి - (సమాధానం) ఈ విషయంలో చెప్పబడుతున్నది - శాంతమే అంగిరసం అనీ, అన్ని పురుషార్థాలకంటె మోక్షపురుషార్థం ప్రధాన మనీ మహాభారతంలోని అనుక్రమణిలో స్పష్టమైన మాటలలో చెప్పలేదనేది నిజమే. కాని ఈ విషయం - "దీనిలో సనాతనుడైన భగవంతుడైన వాసుదేవుడు కూడ వర్ణించబడతాడు" అనే వాక్యంలో వ్యంగ్యంగా చెప్పబడింది. ఈ వాక్యంచేత వ్యంగ్యంగా చెప్పదలచిన విషయం ఏమనగా - "ఈ మహాభారతంలో ఏ పాండవాదిచరిత్ర చెప్పబడుతుందో అదంతా చివరికి విరసమైనది, మాయాప్రపంచ(విలాస) రూపమైనదీ కూడా. ఇక్కడ భగవంతుడైన వాసుదేవుడే పరమార్థసత్యస్వరూపుడుగా కీర్తించబడుతున్నాడు. అందువల్ల భగవంతుడైన ఆ పరమేశ్వరునియందే చిత్తం నిలపండి; అంతే కాని సారవిహీనాలైన ఐశ్వర్యాలమీద ఆసక్తి కలవారు గాని, కేవలం నయం, వినయం, పరాక్రమం మొదలైన ఈ కొన్ని గుణాలయందే స్థిరంగా నిలపబడిన చిత్తం కలవారుగా కాని కాకండి". అట్లే తరవాత కూడ ('మహాభారతంలో అనేక స్థలాలలో) వ్యంజకశక్తిచేత అనుగ్రహించబడిన శబ్దం "సంసారం నిఃసారం అయినది అనే విషయాన్ని గుర్తించండి" అనే ఈ విషయాన్నే స్పష్టంగా ద్యోతింపచేస్తూ (వ్యంజింపచేస్తూ) ప్రకాశిస్తున్నది. "స హి సత్యమ్" (ఆతడే పరమార్థసత్యం) ఇత్యాదులైన తరవాత వచ్చే శ్లోకాలు, ఈ అర్థమే గర్భీకృతమైనది (లోన ఉంచబడినది) అని చూపించేవి, కనబడుతున్నాయి.

లోచనం

నను శృఙ్గారవీరాదిచమత్కారోఽపి తత్ర భాతీత్యాశఙ్క్యాహ-పారమార్థికేతి. భోగాభినివేశినాం లోకవాసనావిష్టానామ్ అఙ్గభూతేఽపి రసే తథాభిమానః, యథా శరీరే ప్రమాతృత్వాభిమానః ప్రమాతుర్భోగాయతనేఽపి.

కేవలేష్వితి. పరమేశ్వరభక్త్యుపకరణేషు తు న దోష ఇత్యర్థః. విభూతిషు రాగిణః, గుణేషు చ నివిష్టధియః మా భూత ఇతి సంబన్ధః. అగ్ర ఇతి - అనుక్రమణ్యనన్తరం యో భారతగ్రన్థః తత్రేత్యర్థః.

బాలానందిని

నన్వితి. ఆ మహాభారతంలో శృంగారవీరాదుల చమత్కారం కూడా భాసిస్తున్నది కదా అని ఆశంకించి చెపుతున్నాడు - పారమార్థికేతి. లోకవాసనతో నిండి భోగాలమీద అత్యాసక్తి కలవారికి అంగమైన రసం విషయంలో కూడ, ప్రమాత(జ్ఞాత) అయిన జీవుని భోగాయతనం మాత్రమే అయిన (సుఖదుఃఖాదుల భోగాన్ని అనుభవించే స్థానమైన) శరీరంలో ప్రమాతృత్వాభిమానం (శరీరమే జ్ఞాత అనే అభిమానం) ఉన్నట్లు చమత్కారజనకత్వాభిమానం అని అర్థం. కేవలేష్వితి. పరమేశ్వరభక్తికి ఉపకరణాలైన గుణాల విషయంలో చిత్తం నిలిపితే దోషం లేదని అర్థం. "విభూతిషు రాగిణః గుణేషు చ నివిష్టధియః మా భూత" అని అన్వయం. అగ్ర ఇతి. అనుక్రమణిక తరవాత వచ్చే భారతగ్రంథంలో అని అర్థం.

## ధ్వన్యాలోకం

అయం చ నిగూఢరమణీయోఽర్థః మహాభారతావసానే హరివంశవర్ణనేన సమాప్తిం విదధతా తేనైవ కవివేధసా కృష్ణద్వైపాయనేన సమ్యక్స్ఫుటీకృతః. అనేన చార్థేన సంసారాతీతే తత్త్వాన్తరే భక్త్యతిశయం ప్రవర్తయతా సకల ఏవ సాంసారికో వ్యవహారః పూర్వపక్షీకృతో న్యక్షేణ ప్రకాశతే. దేవతాతీర్థతపఃప్రభృతీనాం చ ప్రభావాతిశయ వర్ణనం తస్యైవ పరబ్రహ్మణః ప్రాప్త్యుపాయత్వేన, తద్విభూతిత్వేనైవ దేవతావిశేషాణామన్యేషాం చ. పాణ్డవాదిచరితవర్ణనస్యాపి వైరాగ్యజనన తాత్పర్యాత్, వైరాగ్యస్య చ మోక్షమూలత్వాత్, మోక్షస్య చ భగవత్ప్రాప్త్యుపాయత్వేన ముఖ్యతయా గీతాదిషు ప్రదర్శితత్వాత్ పరబ్రహ్మప్రాప్త్యుపాయత్వమేవ. పరంపరయా వాసుదేవాదిసంజ్ఞాభిధేయత్వేన లబ్ధప్రసిద్ధి మాథురప్రాదుర్భావానుకృతసకలస్వరూపం

వివక్షితం న తు మాథురప్రాదుర్భావాంశ ఏవ; సనాతనశబ్దవిశేషితత్వాత్. రామాయణాదిషు చానయా సంజ్ఞయా భగవన్మూర్త్యన్తరే వ్యవహారదర్శనాత్. నిర్ణీతశ్చాయమర్థః శబ్దతత్త్వవిద్భిరేవ.

బాలానందిని

అయమితి. మహాభారతంలో హరివంశాన్ని వర్ణించడంతో సమాప్తిని చేసిన కవిబ్రహ్మయైన ఆ కృష్ణద్వైపాయనుడే (అలా చేయడం ద్వారా) నిగూఢమూ రమణీయమూ అయిన ఈ విషయాన్ని చక్కగా స్పష్టీకరించి ఉన్నాడు. ఈ అర్థంచేత సంసారాతీతమైన తత్త్వాంతరంమీద భక్త్యతిశయాన్ని ప్రవర్తింపచేసిన ఆ కృష్ణద్వైపాయనునిచేత సమస్తసాంసారికవ్యవహారాన్ని కూడ పూర్తిగా (న్యక్షేణ) పూర్వపక్షం చేయబడిందిగా స్పష్టం అవుతున్నది. ఆ పరబ్రహ్మను పొందడానికి ఉపాయాలను చెప్పడంకొరకే ఆ యా దేవతలయొక్క తీర్థాలయొక్క తపస్సులయొక్క వర్ణనం చేయబడింది. ఇతరదేవతావిశేషాలన్నీ ఆ పరబ్రహ్మయొక్క విభూతులే (శక్తులే) అని చెప్పడంకొరకు వారి వర్ణనం చేయబడింది. పాండవాదుల చరిత్రను వర్ణించడంలో తాత్పర్యం కూడా వైరాగ్యాన్ని కలిగించడమే. వైరాగ్యం మోక్షానికి మూలం. మోక్షం భగవంతుణ్ణి చేరడానికి ఉపాయంగా గీతాదులలో ముఖ్యంగా చూపబడింది. ఈ విధంగా పాండవాదిచరితవర్ణనం కూడా పరబ్రహ్మప్రాప్త్యుపాయమే. అపరిమితమైన శక్తికి స్థానమైన పరబ్రహ్మమే పరంపరచేత వాసుదేవాదిసంజ్ఞలచేత అభిధేయం(చెప్పబడేది)గా (వాసుదేవాదిశబ్దాల అర్థంగా) ఉంది. గీతాదిప్రదేశాంతరాలలో ఆ పేరు గలదిగా పొందబడిన ప్రసిద్ధి గలది. (వాసుదేవనామంతో ప్రసిద్ధమైనది). ఇక్కడ 'భగవాన్ వాసుదేవశ్చ' అనే వాక్యంలో చెప్పడానికి ఉద్దేశించబడినది (వివక్షితమైనది) మథురానగరంలో ప్రాదుర్భావంచేత అనుకరించబడిన పరిపూర్ణస్వరూపమే గాని మథురలో జనించిన అంశం మాత్రమే కాదు. అనగా ఇక్కడ 'వాసుదేవ' శబ్దంచేత నిర్దేశించబడిన స్వరూపం అపరిమితశక్తి గల పరబ్రహ్మమే కాని కేవలం మథురలో జనించి కొంతకాలం మాత్రమే ఉన్న పరబ్రహ్మాంశం కాదు. ఎందువల్ల ననగా ఇక్కడ సనాతనశబ్దం విశేషణంగా ఉపయోగించబడింది. (సనాతనః అనగా ఎల్లప్పుడూ ఉన్నవాడు అని అర్థం. ఇది వసుదేవకుమారుని విషయంలో కుదరదు కదా-?) రామాయణాదులలో కూడ ఈ పేరుతోనే (వాసుదేవనామధేయంతోనే) భగవంతుని ఇతరమూర్తుల విషయంలో (కపిలాదిమూర్తుల విషయంలో) వ్యవహారం కనబడుతున్నది. ఈ విషయం శబ్దతత్త్వవేత్తలైన వైయాకరణులచేత నిర్ణయించబడింది కూడ.

లోచనం

నను వసుదేవాపత్యం వాసుదేవ ఇతి ఉచ్యతే; న పరమేశ్వరః పరమాత్మా మహాదేవ ఇత్యాశఙ్క్యాహ - వాసుదేవసంజ్ఞాభిధేయత్వేన ఇతి.

"బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,

వాసుదేవః సర్వమ్" (ఇతి స మహాత్మా సుదుర్లభః) (భ. గీ. 7.19)

ఇత్యాదౌ అంశిరూపమేతత్సంజ్ఞాభిధేయమితి నిర్ణీతమితి తాత్పర్యమ్. శబ్దా హి నిత్యా ఏవ సన్తోఽనన్తరం కాకతాలీయవశాత్తథా సంకేతితా ఇత్యుక్తమ్ - "ఋష్యన్ధకవృష్ణికురుభ్యశ్చ" (4.1.114) ఇత్యత్ర.

బాలానందిని

నన్వితి (ఆశంక) వసుదేవుని కుమారుడు 'వాసుదేవుడు' అని చెప్పబడుతున్నాడు; అంతే కాని పరమేశ్వరుడు, పరమాత్మ, మహాదేవుడు వాసుదేవశబ్దంచేత చెప్పబడడంలేదు కదా అని ఆశంకించి చెపుతున్నాడు. బహూనామితి - "దృశ్యమైన ప్రపంచం అంతా సకలజీవసహితంగా వాసుదేవరూపమే అనే జ్ఞానం కలవాడు అనేక జన్మల అంతమునందు నన్ను చేరుతాడు. (అలాంటి మహాత్ముడు చాల దుర్లభుడు)" ఇత్యాదులలో 'వాసుదేవ' సంజ్ఞకు అభిధేయ మైనది (వాచ్యమైనది) అంశిరూపమే అని నిర్ణయించబడినది అని తాత్పర్యం. నిర్ణీతశ్చేతి. శబ్దాలు నిత్యాలు. కాలాంతరంలో కాకతాలీయన్యాయంచేత అవే కొందరికి పేర్లుగా సంకేతితములైనాయి అని ఋష్యన్ధకేత్యాదిసూత్రంలో (కాశికాకారుడు) చెప్పి ఉన్నాడు.

వివరణ:- వాసుదేవశబ్దానికి సకలజగదధిష్ఠానభూతుడైన పరమాత్మ అనియే అర్థం. మథురలో వసుదేవుని కుమారుడుగా జన్మించిన వాసుదేవుడు ఆ వాసుదేవుని (పరమాత్మ యొక్క) అంశం మాత్రమే. అంశి ఆ వాసుదేవుడే. ఈ అర్థంలోనే "బహూనాం జన్మనామ్" ఇత్యాదిశ్లోకాలలో భగవద్గీతలో వాసుదేవశబ్దం ప్రయోగించబడింది. "భగవాన్ వాసుదేవశ్చ" అనే శ్లోకంలోని 'సనాతనః' (ఎల్లప్పుడూ ఉన్నవాడు, నిత్యుడు) అనే విశేషణం ఆ పరబ్రహ్మరూపవాసుదేవునికే కుదురుతుంది. కొంత కాలం మానవశరీరంతో ఉన్న శ్రీకృష్ణునకు కుదరదు. వాల్మీకిరామాయణంలో ఈ వాసుదేవపదం -

"యస్యేయం వసుధా కృత్స్నా వాసుదేవస్య ధీమతః,

మహిషీ మాధవస్యైషా స ఏష భగవాన్ ప్రభుః"

అనే శ్లోకంలో కపిలుణ్ణి నిర్దేశిస్తూ ఉపయోగించబడింది.

శబ్దాలు నిత్యము లని సిద్ధాంతం కదా? తరవాత వచ్చిన వృష్ణులు, అంధకులు మొదలైన వాళ్ల పేర్లుగా ఉపయోగించిన, అనగా తరవాత సృష్టించబడిన, శబ్దాలకు తద్ధితప్రత్యయాదులు విధించడం అయుక్తం కదా అని ఆశంకించుకొని ఆ శబ్దాలు అనాదిసిద్ధంగా ఉన్నవే. కాకతాళీయంగా వాటిని కొందరి సంజ్ఞలనుగా ఉపయోగించడం జరిగింది అని కాశికాకారుడు చెప్పి ఉన్నాడు. దీనినే దృష్టిలో ఉంచుకొని ఆనందవర్ధనుడు "నిర్ణీతశ్చాయమర్థః శబ్దతత్త్వవిద్భిః" అని వ్రాసినా డని అభినవగుప్తుడు వివరించాడు.

"వాసుదేవార్జునాభ్యాం వున్" (4.3.98) అనే సూత్రంలో - "వాసుదేవశబ్దాన్ని గ్రహించడం ఎందుకు?" "గోత్రక్షత్రియాఖ్యేభ్యో బహులం వుఞ్". (4.3.99) అనే సూత్రం చేతనే క్షత్రియనామధేయమైన 'వాసుదేవ' శబ్దానికి 'వుఞ్' ప్రత్యయం వచ్చి ఇష్టరూపం సిద్ధిస్తుంది కదా" అని ఆశంకించుకొని భాష్యకారులు "అథవా నైషా క్షత్రియాఖ్యా; సంజ్ఞైషా తత్రభవతః" అని సమాధానం చెప్పి ఉన్నారు. కైయటుడు దీనిని వ్యాక్యానిస్తూ - "సంజ్ఞైవేత. నిత్యః పరమాత్మా దేవతావిశేష ఇహ వాసుదేవో గృహ్యతే ఇత్యర్థః" అని వ్రాసి ఉన్నాడు. ఆనందవర్ధనుడు నిర్దేశించినది ఇది కూడ కావచ్చును.

## ధ్వన్యాలోకం

తదేవమనుక్రమణీనిర్దిష్టేన వాక్యేన భగవద్వ్యతిరేకిణః సర్వస్యాన్యస్య అనిత్యతాం ప్రకాశయతా మోక్షలక్షణ ఏవైకః పరః పురుషార్థః శాస్త్రనయే, కావ్యనయే చ తృష్ణాక్షయసుఖపరిపోషలక్షణః శాన్తోరసః మహాభారతస్య అంగిత్వేన వివక్షిత ఇతి ప్రతిపాదితమ్. అత్యన్తసారభూతత్వాచ్చాయమర్థః వ్యఙ్గ్యత్వేనైవ దర్శితః న తు వాచ్యత్వేన. సారభూతో హ్యర్థః స్వశబ్దానభిధేయత్వేన ప్రకాశితః సుతరామేవ శోభామావహతి. ప్రసిద్ధిశ్చేయమస్త్యేవ విదగ్ధ విద్వత్పరిషత్సు యత్ అభిమతతరం వస్తు వ్యఙ్గ్యత్వేన ప్రకాశ్యతే న సాక్షాతచ్ఛబ్దవాచ్యత్వేన. తస్మాత్ స్థితమేతత్ - అఙ్గీభూతరసాశ్రయేణ కావ్యే క్రియమాణే నవార్థలాభో భవతి, బన్ధచ్ఛాయా చ మహతీ సంపద్యతే ఇతి.

బాలానందిని

తదేవమితి. అందువల్ల, ఈ విధంగా భగవంతునికంటె భిన్నమైన ప్రతిపదార్థమూ కూడ అనిత్య మని చెపుతూన్న అనుక్రమణీగతమైన ఈ వాక్యంచేత (శాస్త్రకావ్యమైన) మహాభారతానికి సంబంధించినంతవరకు శాస్త్రమార్గంలో మోక్షరూపమైన ఏకైకపరమపురుషార్థం అంగి అనీ, కావ్యమార్గంలో తృష్ణాక్షయంవల్ల కలిగే సుఖాన్ని పోషించడం అనే లక్షణం గల శాంతరసం అంగి అనీ వివక్షితం అని చక్కగా ప్రతిపాదించబడింది. ఈ అర్థం అత్యంతసారం అవడంచేత వ్యంగ్యంగానే ప్రతిపాదించబడింది గాని, వాచ్యంగా చూపబడలేదు. సారభూతమైన అర్థం స్వశబ్దవాచ్యం కాకుండా ప్రకాశింపచేయబడినట్లయితే అది ఎక్కువ శోభను కలిగిస్తుంది. విదగ్ధులైన విద్వాంసుల పరిషత్తులలో అత్యంతాభిమతమైన వస్తువు వ్యంగ్యంగానే ప్రకాశింపచేయబడుతుంది కాని సాక్షాత్తు శబ్దంచేత వాచ్యంగా ప్రకాశింపచేయబడదు అని ప్రసిద్ధి ఉంది కదా? అందువల్ల - ఏదైన ఒక రసాన్ని అంగిగా గ్రహించి కావ్యం రచిస్తే అప్పుడు నూతనార్థలాభం కలుగుతుంది, గొప్ప బంధసౌందర్యం కూడ లభిస్తుంది అనే విషయం నిశ్చితం.

లోచనం

శాస్త్రనయ ఇతి. తత్రాస్వాదయోగాభావే "పురుషేణ అర్థ్యతే" ఇత్యయమేవ వ్యపదేశః సాదరః, చమత్కారయోగే తు రసవ్యపదేశ ఇత్యర్థః. ఏతచ్చ గ్రన్థకారేణ తత్త్వాలోకే వితత్యోక్తమ్; ఇహ త్వస్య న ముఖ్యోఽవసర ఇతి నాస్మాభిః తద్దర్శితమ్. సుతరామేవేతి యదుక్తం తత్ర హేతుమాహ - ప్రసిద్ధిశ్చేతి. చ శబ్దోయస్మాదర్థే. యత ఇయం లౌకికీ ప్రసిద్ధిరనాదిః తతః భగవద్వ్యాసప్రభృతీనామపి అయమేవ అస్వశబ్దాభిధానే ఆశయః. అన్యథా హి క్రియాకారకసంబన్ధాదౌ, "నారాయణం నమస్కృత్య" ఇత్యాది శబ్దార్థనిరూపణే చ తథావిధ ఏవ తస్య భగవతః ఆశయ ఇత్యత్ర కిం ప్రమాణమ్ ఇతి భావః. విదగ్ధవిద్వద్గ్రహణేన చ కావ్యనయే శాస్త్రనయే ఇతి చానుసృతమ్. "రసాదిమయ ఏకస్మిన్ కవిః స్యాదవధానవాన్" (కా. 4.5) ఇతి యదుక్తం తదేవ ప్రసంగాగతభారతసంబన్ధనిరూపణానన్తరముపసంహారతి - తస్మాత్ స్థితమితి.

బాలానందిని

శాస్త్రనయ ఇతి. దానిలో ఆస్వాదసంబంధం లేనప్పుడు సాదరంగా "పురుషునిచేత అర్థింపబడేది, కోరబడేదిగాన పురుషార్థం" అని చెప్పడం మాత్రమే యుక్తం. చమత్కారసంబంధం ఉంటే మాత్రం 'రసం' అనడం యుక్తం అని భావం. ఈ విషయం గ్రంథకారునిచేత (ఆనందవర్ధనునిచేత) "తత్త్వాలోకం'లో సవిస్తరంగా చెప్పబడింది. ఇక్కడ దాని కంతకీ ముఖ్యమైన అవసరం (సమయం) కాకపోవడంచేత మాచేత చూపబడలేదు. 'సుతరామ్' అని అనడంలో హేతువును చెపుతున్నాడు - ప్రసిద్ధిశ్చేతి. 'చ'కు 'యస్మాత్' అని అర్థం. లోకంలో ఈ ప్రసిద్ధి అనాదిగా వస్తూన్నది గాన స్వశబ్దాలచేత (వాచ్యంగా) చెప్పకపోవడంలో భగవద్వ్యాసాదుల ఆశయం కూడా ఇదే. ఇలా వ్యంగ్యంగా చెప్పడమే వ్యాసుని అభిప్రాయం అని అంగీకరించని పక్షంలో 'ఆయన గ్రంథంలోని క్రియాకారకసంబంధాదుల విషయంలోను, "నారాయణం నమస్కృత్య" ఇత్యాది శబ్దార్థాలను నిరూపించడంలోను ఆ పూజ్యుని ఆశయం అదే అని చెప్పడానికి ప్రమాణం ఏమిటి? అనగా - వ్యాసమహాముని తన గ్రంథంలో అనేకవాక్యాలు ప్రయోగించాడు. ఆ వాక్యాలలో కనబడే క్రియాకారకాదుల సంబంధాన్ని పట్టి ఇక్కడ ఈ విషయం చెప్పా లని అనుకుంటున్నాడు అని గ్రహిస్తున్నాం. "నారాయణం నమస్కృత్య" ఇత్యాదిశ్లోకాలలో ఆయన చెప్పదలచిన అర్థం ఇది అని గ్రహిస్తున్నాం. అదే విధంగా వ్యంగ్యంరూపంలో ఇక్కడ ఈ విషయాన్ని ప్రతిపాదిస్తున్నాడు అని గ్రహించాలి. అలా గ్రహించకపోతే ఇతరవాక్యాలలో మాత్రం ఆయన చెప్పదలచుకున్నది ఇదే అని ఎలా నిర్ధారణచెయ్యాలి? అని భావం.

విదగ్ధేతి 'విదగ్ధ' 'విద్వత్' అనే రెండు పదాలను గ్రహించడంచేత 'కావ్యనయే', 'శాస్త్రనయే' అనేవి అనుసరించబడ్డాయి. అనగా కావ్యనయం విదగ్ధులకు సంబంధించింది గాన ఆ పదం, శాస్త్రనయం విద్వాంసులకు సంబంధించినది గాన ఆపదమూ ప్రయోగించబడ్డాయి అని భావం. "రసాదిమయ ఏకస్మిన్" ఇత్యాదివాక్యంలో చెప్పిన విషయాన్ని, ప్రసంగాగతమైన భారతసంబంధాన్ని నిరూపించినతరవాత ఉపసంహరిస్తున్నాడు- తస్మాత్ స్థితమ్ ఇతి.

## ధ్వన్యాలోకం

అత ఏవ రసానుగుణార్థవిశేషోపనిబన్ధమలఙ్కారాన్తర విరహేఽపి ఛాయాతిశయయోగి లక్ష్యే దృశ్యతే. యథా-

శ్లో. మునిర్జయతి యోగీన్ద్రో మహాత్మా కుమ్భసంభవః,
యేనైకచులుకే దృష్టౌ తౌ దివ్యౌ మత్స్యకచ్ఛపౌ. (138)

ఇత్యాదౌ. అత్ర హ్యద్భుతరసానుగుణమేకచులుకే మత్స్యకచ్ఛపదర్శనం ఛాయాతిశయం పుష్ణాతి. తత్ర హ్యేకచులుకేసకలజలనిధిసంనిధానాదపి దివ్యమత్స్యకచ్ఛపదర్శనమక్షుణ్ణత్వాదద్భుతానుగుణతరమ్. క్షుణ్ణం హి వస్తు లోకప్రసిద్ధ్యా అద్భుతమపి నాశ్చర్యకారి భవతి. న చాక్షుణ్ణం వస్తు ఉపనిబధ్యమానమద్భుతరసస్యైవానుగుణం యావద్రసాన్తరస్యాపి. తద్యథా -

గాథ. సిజ్జఇ రోమఞ్చిజ్జఇ వేవఇ రత్థాతులగ్గపడిలగ్గో
సోపాసో అజ్జ వి సుహఅ జేణాసి వోలీణో. (139)

ఏతద్గాథార్థాద్భావ్యమానాద్యా రసప్రతీతిర్భవతి, సా త్వాం స్పృష్ట్వా స్విద్యతి, రోమాఞ్చతే, వేపతే ఇత్యేవంవిధాదర్థాత్ ప్రతీయమానాత్ మనాగపి నో జాయతే.

బాలానందిని

అత ఏవేతి. అందువలననే ఇతర అలంకారాలేవీ లేకపోయినా రసానుగుణమైన అర్థవిశేషాన్ని కూర్చడం శోభాతిశయంతో కూడినదిగా లక్ష్యంలో కనబడుతున్నది. ఎట్లనగా-

మునిరితి. "యోగీంద్రుడు, మహాత్ముడు అయిన అగస్త్యమహాముని సర్వోత్కర్షతో ఉంటున్నాడు, ఎవనిచేత దివ్యములైన ఆ మత్స్యకచ్ఛపాలు ఒక్క చులుకంలో చూడబడినవో" (ఆచమనం చేసే టప్పుడు బొటనవ్రేలు ముడిచి తర్జనిని దానిపైకి వంచగా అరచేతిలో ఏర్పడిన గుంట చులుకం లేదా చులకం) ఇత్యాదులలో. ఇక్కడ ఒక్క చులుకంలో మత్స్యకచ్ఛపాలను చూడడం అద్భుతరసానికి అనుగుణమై శోభాతిశయాన్ని పోషిస్తున్నది. ఒక్క చులుకంలో సమస్తసముద్రమూ ఉన్నా కూడ దివ్యమత్స్యకచ్ఛపాల దర్శనం అనేది ఎవరిచేతా పూర్వం క్షుణ్ణం కాదు. కాబట్టి (చెప్పబడలేదు కాబట్టి) అద్భుతరసానికి చాలా అనుగుణంగా ఉంది. అద్భుతమైన

వస్తువైనా క్షుణ్ణం అయిపోయినట్లయితే లోకప్రసిద్ధం అయిపోవడంచేత ఆశ్చర్యకారి కాదు. క్షుణ్ణం కాని వస్తువును ఉపనిబంధించినట్లయితే అది అద్భుతరసానికే కాదు రసాంతరానికి కూడ అనుగుణంగా ఉంటుంది. అది ఎట్లనగా-

"స్విద్యతి రోమాఞ్చతి వేపతే రథ్యాతులాగ్రప్రతిలగ్నః,

స పార్శ్వోఽద్యాపి సుభగ తస్యా యేనాస్యతిగః" (సంస్కృతచ్ఛాయ)

సుభగ= ఓ! సుందరుడా! యేన= = ఏ పార్శ్వంతో, రథ్యాతులాగ్రప్రతిలగ్నః= వీధిలో కాకతాలీయంగా (తులాగ్ర) తగుల్కొన్నవాడవై, అతిగః అసి= నువ్వు దాటి వెళ్లి పోయావో, తస్యాః= ఆమెయొక్క, సః పార్శ్వః= ఆ పార్శ్వం, అద్యాపి= ఇప్పటికి కూడ, స్విద్యతి= చెమటకారుస్తూన్నది, రోమాఞ్చతి= పులకిస్తూన్నది; వేపతే= వణుకుతున్నది.

ఏతదితి. ఈ గాథయొక్క అర్థాన్ని భావనచేయడంచేత ఏ రసప్రతీతి కలుగుతుందో అది నిన్ను స్పృశించి ఆమె చెమటకారుస్తూన్నది, పులకిస్తూన్నది, వణుకుతూన్నది ఇత్యాదిరూపమైన ప్రతీయమానార్థంవల్ల కూడ కొంచెం కూడ కలగదు.

వివరణ:- ''యాదృచ్ఛికంగా నీ స్పర్శ కలిగిన ఈమె శరీరపార్శ్వం చెమటకారుస్తూన్నది'' ఇత్యాద్యర్థం పూర్వం ఎవరూ చెప్పనిది. దీనివల్ల - 'నీ స్పర్శవల్ల స్వేదాదులు కలుగుతున్నాయి' అనే అర్థం వ్యంగ్యం అవుతున్నది. ఈ వ్యంగ్యార్థంకంటె అక్షుణ్ణమైన ఆ వాచ్యార్థమే మనోహరంగా ఉంది; శృంగారప్రతీతిని కూడ కలిగిస్తూన్నది అని భావం.

## లోచనం

అత ఇతి - యతః ఏవం స్థితం అత ఏవ ఇదమపి యత్ లక్ష్యే దృశ్యతే తదుపపన్నమ్; అన్యథా తదనుపపన్నమేవ. న చ తదనుపపన్నమ్; చారుత్వేన ప్రతీతేః. తస్యాశ్చైతదేవ కారణం రసానుగుణార్థత్వమేవేత్యాశయః. **అలంకారాన్తరేతి** - అన్తరశబ్దో విశేషవాచీ. యది వా దిత్సితే ఉదాహరణే రసవదలంకారస్య విద్యమానత్వాత్ తదపేక్షయాలంకారాన్తరశబ్దః.

నను మత్స్యకచ్ఛపదర్శనాత్ యదేకచులుకే జలధిసంనిధానం తతో మునేః మాహాత్మ్యప్రతిపత్తిరితి న రసానుగుణేనార్థేన చ్ఛాయా పోషితేత్యాశఙ్క్యాహ - అత్ర హీతి. నన్వేవం ప్రతీయమానం జలనిధిదర్శనమేవాద్భుతానుగుణం భవతు ఇతి రసానుగుణోఽత్ర వాచ్యోఽర్థ

ఇత్యస్మిన్నంశే కథమిదముదాహరణ మిత్యాశఙ్క్యాహ - తత్రేతి. క్షుణ్ణం హీతి - పునః పునర్వర్ణననిరూపణాదినా యత్పిష్టపిష్టత్వాదతినిర్భిన్నస్వరూపమిత్యర్థః. బహుతరలక్ష్యవ్యాపకం చైతదితి దర్శయతి - న చేత్యాదినా. రథ్యాయాం తులాగ్రేణ కాకతాలీయేన ప్రతిలగ్నః సాంముఖ్యేన "సః పార్శ్వః అద్యాపి సుభగ, తస్యాః యేనాన్యతిక్రాన్తః''. రసప్రతీతిరితి - పరస్పరహేతుకశృఙ్గారప్రతీతిః. అస్యార్థస్య రసానుగుణత్వం వ్యతిరేకద్వారేణ ద్రఢయతి - సా త్వామిత్యాదినా.

బాలానందిని

అత ఏవేతి. ఇది ఈ విధంగా ఉంది గాన లక్ష్యంలో కనబడే ఇది కూడ ఉపపన్నం అవుతుంది. అట్లు కాకపోతే అది ఉపపన్నం అయి ఉండేది కాదు. అయితే అది అనుపపన్నంగా లేదు; ఎందువల్ల ననగా చారుత్వంతో కనబడుతున్నది. చారుత్వం కలదై కనబడడానికి కారణం రసానికి అనుగుణమైన అర్థం కలిగి ఉండడమే అని ఆశయం. అలంకారాన్తరేతి - ఇక్కడ 'అన్తర' శబ్దం విశేషం అనే అర్థాన్ని బోధిస్తుంది. లేదా ఇక్కడ ఇవ్వదలచిన ఉదాహరణంలో రసవదలంకారం ఉంది గాన దాని అపేక్షచేత మరొక అలంకారం అని చెప్పబడింది.

నన్వితి (ఆశంక) మత్స్యాన్ని కచ్ఛపాన్ని చూడడంవల్ల ఏకచులుకంలో సముద్రం ఉన్నట్లు వ్యంగ్యం అవుతున్నది గదా; దానివల్ల మునియొక్క మాహాత్మ్యం తెలుస్తూన్నది. అందుచేత (నువ్వుచెప్పినట్లు) రసానుగుణమైన అర్థంచేత శోభ పోషించడంకాదు కదా అని ఆశంకించి చెపుతున్నాడు - అత్ర హీతి. నన్వితి. ఈ విధంగా ప్రతీయమానమైన సముద్రదర్శనమే అద్భుతరసానికి అనుగుణం అని అనవచ్చును. అందుచేత ఇక్కడ వాచ్యార్థం రసానుగుణంగా ఉంది అనే అంశానికి ఇది ఉదాహరణం ఎట్లవుతుంది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - తత్రేతి - క్షుణ్ణం హీతి - మాటిమాటికి వర్ణనం, నిరూపించడం మొదలైనవాటిచేత ఏదైతే బాగా పిండిపిండిగా నలగగొట్టబడడంచేత ఎక్కువ స్పష్టమైన స్వరూపం గలదో అని అర్థం. ఇది అత్యధికలక్ష్యాలలో వ్యాపించి ఉన్నది అని న చేత్యాదివాక్యంచేత చూపుతున్నాడు. రథ్యాయామితి. వీథిలో, తులాగ్రేణ= కాకతాలీయంచేత, ప్రతిలగ్నః= ఎదురవడంచేత తగిలిన, ఆ పార్శ్వం, ఓ! సుభగుడా! ఇప్పటికి కూడ, తస్యాః= ఆమెయొక్క, యేన= దేనిచేత, అతిక్రాంతః= నువ్వు దాటి వెళ్లిపోయావో ("స పార్శ్వోద్యాపి సుభగ తస్యా యేనాస్యతిక్రాన్తః" అని ఉత్తరార్ధానికి

సంస్కృతచ్ఛాయ ఇవ్వబడింది). రసప్రతీతిరితి పరస్పరం హేతువుగా గల శృంగారప్రతీతి. ఈ అర్థం రసానికి అనుగుణం అయినది అనే విషయాన్ని వ్యతిరేకం ద్వారా (అది ఆ విధంగా కాకుండా మరొక విధంగా ఉంటే ఎలా ఉంటుందో చూపడం ద్వారా) సాత్యామిత్యాదికంచేత దృఢీకరిస్తున్నాడు.

## ధ్వన్యాలోకం

తదేవం ధ్వనిప్రభేదసమాశ్రయేణ యథా కావ్యార్థానాం నవత్వం జాయతే తథా ప్రతిపాదితమ్. గుణీభూతవ్యఙ్గ్యస్యాపి త్రిభేద వ్యఙ్గ్యాపేక్షయా యే ప్రకారాః తత్సమాశ్రయేణాపి కావ్యవస్తూనాం నవత్వం భవత్యేవ. తత్తు అతివిస్తారకారీతి నోదాహృతమ్. సహృదయైః స్వయముత్ప్రేక్షణీయమ్.

### బాలానందిని

తదితి. ఈ విధంగా ధ్వనిప్రభేదాలను ఆశ్రయించడంచేత కావ్యార్థాలకు ఏ విధంగా నవత్వం లభిస్తుందో ప్రతిపాదించబడింది. మూడు విధాలైన వ్యంగ్యాలను పట్టి ఏర్పడే గుణీభూతవ్యంగ్యాని కున్న ప్రకారాలను ఆశ్రయించడంచేత కూడ కావ్యవస్తువులకు నవత్వం కలుగుతుంది. కాని అది అతివిస్తారాన్ని కలిగిస్తుంది అనే అభిప్రాయంతో ఉదాహరించబడలేదు. సహృదయులు స్వయంగా ఊహించుకోవాలి.

### లోచనం

"ధ్వనేర్యః సగుణీభూతవ్యఙ్గ్యస్యాధ్వా ప్రదర్శితః" ఇతి ఉద్యోతారమ్భే యః శ్లోకః తత్ర ధ్వనేరధ్వనా కవీనాం ప్రతిభాగుణః అనన్తః భవతీత్యేష భాగః వ్యాఖ్యాత ఇత్యుపసంహరతి - తదేవమిత్యాదినా. సగుణీభూతవ్యఙ్గ్యస్యేత్యముం భాగం వ్యాచష్టే - గుణీభూతేత్యాదినా. త్రిప్రభేదః వస్త్వలంకారరసాత్మనా యః వ్యఙ్గ్యః తస్య యా అపేక్షా వాచ్యే గుణీభావః తయేత్యర్థః. తత్ర సర్వే యే ధ్వనిభేదాః తేషాం గుణీభావాదానన్త్యమితి తదాహ - అతివిస్తరేతి. స్వయమితి. తత్ర వస్తునా వ్యఙ్గ్యేన గుణీభూతేన నవత్వం సత్యపి పురాణస్పర్శే యథా మమైవ-

గాథ. భఅవిహలరఖ్ ఖణేకకమల్లసరణాగఆఇఅత్థాణ,

ఖణమత్తం విణ దిణ్ణా విస్సామకహేత్తి జుత్తమిణమ్.

అత్ర త్వమనవరతమర్థాంస్త్యజసీతి ఔదార్యలక్షణం వస్తు ధ్వన్యమానం వాచ్యస్యోపస్కారకం నవతాం దదాతి, సత్యపి పురాణకవిస్పృష్టేఽర్థే. తథాహి గాథా-

గాథ. చాఇఅణకరపరంపరసంఞ్చారణఖే అణిస్సహసరీరా,

అత్థా కివణఘరంత్థా సత్థాపథ్థాస్వవంతీవ.

బాలానందిని

ధ్వనేః ఇతి:- "ధ్వనేర్యః సగుణీభూతవ్యఙ్గ్యస్యాధ్వా ప్రదర్శితః" అని చతుర్థోద్యోతారంభంలో ఏ శ్లోకం ఉందో, దానిలో ధ్వనిమార్గంచేత కవుల ప్రతిభాగుణం అనంతం అవుతుంది అనే భాగం వ్యాఖ్యానించబడింది అని ఉపసంహరిస్తున్నాడు. "సగుణీభూతవ్యఙ్గస్య" అనే భాగాన్ని గుణీభూతేత్యాది వాక్యంచేత వ్యాఖ్యానిస్తున్నాడు. వస్త్వలంకారరసరూపంలో మూడు భేదాలు గల ఏ వ్యంగ్యం ఉన్నదో, దానియొక్క ఏ అపేక్ష, అనగా వాచ్యంలో గుణీభావం ఉన్నదో దానిచేత అని అర్థం. అన్ని ధ్వనిభేదాలూ కూడ గుణీభావం పొందవచ్చును గాన అవి అసంఖ్యంగా ఉంటాయి అని చెపుతున్నాడు - అతివిస్తరేతి. స్వయమితి. ప్రాచీనార్థస్పర్శ ఉన్నా కూడ గుణీభూతవ్యంగ్యమైన వస్తువుచేత నవత్వానికి ఉదాహరణంగా నా శ్లోకమే ఎట్లనగా-

"భయవిహ్వలరక్షణైకమల్లశరణాగతానామర్థానామ్,

క్షణమాత్రమపి న దత్తా విశ్రామకథేతి యుక్తమిదమ్. (సంస్కృతచ్ఛాయ)

భయ...అగతానామ్ - భయంచేత వ్యాకులులైనవారి రక్షణం విషయంలో ప్రధానమల్లుడవైన నిన్ను శరణుజొచ్చిన, అర్థానామ్= ధనములకు, క్షణమాత్రమపి= క్షణకాలం కూడ, విశ్రామకథా= విశ్రాంతి, న దత్తా= ఇవ్వబడలేదు, ఇతి ఇదమ్= ఇది, యుక్తమ్= యుక్తమేనా? 'అత్రేతి. ఇక్కడ నువ్వు నిరంతరము ధనాన్ని దానం చేస్తావు అనే ఔదార్యరూపమైన వస్తువు వ్యంజింపబడుతున్నది. అది వాచ్యానికి ఉపస్కారకంగా ఉంటూ ప్రాచీనకవిచేత స్పృశించబడిన అర్థం ఉన్నా కూడ, నవత్వాన్ని ఇస్తూన్నది. ప్రాచీనగాథ ఇట్లున్నది-

"త్యాగిజనకరపరంపరాసంచారణఖేదనిస్పృహశరీరాః,

అర్థాః కృపణగృహస్థాః స్వస్థావస్థాః స్వపన్తీవ" (సంస్కృతచ్ఛాయ)

"దాతలైన జనుల పరంపరయందు సంచరించడంవల్ల కలిగిన అలసటచేత కదలలేకుండా అయిపోయిన శరీరాలు గల ధనాలు లుబ్ధుల గృహాలలో ఉన్నవై స్వస్థమైన అవస్థ గలవై, నిద్రిస్తున్న ట్లున్నాయి".

లోచనం

అలంకారేణ వ్యఙ్గ్యేన వాచ్యోపస్కారే నవత్వం యథా మమైవ-

శ్లో. వసన్తమత్తాలిపరంపరోపమాః కచాస్తవాసన్ కిల రాగవృద్ధయే,
శ్మశానభూభాగపరాగభాసురాః కథం తదేతే న మనాగ్విరక్తయే.

అత్ర హ్యాక్షేపేణ విభావనయా చ ధ్వన్యమానాభ్యాం వాచ్యముపస్కృతమితి నవత్వం సత్యపి పురాణార్థయోగిత్వే. తథాహి పురాణశ్లోకః-

క్షుత్తృష్ణా కామమాత్సర్యం మరణాచ్చ మహద్భయమ్,
పఞ్చైతాని వివర్ధన్తే వార్ధకే విదుషామపి. ఇతి

బాలానందిని

వ్యంగ్యమైన అలంకారంచేత వాచ్యానికి ఉపస్కారం చేయడంచేత ప్రాచీనార్థసంబంధం ఉన్నా నవత్వానికి ఉదాహరణం నా శ్లోకమే ఎట్లనగా-

వసన్తేతి. ఒక మిత్రుడు తన మిత్రునితో అంటూన్న మాటలు - "వసంతర్తువులో మదించిన తుమ్మెదల పంక్తులవలె ఉన్న నీ కచాలు (కేశాలు) (నీ యౌవనంలో) నీ రాగాన్ని వృద్ధిపొందించేవిగా ఉండేవి. (యువకుడవుగా ఉన్నప్పుడు స్త్రీరక్తుడవుగా ఉండేవాడవు). ఇప్పుడు శ్మశానభూమిలోని బూడిదవలె ప్రకాశిస్తూన్న (తెల్లనైన) ఆ కేశాలు కొంచెం కూడ విరక్తిని కలిగించడం లేదు? (వార్ధకదశలో కూడ నీ కీ స్త్రీవ్యామోహం ఏమిటి?").

అత్రహీతి. ఇక్కడ వ్యంగ్యాలైన ఆక్షేపవిభావనాలంకారాలచేత వాచ్యం ఉపస్కృతమైనది. అందుచేత ప్రాచీనార్థసంబంధం ఉన్నా కూడ నవత్వం ఉంది.

వివరణ:- ఇక్కడ "కారణం (యౌవనం) లేకపోయినా కామం వృద్ధిపొందుతూనే ఉంది" అని విభావనాలంకారం, "కామమహిమ వర్ణింపశక్యం కానిది" అని ఆక్షేపం వ్యంగ్యాలు. వాటిచేత వాచ్యార్థం ఉపస్కృతం అవుతూన్నది గాన గుణీభూతాలు.

తథాహీతి : (ఈ అర్థంవంటి అర్థం గల) ప్రాచీనశ్లోకం -

క్షుదితి - "ఆకలి, ఆశ, కామం, మాత్సర్యం, మరణంవల్ల మహాభయం, ఈ ఐదూ పండితులకు కూడా వార్ధకంలో వృద్ధి పొందుతాయి".

లోచనం

వ్యఙ్గ్యేన రసేన గుణీభూతేన వాచ్యోపస్కారేణ నవత్వం యథా మమైవ-

శ్లో. జరా నేయం మూర్ధ్ని ధ్రువమయమసౌ కాలభుజగః
క్రుధాన్ధః ఫూత్కారైః స్ఫుటగరలఫేనాన్ ప్రకిరతి,
తదేనం సంపశ్యత్యథ చ సుఖితంమన్యహృదయః
శివోపాయాన్నేచ్ఛన్ బత బత సుధీరః ఖలు జనః.

అత్రాద్భుతేన వ్యఙ్గ్యేన వాచ్యముపస్కృతం శాన్తరసప్రతిపత్త్యఙ్గత్వాచ్చారు భవతీతి నవత్వం సత్యప్యస్మిన్ పురాణశ్లోకే-

జరాజీర్ణశరీరస్య వైరాగ్యం యన్న జాయతే,
తన్నూనం హృదయే మృత్యుర్దృఢం నాస్తీతి నిశ్చయః.

బాలానందిని

వ్యఙ్గ్యేనేతి. వాచ్యోపస్కారకమైన గుణీభూతవ్యంగ్యమైన రసంచేత నవత్వానికి ఉదాహరణంగా నా శ్లోకమే ఎట్లనగా-

జరా ఇతి. - ఇయమ్= ఇది, జరా న= ముసలితనం కాదు. అయమ్ అసౌ= ఈ. కాలభుజగః= కాలసర్పం, క్రుధా= కోపంచేత, అన్ధః= అంధమై, మూర్ధ్ని= శిరస్సు పైన, ఫూత్కారైః= ఫూత్కారాలతో, స్ఫుటగరలఫేనాన్= స్పష్టమైన విషంయొక్క నురుగులను, వికిరతి= చిమ్ముచున్నది. అథ చ= అట్లయినా కూడ, సుఖితంమన్యహృదయః= సుఖపడుతున్నట్లు అనుకుంటూన్న హృదయం కలవాడై, శివోపాయాన్= మంగళకరాలైన ఉపాయాలను, నేచ్ఛన్= చూడనివాడై, ఏనమ్= దీనిని, సంపశ్యతి= చూస్తున్నాడు. బత బత = ఆహా! ఆహా! జనః =జనుడు (మానవుడు) సుధీరః ఖలు= చాల ధీరుడు కదా?

అత్రేతి. ఇక్కడ వ్యంగ్యమైన అద్భుతరసంచేత వాచ్యం ఉపస్కృతమై శాంతరసప్రతిపత్తికి అంగం అవడంవల్ల సుందరంగా ఉంది. అందుచేత-

"ముసలితనంచేత జీర్ణమైన శరీరం కలవానికి వైరాగ్యం కలగడంలేదంటె నిజంగా తనకు మృత్యువే లేదని వాని హృదయంలో నిశ్చయం" అనే (అర్థంగల) ప్రాచీనశ్లోకం ఉన్నా దీనికి నవత్వం ఉంది. 5

## ధ్వన్యాలోకం

కా. ధ్వనేరిత్థంగుణీభూతవ్యఙ్గ్యస్య చ సమాశ్రయాత్,
న కావ్యార్థవిరామోఽస్తి యది స్యాత్ప్రతిభాగుణః. 6

సత్స్వపి పురాతనకవిప్రబన్ధేషు, యది స్యాత్ ప్రతిభాగుణః, తస్మింస్త్వసతి న కించిదేవ కవేర్వస్త్వస్తి. బన్ధచ్ఛాయాప్యర్థద్వయానురూపశబ్దసంనివేశః అర్థప్రతిభానాభావే కథముపపద్యతే? అనపేక్షితార్థవిశేషాక్షరరచనైవ బన్ధచ్ఛాయేతి నేదం నేదీయః సహృదయానామ్. ఏవం హి సత్యర్థానపేక్షచతురమధురవచనరచనాయామపి కావ్యవ్యపదేశః ప్రవర్తేత. శబ్దార్థయోః సాహిత్యేన కావ్యత్వే కథం తథావిధే విషయే కావ్యవ్యవస్థేతి చేత్- పరోపనిబద్ధార్థవిరచనే యథా తత్కావ్యత్వవ్యవహారః తథా తథావిధానాం కావ్యసన్దర్భాణామ్.

### బాలానందిని

ధ్వనేరితి. "ప్రతిభాగుణం అనేది ఉంటే, ఈ విధంగా ధ్వనినీ, గుణీభూతధ్వనినీ ఆశ్రయించడంవల్ల కావ్యార్థానికి విరామం (అంతు) ఉండదు". 6

సత్స్వితి. పురాతనకవిప్రబంధాలు ఉన్నా, ప్రతిభాగుణం ఉంటే ("న కావ్యార్థవిరామో ఽస్తి" అనే కారికాగతవాక్యంతో అన్వయం) అదిలేకపోతే కవికి వస్తువేదీ ఉండదు. అర్థద్వయానికి (వ్యంగ్యానికీ, గుణీభూతవ్యంగ్యానికీ) అనురూపమైన శబ్దాల సంనివేశం అనే బంధచ్ఛాయ (బంధసౌందర్యం కూడ) అర్థమే భాసించకపోతే ఎలా కుదురుతుంది? అర్థవిశేషాపేక్ష లేని అక్షరాల కూర్పే బంధచ్ఛాయ అనడం సహృదయులకు సమీపగతం కాదు (అంగీకార్యం కాదు). అలా అయే పక్షంలో అర్థాపేక్ష లేని నేర్పుగా కూర్చిన చతుర వచనరచనను కూడ కావ్యం అనవలసి వస్తుంది. (ఆశంక) శబ్దార్థాలు రెండూ కలిసి ఉన్నప్పుడే కావ్యం అనబడుతుంది కదా? అలాంటి, అనగా అర్థరహితమైన శబ్దగుంఫనలో కావ్యవ్యవస్థ ఎట్లుంటుంది? (అందుచేత 'ఏవం హి' ఇత్యాద్యాక్షేపానికి అవకాశం లేదు అని భావం) (సమాధానం) పరునిచేత నిబద్ధమైన

అర్థాన్ని గ్రహించి కావ్యం రచించి నప్పుడు అతని కావ్యం అనే వ్యవహారం ఎట్లో అలాంటి కావ్యసందర్భాల కావ్యత్వవ్యవహారం కూడ అట్లే.

వివరణ:- ప్రశ్న స్పష్టంగానే ఉంది కాని సమాధానం మనస్సుకు పట్టడం లేదు. ఇతరకవులు చెప్పిన అర్థాన్నే గ్రహించి కావ్యం రచించి నప్పుడు ఆ కావ్యం ఏ విధంగా ఆ ఇతరకవిదే అని చెప్పబడుతుందో అలాగే ఇక్కడ కూడ అన్నట్లు లోచనకారుడు వ్రాశాడు. అదీ అస్పష్టంగానే ఉంది.

లోచనం

సత్స్వపీత్యాది కారికాయాః ఉపస్కారః. త్రీన్ పాదాన్ స్పష్టాన్ మత్వా తుర్యం పాదం వ్యాఖ్యాతుం పఠతి - యదీతి. విద్యమానో హ్యయం ప్రతిభాగుణః ఉక్తరీత్యా భూయాన్ భవతి; న త్వత్యన్తాసన్నేవేత్యర్థః. తస్మిన్నితి - ప్రతిభాగుణే. న కించిదేవేతి. సర్వం హి పురాణకవినైవ స్పృష్టమితి కిమిదానీం వర్ణ్యం యత్ర కవేర్వర్ణనావ్యాపారః స్యాత్? నను యద్యపి వర్ణ్యమపూర్వం నాస్తి తథాప్యుక్తిపరిపాకగుమ్ఫఘటనాద్యపరపర్యాయ బన్ధచ్ఛాయా నవనవా భవిష్యతి; యన్నివేశనే కావ్యాన్తరాణాం సంరమ్భ ఇత్యాహ - బన్ధచ్ఛాయాపీతి. అర్థద్వయమ్ - గుణీభూతవ్యఙ్గ్యం ప్రధానభూతం వ్యఙ్గ్యం చ. నేదీయ ఇతి - నికటతరం హృదయానుప్రవేశి న భవతీత్యర్థః అత్ర హేతు మాహ - ఏవం హి సతీతి. చతురత్వం సమాససంఘటనా. మధురత్వమపారుష్యమ్. తథావిధానామితి. అపూర్వబన్ధచ్ఛాయాయుక్తానామపి పరోపనిబద్ధార్థనిబన్ధనే పరకృతకావ్యత్వవ్యవహార ఏవ స్యాదిత్యర్థస్య అపూర్వత్వమాశ్రయణీయమ్. కవనీయం కావ్యమ్. తస్య భావః కావ్యత్వమ్. న త్వయం భావప్రత్యయాన్తాత్ భావప్రత్యయ ఇతి శఙ్కితవ్యమ్. 6

బాలానందిని

సత్స్వపీత్యాది వాక్యం కారికకు ఉపస్కారం (వివరణరూపాలంకారం). మూడు పాదాలు స్పష్టంగా ఉన్నాయని తలచి నాల్గవ పాదాన్ని వ్యాఖ్యానించడానికి పఠిస్తున్నాడు - యదీతి. అసలంటూ ప్రతిభాగుణం ఉంటే అది చెప్పిన రీతిలో అధికం అవుతుంది. అసలే లేకపోతే కాదు అని అర్థం. తస్మిన్నితి - అనంతమైన ప్రతిభాగుణం అని అర్థం.

న కించిదేవేతి. ప్రతీదీ ప్రాచీనకవులచేతనే స్పృశింపబడి ఉంటుంది; ఇప్పుడు ఇంక వర్ణించతగినది ఏముంటుంది కవి తన వర్ణనావ్యాపారాన్ని చేయడానికి? నన్వితి (ఆశంక) - అపూర్వమైన వర్ణ్యం ఏదీ లేకపోయినా ఉక్తిపరిపాకం, గుంఫం, ఘటన మొదలైన ఇతరపర్యాయపదాలు గల కొత్త కొత్త బంధచ్ఛాయ ఉంటుంది. దీనిని కూర్చడంలోనే ఇతర కావ్యాల సంరంభం (హడావిడి) ఉంటుంది అని ఆశంకించుకొని చెపుతున్నాడు - బన్ధచ్ఛాయయాపీతి. అర్థద్వయం - గుణీభూతవ్యంగ్యం, ప్రధానవ్యంగ్యమూను. నేదీయ ఇతి. చాలా దగ్గరగా ఉండేది. హృదయంలో ప్రవేశించేది కాదు అని అర్థం. ఇందుకు కారణం చెపుతున్నాడు - ఏవం హి సతీతి. చతురత్వం అనగా సమాసాల కూర్పు, మధురత్వం అనగా పారుష్యం లేకపోవడం. తథావిధానామితి. అపూర్వబంధచ్ఛాయతో కూడినవే అయినా పరులు కూర్చిన అర్థాన్ని నిబంధించినట్లయితే అది పరకృతకావ్య మనే పేరు వస్తుంది. అందుచేత అపూర్వార్థం గ్రహించాలి అని అర్థం. కవనీయమితి. కవనీయ మైనది (వర్ణనలతో కూర్చదగినది) కావ్యం. దాని ధర్మం కావ్యత్వం. అంతేనే కాని ఇది భావప్రత్యయాంతంకంటె భావప్రత్యయం అని శంకించకూడదు. ("కవేః భావః కావ్యం" "కావ్యస్య భావః కావ్యత్వమ్" అని చెప్పినట్లైతే ఒక భావప్రత్యయం చేర్చినదానికి మరొక భావప్రత్యయం చేర్చినట్లు. 'సౌందర్యత్వం' ఇత్యాదులవలె అలాంటి ప్రయోగాలు అయుక్త మైనవి అని భావం).

## ధ్వన్యాలోకం

న చార్థానన్త్యం వ్యఙ్గ్యార్థాపేక్షయైవ; యావద్వాచ్యార్థాపేక్షయాపీతి ప్రతిపాదయితుముచ్యతే-

కా. అవస్థాదేశకాల్దాదివిశేషైరపి జాయతే,
ఆనన్త్యమేవ వాచ్యస్య శుద్ధస్యాపి స్వభావతః. 7

శుద్ధస్య అనపేక్షితవ్యఙ్గ్యస్యాపి వాచ్యస్యానన్త్యమేవ జాయతే స్వభావతః. స్వభావో హ్యయం వాచ్యానాం చేతనానామచేతనానాం చ, యదవస్థాబేదాత్, దేశభేదాత్, కాలభేదాత్, స్వాలక్షణ్యభేదాచ్చానన్తతా భవతి. తైశ్చ తథావ్యపస్థితైః సద్భిః ప్రసిద్ధానేకస్వభావానుసరణరూపతయా స్వభావోక్త్యాపి తావదుపని బధ్యమానైః

నిరవధిః కావ్యార్థః సంపద్యతే.

బాలానందిని

న చేతి. ఆనంత్యం కేవలం వ్యంగ్యాపేక్షచేతనే కాదు, వాచ్యార్థాపేక్షచేత కూడ లభిస్తుంది అని ప్రతిపాదించడానికి చెప్పబడుతుంది-

అవస్థేతి. శుద్ధమైన వాచ్యానికి కూడ అవస్థ, దేశం, కాలం మొదలైన విశేషాలచేత కూడ స్వభావసిద్ధంగానే ఆనంత్యం ఏర్పడుతుంది'' 7.

శుద్ధస్యేతి. వ్యంగ్యాపేక్ష లేని శుద్ధవాచ్యానికి కూడ దాని స్వభావంచేతనే ఆనంత్యం కలుగుతుంది. చేతనాలు గాని అచేతనాలు కాని అయిన వాచ్యాలు అవస్థాభేదంవల్ల, దేశభేదంవల్ల, కాలభేదంవల్ల, స్వస్వరూపభేదంవల్ల అనంతాలుగా అవడం వాటి స్వభావం. అవి అలా వ్యవస్థితాలై ఉండగా వాటిని ప్రసిద్ధాలైన అనేకస్వభావాలను అనుసరించడం అనే రూపం గల స్వభావోక్తిచేత ఉపనిబంధించినా కూడ (కూర్చినా కూడ) అనంతమైన కావ్యార్థం ఏర్పడుతుంది.

లోచనం

ప్రతిపాదయితుమితి - ప్రసఙ్గాదితి శేషః. యది వా, వాచ్యం తావత్ వివిధవ్యఙ్గ్యోపయోగి; తదేవ చేదనన్తం తద్బలాదేవ వ్యఙ్గ్యానన్త్యం భవతీత్యభిప్రాయేణేదం ప్రకృతమేవోచ్యతే. శుద్ధస్యేతి. వ్యఙ్గ్యవిషయో యో వ్యాపారః తత్పూర్వం వినాప్యానన్త్యం స్వరూపమాత్రేణైవ. పశ్చాత్తు స్వరూపేణానన్తం సత్ వ్యఙ్గ్యం వ్యనక్తీతి భావః. న తు సర్వథా తత్ర వ్యఙ్గ్యం నాస్తీతి మన్తవ్యమ్; ఆత్మభూతతద్రూపాభావే కావ్యవ్యవహారహానేః. తథా చోదాహరణేషు రసధ్వనేః సద్భావోఽస్త్యేవ. ఆదిగ్రహణం వ్యాచష్టే - స్వాలక్షణ్యేతి. స్వరూపేత్యర్థః. యథా రూపస్పర్శయోః తీవ్రైకావస్థయోః, ఏకద్రవ్యనిష్ఠయోః ఏకకాలయోశ్చ.

బాలానందిని

ప్రతిపాదయితుమితి - ప్రసంగాత్ - ప్రసంగవశంవలన అని అధ్యాహారం. (వ్యంగ్యాన్ని పట్టి ఏర్పడే ఆనంత్యాన్ని చర్చించే సందర్భంలో వాచ్యాన్ని గూర్చి చెప్పడం అప్రస్తుతం అనే అభిప్రాయంతో ఇలా చెప్పబడింది). యది వా ఇతి - లేదా - వాచ్యం వివిధవ్యంగ్యాలకి ఉపయోగిస్తుంది. అదే అనంతం అయినప్పుడు దాని బలంచేతనే వ్యంగ్యానికి ఆనంత్యం సిద్ధిస్తుంది అనే అభిప్రాయంచేత ప్రకృతమైన విషయమే

చెప్పబడుతున్నది. శుద్ధస్యేతి - వ్యంగ్యవిషయమైన ఏ వ్యాపారం ఉన్నదో దాని స్పర్శ లేకపోయినా కూడ స్వరూపమాత్రంచేతనే (వాచ్యానికి) అనంత్యం. ఆ విధంగా స్వరూపంచేత అనంతమై తరవాత వ్యంగ్యాన్ని వ్యంజింపచేస్తుంది అని భావం. అక్కడ అసలు వ్యంగ్యమే ఉండదు అని అనుకొనకూడదు. ఆత్మయైన ఆ వ్యంగ్యం లేకపోతే కావ్యవ్యవహారానికే ముప్పు వస్తుంది. అందుచేత (ఇవ్వబోయే) ఉదాహరణలో రసధ్వని తప్పకుండా ఉంది. 'ఆది' పదప్రయోగాన్ని వ్యాఖ్యానిస్తున్నాడు - స్వాలక్షణ్యేతి. స్వరూపం అని అర్థం. తీవ్రమైన ఒకే విధమైన అవస్థ గలవి, ఒకే ద్రవ్యంలో ఉన్నవీ, ఒకే కాలంలో ఉన్నవీ అయిన రూపస్పర్శల స్వరూపం వలె అనగా వాటి స్వరూపాలు ఏ విధంగా పరస్పరభిన్నాలో ఆ విధంగా అని అర్థం.

## ధ్వన్యాలోకం

తథాహి - అవస్థాభేదాన్నవత్వం యథా - భగవతీ పార్వతీ కుమారసంభవే "సర్వోపమాద్రవ్యసముచ్చయేన" ఇత్యాదిభిరుక్తిభిః ప్రథమమేవ పరిసమాపితరూపవర్ణనాపి పునర్భగవతః శమ్భోః లోచనగోచరమాయాన్తీ "వసన్తపుష్పాభరణం వహన్తీ" మన్మథోప కరణభూతేన భఙ్గ్యన్తరేణోపవర్ణితా. సైవ చ పునర్నవోద్వాహసమయే ప్రసాధ్యమానా - "తాం ప్రాఙ్ముఖీం తత్ర నివేశ్య తన్వీమ్" ఇత్యాద్యుక్తిభిః నవేనైవ ప్రకారేణ నిరూపితరూపసౌష్ఠవా. న చ తే తస్య కవేః ఏకత్రైవ అసకృత్ కృతాః వర్ణనప్రకారాః అపునరుక్తత్వేన వా నవనవార్థనిర్భరత్వేనవా (న) ప్రతిభాసన్తే. దర్శితమేవ చైత ద్విషమబాణలీలాయామ్ -

గాథ. ణ అ తాణ ఘడఇ ఓహీ ణ అ తే దీసన్తి కహ వి పునరుత్తా,<br>
జే విబ్భమా పిఆణం అత్థా వా సుకఇవాణీణమ్. (140)

బాలానందిని

తథా ఇతి - అది యుక్తమే కదా; అవస్థాభేదంవల్ల నవత్వం ఎట్లనగా - కుమారసంభవంలో ముందుగానే (ప్రథమసర్గలోనే)"సర్వోపమాద్రవ్యసముచ్చయేన"

ఇత్యాదివాక్యాలచేత పూర్తిచేయబడిన రూపవర్ణనం కలదైనా భగవతియైన పార్వతి, భగవంతుడైన మహేశ్వరుని నేత్రగోచరాన్ని పొందుతూ (అతని ఎదుటకు వస్తూన్నప్పుడు) "వసంతపుష్పాభరణాలు ధరించినదై" మన్మథునికి సాధనమైన మరొక భంగిచేత వర్ణించబడింది. ఆమెయే నూతనవివాహోత్సవసమయంలో అలంకరించబడుతూ - "తాం ప్రాఙ్ముఖీం తత్ర నివేశ్య తన్వీమ్" ఇత్యాదివచనాలచేత మళ్లీ క్రొత్త క్రొత్త పద్ధతిచేత చూపబడిన రూపసౌష్ఠవం కలదైనది. ఆ కవి ఒకే కావ్యంలో అనేక పర్యాయాలు చేసిన వర్ణనరీతులు పౌనరుక్త్యదోషం లేనివిగా గాని, క్రొంగ్రొత్త అర్థవిశేషాలతో నిండినవిగా గాని భాసించడంలే దన్నమాట లేదు. (ఇక్కడ అర్థం కుదరడానికి "నవార్థనిర్భరత్వేన వా" తరవాత 'న' చేర్చాలి). ఇది విషమబాణలీలో చూపబడియే ఉంది - 'ణఅ' ఇత్యాది -

"ప్రేయసుల ఏ విలాసా లున్నాయో, సుకవుల వాక్కుల ఏ అర్థా లున్నాయో వాటికి ఒక అవధి అనేది కుదరదు; అవి ఏ విధంగానూ పునరుక్తాలుగా కనబడవు".

లోచనం

"న చ తేషాం ఘటతేఽవధిః న చ తే దృశ్యన్తే కథమపి పునరుక్తాః,

యే విభ్రమాః ప్రియాణామర్థా వా సుకవివాణీనామ్". (సంస్కృతచ్ఛాయ)

చకారాభ్యామతివిస్మయః సూచ్యతే. కథమపీతి - ప్రయత్నేనాపి విచార్యమాణం పౌనరుక్త్యం న లభ్యమితి యావత్. ప్రియాణామితి - బహువల్లభో హి సుభగో రాధావల్లభప్రాయస్తాః కామినీః పరిభోగసుభగముపభుఞ్జానోఽపి న విభ్రమపౌనరుక్త్యం పశ్యతి తదా. ఏతదేవ ప్రియాత్వముచ్యతే. యదాహ - "క్షణే క్షణే యన్నవతాముపైతి తదేవ రూపం రమణీయతాయాః" (శిశు. 4-17) ఇతి. ప్రియాణామితి చాసంసారం ప్రవహద్రూపో యోఽయం కాన్తానాం విభ్రమవిశేషః స నవనవ ఏవ దృశ్యతే. న హ్యసావగ్నిచయనాదివత్ అన్యతః శిక్షితః యేన తత్సాదృశ్యాత్పునరుక్తతాం గచ్ఛేత్. అపి తు నిసర్గోద్భిద్యమానమదనాఙ్కురవికాసమాత్రం తదితి నవనవత్వమ్. తద్వత్పరకీయశిక్షానపేక్షనిజప్రతిభాగుణనిష్యన్దభూతః కావ్యార్థ ఇతి భావః.

బాలానందిని

న చేతి (దీని భావం పైన ఇవ్వబడింది) చకారాలచేత విస్మయాతిశయం సూచించబడుతున్నది. కథమపీతి - ప్రయత్నంచేత విచారించినా (ఆలోచించినా)

పౌనరుక్త్యం లభ్యం కాదు అని భావం. ప్రియాణామితి. రాధావల్లభుడు వంటి అనేకభార్యలు గల సౌభాగ్యవంతుడు పరిభోగంతో సుందరంగా ఆ యా కామికులను అనుభవిస్తున్నా కూడ అప్పుడు విలాసాల పౌనరుక్త్యాన్ని (ఒకే విధమైన విలాసాలు మళ్లీ మళ్లీ చేయడాన్ని) చూడడు. ప్రియాత్వం అంటే ఇదే. అందుచేతనే (మాఘుడు శిశుపాలవధలో) ''క్షణక్షణానికీ (ప్రతిక్షణంలోను) క్రొత్తగా కనబడడం అనేదే సౌందర్యంయొక్క స్వరూపం' ' అని అన్నాడు. ''ప్రియాణామ్'' అనడంచేత కాంతల ఈ విలాసవిశేషం ఏది ఉన్నదో అది సంసారం (సృష్టి) ప్రారంభంనుంచీ కూడ నిత్యమూ ప్రవాహరూపంలో (అవిచ్ఛినంగా) కొంగ్రొత్తగానే కనబడుతూన్నది అని వ్యంగ్యార్థం. ఇది అగ్నిచయనాదికం (ఇదొక వైదికకర్మ) వలె ఇతరులనుండి నేర్చినది కాదు. అలా అయి ఉంటే దాని సాదృశ్యంతో (ఎవరో చేసినదానినే మళ్లీ చూపడంవల్ల) పునరుక్తత్వాన్ని పొందడానికి అవకాశం ఉండేది. మరే మనగా అది సహజంగా పైకి పొడుచుకొనివచ్చే మదనాంకురాల వికాసంమాత్రమే. అందుచేతనే దానికి అలాంటి నవనవత్వం. అదే విధంగా కావ్యార్థం కూడ ఇతరుల శిక్షను అపేక్షించని ప్రతిభాగుణంయొక్క నిష్యందం (జాలువారడం) అని భావం.

## ధ్వన్యాలోకం

అయమపరశ్చావస్థాభేదప్రకారః యత్ అచేతనానాం సర్వేషాం చేతనం ద్వితీయం రూపమభిమానిత్వప్రసిద్ధం హిమవద్గఙ్గాదీనామ్. తచ్చ ఉచితచేతనవిషయస్వరూపయోజనయా ఉపనిబధ్యమాన మన్యదేవ సంపద్యతే. యథా కుమారసంభవ ఏవ పర్వతస్వరూపస్య హిమవతో వర్ణనం, పునః సప్తర్షిప్రియోక్తిషు చేతనతత్స్వరూపాపేక్షయా ప్రదర్శితం తదపూర్వమేవ ప్రతిభాతి. ప్రసిద్ధశ్చాయం సత్కవీనాం మార్గః. ఇదం చ ప్రస్థానం కవివ్యుత్పత్తియే విషమబాణలీలాయాం సప్రపఞ్చం దర్శితమ్. చేతనానాం చ బాల్యాద్యవస్థాభిరన్యత్వం సత్కవీనాం ప్రసిద్ధమేవ. చేతనానామవస్థాభేదేఽప్యవాన్తరావస్థాభేదాన్నా నాత్వమ్. యథా కుమారీణాం కుసుమశరభిన్నహృదయానామన్యాసాం

చ. తత్రాపి వినీతానామవినీతానాం చ.

బాలానందిని

అయమితి - ఇది మరొక అవస్థాభేదప్రకారం - అదేమనగా హిమవత్పర్వతం, గంగ మొదలైన అచేతనవస్తువు లన్నింటికీ అభిమానిత్వం అని ప్రసిద్ధమైన, అనగా అభిమానిదేవత, అధిష్ఠానదేవత, అని ప్రసిద్ధమైన, చేతనమైన రెండవరూపం ఉండడం. అది తగిన చేతనవిషయమైన స్వరూపాన్ని కూర్చడంచేత (కావ్యంలో) ఉపనిబంధింపబడినదై మరొకటే (కొత్తదిగా) అయిపోతుంది. ఎట్లనగా - కుమారసంభవంలో పర్వతరూపంలో ఉన్న హిమవంతుని వర్ణనం, మళ్లీ సప్తర్షులతో ప్రియసంలాపాలు చేసేటప్పుడు చేతనస్వరూపాపేక్షచేత ప్రదర్శించబడిన అదీ (వర్ణనము) అపూర్వంగా ప్రకాశిస్తున్నది. సత్కవులు అనుసరించే ఈ మార్గం ప్రసిద్ధమైనదే. కవుల వ్యుత్పత్తి కొరకై ఈ ప్రస్థానం (మార్గం) 'విషమబాణలీల'లో సవిస్తరంగా ప్రదర్శించబడింది. చేతనాలు కూడ బాల్యాద్యవస్థలచేత అన్యులుగా (కొత్తగా) కనబడడం సత్కవులకు ప్రసిద్ధమే. అవస్థాభేదం(వయోభేదం) లేకపోయినా అవాంతరావస్థాభేదాన్ని పట్టి చేతనాలు వేరు వేరుగా కనబడతారు. ఎట్లనగా - మన్మథునిచేత వేధించబడిన హృదయాలు గల ముగ్ధకుమారీలు,. అట్లు కానివాళ్లు, వాళ్లల్లో కూడ వినీతలు (సిగ్గూ సంకోచం ఉన్నవాళ్లు) అవినీతలు వేరు వేరుగా ఉంటారు.

ధ్వన్యాలోకం

అచేతనానాం చ భావానామ్ ఆరమ్భాద్యవస్థాభేదభిన్నానామ్ ఏకైకశః స్వరూపముపనిబధ్యమానమానన్త్యమేవోపయాతి; యథా -

శ్లో. హంసానాం నినదేషు యైః కవలితైరాసజ్యతే కూజతా

మన్యః కోఽపి కషాయకణ్ఠలుఠనాదాఘర్ఘరో విభ్రమః,

తే సంప్రత్యకఠోరవారణవధూదన్తాఙ్కురస్పర్ధినో

నిర్యాతాః కమలాకరేషు బిసినీకన్దాగ్రిమగ్రన్థయః. (141)

ఏవమన్యత్రాపి దిశానయానుసర్తవ్యమ్.

బాలానందిని

అచేతనానామితి. ఆరంభాద్యవస్థాభేదంచేత భిన్నములైన అచేతనపదార్థాల

స్వరూపం కూడ ఒక్కొక్కటిగా (వేరు వేరుగా) ఉపనిబంధించబడినదై, అనంతత్వాన్నే పొందుతున్నది. ఎట్లనగా-

హంసానామితి. కవలితైః= తినబడిన, యైః= వేటిచేత, కూజతామ్= ధ్వనిచేస్తూన్న, హంసానామ్= హంసలయొక్క, నినదేషు= ధ్వనులలో, కషాయకణ్ఠలుఠనాత్= కషాయములైన (వగరెక్కిన) కంఠాలలో దొర్లడంచేత, అన్యః = మరొక విధమైన, కోఽపి= ఒకానొక, ఆఘర్ఘరః= కొంచెం ఘర్ఘరం (ఇది అనుకరణశబ్దం)గా ఉన్న, విభ్రమః= విలాసం, ఆసజ్యతే= కూర్చబడుతుందో, సంప్రతి= ఇప్పుడు, అకఠోరవారణ వధూదన్తాఙ్కురస్పర్ధినః= ఆడ ఏనుగుల లేత దంతాల అంకురాలతో పోటీపడుతూన్న, తే= అట్టి, బిసినీకన్దాగ్రిమగ్రంథయః= తామరతీగల దుంపల పైభాగంలో ఉండే గ్రంథులు, కమలాకరేషు= పద్మవనాల్లో, నిర్యాతాః= బయలుదేరినవి.

వివరణ:- బిసాంకురాలు ప్రారంభదశలో హంసలు తినగా వాటి కంఠంలో ఒక విధమైన ధ్వనివిశేషాన్ని పుట్టించే వనీ, తరవాత అవే కొంచెం పెరిగి కరిణీదంతాంకురాల వలె ఉన్నాయనీ ఆరంభాద్యవస్థాభేదాన్ని పట్టి వర్ణించబడ్డాయి.

ఏవమితి. ఈ విధంగానే ఇతరస్థలాలలో కూడ ఈ మార్గంచేత ఆనంత్యాన్వేషణ చెయ్యాలి.

## ధ్వన్యాలోకం

దేశభేదాన్నానాత్వమచేతనానాం తావత్. యథా వాయూనాం నానాదిగ్దేశచారిణామ్, అన్యేషామపి సలిలకుసుమాదీనాం ప్రసిద్ధమేవ. చేతనానామపి మానుషపశుపక్షిప్రభృతీనాం గ్రామారణ్యసలిలాది సమేధితానాం పరస్పరం మహాన్విశేషః సముపలక్ష్యత ఏవ. స చ వివిచ్య యథాయథముపనిధ్యమానః తథైవానన్త్యమాయాతి. తథాహి - మానుషాణామేవ తావద్దిగ్దేశభిన్నానాం యే వ్యవహారవ్యాపారాదిషు విచిత్రా విశేషాః తేసాం కేనాన్తః శక్యతే గన్తుమ్; విశేషతో యోషితామ్. ఉపనిబధ్యతే చ తత్సర్వమేవ సుకవిభిర్యథాప్రతిభమ్.

కాలభేదాచ్చ నానాత్వమ్. యతా - ఋతుభేదాద్దిగ్ వ్యోమసలిలాదీనామచేతనానామ్. చేతనానాం చౌత్సుక్యాదయః

కాలవిశేషాశ్రయిణః ప్రసిద్ధా ఏవ. స్వాలక్షణ్యప్రభేదాచ్చ సకలజగద్గతానాం వస్తూనాం వినిబన్ధనం ప్రసిద్ధమేవ. తచ్చ యథావస్థితమపి తావత్ ఉపనిబధ్యమానమనన్తతామేవ కావ్యార్థస్యాపాదయతి.

బాలానందిని

దేశేతి. అచేతనాలకు దేశభేదంచేత నానాత్వం ఉంటుంది. ఎట్లనగా - ఆయాదిక్కులయందు, దేశాలయందు సంచరించే వాయువులయొక్క, ఇతరమైన జల- పుష్పాదులయొక్క నానాత్వం ప్రసిద్ధమే. గ్రామ-అరణ్య-జలాలలో పెరిగే మనుష్య-పశు-పక్ష్యాదులైన చేతనాలలో పరస్పరం గొప్ప విశేషం చూడబడుతూనే ఉన్నది. ఆ విశేషం వివేచించి తగు విధంగా ఉపనిబద్ధమైతే అట్లే ఆనంత్యాన్ని పొందుతుంది. అదెట్లనగా - దిక్కులచేత, దేశాదులచేత వేరువేరుగా ఉండే మనుష్యుల వ్యవహారవ్యాపారాదులలో ఏ విచిత్రమైన విశేషా లున్నాయో వాటి అంతాన్ని పొందడానికి ఎవనికి శక్యం అవుతుంది? విశేషించి స్త్రీల విశేషాలు. అదంతా సుకవులు తమ తమ ప్రతిభను అనుసరించి కూరుస్తూనే ఉన్నారు.

కాలభేదంచేత కూడ నానాత్వం ఉంటుంది. ఉదాహరణకి - ఋతుభేదంవల్ల దిక్కులు, ఆకాశం, జలం మొదలైన అచేతనపదార్థాలకు నానాత్వం కనబడుతుంది. కాలవిశేషాన్ని పట్టి చేతనులలో కలిగే ఔత్సుక్యాదులు ప్రసిద్ధములే. సకలజగత్తులోని వస్తువుల సహజలక్షణాలను పట్టి వాటిని వర్ణించడం ప్రసిద్ధమే. దానిని ఉన్నదున్నట్లుగా వర్ణించినా కూడ కావ్యార్థానికి అనంతత్వాన్ని కలిగిస్తుంది.

లోచనం

తావదితి. ఉత్తరకాలం తు వ్యఙ్గ్యస్పర్శనేన విచిత్రతాం పరాం భజన్తాం నామ, తావతి తు స్వభావేనైవ సా విచిత్రేతి తావచ్ఛబ్దాభిప్రాయః.

బాలానందిని

"యథావస్థితమపి తావత్" అనేదానిలోని 'తావత్'ను ప్రతీకగా తీసికొని వ్యాఖ్యానిస్తున్నాడు - తావదితి. తరవాత వ్యంగ్యస్పర్శచేత గొప్ప విచిత్రతను పొందితే పొందవచ్చును. వాటి స్వరూపమాత్రంలోనే ఆ అనంతత విచిత్ర మైనది అని 'తావత్' శబ్దంయొక్క అభిప్రాయం.

## ధ్వన్యాలోకం

అత్ర కేచిదాచక్షీరమ్ - యథా - సామాన్యాత్మనా వస్తూని వాచ్యతాం ప్రతిపద్యన్తే న విశేషాత్మనా; తాని హి స్వయమనుభూతానాం సుఖాదీనాం తన్నిమిత్తానాం చ స్వరూపమన్యత్రారోపయద్భిః స్వపరానుభూతసామాన్యమాత్రాశ్రయేణోపనిబధ్యన్తే కవిభిః. న హి తైరతీతమనాగతం వర్తమానం చాపరిచితాదిస్వలక్షణం యోగిభిరివ ప్రత్యక్షీక్రియతే, తచ్చ అనుభావ్యానుభవసామాన్యం సర్వప్రతిపత్తృ సాధారణం పరిమితత్వాత్ పురాతనానామేవ గోచరీభూతమ్; తస్య అవిషయత్వానుపపత్తేః. అత ఏవ స ప్రకారవిశేషః యైరద్యతనై రభినవత్వేన ప్రతీయతే తేషామభిమానమాత్రమేవ భణితికృతం వైచిత్ర్యమాత్రమత్రాస్తీతి.

### బాలానందిని

అత్రేతి. ఇక్కడ కొంతమంది ఈ విధంగా చెప్పవచ్చు; ఎట్లనగా - వస్తువులు వాటి సామాన్యస్వరూపంమాత్రంచేతనే వాచ్యత్వాన్ని పొందుతాయి కాని విశేషస్వరూపంచేత కాదు (వస్తువుల సామాన్యస్వరూపమే వాచ్యం, పదాలచేత చెప్ప శక్యమైనది, అవుతుంది కాని వాటి విశేషస్వరూపం కాదు అని అర్థం). కవులు తాము అనుభవించిన సుఖాదుల యొక్క వాటి నిమిత్తాలయొక్క స్వరూపాన్ని ఇతరవస్తువులమీద ఆరోపిస్తూ, తమచేత, ఇతరులచేత అనుభవించబడిన సామాన్యమాత్రాన్ని ఆశ్రయించి ఆ వస్తువులను కావ్యాలలో కూర్చుతూ ఉంటారు. అంతే కాని వాళ్లు యోగుల వలె, గడచిపోయినదీ రాబోయేదీ, వర్తమానకాలంలో ఉన్నదీ అయిన అపరిచితవస్తుస్వరూపాన్ని ప్రత్యక్షంగా చూడజాలరు కదా?

తచ్చేతి. ఆ అనుభావ్యం (అనుభవింపదగినది)యొక్క, అనుభవంయొక్క సామాన్యం పరిమితం అవడంవల్ల అందరు జ్ఞాతలకీ కూడ సాధారణమైనది. అందుచేత ప్రాచీనకవులకే గోచర మైపోయినది. అది విషయం కాకుండా (జ్ఞానవిషయం కాకుండా, తెలియబడకుండా) ఉండడం కుదరదు కదా? అందువల్లనే ఈ నాటివాళ్లు ఆ

ప్రకారవిశేషాన్ని క్రొత్తది అన్నట్లు గ్రహిస్తున్నా రంటే, ఇక్కడ ఏదో చెప్పడంలో వైచిత్ర్యం మాత్రం ఉన్న దని వాళ్ల అభిమానం (అహంకారం) మాత్రమే.

లోచనం

తన్నిమిత్తానాం చేతి. ఋతుమాల్యాదీనామ్. స్వేతి. స్వానుభూతపరానుభూతానాం యత్సామాన్యం తదేవ విశేషాన్తరరహితం తన్మాత్రం, తస్యాశ్రయేణ. నహి తైరితి కవిభిః. ఏతచ్చ-అత్యన్తమసంభావనార్థముక్తమ్. ప్రత్యక్షదర్శనేఽపి హి -

శబ్దాః సంకేతితం ప్రాహుర్వ్యవహారాయ స స్మృతః,
తదా స్వలక్షణం (ణే) నాస్తి సంకేతస్తేన తత్ర నః.

ఇత్యాదియుక్తిభిః సామాన్యమేవ స్పృశ్యతే.

బాలానందిని

తన్నిమిత్తానాం చేతి - సుఖదుఃఖాదులకు నిమిత్తాలైన ఋతుమాల్యాదులు అని అర్థం. స్వేతి. తమచేత పరులచేత అనుభవించబడినవాటి ఏ సామాన్యం ఉన్నదో, అంతరవిశేషాలేవీ లేని అది మాత్రమే. దానియొక్క ఆశ్రయంచేత. న హి తైరితి - తైః అనగా కవులచేత. ఏ మాత్రమూ సంభావ్యం కాదనడానికి ఇట్లు చెప్పబడింది. ప్రత్యక్షంగా చూచినప్పుడు కూడ - "శబ్దాలు సంకేతితమైన అర్థాన్ని మాత్రమే బోధిస్తాయి. ఆ సంకేతం వ్యవహారంకోసం చేయబడింది. సంకేతసమయంలో మనకు స్వలక్షణం (వస్తువుల విశిష్టస్వరూపం) విషయంలో సంకేతం లేదు" (స్వలక్షణం నేదాని స్థానంలో "స్వలక్షణే" అని పాఠం ఉండవచ్చు. అట్లు మార్చబడింది. లేదా తదా స్వలక్షణం నాస్తి అనేదానికి సంకేతగ్రహణసమయంలో స్వలక్షణం లేదు అని అర్థం. 'నాస్తి' అనే దానిని "సంకేతస్తేన తత్ర నః" అనేదానితో కూడ అన్వయించాలి) ఇత్యాది యుక్తులచేత కేవలం సామాన్యం మాత్రమే స్పృశించబడుతుంది.

వివరణ : ఎవరైనా ప్రతివస్తువుయొక్క సామాన్యాన్ని (స్థూలస్వరూపాన్ని) మాత్రమే చూడకలుగుతారు. అయితే ప్రతివస్తువులోను కొన్ని విశిష్టలక్షణాలు ఉంటాయి. వాటికే 'స్వలక్షణం' అని పేరు. వాటిని ఎవరూ చూడలేరు. మాటలలో చెప్పజాలరు. ప్రపంచంలోని ఆ వస్తువుల సామాన్యరూపం ప్రాచీనకవులు ఏనాడో చూచి వాటిని వర్ణించి ఉన్నారు. ఇంక అధునికులకి ఏమి మిగిలింది? వాటినే మేం మాటలలో అందంగా చెప్పాం అని దురభిమానం మాత్రమే అని పూర్వపక్షసారాంశం.

## ధ్వన్యాలోకం

తత్రోచ్యతే - యత్తూక్తం సామాన్యమాత్రాశ్రయేణ కావ్య ప్రవృత్తిః; తస్య చ పరిమితత్వేన ప్రాగేవ గోచరీకృతత్వాత్ నాస్తి నవత్వం కావ్యవస్తూనామితి, తదయుక్తమ్. యతః యది సామాన్య మాత్రమాశ్రిత్య కావ్యం ప్రవర్తతే కిం కృతస్తర్హి మహాకవినిబధ్య మానానాం కావ్యార్థానామతిశయః? వాల్మీకివ్యతిరిక్తస్యాన్యస్య కవివ్యపదేశ ఏవ వా; సామాన్యవ్యతిరిక్తస్యాన్యస్య కావ్యార్థస్యాభావాత్, సామాన్యస్య చాదికవినైవ ప్రదర్శితత్వాత్. ఉక్తివైచిత్ర్యాన్నైష దోష ఇతి చేత్ - కిమిదముక్తి వైచిత్ర్యమ్? ఉక్తిర్హి వాచ్యవిశేషప్రతిపాది వచనమ్. తద్వైచిత్ర్యే కథం న వాచ్యవైచిత్ర్యమ్? వాచ్య వాచకయోరవినాభావేన ప్రవృత్తేః. వాచ్యానాం చ కావ్యే ప్రతిభాసమానానాం యద్రూపం తత్తు గ్రాహ్యవిశేషాభేదేనైవ ప్రతీయతే. తేన ఉక్తివైచిత్ర్యవాదినా వాచ్యవైచిత్ర్యమనిచ్ఛతాపి అవశ్యమభ్యుపగన్తవ్యమ్. తదయమత్ర సంక్షేపః -

వాల్మీకివ్యతిరిక్తస్య యద్యేకస్యాపి కస్య చిత్.
ఇష్యతే ప్రతిభార్థేషు తత్తదానన్త్యలక్షణమ్.

బాలానందిని

అత్రేతి - ఇక్కడ చెప్పబడుతున్నది - "సామాన్యమాత్రాన్నే ఆశ్రయించి కావ్యం రచన జరుగుతుంది; అది పరిమితం అవడంచేత పూర్వమే గ్రహించబడి ఉంటుంది. అందుచేత కావ్యవస్తువులకు నూతనత్వం ఉండదు" అని చెప్పడం యుక్తం కాదు. కేవలం సామాన్యాన్ని మాత్రమే ఆశ్రయించి కావ్యం ప్రవర్తిస్తే అప్పుడు మహాకవులు కూర్చే కావ్యార్థాలలోని అతిశయం దేనిని పట్టి ఏర్పడింది? సామాన్య వ్యతిరిక్తమైన కావ్యార్థమే లేకపోతే, ఆ సామాన్యాన్ని ఆదికవియే ప్రదర్శించి ఉన్నాడు గాన

వాల్మీకిభిన్నుడైన ఎవరినైనా 'కవి' అని దేనిని పట్టి అనాలి? ఉక్తి వైచిత్ర్యం (చెప్పే విధానంలో వైచిత్ర్యం) ఉంటుంది కాబట్టి ఈ దోషం లేదు అన్నట్లయితే - ఏమిటి ఈ ఉక్తిలో వైచిత్ర్యం అంటే? ఒక వాచ్యవిశేషాన్ని (విశిష్టమైన వాచ్యార్థాన్ని) ప్రతిపాదించే వచనమే 'ఉక్తి' అంటే? ఉక్తిలో వైచిత్ర్యం ఉంటే వాచ్యంలో వైచిత్ర్యం ఎందుకు ఉండదు? వాచ్యవాచకాలు అవినాభావసంబంధంచేత ప్రవర్తిస్తాయి కదా? కావ్యంలో భాసిస్తున్న వాచ్యాల ఏ రూపం ఉన్నదో అది గ్రాహ్యంయొక్క విశేషంతో అభిన్నంగానే భాసిస్తుంది. వాచ్యార్థంలో చెప్పబడే వస్తువుకు సంబంధించిన విశేషం కూడా భాసిస్తుంది అని అర్థం. అందుచేత ఉక్తిలో వైచిత్ర్యం ఉంది అని చెప్పేవాడు, వాచ్యంలో కూడా వైచిత్ర్యం ఉంటుంది అని ఇష్టం లేకపోయినా తప్పక అంగీకరించాలి. అందుచేత ఈ విషయంలో సంక్షేపం ఇది -

వాల్మీకీతి. "వాల్మీకికంటె వేరైన ఏ ఒక్క కవికైనా అర్థాల విషయంలో ప్రతిభ ఉంటుంది అని అంగీకరిస్తే అప్పుడు (తత్) ఆ అర్థాల అనంతత్వం (తదానన్త్యమ్) అక్షయమైనది"

## లోచనం

కిమితి - అసంవేద్యమానమర్థపౌనరుక్త్యం కథం ప్రాకరణికైరఙ్గీకార్యమితి భావః. తదేవ ప్రకటయతి - న చేదితి. ఉక్తిర్హీతి. పర్యాయమాత్రతైవ యద్యుక్తివిశేషః తత్పర్యాయాన్తరైరవికలం తదర్థోపనిబన్ధే అపౌనరుక్త్యాభిమానో న భవతి. తస్మాద్విశిష్టవాచ్యప్రతిపాదకత్వైవ ఉక్తేర్విశేష ఇతి భావః. గ్రాహ్యవిశేషేతి - గ్రాహ్యః ప్రత్యక్షాదిప్రమాణైః యః విశేషః తస్య యః అభేదః. తేనాయమర్థః- పదానాం తావత్సామాన్యే వా, తద్వతి వా, అపోహే వా యత్ర కుత్రాపి వస్తుని సమయః; కిమనేన వాదాన్తరేణ? వాక్యాత్తద్విశేషః ప్రతీయతే ఇతి కస్యాత్ర వాదినః విమతిః? అన్వితాభిధానతద్విపర్యయసంసర్గభేదాదివాక్యార్థపక్షేషు సర్వత్ర విశేషస్య అప్రత్యాఖ్యేయత్వాత్.

## బాలానందిని

వృత్తిలో "అత్రోచ్యతే" కి తరవాత "యత్తూక్తం సామాన్యమాత్రాశ్రయేణ కావ్యప్రవృత్తిః" ఇత్యాదివాక్యానికి పూర్వం కొన్ని ప్రతులలో - "యది సామాన్యమాత్రాశ్రయేణ కావ్యప్రవృత్తిః తత్ ప్రదర్శిత ప్రకారం కావ్యవైచిత్ర్యమవస్థావిశేషాత్ కిం

పునరుక్తమేవాస్తు; న చేత్తథా తత్కథం న కావ్యానన్త్యమ్" అనే పాఠం కూడా ఉన్నదట. దానిని అనుసరించియే లోచనంలో కిమితి అని ప్రతీక గ్రహించబడింది (ఇది బాలప్రియకారుడు వ్రాసిన విషయం). "సామాన్యమాత్రాన్ని ఆశ్రయించి కావ్యప్రవృత్తి అని అంటే - అవస్థాదివిశేషంచేత ఇంతవరకూ చూపబడిన వివిధప్రకారాలు గల కావ్యవైచిత్ర్యం అంతా పునరుక్తమేనా? అనగా చెప్పినదే చెప్పినట్లు కాని ఒకదానికీ మరొకదానికీ భేదం లేదా? కాదు; పునరుక్తం కాదు అనే పక్షంలో కావ్యానంత్యం లేదని ఎలా అంటావు?" అని వృత్తిగతమైన పై వాక్యానికి అర్థం.

(లోచనంలో) కిమితి - ప్రకరణజ్ఞానం ఉన్నవాళ్ళు (ప్రాకరణికైః) అక్కడ కనబడని అర్థపౌనరుక్త్యాన్ని (అక్కడ ఉన్నట్లు) ఎలా అంగీకరిస్తారు అని భావం. దానినే విశదీకరిస్తున్నాడు - న చేదితి. ఉక్తిర్హీతి. ఉక్తివిశేషం అనగా పర్యాయమాత్రత్వమే (చెప్పినవిషయాన్నే మరొక మాటలో చెప్పడం) అయితే అప్పుడు ఇతరపర్యాయపదాలచేత ఆ అర్థాన్నే మార్పు లేకుండా (అవికలం) ప్రతిపాదించినప్పుడు అపౌనరుక్త్యాభిమానం (పౌనరుక్త్యం లేదు అనే జ్ఞానం) కలగదు. (కాని పౌనరుక్త్యాభిమానమే కలుగుతున్నది అని అర్థం. అందుచేత ఒక విషయాన్ని యథాతథంగా పర్యాయపదాలచేత చెప్పడం ఉక్తివిశేషం కాదు అని భావం). తస్మాదితి - అందువల్ల విశిష్టమైన వాచ్యాన్ని ప్రతిపాదించడమే ఉక్తివిశేషం అని భావం.

తేనేతి. అందుచేత (ఇంతవరకూ చెప్పినదాని) అర్థం ఇది - పదాలకి సంకేతం (మీమాంసకాదులు చెప్పినట్లు) సామాన్యం (జాతి)లో కావచ్చు, (నైయాయికాదులు చెప్పినట్లు) జాతివిశిష్టవ్యక్తిలో కావచ్చు, లేదా (బౌద్ధులు చెప్పినట్లు) అపోహలో కావచ్చు, ఏదో ఒక వస్తువుమీద కావచ్చు. ఈ అవాంతరవాదాలతో మన కిప్పుడు ఏమి పని? (సమయానికి సంబంధించిన ఈ వాదాలు కావ్యప్రకాశలో నిర్దేశించబడ్డాయి; తద్వ్యాఖ్యయైన బాలానందినిలో విశదీకరించబడ్డాయి). వాక్యాదితి. వాక్యంవల్ల ఆ వస్తువుకు సంబంధించిన విశేషం (తద్విశేషః) ప్రతీతం అవుతుంది అనే విషయంలో ఏ వాదికి విమతి (అభిప్రాయభేదం) ఉంది? వాక్యార్థం విషయంలో అన్వితాభిధానం, అభిహితాన్వయం(తద్విపర్యయ) సంసర్గభేద (సాకాంక్షపదపరస్పరాన్వయం) మొదలైన పక్షాలు ఎన్ని ఉన్నా ఏ పక్షంలోనూ కూడ విశేషాన్ని ప్రత్యాఖ్యానం చేయడం కుదరదు కదా?

## ధ్వన్యాలోకం

కించ, ఉక్తివైచిత్ర్యం యత్ కావ్యనవత్వే నిబన్ధనముచ్యతే తదస్మత్పక్షానుగుణమేవ. యతఃయావానయం కావ్యార్థానన్త్య భేదహేతుః ప్రకారః ప్రాగ్ దర్శితః స సర్వ ఏవ పునః ఉక్తివైచిత్ర్యా ద్విగుణతామాపద్యతే. యశ్చాయముపమాశ్లేషాదిర లంకారవర్గః ప్రసిద్ధః స భణితివైచిత్ర్యాదుపనిబధ్యమానః స్వయమేవానవధిర్ధత్తే పునః శతశాఖతామ్. భణితిశ్చ స్వభాషాభేదేన వ్యవస్థితా సతీ ప్రతినియంతభాషాగోచరార్థవైచిత్ర్యనిబన్ధనం పునరవరం కావ్యార్థానామానన్త్యమాపాదయతి. యథా మమైవ-

**గాథ. మహ మహ ఇతి భణన్తఉ వజ్జది కాలో జణస్స,**

**తోఇ ణ దేఉ జణద్దణ గోఅరీ భోది మణసో.** (142)

ఇత్థం యథా యథా నిరూప్యతే తథా తథా న లభ్యతేఽన్తః కావ్యార్థానామ్.

### బాలానందిని

కిం చేతి - కావ్యనవత్వానికి ఉక్తివైచిత్ర్యం కారణం అని ఏది చెప్పబడుతున్నదో అది మా పక్షానికి అనుగుణమే. ఎందువలన అనగా కావ్యార్థాల ఆనంత్యానికి భేదాలకీ హేతువైన ఈ ఏ ప్రకారం వెనుక చూపించబడిందో అది అంతా కూడ ఉక్తివైచిత్ర్యంవల్ల ఇంకా (పునః) రెట్టింపు అవుతుంది. ప్రసిద్ధమైన ఉపమాశ్లేషాద్యలంకారవర్గం కూడ ఉక్తి వైచిత్ర్యంతో ఉపనిబంధించబడినదై, అదే అవధి లేకుండా వందలకొలది శాఖలుగా అవుతుంది. భణితి (ఉక్తి) కూడ స్వభాషాభేదంచేత వ్యవస్థితమై (అనగా ఒక్కొక్క భాషలో ఒక్కొక్క విధమైన ఉక్తివైచిత్ర్యం ఉంటుందని అర్థం) ఒక్కొక్క భాషకు సంబంధించిన అర్థవైచిత్ర్యం కారణంగా గల మరొక ఆనంత్యాన్ని కూడా కావ్యార్థాలకు కలగజేస్తుంది.

వివరణ:- ఆ యా భాషలలో ఒక్కొక్క విధమైన ఉక్తివైచిత్ర్యం (చెప్పే విధానంలో వైచిత్ర్యం) ఉంటుంది గాన దానిని పట్టి కూడ కావ్యార్థాలకు ఆనంత్యం ఏర్పడుతుంది. దీనిని పట్టి ప్రాచీనసంస్కృతాలంకారికుల దృష్టిలో కేవలం ఒక్క సంస్కృతవాఙ్మయమే

కాదు, సకలభాషావాఙ్మయాలు ఉన్నాయని, వారు చెప్పే విషయాలన్నీ అన్ని వాఙ్మయాలకీ వర్తిస్తాయనీ స్పష్టంగా తెలుస్తూన్నది. ఆనందాభినవగుప్తాదులు చూపిన ఉదాహరణలలో కనీసం నూటికి ఇరవైయైదు ప్రాకృతశ్లోకాలు కనబడుతున్నాయి. వారు స్వయంగా ప్రాకృతశ్లోకాలు ఎన్నో రచించారు. ఆనందవర్ధనుని విషమబాణలీల ప్రాకృతకావ్యమే కదా.

యథా ఇతి. ఉదాహరణగా నా శ్లోకమే ఎట్లనగా-

"మానవుడు 'మమ' 'మమ' అని అంటూండగానే కాలం గడిచిపోతుంది. అయినా భగవంతుడైన జనార్దనుడు మాత్రం మనస్సుకు గోచరుడు కాడు"

ఇత్థమితి - ఈ విధంగా నిరూపిస్తూన్నకొలదీ కావ్యార్థాలకు అంతం కనబడడంలేదు.

లోచనం

ఉక్తివైచిత్రం చ పర్యాయమాత్రకృతమిత్యుక్తమ్. అన్యత్తు యత్ తత్ ప్రత్యుతాస్మాకం పక్షసాధకమిత్యాహ - కిం చేతి. పునరితి - భూయః ఇత్యర్థః. ఉపమా హి నిభ - ప్రతిమ - ఛల - ప్రతిబిమ్బ - ప్రతిచ్ఛాయ - తుల్య - సదృశ - ఆభాసాదిభిర్విచిత్రాభిరుక్తిభిః విచిత్రీభవత్యేవ. వస్తుతః ఏతాసాముక్తీనామర్థ వైచిత్ర్యస్య విద్యమానత్వాత్. నియమేన భానయోగాద్ధి నిభశబ్దః, తదనుకారతయా తు ప్రతిమశబ్దః ఇత్యేవం సర్వత్ర వాచ్యమ్. కేవలం బాలోపయోగి కావ్యటీకాపరిశీలనదౌరాత్మ్యాత్ ఏషు పర్యాయత్వభ్రమ ఇతి భావః.

ఏవమర్థానన్త్యమలఙ్కారానన్త్యం చ భణితివైచిత్ర్యాద్భవతి. అన్యథాపి చ తత్తతో భవతీతి దర్శయతి - భణితిశ్చేతి. ప్రతినియతాయా భాషాయా గోచరో వాచ్యో యోఽర్థః తత్కృతం యద్వైచిత్ర్యం తత్ నిబన్ధనం నిమిత్తం యస్య, అలఙ్కారాణాం కావ్యార్థానాం చానన్త్యస్య, తత్కర్మభూతం, భణితివైచిత్ర్యం కర్తృభూతమాపాదయతీతి సంబన్ధః. కర్మణో విశేషణచ్ఛలేన హేతుర్దర్శితః.

"మమ మమ ఇతి భణతో వ్రజతి కాలో జనస్య,
తథాపి న దేవో జనార్దనో గోచరో భవతి మనసః"

'మధుమథన' ఇతి యోऽనవరతం భణతి తస్య కథం న దేవో మనోగోచరో భవతీతి విరోధాలంకారచ్ఛాయా సైన్ధవభాషయా 'మహమహ' ఇత్యనయా భణిత్యా సమున్మేషితా. 7

బాలానందిని

ఉక్తీతి:- ఉక్తివైచిత్ర్యం పర్యాయపదాల ప్రయోగంచేత కలిగేది కాదు అని చెప్పబడింది. ఇంక మరొక ఉక్తివైచిత్ర్యం ఏదైతే ఉన్నదో అది పైపెచ్చు (ప్రత్యుత) మా పక్షానికి సాధకమే (సాధించేదే) అని చెప్పుచున్నాడు - కిం చేతి. పునరితి - ఇంకా అధికంగా అని అర్థం. ఉపమాలంకారం నిభ, ప్రతిమ, ఛల, ప్రతిబింబ, ప్రతిచ్ఛాయ, తుల్య, సదృశ, ఆభాస మొదలైన విచిత్రములైన ఉక్తులచేత తప్పక విచిత్రంగా ఉంటుంది; ఎందువల్ల ననగా వాస్తవంలో ఈ ఉక్తులలో అర్థవైచిత్ర్యం ఉంది. నియమం చేత (తప్పక) భానంతో (ప్రకాశించడంతో) సంబంధంవల్ల 'ని భ' శబ్దం, దానిని అనుకరించేది గాన 'ప్రతిమ' శబ్దం ఇత్యాది విధంగా ఈ అన్నిశబ్దాల విషయంలోనూ చెప్పాలి. కాని చిన్నపిల్లలకు మాత్రమే ఉపయోగించే కావ్యవ్యాఖ్యానాలను పరిశీలించడం అనే దౌరాత్మ్యం వల్ల, (దౌర్భాగ్యం వల్ల) ఇవన్నీ పర్యాయపదాలే అని భ్రమ అని భావం. ఈ విధంగా భణిత (ఉక్తి) వైచిత్ర్యం వల్ల అర్థాల ఆనంత్యం, అలంకారాల ఆన్యంత్యం కూడా కలుగుతుంది. ఇది మరొకవిధంగా కూడ ఆ యా కారణాలవల్ల కలుగుతుంది అని చెపుతున్నాడు - భణితిశ్చేతి - ప్రతినియత మైన (ఒక్కొక్క విధంగా ఉండే) భాషకు గోచరమైన ఏ అర్థం ఉన్నదో, దానివల్ల ఏర్పడిన ఏ వైచిత్ర్యం ఉన్నదో అది నిబన్ధనమ్ - నిమిత్తం, ఏ అలంకార - కావ్యార్థాల ఆనంత్యానికో అది - "ప్రతినియత భాషాగోచరార్థవైచిత్ర్యనిబన్ధనమ్". కర్మయైన ఆ అలంకారకావ్యార్థానంత్యాన్ని కర్తయైన భణితివైచిత్ర్యం కలిగిస్తుంది అని సంబంధం (అన్వయం). కర్మయైన "కావ్యార్థానామానన్త్యమ్" అనేదానికి "ప్రతినియతభాషాగోచరార్థవైచిత్ర్యనిబన్ధనమ్" అనే విశేషణాన్ని ప్రయోగించడం ద్వారా (ఆనంత్యానికి) హేతువు చూపబడింది. 'మధుమథన" అని నిరంతరమూ పలికేవానికి ఆ దేవుడు మనోగోచరుడు ఎందువల్ల అవడం లేదో" అని విరోధాలంకారచ్ఛాయ సైంధవభాషచేత 'మహమహ' అనే ఉక్తి చేత వికసింపచేయబడింది. ('సైంధవ'భాషాపదమైన 'మహమహ' అనేదానికి "మమ మమ" అనీ 'మధుమథన' అనీ కూడ సంస్కృతచ్ఛాయ అవుతుంది. ఈ పదాన్ని ప్రయోగించడం వల్ల విరోధాలంకారచ్ఛాయ సమున్మిషితమైనది అని భావం) 7.

# ధ్వన్యాలోకం

ఇదం తూచ్యతే -

కా. అవస్థాదివిభిన్నానాం వాచ్యానాం వినిబన్ధనమ్,

యత్ప్రదర్శితం ప్రాక్,

భూమ్నైవదృశ్యతే లక్ష్యే -

న తచ్ఛక్యమపోహితుమ్.

తత్తు భాతి రసాశ్రయాత్. 8.

తదిదమత్ర సంక్షేపేణాభిధీయతే సత్కవీనాముపదేశాయ -

కా. రసభావాదిసంబద్ధా యద్యౌచిత్యానుసారిణీ,

అన్వీయతే వస్తుగతిర్దేశకాలాదిభేదినీ. 9

తత్కా గణనా కవీనామన్యేషాం పరిమితశక్తీనామ్ !

కా. వాచస్పతిసహస్రాణాం సహస్రైరపి యత్నతః,

నిబద్ధా సా క్షయం నైతి ప్రకృతిర్జగతామివ. 10

యథాహి జగత్ప్రకృతిరతీతకల్పపరంపరావిర్భూతవిచిత్రవస్తు ప్రపఞ్చా సతీ పునరిదానీం పరిక్షీణాపపదార్థశక్తిరితి న శక్యతేఽభిధాతుం, తద్వదేవేయం కావ్యస్థితిరనన్తాభిః కవిమతిభిరుపభుక్తాపి నేదానీం పరిహీయతే, ప్రత్యుత నవనవాభిః వ్యుత్పత్తిభిః పరివర్ధతే.

బాలానందిని

ఇదమితి. అయితే ఈ విషయం ఒకటి చెప్పబడుతున్నది -

అవస్థాదీతి. "అవస్థాదులచేత భిన్నములైన వాచ్యార్థాల కూర్పు"- ఏదైతే వెనుక చూపబడిందో - "లక్ష్యంలో అధికంగానే కనబడుతూన్నది". అది లేదనడానికి వీలు లేదు.

"అయితే అది రసాశ్రయంవల్ల ప్రకాశిస్తుంది".

తదితి. అందుచేత సత్కవుల ఉపదేశంకొరకు ఇది ఇక్కడ చెప్పబడుతున్నది-

రసేతి "రసభావాదులతో సంబంధించినదీ, ఔచిత్యాన్ని అనుసరించేదీ, దేశకాలాదిభేదం కలదీ అయిన వస్తుస్వరూపం అనుసరించబడినట్లయితే"

తదితి - అప్పుడు పరిమితశక్తి గల ఇతరకవుల లెక్క ఏమిటి -

వాచస్పతీతి. "అది (ఆ వస్తుగతి) బృహస్పతిసహస్రాల సహస్రాలు ప్రయత్నపూర్వకంగా నిబంధించినా కూడ, జగత్తుల ప్రకృతి (మూలకారణం) వలె క్షయం పొందదు". 10.

యథా హీతి. గడచిన కల్పాల పరంపరయందు ఆవిర్భవించిన విచిత్రవస్తువుల ప్రపంచం గల జగత్ప్రకృతి ఇప్పుడు క్షీణించిన ఇతరపదార్థాల నిర్మాణశక్తి కలది అని చెప్పడానికి ఎట్లు శక్యం కాదో (జగత్ప్రకృతి గడచిన అనేక కల్పాలలో విచిత్రవస్తువులతో నిండిన ప్రపంచాన్ని ఆవిర్భవింపచేసింది. అయినా ఇప్పుడు ఇతరపదార్థాలను సృష్టించే శక్తి దానికింక లేదు అని ఏ విధంగా చెప్పలేమో అట్లే) అనంతమైన కవిశక్తులచేత అనుభవింపబడినా కూడ ఈ కావ్యస్థితి ఎప్పుడూ కూడ క్షీణించదు. క్షీణించకపోగా క్రొత్త క్రొత్త వ్యుత్పత్తులతో వృద్ధి పొందుతుంది.

## లోచనం

అవస్థాదివిభిన్నానాం వాచ్యానాం వినిబన్ధనమ్,
భూమ్నైవ దృశ్యతే లక్ష్యే తత్తు భాతి రసాశ్రయాత్.

ఇతి కారికా. అన్యస్తు గ్రన్థః మధ్యోపస్కరః. 8

అత్ర తు పాదత్రయస్యార్థమనూద్య చతుర్థపాదార్థోఽ పూర్వతయా భిధీయతే. తదిత్యాది శక్తీనామిత్యన్తం కారికయోర్మధ్యోపస్కరః. ద్వితీయకారి యాస్తుర్యం పాదం వ్యాచష్టే - యథా హీ త్యాది. 9.10

## బాలానందిని

"అవస్థాది.... .... రసాశ్రయాత్" అనేది కారిక. మధ్యనున్న ఇతరగ్రంథం ఉపస్కారం. అత్రేతి. ఇక్కడైతే పాదత్రయంయొక్క అర్థాన్ని అనువదించి 'తత్తు భాతి రసాశ్రయాత్' అని చతుర్థపాదం అపూర్వంగా (కొత్త విషయంగా) చెప్పబడుతూన్నది. 8

'తదిదం' మొదలు 'పరిమితశక్తీనామ్' వరకు ఉన్నది, రెండు కారికల మధ్య ఉన్నది, ఉపస్కారం. రెండవ కారిక నాల్గవ పాదాన్ని వాఖ్యానిస్తున్నాడు - యథా హీతి. 9.10

# ధ్వన్యాలోకం

ఇత్థం స్థితే ఽపి -

కా. సంవాదాస్తు భవన్త్యేవ బాహుల్యేన సుమేధసామ్.

స్థితం హ్యేతత్ సంవాదిన్య ఏవ మేధావినాం బుద్ధయః. కిన్తు-

నైకరూపతయా సర్వే తే మన్తవ్యా విపశ్చితా. 11

కథమితి చేత్-

కా. సంవాదో హ్యన్యసాదృశ్యం తత్పునః ప్రతిబిమ్బవత్,

ఆలేఖ్యాకారవత్తుల్యదేహివచ్చ శరీరిణామ్. 12

సంవాదో హి కావ్యార్థస్యోచ్యతే యదన్యేన కావ్యవస్తునా సాదృశ్యమ్. తత్పునః శరీరిణాం ప్రతిబిమ్బవత్, ఆలేఖ్యాకారవత్, తుల్యదేహివచ్చ త్రిధా వ్యవస్థితమ్, కించిద్ధి కావ్యవస్తు వస్త్వన్తరస్య శరీరిణః ప్రతిబిమ్బకల్పమ్, అన్యదాలేఖ్యకల్పమ్, అన్యత్తుల్యేన శరీరిణా సదృశమ్.

## బాలానందిని

ఇత్థమితి - ఇలా ఉన్నా కూడా - సంవాదా ఇతి - "గొప్ప మేధాశక్తి కలవారిలో సాధారణంగా (అధికంగా) సంవాదాలు ఉంటూనే ఉంటాయి".

స్థితమితి - మేధావుల బుద్ధులు సంవాదం కలవి అనేది ప్రసిద్ధంగా ఉంది కదా? అయితే- నైకేతి:- "పండితుడు ఆ సంవాదాలన్నీ ఒకే విధమైనవి అని అనుకొనకూడదు". 11

కథమితి - ఎట్లనగా -

సంవాద ఇతి. సంవాదః = సంవాదం అనగా, అన్యసాదృశ్యమ్ =మరొకదానితో పోలిక. తత్పునః= అదైతే (ఆ సాదృశ్యమైతే), శరీరిణామ్= శరీరధారులయొక్క, ప్రతిబిమ్బవత్= ప్రతిబింబంవలె, ఆలేఖ్యాకారవత్= చిత్తరువులోని ఆకారంవలె, తుల్యదేహివచ్చ= సమానమైన మరొక శరీరధారి వలె. 12.

సంవాదో హీతి. ఒక కావ్యార్థానికి కావ్యవస్తువుతో ఉన్న సాదృశ్యం 'సంవాదం' అని చెప్పబడుతుంది. ఆ సాదృశ్యమైతే దేహధారుల ప్రతిబింబం వలె, చిత్తరువులోని ఆకారం వలె, సమానమైన దేహధారి వలె అని మూడు విధాలుగా ఉన్నది. ఒకానొక కావ్యవస్తువు శరీరి అయిన (పూర్వమే సిద్ధంగా ఉన్న) మరొక కావ్యవస్తువుయొక్క ప్రతిబింబంవంటిది; మరొకటి చిత్తరువువంటిది. మరొకటి తుల్యమైన మరొక శరీరితో సదృశ మైనది.

లోచనం

సంవాదా ఇతి కారికాయా అర్థమ్. నైకరూపతయేతి ద్వితీయమ్. 11 కిమియం రాజాజ్ఞా ఇత్యభిప్రాయేణ ఆశఙ్క్యతే-కథమితి చేదితి. అత్రోత్తరమ్-

సంవాదో హ్యన్యసాదృశ్యం తత్పునః ప్రతిబిమ్బవత్,

ఆలేఖ్యాకారవత్తుల్యదేహివచ్చ శరీరిణామ్.

ఇత్యనయా కారికయా. ఏషా ఖణ్డీకృతా వృత్తౌ వ్యాఖ్యాతా. శరీరిణామిత్యయం చ శబ్దః ప్రతివాక్యం ద్రష్టవ్య ఇతి దర్శితమ్. శరీరిణ ఇతి - పూర్వమేవ ప్రతిలబ్ధశరీరతయా ప్రధానభూతస్యేత్యర్థః. 12

బాలానందిని

'సంవాదాః'ఇత్యాదికం కారికయొక్క అర్థం. నైకరూపతయా అనేది ద్వితీయార్థం. 11

ఇదేమైనా రాజాజ్ఞయా అనే అభిప్రాయంతో ఆశంకిస్తున్నాడు - కథమితి చేత్ ఇతి. దీనికి సమాధానం "సంవాదో.... ... శరీరిణామ్" అనే కారికచేత ఇవ్వబడింది. ఇది వృత్తిలో ఖండాలుగా చేసి వ్యాఖ్యానించబడింది. "శరీరిణామ్" అనే శబ్దాన్ని ప్రతీవాక్యంలోనూ అన్వయించుకోవాలి -(శరీరిణాం ప్రతిబిమ్బవత్, శరీరిణామ్ ఆలేఖ్యాకారవత్, శరీరిణాం తుల్యదేహివత్ అని). శరీరిణః ఇతి. 'వస్త్వన్తరస్య శరీరిణః' అనే చోట 'శరీరిణః' అనే పదానికి పూర్వమే పొందబడిన స్వరూపం కలదవడంచేత ప్రధానమైనది అని అర్థం. 12.

## ధ్వన్యాలోకం

కా. తత్ర పూర్వమనన్యాత్మ తుచ్ఛాత్మ తదనన్తరమ్,

తృతీయం తు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః. 13

తత్ర పూర్వం ప్రతిబిమ్బకల్పం కావ్యవస్తు పరిహర్తవ్యం సుమతినా. యతః తత్ అనన్యాత్మ, తాత్త్వికశరీరశూన్యమ్. తదనన్తరమ్ ఆలేఖ్యప్రఖ్యమన్యసామ్యం శరీరాన్తరయుక్తమపి తుచ్ఛాత్మత్వేన త్యక్తవ్యమ్. తృతీయం తు విభిన్నకమనీయశరీరసద్భావే సతి ససంవాదమపి కావ్యవస్తు న త్యక్తవ్యం కవినా. నహి శరీరీ శరీరిణాన్యేన సదృశోఽప్యేక ఏవేతి శక్యతే వక్తుమ్.

బాలానందిని

తత్రేతి. "వాటిలో మొదటిది మరొక శరీరం (స్వతంత్రమైన శరీరం) లేనిది. దాని తరవాతది తుచ్ఛమైన శరీరం గలది. మూడవదైతే ప్రసిద్ధమైన (అందమైన) శరీరం గలది. కవి అన్యసామ్యాన్ని విడువకూడదు". 13

తత్రేతి. వాటిలో మొదటిదైన, ప్రతిబింబకల్పమైన కావ్యవస్తువు సుమతిచేత పరిహరించదగినది. ఎందువల్ల ననగా అది అనన్యాత్మ, యథార్థమైన శరీరం లేనిది. దాని తరవాతదైన ఆలేఖ్యం వంటి అన్యసామ్యం శరీరాంతరంతో కూడినదైనా తుచ్ఛమైన శరీరం కలదవడంచేత త్యజింపదగినదే. మూడవ కావ్యవస్తువైతే వేరుగా ఉన్న అందమైన శరీరం ఉన్నట్లయితే సంవాదంతో ఉన్నా అది కవిచేత త్యజించదగినది కాదు. ఒక శరీరధారి (కరచరణాద్యవయవసాదృశ్యంచేత) మరొక శరీరధారితో సదృశుడే అయినా (వాడే వీడని) ఒక్కడే అని చెప్పడానికి శక్యం కాదు కదా?

లోచనం

కా. తత్ర పూర్వమనన్యాత్మ తుచ్ఛాత్మ తదనన్తరమ్,

తృతీయం తు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః.

ఇతి కారికా. అనన్యః పూర్వోపనిబన్ధకావ్యాదాత్మా స్వభావః యస్య తదనన్యాత్మ, యేన రూపేణ భాతి తత్ ప్రాక్కవిస్పృష్టమేవ, యథా యేన రూపేణ ప్రతిబిమ్బం తేన రూపేణ బిమ్బమేవైతత్. స్వయం తు తత్కీదృశమిత్యత్రాహ - తాత్త్వికశరీరశూన్యమితి. న హి తేన కించిదపూర్వముత్ప్రేక్షితం, ప్రతిబిమ్బమప్యేవమేవ. ఏవం ప్రథమం ప్రకారం వ్యాఖ్యాయ ద్వితీయం వ్యాచష్టే - తదనన్తరన్త్వితి. ద్వితీయమిత్యర్థః. అన్యేన సామ్యం యస్య తథా.

తుచ్ఛాత్మేతి. అనుకారే హ్యనుకార్యబుద్ధిరేవ చిత్రపుస్తాదావివ, న తు సిన్దూరాదిబుద్ధిః స్ఫురతి. సాపి చ న చారుత్వాయేతి భావః. 13

బాలానందిని

"తత్ర ... ... కవిః" అనేది కారిక. అనన్యః=పూర్వం నిర్మించబడిన కావ్యంకంటె వేరు కాని, స్వభావం దేనికో అది అనన్యాత్మ. ఇది ఏ రూపంతో భాసిస్తున్నదో అది ప్రాచీనకవులచేత స్పృశించబడినదే. ఎట్లనగా- ఏ రూపంచేత ప్రతిబింబం భాసిస్తుందో ఆ రూపంచేత ఇది బింబమే. అయితే అది స్వయంగా ఎటువంటిది అనగా చెప్పుచున్నాడు - తాత్త్వికశరీరశూన్యమితి. దానిచేత క్రొత్త దేదీ ఊహించబడలేదు కదా? ప్రతిబింబం కూడా ఇట్లే. ఏవమితి - ఈ విధంగా మొదటి ప్రకారాన్ని వ్యాఖ్యానించి రెండవదానిని వ్యాఖ్యానిస్తున్నాడు - తదనన్తరన్త్వితి - రెండవది అని అర్థం. మరొకదానితో సామ్యం దేనికో అది "అన్యసామ్యమ్". తుచ్ఛాత్మేతి. అనుకారం విషయంలో చిత్రంలో బొమ్మ మొదలైన దానియందు వలె అనుకార్యబుద్ధియే కలుగుతుంది; (చిత్రపుస్తాదులందు) సిందూరాదిబుద్ధి (ఏ సిందూరాదులచేత ఆ చిత్రం వేయబడిందో ఆ సిందూరాదుల బుద్ధి) కలగదు కదా? అది కూడ (అనుకార్యబుద్ధి కూడ) చారుత్వహేతువు కాదు అని భావం. 13

## ధ్వన్యాలోకం

ఏతదేవోపపాదయితుముచ్యతే-

కా. ఆత్మనోఽన్యస్య సద్భావే పూర్వస్థిత్యనుయాయ్యపి,

వస్తు భాతితరాం తన్వ్యాః శశిచ్ఛాయమివాననమ్. 14

తత్త్వస్య సారభూతస్య ఆత్మనః సద్భావేఽన్యస్య పూర్వస్థిత్యనుయాయ్యపి వస్తు భాతితరామ్. పురాణరమణీయచ్ఛాయానుగృహీతం హి వస్తు శరీరవత్ పరాం శోభాం పుష్యతి న తు పునరుక్తత్వేనావభాసతే, తన్వ్యాః శశిచ్ఛాయమివాననమ్.

బాలానందిని

ఏతదేవేతి. ఈ విషయాన్నే సమర్థించడానికి చెప్పబడుతున్నది -

ఆత్మన ఇతి. ఆత్మనః= ఆత్మయొక్క, సద్భావే= సద్భావమునందు, ఆత్మ ఉన్న

ట్లయితే, అన్యస్య = మరియొకదానియొక్క, పూర్వస్థిత్యనుయాయ్యపి= పూర్వస్థితిని అనుసరించేదైనా, వస్తు= వస్తువు, తన్వ్యాః= యువతియొక్క, శశిచ్ఛాయమ్= చంద్రకాంతి గల, ఆననమివ= ముఖం వలె, భాతి తరామ్= మిక్కిలి భాసిస్తుంది.

తత్త్వస్యేతి. ఆత్మ, అనగా సారభూతమైన తత్త్వం, ఉన్నట్లయితే మరియొకదాని పూర్వస్థితిని అనుసరించే దయినా వస్తువు మిక్కిలి భాసిస్తుంది. ప్రాచీనమైన సుందరకాంతిచేత అనుగ్రహింపబడిన వస్తువు శరీరంవలె గొప్ప శోభను పోషిస్తుంది. అంతే కాని పునరుక్తంవలె కనబడదు; తన్వియొక్క చంద్రకాంతి గల ముఖం వలె.

వివరణ:- కావ్యంలో ఉండవలసిన తత్త్వం, సారం అనేది ఉంటే, అది ప్రాచీనమైన ఒక రమణీయాశంయొక్క ఛాయతో కలిసి ఉన్నా, ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉన్న స్త్రీముఖంలో ఎప్పటినుంచో ఉన్న చంద్రుని కాంతి వంటి కాంతి ఉంటే అది ఎలా అధికంగా భాసిస్తుందో అట్లే భాసిస్తుం దని భావం.

లోచనం

ఏతదేవేతి - తృతీయస్య రూపస్య అత్యాజ్యత్వమ్.

ఆత్మనోఽన్యస్య సద్భావే పూర్వస్థిత్యనుయాయ్యపి,

వస్తు భాతితరాం తన్వ్యాః శశిచ్ఛాయమివాననమ్.

ఇతి కారికా ఖణ్డీకృత్య వృత్తౌ పఠితా. కేషు చిత్పుస్తకేషు కారికా అఖణ్డీకృతా ఏవ దృశ్యన్తే. ఆత్మన ఇత్యస్య శబ్దస్య పూర్వపఠితాభ్యామేవ తత్త్వస్య సారభూతస్యేతి చ పదాభ్యామర్థో నిరూపితః. 14

బాలానందిని

ఏతదేవేతి. తృతీయరూపం త్యజింపదగినది కాదు అనేది. "ఆత్మనో ... ... వాననమ్" అనే కారిక వృత్తిలో ఖండాలుగా చేసి పఠించబడింది. కొన్ని పుస్తకాలలో కారికలు ఖండాలుగా చేయబడకుండానే కనబడుతున్నాయి. ఆత్మనః అనే శబ్దంయొక్క అర్థం ముందు పఠించబడిన "తత్త్వస్య సారభూతస్య" అనే పదాలచేత నిరూపించబడింది.

## ధ్వన్యాలోకం

ఏవం తావత్ససంవాదానాం సముదాయరూపాణాం విభక్తాః సీమానః. పదార్థరూపాణాం చ వస్త్వన్తరసదృశానాం కావ్యవస్తూనాం

నాస్త్యేవ దోష ఇతి ప్రతిపాదయితుముచ్యతే -

కా. అక్షరాదిరచనేన యోజ్యతే యత్ర వస్తురచనా పురాతనీ,
నూతనే స్ఫురతి కావ్యవస్తుని వ్యక్తమేవ ఖలు సా న దుష్యతి. 15

న హి వాచస్పతినాప్యక్షరాణి పదాని వా కానిచిదపూర్వాణి ఘటయితుం శక్యన్తే. తాని తు తాన్యేవోపనిబద్ధాని న కావ్యాదిషు నవతాం విరుధ్యన్తి. తథైవ పదార్థరూపాణి శ్లేషాదిమయాన్యర్థతత్త్వాని. తస్మాత్-

కా. యదపి తదపి రమ్యం యత్ర లోకస్య కించిత్
స్ఫురితమిదమితీయం బుద్ధిరభ్యుజ్జిహీతే,
స్ఫురణేయం కాచిదితి సహృదయానాం చమత్కృతిరుత్పద్యతే,
అనుగతమపి పూర్వచ్ఛాయయా వస్తు తాదృ
క్సుకవిరుపనిబధ్నన్నిన్ద్యతాం నోపయాతి. 16

తదనుగతమపి పూర్వచ్ఛాయయా వస్తు తాదృక్ తాదృక్షం సుకవిః వివక్షితవ్యఙ్గ్యవాచ్యార్థసమర్పణసమర్థశబ్దరచనారూపయా బన్ధచ్ఛాయయా ఉపనిబధ్నన్ నిన్ద్యతాం నైవ యాతి.

బాలానందిని

ఏవమితి. ఈ విధంగా సంవాదాలతో కూడిన సముదాయరూపాలైన వాక్యార్థాల సరిహద్దులు విభజించబడ్డాయి(విభజించి చూపబడ్డాయి). వస్త్వన్తరాలతో (ఇతరకవుల వస్తువులతో) సదృశాలైన పదార్థరూపాలైన కావ్యవస్తువులకు దోషం లేదు అని ప్రతిపాదించడానికి చెప్పబడుతున్నది-

అక్షరాదీతి. నూతనే కావ్యవస్తుని= నూతనమైన కావ్యవస్తువు, స్ఫురతి సతి= ప్రకాశిస్తూండగా, యత్ర = ఎక్కడ, పురాతనీ=ప్రాచీనమైన, వస్తురచనా= వస్తువుయొక్క రచన, అక్షరాదిరచనేవ= అక్షరాదుల రచనవలె, యోజ్యతే= కూర్చబడుతుందో, సా = అది, వ్యక్తమేవ= నిశ్చితంగా, న దుష్యతి= దుష్టం కాదు. 15

న హీతి. బృహస్పతిచేత కూడ అపూర్వాలైన (నూతనాలైన) అక్షరాలు కాని, పదాలు కాని కూర్చడానికి శక్యమైనవి కాదు కదా? ఆ అక్షర-పదాలైతే, అవే, కావ్యాదులలో కూర్చబడినా కూడ నవత్వానికి విరుద్ధమైనవి కావు. శ్లేషాదిరూపాలైన పదార్థరూపాలైన అర్థతత్త్వాలు కూడ అంతే. అందువల్ల-

యదపీతి - "యదపి తదపి= ఎలాంటిదైనా, కించిత్= ఒకానొక, ఇదం స్ఫురితమ్= ఈ స్ఫురణం, రమ్యమ్= రమ్యమైనది, ఇతి= అని, ఇయమ్= ఈ, లోకస్య= జనులయొక్క, బుద్ధిః= బుద్ధి, అభ్యుజ్జిహీతే= పుడుతుందో"

స్ఫురణేతి - ఇది ఒక వర్ణింపశక్యం కాని స్ఫురణ అని సహృదయులకు చమత్కారం పుడుతుందో-

అనుగతమితి. "పూర్వచ్ఛాయయా= పూర్వచ్ఛాయతో, అనుగతమపి= కూడినదైనా, తాదృక్ వస్తు= అలాంటి వస్తువును, ఉపనిబధ్నన్= కూరుస్తూన్న, కవిః =కవి, లోకే= లోకమునందు, నిన్ద్యతామ్= నింద్యత్వాన్ని, నోపయాతి= పొందడు".

తదితి. పూర్వచ్ఛాయానుగతమైనా కూడ, తాదృక్= ఆ విధమైన, వస్తువును, చెప్పదలచిన వ్యంగ్యమైన వాక్యార్థాన్ని అందించడంలో సమర్థమైన శబ్దాల కూర్పు అనే రూపం గల బంధచ్ఛాయతో ఏ కవి కూరుస్తాడో అతడు నింద్యత్వాన్ని పొందడు.

లోచనం

ససంవాదానామితి పాఠః. సంవాదానామితి తు పాఠే వాక్యార్థరూపాణాం సముదాయానాం యే సంవాదాః తేషామితి వైయధికరణ్యేన సంగతిః. వస్తుశబ్దేన ఏకో వా, ద్వౌ వా, త్రయో వా చతురాదయో వా పదానామర్థాః. తాని త్వితి- అక్షరాణి చ పదాని చ. తాన్యేవేతి - తేనైవ రూపేణ యుక్తాని, మనాగప్యన్యరూపతామనాగతానీత్యర్థః. ఏవమక్షరాదిరచనేనేతి దృష్టాన్తభాగం వ్యాఖ్యాయ దార్ష్టాన్తికే యోజయతి - తథైవేతి. సద్వృత్త - తేజస్వి - గుణ - ద్విజాదయో హి శబ్దాః పూర్వపూర్వైరపి కవిసహస్రైః శ్లేషచ్ఛాయయా నిబధ్యన్తే; నిబద్ధాశ్చన్ద్రాదయశ్చోపమానత్వేన. తథైవ పదార్థరూపాణీత్యత్ర నాపూర్వాణి ఘటయితుం శక్యన్తే ఇత్యాది విరుధ్యన్తీత్యేవమన్తం ప్రాక్తనం వాక్యమభిసంధానీయమ్. 15

లోకస్యేతి వ్యాచష్టే - సహృదయానామితి. చమత్కృతిరితి. ఆస్వాదప్రధానా బుద్ధిరిత్యర్థః. అభ్యుజ్జిహీత ఇతి వ్యాచష్టే - ఉత్పద్యతే ఇతి. ఉదేతీత్యర్థః. బుద్ధేరేవాకారం దర్శయతి - స్ఫురణేయం కాచిదితి.

యదపి యదపి రమ్యం యత్ర లోకస్య కించి

త్స్ఫురితమిదమితీయం బుద్ధిరభ్యుజ్జిహీతే.

అనుగతమపి పూర్వచ్ఛాయయా వస్తు తాదృక్

సుకవి రుపనిబధ్నన్ నిన్ద్యతాం నోపయాతి .

ఇతి కారికా ఖణ్డీకృత్య పఠితా.

బాలానందిని

'ససంవాదానామ్' అని పాఠం. 'సంవాదానామ్' అనే పాఠంలో అయితే వాక్యార్థరూపాలైన సముదాయాలయొక్క ఏ సంవాదాలు కలవో వాటియొక్క అని వైయధికరణ్యంచేత అన్వయం. (మూడు షష్ఠ్యంతాలనీ విశేషణవిశేష్యభావంతో అన్వయిస్తే సామానాధికరణ్యాన్వయం. సముదాయాలయొక్క సంవాదాలు అనడంతో విశేషణవిశేష్యభావం లేదు గాన ఇది వైయధికరణ్యాన్వయం). 'వస్తురచనా' లోని 'వస్తు' శబ్దంచేత ఒకటి గాని, రెండు గాని, మూడు గాని, నాలుగు మొదలైనవి గాని పదాల అర్థాలు (గ్రహించబడతాయి). తాని త్వితి - అక్షరాలు, పదాలూ కూడ. తాన్యేవేతి - అదే రూపంతో కూడినవి, కొంచెం కూడ అన్యరూపం పొందనివి అని అర్థం. ఏవమితి- ఈ విధంగా 'అక్షరాదిరచనేవ' అనే దృష్టాంతభాగం వ్యాఖ్యానించి దార్ష్టాంతికంలో అన్వయిస్తున్నాడు - తథైవేతి. శ్లేషాదిమయానీతి. శ్లేషాదిస్వభావములు అని అర్థం. సద్వృత్త, తేజస్విన్, గుణ, ద్విజ మొదలైన అనేకశబ్దాలు అతిప్రాచీనులైన కవిసహస్రాలచేత కూడ శ్లేషచ్ఛాయతో కూర్చబడుతున్నాయి. చంద్రాదులు ఉపమానంగా కూర్చబడ్డాయి. "తథైవ పదార్థరూపాణి" అనే చోట కూడ "న అపూర్వాణి ఘటయితుం శక్యన్తే" మొదలు "విరుధ్యన్తి' వరకు ఉన్న వెనుకటి వాక్యం అనుసంధానం చేసుకోవాలి. (చేర్చుకోవాలి). (అప్పుడు "వర్ణాలను, పదాలను పదార్థరూపాలను ఎవరూ కొత్తగా సృష్టించజాలరు; వాటిని యథాతథంగా ప్రయోగించినా నవత్వానికి లోపం రాదు" అని అర్థం లభిస్తుంది).

'లోకస్య' అనేదానిని వ్యాఖ్యానిస్తున్నాడు - సహృదయానామితి. చమత్కృతిరితి - ఆస్వాదప్రధానమైన బుద్ధి అని అర్థం. 'అభ్యుజ్జిహీతే' అనేదానిని వ్యాఖ్యానిస్తున్నాడు

- ఉత్పద్యత ఇతి. ఉదయిస్తుంది అని అర్థం. బుద్ధియొక్క స్వరూపాన్ని (ఎలాంటి బుద్ధి ఉదయిస్తుందో) చెపుతున్నాడు - స్ఫురణేయం కాచిదితి. "యదపి .... నోపయాతి" అనే కారిక ఖండం చేసి పఠించబడింది. 16

ధ్వన్యాలోకం

తదిత్థం స్థితమ్ -

కా. ప్రతాయన్తాం వాచో నిమితవివిధార్థామృతరసా

న సాదః కర్తవ్యః కవిభిరనవద్యే స్వవిషయే,

సన్తి నవాః కావ్యార్థాః, పరోపనిబద్ధార్థవిరచనే న కశ్చిత్కవేర్గుణ ఇతి భావయిత్వా.

పరస్వాదానేచ్ఛావిరతమనసో వస్తు సుకవేః

సరస్వత్యేవైషా ఘటయతి యథేష్టం భగవతీ. 17

పరస్వాదానేచ్ఛావిరతమనసః సుకవేః సరస్వత్యేషా భగవతీ యథేష్టం ఘటయతి వస్తు. యేషాం సుకవీనాం ప్రాక్తన పుణ్యాభ్యాసపరిపాకవశేన ప్రవృత్తిస్తేషాం పరోపరచితార్థపరిగ్రహనిః స్పృహాణాం స్వవ్యాపారో న క్వచిదుపయుజ్యతే. సైవ భగవతీ సరస్వతీ స్వయమభిమతమర్థమా విర్భావయతి. ఏతదేవ హి మహాకవిత్వం మహాకవీనామితి - ఓమ్.

బాలానందిని

తదితి. అందువల్ల నిశ్చితమైన విషయం ఇది -

ప్రతాయన్తామితి. "నిమితవివిధార్థామృతరసాః= తులితములైన (తూచి తూచి అందించబడిన) వివిధార్థా లనే అమృతరసం గల, వాచః =వాక్కులు, కవిభిః= కవులచేత, ప్రతాయన్తామ్= సవిస్తరంగా నిబంధించబడుగాక, అనవద్యే= నిర్దుష్టమైన, స్వవిషయే= తమ కావ్యవస్తువు విషయంలో, సాదః= ఎంతోమంది అన్ని విషయాలూ ఇదివరకే చెప్పేశారు; ఇంక నాకు మిగిలిందేముంది అనే విషాదం, న కర్తవ్యః= చేయదగినది కాదు.

సన్తీతి - కొత్తవైన కావ్యార్థాలు ఎన్నో ఉన్నాయి; పరులు చెప్పిన విషయాలనే రచించడంలో కవికి గుణం ఏదీ లేదు అని భావించి 'సాదః న కర్తవ్యః'తో అన్వయం.

పరస్యేతి - పరస్వాదానేచ్ఛావిరతమనసః=పరుల సొత్తును గ్రహించాలనే ఇచ్ఛనుండి విరమించిన మనస్సు గల, సుకవేః=సుకవికి, భగవతీ=భగవతియైన, ఏషా సరస్వత్యేవ=ఈ సరస్వతియే, యథేష్టమ్=ఇష్టానుసారం, వస్తు=కావ్యవస్తువును, ఘటయతి=సమకూరుస్తుంది.

పరస్వాదానేతి - పరస్వగ్రహణేచ్ఛనుండి విరమించిన మనస్సు గల సుకవికి భగవతియైన ఈ సరస్వతియే యథేష్టంగా - వానికి కావలసిన విధంగా - వస్తువును సమకూరుస్తుంది. పురాతనపుణ్యాల పరిపాకవశంచేత, అభ్యాసపరిపాకవశంచేత ఏ కవులు కావ్యరచనలో ప్రవర్తిస్తారో పరులచేత రచించబడిన అర్థాన్ని స్వీకరించడంలో ఆసక్తిలేని వాళ్ల స్వవ్యాపారం ఏ విషయంలోనూ ఉపయోగించదు. (వాళ్లు శ్రమపడి చేయవలసిన పని లేదు). భగవతియైన సరస్వతియే స్వయంగా ఇష్టమైన అర్థాన్ని ప్రకటింపచేస్తుంది. మహాకవుల మహాకవిత్వం ఇదే. ఓమ్.

వివరణ:- ఆనందవర్ధనుడు తన గ్రంథాన్ని 'ఓమ్' కారంతో సమాప్తి చేస్తున్నాడు. ఓంకారం, 'అథ' శబ్దం ఉచ్చారణమాత్రంచేతనే సర్వమంగళప్రదాలు.

లోచనం

స్వవిషయ ఇతి. స్వయం తాత్కాలికత్వేన అస్ఫురిత ఇత్యర్థః. పరస్వాదానేచ్ఛేత్యాది ద్వితీయం శ్లోకార్థం. పూర్వోపస్కారేణ సహ పఠతి - "పరస్వాదానేచ్ఛావిరతమనసో వస్తు సుకవేః" ఇతి తృతీయః పాదః. కుతః ఖల్వపూర్వమానయామీత్యాశయేన నిరుద్యోగః పరోపనిబద్ధవస్తూపజీవకో వా స్యాదిత్యాశఙ్క్యాహ - సరస్వత్యేతి. కారికాయాం సుకవేః ఇతి జాతావేకవచనమిత్యభిప్రాయేణ వ్యాచష్టే - సుకవీనామితి. ఏతదేవ స్పష్టయతి - ప్రాక్తనేత్యాదినా తేషామిత్యన్తేన. ఆవిర్భావయతీతి - నూతనమేవ సృజతీత్యర్థః.

బాలానందిని

స్వవిషయే ఇతి. తాత్కాలికంగా తనకు స్ఫురించని విషయమునందు అని అర్థం. పరస్వాదానేచ్ఛా ఇత్యాదికమైన రెండవ శ్లోకార్థాన్ని మొదటి అర్థానికి చేసిన ఉపస్కారంతో కలిపి పఠిస్తున్నాడు. "పరస్వాదానేచ్ఛావిరతమనసో వస్తు సుకవేః" అనేది తృతీయపాదం. కొత్త వస్తువును ఎక్కడినుండి తీసికొని రాగలను అనే అభిప్రాయంతో

ప్రయత్నం లేనివాడుగా గాని, పరులచేత కూర్చబడిన వస్తువును గ్రహించి దానిమీద బ్రతికేవాడుగా గాని అవుతాడు అని ఆశంకించి చెపుతున్నాడు - సరస్వత్యేవేతి. కారికలోని 'సుకవేః' అనే పదం జాత్యేకవచనం అనే అభిప్రాయంతో వ్యాఖ్యానిస్తున్నాడు - సుకవీనామితి.. (ఒకప్పుడు మొత్తం జాతిని సూచించడానికి ఏకవచనం కూడ ప్రయోగిస్తారు. "గౌః పూజ్యా" (ఆవు పూజించదగినది) అన్నప్పుడు ఒక్క అవు అని కాదు, గోజాతికి చెందిన ప్రతి ఆవూ పూజించదగినది అని అర్థం. దీనికి జాత్యేకవచనం అని పేరు). ఏతదేవేతి - దీనినే 'ప్రాక్తన' మొదలు 'తేషామ్' వరకు ఉన్న మాటలతో స్పష్టీకరిస్తున్నాడు. ఆవిర్భావయతీతి. నూతనవస్తువునే సృజిస్తుంది అని అర్థం. 17

## ధ్వన్యాలోకం

శ్లో. ఇత్యక్లిష్టరసాశ్రయోచితగుణాలంకారశోభాభృతో
యస్మాద్వస్తు సమీహితం సుకృతిభిః సర్వం సమాసాద్యతే,
కావ్యాఖ్యేఽఖిలసౌఖ్యధామ్ని విబుధోద్యానే ధ్వనిర్దర్శితః
సోఽయం కల్పతరూపమానమహిమా భోగ్యోఽస్తు భవ్యాత్మనామ్.

### బాలానందిని

ఇతీతి. ఇతి= ఈ విధంగా, అక్లిష్టరసాశ్రయోచితగుణాలఙ్కారశోభాభృతః= క్లిష్టములు కానివి, రసాశ్రయంచేత ఉచితములూ అయిన గుణాలంకారాల శోభను ధరించిన, యస్మాత్=దేనినుండి, సుకృతిభిః=పుణ్యాత్ములచేత, సమీహితమ్= అభిలషించబడిన, సర్వం వస్తు= సమస్తవస్తువూ కూడ, సమాసాద్యతే= పొందబడుతుందో, అఖిలసౌఖ్యధామ్ని= సకలసౌఖ్యాలకీ స్థానమైన, కావ్యాఖ్యే= కావ్యం అనే పేరు గల, విబుధోద్యానే=నందనోద్యానంలో, ధ్వనిః=ధ్వని, దర్శితః=చూపబడింది. కల్పతరూపమానమహిమా= కల్పవృక్షంతో సమానమైన మహిమ గల, సః అయమ్= అట్టి ఈ ధ్వని, భవ్యాత్మనామ్= శ్రేష్ఠమైన మనస్సు కలవారికి, భోగ్యః= అనుభవించతగినది, అస్తు= అవుగాక.

### లోచనం

ఇతీతి - కారికాతద్వృత్తినిరూపణప్రకారేణేత్యర్థః. అక్లిష్టా, రసాశ్రయేణ ఉచితా యే గుణాలంకారాః తతః యా శోభా తాం బిభర్తి కావ్యమ్. ఉద్యానమప్యక్లిష్టః కాలోచితః య రసః సేకాదికృతః తదాశ్రయః తత్కృతః

యో గుణానాం సౌకుమార్యచ్ఛాయావత్త్వసౌగన్ధ్యప్రభృతీనామ్ అలంకారః పర్యాప్తతాకారణత్వం తేన చ యా శోభా తాం బిభర్తి. యస్మాదితి. కావ్యాఖ్యాదుద్యానాత్. సర్వం సమీహితమితి - వ్యుత్పత్తికీర్తిప్రీతిలక్షణమిత్యర్థః. ఏతచ్చ సర్వం పూర్వమేవ వితత్యోక్తమితి శ్లోకార్థమాత్రం వ్యాఖ్యాతమ్. సుకృతిభిరితి. యే కష్టోపదేశేనాపి వినా తథావిధఫలభాజః తైరిత్యర్థః. **అఖిలసౌఖ్యధామ్నీతి** - అఖిలం దుఃఖలేశేనాప్యననువిద్ధం యత్ సౌఖ్యం తస్య ధామ్ని ఏకాయతన ఇత్యర్థః. సర్వథా ప్రియం సర్వథా చ హితం దుర్లభం జగతీతి భావః. విబుధోద్యానం నన్దనమ్. సుకృతీనాం కృతజ్యోతిష్టోమాదీనామేవ సమీహితాసాదననిమిత్తమ్. విబుధాశ్చ కావ్యతత్త్వవిదః. దర్శిత ఇతి - స్థిత ఏవ సన్ ప్రకాశితః, అప్రకాశితస్య హి కథం భోగ్యత్వమ్? కల్పతరుణా ఉపమానం యస్య తాదృఙ్మహిమా యస్య ఇతి బహువ్రీహిగర్భో బహువ్రీహిః. సర్వసమీహితప్రాప్తిర్హి కావ్యే తదేకాయత్తా. ఏతచ్చోక్తం విస్తరతః.

బాలానందిని

ఇతీతి. కారికలను వాటి వృత్తినీ నిరూపించిన ప్రకారంచేత అని అర్థం. క్లిష్టములుకానివి, రసాన్ని ఆశ్రయించడంచేత ఉచితములూ అయిన ఏ గుణాలంకారాలు ఉన్నవో, వాటివల్ల ఏ శోభ ఉన్నదో దానిని ధరిస్తూన్నది కావ్యం. ఉద్యానం కూడ, అక్లిష్టః= కాలానికి తగిన ఏ జలసేకాదులవల్ల కలిగిన రసం గలదో, అది ఆశ్రయంగా గల, దానిచేత చేయబడిన, ఏ సౌకుమార్యం, నీడ కలిగి ఉండడం, సుగంధం మొదలైనవాటి అలంకారం, అనగా చాలడానికి, పరిపూర్ణత్వానికి కారణంగలదో దానిచేత కలిగే శోభను ధరిస్తూన్నది. యస్మాత్ ఇతి - కావ్యం అనే ఏ ఉద్యానంనుండి, సర్వం సమీహితమ్ ఇతి- వ్యుత్పత్తి, కీర్తి, ఆనందం అనే సకలాభిలషితమూ అని అర్థం. ఇదంతా పూర్వమే సవిస్తరంగా చెప్పబడింది. గాన శ్లోకార్థం మాత్రమే వ్యాఖ్యానించబడింది. సుకృతిభిరితి - కష్టమైన ఉపదేశం లేకపోయినా ఎవరు ఆ విధమైన ఫలం పొందుతారో వాళ్లచేత అని అర్థం. అఖిలసౌఖ్యధామ్నీతి. అఖిలమ్= దుఃఖలేశంతో కూడ కలవని, ఏ సౌఖ్యం గలదో దానికి, ధామ్ని= ఏకైకస్థానం అని అర్థం. జగత్తులో అన్ని విధాలా ప్రియమూ, అన్ని విధాలా హితమూ అయినది దుర్లభమైనది అని భావం. విబుధోద్యానమ్=

నందనం, సుకృతీనామ్= జ్యోతిష్టోమాదియాగాలు చేసినవాళ్లు మాత్రమే ఇష్టమైనవాటిని సంపాదించడానికే నిమిత్తమైనది. విబుధాః అనగా కావ్యతత్త్వవేత్తలు అని కూడ అర్థం. దర్శిత ఇతి. ఉన్నదే ప్రకాశింపచేయబడినది. ప్రకాశింపచేయబడనిది భోగ్యం ఎలా అవుతుంది? "కల్పతరూపమానమహిమా" కల్పతరువుతో ఉపమానం ఏ మహిమకో అది 'కల్పతరూపమానం' అని ఒక బహువ్రీహి. కల్పతరూపమానమైన మహిమ దేనికో అట్టి విబుధోద్యానం 'కల్పతరూపమానమహిమ' అని మరొక బహువ్రీహి. ఈ విధంగా బహువ్రీహి గర్భంలో గల బహువ్రీహి. సకలాభిలషణీయవస్తువుల ప్రాప్తి దానియందు ఒక్కదానియందే ఆధారపడి ఉన్నది. ఈ విషయం సవిస్తరంగా చెప్పబడింది. (బాలానందినీ రచయిత తద్రచనకాలంలో నివసించిన కుటీరం పేరు కూడ "నందనం")

## ధ్వన్యాలోకం

శ్లో. సత్కావ్యతత్త్వనయవర్త్మచిరప్రసుప్త
కల్పం మనస్సు పరిపక్వధియాం యదాసీత్,
తద్వ్యాకరోత్సహృదయోదయలాభహేతో
రానన్దవర్ధన ఇతి ప్రథితాభిధానః.

ఇతి శ్రీరాజానకానన్దవర్ధనాచార్యవిరచితే
ధ్వన్యాలోకే చతుర్థ ఉద్ద్యోతః.
సమాప్తోఽయం గ్రన్థః.

### బాలానందిని

సత్కావ్యేతి. యత్= ఏ, సత్కావ్యతత్త్వనయవర్త్మ= సత్కావ్యాల తత్త్వస్వరూపమార్గం, పరిపక్వధియామ్= పరిపక్వమైన బుద్ధి కలవారియొక్క, మనస్సు= మనస్సులలో, ప్రసుప్తకల్పమ్= నిద్రపోయినట్లుగా, ఆసీత్= ఉండెనో, తత్= దానిని, ఆనన్దవర్ధన ఇతి= ఆనందవర్ధనుడు అని, ప్రథితాభిధానః= ప్రసిద్ధమైన పేరు గలవాడు, సహృదయోదయలాభహేతోః= సహృదయుల ఉదయం (అభివృద్ధి) లభించడం కొరకై, వ్యాకరోత్= విశదీకరించెను.

శ్రీరాజానకానందవర్ధనాచార్యులు రచించిన ధ్వన్యాలోకంలో చతుర్థోద్ద్యోతం సమాప్తం.

ధ్వన్యాలోకం సమాప్తం.

లోచనం

"సత్కావ్యతత్త్వనయవర్త్మచిరప్రసుప్త
కల్పం మనస్సు పరిపక్వధియాం యదాసీత్,
తద్వ్యాకరోత్సహృదయోదయలాభహేతోః"

ఇతి సంబన్ధాభిధేయప్రయోజనోపసంహారః. ఇహ బాహుల్యేన లోకః లోకప్రసిద్ధ్యా సంభావనాప్రత్యయబలేన ప్రవర్తతే. స చ సంభావనాప్రత్యయః నామశ్రవణవశాత్, ప్రసిద్ధాన్యతదీయసమాచారకవిత్వవిద్వత్తాదిసమను స్మరణేన భవతి. తథాహి - భర్తృహరిణేదం కృతమ్, యస్యాయమౌదార్య మహిమా, యస్యాస్మిన్ శాస్త్రే ఏవంవిధః సారః దృశ్యతే; తస్యాయం శ్లోకప్రబన్ధః; తస్మాదాదరణీయమేతదితి లోకః ప్రవర్తమానః దృశ్యతే. లోకశ్చావశ్యం ప్రవర్తనీయః తచ్ఛాస్త్రోదితప్రయోజనసంపత్తయే. తదనుగ్రాహ్యశ్రోతృజన ప్రవర్తనాఙ్గత్వాత్ గ్రన్థకారాః స్వనామనిబన్ధనం కుర్వన్తి; తదభిప్రాయేణాహ - ఆనన్దవర్ధన ఇతి. ప్రథితశబ్దేన ఏతదేవ ప్రథితమ్. యత్తు తదేవ నామశ్రవణం కేషాంచిన్నివృత్తిం కరోతి తన్మాత్సర్యవిజృమ్భితమ్; నాత్ర గణనీయమ్, నిఃశ్రేయసప్రయోజనాదేవ హి శ్రుతాత్ కోఽపి రాగాన్ధః యది నివర్తతే కిమేతా వతా? ప్రయోజనప్రయోజనమపి అవశ్యవక్తవ్యమేవ స్యాత్. తస్మాత్ అర్థినాం ప్రవృత్త్యఙ్గం నామ ప్రసిద్ధమ్.

బాలానందిని

సత్కావ్యేతి. "సత్కావ్యతత్త్వ... ... లాభహేతోః" అని (మూడుపాదాలలో) సంబంధ - అభిధేయ - ప్రయోజనాల ఉపసంహారం చేయబడింది. ఈ లోకంలో సాధారణంగా లోకులు ఒక వ్యక్తికి ఉన్న లోకప్రసిద్ధిచేత, ఆవ్యక్తికి ఉన్న సంభావన(జనాదరం) విషయంలో ఉన్న నమ్మకం యొక్క బలంచేతా ప్రవర్తిస్తూంటారు: ఆ సంభావనాప్రత్యయం ఆవ్యక్తి పేరు వినగానే ఆ వ్యక్తికి సంబంధించిన ఇతరమైన సమాచారం (సదాచరం), కవిత్వం, విద్వత్త్వం మొదలైనవి స్మృతికి రావడంచేత కలుగుతుంది. ఇది ప్రసిద్ధమే కదా(తథాహి). ఏ భర్తృహరి అంతటి ఔదార్యమహిమ కలవాడో, ఏ భర్తృహరికి ఈ శాస్త్రంలో ఈ విధమైన సారం కనబడుతూన్నదో అలాంటి

లోచనం

శ్లో. సజ్జనాన్ కవిరసౌ న యాచతే హ్లాదనాయ శశభృత్కిమర్థితః,
నైవ నిన్దతి ఖలాన్ముహుర్ముహుః ధిక్కృతోఽపి న హి శీతలోనలః.

బాలానందిని

సజ్జనానితి - అసౌ కవిః= ఈ కవి (అభినవగుప్తుడు), సజ్జనాన్= సజ్జనులను, హ్లాదనాయ= తన గ్రంథాన్ని ఆదరించడం ద్వారా తనను సంతోషపెట్టడానికి, న యాచతే= యాచించడంలేదు. శశభృత్= చంద్రుడు, హ్లాదనాయ= సంతోషపెట్టడంకోసం, అర్థితః కిమ్= ప్రార్థింపబడ్డాడా? ఎవరూ ప్రార్థించినా ప్రార్థించకపోయినా ఆహ్లాదింపచేసేవాళ్లు ఆహ్లాదింపచేస్తూనే ఉంటా రని అర్థం. ముహుః ముహుః= మాటిమాటికీ, ధిక్కృతోఽపి= ఖలులచేత నిందింపబడినా కూడ, ఖలాన్= దుష్టులను, నైవ నిన్దతి= నిందించడు. అనలః= అగ్ని, శీతలః న హి= చల్లనిది కాదు కదా? అగ్నికి ఉష్ణత్వం వలె ఖలులకు పరనింద స్వాభావికం అని అర్థం.

లోచనం

శ్లో. వస్తుతః శివమయే హృది స్ఫుటం
సర్వతః శివమయం విరాజతే
నాశివం క్వచన కస్యచిద్వచః
తేన వః శివమయీ దశా భవేత్.

ఇతి మహామాహేశ్వరాభినవగుప్తవిరచితే కావ్యాలోకలోచనే చతుర్థ ఉద్ద్యోతః.
సమాప్తశ్చాయం గ్రన్థః.

బాలానందిని

వస్తుత ఇతి. వస్తుతః= వాస్తవంలో, శివమయే= శివమయమైన, హృది= హృదయంలో, సర్వతః= సమస్తవస్తుజాలమూ కూడ, శివమయమ్= శివమయంగా, స్ఫుటమ్= స్పష్టంగా, విరాజతే= ప్రకాశిస్తుంది. కస్యచిత్ వచః= ఎవని వాక్కూ కూడ, క్వచన= ఎక్కడా కూడ, అశివమ్= శివునికంటె భిన్నమైనది, అమంగళకరమైనది, న =

